
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement**(SAI RAM) - **సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

**TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)**

**http://ebooks.tirumala.org**



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# యజుర్వేద భాష్యమ్

## సంస్కృతభాష్యం, ఆంధ్రటీకాతాత్పర్యం, ఆంగ్లభావార్థసహితం

ఓమ్

## ప్రథమ సంపుటము

వైదిక సాహిత్య ప్రచార సమితి

హైదరాబాద్ - 500 060. ఆం.ప్ర.

ओ३म्

परमहंसपरिव्राजकाचार्येण
श्रीमन्महर्षिदयानन्दसरस्वतीस्वामिना निर्मितम्

# यजुर्वेद - भाष्यम्

संस्कृतान्ध्राङ्ग्लभाषासमन्वितम्

## प्रथमो भागः

*( प्रथमकाण्डादारभ्य षष्ठाध्यायपर्यन्तम् )*

आन्ध्रानुवादकः
'चतुर्वेदभाष्यानुवादभास्करः'
**ब्रह्मश्री पण्डितलोकमलहरिसिद्धान्ताचार्यः**

परिष्कर्ता - सम्पादकश्च
सिद्धान्तालङ्कारः, विद्याभूषणः, आर्षविद्याविनोदः
**आचार्य डॉ. मरि कृष्णारेड्डी**

वैदिकसाहित्यप्रचारसमितिः, भाग्यनगरम्-६०, आन्ध्रप्रदेशः

2007

ॐ

# THE YAJURVEDA BHASHYAM

With

**MAHARSHI DAYANANDA SARASWATHI'S COMMENTARY**

# VOLUME - 1

**(1-6 Chapters)**

Translated in English by : **DEVI CHAND M.A.**

***Translated in to Telugu***

***By***

**BRAHMASRI PANDITA LOKA MALAHARI**
**SIDDHANTACHARYA**

***Editor***

**Acharya Dr. MARRI KRISHNA REDDY,** M.A; M.Ed, Ph.D

**Vaidika Sahitya Prachara Samithi, Hyderabad - 60.**

**2007**

ఓ౩మ్

పరమహంసపరివ్రాజకాచార్యేణ
శ్రీమన్మహర్షిదయానందసరస్వతీస్వామినా నిర్మితమ్

# యజుర్వేద భాష్యమ్

(సంస్కృతభాష్యం, ఆంధ్రటీకాతాత్పర్యం, ఆంగ్లభావార్థసహితం)

## ప్రథమ సంపుటము

( 1-6 అధ్యాయములు )


అనువాదకర్త
'చతుర్వేదభాష్యానువాదభాస్కర' - శతాధికగ్రంథకర్త
బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య

పరిష్కర్త - సంపాదకులు
సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద
ఆచార్య డా॥ మట్టి కృష్ణారెడ్డి M.A., M.Ed., Ph.D.



వైదిక సాహిత్య ప్రచార సమితి, హైదరాబాద్-60

2007

# "వైదిక సాహిత్య ప్రచారసమితి" ప్రచురణలు


| | | |
|---|---|---|
| సంపూర్ణ "యజుర్వేదభాష్యమ్" | : | 6 సంపుటములు |
| ద్వితీయ ముద్రణ | : | శ్రీ వ్యయ పుష్యం, జనవరి - 2007. |
| ప్రతులు | : | 1000 |
| వెల | : | **రూ. 1800/- లు** మాత్రమే.(6 సంపుటములకు కలిపి) (పోస్టేజి అదనము) |
| సర్వస్వామ్యములు | : | అనువాదక సంపాదకులవి |
| డి.టి.పి. | : | **వి. రాములింగారెడ్డి (బాలు)** |
| ముద్రణ | : | **సాయిలిఖిత ప్రింటర్స్**, ఖైరతాబాద్, హైదరాబాదు. ఫోన్ : 98490 05182 |


## ప్రతులకు :

1. **వైదికసాహిత్య ప్రచారసమితి,** 3-30; హనుమాన్ నగర్, ఆర్యసమాజం ఎదురువీధి, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 60. ఆం.ప్ర., ఫోన్ : 040 - 24051322, 9849583929

2. **దిల్‌సుఖ్‌నగర్ ఆర్యసమాజం,** బాదంకాంప్లెక్స్, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060, ఫోన్ : 9849468084, 9395376410

3. వేదగిరి, తూంపల్లి గ్రామం, కొందుర్గు మండలం, మహబూబ్‌నగర్ జిల్లా. ఫోన్ : 9441200322, 9849583929

4. **భీమాస్ డీలక్స్ హోటల్,** 34-38, జి.కార్ స్ట్రీట్, రైల్వేస్టేషన్ ఎదురుగా, తిరుపతి. ఫోన్ : 0877-2225521

5. **విశాలాంధ్ర బుక్‌హౌస్** (అన్ని బ్రాంచిలలో) హైదరాబాద్, విశాఖపట్టణం, విజయవాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి, కాకినాడ.

# కృతజ్ఞతానివేదనం

విశ్వములోని జ్ఞానవిజ్ఞానములకు మూల స్రోతస్సులై, సృష్టిరహస్యాలను ప్రకటించు జ్ఞానభాండాగారములై, మానవసంస్కృతీసభ్యతలకు జననియై, సమస్తధర్మమునకు మూలమై, విశ్వమానవమేధోవికాసానికి హేతువై, సృష్ట్యాదిలో ప్రపంచానికే జ్ఞానభిక్ష బెట్టిన ఈ అనంతమైన వేదరాశికి కర్తయైన చరాచరజగత్కర్త, పరమపిత సర్వాంతర్యామి సర్వవ్యాపక సచ్చిదానందస్వరూపయుక్త పరమేశ్వరునకు ప్రణవపూర్వక ప్రణామములు.

ప్రపంచమంతా సత్యవేదజ్ఞానాభావముతో, మతమతాంతరముల అజ్ఞానాంధకారాదిమూఢవిశ్వాసాదులతో, సత్యాసత్యనిర్ణయవివేకమడుగంటి కొట్టుమిట్టాడుతున్న సమయాన హిమవన్నగోన్నతధీరుడు, చతుస్సాగరసదృశగంభీరుడు, ప్రపంచములోని సమస్త మతములవారి మూఢవిశ్వాసములను నిర్భయముగా కూకటివ్రేళ్ళతో పెకిలించివేసిన ధీరగంభీరవీరుడు, చతుర్వేదసారసాగరపారముందాటిన జ్ఞానభాస్కరుడు, కువ్యాఖ్యాన కర్తలకు పండితమ్మన్యులకు, శాస్త్రార్థదిగ్దంతులకుసైతం సింహస్వప్నమైన అరివీరభయంకరుడు, విషంపెట్టిన వానికిసైతం ప్రేమామృతమును పంచిపెట్టిన దయాసాగరుడు, తలపండిన పండితశతంబుకుసైతం వర్ణింపశక్యముగాని కమనీయజీవనగాథాయుక్తుడు, నైష్ఠికబ్రహ్మచారియై కఠోరతపస్సుతో సంపూర్ణసమాధిస్థితిని పొందిన ఆదిత్యబ్రహ్మచారి, వేదవేదాంగాదిశాస్త్రాలను అవపోశనబట్టి వేదార్థాన్ని కరతలామలకంగా దర్శించిన మహర్షి, ఋగ్యజుస్సులకు శాశ్వతసత్యభాష్యములను వ్రాసిన పరమహంసపరివ్రాజకాచార్య మహర్షిస్వామిదయానందసరస్వతీయతీంద్రుల దివ్యాత్మకు భక్తిపూర్వక నమస్కారములు.

**"కృషి యుంటే మనుజులు ఋషు లౌతారు"** అనునానుడికి అక్షరసాక్షిగా నిలిచినవారు "వేదభాష్యానువాదభాస్కర" బిరుదాంకితులు బ్రహ్మశ్రీపండితలోకమలహరిసిద్ధాంతాచార్యులు. నాలుగు కాలాలపాటు నలుగురు మెచ్చేవిధంగా నాలుగువేదాలనాద్యంతం అనువదించి ఆంధ్రులకందించిన ఆదర్శపురుషులు. శతాయువుకు చేరువలోనున్నా సతతమనువాదకార్యక్రతువులో నిమగ్నమై సమిధగా జ్వలిస్తూ వేదజ్ఞానవెలుగులనందిస్తున్న వేదధర్మానురాగి ఈ కర్మయోగి. పండితపామరజనరంజకంగా, సులలితభాషాశైలిలో తాను అనువాదం చేసిన నాలుగువేదాలను ఈ తెలుగులోకానికి ప్రచురించి అందించే పవిత్రబాధ్యతను నాకు అప్పజెప్పినందులకు ధన్యునిగా భావించి వీరికి శతసహస్ర ధన్యవాదములను తెలుపుచున్నాను.

అనంతజ్ఞానరాశియైన ఈ వేదముద్రణమహాయాగములో తనుమనోధనములతో సహకరించిన ఎందరో మహనీయత్యాగధనులు సమిధలు. ఈ గ్రంథములో దాతలుగా ప్రకటించబడినవారు ప్రమిదలు (నిత్యం ఈ వేదములో వెలుగువారు). ఆరుసంవత్సరాలుగా నన్ను ఆదరిస్తున్నవారి సహకారమును పేరుపేరున నోరారా స్తుతించాలని ఉన్నది. కాని, గ్రంథవిస్తరణభీతితో వ్రాయకుండా వారి వారి యుపకారములను నా హృదయమునందే పదిలపరచుకుంటూ అనేకానేక కృతజ్ఞతాభివందనచందనములను సమర్పించుకుంటున్నాను.

విశ్వవిఖ్యాతి గాంచి కలియుగదైవంగా పౌరాణికులచే నిత్యమారాధించబడుతున్న వేంకటేశ్వరుని పాదసేవకులు, తిరుమలతిరుపతి దేవస్థానముల ధర్మకర్తలమండలివారు ఈ సంపూర్ణయజుర్వేదభాష్యముద్రణకు సరిపడుకాగితమును టి.టి.డి నుండి సమకూర్చి ఇచ్చినారు. హిందూధర్మరక్షణకు, పోషణకు ప్రపంచములోనే అతిపెద్ద సంస్థగా

వేనోళ్ళ కీర్తింపబడుతున్న టి.టి.డి సంస్థ హిందూ సంస్కృతీ సభ్యతలకు పట్టుకొమ్మయైన ఈ వేదాలకు సహకరించడం ముదావహం. ఇట్టి ఉత్తమోత్తమమైనపని చేసిన ధర్మకర్తల జీవితములు ధన్యములు. ఇట్టి ధన్యతగాంచిన వీరందరికీ నమస్సుమాంజలులు.

ఈ వేదముద్రణయజ్ఞములో తమవంతు సహాయము నాహుతిగా ఇచ్చిన విజయవాడ కనకదుర్గ అమ్మవారి ముద్దుబిడ్డలగు దేవాలయ ధర్మకర్తలమండలి సభ్యులునూ చరితార్థులు. ఫిలిమ్స్ తీసి ఇచ్చిన వ్యాసాశ్రమము ఏర్పేడువారికి, ముద్రణకు భూరివిరాళముల నిచ్చిన ధర్మహృదయులకు, శక్తికొలది సహకరించిన అనేకమంది ధార్మికసహృదయులకు, ఈ వేదాన్ని ముందే బుకింగుచేసుకున్న వేదప్రేమికులకు, వైదిక సాహిత్య ప్రచారసమితి కార్యమండలికి, ఈ వేదముద్రణను ప్రారంభించినది మొదలు నేటివరకు ఏదో ఒక తీరుగా వారివారి శక్త్యనుసారం సమయానుకూలంగా సహకరించిన వారందరికీ మనఃపూర్వక నమోవాకములు.

ధనమునకు ఏ మాత్రం ఇబ్బంది కలిగించకుండా, అతి తక్కువవ్యయముతో సుందరముగా ముద్రించి, సకాలమునకు గ్రంథముల నందజేసిన సాయిలిఖిత ప్రింటర్స్ (దక్షిణభారతహిందీ ప్రచారసభ ఆవరణ, ఖైరతాబాద్) యజమాని నా చిరకాల మిత్రుడు వై. వేంకటేశ్వరరావుగారికి వేనవేల నమస్సులందజేస్తూ మరొక్కసారి పోషకులకు, సంరక్షకులకు, కార్యవర్గమునకు, దాతలకు, గ్రాహకుల కందరికినీ హృదయపూర్వక కృతజ్ఞతాభినివేదనమ్.

- సంపాదకుడు

సం పత్నీ ప్రతి భూషేహ దేవాన్ ॥అథర్వ 14-2-25॥
శ్రేష్ఠపత్నివై దివ్యజనులను సత్కరించుము.

సుమంగలీ ప్రతరణీ గృహాణామ్ ॥అథర్వ 14-2-26॥
సుమంగళివై గృహస్వాములను తరింపజేయుము

సూర్యేవ నారి! విశ్వరూపా మహిత్వా ॥అథర్వ 14-2-32॥
ఓ నారీ! సూర్యప్రభవలె విశ్వరూపవు, మహిమాన్వితవు కమ్ము.

## అభినందన పూర్వక మంగళాశీస్సులు

**నేను చేయు ప్రతి పనిలో త్రికరణశుద్ధిగా సహకరిస్తూ, నాకు సహధర్మచారిణిగా, వైదికకర్మల నాచరిస్తూ, భర్తకు అనుకూలవతియైన భార్యగా, పిల్లలకు సుసంస్కారాలనిచ్చే తల్లిగా, అతిథి అభ్యాగతులను ఆదరించే ఆదర్శగృహిణిగా మెదులుతూ నాతోపాటు వేదమాతసేవలో అహోరాత్రములు భక్తిశ్రద్ధలతో పరిశ్రమిస్తూ ఎంతో తపనతో ఈ వేదసాహితీ ముద్రణ క్రతువుకు అంకితమైన నా అర్ధాంగి అనురాగమయి 'రాధ' దీర్ఘసుమంగళిగా జీవించునట్లు అనుగ్రహింపుమని ఆ పరమాత్మను ప్రార్థిస్తూ ........**

- కృష్ణారెడ్డి

# కృషి సమర్పణం

ఋగ్యజుస్సామాథర్వవేదములలో ఋగ్యజుస్సులకు భాష్యకర్త - మహర్షి స్వామి దయానంద సరస్వతి. అనువాదకర్త - పండితలోకమలహరి సిద్ధాంతాచార్యగారు. నేను చేస్తున్నది కేవలము వారు చేసిన కృషికి సంపాదకత్వం వహించి ఈ తెలుగులోకానికి అందించడము మాత్రమే. ఈ భాష్యముద్రణలో ఎందరో సహకరించినారు. కొందరు విశేషంగా సహకరించినారు. వారికి కృతజ్ఞతగా తొలిప్రతిని కృషిసమర్పణగా ఇచ్చుచున్నాను.

**ప్రథమ సంపుటి స్వీకర్తలు : ప్రాతఃస్మరణీయులు వి.సోమసుందరరావు నాగపద్మావతి దంపతులు:**-15 సంవత్సరాలనుండి నా చదువుకు, నాకు అవసరమొచ్చినప్పుడల్లా కావలసినంత ధనసహాయమును చేస్తూ, ప్రస్తుతము చేస్తున్న కార్యానికినీ అండగా నిలిచి, విదేశములోనున్న వారి ఏకైక పుత్రుణ్ణి నాలో చూసుకొంటూ, అతనికొరకు కొన్న వాహనాన్నిసైతం ఈ వేదకార్యంలో వినియోగిస్తూ నాకు మహోపకారం చేస్తున్న పితృసమానులగు ఈ ఆదర్శదంపతులకు ఈ కృషిని సమర్పించుకోవడం తప్ప వీరికి నే నేమిచ్చి వీరి ఋణమును తీర్చుకొనగలను?

**ద్వితీయ సంపుటి స్వీకర్త : వందనీయులు వాస్తుశిల్పి డా॥ బి. ఎన్.రెడ్డి Ex.M.P గారు:**- వేదగిరి స్థాపనలో - వేదాలముద్రణలో సర్వశక్తులను కోల్పోయి అన్ని ద్వారాలు మూసుకొనిపోగా వేదనిర్మాణం కొరకు ఏర్పేడు వ్యాసాశ్రమములో ఆశ్రయమును పొందిన సమయాన ప్రముఖపత్రికా రచయితలు ప్రెస్‌క్లబ్ మాజీ అధ్యక్షులు శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి ప్రేరణతో నన్ను ఆదరించి హైద్రాబాద్‌లో నాకు తిరిగి ఆవాసమును కలిగింపజేసిన మహనీయులు.ప్రసిద్ధకవి, సంఘసేవకులు. 1987లో వేదోక్తంగా వర్షేష్టియాగమును చేయించి వర్షాలు కురిపించినవారు.

**తృతీయ సంపుటి స్వీకర్త : ధార్మికులు శ్రీ పి. వేంకటేశ్వర్లు M.D. కాకతీయసిమెంట్ షుగర్స్ అండ్ ఇండస్ట్రీస్. (లి)** గురుకృప, అశోక్‌నగర్, హైదరాబాద్‌గారు:- అష్టాదశపురాణములను ఆమూలాగ్రం సమూలంగా తెలుగులో అనువదింపజేసి ప్రచురిస్తూ 14 పురాణాలను వెలువరించిన వీరు చతుర్వేదభాష్యాలకంప్యూటరీకరణ ప్రారంభించినది 1999 మొదలు నేటి వరకు నెలకు రూ॥1,000/- చొ॥న నాకు సహకరిస్తున్న ఉదారహృదయులు.

**చతుర్థసంపుటి స్వీకర్త : వేదాంతవిశారదులు వ్యాసాశ్రమ పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఏర్పేడు:**- ఆంధ్రదేశములో భగవద్గీతను ఒక వేదంగా భావించి విస్తృతంగా ప్రచారంగావించిన సద్గురు మళయాల స్వాములవారి ఆశ్రమానికి ప్రస్తుతము ఉత్తరాధికారిగా ఉన్న కరుణామయులు పూజ్యశ్రీ పరిపూర్ణానందగిరి స్వాములవారు వేదభాష్యముల నిర్మాణం చేయుచున్న నాకు; నేను గృహస్థుడనైనప్పటికిని చేస్తున్నది వేదకార్యం కావున నన్ను గృహస్థసన్న్యాసిగా భావించి నాకు సరియైన సమయంలో వారి ఆశ్రమములో అన్ని వసతులు కల్పించి ఆదరించి ఆశీర్వదించడమేగాక సంపూర్ణయజుర్వేద భాష్యమును ఫిలిమ్స్ తీసి ఇచ్చినందులకు కృతజ్ఞతగా శ్రీ స్వాములవారి ఆజ్ఞమేరకు ప్రస్తుత ఆశ్రమాధిపతియైన శ్రీ విద్యానందగిరిస్వాములవారికి ఈ చతుర్థసంపుటము సమర్పింతము.

**పంచమ సంపుటి స్వీకర్తలు : ధార్మిక గృహస్థజీవనులు శ్రీ జక్కుల నారాయణరెడ్డి పుణ్యదంపతులు. పెద్దతోకట్ట, బోయిన్‌పల్లి :**-ఆదర్శపూర్వక అన్యోన్యదంపతులై ఎంతోమంది నిరుపేదల దాంపత్యజీవనబంధానికి మాంగళసూత్రములను బహూకరించి ప్రేమసూత్రముతో వారిని బంధిస్తూ, నాకును అదేకారణమై మరియు నా విద్యాభ్యాస సమయంలోనూ, వేదభాష్యముద్రణలోనూ భూరివిరాళములనిచ్చి మా హృదయాలపై చెరగని తీపిముద్రలువేసిన ఆర్యవృద్ధదంపతులకు శ్రద్ధతో ఈ పంచమసంపుటము సమర్పితము.

**షష్ఠ సంపుటి స్వీకర్తలు : న్యాయశాస్త్రవిశారదులు, నీతివర్తనులునైన శ్రీ చల్లాసాంబిరెడ్డి గాయత్రీదేవి దంపతులు:**- శాంతియుతధార్మికజీవనవికాసానికి నీతిశాస్త్రమే తగిన ఉపాయమని భావించి అవినీతితో మసకబారిన నేటి సమాజంలో దశదిశలా నీతికాంతులను ప్రసరింపజేయాలని నీతిని, రీతిని ప్రబోధించే తెలుగు ప్రాచీన దశాధికశతకాలకు దక్షతగలిగిన పండితోత్తములచే వ్యాఖ్యానములను వ్రాయించి తాను స్థాపించిన పావని సాహిత్యసంస్థద్వారా సర్వాంగసుందరంగా ప్రచురించి ప్రచారం ప్రసారం చేస్తూ, వేలాదిమంది చిన్నలను పెద్దలను నీతిమంతులుగా ధర్మవర్తనులునుగా తీర్చిదిద్దడమేగాక వేదధర్మ వ్యాపకాభిలాషులై ఈ వేదముద్రణ మహాయాగానికి తనవంతు సహాయంగా మే మడగనిదే తానే స్వయంగా భూరివిరాళము నందజేసిన ఉదాత్త ఉదార ఉత్తమదాతలు. దృఢసంకల్ప సదాశయాలవిభూషితులు.

- సంపాదకుడు.

చతుర్వేదభాష్యాల నాంధ్రీకరించిన సాహసి - సహజపాండితీవిభాసి

వేదజ్ఞాన పిపాసి, వేదధర్మప్రచారాభిలాషి, శతాధికగ్రంథనిర్మాణక్రతుకృత ఋషి

## బ్రహ్మశ్రీ పండిత లోకమలహరి సిద్ధాంతాచార్య గురించి...

సమస్త మానవులకు శిరోధార్యములైన ఈ హిమవన్నగోన్నత చతుర్వేద భాష్యములను పం. లోకమలహరి సిద్ధాంతాచార్య (95)గారు 30 సంవత్సరాలు అహోరాత్రములు పరిశ్రమించి తెలుగుభాష సుసంపన్నమయ్యే రీతిలో, పండితపామరజనరంజకంగా సులలిత భాషాశైలిలో వేదధర్మం-వేదమర్మం-సామాన్యులకు సైతం తెలిసేటట్లుగా 20 వేల పుటలలో అపురూపంగా అనువదించినారు. ఈ నాలుగువేదాల భాష్యములనే గాక వేదసంబంధమైన 120 లఘుగ్రంథాలను కూడ 5000 పుటలలో అనువదించినారు. సహజపాండిత్యముతో స్వప్రతిభతో బాల్యంనుండే ఎన్నో పద్యాలు, పాటలు, కీర్తనలు, నాటకములు, నవలలు వ్రాసిన ఈ పండితోత్తముడు ఈ పూర్ణవయసులో నాలుగు వేదాలను పరిపూర్ణముగా అనువదించుట సంపూర్ణమైన వారి మనఃపరిపక్వతకు నిదర్శనము.

95 ఏళ్ళవయసులోనూ వారి కరములోనున్న కలము గళమువిప్పి అనువాదగీతికలను పాడుతూనే ఉన్నది. శరీరములో జవసత్వాలు తగ్గలేదు. అనువాదకార్యములో మనసు పక్వమై పరిపూర్ణ యౌవనదశను పొందినది. మాటల్లో తొట్రుబాటులేదు. చిత్తంలో చాంచల్యంలేదు. మనసులో మాలిన్యం లేదు. వారికళ్ళు ఏ సహాయంలేకుండానే స్వయంగా ప్రకాశిస్తూ వేదవిజ్ఞాన కాంతుల్ని లోకానికి ప్రసరిస్తున్నాయి. ఈ నిండువయసులో పండిన తనుమనములలో ఎక్కడా తొణికిస కనిపించదు. ఆరడుగుల ఎత్తుగల పండితులవారు అనువాదంలో నూరడుగుల ఎత్తుకు ఎదిగిన శతాధిక గ్రంథకర్తలు. నిరంతర కృషితో ఋషియైనవారు. ఈషణత్రయరహిత మనస్సుతో త్రికరణశుద్ధిగా రచనక్రతువును అవిరళకృషితో ఆజీవనపర్యంతం నిర్వహిస్తున్న అపురూపమనిషి. సాహితీసమరాంగణంలో విజయుడైన రాజర్షి, చతుర్వేదాల నాద్యంత మనువదించిన బ్రహ్మర్షి, ఇలా మాటల కందనంత ఎత్తు ఎదిగిన జ్ఞానజనాకర్షి ఈ శతాయుషి.

30 ఏళ్ళు గృహారణ్యములో కఠోరదీక్షతో వేదానువాద తపస్సుచేసి వేదమాత విశ్వరూపాన్ని ఆంధ్రరూపంలో దర్శించుకొని 'భగీరథుడు గంగామాతను కైలాసగిరినుండి భూమిమీదకు తెచ్చిన చెందంగా' వేదమాతను ఆర్య(హిందీ)గిరినుండి ఆంధ్రభువిమీదకు తీసుకొనివచ్చిన అపర భగీరథుడు. ఆ వేదజ్ఞానగంగాప్రవాహంతో మన ఆంధ్రమనోభూములు పవిత్రములై అందులో వేదవిజ్ఞానబీజములుద్భిజములై దినదినప్రవర్ధమానములై ప్రతిమానసము జ్ఞానానందములతో పరిపూర్ణమై సత్కర్మాదులతో నిత్యం తులతూగుగాక! ఆచంద్రార్కం పండితులవారి శ్రమ వర్ధిల్లునుగాక!

### న భూతో న భవిష్యతి

25వేలపుటలలో అనగా 50సంపుటములలో ముద్రణ కాగల చతుర్వేదభాష్యములు మరియు ఇతర వైదికసాహిత్యము ఒక్కచేతిమీదుగా అనువదించబడుట అపూర్వకార్యము. ఇది ఆంధ్రసాహితీచరిత్రలోనే **"న భూతో న భవిష్యతి"** ఇట్టి కార్యమింతవరకు ఏ సంస్థనుండియు, వ్యక్తినుండియు జరుగలేదు. ఇప్పుడు జరిగినది కావున భవిష్యత్తుకు అవకాశమే లేదు. ఇలా తెలుగులోకానికి వేదాల నందించిన ఘనత పం.లోకమలహరిగారికే దక్కింది.

**- మట్టి కృష్ణారెడ్డి**

# ప్రకాశకీయం

వేదాలు నాలుగు. అవి ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం. 'వేద'మనగా 'జ్ఞాన'మని అర్థం. ఇది ఈశ్వరీయ జ్ఞానం. మానవులకు కావలసిన సమస్తవిద్యలు (భౌతిక, సామాజిక, రాజనైతిక, ఆధ్యాత్మికాది విద్యలు) ఇందు బీజరూపంలో ఉన్నాయి. వీటిని ఎంతగా మననచింతనలు చేస్తే అంత ఆ విషయాలు అవగతమౌతాయి. వీటి ఆధారంతోనే మన ప్రాచీన ఋషులు అద్భుత ఆవిష్కారాలు చేశారు.

పరమ వైజ్ఞానికములైన వేదాలు కేవలము సంస్కృతమువరకే పరిమితమై ఉన్నాయి. సామాన్య సంస్కృతజ్ఞులకు ఇవి అవగతం కావు. సాంగోపాంగముగా వైదిక సాహిత్యమును అధ్యయనం చేసిన వారికి మాత్రమే అర్థమవుతాయి. వేదపండితులు కొందరున్నా వారికి మంత్రపాఠము తప్ప వేదార్థం అంతగా తెలియదు.

పాశ్చాత్యుల పరిపాలన, సంస్కృతుల ప్రభావంతో వేదాలు, వేదసంబంధ గ్రంథాలు అంతరించిపోతున్న తరుణంలో మహర్షి దయానందసరస్వతి వేదోద్ధరణ చేశారు. వారు వ్రాసిన వేదభాష్యాలే పరమప్రామాణికాలని సమస్త వేదపండితులు కొనియాడారు. వారు యజుర్వేదమునకు సంపూర్ణము, ఋగ్వేదములో ఏడు మండలాలవరకు భాష్యం వ్రాశారు. వేదభాష్యాలు పూర్తికాకముందే దుష్టుల విషప్రయోగముచే తనువు చాలించారు. మిగతా భాగమునకు దయానందుని మార్గంలోనే ఆర్యవిద్వాంసులు వైజ్ఞానికార్థాలతో భాష్యమును పూర్తి చేశారు.

యజుర్వేదమునకు మహర్షి స్వామి దయానందసరస్వతి సంస్కృతార్య (హిందీ) భాషలలో భాష్యం వ్రాయగా శతాధికగ్రంథానువాదకర్తలు, తొమ్మిదిపదులు దాటిన వయోవృద్ధులు శ్రీ పండిత లోక మలహరిసిద్ధాంతాచార్య (95)గారు హిందీభాగమును 1984నుండి 1986 మధ్య కాలంలో ఆంధ్రీకరించినారు. పదిహేనుసంవత్సరాలనుండి వీటిని ముద్రించుటకు సాహసించి ఎవరూ ముందుకు రాలేదు.

చతుర్వేదసంహిత నిర్మాణకర్తయైన ఆచార్య మక్టీ కృష్ణారెడ్డిగారికి పండిత లోక మలహరిగారు తాము వ్రాసిన వేదభాష్యానువాద వ్రాతప్రతులను ఇవ్వగా వాటిని పరిశీలించి సంస్కృత భాగమును జోడించి, సర్వాంగ సుందరంగా పండిత పామర జనరంజకంగా సిద్ధం చేయగా మేము (వైదిక సాహిత్య సమితి ద్వారా) ప్రచురించుటకు పూనుకున్నాము.

నలుబది అధ్యాయములుగల యజుర్వేదభాష్యమునకు శ్రీదేవీచంద్ ఎం.ఏ గారు అనువదించిన ఆంగ్లభావమును కూడ జోడించి ఆరు సంపుటాలుగా ముద్రించి ఆంధ్రార్యుల కందించుచున్నాము.

యువ పండితుడు కర్తవ్యదీక్షాపరాయణుడు నగు మక్టీ కృష్ణారెడ్డిగారు వైదిక సాహిత్యమును విస్తృతంగా తెలుగులో ప్రచురించాలనే సత్సంకల్పముతో అహర్నిశలు పరిశ్రమిస్తున్నారు. వేదభాష్యాల ప్రచురణ పరంపరలో భాగంగా పండితులవారు అనువదించిన వైదికసంపత్తి, వైదికసంపద, దయానందప్రకాశము, వేదముల యథార్థ స్వరూపంతో పాటు నేటివరకు తెలుగులో అనూదితమై పునర్ముద్రణకు నోచుకోలేని అమూల్యగ్రంథరత్నములను కూడ ప్రచురించ గలమని తెలియజేయుటకు సంతసిస్తున్నాము.

పాఠకులు మా యీ ప్రయత్నము నాదరణతో స్వీకరించి, సహకరిస్తూ, వేదసాహిత్యం ద్వారా ప్రేరణ పొంది, ఆర్షవిజ్ఞానం వైపు ఆకర్షితులై తమ జీవితాలను సుఖశాంతిమయం చేసుకుంటారని ఆశిస్తున్నాము.

**ప్రకాశకులు**

# సంపాదకీయం

మన భారతీయ సంస్కృతికి మూలాధారాలుగా, అనంతజ్ఞానవిజ్ఞానసంపదలుగా విరాజిల్లేవి చతుర్వేదాలు. ప్రపంచ వాఙ్మయ చరిత్రలో శిఖరాగ్రకిరీటంలో వెలకట్టలేని మణిదీపాలే మన పవిత్రవేదాలు. భారతీయ వేదర్షులు తమ దివ్యశక్తులతో గుర్తించగా ఆవిష్కరించబడిన ఈ అనంత వేదసంస్కృతి మన జాతికి వెన్నెముకవంటిది. **"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"** అని అత్యంత విశాలదృక్పథంతో తమ దేశపు మానవాళి సుఖాన్ని మాత్రమే కాక - సమస్త భూమండలంలో ఉన్న మొత్తం మానవకోటి సుఖసంతోషాలతోపాటు - విశ్వసృష్టిలోని సమస్త లోకాలసుఖాన్ని మన మహర్షులు మనసారా వాంఛించారు.

'వేద' శబ్దము **'విద్ జ్ఞానే'** అను ధాతువునుండి జనించినందున 'వేద'శబ్దమునకు **'జ్ఞాన'** మని, **'వేదయతీతి వేదః'** తెలియజేసేది అని, **"వేదయతి యతో ధర్మాధర్మ ఇతి వేదః"** ధర్మాధర్మములను తెలియజేసేదని అర్థం. **'విదంత్యనేన ధర్మానితి వేదః'** దీనివలన ధర్మార్థాదులు తెలియబడుతాయి కాబట్టి దీనికి వేదమని పేరువచ్చింది. ప్రత్యక్షానుమానప్రమాణాలచే తెలియని విషయాన్ని తెల్పేది కాన దీన్ని వేదమన్నారు. ఇది ఎవరిచే రచింపబడినది కాదు కాబట్టి అపౌరుషేయమన్నారు. ఒక చెవినుండి వేరొక చెవికి వినికిడి ద్వారా అనగా ఆనుశ్రావికంగా పరంపరగా, ఒక తరంనుండి మరొక తరానికి సంగమిస్తున్నది కావున దీన్ని శ్రుతి అన్నారు. ఇది సమస్త సృష్టికి కారణభూతమైన వాక్కు. విధినిషేధములద్వారా ఇష్టప్రాప్తికి, అనిష్టపరిహారాలకు అలౌకికమైన ఉపాయం తెలిపేది కావున వేదమన్నారు.

దీని నెవరూ వ్రాయకపోయినా లౌకిక దృష్టితో స్వదేశీయులు, విదేశీయులు ఎంతోమంది పరిశోధనలు చేసి వేదకాలంను తెలుపజూచారు. కాని సాధ్యపడలేదు. మహర్షి స్వామి దయానందసరస్వతి తన ఋగ్వేదాదిభాష్యభూమికయందు సప్రమాణములతో వేద మపౌరుషేయమని, కాలాతీతమైనదని నిరూపించారు. అందుకే 'న కశ్చిద్వేదకర్తా చ' వేదానికి కర్తలేదని చెప్పబడింది. ఇది యథార్థం. **'యస్య నిశ్వసితం వేదాః'** వేదములు భగవంతుని నిశ్వాసరూపాలుగా చెప్పబడ్డాయి.

లోకానుగ్రహకాంక్షతో పరమేశ్వరుడందించిన మహావిజ్ఞానాన్ని ఏ స్వార్థప్రయోజనాలూ ఆశించక లోకోపకారార్థం మహర్షులు తమ తపఃశక్తితో గ్రహించి లోకాని కందించారు. నిస్స్వార్థంగా మనహితాన్ని కోరేవారు ఆప్తులు. ఆప్తవాక్యమే శబ్దప్రమాణం. ఆ ప్రామాణిక జ్ఞానసంపదయే శ్రుతులు-వేదాలు. ఇది మన ముఖ్యమైన వేదవాఙ్మయసంపద. విశ్వంలోని సమస్త వాఙ్మయానికి వేదం ప్రాణం కాగా మిగిలిన బ్రాహ్మణారణ్యకస్మృత్యుపనిషదైతిహాసికపురాణాదులన్నీ శరీరం.

ఇంతటి అనంతమైన అమూల్యమైన ఈ వేదవిజ్ఞానాన్ని వదలి వేయిసంవత్సరాలనుండి మనం కృత్రిమమైన భౌతిక అభివృద్ధితో ముందడుగు వేయుచు ఈ భూగోళాన్ని నాశనం చేసే దిశగా ప్రయాణిస్తున్నాం. ఇలా నాగరికత పేరుతో వినాశనం వైపు నడవక ప్రాచీన విలువలను గ్రహించి లోకశ్రేయస్కరమైన శాస్త్రీయదృక్పథాన్ని వహించడం మేలు. దాన్ని సాధింపగల విజ్ఞానసంపదే దైవదత్తమైన వేదవాక్కు.

మనోమయ వేదపురుషునకు యజుర్వేదం శిరస్సు. **'సర్వస్య గాత్రస్య శిరఃప్రధానం'**. కావున యజుర్వేదానికి గల ప్రాధాన్యం బోధపడుతుంది. శుక్ల కృష్ణ భేదములతో ఈ వేదం రెండు విధములు. కృష్ణయజుర్వేదం బ్రాహ్మణమిశ్రితం. శుక్లయజుర్వేదమే అసలైన వేదం. దీనికి మాధ్యందిన, కాణ్వలను రెండు శాఖలు. దయానందులు మాధ్యందినశాఖకు యథార్థమైన సత్యభాష్యమును వ్రాసినారు. ఇదియే పరమప్రామాణికమైనదిగా విద్వాంసులంగీకరించినారు.

## యజుర్వేద సంక్షిప్త పరిచయము

అనాదినుంచి భారతీయులు ఆధ్యాత్మికతత్త్వజిజ్ఞాస చేస్తూనే ఉన్నారు. వేదాలు వీరికి పరమప్రమాణాలు. అందులో యజుర్వేదం భిత్తిస్థానీయం. అంటే ఇంటికి గోడలాగా యజ్ఞక్రియలలో ఉపయోగించే ప్రధానవేదం. అందులోనూ యాజ్ఞికులలో ప్రధానుడైన అధ్వర్యు దుపయోగించే వేదం కాబట్టి 'అధ్వర్యువేద'మని పేరు పొందింది. ఈ యజుర్వేదం శుక్లయజుర్వేదమని, కృష్ణయజుర్వేదమని రెండు రకాలుగా ప్రచారంలో ఉన్నది. దక్షిణదేశంలో కృష్ణయజుర్వేదం, ఉత్తరదేశంలో శుక్లయజుర్వేదం బహుళప్రచారంలో ఉన్నాయి.

శుక్లయజుర్వేదసంహితకు **'వాజసనేయసంహిత'** అని పేరు. ఈ సంహితలో యజ్ఞప్రక్రియ కుపయోగించే మంత్రాలు కూర్చబడ్డాయి. కృష్ణయజుర్వేదంలో సంహితాగ్రంథం, బ్రాహ్మణగ్రంథం సంకీర్ణంగా ఉండగా, శుక్లయజుర్వేదంలో మంత్రాలన్నీ సంహితా భాగంగా ఉన్నాయి. బ్రాహ్మణగ్రంథం వేరుగానున్నది.

ఈ వాజసనేయసంహితలో రెండు శాఖలు ప్రచారంలో ఉన్నాయి. 1. మాధ్యందినశాఖ, 2. కాణ్వశాఖ. రెండు శాఖల్లోను మంత్రాలన్నీ ఇంచుమించు సమానంగా ఉన్నా పాఠప్రవచనాల్లో తేడా ఉన్నది. మంత్రపాఠంలో రెండు శాఖలకు ముందువెనుకల్లో తేడాలున్నాయి. పఠనక్రమంలో తేడాలున్నాయి. పాఠభేదం గద్యాత్మకమైన అర్థవాదభాగంలోనే ప్రత్యేకంగా కనబడుతుంది. పద్యాత్మకభాగంలో అనగా ఋక్కులనబడే మంత్రాల్లో కనపడదు.

ఈ శుక్లయజుర్వేదంలో నలభై అధ్యాయా లున్నాయి. అందులో మొదటి పద్దెనిమిది అధ్యాయాలు వేరుగా ఉన్న బ్రాహ్మణభాగంలో వ్యాఖ్యానింపబడ్డాయి. మిగిలిన ఇరవైరెండధ్యాయాల్లో పదిహేడు అధ్యాయాలకు బ్రాహ్మణభాగం విరళంగాను, ఐదు అధ్యాయాలకు బ్రాహ్మణభాగం లేకపోవడం కన్పడుతుంది. ఇదిగాక, చివరి ఇరవైరెండధ్యాయాలు కృష్ణయజుర్వేదంలో బ్రాహ్మణారణ్యక భాగాలుగా కన్పడుతున్నాయి. కాత్యాయనుని 'కృష్ణయజుర్వేదానుక్రమణిక'లో 26వ అధ్యాయం నుంచి 35వ అధ్యాయం వరకు 10 అధ్యాయాలు ఖిలభాగమని చెప్పబడింది. వాజసనేయసంహితలోని 40 అధ్యాయాల్లోను మొదటి 20 అధ్యాయాలు యజ్ఞప్రక్రియకుపయోగించేవి. 26వ అధ్యాయం మొదలు 29 అధ్యాయము వరకు మొదటి ఇరవై అయిదధ్యాయాలకు వ్యాఖ్యానరూపంగా కనపడతాయి. 30 నుంచి 39వ అధ్యాయం వరకు ఉన్న తొమ్మిది అధ్యాయాలు నరమేధ, పితృయజ్ఞ, విశ్వజిద్యాగాది విషయాలను ప్రతిపాదిస్తున్నాయి. నలభైయవ అధ్యాయం ఈశావాస్యోపనిషత్తు. శుక్లయజుర్వేదంలో ఋక్కులు చాలా చెప్పబడ్డాయి. అంతేకాదు యజ్ఞాలలో ఏ సందర్భంలో ఏ ఋక్కు పఠించాలో చక్కగా వర్ణించబడింది. కాబట్టి శుక్లయజుర్వేదసంహితల రెండుశాఖలలో ఇంచుమించు నాలుగవభాగం ఋఙ్మంత్రాలు, మిగిలిన మూడువంతులు అర్థవాదరూపంగా గాని యజ్ఞక్రియా బోధకంగా గాని కనపడుతుంది.

ఇంతవరకు మనం శుక్లయజుర్వేద స్వరూపాన్ని గురించి తెలిసికొన్నాం. ఈ వేదం యజ్ఞక్రియాస్వరూపాన్ని బోధిస్తుందని చెప్పబడింది. యజ్ఞమంటే దేవతలకు హవిర్భాగాలనిచ్చే క్రియాకలాపం. పరమేశ్వరు డొక్కడే అయినా వర్షం ఇచ్చేటప్పుడు ఇంద్రుడని, అపమృత్యువును జయించటానికి మృత్యుంజయుడు లేక రుద్రుడని, లోకసృష్టికి కారకుడై సూర్యుడుగాను, ఈ ప్రకారం మిత్రావరుణులని, అగ్ని అని అనేక దేవతాస్వరూపాలు కలవాడుగా చెప్పబడుతున్నాడు. ఆ యా దేవతలను హవిర్దానంచేత ఆరాధించే క్రియాకలాపమే యజ్ఞం. ఈ యజ్ఞాలు ఏడు పాకయజ్ఞాలని, ఏడు హవిర్యజ్ఞాలని, ఏడు సోమయజ్ఞాలని వైదిక సంప్రదాయం.

ఇలా దేవతారాధనాప్రధానంగా కృష్ణయజుర్వేదం లాగా శుక్లయజుర్వేదమున్నప్పటికి, ఐహికజీవితసంబంధమైన విషయాలకోసం కూడ దేవతారాధనం చెప్పబడింది. అనావృష్టిసందర్భంలో వర్షంకోసం వరుణజపాదులు, శత్రుజయంకోసం విహవ్యమంత్రాలు, జయలు, రాష్ట్రభృత్తులు, అభ్యాతనములనే మంత్రాలు ఉపదేశించబడ్డాయి. ఈ ప్రకారం ఐహికజీవితోపయోగంకోసం చెప్పబడ్డ మంత్రాలు చాలా ఉన్నాయి. మానవజీవితానికి ఐహికాముష్మికాలు రెండూ ముఖ్యమైనవే. ఆ యా వేదాల సంహితాభాగాలు చాలావరకు ఐహికోపయోగంకోసం, ఆరణ్యకోపనిషద్భాగాలు ఆముష్మికంకోసం ఉద్దేశింపబడ్డాయి. నవీనులకు వేదాల విషయంలో ఒక సందేహం కలుగవచ్చు. అతీంద్రియసత్యాలను ఉపనిషన్ముఖంగా ప్రతిపాదించడంలో వారి కాక్షేపం లేదుగాని, ఐహికజీవితంలో పుత్రసంపత్తికోసం, పశుసంపత్తికోసం, అర్థసంపత్తికోసం అలాగే అనావృష్టి లేకుండా వర్షంకోసం, యుద్ధంలో జయంకోసం, శత్రునాశనంకోసం ప్రార్థనలు చేసే ఈ వేదమంత్రాలు నిజంగా ఆ యా ఇష్టసిద్ధిని కలిగిస్తాయా? అని. కాని అల్పశక్తిగల మానవుడు సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాది గుణాలుగల పరమేశ్వరుని ఆరాధించాలని, ఆ ఆరాధన కేవలం లౌకికభాషలో గాక గొప్పశక్తిగల దివ్య మంత్రాలద్వారా ఆరాధిస్తే తప్పక ఫలితం ఉంటుందని మహర్షుల అభిప్రాయం. వేదాలలో విశ్వాసంలేని బౌద్ధచార్వాకాదులు హేళనాపూర్వకంగా ఇలా ఆక్షేపిస్తారు. ఒకడు ఒకనదికి ఇవతలిఒడ్డున ఉండి ఓ పరమేశ్వరా! నన్ను అవతలి ఒడ్డుకు తీసుకొని పొమ్మని ప్రార్థిస్తే ఆ ప్రార్థన సిద్ధిస్తుందా? అని. దానికి ఇది సమాధానం - (గామానయ దేవదత్త!) దేవదత్త! ఆవుని తీసుకొనిరా! అని శబ్దప్రయోగం

చేయగానే దేవదత్తుడు ఆవును తీసికొని వస్తున్నాడు కదా! లౌకికశబ్దానికే అంతటి శక్తి కన్పడుతుండగా స్వరచ్ఛందోబద్ధమై మహర్షులచేత దర్శింపబడిన ఈ వైదిక మంత్రాలకు ఆ శక్తి ఎందుకుండకూడదు? కాబట్టి మంత్రోచ్చారణలో స్వరవర్ణాదిలోపం లేని మంత్రాలు శబ్దప్రధానాలై శక్తిమంతాలై ఆయుధాల్లాగా పనిచేస్తాయని మహర్షులు చెప్పారు.

మంత్రాలు మహర్షులచేత దర్శింప బడ్డాయని శాస్త్రవచనం. మహర్షులు తీవ్రతపోనిష్ఠలో నుండగా ఆ మంత్రాలు శ్రుతిగోచరాలైనాయి. అందుచేతనే వేదాలకు శ్రుతులు అనే పేరేర్పడింది.

యజుర్వేదములోని మంత్రములు కొన్ని నియతాక్షరావసానాదికములై పాదబద్ధములైన ఛందములుగా నుండును. మరికొన్ని కేవలము గద్యాత్మకములై యుండును. ఋక్సామభిన్నములైన మంత్రము లన్నియు యజుర్వేదములో సంకలింపబడినవి. 'శేషే యజుః' అను మీమాంసాసూత్రము వివరించును. కాని ఋగ్వేదములోని మంత్రములు కొన్ని యజుర్వేదములో కూడ కనిపించును. యజ్ఞవిధానమును దృష్టిలో నుంచుకొని చేసిన విభాగము కనుక ఆ యీ విధమైన సంకలన మావశ్యకమై యుండవచ్చును. యజుశ్శబ్దము దేవపూజాసంగతీకరణదానాదులకు పర్యాయము. యజ్ఞాచరణము దేవతాప్రీతికొరకు. దానివలన సువృష్టికలిగి, లోకము సుభిక్షమై, సమస్త ప్రాణికోటికి సుఖశాంతిమయమైన జీవనము కలుగునని విశ్వాసము.

### శుక్ల యజుస్సంహిత

ఈ సంహితలో యజ్ఞక్రియల్లో ఉపయోగింపబడే మంత్రాలు అర్థవాదాలు మాత్రమే ఉన్నాయి. ఇందులో కృష్ణయజుస్సంహితలో లాగ బ్రాహ్మణ భాగాలు కలిసి ఉండవు. అవి వేరే బ్రాహ్మణ గ్రంథాలుగానే ఉన్నాయి. అందువల్ల ఇందులోని విషయాలు విడి విడిగా ఉండి పాఠకులకు బుద్ధివ్యామోహాన్ని కలిగించకుండా విశదంగా ఉంటాయి. కనుకనే ఈ వైశద్యాన్ని తెలియజేసే "శుక్ల" పదాన్ని చేర్చి దీన్ని "శుక్లయజుర్వేద"మని అన్నారు.

ఈ సంహితకు మాధ్యందినపాఠం, కాణ్వపాఠమని రెండు పాఠా లున్నాయి. ఈ రెండింటికి పెద్ద తేడా లేదు. గద్యాత్మకమైన అర్థవాదభాగాలను వివరించడంలో మాత్రం కొద్ది తేడా కనిపిస్తున్నది. ఇందులో "వాజసనేయిసంహిత"అని పిలువబడేది మాధ్యాందిన పాఠం.

ఈ వాజసనేయిసంహితలో సగభాగం పద్యాత్మకమైంది. అర్థవాదరూపమైన మిగతా సగం గద్యాత్మకమైంది. అందులో సుమారు 700 మంత్రాలు ఋగ్వేదంనుంచి తీసుకోబడ్డాయి. ఇవి సుమారు ఆ సంహితలో 4వ వంతు మంత్రాలై ఉంటాయి.

మానవులందరు బలవంతులు, ఓజస్వంతులు, తేజశ్శాలురు కావాలని యజుర్వేదం ఉపదేశిస్తుంది. సమాజంలో ప్రతివాడు 'సరస్వతి'ని అంటే 'విద్య'ను 'ఇడను' అంటే 'రాష్ట్రా'న్ని 'భారతి'ని అంటే 'సంస్కృతి'ని ఈ మూడు శక్తులను పెంచుకోవాలని ఈ వేదం ఉపదేశిస్తున్నది.

యజ్ఞాచరణమునకు వలయు కాలజ్ఞానమునకై జ్యోతిశ్శాస్త్రమును, యజ్ఞవేదీ నిర్మాణవిధిపరిజ్ఞానమునకై వాస్తుశాస్త్రమును, మంత్రార్థ నిర్ణయమునకై శిక్షావ్యాకరణశాస్త్రాదులును యజుర్వేదము ననుసరించి వికసించినవి. యజ్ఞములు హవిర్యజ్ఞ, సోమయజ్ఞ, పాకయజ్ఞము లని ముప్పిధములు. ఇవి తిరిగి ఒక్కొక్కటి ఏడేసి విధములు. గృహస్థులు నిత్యము జరుపు దేవ, ఋషి, పితృ మనుష్య భూత తర్పణాదులు కూడ యజ్ఞములే. రాజసూయము, అశ్వమేధము, సర్వమేధము మున్నగునవి విశేషయజ్ఞములు. ఇవి దీర్ఘసత్రములు - రాజులో, రారాజులో నిర్వహింపదగినవి.

సూతసంహిత, ముక్తికోపనిషత్తు మున్నగునవి యజుర్వేదమునకు శతాధికముగా శాఖ లేర్పడినట్లు చెప్పును 'ఏకశత మధ్వర్యుశాఖాః' అని పతంజలి దీనికి నూరుశాఖలున్నట్లు చెప్పెను. చరణవ్యూహములో దీనికి 86 శాఖలు మాత్రమే కలవని వ్రాయబడెను. కాని నేడు మనకు శుక్లయజుశ్శాఖలు రెండును, కృష్ణయజుశ్శాఖలు నాల్గును చేరి మొత్తము ఆరు శాఖలకు మాత్రమే సంహితలు లభించుచున్నవి. వీటికి తిరిగి కొన్ని ఉపశాఖ లున్నట్లు చెప్పుదురు.

శుక్లయజుర్వేదశాఖలకు సంబంధించినంతవరకు మనకిప్పుడు లభ్యమగుచున్నవి మాధ్యందిన, కాణ్వసంహితలు రెండు మాత్రమే. వీనిలో మాధ్యందినసంహిత మిక్కిలి ప్రసిద్ధము. దీనినే వాజసనేయిసంహిత అని కూడ పేర్కొందురు. ఇది 40

అధ్యాయముల గ్రంథము. దీనిలో చివరి 15 అధ్యాయములను ఖిలాధ్యాయములని పేర్కొందురు. అధ్యాయము లన్నియు చేరి 303 అనువాకములుగను, 1975 కండికలుగను విభజింపబడినవి. కండికలే మంత్రములు. ఈ సంహితలోని మొదటి అధ్యాయమునకు ప్రజాపతియు, అంతిమాధ్యాయమునకు దంధ్య అథర్వణుడును ఋషులుగా చెప్పబడిరి. సంహితలో చేర్చకున్నను 100 అధ్యాయములు గల శతపథబ్రాహ్మణము ఈ సంహితకే సంబంధించును. కాణ్వసంహితలో ఈ సంహితలో కన్న 111 కండికలు (మంత్రములు) హెచ్చు. ఆ సంహితలో కూడ ఖిల్య శుక్రీయ మంత్రములు కలసియే యున్నవి. కాణ్వ లొకప్పుడు ఉత్తరప్రదేశములో నుండినట్లు సాహిత్యకాధారములు సాక్ష్యమిచ్చును. నేడు దక్షిణదేశములో స్వల్పముగా నున్నట్లు వినికిడి. సాయణాచార్యుడు కాణ్వసంహితకు భాష్యము వ్రాసెను. వాజసనేయమునకు ఉవ్వట మహీధరాదుల భాష్యములు దొరుకుచున్నవి. 19వ శతాబ్దంలో మహర్షి దయానందసరస్వతీస్వామి యజుర్వేదమునకు సంపూర్ణభాష్యమును వ్రాసినాడు. ప్రస్తుతము ఈ భాష్యమునే ప్రామాణికమైనదని యెంచి ప్రచురించు చున్నాము.

అరవిందయోగి తానువ్రాసిన 'బంకిం – తిలక్ – దయానంద'అను గ్రంథమునందు దయానంద వేదభాష్యమును గురించి యిట్లు స్వాభిప్రాయమును ప్రకటించినాడు. "వేదాలకు చిట్టచివరి సంపూర్ణమైన వ్యాఖ్యానమేదైనను కానిండు. వేదార్థపు సత్యశైలిని ప్రప్రథమముగా తెలుసుకొన్నది స్వామిదయానందులనియు, ఈ విషయమునం దాయన సదా గౌరవనీయులనియు నాకు గట్టి నమ్మకమున్నది. దయానందుని దివ్యదృష్టి యుగయుగాల నుండి వస్తూన్న మూర్ఖత్వము మధ్యనుండి, నలువైపుల ఆవరించియున్న అజ్ఞానాంధకారమునుండి, ఘోరమైన వ్యవస్థాశూన్యమైన లోకము మధ్యనుండి సత్యమును గ్రహించగలిగినది. సారగర్భితమును, మహత్వపూర్ణమును నగు వస్తువెద్దియున్నదో దానిని ఆయన గ్రహించగలిగెను. చిరకాలమునుండి మూసిపెట్టబడియున్న ద్వారముల బీగములను తనిపెట్టాడు. సత్యప్రవాహమును నిర్బంధించియుంచిన సీళ్లను (ముద్రలను) చిదుకగొట్టి ఛిన్నాభిన్నమొనర్చినాడు."

ఇటుల అరవిందయోగిచే ప్రశంసించబడిన దయానందకృతభాష్యమును ఆంధ్రులకందించుచున్నందులకు మే మెంతయో హర్షించుచున్నాము.

దయానందమహర్షి క్రీ.శ. 1824లో గుజరాతు రాష్ట్రములో మౌర్వీరాజ్యమందు టంకారా అను గ్రామములో ఔదీచ్యబ్రాహ్మణ కుటుంబమున జన్మించి బాల్యముననే యజుర్వేదమును కంఠస్థముచేసెను. శివరాత్రిఘట్టము, చెల్లెలు, పినతండ్రి మరణసంఘటన దయానందునిలో నిజమైన ఈశ్వరుని దర్శించుట, మృత్యువును జయించుట అను కోరికలను పుట్టించినవి. ఆ కోరిక వైరాగ్యముగా మారి 22వ ఏట గృహత్యాగమునకు కారణమైనది. 15 సం॥రాలు పర్యటించి పరితపించి, ప్రయత్నించి సఫలత సాధించెను. తనవలెనే మానవులందరు ఈశ్వరసాక్షాత్కారము చేసుకొనవలెనని మృత్యువును జయించవలెనని కోరి జీవితాంతము దానికొరకే కృషిచేసెను.

గురువు విరజానందునిసన్నిధిలో 3 సం॥రాలు నిజమైన విద్యనభ్యసించి వేదములు ఈశ్వరరచనలని, సత్యగ్రంథములని స్వతః ప్రమాణములని తెలుసుకొన్నాడు. ఉపవేదములు, వేదశాఖలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, దశోపనిషత్తులు వేదవిద్యలను ప్రతిపాదించు గ్రంథములని, వాటిలోనూ వేదములకు విరుద్ధముగా నున్నవాటిని విడిచిపెట్టవలెనని, ఆరు వేదాంగములు, ఆరు ఉపాంగములు వేదసిద్ధాంతములను ప్రతిపాదించునని, శాస్త్రాలలో పరస్పరవిరోధము లేదని తెలిపినాడు. వీటిని శాశ్వతముగా ప్రచారము చేయుటకు ఆర్యసమాజమును స్థాపించినాడు. తన జీవిత కాలమున ఉత్తరభారతమునందే పర్యటించి అనేక అంశాలలో శాస్త్రార్థములను,సంఘసంస్కరణలను చేపట్టినాడు. దక్షిణభారతమునకు రాలేకపోయినందున ఆంధ్రదేశములో ఆర్యసమాజ ప్రచారము చాలా తక్కువగా నున్నది. అయినను వారి సిద్ధాంత ప్రభావము వలన అనేకులు ప్రేరణపొంది ఆంధ్రములో ఆర్యసమాజమునకు పునాదులు వేసినారు. కొందరు ప్రేరితులై ఉత్తరభారతదేశము వెళ్ళి ఆర్షగురుకులములలో వేదాదిశాస్త్రాలనధ్యయనం చేసి తిరిగివచ్చి వైదిక సాహిత్య నిర్మాణమును, ఆర్యసమాజ స్థాపనలను చేసినారు. అట్టివారిలో మొదటగా చెప్పుకోదగినవారు మద్గురువరేణ్యులు పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యులు. వీరు పంచశాస్త్రములను, దశోపనిషత్తులతో పాటు దయానందులవారి గ్రంథములను చాలావరకు అనువాదం చేసినారు. కాని వయోభారము (100) వలన వేదాల ననువదించలేకపోయిరి.

ఇక తెలుగులో వైదికసాహిత్యనిర్మాణమును చేసిన వారిలో ప్రముఖంగా చెప్పుకోదగినవారు పం. అన్నేకేశవార్యశాస్త్రి గారు. వారు దయానందులవారి సంపూర్ణయజుర్వేదభాష్యమును ఎన్నోశ్రమప్రయాసలకోర్చి అనువదించి 1957-60 ప్రాంతములో ముద్రించినారు. అది నే డలభ్యము. పండితలోకమలహరిగారు బహు చక్కగా నాలుగువేదముల ననువదించినారు కావున వాటినే ముద్రించుచున్నాము. శాస్త్రిగారు ప్రచురించిన యజుర్వేదభాష్యమునుండి సంస్కృతభాగమును గ్రహించినాము. మంత్రగతవిషయములను సేకరించి ఆయా అధ్యాయములకు విషయసూచికలను కూడ ముద్రించినాము. వారి భాష్యము మాకెంతో మార్గదర్శనము గావించినది. వారి ఆత్మకు శతాధికవందనములు.

**చివరగా ఒక్కమాట**. దయానందుని కంటే పూర్వము కొందరు వేదములకు భాష్యములను తమకు తోచినది-తెలిసినది వ్రాసినారు. దయానందుని సత్యభాష్యఝంఝూమారుతము ధాటికి అవి దూదిపింజములుగా కొట్టుకొని పోయినవి. ఇక దయానందుని తరువాత వేదములకు స్వవ్యాఖ్యానముల నెవ్వరూ చేయసాహసించలేదు. కాని నిన్నమొన్న తెలుగులో 'దాశరథి'యను వారు తెలుగులో "వచనవేదసంహితల"ని ఏవేవో వ్రాసి ప్రకటించినారు. **"దాశరథి వేదసంహితలు జ్ఞానరహితాలు - దోషభరితాలు"** అని ఒక కరపత్రిక తీసి గతంలో నేను ఎంతో వ్యతిరేకించినాను. వేదమంటేనే తెలియని వారికి ఏవేవో తమకు తోచిన పిచ్చిమాటలు వ్రాసి ఇవే వేదములని, చెట్టుపేరు చెప్పి కాయలమ్మినట్లుగా సామాన్యజనులను మోసగించినారు. అంగట్లో కూరగాయలు తెచ్చి వెంటవెంటనే వండుకొని తిన్నట్లుగా వేదము ముఖమునే చూడని దాశరథిగారు ఎక్కడెక్కడో తిరిగి వేదసంహితలను దొరికించుకొని వెంటనే అనువాదమునకు పూనుకున్నట్లు తమ పీఠికలో మహా గొప్పగా వ్రాసుకున్నారు. పైగా వేదసంహితలకు రచయితనని.....ఇంకా ఏమేమో స్వోత్కర్షను ప్రకటించుకున్నారు. వృక్షములేని చోట ఆముదపు వృక్షమే మహావృక్షమన్నట్లు.....నాలుగువేదాలకు తెలుగు కర్తనని ప్రకటించుకొని పేరును - సొమ్మును మూటగట్టుకొని వేదమంటే ఎంతో గౌరవమున్న తెలుగువారి మనోభావనలను కూకటివ్రేళ్ళతో సహా పెకిలించి వేసినారు. ఏ వొక్క మంత్రానికి కూడా వీరు వ్రాసిన భావము పొసగదు. మిడిమిడి సంస్కృతము వచ్చినంత మాత్రాన వేదార్థం గోచర మవుతుందా?

**దాశరథిగారూ! తెలుసుకోండి:-** 1) వేదాలను సాంగోపాంగంగా బ్రాహ్మణారణ్యకస్మృతిసూత్రాదిగ్రంథాలను బాగా అధ్యయనంచేసి తపోమయజీవితమును గడుపుతూ అష్టాంగయోగసాధకుడై సమాధిస్థితిని పొందినవాడే స్వయంగా వేదభాష్యం చేయయోగ్యుడు.

2) వేదం సార్వకాలికం, సార్వజనికం, సార్వభౌమికం, వైజ్ఞానికం, హేతుబద్ధం, బుద్ధిపూర్వకం, స్వతఃప్రామాణికం. ఇందులో ఏమాత్రం కూడా తేడా ఉండడానికి వీలులేదు.

కాని, మీరు వ్రాసిన వేదసంహితలు అలాలేవు. ఎన్నో అనర్థాలు, అపార్థాలు చోటు చేసుకున్నాయి. సారంలేని పిచుగా ఉన్నాయి. వేదమంటే ఇదేనా - ఇంతేనా అన్న చందంగా ఉన్నాయి. పైగా రచయితనని వ్రాసుకున్నారు. ఏవో కల్పిత కథలను, నవలలను వ్రాసుకొనకుండా చేతకాని యోగ్యతలేని ఈ వేదానువాదకార్యానికి పూనుకోవడం తగునా?

మీ అజ్ఞానకృతవేదాలు అనార్ష ఆధారాలు. వైదికసిద్ధాంతానికి అపవిత్రకల్పనలు. వేదనిఘంటువిరుద్ధాలు. ధాత్వర్థ యౌగికార్థరహితాలు, అవైజ్ఞానిక అజ్ఞానవికృతకల్పనలు, నాస్తికజీవనపూరితాలు, వేదగౌరవప్రతిష్ఠాప్రతిబంధకాలు.

ఓ మహాశయా! దయానందభాష్యాన్ని చదివి ఇకనైనా కళ్ళుతెరచుకో. వేదానికి చేసిన ద్రోహానికి, ప్రజలను తప్పుత్రోవపట్టించిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకో. వేదాలకు మూఢార్థలనువ్రాస్తున్న సమకాలికులు కావున ఇంతగా వ్యతిరేకిస్తున్నాం. అన్యథా కాదు. మీకు తోచిన ఏదైనా ఒక మంత్రాన్ని విడదీసి నాకు అర్థం చెప్పమని గతంలో ఎన్నోపర్యాయములు మిమ్ములను ప్రత్యక్షంగా పరోక్షంగా అడిగినాను. తప్పించుకున్నారు.

ఇప్పుడు దయానందకృత వేదభాస్కరుడు ఆంధ్రములో ఉదయిస్తున్నాడు. ఇక మీ అజ్ఞానకృతవేదాంధకారము తుడిచిపెట్టుకుపోకతప్పదు. సత్యవేదజ్ఞానకిరణాలు ప్రతివ్యాదిలో ప్రసరింపకమానదు. జ్ఞానులు సత్యదృష్టితో పరిశీలింతురు గాక! విజ్ఞులు దోషములను పరిహరించి గుణములను గ్రహింతురుగాక!.

**- సంపాదకుడు**

# యజుర్వేదభాష్యము

## 1వ అధ్యాయము - విషయసూచిక

ఇందులో 31 మంత్రములు, 43 ఛందస్సులు, 1874 అక్షరములు



గమనిక :-

మహర్షి ప్రతి అధ్యాయము చివర ఒకే పేరాలో అందలి విషయముల పట్టికను వరుసగా వ్రాసినారు. కాని తెలుగు పాఠకుల సౌకర్యార్థము ఆ యా మంత్రములలోని విషయములను విషయసూచికగా ఇచ్చుట నిర్దేశించుచున్నాము. అన్ని అధ్యాయములకు ఇటులనే విషయసూచికలుండును. పాఠకులు గమనింతురుగాక!

- సంపాదకుడు.

ఓ౩మ్

# యజుర్వేద భాష్యమ్

## అథ యజుర్వేదభాష్యారంభః క్రియతే

యో జీవేషు దధాతి సర్వసుకృతజ్ఞానం గుణైరీశ్వర
స్తం నత్వా క్రియతే పరోపకృతయే సద్యః సుబోధాయ చ
ఋగ్వేదస్య విధాయ వై గుణగుణిజ్ఞానప్రదాతుర్వరం
భాష్యం కామ్యమథో క్రియామయయజుర్వేదస్య భాష్యం మయా ॥౧॥

చతుస్త్ర్యష్ట్యేకాబ్దేఽవనిసహితైర్విక్రమసరే
శుభే పౌషే మాసే సితదలభవిశ్వోన్మితతిథౌ
గురోర్వారే ప్రాతః ప్రతిపద మతీష్టం సువిదుషాం
ప్రమాణైర్నిబద్ధం శతపథనిరుక్తాదిభిరపి ॥౨॥

విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ । యద్భద్రం తన్న ఆసువ ॥ య.30-3॥

ఈశ్వరేణ జీవానాం గుణగుణివిజ్ఞానోపదేశాయ హ్యృగ్వేదే సర్వాన్ పదార్థాన్ వ్యాఖ్యాయేదానీం మనుష్యైస్తేభ్యో యథాయథోపకార గ్రహణాయ క్రియాః కథం కర్తవ్యా ఇత్యుపదిశ్యతే.

తత్ర యద్యదంగం యద్యత్సాధనం చాపేక్షితం తత్తదత్ర యజుర్వేదే ప్రకాశ్యతే. కుతః? యావత్ క్రియానిష్ఠం జ్ఞానం న భవతి నైవ తావచ్ఛ్రేష్ఠం సుఖం కదాచిత్ జాయతే. విజ్ఞానస్య క్రియాహేతుత్వ ప్రకాశకారకత్వావిద్యా నివర్తకత్వాధర్మే ప్రవర్తకత్వైర్ధర్మపురుషార్థయోః సంయోజకత్వాత్. యద్యత్కర్మ విజ్ఞాననిమిత్తం భవతి తత్తత్సుఖ జనకం సంపద్యతే. తస్మాన్మనుష్యైర్విజ్ఞానపురఃసరమేవ కర్మానుష్ఠానం కర్తవ్యమ్. కుతః జీవస్య చేతనత్వా దకర్మతయా స్థాతుమశక్యత్వాత్. నైవ కశ్చిదాత్మమనఃప్రాణేన్ద్రియచాలనేన వినా క్షణమపి స్థాతుమ్మర్హతి.

యజుర్భిర్యజన్తీత్యుక్తప్రామాణ్యాత్ యేన మనుష్యా ఈశ్వరం ధార్మికాన్ విదుషశ్చ పూజయన్తి, సర్వచేష్టాసాంగత్యం శిల్పవిద్యాసంగతికరణం శుభవిద్యాగుణదానం యథా యోగ్యతయా సర్వోపకారే శుభే వ్యవహారే విద్వత్సు చ ద్రవ్యాది వ్యయం కుర్వన్తి తద్యజుః అన్యత్సర్వం భూమికాయాం ప్రకాశితం తత్ర ద్రష్టవ్యమ్. సా భూమికా చతుర్ణాం వేదానామేకైవ వర్తతే.

అస్మిన్ యజుర్వేదే చత్వారింశదధ్యాయాః సన్తి, తత్రైకైకస్మిన్నధ్యాయే మంత్రాః సంఖ్యాయన్తే.

| అధ్యాయః | ౧, | ౨, | ౩, | ౪, | ౫, | ౬, | ౭, | ౮, | ౯, | ౧౦, | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మన్త్రాః | ౩౧ | ౩౪ | ౬౩ | ౩౭ | ౪౩ | ౩౭ | ౪౮ | ౬౩ | ౪౦ | ౩౪ | ౪౩౦ |
| అధ్యాయః | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ | ౧౬ | ౧౭ | ౧౮ | ౧౯ | ౨౦ | |
| మన్త్రాః | ౮౩ | ౧౧౭ | ౫౮ | ౩౧ | ౬౫ | ౬౬ | ౯౯ | ౭౭ | ౯౫ | ౯౦ | ౭౮౧ |
| అధ్యాయః | ౨౧ | ౨౨ | ౨౩ | ౨౪ | ౨౫ | ౨౬ | ౨౭ | ౨౮ | ౨౯ | ౩౦ | |
| మన్త్రాః | ౬౧ | ౩౪ | ౬౫ | ౪౦ | ౪౭ | ౨౬ | ౪౫ | ౪౬ | ౬౦ | ౨౨ | ౪౪౬ |
| అధ్యాయః | ౩౧ | ౩౨ | ౩౩ | ౩౪ | ౩౫ | ౩౬ | ౩౭ | ౩౮ | ౩౯ | ౪౦ | |
| మన్త్రాః | ౨౨ | ౧౬ | ౯౭ | ౫౮ | ౨౨ | ౨౪ | ౨౧ | ౨౮ | ౧౩ | ౧౭ | ౩౧౮ |

చత్వారింశదధ్యాయస్థాః సర్వే మన్త్రా ఏతావంతః ఏకోనవింశతిః శతాని ౧౯౭౫
పంచసప్తతిశ్చ సన్తి.

భాషార్థము:- ఇప్పుడు యజుర్వేదభాష్య మారంభించబడుచున్నది. సమస్త జీవులకు గుణములచే సకలసుకృతజ్ఞానము నిచ్చునట్టి పరమేశ్వరునకు నమస్కరించి పరోపకారార్థమును శీఘ్రముగా సుబోధ మగుట కీ భాష్యము వ్రాయబడుచున్నది. గుణగుణిజ్ఞానము నొసగు ఋగ్వేదమునకు శ్రేష్ఠభాష్య మొనరించి, క్రియామయమైన యజుర్వేదమునకు శతపథనిఘంటునిరుక్తాదుల దిలకించి భాష్య మొనరించ నిచ్చగించితిని.

వి.సం.౧౯౩౪ పుష్య శుక్ల త్రయోదశి గురువారము ప్రాతఃకాలమున విద్వాంసుల కిష్టముగురీతి ప్రతిపదమునకు శతపథనిరుక్తాది ప్రమాణముల నిచ్చి భాష్యము వ్రాయుట కారంభించుచున్నాను.

(విశ్వాని).... ఈ మంత్రమునకర్థము ఋగ్వేదాదిభాష్యభూమికయందు వేసియుంటిని. ఈశ్వరుడు ఋగ్వేదమునందు సకల పదార్థములను జీవులకు గుణగుణివిజ్ఞానోపదేశార్థమై ప్రకటించి యుండెను. ఆ మనుష్యు లేయే పదార్థములచే నే యే విధముల యథాయోగ్యోపకారము పొందగలరో, ఆయా క్రియల నిందుపదేశించు చున్నాడు. అం దే యే యంగములు, ఏ యే సాధనము లపేక్షితములో నీ యజుర్వేదమునందు ప్రకాశించబడుచున్నవి. ఎటులన, క్రియానిష్ఠజ్ఞానము లభించనిదే శ్రేష్ఠసుఖ మెన్నటికిని లభించదు.

క్రియాహేతువుల దెలుపుట, అవిద్యను నివర్తించుట, అధర్మమునందు అప్రవృత్తి, ధర్మపురుషార్థముల మేళన మొనర్చుట ఇవి యన్నియు విజ్ఞానమునకు హేతువులు. విజ్ఞాన నిమిత్తమగు కర్మయే సుఖజనకము. కావున మానవులు విజ్ఞానపురస్సరముగా కర్మానుష్ఠాన మొనర్చవలయును.

ఏ జీవుడు మనఃప్రాణవాయుశరీరేంద్రియములు సంచలన మొనర్చకుండ నొకక్షణము నుండజాలడు. జీవుడల్పజ్ఞుడు, ఏకదేశీయుడు, చేతనుడు కావున పరమాత్మ ఋగ్వేదమంత్రములద్వారా గుణగుణి జ్ఞానమును, యజుర్వేదమంత్రముల ద్వారా సర్వక్రియల ననుష్ఠానమును ప్రసిద్ధపరచెను. ఋగ్యజుశ్శబ్దముల యర్థమును వింటియే. మనుష్యు లెద్దానిచే పరమేశ్వరునినుండి పృథివిపర్యంతము సకల పదార్థముల జ్ఞానము, ధార్మిక విద్వాంసుల సాంగత్యము, అశేష శిల్పక్రియాసహిత విద్యల సిద్ధి, శ్రేష్ఠవిద్యల దానము, ఆ యా విద్యల యథాయోగ్యవ్యవహారముచే సర్వోపకారానుకూలము ద్రవ్యముల వ్యయమొనరించుట యజుర్వేద వాక్యార్థము. ఇంకను ఈ శబ్దముల యభిప్రాయము భూమికయందు ప్రకటించితిని. ఆ భూమిక నాలుగు వేదముల కొక్కటియే కావున నందు గాంచవగును.

# యజుర్వేదభాష్యమ్

# ప్రథమోఽధ్యాయః

(అజ్మీరు వైదికయంత్రాలయమునుండి వి.శ.౧౯౫౦న వెలువడిన మహర్షి దయానంద భాష్యమున కనువాదము)

**అస్మిన్నధ్యాయే ఏకత్రింశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్**

౧. ఇషే త్వేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్ఋషిః, సవితా దేవతా, ఇషే త్వేత్యారభ్య భాగం పర్యన్తస్య స్వరాడ్బృహతీఛన్దః, మధ్యమః స్వరః, అగ్రే సర్వస్య బ్రాహ్మ్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథోత్తమకర్మసిద్ధ్యర్థమీశ్వరః ప్రార్థనీయ ఇత్యుపదిశ్యతే.

ఋగ్వేదమునకు భాష్యము వ్రాసిన పిదప యజుర్వేద భాష్యము ప్రారంభించబడుచున్నది. దీని ప్రథమాధ్యాయపు ప్రథమమంత్రమున ఉత్తమోత్తమ కర్మల సిద్ధికై మానవులు ఈశ్వరప్రార్థన మవశ్యముగ చేయవలయునను విషయ మిందు ప్రకాశపరచబడినది.

౧. ఓ౩మ్. ఇషే త్వోర్జే త్వా వాయవ స్థ దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ
కర్మణఽఆప్యాయధ్వమఘ్న్యాఽఇన్ద్రాయ భాగం ప్రజావతీరనమీవాఽ
అయక్ష్మా మా వ స్తేనఽఈశత మాఘశꣳసో ధ్రువాఽఅస్మిన్
గోపతౌ స్యాత బహ్వీర్యజమానస్య పశూన్పాహి॥౧॥

పదవిభాగము :- ఇషే, త్వా, ఊర్జే, త్వా, వాయవః, స్థ, దేవః, వః, సవితా, ప్ర, అర్పయతు, శ్రేష్ఠతమాయేతి శ్రేష్ఠ+తమాయ, కర్మణే, ఆ, ప్యాయధ్వమ్, అఘ్న్యాః, ఇన్ద్రాయ, భాగం, ప్రజావతీరితి ప్రజా + వతీః, అనమీవాః, అయక్ష్మాః, మా, వః, స్తేనః, ఈశత, మా, అఘశꣳస ఇత్యఘ + శꣳసః, ధ్రువాః, అస్మిన్, గోపతావితి గో+పతౌ, స్యాత, బహ్వీః యజమానస్య, పశూన్, పాహి.॥౧॥

పదార్థః :-(ఇషే) అన్నవిజ్ఞానయోః ప్రాప్తయే. ఇష మిత్యన్ననామసు పఠితమ్. నిఘం. ౨.౭. ఇషతీతి గతికర్మసు పఠితమ్. నిఘం. ౨.౧౪. అస్మాద్ధాతోః క్విపి కృతే పదం సిధ్యతి. (త్వా) విజ్ఞానస్వరూపం పరమేశ్వరమ్ (ఊర్జే) పరాక్రమోత్తమరసలాభాయ. ఊర్గ్రసః శ॥౫॥౧॥౨॥౮॥ (త్వా) అనన్తపరాక్రమానందరసఘనమ్, (వాయవః) సర్వక్రియాప్రాప్తిహేతవః స్పర్శగుణా భౌతికాః ప్రాణాదయః. వాయురితి పదనామసు పఠితమ్. నిఘం. ౫.౪; అనేన ప్రాప్తిసాధకా వాయవో గృహ్యన్తే. 'వా' గతిగన్ధనయోరిత్యస్మాత్ కృవాపా.... ఉ. ౧. ౧. అనేనాప్యుక్తార్థో గృహ్యతే. (స్థ) సన్తి. అత్ర పురుషవ్యత్యయేన ప్రథమపురుషస్య స్థానే మధ్యమపురుషః (దేవః) సర్వేషాం సుఖానాం దాతా సర్వవిద్యాద్యోతకః. దేవో దానాద్వా దీపనాద్వా ద్యోతనాద్వా ద్యుస్థానో భవతీతి వా యో దేవః సా దేవతా. - నిరు. ౭-౧౫. (వః) యుష్మాకం (సవితా) సర్వజగదుత్పాదకః సకలైశ్వర్యవాన్ జగదీశ్వరః (ప్రార్పయతు) ప్రకృష్టతయా సంయోజయతు, (శ్రేష్ఠతమాయ) అతిశయేన ప్రశస్తః సోఽతిశయిత స్తస్మై యజ్ఞాయ (కర్మణే) కర్తుం యోగ్యత్వేన సర్వోపకారార్థాయ (ఆప్యాయధ్వమ్) ఆప్యాయామహే వా. అత్ర పక్షే వ్యత్యయః (అఘ్న్యాః) వర్ధయితుమర్హాః హన్తుమనర్హా గావ ఇన్ద్రియాణి పృథివ్యాదయః పశవశ్చ. అఘ్న్యా ఇతి గోనామసు పఠితమ్. నిఘం. ౨.౧౧; (ఇన్ద్రాయ) పరమైశ్వర్యయోగాయ (భాగం) సేవనీయం భాగానాం ధనానాం జ్ఞానానాం వా భాజనమ్. (ప్రజావతీః) భూయస్యః ప్రజావర్తన్తే యాసు తాః. అత్ర భూమ్న్యర్థే మతుప్. (అనమీవాః) అమీవో వ్యాధిర్న విద్యతే యాసు తాః. 'అమరోగే' ఇత్యస్మాద్ బాహులకాదౌణాదిక ఈవన్ ప్రత్యయః. (అయక్ష్మాః) న విద్యతే యక్ష్మా రోగరాజో యాసు తాః. యక్ష ఇత్యస్మాత్. అర్తిస్తు.... ఉ॥ ౧. ౧౩౮. అనేన మన్ప్రత్యయః. (మా) నిషేధార్థే (వః) తాః. అత్ర పురుషవ్యత్యయః. (స్తేనః) చోరః (ఈశత) ఈష్టాం సమర్థో భవతు. అత్ర లోడర్థే లఙ్. బహులం ఛన్దసీతి శపో లుగభావః. (మా) నిషేధార్థే (అఘశంసః) యోఽఘం పాపం శంసతి సః (ధ్రువాః) నిశ్చలసుఖహేతవః (అస్మిన్) వర్తమానే ప్రత్యక్షే. (గోపతౌ) యో గవాం పతిః స్వామీ తస్మిన్ (స్యాత) భవేయుః (బహ్వీః) బహ్వ్యః అత్ర. వా ఛన్దసి అ. ౬.౧.౧౦౬ అనేన పూర్వసవర్ణదీర్ఘాదేశః (యజమానస్య) యః పరమేశ్వరం సర్వోపకారం ధర్మం చ యజతి తస్య విదుషః, (పశూన్) గోఽశ్వహస్త్యాదీన్ శ్రియః ప్రజా వా. శ్రీర్హి పశవః. శ. ౧.౬.౩,౩౬ ప్రజా వై పశవః. శ. ౧.౪.౬.౧౭. (పాహి) రక్ష. అయం మన్త్రః. శ. ౧.౫.౪.౧-౮ వ్యాఖ్యాతః.॥౧॥

అన్వయః:-హే మనుష్యాః! అయం సవితా దేవో భగవాన్ వాయవస్థ యాన్యస్మాకం వో యుష్మాకం చ ప్రాణాన్తఃకరణేన్ద్రియాణి సన్తి తాని శ్రేష్ఠతమాయ కర్మణే ప్రార్పయతు. వయమిషేఽన్నాయోత్తమేచ్ఛాయై సవితారం దేవం త్వా త్వాం తథోర్జే పరాక్రమోత్తమరసప్రాప్తయే భాగం భజనీయం త్వా త్వాం సతతమాశ్రయామః ఏవం భూత్వా యూయ మాప్యాయధ్వం

వయం చాప్యాయామహే. హే పరమేశ్వర! భవాన్కృపయాఽస్మాక మిన్ద్రాయ పరమైశ్వర్య ప్రాప్తయే శ్రేష్ఠతమాయ కర్మణే చేమాః ప్రజావతీరనమీవా అయక్ష్మా గాః సదైవ ప్రార్పయతు. హే పరమాత్మన్! భవత్కృపయాస్మాకం మధ్యే కశ్చిదఘశంసః పాపీ స్తేనశ్చోరశ్చ మేశత కదాచిన్మోత్పద్యతామ్. తథా త్వమస్య యజమానస్య జీవస్య పశూన్పాహి సతతం రక్ష. యతో వః తా గా ఇమాన్పశూంశ్చాఘశంసః స్తేనో మేశత. హర్తుం సమర్థో న భవేద్యతోఽస్మిన్ గోపతౌ పృథివ్యాది రక్షణమిచ్ఛుకస్య ధార్మికమనుష్యస్య సమీపే బహ్వ్యర్బహ్వ్యోగావో ధ్రువాః స్యాత భవేయుః. ॥౧॥

భావార్థః:-మనుష్యైః సదైవ ధర్మ్యం పురుషార్థమాశ్రిత్యర్గ్వేదాధ్యయనేన గుణగుణినౌ జ్ఞాత్వా సర్వపదార్థానాం సంప్రయోగేణ పురుషార్థసిద్ధయే శ్రేష్ఠతమాభిః క్రియాభిః సంయుక్తైర్భవితవ్యమ్. యత ఈశ్వరానుగ్రహేణ సర్వేషాం సుఖైశ్వర్యస్య వృద్ధిః స్యాత్. తథా సమ్యక్ క్రియయా ప్రజాయా రక్షణశిక్షణే సదైవ కర్తవ్యే. యతో నైవ కశ్చిద్రోగాఖ్యో విఘ్నశ్చోరశ్చ ప్రబలః కదాచిద్భవేత్ ప్రజాశ్చ సర్వాణి సుఖాని ప్రాప్నుయుః. యేనేయం విచిత్రా సృష్టి రచితా తస్మై జగదీశ్వరాయ సదైవ ధన్యవాదా వాచ్యాః, ఏవం కుర్వతో భవతః పరమదయాలురీశ్వరః కృపయా సదైవ రక్షయిష్యతీతి మన్తవ్యమ్. ॥౧॥

పదార్థము :- ఓ మానవులారా! ఏ (సవితా) సకల జగత్తునుత్పన్న మొనర్చువాడు, సంపూర్ణైశ్వర్య యుక్తుడు (దేవః) సమస్త సుఖములను ప్రసాదించువాడును, సర్వవిద్యలను ప్రసిద్ధపరచువాడు నగు పరమాత్మగలడో అతడు (వః) మీరు, మేము మరియు మనమిత్రులు ఏ (వాయవః) సమస్తక్రియలను సిద్ధ మొనర్చు స్పర్శగుణముగల ప్రాణము, అంతఃకరణము మరియు ఇంద్రియములు (స్థ) కలవో వానిని (శ్రేష్ఠ తమాయ) అత్యుత్తమముగ (కర్మణే) చేయగల సర్వోపకారక యజ్ఞములు మున్నగు కర్మల కొరకు (ప్రార్పయతు) చక్కగా సంయుక్త పరచుగాక! మనము (ఇషే) అన్నము మున్నగు ఉత్తమోత్తమ పదార్థములు మరియు విజ్ఞానమును గోరుచు (ఊర్జే) పరాక్రమము అనగా ఉత్తమరసప్రాప్తి కొరకు (భాగమ్) సేవయొనర్చదగిన ధనము మరియు జ్ఞానముతో నిండియున్న (త్వా) ఉక్తగుణమును మరియు (త్వా) శ్రేష్ఠపరాక్రమము మున్నగు గుణముల నిచ్చునట్టి నిన్ను సకలవిధములుగ ఆశ్రయింతుము. ఓ మిత్రులారా! మీరును ఇదే విధముగనై (ఆప్యాయధ్వమ్) ఉన్నతిని ప్రాప్తింతురుగాక! మరియు మేమును ఉన్నతిని ప్రాప్తించుకొందుము గాక! హే భగవన్ జగదీశ్వర! మా యొక్క (ఇన్ద్రాయ)పరమైశ్వర్య ప్రాప్తికొరకు (ప్రజావతీః) ఎవరికి అధిక సంతానము గలదో మరియు ఎవరికి (అనమీవాః) వ్యాధిరహితమైన మరియు (అయక్ష్మాః) ఎవరికి రాజయక్ష్మ [క్షయ] మున్నగు వ్యాధులు లేవో వారు (అఘ్న్యాః) ఏ గోవులు మున్నగు పశువులు పెంపొందింపదగినవో మరియు ఏవి ఎప్పుడును హింసించదగనివో మరియు ఏ ఇంద్రియములు, పృథివి మున్నగు లోకములు గలవో వానిని సర్వదా (ప్రార్పయతు) నియత మొనర్చుము. ఓ జగదీశ్వరా! తమ కృపచే మానుండి దుఃఖముల గలిగించువాడు (అఘశంసః) పాపాత్ములు (స్తేనః) చోరులు, బందిపోటులు (మా ఈశత) ఎవ్వరును ఉత్పన్నము గాకుందురు గాక! తాము ఈ (యజమానస్య) పరమేశ్వరుని మరియు సర్వోపకారధర్మమును సేవించు మనుష్యులను

(పశూన్) గోవులు, అశ్వములు, గజములు మున్నగువానిని మరియు లక్ష్మి [సంపదల] చే ప్రజలను (పాహి) నిరంతరము రక్షణయొనర్పుము. ఇందువల్ల ఈ పదార్థములను హరించు ఎట్టి దుష్టుడును సమర్థుడు గాకుండునుగాక (అస్మిన్) ఈ ధార్మిక (గోపతౌ) పృథివి మున్నగు పదార్థముల రక్షణను గోరు సజ్జనుల సమీపమున (బహ్వీః) [మొదట జెప్పిన] అనేక పదార్థములు (ధ్రువాః) నిశ్చలసుఖములకొరకు (స్యాత) అగునుగాక!॥౧॥

ఈ మంత్రము శతపథబ్రాహ్మణమునందు వ్యాఖ్యానించబడినది. సంస్కృతభాష్యమునందు దాని స్థలములు మున్నగునవి వ్రాయబడినవి చూడదలచిన వారు ఆ స్థలములందు జూచుకొనదగును.

**భావార్థము :-** విద్వాంసులగువారు సర్వదా పరమేశ్వరుని ధర్మముతో గూడిన పురుషార్థముల నాశ్రయించి ఋగ్వేదము నధ్యయనమొనర్చి గుణములను గుణిని యథార్థముగా దెలిసికొని సర్వపదార్థముల సంప్రయోగముచే పురుషార్థసిద్ధికై శ్రేష్ఠమగు కర్మలందు ప్రవృత్తులు గావలయును. ఇందువలన ఈశ్వరుని అనుగ్రహము గలిగి సమస్త ప్రజలు సుఖము, ఐశ్వర్యములతో సమృద్ధిపరులై యుందురుగాక! ప్రజలెల్లరును శ్రేష్ఠమగు సత్కార్యములచే ప్రజారక్షణమును సర్వోత్తమగుణములచే సంతానములకు చక్కని శిక్షణను సదా ఈయవలెను. ఇట్లు చేయుటచే మహావ్యాధులు, విఘ్నములు, చోరులు, తస్కరులు మున్నగునవి ప్రబలము గాకుండ నుండును. ఇట్లే ప్రజలెల్లరును సంతానములచే, సంపదలచే సమస్తసౌఖ్యములను పొందగలరు. ఇదియే శ్రేష్ఠకార్యము మరియు సకలసంపదల నిధి. ఓ మానవులారా! మనమెల్లరమును గలిసి ఈ విశ్వమునందు విచిత్ర [ఆశ్చర్య] కరములగు పదార్థములను సృష్టించిన యా పరమేశ్వరునికి సదా ధన్యవాదము లర్పింతము. పరమదయాళువైన యా పరమాత్మయే తన దయచే ఉత్తమకర్మల నొనర్చు మానవులను సదా రక్షించుచుండును. ॥౧॥

1. O, Lord, we resort to Thee for the supply of foodstuffs and vigour. May the creator, the fountain of happiness and knowledge, inspire us for the performance of noblest deeds with our organs. May the cows, which should never be killed, be healthy and strong. For the attainment of prosperity and wealth, may the cows be full of calves, free from consumption and other diseases. May a thief and a smner be never born amongst us. May the lord of land and cattle be in constant and full possession of these. May Ye protect the cattle, wealth and progeny of the virtuous soul!

౨. వసోః పవిత్రమిత్యస్య ఋషిః స ఏవ, యజ్ఞో దేవతా, స్వరాడార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

స యజ్ఞః కీదృశో భవతీత్యుపదిశ్యతే.

యజ్ఞ మే విధముగా నుండవలయునో యీ మంత్రమునం దుపదేశించబడుచున్నది.

౨ వసోః పవిత్ర మసి ద్యౌరసి పృథివ్యసి మాతరిశ్వనో ఘర్మోఽసి విశ్వధాఽ

అసి పరమేణ ధామ్నా దృꣳహస్వ మా హ్వార్మా తే యజ్ఞపతిర్హ్వార్షీత్ ॥౨॥

ప.వి:- వసోః, పవిత్రం, అసి, ద్యౌః, అసి; పృథివీ, అసి, మాతరిశ్వనః, ఘర్మః, అసి, విశ్వధా ఇతి విశ్వధాః, అసి, పరమేణ, ధామ్నా, దృꣳహస్వ, మా, హ్వాః, మా,తే, యజ్ఞపతిరితి యజ్ఞ+పతిః, హ్వార్షీత్.॥౨॥

పదార్థః:-(వసోః) వసుః.అత్రార్థాద్విభక్తేర్విపరిణామ ఇతి ప్రథమావిభక్తిర్విపరిణమ్యతే. యజ్ఞో వై వసుః. శ. ౧. ౭. ౪. ౯. (పవిత్రం) పునాతి యేన కర్మణా తత్. (అసి) భవతి. అత్ర సర్వత్ర పురుషవ్యత్యయః. (ద్యౌః) విజ్ఞానప్రకాశహేతుః. (అసి) భవతి. (పృథివీ) విస్తృతః (అసి) భవతి. (మాతరిశ్వనః) మాతరి అన్తరిక్షే శ్వసితి అశ్వనితివా తస్య వాయోః. శ్వన్నుక్షన్ - ఉ. ౧. ౧౫౭. అనేనాయం శబ్దో నిపాతితః. మాత రిశ్వా వాయుర్మాతర్యన్తరిక్షే శ్వసితి మాతర్యశ్వినీతీతి వా. నిరు. ౭.౨౬. (ఘర్మః) అగ్నితాపయుక్తః శోధకః. ఘర్మ ఇతి యజ్ఞనామసు పఠితమ్. నిఘం. ౩.౧౭. (అసి) భవతి. (విశ్వధాః)విశ్వం దధాతీతి(అసి)భవతి (పరమేణ) ప్రకృష్టసుఖయుక్తేన (ధామ్నా) సుఖాని యత్ర దధతి తేన. బాహులకాడ్డుధాఞ్ధాతోర్మనిన్ ప్రత్యయః. (దృꣳహస్వ) వర్ధతే. అత్ర పురుషవ్యత్యయో లడర్థే లోట్ చ. (మా)నిషేధార్థే. (హ్వాః)హ్వరతు. అత్ర లోడర్థేలుఙ్. (మా) నిషేధార్థే. (తే) తవ. (యజ్ఞపతిః) యజ్ఞస్య స్వామీ యజ్ఞకర్తా యజమానః. ధాత్వర్థా ద్యజ్ఞార్థ స్త్రిధా భవతి. విద్యాజ్ఞానధర్మానుష్ఠానవృద్ధానాం దేవానాం విదుషామైహికపారమార్థికసుఖసంపాదనాయ సత్కరణం సమ్యక్ పదార్థగుణసమ్మేలవిరోధజ్ఞానసంగత్యా శిల్పవిద్యాప్రత్యక్షీకరణం నిత్యం విద్వత్సమాగమానుష్ఠానం శుభవిద్యాసుఖధర్మాదిగుణానాం నిత్యం దానకరణమితి. (హ్వార్షీత్)హ్వరతు హ్వర వా. అత్రాపి లోడర్థే లుఙ్. అయం మన్త్రః శ. ౧. ౭. ౪. ౯-౧౧. వ్యాఖ్యాతః. ॥౨॥

అన్వయః:-హే విద్వన్మనుష్య! త్వం యో వసోర్వసురయం యజ్ఞః పవిత్రమసి పవిత్రకారకోఽస్తి. ద్యౌరసి సూర్యరశ్మిస్థో భవతి. పృథివ్యసి వాయునా సహ విస్తృతో భవతి. తథా మాతరిశ్వనో ఘర్మోసి వాయోః శోధకో భవతి. విశ్వధా అసి సంసారస్య సుఖధారకో భవతి. పరమేణ ధామ్నా సహ దృంహస్వ దృంహతే వర్ధతే. తమిమం యజ్ఞం మా హ్వార్మా త్యజ. తథా తే తవ యజ్ఞపతిస్తం మా హ్వార్షీత్ మా త్యజతు. ॥౨॥

భావార్థః:-మనుష్యాణాం విద్యాక్రియాభ్యాం సమ్యగనుష్ఠితేన యజ్ఞేన పవిత్రతా ప్రకాశః పృథివీ రాజ్యం వాయుప్రాణవద్రాజ్యనీతిః ప్రతాపః సర్వరక్షా అస్మింల్లోకే పరలోకే చ

పరమసుఖవృద్ధిః పరస్పరమమార్జవేన వర్తమానం కుటిలతాత్యాగశ్చ జాయతే. అత ఏవ సర్వైర్మనుష్యైః పరోపకారాయ విద్యాపురుషార్థాభ్యాం ప్రీత్యా యజ్ఞో నిత్యమనుష్ఠాతవ్య ఇతి. ॥2॥

**పదార్థము** :- విద్యాయుక్తుడవగు నోమానవా! నీవు ఏ (వసోః) యజ్ఞము (పవిత్రమ్) శుద్ధికి హేతువై (అసి) యున్నదో (ద్యౌః) ఏది విజ్ఞానప్రకాశమునకు హేతువో మరియు సూర్యకిరణములందు స్థిరమునై (అసి) ఉన్నదో, ఏది (పృథివీ) వాయువుతో గూడి దేశదేశాంతరములందు వ్యాప్తించునదై (అసి) ఉన్నదో, ఏది (మాతరిశ్వనః) వాయువును (ఘర్మః) శుద్ధిపరచునదై (అసి) ఉన్నదో, ఎయ్యది (విశ్వధాః) సృష్టిని ధారణ మొనర్చునదై (అసి) ఉన్నదో మరియు నెయ్యది (పరమేణ) ఉత్తమ (ధామ్నా) స్థానములనుండి (దృంహస్వ) సుఖములను పెంపొందించునదై యున్నదో అట్టి యజ్ఞమును(మా హ్వాః)విసర్జించకుము. మరియు(తే)నీ యొక్క(యజ్ఞపతిః)యజ్ఞమును రక్షణచేయు యజమానియును (మా హ్వార్షీత్)త్యజించకుండునుగాక! [ధాత్వర్థ అభిప్రాయముతోయజ్ఞమునకు ముప్విధములగు అర్థము సిద్ధించుచున్నది. అనగా ఒకటి - ఇహపరలోక సుఖములకై విద్య, జ్ఞానము ధర్మముల సేవనముచే వృద్ధి - అనగా మహావిద్వాంసులను సత్కరించుట. రెండవది - ఉత్తమ పద్ధతిలో పదార్థ గుణముల స్నేహవిరోధముల జ్ఞానముద్వారా శిల్పవిద్యను ప్రత్యక్షము చేసుకొనుట. మూడవది - ఎల్లప్పుడు విద్వాంసుల సత్సంగము లేదా శుభగుణముల విద్య, సుఖము, ధర్మము మరియు సత్యమును సదా దానమొనర్చుట]॥2॥

**భావార్థము** :- మనుష్యులు తమ విద్యచే ఉత్తమకర్మలచే సేవించు యజ్ఞములద్వారా పవిత్రత యొక్క ప్రకాశము, పృథివీరాజ్యము, వాయురూప ప్రాణసమానమగు రాజనీతి, ప్రతాపము, సకల ప్రాణుల రక్షణమొనర్చుట, ఇహపరలోకములందు సుఖవృద్ధి, పరస్పర మృదువర్తనము, కుటిలత్వత్యాగము మున్నగు శ్రేష్ఠగుణములు ఉత్పన్నమగును. కావున మానవులెల్లరును పరోపకారము మరియు స్వసుఖమునకై విద్య పురుషార్థములతో గూడి ప్రీతిపూర్వకముగ ప్రతిదినము యజ్ఞానుష్ఠానముల నొనర్చుచుండవలయును.॥2॥

2. Yajna acts as purifier, makes explicit, true and perfect knowledge, spread in space through the rays of the sun, purifies the air, is the mainstay of the universe, and also adds to our comfort through its exalted office. It behoves us all the learned and their followers not to give up the performance of yajnas.

3. వసోః పవిత్రమిత్యస్య ఋషిః స ఏవ, సవితా దేవతా, భురిగ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునః స కీదృశ ఇత్యుపదిశ్యతే.

యజ్ఞమెటుల సుఖమును సమకూర్చుచున్నదో ఈ మంత్రమునం దుపదేశింప బడుచున్నది.

3 వసోః పవిత్రమసి శతధారం వసోః పవిత్రమసి సహస్రధారమ్ దేవస్త్వా

సవితా పునాతు వసోః పవిత్రేణ శతధారేణ సుప్వా కామధుక్షః ॥3॥

ప. వి:- వసోః, పవిత్రం, అసి, శతధారమితి శత+ధారమ్; వసోః, పవిత్రం, అసి, సహస్రధారమితి సహస్ర+ధారమ్, దేవః, త్వా, సవితా, పునాతు, వసోః, పవిత్రేణ, శతధారేణేతి శత+ధారేణ, సుప్వేతి సు+ప్వా, కామ్, అధుక్షః.॥3॥

పదార్థః :-(వసోః) వసుర్యజ్ఞః (పవిత్రం) శుద్ధికారకం కర్మ (అసి) అస్తి; అత్ర సర్వత్రపురుషవ్యత్యయః, (శతధారం) శతం బహువిధమసంఖ్యాతం విశ్వం ధరతీతి తం. శతమితి బహునామసు పఠితమ్. నిఘం. 3. 1. (వసోః) వసుర్యజ్ఞః. (పవిత్రం) శుద్ధినిమిత్తం (అసి) అస్తి (సహస్రధారం) బహువిధం బ్రహ్మాండం ధరతీతి తం యజ్ఞమ్. సహస్రమితి బహునామసు పఠితమ్. నిఘం. 3. 1. (దేవః) స్వయంప్రకాశస్వరూపః పరమేశ్వరః (త్వా) తం యజ్ఞం (సవితా) సర్వేషాం వసూనామగ్నిపృథివ్యాదీనాం త్రయస్త్రింశతో దేవానాం ప్రసవితా. సవితా వై దేవానాం ప్రసవితా. శ. 1. 1. 2. 17. (పునాతు) పవిత్రీకరోతు. (వసోః) పుర్వోక్తో యజ్ఞః (పవిత్రేణ) పవిత్రనిమిత్తేన వేదవిజ్ఞానకర్మణా, (శతధారేణ) బహువిద్యాధారకేణ పరమేశ్వరేణ వేదేన వా. (సుప్వా) సుష్ఠుతయా పునాతి పవిత్రహేతుర్వా తేన, (కామ్) కాం కాం వాచం (అధుక్షః) దోగ్ధుమిచ్ఛసీతి ప్రశ్నః. అత్ర లడర్థే లుఙ్. అయం మన్త్రః శ. 1. 7. 4. 12-16. వ్యాఖ్యాతః. ॥3॥

అన్వయః :- యో వసోర్వసుర్యజ్ఞః శతధారం పవిత్రమసి శతధా శుద్ధికారకోఽస్తి సహస్రధారం పవిత్రమసి సుఖదోఽస్తి త్వా తం సవితా దేవః పునాతు. హే జగదీశ్వర! భవాన్ వసోః వసుర్యజ్ఞః తేనాస్మాభిరనుష్ఠితేన పవిత్రేణ శతధారేణ సుప్వా యజ్ఞేనాస్మాన్ పునాతు. హే విద్వన్ జిజ్ఞాసో వా త్వం కాం వాచమధుక్షః ప్రపూరయితుమిచ్ఛసి. ॥3॥

భావార్థః :-యే మనుష్యాః పుర్వోక్తం యజ్ఞమనుష్ఠాయ పవిత్రా భవన్తి, తాన్ జగదీశ్వరో బహువిధేన విజ్ఞానేన సహవర్తమానాన్కృత్వైతేభ్యో బహువిధం సుఖం దదాతి పరన్తు యే క్రియావన్తః పరోపకారిణః సన్తి తే సుఖమాప్నువన్తి నేతరేఽలసాః. అత్ర కామధుక్ష ఇతి ప్రశ్నోఽస్తి. ॥3॥

పదార్థము :-ఏ (వసోః) యజ్ఞము (శతధారమ్) అసంఖ్యాక రూపములుగల విశ్వమును ధారణమొనర్చునట్టి (పవిత్రమ్) శుద్ధ మొనర్చునట్టి కర్మయై (అసి) ఉన్నదియో మరియు ఏ (వసోః) యజ్ఞము (సహస్రధారమ్) అనేక విధములుగ బ్రహ్మాండమును ధారణ మొనర్చునదై (పవిత్రమ్) శుద్ధి నిమిత్తమున సుఖము నిచ్చునదియై (అసి) ఉన్నదో (త్వా) అట్టి యజ్ఞమును (దేవః) స్వయం ప్రకాశస్వరూపుడు (సవితా) వసువు

మున్నగు ముప్పదిమూడు [33] దేవతల నుత్పన్న మొనర్చు పరమేశ్వరుడు (పునాతు) పవిత్ర పరచుగాక! ఓ జగదీశ్వరా! నీవు మాచే సేవించబడు ఏ (వసోః) యజ్ఞము గలదో యది (పవిత్రేణ) శుద్ధిపరచు నిమిత్తము వేదవిజ్ఞానము (శతధారేణ) అనేక విద్యలను ధారణ మొనర్చు వేదముచే మరియు (సుప్వా) ఉత్తమ విధిలో పవిత్ర పరచునట్టి యజ్ఞముచే మమ్ము పవిత్ర మొనర్చుము. ఓ విద్వాంసుడా! తెలిసికొను నిచ్ఛగల [జిజ్ఞాసువగు] మానవా! నీవు (కామ్) వేదముయొక్క శ్రేష్ఠవాణుల యభిప్రాయమును (అధుక్షః) నీ మనస్సునందు పూర్ణ మొనర్చుకొన మరియు తెలిసికొన దలచినావు. ॥3॥

**భావార్థము :-** మొదట చెప్పబడిన యజ్ఞము ననుష్ఠించి పవిత్రులగువారికి పరమేశ్వరు డనంతజ్ఞానము నిచ్చి అనేక సుఖముల నిచ్చును. ఇట్టి క్రియల నొనర్చువారు మరియు పరోపకారులగువారు మాత్రమే ఇట్టి సుఖమును పొందగలరు. సోమరిపోతులగు వా రెన్నడును పొందలేరు. (ఈ మంత్రమున 'కామధుక్షః' అను పదములు వాణికి సంబంధించిన ప్రశ్నలై యున్నవి). ॥3॥

3. The Yajna of the Great Lord is the supporter of innumerable worlds and purifies us all. May the self-Effulgent, Lord, lead us aright on the path of virtue. May He purify us through the store of true knowledge and all sciences contained in the Vedas, and elevating selfless deeds. O ye men which branches of true knowledge do ye want to comprehend?

౪. సా విశ్వాయు రిత్యస్య ఋషిః స ఏవ. విష్ణుర్దేవతా. అనుష్టుప్ ఛన్దః గాన్ధారః స్వరః.

అథ త్రివిధస్య ప్రశ్నస్య త్రీణ్యుత్తరాణ్యుపదిశ్యన్తే.

పూర్వోక్త మంత్రమునందు మూడు ప్రశ్నలు చెప్పబడినవి. వానికి ప్రత్యుత్తరములు ముందు మంత్రములో చెప్పబడినవి.

౪ సా విశ్వాయుః సా విశ్వకర్మా సా విశ్వధాయాః।

ఇన్ద్రస్య త్వా భాగꣳ సోమేనా తనచ్మి విష్ణో హవ్యꣳ రక్ష ॥౪॥

ప.విః- సా, విశ్వాయురితి విశ్వ+ఆయుః. సా, విశ్వకర్మేతి విశ్వ+కర్మా. సా, విశ్వధాయా ఇతి విశ్వ+ధాయాః, ఇన్ద్రస్య, త్వా, భాగమ్, సోమేన, ఆ, తనచ్మి, విష్ణో ఇతి విష్ణో, హవ్యమ్, రక్ష ॥౪॥

పదార్థః-(సా) వాక్. వాగు వై యజ్ఞః. శ. ౧. ౧. ౪. ౧౧.(విశ్వాయుః) పూర్ణమా యుర్యస్యాం సా గ్రహీతవ్యా (సా) శిల్పవిద్యాసమ్పాదికా, (విశ్వకర్మా) విశ్వం సమ్పూర్ణం క్రియాకాణ్డం సిధ్యతి యయా సా (సా) సంపూర్ణ విద్యా ప్రకాశికా (విశ్వధాయాః) యా విశ్వం

సర్వం జగద్విద్యాగుణైః సహ దధాతి సా. విశ్వోపపదే డుంధాఞ్ ధాతోరసుస్ప్రత్యయః బాహులకాణ్ణిచ్చ). (ఇన్ద్రస్య) పరమేశ్వరస్య యజ్ఞస్య వా (త్వా) తమ్. అత్ర పురుషవ్యత్యయః (భాగమ్) భజనీయం శుభగుణభాజనం యజ్ఞమ్ (సోమేన) శిల్పవిద్యయా సంపాదితేన రసేనాన్నేన వా (ఆ) సమన్తాత్ (తనచ్మి) సంకోచయామి దృఢీకరోమి. (విష్ణో) వేవేష్టి వ్యాప్నోతి చరాచరం విశ్వం తత్సంబుద్ధౌ పరమేశ్వర! (హవ్యమ్) పూర్వోక్త యజ్ఞసంబన్ధి దాతుం గ్రహీతుం యోగ్యం ద్రవ్యం విజ్ఞానం వా (రక్ష) పాలయ. అయం మన్త్రః శ. ౧. ౫. ౪. ౧౭-౨౧ వ్యాఖ్యాతః.॥౪॥

అన్వయః:-హే విష్ణో వ్యాపకేశ్వర! భవతా యా వాగ్ధార్యతే సా విశ్వాయుః సా విశ్వకర్మా సా విశ్వధాయా అస్తి. తయా త్రివిధయా గృహీతయైవాహం యమిన్ద్రస్య (త్వా తం) భాగం యజ్ఞం సోమేనాతనచ్మి తం హవ్యం యజ్ఞం త్వం సతతం రక్ష.॥౪॥

భావార్థః:-త్రివిధా వాగ్భవతి. యా బ్రహ్మచర్యాశ్రమే పూర్ణవిద్యాపఠనాయ పూర్ణాయుః కరణాయ చ సేవ్యతే సా ప్రథమా. యా గృహాశ్రమేఽనేకక్రియయోద్యోగసుఖప్రాపకఫలా విస్తీర్యతే సా ద్వితీయా. యా చ సర్వమనుష్యైః సర్వమనుష్యేభ్యః శరీరాత్మసుఖవర్ధనాయేశ్వరాదిపదార్థవిజ్ఞానప్రకాశికా వానప్రస్థసంన్యాసాశ్రమే ఖలూపదిశ్యతే సా తృతీయా. న చైనయా వినా కస్యాపి సర్వం సుఖం భవితుమర్హతి. అనయైవ మనుష్యైః పూర్వోక్తో యజ్ఞోఽనుష్ఠాతవ్యః. వ్యాపకేశ్వరః స్తోతవ్యః ప్రార్థనీయ ఉపాసనీయశ్చ భవతి. అనుష్ఠితోఽయం యజ్ఞో జగతి రక్షాహేతుః ప్రేమ్ణా సత్యభావేన ప్రార్థితశ్చేశ్వరస్తాన్ సర్వదా రక్షతి. పరన్తు యే క్రియాకుశలా ధార్మికాః పరోపకారిణో జనాః సన్తి త ఈశ్వరం ధర్మం చ విజ్ఞాయ సమ్యక్ క్రియయా సాధనైర్హైహికం పారత్రికం చ సుఖం ప్రాప్నువన్తి నేతరే.॥౪॥

పదార్థము :-(విష్ణో) వ్యాపకుడవగు ఓ పరమేశ్వరా! నీ వే వాణిని ధారణ మొనర్చెదవో (సా) అది (విశ్వాయుః) పూర్ణాయువు నిచ్చునది (సా) అది (విశ్వకర్మా) సంపూర్ణ కర్మకాండను సంపూర్ణ పరచునదియై యున్నది. మరియు (సా) అది (విశ్వధాయాః) విశ్వమంతటిని విద్య మరియు సద్గుణములచే ధారణ మొనర్చునదై యున్నది [పూర్వమంత్రమునందలి ప్రశ్నకు సమాధానముగ ఈ ముప్విధవాణి గ్రహించదగినదై యున్నది] కావుననే (ఇన్ద్రస్య) పరమేశ్వరుని (భాగమ్) సేవించదగిన యజ్ఞమును (సోమేన) విద్యద్వారా సిద్ధించిన ఆనందరసముచే (ఆ తనచ్మి) నా హృదయమునందు దృఢపరచుకొందును. ఓ పరమేశ్వరా! (హవ్యమ్) పూర్వోక్త యజ్ఞమునకు సంబంధించిన ఇచ్చి పుచ్చుకొనదగిన [ఆదానప్రదాన] ద్రవ్యములు మరియు విజ్ఞానములను (రక్ష) నిరంతరము రక్షించుచుండుము.॥౪॥

**భావార్థము :-వాణి మూడు విధములు;** మొదటిది : బ్రహ్మచర్యాశ్రమమున పూర్ణవిద్యల నభ్యసించుచు పూర్ణాయువుకొరకు సేవనమొనర్చబడును. రెండవది : గృహస్థాశ్రమమున అనేక క్రియలు, పురుషార్థములచే

సుఖముల నిచ్చుచు విస్తరించును. మూడవది : ఈ ప్రపంచమున సకల మానవులకు ఆత్మిక, శారీరక సుఖముల వృద్ధి మరియు ఈశ్వరుడు మున్నగు పదార్థముల విజ్ఞానమును ప్రసాదించు వానప్రస్థ, సన్న్యాసాశ్రమములందు విద్వాంసులచే నుపదేశింపబడునది. ఇట్టి మువ్విధములగు వాణులు తప్ప ఎవ్వరికిని సకల సుఖములు ప్రాప్తించజాలవు. ఏలన ముందు చెప్పియున్న యజ్ఞముల నొనర్చుట, సర్వవ్యాపకుడై యున్న ఈశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనల నొనర్చుట సర్వమానవులకు యోగ్యమై యున్నది. ఈశ్వరు డిట్లాజ్ఞాపించుచున్నాడు. ఏ మనుష్యునిద్వారా సంపన్నము చేయబడిన యజ్ఞము జగత్తునందు రక్షణ హేతువగునో మరియు సత్యభావనచే ప్రార్థితుడగు పరమేశ్వరుడు విద్వాంసులను సర్వదా రక్షించుచుండునో ఆతడే ఎల్లరకును అధ్యక్షుడు. క్రియాకుశలురు, ధార్మికులు, పరోపకారులు నగువారు మాత్రమే ఈశ్వరుని మరియు ధర్మము నెరిగి మోక్షము మరియు సమ్యక్క్రియా సాధనములద్వారా ఇహపరలోకసుఖములను ప్రాప్తించుకొందురు. ॥౪॥

4. Vedas are the true source of knowledge and their study enables us to enjoy the full span of life. They contain the detailed instructions concerning various duties. May we through His grace be firmly convinced of the utility of industrial achievements, and may He, the Omnipresent Lord protect our yajnas and the knowledge and means thereof.

౫. అగ్నే వ్రతపత ఇత్యస్య ఋషిః స ఏవ, అగ్నిర్దేవతా, ఆర్చీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

కిఞ్చ తద్వాచో వ్రతమిత్యుపదిశ్యతే. ఉక్తవాణియొక్క వ్రతమెయ్యదియో నిం దుపదేశింపబడినది.

౫ అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామి తచ్ఛకేయం తన్మే రాధ్యతామ్ ।
ఇదమహమనృతాత్సత్యముపైమి ॥౫॥

ప. వి:- అగ్నే, వ్రతపత ఇతి వ్రత+పతే, వ్రతం, చరిష్యామి, తత్, శకేయం, తత్, మే, రాధ్యతామ్, ఇదమ్, అహమ్, అనృతాత్, సత్యమ్, ఉప, ఏమి. ॥౫॥

పదార్థః :-(అగ్నే) హే సత్యోపదేశకేశ్వర (వ్రతపతే) వ్రతానాం సత్యభాషణాదీనాం పతిః పాలక స్తత్సంబుద్ధౌ, (వ్రతమ్) సత్యభాషణం సత్యకరణం సత్యమానం చ (చరిష్యామి) అనుష్ఠాస్యామి. (తత్) వ్రతమనుష్ఠాతుమ్ (శకేయం) యథా సమర్థో భవేయమ్ (తత్) తస్యానుష్ఠానం పూర్తిశ్చ (మే) మమ (రాధ్యతామ్) సంసేధ్యతామ్ (ఇదమ్) ప్రత్యక్షమాచరితుం సత్యం వ్రతమ్ (అహమ్) ధర్మాదిపదార్థచతుష్టయం చికీర్షుర్మనుష్యః (అనృతాత్) న విద్యతే ఋతం యథార్థమాచరణం యస్మిన్ తస్మాన్మిథ్యాభాషణాత్ మిథ్యాకరణాన్మిథ్యామానాత్పృథగ్భూత్వా (సత్యమ్) యద్వేదవిద్యయా ప్రత్యక్షాదిభిః ప్రమాణైః

సృష్టిక్రమేణ విదుషాం సంగేన సువిచారేణాత్మశుద్ధ్యా వా విభ్రమం సర్వహితం తత్త్వనిష్ఠం సత్ప్రభవం సమ్యక్ పరీక్ష్య నిశ్చీయతే తత్. సత్యం కస్మాత్? సత్సు తాయతే సత్ప్రభవం భవతీతి వా. నిరు. 3. ౧౩. (ఉప) క్రియార్థే (ఏమి) జ్ఞాతుం ప్రాప్తుమనుష్ఠాతుం ప్రాప్నోమి. అయం మన్త్రః శ ౧. ౧. ౧. ౧-౬ వ్యాఖ్యాతః.॥౫॥

అన్వయః :- హే వ్రతపతే అగ్నే సత్యధర్మోపదేశకేశ్వర! అహం యదిదమనృతాత్పృథగ్వర్తమానం సత్యం వ్రతమాచరిష్యామి. తన్మే మమ భవతా స్వకృపయా రాధ్యతాం సంసేధ్యతాం యదుపైమి ప్రాప్నోమి యచ్చానుష్ఠాతుం శకేయం తదపి సర్వం రాధ్యతాం సంసేధ్యతామ్. ॥౫॥

భావార్థః:- ఈశ్వరేణ సర్వమనుష్యైరనుష్ఠేయోఽయం ధర్మ ఉపదిశ్యతే. యో న్యాయః పక్షపాతరహితః సుపరీక్షితః సత్యలక్షణాన్వితః సర్వహితాయ వర్తమాన ఐహికపారమార్థిక సుఖహేతురస్తి స ఏవ సర్వమనుష్యైః సదాచరణీయః. యచ్చైతస్మాద్విరుద్ధో హ్యధర్మః స నైవ కేనాపి కదాచిదనుష్ఠేయః. ఏవం హి సర్వైః ప్రతిజ్ఞాకార్యా. హే పరమేశ్వర! వయం వేదేషు భవదుపదిష్టమిమం సత్యధర్మమాచరితుమిచ్ఛామః. యేయమస్మాకమిచ్ఛా సా భవత్కృపయా సమ్యక్ సిధ్యేత్. యతో వయమర్థకామమోక్షఫలాని ప్రాప్తుం శక్నుయామ. యథా చాధర్మం సర్వథా త్యక్త్వాఽనర్థకుకామబన్ధదుఃఖఫలాని పాపాని త్యక్తుం త్యాజయితుం చ సమర్థా భవేమ. యథా భవాన్ సత్యవ్రత పాలకత్వాద్వ్రతపతిర్వర్తతే తథైవ వయమపి భవత్కృపయా స్వపురుషార్థేన యథాశక్తి సత్యవ్రతపాలకా భవేమ. ఏవం సదైవ ధర్మం చికీర్షవః సత్క్రియావన్తో భూత్వా సర్వసుఖోపగతాః సర్వప్రాణినాం సుఖకార కాశ్చ భవేమేతి సర్వైః సదైవేష్టితవ్యమ్. శతపథబ్రాహ్మణేఽస్య మన్త్రస్య వ్యాఖ్యాయామయుక్తం మనుష్యాణాం ద్వివిధమేవాచరణం సత్యమనృతం చ తత్ర యే వాఙ్మనఃశరీరైః సత్యమేవాచరన్తి తే దేవాః యే చైవానృతమాచరన్తి తే మనుష్యా అర్థాదసుర రాక్షసాః సన్తీతి వేద్యమ్.॥౫॥

పదార్థము :- (వ్రతపతే) సత్యభాషణాది ధర్మముల పాలించు (అగ్నే) సత్యోపదేశము నొనర్చు ఓ పరమేశ్వరా! నేను (అనృతాత్) అసత్యమునకు దూరముగ నుండి (సత్యమ్) వేదవిద్య, ప్రత్యక్షాది ప్రమాణములు, సృష్టిక్రమము, విద్వాంసుల సత్సంగము, శ్రేష్ఠభావములు, ఆత్మశుద్ధి మున్నగు విధములతో భ్రమరహిత, సర్వహిత తత్త్వము అనగా సిద్ధాంతముల ప్రకాశపరచువానిద్వారా సిద్ధియై చక్కగా పరీక్షింపబడిన (వ్రతమ్) సత్యమును స్వీకరించుట, పలుకుట, ఆచరించుట యను వ్రతమును (ఉపైమి) అనుష్ఠానము - నియమపూర్వకముగ గ్రహించుట, తెలిసికొనుట, పొందుటకై అభిలషించుచున్నాను (మే) నా యొక్క (తత్) అట్టి సత్యవ్రతమును నీవు (రాధ్యతామ్) బాగుగా సిద్ధింపజేయుము. అందువల్ల (అహమ్) నేను అట్టి సత్యవ్రతము ననుష్ఠించుటకు (శకేయమ్) సమర్థవంతుడ నగుదునుగాక! (ఇదమ్) ఈ ప్రత్యక్షసత్యవ్రతాచరణ నియమములను (చరిష్యామి) ఆచరించెదనుగాక. ॥౫॥

**భావార్థము** :-పరమేశ్వరుడు నియమపూర్వకముగ సేవించదగిన ధర్మమును మానవుల కుపదేశించినాడు. అది న్యాయయుక్తముగ పరీక్షింపబడిన సత్యలక్షణములచే ప్రసిద్ధమైనది. సర్వజనహితకరమై ఇహలోక ప్రాపంచికసుఖముల మరియు పారలౌకిక అనగా మోక్షసుఖమునకు హేతువైనది. ఇదియే సర్వజనులాదరించుటకు యోగ్యమై యున్నది. ఇందుకు విరుద్ధమైనదానిని, అధర్మమనబడుదానిని ఎవ్వరును ఆచరించవలదు. అన్నిచోటులందును దానిని త్యజించవలయును. ఈ విధముగ మనముకూడ ప్రతిజ్ఞ యొనర్చవలయును. ఏమన : ఓ పరమేశ్వరా! మేము వేదములందు మీచే ప్రకటించబడిన ధర్మమునే గ్రహించెదము గాక! ఓ పరమాత్మా! మేము వేదధర్మమునే ఆచరించి ధర్మార్థకామమోక్షముల ఫలములను సుగమముగ పొందునటుల మమ్మనుగ్రహించుము. సత్యవ్రతపాలనముచే తాము వ్రతపతివగునట్లు మేమును తమ కృప మరియు మా పురుషార్థముచే యథాశక్తి సత్యవ్రతమును పాలించువార మగుదుము గాక! ధర్మమునాచరించు కోరికతో మా సత్కర్మలద్వారా సకలసుఖములను పొంది సకల ప్రాణులకు సౌఖ్యము సమకూర్చువార మగుదుము గాక! మానవు లెల్లరును ఈ కోరికయే కలవారగుదురుగాక! ॥౫॥

శతపథబ్రాహ్మణమునందీ మంత్రమిట్లు వ్యాఖ్యానించబడినది. మనుష్యుల ఆచరణము రెండు విధములు. ఒకటి సత్యము, రెండవది అసత్యము. ''వాక్కు, మనస్సు, శరీరములచే సత్యము నాచరించువారు దేవతలు, అసత్యము నాచరించువారు రాక్షసులు, అసురు''లను పేర్లచే వ్యవహరించబడుదురు.

5. O God, the Lord of Vows, I will observe the vow. May I have strength for that. Pray grant me success in the fulfillment of my vow. I take the vow of renouncing untruth and embracing truth!

౬. కస్త్వేత్యస్యఋషిః స ఏవ. ప్రజాపతి ర్దేవతా. ఆర్చీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

కేన సత్యమాచరితుమసత్యం త్యక్తుమాజ్ఞా దత్తేత్యుపదిశ్యతే.

సత్యమాచరించుటకు, అసత్యమును త్యజించుటకు నెవరాజ్ఞాపించిరో ముందు మంత్రమునందుపదేశించబడెను.

౬ కస్త్వా యునక్తి స త్వా యునక్తి కస్మై త్వా యునక్తి తస్మై త్వా యునక్తి।
కర్మణే వాం వేషాయ వాం ॥౬॥

ప.వి:- కః, త్వా, యునక్తి, సః, త్వా, యునక్తి, కస్మై, త్వా, యునక్తి, తస్మై, త్వా, యునక్తి, కర్మణే, వామ్,వేషాయ, వామ్.॥౬॥

పదార్థః :-(కః) కో హి సుఖస్వరూపః (త్వా) క్రియానుష్ఠాతారం మనుష్యం పురుషార్థే (యునక్తి) నియుక్తం కరోతి (సః) పరమేశ్వరః (త్వా) విద్యాదిశుభగుణానాం గ్రహణే విద్యార్థినం విద్వాంసం వా (యునక్తి) యోజయతి. అత్ర సర్వత్రాన్తర్గతో ణ్యర్థః (కస్మై) ప్రయోజనాయ. (త్వా) త్వాం సుఖమిచ్ఛుకం (యునక్తి) యోజయతి (తస్మై) సత్యవ్రతాచరణాయ యజ్ఞాయ. (త్వా) ధర్మం ప్రచారయితుముద్యోగినం (యునక్తి) యోజయతి (కర్మణే) పూర్వోక్తాయ యజ్ఞాయ (వామ్) కర్తృకారయితారౌ (వేషాయ) సర్వశుభగుణవిద్యావ్యాప్తయే (వామ్) అధ్యేత్రధ్యాపకౌ. అయం మన్త్రః శ. ౧. ౧. ౧-౨; ౧ ౩-౧౨; ౧. వ్యాఖ్యాతః.॥౬॥

అన్వయః :-హే మనుష్య! కస్త్వాం యునక్తి స త్వాం యునక్తి కస్మై త్వాం యునక్తి తస్మై త్వాం యునక్తి స ఏవ వాం కర్మణే నియోజయతి. ఏవం చ వాం వేషాయాజ్ఞాపయతి.॥౬॥

భావార్థః:- అత్ర ప్రశ్నోత్తరాభ్యామీశ్వరో జీవేభ్య ఉపదిశతి. కశ్చిత్ కంచిత్ప్రతి బ్రూతే. కో మాం సత్యక్రియాయాం ప్రవర్తయతీతి సోఽస్యోత్తరం బ్రూయాత్. ఈశ్వరః పురుషార్థక్రియాకరణాయ త్వామాదిశతీతి. ఏవం కశ్చిద్విద్యార్థీ విద్వాంసం ప్రతి పృచ్ఛేత్ కో మదాత్మన్యన్తర్యామిరూపతయా సత్యం ప్రకాశయతీతి. స ఉత్తరం దద్యాత్ సర్వవ్యాపకో జగదీశ్వర ఇతి. కస్మై ప్రయోజనాయేతి కేనచిత్పృచ్ఛ్యతే. సుఖప్రాప్తయే పరమేశ్వరప్రాప్తయే చేత్యుత్తరం బ్రూయాత్. పునః కస్మై ప్రయోజనాయేతి మాం నియోజయతీతి పృచ్ఛ్యతే. సత్యవిద్యాధర్మప్రచారాయేత్యుత్తరం బ్రూయాత్. ఆవాం కిం కరణాయేశ్వర ఉపదిశతి. యజ్ఞానుష్ఠానాయేతి పరస్పరముత్తరం బ్రూయాతమ్. పునః స కిమాప్తయ ఆజ్ఞాపయతీతి. సర్వవిద్యాసుఖేషు వ్యాప్తయే తత్ప్రచారాయేత్యుత్తరం బ్రూయాత్. మనుష్యైర్ద్వాభ్యాం ప్రయోజనాభ్యాం ప్రవర్తితవ్యమ్. ఏక మత్యంతపురుషార్థశరీరారోగ్యాభ్యాం చక్రవర్తిరాజ్యశ్రీప్రాప్తికరణమ్. ద్వితీయం సర్వా విద్యాః సమ్యక్ పఠిత్వా తాసాం సర్వత్ర ప్రచారీకరణం చేతి. నైవ కేనచిదపి కదాచిత్పురుషార్థం త్యక్త్వాఽలస్యే స్థాతవ్యమితి.॥౬॥

పదార్థము :-(కః) ఏ సుఖస్వరూపుడు (త్వా) నిన్ను సత్కర్మల నాచరించుటకు (యునక్తి) ఆజ్ఞాపించు చున్నాడో (సః) ఆ జగదీశ్వరుడు (త్వా) నిన్ను విద్యమున్నగు శుభగుణముల ప్రకటించుటకు విద్వాంసుడు, లేక విద్యార్థియగుటకు (యునక్తి) ఆజ్ఞాపించుచున్నాడు (కస్మై) ఆయన ఏ యే ప్రయోజనములకై (త్వా) నిన్ను మరియు నన్ను (యునక్తి) యుక్తమొనర్చునో (తస్మై) అట్టి పూర్వోక్త సత్యవ్రతాచరణరూప యజ్ఞమున్నకై (త్వా) ధర్మప్రచారమున్నకై ఉద్యమించు నిన్ను (యునక్తి) ఆజ్ఞాపించుచున్నాడు (సః) ఆ యీశ్వరుడే (కర్మణే) ఉక్తశ్రేష్ఠకర్మలనొనర్చుటకై (వామ్) కర్మల నొనర్చు వారిని, ఒనర్పజేయువారిని నియుక్త పరచుచున్నాడు (వేషాయ) శుభ గుణ కర్మ విద్యల వ్యాప్తికై (వామ్) విద్యలను చదువువారలు, చదివించు వారలునగు మీకుపదేశించు చున్నాడు. ॥౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున ప్రశ్నోత్తరములద్వారా ఈశ్వరుడు జీవుల కుపదేశించుచున్నాడు. ఎప్పుడైనా, ఎవనితోనైన ''నిన్ను సత్యకర్మలందు ప్రవృత్తపరచువా డెవడని యడిగిన ప్రజాపతియగు పరమేశ్వరుడే పురుషార్థము మరియు ఉత్తమోత్తమ కర్మల నొనర్చుటకు వేదముద్వార ఉపదేశించి ప్రేరణ నిచ్చుచున్నా''డని సమాధాన మీయవలెను. ఇదేవిధముగ ఏ విద్యార్థియైనను ఏ విద్వాంసునితోనైనను నా యాత్మయందు అంతర్యామిరూపమున సత్యప్రకాశము నెవడు గలిగించుచున్నాడని ప్రశ్నించుచో ''సర్వవ్యాపకుడగు జగదీశ్వరుడే'' యని చెప్పవలెను. మరల నాతడు ''ఆయన ఏ యే ప్రయోజనములకొరకు ఉపదేశించును, ఆజ్ఞాపించు''నని యడిగిన దానికి సమాధాన మిట్లీయవలెను. ''సుఖ స్వరూపుడగు పరమేశ్వర ప్రాప్తికి, సత్యవిద్యల, ధర్మప్రచారము కొరకు అని; నన్ను మరియు నిన్ను ( మన యిరువురను) ఏ యే పనులొనర్చుటకు ఈశ్వరుడుపదేశించుచున్నా'' డని యడిగిన ''యజ్ఞమొనర్చుట''కని ఉత్తరమీయవలెను. ''నాతడు ఏ యే పదార్థముల ప్రాప్తికొరకు ఆజ్ఞ యిచ్చు''నని యడిగిన ''సమస్తవిద్యల ప్రాప్తికి మరియు వాని ప్రచారమున'' కని సమాధాన మీయవలెను.

మనుష్యులు రెండు ప్రయోజనములందు ప్రవృత్తులై యుండవలెను. ఒకటి అత్యంతపురుషార్థము మరియు శరీరారోగ్యముచే చక్రవర్తిరాజ్యలక్ష్మిని ప్రాప్తించుకొనుట. రెండవది :- ఇతర సమస్తవిద్యలను బాగుగ చదివి వానిని ప్రచారమొనర్చుట. ఏ మనుష్యుడును పురుషార్థమును వదలి సోమరిపోతుగా నెప్పుడు నుండ  కూడదు. ।౬॥

6. Who prompts you to do good deeds? It is He, the Great Lord Who guides us on the path of virtue. Why does He do so? For the performance of noble, virtuous deeds and the fulfilment of the vow of leading a truthful life. The Lord enjoins the workers and their organisers, the teacher and the taught to be constantly engaged in doing good deeds and achieving fine qualities and true knowledge.

౭. ప్రత్యుష్టమిత్యస్య ఋషిః స ఏవ। యజ్ఞో దేవతా। ప్రాజాపత్యా జగతీ ఛన్దః । నిషాదః స్వరః.

సర్వైర్దుష్టగుణానాం దుష్టమనుష్యాణాం చ నిషేధః కర్తవ్య ఇత్యుపదిశ్యతే.

దుష్టగుణస్వభావములు కల మనుష్యుని నిషేధించుట మనుష్యులందరికి యోగ్య కార్యమని ఈ మంత్రమునందుపదేశించుచున్నాడు.

౭ ప్రత్యుష్టꣳ రక్షః ప్రత్యుష్టా౨ అరాతయో నిష్టప్తꣳ రక్షో నిష్టప్తా౨ అరాతయః। ఉర్వన్తరిక్షమన్వేమి ॥౭॥

ప. విః - ప్రత్యుష్టమితి ప్రతి+ఉష్టమ్, రక్షః, ప్రత్యుష్టా ఇతి ప్రతి+ ఉష్టాః, అరాతయః, నిష్టప్తమ్, నిస్తప్తమితి నిః+తప్తమ్; రక్షః. నిష్టప్తాః, నిస్తప్తా ఇతి నిః+తప్తాః, అరాతయః, ఉరు, అన్తరిక్షమ్, అను+ ఏమి॥౭॥

పదార్థః:-(ప్రత్యుష్టమ్) యత్ప్రతీతం చ తదుష్టం దగ్ధం చ తత్. (రక్షః) రక్షఃస్వభావో దుష్టో మనుష్యః (ప్రత్యుష్టాః) ప్రత్యక్షతయా ఉష్టా దగ్ధవ్యాస్తే (అరాతయః) అవిద్యమానా రాతిర్దానం యేషు తే శత్రవః, (నిష్టప్తమ్) నితరాం తప్తం సంతాపయుక్తం చ కార్యమ్. (రక్షః)స్వార్థీ మనుష్యః (నిష్టప్తాః) పూర్వవత్. (అరాతయః) కపటేన విద్యాదానగ్రహణరహితాః (ఉరు) బహువిధం సుఖం ప్రాప్తుం ప్రాపయితుం వా. ఉర్వితి బహునామసు పఠితమ్. నిఘం ౩.౧. (అన్తరిక్షమ్) సుఖసాధనార్థమవకాశం (అన్వేమి) అనుగతం ప్రాప్నోమి. అయం మన్త్రః శ. ౧-౧-౨. ౨-౪ వ్యాఖ్యాతః. ॥౭॥

అన్వయః :-మయా రక్షః ప్రత్యుష్టమరాతయః ప్రత్యుష్టా రక్షో నిష్టప్తమరాతయో నిష్టప్తాః పురుషార్థేన సదైవ కార్యాః. ఏవం కృత్వాన్తరిక్ష మురు బహుసుఖం చాన్వేమి. ॥౭॥

భావార్థః:-ఇదమీశ్వర ఆజ్ఞాపయతి సర్వైర్మనుష్యైః స్వకీయం దుష్టస్వభావం త్యక్త్వాఽన్యేషామపి విద్యా ధర్మోపదేశేన త్యాజయిత్వా దుష్టస్వభావాన్ మనుష్యాంశ్చ నివార్య, బహువిధం జ్ఞానం సుఖం చ సంపాద్య విద్యాధర్మ పురుషార్థాన్వితాః సుఖినః సర్వే ప్రాణినః సదా సమ్పాదనీయాః.॥౭॥

పదార్థము :-నా కర్తవ్యము పురుషార్థముతో గూడి (రక్షః) దుష్టగుణస్వభావములుగల మనుష్యుని (ప్రత్యుష్టమ్) నిశ్చయముగ నిర్మూల మొనర్చుట (అరాతయః) దయలేని దానధర్మరహితులగు దుష్టశత్రువులను (ప్రత్యుష్టాః) ప్రత్యక్షముగ నిర్మూలించుట (రక్షః) దుష్టగుణస్వభావుడు, విద్యావిరోధి, స్వార్థియు నగు మనుష్యుని (నిష్టప్తమ్ అరాతయః) ఛలయుక్తులై విద్యాగ్రహణము గాని విద్యాదానముగాని లేని దుష్టప్రాణులను (నిష్టప్తాః) నిరంతరము సంతాపయుక్తులనుగ నొనర్చి (అన్తరిక్షమ్) సుఖముల సిద్ధింపజేయు ఉత్తమ స్థానమును మరియు (ఉరు) అపార సుఖమును (అన్వేమి) ప్రాప్తింతునుగాక.॥౭॥

భావార్థము :-ఈశ్వరుడిట్లాజ్ఞాపించుచున్నాడు. మానవులెల్లరును తమ దుష్టస్వభావములను త్యజించి విద్యాధర్మముల ఉపదేశములద్వారా అన్యులను కూడ దుష్టత్వము మున్నగు అధర్మ వ్యవహారముల నుండి వేరుగ నుంచవలెను. మరియు వారిని విద్య, ధర్మము, పురుషార్థము మొదలగు అనేక విధముల జ్ఞానసుఖములచే యుక్తులనుగా నొనర్చవలయును. ॥౭॥

7. May we root our the evil tendencies of the wicked, the unsympathetic and uncharitable exploiters of humanity. May we take to task the disturbers of peace, and expose the wicked.

May we thus get many an opportunity of attaining to prosperity and bliss.

౮. ధూరసీత్యస్య ఋషిః స ఏవ. అగ్నిర్దేవతా, (నిచృత్)అతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ సర్వవిద్యాధారకేశ్వరో విద్యాసాధనీభూతో భౌతికోఽగ్నిశ్చోపదిశ్యతే.

సర్వమును ధారణమొనర్చు నీశ్వరుడును పదార్థవిద్యాసిద్ధికి హేతువునగు భౌతికాగ్నియు నిందుపదేశింప బడుచున్నది.

౮ ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వ తం యో౽స్మాన్ధూర్వతి తం ధూర్వ యం వయం ధూర్వామః దేవానామసి వహ్నితమం సస్నితమం పప్రితమం జుష్టతమం దేవహూతమమ్।౮॥

ప.వి:- ధూః, అసి, ధూర్వ, ధూర్వన్తం, ధూర్వ, తమ్, యః, అస్మాన్, ధూర్వతి, తం, ధూర్వ, యమ్, వయమ్, ధూర్వామః, దేవానామ్, అసి, వహ్నితమితి వహ్ని+తమమ్, సస్నితమమితి సస్ని+తమమ్, పప్రితమమితి పప్రి+తమమ్, జుష్టతమమితి జుష్ట+తమమ్, దేవహూతమమితి దేవహూ+తమమ్.।౮॥

పదార్థః :-(ధూః) సర్వదోషనాశకో౽న్ధకార నాశకో వా (అసి)అస్తి వా. అత్ర సర్వత్ర భౌతికపక్షే వ్యత్యయేన ప్రథమపురుషో గృహ్యతే (ధూర్వ) హింసయ ధూర్వతి హినస్తి వా (ధూర్వంతమ్)హింసాశీలం ప్రాణినం,(ధూర్వ) హింసయ హినస్తి వా. (తమ్) సర్వభూతాభి ద్రోగ్ధారమ్ (యః) అస్మద్ద్వేష్టా (అస్మాన్) ధార్మికాన్ సర్వేభ్యః సుఖోపకర్తౄన్ (ధూర్వతి) హినస్తి (తమ్) దుష్టం దస్యుం చోరం వా (ధూర్వ) హింసయ హినస్తి వా (యమ్) పాపినమ్ (వయమ్) విద్వాంసః సర్వమిత్రాః, (ధూర్వామః) హింసామః (దేవానామ్)విదుషాం పృథివ్యాదీనాం వా (అసి) ఉత్పాదకో వర్తసే ప్రకాశకో వర్తతే వా. (వహ్నితమమ్) వహతి ప్రాపయతి యథాయోగ్యం సుఖాని స వహ్నిః సో౽తిశయితస్తమ్ (సస్నితమమ్) అతిశయేన శుద్ధం శుద్ధికారకం చ, తథా శుద్ధిహేతుం భౌతికం వా. అథవా స్వవ్యాప్త్యా సర్వజగద్ద్వేష్టయితార మీశ్వరం శిల్పవిద్యాహేతుం వ్యాపనశీలం భౌతికం వా. స్నాశౌచే. అథవా ష్ణో వేష్టనే ఇత్యస్య రూపమ్. (పప్రితమమ్) ప్రాప్తి ప్రపూరయతి సర్వాభిర్విద్యాభిరానన్దైశ్చ జనాన్ స్వవ్యాప్త్యా జగద్వా మూర్తం వస్తు శిల్పవిద్యాసాధ్యాఙ్గాని చ యః సో౽తిశయిత స్తమ్ (జుష్టతమం) ధార్మికై ర్భక్తజనైః శిల్పభిశ్చ యో జుష్యతే స జుష్టః.అతిశయేన జుష్టస్తమ్.

(దేవహూతమమ్) దేవైర్విద్వద్భిః హ్వాయతే శబ్ద్యతే సోఽతిశయితస్తమమ్, హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చేత్యస్య రూపమ్. అయం మంత్రః శ. ౧. ౧-౨.౧౦-౧౨. వ్యాఖ్యాతః. ॥౮॥

అన్వయః:-హే పరమేశ్వర యతస్త్వం ధూరసి సర్వాభిరక్షకశ్చాసి తస్మాద్వయమిష్టబుద్ధ్యా దేవానాం వహ్నితమం సస్నితమం పప్రితమం జుష్టతమం దేవహూతమం త్వాం నిత్యముపాస్మహే. యోఽస్మాన్ ధూర్వతి యా చ వయం ధూర్వామస్తం త్వం ధూర్వ. యశ్చసర్వద్రోహీ తమపి ధూర్వన్తం సర్వహింసకం సదైవ ధూర్వ ఇత్యేకః. హే శిల్పవిద్యాం చికీర్షో త్వం యో భౌతికోఽగ్నిర్ధూః సర్వపదార్థచ్ఛేదకత్వాద్ధింసకో [అసి]ఽస్తి తం కలాకౌశలేన యానేషు సంప్రయోజనీయం దేవానాం వహ్నితమం సస్నితమం పప్రితమం జుష్టతమం దేవహూతమమగ్నిం [యం చ] వయం ధూర్వామస్తాడయామః. యోఽయుక్త్యా సేవితోఽస్మాన్ ధూర్వతి తం ధూర్వన్తమగ్నిం ధూర్వ. హే వీర! త్వం యో దుష్టశత్రురస్మాన్ ధూర్వతి తమప్యాగ్నేయాస్త్రేణ ధూర్వ యశ్చ దస్యురస్తి తమపి ధూర్వ.॥౮॥

భావార్థః:-యో ధాతేశ్వరః సర్వం జగద్దధాతి పాపినో దుష్టాన్ జీవాన్ తత్కృతపాప ఫలదానేన తాడయతి ధార్మికాంశ్చ రక్షతి. సర్వసుఖప్రాపక ఆత్మశుద్ధికారకః పూర్ణవిద్యాప్రదాతా విద్వద్భిః స్తోతవ్యః ప్రీత్యేష్టబుద్ధ్యా చ సేవనీయోఽస్తి స ఏవ సర్వైర్మనుష్యైర్పూజనీయః. తథైవ యోఽగ్నిః సకలశిల్పవిద్యాక్రియాసాధకతమః పృథివ్యాది పదార్థానాం మధ్యే ప్రకాశక ప్రాపకతమతయా శ్రేష్ఠోఽస్తి. యస్య ప్రయోగేణాగ్నేయాస్త్రాది విద్యయా శత్రూణాం పరాజయో భవతి స ఏవ శిల్పిభిర్విద్యాయుక్త్యా హోమయాన క్రియాసిద్ధ్యర్థం సేవనీయః.॥౮॥

పదార్థము :- ఓ పరమేశ్వరా! నీవు (ధూః) సకల దోష నాశకుడవు జగద్రక్షకుడవునై (అసి) ఉన్నావు. ఈ కారణమున మేము ఇష్టబుద్ధితో (దేవానామ్) విద్వాంసులను విద్య, మోక్షము మరియు సుఖమునందు (వహ్నితమమ్) యథాయోగ్యమున చేర్చుటకు (సస్నితమమ్) అతిశయముగ శుద్ధపరచుటకు (పప్రితమమ్) సమస్తవిద్యల మరియు ఆనందములచే విశ్వమును పూర్ణపరచుటకు (జుష్టతమమ్) ధార్మిక భక్తజనులకు సేవించదగినవాడవు. మరియు(దేవహూతమమ్) విద్వాంసులచే స్తుతింపదగిన నిన్ను సదా ఉపాసించుచున్నాము (యః) ఎవడైన ద్వేషి, మోసకారి, కపటి, పాపి, కామక్రోధాదులతో గూడిన మనుష్యుడు (అస్మాన్) ధర్మాత్ములము మరియు ఎల్లరను సౌఖ్యవంతులుగ నొనర్చు మాకు (ధూర్వతి) దుఃఖములను గలిగించునో, (యమ్) ఏ పాపాత్ముని (వయమ్) మేము (ధూర్వామః) దుఃఖముల పాల్జేయుదుమో (తమ్) అతనిని నీవు (ధూర్వ) దండించుము. ఎల్లరకు ద్రోహము గలిగించువాడు, సకల ప్రాణులకు దుఃఖము గలిగించు వానిని కూడ నీవు సదా (ధూర్వ) తాడించుచుండుము. శిల్పవిద్యలను దెలిసికొనగోరు ఓ మానవా! నీవు ఏ భౌతికాగ్ని (ధూః) సకల పదార్థములను ఛేదించునదై, అంధకారమును నాశనమొనర్చునదై (అసి) ఉన్నదో, కళలను

నడుపుటలో చాతుర్యముగల విద్వాంసులను యానములందు (వహ్నితమమ్) సుఖముల నందించు (సస్నితమమ్) శుద్ధపరచుహేతువుచే (పప్రితమమ్) శిల్పవిద్యలకు నేది ముఖ్యసాధనమో (జుష్టతమమ్) శిల్పులెద్దానిని సేవించుచుందురో, నెయ్యది (దేవహూతమమ్) విద్వాంసులు స్తుతించదగినదైన యగ్నిగలదో, దానిని (వయమ్) మేము (ధూర్వామః) తాడింతుము. దానిని యుక్తిపూర్వకముగ సేవించకున్నచో (అస్మాన్) అది మమ్ము (ధూర్వతి) పీడించును. (తమ్) అట్టి (ధూర్వన్తమ్) పీడలను గలిగించునట్టి యగ్నిని (ధూర్వ) యానాదులందు యుక్తపరచుడు. ఓ వీరులారా! మీరు (యమ్) దుష్టులగు ఏ శత్రువులు (అస్మాన్) మాకు (ధూర్వతి) దుఃఖములను గలిగింతురో (తమ్) వారిని (ధూర్వ) నష్టపరచుడు, చోరులగువారెవరైన యున్నచో వారిని కూడ (ధూర్వ) నాశమొందించుడు.।౮॥

**భావార్థము** :- సర్వజగత్తును ధారణమొనర్చియున్న పరమేశ్వరుడు దుష్టులగు పాపాత్ములను వా రొనర్చిన పాపకర్మల కనుకూలమగు దండన విధించి దుఃఖితులుగను, ధర్మాత్ములకు వారి యుత్తమకర్మల కనుసారముగ ఫలముల నిచ్చి సౌఖ్యవంతులుగను నొనర్చి రక్షించును. ఆయనయే సకల సుఖముల ప్రాప్తింపజేయును. ఆత్మను పరిశుద్ధపరచును. మరియు పూర్ణవిద్యలను ఇచ్చును. ఆయనయే విద్వాంసులచే స్తుతించదగినవాడు మరియు చక్కని బుద్ధితో సేవించదగినవాడై యున్నాడు. కాని ఇతరు లెవ్వరును అట్లు గాజాలరు. అదే విధముగ ఈ ప్రత్యక్షముగ నున్న భౌతికాగ్నియును సంపూర్ణశిల్పవిద్యల క్రియలను సిద్ధింపజేయును. వానికి ముఖ్యసాధనమునైన పృథివి మున్నగు పదార్థములందు ప్రకాశము, వాని ప్రాప్తిచేతనే శ్రేష్ఠమై యున్నది. ఏలన దానివల్ల సిద్ధపరచబడిన ఆగ్నేయాది ఉత్తమ అస్త్ర శస్త్రములచే శత్రువులు పరాజితు లగుదురు. విద్యల యుక్తిచే హోమము మరియు విమానాదులను సిద్ధపరచుట యందును భౌతికాగ్ని సేవించదగినదై యున్నది.।౮॥

8. O Lord, Thou art the dispeller of vices. May Thou punish the wicked. May Thou deal with the vicious that put the sages to trouble. May Thou inspire the sinful with noble thought, whom we, too, exhort to do noble deeds. We worship Thee, the Giver of happiness and knowledge to the learned, purifier of them, the Promulgator of learning and joy in the universe, and worthy of adoration by the religious minded devotees and the wise!

౯. అహ్రుతమసీత్యస్య ఋషిః స ఏవ. విష్ణుర్దేవతా. నిచృత్ త్రిష్టుప్ ఛన్దః ధైవతః స్వరః.

అథ యజమానభౌతికాగ్నికృత్యముపదిశ్యతే.

యజమానుని యొక్కయు, భౌతికాగ్ని యొక్కయు కర్మ ఉపదేశింపబడు చున్నది.

౯ అహ్రుతమసి హవిర్ధానం దృꣳహస్వ మా హ్వార్మా తే యజ్ఞపతిర్హ్వార్షీత్।

విష్ణుస్త్వా క్రమతామురు వాతాయాపహతꣳరక్షో యచ్ఛన్తాం పంచ।౯॥

ప.వి:- అహ్రుతమ్, అసి, హవిర్ధానమితి హవిః+ధానమ్, దృంహస్వ, మా, హ్వాః, మా, తే, యజ్ఞపతిరితి యజ్ఞ+పతిః, హ్వార్షీత్, విష్ణుః, త్వా, క్రమతాం, ఉరు, వాతాయ, అపహతమిత్యప+హతమ్, రక్షః; యచ్ఛన్తామ్, పంచ.॥౯॥

పదార్థః:-(అహ్రుతమ్) కుటిలతారహితమ్. (అసి) అస్తి. అత్ర వ్యత్యయః. (హవిర్ధానమ్) హవిషాం ధానం స్థిత్యధికరణమ్, (దృంహస్వ) వర్ధయస్వ వర్ధయతి వా. అత్ర పక్షే వ్యత్యయః (మా హ్వాః) మా త్యజేః. అత్ర లిఙర్థే లుఙ్ (మా) క్రియార్థే నిషేధవాచీ, (తే) తవ (యజ్ఞపతిః) పూర్వోక్తస్య యజ్ఞస్య పతిః పాలకః (హ్వార్షీత్) త్యజతు. అత్ర లోడర్థే లుఙ్ (విష్ణుః) వ్యాపనశీలః సూర్యః (త్వా) తద్హోతవ్యం ద్రవ్యం (క్రమతాం) చాలయతి. అత్ర లడర్థే లోట్ (ఉరు) బహు. ఉర్వితి బహునామసు పఠితమ్. నిఘం. ౩. ౧. (వాతాయ)వాయోః శుద్ధయే సుఖవృద్ధయే వా (అపహతమ్) వినాశితమ్ (రక్షః) దుర్గన్ధాదిదుఃఖజాలమ్ (యచ్ఛన్తామ్) నిగృహ్ణన్తు (పంచ) పంచభిరుత్క్షేపణాదిభిః కర్మభిః. ఉత్క్షేపణమవక్షేపణమాకుంచనం ప్రసారణం గమనమితి కర్మాణి. వైశే. ౧.౭. అత్ర సుపాం సులుగితి భిసో లుక్. అయం మన్త్రః శ. ౧-౧-౨. ౧౨-౧౬వ్యాఖ్యాతః.॥౯॥

అన్వయః:- హే ఋత్విక్! త్వం యదగ్నినా దృంహితమహ్రుతం హవిర్ధానమస్యాస్తి తద్దృంహస్వ కింతు తత్కదాచిన్మా హ్వార్మా త్యజేరిదం తే తవ యజ్ఞపతిర్దృంహతాం మా హ్వార్షీన్మా త్యజతు. ఏవం భవన్తః సర్వే మనుష్యాః పఞ్చభిరుత్క్షేపణాదిభిః కర్మభిర్యదగ్నౌ హూయతే తన్నియచ్ఛన్తాం నిగృహ్ణన్తు. యద్ద్రవ్యం విష్ణుర్వ్యాపనశీలః సూర్యోఽపహతం రక్షో యథా స్యాత్తథోరు వాతాయ [క్రమతామ్] క్రమయతి చాలయతి త్వా తత్సర్వం మనుష్యా అగ్నౌ హోమద్వారా యచ్ఛన్తాం నిగృహ్ణన్తు.॥౯॥

భావార్థః:-యదా మనుష్యాః పరస్పరం ప్రీత్యా కుటిలతాం విహాయ శిక్షకశిష్యభూత్వేమామగ్నివిద్యాం విజ్ఞానక్రియాభ్యాం జ్ఞాత్వాఽనుతిష్ఠన్తి తదా మహతీం శిల్పవిద్యాం సంపాద్య శత్రుదారిద్ర్యనివారణపురఃసరం సర్వాణి సుఖాని ప్రాప్నువన్తీతి.॥౯॥

పదార్థము :- ఓ ఋత్విజుడా! నీవు అగ్నిచే వ్యాపించునదియు (అహ్రుతమ్) కుటిలత్వము లేనిదియును (హవిర్ధానమ్) హోమమునకు దగినపదార్థముల ధారణమొనర్చునదియునగు దీనిని (దృంహస్వ) వృద్ధిపరచుము. ఏ సమయమునందైనను (మా హ్వాః) దానిని త్యజించకుము. మరియు ఈ (తే) నీయొక్క (యజ్ఞపతిః) యజమానుడును (మా హ్వార్షీత్)దానిని [ఆ యజ్ఞకార్యమును] వదలవలదు. ఈ విధముగ

మీరు (పశ్వ) ఉత్క్షేపణ, అపక్షేపణ, ఆకుంచన, ప్రసారణ, గమనము [పైకిలేచుట, కూర్చుండుట, చేష్టలద్వారా అంగములను ముడుచుట, వ్యాపింప జేయుట, నడచుట, తిరుగుట] మున్నగు నీ యైదుకర్మలచే హవనద్రవ్యములద్వారా వానిని యగ్నియందు (యచ్ఛన్తామ్) హవనము [యజ్ఞము] నొనర్పుడు (త్వా) హవన మొనర్చిన ఏ ద్రవ్యములు గలవో వానిని (విష్ణుః) వ్యాపనశీలుడగు సూర్యుడు (అపహతమ్ రక్షః) దుర్గంధము మున్నగు దోషములను నాశపరచుచు (ఉరువాతాయ) అత్యంత సుఖవృద్ధికై, వాయుశుద్ధికై (క్రమతామ్) వృద్ధియొనర్చు చున్నాడు.౹౯॥

**భావార్థము :-** మానవులు పరస్పర ప్రేమతో కుటిలత్వమును వదలి శిక్షణ నిచ్చువారికి శిష్యులై విశేష జ్ఞానక్రియలచే భౌతికాగ్నియొక్క విద్యను దెలిసికొని దాని ననుష్ఠించునప్పుడు సిద్ధించిన శిల్పవిద్యద్వారా సమస్తశత్రువుల మరియు దారిద్ర్యము మున్నగు దుఃఖములనుండి విముక్తులై సకల సుఖములను ప్రాప్తించుకొందురు. ఈ విధముగ విష్ణువు [సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు] మానవులెల్లరకును ఆజ్ఞ యిచ్చుచున్నాడు. ఈ యాజ్ఞల నెల్లరును పాలించుట కర్తవ్యమై యున్నది.౹౯॥

9. O Ye men, increase the store of goods acquired by honest and fair means to be used in the service of humanity. May your life, be constantly dedicated to this principle. May the spiritually minded people, also, not give up this humanitarian work. May your lives be constantly consecrated to the performance of five daily duties. The heat of the sun destroys dirt and odour, and draws substances consigned to fire, in their atomic form for the purification of air!

౧౦. దేవస్య త్వేత్యస్య ఋషిః స ఏవ. సవితా దేవతా. భురిగ్బృహతీఛన్దః, మధ్యమః స్వరః.

తస్య యజ్ఞఫలస్య గ్రహణం కేన కుర్వన్తీత్యుపదిశ్యతే.

ఆ యజ్ఞఫలగ్రహణ మే విధమున చేయునది వివరించ బడున్నది.

౧౦ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్।

అగ్నయే జుష్టఙ్గృహ్ణామ్యగ్నీషోమాభ్యాం జుష్టఙ్గృహ్ణామి ౹౧౦॥

**ప.వి:–** దేవస్య,త్వా,సవితుః,ప్రసవ ఇతి ప్ర + సవే,అశ్వినోః బాహుభ్యామితి బాహుభ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, అగ్నయే, జుష్టమ్, గృహ్ణామి, అగ్నీషోమాభ్యామ్, జుష్టమ్, గృహ్ణామి.౹౧౦॥

పదార్థః :-(దేవస్య) సర్వజగత్ప్రకాశకస్య సర్వసుఖదాతురీశ్వరస్య (త్వా) తత్. (సవితుః) సవితా వై దేవానాం ప్రసవితా. శ. ౧. ౧. ౨. ౧౭. తస్య సర్వజగదుత్పాదకస్య సకలైశ్వర్యప్రదాతుః, (ప్రసవే) సవితృప్రసూతేఽస్మిన్ జగతి (అశ్వినోః) సూర్యాచన్ద్ర

మపోరధ్వర్యోర్వా సూర్యాచన్ద్రమసావిత్యేకే. నిరు. ౧౨. ౧.(బాహుభ్యామ్) బలవీర్యాభ్యామ్. వీర్యం వా ఏతద్రాజన్యస్య యద్బాహూ. శ. ౫. ౩. ౩. ౧౮ (పూష్ణః) పుష్టికర్తుః ప్రాణస్య, (హస్తాభ్యామ్) గ్రహణవిసర్జనాభ్యాం (అగ్నయే) అగ్నివిద్యాసంపాదనాయ (జుష్టమ్) విద్యాం చికీర్షుభిః సేవితం కర్మ (గృహ్ణామి) స్వీకరోమి. (అగ్నీషోమాభ్యామ్) అగ్నిశ్చ సోమశ్చ తాభ్యామగ్నిజలవిద్యాభ్యామ్ (జుష్టమ్) విద్వద్భిః ప్రీతం ఫలం. (గృహ్ణామి) పూర్వవత్. అయం మన్త్రః శ. ౧. ౧. ౨. ౧౮-౧౯. వ్యాఖ్యాతః. ॥౧౦॥

అన్వయః :-యత్సవితుర్దేవస్య ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామగ్నయే జుష్టమస్తి త్వా తత్కర్మాహం గృహ్ణామి. ఏవం చ యద్విద్వద్భిరగ్నీషోమాభ్యాం జుష్టం ప్రీతం వారు ఫలమస్తి తదహం గృహ్ణామి.॥౧౦॥

భావార్థః:- విద్వద్భిర్మనుష్యైర్విద్వత్సంగత్యా సమ్యక్ పురుషార్థే నేశ్వరేణోత్పాదితాయామస్యాం సృష్టౌ సకల విద్యాసిద్ధయే సూర్యాచన్ద్రాగ్నిజలాదిపదార్థానాం సకాశాత్ సర్వేషాం బలవీర్యవృద్ధయే చ సర్వా విద్యాః సంసేవ్య ప్రచారణీయాః. యథా జగదీశ్వరేణ సకలపదార్థానాముత్పాదనధారణాభ్యాం సర్వోపకారః కృతోఽస్తి తథైవాస్మాభిరపి నిత్యం ప్రయతితవ్యమ్. ॥౧౦॥

పదార్థము :-నేను (సవితుః) సర్వజగత్తు నుత్పన్నమొనర్చు కర్తయు, సకలైశ్వర్యదాతయు (దేవస్య) విశ్వమును ప్రకాశపరచువాడును మరియు సర్వ సుఖదాతయునగు పరమేశ్వరునిద్వారా (ప్రసవే) ఉత్పన్నపరచబడిన ఈ జగమునందు (అశ్వినోః) సూర్యచంద్రులయొక్క (బాహుభ్యామ్) బలవీర్యము వలన (పూష్ణః) పుష్టినిగలిగించు ప్రాణముయొక్క (హస్తాభ్యామ్) గ్రహణత్యాగబలములవలన (అగ్నయే) అగ్నివిద్యను సిద్ధమొనర్చుటకొరకు (జుష్టమ్) విద్యలనభ్యసించువారు సేవించుకర్మలను (త్వా) వానిని (గృహ్ణామి) స్వీకరించెదను. ఇదేవిధముగా(అగ్నీషోమాభ్యామ్) అగ్ని మరియు జలవిద్యలను (జుష్టమ్) విద్వాంసులు గోరునట్టి కర్మఫలమును (గృహ్ణామి) నేను స్వీకరించెదను.॥౧౦॥

భావార్థము :-మానవులెల్లరును విద్వాంసుల సత్సంగముల మరియు తమపురుషార్థములద్వారా పరమేశ్వరునిచే సృష్టింపబడిన ప్రత్యక్షసృష్టి, అనగా ఈ విశ్వమునందు సకలవిద్యలసిద్ధికై సూర్యచంద్రాగ్ని జలాదుల ప్రకాశముద్వారా సర్వజనుల బలవీర్యముల వృద్ధికొరకు అనేకవిద్యల నభ్యసించి వానిని ప్రచారమొనర్పవలయును. అనగా జగదీశ్వరుడు సకల పదార్థముల నుత్పత్తి ధారణమొనర్చి ఎల్లర కుపకారమొనర్చు నట్లు మనమును సదా ప్రయత్నించుచుండవలెను.॥౧౦॥

10. In this universe created by the All Effulgent God, I realize the power and influence of the sun and moon, feel the inhalation and exhalation of lifegiving breath, appreciate the efforts made by the votaries of knowledge for mastering the science of electricity. I follow the researches made by the learned in the application of water and fire.

౧౧. భూతాయ త్వేతి ఋషిః స ఏవ, అగ్నిర్దేవతా, స్వరాడ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః,

యజ్ఞశాలాదిగృహాణి కీదృశాని రచనీయానీత్యుపదిశ్యతే.

యజ్ఞశాలాది గృహము లెటుల నిర్మించవలయునో ఈ మంత్రమునం దుపదేశించుచున్నారు.

౧౧ భూతాయ త్వా నారాతయే స్వరభివిఖ్యేషం దృꣳహన్తాం దుర్యాః।

పృథివ్యాముర్వన్తరిక్షమన్వేమి। పృథివ్యాస్త్వా నాభౌ

సాదయామ్యదిత్యాऽఉపస్థేऽగ్నే హవ్యꣳ రక్ష ॥౧౧॥

ప. వి:– భూతాయ, త్వా, న, అరాతయే, స్వః, అభివిఖ్యేషమిత్యభి+విఖ్యేషమ్, దృꣳహన్తామ్, దుర్యాః, పృథివ్యామ్, ఉరు, అన్తరిక్షమ్, అను, ఏమి, పృథివ్యాః, త్వా, నాభౌ, సాదయామి అదిత్యాః, ఉపస్థ ఇత్యుపస్థే, అగ్నే, హవ్యమ్, రక్ష ॥౧౧॥

పదార్థః-(భూతాయ) ఉత్పన్నానాం ప్రాణినాం సుఖాయ (త్వా) తం కృషిశిల్పాదిసాధనం. (న) నిషేధార్థే (అరాతయే) రాతిర్దానం న విద్యతే యస్మిన్ తస్మై శత్రవే బహుదానకరణార్థం దారిద్ర్యవినాశాయ వా (స్వః) సుఖముదకం వా. స్వరితి సుఖనామసు పఠితమ్. నిఘం. 3.౬ ఉదకనామసు చ. ౧-౧౨. (అభివిఖ్యేషమ్) అభితః సర్వతో వివిధం పశ్యేయమ్. అత్రాభివ్యోరుపపదే చక్షిఙ్ ఇత్యస్యాశీర్లిఙ్యార్ధధాతుక సంజ్ఞామాశ్రిత్య ఖ్యాఞ్ ఆదేశః. లిఙ్యాశిష్యఙిత్యఙ్ సార్వధాతుకసంజ్ఞామాశ్రిత్య చ యామ ఇత్యస్య ఇయ్ం ఆదేశః. సకారలోపాభావ ఇతి (దృꣳహన్తాం) దృంహన్తాం వర్ధయన్తామ్. అత్రాంతర్గతోణ్యర్థః (దుర్యాః) గృహాణి, దుర్యా ఇతి గృహనామసు పఠితమ్. నిఘం.3-౪. (పృథివ్యాం) విస్తృతాయాం భూమౌ (ఉరు) బాహు (అన్తరిక్షం) అవకాశం సుఖేన నివాసార్థం (అను) క్రియార్థే (ఏమి) ప్రాప్నోమి. (పృథివ్యాః) శుద్ధాయా విస్తృతాయా భూమేః (త్వా) తం పూర్వోక్తం యజ్ఞం (నాభౌ) మధ్యే (సాదయామి) స్థాపయామి. (అదిత్యాః) విజ్ఞానదీప్తేర్వేదవాచః సకాశాదన్తరిక్షే మేఘమణ్డలస్య మధ్యే అదితిర్ద్యౌరదితిరన్తరిక్షమితి మంత్రప్రామాణ్యాత్, ఋ ౧, ౮, ౯, ౧౦. అదితిరితి వాఙ్నామసు పఠితమ్, నిఘం ౧. ౧౧. పదనామసు చ. నిఘ. ౪. ౧. (ఉపస్థే) సమీపే (అగ్నే) పరమేశ్వర! (హవ్యం) దాతుం

గ్రహీతుం యోగ్యం క్రియాకౌశలం సుఖం వా (రక్ష) పాలయ. అయం మన్త్రః శ. ౧. ౧. ౨. ౨౦-౨౩ వ్యాఖ్యాతః. ॥౧౧॥

అన్వయః :-అహం యం భూతాయారాతయే ఉదానాయాదిత్యా ఉపస్థే యజ్ఞం సాదయామి. [త్వా] తం కదాచిన్న త్యజామి. హే విద్వాంసో! భవన్తః పృథివ్యాం దుర్యా దృంహన్తాం వర్ధయన్తామ్. అహం [త్వా] పృథివ్యా నాభౌ మధ్యే యేషు గృహేషు స్వరభివిఖ్యేషం యస్యాం పృథివ్యాముర్వన్తరిక్షం చాన్వేమి. హే అగ్నే! జగదీశ్వర! త్వమస్మాకం హవ్యం సర్వదా రక్షేత్యేకోఽన్వయః.

హే అగ్నే! పరమేశ్వర! అహం భూతాయారాతయే పృథివ్యా నాభౌ ఈశ్వరత్వోపాస్య త్వాభ్యాం స్వః సుఖరూపం [త్వా] త్వా మభివిఖ్యేషమ్ ప్రకాశయామి. భవత్కృపయేమేఽస్మాకం దుర్యా గృహాదయః పదార్థాస్తత్రస్థా మనుష్యాదయః ప్రాణినో దృంహన్తాం నిత్యం వర్ధయన్తామ్. అహం పృథివ్యాముర్వన్తరిక్షం వ్యాపకమదిత్యాముపస్థే త్వా త్వామన్వేమి నిత్యం ప్రాప్నోమి [న సాదయామి]. న కదాచిత్ త్వా త్వాం త్యజామి. త్వమిమమస్మాకం హవ్యం సర్వదా రక్ష. ఇతి ద్వితీయోఽన్వయః.

అహం శిల్పవిద్ యజమానో భూతాయారాతయే పృథివ్యా నాభౌ త్వా [అగ్నే] తమగ్నిం హోమార్థం శిల్పవిద్యార్థం చ సాదయామి. యతోఽయమగ్నిరదిత్యా అన్తరిక్షస్యోపస్థే హుతం హవ్యం ద్రవం [రక్ష] రక్షతి తస్మాత్తం పృథివ్యాం స్థాపయిత్వోర్వన్తరిక్షమన్వేమి. అత ఏవ త్వా తం పృథివ్యాం సాదయామి. ఏవం కుర్వన్నహం స్వరభివిఖ్యేషమ్. తథైవేమే దుర్యాః ప్రాసాదాస్తత్స్థా మనుష్యాశ్చ దృంహన్తాం శుభగుణైర్వర్ధన్తామితి మత్వా తమిమమగ్నిం కదాచిన్నాహం త్యజామి ఇతి తృతీయోఽన్వయః. ॥౧౧॥

భావార్థః:- అత్ర శ్లేషాలంకారః. ఈశ్వరేణ మనుష్య ఆజ్ఞాప్యతే. హే మనుష్య! అహం త్వాం సర్వేషాం భూతానాం సుఖదానాయ పృథివ్యాం రక్షయామి, త్వయా వేదవిద్యాధర్మాను ష్ఠానయుక్తేన పురుషార్థేన సున్దరాణి సర్వర్తు సుఖయుక్తాని సర్వతో విశాలావకాశసహితాని గృహాణి రచయిత్వా సుఖం ప్రాపణీయమ్. తథా మత్సృష్టౌ యావన్తః పదార్థాః సన్తి తేషాం సమ్యగ్గుణాన్వేషణం కృత్వాఽనేక విద్యాః ప్రత్యక్షీకృత్య తాసాం రక్షణం ప్రచారశ్చ సదైవ సంభావనీయః మనుష్యైణాత్రైవం మన్తవ్యం సర్వత్రాభివ్యాపకం సర్వసాక్షిణం సర్వమిత్రం సర్వసుఖవర్ధక ముపాసితుమర్హం సర్వశ క్తిమన్తం పరమేశ్వరం జ్ఞాత్వా సర్వోపకారో వివిధవిద్యావృద్ధిర్ధర్మోపస్థానమధర్మాద్దూరే స్థితిః క్రియాకౌశలసంపాదనం యజ్ఞక్రియానుష్ఠానం చ కర్తవ్యమితి.॥౧౧॥

**అత్ర మహీధరేణ భ్రాన్త్యా అభివిఖ్యేషమితి పదం ఖ్యా ప్రకథనే ఇత్యస్య దర్శనార్థే గృహీతం తద్ ధాత్వర్థాదేవ విరుద్ధమ్. అభిలిఖ్యేషం పశ్యేయమ్. విపూర్వః ఖ్యాతిదర్శనార్థ ఇత్యువ్వటః.**

**పదార్థము :-** నేను ఏ యజ్ఞమును (భూతాయ) ప్రాణుల సుఖము మరియు (అరాతయే) దారిద్ర్యాది దోషముల నాశనమునకు (ఆదిత్యా) వేదవాణి, విజ్ఞానప్రకాశముయొక్క (ఉపస్థే) గుణములందు (సాదయామి) స్థాపనమొనర్చుచున్నానో (త్వా) దానినెప్పుడును (న)వదలను. ఓ విద్వాంసులారా! మీ కర్తవ్యమేమనగా (పృథివ్యామ్) విశాలమైన భూమియందు (దుర్యాః) మీ గృహములను (దృంహన్తామ్) వ్యాపింపజేయవలెను. నేను (పృథివ్యాః నాభౌ) పృథివీమధ్య గృహములందు (స్వః) జలములు మున్నగు సుఖదాయక పదార్థములను( అభివిఖ్యేషమ్) అన్నివిధముల జూతును గాక! (ఉర్వన్తరిక్షమ్) చెప్పబడినపృథివిలో విశాలమగు అవకాశము [శూన్యము] నిచ్చి సుఖముగా నివసించదగిన స్థానమును సృజించిన (త్వా) నిన్ను (అన్వేమి) ప్రాప్తింతును. ఓ (అగ్నే) జగదీశ్వరా! నీవు (హవ్యమ్) ఇచ్చిపుచ్చుకొనదగిన మా పదార్థములను (రక్ష) సర్వదా రక్షించుచుండుము [ఇది మొదటి పక్షము].

**రెండవ పక్షము:-** ఓ అగ్నే పరమేశ్వరా! నేను (భూతాయ) ప్రాపంచికజీవుల సుఖము, (రాతయే) దారిద్ర్యనాశనము మరియు దానము మున్నగు ధర్మముల నాచరించుటకై (పృథివ్యాః) పృథివియొక్క (నాభౌ) మధ్యన [ఈశ్వర సత్తా మరియు నాతని యుపాసనలద్వారా] (స్వః) సుఖస్వరూపుడవగు (త్వా) నిన్ను (అభివిఖ్యేషమ్) ప్రకాశపరతును. నీ కృపచే నా గృహాదిపదార్థములు మరియు దాని యందుండు మనుష్యులు మున్నగు ప్రాణులు (దృంహన్తామ్) వృద్ధిపొందుదురుగాక! నేను (పృథివ్యామ్) విస్తృత భూమియందు (ఉరు) అధికముగ (అన్తరిక్షమ్) అవకాశముతో నున్న స్థానమును నివాసముకొరకు (ఆదిత్యా ఉపస్థే) సర్వత్రవ్యాపకమై యున్న నీ సమీపమున సదా (అన్వేమి) ప్రాప్తించుకొందును. ఎప్పుడును (త్వా) నిన్ను (న సాదయామి) త్యజించను. ఓ జగదీశ్వరా! నీవు నాయొక్క (హవ్యమ్) ఉత్తమపదార్థములను సర్వదా (రక్ష) రక్షించుము. [ఇది రెండవ యర్థము.]

**మూడవ పక్షము:-** ఇట్లు చెప్పుచున్నాడు. నేను శిల్పవిద్యల నెరుగువాడనై యజ్ఞమునొనర్చు (భూతాయ) విశ్వమందలి ప్రాణులసుఖము (అరాతయే) దారిద్ర్యాది దోషముల వినాశము మరియు సుఖముగా దానము మున్నగు ధర్మకార్యము లొనర్చు నిచ్చుచే (పృథివ్యా నాభౌ) ఈ పృథివిపై శిల్పవిద్యల సిద్ధిపరచునట్టి ఏ (అగ్నే) అగ్ని గలదో దానిని హవన [యజ్ఞ] మొనర్చుటకు మరియు శిల్పవిద్యల సిద్ధికొరకు (సాదయామి) స్థాపింతును. ఏలన! ఉక్తశిల్పవిద్య దీని ద్వారానే సిద్ధించుచున్నది (అదిత్యాః) అంతరిక్షమున స్థితమైయున్న మేఘమండలమున (హవ్యమ్) హోమముద్వారా చేర్పించినట్టి ఉత్తమోత్తమ పదార్థముల (రక్ష) రక్షణ యొనర్చుకొందును. ఇందుచే నీ యగ్నిని (పృథివ్యామ్) పృథివియందు స్థాపితమొనర్చి (ఉర్వన్తరిక్షమ్) గొప్ప అవకాశయుక్త స్థానము అనేక విధములగు సుఖములను (అన్వేమి) ప్రాప్తించుకొందును. ఈ ప్రయోజనముకొరకే (త్వా) ఈ యగ్నిని పృథివియందు స్థాపింతును. ఈ విధముగ శ్రేష్ఠకర్మల నొనర్చుచు (స్వః) పలువిధ సుఖములను (అభివిఖ్యేషమ్) చూచెదను గాక! నాయొక్క (దుర్యాః) గృహము మరియు అందుండు మనుష్యులు (దృంహన్తామ్)

శుభగుణములచే సుఖముగ వృద్ధినొందుదురు గాక! ఇందుచే ఈ భౌతికాగ్నిని నే నెన్నడును (న) త్యజించకుందునుగాక! [ఇది మూడవ యర్థము].॥౧౧॥

**భావార్థము** :- ఈ మంత్రములో శ్లేషాలంకార మున్నది. ఈశ్వరు డీట్లాజ్ఞాపించుచున్నాడు. ఓ మానవులారా! నేను మిమ్మేల రక్షించుచున్నాననగా: మీరు పృథివిపై సకలప్రాణులకు సుఖమును చేకూర్చుడు. వేదవిద్యలు, ధర్మానుష్ఠానములు మరియు మీ పురుషార్థములద్వారా అనేక విధములగు సుఖములను సదా విస్తృత మొనర్చుకొనుట మీకు యోగ్యమై యున్నది. మీరు అన్ని ఋతువులందును సుఖమునిచ్చు యోగ్యమైన, చక్కని అవకాశముతో గూడిన సుందర గృహములను నిర్మించుకొని సర్వదా సుఖములననుభవించుడు. నా సృష్టియందుగల సకల ఉత్తమోత్తమగుణములను పరిశోధించి, లేదా అనేక విద్యలను ప్రకటించుచు వాని యా ఉత్తమగుణములను ప్రపంచమునందు చక్కగా ప్రచారమొనర్చుచుండుడు. దీనివల్ల సకలప్రాణులకు ఉత్తమసుఖము వృద్ధియగుగాక! నన్ను మీరు సర్వవ్యాపకునిగ, సర్వసాక్షిగ, సర్వమిత్రునిగ, సకలసుఖములను వృద్ధిపరచువానిగా, ఉపాసనాయోగ్యునిగ మరియు సర్వశక్తిమంతునిగ నెరిగి, సర్వప్రాణులకు ఉపకారము, వివిధ విద్యలవృద్ధి, ధర్మమునందు ప్రవృత్తి, అధర్మమునందు నివృత్తి, క్రియాకుశలత్వసిద్ధి మరియు యజ్ఞక్రియల అనుష్ఠానము మున్నగువానియందు సదా ప్రవృత్తులై యుండవలెను.॥౧౧॥

ఈ మంత్రమునందు మహీధరుడు భ్రాంతితో **'అభివిఖ్యేషమ్'** అను పదమును **'ఖ్యాప్రకథనే'** ఈ ధాతువు నుదహరించి దర్శనార్థములో స్వీకరించి యుండెను. ఈ విధముగ ధాత్వర్థమునకే విరుద్ధార్థమును వ్రాసి యశుద్ధపరచినాడు.

11. I resort to agriculture and craft for removing poverty and ministering happiness to all. May I feel joy in my domestic life. May our houses be sufficiently commodious, airy, fully comfortable, and built in the middle of an open space. May our life be in conformity with Vedic teachings. O Lord we pray unto Thee to preserve and protect whatever gives us happiness.

౧౨. పవిత్రే స్థ ఇత్యస్య ఋషిః స ఏవ. అప్సవితారౌ దేవతే. భురిగత్యష్టి ఛన్దః, గాన్ధారః స్వరః.

అగ్నౌ హుతం ద్రవ్యం మేఘమండలం ప్రాప్య కీదృశం భవతీత్యుపదిశ్యతే.

అగ్నియందు వ్రేల్చబడిన ద్రవ్యము మేఘమండలమునందు జేరి యెటుల మార్పుజెంది యేమి

గుణమును ఇచ్చున దీ మంత్రమునం దీశ్వరు డుపదేశించెను.

౧౨ పవిత్రే స్థో వైష్ణవ్యౌ సవితుర్వః ప్రసవ ఉత్పునామ్యచ్ఛిద్రేణ పవిత్రేణ సూర్యస్య

రశ్మిభిః। దేవీ రాపో౨ అగ్రేగువో౨ అగ్రేపువో౨ఽగ్ర౨ఇమమద్య

యజ్ఞన్నయతాగ్రే యజ్ఞపతిఀ సుధాతుం యజ్ఞపతిం దేవయువమ్ ॥౧౨॥

ప.వి:-పవిత్రే ఇతి పవిత్రే, స్థః, వైష్ణవ్యౌ, సవితుః, వః, ప్రసవ ఇతి ప్ర+సవే, ఉత్, పునామి, అచ్ఛిద్రేణ, పవిత్రేణ, సూర్యస్య, రశ్మిభిరితి రశ్మి+భిః దేవీః, ఆపః, అగ్రేగువ ఇత్యగ్రే+గువః, అగ్రేపువ ఇత్యగ్రే+పువః, అగ్రే, ఇమమ్, అద్య, యజ్ఞమ్, నయత, అగ్రే, యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, సుధాతుమితి సుధా+తుమ్, యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, దేవయువమితి దేవ+యువమ్.॥౧౨॥

పదార్థః-(పవిత్రే) పవిత్రకరణహేతూ ప్రాణాపానగతీ (స్థః) భవతః. అత్ర వ్యత్యయః (వైష్ణవ్యౌ) యజ్ఞస్యేమౌ వ్యాప్తికర్తారౌ పవనపావకౌ తౌ (సవితుః) జగదుత్పాదకస్యేశ్వరస్య (వః) తాః. అత్ర పురుషవ్యత్యయః. (ప్రసవే) ఉత్పన్నే అస్మిన్ జగతి (ఉద్) ధాత్వర్థే. ఉదిత్యేతయోః ప్రాతిలోమ్యం ప్రాహ. నిరు. ౧-౩. (పునామి) పవిత్రీ కరోమి. (అచ్ఛిద్రేణ) ఛిద్రరహితైః (పవిత్రేణ) శుద్ధికరణహేతుభిః (సూర్యస్య) ప్రత్యక్షలోకస్య (రశ్మిభిః) కిరణైః (దేవీః) దివ్యగుణయుక్తాః. అత్ర సుపాం సులుగితి పూర్వసవర్ణాదేశః (ఆపః) జలాని (అగ్రే గువః) అగ్రే సముద్రే ఉన్తరిక్షే గచ్ఛన్తీతి తాః (అగ్రేపువః) ప్రథమాం పృథివీస్థసోమౌషధిం సేవికాః (అగ్రే) పురఃసరత్వే క్రియాసంబంధే (ఇమమ్) ప్రత్యక్షమ్ (అద్య) అస్మిన్నహని (యజ్ఞమ్) పూర్వోక్తం (నయత) ప్రాపయత (అగ్రే) (యజ్ఞపతిమ్) యజ్ఞస్యానుష్ఠాతారం స్వామినమ్ (సుధాతుమ్) శోభనా ధాతవః శరీరస్థా మన ఆదయః సువర్ణాదయో వా యస్య తమ్. (యజ్ఞపతిమ్) యజ్ఞస్య కామయితారమ్ (దేవయువమ్) దేవాన్ విదుషో దివ్యగుణాన్వా యౌతి ప్రాప్నోతి ప్రాపయతీతి వా తమ్. అయం మన్త్రః శ. ౧. ౧. ౩. ౧-౭. వ్యాఖ్యాతః. ॥౧౨॥

అన్వయః :-హే విద్వాంసో యథా సవితుః పరమేశ్వరస్య ప్రసవేఽస్మిన్ సంసారేఽచ్ఛిద్రేణ పవిత్రేణ సూర్యస్య రశ్మిభిః పవిత్రే శుద్ధౌ వైష్ణవ్యౌ పవనపావకౌ స్థో భవతః. యథా చైతైరగ్రే గువోఽగ్రే పువో [వః] దేవీరాపః పవిత్రా భవేయుః తథా శుద్ధాని ద్రవ్యాణ్యగ్నౌ నయత ప్రాపయత తథైవాహ మద్యేమం యజ్ఞ మగ్రే నీత్వా ఽగ్రే సుధాతుం యజ్ఞపతిం దేవయువం యజ్ఞపతిం చోత్పునామి.॥౧౨॥

**భావార్థః**:- అత్ర లుప్తోపమాలంకారః. యే పదార్థాః సంయోగేన వికారం ప్రాప్నువన్తి. అగ్నినా ఛిన్నాః పృథక్ పృథక్ పరమాణవో భూత్వా వాయౌ విహరన్తి తే శుద్ధా భవన్తి. యథా

**యజ్ఞానుష్ఠానేన వాయుజలానాముత్తమే శుద్ధిపుష్టీ జాయేతే. న తథా ఽన్యేన భవితుమర్హతః తస్మాద్దేవక్రియయాశుద్ధైర్వాయ్వగ్ని జలాదిభిః శిల్పవిద్యయా యానాని సాధయిత్వా కామనాసిద్ధిం కుర్యుః కారయేయుశ్చ యా ఆపో ఽస్మాత్ స్థానాదుత్థాయ సముద్రమన్తరిక్షం గచ్ఛన్తి తతః పునః పృథివ్యాదిపదార్థానాగచ్ఛన్తి. తాః ప్రథమాః సంఖ్యాయన్తే యా మేఘస్థాస్తా ద్వితీయా ఇతి. శతపథబ్రాహ్మణే మేఘస్య వృత్రస్య సూర్యలోకస్య చ యుద్ధాఖ్యాయిక యాఽఽస్య మంత్రస్య వ్యాఖ్యానే మేఘవిద్యోక్తా.॥౧౨॥**

**పదార్థము :-** ఓ విద్వాంసులారా! ఎట్లు మీరు (సవితుః) పరమేశ్వరుడు (ప్రసవే) ఉత్పన్నమొనర్చిన యీ జగమునందు (అచ్ఛిద్రేణ) నిర్దోషమును (పవిత్రేణ) పవిత్ర మొనర్చుటకు హేతువగు (సూర్యస్య) సూర్యుని (రశ్మిభిః) కిరణములచే (వైష్ణవ్యౌ) యజ్ఞసంబంధమగు [వ్యాప్తికారకములగు వాయ్వగ్నులు, ప్రాణాపానగతులు] (పవిత్రే) పదార్థములను సైతము పవిత్రమొనర్చుటకు హేతువులై (స్థః) ఉన్నవియో [ఎట్లు సూర్యకిరణములచే] (అగ్రేగువః) ముందు సముద్రమున, అంతరిక్షమున నడచునవియు (అగ్రేపువః) ప్రథమమున పృథివిపై నున్న సోమ ఓషధిని సేవించునదియు (దేవీః) దివ్యగుణయుక్తములు నైన (ఆపః) జలములు పవిత్రములుగ నుండునట్లు పవిత్రపదార్థములచే మీరు అగ్నియందు హోమము నొనర్చుచున్నారో అట్లే నేనును (అద్య) నేడు (ఇమమ్) ఈ (యజ్ఞమ్) క్రియాసంబంధమగు యజ్ఞమును (నయత) పొంది (అగ్రే) మొదట(సుధాతుమ్) శ్రేష్ఠములగు మనస్సు మున్నగు ఇంద్రియములు, సువర్ణాది ధనములు గలవాడును (యజ్ఞపతిమ్) యజ్ఞములను నియమముగ పాలించువాడును (దేవయువమ్) విద్వాంసులను, శ్రేష్ఠగుణములను ప్రాప్తమొనర్పజేయు మరియు జేయించువాడును నగు (యజ్ఞపతిమ్) యజ్ఞేచ్ఛగల మనుష్యుని (ఉత్పునామి) పవిత్రపరచుచున్నాను.॥౧౨॥

**భావార్థము :-**ఈ మంత్రమున లుప్తోపమాలంకారము గలదు. సంయోగముచే వికారమును పొందు పదార్థములు అగ్నినిమిత్తమున అతిసూక్ష్మములును, పరమాణురూపములుగనై వాయువుమధ్యన నుండును. అట్లు కొన్ని శుద్ధములు నగుచున్నవి. కాని యజ్ఞానుష్ఠానములవల్ల వాయువు, వృష్టి ఎంతగా ఉత్తమము మరియు పుష్టివంతమును నగునో అంతగా ఇతర ఏ పద్ధతులవల్ల నైనను ఎన్నటికిని కాజాలదు. అందుచే విద్వాంసులు యజ్ఞక్రియలచే శుద్ధములగు వాయువు అగ్నులతో శిల్పవిద్యలతో శ్రేష్ఠముగు యానవిమానాదులను నిర్మించుకొని అనేక లాభములను పొందవలయును. తమ మనోకామితములను సిద్ధింపజేసికొని ఇతరుల మనోవాంఛలను కూడ సిద్ధింపజేయవలయును. ఏ జలములు భూమినుండి అంతరిక్షమునకు జేరి అచ్చటి నుండి తిరిగి మరల పృథివి మున్నగు పదార్థములను పొందుచున్నవియో అవి మొదటివి యని, మేఘములందే యుండిపోవునవి ద్వితీయములని యనబడును.॥౧౨॥

శతపథబ్రాహ్మణమునందు మేఘము వృత్రము 'అసురుడు' అనియు, సూర్యుని ఇంద్రుడనియు వర్ణించబడినది. యుద్ధరూప కథా ప్రకాశముచే ఈ మంత్రమునందు మేఘవిద్యను గూర్చి వర్ణింపబడియున్నది.

**12. I learned persons, just as in this world created by God, inhaling and exhaling breaths are purified by the faultless and pure rays of the sun, just as charming and beautiful waters, which run to the ocean and go up in the atmosphere and nourish medi-**

cines are purified by theses rays, so do ye perform Homa with pure substances. I always promote this yajna, and sanctify the worshipper with pure mind and strong body, the worshipper full of learning and noble qualities.

౧౩. యుష్మా ఇన్ద్రో వృణీతేత్యస్య ఋషిః పూర్వోక్తః. ఇన్ద్రో దేవతా. నిచృదుష్ణిక్ ఛన్దః. ఋషభః స్వరః.

అగ్నేయ త్వేత్యస్య ఋషిః స ఏవ. అగ్నిర్దేవతా. విరాడ్గాయత్రీ ఛన్దః. షడ్జః స్వరః.

దైవ్యాయ కర్మణ ఇత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞోదేవతా. భురిగుష్ణిక్ ఛన్దః. ఋషభః స్వరః.

పునస్తాః కథంభూతా ఆప ఇంద్రవృత్రయుద్ధం చేత్యుపదిశ్యతే. జలము లెటులుండునది,

ఇంద్రవృత్రాసురుల యుద్ధ మెటులుండున దీ మంత్రమున వ్యాఖ్యానించబడినది.

౧౩ యుష్మా ఇన్ద్రో వృణీత వృత్రతూర్యే యూయమిన్ద్రమవృణీధ్వం వృత్రతూర్యే ప్రోక్షితా స్థ। అగ్నయే త్వా జుష్టంప్రోక్షామ్యగ్నీషోమాభ్యాం త్వా జుష్టంప్రోక్షామి। దైవ్యాయ కర్మణే శున్ధధ్వం దేవయజ్యాయై యద్వో శుద్ధాః పరాజఘ్ను రిదం వ స్తచ్ఛున్ధామి ॥౧౩॥

ప.వి:- యుష్మాః, ఇన్ద్రః, అవృణీత, వృత్రతూర్య ఇతి వృత్ర+తూర్యే, యూయమ్, ఇన్ద్రమ్. అవృణీధ్వమ్, వృత్రతూర్య ఇతి వృత్ర+తూర్యే, ప్రోక్షితా ఇతి ప్ర+ఉక్షితాః, స్థః, అగ్నయే, త్వా, జుష్టమ్, ప్ర ఉక్షామి, అగ్నీషోమాభ్యామ్, త్వా, జుష్టమ్ ప్ర+ఉక్షామి, దైవ్యాయ, కర్మణే, శున్ధధ్వమ్, దేవయజ్యాయా ఇతి దేవ+య జ్యాయై, యత్, వః అశుద్ధాః, పరాజఘ్నురితి పరా+జఘ్నుః, ఇదమ్, వః, తత్, శున్ధామి.॥౧౩॥

పదార్థః:-(యుష్మాః) తాః పూర్వోక్తా ఆపః. అత్ర వ్యత్యయః. వా ఛన్దసి సర్వే విధయో భవన్తీతి శసః సకారస్య నత్వాభావశ్చ. (ఇన్ద్రః) సూర్యలోకః (అవృణీత) వృణీతే. అత్ర లడర్థే లఙ్. (వృత్రతూర్యే) వృత్రస్య మేఘస్య తూర్యో వధస్తస్మిన్. వృత్ర ఇతి మేఘనామసు పఠితమ్. నిఘం. ౧.౧౦. తూరీ గతిత్వరణ హింసనయోరిత్యస్మాత్ కర్మణి ణ్యత్.

**చ కార్యా. యథేశ్వరః పరోపకారిణాం నృణాముపర్యనుగ్రహం కరోతి తథైవాఽస్మాభిరపి సర్వేషాం ప్రాణినాముపరి నిత్యమనుగ్రహః కార్యః. యథాఽయమన్తర్యామీశ్వరః సూర్యలోకశ్చసంస్కారే అధ్యాత్మని వేదేషు చ సత్యం జ్ఞానం మూర్తద్రవ్యాణి నైరంతర్యేణ ప్రకాశయతి తథైవ సర్వైరస్మాభిర్మనుష్యైః సర్వేషాం సుఖాయాఽఖిలా విద్యాః ప్రత్యక్షీకృత్య నిత్యం ప్రకాశనీయాః. తాభిః పృథివీరాజ్యసుఖం నిత్యం కార్యమితి. ॥౨౦॥**

**పదార్థము** :-(ధాన్యమ్) యజ్ఞముచే శుద్ధములును, ఉత్తమ స్వభావయుక్తములును, సుఖహేతువులును, వ్యాధినాశకములు నగు ఏ యన్నధాన్యాదులుగలవో, లేక (పయః) జలము (అసి)కలదో అవి (దేవాన్) విద్వాంసులను, జీవములను, ఇంద్రియములను (ధినుహి) తృప్తి పరచుచున్నవి. ఓ మనుష్యులారా! నేనేవిధముగ (త్వా) దానిని (ప్రాణాయ) జీవనముకొరకు (త్వా ఉదానాయ) దానిని బలము, స్ఫూర్తి, పరాక్రమములకొరకు (త్వా వ్యానాయ) దానిని సకలశుభగుణములను, శుభకర్మలను, విద్యావ్యాసంగములను వ్యాప్తిపరచుటకొరకు మరియు (దీర్ఘమ్) దీర్ఘకాలమువరకు (ప్రసితిమ్) అత్యుత్తమ సుఖములతో గూడిన (ఆయుః) పూర్ణాయుష్యము ననుభవించుటకొరకు (ధామ్) ధారణ మొనర్చుచున్నానో ఆలాగుననే మీరును పైనజెప్పిన ప్రయోజనములను పొందుటకై దానిని సదా ధారణమొనర్చుడు.

ఎట్లు మాబోటి విద్వాంసులకు (హిరణ్యపాణిః) మోక్షమొసగుటయే పనిగా పెట్టుకొనినవాడును, సర్వజగత్కర్తయు (సవితా) సకలైశ్వర్యప్రదాతయు నగు పరమేశ్వరుడు (అచ్ఛిద్రేణ) తన వ్యాపకత్వముచే, లేక ఉత్తమవ్యవహారములతో (మహీనామ్) వాణులయొక్క [చక్షుషే] ప్రత్యక్షజ్ఞానమును (ప్రత్యనుగృభ్ణాతు) గ్రహించుచున్నాడో, అటులనే మనమును ఆ యీశ్వరుని (అచ్ఛిద్రేణ) నిరంతరము (పాణినా) స్తుతులద్వారా గ్రహింతుముగాక! మరియు నెట్లు (హిరణ్యపాణిః) పదార్థముల ప్రకాశమొనర్చు (సవితా) సూర్యలోకము (మహీనామ్) లోకలోకాంతరములందలి పృథివ్యాదులందు నేత్రసంబంధవ్యవహారములకై (అచ్ఛిద్రేణ) నిరంతరము తీవ్రప్రకాశముచే (పయః) జలములను (ప్రతిగృభ్ణాతు) గ్రహించి అన్నము మున్నగు పదార్థములను పుష్టియొనర్చుచున్నదో, అట్లే మేమును యాతని (అచ్ఛిద్రేణ) నిరంతర (పాణినా) వ్యవహారములతో (మహీనామ్) పృథివిపైనుండు (చక్షుసే) పదార్థముల దృష్టిగోచరమునకై స్వీకరించుచున్నాము. ॥౨౦॥

**భావార్థము** :-ఈ మంత్రమున లుప్తోపమాలంకారము గలదు. యజ్ఞముద్వారా శుద్ధపరచబడిన అగ్ని, జలము, వాయువు మున్నగు పదార్థముల శుద్ధిని, బలపరాక్రమములను, దృఢత్వమును, దీర్ఘాయువును పెంపొందింపజేయుటకు సమర్థనంతము లగుచున్నవి. అందువల్ల మనుష్యు లెల్లరును నిత్యము యజ్ఞకర్మల ననుష్ఠించవలయును. మరియు పరమేశ్వరునిచే ప్రకాశపరచబడిన నాలుగు వేదముల వాణిని ప్రత్యక్షమొనర్చుట కొరకు పరమేశ్వరానుగ్రహెచ్ఛ వలన స్వపురుషార్థముల నొనర్చవలయును. పరోపకారపరులగు మానవులపై భగవంతుడు దయచూపుచున్నటులనే మనమెల్లరమును సమస్తప్రాణులపై సదా దయచూపుచుండవలెను. మరియును ఎట్లు అంతర్యామి యగు పరమేశ్వరుడు సూర్యలోకము, ప్రపంచము, ఆత్మ మరియు వేదములు మున్నగువానియందు సత్యజ్ఞానము, మూర్తిమంతములగు పదార్థములను నిరంతరము ప్రకాశపరచుచున్నాడో,

అదే విధముగ మనమెల్లరమును పరస్పర సుఖమునకై సంపూర్ణవిద్యను మనుష్యులకు దృష్టిగోచర మొనర్చజేయుచు సర్వదా ప్రకాశిత మొనర్చుచుండవలయును. అట్టి కార్యములద్వారా మనము ఈ పృథివిపై చక్రవర్తిరాజ్యము మున్నగు అనేక ఉత్తమోత్తమ సుఖములను నిరంతరము ఉత్పన్నమొనర్చవలయును. ॥౨౦॥

20. The foodstuffs and water purified by the performance of yajna strengthen the body and sense organs. May we resort to yajna for sound health, for activities, for vitality, for long life full of happiness and prosperity. The glorious creator and emancipator of the universe, through His perfect Omnipresence, blesses us for the dissemination of true sublime knowledge.

౨౧. దేవస్య త్వేత్యస్యర్షిః స ఏవ. యజ్ఞోదేవతా సర్వస్య. ఆదౌ సంవపామీత్యంతస్య గాయత్రీ ఛన్దః. షడ్జః స్వరః. అన్త్యస్య విరాట్ నిచృత్ పంక్తిశ్ఛన్దః. పంచమః స్వరః. ఈశ్వరేణ యాభ్య ఓషధిభ్యోఽన్నాదికం జాయతే, తాః కథం శుద్ధా జాయన్త ఇత్యుపదిశ్యతే. ఏ ఓషధుల వలన అన్నాదు లుత్పన్నములగునది యజ్ఞాదు లొనర్చుటచే నవి శుద్ధ మెటులగునది యుపదేశించ బడుచున్నది.

౨౧ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్ ।
సం వపామి సమాపఽ ఓషధీభిః సమోషధయో రసేన సం రేవతీర్జగతీభిః
పృచ్యన్తాꣳసం మధుమతీర్మధుమతీభిః పృచ్యన్తామ్ ॥౨౧॥

ప. విః– దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు +భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, సమ్, వపామి, సమ్, అపః, ఓషధీభిః, సమ్, ఓషధయః రసేన సమ్, రేవతీః, జగతీభిః, పృచ్యన్తామ్, సమ్, మధుమతీ రితి మధు+మతీః, మధు మతీభి రితి మధు+మతీభిః, పృచ్యన్తామ్. ॥౨౧॥

పదార్థః :-(దేవస్య) విధాతురీశ్వరస్య ద్యోతకస్య సూర్యస్య వా(త్వా) తం త్రివిధం యజ్ఞం (సవితుః) సవతి సకలైశ్వర్యం జనయతి తస్య (ప్రసవే) ఉత్పాదితేఽస్మిన్ సంసారే (అశ్వినోః) ప్రకాశభూమ్యోః. ద్యావా పృథివ్యావిత్యేకే. నిరు. ౧౨, ౧ (బాహుభ్యామ్) తేజో దృఢత్వాభ్యామ్ (పూష్ణః) పుష్టికర్తుర్వాయోః. పూషేతి పదనామసు పఠితమ్. నిఘం. ౫. ౬. అనేన పుష్టిహేతుర్గృహ్యతే. (హస్తాభ్యామ్) ప్రాణాపానాభ్యామ్ (సమ్) సమ్యగర్థే (వపామి)

విస్తారయామి. (సమ్) సమ్మేలనే. సమిత్యేకీభావం ప్రాహ. నిరు. ౧. 3 (అపః) జలాని. అప ఇత్యుదకనామసు పఠితమ్. నిఘం ౧. ౧౨. (ఓషధీభిః) యవాదిభిః. ఓషధయ ఓషద్ధ్యయన్తీతి వౌషత్యేనా ధయన్తీతి వా దోషం ధయన్తీతి వా. నిరు ౯. ౨౭. (సమ్) సమ్యగర్థే (ఓషధయః) యవాదయః. ఓషధ్యః ఫలపాకాన్తా బహుపుష్పఫలోపగాః. మనుస్మృతౌ. అ. ౧. శ్లో. ౪౬. (రసేన) సారేణార్ద్రేణానన్దకారకేణ (సమ్) ప్రశంసార్థే (రేవతీః) రేవత్య ఆపః. అత్ర సుపాం సులుగితి పూర్వసవర్ణాదేశః. (జగతీభిః) ఉత్తమాభి రోషధీభిః (పృచ్యన్తామ్) మేల్యన్తామ్. పృచ్యన్తే వా (సమ్) శ్రైష్ఠ్యే (మధుమతీః) మధుః ప్రశస్తో రసో విద్యతే యాసు తా మధుమత్య ఆపః. అత్ర ప్రశంసార్థే మతుప్. సుపాం సులుగితి పూర్వ సవర్ణాదేశశ్చ. (మధుమతీభిః) మధుర్బహువిధో రసో వర్తతే యాసు తాభిరోషధీభిః. అత్ర భూమార్థే మతుప్. (పృచ్యన్తామ్) యుక్త్యా వైద్యక శిల్పశాస్త్రరీత్యా మేల్యన్తామ్. అయం మన్త్రః శ. ౧. ౧. ౬. ౧-౨ వ్యాఖ్యాతః. ॥౨౧॥

అన్వయః :- హే మనుష్యా యథాఽహం సవితుర్దేవస్య పరమాత్మనః ప్రసవే సవితృమండలస్యప్రకాశే చాశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం యుష్మాన్ యజ్ఞం సంవపామి. తథైవ త్వా తం యూయమపి సంవపత. యథై తస్మిన్ప్రసవే ప్రకాశే చౌషధీభిరాప ఓషధయో రసేన జగతీభి [రేవతీ] రేవత్యశ్చ సంపృచ్యన్తే. యథా చ మధుమతీభి [ర్మధుమతీః] మధుమత్యః సంపృచ్యన్తే. తథైవౌషధీభి రోషధయ ఓషధయో రసేన జగతీభిః సహరేవత్యశ్చాస్మాభిః సంపృచ్యన్తామ్. ఏవం మధుమతీభిః సహ మధుమత్యో నిత్యం సంపృచ్యంతామ్. ॥౨౧॥

భావార్థః:- అత్ర లుప్తోపమాలంకారః. విద్వద్భిర్మనుష్యై రీశ్వరోత్పాదితే సూర్య ప్రకాశితేఽస్మిన్ జగతి బహువిధానాం సంప్రయోక్తవ్యానాం ద్రవ్యాణాం సంప్రయో క్తుమర్హైర్బహువిధై ద్రవ్యైః సహ సంమేలనేన త్రివిధో యజ్ఞో నిత్యమనుష్ఠేయః. యథా జలం స్వరసేనౌషధీర్వర్ధయతి తా ఉత్తమరసయోగాద్రోగనాశకత్వేన సుఖదాయిన్యో భవన్తి, యథేశ్వరః కారణాత్కార్యం యథావద్రచయతి, సూర్యః సర్వం జగత్ప్రకాశ్య సతతం రసం భిత్వా పృథివ్యాద్యాకర్షతి, వాయుశ్చ ధారయిత్వా పుష్ణాతి తథైవాఽస్మాభిరపి యథావత్సంస్కృతైః సంప్రయోజితై ద్రవ్యై ర్విద్వత్సంగవిద్యోన్నతిర్ధ్వేమ శిల్పాఖ్యైర్యజ్ఞై ర్వాయువృష్టిజలశుద్ధయశ్చ సదైవ కార్యా ఇతి.॥౨౧॥

పదార్థము :- ఓ మానవులారా! నే నెట్లు (సవితుః) సకలైశ్వర్యముల నిచ్చు (దేవస్య) పరమేశ్వరునిచే (ప్రసవే) ఉత్పన్న మొనర్చబడిన ప్రత్యక్షజగమునందునను, సూర్యలోకపు ప్రకాశములోను (అశ్వినోః) భూమి సూర్యుల తేజస్సుయొక్క (బాహుభ్యామ్) దృఢత్వముతో (పూష్ణః) పుష్టియొనర్చు వాయువుయొక్క

(హస్తాభ్యామ్) ప్రాణాపానములద్వారా (త్వా) పూర్వోక్త మువ్విధములైన యజ్ఞములను (సంవపామి) విస్తరింప జేయుచున్నానో, అటులనే మీరును దానిని సిద్ధింపజేయుడు, లేక ఉత్పన్న మొనర్చబడిన యీ ప్రపంచములో సూర్యుని వెలుతురులో ఎట్లు (ఓషధీభిః) యవలు [గోధుమలు]మున్నగు ఓషధులద్వారా (అపః) జలములును (ఓషధయః) ఓషధులును (రసేన) ఆనందదాయకమగు రసముతోను (జగతీభిః) ఉత్తమౌషధములతోను (రేవత్యః) ఉత్తమజలములును, (మధుమతీభిః) అత్యంత మధురరసములతో గూడిన యౌషధములచే (మధుమతీ) అత్యంత ఉత్తమరసరూపజలములును గలిసి ఎటుల (సంపృచ్యన్తామ్) వృద్ధిజెందుచున్నవో, అటులనే మనమెల్లరమును ఓషధులతో జలములను ఉత్తమ జలములతో ఓషధులను మరియు ఉత్తమ ఔషధములతో ప్రశంసనీయములునగు రసరూపజగములను[ఇట్లు] వీటినన్నిటిని యథాయోగ్యముగ ఒకదానిలో నొకదానిని (సంపృచ్యన్తామ్) యుక్తితో, వైద్య శిల్పశాస్త్రోక్త పద్ధతులతోను సమ్మేళనమొనర్చవలెను. ॥౨౧॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు లుప్తోపమాలంకారము గలదు. ఈశ్వరు డుత్పన్నమొనర్చినదియు, సూర్యప్రకాశితమును నగు ఈ ప్రపంచములో అనేకవిధముల సంప్రయుక్తమొనర్చదగిన పదార్థములను సమ్మిళితమొనర్చదగిన పదార్థములతో సమ్మేళన మొనర్చి, త్రివిధములగు యజ్ఞములను విద్వాంసులగువారు నిత్యము నొనర్చుచుండవలయును.

జలము లే విధముగ స్వ రసముచే ఓషధులను పెంచునో, అవి యా ఉత్తమరసము గల జలముల సంయోగముచే వ్యాధులను నశింపజేసి సుఖదాయకము లగుచున్నవో మరియు ఈశ్వరుడెట్లు కారణముచే కార్యమును యథావిధిగ రచించునో, ఎటుల సూర్యుడు జగమునంతటిని ప్రకాశితమొనర్చి నిరంతరము రసమును భేదనమొనర్చి పృథివి మున్నగు పదార్థములను పుష్టివంతమొనర్చుచున్నాడో అటులనే మనమును సంస్కారయుక్తముగ సంయుక్తమొనర్చబడిన పదార్థములతోను, విద్వత్సత్సంగములతోను, విద్యయొక్క ఉన్నతితోను, హోమము, శిల్పములను యజ్ఞములతోను వాయు వృష్టి జలముల శుద్ధి సదా యొనర్చుచుండ వలయును. ॥౨౧॥

21. O men, just as I the Lord, propagate the knowledge of this yajna in the world created by Me, and perform it through the bright sun, stable Earth, vitalizing air and various kinds of breaths in the human organism, so do ye. May you prepare, for your benefit, mixtures of different medicines with water and with juices and dilute the same again with distilled water. May you, thus, effect useful combinations of the beneficial medicines, with refined tinctures!

**౨౨. జనయత్యై త్వేత్యస్యర్షిః పూర్వోక్తః. ప్రథతామితి పర్యంతస్య యజ్ఞో దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః.**

**ధైవతః స్వరః. అన్త్యస్యాగ్నీ సవితారౌ దేవతే. గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.**

**స యజ్ఞః కస్మై ప్రయోజనాయ సంపాదనీయ ఇత్యుపదిశ్యతే.**

**ఆ యజ్ఞ మే ప్రయోజనార్థ మొనర్చవలయునో నీ మంత్రమునం దుపదేశించబడుచున్నది.**

౨౨ జనయత్యై త్వా సంయౌమీదమగ్నేరిదమగ్నీషోమయోరిషే త్వా ఘర్మోఽసి విశ్వాయు రురు ప్రథాఽఉరు ప్రథస్వోరు తే యజ్ఞపతిః ప్రథతామగ్నిష్టే త్వచం మా హిఀసీద్దేవస్త్వా సవితా శ్రపయతు వర్షిష్ఠేఽధినాకే ॥౨౨॥

ప.వి:- జనయత్యై, త్వా, సమ్, యౌమి, ఇదమ్, అగ్నేః, ఇదమ్. అగ్నీషోమయోః, ఇషే త్వా, ఘర్మః, అసి, విశ్వాయురితి విశ్వ+ఆయుః, ఉరుప్రథా ఇత్యురు+ప్రథాః, ఉరు, ప్రథస్వ, ఉరు, తే, యజ్ఞపతి రితి యజ్ఞ+పతిః, ప్రథతామ్, అగ్నిః, తే, త్వచమ్, మా, హిఀసీత్, దేవః, త్వా, సవితా, శ్రపయతు,వర్షిష్ఠే అధి, నాకే.॥౨౨॥

పదార్థః-(జనయత్యై) సర్వసుఖోత్పాదికాయై రాజ్యలక్ష్మ్యై (త్వా) తం త్రివిధం యజ్ఞమ్ (సమ్) సమ్యక్ (యౌమి) మిశ్రయామి. అగ్నౌ ప్రక్షిప్య వియోజయామి వా. (ఇదమ్) సంస్కృతం హవిః (అగ్నేః) అగ్నేర్మధ్యే (ఇదమ్) యద్ధుతం తత్ (అగ్నీషోమయోః) అగ్నిశ్చ సోమశ్చ తయోర్మధ్యే (ఇషే) అన్నాద్యాయ (త్వా) తం వృష్టిశుద్ధిహేతుమ్ (ఘర్మః) యజ్ఞః. ఘర్మ ఇతి యజ్ఞనామసు పఠితమ్. నిఘం. 3.౧౭. (అసి) భవతి. అత్ర వ్యత్యయః (విశ్వాయుః) విశ్వం పూర్ణమాయుర్యస్మాత్ సః (ఉరుప్రథాః) బహుః ప్రథః సుఖస్య విస్తారో యస్మాత్సః. ఉర్విత బహునామసు పఠితమ్. నిఘం. 3. ౧.(ఉరుప్రథస్వ) బహు విస్తారయ. (ఉరు) బహు (తే) తుభ్యమ్ (యజ్ఞపతిః) యజ్ఞస్య స్వామీ పాలకః (ప్రథతామ్) విస్తారయతు. (అగ్నిః) భౌతికో యజ్ఞసంబంధీ శరీరస్థో వా.(తే) తవ తస్య వా. యుష్మత్తత్తక్షుష్వన్తః పాదమ్. అ. ౮. 3,౧౦3 అనేన మూర్ధన్యాదేశః (త్వచమ్) కంచిదపి శరీరావయవం సుఖహేతుమ్ (మా) నిషేధార్థే (హింసీత్) హినస్తు. అత్ర లోడర్థే లుఙ్. (దేవః) సర్వప్రకాశకః పరమేశ్వరః సూర్య లోకో వా. (త్వా) త్వాం తం వా (సవితా) అన్తః ప్రేరకో వృష్టిహేతుర్వా (శ్రపయతు) శ్రపయతి పాచయతి. అత్ర లడర్థే లోట్. (వర్షిష్ఠే) అతిశయేన వృద్ధో వర్షిష్ఠ స్తస్మిన్ విశాలే సుఖస్వరూపే (అధి) అధీత్యుపరిభావ మైశ్వర్యం వా ప్రాహ. నిరు. ౧,3. (నాకే) అకం దుఃఖం న విద్యతే యస్మిన్నసౌ నాకస్తస్మిన్. అయం మంత్రః శ. ౧. ౧. ౨. 3-౧౪. వ్యాఖ్యాతః. ॥౨౨॥

అన్వయః :-హే మనుష్యా! యథాఽహం జనయత్యై యం యజ్ఞం సంయౌమి తథైవ స భవద్భిరపి సంయూయతామ్. అస్మాభిర్యదిదం సంస్కృతం హవి రగ్నేర్మధ్యే ప్రక్షిప్యతే తదిదం విస్తీర్ణం భూత్వా అగ్నీషోమ యోర్మధ్యే స్థిత్వేషే భవతి. యో విశ్వాయురురుప్రథా ఘర్మో యజ్ఞోఽ(స్య)స్తి యథాఽయం మయా ఉరు ప్రథ్యతే తథైవ ప్రతిజనసంత్వంత్వా తమేతం ఉరుప్రథస్వ. ఏవం కృతవతే తే తుభ్యమయం యజ్ఞపతిరగ్నిః సవితా దేవో జగదీశ్వరశ్చోరు సుఖం ప్రథతామ్. తే తవ త్వచం మా హింసీత్ నైవ హినస్తి. స ఖలు త్వాం వర్షిష్ఠేఽధినాకే |త్వా తం శ్రపయతు| సుఖయుక్తం కరోతు. ఇత్యేకః.

హే మనుష్య! యథాఽహం మనుష్యో యో విశ్వాయు రురుప్రథా ఘర్మో యజ్ఞోఽస్యస్తి త్వా తం జనయత్యా ఇషే సంయౌమి తత్సిద్ధ్యర్థమిదమగ్నేర్మధ్యే ఇదమగ్నీషోమయోర్మధ్యే సంస్కృతం హవిః సంవపామి ప్రక్షిపామి తథా త్వమప్యేతమురుప్రథస్వ బహువిస్తారయ. యతోఽయమగ్నిస్తే తవ త్వచం మా హింసీత్ న హింస్యాత్. యథా చ దేవః సవితా వర్షిష్ఠేఽధినాకే యం యజ్ఞం శ్రపయేత్. తథా భవానపి త్వా తం సంయౌతు శ్రపయతు. తే తవ యజ్ఞపతిశ్చ తమురు ప్రథతామితి ద్వితీయః.॥ ౨౨॥

భావార్థః:-అత్ర లుప్తోపమాలంకారో వేద్యః. మనుష్యై రేవం భూతో యజ్ఞః సదైవ కార్యః, యః పూర్ణాం శ్రియం సకలమాయురన్నాదిపదార్థాన్ రోగనాశం సర్వాణి సుఖాని చ ప్రథయతి. స కేనాపి కదాచిన్నైవ త్యాజ్యః. కుతః? నైవైతేన వాయువృష్టిజలౌషధిశుద్ధికారకేణ వినా కస్యాపి ప్రాణినః సమ్యక్ సుఖాని సిధ్యంతీత్యతః ఏవం స జగదీశ్వరః సర్వాన్ ప్రత్యాజ్ఞాపయతి.॥౨౨॥

పదార్థము :-ఓ మనుష్యులారా! (జనయత్యై) సకలసుఖముల నుత్పన్నముచేయుచు రాజ్యలక్ష్మికొరకు (త్వా) ఆ యజ్ఞమును నే నెట్లు (సంయౌమి) అగ్నియందు పదార్థములను వేసి సంయుక్తమొనర్చుచున్నానో అట్లే మీరును అగ్నిసంయోగముచే సిద్ధమొనర్పవలయును (ఇదమ్) ఈ సంస్కారముచేయబడిన హవిస్సు (అగ్నేః) మాచే అగ్నిమధ్య వదలబడుచున్నది (ఇదమ్) అది విస్తరించి (అగ్నీషోమయోః) అగ్నిసోమముల మధ్యకు చేరి (ఇషే) అన్నాదిపదార్థముల నుత్పన్నమొనర్చుటకు తగినదగుచున్నది. (విశ్వాయుః) పూర్ణాయుష్యమును ప్రసాదించునదియు (ఉరుప్రథాః) అధికసుఖమును గలిగించునదియు నగు (ఘర్మః అసి) యజ్ఞమును నే నెటుల పలువిధముల విస్తరింపజేయుచున్నానో (త్వా) ఓ మానవులారా! మీరును దానిని అటులనే (ఉరుప్రథస్వ) విస్తారమొనర్చుడు. ఈ విధముగ విస్తరింపజేయు (తే) మీ కొరకు (యజ్ఞపతిః) యజ్ఞము యొక్క స్వామియు (అగ్నిః) యజ్ఞసంబంధాగ్నియు (సవితా) అంతర్యామియై యున్న (దేవః) జగదీశ్వరుడును (ఉరుప్రథతామ్) అనేకవిధముల సుఖమును వృద్ధిజేయుగాక! (మా హింసీత్) ఎన్నడును నష్టమొనర్చకుండును గాక! మరియు నా పరమేశ్వరుడు (వర్షిష్ఠే) అధికముగ వృద్ధిపొందిన (అధినాకే) అత్యుత్తమ

సుఖమునందు (త్వా) మిమ్ము (శ్రపయతు) సుఖవంతులనుగ నొనర్చునుగాక! ఇది యీ మంత్రమునకు మొదటి యర్థము.

**రెండవ యర్థము:-** ఓ మానవా! (విశ్వాయుః) పూర్ణాయుష్యమును (ఉరుప్రథాః) అనేక సుఖములనిచ్చు (ఘర్మఃఅసి) ఏ యజ్ఞము గలదో (త్వా) ఆ యజ్ఞమును (జనయత్యై) రాజ్యలక్ష్మి వృద్ధికొరకు (ఇషే) అన్నము మున్నగు పదార్థముల నుత్పన్నమొనర్చుటకై (సంయౌమి) నేను సంయుక్తపరచుచున్నాను. దాని సిద్ధికై (ఇదమ్) సంస్కారమొనర్చిన ఈ హవిస్సును (అగ్నేః) అగ్నిమధ్యన (ఇదమ్) దీనిని (అగ్నీషోమయోః) అగ్నీసోమముల మధ్యన వదలుచున్నాను. ఆ విధముగనే నీవును ఆ యజ్ఞమును (ఉరుప్రథస్వ) విస్తరింపజేయుము. ఏలన నీ (అగ్నిః) భౌతికాగ్ని [లేక శరీరమున నున్న యగ్ని] (తే) నీయొక్క (త్వచమ్) సుఖహేతువగు శరీరమును గాని [ఏ యవయవమునుగాని] (మా హింసీత్) వ్యాధులతో నష్టమొనర్చకుండునుగాక! మరియు నెటుల (దేవః) జగదీశ్వరుడు (సవితా) అంతర్యామి (వర్షిష్ఠే) అధికముగ వృద్ధియైన (అధినాకే) అత్యుత్తమ సుఖమందు (త్వా) ఆ యజ్ఞమును అగ్నియందు పరిపక్వమొనర్చుచున్నాడో అట్లే మీరును ఆ యజ్ఞమును (శ్రపయతు) పరిపక్వమొనర్చుడు. (తే) మీ (యజ్ఞపతిః) యజ్ఞస్వామియు ఆ యజ్ఞమును (ఉరుప్రథతామ్) విస్తారయుక్తముగ నొనర్చుగాక! ॥22॥

**భావార్థము :-** ఈ మంత్రమున లుప్తోపమాలంకారము గలదు. మనుష్యులు సంపూర్ణైశ్వర్యము, సంపూర్ణాయువు, అన్నాది సకలపదార్థములు, రోగనివృత్తి, అపరిమిత సుఖము వృద్ధిబొందు (జేయు)నటుల సదా యజ్ఞము నొనర్చుచుండవలయును. దాని నెన్నడును త్యజించగూడదు. ఏలయన, అది లేకున్న వాయువు, వృష్టి, జలఓషధుల శుద్ధి ఎన్నటికిని జరుగదు. అవి శుద్ధిపొందకున్న ఏ ప్రాణికి నేవిధముగను సుఖము గలుగజాలదు. కనుక పరమేశ్వరుడు ఉక్తయజ్ఞము నొనర్చు యాజ్ఞ ప్రజలెల్లరకును ప్రసాదించినాడు. ॥22॥

22. I fully harness the yajna for the attainment of happiness and material prosperity. This oblation is put into the fire, which expands, reaches in the middle region of the sun and moon and produces foodstuff. The yajna confers fuller life and happiness. May this yajna be performed every where. May the performer of the yajna spread its knowledge. May the sacrificial Agni keep us free from diseases. May the indwelling Effulgent God, make our yajna perfect for the attainment of complete joys.

23. మాభేర్మేత్యస్యర్షిః స ఏవ. అగ్నిర్దేవతా. బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

నిఃశంకతయా సర్వైః స యజ్ఞోఽనుష్ఠాతవ్య ఇత్యుపదిశ్యతే.

సకల జనులు నిస్సంకోచముగా ఉక్తయజ్ఞ మాచరింపవలయునని ఉపదేశించుచున్నాడు.

23 మా భేర్మా సంవిక్థాఽఅతమేరు ర్యజ్ఞోఽతమేరుర్యజమానస్య

ప్రజా భూయాత్ త్రితాయ త్వా ద్వితాయ త్వైకతాయ త్వా ॥23॥

ప.వి:-మా, భేః, మా, సమ్, విక్థాః, అతమేరుః, యజ్ఞః, అతమేరుః, యజమానస్య, ప్రజేతి ప్ర+జా, భూయాత్, త్రితాయ, త్వా, ద్వితాయ, త్వా, ఏకతాయ, త్వా.॥౨౩॥

పదార్థః:-(మా) నిశేధార్థే (భేః) బిభీహి. అత్ర లోడర్థేలఙ్. బహులం ఛన్దసీతి శపో లుక్. (మా) నిషేధార్థే (సమ్) ఏకీభావే (విక్థాః) చల. ఓవిజీ భయచలనయో రిత్యస్మాల్లోడర్థే లఙ్. లఙి మధ్యమైకవచనే బహులం ఛన్దసీతి వికరణాభావశ్చ. (అతమేరుః) న తామ్యతి యేన యజ్ఞేన సః. తము ధాతోర్బాహులకాదేరుః ప్రత్యయః (యజ్ఞః) ఇజ్యతే యస్మిన్ సః (అతమేరుః)న తామ్యతి యః స యజ్ఞకర్తా మనుష్యః (యజమానస్య) యజ్ఞస్యానుష్ఠాతుః (ప్రజా) సుసంతానా యజ్ఞసంపాదికా (భూయాత్) భవేత్ (త్రితాయ) త్రయాణామగ్ని కర్మహవిషాం భావాయ (త్వా) తం (ద్వితాయ) ద్వయోర్వాయువృష్టిజలశుద్ధ్యోర్భావాయ (త్వా) తమ్ (ఏకతాయ) ఏకస్య సుఖస్య భావాయ (త్వా) త్వామ్. అయం మంత్రః శ. ౧. ౧,౨; ౧౪-౧౮ తథా ౧,౨,౩.౧-౯ వ్యాఖ్యాతః.॥౨౩॥

అన్వయః :-హే విద్వన్! త్వమతమేరుః సన్ యజమానస్య యజ్ఞస్యానుష్ఠానాన్మా భేర్భయం మా కురు. ఏతస్మాన్మా సంవిక్థా మా విచల. ఏవం యజ్ఞం కృతవతస్తేఽతమేరుః ప్రజా భూయాత్. అహం త్వాం తమగ్నిం యజ్ఞాయ త్రితాయ [త్వా] ద్వితాయ [త్వా] ఏకతాయ చ సుఖాయ సంయౌమి.॥౨౩॥

భావార్థః:- ఈశ్వరః ప్రతి మనుష్యమాజ్ఞాపయత్యాశీశ్చ దదాతి నైవ కేనాపి మనుష్యేణ యజ్ఞసత్యాచార విద్యాగ్రహణస్య సకాశాద్భేతవ్యమ్, విచలితవ్యం వా. కాస్మాద్యుష్మాభి రేతైరేవ సుప్రజాః శారీరిక వాచిక మానసాని నిశ్చలాని [చ] సుఖాని ప్రాప్తుం శక్యాని భవంత్య స్మాదితి.॥౨౩॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! మీరు (అతమేరుః)శ్రద్ధాళువులై (యజమానస్య) యజమానుని యజ్ఞానుష్ఠానము గాంచి (మాభేః) భయముజెందకుడు. మరియు దానినుండి (మా సంవిక్థాః) విచలితులు గాకుడు. ఈ విధముగ (యజ్ఞః) యజ్ఞమొనర్చుచున్న మీకు ఉత్తమోత్తమమును (అతమేరుః) గ్లానిరహితమును, శ్రద్ధావంతము నగు (ప్రజా) సంతానము (భూయాత్) ప్రాప్తించుగాక! మరియు నేను (త్వా) ఆ భౌతికాగ్నిని (ఏకతాయ) ఉక్తగుణయుక్తమగు సత్యసుఖమునకై (ద్వితాయ) వాయువు, వృష్టిజలముల శుద్ధికై (త్రితాయ)అగ్ని, కర్మ, హవిస్సు లకై (సంయౌమి) నిశ్చలమైనదానిగ నొనర్చుచున్నాను. ॥౨౩॥

**భావార్థము** :-పరమేశ్వరు డెల్లరకు ఆజ్ఞయు, నాశీర్వాదమునిచ్చుచున్నాడు. ఏ మనుష్యుడును యజ్ఞసత్యాచారవిద్యాగ్రహణాదులకు భయమును, చంచలత్వము నెన్నడును పొందవలదు. ఏలన ఉక్త యజ్ఞాది

శ్రేష్ఠకర్మలవల్లనే ఉత్తమోత్తమ సంతానము, శారీరక, మానసిక, వాచికములైన వివిధ రకముల నిశ్చల సుఖమును మానవులు పొందగలరు. ॥౨౩॥

23. Be fearless and do not waver as to the performance of yajna. Let the offspring of the performer of this yajna be excellent, faithful and free from weakness. We whole heartedly take recourse to yajnas for the realisation of the one Lord, for the purification of air and water and for getting the blessings of mother, father and preceptor.

౨౪. దేవస్య త్వే త్యస్యర్షిః స ఏవ. ద్యోవిద్యుతా దేవతే. స్వరాడ్ బ్రాహ్మీ పంక్తిశ్ఛందః. పంచమః స్వరః.

పునః స యజ్ఞః కీదృశోఽస్తి కిమర్థశ్చానుష్ఠేయ ఇత్యుపదిశ్యతే.

మరల ఆ యజ్ఞ మెటుల యెందుకు అనుష్ఠించ వలయునో నిరూపించుచున్నాడు.

౨౪ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్।
ఆదదేఽధ్వర కృతం దేవేభ్యఽ ఇంద్రస్య బాహురసి దక్షిణః
సహస్రభృష్టిః శతతేజా వాయురసి తిగ్మతేజా ద్విషతో వధః ॥౨౪॥

ప.వి:-దేవస్య, త్వా, సవితుః ప్రసవ ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు+భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ఆ, దదే, అధ్వరకృత మిత్యధ్వర+కృతమ్, దేవేభ్యః, ఇంద్రస్య, బాహుః, అసి, దక్షిణః, సహస్రభృష్టిరితి సహస్ర+భృష్టిః, శతతేజా ఇతి శత+తేజాః, వాయుః, అసి, తిగ్మ తేజా ఇతి తిగ్మ+తేజాః, ద్విషతః, వధః.॥౨౪॥

పదార్థః :-(దేవస్య) సర్వానందప్రదస్య (త్వా) తం (సవితుః) ప్రేరకస్యైశ్వరస్య సూర్యస్య వా (ప్రసవే) ప్రేరణే ఐశ్వర్య హేతౌ వా (అశ్వినోః) సూర్యాచంద్రమసోరధ్వర్యోర్వా, అశ్వినా వధ్వర్యూ శ. ౧.౨.౪.౫. (బాహుభ్యామ్) బలవీర్యాభ్యాం (పూష్ణః) పుష్టిహేతోర్వాయోః. వృషా పూషా శ. ౨.౫.౧.౧౧. (హస్తాభ్యామ్) గ్రహణత్యాగహేతుభ్యాముదానాపానాభ్యామ్. (ఆదదే) ఆసమన్తాత్ స్వీకరోమి (అధ్వరకృతమ్) అధ్వరం కరోతి యేన సామగ్రీ సమూహేన తమ్. అత్ర కృతో బహులమితి వార్త్తికేన కరణే క్విప్. అధ్వరో వై యజ్ఞో యజ్ఞకృతమ్. శ.౧.౨.౪.౫. (దేవేభ్యః) విద్వద్భ్యో దివ్యసుఖేభ్యో వా (ఇంద్రస్య) సూర్యస్య

(బాహుః) వీర్యవత్తమకిరణ సమూహస్థో యజ్ఞః (అసి) భవతి. (దక్షిణః) ప్రాప్తః. దక్షగతిహింసనయోరిత్యస్మాత్. ద్రుదక్షిభ్యామినన్. ఉ. ౨.౫౦. ఇతీనన్ ప్రత్యయః. అనేన గతే రంతర్గతః ప్రాప్త్యర్థో గృహ్యతే (సహస్ర భృష్టిః) సహస్రాణి బహూని భృష్టయః పాకా యస్మాత్ సః సూర్యస్య ప్రకాశః. సహస్రమితి బహునామసు పఠితమ్. నిఘం.౩.౧.(శతతేజాః) శతాని బహూని తేజాంసి యస్మిన్స సూర్యః. శతమితి బహునామసు పఠితమ్. నిఘం.౩.౧. (వాయుః) గమనాగమనశీలః పవనః (అసి) అస్తి. అత్ర సర్వత్ర వ్యత్యయః. (తిగ్మతేజాః) తిగ్మాని తీక్ష్ణాని తేజాంసి భవంతి యస్మాత్ సః. యుజిరుచితిజాం కుశ్చ.ఉ.౧.౧౪౬. అనేన 'తిజ నిశానే' ఇత్యస్మాన్మక్ ప్రత్యయః కుత్వాదేశశ్చ. తథైవ సర్వధాతుభ్యోఽసున్. ఉ.౪. ౧౮౯. అనేన 'తిజ' ఇత్యస్మాదసున్ ప్రత్యయః (ద్విషతః) శత్రోః (వధః) నాశః. అయం మంత్రః శ. ౧.౨.౪.౩-౭. వ్యాఖ్యాతః ॥౨౪॥

అన్వయః :-అహం సవితుర్దేవస్య ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం దేవేభ్యో అధ్వరకృతం [త్వా తం] ఆదదే యో మయాఽనుష్ఠితో యజ్ఞ ఇంద్రస్య సహస్రభృష్టిః శతతేజా దక్షిణో బాహురసి భవతి. యస్యేంద్రస్య సూర్యలోకస్య మేఘస్య వా తిగ్మతేజా వాయుర్హేతురస్తి తేన సుఖాని ద్విషతో వధశ్చ కార్యః.॥౨౪॥

భావార్థః:-ఈశ్వర ఆజ్ఞాపయతి. మనుష్యైః సమ్యక్ సంపాదితోఽయం యజ్ఞోఽగ్నినోర్ధ్వం ప్రక్షి ప్తద్రవ్యః సూర్యకిరణస్థో వాయునా ధృతః సర్వోపకారీ భూత్వా సహస్రాణి సుఖాని ప్రాపయిత్వా దుఃఖానాం నాశకారీ భవతీతి. ॥౨౪॥

పదార్థము :-(సవితుః) అంతర్యామియై ప్రేరేపించు (దేవస్య) సకల ఆనందముల నొసగు పరమేశ్వరుని (ప్రసవే) ప్రేరణలో (అశ్వినోః) సూర్యచంద్రుల, అధ్వర్యుల (బాహుభ్యామ్) బలవీర్యముల వలనను (పూష్ణః) పుష్టికారకమగు వాయువుయొక్క (హస్తాభ్యామ్) గ్రహించుటకు త్యజించుటకు హేతువులుగ నున్న ఉదాన అపానముల వలనను (దేవేభ్యః) విద్వాంసులకై, లేక దివ్యసుఖముల ప్రాప్తికొరకై (అధ్వరకృతమ్) యజ్ఞముద్వార సుఖకారకమగు కర్మను (ఆదదే) నేను చక్కగా గ్రహించుచున్నాను. మరియు నాచే ననుష్ఠింపబడిన ఏ యజ్ఞము (ఇన్ద్రస్య) సూర్యునియొక్క (సహస్రభృష్టిః) అనేకపదార్థముల పాకమొనర్చు సామర్థ్యమును (శతతేజాః) అనేక విధములగు తేజస్సును (దక్షిణః) ప్రాప్తమైన (బాహుః) కిరణపుంజమై యున్నదో (ఇన్ద్రస్య) మరియు సూర్యునికి, లేక మేఘమండలమునకు (తిగ్మతేజాః) తీక్ష్ణ తేజస్సు [నీయ] గల (వాయుః) హేతువున్నై (అసి) ఉన్నదో, దానివలన మన మనేక విధముల సుఖములను పొందవలయును. మరియు (ద్విషతః) శత్రువుల (వధః) నాశనమొనర్పవలయును. ॥౨౪॥

**భావార్థము :**-ఈశ్వరు డిట్లాజ్ఞాపించుచున్నాడు :- ఈ భౌతికాగ్నిద్వారా ఊర్ధ్వదిశకు విసరివేయబడిన శ్రేష్ఠతమ పదార్థములు గలదియు, మానవులచే చక్కగా సంపాదితమును నైన యజ్ఞము సూర్యకిరణములకు

చేరును. వాయు వర్షానిని ధారణమొనర్చును. మరల నది సర్వప్రాణుల యుపకారమునకై వేలకొలది సుఖముల సమకూర్చి దుఃఖముల వినాశన మొనర్చున దగుచున్నది. ॥౨౪॥

24. By the impulse of God, the Giver of bliss, I perform the yajna free from Hinsa (violence), for the attianment of noble qualities and association of the learned, through the aid of life-giving-breath, vitalising air, and through the rejuvenating rays of the sun and moon. A yajna is the recipient of the rays of the sun that ripens a large variety of objects and is full of immense lustre, and innumerable rays. A yajna is the illuminating source of rain. With the aid of the yajna we should remove our miseries.

౨౫. పృథివీత్యస్య ఋషిః స ఏవ. సవితా దేవతా. విరాడ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః. ధైవతః స్వరః.

పునః స యజ్ఞః క్వ గత్వా కింకారీ భవతీత్యుపదిశ్యతే.

ఆ యజ్ఞ మెచ్చటకు పోయి యేమి యొనర్చునది యుపదేశించుచున్నాడు.

౨౫ పృథివి దేవయజన్యోషధ్యాస్తే మూలమ్మా హిఁసిషం వ్రజం గచ్ఛ గోష్ఠానం

వర్షతు తే ద్యౌర్బధాన దేవ సవితః పరమస్యాం పృథివ్యాఁ శతేన పాశై

ర్యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తమతో మా మౌక్ ॥౨౫॥

ప. వి:- పృథివి, దేవయజనీతి దేవ+యజని, ఓషధ్యాః, తే , మూలమ్, మా, హిఁసిషమ్, వ్రజమ్, గచ్ఛ, గోష్ఠానమ్ గోష్ఠానమితి గో+స్థానమ్, వర్షతు, తే, ద్యౌః, బధాన, దేవ, సవితరితి సవితః, పరమ్, అస్యామ్, పృథివ్యామ్, శతేన, పాశైః, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్ ద్విష్మః, తమ్ అతః, మా, మౌక్.॥౨౫॥

పదార్థః:-(పృథివి) విస్తృతాయా భూమేః (దేవయజని) దేవా యజన్తి యస్యాం సా(తే)అస్యాః (ఓషధ్యాః) యవాదేః (తే) అస్యాః. అత్ర సర్వత్ర విభక్తే ర్విపరిణామః క్రియతే. (మూలమ్) వృద్ధిహేతుకమ్ (మా) నిషేధార్థే (హింసిషమ్) ఉచ్ఛింద్యామ్. అత్ర లిఙర్థే లుఙ్ (వ్రజం) వ్రజన్తి. గచ్ఛంతి ప్రాప్నువంత్యాపో యస్మాత్ యస్మిన్ వా తం వ్రజం మేఘమ్. వ్రజ ఇతి మేఘ నామసు పఠితమ్ . నిఘం. ౧. ౧౦.(గచ్ఛ) గచ్ఛతు. అత్ర వ్యత్యయః (గోష్ఠానమ్) గవాం సూర్యరశ్మీనాం పశూనాం వా స్థానమ్. గావ ఇతి రశ్మినామసు పఠితమ్.

నిఘం. ౧. ౫. (వర్షతు) వృష్టేర్థః (తే) తస్య. అత్ర సంబంధార్థే షష్ఠీ. (ద్యౌః) సూర్యప్రకాశః (బధాన)బంధయ. (దేవ) సూర్యాది ప్రకాశకేశ్వర (సవితః) రాజ్యైశ్వర్యప్రద (పరమ్) శత్రుమ్ (అస్యామ్) ప్రత్యక్షాయామ్ (పృథివ్యామ్) బహుసుఖప్రదాయామ్. (శతేన) బహుభిః (పాశైః) బంధనసాధనైః. పశబంధన ఇత్యస్య రూపమ్. (యః) అధర్మాత్మా దస్యుః శత్రుశ్చ (అస్మాన్) సర్వోపకారకాన్ ధార్మికాన్ (ద్వేష్టి) విరుధ్యతి (యం) దుష్టం శత్రుమ్ (చ) సముచ్చయే (వయమ్) ధార్మికాః శూరాః (ద్విష్మః) విరుద్ధ్యామః (తమ్) పూర్వోక్తమ్ (అతః) బంధాత్ కదాచిత్ (మా) నిషేధార్థే (మౌక్) మోచయ. ముచ్ల్ముమోక్షణే ఇత్యస్మాల్లోడర్థే లుఙ్యడభావే ల్లేః సిజాదేశే బహులం ఛందసీతీడభావః. వదవ్రజేతి వృద్ధిః. సంయోగాంతస్య లోప ఇతి సిజ్లుక్. అయం మంత్రః శ.౧.౨.౪.౧౬. వ్యాఖ్యాతః.॥౨౫॥

అన్వయః :-హే దేవ! సవితః! పరమాత్మన్! తే తవ కృపయాఽహం దేవయజని దేవయజ్ఞాధి కరణాయా స్తేఽస్యాః పృథివి భూమేర్మూలం వృద్ధిహేతుం మా హింసిషం మయా పృథివ్యాం యోఽయం యజ్ఞోఽనుష్ఠీయతే స వ్రజం మేఘం గచ్ఛ గచ్ఛతు, గత్వా గోష్ఠానం వర్షతు ద్యౌర్వర్షతు. హే వీర! త్వమస్యాం యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తం పరం శత్రుం శతేన పాశైర్బధాన బంధయ. తమతో బంధనాత్ కదాచిన్మా మౌక్ మా మోచయ. ॥౨౫॥

భావార్థః:-ఈశ్వర ఆజ్ఞాపయతి విద్వద్భిర్మనుష్యైః పృథివ్యాం రాజ్యస్య తస్యాం త్రివిధస్య యజ్ఞస్యౌషధీనాం చ హింసనం కదాచిన్నైవకార్యమ్. యోఽగ్నౌహుతద్రవ్యస్య సుగంధ్యాది గుణవిశిష్టో ధూమో మేఘమండలం గత్వా సూర్యవాయుభ్యాం ఛిన్నస్యాకర్షితస్య ధారితస్య జలసమూహస్య శుద్ధికరో భూత్వా ఽస్యాం పృథివ్యాం వాయుజలౌషధిశుద్ధిద్వారా మహత్సుఖం సంపాదయతి. తస్మా త్స యజ్ఞః కేనాపి కదాచి న్నైవ త్యాజ్యః. యే దుష్టా మనుష్యా స్తానస్యాం పృథివ్యా మనేకైః పాశైర్బధ్వా దుష్టకర్మభ్యో నివర్త్య కదాచిత్తే న మోచనీయాః. అన్యచ్చ పరస్పరం ద్వేషం విహాయాన్యోఽన్యస్య సుఖోన్నతయే సదైవ ప్రయతితవ్య మితి.॥౨౫॥

పదార్థము :- (దేవ) సూర్యాది జగత్తును ప్రకాశింపజేయు ఓ దేవా! (సవితః) రాజ్యైశ్వర్య ప్రదాతా! పరమేశ్వరా! (తే) నీ దయవల్ల నేను (దేవయజని) విద్వాంసులు యజ్ఞమొనర్చు [దేవయజ్ఞాకరణమగు] (తే) నీదైన యీ (పృథివి) భూమిని (మూలమ్) వృద్ధియొనర్చు మూలమును (మా హింసిషమ్) నాశపరచకుందును గాక! మరియు (పృథివ్యామ్) అనేక విధముల సుఖదాయకమగు భూమియందు (యః) నాచే ననుష్ఠించబడు నీ యజ్ఞము (వ్రజమ్) జలవృష్టికారకమగు మేఘములను (గచ్ఛ) చేయునుగాక! అట్లుచేర (గోష్ఠానమ్) సూర్యకిరణము లను గుణములద్వారా (వర్షతు) వర్షింపజేయును. మరియు (ద్యౌః) సూర్యుని ప్రకాశము (వర్షతు) వర్షింజేయును. ఓ వీరులారా! మీరు (అస్యామ్) ఈ పృథివియందు (యః) ఎట్టి అధర్మాత్ములు బందిపోటులు (అస్మాన్) ఎల్లర కుపకరించు ధార్మికులము, సజ్జనులము నగు మమ్ము (ద్వేష్టి)

ద్వేషించుచుందురో (చ) మరియు (యమ్) ఏ దుష్టశత్రువును (వయమ్) ధార్మికశూరుల మగు మేము (ద్విష్మః) విరోధించెదమో (తమ్) అట్టి (పరమ్) దుష్టశత్రువులను (శతేన పాశైః) అనేక బంధనములతో (బధాన) బంధించుడు. మరియు వారిని (అతః) ఇట్టి బంధనములనుండి ఎన్నటికిని (మా మౌక్) వదలకుడు. ॥౨౫॥

భావార్థము :- విద్వాంసులగు మానవులకు పరమేశ్వరు డిట్లాజ్ఞాపించుచున్నాడు. ఓ మానవులారా! పృథివీరాజ్యమును, పృథివియందలి మువ్విధ యజ్ఞములను, ఓషధులను మీరెప్పుడును నష్టపరచకుడు. యజ్ఞాగ్నియందు హవనమొనర్చబడిన పదార్థముల ధూమము మేఘమండలము లోనికి వెళ్లి సూర్యవాయువుల ద్వారా ఛిన్నాభిన్నమొనర్చబడి, ఆకర్షించబడి, ధరించబడియున్న జలసమూహమును శుద్ధపరచి ఈ భూమియందు వాయువు జల ఔషధములశుద్ధిద్వారా అత్యంత సుఖము నుత్పన్నమొనర్చుచున్నది. కావుననే మనుష్యులు ఈ యజ్ఞము నెన్నడును వదలివేయవలదు. దుష్టులు దుష్టకర్మలనుండి నివృత్తులగునటుల దుష్టులను అనేక బంధనములతో బంధించి, వారి నెన్నడును అట్టి బంధనములనుండి వదలవలదు. మనుష్యు లెల్లరును పరస్పరము ఈర్ష్యాద్వేషములనువీడి సర్వవిధముల పరస్పర సుఖవృద్ధికై సదా ప్రయత్న మొనర్చుచుండ వలయును. ॥౨౫॥

25. O God, the creator of the solar and bright regions we implore thee that through thy grace, may we not destroy the medicinal herbs of the earth, on which the learned perform the yajnas. May the yajna reach the clouds. Let the sun pour rain on the earth through its rays. O heroic persons bind by various fetters a wicked man in this world, who is opposed to us and is opposed by us, and release him not!

౨౬. అపారరుమిత్యస్య సర్వస్య ఋషిః స ఏవ. సవితా దేవతా. పూర్వార్ధే స్వరాడ్బ్రాహ్మీపంక్తిశ్ఛందః.

ఉత్తరార్ధే భురిగ్బ్రాహ్మీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

పున రేతేన యజ్ఞేన కిం కిం సిద్ధ్యతీత్యుపదిశ్యతే.

మరల నీ యజ్ఞముచే యే కార్యములు సిద్ధించుచున్నవో ఆ విషయ మీ మంత్రమం దుపదేశించబడెను.

౨౬ అపారరుం పృథివ్యై దేవయజనాద్వధ్యాసం వ్రజం గచ్ఛ గోష్ఠానం వర్షతు తే ద్యౌర్బధాన దేవ సవితః పరమస్యాం పృథివ్యాశ్ శతేన పాశై ర్యో౽స్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తమతో మా మౌక్। అరరో దివం మా పప్తో ద్రప్సస్తే ద్యాం మా స్కన్ వ్రజఙ్గచ్ఛ గోష్ఠానం వర్షతు తే ద్యౌర్బధాన దేవ

సవితః పరమస్యాం పృథివ్యాగ్ం శతేన పాశైర్యో౽స్మాన్ ద్వేష్టి యం చ

వయం ద్విష్మ స్తమతో మా మౌక్ ॥౨౬॥

ప.వి:- అప, అరరుమ్, పృథివ్యై, దేవయజనాదితి దేవ+యజనాత్, వధ్యాసమ్, వ్రజమ్, గచ్ఛ, గోస్థానమితి గో+స్థానమ్, వర్షతు, తే, ద్యౌః, బధాన, దేవ, సవితరితి సవితః, పరమ్, అస్యామ్, పృథివ్యామ్, శతేన, పాశైః, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః, తమ్, అతః, మా, మౌక్, అరరో౽ ఇత్యరరో, దివమ్, మా, పప్తః, ద్రప్సః,తే, ద్యామ్, మా, స్కన్, వ్రజమ్, గచ్ఛ, గోస్థానమితి గో+స్థానమ్, వర్షతు, తే, ద్యౌః, బధాన, దేవ, సవితరితి సవితః, పరమస్యామ్, పృథివ్యామ్, శతేన,పాశైః, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః, తమ్, అతః, మా, మౌక్.॥౨౬॥

పదార్థః:-(అప) ధాత్వర్థే (అరరుమ్) అసురరాక్షసస్వభావశత్రుమ్. అర్తేరరుః. ఉ.౪.౭౯. అనేన, ఋధాతోరరుః ప్రత్యయః (పృథివ్యై)పృథివ్యామ్. అత్ర సుపాం సులుగితి సప్తమీస్థానే చతుర్థీ (దేవయజనాత్) దేవా యజంతి యస్మిన్ తస్మాత్. (వధ్యాసమ్) హన్యామ్. (వ్రజమ్) వ్రజంతి జానంతి జనా యేన తం సత్సంగమ్. (గచ్ఛ) ప్రాప్నుహి గచ్ఛతు వా. (గోస్థానమ్) గౌర్వాణీ తిష్ఠతి యస్మిన్నధ్యయనాధ్యాపనే తం వ్యవహారమ్. గౌరితి వాఙ్నామసు పఠితమ్ . నిఘం. ౧. ౧౧. (వర్షతు) శబ్దవిద్యాయా వృష్టిం కరోతు. (తే)తవ (ద్యౌః)విద్యాప్రకాశః. దివో ద్యోతన కర్మణావాదిత్యరశ్మీనామ్. నిరు. ౧౩.౨౫.(బధాన) బంధయ (దేవ) సర్వానందప్రదేశ్వరవ్యవహారహేతుర్వా (సవితః) సర్వేషు జీవేష్వంతర్యామితయా సత్యప్రేరకవ్యవహారప్రేరణాహేతుర్వా. (పరమ్) శత్రుంభూతమ్. (అస్యామ్) ఆధారభూతాయామ్, (పృథివ్యామ్) బహుపదార్థప్రదాయామ్ (శతేన) బహుభిః (పాశైః) బంధనైః (యః) మూర్ఖః (అస్మాన్) విద్యారతప్రచారకాన్ (ద్వేష్టి) అప్రీణాతి (యమ్) విద్యావిరోధినమ్. (చ) పునరర్థే (వయమ్) విద్వాంసః (ద్విష్మః) అప్రీణీమః. (తమ్)

పూర్వోక్తం విద్యాశత్రుం (అతః) అస్మద్బంధనాదుపదేశాద్వా (మా) నిషేధార్థే (వహ్వా) త్యజ (అరరో) దుష్టమనుష్య (దివమ్) ప్రకాశమ్ (మా) నిషేధార్థే (పప్తః) పతతు. అత్ర లోడర్థే లుఙ్. (ద్రప్సః) హర్షకారీ రసః. దృప హర్షణమోహనయోరిత్యాస్మాదౌణాదికః సః ప్రత్యయః. అనుదాత్తస్య చర్దుపధస్యాన్యతరస్యామ్. అ. ౬.౧.౫౯. అనేనామాగమః (తే) తవ తస్యాః పృథివ్యా వా (ద్యామ్) ఆనందమ్. దివు ధాతోర్బాహులకాడ్డో ప్రత్యయస్టిలోపే ప్రాప్తే వకారలోపశ్చ.(మా) నిషేధార్థే (స్కన్) నిస్సారయతు. అత్ర లోడర్థే లఙ్. బహులం ఛందసీతి శపో లుక్. (వ్రజమ్) వ్రజంతి విద్వాంసో యస్మిన్సన్మార్గే తమ్ (గచ్ఛ) గచ్ఛతు,గమయ వా.(గోష్ఠానమ్) గౌః పృథివీ తిష్ఠతి యస్మిన్ తదన్తరిక్షమ్. (వర్షతు)సించతు. (తే) తవ (ద్యౌః) కాన్తిః.ద్యౌర్వై సర్వేషాం దేవానామాయతనమ్. శ. ౧౪. ౩. ౨. ౮.(బధాన) బధ్నాతి వా పక్షే వ్యత్యయః. (దేవ) విజయప్రదవిజయ హేతుర్వా. (సవితః) సర్వోత్పాదక వ్యవహారోత్పత్తి హేతుర్వా (పరమ్) శత్రుమ్ (అస్యాం) సర్వబీజారోపణార్థాయామ్. (పృథివ్యామ్) బహుప్రజాయుక్తాయామ్. (శతేన)బహుభిః (పాశైః) సామదానదండ భేదాదికర్మభిః (యః) న్యాయవిరోధీ (అస్మాన్) న్యాయాధీశాన్ (ద్వేష్టి) కోపయతి. (యమ్) అన్యాయకారిణమ్. (చ) పునరర్థే (వయమ్) సర్వహిత సంపాదినః (ద్విష్మః) కోపయామః (తమ్) అధర్మప్రియమ్. (అతః)శిక్షణాత్ (మా) నిషేధే (వహ్వా) త్యజతు. అయం మంత్రః. శ. ౧.౨.౪.౧౭ - ౨౧ వ్యాఖ్యాతః.॥౨౬॥

అన్వయః :-హే దేవ! సవితర్భవత్కృపయా వయం పరస్పరం విద్యామేవోపదిశామః. యథాయం సవితా దేవః సూర్యలోకో అస్యాం పృథివ్యాం శతేన పాశైః బంధనహేతుభిః కిరణై రాకర్షణేన పృథివ్యాదీన్ సర్వాన్ పదార్థాన్ బధ్నాతి. తథైవ త్వమపి దుష్టాన్ బద్ధ్వా శుభగుణాన్ ప్రకాశయ. హే విద్వాంసో యథాఽహం [పృథివ్యై] పృథివ్యాం దేవయజనా దరరుమపవధ్యాసం తథైవ తం యూయమప్యపాఘ్నత. యథాఽహం వ్రజం గచ్ఛామి తథైవ త్వమప్యేతంగచ్ఛ యథాఽహం గోష్ఠానం వర్షామి తథైవ భవానపి వర్షతు. యథా మమ ద్యౌర్విద్యాప్రకాశః సర్వాన్ ప్రాప్నోతి తథైవ తే తవాపి ప్రాప్నోతు. యథాహం యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మ స్తం పరమస్యాం పృథివ్యాం శతేన పాశైర్నిత్యం బధ్నామి కదాచి త్తం న త్యజామి, తథైవ హే వీర! తం త్వమిమం బధాన తం చాతః కదాచిన్మా వహ్వా. యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తమతో బంధనా త్కోఽపి మా ముంచతు. ఏవం చ తం ప్రతి సర్వ ఉపదిశన్తు. హే అరరో! త్వం దివం మా పప్త స్తథా తే తవ ద్రప్సో ద్యాం మాఽస్కన్.

హే సన్మార్గ జిజ్ఞాసో! యథాఽహం వ్రజం సన్మార్గం గచ్ఛామి, తథైవ త్వమప్యేతం గచ్ఛ. యథేయం ద్యౌర్గోష్ఠానం వర్షతి, తథైవేశ్వరో విద్వాన్ వా తే తవ కామాన్ వర్షతు. యథాయం

[దేవ సవితః] సవితా దేవః సూర్యలోకః [పరమం] స్యాం పృథివ్యాం శతేన పాశైర్బంధనహేతుభిః కిరణై రాకర్షణేన పృథివ్యాదీన్ సర్వాన్ పదార్థాన్ బధ్నాతి తథైవ త్వమపి చ పునర్యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తం పరంశత్రుమస్యాం పృథివ్యాం శతేన పాశై ర్బధాన. యథాహం తం ద్వేష్టారం శత్రుం శతేన పాశైర్బధ్వా న కదాచి న్ముంచామి, తథైవ త్వమప్యేనం సదా బధాన [తం చాతః] కదాచి న్మా మౌక్. ॥౨౬॥

భావార్థః :-అత్ర లుప్తోపమాలంకారః. ఈశ్వర ఆజ్ఞాపయతి. హే మనుష్యా యుష్మాభి ర్విద్వత్కార్యానుష్ఠానే విఘ్న కారిణో దుష్టాః ప్రాణినః సదాఽపహన్తవ్యాః. సత్సమాగమేన విద్యావృద్ధిర్నిత్యం కార్యా. యథానేకోపాయైః శ్రేష్ఠానాం హాని ర్దుష్టానాం చ వృద్ధి ర్న స్యాత్ తథైవానుష్ఠేయమ్. సదా శ్రేష్ఠాః సత్కార్యా దుష్టాస్తాడనీయా బన్ధనీయాశ్చ. పరస్పరం ప్రీత్యా విద్యాశరీరబలం సంపాద్య క్రియయా కలాయంత్రై రనేకాని యానాని రచయిత్వా సర్వేభ్యః సుఖం దేయం, నిరంతరమీశ్వరస్యాజ్ఞాపాలనం [కర్తవ్యమ్] స ఏవోపాసనీయ శ్చేతి. ॥౨౬॥

**పదార్థము** :-(దేవ) ఓ సర్వానందప్రద పరమేశ్వరా! (సవితః) సర్వభూతాంతర్యామీ! సత్యప్రకాశకా! నీ దయవలన మేము పరస్పరము విద్యోపదేశ మొనర్చుకొందుముగాక! సర్వమును ప్రకాశమొనర్చు నీ సూర్యలోకము ఈ పృథివియందు ననేక బంధనహేతువులగు కిరణములతో ఎట్లాకర్షించి పృథివి మున్నగు సమస్త పదార్థములను బంధించుచున్నదో, అటులనే మీరును దుష్టులను బంధించి ఉత్తమగుణములను ప్రకాశింప జేయుడు. నే నెట్లు (పృథివ్యై) పృథివియందు (దేవయజాత్) శ్రేష్ఠమగు పదార్థములు, ఉత్తమవిద్వాంసుల సాంగత్యముల లభింపజేయు యజ్ఞభూమినుండి (అరరుమ్) దుష్టశత్రువులను (అపపధ్యాసమ్) చంపు [తొలగించు]చున్నానో, అటులనే మీరును వారిని చంపుడు. నే నెట్లు (వ్రజమ్) ఉత్తమోత్తమ గుణముల గలుగజేయు సజ్జనసాంగత్యమును పొందుచున్నానో, అటులనే మీరును దానిని (గచ్ఛ) పొందుడు. నే నేవిధముగ (గోష్ఠానమ్) పఠనపాఠన వ్యవహారములను జరుపునదియు మేఘగర్జనముతో తుల్యమునగు వేదవాణిని చక్కని శబ్దరూప బిందువులద్వారా వర్షింపజేయుచున్నానో అదేవిధముగ మీరును (వర్షతు) వర్షింపజేయుడు. ఎట్లు (ద్యౌః) నౌవిద్యాప్రకాశ మందరికి దృష్టిగోచరమై యున్నదో అట్లే మీ విద్యయు ఎల్లరకును శోభించునుగాక! (యః) ఏ మూర్ఖుడు (అస్మాన్) విద్యాప్రచారమొనర్చు మమ్ము (ద్వేష్టి) ద్వేషించుచుండునో (చ) మరియు (యమ్) అట్టి విద్యావిరోధిని (వయమ్) విద్వాంసుల మగు మేము (ద్విష్మః) దుష్టునిగ తలచుచున్నామో (తమ్ పరమ్) అట్టి విద్యాశత్రువును (అస్యామ్)సకల పదార్థములను ధారణమొనర్చి (పృథివ్యామ్) వివిధసుఖములనిచ్చు ఈ పృథివియందు (శతేన పాశైః) అనేక బంధనములతో నిత్యము బంధించి ఆ బంధనములనుండి వానిని మే మెన్నటికిని ఎట్లు విడువకుందుమో అటులనే ఓ వీరపురుషులారా! మీరును వానిని (బధాన)బంధించుడు. వానినెన్నటికిని (అతః) ఆ బంధనములనుండి (మామౌక్) వదలివేయకుడు. ఏ దుష్టుడు మమ్ము విరోధించునో, అట్లే ఏ దుష్టుని మేము విరోధింతుమో, అతనిని అట్టి బంధనములనుండి ఎవ్వడును విడిపించరాదు.

ఈ విధముగ ఎల్లరును నాతని కుపదేశించుచుండవలయును (అరరో) ఓ దుష్టుడా! నీవు (దివమ్) ప్రకాశమును [ఉన్నతిని] (మా పప్తః) పొందనటులనే (తే) నీకు (ద్రప్సః) ఆనందమును ప్రసాదించు విద్యారూప రసమును (ద్యామ్) ఆనందమును (మా స్కన్) లభించజాలదు [శ్రేష్ఠుల మార్గము నభిలషించు] ఓ మానవులారా! నే నెట్లు (వ్రజమ్) విద్వాంసులుపొందు శ్రేష్ఠమార్గమును పొందుచున్నానో అట్లే మీరును (గచ్ఛ) దానిని పొందుడు. ఎట్లు (ద్యౌః) ఈ సూర్యప్రకాశము (గోష్ఠానమ్) పృథివికి నిలయమగు అన్తరిక్షమును ఆర్ద్రమొనర్చుచున్నదో అటులనే పరమేశ్వరుడు లేక విద్వాంసులు మీ కోరికలను (వర్షతు) వర్షింప జేయునుగాక! అనగా క్రమముగా పూరించునుగాక! (దేవః) లోకవ్యవహారహేతువగు (సవితః) సూర్యలోకము (అస్యామ్ పృథివ్యామ్) బీజావాపనమునకు తగినదియు అనేక ప్రాణులు, అప్రాణులను వహించునదియు నగు ఈ భూమియందు (శతేన పాశైః) బంధనహేతువులగు కిరణములద్వారా ఆకర్షించి పృథివి మున్నగు సమస్త పదార్థములను బంధించుచున్నటుల నీవును దుష్టులను బంధించుము (యః) ఏ న్యాయవిరోధి (అస్మాన్) న్యాయాధీశుల మగు మమ్ము (ద్వేష్టి)ద్వేషించుచున్నాడో (చ) మరియు (యమ్) ఏ న్యాయాధీశుని (వయమ్) సర్వహిత సంపాదనేచ్ఛగలవారమగు మేము (ద్విష్మః) ద్వేషించుచున్నామో (తమ్ పరమ్) అట్టి శత్రువును (అస్యామ్) పృథివ్యామ్ ఉక్తగుణములు గల ఈ పృథివియందు (శతేన పాశైః) సామ దాన భేద దండము లను అనేక ఉపాయములతో బంధించుచున్నాము.ఎట్లు నే నతనిని దండనమునందు బంధించి ఎన్నటికిని వదలక యుండెదనో అట్లే మీరును (బధాన) బంధించుడు. అనగా బంధనరూప దండనమును సదా ప్రయోగించుడు. ఆతని నెన్నటికిని (మా మౌక్) వదలివేయకుడు. ॥౨౬॥

భావార్థము :- ఈ మంత్రములో లుప్తోపమాలంకారము గలదు. ఈశ్వరుడిట్లాదేశించుచున్నాడు :- ఓ మానవులారా! మీరు విద్యను సాధించు కార్యమునందు విఘ్నములను గలిగించు దుష్టులను సదా తొలగించుకొనుడు. సదా సజ్జనసాంగత్యములద్వారా విద్యాభివృద్ధిని సాధించుడు. నే నెట్లు ఏ యే ప్రయత్నములచే శ్రేష్ఠులకు హాని, దుష్టులకు వృద్ధి కలుగజేయకుందునో అట్టి నియమముల నాచరించుడు. శ్రేష్ఠులు సదా సత్కారార్హులు, దుష్టులు బంధనీయులు మరియు దండనీయులునై యున్నారు. పరస్పర ప్రేమద్వారా విద్యా శరీర శక్తులను సంపాదనమొనర్చి పురుషార్థముతో కళలు, యంత్రములద్వారా అనేక యాన విమానముల నిర్మించి ఎల్లరకును సుఖముల చేకూర్చుచు ఈశ్వరాజ్ఞలను పాలించుచు ఆతని నుపాసించుడు. ॥౨౬॥

**26. O' Omnipresent Lord, the Giver of happiness, may we subjugate the wicked folk on this earth where the sages perform yajnas. May we associate with the learned and, thus spread freely the system of education as propounded in the Vedic hymns. Just as my light of knowledge is valued by all, so should yours. The ignorant moving in the dark who are opposed to the learned, and whom the learned disapprove for their antagonism to knowledge, should be brought round to the path of virtue by hundreds of means available and let the restriction on them be not removed till their enlightenment. May the wicked be not blessed with prosperity, and the pleasure of knowledge. O' Ye dutiful may ye persistently follow the path of virtue!**

Just as the light of the sun brightens up the mid region, so does God fulfil our desires. The sun controls the earth by the force of gravitation, attracts it towards him, and maintains it in its proper place.

The cruel who are opposed to the just, and are opposed by the peace-loving, be bound by all the means possible and be never let loose till they have been brought to their senses.

౨౭. గాయత్రేణేత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞో దేవతా, బ్రాహ్మీ త్రిష్టుప్ ఛందః. ధైవతః స్వరః

కేన స యజ్ఞో గ్రాహ్యోఽనుష్ఠాతవ్యశ్చేత్యుపదిశ్యతే.

ఎవ రా యజ్ఞమును గ్రహించవలయునో, అనుష్ఠించవలయునో ఇందుపదేశించ బడుచున్నది.

౨౭ గాయత్రేణ త్వా ఛన్దసా పరిగృహ్ణామి త్రైష్టుభేన త్వా ఛన్దసా పరిగృహ్ణామి జాగతేన త్వా ఛన్దసా పరిగృహ్ణామి। సుక్ష్మా చాసి శివా చాసి స్యోనా చాసి సుషదా చాస్యూర్జస్వతీ చాసి పయస్వతీ చ ॥౨౭॥

ప. వి:- గాయత్రేణ, త్వా, ఛందసా, పరి, గృహ్ణామి, త్రైష్టుభేన, త్రైస్తుభేనేతి త్రై + స్తుభేన, త్వా, ఛన్దసా, పరి, గృహ్ణామి, జాగతేన, త్వా, ఛన్దసా, పరి, గృహ్ణామి, సుక్ష్మా, చ, అసి, శివా, చ, అసి, స్యోనా, చ, అసి, సుషదా, సుసదేతి సు+సదా, చ, అసి, ఊర్జస్వతీ, చ, అసి, పయస్వతీ చ. ॥౨౭॥

పదార్థః :-గాయత్రేణ గాయత్ర్యేవ గాయత్రం తేన. ఛన్దసః ప్రత్యయవిధానే నపుంసకాత్ స్వార్థ ఉపసంఖ్యానమ్. అ. ౪. ౨. ౫౫. అనేన గాయత్ర శబ్దే అణ్ త్రైష్టుభాదిషు అణ్ చ. (త్వా) పరమాత్మానం తమిమం యజ్ఞం వా (ఛందసా) ఆహ్లాదకారిణా. చన్దేరాదేశ్చ ఛః. ఉ. ౪.౨౧౯. అనేనాసున్ ప్రత్యయః. (పరి)సర్వతో భావే. పరీతి సర్వతో భావం ప్రాహ. నిరు. ౧. ౩. (గృహ్ణామి) సంపాదయామి. (త్రైష్టుభేవ) త్రిష్టుభేవ త్రైష్టుభం తేన (త్వా) త్వాం సర్వానందమయం తం పదార్థసమూహం వా (ఛన్దసా) స్వాతంత్ర్యానందప్రదేన (పరి) అభితః (గృహ్ణామి) సంపాదయామి (జాగతేవ)జగత్యేవ జాగతం తేన (త్వా) త్వాం సుఖస్వరూపం తమగ్నిం వా (ఛన్దసా) అత్యానందప్రకాశేన (పరి) సమన్తాత్ (గృహ్ణామి) స్వీకరోమి (సుక్ష్మా)

శోభవా చాసౌ క్ష్మేయం పృథివీ చ సా. క్ష్మేతి పృథివీ నామసు పఠితమ్. నిఘం ౧. ౧. (చ) సముచ్చయార్థే (అసి) భవతి. అత్ర సర్వత్ర పురుష వ్యత్యయః. (శివా) మంగళప్రదా. (చ) సముచ్చయే (అసి) భవతి (స్యోనా) సుఖప్రదా. స్యోనమితి సుఖనామసు పఠితమ్. నిఘం. 3. ౬. (చ) సముచ్చయే (అసి) భవతి (సుషదా) సుష్ఠు సీదన్తి యస్యాం సా (చ) సముచ్చయే (అసి) భవతి (ఊర్జస్వతీ) అన్నవతీ. ఊర్గిత్యన్ననామసు పఠితమ్. నిఘం. ౨. ౭ ఊర్గ్బహువిధమన్నం యస్యాం సేతి భూమ్ని మతుప్. జ్యోత్స్నతమిస్రా అ. ౫. ౨. ౧౧౪. ఇతి నిపాతితః. (చ) సముచ్చయే. (అసి) భవతి (పయస్వతీ) పయః ప్రశస్తో రసో విద్యతేఽస్యాం సా. అత్ర ప్రశంసార్థే మతుప్. పయస్వతీ రసవతీ. శ.౧.౨.౫. ౧౧. (చ) సముచ్చయే. అయం మంత్రః. శ.౧.౨.౫.౧-౧౧ వ్యాఖ్యాతః ॥౨౭॥

అన్వయః :-యేన యజ్ఞేన చోత్తమైః పదార్థైః సహ సుక్ష్మాసి భవతి. యేన చ కల్యాణ కారిభిర్గుణై ర్మనుష్యైశ్చేయం శివాసి భవతి. యేన చానుత్తమైః సుఖైః సహేయం స్యోనాసి భవతి. యేన చోత్తమాభిః సుఖకారికాభి స్థితిగతిభిః సహేయం సుషదాసి భవతి. యేన చోత్తమై ర్యవాదిభి రన్నైః సహేయమూర్జస్వత్యసి భవతి. యేన చోత్తమై ర్మధురాది రసవద్భిః ఫలైర్యుక్తేయం పృథివీ పయస్వతీ చ జాయతే. అహం యజ్ఞవిద్యావిన్మనుష్యో గాయత్రేణ ఛన్దసా త్వా తం యజ్ఞం పరిగృహ్ణామి. అహం త్రైష్టుభేన ఛన్దసా త్వా తమిమం పదార్థసమూహం పరిగృహ్ణామి. అహం జాగతేన ఛన్దసా త్వా తమిమమగ్నిం పరిగృహ్ణామి. ॥౨౭॥

భావార్థః:-వేద ప్రకాశకేశ్వరోఽస్మాన్ ప్రత్యభివదతి యుస్మాభిర్నచాన్తరేణ వేద మంత్రాణాం పఠనం, తదర్థజ్ఞానం [అన్తరేణచ] యజ్ఞానుష్ఠానం సుఖఫలం ప్రాప్తుం సర్వశుభ గుణాఢ్యాః సుఖకారిణోఽన్న జలవాయ్వాదయః పదార్థాః శుద్ధాశ్చ కర్తుం శక్యన్తే. తస్మాదేతస్య త్రివిధస్య యజ్ఞస్య సిద్ధిం ప్రయత్నేన నిష్పాద్య సుఖే స్థాతవ్యమ్. యే చాఽస్యాం వాయు జలౌషధిదూషకా దుర్గంధాదయో దోషా దుష్టాశ్చ మనుష్యాః సన్తి తే సర్వదా నివారణీయాః. ॥౨౭॥

పదార్థము:-ఏ యజ్ఞముద్వారా ఉత్తమ పదార్థములతో నిండిన యీ పృథివి (సూక్ష్మా అసి) శోభాయమాన మగునో (చ) మరియు మనుష్యులతోను(శివా అసి) శుభములనిచ్చునదిగా యగునో (చ) మరియు దేనివలన నిది కల్యాణ సుఖకరగుణములతోను (చ) మరియు దేనివలన అత్యుత్తమ సుఖములతో ఈ పృథివి (స్యోనా అసి) సుఖముల నుత్పన్నమొనర్చున దగుచున్నదో (చ) మరియు దేనివలన అనేక సుఖములను సమకూర్చు స్థితిగతులతో నిది (సుషదా అసి)సౌఖ్యముల గలిగించుటకు యోగ్యమగుచున్నదో అట్లే దేనిచే ఉత్తమ యవలు గోధుమలు మున్నగు (ఊర్జస్వతీ) అన్నము నిచ్చునదిగ (అసి) అగుచున్నదో (చ) మరియు నెద్దానిచే ఉత్తమ మధురములగు రసభరిత ఫలములతో నీ భూమి (పయస్వతీ అసి) ప్రశంసించదగిన

రసమయి యగుచున్నదో (త్వా) ఆ యజ్ఞమును ఆ విద్య నెరిగి నేను (గాయత్రేణ ఛన్దసా) చిత్తమును ఆనందమున నోలలాడించు గాయత్రితో "గాయత్రి యను ఛందముతో" (పరిగృహ్ణామి) సకలవిధముల సిద్ధింపజేయుచున్నాను. మరియు నేను (త్రైష్టుభేన ఛన్దసా) స్వతంత్రరూపమున నానందమునిచ్చు త్రైష్టుభము లను ఛన్దములద్వార (త్వా) పదార్థసమూహమును (పరిగృహ్ణామి) సకలవిధముల సమకూర్చు కొనుచున్నాను. మరియు నేను (జాగతేన ఛన్దసా) అత్యంతానందము నిచ్చు జగతీఛందస్సుచే (త్వా) ఆ భౌతికాగ్నిని (పరిగృహ్ణామి) దృఢముగ స్వీకరించుచున్నాను.॥౨౭॥

**భావార్థము** :-వేదప్రకాశకుడగు పరమేశ్వరుడు ఇట్లనుచున్నాడు:- ఓ మానవులారా! వేదమంత్ర పఠనమొనర్చికయు, వాని యర్థముల గ్రహించకయు మీరు యజ్ఞానుష్ఠాన మొనర్పజాలరు. మరియు సుఖరూప ఫలమును పొందజాలరు. ఇంతే గాక సమస్త శుభగుణయుక్తములును, సుఖకరములును నగు అన్నము, జలము వాయువు మున్నగు పదార్థములును శుద్ధములు కాజాలవు. కావున ఇట్టి త్రివిధ యజ్ఞములను ప్రయత్నపూర్వకముగా నెరవేర్చి సదా సుఖముల పొందుడు. మరియు ఈ పృథివియందలి వాయుజల ఓషధులను దూషితమొనర్చుచున్న దుర్గంధములు మున్నగు ఏ అవగుణములు, దోషములు గలవో అట్లే ఏ యే దుష్టమానవులు గలరో వారెల్లరను సదా వానిని నివారించ ప్రయత్నించవలయును.॥౨౭॥

27. I perform the yajna with the recitation of vedic verses in Gayatri, Trishtup, and jagati metres. O Earth, thou art beautiful, a source of prosperity, and happiness, a fit place to dwell upon comfortably, full of corn, milk, sweet juices and fruits!

౨౮. పురా క్రూరస్యేత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞో దేవతా విరాడ్ బ్రాహ్మీ పంక్తి శ్ఛన్దః. పఞ్చమః స్వరః.

తే దోషాః కథం నివారణీయాస్తత్ర మనుష్యైః పునః కిం కరణీయమిత్యుపదిశ్యతే.

ఆ దోషము లెటుల నివారించవలయును? అప్పుట మనుష్యు లింకా యేమి చేయవలయును?

ఇందుపదేశ మొనర్చబడినది.

౨౮ పురా క్రూరస్య విసృపో విరప్శిన్నుదాదాయ పృథివీం జీవదానుమ్

యామైరయఀశ్చన్ద్రమసి స్వధాభిస్తాము ధీరాసో౽అనుదిశ్య యజన్తే।

ప్రోక్షణీరాసాదయ ద్విషతో వధో౽సి ॥౨౮॥

ప.వి:-పురా, క్రూరస్య, విసృప ఇతి వి+సృపః, విరప్శిన్నితి వి+రప్శిన్, ఉదాదాయేత్యుత్ + ఆదాయ, పృథివీమ్, జీవదానుమితి జీవ+దానుమ్, యామ్, ఐరయన్, చన్ద్రమసి, స్వధాభిః,

తామ్, ఉ॥ ఇత్యూహ్య॥, ధీరాసః అనుదిశ్యేత్యను+దిశ్య, యజన్తే, ప్రోక్షణీరితి ప్ర+ఉక్షణీః,

ఆ, సాదయ, ద్విషతః, వధః అసి.॥౨౮॥

పదార్థః :-(పురా) పురస్తాత్ (క్రూరస్య) కృంతవ్యంగాని యస్మిన్ తస్య యుద్ధస్య. కృతేశ్చః క్రూ చ. ఉ. ౨.౨౧. అనేన కృంతతేరక్ ప్రత్యయః. క్రూ ఇత్యాదేశ శ్చ. (విసృపః)యోద్ధృభి ర్వివిధం యత్సృప్యతే తస్య. సృపితృదోః కసున్. అ. ౩. ౪. ౧౭. అనేన భావలక్షణే సృపిధాతోః కసున్. (విరప్శిన్) మహాగుణవిశిష్టేశ్వర వా మహైశ్వర్యమిచ్ఛుకమనుష్యవిరప్శీతిమహన్నామసు పఠితమ్. నిఘం. ౩. ౩. (ఉదాదాయ) ఊర్ధ్వం సమంతా ద్గృహీత్వా. (పృథివీమ్) విస్తృత ప్రజాయుక్తాం (జీవదానుమ్) యా జీవేభ్యో జీవనార్థం వస్తు దదాతి తామ్ (యామ్) పృథివీమ్. (ఐరయన్) రాజ్యాయ ప్రాప్నువన్తి. అత్ర లడర్థే లఙ్. (చన్ద్రమసి) చన్ద్రలోక సమీప ఆహ్లాదే వా (స్వధాభిః) అన్నైః సహ వర్తమానామ్. స్వధేత్యన్ననామసు పఠితమ్. నిఘం. ౨. ౭. (తామ్) ఏతల్లక్షణామ్. (ఉ) వితర్కే (ధీరాసః) మేధావినః ధీర ఇతి మేధావినామసు పఠితమ్. నిఘం. ౩. ౧౫. (అనుదిశ్య) ప్రాప్తుం శోధయితుమనులక్ష్య. (యజన్తే) పూజయన్తి సంగతిం కుర్వతే (ప్రోక్షణీః) ప్రకృష్టతయా సించన్తి యాభిః క్రియాభిః పాత్రైర్వా తాః (ఆ) సమన్తాత్ (సాదయ) స్థాపయ (ద్విషతః) శత్రోః (వధః) హననమ్ (అసి) భవేత్. అత్రాపి పురుషవ్యత్యయో లిఙర్థే లట్ చ. అయం మంత్రః శ.౧.౨.౪.౧౮-౧౯. వ్యాఖ్యాతః.॥౨౮॥

అన్వయః:-హే విరప్శిన్ జగదీశ్వర! భవానేవ యాం స్వధాభిర్యుక్తాం జీవదానుం పృథివీ ముదాదాయ చంద్రమసి స్థాపితా వానస్తి తస్మాద్ధీరాసస్తామిమాం పృథివీం ప్రాప్య భవన్త మనుదిశ్య నిత్యం యజన్తే. యథా చన్ద్రమస్యానన్దేన వర్తమానా ధీరాసః యాం జీవదానుం పృథివీమనుదిశ్య సేనాం శస్త్రాణ్యుదాదాయ విసృపః క్రూరస్య మధ్యే శత్రూన్ జిత్వా రాజ్యమైరయన్ ప్రాప్నువన్తి. యథా చైవం కృత్వా ధీరాసః పురా ప్రోక్షణీశ్చాసాదితవన్త స్తథైవ. హే విరప్శిన్! త్వమపి ఉ ఇతి వితర్కే తాం ప్రాప్యేశ్వరం యజ ప్రోక్షణీశ్చాసాదయ. యథా చ ద్విషతో వధోఽసి భవేత్ తథా కృత్వాఽఽనందే నిత్యం ప్రవర్తస్వ. ॥౨౮॥

భావార్థః:-యేనేశ్వరేణాన్తరిక్షే పృథివ్య స్తత్సమీపే చన్ద్రాస్తత్సమీపే పృథివ్యోఽన్యోన్యం సమీపస్థాని నక్షత్రాణి సర్వేషాం మధ్యే సూర్యలోకా ఏతేషు వివిధాః ప్రజాశ్చ రచయిత్వా స్థాపితాః సర్వై స్తత్రస్థై ర్మనుష్యైః స ఏవోపాసితుం యోగ్యోఽస్తి. న యావన్మనుష్యా బలక్రియాభ్యాం యుక్తా భూత్వా శత్రూన్ విజయన్తే నైవ తావచ్చిరం రాజ్యసుఖం

**ప్రాప్నువన్తి. నైవ యుద్ధబలాభ్యాం వినా శత్రవో బిభ్యతి. నైవ చ విద్యాన్యాయవినయైర్వినా యథావత్ ప్రజాః పాలయితుం శక్నువంతి, తస్మా త్సర్వై ర్జితేన్ద్రియై ర్భూత్వైతత్సమాసాద్య సర్వేషాం సుఖం కర్తుమనులక్ష్య నిత్యం ప్రయతితవ్యమ్.॥౨౮॥**

**పదార్థము** :-(విరప్శిన్) మహాశయుడవు, మహాగుణనిధివగు ఓ జగదీశ్వరా! నీవు (యామ్) ఏ స్వధివి (స్వదాభిః) అన్నము మున్నగు పదార్థములతో (జీవదానుమ్) ప్రాణులకు జీవనమునిచ్చు పదార్థములతో కూడియున్నదో (పృథివీమ్) బహుప్రజలతోగూడిన యా పృథివిని (ఉదాదాయ) ఊర్ధ్వమునకు [పైకి] ఎత్తి (చన్ద్రమసి) చంద్రలోకసమీపమున స్థాపించితివి. కావున (ధీరాసః) ధీరులు, బుద్ధిశాలురగు వారు ఆ పృథివినిపొంది, మీకనుకూలముగ నడచి, నిత్యము యజ్ఞానుష్ఠానముల నొనర్చుచున్నారో (చన్ద్రమసి) ఆనందమునందుండిన (ధీరాసః) బుద్ధిశాలు రెట్లు (యామ్ జీవదానుమ్) జీవులకు హితకారకమగు ఏ (పృథివీమ్) పృథివి గలదో దాని నాశ్రయించి నే నా శస్త్రములను (ఉదాదాయ) క్రమముగ గ్రహించి (విస్పృషః) యుద్ధమునొనర్చు వీరుల పరాక్రమమును ప్రకటించదగినదియు (క్రూరస్య) శత్రువుల యంగములను విదీర్ణమొనర్చునదియు నగు రణక్షేత్రమున శత్రువుల నిర్జించి రాజ్యమును (ఐరయన్) పొందుచుందురో, మరియు నీ విధముగ ధీరులు ఎట్లు (పురా) పూర్వకాలమున (ప్రోక్షణీః) బాగుగ పదార్థములనుతడుపు క్రియలను సంపాదనమొనర్చుచుండిరో అట్లే (విరప్శిన్) మహదైశ్వర్యములను గోరు నో విద్వాంసా! నీవును దానిని పొంది ఈశ్వరపూజనము, ఐశ్వర్యములను సిద్ధింపజేయు ఉత్తమోత్తమ క్రియలను సమకూర్చుకొనుము. ఎట్లు (ద్విషతః) శత్రువుల (వధః అసి) నాశనము జరుగునో యటువంటి కార్యములనే యొనర్చుచు సర్వదా ఆనందములో వర్తమానుడవై యుండుము. ॥౨౮॥

**భావార్థము** :-ఏ పరమేశ్వరుడు క్రమముగ అంతరిక్షమునందు పృథ్వులను, ఆ పృథ్వుల సమీపమున చంద్రలోకములను, చంద్రలోకములసమీపమున మరల పృథ్వులను ఇట్లొకదాని సమీపమున నొకదానినిగ తారామండలములను, అన్నిటిమధ్య అనేక సూర్యలోకములను, మహాసూర్యమండలములను మరియు వీని యన్నిటియందును నానావిధములగు ప్రజలను, ప్రాణులను సృష్టించి స్థాపించెనో ఆ పరమేశ్వరుడే మానవు లెల్లరకును నుపాసించ యోగ్యుడు. మనుష్యులు బలపురుషార్థములతో శత్రువులను నిర్జించనంతవరకు సుస్థిరమగు రాజ్యసుఖమును పొందజాలరు. ఏలన బలహీనులై యుద్ధము లొనర్చుకున్న శత్రువులెన్నడును భీతిల్లరు. అదే విధముగ విద్వాంసులు విద్య, న్యాయ, వినయములు లేక ప్రజలను చక్కగా పాలించుటకు సమర్థులు గాజాలరు. కావుననే యెల్లరును జితేంద్రియులై ఉక్త పదార్థములను సంపాదించుకొని సకలప్రాణుల సుఖమున్నకై ఉత్తమోత్తమ ప్రయత్నముల నొనర్చవలెను. ॥౨౮॥

**28. O Almighty Lord Thou hast suspended in space near Moon, this Earth, full of foodstuffs, and producer of all the life-giving substances for the living creatures. May the learned of refined intellect, full of happiness, residing upon it, the well-wisher of all, abiding by thy eternal laws, conquer all foes waging severe fight with the aid of warriors and arms, and thus attain to power. O learned person, just as from times immemorial the dutiful have been acquiring wealth, so do thou full of wealth worship God. Let evil be eradicated!**

౨౯. ప్రత్యుష్ట మిత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞో దేవతా సర్వస్య. పూర్వార్ధే భురిగ్జగతీ ఛన్దః. నిషాదః స్వరః. ఉత్తరార్ధే త్రిష్టుప్ ఛన్దః. ధైవతః స్వరః. పునః స సంగ్రామః కిం కృత్వా జేతవ్యో యజ్ఞశ్చానుష్ఠాతవ్య ఇత్యుపదిశ్యతే.

మరల నా సంగ్రామ మెటుల జయించవలయును?

యజ్ఞానుష్ఠాన మెటు లొనరించవలయును? ఈ విషయము ఉపదేశింపబడుచున్నది.

౨౯ ప్రత్యు॑ష్ట॒ꣳ రక్షః॒ ప్రత్యు॑ష్టా॒ అరా॑తయో॒ నిష్ట॑ప్త॒ꣳ రక్షో॒ నిష్ట॑ప్తా॒

అరా॑తయః। అని॑శితో॒ఽసి సపత్న॒క్షిద్వా॒జినం॑ త్వా వా॒జేధ్యా॒యై

సమ్మా॑ర్జ్మి। ప్రత్యు॑ష్ట॒ꣳ రక్షః॒ ప్రత్యు॑ష్టా॒ అరా॑తయో॒ నిష్ట॑ప్త॒ꣳ

రక్షో॒ నిష్ట॑ప్తా॒ అరా॑తయః। అని॑శితాఽసి సపత్న॒క్షిద్వా॒జినీం॑

త్వా వా॒జేధ్యా॒యై సమ్మా॑ర్జ్మి ॥౨౯॥

ప. వి:- ప్రత్యుష్టమితి ప్రతి+ ఉష్టమ్, రక్షః, ప్రత్యుష్టా ఇతి ప్రతి+ఉష్టాః, అరాతయః, నిష్టప్తం నిస్తప్తమితి నిః+తప్తమ్, రక్షః నిష్టప్తాః, నిస్తప్తా ఇతి నిః+తప్తాః అరాతయః, అనిశిత ఇత్యని+శితః, అసి, సపత్న క్షిదితి సపత్న+క్షిత్, వాజినమ్ త్వా, వాజేధ్యాయా ఇతి వాజ +ఇధ్యాయై, సమ్ మార్జ్మి, ప్రత్యుష్ట మితి ప్రతి+ఉష్టమ్, రక్షః ప్రత్యుష్టా ఇతి ప్రతి+ ఉష్టాః అరాతయః, నిష్టప్తమ్, నిస్తప్తమితి నిః+తప్తమ్, రక్షః, నిష్టప్తాః, నిస్తప్తా ఇతి నిః+తప్తాః, అరాతయః, అనిశితేత్యని +శితా, అసి, సపత్నక్షిదితి సపత్న: క్షిత్, వాజినీమ్, త్వా, వాజేధ్యాయా ఇతి వాజ+ ఇధ్యాయై, సమ్, మార్జ్మి. ॥౨౯॥

పదార్థః :-(ప్రత్యుష్టమ్) ప్రతిదగ్ధవ్యమ్ (రక్షః) విఘ్నకారీ ప్రాణీ ((ప్రత్యుష్టాః) ప్రతిదగ్ధవ్యాః (అరాతయః) సత్యవిరోధినో ఽరయః. (నిష్టప్తమ్) యన్నితరాం తప్యతే తత్

(రక్షః) బంధనేవ రక్షయితవ్యమ్. (నిష్టప్తాః) నితరాం తప్యంతే యే తే. (అరాతయః) విద్యావిఘ్నకారిణః (అనిశితః) న విద్యతే నితరాం శితా తీవ్రా క్రియా యస్మిన్స సంగ్రామో యజ్ఞపాత్రం వా (అసి) భవతి. అత్ర పురుషవ్యత్యయః (సపత్నక్షిత్) సపత్నాన్ శత్రూన్ క్షయతి యేన సః. అత్ర కృతో బహుళ మితి వార్తికేన కరణ కారకే క్విప్. క్షి క్షయే ఇత్యస్య రూపమ్. ఏతదువటమహీధరాభ్యాం క్షిణు హింసాయా మిత్యస్య భ్రాంత్యా వ్యాఖ్యాతమ్. (వాజినమ్) అన్నవంతం వేగవంతం వా. వాజ ఇత్యన్న నామసు పఠితమ్. నిఘం.౨. ౭. (త్వా) తమ్. (వాజేధ్యాయై) వాజేనాన్నేన యుద్ధేన వా ఇధ్యా దీపనీయా సేనా యజ్ఞపాత్రం వా యయా క్రియయా తస్యై (సంమార్జ్మి) సమ్యక్ శోధయామి (ప్రత్యుష్టమ్) నిత్యం ప్రజాపాలనాయ తాపనీయః (రక్షః) పరసుఖాసహో మనుష్యః (ప్రత్యుష్టాః) ప్రత్యక్షం జ్వాలనీయాః (అరాతయః) పరసుఖా సోఢార్షః (నిష్టప్తమ్) నిఃసారణీయః (రక్షః) దుష్టజారకర్మశీలః (నిష్టప్తాః) నిఃసారణీయాః (అరాతయః) అన్యేభ్యో దుఃఖప్రదాః (అనిశితా) అతివిస్తీర్ణా సేనా కార్యా వేది ర్వా (అసి) అస్తి. అత్రాపి వ్యత్యయః. (సపత్నక్షిత్) సపత్నాన్ క్షయతి యయా సా (వాజినీమ్) బలవేగవతీమ్ (త్వా) త్వామ్ (వాజేధ్యాయై) వాజేన బహుసాధనసమూహేన సంగ్రామేణ సేనయా యజ్ఞేన వా ప్రకాశనీయాయై సత్యనీత్యై (సంమార్జ్మి) సమ్యక్ శిక్షయా శోధయామి. అయం మంత్రః శ. ౧.౩.౧.౪-౧౧ వ్యాఖ్యాతః.॥౨౯॥

అన్వయః :- అహం యేనశితేన [సపత్నక్షిత్] సపత్నక్షితా సంగ్రామేణ ప్రత్యుష్టం రక్షః [అసి] ప్రత్యుష్టా అరాతయో నిష్టప్తం రక్షో నిష్టప్తా అరాతయో భవన్తి [త్వా] తం వాజినం వాజేధ్యాయై యుద్ధాంగాని సంమార్జ్మి. అహం యయా [సపత్నక్షిత్] సపత్నక్షితా [అనిశితా] నిశితయా సేనయా ప్రత్యుష్టం రక్షః [అసి] ప్రత్యుష్టా అరాతయో నిష్టప్తం రక్షో నిష్టప్తా అరాతయో భవన్తి [త్వా] తాం వాజనీం సేనాం శిక్షయా వాజేధ్యాయై సంమార్జ్మి. అహం యేన [అనిశితః]శితేన [సపత్నక్షిత్] సపత్నక్షితా యజ్ఞేన ప్రత్యుష్టం రక్షః ప్రత్యుష్టా అరాతయో నిష్టప్తం రక్షో నిష్టప్తా అరాతయో [అసి] భవన్తి [త్వా] తం వాజినం యజ్ఞం వాజేధ్యాయై సంమార్జ్మి.ఏవం యయా [సపత్నక్షిత్] సపత్నక్షితా [అనిశితా] అనిశితయా క్షియయా ప్రత్యుష్టం రక్షః ప్రత్యుష్టా అరాతయో నిష్టప్తంరక్షో నిష్టప్తా అరాతయో [ఽసి] భవన్తి [త్వా] తాం వాజినీం వాజేధ్యాయై సమ్మార్జ్మి తథైవ భవన్తోఽప్యేతం, ఏతాం సమ్మార్జన్తు. ఇతి ద్వితీయోఽర్థః.॥౨౯॥

భావార్థః:- ఈశ్వర ఆజ్ఞాపయతి సర్వైర్మనుష్యైర్విద్యాశుభగుణదీప్త్యై దుష్టశత్రుం నివారణాయ నిత్యం పురుషార్థః కర్తవ్యః. సుశిక్షయా శస్త్రాస్త్ర సత్పురుషాఢ్య సేనయా శ్రే

ష్టానాం రక్షణం దుష్టానాం తాడనం చ నిత్యం కర్తవ్యమ్. యతో ఉశుద్ధిక్షయాత్సర్వత్ర పవిత్రతా ప్రవర్తేత. ॥౨౯॥

**పదార్థము :-** శత్రువులను హతమార్చు అతివిస్తృతము నగు నే సంగ్రామముద్వారా (ప్రత్యుష్టం రక్షః) విఘ్నకారులగు ప్రాణులను (ప్రత్యుష్టా అరాతయః) నిజశత్రువులును బాగుగ దహనమొనర్చబడుదురో (నిష్టప్తం రక్షః) బంధనములచే బంధింపదగినవారు (నిష్టప్తా అరాతయః) విద్యలకు నిరంతరము విఘ్నములనొనర్చువారు సంతాపమును పొందువారుగ నగుచున్నారో (త్వా వాజినమ్) అట్టి మహా సంకుల సంగ్రామమును (వాజేధ్యాయై) అన్నము మున్నగు పదార్థములతో శక్తివంతమొనర్చుటకు సమర్థవంతముగ నున్న సైన్యములకొరకు యుద్ధసాధనములను (సమ్మార్జ్మి) నేను బాగుగ శుద్ధమొనర్చుచున్నాను. వానిదోషములను వినాశమొనర్చుచున్నాను. మరియు నేను (సపత్నక్షిత్) శత్రుసంహారమొనర్చునదియు (అశితా) అతివిస్తారముగ నున్న ఏ సైన్యములద్వారా (ప్రత్యుష్టం రక్షః) ఇతరుల సుఖములను జూచి సహించజాలని (ప్రత్యుష్టా అరాతయః) అవగుణములు గల సర్వమానవులను (నిష్టప్తం రక్షః) జూదరులను, పరకామినీకాముకులను అటులనే (నిష్టప్తా అరాతయః) ఎల్లప్పుడును పరులకు దుఃఖములను గలిగించు మనుష్యులను నిశ్శేషముగా తరిమివేయించుచున్నానో (త్వా వాజినీ) అట్టి బలవేగము, గుణయుక్తమును నగు సేనను (వాజేధ్యాయై) బహుళ సాధనములద్వారా ప్రకాశింపజేయుటకై (సమ్మార్జ్మి) ఉత్తమోత్తమ శిక్షలద్వారా శుద్ధపరచుచున్నాను (అనిశితః) గొప్పక్రియలద్వారా సిద్ధింపబడుటకు యోగ్యమును (సపత్నక్షిత్) శత్రువులను దోషములను నాశమొనర్చునట్టి యుద్ధమును (వాజేధ్యాయై) అన్నాది పదార్థములప్రకాశపరచుటకై (సమ్మార్జ్మి) శోధించుచున్నాను. ॥౨౯॥

**భావార్థము :-** ఈశ్వరు డిట్లాజ్ఞాపించుచున్నాడు. మానవులు విద్య మున్నగు శుభగుణముల ప్రకాశమునకై, దుష్టశత్రువులను దొలగించుటకై సదా పురుషార్థముల నొనర్చుచుండవలయును. అట్లే ఉత్తమశిక్షణ, శస్త్రాస్త్రములచే వీరశూరులగు నుత్తమ సైన్యములతో దుష్టశిక్షణ, శిష్టరక్షణము సర్వధా యొనర్చుచుండ వలయును. అట్లు చేయుటవలన అశుద్ధి మున్నగు దోషములు రూపుమాసిపోవుటవల్ల సర్వత్రా శుద్ధగుణములు వ్యాపించును. ॥౨౯॥

29. The wicked should be removed, the enemies of truth should be punished; those fit to be shackled should be cast aside and those opposed to knowledge should come to grief. Oh destroyer of foes, Thou art not wrathful, I prepare thee full of virility for battle!

Those who can't tolerate the good of others must be chastised, and openly condemned. Those who cause harm to others should be humiliated. I duly instruct the army to be strong for weakening the foe, and waging war.

**౩౦. అదిత్యా ఇత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞో దేవతా. నిచృజ్జగతీ ఛన్దః. నిషాదః స్వరః.**

**పునః స యజ్ఞః కీదృశః కిం ఫలో భవతీ త్యుపదిశ్యతే.**

**ఆ యజ్ఞ మే విధముగా నుండును? ఫలమేమి లభించును? ఇం దుపదేశించబడుచున్నది.**

30 అదిత్యై రాస్నాసి విష్ణో ర్వే ష్పో స్యూర్జే త్వాఽ దబ్ధేన త్వా
చక్షుషావపశ్యామి। అగ్నే ర్జిహ్వాసి సుహూర్దేవేభ్యో ధామ్నే ధామ్నే
మే భవ యజుషే యజుషే ॥30॥

ప.వి:-అదిత్యై, రాస్నా, అసి, విష్ణోః, వేష్పః, అసి, ఊర్జే, త్వా, అదబ్ధేన, త్వా, చక్షుషా, అవ, పశ్యామి, అగ్నేః, జిహ్వా, అసి, సుహూరితి సు+హూః, దేవేభ్యః, ధామ్నే, ధామ్న ఇతి ధామ్నే, మే భవ, యజుషే, యజుష ఇతి యజుషే, యజుషే.॥30॥

పదార్థః:-(అదిత్యై) పృథివ్యా అన్తరిక్షస్య వా. అత్ర షష్ఠ్యర్థే చతుర్థీ. అదితి రితి పృథివీనామసు పఠితమ్. నిఘం. ౧. ౧. పదనామసు చ. నిఘం. ౪. ౧. అనేన గమనాగమనవ్యవహార ప్రాప్తిహేతురవకాశో ఽన్తరిక్షం గృహ్యతే. (రాస్నా) రసహేతుభూతా క్రియా. రాస్నా సాస్నా స్థూణా వీణాః. ఉ.3.౧౫. అనేన రసధాతో ర్నిపాతనాన్నః ప్రత్యయః (అసి) అస్తి వా. అత్ర సర్వత్ర పక్షే వ్యత్యయః (విష్ణోః) వ్యాపకేశ్వరస్య యజ్ఞస్య వా. యజ్ఞో వై విష్ణుః. శ. ౧. ౧. ౨. ౧3. (వేష్పః) వేవేష్టి వ్యాప్నోతి పృథివీమన్తరిక్షం వా స యజ్ఞో త్థో వాష్ప జ్ఞానసమూహో వా. పానీవిషిభ్యః పః. ఉ. 3. ౨3. అనేన విషేః పః ప్రత్యయః (అసి) అస్తి వా (ఊర్జే)అన్నాయ రసాయ పరాక్రమాయ చ. (త్వా) త్వాం తం వా (అదబ్ధేన) సుఖయుక్తేన (త్వా) త్వాం తం వా. (చక్షుషా) విజ్ఞానేన ప్రత్యక్షప్రమాణేన నేత్రేణ (అవ) క్రియార్థే. అవేతి వినిగ్రహార్థీయః. నిరు. ౧. 3. (పశ్యామి) సంప్రేక్షే (అగ్నేః) భౌతికస్య (జిహ్వా) జోహూతే విజానాతి రసమనయా సా. శేవయహ్వాజిహ్వా... ఉ. ౧. ౧౫౪ అనేనాయం నిపాతితః. (అసి) అస్తి వా (సుహూః) సుష్ఠు హూయతే యో యా వా సా క్విప్ బహుల మితి కర్మణి హ్వేఞ్ ఇత్యస్య క్విబన్తః ప్రయోగః (దేవేభ్యః) విద్వద్భ్యో దివ్యగుణేభ్యో వా (ధామ్నేధామ్నే) దధతి వస్తూని సుఖాని చ యస్మిన్ తస్మై ప్రత్యధికరణప్రాప్తయే. ధామాని త్రయాణి భవన్తి స్థానాని నామాని జన్మానీతి. నిరు. ౯. ౨౮. అత్ర వీప్సాయాం ద్విత్వమ్. (భవ) భవతి వా (యజుషే యజుషే) యజన్తి యేన తస్మై ప్రతి యజుర్వేదమన్త్రమ్. అయం మంత్రః. శ ౧. 3. ౧. ౧౨-౧౯. వ్యాఖ్యాతః. ॥30॥

అన్వయః :-హే జగదీశ్వర! యస్త్వమ[దిత్యై అ]అదిత్యా రాస్నాసి విష్ణురసి సర్వస్య వేష్ప్ర ఉస్యగ్నేర్జిహ్వాసి దేవేభ్యో ధామ్నే ధామ్నే యజుషే యజుషే సుహూరసి. ఏవం భూతం [త్వా] త్వామహమదబ్ధేన చక్షుషా ఊర్జే [త్వా]ఉదిత్యై దేవేభ్యో ధామ్నే ధామ్నే యజుషే యజుషే చావపశ్యామి. స చ త్వమస్మాభిః సర్వత్ర కృపయా విదితః పూజిత శ్చ భవేత్యేకః.

యతోఽయం యజ్ఞో ఽ[దిత్యై]దిత్యా రాస్నాఅస్తి విష్ణో ర్వేష్ప్ర ఉ[స్య]స్త్యగ్నేర్జిహ్వాఽ[స్య]స్తి. దేవేభ్యో ధామ్నే ధామ్నే [వేంభవ]యజుషే యజుషే సుహూర్భవతి తస్మాత్తమహ మదబ్ధేన [త్వా]చక్షుషోర్జే [త్వా]ఽవపశ్యామి తథా అదిత్యై దేవేభ్యో ధామ్నే ధామ్నే యజుషే యజుషే హితాయావపశ్యామి ఇతి ద్వితీయః. ॥30॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. సర్వైర్మనుష్యై రయం జగదీశ్వరః ప్రతివస్తు స్థితః ప్రతిమన్త్రం ప్రతిపాఽదితః పూజ్యశ్చ భవతీతి మన్తవ్యమ్. తథా చాయం యజ్ఞః ప్రతి మంత్రేణ సమ్యగనుష్ఠితః సర్వప్రాణిభ్యః ప్రతివస్తుషు పరాక్రమబలప్రాప్తయే భవతీతి ॥30॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! నీవు (అదిత్యై) పృథివియందలి (రాస్నా అసి) రసాదిపదార్థముల నుత్పన్న మొనర్చువాడవు (విష్ణో అసి) సర్వవ్యాపకుడవై యున్నావు (వేష్పః అసి) పృథివి మున్నగు సకల పదార్థములందు వర్తమానమై యున్నావు (అగ్నేః) భౌతికాగ్నికి (జిహ్వా అసి) నాలుకవైయున్నావు (దేవేభ్యః) విద్వాంసులకు (ధామ్నే ధామ్నే) ధర్మాత్ములు సుఖరూప పదార్థములను పొందగలుగు ముప్విధ స్థాన నామ జన్మ [ధర్మ]ముల ప్రాప్తికొరకు (యజుషే యజుషే) యజుర్వేద ప్రతి మంత్రాశయమును ప్రకటపరచుటకై (సుహూః) ఉత్తమముగ స్తుతింపదగినవాడవై యున్నావు (త్వా) అట్టి నిన్ను నేను (అదబ్ధేన) ప్రేమసుఖయుక్తమగు (చక్షుషా) విజ్ఞానముతో (ఊర్జే) పరాక్రమ ప్రాప్తికి (అదిత్యై) పృథివీప్రాప్తికి మరియు (దేవేభ్యః) శ్రేష్ఠగుణములప్రాప్తికి (ధామ్నే ధామ్నే) స్థాన నామ జన్మ మున్నగు పదార్థముల ప్రాప్తికై అటులనే (యజుషే యజుషే) యజుర్వేదము ప్రతి మంత్రముయొక్క ఆశయమును దెలిసికొనుటకు పొందుటకు (అవపశ్యామి) జ్ఞాననేత్రములతో జూచుచున్నాను. దయతో నీవు (మే) నాకు విదితుడవై, నా పూజనమును గైకొనువాడవు (భవ)అగుము. ఇది **యీ మంత్రవము మొదటి యర్థము.**

**ఇక రెండవ యర్థము :-** ఏ కారణమువల్ల ఈ యజ్ఞము (అదిత్యై) అంతరిక్షసంబంధములైన (రాస్నా అసి) రసాది పదార్థముల క్రియలకు కారణమై యున్నదో (విష్ణోః వేష్పః అసి) యజ్ఞసంబంధమగు కార్యములందు వ్యాపకమై యున్నదో (అగ్నేః జిహ్వా అసి) భౌతికాగ్నికి జిహ్వారూపమై యున్నదో అటులనే (దేవేభ్యః) దివ్యగుణ ప్రాప్తికై (ధామ్నే ధామ్నే) కీర్తి, స్థాన, జన్మముల ప్రాప్తికై (యజుషే యజుషే) యజుర్వేద ప్రతి మంత్రార్థమును ఎరుగుటకై (సుహూః అసి) మిక్కిలి ప్రశంసించదగినదై యున్నదియో ఆ కారణముననే (త్వా) ఆ యజ్ఞమును నేను (అదబ్ధేన) సుఖపూర్వకమైన (చక్షుషా) నేత్రములద్వారా ప్రత్యక్షముగ (అవ పశ్యామి) చూచుచున్నాను. అటులనే (త్వా) దానిని (అదిత్యై) పృథివిమున్నగు పదార్థములవలనను (దేవేభ్యః) ఉత్తమోత్తమ

గుణవములవలనను (ధామ్నే ధామ్నే) ప్రతి స్థానవమునందును (యజుషే యజుషే) యజుర్వేద ప్రతి మంత్రమునందును హితముకొరకు (అవపశ్యామి) కుశలతతో చూచుచున్నాను. ॥30॥

**భావార్థము** :-ఈ మంత్రమున శ్లేషాలంకారమున్నది. మానవు లెల్లరకును ప్రతిపదార్థము నందు స్థితుడును, ప్రతి వేదమంత్రమును విశదీకరించువాడును నగు జగదీశ్వరుడెటుల సేవించదగినవాడో అట్లే ఈ యజ్ఞమును ప్రతి వేదమంత్రముచే సిద్ధియును, ప్రతిపాదితమును విద్వత్సేవితమునునై సకల ప్రాణులును ప్రతి పదార్థము నందును బలపరాక్రమములను సమకూర్చుకొనుటకు శక్తివంతమగుచున్నది. ॥30॥

30. O' Lord Thou art the Creator of juices in the soil. Thou art the Omnipresent, the Pervader of all. Like the flame of fire Thou art inextinguishable. Thou art worthy of worship by the sages at all places, meant for it, through the recitation of the vedic texts. May we realise thee through our peaceful spiritual vision, for our advancement!

31. సవితు స్త్వేత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞో దేవతా సర్వస్య. పూర్వార్ద్ధే జగతీ ఛన్దః నిషాదః స్వరః.

తేజో౨ఽసీత్యస్యా ౨ఽనుష్టుప్ ఛన్దః. గాన్ధారః స్వరః.

స యజ్ఞః కథం పవిత్రీకరోతీత్యుపదిశ్యతే. ఆ యజ్ఞ మెటుల పవిత్ర మగునదిం దుపదేశించబడుచున్నది.

31 సవితు స్త్వా ప్రసవ౨ఽఉత్పునామ్యచ్ఛిద్రేణ పవిత్రేణ సూర్యస్య

రశ్మిభిః। సవితుర్వః ప్రసవ౨ఽఉత్పునామ్యచ్ఛిద్రేణ పవిత్రేణ

సూర్యస్య రశ్మిభిః। తేజో౨ఽసి శుక్రమస్యమృతమసి ధామ

నామాసి ప్రియన్దేవానామనాధృష్టం దేవయజనమసి ॥31॥

ప.వి:- సవితుః, త్వా, ప్రసవ ఇతి ప్ర+సవే, ఉత్, పునామి, అచ్ఛిద్రేణ, పవిత్రేణ, సూర్యస్య, రశ్మిభిరితి రశ్మి+భిః, సవితుః, వః, ప్రసవ ఇతి ప్ర+ సవే అచ్ఛిద్రేణ, పవిత్రేణ, సూర్యస్య, రశ్మిభిరితి రశ్మిభిః, తేజః, అసి, శుక్రమ్, అసి, అమృతమ్, అసి, ధామ, నామ, అసి, ప్రియమ్, దేవానామ్, అనాధృష్టమ్, దేవయజనమితి దేవ+యజనమ్, అసి. ॥31॥

పదార్థః :- (సవితుః) పరమేశ్వరస్య సూర్యలోకస్య వా (త్వా) త్వాం జగదీశ్వరం తం యజ్ఞం వా (ప్రసవే) ప్రకృష్టతయోత్పద్యన్తే సర్వే పదార్థా యస్మింస్తస్మిన్సంసారే (ఉత్) ఉత్కృష్టార్థే. ఉదిత్యేతయోః ప్రాతిలోమ్యం ప్రాహ. నిరు. ౧.౩.(పునామి) పవిత్రీకరోమి, (అచ్ఛిద్రేణ) న విద్యతే ఛిద్రం ఛేదనం యస్మిన్ తేన.(పవిత్రేణ)శుద్ధేన (సూర్యస్య) చరాచరాత్మనః పరమేశ్వరస్య ప్రకాశమయస్య సూర్యలోకస్య వా. సరతి జానాతి ప్రకాశయతి చరాచరం జగదితి. రాజసూయ సూర్య....అ. ౩. ౧. ౧౧౪ అనేన నిపాతితః. (రశ్మిభిః) ప్రకాశకైర్గుణైః కిరణైర్వా (సవితుః) ఉత్కర్షస్య (వః) యుష్మానేతాంశ్చ (ప్రసవే) ఉత్కర్షే (అచ్ఛిద్రేణ) నిరంతరేణ (పవిత్రేణ) శుద్ధికారకేణ (సూర్యస్య) యః సువత్యైశ్వర్యం దదాతి, ఐశ్వర్యహేతూన్ ప్రేరయతి సః పరమేశ్వరః ప్రాణో వా తస్య (రశ్మిభిః) అన్తః ప్రకాశకై ర్గుణైః (తేజః) స్వప్రకాశః ప్రకాశహేతుర్వా (అసి) అస్తి వా. అత్ర సర్వత్ర పక్షే వ్యత్యయః (శుక్రమ్) శుద్ధం శుద్ధి హేతుర్వా (అసి) అస్తి వా. (అమృతమ్) అమృతాత్మకం మోక్షసుఖం ప్రకాశనం వా (అసి) అస్తి వా (ధామ) ధీయన్తే సర్వే పదార్థా యస్మిన్ తత్ (నామ) నమస్కరణీయో జలహేతు ర్వా. నామ ఇత్యుదక నామసు పఠితమ్. నిఘం. ౧.౧౨. (అసి) అస్తి వా (ప్రియమ్) ప్రీతికారకం (దేవానామ్) విదుషాం దివ్యగుణానాం వా (అనాధృష్టమ్) యన్న సమంతాద్ధృష్యతే ఇత్యనాధృష్టమ్ (దేవయజనమ్) దేవైర్యదిజ్యతే యేన వా దేవానాం యజనం దేవయజనం తత్ (అసి) అస్తి వా. అయం మంత్రః శ. ౧.౩.౧. ౨౨-౨౦.౧.౩.౨. ౧-౧౮ వ్యాఖ్యాతః. ॥౩౧॥

అన్వయః :-యో యజ్ఞో [సవితుః ప్రసవే] అచ్ఛిద్రేణ పవిత్రేణ సూర్యస్య రశ్మిభిః సహ సర్వా న్పదార్థా న్పునాతి [త్వా] త్వాం [తం యజ్ఞం] యజమానం వాహ ముత్పునామి. త్వాం యజమానం వా. ఏవం చ సవితుః ప్రసవేఽచ్ఛిద్రేణ పవిత్రేణ సూర్యస్య రశ్మిభిర్వో యుష్మానేతాఀశ్చ పదార్థాన్ యజ్ఞేనోత్పునామి. హే బ్రహ్మన్! యత స్త్వం తేజో ఽసి శుక్రమస్యమృతమసి ధామాసి నామాసి దేవానాం ప్రియమస్యనాధృష్టమసి దేవయజనమసి తస్మాత్త్వామేవాహమాశ్రయామీత్యేకః.

యతోఽయం యజ్ఞ స్తేజోఽ[స్య]స్తి శుక్రమ[స్య]స్త్యమృతమ[స్య]స్తి ధామాస్తి నామా[స్య]స్తి. దేవానాం ప్రియమనాధృష్టం దేవయజనమ[స్య]స్తి తేనానేన యజ్ఞేనాహం సవితు ర్జగదీశ్వరస్య ప్రసవే ఽచ్ఛిద్రేణ పవిత్రేణ సూర్యస్య రశ్మిభి ర్వో యుష్మా నేతాన్ సర్వాన్ పదార్థాంశ్చోత్పునామి. ఇతి ద్వితీయః.॥౩౧॥

భావార్థః :-అత్ర శ్లేషాలంకారః. ఈశ్వరో యజ్ఞ విద్యాఫలం జ్ఞాపయతి యుష్మాభిర్యథా వదనుష్ఠితో యజ్ఞః సూర్యస్య రశ్మిభిర్విహరతి స స్వకీయేన పవిత్రేణాచ్ఛిద్రేణ గుణేన సర్వాన్

**పదార్థాన్ పవిత్రయంతి. స చ తద్ ద్వారా సూర్యస్య రశ్మిభిస్తేజస్వినః శుద్ధానవృతరసాన్ సుఖహేతుకాన్ ప్రసన్నతాజనకాన్ దృఢాఙన్ యజ్ఞహేతూన్ పదార్థాన్ కరోతి. యంత స్తద్భోజనాచ్ఛాదనద్వారా వయం శరీరపుష్టివృద్ధిబలాదీన్ శుద్ధగుణాంశ్చ సంపాద్య నిత్యం సుఖయామ ఇతి. ౩౧.**

**పదార్థము:**- ఏ యజ్ఞము (సవితుః) పరమేశ్వరునిచేత (ప్రసవే) ఉత్పన్నము చేయబడిన ప్రపంచమున (అచ్ఛిద్రేణ) నిరంతరము (పవిత్రేణ) పవిత్రమును, ప్రకాశమయమును నగు (సూర్యస్య) సూర్యునియొక్క (రశ్మిభిః) కిరణములతో గలిసి సకల పదార్థములను శుద్ధమొనర్చుచున్నదో (త్వా) ఆ యజ్ఞమును లేక యజ్ఞకర్తను నేను (ఉత్పునామి) ఉత్కృష్టముగ పవిత్ర మొనర్చుచున్నాను. ఇదేవిధముగ (సవితుః ప్రసవే) పరమేశ్వరునిచే సృష్టించబడిన జగమున (అచ్ఛిద్రేణ) నిరంతరము (పవిత్రేణ) శుద్ధకారకములు (సూర్యస్య) ఐశ్వర్య హేతువులకు ప్రేరకులైన ప్రాణములయొక్క (రశ్మిభిః) అంతరాశయములను ప్రకాశింపజేయు గుణములను (వః) మిమ్ము మరియు ప్రత్యక్ష పదార్థములను యజ్ఞముద్వారా (ఉత్పునామి) పవిత్రమొనర్చుచున్నాను. హే బ్రహ్మన్! నీవు (తేజోఽసి) స్వయం ప్రకాశకుడవు (శుక్రమసి) పరిశుద్ధుడవు (అమృతమసి) నాశరహితడవు (ధామాసి) సర్వమున కాధారుడవు (నామాసి) వందన యోగ్యుడవు (దేవానామ్) విద్వాంసులకు (ప్రియమ్) ప్రీతికారకుడవు (అనాధృష్టమ్) ఎవ్వరికిని భయముజెందనివాడవు (దేవ యజనమసి) విద్వాంసులకు పూజనీయుడవునై యున్నావు. కావున నేను (త్వా) నిన్నే ఆశ్రయించుచున్నాను. **ఇది మొదటియర్థము.**

ఏ కారణముచే నీ యజ్ఞము (తేజోఽసి) ప్రకాశమును (శుక్రమసి) శుద్ధికి హేతువును (అమృతమసి) మోక్షానందప్రదయు (ధామాసి) సమస్త అన్నాదులను పుష్టియొనర్చునదియు (నామాసి) జలమునకు హేతువును (దేవానామ్) శ్రేష్ఠగుణములయందు (ప్రియమ్) ప్రీతిని గలిగింప జేయునదియు (అనాధృష్టమ్) ఎవరిచేతను ఖండింపబడజాలనంతటి సర్వోత్కృష్టమైనదియు (దేవయజనమ్) విద్వాంసులద్వారా పరమాత్మను పూజింపజేయునదియు (అసి) ఐ యున్నదో, ఆకారణముచే (సవితుః ప్రసవే) పరమేశ్వరునిచే నుత్పన్నముచేయబడిన యీ ప్రపంచమునందు (అచ్ఛిద్రేణ) నిరంతరము (పవిత్రేణ) అతిశుద్ధమగు యజ్ఞముతోను (సూర్యస్య రశ్మిభిః) ఐశ్వర్యములను సృష్టించు పరమేశ్వరుని విజ్ఞానము మున్నగు ప్రకాశమయ గుణములతోను, ఐశ్వర్యము నుత్పన్నముజేయు సూర్యుని కిరణములతోను (వః) మిమ్ము మరియు ప్రత్యక్షపదార్థములను (ఉత్పునామి) పవిత్ర మొనర్చుచున్నాను. **ఇది రెండవ యర్థము.** ॥౩౧॥

**భావార్థము :**-ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. పరమేశ్వరుడు మానవులెల్లరకొరకును యజ్ఞవిద్య యొక్క ఫలమును దెలియజేయుచున్నాడు. మీచే ననుష్ఠింపబడిన యజ్ఞము సూర్యకిరణములతో బాటు విహరించుచు నిరంతరము తన శుద్ధ గుణములతో సకల పదార్థములను పవిత్రమొనర్చుచున్నది. మరియు నది వానిద్వార పదార్థముల నన్నిటిని సూర్యకిరణములద్వారా తేజోవంతములుగను, శుద్ధ శ్రేష్ఠములగు రసయుక్తములుగను, సుఖకారకములుగను నొనర్చుచున్నది. కావున వానిని భోజన, ఆచ్ఛాదనకార్యములందు వినియోగించుటవలన శరీరపుష్టి, బుద్ధిబలము మున్నగు శుభగుణములు లభించుటచే సకల జీవులకు సుఖము గలుగుచున్నది. ॥౩౧॥

31. I consecrate the yajna, which purifies all objects with the flawless, pure rays of the sun. In this world created by the Great Lord, sanctify the hearts and souls of the people by the pure and ever soul-illuminating knowledge. O' Lord thou art the source of all light, pure, giver of the bliss of emancipation, the final resort of the universe' fit to be adored by the learned, loved by the sincere, fearless devotees, Invincible and worshipped by the sages!.

ఈశ్వరేణాస్మిన్నధ్యాయే మనుష్యాన్ ప్రతి శుద్ధకర్మానుష్ఠాతుం, దోషాన్ శత్రూంశ్చ నివారయితుం యజ్ఞక్రియా ఫలం జ్ఞాతుం, సమ్యక్పురుషార్థం కర్తుం విద్యా విస్తారయితుం ధర్మేణ ప్రజాః పాలయితుం ధర్మానుష్ఠానే నిర్భయతయా స్థాతుం సర్వైః సహ మిత్రతా మాచరితుం వేదాధ్యయనాధ్యాపనాభ్యాం సర్వా విద్యా గ్రహీతుం గ్రాహయితుం శుద్ధయే పరోపకారాయ చ ప్రయతితుమాజ్ఞా దత్తాస్తి సేయం సర్వైర్మనుష్యైర్యథావదనుష్ఠాతవ్యేతి.॥౩౧॥

ఈశ్వరుడు ఈ యధ్యాయమున శుద్ధకర్మల ననుష్ఠించుటకు, దోష నివృత్తికి, శత్రువుల దొలగించుటకు, యజ్ఞక్రియాఫలితమును దెలిసికొనుటకు, సమస్త పురుషార్థముల నొనర్చుటకు, విద్యను విస్తరింపజేయుటకు, ధర్మానుసారముగ ప్రజాపాలన మొనర్చుటకు, ధర్మానుష్ఠాన కార్యములందు నిర్భయముగ నిలబడుటకు, సకల జనులతో మిత్రత్వముగా నుండుటకు, వేదములు చదివి చదివించుటకై సమస్తవిద్యలను గ్రహించుటకు, గ్రహింపజేయుటకు, శుద్ధికొరకు, పరోపకారము కొరకై ప్రయత్నించుటకు ఆజ్ఞ నొసగి యున్నాడు. కావున నా యాజ్ఞ సకల మానవులకును అనుష్ఠింప యోగ్యమై యున్నది.

ఇతి శ్రీమత్పరివ్రాజకాచార్య శ్రీయుత దయానంద సరస్వతీస్వామినా సువిరచితే సంస్కృతార్యభాషావిభూషితే యజుర్వేదభాష్యే ప్రథమోఽధ్యాయః సంపూర్ణః.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి మొదటి అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యుల ద్వితీయపుత్రుడు,

శిష్యుడును నగు 'చతుర్వేదభాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన 'పం. లోకములహరి సిద్ధాంతాచార్యు'లచే నొనర్చబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య

మల్లెల కృష్ణారెడ్డి సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**మొదటి అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

# యజుర్వేదభాష్యము

## ద్వితీయాధ్యాయము - విషయసూచిక

ఇందులో 34 మంత్రములు, 44 ఛందస్సులు, 1807 అక్షరములు

# అథ ద్వితీయోऽధ్యాయః

## అస్మిన్నధ్యాయే చతుస్త్రింశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ, యద్భద్రం తన్న ఆసువ ॥య. 30.3॥

ఈశ్వరేణైతత్ సర్వమాద్యేऽధ్యాయే విధాయేదానీం ద్వితీయేऽధ్యాయే ప్రాణినాం సుఖాయోక్తార్థస్య సిద్ధిం కర్తుం విశిష్టా విద్యాః ప్రకాశ్యన్తే ॥

౩౨. కృష్ణోऽసీత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిరృషిః. యజ్ఞో దేవతా. నిచృత్పంక్తిశ్ఛన్దః. పఞ్చమః స్వరః. తత్రాదౌ వేద్యాదిరచనముపదిశ్యతే.

పరమేశ్వరుడు ప్రాణుల సుఖము కొరకు మొదటియధ్యాయమున ప్రకాశపరచిన విద్యలను సిద్ధింపజేయుటకై విశేషవిద్యలను ఈ రెండవ యధ్యాయమున ప్రకాశపరచినాడు. వానిలో వేదికాది పదార్థములను నిర్మించు క్రియాకౌశలముతో బాటు ఆ యా విద్యల విధానమును ప్రకాశపరచినాడు.

అందు మొదటిమంత్రమున యజ్ఞసిద్ధికి సాధనములను, నిమిత్తములను వివరించెను.

౩౨ కృష్ణోऽస్యాఖరేష్ఠోऽగ్నయే త్వా జుష్టం ప్రోక్షామి వేదిరసి బర్హిషే త్వా జుష్టాం ప్రోక్షామి బర్హిరసి స్రుగ్భ్యస్త్వా జుష్టం ప్రోక్షామి ॥౧॥

ప. వి:- కృష్ణః, అసి, ఆఖరేష్ఠః, ఆఖరేష్ఠ ఇత్యాఖరే+స్థః, అగ్నయే, త్వా, జుష్టమ్, ప్ర+ఉక్షామి, వేదిః, అసి, బర్హిషే, త్వా, జుష్టామ్, ప్ర+ఉక్షామి, బర్హిః, అసి, స్రుగ్భ్య ఇతి స్రుక్+భ్యః, త్వా, జుష్టమ్, ప్ర+ ఉక్షామి.॥౧॥

పదార్థః :-(కృష్ణః) అగ్నినా ఛిన్నో వాయునాऽకర్షితో యజ్ఞః (అసి) భవతి. అత్ర సర్వత్ర వ్యత్యయః. (ఆఖరేష్ఠః) సమన్తాత్ఖనతి యం తస్మిన్ తిష్ఠతీతి సః. ఖనోడడరేకే కవకాః. అ.3. 3.౧౨౫ అనేన వార్త్తికేనాऽऽఖరః సిధ్యతి. (అగ్నయే) హవనార్థాయ. (త్వా)తద్ధవిః. (జుష్టమ్) ప్రీత్యా సంశోధితమ్. (ప్రోక్షామి) శోధితేన ఘృతాదినాऽర్ద్రీ కరోమి. (వేదిః) విన్దతి సుఖాన్యనయా సా. (అసి) భవతి. (బర్హిషే) అన్తరిక్షగమనాయ. బర్హిరిత్యన్తరిక్షనామసు పఠితమ్. నిఘం. ౧. 3. (త్వా) తాం వేదిమ్. (జుష్టామ్) ప్రీత్యా సంపాదితామ్. (ప్రోక్షామి) ప్రకృష్టతయా ఘృతాదినా సించామి. (బర్హిః) శుద్ధముదకమ్. బర్హిరిత్యుదకనామసు పఠితమ్,

విఘం. ౧. ౧౨ (అసి) భవతి. (స్రుగ్భ్యః) స్రావయన్తి గమయన్తి హవిర్యేభ్యస్తేభ్యః. అత్ర స్రుగతావిత్యస్మాత్. చిక్ చ. ఉ. ౨. ౬౧. అనేన చిక్ ప్రత్యయః. (త్వా) తత్, (జుష్టమ్) పుష్ట్యాదిగుణయుక్తం ప్రీతికరం జలం పవనం వా. (ప్రోక్షామి) శోధయామి. అయం మంత్రః. శ. ౧.3.3. ౧-3 వ్యాఖ్యాతః.॥౧॥

అన్వయః :-యతో౽యం యజ్ఞ ఆఖరేష్ఠః కృష్ణో [౽సి] భవతి తస్మాత్త్వా తమహమగ్నయే జుష్టం ప్రోక్షామి. యత ఇయం వేదిరన్తరిక్షస్థాసి భవతి తస్మాదహం త్వా తామిమాం బర్హిషే జుష్టాం ప్రోక్షామి. యత ఇదం బర్హిరుదకమన్తరిక్షస్థం సచ్ఛుద్ధికారి [అసి] భవతి తస్మాత్త్వా తచ్ఛోధితం జుష్టం హవిః స్రుగ్భ్యో౽హం ప్రోక్షామి. ॥౧॥

భావార్థః:-ఈశ్వర ఉపదిశతి సర్వైర్మనుష్యై ర్వేదిం రచయిత్వా పాత్రాది సామగ్రీం గృహీత్వా సమ్యక్ శోధయిత్వా తద్ధవిరగ్నౌ హుత్వా కృతో యజ్ఞః శుద్ధేన వృష్టిజలేన సర్వా ఓషధీః పోషయతి. తేన సర్వేప్రాణినో నిత్యం సుఖయితవ్యా ఇతి.॥౧॥

పదార్థము :-ఈ యజ్ఞము (ఆఖరేష్ఠః) వేదికరచనావిధానముచే త్రవ్వబడిన స్థానమున స్థిరమై (కృష్ణః అసి) భౌతికాగ్నిచే సూక్ష్మరూపమై వాయుగుణములచే నాకర్షితమగుచున్నది. కావున నేను (అగ్నయే) భౌతికాగ్నియందు హవనమొనర్చుటకు (జుష్టమ్) ప్రీతిచే శుద్ధపరచబడిన (త్వా) ఆ యజ్ఞపు హవనసామగ్రిని (ప్రోక్షామి) ఘృతాదిపదార్థములచే సేచన మొనర్చి [తడిపి] శుద్ధపరచెదను. మరియు నే కారణమున ఈ (వేదిః) అంతరిక్షమున స్థితమైన వేదిక (అసి) ఐనదో, దానిచే నేను (బర్హిషే) హోమమొనర్చిన పదార్థము [సారము]లను అంతరిక్షమునకు చేర్చుటకు (జుష్టామ్) ప్రియముగా సంపాదించినట్టి (త్వా) ఆ వేదికను (ప్రోక్షామి) ఉత్తమరీతిలో ఘృతాది పదార్థములతో సేచనమొనర్చెదను. కావుననే నిది(బర్హిః) జలరూపమున అంతరిక్షమందు స్థిరమై పదార్థములను శుద్ధపరచునది (అసి) యగును. దీనిచే (త్వా) దాని శుద్ధికొరకు శుద్ధమొనర్చబడినదియు (జుష్టమ్) పుష్టి మున్నగు గుణముల నుత్పన్నమొనర్చునదియు నగు హవిస్సును నేను (స్రుగ్భ్యః) స్రుక్కు-స్రువలు మున్నగు సాధనములచే అగ్నియందు వేయుటకై (ప్రోక్షామి) శుద్ధి యొనర్తును. ॥౧॥

**భావార్థము** :- ఈశ్వరుడు ఉపదేశమొనర్చుచున్నాడు - ఏమన:- మానవులెల్లరును వేదికను నిర్మించి స్రువలు, పాత్రలు మున్నగు హోమసామగ్రిని దీసికొని ఆ హవిని బాగుగా శుద్ధపరచి, అగ్నియందు హోమమొనర్చి చేయబడినయజ్ఞము శుద్ధమైనజలముతో సమస్త ఓషధులను పోషించి పెంచుచున్నది. కావున అట్టి యజ్ఞానుష్ఠానములచే సర్వప్రాణులకు సదా సుఖమొనర్చుట మానవులకు పరమధర్మమై యున్నది. ॥౧॥

1. Oh yajna, thou art being performed in a well. Dug place, thou art rarefied by fire and attracted by the air. For the sake of Havan I consecrate the oblation agreeably rectified by ghee. Thou art an altar for taking the oblations high up into the space; I erect thee and consecrate thee with ghee. Just as water in the space contributes to the purification of the material objects, so do I carefully cleanse the oblations to be put into the fire ladles!

33. అదిత్యా ఇత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞో దేవతా. స్వరాడ్ జగతీ ఛన్దః. నిషాదః స్వరః.

ఏవం కృతో యజ్ఞః కిం హేతుకో భవతీత్యుపదిశ్యతే.

ఈ విధముగ నొనర్చబడిన యజ్ఞము ఏ యే దానిని సిద్ధింపజేయునదై యుండునో ఈ మంత్రమునం దుపదేశింపబడుచున్నది.

33 అదిత్యై వ్యున్దనమసి విష్ణో స్తుపోఽసూర్ణమ్రదసం త్వా స్తృణామి స్వాసస్థాం దేవేభ్యో భువపతయే స్వాహా భువనపతయే స్వాహా భూతానాంపతయే స్వాహా ॥౩౩॥

ప.వి:- అదిత్యై, వ్యున్దనమితి వి+ ఉన్దనమ్, అసి, విష్ణోః, స్తుపః, అసి, ఊర్ణమ్రదస మిత్యూర్ణ+మ్రదసమ్, త్వా, స్తృణామి, స్వాసస్థామితి సు+ఆసస్థామ్, దేవేభ్యః, భువపతయ ఇతి భువ+పతయే, స్వాహా, భువనపతయ ఇతి భువన+పతయే, స్వాహా, భూతానామ్, పతయే, స్వాహా.॥౩౩॥

పదార్థః:- (అదిత్యై) పృథివ్యాః అత్ర చతుర్థ్యర్థే బహులం ఛన్దసి. అ. ౨. ౩. ౬౨. ఇతి [సూత్రస్థేన 'షష్ఠ్యర్థే చతుర్థీ' ఇతి వార్తికేన] షష్ఠ్యర్థే చతుర్థీ. (వ్యున్దనమ్) వివిధానా మోషధ్యాదీనాముఉన్దనం క్లేదనం యేన తత్. (అసి) భవతి. అత్ర సర్వత్ర వ్యత్యయః. (విష్ణోః) యజ్ఞస్య (స్తుపః) శిఖా. యజ్ఞో వై విష్ణుస్తస్యైయమేవ శిఖా స్తుపః. శ. ౧.౩.౩.౫॥ (అసి) అస్తి. (ఊర్ణమ్రదసమ్) ఊర్ణాని ధాన్యాచ్ఛాదనాని తుషాణి మ్రదయతి యేన తం పాషాణ మయమ్ (త్వా) తమ్ (స్తృణామి) ఆచ్ఛాదయామి. (స్వాసస్థామ్) సుష్ఠు ఆసాః ప్రక్షిప్తాస్తిష్ఠన్తి యస్యాం సా వేదిస్తామ్. అత్ర ఘఞర్థేకవిధానం [స్థాస్నాపావ్యధిహనియుధ్యర్థం] అ.3.3.౫౮ ॥ ఇతి వార్తికేన 'కః' ప్రత్యయః. (దేవేభ్యః)విద్వద్భ్యో దివ్యసుఖేభ్యో వా (భువపతయే) భవన్త్యుత్పద్యన్తే భూతాని యస్మిన్ సంసారే తస్య పతిస్తస్మై జగదీశ్వరాయ. ఆహవనీ యాఖ్యాగ్నయే వా. అత్ర బాహులకా దుణాది ధాతో రౌణాదికః 'కః' ప్రత్యయః; (స్వాహా) సత్యభాషణయుక్తా వాక్. స్వాహేతి వాఙ్నామసు పఠితమ్, నిఘం. ౧, ౧౧. స్వాహా శబ్దస్యార్థం

నిరుక్తకార ఏవం సమాచష్టే. స్వాహాకృతయః స్వాహేత్యేతత్సు ఆహేతి వా, స్వా వాగాహేతి వా, స్వం ప్రాహేతి వా స్వాహుతం హవిర్జుహోతీతి వా. నిరు. ర. ౨౦॥ యత్ శోభనం వచనం, సత్యకథనం, స్వపదార్థాన్ ప్రతి మమత్వవచో మంత్రోచ్చారణేన హవనం చేతి స్వాహాశబ్దార్థా విజ్ఞేయాః, (భువనపతయే) భువనానాం సర్వేషాం లోకానాం పతిః. పాలక ఈశ్వరః. పాలన హేతుర్భౌతికో వా తస్మై, (స్వాహా) ఉక్తార్థః. (భూతానాం పతయే) భూతాన్యుత్పన్నాని యావన్తి వస్తూని సన్తి తేషాం యః పతిః స్వామీశ్వర ఐశ్వర్యహేతుర్భౌతికో వా తస్మై (స్వాహా) ఉక్తార్థః. అయం మంత్రః, శ. ౧.౩.౩. ౪-౨౦. వ్యాఖ్యాతః॥౨ ॥

అన్వయః:-యతోఽయం విష్ణుర్యజ్ఞోఽ[దిత్యాః] దిత్యా వ్యున్దన కార్యసి భవతి, తస్మాత్తమహమను తిష్ఠామి. అస్య విష్ణోర్యజ్ఞస్య స్తుపః ప్రస్తర ఉలూఖలాఖ్యః సాధకోఽస్త్యస్తి, తస్మాత్త మహ మూర్ణమ్రదసం స్తృణామి. వేదిర్దేవేభ్యో హితాసి భవతి తస్మాత్త్వామహం స్వాసస్థాం రచయామి. కస్మై ప్రయోజనాయేత్యత్రాహ. యతోఽయం భువపతి ర్భువనపతి ర్భూతానాం పతిరీశ్వరః ప్రసన్నో భవతి. భౌతికో వా. సుఖసాధకో భవతి. తస్మై భువపతయే స్వాహా విధేయా, భువనపతయే స్వాహా వాచ్యా, భూతానాం చ పతయే స్వాహా ప్రయోజ్యా భవతీత్యస్మై ప్రయోజనాయ ॥౨॥

భావార్థః:-ఈశ్వరః సర్వమనుష్యేభ్య ఇదముపదిశతి యుష్మాభిర్వేద్యాదీని యజ్ఞసాధనాని సంపాద్య సర్వప్రాణినాం సుఖాయ పరమేశ్వరప్రీతయే చ సమ్యక్ క్రియాయజ్ఞః కార్యః. సదైవ సత్యమేవ వాచ్యమ్. యథాఽహం న్యాయేన సర్వం విశ్వం పాలయామి, తథైవ యుష్మాభిరపి పక్షపాతం విహాయ సర్వేషాం పాలనేన సుఖం సంపాదనీయమితి ॥౨॥

పదార్థము :-ఈ యజ్ఞము (అదిత్యై) పృథివిపైనున్న (వ్యున్దనమ్ అసి) అనేక విధములగు ఓషధులు మున్నగు పదార్థములను సేచనమొనర్చునదై యున్నది. కావుననే నేను దాని ననుష్ఠించుచున్నాను. మరియు (విష్ణోః) ఈ యజ్ఞమునసిద్ధపరమునది (స్తుపః) శిఖారూపముగ నున్న శిల (ఊర్ణమ్రదసమ్) ఉలూఖలము [రోలు] స్త్రై (అసి) ఉన్నది. కావున నేను (త్వా) ధాన్యపుపొట్టు [ఊకను] వేరుపరచెడు రోటిని (స్తృణామి) పదార్థములచే కప్పుచున్నాను. వేదికయును (దేవేభ్యః) విద్వాంసులకు హితమును మరియు దివ్యసుఖములను కలుగజేసెడిది (అసి) అగుచున్నది. కావున నేను (స్వా సస్థామ్) దేనియందు హోమముచేయబడిన పదార్థములు బాగుగ స్థిరమై యుండగలుగుచున్నవియో, దేనివలన (భువపతి) లోక లోకాంతరముల పతియు, ప్రాపంచిక పదార్థములకు స్వామియు నైన పరమేశ్వరుడు ప్రసన్నుడు కాగలడో మరియు దేనివలన భౌతికాగ్ని సౌఖ్యములను గలుగ జేయునదిగా నగుచున్నదో అట్టి యజ్ఞవేదికను నిర్మించుచున్నాను. కనుక (భువపతయే స్వాహా, భువనపతయే స్వాహా, భూతానాం పతయే స్వాహా) పైన పేర్కొనబడిన పరమేశ్వరుని ప్రసన్నపరచుటకు మరియు నాతని ఆజ్ఞను పాలించుటకు, సత్యభాషణము అనగా తనవానినే తనవియని చెప్పుకొనుటకు శ్రేష్ఠవాక్యములు, ఉత్తమవాణియు

కలిగియున్న వేదమంత్రములతోపాటు స్వాహా శబ్దము ననేక విధములుగ నుచ్చరించి యజ్ఞము మున్నగు శ్రేష్ఠకర్మల విధానమొనర్చు ప్రయోజనముల నిమిత్తము నేను వేదిని నిర్మింతును.॥౨॥

**భావార్థము :-** పరమేశ్వరుడు సమస్త మానవుల నిమిత్తమై ఇట్లుపదేశించుచున్నాడు. ఓ మానవులారా! మీరు వేదిక మున్నగు యజ్ఞసాధనములను సంపాదించి సకలప్రాణుల సుఖమునకై మరియు పరమేశ్వరుని ప్రసన్నతకై క్రియామయమగు యజ్ఞమును చక్కగా నొనర్చవలయును. సదా సత్యమునే పలుకవలయును. న్యాయముగా నేను విశ్వమంతటిని పాలించుచున్నటులే మీరును పక్షపాతరహితులై సకల ప్రాణులను పాలించుచు సుఖసంపదలను వృద్ధిపరచుకొనుచుండవలయును. ॥౨॥

2. Yajna showers water on the Earth. Mortar is the chief receptacle of the Yajna. I prepare the altar for the learned to sit on. May those scholars sing the praises of God, the Earth's Lord, the World's Lord, the Lord of Kings.

౩౪. గంధర్వస్త్వేత్యస్య ఋషిః స ఏవ, అగ్ని ర్దేవతా సర్వస్య, ఆద్యస్య భురిగార్షీ త్రిష్టుప్ ఛన్దః. ధైవతః స్వరః. మధ్యభాగస్య[భురిగ్] ఆర్షీ పంక్తిశ్ఛన్దః, అన్త్యస్య పంక్తి శ్ఛన్దః. ఉభయత్ర పంచమః స్వరః.

స యజ్ఞోఽగ్న్యాదిభి ర్ధార్యత ఇత్యుపదిశ్యతే.

ఆ యజ్ఞము అగ్న్యాది పదార్థములచే ధారణమొనర్చబడుచున్నదని ఈ మంత్రముద్వారా ఉపదేశించినాడు.

౩౪ గన్ధర్వస్త్వా విశ్వావసుః పరిదధాతు విశ్వస్యారిష్ట్యై యజమానస్య

పరిధిరస్యగ్ని రిడఽఈడితః। ఇన్ద్రస్య బాహురసి దక్షిణో

విశ్వస్యారిష్ట్యై యజమానస్య పరిధిరస్యగ్నిరిడఽ ఈడితః।

మిత్రావరుణౌ త్వోత్తరతః పరి ధత్తాన్ధ్రువేణ ధర్మణా

విశ్వస్యారిష్ట్యై యజమానస్య పరిధిరస్యగ్నిరిడఽఈడితః॥౩॥

**ప.వి:-** గన్ధర్వః, త్వా, విశ్వావసుః, విశ్వావసురితి విశ్వ+వసుః, పరి, దధాతు, విశ్వస్య, అరిష్ట్యై, యజమానస్య, పరిధిరితి పరి+ధిః, అసి, అగ్నిః, ఇడః ఈడితః, ఇన్ద్రస్య, బాహుః, అసి, దక్షిణః, విశ్వస్య, అరిష్ట్యై, యజమానస్య, పరిధిరితి పరి+ధిః, అసి, అగ్నిః, ఇడః,

ఈడితః, మిత్రావరుణౌ, త్వా, ఉత్తరతః, పరి, ధత్తామ్, ధ్రువేణ, ధర్మణా, విశ్వస్య, అరిష్ట్యై, యజమానస్య, పరిధిరితి పరి+ధిః, అసి, అగ్నిః, ఇడః, ఈడితః.॥3॥

పదార్థః-(గన్ధర్వః) యో గాం పృథివీం వాణీం వా ధరతి ధారయతి వా స గన్ధర్వః సూర్యలోకః. (త్వా) తమ్. (విశ్వావసుః) విశ్వం వాసయతి యః సః. (పరి) సర్వతోభావే, (దధాతు) దధాతి వా. అత్ర లడర్థేలోట్. (విశ్వస్య) సర్వస్య జగతః. (అరిష్ట్యై) దుఃఖనివారణేన సుఖాయ. (యజమానస్య) యజ్ఞానుష్ఠాతుః (పరిధిః) పరితః సర్వతః సర్వాణి వస్తూని ధీయన్తే యేన సః. (అసి) భవతి. అత్ర చతుర్షు ప్రయోగేషు పురుషవ్యత్యయః. (అగ్నిః)(ఇడః) స్తోతుమర్హః. అత్ర వర్ణవ్యత్యయేన హ్రస్వాదేశః. (ఈడితః) స్తుతః (ఇన్ద్రస్య) సూర్యస్య (బాహుః) బలం బలకారీ వా. (అసి) అస్తి.(దక్షిణః) వృష్టేః ప్రాపకః. దక్షధాతోర్గత్యర్థత్వాదత్ర ప్రాప్త్యర్థో గృహ్యతే, (విశ్వస్య) సర్వప్రాణిసమూహస్య. (అరిష్ట్యై) సుఖాయ (యజమానస్య) శిల్పవిద్యాం చికీర్షోః. (పరిధిః) విద్యాపరిధానమ్ (అసి) భవతి. (అగ్నిః) విద్యుత్ (ఇడః) దాహప్రకాశాది గుణాధిక్యేన స్తోతుమర్హః. (ఈడితః) అధ్యేషితః. (మిత్రావరుణౌ) విశ్వస్య ప్రాణాపానౌ. ప్రాణో వై మిత్రోఽపానో వరుణః శ. ౧.౨.౪.౬. (త్వా) తమ్. (ఉత్తరతః) ఉత్తరకాలే, (పరిధత్తామ్) సర్వతో ధారయతో వా. అత్ర లడర్థే లోట్, (ధ్రువేణ) నిశ్చలేన (ధర్మణా), స్వాభావికధారణశక్త్యా (విశ్వస్య) చరాచరస్య (అరిష్ట్యై) సుఖహేతవే, (యజమానస్య) సర్వమిత్రస్య. (పరిధిః) విద్యావధిః (అగ్నిః) ప్రత్యక్షో భౌతికః (ఇడః) విద్యాప్రాప్తయే స్తోతుమర్హః (ఈడితః) విద్యామీప్సుభిః సమ్యగధ్యేషితవ్యః. అయం మంత్రః. శ.౧.౩.౪.౧-౫ వ్యాఖ్యాతః.॥3॥

అన్వయః :- విద్వద్భిర్యోఽయం గన్ధర్వో విశ్వావసురిడోఽగ్ని రీడితో ఽస్యస్తి స విశ్వస్య యజమానస్య చారిష్ట్యై యజ్ఞం పరిదధాతి తస్మాత్[త్వా]తం విద్యాసిద్ధ్యర్థం మనుష్యో యథావత్ పరిదధాతు. విదుషా యో వాయురిన్ద్రస్య బాహుర్దక్షిణః పరిధిరిడ ఈడితోఽగ్నిశ్చాస్యస్తి స సమ్యక్ ప్రయోజితో యజమానస్య విశ్వస్యారిష్ట్యై [అసి] భవతి. యౌ బ్రహ్మణ్డస్థౌ గమనాగమనశీలౌ మిత్రావరుణౌ ప్రాణాపానౌ స్తస్తౌ ధ్రువేణ ధర్మణోత్తరతో విశ్వస్య యజమానస్యారిష్ట్యై తం యజ్ఞం పరిధత్తాం సర్వతో ధారయతః. యో విద్వద్భిరిడః పరిధిరీడితోఽగ్నిర్విద్యుదస్తి సోఽపీమం యజ్ఞం సర్వతః పరిదధాత్యేతాన్మనుష్యో యథాగుణం సమ్యగ్ధధాతు ॥3॥

**భావార్థః** :-ఈశ్వరేణ యః సూర్యవిద్యుత్ప్రత్యక్షరూపేణ త్రివిధోऽగ్నిర్నిర్మితః స మనుష్యైర్విద్యయా సమ్యగ్యోజితః సన్ బహూని కార్యాణి సాధయతీతి ॥3॥

**పదార్థము** :-విద్వాంసులు (గన్ధర్వః) పృథివి, లేక వాణిని ధరింపజేయునదియు (విశ్వావసుః) విశ్వమును నివసింపజేయునదియు (ఇడః) స్తుతించదగినదియు నగు (అగ్నిః) ఏ సూర్యరూపాగ్నిని (ఈడితః) స్తుతించుచు (అసి) ఉందురో, అట్టి యగ్ని (విశ్వస్య) లోకముయొక్క [విశేషించి] (యజమానస్య) యజ్ఞమొనర్చెడి విద్వాంసులయొక్క (అరిష్ట్యై) దుఃఖములను నివారణమొనర్చి సుఖముల లభింపజేయుటకై ఈ యజ్ఞమును (పరిదధాతు) ధరించుచున్నది.కావున దానిని విద్వాంసులు విద్యాసిద్ధికొరకు ధరించెదరుగాక! మరియు నే వాయువు (ఇన్ద్రస్య) సూర్యుని (బాహుః) బలమును (దక్షిణః) వర్షమును లభింపజేయునవియు (పరిధిః) శిల్పవిద్యను ధరింపజేయునదియునై యున్నదో (ఇడః) దాహప్రకాశాది గుణములు గలిగియుండుటచే స్తుతింపదగినదియు (ఈడితః) [విద్వాంసులచే] అన్వేషించబడినదియు నగు (అగ్నిః) ఏ ప్రత్యక్షాగ్ని (అసి)కలదో,ఆ వాయువు అగ్ని రెండును విద్వాంసులచే బాగుగ శిల్పవిద్యలం దుపయోగించబడినదై (యజమానస్య) శిల్పవిద్యలనుకోరు యజమానికి (విశ్వస్య) సమస్తప్రాణులకు (అరిష్ట్యై)సౌఖ్యముల గలిగించునవి (అసి) అగుచున్నవి. మరియు గమనాగమన స్వభావములు గలవియు బ్రహ్మాండస్థములును నగు (మిత్రావరుణౌ) ఏ ప్రాణాపానవాయువులు గలవో యవి (ధ్రువేణ) నిశ్చలమైన (ధర్మణా) తమ ధారణాశక్తిచేతను, పూర్వముదెలిపిన వాయ్వగ్నులచేతను (ఉత్తరతః)నిరంతరము జరుగు కాలమున [ముమ్మందు, ఆపై జరుగు కాలమున] (విశ్వస్య) చరాచరజగత్తునకు, (యజమానస్య) సకల ప్రాణులందు మిత్రభావముతో మెలగెడు సజ్జనులకు (అరిష్ట్యై) సౌఖ్యములను సమకూర్చుటకు (త్వా) అట్టి పూర్వోక్త యజ్ఞమును (పరిధత్తామ్) సర్వవిధములుగ ధరించుచుండెను. మరియు విద్వాంసులచే (ఇడః) విద్యాప్రాప్తికై ప్రశంసించదగినట్టిదియు (పరిధిః) ఆవరించి, చుట్టుముట్టి సమస్త శిల్పవిద్యల సిద్ధులకు మేరయై యున్నట్టి (ఈడితః) విద్యాభిలాషులచే ప్రశంసలనందుచున్నట్టియు (అగ్నిః) ఏ విద్యుత్‌రూపాగ్ని (అసి) కలదో అదియును నీ యజ్ఞమును సకల విధములుగ ధరించుచున్నది. కావున వీని గుణములను మానవులు యథావిధిగ తెలిసికొని ప్రయోజనమొనర్చుకొందురు గాక! ॥3॥

**భావార్థము** :-పరమేశ్వరుడు సూర్యుడు, విద్యుత్తు, భౌతికాగ్ని యనునిట్టి ముప్విధ అగ్నులను సృష్టించి యున్నాడో అవి విద్వాంసులచే శిల్పవిద్యాదులద్వారా యంత్రాదులందు విరివిగా నుపయోగించుకొనబడినవియై అనేక కార్యములను సాధించునవి యగుచున్నవి. ॥3॥

3. The sun, the sustainer of the world and the holder of the earth, spreads the yajna far and wide for the hapiness of the universe. Adorable fire, being adored in the yajna, thou art the guardian of the worshipper. O yajna thou art the inducer of rain through the power of sun for the happiness of the universe. Adorable fire, being adored in the yajna, thou art the guardian of the worshipper. Inhalation and exhalation, for the happiness of the universe, protect thee (yajna) with firm strength every now and then. Adorable fire, being adored in the yajna, thou art the protector of the worshipper!

3॥ వీతిహోత్ర మిత్యస్య ఋషిః స ఏవ. అగ్ని ర్దేవతా. నిచృత్ గాయత్రీ ఛన్దః. షడ్జః స్వరః.

అథాగ్నిశబ్దేనోభావార్థావుపదిశ్యేతే.

ఇవు దగ్ని శబ్దముతో చెప్పబడిన రెండర్థములను ఈ మంత్రమున ప్రకాశ పరచెను.

3॥ వీతి హోత్రన్త్వా కవే ద్యుమన్తఀ సమీధీమహి। అగ్నే బృహన్తమధ్వరే ॥౪॥

ప.వి:- వీతిహోత్ర మితి వీతి+హోత్రమ్; త్వా, కవే, ద్యుమన్తమితి ద్యు+మన్తమ్, సమ్, ఇధీమహి, అగ్నే, బృహన్తమ్, అధ్వరే. ॥౪॥

పదార్థః:-(వీతిహోత్రమ్) వీతయో విజ్ఞాపితా హోత్రాఖ్యా యజ్ఞా యేనేశ్వరేణ. యద్వా వీతయః ప్రాప్తిహేతవో హోత్రాఖ్యా యజ్ఞక్రియా భవన్తి యస్మాత్తం పరమేశ్వరం భౌతికం వా. 'వీ' గతివ్యాప్తి ప్రజనకాన్త్యసన ఖాదనేషు. ఇత్యస్య రూపమ్. (త్వా) త్వాం తం వా. అత్ర పక్షే వ్యత్యయః. (కవే) సర్వజ్ఞ క్రాంతప్రజ్ఞ, కవిం క్రాన్తదర్శనం భౌతికం వా. (ద్యుమన్తమ్) ద్యౌర్బహుప్రకాశో విద్యతే యస్మిఀ స్తమ్. అత్ర భూమ్న్యర్థే మతుప్ (సమ్) సమ్యగర్థే. (ఇధీమహి) ప్రకాశయేమహి. అత్ర బహులం ఛన్దసీతి శ్నమోలుక్ (అగ్నే) జ్ఞానస్వరూపేశ్వర ప్రాప్తిహేతుం భౌతికం వా । (బృహన్తమ్) సర్వేభ్యో మహాన్తం సుఖవర్ధకమీశ్వరం బృహతాం కార్యాణాం సాధకం భౌతికం వా (అధ్వరే) మిత్రభావే ఽహింసనీయే యజ్ఞే వా. అయం మంత్రః, శ. ౧.౩.౪,౬ వ్యాఖ్యాతః.॥ ౪ ॥

అన్వయః:-హే కవే అగ్నే జగదీశ్వర! వయమధ్వరే బృహన్తం ద్యుమన్తం వీతిహోత్రం త్వాం సమిధీమహీత్యేకః. వయమధ్వరే వీతిహోత్రం ద్యుమన్తం బృహన్తం కవే కవిం త్వా తమగ్నే భౌతిక మగ్నిం సమిధీమహీతి ద్వితీయః ॥ ౪॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. యావన్తి క్రియాసాధనాని క్రియయా సాధ్యాని చ వస్తూని సంతి తాని సర్వాణీశ్వరేణైవ రచయిత్వా ధ్రియంతే మనుష్యైస్తేషాం సకాశాత్ గుణజ్ఞానక్రియాభ్యాం బహవ ఉపకారాః సంగ్రాహ్యాః.॥౪॥

**పదార్థము** :-(కవే) ఓ సర్వజ్ఞా! ప్రతిపదార్థమును గురించి సంపూర్ణ జ్ఞానముగలవాడా! (అగ్నే) జ్ఞానస్వరూపుడవగు నో పరమేశ్వరా! మేము (అధ్వరే) మిత్రభావముతో నుండి (బృహన్తమ్) సమస్తప్రాణులకు అపరిమితసుఖములను పెంపొందింపజేయు (ద్యుమన్తమ్) మిక్కిలి ప్రకాశముకలిగినట్టి (వీతిహోత్రమ్) అగ్నిహోత్రము మున్నగు యజ్ఞములనుతెలియజేయునట్టి (త్వా) నిన్ను (సమిధీమహి) బాగుగా ప్రకాశపరచెదముగాక! ఈ మంత్రమున కిది మొదటి యర్థము.

(అధ్వరే) అహింసనీయమును, ఎప్పుడును పరిత్యజింపబడగూడనిదియు ఉత్తమయజ్ఞమున (వీతిహోత్రమ్) సకల పదార్థముల ప్రాప్తిని గలిగించు అగ్నిహోత్రము మున్నగు క్రియలను సిద్ధింపజేయునట్టియు (ద్యుమన్తమ్) ప్రచండ జ్వాలలతో గూడిన (బృహన్తమ్) మహాగొప్పకార్యములను సిద్ధింపజేయునదియు (కవే) పదార్థములయందు అనుక్రమముగా దృష్టిగోచరముగునట్టియు (త్వా) అట్టి (అగ్నే) భౌతికాగ్నిని (సమిధీమహి) మేము ప్రజ్వలింపజేయుదుముగాక! ఇది రెండవయర్థము. ॥౪॥

భావార్థము :- ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. ప్రపంచమునందు గల క్రియాసాధనములు మరియు క్రియలతో సిద్ధమగు పదార్థములన్నిటిని ఈశ్వరుడే నిర్మించి చక్కగా ధరించియున్నాడు. కావున మానవులు వాని సహాయమువలనను, గుణజ్ఞానమువలనను ఉత్తమోత్తమక్రియల అనుకూలతతో అనేక విధములగు ఉపకారములను పొందుచుండవలెను. ॥౪॥

4. May we, in a friendly spirit, manifest Thy glory Oh Omniscient, All illumining God, the Giver of great happiness to all, the Embodiment of effulgence, and the Preacher of the yajnas!.

౩౬ సమిద సీత్యస్య ఋషిః స ఏవ. యజ్ఞో దేవతా. నిచృద్ బ్రాహ్మీ బృహతీ ఛన్దః. మధ్యమః స్వరః.

పున స్తస్య యజ్ఞస్య సాధకాన్యుపదిశ్యన్తే ॥

మరల పై యజ్ఞసాధనములను గూర్చి యీ మంత్రమున ఉపదేశించెను.

౩౬ సమిదసి సూర్యస్త్వా పురస్తాత్ పాతు కస్యాశ్చిదభిశస్త్యై। సవితు

ర్బాహూ స్థఽఊర్ణమ్రదస న్త్వా స్తృణామి స్వాసస్థ న్దేవేభ్యఽ

ఆ త్వా వసవో రుద్రాఽ ఆదిత్యాః సదన్తు ॥౫॥

ప. వి:- సమిదితి సమ్+ఇత్, అసి, సూర్యః, త్వా, పురస్తాత్, పాతు, కస్యాః, చిత్, అభిశస్త్యా ఇత్యభి+శస్త్యై, సవితుః, బాహూఽ ఇతి బాహూ, స్థః, ఊర్ణమ్రదసమిత్యూర్ణ +మ్రదసమ్, త్వా, స్తృణామి, స్వాసస్థమితి సు+ఆసస్థమ్, దేవేభ్యః, ఆ, త్వా, వసవః, రుద్రాః, ఆదిత్యాః సదన్తు. ॥౫॥

పదార్థః :- (సమిత్) సమ్యగిధ్యతేఽనయాఽనేన వా సా సమిదగ్నిప్రదీపకం కాష్ఠాదికం వసంత ఋతుర్వా (అసి) భవతి. అత్ర వ్యత్యయః (సూర్యః) సవితైశ్వర్యహేతుర్భవతి సోఽయం సూర్యలోకః. (త్వా) తమ్. (పురస్తాత్) పూర్వస్మాదితి పురస్తాత్ (పాతు) రక్షతి. అత్ర లడర్థే లోట్, (కస్యాః)కస్యై సర్వస్యై. అత్ర చతుర్థ్యర్థే బహులం ఛన్దసి, అ. ౨. ౩. ౬ ౨. ఇతి చతుర్థ్యర్థే షష్ఠీ, (చిత్) చిదిత్యుపమార్థే. నిరు. ౧-౪. (అభిశస్త్యై) అభిముఖ్యాయై స్తుతయే. శంసు స్తుతావిత్యస్య క్తిన్ ప్రత్యయాన్తః ప్రయోగః (సవితుః) సూర్యలోకస్య. (బాహూ)బలవీర్యాభ్యాం. (స్థః) స్తః. అత్ర వ్యత్యయః. (ఊర్ణమ్రదసమ్) ఊర్ణాని సుఖాచ్ఛాదనాని మ్రదయతి యేన తం యజ్ఞమ్. (త్వా) తమ్. (స్తృణామి) సామగ్ర్యాఽఽచ్ఛాదయామి. (స్వాసస్థమ్) శోభనే ఆసే ఉపవేశనే తిష్ఠతీతి తమ్. (దేవేభ్యః) దివ్యగుణేభ్యః. (ఆ) సమన్తాత్ క్రియాయోగే. (త్వా) తమ్. (వసవః) అగ్న్యాదయోఽష్టౌ. (రుద్రాః) ప్రాణాపానవ్యానోదానసమాన నాగకూర్మ కృకల దేవదత్తధనంజయాఖ్యా దశప్రాణా ఏకాదశో జీవశ్చేత్యేకాదశ రుద్రాః. (ఆదిత్యాః) ద్వాదశా మాసాః. కతమే వసవ ఇతి. అగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాంతరిక్షం చాదిత్యశ్చ ద్యౌశ్చ చన్ద్రమాశ్చ నక్షత్రాణి చైతే వసవ ఏతేషు హీదఀ సర్వం వసు హితమేతే హీదఀ సర్వం వాసయన్తే తద్యదిదఀ సర్వం వాసయన్తే తస్మాద్వసవ ఇతి. కతమే రుద్రా ఇతి. దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశస్తే యదాస్మాన్మర్త్యాచ్ఛరీరాదుత్క్రామన్త్యథ రోదయన్తి. తద్యద్రోదయన్తి తస్మాద్రుద్రా ఇతి. కతమ ఆదిత్యా ఇతి. ద్వాదశ మాసాః సంవత్సరస్యైత ఆదిత్యా ఏతే హీదఀ సర్వమాదదానా యన్తి యద్యదిదఀ సర్వమాదదానా యన్తి తస్మాదాదిత్యా ఇతి. శ. ౧౪.౬.౯.౪-౬॥ (సదన్తు) అవస్థాపయన్తి. షద్ ఇత్యస్య స్థానే వా ఇచ్ఛన్దసి సర్వే విధయో భవన్తీతి సీదాదేశాభావో లడర్థే లోట్ చ. అయం మంత్రః శ. ౧.౪.౧.౭-౧౨॥ వ్యాఖ్యాతః. ॥౫॥

అన్వయః :-చిత్ యథా కశ్చిన్మర్త్యః సుఖార్థం క్రియాసిద్ధాని ద్రవ్యాణి రక్షిత్వాఽఽవర్ధయతే, తథైవ యోఽయం యజ్ఞః సమిదసి [త్వా] భవతి తం సూర్యః కస్యా అభిశస్త్యై పురస్తాత్పాతు పాతి యౌ సవితు ర్బాహూ స్థః స్తో యో యాభ్యాం నిత్యం విస్తార్యతే [త్వా] తమూర్ణమ్రదసం స్వాసస్థం యజ్ఞం వసవో రుద్రా ఆదిత్యాః సదన్త్వవస్థాపయన్తి ప్రాపయన్తి [త్వా]తం యజ్ఞమహమపి సుఖాయ దేవేభ్య ఆస్తృణామి. ॥౫॥

భావార్థః :-అత్రోపమాలంకారః. ఈశ్వరః సర్వేభ్య ఇదముపదిశతి. మనుష్యైర్వసురుద్రాదిత్యాఖ్యేభ్యో యద్యదుపకర్తుం శక్యం తత్తత్సర్వస్యాభిరక్షణాయ నిత్యమనుష్ఠేయమ్. యోఽగ్నౌ ద్రవ్యాణాం ప్రక్షేపః క్రియతే స సూర్యం వాయుం వా ప్రాప్నోతి. తావేవ తత్పృథగ్భూతం ద్రవ్యం రక్షిత్వా పునః పృథివీం ప్రతి విముంచతః. యేన పృథివ్యాం దివ్యా ఓషధ్యాదయః పదార్థా జాయన్తే యేన చ ప్రాణినాం నిత్యం సుఖం భవతి తస్మాదేతత్సదైవానుష్ఠేయమితి. ॥ ౫॥

పదార్థము :- (చిత్) ఒకానొక మనుష్యుడు సుఖముల కొరకు క్రియలద్వారా సిద్ధపరచుకొనిన పదార్థములను కాపాడుకొని నిశ్చింతగా ఆనందము పొందుచుండునట్లు (సమిత్ అసి) వసంతఋతువువలె చక్కగా ప్రకాశించుచుండు ఏ యజ్ఞము గలదో (త్వా) దానిని (సూర్యః) సకల ఐశ్వర్యములకు హేతువగు సూర్యుడు (కస్యాః) సకలపదార్థములను (అభిశస్త్యై) ప్రకటపరచుటకు (పురస్తాత్) పూర్వమునుండియు (పాతు) రక్షించెడివా డగుచున్నాడు. (సవితుః) సూర్యలోకముయొక్క (బాహూ) ఏ బలవీర్యములు (స్థః) కలవో, వానిద్వారా ఈ యజ్ఞము విస్తరింపబడుచున్నదో (త్వా ) అట్టి (ఊర్ణమ్రదసమ్) అనేక సుఖములను వృద్ధియొనర్చు (స్వాసస్థమ్) ఉత్తమమగు అన్తరిక్షమున స్థిరమైయున్నదగు నే యజ్ఞమును (వసవః) వసువులు [అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, సూర్యుడు, ప్రకాశము, చంద్రుడు, తారాగణము మున్నగు అగ్న్యాద్యష్టవసువులును] (రుద్రాః) రుద్రులు [ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయ, జీవాత్మ అను నీ యేకాదశ రుద్రులు]ను (ఆదిత్యాః) ద్వాదశాదిత్యులు [పంద్రెడు నెలలు] ను (సదన్తు) పెంపొందింప జేయుచున్నవో (త్వా) అట్టి (ఊర్ణమ్రదసమ్) అనేక సుఖములను పెంపొందింప జేయునదియు (స్వాసస్థమ్) అంతరిక్షమున స్థిరముగ నుండునదియు నగు (త్వా) ఆ యజ్ఞమును నేను కూడా సుఖప్రాప్తికొరకు, లేక (దేవేభ్యః) దివ్యగుణములను సాధించుటకు (ఆ స్తృణామి) చక్కగా సామగ్రిచే కప్పివేసి సిద్ధింపజేయుచున్నాను. ॥౫॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారముద్వారా వివరించబడినదేమన; వసువులు, రుద్రులు, ఆదిత్యు లను నామములు గల వానిచే సిద్ధింపగల పదార్థము లన్నియును మానవులు సకల ప్రాణులను పాలించుట కొరకు సర్వథా సేవింపదగినవైయున్నవి. మరియు యజ్ఞాగ్నియం దే యే పదార్థముల ఆహుతులద్వారా హవనము చేయబడుచున్నదో అవి యన్నియును సూర్యవాయువులను పొందుచున్నవి. ఆ రవివాయువులే వేరు వేరైన ఆ పదార్థములను కాపాడి బలపరచి తిరిగి వానిని భూమిపైకి వదలుచున్నవి. దానివలన ఈ భూమిపై దివ్యమగు ఓషధులు మున్నగు పదార్థములు జనించుచున్నవి. వాని వలన జీవులకు నిత్యసుఖము గలుగుచున్నది. కావున మానవు లెల్లరును ఈ యజ్ఞము నెల్లప్పుడును అనుష్ఠించుచుండవలెను అని యీశ్వరుడుపదేశించు చున్నాడు. ॥౫॥

5. Oh yajna, Thou art beautiful like the spring. The sun protects thee from time immemorial, for unfolding all objects. Thou art diffused through the power and potency (the two arms) of the sun. Just as Vasus, Rudras, and Adityas promote the yajna, the giver of happiness, pervaded in space, so do I for the acquisition of divine qualities, perform the yajna!.

౩౭. ఘృతాచ్య సీత్యస్య ఋషిః స ఏవ. విష్ణు ర్దేవతా సర్వస్య. షట్ షష్టితమాక్షర పర్యంతం

బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః. అగ్రే నిచృత్రిష్టుప్ ఛన్దః. సర్వస్య ధైవతః స్వరః.

స కిం కిం ప్రియం సుఖం సాధయతీత్యుపదిశ్యతే. మరల పై యజ్ఞమువలన నే యే ప్రియసుఖములు

సిద్ధించుచున్నవో వాని యన్నింటిని ఈ దిగువ మంత్రముద్వారా ప్రకాశపరచుచున్నాడు.

౩౭ ఘృతాచ్యసి జుహూర్నామ్నా సేదమ్ప్రియేణ ధామ్నా ప్రియꣳ సదఽ ఆసీద ఘృతాచ్యస్యుపభృన్నామ్నా సేదమ్ప్రియేణ ధామ్నా ప్రియꣳ సదఽ ఆసీద ఘృతాచ్యసి ధ్రువా నామ్నా సేదం ప్రియేణ ధామ్నా ప్రియꣳ సదఽ ఆసీద ప్రియేణ ధామ్నా ప్రియꣳ సదఽ ఆసీద। ధ్రువాఽ అసదన్నృతస్య యోనౌ తా విష్ణో పాహి పాహి యజ్ఞం పాహి యజ్ఞపతిం పాహి మాం యజ్ఞన్యమ్॥౬॥

ప.వి:- ఘృతాచీ, అసి, జుహూః, నామ్నా, సా, ఇదమ్, ప్రియేణ, ధామ్నా, ప్రియమ్, సదః, ఆ, సీద, ఘృతాచీ, అసి, ఉపభృదిత్యుప+భృత్, నామ్నా, సా, ఇదమ్, ప్రియేణ, ధామ్నా, ప్రియమ్, సదః, ఆ, సీద, ఘృతాచీ, అసి, ధృవా, నామ్నా, సా, ఇదమ్, ప్రియేణ, ధామ్నా, ప్రియమ్, సదః, ఆ, సీద, ప్రియేణ, ధామ్నా, ప్రియమ్, సదః, ఆ, సీద, ధ్రువా, అసదన్, ఋుతస్య, యోనౌ, తా, విష్ణో ఇతి విష్ణో, పాహి, పాహి, యజ్ఞమ్, పాహి, యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, పాహి, మామ్, యజ్ఞన్యమితి, యజ్ఞ+న్యమ్.॥౬॥

పదార్థః :- (ఘృతాచీ) ఘృతమాజ్యమంచతి ప్రాప్నోత్యనయాఽఽదానక్రియయా సా (అసి) భవతి. అత్ర సర్వత్ర వ్యత్యయః (జుహూః) జుహోతి దదాతి హవిరాదత్తే సుఖం చానయా సా.'హు' దానాదనయో రిత్యస్మాత్. హువః శ్లువచ్చ). ఉ. ౨.౬౦. అనేన క్విప్ ప్రత్యయో దీర్ఘాదేశశ్చ. (నామ్నా) ప్రసిద్ధేన (సా) పూర్వోక్తా (ఇదమ్) ప్రత్యక్షమ్. (ప్రియేణ) సుఖై స్తర్పకేణ, కమనీయేన (ధామ్నా) స్థానేన, (ప్రియమ్) ప్రీణాతి సుఖయతి యత్తత్ (సదః) సీదన్తి ప్రాప్నువంతి సుఖాని యస్మిన్ తద్ గృహమ్. (ఆ) సమన్తాత్ (సీద) సాదయతి.

అత్రోభయత్ర లడర్థే లోడన్తర్గతో ణ్యర్థో వ్యత్యయశ్చ (ఘృతాచీ)యయా హోమక్రియయా ఘృతముదకమంచతి ప్రాపయతి సా. ఘృతమిత్యుదకనామసు పఠితమ్. నిఘం. ౧.౧౨. (అసి) అస్తి. (ఉపభృత్) యోఽఉపగతం బిభర్త్యనయా హస్తక్రియయా సా. (నామ్నా) ప్రఖ్యాతేన. (సా) పూర్వోక్తా (ఇదమ్) ఓషధ్యాదికమ్. (ప్రియేణ) ప్రీతిహేతునా (ధామ్నా) స్థలేన (ప్రియమ్) ప్రీయంతే సుఖయంత్యారోగ్యేన యత్తత్ (సదః) సీదన్తి ఘ్నన్తి దుంఖాని యేన తదౌషధసేవనం పథ్యాచరణం చ అత్ర సదిర్విశరణార్థః (ఆ) సమన్తాత్. (సీద) ప్రాపయతి (ఘృతాచీ) ఘృతమాయుర్నిమిత్తమంచతి ప్రాప్నోత్యనయా సునియమాచరణక్రియయా సా (అసి) భవతి (ధ్రువా) ధ్రువన్తి ప్రాప్నువన్తి స్థిరాణి సుఖాన్యనయా విద్యయా సా. ధ్రు గతిస్థైర్యయోరిత్యస్య కప్రత్యయాన్తః ప్రయోగః, కృతో బహులమితి కరణకారకే (నామ్నా) ప్రసిద్ధేన (సా) ఉక్తార్థా (ఇదమ్) జీవనమ్. (ప్రియేణ) ప్రీతికరేణ. (ధామ్నా) స్థిత్యర్థేన (ప్రియమ్) ఆనన్దకరమ్. (సదః) వస్తు (ఆ) అభితః (సీద) సీదతి గమయతి. అత్రోభయత్ర లడర్థే లోడ్ వ్యత్యయశ్చ (ప్రియేణ) ప్రీతిసాధకేన (ధామ్నా) హృదయేన (ప్రియమ్) ప్రీతికరమ్. (సదః) సీదతి జానాతి యేన తత్ జ్ఞానమ్ (ఆ) సర్వతః (సీద) సీదతి ప్రాప్నోతి. (ధ్రువా) ధ్రువాణి నిశ్చలాని వస్తూని. అత్ర శేశ్ఛన్దసి బహులమితిలోపః (అసదన్) భవేయుః. అత్ర లిఙర్థే లఙ్. వా ఛన్దసి సర్వేవిధయో భవన్తీతి సీదాదేశో న (ఋతస్య) శుద్ధస్య సత్యస్య (యోనౌ) యజ్ఞే. యజ్ఞో వా ఋతస్య యోనిః. శత ౧.౩. ౧. ౧౬. (తా) తాని. అత్రాపి శేర్లోపః (విష్ణో) వ్యాపకేశ్వర. (పాహి) రక్ష (పాహి) పాలయ (యజ్ఞమ్) పూర్వోక్తం త్రివిధం (పాహి) పాలయ (యజ్ఞపతిమ్) యజ్ఞస్య పాలకం యజమానమ్. (పాహి) రక్ష (మామ్) హోతార మధ్వర్యుముద్గాతారం బ్రహ్మాణం వా (యజ్ఞన్యమ్) యజ్ఞం నయతి ప్రాపయతీతి యజ్ఞనీస్తమ్. అత్ర అమిపూర్వః. అ. ౬. ౧. ౧౦౬॥ ఇత్యత్ర వా ఛన్దసీత్యనువర్తనాత్పూర్వరూపాదేశో న భవతి. అయం మంత్రః. శ. ౧. ౩. ౧. ౧౩-౧౬ వ్యాఖ్యాతః.।౬॥

అన్వయః :- యా జుహూర్నామ్నా ఘృతాచ్యసి భవతి సా యజ్ఞే ప్రయుక్తా సతీ ప్రియేణ ధామ్నా సహ వర్తమానమిదం ప్రియం సద ఆసీద ఆసాదయతి. యోఽఉపభృన్నామ్నా ఘృతాచ్యస్తి సాఽథ యత్తే ప్రయుక్తా సతీ ప్రియేణ ధామ్నేదం ప్రియం సద ఆసీద సమన్తాత్ ప్రాపయతి. యా ధ్రువా నామ్నా ఘృతాచ్యసి భవతి సా సమ్యక్ స్థాపితా సతీ ప్రియేణ ధామ్నేదం ప్రియం సద ఆసీద ఆగమయతి. యయా క్రియయా ప్రియేణ ధామ్నా ప్రియం సద ఆసీద సమన్తాత్ ప్రాప్నోతి. సా సర్వైర్నిత్యం సాధ్యా. హే విష్ణో! యథేమాని ఋతస్య యోనౌ ధ్రువా ధ్రువాణి వస్తూన్యసదన్ భవేయుస్తథైవైతాని నిరంతరం పాహి తథా కృపయా యజ్ఞం పాహి. యజ్ఞన్యం యజ్ఞపతిం పాహి యజ్ఞన్యం మాం చ పాహి.।౬॥

**భావార్థః :-** యో యజ్ఞః పూర్వోక్తే మంత్రే వసురుద్రాదిత్యైః సిధ్యతి స వాయుజలశుద్ధి ద్వారా సర్వాణి స్థానాని సర్వాణి వస్తూని చ ప్రియాణి విశ్చలసుఖసాధకాని జ్ఞానవర్ధకాని చ కరోతి తేషాం వృద్ధయే రక్షణాయ చ సర్వై ర్మనుష్యైర్వ్యాపకేశ్వరస్య ప్రార్థనా సమ్యక్ పురుషార్థశ్చ కర్తవ్య ఇతి.।౬॥

**పదార్థము:-**(నామ్నా జుహూః) ఏ హవిస్సును అగ్నియందు సమర్పించుటకై సుఖముల నుత్పన్నమొనర్చు (ఘృతాచీ) ఘృతమును ప్రాప్తించుకొను ఆదానక్రియ (అసి) కలదో (సా) అది యజ్ఞమున యుక్తపరచబడిన సారగ్రహణ క్రియయైయున్నది. ఐతే (ప్రియేణ) సుఖములచే తృప్తిని గలుగజేయు శోభాయమానమగు (ధామ్నా) స్థానముతో గూడ వర్తమానమై యుండి (ఇదమ్) ఇది (ప్రియమ్) చక్కగా తృప్తినొందించు (సదః) ఉత్తమోత్తమసుఖములను ప్రాప్తింపజేయు స్థానములను (ఆసీద) సిద్ధపరచుచున్నది. ఎయ్యది (నామ్నా) ప్రసిద్ధిచే (ఉపభృత్) సమీపమున ప్రాప్తించు పదార్థములను ధారణమొనర్చు (ఘృతాచీ) జలమును ప్రాప్తింపజేయు హస్తక్రియయునై (అసి) ఉన్నదో (సా) ఎయ్యది యజ్ఞమునందు యుక్తపరచబడినదై (ప్రియేణ) ప్రీతికొరకు (ధామ్నా) స్థలముతో (ఇదమ్) ఇట్టి ఓషధాదిపదార్థముల సమూహము (ప్రియమ్) ఆరోగ్యముతో గూడ సుఖదాయకము మరియు (సదః) దుఃఖములను నాశనమొనర్చునదై యున్నదో దానిని (ఆసీద) చక్కగా ప్రాప్తింపజేయును. ఏది (నామ్నా) సుఖములను (ధ్రువా) స్థిరమగు (ఘృతాచీ) ఆయుర్వృద్ధికి కారణమగు [చక్కని నియమములను గూర్చిన] విద్య (అసి) కలదో (సా) అది ఉత్తమకార్యములందు ప్రయుక్త పరచబడినదై (ప్రియేణ) ప్రియమైనప్రేమ నుత్పన్నమొనర్చుటకు (ధామ్నా) హేతువగుదానిచే (ఇదమ్ ప్రియమ్) ఆనందమునిచ్చు నీ జీవనమునకు (సదః) సామగ్రులను (ఆసీద) లభింపజేయుచున్నది. ఏ క్రియచే (ప్రియేణ) ప్రసన్నపరచు (ధామ్నా)హృదయములతో (ప్రియమ్) ప్రసన్నత నొనర్చు (సదః)జ్ఞానము (ఆసీద) విరివిగ లభించునో (సా) అట్టి జ్ఞాననిధిని ఎల్లరును సదా సాధించవలయును (విష్ణో) హే సర్వవ్యాపక పరమేశ్వరా [ఈ వస్తువులు] (ఋతస్యయోనౌ) శుద్ధమగు యజ్ఞమున (ధ్రువా) స్థిరవస్తువు (అసదన్) అగుటకును అట్లే నిరంతరము (పాహి) రక్షించుము. మరియు కృపచే (యజ్ఞమ్) యజ్ఞమును (పాహి) కాపాడుము (యజ్ఞన్యమ్) యజ్ఞము ప్రాప్తించుటకు (యజ్ఞపతిమ్) యజ్ఞమొనర్చు యజమానుని (పాహి) రక్షణమొనర్చుము. మరియు యజ్ఞమును ప్రకాశిత మొనర్చు (మామ్) నన్ను (చ) కూడా (పాహి) పాలించుము. ।౬॥

**భావార్థము :-**పై మంత్రమున వసురుద్రాదిత్యులద్వారా సిద్ధించుటకై చెప్పబడియున్న యజ్ఞము జలవాయువుల శుద్ధిద్వారా సకల స్థానములను, సకలవస్తువులను, ప్రీతిని ఉత్పన్నపరచునదిగాను, ఉత్తమ సౌఖ్యములను పెంపొందింపజేయునది గాను [జ్ఞాన వర్ధకముగాను] ఐయున్నది. కావుననే అట్టి యజ్ఞములను వృద్ధిపరచి కాపాడుటకై మానవులెల్లరును ఆ సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని ప్రార్థించుచు సదా పురుషార్థపరులై యుండవలయును. ।౬॥

**6. Oh Yajna, thy name is sky, thou art full of butter, be confirmed in this decorated place with thy lovely glory. Oh yajna thy name is space, thou art full of water, be confirmed in this decorated space with thy lovely glory. Oh Yajna thy name is Earth, thou art**

the giver of longevity, be confirmed in this decorated place with thy lovely glory. May necessary articles be placed in the holy yajna. O God, may Thou protect those articles, may Thou protect the Yajna, may Thou protect the worshipper, may Thou protect me the conductor of the Yajna!.

౩౮. అగ్నే వాజజిదిత్యస్య ఋషిః స ఏవ. అగ్నిర్దేవతా. బృహతీ ఛన్దః. మధ్యమః స్వరః.

పునః స యజ్ఞః కీదృశ ఇత్యుపదిశ్యతే.

మరల నాయజ్ఞ మెటువంటిదో ఈ మంత్రమున ప్రకాశితమొనర్చబడినది.

౩౮ అగ్నే వాజజిద్వాజన్త్వా సరిష్యన్తం వాజజితꣳ సమ్మార్జ్మి।
నమో దేవేభ్యః స్వధా పితృభ్యః సుయమే మే భూయాస్తమ్ ॥౭॥

ప. వి:- అగ్నే, వాజజిదితి వాజ+జిత్, వాజమ్, త్వా, సరిష్యన్తమ్, వాజజితమితి వాజ+జితమ్, సమ్, మార్జ్మి, నమః, దేవేభ్యః, స్వధా, పితృభ్య ఇతి పితృ+భ్యః, సుయమే ఇతి సు+యమే, మే, భూయాస్తమ్. ॥౭॥

పదార్థః :-(అగ్నే) అగ్నిర్భౌతికః (వాజజిత్) వాజమన్నం జయతి యేన సః. వాజ ఇత్యన్ననామసు పఠితమ్. నిఘం. ౨. ౭॥ అత్రోభయత్ర కృతో బహులమితి కరణే క్విప్. (వాజమ్) వేగవన్తమ్, (త్వా) తమ్ (సరిష్యన్తమ్) సర్వాన్ పదార్థానన్తరిక్షం గమయిష్యన్తమ్ (వాజజితమ్) వాజం యుద్ధం జయతి యేన తమ్ (సమ్) సమ్యగర్థే (మార్జ్మి) మార్ష్టి వా. అత్ర పక్షే పురుషవ్యత్యయః (నమః) అమృతాత్మకం జలమ్. నమ ఇత్యుదకనామసు పఠితమ్. నిఘం. ౧. ౧౨॥ (దేవభ్యః) దివ్యసుఖకారకేభ్యః పూర్వోక్తేభ్యో వస్వాదిభ్యః (స్వధా)అమృతాత్మకమన్నమ్. స్వధేత్యన్ననామసు పఠితమ్. నిఘం. ౨. ౭॥ స్వం స్వకీయం సుఖం దధాత్యనయా సా. (పితృభ్యః) పాలన హేతుభ్య ఋతుభ్యః. ఋతవో వై పితరః. శ. ౨. ౫. ౨. ౩౨॥ (సు) శోభనేఽర్థే. (యమే) యచ్ఛన్తి బలపరాక్రమౌ యాభ్యాం తే (మే) మమ. (భూయాస్తమ్) భూయాస్తామ్. అత్ర వ్యత్యయః. అయం మంత్రః. శ. ౧.౩. ౬. ౧౪,౧౫. వ్యాఖ్యాతః ॥ ౭॥

అన్వయః:-యతోఽయమ[గ్నేఽ] గ్ని ర్వాజజిద్భూత్వా సర్వాన్ పదార్థాన్ సంమార్ష్టి తస్మా[త్వా]త మహం వాజం పరిష్యన్తం వాజజితం సంమార్జ్మి యేన యజ్ఞేన ప్రయుక్తే వాగ్ని

వా దేవేభ్యో నమః పితృభ్యః స్వధా సుయమే భవత స్తేనైతే మే మమ సుయమే భూయాస్తం, భూయాస్తామ్. ॥౭॥

**భావార్థః :-ఈశ్వర ఉపదిశతి. మనుష్యై ర్యః పూర్వమంత్రోక్తోఽగ్నిః [సః]యజ్ఞస్య ముఖ్యసాధనః కర్తవ్యః. కుతః? అగ్నే రూర్ధ్వగమనశీలేన సర్వపదార్థభేదకత్వాత్. యానాస్త్రేషు సమ్యక్ ప్రయుక్తః శీఘ్రగమన విజయహేతుః స న్నృతుభి ర్దివ్యాన్ పదార్థాన్ సంపాద్య శుద్ధే సుఖప్రాపకే అన్నజలే కరోతీతి విజ్ఞాతవ్యమ్.॥౭॥**

**పదార్థము** :-(అగ్నే) ఈ యగ్ని (వాజజిత్) ఉత్తమమగు అన్నమును ప్రాప్తింపజేయునది, సకల పదార్థములను శుద్ధము చేయునదై యున్నది. దీనిచే నేను (త్వా) అట్టి (వాజమ్) వేగవంతమగు (సరిష్యన్తమ్) సకల పదార్థములను అంతరిక్షమునకు జేర్చునదియు (వాజజితమ్) యుద్ధములందు విజయమును గలిగించునదియు నగు (త్వా) అట్టి భౌతికాగ్నిని (సమ్మార్జ్మి) చక్కగా శుద్ధపరచుచున్నాను. యజ్ఞమునందు ప్రయుక్తమొనర్చిన ఏ యగ్నిచే (దేవేభ్యః) సుఖకారకులగు పూర్వోక్త వస్వాదులద్వారా సౌఖ్యములకై (నమః) మిక్కిలి మధుర జలములు (పితృభ్యః) పాలనహేతువులగు వసంతము మున్నగు ఋతువులద్వారా స్వాస్థ్యము కొరకు (స్వధా) అమృతాత్మకమగు నన్నము సిద్ధపరచబడుచున్నదో ఆ రెండు యజ్ఞములు (మే) నాకొరకు (సుయమే) బలపరాక్రమముల ప్రసాదించునవిగా (భూయాస్తమ్) అగుగాక! ॥౭॥

**భావార్థము** :-పూర్వమంత్రోక్తమగు అగ్నిని యజ్ఞమునకు ముఖ్యసాధనముగా చేసికొనవలయును. ప్రత్యక్షముగ దాని జ్వాలలు కనబడుచునే యున్నవి. అట్లే అగ్నికి ఊర్ధ్వగమన, ఊర్ధ్వప్రజ్జ్వలన స్వభావములు గలవు. సకల పదార్థములను ఛిన్నాభిన్న మొనర్చుటయు దాని స్వభావమై యున్నది. మరియు యానములందు, అస్త్రశస్త్రములందు బాగుగ ప్రయుక్తపరచబడునదై శీఘ్రగమనమునకు, విజయమునకు హేతువగుచున్నది. వసంతము మున్నగు ఋతువులద్వారా ఉత్తమోత్తమ పదార్థములను సమకూర్చి అన్నజలములను శుద్ధములుగను, సౌఖ్యమునొసగునవిగను జేయుచున్నదనియు దెలిసికొనవలయును అని పరమేశ్వరుడు ఉపదేశించు చున్నాడు. ॥౭॥

7. I kindle the fire, the giver of corn, full of intensity, the carrier of all oblations to the sky, and the bringer of victory in war. The fire properly used in the Yajna brings water through the forces of nature, and food through the seasons that protect us. May these (water and food) be the givers of strength and power for my use.

**౩౮. అస్కన్నమద్యేత్యస్య ఋషిః స ఏవ. విష్ణు ర్దేవతా. విరాట్ పంక్తి శ్ఛన్దః. పంచమః స్వరః.**

**పునః స కీదృశో భూత్వా కిం కరోతీత్యుపదిశ్యతే.**

**మరల నా యజ్ఞ మెటువంటిదై యేమిచేయుచుండునో యీ మంత్రమున ప్రకాశ పఱచబడియున్నది**

౩౮ అస్కన్నమద్య దేవేభ్య ఆజ్యꣳ సంభ్రియాసమంఘ్రిణా విష్ణో
మా త్వావక్రమిషం వసుమతీమగ్నే తే ఛాయాముపస్థేషం విష్ణో
స్థానమసీతఽఇన్ద్రో వీర్యమకృణో దూర్ధ్వోఽధ్వరఽఆస్థాత్ ॥౮॥

ప.వి:- అస్కన్నమ్, అద్య, దేవేభ్యః, ఆజ్యమ్, సమ్, భ్రియాసమ్, అంఘ్రిణా, విష్ణో ఇతివిష్ణో, మా, త్వా, అవ, క్రమిషమ్, వసుమతీమితి వసు+మతీమ్, అగ్నే, తే, ఛాయామ్, ఉపస్థేషమ్, విష్ణోః, స్థానమ్, అసి, ఇతః, ఇన్ద్రః, వీర్యమ్, అకృణోత్, ఊర్ధ్వః, అధ్వరః, ఆ, అస్థాత్.॥౮॥

పదార్థః:-(అస్కన్నమ్) అవిక్షుబ్ధమ్ (అద్య) అస్మిన్నహని (దేవేభ్యః) దివ్యసుఖానామ్ ప్రాప్తయే. (ఆజ్యమ్) ఘృతాదికమ్ (సమ్) క్రియాయోగే (భ్రియాసమ్) ధారయేయమ్ (సమ్) క్రియాయోగే. (అంఘ్రిణా) గమనసాధనేనాగ్నినా. (విష్ణో) వ్యాపకేశ్వర (మా) నిషేధార్థే (త్వా) తం వా (అవ) అవేతి వినిగ్రహార్థీయః. నిరు. ౧. ౩॥ (క్రమిషమ్) ఉల్లంఘయేయమ్. అత్ర లిఙర్థేలుఙ్ (వసుమతీమ్) వసూని బహూని వస్తూని భవన్తి యస్యాం తామ్. అత్ర భూమన్యర్థే మతుప్ (అగ్నే) పరమేశ్వర భౌతికో వా, (తే) తవ తస్య వా (ఛాయామ్) ఆశ్రయమ్ (ఉప) క్రియార్థే (స్థేషమ్) ఉపపత్సీయ. అత్ర లిఙ్యాశిష్యఙిత్యఙి కృతే ఛన్దస్యుభయథేతి సార్వధాతుకత్వాదియాదేశ ఆర్ధధాతుకత్వాత్సకారలోపో న భవతి. (విష్ణోః) యజ్ఞస్య (స్థానమ్) స్థిత్యర్థమ్ (అసి) భవతి. అత్ర వ్యత్యయః (ఇతః) స్థానాత్ (ఇన్ద్రః) సూర్యోవాయుర్వా. (వీర్యమ్) వీరస్య కర్మ పరాక్రమం వా (అకృణోత్) కరోతి. అత్ర లడర్థే లఙ్ (ఊర్ధ్వః) ఆకాశస్థః సన్ (అధ్వరః)యజ్ఞః (ఆ) సమన్తాత్ (అస్థాత్)తిష్ఠతి. అత్ర లడర్థే లుఙ్. అయం మన్త్రః. శ., ౧. ౪. ౧. ౧-౩ వ్యాఖ్యాతః॥౮॥

అన్వయః :-అహం దేవేభ్యో యదస్కన్నమవిక్షుబ్ధమాజ్యమంఘ్రిణా సంభ్రియాసం [విష్ణో]అద్య త్వా తదహం మావక్రమిషం మోల్లంఘయేయమ్. హే అగ్నే జగదీశ్వర! తే తవ వసుమతీం ఛాయామహముపస్థేష ముపపత్సీయ. యోఽయ మగ్ని ర్విష్ణో ర్యజ్ఞస్య

స్థానమస్యస్తి తస్యాపి వసుమతీం ఛాయయా ముపస్థాయ యజ్ఞం సాధయామి. య ఊర్ధ్వోఽధ్వరోఽగ్నౌ హుతః సమన్తాత్ తిష్ఠతి తమిత ఇన్ద్రో ధృత్వా వీర్యమకృణోత్ కరోతి.॥౮॥

**భావార్థః:-**ఈశ్వర ఉపదిశతి యేన పూర్వోక్తేన యజ్ఞేనాన్నజలే శుద్ధే పుష్కలే భవత స్తదేతస్య సిద్ధ్యర్థం మనుష్యైః పుష్కలాః సంభారాః సదా చేతవ్యాః. నైవ మమ వ్యాపకస్యాజ్ఞాముల్లంఘ్య వర్తితవ్యమ్. కిన్తు బహుసుఖప్రాపకం మదాశ్రయం గృహీత్వాఽగ్నౌ యో యజ్ఞః క్రియతే. యమిన్ద్రః స్వకీయైః కిరణైః శ్రిత్వా వాయునా సహోర్ధ్వమాకృష్యోర్ధ్వం మేఘమణ్డలే స్థాపయతి. పునస్తస్మాద్భూమిం ప్రతి నిపాతయతి యేన భూమౌ మహద్వీర్యం జాయతే స సదాఽనుష్ఠాతవ్య ఇతి.॥౮॥

**పదార్థము :-** నేను (దేవేభ్యః) ఉత్తమసుఖ ప్రాప్తికై ఏవి (అస్కన్నమ్) నిశ్చలసుఖముల నిచ్చు (ఆజ్యమ్) ఘృతము మున్నగు ఉత్తమోత్తమ పదార్థములు గలవో, వానిని (అంఘ్రిణా) పదార్థములను చేర్చునట్టి అగ్నిచే (అద్య) నేడు (సంభ్రియాసమ్) ధరించెదను (త్వా) దానిని నేను (మా నక్రమిషమ్) ఎన్నటికిని ఉల్లంఘించకుండెదనుగాక! హే అగ్నే పరమాత్మా! (తే) నీయొక్క (వసుమతీమ్) పదార్థముల నిచ్చు (ఛాయామ్) ఆశ్రయమును నేను (ఉపస్థేషమ్) పొందుదునుగాక! (అగ్నే) ఏ యీ భౌతికాగ్ని (విష్ణోః) యజ్ఞమునకు (స్థానమ్) నివసించు స్థానమై (అసి) ఉన్నదో దానియొక్క (వసుమతీమ్) ఉత్తమ పదార్థముల నొసగు (ఛాయామ్) ఆశ్రయమును నేను (ఉపస్థేషమ్) ప్రాప్తించుకొని యజ్ఞమును సిద్ధమొనర్చుచున్నాను. (ఊర్ధ్వః) ఆకాశస్థమై (అధ్వరః) అగ్నియందు స్థిరమై యుండు ఏ యజ్ఞము (ఆ) సకల దిశలకు (అస్థాత్) వ్యాపించున దగుచున్నదో దానిని (ఇతః) ఇచ్చటినుండి (ఇన్ద్రః) సూర్యుడు మరియు వాయవులు ధారణమొనర్చి (వీర్యమ్) అట్టికర్మను, లేక పరాక్రమమును (అకృణోత్) చేయుచున్నవి. ॥౮॥

**భావార్థము :-**ఈశ్వరు డిట్లుపదేశించుచున్నాడు :-పూర్వోక్త యజ్ఞముచే ఏ జలవాయువులు శుద్ధమై అధిక అన్నము నుత్పన్నమొనర్చునవి యగుచున్నవో - అట్టి యా యజ్ఞమును సిద్ధించుకొనుటకు మనుష్యు లధిక సామగ్రిని సమకూర్చుకొనవలయును. సర్వవ్యాపకుడనగు నా యాజ్ఞ నెల్లప్పుడును ఉల్లంఘించవలదు. మరియు నేమనగా అనేక సౌఖ్యములను సమకూర్చునట్టి నా యాశ్రయమును గ్రహించి సదా అగ్నియందు ఏ యజ్ఞ మొనర్చబడునో, దేనిని సూర్యుడు తన కిరణములద్వారా ఆకర్షించి వాయుపుసహాయముచే ఊర్ధ్వమున మేఘమండలమున స్థాపించి, తిరిగి దాని నచటినుండి భూమిపైకి మేఘములద్వారా వర్షింపజేయుచున్నాడో, దేనివల్ల భూమిపై అధిక సుఖ ముత్పన్నమగుచున్నదో అట్టి యజ్ఞమును మానవు లెల్లరును ఎల్లప్పుడును అనుష్ఠించుట యోగ్యమైయున్నది. ॥౮॥

8. May I today for the acquisition of comforts collect through Yajna butter and other articles which contribute to happiness.

O God may I never violate it (Yajna). O Lord may I obtain Thy refuge, abounding in

store of riches. This fire is the abode of yajna. Through it (yajna) sun, and air gain strength. This yajna resides is space and fire!.

౪౦. అగ్నే వేరిత్యస్య ఋషిః స ఏవ. అగ్నిర్దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తేన కిం భవతీత్యుపదిశ్యతే.

ఆ యజ్ఞమువలన నేమి లాభము కలుగునో ఈ మంత్రమున ప్రకాశపఱచినాడు.

౪౦ అగ్నే వేర్హోత్రం వేర్దూత్యమవతాన్త్వాం ద్యావా పృథివీఽఅవ త్వం ద్యావాపృథివీ స్విష్టకృ ద్దేవేభ్యఽ ఇన్ద్రఽ ఆజ్యేన హవిషా భూత్స్వాహా సం జ్యోతిషా జ్యోతిః॥౯॥

ప.వి:- అగ్నే, వేః, హోత్రమ్, వేః, దూత్యమ్, అవతామ్, త్వామ్, ద్యావాపృథివీ ఇతి ద్యావా+ పృథివీ, అవ, త్వమ్, ద్యావాపృథివీ ఇతి ద్యావా+ పృథివీ, స్విష్టకృదితి స్విష్ట+ కృత్, దేవేభ్యః, ఇన్ద్రః, ఆజ్యేన, హవిషా, భూత్, స్వాహా, సమ్, జ్యోతిషా, జ్యోతిః.౯॥

పదార్థః:-(అగ్నే) పరమేశ్వర భౌతికో వా. (వేః) విద్ధి వేదయంతి ప్రాపయంతి వా. అత్రోభయత్ర లడర్థే లఙ్. వీ గతి..... ఇత్యస్య ప్రయోగోఽడభావ శ్చ (హోత్రమ్) జుహ్వతి యస్మిన్ తద్యజ్ఞ కర్మ (వేః) విద్ధి వేదయంతి ప్రాపయంతి వా. (దూత్యమ్) దూతస్య కర్మ తత్. దూతస్య భాగకర్మణీ. అ.౪. ౪. ౧౨౧. అనేన యత్ప్రత్యయః. (అవతామ్) రక్షతః. (త్వామ్) తత్ (ద్యావాపృథివీ) ద్యౌశ్చ పృథివీ చ తే. దివో ద్యావా. అ. ౬.౩.౨౯. అనేన ద్వన్ద్వే సమాసే దివః స్థానే ద్యావాదేశః (అవ) రక్ష రక్షతి వా. అత్ర పక్షే వ్యత్యయః. (త్వమ్) స వా. (ద్యావాపృథివీ) అస్మత్ప్రాప్తే న్యాయప్రకాశపృథివీ రాజ్యే. ద్యావాపృథివీ ఇతి పదనామసు పఠితమ్, నిఘం. ౫. ౩. ఇత్యత్ర ప్రాప్త్యర్థో గృహ్యతే (స్విష్టకృత్) యః శోభన మిష్టం కరోతి సః. (దేవేభ్యః) విద్వద్భ్యో దివ్యసుఖేభ్యో వా. (ఇన్ద్రః) భౌతికః సూర్యో వాయుర్వా. ఇన్ద్రేణ వాయునా ఋ. ౧. ౧౪. ౧౦ అనేనేన్ద్రశబ్దేన వాయురపి గృహ్యతే. (ఆజ్యేన) యజ్ఞే ఽగ్నౌ చ ప్రక్షేపితుం యోగ్యేన ఘృతాదినా (హవిషా) సంస్కృతేన హోతవ్యేన పదార్థేన. (భూత్) భవతి. అత్ర లడర్థే లుఙ్. అడభావ శ్చ (స్వాహా) వేదవాణీదం కర్మాహ (సమ్) సమ్యగర్థే (జ్యోతిషా)

తేజస్వినా లోకసమూహేన సహ. (జ్యోతిః) ప్రకాశవాన్. ద్యుతేరిసున్నాదేశ్చ జః ఉ. ౨. ౧౦౫ ఇతి ద్యుతధాతో రిసప్రత్యయ ఆదేర్జకారాదేశశ్చ. అయం మంత్రః॥ శ. ౧. ౪. ౧. ౪-౯॥ వ్యాఖ్యాతః.।౯॥

అన్వయః:-హే పరమేశ్వర! యే ద్యావాపృథివీ యజ్ఞమవతాం రక్షతస్తే త్వం వేః రక్ష. యథా ఽ యమగ్నిర్హోత్రం దూత్యం చ కర్మ ప్రాప్తో ద్యావాపృథివీ రక్షతి తథా హే భగవన్! దేవేభ్యః స్విష్టకృత్ త్వమస్మాన్ వేః సదా పాలయ. యథాఽయమాజ్యేన హవిషా జ్యోతిషా సహ జ్యోతిః స్విష్టకృదిన్ద్రో ద్యావాపృథివ్యో రక్షకో భూాద్భవతి తథా త్వం విజ్ఞానజ్యోతిః ప్రదానేనాస్మాన్సమవేతి స్వాహా.।౯॥

భావార్థః:-ఈశ్వరో మనుష్యేభ్యో వేదేషూపదిష్టవానస్తి. మనుష్యైర్యద్యదగ్నిపృథివీ సూర్య వాయ్వాదిభ్యః పదార్థేభ్యః హోత్రం దూత్యం చ కర్మనిమిత్తం విదిత్వాఽనుష్ఠీయతే తత్తదిష్టకారి భవతి. అష్టమ మంత్రేణ యజ్ఞసాధనం యదుక్తం తత్ఫలం నవమేన ప్రకాశితమితి.।౯॥

**పదార్థము** :-(అగ్నే) ఓ పరమేశ్వరా! ఏ (ద్యావాపృథివీ) ప్రకాశమయ సూర్యుడు మరియు భూమి యజ్ఞమును (అవతామ్) రక్షించుచున్నవో అట్లే (త్వమ్) నీవును (వేః) రక్షించుము. మరియు నెటుల ఈ భౌతికాగ్ని (హోత్రమ్) యజ్ఞము (దూత్యమ్) చేరవేయు [దూత] కర్మను పొంది (ద్యావాపృథివీ) ప్రకాశమయమగు సూర్యలోక మరియు పృథివీలోకములను రక్షణచేయునో, అదేవిధముగ ఓ పరమాత్మా! (దేవేభ్యః) విద్వాంసులకొరకై (స్విష్టకృత్) సర్వశ్రేష్ఠములగు ఇష్టకార్యములొనర్చు నీవు మమ్ము (అవ) రక్షించుము. (ఆజ్యేన) యజ్ఞాగ్నియందు సమర్పించుటకు యోగ్యమగు ఘృతము మున్నగు ఉత్తమోత్తమ పదార్థములతోను (హవిషా) సంస్కరించబడిన అనగా చక్కగా శుద్ధమొనర్చబడిన హవనయోగ్యమగు కస్తూరి, కేసరి మున్నగు పదార్థములతోను (జ్యోతిషా) ప్రకాశమయములగు లోకములతోగూడి (జ్యోతిః) ప్రకాశమయమగు కిరణములచే (స్విష్టకృత్) కోరినట్టి ఉత్తమకార్యముల సిద్ధియొనర్చునట్టి (ఇన్ద్రః) సూర్యలోకముగూడ (ద్యావాపృథివీ) మా న్యాయప్రకాశము మరియు పృథివీరాజ్యమును రక్షించునదిగా (అభూత్) అగుచున్నది. అట్లే (జ్యోతిః) విజ్ఞానరూప ప్రకాశ [జ్యోతి] దానముచే మమ్ము (సమ్, అవ) ఈ కర్మను రక్షించుము అని (స్వాహా) వేదవాణి చెప్పుచున్నది. ।౯॥

**భావార్థము** :-సూర్యుడు, పృథివి, అగ్ని, వాయువు మున్నగు పదార్థముల నిమిత్తకారణములను దెలిసికొని హోమ దౌత్య సంబంధ కార్యముల ననుష్ఠించగా నవి కోరిన సౌఖ్యముల నిచ్చునవి అగునని ఈశ్వరుడు వేదములద్వారా ఉపదేశించెను. ఎనిమిదవ మంత్రమున చెప్పబడిన యజ్ఞసాధన ఫలితము తొమ్మిదవ మంత్రమున ప్రకాశపరచబడినది. ।౯॥

9. Oh God protect the sun and earth, which protect the yajna. Just as fire acquiring the yajna and acting as an envoy, protects the sun and earth, so protect us, Oh Lord, the doer of the noble deeds for the learned. Just as the sun conbining light with light through the oblations put into fire, protects the heaven and earth so God guard us with the light of spiritual knowledge. This is thus ordained in the Veda!.

౪౧. మయీద మిత్యస్య ఋషిః స ఏవ. ఇన్ద్రో దేవతా. భురిగ్బ్రాహ్మీ పంక్తి శ్ఛన్దః. పంచమః స్వరః.

అథ తజ్జన్యం ఫలముపదిశ్యతే.

ఇపు డీ మంత్రమున చెప్పబడిన యజ్ఞముచే కలిగెడు ఫలితముల ఉపదేశము.

౪౧ మయీదమిన్ద్ర౨ ఇన్ద్రియం దధాత్వస్మాన్ రాయో మఘవానః సచన్తామ్

అస్మాకఀ సన్త్వాశిషః సత్యా నః సన్త్వాశిష౨ ఉపహూతా పృథివీ మాతోప

మాం పృథివీ మాతా హ్వయతామగ్ని రాగ్నీధ్రాత్స్వాహా ॥౧౦॥

ప.వి:- మయి, ఇదమ్, ఇన్ద్రః, ఇంద్రియమ్, దధాతు, అస్మాన్, రాయః, మఘవాన ఇతి మఘ+వానః, స చన్తామ్, అస్మాకమ్, సన్తు, ఆశిష ఇత్యాశిషః, సత్యాః, నః, సన్తు,ఆశిష ఇత్యాశిషః, ఉపహూతే త్యుప+హూతా, పృథివీ, మాతా, ఉప, మామ్, పృథివీ, మాతా, హ్వయతామ్, అగ్నిః, ఆగ్నీధ్రాత్, స్వాహా.॥౧౦॥

పదార్థః-(మయి) ఆత్మని (ఇదమ్) యచ్ఛ్రద్ధం జ్ఞానయుక్తం సాధుకారి ప్రత్యక్షం తత్ (ఇన్ద్రః) పరమేశ్వరః (ఇన్ద్రియమ్) ఇన్ద్రస్యైశ్వర్యప్రాప్తే ర్లిఙ్గం చిహ్నమిన్ద్రేణ పరమేశ్వరేణ దృష్టమిన్ద్రేణ సృష్టం ప్రకాశిత మిన్ద్రేణ విద్యావతా జీవేన జుష్టం సంప్రీత్యా సేవితమిన్ద్రేణ పరమేశ్వరేణ యద్దత్తం సర్వసుఖజ్ఞానసాధకమ్. ఇన్ద్రియ మిన్ద్రలింగమిన్ద్ర దృష్టమిన్ద్రసృష్టమిన్ద్రజుష్టమిన్ద్రదత్తమితి వా.అ. ౫.౨,౯౩. అనేనోక్తేష్వర్థేష్విన్ద్రియశబ్దో నిపాతితః (దధాతు) నిత్యం ధారయతు (అస్మాన్) మనుష్యాన్ (రాయః) విద్యా సువర్ణ చక్రవర్తి రాజ్యాది ధనాని. రాయ ఇతి ధననామసు పఠితమ్. నిఘం. ౨,౧౦॥ (మఘవానః) మఘాని బహూని ధనాని విద్యన్తే యేష్వైశ్వర్య యోగేషు తే. అత్ర భూమ్న్యర్థే మతుప్. మఘమితి

ధనవామధేయం మంహతేర్దానకర్మణః నిరు. ౧,౭ (సచన్తామ్) సమవేతాః ప్రాప్తా భవన్తు. (అస్మాకమ్) పరోపకారిణాం ధార్మికాణాం మానవానాం (సంతు) భవన్తు. (ఆశిషః) కామనాః (సత్యాః) సిద్ధాః (నః) అస్మాకం విద్యావతాం రాజ్య సేవినామ్. (సన్తు) భవన్తు. (ఆశిషః) న్యాయేచ్ఛావిశిష్టాః క్రియాః. శాస ఇత్వే ఆశాసః క్వావుపసంఖ్యానమ్. అ, ౬.౪.౩౪. అనేన వార్తికేనాశీరితి సిద్ధః (ఉపహూతా) ఉపహూయతే జనైరాజ్యసుఖార్థం యా (పృథివీ) పృథుసుఖనిమిత్తా; (మాతా) మాన్యకరణహేతుః. (ఉప) గతార్థే (మామ్) సుఖార్థినం ధార్మికమ్, (పృథివీ) పృథుసుఖదాత్రీ విద్యా (మాతా) ధర్మార్థకామమోక్షసిద్ధ్యా మాన్యదాత్రీ (హ్వయతామ్) స్పర్ధతాముపదిశతామ్. (అగ్నిః) ఈశ్వరః (ఆగ్నీధ్రాత్) అగ్నిరిధ్యతే ప్రదీప్యతే యస్మిన్ తస్యేదం శరణమాశ్రయణం తస్మాత్. అగ్నీధః శరణే రణ్ భం చ. అ. ౪.౩. ౧౨౦. అనేన వార్తికేనాధికరణవాచినః క్విబన్తాదగ్నీధ్ ప్రాతిపతికాదణ్ ప్రత్యయః. (స్వాహా) సుహుతమాహ యయా సా. అయం మంత్రః శత. ౧. ౬.౩. ౩౯-౪౪. వ్యాఖ్యాతః. ॥౧౦॥

అన్వయః :-ఇన్ద్రో మయీద మిన్ద్రియం రాయశ్చ దధాతు, తత్కృపయా స్వపురుషార్థేన చ యథా వయం మఘవానో భవేమ తథాఽస్మాన్ రాయః సచన్తామ్. ఏవం చాస్మాకమాశిషః సత్యాః సన్త్వేవం మాతేయం పృథివీ విద్యోపహూతా చ సతీ మాముపాహ్వయతాముపదిశతామ్. తథా మయాఽనుష్ఠితోఽయ మగ్నిరాగ్నీధ్రా దిష్టకృత్సన్ నోఽస్మాకం సుఖాన్యుపహ్వయతి ఏవం సమ్యగ్ఘుతమిష్టకారి భవతీతి స్వాహా వేదవాణ్యాహ. ॥౧౦॥

భావార్థః:-యే పురుషార్థిన ఈశ్వరోపాసకా స్త ఏవ శోభనం మనః శ్రేష్ఠాన్యుత్తమాని ధనాని సత్యా ఇచ్ఛాశ్చ ప్రాప్నువన్తి నేతరే. సర్వస్య మాన్యప్రాప్తిహేతుత్వాత్ భూమివిద్యే పృథివీశబ్దేనాత్ర ప్రకాశితే స్తః. సర్వైరేతే సదోపకర్తవ్యే భవత ఇతీశ్వరోఽనేన వేద మంత్రేణాహ. నవమ మంత్రేణాగ్న్యాదిభ్యః సాధితేభ్య ఇష్టసుఖప్రాప్తి రుదితా సైవానేన దశమేన మంత్రేణ ప్రకాశితేతి.॥౧౦॥

పదార్థము :-(ఇన్ద్రః)పరమేశ్వరుడు (మయి) నాయందు (ఇదమ్ ఇన్ద్రియమ్) ప్రత్యక్ష ఐశ్వర్యప్రాప్తికి చిహ్నములును పరమేశ్వరుడు తన జ్ఞానముతో గావించినవియును, పరమేశ్వర ప్రకాశితములును, సకల సౌఖ్యములను గలుగజేయు నిమిత్తము విద్వాంసులకొసగబడినవియును 'ఇంద్రులు' అనగా విద్వాంసులు ప్రీతిపూర్వకముగా సేవించునవియు నగు ఈ ఇంద్రియములను (రాయః) విద్య, సువర్ణము, చక్రవర్తిరాజ్యాది ధనములను (దధాతు) నిత్యము స్థాపించునుగాక! మరియు నాతని కృపచేతను, మా పురుషార్థమువల్లను (మఘవానః) బహుళ ధనములు,రాజ్యాది పదార్థములు కలిగి మమ్ము పరిపూర్ణైశ్వర్యవంతులుగా జేయగలుగునట్టివియు నగు ధనములు (నః) ధర్మాత్ములము, విద్వాంసులము నగు మాకు (సచన్తామ్) ప్రాప్తించుగాక! (అస్మాకమ్) పరోపకారులము, ధర్మాత్ములము నగు మా (ఆశిషః) మనోరథములును (సత్యాః)

సిద్ధించి (సన్తు)యుండును గాక! (నః) మా (ఆశిషః) న్యాయమగు ఇచ్ఛాయుక్తక్రియలును (సత్యాః) సిద్ధించి (సన్తు) ఉండుగాక! మరియు నిదే విధముగ (మాతా) ధర్మార్థకామమోక్షముల సిద్ధిద్వారా మాన్యతను గలిగించు ఏ విద్య (పృథివీ) అధికసుఖములనొసగెడు ఏ భూమియును గలవో (ఉపహూతా) రాజ్యాదిసుఖముల నిమిత్తము మనుష్యులు వేనిని సత్క్రమముగ పొందుచున్నారో వానిని (మామ్) సుఖమును గోరెడు నాకు (ఉపహ్వయతామ్) బాగుగా యుపదేశించుగాక! (అగ్నిర్ధ్రాత్) ఇంధనముల [సమిధల] చే ప్రజ్వలింపబడుచు నాచే ననుష్ఠించబడు ఈ (అగ్నిః) భౌతికాగ్ని మా కోరికలను దీర్చునదగుచు (నః) మాకు సకలసుఖములను గలుగజేయును గాక! ఏలయనగా ఇట్లు బాగుగా హోమమొనర్చబడినది మా వాంఛలను సఫలీకృతమొనర్చును. (స్వాహా) ఈ కార్యమును మానవులెల్లరును ఆచరించవలయునని వేదవాణి యాదేశించుచున్నది. ॥౧౦॥

**భావార్థము :-** పురుషార్థులు, పరోపకారులు, ఈశ్వరోపాసకులు నగువారే శ్రేష్ఠజ్ఞానము, ఉత్తమ ధనము, కామ్యసిద్ధి బడయగలుగుదురు. ఎల్లరకును మాన్యతనిచ్చు భూమి, విద్య ఈ మంత్రమున పృథివీ శబ్దముచే ప్రకాశింపబడినవి. మానవులు ఉపకారమును పొందుటకీ రెండు యోగ్యతలను ఈశ్వరుడు ఉపదేశించినాడు. తొమ్మిదవ మంత్రమునం దగ్న్యాది పదార్థములద్వారా వాంఛితప్రాప్తి చెప్పబడినది. ఈ విషయమీ పదవ మంత్రమునను ప్రకాశపరచ బడినది. ॥౧౦॥

10. May God bestow on me spiritual power. May we obtain wealth full of various kinds of splendour, and earthly power. May our desires be fulfilled, may they attain to fruition, Men use this Earth and knowledge (where by salvation is attained) for the pleasures of kingship. May these Earth and knowledge advise me. May God, as my ultimate refuge and resort instruct me. This is thus ordained in the Veda.

**౪౨. ఉపహూతే త్యస్య ఋషిః స ఏవ. ద్యావా పృథివీ దేవతే. బ్రాహ్మీ బృహతీ ఛన్దః. మధ్యమః స్వరః.**

**పునస్తమేవార్థం దృఢయతి. మరల పై మంత్రమున చెప్పబడిన అర్థములనే దృఢపరచెను.**

౪౨ ఉపహూతో ద్యౌష్పితోప మాం ద్యౌష్పితా హ్వయతామగ్నిరాగ్నీధ్రా

త్స్వాహా। దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో

హస్తాభ్యామ్। ప్రతిగృహ్ణామ్యగ్నే ష్ట్వాస్యేన ప్రాశ్నామి ॥౧౧॥

ప. వి:- ఉపహూత ఇత్యుప+హూతః, ద్యౌః, పితా, ఉప, మామ్, ద్యౌః, పితా, హ్వయతామ్, అగ్నిః, ఆగ్నీధ్రాత్, స్వాహా, దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర+సవే,

అశ్వినోః, బాహుభ్యామితి బాహు+భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ప్రతి, గృహ్ణామి, అగ్నేః, త్వా, ఆస్యేన, ప్ర, అశ్నామి.॥౧౧॥

పదార్థః:-(ఉపహూతః) కృతోపహ్వానః, (ద్యౌః) ప్రకాశరూపః (పితా) సర్వపాలక ఈశ్వరః. (ఉప) క్రియార్థే (మామ్) సుఖభోక్తారమ్. (ద్యౌః) ప్రకాశమయః, (పితా) పాలనహేతుః సూర్యలోకః. (హ్వయతామ్) హ్వయతి. అత్ర వ్యత్యయేన లడర్థేలోట్. (అగ్నిః) జాఠరస్థః. (ఆగ్నీధ్రాత్) అన్నాశయాత్. సాధుత్వమస్య పూర్వవజ్ జ్ఞేయమ్. (స్వాహా) సుహుతం సుఖకార్యాహేశ్వరః. (దేవస్య) హర్షకరస్య. (త్వా) త్వాం తం వా. (సవితుః) సర్వస్య జగతః ప్రసవితురీశ్వరస్య (ప్రసవే) ఉత్పన్నేఽస్మిన్ జగతి (అశ్వినోః) ప్రాణాపానయోః (బాహుభ్యామ్) ఆకర్షణధారణాభ్యామ్, (పూష్ణః) పుష్టిహేతోః సమానస్య వాయోః, (హస్తాభ్యామ్) శోధనసర్వాంగప్రాపణాభ్యామ్. (ప్రతిగృహ్ణామి) నిత్యం స్వీకరోమి (అగ్నేః) భౌతికస్య. (పాచకస్య) (త్వా) తం భక్ష్యం పదార్థమ్. (ఆస్యేన)ముఖేన ఓష్ఠాత్ప్రభృతి ప్రాక్కాకలకాదాస్యమ్, అ. ౧. ౧,౯ ఇతి మహాభాష్యే. అస్యన్తిప్రక్షిపన్తి ఉదరేఽన్నాదికం యేన తదాస్యం ముఖమ్. (ప్ర) గుణైర్యత్ప్రకృష్టం తదర్థే. క్రియాయోగే. ప్రపరేత్యేతస్య ప్రాతిలోమ్యం ప్రాహ. నిరు. ౧. ౩. (అశ్నామి) భుంజే. అయం మంత్రః శ. ౧.౬.౩. ౩౯-౪౪. వ్యాఖ్యాతః. ॥౧౧॥

అన్వయః :-మయా ద్యౌః పితేశ్వర ఉపహూతో మాముపహ్వయతాం స్వీకరోత్వేవం మయా ద్యౌః పితా పాలనహేతుః సూర్యలోక ఉపహూతః స్పర్ధితః సన్ మాం విద్యాయై ఉపహ్వయతి. యోఽగ్నిః స్వాహా సుహుతం భుక్తమన్నమాగ్నీధ్రాత్ పచతి యో దేవస్య సవితుః ప్రసవే వర్తమానోఽస్తి తమహంభోగమశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం ప్రతి గృహ్ణామి. గృహీత్వా చ ప్రదీప్తస్యాగ్నేర్మధ్యే పాచయిత్వాఽఽస్యేన ప్రాశ్నామి. ॥౧౧॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. మనుష్యైరాత్మశుద్ధ్యర్థమనన్తవిద్యాప్రకాశకస్య పరమేశ్వరస్యాహ్వానం నిత్యం కార్యమ్. తథా చ విద్యాసిద్ధయే చక్షుషా సంశోధ్య జాఠరాగ్నిం ప్రదీప్య సంస్కృతం మితమన్నం నిత్యం భోక్తవ్యమ్. ఈశ్వరేణ జగత్యుత్పాదితైః పదార్థైర్యః సర్వో భోగః సిద్ధ్యతి, స చ విద్యాధర్మయుక్త్యైవ వ్యవహారేణ భోక్తవ్యో భోజయితవ్య శ్చ. యే పూర్వమంత్రేణ పృథివ్యాం విద్యయా ప్రాప్తవ్యా మావ్యకారిణః పదార్థా ఉక్తా స్తేషాం భోగో ధర్మేణ యుక్త్యా చ సర్వైః కార్య ఇత్యనేన ప్రతిపాదితః ॥౧౧॥

**పదార్థము** :-నాచే (ద్యౌః) ప్రకాశమయుడు (పితా) సర్వపాలకుడు నగు ఈశ్వరుడు (ఉపహూతః) ప్రార్థించబడెనో(మామ్) సౌఖ్యములనుభవించు నన్ను (ఉపహ్వయతామ్) చక్కగా స్వీకరించుగాక! ఇదేవిధముగ (ద్యౌః) ప్రకాశవంతమగు (పితా) సకల శ్రేష్ఠక్రియలను పాలించుటకు హేతువగు సూర్యలోకము (ఉపహూతః) నాచే క్రియలయందు ప్రయుక్తమొనర్చబడినదై (మామ్) సకలసుఖముల ననుభవించెడి నన్ను విద్యనిమిత్తము (ఉపహ్వయతామ్) సంయుక్తపరచునుగాక! (అగ్నిః) ఏ జఠరాగ్ని (స్వాహా) బాగుగాతినబడిన యన్నమును (అగ్నిధ్రాత్) ఉదరమునందున్న యన్నకోశమున జీర్ణమొనర్చుచున్నదో దానితో (దేవస్య) సంతోషమును గలిగించువాడును (సవితుః) సృష్టి కర్తయునైన పరమేశ్వరునిచే నుత్పన్నమొనర్చబడిన (ప్రసవే) విశ్వమున స్థిరమై యున్న (త్వా) ఆ భోగమును నేను (అశ్వినోః) ప్రాణాపానముల (బాహుభ్యామ్) ఆకర్షణ, ధారణగుణముల చేతను (పూష్ణః) పుష్టికి కారణమైన సమానవాయువుయొక్క (హస్తాభ్యామ్) శోధనగుణముచేతను శరీరమునందలి ప్రతియంగమునకుజేర్చు గుణముచేతను (ప్రతిగృహ్ణామి) బాగుగా గ్రహించుచున్నాను. ఆ పిదప (అగ్నేః) ప్రజ్వలిత యగ్నియందు పక్వమొనర్చి (త్వా) భుజించదగిన యన్నమును (ఆస్యేన) నోటితో (ప్రాశ్నామి) తినుచున్నాను. ॥౧౧॥

**భావార్థము** :-ఈ మంత్రమున శ్లేషాలంకార మున్నది. మనుష్యు లెల్లరును తమ ఆత్మశుద్ధికై, అనంత విద్యలను ప్రకాశమొనర్చిన యా జగదీశ్వరుని సదా ఆహ్వానించవలయును అనగా అనుదినమును సేవించవలయును. మరియు విద్యాసిద్ధికై ఉదరాగ్నిని ప్రజ్వలితమొనర్చి నేత్రములతో బాగుగా జూచి పక్వమొనర్చబడిన యన్నమును తగు మాత్రముగ నిత్యమును భుజించవలయును. ఈశ్వరునిచే సృష్టించబడిన పదార్థములవలన సిద్ధమగు సకల భోగములను ఈ లోకమున విద్యాధర్మయుక్త వ్యవహారములచే భోగించవలయును [అనగా భుజించవలయును]. ఎల్లరును భుజించునట్లు చేయవలెను. పూర్వమంత్రమున భూమండలమున విద్యద్వారా ప్రాప్తించదగినవియు, గౌరవము గలిగించునవియు నగు ఏ పదార్థములు చెప్పబడియున్నవో, వానిని మానవు లెల్లరును పురుషార్థముద్వారా సేకరించుకొని ధర్మముతోను, యుక్తితోను అనుభవించవలయునని ఈ మంత్రమున ప్రతిపాదించబడినది. ॥౧౧॥

11. I have prayed to the Effulgent, All sustaining God, May the Lord Father accept my prayer. Our digestive faculty digests by means of gastric juice the food put into the stomach. In this universe created by the All-Blissful God, I take that food through the qualities of attraction and retention, of inhalation and exhalation; and the forces of purification and permeation of the invigorating air, through out the body. Cooking my food in the burnt fire I eat it with my mouth.

౪౩. ఏతన్త ఇత్యస్య ఋషిః స ఏవ. సవితా దేవతా. భురిగ్బృహతీ ఛన్దః. మధ్యమః స్వరః.

కస్మై ప్రయోజనాయ కేనాయం విద్యాప్రబంధః ప్రకాశిత ఇత్యుపదిశ్యతే.

ఏ ప్రయోజనముకై ఈ విద్యా ప్రబంధమును నెవ్వడు ప్రకాశిత మొనర్చెనో

యా మంత్రమునం దుపదేశించబడినది.

౪౩ ఏత స్తే దేవ సవితర్యజ్ఞం ప్రాహు ర్బృహస్పతయే బ్రహ్మణే।
తేన యజ్ఞమవ తేన యజ్ఞపతి న్తేన మా మవ ॥౧౨॥

ప.వి:- ఏతమ్, తే, దేవ, సవితః, యజ్ఞమ్, ప్ర, ఆహుః, బృహస్పతయే, బ్రహ్మణే, తేన, యజ్ఞమ్, అవ, తేన, యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, తేన, మామ్, అవ.॥౧౨॥

పదార్థః:- (ఏతమ్)పూర్వోక్తం (తే) తవ. (దేవ) దివ్యసుఖగుణానాం దాతః (సవితః) సకలైశ్వర్య విధాతర్జగదీశ్వర! (యజ్ఞమ్) యం సుఖాయ యష్టు మర్హమ్, (ప్రాహుః) ప్రకృష్టం బ్రువన్తి (బృహస్పతయే) బృహత్యా వేదవాణ్యాః పాలకాయ (బ్రహ్మణే) చతుర్వేదాధ్యయనేన బ్రహ్మత్వాధికారం ప్రాప్తాయ (తేన) బృహద్విజ్ఞానదానేన (యజ్ఞమ్) పూర్వోక్తం త్రివిధం, (అవ) నిత్యం రక్ష (తేన) ధర్మానుష్ఠానేన, (యజ్ఞపతిమ్) యజ్ఞస్యానుష్ఠానేన పాలకమ్, (తేన) విద్యాధర్మప్రకాశేన, (మామ్) (అవ) రక్ష. అయం మంత్రః.శ.౧.౬.౨. ౧౪-౨౧. వ్యాఖ్యాతః ॥౧౨॥

అన్వయః:-హే దేవ సవితర్జగదీశ్వర! వేదా విద్వాంసశ్చ యమేతం యజ్ఞం భవత్ప్రకాశితం ప్రాహుర్యేన బృహస్పతయే బ్రహ్మణే సుఖాధికారాః ప్రాప్నువన్తి తేనేమం యజ్ఞం యజ్ఞపతిం మాం చావ సతతం రక్ష ॥౧౨॥

భావార్థః:- ఈశ్వరేణ సృష్ట్యాదౌ గుణవద్భ్యో ఽగ్నివాయురవ్యంగిరోభ్యశ్చతుర్వేదోపదేశేన సర్వేషాం మనుష్యాణాం విద్యాప్రాప్త్యై సుఖాయ యజ్ఞానుష్ఠానవిధిరుపదిష్టో ఽనేనైవ రక్షణవిధానం చ. నైవ విద్యాశుద్ధి క్రియాభ్యాం వినా కస్యచిత్సుఖరక్షణే భవితుమర్హత స్తస్మాత్సర్వైః పరస్పరం ప్రీత్యై తయోర్వృద్ధిరక్షణే ప్రయత్నతః సదైవ కార్యే. య శ్చైకాదశేన మన్త్రేణ యజ్ఞఫలభోగ ఉక్తస్తత్ప్రకాశ ఈశ్వరేణైవ కృత ఇతి గమ్యతే ॥౧౨॥

పదార్థము :- ఓ (దేవ) దివ్యసుఖముల, లేక ఉత్తమ గుణముల ప్రదాతా! (సవితః) సకలైశ్వర్యవిదాతవగు ఓ జగదీశ్వరా! వేదములు మరియు విద్వాంసులు నీచే ప్రకటించబడిన (ఏతమ్)పైన సూచించిన యజ్ఞమును (ప్రాహుః) చక్కగా కీర్తించుచున్నారు (బృహస్పతయే) సర్వశ్రేష్ఠమగు వేదవాణిని పాలించువారికి (బ్రహ్మణే) చతుర్వేదముల నధ్యయనమొనర్చినందువలన బ్రహ్మపదవిలభించిన విద్వాంసులకు సుఖము మరియు శ్రేష్ఠమగు నధికారములు లభించుచున్నవి. (తేన) అట్టి బృహద్విజ్ఞాన దానముచే (యజ్ఞమ్) పూర్వోక్తముత్త్రివిధ యజ్ఞములను (అవ) సదా [యజ్ఞసంబంధమైన ధర్మముచే] రక్షించుము. (యజ్ఞపతిమ్) యజ్ఞమొనర్చు

యజమానులను సకల ప్రాణులకు సుఖమును గలిగించు విద్వాంసులను (మా) నన్నును (తేన) విద్యాధర్మముల ప్రకాశముచే (అవ) రక్షించుము. ॥౧౨॥

భావార్థము :- ఈశ్వరుడు సృష్ట్యాదియందు దివ్యగుణములు గల అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసు డను ఋషులకు చతుర్వేదము లుపదేశించెను. అందు సకలమానవులకు విద్యాప్రాప్తితో బాటు సమస్తమును రక్షించు యజ్ఞానుష్ఠానవిధియు నుపదేశించెను. ఏలన; విద్య లేక, శుద్ధాచరణ లేక ఎవ్వరికిని సుఖముగాని, రక్షణ గాని లభించజాలదు. కావున మనమెల్లరమును పరస్పరము ప్రీతిపూర్వకముగ, ప్రయత్న పూర్వకముగ ఆ రెండింటిని వృద్ధిపరచి రక్షణ జేయవలయును. పదునొకండవ మంత్రమున నే యజ్ఞఫల భోగము చెప్పబడెనో దానిని పరమాత్మయే ప్రకాశపరచెనని ఈ మంత్రము ధృవపరచుచున్నది. ॥౧౨॥

12. Oh Lord, the Creator of the universe, the Vedas and the learned proclaim this fore - mentioned yajna of Thine for Brihaspati and Brahma. Through that great sacrifice protect my yajna, protect the performer of the Yajna, protect Thou me!.

౧౩. మనోజూతిరిత్యస్య ఋషిః స ఏవ. బృహస్పతి ర్దేవతా. విరాడ్ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

యేన యజ్ఞః కర్తుం శక్యస్తదుపదిశ్యతే.

దేనిచే యజ్ఞమునొనర్ప వీలగుచున్నదో ఆ విషయము నీ మంత్రమునం దుపదేశించబడినది.

౧౩ మనో జూతి ర్జుషతా మాజ్యస్య బృహస్పతి ర్యజ్ఞమిమం తనో త్వరిష్టం

యజ్ఞꣳ। సమిమ్దధాతు। విశ్వేదేవాస ఇహ మాదయన్తా మోం ప్రతిష్ఠ॥౧౩॥

ప. వి:- మనః, జూతిః, జుషతామ్, ఆజ్యస్య, బృహస్పతిః, యజ్ఞమ్, ఇమమ్, తనోతు, అరిష్టమ్, యజ్ఞమ్, సమ్, ఇమమ్, దధాతు, విశ్వే, దేవాసః, ఇహ, మాదయన్తామ్, ఓమ్, ప్ర, తిష్ఠ. ॥౧౩॥

పదార్థః :- (మనః) మననశీలం జ్ఞానసాధనమ్. (జూతిః) వేగేన వ్యాప్తికర్మ. ఊతి యూతి జూతి.. అ. ౩. ౩. ౯౭ అనేన నిపాతితః, (జుషతామ్) ప్రీత్యా సేవతామ్, (ఆజ్యస్య) యజ్ఞసామగ్రీమ్. సుపాం సులుగితి ద్వితీయాస్థానే షష్ఠీ (బృహస్పతిః) బృహతాం ప్రకృత్యాకాశాదీనాం పతిః పాలకో జగదీశ్వరః. తద్ బృహతోః కరపత్యోశ్చోరదేవతయోః సుట్ తలోపశ్చ. అ.౬.౧.౧౫౭. అనేన వార్తికేన బృహస్పతిశబ్దో నిపాతితః (యజ్ఞమ్) సంసారాఖ్యమ్. (ఇమమ్) ప్రత్యక్షాప్రత్యక్షం సుఖభోగహేతుమ్. (తనోతు) విస్తారయతు (అరిష్టమ్) రిష్యతే

హింస్యతే యః స రిష్టో న రిష్టో ఽరిష్టస్తమ్, (యజ్ఞమ్) అస్మాభిరనుష్ఠితం మర్థమ్ (సమ్) ఏకీభావే క్రియాయోగే (ఇమమ్) పమంక్షం విజ్ఞానయజ్ఞమ్ (దధాతు) ధారయతు (విశ్వేదేవాసః) సర్వే విద్వాంసః. అత్ర జసేరసుగాగమః (ఇహ) అస్మిన్ సంసారే హృదయే వా. (మాదయన్తామ్) హృష్యన్తు (ఓమ్) ఈశ్వరవాచకో యజ్ఞో వేదవిద్యా వా. ఓ3మ్ ఖం బ్రహ్మ. యజుః. ౪౦. ౧౭. అత్ర అవతేష్టి లోపశ్చ. ఉ. ౧. ౧౪౧ అనేనాఽవ ధాతోర్మన్ ప్రత్యయోఽస్య టిలోపశ్చ. (ప్రతిష్ఠ) ప్రతిష్ఠతి వా అత్రాన్యపక్షే వ్యత్యయో లడర్థే లోట్ చ. అయం మంత్రః శ. ౧. ౬. ౨. ౨౨. వ్యాఖ్యాతః. ॥౧౩॥

అన్వయః:- మమ జూతిర్మన ఆజ్యస్య జుషతాం బృహస్పతిర్యమిమం యజ్ఞమరిష్టం తనోతు సందధాతు. హే విశ్వేదేవాస! ఏతమరిష్టం యజ్ఞద్వయం సంతన్య సంధాయ చేహ మాదయన్తామ్. హే ఓంకారవాచ్య బృహస్పతే! త్వమిహ ప్రతిష్ఠ కృపయేమం యజ్ఞం విద్యాం చ ప్రతిష్ఠాపయ. ॥౧౩॥

భావార్థః:- ఈశ్వర ఆజ్ఞాపయతి. హేమనుష్యా! యుష్మన్మనః సత్కర్మణ్యేవప్రాప్నోతు. మయా యోఽయం సంసారే యజ్ఞః కర్తుమాజ్ఞాప్యతే తమేవానుష్ఠాయ సుఖినో భవన్తు భావయన్తు వా. ఓమితి పరమేశ్వరస్యైవ నామ. యథా పితాపుత్రయోః ప్రియః సంబన్ధ స్తథైవేశ్వరేణ సహోంకారస్య సంబన్ధోఽస్తి. నైవ కస్యచిత్ సత్క్రియయా వినా ప్రతిష్ఠా భవితుమర్హతి. తస్మాత్సర్వైర్మనుష్యైః సర్వథాఽధర్మం విహాయ ధర్మకార్యాణ్యేవ సేవనీయాని. యతః ఖల్వవిద్యాన్ధకారనివృత్తయే విద్యార్కః ప్రకాశేత. ద్వాదశమంత్రేణ యో యజ్ఞః ప్రకాశితస్తస్యానుష్ఠానేన సర్వేషాం ప్రతిష్ఠాసుఖే భవత ఇత్యనేన ప్రకాశితమ్ ॥౧౩॥

పదార్థము:- (జూతిః) తన వేగముచే సకల ప్రదేశములందును ప్రవేశించునదియు (మనః) మననశీలము, జ్ఞానసాధనమును నైన నా మనస్సు (ఆజ్యస్య) యజ్ఞసామగ్రిని (జుషతామ్) సేవించుగాక! (బృహస్పతిః) మహామహా ప్రకృతి, ఆకాశము మున్నగు పదార్థముల కధికారియై పాలించు పరమేశ్వరుడు (ఇమమ్) ఈ ప్రకట అప్రకట రూపమును (అరిష్టమ్) హింసారహితమును (యజ్ఞమ్) సుఖభోగరూపమగు నీ యజ్ఞమును (తనోతు) విస్తారపరచునుగాక! (అరిష్టమ్) విడువదగనిదియు (యజ్ఞమ్) మే మనుష్ఠించుటకు యోగ్యమైనట్టిదియు, విజ్ఞానప్రాప్తిరూపము నగు (ఇమమ్) ఈ యజ్ఞమును (సం దధాతు) ఉత్తమముగా ధరింపజేయుగాక! (విశ్వేదేవాసః) ఓ సకల విద్వాంసులారా! మీరు పాలించుటకు యోగ్యమగు ఈ రెండు యజ్ఞములను ధారణమొనర్చి, విస్తరింపజేసి (ఇహ) ఈ లోకమునందు, లేక మీ మనస్సులందు (మాదయన్తామ్) ఆనందితు లగుడు. (ఓ3మ్) ఓంకారనామమున సంబోధించబడు ఓ జగదీశ్వరా! (బృహస్పతిః) అనంత విశాలము లగు నీ ప్రకృత్యాదులను పాలించు నీవు (ఇహ) ఈ లోకము [విద్వాంసుల హృదయము]లందు (ప్రతిష్ఠ) దయతో ఈ యజ్ఞమును, వేదవిద్యాదులను స్థాపించుము. ॥౧౩॥

భావార్థము:-ఈశ్వరు డిట్లాజ్ఞాపించుచున్నాడు:-ఓ మానవులారా! మీ మనస్సులు ఉత్తమ కార్యములందు ప్రవేశించుగాక! విశ్వమున యజ్ఞముల నొనర్చుటకు నే నిడిన యాజ్ఞలను మీరు చక్కగా ననుష్ఠించి సుఖవంతులై ఇతరులను కూడ సుఖవంతులనుగ నొనర్చుడు. (ఓ౩మ్) ఇది పరమేశ్వరుని ముఖ్యనామము. పితాపుత్రుల ప్రేమసంబంధ మున్నటులే పరమేశ్వరునకు [ఓ౩మ్] ఓంకారమునకును సంబంధము గలదు. సత్కార్యము లొనర్చక ఎవ్వరికి ప్రతిష్ఠ గలుగజాలదు. కావున మానవు లెల్లరును అధర్మములను త్యజించి ధర్మకార్యములనే సేవించుట యోగ్యమై యున్నది. అందువలన నిశ్చయముగ లోకమున అవిద్యాంధకారము నశించి విద్యారూప సూర్యోదయ మగును గాక! పం(డెండవ మం(త్రమున (ప్రకటించబడిన యజ్ఞమును అనుష్ఠించినచో సమస్త మానవులు సౌఖ్యముల ననుభవించగలరని ఈ మం(త్రమున ఉపదేశించబడినది. ॥౧౩॥

13. May my active mind enjoy the yajna's provisions. May God expand and preserve this unabandonable acquisition of knowledge, which is a kind of yajna. May all the learned persons in the world rejoice. May Om be seated in our hearts.

౪౫. ఏషా తే ఇత్యస్య ఋషిః స ఏవ. అగ్ని ర్దేవతా సర్వస్య, పూర్వోऽనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః,

అగ్నే వాజజిదిత్యత్ర నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అగ్నినా యజ్ఞే కథ ముపకారో గ్రాహ్య ఇత్యుపదిశ్యతే.

యజ్ఞమున అగ్నిచే నుపకార మెటుల పొందవలెనో యుపదేశించబడినది.

౪౫ ఏషా తేऽ అగ్నే సమిత్తయా వర్ధస్వ చా చ ప్యాయస్వ ।

వర్ధిషీమహి చ వయమా చ ప్యాసిషీమహి ।

అగ్నే వాజజిద్వాజం త్వా సస్నివాꣳసం వాజజితꣳ సంమార్జ్మి ॥౧౪॥

ప.వి:- ఏషా, తే, అగ్నే, సమిదితి సమ్+ ఇత్, తయా, వర్ధస్వ, చ, ఆ, చ, ప్యాయస్వ, వర్ధిషీమహి, చ, వయమ్, ఆ, చ, ప్యాసిషీమహి, అగ్నే, వాజజిదితి వాజ+జిత్, వాజమ్ త్వా, సస్నివాꣳసమితి సస్నివాꣳసమ్, వాజజితమితి వాజ+జితమ్, సమ్, మార్జ్మి.॥౧౪॥

పదార్థః-(ఏషా) ప్రదీప్తిహేతుః. (తే) తవ తస్య వా. (అగ్నే) పరమేశ్వర భౌతికో వా. (సమిత్) సమ్యగిధ్యతే దీప్యతేऽనయా సా విద్యా కాష్ఠాదిర్వా, (తయా) విద్యయా సమిధా వా, (వర్ధస్వ) వర్ధతే వా. సర్వత్రాంత్యపక్షే వ్యత్యయో లడర్థే లోట్ చ. (చ) సముచ్చయే

(అ) క్రియాయోగే (చ) పునరర్థే (ప్యాయస్వ) ప్యాయతే వా (వర్ధిషీమహి) స్పష్టార్థమ్, (చ) సముచ్చయే (వయమ్) విద్యావన్తో ధార్మికాః (అ) సమన్తాత్ క్రియాయోగే (చ) అన్వాచయే (ప్యాసిషీమహి) అత్ర ప్యైఙ్ ధాతోః సిబుత్సర్గ శ్ఛన్దసి.అ. 3. ౧. 34. అనేన వార్త్తికేన సిప్రత్యయః. (అగ్నే) జ్ఞానస్వరూపవిజయప్రదేశ్వర భౌతికో వా. (వాజజిత్) వాజం సర్వస్య వేగం జయతి స ఈశ్వరః. వాజం జయతి యేన వా స భౌతికః. (వాజమ్) జ్ఞానవన్తం వేగవన్తం వా (త్వా) త్వాం తం వా. (సస్వాంసమ్) సర్వం జ్ఞానవన్తం శిల్పవిద్యాగుణ ప్రాప్తిమన్తం వా. (వాజజితమ్) యో యేన వా వాజం సంగ్రామం జయతి తమ్ (సమ్) సమ్యగర్థే, (మార్జ్మి) శుద్ధో భవామి శోధయామి వా. అయం మంత్రః శ. ౧,౬ 4. 3-2. వ్యాఖ్యాతః ॥౧4॥

అన్వయః :- హే అగ్నే జగదీశ్వర! తే తవ య్యైషా సమిత్ వేదవిద్యాస్తి తయాఽస్మాభిః స్తుతః సంస్త్వం వర్ధస్వ చాస్మాన్ నిత్యం వర్ధయ. హే భగవన్నేవం భవద్విదితగుణై రస్మాభిః ప్రకాశితః సంస్త్వం ప్యాయస్వ చాస్మాన్ నిత్యం ప్యాయయ. హే భగవన్నగ్నే వాజజిద్వాజం సస్వాంసం త్వాం వయం వర్ధిషీమహి. కృపయా భవాన్ చాస్మానపి వాజజితః సస్రుషో వాజాన్ కరోతు. యథా వయం భవన్త మాప్యాసిషీమహి తథైవ భవాంశ్చాస్మాన్ సర్వైః శుభగుణై రాప్యాయతామ్. అహం భవన్తమాశ్రిత్య సంమార్జ్మి భవదాజ్ఞానుష్ఠానేన శుద్ధో భవామీత్యేకః.

య్యైషా తేఽస్యాగ్నే ర్వర్ధికా సమిదస్తి తయా వాయం వర్ధతే ఆప్యాయతే చ వయం తం వాజం సస్వాంసం వాజజితమగ్నిం విద్యావృద్ధయే వర్ధిషీమహి. ఆప్యాసిషీమహి చ యతోఽయం శిల్పవిద్యాసిద్ధై ర్విమానాదిభి ర్యానైర్వాజాన్ సస్రుషో వాజజితోఽస్మాన్ విజయేన వర్ధయతి తమహం సంమార్జ్మీతి ద్వితీయః.॥౧4॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. క్రియాద్వయం చాదరార్థం విజ్ఞేయం. యే మనుష్యాః పరమేశ్వరాజ్ఞాపాలనే క్రియాకౌశలే చ వర్ధన్తే తే విద్యయాం సర్వానానన్దయిత్వా దుష్టాన్ శత్రూన్ జిత్వా శుద్ధా భూత్వా సుఖయన్తి నేతరేఽలసాః. చకారచతుష్టయే నేశ్వరాజ్ఞా ధర్మ్యా సూక్ష్మస్థూలతయాఽనేకవిధాస్తి తథా క్రియాకాండే కర్తవ్యాని కర్మాణ్యనేకాని సన్తీతి విజ్ఞేయమ్ త్రయోదశమంత్రేణ యా వేదవిద్యా ప్రతిపాదితాస్తి తయా సుఖార్థం యజ్ఞసంధానముక్తమనే నైతయ్యైవం పురుషార్థః కార్య ఇతి ప్రకాశితమ్.॥౧4॥

పదార్థము :-(అగ్నే) ఓ పరమేశ్వరా! (తే) నీ యొక్క (ఏషా సమిత్) పదార్థములగుణములను చక్కగా ప్రకాశపరచెడు ఏ వేదవిద్య గలదో (తయా) దానిచే మే మొనర్చు స్తుతులను పొంది నీవు సదా (వర్ధస్వ) మా జ్ఞానమును వృద్ధి నొందించుము (తయా) మరియు ఆ వేదవిద్యచే మమ్ము నిత్యము వృద్ధిపరచుము. ఓ భగవన్! నీ గుణముల నెరిగిన మాచే (చ) ప్రకాశితుడవై (ప్యాయస్వ) మా యాత్మలయందు వృద్ధిజెందుము. అట్లే

మమ్ముదను వృద్ధిపరచుము. ఓ పరమాత్మా! (అగ్నే) ఓ విజ్ఞాన స్వరూపా! విజయ ప్రదాతా! (వాజజిత్) సకల వేగములను జయించు పరమేశ్వరా! (వాజమ్) జ్ఞానస్వరూపుడవు (సస్వాంసమ్) సర్వము నెరిగినవాడవు (త్వా) అగు నిన్ను మేము (వర్ధిషీమహి) స్తుతులచే వర్ధింపజేయుదుముగాక; ప్రాప్తించుకొందుముగాక! (చ) మరియు దయయుంచి మమ్ముకూడ సమస్త వేగములను జయించువారుగను జ్ఞానవంతులుగను నొనర్చి అందరి మనోవ్యవహారముల నెరుగువారముగను నొనర్చుము. మేము నిన్ను (ఆ ప్యాసిషీమహి) అధికముగ స్తుతించుచున్నటులే నీవు కూడ మమ్ము సర్వోత్తమగుణ సుఖములతో (ఆప్యాయస్వ) వృద్ధియుక్తులుగ నొనర్చుము. మేము నీ యాశ్రయమును పొంది నీ యాజ్ఞాపాలన మొనర్చి (సంమార్జ్మి) చక్కగా పరిశుద్ధుల మగు చున్నాము. **ఇది మొదటి యర్థము.**

(ఏషా అగ్నే) ఈ భౌతికాగ్నిని (తే సమిత్) దానిని వృద్ధిపరచు, ప్రదీప్తమొనర్చు నే కాష్ఠ సమూహము గలదో (తయా) దానితో నీ యగ్ని (వర్ధస్వ) వృద్ధిగాంచుచున్నది. (ఆప్యాయస్వ) పరిపూర్ణమును నగుచున్నది. మేము (త్వా) అట్టి (వాజమ్) వేగవంతమును (సస్వాంసమ్) శిల్పవిద్యాగుణముల నొసగునదియు (వాజజితమ్) సమరములను జయింపజేయు సాధనమును నగు యగ్నిని విద్యావృద్ధి కొరకు (వర్ధిషీమహి) వ్యాపింపజేయుచున్నాము. (చ) మరియు (ఆ ప్యాసిషీమహి) శిల్పకళలను పరిపూర్ణపరచుచున్నాము. మరియు ఈ యగ్ని శిల్పవిద్యచే సిద్ధముచేయబడిన విమానములు మున్నగు యానముల ప్రాప్తిచేతను శిల్పవిద్యయొక్క వేగవంతములగు గుణముల ప్రాప్తిచేతను సంగ్రామములందు జయమును పొందుచున్న మమ్ము విజయముచే వృద్ధిపరచుచున్నది. కావున (త్వా) ఆ యగ్నిని మేము బాగుగా ప్రయోగించుచున్నాము. **ఇది రెండవ యర్థము.**॥౧౪॥

భావార్థము :- ఈ మంత్రమున శ్లేషాలంకార మున్నది. (ఒకే అర్థము గల రెండు క్రియా పదముల ప్రయోగము ఆదరణ నిమిత్తమని యెరుగవలయును.) పరమేశ్వరుని యాజ్ఞాపాలనమందును, క్రియాకౌశలమందును ఉన్నతిని పొందుచున్న మానవులు విద్యాసుఖములయందు అందర నానందపరచి దుష్ట శత్రువులను జయించి శుద్ధులై సుఖవంతు లగుచున్నారు. ఎన్నడును సోమరులు కాజాలరు. నాలుగు చకారముల (మంత్రమునందు వచ్చుట) వలన పరమేశ్వరుని యాజ్ఞ ధర్మయుక్తమనియు, సూక్ష్మ స్థూలత్వ భేదము లనేకవిధములనియు, అటులనే క్రియాకాండమందు చేయవలసిన యోగ్యకార్యములును అనేక విధములనియు నెరుగవలెను. పదమూడవ మంత్రమున చెప్పబడిన వేదవిద్యద్వారా సౌఖ్యములకొరకు యజ్ఞసంధాన మొనర్చవలె ననియు, పురుషార్థమే ముఖ్యమనియు నీ మంత్రమున ప్రతిపాదించబడినది.॥౧౪॥

**14. Oh God, may Thou be glorified by our praises sung through Thy Vedas. May Thou promote our knowledge. Oh God, may we advance our soul. O God Thou controllest the activities of all. Thou art the embodiment of knowledge. Thou art Omniscient and the Bringer of victory in battles. May we prosper and sing Thy praises. I become pure and holy by following Thy commands!.**

౪౬. అగ్నీ షోమయోరితి సర్వస్య ఋషిః స ఏవ. అగ్నీషోమౌ దేవతే. పూర్వార్ధే బ్రాహ్మీబృహతీ ఛన్దః, మధ్యమః స్వరః, ఉత్తరార్ధే ఇన్ద్రాగ్నీ దేవతే. అతిజగతీ ఛన్దః. నిషాదః స్వరః.

అథ తేన కిం కిం దూరీకర్తవ్యమిత్యుపదిశ్యతే.

ఇపుడా యజ్ఞముచే నేమేమి దూరమొనర్పవలయుననెడి విషయము ఈ దిగువ మంత్రమునం దుపదేశించబడినది.

౪౬ అగ్నీషోమయోరుజ్జితిమనూజ్జేషం వాజస్య మా ప్రసవేన ప్రోహామి। అగ్నీషోమౌ తమపనుదతాం యో౨ఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మో వాజస్యైనం ప్రసవేనాపోహామి। ఇన్ద్రాగ్న్యోరుజ్జితిమనూజ్జేషం వాజస్య మా ప్రసవేన ప్రోహామి। ఇన్ద్రాగ్నీ తమపనుదతాం యో౨ఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మో వాజస్యైనం ప్రసవేనాపోహామి ॥౨౯॥

ప. వి:- అగ్నీషోమయోః, ఉజ్జితి మిత్యుత్+జితిమ్, అను, ఉత్, జేషమ్, వాజస్య, మా, ప్రసవేనేతి ప్ర+సవేన, ప్ర+ఊహామి, అగ్నీషోమౌ, తమ్, అప, నుదతామ్, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః, వాజస్య, ఏనమ్, ప్రసవేనేతి ప్ర+సవేన, అప, ఊహామి, ఇన్ద్రాగ్న్యోః, ఉజ్జి తిమిత్యుత్౨ఽజితిమ్, అను, ఉత్, జేషమ్, వాజస్య, మా, ప్రసవేనేతి, ప్ర+సవేన, ప్ర+ఊహామి, ఇన్ద్రాగ్నీ౨ఽ ఇతీన్ద్రాగ్నీ, తమ్, అప, నుదతామ్, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః, వాజస్య ఏనమ్, ప్రసవేనేతి ప్ర+సవేన, అప, ఊహామి.॥౨౯॥

పదార్థః:-(అగ్నీషోమయోః) అగ్నిశ్చ సోమశ్చ తయోః ప్రసిద్ధాగ్నిచన్ద్రలోకయోః. అత్ర ఈదగ్నేః సోమవరుణయోః. అ. ౬.౩. ౨౭. అనేన దేవతాద్వంద్వసమాసేఽగ్నే రీకారాదేశః. (ఉజ్జితిమ్) జయత్యనయా సా జితిరుత్కృష్టా చాసౌ జితిశ్చ తాముత్కృష్టం విజయమ్. (అను) పశ్చాద్భావే (ఉత్) ఉత్కృష్టార్థే (జేషమ్) జయం కుర్యామ్ అత్ర లిఙర్థే లుఙడభావో వృద్ధ్యభావశ్చ. (వాజస్య) యుద్ధస్య. (మా) మాం విజేతారమ్; (ప్రసవేన) ఉత్పాదనేన ప్రకృష్టైశ్వర్యేణ సహ వా (ప్రోహామి) ప్రకృష్టతయా వివిధశుద్ధతర్కేణ యోజయామి. (అగ్నీషోమౌ) విద్యయా సమ్యక్ ప్రయోజితౌ. (తమ్) శత్రుం రోగం వా (అప) దూరీకరణే (నుదతామ్) ప్రేరయతః. అత్ర లడర్థే లోట్ (యః) అన్యాయకారీ (అస్మాన్) న్యాయకారిణః (ద్వేష్టిః) శత్రూయతి (యమ్) అన్యాయకారిణమ్, (చ) సముచ్చయే (వయమ్) న్యాయాధీశాః (ద్విష్మః) విరుధ్యామః (వాజస్య) యానవేగాదియుక్తస్య సైన్యస్య (ఏనమ్) పూర్వోక్తం దుష్టమ్. (ప్రసవేన) ప్రకృష్టతయా యుద్ధవిద్యాప్రేరణేన, (అప) దూరీకరణే (ఊహామి) వివిధతర్కేణ క్షిపామి (ఇన్ద్రాగ్న్యోః) ఇన్ద్రోవాయురగ్నిర్విద్యుత్తయోః, (ఉజ్జితిమ్) విద్యయా సమ్యగుత్కర్షమ్, (అనూజ్జేషమ్) అనుగతముత్కర్షం ప్రాప్నుయామ్. అస్య సిద్ధిః పూర్వవత్ (వాజస్య) ప్రేరణాప్రేరణవేగప్రాప్తేః (మా) మామ్ వాయువిద్యుద్విద్యాప్రాప్తమ్. (ప్రసవేన) ఐశ్వర్యార్థముత్పాదితేన (ప్రోహామి) ప్రకృష్టైర్వివిధై స్తర్కైః సుఖాని ప్రాప్నోమి (ఇన్ద్రాగ్నీ) పూర్వోక్తౌ సమ్యక్ సాధితౌ (తమ్) ద్వేషస్వభావమ్ (అప) నిషేధార్థే (నుదతామ్) ప్రేరయతః. అత్ర లడర్థే లోట్. (యః) అవిద్వాన్ (అస్మాన్) విదుషః (ద్వేష్టి) అప్రీతయతి (యమ్) దుష్టస్వభావమ్ (చ) సముచ్చయార్థే (వయమ్) విద్వాంసః (ద్విష్మః) అప్రీతయామః. (వాజస్య) విజ్ఞానస్య. (ఏనమ్) మూర్ఖమ్, (ప్రసవేన) ఉత్పాదనేన, (అప) వర్జనే. (ఊహామి) వివిధాం శిక్షాం కరోమి. అయం మంత్రః శ. ౧. ౭. ౧. ౧-౬ వ్యాఖ్యాతః.॥౧౫॥

అన్వయః :-అహమగ్నీషోమయోరుజ్జితిమనూజ్జేషమహం వాజస్య ప్రసవేన మా మాం ప్రోహామి మయా సమ్యక్సాధితావగ్నీషోమౌ యోఽస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తమపనుదతః. అహమేనం వాజస్య ప్రసవేనాపోహామి. అహమిన్ద్రాగ్న్యోరుజ్జితిమనూజ్జేషమహం వాజస్య ప్రసవేన మా మాం నిత్యం ప్రోహామి. అస్మాభిః సమ్యక్ సాధితావిన్ద్రాగ్నీ యోఽస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మ స్తమపనుదతః. అహం వాజస్య ప్రసవేనైన మపోహామి. ॥౧౫॥

భావార్థః:-ఈశ్వర ఉపదిశతి సర్వైర్మనుష్యైరివ విద్యాయుక్తిభ్యామగ్నిజలయోర్మేలనేన కలాకౌశలా ద్వేగాదిగుణానాం ప్రకాశేన తథా వాయువిద్యుతోర్విద్యయాతో సర్వదారిద్ర్యనాశేన

**శత్రూణాం విజయేన సుశిక్షయా మనుష్యాణాం మూఢత్వం దూరీకృత్య విద్వత్వం ప్రాపయ్య చ వివిధాని సుఖాని ప్రాప్తవ్యాని ప్రాపయితవ్యాని చైవం సమ్యక్ సర్వాః పదార్థవిద్యా జగతి ప్రకాశనీయాః. పూర్వేణ మంత్రేణ యత్కార్యం ప్రకాశితం తదనేన పోషితమ్.॥౧౫॥**

**పదార్థము** :-నేను (అగ్నీషోమయోః) ప్రసిద్ధ భౌతికాగ్ని మరియు చంద్రలోకమునందలి (ఉజ్జితిమ్) ఎదుర్కొనుటకు దుస్సాధ్యులైన శత్రువులను (అనూజ్జేషమ్) యథాక్రమముగ జయించెదనుగాక! (వాజస్య) సమరముయొక్క (ప్రసవేన) ఉద్పాదనముద్వారా విజయమునొందు (మా) నన్ను నేను స్వయముగ (ప్రోహామి) చక్కని తర్కముతో బాగుగ సంయుక్తపరచుకొందును గాక! విద్యచే క్రియాకుశలతయందు నాద్వారా బాగుగా సమకూర్చబడిన (అగ్నీషోమౌ)పైన దెలిపిన అగ్ని, చంద్రలోకములు (యః) అన్యాయకారియగు ఏ దుర్మార్గుడు (అస్మాన్) న్యాయముగ నడుచుకొను మమ్ము (ద్వేష్టి) ద్వేషించుచుండునో, ఏ యన్యాయకారిని (వయమ్)న్యాయాధీశుల మగు మేము (ద్విష్మః) ద్వేషించుచున్నామో (తమ్) అట్టి శత్రువును, ఆ వ్యాధులను (అపనుదతామ్) దూరమొనర్చును గాక! మరియు నేనును (ఏనమ్) ఈ దుష్టశత్రువును (వాజస్య) యానములు, వేగముతో గూడిన సైన్యములు గల సమరంగముయొక్క (ప్రసవేన) పవిత్రప్రేరణచే (అపోహామి) తొలగించుచున్నాను. (ఇన్ద్రాగ్న్యోః) వాయువు మరియు విద్యుత్తురూప అగ్నియొక్కయు విద్యచే (ఉజ్జితిమ్) శ్రేష్ఠమగు అభివృద్ధిని (అనుజ్జేషమ్) క్రమబద్ధముగా పొందుదును గాక! (వాజస్య) జ్ఞానముయొక్క ప్రేరణచే మేగ్రాప్తికై (ప్రసవేన) ఐశ్వర్యముకొరకు ఉత్పన్నమైన వాయువు విద్యుత్తుల విద్యచేగూడిన (మామ్) నాకు [నేను స్వయముగ నిత్యము] (ప్రోహామి) తర్కభావముచే ఉత్తమసుఖమును పొందెదను. నాచే చక్కగా సిద్ధ పరచబడిన (ఇన్ద్రాగ్నీ) వాయువును, విద్యుత్ రూపాగ్నియును (యః) ఏ మూర్ఖుడు (అస్మాన్) విద్వాంసుల మగు మమ్ము (ద్వేష్టి) ద్వేషించుచున్నాడో (చ) మరియు(యమ్) ఏ మూర్ఖునితో (వయమ్) మేము (ద్విష్మః) ప్రీతిరహితముగ వ్యవహరించుచున్నామో (తమ్) ఆ మూర్ఖుని మూర్ఖత్వము (అపనుదతామ్) దూరమొనర్చును గాక! మరియు నేనును (ఏనమ్) ఇట్టి (వాజస్య) విజ్ఞానముయొక్క (ప్రసవేన) ప్రకాశముతో (అపోహామి) ఉత్తమోత్తమ శిక్షణల నొసగి పరిశుద్ధపరచుచున్నాను.॥౧౫॥

**భావార్థము** :-సకల మానవులు విద్యాయుక్తులవలన అగ్ని జలములను ప్రకాశమొనర్చి వాయువు విద్యుదగ్నులయొక్క విద్యవలన సమస్త దారిద్ర్యములను నిర్మూలన మొనర్చి, శత్రువులను పరాజయమొనర్చి శ్రేష్ఠమగు శిక్షద్వారా [మానవుల] యజ్ఞానమును దూరమొనర్చి ఆ మూర్ఖులను విద్వాంసులుగ నొనర్చి అనేక సుఖములను ఈ లోకమున పొందవలెను. మరియు ఇతరులకు కూడా లభింపజేయవలయును. ఉత్తమ ప్రయత్నములతో సమస్త పదార్థముల విద్యలను లోకమున వ్యాపింపజేయవలయునని పరమేశ్వరు డుపదేశించు చున్నాడు. పై మంత్రమున ప్రకటించబడిన కార్యము ఈ మంత్రమున ధృవపరచబడినది. ॥౧౫॥

15. May I achieve victory like the victory of Fire and Moon. May I speed onward with the materials of war. May fire and Moon, drive off him who hates us, drive off the man whom we detest. May I remove that sinful enemy by warlike, military skill and equip-

ment. May I achieve victory like the victory of Air and lightning. May I achieve happiness through the impulse of knowledge, used for the acquisition of supremacy. May air and lightning properly employed, drive off him who hates us, drive off the man whom we dislike. I purify this ignorant person by the light of knowledge.

౪౭. వసుభ్యస్త్వేతి సర్వస్య ఋషిః స ఏవ. పూర్వార్ద్ధే ద్యావాపృథివీ మిత్రావరుణౌ చ దేవతాః.

నిచృదార్షీ పంక్తి శ్ఛన్దః. పంచమః స్వరః. వ్యన్తువయ ఇత్యారభ్యాన్త పర్యన్త

స్యాగ్ని ర్దేవతా. విరాట్ త్రిష్టుప్ ఛన్దః. ధైవతః స్వరః.

తస్మాత్ కిం భవతీ త్యుపదిశ్యతే. పూర్వోక్త యజ్ఞమువలన ఏమగు నను దీ మంత్రమునందుపదేశించెను.

౪౭ వసుభ్యస్త్వా రుద్రేభ్యస్త్వాదిత్యేభ్యస్త్వా సంజానాథాం ద్యావాపృథివీ మిత్రావరుణౌ త్వా వృష్ట్యావతామ్। వ్యన్తు వయోక్తం రిహాణా మరుతాం పృషతీర్గచ్ఛ వశా పృశ్నిర్భూత్వా దివం గచ్ఛ తతో నో వృష్టిమావహ। చక్షుష్పా ఽఅగ్నే ఽసి చక్షుర్మే పాహి ॥౧౬॥

ప.వి:- వసుభ్య ఇతి వసు+భ్యః, త్వా, రుద్రేభ్యః, త్వా, ఆదిత్యేభ్యః, త్వా, సమ్, జానాథామ్, ద్యావాపృథివీ ఇతి ద్యావా+పృథివీ, మిత్రావరుణౌ, త్వా, వృష్ట్యా, అవతామ్, వ్యన్తు, వయః, అక్తమ్, రిహాణాః, మరుతామ్, పృషతీః, గచ్ఛ, వశా, పృశ్నిః, భూత్వా, దివమ్, గచ్ఛ, తతః, నః, వృష్టిమ్, ఆ, వహ, చక్షుష్పాః, అగ్నే, అసి, చక్షుః, మే, పాహి ॥౧౬॥

పదార్థః:-(వసుభ్యః) అగ్న్యాదిభ్యోఽష్టభ్యః (త్వా) తం పూర్వోక్తం యజ్ఞమ్ (రుద్రేభ్యః) పూర్వోక్తేభ్య ఏకాదశభ్యః (త్వా) తమ్ (ఆదిత్యేభ్యః) ద్వాదశభ్యో మాసేభ్యః. (త్వా) తం క్రియామయమాహవమ్, (సమ్) సమ్యగర్థే (జానాథామ్) జానీతః ప్రాదుర్భూతవిద్యాపాదికే భవతః. అత్ర వ్యత్యయో లడర్థే లోట్ చ. (ద్యావాపృథివీ) సూర్యప్రకాశో భూమిశ్చ. అత్ర దివోద్యావేతి ద్యావాదేశః (మిత్రావరుణౌ) యః సర్వప్రాణో బహిఃస్థో వాయుర్వరుణోఽన్తస్థ ఉదానో వాయుశ్చ తౌ, (త్వా) తమిమం సంసారమ్. (వృష్ట్యా)

శుద్ధజలవర్షణేన (అవతామ్) రక్షతః, (వ్యన్తు) వ్యన్తి ప్రాప్నువన్తి. అత్ర సర్వత్ర లడర్థే లోట్. (వయః) పక్షిణ ఇవ గాయత్ర్యాదీని ఛన్దాంసి. (అక్తమ్) ప్రకటం వస్తు సుఖం వా. (రిహాణాః) అర్చకాః. రిహతీత్యర్చతికర్మసు పఠితమ్, నిఘం. 3. ౧౪. (మరుతామ్) వాయూనామ్. (పృషతీః) పృషన్తి సించన్తి యాభి ర్నాడీభిర్నదీభిర్వ్యాస్తాః, (గచ్ఛ) గచ్ఛతి, (వశా) కామితాహుతిః, (పృశ్నిః) అన్తరిక్షస్థాః. పృశ్నిరితి సాధారణనామసు పఠితమ్. నిఘం. ౧,౪ (భూత్వా) భావయిత్వా. అత్రాన్తర్గతో ణ్యర్థః. (దివమ్) సూర్యప్రకాశమ్, (గచ్ఛ) గచ్ఛతి (తతః) తస్మాత్ (నః) అస్మాకమ్, (వృష్టిమ్) జలసమూహమ్, (ఆ) సమన్తాత్ క్రియాయోగే (వహ) వహతి ప్రాపయతి, (చక్షుష్పాః) చక్షుర్దర్శనం రక్షతీతి సః (అగ్నే) అగ్నిర్భౌతికః (అసి) భవతి. అత్ర సర్వత్ర పురుషవ్యత్యయః (చక్షుః) బాహ్యమాభ్యన్తరం విజ్ఞానం తత్సాధనం వా. (మే) మమ. (పాహి) పాతి రక్షతి. అయం మంత్రః.శ.౧. ౭. ౧.౭-౧౯. వ్యాఖ్యాతః.॥౧౬॥

అన్వయః :- వయం వసుభ్యస్త్వా తం రుద్రేభ్య స్త్వా తమాదిత్యేభ్యస్త్వా తం నిత్యం ప్రోహామః. యజ్ఞేనేమే ద్యావాపృథివీ సంజానాథామ్. మిత్రావరుణౌ వృష్ట్యా త్వా తమిమం సంసారం ద్యావాపృథివీస్థమవతామతవః. యథా వయః పక్షిణోఽక్తం వ్యక్తం స్థానం వ్యన్తు వ్యన్తి గచ్ఛన్తి తథా రిహాణా వయం ఛన్దోభి స్తం యజ్ఞం నిత్యమనుతిష్ఠామః. యజ్ఞే కృతాహుతిర్వశా పృశ్నిరన్తరిక్షే భూత్వా మరుతాం సంగేన దివం గచ్ఛ గచ్ఛతి సా తతో నోఽస్మాకం వృష్టిమావహ సమన్తాద్వర్షయతి తజ్జలం పృషతీర్నాడీర్నదీర్వా గచ్ఛతి యతోఽయమగ్ని శ్చక్షుష్పా అస్యస్త్యతో మే మమ చక్షుః పాహి పాతి.॥౧౬॥

భావార్థః:-అత్ర లుప్తోపమాలంకారః. ప్రోహామి. అపోహామీతి పదద్వయానువృత్తిశ్చ. మనుష్యై రగ్నౌ యాఽఽహుతిః క్రియతే సా వాయోః సంగేన మేఘమండలం గత్వా సూర్యాకర్షితజలం శుద్ధం భావయిత్వా పున స్తస్మాత్పృథివీమాగత్యౌషధీః పుష్ణాతి సా వేదమంత్రై రేవ కర్తవ్యా యత స్తస్యాః ఫలజ్ఞానే నిత్యం శ్రద్ధోత్పద్యేత. అయమగ్నిః సూర్యరూపో భూత్వా సర్వం ప్రకాశయత్యతో దృష్టివ్యవహారస్య పాలనం జాయతే. ఏతేభ్యో వస్వాదిభ్యో విద్యోపకారేణ దుష్టానాం గుణానాం ప్రాణినాం చాపోహనం నివారణం నిత్యం కర్తవ్యమ్. ఇదమేవ సర్వేషాం పూజనం సత్కరణం చేతి, యత్పూర్వేణ మంత్రేణోక్తం తదనేన విశిష్టతయా ప్రకాశితమితి.॥౧౬॥

పదార్థము :-మేము (వసుభ్యః) అగ్నిమున్నగు అష్టవసువులవల్ల (త్వా)ఆ యజ్ఞమును (రుద్రేభ్యః) మొదట జెప్పినట్టి ఏకాదశ రుద్రుల వలనను (త్వా) పూర్వోక్తయజ్ఞమును (ఆదిత్యేభ్యః) ద్వాదశాదిత్యుల

[మాసముల] వలనను (త్వా) ఆ క్రియాసమూహమును సదా ఉత్తమ తర్కముద్వారా నెరుగుదుముగాక! మరియు యజ్ఞమువలన నీ (ద్యావాపృథివీ) సూర్యప్రకాశమును భూమియు (సంజానాథామ్) వానివలన నుత్పన్నములగు శిల్పవిద్యలును సాధితములగు గాక! మరియు సాధన సాధ్యములగునుగాక! (మిత్రావరుణౌ) సకల జీవుల బహిఃప్రాణ మగు వరుణుడు మరియు శరీరస్థ ఉదానవాయువు (వృష్ట్యా) శుద్ధజల వర్షముల ద్వారా (త్వా) సూర్యప్రకాశమును భూమియందలి లోకములను రక్షించుచున్నవి (వయః) పక్షులు తమ తమ గూళ్ళను నిర్మించుకొని (వ్యన్తు) పొందుచున్నటులే ఆ [గాయత్ర్యాది] ఛందస్సులతో (రిహాణాః) పూజించెడి మేము (త్వా) అట్టి యజ్ఞమును అనుష్ఠించుచున్నాము. ఆ యజ్ఞమునందలి ఆహుతి (పృశ్నిః) అంతరిక్షమున స్థిరమై (వశాభూత్వా) సుశోభితమై (మరుతామ్) వాయువులతో గలిసి (దివమ్) సూర్యప్రకాశమును (గచ్ఛ) పొందుచున్నది. (తతః) అచ్చటినుండి (నః) మా సుఖమునకై (వృష్టిమ్) వర్షమును (ఆవహ) బాగుగ వర్షింపజేయుచున్నది. ఆ వర్షజలము (పృషతీః) నాడీనదులను పొందుచున్నది. మరియు నీ యగ్ని (చక్షుష్పాః) నేత్రములను రక్షించెడిది (అసి) ఐయున్నందువలన (మే) నా (చక్షుః) నేత్రముల లోపల వెలుపల విజ్ఞానమును (పాహి) రక్షించుచున్నది. ౹౧౬॥

భావార్థము :- ఈ మంత్రమున లుప్తోపమాలంకారము గలదు. మానవులు యజ్ఞమునందిచ్చుచున్నట్టి ఆహుతులు వాయువుతో మేఘమండలమునకు జేరి, అచ్చట సూర్యునిచే నాకర్షింపబడిన జలములను పరిశుద్ధమొనర్చుచున్నవి. అటనుండి యా జలములు తిరిగి భూమిపై బడి ఓషధులను బలపరచుచున్నవి. అట్టి ఆహుతులను వేదమంత్రములతోనే ఇవ్వవలయును. దాని ఫలితమును దెలిసికొనుటకై నిత్యము శ్రద్ధ జనించవలయును. ఈ యగ్ని సూర్యరూపమున సర్వమును ప్రకాశింపజేయుచున్నందువల్ల దృష్టి వ్యవహార పాలనము జరుగుచున్నది. దేవతలుగ చెప్పబడుచున్న వస్వాదులద్వారా విద్య, ఉపకారములద్వారా దుష్టగుణములను, దుష్టప్రాణులను సదా తొలగించవలయును. ఇదియే అందరను పూజించుట, సత్కరించుట. పూర్వమంత్రమున చెప్పబడిన విషయమే ఈ మంత్రమున విశేషముగ వివరించబడినది. ౹౧౬॥

16. We perform the yajna for Vasus, Rudras and Adityas. The light of the sun and earth bring thee (yajna) to light. The Pran (external air) and Udan (internal air) protect thee through rain. Just as birds go to their nests, so let us daily go to the yajna reciting Gayatri Mantras.

The desired oblation (Ahuti) reaches the space, comes in contact with air and the light of the sun. It thence brings down rain for us, which fills streams and stalks of plants and flowers. Oh Fire thou protectest the eye from darkness, may thou protect my physical and spiritual eye!.

**౧౭. యం పరిధిమిత్యస్య ఋషిర్దేవలః, అగ్నిర్దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.**

**సోఽగ్నిః కీదృశ ఇత్యుపదిశ్యతే.**

**పూర్వోక్తాగ్ని యెటులున్నదో ఈ మంత్రమునందుపదేశించబడుచున్నది.**

౪౮ యం పరిధిం పర్యధత్థాఽ అగ్నే దేవపణిభిర్గుహ్యమానః।
తన్త ఽ ఏత మను జోషం భరామ్యేష నేత్త్వదప చేతయాతాఽ
అగ్నేః ప్రియం పాథోఽపీతమ్ ॥౧౭॥

ప.వి:- యమ్, పరిధిమ్, పరి, అధత్థాః, అగ్నే, దేవ + పణిభిః, గుహ్యమానః, తమ్, తే, ఏతమ్, అను, జోషమ్, భరామి, ఏషః, మా, ఇత్, త్వత్, అప, చేతయాతై, అగ్నేః, ప్రియమ్, పాథః, అపీతమ్.॥౧౭॥

పదార్థః :-(యమ్) ఏతద్ గుణవిశిష్టమ్ (పరిధిమ్) పరితః సర్వతో ధీయంతే యస్మింస్తమ్ (పర్యధత్థాః) సర్వతో దధాసి దధాతి వా. అత్ర లడర్థే లఙ్ పక్షే వ్యత్యయశ్చ. (అగ్నే) సర్వత్ర వ్యాపకేశ్వర! భౌతికో వా. (దేవపణిభిః) దేవానాం దివ్యగుణవతా మగ్నిపృథివ్యాదీనాం విదుషాం వా పణయో వ్యవహారాః స్తుతయశ్చ తాభిః (గుహ్యమానః) సమ్యక్ క్రియమాణః. (తమ్) పరిధిమ్ (తే) తవ (ఏతమ్) యథోక్తమ్ (అను) పశ్చాదర్థే. అన్వితి సాదృశ్యాపర భావం ప్రాహ. నిరు. ౧. 3.(జోషమ్) జుష్యతే ప్రీత్యా సేవ్యతే తమ్ (భరామి) ధారయామి (ఏషః) పరిధిరహం వా (మా) ప్రతిషేధే. (ఇత్) ఏవ (త్వత్) అన్తర్యామినో జగదీశ్వరాత్తస్మాదగ్నేర్వా (అప) దూరార్థే (చేతయాతై) చేతయేత్. చితీ సంజ్ఞానే ఇతి ణ్యన్తస్య లేటః ప్రథమపురుషస్యైకవచనే ప్రయోగోఽయమ్. (అగ్నేః) జగదీశ్వరస్య భౌతికస్య వా (ప్రియమ్) ప్రీతిజనకమ్ (పాథః) పాతి శరీరమాత్మానం చ యేన తత్తదన్నమ్. అన్నే చ. ఉ. ౪. ౨౦౪. అనేన పాతేరన్నేఽసున్ప్రత్యయ థుడాగమశ్చ (అపీతమ్) అపి సంయోగే. అపీతి సంసర్గం ప్రాహ. నిరు. ౧.3. ఇతం ప్రాప్తమ్. అయం మంత్రః శ. ౧. ౭. ౧. ౨౨. వ్యాఖ్యాతః. ॥౧౭॥

అన్వయః :-హే అగ్నే! జగదీశ్వర! ఏష దేవపణిభిర్గుహ్యమాన స్త్వం యమేతం జోషం పరిధిం పర్యధత్థాః సర్వతో దధాసి తమిత్ త్వామహమనుభరామి. అహం త్వా మాప చేతయాతై. కదాచిద్విరుద్ధో మా భవేయమ్. మయా తవాగ్నేః సృష్టౌ యత్ ప్రియం పాథోఽపీతం తస్మాదహం మా కదాచిదపచేతయాతై. ఇత్యేకః.

హే జగదీశ్వర! తే తవ సృష్టౌ యోఽయం దేవపణిభిర్గుహ్యమాన ఏషోఽగ్నిర్యం పరిధిం జోషం పర్యధత్థాః సర్వతో దధాతి తమిత్తమహమనుభరామి తస్మాత్క్వదాచిన్మాఽపచేతయాత్తై మయయా యదస్యాగ్నేః ప్రియం పాథోఽపీతం తదహం జోషం నిత్యమనుభరామీతి ద్వితీయః॥౧౭॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. సర్వైర్మనుష్యైర్యః ప్రతివస్తుషు వ్యాపకత్వేన ధారకో విద్వద్భిః స్తోతవ్యః సంప్రీత్యా నిత్యమనుసేవనీయః. యతస్తదాజ్ఞాపాలనేన ప్రియం సుఖం ప్రాప్నుయుః,. సోఽయమీశ్వరేణ ప్రకాశదాహవేగగుణాదిసహితో మూర్తద్రవ్యానుగతోఽగ్ని రచితస్తస్మాన్మనుష్యైః కలాకౌశలాదిషు ప్రయోజితాదగ్నేర్వ్యవహారాః సంసాధనీయాః. యతః సుఖాని సిధ్యేయుః. యతఃపూర్వేణ మంత్రేణ వృష్ట్యాదిసాధకత్వముక్తం తస్యానేన వ్యాపకత్వం ప్రకాశితమితి సంగతిః ॥౧౭॥

పదార్థము :-(అగ్నే) సర్వవ్యాపకుడవగు నో పరమేశ్వర! నీవు (దేవపణిభిః) దివ్యగుణనిధులగు విద్వాంసుల స్తోత్రములతో (గుహ్యమానః) విరివిగా గుణవర్ణనలను పొందుచు (యమ్)అట్టి గుణముల కనుకూలముగ (జోషమ్) ప్రీతితో సేవించదగిన (పరిధిమ్) ప్రభుత్వమును [అధికారమును] (పర్యధత్థాః) నిరంతరము ధరించుచున్నావు. (తమ్) అట్టి నీ రూపమునే (ఇత్) నిశ్చయముగ (ఏషః) నేను (అనుభరామి) నా హృదయమందు ధరించుచున్నాను. మరియు నేను (త్వత్) నీకు (మా అపచేత యాత్తైః) ప్రతికూలుడుగ నెన్నటికిని గాను. (అగ్నే) ఓ జగదీశ్వర! నీ సృష్టియందు నేను (ప్రియమ్) ప్రేమను పెంపొందజేయునదియు (పాథః) శరీరమును రక్షించునదియు నగు ఏ యన్నమును (అపీతమ్) పొందియుంటినో అట్టి దానికి నే నెన్నటికిని (మా అపచేతయాత్తై) ప్రతికూలుడను కాలేను **(ఇది మొదటి యర్థము)**.

(అగ్నే) ఓ జగదీశ్వర! (తే) నీ సృష్టియందు (ఏషః) ఈ భౌతికాగ్ని (దేవపణిభిః) దివ్యగుణములు గల పృథివ్యాది పదార్థములయొక్క వ్యవహారములతో (గుహ్యమానః) బాగుగ స్వీకరించబడి (పరిధిమ్) విద్య మున్నగు శ్రేష్ఠగుణములతో ధరించుటకు (జోషమ్) ప్రీతితో స్వీకరించుటకు (యమ్) యోగ్యమగు ఏ కర్మను (పర్యధత్థాః) సకల విధములుగ ధరించుచున్నదో (తమిత్) దానిని నేను (అనుభరామి)క్రమముగ స్వీకరించుచున్నాను. మరియు దానికి ఎన్నడును (మా అపచేత, యాత్తై) ప్రతికూలుడను కాను. మరియు నేను (అగ్నేః) ఈ యగ్నిసంబంధముచే (ప్రియమ్) ప్రీతినిగలిగించు (పాథః) శరీరమును కాపాడునట్టి ఏ యన్నమును (అపీతమ్) నేను గ్రహించితినో, దానిని (జోషమ్)అత్యంత ప్రీతితో సదా (అనుభరామి)క్రమముగ పొందుదును. **(ఇది రెండవ యర్థము)**.॥౧౭॥

**భావార్థము** :-ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. మొదటి యర్థమున అగ్ని శబ్దముచే పరమేశ్వరుడును, రెండవ యర్థమున భౌతికాగ్నియు గ్రహింపబడి యున్నది. ప్రతివస్తువునందును వ్యాపకుడై యుండి సకల పదార్థములను ధరించెడివాడును, విద్వాంసులచే స్తుతించదగినవాడును నైన పరమేశ్వరుని

ప్రేమపూర్వకముగ సదా సేవించవలయును. ఆతని యాజ్ఞను సర్వదా పాలించువారు అనేక సౌఖ్యములను పొందుచున్నారు. మరియు నా పరమేశ్వరుడు ప్రకాశ, దాహక, వేగాది గుణములు గలిగి మూర్తిమంతమగు పదార్థమును పొందదగు నే యగ్నిని సృష్టించెనో దానివల్లను మనుష్యులు క్రియాకౌశలముద్వారా ఉత్తమోత్తమ వ్యవహారములను సాధించవలయును. అందువలన పరమసుఖములు ప్రాప్తించును. పూర్వమంత్రమున వృష్టి మున్నగు పదార్థములకు సాధకముగ చెప్పబడినదే ఈ మంత్రమున వ్యాపకత్వముగ ప్రకాశపరచబడినది. ॥౧౭॥

17. Oh Omnipresent God, extolled by the praises of the learned, Thou attainest to greatness through those lovely panegyrics. I realise that greatness of Thine in my heart. May I never disobey Thee. May I, Oh God, never abuse the pleasant and invigorating food, I have secured in Thy creation!.

౪౯. సంస్రవేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్ఋషిః, విశ్వేదేవా దేవతాః. స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః. ధైవతః స్వరః.

స యజ్ఞః కథం కిమర్థశ్చ కర్తవ్య ఇత్యుపదిశ్యతే.

ఈ యజ్ఞ మెట్లు, ఏ ప్రయోజనముకొరకు చేయవలయునో ఉపదేశింపబడెను.

౪౯ సꣳస్రవభాగా స్థేషా బృహన్తః ప్రస్తరేష్ఠాః పరిధేయాశ్చ దేవాః।

ఇమాం వాచమభి విశ్వే గృణన్తఽ ఆసద్యాస్మిన్బర్హిషి

మాదయధ్వꣳస్వాహా వాట్ ॥౧౮॥

ప.వి:- స్యꣳ స్రవభాగాః, స్థ, ఇషా, బృహన్తః, ప్రస్తరేష్ఠాః, పరిధేయాః, చ దేవాః, ఇమామ్, వాచమ్, అభి, విశ్వే, గృణన్తః, ఆసద్య, అస్మిన్, బర్హిషి, మాదయధ్వమ్, స్వాహా, వాట్.॥౧౮॥

పదార్థః :- (సంస్రవభాగాః) సమ్యక్ స్రూయన్తే యే తే సంస్రవాః. భజ్యన్తే యే తే భాగాః. సంస్రవా భాగా యేషాం తే (స్థ) భవత (ఇషా) ఇష్యతే జ్ఞాయతే యేన తదిట్ జ్ఞానమ్. ఇషగతావిత్యస్య క్విబన్తస్య రూపమ్. కృతో బహులమితి కరణే క్విప్ (బృహన్తః) వర్ధమానా వర్ధయన్తశ్చ (ప్రస్తరేష్ఠాః)శుభే న్యాయవిద్యాసనే తిష్ఠన్తి తే. తత్పురుషే కృతి బహులమ్ అ. ౬. 3. ౧౪. ఇతి సప్తమ్యా అలుక్ (పరిధేయాః) పరితః సర్వతో ధాతుం ధాపయితుమర్హాః (చ) సముచ్చయార్థే (దేవాః) విద్వాంసో దివ్యాః పదార్థా వా (ఇమామ్) ప్రత్యక్షామ్ (వాచమ్) వదన్తి వాచయన్తి సర్వా విద్యా యయా తామ్. సత్యలక్షణాం వేదచతుష్టయీమ్. వాగితి పదనామసు పఠితమ్. నిఘం. ౫. ౫ (అభి) అభీత్యాభిముఖ్యం ప్రాహ. నిరు. ౧. 3. (విశ్వే)

సర్వే (గృణన్తః) స్తువన్త ఉపదిశన్తో వా (అసద్య) సమంతాద్విజ్ఞాయ స్థిత్వా వా (అస్మిన్) ప్రత్యక్షప్రాప్తే (బర్హిషి) బృహన్తే వర్ధయన్తే యేన తద్బర్హిర్ జ్ఞానం ప్రాప్తం కర్మకాండం వా తస్మిన్ (మాదయధ్వమ్) హర్షయధ్వమ్ (స్వాహా) సు ఆహేత్యస్మిన్నర్థే (వాట్) వహన్తి సుఖాని యయా క్రియయా సా వాట్ నిపాతో౽యమ్. అయం మంత్రః. శ.౧.౭.౧.౨౩-౨౬. వ్యాఖ్యాతః. ॥౧౮॥

అన్వయః :- హే బృహన్తః ప్రస్తరేష్ఠాః పరిధేయాః దేవా విద్వాంసో యూయమిమాం వాచమభిగృణన్త ఇషా సంస్రవభాగా స్థ భవత స్వాహావాడాసాద్యాస్మిన్బర్హిషి మాదయధ్వమన్యానేతల్లక్షణాన్మనుష్యాన్ కృత్వా హర్షయత చైవమస్మిన్ బర్హిషి ఇమాం వాచమభి గృణద్భిర్యుష్మాభిరిషా స్వాహా వాడాసాద్య ప్రస్తరేష్ఠా విశ్వేదేవాః సర్వే విద్వాంసః సదా పరిధేయాః. తాన్ప్రాప్య చాస్మిన్ బర్హిషి మాదయధ్వమ్. ॥౧౮॥

భావార్థః:- ఈశ్వర ఆజ్ఞాపయతి యే మనుష్యా ధార్మికాః పురుషార్థినో వేదవిద్యా ప్రచారే, ఉత్తమే వ్యవహారే చ నిత్యం వర్తన్తే తేషామేవ బృహన్తి సుఖాని భవన్తి. యౌ పూర్వస్మిన్మంత్రే౽గ్నిశబ్దే నేశ్వర భౌతికార్థావుక్తావనేన తయోః సకాశాదీదృశా ఉపకారా గ్రాహ్యా ఇత్యుచ్యతే.॥౧౮॥

పదార్థము :-(బృహన్తః) వృద్ధి నొందువారును (ప్రస్తరేష్ఠాః) ఉత్తమ న్యాయ, విద్యారూపమగు ఆసనమున గూర్చున్న (పరిధేయాః) సకలవిధముల ధారణమొనర్చు బుద్ధిని గలిగినవారును (ఇమాం వాచమ్) ప్రత్యక్షములగు నీ నాలుగు వేదములయొక్క వాణుల నుపదేశించువారును నగు (దేవాః) ఓ విద్వాంసులారా! మీరు (ఇషా) మీ జ్ఞానముచే (సంస్రవభాగాః) ఘృతాది పదార్థములను హోమమునందు వ్రేల్చువారు (స్థ) అగుడు. (స్వాహా) పరిశుద్ధ వాక్కులచే (వాట్) ప్రాప్తమగునట్టియు, సౌఖ్యములను పెంపొందింప జేయునట్టియు క్రియను పొంది (అస్మిన్) ప్రత్యక్షమగు నీ (బర్హిషి) జ్ఞాన, కర్మకాండలయందు (మాదయధ్వమ్) ఆనందితులగుడు. అటులనే ఇతరులను కూడ ఆనందితులుగ నొనర్చుడు. ఈ విధముగ పై దెలిపిన జ్ఞానమును కర్మకాండయందు ఉపర్యుక్త వేదవాణిని ప్రశంసించుచు మీరు మీ యాలోచనలతో నుత్తమజ్ఞానము నొసగు క్రియను పొంది (బృహన్తః) వృద్ధిపొందునవియు (ప్రస్తరేష్ఠాః) సర్వోత్తమ కార్యములందు స్థిరముగ నిలుచునవియు నగు (విశ్వే) సమస్త (దేవాః) సర్వోత్తమ పదార్థములను (పరిధేయాః) ధరించుడు. ఇతరులను కూడ ధరింపజేయుడు. వాని సహాయముచే పైన చెప్పబడిన (బర్హిషి) జ్ఞాన కర్మకాండలయందు సదా (మాదయధ్వమ్) హర్షించుడు. ॥౧౮॥

భావార్థము :-ధార్మికులు, పురుషార్థులు, వేదవిద్యాప్రచారమునందును, ఉత్తమ వ్యవహారములలోను వర్తమానులై యుండువారికే అధిక సౌఖ్యములు ప్రాప్తించును. [అగ్నిశబ్దమునకు] పూర్వమంత్రమున ఈశ్వర, భౌతికార్థములు చెప్పబడినవి. వానితో నా యా యుపకారములను పొందవలయునని ఈ మంత్రమునం దుపదేశించబడినది. ॥౧౮॥

18. May ye thriving, justice loving, wise, larned persons, preachers of the knowledge of the Vedas, become supreme through knowledge. Let all seekers after truth, devotees of learning and action, attain to happiness. Preach My noble word, that brings all kinds of joys.

౨౦. ఘృతాచీస్థ ఇత్యస్య ఋషిః స ఏవ, అగ్నివాయూ దేవతే, భురిక్ పంక్తి శ్ఛన్దః, పంచమః స్వరః.

అథోక్తేన యజ్ఞేన కిం భవతీత్యుపదిశ్యతే. పై యజ్ఞముచే నేమగుచున్న దీ మంత్రమున నుపదేశించెను.

౨౦ ఘృతాచీ స్థో ధుర్యౌ పాతꣳ సుమ్నే స్థః సుమ్నే మా ధత్తమ్। యజ్ఞ నమశ్చ

తఽఉప చ యజ్ఞస్య శివే సన్తిష్ఠస్వ స్విష్టే మే సంతిష్ఠస్వ ।౧౯॥

ప.వి:- ఘృతాచీ, స్థః ధుర్యౌ, పాతమ్, సుమ్నే, స్థః, సుమ్నే, మా, ధత్తమ్, యజ్ఞ, నమః, చ, తే, ఉప, చ, యజ్ఞస్య, శివే, సమ్, తిష్ఠస్వ, స్విష్టే ఇతి సు+ఇష్టే, మే, సమ్, తిష్ఠస్వ.।౧౯॥

పదార్థః:-(ఘృతాచీ) ఘృతముదకమంచత ఇతి ఘృతాచీ అగ్నివాయ్వోర్ధారణాకర్షణక్రియే. అత్ర పూర్వసవర్ణాదేశః ఘృతమిత్యుదక నామసు పఠితమ్. నిఘం. ౧. ౧౨. (స్థః) స్తః. అత్ర సర్వత్ర పురుషవ్యత్యయః (ధుర్యౌ) ధురం యజ్ఞస్యాగ్రం ముఖ్యాఙ్గం వహతస్తౌ. అత్ర ధురో యడ్ఢకౌ.అ. ౪. ౪. ౭౭. ఇతి యత్ప్రత్యయః (పాతమ్) రక్షతః (సుమ్నే) సుఖకారికే ఉక్తే క్రియే. సుమ్నమితి సుఖనామసు పఠితమ్. నిఘం. ౩. ౬ ॥ (స్థః) భవతః (సుమ్నే)అత్యుత్కృష్టే సుఖే (మా) మాం యజ్ఞానుష్ఠాతారమ్ (ధత్తమ్) ధారయతః. యజ్ఞ ఇజ్యతే సర్వైర్జనైః స యజ్ఞ ఈశ్వర స్తత్సమ్బుద్ధౌ. క్రియాసాధ్యో వా, అత్రాన్త్యే పక్షే సుపాం సులుగితి సోర్లుక్ (నమః) నమ్రీభావార్థే (చ) సముచ్చయే (తే) తుభ్యం తస్య వా (ఉప) సామీప్యే క్రియాయోగే. ఉపేత్యుపజనం ప్రాహ. నిరు. ౧. ౩॥ (చ) పశ్చాదర్థే (యజ్ఞస్య) జ్ఞానక్రియాభ్యా మనుష్ఠేయస్య (శివే) కల్యాణసాధికే. సర్వనిఘృష్వ ఉ.౧.౧౨౧॥ ఇత్యయం సిద్ధః (సంతిష్ఠస్వ) సంతిష్ఠతే. అత్ర లడర్థే లోట్. (స్విష్టే) శోభనమిష్టం యాభ్యాం తే (మే) మమ (సంతిష్ఠస్వ) సుష్ఠుసాధనే స్థిరో భవ, సంతిష్ఠతే వా. అయం మంత్రః. శ. ౧.౮.౩,౨౭॥. వ్యాఖ్యాతః.।౧౯॥

అన్వయః :-యావగ్ని వాయూ యజ్ఞస్య ధుర్యౌ సుమ్నే స్థో ఘృతాచీ స్థః సర్వం జగత్పాతం రక్షత స్తౌ మయా సమ్యక్ ప్రయోజితౌ సుమ్నే సుఖే మా మాం ధత్తం ధారయతః. యజ్ఞో

**పదార్థము:** (పిరతః) విద్యానందము నొసగు ఓ విద్వాంసులారా! (రసాయ) విజ్ఞానరూప ఆనందమునకై (వః) మీకు మా (నమః) నమస్కారములు (పితరః) దుఃఖములదొలగించి రక్షించు ఓవిద్వాంసులారా! (శోషాయ) దుఃఖములను మరియు శత్రువులను నివారించుకొరకు (వః) మీకు (నమః) మా నమస్కారములు (పితరః) ధర్మయుక్త జీవనమునకు విజ్ఞానమును ప్రసాదించు ఓ విద్వాంసులారా! (జీవాయ) ప్రాణముల స్థిరముగనుంచగల బ్రతుకునకై (వః) మీకు మా (నమః) సౌశీల్యము విదితమగుగాక! (పితరః) విద్య, అన్నము మున్నగు భోగముల నొసగు ఓ విద్వాంసులారా! (స్వధాయై) అన్నము, పృథివీరాజ్యము, న్యాయాదుల ప్రకాశము కొరకు (వః) మీకు (నమః) మా వినయము విదితమగుగాక! (పితరః) పాపములను, ఆపత్కాలములను దొలగించు నో విద్వాంసులారా! (ఘోరాయ) దుఃఖవినాశము, దుఃఖసమూహముల నివృత్తికొరకు (వః) మీకు (నమః) క్రోధత్యాగ వృత్తి విదితమగుగాక! (పితరః) శ్రేష్ఠులను పాలించెడు విద్వాంసులారా! (మన్యవే) దుష్టాచరణ మొనర్చు దుష్టజీవులపై క్రోధమొనర్చుటకై (వః) మీకు (నమః) మా సత్కారము విదితమగుగాక! (పితరః) ఓ విజ్ఞానవిదులగు విద్వాంసులారా (వః) మీకు విద్యకొరకై (నమః) విజ్ఞానమును గ్రహించుటయందుగల మా కోరిక విదితమగుగాక! (పితరః) ప్రేమపూర్వకముగ కాపాడు నో విద్వాంసులారా (వః) మిమ్ము సత్కరించుటకై మే మొనర్చు (నమః) మా సత్కారము మీకు విదితమగుగాక! మీరు (నః) మా (గృహాన్) గృహములకు దయజేయుడు. వచ్చి బసచేయుడు. (పితరః) విద్యనొసగెడు ఓ విద్వాంసులారా! (నః) మాకు విద్యా శిక్షణలను సదా (దత్త) ఇచ్చుచుండుడు. ఓ మాతాపితరులాది విద్వాంసులారా! మేము (వః) మీకు (సతః) మా వద్ద గల పదార్థములను సదా (దేష్మ) సమర్పించుచుందుముగాక! (పితరః) సేవించదగిన ఓ పితరులారా! మే మొసగు (వాసః) ఈ వస్త్రాదులను స్వీకరించుడు. ॥౩౨॥

**భావార్థము** :-'నమః' అను పదము అనేక శుభగుణములను, సత్కారములను ప్రకటించుటకై ఈ మంత్రమునం దనేకతడవలు చెప్పబడినది. వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిరము లను షడృతువులు రస, శోష, జీవ, అన్న, కఠినత్వ, క్రోధాదుల నుత్పన్నమొనర్చునట్లు పితరులును అనేక విద్యల నుపదేశించి మానవులకు నిరంతరము సుఖములను గలుగజేయుచున్నారు. కావున మానవులు ఉపర్యుక్త పితరులకు ఉత్తమోత్తమ పదార్థముల నొసగి సంతుష్టులుగ నొనర్చి వారి నుండి విద్యోపదేశమును నిరంతరము గ్రహించవలయును. ॥౩౨॥

32. Obeisance unto Yee, O Fathers, for the acquisition of happiness and knowledge. Obeisance unto Yee, O Fathers for the removal of misery and enemies. Obeisance unto Yee, O Fathers for longevity, Obeisance unto Yee, O Fathers, for solvereignty, and display of justice. Obeisance unto Yee, O Fathers, for the cessation of manifold calamities, obeisance unto yee, O Fathers, for righteous indignation. Fathers, know our desire to acquire knowledge. Father, know our reverence unto Ye is for your respect. Fathers, come daily to our houses, and give us instructions.

**౬౪. ఆధత్త ఇత్యస్య ఋషిః స ఏవ. పితరో దేవతాః. గాయత్రీ ఛన్దః. షడ్జః స్వరః.**

**తైః కిం కిం కర్తవ్య మిత్యుపదిశ్యతే.**

**పూర్వోక్త పితరు లేమేమి చేయుచుండవలయునో ఉపదేశించబడినది.**

౬౪ ఆ ధత్త పితరో గర్భం కుమారం పుష్కరస్రజమ్।

యథేహ పురుషోఽసత్ ॥33॥

ప.వి:- ఆ, ధత్త, పితరః, గర్భమ్, కుమారమ్, పుష్కరస్రజమితి పుష్కర + స్రజమ్, యథా, ఇహ, పురుషః, అసత్.॥33॥

పదార్థః :-(ఆ) సమన్తాత్ (ధత్త) ధారయత (పితరః) యే పాన్తి విద్యాన్నాదిదానేన తత్సంబుద్ధౌ (గర్భమ్) గర్భమివ (కుమారమ్) బ్రహ్మచారిణమ్. (పుష్కరస్రజమ్) విద్యాగ్రహణార్థా స్రగ్ ధారితా యేన తమ్ (యథా) యేన ప్రకారేణ (ఇహ)అస్మిన్ సంసారేఽస్మత్కులే వా (పురుషః) విద్యాపురుషార్థ యుక్తోఽయం మనుష్యః (అసత్) భవేత్. లేటః ప్రయోగోఽయమ్. ॥33॥

అన్వయః :-హే పితరో! యూయం యథాఽయం బ్రహ్మచారీహ శరీరాత్మబలం ప్రాప్య పురుషవద్భవతి తథైవ గర్భమివ పుష్కరస్రజం కుమారం విద్యార్థినమాధత్త ధారయత.॥33॥

భావార్థః :-అత్ర లుప్తోపమాలంకారః. ఈశ్వర ఆజ్ఞాపయతి. విద్వద్భిర్విదుషీభిశ్చ విద్యార్థినః కుమారా విద్యార్థిన్యః కుమార్యశ్చ విద్యాదానాయ గర్భవద్ధార్యాః. యథా గర్భే దేహః క్రమేణ వర్ధతే తథైవ సుశిక్షయైవ ఏతాశ్చ సద్విద్యాయాం వర్ధయితవ్యాః పాలనీయాశ్చ యతో విద్యాయోగేన ధార్మికాః పురుషార్థయుక్తా భూత్వా సదైవ సుఖయుక్తా భవేయురిత్యేతత్ సదైవానుష్ఠేయమితి.॥33॥

పదార్థము:-(పితరః) విద్యాదానముచే రక్షించు ఓ విద్వాంసులారా! మీరు (యథా) ఎటుల నీ బ్రహ్మచారి (ఇహ) ఈ సంసారమున, లేక మా వంశమున తన శారీరక, ఆత్మిక బలములను పొంది విద్యాపురుషార్థములతో గూడిన మానవుడుగ (అసత్) అగుచున్నాడో, అటులనే (గర్భమ్) గర్భమువలె (పుష్కరస్రజమ్) విద్యాగ్రహణ అభిలాషను సూచించు పుష్పమాలనుధరించియున్న (కుమారమ్) బ్రహ్మచారిని (ఆధత్త) బాగుగ స్వీకరించుడు. ॥33॥

భావార్థము :-ఈ మంత్రమున లుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులు, విదుషీమణులు విద్యాదాన మొనర్చుటకై విద్యార్థులగు బాలబాలికలను గర్భమువలె ధరించవలయును. క్రమక్రమముగ గర్భములో శిశువుశరీర మెట్లు వృద్ధియగునో అటులనే అధ్యాపకులు ఉత్తమ శిక్షణలచే బ్రహ్మచారులను శ్రేష్ఠవిద్యలయం దభివృద్ధి పరచవలయును. మరియు పాలించవలయును. వారు విద్యాయోగములచే ధర్మాత్ములు, పురుషార్థులునై సుఖయుక్తులుగ నిరంతర మిద్దానిని అనుష్ఠించవలెనని ఈశ్వరు డాజ్ఞాపించుచున్నాడు.॥33॥

33. Accept thou teacher, in the womb of thy discipleship, the youth with a garland of flowers in hand, eager for knowledge, so that he may attain to full manhood.

ఓ౩. ఊర్జమిత్యస్యర్షిః స ఏవ. ఆపో దేవతా. భురిగుష్ణిక్ ఛన్దః. ఋషభః స్వరః.

ఏతే పితరః కేన కేన పదార్థేన సత్కర్తవ్యా ఇత్యుపదిశ్యతే.

పూర్వోక్త పితరు లే యే పదార్థములతో సత్కరించదగి యున్నారో యీ మంత్రమునం దుపదేశించబడినది.

ఓ౩ ఊర్జం వహన్తీరమృతం ఘృతం పయః కీలాలం పరిస్రుతమ్ ।

స్వధా స్థ తర్పయత మే పితౄన్ ॥34॥

ప.వి:- ఊర్జమ్, వహన్తీః, అమృతమ్, ఘృతమ్, పయః, కీలాలమ్, పరిస్రుత మితి పరి + స్రుతమ్, స్వధాః, స్థ, తర్పయత, మే, పితౄన్.॥34॥

పదార్థః:-(ఊర్జమ్) ఇష్టం వివిధం రసమ్. ఉర్గ్రసః. శ. 1. 3. 4. 2. (వహన్తీః) ప్రాపయన్తీః స్వాదిష్ఠా ఆపః (అమృతమ్) సర్వరోగహరం సురసం మిష్టాదికమ్ (ఘృతమ్) ఆజ్యమ్ (పయః) దుగ్ధమ్ (కీలాలమ్) సుసంస్కృతమన్నమ్. కీలాలం ఇత్యన్ననామసు పఠితమ్. నిఘం. 2. 7. (పరిస్రుతమ్) పరితః సర్వతః స్రుతం సురసయోగేన పరిపక్వం ఫలాదికమ్ (స్వధాః) యే స్వమేవ దధతే తే (స్థ) సర్వే పితృసేవినో భవత. (తర్పయత) సుఖయత.(మే) మమ పితౄన్ పూర్వోక్తాన్.॥34॥

అన్వయః:-హే పుత్రాదయో! యూయం మే మమ పితౄనూర్జం వహన్తీరమృతం ఘృతం పయః కీలాలం పరిస్రుతం దత్వా తర్పయతైవం తత్సేవనేన విద్యాః ప్రాప్య స్వధాః స్థ పరస్వత్యాగేన సదా స్వసేవినో భవత.॥34॥

భావార్థః :-ఈశ్వర ఆజ్ఞాపయతి. మనుష్యాః సర్వాన్ పుత్రప్రభృతీన్ ప్రత్యేవమాదిశన్తు యుష్మాభిరస్మాకం పితరో జనకా విద్యాప్రదాశ్చ ప్రీత్యా నిత్యం సేవనీయాః. యథా తైర్బాల్యావస్థాయాం విద్యాప్రదానసమయే చ వయం యూయం చ పాలితాస్తథైవాస్మాభిరపి తే సర్వదా సర్వథా సత్కర్తవ్యాః. యతో నైవాఽస్మాకం మధ్యే కదాచిద్విద్యానాశ కృతఘ్న(తా)దోషౌ భవేతామితి.॥34॥

పదార్థము :- ఓ పుత్రాదులారా! మీరు (మే) నాయొక్క (పితౄన్) పై దెలిపిన గుణములుగల పితరులను (ఊర్జమ్) అనేక విధములగు ఉత్తమరసములను (వహన్తీః) సౌఖ్యములనుగలిగించు స్వాదిష్ఠ జలములను

(అమృతమ్) సకల వ్యాధులను దూరమొనర్చు ఓషధులను, మిష్టాదిపదార్థములను (పయః) క్షీరములను (ఘృతమ్) నేతిని (కీలాలమ్) ఉత్తమ రీతిలో పక్వమొనర్చిన యన్నమును (పరిస్రుతమ్) రసముతో నిండిన పక్వఫలములను ఇచ్చి (తర్పయత) తృప్తిపరచుడు. ఈ విధముగ వారిని భక్తితో సేవించి, విద్యలను బడసి (స్వధామ్) పరధనములను త్యజించి న్యాయయుక్త స్వార్జిత ధనముల సేవించువారు (స్థ) అగుడు. ॥౩౪॥

**భావార్థము :**-"మీరు మా పితరులను, తల్లిదండ్రులను మరియు విద్యాప్రదానమొనర్చిన వారిని ప్రీతితో సేవించవలయును. వారివల్ల మేమును, మీరును బాల్యావస్థయందును, విద్యాసమయమునను ఎట్లు పాలింపబడియుంటిమో, అట్లే మనయందు విద్యానాశము, కృతఘ్నత మున్నగు దోషముల నెన్నటికిని సంభవించకుండుటకై సర్వకాలములందును వారు మనకు సర్వవిధముల సత్కరించదగినవారు" అని పుత్రులకు, బ్రహ్మచారులకు మనుష్య లెల్లరును ఆజ్ఞాపించి చెప్పవలెనని ఈ మంత్రముద్వారా ఈశ్వరు డాజ్ఞాపించు చున్నాడు. ॥౩౪॥

**34**.Oh sons, please my parents and teachers by offering them various juices, sweet waters, disease - dissipating articles, milk, clarified butter, wellcooked food, and juicy fruits, Enjoy your own wealth, and covet not the wealth of others.

ఈశ్వరేణ యద్యదస్మిన్నధ్యాయే వేద్యాదిరచనం యజ్ఞస్య ఫలగమనసాధకాని సామగ్రీధారణాగ్నే ర్దూతత్వప్రకాశనం ఆత్మేన్ద్రియాదిశోధనం సుఖభోగో వేదప్రకాశనం పురుషార్థ సాధనం యుద్ధే విజయకరణం శత్రునివారణం ద్వేషత్యాగోऽగ్న్యాదీనాం యానేషు యోజనం పృథివ్యాదిభ్య ఉపకారగ్రహణ మీశ్వరే ప్రీతిర్దివ్యగుణవిస్తరణం సర్వరక్షణం వేదశబ్దార్థవర్ణనం వాయ్వగ్న్యాదీనాం పరస్పరమేలనం పురుషార్థగ్రహణముత్తమానాం పదార్థానాం స్వీకరణం త్రిషులోకేషు యజ్ఞాహుతద్రవ్యస్య గమనం పునస్తస్మాదా గమనం స్వయంభూశబ్దార్థవర్ణనం గృహస్థకృత్యం సత్యాచరణమగ్నౌ హోమో దుష్టానాం నివారణం పితౄణాం సేవనం చోక్తం తత్తన్మనుష్యైః సంప్రీత్యా సేవనీయమితి ప్రథమాధ్యాయార్థేన సహాऽస్య ద్వితీయాధ్యాయార్థస్య సంగతిరస్తీతి వేద్యమ్.

ఈశ్వరుడీ ద్వితీయాధ్యాయమున వేదిక మున్నగు యజ్ఞ సాధనములను నిర్మించుట, యజ్ఞఫల ప్రాప్తి, దాని సాధనములు, సామగ్రి ధారణము, అగ్నియొక్క దూతకార్యప్రకాశము, ఆత్మ ఇంద్రియాది పదార్థముల శుద్ధి, సుఖభోగములు, వేదప్రకాశము, పురుషార్థ సంధానము, యుద్ధమున శత్రువులను జయించుట, శత్రు నివారణము, ద్వేష త్యాగము, అగ్ని మున్నగు పదార్థములను యానములందుపయోగించుట, పృథివి మున్నగు పదార్థములద్వారా ఉపకారములను పొందుట, ఈశ్వరునియందు ప్రీతిగలిగి యుండుట, సద్గుణములను విస్తృతపరచుకొనుట, ఎల్లర నభివృద్ధి పరచుట, వేదశబ్దార్థవర్ణన, వాయ్వగ్న్యాదులను పరస్పరము మేళవింపజేయుట, పురుషార్థగ్రహణము, ఉత్తమోత్తమపదార్థములను స్వీకరించుట, యజ్ఞమునందు హోమమొనర్చబడిన పదార్థములు ముల్లోకములందు సంచారమొనర్చుట, స్వయంభూ శబ్ద వర్ణనము, గృహస్థుల కర్మలు, సత్యాచరణము, అగ్నియందు హోమ మొనర్చుట, దుష్టుల నివారించుట, పితృసేవనము మున్నగు ఉపదేశముల నొనర్చియున్నాడు. ఇట్లే ఏ యే

కార్యములు సేవించవలయు నని చెప్పబడినవో వాని నన్నిటిని మానవులు ప్రీతితో తప్పక సేవించవలయు ననియు పరమేశ్వరు డాజ్ఞాపించియున్నాడు.

ఈ విధముగ ప్రథమాధ్యాయముయొక్క అర్థముతో నీ ద్వితీయాధ్యాయముయొక్క అర్థములకు సంబంధము గలదని యెరుగవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుతదయానందసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే ద్వితీయోఽధ్యాయః పూర్తిమగాత్ ॥ ౨ ॥

ఇతి ద్వితీయోఽధ్యాయః సమాప్తః

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామివిరచిత సంస్కృతార్యభాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి రెండవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యుల ద్వితీయపుత్రుడు,
శిష్యుడును నగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకవుంహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదము నందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
'మర్రి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**రెండవ అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

# యజుర్వేదభాష్యము

## తృతీయాధ్యాయము - విషయసూచిక

ఇందులో 63 మంత్రములు, 67 ఛందస్సులు, 2052 అక్షరములు

# అథ తృతీయోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే త్రిషష్టిర్మంత్రాః సన్తీతి వేదితవ్యమ్.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ. యద్భద్రన్తన్న ఆసువ ॥య.30.3॥

౬౬. తత్ర సమిధేత్యస్య ప్రథమమంత్రస్యాంగిరస ఋషిః, అగ్ని ర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః ॥

అథ భౌతికోఽగ్నిః క్వ క్వోపయోక్తవ్య ఇత్యుపదిశ్యతే.

ఇపుడు మూడవ యధ్యాయమందలి మొదటి మంత్రమున భౌతికాగ్ని నే యే పనుల కుపయోగించవలయు నొనెడి యుపదేశము కలదు.

౬౬ సమిధాగ్నిం దువస్యత ఘృతైర్బోధయతాతిథిమ్।

ఆస్మిన్హవ్యా జుహోతన ॥౧॥

ప.వి:- సమిధేతి సమ్ + ఇధా, అగ్నిమ్, దువస్యత, ఘృతైః, బోధయత, అతిథిమ్, ఆ, అస్మిన్, హవ్యా, జుహోతన.॥౧॥

పదార్థః:-(సమిధా) సమ్యగిధ్యతే ప్రదీప్యతే యయా తయా. అత్ర సమ్పూర్వాదిన్ధేః కృతో బహులమితి కరణే క్విప్. (అగ్నిమ్) భౌతికమ్ (దువస్యత) సేవధ్వమ్! (ఘృతైః) శోధితైః సుగంధ్యాది యుక్తై ర్ఘృతాదిభిర్యానేషు జలబాష్పాదిభిర్వా ఘృతమిత్యుదకనామసు పఠితమ్. నిఘం ౧.౧౨. అత్ర బహువచన మనేక సాధనద్యోతనార్థమ్ (బోధయత) ఉద్దీపయత. (అతిథిమ్) అవిద్యమానాతిథిర్యస్య తమ్ (ఆ) సమన్తాత్ (అస్మిన్) అగ్నౌ (హవ్యా) దాతుమత్తుమాదాతుమర్హాణి వస్తూని. అత్ర శేశ్ఛన్దసి బహులమితి లోపః. (జుహోతన) ప్రక్షిపత. అత్ర హుధాతో ర్లోటిమధ్యమబహువచనే. తప్తనప్ ఇతి తనబాదేశః. అయం మన్త్రః. శత. ౬.౮,౮,౬. వ్యాఖ్యాతః.॥౧॥

అన్వయః :- హే విద్వాంసో! యూయం సమిధా ఘృతైరగ్నిం బోధయత. తమతిథిమివ దువస్యత. అస్మిన్ హవ్యా హోతవ్యాని ద్రవ్యాణ్యాజుహోతన ప్రక్షిపత.॥౧॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా గృహస్థా మనుష్యా ఆసనాన్నజలవస్త్ర ప్రియవచనాదిభి రుత్తమగుణమతిథిం సేవన్తే, తథైవ విద్వద్భిర్యజ్ఞవేదీకలాయంత్ర

యానేష్వగ్నిం స్థాపయిత్వా యథాయోగ్యై రింధనాజ్యజలాదిభిః ప్రదీప్య వాయువృష్టి జలశుద్ధి యానోపకారాశ్చ నిత్యం కార్యా ఇతి.॥౧॥

**పదార్థము :-** ఓ విద్వాంసులారా! మీరు (సమిధా) చక్కగా ప్రకాశించగల ఘృతసమిధాదులచే (అగ్నిమ్) భౌతికాగ్నిని (బోధయత) ఉద్దీపనమొనర్చుడు. [ప్రకాశింప జేయుడు] మరియు (అతిథిమ్) అతిథిని [తిథినిర్ణయము లేకుండా అకస్మాత్తుగ వచ్చిపోవుచుండు, నిశ్చిత నివాసములేని సన్న్యాసిని] సేవించునట్లు అగ్నిని (దువస్యత) సేవించుడు (అస్మిన్) ఈ యగ్నియందు (హవ్యా) కస్తూరి, కుంకుమపువ్వు, సుగంధవస్తువులు, బెల్లము, పటికబెల్లము మున్నగునవి తిప్పతీగ సోమలత మొదలగు ఓషధులు అను నీ చతుర్విధ పదార్థములచే (ఆ జుహోతన) బాగుగా హోమమొనర్చుడు. ॥౧॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము కలదు. గృహస్థులు ఆసన, అన్న, జల, వస్త్ర, ప్రియవచనాదులచే ఉత్తమగుణ సమన్వితులగు సన్న్యాసి మున్నగు అతిథులను సేవించుచుండునట్లు విద్వాంసులు యజ్ఞవేది యంత్రయానాదులయం దగ్నిని స్థాపించి యథాయోగ్యము లగు ఇంధనఘృతజలాదులచే అగ్నిని ప్రజ్వలిత మొనర్చి వాయు, వర్షజలశుద్ధి, యాననిర్మాణము మున్నగు ఉపకారములను నిత్యము నొనర్చుచుండవలెను. ॥౧॥

1. Oh learned persons, kindle the fire with the wood sticks, with butter, set ablaze the fire, which is worthy of respect lika a Sanyasi. Put oblations in this fire of the yjana!.

౬౨. సుసమిద్ధాయేత్యస్య సుశ్రుత ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః॥

పునః స కీదృశః కథముపయోజనీయశ్చేత్యుపదిశ్యతే॥

మరల యా భౌతికాగ్ని యెటులున్నది? దాని నెట్లుపయోగించవలయు నను నీ విషయ

మీ మంత్రమునం దుపదేశింపబడినది.

౬౨ సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం జుహోతన। అగ్నయే జాతవేదసే ॥౨॥

ప.వి:- సుసమిద్ధాయేతి సు + సమిద్ధాయ, శోచిషే, ఘృతమ్, తీవ్రమ్, జుహోతన, అగ్నయే జాతవేదస ఇతి జాత +వేదసే ॥౨॥

పదార్థః :-(సుసమిద్ధాయ) సుష్ఠు సమ్యగిద్ధో దీప్తస్తస్మిన్. అత్ర సర్వత్ర సుపాం సులుగితి సప్తమీ స్థానే చతుర్థీ. (శోచిషే) శోధితే దోషనివారకే (ఘృతమ్) ఆజ్యాదికమ్ (తీవ్రమ్) సర్వదోషాణాం నివారణే తీక్ష్ణస్వభావమ్ (జుహోతన) ప్రక్షిపత. సిద్ధిరస్య పూర్వవత్ (అగ్నయే) రూపదాహప్రకాశచ్ఛేదనాది గుణస్వభావే (జాతవేదసే) జాతే జాతే ఉత్పన్నే

ఉత్పన్నే పదార్థే విద్యమానస్తస్మిన్. జాతే జాతే విద్యత ఇతి వా, జాతవిత్తో వా జాతధనో జాతవిద్యో వా జాతప్రజ్ఞానో యత్తజ్జాతః పశూనవిన్దతేతి తజ్జాతవేదసో జాతవేదస్త్వమితి నిరు.౭౧౯.॥౨॥

అన్వయః:-హే మనుష్యా! యూయం సుసమిద్ధాయ సుసమిద్ధే శోచిషే శోచిషి జాతవేదసే జాతవేదసి అగ్నయే అగ్నౌ తీవ్రం ఘృతం జుహోతన.॥౨॥

భావార్థః:-మనుష్యైరస్మిన్ ప్రదీప్తేఽగ్నౌ శీఘ్రం దోషనివారకాణి శోధితాని ద్రవ్యాణి ప్రక్షిప్య సుఖాని సాధనీయానీతి.॥౨॥

పదార్థము :- ఓ మానవులారా! మీరు (సుసమిద్ధాయ) బాగుగా ప్రకాశించునదియు (శోచిషే) శుద్ధి పరచబడినదియు, దోషములను తొలగించునదియు (జాతవేదసే) సకల పదార్థములందును విద్యమానమై యున్నదియు; రూప, దాహ, ప్రకాశ, భేదనాది గుణస్వభావములు గలిగినదియు నగు (అగ్నయే) అగ్నియందు (తీవ్రమ్) సమస్తదోషములను నివారించు తీక్ష్ణ స్వభావముగల (ఘృతమ్) ఘృతమును, మిష్టాదిపదార్థములను (జుహోతన) హోమ మొనర్చుడు.॥౨॥

భావార్థము:-శుద్ధి చేయబడినవియు, శీఘ్రముగ దోషనివారణ మొనర్చునవియు నగు పదార్థములను ప్రజ్వలితాగ్నియందు హోమ మొనర్చి మానవులు ఇష్టసుఖములను బడయవలయును.॥౨॥

2. Put the oblations of ghee that removes physical infirmities, into this well ablaze, disease- killing fire present in all objects.

౭౮. తం త్వేత్యస్య భారద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

మనుష్యైః స నిత్యం వర్ధనీయ ఇత్యుపదిశ్యతే.

మానవులు పైన దెలిపిన యగ్నిని నిత్యము వృద్ధిపరచవలయు నను విషయ

మీ మంత్రమం దుపదేశింపబడుచున్నది.

౭౮ తన్త్వా సమిద్భిరఙ్గిరో ఘృతేన వర్ధయామసి। బృహచ్ఛోచా యవిష్ఠ్య ॥౩॥

ప.వి:- తమ్, త్వా, సమిద్భిరితి సమిత్ + భిః, అంగిరః, ఘృతేన, వర్ధయామసి, బృహత్, శోచ, యవిష్ఠ్య.॥౩॥

పదార్థః :-(తమ్) భౌతికమగ్నిమ్, (త్వా) యః. అత్ర వ్యత్యయః (సమిద్భిః) కాష్ఠాదిభిః (అంగిరః) అఙ్గతి ప్రాపయతి యః సోఽఙ్గిరః. అంగారా అంకనా అంచనాః. నిరు. 3.౧౭

॥ (ఘృతేన) పూర్వోక్తేన. (వర్ధయామసి) వర్ధయామః. అత్రేదంతో మసీతీకారాదేశః. (బృహత్) మహత్ యథా స్యాత్తథా (శోచ) శోచతి ప్రకాశతే. అత్ర వ్యత్యయేన లడర్థే లోట్. ద్వ్యచోతస్తిఙ ఇతి దీర్ఘశ్చ. (యవిష్ఠ్య) యోఽతిశయేన యువా పదార్థానామమిశ్రీకరణే బలవాన్ సః. యవిష్ఠ ఏవ యవిష్ఠ్యః. అత్ర యువన్ శబ్దాదిష్ఠన్ ప్రత్యయస్తతో నవసూర మర్తయవిష్ఠేభ్యో యత్. అ. ౫.౪.౩౬. ఇతి వార్తికేన స్వార్థే యత్ప్రత్యయః. అయం మంత్రః. శ. ౧.౩.౩. ౨౫-౨౬ వ్యాఖ్యాతః ॥౩॥

అన్వయః :- వయం యోఽఙ్గిరోఽఙ్గిరా యవిష్ఠ్య యవిష్ఠ్యోఽగ్నిర్బృహచ్ఛోచ మహద్యథా స్యాత్తథా శోచతి ప్రకాశతే త్వా తం సమిద్భిర్ఘృతేన వర్ధయామసి వర్ధయామః ప్రదీపయామః ॥౩॥

భావార్థః:- మనుష్యైర్యో గుణైర్మహాన్ పూర్వోక్తోఽగ్నిర్వర్తతే స హోమశిల్పవిద్యాసిద్ధయే సాధనై రిన్ధనాదిభిః సేవిత్వా నిత్యం వర్ధనీయ ఇతి ॥౩॥

పదార్థము :- (అఙ్గిరః) పదార్థములను లభింపజేయునదియు (యవిష్ఠ్య) పదార్థములను భేదించుట యందతిబలము గలిగినదియు (బృహత్) మహాతేజముతోఁగూడినదియు నగు నే యగ్ని (శోచ) ప్రకాశించుచున్నదో (త్వా) ఆ యగ్నిని (సమిద్భిః) కాష్ఠాదులచేతను (ఘృతేన) ఘృతాదుల చేతను (వర్ధయామసి) ప్రదీప్తపరచుచున్నాము. ॥౩॥

భావార్థము :- మొదట చెప్పబడిన సమస్తగుణములచే బలసమన్వితమగు నే యగ్ని గలదో దానిని మనుష్యులు హోమశిల్పవిద్యాదుల సిద్ధికై సమిధాఘృతాదిసాధనములచే సేవించి నిరంతరము వృద్ధి పరచుచుండవలెను. ॥౩॥

3. We fan the fire with sticks of wood and ghee that is powerful in splitting all things, and burns intensely.

౬౯. ఉప త్వేత్యస్య ప్రజాపతిర్ ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః స కీదృశ ఇత్యుపదిశ్యతే.

మరల నా యగ్ని యెటులున్నది ఈ మంత్రమునం దుపదేశింపబడినది.

౬౯ ఉప త్వాగ్నే హవిష్మతీర్ఘృతాచీర్యన్తు హర్యత। జుషస్వ సమిధో మమ ॥౪॥

ప.వి:- ఉప, త్వా, అగ్నే, హవిష్మతీః, ఘృతాచీః, యన్తు, హర్యత, జుషస్వ, సమిధః ఇతి సమ్ + ఇధః, మమ ॥౪॥

పదార్థః :-(ఉప) సామీప్యే (త్వా) తమ్ (అగ్నే) అగ్నిమ్ (హవిష్మతీః) ప్రశస్తాని హవీంషి విద్యన్తే యాసు తాః. అత్ర ప్రశంసార్థే మతుప్ (ఘృతాచీః) యా ఘృతమాజ్యాదికం జలం వాఽఞ్చంతి ప్రాపయన్తి తాః (యన్తు) ప్రాప్నువన్తు (హర్యత) ప్రాపకః కామనీయో వా (జుషస్వ) జుషతే. అత్ర వ్యత్యయో లడర్థే లోట్ చ (సమిధః) కాష్ఠాదిసామగ్రీః (మమ) కర్మానుష్ఠాతుః. ॥౪॥

అన్వయః :-హే మనుష్యా! యో హర్యతాగ్నే ప్రాపకః కామనీయోఽగ్నిర్మమ సమిధో జుషస్వ జుషతే సేవతే. యథా తమేతాః సమిధో యన్తు ప్రాప్నువన్తు తథాఽస్మిన్నయ్యాయం హవిష్మతీ ర్ఘృతాచీః సమిధః ప్రతిదినం సంచినుత. ॥౪॥

భావార్థః:-మనుష్యైర్యదాఽస్మిన్నగ్నౌ సమిధః ఆహుతయశ్చ ప్రక్షిప్యంతే స ఏతాః పరమసూక్ష్మాః కృత్వా వాయునా సహ దేశాన్తరం ప్రాపయిత్వా దుర్గన్ధాదిదోషాణాం నివారణేన సర్వాన్సుఖయతీతి వేదితవ్యమ్.॥౪॥

పదార్థము :- ఓ మానవులారా! (హర్యత) ప్రాప్తించుకొన, కామించదగినదియు నగు (అగ్నే) ఏ ప్రసిద్ధాగ్ని గలదో, ఏది (మమ) యజ్ఞమొనర్చెడి మాయొక్క (సమిధః) కాష్ఠఘృతాదిపదార్థములను (జుషస్వ) సేవించుచున్నదో (తమ్) ఆ యగ్నిని ఘృతము మున్నగు పదార్థములను (యన్తు) ఎట్లు పొందుచున్నదో అట్లే మీరును (హవిష్మతీః) శ్రేష్ఠమగు హవిస్సుతో గూడినదియును (ఘృతాచీః) ఘృతము మున్నగు పదార్థములతో గూడినదియు నగు ఆహుతులను, సామగ్రిసమిధలను ప్రతిదినము సంచయన మొనర్చుడు.॥౪॥

భావార్థము :-మనుష్యులు అగ్నియందు కాష్ఠఘృతాదిసామగ్రులను ఆహుతిగ వేయుచున్నప్పు డాయగ్ని వాని నతిసూక్ష్మపరచి వాయువుతో బాటు స్థానాంతరములకు జేర్చించి దుర్గంధాదిదోషముల నివారించుటను సకల ప్రాణులకు సుఖము గలుగుచుండుటను సకలమానవు లెరుగవలయును.॥౪॥

4. O beautiful fire, wood sticks soaked with ghee go unto thee along with oblations. May thou accept my fuel put into thee!.

౫. భూర్భువః స్వరిత్యస్య ప్రజాపతిర్ ఋషిః, అగ్నివాయుసూర్యా

దేవతాః, దైవీ బృహతీ ఛన్దః, ద్యౌరివేత్యస్య నిచృద్బృహతీఛన్దః, ఉభయత్ర మధ్యమః స్వరః.

పునః స కిమర్థ ఉపయోజనీయ ఇత్యుపదిశ్యతే.

మరల నా యగ్ని నెందునిమిత్త ముపయోగించవలయు నను విషయ మీ మంత్రమున నుపదేశించబడినది.

౫ భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా। తస్యాస్తే పృథివి దేవయజని పృష్ఠేఽగ్నిమన్నాదమన్నాద్యాయా దధే ॥౫॥

ప.వి:- భూః, భువః, స్వః, ద్యౌరివేతి ద్యౌఃఽ ఇవ, భూమ్నా, పృథివీవేతి పృథివీఽఇవ, వరిమ్ణా, తస్యాః, తే, పృథివి, దేవయజనీతి దేవఽయజని, పృష్ఠే, అగ్నిమ్, అన్నాద మిత్యన్నఽఅదమ్, అన్నాద్యాయే స్యన్నఽఅద్యాయ, ఆ, దధే ।౫॥

పదార్థః :-(భూః) భూమిః. భూరితి వై ప్రజాపతిరిమామజనయత (భువః) భువరిత్యన్తరిక్షమ్ (స్వః) స్వరితిదివమేతావద్వా. ఇదఀ సర్వం యావదిమే లోకాః. సర్వేణైవాధీయతే. శత ၊ ౨. ౧. ౪. ౧౧. (ద్యౌరివ) యథా సూర్యప్రకాశయుక్త ఆకాశే (భూమ్నా) విభునా (పృథివీవ) యథా విస్తృతా భూమిః (వరిమ్ణా) శ్రేష్ఠగుణసమూహేన (తస్యాః) వక్ష్యమాణాయాః (తే) అస్యాః ప్రత్యక్షాయాః. అత్ర వ్యత్యయః. (పృథివి) పృథివ్యాః (దేవయజని) దేవా యజన్తి యస్యాం తస్యాః. అత్రోభయత్ర ప్రాతిపదిక నిర్దేశానామర్థ తన్త్రత్వాత్ షష్ఠ్యర్థే ప్రథమా విపరిణమ్యతే (పృష్ఠే) ఉపరి (అగ్నిమ్) భౌతికమ్ (అన్నాదమ్) యోఽన్నం యవాదికం సర్వమత్తి తమ్, (అన్నాద్యాయ) అత్తుం యోగ్యమద్య మన్నం చ తదద్యం చాన్నాద్యం చ తస్మై (ఆ) సమన్తాత్ (దధే) స్థాపయామి. అయం మన్త్రః. శత. ౨.౧.౪.౯-౨౮. వ్యాఖ్యాతః ।౫॥

అన్వయః:-అహమన్నాద్యాయ భూమ్నా ద్యౌరివ వరిమ్ణా పృథివీవ తేఽస్యాః ప్రత్యక్షాయాస్తస్యా అప్రత్యక్షాయా అంతరిక్షలోకస్థాయా దేవయజని దేవయజన్యాః పృథివి, పృథివ్యాః పృష్ఠే, పృష్ఠో పరి భూర్భువః స్వర్లోకాంతర్గతమన్నాదమగ్నిమాదధే, స్థాపయామి.।౫॥

భావార్థః :-అత్రోపమాలంకారౌ. హేమనుష్యా! యూయమీశ్వరేణ రచితం త్రైలోక్యోపకారకం స్వవ్యాప్త్యా సూర్యప్రకాశసదృశం శ్రేష్ఠైర్గుణైః పృథివీసమానం స్వస్వలోకే సన్నిహితమిమమగ్నిం కార్యసిద్ధ్యర్థం ప్రయత్నే నోపయోజయత. ॥ ౫॥

**పదార్థము:**-నేను (అన్నాద్యాయ) తినదగిన అన్నముకొరకు (భూమ్నా) మహదైశ్వర్యములచే (ద్యౌరివ) ఆకాశమందు సూర్యునివలెనున్నదియు (వరిమ్ణా) ఉత్తమగుణములచే (పృథివీవ) విశాలమగు భూమితో సమానముగనున్నదియును (తే) ప్రత్యక్షముగనున్నదియు (తస్యాః) అప్రత్యక్షముగ ఆకాశములో సుండునదియు (దేవయజని) దేవతలు, విద్వాంసులు యజ్ఞముచేయుట కాధారమైనదియు (పృథివీ) భూమియొక్క (పృష్ఠే) పై భాగమున (భూః) భూమి (భువః) అంతరిక్షము (స్వః) ద్యులోకము [ప్రకాశస్వరూపసూర్యలోకము] వీనియందంతర్గతమై యున్నదియు (అన్నాదమ్) యవలుమున్నగు సర్వాన్నముల భక్షించెడిదియు నగు (అగ్నిమ్) ప్రసిద్ధాగ్నిని (ఆ దధే) స్థాపించుచున్నాను.।౫॥

భావార్థము :-ఈ మంత్రమున రెండుపమాలంకారములు గలవు. ఓ మానవులారా! మీరు ముల్లోకములకు ఉపకార మొనర్చునదియు, తన వ్యాప్తివల్ల సూర్యప్రకాశసదృశమును, ఉత్తమోత్తమగుణములచే భూమి సదృశమును, తమ తమ లోకములందు సన్నిహితమును, పరమాత్మచే నిర్మింపబడినదియు నగు నీ యగ్నిని కార్యసిద్ధికై ప్రయత్నపూర్వకముగ నుపయోగించుడు.॥౫॥

5. I lay upon the back of the Earth upon which the learned perform yajna, which is like Heaven in plenty, and like Earth in grandeur, for gain of eatable food, this food - eating fire, that pervades the Earth, Ether,and Sky.

౬. ఆయమిత్యస్య సర్పరాజ్ఞీకద్రూర్ ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథాగ్నినిమిత్తేన పృథివీభ్రమణవిషయ ఉపదిశ్యతే.

ఇపుడగ్నిద్వారా భూభ్రమణ మను విషయ మీ మంత్రమున గలదు.

౬ ఆ యం గౌః పృశ్ని రక్రమీ దసదన్మాతరం పురఃపితరఞ్చ ప్రయన్త్స్వః॥౬॥

ప.వి:- ఆ, అయమ్, గౌః, పృశ్నిః, అక్రమీత్, అసదత్, మాతరమ్, పురః, పితరమ్, చ, ప్రయన్నితి ప్ర+యన్, స్వరితి స్వః ॥౬॥

పదార్థః :- (ఆ) అభ్యర్థే (అయమ్) ప్రత్యక్షః (గౌః) యో గచ్ఛతి స భూగోలః. గౌరితి పృథివీ నామసు పఠితమ్. నిఘం ౧. ౧. గౌరితి పృథివ్యా నామధేయమ్. యద్దూరం గతా భవతి. యచ్చాస్యాం భూతాని గచ్ఛంతి. నిరు. ౨.౫. (పృశ్నిః)అంతరిక్షే. అత్ర సుపాం సులుగితి సప్తమ్యేకవచనే ప్రథమైకవచనమ్. పృశ్నిరితి సాధారణ నామసు పఠితమ్.. నిఘం ౧,౪॥ (అక్రమీత్) క్రామ్యతి. అత్ర లడర్థే లుఙ్ (అసదత్) స్వకక్ష్యాయాం ( భమతి. అత్రాపి లడర్థే లుఙ్ (మాతరమ్) స్వయోనిమపః. జలనిమిత్తేన పృథివ్యుత్పత్తేః. (పురః) పూర్వం పూర్వమ్. (పితరమ్) పాలకమ్ (ప్రయన్) ప్రకృష్టతయా గచ్ఛన్. (స్వః) (ఆదిత్యమ్) స్వరాదిత్యో భవతి. నిరు. ౨. ౧౪. అయం మంత్రః. శత. ౨. ౧. ౪. ౨౯. వ్యాఖ్యాతః.॥౬॥

అన్వయః :-అయం గౌః పృథివీగోలః స్వః పితరం పురః ప్రయన్మాతరమపశ్చ ప్రయన్ పృశ్నిరన్తరిక్షే అక్రమీదాక్రామ్యతి సమంతాద్ భ్రమతి.॥ ౬॥

భావార్థః:-మనుష్యై ర్యస్మాజ్జలాగ్నినిమత్తోత్పన్నోఽయం భూగోలోఽన్తరిక్షే స్వకక్ష్యాయామాకర్షణేన రక్షకస్య సూర్యస్యాభితః ప్రతిక్షణం భ్రమతి, తస్మాదహోరాత్ర శుక్లకృష్ణపక్షర్త్వయనాదీని కాలవిభాగాః క్రమశః సంభవన్తీతి వేద్యమ్.॥౬॥

**పదార్థము** :-(అయమ్) ప్రత్యక్షముగ నున్న యీ (గౌః) గోళాకారపృథివి (పితరమ్) పాలనమొనర్చు (స్వః) సూర్యలోకమునకు (పురః) మున్ముందు (అసదత్) నడచును (మాతరమ్) తన యోనిరూప జలముల శక్తితోసహ గూడియుండి (ప్రయన్) ఉత్తమముగ నడచుచు (పృశ్నిః) ఆకాశమున (అక్రమీత్) నలువైపుల దిరుగుచున్నది. ॥౬॥

భావార్థము :- జలాగ్నుల నిమిత్తముచే ఉత్పన్నమైన ఈ పృథివి [భూగోళము] అంతరిక్షమున తన కక్ష్యయందు తన యోనిరూపమగు జలములతో గూడి ఆకర్షణగుణములతో సమస్తమును కాపాడుచున్న సూర్యుని చుట్టు ప్రతిక్షణము ప్రదక్షిణ మొనర్చుచున్నది. ఇందువల్లనే రేబవళ్లు, శుక్ల కృష్ణ పక్షములు, ఋతువులు, అయనములు మున్నగు కాలవిభాగములు క్రమముగ నేర్పడుచున్నవని మానవు లెరుగవలయును. ॥౬॥

6. This Earth revolves in the space, it revolves with its mother water in its orbit. It moves round its father, the sun.

౭౨. అన్తరిత్యస్య సర్పరాజ్ఞీ కద్రూర్ ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః. షడ్జః స్వరః.

సోఽగ్నిః కథం భూత ఇత్యుపదిశ్యతే.

ఆ యగ్ని ఎట్లున్నది ఈ మంత్రమున నుపదేశించబడుచున్నది.

౭౨ అన్తశ్చరతి రోచనాస్య ప్రాణాదపానతీ। వ్యఖ్యన్మహిషో దివమ్ ॥౭॥

ప.వి:- అన్తరిత్యన్తః, చరతి, రోచనా, అస్య, ప్రాణాత్, అపానతీత్యప+అనతీ, వి, అఖ్యత్, మహిషః, దివమ్. ॥౭॥

పదార్థః :- (అన్తః) బ్రహ్మాణ్డశరీరయోర్మధ్యే (చరతి) గచ్ఛతి (రోచనా) దీప్తిః (అస్య) అగ్నేః (ప్రాణాత్) బ్రహ్మాండశరీరయోర్మధ్య ఊర్ధ్వగమనశీలాత్ (అపానతీ) అపానమ, దోగమనశీలం వాయుం నిష్పాదయంతీ విద్యుత్ (వి) వివిధార్థే (అఖ్యత్) ఖ్యాపయతి. అత్ర లడర్థే లుఙన్తర్గతో ణ్యర్థశ్చ (మహిషః) స్వగుణైర్మహాన్. (దివమ్) సూర్యలోకమ్. ॥౭॥

అన్వయః:- యయాఽస్యాగ్నేః ప్రాణాదపానతీ సతీ రోచనా దీప్తిర్విద్యుచ్ఛరీర బ్రహ్మాణ్డయోరన్తశ్చరతి. స మహిషోఽగ్నిర్దివం వ్యఖ్యత్ విఖ్యాపయతి. ॥౭॥

భావార్థః:- మానవైర్యోఽగ్నిర్ విద్యుదాఖ్యా సర్వాన్తఃస్థా కాంతిర్వర్తతే సా ప్రాణాపానాభ్యాం సహ సంయుజ్య సర్వాన్ ప్రాణాపానాగ్నిప్రకాశగత్యాదీన్ చేష్టావ్యవహారాన్ ప్రసిద్ధీకరోతీతి బోధ్యమ్. ॥౭॥

పదార్థము :-(అస్య) ఈ యగ్నియొక్క (ప్రాణాత్) బ్రహ్మాండము మరియు శరీరముల మధ్యను పైకి బోవు వాయువువలన (అపానతీ) క్రిందికి వచ్చెడి వాయువు నుత్పత్తి జేయుచున్నట్టి (రోచనా) ప్రకాశరూప విద్యుచ్ఛక్తి (అన్తః) బ్రహ్మాండము మరియు శరీరముల మధ్య (చరతి) నడచుచున్నదియు (మహిషః) తన గుణములచే గొప్పదియునైన ఆ యగ్ని (దివమ్) సూర్యలోకమును (వ్యఖ్యత్) ప్రకటమొనర్చుచున్నది. ॥ ౭॥

భావార్థము:-విద్యుత్తు అను పేరుతో ప్రసిద్ధమై, సర్వాంతర్గతమై సర్వమానవుల అంతఃకరణము లందుండెడి అగ్నియొక్క కాంతి ప్రాణాపాన వాయువులతో కూడి ప్రాణ, అపాన, అగ్ని, ప్రకాశము మున్నగు కార్యవ్యవహారములను ప్రసిద్ధపరచుచున్నది అని మానవులు గ్రహించవలెను. ॥ ౭॥

7. The lustre of this fire, goes up and comes down in the space like exhalation and inhalation in the body. This great fire displays the Sun.

౭౩. త్రిꣳశద్ధామేత్యస్య సర్పరాజ్ఞీ కద్రూర్ ఋషిః, అగ్ని ర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః స కీదృశ ఇత్యుపదిశ్యతే.

మరల ఆ యగ్ని యెట్లుగల దను విషయ మీ మంత్రమునం దుపదేశించబడినది.

౭౩ త్రిꣳశద్ధామ విరాజతి వాక్ పతఙ్గాయ ధీయతే। ప్రతివస్తో రహద్యుభిః॥౮॥

ప.వి:- త్రిꣳశత్, ధామ, వి, రాజతి, వాక్, పతఙ్గాయ, ధీయతే, ప్రతి, వస్తోః, అహ, ద్యుభిరితి, ద్యు+భిః.।౮॥

పదార్థః:-(త్రింశత్) పృథివ్యాదీని త్రయస్త్రింశతో వస్వాదీనాం దేవానాం మధ్యే పఠితాని. అంతరిక్ష మాదిత్యమగ్నిం చ విహాయ త్రింశత్సంఖ్యాకాని (ధామ) దధతి యేషు తాని ధామాని. అత్ర సుపాం సులుగితి శసో లుక్. (వి) విశేషార్థే (రాజతి) ప్రకాశయతి అత్రాంతర్గతో ణ్యర్థః. (వాక్) ఉచ్యతే యయా సా. వాగితి వాఙ్ నామసు పఠితమ్. నిఘం. ౧. ౧౧. (పతంగాయ)పతతి గచ్ఛతీతి పతంగస్తస్మా అగ్నయే (ధీయతే) ధార్యతామ్. (ప్రతి) వీప్సాయామ్. (వస్తోః) దినం దినమ్. వస్తో రిత్యహర్నామసు పఠితమ్. నిఘం. ౧.౯. (అహ) వినిగ్రహార్థే. అహ ఇతి వినిగ్రహార్థీయః. నిరు. ౧.౫ (ద్యుభిః) ప్రకాశాది గుణవిశేషైః. దివో ద్యోతన కర్మణా మాదిత్య రశ్మీనామ్.నిరు. ౧౩. ౨౫ ॥ ౮॥

అన్వయః :-మనుష్యైర్యోఽగ్ని ర్ద్యుభిః ప్రతివస్తో స్త్రింశద్ధామ ధామాని విరాజతి ప్రకాశయతి. తస్మై పతంగాయ పతనపాతనాదిగుణప్రకాశితాయ ప్రతివస్తోః ప్రతిదినం విద్వద్భిరహవాగ్ధీయతామ్. ॥ ౮॥

**భావార్థః :-యా వాణీ ప్రాణయుక్తేవ శరీరస్థేవ విద్యుదాఖ్యేనాగ్నినా నిత్యం ప్రకాశ్యతే సా తద్ గుణప్రకాశాయ విద్వద్భిర్నిత్యముపదేష్టవ్యా శ్రోతవ్యా చేతి. ॥౮॥**

పదార్థము :-(ద్యుభిః) ప్రకాశము మున్నగు గుణములతో నే యగ్ని మనుష్యులద్వార (ప్రతివస్తోః) ప్రతిదినము (త్రింశత్) ఆదిత్యాగ్న్యంతరిక్షములు తప్ప మిగతా పృథివ్యాది (ధామ) ముప్పది స్థానములను (వి రాజతి) ప్రకాశపరచుచున్నదో (పతంగాయ) నడచుట, నడుపుట మున్నగు గుణములతో ప్రకాశముతో నున్న నా యగ్నికొరకు (ప్రతివస్తోః) ప్రతిదినము విద్వాంసుల (వాక్) వాణిని (అహ) బాగుగ (ధీయతే) అవశ్యముగ ధరించవలయును. ॥౮॥

భావార్థము :-ప్రాణవాయువుతో గూడ శరీరస్థము నగు విద్యుత్ రూపాగ్నిచే ప్రకాశింపబడు నే వాణి గలదో దాని గుణముల ప్రకాశమునకై ప్రతిదినము విద్వాంసులు వినుచు వినిపించుచు నుండవలయును. ॥౮॥

8. God's word rules supreme throughout the world. The Vedas are recited for acquiring the knowledge of God. We whould resolutely recite and understand the Vedas everyday with their illuminating sayings.

౯. అగ్నిరిత్యస్య ప్రజాపతిర్ ఋషిః। అగ్నిసూర్యౌ దేవతే। పంక్తిశ్ఛందః। పఞ్చమః స్వరః। జ్యోతిరిత్యస్య యాజుషీ బృహతీ ఛన్దః। మధ్యమః స్వరః.

అథాగ్నిసూర్యౌ కీదృశావిత్యుపదిశ్యతే. అగ్ని, సూర్యులెట్టి వారను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడెను.

౯ అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిః స్వాహా సూర్యో జ్యోతి ర్జ్యోతిః సూర్యః స్వాహా।
అగ్నిర్వర్చో జ్యోతిర్వర్చః స్వాహా సూర్యో వర్చో జ్యోతిర్వర్చః స్వాహా।
జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా ॥౯॥

ప.వి:- అగ్నిః, జ్యోతిః, జ్యోతిః, అగ్నిః స్వాహా, సూర్యః, జ్యోతిః, జ్యోతిః, సూర్యః, స్వాహా, అగ్నిః, వర్చః, జ్యోతిః, వర్చః, స్వాహా, సూర్యః, వర్చః, జ్యోతిః, వర్చః, స్వాహా, జ్యోతిః,సూర్యః, సూర్యః, జ్యోతిః, స్వాహా.॥౯॥

పదార్థః:-(అగ్నిః) పరమేశ్వరః. (జ్యోతిః) సర్వప్రకాశకః. (జ్యోతిః) ప్రకాశమయః. శిల్పవిద్యాసాధన ప్రకాశకః (అగ్నిః) భౌతికః. అగ్నిరితి పదనామసు పఠితమ్. నిఘం. ౫. ౪.

అనేనాగ్నేర్గత్యర్థత్వేన జ్ఞానస్వరూపత్వా దీశ్వరః ప్రాప్తిహేతుత్వాద్భౌతికోఽర్థో వా గృహ్యతే, (స్వాహా) సుష్ఠు సత్యమాహ యస్యాం వాచి సా. స్వాహేతి వాక్ నామసు పఠితమ్. నిఘం. ౧.౧౧॥ (సూర్యః) చరాచరాత్మా. యః సరతి జానాతి చరాచరం జగత్స జగదీశ్వరః.'సూర్య ఆత్మా జగతస్ తస్థుషశ్చ'. యజు. ౭. ४౨. అనేన సర్వస్యాంతర్యామీ పరమేశ్వరోఽర్థో గృహ్యతే. (జ్యోతిః) సర్వాత్మప్రకాశకో వేదద్వారా సకలవిద్యోపదేశకః (జ్యోతిః) పృథివ్యాదిమూర్తద్రవ్యప్రకాశకః. (సూర్యః) యః సువతి స్వప్రకాశేన ప్రేరణాహేతుర్భవతి స సూర్యలోకః. సూర్య ఇతి పదనామసు పఠితమ్. నిఘం ౫.౬ అనేన జ్ఞాపకేనేశ్వరో వ్యవహారసిద్ధేః ప్రాప్తిహేతుత్వాత్సూర్య లోకో వా గృహ్యతే, (స్వాహా) స్వా స్వకీయా హృదయస్థా వాగ్ యదాహ తదేవ సత్యం వాచ్యం నానృత మిత్యస్మిన్నర్థే (అగ్నిః) సర్వవిద్యోపదేష్టా (వర్చః) వర్చంతే దీప్యంతేఽనేన తద్ వర్చో విద్యాప్రాపణమ్ (జ్యోతిః) సకలపదార్థప్రకాశనమ్. (వర్చః) విద్యావ్యవహార ప్రాపకమ్. (స్వాహా) మనుష్యైః స్వకీయాన్ పదార్థాన్ప్రతి మమేతి వాచ్యం నాన్యపదార్థాన్ ప్రతీత్యస్మిన్నర్థే (సూర్యః) సకలవిద్యాదివ్యవహారప్రాపకత్వేన వర్తమానః ప్రాణాది సమూహో వాయుగుణః (వర్చః) ప్రకాశకం విద్యుత్సూర్యప్రసిద్ధాగ్న్యాఖ్యం తేజః (జ్యోతిః) సర్వవ్యవహార ప్రకాశకమ్, (జ్యోతిః) సత్యప్రకాశకః. (సూర్యః) సర్వవ్యాపక ఈశ్వరః (స్వాహా) వేదవాణీ యజ్ఞక్రియామాహేత్యస్మిన్నర్థే. స్వాహా శబ్దార్థం నిరుక్త కార ఏవం సమాచష్టే. స్వాహా కృతయః స్వాహేత్యేతత్ సు ఆహేతి వా. స్వా వాగా హేతి వా, స్వం ప్రాహేతి వా స్వాహుతం హవిర్జుహోతీతి వా. నిరు. ౮. ౨౦. అయం మంత్రః శత ౨.౨.౩. ౧-౩౬ వ్యాఖ్యాతః. ॥౯॥

అన్వయః:-అగ్నిర్జగదీశ్వరః స్వాహా జ్యోతిః సర్వస్మై దదాతి. ఏవం భౌతికోఽగ్నిః సర్వప్రకాశకం జ్యోతిర్దదాతి. సూర్యశ్చరాచరాత్మా స్వాహా జ్యోతిః సర్వాత్మసు జ్ఞానం దదాతి. అయం సూర్యలోకో జ్యోతిర్దానం మూర్తద్రవ్యప్రకాశనం చ కరోతి. సర్వవిద్యాప్రకాశకోఽగ్నిర్జగదీశ్వరో మనుష్యార్థం సర్వవిద్యాధికరణం వర్చో వేదచతుష్టయం ప్రాదుర్భావయతి. ఏవం జ్యోతిర్విద్యుదాఖ్యోఽయమగ్నిః శరీర బ్రహ్మాండస్థో వర్చో విద్యావృష్టి హేతు ర్భవతి. సూర్యః సకలవిద్యాప్రకాశకో జగదీశ్వరః సర్వమనుష్యార్థం స్వాహా జ్యోతిర్వర్చః ప్రకాశకం విద్యుత్సూర్యప్రసిద్ధాగ్న్యాఖ్యం తేజః కరోతి. ఏవం జ్యోతిః సూర్యలోకోఽపి వర్చః శరీరాత్మబలం ప్రకాశయతి. సూర్యః ప్రాణో జ్యోతిః సకల విద్యాప్రకాశకం జ్ఞానం కారయతి. తథాఽయం జ్యోతిర్మయః సూర్యో జగదీశ్వరః స్వాహా. జ్యోతిః స్వాహుతం హవిః స్వసృష్టపదార్థేషు స్వశక్త్యా సర్వత్ర ప్రసారయతి. ॥ ౯॥

**భావార్థః**:-స్వాహా శబ్దార్థో నిరుక్తకారరీత్యాఽత్ర గృహీతః. ఈశ్వరేణాఽగ్నినా కారణేవాగ్న్యాదికం జగత్ప్రకాశ్యతే. తత్రాగ్నిః స్వప్రకాశేన స్వం స్వేతరం విశ్వం చ ప్రకాశయతి. పరమేశ్వరో వేదద్వారా సర్వా విద్యాః ప్రకాశయత్యేవమగ్నిసూర్యావపి శిల్పాదివిద్యాః ప్రకాశయత ఇతి.॥౯॥

**పదార్థము** :-(అగ్నిః) పరమేశ్వరుడు (స్వాహా) సత్యమును దెలిపెడి వాణిని (జ్యోతిః) విజ్ఞాన ప్రకాశములతో సమ్మిళితమొనర్చి సకలమానవులకొరకు విద్యనొసగుచున్నాడు. ఇట్లే (అగ్నిః) ఏ ప్రసిద్ధాగ్ని (జ్యోతిః) శిల్పవిద్య మున్నగు సాధనములను ప్రకటించుచున్నదో (సూర్యః) చరాచరజగత్తంతటికిని ఆత్మ యైన పరమేశ్వరుడు (స్వాహా) మానవులు తన హృదయమున జనించిన దానినట్లే చెప్పవలయును. ఎట్లు (జ్యోతిః) సర్వాత్మలకు ప్రకాశము, జ్ఞానము మున్నగు సమస్తవిద్యల నుపదేశించుచున్నాడో మరియు (సూర్యః) తన ప్రకాశముచే ప్రేరణకు హేతువగు ఏ సూర్యలోకము (జ్యోతిః) మూర్తివంతములగు పదార్థములను ప్రకాశపరచుచున్నదో (అగ్నిః) సమస్తవిద్యలను ప్రకాశపరచుచు ఏ పరమేశ్వరుడు మానవులకొరకు (వర్చః) సకలవిద్యలకు నాధారభూతమగు చతుర్వేదములను ప్రకాశపరచినాడో (జ్యోతిః) విద్యుద్రూపమున శరీరమునందు, బ్రహ్మాండమునందు నుండు ఏ యగ్ని (వర్చః) విద్యకు, వృష్టికి హేతువై యున్నదో (సూర్యః) సర్వవిద్యలను ప్రకాశపరచు నే జగదీశ్వరుడు సకల మానవులకొరకు (స్వాహా) వేదవాణిద్వారా (వర్చః) సకల విద్యలను (జ్యోతిః) విద్యుత్తు, సూర్యుడు, ప్రసిద్ధాగ్నుల తేజమును ప్రకాశపరచుచున్నాడో (సూర్యః) ఏ సూర్యలోకము (వర్చః) శరీరాత్మల బలములను ప్రకాశపరచుచున్నదో (సూర్యః) ఏ ప్రాణవాయువు (వర్చః) సమస్తవిద్యలను ప్రకటించెడు జ్ఞానమును పెంపొందజేయుచున్నదో (జ్యోతిః) ప్రకాశస్వరూపుడగు ఏ జగదీశ్వరుడు సక్రమముగ హోమ మొనర్చబడిన పదార్థములను తానుసృష్టించిన పదార్థములందు స్వశక్తిచే సర్వత్ర వ్యాపింపజేయుచున్నాడో, ఆ పరమాత్మయే సకల మానవులకు నుపాస్యదైవము. మరియు నట్టి భౌతికాగ్నియు కార్యసిద్ధికి సాధనమునై యున్నది. ॥౯॥

**భావార్థము** :-ఈ మంత్రమున నిరుక్తకారుని పద్ధతి ననుసరించి 'స్వాహా' శబ్దార్థము గ్రహించబడెను. (అగ్ని) ఈశ్వరుడు తన సామర్థ్యముచే కారణమును (ప్రకృతిని) అగ్ని మున్నగు సమస్త జగద్రూపమున నుత్పత్తి జేసి ప్రకాశపరచెను. వానియందు అగ్ని తన ప్రకాశము చేతను, ఇతర సకల పదార్థములను ప్రకాశపరచుచున్నది. పరమేశ్వరుడు వేదములద్వారా సమస్తసత్యవిద్యలను ప్రకటించుచున్నాడు. అదేవిధముగ సూర్యాగ్నులును శిల్ప విద్యాదులను ప్రకటించుచున్నవి.॥౯॥

9. Just as God gives the light of truthful speech to all human brings, so does physical fire give light that illumines all substances. Just as God inculcates knowledge in the souls of all, that man should speak, as he feels in his heart, so does the Sun being to light all physical objects. Just as God reveals for humanity all the four Vedas, the storehouse of knowledge, so does fire in the shape of lightning exist in the space, and become the source of rain and knowledge.

Just as God through the Vedas displays all sciences, fire, and lightning, so does the sun develops our physical and spiritual forces. Sun illumines all objects. God is self-resplendent. This is the manifestation of His Glory.

౧౦. సజూరిత్యస్య ప్రజాపతిర్ ఋషిః, పూర్వార్ధస్యాగ్నిరుత్తరార్ధస్య సూర్యశ్చ దేవతే, పూర్వార్ధస్య గాయత్ర్యుత్తరార్ధస్య భురిగ్గాయత్రీ చ ఛన్దః, షడ్జః స్వరః.

భౌతికావగ్నిసూర్యౌ కస్య సత్తయా వర్తేత ఇత్యుపదిశ్యతే. భౌతికాగ్ని, సూర్యుడు ఎవని సత్తా(శక్తి)వలన వర్తమానములై యున్నవో ఈ మంత్రమునం దుపదేశ మొనర్చబడెను.

౧౦ సజూర్దేవేన సవిత్రా సజా రాత్ర్యేన్ద్రవత్యా। జుషాణో౭ అగ్నిర్వేతు స్వాహా। సజూర్దేవేన సవిత్రా సజూరుషసేన్ద్ర వత్యా। జుషాణః సూర్యోవేతు స్వాహా॥౧౦॥

ప. వి:- సజూరితి స+జూః, దేవేన, సవిత్రా, సజూరితి స+జూః, రాత్ర్యా, ఇన్ద్ర వత్యేతీన్ద్ర + వత్యా, జుషాణః, అగ్నిః, వేతు, స్వాహా, సజూరితి స+జూః, దేవేన, సవిత్రా, సజూరితి స + జూః, ఉషసా, ఇన్ద్ర,వత్యేతీన్ద్ర + వత్యా, జుషాణః, సూర్యః, వేతు, స్వాహా ॥౧౦॥

పదార్థః:-(సజూః) యః సమానం జుషతే సేవతే సః (దేవేన) సర్వజగద్ద్యోతకేన (సవిత్రా) సర్వస్య జగత ఉత్పాదకేనేశ్వరేణోత్పాదితయా (సజూః) యః సమానం జుషతే ప్రీణాతి సః (రాత్ర్యా) తమోరూపయా (ఇన్ద్రవత్యా) ఇన్ద్రో బహ్వీ విద్యుద్విద్యతే యస్యాం తయా అత్ర భూమ్న్యర్థే మతుప్ స్తనయిత్నురేవేన్ద్రః. శత.౧౪. ౫. ౭. ౭ (జుషాణః) యో జుషతే సేవతే సః. (అగ్నిః) భౌతికః.(వేతు) వ్యాప్నోతి. అత్ర లడర్థే లోట్. (స్వాహా) ఈశ్వరస్య స్వా వాగాహేత్యస్మిన్నర్థే (సజూః) ఉక్తార్థః (దేవేన) సూర్యాదిప్రకాశకేన. (సవిత్రా) సర్వాంతర్యామినా జగదీశ్వరేణోత్పాదితయా (సజూః) ఉక్తార్థః (ఉషసా) రాత్ర్యవసానోత్పన్నయా దివసహేతునా (ఇన్ద్రవత్యా) సూర్యప్రకాశసహితయోషసా (జుషాణః) సేవమానః సూర్యలోకః (వేతు) వ్యాప్నోతి. అత్రాపి లడర్థే లోట్. (స్వాహా) హుతామాహుతిమ్. అయం మంత్రః. శత ౨. ౨. ౩. ౩౭-౩౯। వ్యాఖ్యాతః ॥ ౧౦॥

**అన్వయః :-అయమగ్నిర్దేవేన సవిత్రా జగదీశ్వరేణోత్పాదితయా సృష్ట్యా సహ సజూర్జుషాణ ఇన్ద్రవత్యా రాత్ర్యా సహ స్వాహా జుషాణః సన్వేతు సర్వాన్ పదార్థాన్వ్యాప్నోతి. ఏవం సూర్యో దేవేన సవిత్రా సకలజగదుత్పాదకేన ధారితయా సృష్ట్యా సహ సజూర్జుషాణ ఇన్ద్రవత్యోషసా సహ స్వాహా జుషాణః సన్ హుతం ద్రవ్యం వేతు వ్యాప్నోతి.॥౧౦॥**

**భావార్థః :-హే మనుష్యా! యూయం యోఽయమగ్నిరీశ్వరేణ నిర్మితః స తత్పత్త్రయా స్వస్వరూపం ధారయన్ సన్ రాత్రిస్థాన్వ్యవహారాన్ప్రకాశయతి. ఏవం చ సూర్య ఉషఃకాలమేత్య సర్వాణి మూర్తద్రవ్యాణి ప్రకాశయితుం శక్నోతీతి విజానీత. ॥౧౦॥**

**పదార్థము:-**(అగ్నిః) ఏ భౌతికాగ్ని (సవిత్రా) విశ్వమంతటి నుత్పత్తి జేయువాడును (దేవేన) విశ్వమంతటికి జ్ఞానము నొసగువాడును నగు నీశ్వరునిచే నుత్పన్నపరచబడిన జగత్తుతో గూడ (సజూః) సమగుణము గలిగియుండి (జుషాణః) సేవించుచున్నదో (ఇన్ద్రవత్యా) విశాలమగు విద్యుచ్ఛక్తితో గూడినదై (రాత్ర్యా) అంధకారరూప రాత్రితో బాటు (స్వాహా) వాణిని సేవించుచు (వేత) సమస్తపదార్థములందు వ్యాపించుచున్నదో, ఇట్లే (సూర్యః) ఏ సూర్యలోకము (దేవేన) సమస్తమును ప్రకాశింపజేయువాడును (సవిత్రా) సర్వాంతర్యామియునైన పరమేశ్వరునిచే సృష్టింపబడిన జగుత్తుతో బాటు (సజూః) సమానముగ నుండి (జుషాణః) సేవించుచున్నదో (ఇన్ద్రవత్యా) సూర్యప్రకాశముతోగలిసి (ఉషసా) ప్రకాశమగు ఉషః [ప్రాతః] కాలముతో బాటు (స్వాహా) అగ్నియందు హోమమొనర్పబడిన ఆహుతులను (జుషాణః) సేవించుచు హవన మొనర్పబడిన పదార్థములను (వేతు) సకలప్రదేశములకు చేర్చుచున్నదో, అట్టి దానితోనే సకలవ్యవహారములను సాధించవలయును. ॥౧౦॥

**భావార్థము :-** మానవులారా! ఈ యగ్ని పరమేశ్వరునిచే రచింపబడినదై ఆతని శక్తిచేతనే స్వస్వరూపమును ధారణమొనర్చుచు దీపములు మున్నగు రూపములద్వారా రాత్రి వ్యవహారములను నడుపుచున్నది. అటులనే ప్రాతఃకాలమున సూర్యుడుదయించి తన ప్రకాశముద్వారా పగటి వ్యవహారములను మరియు మూర్తిమంతమగు సమస్త ద్రవ్యములను ప్రకాశపరచుచున్నాడు. ఆ భౌతికాగ్ని, సూర్య విద్యుదగ్నులు కార్యములను సిద్ధి యొనర్చును. ఈ విషయమును మీ రెల్లరును తెలిసికొనుడు. ॥౧౦॥

**10. This enjoyable fire, in accompaniment with the recital of Vedic texts, mixed with God's creation and dark night, with flashes of lightning pervades all objects.**

**This sun, mixed with God's creation and brilliant dawn, receives the oblations put into the fire, and carries them to places far and wide.**

**౭౬. ఉపేత్యస్య గోతమ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్ గాయత్రీ ఛన్దః. షడ్జ స్వరః.**

**అథేశ్వరేణ స్వస్వరూపముపదిశ్యతే.**

**ఇపు డీ మంత్రమున ఈశ్వరుడు తన స్వరూపమును ప్రకాశపరచెను.**

౭౬. ఉప ప్రయన్తో॑ అధ్వరం మంత్రం వోచేమాగ్నయే।

ఆరే॑ అస్మే చ శృణ్వతే ॥౧౧॥

ప. వి:- ఉపప్రయన్త ఇత్యుప+ ప్రయన్తః, అధ్వరమ్, మన్త్రమ్, వోచేమ, అగ్నయే, ఆరే, అస్మే॑ ఇత్యస్మే, చ, శృణ్వతే.॥ ౧౧॥

పదార్థః :-(ఉపప్రయన్తః) ఉత్కృష్టం నిష్పాదయంతో జానంతః (అధ్వరమ్) క్రియామయం యజ్ఞమ్ (మన్త్రమ్) వేదస్థం విజ్ఞానహేతుమ్, (వోచేమ) ఉచ్యామ. అయమవాశిషి లిఙ్యుత్తమబహువచనే ప్రయోగః. లిఙాశిష్యఙిత్యఙి కృతే ఛన్దస్యుభయథేతి సార్వధాతుకమాశ్రిత్యేయ్ సకారలోపౌ. వచ ఉమ్. అ. ౭.౪.౨౦. ఇత్యఙి పర ఉమాగమశ్చ (అగ్నయే) విజ్ఞానస్వరూపాయాంతర్యామినే జగదీశ్వరాయ (ఆరే) దూరే. అర ఇతి దూరనామసు పఠితమ్. నిఘం ౩. ౨౬॥ (అస్మే) అస్మాకమ్. అత్ర సుపాం సులుగిత్యమస్థానే శే ఆదేశః (చ) సముచ్చయే (శృణ్వతే) యో యథార్థతయా శృణోతి తస్మై. అయం మంత్రః శత. ౨. ౩. ౨. ౯. ౧౦ వ్యాఖ్యాతః. ॥౧౧॥

అన్వయః :-అధ్వరముపప్రయంతో వయముస్మే అస్మాకమారే దూరే చాత్సమీపే శృణ్వతే॑ఽగ్నయే జగదీశ్వరాయ మంత్రం వోచేమోచ్యామ. ॥౧౧॥

భావార్థః:-మనుష్యై ర్వేదమన్త్రై రీశ్వరస్య స్తుతియంజ్ఞానుష్ఠానే కృత్వా, య ఈశ్వరో॑ఽంతర్బ హిశ్చాభివ్యాప్య సర్వం శృణ్వన్వర్తతే, తస్మాద్భీత్వా న కదాచిదధర్మం కర్తుమిచ్ఛాపి కార్యా. యదా మనుష్య ఏతం జానాతి తదా సమీపస్థో యదైనం న జానాతి తదా దూరస్థ ఇతి వేద్యమ్.॥౧౧॥

పదార్థము :-(అధ్వరమ్) క్రియామయమగు యజ్ఞమును (ఉప ప్రయన్తః) బాగుగా దెలిసికొనుచున్న మేము (అస్మే) మాకు (ఆరే) దూరమందును లేక (చ) సమీపమందును (శృణ్వతే) సత్యాసత్యముల నెరుగువాడును (అగ్నయే) విజ్ఞానప్రకాశ స్వరూపుడును, అంతర్యామియు నగు పరమేశ్వరుని (మన్త్రమ్) జ్ఞానమును లభింపజేయు మంత్రములతో (వోచేమ) నిత్యము స్తుతింతుముగాక, ఆలోచించెదముగాక!॥౧౧॥

భావార్థము :- మానవులు వేదమంత్రములచే ఈశ్వరుని స్తుతించి యజ్ఞానుష్ఠాన మొనర్చుచు జగదీశ్వరుడు లోపల వెలుపల యంతట నిండియుండి సమస్తవ్యవహారముల నెరుగుచు, తెలిసికొనుచు ప్రకాశించుచున్నాడని భావించి అనుభూతి నొంది, అధర్మకర్మలందు నాతనికి భయపడుచు అట్టివాని నెన్నడును సంకల్పించరాదు. మానవుడు పరమాత్మను తెలిసికొన్నప్పు డాతడు అతి సమీపస్థుడనియు, తెలియనప్పు డతిదూరస్థుడనియు నిశ్చయముగ నెరుగవలెను. ॥౧౧॥

11. Performing sacrifice, may we pronounce vedic texts, in praise of God, Who hears us from far and near.

౧౨. అగ్నిర్మూర్ధేత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథాగ్నిశబ్దే నేశ్వరభౌతికావుపదిశ్యేతే.

ఇపు డీ మంత్రమున అగ్ని శబ్దముచే పరమేశ్వరుడు మరియు భౌతికాగ్నియు నని యుపదేశించబడినది.

౧౨ అగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృథివ్యా౭ అయమ్।
అపాꣳరేతాꣳసి జిన్వతి॥౧౨॥

ప.విః- అగ్నిః, మూర్ధా, దివః, కకుత్, పతిః, పృథివ్యాః, అయమ్, అపామ్, రేతాꣳసి, జిన్వతి.॥౧౨॥

పదార్థః :-(అగ్నిః) సర్వస్వామీశ్వరః. ప్రకాశాదిగుణవాన్భౌతికో వా. (మూర్ధా) సర్వోపరి విరాజమానః (దివః) ప్రకాశవతః సూర్యాదేర్జగతః (కకుత్) మహాన్. కకుహ ఇతి మహన్నామసు పఠితమ్. నిఘం 3.3. కకుహశబ్దస్య స్థానే కకుత్. పృషోదరాద్యాకృతి గణాంతర్గతత్వాత్సిద్ధః. (పతిః) పాలయితా. పాలనహేతుర్వా (పృథివ్యాః) ప్రకాశ రహితస్య పృథివ్యాదేర్జగతః (అయమ్) నిరూపితపూర్వః (అపామ్) ప్రాణానాం జలానాం వా. ఆప ఇతి పదనామసు పఠితమ్. నిఘం. ౫. 3. అనేన చేష్టాదివ్యవహారప్రాపకాః ప్రాణా గృహ్యంతే. ఆప ఇత్యుదక నామసు పఠితమ్, నిఘం ౧.౧౨॥ (రేతాంసి) వీర్యాణి. (జిన్వతి) రయితుం జానాతి, ప్రాపయతి వా. జిన్వతీతి గతికర్మసు పఠితమ్. నిఘం ౨. ౧౪. అయం మంత్రః. శత. ౨.3. ౨. ౧౧. వ్యాఖ్యాతః. ॥౧౨॥

అన్వయః :-హే మనుష్యా! యూయం యో౭యం కకున్మూర్ధాగ్నిర్జగదీశ్వరో దివః పృథివ్యాశ్చ పతిః పాలకః సన్నపాం రేతాంసి జిన్వతి ప్రష్టుం జానాతి తమేవ పూజ్యం మన్యధ్వమిత్యేకః.

యో౭యమగ్నిః కకుద్దివో మూర్ధా పృథివ్యాశ్చ పతిః పాలనహేతుః సన్నపాం రేతాంసి జిన్వతి స సుఖం ప్రాపయతీతి ద్వితీయః. ॥౧౨॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః.యో జగదీశ్వరః ప్రకాశాప్రకాశవద్ద్వివిధం జగదర్థాత్ ప్రకాశవత్సూర్యాదిక మప్రకాశవత్పృథివ్యాదికం చ రచయిత్వా పాలయిత్వా ప్రాణేషు బలం

**చ దధాతి. తథాయోఽయమగ్నిః పృథివ్యాది జగతః పాలనహేతుర్భూత్వా విద్యుజ్జాఠరాది రూపః ప్రాణానాం జలానాం వీర్యాణి జనయతి స ఏవ సుఖసాధకో భవతీతి. ॥౧౨॥**

**పదార్థము** :-(అయమ్) కార్యకారణములచే ప్రత్యక్షమగుచున్నవాడును (కకుత్) సర్వమునకు గొప్పవాడును (మూర్ధా) సమస్తమునకు పైనయుండి ప్రకాశించువాడును అగు (అగ్నిః) పరమాత్మ (దివః) ప్రకాశమానమైయున్న సూర్యాది లోకములకు (పృథివ్యాః) ప్రకాశహీనమైన భూమి మున్నగు లోకములను (పతిః) పాలించుచు (అపామ్) ప్రాణముల సంబంధ (రేతాంసి) వీర్యములను (జిన్వతి) [ప్రాప్తిగిలిగించుచున్నాడు] సృష్టి నెరుగుచున్నాడు. ఆతనినే పూజనీయుడుగ స్వీకరించుడు. **[ఇది మొదటి పక్షము].**

(కకుత్)పదార్థము లన్నిటికంటెను గొప్పదైన (అయమ్) ఈ యగ్ని (దివః) ప్రకాశవంతమగు పదార్థములకు (మూర్ధా) పైన విరాజమానమై (పృథివ్యాః) ప్రకాశరహితమైన పృథివిమున్నగు లోకముల (పతిః) పాలనకు హేతువై (అపామ్) జలముల (రేతాంసి) వీర్యములను (జిన్వతి) పొందుచున్నది. **[ఇది రెండవ పక్షము]**॥౧౨॥

**భావార్థము** :-ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. పరమేశ్వరుడు ప్రకాశ, అప్రకాశములు నగు ద్వివిధ జగత్తులను అనగా ప్రకాశవంతమగు సూర్యాదిలోకములను, ప్రకాశరహితములు నగు పృథివి మున్నగు లోకములను నిర్మించి, పాలించి ప్రాణములందు బలమును ధరింపజేయుచున్నాడు. మరియు భౌతికాగ్ని పృథివి మున్నగు జగత్పాలనకు హేతువై విద్యుత్తు, జఠరాగ్ని మొదలగు రూపములతో ప్రాణముల, జలముల వీర్యముల నుత్పత్తి జేయుచున్నది. ఈ విధముగ అగ్ని సౌఖ్యములకు సాధన మగుచున్నది. ॥౧౨॥

12. Men should worship God alone, Who is the Great and Supreme Lord, Who sustains the luminous Sun, and the non-luminous Earth, Who knows the formation of the vitality of waters.

౧౩. ఉభావామిన్ద్రాగ్నీ ఇత్యస్య భరద్వాజ ఋషిః, ఇంద్రాగ్నీ దేవతే, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వర భౌతికావగ్నివాయూ ఉపదిశ్యేతే.

ఈ మంత్రమున భౌతికాగ్ని, వాయువును గూర్చి ఉపదేశించబడినది.

౧౩ ఉభా వామిన్ద్రాగ్నీఽ ఆహువధ్యాఽ ఉభా రాధసః సహ మాదయధ్యై।

ఉభా దాతారా విషాగ్ంరయీణాముభా వాజస్య సాతయే హువే వామ్ ॥౧౩॥.

ప.విః- ఉభా, వామ్, ఇన్ద్రాగ్నీ ఇతీన్ద్రాగ్నీ, ఆహువధ్యాఽఇత్యా+హువధ్యై, ఉభా, రాధసః, సహ, మాదయధ్యై, ఉభా, దాతారౌ, ఇషామ్, రయీణామ్, ఉభా, వాజస్య, సాతయే, హువే, వామ్.॥౧౩॥

పదార్థః:-(ఉభా) ద్వౌ. అత్ర సర్వత్ర సుపాం సులుగిత్యాకారాదేశః (వామ్) తౌ. అత్ర వ్యత్యయః. (ఇన్ద్రాగ్నీ) ఇన్ద్రోవాయుర్విద్యుదాది రూపోఽగ్నిశ్చ తౌ (ఆహువధ్యై) శబ్దయితుముపదేష్టుం శ్రోతుం వా. అత్ర తుమర్థే సేసే... ఇతి కధ్యై ప్రత్యయః (ఉభా) ఉభౌ (రాధసః) రాధ్నువన్తి సమ్యక్ నిర్వర్తయన్తి సుఖాని యేభ్యః సాధనేభ్యస్తాని ధనాని. రాధ ఇతి ధననామసు పఠితమ్. నిఘం ౨. ౧౦ (సహ) పరస్పరమ్. (మాదయధ్యై) మోదయితుమ్. అత్ర మదీ హర్షగ్లేపనయోరితి ణిజన్తాచ్ఛధ్యై ప్రత్యయః (ఉభా) ఉభౌ (దాతారౌ) సుఖదానహేతూ (ఇషామ్) సర్వైర్జనైర్యానీష్యంతే తేషామ్, (రయీణామ్) పరమోత్తమానాం చక్రవర్తిరాజ్యాదిధనానామ్, (ఉభా) ద్వౌ (వాజస్య) అత్యుత్తమస్యాన్నస్య. వాజ ఇత్యన్న నామసు పఠితమ్. నిఘం. ౨.౭ (సాతయే) సంభోగాయ (హువే) గృహ్ణామి. అత్ర హు దానాదనయోరిత్యస్మా ద్బహులం ఛన్దసీతి శపో లుక్. వ్యత్యయేనాత్మనే పదం చ. (వామ్) తౌ. అత్రాపి పూర్వవద్ వ్యత్యయః. అయం మంత్రః. శత ౨. ౩.౨. ౧౨. వ్యాఖ్యాతః.॥౧౩॥

అన్వయః:-అహం యావుభౌ దాతారౌ సుఖదానహేతూ వర్త్తేతే తావిన్ద్రాగ్నీ ఆహువధ్యై శబ్దయితుం హువే గృహ్ణామి రాధసో భోగేన సహ మాదయధ్యై మోదయితు ముభౌ వాం తౌ హువ ఇషాం రయీణాం వాజస్య చ సాతయ ఉభౌ వాం తౌ హువే గృహ్ణామి. ॥౧౩॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. యే మనుష్యా ఈశ్వరసృష్టౌ సుష్ఠు కిలాగ్నివాయు గుణాన్విదిత్వా తౌ సంప్రయుజ్య కార్యాణి సాధయన్తి తే సర్వాణి సార్వభౌమరాజ్యాదిధనాని ప్రాప్య నిత్యం మోదంతే నేతర ఇతి.॥౧౩॥

పదార్థము :-నేను (ఉభౌ) ఏ రెండు (దాతారౌ) సుఖములను గలిగించుటకు హేతువులగు (ఇన్ద్రాగ్నీ) వాయువు, అగ్నులు గలవో (వామ్) వానిని (ఆహువధ్యై) గుణములను దెలిసికొనుటకై (హువే) ధరించుచున్నాను. (రాధసః) ఉత్తమ సుఖములతో గూడిన రాజ్యములు మున్నగు ధనభోగములతో (సహ) కూడ (మాదయధ్యై) ఆనందముకొరకు (వామ్) అట్టి (ఉభా) రెండింటిని (హువే) ధరించుచున్నాను. మరియు (ఇషామ్) సకలజన సమ్మతమగు (రయీణామ్) అత్యంత ఉత్తమమైన సామ్రాజ్యము మున్నగు ధనములను (వాజస్య) అత్యుత్తమమైన యన్నమును (సాతయే) బాగుగా యనుభవించుటకై (ఉభౌ) ఆ రెండింటిని (హువే) గ్రహణమొనర్చు చున్నాను.॥౧౩॥

భావార్థము :-మనుష్యులు ఈశ్వరసృష్టియందలి వాయ్వగ్నుల గుణములను దెలిసికొని కార్యములందు ప్రయుక్తపరచి తమతమ కార్యములను సాధించుకొని పృథివియందలి రాజ్యాది ధనసంపదలను పొంది ఆనందించవలయును. ఇట్టి కార్యశూరులే ఆనందమును పొందెదరు. కాని ఇతరులు పొందలేరు.॥౧౩॥

13. Oh Electricity and Fire, I invoke Ye both for knowing your attributes, for enjoying the pleasures of riches. Ye both are the givers of desired sovereignty. Ye twain I invoke for consuming excellent food.

౧౪. అయన్త ఇత్యస్య దేవవాతా భరతా వృషీ, అగ్ని ర్దేవతా, స్వరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునరీశ్వరభౌతికావుపదిశ్యేతే.

మరల నీ మంత్రమున ఈశ్వరుని, మరియు భౌతికాగ్నిని గూర్చి ఉపదేశించబడినది.

౧౪ అయన్తే యోనిర్ఋత్వియో యతో జాతోఽ అరోచథాః।

తఞ్జాన న్నగ్నఽ ఆరోహాథా నో వర్ధయా రయిమ్ ॥౧౪॥

ప.వి:- అయమ్, తే, యోనిః, ఋత్వియః, యతః, జాతః అరోచథాః, తమ్, జానన్, అగ్నే, ఆ, రోహ, అథ, నః, వర్ధయ, రయిమ్.॥౧౪॥

పదార్థః :-(అయమ్) వాయుః (తే) తవేశ్వరస్య (యోనిః) నిమిత్తకారణమ్. (ఋత్వియః) ఋతుః ప్రాప్తో ఽస్య సః.అత్ర ఛన్దసి ఘస్. అ. ౫.౧.౧౦౬ అనేన ఋతుశబ్దాద్ ఘప్రత్యయః (యతః) యస్మాత్ (జాతః) ప్రాదుర్భూతః (అరోచథాః) దీపయతి. అత్ర వ్యత్యయో లడర్థే లుఙ్ (తమ్) అగ్నిమ్. (జానన్)(అగ్నే) జగదీశ్వరో విద్యుద్వా. (ఆ) సమంతాత్ క్రియాయోగే (రోహ) ఉన్నతిం గమయ గమయతి వా (అథ) ఆనంతర్యే. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. (నః) అస్మాకమ్. (వర్ధయ) సర్వోత్కృష్టతాం సంపాదయ సంపాదయతి వా. అత్రాన్యేషా మపీతి దీర్ఘః. (రయిమ్) పూర్వోక్తం ధనమ్ అయం మంత్రః. శత. ౨. 3. ౨. ౧3. వ్యాఖ్యాతః. ॥౧౪॥

అన్వయః :-హే అగ్నే జగదీశ్వర! తే తవ సృష్టౌ య ఋత్వియోఽగ్నిర్వాయోః సకాశాజ్జాతః సన్నారోచథాః సమంతాత్ప్రదీపయతి. యః సూర్యాదిరూపేణ దివమారోహ సమంతాద్రోహతి యో నోఽస్మాకం రయిం వర్ధయతి. యస్యాగ్నేరయం వాయుర్యోనిరస్తి తం జానం స్త్వం తేన నోఽస్మాకం రయిం సార్వభౌమరాజ్యాదిసిద్ధిం ధనం వర్ధయ.॥౧౪॥

భావార్థః :-మనుష్యైర్యః సర్వేషు కాలేషు యథావద్యోజనీయోఽస్తి యో వాయు నిమిత్తే నోత్పద్యతే య ఏవానేక కార్యసిద్ధి కరత్వేన సర్వాన్ సుఖయతి తం యథావద్ విదిత్వా సంప్రయుజ్య కార్యాణి సాధనీయానీతి.॥౧౪॥

**పదార్థము** :-(అగ్నే) ఓ జగదీశ్వరా! (తే) నీ సృష్టియందు (ఋత్వియః) ప్రతిఋతువునందును ప్రాప్తించుకొనదగిన ఏ యగ్నిగలదో, ఏది వాయువువల్ల (జాతః) ఉద్భవించి (అరోచథాః) సకలవిధములుగ ప్రకాశించుచున్నదో, ఎయ్యది సూర్యుడు మున్నగు రూపములతో ప్రకాశించెడి లోకముల యున్నతిని (ఆరోహ) సర్వవిధముల నభివృద్ధిపరచుచున్నదో మరియు ఎయ్యది (నః) మా (రయిమ్)రాజ్యాది ధనములను పెంపొందించుచున్నదియో [ఏయగ్నికి ఈ వాయువు ఉత్పత్తి స్థానమై యున్నదియో] (తమ్)అట్టి అగ్నిని (జానన్) ఎరుగుచున్న నీవు దానిచే (నః రయిమ్) సార్వభౌమిక రాజ్యముద్వారా సిద్ధించిన మా ధనములను (వర్ధయ) వృద్ధినొందించుము. ॥౧౪॥

**భావార్థము** :- మనుష్యు లెల్లకాలములందు యథోచితముగ నుపయోగించదగినదియు, వాయువు నిమిత్తమున ఉత్పన్నమైనదియు, అనేక కార్యములను సిద్ధింపజేయునదియు నగుటచే సకల ప్రాణులకు సుఖమొసగుచున్నదియు నగు అగ్నిని యథావతుగ దెలిసికొని, ఉపయోగపరచుకొని సమస్తకార్యములను సిద్ధింపజేసికొనవలయును. ॥౧౪॥

14. Oh God, in Thy creation, sacrificial fire, whose cause of birth is air, burns in different seasons, and develops in all directions. Knowing this, cause our riches increase!.

౧౫. అయమిహేత్యస్య వామదేవ ఋషిః। అగ్నిర్దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః సోఽగ్నిః కీదృశ ఇత్యుపదిశ్యతే.

మరల నా యగ్ని యెట్టుగల దను విషయ మీ మంత్రమం దుపదేశించబడినది.

౧౫ అయమిహ ప్రథమో ధాయి ధాతృభిర్హోతా యజిష్ఠోఽ అధ్వరేష్వీడ్యః।
యమప్నవానో భృగవో విరురుచుర్వనేషు చిత్రం విభ్వం విశే విశే ॥౧౫॥

ప.వి:- అయమ్, ఇహ, ప్రథమః, ధాయి, ధాతృభిరితి ధాతృ+భిః । హోతా, యజిష్ఠః, అధ్వరేషు, ఈడ్యః, యమ్, అప్నవానః, భృగవః, విరురుచురితి వి + రురుచుః. వనేషు, చిత్రమ్, విభ్వమితి వి + భ్వమ్, విశేవిశ ఇతి విశే + విశే. ॥౧౫॥

పదార్థః:-(అయమ్) ఈశ్వరో భౌతికో వా (ఇహ) అస్యాం సృష్టౌ (ప్రథమః) యజ్ఞక్రియాయాముపాస్య ఆదిమం సాధనం వా (ధాయి) ధ్రియతే. అత్ర వర్తమానే లుఙ్. బహులం ఛన్దస్యమాఙ్యోగే పీత్యడభావః (ధాతృభిః) యజ్ఞక్రియాధారకైర్విద్వద్భిః (హోతా) గ్రాహకః (యజిష్ఠః) అతిశయేనావ న్దశిల్పవిద్యయోః సంగతిహేతుః (అధ్వరేషు)

ఉపాసనాగ్నిహోత్రాద్యశ్వమేధాం తేషు శిల్పవిద్యాంతర్గతేషు వా యజ్ఞేషు (ఈడ్యః) ఉపాసితుమధ్యేషితుం వాఽర్హః (యమ్) ఉక్తార్థమ్, (అప్నవానః) యేఽప్నాన్విద్యా సంతానాన్ కుర్వన్తి తే అప్న ఇత్యస్మాత్తత్క ఉరోతి తదాచేష్టే. అ. 3. 1. 26 అనేన కరోత్యర్థే ణిచ్. తతోఽన్యేభ్యోఽపి దృశ్యన్త ఇతి వనిప్. అప్న ఇత్యపత్యనామసు పఠితమ్. నిఘం. 2. 2. (భృగవః) యజ్ఞవిద్యావేత్తారః. భృగవ ఇతి పదనామసు పఠితమ్. నిఘం. 5.5. అనేన జ్ఞానవత్త్వం గృహ్యతే (విరురుచుః) విదీపయన్తి. అత్ర లడర్థే లిట్. (వనేషు) సంభజనీయేషు. (చిత్రమ్) అద్భుతగుణమ్, (విభ్వమ్) వ్యాపనశీలమ్. అత్ర వా ఛన్దసీత్యనేన పూర్వరూపాదేశో న (విశే విశే) ప్రతి ప్రజామ్. అయం మంత్రః. శత 2. 3. 2. 14. వ్యాఖ్యాతః ॥15॥

అన్వయః :- అప్నవానో భృగవో విద్వాంస ఇహ వనేష్వధ్వరేషు విశే విశే విభ్వం. చిత్రం యమగ్నిం విరురుచుర్వివిదీపయంతి సోఽయం ధాతృభిః ప్రథమ ఈడ్యో హోతా యజిష్ఠోఽగ్నిరిహ ధాయి ధ్రియతే.॥15॥

భావార్థః :- అత్ర శ్లేషాలంకారః. విద్వాంసో యజ్ఞక్రియాసిద్ధ్యర్థముపాస్య సాధనత్వాభ్యా మేతమగ్నిం స్తుత్వా గృహీత్వా వాఽస్యాం సృష్టౌ ప్రజాసుఖాని నిర్వర్తయేయురితి. ॥15॥

పదార్థము :- (అప్నవానః) విద్యా సంతానములను అనగా విద్యలను చదివించి, విద్వాంసులుగ నొనర్చువారు (భృగవః) యజ్ఞవిద్యల నెరిగిన విద్వాంసులు (ఇహ) ఈ విశ్వమందు (వనేషు) బాగుగా సేవించదగిన (అధ్వరేషు) ఉపాసన, అగ్నిహోత్రము మొదలుకొని అశ్వమేధాది యజ్ఞములవరకు గల శిల్పవిద్యామయ యజ్ఞములందును (విశే విశే) ప్రతిమనుష్యునందును (విభ్వమ్) వ్యాప్తస్వభావముగలవాడును (యమ్) ఏ యీశ్వరుని మరియు అగ్నిని (విరురుచుః) విశేషముగ ప్రకాశపరచుచున్నారో (చిత్రమ్) ఆశ్చర్యగుణములు గలవాడును (అయమ్) అట్టివారే (ధాతృభిః) యజ్ఞక్రియలను ధారణమొనర్చు విద్వాంసులకు (ఈడ్యః) అన్వేషించదగినవాడు (ప్రథమః) యజ్ఞక్రియకు ప్రథమ సాధనము (హోతా) యజ్ఞమును ధరింపజేయువాడు మాత్రమే (యజిష్ఠః) ఉపాసనకు, శిల్పవిద్యకు హేతువునగు నాతని (ఇహ) ఈ జగమునందు (ధాయి) ధరించుచున్నాడు. ॥15॥

భావార్థము :- ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. విద్వాంసులు యజ్ఞసిద్ధికై ముఖ్యముగ ఉపాసనీయ దేవుని మరియు అందుకు సాధనమగు భౌతికాగ్నిని గ్రహించి ఈ సృష్టియందు ప్రజల సుఖములను సదా సిద్ధింపజేయవలయును. ॥15॥

15. In this world the instructors and the learned kindle in serviceable yajnas, for mankind, the ubiquitous fire of extra- ordinary qualities.

That fire is recognised by the regulators of sacrifice as worthy of adoration, as the first means of the performance of a yajna, as the receiver of sacrifice and giver of happiness and scientifice knowledge.

౮౧. అస్య ప్రత్నామిత్యస్యావత్సార ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః స కీదృశ ఇత్యుపదిశ్యతే.

మరియు నది యెట్లున్నదను విషయ మీ మంత్రమున గలదు.

౮౧ అస్య ప్రత్నామనుద్యుతఀ శుక్రం దుదుహ్రేఽ అహ్రయః।
పయః సహస్రసామృషిమ్ ॥౧౬॥

ప.వి:- అస్య, ప్రత్నామ్, అను, ద్యుతమ్, శుక్రమ్ దుదుహ్రే, అహ్రయః, పయః, సహస్రసామితి సహస్ర+సామ్, ఋషిమ్ ॥౧౬॥

పదార్థః :-(అస్య) అగ్నేః (ప్రత్నామ్) అనాదివర్తమానాం పురాణీమనాదిస్వరూపేణ నిత్యామ్. ప్రత్నమితి పురాణ నామసు పఠితమ్. నిఘం. 3. ౨౭. (అను) పశ్చాదర్థే (ద్యుతమ్) కారణస్థాం దీప్తిమ్. అత్ర ద్యుత దీప్తా నిత్యస్మాత్ క్విప్ ప్రత్యయః (శుక్రమ్) శుద్ధం కార్యకరం సాధనమ్. (దుదుహ్రే) ప్రపూరయన్తి. అత్ర వర్తమానే లిట్. ఇరయోరే. అ. ౬. ౪. ౭౬. అనేనేరేజిత్యస్య స్థానే రే ఆదేశః, (అహ్రయః) అహ్రువన్తి వ్యాప్నువన్తి సర్వా విద్యా యే తే విద్వాంసః. అత్రాఽ హవ్యాప్తా విత్యస్మాద్బాహులకే నౌణాదికః క్రిః ప్రత్యయః. మహీధరేణాయం హ్రీ లజ్జాయా మిత్యస్య ప్రయోగోఽ శుద్ధ ఏవ వ్యాఖ్యాత ఇతి (పయః) జలమ్. పయ ఇత్యుదకనామసు పఠితమ్. నిఘం. ౧. ౧౨. (సహస్రసామ్) యా సహస్రాణ్యసంఖ్యాతాని కార్యాణి సనోతి తామ్. (ఋషిమ్) కార్యసిద్ధి ప్రాప్తి హేతుమ్. అత్రే గుపధాత్కిత్. ఉ. ౪. ౧౨౫ అనేన ఋషీ గతావిత్యస్మాద్ధాతోరిన్ప్రత్యయః. అయం మంత్రః. శత ౨. 3. ౨. ౧౫. వ్యాఖ్యాతః.॥౧౬॥

అన్వయః :-అహ్రయో విద్వాంసోఽస్యాగ్నేః సహస్ర సామృషిం ప్రత్నాం ద్యుతం జ్ఞాత్వా శుక్రం పయశ్చాను దుదుహ్రే ప్రపూరయన్తి.॥౧౬॥

భావార్థః :-మనుష్యైర్యథాగ్నే ష్స్వగుణసహితస్య కారణరూపేణానాదిత్వేన నిత్యత్వం విజ్ఞేయమస్తి. తథై వాన్యేషామపి జగత్ స్థానాం కార్యద్రవ్యాణాం కారణరూపేణానాదిత్వం వేదితవ్యమేతద్విదిత్వైతానగ్న్యాదీన్ పదార్థాన్ కార్యేషూపకృత్య సర్వే వ్యవహారాః సంసాధనీయా ఇతి.॥౧౬॥

పదార్థః:-(తత్) వక్ష్యమాణమ్ (సవితుః) సర్వస్య జగతః ప్రసవితుః. సవితా వై దేవానాం ప్రసవితా తథోహాస్మాఽ ఏతే సవితృప్రసూతా ఏవ సర్వే కామాః సమృధ్యంతే. శత ౨. ౩.౪. ౩౯. (వరేణ్యం అతిశ్రేష్ఠమ్. అత్ర వృఞ్ ఏణ్యః ఉ. ౩. ౯౮. అనేన వృఞ్ ధాతో రేణ్యప్రత్యయః (భర్గః) భృజ్జంతి పాపాని దుఃఖమూలాని యేన తత్. అంచ్యంజియుజి. ఉ. ౪. ౨౧౮. ఇతి భ్రస్జ ధాతోరసున్ ప్రత్యయః కవర్గాదేశశ్చ (దేవస్య) ప్రకాశమయస్య శుద్ధస్య సర్వసుఖప్రదాతుః పరమేశ్వరస్య (ధీమహి) దధీమహి. అత్ర డుధాఞ్ ధాతోః ప్రార్థనాయాం లిఙ్ ఛన్దస్యుభయథేత్యార్ధధాతుకత్వాచ్ఛప్ న. ఆతోలోప ఇటి చేత్యాకారలోపశ్చ. (ధియః) ప్రజ్ఞా బుద్ధీః. ధీరితి ప్రజ్ఞా నామసు పఠితమ్. నిఘం. ౩. ౯. (యః) సవితా దేవః పరమేశ్వరః (నః) అస్మాకమ్ ((ప్ర) ప్రకృష్టార్థే (చోదయాత్) ప్రేరయేత్. అయం మంత్రః. శత. ౨.౩.౪.౩౯. వ్యాఖ్యాతః. ॥౩౫॥

అన్వయః :-వయం సవితుర్దేవస్య పరమేశ్వరస్య యద్వరేణ్యం భర్గః స్వరూపమస్తి తద్ధీమహి. యః సవితా దేవోఽన్తర్యామీ పరమేశ్వరః స నోఽస్మాకం ధియః ప్రచోదయాత్ ప్రేరయేత్.॥౩౫॥

భావార్థః:-మనుష్యైః సకలజగదుత్పాదకస్య సర్వోత్కృష్టస్య సకలదోషనాశకస్య శుద్ధస్య పరమేశ్వరస్యైవోపాసనా నిత్యం కార్యా. కస్మై ప్రయోజనాయేత్యత్రాహ స స్తుతో ధారితః ప్రార్థిత ఉపాసితః సన్నస్మాన్ సర్వేభ్యో దుష్టగుణకర్మ స్వభావేభ్యః పృథక్కృత్య సర్వేషు గుణకర్మ స్వభావేషు నిత్యంప్రవర్తయేదిత్యస్మై. శుభేషు అయమేవ ప్రార్థనాయా ముఖ్యః సిద్ధాన్తః. యాదృశీం ప్రార్థనాం కుర్యాత్ తాదృశమేవ కర్మాచరేదితి. ॥౩౫॥

పదార్థము :-మేము (సవితుః) చరాచర ప్రపంచ నిర్మాతయు (దేవస్య) శుద్ధ ప్రకాశమయుడును, సుఖముల నొసగువాడును నగు పరమేశ్వరుని (వరేణ్యమ్) అతిశ్రేష్ఠమును (భర్గః) పాపరూప దుఃఖమూలమును నాశమొనర్చునదియును నగు (తేజః) ఏ స్వరూపము గలదో (తత్) దానిని (ధీమహి) ధరింతుముగాక! మరియు(యః) సర్వాంతర్యామి, సర్వసుఖప్రదాత యగు నా పరమేశ్వరుడు కరుణించి (నః) మాయందరి (ధియః) బుద్ధులను, ఉత్తమ గుణ కర్మ స్వభావములందు (ప్రచోదయాత్) ప్రేరేపించునుగాక! ॥౩౫॥

భావార్థము:-ఈ సమస్తసృష్టిని రచించువాడును, సర్వోత్తముడును, సమస్త దోషములను నాశనమొనర్చువాడును, అత్యంత పరిశుద్ధుడును నగు పరమేశ్వరునే స్తుతించుట, ప్రార్థించుట, ఉపాసించుట మానవుల కత్యంత యోగ్యమై యున్నది. ఏలన అట్టి ధారణ మొనర్చబడిన, ప్రార్థించబడిన ఆ పరమేశ్వరుడు మమ్ము దుష్టగుణకర్మలనుండి తప్పించి గుణకర్మస్వభావములందు ప్రవృత్తమొనర్చుగాక!

ఏ విధముగు ప్రార్థనల నొనర్తుమో తదనుసారముగనే పురుషార్థపరులమై కర్మల నాచరించవలయును. ఇదియే ప్రార్థనయొక్క ముఖ్యోద్దేశ్యము. ॥౩౫॥

35. O Creator of the Universe! O All holy and worthy of adoration! May we meditate on Thy adorable self. May Thou guide our understanding!.

౧౦౧. పరి త ఇత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, విపృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

స జగదీశ్వరః కీదృశ ఇత్యుపదిశ్యతే.

ఆ జగదీశ్వరుడెటువంటివాడను విషయ మీ మంత్రమం దుపదేశింపబడినది.

౧౦౧ పరి తే దూడభో రథోఽస్మాం౹౨ఽఅశ్నోతు విశ్వతః।

యేన రక్షసి దాశుషః॥౩౬॥

ప.విః- పరి, తే, దూడభః, దుర్దభ ఇతి దుః + దభః, రథః, అస్మాన్, అశ్నోతు విశ్వతః, యేన। రక్షసి దాశుషః. ॥౩౬॥

పదార్థః :-(పరి) సర్వతః. (తే) తవ వ్యాపకేశ్వరస్య. (దూడభః) దుఃఖేన దంభితుం హింసితుం యోగ్యః. అత్ర దంభుధాతోః ఖల్ ప్రత్యయః. దురోదాశనాశదభధ్యేషు ఊత్వం వక్తవ్యముత్తరపదాదేశశ్చ ష్టుత్వమ్, అ. ౬.౩.౧౦౯, ఏతత్సూత్రభాష్యోక్తవార్తికేననకార లోపేన చాస్య సిద్ధిః (రథః)రయతే జానాతి యేన స రథః. రథో రంహతే ర్గతికర్మణః స్థిరతేర్వా స్యాద్విపరీతస్య, రమమాణోఽస్మింస్తిష్ఠతీతి వా రపతే ర్వా రసతే ర్వా. ని. ౯.౧౧. (అస్మాన్) భవదాజ్ఞాసేవకాన్. (అశ్నోతు) అశ్నుతామ్ వ్యాప్నోతు. అత్ర వ్యత్యయేన పరస్మైపదమ్ (విశ్వతః) సర్వతః (యేన) జ్ఞానేన (రక్షసి) పాలయసి (దాశుషః) విద్యాదిదానకర్తౄన్. అయం. మంత్రః. శత. ౨. ౩. ౨. ౪౦-౪౧. వ్యాఖ్యాతః.॥౩౬॥

అన్వయః :-హే జగదీశ్వర! త్వం యేన రథేన దాశుషో విశ్వతో రక్షసి స తే తవ దూడభో రథో విజ్ఞానం విశ్వతో రక్షితుమస్మాన్ పర్యశ్నోతు సర్వతః ప్రాప్నోతు. ॥౩౬॥

భావార్థః:-మనుష్యైః సర్వాభిరక్షకస్య పరమేశ్వరస్య విజ్ఞానస్య చ ప్రాప్తయే ప్రార్థనా పురుషార్థౌ నిత్యం కర్తవ్యౌ. యతో రక్షితాః సంతో వయమసద్విద్యాఽధర్మాదిదోషాంస్త్యక్త్వా సద్విద్యా ధర్మాది శుభగుణాన్ ప్రాప్య సదా సుఖినః స్యామేతి. ॥౩౬॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! నీవు(యేన) ఏ యజ్ఞ [జ్ఞాన] ముద్వారా (దాశుషః) విద్య మున్నగు దానముల నొసగెడు విద్వాంసులను (విశ్వతః) సకలదిశలనుండి (రక్షసి) రక్షించుచుంటివో మరియు (దూడభః) జయముగల, అణచవీలుగాని (రథ) ఎల్లరెరుగ దగినట్టిసకలదిశలనుండి రక్షించదగిన (తే) నీ యొక్క విజ్ఞానమును

(అస్మాన్) నీ యాజ్ఞలను పాలించువారము, సేవించువారము నగు మాకు (పరి) సకలవిధములఁ (అశ్నోతు) ప్రాప్తించుఁగాక! ॥౩౬॥

**భావార్థము** :- మానవులు సమస్తమును రక్షించు పరమాత్మను, విజ్ఞానమును బడయుటకై నిత్యము ప్రార్థనోపాసనాదులద్వారా సేవించవలయును. అవిద్య, అధర్మము మున్నగు దోషములను త్యజించి ఉత్తమ విద్య, శ్రేష్ఠమగు ధర్మము మున్నగు శుభగుణములను బడసి సదా సుఖము ననుభవింతురు గాక! ॥౩౬॥

36. Oh God, may Thine immortal knowledge, wherewith Thou guardest the learned in all directions, come close from all sides!.

౧౦౨. భూర్భువరిత్యస్య వామదేవ ఋషిః, ప్రజాపతిర్దేవతా, బ్రాహ్మ్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః స జగదీశ్వరః కిమర్థః ప్రార్థనీయ ఇత్యుపదిశ్యతే.

మరల యా జగదీశ్వరుని ఎందునిమిత్తము ప్రార్థించవలయునో ఈ మంత్రమునం దుపదేశింపబడియున్నది.

౧౦౨ భూర్భువః స్వః సుప్రజాః ప్రజాభిః స్యాꣳ సువీరో వీరైః సుపోషః పోషైః।
నర్య ప్రజాం మే పాహి శꣳస్య పశూన్మే పాహ్యథర్య పితుం మే పాహి॥౩౭॥

ప.వి:- భూః, భువః, స్వరితి స్వః, సుప్రజా ఇతి సు+ప్రజాః, ప్రజాభిరితి ప్ర+జాభిః, స్యామ్, సువీర ఇతి సు+వీరః, వీరైః సుపోష ఇతి సు+పోషః, పోషైః, నర్య, ప్రజామితి ప్ర+జామ్, మే, పాహి, శꣳస్య, పశూన్, మే, పాహి, అథర్య, పితుమ్, మే, పాహి.॥౩౭॥

పదార్థః :-(భూః) ప్రియస్వరూపః ప్రాణః (భువః) బలనిమిత్త ఉదానః (స్వః) సర్వచేష్టానిమిత్తో వ్యానశ్చ తైః సహ (సుప్రజాః) శోభనా సుశిక్షాసద్విద్యాసహితా ప్రజా యస్య సః (ప్రజాభిః) అనుకూలాభిః స్త్రీ్యరసవిద్యాసంతాన మిత్రభృత్యరాజ్యపశ్వాదిభిః (స్యామ్) భవేయమ్ (సువీరః) శోభనా వీరాః శరీరాత్మ బలసహితా యస్య సః (వీరైః) శౌర్యధైర్య విద్యాశత్రు నివారణ ప్రజాపాలనకుశలైః (సుపోషః) శ్రేష్ఠాః పోషాః పుష్టయో యస్య సః (పోషైః) పుష్టికారకైరాప్తవిద్యాజనితై ర్బోధయుక్తైర్వ్యవహారైః (నర్య) నీతియుక్తేషు నృషు సాధుస్తత్సం బుద్ధౌ పరమేశ్వర! (ప్రజామ్) సంతానాదికామ్ (మే) మమ (పాహి) సతతం రక్ష (శంస్య) శంసి తుం సర్వథా స్తోతుమర్హ (పశూన్) గోఽశ్వహస్త్యాదీన్ (మే) మమ (పాహి) రక్షయ (అథర్య) సంశయరహిత. థర్వతిశ్చరతికర్మా. నిఘ. ౧౧.౧౯. థర్వతి సంశేతే యః సః థర్వో

న థర్వో౽థర్వస్తత్సంబుద్ధౌ. అత్ర వర్ణవ్యత్యయేన వకారస్థానే యకారః (పితుమ్) అన్నమ్. పితురిత్యన్ననామసు పఠితమ్. నిఘం.౨.౭. (మే) మమ (పాహి) రక్ష. అత్రోభయత్రాం తర్గతో ణ్యర్థః. అయం మంత్రః. శత. ౨. ४. ౧. ౧-౬. వ్యాఖ్యాతః. ॥౩౭॥

అన్వయః :-హే నర్య! త్వం కృపయా మే మమ ప్రజాం పాహి. మే మమ పశూన్ పాహి. హే అథర్య! మే మమ పితుం పాహి. హే శంస్య! జగదీశ్వర! భవత్కృపయా౽హం భూర్భువః స్వః ప్రాణాపానవ్యానైర్యుక్తః సన్ ప్రజాభిః సుప్రజా వీరైః సువీరః పోషైః సహ చ సుపోషః స్యాం నిత్యం భవేయమ్.॥౩౭॥

భావార్థః :-మనుష్యై రీశ్వరోపాసనాజ్ఞాపాలన మాశ్రిత్య సునియమైః పురుషార్థేన శ్రేష్ఠప్రజావీరపుష్ట్యాది కారణైః ప్రజాపాలనం కృత్వా నిత్యం సుఖం సంపాదనీయమ్.॥౩౭॥

పదార్థము :-(నర్య) నీతియుక్తులగు మనుష్యులపై దయను జూపు నో పరమేశ్వరా! నీవు కరుణించి (మే) నా (ప్రజామ్) సన్తానము, ప్రజలు మున్నగువారిని (పాహి) రక్షింపుము (మే) నా (పశూన్) అశ్వములు, గోవులు, గజములు మున్నగు పశువులను (పాహి) కాపాడుము (అథర్వ) సందేహరహితమైన ఓ పరమేశ్వరా! నీవు (మే) నా (పితుమ్) అన్నమును (పాహి) రక్షించుము (శంస్య) స్తవనీయుడవు నగు ఓ జగదీశ్వరా! నీ కృపచే నేను (భూర్భువః స్వః) ప్రియస్వరూపమైన ప్రాణముతోను బలమునకు హేతువైన ఉదానముతోను సకల కార్యవ్యవహారములకు కారణమైన వ్యానవాయువులతోను కూడినవాడనై (ప్రజాభిః) నా కనుకూలముగ నడచుకొను పుత్రమిత్ర కళత్ర భాతృ భృత్యాదులతోను, విద్య, ధర్మము, పశువులు మున్నగు పదార్థములతోను (సుప్రజాః) ఉత్తమ విద్యాధర్మయుక్తమగు ప్రజల సహితుడనై (వీరైః) శౌర్య, ధైర్య, విద్యాదులందును, శత్రువులను దొలగించుటయందును, ప్రజాపాలనమునందును కుశలురగువారితోను (సువీరః) ఉత్తమ శూరవీరయుక్తుడనై (పోషైః) పుష్టికారకమగు పూర్ణవిద్యచే నుత్పన్నమగు వ్యవహారములతో (సుపోషః) ఉత్తమపుష్టిని ఉత్పన్ను మొనర్చువాడనై (స్యామ్) సదా వ్యవహరించు చుందునుగాక. ॥౩౭॥

భావార్థము :-మానవులు ఈశ్వరోపాసనమును, ఆతని యాజ్ఞాపాలనమును ఆశ్రయించి ఉత్తమ నియమములతోను, ఉత్తమప్రజలతోను, వీర, శూరత్వ పుష్టి మున్నగు కారణములతోను ప్రజాపాలన మొనర్చి నిరంతరము సుఖములను సాధించుచుండ వలయును.॥౩౭॥

37. O God, friendly to the wise, do Thou protect my offspring. O worthy of praise do Thou protect my cattle. O God, above all suspicion, protect my food. O God, through Thy grace, in unison with the three lifewinds, Pran, Apan and Vyan, may I be rich in offspring, Well-manned with men, a hero with the heroes, and strong with wise and invigorating deeds.

౧౦౩. ఆగన్మేత్యస్యాసురిర్ఋషిః, అగ్నిర్దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాంధారః, స్వరః.

అథాగ్నిశబ్దేనేశ్వర భౌతికావర్థావుపదిశ్యేతే.

ఇపుడు అగ్ని శబ్దముచే ఈశ్వరుని భౌతికాగ్నినిగూర్చి ఈ మంత్రముద్వారా ఉపదేశించబడుచున్నది.

౧౦౩ ఆగన్మ విశ్వవేదస మస్మభ్యం వసువిత్తమమ్।

అగ్నే సమ్రాడభి ద్యుమ్నమభి సహ ఆయచ్ఛస్వ ॥౩౮॥

ప.విః-ఆ, అగన్మ, విశ్వవేదసమితి విశ్వ + వేదసమ్, అస్మభ్యమ్, వసువిత్తమమితి వసువిత్ + తమమ్, అగ్నే, సమ్రాడితి సమ్+రాట్, అభి, ద్యుమ్నమ్, అభి సహః, ఆ, యచ్ఛస్వ.॥౩౮॥

పదార్థః :-(ఆ) సమంతాత్ (అగన్మ) ప్రాప్నుయామ. అత్ర లిఙర్థే లుఙ్ మంత్రే ఘసహ్వర..ఇతి చ్లేర్లుక్. మ్వోశ్చ. అ. ౮. ౨. ౬౫. ఇతి మకారస్య నకారః (విశ్వవేదసమ్) యో విశ్వం వేత్తి స విశ్వవేదాః పరమేశ్వరః విశ్వం సర్వం సుఖం వేదయతి ప్రాపయతి స భౌతికోఽగ్నిర్వా. అత్ర విదిభుజిభ్యాం విశ్వే. ఉ. ౪. ౨౪౩. అనేనాసిః ప్రత్యయః (అస్మభ్యమ్) ఉపాసకేభ్యో యజ్ఞానుష్ఠాతృభ్యోవా (వసువిత్తమమ్) వసూన్ పృథివ్యాది లోకాన్వేత్తి సోఽతిశయితస్తమ్. పృథివ్యాదిలోకాన్ వేదయతి సూర్యరూపేణాగ్ని రేతాన్ ప్రకాశ్య ప్రాపయతి స వసువిత్. అతిశయేన వసువిదితి వసువిత్తమో వా తమ్ (అగ్నే) విజ్ఞానస్వరూపేశ్వర! విజ్ఞాపకో భౌతికో వా (సమ్రాట్) యః సమ్యగ్రాజతే ప్రకాశతే సః (అభి) ఆభిముఖ్యే (ద్యుమ్నమ్) ప్రకాశకారకముత్తమం యశః (ద్యుమ్నం) ద్యోతతేర్యశో వాఽన్నం వా. ని. ౫.౫. (అభి) ఆభిముఖ్యే (ద్యుమ్నమ్) ప్రకాశకారకముత్తమం యశః. ద్యుమ్నం ద్యోతతేర్యశో వాన్నం వా॥ నిఘం....౫.౫ (అభి) ఆభిముఖ్యే (సహః) ఉత్తమం బలమ్. సహ ఇతి బలనామసు పఠితమ్. నిఘం. ౨. ౯. (ఆ) సమంతాత్ (యచ్ఛస్వ) విస్తారయ విస్తారయతి వా. అత్ర పక్షే లడర్థే లోట్. ఆఙో యమహనః. ౧. ౩. ౨౮. అనేనాత్మనేపదమ్. ఆఙ్ పూర్వకో యమధాతు ర్విస్తారార్థే. అయం మంత్రః. శత. ౨. ౩. ౩. ౭.౮. వ్యాఖ్యాతః.॥౩౮॥

అన్వయః:-హే సమ్రాడగ్నే జగదీశ్వర! త్వమ్ అస్మభ్యం ద్యుమ్నం సహశ్చాభ్యాయచ్ఛస్వ విస్తారయ. ఏతదర్థం వయం వసువిత్తమం విశ్వవేదసం త్వామభ్యాగన్మ ప్రాప్నుయామేత్యేకః.

యః సమ్రాడగ్నేఽయమగ్నిరస్మభ్యం సహశ్చాభ్యా యచ్ఛతి సర్వతో విస్తారయతి తం వసువిత్తమం విశ్వవేదస మగ్నిం వయమభ్యాగన్మ ప్రాప్నుయామేతి ద్వితీయః. ॥౩౮॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. మనుష్యైః పరమేశ్వర భౌతికాగ్న్యోర్గుణ విజ్ఞానేన తదనుష్ఠానేన సర్వతః కీర్తిబలే నిత్యం విస్తారణీయే ఇతి.॥౩౮॥

**పదార్థము** :-(సమ్రాట్) ఓ ప్రకాశస్వరూపా! (అగ్నే) ఓ జగదీశ్వరా నీవు (అస్మభ్యమ్) ఉపాసకుల మగు మాకొరకు (ద్యుమ్నమ్) ప్రకాశస్వరూపమగు ఉత్తమయశస్సును (సహః) ఉత్తమ బలమును (అభ్యాయచ్ఛస్వ) సకలదిశలనుండి విస్తారముగ సమకూర్చు చున్నావు. కావున మేము (వసువిత్తమమ్) పృథివి మున్నగు లోకముల నెరుగువాడవును (విశ్వవేదసమ్) సమస్తసుఖముల నిచ్చువాడవు నగు నిన్ను (అభ్యాగన్మ) సమస్తవిధముల పొందెదముగాక! **[ఇది ప్రథమార్థము].**

(సమ్రాట్) ప్రకాశకమగు (అగ్నే) భౌతికాగ్ని (అస్మభ్యమ్) యజ్ఞానుష్ఠానముల నొనర్చు మాకొరకు (ద్యుమ్నమ్) ఉత్తమోత్తమ యశస్సును (సహః) ఉత్తమోత్తమ బలమును (అభ్యాయచ్ఛస్వ) సకలవిధములుగ విస్తారయుక్త మొనర్చుచున్నది. కావుననే మేము (వసువిత్తమమ్) పృథివి మున్నగు లోకములను సూర్యరూపముతో ప్రకాశపరచి లభింపజేయునదియు (విశ్వవేదసమ్) సకలసుఖముల నెరిగించునదియు నగు ఆ యగ్నిని (అభ్యాగన్మ) సర్వవిధముల పొందెదము గాక! **[ఇది ద్వితీయార్థము].॥౩౮॥**

**భావార్థము** :-ఈ మంత్రమునందు శ్లేషాలంకారము గలదు. మానవులు పరమేశ్వరునియొక్కయు, భౌతికాగ్నియొక్కయు గుణములను చక్కగా దెలిసికొని వానియనుసార మనుష్ఠించి కీర్తి బల యశస్సులను విస్తరింప జేయవలయును. ॥౩౮॥

38. O, Ocean of Light, the Omniscient, the best knower of all the worlds, and enjoyments may we well approach Thee. May Thou spread for us splendour and strength in all directions!.

౧౦౪. అయమగ్నిరిత్యస్యాసురిరృషిః, అగ్నిర్దేవతా, భురిగ్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథేశ్వరభౌతికావగ్నీ ఉపదిశ్యేతే.

ఈ మంత్రమున ఈశ్వరుని, భౌతికాగ్నిని గూర్చి యుపదేశించబడుచున్నది.

౧౦౪ అయమగ్నిర్గృహపతిర్గార్హపత్యః ప్రజాయా వసువిత్తమః।

అగ్నే గృహపతేఽభిద్యుమ్నమభి సహఽ ఆయచ్ఛస్వ ॥౩౯॥

ప.వి:- అయమ్, అగ్నిః, గృహపతిరితి గృహ+పతిః, గార్హపత్య ఇతి గార్హ+పత్యః, ప్రజాయా ఇతి ప్ర+జాయాః, వసువిత్తమ ఇతి వసువిత్+ తమః, అగ్నే, గృహపత ఇతి గృహ+పతే, అభి, ద్యుమ్నమ్, అభి, సహః, ఆ, యచ్ఛస్వ.॥౩౯॥

పదార్థః:-(అయమ్) ప్రత్యక్షో వక్ష్యమాణః (అగ్నిః) ఈశ్వరో విద్యుత్స్వరూపో జ్వాలామయో భౌతికో వా (గృహపతిః) గృహాణాం స్థానవిశేషాణాం పతిః పాలనహేతుః (గార్హపత్యః) గృహపతినా సంయుక్తః. అత్ర గృహపతినా సంయుక్తే ఞ్యః. అ. ౪. ౪. ౯౦. అనేన ఞ్యః ప్రత్యయః. ఇదం పదం మహీధరాదిభిర్వ్యాకరణజ్ఞాన విరహత్వాత్ గృహస్య పతిః పాలక ఇత్యశుద్ధం వ్యాఖ్యాతమ్ (ప్రజాయాః) విద్యమానాయాః (వసువిత్తమః) యో వసూని ద్రవ్యాణి వేదయతి ప్రాపయతి సోఽతిశయితః (అగ్నే) అయమగ్నిః (గృహపతే) గృహాభిరక్షకేశ్వర! గృహాణాం పాలయితా వా (అభి) అభితః (ద్యుమ్నమ్) సుఖప్రకాశయుక్తం ధనమ్. ద్యుమ్నమితి ధననామసు పఠితమ్. నిఘం ౨.౧౦ (అభి) ఆభిముఖ్యే (సహః) ఉదకం బలం వా. సహ ఇత్యుదకనామసు పఠితమ్. నిఘం, ౧.౧౨. బలనామసు చ. నిఘం. ౨. ౯. (ఆ) సమంతాత్ క్రియాయోగే (యచ్ఛస్వ) సర్వతో దేహి. ఆ యచ్ఛతి విస్తారయతి వా. అత్ర పక్షే వ్యత్యయః సిద్ధిశ్చ పూర్వవత్. అయం మంత్రః. శత. ౨. ౪. ౧. ౯-౧౧ వ్యాఖ్యాతః.॥౩౯॥

అన్వయః:-హే గృహపతేఽగ్నే! పరమాత్మన్యోఽయం భవాన్ గృహపతిర్గార్హపత్యః ప్రజాయా వసువిత్తమోఽగ్నిరస్తి తస్మాత్త్వమస్మదర్థం ద్యుమ్నమభ్యాయచ్ఛస్వ సహశ్చాభ్యాయచ్ఛస్వేత్యేకః.

యస్మాద్ గృహపతిః ప్రజాయా వసువిత్తమో గార్హపత్యోఽయమగ్నిరస్తి తస్మాత్సోఽభిద్యుమ్నం సహశ్చాభ్యాయచ్ఛతి. ఆభిముఖ్యేన సమంతాత్ విస్తారయతీతి ద్వితీయః ॥౩౯॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. గృహస్థైర్యదేశ్వరముపాస్యైతస్యాజ్ఞాయాం వర్తిత్వాఽయమగ్నిః కార్యసిద్ధయే సంయోజ్యతే తదానేకవిధే ధనబలే అత్యంత విస్తారయతి. కుతః? ప్రజాయా మధ్యేఽస్యాగ్నేః పదార్థప్రాప్తయే సాధకతమత్వాదితి.॥౩౯॥

పదార్థము :-(గృహపతే) గృహపాలకా! (అగ్నే) పరమేశ్వరా! (అయమ్) ఈ నీవు (గృహపతిః) స్థానవిశేషముల పాలనకు హేతువవు (గార్హపత్యః) గృహపాలనమునకు సంయుక్తుడవు (ప్రజాయా వసువిత్తమః) ప్రజలకు సమస్త ధనములను ప్రాప్తింపజేయువాడవు (అగ్నిః) ప్రకాశస్వరూపుడవునై [యున్నావు. కావున అట్టి నీవు మాకు] (ద్యుమ్నమ్) సుఖము ప్రకాశములతో గూడిన భాగ్యములను (అభ్యాయచ్ఛస్వ) విరివిగనొసగుము. మరియు (సహః) ఉత్తమ బలపరాక్రమములను (అభ్యాయచ్ఛస్వ) బాగుగ నిమ్ము. **[ఇది మొదటి యర్థము].**

(గృహపతిః) ఉత్తమ స్థానములను పాలించుటకు హేతువును (ప్రజాయాః) పుత్ర, భ్రాతృ, మిత్ర, కళత్ర భృత్యాదులకు (వసువిత్తమః) ద్రవ్యాదులను సంపూర్ణముగ లభింపజేయునదియు (గార్హపత్యః) గృహములను పాలించెడి వారితో సంయుక్తమును నగు (అయమ్ అగ్నే) సూర్యుడు విద్యుత్తు, ప్రత్యక్షరూపములలో నున్న ఈ యగ్ని (గృహపతే అగ్నే) గృహములను పాలించు నీ యగ్ని మాకు (అభిద్యుమ్నమ్) సకలదిశలనుండి

శ్రేష్ఠధనములను (సహః) ఉత్తమ బలములను( అభ్యాయచ్ఛస్వ) సకల విధములుగ విస్తరింపజేయుచున్నది. [ఇది రెండవయర్థము].॥౩౯॥

భావార్థము :- ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. గృహస్థులు ఈశ్వరు నుపాసించుచు నాతని యాజ్ఞయందు ప్రవృత్తులై కార్యసిద్ధికై ఈ యగ్నిని సేవించుచుండు నప్పు డాయగ్ని అనేక విధముల ధన బలములను విస్తార మొనర్చుచున్నది. ఏలన నది ప్రజలకు సంపదలను గలుగజేయుటయం దత్యంత సిద్ధిని కలిగించునదై యున్నది. ॥౩౯॥

39. Lord of our houses, O God, Thou art the best Finder of riches for our children, Thou art the Protector of our hearths, and the Companion of the householders. Bestow splendour and strength on us!.

౧౦౫. అయమగ్నిః పురీష్యేత్యస్యానురిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునర్భౌతికోఽగ్నిః కీదృశ ఇత్యుపదిశ్యతే.

మరల నా భౌతికాగ్ని యెటువంటిదను విషయ మీ మంత్రమం దుపదేశింపబడుచున్నది.

౧౦౫ అయమగ్నిః పురీష్యో రయిమాన్ పుష్టివర్ధనః।

అగ్నే పురీష్యాభి ద్యుమ్నమభి సహఽఆ యచ్ఛస్వ ॥౪౦॥

ప.వి:- అయమ్, అగ్నిః, పురీష్యః, రయిమానితి రయి+మాన్, పుష్టి వర్ధన ఇతి పుష్టి+వర్ధనః, అగ్నే, పురీష్య, అభి, ద్యుమ్నమ్, అభి, సహః. ఆ, యచ్ఛస్వ ॥౪౦॥

పదార్థః :-(అయమ్)వక్ష్యమాణలక్షణః (అగ్నిః) పూర్వోక్తో భౌతికః (పురీష్యః) యే పృణంతి యాని కర్మాణి తాని పురీషాణి తేషు సాధుః (రయిమాన్) ప్రశస్తా రయయో ధనాని విద్యంతే యస్మిన్ సః. అత్ర ప్రశంసార్థే మతుప్. రయిరితి ధననామసు పఠితమ్ నిఘం. ౨. ౧౦ (పుష్టివర్ధనః) వర్ధయతీతి వర్ధనః పుష్టేర్వర్ధనః పుష్టివర్ధనః. (అగ్నే) సర్వోత్తమపదార్థ ప్రాపకేశ్వర! (పురీష్య) పృణన్తి పూరయన్తి సుఖాని యైర్గుణైస్తే పురీషాస్తేషు సాధుస్తత్సంబుద్ధౌ అభి (అభితః) దుమ్నమ్. విజ్ఞానసాధకమ్ (అభి) ఆభిముఖ్యే (సహః) శరీరాత్మబలమ్. (ఆ) సమంతాత్ క్రియాయోగే (యచ్ఛస్వ) విస్తారయ. అస్య సిద్ధిః పూర్వవత్. ॥౪౦॥

అన్వయః:-హే పురీష్యాగ్నే! విద్వంస్త్వం యోఽయం పురీష్యో రయిమాన్ పుష్టివర్ధనోఽగ్నిరస్తి తస్మాదభిద్యుమ్నమభిసహో వా యచ్ఛస్వ విస్తారయ. ॥౪౦॥

**భావార్థః** :- మనుష్యైః పరమేశ్వరానుగ్రహస్వపురుషార్థాభ్యామగ్నివిద్యాం ప్రాప్యానేకవిధం ధనం బలం చ సర్వతో విస్తారణీయమితి. ॥౪౦॥

**పదార్థము** :- (పురీష్యః) కర్మలను పూర్తియొనర్చుటయందు నేర్పరులును (అగ్నే) ఉత్తమోత్తమ పదార్థములను ప్రాప్తింపజేయువారును నగు ఓ విద్వాంసులారా! మీరు (అయమ్) ఈ (పురీష్యః) సమస్త సుఖములను పూర్ణమొనర్చుటయం దత్యుత్తమమైనట్టిదియు (రయిమాన్) సర్వోత్తమమగు ధనములతో గూడినదియు (పుష్టివర్ధనః) శక్తులను పెంపొందింపజేయునదియు నగు (అగ్నిః) ఏ భౌతికాగ్ని గలదో దానితో మా కొరకు (అభిద్యుమ్నమ్) ఉత్తమోత్తమ జ్ఞానమును ప్రాప్తింపజేయు ధనమును (అభిసహః) ఉత్తమోత్తమ శరీరాత్మల బలములను (ఆ యచ్ఛస్వ) సర్వవిధముల విస్తారపరచుడు. ॥౪౦॥

**భావార్థము** :- పరమేశ్వరుని కృపచేతను, స్వ పురుషార్థముచేతను మానవులు అగ్నివిద్యను సంపాదనమొనర్చి అనేక విధములగు ధనములను, బలములను విస్తరింపజేయవలయును. ॥౪౦॥

40. This fire assists us in the accomplishment of our deeds. It is rich, and furtherer of plenty. O God, the Giver of our comforts, bestow splendour and strength upon us!.

౧౦౬. గృహామేత్యస్యాసురిర్ఋషిః వాస్తురగ్నిర్దేవతా, ఆర్షీపంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

అథ గృహాశ్రమానుష్ఠానముపదిశ్యతే. ఈ మంత్రమున గృహస్థాశ్రమ అనుష్ఠాన ముపదేశింపబడుచున్నది.

౧౦౬ గృహా మా బిభీత మా వేపధ్వమూర్జం బిభ్రత ఏమసి।

ఊర్జం బిభ్రద్వః సుమనాః సుమేధా గృహానైమి మనసా మోదమానః ॥౪౧॥

ప.వి:- గృహాః, మా, బిభీత, మా, వేపధ్వమ్, ఊర్జమ్, బిభ్రతః, ఆ, ఇమసి, ఊర్జమ్, బిభ్రత్, వః, సుమనా ఇతి సు+మనాః, సుమేధా ఇతి సు+మేధాః, గృహాన్, ఆ, ఏమి, మనసా మోదమానః. ॥౪౧॥

పదార్థః:- (గృహాః) గృహ్ణన్తి బ్రహ్మచర్యాశ్రమానంతరం గృహాశ్రమం యే మనుష్యాస్తత్సం బుద్ధౌ (మా) నిషేధార్థే (బిభీత) భయం కురుత (మా) ప్రతిషేధే (వేపధ్వమ్) కంపధ్వమ్ (ఊర్జమ్) పరాక్రమమ్. (బిభ్రతః) ధారయంతః (ఆ) సమంతాత్ (ఇమసి) ప్రాప్నుమః. అత్రేదంతో మసీతీదాదేశః (ఊర్జమ్) అనేకవిధం బలమ్ (బిభ్రత్) ధారయన్ (వః) యుష్మాన్ (సుమనాః) శోభనం మనోవిజ్ఞానం యస్య సః (సుమేధాః) సుష్ఠు మేధా ధారణావతీ

సంగమికా ధీర్యప్య సః (గృహాన్) గృహాశ్రమస్థాన్ విదుషః (ఆ) సమంతాత్ (ఏమి) ప్రాప్నుయామ్. అత్ర లిఙర్థే లట్. (మనసా) విజ్ఞానేన (మోదమానః) హర్షోత్సాహయుక్తః. ఏతదాది మంత్రత్రయమ్. శత. ౨.౩.౩.౧౪. వ్యాఖ్యాతః.॥౪౧॥

అన్వయః :-హే బ్రహ్మచర్యేణ కృతవిద్యా గృహాశ్రమిణః! ఊర్జం బిభ్రతో గృహా మనుష్యా యూయం గృహాశ్రమం ప్రాప్నుత. తదనుష్ఠానాన్మా బిభీత మా వేపధ్వం చ. ఊర్జం బిభ్రతో వయం యుష్మాన్ గృహానేమసి సమంతాత్ ప్రాప్నుమః. వో యుష్మాకం మధ్యే స్థిత్వైవం గృహాశ్రమే వర్తమానః సుమనాః సుమేధా మనసా మోదమాన ఊర్జం బిభ్రత్సన్నహం సుఖాన్యేమి నిత్యం ప్రాప్నుయామ్.॥౪౧॥

భావార్థః:-మనుష్యైః పూర్ణబ్రహ్మచర్యాశ్రమం సంసేవ్య యువావస్థాయాం స్వయంవరవిధానేన స్వతుల్యస్వభావవిద్యారూపబలవతీం సుపరీక్షితాం స్త్రియముద్వాహ్య శరీరాత్మబలం సంపాద్య సంతానోత్పత్తిం విధాయ. సర్వైః సాధనైః సద్వ్యవహారేషు స్థాతవ్యమ్. నైవ కేనాపి గృహాశ్రమానుష్ఠానాత్కదాచిద్భేతవ్యం కంపనీయం చ కుతః? సర్వేషాం సద్వ్యవహారాణామాశ్రమాణాం చ గృహాశ్రమో మూలమస్త్యత ఏష సమ్యగనుష్ఠాతవ్యః. నైతేన వినా మనుష్య వృద్ధీ రాజ్యసిద్ధిశ్చ జాయతే. ॥౪౧॥

పదార్థము :- బ్రహ్మచర్యాశ్రమమందు సమస్త విద్యలను గ్రహించిన ఓ గృహస్థులారా! (ఊర్జమ్) శౌర్యము మున్నగు పరాక్రమములను (బిభ్రతః) ధరించిన వారును (గృహాః) బ్రహ్మచర్యాశ్రమము పిదప గృహస్థాశ్రమమున ప్రవేశించదలచినవారును నగు ఓ మానవులారా! మీరు గృహస్థాశ్రమమున యథావిధిగ ప్రవేశించుడు. అట్టి గృహస్థాశ్రమముయొక్క అనుష్ఠానమువల్ల (మా బిభీత) భయపడవలదు (మా వేపధ్వమ్) కంపించకుడు. శౌర్యము మున్నగు పరాక్రమములు గలిగిన మేము (గృహాన్) గృహస్థులైయున్న మీకు (ఏమసి) సదాప్రాప్తించు చుందుముగాక! మరియు (వః) మీమధ్య స్థిరపడి ఇట్లు గృహస్థాశ్రమమున నుండి (సుమనాః) ఉత్తమ జ్ఞానినై (సుమేధాః) ఉత్తమ బుద్ధిగలవాడనై (మనసా) విజ్ఞానముతో గూడ (మోదమానాః) హర్ష, ఉత్సాహములతో (ఊర్జమ్) అనేక బలములను (బిభ్రత్) ధరించుచు అత్యంత సుఖములను నేను(ఏమి) నిరంతరము పొందెదనుగాక! ॥౪౧॥

భావార్థము :- మానవులు సంపూర్ణ బ్రహ్మచర్యాశ్రమమును సేవించి యువావస్థయందు స్వయంవర విధిగా తనకు సమానమైన స్వభావము, విద్య, బుద్ధి, రూపము, బలము మున్నగు గుణములు గల స్త్రీని పరీక్షించుకొని, వివాహమాడి శరీర ఆత్మల బలములను సంపాదించి సంతానవంతులై సకల సాధనములద్వారా ఉత్తమ వ్యవహారములందు పాల్గొనుచుండవలెను. మనుష్యు లెవ్వరును గృహస్థాశ్రమమును గూర్చి భయపడవలదు. ఏలన సద్వ్యవహారములు, సకల ఆశ్రమములకు గృహస్థాశ్రమమే మూలము. కాబట్టి గృహస్థాశ్రమమును చక్కగా అనుష్ఠించవలెను. ఈ గృహస్థాశ్రమము లేకుండా మానవుల వృద్ధి, రాజ్యము మున్నగు వ్యవహారసిద్ధి ఎన్నటికిని సాధ్యము గాదు. ॥౪౧॥

41. Fear not, nor tremble Ye, O householders. We, bearing strength, come to Ye. May I bearing strength, intelligent and happy, rejoicing in my mind, enjoy all pleasures and approach the householders!.

౧౦౭. యేషామిత్యస్య శంయుర్ఋషిః, వాస్తుపతిరగ్నిర్దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తే గృహాశ్రమిణః కీదృశాః సన్తీత్యుపదిశ్యతే.

ఆ గృహస్థు లెట్టివారను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడినది.

౧౦౭ యేషా॑మ॒ధ్యేతి॑ ప్ర॒వస॒న్యేషు॑ సౌమ॒నసో॑ బ॒హుః।

గృ॒హానుప॑హ్వయామహే॒ తే నో॑ జానన్తు జా॒నతః ॥౪౨॥

ప.వి:- యేషా॑మ్, అ॒ధ్యేతీ॑త్యధి॒+ ఏతి॑, ప్ర॒వస॒న్నితి॑ ప్ర+వసన్, యేషు॑, సౌ॒మ॒న॒సః బ॒హుః, గృ॒హాన్, ఉప, హ్వ॒యా॒మ॒హే॒, తే, నః, జా॒న॒న్తు॒, జా॒న॒తః.॥౪౨॥

పదార్థః :- (యేషామ్) గృహస్థానామ్. అత్ర అధీగర్థదయేశాం కర్మణి. అ. ౨. ౩. ౫౨. ఇతి కర్మణి షష్ఠీ (అధ్యేతి) స్మరతి (ప్రవసన్) ప్రవాసం కుర్వన్ (యేషు) గృహస్థేషు (సౌమనసః) శోభనం మనః సుమనస్తస్యాయమానందః సుహృద్భావః. అత్ర తస్యేదమిత్యణ్ (బహుః) అధికః. (గృహాన్) గృహస్థాన్. (ఉప) సామీప్యే (హ్వయామహే) శబ్దయామహే (తే) గృహస్థాః (నః) అస్మాన్ ప్రవసతోఽతిథీన్ (జానంతు) విదన్తు. (జానతః) ధార్మికాన్ విదుషః. ॥౪౨॥

అన్వయః:- ప్రవసన్నతిథిర్యేషామధ్యేతి యేషు బహుః సౌమనసోఽస్తి. తాన్ గృహస్థాన్ వయమతిథయ ఉపహ్వయామహే. యే సుహృదో గృహస్థాస్తే జానతో నోఽస్మానతిథీన్ జానంతు.॥౪౨॥

భావార్థః:- గృహస్థైః సర్వైర్ధార్మికైర్విద్వద్భిరతిథిభిః సహ గృహస్థైః సహాతిథిభిశ్చాత్యంతః సుహృద్భావో రక్షణీయో నైవ దుష్టైః సహ, తేషాం సంగే పరస్పరం సంలాపం కృత్వా విద్యోన్నతిః కార్యా. యే పరోపకారిణో విద్వాంసోఽతిథయః సంతి తేషాం గృహస్థైర్నిత్యం సేవా కార్యా నేతరేషామితి. ॥౪౨॥

**పదార్థము** :- (ప్రవసన్) ప్రవాసమొనర్చును [అతిథి] (యేషామ్) ఏ గృహస్థులను (అధ్యేతి) స్మరించునో మరియు (యేషు) ఏ గృహస్థులందు (బహుః) అధికముగ (సౌమనసః) చక్కని మనస్సుగలదో, అట్టి (గృహాన్)

గృహస్థులను [అతిథులమగు మేము] (ఉపహ్వయామహే) [(ప్రేమతో ఆహ్వానించు గృహస్థులను] మేము సదా ప్రశంసించుచుందుము. (తే) వారు (జానతః) ధార్మికులు ఎరుగుచు (నః) అతిథులమగు మమ్ము (జానన్తు) యథావతుగ తెలిసికొందురుగాక! ॥౪౨॥

భావార్థము :- ధార్మికులగు అతిథుల యెడ గృహస్థులును, గృహస్థుల యెడ అతిథులును అత్యంత ప్రీతి గలిగి యుండవలెను. మోసకారులను, టక్కరులను దూరముగ నుంచవలెను. విద్వాంసుల సాంగత్యము (సత్సంగము)లచే పరస్పరము సంభాషించి (శంకా సమాధానములద్వారా) విద్యను ఉన్నతి చేయవలయును. పరోపకారులును, విద్వాంసులు నైన అతిథులను గృహస్థులు నిరంతరము సేవించుచు ఇతర డాంబికులను దూరముంచవలెను. ॥౪౨॥

42. We praise the householders, whom the guest staying far from home remembers and whom he loves much. The loving householders welcome us, the religious guests.

౧౦౮. ఉపహూతా ఇత్యస్య శంయుర్బార్హస్పత్య ఋషిః, వాస్తుపతి ర్దేవతా, భురిగ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునః స కీదృశః సంపాదనీయ ఇత్యుపదిశ్యతే.

మరల నా గృహస్థాశ్రమమును ఎట్లు సాధించవలయు నను విషయ మీ మంత్రమున నుపదేశించబడినది.

౧౦౮ ఉపహూతా ఇహ గావ ఉపహూతా అజావయః।

అథో అన్నస్య కీలాల ఉపహూతో గృహేషు నః।

క్షేమాయ వః శాన్త్యై ప్రపద్యే శివꣳ శగ్మꣳ శంయోః శంయోః ॥౪౩॥

ప.వి:- ఉపహూతా ఇత్యుప + హూతాః, ఇహ, గావః ఉపహూతా ఇత్యుప+ హూతాః అజావయః, అథో ఇత్యథో అన్నస్య, కీలాలః, ఉపహూత ఇత్యుప+హూతః, గృహేషు, నః, క్షేమాయ, వః, శాన్త్యై, ప్ర, పద్యే, శివమ్, శగ్మమ్, శంయోరితి శమ్+యోః, శంయోరితి శమ్+ యోః. ॥౪౩॥

పదార్థః :- (ఉపహూతాః) సామీప్యం ప్రాపితాః. (ఇహ) అస్మిన్గృహాశ్రమే సంసారే వా (గావః) దుగ్ధప్రదా ధేనవః. (ఉపహూతాః) సామీప్యం ప్రాపితాః, (అజావయః) అజాశ్చావయశ్చ తే

(అథో) అనంతరే్య, (అన్నస్య) ప్రాణధారణస్య నిరంతరసుఖస్య చ హేతుః. కృవ్యా.... ఉ. 3. ౧౦. ఇత్యనధాతో ర్నః ప్రత్యయః. ధాపృావస్యజ్య...., ఉ.3. ౬. ఇత్యత ధాతోర్నః ప్రత్యయః (కీలాలః) ఉత్తమాన్నాది పదార్థసమూహః. కీలాలం ఇత్యన్ననామసు పఠితమ్. నిఘం ౨.౭. (ఉపహూతః) సమ్యక్ ప్రాపితః. (గృహేషు) నివసనీయేషు ప్రాసాదేషు (నః) అస్మాకమ్ (క్షేమాయ) రక్షణాయ (వః) యుష్మాకమ్) (శాంత్యై) సుఖాయ (ప్రపద్యే) ప్రాప్నోమి (శివమ్) కల్యాణమ్ (శగ్మమ్) సుఖమ్ (శంయోః) కల్యాణవతః సాధనాత్కర్మణః సుఖవతో వా (శంయోః) సుఖాత్. అత్రోభయత్ర కంశంభ్యాం వభయుస్తితు తయసః అ. ౫. ౨. ౧౩౮. ఇతి శమో యుస్ప్రత్యయః. శివం శగ్మం చేతి సుఖనామసు పఠితమ్. నిఘం 3.౬. ॥౪3॥

అన్వయః :-ఇహాస్మిన్ సంసారే వో యుష్మాకం శాంత్యై నోऽస్మాకం క్షేమాయ గృహేషు గావ ఉపహూతా అజావయ ఉపహూతా అథోऽన్నస్య కీలాల ఉపహూతోऽస్త్వేవం కుర్వన్నహం గృహస్థః శంయోః శివం శగ్మం చ ప్రపద్యే.॥౪3॥

భావార్థః :-గృహస్థైరీశ్వరోపాసనాజ్ఞాపాలనాభ్యాం గోహస్త్యశ్వాదీన్ పశూన్ భక్ష్యభోజ్యలేహ్యచూష్యాన్ పదార్థాంశ్చోపసంచిత్య స్వేషామన్యేషాం చ రక్షణం కృత్వా విజ్ఞానధర్మపురుషార్థై రైహిక పారమార్థికే సుఖే సంసేధనీయే నైవ కేనచిదాలస్యే స్థాతవ్యమ్. కింతు యే మనుష్యాః పురుషార్థవంతో భూత్వా ధర్మేణ చక్రవర్తిరాజ్యాదీనుపార్జ్య సంరక్ష్యేన్నీయ సుఖాని ప్రాప్నువంతి తే శ్రేష్ఠా గణ్యన్తే నేతరే. ॥౪3॥

పదార్థము :-(ఇహ) ఈ గృహస్థాశ్రమమున, ప్రపంచమందు (వః) మీయొక్క (శాన్త్యై) సౌఖ్యములకై (నః) మాయొక్క (క్షేమాయ) రక్షణకొరకు (గృహేషు) నివాసమొనర్పదగిన స్థానములందు (గావః) పాలనిచ్చు ఆవులు (ఉపహూతాః) సమీపమందే లభించుగాక! (అజావయః) గొఱ్ఱెలు, మేకలు మున్నగు పశువులు (ఉపహూతాః) సమీపముననే లభించుగాక! (అథో) తరువాత (అన్నస్య కీలాలః) ప్రాణముల ధరింపజేయు అన్నము మున్నగు పదార్థములు (ఉపహూతాః) సులభముగ లభించుగాక! [ఈ యన్నిటిని సంరక్షించుచు గృహస్థుడనగు నేను] (శంయోః) సకలవిధ సుఖసాధనములచే (శివమ్) శుభము [కల్యాణము]లను (శగ్మమ్) ఉత్తమ సుఖములను (ప్ర పద్యే) పొందుదునుగాక! ॥౪3॥

**భావార్థము** :-మానవులు ఈశ్వరోపాసన నొనర్చుచు, ఆతని యాజ్ఞలను పాలించుచు, గోవులు, గజములు, అశ్వములు మున్నగు పశుసంపదలను, భక్ష్య భోజ్య,లేహ్య చోష్యాది యోగ్య స్వాదుపదార్థములను సంగ్రహమొనర్చియు, స్వకీయ పరకీయ రక్షణ మొనర్చియు, జ్ఞాన ధర్మ విద్య పురుషార్థములద్వారా ఇహ పరలోక సుఖములను సాధించవలయును. ఏ మనుష్యుడును సోమరియై యుండరాదు. ప్రజలెల్లరును పురుషార్థపరులై ధర్మయుక్తముగ చక్రవర్తి రాజ్యము మున్నగు ధనములను సంగ్రహమొనర్చి వానిని బాగుగ రక్షించుచు ఉత్తమ

సుఖములను బడయువలయును. కాని దీనికి విరుద్ధముగ మానవులు వ్యవహరించవలదు. అట్లు వ్యవహరించువారికి ఎన్నటికిని సుఖము గలుగదు. ॥४3॥

43. May we in this world get. cows, goats, sheep and abundant food in our houses. I come to you for safety and quietude. May I acquire mundane and celestial joy and felicity.

౧౦౯. ప్రఘాసిన ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, మరుతో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునర్గృహస్థైః కిం కర్తవ్యమిత్యుపదిశ్యతే.

మరల గృహస్థులు ఏవిధమగు కర్మలాచరించవలయు నను విషయ మీ మంత్రమున ఉపదేశింపబడినది.

౧౦౯ ప్రఘాసినో హవామహే మరుతశ్చ రిశాదసః। కరమ్భేణ సజోషసః ॥४४॥

ప.వి:- ప్రఘాసిన ఇతి ప్ర+ఘాసినః, హవామహే, మరుతః, చ, రిశాదసః, కరంభేణ సజోషస ఇతి స+జోషసః ॥४४॥

పదార్థః :- (ప్రఘాసినః) ప్రఘస్తుమత్తుం శీలమేషాం తాన్. (హవామహే) ఆహ్వయామహే (మరుతః) విదుషోఽతిథీన్ (చ) సముచ్చయే (రిశాదసః) రిశాన్ దోషాన్ శత్రూంశ్చాదంతి హింసంతి తాన్ (కరంభేణ) అవిద్యాహింసనేన. అత్ర కృ హింసాయామిత్యస్మాద్ధాతోర్బాహుల కాదౌణాదికోఽంభచ్ ప్రత్యయః. (సజోషసః) సమానప్రీతిసేవినః. అయం మంత్రః. శత. ౨. ४. 3. ౨౧ వాఖ్యాతః. ॥४४॥

అన్వయః:- వయం కరంభేణ సజోషసో రిశాదసః ప్రఘాసినోఽతిథీన్మరుత ఋత్విజశ్చ హవామహే. ॥४४॥

భావార్థః :- మనుష్యైర్వైద్యాన్ శూరవీరాన్యజ్ఞసంపాదకాన్ మనుష్యానాహూయ సేవిత్వా తేభ్యో విద్యాశిక్షా నిత్యం సంగ్రాహ్యాః. ॥४४॥

పదార్థము :- మేము (కరమ్భేణ) అవిద్య యను దుఃఖములనుండి వేరై (సజోషసః) సమానముగ ప్రేమను జూపువారిని (రిశాదసః) దోషములను నాశమొనర్చువారిని (ప్రఘాసినః) పక్వమొనర్చిన పదార్థముల నారగించు (మరుతః) అతిథులను (చ) మరియు [యజ్ఞముల నొనర్చు విద్వాంసులను] (హవామహే) సత్కార పూర్వకముగ ప్రతినిత్యము ఆహ్వానించుచుండెదముగాక! ॥४४॥

భావార్థము :- గృహస్థులు విద్వాంసులను, వైద్యులను, శూరులను, వీరులను, యజ్ఞములను సాధించువారిని పిలుచుకొని వారిని యథోచితముగ, సత్కారపూర్వకముగ సేవించి ఉత్తమోత్తమ విద్యాశిక్షలను నిరంతరము పొందుచుండవలెను. ॥४४॥

44. We invocate the guests, who are delightful, free from ignorance, removers of sins, eaters of the food well cooked, and full of knowledge.

౧౧౦. యద్ గ్రామ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, మరుతో దేవతా, స్వరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున ర్గృహస్థకృత్యముపదిశ్యతే. మరల గృహస్థుల కర్మ లీ మంత్రమం దుపదేశింపబడినవి.

౧౧౦ యద్గ్రామే యదరణ్యే యత్సభాయాం యదిన్ద్రియే।

యదేనశ్చకృమా వయమిదన్తదవ యజామహే స్వాహా ॥౪౫॥

ప.వి:- యత్, గ్రామే, యత్, అరణ్యే యత్, సభాయామ్, యత్, ఇన్ద్రియే, యత్, ఏనః, చకృమ, వయమ్, ఇదమ్, తత్, అవ, యజామహే స్వాహా.॥౪౫॥

పదార్థః:-(యత్) యస్మిన్ వక్ష్యమాణే (గ్రామే) శాలాసముదాయే గృహస్థైః సేవితే. గ్రామ ఇత్యుపలక్షణం నగరాదీనామ్. (యత్) యస్మిన్వక్ష్యమాణే (అరణ్యే) వానప్రస్థైః సేవిత ఏకాంతదేశే వనే (యత్) యస్యాం వక్ష్యమాణాయామ్ (సభాయామ్) విద్వత్సమూహ శోభితాయామ్ (యత్) యస్మిన్ఛ్రేష్ఠే (ఇన్ద్రియే) మనసి శ్రోత్రాదౌ వా (యత్) వక్ష్యమాణమ్ (ఏనః) పాపమ్ (చకృమ) కుర్మహే కరిష్యామో వా. అత్ర లఙ్ ల్యటో రర్థే లిట్. అన్యేషామపీతి దీర్ఘశ్చ. (వయమ్) కర్మానుష్ఠాతారో గృహస్థాః (ఇదమ్) ప్రత్యక్షమనుష్ఠీ యమానం కరిష్యమాణం వా. (తత్) కర్మ (అవ) దూరీకరణే (యజామహే) సంగచ్ఛామహే (స్వాహా) సత్యవాచా. స్వాహేతి వాఙ్నామసు పఠితమ్. నిఘం. ౧. ౧౧. అయం మంత్రః. శత. ౨. ౪. ౩. ౨౫. వ్యాఖ్యాతః ॥౪౫॥

అన్వయః :- వయం యద్ గ్రామే యదరణ్యే యత్సభాయాం యదిన్ద్రియే యద్యత్రైనశ్చకృమస్తదవ యజామహే దూరీకుర్మః. యద్యత్ర తత్ర స్వాహా సత్యవాచా పుణ్యకర్మ చకృమ తత్తత్సర్వం సంగచ్ఛామహే.॥౪౫॥

భావార్థః:- చతురాశ్రమస్థైర్మనుష్యైర్మనసా వాచా కర్మణా సదా సత్యం కర్మాచర్య పాపం చ త్యక్త్వా సభావిద్యాశిక్షాప్రచారేణ ప్రజాయాః సుఖోన్నతిః కార్యేతి.॥౪౫॥

**పదార్థము** :-(వయమ్) కర్మానుష్ఠాన మొనర్చెడి మేము (యత్, గ్రామే) గృహస్థులచే సేవించబడిన గ్రామమున (యత్,అరణ్యే) వానప్రస్థులచే సేవించబడిన వనమున (యత్ సభాయామ్) విద్వాంసులు సేవించు

సభయందు (యత్, ఇన్ద్రియే) యోగులు సేవించిన మనః శ్రోత్రాదుల [ఇంద్రియముల సేవ]యందు స్థితమై యుండి (ఏనః) ఏ యే పాపములను, అధర్మ కర్మలను (చకృమ) చేసితిమో, చేయుదుమో (ఇదమ్ తత్) ఆ యన్నిటిని (అవ యజామహే) దూరమొనర్చుచుండెదముగాక! మరియు ఆ యా స్థానములందు (స్వాహా) సత్యవాక్కులచే పుణ్య, ధర్మకార్యములు (చకృమ) ఆచరించదగినవి (తత్) ఆ యన్నిటిని (యజామహే) పొందుచుండెదము గాక! ॥౪౫॥

**భావార్థము :**- నాలుగాశ్రమములందుండు మానవులు మనోవాక్కాయ కర్మలచే సదా సత్కర్మలాచరించుచు అధర్మపాపకృత్యములను వదలివేయుచు విద్వాంసుల సభలను నెలకొల్పి ఉత్తమ విద్యాశిక్షలను ప్రచారమొనర్చి ప్రజల సుఖములను అభివృద్ధి పరచవలయును. ॥౪౫॥

45. May we forsake each sinful act that we have commited in village or solitude, in an assembly or corporeal sense. Let every man so resolve.

౧౧౧. మో షూ ణ ఇత్యస్యాగస్త్య ఋషిః, ఇన్ద్రమారుతౌ దేవతే, భురిక్పంక్తిశ్ఛన్దః. పంచమః స్వరః.

ఈశ్వరశూరవీరసహాయేన యుద్ధే విజయో భవతీత్యుపదిశ్యతే.

ఈశ్వరానుగ్రహముచేతను, శూరుల పరాక్రమశాలుర సహాయము చేతను, యుద్ధమున విజయము లభించగలదను విషయము చెప్పబడినది.

౧౧౧ మో షూణఽ ఇన్ద్రాత్ర పృత్సు దేవైరస్తి హి ష్మా తే శుష్మిన్నవయాః।
మహశ్చిద్యస్య మీఢుషో యవ్యా హవిష్మతో మరుతో వన్దతే గీః ॥౪౬॥

ప.వి:- మోఽఇతి మో, సూ, నః, ఇన్ద్ర, అత్ర, పృత్స్వితి, పృత్+సు, దేవైః, అస్తి, హి, స్మ, తే, శుష్మిన్, అవయా ఇత్యవ+యాః, మహః, చిత్, యస్య, మీఢుషః యవ్యా, హవిష్మతః, మరుతః, వన్దతే, గీః. ॥౪౬॥

పదార్థః:-(మో) నిషేధార్థే (సూ) శోభనార్థే నిపాతస్య చేతి దీర్ఘః (నః) అస్మాన్ (ఇన్ద్ర) జగదీశ్వర సువీర వా అత్ర అస్మిన్ సంసారే (పృత్సు) సంగ్రామేషు. పృత్స్వితి సంగ్రామనామసు పఠితమ్. నిఘం. ౨. ౧౭. (దేవైః) విద్వద్భిః శూరైః (అస్తి) (హి) ఖలు (స్మ) వర్తమానే. నిపాతస్య చేతి దీర్ఘః (తే) తవ. (శుష్మిన్) అనంతబలవన్! పూర్ణబలవన్ వా. శుష్మమితి బలనామసు పఠితమ్. నిఘం. ౨.౯. (అవయాః) అవయజతే వినిగృహ్ణాతి (మహః)

మహత్తరమ్ (చిత్) ఉపమార్థే (యస్య) వక్ష్యమాణస్య (మీఢుషః) విద్యాదిసద్గుణసేచకాన్ (యవ్యా) యవేషు సాధూని హవీంషి యవ్యాని. అత్ర శేశ్ఛందసీతి శేర్లోపః (హవిష్మతః) ప్రశస్తాని హవీంషి విద్యంతే యేషు తాన్ (మరుతః) ఋత్విజః. (వందతే) స్తౌతి. తద్గుణాన్ప్రకాశయతి (గీః) వాణీ. గీరితి వాఙ్నామసు పఠితమ్ నిఘం. ౧. ౧౧. అయం మంత్రః. శత. ౨. ౪. ౩. ౨౬-౨౭ వ్యాఖ్యాతః.॥౪౬॥

అన్వయః :- హే ఇన్ద్ర శూరవీరేశ్వర! కృపయా త్వమత్ర పృత్సు దేవైర్విద్వద్భిః సహితాన్ నోఽస్మాన్ సు రక్ష మో హింధి. హే శుష్మిన్! స్మ తే తవ మహో గీర్యైతాన్ మీఢుషో హవిష్మతో మరుతో వందతే చిదేతే త్వాం సతతం వందన్తేఽభివాద్యానందయంతీవ యోఽవయా యజమానోఽస్తి స త్వదాజ్ఞయా యాని యవ్యా యవ్యాని హవీంష్యగ్నౌ జుహోతి తాని సర్వాన్ ప్రాణినః సుఖయంతీతి. ॥౪౬॥

భావార్థః :- అత్రోపమాలంకారః. యదా మనుష్యాః పరమేశ్వరమారాధ్య సమ్యక్ సామగ్రీః కృత్వా యుద్ధేషు శత్రూన్ విజిత్య చక్రవర్తిరాజ్యం ప్రాప్య సంపాల్య మహాంతమానందం సేవంతే తదా సురాజ్యం జాయత ఇతి. ॥౪౬॥

పదార్థము :- (ఇన్ద్ర) ఓ శూరవీరా! నీవు (అత్ర) ఈ లోకమున (పృత్సు) యుద్ధములందు (దేవైః) విద్వాంసులతో గూడ (నః) మమ్ము (సు) చక్కగా కాపాడుము (మో) హింసింపకుము(శుష్మిన్)సంపూర్ణశక్తి శాలివగు ఓ శూరుడా! (హి) నిశ్చయముగ (చిత్) ఎట్లు (తే) నీయొక్క (మహః) గొప్పదైన (గీః) వేద ప్రమాణములతోగూడిన వాణి (మీఢుషః) విద్య మున్నగు ఉత్తమగుణములను సేచన మొనర్చువారిని (హవిష్మతః) ఉత్తమోత్తమమైన హవిస్సు గలవారిని (మరుతః) అన్నిఋతువులందును యజ్ఞమొనర్చు యాజ్ఞికులను (వన్దతే) ప్రశంసించుచు [గుణముల ప్రకాశపరచునట్లు, విద్వాంసులు నీ గుణములను మా నిమిత్తము నిరంతరము ప్రకాశపరచి ఆనందితు లగుచున్నట్లు] (అవయాః) యజ్ఞమొనర్చు యజమాని నీ యాజ్ఞచే (యవ్యా) ఏ యుత్తమ యవలు మున్నగు అన్నముల నగ్నియందు హోమమొనర్చుచున్నాడో, అట్టి 'హుత' పదార్థములు సకలప్రాణులకు సుఖముల నొసగుచున్నవి. ॥౪౬॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. మానవులు పరమేశ్వరు నారాధించుచు, సమస్త సామగ్రిని చక్కగా సంగ్రహపరచికొని, యుద్ధమున శత్రువులను జయించి, చక్రవర్తి రాజ్యమును పొంది, చక్కగా ప్రజాపాలన మొనర్చుచు అధికానందము పొందినపుడే యది ఉత్తమ రాజ్యమగుచున్నది. ॥౪౬॥

**46. O God, protect us in battles, in this world, with the help of heroes and destroy us not, O mighty hero, verily, as the vedic voice, replete with noble virtues, offering oblations, displays the qualities of the larned worshippers, so does the worshipper, put oblations into the fire, which contribute to the happiness of mankind.**

౧౧౨. అక్రన్నిత్యస్యాగస్త్య ఋషిః, అగ్నిర్దేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

కే యజ్ఞయుద్ధాదికర్మాణి కర్తుం యోగ్యా భవంతీత్యుపదిశ్యతే.

యజ్ఞ యుద్ధాదికర్మ లొనర్చుటకు యోగ్యు లెవరు? అను విషయ మీ మంత్రమునం దుపదేశించబడినది.

౧౧౨ అక్రన్ కర్మ కర్మకృతః సహ వాచా మయోభువా।

దేవేభ్యః కర్మ కృత్వాస్తం ప్రేత సచాభువః ॥౪౭॥

ప.వి:-అక్రన్ కర్మ, కర్మకృత ఇతి కర్మ + కృతః, సహ, వాచా, మయోభువేతి మయః +భువా, దేవేభ్యః, కర్మ, కృత్వా, అస్తమ్, ప్ర, ఇత, సచా భువ ఇతి సచా+భువః.॥౪౭॥

పదార్థః:-(అక్రన్) కుర్వన్తి అత్ర లిజ [లడ]ర్థే లుఙ్. మంత్రే ఘసహ్వర... ఇతి చ్లేర్లుక్ (కర్మ) కర్తురీప్సితతమం కర్మ. అ. ౧. ౪. ౪౯. కర్తుర్యదీప్సితమభీష్టయోగ్యం చేష్టామయముత్క్షేపణాదికమస్తి తత్కర్మ. (కర్మకృతః) యే కర్మాణి కుర్వన్తి తే (సహ) సంగే (వాచా) వేద వాణ్యా. స్వకీయయా వా (మయోభువా) యా మయః సుఖం భావయతి తయా సత్యప్రియమంగలకారిణ్యా.మయ ఇతి సుఖనామసు పఠితమ్. నిఘం 3. ౬. అత్రాంతర్గతో ణ్యర్థఃక్విప్చేతి క్విప్. (దేవేభ్యః) విద్వద్భ్యో దివ్యగుణసుఖేభ్యో వా (కర్మ) క్రియమాణమ్ (కృత్వా) అనుష్ఠాయ (అస్తమ్) సుఖమయం గృహమ్. అస్తమితి గృహనామసు పఠితమ్. నిఘం 3.౪. (ప్ర) ప్రకృష్టార్థే (ఇత) ప్రాప్నువంతి. అత్ర వ్యత్యయో లడర్థే లోట్ చ (సచాభువః) యే సచా పరస్పరమనుషజ్గిణో భవంతి తే. అయం మంత్రః. శత. ౨. ౪. 3. ౨౯. వ్యాఖ్యాతః. ॥౪౭॥

అన్వయః :-యే మయోభువా వాచా సహ సచాభువః కర్మకృతః కర్మ కర్మాక్రన్త ఏతత్కృత్వా దేవేభ్యోఽస్తం సుఖమయం గృహం ప్రేత ప్రాప్నువన్తి.॥౪౭॥

భావార్థః:-మనుష్యైర్నిత్యం పురుషార్థే వర్తితవ్యమ్.న కదాచిదాలస్యే స్థాతవ్యమ్ తథా వేదవిద్యాసంస్కృతయా వాణ్యా సహ భవితవ్యమ్, న చ మూర్ఖత్వేన. సదా పరస్పరం ప్రీత్యా సహాయః కర్తవ్యః. యే చైవం భూతాస్తే దివ్యసుఖయుక్తం మోక్షాఖ్యం వ్యావహారికం చానందం ప్రాప్య మోదంతే న చైవమలసా ఇతి. ॥౪౭॥

పదార్థము :- ఏ మానవులు (మయోభువా) సత్య, ప్రియ శుభములను కలుగజేయించు (వాచా)వేదవాణి, లేక స్వంత వాణితో (సహ) యుక్తమై (సచాభువః) పరస్పరముకలిసి మెలిసి (కర్మకృతః) కర్మలనొనర్చుచు (కర్మ)

తమ యభీష్ట కర్మను (అక్రన్) చేయుచుందురో వారు (దేవేభ్యః) విద్వాంసులకొరకు, ఉత్తమ గుణముల కొరకు, సౌఖ్యములకొరకు (కర్మ) చేయదగిన కృత్యమును (కృత్వా) అనుష్ఠించి (అస్తమ్) పూర్ణ సుఖయుక్తమగు గృహమును (ప్రేత) పొందుచున్నారు. ॥౪౭॥

**భావార్థము :-** మానవులు సోమరితనము, మూర్ఖత్వమును వదలి నిరంతరము పురుషార్థపరులై యుండి వేదవిద్యచే శుద్ధపరచబడిన వాణితో సదా వర్తించవలయును. పరస్పరము ప్రేమపూర్వకముగ సహకరించుకొనవలయును. ఇట్లు వ్యవహరించువారే శ్రేష్ఠ సుఖములతో కూడినవారై ఇహ పరలోక, మోక్ష సుఖముల వడసి ఆనందితు లగుచున్నారు. ఇతరు (సోమరు) లెన్నడును ఇట్టి ఆనందమును పొందజాలరు. ॥౪౭॥

47. They, who with delightful vedic voice, working in cooperation perform their desired deeds, go to their comfortable house, after the completion of their task for the acquisition of noble virtues.

౧౧౩ అవభృథేత్యస్యౌర్ణవాభ ఋషిః, యజ్ఞో దేవతా, బ్రాహ్మ్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

అథ యజ్ఞానుష్ఠాతృకృత్యముపదిశ్యతే.

యజ్ఞానుష్ఠాన మొనర్చు యజమానుని కర్మ లీ మంత్రమున నుపదేశించబడినవి.

౧౧౩ అవభృథ నిచుమ్పుణ నిచేరురసి నిచుమ్పుణః। అవ దేవైర్దేవకృత

మేనోఽయాసిషమవ మర్త్యైర్మర్త్యకృతం పురురావ్ణో దేవ రిషస్పాహి॥౪౮॥

ప. వి:- అవభృథేత్యవ+భృథ, నిచుమ్పుణేతి ని+చుమ్పుణ, నిచేరురితి ని+చేరుః । అసి, నిచుమ్పుణ ఇతి ని+చుమ్పుణః, అవ, దేవైః దేవకృతమితి దేవ+కృతమ్, ఏనః, అయాసిషమ్, అవ, మర్త్యైః, మర్త్యకృతమితి మర్త్య+కృతమ్, పురురావ్ణ ఇతి పురు+రావ్ణః, దేవ, రిషః, పాహి. ॥౪౮॥

పదార్థః :- (అవభృథ) విద్యాధర్మానుష్ఠానేన శుద్ధ. అత్ర అవే భృఞః, ఉ.౨.3. ఇతి క్థన్ ప్రత్యయః. (నిచుమ్పుణ) ధైర్యేణ శబ్దవిద్యాధ్యాపక! నితరాం చోపతి మందం మందం చలతి తత్సంబుద్ధౌ. అత్ర చుప్ ధాతో ర్బాహులకాదుణః ప్రత్యయో ముమాగమశ్చ). నీచైరస్మిన్ క్వణన్తి నీచైర్దధతీతి వా. అవభృథ నిచుమ్పుణేత్యపి నిగమో భవతి. నిచుమ్పుణ నిచుంకుణేతి

చ నిరు. ౫. ౧౮. నిచుమ్పుణ ఇతి పదనామసు పఠితమ్. నిఘం ౪.౨. అనేన ప్రాప్తజ్ఞానో మనుష్యో గృహ్యతే (నిచేరుః) యో నితరాం చినోతి సః. అత్ర నిపూర్వకాచ్చిఞ్ ధాతో ర్బాహులకాదౌణాదికో రుః ప్రత్యయః. (అసి) భవ. అత్ర లోడర్థే లట్. (నిచుమ్పుణః) ఉక్తార్థః. (అవ) వినిగ్రహార్థే (దేవైః) ద్యోతనాత్మకైర్మన ఆదీన్ద్రియైః. (దేవకృతమ్) యద్దేవైరిన్ద్రియైః కృతం తత్. (ఏనః) పాపమ్ (అయాసిషమ్) కరోమి. అత్ర లఙర్థే లుఙ్ (అవ) నీచగత్యర్థే (మర్త్యైః) మరణధర్మైః శరీరైః (మర్త్యకృతమ్) అనిత్యదేహేన నిష్పాదితమ్ (పురురావ్ణః) యః పురూణి బహూని దుఃఖాని రాతి దదాతి స పురురావా తస్మాత్. అత్ర ఆతో మనిన్ క్వనిబ్వనిపశ్చేతి వనిప్ ప్రత్యయః. (దేవ) జగదీశ్వర! (రిషః) హింసకాచ్ఛత్రోః పాపాచ్చ. (పాహి) రక్ష. ॥౪౮॥

అన్వయః:-హే అవభృథ నిచుమ్పుణ! యథాఽహం నిచుమ్పుణో నిచేరుః సన్దేవైరిన్ద్రియైర్దేవకృతం మర్త్యైర్మర్త్యకృత మేనోఽవాయాసిషం దూరతస్త్యజామి తథా త్వమప్యసి భవావయాహి దూరతస్త్యజ. హే దేవ! జగదీశ్వరాస్మాన్ పురురావ్ణో రిషో హింసాలక్షణాత్పాపాత్పాహి దూరే రక్ష. ॥౪౮॥

భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. మనుష్యైః పాపనివృత్తయే ధర్మప్రవృత్తయే పరమేశ్వరో నిత్యం ప్రార్థనీయః యాని మనోవచః కర్మభిః పాపాని సంతి తేభ్యో దూరే స్థాతవ్యమ్. యత్కించిద జ్ఞానాత్పాపమనుష్ఠితం తద్దుఃఖఫలం విజ్ఞాయ ద్వితీయవారం న సమాచరణీయమ్. కింతు సర్వదా పవిత్ర కర్మానుష్ఠానమేవ వర్ధనీయమ్. ॥౪౮॥

పదార్థము :-(అవభృథ) విద్య ధర్మ అనుష్ఠానములచే శుద్ధుడవు(నిచుమ్పుణ) ధైర్యముతో శబ్దవిద్యను చదివించు నో విద్వాంసుడా! నే నెట్లు (నిచుమ్పుణః) జ్ఞానమును పెంపొందింపజేయువాడను (నిచేరుః) నిరంతరము విద్యలను సంగ్రహపరచెడివాడనునై (దేవైః) ప్రకాశస్వరూపములగు మనస్సు మొదలగు ఇంద్రియములద్వారా (దేవకృతమ్) ఇంద్రియము లొనర్చినదానిని (మర్త్యై) [మరణ ధర్మము గల] మానవులచే (మర్త్యకృతమ్) శరీరములద్వారా చేయబడినదియు నగు (ఏనః) పాపములను (అయాసిషమ్) దూరమొనర్చి శుద్ధుడనగుచున్నానో, అటులనే నీవును (అసి) అగుము. (దేవ) ఓ జగదీశ్వరా! నీవు మాకు (పురురావ్ణః) బహుదుఃఖములను గలిగించువానినుండియు (రిషః) చంపదలచు శత్రువులనుండియు హింసాలక్షణములతో గూడిన పాపములనుండియు మమ్ము (పాహి) రక్షించుము [మా పాపములను తొలగింపుము].॥౪౮॥

భావార్థము :-ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారము గలదు. పాపనివృత్తి, ధర్మవృద్ధికొరకు పరమేశ్వరుని నిరంతరము ప్రార్థించుచు మనోవాక్కాయ కర్మలచే జరుగు పాపములనుండి దూరముగ దొలగి, అజ్ఞానముచే జరిగిన పాపకర్మల ఫలమే దుఃఖరూపమని తెలిసికొని తిరిగి రెండవ తడవ అట్టి పాపకర్మ లెన్నటికిని చేయకుందురు గాక! మరియు సర్వకాల సర్వావస్థలయందును శుద్ధకర్మల అనుష్ఠానమునే వృద్ధిపరచెదరు గాక! ఇదియే మానవులకుచితము.॥౪౮॥

48. O purified through knowledge and righteousness. O patient teacher of grammar, just as I, a seeker after knowledge, and a firm gleaner of wisdom, wash out the sin that I have committed throught my senses and the mortal body, so do thou O God, preserve me from tortuous sin!.

౧౧౪. పూర్ణాదర్వీతిత్యస్యౌర్ణవాభ ఋషిః, యజ్ఞో దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

యజ్ఞే హుతం ద్రవ్యం కీదృశం భవతీత్యుపదిశ్యతే.

యజ్ఞమున హోమమొనర్చిన పదార్థము లేమగుచున్నవను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడుచున్నది.

౧౧౪ పూర్ణా దర్వి పరా పత సుపూర్ణా పునరాపత।

వస్నేవ విక్రీణావహా ఇషమూర్జꣳ శతక్రతో॥౪౯॥

ప.వి:- పూర్ణా, దర్వి, పరా, పత, సుపూర్ణేతి సు+పూర్ణా, పునః, ఆ, పత, వస్నేవేతి వస్నా+ ఇవ, వి, క్రీణావహై। ఇషమ్ ఊర్జమ్ శతక్రతోꣳ ఇతి శత +క్రతో ॥౪౯॥

పదార్థః :-(పూర్ణా) హోతవ్యద్రవ్యేణ పరిపూర్ణా (దర్వి) పాకసాధికా హోతవ్యద్రవ్య గ్రహణార్థా. అత్ర సుపాం సులుగితి సు లోపః (పరా) ఊర్ధ్వార్థే పరేత్యేతస్య ప్రాతిలోమ్యం ప్రాహ. నిరు.౧.౩. (పత) పతతి గచ్ఛతి. అత్రోభయత్ర వ్యత్యయో లడర్థే లోట్ చ. (సుపూర్ణా) యా సుష్ఠు పూర్యతే సా. (పునః) పశ్చాదర్థే (ఆ) సమంతాత్ (పత) పతతి గచ్ఛతి (వస్నేవ) పణ్యక్రియేవ. (వి) విశేషార్థే క్రియాయోగే (క్రీణావహై) వ్యవహారయోగ్యాని వస్తూని దద్యావ గృహ్ణీయావ వా (ఇషమ్) అభీష్టమన్నమ్ (ఊర్జమ్) పరాక్రమమ్ (శతక్రతో) శతమసంఖ్యాతాః క్రతవః కర్మాణి ప్రజ్ఞా యస్యేశ్వరస్య తత్సంబుద్ధౌ. అయం మంత్రః. శత ౨. ౪. ౧౫-౧౭ వ్యాఖ్యాతః. ॥౪౯॥

అన్వయః :-యా దర్వి హోతవ్యద్రవ్యేణ పూర్ణా హోమసాధికా భూత్వా పరాపత పతత్యూర్ధ్వం ద్రవ్యం గమయతి యాఽఽహుతిరాకాశం గత్వా వృష్ట్యా సుపూర్ణా భూత్వా పునరాపతతి సమంతాత్ పృథివీం శోభనం జలరసం గమయతి తయా. హే శతక్రతో! తవ కృపయా ఆవామృత్విగ్యజ్ఞపతీ వస్నేవేషమూర్జం చ విక్రీణావహై.॥౪౯॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యదా మనుష్యైః సుగంధ్యాదిద్రవ్యమగ్నౌ హూయతే తదూర్ధ్వం గత్వా వాయువృష్టిజలాదికం శోధయత్ పునః పృథివీమాగచ్ఛతి యేన యవాదయ

**ఓషధ్యః శుద్ధాః సుఖపరాక్రమప్రదా జాయంతే. యథా వణిగ్జనో రూప్యాదికం దత్వా గృహీత్వా ద్రవ్యాంతరాణి క్రీణీతే విక్రీణీతే చ, తథైవాగ్నౌ ద్రవ్యాణి దత్వా ప్రక్షిప్య వృష్టిసుఖాదికం క్రీణీతే వృష్ట్యోషధ్యాదికం గృహీత్వా పునర్వృష్ట్యయే విక్రీణీతేఽగ్నౌ హోమః క్రియత ఇతి. ॥౪౯॥**

**పదార్థము** :-(దర్వి) పక్వమైనవానిని, హోమయోగ్యమైన పదార్థములను గ్రహించు ఏ దర్వి [స్రువ, చమస] (పూర్ణా) ద్రవ్యములచే పరిపూర్ణమైనదై ఆహుతిని హోమమొనర్చబడిన పదార్థముల సూక్ష్మాంశములను (పరాపత) ఆకాశమునకు పంపించుచున్నదో, ఏ యాహుతి ఆకాశమునకు చేరి వర్షముచే (సుపూర్ణా) నిండినదై (పునరాపత) తిరిగి భూమిపైకి ఉత్తమ జలరసములను చేర్పించుచున్నదో, దానిద్వారా (శతక్రతో) అసంఖ్యాక కర్మలు, ప్రజ్ఞలు కలిగిన ఓ జగదీశ్వరా! నీ కృపచే మే మిరువురము [యజ్ఞము చేయించు విద్వాంసుడైన హోత, మరియు యజ్ఞమొనర్చు యజమానులము] (ఇషమ్) ఉత్తమ మగు అన్నము మున్నగు పదార్థములను (ఊర్జమ్) పరాక్రమవంతమైన వస్తువులను (వస్నేవ) వైశ్యుల వ్యవహారముల వలె [క్రయవిక్రయ వ్యాపారమువలె] (విక్రీణావహై) ఇచ్చి పుచ్చుకొనుచుందుముగాక! ॥౪౯॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. మానవులు ఘృతము, సుగంధాది పదార్థములను అగ్నియందు హోమమొనర్చునపు డవి సూక్ష్మరూపమున పైకి వెళ్ళి వాయువు, వర్షజలములను శుద్ధమొనర్చుచు తిరిగి భూమిపైకి వచ్చుచున్నవి. అందువలన యవలు [గోధుమలు] మున్నగు ఓషధులు పరిశుద్ధములై సుఖమును, పరాక్రమమును ఒసగెడివగుచున్నవి. వైశ్యులు డబ్బుద్వారా క్రయ విక్రయములద్వారా అన్నాదిపదార్థములను వినిమయ మొనర్చుకొనునట్లు మనమందరమును పరిశుద్ధమైన సుగంధ, రోగనాశక, పుష్టివర్ధక పదార్థముల నగ్నియందాహుతి యొనర్చి వర్షమును, అనేక సౌఖ్యములను కొనుచున్నాము. వృష్టిచే ఫలించిన ఓషధ్యాదుల గ్రహించి వానిని మరల వృష్టి మరియు సుఖములకొరకు అగ్నియందు హవనము (యజ్ఞము) నొనర్చుచున్నాము. ॥౪౯॥

49. The oblation full of cooked articles put into the fire, goes up to the sky, and returns therefrom full of rain.

౧౧౫. దేహి మ ఇత్యస్యౌర్ణవాభ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిగనుష్టుప్ ఛన్దః. గాంధారః స్వరః.

అథ సర్వాశ్రమవ్యవహార ఉపదిశ్యతే.

ఇపు డీ మంత్రమున సర్వాశ్రమమున్నలి మనుష్యుల వ్యవహారముల నుపదేశించెను.

౧౧౫ దేహి మే దదామి తే ని మే ధేహి ని తే దధే ।

నిహారం చ హరాసి మే నిహారం నిహరాణి తే స్వాహా ॥౫౦॥

ప.వి:- దేహి, మే, దదామి, తే, ని, మే, ధేహి, ని, తే, దధే, నిహారమితి ని+హారమ్,

చ, హరాసి, మే, నిహారమితి ని+హారమ్, ని, హరాణి, తే, స్వాహా.॥౫౦॥

పదార్థః:-(దేహి) (మే) మహ్యమ్ (దదామి) (తే) తుభ్యమ్ (ని) నితరామ్ (మే) మమ (ధేహి) ధారయ (ని) నితరామ్ (తే) తవ (దధే) ధారయే (నిహారమ్) మూల్యేన క్రేతవ్యం వస్తు నితరాం హ్రియతే తత్ (చ) సముచ్చయే (హరాసి) హర ప్రయచ్ఛ. అయం లేట్ ప్రయోగః (మే) మహ్యమ్ (నిహారమ్) పదార్థమూల్యమ్ (ని) నితరామ్ (హరాణి) ప్రయచ్ఛాని (తే) తుభ్యమ్ (స్వాహా) సత్యావాగాహ. అయం మంత్రః. శత . ౨. ౪. ౪. ౧౯-౨౦ వ్యాఖ్యాతః. ॥౫౦॥

అన్వయః:-హే మిత్ర! త్వం యథా స్వాహాసత్యావాగాహేత్యేవం మే మహ్యమిదం దేహ్యాహం చ తే తుభ్యమిదం దదామి త్వం మే మమేదం వస్తు నిధేహ్యాహం తే తవేదం విదధే త్వం మే మహ్యం నిహారం హరాస్యహం తే తుభ్యం నిహారం నిహారాణి నితరాం దదాతి. ॥౫౦॥

భావార్థః:-సర్వైర్మనుష్యైర్దానగ్రహణనిఃక్షేపోపనిధ్యాదివ్యవహారాః సత్యత్వేనైవ కార్యాః. తద్యథా కేనచిదుక్తమిదం వస్తు త్వయా దేయం న వా. యది వదేద్దదామి దాస్యామి వేతి తర్హి తత్తథైవ కర్తవ్యమ్. కేన చిదుక్తం మమేదం వస్తుత్వం స్వసమీపే రక్ష. యదాఽహమిచ్ఛేయం తదా దేయమేవమహం తవేదం వస్తు రక్షయామి, యదా త్వమేష్యసి తదా దాస్యామి. తస్మిన్ సమయే దాస్యామి త్వత్సమీపమాగమిష్యామి వా త్వయా గ్రాహ్యం మమ సమీప మాగంతవ్యమిత్యాదయో వ్యవహారాః సత్యవాచా కార్యాః. నైతైర్వినా కస్యచిత్ప్రతిష్ఠా కార్యసిద్ధీ స్యాతాం నైతాభ్యాం వినా కశ్చిత్సతతం సుఖం ప్రాప్తుం శక్నోతీతి.॥౫౦॥

పదార్థము :- ఓ మిత్రమా! నీవు (స్వాహా) హృదయమునందుండు సత్యవాణిని చెప్పుచున్నట్లే (మే) నాకు ఈ వస్తువును (దేహి) ఇమ్ము. నేను (తే) నీకు ఈ వస్తువును (దదామి) ఇవ్వగలను [ఇచ్చెదను]. మరియు నీవు (మే) నా యీ వస్తువును (నిధేహి) ధరించుము. నేను (తే) నీ యీ వస్తువును (నిదధే) ధారణ మొనర్చుచున్నాను. మరియు నీవు (మే) నాకొరకు (నిహారమ్) క్రయమొనర్చదగిన వస్తువును (హరాసి) తీసికొనుము. నేను (తే) నీకు (నిహారమ్) పదార్థముల మూల్యమును (నిహరాణి) నిశ్చయముగ నిచ్చెదను. (స్వాహా) ఈ వ్యవహారములన్నియును సత్యమైన మనోవాక్కులచే సిద్ధింప జేసికొనవలెను. అట్లుగానిచో ఇవేవియును సిద్ధింపజాలవు.॥౫౦॥

**భావార్థము :-** మనుష్యులు ఇచ్చిపుచ్చుకొనుట, పదార్థముల నితరులవద్ద దాచియుంచుట, కుదువ యుంచుట మున్నగు వ్యవహారములన్నియు సత్య ప్రతిజ్ఞతోనే చేయవలెను. ఎట్లన:-''ఒకడు మరొకనితో నీవు

నా కీ వస్తువు నిమ్మని యడుగ అతడు ఈయను అని యనినప్పుడు అట్లే యొనర్చవలయును. మరియు నొకడు ఈ నా వస్తువును నీవద్ద నుంచుము. నే నడిగినప్పుడు తిరిగి ఇమ్ము. ఇట్లే : నేను నీ యీ వస్తువును నావద్ద నుంచుదును. నీ వడిగిన వెంటనే తిరిగి ఇత్తును. లేక నేను స్వయముగ తెచ్చియిత్తును. లేదా నీవే కొని పొమ్ము''. ఇత్యాది వ్యవహారము లన్నియును సత్య మనోవాక్కులచేతనే జరుగవలెను. సత్యముగ వ్యవహరించనిచో మానవుల ప్రతిష్ఠగాని, కార్యసిద్ధిగాని జరుగనేరదు. ఇవిరెండు లేనిదే ఎవ్వడును సుఖములను పొందుటకు సమర్థుడు గాజాలడు. ॥౫౦॥

50. Give me this article and I will give you that in return. Keep this as my desposit, I keep this as your deposit. Give me the cash price for it. I give you the price demanded. Let peopl thus transact business truthfully.

౧౧౬. అక్షన్నిత్యస్య గోతమ ఋషిః, ఇన్ద్రోదేవతా, విరాట్ పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

తేన యజ్ఞాదివ్యవహారేణ కిం భవతీత్యుపదిశ్యతే.

అట్టి యజ్ఞాది వ్యవహారములవల్ల నేమి యగుచున్నదను విషయ మీ మంత్రమునం దుపదేశించియున్నాడు.

౧౧౬ అక్షన్నమీమదన్త హ్యవ ప్రియాఽఅధూషత । అస్తోషత స్వభానవో విప్రా నవిష్ఠయా మతీ యోజా న్విన్ద్ర తే హరీ ॥౫౧॥

ప.వి:- అక్షన్, అమీమదంత, హి, అవ, ప్రియాః, అధూషత, అస్తోషత, స్వభానవ ఇతి స్వ+భానవః, విప్రాః, నవిష్ఠయా, మతీ, యోజ, ను, ఇన్ద్ర, తే, హరీఽఇతి హరీ.॥౫౧॥

పదార్థః:-(అక్షన్) అదంతి. అత్ర లడర్థే లుఙ్. మంత్రే ఘస హ్వ... ఇతి చ్లేర్లుక్. గమ హన జన.... ఇత్యుపధాలోపః, శాసి వసి ఘ... ఇతి షత్వం. ఖరిచేతి చర్త్వమ్. (అమీ మదన్త) ఆనందయంతి.అత్ర లడర్థే లుఙ్. (హి) ఖలు, (అవ) విరుద్ధార్థే, (ప్రియాః) ప్రసన్నతాకారకాః (అధూషత) దుష్టాన్ దోషాంశ్చ కంపయతి. అత్ర లడర్థే లుఙ్, (అస్తోషత) స్తువన్తి. అత్ర లడర్థే లుఙ్. (స్వభావవః) స్వకీయా భాను ర్దీప్తిః ప్రకాశో యేషాం తే (విప్రాః) మేధావినః. (నవిష్ఠయా) అతిశయేన నవా నవిష్ఠా తయా. (మతీ) మత్యా. అత్ర సుపాం సులుగితి పూర్వసవర్ణాదేశః (యోజ) యోజయతి. అత్ర వికరణవ్యత్యయేన శప్. లడర్థే లోడన్తర్గతో ణ్యర్థో ద్వ్యచోత స్తిఙ ఇతి దీర్ఘశ్చ. (ను) క్షిప్రార్థే! (ఇన్ద్ర)సభాపతే! (తే) అస్య (హరీ) బలపరాక్రమౌ. అయం మంత్రః . శత. ౨. ౫. ౨. ౩౮.వ్యాఖ్యాతః ॥౫౧॥

అన్వయః :- హే ఇన్ద్ర! తే తవ యే స్వభానవోఽవప్రియా విప్రా నవిష్ఠయా మతీ మత్యా హి ఖలు పరమేశ్వరమస్తోషతస్తువంత్యక్షన్ శ్రేష్ఠాన్నాదికమదంత్యమీమదంతానందయంతి తస్మాత్తం శత్రూన్ దుఃఖాని చ న్యధూషత క్షిప్రం ధున్వంతి త్వముప్యేతేషు స్వకీయౌ హరీ బలపరాక్రమౌ యోజ సంయోజయ.॥౫౧॥

భావార్థః:- మనుష్యైః ప్రతిదినం నవీనవిజ్ఞానక్రియావర్ధనేన భవితవ్యమ్. యథా విద్వత్సంగశాస్త్రాధ్యయనేన నవీనాన్నవీనాం మతిం క్రియాం చ జనయంతి, తథైవ సర్వైర్మనుష్యై రనుష్ఠేయమితి.॥౫౧॥

పదార్థము :-(ఇన్ద్ర) సభాపతివగు ఓ ఇంద్రా! (తే) నీకు సంబంధించిన యే మనుష్యులు (స్వభానవః) స్వదీప్తిచే ప్రకాశించువారును( అవప్రియాః) ఇతరులను ప్రసన్నపరమవారును నగు (విప్రాః) విద్వాంసులు, వారు (నవిష్ఠయా) అత్యంతనవీనమైన (మతీ) బుద్ధితో (హి) నిశ్చయముగ పరమాత్మను (అస్తోషత) స్తుతించుచు (అక్షన్) ఉత్తమ అన్నాది పదార్థములను భక్షించుచు (అమీమదన్త) ఆనందమును పొందుచున్నారు. మరియు అందువలన వారు శత్రువులను, దుఃఖములను (అవధూషత) శీఘ్రముగ కంపింపజేయుచున్నారు. అట్లే ఈ యజ్ఞమున (ఇన్ద్ర) హే సభాపతే! (తే) నీ సహాయముచే వారు యజ్ఞనిపుణులగుదురుగాక! మరియు నీవు (హరీ) బలపరాక్రమములను మాతో (యోజ) సంయుక్త మొనర్పుము.॥౫౧॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. సర్వదా నూతనజ్ఞానము, నవీన ఆవిష్కారములను వృద్ధియొనర్చుట మానవులకు విధియై యున్నది. మానవులు శాస్త్రాధ్యయనమువలనను, నూతన బుద్ధి నుపయోగించి క్రొత్త క్రొత్త ఆవిష్కారములను గనుగొనునట్లు ఎల్లరును ఆచరింపవలయును.॥౫౧॥

51.Thou chairman, just as comrades, luminous in themselves, pleasing others, advanced in knowledge, with their sharpest intellect, do verily praise God, and being regaled with nutritious diet, overcome miseries, so do thou yoke thy vigorur and prowess with them.

౧౧౭. సుసందృశమిత్యస్య గోతమ ఋషిః, ఇన్ద్రో దేవతా, విరాట్ పంక్తి శ్ఛన్దః పంచమః స్వరః.

స ఇన్ద్రః కీదృశ ఇత్యుపదిశ్యతే.

ఆ ఇంద్రుడెటువంటివా డను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడినది.

౧౧౭ సుసందృశం త్వా వయం మఘవన్వన్దిషీ మహి। ప్ర నూనం పూర్ణబన్ధుర స్తుతో యాసి వశాఁ౨ఽఅను యోజాన్విన్ద్ర తే హరీ ॥౫౨॥

ప.వి:-సుసన్దృశమితి సు+సన్దృశమ్, త్వా, వయమ్, మఘవన్నితి మఘ+వన్, వన్దిషీమహి, ప్ర, నూనమ్, పూర్ణబంధుర ఇతి పూర్ణ+ బంధురః, స్తుతః, యాసి, వశాన్,అను, యోజ, ను, ఇన్ద్ర, తే, హరీఽ ఇతి హరీ. ॥౫౨॥

పదార్థః :-(సుసన్దృశమ్) యః సుష్ఠు పశ్యతి దర్శయతి వా తమ్. (త్వా) త్వాం తం వా.(వయమ్) మనుష్యాః (మఘవన్)పరమోత్కృష్టధనయుక్తేశ్వర! ధనప్రాప్తిహేతుర్వా (వన్దిషీమహి) నమేంమ స్తువీమహి. (ప్ర) ప్రకృష్టార్థే. (నూనమ్) నిశ్చయార్థే, (పూర్ణబంధురః) యః పూర్ణశ్చాసౌ బంధురశ్చ సః. పూర్ణస్య జగతో బంధురో బంధనహేతుర్వా (స్తుతః) స్తుత్యా లక్షితః (యాసి) ప్రాప్నోషి ప్రాపయతి వా. అత్ర పక్షే వ్యత్యయః. (వశాన్) కామయమానాన్ పదార్థాన్ (అను) పశ్చాత్ (యోజ) యోజయ యుంక్తే వా. అత్రాపి పూర్వవద్వ్యత్యయదీర్ఘత్వే (ను) ఉపమార్థే (ఇన్ద్ర) జగదీశ్వర సూర్యస్య వా. (తే) తవాస్య వా (హరీ) బలపరాక్రమౌ ధారణాకర్షణే వా. అయం మంత్రః.శత.౨.౬. ౧.౩౮.వ్యాఖ్యాతః.॥౫౨॥

అన్వయః :-హే మఘవన్నిన్ద్ర! వయం సుసన్దృశం త్వా త్వాం వందిషీమహి అస్మాభిః స్తుతః పూర్ణబంధురః సం స్త్వం వశాన్ కామాన్యసి ప్రాపయసి తే తవ హరీ త్వమను ప్రయోజేత్యేకః. ॥౫౨॥

వయం సుసన్దృశం మఘవన్ మఘవంతం పూర్ణబంధురం త్వా తమిమం సూర్యలోకం నూనం వంది షీమహి. స్తుతః ప్రకాశితగుణః సన్నయం వశానుత్కృష్టవ్యవహారసాధకాన్ కామాన్ యాసి ప్రాపయతి. హే విద్వంస్త్వం యథా తేఽస్యేన్ద్రస్య హరీ అస్మిన్ జగతి యుంక్తః, తథైవ విద్యాసిద్ధికరాణ్యనుప్రయోజేతి ద్వితీయః. ॥౫౨॥

భావార్థః :-అత్ర శ్లేషోపమాలంకారౌ. మనుష్యైః సర్వజగద్ధితకారీ జగదీశ్వరో వందితవ్యోనైవేతరః. యథా సూర్యో మూర్త్తద్రవ్యాణి ప్రకాశయతి తథోపాసితః సోఽపి భక్తజనాత్మసు విజ్ఞానోత్పాదనేన సత్యాసత్యవ్యవహారాన్ ప్రకాశయతి తస్మాన్నైవేశ్వరం విహాయ కస్యచిదన్యస్యోపాసనం కర్త్తవ్యమితి. ॥౫౨॥

పదార్థము :-(మఘవన్) ఓ ఉత్తమోత్తమ విద్యాదిభాగ్యశాలీ! (ఇన్ద్ర) పరమేశ్వరా! (వయమ్) మేము (సుసన్దృశమ్) చక్కగా వ్యవహారముల నెరిగియున్న (తే) నిన్ను (నూనమ్) నిశ్చయముగ (వందిషీమహి)

స్తుతించెదముగాక! మరియు మాచే (స్తుతః) స్తుతించబడిన నీవు (వశాన్) కోరిన పదార్థములను (యాసి) లభింపజేయుచున్నావు. (తే) నీకున్న (హరీ) బలపరాక్రమములను (అనుప్రయోజ) మా సహాయమునకై ప్రయోగించుము [ఇది ప్రథమార్థము].

(వయమ్) మేము (సుసన్దృశమ్) పదార్థములను బాగుగ జూచువాడును (మఘవన్) ధనములను ప్రాప్తింపజేయువాడును (పూర్ణబంధురః) సమస్త జగమునకు బంధనహేతువును నగు (త్వా) ఆ సూర్యలోకమును (నూనమ్) నిశ్చయముగ (వందిషీమహి) స్తుతించెదము. అనగా గుణములను ప్రకాశపరచెదము. (స్తుతః) ఇట్లు స్తుతింపబడిన ఈ సూర్యుడు మాకు (వశాన్) ఉత్తమమగు వ్యవహారములను, సిద్ధింపజేయు కోరికలను (యాసి) లభింపజేయుచున్నాడు. (ను) ఎట్లు (తే) ఈ సూర్యుని (హరీ) ధారణ, ఆకర్షణాది గుణములు ప్రపంచమున విహరించుచున్నవో, అట్లే నీవును మాకు విద్యను ప్రాప్తించుకొను గుణములను (అను ప్ర యోజ) బాగుగ లభింపజేయుము. [ఇది ద్వితీయార్థము]॥౫౨॥

**భావార్థము** :- ఈ మంత్రమున శ్లేష ఉపమాలంకారములు గలవు. మానవులు సర్వజగమునకు హితమొనర్చు నా జగదీశ్వరునే స్తుతించవలయును కాని మరెవ్వరిని, దేనిని స్తుతించనలదు. ఏలయన సూర్యలోకము మూర్తివంతమగు సమస్త ద్రవ్యములను ప్రకాశపరచుచున్నటులే స్తుతించబడిన ఈశ్వరుడు కూడా భక్తుల ఆత్మలందు విజ్ఞానమును గలిగించుటచే సమస్త వ్యవహారములను ప్రకాశిత మొనర్చుచున్నాడు. కావున పరమేశ్వరుని తప్ప మరెవ్వరిని ఉపాసించకూడదు. ॥౫౨॥

52. We revere Thee, O God of Bounty, who art fair to see. Being praised by us, O best Companion, Thou fulfillest all our desires. O Lord, yoke Thy vigour and prowess for us!.

౧౧౮. మనో న్విత్యస్య బంధుర్‌ఋషిః, మనో దేవతా, అతిపాదనిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ మనసో లక్షణముపదిశ్యతే.

ఈ మంత్రమున మనస్సుయొక్క లక్షణము గూర్చి ఉపదేశించబడినది.

౧౧౮ మనో న్వాహ్వామహే నారాశꣳసేన స్తోమేన । పితౄణాం చ మన్మభిః ॥౫౩॥

ప. వి:- మనః, ను, ఆ, హ్వామహే, నారాశꣳసేన, స్తోమేన, పితౄణామ్, చ, మన్మభిరితి మన్మ+భిః॥౫౩॥

**పదార్థః** :- (మనః) మననశీలం సంకల్ప వికల్పాత్మకమ్ (ను) క్షిప్రార్థే (ఆ) సమంతాత్ క్రియాయోగే (హ్వామహే) స్పర్ధామహే (నారాశంసేన) నరాణాం సమంతాచ్ఛంసః ప్రశంసనం నరాశంసః. నరాశంసేన నిర్వృత్తస్తేన (స్తోమేన) స్తుతియుక్తేన వ్యవహారేణ (పితౄణామ్)

పాలకానామృతూనాం జ్ఞానవతాం మనుష్యాణాం వా (చ) సముచ్చయే (మన్మభిః) మన్యంతే జానంతి యైస్తైః. అత్ర సర్వధాతుభ్యో మనిన్, ఉ. ४.१४५ ఇతి మనిన్ ప్రత్యయః. అయం మంత్రం.శత.౨. ౫. ౨. ३८.వ్యాఖ్యాతః. ॥५३॥

అన్వయః:-వయం నారాశంసేన స్తోమేన పితౄణాం చ మన్మభిర్మనోఽన్వాహ్వామహే.॥५३॥

భావార్థః :-మనుష్యైర్మనుష్య జన్మసాఫల్యార్థం విద్యాదిగుణయుక్తం మనః కర్తవ్యమ్. యథర్తవః స్వాన్ స్వాన్ గుణాన్ క్రమేణ ప్రకాశయంతి, యథా చ విద్వాంసః క్రమశోఽన్యామన్యాం చ విద్యాం సాక్షాత్కుర్వంతి, తథైవ సతత మనుష్యైయ విద్యాప్రకాశౌ ప్రాప్తవ్యౌ. ॥५३॥

పదార్థము :-మేము (నారాశꣳసేన) మానవుల అతిప్రశంసనీయమగు (స్తోమేన) స్తుతితో గూడిన వ్యవహారముతోను మరియు (పితౄణామ్) పాలించు ఋతువుల, లేక జ్ఞానవంతులగు మానవుల (మన్మభిః) సమస్త గుణములను దెలిసికొనగలుగు శ్రేష్ఠగుణములతోను (మనః) సంకల్ప వికల్పములతో గూడిన చిత్తమును (అన్వాహ్వామహే) అన్నిదిశలకు ద్రిప్పి దృఢపరచుచున్నాము. ॥५३॥

భావార్థము :-మానవులు తమ జన్మసాఫల్యమునకై మనస్సును విద్య మున్నగు గుణములచే యుక్తముగ నొనర్పవలయును. ఋతువులు క్రమముగా వాని వాని గుణములను ప్రకాశపరచుచున్నట్లు విద్వాంసులు క్రమక్రమముగా ఇతర యనేక విద్యలను సాక్షాత్కారపరచుకొనునట్లు మానవు లెల్లరును పురుషార్థవంతులై నిరంతర మనేక ఉత్తమవిద్యలను బడయవలెను. ॥५३॥

53. By reflecting on the merits of the learned, and following the high principles of the elders, we strengthen our mind through non-attachment.

११८. ఆ న ఏత్విత్యస్య బంధుర్ఋషిః, మనో దేవతా, విరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తన్మనః కీదృశ మిత్యుపదిశ్యతే.

ఆ మనస్సు ఎటువంటిదను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడినది.

११८ ఆ న॒ ఏతు॒ మనః॒ పున॒: క్రత్వే॒ దక్షా॑య జీ॒వసే॑।

జ్యోక్ చ॒ సూర్యం॑ దృ॒శే ॥५४॥

ప.వి:-ఆ, నః, ఏతు, మనః, పునరితి పునః, క్రత్వే, దక్షాయ, జీవసే, జ్యోక్. చ, సూర్యమ్, దృశే ॥५४॥

**పదార్థః** :-(ఆ) సమంతాత్ (నః) అస్మాన్ (ఏతు) ప్రాప్నోతు (మనః) స్మరణాత్మకం చిత్తం (పునః) వారం వారం జన్మని జన్మని వా. (క్రత్వే) సద్విద్యాశుభకార్మనుభూతసంస్కారస్మృతయే. క్రతురితి కర్మనామసు పఠితమ్. నిఘం. ౨. ౧. (దక్షాయ) బలప్రాప్తయే. దక్ష ఇతి బలనామసు పఠితమ్. నిఘం ౨. ౯. (జీవసే) జీవితుమ్. అత్ర తుమర్థే సే...... ఇత్యసే ప్రత్యయః (జ్యోక్) నిరంతరమ్. (చ) సముచ్చయే (సూర్యమ్) పరమేశ్వరం సవితృమండలం ప్రాణం వా (దృశే) ద్రష్టుమ్. అత్ర దృశే విఖ్యే చ. అ.౩. ౪. ౧౧. ఇత్యయం నిపాతితః. అయం మంత్రః శత. ౨. ౫. ౨. ౩౯. వ్యాఖ్యాతః. ॥౫౪॥

**అన్వయః** :-యన్మనశ్చిత్తం జ్యోక్ నిరంతరం సూర్యం దృశే క్రత్వే దక్షాయ జీవసే చాన్యేషాం శుభకర్మణా మనుష్యానాయయాస్తి తన్నోఽస్మాన్ పునః పునరాసమంతాదేతు ప్రాప్నోతు.॥౫౪॥

**భావార్థః**:-మనుష్యైః శ్రేష్ఠకర్మానుష్ఠానేన చిత్తశుద్ధిం కృత్వా పునః పునర్జన్మని చిత్తప్రాప్తిరేవాపేక్ష్యా యేన మనుష్యజన్మ ప్రాప్యేశ్వరోపాసనం సంరాధ్య నిరంతరం సద్ధర్మోఽనుసేవ్య ఇతి.॥౫౪॥

**పదార్థము** :-(మనః) స్మరణశీలమగు చిత్తము (జ్యోక్) నిరంతరము (సూర్యమ్) పరమేశ్వరుని, సూర్యుని, ప్రాణమును (దృశే) చూచుటకు (క్రత్వే) ఉత్తమవిద్య ఉత్తమకర్మల స్మృతి గలిగియుండుటకు (జీవసే) నూరు సంవత్సరములకన్న అధికముగ జీవించు కోరిక గలది (చ) మరియు ఇతర శుభకర్మలను ఆచరించుటకు దగినది కావున నది (నః) మాకు (పునః) జన్మజన్మాంతరములందును (ఆ) సకలవిధముల (ఏతు) ప్రాప్తించుగాక.॥౫౪॥

**భావార్థము** :-మానవులు శ్రేష్ఠకర్మల నాచరించుటకు, చిత్తశుద్ధికొరకు, జన్మజన్మాంతరములందు ఉత్తమ చిత్తము లభించుటకు ఇచ్చ గలిగియుండవలెను. అందు కనువగునట్టి మానవ జన్మను నడసి ఈశ్వరోపాసనను సాధించి, ఉత్తమ శ్రేష్ఠధర్మమునే సేవించవలయును. ॥౫౪॥

54. May we get in future births again and again the mind, for doing virtuous deeds, for acquiring strength, for longevity, and contemplation of God for long.

౧౨౦. పునర్న ఇత్యస్య బంధుర్ఋషిః, మనో దేవతా । నిచృద్గాయత్రీ ఛన్దః । షడ్జః స్వరః.

పునర్మనః శబ్దేన బుద్ధిరుపదిశ్యతే.

మరల మనస్సను శబ్దముద్వారా బుద్ధిని గూర్చి ఈ మంత్రమున నుపదేశించెను.

౧౨౦ పునర్నః పితరో మనో దదాతు దైవ్యో జనః।

జీవం వ్రాతం సచే మహి ॥౫౫॥

ప.వి:-పునః, నః, పితరః, మనః, దదాతు, దైవ్యః,జనః, జీవమ్, వ్రాతమ్. సచేమహి.॥౫౫॥

పదార్థః:-(పునః) అస్మిన్ జన్మని పునర్జన్మని వా (నః) అస్మభ్యమ్ (పితరః) పాంత్యన్నసుశిక్షా విద్యాదానేన తత్పంబుద్ధా. (మనః) ధారణావతీం బుద్ధిమ్. (దదాతు) ప్రయచ్ఛతు (దైవ్యః) యో దేవేషు విద్వత్సు జాతో విద్వాన్. అత్ర దేవాద్యఞ ఞౌ అ.౪.౧.౮౫. ఇతి వార్తికేన ప్రాగ్దీవ్యతీయాంతర్గతే జాతే ఽర్థేయఞ్ ప్రత్యయః. (జనః) యో విద్యాధర్మాభ్యాం పరోపకారాన్ జనయతి ప్రకటయతి (జీవమ్) జ్ఞానసాధనయుక్తమ్ (వ్రాతమ్) వ్రతానాం సత్యభాషణాదీనాం సమూహస్తత్ (సచేమహి) సమవేయావ. అయం మంత్రః. శత.౨. ౫. ౩౯. వ్యాఖ్యాతః. ॥౫౫॥

అన్వయః:-హే పితరో! జనకా! విద్యాప్రదాశ్చ భవచ్ఛిక్షయా దైవ్యో జనో విద్వాన్ నోఽస్మభ్యం పునః పునర్మనోధారణావతీం బుద్ధిం దదాతు, యేన వయం జీవం వ్రాతం సచేమహి సమవేయావ. ॥౫౫॥

భావార్థః:-నహి మనుష్యాణాం విదుషాం మాతాపిత్రాచార్యాణాం చ సుశిక్షయా వినా మనుష్యజన్మసాఫల్యం సంభవతి. న చ మనుష్యా స్తయా వినా పూర్ణం జీవనం కర్మ చ సమవైతుం శక్నువన్తి, తస్మాత్సర్వదా మాతాపిత్రాచార్యైః స్వసంతానాని సమ్యగుపదేశేన శరీరాత్మబలవంతి కర్తవ్యానీతి. ॥౫౫॥

పదార్థము :-(పితరః) ఉత్పన్నమొనర్చి, అన్నమును, విద్యాశిక్షణలనొసగి రక్షించు ఓ పితరులారా! మీ శిక్షణవల్ల (దైవ్య) విద్వాంసులందు జన్మించిన [ప్రసిద్ధిగాంచిన] వాడును (జనః) విద్య, ధర్మములచే ఇతరుల కుపకారముల నొనర్చు విద్వాంసుడు (నః) మాకు (పునః) ఇహ పర జన్మలయందు (మనః) ధారణ బుద్ధిని (దదాతు) ప్రసాదించుగాక! దానివల్ల (జీవమ్) జ్ఞానసాధనముతో గూడిన జీవనమును (వ్రాతమ్) సత్యగుణ సముదాయమును (సచేమహి) మేము చక్కగా పొందుదుముగాక! ॥౫౫॥

**భావార్థము** :-విద్వాంసులగు తల్లిదండ్రుల, ఆచార్యుల శిక్షణ లేనిదే మానవజన్మ సఫలము నొందజాలదు. మానవుడును అట్టి శిక్షణ లేకుండ పూర్ణజీవనమును మరియు కర్మల సంయుక్తపరచుటకు సమర్థుడును గాజాలడు. కావున సర్వకాల సర్వావస్థలయందును విద్వాంసులు, తల్లి, తండ్రి, ఆచార్యుడు మున్నగు పూజనీయులు సదుపదేశములచే తమ సంతానములను శారీరకముగ, ఆత్మికముగ బలశాలురుగ నొనర్చవలయును. ॥౫౫॥

55. O venerable elders, may this man endowed with godly qualities, give us in this and the next life, intellect whereby we may enjoy a long life and perform noble deeds!.

౧౨౧. వయమిత్యస్య బంధుర్ఋషిః, సోమో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ సోమశబ్దేనేశ్వరౌషధిరసా ఉపదిశ్యన్తే

ఇపుడు సోమశబ్దముచే పరమేశ్వరుని గూర్చియు, ఓషధులను రసములను గూర్చియును ఈ మంత్రమునం దుపదేశించబడినది.

౧౨౧ వయꣳ సోమ వ్రతే తవ మనస్తనూషు బిభ్రతః। ప్రజావన్తః సచేమహి ॥౫౬॥

ప.వి:-వయమ్, సోమ, వ్రతే, తవ, మనః, తనూషు, బిభ్రతః, ప్రజావన్త ఇతి ప్రజా+వన్తః, సచేమహి. ॥౫౬॥

పదార్థః :-(వయమ్) మనుష్యాః (సోమ) సువతి చరాచరం జగత్తత్సంబుద్ధౌ జగదీశ్వర! అథవా సూయన్తే రసా యస్మాత్స సోమ ఓషధిరాజః (వ్రతే) సత్యభాషణాదిధర్మానుష్ఠానే (తవ) అస్య వా (మనః) అన్తః కరణస్యాహంకారాది వృత్తిమ్ (తనూషు) విస్తృతసుఖశరీరేషు (బిభ్రతః) ధారయన్తః పోషయన్తశ్చ (ప్రజావన్తః) బహ్వ్యః సుసంతానరాష్ట్రాఖ్యాః ప్రజా విద్యన్తే యేషాన్తే. అత్ర భూమన్యర్థే మతుప్ (సచేమహి) సమవేయామ. ॥౫౬॥

అన్వయః :-హే సోమ జగదీశ్వర! తవ సత్యాచరణరూపే వ్రతే వర్తమానాస్తనూషు మనో బిభ్రతః ప్రజావన్తః సన్తో వయం సర్వైః సుఖైః సచేమహి సమవేయామేత్యేకః.॥

తవాస్య సోమస్య వ్రతే సత్యాచరణనిమిత్తే తనూషు మనో బిభ్రతః సన్తః ప్రజావన్తో భూత్వా వయం సర్వైః సుఖైః సచేమహి నిత్యం సమవేయామేతి ద్వితీయః ॥౫౬॥

భావార్థః-అత్ర శ్లేషాలంకారః. ఈశ్వరస్యాజ్ఞాయాం వర్తమానా మనుష్యాః శరీరాత్మసుఖం నిత్యం ప్రాప్నువన్తి. ఏవం సోమాద్యోషధిసేవినోఽపి తత్సుఖం సమవయన్తి నేతర ఇతి. ॥౫౬॥

**పదార్థము** :-(సోమ) సృష్టినిర్మాణమొనర్చు నో పరమేశ్వరా! (తవ) నీయొక్క (వ్రతే) సత్యభాషణము మున్నగు ధర్మానుష్ఠానమునం దుండి (తనూషు) ఉత్తమ శరీరములందు (మనః) అంతఃకరణమునందలి అహంకారము మున్నగు వృత్తులను (బిభ్రతః)ధరించువారమై (ప్రజావన్తః) అనేక ఉత్తమ సంతానము, రాష్ట్రము మున్నగు సంపదలు గలవారమై మేము (సచేమహి) సమస్త సౌఖ్యములను బడయుదుము గాక! [ఇది మొదటి యర్థము].

(తవ) నీయొక్క యీ (సోమ) సోమలత మున్నగు ఓషధులను(వ్రతే) సత్యమైన గుణజ్ఞానములతో సేవించుచు (తనూషు) సుఖయుక్త శరీరములందును (మనః) చిత్తవృత్తిని (బిభ్రతః)ధరించుచు (ప్రజావన్తః)

పుత్రులు, రాజ్యము మున్నగు ధనములుగలవారమై (వయమ్) మేము (పచేమహి) సకల సౌఖ్యములను పొందెదముగాక! [ఇది రెండవయర్థము].॥౫౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. ఈశ్వరాజ్ఞను పాలించు శ్రేష్ఠులు శరీర, ఆత్మల సుఖములను సదా పొందుదురు. ఇదే విధముగ యుక్తిపూర్వకముగ సోమలత మున్నగు ఓషధుల సేవనముచే ఆ యా సుఖములను పొందుచుందురు. సోమరుల కిది సాధ్యము గాదు. ॥౫౬॥

56. O God, acting upon thy Law, possessing mental self-consciousness in healthy bodies, blest with progeny, let us enjoy happiness!.

౫౭. ఏష త ఇత్యస్య బన్ధుర్ఋషిః, రుద్రో దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

అథ మనోలక్షణకథనానన్తరం ప్రాణలక్షణముపదిశ్యతే.

మనస్సు లక్షణముల తెలిపినపిదప ప్రాణముయొక్క లక్షణమునుగూర్చి

ఈ మంత్రముద్వారా ఉపదేశించ బడుచున్నది.

౫౭ ఏష తే రుద్ర భాగః సహ స్వస్రామ్బికయా తం జుషస్వ స్వాహా।
ఏష తే రుద్ర భాగఽ ఆఖుస్తే పశుః ॥౫౭॥

ప.వి:- ఏషః, తే, రుద్ర, భాగః, సహ, స్వస్రా, అమ్బికయా, తమ్, జుషస్వ స్వాహా, ఏషః, తే, రుద్ర, భాగః, ఆఖుః, తే, పశుః.॥౫౭॥

పదార్థః:-(ఏషః) ప్రత్యక్షః (తే) తవాస్య వా (రుద్ర) రోదయత్యన్యాయకారిణో జనాన్ స రుద్రః స్తోతా తత్సంబుద్ధౌ, రుద్ర ఇతి స్తోతృనామసు పఠితమ్. నిఘం.౩.౧౬. రుద్ర ఇత్యేతస్య త్రయస్త్రింశద్దేవ వ్యాఖ్యానే ప్రాణసంజ్ఞేత్యుక్తమ్. రుద్రో రౌతీతి సతో రోరూయమాణో ద్రవతీతి వా రోదయతేర్వా యదరుదత్తద్రుద్రస్య రుద్రత్వమితి కాఠకం. యదరోదీత్తద్రుద్రస్య రుద్రత్వమితి హారిద్రావికమ్ నిరు. ౧౦. ౫. రోదే ర్ణి లుక్ చ. ఉ. ౨. ౨౨.అనేన రుద్రశబ్దః సిద్ధః (భాగః) సేవనీయః (సహ) సంగే (స్వస్రా) సుష్ఠ్వస్యతి ప్రక్షిపతి యయా విద్యయా క్రియయా వా తయా సహ సేర్వన్. ఉ.౨.౯౭. అనేన స్వసృశబ్దః సిధ్యతి (అమ్బికయా) అమ్బతే శబ్దయతి యయా తయా, (తమ్) భాగమ్ (జుషస్వ) సేవస్వ సేవతేవా. అత్ర పక్షే వ్యత్యయో లడర్థే లోట్ చ. (స్వాహా) శోభనం దేయమాదేయమాహ యయా సా (ఏషః) వక్ష్యమాణః, (తే) తవాస్య వా (రుద్ర) ఉక్తార్థః (భాగః) భజనీయః.

(ఆఖుః) పమంతాత్ ఖనత్యవదృణాతి యేన భోజనసాధనేన సః. అత్ర ఆఙ్ పరయోః ఖని శృభ్యాం డిచ్చ, ఉ. ౧. 33. ఇతి కు ప్రత్యయో డిత్సంజ్ఞా చ (పశుః) యో దృశ్యతే భోగ్యపదార్థసమూహః సమక్షే స్థాపితః సః. అత్ర అంజి దృశి కమి....౧.౨౭ ఇత్యౌణాదిక సూత్రేణాస్య సిద్ధిః. అయం మంత్రః. శత. ౨. ౬. 3.౯. ౧౦ వ్యాఖ్యాతః.॥౫౭॥

అన్వయః:-హే రుద్ర! స్తోతస్తే తవైషో భాగోఽస్తి తం త్వమమ్బికయా స్వస్రా సహ జుషస్వ. హేరుద్ర! తే తవై షోఽయం భాగః స్వాహాస్తి తం సేవస్వ. హే రుద్ర! తే తవైష ఆఖుః పశుశ్చాస్తి తం జుషస్వ సేవస్వేత్యేకః.

యోఽయం రుద్రః ప్రాణస్తేఽస్య రుద్రస్య యోఽ యం భాగోఽయమమ్బికయా స్వస్రా సహ జుషస్వ సేవతే తేఽస్య రుద్రస్యై షోఽయం స్వాహా భాగస్తథా యస్తేఽస్యాఖుః పశుశ్చాస్తి యమయం సతతం సేవతే తం సర్వే మనుష్యాః సేవన్తామ్. ఇతి ద్వితీయః ॥౫౭॥

భావార్థః :-అత్ర శ్లేషాలంకారః. యథా భ్రాతా ప్రియయా విదుష్యా భగిన్యా సహ వేదాదిశబ్దవిద్యాం పఠిత్వాఽఽనన్దం భుంక్తే యథా చాఽయం ప్రాణః శ్రేష్ఠయా శబ్దవిద్యయా ప్రియో జాయతే, తథైవ విద్వాన్ శబ్దవిద్యాం ప్రాప్య సుఖీ జాయతే. నైతాభ్యాం వినా కశ్చిదపి సత్యం జ్ఞానం సుఖభోగం చ ప్రాప్తుం శక్నోతీతి. ॥౫౭॥

**పదార్థము :**-(రుద్ర) అన్యాయకారు లగు మానవుల నేడ్పించు ఓ విద్వాంసా! (త) నీయొక్క (ఏషః) ఇట్టి (భాగః) సేవించదగిన పదార్థ సముదాయమును నీవు (అమ్బికయా) వేదవాణిచే (స్వస్రాసహ) ఉత్తమ విద్యల మరియు క్రియలచే (జుషస్వ) సేవించుము. (రుద్ర) ఓ విద్వాంసా (తే) నీయొక్క (ఏషః) ఏది యీ (భాగః) ధర్మముచే సిద్ధమైన అంశము గలదో (స్వాహా) వేదవాణి గలదో, దానిని సేవించుము. మరియు (రుద్ర) ఓ విద్వాంసా! (తే) నీయొక్క (ఏషః ఆఖుః) త్రవ్వదగిన ఏ యీ శస్త్రముగలదో (పశుః) భోగ్య పదార్థముగలదో (తమ్) దీనిని (జుషస్వ) సేవించుము **[ఇది ప్రథమార్థము].**

(ఏషః) ఏది యీ (రుద్ర) ప్రాణముగలదో, అది (తే ఏషః భాగః) ఎద్దానికి భాగముగ నున్నదో, దేనిని (అమ్బికయా) వాణి, లేక (స్వస్రాసహ) విద్యాక్రియలచే (జుషస్వ) సేవించుచున్నదో (తే) దేనికి (స్వాహా) సత్యవాణిరూపమే (భాగః) భాగమై యున్నదో మరియు ఏది దీనిని (ఆఖుః) త్రవ్వుసాధనమో (పశుః) దర్శించదగిన భోగ్యపదార్థములేవి గలవో, దేనిని ఇది (జుషస్వ) సేవించుచున్నదో దానిని సకల జనులు సదా సేవించుచుండవలయును **[ఇది ద్వితీయార్థము].**॥౫౭॥

**భావార్థము :**-ఈ మంత్రమున శ్లేషాలంకార మున్నది. సోదరుడు సంపూర్ణ విద్యావతియగు సోదరితో వేదాది విద్యలను చదివి ఆనందించునట్లు విద్వాంసులు సర్వవిద్యలనుబడసి సుఖులగుచున్నారు. ఈ ప్రాణము శ్రేష్ఠముగు శబ్దవిద్యచే ప్రియము, ఆనందదాయక మగునట్లు సుశిక్షిత విద్వాంసుడును ఎల్లరకును సుఖము

గలుగజేయువాడగుచున్నాడు. ఈ రెండును లేకుండ ఏ మనుష్యుడును సత్యజ్ఞానమును, సుఖభోగములను బడయుటకు సమర్థుడు గాజాలడు. ॥౫౭॥

57. O learned person the chastiser of the sinful and the unrighteous, all these eatable things are for thee. Accpet them with thy knowledge and Vedic lore. O learned man, follow the Veda and the law of Dharma. O learned person, accept the food worth eating which uproots all diseases!.

౧౫౩. అవ రుద్రమిత్యస్య బన్ధురృషిః, రుద్రో దేవతా, విరాట్ పంక్తి శ్ఛన్దః, పంచమః స్వరః.

అథ రుద్రశబ్దేనేశ్వర ఉపదిశ్యతే.

ఇపు డీ మంత్రమందు రుద్రశబ్దముచే నీశ్వరుని గూర్చి ఉపదేశించబడుచున్నది.

౧౫౩ అవ రుద్రమదీమహ్యవ దేవం త్ర్యమ్బకమ్। యథా నో వస్యస

స్కరద్యథా నః శ్రేయస స్కరద్యథా నో వ్యవసాయయాత్ ॥౫౮॥

ప.వి:-అవ, రుద్రమ్, అదీమహి, అవ, దేవమ్, త్ర్యమ్బకమితి త్రి+అంబకమ్, యథా, నః, వస్యసః, కరత్, యథా, నః, శ్రేయసః, కరత్, యథా, నః, వ్యవసాయయాదితి వి+ అవసాయయాత్.॥౫౮॥

పదార్థః :-(అవ) వినిగ్రహార్థే (రుద్రమ్)దుష్టానాం రోదయితారం పరమేశ్వరమ్ (అదీమహి) సర్వాణి దుఃఖాని క్షాయయేమ నాశయేమ. అత్ర దీఙ్ క్షయ ఇత్యస్మాల్లిఙర్థే లఙ్. బహులం ఛన్దసీతి శ్యనో లుక్.(అవ) అవగమార్థే (దేవమ్) దాతారమ్ (త్ర్యమ్బకమ్) అవంతి యేన జ్ఞానేన తదమ్బం త్రిషు కాలేష్వేకరసం జ్ఞానం యస్య తమ్ అత్ర అవుగత్యాదిష్వస్మాద్ బాహులకేన కరణకారకే వః ప్రత్యయస్తతః. శేషాద్విభాషా. అ.౫. ౪. ౧౫౪. ఇతి సమాసాన్తః కప్ ప్రత్యయః. (యథా) యేన ప్రకారేణ (నః) అస్మాన్ (వస్యసః) యేఽతిశయేన వసంతి తే వసీయాంసస్తాన్. అత్ర ఛాన్దసో వర్ణలోపో వేతికారలోపః (కరత్) కుర్యాత్. అయం లేట్ ప్రయోగః. డుకృఞ్ కరణ ఇత్యస్య భ్వాదిగణాన్తర్గత పఠితత్వాచ్ఛబ్వి కరణోఽత్ర గృహ్యతే. తనాదిభిః సహపాఠాదువికరణోఽపి. కః కరత్కరతి కృధి కృతేష్వనదితేః. అ. ౮. ౩. ౫౦. నిత్యం కరోతేః. అ. ౬. ౪. ౧౦౮ ఏతాభ్యాం ద్వాభ్యాం జ్ఞాపకాభ్యామప్యుభయగణ ప్రయోగః కృఞ్ గృహ్యతే. (యథా) (నః) అస్మాన్ (శ్రేయసః)

అతిశయేన ప్రశస్తాన్ (కరత్) కుర్యాత్. అత్రాపి లేట్. (యంథా) (నః) అస్మాన్ (వ్యవసాయంయాత్) నిశ్చయంవతః కుర్యాత్. అయం వ్యవపూర్వాత్ షోఽన్తకర్మణీతి ఏజన్తాద్ధాతోః ప్రథమపురుషైకవచనే తిపి లేట్ ప్రయోగః. అయం మంత్రః. శత ౨. ౫. 3. ౧౧ వ్యాఖ్యాతః. ।।౫౮।।

అన్వయః :-వయం త్ర్యమ్బకం దేవం రుద్రం జగదీశ్వరముపాస్య దుఃఖాన్యవాదీమహ్యవక్షాయయేమ. స యథా నోఽస్మాన్ వస్యసోఽవ కరద్యథా నోఽస్మాన్ శ్రేయసోఽవ కరద్యథా నోఽస్మాన్ వ్యవసాయయాత్ తథా తం వసీయాంసం శ్రేయాంసం వ్యవసాయప్రదం పరమేశ్వరమేవ ప్రార్థయామః. ।।౫౮।।

భావార్థః:-నహీశ్వరస్యోపాసనేన వినా కశ్చిన్మనుష్యః సర్వదుఃఖాన్తం గచ్ఛతి. యః సర్వాన్ సుఖనివాసాన్ప్రశస్తాన్ సత్యనిశ్చయాన్ కరోతి తస్యైవాజ్ఞా సర్వైః పాలనీయేతి.।।౫౮।।

**పదార్థము** :-మేము (త్ర్యమ్బకమ్) ముక్కాలములందును ఏకరసుడు, జ్ఞానయుక్తుడును (దేవమ్) దాతయు (రుద్రమ్) దుష్టుల నేడ్పించువాడునగు జగదీశ్వరు నుపాసించి సకల దుఃఖములను (అవాదీమహి) బాగుగా నష్టమొనర్చెదముగాక! (యథా) పరమేశ్వరు డేవిధముగ (నః) మమ్ము (వస్యసః) చక్కని గృహములందు నివసించువారుగా (అవాకరత్) చేయునో (యథా) ఎట్లు (నః) మమ్ము (శ్రేయసః) అతిశ్రేష్ఠులుగ (కరత్) చేయునో (యథా) ఎట్లు (నః) మమ్ము (వ్యవసాయయాత్) నిశ్చయశాలురుగ నొనర్చునో అటులనే సుఖపూర్వకముగ నివసింపజేయువాడును, ఉత్తమోత్తమగుణయుక్తుడును, సత్యమగు నిశ్చయమును గలిగించువాడును నగు పరమేశ్వరునే ప్రార్థించెదముగాక! ।।౫౮।।

**భావార్థము** :-ఏ మనుష్యుడును ఈశ్వర స్తుతి, ప్రార్థన, ఉపాసనాదులు లేక సమస్త దుఃఖములను దాటజాలడు. ఏలన ఆ పరమేశ్వరుడే సకల సుఖముల నివాసమును, ఉత్తమోత్తమ సత్యనిశ్చయములను జేయించువాడునునై యున్నాడు. కావున నాతని యాజ్ఞలను యథావిధిగ పాలించుట మానవులకు యోగ్యము.।।౫౮।।

58. May we ward off all calamities by worshipping God, Who is unchangeable in the past, present and future, chastises the sinners, and is highly benevolent. Just as God makes us better housed, more prosperous, and determined so may we adore Him.

౫౯. భేషజమసీత్యస్య బన్ధుర్ఋషిః, రుద్రో దేవతా, స్వరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః స కీదృశ ఇత్యుపదిశ్యతే.

ఆ పరమేశ్వరు డెటువంటి వాడను విషయ మీ మంత్రమం దుపదేశించెను.

౧౨౪ భేషజమసి భేషజం గవేఽశ్వాయ పురుషాయ భేషజమ్।

సుఖం మేషాయ మేష్యై ।౫౯॥

ప.వి:- భేషజమ్, అసి, భేషజమ్, గవే, అశ్వాయ, పురుషాయ, భేషజమ్, సుఖమితి సు+ఖమ్, మేషాయ, మేష్యై.।౫౯॥

పదార్థః :-(భేషజమ్) శరీరాన్తఃకరణేన్ద్రియాత్మనాం సర్వరోగాఽపహారకమౌషధమ్ (అసి) (భేషజమ్) అవిద్యాది క్లేశనివారకమ్ (గవే) ఇన్ద్రియధేనుసమూహాయ (అశ్వాయ) తురఙ్గాద్యాయ (పురుషాయ) పురుషప్రభృతయే (భేషజమ్) రోగనివారకమ్ (సుఖమ్) సుఖం కస్మాత్సుహితం ఖేభ్యః ఖం పునః ఖనతేః. నిరు. 3. ౧3. (మేషాయ) అవయే (మేష్యై) తత్స్త్రియై అయం మంత్రః. శత. ౨. ౫. ౧౧ వ్యాఖ్యాతః.।౫౯॥

అన్వయః:-హే రుద్ర జగదీశ్వర! యః శరీరరోగనాశకత్వాద్ భేషజమస్యాత్మరోగ దూరీకరణాద్ భేషజమస్యేవం సర్వేషాం దుఃఖనివారకత్వాద్భేషజమసి స త్వం నోఽస్మభ్యమస్మాకం వా గవేఽశ్వాయ పురుషాయ మేషాయ మేష్యై సుఖం దేహి. ।౫౯॥

భావార్థః :-నహి పరమేశ్వరోపాసనేన వినా శరీరాత్మప్రజానాం దుఃఖాపనయో భూత్వా సుఖం జాయతే. తస్మాత్సర్వైర్మనుష్యైరీశ్వరౌషధసేవనేన శరీరాత్మప్రజాపశూనాం ప్రయత్నేన దుఃఖాని నివార్య సుఖం జననీయమితి. ।౫౯॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! నీవు (భేషజమ్ అసి) శరీమునందలి అంతఃకరణము ఇంద్రియములు, గోవులు మున్నగు పశువుల రోగములను నాశమొనర్పువాడవు (భేషజమ్ అసి) అవిద్యమున్నగు క్లేశములను దూరమొనర్పువాడవు. అట్టి నీవు (నః) మాకు మా (గవే) గోవులకు (అశ్వాయ) అశ్వములకు (పురుషాయ) సకల మానవులకు (మేషాయ) గొఱ్ఱెపోతులకు (మేష్యై) ఆడగొఱ్ఱెలకు (సుఖమ్) ఉత్తమ సౌఖ్యములను విరివిగ నొసగుము. ।౫౯॥

భావార్థము :-పరమేశ్వరు నుపాసించకుండా మానవులకు దుఃఖములు దొలగి సుఖములు గలుగజాలవు. కావున మానవు లెల్లరును పరమేశ్వరుని స్తుతి, ప్రార్థనోపాసనాదు లొనర్చియు, ఓషధుల సేవించియు, పుత్ర, మిత్ర, పశువులు మున్నగువాని శారీరక, ఆత్మిక దుఃఖములను ప్రయత్న పూర్వకముగ దొలగించి సుఖములను సాధించవలయును. ।౫౯।

59. O God, Thou art the healer of the physical, mental and spiritual maladies. Heal. Thou the sufferings of cow, horse and all mankind. Grants happiness to ram and ewe.

౬౦. త్ర్యమ్బకమిత్యస్య వసిష్ఠ ఋషిః, రుద్రోదేవతా, విరాడ్ బ్రాహ్మీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః స కీదృశ ఇత్యుపదిశ్యతే.

ఆ పరమేశ్వరు డెట్లుండునను విషయ మీ మంత్రమం దుపదేశించెను.

౬౦ త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్।

ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్।

త్ర్యమ్బకం యజామహహే సుగన్ధిం పతి వేదనమ్।

ఉర్వారుకమివ బన్ధనాదితో ముక్షీయ మాముతః ॥౬౦॥

ప. వి: - త్ర్యమ్బకమితి త్రి+ అమ్బకమ్, యజామహే, సుగన్ధిమితి సు+ గన్ధిమ్ పుష్టివర్ధనమితి పుష్టి+ వర్ధనమ్, ఉర్వారుకమివేత్యుర్వారుకమ్ + ఇవ, బన్ధనాత్, మృత్యోః, ముక్షీయ, మా, అమృతాత్, త్ర్యమ్బకమితి త్రి+ అమ్బకమ్,యజామహే, సుగన్ధిమితి సు+ గన్ధిమ్, పతివేదనమితి పతి+ వేదనమ్, ఉర్వారుక మివేత్యుర్వారుకమ్ + ఇవ, బన్ధనాత్, ఇతః, ముక్షీయ, మా, అముతః. ॥౬౦॥

పదార్థః :- (త్ర్యమ్బకమ్) ఉక్తార్థం జగదీశ్వరమ్ (యజామహే) నిత్యం పూజయేమహి (సుగంధిమ్) శోభనః శుద్ధో గన్ధో యస్మాత్తమ్. అత్ర గన్ధపూజస్యేదుత్పూతిసుసురభిభ్యః. అ. ౫. ౪. ౧౩౫. ఇతి సూత్రేణ సమాసాన్త ఇకారాదేశః (పుష్టివర్ధనమ్) పుష్టేః శరీరాత్మబలస్య వర్ధనస్తమ్. అత్ర నన్ద్యాదిత్వాల్ల్యుః ప్రత్యయః (ఉర్వారుకమివ) యథోర్వారుకఫలం పక్వం భూత్వాఽమృతాత్మకం భవతి (బన్ధనాత్) లతాసమ్బన్ధాత్ (మృత్యోః) ప్రాణశరీరాత్మ వియోగాత్ (ముక్షీయ) ముక్తోభూయాసమ్ (మా) నిషేధే (అమృతాత్) మోక్షసుఖాత్ (త్ర్యమ్బకమ్) సర్వాధ్యక్షమ్ (యజామహే) సత్కుర్వీమహి. (సుగన్ధిమ్) సుష్ఠుగంధో యస్మిన్ స్తమ్ (పతివేదనమ్) పాతి రక్షతి సః పతిః పతేర్వేదనం ప్రాపణం జ్ఞానం వా యస్మా

త్తమ్ (ఉర్వారుకమివ) ఉక్త్వోఽర్థః (బన్ధనాత్) ఉక్త్వోఽర్థః (ఇతః) అస్మాచ్ఛరీరాన్మర్త్య లోకాద్వా (ముక్షీయ) పృథగ్భూయాసమ్ (మా) నిషేధార్థే (అమృతః) మోక్షాఖ్యాత్ పరలోకాత్ పరజన్మసుఖఫలాద్ ధర్మాద్వా.

అత్రాహ యాస్కో నిరుక్తే - త్ర్యమ్బకో రుద్ర స్తం త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం సుష్ఠు గన్ధిం పుష్టివర్ధనం పుష్టికారకమివోర్వారుకమివ ఫలం బన్ధనాదారోధనాన్మృత్యోః సకాశా న్ముంచస్వ మామ్. నిరు. ౧౩. ౪౧. అయం మంత్రః. శత. ౨. ౫. ౩. ౧౨-౧౪. వ్యాఖ్యాతః.॥౬౦॥

అన్వయః:-వయం సుగన్ధిం పుష్టివర్ధనం త్ర్యమ్బకం దేవం యజామహే నిత్యం పూజయేమహి. ఏతస్య కృపయాఽహం బన్ధనాదుర్వారుకమివ మృత్యో ర్ముక్షీయ ముక్తోభూయాసమ్, అమృతాన్మా ముక్షీమహి మా శ్రద్ధా రహితా భూయాసమ్. వయం సుగన్ధిం పతివేదనం త్ర్యమ్బకం సర్వస్వామినం జగదీశ్వరం యజామహే సతతం సత్కుర్వీమహి. ఏతదనుగ్రహేణాహం బంధనాదుర్వారుక మివేతో ముక్షీయ పృథగ్భూయాసమ్. వయ మముతో మోక్షసుఖాత్సత్యసుఖఫలాద్ ధర్మాద్విరక్తా మా భూయాస్మ. ॥౬౦॥

భావార్థః:-అత్రోపమాలంకారః. నైవ మనుష్యా ఈశ్వరం విహాయ కస్యాప్యన్యస్య పూజనం కుర్యుః. తస్య వేదవిహితత్వేన దుఃఖఫలత్వాత్ యథోర్వారుకఫలం యదా లతాయాం లగ్నం సత్స్వయం పక్వం భూత్వా సమయం ప్రాప్య లతాబన్ధనాన్ముక్తా సుస్వాదు భవతి, తథైవ వయం పూర్ణమాయుర్భుక్త్వా శరీరం త్యక్త్వా ముక్తిం ప్రాప్నుయామ. మా కదాచిన్మోక్షప్రాప్త్యనుష్ఠానాత్ పరలోకాత్పరజన్మనో వా విరక్తా భవేమ. నైవ నాస్తికత్వమాశ్రిత్య కదాచిదీశ్వరస్యానాదరం కుర్యామ. యథా వ్యావహారిక సుఖాయాన్నజలాదికమీప్సన్తి, తథైవేశ్వరే వేదేషు తదుక్త ధర్మే ముక్తౌ చ నిత్యం శ్రద్ధధీమహి.॥౬౦॥

పదార్థము :-మేము (సుగన్ధిమ్) సుగంధయుక్తుడును (పుష్టివర్ధనమ్)శరీరము, ఆత్మ మరియు సమాజముల బలములను పెంపొందజేయువాడును (త్ర్యమ్బకమ్) రుద్రరూపుడును నగు జగదీశ్వరుని (యజామహే) నిరంతరము స్తుతించుచుందుముగాక! అతని కృపచే (ఉర్వారుకమివ) పుచ్చ [ఖర్బూజా] పండు పక్వమై (బన్ధనాత్) తీగె సంబంధము [తొడిమ] నుండి వేరై అమృతతుల్యమగు నట్లు మేము (మృత్యోః) ప్రాణము లేక శరీర వియోగమునుండి (ముక్షీయ) విముక్తినొందుదుము గాక! (అమృతాత్) మోక్షరూప సుఖమునుండి (మా) శ్రద్ధారహితులము, విముఖుల మెన్నటికిని గాకుందుముగాక! మరియు మేము (సుగన్ధిమ్) చక్కని సుగంధయుక్తుడును (పతివేదనమ్) రక్షకుడగు స్వామిని గూర్చిన జ్ఞానము నొసగువాడును (త్ర్యమ్బకమ్) సర్వమున కధిపతియైన జగదీశ్వరుని (యజామహే) నిరంతరము సత్కారపూర్వకముగ ధ్యానింతుముగాక!

మరియు నాతని యనుగ్రహముచే (ఉర్వారుక మివ) పెద్దపుచ్చ [దోస - ఖర్బూజా] పండు పక్వమై (బంధనాత్) తీగె తొడిమసంబంధము నుండి వేరై అమృతమువలె అతి మిష్టమగునట్లు మేమును (ఇతః) ఈ శరీరమునుండి (ముక్షీయ) వేరగుదుముగాక! (అమృతః) మోక్షము నుండి ఇతర జన్మసుఖములనుండి సత్యధర్మముయొక్క ఫలితమునుండి (మా) వేరు గాకుందుముగాక. ౹౬౦॥

**భావార్థము** :-ఈ మంత్రమందు ఉపమాలంకారము గలదు. మానవులు ఈశ్వరుని వదలి ఇతరు లెవ్వరిని పూజించరాదు. వేదవిహితము గానందువలనను, దుఃఖరూప ఫలమొసగున దగుటవల్లను పరమేశ్వరునకు భిన్న [ప్రకృతి సంబంధ]మైన వేరొకదానిని దేనినైనను ఉపాసించ వలదు. పుచ్చ [పెద్ద దోస, లేక ఖర్బూజా] పండు తొడిమ తీగెకు అంటుకొనియుండి పండిన తరువాత తనకు తానే తొడిమనుండి వేరైపోవును. అప్పుడది నుంచి స్వాదిష్టము గలదగును. అట్లే మేమును పూర్ణ (దీర్ఘ) ఆయువు ననుభవించి క్లేశరహితముగ శరీరమును త్యజించి ముక్తిని పొందుదుము గాక! మరియు మోక్షప్రాప్తికనువగు అనుష్ఠానమునుండిగాని, పరలోకేచ్ఛనుండి గాని మే మెన్నడును విముఖులము గాకుందుము గాక! పరమేశ్వరు ననాదరపరచు నాస్తిక పక్షమవలంబించకుందుము గాక! లౌక్య వ్యావహారిక సుఖములకొరకు అన్న జలాదులను గోరుచుండునట్లు మేము ఈశ్వరునియందు, వేదమునందు, వేదోక్త ధర్మమునందు, ముక్తియందు నిరంతరము భక్తితో శ్రద్ధ వహించుచుందుము గాక. ౹౬౦॥

60. We worship the Omnipresent, Pure God, Who augments our physical, spiritual and social forces. Through His Crace may we be released from this mortal coil without the agony of death, as naturally as a ripe cucumher is from its stem. Let us not be bereft of immortality. We worship the Omnipresent, Pure God, Who grants us wisdom. Throught His Grace, may we be released easily from this world, as a ripe cucumber is from its stem, but not from immortality.

౧౨౬. ఏతత్త ఇత్యస్య వసిష్ఠ ఋషిః, రుద్రో దేవతా, భురిగాస్తారపంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

అథ రుద్రశబ్దేన శూరవీరకృత్యముపదిశ్యతే.

ఇపు డీ మంత్రమందు రుద్రశబ్దముచే శూరవీరుల కర్మ లుపదేశించబడుచున్నవి.

౧౨౬ ఏతత్తే రుద్రావసం తేన పరో మూజవతోఽతీహి।

అవతతధన్వా పినాకావసః కృత్తివాసా అహింసన్నః శివోఽతీహి ౹౬౧॥

ప.వి:- ఏతత్, తే, రుద్ర, అవసమ్, తేన, పరః, మూజవత ఇతి మూజ+వతః అతి, ఇహి, అవతత ధన్వేత్యవతత +ధన్వా, పినాకావస ఇతి పినాక+ అవసః, కృత్తి వాసా ఇతి కృత్తి+వాసాః, అహింసన్, నః, శివః, అతి, ఇహి. ౹౬౧॥

పదార్థః :-(ఏతత్) ఉక్తం వక్ష్యమాణం చ (తే) తవ (రుద్ర) యో రోదయతి శత్రూం స్తత్సంబుద్ధౌ శూరవీర! (అవసమ్) రక్షణం ప్రాప్త్యర్థం వా (తేన) రక్షణాదినా (పరః) ప్రకృష్టః సమర్థః (మూజవతః) బహవో మూజా ఘాసాదయో విద్యంతే యస్మిన్ తస్మాత్ పర్వతాత్ మూజవాన్ పర్వతః. నిరు. ౯. ౮. (అతి) అతిక్రమేణ (ఇహి) ఉల్లంఘయ. అత్రాంతర్గతో ణ్యర్థః (అవతతధన్వా) అవేతి నిగ్రహితం తతం విస్తృతం ధనుర్యేన సః (పినాకావసః) పినష్టి శత్రూన్ యేన తత్ పినాకం. తేనావసో వా పినాకస్యావసో రక్షణం యస్మాత్సః. పినాకం ప్రతి పినష్ట్యనేన నిరు 3. ౨౧ (కృత్తివాసాః) కృత్తిశ్చర్మ తద్వద్దృఢాని వాసాంసి ధృతాని యేన సః (అహింసన్) అనాశయన్ రక్షన్సన్ (నః) అస్మాన్ (శివః) సుఖప్రదః (అతి) అభి పూజితార్థే..నిరు ౧. 3. (ఇహి) ప్రాప్నుహి, అయం మంత్రః. శత. ౨. ౫. 3. ౧౬. ౧౭. వ్యాఖ్యాతః. ॥౬౧॥

అన్వయః :-హే రుద్ర శూరవీర విద్వన్! యుద్ధవిద్యావిచక్షణ సేనాధ్యక్ష! అవతతధన్వా పినాకావసః కృత్తివాసాః శివః పరః ప్రకృష్టసామర్థ్యః సంస్త్వం మూజవతః పర్వతాత్ పరం శత్రూనతీహ్యుల్లంఘయ తస్మాత్ పారం గమయ. యదేతత్తే తవావసం పాలనమస్తి తేనాస్మానహింసన్నతీహి.॥౬౧॥

భావార్థః:-హే మనుష్యా! అజాతశత్రుభి ర్యుష్మాభిర్భూత్వా నిశ్శత్రుకం రాజ్యం కృత్వా సర్వాణ్యస్త్రశస్త్రాణి సంపాద్య దుష్టానాం దండహింసాభ్యాం శ్రేష్ఠానాం పాలనేన భవితవ్యమ్. యతో న కదాచిద్దుష్టా సుఖినః శ్రేష్ఠా దుఃఖితాశ్చ భవేయురితి.॥౬౧॥

పదార్థము :- (రుద్ర) శత్రువులనేడ్పించువాడా! యుద్ధవిద్యలందు కుశలుడవును నగు ఓ విద్వాంసుడా! (అవతతధన్వా) యుద్ధముకొరకు విరివిగా ధనుర్ధారణమొనర్చువాడవును (పినాకావసః) పినాకము అనగా శత్రువు బలపరాక్రమములను మసి యొనర్చి స్వాత్మరక్షణమొనర్చగల శస్త్రము గలవాడవును (కృత్తివాసాః) చర్మము కవచమునకు సమానమైన దృఢవస్త్రములను ధరించువాడవును (శివః) సమస్త సుఖముల నొసగువాడువును (పరః) ఉత్తమ సామర్థ్యముగల శూరవీరుడవునై (మూజవతః) ముంజగడ్డి మున్నగు వానిచే ఆవరించబడియున్న పర్వతము లోపలి పరదేశములందలి శత్రువులను (అతీహి) అతిక్రమించుము (ఏతత్ తే) ఇట్లు నీ వొనర్చు (అవసమ్) ఏ రక్షణ గలదో (తేన) దాని ద్వారా (నః) మమ్ము (అహింసన్) హింసించకుండ రక్షణమొనర్చు నీవు (అతీహి) సర్వవిధముల మమ్ము సమ్మానించుము. ॥౬౧॥

భావార్థము :- ఓ మానవులారా! మీరు అజాతశత్రువు [శత్రురహితు]లై రాజ్యమును నిష్కంటక మొనర్చి, సకల శస్త్రాస్త్రములను సేకరించి దుష్టశిక్షణము శిష్టరక్షణము నొనర్చుడు. ఈ విధముగ సజ్జనులు దుఃఖితులుగ, దుర్జనులు నగు శత్రువులు సుఖవంతులుగ నెన్నడు నుండకుండున ట్లొనర్చుడు. ॥౬౧॥

61. O hero, the chastiser of enemies, and expert in the art of war, with bow extended, with self-protecting trident, with full armour, with grace and power, meet thy foes on the other side of the mountain. With thy this power of protection, come to us, without causing us any harm.

౧౨౭. త్ర్యాయుషమిత్యస్య నారాయణ ఋషిః, రుద్రో దేవతా, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

మనుష్యేణ కీదృశ మాయుర్ప్రోక్త మీశ్వరః ప్రార్థనీయ ఇత్యుపదిశ్యతే.

మానవు డెటువంటి ఆయువును అనుభవించుటకు ఈశ్వరుని ప్రార్థించవలయు నను విషయ మీ మంత్రమం దుపదేశించబడెను.

౧౨౭ త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్।

యద్దేవేషు త్ర్యాయుషం తన్నోఽఅస్తు త్ర్యాయుషమ్ ॥౬౨॥

ప. వి:- త్ర్యాయుషమితి త్రి+ ఆయుషమ్, జమదగ్నే రితి జమత్ + అగ్నేః, కశ్యపస్య, త్ర్యాయుషమితి త్రి+ఆయుషమ్, యత్, దేవేషు, త్ర్యాయుషమితి త్రి+ ఆయుషమ్, తత్, నః, అస్తు, త్ర్యాయుషమితి త్రి+ఆయుషమ్. ॥౬౨॥

పదార్థః :-(త్ర్యాయుషమ్) త్రీణి చ తాన్యాయూంషి చ త్ర్యాయుషమ్. బాల్యయౌవనవృద్ధావస్థా సుఖకరమ్. ఇదం పదం అచతుర విచతుర....అ. ౫. ४. ౭౭. ఇతి సూత్రే సమాసాన్తత్వేన నిపాతితమ్, (జమదగ్నేః)చక్షుషః, చక్షుర్వై జమదగ్ని ఋషిర్యదనేన జగత్పశ్యత్యథో మనుతే తస్మాచ్చక్షుర్జమదగ్నిర్ఋషిః. శత. ౮.౧.౨.౩. జమదగ్నయః ప్రజమితాగ్నయో వా ప్రజ్వలితాగ్నయో వా తైరభిహుతో భవతి. నిరు. ౭.౨४. అనేనాపి ప్రమాణేన రూపగుణగ్రాహకం చక్షుర్గృహ్యతే (కశ్యపస్య) ఆదిత్యస్యేశ్వరస్య. ప్రజాపతిః ప్రజా అసృజత యదసృజతాకరోత్తద్యదకరోత్తస్మాత్ కూర్మః. కశ్యపో వై కూర్మస్తస్మాదాహుః సర్వాః ప్రజాః కాశ్యప్య ఇతి. శత. ౭.४.౧.౫. అనేన ప్రమాణేనేశ్వరస్య కశ్యపసంజ్ఞా. ఏతన్నిర్మితం త్రిగుణమాయుర్లభే మహీత్యభిప్రాయః (త్ర్యాయుషమ్) బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థాశ్రమ సుఖసంపాదకం త్రిగుణమాయుః. (యత్) యాదృశం యావత్ (దేవేషు) విద్వత్సు. విద్వాంసో హి దేవాః. శత, ౩. ౫. ౬. ౧౦ (త్ర్యాయుషమ్) విద్యాశిక్షాపరోపకారసహితం త్రిగుణమాయుః (తత్) తాదృశం తావత్ (నః) అస్మాకమ్. అస్తు భవతు (త్ర్యాయుషమ్)

పూర్వోక్తం త్రిగుణమాయుః. అత్ర ఏతేర్ణిచ్చ. ఉ. ౨. ౧౧౮. అనేనేణ్ ధాతో రుషిః ప్రత్యయో ణిద్వత్వాద్వృద్ధిః. ఈయతే ప్రాప్యతే యత్తదాయుః. అయం మంత్రః. శత. ౨. ౫. ౪. ౧-౭ వ్యాఖ్యాతః.॥౬౨॥

అన్వయః :-హే రుద్ర జగదీశ్వర! తవ కృపయా యద్దేవేషు త్ర్యాయుషం యజ్జమదగ్నే స్త్ర్యాయుషం కశ్యపస్య తవ వ్యవస్థాసిద్ధం త్ర్యాయుషమస్తి తన్నోఽస్మాకమస్తు.॥౬౨॥

భావార్థః:-అత్ర చక్షురిన్ద్రియాణాం కశ్యప ఈశ్వరః సప్ప్రాణానాముత్తమోఽస్తీతి విజ్ఞేయమ్. త్ర్యాయుషమిత్యస్య చతురావృత్యా త్రిగుణాదధికం చతుర్గుణమప్యాయుః సంగృహ్యతే. తత్ప్రాప్త్యర్థం జగదీశ్వరం ప్రార్థ్య స్వేన పురుషార్థశ్చ కర్తవ్యః. తద్యథా-హే జగదీశ్వర! భవత్కృపయా యథా విద్వాంసో విద్యాపరోపకారధర్మానుష్ఠానేనానన్దతయా త్రీణి శతాని వర్షాణి యావత్తావదాయుర్భుంజతే, తథైవ యం త్రివిధతా [ప] వ్యతిరిక్తం శరీరేన్ద్రియాన్తఃకరణప్రాణసుఖాఢ్యం విద్యావిజ్ఞానసహితమాయురస్తి తద్వయం ప్రాప్య త్రిశతవర్షం చతుఃశతవర్షం వాఽఽయుః సుఖేన భుంజీమహీతి. ॥౬౨॥

పదార్థము :- ఓ పరమేశ్వరా! నీవు (యత్ దేవేషు) విద్వాంసులందుండు (త్ర్యాయుషమ్) బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములందలి పరోపకారయుక్తమగు ఏ యాయువు గలదో (జమదగ్నేః) నేత్రములు మున్నగు ఇంద్రియముల (త్ర్యాయుషమ్) శుద్ధి బలపరాక్రమయుక్తమగు ఏ మూడురెట్లు అయువు గలదో, మరియు (కశ్యపస్య) ఈశ్వరప్రేరితమగు (త్ర్యాయుషమ్) త్రిగుణము అనగా మూడువందల సంవత్సరముల కన్న నధికముగను ఏ యాయువున్నదో (తత్) దానిని ఈ శరీరము, ఆత్మ సమాజములకు ఆనందము నొసగు (త్ర్యాయుషమ్) మూడువందల సంవత్సరముల కన్నను అధికమగు ఆయువును (నః) మాకు లభింప జేయుము.॥౬౨॥

భావార్థము :-ఈ మంత్రమునందు సర్వేంద్రియములందు చక్షువులు, సమస్త నిర్మాణకర్తలలో పరమేశ్వరుడు సర్వోత్తముడని చెప్పబడినది. ఇట్లు మానవు లెరుగవలయును. మరియు (త్ర్యాయుషమ్) ఈ పదము నాలుగు పర్యాయములు ఆవృత్తమగుటచే మూడువందల సంవత్సరములకంటెను, నాలుగువందల సంవత్సరముల వరకు ఆయువు గ్రహించబడినది. దీనిని బడయుటకై పరమేశ్వరుని ప్రార్థించి మానవులు స్వయముగ పురుషార్థ మొనర్చుట యుచితమై యున్నది. ఇవ్విధముగ ప్రార్థించవలయును అనగా ఓ జగదీశ్వరా! నీ కృపచే విద్వాంసులు ఏ విధముగ విద్య, ధర్మ, పరోపకార అనుష్ఠానములచే ఆనందపూర్వకముగ మూడువందల సంవత్సరములవరకు ఆయువును భోగించుచున్నారో, అట్లే త్రివిధ తాపరహితమును, శరీరము, మనుస్సు, బుద్ధి, చిత్తము, అహంకారరూప అంతఃకరణము, ఇంద్రియములు, ప్రాణాదులకు సుఖములను గలుగజేయునదియు, విద్యా విజ్ఞానసహితమును నగు ఆయువును మేము పొంది మూడువందలు, లేక నాలుగు వందల వత్సరముల పర్యంతము సుఖపూర్వకముగ జీవించి యుందుము గాక!॥౬౨॥

62. May we be endowed with triple life, as a truth-seer sage, or the custodian of knowledge through the grace of God, is endowed with, or as the learned persons enjoy triple life.

౬౩. శివో నామాసీత్యస్య నారాయణ ఋషిః, రుద్రో దేవతా, భురిగ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ రుద్రశబ్దేనోపదేశక గుణా ఉపదిశ్యన్తే.

ఈ మంత్రమున రుద్రశబ్దముచే నుపదేశకునిగుణము లుపదేశించబడినవి.

౬౩ శివో నామాసి స్వధితిస్తే పితా నమస్తేఽ అస్తు మా మా హిఀసీః।

నివర్త్తయా మ్యాయుషేఽన్నాద్యాయ ప్రజననాయ రాయస్పోషాయ

సుప్రజా స్త్వాయ సువీర్యాయ ॥౬౩॥

ప.వి:-శివః, నామ, అసి, స్వధితిరితి స్వ + ధితిః, తే, పితా, నమః, తే, అస్తు, మా, మా, హిఀసీః, ని, వర్త్తయామి, ఆయుషే, అన్నాద్యాయేత్యన్న+అద్యాయ, ప్రజననాయేతి ప్ర+ జననాయ, రాయః, పోషాయ, సుప్రజాస్త్వాయేతి సుప్రజాః+త్వాయ, సువీర్యాయేతి సు+వీర్యాయ.॥౬౩॥

పదార్థః :-(శివః) మంగలస్వరూపో జ్ఞానమయో విజ్ఞానప్రదః (నామ) ఆఖ్యా (అసి) భవసి (స్వధితిః) అవినాశిత్వాద్వజ్రమయః. స్వధితి రితి వజ్ర నామసు పఠితమ్. నిఘం ౨. ౨౦. (తే) తవ (పితా) పాలకః (నమః) సత్కారార్థే (తే) తుభ్యమ్ (అస్తు) భవతు (మా) నిషేధార్థే (మా) మామ్ (హిఀసీః) హిన్ధి. అత్ర లోడర్థే లుఙ్ (ని) నిశ్చయార్థే నివారణార్థే వా (వర్త్తయామి) (ఆయుషే) ఆయుర్భోగాయ (అన్నాద్యాయ) అత్తుం యోగ్యమాద్యమన్నం చ తస్మై. యద్వాఽన్న మోదనాదికం భోజ్యం యస్మింస్తస్మై (ప్రజననాయ) సన్తానోత్పాదనాయ (రాయస్పోషాయ) రాయో విద్యాసువర్ణాది ధనస్య పోషాయ. పుష్యన్తి యస్మిన్ స్తస్మై (సుప్రజాస్త్వాయ) శోభనాః, సన్తానాదయ శ్చక్రవర్తిరాజ్యం చ ప్రజా యస్మాత్తస్య భావస్తస్మై (సువీర్యాయ) శోభనం వీర్యం శరీరాత్మనో బలం పరాక్రమో యస్మాత్తస్మై. అయం మంత్రః. శత. ౨.౫.౪. ౮-౧౧ వ్యాఖ్యాతః.॥౬౩॥

అన్వయః:-హే రుద్ర! యస్త్వం స్వధితి రసి యస్య తే తవ శివో నామాస్తి.స త్వం మమ పితాఽసి తే తుభ్యం నమోఽస్తు.త్వం మాం మా మా హింసీర్మాహిన్త్వహం త్వా మాయుషేఽ న్నాద్యాయ [ప్రజననాయ] సుప్రజాస్త్వాయ సువీర్యాయ రాయస్పోషాయ వర్తయామి త్వదాశ్రయేణ సర్వాణి దుఃఖాని నివర్తయామి.।౬౩॥

భావార్థః :-నహి కశ్చిన్మనుష్యో మంగలమయస్య సర్వపితుః పరమేశ్వరస్యాజ్ఞాపాలనేనోపదేశకసంగేన వినైహిక పారమార్థికసుఖే ప్రాప్తుం శక్నోతి. నైవ కేనాపి నాస్తికత్వేన ఖల్వీశ్వరస్య విదుషాం చానాదరః కర్తవ్యః. యో నాస్తికో భూత్వైతస్యైతేషాం చానాదరం కరోతి తస్య సర్వత్రానాదరో జాయతే. తస్మాన్మనుష్యైరాస్తికైః సదా భవితవ్యమితి. ।౬౩॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! ఉపదేశికుడవగు నో విద్వాంసా! నీవు (స్వధితః అసి) అవినాశివి యగుటచే వజ్రమయుడవు (తే) నీకు (శివః) సుఖస్వరూపుడు, మంగళమయుడు, విజ్ఞానప్రదుడు అని (నామ అసి) నామము లున్నవి. అట్టి నీవు నన్ను (పితా) పాలించువాడవు (తే) నీకు నా (నమః) సత్కారపూర్వకము (అస్తు) విదితమగుగాక! మరియు నీవు (మా) నన్ను (మా హిగ్ంసీః) అల్పాయుష్కునిగ నొనర్చకుము! మరియు నేను (ఆయుషే) ఆయువును భోగించుటకై (అన్నాద్యాయ) అన్నాదుల ననుభవించుటకై (సుప్రజాస్త్వాయ) ఉత్తమ సంతానము, చక్రవర్తి రాజ్యాదులను బడయుటకై (సువీర్యాయ) శరీరాత్మలకు శ్రేష్ఠబలపరాక్రమములు లభించుటకై (రాయస్పోషాయ) విద్య సువర్ణము మున్నగు ధనముల వృద్ధికై (నివర్తయామి) నిన్ననుసరించి నిశ్చయముగ ప్రవర్తింతును. నీ యాశ్రయమునుపొంది దుఃఖములను (నివర్తయామి) తొలగింతును. ।౬౩॥

భావార్థము :- మంగళమయుడు, సర్వపాలకుడునైన పరమేశ్వరాజ్ఞను పాలించకుండ ఏ మనుష్యుడును ఇహ పరలోకములను బడయుటకు సమర్థుడు గాజాలడు. ఎవ్వడును నాస్తిక పక్షముగ ఈశ్వరుని అనాదరణ మొనర్పవలదు. నాస్తికుడై ఈశ్వరుని అనాదరణ మొనర్చువాడు సర్వత్ర అనాదరము పొలగుచుండును. కావున మానవు లెల్లరును ఆస్తికబుద్ధిచే ఈశ్వరు నుపాసించుటయే యోగ్యము. ।౬౩॥

63. O God, Thou art certainly the Embodiment of grace, self-Existent, our Father, obeisance be to Thee. Harm me not. I approach Thee for long life. For nice food, for progeny, for riches in abundance, for noble children, and thr heroie vigour.

అత్ర తృతీయాధ్యాయేఽగ్ని హోత్రాది యజ్ఞ వర్ణన మగ్నిస్వభావార్థప్రతిపాదనం పృథివీ భ్రమణలక్షణ మగ్ని శబ్దేనేశ్వర భౌతికార్థప్రతిపాదన మగ్నిహోత్రమంత్రప్రకాశన మీశ్వరోపస్థాన మగ్నిస్వరూప మీశ్వరప్రార్థనం తదుపాసనం తత్ఫలవర్ణన మీశ్వర స్వభావప్రతిపాదనం సూర్యకిరణ కృత్యవర్ణనం విత్యోపాసనం పావిత్రీమంత్ర ప్రతిపాదన మీశ్వరోపాసనం యజ్ఞఫలప్రకాశనం భౌతిక గార్హస్థ్య వర్ణనం గృహాశ్రమకరణావశ్యకానుష్ఠానలక్షణే ఇద్రమరుత్కృత్యం పురుషార్థకరణావశ్యకం పాపాన్ని వర్తనం యజ్ఞపూర్త్యావశ్యకం సత్యత్వేన గ్రహణదానవ్యవహారకరణం విద్వత్పురుషర్తు స్వభావ వర్ణనం చతుష్టయముక్తః కరణస్య లక్షణం రుద్రశబ్దార్థప్రతిపాదనం త్రిగుణాయుష్కరణావశ్యకం ధర్మేణాయురాది పదార్థ సంగ్రహణం చ వర్ణితమేతేనాస్య తృతీయాధ్యాయార్థస్య ద్వితీయాధ్యాయార్థేన సహ సంగతిరస్తీతి బోద్ధవ్యమ్.

ఇతి శ్రీ మద్విద్వద్వర్య పరివ్రాజకాచార్యేణ దయానందసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే తృతీయోఽధ్యాయః పూర్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి మూడవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత చీచిపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన పం. లోకమలహరి సిద్ధాంతాచార్యులచే నొనర్పబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
వంశీ కృష్ణారెడ్డి సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**మూడవ అధ్యాయము సమాప్తము.**

ఓం శాంతిః శాంతిః శాంతిః

- ౦-

# యజుర్వేదభాష్యము

## చతుర్థాధ్యాయము - విషయసూచిక

**ఇందులో 37 మంత్రములు, 48 ఛందస్సులు, 1840 అక్షరములు**

# అథ చతుర్థోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే సప్తత్రింశన్మంత్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౧౭౯. తత్రైదమగన్మేత్యస్య ప్రజాపతిర్ ఋషిః, అబోషధ్యౌ దేవతే. విరాడ్ బ్రాహ్మీజగతీ ఛన్దః. నిషాదః స్వరః.

అథ జలగుణస్వభావకృత్యముపదిశ్యతే.

ప్రథమ మంత్రమున జలముయొక్క గుణస్వభావకర్తవ్యము ఉపదేశించబడుచున్నవి.

౧౭౯ ఏదమగన్మ దేవయజనం పృథివ్యా యత్ర దేవాసోఽఅజుషన్త విశ్వే। ఋక్సా

మాభ్యాఀ సన్తరన్తో యజుర్భీ రాయస్పోషేణ సమిషా మదేమ। ఇమాఽ

ఆపః శము మే సన్తు దేవీః। ఓషధే త్రాయస్వ స్వధితే మైనఀహిఀ సీః ॥౧॥

ప.వి:- ఆ, ఇదమ్, అగన్మ, దేవయజనమితి దేవ+యజనమ్, పృథివ్యాః, యత్ర, దేవాసః, అజుషన్త, విశ్వే, ఋక్సామాభ్యామిత్యృక్+సామాభ్యామ్, సన్తరన్త ఇతి సమ్+ తరన్తః, యజుర్భిరితి యజుః+ భిః, రాయః, పోషేణ, సమ్, ఇషా, మదేమ, ఇమాః ఆపః, శమ్, ఉఀఇత్యూ, మే, సన్తు, దేవీః, ఓషధే, త్రాయస్వ, స్వధిత ఇతి స్వ+ ధితే, మా, ఏనమ్, హిఀసీః.॥౧॥

పదార్థః:- (ఆ) సమన్తాత్ (ఇదమ్) వక్ష్యమాణమ్ (అగన్మ) ప్రాప్నుయామ. అత్ర లిఙర్థే లుఙ్ (దేవయజనమ్) దేవానాం విదుషాం యజనం పూజనం తేభ్యో దానం చ (పృథివ్యాః) భూమేర్మధ్యే (యత్ర) దేశే (దేవాసః) విద్వాంసః (అజుషన్త) ప్రీతవన్తః సేవితవంతః (విశ్వే) సర్వే (ఋక్సామాభ్యామ్) ఋచన్తి స్తువన్తి పదార్థాన్యేన స ఋగ్వేదః. సామయన్తి సాన్త్వయన్తి కర్మాన్తం ఫలం ప్రాప్నువన్తి యేన స సామవేదః. ఋక్ చ సామ చ తాభ్యామ్. అత్ర అచతుర విచతుర సుచతుర స్త్రీపుంసధేన్వనడుహర్క్సామ. అ.౫.౪.౭౭॥ ఇతి సూత్రేణాయం

సమాసాన్తోఽచ్ ప్రత్యయేన నిపాతితః. (సన్తరన్తః) దుఃఖస్యాన్తం ప్రాప్నువన్తః (యజుర్భిః) యజుర్వేదస్థ మంత్రోక్తైః కర్మభిః (రాయః) ధనస్య (పోషేణ) పుష్ట్యా (సమ్) సమ్యగర్థే (ఇషా) ఇష్టవిద్యయాఽన్నాదినా వా (మదేమ) సుఖయేమ. అత్ర వికరణవ్యత్యయః (ఇమాః) ప్రత్యక్షాః (ఆపః) జలాని (శమ్) సుఖకారికాః (ఉ) వితర్కే (మే) మమ (సన్తు) భవన్తు (దేవీః) శుద్ధా రోగనాశికాః. అత్ర వా ఛన్దసీతి జసః పూర్వసవర్ణత్వమ్ (ఓషధే) సోమాద్యోషధిగణః (త్రాయస్వ) త్రాయంతామ్ (స్వధితే) రోగనాశనే స్వధితిర్వజ్రవత్ర్వ వర్తమానః. స్వధితిరితి వజ్రనామసు పఠితమ్. నిఘం. ౨.౨౦॥ (మా) నిషేధార్థే (ఏనమ్) యజమానం ప్రాణిసమూహం వా (హింసీః) హింస్యాత్. అత్ర లిఙర్థే లుఙ్. అయం మన్త్రః శత ౩.౧.౧.౧౧-౧౨; ౩.౧.౨. ౧-౧౦- వ్యాఖ్యాతః. ॥౧॥

అన్వయః:-హే విద్వన్! యథా పృథివ్యా మధ్యే మనుష్యజన్మదేవయజనం ప్రాప్య యత్ర ఋక్సామాభ్యాం యజుర్భిః రాయస్పోషేణ దుఃఖాని సన్తరన్తో విశ్వేదేవాసో వయం సుఖాన్యగన్మాజుషన్త మదేమ సుఖయేమ. ఉ ఇతి వితర్కే మే మమ విద్యా సుశిక్షాభ్యాం సేవితా ఇమా దేవ్య ఆపః సుఖకారికాః సన్తి. తథైవ తత్ర త్వం తాని జుషస్వ మదేమ స్తవైతాః శంసన్తు సుఖకారికా భవన్తు. యథౌషధే సోమలతాద్యోషధిగణో రోగేభ్యస్త్రాయంతే తథా త్వం నస్త్రాయస్వ స్వధితిర్వజ్రస్త్వమేనం జీవం మా హింసీర్హననం మా కుర్యాః.॥౧॥

భావార్థః:-అత్ర లుప్తోపమాలంకారః. యథా మనుష్యాః సాఙ్గోపాఙ్గసరహస్యాంశ్చతురో వేదానధీత్యాన్యానధ్యాప్య విద్యాం ప్రదీప్య విద్వాంసో భూత్వా సుకర్మానుష్ఠానేన సర్వాన్ ప్రాణినః సుఖయేయుస్తథైవైతాన్ సత్కృత్యైతేభ్యో వైదికవిద్యాం ప్రాప్య శ్రేష్ఠాచారౌషధి సేవనాభ్యాం దుఃఖాన్తం గత్వా శరీరాత్మపుష్ట్యా ధనం సముపచిత్య సర్వైర్మనుష్యై రానన్దితవ్యమ్ ॥౧॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! (పృథివ్యాః) పృథివిపై మానవుడుగ జన్మించి (ఇదమ్) ఇట్టి (దేవయజనమ్) విద్వాంసుల పూజనము వారికి దానసత్కారముల నొనర్చు అవకాశమును పొంది (యత్ర) ఎచ్చట [ఏ దేశమున] (ఋక్సామాభ్యామ్) ఋగ్వేద, సామవేద (యజుర్భిః) యజుర్వేదముల మంత్రములందు దెలుపబడిన కర్మలతోను (రాయస్పోషేణ) ధనపుష్టి తోను (సమిషా) ఉత్తమోత్తమ విద్యాదుల కోరికతోను, అన్నాదులతోను దుఃఖములను (సన్తరన్తః) తరించుచు (విశ్వే) సమస్త (దేవాసః) విద్వాంసులును మేమును సుఖములను (అగన్మ)పొందెదమో అచ్చట [ఆదేశమును] (అజుషన్త) సర్వవిధముల సేవింతుముగాక! (మదేమ) సుఖులమై యుందుముగాక! (ఉ) మరియును (మే) చక్కని నియమములుగల ఉత్తమ విద్యాశిక్షణలతో మాద్వారా సేవించబడిన (ఇమాః దేవీః) ఈ శుద్ధమగు (ఆపః) జలములు [సుఖము నొసగెడి వగుచున్నవి] అట్లే అచ్చట నీవును వానిని పొందుము (జుషస్వ) సేవించుము. ఆనందించుము. అట్టి జలము మున్నగు పదార్థములును

నీకు (శమ్) సౌఖ్యముల నిచ్చునవి (సన్తు) అగుగాక! (ఓషధే) సోమలతాది ఓషధీగణము సర్వరోగములనుండి కాపాడుచున్నటులే నీవును మమ్ము (త్రాయస్వ) రక్షించుము. (స్వధితే) వ్యాధులను తొలగించుటయందు వజ్రముతో సమానమై (ఏనమ్) ఈ యజమానుని, లేక ప్రాణిమాత్రమును (మా హింసీః) ఎప్పుడును చంపవలదు.।౧॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు లుప్తోపమాలంకారము గలదు. మానవు లెట్లు బ్రహ్మచర్య పూర్వకముగ, శిక్షావ్యాకరణాది అంగములతో గూడ, ఉపనిషత్తుల సహితముగ నాలుగు వేదములను చదివియు, చదివించియు విద్యను ప్రకాశమొనర్చుచు విద్వాంసులై ఉత్తమకర్మల ననుష్ఠించి సకలప్రాణులకు సుఖములను చేకూర్చుచున్నారో, అట్లే ఈ విద్వాంసులను సత్కరించి వీరినుండి వైదికవిద్యను పొంది శారీరిక, ఆత్మిక బలములచే ధనమును చక్కగా సంపాదించి సకలజనులను ఆనందపరచవలయును. ।౧॥

1. May we, on this earth, where reside happily all the learned persons, be able to revere the sages.

May we acting on the teachings of the Rig, Sam and Yajur Vedas, end all our miseries. May we rejoice in food and growth of riches. These pure, disease-killing waters be gracious to me. May the herbs protect me. Thou armed king, harm not the worshipper.

౧౩౦. ఆపో అస్మానిత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ఆపో దేవతా, స్వరాడ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తాభిరద్భిః కిం కర్తవ్యమిత్యుపదిశ్యతే.

మరల నా జలములచే ఏ మేమి చేయవలయు నను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడెను.

౧౩౦ ఆపోఽ అస్మాన్మాతరః శున్ధయన్తు ఘృతేన నో ఘృతప్వః పునన్తు। విశ్వꣳ హి రిప్రం ప్రవహన్తి దేవీ రుదిదాభ్యః శుచిరా పూతఽ ఏమి। దీక్షాతపసో స్తనూరసి తాన్త్వా శివాꣳ శగ్మాం పరిదధే భద్రం వర్ణం పుష్యన్ ।౨॥

ప. వి:-ఆపః, అస్మాన్, మాతరః, శున్ధయన్తు, ఘృతేన, నః, ఘృతప్వ ఇతి ఘృత+ప్వః, పునన్తు విశ్వమ్, హి, రిప్రమ్, ప్ర వహన్తీతి ప్ర+వహన్తి, దేవీః, ఉత్, ఇత్, ఆభ్యః, శుచిః ఆ, పూతః, ఏమి, దీక్షాతపసోః, తనూః, అసి, తామ్, త్వా, శివామ్, శగ్మామ్, పరి, దధే, భద్రమ్, వర్ణమ్, పుష్యన్. ।౨॥

పదార్థః :-(ఆపః) జలాని (అస్మాన్) మనుష్యాదీన్ప్రాణినః (మాతరః) మాతృవత్పాలికాః (శున్ధయన్తు) బాహ్యదేశం పవిత్రం కుర్వన్తు (ఘృతేన) ఆజ్యేన (నః) అస్మాన్ (ఘృతప్వః) ఘృతం పువన్తి యాస్తాః (పునన్తు) పవిత్రయన్తు (విశ్వమ్) సర్వం జగత్ (హి) ఖలు (రిప్రమ్) వ్యక్తవాణీప్రాప్తవ్యం వేదితవ్యమ్. అత్ర లీరీజో హ్రస్వః ఉ. ౫. ౫౫. అనేనాయం సిద్ధః (ప్రవహన్తి) ప్రకర్షేణ ప్రాప్నువన్తి (దేవీః) దేవ్యః (ఉత్) ఉత్కృష్టే (ఇత్) అపి (ఆభ్యః) అద్భ్యః (శుచిః) పవిత్రః (ఆ) సమన్తాత్. (పూతః) శుద్ధః (ఏమి) ప్రాప్నోమి (దీక్షాతపసోః) దీక్షాబ్రహ్మచర్యాది నియమసేవనం చ తపోధర్మానుష్ఠానం చ తయోః (తనూః) సుఖవిస్తార నిమిత్తం శరీరమ్ (అసి) అస్తి అత్ర వ్యత్యయః (తామ్) (త్వా) ఏతామ్ (శివామ్) కల్యాణకారికామ్ (శగ్మామ్) సుఖస్వరూపామ్. (పరి) సర్వతః (దధే) ధరామి (భద్రమ్) భజనీయమ్ (వర్ణమ్) స్వీకర్తుమర్హమతిసున్దరమ్ (పుష్యన్) పుష్టం కుర్వన్. అయం మన్త్రః. శ. ౩. ౧. ౨.౧-౧౧. వ్యాఖ్యాతః ॥౨॥

అన్వయః :-హే మనుష్యా! యథా భద్రం వర్ణం పుష్యన్నహం యా ఘృతప్వోదేవ్య ఆపో విశ్వం రిప్రం ప్రవహన్తి విద్వాంసో యా మాతరో యా ఘృతప్వో ఘృతేన సన్తి యాభిర్నోఽస్మాన్ సుఖయన్తి తాభిర్నోఽస్మాన్ భవన్తః శున్ధయన్తు పునన్తు చ యథాఽహముదిదాభ్యః శుచిః పవిత్రో భూత్వా యా దీక్షాతపసో స్తనూరస్యస్తి తాం త్వా మేతాం శివాం శగ్మాం పరిదధే సర్వతో ధరామి తథా తస్తాం చ యూయమపి ధరత ॥౨॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యాః సర్వసుఖప్రాపికాః ప్రాణధారికా మాతృవత్పాలనహేతవ ఆపః సన్తి తాభ్యః సర్వతః పవిత్రతాం సంపాద్యైతాః శోధిత్వా మనుష్యైర్నిత్యం సంసేవ్యా యతః సున్దరం వర్ణం రోగరహితం శరీరం చ సంపాద్య నిత్యం ప్రయత్నేన ధర్మమనుష్ఠాయ పురుషార్థేనానన్దః కర్తవ్య ఇతి.॥౨॥

పదార్థము :-ఓ మానవులారా! (భద్రమ్) అతిసుందరమైనదియును (వర్ణమ్)పొందదగినదియు నగు రూపమును (పుష్యన్) బలపరచుచు నే నుండునట్లు (ఘృతప్వః) నేతిని పవిత్రపరచునవియు (దేవీః) దివ్యగుణ యుక్తములును (మాతరః) తల్లివలె పాలించునవియు నగు (ఆపః) ఏ జలములు (రిప్రమ్) వక్త, వాణిచే తెలిసికొనదగిన, లేక పొందదగిన (విశ్వమ్)సమస్తమును (ప్రవహన్తి) పొందుచున్నవో, వేనిచే విద్వాంసులు (అస్మాన్) మనుష్యులమగు మమ్ము (శున్ధయన్తు) బయటిప్రదేశమును పవిత్రపరచుచున్నారో, ఆ (ఘృతేన) నేతితో పుష్టిపరచదగిన జలములు (నః) మమ్ము (పునన్తు) పవిత్రపరచుగాక! నేను (ఉత్ ఇత్) చక్కగా (ఆభ్యః) ఈ జలములతో (శుచిః) పవిత్రుడను (అపూతః) శుద్ధుడనునై (దీక్షా తపసోః) బ్రహ్మచర్యము మున్నగు ఉత్తమోత్తమ యమనియమముల సేవనచే ధర్మానుష్ఠానముకొరకు (తనూః) ఏ శరీరము (అసి) కలదో అట్టి యా శరీరము (శివామ్) శుభప్రదమైనదానివలె (శగ్మామ్) సుఖవంతమగు శరీరముగాను (ఏమి) పొందుచున్నట్లు

(పరిదధే) సకలవిధముల ధరించుచున్నట్లు మీరును అట్టి జలములను మరియు (తామ్ త్వామ్) అట్టి అత్యుత్తమ శరీరమును ధరించుడు.॥2॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకారము గలదు. మనుష్యులు సమస్త సుఖములను లభింపజేయునవియు, ప్రాణములను ధరింపజేయునవియు, తల్లివలె పోషించుటకు హేతువులును నగు జలములతో పవిత్రులై వానిని శోధించి సర్వదా సేవించవలెను. దానివల్ల సుందర వ్యాధిరహిత శరీరములను బడసి నిరంతరము ప్రయత్నపూర్వకముగా ధర్మానుష్ఠాన మొనర్చి పురుషార్థముతో ఆనందము ననుభవించవలెను.॥2॥

2. May waters, like mother, purify our bodies. May the waters purified by clarified butter, purify us through rain. Pute waters remove all our physical imperfections.

May I advance in life, being bight and pure through waters. Through celibacy and abstemiousness may I possess a body, healthy, comfortable, excellent, beautiful and strong.

౧౩౧. మహీనామిత్యస్య ప్రజాపతిర్ ఋషిః, మేఘో దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునరస్య జలసమూహజన్యస్య మేఘస్య కిం నిమిత్తమస్తీత్యుపదిశ్యతే.

మరల నీ జల సమూహముచే నుత్పన్నమైన మేఘములకు ఏది నిమిత్తమో యీ మంత్రమునం దుపదేశించబడినది.

౧౩౧ మహీనాం పయోఽసి వర్చోదాఽ అసి వర్చో మే దేహి।
వృత్రస్యాసి కనీనక శ్చక్షుర్దాఽఅసి చక్షుర్మే దేహి ॥3॥

ప.వి:- మహీనామ్, పయః, అసి, వర్చోదా ఇతి వర్చః+దాః, అసి, వర్చః, మే, దేహి, వృత్రస్య, అసి, కనీనకః, చక్షుర్దా ఇతి చక్షుః+దాః, అసి, చక్షుః, మే, దేహి.॥3॥

పదార్థః:-(మహీనామ్) పృథివీనామ్. మహీతి పృథివీనామసు పఠితమ్ నిఘం ౧. ౧. (పయః) రసనిమిత్తమ్ (అసి)అస్తి. అత్ర సర్వత్ర వ్యత్యయః (వర్చోదాః) దీప్తిం దదాతీతి (అసి) అస్తి (వర్చః) ప్రకాశమ్ (మే) మహ్యమ్ (దేహి) దదాతి (వృత్రస్య) మేఘస్య (అసి) అస్తి (కనీనకః) యః కనతి దీపయతీతి స ఏవ కనీనకః. అత్ర కనీ ధాతో ర్బాహులకాదౌణాదిక ఈన ప్రత్యయస్తతః స్వార్థే కన్ (చక్షుర్దాః) చష్టేఽనేన తద్దదాతీతి (అసి) అస్తి (చక్షుః) నేత్రవ్యవహారమ్ (మే) మహ్యమ్ (దేహి) దదాతి. అయం మన్త్రః. శ. 3-౧-3,౯-౧౫ వ్యాఖ్యాతః.॥3॥

అన్వయః :- యో మహీనాం పయోఽస్యస్తి వర్చోదా అస్యస్తి యో మే మహ్యమ్ వర్చోదా దదాతి వృత్రస్య కనీనకోఽస్తి చక్షుర్దా అస్తి స సూర్యో మే మహ్యం చక్షుర్దదాతి.॥3॥

భావార్థః :- మనుష్యైర్నహి సూర్యస్య ప్రకాశేన వినా వృష్ట్యుత్పత్తి శ్చక్షుర్వ్యవహారశ్చ సిధ్యతి. యేనాయం సూర్యో నిర్మితస్తస్మై ఈశ్వరాయ కోటి శో ధన్యవాదా దేయా ఇతి వేద్యమ్.॥3॥

పదార్థము :- (మహీనామ్) పృథివి మున్నగువాని (పయః) జలములకు రసములకు ఏది నిమిత్తమై (అసి) ఉన్నదో (వర్చోదాః అసి) ఏది దీప్తినొసగునదై యున్నదో (మే) నాకు (వర్చః) ప్రకాశమును(దేహి) ఏది ఇచ్చు చున్నదో (వృత్రస్య) మేఘమును (కనీనకః అసి) ఏది ప్రకాశపరచునదై యున్నదో లేక (చక్షుర్దాః,అసి) నేత్రవ్యవహారమును ఏది సిద్ధపరచునదిగా నున్నదో, ఆ సూర్యలోకమే (మే)నాకు (చక్షుః) నేత్రవ్యవహారమును (దేహి) ఇచ్చుచున్నది. ॥3॥

భావార్థము :- సూర్యప్రకాశము లేకున్న వర్షోత్పత్తిగాని, నేత్రముల వ్యవహారము గాని యెన్నటికిని జరుగదు. కావున నట్టి సూర్యలోకమును నిర్మించిన యా పరమేశ్వరునకు అసంఖ్యాక ధన్యవాదము లర్పించుట ఉచితమని మానవులు గ్రహించవలయును.॥3॥

3. O sun, thou bringest rain on different parts of the earth. Giver of splendour art thou; bestow on me the gift of splendour. The disperser of cloud art thou with thy brilliance. The giver of eye art thou. Give me the gift of vision!.

౧౩౨. చిత్పతిర్మేత్యస్య ప్రజాపతిర్ఋషిః పరమాత్మా దేవతా. నిచృద్ బ్రాహ్మీ పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

యేన సూర్యాదికం జగద్రచితం సోఽస్మదర్థం కిం కిం కుర్యాదిత్యుపదిశ్యతే.

సూర్యుడు మున్నగు సర్వప్రపంచమును నిర్మించిన యా పరమాత్మ మన కేమేమి చేయుచున్నది

ఈ మంత్రమునం దుపదేశింపబడుచున్నది.

౧౩౨ చిత్పతిర్మా పునాతు వాక్పతిర్మా పునాతు దేవో మా సవితా పునాత్వచ్ఛి
ద్రేణ పవిత్రేణ సూర్యస్య రశ్మిభిః। తస్య తే పవిత్రపతే పవిత్ర పూతస్య
యత్కామః పునే తచ్ఛకేయమ్ ॥ ४॥

ప.విః- చిత్పతిరితి చిత్+పతిః, మా, పునాతు, వాక్పతిరితి వాక్+పతిః, మా, పునాతు, దేవః, మా, సవితా, పునాతు అచ్ఛిద్రేణ, పవిత్రేణ, సూర్యస్య, రశ్మిభిరితి రశ్మి+భిః, తస్య, తే, పవిత్ర

పతె ఇతి పవిత్ర+పతే, పవిత్రపూతస్యేతి పవిత్ర+పూతస్య యత్కామ ఇతి యత్+కామః,పునే,

తత్, శకేయమ్.॥౪॥

పదార్థః :- (చిత్పతిః) చేతయతి యేన విజ్ఞానేన తస్య పతిః పాలయితాఽధిష్ఠాతేశ్వరో భవాన్ (మా) మామ్ (పునాతు) పవిత్రం కరోతు (వాక్పతిః) యో వాచో వేదవిద్యాయాః పతిః స్వామీ పాలయితా (మా) మామ్ (పునాతు) విద్వాంసః కృత్వా పవిత్రయతు (దేవః)యః స్వప్రకాశేన సర్వస్య ప్రకాశకః(మా)మామ్ (సవితా) సర్వస్య జగతో దివ్యస్య ప్రసవితోత్పాదకః (పునాతు) శోధయతు శుద్ధం కరోతు. (అచ్ఛిద్రేణ) అవినాశినా విజ్ఞానేన (పవిత్రేణ) శద్ధికారకేణ (సూర్యస్య) సవితృమండలస్య ప్రాణస్య వా (రశ్మిభిః) ప్రకాశైర్గమనాగమనైః (తస్య) జగదీశ్వరస్య (తే) తవ (పవిత్రపతే) పవిత్రస్య పాలయితః పవిత్రపూతస్య యః పవిత్రైః శుద్ధైః స్వాభావికైర్విజ్ఞానాదిభిర్గుణైః పూతః పవిత్రస్తస్య (యత్కామః) యః కామో యస్య సః (పునే) పవిత్రో భవామి. (తత్) పవిత్రం కర్మ (శకేయమ్) శక్నుయామ్. అయం మంత్రః. శత. ౩. ౧. ౩. ౨౨-౨౩.వ్యాఖ్యాతః.॥౪॥

అన్వయః :-హే పవిత్రపతే! పరమాత్మన్ చిత్పతిర్వాక్పతిః సవితా దేవో భవాన్ పవిత్రేణాచ్ఛిద్రేణ విజ్ఞానేన సూర్యస్య రశ్మిభిశ్చ మా మాం మమ చిత్తం చ పునాతు. మా మాం మమ వాచం చ పునాతు. మా మాం మమ చక్షుశ్చ పునాతు. యస్య పవిత్రపూతస్య కృపయా యత్కామోఽహం పునే పవిత్రో భవామి. యస్య తే తవోపాసనయా పవిత్రం కర్మ కర్తుం శక్నుయాం తస్య సేవా కర్తుం యోగ్యా మే కథం న భవేత్. ॥౪॥

భావార్థః :-మనుష్యై ర్యేన వేదవిజ్ఞాత్రా పత్యా పరమేశ్వరేణ విద్యా భూజలవాయు సూర్యాదయః శుద్ధికారకాః పదార్థాః ప్రకాశితాస్తస్యోపాసనా పవిత్రకర్మానుష్ఠానాభ్యాంమనుష్యైః పూర్ణకామః పవిత్రతా చ కార్యా. ॥౪॥

పదార్థము :-(పవిత్ర పతే) పవిత్రతను పాలించెడు పరమేశ్వరా! నీవు (చిత్పతిః) విజ్ఞానమునకు స్వామివి (వాక్పతిః) వేదవాణికి పతివి, పాలకుడవు (సవితా) సమస్త జగత్తు నుత్పన్నపరచువాడవు (దేవః) దివ్యస్వరూపుడవు (పవిత్రేణ) పవిత్రపరచు (అచ్ఛిద్రేణ) నాశరహితమగు విజ్ఞానముచేతను (సూర్యస్య) సూర్యుని మరియు ప్రాణము యొక్కయు (రశ్మిభిః) ప్రకాశముచేతను, గమనాగమనముల [రాకపోకల] చేతను (మా) నన్ను నా చిత్తమును (పునాతు) పవిత్రమొనర్పుము. (మా) నన్ను నా వాక్కును (పునాతు) పవిత్రపరచుము. (మా) నన్ను నా ప్రజలను [చక్షువులను] (పునాతు) పరిశుద్ధపరచుము. (పవిత్ర పూతస్య) శుద్ధ స్వాభావిక విజ్ఞానము మున్నగు గుణములచే పవిత్రుడవైన (తే) నీయొక్క ఏ కృపచే (యత్కామః) ఆ

యా శ్రేష్ఠ కామనలతోగూడ (పునే) నేను పవిత్రుడ నగుచున్నానో (తే) ఏ నీ యుపాసనచే (తత్) ఆ యా ఉత్తమ కర్మలనొనర్చుటకు (శకేయమ్) సమర్థుడ నగుచున్నానో, అట్టి నీ సేవను నే నేల చేయకూడదు? [అనగా సదా చేయుచుందును గాక యని భావము].।౪॥

భావార్థము :-వేదజ్ఞుడును, వేదపతియు నగు పరమేశ్వరుడు వేదవిద్య, భూ, జల, వాయువు, సూర్యుడు మున్నగు శుద్ధికారక పదార్థములను ప్రకాశపరచినాడు. అట్టి పరమాత్మయొక్క ఉపాసన పవిత్రకర్మానుష్ఠానముల ద్వార పూర్ణకామితములను, పవిత్రతను సంపాదించుటయే మానవుల కుచితము.।౪॥

4. Purify me, the Lord of purity me, the Lord of knowledge. Purify me, the Lord of the Vedas.

O Lord, Creator of the universe, purify me, through sun - beams and thy immortal purifying knowledge.

O master of the purified souls, may I full of lofty sentiments accomplish the desire actuated by which, through your grace, I purify myself!.

౧౩౩. ఆ వో దేవాస ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః యజ్ఞోదేవతా నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః. గాన్ధారః స్వరః.

మనుష్యైః కథం పురుషార్థః కర్తవ్య ఇత్యుపదిశ్యతే.

మానవులు పురుషార్థ మెట్లొనర్పవలె నను విషయ మీ మంత్రమున గలదు.

౧౩౩ ఆ వో దేవాసఽ ఈ మహే వామం ప్రయత్యధ్వరే।

ఆ వో దేవాసఽ ఆశిషో యజ్ఞి యాసో హవామహే ।౫॥

ప.విః- ఆ, వః, దేవాసః, ఈమహే, వామమ్, ప్రయతీతి ప్ర+యతి, అధ్వరే, ఆ, వః, దేవాసః, ఆశిష ఇత్యా + శిషః, యజ్ఞియాసః, హవామహే.।౫॥

పదార్థః:-(ఆ) సమన్తాత్ (వః) యుష్మాన్ (దేవాసః) యే దీవ్యన్తి విద్యాదిగుణైః ప్రకాశన్తే తత్సంబుద్ధౌ, (ఈమహే) యాచామహే ఈమహ ఇతి యాఞ్చాకర్మసు పఠితమ్ నిఘం 3.౧౯ (వామమ్) ప్రశస్తం గుణకర్మసమూహమ్. వామమితి ప్రశస్యనామసు పఠితమ్. నిఘం. 3. ౮. (ప్రయతి) ప్రకృష్టం సుఖమేతి యేన తస్మిన్. అత్ర కృతోబహులమితి కరణకారకే కృత్ (అధ్వరే) అహింసనీయే యజ్ఞే (ఆ) అభితః (వః) యుష్మాకం సకాశాత్ (దేవాసః) విద్వాంసః (ఆశిషః) ఇచ్ఛాః (యజ్ఞియాసః) యా యజ్ఞమర్హన్తి తాః (హవామహే) స్వీకుర్వీమహి. లేట్ ప్రయోగోఽయమ్. అయం మంత్రః. శత. 3. ౧. 3. ౨౪ వ్యాఖ్యాతః.।౫॥

**అన్వయః** :-హే దేవాసో! యథా వయం వో యుష్మాన్ ప్రయత్యధ్వరే వో యుష్మాకం వామమేమహే సమన్తాద్యాచామహే, హే యజ్ఞియాసో దేవాసో యథాఽస్మిన్ సంసారే వో యుష్మాకం సకాశాత్ యజ్ఞియా ఆశిష ఆహవామహేఽభితః స్వీకుర్వీమహి. తథైవాస్మదర్థం భవద్భిః సతతమనుష్ఠేయమ్. ॥౫॥

**భావార్థః** :-మనుష్యైః పరమవిద్వద్భ్యః ప్రశస్తా విద్యాః సంపాద్య స్వేచ్ఛాః పూర్ణాః కృత్వైతేషాం సంగసేవే సదైవ కర్తవ్యే. ॥౫॥

**పదార్థము** :-(దేవాసః) విద్యాది గుణములచే ప్రకాశించు నో విద్వాంసులారా! ఎట్లు మేము (వః) మిమ్ము (ప్రయతి) సుఖయుక్తమును (అధ్వరే) హింసారహితమును నగు యజ్ఞము ననుష్ఠించుటలో (వః) మీయొక్క (వామమ్) ప్రశంసనీయమగు గుణములను (ఏమహే) బాగుగా యాచించుచున్నామో (దేవాసః) ఓ విద్వాంసులారా! ఎట్లు మేము ఈ లోకమునందు మీ వలన (యజ్ఞియాః) యజ్ఞమును సఫల మొనర్చదగిన (ఆశిషః) కామితములను (ఆ హవామహే) బాగుగా స్వీకరించగలమో అట్లే మా నిమిత్తమును మీరు సదా ప్రయత్నించుచుందురుగాక! ॥౫॥

**భావార్థము** :- మానవులు ఉత్తమవిద్వాంసుల సత్సంగములచే ఉత్తమోత్తమ విద్యలను ప్రాప్తించుకొని తమ కోర్కెలను పూర్తిజేసికొని సదా యా విద్వాంసుల సేవాసాంగత్యముల నొనర్చుచుండవలయును. ॥౫॥

5. O sages, we admire your praiseworthy qualities, during the performance of this happy sacrifice. O sages, we beg of you the fulfilment of our desires pertaining to the sacrifice!.

౧౩౪. స్వాహా యజ్ఞమిత్యస్య ప్రజాపతి ఋషిః యజ్ఞో దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

కిం కిమర్థః స యజ్ఞోఽనుష్ఠాతవ్య ఇత్యుపదిశ్యతే.

ఏ యే ప్రయోజనములకొరకు ఆ యజ్ఞము ననుష్ఠించవలయు నను విషయ

మీ మంత్రమునం దుపదేశింపబడినది.

౧౩౪ స్వాహా యజ్ఞం మనసః స్వాహోరో రన్తరిక్షాత్।

స్వాహా ద్యావాపృథివీభ్యాꣳ స్వాహా వాతా దారభే స్వాహా ॥౬॥

ప.వి:- స్వాహా, యజ్ఞమ్, మనసః, స్వాహా, ఉరోః, అన్తరిక్షాత్, స్వాహా, ద్యావాపృథివీభ్యామ్, స్వాహా, వాతాత్, ఆ, రభే, స్వాహా. ॥౬॥

కలదో ఏది ( అదితిః అసి) ప్రకాశకారకమై యున్నదో ( రుద్రా అసి) ఏది ప్రాణవాయువునకు సంబంధించి నలువది నాల్గు [౪౪] సంవత్సరములవరకు బ్రహ్మచర్యము అనుష్ఠించినవారిచే స్వీకరించబడినదో ( ఆదిత్యాః) ఏది సూర్యునివలె సర్వవిద్యలను ప్రకాశించు నలువదెనిమిది [౪౮] సంవత్సరములవరకు బ్రహ్మచర్యమును సేవించిన వారిచే స్వీకరించబడినదై ( అసి) ఉన్నదో ( చన్ద్రా) ఏది ఆహ్లాద మొనర్చునదై యున్నదో, దేనిని ( బృహస్పతిః) సర్వోత్తముడు ( రుద్రః) దుష్టులనేడిపించు పరమేశ్వరుడు లేక విద్వాంసుడు ( సుమ్నే) సుఖమునందు ( రమ్ణాతు) రమింపజేయుచున్నాడో, ప్రేరేపించుచున్నాడో ( వసుభిః) పూర్ణవిద్వాంసులతో నున్న ఏ వాణిని, లేక విద్యుత్తును ( ఆ చకే) నిర్మాణ మొనర్చుచున్నాడో, లేక కోరుచున్నాడో అటులనే నీవును ( త్వా) దానిని ( రమ్ణాతు) మనోజ్ఞముగ నొనర్చుటకు లేక సిద్ధింపజేయుటకు సంకల్పించుము. ॥౨౧॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు శ్లేష, వాచకలుప్తోపమాలంకారము లున్నవి. ఎట్లు వాణీవిద్యుత్తులు ప్రాణవముల, విద్వాంసుల, పృథివ్యాదులతో నుండి అనేక వ్యవహారములను సిద్ధింపజేయుచున్నవో, జితేంద్రియత్వము మున్నగు ధర్మసేవనముతో బ్రహ్మచర్యమనుష్ఠించిన విద్వాంసు లెద్దానిని సేవించిరో అట్టి వాణీ విద్యుత్తులు మనుష్యులచే విజ్ఞాన క్రియలద్వారా ప్రయోగ మొనర్చబడినచో అనేక సౌఖ్యముల నొసగుచున్నవి. దీనిని సదా సేవించుచుండవలయును. ॥౨౧॥

21. O speech, thou art all - pervading, eternal, lustrous, sublime and pleasant. The learned person uses thee for happiness. The sage, the chastiser of the wicked longs for thee along with other educated persons!.

౧౫౦. అదిత్యా స్త్వేత్యస్య వత్స ఋషిః, వాగ్విద్యుతౌ దేవతే, బ్రాహ్మీ పంక్తి శ్ఛందః. పంచమః స్వరః.

పునస్తే కీదృశ్యావిత్యుపదిశ్యతే.

మరల నా వాణీ విద్యుత్తు లెట్టివో ఈ మంత్రమునం దుపదేశింపబడినది.

౧౫౦ అదిత్యాస్త్వా మూర్ధన్నా జిఘర్మి దేవయజనే పృథివ్యా ఇడాయాస్పదమసి ఘృతవత్స్వాహా । అస్మే రమస్వాస్మే తే బన్ధుస్త్వే రాయో మే రాయో మా వయꣳ రాయస్పోషేణ వియౌష్మ తోతో రాయః ॥౨౨॥

ప.వి:- అదిత్యాః, త్వా, మూర్ధన్, ఆ, జిఘర్మి, దేవయజన ఇతి దేవ+ యజనే, పృథివ్యాః, ఇడాయాః, పదమ్, అసి, ఘృతవదితి ఘృత+ వత్, స్వాహా, అస్మే ఉ ఇత్యస్మే, రమస్వ, అస్మే ఉ

ఇత్యస్మే, తే, బంధుః, త్వే ఉ ఇతి త్వే, రాయః, మే ఇతి మే, రాయః, మా, వయమ్, రాయః, పోషేణ, వి,యౌష్మ, తోతః రాయః.॥౨౨॥

పదార్థ ః:-(అదిత్యాః) అంతరిక్షస్య. అదితిరంతరిక్షమిత్యస్మాదయమర్థో గృహ్యతే (త్వా) తామ్ (మూర్ధన్) మూర్ధని వర్తమానామ్ (ఆ) సమంతాత్ (జిఘర్మి) ప్రదీప్యే సంచాలయామి వా (దేవయజనే) దేవానాం విదుషాం సంగతికరణ ఏతేభ్యో దానే వా (పృథివ్యాః) భూమేర్మధ్యే (ఇడాయాః) స్తోతుమన్వేష్టుమర్హాయా వేదవాణ్యాః । ఇడేతి వాఙ్నామసు పఠితమ్. నిఘం. ౧.౧౧. (పదమ్) వేదితవ్యం ప్రాప్తవ్యం వా (అసి) అస్తి (ఘృతవత్) ఘృతేన పుష్టి దీప్తి కారకేన తుల్యా (స్వాహా) యయా క్రియయా సుహుతం యజతి తస్యాః (అస్మే) అస్మాసు (రమస్వ) రమతాం రమయతు వా (అస్మే) అస్మాకమ్. అత్ర సర్వత్ర సుపాం సులుగితి శే ఆదేశః (తే) తవ (బంధుః) భ్రాతా (త్వే) త్వయి (రాయః) ఉక్తధనస్య (పోషేణ) పుష్యన్తి యేన తేన (వి) విగతార్థే (యౌష్మ) యుక్తా భవేమ (తోతః) తువంతి జానంతి ప్రాప్నువంతి హింసంతి వా యేన సః. అత్ర తు గతివృద్ధి హింసాస్వితిధాతోర్బాహులకాదౌణాదిక స్తన్ ప్రత్యయః (రాయః) విద్యా రాజ్యసమృద్ధయః అయం మంత్రః. శ.౩.౩.౧.౪.౧౧. వ్యాఖ్యాతః.॥౨౨॥

అన్వయః :-హే విద్వన్ మనుష్య! త్వం యథా యా దేవయజనేఽదిత్యాః పృథివ్యా ఇడాయాః స్వాహా ఘృతవత్పదమస్యస్తి యామహం ఆ జిఘర్మి త్వా తాం త్వమపి జిఘృహి. యాఽస్మే అస్మాసు రమతే సా యుష్మాస్వపి రమస్వ రమతాం. యామహం రమయామి తాం భవానపి స్వస్మిన్ రమయతు. యోఽస్మే అస్మాకం బంధురస్తి స తే తవాప్యస్తు. యో రాయో ధనసమూహ స్త్వయ్యస్తి స మే మయ్యప్యస్తు. తోతో భవాన్ యా రాయో విద్యాధనసమృద్ధీః ప్రాప్నోతి తా మే మయ్యపి సంతు యా మయి వర్తంతే తా స్త్వే త్వయ్యపి సన్త్వే తా రాయః సమృద్ధయః సంతి తాః సర్వేషాం సుఖాయాపి సంప్రయుక్తాః సన్తు యథైవం జానంతో నిశ్చిన్వంతోఽనుతిష్ఠంతో యూయం వయం చ రాయస్పోషేణ కదాచిన్మా వియౌష్మ కదాచిద్వియుక్తా మా భవేమ తథైవ సర్వే భవంతు. ॥౨౨॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యా సత్యవిద్యాధర్మసంస్కృతావాగ్ విద్యాక్రియాభ్యాం సంప్రయుక్తా విదుష్యదాది విద్యాప్తి సా సర్వేభ్య ఉపదిశ్య సంగ్రాహ్య సుఖదుఃఖవ్యవస్థాం సమానం విదిత్వా సర్వమైశ్వర్యం పరోపకారే సంయోజ్య సదా

సుఖయితవ్యమ్. నైవం కదాచిద్వ్యహారః కర్తవ్యో యేన సర్వ్యాన్యస్యైశ్వర్యహ్రాసః కదా చిద్భవేదితి.॥౨౨॥

**పదార్థము** :- విద్వాంసుడవగు ఓ మానవా! (దేవయజనే) విద్వాంసుల యజ్ఞదానములందు (అదిత్యాః) అంతరిక్షముయొక్కయు (పృథివ్యాః) భూమియొక్కయు (ఇడాయాః) వాణియొక్కయు (స్వాహా) సుహుతముగ యజ్ఞమొనర్చు క్రియమధ్య (మూర్ధన్) సర్వోత్తమమును (ఘృతవత్) దీప్తినొసగు ఘృతమువంటి (పదమ్ అసి) తెలిసికొనదగిన మరియు పొందదగిన ఏ పదవి గలదో, దేనిని నేను (ఆ జిఘర్మి) ప్రదీప్త మొనర్చుచున్నానో నీవును (త్వా) దానిని [ప్రదీప్తపరచుము] (అస్మే) మాయందు ఏ విభూతి రమించుచున్నదో అది మీయందును (రమస్వ) రమించుగాక! (అస్మే) మాకు ఏ (బన్ధుః) భ్రాతగలడో, యాతడు (తే) నీకును [భ్రాత] యగుగాక! (రాయః) విద్యమున్నగు ఏ ధనసమూహము (తే) నీయందుగలదో అది (మే) నాయందును ఉండుగాక! (రాయః) ఎట్టి విద్యాధనము (తోతః) పొందుటకు యోగ్యుడనైన నాయందు గలదో అది నీయందును ఉండునుగాక! (రాయః) మీకు, మాకు గల ఐశ్వర్యములు సకలజనుల సుఖమునకు మూలము అగుగాక! ఈ విధముగ నెరుగుచు, నిశ్చయించుకొనుచు, అనుష్ఠించుచు మీరు, మేము ఎల్లరమును (రాయస్పోషేణ) ధనపుష్టితో ఎన్నటికిని (మా వియౌష్మ) విడిపోకుందుముగాక!॥౨౨॥

**భావార్థము** :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకార మున్నది. మనుష్యులు సత్యవిద్యను, ధర్మముచే సంస్కృతమైన వాణిని, శిల్పవిద్యతో గూడిన విద్యుత్తు మున్నగు విద్యలను సకలమానవుల కుపదేశించి, గ్రహించి, గ్రహింపజేసి సుఖదుఃఖముల వ్యవస్థను సమముగా భావించి సకలైశ్వర్యములను పరోపకార కార్యములందు వినియోగించవలెను. విద్య, ధనైశ్వర్యములు క్షీణించిపోవు ఎట్టి వ్యవహారమును ఎవరును, ఎన్నటికిని చేయ వలదు.॥౨౨॥

22. O speech, I use thee in the heights of sky and the sacrificial places on the Earth. Thou art the preserver of Vedic verses. May thou be enriched with high knowledge. May thou rest in us. May thou be united to us. Thou art rich. May I be full of riches. Let us not be deprived of abundant riches. May splendour reside in thee full of understading!.

౧౫౧. సమఖ్య ఇత్యస్య వత్స ఋషిః, వాగ్విద్యుతౌ దేవతే. ఆస్తారపంక్తిశ్ఛందః. పంచమః స్వరః.

ఏతయోః కథముపయోగః కార్య ఇత్యుపదిశ్యతే.

ఈ రెంటిని ఏ విధముగ నుపయోగించవలయు నను విషయ మిందు గలదు.

౧౫౧ సమఖ్యే దేవ్యా ధియా సం దక్షిణ యోరు చక్షసా। మా మ ఆయుః ప్రమోషీ ర్మో అహన్తవ వీరం విదేయ తవ దేవి సందృశి ॥౨౩॥

ప.వి:- సమ్, అఖ్యే, దేవ్యా, ధియా, సమ్, దక్షిణయా, ఉరుచక్షసేత్యురు+ చక్షసా, మా, మే, ఆయుః, ప్ర, మోషీః, మోఽఽ ఇతి మో, అహమ్, తవ, వీరమ్, విదేయ, తవ, దేవి, సన్దృశీతి సమ్+ దృశి.॥౨౩॥

పదార్థః :-(సమ్) సమ్యగర్థే (అఖ్యే) ప్రకథయామి. అత్ర వ్యత్యయేనాత్మనే పదం. లడర్థే లుఙ్ చ (దేవ్యా) దేదీప్యమానయా (ధియా) ప్రజ్ఞయా కర్మణా వా (సమ్) ఏకీభావే (దక్షిణయా) జ్ఞాన సాధికయాఽజ్ఞాననాశికయా చ (ఉరుచక్షసా) ఉరు బహు చక్షో వ్యక్తం వచనం దర్శనం వా యస్యాస్తయా (మా) నిషేధే (మే) మమ (ఆయుః) జీవనమ్ (ప్ర) క్రియాయోగే (మోషీః) ముష్ణీయాత్ ఖండయేత్.అత్ర లిఙర్థే లుఙ్ (మో) నివారణే (అహమ్) సర్వప్రియం ప్రేప్సుః (తవ) సర్వసుహృదః (వీరమ్) విక్రాంతం జనమ్ (విదేయ) అన్యాయేన విందేయ. అత్ర వా ఛందసి సర్వే విధయో భవంతీతి నుమభావః. అత్రాస్యైయా కరణేన మహీధరేణ భ్రాన్త్యా విద్ల్ృలాభ ఇత్యస్య వ్యత్యయేన తుదాదిభ్యః శప్రత్యయేన లిఙి రూపమిత్యశుద్ధం వ్యాఖ్యాతమ్. కుతః? విద్ల్ృ ధాతోః స్వత ఏవ తుదాదిత్వం వర్తతే (తవ) తస్యాః (దేవి) దివ్యగుణై ర్విరాజమానాయాః. అత్రార్థాద్విభక్తే ర్విపరిణామ ఇతి విభక్తే ర్విపరిణామః. (సందృశి) సమీచీనం దృగ్దర్శనం యస్మిన్ వ్యవహారే తస్మిన్. అయం మంత్రః. శ. ౩.౩.౧.౧౨. వ్యాఖ్యాతః.॥౨౩॥

అన్వయః :-హే విద్వన్మనుష్య! యథాఽహం దక్షిణయో రుచక్షసా దేవ్యా ధియా తవ దేవి తస్యా దివ్యగుణై ర్విరాజమానాయా వాచో విద్యుతో వా సందృశి జీవనం సమఖ్యే సా మే మమాయుర్మా ప్రమోషీః ఖండనం న కుర్యాదహమేతాం సమఖ్యే ప్రఖ్యాతాం కుర్యామన్యాయేన తవ వీరం మో మా సంవిదేయ తథైవ త్వమేతత్ సర్వమాచార్యాన్యా యేనాపి మమ వీరం చ మా సంవిందస్వ.॥౨౩॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైః శుద్ధాభ్యాం కర్మప్రజ్ఞాభ్యాం వాగ్విద్యుద్విద్యాం సంగృహ్య జీవనం వర్ధయిత్వా విద్యాది సద్గుణేషు వీరాన్సంపాద్య సదా సుఖయితవ్యమ్.॥౨౩॥

పదార్థము :-ఓ విద్వాంసుడా! (అహమ్) నేనెట్లు (దక్షిణయా) జ్ఞానసాధకము (ఉరుచక్షసా) దర్శనయుక్తము నగు వ్యక్తవచనముగల (దేవ్యా) దివ్యప్రకాశవంత (ధియా) ప్రజ్ఞచేత (తవ) అట్టి (దేవి)

సర్వోత్కృష్టగుణములచే గూడిన వాణియొక్క, విద్యుత్తుయొక్క (సంధృశి) చక్కగా పరిశీలించబడిన వ్యవహారమున జీవితమును (సమఖ్యే) కథనముద్వారా ప్రకటింతునో, అదియును (మే ఆయుః) నా జీవితమును (మా ప్రమోషీః) ఎట్లునష్టమొనర్చబడదో, అజ్ఞానముచే నేను దానిని (మో) ఎట్లు నష్టమొనర్చకుందునో (తవ) ఓ సర్వులకు మిత్రుడా! నే నన్యాయముగ (వీరమ్) మీ శూరవీరులను (మా సం విదేయ) హింసించకుందునో, అట్లే నీవును నా శూరవీరులను హింసించకుందువుగాక! ॥౨౩॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకారము గలదు. శుద్ధప్రజ్ఞ, కర్మలద్వారా వాణీ విద్యుత్తుల విద్యలను గ్రహించియు, ఆయువును వృద్ధిపరచుకొనుచును, విద్య మున్నగు ఉత్తమగుణములందు మానవులు తమ సంతానమును మరియు నితరులను వీరులుగ నొనర్చి సదా సుఖించవలయును. ॥౨౩॥

23. O speech, I praise thee with divine, ignorance - removing and penetrating intelligence. End not my life. I will not throngh ignoranc spoil thee. O Vedic text, in thy protection, may I be blessed with heroism.

౧౫౨ ఏష త ఇత్యస్య వత్స ఋషిః. యజ్ఞో దేవతా, పూర్వస్య బ్రాహ్మీ జగతీ ఛందః.

నిషాదః స్వరః. అన్త్యస్య దశాక్షరస్య యాజుషీ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

కిం ప్రతిపాదనాయ జిజ్ఞాసుర్విదుషః పృచ్ఛేదిత్యుపదిశ్యతే.

ఏ ప్రతిపాదనకై జిజ్ఞాసువులు విద్వాంసులను ప్రశ్నించవలయు నను విషయ మీ మంత్రమునం దుపదేశించబడుచున్నది.

౧౫౨ ఏ॒ష తే॒ గా॒య॒త్రో భా॒గఽఇతి॑ మే॒ సోమా॑య బ్రూతాదే॒ష తే॒ త్రైష్టు॑భో

భా॒గఽఇతి॑ మే॒ సోమా॑య బ్రూతాదే॒ష తే॒ జాగ॑తో భా॒గఽఇతి॑ మే॒

సోమా॑య బ్రూతాచ్ఛందో నా॒మా॒నా॒ꣳ సామ్రా॑జ్యఙ్గ॒చ్ఛేతి॑ మే॒ సోమా॑య

బ్రూతాదా॒స్మా॒కో॒ఽసి శు॒క్రస్తే॒ గ్రహ్యో॑ వి॒చిత॑స్త్వా॒విచి॑న్వంతు ॥౨౪॥

ప. వి:- ఏ॒షః, తే॒, గా॒య॒త్రః, భా॒గః, ఇతి॑, మే॒, సోమా॑య, బ్రూ॒తా॒త్, ఏ॒షః, తే॒, త్రైష్టు॑భ ఇతి త్రై+స్తు॑భః, భా॒గః ఇతి॑, మే॒, సోమా॑య, బ్రూ॒తా॒త్, ఏ॒షః తే॒, జాగ॑తః భా॒గః ఇతి॑, మే॒, సోమా॑య, బ్రూ॒తా॒త్, ఛ॒న్దో॒నా॒మా॒నా॒మితి॑ ఛందః+నా॒మానామ్, సామ్రా॒జ్యమి॒తి సామ్+రా॑జ్యమ్,

గచ్ఛ, ఇతి, మే, సోమాయ, బ్రూతాత్, ఆస్మాకః, అసి, శుక్రః తే, గ్రహ్యః, విచిత ఇతి వి+ చితః,

త్వా, వి, చిన్వన్తు.॥౨౪॥

పదార్థః :-(ఏషః) ప్రత్యక్షః (తే) తవ (గాయత్రః) గాయత్రీ ప్రగాథోఽస్య సః. సోఽస్యాదిరితి చ్ఛందసః ప్రగాథేషు అ. ౪.౨. ౫౫ అనేన ప్రగాథవిషయే ప్రత్యయః (భాగః) సేవనీయః (ఇతి) ప్రకారార్థే (మే) మహ్యమ్ (సోమాయ) పదార్థవిద్యాసంపాదకాయ, (బ్రూతాత్) బ్రవీతు (ఏషః) యో విజ్ఞాతుం యోగ్యః సః (తే) తవ (త్రైష్టుభః) త్రిష్టుప్ ప్రగాథోఽస్య సః (భాగః) అంశః (ఇతి) ప్రకారే (మే) మహ్యమ్ (సోమాయ) ఉత్తమరససంపాదకాయ (బ్రూతాత్) బ్రవీతు (ఏషః) యోక్తుమర్హః (తే) తవ (జాగతః) జగతీప్రగాథోఽస్య సః (భాగః) స్వీకర్తుమర్హః (ఇతి) ప్రకారార్థే (మే) మహ్యమ్ (సోమాయ) పదార్థవిద్యాస్వీకారకాయ (బ్రూతాత్) ఉపదిశతు (ఛందోనామానామ్) యాని ఛన్దసాముష్ణిగాదీనాం నామాని తేషామ్.అత్ర అనసంతాన్న. అ. ౫. ౪. ౧౦౩. ఇతి సూత్రేణ సమాసాంతష్టచ్ ప్రత్యయః (సామ్రాజ్యమ్) సమ్యగ్రాజంతే ప్రకాశంతే తే సమ్రాజో రాజానస్తేషాం భావః కర్మ వా తత్ (గచ్ఛ) ప్రాప్నుహి ప్రాపయ వా (ఇతి) ప్రకారే (మే) మహ్యమ్ (సోమాయ) ఐశ్వర్యయుక్తాయ రాజ్యాయ (బ్రూతాత్) బ్రవీతు (అస్మాకః) యోఽస్మాకమయముపదేష్టాఽధిపతి సః (అసి) వర్తసే (శుక్రః) పవిత్రః పవిత్రకారకో వా (తే) తవ (గ్రహ్యః) గ్రహీతుం యోగ్యః (విచితః) వివిధవిద్యాశుభగుణధనాదిభిశ్చితః సంయుక్తః (త్వా) త్వాం తం వా (వి) వివిధార్థే (చిన్వంతు) వర్ధయంతు. అత్రాంతర్గతోణ్యర్థః. అయం మంత్రః. శ. ౩. ౨. ౫. ౪-౮ వ్యాఖ్యాతః. ॥౨౪॥

అన్వయః :-హే విద్వం స్త్వం విద్వాంసం ప్రతి కోఽస్య యజ్ఞస్య గాయత్రో భాగోఽస్తీతి పృచ్ఛ, స విద్వాన్ తే తస్యైషోఽయమస్తీతి మే మహ్యంసోమాయైతం బ్రూతాద్ బ్రవీతూపదిశతు. కోఽస్య యజ్ఞస్య త్రైష్టుభో భాగోఽస్తీతి త్వం పృచ్ఛ, స తే తస్యైషోఽయమస్తీతి సమక్షే ఖల్వేతం మే మహ్యం సోమాయ బ్రూతాత్. కోఽస్య యజ్ఞస్య జాగతో భాగోఽస్తీతి త్వం పృచ్ఛ, స తే తస్యైషోఽయమస్తీతి ప్రసిద్ధ్యైతం సోమాయ మే మహ్యం బ్రూతాత్. యథా భవాంశ్ఛందో నామానాముష్ణిగాదీనాం ఛందసాం మధ్యే ప్రతిపాదితస్య యజ్ఞస్యోపదేశే సామ్రాజ్యం గచ్ఛతు, తథైవైతేషామేనం సోమాయ మే మహ్యం బ్రూతాత్. యతస్త్వమాస్మాకః శుక్రోఽపి తస్మాత్తే తవాహం విచితో గ్రహ్యోఽస్మి త్వం మాం సర్వైరేతైర్విచినుహి. అహం త్వాం విచినోమ్యేవ సోఽపి సర్వేత్వామేతం యజ్ఞం మాం చ విచిన్వన్తు వర్ధయంతు.॥౨౪॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా విద్వద్భ్యః పృష్ట్వా సర్వా విద్యాః సంగృహ్ణీరన్. విద్వాంసః ఖల్వేతాః సంగ్రాహయంతు. పరస్పరమనుగ్రాహ్యానుగ్రాహకభావేన వర్తిత్వా సర్వే వృద్ధిం ప్రాప్య చక్రవర్తిరాజ్యం సేవేరన్నితి.॥౨౪॥

**పదార్థము** :- విద్వాంసుడవగు ఓ మానవా! ఈ యజ్ఞమునకు (గాయత్రః) వేదస్థ గాయత్ర్యాది ఛందములతో గూడిన మంత్రముల సమూహముచే ప్రతిపాదించబడిన (భాగః) సేవించదగిన భాగమేది? (ఇతి) అని నీవు విద్వాంసుని ప్రశ్నించుము. ఆ విద్వాంసుడు (తే) నీకు ఈ యజ్ఞమునకిది ప్రత్యక్షభాగము (ఇతి) అని చెప్పునట్లు (సోమాయ) పదార్థవిద్యనార్జించు (మే) నాకొరకును (బ్రూతాత్) వచించు గాక! ఈ యజ్ఞమునందు (త్రైష్టుభః) త్రిష్టుప్ ఛందస్సుతో ప్రతిపాదించబడిన (భాగః) భాగ మెయ్యది? (ఇతి) అని విద్వాంసుని ప్రశ్నించుము. అతడెట్లు (తే) నీకు ఆ యజ్ఞమునకు (ఏషః) ఇది భాగము (ఇతి) అని ప్రత్యక్షముగ సమాధాన మిచ్చునో అట్లే (సోమాయ) ఉత్తమరసమును సంపాదించు. (మే) నాకును (బ్రూతాత్) నివేదించునుగాక! ఈ యజ్ఞమున (జాగతః) జగతీ ఛందస్సుచే విధానపరచబడిన (భాగః) అంగమేది? (ఇతి) అని నీవు ఆప్తుని ప్రశ్నించుము. అతడు (తే) నీకు ఆ యజ్ఞమున (ఏషః) ఇది ప్రసిద్ధభాగము (ఇతి) అని చెప్పునట్లు (సోమాయ) పదార్థవిద్యను సంపాదించు (మే) నాకును ఉత్తరము (బ్రూతాత్) తెలుపునుగాక! మీరెట్లు (ఛన్దోనామానామ్) ఉష్ణిక్ మున్నగు ఛందస్సులతో చెప్పబడిన యజ్ఞోపదేశమున (సామ్రాజ్యమ్) చక్కని సామ్రాజ్యమును (గచ్ఛ) పొందుదురో (ఇతి) అటులనే (సోమాయ) ఐశ్వర్యయుక్తుడనగు (మే) నాకు [సార్వభౌమ రాజ్యము ప్రాప్తించు నుపాయము]ను (బ్రూతాత్) చెప్పుడు. మీరు (అస్మాకః) మమ్ము (శుక్రః అసి) పవిత్రమొనర్చు ఉపదేశకులై యున్నట్లే నేను (తే) మీకు (గృహ్యాః) గ్రహించదగిన (విచితః) ఉత్తమవిద్య మున్నగు ధనములతో గుణములతో కూడిన శిష్యుడను. మీరు నన్ను సకలసద్గుణములందు వృద్ధిపరచుడు. నేనును (త్వా) మిమ్ము అభివృద్ధిపరులనుగ నొనర్తును. మరియు మానవులెల్లరును (త్వా) మిమ్ము, మమ్ము ఈ యజ్ఞమును (విచిన్వన్తు) అభివృద్ధిపరతురుగాక!॥౨౪॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మనుష్యులు విద్వాంసుల సాంగత్యముచే సకల విద్యలను గ్రహించవలయును. విద్వాంసులును సకల విద్యలను జిజ్ఞాసువులకు గ్రహింపజేయవలెను. విద్వాంసులు పరస్పరము గ్రహించియు, గ్రహింపజేసియు సకల వృద్ధులను పొంది విద్యలను, చక్రవర్తి సామ్రాజ్యమును సేవించెదరు గాక.॥౨౪॥

24. O learned person "This is thy share of the sacrifice allied with Gayatri verses" so may he say unto me a student of science. This is thy share of the sacrifice allied with Trishtup verses, so may he say unto me, the seeker of the essence of things. "This is thy share of the sacrifice allied with verses in Jagati metre,' so may he say unto me a student of science. 'May thou attain to sovereignty detailed in Vedic verses in all other metres.' May he thus preach the art of kingship unto me, full of affluence. O learned persons, just as ye are our purifying preachers, so am I your worthy disciple, endowed with virtues and wealth. May ye develop me and this sacrifice (yajna) as well!.

౧౫౩. అభిత్య మిత్యస్య వత్స ఋషిః, సవితా దేవతా, పూర్వస్య విరాడ్బ్రాహ్మీ జగతీ ఛందః.
నిషాదః స్వరః. సుక్రతు రిత్యుత్తరస్యనిచృదార్షీగాయత్రీ ఛందః. షడ్జః స్వరః.
పునరీశ్వరరాజసభా ప్రజాగుణా ఉపదిశ్యంతే.
ఈ మంత్రమున ఈశ్వరునియొక్కయు రాజసభయొక్కయు.
ప్రజలయొక్కయు గుణవివరములు ఉపదేశించబడినవి.

౧౫౩ అభి త్యం దేవꣳ సవితార మోణ్యోః కవిక్రతు మర్చామి సత్యసవꣳ
రత్నధామభి ప్రియమ్మతిఙ్కవిమ్ । ఊర్ధ్వా యస్యామతి ర్భాꣲ
అదిద్యుత త్సవీమని హిరణ్యపాణిరమిమీత । సుక్రతుః కృపా స్వః
ప్రజాభ్య స్త్వా ప్రజాస్త్వాꣲను ప్రాణన్తు ప్రజాస్త్వ మను ప్రాణిహి ॥౧౫॥

ప.వి:- అభి, త్యమ్, దేవమ్, సవితారమ్, ఓణ్యోః, కవిక్రతుమితి కవి+ క్రతుమ్, అర్చామి, సత్యసవమితి సత్య+ సవమ్, రత్నꣲ ధామితి, రత్నధామ్, అభి, ప్రియమ్, మతిమ్, కవిమ్, ఊర్ధ్వా, యస్య, అమతిః, భాః, అదిద్యుతత్, సవీమని, హిరణ్య పాణిరితి హిరణ్య+పాణిః అమిమీత, సుక్రతురితి సు+ క్రతుః, కృపా, స్వరితి స్వః, ప్రజాభ్య ఇతిప్ర+ జాభ్యః, త్వా, ప్రజా ఇతి ప్ర+జాః, త్వా, అనుప్రాణ న్త్విత్యను+ ప్రాణన్తు, ప్రజా ఇతి ప్ర+జాః, త్వమ్, అనుꣲప్రాణిహీ త్యను+ ప్రాణిహి. ॥౧౫॥

పదార్థః :-(అభి) అభిముఖ్యే (త్యమ్) జగదీశ్వరం రాజసభాస్థజనసమూహం వా(దేవమ్) సుఖదాతారం (సవితారమ్) దేవానామగ్న్యాదీనాం రసానాం వా ప్రసవితారమ్ (ఓణ్యోః) ద్యావాపృథివ్యోః ఓణ్యోరితి ద్యావాపృథివీ నామసు పఠితమ్ నిఘం. 3. 30 (కవిక్రతుమ్) కవిః సర్వజ్ఞః సకలవిద్యాయుక్తః క్రతుః ప్రజ్ఞా కర్మ క్రమదర్శనం వా యస్య

తమ్. కవిః క్రాంతదర్శనో భవతి కవతే ర్వా. నిరు. ౧౨. ౧౩. (అర్చామి) పూజయామి (సత్యసవమ్) సత్యం సవ ఐశ్వర్యం జగద్వా యస్మిన్యస్య వా తమ్ (రత్నధామ్) యో రత్నాని రమణీయాని విజ్ఞానాని హీరకాదీని భువనాని వా దధాతీతి తమ్ (అభి) ఆభిముఖ్యే (ప్రియమ్) యః ప్రీణాతి తమ్ (మతిమ్) యో వేదాదిశాస్త్రైర్విద్వద్భిశ్చ మన్యతే తమ్ (కవిమ్) వేదవిద్యాయా ఉపదేష్టారం నిమిత్తం వా (ఊర్ధ్వా) ఉత్కృష్టా (యస్య) సచ్చిదానంద స్వరూపస్య శుభ గుణయుక్తస్య వా (అమతిః) రూపమ్. అమతిరితి రూపనామసు పఠితమ్. నిఘం. ౩.౭. (భాః) యో భాతి ప్రకాశతే సః (అదిద్యుతత్) ప్రకాశితవాన్, ప్రకాశయతి వా. (సవీమని) యః సూయతే సంసార స్తస్మిన్ (హిరణ్యపాణిః) హిరణ్యాని జ్యోతీంషి సూర్యాదీని సువర్ణాదీని వా పాణౌ వ్యవహారే యస్య సః. జ్యోతిర్హిహిరణ్యమ్ శ. ౪.౩. ౧.౨౧. ఇతి ప్రమాణేన హిరణ్యశబ్దేన జ్యోతిషో గ్రహణమ్ (అమిమీత) నిర్మితవాన్ నిర్మిమీతే వా (సుక్రతుః) శోభనః క్రతుః ప్రజ్ఞా కర్మ వా యస్య సః (కృపా) కరుణా (స్వః) సుఖ మాదిత్యం వా. స్వరాదిత్యో భవతి స ఏతాని సారయతి. నిరు. ౫.౪. (ప్రజాభ్యః) ఉత్పన్నాభ్యః సృష్టిభ్యః (త్వా) త్వామ్. (ప్రజాః) మనుష్యాదిసృష్టయః (త్వా) త్వామ్ (అనుప్రాణన్తు) ఆయుర్భుంజతామ్ (ప్రజాః) జగత్స్థాః (త్వమ్) అయం వా (అనుప్రాణిహి) జీవితోఽనుజీవనం ధర ధరతి వా. అయం మంత్రః. శ. ౩.౩. ౨.౧౨-౧౯ వ్యాఖ్యాతః. ॥౨౫॥

అన్వయః :-హే పరమాత్మన్ సభాధ్యక్ష! ప్రజాపురుష! వాఽహం యస్య సవీమన్యూర్ధ్వా మతిర్భా అదిద్యుతత్కృపా స్వః సుఖం కరోతి. యో హిరణ్య పాణిః సుక్రతుః స్వరమిమీతాదిత్యం వా నిర్మితవాన్. త్యమోణ్యోః సవితారం కవిక్రతుం రత్నధాం ప్రియం మతిం కవిం దేవం త్వా త్వాం ప్రజాభ్యోఽభ్యర్చామి తం త్వాం ప్రజా అనుప్రాణంతు కృపయా త్వం ప్రజా అనుప్రాణిహి. ॥౨౫॥

భావార్థః :-అత్ర శ్లేషాలంకారః. మనుష్యైః సర్వజగత్స్రష్టుర్నిరాకారస్య వ్యాపినః సర్వశక్తిమతః సచ్చిదానందాదిలక్షణస్య పరమేశ్వరస్య ప్రజాపాలన తత్పరస్య సభాపతే ర్ధార్మికస్య ప్రజాజనస్య వైవార్చా నిత్యం కర్తవ్యా నాఽతో భిన్నస్య కస్యచిత్. విద్వద్భిః ప్రజాస్థానాం సుఖాయైతేషాం స్తుతిప్రార్థనోపదేశా నిత్యం కార్యాః. యతః సర్వాః ప్రజా స్తదాజ్ఞానుకులాః సదా వర్తేరన్. యథా ప్రాణే సర్వేషామ్ జీవానాం ప్రీతిరస్తి తథా పరమాత్మాదిష్వపి కార్యేతి. ॥౨౫॥

పదార్థము :-(యస్య) సచ్చిదానందము మున్నగు లక్షణములతో గూడిన పరమేశ్వరుడు ధార్మిక సభాపతి, ప్రజాపురుషుడు (సవీమని) ఉత్పన్నమొనర్చిన సృష్టియందు (ఊర్ధ్వా) ఉత్తమమైన ఏ (అమతిః) స్వరూపము (భాః) తళుకులీనుచు (ఆదిద్యుతల్) ప్రకాశితమై యున్నదో, ఎవని (కృపా) కరుణ (స్వః) సౌఖ్యముల సమకూర్చుచున్నదో (హిరణ్యపాణిః) సూర్యాదిజ్యోతుల సువర్ణాదుల వ్యవహారమునందు ఉత్తమగుణములను కర్మలను ఎవడు సంయుక్తపరచెనో (సుక్రతుః) ఉత్తమప్రజ్ఞాకర్మలు గల ఏ పరమాత్మ, సభాపతిని, ప్రజలను

(స్వః) సూర్యుని మరియు సుఖమును (అమిమీత) స్థాపించెనో (త్వమ్) అట్టి (ఓణ్యోః) ద్యావాపృథువులందలి (సవితారమ్) అగ్న్యాదుల నుత్పన్నపరచువాడును, ప్రయోగపరచువాడును (కవిక్రతుమ్) సర్వజ్ఞుడు మరియు క్రాంతదర్శనుడును (రత్నధామ్) రమణీయరత్నములను ధారణ మొనర్చువాడును (సత్యసవమ్) సత్య, ఐశ్వర్యయుక్తుడును (ప్రియమ్) ప్రీతికారకుడును (మతిమ్) వేదశాస్త్రములను, విద్వాంసులను మన్నించు యోగ్యుడును (కవిమ్) వేదవిద్యనుపదేశించువాడును (దేవమ్) సౌఖ్యముల నొసగువాడును నగు ఏ పరమేశ్వరుని సభాధ్యక్షుని, లేక ప్రజాజనుని నేను పూజించుచున్నానో, లేక (త్వా) నిన్ను (ప్రజాభ్యః) ఉత్పన్నమైన సృష్టిలో నర్చించుచున్నానో అట్టి నీ సృష్టిలో (ప్రజాః) మనుష్యాదులు (అనుప్రాణన్తు) ఆయుష్యము ననుభవింతురుగాక! (త్వమ్) అట్టి నీవు దయయుంచి (ప్రజాః) ప్రజలపై సకలజీవుల కనుకూలముగా (అను ప్రాణిహి) అనుగ్రహమొనర్చుము. ॥౨౫॥

**భావార్థము** :- ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. సకల జగత్తును ఉత్పన్నమొనర్చిన నిరాకారుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, సచ్చిదానందము మున్నగు లక్షణములుగలవాడు నగు పరమేశ్వరుని, ధార్మికుడైన సభాపతిని, ధార్మికజనసమూహమును మాత్రమే మానవులు సత్కరించవలయును. అన్యులను పూజించరాదు. ప్రజలసుఖములకొరకు, పరమేశ్వరుని స్తుతి ప్రార్థన ఉపాసనల నొనర్చుటకు, శ్రేష్ఠసభాపతిని, ధార్మికప్రజలను సత్కరించుటకై సదా ఉపదేశించుచుండవలెను. వారి యాజ్ఞలకు సర్వజనులును అనుకూలురుగ ప్రవర్తింతురు గాక! ప్రాణులకు ప్రాణములపై ప్రీతియుండునట్లే పరమేశ్వరునిపైనను ఉంచుట మానవులకు యోగ్యమై యున్నది. ॥౨౫॥

25. O adorable God, the Creator of the Earth and Sky, the Source of all Knowledge, the Embodiment of Splendour, the Sustainer of all the beautiful planets, the Centre of love, object of praise by the Vedas, and their Revealer. His lofty effulgent Stelf is divulged in the created world. He has fixed the bright sun and the moon in their conduct. He is the wisest Actor. His mercy grants us happiness. O God I worship Thee as Bestower of happiness on mankind. May all mortals onjoy life, through thee. May thou grant life to all human beings!.

౧౫౪. శుక్రం త్వేత్యస్య వత్స ఋషిః, యజ్ఞో దేవతా, భురిగ్బ్రాహ్మీ పంక్తిశ్ఛందః పంచమః స్వరః.

మనుష్యైః కిం కృత్వా యజ్ఞః సాధనీయ ఇత్యుపదిశ్యతే.

ఏ యే సాధనములచే యజ్ఞమును సాధించవలయునో ఇందుపదేశించబడెను.

౧౫౪ శుక్రం త్వా శుక్రేణ క్రీణామి చన్ద్రంచన్ద్రేణామృత మమృతేన।

సగ్మే తే గోరస్మే తే చన్ద్రాణి తపసస్తనూ రసి। ప్రజాపతే ర్వర్ణః

పరమేణ పశునా క్రీయసే సహస్రపోషం పుషేయమ్ ॥౨౬॥

ప.వి:-శుక్రమ్, త్వా, శుక్రేణ, క్రీణామి, చన్ద్రమ్, చన్ద్రేణ, అమృతమ్, అమృతేన, సగ్మే, తే, గోః, అస్మే ఇత్యస్మే, తే, చంద్రాణి, తపసః, తనూః, అసి, ప్రజాపతే రితి ప్రజా+పతేః వర్ణః, పరమేణ, పశునా, క్రీయసే, సహస్ర పోషమితి సహస్ర+ పోషమ్, పుషేయమ్.॥౨౬॥

పదార్థః :-(శుక్రమ్)శుద్ధికారకమ్ (త్వా) తం క్రియామయం యజ్ఞం (శుక్రేణ) శుద్ధ భావేన (క్రీణామి) గృహ్ణామి (చంద్రమ్) సువర్ణమ్. చన్ద్రమితి హిరణ్యనామసు పఠితమ్. నిఘం. ౧.౨. (చంద్రేణ) సువర్ణేన (అమృతమ్) మోక్షసుఖమ్ (అమృతేన) నాశరహితేన విజ్ఞానేన (సగ్మే) గచ్ఛతీతి గ్మా పృథివీ తయా సహ వర్తతే తస్మిన్ యజ్ఞే. గ్మేతి పృథివీనామసు పఠితమ్, నిఘం ౧.౧(తే) తవ (గోః) పృథివ్యాః సకాశాత్ (అస్మే) అస్మభ్యమ్ (తే) తవ సకాశాత్ (చన్ద్రాణి) కాంచనాదీన్ ధాతూన్ (తపసః) ధర్మానుష్ఠానస్యాగ్నేస్తాపసస్య వా (తనూః) శరీరమ్ (అసి) అస్తి. అత్ర సర్వత్ర వ్యత్యయః. (ప్రజాపతేః) ప్రజానాం పతిః పాలనహేతుః సూర్యస్తస్య (వర్ణః) వరీతుం యోగ్యః (పరమేణ) ప్రకృష్టేన (పశునా) వ్యవహృతేన విక్రీతేన గవాదినా (క్రీయసే) క్రీయతే (సహస్రపోషమ్) అసంఖ్యాతపుష్టిమ్ (పుషేయమ్) పుష్టో భవేయమ్. అయం మన్త్రః. శత. 3.3.3.౬-౯ వ్యాఖ్యాతః.॥౨౬॥

అన్వయః :-అహం సగ్మే యా తపస స్తనూరస్యస్తి యః పశునా ప్రజాపతే ర్వర్ణః క్రీయసే క్రీయతే తం సహస్రపోషం పుషేయమ్. హేవిద్వన్! యాని తే తవ యస్యాః గోః సకాశా చ్చంద్రాణ్యుత్పన్నాని సంతి తాన్య స్మే అస్మభ్యమపి సంతు. అహం పరమేణ శుక్రేణ యం శుక్రం యజ్ఞం చన్ద్రేణ చంద్రమమృతేనామృతం చ క్రీణామి,త్వా తం త్వమపి క్రీణీహి. ॥౨౬॥

భావార్థః:-మనుష్యైః శరీరమనోవాగ్భిరేవ పరమేశ్వరోపాసనాదిలక్షణం యజ్ఞం సతత మనుష్ఠాయా సంఖ్యాతాఽతులా పుష్టిః ప్రాప్తవ్యా.॥౨౬॥

పదార్థము :-(సగ్మే) పృథివితోబాటు వర్తమానమైయున్న యజ్ఞమునందు (తపసః) ప్రతాపయుక్తమగు అగ్ని, లేక తపస్వి లేక విద్వాంసుని (తనూః అసి) శరీరమును శిల్పవిద్యాసిద్ధికై, సత్యసిద్ధికై (పశునా) పశువులుమున్నగువాని విక్రయధనముచే గ్రహించి (ప్రజాపతేః) ప్రజా [ప్రాణుల] పాలనకు హేతువైన సూర్యుని (వర్ణః) స్వీకరించదగిన ఏ తేజస్సు (క్రీయసే) దత్తమొనర్చుకొనబడుచున్నదో (సహస్రపోషమ్) అసంఖ్యాక పుష్టిని పొంది నేను (పుషేయమ్) పుష్టివంతుడ నగుదును గాక! ఓ విద్వాంసా! (తే) నీకు (గోః) పృథివీరాజ్యము వలన (చన్ద్రాణి) లభించు సువర్ణము మున్నగు ధాతువులు (అస్మే) మాకును గలుగుగాక! నే నెటుల (పరమేణ శుక్రేణ)

ఉత్తమ శుద్ధభావముతో (శుక్రమ్) శుద్ధికారకమగు యజ్ఞమును (చన్ద్రేణ) సువర్ణముచే (చన్ద్రమ్) సువర్ణమును మరియు (అమృతేన) నాశరహితమగు విజ్ఞానముచే (అమృతమ్) మోక్షసుఖమును (క్రీణామి) గ్రహించుచున్నానో అట్లే నీవును (త్వా) దానిని పొందుము.॥౨౬॥

**భావార్థము** :- తనుమనోధనములచే పరమేశ్వరోపాసనాది లక్షణములతో గూడిన యజ్ఞమును నిరంతర మనుష్ఠించి సాటిలేని పుష్టిని పొందవలయును.॥౨౬॥

26. In the yajna, we should please the learned performer by offering him cash and kind. May the praiseworthy brilliance of the sun make me strong through its thousandfold abundance. O wise person, may we also obtain the riches, which thou hast secured through thy rule over the earth. Just as I accomplish the sacrifice through noble, pure sentiments, earn gold with gold, attain to salvation through immortal knowledge, so may thou!.

౧౨౭. మిత్రో న ఇత్యస్య వత్స ఋషిః, విద్వాన్ దేవతా, భురిగ్బ్రాహ్మీ పంక్తి శ్ఛన్దః, పంచమః స్వరః.

మనుష్యై ర్విదుషా సహ విదుషైశ్చ కథం వర్తితవ్యమిత్యుపదిశ్యతే.

విద్వాంసులు, మనుష్యులు పరస్పరమెట్లుండవలయునను ఉపదేశమిందుగలదు.

౧౨౭ మిత్రో నఽ ఏహి సుమిత్రధఽ ఇన్ద్రస్యోరు మావిశ దక్షిణ ముశన్నుశ

న్తఀస్యోనః స్యోనమ్। స్వాన భ్రాజాఙ్ఘారే బంభారే హస్త సుహస్త

కృశాన వేతే వః సోమక్రయణా స్తాన్రక్షధ్వ మ్మావో దభన్ ॥౨౭॥

ప.వి:- మిత్రః, నః, ఆ, ఇహి, సుమిత్రధ ఇతి సు+ మిత్రధః, ఇంద్రస్య, ఉరుమ్, ఆ,విశ, దక్షిణమ్, ఉశన్, ఉశంతమ్, స్యోనః, స్యోనమ్,స్వాన, భ్రాజ, అఙ్ఘారే, బంభారే, హస్త, సుహస్తేతి సు+హస్త, కృశానో ఽ ఇతి కృశానో, ఏతే, వః, సోమ క్రయణా ఇతి సోమ+ క్రయణాః, తాన్, రక్షధ్వమ్, మా, వః, దభన్.॥౨౭॥

పదార్థః :- (మిత్రః) సుహృత్ సన్(నః) అస్మాన్ (ఆ) ఆగమనే (ఇహి) ప్రాప్నుహి (సుమిత్రధః) యః శోభనాని మిత్రాణి దధాతి సః (ఇన్ద్రస్య) పరమైశ్వర్యస్య సభాధ్యక్షస్య విదుషః (ఉరుమ్) బహ్వైశ్వర్యాదవం స్వీకరణం వా (ఆ) సమంతాత్ (విశ) (దక్షిణమ్)

ఉత్తమాంగం దక్షిణభాగమ్. (ఉశన్) కామయన్ (ఉశంతమ్) కామయంతమ్ (స్యోనః) సుఖకారకః (స్యోనమ్) సుఖమ్. స్యోనమితి సుఖనామసు పఠితమ్. నిఘం 3.౬.(స్వాన) స్వనత్యుపదిశతి యస్తత్సంబుద్ధౌ. (భ్రాజ) యో భ్రాజతే ప్రకాశతే తత్సంబుద్ధౌ (అఙ్ఘారే) అఙ్ఘస్య ఫలస్యారిః శత్రుస్తత్ సంబుద్ధౌ (బంభారే) బంధానాం సువిచార నిరోధకానాం శత్రుస్తత్సంబుద్ధౌ. అత్ర వర్ణవ్యత్యయేన ధస్య భః (హస్త) హసన్తి ప్రసన్నాభవన్తి యస్మాత్తత్సంబుద్ధౌ (సుహస్త) శోభనా హస్తక్రియా యస్య తత్సంబుద్ధౌ (కృశానో) దుష్టాన్ కృశతి తత్సంబుద్ధౌ (ఏతే) సర్వే ధార్మికాః ప్రజాస్థా భృత్యా వా (వః) యుష్మాన్ (సోమక్రయణాః) యే సోమానుత్తమాన్ పదార్థాన్ క్రీణన్తి తే(తాన్) సర్వాన్(రక్షధ్వమ్) సతతం పాలయత. అత్ర వ్యత్యయేనాత్మనేపదమ్ (మా) నిషేధే (వః) యుష్మాన్ (దభన్) హింసేయుః. అత్ర వికరణవ్యత్యయో లిఙర్థే లుఙ్ చ. అయం మంత్రః. శత. 3.3.3. ౧౦-౧౨ వ్యాఖ్యాతః.॥౨౬॥

అన్వయః :- హే స్వాన! భ్రాజాంఘారే బంభారే హస్త సుహస్త కృశానో సభాధ్యక్ష సుమిత్రధో మిత్రః స్యోన ఉశꣳస్త్వం నోఽస్మానేహి దక్షిణముమురుముశంతం స్యోనమావిశ. హేమనుష్యా ఏత ఇంద్రస్య విదుషః సోమక్రయణా మనుష్యా వోయుష్మాన్ రక్షంతు యూయమేతాన్ రక్షధ్వమ్. యథాతాన్ సర్వాన్ వో యుష్మాన్ శత్రవో మా దభన్ హింసితారో న భవేయు స్తథైవ పరస్పరం సంప్రీత్యా మిలిత్వాఽనుష్ఠేయమ్.॥౨౬॥

భావార్థః:-రాజప్రజాపురుషైః పరస్పరం ప్రీత్యోపకారే ధర్మ్యే వ్యవహారే చ వర్తిత్వాశత్రూన్నివార్యా విద్యాంధకారం వినాశ్య చక్రవర్తిరాజ్యం ప్రశాస్యానందే సదా స్థాతవ్యమ్.॥౨౬॥

పదార్థము :- (స్వాన) ఓ యుపదేష్టా! (భ్రాజ) ప్రకాశకా! (అంఘారే) కల్లకపటములకు వైరీ! (బంభారే) సద్విచారముల నిరోధకుల విరోధీ! (హస్త) ఎల్లరను ప్రసన్న మొనర్చువాడా! (సుహస్త) శుభమగు హస్తక్రియల నెరిగినవాడా! (కృశానో) దుష్టులను కృశింపజేయువాడా! (సుమిత్రధః) ఉత్తమమిత్రులను ధరించువాడా! (మిత్రః) సర్వమిత్రా! (స్యోనః ఉషన్) సుఖముల నాకాంక్షించు సభాధ్యక్షా! నీవు (నః) మాకు (ఏహి) బాగుగ ప్రాప్తించుము (దక్షిణమ్) ఉత్తమాంగములతో గూడిన (ఉరుమ్) అనేక ఉత్తమపదార్థములతో నుండి స్వీకరించదగినదియు (ఉశన్తమ్) కామించదగినదియు నగు (స్యోనమ్) సుఖమును (ఆ విశ) లభింపజేయుము. ఓ సభాధ్యక్షా (ఇన్ద్రస్య) పరమైశ్వర్యవంతుడ వగు నీయొక్క మరియు విద్వాంసునియొక్క (సోమక్రయణాః) ఉత్తమ పదార్థములగొను మనుష్యులు [భృత్యులు మున్నగు వారు] (వః) మిమ్ము రక్షింతురుగాక! మీరును వారిని (రక్షధ్వమ్) సదా రక్షించుడు. మరియు శత్రువులు (తాన్ వః) మిమ్ము హింసింపసమర్థులు (మా దభన్) కాకుండునట్లు పరస్పరము ప్రీతితో నుండుడు.॥౨౬॥

**భావార్థము** :-రాజు మరియు ప్రజలు పరస్పరము ప్రీతితో ఉపకారకార్యములందు, ధర్మయుక్త వ్యవహారములందు, యథోచితముగ నుండి శత్రువుల దొలగించి, అవిద్యాంధకారము, అన్యాయతమమును నాశమొనర్చి చక్రవర్తిరాజ్యమును స్థాపించి ఆనందమున సర్వముగ్నులై యుందురు గాక! ॥౨౭॥

27. O king, famous for eloquence, brilliance, enmity to fraud, antagonism to the thoughtless, pleasing manners, dexterity, defeating the designs of the ill - minded, friendship, and the art of befriending others, with longing for delight, come unto us !.

May thou, with a beautiful and healthy body, and endowed with all cherished objects, enjoy, enviable happiness. These intelligent and faithfull subjects and servants, who all round protect you, should be protected by you to ward off your enemy from doing injury unto you.

౧౨౮. పరిమాగ్న ఇత్యస్య వత్సఋషిః. అగ్నిర్దేవతా, పూర్వార్ధస్య సామ్నీబృహతీ ఛన్దః

మధ్యమః స్వరః. ఉత్తరార్ధస్య సామ్న్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

సర్వైర్మనుష్యైః సర్వేషు కర్తవ్యేషు శుభకర్మానుష్ఠానేషు పరమేశ్వరః సదా ప్రార్థనీయ ఇత్యుపదిశ్యతే.

సమస్త కర్తవ్య శుభకార్యముల ఆది మధ్య అవసానములందు మానవులెల్లరును

పరమేశ్వరుని సదా ప్రార్థించవలయునని యుపదేశించబడుచున్నది.

౧౨౮ పరిమాగ్నే దుశ్చరితా ద్బాధస్వా మా సుచరితే భజ।

ఉదాయుషా స్వాయుషోదస్థా మమృతాం॥ ౨౮ అను॥౨౮॥

ప.వి:-పరి, మా, అగ్నే, దుశ్చరితాదితి దుః+చరితాత్, బాధస్వ, ఆ, మా, సుచరిత ఇతి సు+చరితే, భజ, ఉత్, ఆయుషా, స్వాయుషేతి సు+ ఆయుషా, ఉత్,అస్థామ్, అమృతాన్, అను.॥౨౮॥

పదార్థః :-(పరి) సర్వతః (మా) మామ్ (అగ్నే) విజ్ఞానస్వరూప దయాలో జగదీశ్వర! (దుశ్చరితాత్) దుష్టాచరణాత్ (బాధస్వ) నివర్తయ (ఆ) సమన్తాత్ (మా) మామ్ (సుచరితే) యస్మిన్ శోభనాని చరితాని ధర్మ్యే వ్యవహారే తస్మిన్ (భజ)స్థాపయ (ఉత్) అపి (ఆయుషా) జీవనేన (స్వాయుషా) శోభనమాయుర్జీవనం ప్రాణధారణం యస్మిన్స్తేన సహ (ఉత్) ఉత్కృష్టే (అస్థామ్) తిష్ఠేయమ్ (అమృతాన్) ప్రాప్తమోక్షాన్ సదేహాన్ విగతదేహాన్ వా విదుషో ముక్త్యానందానుత్తమాన్ భోగాన్ వా (అను) అనుకూల్యే. అయం మంత్రః శత. 3. 3.3.౧౩-౧౪ వ్యాఖ్యాతః.॥౨౮॥

అన్వయః :- హే అగ్నే! జగదీశ్వర త్వం కృపయా యేన కర్మణాహం స్వాయుషా యుషాఽమృతాన్ ప్రాప్తమోక్షాన్ సదేహాన్ విగతదేహాన్ వా విదుషోఽమృతాత్మభోగాన్ వోదస్థాముత్కృష్టతయా ప్రాప్నుయామ్. తేన మా మాం సంయోజ్య దుశ్చరితాదుద్బాధస్వ పృథక్ కురు, పృథక్ కృత్వా మా మాం యేన కర్మణాఽహం సుచరితేఽన్వాభజ.॥౨౭॥

భావార్థః :- మనుష్యైరధర్మత్యాగాయ ధర్మగ్రహణాయ సత్యభావేన ప్రార్థితోఽయం పరమాత్మా యథైతానధర్మాద్వియోజ్య ధర్మే సద్యః ప్రవర్తయతి తథైవ సైరపి యావజ్జీవనం తావత్సర్వం ధర్మాచరణే నీత్వా సంసారముక్తిసుఖాని సేవనీయాని.॥౨౭॥

పదార్థము :- (అగ్నే) ఓ జగదీశ్వరా! నీవు దయతో నేనే కర్మచే (స్వాయుషా) శుభకరమగు ప్రాణమును ధరించిన (ఆయుషా) జీవనముతో (అమృతాన్) దేహముతోనో, దేహములేకుండనో మోక్షము పొందిన విద్వాంసులను [ముక్త్యానంద ఉత్తమభోగములను] (ఉదస్థామ్)చక్కగా పొంద గలుగుదునో, అట్టి కర్మతో (మా) నన్ను సంయుక్తపరచి (దుశ్చరితాత్) దుష్టాచరణమునుండి (ఉద్బాధస్వ) విడదీసి (మా) నన్ను (సుచరితే) ఉత్తమములగు ధర్మాచరణముతో గూడ వ్యవహారమున (అనుభజ) చక్కగా స్థిరపరచుము.॥౨౭॥

భావార్థము :- అధర్మము త్యజించుటకును, ధర్మమును గ్రహించుటకును సత్యమైన ప్రేమతో మనుష్యులు ప్రార్థించవలయును. ప్రార్థించబడిన పరమాత్మ శీఘ్రముగ అధర్మమునుండి తొలగి ధర్మమునందు ప్రవృత్తమొనర్చును. అట్లే సర్వమానవులును జీవించియున్నంతవరకు ధర్మాచరణమునందే యుండి ఇహపర సుఖముల ననుభవించవలెను. ॥౨౭॥

28. Oh God, dissuade me from sin, and establish me firmly in righteousness. May I enjoy the pleasures of final beatitude by leading a long and virtuous life!.

౧౫౭. ప్రతిపన్థామిత్యస్య వత్స ఋషిః. అగ్నిర్దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛందః. గాన్ధారః స్వరః.

పునః స కిమర్థం ప్రార్థనీయ ఇత్యుపదిశ్యతే.

ఆ పరమేశ్వరునేల ప్రార్థించవలయు నను విషయ మిందుపదేశించబడెను.

౧౫౭ ప్రతి పన్థా మపద్మహి స్వస్తి గామనేహసమ్।

యేన విశ్వాః పరిద్విషో వృణక్తి విన్దతే వసు ॥౨౮॥

ప.వి:- ప్రతి, పన్థామ్, అపద్మహి, స్వస్తి గామితి స్వస్తి+గామ్, అనేహసమ్, యేన, విశ్వాః, పరి, ద్విషః, వృణక్తి, విన్దతే, వసు.॥౨౮॥

పదార్థః :- (ప్రతి) ప్రత్యక్షే వీప్సాయాం చ (పంథామ్) మార్గం మార్గమ్ (అపద్మహి) ప్రాప్నుయామ (స్వస్తిగామ్) స్వస్తిసుఖం గచ్ఛతి యేన తమ్. అత్ర జన సన ఖన. అ. 3. ౨. ౬౭. అనేన విట్ ప్రత్యయః (అనేహసమ్) అవిద్యమానాని ఏహాంసి హననాని యస్మింస్తమ్. అత్ర నఞి హన ఏహ. చ.ఉ. ४-౨౨४. అనేనాయం సిద్ధః (యేన) మార్గేణ (విశ్వాః) సర్వాః (పరి) సర్వతః (ద్విషః) ద్విషన్త్య అప్రీణయన్తి యాభ్యః శత్రుసేనాభ్యో దుఃఖక్రియాభ్యో వా తాః. అత్ర కృతో బహులమితి హేతౌ క్విప్ (వృణక్తి) వర్జయతి. అత్రాంతర్గతో ణ్యర్థః (విన్దతే)లభతే (వసు) సుఖకారకం ధనమ్. అయం మంత్రః. శత. 3.3.3. ౧౫-౧౬ వ్యాఖ్యాతః.॥౨౯॥

అన్వయః :- హే జగదీశ్వరాగ్నే! త్వదనుగృహీతాః పురుషార్థినో భూత్వా వయం యేన విద్వాన్ విశ్వాః ద్విషః పరివృణక్తి వసువిన్దతే తమనేహసం స్వస్తిగాం పన్థాం మార్గం ప్రత్యపద్మహి ప్రత్యక్షతయా వ్యాప్త్య ప్రాప్నుయామ. ॥౨౯॥

భావార్థః:- మనుష్యై ర్ద్వేషాదిత్యాగాయ విద్యాధనప్రాప్తయే ధర్మమార్గప్రకాశాయేశ్వర ప్రార్థనా ధర్మవిద్వత్సేవా చ నిత్యం కార్యా. ॥౨౯॥

పదార్థము :- ఓ పరమేశ్వరా! మీ యనుగ్రహముచే మేము పురుషార్థులమై (యేన) ఏ మార్గమున విద్వాంసుడు (విశ్వాః ద్విషః) సమస్త శత్రుసేనలను, దుఃఖములను గలిగించు భోగక్రియలను (పరివృణక్తి) సకల విధముల దూరమొనర్చునో మరియు (వసు) సుఖముల గలిగించు ధనమును (విందతే) పొందునో [అట్టే మేమును] (అనేహసమ్) హింసారహితమును (స్వస్తిగామ్) సుఖముగ ప్రయాణించదగు (పన్థామ్) మార్గమును (ప్రతి అపద్మహి) ప్రత్యక్షముగ పొందుదుము.॥౨౯॥

భావార్థము :- ద్వేషాదుల త్యజించుటకు, విద్య మున్నగు ధనములను పొందుటకు ధర్మమార్గ[ప్రకాశ]మున వెలుతురుకొరకు ఈశ్వర ప్రార్థన, ధర్మసేవ, ధార్మికవిద్వాంసుల సేవ నిరంతర మొనర్చుట మనుష్యుల కుచితమై యున్నది.॥౨౯॥

29. May we tread the path free from sin, and full of delight, by which a wise man overcomes all carnal pleasures, and gathers wealth.

౧౩౦. అదిత్యా స్త్వగసీత్యస్య వత్స ఋషిః, వరుణో దేవతా, పూర్వస్య స్వరాడ్యాజుషీ త్రిష్టుప్,

అస్తభ్నాదిత్యన్తస్యార్షీ త్రిష్టుప్ ఛన్దః. ధైవతః స్వరః.

అథేశ్వరసూర్యవాయుగుణా ఉపదిశ్యంతే.

ఈశ్వర, సూర్య వాయువుల గుణము లీ మంత్రమం దుపదేశించెను.

౧౫౮ అదిత్యా స్త్వగస్యదిత్యై సద౨ ఆసీద। అస్తభ్నాద్ ద్యాం
వృషభో౨ అన్తరిక్షమమిమీత వరిమాణం పృథివ్యాః।
ఆసీదద్విశ్వా భువనాని సమ్రాడ్విశ్వేత్తాని వరుణస్య వ్రతాని ॥30॥

ప.వి:- అదిత్యాః, త్వక్, అసి, అదిత్యై, సదః, ఆ, సీద, అస్తభ్నాత్, ద్యామ్, వృషభః, అన్తరిక్షమ్, అమిమీత, వరిమాణమ్, పృథివ్యాః ఆ, అసీదత్, విశ్వా, భువనాని సమ్రాడితి సమ్+ రాట్, విశ్వా, ఇత్, తాని, వరుణస్య, వ్రతాని.॥30॥

పదార్థః :-(అదిత్యాః) పృథివ్యాదేః (త్వక్) యస్త్వచతి సంవృణోతి సః (అసి) అస్తి వా. అత్ర పక్షే సర్వత్ర వ్యత్యయః (అదిత్యై) పృథివ్యాదిసృష్టయే (సదః) స్థాపనమ్ (ఆ) సమన్తాత్ (సీద) సాదయతి సాదయసి వా. అత్ర వ్యత్యయో౽న్తర్గతో ణ్యర్థశ్చ (అస్తభ్నాత్) స్తభ్నాసి స్తభ్నాతి ధరతి వా. అత్ర లడర్థే లజ్. (ద్యామ్) సూర్యాదికం ప్రకాశం వా (వృషభః) శ్రేష్ఠః (అన్తరిక్షమ్) అవకాశమ్ (అమిమీత) నిర్మిమీతే. అత్రాపి లడర్థే లజ్ (వరిమాణమ్) వరస్య భావమ్ (పృథివ్యాః) అంతరిక్షస్యావకాశస్య మధ్యే. పృథివీత్యంతరిక్షనామసు పఠితమ్. నిఘం ౧.3. (ఆ) సర్వతః (అసీదత్) సాదయసి సాదయత్యవస్థాపయతి వా. (విశ్వా) సర్వాణి (భువనాని) లోకాన్ (సమ్రాట్) యః సమ్యగ్ రాజతే సః (విశ్వా) అఖిలాని (ఇత్) ఏవ (తాని) ఏతాని (వరుణస్య) పరమేశ్వరస్య సూర్యస్య వాయోర్వా (వ్రతాని )శీలాని. అయం మంత్రః. శ. 3.3.౪. ౧-౫ వ్యాఖ్యాతః.॥30॥

అన్వయః :-హే జగదీశ్వర! యతో వృషభస్త్వమదిత్యాస్త్వగస్యదిత్యై సద ఆసీదాసాదయసి ద్యామస్తభ్నాత్ స్తభ్నాసి వరిమాణమన్తరిక్షమమిమీత నిర్మిమీషే. సమ్రాట్ సన్ పృథివ్యా అన్తరిక్షస్య మధ్యే విశ్వా భువనాన్యాసీదదా సాదయస్యస్మాత్తాన్యేతాని విశ్వా సర్వాణి వరుణస్య తవేదేవ వ్రతాని శీలాని సంతీతి వయముపదిశ్మహి విజానీయామిత్యేకః.

యో వృషభః సమ్రాట్ సూర్యో వాయుశ్చాదిత్యాస్త్వ గస్యస్తి సంవృణోత్యదిత్యై సద ఆసీదాసాదయతి ద్యామస్తభ్నాత్ స్తభ్నాతి వరిమాణమన్తరిక్షమవకాశ మమిమీత నిర్మిమీతే పృథివ్యా అన్తరిక్షస్య మధ్యే విశ్వా భువనాన్యాసీదదాసాదయతి తస్య తాన్యేతాని విశ్వా సర్వాణి వరుణస్య సూర్యస్య వాయో శ్చేదేవ వ్రతాని శీలాని సన్తీతి వయముపదిశ్మహీతి ద్వితీయః.॥30॥

**భావార్థః :-** అత్ర శ్లేషాలంకారః. పూర్వస్మాన్మంత్రాదపద్మహీతి పదమనువర్తతే. పరమేశ్వర స్యైవైష స్వభావో యదిదం సర్వమభివ్యాప్య రచయిత్వా ధరత్యేవం సూర్యవాయ్వోరపి ప్రకాశ ధారణస్వభావోఽస్తి. ॥30॥

**పదార్థము :-** ఓ జగదీశ్వరా! నీవు (అదిత్యాః) పృథివిని (త్వక్‌అసి) కప్పువాడవు (వృషభః) శ్రేష్ఠగుణయుక్తుడవగు నీవు (అదిత్యై) పృథివ్యాదుల సృష్టించుటకు (సదః) స్థాపించయోగ్యమగు వ్యవస్థను (ఆసీద) స్థాపించుచున్నావు (ద్యామ్) సూర్యాదులను (అస్తభ్నాత్) ధారణమొనర్చుచున్నావు (పరిమాణమ్) అత్యుత్తమ మగు (అన్తరిక్షమ్) ఆకాశమును (అమిమీత) రచించితివి (సమ్రాట్) శ్రేష్ఠమగు ప్రకాశమును పొందిన సర్వాధిపతివగు నీవు (పృథివ్యాః) అంతరిక్షము మధ్య (విశ్వా భువనాని) సమస్తలోకములను (ఆసీదత్) స్థాపించుచున్నావు. కావున (తాని విశ్వా) అట్టి యీ సమస్తము (వరుణస్య తే ఇత్) శ్రేష్ఠరూపుడవగు నీ (వ్రతాని) సత్యస్వభావము మరియు కర్మలేయని మేము (అపద్మహి) ఎరుగుచున్నాము **[ఇది మొదటి యర్థము].**

(వృషభః) అత్యుత్తముడు (సమ్రాట్) స్వయంప్రకాశుడునగు సూర్యుడు మరియు వాయువు (అదిత్యాః త్వక్ అసి) అవి పృథివి మున్నగువానికి పైకప్పులుగ నగుచున్నవి లేక (అదిత్యైః) పృథివి మున్నగు సృష్టికొరకు (సదః) లోకములను (ఆసీద) స్థాపించుచున్నవి. (ద్యామ్ అస్తభ్నాత్) ప్రకాశమును ధారణ మొనర్చుచున్నవి (పరిమాణమ్ అన్తరిక్షమ్) శ్రేష్ఠమగు ఆకాశమును (అమిమీత) రచించుచున్నవి మరియు (పృథివ్యాః) ఆకాశమధ్యమందు (విశ్వా-భువనాని ఆసీదత్) సకలలోకములను స్థాపించుచున్నవి (తాని విశ్వా) ఆ సమస్తము (తే వరుణస్య ఇత్) నిశ్చయముగ సూర్యునియొక్కయు, వాయువుయొక్కయు (వ్రతాని) స్వభావము, కర్మలునై యున్నవని మేము (అపద్మహి) ఎరుగుదుము. **(ఇది రెండవ యర్థము)**॥30॥

**భావార్థము :-** ఇందు శ్లేషాలంకారమున్నదనియు, పూర్వమంత్రమునుండి ''అపద్మహి'' అను పదానువృత్తి జరిగిన దనియు గ్రహించవలయును. సర్వవ్యాపకుడైన సూర్యుని, వాయువును రచించి ధారణమొనర్చుట పరమేశ్వరుని స్వభావమై యున్నట్లే ప్రకాశమొనర్చుట, స్థూలలోకముల ధారణమొనర్చుట సూర్య వాయువుల స్వభావమై యున్నది. ॥30॥

30. O God, Thou art the protector of the Earth. O Mighty Lord, Thou fixest the Earth in its Orbit. Thou Controllest the Sun. Thou hast created the beautiful sky. O Lord of all, thou fixest in space all the worlds. All these are the works of Him alone, so do we know!.

౧౫. వనేష్విత్యస్య వత్స ఋషిః. వరుణో దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తే కీదృశా ఇత్యుపదిశ్యతే. మరల పైవానిని గురించియే ఉపదేశించబడుచున్నది.

౧౫ వనేషు వ్యన్తరిక్షం తతాన వాజమర్వత్సు పయఉఽ ఉస్రియాసు।
హృత్సు క్రతుం వరుణో విక్ష్వగ్నిం దివి సూర్యమదధాత్ సోమ మద్రౌ॥31॥

ప.వి:- వనేషు, వి, అంతరిక్షమ్, తతాన, వాజమ్, అర్వత్స్విత్యర్వత్+సు, పయః, ఉస్రియాసు, హృత్స్వితి హృత్+సు, క్రతుమ్, వరుణః, విక్షు, అగ్నిమ్, దివి, సూర్యమ్, అదధాత్, సోమమ్, అద్రౌ.॥౩౧॥

పదార్థః :-(వనేషు) రశ్మిషు వృక్షసమూహేషు వా. వనమితి రశ్మినామసు పఠితమ్. నిఘం ౧.౫.(వి) విశేషార్థే (అంతరిక్షమ్) ఆకాశమ్ (తతాన) విస్తారితవాన్ విస్తారయతి వా (వాజమ్) వేగమ్ (అర్వత్సు) అశ్వేషు ప్రాప్తవేగగుణేషు విద్యుదాదిషు వా. అర్వేత్యశ్వనామసు పఠితమ్. నిఘం ౧-౧౪, (పయః) దుగ్ధమ్ (ఉస్రియాసు) గోషు. ఉస్రియేతి గోనామసు పఠితమ్. నిఘం. ౨-౧౧(హృత్సు) హృదయేషు (క్రతుమ్) ప్రజ్ఞాం కర్మ వా (వరుణః) పరమేశ్వరః ప్రాణః సూర్యో వాయుర్వా (విక్షు) ప్రజాసు (అగ్నిమ్) విద్యుతం ప్రసిద్ధమగ్నిం వా (దివి) ప్రకాశే (సూర్యమ్) సవితారమ్ (అదధాత్) ధృతవాన్ దధాతి వా (సోమమ్) అమృతాత్మకం రసం సోమవల్ల్యాద్యోషధీగణం వా (అద్రౌ) మేఘే శైలే వా. అద్రి రితి మేఘనామసు పఠితమ్. నిఘం. ౧-౧౦ అయం మంత్రః. శ. 3.3.౪. ౭. వ్యాఖ్యాతః.॥౩౧॥

అన్వయః :- యో వరుణః పరమేశ్వరః సూర్యోవాయుర్వా వనేషు కిరణేష్వరణ్యేషు వాన్తరిక్షం వితతానార్వత్సు వాజముస్రియాసు పయోహృత్సుక్రతుం విక్ష్వగ్నిం దివి సూర్యమద్రౌ సోమం చాదధాత్స ఏవ సర్వై రుపాస్యః సమ్యగుపయోజనీయో వాఽస్తి.॥౩౧॥

భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. యథా పరమేశ్వరః స్వవిద్యాప్రకాశ జగద్రచనాభ్యాం సర్వేషు పదార్థేషు తత్తత్స్వభావయుక్తాన్ గుణాన్ సంస్థాప్య విజ్ఞానాదికం వాయుసూర్యాదికం చ విస్తృణోతి. తథైవ వాయు సూర్యావపి సర్వేభ్యః సుఖం విస్తారయతః. ॥౩౧॥

పదార్థము :-(వరుణః) అత్యుత్తముడగు పరమేశ్వరుడు, సూర్యుడు, ప్రాణవాయువులు (వనేషు) కిరణములందు వనములందు (అన్తరిక్షమ్) ఆకాశమును (వితతాన) విస్తారమొనర్చెను, ఒనర్చుచున్నాడు. (అర్వత్సు) అత్యుత్తమ వేగము మున్నగు గుణములతో నున్న విద్యుత్తు మొదలగు పదార్థములందు అశ్వములు మున్నగు పశువులందు (వాజమ్) వేగమును (ఉస్రియాసు) గోవులందు (పయః) పాలను (హృత్సు) హృదయములందు (క్రతుమ్) ప్రజ్ఞాకర్మలను (విక్షు) ప్రజలలో (అగ్నిమ్) అగ్నిని (దివి) ప్రకాశమునందు (సూర్యమ్) ఆదిత్యుని (అద్రౌ) పర్వతములు మరియు మేఘములందు (సోమమ్) సోమవల్లి మున్నగు ఓషధులను మరియు శ్రేష్ఠ రసమును (అదధాత్) ధారణమొనర్చెను. కావున ఆ పరమేశ్వరునే ఉపాసించవలయును. మరియు ఆ రెంటి [సూర్యవాయువుల]నే యుపయోగించవలయును.॥౩౧॥

**భావార్థము** :-ఇందు శ్లేషాలంకారము గలదు. పరమేశ్వరుడు తన విద్యాప్రకాశముల చేతను, జగద్రచన ద్వారాను సమస్తపదార్థములందు వాని స్వభావముతో గూడిన గుణముల స్థాపించి విజ్ఞానము మున్నగు గుణముల నుంచి సూర్యవాయువులను విస్తార పరచునట్లు సూర్య వాయువులును సకలజీవుల సుఖములను విస్తరింప జేయుచున్నవి.॥30॥

31. We should worship God, Who hast created the sky over the forests, put speed in horses, milk in cows, intellect in hearts, gastric juice in men, sun in heaven, and medicinal plants like Soma in the mountains!.

౧౬౦. సూర్యస్య చక్షురిత్యస్య వత్స ఋషిః, అగ్ని ర్దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున స్తే కీదృశా ఇత్యుపదిశ్యతే.

మరల నా సూర్యవాయువు లెటువంటివను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడినది.

౧౬౦ సూర్యస్య చక్షురారోహాగ్నేరక్ష్ణః కనీనకమ్ ।
యత్రైతశేభి రీయసే భ్రాజమానో విపశ్చితా॥ 32॥

ప.వి:- సూర్యస్య, చక్షుః, ఆ, రోహ, అగ్నేః, అక్ష్ణః, కనీనకమ్, యత్ర ఏతశేభిః, ఈయసే, భ్రాజమానః, విపశ్చితేతి విపః+చితా.॥32॥

పదార్థః :-(సూర్యస్య) సవితృమండలస్య విద్యుతో వా (చక్షుః) దర్శకమ్. (ఆ) సమన్తాత్ (రోహ) దర్శయసి దర్శయతి వా. అత్ర లడర్థే లోట్. (అగ్నేః) భౌతికస్య (అక్ష్ణః) దర్శనసాధకస్య (కనీనకమ్) కనతి ప్రకాశతే యేన తత్. అత్ర కనీధాతో ర్బాహులకాదౌణాదిక ఈనక ప్రత్యయః (యత్ర) యస్మిన్ (ఏతశేభిః) విజ్ఞాన వేగాదిభిరాగమకైర్గుణైరశ్వైః. ఏతశ ఇత్యశ్వనామసు పఠితమ్. నిఘం. ౧-౧౪, (ఈయసే) విజ్ఞాయసే విజ్ఞాయతే వా (భ్రాజమానః) ప్రకాశమానః (విపశ్చితా) మేధావినా విదుషా. విపశ్చిదితి మేధావి నామసు పఠితమ్ నిఘం 3. ౧౫. అయం మన్త్రః శత. 3.3.౧.౮. వ్యాఖ్యాతః. ॥32॥

అన్వయః :-హేపరమేశ్వర! యత్ర త్వమేత శేభిర్భ్రాజమానో విపశ్చితేయసే యత్ర ప్రాణో విద్యుద్వైతశేభిర్విపశ్చితా భ్రాజమానో విజ్ఞాయతే.యత్ర త్వం స సా చ సూర్యస్యాగ్నే రక్ష్ణః కనీనకం చక్షురారోహసమన్తాద్దర్శయతి వా తత్ర వయం త్వాం తం తాం చోపాసీమహి యుఞ్జ్మహే వా.॥32॥

**భావార్థః:-అత్ర శ్లేషాలంకారః. మనుష్యైర్యథా విద్వద్భిరీశ్వరః ప్రాణో విద్యుచ్చ విజ్ఞాయోపాస్యతే సంప్రయుజ్యతే చ తథైవ విజ్ఞాయోపాస్య ఉపయోక్తవ్యాః సంప్రయోజితవ్యా చ.॥32॥**

పదార్థము :-ఓ పరమేశ్వరా! (యత్ర) నీ వెచ్చట (ఏతశేభిః) విజ్ఞానము మున్నగు గుణములతో (భ్రాజమానః) ప్రకాశమానుడవై (విపశ్చితా) మేధావియైన విద్వాంసునిచే (ఈయసే) తెలిసికొనబడుచుందువో, లేక ఎచ్చట ప్రాణవాయువు, లేదా విద్యుత్తు (ఏతశేభిః) వేగాదిగుణములచే (విపశ్చితా) విద్వాంసునిచే (భ్రాజమానః) ప్రకాశితములై (ఈయసే) విజ్ఞాతములగు [తెలియబడు] చున్నవో మరియు ఎచ్చట నీ వా ప్రాణము, విద్యుత్తు (సూర్యస్య) సూర్యుని, లేక విద్యుత్తుయొక్కయు (అగ్నేః) భౌతికాగ్నియొక్కయు (అక్ష్ణః) దర్శనసాధనములను (కనీనకమ్) ప్రకాశపరచు (చక్షుః)నేత్రములకు (ఆరోహ) చూపించుచున్నావో అచ్చటనే మేము నిన్ను ఉపాసించెదము. మరియు నా రెంటినీ యుపయోగించుకొందుము.॥32॥

**భావార్థము** :-ఇందు శ్లేషాలంకారమున్నది. విద్వాంసులు ఈశ్వరుడు, ప్రాణములు మరియు విద్యుత్తు గుణముల నెరిగి ఉపాసించుచు కార్యసిద్ధిని పొందుచున్నట్లే మానవులును వాని నెరిగి, ఉపాసించి, స్వ ప్రయోజనములను సదా సాధించుకొనవలయును.॥32॥

32. O God where resplendent through Thy qualities of knowledge, Thou art known by the learned, and where Thou createst lustrous eyes, the instruments for seeing the sun and fire, there we worship Thee!.

౧౬౧. ఉస్రావేతమిత్యస్య వత్స ఋషిః, సూర్యవిద్వాంసౌ దేవతే, పూర్వస్య నిచృదార్షీగాయత్రీ ఛన్దః, పంచమః స్వరః; స్వస్తీత్యన్తస్య యాజుషీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ సూర్యవిద్వాంసౌ కథం భూతావేతాభ్యాం శిల్పవిదౌ కిం కుర్యాతామిత్యుపదిశ్యతే.

సూర్యుడు, విద్వాంసుడెట్టివారు? శిల్ప విద్వాంసులు వారివల్ల నెట్లు ప్రవర్తించవలయును? అను విషయ మీ మంత్రమం దుపదేశించబడినది.

౧౬౧ ఉస్రావేతం ధూర్షాహౌ యుజ్యేథా మనశ్రూ అవీరహణౌ బ్రహ్మచోదనౌ। స్వస్తి యజమానస్య గృహాన్ గచ్ఛతమ్॥33॥

ప.విః-ఉస్రౌ, ఆ, ఇతమ్, ధూర్షాహౌ, ధూః సహావితి ధూః+సహౌ, యుజ్యేథామ్, అనశ్రూ ఇత్యనశ్రూ, అవీరహణౌ, అవీరహణావిత్యవీర+హనౌ, బ్రహ్మచోదనావితి బ్రహ్మ+చోదనౌ, స్వస్తి, యజమానస్య, గృహాన్, గచ్ఛతమ్.॥33॥

**పదార్థః** :-(ఉస్రౌ) రశ్మిమంతౌ నివాసహేతూ సూర్యవాయూ. ఉస్రా ఇతి రశ్మినామసు పఠితమ్. నిఘం ౧.౫. గో నామసు చ.నిఘం ౨.౧౧. (అ) సమన్తాత్ (ఇతమ్) ప్రాప్నుతః (ధూర్షాహౌ) యౌ దురం పృథివ్యాః శరీరస్య జ్ఞానానాం వా ధారణం సహేతే తౌ (యుజ్యేథామ్) యుజ్యేతే యుక్తౌ కురుతః (అనశ్రూ) అవ్యాపినౌ (అవీరహణౌ) వీరహనన రహితౌ. (బ్రహ్మచోదనౌ) ఆత్మాన్నప్రాప్తిప్రేరకౌ (స్వస్తి) సుఖం సుఖేన వా (యజమానస్య) ధార్మికస్య జీవస్య (గృహాన్) గృహాణి (గచ్ఛతమ్) గమయతః. అయం మన్త్రః. శత. 3.3.౪.౧౨. వ్యాఖ్యాతః.॥33॥

**అన్వయః** :-హే మనుష్యా! యథా విద్యాశిల్పే చికీర్షూ యౌ బ్రహ్మచోదనా వనశ్రూ అవీరణావుస్రౌ ధూర్షా హౌ సూర్యవిద్వాంసౌ గావౌ వృషవద్యానచాలనాయైతం ప్రాప్నుతో యుజ్యేథాం యుక్తౌ కురుతో యజమానస్య గృహాన్ స్వస్తి గచ్ఛతం సుఖేన గమయత స్తౌ యూయం యుక్త్వా సేవయత.॥33॥

**భావార్థః** :-అత్ర శ్లేష వాచకలుప్తోపమాలంకారౌ. యథా సూర్యవిపశ్చితౌ క్రమేణ సర్వం ప్రకాశ్య ధృత్వా సహిత్వా యుక్త్వా ప్రాప్య సుఖం ప్రాపయత స్తథైవ శిల్పవిద్యాసంపాదకేన యానేషు యుక్త్వా సేవితే అగ్నిజలే సుఖేన సర్వత్రాభిగమనం కారయతః. ॥33॥

**పదార్థము** :- ఓ మానవులారా! విద్యను మరియు శిల్పవిద్యనుపొందగోరు వారిరువురును (బ్రహ్మచోదనౌ) అన్నము మరియు విజ్ఞానముల ప్రాప్తికొరకు (అనశ్రూ) వ్యాపించని (అవీరహణౌ) వీరులను రక్షించునవి (ఉస్రౌ) జ్యోతి యుక్తములు మరియు నివసించదగిన (ధూర్షాహౌ) పృథివి, ధర్మముల రెండింటి భారమును వహించునవియునగు [యానవాహనములకొరకు వృషభములను పొందునట్లు] (ఏతమ్) సూర్య వాయువులనెట్లు పొందుదురో, (యుజ్యేథామ్) ఎట్లు యుక్తపరతురో, ఎట్లు (యజమానస్య) ధార్మిక యజమానుని (గృహాన్) గృహములకు (స్వస్తి) సుఖముగ (గచ్ఛతమ్) వెళ్లుచుందురో అట్లే మీరును వానిని యుక్తితో సమకూర్చుకొని కార్యములను సాధించుచుండుడు.॥33॥

**భావార్థము** :-ఈ మంత్రమున శ్లేష వాచక లుప్తోపమాలంకారము లున్నవి. ఏ విధముగ సూర్యుడు, విద్వాంసుడు సమస్తపదార్థములను ధరించువారుగ, సహనవంతులుగ, పొందబడినవారుగ సౌఖ్యములను గలిగింపజేయుచుందురో, అదే విధముగ శిల్పవిద్యలనెరుగు విద్వాంసులద్వారా రథములు మున్నగు యానములందు యుక్తితో సేవన మొనర్పబడిన అగ్ని మరియు జలములు వాహనములను నడిపించి సర్వత్రా సుఖపూర్వకముగా యానమొనర్ప జేయుచున్నవి.॥33॥

33. Let man and woman, who study the Vedas kill not their heroes, are limited in resources, be ever joyous, who live together and are fit to bear the burden of domestic life, be united together in married life. May such couples visit the houses of religious persons and give them happiness.

౧౬౨. భద్రో మేఽసీత్యస్య వత్సఋషిః, యజమానో దేవతా, పూర్వస్య భురిగార్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః, మా త్వేత్యస్య, భురిగార్షీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః. శ్యేనో భూత్వేత్యస్య విరాడార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారఃస్వరః.

తేన యానేన విదుషా కిం కిం కర్తవ్య మిత్యుపదిశ్యతే.

ఆ యానముచే విద్వాంసుడేమి చేయవలయునో ఉపదేశించబడినది.

౧౬౨ భద్రో మేఽసి ప్రచ్యవస్వ భువస్పతే విశ్వాన్యభి ధామాని। మా త్వా పరి పరిణో విదన్ మా త్వా పరిపంథినో విదన్ మాత్వా వృకాఽఅఘాయవో విదన్। శ్యేనో భూత్వా పరాపత యజమానస్య గృహాన్ గచ్ఛ తన్నౌ సఙ్స్కృతమ్ ॥౩౪॥

ప. విః- భద్రః, మే, అసి, ప్ర, చ్యవస్వ, భువః, పతే, విశ్వాని, అభి, ధామాని, మా, త్వా, పరిపరిణ ఇతి పరి+పరిణః, విదన్, మా, త్వా, పరిపంథిన ఇతి పరి+ పంథినః విదన్,మా, త్వా, వృకాః, అఘాయవః, అఘయువ ఇత్యఘ+యువః, విదన్, శ్యేనః, భూత్వా, పరా, పత, యజమానస్య, గృహాన్, గచ్ఛ, తత్, నౌ, సఙ్స్కృతమ్.॥౩౪॥

పదార్థః :-(భద్రః) సుఖకారీ (మే) మమ (అసి) భవసి ((ప్ర) ప్రకర్షే (చ్యవస్వ) గచ్ఛ (భువః) పృథివ్యాః (పతే) స్వామిన్ (విశ్వాని) సర్వాణి (అభి) ఆభిముఖ్యే (ధామాని) స్థానాని (మా) నిషేధే (త్వా) త్వాం గృహాదిషూపస్థితమ్ (పరిపరిణః) పరితః సర్వతశ్చలేన రాత్రౌ వా పరస్వాదాయిన శ్చోరాః. ఛన్దసి పరిపన్థి పరిపరిణౌ పర్యవస్థాతరి అ.౫.౨. ౮౯ అనేనైతౌ శబ్దౌ స్తేన విషయే నిపాత్యేతే (విదన్) విన్దన్తు ప్రాప్నువన్తు. అత్ర సర్వత్ర వా ఛన్దసి సర్వే విధయో భవన్తీతి నుమటోరభావో లోడర్థే లుఙ్ చ (మా) నిషేధార్థే (త్వా) ప్రవాససేవినం (త్వామ్) (పరిపన్థినః) ఉత్కోచకా దస్యవః (విదన్) లభన్తామ్ (మా) నిషేధార్థే (త్వా)

త్వామైశ్వర్యవన్తమ్ (వృకాః) స్తేనాః. వృక ఇతి స్తేన నామసు పఠితమ్. నిఘం. 3. 24. (అఘాయవః) ఆత్మనోఽఘం పాపమిచ్ఛవః (విదన్) లభన్తామ్ (శ్యేనః) శ్యేన ఇవ (భూత్వా) (పరా) దూరార్థే (పత) గచ్ఛ (యజమానస్య) సంగమం కర్తుం యోగ్యస్య పూజ్యస్య మనుష్యస్య (గృహాన్) ద్వీపఖండదేశాంతరస్థానాని (గచ్ఛ) గమనం కురు (తత్) (నౌ) ఆవయోః (సంస్కృతమ్) శిల్పవిద్యా సంస్కారయుక్తం సర్వర్తుకమ్. అయం మన్త్రః. శత. 3.3.4. 14-15 వ్యాఖ్యాతః. ॥34॥

అన్వయః :- హే భువస్పతే విద్వం స్త్వం మే మమ భద్రోఽసి యన్నౌ తవ మమ చ సంస్కృతం యానమస్తి తత్ తేన విశ్వాని ధామాన్యభి ప్రచ్యవస్వాభితః ప్రకృష్టతయా గచ్ఛ, యథా సర్వత్రాభిగచ్ఛన్తం త్వాం పరి పరిణో వృకా మా విదన్ మా లభన్తాం తథా ప్రయతస్వ. పరదేశసేవినం త్వాం యథా పరిపన్థినో వృకా మా విదన్, తథాఽనుతిష్ఠ. యథా పరదేశసేవినం త్వా మఘాయవః పాపినో మనుష్యా మా విదన్, తథాఽను జానీహి. త్వం శ్యేనో భూత్వా తేభ్యః పరాపత గచ్ఛైతాన్వా పరాపత దూరే గమయ్యైవం కృత్వా యజమానస్య గృహాన్ గచ్ఛ తయో మార్గే కించిదపి దుఃఖం న స్యాత్. ॥34॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైరుత్తమాని విమానాదీని యానాని రచయిత్వా తత్ర స్థిత్వా తాని యథాయోగ్యం ప్రచాల్య శ్యేన ఇవ ద్వీపాద్యంతరం దేశం గత్వా ధనం ప్రాప్య తస్మాదాగత్య దుష్టేభ్యః ప్రాణిభ్యో దూరే స్థిత్వా సర్వదా సుఖం భోక్తవ్యమ్. ॥34॥

పదార్థము :- (భువస్పతే) పృథివిని పాలించు విద్వాంసుడా! నీవు (మే భద్రః అసి) నాకు శుభముల నొనర్చు బంధువవు. అట్టి నీవు (నౌ సంస్కృతమ్) మన యిరువురిచే సంస్కరించబడిన యానముద్వారా (విశ్వాని ధామాని) సకలజగములందు (అభిప్రచ్యవస్వ) బాగుగా సంచరించుము. (త్వా) అట్లు భ్రమణ మొనర్చుచున్న నిన్ను (పరిపరిణః) మోసముచే రాత్రులందితరులపదార్థముల దొంగిలించు (వృకాః) దొంగలు (మా విదన్) అడ్డురాకుండునట్లు, పరదేశము పయనించు నిన్ను (పరిపంథినః) దారిదోపిడికాండ్రు (మా విదన్) దాడి చేయకుండునటులను (త్వా) పరమైశ్వర్యశాలివగు నిన్ను (అఘాయవః) పాపాత్ములగు దుష్టులు తారస పడకుండనట్లు, అపాయరహిత కర్మలనే సదా రక్షణ యొనర్చుచుండుము (శ్యేనభూత్వా) డేగపక్షితో సమముగు బలవేగములు గలవాడవై ఆ దుష్టులకు (పరాపత) దూరముగ నుండుడు, లేక ఈ దుష్టులను దూరమొనర్చుడు. ఇట్టి క్రియలనొనర్చుచు దారియందెట్టి దుఃఖములను పొందకుడు (యజమానస్య) ధార్మికులగు యజమానుల (గృహాన్) ఇండ్లకు దేశదేశాంతరములకు (గచ్ఛ) వెళ్లుచుండుడు. ॥34॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఉత్తమోత్తమ విమానాది యానముల నిర్మించి, అందు ఆరూఢులై, వానిని యథాయోగ్యముగ నడపుచు, శ్యేనపక్షి వలె ద్వీపద్వీపాంతరములకు వెళ్లి,

ధనమునార్జించి, అటనుండి క్షేమముగ తిరిగివచ్చి, దుష్టప్రాణులకు దూరముగనుండి సర్వకాలములందును స్వయముగ సుఖము లనుభవించుచు, ఇతరులను కూడ అనుభవింపజేయుట మానవు లెల్లరకును యోగ్యమై యున్నది.॥౩౪॥

34. O learned man, the Lord of Earth, thou art my gracious helper. Fly happily to all the stations in our well overhauled aeroplane. Doing so, let not thieves, robbers, and malignant opponents meet thee. Fall like a falcon upon such foes. Go to the houses of religious persons, situated in distant parts of the world.

౧౬౩. నమో మిత్రస్యేత్యస్య వత్స ఋషిః, సూర్యోదేవతా, నిచృదార్షీ జగతీ ఛందః. నిషాదః స్వరః.

పునరీశ్వరసవితారౌ కీదృశావిత్యుపదిశ్యతే.

ఈశ్వరుడు,సూర్యుడు ఎటువంటివా రను విషయ మీ మంత్రమునం దుపదేశించబడినది.

౧౬౩ నమో మిత్రస్య వరుణస్య చక్షసే మహో దేవాయ తదృతꣳ సపర్యత।
దూరే దృశే దేవజాతాయ కేతవే దివస్పుత్రాయ సూర్యాయ శꣳ సత ॥౩౫॥

ప.విః- నమః, మిత్రస్య, వరుణస్య, చక్షసే, మహః, దేవాయ, తత్, ఋతమ్, సపర్యత, దూరే దృశ ఇతి దూరే+ దృశే, దేవజాతాయేతి దేవ+జాతాయ, కేతవే, దివః, పుత్రాయ, సూర్యాయ, శꣳసత.॥౩౫॥

పదార్థః :-(నమః) సత్కారణమన్నం వా. నమ ఇత్యన్ననామసు పఠితమ్. నిఘం ౨,౭ (మిత్రస్య) సర్వజగత్సుహృదః. ప్రకాశకస్య వా(వరుణస్య) శ్రేష్ఠస్య (చక్షసే) సర్వద్రష్టుర్దర్శయితుర్వా. అత్ర షష్ఠ్యర్థే చతుర్థీతి వార్తికేన చతుర్థీ. చష్ట ఇతి పశ్యతి కర్మసు పఠితమ్ నిఘం. ౩. ౧౧ (మహః) మహసే. అత్ర సుపాం సులుగితి జేర్లుక్ (దేవాయ) దివ్యగుణాయ (తత్) చేతనస్వరూపం ప్రకాశ స్వరూపం వా (ఋతమ్) సత్యమ్ (సపర్యత) పరిచరత. సపర్యతీతి పరిచరణకర్మసు పఠితమ్.నిఘం. ౩.౫ (దూరే దృశే) యో దూరే స్థితాన్ దర్శయతి తస్మై (దేవజాతాయ) దేవైర్దివ్యైర్గుణైః ప్రసిద్ధాయ (కేతవే) విజ్ఞానస్వరూపాయ జ్ఞాపకాయ వా(దివః) ప్రకాశస్వరూపస్య (పుత్రాయ) పవిత్రకారకాయాగ్ని పుత్రాయ వా (సూర్యాయ) చరాచరాత్మనే. పరమైశ్వర్యహేతవే వా. (శꣳసత) ప్రశంసత అయం మన్త్రః. శత. ౩. ౩.౪.౨౪ వ్యాఖ్యాతః.॥౩౫॥

**అన్వయః** :- హే మనుష్యా యథా వయం యన్మిత్రస్య వరుణస్య దివ ఋతం సత్యం స్వరూపమస్తి తద్యూయమపి సపర్యత. యస్య మహో మహసే దూరేదృశే చక్షసే దేవజాతాయ కేతవే దేవాయ పుత్రాయ పవిత్రకర్త్రే సూర్యాయ పరమాత్మనే వయం నమస్కుర్మస్తస్మై యూయమపి కురుతేత్యేకః.

హే మనుష్యా యథా వయం యన్మిత్రస్య వరుణస్య దివః ప్రకాశస్వరూపస్య సూర్యలోకస్యర్థం యథార్థ స్వరూపం సేవేమహి తద్యూయమపి విద్యయా సపర్యత. యథా వయం యస్మై చక్షసే దేవజాతాయ కేతవే దివోఽగ్నేః పుత్రాయ దూరేదృశే మహోదేవాయ సూర్యాయ లోకాయ ప్రాప్త్యర్థం ప్రవర్తేమహి తథా యూయమపి ప్రవర్తధ్వమ్. ఇతి ద్వితీయః..॥౩౫॥

భావార్థః :- అత్ర శ్లేషవాచకలుప్తోపమాలంకారౌ. యస్య కృపయా ప్రకాశేన వా చోరదస్యాదయో నివర్తంతే, యతః పరమేశ్వరేణ సమః సమర్థః సూర్యేణ సమో లోకశ్చ న విద్యతే తస్మాత్ సర్వైర్మనుష్యైః స ఏవ ప్రశంసనీయ ఇతి వేద్యమ్.॥౩౫॥

పదార్థము :- ఓ మానవులారా! మే మెటుల (మిత్రస్య) ఎల్లరకు సుహృదయుడును (వరుణస్య) శ్రేష్ఠుడును (దివః) ప్రకాశస్వరూపుడును నగు పరమేశ్వరుని (యత్‌ఋతమ్) ఏ సత్యస్వరూపము గలదో (తత్) ఆ చేతనస్వరూపమును సేవించుచున్నామో, అటులనే మీరును సతతము అట్టి సేవనము (సపర్యత) ఒనర్చుడు. (మహః) గొప్పవాడును (దూరేదృశే) దూరమునగలవానిని చూపువాడును (చక్షసే) ఎల్లరను చూచువాడును (దేవజాతాయ) దివ్యగుణప్రసిద్ధుడును (కేతవే) విజ్ఞానస్వరూపుడును (దేవాయ) దివ్యగుణయుక్తుడును (పుత్రాయ) పవిత్ర మొనర్చువాడును (సూర్యాయ) చరాచరాత్మయగు పరమేశ్వరునకు మే మెటుల (నమః) నమస్కార మొనర్చుచుందుమో, అటులనే మీరును (ప్రశంసత) ఆతనిని స్తుతించుడు. **(ఇది ప్రథమార్థము)**

ఓ మనుష్యులారా (మిత్రస్య) ప్రకాశమును (వరుణస్య) శ్రేష్ఠమును (దివః) ప్రకాశస్వరూపమును నగు సూర్యలోకపు (ఋతమ్) యథార్థస్వరూప మేది గలదో (తత్) ఆ ప్రకాశస్వరూమును మీరును విద్యచే (సపర్యత) సేవించుడు. (చక్షసే) ఎల్లరను చూపించువాడును (దేవజాతాయ) దివ్యగుణములవలన ప్రసిద్ధుడును (కేతవే) జ్ఞానదాతయు (దివః) అగ్నియొక్క (పుత్రాయ) పుత్రుడును (దూరదృశే) దూరస్థిత పదార్థములను దర్శింపజేయువాడును (మహః) గొప్పవాడును (దేవాయ) దివ్యగుణయుక్తుడును నగు (సూర్యాయ) ఏ సూర్యునిపొందుటకు మే మెట్లు ప్రవృత్తుల మగుచుందుమో అటులనే మీరును పురుషార్థముల నొనర్చుడు. **(ఇది ద్వితీయార్థము).** ॥౩౫॥

**భావార్థము** :- ఈ మంత్రమునన్ శ్లేష, వాచక లుప్తోపమాలంకారము లున్నవి. ఎవని దయవలన, లేక ప్రకాశము వలన దొంగలు దోపిడీకాండ్రు మొదలగు దుష్టులు తమ కార్యములనుండి నివృత్తు లగుచుందురో నాతనినే ప్రశంసించుట, ఆతని గుణములనే ప్రసిద్ధపరచుట ఉచితము. పరమేశ్వరునికి సమానమగు సమర్థుడును లేడు.

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా పవనః సర్వాన్ సుఖయన్ సర్వాధిష్ఠానోఽస్తి, తథైవ విదుషా సంతప్తవ్యమ్.॥౪౧॥

**పదార్థము** :-సమస్త పదార్థములందు వ్యాప్తమగు వాయువు వీచుచున్నట్లు విద్యాగుణములందు వ్యాప్తమగు ఓ విద్వాంసుడా! (ఉరు) అత్యంత విస్తారముతో (క్షయాయ) విద్య, జ్ఞానోన్నతికై (విక్రమస్వ) విద్యాంగములచే పరిపూర్ణుడవు కమ్ము. మరియు (నః) మమ్ము సుఖవంతులుగ (కృధి) ఒనర్చుము. (ఘృతయోనే) జలమునకు విద్యుత్తు నిమిత్తకారణమైయున్నట్లు పదార్థముల గ్రహించు ఓ విద్వాంసుడా! విద్యుత్తువలె (ఘృతమ్) జలమును (పిబ) పానమొనర్చుము. మరియు నేను యజ్ఞపతిని తరింపజేయుచున్నట్లు నీవును (స్వాహా) ఉత్తమముగ హవనము మున్నగుకర్మల ననుష్ఠించుచు దుఃఖ, క్లేశములనుండి తరించుము. ॥౪౧॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. వాయువు ఎల్లరకును సుఖమును సమకూర్చుచు సర్వాధిష్ఠానమైయున్నట్లు విద్వాంసు డుండవలెను. ॥౪౧॥

41. O learned person, mayest thou be conversant with all branches of knowledge, for the vast development of learning. Give us happiness. Drink thou the water, the precursor of which is lightning. Just as I make the worshipper overcome all obstacles, so shouldst thou be totally free from all ills, by the regular performance of Havan!.

౨౦౮ అత్యన్యానిత్యస్యాగస్త్య ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః పూర్వోక్తాభ్యాం విరుద్ధా మనుష్యా న సేవనీయా ఇత్యుపదిశ్యతే.

మానవులు పైన దెలుపబడిన వ్యవహారములకు విరుద్ధముగా నడచు మనుష్యుల సేవించరాదను విషయ మీమంత్రమం దుపదేశించబడినది.

౨౦౮ అత్యన్యాఁ২ఽఽ অগాన్నాన్యాఁ২ఽఽ ఉపాగామర్వాక్త్వా

పరేభ్యోఽవిద మ్పరోఽవరేభ్యః। తం త్వా జుషామహే దేవ

వనస్పతే దేవయజ్యాయై దేవా స్త్వా దేవ యజ్యాయై జుషన్తాం

విష్ణవే త్వా। ఓషధే త్రాయస్వ స్వధితే మైనఁ హిఁసీః॥౪౨॥

ప.వి:- అతి, అన్యాన్, అగామ్, న, అన్యాన్, ఉప, అగామ్, అర్వాక్, త్వా, పరేభ్యః, అవిదమ్, పరః, అవరేభ్యః, తమ్, త్వా, జుషామహే, దేవ, వనస్పతే, దేవయజ్యాయా ఇతి దేవ

+ యజ్యాయై, దేవాః, త్వా, దేవయజ్యాయా ఇతి దేవ + యజ్యాయై, జుషన్తామ్, విష్ణవే, త్వా, ఓషధే, త్రాయస్వ, స్వధితే, మా, ఏనమ్, హిꣳసీః. ॥౪౨॥

పదార్థః:-(అతి) అత్యంతే (అన్యాన్) పూర్వోక్తభిన్నానవిదుషః (అగామ్) ప్రాప్నుయామ్ (న) నిషేధే (అన్యాన్) అవిదుషో విరుద్ధాన్ విదుషః (ఉప) సామీప్యే (అగామ్) ప్రాప్నుయామ్ (అర్వాక్) అవరః (త్వా) త్వాం (పరేభ్యః) ఉత్తమేభ్యః (అవిదమ్) లభేయ (పరః) ఉత్కృష్టః (అవరేభ్యః) ఉత్కృష్టేభ్యః (తమ్) అను (త్వా) త్వామ్ (జుషామహే) ప్రీణీయావు (దేవ) కమనీయ (వనస్పతే) వనానాం రక్షక (దేవయజ్యాయై) యథా దివ్యానాం సంగతయే తథా (దేవాః) విద్వాంసః (త్వా) త్వామ్ (దేవయజ్యాయై) యథోత్తమగుణదానాయ తథా (జుషన్తామ్) సేవన్తామ్ (విష్ణవే) యజ్ఞాయ (త్వా) త్వామ్ (ఓషధే) యథా సోమాద్యోషధిగణస్త్రాయతే తథా (త్రాయస్వ) రక్ష (స్వధితే) దుఃఖవిచ్ఛేదక (మా) నిషేధే (ఏనమ్) ఓషధిగణం పరం పురుషం వా (హింసీః) వినాశయేః. అయం మన్త్రః. శత. 3.౬.౪. 3.౫-౧౦. వ్యాఖ్యాతః.॥౪౨॥

అన్వయః:-హే వనస్పతే దేవ విద్వన్! యథా త్వమన్యానతీత్యాన్యానుపాగచ్ఛసి తథాఽహమన్యాన్ నాగామన్యానుపాగామ్. యస్త్వం పరేభ్యః పరోఽస్యవరేభ్యోఽర్వాక్ చ తం త్వామవిదం. యథా దేవా దేవయజ్యాయై త్వా త్వాం జుషంతే తథా త్వా త్వాం వయం జుషామహే. యథా వయం దేవయజ్యాయై త్వాం జుషామహే తథైతే సర్వే తం త్వాం జుషన్తామ్. యథౌషధిగణో విష్ణవే సంభూయ సర్వాన్ త్రాయతే తథా హే ఓషధే సర్వరోగ నివారక స్వధితే దుఃఖవిచ్ఛేదక విద్వన్! త్వా త్వాం విష్ణవే యజ్ఞాయ వయం జుషామహే. హే దేవ విద్వన్! యథాఽహమిమం యజ్ఞం న హింసామి, తథైనం త్వమపి మా హింసీః.॥౪౨॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. మనుష్యైర్నీచవ్యవహారాన్ నీచపురుషాంశ్చ త్యక్త్వోత్తమా వ్యవహారా ఉత్తమాః పురుషాశ్చ ప్రతిదినమేషితవ్యాః. ఉత్తమేభ్య ఉత్తమశిక్షాఽవరేభ్యోఽవరా చ గ్రాహ్యా యజ్ఞో యజ్ఞసామగ్రీ చ కదాచిన్న హింసనీయా సర్వైః పరస్పరం సుఖేన భవితవ్యమ్. ॥౪౨॥

పదార్థము:-(వనస్పతే) సకల మూలికలను రక్షించువాడా! (దేవ) విద్వాంసా! నీ వెటుల (అన్యాన్) విద్వాంసుల విరోధులగు మూర్ఖులను వదలి (అన్యాన్) మూర్ఖుల విరోధులగు విద్వాంసుల సన్నిధికి చేరుచున్నట్లు నేనును విద్వాంసుల విరోధులను వదలి (ఉప అగామ్) విద్వాంసుల సత్సంగమునకు

చేరుదునుగాక! నీవును (పరేభ్యః) ఉత్తములకన్న (పరః) ఉత్తముడవు. మరియు (అవరేభ్యః) చిన్నవారికంటే (అర్వాక్) చిన్నవాడవును [సూక్ష్మాతి సూక్ష్ముడవును] ఐ యున్నావు (తమ్ త్వామ్) అట్టి నిన్ను (అవిదమ్) పొందుదునుగాక! ఎట్లు(దేవాః) విద్వాంసులు (దేవయజ్యాయై) ఉత్తమ గుణములను ఒసగుటకై (త్వా) నిన్ను కోరుచుందురో మేమును (త్వా) నిన్ను (జుషామహే) అభిలషింతుముగాక! మరియు మేము (దేవయజ్యాయై) సద్గుణముల సాంగత్యమునకై (త్వా) నిన్ను కోరుచున్నట్లు మీరెల్లరును (జుషన్తామ్) కోరుదురుగాక! ఓషధుల సమూహము (విష్ణవే) యజ్ఞమున కెట్లు సిద్ధమై ఎల్లరను (త్రాయస్వ) రక్షించుచున్నదో, అట్లే రోగములను దూరమొనర్చువాడవును (స్వధితే) దుఃఖనాశకుడవగు ఓ విద్వాంసా! (త్వా) నిన్ను మేము యజ్ఞమునకై కోరుచున్నాము. నే నీ యజ్ఞమును నష్టపరచగోరనట్లు నీవును (ఏనమ్) ఈ యజ్ఞమును (మా హింసీః) భగ్నమొనర్పకుము. ॥42॥

**భావార్థము** :-ఇందు వాచకలుప్తోపమాలంకారము గలదు. నీచమానవులను, నీచ వ్యవహారములను త్యజించి, ఉత్తమ విద్వాంసులను, ఉత్తమోత్తమ వ్యవహారములను సదా అభిలషించుచు ఉత్తములనుండి ఉత్తమశిక్షను, న్యూనుల[అవరుల]నుండి న్యూనశిక్షను గ్రహించవలయును. యజ్ఞమును, యజ్ఞపదార్థముల నెన్నటికిని తిరస్కరించకూడదు. జనులెల్లరును పరస్పర స్నేహముతో సుఖముగ నుండవలెను. ॥42॥

42. O learned botanist, just as thou shunnest the foolish and seekest the company of the wise, so may I avoid the company of the enemies of the wise, and go to the wise. May I approach thee more learned among the learned but the humblest among the humble. Just as the learned long for the acquisition of good qualities, so do I. Just as medicinal herbs, rendered fit for the yajana protect all, so do we for sacrifce hail thee, the remover of diseases, and the assuager of affliction!.

O learned person, just as I do not want to spoil this yajna, so shouldst thou not!.

౨౦౮ ద్యామ్మా లేఖీరిత్యస్యాగస్త్య ఋషిః, యజ్ఞో దేవతా, బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైర్యజ్ఞార్థా విద్యా సర్వదా సంసేవనీయేత్యుపదిశ్యతే.

యజ్ఞమును సిద్ధపరచు విద్యను మానవులు నిత్యము సేవించుటయోగ్య మను

విషయ మీ మంత్రమునం దుపదేశించబడుచున్నది.

౨౦౮ ద్యామ్మా లేఖీ రన్తరిక్షం మ్మా హిఁసీః పృథివ్యా సంభవ। అయఁహి త్వా స్వధితి స్తేతిజానః ప్రణినాయ మహతే సౌభగాయ। అతస్త్వన్దేవ వనస్పతే శతవల్శో విరోహ సహస్రవల్శా వి వయఁరుహేమ ॥43॥

ప.వి:- ద్యామ్, మా, లేఖీః, అన్తరిక్షమ్, మా, హింసీః, పృథివ్యా, సమ్, భవ, అయమ్, హి, త్వా, స్వధితిరితి స్వ + ధితిః, తేతిజానః, ప్రణినాయ, ప్రనినాయేతి ప్ర + నినాయ, మహతే, సౌభగాయ, అతః, త్వమ్, దేవ, వనస్పతే, శతవల్శ ఇతి శత + వల్శః, వి, రోహ, సహస్రవల్శాఇతి సహస్రవల్శాః, వి, వయమ్, రుహేమ.॥43॥

పదార్థః:-(ద్యామ్) సూర్యప్రకాశమ్ (మా) నిషేధే (లేఖీః) లిఖేః (అన్తరిక్షమ్) అవకాశమ్ (మా) నిషేధే (హింసీః) హన్యాః (పృథివ్యా) సహ (సమ్) క్రియాయోగే (భవ) (అయమ్) వక్ష్యమాణః (హి) యతః (త్వా) త్వామ్ (స్వధితిః) యథా వజ్ర స్తథా (తేతిజానః) భృశం తీక్ష్ణః, (ప్రణినాయ) యథా త్వం ప్రణయేస్తథా (మహతే) విశిష్టాయ పూజ్యతమాయ (సౌభగాయ) సుష్ఠుభగానామైశ్వర్యాణాం భవాయ (అతః) కారణాత్ (త్వమ్) (దేవ) అనర్థిత (వనస్పతే) వనానాం రక్షక (శతవల్శః) యథా బహ్వఙ్కురో వృక్షస్తథా (విరోహ) వివిధతయా ప్రాదుర్భవ (సహస్రవల్శాః) యథా బహుమూలా వృక్షా రోహన్తి తథా (వి) వివిధతయా (రుహేమ) వర్ధేమహి. అయం మన్త్రః. శత.3.6. 4.13-16. వ్యాఖ్యాతః.॥43॥

అన్వయః:-హే విద్వన్! యథాఽహం ద్యాం న లిఖామి, తథా త్వమేనాం మా లేఖీః. యథాఽహమన్తరిక్షం న హింసామి తథా త్వమేతన్మా హింసీః. యథాఽహం పృథివ్యా సహ సంభవామి తథైతయా సహ త్వమపి సంభవ. హి యతః కారణాత్ యథా తేతిజానః స్వధితిః శత్రూన్ విచ్ఛిద్యైశ్వర్యం ప్రాపయతి, తథా త్వమపి ప్రాపయేః. అతో వయం త్వాం మహతే సౌభగాయ సంభావయేమ. యథా కశ్చిదైశ్వర్యం ప్రణినాయ ప్రాపయతి, తథా వయం త్వాం ప్రాపయేమ. హే దేవ వనస్పతే! పూర్వోక్తేన మహతా సౌభగేన యథా శతవల్శో వృక్షో విరోహతి తథా విరోహ. యథా సహస్రవల్శా వనస్పతయో విరోహన్తి తథా వయమపి విరోహేమ. ॥43॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. ఇహ సంసారే కేనచిన్మనుష్యేణ విద్యాప్రకాశాభ్యాసః కదాచిన్నైవ త్యాజ్యః స్వాతన్త్ర్యావకాశ శ్చైశ్వర్యసంభావనాయోగేనా సంఖ్యాతోన్నతికరణం చేతి.॥43॥

పదార్థము :-ఓ విద్వాంసా! సూర్యున కభిముఖుడవై (ద్యామ్) దాని ప్రకాశమును నేను కంటిపై పడనీయనట్లు నీవును దానిని (మా లేఖీః) దృష్టిగోచరము కానీయకుము. నే నెట్లు (అన్తరిక్షమ్) యథార్థ

పదార్థముల అవకాశమును నాశపరచి చెరుపనో, నీవును అట్లే వానిని (మా హిꣳసీ) నాశపరచకుము. నేనెట్లు (పృథివ్యా) పృథివిని అనుకరించుచున్నానో, అట్లే నీవును దానికి (సమ్భవ) కమ్ము (హి) ఏ కారణముచే (తేతిజానః) అత్యంత పదునుగల [కఠినమైన] (స్వధితిః) ఈ వజ్రము శత్రువులను నాశమొందించి ఐశ్వర్యము నిచ్చుచున్నదో (అతః) ఆ కారణముననే (అయమ్) ఇతడు (త్వా) నిన్ను (మహతే) అత్యంత శ్రేష్ఠ (సౌభగాయ) సౌభాగ్యముకొరకు సంపన్నమొనర్చుగాక! ఇతరపదార్థము లెట్లు ఐశ్వర్యములను (ప్రణినాయ) పొందుచున్నవో అట్లే నీకు ఐశ్వర్యమును సమకూర్చుగాక! (దేవ) ఓ ఆనందయుక్తా! (వనస్పతే) వనముల రక్షించు విద్వాంసా! (శతవల్శః) వందలకొలది అంకురములుగల వృక్షము ఫలించుచున్నట్లు నీవును ఈ యుక్త ప్రశంసనీయ సౌభాగ్యముతో (విరోహ) ఉత్తమముగా వ్యాపించుము. (సహస్రవల్శాః) వేలాది అంకురములుగల వృక్షములు ఫలించునట్లు మేమును ఉక్తసౌభాగ్యములతో వికసింపజేయుదము గాక! ॥౪౩॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఈ సంసారము [ప్రపంచము] నందే మానవుడు విద్యాప్రకాశాభ్యాసమును, స్వాతంత్ర్యమును మరియు అనేక విధములగు స్వాంతకార్యముల యున్నతిని వృద్ధినొందించుకొనవలయును. ॥౪౩॥

43. Just as I gaze not at the sun, so shouldst thou not. Just as I disturb not the proper arrangement of things, so shouldst thou not. Just as I live on the earth in a spirit of friendliness towards all, so shouldst thou.

As a well - sharpened axe, gives splendour by the removal of enemies, so may this grant thee glory.

O happy learned person, the master of forests, may thy dynasty increase, just as a tree does with its hundred roots. May our progeny increase in numbers, just as a tree does with its manifold boughs.

అత్ర (౧) యజ్ఞానుష్ఠాన (౨) స్వరూపసంపాదక (౩) విద్వత్పరమాత్మప్రార్థనా (౪) విద్యావ్యాప్తి విద్వద్వ్యాప్తినిరూపణ (౫) మృగ్వ్యాదినా యజ్ఞసాధనం, (౬,౭) సర్వవిద్యా నిమిత్తవాహోవ్యాఖ్యా ధ్యయనాధ్యాపన (౮) యజ్ఞవివృతి (౯) యోగాభ్యాసలక్షణం (౧౦) సృష్ట్యుత్పత్తి (౧౧) రీశ్వర సూర్యకర్మాభిధానం (౧౨) ప్రాణాపానక్రియానిరూపణం (౧౩) విభోరీశ్వరస్య వ్యాప్త్యుక్తి (౧౪) ర్యజ్ఞానుష్ఠానం (౧౫) సృష్టే రుపకారగ్రహణం (౧౬) సూర్యసభాధ్యక్షగుణాభిలాషో (౧౭) యజ్ఞానుష్ఠాన శిక్షాదానం (౧౮) సవితృసభాధ్యక్షకృత్యోపదేశో (౧౯) యజ్ఞాత్సిద్ధి (౨౦) రీశ్వర సభాధ్యక్షాభ్యాం కార్యసిష్పత్తి (౨౧) రేతయోః స్వరూపకృత్యవర్ణన (౨౨) మీశ్వరవద్విదుషాం వర్తమానం లక్షణం (౨౩) చేశ్వరోపాసనం (౨౪) శూరవీరగుణకథన (౨౫) మీశ్వరవిద్యుద్గుణవర్ణనం (౨౬) పరమైశ్వర్యప్రాప్తి (౨౭) రాకాశాదిదృష్టాంతేన విద్యుద్గుణవర్ణన (౨౮) మీశ్వరోపాసక గుణప్రకాశనం (౨౯) సర్వబంధనాద్విముక్తిః (౩౦) పరస్పరద్వర్ణనప్రకారో (౩౧) దుష్టత్యాగేన విదుషాం సంగకరణావశ్యకతా (౩౨) మనుష్యైర్యజ్ఞసిద్ధయే విద్యాసంగ్రహణం చోక్తమతః పంచమాధ్యాయోక్తార్థానాం చతుర్థాధ్యాయోక్తార్థైః సాకం సంగతి రస్తీతి వేదితవ్యమితి.

ఈ పంచమాధ్యాయమున యజ్ఞానుష్ఠానము, యజ్ఞస్వరూపము విద్వాంసుల మరియు పరమాత్మను గూర్చి ప్రార్థన, విద్య మరియు విద్వాంసుల వ్యాప్తినిరూపణ, అగ్ని మున్నగు పదార్థముల ద్వారా యజ్ఞసిద్ధి, సమస్త విద్యలనిమిత్తము వాణిని గూర్చి వ్యాఖ్యానము, చదువుట, చదివించుట, యజ్ఞమును గూర్చి వివరణము, యోగాభ్యాస లక్షణములు, సృష్ట్యుత్పత్తి, ఈశ్వరుడు మరియు సూర్యుని కర్మల వివరణ, ప్రాణాపాన క్రియానిరూపణ, సర్వమును నియమమున మంచు పరమేశ్వరుని వ్యాప్తిని గూర్చిన వివరణ, యజ్ఞానుష్ఠానము, సృష్టితో ఉపకారమును పొందుట, సూర్యుడు మరియు సభాధ్యక్షుని గుణముల వర్ణనము, యజ్ఞానుష్ఠానమును గూర్చి శిక్షణము, సవితా మరియు సభాధ్యక్షుని కర్మలను గూర్చి యుపదేశము, యజ్ఞముద్వారా సిద్ధినిపొందుట, ఈశ్వరుడు మరియు సభాధ్యక్షుని ద్వారా కార్యసిద్ధి, వారిస్వరూపము మరియు కర్మలను గూర్చిన వర్ణనము, ఈశ్వరుడు, విద్వాంసుల వర్తనము మరియు వారి లక్షణములు, శూరవీరులనుగూర్చి వర్ణనము, ఈశ్వరుడు మరియు విద్వాంసులను గూర్చి వర్ణనము, ఈశ్వరోపాసకుల గుణములను గూర్చి ప్రకాశము, సకల బంధనములనుండి విముక్తము, పరస్పర చర్చను గూర్చిన వివరణము, దుష్టులనుండి విముక్తి వివరణము. ఈ యర్థములను వివరించుటద్వారా పంచమాధ్యాయమున దెలుపబడిన అర్థముల సంగతీకరణము చతుర్థాధ్యాయార్థములచే దెలిసికొనవలయును.

ఇతి శ్రీ మత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుతమహావిదుషాం విరజానన్దసరస్వతీస్వామినాం శిష్యేణ దయానన్దసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే పఞ్చమోఽధ్యాయః పూర్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి ఐదవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత బీబిపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరిసిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మలుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, అర్షవిద్యావినోద ఆచార్య
'మల్లేశ్ కృష్ణారెడ్డి' సంపాద కత్వమున పరిష్కరింపబడిన
**ఐదవ అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

# యజుర్వేదభాష్యము

## షష్ఠాధ్యాయము - విషయసూచిక

ఇందులో 37 మంత్రములు, 70 ఛందస్సులు, 1902 అక్షరములు

# అథ షష్ఠోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే సప్తత్రింశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ। యద్భద్రం తన్న ఆ సువ ॥య.30,3॥

౨౦౯.అథ దేవస్య త్వేత్యస్యాగస్త్య ఋషిః, సవితా దేవతా, పంక్తిశ్ఛందః, ధైవతః స్వరః.

యవోఽసీత్యస్యాసురీ దివేత్యస్య చ భురిగార్చ్యుష్ణిక్ ఛందసీ, ఋషభః స్వరః.

అథ రాజ్యాభిషేకాయ సుశిక్షితం సభాధ్యక్షం విద్వాంసం ప్రత్యాచార్యాదయః కిం కిముపదిశే యురిత్యుపదిశ్యతే. మొదటి మంత్రమున రాజ్యాభిషేకమునకై సుశిక్షితుడైన సభాధ్యక్షుడగు విద్వాంసునికి ఆచార్యుడు మున్నగు విద్వాంసులేమేమి యుపదేశించవలయునో వివరించబడియున్నది.

౨౦౯ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామాదదే నార్యసీదమహం రక్షసా గ్రీవా అపి కృన్తామి। యవోఽసి యవయాస్మద్ద్వేషో యవయారాతీర్దివే త్వాఽన్తరిక్షాయ త్వా పృథివ్యై త్వా శుంధంతాంల్లోకాః పితృషదనాః పితృషదనమసి ॥౧॥

ప.విః-దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర + సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు + భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ఆ, దదే, నారి, అసి, ఇదమ్, అహమ్, రక్షసామ్, గ్రీవాః, అపి, కృన్తామి, యవః, అసి, యవయ, అస్మత్, ద్వేషః, యవయ, అరాతీః, దివే, త్వా, అంతరిక్షాయ, త్వా, పృథివ్యై, త్వా, శుంధంతామ్, లోకాః, పితృషదనాః, పితృషదనా ఇతి పితృ+సదనాః, పితృషదనమ్, పితృషదనమితి పితృ+సదనమ్, అసి.॥౧॥

పదార్థః :-(దేవస్య) ద్యోతమానస్య (త్వా) త్వాం సభాధ్యక్షమ్ (సవితుః) సర్వవిశ్వోత్పాదకస్య (ప్రసవే) యథైశ్వర్యసృష్టౌ (అశ్వినోః) ప్రాణోదానయోః (బాహుభ్యామ్) యథా బలవీర్యాభ్యామ్ (పూష్ణః) పుష్టినిమిత్తస్య ప్రాణస్య (హస్తాభ్యామ్) ధారణాకర్షణాభ్యామ్ (ఆదదే) గృహ్ణామి (నారి) యజ్ఞసహకారిణే

(అసి) (ఇదమ్) యుద్ధాఖ్యం కృత్వా (అహమ్) (రక్షసామ్) దుష్టకర్మకారిణామ్ (గ్రీవాః) కంఠాన్ (అపి) (కృంతామి) ఛినద్మి (యవః) సంయోగవిభాగకర్తా (అసి) (యవయ) వా ఛందసీతి..అ..౧,౪,౯. భా... వా... ఇతి వృద్ధ్యభావః (అస్మత్) అస్మాకం సకాశాత్ (ద్వేషః) ద్వేషకాన్ (యవయ) వియుహి (అరాతీః) శత్రూన్ (దివే) విద్యాదిప్రకాశాయ (త్వా) త్వాం న్యాయప్రకాశం (అంతరిక్షాయ) అంతరిక్షయమితి. నిరు.౨.౧౦. అంతరిక్షమిత్యంతరిక్ష నామసు పఠితమ్. నిఘం. ౧.౩. (త్వా) సత్యానుష్ఠానావకాశదమ్ (పృథివ్యై) భూరి రాజ్యాయ (త్వా) రాజ్యవిస్తారకమ్ (శుంధంతామ్) (లోకాః) న్యాయదృష్ట్యా సమీక్షణీయాః (పితృషదనాః) యథా పితృషు సీదంతి తే. పితర ఇతి పదనామసు పఠితమ్. నిఘం. ౫.౫. (పితృషదనమ్) యథా విద్వత్ స్థానమ్. (అసి). అయం మంత్రః. శ. ౩.౭.౧.౧-౨ వ్యాఖ్యాతః. ॥౧॥

అన్వయః :- హే సభాధ్యక్ష! యథా పితృషదనా దేవస్య సవితుః ప్రసవే అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వామాదదాతి, తథాఽహ మాదదే. యథాఽహం రక్షసాం గ్రీవాః కృంతామి, తథా త్వమపి కృంత. హే సభాధ్యక్ష! త్వం యవోఽస్యస్మద్ ద్వేషో యవయారాతీర్యవయ, తథాఽహం దివే త్వాఽన్తరిక్షాయ త్వా పృథివ్యై త్వా త్వాం శుంధామి తథేమే పితృషదనా లోకాస్త్వాం శుంధంతామ్. యతస్త్వం పితృషదనమివాసి. తస్మాత్పితృపాలకో భవ. హే సభాపతేర్నారి! భవత్యాఽప్యేవమేవ కార్యమ్. ॥౧॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే విద్యానిష్ఠా ఈశ్వరసృష్టౌ స్వస్య పరేషాం చ దుష్టతాం విధూయ రాజ్యం సేవంతే తే సుఖినో భవన్తి. ॥౧॥

**పదార్థము** :- ఓ సభాధ్యక్షా! (పితృషదనాః) పితరులందు వసించు విద్వాంసులు (దేవస్య) ప్రకాశమయుడును (సవితుః) సమస్త విశ్వమును సృష్టించువాడును నగు జగదీశ్వరునిచే (ప్రసవే) సృజింపబడిన జగమునందు (అశ్వినోః) ప్రాణాపానముల (బాహుభ్యామ్) బలముచేత, ఉత్తమ వీర్యములచేతను మరియు (పూష్ణః) పుష్టినిమిత్తమగు ప్రాణముల (హస్తాభ్యామ్) ధారణాకర్షణముల శక్తులచేతను (త్వా) నిన్ను గ్రహించుచున్నట్లు నేను (ఆ దదే) గ్రహించుచున్నాను. నేను (రక్షసామ్) దుష్టకృత్యములొనర్చు జీవముల (గ్రీవాః) మెడలను (కృన్తామి) నరికివేయునట్లు (త్వమ్ అపి) నీవును నరికివేయుము. ఓ సభాధ్యక్షా! నీవు (యవః) సంయోజ విభాజన మొనర్చువాడవై (అసి) ఉన్నావు. కావున (అస్మత్) నన్ను (ద్వేషః) ప్రీతిజూపక ద్వేషించు వైరులను (యవయ) తొలగించుము [వేరుచేయుము.] మరియు (అరాతీః) నా శత్రువులను (యవయ) దూరపరచుము.

న్యాయముగ రక్షణయొనర్చదగినవాడ నగు నేను (దివే) విద్యాదిగుణప్రకాశమునకై (త్వామ్) న్యాయప్రకాశమొనర్చు నిన్ను (అన్తరిక్షాయ) అంతరిక్షవ్యవహారరక్షణకై (త్వామ్) సత్యానుష్ఠానమున కవకాశమిచ్చు నిన్ను (పృథివ్యై) ధరణీరాజ్యమునకై (త్వా) రాజ్యవిస్తరణమొనర్చు నిన్ను నేను పవిత్రపరచునట్లు వీరును (త్వా) నిన్ను (శున్ధన్తామ్) పవిత్రమొనర్చుదురుగాక! నీవు (పితృషదనమ్) విద్వాంసుల గృహములవలె (అసి) ఉన్నావు. కావున నీవు పితరులవలె సకలప్రజలను పోషించుము. ఓ సభాపతిసతీమణీ! నీవును ఇట్లే యొనర్చుము. ॥౧॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మానవులు విద్యయందు దూరదృష్టి, విచక్షణముగలవారై ఈశ్వరసృష్టియందు స్వకీయ, పరకీయ దుష్టత్వములను దూరమొనర్చి రాజ్యమును సేవించుచుందురో అట్టివారు సుఖయుక్తులగుదురు.॥౧॥

1. O king, just as the wise and aged persons, in this world, created by the Effulgent God, accept thee, with the force and strength of vital breaths, and attraction and retention of breath, the source of strength; so do I.

Just as I cut the throats of the sinners, so shouldst thou.

O king, thou hast the power of imparting virtue and removing vice, remove from us our despisers and foes!.

Just as I sanctify thee, the exponent of justice, for the display of knowledge, thee, the embodiment of truth, for spiritual advancement; thee, the administrator, for rule over the Earth; so should these justice-loving people do.

O king thou art a father unto thine subjects, rear them up!.

O Queen, thou also shouldst behave similarly!.

౨౧౦. అగ్రేణీరిత్యస్య శాకల్య ఋషిః, సవితా దేవతా, విచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః,

దేవస్త్వేత్యస్య స్వరాట్ పంక్తిశ్ఛందః, ధైవతః స్వరః.

పునః సోఽభిషిక్తః సభాధ్యక్షః కథం ప్రవర్త్తేతేత్యుపదిశ్యతే.

అభిషిక్తుడగు సధ్యక్షుడెట్లు మెలగవలె నను విషయ మీ మంత్రమునం దుపదేశించెను.

౨౧౦ అగ్రేణీరసి స్వావేశఽఉన్నేతృణా మేతస్య విత్తాదధి త్వా స్థాస్యతి।

దేవస్త్వా సవితా మధ్వానక్తు సుపిప్పలాభ్య స్త్వౌషధీభ్యః। ద్యామగ్రేణాస్పృక్షఽ

ఆన్తరిక్ష మ్మధ్యే నాప్రాః పృథివీముపరేణాదృꣳహీః॥౨॥

ప.వి:- అగ్రేణీః, అగ్రేనీ రిత్యగ్రే+నీః, అసి, స్వావేశ ఇతి సు+ఆవేశః, ఉన్నేతృణా మిత్యుత్+నేతృణామ్, ఏతస్య, విత్తాత్, అధి, త్వా, స్థాస్యతి, దేవః, త్వా, సవితా, మధ్వా, అనక్తు, సుపిప్పలాభ్య ఇతి సు+పిప్పలాభ్యః, త్వా, ఓషధీభ్యః, ద్యామ్, అగ్రేణ, అస్పృక్షః, ఆ, అంతరిక్షమ్, మధ్యేన, అప్రాః, పృథివీమ్, ఉపరేణ, అదృꣳహీః.॥౨॥

**పదార్థః**:-(అగ్రేణీః) యథాధ్యాపకః శిష్యాన్ పితా స్వసంతానాన్ వా పురస్తాదేవ సుశిక్షయా విద్యాం ప్రాపయతి తథా (అసి)(స్వావేశః) యథాప్తః శోభనం ధర్మమావిశతి తథా నేతా (ఉన్నేతౄణాం) యథోన్నేతౄణాం ఉత్కృర్ష ప్రాపయితౄణాం రాజ్యం తథా ఏతస్య ప్రకృతం రాజ్యం పాలయితుం (విత్తాత్) విజానీహి (అధి) ఉపరిభావే (త్వా) త్వామ్ (స్థాస్యతి) (దేవః) అఖిలరాజ్యేశ్వరః (త్వా) త్వామ్ (సవితా) సర్వస్య విశ్వస్య జనితా.(మధ్వా) మధురగుణేన (అనక్తు) సించతు (సుపిప్పలాభ్యః) యథా సుష్ఠుఫలాభ్యః (త్వా) త్వామ్ (ఓషధీభ్యః) ప్రసిద్ధాభ్యః (ద్యామ్) విద్యాన్యాయప్రకాశం (అగ్రేణ) పురస్తాత్ (అస్పృక్షః) స్పృశ. అత్ర సర్వత్ర లడర్థే లుఙ్ (ఆ) సమంతాత్ (అంతరిక్షమ్) ధర్మప్రచారస్యావకాశమ్ (మధ్యమేన) మధ్యమావస్థావిశేషేణ (అప్రాః) పిపృహి (పృథివీమ్) భూమిరాజ్యమ్ (ఉపరేణ) ఉత్కృష్టనియమేన (అదృంహీః) ప్రాప్య వర్ధస్వ. అయం మంత్రః. శత.౩.౭.౧.౯. వ్యాఖ్యాతః. ॥౨॥

**అన్వయః** :- హే సభాధ్యక్ష! యథాగ్రేణీరస్తి తథా త్వమసి ఉన్నేతౄణాం స్వావేశః సన్నేతస్యైతం రాజ్యం విత్తాత్. హే రాజన్! యథా తే త్వాం రాజపురుషసమూహః సుపిప్పలాభ్య ఓషధీభ్యో మధ్వాఽనక్తు ఏవం ప్రజాపురుషసమూహోఽపి త్వాం చానక్తు. త్వమగ్రేణ యశసా ద్యామస్పృక్షో మధ్యమేన నాంతరిక్షమాప్రాః ఉపరేణ పృథివీం ప్రాప్యైవాదృంహీః. దేవః సవితా సర్వప్రేరకో జగదీశ్వరస్త్వాఽధి స్థాస్యతి.॥౨॥

**భావార్థః**:-నహి కశ్చిజ్జనో రాజప్రజాపురుషై రస్వీకృతో రాజ్యమర్హతి, న చాపి రాజ్ఞానాదృతః సామ్రాజ్యం, కీర్త్యనుక్రమేణ వినా సైన్యాపత్యం, దండనేతృత్వం, సర్వలోకాధిపతిత్వం చ. ॥౨॥

**పదార్థము** :- ఓ సభాధ్యక్షా! (అగ్రేణీః) గురువు తన శిష్యులకు, తండ్రి తన తనయులకు పఠనారంభమునకు పూర్వమునుండియే చక్కని శిక్షనుగరపి సచ్ఛీలురుగను, జితేంద్రియులుగను, ధర్మాత్ములుగను జేయుచున్నట్లు నీవు మాయెల్లరకును (అసి) ఐ యున్నావు (ఉన్నేతౄణామ్) ఉన్నతిని పెంపొందింపజేయువారి రాజ్యపాలనమువలె (స్వావేశః) సుగుణములందు ప్రవేశించువారివలె (ఏతస్య) ఈ రాజ్యపాలనమును (విత్తాత్) ఎరుగుము. ఓ రాజా! (త్వా) నిన్ను సభాసదులు (సుపిప్పలాభ్యః) ఉత్తమోత్తమఫలమునీయగల (ఓషధీభ్యః) ఓషధులనుండి (మధ్వా) నిష్పాదన [సిద్ధి] మొనర్చిన, మాధుర్యముగనుండు రసముతో (అనక్తు) సేచనమొనర్చునట్లు ప్రజలెల్లరును నిన్ను సించనమొనర్తురుగాక! నీ వీ రాజ్యమందు స్వంతమగు(అగ్రేణ) ప్రథమయశస్సుతో (ద్యామ్) విద్య మరియు రాజనీతిప్రకాశమును (అస్పృక్షః) స్పర్శించుము (మధ్యమేన) మధ్యలో [లేక తరువాతను] లభించిన యశస్సుతో (అన్తరిక్షమ్) ధర్మమార్గమును (ఆప్రాః) పూరించుము. మరియు (ఉపరేణ) స్వకీయరాజ్యనియమములచే (పృథివీమ్) ఈ పృథివీరాజ్యమును పొందియు (అదృంహీః) దృఢగాత్రులై [ముందుకు పరుగిడకుడు] (దేవః) రాజాధిరాజ [సామ్రాట్టు] (సవితా) అంతర్యామియై విశ్వమునంతయును ప్రేరేపణము నొందింపజేయు జగదీశ్వరుడు (త్వా) నిన్ను రాజుగనొనర్చి (స్థాస్యతి) నీకు అధిష్ఠాతయై యుండునుగాక!॥౨॥

**భావార్థము** :-ప్రజలద్వారా ఎన్నుకొనబడనిరాజు రాజ్యమొనర్చుటకు అర్హుడుగాడు. అటులనే రాజుచేతగాని, సభచేతగాని మర్యాదగా ఆహ్వానించబడనివాడు మంత్రిగను, ఉత్తరోత్తరముగ తన బలపరాక్రమ

సైనికయోధులను దృఢమొనర్చుకొనజాలినవాడు సేనాప్రశాసకుడుగను, యథాయోగ్యమున న్యాయముతో దండించుట యొనర్చునివాడు న్యాయాధీశుడగుటకును రాజమండలాధిపత్యమునకు యోగ్యులుగా జాలరు.॥౨॥

2. O king, thou art our leader; thou putteth upon the path of rectitude, even the leaders of a high order. Know thou this art of government!.

God, the Creator will rule over thee. Just as the state officials anoint thee with sweet juices and flower-laden herbs, so should the subjects do.

Thy first duty is to undertake the spread of knowledge and the administration of justice.

The second duty is to propagate religious truths. Thy foremost duty is to strengthen thy rule over the Earth.

౨౧౧. యా తే ధామానీత్యస్య దీర్ఘతమా ఋషిః, విష్ణుర్దేవతా, ఆర్చ్యుష్ణిక్ ఛందః, అత్రాహేత్యస్య సామ్న్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః, బ్రహ్మవనిత్వేత్యస్య నిచృద్బ్రాజాపత్యా బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునస్తం కీదృశం విదిత్వా వాణిజ్యకర్మ కుర్వాణాః జనా ఆశ్రయస్త్విదముపదిశ్యతే.

వణిజు లతని నెట్లు భావించి యాశ్రయించుదురో యీ మంత్రమున నుపదేశింపబడెను.

౨౧౧ యా తే ధామాన్యుశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృఙ్గాఽ అయాసః।
అత్రాహ తదురుగాయస్య విష్ణోః పరమమ్పదమవభారి భూరి।
బ్రహ్మవని త్వా క్షత్రవని రాయస్పోషవని పర్యూహామి।
బ్రహ్మ దృꣳహ క్షత్రం దృꣳహాయు ర్దృꣳహ ప్రజాం దృꣳహ ॥౩॥

ప.వి:- యా, తే, ధామాని, ఉశ్మసి, గమధ్యై, యత్ర, గావః, భూరిశృఙ్గా ఇతి భూరిశృఙ్గాః, అయాసః, అత్ర, అహ, తత్, ఉరుగాయస్యేత్యురు + గాయస్య, విష్ణోః, పరమమ్, పదమ్, అవ, భారి, భూరి, బ్రహ్మవనీతి బ్రహ్మ + వని, త్వా, క్షత్రవనీతి క్షత్ర+వని, రాయస్పోషవనీతి రాయస్పోష+వని, పరి, ఊహామి, బ్రహ్మ, దృꣳహ, క్షత్రమ్, దృꣳహ, ఆయుః, దృꣳహ, ప్రజామితి ప్రజామ్, దృꣳహ.॥౩॥

**పదార్థః** :-(యా) యాని (తే) తవ సభాధ్యక్షస్య (ధామాని) దధతి సుఖాని యేషు తాని రాజ్య ప్రబంధస్థానాని దేశదేశాంతరవాణిజ్యార్థాణి (ఉశ్మసి) ఉశ్మః కామయామహే (గమధ్యై) గంతుం ప్రాప్తుం (యత్ర) యేషు (గావః) రశ్మయః. గావ ఇతి రశ్మినామసు పఠితమ్. నిఘం. ౧.౫. (భూరిశృఙ్గాః) భూరీణి శృఙ్గాణి ప్రకాశా యాసు తాః. శృఙ్గాణీతి జ్వలతో నామసు పఠితమ్ నిఘం. ౧. ౧౭. (అయాసః) అయన్త ఇత్యయాసః. మహీధరేణాత్రాయగతావిత్యస్య యదయంతీతి పరస్మైపదముక్తం తదసదాత్మనేపదో పయోగ్యత్వాత్. (అత్ర) యేషు (అహ) నిశ్చయే (తత్) తస్య (ఉరుగాయస్య) ఉరుభ్రిర్బహుర్భిర్గాయః స్తుతిర్యస్య తస్య. అత్రగైశబ్ద ఇత్యస్మాద్ ఘఞర్థే కవిధానమితి కర్మణి కః (విష్ణోః) వ్యాపకస్య పరమేశ్వరస్య (పరమమ్) సర్వథోత్కృష్టమ్ (పదమ్) పత్తుం యోగ్యం (అవ) క్రియాయోగే (భారి) భ్రియతే. అత్ర లఙర్థే లుఙ్. భృఞ్ ధాతోశ్చిణి పరేఽడభావః. అత్ర బహులం ఛందస్యమాఙ్ యోగేఽపి.అ....౬,౪,౭౫, ఇతి సూత్రేణాడభావః (భూరి) బహు (బ్రహ్మవని) బ్రహ్మణో వేత్తౄణాం సంవిభక్తారం తత్తథా (త్వా) త్వామ్ (క్షత్రవని) క్షత్రస్య రాజ్యస్య క్షత్రియాణాం వా సంవిభాజకమ్ (రాయస్పోషవని) రాయో ధనస్య పోషో దృఢతా తస్యాః సంవిభాజినమ్ (పరి) పరితః (ఊహామి) వివిధతయా తర్కయామి. (బ్రహ్మ) పరమాత్మానం వేదం వా (దృంహ) స్థిరీకురు (క్షత్రమ్) రాజ్యం ధనుర్వేదవిదం క్షత్రియం వా (దృంహ) ఉన్నయ (ఆయుః) జీవనమ్ (దృంహ) ప్రజాం స్వసంతానాన్ సంరక్షణీయాన్ జనాన్ (దృంహ) బ్రహ్మచర్యరాజ్యధర్మాభ్యాం పరిపాలయ.

అత్రాహ యాస్కమునిః-తా వాం వాస్తూన్యుశ్మసి గమధ్యై. యత్ర గావో భూరిశృఙ్గా అయాసః. అత్రాహ తదురుగాయస్య వృష్ణః పరమం పదమవభాతి భూరి. ఋ....౧,౧౫౪,౬. తాని వాం వాస్తూని కామయామహే గమనాయ యత్ర గావో భూరిశృంగాః బహుశృఙ్గాః. భూరితి బహునామధేయం ప్రభవతీతి సతః శృఙ్గం శ్రయతే ర్వా శృణోతే ర్వా శమ్నాతే ర్వా శరణాయోద్గతమితి వా శిరసో నిర్గతమితి వాఽయా సోఽయనాస్తత్ర తదురుగాయస్య విష్ణోర్మహాగతేః పరమం పదం పరార్ధ్యస్థమవభాతి భూరిపాదః పద్యతే. నిరు. ౨.౭.అయం మన్త్రః. శత....౩.౭.౧.౧౫ వ్యాఖ్యాతః ॥౩॥

**అన్వయః** :-హే సభాధ్యక్ష యా యాని తే ధామాని గమధ్యై గంతుం వయముశ్మసి తాని కిం భూతాని సన్తి? యత్ర యేషూరుగాయస్య విష్ణోర్భూరిశృఙ్గా గావో అయాసో భవన్తి, తదుక్త న్యాయమార్గాః ప్రకాశంత ఏవేతి యావత్. అత్రాహ-ఏషు హి తత్తస్య విష్ణోః పరమం పదం విద్వద్భిర్భూర్యవభారి అతస్త్వాం యథా బ్రహ్మవని యథా క్షత్రవని యథా రాయస్పోషవని తథా పర్యూహామి త్వం బ్రహ్మ దృంహ క్షత్రం దృంహాయుర్దృంహ ప్రజాం చాపి దృంహ. ॥౩॥

**భావార్థః**:-నహి సభాధ్యక్షరక్షితస్థానకామనయా వినా కశ్చిదపి సుఖం ప్రాప్తుం శక్నోతి. నహి కోఽపి జనః పరమేశ్వరమనాదృత్య ధర్మరాజ్యం భోక్తుమర్హతి నైవ కోఽపి విజ్ఞానం సేనాం జీవనం ప్రజాం చారక్షిత్వా సమేధత ఇతి. ॥౩॥

**పదార్థము** :- ఓ సభాధ్యక్షా! (యా తే) ఎద్దానియందు నీయొక్క (ధామాని) ప్రాణములకు సుఖముగలుగు స్థానము గలదో దానిని మేము (గమధ్యై ఉశ్మసి) పొందగోరుచున్నాము. ఆ స్థానములు సూర్యప్రకాశము వలె నున్నవి. అట్లే (యత్ర) వేనియందు (ఉరుగాయస్య) స్తుతింపదగినవాడును (విష్ణోః) సర్వవ్యాపకుడును నగు పరమేశ్వరుని (భూరి శృంగాః) అత్యంత ప్రకాశముగల (గావః) కిరణములు, లేక చైతన్యకళ (అయాసః) వ్యాపించి యున్నదో (అత్ర ఆహ) వానియందే (తత్ పరమం పదమ్) ఆ పరమేశ్వరుని సర్వోత్తమమును, ప్రాప్తించదగినదియు నగు పరమపదమును విద్వాంసులు (భూరి, అవ, భారి) సర్వవిధముల ధారణమొనర్చిరి. కావున (త్వా) నీకు (బ్రహ్మవని) పరమేశ్వరుని లేక వేదవిజ్ఞానమును (క్షత్రవని) రాజ్యకాంక్షను, వీరుల కోరికను (రాయస్పోషవని) ధనపుష్టిని విభజించు విధానమును నేను (పర్యూహామి) వివిధతర్కములతో నచ్చజెప్పుచున్నాను. ఏమన నీవు (బ్రహ్మ) పరమాత్మను, వేదమును (దృంహ) దృఢపరచుము. అనగా చిత్తమున స్థిరపరచి వృద్ధిచెందుము. (క్షత్రమ్) రాజ్యమును, ధనుర్వేదవేత్తలగు క్షత్రియులను (దృంహ) వృద్ధిపరచుము (ఆయుః) ఆయుస్సును (దృంహ) వృద్ధిపరచుము [బ్రహ్మచర్య, రాజధర్మముచే దృఢపరచుము.] మరియు (ప్రజామ్) సంతానమును, ప్రజలను (దృంహ) ఉన్నతినొందించుము.॥3॥

**భావార్థము** :- సభాధ్యక్షునిద్వారా సురక్షితములగు స్థానములను గోరక ఎవ్వడును సుఖమును పొందజాలడు. పరమేశ్వరుని అనాదరపరచియు నెవ్వడును చక్రవర్తి [ధర్మ] రాజ్యమును భోగించుటకు అర్హుడు గాజాలడు. ఏ మనుష్యుడును విజ్ఞానము, సైన్యము, ఆయువు, సంతానము, ప్రజలను రక్షించనిదే సౌఖ్యములను పొందజాలడు.॥3॥

3. O king, we desire to reach all thy abodes, where the resplendent beams of adorable God's knowledge spread far and wide!.

In those very places, have the sages attained the highest bliss of God.

I consider thee as the source of spiritual knowledge, earthly power, and vast riches.

Advance the knowledge of the Vedas, improve thy rule and military experts, prolong thy life, and advance thy progeny.

**౨౧౨. విష్ణోః కర్మాణీత్యస్య మేధాతిథిరృషిః, విష్ణుర్దేవతా, నిచృదార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః**

**అథ సభాధ్యక్షః సభ్యాదీన్ మనుష్యాన్ ప్రతి కిం కిముపదిశేదిత్యాహ.**

**సభాపతి సభాసదుల కేమి యుపదేశించవలయునో ఇందు చెప్పబడినది.**

**౨౧౨ విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే। ఇంద్రస్య యుజ్యః సఖా॥4॥**

**ప.వి:- విష్ణోః, కర్మాణి, పశ్యత, యతః, వ్రతాని, పస్పశే, ఇంద్రస్య, యుజ్యః, సఖా॥4॥**

**పదార్థః** :- (విష్ణోః) వ్యాపకస్య (కర్మాణి) జగత ఉత్పత్తిస్థితిసంహృత్యాదీని (పశ్యత) సంప్రేక్షధ్వమ్ (యతః) యేన విజ్ఞానేన (వ్రతాని) నియతసత్యభాషణాదీని (పస్పశే) బధ్నాతి. అత్ర లడర్థేలిట్ (ఇంద్రస్య) పరమేశ్వరస్య (యుజ్యః) యునక్తి సదాచారేణేతి యుజ్యః. అత్రౌణాదికః క్యప్ (సఖా) మిత్రమ్. అయం మంత్రః. శత. ౩.౭.౧.౧౭. వ్యాఖ్యాతః. ॥౪॥

**అన్వయః** :- హే సభ్యజనా! యూయం యథేంద్రస్య యుజ్యః సఖా విష్ణోః కర్మాణి పశ్యన్నహం యతో విజ్ఞానేన మనసి వ్రతాని సత్యభాషణాది నియమాన్ పస్పశే బధ్నామి, తథా తేనైవ విజ్ఞానేన తాని యూయం పశ్యత. యతో రాజ్యకర్మాణి సత్యానుష్ఠాతారో భవత. ॥౪॥

**భావార్థః**:- నహి పరమేశ్వరావిరోధసత్యాచరణాభ్యాం వినా కశ్చిదీశ్వరగుణకర్మస్వభావాన్ ద్రష్టుమర్హతి న తథాభూతేన వినా రాజ్యకర్మాణి యథార్థతయా సేవితుం శక్నోతి నో ఖలు సత్యాచరణమంతరా రాజ్యం వర్ధయితుం ప్రభుర్భవతి. ॥౪॥

**పదార్థము** :- ఓ సభాసదులారా! ఎట్లు (ఇన్ద్రస్య) పరమేశ్వరునకు (యుజ్యః) సదాచారముతో గూడిన (సఖా) మిత్రుడనగు నేను (విష్ణోః) ఆ వ్యాపకపరమేశ్వరుని (కర్మాణి) విశ్వమును సృష్టించి, పాలించి, అంతరింపజేయు మున్నగు సత్యగుణములను జూచుచు (యతః) ఏ జ్ఞానముతో (వ్రతాని) మనస్సునందు సత్యభాషణములు మున్నగు నియమములను (పస్పశే) ఆ విజ్ఞానముతో ఎట్లు బంధించుచున్నానో అట్లే దానితోనే మీరును పరమేశ్వరుని ఉత్తమగుణములను (పశ్యత) శ్రద్ధతో జూడుడు. [దానిద్వారా రాజ్యాధికారములందు సత్యవ్యవహారముల నొనర్చువా రగుడు]. ॥౪॥

**భావార్థము** :- పరమేశ్వరునియందు ప్రీతి, సత్యాచరణము లొనర్చుటయందు దీక్షగలుగనిదే మానవులెవ్వరును ఈశ్వరుని గుణకర్మస్వభావములను గమనించుటకు తగినవారు గాజాలరు. అంతేగాక రాజ్యకార్యములను యథార్థన్యాయముతో నిర్వహించ జాలరు. సత్యధర్మాచరణము లేనివాడు రాజ్యమును విస్తరింప జేయుటకు సమర్థుడు గాజాలడు. ॥౪॥

4. O men study God's works of Creation, preservation and dissolution of the universe; whereby He determines His laws!

Each one of us is His close-allied friend.

౨౧౩. తద్విష్ణోరిత్యస్య మేధాతిథి ర్ఋషిః, విష్ణుర్దేవతా, నిచృదార్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

తదనుష్ఠానేన కిం ఫలమిత్యాహ.

పై మంత్రానుష్ఠానమువలన నేమి సిద్ధించునను దీ మంత్రమున చెప్పబడినది.

**౨౧౩ తద్విష్ణోః పరమం పదꣳ సదా పశ్యన్తి సూరయః దివీవ చక్షురాతతమ్ ॥౫॥**

ప.వి:- తత్, విష్ణోః, పరమమ్, పదమ్, సదా, పశ్యంతి, సూరయః, దివి ఇవేతి దివి+ఇవ, చక్షుః, ఆతత మిత్యాతతమ్ ॥౫॥

**పదార్థః** :-(తత్) (విష్ణోః) పూర్వమంత్రప్రతిపాదితస్య జగదుత్పత్తిస్థితిసంహృతివిధాతుః పరమేశ్వరస్య (పరమమ్) సర్వోత్కృష్టమ్ (పదమ్) ప్రాప్తుమర్హమ్ (సదా) సర్వస్మిన్ కాలే (పశ్యన్తి) అవలోకన్తే (సూరయః) వేదవిదః స్తోతారః. సూరిరితి స్తోతృనామసు పఠితమ్. నిఘం. 3. ౧౬. (దివీవ) ఆదిత్యప్రకాశ ఇవ (చక్షుః) చష్టేఽనేన తత్ (ఆతతమ్) వ్యాప్తిమత్. అయం మంత్రః శత. 3.౭.౧.౮. వ్యాఖ్యాతః. ॥౫॥

**అన్వయః** :-భోః సభ్యజనా! యేన పూర్వోక్తేన కర్మణా సూరయః స్తోతారః విష్ణోర్యత్పరమం పదం దివి ఆతతం చక్షురివ సదా పశ్యన్తి తేనైవ తద్ యూయమపి సతతం పశ్యత. ॥౫॥

**భావార్థః**:-అత్ర మంత్రే పూర్వమంత్రాత్ 'పశ్యత' ఇత్యస్య పదస్యానువృత్తిః క్రియతే. పూర్ణోపమాలంకారశ్చాస్తి. నిర్ధూతమలా విద్వాంసః స్వవిద్యాప్రకాశేన యథేశ్వరగుణాన్ దృష్ట్వా విశుద్ధాచరణశీలా జాయంతే తథాఽస్మాభిరపి భవితవ్యమ్. ॥౫॥

**పదార్థము** :-ఓ సభాసదులారా! పైన దెలిపిన ఏ కర్మచే (సూరయః) స్తుతింపబడు వేదవేత్తలు (విష్ణోః) జగత్తును సృష్టి, స్థితి, లయములొనర్చు పరమాత్మయొక్క (పరమమ్ పదమ్) అత్యుత్తమమగు ప్రాప్తించదగిన ఏ స్థానము గలదో (దివి) సూర్యప్రకాశమందు (ఆతతం చక్షుః ఇవ) తెరచియున్న నయనములవలె (సదా) ఎల్లప్పుడును (పశ్యన్తి) చూచుచున్నారో (తత్) [అట్టి కర్మలద్వారా] మీరును దానిని చూడుడు. ॥౫॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు పై మంత్రమునుండి 'పశ్యత' అను పదమును అనుసరింపబడినది. ఇందు పూర్ణోపమాలంకారము గలదు. పాపములను వదలి విద్వాంసులు స్వవిద్యాప్రకాశముచే ఈశ్వర గుణమును దెలిసికొని సత్యధర్మముల ననుసరించునట్లు మనమును గావలయును. ॥౫॥

5. The learned scholars of the Vedas realise the lofty attributes of God, as the extended eye gazes at the sun.

**౨౧౪.పరివీరిత్యస్య దీర్ఘతమా ఋషిః, విద్వాంసో దేవతాః, ఆర్చ్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.**

**దివః సూనురసీత్యస్య భురిక్ సామ్నీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.**

**పునరేతదుపాసకః సభాధ్యక్షః కీదృగిత్యుపదిశ్యతే.**

**ఉపాసకుడగు సభాధ్యక్షు డెట్లుండునో ఆదేశించబడినది.**

౨౧౪ పరివీరసి పరి త్వా దైవీ ర్విశో వ్యయన్తా మ్పరీమం యజమానꣳరాయో
మనుష్యాణామ్। దివః సూనురస్యేష తే పృథివ్యాం
ల్లోకꣳ ఆరణ్యాస్తే పశుః॥౬॥

ప.విః-పరివీరితి పరి+వీః, అసి, పరి, త్వా, దైవీః, విశః, వ్యయన్తామ్, పరి, ఇమమ్, యజమానమ్, రాయః, మనుష్యాణామ్, దివః, సూనుః, అసి, ఏషః, తే, పృథివ్యామ్, లోకః, ఆరణ్యాః, తే, పశుః.॥౬॥

పదార్థః :-(పరివీః) యథా పరితః సర్వతః సర్వా విద్యా వ్యేతి వ్యాప్నోతి తథా (అసి) (పరి) సర్వతః (త్వా) త్వాం సభాధ్యక్షమ్ (దైవీః) దేవానాం విదుషామిమాః (విశః) ప్రజాః (వ్యయంతామ్) విశిష్టతయా ప్రాప్నువన్తు జానంతు వా (పరి) సర్వతః (ఇమమ్) ప్రత్యక్షమ్ (యజమానమ్) ప్రజ్ఞానుష్ఠాతారమ్ (రాయః) ధనాని (మనుష్యాణామ్) (దివః) ప్రకాశమయాత్ సూర్యాత్ సూర్యత ఉత్పద్యతే కిరణసమూహ ఇవ (అసి) (ఏషః) (తే) తవ (పృథివ్యామ్) (లోకః) రాష్ట్రం రాజ్యస్థానమ్ (ఆరణ్యాః) అరణ్యే భవః (తే) తవ (పశుః) పశ్యకశ్చతుష్పాత్ సింహాదిః. అయం మంత్రః. శత. ౩.౭. ౧-౨౧. వ్యాఖ్యాతః.॥౬॥

అన్వయః:-హే సభాధ్యక్ష! రాజꣳ స్త్వం పరివీః సర్వావిద్యావ్యాపకవదసి త్వా త్వాం దైవీర్విశః పరివ్యయంతామ్. త్వం దివః సూనురివాసి పృథివ్యామేష తే తవ లోకోఽస్తు ఆరణ్యాః పశుః సింహాది రప్యధీనోఽస్తు. ॥౬॥

భావార్థః:-రాజ్యమాచరన్తం రాజానం ప్రజాజనా అభ్యాశ్రిత్య కరం వినయంతు స రాజా ప్రజాపాలనాయ సింహాదిపశూన్ దస్యుప్రభృతీంశ్చ నిహత్య స్వప్రజా యథాయోగ్యం ధర్మే సంస్థాపయేత్. ॥౬॥

పదార్థము :-ఓ సభాధ్యక్షా! రాజా! నీవు (పరివీః అసి) సకలవిద్యలందును చక్కని ఆప్తునితో సమానుడవు (త్వామ్) నిన్ను (దైవీః) విద్వాంసుల (విశః) సంతానముతో సమమైన ప్రజలు (పరివ్యయన్తామ్) అనేక స్థలములకు వ్యాపకుడవైయున్న నీకు సేవలొనర్చువా రగుదురు గాక! (దివః) ప్రకాశపుంజమగు సూర్యునినుండి (సూనుః) పుట్టిన కిరణముల తుల్యుడవై (అసి) నీ వున్నావు (పృథివ్యామ్) విశ్వమందు (ఏషః తే) నీయొక్క (లోకః) రాజ్యము, రాజధానికి దేశము అగుగాక! మరియును (ఆరణ్యాః) వన్య (పశుః) సింహాదిక్రూరమృగములు నీకు వశములగు గాక! ॥౬॥

**భావార్థము** :- ప్రజలు రాజదర్శనమొనర్చుకొని నమ్రతతో నమస్కరించి తమ తమ పదార్థములను, కప్పములను పూర్తిగా చెల్లించవలయును. అట్టి రాజయును తన ప్రజల రక్షణమునకై, పంటచేల పరిరక్షణకై సింహశార్దూల శూకరవములు మున్నగు దుష్టమృగములను, దొంగలను, బందిపోటులను, టక్కరి మోసకారులను, జేబుదొంగలను, దుష్టజనులను దండనముచే వశపరచుకొని, [నాశమొనర్చి] ప్రజలను యథోచితముగ ధర్మమునందు ప్రవృత్త పరచవలెను. ॥౬॥

6. O king, thou art the repository of knowledge like a sage!

The learned subjects obey thee in all directions. May riches fit for men be secured by this intelligent devotee. Thou art lustrous like the beams of the sun.

May all people on the earth and all beasts of the forest be under thy control.

**౨౧౫ ఉపావీరిత్యస్య మేధాతిథి ర్ఋషిః, త్వష్టా దేవతా, ఆర్షీబృహతీ ఛందః, మధ్యమః, స్వరః.**

**పునః స తాన్ప్రతి కిం కుర్యాత్, తే చ తం ప్రతి కిం కుర్యురిత్యుపదిశ్యతే.**

**ఆయన ప్రజలను ప్రజ లాతని గూర్చి ఏమిచేయవలయునో ఈ మంత్రమునం దుపదేశించబడియున్నది.**

**౨౧౫ ఉపావీరస్యుపదేవా న్దైవీ ర్విశః ప్రాగురుశిజో వహ్నితమాన్।**

**దేవ త్వష్టర్వసురమ హవ్యా తే స్వదంతామ్ ॥౭॥**

**ప. వి:- ఉపావీరిత్యుప+అవీః, అసి, ఉప, దేవాన్, దైవీః, విశః, ప్ర, అగుః, ఉశిజః, వహ్నితమానితి వహ్ని+తమాన్, దేవ, త్వష్టః, వసు, రమ, హవ్యా, తే, స్వదంతామ్॥౭॥**

పదార్థః:-(ఉపావీః) ఉపాగతపాలక ఇవ (అసి) (దేవాన్) విదుషః (దైవీః) దేవ సంబంధినీర్దివ్యాః (విశః) ప్రజాః (ప్ర) ప్రకృష్టార్థే (అగుః) అగమన్ (ఉశిజః) కమనీయాన్ (వహ్నితమాన్) అతిశయితా వహ్నయో వోఢారస్తాన్ (దేవ) దివ్యగుణ సంపన్న! (త్వష్టః) సర్వదుఃఖచ్ఛిత్ (వసు) వసూని ధనాని. అత్ర సుపాం సులుక్.అ.౭.౧.౩౯. ఇతి శపో లుక్ (రమ) రమస్వ. అత్రాత్మనేపదే వ్యత్యయేన పరస్మై పదమ్ (హవ్యా) హోతుమత్తుమర్హాణి (తే) తవ (స్వదంతామ్) భుంజతామ్. అయం మంత్రః. శత. 3.7.3. ౯-౧౨. వ్యాఖ్యాతః. ॥౭॥

**అన్వయః** :- హే దేవ త్వష్టః సభాపతే! యతస్త్వముపావీరివాసి, తస్మాద్దైవీర్విశో యథా ఉశిజో వహ్నితమాన్ దేవాన్ ఉపప్రాగుస్తథా త్వాం ప్రాప్నువంతి. యథైతాస్త్వదాశ్రయేణాఢ్యా భూత్వా రమన్తే, తథా త్వమపి తాసు రమ రమస్వ. భవానేతేషాం పదార్థాన్ భుంక్తే, తథైతే తే హవ్యా హోతుమర్హాణి హవ్యాని వసు వసూని స్వదన్తామ్. ॥౭॥

**భావార్థః** :-యథా గుణగ్రాహిణ ఉత్తమగుణం సేవన్తే, తథా న్యాయవిచక్షణం రాజానం ప్రజాశ్చ సేవన్తే, యేన మిథః ప్రీత్యా పరస్పోన్నతిర్భవతీతి. ॥౭॥

**పదార్థము** :-ఓ దేవా! దివ్యగుణ సంపన్నా! (త్వష్టః) సకలదుఃఖములను దొలగించు సభాధ్యక్షా! నీవు (ఉపావీః) శరణాగతరక్షకునివంటివాడవై (అసి) ఉన్నావు. కావున (దైవీః) విద్వాంసులతో సంబంధముగల, దివ్యగుణసంపన్నులగు (విశః) ప్రజలు (ఉశిజః) శ్రేష్ఠగుణవంతులు, కోరదగినవారును నగు (వహ్నితమాన్) చక్కని ధర్మమార్గమున నడచుచు, నడిపించువారును నగు (దేవాన్) విద్వాంసులను (ఉపప్రాగుః) సమీపించునట్లు నిన్ను సమీపించుచున్నారు. నీ యాశ్రయమున ప్రజలెల్లరును ధనాఢ్యులు, సుఖులునై యున్నట్లు ప్రాప్తించిన ప్రజలద్వారా సత్కరింపబడినవాడవై (రమస్వ) [వారియెడల] ఆనందితుడవు కమ్ము. నీవు ప్రజల పదార్థములను భోగించునట్లు ప్రజలు నీయొక్క (హవ్యా) అనుభవించదగిన అమూల్యములగు (వసు) ధనములు మున్నగు పదార్థములను (స్వదన్తామ్) భోగింతురుగాక! ॥౭॥

**భావార్థము** :-గుణగ్రహణమొనర్చు మేధావులు ఉత్తమగుణవంతుడగు విద్వాంసుని సేవించునట్లు పరస్పరప్రీతితో ప్రజలెల్లరకును ఉన్నతిని గలిగించుటకై ప్రజలు న్యాయవిచక్షణుడగు రాజును సేవించుచుందురు. ॥౭॥

7. O king, thou art the embodiment of noble qualities, and remover of the miseries of thy subjects. Thou protectest those who take refuge under thy shelter. May thy noble subjects be associated with learned persons, full of splendour and efficient to undertake the responsibility of government. Feel pleasure, and let thy subjects enjoy thy pleasurable precious riches!.

౨౧౬ రేవతీ రమధ్వ మిత్యస్య దీర్ఘతమా ఋషిః, బృహస్పతి ర్దేవతా, ప్రాజాపత్యానుష్టుప్ ఛన్దః,

ఋషభః స్వరః, ఋతస్య త్వేత్యస్య నిచృత్ ప్రాజాపత్యా బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ పిత్రాదయః స్వసంతానాన్ కథమధ్యాపకాయ ప్రదదుః స చ తాన్ కథం గృహ్ణీయాదిత్యాదిత్యుపదిశ్యతే.

తల్లిదండ్రులు తమ సంతానములను అధ్యాపకుల కెట్లు అప్పగించవలయును ? వా రెటుల

వారిని స్వీకరించవలయు? నను విషయము లిం దుపదేశించబడినవి.

## ౨౧౬ రేవతీ రమధ్వం బృహస్పతే ధారయా వసూని।

## ఋతస్య త్వా దేవహవిః పాశేన ప్రతి ముఞ్చామి ధర్షా మానుషః ॥౮॥

**ప.వి:- రేవతీః, రమధ్వమ్, బృహస్పతే, ధారయ, వసూని, ఋతస్య, త్వా, దేవహవిరితి దేవ+హవిః, పాశేన, ప్రతి, ముఞ్చామి, ధర్ష, మానుషః ॥౮॥**

**పదార్థః**:-(రేవతీః) రాయః ప్రశస్తాని ధనాని విద్యన్తే యాసు తాః ప్రజాః (రమధ్వమ్) క్రీడధ్వమ్ (బృహస్పతే) బృహత్యా వేదవాచః పతే పాతః పరమవిద్వన్! (ధారయ). అత్రాన్యేషామపి దృశ్యతే. అ. ౬.3. ౧3౭., ఇతి దీర్ఘః (వసూని) (ఋతస్య) సత్యన్యాయాఖ్య యజ్ఞస్య (దేవహవిః) యథా దేవానాం హవిరాదాతుమర్హం చరిత్రమస్తి తథా (పాశేన) బంధనేన (ప్రతి) (ముఞ్చామి) (ధర్ష) ధృష్ణుహి. ద్వ్యచోతస్తిజ. అ.౬.3.౧3౫., ఇతి దీర్ఘః. వికరణవ్యత్యయేన శప్ చ (మానుషః) సర్వశాస్త్రమననశీలః. అయమ్మన్త్రః శత. 3,౭,3,౧3. వ్యాఖ్యాతః. ॥౮॥

**అన్వయః** :- హే (రేవతీః) రేవత్యః ప్రజా! యూయం విద్యాసు శిక్షాసు రమధ్వమ్. హే బృహస్పతే! త్వమృతస్య వసూని ధారయ. అథ శిష్యాయోపదిశతి గురుః. హే రాజన్! ప్రజాజన వా! మానుషోఽహం పాశేనావిద్యాబంధనేన దేవహవిర్యథా తథా త్వాం ప్రతిముఞ్చామి. త్వం విద్యాసు శిక్షాసు ధర్ష ధృష్టో భవ. ॥౮॥

**భావార్థః**:-విద్వద్భిః సుశిక్షయా కుమారాణాం కుమారీణాం చ జగదీశ్వరాత్ పృథివీపర్యంత పదార్థానాం బోధః సంపాదనీయో యతస్తే మూర్ఖత్వబంధనం పరిత్యజ్య సదా సుఖినః స్యురితి. ॥౮॥

**పదార్థము** :-(రేవతీః) ఉత్తమధనముగల ఓ సంతానమా! ప్రజలారా! మీరు విద్యయందు, చక్కని శిక్షణయందు (రమధ్వమ్) రమించుడు (బృహస్పతే) వేదవాణిని పాలించు ఓ విద్వాంసుడా! నీవు (ఋతస్య) సత్యన్యాయవ్యవహారములచే లభించు (వసూని) ధనమును, మే మొసగునట్టి ద్రవ్యములను, పదార్థములను (ధారయ) స్వీకరించుము.

శిష్యులకు గురు విట్లుపదేశించుచున్నాడు. ఓ రాజా! లేక ప్రజలారా! (మానుషః) సకల శాస్త్రములపై నాలోచించు నేను నిన్ను [(దేవహవిః) దేవతల హవిర్భాగములను గ్రహించదగిన నడవడి గలవారినిగ నొనర్చి] (పాశేన) అవిద్యాబంధములనుండి (ప్రతిముంచామి) ముక్తి నొందించుచున్నాను. నీవు చక్కని విద్యయందు (ధర్ష) దిట్టవు గమ్ము. ॥౮॥

**భావార్థము** :-విద్వాంసులు తమ శిక్షణచే బ్రహ్మచారులకు, బ్రహ్మచారిణులకు పరమేశ్వరుని మొదలుకొని పృథివిపర్యంతము సకలపదార్థవిషయముల బోధించవలయును. అట్లు బోధింపబడినవారు అవివేక బంధనములనుండి విముక్తులై సదా సుఖయుక్తులై యుండగలుగుదురు. ॥౮॥

8. O rich sons, roam in knowledge and good training. O highly learned teacher, please accept the honestly earned money, we offer thee. O prince, thou art liked by the learned, I, a scholar of scriptures, release thee from the bondage of ignorance, be steadfast and firm in the acquisition of knowledge!.

**౨౧౭. దేవస్య త్వేత్యస్య దీర్ఘతమా ఋషిః, సవితా అశ్వినౌ పూషా చ దేవతాః, ప్రాజాపత్యా బృహతీ**

**ఛందః, మధ్యమః స్వరః, అగ్నీషోమాభ్యామిత్యస్య పంక్తిశ్ఛన్దః, ధైవతః స్వరః.**

**పునః స శిష్యం కిముపదిశేదిత్యాహ.**

**అట్టి గురువు శిష్యున కేమి యుపదేశించవలయు నను విషయ మీ మంత్రమున పొందుపరచబడినది.**

౨౧౭ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్।
అగ్నీషోమాభ్యాఞ్జుష్టన్నియునజ్మి। అద్భ్యస్త్వౌషధీభ్యోఽను త్వా మాతా
మన్యతామను పితాను భ్రాతా సగర్భ్యోఽను సఖా సయూథ్యః।
అగ్నీషోమాభ్యా న్త్వా జుష్ట ప్రోక్షామి ॥౯॥

**ప. వి:**- దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు+భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, అగ్నీషోమాభ్యామ్, జుష్టమ్, ని, యునజ్మి, అద్భ్య ఇత్యద్+భ్యః, త్వా, ఓషధీభ్యః, అను, త్వా, మాతా, మన్యతామ్, అను, పితా, అను, భ్రాతా, సగర్భ్య ఇతి స+గర్భ్యః, అను, సఖా, సయూథ్య ఇతి స+యూథ్యః, అగ్నీషోమాభ్యామ్, త్వా, జుష్టమ్, ప్ర, ఉక్షామి ॥౯॥

**పదార్థః** :- (దేవస్య) వేదవిద్యాప్రకాశకస్య (త్వా) త్వాం విద్యార్థినమ్. (సవితుః) సకలైశ్వర్యవతః (ప్రసవే) ప్రసూయతే విశ్వస్మిన్ యస్తస్మిన్ (అశ్వినోః) సూర్యాచంద్రమసోః (బాహుభ్యామ్) తత్తద్ గుణాభ్యామ్ (పూష్ణః) పృథివ్యాః. పూషేతి పృథివీనామసు పఠితమ్. నిఘం. ౧.౧. (హస్తాభ్యామ్) హస్త ఇవ వర్తమానాభ్యాం ధారణాకర్షణాభ్యామ్ (అగ్నీషోమాభ్యామ్) ఏతయోస్తేజః శాన్తిగుణాభ్యామ్ (జుష్టమ్) ప్రీతమ్ (ని) (యునజ్మి) (అద్భ్యః) యథా జలేభ్యః (ఓషధీభ్యః) రోగనివారికాభ్యః (అను) (త్వా) త్వామ్ (మాతా) జననీ (మన్యతామ్) (అను) (పితా) జనకః (అను) (భ్రాతా) బంధుః (సగర్భ్యః) సోదరః (అను) (సఖా) సుహృత్ (సయూథ్యః) ససైన్యః (అగ్నీషోమాభ్యామ్) పూర్వోక్తాభ్యామ్ (త్వా) జుష్టమ్ (ప్రీతమ్) (ప్ర ఉక్షామి) సిఞ్చామి. అయం మన్త్రః శత. ౩.౭.౪. ౩-౫. వ్యాఖ్యాతః. ॥౯॥

**అన్వయః** :- హే శిష్య! అహం సవితుర్దేవస్య ప్రసవే అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వా త్వామాదదే. అగ్నీషోమాభ్యాం జుష్టం త్వా త్వాం యే బ్రహ్మచర్యధర్మానుకూలా ఆప ఓషధయశ్చ సన్తి తాభ్యోఽద్భ్య ఓషధీభ్యో నియునజ్మి. త్వాం మత్సమీపే స్థాతుం మాతా జననీ అనుమన్యతామ్, పితాఽనుమన్యతామ్, సగర్భ్యో భ్రాతాఽనుమన్యతామ్, సఖాఽనుమన్యతామ్, సయూథ్యోఽనుమన్యతామ్, అగ్నీషోమాభ్యాం జుష్టం ప్రీతియుక్తం త్వామహం ప్రోక్షామి తద్గుణైరభిషించామి. ॥౯॥

**భావార్థః** :-అస్మిన్ సంసారే మాత్రాదిభిః పిత్రాదిభిర్బన్ధువర్గైర్మిత్రవర్గైశ్చ స్వాపత్యాదీని సుశిక్ష్య త్రైర్బ్రహ్మచర్యం కారయితవ్యం యతస్తే సద్గుణినః స్యురితి.॥౯॥

పదార్థము :-ఓ శిష్యా! నేను (సవితుః) సకలైశ్వర్యవంతుడును (దేవస్య) వేదవిద్యలను ప్రకాశపరచువాడును నగు పరమేశ్వరునిచే (ప్రసవే) సృష్టించబడిన యీ ప్రపంచమునందు (అశ్వినోః) సూర్యచంద్రాదుల (బాహుభ్యామ్) ఆ యా గుణములచేతను (పూష్ణః) భూమికి (హస్తాభ్యామ్) హస్తములవలె నుండి ధారణాకర్షణమొనర్చు గుణములచేతను (త్వామ్) నిన్ను (ఆ దదే) స్వీకరించుచున్నాను. మరియు (అగ్నీషోమాభ్యామ్) అగ్నియొక్కయు, సోమముయొక్కయు తేజము మరియు శాంతి గుణములచే (జుష్టమ్) ప్రీతి గలిగించుచున్న (త్వా) నిన్ను [బ్రహ్మచర్యము, ధర్మమునకనుకూలమగు ఏ జలములు, ఓషధులు గలవో అట్టి] (అద్భ్యః) జలములతోను (ఓషధీభ్యః) గోధుమలు మున్నగు అన్నములతోను (నియునజ్మి) నియుక్త పరచుచున్నాను. నా సమీపమున నుండుటకు నిన్ను నీ (మాతా) జనని (అను, మన్యతామ్) ఆమోదించునుగాక! (పిత) జనకుడు ఆమోదించునుగాక! (సగర్భ్యః) సహోదరులు (భ్రాతా) అన్నదమ్ములు (అను) అనుమోదింతురుగాక! (సఖ్యా) మిత్రులు (అను) అనుమోదింతురుగాక! మరియు (సయూథ్యః) నీ సహవాసులు (అను) అనుమోదింతురుగాక! (అగ్నీషోమాభ్యామ్) అగ్ని మరియు సోమములయొక్క తేజము, శాంతిగుణములచే (జుష్టమ్) ప్రీతి యొనరించుచున్న (త్వా) నిన్ను (ప్ర ఉక్షామి) ఆ గుణములతోనే బ్రహ్మచర్యనియమముల పాలించుటకై అభిషేకించుచున్నాను.॥౯॥

**భావార్థము** :-ఈ ప్రపంచమున మాతాపితరులు, బంధుమిత్రవర్గమంతయును తమ సంతానములను చక్కని విద్యలనభ్యసింపజేసి బ్రహ్మచర్యము ననుష్ఠింప జేయవలయును. దానివలన వారు గుణశీలురగుదురు.॥౯॥

9. O disciple, in this world - created by God, full of splendour, and the Revealer of the Vedas, with the attributes of the Sun and moon, and with the retention and gravitation of the Earth, namely its hands I welcome thee. I lovingly initiate thee endowed with prosperity and peace in the Brahmcharya Ashram sprinkling thee with water and corn!.

May thy mother, father, brother, friend and fellow students grant thee permission for my discipleship.

For observing the vow of celibacy, I lovingly anomt thee in peace and prosperity.

**౧౦. అపాం పేరురిత్యస్య మేధాతిథి ఋషిః, ఆపో దేవతాః, ప్రాజాపత్యా బృహతీ ఛన్దః,**

**మధ్యమః స్వరః, పంత ఇత్యస్య విచృదార్షీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.**

**అథోపనీతేన శిష్యేణ విద్యాసుశిక్షాగ్రహణాగ్నిహోత్రాది యజ్ఞోఽనుష్ఠాతవ్య ఇతి గురురుపదిశేత్.**

**యజ్ఞోపవీతధారణజరిగినపిదప విద్య, ఉత్తమ శిక్షాగ్రహణము అగ్నిహోత్రము మున్నగు**

**యజ్ఞముల నాచరించవలయునని గురువు శిష్యులకు ఉపదేశించుట గూర్చి ఈ మంత్రమున చెప్పబడినది.**

౨౧౮ అపాం పేరురస్యాపో దేవీః స్వదన్తు స్వాత్తఞ్చిత్ సద్దేవహవిః। సం తే ప్రాణో వాతేన గచ్ఛతాꣳ సమఙ్గాని యజత్రైః సం యజ్ఞపతి రాశిషా ॥౧౦॥

**ప.విః-** అపామ్, పేరుః, అసి, ఆపః, దేవీః, స్వదన్తు, స్వాత్తమ్, చిత్, సత్, దేవహవిరితి దేవ+హవిః, సమ్,తే, ప్రాణః, వాతేన, గచ్ఛతామ్, అఙ్గాని, యజత్రైః, యజ్ఞపతిరితి యజ్ఞ+పతిః, ఆశిషేత్యా శిషా ॥౧౦॥

**పదార్థః:**-(అపామ్) జలానామ్ (పేరుః) రక్షకః (అసి) (ఆపః) (దేవీః) శుద్ధా దివ్యసుఖప్రదా (స్వదన్తు) (స్వాత్తమ్) స్వేన సమన్తాత్ గృహీతమ్ (చిత్) అపి (సత్) (దేవహవిః) దేవేభ్యో హవిరివ (సమ్) (తే) తవ (ప్రాణః) (వాతేన) పవనేన సహ (గచ్ఛతామ్) (అఙ్గాని) శిర ఆదీని (యజత్రైః) యజ్ఞసాధకై ర్విద్వద్భిః సహ (యజ్ఞపతిః) యజ్ఞస్య పాలకః (ఆశిషా) అయం మన్త్రః శత. ౩. ౭. ౪. ౬-౯ వ్యాఖ్యాతః.॥౧౦॥

**అన్వయః:**-హే శిష్య! త్వమపాం పేరురసి. సంసారస్థాః ప్రాణినస్త్వద్యజ్ఞశోధితా దేవీరాపశ్చిత్ స్వాత్తం ధర్మానుష్ఠానస్వీకృతం దేవహవిరివ సంస్వదన్తు మదాశిషా తవాంగాని యజత్రైః సహ గచ్ఛంతామ్, ప్రాణో వాతేన సంగచ్ఛతాం త్వం యజ్ఞపతి ర్భవ.॥౧౦॥

**భావార్థః:**-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యా యజ్ఞే ప్రాస్తాహుతయస్తా ఆదిత్య ముపతిష్ఠన్తే ఆదిత్యాకర్షణశక్త్యా పృథివీజలాకర్షణేన వృష్టి ర్భవతి తతోఽన్నమన్నాద్భూతానీతి పరంపరాసంబంధేన యజ్ఞశోధితా అపో హుతద్రవ్యం చ సర్వే జీవా భుఞ్జతే.॥౧౦॥

**పదార్థము :**-ఓ శిష్యా! నీవు (అపామ్) జలము మున్నగువానిని (పేరుః) రక్షించువాడవు (అసి) ఐయున్నావు [విశ్వమందలి జీవులు] నీ యజ్ఞముద్వారా శుద్ధమైనవియు (దేవీః) దివ్యసుఖమును నిచ్చునవియునగు (ఆపః) జలములను (చిత్) మరియు (స్వాత్తమ్) ధర్మయుక్త వ్యవహారములతో ప్రాప్తించిన పదార్థములను (దేవహవిః) విద్వాంసు లనుభవించుపగిది (సం స్వదన్తు) ఉత్తమముగ అనుభవింతురుగాక (ఆశిషా) నా యాశీర్వాదముచే (తే అఙ్గాని) నీ శిరస్సు మున్నగు అవయవములు (యజత్రైః) యజ్ఞము నొనర్చువారితో బాటు (సమ్) చక్కగా నియుక్తము లగుగాక! మరియు (ప్రాణః) ప్రాణము (వాతేన) పవిత్రవాయువుతో గూడ (సం గచ్ఛతామ్) చక్కగా రమణమొనర్చునుగాక! మరియు నీవు (యజ్ఞపతిః) విద్యాప్రచారరూప యజ్ఞమును పాలించువాడ వగుదువుగాక!॥౧౦॥

**భావార్థము** :-ఇచ్చట వాచకలుప్తోపమాలంకారము గలదు. యజ్ఞమున సమర్పించబడిన ఆహుతులు సూర్యునియందు జేరుచున్నవి. అనగా సూర్యుని ఆకర్షణశక్తిద్వారా పరమాణురూపమను దాల్చి పదార్థములన్నియు భూమిపైనను, ఆకాశముపైనను యుండును. ఆ పృథివిపైనున్న జలములే పైకి ఆకర్షించబడి మరల వర్షించుచున్నవి. ఆ వర్షమువలన అన్నము, అన్నమువలన సకలజీవులకు సుఖము చేకూరుచున్నది. ఈ క్రమబద్ధమగు సంబంధముచే యజ్ఞముద్వారా శోధింపబడిన జలములను, హోమద్రవ్యములను సకలజీవు లనుభవించు చుండును.॥౧౦॥

10. O pupil, thou art the purifier of water through yajna. May people purified by thy sacrifice enjoy pleasant waters, and substances obtained by virtuous means, as do the sages!.

Through my benediction, may all thy organs be devoted to the performance of the yajna along with the learned priests.

May thy breath roam freely with the wind, and may thou be the performer of the yajna for the spread of knowledge.

౨౧౯. ఘృతేనాక్తా విత్యస్య మేధాతిథి ర్ఋషిః, వాతో దేవతా, భురిగార్చ్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ యజ్ఞకర్త్ర కారయిత్రోః కర్తవ్యముపదిశ్యతే.

యజన మొనర్చువారి కర్తవ్య కర్మలిందుపదేశించబడుచున్నవి.

౨౧౯ ఘృతేనాక్తౌ పశూం॑స్త్రాయేథాꣳ రేవతి యజమానే ప్రియం ధాऽఆవిశ।
ఉరోరన్తరిక్షాత్ సజూర్దేవేన వాతేనాస్య హవిషస్త్మనా యజ సమస్య
తన్వా భవ వర్షో వర్షీయసి యజ్ఞే యజ్ఞపతిం ధాః స్వాహా దేవేభ్యో
దేవేభ్యః స్వాహా ॥౧౧॥

ప.వి:- ఘృతేన, అక్తౌ, పశూన్, త్రాయేథామ్, రేవతి, యజమానే, ప్రియమ్, ధాః, ఆ, విశ, ఉరోః, అన్తరిక్షాత్, సజూరితి స+జూః, దేవేన, వాతేన, అస్య, హవిషః, త్మనా, యజ, సమ్, అస్య, తన్వా, భవ, వర్షోఽ ఇతి వర్షో, వర్షీయసి, యజ్ఞే, యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, ధాః, స్వాహా, దేవేభ్యః, దేవేభ్యః, స్వాహా॥౧౧॥

**పదార్థః** :- (ఘృతేన) (అక్తౌ) ఘృతేనాసక్తచిత్తౌ యజ్ఞకర్తా యజ్ఞకారయితా చ (పశూన్) గవాదీన్ (త్రాయేథామ్) రక్షేతామ్ (రేవతి) ప్రశస్తైశ్వర్యయుక్తే (యజమానే) యజ్ఞానుష్ఠాతరి (ప్రియమ్) ప్రసన్నతా సంపాదిసుఖమ్ (ధాః) ధేహి. అత్ర లోడర్థే లుఙ్ అడభావశ్చ (ఆ) సమన్తాత్ (విశ) (ఉరోః) బహోః (అన్తరిక్షాత్) (సజూః) మిత్రమివ (దేవేన) సర్వగతేన (వాతేన) వాయునా సహ (అస్య) (హవిషః) హోతవ్యస్య. కర్మణి షష్ఠీ (త్మనా) ఆత్మనా (యజ) సంగచ్ఛస్వ ఏకీభవ (సమ్) (అస్య) (తన్వా) (భవ) (వర్షో) యజ్ఞకర్మణా సర్వసుఖసేచక! (వర్షీయసి) సర్వసుఖమభివర్షతి. (యజ్ఞపతిమ్) యజ్ఞపాలకమ్ (ధాః) ధేహి (స్వాహా) సత్కృత్యనుకూలామ్ (దేవేభ్యః) దీవ్యన్తి ప్రకాశన్తే సత్కర్మానుష్ఠానేన యే తేభ్యో ధర్మిష్ఠేభ్యో విద్వద్భ్యః (దేవేభ్యః) శుభేభ్యో గుణేభ్యః (స్వాహా) సత్కృత్యనురూపామ్. అయం మంత్రః. శత. ౩.౭.౧. ౫-౧౬. వ్యాఖ్యాతః.॥౧౧॥

**అన్వయః** :-హే యజ్ఞకర్తృ కారయితారౌ! ఘృతేనాక్తౌ ఘృతమనస్కౌ! యువాం పశూన్ త్రాయేథామ్. త్వమేకైకో దేవేన వాతేన సజూరురోరంతరిక్షాత్ప్రియం ప్రేమోత్పాదకం సుఖం రేవతి యజమానే ధా ఆవిశ చ తత్ స్వాంతవృత్తమాప్నుహి. అస్య హవిషస్త్మనా ఆత్మనా యజ, అస్య తన్వా సంభవైకీభవ న ద్వైధమాచర. హే వర్షో! యజ్ఞకర్మణా సుఖసేచకం త్వం దేవేభ్యః స్వాహా దేవేభ్యః స్వాహా తద్యజ్ఞం దిదృక్షుభ్యః పునః పునరాగతేభ్యో విద్వద్భ్యశ్చ సకృత్ సత్కృత్యనురూపాం వాచముదీరయన్ వర్షీయసి యజ్ఞే యజ్ఞపతిం ధాః.॥౧౧॥

**భావార్థః**:-యజ్ఞార్థం ఘృతాదిమభీప్సుభిర్మనుష్యైః పశవో రక్షణీయా ఘృతాది సద్ద్రవ్యేణాగ్ని హోత్రాది యజ్ఞాన్ సంపాద్య తైర్జలవాయూ సంశోధ్య సర్వేషాం ప్రాణినామభీష్టం సుఖం సంపాద్యమ్. ॥౧౧॥

**పదార్థము** :- (ఘృతేన అక్తౌ) ఘృతమును గోరునట్టి యజ్ఞకర్తా [యజ్ఞమును జేయించు సజ్జనులారా!] మీ రిరువురును (పశూన్) గోవులు మున్నగు పశువులను (త్రాయేథామ్) పాలించుడు [మీరొక్కరొక్కరే] (దేవేన) సర్వమున సంచరించు (వాతేన) వాయువువలె [సమానముగ] (సజూః) సమానప్రేమను ప్రదర్శించు మిత్రునివలె (ఉరోః) విస్తృతమగు (అన్తరిక్షాత్) అంతరిక్షముద్వారా యుత్పన్నమైన (ప్రియమ్) ప్రియసుఖములను (రేవతి) ప్రశంసించదగిన ఐశ్వర్యయుక్తుడగు (యజమానే) యజ్ఞమొనర్చు భాగ్యశాలియందు (ధాః) స్థాపించుడు. మరియు (ఆ విశ) ఆతని యభిప్రాయమును గ్రహించుడు (అస్య హవిషః) మరియు నీ హోమమొనర్చదగిన పదార్థములను (త్మనా) స్వయముగా సంపూర్ణపరచిన వానివలె (యజః) అగ్నియందు వ్రేల్చుడు [యజ్ఞమందలి ఏ క్రియనైనను విరుద్ధముగ భావించకుడు.] మరియు (అస్య తన్వా) ఈయన శరీరముతో (సమ్ భవ) ఏకీభావము నుంచుడు [ఎన్నడును విరోధభావముతో, ద్వివిధముగ నుండకుడు.] (వర్షో) యజ్ఞకర్మచే సకలసుఖముల సమకూర్చుకొను ఓ మానవులారా! (దేవేభ్యః స్వాహా, దేవేభ్యః స్వాహా) సత్కర్మానుష్ఠానములచే ప్రకాశితులును, ధర్మనిష్ఠులును జ్ఞానులును నగు ఏ బుద్ధిశాలురు యజ్ఞకార్యమును దర్శించుటకై పదే పదే యజ్ఞమునకు వచ్చుచుందురో అట్టి విద్వాంసులకై చక్కని

సత్కృత్యముల అనురూపములగు వాణుల నుచర్పించుచు యజ్ఞపతిని (వర్షీయసి) సకలసౌఖ్యముల వర్షింపజేయు యజ్ఞమునందు (ధాః) శ్రద్ధగా నియుక్తపరచుడు. ॥౧౧॥

**భావార్థము** :- యజ్ఞముకొరకు ఘృతము మున్నగు పదార్థముల గోరువారు గోవులు మున్నగు పశువులను పాలించవలయును. నేయి మున్నగు ఉత్తమపదార్థములతో అగ్నిహోత్రము మున్నగు ఉత్తమోత్తమ యజ్ఞములద్వారా వాయువు జలములను శుద్ధమొనర్చి సకలప్రాణులకు సౌఖ్యముల నుత్పన్నమొనర్చ వలయును. ॥౧౧॥

11. O performers of yajna and its supervisor fond of ghee as ye are, rear cows. Let each one of you regulate by purifying all pervading air the worshipper full of splendour, pleasure, born of wide space; and understand his primary aim. Perform duly yourself the yajna with all its materials, and be one with the full observance of the details of the yajna!.

O giver of happiness through yajna, welcome with sweet words all the religious minded and learned persons who visit the yajna again and again, and establish the worshipper in the pleasure - giving yajna!.

౨౨౦. మాఽహిర్భూరిత్యస్య మేధాతిథి ర్ఋషిః విద్వాంసో దేవతాః, భురిక్ ప్రాజాపత్యానుష్టుప్

ఛన్దః, గాంధారః స్వరః.

స విద్వాన్ కీదృగ్భవేదిత్యుపదిశ్యతే.

ఆ విద్వాంసు డెటులుండవలయు నను విషయ మిం దుపదేశించబడినది.

౨౨౦ మాహిర్భూర్మా పృదాకు ర్నమ స్తఽఆతానానర్వా ప్రేహి ఘృతస్య కుల్యాఽ ఉపఽ ఋతస్య పథ్యాఽ అను ॥౧౨॥

**ప. వి:- మా, అహిః, భూః, మా, పృదాకుః, నమః, తే, ఆతానేతేత్యాతాన, అనర్వా, ప్ర, ఇహి, ఘృతస్య, కుల్యాః, ఉప, ఋతస్య, పథ్యాః, అను॥౧౨॥**

పదార్థః:-(మా) నిషేధే (అహిః) సర్పవత్ (భూః) భవేః. అత్ర లిఙర్థే లుఙ్ (పృదాకుః) మూఢవ దభిమానీ వ్యాధవద్వా హింసకః (నమః) అన్నమ్. నమ ఇత్యన్ననామసు పఠితమ్ నిఘం.౨.౭. (తే) తుభ్యమ్ (ఆతాన) సమంతాత్సుఖం తనితః (అనర్వా) అశ్వహీనః. అర్వేత్యశ్వనామసు పఠితమ్. నిఘం. ౧.౧౪. (ప్ర) ప్రకృష్టార్థే (ఇహి) గచ్ఛ (ఘృతస్య) ఉదకస్య (కుల్యాః) ఘృతధారాః (ఉప) (ఋతస్య) సత్యస్య (పథ్యాః) వీథీః (అను) అయమ్మన్త్రః. శత. 3.౮.౨.౧-3. వ్యాఖ్యాతః.॥౧౨॥

**అన్వయః**:-హే ఆతాన! త్వం అహిర్మాభూః, పృదాకుర్మాభూస్తే తుభ్యం నమోఽస్తు. సర్వత్రత్వత్సు ఖాయాన్నాదిపదార్థః పురత ఏవ ప్రవర్తత ఇతి భావః. అనర్వా ఘృతస్య కుల్యా ఇవర్తస్య పథ్యా ప్రోపైహి.॥౧౨॥

**భావార్థః**:-కేనాపి మనుష్యేణ ధర్మమార్గే కుటిలమార్గామిసర్పాదివత్కుటిలాచరణేన న భవితవ్యం కింతు సర్వదా సరలభావేనైవ భవితవ్యమ్.॥౧౨॥

**పదార్థము** :-(ఆతాన) సుఖములను విరివిగ విస్తరింపజేయు ఓ విద్వాంసుడా! నీవు (అహిః) సర్పమువలె కుటిలమార్గమున నడచువానివి (మా) కాకుము. మరియు (మా, భూః, పృదాకుః) మూర్ఖులవలె అభిమానవంతుడవును, లేక వ్యాఘ్రమువలె హింసకుడవును గాకుము. (తే నమః) సర్వత్ర నీ సౌఖ్యమునకై అన్నము మున్నగునవి పూర్వమునుండియే ప్రవృత్తములై యున్నవి. మరియు (అనర్వా) అశ్వములు మున్నగు యానములు లేని నిరాశ్రయు డెట్లు (ఘృతస్య) జలముల (కుల్యాః) పెద్దధారలను పొందునో అట్లు (ఋతస్య) సత్యముయొక్క (పథ్యాః) మార్గములను (ప్ర ఉప ఇహి) పొందుము.॥౧౨॥

**భావార్థము** :-ఏ మనుష్యుడును ధర్మమార్గమున కుటిలముగ నడువగూడదు. సర్పాదులవలె వంకరనడక యుండరాదు. సదా సరళ భావమునే మెలగవలయును.॥౧౨॥

12. O learned person, the diffuser of delight, behave not crookedly like a serpent, or proudly like a fool, or ferociously like a tiger. Food is ready for thee everywhere. Tread on the paths of truth and rectitude, just as shelterless persons without any conveyance feel happy when they reach a stream of water!.

౨౨౧౩.దేవీరాప ఇత్యస్య మేధాతిథి ర్ఋషిః, ఆపో దేవతాః, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

అథ వటుభిర్బ్రహ్మచారిణీభిశ్చ గురుపత్న్యః కథం సమ్మాననీయా ఇత్యుపదిశ్యతే.

బాలకబ్రహ్మచారులు, బ్రహ్మచారిణీకన్యలు గురుపత్నుల నెటుల సమ్మానించవలయునో యిందుపదేశించబడింది.

౨౨౧ దేవీరాపః శుద్ధా వోఢ్వꣳసుపరివిష్టా దేవేషు సుపరివిష్టా వయమ్పరివేష్టారో భూయాస్మ ॥౧౩॥

ప.వి:- దేవీః, ఆపః, శుద్ధాః, వోఢ్వమ్, సుపరివిష్టా ఇతి సు+పరివిష్టాః దేవేషు, సుపరివిష్టా ఇతి సు+పరివిష్టా, వయమ్, పరివేష్టార ఇతి పరి+వేష్టారః, భూయాస్మ॥౧౩॥

**పదార్థః** :-(దేవీః) సద్విద్యాప్రకాశవత్యః (ఆపః) ఆప్నువంతి సద్గుణాన్ యాస్తాః (శుద్ధాః) సత్కర్మానుష్ఠానపూతాః (వోఢ్వమ్) స్వయంవరవివాహవిధిం ప్రాప్నుత. అత్ర వహప్రాపణాత్యస్మాల్లోటి మధ్యమబహువచనే. బహులం ఛందసీతి శపో లుకి కృతే. సహివహోరోదవర్ణస్య. అ. ౬. ౩. ౧౧౨. ఇత్యనేనౌకారః. (సుపరివిష్టాః) తత్తత్సేవాయున్ముఖ్య ఏవ. అత్ర వర్తమానే లోట్ (దేవేషు) సద్విద్యాది దివ్యగుణేషు విద్వత్సు (సుపరివిష్టాః) తథా భూతా ఏవ (వయమ్) (పరివేష్టారః) పరతో వ్యాప్తాః (భూయాస్మ). అయం మన్త్రః. శత. ౩.౧.౨.౩. వ్యాఖ్యాతః.॥౧౩॥

**అన్వయః** :-హే కుమార్యో యథాపః సద్గుణేషు వ్యాప్తా శుద్ధా దేవీః విదుష్యః సత్ స్త్రియో దేవేషు సద్విద్యాదిదివ్యగుణేషు విద్వత్సు స్వపతిషు సుపరివిష్టాః కృతబ్రహ్మచర్యాః స్వసమాన్వరాన్ స్వీకృతవత్యః యథా చ తే విద్వాంస స్తాః విదుషీః ప్రాప్తాస్తథా యూయం స్త్రీభావేనాస్మాన్ ప్రాప్నుతైవం వయమపి పరివేష్టారో భూయాస్మ. ॥౧౩॥

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా విదుష్యో విదుషాం స్త్రియః పతివ్రత్యధర్మతత్పరా భవన్తి తథా బ్రహ్మచారిణ్యః కన్యాస్సద్గుణస్వభావా భవేయుర్బ్రహ్మచారిణ్యో గురుజనస్వభావాః స్యుః. యతః సుశిక్షయా స్త్రీపుత్రాది రక్షణశీలా భవేయురితి.॥౧౩॥

**పదార్థము** :-ఓ కుమారీమణులారా! (ఆపః) శ్రేష్ఠగుణములందు రమణమొనర్చువారును (శుద్ధాః) సత్కర్మల అనుష్ఠానముచే పవిత్రులును (దేవీః) విద్యాప్రకాశవంతురాండ్రునగు స్త్రీలు (దేవేషు) శ్రేష్ఠ విద్వాంసులగు పతులకొరకు (సుపరివిష్టాః) వారి సన్ముఖమున సేవయొనర్చుటకు సిద్ధపడి [బ్రహ్మచర్య దీక్షగలవారై] తమవంటి పతులను (వోఢ్వమ్) పొందుచున్నారో మరియు విద్వాంసులగు పతులు ఆ స్త్రీలను పొందుచున్నారో, అట్లే మీరును [స్వంతభావముతో మమ్ము పొందువారుగ నగుడు.] మేమును (పరివేష్టారః) అట్టి కర్మలకు యోగ్యులము (భూయాస్మ) అగుదుముగాక! ॥౧౩॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విదుషీమణులు, [విద్వాంసురాండ్రు] పతివ్రతధర్మమునందు తత్పరురాండ్రై యుండునట్లు బ్రహ్మచారిణులగు కన్యలును అట్టి గుణకర్మస్వభావములు గలవా రగుదురు గాక! బ్రహ్మచారులును గురువుల శిక్షణచే [గురుజనస్వభావములతో గూడిన వారై స్త్రీ పురుష పుత్రాదులను] సంరక్షించుటయందు తత్పరులై యుందురుగాక!॥౧౩॥

13. O girls, just as women, endowed with noble qualities, pure and highly educated are married to the deserving husbands, and serve them faithfully; and educated husbands are married to worthy wives, so should ye be married; and so shall we be joined in wedlock!.

**౨౨౨.వాచం త ఇత్యస్య మేధాతిథి ర్ఋషిః, విద్వాంసో దేవతాః, భురిగార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.**

**అథ కథం తా గురుపత్న్యో గురవశ్చ యథాయోగ్యశిక్షయా స్వస్వాన్తేవాసినః**

సద్గుణేషు ప్రకాశయన్తీత్యుపదిశ్యతే.

ఆ గురుపత్నులు, గురుజనులు యథాయోగ్యశిక్ష యొసగి తమ శిష్యులను

సద్గుణములచే నెట్లు ప్రకాశితమొనర్చుదురో యిందు చెప్పబడినది.

౨౨౨ వాచం తే శుంధామి ప్రాణం తే శుంధామి చక్షుస్తే శున్ధామి

శ్రోత్రస్తే శున్ధామి నాభిస్తే శున్ధామి మేఢ్రం తే శున్ధామి

పాయుస్తే శున్ధామి చరిత్రాంస్తే శుంధామి ॥౧౪॥

ప.వి:- వాచమ్, తే, శుంధామి, ప్రాణమ్, తే, శుంధామి, చక్షుః, తే, శుంధామి, శ్రోత్రమ్, తే, శుంధామి, నాభిమ్, తే, శుంధామి, మేఢ్రమ్, తే, శున్ధామి, పాయుమ్, తే, శున్ధామి, చరిత్రాన్, తే, శున్ధామి॥౧౪॥

పదార్థః:- (వాచమ్) వక్త్యనయా తాం వాణీమ్ (తే) తవ (శుంధామి) నిర్మలీకరోమి (ప్రాణమ్) ప్రాణితి యేన తం జీవనహేతుమ్ (తే)(శుంధామి) (చక్షుః) చష్టేఽనేన తన్నేత్రమ్ (తే) (శుంధామి) (శ్రోత్రమ్) శృణోతి యేన తత్ (తే)(శుంధామి) (నాభిమ్) నహ్యతే బధ్యతే యయా తామ్ (తే) (శుంధామి) (మేఢ్రమ్) మేహత్యనేన తదుపస్థేన్ద్రియమ్ (తే) (శుంధామి) (పాయుమ్) పాత్యనేన తం గుహ్యేన్ద్రియమ్ (తే) (శుంధామి) (చరిత్రాన్) వ్యవహారాన్(తే) (శుంధామి) అయమ్మంత్రః. శత. ౩.౧. ౨.౬.వ్యాఖ్యాతః. ॥౧౪॥

**అన్వయః** :-హే శిష్య! వివిధశిక్షాభి స్తేఽహం వాచం శుంధామి. తే ప్రాణం శుంధామి. తే చక్షుః శుంధామి. తే శ్రోత్రం శుంధామి. తే నాభిం శుంధామి. తే మేఢ్రం శుంధామి. తే పాయుం శుంధామి. తే చరిత్రాన్ శుంధామి. ॥౧౪॥

**భావార్థః** :-గురుభిర్గురుపత్నీభిశ్చ వేదోపవేద వేదాంగోపాఙ్గశిక్షయా దేహేంద్రియాంతఃకరణాత్మమనః శుద్ధిశరీరపుష్టిప్రాణసంతుష్టీః ప్రదాయ సర్వే కుమారాః సర్వాః కన్యాశ్చ సద్గుణేషు ప్రవర్తయితవ్యా ఇతి.॥౧౪॥

**పదార్థము** :-ఓ శిష్యుడా! నేను వివిధ శిక్షణలద్వారా (తే) నీయొక్క (వాచమ్) వాణిని (శున్ధామి) శుద్ధముగ, ధర్మమున కనుకూలముగ నొనర్చుచున్నాను (తే) నీ (చక్షుః) నేత్రములను (శున్ధామి) పరిశుద్ధ

పరచుచున్నాను (తే నాభిమ్) నాడులు యున్నగువానిచే బంధించబడియున్న నీ నాభిని (శున్ధామి) పవిత్రమొనర్చుచున్నాను (తే మేఢ్రమ్) మూత్రవిసర్జనమొనర్చు నీ లింగమును (శున్ధామి) పవిత్రపరచుచున్నాను (తే పాయుమ్) రక్షణమొనర్చు నీ గుదేన్ద్రియమును (శున్ధామి) పవిత్రమొనర్చుచున్నాను (తే చరిత్రాన్) నీ సమస్తవ్యవహారములను (శున్ధామి) పవిత్రముగను, శుద్ధముగను, ధర్మానుకూలముగను ఒనర్చుచున్నాను. [గురుపత్నిపక్షమునగూడ ఈ యర్థమునే ఎల్లప్పుడును యోచించవలయును].॥౧౪॥

(తే ప్రాణం శుంధామి, తే శ్రోత్రం శున్ధామి అనుపదముల అర్థము సులభగ్రాహ్యము.)

భావార్థము :- గురువులు, గురుపత్నులు వేదముల, ఉపవేదముల వేదాంగముల, ఉపాంగముల "వేదాః:-ఋగ్యజుస్సామాథర్వణః, ఉపవేదాః:-అర్థవేద, ధనుర్వేద, గాన్ధర్వవేదాయుర్వేదాః, వేదాఙ్గాని:-శిక్షాకల్పోవ్యాకరణం, నిరుక్తం, ఛన్దో జ్యోతిషమితి, ఉపాఙ్గాని:-మీమాంసా వైశేషిక న్యాయ, పాతంజల, సాంఖ్య, వేదాన్తాః. శిక్షద్వారా దేహ, ఇన్ద్రియ, ఆత్మ, అంతఃకరణ, మనస్సు మున్నగు వాని శుద్ధియు, శరీరపుష్టియు, ప్రాణసంతుష్టియు గలిగించి శిష్యులగు సకల కుమార, కుమారీ రత్నములను సద్గుణములందు ప్రవృత్తులనుగ నొనర్చవలయును.॥౧౪॥

14. O disciple, through various sermons, I enjoin upon thee to purify thy voice, thy breath, thy eye, thy ear, thy navel, thy penis, thy anus; and all thy dealings!.

౨౨౩.మనస్త ఇత్యస్య మేధాతిథిరృషిః, విద్వాంసో దేవతాః, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, పంచమః స్వరః.

పునరుక్తోఽర్థః ప్రకారాంతరేణ ప్రకాశ్యతే

మరల ప్రకారాంతరమున పై యర్థమునే ఈ మంత్రమున విశదపరచెను.

౨౨౩ మనస్తఽ ఆప్యాయతాం వాక్తఽ ఆప్యాయతాం ప్రాణస్తఽ ఆప్యాయతాం

చక్షుస్తఽ ఆప్యాయతాꣳ శ్రోత్రం తఽ ఆప్యాయతామ్।

యత్తే క్రూరం యదాస్థితం తత్తఽ ఆప్యాయతాం నిష్ట్యాయతాం తత్తే

శుధ్యతు శమహోభ్యః। ఓషధే త్రాయస్వ స్వధితే మైనꣳ హిꣳసీః ॥౧౫॥

ప.వి:- మనః, తే, ఆ, ప్యాయతామ్, వాక్, తే, ఆ, ప్యాయతామ్, ప్రాణః, తే। ఆ, ప్యాయతామ్, చక్షుః, తే, ఆ, ప్యాయతామ్, శ్రోత్రమ్, తే, ఆ, ప్యాయతామ్, యత్, తే,

క్రూరమ్, యత్, ఆస్థితమిత్యాఽస్థితమ్, తత్, తే, ఆ, ప్యాయతామ్, నిః, ష్ట్యాయతామ్, తత్, తే, శుధ్యతు, శమ్, అహోభ్యఽ ఇత్యహః + భ్యః, ఓషధే, త్రాయస్వ, స్వధిత ఇతి స్వ+ధితే, మా, ఏనమ్, హింసీః॥౧౫॥

**పదార్థః**:-(మనః) సంకల్పవికల్పాత్మకమ్ (తే) తవ (ఆ) (ప్యాయతామ్) సత్కర్మానుష్ఠానేన వర్ధతామ్ (వాక్) (తే) (ఆ ప్యాయతామ్) (ప్రాణః) (తే) (ఆ ప్యాయతామ్) (చక్షుః) (తే) (ఆ) (ప్యాయతామ్) (శ్రోత్రమ్) (తే) (ఆ) (ప్యాయతామ్) (యత్) (తే) తవ (క్రూరమ్) దుశ్చరిత్రమ్ (యత్) (ఆస్థితమ్) నిశ్చితమ్ (తత్) (తే) (ఆ) (ప్యాయతామ్) (నిః) పృథగ్ధే (ష్ట్యాయతామ్) సంహన్యతామ్ (తత్) (తే) (శుధ్యతు) (శమ్) సుఖమ్ (అహోభ్యః) కాలవిశేషేభ్యః (ఓషధే) ఓషో విజ్ఞానం ధీయతే యస్మింస్తత్సంబుద్ధౌ. అత్ర ఓషగతావిత్యస్మాద్గతిరత్ర విజ్ఞానం గృహ్యతే (త్రాయస్వ) (స్వధితే) స్వేష్వాత్మీయేషు ధితిః పోషణం యస్యాస్తత్సంబుద్ధౌ (మా) నిషేధే (ఏనమ్) పూర్వోక్తమ్ (హింసీః) కుశిక్షయా లాలనేన వా మా వినాశయేః. ॥౧౫॥

**అన్వయః** :- హే శిష్య! మదీయ శిక్షణేన తే తవ మన ఆప్యాయతామ్. తే ప్రాణ ఆప్యాయతామ్, తే చక్షురాప్యాయతామ్, తే శ్రోత్రమాప్యాయతామ్, తే యత్క్రూరం దుశ్చరిత్రం తత్ నిష్ట్యాయతామ్ దూరీగచ్ఛతు. యత్ తే తవాస్థితం నశ్చితం తదాప్యాయతామ్, ఇత్థం తే సర్వం శుధ్యతు అహోభ్యో దినేభ్యస్తుభ్యం శమస్తు. అత స్వస్వామిని శిష్యలాలనాపరం గురుపత్నీవాక్యమ్. హే ఓషధే! విజ్ఞానపరాధ్యాపక! త్వమేనం శిష్యం త్రాయస్వ మా హింసీః. స చ స్వపత్నీం ప్రత్యాహ. హే స్వధితేఽధ్యాపికే స్త్రీ! త్వమేనాం త్రాయస్వ మా హింసీశ్చ. ॥౧౫॥

**భావార్థః**:-సత్కర్మానుష్ఠానేన సర్వస్యోన్నతిర్భవత్యతః సర్వైర్మనుష్యైర్గురుశిక్షయా సమస్త సత్కర్మానుష్ఠేయమ్. గురవో గుణగ్రహణాయైవ శిష్యాణాం తాడనం విదధతి. తతస్తేషామిదమభ్యుదయనిః శ్రేయసకారి జాయత ఏవేతి బోధ్యమ్. దమ్పతీ పరస్పరమేవముపదిశేతామ్. హే పతే! భవానయం శిష్యో యథా సద్యో విద్వాన్ స్యాత్తథా ప్రయతతామ్. హే ధర్మపత్ని! భవతీ యథేయం కన్యా తూర్ణం విదుషీ భవేత్తథా విదధాతు. ॥౧౫॥

**పదార్థము** :-ఓ శిష్య! నా శిక్షణమున (తే మనః) నీ మనస్సు (ఆప్యాయతామ్) సంపూర్ణ గుణయుక్తమగు గాక! [సత్కర్మల ననుష్ఠించి వృద్ధిపొందునుగాక!] (తే ప్రాణః) నీ ప్రాణము (ఆప్యాయతామ్) బలవీర్యశక్తులచే పూర్ణమగుగాక! (తే చక్షుః) నీ నేత్రములు (ఆప్యాయతామ్) నిర్మలదృష్టిగల వగును గాక! (తే శ్రోత్రమ్) నీ కర్ణములు (ఆప్యాయతామ్) సద్గుణగ్రాహకములగు గాక! (తే యత్ క్రూరమ్) ఏదైన నీ

దుష్టవ్యవహారములున్న నవి (నిః ష్వాయతామ్) దూరమగును గాక! (యత్ తే ఆస్థితమ్) నీ మనోనిశ్చయమేది గలదో, అది (ఆప్యాయతామ్) పూర్తియగుగాక! ఇదే విధముగ.

(తే) నీ సమస్తవ్యవహారములు (శుధ్యతు) శుద్ధములగుగాక! మరియు (అహోభ్యః) ప్రతిదినము నీకు (శమ్) సుఖముగలుగునుగాక! హే (ఓషధే) విజ్ఞానప్రవరుడవగు నధ్యాపకా! నీవు (ఏనమ్) ఈ శిష్యుని (త్రాయస్వ) రక్షించుము. మరియు (మా హింసీః) వ్యర్థముగ దండించకుము (స్వధితే) ప్రశస్తురాలవగు ఓ యధ్యాపికే! నీవు శిష్యురాలగు ఈ కుమారిని (త్రాయస్వ) రక్షించుము. మరియు నీమెను అకారణముగ దండించకుము.॥౧౫॥

భావార్థము :- సత్కర్మలొనర్చుటద్వారా అందరకు ఉన్నతి గలుగును. కావున మానవులెల్లరును సుశిక్షితులై సమస్తసత్కర్మల ననుష్ఠించవలయును. చక్కని గుణములను గ్రహించునిమిత్తమే గురువులు శిష్యులను తాడనమొనర్తురు. వారి యీ తాడనము అత్యంత సుఖము (అభ్యుదయ నిఃశ్రేయసముల) సమకూర్చునదగును. [అధ్యాపక దంపతులగు] స్త్రీ పురుషు లిట్లు పరస్పరము చెప్పకొనవలయును:- ఓ సర్వోత్తమ అధ్యాపకా! ఈ మీ విద్యార్థి ఎటుల శీఘ్రముగ విద్వాంసుడగునో అటుల ప్రయత్నమొనర్చుడు. ప్రియమగు ఓ అధ్యాపికే! ఈ కన్య ఎట్లు అతిశీఘ్రముగ విదుషీమతల్లి యగునో అట్టి పనిని చేయుము.॥౧౫॥

15. O disciple, through my teaching, let thy mind be filled with noble qualities, thy voice and breath be strong, thy eye clear in vision, thy ear quick of hearing. Let thy evil designs be removed, and thy intentions fulfilled. Let all thy doings be pure, and may thou daily derive happiness!.

O exalted teacher, guard this disciple, and spoil him not through fondness and wrong teaching. O noble mistress, protect this girl, and chastise her not uselessly!.

౨౨౪. రక్షసాం భాగ ఇత్యస్య మేధాతిథి ఋషిః, ద్యావాపృథివ్యౌ దేవతే,

బ్రాహ్మ్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

అథ శిష్యవర్గేషు యథాయోగ్యోపదేశకరణమాహ

శిష్యులెల్లరకును యథాయోగ్యముగ నుపదేశించవలయునని చెప్పబడినది.

౨౨౪ రక్షసాం భాగోఽసి నిరస్తం రక్షః ఇదమహం రక్షోఽభితిష్ఠామీద

మహం రక్షోఽవబాధ ఇదమహం రక్షోఽధమం తమో నయామి।

ఘృతేన ద్యావాపృథివీ ప్రోర్ణువాథాం వాయో వే స్తోకానా మగ్ని రాజ్యస్య

వేతు స్వాహా స్వాహా కృతే ఊర్ధ్వనభసమ్మారుతఙ్గచ్ఛతమ్ ॥౧౬॥

ప.వి:- రక్షసామ్, భాగః, అసి, విర స్తమితి విః+అస్తమ్, రక్షః, ఇదమ్, అహమ్, రక్షః, అభి, తిష్ఠామి, ఇదమ్, అహమ్, రక్షః, అవబాధే, ఇదమ్, అహమ్, రక్షః, అధమమ్, తమః, నయామి, ఘృతేన, ద్యావాపృథివీఽ ఇతి ద్యావాపృథివీ, ప్ర, ఊర్ణువాథామ్, వాయోఽ ఇతి వాయో, వేః, స్తోకానామ్, అగ్నిః, ఆజ్యస్య, వేతు, స్వాహా, స్వాహా కృత ఇతి స్వాహా+కృతే, ఊర్ధ్వనభసమిత్యూర్ధ్వనభసమ్, మారుతమ్, గచ్ఛతమ్.॥౧౬॥

పదార్థః :-(రక్షసామ్) రక్షంతి పరార్థహాననేన స్వార్థమితి రక్షాంసి తేషామ్ (భాగః) సేవనీయః (అసి) (నిరస్తమ్) నిఃసృతమ్ (రక్షః) సర్వతః స్వార్థరక్షకః పరార్థహంతా (ఇదమ్) (అహమ్) (రక్షః) (అభి) సన్ముఖే (తిష్ఠామి) (ఇదమ్) (అహమ్) (రక్షః) రక్షతి సర్వతః రక్షార్థనిమిత్తీభూతం కర్మ (అవ) అర్వాగర్థే (బాధే) నాశయామి (ఇదమ్) (అహమ్) (రక్షః) (అధమమ్) నీచం తమోఽన్ధకారమ్ (నయామి) ప్రాపయామి (ఘృతేన) జలేన (ద్యావాపృథివీ) భూమిప్రకాశౌ (ప్ర) ప్రకృష్టార్థే (ఊర్ణువాథామ్) ఆచ్ఛాదయతామ్ (వాయో) వాతి జానాతి సూచయతి సదసత్పదార్థానితి వా వాయుస్తత్సంబుద్ధౌ (వేః) విద్ధి. అత్ర లోడర్థే లఙ్ (స్తోకానామ్) స్వల్పానామ్. శేషవివక్షాతః కర్మణి షష్ఠీ (అగ్నిః) సర్వవిద్యాప్రాప్తో విద్వాన్ (ఆజ్యస్య) స్నేహద్రవ్యస్య (స్వాహాకృతే) సత్యావాచాముపగతే వ్యవహారే (ఊర్ధ్వనభసమ్) ఊర్ధ్వం నభో జలం యస్మాత్తమ్ (మారుతమ్) (గచ్ఛతమ్).॥౧౬॥

అన్వయః :-హే దుష్టకర్మకారిన్! త్వం రక్షసాం భోగోఽస్యతో రక్షో నిరస్తం భవ. అహం ఇదం రక్షోఽభితిష్ఠామి తిరస్కరణాయ తత్సన్ముఖముపవిశామి. న కేవలమభితిష్ఠామి కింతు అహమిదం రక్షో దుష్టస్వభావినమవబాధేఽర్వాచీనో యథా స్యాత్తథా హన్మి యతో న పునః సన్ముఖో భూయాదితి భావః. అహమిదం రక్షోఽధమం తమో నయామి, దుఃసహదుఃఖం ప్రాపయామి చ. హే వాయో! గుణగ్రాహక సదసద్వివేచనశీల శిష్య! త్వం స్తోకానాం స్తోకాన్ సూక్ష్మవ్యవహారాన్ వేః విద్ధి. త్వద్యజ్ఞశోధితేన ఘృతేన ద్యావాపృథివీ ప్రోర్ణువాథామ్, ఆచ్ఛాదయేతామ్. అగ్నిః సమస్తవిద్యావాన్ విద్వాంస్త్వమాజ్యస్య స్నేహద్రవ్యం స్వాహా వేత్తు జానాతు. తథా స్వాహాకృతే పూర్వోక్తే ద్యావాపృథివ్యా ఊర్ధ్వనభసం త్వద్యజ్ఞశోధితజలమూర్ధ్వ ప్రాపకం మారుతం గచ్ఛతం ప్రాప్నుతమ్.॥౧౬॥

భావార్థః:-బుద్ధిమన్తః సదసద్వివేచకా విద్వాంసః శిష్యేషు యథాయోగ్యశిక్షణమనువిదధతి యజ్ఞకర్మణా జలవాయుశుద్ధ్యా వృష్టిర్భవతి. వృష్ట్యైవ సర్వప్రాణిభ్యః సుఖం సంపద్యతే.॥౧౬॥

పదార్థము :- ఓ దుష్టకర్మలొనర్చువాడా! నీవు (రక్షసామ్) పదార్థముల నాశమొనర్చి స్వార్థమును సాధించుకొను దుష్టులకు (భాగః అసి) [సేవనీయుడవునగు] భాగస్థుడవై యున్నావు. కావున (రక్షః) రాక్షస స్వభావుడవైన నీవు (నిరస్తమ్) వెడలిపొమ్ము (అహమ్) నేను (ఇదమ్ రక్షః) ఇట్టి స్వార్థసాధకుని (అభి తిష్ఠామి) తిరస్కరించుటకు సంసిద్ధుడ నగుచున్నాను. కేవలము ఎదుర్కొనుటయేగాక (అహమ్) నేను (ఇదమ్ రక్షః) ఇట్టి దుర్జనుని (అవబాధే) మరల నాతడు తనముఖము చూపకుండ అత్యంత తిరస్కార భావముతో తాడన మొనర్చెదను. (అహమ్) నేను (ఇదమ్ రక్షః) ఇట్టి దుష్టునకు (అధమమ్) భరించరాని దుఃఖమును (నయామి) కలిగించుచున్నాను.

ఇక ఉత్తమశిష్యున కుపదేశము:- గుణగ్రాహకుడవును, సదసద్వ్యవహారములందు వివేచనాశీలుడవునగు ఓ శిష్యా! నీవు (స్తోకానామ్) సూక్ష్మాతిసూక్ష్మ వ్యవహారములను (వేః) ఎరుగుము. మరియు ఈ యజ్ఞశోధితమగు జలముచే (ద్యావాపృథివీ) సూర్యుడు, భూమి (ప్రోర్ణువాథామ్) చక్కగా కప్పబడునుగాక! (అగ్నిః) సకల విద్వాంసులు ఘృతము మున్నగు పదార్థములతో (స్వాహా) చక్కగా నీచే హోమమొనర్చి దానిని (వేతు) ఎరుగుదురుగాక! మరియు (స్వాహాకృతే) హవనమొనర్చబడిన స్నిగ్ధద్రవ్యమును పొందిన, పైన చెప్పబడిన భూమి సూర్యులు (ఊర్ధ్వనభసమ్) నీ యజ్ఞముచే శుద్ధమగు జలమును పైకి పంపించు (మారుతమ్) వాయువును (గచ్ఛతమ్) పొందుదురుగాక!॥౧౬॥

భావార్థము :- బుద్ధిశాలురు, శ్రేష్ఠశ్రేష్ఠముల వివేచనము గలిగియున్న విద్వాంసులు తమ శిష్యులకు యథాయోగ్యముగ శిక్షావిధానమును ప్రసాదించుచున్నారు. యజ్ఞకర్మలతో జలవాయువుల శుద్ధి, వాని శుద్ధివలన వర్షము, వర్షముచే సకలప్రాణులకు సుఖము లభించుచున్నది.॥౧౬॥

16. O sinner, demons pay homage unto thee. Get out ye evil spirited. I stand before such a devil for dishonouring him, rather I chastise such a despicable fellow with great disgust. I carry such a satan to the lowest depth of distress. O disciple, the discriminator between virtue and vice, and cultivator of goodness, understand all the intricate problems, fill the Earth and Sun with water rendered pure through thy yajna. Let the learned person know thy yajna performed with clarified butter. Let the Earth and Sun filled with the greasy substance of Homa attain to the air which carries up the water purified by thy yajna!.

**౨౨౫. ఇదమాప ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆపో దేవతాః, నిచృద్ బ్రాహ్మ్యనుష్టుప్ ఛందః,**

**గాంధారః స్వరః.**

**శుద్ధేన జలేన కిం భావనీయమిత్యుపదిశ్యతే.**

**శుద్ధజలముచే నేమి ప్రసిద్ధపరచవచ్చునో ఈ మంత్రమున చెప్పబడినది.**

౨౨౫ ఇదమాపః ప్రవహతావద్యఞ్చ మలఞ్చ యత్।
యచ్చాభిదుద్రోహానృతం యచ్చ శేపేఽఅభీరుణమ్।
ఆపో మా తస్మాదేనసః పవమానశ్చ ముఞ్చతు ॥౧౭॥

ప.వి:-ఇదమ్,ఆపః, ప్ర, వహత, అవద్యమ్, చ, మలమ్, చ, యత్, యత్, చ, అభిదుద్రోహేత్యభి దుద్రోహ, అనృతమ్, యత్, చ, శేపే, అభీరుణమ్, ఆపః, మా, తస్మాత్, ఏనసః, పవమానః, చ, ముఞ్చతు.॥౧౭॥

పదార్థః:-(ఇదమ్) వక్ష్యమాణమ్ (ఆపః) అప్నువంతీత్యాపః (ప్ర) (వహత) అత్ర లడర్థే లోట్ (అవద్యమ్) నింద్యమ్ (చ) వికారి సముచ్చయే (మలమ్) అశుద్ధికరమ్ (యత్) (చ) ప్రకృతివిరుద్ధగ్రహణే (యత్) (చ) లోకవిక్రుష్టసముచ్చయే (అభిదుద్రోహ) యథాఽభిద్రుహ్యాతి తథా (అనృతమ్) అసత్యమ్ (యత్) (చ) పరుషవచః సముచ్చయే (శేపే) ఆక్రుశ్యామి (అభీరుణమ్) నిర్భయమ్ (ఆపః) (మా) మామ్ (తస్మాత్) (ఏనసః) ధర్మవిరుద్ధాచరణాత్ (పవమానః) పవిత్రీకరో వ్యవహారః (చ) శుద్ధోపదేశ సముచ్చయే (ముఞ్చతు) పృథక్ కరోతు. ॥౧౭॥

అన్వయః :-ఆపః సర్వవిద్యావ్యాపినో విపశ్చితో యూయం యథాపః శుద్ధికరాస్తథా మమ యదవద్యం నింద్యం కర్మ యచ్చ మలం అవిద్యారూపం తదిదం ప్రవహత అపనయత చ పునః యదహమనృతం కం చ దుద్రోహ చ యత్ అభీరుణం నిరపరాధినం పురుషం శేపే తస్మాత్ పూర్వోక్తాదేనసః మా మాం పృథక్ రక్షతు. యథా పవమానో మాలిన్యాన్మాం సద్యో దూరీకరోతి తథాఽన్యానపి ముంచతు పృథక్ కరోతు. ॥౧౭॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకార ఉపమాలంకారశ్చ. విద్వాన్ జలమివ సాంసారిక పదార్థానాం శోధకో భూత్వా ధర్మ్యం కర్మాచరేత్. మనుష్యైరీశ్వరప్రార్థనయా దుష్టాచారాత్ పృథక్ భూత్వా నిర్మలేషు విద్యాదిగ్రహణకర్మసు సదా ప్రవర్తితవ్యమితి. ॥౧౭॥

పదార్థము :-(ఆపః) సర్వవిద్యావ్యాపకులగు ఓ విద్వాంసులారా! మీ రెట్లు (ఆపః) జలముల శుద్ధమొనర్చుచున్నారో, అట్లే నాయొక్క (యత్ అవద్యమ్) చెప్పరాని నింద్యమగు ఏ కర్మగలదో (చ) మరియు ఏ వికారమున్నదో (యత్ మలమ్) అవిద్యారూపమగు నే మలము గలదో (ఇదమ్) అట్టి దీనిని (ప్రవహత)

కడిగివేయుడు [దూరమొనర్చుడు.] (చ) మరియు (యత్) నేను (అనృతమ్) అబద్ధముగ [నిష్కారణముగ ఎవరికైన] (దుద్రోహ) ద్రోహమొనర్చుచున్నానో (చ) మరియు (యత్ అభీరుణమ్) నిర్భయుడు, నిరపరాధియు నగువానిని (శేపే) రెచ్చగొట్టుచు దూషించువానిని (తస్మాత్) పైన జెప్పబడిన (ఏనసః) ఈ పాపములనుండి (మా) నన్ను వేరుపరచుము. (చ) మరియు (పవమానః) పవిత్ర వ్యవహారము (మా) నన్ను పాపకార్యములనుండి వేరుపరచుచున్నట్లే (చ) ఇతరులను గూడ వేరుపరచుగాక! ॥౧౭॥

భావార్థము :-జలములు సాంసారిక పదార్థముల శుద్ధికి మూలకారణమగునట్లే విద్వాంసులు సంస్కారణములకు మూలకారకులై యుందురు. కావున వారు సత్కార్మలనే యొనర్చవలయును. మానవులు ఈశ్వరోపాసన, విద్వాంసుల సాంగత్యముచే దుష్టాచరణములను వదలి సదా ధర్మమునందు ప్రవృత్తులగుదురు గాక! ॥౧౭॥

17. Ye masters of knowledge, just as waters purify us, so do ye wash away this indescribable sin and ignorance of mine. O learned persons keep me away from the vice of false malice, and accusation of the innocent. May noble, virtuous deeds save me from sin!.

౨౨౬. సం త ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, అగ్నిర్దేవతా, ప్రాజాపత్యానుష్టుప్ ఛందః గాంధారః స్వరః,

రేడసీత్యస్య దైవీపంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

అథ రణే యోద్ధా కీదృగ్భవేదిత్యుపదిశ్యతే.

రణమందు యుద్ధమొనర్చు వీరు డెట్లుండవలెనో ఈ మంత్రమం దుపదేశించబడినది.

౨౨౬ సన్తే మనో మనసా సంప్రాణః ప్రాణేన గచ్ఛతామ్।

రేడస్యగ్నిష్ట్వా శ్రీణాత్వాపస్త్వా సమరిణన్వాతస్య త్వా ధ్రాజ్యై పూష్ణో

రంహ్యా ఊష్మణో వ్యథిషత్ ప్రయుతం ద్వేషః ॥౧౮॥

ప.వి:- సమ్, తే, మనః, మనసా, సమ్, ప్రాణః, ప్రాణేన, గచ్ఛతామ్, రేట్, అసి, అగ్నిః, త్వా, శ్రీణాతు, ఆపః, త్వా, సమ్, అరిణన్, వాతస్య, త్వా, ధ్రాజ్యై, పూష్ణః, రంహ్యై, ఊష్మణః, వ్యథిషత్, ప్రయుతమితి ప్రయుతమ్, ద్వేషః॥౧౮॥

పదార్థః:-(సమ్) (తే) తవ (మనః) అంతఃకరణమ్ (మనసా) విజ్ఞానేన (సమ్) (ప్రాణః) (ప్రాణేన) బలేన (గచ్ఛతామ్) (రేట్) శత్రుహింసకః. అత్ర రిషతే ర్హింసార్థాత్ కర్తరి విచ్ (అగ్నిః)

యుద్ధజన్య క్రోధాగ్నిః (త్వా) త్వామ్ (శ్రీణాతు) పరిపచతు (త్వా) త్వామ్ (అపః) జలాని (సమ్) (అరిణన్) ప్రాప్నువంతు. రిణాతీతి గతికర్మసు పఠితమ్. నిఘం. ౨. ౧౪. (వాతస్య) వాయోః (ధ్రాజ్యై) గత్యై. అత్ర గత్యర్థాత్ ధ్రజ ధాతోః ఇఞ్ వపాదిభ్య అ.3.3.౧౦౮ భా....వా....ఇతీఞ్ ప్రత్యయః (పూష్ణః) పోషకరస్యాదిత్యస్య (రంహ్యై) గత్యై (ఊష్మణః) ఆతపాత్ (వ్యథిషత్) వ్యథతే (ప్రయుతమ్) ఏతత్సంఖ్యాకమ్ (ద్వేషః) ద్వేష్టి యేన సః అయమ్మంత్రః. శత.3.౮.3.౯-3౧. వ్యాఖ్యాతః.॥౧౮॥

అన్వయః :-హే యోద్ధః సంగ్రామే తే మనో మనసా ప్రాణః ప్రాణేన చ సంగచ్ఛతామ్. హే వీర! త్వం రేడసి త్వా త్వామగ్నిర్యుద్ధజన్యక్రోధాగ్నిశ్శ్రీణాతు. త్వం ప్రయుతం శత్రుసైన్యం ప్రాప్య తజ్జన్యాదూష్మణో ద్వేషో మా వ్యథిషత్. త్వాం వాతస్య ధ్రాజ్యై వాతస్య గతిభిర్యుద్ధకర్మణే గత్యై యద్వా పూష్ణో రంహ్యై సూర్యస్య గతిరివ యుద్ధభూమిషు గత్యై యదార్థతయా యుద్ధకర్మణే ప్రవృత్త్యై ఆపః సమరిణన్. ॥౧౮॥

భావార్థః:-మనుష్యైః సంగ్రామే మనఃసమాధాయ స్వబలవర్ధకాన్నపానశస్త్రాదిపదార్థాన్ సంపాద్య శత్రూన్ నిహత్య సంగ్రామో విజేతవ్య ఇతి. ॥౧౮॥

పదార్థము :-శూరవీరుడవగు ఓ యుద్ధశీలుడా! రణరంగమున (తే మనః) నీ మనస్సు (మనసా) విద్యా బలముతోను మరియు (ప్రాణః) ప్రాణము (ప్రాణేన) ప్రాణముతోను (సమ్ గచ్ఛతామ్) సంగతములును అగుగాక! ఓ వీరా! నీవు (రేట్ అసి) శత్రుసంహారకుడవు (త్వా) నిన్ను (అగ్నిః) యుద్ధమున జనించిన క్రోధాగ్ని (శ్రీణాతు) చక్కగా పచనమొనర్చునుగాక! నీవు (ప్రయుతమ్) కోట్లకొలదిగ నున్న శత్రుసైన్యముల నెదుర్కొనినప్పుడు, దానబుట్టిన (ఊష్మణః) ఉష్ణముయొక్క (ద్వేషః) ద్వేషము (వ్యథిషత్) నిన్ను అధిక బాధలకు గురిచేయకుండుగాక! ఎద్దానివల్ల (వాతస్య, ధ్రాజ్యై) వాయువు సమానమగు గతికొరకు (పూష్ణః) పుష్టికారకుడగు (రంహ్యై) సూర్యుని వేగముతో సమమగు వేగముకొరకు అనగా యథార్థత్వముతో యుద్ధమొనర్చుటకు ప్రవృత్తుడవగుటకై (ఆపః) ఉత్తమజలములు (సమ్ అరిణన్) చక్కగా ప్రాప్తించును గాక! ॥౧౮॥

భావార్థము :-మనుష్యులు తమ బలమును అభివృద్ధిపరచు అన్న జలములను అస్త్ర శస్త్రములు మున్నగు పదార్థములను సంగ్రహించుకొని శత్రువులను సంహరించి సంగ్రామమునందు విజయమును పొందవలయును. ॥౧౮॥

**18. O warlike hero, may thy mind in battle be filled with knowledge, and thy breath be united to life's force. O hero, thou art the killer of foes. May the fire of righteous indignation created by battle mature thee. Facing millions of the army of enemies, let not the heat generated by battle disturb thee!.**

**May thou get refreshing drinks to fight in war with the velocity of wind, and speed of the sun.**

౨౨౮. ఘృతం ఘృతపావాన ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, విశ్వేదేవా దేవతాః, బ్రాహ్మ్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తత్ర కిం భవితువ్యమిత్యుపదిశ్యతే.

మరల యుద్ధకర్మమునం దేమి కావలయునో ఈ మంత్రమున చెప్పబడినది.

౨౨౮ ఘృతం ఘృతపావానః పిబత వసాం వసాపావానః పిబతాన్తరిక్షస్య హవిరసి స్వాహా। దిశః ప్రదిశ ఆదిశో విదిశ ఉద్దిశో దిగ్భ్యః స్వాహా ॥౧౯॥

ప.విః- ఘృతమ్, ఘృతపావాన ఇతి ఘృత+పావానః, పిబత, వసామ్, వసాపావాన ఇతి వసా+పావానః, పిబత, అన్తరిక్షస్య, హవిః, అసి, స్వాహా దిశః, ప్రదిశ ఇతి ప్ర+దిశః, ఆదిశ ఇత్యా+దిశః, విదిశ ఇతి వి+దిశః, ఉద్దిశ ఇత్యుత్+దిశః, దిగ్భ్య ఇతి దిక్+భ్యః, స్వాహా ॥౧౯॥

పదార్థః:-(ఘృతమ్) ఉదకమ్. ఘృతమిత్యుదకనామసు పఠితమ్ నిఘం. ౧. ౧౨. (ఘృతపావానః) ఉదకపా వీరాః (పిబత) (వసామ్) వీరరసనీతిమ్ (వసాపావానః) వసాం నివాసం పాంతి తే (పిబత) (అంతరిక్షస్య) ఆకాశస్య (హవిః) ఆదీయత ఇతి. (అసి) (స్వాహా) యుద్ధానుకూలాం శోభనాం వాచమ్ (దిశః) పూర్వాద్యాః (ప్రదిశః) అభ్యంతరదిశః (ఆదిశః) అభిముఖ్యదిశః (విదిశః) విరుద్ధదిశః (ఉద్దిశః) యా ఉద్దిశ్యంతే తాః (దిగ్భ్యః) పూర్వప్రతిపాదితాభ్యః సర్వాభ్యః (స్వాహా) తత్తత్ స్థానానుకూలాం శోభనాం వాచమ్. అయమ్మన్త్రః. శత ౩.౮.౩.౩౨-౩౬. వ్యాఖ్యాతః. ॥౧౯॥

అన్వయః:- హే ఘృతపావానో వీరా! యూయం ఘృతం పిబత. హే వసాపావానో! యూయం వసాం పిబత. హే సేనాధ్యక్ష చక్రవ్యూహాదిసేనారచక ! త్వం ప్రతివీరమన్తరిక్షస్య హవిరసీతి. స్వాహా శోభనయా వాచా సర్వాన్ వీరాన్ యా దిశః, ప్రదిశ, ఆదిశో, విదిశ, ఉద్దిశశ్చ సన్తి తాభ్యః సర్వాభ్యో దిగ్భ్యః సర్వాః సేనా విభజ్య శత్రూన్ విజయధ్వమ్. ॥౧౯॥

భావార్థః :-సేనాధ్యక్షాణాముచితమస్తి స్వసేనాస్థాన్ వీరాన్ శరీరబలయుక్తాన్ యుద్ధవిద్యా సుశిక్షితాన్ సంపాద్య యుద్ధే సర్వాసు దిక్షు యథాయోగ్యాన్ స్వసేనాభాగాన్ సంస్థాప్య సర్వతః శత్రూనావృత్య విజిత్య చ న్యాయేన ప్రజాం పాలయేయురితి. ॥౧౯॥

పదార్థము:-(ఘృతపావానః) జలపానముచేయువారు ఓ వీరులారా! మీరు (ఘృతమ్) అమృతాత్మకములగు జలములను (పిబత) త్రాగుడు (వసాపావానః) నీతిని పాలించు వో వీరులారా! మీరు (వసామ్) శత్రువులను

స్తంభింపజేయు వీరరసవాణిని (పిలత) పిలిపించుడు. ఓ సేనాధ్యక్షా! చక్రవ్యూహము మున్నగు సేనావిధానకర్తా! నీవు ప్రతి శత్రువీరునకు (అన్తరిక్షస్య) ఆకాశముయొక్క (హవిః) యుద్ధరంగమునందు శత్రుసైన్యములకు అడ్డుగోడవై (అసి) ఉన్నావు (స్వాహా) ఆ శుభకరవాణిచే (దిశః) పూర్వ, పశ్చిమ, ఉత్తర, దక్షిణ దిశలకు (ప్రదిశః) ఆగ్నేయ, నైఋతి, వాయవ్య, ఈశాన్యము మున్నగు ఉపదిశలకు (ఆదిశః) ఎదురు బొదురు, వెనకా, ముందు నైపులకు (విదిశా) వెనుకదిశకు మరియు (ఉద్దిశః) శత్రువులుండు దిశలకు (దిగ్భ్యః) ఇట్లు సర్వదిశలకు యథాయోగ్యముగ వీరులను పంపి శత్రువులను జయించుము.॥౧౯॥

భావార్థము :- సైన్యాధ్యక్షులొనర్పదగిన కార్యము :- తమ తమ సైనిక వీరులెల్లరను అత్యంత పుష్టి వంతులుగ నొనర్చి యుద్ధసమయమున చక్రవ్యూహము, శ్యేనవ్యూహము, శకటవ్యూహము మొదలగు వ్యూహరచనలు మున్నగు కర్మలచే సకలదిశలందును స్వ సేనాభాగములను నిలిపి సకలవిధముల శత్రువుల నాక్రమించి, దాడిచేసి, ముట్టడించి, జయించి న్యాయయుక్తముగా ప్రజాపాలన మొనర్పవలయును.॥౧౯॥

19. Oh warriors, drinkers of water, drink refreshing water. O warriors expert in statesmanship, follow the policy of heroic action. O general, thou shouldst stop the foes in the air. With thy martial and commanding voice spread thy soldiers in all regions, by-regions, fore-regions, back-regions, and regions in which the enemy goes, and conquers the foes, by slaying their warriors!.

౨౨౮. ఐంద్రః ప్రాణ ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, త్వష్టా దేవతా, బ్రాహ్మ్యనుష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తత్రాన్యోన్యం కథం వర్తేరన్నిత్యుపదిశ్యతే.

సంగరమందు వీరపురుషులు పరస్పర మెట్లుండవలెనను విషయ మిందు గలదు.

౨౨౮ ఐన్ద్రః ప్రాణో అఙ్గే అఙ్గే నిదీధ్యదైన్ద్ర ఉదానో అఙ్గే అఙ్గే నిధీతః।
దేవ త్వష్టర్భూరి తే సꣳసమేతు సలక్ష్మా యద్విషురూపం భవాతి।
దేవత్రా యన్తమవసే సఖాయో అను త్వా మాతా పితరో మదన్తు ॥౨౦॥

ప.వి:- ఐంద్రః, ప్రాణః, అఙ్గే అఙ్గ ఇత్యఙ్గే+అఙ్గే, ని, దీధ్యత్, ఐన్ద్రః, ఉదాన ఇత్యుత్+ఆనః, అఙ్గే అఙ్గ ఇత్యఙ్గే+అఙ్గే, నిధీత ఇతి ని+ధీతః, దేవ, త్వష్టః, భూరి, తే, సꣳసమితి, సమ్, సమ్, ఏతు, సలక్ష్మేతి స+లక్ష్మ, యత్, విషురూపమితి విషు+రూపమ్, భవాతి, దేవత్రేతి దేవ+త్రా, యన్తమ్, అవసే, సఖాయః, అను, త్వా, మాతా, పితరః, మదన్తు॥౨౦॥

**పదార్థః** :-(ఐంద్రః) ఇంద్రో జీవో దేవతాఽస్య స ఐంద్రః (ప్రాణః) శరీరస్థో వాయువిశేషః (అంగే అంగే) యథా ప్రత్యంగం ప్రకాశతే (ని) నితరామ్ (దీధ్యత్) యుద్ధే శత్రూన్ వఞ్చిత్వా స్వయం ప్రకాశేత (ఐన్ద్రః) విద్యుద్దేవతాకః (ఉదానః) య ఊర్ధ్వమనితి (అంగే అంగే) ప్రత్యంగమ్ (నిధీతః) నిహిత ఇవ (దేవ) దివ్యవిద్యాసంపన్న సేనాధ్యక్ష (త్వష్టః) శత్రుబలచ్ఛేత్తః (భూరి) బహు (తే) తవ (సమ్ సమ్) ఏకీభావే. అత్ర ప్రసముపోదః పాదపూరణే అ. ౮. ౧. ౬. ఇతి సమిత్యస్య ద్విత్వమ్. (ఏతు) ప్రాప్నోతు. (సలక్ష్మ) సమానం లక్ష్మ యస్య తత్. అత్ర అన్యేషామపి దృశ్యత అ.౬.౩.౧౩౭. ఇతి దీర్ఘః. (విషురూపమ్) వ్యాపకం వివిధరూపం వా (భవాతి) భవతు. (దేవత్రా) దేవం దేవమితి దేవత్రా (యంతమ్) గచ్ఛంతమ్ (అవసే) రక్షణాయ (సఖాయః) సుహృదః సన్తః (అను) (త్వా) త్వామ్ (మాతా) జననీ (పితరః) రక్షకా జనకాః (మదన్తు) హర్షన్తు. అయమ్మన్త్రః. శత. ౩.౮.౩-౩౭. వ్యాఖ్యాతః. ॥౨౦॥

**అన్వయః** :-హే త్వష్టర్దేవ సేనాపతే! భగవన్ అంగే అంగే ఐన్ద్రః ప్రాణ ఇవావసే సంగ్రామే నిదీధ్యత్ యద్వా అంగే అంగే ఉదాన ఇవ సంగ్రామే నిధీతో భవతి. యత్ తే తవ విషురూపం సలక్ష్మ భవాతి తత్సంగ్రామే భూరి యథా స్యాత్తథా సంసమేతు. సఖాయో మాతా పితరశ్చ దేవత్రా ధర్మ్యం యుద్ధం వ్యవహారం వా యంతం త్వా త్వామనుమదన్తు. ॥౨౦॥

**భావార్థః** :-సేనాపతిః సర్వమిత్రోఽఙ్గేఽఙ్గే ప్రాణ ఉదాన ఇవ సంగ్రామే విచరన్ సేనాస్థవీరాన్ ప్రజాస్థపురుషాంశ్చ హర్షయిత్వా శత్రూన్విజయేత. ॥౨౦॥

**పదార్థము** :- (త్వష్టః) ఓ శత్రునాశకా! (దేవ) దివ్య విద్యాసంపన్నుడవగు సేనాపతీ! నీవు (అవసే) రక్షణము నున్నగువానికొరకై ఎట్లు (అంగే అంగే) ప్రతి అంగమునందును (ఐన్ద్రః) ఇంద్రుడనగా ప్రాణము [అధిదేవతగా, దేవతగా గలిగియున్న శరీరమందంతటను వసించు ప్రాణవాయువు సకల వాయువులను తిరస్కరించుచు స్వయముగ ప్రకాశించుచున్నట్లు నీవును సమరమందు సకలశత్రువులను తిరస్కరించుచు] (నిదీధ్యత్) ప్రకాశకుడవుకమ్ము. లేక (అంగే అంగే) ప్రతియంగమునందెట్లు (ఉదానః) అన్నము మున్నగు పదార్థములను ఊర్ధ్వమునకు చేర్చు ఉదానవాయువు ప్రవృత్తమైయున్నదో అట్లే నీవును స్వశక్తిచే సకల వీరులను ఉత్తేజపరచుచు రణరంగమున (నిధీతః) నిరంతరము నిలిచియున్నవానివలె ప్రకాశింపుము (యత్ తే విషురూపమ్) నీ వివిధరూపములలో [వ్యాపకమైయున్న] (సలక్ష్మ) పరస్పరము ఏ యుద్ధలక్షణము (భవాతి) కలదో యది (సంగ్రామే) సంగరమందు (భూరి) విస్తారముగ (సం సమ్ ఏతు) ప్రవృత్తమగుగాక: ఓ సేనానాయకా! నీ భద్రతకొరకు సమస్త శూరులు, వీరులు (సఖాయః) మిత్రులై ప్రవర్తించెదరుగాక! (మాతా) జనని (పితరః) తండ్రి, పితృవ్యులు, భృత్యులు, శుభచింతకులు [మున్నగు వారెల్లరును] (దేవత్రా) దేవతలను, విద్వాంసులను, ధర్మయుక్త యుద్ధమును, ధర్మయుక్త వ్యవహారమును (యన్తమ్) పొందుచున్న (త్వా) నిన్ను (అనుమదన్తు) అనుమోదింతురుగాక! ॥౨౦॥

భావార్థము :- ప్రతియంగమునందు ప్రాణ ఉదానములు ప్రవర్తమానములై యున్నట్లు సకల ప్రాణులయందు మిత్రభావముతో మెలగు సేనాపతి సంగ్రామమునందు విహరించుచు [తిరుగుచు] సేనను, ప్రజలను ఆనందపరచుచు శత్రువులను జయించునుగాక! ౨౦॥

**20.O destroyer of the strength of the enemy, O general endowed with beautiful knowledge, shine forth in the battle-field subduing all thy foes, as the in-going breath pertaining to our soul, overcomes all other breaths in every part of the body!.**

**Just as Udan breath permeates all our organs, so do thou O general shine forth in the battle leading all your warriors. Let thy diverse forces in uniform gather together in large numbers. O general, may all warriors behave friendly towards thee for the protection. May they mother, father and relatives be pleased to see thee moving in the midst of warriors.**

౨౧.సముద్రం గచ్ఛేత్యాదే ర్దీర్ఘతమా ఋషిః, సేనాపతి ర్దేవతా, యాజుష్య ఉష్ణిక్ఛందాంసి, ఋషభః స్వరః.

అథ రాష్ట్రకర్మానుష్ఠాతుమర్హాయ శిష్యాయ గురుః కిం కిముపదిశేదిత్యాహ.

రాజ్యకార్య మొనర్చుటకు యోగ్యుడైన శిష్యునకు గురు వే మేమి.

యుపదేశించవలయునో ఈ మంత్రమున చెప్పబడుచున్నది.

౨౧ సముద్రఙ్గచ్ఛ స్వాహాఽన్తరిక్షఙ్గచ్ఛ స్వాహా దేవꣳ సవితారఙ్గచ్ఛ స్వాహా।
మిత్రావరుణౌ గచ్ఛ స్వాహాఽహోరాత్రే గచ్ఛ స్వాహా ఛందాꣳసి గచ్ఛ
స్వాహా ద్యావా పృథివీ గచ్ఛ స్వాహా యజ్ఞం గచ్ఛ స్వాహా సోమం గచ్ఛ
స్వాహా దివ్యన్నభో గచ్ఛ స్వాహాగ్నిం వైశ్వానర ఙ్గచ్ఛ స్వాహా మనో మే హార్ది
యచ్ఛ దివన్తే ధూమో గచ్ఛతు స్వర్జ్యోతిః పృథివీ మ్భస్మనా పృణ స్వాహా ౨౧॥

ప.వి:- సముద్రమ్, గచ్ఛ, స్వాహా, అన్తరిక్షమ్, గచ్ఛ, స్వాహా, దేవమ్, సవితారమ్, గచ్ఛ, స్వాహా, మిత్రావరుణౌ, గచ్ఛ, స్వాహా, అహోరాత్రేఽ ఇత్యహో రాత్రే, గచ్ఛ, స్వాహా, ఛందాసి, గచ్ఛ, స్వాహా, ద్యావాపృథివీఽ ఇతి ద్యావాపృథివీ, గచ్ఛ, స్వాహా, యజ్ఞమ్, గచ్ఛ,

స్వాహా, సోమమ్, గచ్ఛ స్వాహా, దివ్యమ్, నభః, గచ్ఛ, స్వాహా, అగ్నిమ్, వైశ్వానరమ్, గచ్ఛ, స్వాహా, మనః, మే, హార్ది, యచ్ఛ, దివమ్, తే, ధూమః, గచ్ఛతు, స్వః, జ్యోతిః, పృథివీమ్, భస్మనా ఆ, పృణ, స్వాహా॥౨౧॥

పదార్థః:-(సముద్రమ్) సముద్రవన్తి జలాని యస్మిన్ తముదధిమ్ (గచ్ఛ) (స్వాహా) బృహన్నౌకారచనాదివిద్యాసిద్ధేన యానేన (అన్తరిక్షమ్) ఆకాశమ్ (గచ్ఛ) (స్వాహా) ఖగోళప్రకాశికయా విద్యయా సంపాదితేన విమానేన (దేవమ్) ద్యోతమానం పరమేశ్వరం (గచ్ఛ) జానీహి (స్వాహా) వేదవాచా సత్సంగసంస్కృతయా వా (మిత్రావరుణౌ) ప్రాణోదానౌ (గచ్ఛ) ప్రాణాయామాభ్యాసేన విద్ధి (స్వాహా) యోగయుక్త్యా వాచా (అహోరాత్రే) అహశ్చ రాత్రిశ్చ అహోరాత్రే. హేమంతశిశిరావహోరాత్రే చ ఛందసి అ. ౨. ౪.౨౮. అనేన నపుంసకత్వమ్ (గచ్ఛ) కాలవిద్యయా జానీహి యాహి వా (స్వాహా) జ్యోతిష్ప్రోధయుక్త్యా వాచా (ఛందాంసి) ఋగ్యజుఃసామాథర్వాణశ్చతురో వేదాన్ (గచ్ఛ) పఠనపాఠనపురస్సరేణ శ్రవణమననిధిధ్యాసనసాక్షాత్కారేణ విజానీహి. (స్వాహా) వేదాఙ్గాదివిజ్ఞానసహితయా వాచా (ద్యావా పృథివీ) ద్యౌశ్చ పృథివీ చ తౌ భూమిసూర్యౌ తద్గతావభీష్ట దేశదేశాంతరావితి యావత్ (గచ్ఛ) జానీహి (స్వాహా) భూమియానాకాశయానరచన భూగోల భూగర్భఖగోలవిద్యయా (యజ్ఞమ్) అగ్నిహోత్ర శిల్పరాజవ్యవహారాదికమ్. (గచ్ఛ) (సోమమ్) ఓషధిసమూహమ్ (గచ్ఛ) జానీహి (స్వాహా) వైద్యకశాస్త్ర బోధార్థయా వాచా (దివ్యమ్) వ్యవహర్తవ్యం శుద్ధమ్ (నభః) జలమ్ (గచ్ఛ) ప్రాప్నుహి (స్వాహా) తద్గుణవిజ్ఞాపయిత్ర్యా వాచా (అగ్నిమ్) విద్యుతమ్ (వైశ్వానరమ్) సర్వత్ర ప్రకాశమానమ్ (గచ్ఛ) జానీహి (స్వాహా) తద్బోధయుక్త్యా వాణ్యా (మనః) చిత్తమ్ (మే) మమ (హార్ది) హృదయస్యాతిశయేన ప్రియమ్ (గచ్ఛ) విధేహి (దివమ్) సూర్యమ్ (తే) తవ (ధూమః) యంత్రజ్వలనబాష్పః (స్వః) సుఖమ్ (అంతరిక్షమ్) అవకాశమ్ (జ్యోతిః) జ్వాలామ్ (పృథివీమ్) భస్మనా (ఆ) సమంతాత్ (పృణ) యోజయ (స్వాహా) యజ్ఞానుష్ఠానయంత్రరచనవిద్యయా. అయమ్మంత్రః శత. ౩.౮.౪.౧౧-౧౮. తథా ౮.౫.౧. ౧-౫. వ్యాఖ్యాతః. ॥౨౧॥

అన్వయః :-హే రాజకర్మానుష్ఠాతః! విద్వంస్త్వం స్వాహా సముద్రం గచ్ఛ, స్వాహాఽన్తరిక్షం గచ్ఛ స్వాహా దేవం సవితారం గచ్ఛ, స్వాహా మిత్రావరుణౌ గచ్ఛ స్వాహాఽహోరాత్రే గచ్ఛ. స్వాహా యజ్ఞం గచ్ఛ. స్వాహా సోమం గచ్ఛ. స్వాహా దివ్యం నభో గచ్ఛ స్వాహాఽగ్నిం వైశ్వానరం చ గచ్ఛ. మే మమ మనో హార్ది యచ్ఛ. తే తవ ధూమో దివ్యం జ్యోతిః స్వర్గచ్ఛతు. త్వం స్వాహా భస్మనా పృథివీమాపృణ.॥౨౧॥

భావార్థః:-ధర్మాదిరాజ్యవ్యాపారకరణవృత్తిమద్భిర్విద్వద్భిర్భూమియానాంతరిక్షయానాకాశయానైర్వివిధయంత్రకలారచనైశ్చ సర్వాః సామగ్రీః సంపాద్య ద్రవ్యసంచయః కార్యః.॥౨౧॥

పదార్థము :- ధర్మాదిరాజ్యకర్మలొనర్చదగిన ఓ శిష్యా! నీవు (స్వాహా) గొప్ప అశ్వతరీనావలను, పొగయోడలను నిర్మించు విద్యచే నౌక మున్నగు యానములనధిష్ఠించి (సముద్రం గచ్ఛ) సముద్రములను దాటుము (స్వాహా) ఖగోళమును ప్రకాశింపజేయు విద్యచే సిద్ధపరచబడిన విమానాది యానములతో (అన్తరిక్షమ్ గచ్ఛ) ఆకాశమునందు విహరించుము (స్వాహా) వేదవాణితో (దేవమ్) ప్రకాశమానుడగు (సవితారమ్) సర్వమును సృష్టించు పరమేశ్వరుని (గచ్ఛ) తెలిసికొనుము (స్వాహా) వేదము, సజ్జన సాంగత్యముచేతను, శుద్ధము మరియు సంస్కరింపబడినదియు నగు వాణిచేతను (మిత్రావరుణౌ) ప్రాణ, ఉదాన వాయువులను (గచ్ఛ) తెలిసికొనుము (స్వాహా) జ్యోతిషవిద్యచే (అహోరాత్రే) దివారాత్రములను, వానిగుణములను (గచ్ఛ) గ్రహించుము (స్వాహా) వేదాంగ విజ్ఞానసహిత వాణిచే (ఛన్దాంసి) ఋగ్యజుస్సామాథర్వము లను చతుర్వేదములను (గచ్ఛ) బాగుగా దెలిసికొనుము (స్వాహా) భూమి, ఆకాశమార్గ యాన రచనలచేతను, భూగోళ, ఖగోల, భూగర్భ విద్యలచేతను (ద్యావాపృథివీ) భూమి మరియు సూర్యప్రకాశస్థములు నగు అభీష్ట దేశదేశాంతరములను (గచ్ఛ) ఎరుగుము. మరియు ప్రాప్తించుకొనుము. (స్వాహా) సంస్కృతవాణిద్వారా (యజ్ఞమ్) అగ్నిహోత్రమును, శిల్పవిద్యను, రాజనీతిని, యజ్ఞమును (గచ్ఛ) పొందుము (స్వాహా) వైద్యవిద్యచే (సోమః) సోమలత మున్నగు ఓషధిసమూహమును (గచ్ఛ) తెలిసికొనుము (స్వాహా) జలముల మంచిచెడుగుణములను బోధపరచు విద్యలచే (దివ్యమ్) వ్యవహరించుట కుపయుక్తములగు పవిత్రములైన (నభః) జలములను (గచ్ఛ) ఎరుగుము. మరియు (స్వాహా) విద్యుత్తును, ఆగ్నేయము మున్నగు అస్త్రములు, తంతి మరియు సకల కళాయంత్రములను ప్రకాశమొనర్చు విద్యచే (అగ్నిమ్) విద్యుదగ్నిని (గచ్ఛ) బాగుగనెరుగుము. మరియు (మే మనః) నా మనస్సును (హార్ది) ప్రీతియుక్తముగ (గచ్ఛ) సత్య ధర్మమునందు స్థిరపరచుము. అనగా నా యుపదేశము ననుసరించి ప్రవర్తించుము. మరియు (తే) నీ (ధూమః) కళలయొక్క, యజ్ఞాగ్నియొక్క ధూమము (దివమ్) సూర్యప్రకాశమును మరియు (జ్యోతిః) దాని జ్వాలలు (స్వః) అంతరిక్షమును (గచ్ఛతు) ప్రాప్తించునుగాక! మరియు నీవు యంత్రకళయందుగల అగ్నియందు (స్వాహా) కాష్ఠములను మున్నగు పదార్థములను భస్మమొనర్చి (భస్మనా) ఆ భస్మముచే (పృథివీమ్) పృథివిని (ఆపృణ) కప్పివేయుము.॥౨౧॥

భావార్థము :- ధర్మార్థకామమోక్ష, రాజ్యవాణిజ్యాదులను గోరు మనుష్యుడు భూయానములను, అంతరిక్షయానములను మరియు ఆకాశమార్గమున ప్రయాణమొనర్చు విమానాది రథములను, లేక నానా ప్రకారములగు కళాయంత్రములను నిర్మించియు, సకల సామగ్రిని సంగ్రహించుకొని ధనమును, రాజ్యమును ఉపార్జించుకొనవలయును.॥౨౧॥

**21.O disciple, a student in the science of government, sail in oceans in steamers, fly in the air in aeroplanes, know God the Creator through the vedas, control thy breath through yoga, through astronomy know the functions of day and night, know all the Vedas, Rig, Yajur, Sama, and Atharva, by means of their constituent parts!.**

**Through astronomy, geography, and geology go thou to all the different countries of the world under the sun. Mayest thou attain through good preaching to statesmanship**

and artisanship, through medical science, obtain knowledge of all medicinal plants through hydrostatics, learn the different uses of water through electricity, understand the working of ever-lustrous lightning. Carry out my instructions willingly. May the smoke of thy yajna and military machines reach the sun, and may their flames go up the heaven; and may thou cover the earth with the ashes, the residue of thy yajna.

౨౩౦.మాప ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, వరుణో దేవతా, బ్రాహ్మీ స్వరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః, సుమిత్రియా న ఇత్యస్య విరాడ్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ వాణిజ్యార్థం రాజప్రబంధమాహ.

వాణిజ్యవ్యాపారములకు రాజ్యప్రబంధము ఈ మంత్రమున చెప్పబడినది.

౨౩౦ మాపో మౌషధీర్హిꣳసీ ర్ధామ్నో ధామ్నో రాజꣳస్తతో వరుణ నో ముఞ్చ।
యదాహు రఘ్న్యా౾ ఇతి వరుణేతి శపామహే తతో వరుణ నో ముఞ్చ।
సుమిత్రియా న౾ఆప౾ ఓషధయః సంతు దుర్మిత్రియా
స్తస్మైసన్తు యో౾స్మాన్ద్వేష్టి యఞ్చ వయం ద్విష్మః ॥౨౨॥

ప.వి:- మా, అపః, మా, ఓషధీః, హింసీః, ధామ్నోధామ్న+ఇతి ధామ్నః + ధామ్నః, రాజన్, తతః, వరుణ, నః, ముఞ్చ, యత్, ఆహుః, అఘ్న్యాః, ఇతి, వరుణ ఇతి, శపామహే, సుమిత్రియా ఇతి సు+మిత్రియాః, నః, ఆపః, ఓషధయః, సంతు, దుర్మిత్రియా ఇతి దుః+మిత్రియాః, తస్మై, సన్తు, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః॥౨౨॥

పదార్థః-(మా) నిషేధే (అపః) జలాని (మా) నిషేధే (ఓషధీః) యవాదీన్ (హింసీః) (ధామ్నో ధామ్నః) స్థానాత్ స్థానాత్ (రాజన్) సభాపతే! (తతః) తస్మాత్ (వరుణ) ప్రశస్త (నః) అస్మాన్ (ముఞ్చ) (యత్) (ఆహుః) (అఘ్న్యాః) హన్తుమయోగ్యా గావస్తాః. అఘ్న్యా ఇతి గోనామసు పఠితమ్. నిఘం. ౨. ౧౧. (ఇతి) అనేన ప్రకారేణ (వరుణ) న్యాయకారిన్! (ఇతి) ప్రకారాంతరే (శపామహే) (సుమిత్రియాః) సుమిత్రాణీవ (నః) అస్మభ్యమ్ (ఆపః) (ఓషధయః) (సంతు) (దుర్మిత్రియాః) దుర్మిత్రాణీవ (తస్మై)

ద్విషతే (సంతు) (యః) అమిత్రః (అస్మాన్) ద్వేష్టి (యమ్) (చ) (వయమ్) (ద్విష్మః) అయమ్మంత్రః శు. 3.౮.౫.౯-౧౧. వ్యాఖ్యాతః. ॥౨౨॥

అన్వయః :-హే రాజన్! త్వమప ఓషధీశ్చ మా హింసీః. న కేవలమిదమేవ కుర్యాః కింతు తతో ధామ్నో ధామ్నోఽస్మాన్ మా ముఞ్చ. హే వరుణ! అఘ్న్యా ఇతి యద్బ్రువన్త ఆపః వయం చేత్థం శపామహే తతస్త్వం మా ముఞ్చ వయమపి న ముఞ్చామః. హే వరుణ ! నః అస్మభ్యమాప ఓషధయశ్చ సుమిత్రియా స్సుమిత్రవత్ సన్తు. యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మ స్తస్మై దుర్మిత్రియాః శత్రువత్ సన్తు. ॥౨౨॥

భావార్థః:-రాజపురుషాః ప్రజాభ్యోఽనీత్యా ధనం న గృహ్ణీయుః రాజరక్షణాయ ప్రతిజ్ఞాం కుర్యు రన్యాయం వయం న కరిష్యామ ఇతి దుష్టాన్ సతతం దండయేయురితి. ॥౨౨॥

పదార్థము:-(రాజన్) ఓ సభాధ్యక్షా! నీవు నీ ప్రత్యేకస్థానములందు (అపః) జలములను మరియు (ఓషధీః) అన్నపానపదార్థములను, కిరాణాభోజనవస్తువులను [వ్యాపార దినుసులను] వనముల సంబంధ పదార్థములను (మా హింసీః) నష్టపరచకుము [మాకు ప్రతిచోట కావలసిన పదార్థములు లభించు చుండవలయును.] ఇంతయేకాదు (తతః ధామ్నః ధామ్నః) ఆ యా స్థలములనుండి (నః) మమ్ము (మా ముంచ) వదలివేయకుము (వరుణ) ఓ న్యాయాధిపతీ! సభాపతి యొనర్చిన న్యాయములో (అఘ్న్యాః) చంపకూడని గోవులు మున్నగు వానిపై ఒట్టు (ఇతి) అని నీవే [ఒట్టు] శపథ మొనర్చుచున్నావు. మరియు మేమును (శపామహే) శపథ మొనర్చుచున్నాము [నీవును ఈ ప్రతిజ్ఞను విడిచిపెట్టకుము. మేమును వీడము.] ఓ వరుణా! మీ రాజ్యమున (నః) మాకు (అపః) జలములు, ఓషధులు (సుమిత్రియాః సన్తు) నిజమిత్రునివలె ఉండునుగాక! (యః) ఎవడు (అస్మాన్ ద్వేష్టి) మమ్ము ద్వేషించునో (చ వయమ్) మరియు (యమ్ ద్విష్మః) మేము ద్వేషించువానిని (తస్మై) వారికి యా ఓషధులు (దుర్మిత్రియాః) దుఃఖము గలిగించునవి యగునుగాక! ॥౨౨॥

భావార్థము :- రాజు మరియు రాచకర్మచారులు ప్రజలనుండి అవినీతిగా ధనము గ్రహించవలదు. రాజపురుషులు ప్రజలనుద్దేశించి మే మన్యాయమొనర్చము, సదా మిమ్ము సంరక్షింతుము. దొంగలను, దోపిడి, టక్కరి, మోసకాండ్రను, లంపటులను, కపటులను, దుర్మార్గులను, కుకర్ములను నిరంతరము నష్టపరచు చుందు మని ప్రతిజ్ఞ యొనర్చవలయును. ॥౨౨॥

**22.O praiseworthy king, do not destroy canals, wells, tanks, corn fields and forests. Protect us at every place. O Justice-loving king, we take a solemn vow that cows and learned Brahmans whom thou declarest to be unworthy of destruction, will not be killed by us. We will stick to this resolve and so shouldst thou!.**

**O king, in thy rule, may waters, and medicines be friendly to us, and unfriendly to him who dislikes us or whom we dislike!.**

౨౩౧.హవిష్మతీరిత్యస్య దీర్ఘతమా ఋషిః,అన్నిర్జీ సూర్యాః దేవతాః,విచృదార్య్యనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః.

పునరన్యోఽన్యం మిలిత్వా రాజప్రజే కేన కిం కిం కుర్యాతామిత్యాహ.

రాజు, ప్రజలు కలిసి యుండి ఎట్లావిచే నేమేమి చేయవలయు నను విషయ మీ మంత్రమునం దుపదేశింపబడినది.

౨౩౧ హవిష్మతీ రిమాఽ ఆపో హవిష్మాఀ౨ఽ॥ ఆవివాసతి।

హవిష్మాన్ దేవోఽ అధ్వరో హవిష్మాఀ౨ఽ॥ అస్తు సూర్యః॥౨౩॥

ప.వి:- హవిష్మతీః, ఇమాః, ఆపః, హవిష్మాన్, ఆ, వివాసతి, హవిష్మాన్, దేవః, అధ్వరః, హవిష్మాన్, అస్తు, సూర్యః. ॥౨౩॥

పదార్థః :-(హవిష్మతీః) ప్రశస్తాని హవీంషి విద్యన్తే యాసు తాః (ఇమాః) ప్రత్యక్షాః (ఆపః) జలాని (హవిష్మాన్) ప్రశస్తాని హవీంషి విద్యన్తే యస్య వాయోః సః. దీర్ఘాదటి సమానపాదే అ.౮.౩.౯.ఇతి రుః. ఆతోఽటి నిత్యమ్.౮.౩.౩. ఇతి సానునాసికత్వమ్ (ఆ) సమన్తాత్ (వివాసతి) సేవతే. వివాసతీతి పరిచరణకర్మను పఠితమ్. నిఘం.౩.౫. (హవిష్మాన్) (దేవః) సుఖయితా (అధ్వరః) యజ్ఞః (హవిష్మాన్) అస్తు. (సూర్యః) అయమ్మన్త్రః శత. ౩.౯.౨.౧౦. వ్యాఖ్యాతః. ॥౨౩॥

అన్వయః:-హే విద్వాంసో యథేమా ఆపో హవిష్మతీర్హవిష్మత్యః స్యురయం వాయుర్హవిష్మానేవా వివాసతి, సర్వాన్ పరిచరతి దేవోఽధ్వరో హవిష్మాన్ స్యాత్ సూర్యో హవిష్మాన్ అస్తు భవేత్, తథా భవంతో యజ్ఞైనైతాన్ శుద్ధాన్ కుర్వన్తు. ॥౨౩॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యేన వాయుజల సంయోగేనానేకాని సుఖాని సాధ్యంతే, ధ్యై.ర్వివిధదేశ దేశాంతరగమనేన వస్తుప్రాపణం భవతి. తైరేతత్ కర్మ క్రియావిచక్షణ ఏవ కర్తుం శక్నోతి. యో వివిధక్రియా ప్రకాశకోఽస్తి స యజ్ఞో వృష్ట్యాదిసుఖకరో భవతి.॥౨౩॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! (ఇమాః ఆపః) ఈ జలములు (హవిష్మతీః) చక్కగా ఆదాన ప్రదానముల నొనర్పునవియు, క్రియాశుద్ధికరణములును, సుఖప్రదములును అగుగాక! [అనగా సకల విధములగు ఉపకారములు పరస్పరము సమకూర్చుకొనదగిన కార్యముల నొనర్చుడు.] (హవిష్మాన్) పవనములు ఉపకార అనుపకారములను (ఆ వివాసతి) చక్కగా ప్రాప్తింపజేయుగాక! (దేవః) సౌఖ్యముల ప్రసాదించు (అధ్వరః)

యజ్ఞము సైతము (హవిష్మాన్) పరమానందకరముగూాక! (సూర్యః) సూర్యలోకమును (హవిష్మాన్) సుగంధాదియుక్తమై సౌఖ్యదాయకము (అస్తు) అగుగాక! ॥౨౩॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ వాయువు జలముల సంయోగముద్వారా అనేక సుఖములు సాధింపబడుచున్నవో, వేనివల్ల దేశదేశాంతరములకు పోగలుగుటచే ఉత్తమోత్తమ వస్తువులప్రాప్తి గలుగుచున్నవో, ఆ యగ్ని, జలము మున్నగు పదార్థములతో ఉక్తకార్యములను క్రియాశీలుడగు మనుష్యుడే చేయగలుగుచున్నాడు. మరియు ఎవడు అనేక విధములగు శిల్పవిద్యలను అనేక క్రియలను ప్రకాశమొనర్చునో అతడే యజ్ఞమును, వర్షములు మున్నగు ఉత్తమోత్తమ సుఖములను సమకూర్చు వా డగుచున్నాడు. ॥౨౩॥

23.O learned persons, see that these waters contribute to your purity, comfort and usefulness. Air can be used and abused. May pleasure-promoting yajna grant us happiness, may the sun give us health and comfort!.

౨౩౨. అగ్నేర్వ ఇత్యస్య మేధాతిథి ఋషిః, ఆర్చీత్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః, అమూర్యేత్యస్య త్రిపాద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ గురుపత్న్యో బ్రహ్మచర్యమనువర్తినీః కన్యాః కిం కిముపదిశేయురిత్యాహ.

బ్రహ్మచర్యమును పాలించు కన్యలకు గురుపత్ను లుపదేశించదగిన విషయము లీ మంత్రమునందు తెలుపబడినవి.

౨౩౨ అగ్నే ర్వో౽పన్నగృహస్య సదసి సాదయామీన్ద్రాగ్న్యోర్భాగధేయీ స్థ మిత్రావరుణయో ర్భాగధేయీ స్థ విశ్వేషాం దేవానాం భాగధేయీ స్థ।
అమూర్యా౽ ఉప సూర్యే యాభిర్వా సూర్యః సహ
తా నో హిన్వన్త్వధ్వరమ్ ॥౨౪॥

ప.వి:- అగ్నేః, వః, అపన్నగృహస్యేత్యపన్న గృహస్య, సదసి, సాదయామి, ఇంద్రాగ్న్యోః, భాగధేయీరితి భాగ+ధేయీః, స్థ, మిత్రావరుణయోః, భాగధేయీరితి భాగ+ధేయీః, విశ్వేషామ్, దేవానామ్, భాగధేయీరితి భాగ+ధేయీః అమూః, యాః, ఉప, సూర్యే, యాభిః, వా, సూర్యః, సహ, తాః, నః, హిన్వన్తు, అధ్వరమ్. ॥౨౪॥

పదార్థః:-(అగ్నేః) విద్యాదిగుణప్రకాశితస్య సభ్యజనస్య (వః) యుష్మాన్ యుష్మాకం వా (అపన్నగృహస్య) అప్రాప్తగృహస్య కుమారబ్రహ్మచారిణః (సదసి) సీదంతి బుద్ధివిషయా యస్మిన్నితి సదః అధ్యయనాధ్యాపన నిమిత్తా సభా. తత్ర (సాదయామి) స్థాపయామి (ఇంద్రాగ్న్యోః) సూర్యవిద్యుతో ర్గుణానామ్ (భాగధేయీః) విభాగ విజ్ఞానయుక్తాః. నామరూపభాగేభ్యః స్వార్థే ధేయః. ప్రత్యయః. అ. ౫-౪-౩౬. భా....వ... కేవలమామకేత్యాదినా అ. ౪. ౧. ౩౦ జీప్ (స్థ) భవథ (మిత్రావరుణయోః) ప్రాణోదానయోః (భాగధేయీః) విభాగవిజ్ఞానయుక్తాః (స్థ) భావథ (విశ్వేషామ్) సర్వేషామ్ (దేవానామ్) విదుషాం పృథివ్యాదీనాం వా (అమూః) ప్రత్యక్షాః (యాః) (ఉప) (సూర్యే) సవితృలోకే (యాభిః) (వా) పక్షాంతరే (సూర్యః) సూర్యలోకః (సహ) (తాః) (నః) అస్మాకమ్ (హిన్వన్తు) ప్రీణంతు (అధ్వరమ్) గృహాశ్రమక్రియాసిద్ధికరం యజ్ఞమ్.॥౨౪॥

అన్వయః:-హే బ్రహ్మచారిణ్యో! యూయం యా అమూః స్వయంవరవివాహం కృతవత్యః సన్తి యూయం ఇన్ద్రాగ్న్యో ర్భాగధేయీ స్థ. మిత్రావరుణయోర్భాగధేయీః స్థ. విశ్వేషాం దేవానాం భాగధేయీః స్థ, తా వో యుష్మాన్ అపన్న గృహస్యాగ్నేః సదస్యహం సాదయామి. యా ఉపసూర్యే సూర్యగుణేషు తిష్ఠంతి, వా యాభిః సహ సూర్యో వర్తతే, తా నోఽస్మాకమధ్వరం వివాహం కృత్వా హిన్వన్తు. ॥౨౪॥

భావార్థః:-బ్రహ్మచర్యధర్మమనువర్తినీనాం కన్యానామవివాహితైః స్వతుల్యగుణకర్మ స్వభావైః పురుషైః సహైవ. వివాహకరణయోగ్యతాఽస్తీతి హేతోర్గురుపత్న్యో బ్రహ్మచారిణ్యః కన్యాస్తాదృశమేవోపదిశంతు. ఇల్వాపత్కాలే కృతవివాహయోర్నియోగో భవితుమర్హతి నాన్యథేతి. ॥౨౪॥

పదార్థము :- బ్రహ్మచారిణులగు ఓ కన్యామణులారా! (అమూః యాః) స్వయంవరవివాహముచే పతులను వరించిన కన్యలవలె (ఇన్ద్రాగ్న్యోః) సూర్య విద్యుత్తుల గుణములను (భాగధేయీః) వేరువేరుగ నెరుగువారు ఎవరు (స్థ) కలరో (మిత్రావరుణయోః) ప్రాణ ఉదానముల గుణములను (భాగధేయీః) విడివిడిగా నెరుగువారు ఎవరు (స్థ) ఉన్నారో (విశ్వేషామ్) విద్వాంసులను మరియు పృథివి మున్నగు పదార్థములను సేవించువారు ఎవరు (స్థ) కలరో అట్టి (వః) మీరెల్లరును (అపన్నగృహస్య) ఇంతవరకు గృహకృత్యములను పొందనివారును, బ్రహ్మచర్య ధర్మానుష్ఠానమొనర్చినవారును (అగ్నేః) సకల విద్యాది గుణములచే ప్రకాశితులగు ఉత్తమబ్రహ్మచారుల (సదసి) సభలో నేను (సాదయామి) స్థాపించుచున్నాను. మరియు (యాః, ఉప, సూర్యే) ఏ స్త్రీలు సూర్యలోకపు గుణములతో ఉపస్థితులైయుండగుచున్నారో (వా) లేక (యాభిః సహ) ఏ మహిళలతో బాటు (సూర్యః) సూర్యలోకము నిలిచియున్నదో, ఏ విదుషీమణులు సూర్యుని గుణములందు అతిచతురమతులో (తాః) వా రెల్లరును (నః) మాయొక్క (అధ్వరమ్) గృహకార్యభారమును వహించు యజ్ఞమును (హిన్వన్తు) వృద్ధిపరతురుగాక! ॥౨౪॥

భావార్థము :-బ్రహ్మచర్యమును పాలించు కన్యలకు అవివాహిత బ్రహ్మచారులకు [వారి గుణకర్మ స్వభావములకు తగినవారిని] వివాహమాడుటకు అధికారము గలదు. కావున గురుజనుల పత్నీమణులు

బ్రహ్మచారిణులగు కన్యలకు వారు తమ యిష్టానుసారము తుల్యగుణకర్మస్వభావయుక్త పురుషులను వివాహమాడి సదా సుఖవంతులుగ నుండునట్లు ఉపదేశించవలయును. పతి మరణించిన స్త్రీ, భార్యగతించిన పురుషుడును సంతానేచ్ఛగలవా రగుచో నా యిరువురు నియోగమొనర్చుకొనవచ్చును. కాని వ్యభిచారము మున్నగు కుకర్మల నెన్నటికిని ఆచరించవలదు.॥౨౪॥

24.O virgins, I set ye down in the assembly of learned bachelors. Ye are cognisant of the diverse qualities of sun and lighting, ye know fully well the science of the control of breath, ye can make selection of learned husbands!.

Those of you, who after marriage live with husbands brilliant like the sun, and with you whom, live brilliant husbands, should both advance our domestic dealings.

౨౩౩. హృదే త్వేత్యస్య మేధాతిథి ఋషిః, సోమో దేవతా, ఆర్షీ విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తాః కిం కిముపదిశేయురిత్యాహ.

ఇంక వారేమి యుపదేశించవలయు నను విషయ మిందు చెప్పబడినది.

౨౩౩ హృదే త్వా మనసే త్వా దివే త్వా సూర్యాయ త్వా ఊర్ధ్వమిమ మధ్వరం

దివి దేవేషు హోత్రా యచ్ఛ ॥౨౫॥

ప.విః- హృదే, త్వా, మనసే, త్వా, దివే, త్వా, సూర్యాయ, త్వా, ఊర్ధ్వమ్, ఇమమ్, అధ్వరమ్, దివి, దేవేషు, హోత్రాః, యచ్ఛ.॥౨౫॥

పదార్థః :-(హృదే) హృత్సుఖాయ (త్వా) త్వామ్ (మనసే) సదసన్మననాయ (త్వా) త్వామ్ (దివే) సర్వసుఖద్యోతనాత్ (త్వా) త్వామ్ (సూర్యాయ) సూర్యగుణాయ (త్వా) త్వామ్ (ఊర్ధ్వమ్) ఉత్కృష్టమ్ (ఇమమ్) ప్రత్యక్షమ్ (అధ్వరమ్) అవినశ్వరం యజ్ఞమ్ (దివి) శుభగుణప్రకాశే (దేవేషు) విద్వత్సు (హోత్రాః) హవనకర్మానుష్ఠాత్ర్యః (యచ్ఛ) ఉపగృహ్ణీహి. అయం మంత్రః శత. ౩.౯.౩. ౪-౫. వ్యాఖ్యాతః. ॥౨౫॥

అన్వయః :-హే బ్రహ్మచారిణి కన్యే! త్వం యథా వయం సర్వా దేవేషు స్వపతిషు సమీపవర్తిన్యో హోత్రా హవనకర్మానుష్ఠాత్ర్యః స్మస్తథా భవ. యథా వయం హృదే త్వా, మనసే త్వా, దివే త్వా, సూర్యాయ, త్వామశాస్మ స్తథా దివీమమధ్వరమూర్ధ్వం యచ్ఛ. ॥౨౫॥

భావార్థః :- యథా పతివ్రతాః స్వపతిషు శుశ్రూషయమాచరన్త్యోఽగ్నిహోత్రాది కర్మసు విదుషః స్యుస్తథా వివాహానంతరం బ్రహ్మచారిణీభిర్బ్రహ్మచారిభిరపి వరప్పరమనువర్తితవ్యమితి. ॥౨౫॥

పదార్థము :- ఓ బ్రహ్మచారిణీ! మే మెట్లు (దేవేషు) మాకు సుఖము గలిగించు, సమీపమున నుండువారముగ (హోత్రా) అగ్నిహోత్రము మున్నగు కర్మల ననుష్ఠించువారముగ నున్నామో నీవును అట్లే ఆగువము. మరియు మే మెట్లు (హృదే) సౌహార్దసుఖమునకై (త్వా) నిన్ను (మనసే) మంచిచెడుల నాలోచించుటకై (త్వా) నిన్ను (దివే) సర్వసుఖములను ప్రకాశింపజేయుటకు (త్వా) నిన్ను (సూర్యాయ) సూర్యునివంటి గుణములకొరకు (త్వా) నిన్ను విదుషీమణిగా నొనర్చుచున్నామో అట్లే నీవును (దివి) సకల సుఖముల ప్రకాశపరచుటకై (ఇమమ్ అధ్వరమ్) సదా సుఖముగలిగించు గృహాశ్రమరూపమగు నీ యజ్ఞమును (ఊర్ధ్వమ్ యచ్ఛ) వృద్ధిపరచుము. ॥౨౫॥

భావార్థము :- పతులసేవ యొనర్చు పతివ్రతలై గురుపత్నులు పతులతోగూడ అగ్నిహోత్రాది కర్మలందు స్థిరబుద్ధిపరులై యుండునట్లు వివాహానంతరము బ్రహ్మచారిణులగు కన్యలు, బ్రహ్మచారులగు యువకులు పరస్పరము ఉండవలయును. ॥౨౫॥

25.O virgins, just as we live with our husbands and perform the Havan, so do ye. Just as we impart instruction unto ye for mental peace, for discriminating between virtue and vice, for spreading happiness, and acquiring brilliance like the sun, so do ye uplift the domestic life for the diffusion of all kinds of happiness!.

౨౩౪. సోమ రాజన్నిత్యస్య మేధాతిథి ఋషిః, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః, శృణోత్విత్యస్యార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ గురుజనః క్షత్రియం శిష్యం ప్రజాజనాంశ్చ ప్రత్యుపదిశతి.

క్షత్రియశిష్యునికి, ప్రజలకు గురు వుపదేశించుచున్నాడు.

౨౩౪ సోమ రాజన్విశ్వా స్త్వం ప్రజా౨ ఉపావరోహ విశ్వాస్త్వాం ప్రజా౨ ఉపా వరోహంతు । శృణోత్వగ్నిః సమిధాహవ మ్మే శృణ్వంత్వాపో ధిషణాశ్చ దేవీః।శ్రోతా గ్రావాణో విదుషో న యజ్ఞ౯ శృణోతు దేవః సవితా హవమ్మే స్వాహా॥౨౬॥

ప.వి:- సోమ, రాజన్, విశ్వాః, త్వమ్, ప్రజా ఇతి ప్ర+జాః, ఉపావరోహేత్యుప +అవరోహ, విశ్వాః, త్వామ్, ప్రజా ఇతి ప్ర+జాః, ఉపావరోహన్త్విత్యుప+అవరోహంతు,

శృణోతు, అగ్నిః, సమిధేతి సమ్ + ఇధా, హవమ్, మే, శృణ్వంతు, ఆపః, ధిషణాః, చ, దేవీః, శ్రోత, గ్రావాణః, విదుషః, న, యజ్ఞమ్, శృణోతు, దేవః, సవితా, హవమ్, మే, స్వాహా॥౨౮॥

పదార్థః :- (సోమ) ప్రశస్తైశ్వర్యయుక్త (రాజన్) సర్వోత్కృష్టగుణైః ప్రకాశమాన! (విశ్వాః) సర్వాః (త్వమ్) (ప్రజాః) పాలనీయాః (ఉపావరోహ) ఉపవర్తస్వ (విశ్వాః) సర్వాః (త్వామ్) పితరమపత్యానీవ సుఖాయ (ప్రజాః) ప్రజననీయాః (ఉపావరోహంతు) సముపాశ్రయన్తు (శృణోతు) (అగ్నిః) పావకః (సమిధా) సమిధేవ (హవమ్) అర్చనమ్ (మే) మమ (శృణ్వన్తు) (ఆపః) శుభగుణకర్మవ్యాప్తాః (ధిషణాః) ధృష్టా వాచో యాసాం తాః. ధిషణేతి వాఙ్నా. నిఘం. ౧.౧౧. (చ) పక్షాంతరే (దేవీః) విదుష్యః (శ్రోత) శృణుత. అత్ర తస్య స్థానే లోట్ తప్ తనధనాశ్చ.అ,౭.౧.౪౫. అనేన తబాదేశః. ద్వ్యచోఽతస్తిఙ అ.౬.౩.౧౩౫. ఇతి దీర్ఘః. బహులం ఛందసి. అ. ౨.౪. ౭౩. ఇతి శ్నులోపశ్చ (గ్రావాణః) సదసద్వివేచకా విద్వాంసః గ్రావాణ ఇతి పదనామసు పఠితమ్. ని. ౫. ౩. (విదుషః) (న) ఇవ (యజ్ఞమ్) (శృణోతు) (దేవః) విద్యాప్రకాశితః. (సవితా) ఐశ్వర్యవాన్ (హవమ్) (మే) మమ (స్వాహా) స్తుతియుక్తా వాగ్యథా తథా. అయం మంత్రః. శత. ౩.౯.౩. ౬-౨౪ వ్యాఖ్యాతః. ॥౨౮॥

అన్వయః:- హే సోమ రాజంస్త్వం పితేవ విశ్వాః ప్రజా ఉపావరోహ. త్వాం విశ్వాః ప్రజా అపత్యానీవోపావరోహంతు. భవాన్ సమిధాగ్నిరివ మే మమ ప్రజాజనస్య హవం శృణోతు. యా ఆపో ధిషణా దేవీః దేవ్యః పత్న్యశ్చ మాతరమివ స్త్రీన్యాయం శృణ్వంతు. హే గ్రావాణః స్తావకా విద్వాంసః సభాసదో! యూయం మమ హవం శ్రోత దేవః సవితా భవాన్ విదుషో యజ్ఞం న ఇవ మే మమ హవం స్వాహా శృణోతు. ॥౨౮॥

భావార్థః:- రాజా ప్రజాశ్చ పరస్పరానుమత్యా సర్వాన్ రాజ్యవ్యవహారాన్ పాలయేయురితి.॥౨౮॥

పదార్థము :- (సోమ) శ్రేష్ఠ ఐశ్వర్యవంతుడా! (రాజన్) సకల ఉత్కృష్ట గుణములచే ప్రకాశించు సభాధ్యక్షా! నీవు పితృతుల్యుడవై (విశ్వాః) సమస్త (ప్రజాః) ప్రజలను (ఉపావరోహ) సమీపమందుండి రక్షించుము (త్వామ్) నిన్ను (విశ్వాః) సమస్త (ప్రజాః) పుత్రులవంటి ప్రజలు (ఉపావరోహన్తు) ఆశ్రయింతురుగాక! ఓ సభాధ్యక్షా! (సమిధా) ప్రదీప్తపరచు పదార్థముతో (అగ్నిః) సకలగుణసంపన్నుడగు అగ్ని ప్రకాశించునట్లు (మే) నాయొక్క (హవమ్) ప్రగల్భవాణిని (శృణోతు) విని న్యాయముగా ప్రకాశించుము. మరియు (ఆపః) సర్వగుణములందు వ్యాప్తురాలును (ధిషణాః) విద్యాబుద్ధులు గలదియు (దేవీః) ఉత్తమగుణములచే ప్రకాశవతియునగు నీ పత్నియు మాతృతుల్యముగ స్త్రీల న్యాయమును (శృణ్వన్తు)

అలకించుముగాక! (గ్రావాణః) సత్యాసత్యముల నెరుగు విద్వాంసులగు సభాసదులారా! మీరు మా మాటలచే మా యభిప్రాయములను (శ్రోత) వినుడు. మరియు (దేవః) విద్యాప్రకాశితుడు, (సవితా) ఐశ్వర్యవంతుడునగు సభాపతి (విదుష్టః) విద్వాంసుల (యజ్ఞమ్) యజ్ఞమువలె (మే) మా ప్రజల (హవమ్) నివేదనమును (స్వాహా) ప్రశంసతో గూడిన వాక్యమువలె (శృణోతు) వినునుగాక! ॥౨౬॥

భావార్థము:- రాజ, ప్రజలు పరస్పరము ఆలోచించి సమస్త రాజ్యవ్యవహారములను నెరవేర్చుచుందురు గాక! ॥౨౬॥

26.O noble king, like a father go near thy subjects, and let the subjects like sons come near thee to seek protection. Just as fire is kindled with wood-sticks, so hear my complaint and kindle justice. Let versatile, learned and noble - minded queens, like mothers, hear the complaints of women, and do justice unto them!.

You magistrates who distinguish justice from injustice, listen to our grievances!.

O supreme king, endowed with knowledge, hear like sacrificing learned persons, our requests made in an humble, laudatory tone!.

౨౭॥.దేవీరాప ఇత్యస్య మేధాతిథిర్ఋషిః, ఆపో దేవతాః, నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునరేతే కథం వర్తేరన్నిత్యుపదిశ్యతే.

రాజ ప్రజలు పరస్పర మెట్లుండవలె నను విషయ మీ మంత్రమున ఉపదేశించబడినది.

౨౭॥ దేవీరాపోఽ అపాన్నపాద్యో వఽ ఊర్మిర్హవిష్యఽ ఇంద్రియావాన్

మదింతమః। తం దేవేభ్యో దేవత్రా దత్త శుక్రపేభ్యో

యేషాంభాగ స్థ స్వాహా ॥౨౭॥

ప.వి:- దేవీః, ఆపః, అపామ్, నపాత్, యః, వః, ఊర్మిః, హవిష్యః, ఇన్ద్రియావాన్ ఇంద్రియావానితీంద్రియ+వాన్, మదింతమ ఇతి మదిన్ఽతమః, తమ్, దేవేభ్యః, దేవత్రేతి దేవ + త్రా, దత్త, శుక్రపేభ్య ఇతి శుక్ర+పేభ్యః, యేషామ్, భాగః, స్థ, స్వాహా॥౨౭॥

పదార్థః:-(దేవీః) దివ్యాః (ఆపః) ఆప్తాః ప్రజాః (అపాం నపాత్) అవినశ్వరః (యః) (వః) యుష్మాకమ్ (ఊర్మిః) జలతరంగ ఇవ (హవిష్యః) హవిర్భ్యో హితః (ఇంద్రియావాన్) ప్రశస్తానీంద్రియాణి

యస్మిన్ సః (మదింతమః) మదయతీతి మదీ సోఽతిశయితః. నాద్ ఘస్య. అ, ౮.౨.౧౭. ఇతి మదిన్ శబ్దాన్నుడాగమః (తమ్) (దేవేభ్యః) విద్వద్భ్యః (దేవతా) దివ్యాన్ గుణాన్ (దత్త) (శుక్రపేభ్యః) శుక్రం వీర్యం రక్షన్తి తేభ్యః (యేషామ్) (భాగః) (స్థ) (స్వాహా) అయం మంత్రః. శత. ౩.౯.౩.౨౫. వ్యాఖ్యాతః. ॥౨౭॥

**అన్వయః** :-హే ఆపో దేవీర్దేవ్యః ప్రజా! యూయం రాజభక్తా స్థ భవత. శుక్రపేభ్యో దేవేభ్యో యేషాం వో యుష్మాకమపాం నపాదూర్మిరివేంద్రియావాన్ మదింతమో హవిష్యో భాగోఽస్తి తం స్వాహా సద్వాచా గృహ్ణీత తథా రాజాదయః సభ్యా జనా దేవత్రా దివ్యాన్ భోగాన్ యుష్మభ్యం ప్రదదతి తథైతేభ్యో యూయమపి దత్త. ॥౨౭॥

**భావార్థః** :-ప్రజాజనానామిదముచితముత్కృష్టగుణం సభాపతిం మత్వా రాజ్యపాలనాయ కరం దత్వా న్యాయం ప్రాప్నుయురితి. ॥౨౭॥

**పదార్థము** :- (ఆపః) శ్రేష్ఠగుణములందు వ్యాప్తులును (దేవీః) శుభకర్మలచే ప్రకాశితులునగు ప్రజలారా! మీరు రాజసేవకులుగ (స్థ) అగుడు (శుక్రపేభ్యః) శరీరాత్మల పరాక్రమమును రక్షించువారును (దేవేభ్యః) దివ్యగుణయుక్తులునగు విద్వాంసులకై (యేషామ్) ఎట్టి (వః) మీ బలరూప విద్వాంసుల (యః) ఏ (అపాం నపాత్) జలముల నాశరహిత, స్వాభావిక (ఊర్మిః) జలతరంగములవలె ప్రజారక్షణమును (ఇన్ద్రియావాన్) ప్రశంసనీయమగు ఇన్ద్రియములు గల మరియు (మదిన్తమః) ఆనందదాయిని (హవిష్యః) భోగ్యపదార్థములతో సిద్ధించిన (భాగః) భాగము గలదో అట్టి మీ రెల్లరును (తమ్) దానిని (స్వాహా) ఆదరపూర్వకముగా గ్రహణమొనర్చుడు. రాజు మున్నగు సభ్యజనులు (దేవత్రా) దివ్యభోగములనిచ్చుచున్నట్లు మీరును వారికి (దత్త) ఆనందము నొసగుడు. ॥౨౭॥

**భావార్థము** :- పరస్పరము సమ్మతిజేసికొని, ఉత్తమగుణయుక్తుడగు సభాపతిని రాజుగా స్వీకరించి రాజ్యపాలనమునకై కప్పమును చెల్లించి న్యాయమును పొందుట ప్రజలకు ఉచితమైయున్నది. ॥౨౭॥

**27.O noble and virtuous subjects, select as your king for the benefit of the learned persons and Brahmcharis who preserve their semen, one, born out of you, who is high like the flood in water, fit for service with food, endowed with strength, capable of subduing his foes, and completely capable of adding to the happiness of his kingdom. Ye too constitute a part of those learned persons!.**

**౨౮. కార్షిరసిత్యస్య మేధాతిథిర్ఋషిః, ప్రజా దేవతా, విచృదార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.**

**అథాధ్యాపకో జనః ప్రతిజనం కిం కిముపదిశేదిత్యుచ్యతే.**

**మానవు లెల్లరకును అధ్యాపకు డేమి యుపదేశించవలయును?**

౨౮. కార్షి రసి సముద్రస్య త్వా క్షిత్యా॒ ఉన్నయామి ।
సమాపో॒ అద్భి రగ్మత సమోషధీభి రోషధీః ॥౨౮॥

ప.వి:- కార్షిః, అసి, సముద్రస్య, త్వా, అక్షిత్యై, ఉత్, నయామి, సమ్, ఆపః, అద్భిరిత్యత్ + భిః, అగ్మత, సమ్, ఓషధీభిః, ఓషధీః. ॥౨౮॥

పదార్థః:-(కార్షిః) కర్షతి హలేన భూమిమితి. ఇశ్ వపాదిభ్య అ.3.3.౧౦౮. భా...వా... ఇతీశ్ (అసి) (సముద్రస్య) అంతరిక్షస్య. సముద్రఇత్యంతరిక్షనామసు పఠితమ్. నిఘం.౧.3. (త్వా) త్వామ్ (అక్షిత్యై) (ఉత్) ఉత్కృష్టే (నయామి) (సమ్) (ఆపః) జలాని (అద్భిః) జలైరేవ (అగ్మత) ప్రాప్నుత. లోడర్థే లుఙ్ (సమ్) (ఓషధీభిః) సోమాదిభిః (ఓషధీః) అయం మన్త్రః. శత. 3.౬.3.౨౯-3౧. వ్యాఖ్యాతః. ॥౨౮॥

అన్వయః :-హే వైశ్యజన! త్వం కార్షిరసి త్వాం సముద్రస్యాక్షిత్యై సమున్నయామి. సర్వే యూయం యజ్ఞశోధితాభిరద్భిరేవాప ఓషధీభిరోషధీః సమగ్మత.॥౨౮॥

భావార్థః :- క్షేత్రాదిభూమిషు నానౌషధయో జాయంత. ఓషధీభిరగ్నిహోత్రాదయో యజ్ఞా యజ్ఞై రంతరిక్షం జలపరమాణుభిః పూర్ణం భవతీతి హేతో ర్విద్వాంసో నిర్బుద్ధిజనాన్ క్షేత్రాదిషు నయన్తి. కుతస్తే విద్యామభ్యసితుం సమర్థా ఏవ న భవంతీతి. ॥౨౮॥

పదార్థము :- ఓ వైశ్యజనులారా! మీరు (కార్షిః) నాగలితో భూమిని దున్నదగినవారునై (అసి) ఉన్నారు. (త్వా) నిన్ను (సముద్రస్య) అంతరిక్షముయొక్క (అక్షిత్యై) పరిపూర్ణత్వముకొరకై (సమ్ ఉత్ నయామి) చక్కని యభివృద్ధినిచ్చుచున్నాను. మీరెల్లరును (అద్భిః) యజ్ఞశోధిత జలముచే (ఆపః) జలము మరియు (ఓషధీభ్యః) ఓషధులచే (ఓషధీః) ఓషధులను (సమ్ అగ్మత) ప్రాప్తించుడు. ॥౨౮॥

భావార్థము :-క్షేత్రములు మున్నగు స్థానములందు అనేక ఓషధులు (మూలికలు) ఉత్పన్నమగును. ఓషధులచే అగ్నిహోత్రము మున్నగు యజ్ఞములద్వారా శుద్ధమగు జలముల పరమాణువులు ఉత్పన్నమగును వానివల్ల ఆకాశము పరిపూర్ణమగును. కావుననే విద్వాంసులు విద్యాభ్యాసమునకు సమర్థులుగాని మంద బుద్ధిజనులను క్షేత్రాది కార్యములందు నియోగించు చుందురు.॥౨౮॥

**28.O farmer, thou art fit to cultivate the land, I uplift thee for the purification of space. Get waters from waters, and medicinal plants from plants!.**

౨౩౭. యమగ్న ఇత్యస్య మధుచ్ఛందా ఋషిః, అగ్ని ర్దేవతా, భురిగార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ స విద్వాంసం కిమాహేత్యుపదిశ్యతే.

అత డధ్యాపకునితో ఏమనవలె ననుచది ఈ మంత్రమం దుపదేశించబడినది.

౨౩౭ యమగ్నే పృత్సు మర్త్యమవా వాజేషు యఞ్జునాః।

స యన్తా శశ్వతీ రిషః స్వాహా ॥౨౯॥

ప.వి:- యమ్, అగ్నే, పృత్స్వితి పృత్సు, మర్త్యమ్, అవాః, వాజేషు, యమ్, జునాః, సః, యన్తా, శశ్వతీః, ఇషః, స్వాహా ॥౨౯॥

పదార్థః:-(యమ్) (అగ్నే) సర్వగుణవర! (పృత్సు) సంగ్రామేషు. పృత్స్వితి సంగ్రామ నామసు పఠితమ్. నిఘం. ౨. ౧౭. (మర్త్యమ్) మనుష్యమ్ (అవాః) రక్షేః (వాజేషు) అన్ననిమిత్తక్షేత్రాదిషు (యమ్) (జునాః) గమయేః (సః) (యన్తా) (శశ్వతీః) అవినశ్వరాః (ఇషః) ఇష్యంతే యాస్తాః ప్రజాః (స్వాహా) ఉత్సాహికయా వాచా. అయం మంత్రః. శత. 3.౯.3.3౧-3౨. వ్యాఖ్యాతః. ॥౨౯॥

అన్వయః :-హే అగ్నే! త్వం పృత్సు యం మర్త్యమవా, యం చ వాజేషు జునాః స శశ్వతీ రిషో యంతా స్యాత్. ॥౨౯॥

భావార్థః:- గురుశిక్షయా సర్వస్య సుఖం వర్ధత ఏవ. ॥౨౯॥

పదార్థము :-(అగ్నే) ఎప్పుడైనను వివేకముతో కర్మలొనర్చువాడవగు నీవు (పృత్సు) సంగ్రామములందు (యమ్) ఏ మనుష్యుని (అవాః) రక్షింతువో మరియు (వాజేషు) అన్నము మున్నగు పదార్థములను సిద్ధింపజేయుటకై (యమ్) ఎవనిని (జునాః) నియుక్తపరతువో (సః) అతడు (శశ్వతీః) సదా అనాదిరూపమున గల (ఇషః) తన ప్రజలను (యన్తా) నిర్వాహమొనర్చువాడగును. అవగా; వారి నియమములకు చేరుచున్నాడు. ॥౨౯॥

భావార్థము :- గురుజనుల శిక్షణచే సర్వజనుల సుఖము వృద్ధియగుచుండును. ॥౨౯॥

29.O king, whomsoever thou protectest in the battle and appointest for the supervision of food supply, deserves the award of a permanent pension for his maintenance. This is a proper rule!.

౨౩౮. దేవస్య త్వేత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, సవితా దేవతా, స్వరాడార్షీ పంక్తి శ్ఛందః, పంచమః స్వరః.

అథ సభాపతిః కరధనప్రదం ప్రజాపురుషం కథం స్వీకుర్యాదిత్యుపదిశ్యతే.

పన్ను చెల్లించుముండు ప్రజలను సభాపతి యెట్లుల సంభావించవలయు నను విషయ మీ మంత్రమం దుపదేశించబడుచున్నది.

౨౩౦ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్ ।

ఆదదే రావాసి గభీర మిమ మధ్వరఙ్కృధీంద్రాయ సుషూతమమ్ ।

ఉత్తమేన పవినోర్జస్వన్తమ్మధుమంత మ్పయస్వన్తన్నిగ్రాభ్యా స్థ

దేవశ్రుత స్తర్పయత మా ॥30॥

ప.వి:- దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర + సవే, అశ్వినోః, బాహుభ్యా మితి బాహు + భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామితి హస్త+భ్యామ్, అ, దదే, రావా, అసి, గభీరమ్ ఇమమ్, అధ్వరమ్, కృధి, ఇంద్రాయ, సుషూతమమ్ సుషూతమమితి సు + షూతమమ్, ఉత్తమేనేత్యుత్ + తమేన, పవినా, ఊర్జస్వంతమ్, మధుమంతమితి మధు + మంతమ్, పయస్వంతమ్, నిగ్రాభ్యా ఇతి ని + గ్రాభ్యాః, స్థ, దేవశ్రుత ఇతి దేవ + శ్రుతః, తర్పయత, మా॥30॥

పదార్థః :-(దేవస్య) సర్వసుఖప్రదాతుః (త్వా) త్వాం కరధనదాతారమ్ (సవితుః) సకలైశ్వర్యస్య ప్రసవితుర్జగదీశ్వరస్య (ప్రసవే) ప్రసూతే జగతి (అశ్వినోః) సూర్యాచంద్రమసోః (బాహుభ్యామ్) బలవీర్యాభ్యామ్ (పూష్ణః) సోమాద్యోషధిగణస్య (హస్తాభ్యామ్) రోగనాశకధాతుసామ్యకారకాభ్యాం గుణాభ్యామ్. (ఆదదే) గృహ్ణామి. (రావా) దాతా (అసి)(గభీరమ్) అగాధగుణమ్ (ఇమమ్) ప్రత్యక్షమ్ (అధ్వరమ్) విఙ్కోటిల్యమ్ (కృధి) కురు (ఇంద్రాయ) పరమైశ్వర్యవతే మహ్యం (సుషూతమమ్) సుష్ఠు సూతే తమ్ (ఉత్తమేన) ప్రశస్తేనేవ (పవినా) వాచా. పవిరితి వాఙ్నామసు పఠితమ్. నిఘం. ౧.౧౧. (ఊర్జస్వంతమ్) ఉత్తమపరాక్రమసంబంధినమ్ (మధుమంతమ్) ప్రశస్తమధ్వాదిపదార్థయుక్తమ్ (పయస్వంతమ్) బహుదుగ్ధాదిమంతమ్ (నిగ్రాభ్యాః) నితరాం గ్రహీతుం యోగ్యాః (స్థ) భవత (దేవశ్రుతః)

యా దేవావ్ శృణ్వంతి తాః (తర్పయత) ప్రీణీత (మా) మామ్. అయం మంత్రః శత. ३.౯.४.३-౬. వ్యాఖ్యాతః. ॥౩౦॥

**అన్వయః** :-హే ప్రజాజనా! అహం దేవస్య సవితుః ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వా మాదదే త్వమింద్రాయ మహ్యముత్తమేన పవినా వచసేమం గభీరం సుషూతమ మూర్జస్వంతం కరదాయ మధ్వరం కృధి. హే దేవశ్రుతో! ప్రజా యూయం విగ్రాభ్యా మయా నితరాం గ్రహీతుం యోగ్యాః స్థ. మా మామనేన తర్పయత.॥౩౦॥

**భావార్థః**:-ప్రజాజనానాం యోగ్యతాఽస్తి రాజానమాగత్య తస్మై సర్వేషం స్వకీయ పదార్థానాం యథాయోగ్యమంశం దద్యుర్యతః స భూమిగతపదార్థానామంశభాగీ భవతి.॥౩౦॥

**పదార్థము**:-ఓ ప్రజలారా! సకలసుఖముల నిచ్చు (సవితుః) సమస్తైశ్వర్యములనుత్పన్నమొనర్చు జగదీశ్వరుడు (ప్రసవే) సృష్టించిన విశ్వమున (అశ్వినోః) సూర్యచంద్రుల (బాహుభ్యామ్) బలపరాక్రమగుణములచే (పూష్ణః) పుష్టిదాయకమగు సోమాది ఓషధీగణములతో (హస్తాభ్యామ్) రోగనాశమొనర్చు మరియు ధాతువులను సమత్వముగనుంచు గుణములచేతను (త్వా) [కప్పము కట్టు] మిమ్ము (ఆ దదే) స్వీకరించుచున్నాను. నీవు (ఇన్ద్రాయ) పరమైశ్వర్యవంతుడనగు నాకొరకు (ఉత్తమేన) ఉత్తమమైన సభ్యతాపూర్ణ (పవినా) వాణితో (ఇమమ్ గభీరమ్) బాగుగదెలిసికొనదగినదియు (సుషూతమమ్) సకలపదార్థములనుండి ఉత్పన్నమగునదియు (ఊర్జస్వన్తమ్) రాజ్యమును పటిష్ఠ పరచునదియు. (మధుమన్తమ్) ప్రశస్తమగు మధువు మున్నగు శ్రేష్ఠపదార్థములతో గూడినదియు (పయస్వన్తమ్) దుగ్ధాదులతో గూడిన కరధనమును (అధ్వరమ్) కుటిలములేకుండ (కృధి) ఒనర్చుడు (దేవశ్రుతః) శ్రేష్ఠమగు రాజ్యగుణములను గౌరవించు ఓ ప్రజలారా! మీరు (నిగ్రాభ్యః) నిరంతరము స్వీకరించదగినవారుగ (స్థ) అగుడు (మా) నన్ను [ఈ కరధన మిచ్చుచు] (తర్పయత) తృప్తిపరచుడు. ॥౩౦॥

**భావార్థము** :-ప్రజాధ్యక్షుని ప్రాప్తించుకొని ప్రజలు తమ సకలపదార్థములనుండి యథాయోగ్యముగ భాగములను సమర్పించవలయును. రాజు ప్రజలను పాలించుటకొరకే ప్రపంచమున ఉత్పన్నమై యున్నాడు. కావున రాజ్యమొనర్చురాజు సాంసారిక పదార్థములనుండి అంశమును గ్రహించు నధికారి యగును.॥౩౦॥

**30.O my subjects, in this world created by God, the Giver of happiness and the Source of all splendour, I receive ye with the strength and coolness of the sun and moon, and the disease-killing, and bodily humours - equilibrium maintaining qualities of the herbs!. For me full of splendour, in a civilised manner, pay open-heartedly the tax which is highly useful, is levied on all your products, which conduces to efficient administration, which is utilized for the advancement of industries and improving the cattle breed. O my subjects, ye who take interest in the welfare of your king, deserve to be welcomed by me! Please me by paying your taxes.**

**౨౩౯.మనో న ఇత్యస్య మధుచ్ఛందా ఋషిః, ప్రజాపత్యారాజానో దేవతాః, భుక్షిగ్బృహతీఛందః, మధ్యమః స్వరః.**

అథ రాజా సభ్యజనాన్ సభా రాజానం చ కిముపదిశేదిత్యాహ.

సభాసదులకు రాజు, రాజుకు సభ యేమి యుపదేశించవలయును?

౨౩౯ మనో మే తర్పయత వాచమ్మే తర్పయత ప్రాణమ్మే తర్పయత చక్షుర్మే తర్పయత శ్రోత్రమ్మే తర్పయతాత్మానమ్మే తర్పయత ప్రజామ్మే తర్పయత పశూన్మే తర్పయత గణాన్మే తర్పయత గణా మే మా వితృషన్ ॥౩౧॥

ప.వి:- మనః, మే, తర్పయత, వాచమ్, మే, తర్పయత, ప్రాణమ్, మే, తర్పయత, చక్షుః, మే, తర్పయత, శ్రోత్రమ్, మే, తర్పయత, ఆత్మానమ్, మే, తర్పయత, ప్రజామితి ప్రజామ్, మే, తర్పయత, పశూన్, మే, తర్పయత, గణాన్, మే, తర్పయత, గణాః, మే, మా, వి, తృషన్ ॥౩౧॥

**పదార్థః**:-(మనః) అంతఃకరణమ్ (మే) మమ (తర్పయత) (వాచమ్) (మే) (తర్పయత) (ప్రాణమ్) (మే) (తర్పయత) (చక్షుః) (మే) (తర్పయత) (శ్రోత్రమ్) (మే) (తర్పయత) (ఆత్మానమ్) (మే) (తర్పయత) (ప్రజామ్) సంతానాదికామ్. (మే) (తర్పయత) (పశూన్) గోహస్త్యశ్వాదీన్ (మే) (తర్పయత) (గణాన్) పరిచారకాదీన్ (మే) (తర్పయత) (గణాః) (మే) మమ (మా) నిషేధార్థే (వి) విరుద్ధార్థే (తృషన్) తృషితా భవన్తు. అత్ర లోడర్థే లుఙ్. అయం మన్త్రః శత. 3. ౯.౪.౭-౮. వ్యాఖ్యాతః ॥౩౧॥

**అన్వయః**:-హే సభాజనాః ప్రజాజనా వా యూయం స్వగుణై ర్మే మమ మనస్తర్పయత. మే వాచం తర్పయత. మే ప్రాణం తర్పయత. మే చక్షు స్తర్పయత. మే శ్రోత్రం తర్పయత. మే మమాత్మానం తర్పయత. మే ప్రజాం తర్పయత. మే పశూ౯ స్తర్పయత. మే గణా౯ స్తర్పయత. యతో మే గణాః మా వితృషన్ తృషితా మా భవంతు. ॥౩౧॥

**భావార్థః**:-సభాధీనమేవ రాజ్యప్రబంధో భవితుమర్హతి. యతః సర్వే ప్రజాజనా రాజసేవకాః, రాజజనాః, ప్రజాసేవినో భూత్వా స్వేషు స్వేషు కర్మసు ప్రవృత్యాఽన్యోన్యమభిమోదయేయు రితి. ॥౩౧॥

**పదార్థము** :- ఓ సభ్య సభాజనములారా! మీరు మీ గుణములతో (మే మనః) నా మనస్సును (తర్పయత)

తృప్తిపరచుడు (మే ప్రాణమ్ తర్పయత) నా ప్రాణములను తృప్తిపరచుడు (మే వాచమ్) నా వాణిని (తర్పయత) తృప్తిజేయుడు (మే చక్షుః) నా నేత్రములను (తర్పయత) తృప్తిపరచుడు (మే శ్రోత్రమ్) నా కర్ణములను (తర్పయత) తృప్తియొనర్చుడు (మే ఆత్మానమ్) నా యాత్మను (తర్పయత) తృప్తిజేయుడు (మే ప్రజామ్) నా సంతానము మున్నగు ప్రజలను (తర్పయత) తృప్తియొనర్చుడు (మే పశూన్) నా గోవులు, అశ్వములు మున్నగు పశువులను (తర్పయత) తృప్తిపరచుడు (మే గణాన్) నా సేవకులను (తర్పయత) తృప్తిపరచుడు. అందువల్ల (మే గణాః) నా రాజ్యము, ప్రజలు, కర్మాధికారులు మరియు సేవకజనము తమ కార్యకలాపములందు (మా వితృషన్) ఉదాసీనులు గాకుండ నుందురు. ॥30॥

భావార్థము :- రాజ్యప్రబంధము రాజ్యసభకు అధీనమై యుండును. అందువలన ప్రజలు, రాజసేవకులు, రాజపురుషులు, ప్రజాసేవకులు మున్నగువారెల్లరును తమ తమ కార్యములందు ప్రవృత్తులై సకలవిధముల పరస్పరము ఆనందితులనూగా నొనర్చుకొనుచుండవలయును. ॥30॥

31.O subjects and legislators, satisfy my mind, satisfy my speech, satisfy my breath, satisfy my eye, satisfy my ear, satisfy my soul, satisfy my progeny. satisfy my cattle, satisfy my subordinate officers, so that my officers may not feel sad!.

౨౪౦.ఇంద్రాయ త్వేత్యస్య మధుచ్ఛందా ఋషిః, సభాపతీ రాజా దేవతా, పంచపాద్భ్యోతిష్మతీ జగతీ ఛందః, నిషాదః స్వరః.

రాజ్యవ్యవహారః సభాధీన ఏవ త్వర్థి కస్మై ప్రయోజనాయ ప్రజాపురుషైః సభాపతి స్స్వీకార్య ఇత్యుపదిశ్యతే.

సకల రాజవ్యవహారములు రాజసభాధీనములే యైనప్పుడు ప్రజలెందుకు సభాపతిని స్వీకరించవలయును?

౨౪౦ ఇంద్రాయ త్వా వసుమతే రుద్రవత ఽఇంద్రాయ

త్వాదిత్యవతఽ ఇంద్రాయ త్వాభిమాతిఘ్నే। శ్యేనాయ త్వా

సోమభృతేఽగ్నయే త్వా రాయస్పోషదే ॥31॥

ప.విః- ఇంద్రాయ, త్వా, వసుమత ఇతి వసు + మతే, రుద్రవత ఇతి రుద్ర + వతే, ఇంద్రాయ, త్వా, ఆదిత్యవత ఇత్యాదిత్య + వతే, ఇంద్రాయ, త్వా, అభిమాతిఘ్నఽ ఇత్యభిమాతి + ఘ్నే, శ్యేనాయ, త్వా, సోమభృత ఇతి సోమ + భృతే, అగ్నయే, త్వా, రాయస్పోషద ఇతి రాయస్పోషదే॥31॥

పదార్థః :-(ఇంద్రాయ) పరమైశ్వర్యాయ (త్వా) త్వామ్ (వసుమతే) బహవో వసవశ్చతుర్వింశతివర్ష బ్రహ్మచర్యసంపన్నా విద్వాంసో విద్యంతే యత్ర తస్మై కర్మణే (రుద్రవతే) ప్రశస్తాః కృతచతుశ్చత్వారింశద్వర్ష బ్రహ్మచర్యా విద్వాంసో వీరాః శత్రురోదయితారో రుద్రా భవంతి యత్ర తస్మై (ఇంద్రాయ) పరమవిద్యా ప్రకాశాయ విద్యా విదారకాయ (త్వా) త్వామ్ (అభిమాతిఘ్నే) యేనాభి మానయుక్తాః శత్రవో హన్యంతే తస్మై (శ్యేనాయ) శ్యేనవత్ప్రవర్తమానాయ (త్వా) త్వామ్ (సోమభృతే) యః సోమమైశ్వర్య సమూహం బిభర్తీతి తస్మై (అగ్నయే) విద్యుదాద్యాయ (త్వా) త్వామ్ (రాయః) ధనస్య (పోషదే) పుష్టిప్రదాయ. సుపాం సులుగితి జేః స్థానే ''శే'' ఇత్యాదేశః. అయం మంత్రః శత. 3.౯.४. ౯.౧౦.వ్యాఖ్యాతః. ॥32॥

అన్వయః:-హే సభాపతే! వసుమతే వయం రుద్రవత ఇంద్రాయ త్వా ఆదిత్యవత ఇంద్రాయ త్వా అభిమాతిఘ్నే ఇంద్రాయ త్వా సోమభృతే శ్యేనాయ త్వా రాయస్పోషదేఽగ్నయే త్వా త్వాం వృణుమః. ॥32॥

భావార్థః:-య ఇంద్రానిలయమార్కాగ్నివరుణచంద్రవిత్తేశానాం గుణైర్యుక్తో విద్వత్ప్రియో విద్యాప్రచారీ సర్వేభ్యః సుఖం దద్యాత్ స ఏవ సర్వై రాజా మంతవ్య ఇతి. ॥32॥

పదార్థము :- ఓ సభాపతీ! (వసుమతే) ౨४సంవత్సరములు బ్రహ్మచర్య మాచరించి విద్వాంసుడవు గాగలుగు కర్మలందు (రుద్రవతే) ४४ వత్సరముల బ్రహ్మచర్యముతో సేవించబడు కర్మలందు అట్టి (ఇన్ద్రాయ) పరమైశ్వర్యవంతకర్మకొరకు (త్వా) నిన్ను గ్రహించుచున్నాము (ఆదిత్యవతే) ४८ వర్షముల పర్యంతము బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించి సూర్యసదృశుడగు పరమవిద్వాంసుడగుట కెట్టి కర్మలవసరమో (ఇన్ద్రాయ) అట్టి ఉత్తమగుణములను పొందుటకు (త్వా) నిన్ను [గ్రహించుచున్నాము] (అభిమాతిఘ్నే) గొప్ప అభిమానధనులగు శత్రువులను హతమొనర్చునదియు (ఇన్ద్రాయ) మహా ఉత్కృష్ట శత్రువినాశక కార్యముకొరకు (త్వా) నిన్ను [గ్రహించుచున్నాము] (సోమభృతే) ఉత్తమైశ్వర్యమును ధారణ మొనర్చుటకు (శ్యేనాయ) యుద్ధము మున్నగు కార్యములందు డేగపక్షివలె ఎగిరెగిరి తన్నుటకు, హతమార్చుటకు (త్వా) నిన్ను [గ్రహించుచున్నాము] (రాయస్పోషదే) ధనమునకు నిలకడ సమకూర్చుటకై (అగ్నయే) విద్యుత్తు మున్నగు పదార్థముల గుణములను ప్రకాశపరచుటకై (త్వా) మే మెల్లరమును నిన్ను స్వీకరించుచున్నాము. ॥32॥

భావార్థము:-ఇన్ద్రాగ్ని యమ సూర్య వరుణ ధనాఢ్యుల గుణములచే గూడుకొనిన వాడును, విద్వాంసులకు ప్రియుడును, విద్యాప్రచారమొనర్చజేయువాడు నైయుండి సర్వప్రజలకు, ప్రాణులకు సుఖము గలిగించువానినే యెల్లరము రాజుగా స్వీకరించవలయును. ॥32॥

**32.O Lord, we appoint thee as a king, as thou possessest the vigour of a Vasu Brahmchari, as thou hast got the strength of a Rudra Brahmchari, as thou art full of splendour, full of knowledge like an Aditya Brahmchari, as thou hast the power of killing the proud foes. as thou art full of dignity, and art quick in attacking in the battle-field like a falcon, as thou strengthenest our finances, and advancest the knowledge of science!.**

౨౪౧. యత్తే, ఇత్యస్య మధుచ్ఛందా ఋషిః, సోమో దేవతా, భురిగార్షీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తత్ సభాపతిః ప్రజాభ్యః కిం ప్రయచ్ఛేదిత్యుపదిశ్యతే.

ఇట్టి గుణములుగల సభాపతి ప్రజలకెట్టి లాభము గలిగించును?

౨౪౧ యత్తే సోమ దివి జ్యోతి ర్యత్పృథివ్యాం యదురావంతరిక్షే ।

తేనాస్మై యజమానాయోరురాయే కృధ్యధి దాత్రే వోచః ॥౩౩॥

ప.వి:-యత్, తే, సోమ, దివి, జ్యోతిః, యత్ పృథివ్యామ్, యత్, ఉరౌ, అంతరిక్షే, తేన, అస్మై, యజమానాయ, ఉరు, రాయే, కృధి, అధి, దాత్రే, వోచః. ॥౩౩॥

పదార్థః :- (యత్) (తే) తవ (సోమ) సకలైశ్వర్య ప్రేరక! (దివి) సూర్యే (జ్యోతిః) జ్యోతిరివ (యత్) (పృథివ్యామ్) (యత్) (ఉరౌ) విస్తృతే (అంతరిక్షే) అంతరాల ఆకాశే (తేన) (అస్మై) (యజమానాయ) పరోపకారార్థం యజ్ఞానుష్ఠాత్రే (ఉరు) బహు (రాయే) ధనాయ (కృధి) కురు (అధి) అధికార్థే (దాత్రే) (వోచః) ఉచ్యాః. అత్ర లిఙర్థే లుఙ్. ఛందస్యమాఙ్యోగేఽపి.౬.౪.౭౫. ఇత్యడభావః. అయం మంత్రః శత. ౩.౯.౪. ౧౨-౧౫ వ్యాఖ్యాతః. ॥౩౩॥

అన్వయః:-హే సోమ సభాపతే! తే తవ యత్ దివి యత్ పృథివ్యాం యదురావంతరిక్షే జ్యోతి రివ రాజ్యకర్మాస్తి తేన త్వం దాత్రేఽస్మై యజమానాయోరుకృధి రాయేఽధివోచశ్చ. ॥౩౩॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. సభాపతిస్స్వరాజ్యోత్కర్షేణ విద్యాది శుభగుణ కర్మసు సర్వాన్ జనాన్ సుశిక్ష్య నిరాలస్యాన్ సంపాదయేత్ యతస్తే పురుషార్థ మనువర్తినో భూత్వా ధనాదిపదార్థాన్ సతతం వర్ధయేయురితి. ॥౩౩॥

పదార్థము:-(సోమ)సకలైశ్వర్యముకొరకు ప్రేరణనిచ్చు నో సభాపతీ! (దివి) సూర్యలోకములోను, (పృథివ్యామ్) భూమిపైనను మరియు (ఉరౌ) విస్తృతమగు (అంతరిక్షే) ఆకాశములోను (జ్యోతిః) జ్యోతివలె (యత్ తే) ఏ నీ రాచకార్యము గలదో (తేన) దానిచే (అస్మై) పరోపకారముకొరకు (దాత్రే యజమానాయ) యజ్ఞముల నొనర్చు ఈ యజమానునకు (ఉరు కృధి) అత్యంత ఉపకారము నొనర్చుము. మరియు (రాయే) ధనవృద్ధికొరకై (అధివోచః) అత్యధిక రాజ్యప్రబంధము నొనర్చుము. ॥౩౩॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. సభాపతియగురాజు తన రాజ్య విస్తరణ మరియు ఉన్నతికొరకు విద్యమున్నగు శుభగుణకర్మలయందందరకును శిక్షణనిచ్చి ఎల్లరను సోమరితనము

లేకుండజేయువలయును. అట్లు ప్రజలను పురుషార్థపరులజేసి ధనము మున్నగు పదార్థములను వృద్ధిపరచుకొని రాజ్యోన్నతి నొనర్పుదురుగాక॥౩౩॥

**33.O king thy rule extends over Heaven, Earth and mid-air wide region with that power show obligation to this worshipper who performs the yajna, and has recourse to measures conducive to the propagation of national wealth!.**

౨౪౨. శ్వాత్రా స్థ ఇత్యస్య మధుచ్ఛందా ఋషిః, యజ్ఞో దేవతా, స్వరాడార్షీ పథ్యా బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

అథోక్తానాం సభాసత్యాదివిదుషాం పత్న్యః కీదృశకర్మానుష్ఠాత్ర్యో భవంత్విత్యుపదిశ్యతే.

ఇప్పుడు ఉక్తసభాధ్యక్షుల పతిమణులెట్టి కర్మల ననుష్ఠించువారుగా కావలయునో ఈ మంత్రమున ఉపదేశింపబడినది.

౨౪౨ శ్వాత్రా స్థ వృత్రతురో రాధోగూర్తా అమృతస్య పత్నీః తా దేవీర్దేవత్రేమం యజ్ఞం నయతోపహూతాః సోమస్య పిబత ॥౩౪॥

ప.వి:- శ్వాత్రాః, స్థ, వృత్రతుర ఇతి వృత్ర + తురః, రాధోగూర్తా ఇతి రాధః + గూర్తాః, అమృతస్య, పత్నీః, తాః, దేవీః, దేవత్రేతి దేవ + త్రా, ఇమమ్, యజ్ఞమ్, నయత, ఉపహూతా ఇత్యుప + హూతాః, సోమస్య, పిబత॥౩౪॥

పదార్థః:-(శ్వాత్రాః) శ్వాత్రం శీఘ్రం కర్మవిజ్ఞానం వర్తతే యాసాం తాః. అర్శ ఆదిభ్యో దచ్. శ్వాత్రమితి క్షిప్రనామసు పఠితమ్ నిఘం. ౨. ౩. (స్థ) భవత. (వృత్రతురః) వృత్రం మేఘం తూర్వతి యా స్తా విద్యుత ఇవ (రాధోగూర్తాః) ధనవర్ధిన్య ఏవ (అమృతస్య) అతిస్వాదిష్ఠస్య (పత్నీః) పత్న్యః (తాః) (దేవీః) దేదీప్యమానాః (దేవత్రా) దేవేషు పతిషు (ఇమమ్) గృహసంబంధినమ్ (యజ్ఞమ్) సంగంతవ్యమ్ (నయత) (ఉపహూతాః) సామీప్య మాహూతాః (సోమస్య) సోమాద్యోషధి నిష్పాదితస్య సారమ్. అత్ర కర్మణి షష్ఠీ. అయం మంత్రః శత. ౩.౯.౪. ౧౬-౧౭. వ్యాఖ్యాతః. ॥౩౪॥

అన్వయః :-హే దేవీర్దేవ్యః పత్న్యః స్త్రియో యూయం వృత్రతుర ఇవ రాధో గూర్తా ఏవ సత్యో యజ్ఞసహకారిణ్యః శ్వాత్రాః స్థ. తా దేవత్రేమం యజ్ఞం నయత. ఉపహూతా ఇవామృతస్య సోమస్యాతి స్వాదిష్ఠం సోమాద్యోషధిరసం పిబత.॥౩౪॥

భావార్థః:-అత్రవాచకలుప్తోపమాలంకారః. యథా విదుష్యో విద్వత్స్త్రియః స్వధర్మ్యవ్యవహారేణ స్వపతీన్

ప్రసాదయంతి తథైవ పురుషా స్యు: స్త్రీస్సతతం ప్రసాదయేయురిత్థం పరస్పరామమోదేన గృహాశ్రమధర్మ మలంకుర్వంతు. ॥౩౪॥

పదార్థము :-(దేవీ:) విద్యావంతులగు మహిళామణులారా! మీరు (వృత్రతుర:) విద్యుత్తువలె, మేఘవర్షమువలె, సుఖదాయకమగు వడగళ్లవారును (రాధోగూర్తా:) ధనముకొరకు కృషిచేయువారుగను (పత్న్య:) యజ్ఞసహాయకురాండ్రుగను (స్థ) అగుడు (దేవత్రా) ఉత్తమగుణములచే ప్రకాశితులును, విద్వాంసులును నగు పతులయెడ ప్రీతితో నుండుడు (ఇదమ్) ఈ యజ్ఞమును (నయత) సిద్ధిని పొందునట్లు జేయుడు. మరియు (ఉపహూతా:) ఆహ్వానించబడినవారై పతులతో గూడ (అమ్వుతస్య) అతి స్వాదిష్టమును, బలపుష్టికరమునగు సోమలతాది ఓషధుల రసమును (పిబత) పానముచేయుడు.॥౩౪॥

భావార్థము:-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసుల పత్నులు స్వధర్మమగు వ్యవహారములచే తమ పతులను ప్రసన్నులుగా నొనర్చునట్లు పురుషులును తమ పత్నులను నిరంతరము ప్రసన్నురాండ్రుగ నొనర్చవలయును. ఇటువంటి పరస్పరామమోదముతో గృహాశ్రమ ధర్మమును ఉత్తమముగా నెరవేర్చవలయును.॥౩౪॥

34.O ladies, ye are the possessors of practical wisdom, removers of all impediments, argmenters of wealth, helpers in the yajna, and lovers of your virtuous husbands. Fulfil this sacrifice of domestic life. Being invited taste with your husbands the sweet juice of the plants like Soma!.

౨౪౩.మా భే ర్మేత్యస్య మధుచ్ఛందా ఋషి:, ద్యావాపృథివ్యౌ దేవతే, భురిగార్ష్యనుష్టుప్ ఛంద:, గాంధార: స్వర:.

పున: స్త్రీపురుషౌ పరస్పరం కథం వర్తేయాతా మిత్యుపదిశ్యతే

స్త్రీ పురుషులు పరస్పర మెట్లు ప్రీతితో ప్రవర్తిందవలయును?

౨౪౩ మా భేర్మా సంవిక్థాఽ ఊర్జం ధత్స్వ ధిషణే వీడ్వీ సతీ

వీడయేథామూర్జం దధాథామ్। పాప్మా హతో న సోమ: ॥౩౫॥

ప.వి:- మా, భే:, మా, సమ్, విక్థా:, ఊర్జమ్, ధత్స్వ, ధిషణేఽ ఇతి ధిషణే, వీడ్వీఽ ఇతి వీడ్వీ, సతీఽ ఇతి సతీ, వీడయేథామ్, ఊర్జమ్, దధాథామ్, పాప్మా, హత:, న, సోమ:.॥౩౫॥

పదార్థః :-(మా) (భైః) మా బిభీయాః. లిఙర్థే లుఙ్.(మా) (సమ్) (విక్థాః) భయం కంపనం చ కుర్యాః (ఊర్జమ్) స్వశరీరాత్మబలం పరాక్రమం వా (ధత్స్వ) (ధిషణే) ద్యావాపృథివ్యావివ (వీడ్వీ) బలవతీ. వీడ్వీతి బలనామసు పఠితమ్. నిఘ. ౨.౯ (సతీ) సద్గుణయుక్తా (వీడయేథామ్) దృఢబలౌ భవేతామ్ (ఊర్జమ్) సంతానాదిభ్యోఽపి బలం పరాక్రమం చ (దధాథామ్) (పాప్మా) అపరాధః (హతః) నష్టః (న) ఇవ (సోమః) అయం మంత్రః. శత. ౨.౯.౪.౧౦. వ్యాఖ్యాతః. ॥౩౫॥

అన్వయః :-హే స్త్రి! త్వం వీడ్వీ సతీ పత్యుః సకాశాన్మా భై ర్మా సంవిక్థా ఊర్జం ధత్స్వ. హే పురుష త్వమప్యేవం భవేర్యువాం ధిషణే ఇవోర్జం దధాథాం వీడయేథామ్. ఏవమనువర్తినో ర్యువయోః పాప్మా హతో భవతు. సోమేన చంద్ర ఇవాహ్లాదశాంత్యాదిగుణవృందః ప్రకాశితో భవతు. ॥౩౫॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. ఇత్థం స్త్రీపురుషౌ వ్యవహార మనువర్తేయాతాం యతః పరస్పరం భయోద్వేగౌ నశ్యేతా మాత్మనో దృఢోత్సాహః ప్రీతి ర్గృహాశ్రమవ్యవహారసిద్ధి రైశ్వర్యం చ వర్ధేత, దోషదుఃఖాని నివర్త్య చంద్ర ఇవ పరస్పరమాహ్లాదకారిణౌ భవేతామ్. ॥౩౫॥

పదార్థము:-ఓ నారీ! నీవు (వీడ్వీ) శరీరాత్మబలయుక్తురాలవై పతినుండి (మా భైః) భయపడకుము (మా సం విక్థాః) కంపించకుము (ఊర్జమ్) శరీరాత్మల బలపరాక్రమములను (ధత్స్వ) ధారణమొనర్పుము. ఓ పురుషా! నీవును అట్లే నీ స్త్రీతో ప్రవర్తించుము. [స్త్రీ పురుషులు మీ రిరువురును] (వీడయేథామ్) దృఢబలసంపన్నులు కాగలుగునట్లు (ధిషణే) పృథివీసూర్యులతో సమానమగు పరోపకారపరాక్రమములను ధరించు ప్రవర్తనతో మెలగు మీ యిరువురి (పాప్మా) అపరాధము (హతః) నశించుగాక! మరియు (సోమః) చంద్రునివంటి ఆనంద, శాంతి మున్నగు గుణముల నభివృద్ధిపరచి పరస్పరము ఆనందమునభివృద్ధి పరచుచు నుండుడు. ॥౩౫॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. భార్యాభర్త లిరువురును పరస్పరము భయోద్వేగములను వదలి ఆత్మదృఢత్వము, ప్రీతి, ఉత్సాహము, గృహాశ్రమ వ్యవహారసిద్ధి, ఐశ్వర్యము, అభివృద్ధియగునట్లు దోషములను, దుఃఖములను వదలి చంద్రునివలె ఆహ్లాదపరులగునట్లు సదా వ్యవహరించు చుండవలయును. ॥౩౫॥

**35.O woman, full of physical and spiritual strength, be not afraid of thy husband, shake not with terror, cultivate the strength of your body and soul. O man, thou also shouldst behave similarly towards thy wife, Ye both, like the sun and earth should become strong and resolute; whereby the shortcomings of ye both be removed, and ye become happy like the moon!.**

**౩౬. ప్రాగపాగిత్యస్య మధుచ్ఛందా ఋషిః, సోమో దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.**

**అథైతయోరపత్యాని కిం కిం కుర్యుస్తే కథం పాలయేయురిత్యాహ.**

**వారి పుత్రు లేమి చేయవలెను? వారి నెట్లు పాలించవలయును?**

౨౪౪ ప్రాగపాగుదగధరాక్ సర్వత స్త్వాదిశ ఆధావంతు।
అంబ నిష్పర సమరీ ర్విదామ్ ॥౩౬॥

ప.వి:- ప్రాక్, అపాక్, ఉదక్, అధరాక్, సర్వతః, త్వా, దిశః, ఆ, ధావన్తు, అంబ, నిః, పర, సమ్, అరీః, విదామ్॥౩౬॥

పదార్థః :-(ప్రాక్) పూర్వస్యాః (అపాక్) పశ్చిమాయాః (ఉదక్) ఉత్తరస్యాః (అధరాక్) దక్షిణస్యాః (సర్వతః) అన్యాభ్యః (త్వా) త్వామ్ (దిశః) (ఆ) సమంతాత్ (ధావంతు) (అంబ) అమతి ప్రేమభావేన ప్రాప్నోతి తత్సంబుద్ధౌ. అత్రోణాదిర్వన్ ప్రత్యయః (నిః) నితరామ్ (పర) పాలయ (సమ్) (అరీః) సుఖప్రాపికాః ప్రజాః (విదాం) విదతామ్. విద జ్ఞాన ఇత్యస్మాల్లోటి ప్రథమబహువచనే. లోపస్త ఆత్మనే పదేషు. అ. ౭. ౧. ४౧. అనేన తకారలోపే సవర్ణదీర్ఘే విదామితి రూపమ్. అయం మంత్రః. శత ౩.౯.४. ౨౦-౨౩ వ్యాఖ్యాతః.॥౩౬॥

అన్వయః :-హే అంబ! త్వం యా అరీః సుఖప్రాపికాః ప్రజాస్తే ప్రాగపాగుదగధరాక్ సర్వతో దిశ స్త్వామాధావంతు తా స్త్వం నిష్పర నితరాం రక్ష, తా అపి త్వా త్వాం సంవిదాం జానంతు.॥౩౬॥

భావార్థః:-మాతాపిత్రో ర్యోగ్యతాఽస్తి స్వాపత్యాని విద్యాదిసద్గుణేషు నియోజ్య నిరంతరం రక్షణీయాని, అపత్యానాం యోగ్యతాఽస్తి సర్వతః పిత్రోః సేవనం కుర్యురితి. ॥౩౬॥

పదార్థము :-(అమ్బ) ప్రేమద్వారా లభించు నో మాతా! నీయొక్క (అరీః) సంతానాది ప్రజలు (ప్రాక్) తూర్పు (అపాక్) పడమర (ఉదక్) ఉత్తర (అధరాక్) దక్షిణ మరియును (సర్వతః) సకల (దిశః) దిశలనుండి (త్వా) నిన్ను (ఆధావంతు) పరుగు పరుగున వచ్చి చుట్టుముాగువారిని (నిః పర) నిరంతరము ప్రేమించుము. మరియు వారును నిన్ను (సమ్) ఉత్తమభావముతో (విదామ్) గుర్తింతురు గాక!॥౩౬॥

భావార్థము :- బాలురు రోగరహితులు, ఉత్సాహవంతులునునై సద్గుణములు అలవరచుకొనునట్లు వారిని విద్య మొదలగు ఉత్తమగుణములందు ప్రవృత్తపరచి వారి శరీరములను కాపాడుట మాతాపితరుల కర్తవ్యము. తల్లిదండ్రుల నన్నివిధముల సేవించుటయు పుత్రుల కర్తవ్యమునై యున్నది. ॥౩౬॥

36.O mother, love thy children who run unto thee from east, west, north, south and all other directions,; and they too should love thee!.

౨४౫. త్వమంగ ఇత్యస్య గోతమ ఋషిః, ఇంద్రో దేవతా, భురిగార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ ప్రజాజనాః క్షత్రియం సభాపతిం కథం ప్రశంసేయురిత్యుపదిశ్యతే.

ఎన్నుకొనబడిన సభాధ్యక్షుని ప్రజ ఏవిధముగ గౌరవించి ప్రశంసింపవలయునను విషయమీ మంత్రమునం దుపదేశింపబడినది.

౨౪౫ త్వమఙ్గ ప్రశꣳసిషో దేవః శవిష్ఠ మర్త్యమ్।

న త్వదన్యో మఘవన్నస్తి మర్డితేన్ద్ర బ్రవీమి తే వచః ॥౩౭॥

ప. వి:- త్వమ్ అఙ్గ, ప్ర, శꣳసిషః, దేవః, శవిష్ఠ, మర్త్యమ్, న, త్వత్, అన్యః, మఘవన్నితి మఘ+వన్, అస్తి, మర్డితా, ఇంద్ర, బ్రవీమి, తే, వచః॥౩౭॥

పదార్థః :-(త్వమ్) (అంగ) సంబోధనే (ప్ర) (శంసిషః) ప్రశంస. లేట్ మధ్యమైకవచనప్రయోగః (దేవః) శత్రూన్ విజిగీషుః (శవిష్ఠ) బహుశవో బలం విద్యతే యస్య స శవస్వాన్ సోఽతిశయిత స్తత్సంబుద్ధౌ. అత్ర శవ శబ్దాద్భూమ్న్యర్థే మతుప్, తత ఇష్ఠన్. విన్మతోర్లుక్. అ. ౫.౩.౬౫. ఇతి మతుపో, లుక్ టేః. అ. ౬. ౪.౧౫౫. అనేన టి లోపః (మర్త్యమ్) ప్రజాస్థం మనుష్యం (న) నిషేధే (త్వమ్) (అన్యః) (మఘవన్) ఈశ్వర ఇవ సమృద్ధః (అస్తి) (మర్డితా) సుఖయితా (ఇంద్ర) పరమైశ్వర్యాన్విత (బ్రవీమి) (తే) తుభ్యమ్ (వచః) ప్రాక్ ప్రతిపాదితం రాజధర్మానురూపం వచః. అయం మంత్రః శత. ౩.౯.౪. ౨౪. వ్యాఖ్యాతః.॥౩౭॥

అన్వయః :-హే అంగ శవిష్ఠ మఘవన్నింద్ర సభాపతే! త్వం మర్త్యం ప్రశంసిషో న త్వదన్యో మర్డితా దేవోఽస్త్యతోఽహం తే తుభ్యం వచో బ్రవీమి. ॥౩౭॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా పక్షపాతవిరహః సర్వసుహృదీశ్వర స్తదనుకూలః సభాపతీ రాజ్యధర్మానువర్తీ రాజా ప్రశంసనీయం ప్రశంసయన్, నింద్యం నిందన్, దండార్హం దండయన్, రక్షితవ్యం రక్షన్, సర్వేషామభీష్టం సంపాదయేత్. ॥౩౭॥

పదార్థము :-(అఙ్గశవిష్ఠ) అత్యంత బలసంపన్నుడా! (మఘవన్) మహారాజాతో సమానుడా! (ఇన్ద్ర) బుద్ధిసిద్ధుం డౌసంగు ఓ సభాపతీ! (త్వమ్) నీవు (మర్త్యమ్) ప్రజలందలి మనుష్యులను (ప్రశంసిషః) ప్రశంసాయుక్తులుగ జేయుదువు నీవు (దేవః) శత్రువులను చక్కగా జయించు దేవతవంటి వాడవు (త్వదన్యః) నీకన్నవెవ్వరును (మర్డితా) సుఖప్రదాత (న) లేడు. ఇట్లే నేను (తే) నిన్ను గురించి (వచః) పూర్వము చెప్పినట్టి రాజ్యప్రబంధానుకూల వచనములను (బ్రవీమి) పలుకుదును. ॥౩౭॥

భావార్థము :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఈశ్వరుడు సర్వసుహృత్తు, పక్షపాత రహితుడునై యున్నట్లు సభాపతియు రాజ్యధర్మము ననుసరించు ప్రభువవునై ప్రశంసనీయుని ప్రశంసించుచు,

నింద్యుల నిందించుచు, దుష్టశిక్షణ శిష్టరక్షణ మొనర్చుచు అందరి యభీష్టములను సిద్ధింపజేయు చుండవలయును. ॥౩౭॥

37.O mighty, glorious king, render thy subjects praiseworthy. Thou art the conqueror of foes. None but thee is the giver of pleasure. I say this un to thee!.

అత్రాధ్యాయే. (౧) రాజ్యాభిషేక పురః సరం శిక్షా, రాజ్యకృత్యం, (౨) ప్రజాయా రాజాశ్రయః, (౩) సభాధ్యక్షాదికృత్యం, (౪) విష్ణోః పరమపదాదివర్ణనం, (౫) సభాధ్యక్షేణ తదుపాసనం, (౬) పరస్పరం రాజసభాకృత్యం, (౭) గురుణా శిష్యస్వీకారః, తచ్ఛిక్షాకరణం, (౮) యజ్ఞానుష్ఠానం, (౯) హుతద్రవ్యఫలం, (౧౦) విద్వల్లక్షణం, (౧౧) మనుష్యకృత్యం, (౧౨) మనుష్యాణాం పరస్పరం వర్తనానం, (౧౩) దుష్టదోష నివృత్తిఫలం (౧౪) మీశ్వరాత్కిం కిం ప్రార్థనీయం, (౧౫) రణే యోద్ధృవర్ణనం, (౧౬) యుద్ధకృత్యం, (౧౭) యుద్ధేఽన్యోన్య వర్తనానప్రకారః, (౧౮) యోధ్యాణామనుమోదనం, (౧౯) రాజ్యప్రబంధకరణం, తత్ర సాధ్యసాధనం, (౨౦) రాజ్యకర్మకరణం ప్రతీశ్వరోపదేశః రాజ్యకర్మానుష్ఠానం, (౨౧) రాజప్రజాకృత్యం, (౨౨) ప్రజారాజసభయోః పరస్పరాను (వర్త) మానం, (౨౩) ప్రజయా సభాపత్యుత్కర్షకరణం, (౨౪) ప్రజాజనం ప్రతి సభాపతిప్రేరణం, (౨౫) ప్రజయా స్వీకర్తవ్యం సభాపతేర్లక్షణం, (౨౬) ప్రజారాజసభయోః పరస్పరం ప్రతిజ్ఞాకరణం, (౨౭) సభాపతి స్వీకరణప్రయోజనం, (౨౮) ప్రజాసుఖాయ సభాపతేః కర్తవ్యకర్మానుష్ఠానం, (౨౯) సభాపత్యాదీనాం పత్నీభిః కింకిం కర్మ కర్తవ్యం, (౩౦) స్త్రీపుంసయోః పరస్పరమనువర్తమానం, (౩౧) పితరౌ ప్రతి సంతానకృత్యం, (౩౨) సభాపతిం ప్రతి ప్రజాజనోపదేశవర్ణనం, చాస్త్యతః. పంచమాధ్యాయోక్తార్థైః సహాస్య షష్ఠాధ్యాయస్యార్థానాం సంగతి రస్తీతి వేద్యమ్.

-------------

ఈ యధ్యాయమున రాజ్య అభిషేక పూర్వకమగు విద్య, రాజ్యకార్యములు, ప్రజలకు రాజాశ్రయము, సభాధ్యక్షుడు మున్నగువారి కార్యములు, విష్ణువుయొక్క పరమపద వర్ణనము, సభాధ్యక్షుడు ఈశ్వరోపాసన నొనర్చుట, రాజ ప్రజల పరస్పర కృత్యములు, గురువు శిష్యులను స్వీకరించుట, మరియు ఆ శిష్యులకు విద్యలను గరపుట, యజ్ఞానుష్ఠానము, హోమమొనర్చు ద్రవ్యముల ఫలమును వర్ణించుట, విద్వాంసుల లక్షణము, మానవులకృత్యము, మనుష్యులు పరస్పరము వ్యవహరించుకొనువిధి, దుష్ట దోషనివృత్తి ఫలము, ఈశ్వరుని నేనేమి ప్రార్థించవలయును, రణభూమియందలి యోధుల వర్ణనము, యుద్ధకృత్య నిరూపణము, యుద్ధమున పరస్పరము వర్తించు విధానము, వీరులను ప్రోత్సహించుట, రాజ్య ప్రబంధకారణము, మరియు సాధ్య సాధనము, రాజునకు ఈశ్వరోపదేశము, రాజ్యకర్మానుష్ఠానము, రాజు మరియు ప్రజల కృత్యములు, రాజు మరియు ప్రజల సభలను గూర్చి పరస్పర వార్తాలాపము, సభాపతి అభివృద్ధిని గూర్చిన ప్రసంగము, సభాపతి ప్రజలకు ప్రేరణనిచ్చుట, ప్రజలచే స్వీకరింపదగిన ప్రజల

లక్షణములు, ప్రజలు మరియు రాజసభయొక్క పరస్పర ప్రతిజ్ఞలు, సభాపతి స్వీకరించదగిన ప్రయోజనములు, ప్రజాసుఖమునకై సభాపతి కర్తవ్యకర్మల అనుష్ఠానము, సభాపతి మున్నగువారి పత్నులేమి చేయవలయును? స్త్రీ పురుషుల పారస్పరిక ప్రవర్తనము, మాతాపితరుల యెడ సంతానముల కర్తవ్యము మరియు సభాపతియెడ ప్రజల ఉపదేశక వర్ణనము లిందుగలవు. దీనివల్ల పంచమాధ్యాయములో చెప్పబడిన అర్థములతో ఈ యారవ అధ్యాయమందలి అర్థములకు కూడ సంబంధము గలదని తెలిసికొనవలయును.

ఇతి శ్రీ మత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత మహావిదుషాం విరజానన్దసరస్వతీస్వామినాం శిష్యేణ దయానన్ద సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే షష్ఠోఽధ్యాయః పూర్తిమగాత్ ॥

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి ఆరవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వెంకమాంబార్యుల ద్వితీయపుత్రుడు,
శిష్యుడునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యు'లచే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కులప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, అర్షవిద్యావినోద ఆచార్య
'మల్లి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**అరవ అధ్యాయము సమాప్తము**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# వేదగిరిపై 'వేదపీఠ, వేదమందిర, వేదాశ్రమ' నిర్మాణం

నాలుగు వేదములలోని మంత్రములను సంపూర్ణముగా శిలలపై చెక్కించి వేదమందిరము నిర్మించుట

**వేదగిరి, తూంపల్లి గ్రా॥, కొందుర్గు మం॥, మహబూబ్‌నగర్ జి॥**



**వేదగిరి పీఠాధిపతి**

**వేదభాష్యానువాదభాస్కర బిరుదాంకితులు, శతాధిక గ్రంథకర్త**

## బ్రహ్మశ్రీ పండిత లోకమలహాల సిద్ధాంతాచార్య



వేదగిరి స్థాపకులు

ఆచార్య డా॥ **మట్టి కృష్ణారెడ్డి,** M.A., M.Ed., Ph.D.

# యజుర్వేద భాష్యమ్

సంస్కృతభాష్యం, ఆంధ్రటీకాతాత్పర్యం, ఆంగ్లభావార్థసహితం




## ద్వితీయ సంపుటము

వైదిక సాహిత్య ప్రచార సమితి
హైదరాబాద్ - 500 060. ఆం.ప్ర.

ओ३म्

परमहंसपरिव्राजकाचार्येण
श्रीमन्महर्षिदयानन्दसरस्वतीस्वामिना निर्मितम्

# यजुर्वेद - भाष्यम्

संस्कृतान्ध्राङ्ग्लभाषासमन्वितम्

## द्वितीयो भागः

*( सप्तमाध्यायादारभ्य द्वादशाध्यायपर्यन्तम् )*

आन्ध्रानुवादकः
'चतुर्वेदभाष्यानुवादभास्करः'
**ब्रह्मश्री पण्डितलोकमलहरिसिद्धान्ताचार्यः**

परिष्कर्ता - सम्पादकश्च
सिद्धान्तालङ्कारः, विद्याभूषणः, आर्षविद्याविनोदः
**आचार्य डॉ. मर्रि कृष्णारेड्डी**

वैदिकसाहित्यप्रचारसमितिः, भाग्यनगरम्-६०, आन्ध्रप्रदेशः

2007

ॐ

# THE YAJURVEDA BHASHYAM

With

MAHARSHI DAYANANDA SARASWATHI'S COMMENTARY

## VOLUME - 2

### (7-12 Chapters)

Translated in English by : **DEVI CHAND** M.A.

***Translated in to Telugu***

***By***


BRAHMASRI **PANDITA LOKA MALAHARI**

SIDDHANTACHARYA


***Editor***


**Acharya Dr. MARRI KRISHNA REDDY,** M.A; M.Ed, Ph.D



**Vaidika Sahitya Prachara Samithi, Hyderabad - 60.**

**2007**

ఓ౩మ్

పరమహంసపరివ్రాజకాచార్యేణ

శ్రీమన్మహర్షిదయానందసరస్వతీస్వామినా నిర్మితమ్

# యజుర్వేద భాష్యమ్

(సంస్కృతభాష్యం, ఆంధ్రటీకాతాత్పర్యం, ఆంగ్లభావార్థసహితం)

## ద్వితీయ సంపుటము

( 7-12 అధ్యాయములు )

అనువాదకర్త

'చతుర్వేదభాష్యానువాదభాస్కర' - శతాధికగ్రంథకర్త

బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య

పరిష్కర్త - సంపాదకులు

సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద

ఆచార్య డా॥ మట్టి కృష్ణారెడ్డి, M.A., M.Ed., Ph.D.

వైదిక సాహిత్య ప్రచార సమితి, హైదరాబాద్-60

2007

# "వైదిక సాహిత్య ప్రచారసమితి" ప్రచురణలు


సంపూర్ణ "యజుర్వేదభాష్యమ్" : 6 సంపుటములు

ద్వితీయ ముద్రణ : శ్రీ వ్యయ పుష్యం, జనవరి - 2007.

ప్రతులు : 1000

వెల : **రూ. 1800/- లు** మాత్రమే.(6 సంపుటములకు కలిపి)

(పోస్టేజి అదనము)





డి.టి.పి. : **వి. రామలింగారెడ్డి (బాలు)**

ముద్రణ : **సాయిలిఖిత ప్రింటర్స్**, ఖైరతాబాద్, హైదరాబాదు.

ఫోన్ : 98490 05182


## ప్రతులకు :

1. **వైదికసాహిత్య ప్రచారసమితి,** 3-30; హనుమాన్ నగర్, ఆర్యసమాజం ఎదురువీధి, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 60. ఆం.ప్ర., ఫోన్ : 040 - 24051322, 9849583929

2. **దిల్‌సుఖ్‌నగర్ ఆర్యసమాజం,** బాదంకాంప్లెక్స్, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060, ఫోన్ : 9849468084, 9395376410

3. వేదగిరి, తూంపల్లి గ్రామం, కొందుర్గు మండలం, మహబూబ్‌నగర్ జిల్లా. ఫోన్ : 9441200322, 9849583929

4. **భీమాస్ డీలక్స్ హోటల్,** 34-38, జి.కార్ స్ట్రీట్, రైల్వేస్టేషన్ ఎదురుగా, తిరుపతి. ఫోన్ : 0877-2225521

5. **విశాలాంధ్ర బుక్‌హౌస్** (అన్ని బ్రాంచిలలో) హైదరాబాద్, విశాఖపట్టణం, విజయవాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి, కాకినాద.

# ద్వితీయ సంపుటము

## 7-12 అధ్యాయములు

### అధ్యాయసూచిక

# యజుర్వేదభాష్యము

## సప్తమాధ్యాయము - విషయసూచిక

**ఇందులో 48 మంత్రములు, 93 ఛందస్సులు, 2745 అక్షరములు**

# అథ సప్తమోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే అష్టచత్వారింశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్.

ఓం. విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౨౪౬. వాచస్పతయ ఇత్యస్య గోతమ ఋషిః, ప్రాణో దేవతా, భురిగార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

తస్య ప్రథమమంత్రే సృష్టినిమిత్తో బాహ్యాభ్యంతరవ్యవహార ఉపదిశ్యతే.

ఈ సప్తమాధ్యాయపు ప్రథమమంత్రమున సృష్టినిమిత్తమగు బాహ్యాభ్యంతరవ్యవహారముల ఉపదేశము కలదు.

౨౪౬ వాచస్పతయే పవస్వ వృష్ణోఽఅంశుభ్యాం గభస్తిపూతః।
దేవో దేవేభ్యః పవస్వ యేషాం భాగోఽసి ॥౧॥

ప.వి:- వాచః, పతయే, పవస్వ, వృష్ణో, అంశుభ్యామిత్యంశు+భ్యామ్, గభస్తిపూత ఇతి గభస్తి + పూతః, దేవః, దేవేభ్యః, పవస్వ, యేషామ్, భాగః, అసి ॥౧॥

పదార్థః:-(వాచః) వాణ్యాః (పతయే) పాలకేశ్వరాయ (పవస్వ) పవిత్రో భవ (వృష్ణః) వీర్యవతః (అంశుభ్యామ్) బాహుభ్యామివ (గభస్తిపూతః) గభస్తిభిః కిరణైః పూత ఇవ. గభస్తయ ఇతి రశ్మినామసు పఠితమ్. నిఘం. ౧. ౫. (దేవః) విద్వాన్ (దేవేభ్యః) విద్వద్భ్యః (పవస్వ) శుద్ధో భవ. (యేషామ్) విదుషామ్ (భాగః) భజనీయః (అసి). అయం మంత్రః శత. ౪. ౧. ౧. ౮-౧౧ వ్యాఖ్యాతః.॥౧॥

అన్వయః:-హే మనుష్య! త్వం వాచస్పతయే పవస్వ, వృష్ణోఽంశుభ్యామివ బాహ్యాభ్యంతరం వ్యవహారాయ గభస్తిపూత ఇవ, దేవో భూత్వా యేషాం విదుషాం భాగోఽసి తేభ్యో దేవేభ్యః పవస్వ.॥౧॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. సర్వేషాం జీవానాం యోగ్యతాఽస్తి వేదపతిం సతతం పూతం పరమేశ్వరం విజ్ఞాయ విదుషాం సంగమేన విద్యాదిగుణేషు సుస్నాతాః సత్యవాగనుష్ఠాతారః స్యురితి.॥౧॥

పదార్థము:-ఓ మానవా! నీవు (వాచః) వాణియొక్క (పతయే) పాలకుడగు ఈశ్వరునికై (పవస్వ) పవిత్రుడవు కమ్ము (వృష్ణః) బలవంతుని (అంశుభ్యామ్) భుజములవలె బాహ్యాభ్యంతర వ్యవహారములు జరుగుటకై (గభస్తి పూతః) సూర్యకిరణములచే పదార్థములు పవిత్రములగుచున్నట్లు శాస్త్రములచే (దేవః) దివ్యగుణయుక్తుడవును, విద్వాంసుడవునై (యేషామ్) విద్వాంసులకు (భాగః అసి) సేవించదగిన వాడవగుచున్నట్లు (దేవేభ్యః) విద్వాంసులకై (పవస్వ) పవిత్రుడవు కమ్ము. ॥౧॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. వేదరక్షకుడును, నిత్య పవిత్రుడునగు పరమాత్మను దెలిసికొని విద్వాంసుల సాంగత్యమున విద్య మున్నగు ఉత్తమగుణములందు నిష్ణాతులును సత్యమును పలుకువారును నగుట యెల్లరకును యోగ్యము.॥౧॥

1.O man, for realising God, the Lord of Speech, purify thy mind. Just as objects are purified by the rays of the sun, so purify thyself with the outward and inward powers of a strong king. Be a learned man, work pure-heartedly for the sages, who are adorable by thee!.

౨౪౭.మధుమతీరిత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృదార్షీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

మనుష్యాః పరస్పరం కథం వ్యవహరేయురిత్యాహ.

మనుష్యులు పరస్పరమెట్లు వ్యవహరించుకొనవలయును?

౨౪౭ మధుమతీర్న౽ఇషస్కృధి యత్తే సోమాదాభ్యన్నామ జాగృవి తస్మై తే సోమ సోమాయ స్వాహా స్వాహోర్వన్తరిక్షమన్వేమి ॥౨॥

ప.వి:- మధుమతీరితి మధు + మతీః, నః, ఇషః, కృధి, యత్, తే, సోమ, అదాభ్యమ్, నామ, జాగృవి, తస్మై, తే, సోమ, సోమాయ, స్వాహా, స్వాహా, ఉరు, అంతరిక్షమ్, అను, ఏమి ॥౨॥

**పదార్థః** :-(మధుమతీః) మధురగుణవతీః (నః) అస్మభ్యమ్ (ఇషః) అన్నాని (కృధి) కురు (యత్) యస్మాత్ (తే) తవ (సోమ) ఐశ్వర్యయుక్త విద్వన్! (అదాభ్యమ్) అహింసనీయమ్ (నామ) సంజ్ఞా (జాగృవి) జాగరూకం ప్రసిద్ధమ్ (తస్మై) (తే) తుభ్యమ్ (సోమ) శుభకర్మసు ప్రేరక! (సోమాయ) ఐశ్వర్యస్య ప్రాప్తయే (స్వాహా) సత్యాం క్రియామ్ (స్వాహా) సత్యాం వాచమ్ (ఉరు) విస్తీర్ణమ్ (అంతరిక్షమ్) అవకాశమ్ (అను) (ఏమి) అనుగచ్ఛామి. అయం మంత్రః. శత. ౪. ౧.౧. ౧౨-౨౧. వ్యాఖ్యాతః. ॥౨॥

**అన్వయః**:- హే సోమ! ఐశ్వర్యయుక్త! విద్వంస్త్వం నో౽స్మభ్యం మధుమతీరిషస్కృధి తథా హే సోమాహం యద్యస్మాత్ తే తవాదాభ్యం జాగృవి నామాస్తి తస్మై సోమాయ తే తుభ్యం చ స్వాహా సత్యాం క్రియాం స్వాహా సత్యాం వాణీముర్వంతరిక్షం చాన్వేమి.॥౨॥

**భావార్థః**:-మనుష్యా యథా స్వసుఖాయాన్నజలాది పదార్థాన్ సంపాదయేయుస్తథా౽న్యేభ్యో౽పి దేయా. యథా కశ్చిత్ స్వస్య ప్రశంసాం కుర్యాత్, తథా౽న్యస్య స్వయమపి కుర్యాత్. యథా విద్వాంసః సద్గుణవంతః సన్తి తథా తే౽పి భవేయురితి. ॥౨॥

**పదార్థము:**-(సోమ) ఐశ్వర్యయుక్తుడవగు నో విద్వాంసా! నీవు (నః) మాకొరకు (మధుమతీః) మధురగుణసహితమగు (ఇషః) అన్నము మున్నగు పదార్థములను (కృధి) ఉత్పన్నమొనర్చుము (సోమ) శుభకర్మలందు ప్రేరణ నొనర్చు విద్వాంసుడా! నేను (యత్ తే) నీయొక్క (అదాభ్యమ్) అహింసనీయమును, రక్షించదగినదియు (జాగృవి) ప్రసిద్ధమగునదియు నగు (నామ) ఏ నామము గలదో (తస్మై సోమాయ) ఆ యైశ్వర్యములను పొందుటకును (తే) నీకొరకు [నీ యాజ్ఞాపాలనకు] (స్వాహా) సత్యధర్మముతో గూడిన క్రియను (స్వాహా) సత్యవాక్కును (ఉరు) విస్తృత (అన్తరిక్షమ్) అవకాశమును (ఏమి) పొందుచున్నాను.॥౨॥

**భావార్థము** :- మనుష్యులు తమ సౌఖ్యములకై అన్నజలాది పదార్థములను సమకూర్చుకొనునట్లు ఇతరులకును ఈయవలెను. ఆత్మస్తుతియొనర్చుకొనునట్లు పరప్రశంసయును చేయవలయును. సద్గుణవంతులగు విద్వాంసులవలె తామును కావలయును. ॥౨॥

2.O superb man of knowledge, sweeten our foods. O learned preacher of virtuous deeds, whatever well-known name free from harm, thou hast, for the acquisition of power and carrying out thy instructions, I attain to true deed, truthful speech and wide atmosphere of prosperity!.

౨౪౮. స్వాఙ్కృతోఽసీత్యస్య గోతమ ఋషిః, విద్వాంసో దేవతాః, విరాట్ బ్రాహ్మీ జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునరాత్మకృత్య మాహ. ఈ మంత్రమున ఆత్మక్రియ మరల నిరూపింపబడినది.

౨౪౮ స్వాంకృతోఽసి విశ్వేభ్యఽ ఇన్ద్రియేభ్యో దివ్యేభ్యః పార్థివేభ్యో

మనస్త్వాష్టు స్వాహా త్వా సుభవ సూర్యాయ దేవేభ్య స్త్వా

మరీచిపేభ్యో దేవాంశో యస్మైత్వేడే తత్సత్య ముపరిప్రుతా

భంగేన హతోఽసౌ ఫట్ ప్రాణాయ త్వా వ్యానాయ త్వా ॥౩॥

**ప.వి:**- స్వాఙ్కృత ఇతి స్వామ్ + కృతః, అసి, విశ్వేభ్యః, ఇంద్రియేభ్యః, దివ్యేభ్యః, పార్థివేభ్యః, మనః, త్వా, అష్టు, స్వాహా, త్వా, సుభవేతి సు + భవ, సూర్యాయ, దేవేభ్యః, త్వా, మరీచిపేభ్య ఇతి మరీచి + పేభ్యః, దేవ అంశో + ఇత్యంశో, యస్మై, త్వా, ఈడే, తత్,

**సత్యమ్, ఉపరిప్రుతేత్యు పరిప్రుతా, భంగేన, హతః, అసౌ,ఫట్, ప్రాణాయ, త్వా, వ్యానాయేతి వి + ఆనాయ, త్వా ॥3॥**

**పదార్థః**:-(స్వాఙ్కృతః) స్వయంకృత ఇవ (అసి) (విశ్వేభ్యః) సమస్తేభ్యః (ఇంద్రియేభ్యః) శ్రోత్రాదిభ్యః (దివ్యేభ్యః) దివి భవేభ్యః (పార్థివేభ్యః) పృథివ్యాం విదితేభ్యః (మనః) శుద్ధం విజ్ఞానమ్ (త్వా) త్వామ్ (అష్టు) వ్యాప్నోతు (స్వాహా) వేదోక్తా వాక్ (త్వా) త్వామ్ (సుభవ) భవతీతి భవః శోభనశ్చాసౌ భవశ్చ సుభవస్తత్సమ్బుద్ధౌ (సూర్యాయ) సవిత్రే (దేవేభ్యః) శోధకేభ్యో వాయ్వాదిభ్యః (త్వా) త్వామ్ (మరీచిపేభ్యః) కిరణరక్షితృభ్య ఇవ (దేవ) దివ్యాత్మన్ (అంశో) సూర్యవత్ ప్రకాశమాన (యస్మై) (త్వా) త్వామ్ (ఈడే) స్తౌమి (తత్) సత్యమ్ (ఉపరిప్రుతా) ఉపరి ప్రవతే యస్తేన (భంగేన) మర్దనేన (హతః) నష్టః (అసౌ) శత్రుః (ఫట్) విశీర్ణః (ప్రాణాయ) జీవనహేతవే (త్వా) (వ్యానాయ) వివిధమానయతి యస్మై ఇవ (త్వా) త్వామ్. అయం మంత్రః. శత. ౪. ౧.౧.౨౨-౨౫ వ్యాఖ్యాతః. ॥3॥

**అన్వయః** :-హే అంశో దేవ దివ్యాత్మన్! యస్త్వం దివ్యేభ్యో విశ్వేభ్య ఇంద్రియేభ్యః పార్థివేభ్యో మరీచిపేభ్యో దేవేభ్య స్స్వాంకృతోఽసి తం త్వాం మనః స్వాహా చాష్టు. హే సుభవ! యస్మై సూర్యాయ చరాచరాత్మనే పరమేశ్వరాయ త్వామహమీడే తత్సత్యం పరేశం గృహాణోపరిప్రుతేవ యేన త్వయా భంగేనాసౌ శత్రుః ఫడ్ఢతస్తం త్వా త్వాం ప్రాణాయేడే వ్యానాయ త్వా త్వామీడే. ॥3॥

**భావార్థః**:- స్వయంభూభిర్జీవైర్దేహప్రాణేన్ద్రియాన్తఃకరణాని నిర్మలీకృత్య ధర్మవ్యాపారేషు ప్రవర్త్య పరమేశ్వరోపాసనే చ సంస్థాయ పురుషార్థేన దుష్టాన్ హత్వా శ్రేష్ఠాన్ రక్షిత్వాఽఽనందితవ్యమితి. ॥3॥

**పదార్థము** :-(అంశో) సూర్యునివంటి ప్రకాశవంతుడవగు నీవు (దివ్యేభ్యః) దివ్య (విశ్వేభ్యః) సమస్త (పార్థివః) పృథివిపై ప్రసిద్ధమగు (ఇన్ద్రియేభ్యః) ఇంద్రియములకొఱకును (మరీచిపేభ్యః) కిరణములవలె పవిత్రపరచు (దేవేభ్యః) విద్వాంసులకొఱకును, వాయ్వాది పదార్థములకొఱకును (స్వాంకృతః) స్వయం సిద్ధుడవై యున్న (త్వా) నీకు (మనః) విజ్ఞానము (చ) మరియు (స్వాహా) వేదవాణి (అష్టు) లభించుగాక! (సుభవ) ఉత్తమగుణవంతుడవగు మానవా! (సూర్యాయ) సర్వప్రేరకుడును, చరాచరాత్మయు నగు ఏ పరమాత్మకై (త్వామ్) నిన్ను (ఈడే) నేను ప్రశంసించుచున్నానో నీవును (తత్) ప్రశంసించదగిన (సత్యమ్) ఆ సత్యపరమాత్మను ప్రీతితో గ్రహించుము (ఉపరిప్రుతా) సర్వోత్తమ ఉత్కర్షను పొందునట్టి నీవు (భంగేన) ఏ మర్దనముచే (అసౌ) ఈ యజ్ఞానశత్రువును (ఫట్) శీఘ్రముగ (హతః) హతమార్చెదవో (త్వామ్) అట్టి నిన్ను (ప్రాణాయ) జీవనమునకై ప్రశంసితునిగ నొనర్చుచున్నాను (వ్యానాయ) అనేక సుఖములను పొందుటకొఱకు (త్వా) నిన్ను ప్రశంసించుచున్నాను. ॥3॥

**భావార్థము** :- జీవుడు స్వయం సిద్ధుడు అనాదిరూపుడు నైయున్నాడు. కావున జీవులు శరీరము, ప్రాణము, ఇంద్రియములు, అంతఃకరణములను నిర్మలముగ నుంచుకొని ధర్మయుక్త వ్యవహారములందు

ప్రవృత్తులై పరమేశ్వరోపాసనయందు స్థిరులగుదురుగాక! పురుషార్థముచే దుష్టులను సంహరించి శిష్టులను రక్షించుచు ఆనందితులై యుండవలయును. ॥3॥

3.O brilliant soul, self-made art thou, for all subtle and gross bodily organs, and for the learned who purify us like the beams of the sun. May knowledge and vedic lore be acquired by thee!.

O virtuous soul, I praise thee for thy nearness to God. Attain to that Adorable, Truthful God, Thou hast promptly crushed and killed the demon of ignorance. I extol thee for longevity and the acquisition of happiness!.

౨౪౯. ఉపయామ గృహీత ఇత్యస్య గోతమ ఋషిః, మఘవా దేవతా, ఆర్ష్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునరాత్మనాభ్యంతరే కథం ప్రయతితవ్యమిత్యాహ.

మనస్సుతో నాత్మయందెటుల ప్రయత్నించవలయు నను విషయమీ మంత్రమునం దుపదేశించబడుచున్నది.

౨౪౯ ఉపయామ గృహీతోఽస్యన్తర్యచ్ఛ మఘవన్పాహి సోమమ్ ।

ఉరుష్య రాయఽ ఏషో యజస్వ ॥౪॥

ప. వి:- ఉపయామ గృహీత ఇత్యుపయామ + గృహీతః, అసి, అన్తః, యచ్ఛ, మఘవన్నితి మఘ + వన్, పాహి, సోమమ్, ఉరుష్య, రాయః, ఆ, ఇషః, యజస్వ ॥౪॥

పదార్థః:-(ఉపయామ గృహీతః) ఉపాత్తైర్యమైర్గృహీత ఇవ (అసి) (అంతః) అభ్యంతరస్థాన్ ప్రాణాదీన్ (యచ్ఛ) నిగృహాణ (మఘవన్) పరమపూజిత! ధనిసదృశ! (పాహి) రక్ష (సోమమ్) యోగసిద్ధమైశ్వర్యమ్ (ఉరుష్య) బహునా యోగాభ్యాసేనావిద్యాదిక్లేశానంతం నయ. అత్రోరూపపదాత్ షోఽన్తకర్మణీత్యస్మాత్ క్విప్ తతో నామధాతుత్వాత్ క్విప్ తతో మధ్యమైకవచన ప్రయోగః (రాయః) బుద్ధిసిద్ధిధనాని (ఆ) సమంతాత్ (ఇషః) ఇచ్ఛాసిద్ధీః (యజస్వ). అయం మంత్రః. శత. ౪.౧.౧-౧౫. వ్యాఖ్యాతః. ॥౪॥

**అన్వయః:**-హే యోగజిజ్ఞాసో! యతస్త్వముపయామగృహీత ఇవాసి తస్మాదంతర్యచ్ఛ. హే మఘవన్! సోమం పాహి క్లేశానురుష్య, యతో రాయ ఇష ఆయజస్వ. ॥౪॥

**భావార్థః:**-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యోగార్థినా యమాదిభిర్యోగాంగైశ్చిత్తాదీన్నిరుధ్యావిద్యాదిదోషాన్నివార్య సంయమేనర్ద్ధిసిద్ధయో నిష్పాద్యంతామ్. ॥౪॥

**పదార్థము:**- ఓ యోగజిజ్ఞాసువా! నీవు (ఉపయామ గృహీతః) యోగమునందు ప్రవేశమొనర్చి యమనియమాదులద్వారా జ్ఞానులతో సమానుడవై (అసి) ఉన్నావు. కావున (అన్తః) శరీరమునందుండు

ప్రాణము మున్నగు వాయువులను, చిత్తము మున్నగు ఇంద్రియములను (యచ్ఛ) నియమమునం దుంచుము. (మఘవన్) పూజనీయుడగు ధనవంతునివంటివాడా! నీవు (సోమమ్) యోగవిద్యాసిద్ధమగు ఐశ్వర్యమును (పాహి) కాపాడుము (ఉరుష్య) అవిద్యాదిక్లేశములను అత్యంత యోగవిద్యాబలముచే నాశమొనర్చుము. ఆ పిదప (రాయః) బుద్ధి, సిద్ధి ధనాదులను (ఇషః) కోరిన సిద్ధులను (ఆ యజస్వ) విరివిగా పొందుము. ॥౪॥

**భావార్థము:**-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. యోగజిజ్ఞాసువగు పురుషార్థి యమనియమాదులను యోగాంగములచే చిత్తము మున్నగు అంతఃకరణ చిత్తవృత్తులను నిరోధించి అవిద్య మున్నగు దోషములను నివారించి సంయమముతో బుద్ధిసిద్ధులను సాధించవలెను. ॥౪॥

4.O aspirant after yoga, thou art the master of yamas and niyamas. Control thou the internal vital breaths, mind and organs!.

O rich lord, guard the supremacy emanating from yoga. Remove through the power of yoga all the ills arising from ignorance. whereby thou mayest obtain supernatural power and the fulfilment of desires!.

౨౫౦. అంతస్తే ఇత్యస్య గోతమ ఋషిః, ఈశ్వరో దేవతా, ఆర్షీపంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

అథేశ్వరః ప్రాథమకల్పికాయ యోగినే విజ్ఞానమాహ.

యోగమునందు ప్రప్రథమముగా ప్రవృత్తుడగువానికి ఈశ్వరుడు విజ్ఞానోపదేశము

ఈ మంత్రముద్వారా యొనర్చుచున్నాడు.

౨౫౦ అన్తస్తే ద్యావాపృథివీ దధామ్యంతర్దధామ్యుర్వన్తరిక్షమ్ ।
సజూర్దేవేభి రవరైః పరైశ్చాంతర్యామే మఘవన్ మాదయస్వ ॥౫॥

**ప. వి:**-అంతరిత్యన్తః, తే, ద్యావాపృథివీ౩ ఇతి ద్యావాపృథివీ, దధామి, అన్తః, దధామి, ఉరు, అన్తరిక్షమ్, సజూరితి స+జూః, దేవేభిః, అవరైః, పరైః, చ, అంతర్యామ ఇత్యన్తః+యామే, మఘవన్నితి మఘ+వన్, మాదయస్వ॥౫॥

పదార్థః:-(అన్తః) ఆకాశాభ్యంతర ఇవ (తే) తవ (ద్యావాపృథివీ) భూమిసూర్యావివ (దధామి) స్థాపయామి (అన్తః) శరీరాభ్యంతరే (దధామి) స్థాపయామి (ఉరు) బహు (అంతరిక్షమ్) అంతరాలమవకాశమ్ (సజూః) మిత్ర ఇవ (దేవేభిః) విద్వద్భిః (అవరైః) నికృష్టైః (పరైః) ఉత్తమైశ్వర్య వ్యవహారైః (చ) సముచ్చయే (అంతర్యామే) యమానామయం యామః అన్తశ్చాసౌ యామశ్చ తస్మిన్

(మఘవన్) పరమోత్కృష్టధనితుల్య (మాదయస్వ) హర్షయస్వ. అయం మంత్రః. శత.౪.౧.౨.౧౬. వ్యాఖ్యాతః. ॥౫॥

**అన్వయః** :- హే మఘవన్! యోగిన్నహం తే తవాంతర్ద్యావాపృథివీ ఇవ విజ్ఞానాదిపదార్థాన్ దధామి. ఉర్వంతరిక్షమంతర్దధామి. సజూస్త్వం దేవేభిః ప్రాప్తైరవరైః పరైశ్చ సహాంతర్యామే వర్తమానః సన్నన్యాన్ మాదయస్వ. ॥౫॥

**భావార్థః**:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. ఈశ్వర ఉపదిశతి బ్రహ్మాండే యాదృశా యావంతః పదార్థాః సన్తి తాదృశాస్తావంతో మమ జ్ఞానే వర్తంతే. యోగవిద్యాది రహితస్తాన్ ద్రష్టుం న శక్నోతి. నహీశ్వరోపాసనయా వినా కశ్చిద్యోగీ భవితుమర్హతి. ॥౫॥

**పదార్థము**:- (మఘవన్) ఓ యోగీ! పరమేశ్వరుడనగు నేను (తే) నీయొక్క (అన్తః) హృదయాకాశమున (ద్యావాపృథివీ) పృథివీసూర్యులవలె విజ్ఞానాది పదార్థములను (దధామి) స్థాపించుచున్నాను. మరియు (ఉరు) విస్తృతమగు (అన్తరిక్షమ్) అవకాశము [ఆకాశము] ను (అన్తః) శరీరమునందు (దధామి) స్థాపించుచున్నాను. (సజూః) మిత్రునివంటివాడవగు నీవు (దేవేభ్యః) విద్వాంసులద్వారా సకలవిద్యలను పొంది (అవరైః పరైః చ) నిమ్నోన్నతయోగవ్యవహారములచే (అన్తర్యామే) అంతఃకరణముల నియమములందు స్థిరుడవునైయుండి ఇతరులనుగూడ (మాదయస్వ) ప్రసన్నులుగా నొనర్చుము. ॥౫॥

**భావార్థము** :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ''విశ్వమునందున్న పదార్థములన్నియు నా జ్ఞానమందు అదేవిధముగ నున్నవి. యోగవిద్య నెరుగనివారు వాని నెరుగజాలరు. నన్నుపాసించనిదే ఎవ్వరును యోగులు గాజాల''రని పరమేశ్వరుని ఉపదేశమైయున్నది. ॥౫॥

5.O Yogi, I place in thy heart knowledge spacious like the sun and moon and mid air's wide region. Like a friend, acquiring learning form the sages, and practising internal austerities, gladden others with the preliminary and advanced usages of Yoga!.

౨౫౧.స్వాఙ్కృతోఽసీత్యస్య గోతమ ఋషిః, యోగీ దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునరీశ్వరో యోగజిజ్ఞాసుం ప్రత్యాహ.

యోగవిద్య నభ్యసించువారికి మరల నీశ్వరు డిట్లుపదేశించుచున్నాడు.

౨౫౧ స్వాఙ్కృతోఽసి విశ్వేభ్యఽ ఇంద్రియేభ్యో దివ్యేభ్యః
పార్థివేభ్యో మనస్త్వాష్టు స్వాహా త్వా సుభవ సూర్యాయ
దేవేభ్యస్త్వా మరీచిపేభ్యఽఉదానాయ త్వా॥౬॥

**ప.విః-** స్వాంకృత + ఇతి స్వామ్ + కృతః, అసి, విశ్వేభ్యః, ఇంద్రియేభ్యః, దివ్యేభ్యః, పార్థివేభ్యః, మనః, త్వా, అష్టు, స్వాహా, త్వా, సుభవేతి సు + భవ, సూర్యాయ, దేవేభ్యః, త్వా, మరీచిపేభ్య ఇతి మరీచిపేభ్యః, ఉదానాయేత్యుత్ + ఆనాయ, త్వా।౬॥

**పదార్థః**:-(స్వాఙ్కృతః)స్వయం సిద్ధోఽనాదిస్వరూపః (అసి)(విశ్వేభ్యః) అఖిలేభ్యః (ఇంద్రియేభ్యః) కార్యసాధకతమేభ్యః (దివ్యేభ్యః) నిర్మలేభ్యః (పార్థివేభ్యః) పృథివ్యాం విదితేభ్యః (మనః) యోగమననమ్ (త్వా) త్వాం యోగమభీప్సుమ్ (అష్టు) ప్రాప్నోతు (స్వాహా) సత్యవచనరూపా క్రియా (త్వా) త్వామ్ (సుభవ) సుష్ఠ్వైశ్వర్య (సూర్యాయ) సూర్యస్యేవ యోగప్రకాశాయ (దేవేభ్యః) ప్రశస్త గుణపదార్థేభ్యః (త్వా) త్వామ్ (మరీచిపేభ్యః) రశ్మిభ్యః. మరీచిపా ఇతి రశ్మినామసు పఠితమ్. నిఘం. ౧. ౫. (ఉదానాయ) ఉత్కృష్టాయ జీవనబలసాధనాయైవ (త్వా) త్వామ్. అయం మంత్రః. శత. ౪. ౧,౨. ౨౧-౨౪ వ్యాఖ్యాతః.।౬॥

**అన్వయః** :-హే సుభవ! యోగింస్త్వం స్వాఙ్కృతోఽస్యహం దివ్యేభ్యో విశ్వేభ్యో దేవేభ్యో మరీచిపేభ్యశ్చ త్వా త్వాం స్వీకరోమి పార్థివేభ్యస్త్వా త్వాం స్వీకరోమి. యతస్త్వా త్వాం మనః స్వాహా సత్యారూఢా క్రియా చాష్టు.।౬॥

**భావార్థః**:-యావన్మనుష్యః శ్రేష్ఠాచారీ న భవతి, తావదీశ్వరోఽపి తం న స్వీకరోతి. యావదయం న స్వీకరోతి, తావత్తస్యాత్మబలం పూర్ణం న భవతి. యావదిదం న జాయతే తావన్నాత్యంతం సుఖం భవతీతి.।౬॥

**పదార్థము** :-(సుభవ) శోభన ఐశ్వర్యయుక్తుడవునగు ఓ యోగీ! నీవు (స్వాంకృతః) అనాదికాలము నుండి స్వయంసిద్ధుడవునై (అసి) ఉన్నావు (త్వా) యోగము నభిలషించు నీకు (మనః) యోగ సమాధియుక్త మనస్సును (స్వాహా) సత్యానుష్ఠానమొనర్చు క్రియయు (అష్టు) ప్రాప్తించుగాక! ఇందులకై నేను (దివ్యేభ్యః) శుద్ధములును (విశ్వేభ్యః దేవేభ్యః) సమస్త ప్రశంసించదగిన గుణములతోను, ప్రశస్త పదార్థములతోను (మరీచిపేభ్యః) యోగప్రకాశముచే గూడిన వ్యవహారముతోను (త్వా) నిన్ను స్వీకరించుచున్నాను (పార్థివేభ్యః) పృథివీస్థ ప్రసిద్ధములగు పదార్థములకొరకును (త్వా) నిన్ను స్వీకరించుచున్నాను (సూర్యాయ) సూర్యునివలె యోగమును ప్రకాశింపజేయుటకొరకును (ఉదానాయ) ఉత్కృష్టమగు జీవితముకొరకును (త్వా) నిన్ను గ్రహించుచున్నాను. ।౬॥

**భావార్థము**:-మానవులు శిష్టాచారముల నాచరింపజాలనంతవరకు ఈశ్వరుడాతనిని స్వీకరించజాలడు. ఈశ్వరుడు స్వీకరించనంతవరకు వారికి సంపూర్ణ ఆత్మబలము సిద్ధించదు. ఆత్మబలము సిద్ధించనంతవరకు వారికి సుఖములు లభించజాలవు. ।౬॥

6.O supreme yogi, thy soul is self-made and eternal. Thou art competent to cultivate all spiritual, mundane and physical forces. I instruct thee to follow the lustrous usages of yoga, for exhibiting the practices of yoga like the sun, and for leading a pure and noble life by controlling breath!.

May thou an aspirant after yoga attain to a mind full of yogic concentration, and know the best course for the observance of truth.

౨౫౨.ఆ వాయో భూషేత్యస్య వసిష్ఠ ఋషిః, వాయుర్దేవతా, నిచృజ్జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునర్యోగికృత్య మాహ. యోగికృత్యములను మరల ఈ మంత్రమునం దుపదేశించబడినది.

౨౫౨ ఆ వాయో భూష శుచిపా ఉప నః సహస్రం తే నియుతో విశ్వవార ।

ఉపో తే అంధో మద్య మయామి యస్య దేవ దధిషే

పూర్వపేయం వాయవే త్వా॥౭॥

**ప.విః-** ఆ, వాయో ఇతి వాయో, భూష, శుచిపా ఇతి శుచి+పాః, ఉప, నః, సహస్రమ్, తే, నియుత ఇతి ని+యుతః, విశ్వవారేతి విశ్వ+వార, ఉపో ఇత్యుపో, తే, అంధః, మద్యమ్, అయామి, యస్య, దేవ, దధిషే, పూర్వపేయమితి పూర్వ+పేయమ్, వాయవే, త్వా॥౭॥

**పదార్థః**:-(ఆ) సమంతాత్ (వాయో) వాయురివ వర్తమాన (భూష) అలంకురు (శుచిపాః) శుచిం పవిత్రతాం పాలయతీతి శుచిపాః పవిత్రపాలక (ఉప) (నః) అస్మాన్ (సహస్రమ్) (తే) తవ (నియుతః) నియుజ్యంతే యే తాన్ నిశ్చితాన్ శమాదిగుణాన్. అత్ర కర్మణి క్విప్. (విశ్వవార) విశ్వాన్ సర్వానానందాన్ వృణోతి తత్సంబుద్ధౌ (ఉపో) సమీపమ్ (తే) (అంధః) అన్నమ్ (మద్యమ్) తృప్తిప్రదమ్ (అయామి) ప్రాప్నోమి (యస్య) (దేవ) యోగేనాత్మప్రకాశిత (దధిషే) ధరసి (పూర్వపేయమ్) పూర్వైః పాతుం యోగ్యమివ (వాయవే) (త్వా) త్వామ్. అయం మంత్రః. శత. ౪. ౧. ౩-౧౮. వ్యాఖ్యాతః.॥౭॥

**అన్వయః**:-హే శుచిపా! వాయో త్వం సహస్రం నియుత ఆభూష. హే విశ్వవార! తే తవ సకాశాన్మద్యమంధ ఉపో అయామి. హే దేవ! యస్య తే తవ పూర్వపేయమస్తి, యచ్చ త్వం దధిషే తద్వాయవే త్వా త్వామహం స్వీకరోమి. ॥౭॥

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యో యోగీ ప్రాణ ఇవ సర్వానలంకరోతి ఈశ్వర ఇవ సదుణేను నాసోతఽనుజలే ఇవ సరాఽన్ సుఖయతి. స ఏవ యోగే ప్రభవతి. ॥౭॥

**పదార్థము :-**(శుచిపాః) అత్యంత శుచిత్వమును పాటించువాడా! (వాయో) పవనమువలె యోగక్రియలందు ప్రవృత్తుడవునగు ఓ యోగీ! నీవు (సహస్రమ్) వేలకొలది (నియుతః) నిశ్చితములునగు శమాది గుణములను (అభూష) సకలవిధములుగా అలంకరించుము. (విశ్వవార) సకల సద్గుణములను స్వీకరించువాడా! (తే) నీకు (మద్యమ్) బాగుగ తృప్తినొసగు (అన్ధః) ఏ యన్నము గలదో దానిని (ఉపో) నీ సమీపమునకు (అయామి) చేర్చుచున్నాను. (దేవ) యోగశక్తిచే ఆత్మను ప్రకాశింపజేయువాడా! (యస్య) నీయొక్క (పూర్వపేయమ్) శ్రేష్ఠయోగులను రక్షించగల ఏ యోగబలము గలదో, దేనిని నీవు (దధిషే) ధరించుచున్నావో (వాయవే) ఆ యోగబలమును ఎరుగుటకై (త్వా) నిన్ను స్వీకరించుచున్నాను. ॥౭॥

**భావార్థము :-**ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ప్రాణములవలె సకలజనమును అలంకరింపజేయు ఈశ్వరునివలె సద్గుణములందు వ్యాప్తుడగు, అన్నజలములవలె విశ్వమునకు సుఖమును, పుష్టిని ప్రసాదించు యోగియే యోగమునందు సమర్థుడు కాగలుగుచున్నాడు. ॥౭॥

7.O yogi, the cultivator of purity, and expert in the practices of yoga, adorn thyself with the manifold definite virtues of mental peace and contentment. O yogi, the possessor of diverse qualities, I send unto thee the hunger-allaying food. O elevator of the soul through yoga, thou possessest the yogic power to protect the pure yogis. I instruct thee to practice such a Yoga!.

౨౫౩. ఇంద్రవాయూ ఇత్యస్య మధుచ్ఛందా ఋషిః, ఇంద్రవాయూ దేవతే, ఇంద్రవాయూ ఇత్యస్యార్షీ గాయత్రీ ఛందః, ఉపయామగృహీత ఇత్యస్యార్షీ స్వరాడ్ గాయత్రీచ్ఛందః, షడ్జః స్వరః.

పునః స యోగీ కీదృశో భవతీత్యుచ్యతే.

ఆ యోగి యెటులుండును దీ మంత్రమున మరల తెలుపబడినది.

**౨౫౩ ఇంద్రవాయూ౨ ఇమే సుతా౨ ఉప ప్రయోభిరాగతమ్।**

**ఇందవో వాముశంతి హి। ఉపయామగృహీతో౨సి వాయవ౨**

**ఇంద్రవాయుభ్యాం త్వైష తే యోనిః సజోషోభ్యాం త్వా ॥౮॥**

**ప.వి:-** ఇంద్రవాయూ ఇతీంద్ర+వాయూ, ఇమే, సుతాః, ఉప, ప్రయోభిరితి ప్రయః + భిః, ఆగతమ్, ఇందవః, వామ్, ఉశంతి, హి, ఉపయామగృహీత ఇత్యుపయామ + గృహీతః, అసి, వాయవే, ఇంద్రవాయుభ్యా మితీంద్రవాయు+ భ్యామ్, త్వా, ఏషః, తే, యోనిః, సజోషోభ్యామితి సజోషః + భ్యామ్, త్వా।౮॥

**పదార్థః**:-(ఇంద్రవాయూ) ప్రాణసూర్య సదృశౌ యోగస్యోపదేష్టభ్యాసినౌ (ఇమే) సముక్షాః, (సుతాః) నిష్పన్నాః పదార్థాః (ఉప) సమీపే (ప్రయోభిః) కమనీయైర్లక్షణైః (అ) (గతమ్) ఆగచ్ఛతమ్ గమ్ ల్ఙగతావిత్యస్మాద్బహులం ఛందసి. అ.2.4.73. ఇతి శపో లుకి సతి శిత్వాభావాచ్ఛస్యాభావోఽనుదాత్తోపదేశ. అ.6.4.37. ఇత్యాదినా మలోపశ్చ (ఇందవః) సుఖకారకా జలాదిపదార్థాః. ఇందురిత్యుదకనామసు పఠితమ్. నిఘం 1.12. (వామ్) యువామ్ (ఉశంతి) కామయంతే (హి) సాధృశ్యే (ఉపయామగృహీతః) యోగస్య యమనియమాంగైః సహ స్వీకృతః (అసి) (వాయవే) వాయువద్గత్యాదిసిద్ధయే యద్వా వాతి ప్రాపయతి యోగబలేన వ్యవహారానితి వాయుర్యోగవిచక్షణస్తస్మై తాదృశసంపన్నాయ (ఇంద్రవాయుభ్యామ్) విద్యుత్ప్రాణాభ్యామివ యోగాకర్షణ నిష్కర్షణాభ్యాం (త్వా) త్వామ్ (ఏషః) యోగః (తే) తవ (యోనిః) గృహమ్. యోనిరితి గృహనామసు పఠితమ్. నిఘం. 3. 4. (సజోషోభ్యామ్) యౌ జోషసా సేవనేన సహ వర్తమానౌ తాభ్యామ్ (త్వా) త్వామ్. అయమ్మన్త్రః. శత. 4.1.3.19. వ్యాఖ్యాతః.॥8॥

**అన్వయః** :-హే ఇంద్రవాయూ! హి యత ఇమే సుతా ఇందవో వాముశంతి తస్మాద్యువామేతైః ప్రయోభిః పదార్థైః సహైవోపాగతముపాగచ్ఛతమ్. భో యోగమభీప్సో! త్వమనేనాధ్యాపకేన వాయవే ఉపయామగృహీతోఽసి. హే భగవన్! యోగాధ్యాపక! ఏష యోగస్తే తవ యోనిః సర్వదుఃఖనివారకం గృహమివాస్తి. ఇంద్రవాయుభ్యాం జుష్టం త్వా త్వాం తథా యోగమభీప్సో సజోషాభ్యాముక్తగుణాభ్యాం జుష్టం త్వా త్వాం చాహం వశ్మి. ॥8॥

**భావార్థః** :-త ఏవ జనా యోగినస్సిద్ధాశ్చ భవితుం శక్నువంతి. యే యోగవిద్యాభ్యాసం కృత్వేశ్వర మారభ్య భూమిపర్యంతాన్ పదార్థాన్ సాక్షాత్కర్తుం ప్రయతంతే యమాదిసాధనాన్వితాశ్చ యోగే రమంతే యే చైతాన్ సేవంతే తేఽప్యేతత్సర్వం ప్రాప్నువంతి నేతరే. ॥8॥

**పదార్థము** :-(ఇంద్రవాయూ) ప్రాణమువలె, సూర్యునివలె యోగశాస్త్రమును చదివించు విద్వాంసులారా! (హి) ఏలయన (ఇమేసుతాః) ఈ యుత్పన్నములైన (ఇన్దవః) సుఖములను గలిగించు జలము మున్నగు పదార్థములు (వామ్) మీ యిరువురకు (ఉశన్తి) లభించుచున్నవి. కావున మీరు (పయోభిః) ఈ మనోహరములగు పదార్థములతో బాటు (అగతమ్) మీ స్వంత ఆగమనమును దెలిసికొనుడు. ఓ యోగాభిలాషీ! యోగమును అభ్యసింపజేయు నీ యధ్యాపకునిచే (వాయవే) వాయువువంటి యోగసిద్ధిని పొందుటకై [యోగబలముతో సమస్త చరాచర జ్ఞానప్రాప్తికై] (ఉపయామ గృహీతః) యోగమయొక్క యమనియమములతో బాటు స్వీకరింపబడియున్నావు. భగవానుడవగు యోగాధ్యాపకా! (ఏషః) ఈ యోగము (తే) నీకు (యోనిః) సమస్త దుఃఖములను దొలగించు గృహము వంటిది. మరియు (ఇన్ద్రవాయుభ్యామ్) విద్యుత్తు, ప్రాణవాయువులవలె యోగవృద్ధిని, సమాధిని, ఆకర్షణ నిష్కర్షణ లొనర్చు శక్తులద్వారా (జుష్టమ్) ప్రసన్నుడవైన (త్వా) నిన్ను మరియు [యోగమునభిలషించు ఓ మానవుడా!] (సజోషాభ్యామ్) సేవించదగిన, పైనజెప్పబడిన గుణములచే ప్రసన్నుడవైన (త్వా) నిన్ను నా సుఖముకొరకై నేను కోరుచున్నాను.॥8॥

**భావార్థము** :- యోగవిద్యాభ్యాసమొనర్చి పృథివి మొదలు పరమాత్మవరకు గల సకలపదార్థములను సాక్షాత్కరింపజేసికొనుటకు ప్రయత్నమొనర్చువారు మరియు యమనియమాది సాధనయుక్తులై యోగమునందు

రమించువారు మాత్రమే పూర్ణయోగులు, సిద్ధులు అగుటకు సమర్థులు కాగలరు. వీరిని [ఈ సిద్ధులను] సేవించువారు మాత్రమే యోగసిద్ధిని పొందగలరు. ।౮॥

8.O student and teacher of yoga, these created pleasant objects like water etc. long for ye both. Come with them. The aspirant after yoga, thou hast been accepted with yogic yamas and niyamas, by the teacher of yoga, for acquring the knowledge of the animate and inanimate objects through the power of yoga!.

O teacher of yoga, this yoga is like your pain-dispelling house. I long for thee, well versed in the practice of yogic concentration, and the student of yoga, full of qualities necessary for yoga!.

౨౫౪. అయం వామిత్యస్య గృత్సమద ఋషిః, మిత్రావరుణౌ దేవతే, ఆర్షీ గాయత్రీచ్ఛందః, ఉపయామగృహీతో౽సీత్యస్యాసురీగాయత్రీచ్ఛందః, షడ్జః స్వరః.

పునరధ్యాపక శిష్యకృత్యమాహ.

అధ్యాపకుల, శిష్యుల కర్మలను గూర్చి యీ మంత్రమం దుపదేశించబడినది.

౧౫౪ అయం వాంమిత్రావరుణా సుతః సోమ౨ ఋతావృధా। మమేదిహ శ్రుతఌహవమ్। ఉపయామ గృహీతో౽సి మిత్రావరుణాభ్యాం త్వా ।౯॥

ప. విః- అయమ్, వామ్, మిత్రావరుణా, సుతః, సోమః, ఋతావృధేత్యృత + వృధా, మమ, ఇత్, ఇహ, శ్రుతమ్, హవమ్, ఉపయామగృహీత ఇత్యుపయామ + గృహీతః, అసి, మిత్రావరుణాభ్యామ్, త్వా।౯॥

పదార్థః:-(అయమ్) (వామ్) యువయోః (మిత్రావరుణా) ప్రాణోదానావివ వర్తమానౌ (సుతః) నిష్పాదితః (సోమః) యోగైశ్వర్యవృందః (ఋతావృధా) యౌ ఋతం విజ్ఞానం వర్ధయతస్తౌ (మమ) యోగవిద్యాప్రియస్య (ఇత్) ఇవ (ఇహ) అస్మిన్ యోగవిద్యాగ్రాహకే వ్యవహారే (శ్రుతమ్) శృణుతమ్ (హవమ్) స్తుతిసమూహమ్ (ఉపయామగృహీతః) (అసి) (మిత్రావరుణాభ్యామ్) (త్వా) త్వామ్. అయం మంత్రః. శత. ౪.౧.౪.౭. వ్యాఖ్యాతః. ।౯॥

**అన్వయః**:- భో మిత్రావరుణా! ఋతావృధాధ్యాపకాధ్యేతారౌ! వాం యువయోరయం సోమః సుతో౽స్తి, యువామిహ మమ హవం శ్రుతం. హే యజమాన! యతస్త్వముపయామగృహీత ఇదేవాస్యతో౽హం మిత్రావరుణాభ్యాం సహ వర్తమానం త్వా త్వాం గృహ్ణామి. ।౯॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యాణాముచిత మేతద్విద్యాం గృహీత్వోపదేశం శ్రుత్వా యమనియమాన్ ధృత్వా యోగాభ్యాసేన సహ వర్తితవ్యమ్. ।౯॥

**పదార్థము** :-(మిత్రావరుణా) ప్రాణ, ఉదానములవలె నున్న (ఋతావృధా) సత్యవిజ్ఞానవర్ధకులారా! యోగవిద్యను చదువు, చదివించువారలారా! (వామ్) మీ యిరువురి (అయమ్ సోమః) ఈ యోగసంపద (సుతః) సిద్ధపరచబడియున్నది. కావున మీరిరువురును (ఇహ) ఇచ్చట (మమ) యోగవిద్యచే ప్రసన్నుడనగు నాయొక్క (హవమ్) స్తుతిని (శ్రుతమ్) వినుడు. ఓ యజమానుడా! నీవు (ఉపయామగృహీతః ఇత్) ఉత్తమనియమములద్వారా నిశ్చయముగ స్వీకరించబడినవాడవై (అసి) ఉన్నావు. కావున నేను (మిత్రా వరుణాభ్యామ్) ప్రాణ, ఉదానములతో వర్తమానుడవైయున్న (త్వా) నిన్ను గ్రహించుచున్నాను. ।౯॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవు లీ యోగవిద్యను గ్రహించి, శ్రేష్ఠవిద్వాంసుల ఉపదేశములను విని, యమనియమములను ధారణమొనర్చి యోగాభ్యాసమున ప్రవర్తించుట యుచితము. ।౯।

9. O student and teacher of yoga, the augmenters of true knowledge, living in unison like the vital breaths, the Prana and Udana, here is this your accomplished supremacy of yoga. Listen to my praise. O worshipper thou art endowed with noble traits, I welcome thee, who controls the vital breaths. the Prana and Udana!.

ఒ౫౦ రాయా వయమిత్యస్య త్రసదస్యుర్ఋషిః, మిత్రావరుణౌ దేవతే, బ్రాహ్మీ బృహతీచ్ఛందః, మధ్యమః స్వరః.

పునరేతయోః కృత్యమాహ.

యోగము చదువువారల, చదివించువారల కృత్యము లిందుపదేశింపబడును.

ఒ౫౦ రాయా వయఀ ససవాఀసో మదేమ హవ్యేన దేవా యవసేన గావః।
తాం ధేను మ్మిత్రావరుణా యువన్నో విశ్వాహా ధత్త మనపస్ఫురంతీ
మేష తే యోనిర్ఋతాయుభ్యాం త్వా ।౧౦॥

ప. వి:- రాయా, వయమ్, ససవాఀస ఇతి, సస+వాఀసః, మదేమ, హవ్యేన, దేవాః, యవసేన, గావః, తామ్, ధేనుమ్, మిత్రావరుణా, యువమ్ నః, విశ్వాహా, ధత్తమ్, అనపస్ఫురంతీమిత్యనప+స్ఫురంతీమ్, ఏషః, తే, యోనిః, ఋతాయుభ్యామ్ ఋతయు భ్యామిత్యృతయు+భ్యామ్, త్వా।౧౦॥

**పదార్థః** :-(రాయా) ధనేన సహ (వయమ్) పురుషార్థినః (ససవాంసః) సంవిభక్తాః (మదేమ) హృష్యేమ (హవ్యేన) గ్రహీతవ్యేన (దేవాః) విద్వాంసః (యవసేన) అభీష్టేన తృణబుసాదినా (గావః) గవాదయః పశవః (తామ్) (ధేనుమ్) ధయతి పిబత్యానందరసమనయా తామ్. ధేనురితివాఙ్నామసు పఠితమ్. నిఘం. ౧. ౧౧. (మిత్రావరుణా) ప్రాణవత్ సఖాయావుత్తమౌ జనౌ (యువమ్) యువామ్ (నః) అస్మభ్యమ్ (విశ్వాహా) సర్వాణి దినాని (ధత్తమ్) (అనపస్ఫురంతీమ్) విజ్ఞాపయిత్రీమివ యోగవిద్యాజన్యాం వాచమ్ (ఏషః) (తే) (యోనిః) (ఋతాయుభ్యామ్) ఆత్మన ఋతమిచ్ఛద్భ్యామివ (త్వా) త్వామ్. అయం మంత్రః.శత. ౪.౧.౪-౧౦. వ్యాఖ్యాతః. ॥౧౦॥

**అన్వయః**:-ససవాంసో దేవా వయం యవసేన గావ ఇవ హవ్యేన రాయా మదేమ. హే మిత్రావరుణా! యువం యువాం నోఽస్మభ్యం విశ్వాహా విశ్వాన్యహాన్యనపస్ఫురంతీం తాం ధేనుం ధత్తమ్. హే యజమాన! యస్యైష తే విద్యాబోధో యోనిరస్తి అత ఋతాయుభ్యాం సహితం త్వా త్వాం వయమాదదీమహే. ॥౧౦॥

**భావార్థః**:- అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. మనుష్యైః పురుషార్థేన విద్వత్సంగేన చ పరోపకార నిష్పాదయిత్రీం కామదుఘాం వేదవాచం ప్రాప్యానందయితవ్యమితి. ॥౧౦॥

**పదార్థము** :- (ససవాంసః) మంచిచెడులను విడదీయు విజ్ఞులారా! (దేవాః) విద్వాంసులారా! మీరును (వయమ్) మేమును (యవసేన) తృణము, గడ్డిపొట్టు మున్నగువానిచే (గావః) గోవులవలె (హవ్యేన) గ్రహించదగిన (రాయా) ధనములచే (మదేమ) హర్షితులమగుదుముగాక! మరియు (మిత్రావరుణా) ప్రాణములవంటి ఉత్తములారా! (యువమ్) మీరిరువురును (నః) మాకై (విశ్వాహా) సర్వకాలములందును (అనపస్ఫురన్తీమ్) చక్కని జ్ఞానమునొసగు (ధేనుమ్) వాణిని (ధత్తమ్) ధారణమొనర్పుడు. ఓ యజమానీ! (తే) నీకు (ఏషః) ఈ విద్యాబోధ (యోనిః) నిలయమ్మైయున్నది. కావున (ఋతాయుభ్యామ్) సత్యవ్యవహారముల నభిలషించువారితోగూడ (త్వా) నిన్ను మేము స్వీకరించుచున్నాము. ॥౧౦॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు ఉపమాలంకారము, వాచకలుప్తోపమాలంకారము లున్నవి. మానవులు స్వంతపురుషార్థముచేతను, విద్వాంసుల సాంగత్యముచేతను పరోపకారసిద్ధిని మరియు కామితములను దీర్చునదియునగు వేదవాణిని ప్రాప్తించుకొని ఆనందితులై యుండవలయును. ॥౧౦॥

10.O learnd persons, the discriminators between right and worng, ye and we, should be delighted with acquirable riches, just as cows are with grass. O noble and friendly souls, ye both give us daily the speech that rightly teaches us the knowledge of yoga. O worshipper, this knowledge of yours is thy shelter like a house. We welcome thee along with the observers of Truth!.

**౨౫౬. యా వాఙ్కశేత్యస్య మేధాతిథిర్ఋషిః, అశ్వినౌ దేవతే, బ్రాహ్మీ ఉష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.**

**పునరప్యేతయోః కర్తవ్యముపదిశ్యతే.**

**ఈ యోగవిద్య నభ్యసించువారు, అభ్యసింపజేయువారు చేయవలసిన కర్మలు మరల**

**నీ మంత్రమునం దుపదేశింపబడుచున్నవి.**

౨౫౬. యా వాఙ్కశా మధుమత్యశ్వినా సూనృతావతీ। తయా యజ్ఞమ్మిమిక్షతమ్।
ఉపయామగృహీతోఽస్యశ్విభ్యాన్త్వైష తే యోని ర్మాధ్వీభ్యా న్త్వా ॥౧౧॥

ప.వి:- యా, వాఙ్, కశా, మధుమతీతి మధు+మతీ, అశ్వినా, సూనృతావతీతి సూనృతా+వతీ, తయా, యజ్ఞమ్, మిమిక్షతమ్, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, అశ్విభ్యామిత్యశ్వి+భ్యామ్, త్వా, ఏషః, తే, యోనిః, మాధ్వీభ్యామ్, త్వా॥౧౧॥

**పదార్థః** :-(యా) (వామ్) యువయోః (కశా) వాణీ. కశేతి వాఙ్నామసు పఠితమ్. నిఘం. ౧. ౧౧. (మధుమతీ) ప్రశస్తమాధుర్యగుణయుక్తేవ. (అశ్వినా) సూర్యచంద్రవత్ ప్రకాశమానౌ (సూనృతావతీ) ఉషా ఇవ (తయా) (యజ్ఞమ్) యోగమ్ (మిమిక్షతమ్) సేక్తుమిచ్ఛతమ్ (ఉపయామ గృహీతః) ఉపనియమైః స్వీకృతః (అసి) (అశ్విభ్యామ్) ప్రాణాపానాభ్యామ్ (త్వా) త్వామ్ (ఏషః) (తే) తవ (యోనిః) గృహమ్ (మాధ్వీభ్యామ్) సునీతియోగరీతిభ్యామ్ (త్వా) త్వామ్. అయం మంత్రః. శత. ౪. ౧.౫.౧౭. అథా బ్రాహ్మ. ౪.౧.౬.౧-౭. వ్యాఖ్యాతః.॥౧౧॥

**అన్వయః**:- హే అశ్వినౌ! యోగాధ్యేత్రధ్యాపకౌ! యా వాం మధుమతీ సూనృతావతీ కశాఽస్తి తయా యజ్ఞం మిమిక్షతమ్. హే యోగమభీప్సో త్వముపయామగృహీతోఽసి కిం చ తే తవైష యోగో యోనిరస్త్యతోఽశ్విభ్యాం సహ వర్తమానం త్వామ్. హే యోగాధ్యాపక! మాధ్వీభ్యాం సహ వర్తమానం చ త్వాం వయముపాశ్రయామః. ॥౧౧॥

**భావార్థః**:- అత్రోపమాలంకారః. యోగినో మధురవాచాఽధ్యేతౄన్ ప్రతి యోగముపదిశేయు రాత్మసర్వస్వం యోగమేవ మన్యేరన్నితరే జనాస్తాదృశం యోగినం సర్వత్రాఽశ్రయేయు రితి. ॥౧౧॥

**పదార్థము** :-(అశ్వినౌ) సూర్యచంద్రులవలె ప్రకాశవంతులగు యోగవిద్య అధ్యాపక, అధ్యేతలారా! (వామ్) మీయొక్క (మధుమతీ) ప్రశంసనీయమగు మధురగుణము (సూనృతావతీ) ప్రభాతకాలమున క్రమక్రమముగ ప్రదీప్తమగు ఉషస్సువంటి (యా కశా) ఏ వాణి గలదో (తయా) దానిచే (యజ్ఞమ్) ఈశ్వర సాక్షాత్కార మొనర్చజేయు యోగరూప యజ్ఞమును (మిమిక్షతమ్) సాధింపబూనుడు సంకల్పించుడు. మీరు (ఉపయామగృహీతః) యమనియమాదులచే స్వీకరింపబడి (అసి) ఉన్నారు (తే) నీకు (ఏషః) ఈ యోగము (యోనిః) గృహమువలె సుఖదాయకమైయున్నది. కావున (అశ్విభ్యామ్) ప్రాణాపానవాయులయొక్క యోగనియమములతోనుండు (త్వా) నిన్ను [ఓ యోగాధ్యాపకా!] (మాధ్వీభ్యామ్) మధురములగు, శ్రేష్ఠ నీతియుగల యోగరీతులచే నున్న (త్వా) నిన్నును మే మాశ్రయించుచు సమీపస్థుల మగుచున్నాము. ॥౧౧॥

భావార్థము:- ఈ మంత్రమున ఉపమాలంకారమున్నది. యోగులు మధురమగు ప్రియమైనవాణులతో యోగము నేర్చుకొనువారికి ఉపదేశించవలయును. మరియు తమ సర్వస్వము యోగమనియే యెరుగవలయును. ఇతరమనుష్యులెల్లరును అట్టి యోగిని సదా ఆశ్రయించుచుండవలయును. ॥౧౧॥

11. O student and teacher of yoga, resplendent like the sun and the moon, desire to develop yoga by your sweet and dawn-like pleasant speech. O student of yoga, thou hast been welcomed for thy noble traits. This yoga of yours is a house unto thee for comfort!.

We approach thee, well versed in yogic laws of the control of breath, and thy teacher, expert in the sweet practices and methods of yoga.

౨౫౭. తం ప్రత్నథేత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృదార్షీ జగతీ ఛందః, నిషాదః స్వరః, ఉపయామగృహీత ఇత్యస్య పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

పునర్యోగిగుణా ఉపదిశ్యన్తే. యోగిగుణములీ మంత్రమునం దుపదేశించబడుచున్నవి.

౨౫౭ తం ప్రత్నథా పూర్వథా విశ్వథేమథా జ్యేష్ఠతాతిం బర్హిషదగ్ం స్వర్విదమ్ ।
ప్రతీచీనం వృజనం దోహసే ధునిమాశుం జయన్తమను యాసు వర్ధసే ।
ఉపయామగృహీతో౽సి శండాయ త్వైష తే యోనిర్వీరతాం
పాహ్యపమృష్టః శండో దేవాస్త్వా శుక్రపాః ప్రణయన్త్వనాధృష్టాసి॥౧౨॥

ప.వి:- తమ్, ప్రత్నథేతి ప్రత్న + థా, పూర్వథేతి పూర్వ + థా, విశ్వథేతి విశ్వ + థా, ఇమథేతీమ+థా, జ్యేష్ఠతాతిమితి జ్యేష్ఠ+తాతిమ్, బర్హిషదమ్, బర్హిసదమితి బర్హిః+సదమ్, స్వర్విదమితి స్వః+విదమ్, ప్రతీచీనమ్, వృజనమ్, దోహసే, ధునిమ్, ఆశుమ్, జయన్తమ్, అను, యాసు, వర్ధసే, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, శండాయ, త్వా, ఏషః, తే,యోనిః, వీరతామ్, పాహి, అపమృష్ట ఇత్యప+మృష్టః, శండః, దేవాః, త్వా, శుక్రపా ఇతి శుక్ర + పాః, ప్ర, నయన్తు, అనాధృష్టా, అసి॥౧౨॥

పదార్థః:-(తమ్) యోగమ్ (ప్రత్నథా) ప్రాక్తనానాం యోగినామివ (పూర్వథా) పూర్వేషాం యోగినామివ (విశ్వథా) సర్వేషామివ (ఇమథా) ఇదానీంతనానామివ (జ్యేష్ఠతాతిం) ప్రశస్తం జ్యేష్ఠమ్ (బర్హిషదమ్) యో బర్హిరంతరిక్షే సీదతి తమ్ (స్వర్విదమ్) స్వః సుఖం వేదయతి తమ్ (ప్రతీచీనమ్) అవిద్యాదిదోషేభ్యః ప్రతికూలమ్ (వృజనమ్) యోగబలమ్ (దోహసే) ప్రపిపర్షి ఉత్కర్షప్రాపకమ్ (ధునిమ్) ఇంద్రియకంపకమ్ (ఆశుమ్) శీఘ్రం సిద్ధిప్రదమ్ (జయంతమ్) ఉత్కర్షప్రాపకమ్ (అను) క్రియాయోగే (యాసు) కుశలాసు (వర్ధసే) శమాదిషు స్వాత్మానమున్నయసి (ఉపయామగృహీతః) ఉపయామాః శౌచాదయో నియమా గృహీతా యేన సః (అసి) వర్తసే (శండాయ) (త్వా) త్వామ్ (ఏషః) యోగయుక్తః స్వభావః (తే) యోగవిద్యాధ్యాపకస్య తవ (యోనిః) సుఖహేతుః (వీరతామ్) వీరస్య భావమ్ (పాహి) రక్ష (అపమృష్టః) అపమృజ్యతే దూరీక్రియతేऽవిద్యాదిక్లేశై ర్యః సః శుద్ధః (శండః) శమాన్వితః (దేవాః) దేదీప్యమానా యోగినః (త్వా) త్వామ్ (శుక్రపాః) శుక్రం యోగవీర్యం యోగబలం వా పాన్తి తే (ప్ర) (నయన్తు) (అనాధృష్టా) సమంతాద్ధర్షితుమనర్హా (అసి) అస్తు. అయం మన్త్రః. శత.౪.౧.౬.౯-౧౫. వ్యాఖ్యాతః.॥౧౨॥

అన్వయః :-హే యోగిన్! త్వముపయామగృహీతోऽసి తే తవైష యోగస్వభావో యోనిః సుఖహేతు రస్తి. యేన యోగేన త్వమపమృష్టః శండోऽసి. యాసు యోగక్రియాసు త్వం వర్ధసే విశ్వథా ప్రత్నథా పూర్వథేమథా జ్యేష్ఠతాతిం బర్హిషదం స్వర్విదం ప్రతీచీనమాశుం జయన్తం ధునిం వృజనం దోహసే చ. తం యోగబలం శుక్రపా దేవాస్త్వాం ప్రణయన్తు తస్మై శండాయ తుభ్యమస్య యోగస్యానాధృష్టా వీరతాऽస్తు త్వమిమాం వీరతాం పాహి తదను త్వామియం వీరతా పాతు. ॥౧౨॥

భావార్థః:-అత్రోపమాలంకారః. హే యోగవిద్యా జిజ్ఞాసో యోగిన్! త్వం యథా శమాదిగుణప్రసక్తః పురుషో యోగబలేన విద్యాబలమున్నేతుం శక్నోతి సాచా విద్యాధ్వాంతౌఘవిధ్వంసినీ యోగవిద్యా పురుషేనభ్యేత్య యథార్థం సుఖయతి తథా త్వామపి సుఖయతు. ॥౧౨॥

పదార్థము :-ఓ యోగీ! నీవు (ఉపయామగృహీతః) యోగాంగములను అనగా శౌచాది నియమములను గ్రహించువాడవై (అసి) ఉన్నావు (తే ఏషః) నీయొక్క ఈ యోగయుక్తస్వభావము (యోనిః) సుఖమునకు హేతువైయున్నది. ఏ యోగమువలన నీవు (అపమృష్టః) అవిద్య మున్నగు దోషములనుండి విముక్తుడవై (శండః అసి) శమాది గుణములతో గూడినవాడవై యున్నావో (యాసు) ఏ యోగక్రియలందు నీవు (వర్ధసే) వృద్ధిని పొందుచున్నావో మరియు (విశ్వథా) సమస్త (ప్రత్నథా) ప్రాచీన మహర్షులవలె (పూర్వథా) ప్రాచీనకాలపు యోగులవలె (ఇమథా) ఆధునిక యోగులవలె (జ్యేష్ఠతాతిమ్) అత్యంత ప్రశంసనీయమును (బర్హిషదమ్) హృదయాకాశమునందు స్థిరమైయుండి (స్వర్విదమ్) సుఖమును గలిగించునదియు (ప్రతీచీనమ్) అవిద్యాది దోషములకు ప్రతికూలమును (ఆశుమ్) శీఘ్రముగ సిద్ధినొసగునదియు (ఉదజయన్తమ్) ఉత్కర్షను గలిగింపజేయునదియు (ధునిమ్) కంపింపజేయునదియు నగు (వృజనమ్) యోగబలమును (దోహసే)

పరిపూర్ణమొనర్చుచున్నావో ఆ యోగబలమును (శుక్రపాః) రక్షించువారును (దేవాః) యోగశక్తి ప్రకాశముచే ప్రకాశితులగు నే యోగులు గలరో వారుమ (త్వా) నీకు (ప్రణయన్తు) ఉత్తమముగ లభింపజేయుదురుగాక. ఆ యోగబలమును పొందిన (శండాయ) శమదమాది గుణయుక్తుడవు నగు నీకు (అనాధృష్టా) ఆ యోగసంబంధ దృఢవీరత్వము (అసి) లభింపుగాక! నీవు (వీరతామ్) ఆ వీరత్వమును (పాహి) రక్షింపుము (అను) రక్షణను పొందిన ఆ వీరత్వము (త్వా) నిన్ను పాలించి రక్షించునుగాక! ॥12॥

భావార్థము :- ఈ మంత్రమునందుపమాలంకారము గలదు. యోగవిద్య నభిలషించు మనుష్యులారా! శమదమాది గుణయుక్తులగు మానవులెట్లు యోగబలముచే విద్యాబలములయున్నతిని యొనర్చుచున్నారో అవిద్యాంధకారమున విధ్వంసమొనర్చు నా యోగవిద్య సజ్జనులకు లభించి యథోచిత సౌఖ్యములను చేకూర్చుచున్నట్లు నీకును గలిగించుగాక! ॥12॥

12.O yogi, thou art the master of all the branches of yoga. This yogiec propensity of thine conduces to thy happiness. Through yoga, freed from the shackles of ignorance, thou art full of peace. Thou elevatest thy soul through various yogic practices!.

Like all the ancient sages and yogis and modern yogis, thou perfectest the yoga, which is higly commendable, deeply seated in the soul, pleasure-giving, inimical to nescience, quick at success, elevating, victory-giving, and quiverer of bodily organs

Let the guardians of yogic force, and yogis resplendent with the power of yoga, instruct thee in yoga. Mayest thou be invincible through that yoga. Protect thou the manly power, which in turn will protect thee.

213. సువీర ఇత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృదార్షీ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః, శుక్రస్యేత్యస్య ప్రాజాపత్యా గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

ఉక్త యోగమనుష్ఠాతా యోగీ కీదృగ్ భవతీత్యుపదిశ్యతే.

ఈ యోగము ననుష్ఠించు యోగి ఎట్లుండున దీ మంత్రమం దుపదేశించబడినది.

213 సువీరో వీరా ప్రజనయన్పరీహ్యభిరాయస్పోషేణ యజమానమ్ ।
సంజగ్మానో దివా పృథివ్యా శుక్రః శుక్రశోచిషా నిరస్తః శండః
శుక్రస్యాధిష్ఠానమసి ॥13॥

ప.వి:- సువీర ఇతి సువీరః, వీరాన్, ప్రజనయన్నితి ప్ర + జనయన్, పరి, ఇహి, అభి, రాయః, పోషేణ, యజమానమ్, సంజగ్మాన ఇతి సమ్ + జగ్మానః, దివా, పృథివ్యా, శుక్రః,

శుక్రశోచిషేతి శుక్ర + శోచిషా, నిరస్త ఇతి నిః+అస్తః, శండః, శుక్రస్య అధిష్ఠానమ్, అధిష్ఠానమిత్యధి+స్థానమ్, అసి॥13॥

పదార్థః:-(సువీరః) శోభనశ్చాసౌ వీర ఇవ (వీరాన్) ఉత్కృష్టగుణాన్ (ప్రజనయన్) నిష్పాదయన్నేవ (పరి) సర్వతః (ఇహి) ప్రాప్నుహి (అభి) ఆభిముఖ్యే (రాయః) ధనస్య (పోషేణ) పుష్ట్యా (యజమానమ్) దాతారమ్ (సంజగ్మానః) సంగతవాన్ (దివా) సూర్యేణ (పృథివ్యా) భూమ్యాసహ (శుక్రః) వీర్యవాన్ (శుక్రశోచిషా) శుక్రస్య శోధకస్య సూర్యస్య శోచిర్దీపనం తేనేవ (నిరస్తః) నిఃసారితోఽన్ధకార ఇవ (శండః) శమాదిసహితః (శుక్రస్య) శోధకస్య యోగస్య (అధిష్ఠానమ్) అధితిష్ఠంతి యస్మిన్నితి తత్ (అసి). అయం మంత్రః. శత. ४. ౧. ౬.४-౨.వ్యాఖ్యాత. ॥13॥

అన్వయః:-హే యోగిన్! సువీరస్త్వం వీరాన్ ప్రజనయన్ పరీహి. ఏవం యజమానమభిరాయస్పోషేణ సంజగ్మానో దివా పృథివ్యా సహ శుక్రః శుక్రశోచిషా నిరస్త ఏవ విషయవాసనారహితః శండస్త్వం శుక్రస్యాధిష్ఠానమసి. ॥13॥

భావార్థః:-శమదమాది గుణాధిష్ఠానో యోగాభ్యాసనిరతో యోగీ స్వయోగవిద్యాప్రచారేణ జిజ్ఞాసూనామాత్మబలం వర్ధయన్ సర్వథా సూర్య ఇవ ప్రకాశమానో భవతి.॥13॥

పదార్థము :- ఓ యోగీ! (సువీరః) ఉత్తమవీరునివలె యోగబలమును పొందిన నీవు (వీరాన్) సద్గుణవంతులను (ప్రజనయన్) ప్రసిద్ధపరచుచు (పరీహి) సర్వత్రా భ్రమణమొనర్పుము. ఇదేవిధముగ (యజమానమ్) ధనము మున్నగు పదార్థముల ప్రదానమొనర్చు ఉత్తమదాతల (అభి) ఎదుట (రాయః) ధనములను (పోషేణ) పుష్టిచే (సంజగ్మానః) సమకూర్పుము. మరియు (దివా) సూర్యునియొక్కయు (పృథివ్యా) పృథివియొక్కయు గుణములతో (శుక్రః) అతిబలశాలివై (శుక్రశోచిషా) సర్వమును శోధింపజేయు సూర్యుని దీప్తిచే (నిరస్తః) తరిమివేయబడిన అంధకారమువలె యోగబలప్రకాశముచే విషయవాసనలనుండి విముక్తుడవును (శండః) శమదమాది గుణయుక్తుడవును (శుక్రస్య) అత్యంతయోగ బలమునకును (అధిష్ఠానమ్ అసి) ఆధారుడవునై యున్నావు.॥13॥

భావార్థము :- యోగాభ్యాసనిరతుడు, శమదమాది గుణశీలుడును నగు యోగి తన యోగవిద్యా ప్రచారముద్వారా యోగవిద్యను గోరువారి యాత్మబలమును పెంపొందింపజేయుచు సర్వత్ర సూర్యునివలె ప్రకాశించును.॥13॥

13.O yogi, endowed with yogic force, cultivate noble traits, like an exalted hero. Go to all places. Be friendly towards the charitably disposed person, who perfects his riches through charity!.

Thou art the manistay of yoga, being full of mental peace, free from desire for passions, full of strength like the sun and earth, and purifier of all like the sun.

౨౫౫. అచ్ఛిన్నస్యత ఇత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, స్వరాడ్ జగతీ ఛందః, నిషాదః స్వరః.

అథ శిష్యాయాధ్యాపకకృత్యమాహ. శిష్యుని చదివించు పద్ధతి ఈ మంత్రమున ఉపదేశించబడినది.

౨౫౫ అచ్ఛిన్నస్య తే దేవ సోమ సువీర్యస్య రాయస్పోషస్య దదితారః స్యామ॥ సా ప్రథమా సంస్కృతిర్విశ్వవారా స ప్రథమో వరుణో మిత్రోఽఅగ్నిః॥౧౮॥

ప. వి:- అచ్ఛిన్నస్య, తే, దేవ, సోమ, సువీర్యస్యేతి సు+వీర్యస్య, రాయః, పోషస్య, దదితారః, స్యామ, సా, ప్రథమా, సంస్కృతిః, విశ్వవారేతి విశ్వ + వారా, సః, ప్రథమః, వరుణః, మిత్రః, అగ్నిః ॥౧౮॥

పదార్థః:-(అచ్ఛిన్నస్య) అఖండితస్య (తే) తుభ్యం తవ వా యోగజిజ్ఞాసో (సోమ) ప్రశస్తగుణ! శిష్య! (సువీర్యస్య) శోభనాని వీర్యాణి పరాక్రమాణి యస్మాత్ తస్యైవ (రాయః) సర్వవిద్యాజనితస్య బోధధనస్య (పోషస్య) పుష్టేః (దదితారః) (స్యామ) (సా) (ప్రథమా) ఆదిమా (సంస్కృతిః) విద్యాసుశిక్షాజనితా నీతిః (విశ్వవారా) సర్వైరేవ స్వీకర్తుం యోగ్యా (సః) (ప్రథమః) (వరుణః) శ్రేష్ఠః (మిత్రః) సఖా (అగ్నిః) పావక ఇవ దేదీప్యమానః. అయం మంత్రః. శత. ౪.౨.౧.౨౨-౨౬. వ్యాఖ్యాతః. ॥౧౮॥

అన్వయః:-హే దేవ సోమ! వయమధ్యాపకాస్తే తుభ్యం సువీర్యస్యాచ్ఛిన్నస్య రాయస్పోషస్య దదితారః స్యామ. యా ప్రథమా విశ్వవారా సంస్కృతిరస్తి సా తుభ్యం సుఖదా భవతు. యోఽస్మాకమ్మధ్యే వరుణోఽగ్నిరివాధ్యాపకోఽస్తి స ప్రథమస్తే మిత్రో భవతు. ॥౧౮॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యోగవిద్యాసంపన్నమనసాం యోగినాం యోగ్యతాఽస్తి జిజ్ఞాసుభ్యో నిత్యం యోగవిద్యాం ప్రదాయ తే సుశరీరాత్మబలాః సంపాదనీయాః. ॥౧౮॥

పదార్థము :-(దేవ) యోగవిద్యనభ్యసించు వీరా! (సోమ) ప్రశంసగుణశీలా! శిష్యా! మేము అధ్యాపకులము (తే) నీకు (సువీర్యస్య) శుద్ధపరాక్రమము నభివృద్ధిపరచుపదార్థమువలె (అచ్ఛిన్నస్య) అఖండమగు (రాయః) యోగవిద్యద్వారా కలిగిన ధనముయొక్క (పోషస్య) దృఢపుష్టిని (దదితారః) దానమొనర్చువారము (స్యామ) అగుదుముగాక! ఏ యీ (ప్రథమా) మొదటి (విశ్వవారా) సకలసుఖముల నుపకూర్చగల (సంస్కృతిః) విద్యాసుశిక్షాజనిత నీతిగలదో (సా) అది [ఈ జగత్తునందు నీకు సుఖదాయకమగుగాక! మరియు] మా యందు (వరుణః) శ్రేష్ఠుడును (అగ్నిః) అగ్నివంటి సకల విద్యలందు ప్రకాశితుడునగు ఏ విద్వాంసుడు గలడో (సః) అతడు (ప్రథమః) సర్వప్రథమముగ (మిత్రః) నీకు మిత్రుడగునుగాక! ॥౧౮॥

భావార్థము :- ఈ మంత్రమందు ఉపమాలంకారము గలదు. జిజ్ఞాసువులకు నిత్యము యోగమును, విద్యాదానమును నొనర్చుచు వారిని శారీరిక, ఆత్మిక బలయుక్తులనుగ నొనర్చుచుండుట యోగవిద్యా సంపన్నులు, నిర్మలమనస్సును గల యోగులకు యోగ్యమగు కార్యము. ॥౧౪॥

14. O well mannered disciple desiring to learn yoga, we your teachers, are the givers for you of uninterrupted, chivalrous strength of the knowledge of yoga!.

May our preliminary method of teaching, acceptable to all, be accomodating to thee. May he, who is spiritually advanced and highly learned amongst us, be first of all friendly to thee.

౨౬౦.స ప్రథమ ఇత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృద్ బ్రాహ్మ్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ స్వామిసేవకకృత్యమాహ. స్వామి సేవకుల కర్తవ్య మీ మంత్రమున గలదు.

౨౬౦ స ప్రథమో బృహస్పతి శ్చికిత్వాంస్తస్మా౭ ఇంద్రాయ సుతమా
జుహోత స్వాహా ॥ తృమ్పన్తు హోత్రా మధ్వో యాః స్విష్టా యాః
సుప్రీతాః సుహుతా యత్స్వాహా౭యాడగ్నీత్ ॥౧౫॥

ప.వి:- సః, ప్రథమః, బృహస్పతిః, చికిత్వాన్, తస్మై, ఇంద్రాయ, సుతమ్, ఆ,జుహోత, స్వాహా,తృమ్పన్తు, హోత్రాః, మధ్వః, యాః, స్విష్టా ఇతి సు + ఇష్టాః, యాః, సుప్రీతా ఇతి సు+ప్రీతాః, సుహుతా ఇతి సు+హుతాః, యత్, స్వాహా, అయాట్, అగ్నీత్॥౧౫॥

పదార్థః:-(సః) (ప్రథమః) ఆదిమః (బృహస్పతిః) బృహత్యా విద్యాయుక్తాయా వాచః పాలకః (చికిత్వాన్) విజ్ఞానవాన్ (తస్మై) (ఇంద్రాయ) ఐశ్వర్యాయ (సుతమ్) నిష్పాదితం వ్యవహారమ్ (ఆజుహోత) ఆదత్త (స్వాహా) సత్యాం వాచమ్ (తృమ్పంతు) ప్రీణంతు (హోత్రాః) స్వీకర్తుమర్హాః (మధ్వః) మాధుర్యాది గుణోపేతాః (యాః) (స్విష్టాః) శోభనానీష్టాని యాభ్యస్తాః (యాః) (సుప్రీతాః) సుప్రసన్నాః (సుహుతాః) సుష్ఠు హుతాని యోగాదానరూపాణి కర్మాణి యాభిర్యోగినీభిః స్త్రీభిస్తాః (యత్) యా (స్వాహా) శోభనయా వాచా (అయాట్) అయాక్షీత్ (అగ్నీత్) సంప్రేషితః. అయం మంత్రః. శత. ౪.౨.౧. ౨౭ -౨౮ వ్యాఖ్యాతః. ॥౧౫॥

అన్వయః:- హే శిష్యా! యూయం యథా స పూర్వోక్తో మిత్రః ప్రథమశ్చికిత్వాన్ బృహస్పతిర్యస్మై ప్రయతేత తస్మై ఇంద్రాయ స్వాహా సుతమాజుహోత, తథా యద్వా హోత్రా. యా మధ్వః స్విష్టా యాః సుహుతాః సుప్రీతాః స్త్రియో౽గ్నిశ్చిద్యోగీ చ స్వాహా౽యాట్, తథా భవన్తస్తృప్యంతు. ॥౧౫॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా యోగినో విద్వాంసో యోగిన్యో విదుష్యశ్చ పరమైశ్వర్యప్రాప్తయే ప్రయతంతే యథా చ సేవకః స్వామిసేవనమాచరతి తథైవాస్మిస్తత్కార్మణి ప్రవృత్య స్వాభీష్టసిద్ధిః సంపాదనీయా. ॥౧౫॥

పదార్థము :- ఓ శిష్యులారా! మీరు పూర్వమంత్రమున మేము చెప్పినట్లు (ప్రథమః) మొదటి మిత్రుడు (చికిత్వాన్) విజ్ఞానవంతుడు (బృహస్పతిః) సమస్త విద్యలతో గూడిన వాణిని పాలించువాడు ఎట్లు ఏ యైశ్వర్యమునకై ప్రయత్నమొనర్చునో అట్లే (తస్మై ఇన్ద్రాయ) ఆ యైశ్వర్యముకొరకు (స్వాహా) సత్యవాణిని (సుతమ్) సంపూర్ణపరచబడిన శ్రేష్ఠవ్యవహారమును నీవు (ఆ జుహోత) చక్కగా గ్రహణమొనర్చుము. మరియు నెట్లు (యత్ హోత్రాః) యోగము నెవరు స్వీకరింపదగినవారో లేక (యాః) ఏ స్త్రీలు (మధ్వః) మధురమైన గుణము గలవారో (స్విష్టాః) ఇష్టమగు ఉత్తమకార్యము లొనర్చువారుగ నున్నారో, లేక (యాః) ఏ స్త్రీలు (సుహుతాః) చక్కగా హవనము మున్నగు కర్మలను నిర్వర్తించి సాధింతురో (సుప్రీతాః) మరియు బాగుగా ప్రసన్నులై యుందురో, విదుషీమణులగు నా మహిళామతల్లులు, లేక (అగ్నిః) ఉత్తమ ప్రేరణను పొందియున్న విద్వాంసుడగు యోగి (స్వాహా) సత్యవాణిచే (అయాట్) ఎల్లరను తృప్తులుగానొనర్చి తృప్తులుగ నుండునట్లు [మీరును ఆ మహిళలవలె, యోగులవలె] (తృప్యన్తు) తృప్తులగుడు. ॥౧౫॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. యోగులైన విద్వాంసులు, యోగినులైన విదుషీమణులు పరమైశ్వర్యప్రాప్తికై ప్రయత్నమొనర్చునట్లు మరియు సేవకుడు తన స్వామికై పరిశ్రమించునట్లు మానవులెల్లరును ఆ యా కార్యములందు ప్రవృత్తులై అభీష్టసిద్ధినొందుదురుగాక! ॥౧౫॥

15. O pupils, just as a learned teacher, the protector of knowledge tries for advancement, so should ye, to be great, resort to truth and virtuous deeds!.

Just as affable, sweet, high-minded, happy ladies, well versed in yoga, and a learned yogi, remain contented, so should yee, like them.

౨౬.౧. అయం వేన ఇత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, ఆద్యస్య నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః, ఉపయామ ఇత్యస్య సామ్నీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ సభాధ్యక్షేణ రాజ్ఞా కిం కర్తవ్య మిత్యుపదిశ్యతే.

సభాధ్యక్షుడగు రాజు ఏమి చేయవలయునను విషయ మిందు గలదు.

౨౬౧ అయం వేన శ్చోదయత్పృశ్నిగర్భా జ్యోతిర్జరాయూ రజసో విమానే।
ఇమమపాంసఙ్గమే సూర్యస్య శిశున్న విప్రా మతిభీ రిహంతి।
ఉపయామగృహీతో౽సి మర్కాయ త్వా ॥౧౬॥

ప.వి:- అయమ్, వేనః, చోదయత్, పృశ్నిగర్భా ఇతి పృశ్ని+గర్భాః, జ్యోతిర్జరాయురితి జ్యోతిః + జరాయుః, రజసః, విమాన ఇతి వి + మానే, ఇమమ్, అపామ్, సంగమ ఇతి సమ్+గమే, సూర్యస్య, శిశుమ్, న, విప్రాః, మతిభిరితి మతి+భిః, రిహంతి, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, మర్కాయ, త్వా ॥౧౬॥

**పదార్థః** :-(అయమ్) (వేనః) కమనీయశ్చంద్రః (చోదయత్) ప్రేరయతి. అత్ర లడర్థే లజడభావశ్చ (పృశ్నిగర్భాః) పృశ్ని రంతరిక్షం గర్భో యేషాం తే పృశ్నిగర్భాః (జ్యోతిర్జరాయుః) జ్యోతిషాం జరాయురి వాచ్ఛాదకః (రజసః) లోకసమూహస్య (విమానే) విగతం మానం పరిమాణం యస్యాన్తరిక్షస్య తస్మిన్ (ఇమమ్) ప్రత్యక్షమ్ (అపామ్) జలానామ్ (సంగమే) సంగ్రామ ఇవ. సంగమ ఇతి సంగ్రామ నామసు పఠితమ్. నిఘం. ౨. ౧౭. (సూర్యస్య) మార్తండస్య (శిశుమ్) శాసనీయం కుమారం బాలకమ్ (న) ఇవ (విప్రాః) మేధావినః (మతిభిః) బుద్ధిభిః (రిహంతి) సత్కుర్వంతి. రింహతీత్యర్చతి కర్మసు పఠితమ్. నిఘం. 3. ౧౪. (ఉపయామ గృహీతః) రాజ్యాంగైర్యుక్తః (మర్కాయ) మృత్యునిమిత్తాయ వాయవే (త్వా) త్వామ్.

ఇమం మంత్రం నిరుక్తకార ఏవం సమాచష్టే-వేనో వేనతేః కాంతికర్మణస్తస్యైషా భవతి. నిరు. ౧౦-3౮. అయం వేనశ్చోదయత్ పృశ్నిగర్భాః ప్రాష్టవర్ణగర్భా ఆప ఇతి వా జ్యోతిర్జరాయుర్జ్యోతిరస్య జరాయు స్థానీయం భవతి. జరాయు జరయా గర్భస్య జరయా యూయత ఇతి వేమమపాం సంగమనే సూర్యస్య చ శిశుమివ విప్రా మతిభీ హంతి, లిహంతి స్తువంతి, వర్ధయంతి, పూజయంతీతి వా. శిశుః శంసనీయో భవతి. శిశీతే ర్వా స్యాద్దానకర్మణశ్చిరలబ్ధో గర్భో భవతి. నిరు.౧౦.3౯. అయం మంత్రః. శత. ౪.౨.౧. ౧౦-౧౧. వ్యాఖ్యాతః. ॥౧౬॥

**అన్వయః**:- హేశిల్పవిధివిద్విద్వన్! త్వముపయామగృహీతో౽స్యతో౽హం రజసో మధ్యే పృశ్నిగర్భా లోకా ఇవ జ్యోతిర్జరాయురివాయం వేనశ్చోదయాదిమం చంద్రమపాం సూర్యస్య సంగమే శిశుం విప్రా మతిభీ

రిహంతి నేవ మర్త్యాయ దుష్టానాం ప్రశమనాయ శ్రేష్ఠవ్యవహారస్థాపనాయ చ విమానే త్వా త్వాం గృహ్ణామి. ॥౧౬॥

భావార్థః:- సభాధ్యక్షేణ సూర్యాచంద్రమసో ర్గుణానివ శ్రేష్ఠగుణాన్ ప్రకాశయిత్వా దుష్టప్రశమనేన శ్రేష్ఠవ్యవహారేణ సజ్జనా ఆహ్లాదయితవ్యాః. ॥౧౬॥

పదార్థము :- శిల్పవిద్యావేత్తవగు సభాధ్యక్షా! నీవు (ఉపయామగృహీతః అసి) సైన్యములు మున్నగు రాజ్యాంగములచే యుక్తుడవై యున్నావు. కావున (రజసః) లోకములమధ్య (పృశ్నిగర్భాః) విశాల అవకాశము [ఆకాశము] గల లోకములవలె (జ్యోతిర్జరాయుః) తారాగణమును జరాయువువలె [మావిచే గప్పబడిన వానివలె] (అయమ్ వేనః) అతిమనోహరుడగు ఈ చంద్రుడు (చోదయత్) యథాయోగ్యముగ వారి వారి మార్గమునందు సిద్ధపరచును (ఇమమ్) ఈ చంద్రుని (అపామ్) జలముయొక్కయు (సూర్యస్య) సూర్యునియొక్కయు (సంగమే) సంబంధమగు ఆకర్షణ మున్నగు విషయములందు (శిశుమ్) శిక్షార్హుడగు బాలుని (మతిభిః) విద్వాంసులు స్వబుద్ధిద్వారా (రిహన్తి) సత్కరించి (న) సమానాదరముతో గ్రహించునట్లు నేను (మర్త్యాయ) దుష్టులను నశింప [శమింప] జేయుచు, శ్రేష్ఠవ్యవహారములను స్థాపించుటకు (విమానే) అనంతమగు అంతరిక్షమున అనేక విధములగు యానముల నిర్మించుటకు (త్వా) నిన్ను స్వీకరించుచున్నాను. ॥౧౬॥

భావార్థము :-సభాధ్యక్షుడు సూర్యచంద్రుల గుణములవలెనే శ్రేష్ఠగుణములను ప్రకాశితమొనర్చియు, దుష్టవ్యవహారముల శాంతపరచుచు, శ్రేష్ఠవ్యవహారములచే సజ్జనులను ఆహ్లాదపరచవలయును. ॥౧౬॥

16. O' skilful ruler, thou art equipped with army, the essential mainstay of kingship. I fix in its orbit, in the midst of spacious regions, this beautiful moon that covers the luminous stars, and is linked with the sun and the waters that it attracts. Just as learned persons wisely and respectfully accept a young pupil, so do I accept thee for curbing the sinful and establishing the code of morality!.

౧౭. మనో న యేష్విత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, స్వరాడ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. పై విషయమే మరల నిందు విశదపరచబడినది.

౧౭ మనో న యేషు హవనేషు తిగ్మం విపః శచ్యా వనుథో ద్రవంతా। ఆ యః శర్యాభి స్తువిన్నృమ్ణో౨ అస్యాశ్రీణీతా దిశం గభస్తావేష తే యోనిః ప్రజాః పాహ్యపమృష్టో మర్కో దేవా స్త్వా మంథిపాః ప్రణయన్త్వనా ధృష్టాసి॥౧౭॥

**ప. వి:-** మనః, న, యేషు, హవనేషు, తిగ్మమ్, విపః, శచ్యా, వనుథః, ద్రవంతా, ఆ, యః, శర్యాభిః, తువిన్నృమ్ణ ఇతి తువి + నృమ్ణః, అస్య, అశ్రీణీత, ఆదిశమిత్యా + దిశమ్, గభస్తౌ, ఏషః, తే, యోనిః, ప్రజా ఇతి ప్ర + జాః, పాహి, అపమృష్ట ఇత్యప + మృష్టః, మర్త్యః, దేవాః, త్వా, మంథిపా ఇతి మంథి + పాః, ప్ర, నయంతు, అనాధృష్టా, అసి॥౧౭॥

**పదార్థః:-**(మనః) విజ్ఞానమ్ (న) ఇవ (యేషు) (హవనేషు) ధర్మేణైవాదానేషు. (తిగ్మమ్) వజ్రవత్తీవ్రమ్, తిగ్మమితి వజ్రనామసు పఠితమ్. నిఘం. ౨. ౨౦. (విపః) వివిధం పాతీతి విపో మేధావీ. విప ఇతి మేధావినామసు పఠితమ్. నిఘం. ౩. ౧౫. శచ్యా ప్రజ్ఞయా. శచీతి ప్రజ్ఞా నామసు పఠితమ్. నిఘం. ౩. ౯. (వనుథః) కామయేథే. వనోతీతి కాంతికర్మసు పఠితమ్. నిఘం. ౨. ౬. (ద్రవంతా) గంతారౌ. అత్ర సుపాం సులుగిత్యాకారాదేశః. అ.౭.౧.౩౯. (ఆ) (యః) (శర్యాభిః) గతిభిః (తువిన్నృమ్ణః) తువీని బహూని ధనాని యస్య సః. తువీతి బహునామసు పఠితమ్. నిఘం. ౩. ౧. (అస్య) (అశ్రీణీత) శ్రీణాతి పచతి (ఆదిశ) దిశమభివ్యాప్యైవ (గభస్తౌ) అంగుల్యా నిర్దేశే. గభస్తయ ఇత్యంగులీనామసు పఠితమ్. నిఘం.౨.౫. (ఏషః) రాజధర్మః (తే) తవ (యోనిః) గృహమ్ (ప్రజాః) సంరక్షణీయాః (పాహి) (అపమృష్టః) దూరీకృతః (మర్త్యః) మరణదుఃఖదో దుర్నయః (దేవాః) విద్వాంసః (త్వా) త్వామ్ (మంథిపా) యే మంథంతి శత్రూన్ తాన్ వీరాన్ పాంతి తే (ప్ర) (నయంతు) ప్రీణయంతు (అనాధృష్టా) అధర్షనీయా (అసి) లోడర్థే లట్. అయం మంత్రః. శత. ౪. ౧. ౬. ౧౨-౧౫. వ్యాఖ్యాతః. ॥౧౭॥

**అన్వయః:-**హే శిల్పవిద్యావిచక్షణ సభాపతే! విద్వన్నేష రాజధర్మస్తే తవ యోని రస్తి, త్వం యథా యస్తు విన్నృమ్ణః ప్రజాపతిర్విపః ప్రజాజనశ్చైతౌ ద్వౌ యువాం యేషు హవనేషు శర్యాభిస్తిగ్మం మనో న ద్రవంతౌ సంతౌ శచ్యా సహ ఆవనుథ ఇత్థం ప్రత్యేకః ప్రజాజనోఽస్య గభస్తావా దిశం. యథా స్యాత్తథా శత్రూనాశ్రీణీత మర్త్యశ్చాపమృష్టో భవతు ప్రజాః పాహి మంథిపా దేవాస్త్వా త్వాం ప్రణయంతు. హే ప్రజే! యతోఽనాధృష్టా నిర్భయా స్వతంత్రా త్వమసి తం రాజానం సతతం రక్ష. ॥౧౭॥

**భావార్థః :-**ప్రజాపురుషా రాజ్యకర్మణి యం రాజానమాశ్రయేయు స్స తేషాం న్యాయేన రక్షాం కుర్యాత్. తే చ తం న్యాయాధీశం ప్రతి స్వాభిప్రాయం ప్రవదేయుః. రాజసేవకాశ్చ న్యాయకర్మణైవ ప్రజాపురుషాన్ రక్షేయురితి.॥౧౭॥

**పదార్థము :-**శిల్పవిద్యాచతురుడవునగు నో సభాపతీ! (ఏషః) ఈ రాజధర్మము (తే) నీయొక్క (యోనిః) సుఖస్థిరత్వమునకు స్థానము. ఎట్లు (యః తువిన్నృమ్ణః) గొప్పధనశాలివి, ప్రజాపాలకుడవునగు నీవు

(విపః) బుద్ధిశాలురగు ప్రజాజనము ఇట్టి మీ యిరువురును (యేషు) యజ్ఞాదికర్మలందు (శర్యాభిః) వేగములతో (తిగ్మమ్) వజ్రమువంటి అతిదృఢమగు (మనః న) మనస్సువంటి వేగముతోను (ద్రవన్తో) నడచుచున్నవారలై (శవ్యా) బుద్ధితో (అనుమథః) పరస్పరము కోరుకొనునట్లు ప్రజాపురుషులెల్లరును (అప్య) ఈ ప్రజాపతియొక్క (గభస్తౌ) వ్రేలిసంజ్ఞామాత్రముచే (ఆదిశమ్) సకలదిశలందుండు శత్రువులకు (ఆ అశ్రీణీత) అధిక దుఃఖములు గలిగింతురుగాక! (మర్మ్కః) మరణసమానముగు దుఃఖముల గలిగించువాడును, చెడుమార్గమున ప్రవర్తించువాడును నగు శత్రువు (అపమృష్టః) దూరమగుగాక! మరియు నీవు (ప్రజాః) ప్రజలను (పాహి) పాలించుము (మన్థిపాః దేవాః) శత్రువులను శిక్షించు, వీరులను రక్షించు విద్వాంసులు (త్వా) నిన్ను (ప్రనయన్తు) ప్రసన్నులుగా నొనర్చుదురుగాక! ఓ ప్రజాజనమా! మీరును (అనాధృష్టా అసి) నిర్భయ స్వాధీనులు. కావున సదా రాజును సంరక్షించుచుండుడు. ।౧౭॥

భావార్థము :- ప్రజలు రాజ్యకర్మయందు ఏ రాజును ఆశ్రయింతురో అయన వారిని రక్షించవలయును. ఆ ప్రజయును తమ న్యాయాధీశుని సమ్ముఖమున తమ యభిప్రాయములను శంకాసమాధానములతో బాటు నివేదించవలయును. రాజకర్మచారులును న్యాయముతో ప్రజలను రక్షించవలయును. ।౧౭॥

17. O' skilful ruler, this art of government is thy mainstay. Just as thou, master of wealth, and protector of thy subjects, and the wise people of thine, both perform Havan with alertness, and determined mind, and acting wisely contribute to the welfare of the state, so should each subordinate of thine, on the signal of thy finger, remove enemies from all sides. Let the wicked and agonising foe be cast aside. Protect thy subjects!.

Let the learned, who quell the foes, add to thy happiness. O people protect the ruler that grants ye independence and fearlessness!.

౨౬౩. సుప్రజా ఇత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృత్ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః,

మంథినో౽ధిష్ఠానమిత్యస్య ప్రాజాపత్యా గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

న్యాయాధీశేన ప్రజాః ప్రతి కథం వర్తితవ్యమిత్యుపదిశ్యతే.

ప్రజలయెడ న్యాయాధీశుడెట్టుల ప్రవర్తించవలయున దిందు చెప్పబడినది.

౧౮ సుప్రజాః ప్రజాః ప్రజనయన్ పరీహ్యాభి రాయస్పోషేణ యజమానమ్ । సంజగ్మానో దివా పృథివ్యా । మంథీ మంథిశోచిషా నిరస్తో మర్కో మంథినో౽ధిష్ఠానమసి ।౧౮॥

ప.వి:- సుప్రజా ఇతి సు + ప్రజాః, ప్రజా ఇతి ప్ర + జాః, ప్రజనయన్నితి ప్ర + జనయన్, పరి, ఇహి, అభి, రాయః, పోషేణ యజమానమ్, సంజగ్మాన ఇతి సమ్ + జగ్మానః, దివా, పృథివ్యా, మంథీ, మంథిశోచిషేతి మన్థి + శోచిషా, నిరస్త ఇతి నిః + అస్తః, మర్త్యః, మంథినః, అధిష్ఠానమ్, అధిష్ఠానమిత్యధి + స్థానమ్, అసి ॥౧౨॥

పదార్థః :-(సుప్రజాః) శోభనా ప్రజా యస్య సః సుప్రజాః స యథాస్యాత్తథా (ప్రజాః) ప్రజా ఏవ (ప్రజనయన్) పరమేశ్వర ఇవ ప్రకటయన్ (పరి) సర్వతః (ఇహి) జానీహి (అభి) ఆభిముఖ్యే (రాయః) ధనసమూహస్య (పోషేణ) పుష్ట్యా (యజమానమ్) సుఖప్రదమ్. (సంజగ్మానః) ధీరతాది శుభగుణేష్వాసక్తః (దివా) సూర్యేణ (పృథివ్యా) భూమ్యా (మంథీ) మంథితుం శీలమస్య న్యాయాధీశస్య సః (మంథిశోచిషా) సూర్యదీప్త్యేవ (నిరస్తః) నితరాం ప్రక్షిప్త ఇవ (మర్త్యః) మృత్యునిమిత్తః ఖల్వన్యాయకారీ (మంథినః) న్యాయకారిణః (అధిష్ఠానమ్) ఆధార ఇవ (అసి). అయం మంత్రః. శత.౪.౨.౧.౧౭-౨౧. వ్యాఖ్యాతః.॥౧౨॥

అన్వయః:-భో న్యాయాధీశ! సుప్రజాస్త్వం ప్రజాః ప్రజనయన్ రాయస్పోషేణ సహ యజమాన మభిపరీహి సర్వథా తస్య ధనవృద్ధిమిచ్ఛ. మంథీత్వం దివా పృథివ్యా సంజగ్మానో భవ. తద్గుణీభవేతి భావః. యతస్త్వం మంథినోఽధిష్ఠానమస్యతస్తే మంథిశోచిషా మర్త్యో నిరస్తో భవతు. ॥౧౨॥

భావార్థః:- అత్రోపమాలంకారః. న్యాయాధీశో యజమానస్య పురోహిత ఇవ ప్రజాః సతతం పాలయేత్. ॥౧౨॥

పదార్థము :- ఓ న్యాయాధీశా! (సుప్రజాః) ఉత్తమ ప్రజలుగల నీవు (ప్రజాః) ప్రజలను (ప్రజనయన్) ఈశ్వరునివలె ప్రకటింపజేయుచు (రాయః) ధనముల (పోషేణ) పుష్టిచే (యజమానమ్) యాగాది కర్మలొనర్చువారిని (అభి, పరి, ఇహి) సకలవిధముల ధనవంతులనుగ నొనర్చుము. నీవు (మన్థీ) వాదవివాదములచే మథించువాడవును (దివా పృథివ్యా) ద్యావాపృథ్వులవలె ధీరత్వాది గుణములందు ప్రవర్తించువాడవుము (మన్థినః) సదసద్వివేచన మొనర్చదగిన గుణములకు (అధిష్ఠానమ్) ఆధారుడవై (అసి) ఉన్నావు. కావున (మన్థిశోచిషా) సూర్యదీప్తివలెనున్న నీ న్యాయప్రకాశముచే (మర్త్యః) మృత్యువును చేకూర్చు అన్యాయకారి (నిరస్తః) నివృత్తుడగుగాక! ॥౧౨॥

భావార్థము:-ఈ మంత్రమునం దుపమాలంకారము గలదు. ధర్మముతో యజ్ఞము నొనర్చు సత్పురుషుడగు పురోహితునివలె ప్రజలను నిరంతరము పాలించుట న్యాయాధీశుడగు రాజునకు కర్తవ్యము. ॥౧౨॥

18.O' ruler, having loyal subjects, whose maker art thou, fill with profuse wealth him who does nobel deeds. Be thou patient like the Sun and Earth. Thou art the support of the just. With the moral power of thy justice, may the unjust be suppressed!.

౭.౧౯.యో దేవాస ఇత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వే దేవా దేవతాః, భురిగార్షీ పంక్తిశ్ఛందః, ధైవతః స్వరః.

అథ రాజ సభ్యజన కృత్యమాహ.

రాజు మరియు సభాసదుల కార్యము లీ మంత్రమందుపదేశింపబడెను.

౭.౧౯ యే దేవాసో దివ్యేకాదశ స్థ పృథివ్యామధ్యేకాదశ స్థ।

అప్సుక్షితో మహినైకాదశ స్థ తే దేవాసో యజ్ఞ మిమం జుషధ్వమ్ ॥౧౯॥

ప.వి:- యే, దేవాసః, దివి, ఏకాదశ, స్థ, పృథివ్యామ్, అధి, ఏకాదశ, స్థ, అప్సు క్షిత ఇత్యప్సు + క్షితః, మహినా, ఏకాదశ, స్థ, తే, దేవాసః, యజ్ఞమ్, ఇమమ్, జుషధ్వమ్॥౧౯॥

పదార్థః :-(యే) (దేవాసః) దివ్యగుణయుక్తాః (దివి) విద్యుతి (ఏకాదశ) ప్రాణాపానోదానసమాన వ్యాననాగకూర్మకృకలదేవదత్తధనంజయజీవాః (స్థః) సంతి. అత్ర పురుషవ్యత్యయః (పృథివ్యామ్) భూమౌ (అధి) ఉపరిభావే (ఏకాదశ) పృథివ్యప్తేజోవాయ్వాకాశాదిత్యచంద్రనక్షత్రాహంకార మహత్తత్త్వప్రకృతయః (స్థ) సన్తి (అప్సుక్షితః) ప్రాణేషు క్షయంతి నివసంతి తే (మహినా) మహిమ్నా (ఏకాదశ) శ్రోత్ర త్వక్ చక్షురసనాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థమనాంసి (స్థ) సంతి (తే) (దేవాసః) రాజసభాసదో విద్వాంసః (యజ్ఞమ్) రాజప్రజాసంబద్ధ వ్యవహారమ్ (ఇమమ్) ప్రత్యక్షమ్ (జుషధ్వమ్) సేవధ్వమ్. అయమ్మంత్రః. శత.౪.౨.౨.౯. వ్యాఖ్యాతః.॥౧౯॥

అన్వయః:-యే మహినా స్వమహిమ్నా దివ్యేకాదశ దేవాసః స్థ సంతి. పృథివ్యామధ్యేకాదశ స్థ సంతి. అప్సుక్షితశ్చైకాదశ స్థ సంతి తే యథా స్వస్వకర్మసు వర్తంతే తద్వద్వర్తమానా. హే దేవాసో! రాజసభాయాః సభ్యజనా యూయమిమం యజ్ఞం జుషధ్వమ్. ॥౧౯॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా స్వకర్మణి ప్రవర్తమానా ఇమేఽన్తరిక్షా దిషు పదార్థాః సంతి, తథా సభాజనైస్స్వస్వన్యాయకర్మణి ప్రవర్తితవ్యమితి. ॥౧౯॥

పదార్థము :- (మహినా) స్వంతమహిమచే (దివి) విద్యుత్స్వరూపమున (ఏకాదశ) పదునొకండును [ప్రాణ, అపాన, ఉదాన, వ్యాన, సమాన, నాగ, కూర్మ, కృకల, దేవదత్త,ధనంజయ, జీవాత్మ అను] (దేవాస్థః) దివ్యగుణయుక్తములగు ఏ దేవతలుగలవో (పృథివ్యామ్ అధి) భూమిమీద (ఏకాదశ) పదునొకండు [పృథివి,

ప్రకృతి] (స్థ) ఉన్నవో మరియు (అప్సుక్షితః) ప్రాణములందు వసించు (ఏకాదశ) పదునొకండు [కన్నులు, చెవులు, త్వక్కు, జిహ్వ, నాసిక, వాణి, హస్త, పాద, గుద, లింగ, మనస్సులు] (స్థ) కలవో (తే) అవియన్నియు స్వకార్యములందు లీనమైయున్నట్లు (దేవాసః) ఓ రాజసభాసదులారా! మీరును యథాయోగ్యముగ స్వకార్యములందు స్థితులై (ఇమమ్ యజ్ఞమ్) [రాజ ప్రజా సంబంధ వ్యవహారములను] ఈ యజ్ఞమును (జుషధ్వమ్) సేవించుడు. ॥౧౯॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎటుల అంతరిక్ష, శరీర, ప్రాణములందలి పదార్థములు తమతమ కార్యములందు ప్రవృత్తములై యున్నవియో అటులనే రాజసభాసదులును తమ తమ న్యాయమార్గములందు ప్రవృత్తులై యుండవలయును. ॥౧౯॥

19.In their elen majesty, eleven mighty substances reside in heaven, on the earth and in respiration. Just as they perform their functions faithfully, so should you the members of the House of the People, carry on the administration of the State with zeal and devotion.

**౨౦॥. ఉపయామగృహీతోఽసీత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, యజ్ఞో దేవతా నిచృదార్షీ**

**జగతీ ఛందః, నిషాదః స్వరః.**

అథ రాజ్ఞాం విదుషాం చోపదేశప్రకారమాహ.

రాజుయొక్క, విద్వాంసులయొక్క ఉపదేశపద్ధతి చెప్పబడుచున్నది.

**౨౦॥ ఉపయామ గృహీతోఽస్యాగ్రయణోఽసి స్వాగ్రయణః।**

**పాహి యజ్ఞం పాహి యజ్ఞపతిం విష్ణుస్త్వామింద్రియేణ**

**పాతు విష్ణుంత్వం పాహ్యభి సవనాని పాహి॥౨౦॥**

ప.వి:-ఉపయామ గృహీత ఇత్యుపయామ + గృహీతః, అసి, ఆగ్రయణః, అసి, స్వాగ్రయణ ఇతి సు + ఆగ్రయణః, పాహి, యజ్ఞమ్, పాహి, యజ్ఞపతిమితి యజ్ఞ + పతిమ్, విష్ణుః, త్వామ్, ఇంద్రియేణ, పాతు, విష్ణుమ్, త్వమ్, పాహి, అభి, సవనాని, పాహి ॥౨౦॥

పదార్థః :-(ఉపయామ గృహీతః) వినయాదిరాజగుణైర్యుక్తః (అసి) (ఆగ్రయణః) సమంతాదగ్రాణి విజ్ఞానయుక్తాని ప్రశస్తాని కర్మాణ్యయతే సః. శకంధ్వాదిషు పరరూపం వాచ్యమ్. ఇతి పరరూపమ్ (అసి)

(స్వాగ్రయణః) శోభనశ్చాసావాగ్రయణశ్చ తద్వత్ (పాహి) (యజ్ఞమ్) రాజప్రజాపాలకమ్ (పాహి) (యజ్ఞపతిమ్) సంగతస్య న్యాయస్య పాలకమ్ (విష్ణుః) సకలశుభగుణకర్మవ్యాపీ విద్వాన్ (త్వామ్) (ఇంద్రియేణ) మనసా ధనేన వా. ఇంద్రియమితి ధననామసు పఠితమ్. నిఘం. ౨. ౧౦. (పాతు) (విష్ణుమ్) విద్వాంసమ్ (త్వమ్) న్యాయాధీశ (పాహి) (అభి) (సవనాని) ఐశ్వర్యాణి (పాహి). అయం మంత్రః. శత. ౪.౨.౨.౯-౧౧. వ్యాఖ్యాతః.॥౨౦॥

అన్వయః:- హే సభాపతే! రాజన్ ఉపదేశక వాయతస్త్వముపయామగృహీతో౽స్యతో యజ్ఞమ్పాహి. స్వాగ్రయణ ఇవాగ్రయణో౽సి తస్మాద్ యజ్ఞపతిం పాహి. అయం విష్ణురింద్రియేణ త్వాం పాతు. త్వమేనం విష్ణుమ్పాహి, సవనాన్యభి పాహి. ॥౨౦॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. రాజ్ఞో విదుషాం చ యోగ్యతా౽స్తి తే సతతం కుర్యుర్నహి రాజ్యోన్నత్యా వినా విద్వాంసో స్వాస్థ్యేన విద్యాప్రచారయితుముపదేష్టుం చ శక్నువంతి, న ఖలు విదుషాం సంగోపదేశాభ్యాం వినా కశ్చిద్ రాజ్యం రక్షితుమర్హతి. న ఖలు రాజప్రజోత్తమ విదుషాం పరస్పరం ప్రీతిమంతరైశ్వర్యోన్నతిరైశ్వర్యోన్నత్యా వినా౽౽నన్దశ్చ సతతం జాయతే. ॥౨౦॥

పదార్థము :- ఓ సభాపతి రాజా! లేక ఉపదేశకుడా! నీవు (ఉపయామగృహీతః అసి) వినయము మున్నగు రాజగుణయుక్తుడవు, వేదాదిశాస్త్ర ఉపదేశకుడవు. కావున (యజ్ఞమ్) రాజును, ప్రజలను పాలించు యజ్ఞమును (పాహి) పాలించుము (సవనాని) ఐశ్వర్యముల నొసగు కార్యములను (అభి) సకల విధముల (పాహి) రక్షించుము (విష్ణుః) సమస్త సద్గుణములను మరియు కర్మలను చక్కగా నెరుగు ఈ విద్వాంసుడు (ఇన్ద్రియేణ) మనస్సుచే, ధనములచే (త్వామ్) నిన్ను (పాతు) పాలించుగాక! మరియు నీవు (విష్ణుమ్) ఆ విష్ణువును [విద్వాంసుని] (పాహి) రక్షించుము (స్వాగ్రయణః) ఉత్తమ ఆలోచనాయుక్త కర్మలను పొందువాడవు కమ్ము (యజ్ఞపతిమ్) యథావతుగ న్యాయమును రక్షించువానిని (పాహి) పాలించుము. ॥౨౦॥

భావార్థము :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. రాజు, విద్వాంసులు మరియు ప్రజలు కలిసి సర్వథా రాజ్యము నభివృద్ధి పరచవలెను. ఏలన; రాజ్యోన్నతి గానిదే విద్వాంసులు శాంతమనస్కులై విద్యా ప్రచారము, ఉపదేశమునొనర్చ జాలరు. విద్వాంసుల సత్సంగము, ఉపదేశములేనిదే ఎవ్వడును రాజ్యమును రక్షించుటకు సమర్థుడు గాజాలడు. మరియు రాజు, ప్రజలు, విద్వాంసులందు పరస్పర ప్రీతిలేనిచో ఐశ్వర్యోన్నతియును జరుగదు. అట్టి ఐశ్వర్యము లేకున్న ఆనందము ఎన్నటికిని గలుగ జాలదు. ॥౨౦॥

**20.O' ruler, thou art an embodiment of humility and vedic lore, thou art the doer of laudable deeds, and worthy of respect. Protect the administration of justice. May the virtuous, and the learned protect thee. May thou fully protect the learned, and all works that contribute to prosperity!.**

**౨౧. సోమ స్య త ఇత్యస్య వత్సార కాశ్యప ఋషిః, సోమో దేవతా, స్వరాడ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః, ఏష త ఇత్యస్య యాజుషీ జగతీ ఛందః, నిషాదః స్వరః.**

**అథ రాజకృత్యమాహ. రాజుయొక్క కార్యము ఈ మంత్రమున ఉపదేశించుచున్నాడు.**

౨౬౬. సోమః పవతే సోమః పవతేఽస్మై బ్రహ్మణేఽస్మై క్షత్రాయాస్మై సున్వతే యజమానాయ పవతఽఇషఽ ఊర్జే పవతేఽద్భ్యఽ ఓషధీభ్యః పవతే ద్యావా పృథివీభ్యామ్పవతే సుభూతాయ పవతే విశ్వేభ్యస్త్వా దేవేభ్యఽఏష తే యోనిర్విశ్వేభ్య స్త్వా దేవేభ్యః ॥౨౧॥

ప.వి:- సోమః, పవతే, సోమః, పవతే, అస్మై, బ్రహ్మణే, అస్మై, క్షత్రాయ, అస్మై, సున్వతే, యజమానాయ, పవతే, ఇషే, ఊర్జే, పవతే, అద్భ్య ఇత్యత్ + భ్యః, ఓషధీభ్యః, పవతే, ద్యావాపృథివీభ్యామ్, పవతే, సుభూతాయేతి సు + భూతాయ, పవతే, విశ్వేభ్యః, త్వా, దేవేభ్యః, ఏషః, తే, యోనిః, విశ్వేభ్యః, త్వా, దేవేభ్యః ॥౨౧॥

పదార్థః:-(సోమః) సౌమ్యగుణసంపన్నో రాజా (పవతే) విజానీయాత్. లేట్ ప్రయోగః. (సోమః) రాజసభాయాః సభాసత్ ప్రజాజనో వా (పవతే) పూతో భవేత్ (అస్మై) ప్రత్యక్షాయ (బ్రహ్మణే) పరమేశ్వరాయ వేదాయ వా (అస్మై) (క్షత్రాయ) రాజ్యాయ క్షత్రియాయాయ వా (అస్మై) (సున్వతే) సర్వవిద్యాసిద్ధాంతం నిష్పాదయతే (యజమానాయ) సంగచ్ఛమానాయ (పవతే) (ఇషే) అన్నాయ (ఊర్జే) పరాక్రమాయ (పవతే) (అద్భ్యః) జలేభ్యః ప్రాణేభ్యో వా (ఓషధీభ్యః) సోమాదిభ్యః (పవతే) (ద్యావాపృథివీభ్యామ్) సూర్యభూమిభ్యామ్ (పవతే) (సుభూతాయ) సుష్ఠుసత్యాయ వ్యవహారాయ. (పవతే) (విశ్వేభ్యః) సమస్తేభ్యః (త్వా) త్వామ్ (దేవేభ్యః) దివ్యేభ్యో గుణేభ్యః (ఏషః) రాజధర్మగుణగ్రాహణమ్ (తే) తవ. (యోనిః) వసతిః (విశ్వేభ్యః) అఖిలేభ్యః (త్వా) త్వామ్ (దేవేభ్యః) విద్వద్భ్యః. అయమ్మంత్రః. శత. ౪.౨.౨.౧౨-౧౬.తథా.బ్రా.౩.౧-౯.వ్యాఖ్యాతః. ॥౨౧॥

**అన్వయః** :-హే విద్వంసో! యథాఽయం సోమోఽస్మై బ్రహ్మణే పవతేఽస్మై క్షత్రాయ పవతేఽస్మై సున్వతే. యజమానాయ పవత ఇష ఊర్జే పవతేఽద్భ్య ఓషధీభ్యః పవతే. ద్యావాపృథివీభ్యాం పవతే. సుభూతాయ పవతే, తద్వత్సోమః సభ్యజనః ప్రజాజనోఽప్యేతస్మై సర్వస్మై పవతామ్. హే రాజన్! యస్య తే తవైష యోనిరస్తి, తం త్వాం విశ్వేభ్యో దేవేభ్యో వయం స్వీకుర్మస్తథా విశ్వేభ్యో గుణేభ్యశ్చ త్వా త్వామఙ్గీకుర్మహే. ॥౨౧॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా చంద్రలోకః సర్వస్మై జగతే హితకారీ వర్తతే యథా చ రాజా సభ్యజనప్రజాజనాభ్యాం సహ తదుపకారాయ ధర్మానుకూలం వ్యవహారమాచరతి, తథైవ సభ్యజనప్రజాజనౌ రాజ్ఞా సహ వర్తేతామ్. య ఉత్తమ వ్యవహారగుణ కర్మానుష్ఠాతా భవతి, స ఏవ రాజా సభ్యజనశ్చ న్యాయాధీశో భవితు మర్హతి. యో ధర్మాత్మా (జనః) స ఏవ ప్రజాయామగ్ర్యో గణనీయోఽస్త్యేవమేతే త్రయః పరస్పరం ప్రీత్యా పురుషార్థేన విద్యాదిగుణేభ్యః పృథివ్యాదిపదార్థేభ్య శ్చాఖిలం సుఖం ప్రాప్తుం శక్నువంతి. ॥౨౧॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! (సోమః) సౌమ్యగుణయుక్తుడగు నీ రాజు ఎట్లు (అస్మై బ్రహ్మణే) ఈ పరమేశ్వరుని, లేక వేదమును ఎరుగుటకై (పవతే) పవిత్రుడగుచున్నాడో (అస్మై క్షత్రాయ) ఈ క్షాత్రధర్మమునకై (పవతే) జ్ఞానవంతుడగుచున్నాడో (అస్మై సున్వతే) సమస్త విద్యాసిద్ధాంతములను సిద్ధింపజేయు (యజమానాయ) ఉత్తమసాంగత్యమొనర్చు విద్వాంసునికై (పవతే) నిర్మలుడగుచున్నాడో (ఇషే) అన్నముయొక్కగుణముకొరకు (ఊర్జే) పరాక్రమముకొరకు (పవతే) శుద్ధుడగుచున్నాడో (అద్భ్యః) జలములకొరకు [ప్రాణములకొరకు] (ఓషధీభ్యః) సోమ మున్నగు ఓషధులకై (పవతే) ఎరుగుచున్నాడో (ద్యావాపృథివీభ్యామ్) పృథివీసూర్యులకొరకు (పవతే) శుద్ధుడగుచున్నాడో (సుభూతాయ) చక్కని వ్యవహారములకై (పవతే) దుష్కర్మలనుండి తప్పుకొనుచున్నాడో, అట్లే (సోమః) సభాసదులు మరియు ప్రజలు ఎల్లరను యథోక్తముగా నెరుగుదురుగాక, స్వీకరింతురుగాక! మరియు మీరును స్వయముగ పవిత్రులుగ నుండుడు. ఓ రాజా! సభ్యులారా! ప్రజాజనమా! (తే) మీకు (ఏషః) ఏ యీ రాజధర్మము (యోనిః) గృహమువలె నున్నదో (త్వా) అట్టి మిమ్ము (విశ్వేభ్యః, దేవేభ్యః) సకల విద్వాంసులకొరకును (త్వా) మిమ్ము (విశ్వేభ్యః) సంపూర్ణ దివ్యగుణములకొరకును మేము స్వీకరించుచున్నాము. ॥౨౧॥

భావార్థము :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. చంద్రలోకము సర్వజగత్తునకు హితకారి యగుచున్నట్లు, రాజు సభ్యజనులతో, ప్రజాజనముతో సహా వారి యుపకారమునకై ధర్మానుకూలమగు వ్యవహారమొనర్చుచున్నట్లు, సభ్యపురుషులు, ప్రజాజనమును రాజుయెడల ప్రవర్తించవలయును. ఉత్తమవ్యవహార గుణకర్మల ననుష్ఠించు యీ రాజు మరియు సభాపురుషులు మాత్రమే న్యాయశీలురు గాగలుగుచున్నారు. మరియు ధర్మాత్ములు మాత్రమే ప్రజలయం దగ్రగణ్యులుగ తలచబడుదురు. ఇట్లే మువ్వురును పరస్పర ప్రీతితో పురుషార్థమొనర్చి విద్య మున్నగు దివ్యగుణములవల్లను, పృథివ్యాది పదార్థముల చేతను సమస్త సుఖములను పొందుటకు సమర్థులగుదురు. ॥౨౧॥

21.O' learned people, just as the amiable ruler purifies himself for knowing God and the veda, tries to acquire military knowledge, makes strenous efforts for the advancement of scholars and friends of learnings, is eager to produce foodstuffs which add to our vitality, exerts for the collection of medicines and canalizing waters, desires for the light of the sun and improvement of all material objects, avoids vice to acquire virtue, so should ye and other citizens do. O ruler, successful administration is thy aim. We honour thee for the betterment of the learned, and noble qualities of thine!.

**౨౭౭.ఉపయామ గృహీతో౽సీత్యస్య వత్సారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, బ్రాహ్మీత్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.**

**కీదృశం జనం సేనాపతిం కుర్యాదిత్యుపదిశ్యతే.**

ఎటువంటి మనుష్యుని సేనాపతిగ నొనర్చవలసినదీ మంత్రమున చెప్పబడుచున్నది.

౨౭౭ ఉపయామగృహీతో౽సీంద్రాయ త్వా బృహద్వతే వయస్వతఽ ఉక్థావ్యం గృహ్ణామి। యత్తఽ ఇంద్ర బృహద్వయస్తస్మై త్వా విష్ణవే త్వైష తే యోని రుక్థేభ్య స్త్వా దేవేభ్యస్త్వా దేవా వ్యం యజ్ఞస్యాయుషే గృహ్ణామి ॥౨౨॥

ప.వి:- ఉపయామ గృహీత ఇత్యుపయామ + గృహీతః, అసి, ఇంద్రాయ, త్వా, బృహద్వత ఇతి బృహత్ + వతే, వయస్వతే, ఉక్థావ్యమిత్యుక్థ + అవ్యమ్, గృహ్ణామి, యత్, తే, ఇంద్ర, బృహత్, వయః, తస్మై, త్వా, విష్ణవే, త్వా ఏషః, తే, యోనిః, ఉక్థేభ్యః, త్వా, దేవేభ్యః, త్వా, దేవావ్యమితి దేవ + అవ్యమ్, యజ్ఞస్య, ఆయుషే, గృహ్ణామి॥౨౨॥

పదార్థః :-(ఉపయామ గృహీతః) సునియమైరధీతవిద్యః (అసి) (ఇంద్రాయ) పరమైశ్వర్యవతే (త్వా) త్వామ్ (బృహద్వతే) ప్రశస్తాని బృహంతి కర్మాణి యస్య తస్మై (వయస్వతే) బహుజీవనం విద్యతే యస్య తస్మై (ఉక్థావ్యమ్) ప్రశంసార్హాణి స్తోత్రాణి శస్త్రవిశేషాణి వా తస్య తమివ సేనాపతిమ్ (గృహ్ణామి) (యత్) (తే) తవ (ఇంద్ర) (బృహత్) (వయః) జీవనమ్ (తస్మై) (త్వా) త్వామ్ (విష్ణవే) పరమేశ్వరాయ యజ్ఞాయ వా (త్వా) త్వామ్ (ఏషః) (తే) తవ (యోనిః) స్థిత్యర్థః స్థానవిశేషః (ఉక్థేభ్యః) ప్రశంసనీయేభ్యో వేదోక్తేభ్యః కర్మభ్యః (త్వా) త్వామ్ (దేవేభ్యః) విద్వద్భ్యో దివ్యగుణేభ్యో వా (త్వా) త్వామ్ (దేవావ్యమ్) ఉక్తానాన్దేవానామ్పాలకమ్ (యజ్ఞస్య) రాజ్యపాలనాదేః (ఆయుషే) జీవనాయ (గృహ్ణామి). అయమ్మంత్రః శత. ౪.౨.౩.౧౦-౧౧. వ్యాఖ్యాతః. ॥౨౨॥

అన్వయః :-ధర్మార్థకామమోక్షానిచ్ఛురహం హే ఇంద్ర సేనాపతే! త్వముపయామగృహీతో౽స్యతో బృహద్వతే వయస్వత ఇంద్రాయోక్థావ్యం త్వా త్వాం గృహ్ణామి. యత్ తే బృహత్ వయస్తస్మై తత్ పాలనాయ

విష్ణవే త్వా త్వాం గృహ్ణామి. ఏష సేనాధికారస్తే యోనిరస్తి ఉక్థేభ్యస్త్వా త్వాం దేవేభ్యో దేవావ్యం త్వా త్వాం యజ్ఞస్యాయుషే వర్ధనాయాపి గృహ్ణామి.॥౨౨॥

**భావార్థః**:-సర్వవేత్తా విద్వాన్ రాజ్యవ్యవహారే సైన్యవీరాణాం పాలనాయ సుశిక్షితం శస్త్రాస్త్ర పరమప్రవీణం యజ్ఞకర్మానుష్ఠాతారం వీరపురుషం సేనాపతిత్వేఽభియుంజీయాత్. సభాపతి సేనాపతీ పరస్పరానుమత్యా రాజ్యం యజ్ఞం చ వర్ధయేతామితి.॥౨౨॥

**పదార్థము** :-(ఇన్ద్ర) హే సేనాపతీ! నీవు (ఉపయామగృహీతః అసి) ఉత్తమనియమములతో విద్యనభ్యసించువాడవు. కావున నీ హేతువుచే (బృహద్వతే) శ్రేష్ఠమగు గొప్ప కర్మలు గలవాడును (వయస్వతే) దీర్ఘాయువుగలవాడును. (ఇన్ద్రాయ) పరమైశ్వర్యవంతుడగునట్టి సభాపతికై (ఉక్థావ్యమ్) ప్రశంసనీయ స్తోత్రమును, లేక విశేష శస్త్రవిద్య నెరిగియున్న (త్వా) నిన్ను (గృహ్ణామి) నేను గ్రహించునట్లు (యత్) ఏదైతే (తే) నీయొక్క (బృహత్) గొప్పదగు (వయః) జీవనము గలదో (తస్మై) దానిని పాలించుటకై (విష్ణవే) ఈశ్వరజ్ఞానము [వేదజ్ఞానము] నకై (త్వా) నిన్ను (గృహ్ణామి) స్వీకరించుచున్నాను (ఏషః) సైన్యముయొక్క ఈ యధికారము (తే యోనిః) నీవు స్థిరమగుటకు స్థానము. ఓ సేనాపతీ! (ఉక్థేభ్యః) ప్రశంసలు గల వేదకర్మలపై (త్వా) నిన్ను (దేవేభ్యః) విద్వాంసులకొరకు [దివ్యగుణములకొరకు] (దేవావ్యమ్) వానిని పాలనమొనర్చు (త్వా) నిన్ను (యజ్ఞస్య) రాజ్యపాలనాది వ్యవహారములను (ఆయుషే) వృద్ధి యొనర్చుటకై (గృహ్ణామి) గ్రహించుచున్నాను. ॥౨౨॥

**భావార్థము** :-సభాపతి, సేనాపతి పరస్పరము సంప్రదించుకొనుచు రాజ్యమును, యజ్ఞకార్యములను వృద్ధిపరచవలయును. రాజ్యవ్యవహారములందు సైన్యమునందలి వీరులను రక్షించుటకై చక్కని శిక్షాయుక్తుడును, శస్త్రాస్త్ర విద్యలందు గొప్ప ప్రవీణుడును యజ్ఞానుష్ఠాన మొనర్చువాడును నగు వీరవరుని సైన్యాధికారిగ నియుక్తమొనర్చుట సకలవిద్యాపారంగతులగు విద్వాంసులకు యోగ్యము.॥౨౨॥

22.O General, I appoint thee, well versed in knowledge, the doer of valorous deeds, advanced in age, full of dignity, expert in the knowledge of arms, as Commander-in-chief of the forces. I direct thee to lead a grand life. I advise thee to be God-fearing. The command of the army is thy foremost duty. I enjoin thee to preserve the interests of the state, to perform praiseworthy Vedic acts, cultivate and preserve noble qualities!.

౨౩-౨౬.మిత్రావరుణాభ్యాం త్వేత్యస్య చత్వారః కాశ్యప ఋషిః, విశ్వేదేవా దేవతాః, మిత్రావరుణాభ్యా మిత్యస్యానుష్టుప్, ఇంద్రాగ్నిభ్యామిత్యస్య ప్రాజాపత్యానుష్టుప్, ఇంద్రావరుణాభ్యామిత్యస్య స్వరాట్ సామ్న్యనుష్టుప్ ఛందాంసి, గాంధారః స్వరః, ఇంద్రాబృహస్పతిభ్యామిత్యస్య భురిగార్చీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః, ఇంద్రావిష్ణుభ్యామిత్యస్య భురిక్ సామ్న్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరశ్చ.

సర్వవిద్యాప్రవీణం సభాపతిం కుర్యాదిత్యుపదిశ్యతే.

సకలవిద్యాప్రవీణుని సభాపతిగా నొనర్చవలయునని ఇందుపదేశించబడినది.

౩౬౧. అప్స్వన్తరిత్యస్య బృహస్పతిర్ఋషిః, అశ్వో దేవతా, భురిగ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునః స్త్రీపురుషైః కథం భవితవ్యమిత్యాహ.

స్త్రీ పురుషు లన్యోన్యులై ఎట్లుండవలెనను దీ మంత్రమం దుపదేశించబడినది.

౩౬౧ అప్స్వన్తరమృతమప్సు భేషజమపాముత ప్రశస్తిష్వశ్వా భవత

వాజినః। దేవీ రాపో యో వ ఊర్మిః ప్రతూర్తిః కకున్మాన్

వాజసా స్తేనాయం వాజ౯ం సేత్।౬॥

ప.వి:- అప్స్విత్యప్ + సు, అంతః, అమృతమ్, అప్స్విత్యప్ + సు, భేషజమ్, అపామ్, ఉత, ప్రశస్తిష్వితి ప్ర+శస్తిషు, అశ్వాః, భవత, వాజినః, దేవీః, ఆపః, యః, వః, ఊర్మిః, ప్రతూర్తి రితి ప్ర + తూర్తిః, కకున్మానితి కకుత్ + మాన్, వాజసా ఇతి వాజ + సాః, తేన, అయమ్, వాజమ్, సేత్ ।౬॥

పదార్థః:-(అప్సు) ప్రాణేషు (అంతః) మధ్యే (అమృతమ్) మరణధర్మరహితమ్ కారణ మల్పమృత్యునివారకం వా (అప్సు) జలేషు (భేషజమ్) రోగనాశకమౌషధమ్ (అపామ్) ఉక్తానామ్ (ఉత) అపి (ప్రశస్తిషు) గుణానాం ప్రశంసాసు (అశ్వాః) వేగవంతః (భవత) (వాజినః) వాజః ప్రశస్తః పరాక్రమో బలం వా యేషాం తే (దేవీః) దివ్యగుణాః (ఆపః) అంతరిక్షే వ్యాప్తిశీలాః (యః) (వః) యుష్మాకమ్ (ఊర్మిః) ఆచ్ఛాదకస్తరంగః (ప్రతూర్తిః) ప్రకృష్టా తూర్ణగతిర్యస్య సః (కకున్మాన్) ప్రశస్తాః కకుతః లౌల్యా గుణా విద్యంతే యస్మిన్. అత్ర కకధాతోరౌణాదిక ఉతిః (వాజసాః) వాజన్ సంగ్రామాన్ సనంతి సంభజంతి యేన సః (తేన) (అయమ్) సేనాపతిః (వాజమ్) సంగ్రామమన్నం చ (సేత్) సంబంధ్నీయాత్. అయం మంత్రః. శత. ౫.౧. ౪-౬. వ్యాఖ్యాతః. ।౬॥

**అన్వయః** :-హే దేవీరాపో దేవా విద్వాంసశ్చ యూయం యో వః సముద్రస్య కకున్మాన్ వాజసాః ప్రతూర్తి రూర్మిరివ పరాక్రమోఽస్తి యదప్స్వంతరమృతమప్సు భేషజం చాస్తి యేనాయం వాజం సేత్ తేనాఽపాం ప్రశస్తిషు వాజినోఽశ్వా ఇవ భవత. ।౬॥

**భావార్థః** :- అత్ర వాచక లుప్తోపమాలంకారః. స్త్రియః సాగర ఇవ గంభీరా, జలమివ శాంతస్వభావా, వీరప్రసవాః, సదౌషధసేవిన్యో, జలాదిపదార్థాభిజ్ఞాః స్యురేవం యే పురుషా వాయుజలవేత్తృభిః సహ సంప్రయుంజతే తాస్తే చారోగాః సంతో విజయినశ్చ స్యుః. ॥౬॥

**పదార్థము** :- (దేవీః) ఓ దివ్యగుణవతీ! (ఆపః) అంతరిక్షమున వ్యాపకులైయున్నవారగు స్త్రీ పురుషులారా! (యః) ఏ (వః) మీయొక్క (సముద్రస్య) సాగరముయొక్క (కకున్మాన్) ప్రశస్త చంచలగుణములతోగూడ (వాజసాః) సంగ్రామములందు ప్రేరణ నిచ్చునదియు (ప్రతూర్తిః) అతి శీఘ్రముగ నడచు (ఊర్మి) సముద్రము నాచ్ఛాదన మొనర్చు తరంగములవంటి పరాక్రమము గలదో (అప్సు) ప్రాణముల (అన్తః) మధ్య (అమృతమ్) మరణధర్మములేని కారణము గలది గలదో (అప్సు) జలముల మధ్య అల్పమృత్యువు నుండి విముక్తపరచునదియు (భేషజమ్) రోగనివారకమునగు ఔషధమువంటి గుణముచే (అయమ్) ఈ సేనాపతి (వాజమ్) సమర మరియు ఆహారవ్యవస్థ నొనర్చు (తేన) దానిద్వారా (అపామ్) పై దెలిపిన ప్రాణముల మరియు జలముల (ప్రశస్తిషు) గుణప్రశంసలందు (వాజినః) ప్రశంసనీయ బలపరాక్రమములుగల (అశ్వా) ఉచ్చజాతి తురగములవలె వేగవంతములు (భవత) అగుగాక! ॥౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. స్త్రీలు సముద్రమువలె గంభీర స్వభావులు, జలములవలె శాంత స్వభావులు, వీరసంతాన ప్రసూతలు, చక్కని ఓషధులను సేవించువారు, జలములు మున్నగు పదార్థగుణములను బాగుగ నెరుగువారలునై యుండవలెను. ఇట్లే వాయుజలముల వంటి గుణశాలురగు పురుషులతో కాపురమొనర్చు స్త్రీపురుషులు సదా రోగరహితులు, విజయశీలురును అగుదురు. ॥౬॥

6.In control of breath lies longevity, in waters lies the healing medicine. Having realised the praiseworthy qualities of breath and water, grow thee fleet and strong.

O noble-minded wife and broad-minded husband may the commander of the army, the winner of battles, win the campaign, with your strength, forceful like the waves of the ocean and roaring like the fast sea!.

౩౬౩. వాతో వేత్యస్య బృహస్పతిర్ఋషిః, సేనాపతి ర్దేవతా, భురిగుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

మనుష్యాః కథం కిం కృత్వా వేగవంతో భవేయురిత్యాహ.

మానవులెట్లు వేగవంతులు కాగలుగుదు రను విషయమిందు చెప్పబడినది.

## ౩౬౩ వాతో వా మనో వా గంధర్వాః సప్త వింశతిః।
## తే అగ్రే౽శ్వ మయుంజంస్తే౽ అస్మిన్ జవ మాదధుః ॥౭॥

**ప.వి:- వాతః, వా, మనః, వా, గంధర్వాః, సప్తవింశతిరితి సప్త + వింశతిః, తే, అగ్రే, అశ్వమ్, అయుంజన్, తే, అస్మిన్, జవమ్, ఆ, అదధుః ॥౭॥**

**పదార్థః**:-(వాతః) వాయుః (వా) ఇవ (మనః) స్వాన్తమ్ (వా) ఇవ (గంధర్వాః) యే వాయవ ఇంద్రియాణి చ ధరంతి తే (సప్తవింశతిః) ఏతత్సంఖ్యాకాః (తే) (అగ్రే) (అశ్వమ్) వ్యాపకత్వవేగాదిగుణ సమూహమ్ (అయుంజన్) యుంజంతి (తే) (అస్మిన్) జగతి (జవమ్) వేగమ్ (ఆ) (అదధుః) అయం మంత్రః. శత. ౫.౧.౪-౮. వ్యాఖ్యాతః. ॥౭॥

**అన్వయః** :- యే విద్వాంసో వాతో వా మనో వా యథా సప్తవింశతిర్గంధర్వా అస్మిన్ జగత్యగ్రేఽశ్వమయుంజంస్తే ఖలు జవమాదధుః. ॥౭॥

**భావార్థః** :-యాన్యేకః సమష్టిర్వాయుః ప్రాణాఽపానవ్యానోదానసమాననాగకూర్మకృకలదేవదత్త ధనంజయా దశ ద్వాదశం మనః తత్సహచారితాని శ్రోత్రాదీని దశేంద్రియాణి పంచసూక్ష్మభూతాని చ మిలిత్వా సప్తవింశతిః, పూర్వమీశ్వరేణాస్మిన్ జగతి వేగవంతి నిర్మితాని య ఏతాని యథా గుణకర్మస్వభావం విజ్ఞాయ, యథాయోగ్యం కార్యేషు సంప్రయుజ్య, స్వస్త్రీభిరేవ సాకం రమంతే తేఽఖిలమైశ్వర్యం జనయిత్వా రాజ్యం కర్తుమర్హంతి. ॥౭॥

**పదార్థము** :- ఏ విద్వాంసులు (వాతః) వాయువు (వా) వంటి (మనః) మనస్సు (వా) వంటి వారైయుండి (సప్తవింశతిః) ఇరువదియేడు (గన్ధర్వాః) వాయువు, ఇన్ద్రియ భూతములను ధరించువారై (అస్మిన్) ఈ విశ్వమునందు (అగ్రే) ప్రథమముననే (అశ్వమ్) వ్యాపకత్వము మరియు వేగము మున్నగు గుణములను (అయుఞ్జన్) సంయుక్తపరచుచుందురో (తే) అట్టివారే (జవమ్) ఉత్తమ వేగమును (ఆదధుః) ధారణ మొనర్చుచుందురు. ॥౭॥

**భావార్థము**:- ఒకటి సమష్టివాయువు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన,సమాన, నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయ మను పదివాయువులు. పంద్రెండవది మనస్సు. దానితో నడచు శ్రోత్రములు మున్నగు పదిఇంద్రియములు, పంచసూక్ష్మభూతములు, మొత్త మీ ఇరువదేడు (౨౭) పదార్థములను పరమాత్మ ముందుగా ఈ జగత్తునందు సృష్టించినాడు. వీని గుణకర్మస్వభావములను చక్కగా నెరిగి యథాయోగ్య కార్యములందు సంయుక్త మొనర్చి తమతమ భార్యలతోనే కాపుర మొనర్చు పురుషులే సకలైశ్వర్యములను సమకూర్చుకొని రాజ్యమునకు అర్హు లగుచున్నారు. ॥౭॥

**7.The learned, who like the wind, mind and twenty seven articles, primarily harness swiftness in this world, may acquire alertness as well.**

౩౬౪. వాతరంహేత్యస్య బృహస్పతిర్ఋషిః, ప్రజాపతిర్దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

తం రాజానం విద్వాంసః కిం కిముపదిశేయురిత్యాహ.

ఆ రాజునకు విద్వాంసు లేమి యుపదేశించవలయున దీ మంత్రమున గలదు.

౩౬౪ వాతరంహా భవ వాజిన్యుజ్యమాన ఇంద్రస్యేవ దక్షిణః

శ్రియైధి। యుంజంతు త్వా మరుతో విశ్వవేదస ఆ తే త్వష్టా

పత్సు జవం దధాతు ॥౮॥

ప. విః-వాతరంహా ఇతి వాత+రంహాః, భవ, వాజిన్, యుజ్యమానః, ఇంద్రస్యేవేతీంద్రస్య + ఇవ, దక్షిణః, శ్రియా, ఏధి, యుంజంతు, త్వా, మరుతః, విశ్వవేదస ఇతి విశ్వ + వేదసః, ఆ, తే, త్వష్టా, పత్స్వితి పత్ + సు, జవమ్, దధాతు ॥ ౮ ॥

**పదార్థః**:-(వాతరంహాః) వాయువద్రంహో వేగో యస్య సః (భవ) (వాజిన్) శాస్త్రోక్తక్రియాకుశలతా బోధయుక్త (యుజ్యమానః) సమాహితః సన్ (ఇంద్రస్యేవ) యథా పరమైశ్వర్యయుక్తస్య రాజ్ఞః (దక్షిణః) దక్షః ప్రశస్తం బలం గతిర్విద్యతే యస్య తస్య (శ్రియా) శోభాయుక్తయా రాజ్యలక్ష్మ్యా దేదీప్యమానయా రాజ్ఞ్యా వా (ఏధి) వృద్ధో భవ (యుంజంతు) ప్రేరతామ్ (త్వా) త్వామ్ (మరుతః) విద్వాంసో మనుష్యాః (విశ్వవేదసః) సకలవిద్యావేత్తారః (ఆ) (తే) తవ (త్వష్టా) వేగాదిగుణ విద్యావిత్ (పత్సు) పాదేషు (జవమ్) వేగమ్ (దధాతు) అయం మంత్రః. శత. ౫.౧.౪-౯. వ్యాఖ్యాతః.॥౮॥

**అన్వయః**:-హే వాజిన్!యం త్వా విశ్వవేదసో మరుతో రాజ్యశిల్పకార్యేషు యుంజంతు. త్వష్టా తే తవ పత్సు జవమా దధాతు స త్వం వాతరంహా భవ. యుజ్యమాన స్త్వం దక్షిణ ఇంద్రస్యేవ శ్రియా సహైధి.॥౮॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. హే రాజ స్త్రీ పురుషా! యూయం నిరభిమానినో నిర్మత్సరా భూత్వా విద్వత్సంగేన రాజ్యధర్మం పాలయిత్వా విమానాదియానేషు స్థిత్వాఽభీష్టదేశేషు గత్వాఽగత్య జితేంద్రియాః సంతః ప్రజాః సతతం ప్రసాద్య శ్రీమంతో భవత.॥౮॥

**పదార్థము** :-(వాజిన్) శాస్త్రోక్త క్రియాకౌశల్యముల ప్రశస్త బోధయుక్తుడవగు ఓ రాజా! (త్వా) నిన్ను (విశ్వవేదసః) సకలవిద్యల నెరిగినవారు. (మరుతః) విద్వాంసులు రాజ్య శిల్పవిద్యాకార్యములందు (యుఞ్జన్తు) యుక్తపరతురు (త్వష్టా) వేగాది గుణముల నెరిగిన ఓ మానవా! (తే) నీయొక్క (పత్సు) పాదములందు

(జవమ్) వేగమును (ఆదధాతు) బాగుగా ధారణమొనర్చు మీరు (వాతరంహా౽రి) వాయువువంటి వేగవంతు లగుడు (యుజ్యమానః) సావధానులై (రక్షిణః) ప్రశంసించబడిన ధర్మముతో నడచు శక్తిచే (ఇన్ద్రస్య ఇవ) పరమైశ్వర్యవంతుడగు రాజవలె (శ్రియా) శోభాయుక్తమగు రాజ్యసంపదల సహితముగా (ఏధి) అభివృద్ధిని ప్రాప్తించుకొనుడు. ।౮॥

**భావార్థము :**-ఈ మంత్రమునం దుపమాలంకారము గలదు. రాజ్యసంబంధ స్త్రీ పురుషులారా! మీరు అభిమానమును వదలి మాత్సర్యములేనివారై ఇతరుల యున్నతిని జూచి ఆనందించువారలునై విద్వాంసులతో గూడ రాజధర్మమును బాగుగా రక్షించుడు. విమానములు మున్నగు యానముల నధిష్ఠించి మీరు కోరిన దేశములకు రాకపోకల నొనర్చుచు జితేంద్రియులై ప్రజలను నిరంతరము సంతుష్టులుగ, ప్రసన్నులుగ నుంచుచు శ్రీమంతు లగుడు.।౮॥

8.O well equipped and qualified king may the masters of all sciences harness thee to the work of administration and mechanical enterprises, may the expert in the science of velocity, put swiftness in thy feet! Be thou active like the wind.

Being ever wary, endowed with a religious bent of mind, like a powerful king, attain to greatness and glory, with splendid royal accomplishment.

౩౬౫. జవ ఇత్యస్య బృహస్పతిర్ఋషిః, వీరో దేవతా, ధృతిశ్ఛందః, ఋషభః స్వరః.

పునః స రాజా కీదృశో భవేదిత్యాహ.

ఆ రాజు ఎట్లుండవలసిన దీ మంత్రమం దుపదేశించబడినది.

౩౬౫ జవో యస్తే వాజిన్నిహితో గుహా యః శ్యేనే పరీత్తోఽ అచరచ్చ వాతే।
తేన నో వాజి న్బలవా న్బలేన వాజజిచ్చ భవ సమనే చ పారయిష్ణుః।
వాజినో వాజజితో వాజఀ౯సరిష్యంతో బృహస్పతేర్భాగమవజిఘ్రత ।౯॥

ప.వి:- జవః, యః, తే, వాజిన్, నిహిత ఇతి ని+హితః, గుహా, యః, శ్యేనే, పరీత్తః, అచరత్, చ, వాతే, తేన, నః, వాజిన్, బలవానితి బల+వాన్, బలేన, వాజజిదితి వాజ+జిత్, చ, భవ, సమనే, చ, పారయిష్ణుః, వాజినః, వాజజిత ఇతి వాజ+జితః, వాజమ్, సరిష్యంతః, బృహస్పతేః, భాగమ్, అవ, జిఘ్రత ।౯॥

**పదార్థః** :-(జవః) వేగః (యః) (తే) తవ (వాజిన్) ప్రశస్తశాస్త్రయోగాభ్యాసకృత్యసహిత (నిహితః) స్థితః (గుహా) గుహాయాం బుద్ధౌ (యః) వేగః (శ్యేనే) పక్షిణీవ (పరీత్తః) సర్వతో దత్తః (అచరత్) చరతి (చ)(వాతే) వాయావివ (తేన) (నః) అస్మాకమ్ (వాజిన్) వేగవన్ (బలవాన్) బహుబలయుక్తః (బలేన) సైన్యేన పరాక్రమేణ వా (వాజజిత్) సంగ్రామం విజయమానః (చ) (భవ) (సమనే) సంగ్రామే (చ) (పారయిష్ణుః) దుఃఖాత్పారయితా (వాజినః) ప్రశస్తవేగయుక్తాః (వాజజితః) సంగ్రామం జయంతః (వాజమ్) బోధమన్నాదికం వా (సరిష్యంతః) ప్రాప్స్యంతః (బృహస్పతేః) మహతాం వీరాణాం పాలయితుః సేనాధ్యక్షస్య (భాగమ్) సేవనమ్ (అవ) అధోఽర్థే (జిఘ్రత) సుగంధాన్ బోధాన్ వా గృహ్ణీత. అయం మంత్రః. శత, ౫.౧.౪-౧౦. వ్యాఖ్యాతః.॥౯॥

**అన్వయః** :-హే వాజిన్ సేనాధ్యక్ష రాజన్! తే తవ యో జవో గుహా నిహితో, యః శ్యేనే ఇవ పరీత్తో వాతే ఇవాచరచ్చ తేన నో బలేన బలవాన్ భవ. హే వాజిన్! తేన చ సమనే పారయిష్ణుర్వాజజిచ్చ భవ. హే వాజినో యోద్ధారో! యూయం బృహస్పతేః సేవనం ప్రాప్య వాజం సరిష్యంతః సంతో భవత. సుగంధానవజిఘ్రత. ॥౯॥

**భావార్థః**:-అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. రాజా పూర్ణం శరీరాత్మబలం సంప్రాప్య శ్యేనవద్వాయువచ్ఛత్రువిజయే యశస్వీ భూత్వా స్వమాత్యాన్ సేనాస్థాన్ సర్వాన్ భృత్యాంశ్చ సుశిక్షితాన్ బలసుఖయుక్తాన్ ధార్మికాన్ సతతం రక్షేత్. సర్వే రాజప్రజాజనాః శత్రూన్ విజిత్య పరస్పరం ప్రీణంతు. ॥౯॥

**పదార్థము** :-(వాజిన్) ఉత్తమ శాస్త్రబోధ మరియు యోగాభ్యాసములచే యుక్తమగు సేనాపతి, సభాపతియైన ఓ రాజా! (తే) నీయొక్క (యః జవః) వేగవంతమగు (గుహా) ఏ బుద్ధియందు (నిహితః) స్థిరమైయున్న (యః) ఎయ్యది (శ్యేనే) పక్షియందువలె (పరీత్తః) అన్నిదిశలనుండి ప్రాప్తమైయున్న (చ) మరియు ఎట్లు (వాతే) వాయువునందు (అచరత్) విహరించుచున్న (తేన) దానిచేతను (నః) మాయొక్క (బలేన) సైన్య పరాక్రమములతోను (బలవాన్) మహాబలశాలురు (భవ) అగుడు (వాజిన్) వేగవంతుడవగు రాజపురుషా! ఆ నీ బలముతో (సమనే) సంగ్రామములందు (పారయిష్ణుః) దుఃఖములనుండి తరించువారు (వాజజిత్) సంగరములందు విజయమును పొందువారును అగుడు (వాజినః) ప్రశంసనీయ వేగముతోగూడిన యోధులారా! మీరు (బృహస్పతేః) విద్వాంసులను, సకలప్రజలను రక్షించు సభాధ్యక్షుని (భాగమ్) సేవను పొంది (వాజమ్) బోధను, అన్నము మున్నగు పదార్థములను (సరిష్యంతః) ప్రాప్తించుకొనుచు (వాజజితః) సమరములందు విజయవంతు లగుడు. మరియు సుగంధపదార్థములను (అవజిఘ్రత) సేవించుడు. ॥౯॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. శరీర ఆత్మల బలములను సంపూర్ణముగ పొంది శత్రువులను జయించుటయందు శ్యేనపక్షి మరియు వాయువులవలె శీఘ్రకారియై తన సభాసదులను, సైనికులను, సకల రాజపురుషులను, భృత్యులను సుశిక్షితులుగ నొనర్చి ధర్మాత్ములను నిరంతరము రక్షించుట రాజున కుచితకర్తవ్యమై యున్నది. మరియును రాజు ప్రజలు పరస్పరము ఏక మనస్సుతో శత్రువులను జయించి ప్రసన్నులుగా నుండి సౌఖ్యముల ననుభవించవలయును.॥౯॥

9.O king, the swiftness laid in thee in secret, resembles the swiftness granted to a falcon, and the swiftness found in air. Be thou pwerful for us, with that swiftness and army. Be thou the winner of battles, and our saviour through war!.

O nice, brave soldiers, serve your commander, acquire wisdom and food, win battles, and enjoy fragrant substances!.

3౬౬. దేవస్యాహమిత్యస్య బృహస్పతిర్ఋషిః, ఇంద్రాబృహస్పతీ దేవతే, విరాడుత్కృతిశ్ఛందః, షడ్జః స్వరః.

మనుష్యైర్విదుషామేవాఽనుకరణం కార్యం న మూఢానామిత్యుపదిశ్యతే.

మానవులు విద్వాంసుల ననుకరించవలయునే గాని మూర్ఖుల ననుకరించవల దని ఈ మంత్రమున ఉపదేశించబడినది.

3౬౬ దేవస్యాహ౯ సవితుః సవే సత్యసవసో బృహస్పతే రుత్తమం నాక౯ రుహేయమ్। దేవస్యాహ౯ సవితుః సవే సత్యసవస ఇంద్రస్యోత్తమం నాకఌరుహేయమ్। దేవస్యాహ౯ సవితుః సవే సత్య ప్రసవసో బృహస్పతే రుత్తమం నాకమరుహమ్। దేవస్యాహ౯ సవితుః సవే సత్యప్రసవసఽ ఇంద్రస్యోత్తమం నాకమరుహమ్ ॥౧౦॥

ప.వి:- దేవస్య, అహమ్, సవితుః, సవే, సత్యసవస ఇతి సత్య+సవసః, బృహస్పతేః, ఉత్తమమిత్యుత్+తమమ్, నాకమ్, రుహేయమ్, దేవస్య, అహమ్, సవితుః, సవే, సత్యసవస ఇతి సత్య + సవసః, ఇంద్రస్య ఉత్తమమిత్యుత్ + తమమ్, నాకమ్, రుహేయమ్, దేవస్య, అహమ్, సవితుః, సవే, సత్యప్రసవస ఇతి సత్య + ప్రసవసః, బృహస్పతేః, ఉత్తమమిత్యుత్ + తమమ్, నాకమ్, అరుహమ్, దేవస్య, అహమ్, సవితుః, సవే, సత్యప్రసవస ఇతి సత్యప్రసవసః, ఇంద్రస్య, ఉత్తమమిత్యుత్ + తమమ్, నాకమ్, అరుహమ్ ॥౧౦॥

**పదార్థః**:-(దేవస్య) సర్వతః ప్రకాశమానస్య (అహమ్) సభాధ్యక్షో రాజా (సవితుః) సకల జగత్ప్రసవితుః పరమేశ్వరస్య (సవే) ప్రసూతే జగతి (సత్యసవసః) సత్యం సవ ఐశ్వర్యం జగతః కారణం కార్యం చ యస్య తస్య (బృహస్పతేః) బృహతాం ప్రకృత్యాదీనాం పాలకస్య (ఉత్తమమ్) సర్వథోత్కృష్టమ్. (నాకమ్) అవిద్యమానదుఃఖం సర్వసుఖయుక్తం సచ్చిద్రూపం మోక్షపదమ్ (రుహేయమ్) (దేవస్య) సర్వసుఖప్రదాతుః (అహమ్) పరోపకారీ (సవితుః) సకలైశ్వర్యప్రసవితుః (సవే) ఐశ్వర్యే (సత్యసవసః) సత్యన్యాయయుక్తస్య (ఇంద్రస్య) పరమైశ్వర్యసహితస్య సమ్రాజః (ఉత్తమమ్) ప్రశస్తం (నాకమ్) అవిద్యమానదుఃఖం భోగమ్ (రుహేయమ్) (దేవస్య) అఖిలవిద్యాశుభగుణకర్మస్వభావద్యోతకస్య (అహమ్) విద్యామభీప్సుః (సవితుః) సమగ్రవిద్యాబోధ ప్రసవితుః (సవే) విద్యాప్రచారైశ్వర్యే (సత్యప్రసవసః) సత్యోఽవినాశీ ప్రసవః ప్రకటో బోధోయస్మాత్తస్య (బృహస్పతేః) బృహత్యా వేదవాణ్యా పాలకస్య (ఉత్తమమ్) (నాకమ్) సర్వదుఃఖప్రణాశక మానందమ్ (అరుహమ్) ఆరూఢోఽస్మి (దేవస్య) ధనుర్వేదాదియుద్ధవిద్యా ప్రాపకస్య (అహమ్) యోద్ధా (సవితుః) శత్రువిజయ ప్రసవితుః (సవే) ప్రేరణే (సత్యప్రసవసః) సత్యానాం న్యాయవిజయాదీనాం ప్రసవో యస్మాత్ తస్య (ఇంద్రస్య) దుష్టశత్రు విదారకస్య (ఉత్తమమ్) విజయాఖ్యమ్ (నాకమ్) సర్వసుఖప్రదం (అరుహమ్) ఆరూఢోఽస్మి. అయం మంత్రః. శత.౫.౧.౫.౨-౪. వ్యాఖ్యాతః.॥౧౦॥

**అన్వయః** :-హే ప్రజారాజజనాః యథాఽహం సత్యసవసో దేవస్య బృహస్పతేః సవితుర్జగదీశ్వరస్య సవ ఉత్తమం నాకం రుహేయమ్. హే రాజామాత్యపురుషాః యథాఽహం సత్యసవసో దేవస్య సవితురింద్రస్య సమ్రాజః సవ ఉత్తమం నాకం రుహేయమ్. హే అధ్యేతాధ్యాపకా విద్యాప్రియా జనాః! యథాఽహం సత్యప్రసవసః సవితు ర్దేవస్య బృహస్పతేరుత్తమం నాకమరుహమ్. హే విజయాభికాంక్షిణో యోద్ధారో వీరాః! యథాఽహం సత్యప్రసవసో దేవస్య సవితురింద్రస్య సవ ఉత్తమం నాకమరుహం తథా యూయమప్యా రోహత. ॥౧౦॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. రాజప్రజాజనైః పరస్పరమవిరోధేనేశ్వరచక్రవర్తి రాజ్యసమగ్రవిద్యాః సంభజ్య సర్వాణ్యుత్తమాని సుఖాని ప్రాప్తవ్యాని ప్రాపయితవ్యాని చ.॥౧౦॥

**పదార్థము** :-ఓ ప్రజలారా! (అహమ్) సభాధ్యక్షుడను రాజును నే నెట్లు (సత్యసవసః) సత్యమైన ఐశ్వర్యము, జగత్కారణములు గలవాడను (దేవస్య) సకలదిశలందు ప్రకాశమానుడను (బృహస్పతే) ప్రకృతి మున్నగు మహాపదార్థముల రక్షకుడను (సవితుః) సమస్త జగదుత్పాదకుడునగు జగదీశ్వరునిచే (సవే) సృష్టింపబడిన ప్రపంచమునందు (ఉత్తమమ్) సర్వోత్తమము (నాకమ్) సర్వదుఃఖరహితమునగు సచ్చిదానంద స్వరూపమునందు (రుహేయమ్) ఆరూఢుడ నగుదునో, ఓ రాజసభాసదులారా! (అహమ్) పరోపకారినగు నే నెట్లు (సత్యసవసః) సత్యన్యాయయుక్తుడను (దేవస్య) సకల సుఖప్రదుడు (సవితుః) సంపూర్ణైశ్వర్యముల నుత్పన్నమొనర్చువాడు (ఇంద్రస్య) పరమైశ్వర్యవంతుడగు చక్రవర్తిరాజుయొక్క (సవే) ఐశ్వర్యములందు (ఉత్తమమ్ నాకమ్) ప్రశంసనీయ, దుఃఖరహితములగు భోగములను పొంది (రుహేయమ్) ఆరూఢుడ

నగుదునో, అధ్యాపక, అధ్యయన విద్యాప్రియులారా! (అహమ్) విద్యనభ్యసించువాడనగు నే నెట్లు (సత్య ప్రసవసః) అవినాశియగు సృష్టిబోధను గలిగించువాడను (దేవస్య) సంపూర్ణ విద్యలచేతను, శుభగుణ కర్మస్వభావముల ప్రకాశముతో గూడినవాడను(సవితుః) సమగ్ర విద్యాబోధనుత్పన్నమొనర్చువాడను (బృహస్పతేః) ఉత్తమ వేదవాణిని రక్షించువాడను, సాంగోపాంగముగ వేదముల పారదర్శినగువాడను(సవే) ఉత్పన్నమొనర్చిన విజ్ఞానమున (ఉత్తమమ్) సర్వోత్తమమైన (నాకమ్) సమస్త దుఃఖరహితమగు ఆనందమున (అరుహమ్) ఆరూఢుడనై యుందునో, ఓ విజయాకాంక్షులారా! (అహమ్) మహాయోధనగు నే నెట్లు (సత్యప్రసవసః) సత్య, న్యాయ, వినయ, విజయములు మున్నగువాని యుత్పన్నకర్తను (దేవస్య) ధనుర్వేద యుద్ధవిద్యా ప్రకాశకుడను (సవితుః) శత్రువును జయించుటకై ప్రేరేపించువాడను (ఇన్ద్రస్య) దుష్ట శత్రువులను నాశపరచువాని (సవే) ప్రేరణయందు (ఉత్తమమ్) ఉత్తమమగు విజయమును (నాకమ్) సర్వ సౌఖ్యములనిచ్చు సంగ్రామమునందు (అరుహమ్) నే నారూఢుడనగునట్లు మీరును అగుడు.॥౧౦॥

**భావార్థము** :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. రాజు మరియు ప్రజలెల్లరును పరస్పర ద్వేషవిరోధములను వదలి పరమేశ్వరుని, చక్రవర్తిరాజ్యమును, సకలవిద్యలను సేవించి సర్వోత్తమ సుఖముల ననుభవించుచు ఇతరులకు అనుభవించు అవకాశము గలిగించవలెను. ॥౧౦॥

10.May I realise in this world, the nature of God free from pain and full of delight; Who is lustrous, and Generator of the universe. Whose cause and effect of the universe are true; Who nourishes all material objects, and is most high. May I rise, through the prosperity, and excellent gifts of the king, the creator of riches, the giver of comforts, and dispenser of justice.

May I rise through the highest pleasure I obtain from the knowledge imparted by my learned preceptor, the giver of imperishable knowledge, the embodiment of noble attributes and actions; and the encyclopaedia of learning.

May I rise through the victory-giving battle, and the persuasion of the commander, the subduer of wicked foes, the inciter to victory over opponents. the expert in the science of military warfare, the dispenser of justice and full of humility.

౩౬౭. బృహస్పత ఇత్యస్య బృహస్పతి ఋషిః, ఇంద్రాబృహస్పతీ దేవతే, జగతీ ఛందః, నిషాదః స్వరః.

అథోపదేష్టృవిధిమాహ.

ఉపదేశకుల, శ్రోతల విషయ మీ మంత్రమం దుపదేశించబడినది.

౩౬౭ బృహస్పతే వాజం జయ బృహస్పతయే వాచం వదత బృహస్పతిం

వాజం జాపయత। ఇంద్ర వాజం జయేంద్రాయ వాచం

వదతేంద్రం వాజం జాపయత ॥౧౧॥

ప. వి:- బృహస్పతే, వాజమ్, జయ, బృహస్పతయే, వాచమ్, వదత, బృహస్పతిమ్, వాజమ్, జాపయత, ఇంద్ర, వాజమ్, జయ, ఇంద్రాయ, వాచమ్, వదత, ఇంద్రమ్, వాజమ్, జాపయత ॥౧౧॥

**పదార్థః** :-(బృహస్పతే) సకలవిద్యాప్రచారకోపదేశక! (వాజమ్) విజ్ఞానం సంగ్రామం వా (జయ) (బృహస్పతయే) అధ్యయనాధ్యాపనాభ్యాం విద్యాప్రచార రక్షకాయ (వాచమ్) వేదసుశిక్షాజనితాం వాణీమ్. (వదత) అధ్యాపయతోపదిశత వా (బృహస్పతిమ్) సమ్రాజమనూచానమధ్యాపకం వా (వాజమ్) విద్యాబోధం యుద్ధం వా (జాపయత) ఉత్కర్షేణ బోధయత (ఇంద్ర) విద్యైశ్వర్యప్రకాశకశత్రువిదారక వా (వాజమ్) పరమైశ్వర్యం శత్రువిజయాఖ్యం యుద్ధం వా (జయ) ఉత్కర్ష (ఇంద్రాయ) పరమైశ్వర్య ప్రాపకాయ (వాచమ్) రాజధర్మ ప్రచారిణీం వాణీమ్ (వదత) (ఇంద్రమ్) (వాజమ్) (జాపయత) ఉత్కృష్టతాం ప్రాపయత. అయం మంత్రః శత. ౫.౧.౫.౮-౯ వ్యాఖ్యాతః. ॥౧౧॥

**అన్వయః** :-హే బృహస్పతే! సర్వవిద్యాధ్యాపకోపదేశక వా త్వం వాజం జయ. హే విద్వాంసో! యూయమస్మై బృహస్పతయే వాచం వదతేమం బృహస్పతిం వాజం జాపయత. హే ఇంద్ర త్వం వాజం జయ. హే యుద్ధవిద్యాకుశలా విద్వాంసో! యూయమస్మా ఇంద్రాయ వాచం వదతేమమీంద్రం వాజం జాపయత. ॥౧౧॥

**భావార్థః** :-అత్రశ్లేషాలంకారః. రాజా తథా ప్రయతేత యథావేదవిద్యాప్రచారః శత్రువిజయశ్చ సుగమః స్యాత్. ఉపదేశకా యోద్ధారశ్చేత్థం ప్రయతేరన్ యతో రాజ్యే వేదాదిశాస్త్రాధ్యయనాఽధ్యాపనప్రవృత్తిః స్వరాజా విజయాలంకృతో భవేద్యేన ధర్మబుద్ధిరధర్మహానిశ్చ సుతిష్ఠేత్. ॥౧౧॥

**పదార్థము** :-(బృహస్పతే) పూర్ణవిద్యల ప్రచారము మరియు ఉపదేశములొనర్చు రాజపురుషులారా! మీరు (వాజమ్) విజ్ఞానము, లేక సంగ్రామమునందు (జయ) జయమునొందు విద్వాంసులారా! మీరు (బృహస్పతయే) ఈ రాజపురుషునకు (వాచమ్) వేదోక్తశిక్షణచే ప్రసిద్ధమైన వాణిని (వదత) ఉపదేశించుడు, చదివించుడు. (బృహస్పతిమ్) ఇట్టి ఉత్తమ అధ్యాపనను (వాజమ్) విద్యాబోధనను (జాపయత) వృద్ధిపరచుడు. లేక ఈ రాజునకు సమరమున జయముకలిగేటందుకు నడుముకట్టుడు. (ఇన్ద్ర) విద్య, ఐశ్వర్యములను ప్రకాశింపజేయు, శత్రువుల నాశమొందించు రాజపురుషా! (వాజమ్) పరమైశ్వర్యమును, లేక శత్రువుల విధ్వంసపరచు రణమును (జయ) జయించుము. యుద్ధవిద్యలందు కుశలురగు విద్వాంసులారా! మీరు (ఇన్ద్రాయ) పరమైశ్వర్యవంతుడగు ఈ రాజపురుషునకు (వాచమ్) రాజధర్మమును బోధించు వేదవాణిని (వదత) చెప్పుడు. (ఇన్ద్రమ్) ఈ రాజపురుషునకు (వాజమ్) సంగ్రామమునందు (జాపయత) జయమును సంప్రాప్తింపజేయుడు. ॥౧౧॥

**భావార్థము** :- ఈ మంత్రమందు శ్లేషాలంకారము గలదు. వేదవిద్యాప్రచారము, శత్రువులపై విజయము సుగమమగునట్లు రాజు ప్రయత్నమొనర్చవలెను. రాజ్యమందు వేదాది సచ్ఛాస్త్రముల అధ్యయనాధ్యాపనములు చక్కగా జరిగి, అధర్మము నశించి ధర్మవృద్ధి చక్కగా స్థిరపడునట్లు, తమరాజు విజయముపొందునట్లు ఉపదేశకులు, యోధులు ప్రజలెల్లరును ప్రయత్నించవలెను. ॥౧౧॥

11.O preacher, acquire knowledge. Let the learned speak to thee the ennobling language of the vedas. may they impart knowledge to the instructor!.

O king win the battle. May the learned speak to thee the language of the duty of kingship, and bring victoy to thee!.

౩౬౮. ఏషా వ ఇత్యస్య బృహస్పతిరృషిః, ఇంద్రాబృహస్పతీ దేవతే, స్వరాడతిధృతి శ్ఛందః, షడ్జః స్వరః.

అథ మనుష్యైః సర్వదా సర్వథా సత్యం వక్తవ్యం శ్రోతవ్యం చేత్యాహ.

సదా సత్యమునే భాషించుట, వినుట మానవుల కర్తవ్యంతోచిత మని చెప్పబడినది.

౩౬౮ ఏషా వః సా సత్యా సంవాగభూద్యయా బృహస్పతిం వాజమజీజపతాజీజపత బృహస్పతిం వాజం వనస్పతయో విముచ్యధ్వమ్। ఏషా వః సా సత్యా సంవాగభూద్యయేంద్రం వాజమజీజపతాజీజపతేంద్రం వాజం వనస్పతయో విముచ్యధ్వమ్ ॥౧౨॥

**ప.వి:**- ఏషా, వః, సా, సత్యా, సంవాగితి సమ్+వాక్, అభూత్, యయా, బృహస్పతిమ్, వాజమ్, అజీజపత, అజీజపత, బృహస్పతిమ్, వాజమ్, వనస్పతయః, వి, ముచ్యధ్వమ్, ఏషా, వః, సా, సత్యా, సంవాగితి, సమ్ + వాక్, అభూత్, యయా, ఇంద్రమ్, వాజమ్, అజీజపత, అజీజపత, ఇంద్రమ్, వాజమ్, వనస్పతయః, వి, ముచ్యధ్వమ్ ॥౧౨॥

**పదార్థః**:-(ఏషా) ఉక్తా వక్ష్యమాణా చ (వః) యుష్మాకమ్ (సత్యా) యథార్థోక్తా (సంవాక్) రాజనీతినిష్ఠా సమ్యగ్వాణీ (అభూత్) భవతు (యయా) (బృహస్పతిమ్) వేదశాస్త్రపాలకమ్ (వాజమ్) వేదశాస్త్రబోధమ్ (అజీజపత) ఉత్కర్షయత (అజీజపత) (బృహస్పతిమ్) బృహతో రాజ్యస్య పాలకమ్

(వాజమ్) సంగ్రామమ్ (వనస్పతయః) వనస్య కిరణసమూహస్యేవ న్యాయస్య పాలకాః. వనమితి రశ్మి నా... నిఘం..౧.౫. (వి) (ముచ్యధ్వమ్) ముక్తా భవత. వికరణవ్యత్యయేన శ్యన్ (ఏషా) పూర్వాపరప్రతిపాదితా (వః) యుష్మాకమ్ (సా) (సత్యా) సత్యభాషణయుక్తా (సంవాక్) వినయపురుషార్థయోః సమ్యక్ ప్రకాశినీ వాణీ (అభూత్) భవేత్ (యయా) (అజీజపత) జాపయత. (అజీజపత) సమ్యక్ ప్రాపయత (ఇంద్రమ్) పరమైశ్వర్యవతే పురుషాయ (వాజమ్) యుద్ధమ్ (ఇంద్రమ్) పరమైశ్వర్యయుక్తముత్తమ శ్రీప్రాపకముద్యోగమ్ (వాజమ్) వేగయుక్తమ్ (వనస్పతయః) వనానాం జంగలానాం పాలకాః (వి) (ముచ్యధ్వమ్) అయం మంత్రః. శత.౫.౧.౫.౧౧.౧౨. వ్యాఖ్యాతః. ॥౧౨॥

**అన్వయః**:-హే వనస్పతయో! యూయం యయా బృహస్పతిం వాజమజీజపత. బృహస్పతి మజీజపత, సైషా వః సంవాక్ సత్యాఽభూత్. హే వనస్పతయో! యూయం యయేంద్రం వాజమజీ జపతేంద్ర మజీజపత సైషా వః సంవాక్ సత్యాఽభూత్.॥౧౨॥

**భావార్థః**:- నైవ కదాచిదపి రాజా రాజాఽమాత్యభృత్యాః ప్రజాజనాశ్చ స్వకీయాం ప్రతిజ్ఞాం వాచం చాసత్యాం కుర్యుః. యావతీం బ్రూయు స్తావతీం తథ్యామేవ కుర్యుః. యస్య వాణీ సర్వదా సత్యాఽస్తి స ఏవ సమ్రాట్ భవితుమర్హతి. యావదేవం న భవతి తావద్రాజప్రజాజనా విశ్వసితాః సుఖస్యోత్కర్షకాశ్చ భవితుం నార్హంతి. ॥౧౨॥

**పదార్థము** :-(వనస్పతయః) కిరణములవలె న్యాయపాలనమొనర్చు నో రాజపురుషులారా! మీరు (యయా) ఎద్దానిచే (బృహస్పతిమ్) వేదశాస్త్రపాలకుడగు విద్వాంసుని (వాజమ్) వేదశాస్త్రబోధను (అజీజపత) వృద్ధిచేయుదురో (బృహస్పతిమ్) మహారాజ్య రక్షకుడగు రాజపురుషునకు సంగ్రామములందు (అజీజపత) జయమును గలిగింపజేయుదురో (సా ఏషా) మొదటచెప్పిన, తరువాత చెప్పబోవు (వః సంవాక్) రాజనీతియుక్తమగు ఈ వాణి (సత్యా) సత్యస్వరూపము (అభూత్) అగును గాక! (వనస్పతయః) సూర్యకిరణములవలె న్యాయప్రకాశమొనరించి ప్రజలను పాలించు రాజపురుషులారా! మీరు (యయా) ఎద్దానిచే (ఇన్ద్రమ్) పరమైశ్వర్యముల ప్రాప్తింపజేయు సేనాపతికి (వాజమ్) యుద్ధములందు (అజీజపత) జయమును గలిగింపజేయుదురో (ఇన్ద్రమ్) మహదైశ్వర్యశాలియగు వానికి (వాజమ్) అత్యంత ఉత్తమమగు లక్ష్మిని ప్రాప్తిగలిగించు ఉద్యమమునందు (అజీజపత) ఉత్తమముగా ప్రయత్నింతురో (సా, ఏషా) ముందు వెనుకల ప్రతిపాదితమగు (వః సం వాక్) మీ వినయ పురుషార్థములను చక్కగా ప్రకాశపరచు మీ వేదవాణి (సత్యా) ఎల్లప్పుడును సత్యభాషణములు మున్నగు లక్షణములతో గూడినది (అభూత్) అగుగాక!॥౧౨॥

**భావార్థము** :-ఎప్పుడును తన ప్రతిజ్ఞలను వమ్ము చేయవలదు. చెప్పినదెల్లను చేసివేయవలయును. ఇది ఒక రాజునకే గాక రాజపురుషులకు, ప్రజల కెల్లరకును ఉచితమైయున్నది. సదా సత్యవాణిగల మానవుడు సమ్రాట్టు అగుటకు యోగ్యుడగును. ఇట్లుగాకున్న రాజా, రాజపురుషులు మరియు ప్రజలెల్లరును విశ్వమునందు సుఖముల నభివృద్ధిపరచజాలరు. ॥౧౨॥

12.O guardians of justice, advance thereby the knowledge of the Vedas, and the learned who protect them, bring victory to the king in the battle!.

May ye be free in speech. O guardians of justice, bring thereby like the sun's beams victory to your commander in the battle. May ye grant to your king success in wealth-producing pursuit. May this your utterance of statesmanship be true. May ye be free in speech!.

౩౯. దేవస్యాహమిత్యస్య బృహస్పతిరృషిః, సవితా దేవతా, జగతీ ఛందః, నిషాదః స్వరః.

రాజపురుషైర్ధార్మికజనానామనుకరణం కర్తవ్యం నేతరేషామిత్యాహ.

రాజపురుషులు ధర్మాత్ములగు వారినే యనుసరించవలయును.

కాని ఇతర తుచ్ఛబుద్ధుల ననుకరించకూడదని ఇందుపదేశించబడినది.

౩౯ దేవస్యాహꣳ సవితుః సవే సత్యప్రసవసో బృహస్పతేర్వాజజితో

వాజం జేషమ్। వాజినో వాజజితోఽధ్వన స్కభ్నువంతో

యోజనామిమానాః కాష్ఠాంగచ్ఛత ॥౧౩॥

ప.వి:- దేవస్య, అహమ్, సవితుః, సవే, సత్యప్రసవస ఇతి సత్య + ప్రసవసః, బృహస్పతేః, వాజజిత ఇతి వాజ + జితః, వాజమ్, జేషమ్, వాజినః వాజజిత ఇతి వాజ + జితః, అధ్వనః, స్కభ్నువంతః, యోజనాః, మిమానాః, కాష్ఠామ్, గచ్ఛత ॥౧౩॥

పదార్థః :-(దేవస్య) సర్వప్రకాశకస్య జగదీశ్వరస్య (అహమ్) శరీరాత్మబలయుక్తః సేనాపతిః (సవితుః) సకలైశ్వర్యప్రదస్య (సవే) ఉత్పాదితేఽస్మిన్నైశ్వర్యే (సత్యప్రసవసః) సత్యాని ప్రసవాంసి జగత్స్థాని కారణరూపేణ నిత్యాని యస్య తస్య (బృహస్పతేః) వేదవాణ్యాః పాలకస్య (వాజజితః) సంగ్రామం విజయమానస్య (వాజమ్) సంగ్రామమ్ (జేషమ్) జయేయమ్. లోడుత్తమైకవచనే ప్రయోగః. (వాజినః) విజ్ఞానవేగయుక్తాః (వాజజితః) సంగ్రామం జేతుం శీలాః (అధ్వనః) శత్రోర్మార్గాన్ (స్కభ్నువంతః) ప్రతిష్టంభనం కుర్వంతః (యోజనా) యోజనాని బహూన్ క్రోశాన్ (మిమానాః) శత్రూన్ ప్రక్షేపమాణాః (కాష్ఠామ్) దిశమ్ (గచ్ఛత). అయం మంత్రః శత. ౫.౧.౫.౧౫-౧౭ వ్యాఖ్యాతః ॥౧౩॥

**అన్వయః:-** హే వీరాః! యథాఽహం సత్యప్రసవసః సవితుర్దేవస్య వాజజితో బృహస్పతేః సవే వాజం జేషం తథా యూయమపి జయత. హే వాజినో వాజజితో జనాః యథా యూయం యోజనా మిమానా అధ్వనః స్కభ్నువంతః కాష్ఠాం గచ్ఛత తథా వయమపి గచ్ఛేమ.॥౧౩॥

**భావార్థః:-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. యోద్ధారః సేనాఽధ్యక్షసహాయపాలనాభ్యామేవ శత్రూన్ జేతుం శక్నువంతి. శత్రూణాం మార్గాన్ ప్రతిబద్ధుం చ ప్రభవంతి. యస్యాం దిశి శత్రవో వికుర్వతే తత్ర తాన్ వశం నయేయుః. ॥౧౩॥

**పదార్థము :-** ఓ వీరపురుషులారా! ఎట్లు (అహమ్) నేను శరీరాత్మల బలముచే పూర్ణముగు సేనాపతిని (సత్యప్రసవసః) నిత్యములగు కారణరూప పదార్థములతో గూడ జగత్తును రచించినవాడు (సవితుః) సకలైశ్వర్యదాత (దేవస్య) సమస్తమును ప్రకాశ పరచువాడు (వాజజితః) విజ్ఞానము మున్నగు వానిచే శ్రేష్ఠుడు (బృహస్పతేః) ఉత్తమ వేదజ్ఞాన సంరక్షకుడగు పరమేశ్వరునిచే (సవే) ఉత్పన్నమైనదర్పబడిన ఈ యైశ్వర్యమునందు (వాజమ్) సంగ్రామమును (జేషమ్) నేను జయించునటులనే మీరును అందు విజయమును పొందుడు. (వాజినః) విజ్ఞానరూపముచే వేగవంతులగు (వాజజితః) రణవిజేతలారా! మీరు (యోజనా) అనేక యోజనము [ఆమడు]ల దూరమందున్న శత్రువుల యునికిని (మిమానాః) కనుగొనుచు (అధ్వనః) శత్రుమార్గముల నిరోధించుచు మీ రెట్లు (కాష్ఠామ్) దిశల నధిగమించుచున్నారో (గచ్ఛత) మేమును అధిగమించుదుముగాక! ॥౧౩॥

**భావార్థము :-** ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. యోధులగు వారు సైన్యాధీశుని సహాయ, రక్షణలచే శత్రువులను నిర్జించి వారి మార్గముల నరికట్టుచున్నారు. శత్రువు లే దిశనుండి అపాయమును తలపెట్టుదురో, ఆ వైపునకే వెళ్ళి వారిని వశపరచుకొని తరిమివేయవలెను. ॥౧౩॥

13.May I, the general, stout in body and soul, win the battle with the help of God, in Whose universe reside the eternal causes, Who is the giver of all affluence, the Illuminator of all, Supreme in knowledge, and the Guardian of the Vedas. O active, learned persons, winners of battle, see the enemies from a distance and go towards different directions to check their onward march.

**౩౭౦. ఏషస్యేత్యస్య దధిక్రావా ఋషిః, బృహస్పతిర్దేవతా, జగతీ ఛందః, నిషాదః స్వరః.**

**యదా సేనాసేనేశా సుశిక్షితా పరస్పరం ప్రీతియుక్తౌ స్యాతాం తదైవ విజయలాభః స్యాదిత్యాహ.**

**చక్కని శిక్షితులగు సైన్యములు, సేనాధిపతులు పరస్పరము ప్రీతిపూర్వకముగ**

**నుండి శత్రువులపై విజయముఁ బొందవలెను.**

౩౨౦ ఏష స్య వాజీ క్షిపణిం తురణ్యతి గ్రీవాయాం బద్ధో అపికక్ష ఆసని। క్రతుం దధిక్రా అను సంసనిష్యదత్ పథా మఙ్కాంస్యన్వాపనీఫణత్ స్వాహా॥౧౪॥

ప.విః- ఏషః, స్యః, వాజీ, క్షిపణిమ్, తురణ్యతి, గ్రీవాయామ్, బద్ధః, అపికక్ష ఇత్యపి + కక్షే, ఆసని, క్రతుమ్, దధిక్రా ఇతి దధి + క్రాః, అను, సంసనిష్యదత్, సంసనిస్యదదితి సమ్+సనిస్యదత్, పథామ్, అఙ్కాంసి, అను, ఆపనీఫణదిత్యా+పనీఫణత్, స్వాహా ॥౧౪॥

**పదార్థః** :-(ఏషః) వీరః (స్యః) అసౌ. అత్ర స్యశ్ఛన్దసి బహులమితి సోర్లోపః (వాజీ) వేగవాన్ (క్షిపణిమ్) దూరే క్షిపంతి శత్రూన్ యయా తాం సేనామ్ (తురణ్యతి) త్వరయతి (గ్రీవాయామ్) కంఠే (బద్ధః) (అపికక్షే) నిశ్చితపార్శ్వావయవే (ఆసని) ఆస్యే (క్రతుమ్) కర్మ (దధిక్రాః) యో దధీన్ ధారకాన్ క్రామ్యతి స దధిక్రః అశ్వః. దధిక్రా ఇత్యశ్వ నా.. నిఘం. ౧.౧౪. (అను) (సంసనిస్యదత్) అతిశయేన ప్రస్రవన్. అత్ర స్యందూ ధాతోర్యఙ్‌లుక్ శతృప్రత్యయేఽభ్యాసస్య నిక్ నిపాత్యతే (పథామ్) మార్గాణామ్. (అంకాంసి) లక్షణాని (అను) (ఆపనీఫణత్) అతిశయేన గచ్ఛన్ (స్వాహా) సత్యయా వాచా. అయం మంత్రః. శత. ౫.౧.౫.౧౯.వ్యాఖ్యాతః. ॥౧౪॥

**అన్వయః** :-యథైష స్యోఽసౌ వాజ్యాసని గ్రీవాయాం బద్ధః క్రతుం సంసనిష్యదదపికక్షే పథామేకాంస్యన్వా పనీఫణద్ దధిక్రాః క్షిపణిం గచ్ఛతి తథా సేనేశః స్వాహా, స్వసేనాం పరాక్రమయేత్.॥౧౪॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంఙ్కారః. సేనాపతి రక్షితా వీరా అశ్వవద్ధావంతః సద్యః శత్రూన్ హంతుం శక్నువంతి. సేనాపతిః సుకర్మకారాభిః సంశిక్షితైర్వీరైః సహైవ యుధ్యమానః సన్ ప్రశంసితో విజయతే నాఽన్యథా.॥౧౪॥

**పదార్థము** :-ఏవిధముగ (స్యః) అవి (ఏషః) మరియు నివి (వాజీ) వేగవంతముగ (ఆసని) ముఖము మరియు (గ్రీవాయామ్) కంఠమునందును (బద్ధః) బంధించబడినవియు (క్రతుమ్) కర్మను, లేక గతిని (సంసనిష్యదత్) అతిగా వ్యాపింపజేయు (పథామ్) మార్గముల (అఙ్కాంసి) చిహ్నముల (అను) సమీపమున (ఆ పనీఫణత్) చక్కగా స్ఫూరిచేయునదియు (దధిక్రాః) పైన కూర్చున్న రౌతును స్థానమునకు

చేరవేయునదియు నగు అశ్వము (క్షిపణిమ్) సైన్యములను చేరుచున్నట్లు (అపికక్షే) నలువైపుల నున్న సైన్యమును సేనాధిపతిని (స్వాహా) సత్యవాణితో (తురణ్యతి) వేగవంతముగ నొనర్చును.॥౧౪॥

భావార్థము:- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. సేనాధ్యక్షునిచే రక్షింపబడుచున్న వీరసైనికులు తురగములవలె పరుగెత్తుచు శత్రువులను నాశపరచగలరు. ఉత్తమశిక్షణగల, శ్రేష్ఠకర్మలొనర్చు వీరపురుషులతోగూడ యుద్ధమొనర్చు సేనాపతి విజయముతో ప్రశంసలను పొందగలడు. అట్లు గానిచో పరాజయమే సంప్రాప్తమగును.॥౧౪॥

14.Just as this fast horse bound by the neck, and at the flanks and in the mouth, ever accelerating its speed. passes by the mile-stones, with full force and goes to the army; so does the commander of the army, with due orders, make it march on speedily.

౩౭౧. ఉతేత్యస్య దధిక్రావా ఋషిః, బృహస్పతిర్దేవతా, జగతీ ఛందః, నిషాదః స్వరః.

సేనాపత్యాదయః కథం పరాక్రమేరన్నిత్యుపదిశ్యతే.

సేనాపతులు మున్నగు రాజపురుషులు ఎట్లు పరాక్రమించవలయు నను విషయ

మీ మంత్రమునం దుపదేశించబడినది.

౩౭౧ ఉత స్మాస్య ద్రవత స్తురణ్యతః పర్ణం న వేరనువాతి ప్రగర్ధినః। శ్యేనస్యేవ ధ్రజతోఽఙ్కసం పరి దధిక్రావ్ణః సహోర్జా తరిత్రతః స్వాహా ॥౧౫॥

ప.వి:- ఉత, స్మ, అస్య ద్రవతః, తురణ్యతః, పర్ణమ్; న, వేః, అను, వాతి, ప్రగర్ధిన ఇతి ప్ర + గర్ధినః, శ్యేనస్యేవేతి శ్యేనస్య + ఇవ, ధ్రజతః, అఙ్కసమ్, పరి, దధిక్రావ్ణ ఇతి దధి + క్రావ్ణః, సహ, ఊర్జా, తరిత్రతః, స్వాహా. ॥౧౫॥

పదార్థః :-(ఉత) అపి (స్మ) ఏవ (అస్య) (ద్రవతః) ద్రవీభూతస్య (తురణ్యతః) శీఘ్రం గచ్ఛతః (పర్ణమ్) పత్రం పక్షో వా (న) ఇవ (వేః) పక్షిణః (అను) (వాతి) గచ్ఛతి (ప్రగర్ధినః) ప్రకర్షేణాభికాంక్షిణః (శ్యేనస్యేవ) (ధ్రజతః) గచ్ఛతః (అంకసమ్) లక్షణాన్వితం మార్గమ్ (పరి) (దధిక్రావ్ణః) అశ్వస్య (సహ) (ఊర్జా) పరాక్రమేణ (తరిత్రతః) అతిశయేన సంప్లవతః (స్వాహా) సత్యయా క్రియయా. అయం మంత్రః. శత. ౫.౧.౫.౨౦. వ్యాఖ్యాతః. ॥౧౫॥

**అన్వయః** :-హే రాజజనాః! య ఊర్జా స్వాహోఽస్య ద్రవతస్తురణ్యతో వేః పర్ణం నోత ప్రగర్ధినో ధ్రజతః శ్యేనస్యేవ తరిత్రతో దధిక్రాష్ణ ఇవాంకసం పర్యనువాతి స్మ. స ఏవ శత్రుం జేతుం శక్నోతి.॥౧౫॥

**భావార్థః** :-అత్రోపమావాచక లుప్తోపమాలంకారః. యే వీరాః నీలకంఠపక్షివచ్ఛ్యేనవదశ్వవచ్చ పరాక్రమంతే తేషాం శత్రవః సర్వతో నిలీయంతే. ॥౧౫॥

**పదార్థము** :- ఓ రాజపురుషులారా! ఎవడు (ఊర్జా) పరాక్రమముతోను (స్వాహా) సత్యక్రియతో (సహా) కూడ (అస్య) ఈ (ద్రవతః) రసప్రదమగు వృక్షపత్రములవలెను (తురణ్యతః) అతిశీఘ్రగామియగు (వేః) పక్షియొక్క (పర్ణమ్) పక్షము [రెక్క]ల (న) వలె (ఉత) మరియు (ప్రగర్ధినః) అత్యంత ఇచ్ఛగలిగిన (ధ్రజతః) కామితములుగల (శ్యేనస్యేవ) డేగపక్షివలె (తరిత్రతః) అతి శీఘ్రముగ నడుచు (దధిక్రాష్ణః) అశ్వమువలె (అఙ్కసమ్) చక్కని లక్షణములుగల మార్గమున (పరి,అను, వాతి) సకలవిధముల అనుకూలముగనడచు వీర (స్మ) పురుషుడే శత్రువులను జయించగలుగుచున్నాడు.॥౧౫॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు ఉపమా, వాచకలుప్తోపమాలంకారము లున్నవి. నీలకంఠ, శ్యేన విహంగములవలెను, అశ్వమువలెను, త్వరితగామి, పరాక్రమవంతుడగు వీరుడే నలువైపులనుండి శత్రువులను నిర్జించుచుండును. శత్రువు లాతని కంటబడకుండ దాగుకొనెదరు.॥౧౫॥

15.O Government officials, he alone can conquer the foes, who marches speedily according to plan, on well constructed roads, with equipment and firm determination like the wings of a fast flying bird, the falcon that soars high desirous of prey, and the fleeting horse!.

౩౭౨. శన్న ఇత్యస్య వసిష్ఠ ఋషిః, బృహస్పతిర్దేవతా, భురిక్ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

కే ప్రజాపాలనే శత్రువినాశనే చ శక్తిమంతో భవంతీత్యాహ.

శత్రునాశనమొనర్చి ప్రజాపాలనము చేయవలయును.

౩౭౨ శన్నో భవంతు వాజినో హవేషు దేవతాతా మితద్రవః స్వర్కాః। జమ్భ యంతోఽహిం వృకం రక్షాంసి సనేమ్యస్మద్యుయవన్నమీవాః॥౧౬॥

**ప.వి:**- శమ్, నః, భవంతు, వాజినః, హవేషు, దేవతాతేతి దేవ+తాతా, మితద్రవ ఇతి మిత+ద్రవః, స్వర్కా ఇతి సు+అర్కాః, జంభయంతః, అహిమ్, వృకమ్, రక్షాంసి, సనేమి, అస్మత్, యుయవన్, అమీవాః ॥౧౬॥

పదార్థః :-(శమ్) సుఖమ్ (నః) అస్మాకమ్ (భవంతు) (వాజినః) ప్రశస్తయుద్ధవిద్యావిదః సుశిక్షితా స్తురంగాః (హవేషు) సంగ్రామేషు (దేవతాతా) దేవానాం విదుషాం కర్మసు. అత్ర దేవాత్తాతిల్. సుపాం సులుగితి డాదేశశ్చ (మితద్రవః) యే పరిమితం ద్రవంతి గచ్ఛంతి తే (స్వర్కాః) శోభనోఽర్కోఽన్నం సత్కారో వా యేషాం తే. అర్క ఇత్యన్న నామసు.... నిఘం. 2.7. (జంభయంతః) గాత్రాణి వినమయంతః (అహిమ్) మేఘమివ చేష్టమాన మున్నతమ్ (వృకమ్) చోరమ్ (రక్షాంసి) హింసకాన్ దస్యూన్ (సనేమి) సనాతనమ్. సనేమీతి పురాణ నా....నిఘం, 3.27. (అస్మత్) (యుయవన్) యువంతు పృథక్ కుర్వంతు. అత్ర లేటి శపః శ్లుః (అమీవాః) యే రోగవద్వర్తమానాః శత్రవస్తాన్. అయం మంత్రః. శత. ౫.౧.౫.౨౨. వ్యాఖ్యాతః. ॥౧౬॥

అన్వయః :-యే మితద్రవః స్వర్కా అహిం వృకం రక్షాంసి చ జంభయంతో వాజినో వీరా నో దేవతాతా హవేషు సనేమి శం భవంతు తేఽస్మదమీవా ఇవ వర్తమానానరీన్ యుయవన్. ॥౧౬॥

భావార్థః :- యే శ్రేష్ఠాః ప్రజాపాలనే తత్పరా వ్యాధివచ్ఛత్రూణాం వినాశకా న్యాయకారిణో రాజజనాః సంతి, త ఏవ సర్వేషాం సుఖం కర్తుం శక్నువంతి. ॥౧౬॥

పదార్థము :- (మితద్రవః) నియమముగ నడచు (స్వర్కాః) ఉత్తమమగు అన్నసత్కారములు గల యోధులు (అహిమ్) మేఘములవలె చేష్టలొనర్చుచు ముందుకు సాగివచ్చిన (వృకమ్) దొంగలను (రక్షాంసి) ఇతరులకు కష్టనష్టములను గలిగించు దోపిడీకాండ్రను (జమ్భయన్తః) హస్తపాదములను విరగగొట్టుచు (వాజినః) శ్రేష్ఠ యుద్ధవిద్యల నెరుగువారగు వీరులు (నః) మా (దేవతాతా) విద్వాంసుల కర్మలందు (హవేషు) రణరంగములందు (సనేమి) సనాతనమగు (శమ్) సుఖములను(భవంతు) పొందువారు (అస్మత్) మానుండి (అమీవా) వ్యాధులవలె పీడలగలిగించు శత్రువులను (యుయవన్) వేరుపరచెదరుగాక.॥౧౬॥

భావార్థము :- వైద్యులు వ్యాధినిర్మూలన మొనర్చునట్లు శ్రేష్ఠులు, ప్రజాపాలకులగు రాజపురుషులు శత్రువులను పరిమార్చి ప్రజలకు క్షేమ సుఖములను గలిగించగలరు.॥౧౬॥

16.May the heroes expert in the science of warfare, marching uniformly, well respected and well fed, breaking the bodies of strong thieves and rascals, attain to everlasting happiness in battles, through the deeds of us the learned. May they banish for us all disease-like foes.

౩౭౩. తే న ఇత్యస్య నాభానేదిష్ఠ ఋషిః, బృహస్పతిర్దేవతా, జగతీ ఛందః, నిషాదః స్వరః.

ప్రజాజనాః స్వరక్షార్థమేవ కరం దద్యుస్తదర్థ మేవ రాజజనా గృహ్ణంతు నాన్యథేత్యాహ.

ప్రజలు తమ రక్షణకొరకై కప్పముల చెల్లించవలయును. వీనికి భిన్నముగ నడువవల దని,

రాజపురుషులు గ్రహించవలె నను విషయ మీ మంత్రమున చెప్పబడినది.

323 తే నో౽ అర్వంతో హవనశ్రుతో హవం విశ్వే శృణ్వంతు
వాజినో మితద్రవః సహస్రసా మేధసాతా సనిష్యవో
మహో యే ధనం సమిథేషు జభ్రిరే ॥౧౭॥

ప.వి:- తే, నః, అర్వంతః, హవనశ్రుత ఇతి హవన + శ్రుతః, హవమ్, విశ్వే, శృణ్వంతు, వాజినః, మిత ద్రవ ఇతి మిత+ద్రవః, సహస్రసా ఇతి సహస్ర+సాః, మేధసాతేతి మేధ+సాతా, సనిష్యవః, మహః, యే, ధనమ్, సమిథేష్వితి సమ్ + ఇథేషు, జభ్రిరే ॥౧౭॥

**పదార్థః** :-(తే) (నః) అస్మాకమ్ (అర్వంతః) జానంతః (హవనశ్రుతః) యే హవనాని గ్రాహ్యాణి శాస్త్రాణి శృణ్వంతి తే (హవమ్) అధ్యయనాధ్యాపనజన్యం బోధశబ్దసమూహమర్థిప్రత్యర్థినాం వివాదం చ (విశ్వే) సర్వే విద్వాంసః (శృణ్వంతు) (వాజినః) ప్రశస్తప్రజ్ఞాః (మితద్రవః) యే మితం శాస్త్రప్రమితం విషయం ద్రవంతి తే (సహస్రసాః) యే సహస్రం విద్యావిషయాన్ సనంతి తే (మేధసాతా) మేధానాం సంగమానాం సాతిర్దానం యేషు. అత్ర సప్తమీబహువచనస్య సుపాం సులుగితి డాదేశః (సనిష్యవః) ఆత్మనః సనిం సంవిభాగ మిచ్ఛవః. సనిశబ్దాత్క్యచి లాలసాయాం సుక్ తత ఉః (మహః) మహత్ (యే) (ధనమ్) శ్రియమ్ (సమిథేషు) సంగ్రామేషు. సమిథ ఇతి సంగ్రామ నా.. నిఘం.౨.౧౭. (జభ్రిరే) భరేయుః. అత్రాభ్యాసస్య వర్ణవ్యత్యయేన వస్య జః. అయం మంత్రః. శత. ౫.౧.౫.౨౩. వ్యాఖ్యాతః. ॥౧౭॥

**అన్వయః** :-యే౽ర్వంతో హవనశ్రుతో వాజినో మితద్రవః సహస్రసాః సనిష్యవో రాజజనా మేధసాతా సమిథేషు నో మహో ధనం జభ్రిరే తే విశ్వే౽స్మాకం హవం శృణ్వంతు. ॥౧౭॥

**భావార్థః** :-య ఇమే రాజపురుషా అస్మాకం సకాశాత్కరం గృహ్ణంతి. తే౽స్మాన్ సతతం రక్షంతు, నో చేన్మా గృహ్ణంతు. వయమపి తేభ్యః కరం నైవ దద్యామ. అతః ప్రజారక్షణాయైవ కరదానం, దుష్కర్మిభిః సహ యోద్ధుం చ నాన్యదర్థమితి నిశ్చయః. ॥౧౭॥

**పదార్థము** :-(యే) ఎవరైతే (అర్వన్తః) జ్ఞానులు (హవనశ్రుతః) గ్రహణమొనర్పదగిన శాస్త్రములను వినువారు (వాజినః) ప్రశంసించదగిన బుద్ధిశాలురు (మితద్రవః) శాస్త్రీయ విషయములను ప్రాప్తించుకొనువారు (సహస్రసాః) అసంఖ్యాక విషయములను పొందువారు (సనిష్యవః) స్వ ఆత్మను చక్కగా గౌరవించు ఏ రాజపురుషులు (మేధసాతా) చక్కని పొందికగల దానములచే గాడి (సమిథేషు)

సంగ్రామములందు (నః) మాయొక్క (ధనమ్) విస్తృత ఐశ్వర్యములను (జభ్రిరే) ధరించుచున్నారో (విశ్వే) అట్టి విద్వాంసు లెల్లరును మాయొక్క (హవమ్) చదువుట, చదివించుటలోని బోధ శబ్దములను (శృణ్వన్తు) వినెదరుగాక!॥౧౭॥

భావార్థము :- మానుండి కరగ్రహణమొనర్చు రాజపురుషులు మమ్ము నిరంతరము రక్షించుచుందురు గాక! అట్లు జేయకున్న మేము కరమును ఇచ్చుట గాని, వారు పుచ్చుకొనుట గాని జరుగకుండును గాక! కావున ప్రజారక్షణకొరకు, దుష్టులను తరిమివేయుటకు కప్పముల చెల్లించుట, పుచ్చుకొనుట జరుగవలెను. కాని ఇతర ఎట్టి ప్రయోజనములకును అట్లు జరుగవలదని దీని భావము. ॥౧౭॥

17.The state officials, who are advanced in knowledge, listeners of religious books, full of wisdom, masters of their subjects, seekers after different branches of knowledge, lovers of their souls, leaders of social life and acquirers of mighty wealth in battles, should all, listen to our learned discussions.

౩౭౪. వాజే వాజ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, బృహస్పతిర్దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, నిషాదః స్వరః.

అథైతే పరస్పరమస్మిన్ కథం వర్తేరన్నిత్యుపదిశ్యతే.

రాజు మరియు ప్రజలు పరస్పర మెట్లుండవలయు నను విషయ మిందుపదేశించబడినది.

౩౭౪ వాజే వాజేఽవత వాజినో నో ధనేషు విప్రాఽ అమృతాఽ ఋతజ్ఞాః।

అస్య మధ్వః పిబత మాదయధ్వన్తృప్తా యాత పథిభిర్దేవయానైః ॥౧౮॥

ప.వి:- వాజే వాజ ఇతి వాజే + వాజే, అవత, వాజినః, నః, ధనేషు, విప్రాః, అమృతాః, ఋతజ్ఞా ఇత్యృత + జ్ఞాః, అస్య, మధ్వః, పిబత, మాదయధ్వమ్, తృప్తాః, యాత, పథిభిరితి పథి + భిః, దేవయానై రితి దేవ + యానైః॥౧౮॥

పదార్థః :- (వాజే వాజే) సంగ్రామే సంగ్రామే (అవత) పాలయత (వాజినః) వేగవంతః (నః) అస్మాన్ (ధనేషు)(విప్రాః) విద్యాసుశిక్షాజాతప్రజ్ఞాః (అమృతాః) స్వస్వరూపేణ నాశరహితాః ప్రాప్తజీవన్ముక్తిసుఖాః (ఋతజ్ఞాః) యే ఋతం సత్యం జానంతి తే. (అస్య) ప్రత్యక్షస్య (మధ్వః) మధునో మధురస్య రసస్య. అత్ర కర్మణి షష్ఠీ (పిబత) (మాదయధ్వమ్) హృష్యత (తృప్తాః) ప్రీణితాః (యాత) గచ్ఛత (పథిభిః) మార్గైః (దేవయానైః) దేవా విద్వాంసో యాంతి యైర్మార్గైః. అయం మంత్రః. శత. ౫.౧.౫.౨౪. వ్యాఖ్యాతః.॥౧౮॥

**అన్వయః :-** హే ఋతజ్ఞా అమృతా వాజినో విప్రా! యూయం వాజే వాజే నోఽవత. అస్య మధ్వః పిబతాఽస్మాకం ధనైస్తృప్తాః సంతో మాదయధ్వమ్. దేవయానైః పథిభిః సతతం యాత. ॥౧౮॥

**భావార్థః :-** రాజపురుషై వేదాదీని శాస్త్రాణ్యధీత్య సుశిక్షయా యథార్థం బోధం ప్రాప్య ధార్మికాణాం విదుషాం మార్గేణ సదా గంతవ్యం నేతరేషామ్. శరీరాత్మబలపాలనేనైవ సతతమానందితవ్యం, ప్రజాజనాః స్వధనైరేతాన్ సతతం తర్పయంతు. ॥౧౮॥

**పదార్థము :-** (ఋతజ్ఞాః) సత్యవిద్యలనెరిగినట్టి (అమృతాః) తమతమ రూపములచే నాశరహితులై జీవన, మోక్షసుఖములను పొందినట్టి (వాజినః) వేగశాలులైనట్టి (విప్రాః) విద్య మరియు చక్కని శిక్షణద్వారా బుద్ధిని ప్రాప్తించుకొని విద్వాంసులైనట్టి రాజపురుషులారా! మీరు (వాజే వాజే) ప్రతి సంగ్రామమునందును (నః) మమ్ము (అవత) రక్షించుడు. (అస్య) ఇట్టి (మధ్వః) మధురరసమును (పిబత) త్రావుడు. మా ధనములచే (తృప్తాః) తృప్తిపరులై (మాదయధ్వమ్) ఆనందితులగుడు. మరియు (దేవయానైః) విద్వాంసులు నడచునట్టి (పథిభిః) మార్గములందు (యాత) నడచుచుండుడు. ॥౧౮॥

**భావార్థము :-** రాజపురుషులు వేదములు మున్నగు శాస్త్రములనభ్యసించి, ఉత్తమజ్ఞానమును పొంది ధర్మాత్ములగు విద్వాంసులమార్గమునే నిరంతరము అనుసరించుచు చెడుమార్గములకు దూరముగ నుండవలెను. శరీరాత్మల బలములను వృద్ధిపరచుకొనుటకు వైద్యశాస్త్రములచే పరీక్షించబడిన, చక్కగా పాకమొనర్చబడిన అన్నము మున్నగు రసములను సేవించుచు ప్రజలను రక్షించుటయందే ఆనందమును పొందుచు ప్రజలను నిరంతరము ప్రసన్నులుగా నుంచవలెను. ॥౧౮॥

18.O truthful, aged, steadfast and wise officials, protect us in each fray. Enjoy the reward of victory in the battle. Be joyful, be satisfied. Tread on paths, which sages are wont to tread!.

**౩౭౫.ఆ మా వాజస్యేత్యస్య వశిష్ఠ ఋషిః, ప్రజాపతిర్దేవతా, విచృద్ధృతిశ్ఛందః, ఋషభః స్వరః.**

**మనుష్యైర్ధర్మాచరణేన కిం కిమేష్టవ్యమిత్యాహ.**

**మనుష్యులు ధర్మాచరణముచే ఏ యే పదార్థములను కోరవలెను విషయమిందు గలదు.**

౩౭౫ ఆ మా వాజస్య ప్రసవో జగమ్యాదేమే ద్యావాపృథివీ విశ్వరూపే

ఆ మా గంతాం పితరా మాతరా చా మా సోమోఽ అమృతత్వేన

గమ్యాత్ । వాజినో వాజజితో వాజంస్ససృవాంసో బృహస్పతే

ర్భాగమవజిఘ్రత నిమృజానాః॥౧౯॥

ప.వి:- ఆ, మా, వాజస్య, ప్రసవ ఇతి ప్ర + సవః, జగమ్యాత్, ఆ, ఇమే, ఇతీమే, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, విశ్వరూపే ఇతి విశ్వ + రూపే, ఆ, మా, గంతామ్, పితరామాతరా, చ, ఆ, మా, సోమః, అమృతత్వేనేత్యమృత + త్వేన, గమ్యాత్, వాజినః, వాజజిత ఇతి వాజ + జితః, వాజమ్, సస్రువాంస ఇతి సస్రు+వాంసః, బృహస్పతేః, భాగమ్, అవ, జిఘ్రత, నిమృజానా ఇతి ని + మృజానాః.॥౧౯॥

పదార్థః:-(ఆ) (మా) మామ్ (వాజస్య) వేదాదిశాస్త్రార్థప్రసూతజ్ఞానబోధస్య (ప్రసవః) ప్రకృష్టైశ్వర్యసమూహః (జగమ్యాత్) భృశం ప్రాప్నుయాత్ (ఆ) (ఇమే) (ద్యావాపృథివీ) ప్రకాశభూమీ రాజ్యార్థే (విశ్వరూపమ్) విశ్వాని సర్వాణి రూపాణి యయో స్తే (ఆ) (మా) మామ్ (గంతామ్) ప్రాప్నుతః. అత్ర వికరణలుక్ (పితరా మాతరా) పితా చ మాతా చ తే. అత్ర పితరామాతరా చ ఛందసి అ. ౬.3.33. ఇతి పూర్వపదస్యానఙ్. ఉత్తరపదస్యాకారాదేశశ్చ నిపాత్యతే (చ) సుసహాయః (ఆ) (మా) మామ్. (సోమః) సోమవల్ల్యాద్యోషధిగణః (అమృతత్వేన) సర్వరోగనివారకత్వేన సహ (గమ్యాత్) ప్రాప్నుయాత్ (వాజినః) ప్రశస్తబలినః (వాజజితః) విజితసంగ్రామాః (వాజమ్) సంగ్రామమ్ (సస్రువాంసః) ప్రాప్తవంతః (బృహస్పతేః) బృహత్యాః సేనాయాః స్వామినః (భాగమ్) భజనీయమ్ (అవ) (జిఘ్రత) (నిమృజానాః) నితరాం శుంధంతః. అయం మంత్రః. శత.౫.౧.౫.౨౭-౨౭ వ్యాఖ్యాతః.॥౧౯॥

అన్వయః:-హే పూర్వోక్తా విద్వాంసో! యేషాం భవతాం సహాయేన వాజస్య ప్రసవో మా జగమ్యాత్ సమంతాత్ ప్రాప్నుయాదిమే విశ్వరూపే ద్యావాపృథివీ చామృతత్వేన సోమో గమ్యాత్. పితరామాతరా చాగంతామ్. తే వాజినో వాజజితో వాజం సస్రువాంసో నిమృజానాః సంతోయూయం బృహస్పతేర్భాగ మవజిఘ్రత.॥౧౯॥

భావార్థః:-యే మనుష్యాః! విద్వత్సంగేన విద్యాసుశిక్షే ప్రాప్య ధర్మమాచరంతి. తానిహాముత్ర పరమైశ్వర్యసాధకం రాజ్యం విద్వాంసౌ మాతాపితరౌ రోగరాహిత్యం చ ప్రాప్నోతి. యే విదుషాం సేవనం కుర్వంతి తే శరీరాత్మబలం ప్రాప్తాః సంతః సర్వాణి సుఖాని ప్రాప్నువంతి. నాతో విరుద్ధాచరణా ఏతత్సర్వమాప్తుం శక్నువంతి. ॥౧౯॥

**పదార్థము** :-[మొదట చెప్పబడిన] ఓ విద్వాంసులారా! మీ సహాయముచే (వాజస్య) వేదాది శాస్త్రముల అర్థబోధనలు (ప్రసవః) ఉత్తమైశ్వర్యములు (మా) నాకు (జగమ్యాత్) శీఘ్రముగ ప్రాప్తించుగాక (ఇమే) ఇట్టి

(విశ్వరూపే) విశ్వరూపములుగలిగియున్న (ద్యావాపృథివీ) ఆకాశము మరియు భూరాజ్యముల (చ) మరియు (అమృతత్వేన) సకలరోగనిర్మూలనగుణములతో (సోమః) సోమవల్లి మున్నగు ఓషధీవిజ్ఞానము నాకు లభించునుగాక! మరియు (పితరా మాతరా) విద్వాంసులగు మాతాపితరులు (ఆగన్తామ్) లభించుదురుగాక! అట్టి (వాజినః) ప్రశంసిత బలవంతులు (వాజజితః) సంగ్రామముల జయించువారు (వాజమ్) సంగ్రామములను పొంది (నిమృజానాః) నిరంతరము శుద్ధులునైన మీరు (బృహస్పతేః) మహాసేనాధిపతి యొక్క (భాగమ్) సేవించదగిన భాగమును (అవజిఘ్రత) నిరంతరము పొందుచుందురు గాక! ॥౧౯॥

**భావార్థము** :- విద్వాంసులచే విద్య మరియు ఉత్తమశిక్షణను ప్రాప్తించుకొని ధర్మము నాచరించు మానవులకు ఇహపరలోకములందు పరమైశ్వర్యములను సాధించు రాజ్యము, విద్వాంసులను మాతా పితరులు, చక్కని ఆరోగ్యము ప్రాప్తించును. విద్వాంసులను సేవించువారు శరీరాత్మల శుద్ధిని ప్రాప్తించుకొని సకల సుఖముల ననుభవింతురు. కాని ఇందుకు విపరీతముగ నడచుకొనువారికి సాధ్యముగాదు. ॥౧౯॥

19.May I get in full, bounteous wealth of knowledge. May I get sovereignty over Heaven and Earth, in which reside all shining objects. May I get the knowledge of healing medicines. May I obtain learned father and mother.

Ye, mighty warriors, winners of battles, going to the battle-field, purified in heart, obey the orders of your general!.

౩౭౬. ఆపయ ఇత్యస్య వశిష్ఠ ఋషిః, ప్రజాపతిర్దేవతా, భురిక్ కృతిశ్ఛందః, నిషాదః స్వరః.

విద్యా సుశిక్షితయా వాచా మనుష్యాణాం కిం కిం ప్రాప్నోతీత్యాహ.

విద్యానుశిక్షాయుక్త మగు వాణిచే మనుష్యుల కేమి ప్రాప్తించునది చెప్పబడినది.

౩౭౬ ఆపయే స్వాహా స్వాపయే స్వాహాఽపిజాయ స్వాహా క్రతవే స్వాహా వసవే
స్వాహాఽహర్పతయే స్వాహాఽహ్నే ముగ్ధాయ స్వాహా ముగ్ధాయ
వైనꣳశినాయ స్వాహా వినꣳశినఽ ఆన్త్యాయనాయ స్వాహాఽఽన్త్యాయ
భౌవనాయ స్వాహా భువనస్య పతయే స్వాహాఽధిపతయే స్వాహా॥౨౦॥

ప.వి:- ఆపయే, స్వాహా, స్వాపయ ఇతి సు+ఆపయే, స్వాహా, అపిజాయేత్యపి+జాయ, స్వాహా, క్రతవే, స్వాహా, వసవే, స్వహా, అహర్పతయే, అహఃఽపతయ ఇత్యహః+పతయే,

స్వాహా,అహ్నే, ముగ్ధాయ, స్వాహా, ముగ్ధాయ, వైనఀశినాయ, స్వాహా, వినఀశిన ఇతి వినఀశినే, ఆంత్యాయనాయేత్యాన్త్య+ ఆయనాయ, స్వాహా, అన్త్యాయ, భౌవనాయ, స్వాహా, భువనస్య, పతయే, స్వాహా, అధిపతయ ఇత్యధి+పతయే,స్వాహా.॥౨౦॥

పదార్థః:-(ఆపయే) సకలవిద్యావ్యాప్తయే (స్వాహా) సత్యా క్రియా (స్వాపయే) సుఖానాం సుష్ఠుప్రాప్తయే (స్వాహా) ధర్మ్యా క్రియా (అపిజాయ) నిశ్చయేన జాయమానాయ (స్వాహా) పురుషార్థయుక్తాక్రియా (క్రతవే) ప్రజ్ఞాయై (స్వాహా) అధ్యయనాధ్యాపనప్రవర్తికా క్రియా (వసవే) విద్యానివాసాయ (స్వాహా) సత్యాం వాణీమ్ (అహర్పతయే) పురుషార్థేన గణితవిద్యయా దివస్పాలకాయ (స్వాహా) కాలవిజ్ఞాపికా వాణీ (అహ్నే) దినాయ (ముగ్ధాయ) ప్రాప్తమోహనిమిత్తాయ (స్వాహా) విజ్ఞానయుక్తా వాక్ (ముగ్ధాయ) మూర్ఖాయ (వైనంశినాయ) వినాశశీలేషు కర్మసు భవాయ (స్వాహా) చేతయిత్రీం వాణీమ్ (వినంశినే) వినష్టుం శీలాయ (ఆంత్యాయనాయ) అంత్యం నీచమయనం ప్రాపణం యస్య తస్మై (స్వాహా) నష్టకర్మనివారికా వాణీ (అంత్యాయ) అంతే భవాయ (భౌవనాయ) భువనేషు ప్రభవాయ (స్వాహా) పదార్థవిజ్ఞాపికా వాక్ (భువనస్య) సంసారస్య (పతయే) స్వామిన ఈశ్వరాయ (స్వాహా) యోగవిద్యాజనితా ప్రజ్ఞా (అధిపతయే) సర్వాధిష్ఠాతౄణాముపరి వర్తమానాయ (స్వాహా) సర్వవ్యవహారవిజ్ఞాపికా వాక్. అయం మంత్రః. శత.౫.౨.౧.౨. వ్యాఖ్యాతః. ॥౨౦॥

అన్వయః:-హే విద్వాంసో! యూయం యథా మామాపయే స్వాహా. స్వాపయే స్వాహాఽపిజాయ స్వాహా క్రతవే స్వాహాఽహర్పతయే స్వాహా, ముగ్ధాయాహ్నే స్వాహా, ముగ్ధాయ వైనంశినాయ స్వాహా. ఆంత్యాయనాయ వినంశినే స్వాహాఽఽన్త్యాయ భౌవనాయ స్వాహా భువనస్య పతయే స్వాహాఽధిపతియే చ స్వాహా ప్రాప్నుయాత్ తథా ప్రయతధ్వమ్. ॥౨౦॥

భావార్థః :-మనుష్యైః సకలవిద్యాప్రాప్త్యాదిప్రయోజనాయ విద్యాసుశిక్షాయుక్తా వాణీ ప్రాప్తవ్యా. యతః సర్వాణి సుఖాని ప్రాప్నుయుః. ॥౨౦॥

పదార్థము :-ఓ విద్వాంసులారా! మీరు నా కెట్లు (ఆపయే) సంపూర్ణవిద్యల ప్రాప్తికై (స్వాహా) సత్యక్రియ మరియు (స్వాపయే) సుఖేచ్ఛప్రాప్తికై (స్వాహా) ధర్మయుక్త క్రియ (క్రతవే) బుద్ధి వృద్ధియగుటకు (స్వాహా) చదివించు ప్రవృత్తిని గలిగించు క్రియ (వసవే) విద్యానివాసమునకై (స్వాహా) సత్యవాణి (అహర్పతయే) పురుషార్థపూర్వకముగ గణితవిద్యద్వారా దినమును, కాలగతిని దెలుసికొను వాణి (ముగ్ధాయ) మోహప్రాప్తికై (అహ్నే) దినమగుటకై (స్వాహా) విజ్ఞానయుక్తమగు వాణిని (వైనఀశినాయ) నష్టస్వభావముతో గూడిన కర్మలందుండు (ముగ్ధాయ) మూర్ఖులకొరకు (స్వాహా) హెచ్చరించు వాణి (అన్త్యాయనాయ) నీచత్వమును

ప్రాప్తించిన (విన్ర్త్రిశినే) నష్టస్వభావయుక్తునకు (స్వాహా) పదార్థముల నెరుకపరచు వాణి (భువనస్య పతయే) విశ్వస్వామియగు పరమేశ్వరునకు (స్వాహా) యోగవిద్యను ప్రకటించుబుద్ధి (అధిపతయే) అధిష్ఠాత లెల్లరపై నుండు పురుషునికొరకు (స్వాహా) సకల వ్యవహారముల నెరిగించు వాణి (గమ్యాత్) లభించుటకు ఆలస్యమును వదలి ప్రయత్నించుడు.॥౨౦॥

**భావార్థము** :- సదా సమస్త సుఖములు లభించుటకై మానవులెల్లరును సకలవిద్యల ప్రాప్తి మున్నగు ప్రయోజనముల సాధించుటకు చక్కని శిక్షాయుక్తవాణిని పొందుటకు సదా పురుషార్థముల నొనర్ప వలయును.॥౨౦॥

20.For the attainment of full knowledge, noble deeds; gof the attainment of happiness, religious life; for the attainment of definite object, activity, for the advancement of wisdom, the habit of reading and teaching, for retention of knowledge, truthful speech; for arithmetical measurement of day, the science of arithmetic; for checking the waste of time in infatuation, a word of wisdom; for the fool who revels in vice, a word of caution; for the degraded, wicked soul, advice to ward off evil deeds; for the strong person amongst the low and despicable, speech revealing the true nature of things; for the attainment of God, the Lord of the universe, the knowledge of yoga; for the king, the knowledge of all affairs, are essential.

322.ఆయుర్యజ్ఞేనేత్యస్య వశిష్ఠ ఋషిః, యజ్ఞో దేవతా, అత్యష్టిశ్ఛందః, గాంధారః స్వరః.

అథ మనుష్యాన్ ప్రతీశ్వర ఆహేత్యుపదిశ్యతే.

ఈశ్వరుడు పై విధముగనే మనుష్యులకు మరల నుపదేశించుచున్నాడు.

322 ఆయుర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతాం చక్షుర్యజ్ఞేన
కల్పతాగ్ంశ్రోత్రం యజ్ఞేన కల్పతాం పృష్ఠం యజ్ఞేన కల్పతాం యజ్ఞో
యజ్ఞేన కల్పతామ్। ప్రజాపతేః ప్రజాఽ అభూమ స్వర్దేవాఽ
అగన్మామృతాఽ అభూమ ॥౨౧॥

ప.వి:- ఆయుః, యజ్ఞేన, కల్పతామ్, ప్రాణః, యజ్ఞేన, కల్పతామ్, చక్షుః, యజ్ఞేన, కల్పతామ్, శ్రోత్రమ్, యజ్ఞేన, కల్పతామ్, పృష్ఠమ్, యజ్ఞేన, కల్పతామ్, యజ్ఞః, యజ్ఞేన,

కల్పతామ్, ప్రజాపతేరితి ప్రజా + పతేః, ప్రజ ఇతి ప్ర + జాః, అభూమ, స్వః, దేవాః, అగన్మ, అమృతాః, అభూమ ॥౨౧॥

**పదార్థః** :-(ఆయుః) జీవనమ్ (యజ్ఞేన) ధర్మేణేశ్వరాజ్ఞాపాలనేన (కల్పతామ్) సమర్థతామ్ (ప్రాణః) జీవనహేతుర్బలకారీ (యజ్ఞేన) ధర్మ్యేణ విద్యాభ్యాసేన (కల్పతామ్) (చక్షుః) చష్టేఽనేన తత్ (యజ్ఞేన) శిష్టాచరితేన ప్రత్యక్షవిషయేణ (కల్పతామ్) (శ్రోత్రమ్)శృణోతి యేన తత్ (యజ్ఞేన) శబ్దప్రమాణాభ్యాసేన (కల్పతామ్) (పృష్ఠమ్) ప్రచ్ఛన్నమ్ (యజ్ఞేన) సంవాదాఖ్యేన (కల్పతామ్) యజధాతోరర్థః (యజ్ఞేన) బ్రహ్మచర్యాద్యాచరణేన (కల్పతామ్) (ప్రజాపతేః) విశ్వంభరస్య జగదీశ్వరస్యేవ ధార్మికస్య రాజ్ఞః (ప్రజాః) తదధీనపాలనాః (అభూమ) భవేమ (స్వః) సుఖమ్ (దేవాః) విద్వాంసః (అగన్మ) ప్రాప్నుయామ (అమృతాః) ప్రాప్తమోక్షసుఖాః (అభూమ) భవేమ. అయం మంత్రః. శత.౫.౨.౧-౪. వ్యాఖ్యాతః. ॥౨౧॥

**అన్వయః** :-హే మనుష్యా! యుష్మాకమాయుః సతతం యజ్ఞేన కల్పతామ్. ప్రాణో యజ్ఞేన కల్పతామ్. చక్షుర్యజ్ఞేన కల్పతామ్. శ్రోత్రం యజ్ఞేన కల్పతామ్. పృష్ఠం యజ్ఞేన కల్పతామ్. యథా వయం ప్రజాపతేః ప్రజా అభూమ. దేవాః సంతోఽమృతా అభూమ. స్వరగన్మేతి యూయం నిశ్చినుత. ॥౨౧॥

**భావార్థః**:-ఈశ్వరః సర్వాన్ మనుష్యానిదమాజ్ఞాపయతి. యూయం మత్సదృశస్య సత్య గుణకర్మస్వభావస్యైవ ప్రజా భవతేతరస్య క్షుద్రాఽఽశయస్య చ కదాచిత్ప్రజాభావం మా స్వీకురుత. యథా మాం న్యాయాధీశం మత్వా మదాజ్ఞాయాం వర్తిత్వా సర్వం స్వం ధర్మేణ సహచరితం కృత్వాఽఽభ్యుదయి కనిఃశ్రేయసే సుఖే నిత్యం ప్రాప్నుతః, తథా యో హి ధర్మేణ న్యాయేన యుష్మాన్ నిరంతరం పాలయేత్తం చ సభేశం రాజానం మన్యధ్వమ్. ॥౨౧॥

**పదార్థము** :-ఓ మనుష్యులారా! మీయొక్క (ఆయుః) ఆయుష్యము (యజ్ఞేన) నిరంతరము పరమేశ్వరాజ్ఞాపాలనమునందు (కల్పతామ్) సమర్థవంతమగునుగాక! (ప్రాణః) జీవనహేతువు బలకారకమునగు ప్రాణము (యజ్ఞేన) ధర్మయుక్తమగు విద్యాభ్యాసమున (కల్పతామ్) సమర్థవంతమగు గాక! (చక్షుః) నేత్రములు (యజ్ఞేన) ప్రత్యక్షవిషయమగు శిష్టాచారమునందు (కల్పతామ్) సమర్థవంతమగును గాక! (శ్రోత్రమ్) కర్ణములు [చెవులు] (యజ్ఞేన) వేదాభ్యాసముచే (కల్పతామ్) సమర్థవంతమగు గాక! మరియు (పృష్ఠమ్) ప్రశ్నించు విషయములు (యజ్ఞేన) సంవాదములద్వారా (కల్పతామ్) సమర్థవంతమగును గాక! (యజ్ఞః) యజ్ఞధాతువునకర్థము (యజ్ఞేన) బ్రహ్మచర్యము మున్నగువాని యాచరణములద్వారా (కల్పతామ్) సమర్థవంతమగు గాక! మేము (ప్రజాపతేః) సకల ప్రాణికోటిని పాలించు ఈశ్వరునివంటి ధర్మాత్ముడగు రాజునకు (ప్రజాః) పాలించదగిన సంతానమువంటివారము (అభూమ) అగుదుము గాక! మరియు (దేవాః) విద్వాంసులమై (అమృతాః) జన్మమరణ పరంపరనుండి విముక్తులమై (స్వః) మోక్షసుఖమును (అగన్మ) చక్కగా పొందుదుము గాక! [అని మీరు నిశ్చయించుకొనుడు]. ॥౨౧॥

**భావార్థము** :-పరమేశ్వరుడనగు నేను సర్వమానవులనాజ్ఞాపించుచున్నాను. నావంటి ధర్మయుక్త గుణకర్మస్వభావములుగల రాజునకే ప్రజలుగా నగుడు. మూర్ఖుడు, క్షుద్రాశయములుగలవాని ప్రజలుగుట కెన్నడును అంగీకరించకుడు. నన్ను న్యాయాధీశునిగ భావించి, నా యాజ్ఞలందు ప్రవర్తించి, సర్వస్వమును ధర్మముతో సంయుక్త మొనర్చి, అభ్యుదయ, నిఃశ్రేయస సుఖములను సదా పొందుచుండునట్లు మిమ్ము ధర్మముతో గూడిన న్యాయముతో నిరంతరము పరిపాలించునట్టి విద్యావంతుడగు, శక్తిశాలినే సభాపతి రాజుగా స్వీకరించుడు. ॥౨౧॥

21.May life be devoted to obeying the orders of God. May life-breath thrive through practice. May eye thrive by the study of natural objects. May ear thrive by listening to the Vedas. May questioning improve through mutual discussion. May worship of God thrive through celibacy. May we be the true sons of God. May the learned attain to final emancipation and thereby enjoy happiness.

౩౭౮. అస్మే ఇత్యస్య వసిష్ఠ ఋషిః, దిశో దేవతాః, నిచృదత్యష్టిశ్ఛందః, గాంధారః స్వరః.

ఈశ్వరాజ్ఞాతో మనుష్యైరిహ కథం వర్తితవ్యమిత్యుపదిశ్యతే.

పరమేశ్వరాజ్ఞానుసారము మానవు లీ లోకమునం దెట్లుండవలయునను

విషయ మీ మంత్రమునందు చెప్పబడినది.

౩౭౮ అస్మే వో అస్త్వింద్రియమస్మేనృమ్ణముత క్రతురస్మే వర్చాంసి

సంతు వః। నమో మాత్రే పృథివ్యై నమో మాత్రే పృథివ్యాఽ

ఇయం తే రాడ్యంతాసి యమనో ధ్రువోఽసి ధరుణః।

కృష్యై త్వా క్షేమాయ త్వా రయ్యై త్వా పోషాయ త్వా॥౨౨॥

**ప.విః-** అస్మేఽ ఇత్యస్మే, వః, అస్తు, ఇంద్రియమ్, అస్మేఽ ఇత్యస్మే, నృమ్ణమ్, ఉత, క్రతుః, అస్మేఽ ఇత్యస్మే వర్చాంసి. సంతు, వః, నమః, మాత్రే, పృథివ్యై, నమః, మాత్రే, పృథివ్యై, ఇయమ్, తే, రాట్, యంతా, అసి, యమనః, ధ్రువః, అసి, ధరుణః, కృష్యై, త్వా, క్షేమాయ, త్వా, రయ్యై, త్వా, పోషాయ, త్వా ॥౨౨॥

**పదార్థః** :-(అస్మే) అస్మాకమస్మభ్యం వా (వః) యుష్మాకం యుష్మభ్యం వా (అస్తు) భవతు (ఇంద్రియమ్) మన ఆదీని (అస్మే) మే (నృమ్ణమ్) ధనమ్ (ఉత) అపి (క్రతుః) ప్రజ్ఞా కర్మ వా (అస్మే) మే (వర్చాంసి) ప్రకాశమానాధ్యయనాని. వర్చ ఇత్యన్న నా... నిఘం.౨.౭. (సంతు) (వః) యుష్మాకం యుష్మభ్యం వా (నమః) అన్నాదికమ్ (మాత్రే) మాన్యనిమిత్తాయై (పృథివ్యై) విస్తృతాయై భూమయే (నమః) జలాదికమ్ (మాత్రే) (పృథివ్యై) (ఇయమ్) (తే) తవ (రాట్) రాజమానా (యంతా) నియంతా (అసి) (యమనః) ఉపయంతా (ధ్రువః) నిశ్చలః (అసి) (ధరుణః) ధర్తా (కృష్యై) కృషంతి విలిఖంతి భూమిం యయా తస్యై (త్వా) త్వామ్ (క్షేమాయ) రక్షణాయ (త్వా) (రయ్యై) శ్రియై (త్వా) (పోషాయ) పుష్టయే (త్వా) అయం మంత్రః. శత. ౫.౨.౧.౧౫-౨౫.వ్యాఖ్యాతః.॥౨౨॥

**అన్వయః**:-హే మనుష్యాఽహమీశ్వరః కృష్యై త్వా, క్షేమాయ త్వా, రయ్యై త్వా, పోషాయ త్వా నియుంజామి. యస్త్వం ధ్రువో యంతాసి, ధరుణో యమనోఽసి, యస్య తే తవేయం రాడస్తి. అస్యై మాత్రే పృథివ్యై నమోఽస్యై మాత్రే పృథివ్యై నమో విధేహి. సర్వే యూయం యదస్మే ఇంద్రియం తద్వోఽస్తు. యదస్మే నృమ్ణం తద్వోఽస్తు. ఉతాపి యోఽస్మే క్రతుః స వోఽస్తు. యాన్యస్మాకం వర్చాంసి తాని వః సంతు. యదేతత్సర్వం వోఽస్తు. తదస్మాకమస్త్విత్యేవం పరస్పరం యూయం సమాచరత.॥౨౨॥

**భావార్థః** :-మనుష్యాన్ ప్రతీశ్వరస్యేయమాజ్ఞాఽస్తి భవంతః సదైవ సత్కర్మసు ప్రయతంతామ్. ఆలస్యం మా కుర్వతామ్. పృథివ్యాః సకాశాదన్నాదీన్యుత్పాద్య సంరక్ష్యైతత్సర్వం పరస్పరముపకారాయ యథా స్యాత్తథా తద్ధితం విదధతామ్. ॥౨౨॥

**పదార్థము** :- ఓ మానవా! ఈశ్వరుడనగు నేను (కృష్యై) వ్యవసాయమునకై (త్వా) నిన్ను (క్షేమాయ) రక్షణకొరకు (త్వా) నిన్ను (రయ్యై) సంపదలకొరకు (త్వా) నిన్ను (పోషాయ) పుష్టికొరకు (త్వా) నిన్ను నియుక్తమొనర్చుచున్నాను. నీవు (ధ్రువః) దృఢశాలివి (యన్తా) నియమముగ నడచువాడవు (అసి) ఐయున్నావు (ధరుణః) ధారణమొనర్చువాడవు (యమనః) ఉద్యోగశాలివి (అసి) ఐయున్నావు (తే) నీ కెయ్యది (ఇయమ్) ఇట్టి (రాట్) శోభాయుక్తమై యున్నదో అట్టి ఈ (మాత్రే) మాన్యతకు హేతువగు (పృథివ్యై) విస్తారముతోగూడిన పృథివికి (నమః) అన్నజలాది పదార్థములు లభించుగాక! (మాత్రే) మాన్యతనిచ్చునట్టి (పృథివ్యై) పృథివీతత్త్వమును మరియు భూగర్భవిద్యనెరిగి దీనినుండి (నమః) అన్నము, జలము మున్నగు పదార్థముల ప్రాప్తిజేసికొని మీరెల్లరును పరస్పరము ఇట్లు చెప్పుకొనుడు, ప్రవర్తించుకొనుడు. ఎట్లన (అస్మే) మాయొక్క (ఇన్ద్రియమ్) మనస్సు మున్నగు ఇంద్రియములు (వః) మీకొరకై యుండుగాక! (అస్మే) మాయొక్క (నృమ్ణమ్) ధనము (వః) మీకొరకు వినియోగముగుగాక! (ఉత) మరియు (అస్మే) మాయొక్క (క్రతుః) బుద్ధి, లేక కర్మ (వః) మీ హితముకొరకు వినియోగపడుగాక! (వర్చాంసి) మేము చదివినవి, చదివించినవి, మాయన్నములు మున్నగునవి (వః) మీకొరకు (సన్తు) వినియోగపడుగాక! ఈ సర్వమును మీదియు, మాదియును అగుగాక! పరస్పర మిట్టి యాచరణనే యొనర్చుడు. ॥౨౨॥

**భావార్థము:**- మానవులకీశ్వరు డీవిధముగా ఉపదేశించుచున్నాడు. ఓ మానవులారా! మీరెల్లరును సోమరితనమును దరిజేరనీయక సదా పురుషార్థపరులై పృథివినుండి పండించిన అన్నాది పదార్థములను రక్షించుడు. వానిని పరస్పరము ఉపకారకార్యములందు ఉపయోగమగునట్లు ప్రయత్నించుడు. పరస్పరం విరోధములను వదలి ఇతరుల కార్యసాధనములందు మీరును సహకరించుడు. ॥౨౨॥

22.I enjoin thee for agriculture, advancement, wealth, and prosperity. Thou art persevering, law-abiding, preserving and eminent. May food-grains be produced from this venerable Earth. May the worthy science of geology be studied, and water and food grains produced thereby from the Earth. May our physical force, wealth, wisdom, and knowledge be for your service.

౩౭౯.వాజస్యేత్యస్య వసిష్ఠ ఋషిః, ప్రజాపతిర్దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తైరత్ర కథం భవితవ్యమిత్యాహ.

ఈ విషయమున వా రెట్లుండ వలయున దీ మంత్రమం దుపదేశించబడినది.

౩౭౯ వాజస్యేమం ప్రసవః సుషువేఽగ్రే సోమ్ꣳరాజాన మోషధీష్వప్సు।

తాఽఅస్మభ్యం మధుమతీర్భవంతు వయꣳ రాష్ట్రే

జాగ్రియామ పురోహితాః స్వాహా ॥౨౩॥

ప.వి:- వాజస్య, ఇమమ్, ప్రసవ ఇతి ప్ర + సవః, సుషువే, సుసువ ఇతి సుసువే, అగ్రే, సోమమ్, రాజానమ్, ఓషధీషు, అప్స్విత్యప్ + సు, తాః, అస్మభ్యమ్, మధుమతీ రితి మధు +మతీః, భవన్తు, వయమ్ రాష్ట్రే, జాగ్రియామ, పురోహితా ఇతి పురః+హితాః, స్వాహా॥౨౩॥

**పదార్థః** :-(వాజస్య) బోధస్య సకాశాత్ (ఇమమ్) (ప్రసవః) ఐశ్వర్యయుక్తః (సుషువే) ప్రసవే ఉత్పాదయే (అగ్రే)పూర్వమ్ (సోమమ్) సోమమివ సర్వదుఃఖప్రణాశకమ్ (రాజానమ్) విద్యాన్యాయవినయైః ప్రకాశమానం స్వామినమ్ (ఓషధీషు) పృథివీస్థాసు యవాదిషు (అప్సు) జలేషు వర్తమానాః (తాః) (అస్మభ్యమ్) (మధుమతీః) ప్రశస్తా మధవో మధురాదయో గుణా విద్యంతే యాసు తాః (భవంతు) (వయమ్) అమాత్యాదయో భృత్యాః (రాష్ట్రే) రాజ్యే (జాగ్రియామ) సచేతనా అనలసాః సంతో వర్తేమహి. (పురోహితాః) సర్వేషాం హితకారిణః. (స్వాహా) సత్యయా క్రియయా సహ. అయం మంత్రః. శత.౫.౨.౨-౫. వ్యాఖ్యాతః.॥౨౩॥

**అన్వయః** :- హే మనుష్యాః! యథాఽహమగ్రే ప్రసవః సన్ వాజస్యేమం సోమం రాజానం సుషేవే యథా తద్రక్షణేన యా ఓషధీష్వప్స్వోషధయః సంతి, తాః అస్మభ్యం మధుమతీ ర్భవంతు. యథా స్వాహా పురోహితా వయం రాష్ట్రే సతతం జాగృయామ తథా యూయమపి వర్తధ్వమ్. ॥౨౩॥

**భావార్థః** :- శిష్టా మనుష్యాః! సర్వవిద్యాచాతుర్యారోగ్యసహితం సౌమ్యాదిగుణాలంకృతం రాజానం సంస్థాప్య తద్రక్షకో వైద్య ఏవం ప్రవర్తేత. యథాఽస్య శరీరే బుద్ధావాత్మని చ రోగావేశో న స్యాత్. ఇత్థమేవ రాజవైద్యో సర్వానమాత్యాదీన్ భృత్యానరోగాన్ సంపాదయేతామ్. యత ఏతే రాజ్యస్థ సజ్జనపాలనే దుష్టతాడనే సదా ప్రయతేరన్. రాజా ప్రజా చ పితా పుత్రవత్ సదా వర్తేయాతామ్. ॥౨౩॥

**పదార్థము** :- ఓ మానవులారా! నే నెట్లు (అగ్రే) ప్రథమముగ (ప్రసవః) ఐశ్వర్యయుక్తుడనై (వాజస్య) వైద్యశాస్త్రబోధనకు సంబంధించిన (ఇమమ్) ఈ (సోమమ్) చంద్రునివలె సమస్త దుఃఖములను నాశమొనర్చువాడు (రాజానమ్) విద్యావినయ న్యాయములచే ప్రకాశవంతుడగు రాజును (సుషువే) ఐశ్వర్యవంతునిగా నొనర్చితినో ఆయన రక్షణయందు (ఓషధీషు) పృథివిపై యుత్పన్నమగు యవలు మున్నగు ధాన్యోషధులు (అప్సు) జలము మధ్యనగల ఓషధులు (తాః) అవన్నియును (అస్మభ్యమ్) మాకొరకు (మధుమతీ) ప్రశస్తమగు మధురగుణములు గలవిగా (భవన్తు) అగునుగాక! (స్వాహా) సత్యక్రియలతోగూడ (పురోహితాః) సర్వహితకారులమగు మేము (రాష్ట్రే) రాజ్యమునందు నిరంతరము (జాగృయామ) సోమరితనమును వదలివేసి మేల్కొనియుండునట్లు మీరును వర్తించుచుండుడు. ॥౨౩॥

**భావార్థము** :- సమస్త విద్యలందు పారంగతుడు, రోగరహితుడు ఉత్తమగుణములచే విరాజిల్లుచుండు ధర్మాత్మునకు రాజ్యాధికారమునిచ్చుట ప్రజల ముఖ్యకర్తవ్యమైయున్నది. ఆ రాజును రక్షించు వైద్యుడు అతని శరీరము, బుద్ధి, ఆత్మలయందు వ్యాధులు ప్రవేశించకుండునట్లు ప్రయత్నించవలయును. ఇదేవిధముగ రాజు మరియు వైద్యుడు ఇరువురును అమాత్యులు మున్నగు సకల రాజపురుషులను, ప్రజలను ఆరోగ్యవంతులుగ నుంచవలెను. అందువల్ల వీరు రాజ్యమునందలి దుష్టులను శిక్షించుచు, శిష్టులను రక్షించుచుండవలెను. రాజు మరియు ప్రజలు పరస్పరము పితా పుత్రులవలె సదా వర్తించుచుండవలెను. ॥౨౩॥

**23.I, being First and Affluent, lend wisdom and prosperity to this king, the driver of all miseries and shining with knowledge, justice and humility.**

**May the medicines produce on the earth or grown in water, be highly efficacious for us. May we, the ministers, act tactfully for the betterment of the State, remaining alert, and always keeping the interests of the government foremost.**

**౩౨౦. వాజస్యేమామిత్యస్య వసిష్ఠ ఋషిః, ప్రజాపతిర్దేవతా, భురిగ్ జగతీ ఛందః నిషాదః స్వరః.**

**రాజా కిమాశ్రిత్య కేన కిం కుర్యాదిత్యుపదిశ్యతే.**

**రా జెవరి యాశ్రయమున ఎవరితో నే మొనర్పవలెనను దీ మంత్రమున గలదు.**

౩౮౦ వాజస్యేమాం ప్రసవః శిశ్రియే దివమిమా చ విశ్వా
భువనాని సమ్రాట్। అదిత్సన్తం దాపయతి ప్రజానన్త్స నో
రయిం సర్వవీరం నియచ్ఛతు స్వాహా ॥౨౪॥

ప.వి:- వాజస్య, ఇమామ్, ప్రసవ ఇతి ప్ర + సవః, శిశ్రియే, దివమ్, ఇమా, చ, విశ్వా, భువనాని, సమ్రాడితి సమ్+రాట్, అదిత్సన్తమ్, దాపయతి, ప్రజానన్నితి ప్ర+జానన్, సః, నః, రయిమ్, సర్వవీరమితి సర్వ + వీరమ్, ని, యచ్ఛతు, స్వాహా ॥౨౪॥

**పదార్థః** :-(వాజస్య) రాజ్యస్య (ఇమామ్) భూమిమ్ (ప్రసవః) ప్రసూతః (శిశ్రియే) సమాశ్రయే (దివమ్) దేదీప్యమానాం రాజనీతిమ్ (ఇమా) ఇమాని (చ) (విశ్వా) సర్వాణి (భువనాని) గృహాణి (సమ్రాట్) యో రాజధర్మే సమ్యగ్రాజతే సః (అదిత్సన్తమ్) రాజకరం దాతుమనిచ్ఛన్తమ్ (దాపయతి) (ప్రజానన్) ప్రజ్ఞావాన్ సన్ (సః) (నః) అస్మాకం ప్రజాస్థానామ్ (రయిమ్) ధనమ్ (సర్వవీరమ్) సర్వే వీరా యస్మాత్తత్ (ని) నితరామ్ (యచ్ఛతు) గృహ్ణాతు (స్వాహా) ధర్మ్యయా వాచా. అయమ్మన్త్రః. శత. ౫.౨.౨. ౬. వ్యాఖ్యాతః.॥౨౪॥

**అన్వయః**:-హే మనుష్యా! యథా వాజస్య మధ్యే ప్రసవః సమ్రాడహమిమాం దివమిమా విశ్వా భువనాని చ శిశ్రియే తథా యూయమప్యేనమేతాని చాశ్రయత. యః స్వాహా ప్రజానన్నదిత్సన్తం దాపయతి స నః సర్వవీరం రయిం నియచ్ఛతు.॥౨౪॥

**భావార్థః**:-హే మనుష్యాః! యో మూలస్య రాజ్యస్య మధ్యే సనాతనీం రాజనీతిం విదిత్వా రాజ్యం సంరక్షితుం శక్నుయాత్, తమేవ చక్రవర్తినం రాజానం కురుత. యః కరస్యాదాతుః కరం దాపయేత్, సోఽమాత్యో భవితు మర్హేత్. యః శత్రూన్ నిగ్రహీతుం శక్నుయాత్ తం సేనాపతిం కురుత. యో విద్వాన్ ధార్మికో భవేత్తం న్యాయాధీశం కోశాధ్యక్షం వా కురుత.॥౨౪॥

**పదార్థము** :- ఓ మనుష్యులారా! ఎట్లు (వాజస్య) రాజ్యమందు (ప్రసవః) ఉత్పన్నమైన (సమ్రాట్) ఉత్తమవిధిగా రాజధర్మమందు ప్రవర్తమానుడనైన నేను (ఇమామ్) ఈ భూమిని (దివమ్) ప్రకాశితమునగు [రాజనీతిని] (ఇమా) ఈ (విశ్వా) సకల (భువనాని) గృహములను (శిశ్రియే) నేను చక్కగా ఆశ్రయించుచున్నట్లే మీరును వీనిని బాగుగ ఆశ్రయించి శోభింపజేయుడు. (స్వాహా) ధర్మముతో గూడిన

సత్యవాణిచే (ప్రజానన్) ప్రజ్ఞాశాలినై (అదిత్సన్తమ్) రాజ్యపుపన్నులను [సిస్తులను] చెల్లించదలచనివారినుండి (దాపయతి) ఇప్పించుచున్నట్లు (సః) అతడు (నః) మాలోగల (సర్వవీరమ్) సకల వీరులను ప్రాప్తింపజేయు (రయిమ్) ధనమును (నియచ్ఛతు) ధరించునుగాక! ॥౨౪॥

భావార్థము :- ఓ మనుష్యులారా! రాజ్యమున సనాతన రాజనీతిని చక్కగానెరిగి, రాజ్యమును సమర్థవంతముగా రక్షించువానినే చక్రవర్తిరాజుగా నియమించుకొనుడు. పన్నులు చెల్లించని వారినుండి పన్నులు రాబట్టువానిని అమాత్యునిగ నొనర్చుడు. శత్రువులకు భయంకరుడగు వానిని సేనాపతిగ మరియు ధార్మికుడగు విద్వాంసుని న్యాయాధీశునిగాని, కోశాధ్యక్షునిగాని జేసికొనవలెను. ॥౨౪॥

24.I,the king,born in my state,afford shelter to all habitations,and enforce my policy.

May he, who truly. knowing all his duties, realises taxes from those, unwilling to pay, receive from us riches, that bring us heroes.

౩౮౧. వాజస్యన్విత్యస్య వసిష్ఠ ఋషిః, ప్రజాపతి ర్దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునా రాజా కీదృశో భవేదిత్యాహ.

రాజెట్టివాడై యుండవలెనను విషయ మీ మంత్రమం దుపదేశించబడినది.

౩౮౧ వాజస్య ను ప్రసవ ఆ బభూవేమా చ విశ్వా భువనాని సర్వతః। సనేమి రాజా పరియాతి విద్వాన్ ప్రజాం పుష్టిం వర్ధయమానో౨ అస్మే౨ స్వాహా॥౨౫॥

ప. విః- వాజస్య, ను, ప్రసవ ఇతి ప్ర + సవః, ఆ, బభూవ, ఇమా, చ, విశ్వా, భువనాని, సర్వతః, సనేమి, రాజా, పరి, యాతి, విద్వాన్, ప్రజామితి ప్ర+జామ్, పుష్టిమ్, వర్ధయమానః, అస్మే౨ ఇత్యస్మే, స్వాహా॥౨౫॥

పదార్థః :-(వాజస్య) వేదాదిశాస్త్రోత్పన్నబోధస్య (ను) శీఘ్రమ్ (ప్రసవః) యః ప్రసూతే సః (ఆ) సమంతాత్ (బభూవ) భవేత్ (ఇమా) ఇమాని (చ) (విశ్వా) సర్వాణి (భువనాని) మాండలికరాజ నివాసస్థానాని (సర్వతః) (సనేమి) సనాతనేన నేమినా ధర్మేణ సహ వర్తమానం రాజ్యమండలమ్ (రాజా) వేదోక్తరాజగుణైః ప్రకాశమానః (పరి) (యాతి) ప్రాప్నోతి (విద్వాన్) సకల విద్యావిత్ (ప్రజామ్) పాలనీయామ్ (పుష్టిమ్) పోషణమ్ (వర్ధయమానః) (అస్మే) అస్మాకమ్ (స్వాహా) సత్యయా నీత్యా. అయం మంత్రః. శ.౨.౨.౨.౭. వ్యాఖ్యాతః. ॥౨౫॥

**అన్వయః** :- యో వాజస్య స్వాహా ప్రసవో విద్వానాబభూవేమా విశ్వా భువనాని సనేమి. చ ప్రజాం పుష్టిం ను వర్ధయమానః పరియాతి సో అస్మే రాజా భవతు.॥౨౫॥

**భావార్థః** :- ఈశ్వరోఽభివదతి. హే మనుష్యాః! యూయం ప్రశంశితగుణకర్మస్వభావో రాజ్యం రక్షితుం సమర్థో భవేత్తం సభాధ్యక్షం కృత్వాఽఽప్తనీత్యా సామ్రాజ్యం కురుతేతి.॥౨౫॥

**పదార్థము** :- ఎవడు (వాజస్య) వేదాది శాస్త్రములద్వారా ఉత్పన్నజ్ఞానమును (స్వాహా) సత్యనీతితో (ప్రసవః) ప్రాప్తించుకొని (విద్వాన్) సంపూర్ణవిద్యల నెరిగినవాడు (ఆ) ఉత్తమరీతిలో (బభూవ) యుండునో (చ) మరియు (ఇమా) ఈ (విశ్వా) సకల (భువనాని) మాండలికరాజ నివాసస్థానములను (సనేమి) సనాతన నియమధర్మములతో గూడియున్న (ప్రజామ్) పాలించదగిన ప్రజలను (పుష్టిమ్) పోషణమును (ను) శీఘ్రముగ (వర్ధయమానః) వృద్ధిపరచుచు (పరి) సకలదిశలనుండి (యాతి) వ్యాపించువాడే (అస్మే) మాకు రాజగుగాక!॥౨౫॥

**భావార్థము** :- ఓ మానవులారా! మీరు ప్రశంసించదగిన గుణకర్మస్వభావములు గలిగి రాజ్యమును చక్కగా రక్షించి పెంపొందజేయు సమర్థతగలవానినే సభాధ్యక్షునిగ నొనర్చి ఆప్తనీతిద్వారా సామ్రాజ్యమును పాలించుచుండు డని పరమేశ్వరు డెల్లరకును ఉపదేశించుచున్నాడు. ॥౨౫॥

25. He is fit to be our King, who knows the course of conduct, as inculcated by the Vedas, who advances in knowledge, behaves properly, conduces to the prosperity of his old subjects, and all these provinces of the state, and thours throughout his territory.

౩౦౨. సోమమిత్యస్య తాపస ఋషిః, సోమాగ్న్యాదిత్యవిష్ణుసూర్యబృహస్పతయో దేవతాః, అనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.

పునః కీదృశం రాజానం స్వీకుర్యురిత్యుపదిశ్యతే.

ఎట్టి రాజును నియమించుకొనవలె నను విషయము మరల నిందుపదేశించబడెను.

౩౦౨ సోమ్ం రాజా॑నం॒ మవ॑సే॒ఽగ్నిమ్॒న్వార॑భామహే।

ఆ॒ది॒త్యాన్విష్ణు॒ꣳ సూర్యం॑ బ్ర॒హ్మాణం॑ చ॒ బృహ॒స్పతి॒ꣳ స్వాహా॑ ॥౨౬॥

ప.వి:- సోమ॑మ్, రాజా॑నమ్, అవ॑సే, అ॒గ్నిమ్, అ॒న్వారభామహ॒ ఇత్యను + ఆరభామహే,

ఆ॒ది॒త్యాన్, విష్ణు॑మ్, సూర్య॑మ్, బ్ర॒హ్మాణ॑మ్, చ॒, బృ॒హ॒స్పతి॑మ్, స్వాహా॑ ॥౨౬॥

పదార్థః:-(సోమమ్) సోమగుణసంపన్నమ్ (రాజానమ్) ధర్మాచరణేన ప్రకాశమానమ్ (అవసే) రక్షణాద్యాయ (అగ్నిమ్) అగ్నిమివ శత్రుదాహకమ్ (అన్వారభామహే) (ఆదిత్యాన్) విద్యాఽర్జనాయ కృతాఽష్టచత్వారింశద్వర్షబ్రహ్మచర్యాన్ విదుషః (విష్ణుమ్) వ్యాపకం పరమేశ్వరమ్ (సూర్యమ్) సూరిషు విద్వత్సు భవమ్ (బ్రహ్మాణమ్) అధీతసాంగోపాంగచతుర్వేదమ్ (చ) (బృహస్పతిమ్) బృహతామాప్తానాం పాలకమ్ (స్వాహా) సత్యయా వాణ్యా. ॥౨౬॥

అన్వయః:-హే మనుష్యా యథా వయం స్వాహాఽవసే సహ వర్తమానం విష్ణుం సూర్యం బ్రహ్మాణం బృహస్పతిమగ్నిం సోమం రాజానమాదిత్యాంశ్చాన్వారభామహే, తథా యూయమప్యారభధ్వమ్. ॥౨౬॥

భావార్థః:-ఈశ్వరాజ్ఞాఽస్తి. సర్వే మనుష్యా రక్షణాద్యాయ బ్రహ్మచర్యాదినా విద్యాపారగాన్ విదుషస్తన్మధ్య ఉత్తమం సూర్యాదిగుణసంపన్నం రాజానం చ స్వీకృత్య సత్యాం నీతిం వర్ధయంత్వితి. ॥౨౬॥

పదార్థము :-ఓ మానవులారా! మే మెట్లు (స్వాహా) సత్యవాణిచే (అవసే) రక్షణ మున్నగువానికై (విష్ణుమ్) సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు (సూర్యమ్) విద్వాంసులందు సూర్యునివంటి విద్వాంసుడు (బ్రహ్మాణమ్) చతుర్వేదములను సాంగోపాంగముగ చదువువాడు (బృహస్పతిమ్) పెద్దలను రక్షించువాడు (అగ్నిమ్) అగ్నివలె శత్రువులను దహించివేయువాడు (సోమమ్) శాంతగుణసంపన్నుడు (రాజానమ్) ధర్మాచరణమునందు ప్రకాశవంతుడగు రాజును (ఆదిత్యాన్) నలుబదెనిమిది (౪౮) సంవత్సరములవరకు బ్రహ్మచర్యవ్రతుడై పూర్ణవిద్యలగ్రహించి సూర్యునివలె ప్రకాశవంతుడై విద్వాంసుల మెప్పును పొంది గృహస్థాశ్రమమును (అన్వారభామహే) ఆరంభించునట్లు మీరును ఆచరించుడు. ॥౨౬॥

భావార్థము :-మానవులెల్లరును రక్షణము మున్నగువానికొరకు బ్రహ్మచర్యాది వ్రతములను పాలించి మహావిద్వాంసులమధ్య నలువదెనిమిది (౪౮) సంవత్సరములు ఆదిత్యబ్రహ్మచర్యముతో, దీక్షతో వేదాది సకలశాస్త్రముల నభ్యసించినవానినే రాజుగా స్వీకరించి సత్యమైన నీతిని వర్ధిల్లజేయవలెనని ఈశ్వరాజ్ఞ.॥౨౬॥

26.Let us elect him, for our protection, after due deliberations, as king, who is amiable, and destroyer of foes like fire, who has received education from the learned, who has observed the vow of celibacy for forty eight years, who holds sway over administrative problems, is supreme among the learned, is master of all the four vedas, and protector of the sages.

౩౮౩. అర్యమణ మిత్యస్య తాపస ఋషిః, అర్యమాదిమంత్రోక్తా దేవతాః, స్వరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునా రాజా కాన్ కస్మిన్ ప్రేరయే దిత్యాహ.

రాజు ఎవరి నెట్టికార్యములందు ప్రేరేపించవలయునను దిందుగలదు.

౩౮౩ అర్యమణం బృహస్పతిమింద్రం దానాయ చోదయ ।
వాచం విష్ణుగ్ం సరస్వతీగ్ం సవితారం చ వాజినగ్ం స్వాహా ॥౨౭॥

ప.వి:- అర్యమణమ్, బృహస్పతిమ్, ఇంద్రమ్, దానాయ, చోదయ, వాచమ్, విష్ణుమ్, సరస్వతీమ్, సవితారమ్, చ, వాజినమ్, స్వాహా ॥౨౭॥

**పదార్థః** :-(అర్యమణమ్) పక్షపాతరాహిత్యేన న్యాయకర్తారమ్. (బృహస్పతిమ్) సకలవిద్యాధ్యాపకమ్ (ఇంద్రమ్) పరమైశ్వర్యయుక్తమ్ (దానాయ)(చోదయ) ప్రేరయ (వాచమ్) వేదవాణీమ్ (విష్ణుమ్) సర్వాధిష్ఠాతారమ్ (సరస్వతీమ్) బహువిధం సరో వేదాదిశాస్త్రవిజ్ఞానం విద్యతే యస్యాస్తాం విజ్ఞాన యుక్తామధ్యాపికాం స్త్రియమ్. (సవితారమ్) వేదవిద్యైశ్వర్యోత్పాదకమ్ (చ) (వాజినమ్) ప్రశస్త బలవేగాదియుక్తం శూరవీరమ్. (స్వాహా) సత్యయా నీత్యా. అయమ్మన్త్రః. శత. ౫.౨.౨.౯. వ్యాఖ్యాతః. ॥౨౭॥

**అన్వయః** :-హే రాజ న్స్త్వం స్వాహా దానాయార్యమణం బృహస్పతిమింద్రం వాచం విష్ణుం సవితారం వాజినం సరస్వతీం చ సత్కర్మసు సదా చోదయ.॥౨౭॥

**భావార్థః** :-ఈశ్వరోఽభివదతి. రాజా స్వయం ధార్మికో విద్వాన్ భూత్వా సర్వాన్ న్యాయాధీశాన్ మనుష్యాన్ విద్యాధర్మవర్ధనాయ సతతం ప్రేరయేద్యతో విద్యాధర్మవృద్ధ్యాఽవిద్యాఽ ధర్మానివృత్తౌ స్యాతామ్. ॥౨౭॥

**పదార్థము** :- ఓ రాజా! నీవు (స్వాహా) సత్యమగు నీతితో (దానాయ) విద్య మున్నగు దానములకై (అర్యమణమ్) పక్షపాతములేని న్యాయశాలిని (బృహస్పతిమ్) సమస్త విద్యలనభ్యసింపజేయువానిని (ఇంద్రమ్) మహదైశ్వర్యశాలిని (వాచమ్) వేదవాణిని (విష్ణుమ్) సర్వమునకు అధిష్ఠాతయైనవానిని (సవితారమ్) వేదవిద్యలను అభ్యసించి సమస్తైశ్వర్యముల నుత్పన్నమొనర్చువానిని (వాజినమ్) చక్కని బలవేగములు గలిగియున్న శూరువీరుని (సరస్వతీమ్) బహువిధముల వేదాదిశాస్త్రములను విజ్ఞానయుక్తముగ చదివినట్టి విదుషీమణిని సత్కర్మలందు (చోదయ) నీవు సదా ప్రేరణ మొనర్చుచుండుము. ॥౨౭॥

**భావార్థము** :-ధర్మాత్ముడు, విద్వాంసుడునగు రాజు న్యాయశీలురెల్లరును విద్యాధర్మములను వృద్ధిపరచుటకై సదా ప్రేరేపణ గలిగించుచుండినచో విద్యాధర్మములు వర్ధిల్లి అవిద్య, అధర్మము దూరమగునని పరమేశ్వరుడు సకల ప్రజలను గూర్చి ఉపదేశించుచున్నాడు. ॥౨౭॥

27.O King, with a sound policy, for the spread of knowledge, urge, the lover of impartial justice, the teacher of all sciences, the master of riches and the vedas, the leader of men, the learned mistress, the lover of vedic lore and the brave warrior for nobledeeds!.

౩౮౪. అగ్న ఇత్యస్య తాపస ఋషిః, అగ్నిర్దేవతా, భురిగనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః స రాజా కిం కిం కుర్యాదిత్యాహ.

ఆ రాజా ఏ మేమి చేయవలయునను విషయ మీ మంత్రమునం దుపదేశించబడినది.

౩౮౪ అగ్నఽఉ అచ్ఛా వదేహ నః ప్రతి నః సుమనా భవ ।

ప్ర నో యచ్ఛ సహస్రజిత్ త్వꣳహి ధనదాఽఉ అసి స్వాహా ॥౨౮॥

ప. విః-అగ్నే, అచ్ఛ, వద, ఇహ, నః, ప్రతి, నః, సుమనా ఇతి సు+మనాః, భవ, ప్ర, నః, యచ్ఛ, సహస్రజిదితి సహస్ర+జిత్, త్వమ్, హి, ధనదా ఇతి ధన+దాః, అసి, స్వాహా॥౨౮॥

పదార్థః:-(అగ్నే) విద్వన్ (అచ్ఛ) సమ్యక్ నిపాతస్య చేతి దీర్ఘః (వద) సత్యముపదిశ (ఇహ) అస్మిన్సమయే (నః) అస్మాన్ (ప్రతి)(నః) అస్మాన్ (సుమనాః) సుహృద్భావః (భవ) ((ప్ర) (నః) అస్మభ్యమ్ (యచ్ఛ) దేహి (సహస్రజిత్) అసహాయః సన్ సహస్రం యోద్ధ్రాన్ జేతుం శీలః (త్వమ్) (హి) యతః (ధనదాః) ఐశ్వర్యదాతా (అసి) (స్వాహా) సత్యయా వాణ్యా. అయమ్మన్త్రః. శత. ౫.౨.౨.౧౦. వ్యాఖ్యాతః.॥౨౮॥

**అన్వయః**:-హే అగ్నే త్వమిహ స్వాహా నోఽచ్ఛ వద. నోఽస్మాన్ ప్రతి సుమనా భవ. త్వం హి సహస్రజిద్ధనదా అసి తస్మాన్నః సుఖం ప్రయచ్ఛ. ॥౨౮॥

**భావార్థః**:-ఈశ్వర ఆహ. రాజా ప్రజాసేనాజనాన్ప్రతి సదా సత్యం ప్రియం చ దద్యాత్, గృహ్ణీయాచ్ఛ, శరీరాత్మబలం వర్ధిత్వా నిత్యం శత్రూన్ జిత్వా ధర్మేణ ప్రజాః పాలయేదితి. ॥౨౮॥

**పదార్థము** :-(అగ్నే) ఓ విద్వాంసుడా! నీవు (ఇహ) ఈ సమయమునందు (స్వాహా) సత్యవాణిచే (నః) మాకు (అచ్ఛ) ఉత్తమరీతిలో (వద) ఉపదేశమొనర్చుము. (నః) మాయెడ (సుమనాః) మిత్రభావము గలవాడవు (భవ) ఆగుము. (హి) దీనివల్ల (సహస్రజిత్) అన్యసహాయము నాశించకుండ వేలాది శత్రువులను జయించువాడవు (ధనదాః) ఐశ్వర్యములనిచ్చువాడవు (అసి) ఐయుందువు (నః) మాకు (ప్రయచ్ఛ)) సుఖముల నిమ్ము.॥౨౮॥

**భావార్థము** :-రాజు, ప్రజలు మరియు సైన్యములతో సదా సత్యమును, ప్రియమునునగు వచనములే పలుకవలయును. వారికి ధనమునిచ్చుట, వారినుండి గ్రహించుటయును జేయుచు శారీరిక, ఆత్మిక బలములను వృద్ధిపరచుకొని శత్రువుల నిర్మూలించి ధర్మముగ ప్రజాపాలన మొనర్చవలెనని ఈశ్వరు డుపదేశించుచున్నాడు.॥౨౮॥

28.O King, speak truthfully and kindly to us here, be graciously inclined to us. Winner of thousands of warriors, grant us happiness, for thou art the giver of wealth!.

౩౦౫. ప్ర న ఇత్యస్య తాపస ఋషిః, అర్యమాది మంత్రోక్తా దేవతాః, భురిగార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

రాజా మాత్రాదయశ్చ ప్రజాః కిం కిముపదిశేయురిత్యాహ.

రాజు ప్రజలతో, మాత తన సంతానముతో ఎట్లుండవలయునన దిందు గలదు.

౩౦౫ ప్ర నో॑ యచ్ఛత్వర్య॒మా ప్ర పూ॒షా ప్ర బృహ॒స్పతి॑ః ।
ప్ర వా॒గ్దే॒వీ ద॑దాతు నః॒ స్వాహా॑ ॥౨౯॥

**ప.వి:**-ప్ర, నః॒, య॒చ్ఛ॒తు॒, అ॒ర్య॒మా, ప్ర, పూ॒షా, ప్ర, బృహ॒స్పతి॑ః, ప్ర, వాక్, దే॒వీ, ద॒దా॒తు॒, నః॒, స్వాహా॑ ॥౨౯॥

**పదార్థః**:-(ప్ర) (నః) అస్మభ్యమ్ (యచ్ఛతు) దదాతు (అర్యమా) న్యాయాధీశః (ప్ర)(పూషా) పోషకః (ప్ర) (బృహస్పతిః) విద్వాన్ (ప్ర)(వాక్)విద్యాసుశిక్షిత వాణీయుక్తా (దేవీ) దేదీప్యమానాఽధ్యాపికా మాతా (దదాతు) (నః) అస్మభ్యమ్ (స్వాహా) సత్యవిద్యాయుక్తాం వాణీమ్. అయమ్మన్త్రః. శత. ౫.౨.౨.౧౧. వ్యాఖ్యాతః.॥౨౯॥

**అన్వయః**:-యథాఽర్యమా నోఽస్మభ్యం సుశిక్షాం ప్రయచ్ఛతు. యథా పూషా పుష్టిం ప్ర దదాతు. యథా బృహస్పతిః స్వాహా ప్రార్పయతు తథా వాగ్ దేవీ మాతాఽస్మభ్యం విద్యాం దదాతు.॥౨౯॥

**భావార్థః**:-అత్రాఽఽహ జగదీశ్వరః. రాజాదయః సర్వే పురుషా మాత్రాది స్త్రియశ్చ సర్వదా ప్రజాః పుత్రాదీన్ ప్రతి సత్యముపదేశం కుర్యుర్విద్యాం సుశిక్షాం చ సతతం గ్రాహయేయుర్యతః ప్రజాః సదాఽఽనందితాః స్యుః. ॥౨౯॥

**పదార్థము** :-ఎట్లు (అర్యమా) న్యాయాధీశుడు (నః) మాకొరకు ఉత్తమశిక్షణ (ప్రయచ్ఛతు) ఇచ్చునో (పూషా) పోషణకొరకు శరీరాత్మలకు పుష్టిని గలిగించు శిక్షణను (ప్ర) ఉత్తమరీతిలో ఇచ్చునో, ఎట్లు

(బృహస్పతిః) విద్వాంసుడు ((ప్ర స్వాహా) అత్యుత్తమవిద్యలను ప్రసాదించునో, అదేవిధముగ (వాక్) ఉత్తమవిద్యా, సుశిక్షణ, వాణితో గూడిన (దేవీ) శ్రేష్ఠపద్ధతిలో చదివించు విదుషీమాత మాకొరకు సత్యవిద్యలతో గూడిన వాణిని ((ప్ర దదాతు) సదా ఉపదేశించుచుండుగాక॥౨౯॥

**భావార్థము :-** రాజు మున్నగు సకల విద్వాంసులు, మాతలు మున్నగు సకల విదుషీమణులు, ప్రజలకు, వారిసంతానములకు సత్యవాణులను సదా ఉపదేశించుచుండవలెను. వారికి ధనముల నీయవలెను. వారినుండి ధనములను స్వీకరించవలెను. శరీరాత్మల శక్తులను వృద్ధిపరచుకొని శత్రువుల నిర్జించవలెనని పరమేశ్వరు డుపదేశించుచున్నాడు.॥౨౯॥

29.As the Lord of Justice gives us good instruction, as the nourisher gives us strength of body and soul, as a learned man gives us knowledge, so let the mother, a sweet-tongued and nice instructor impart knowledge unto us.

౩౦. దేవస్యేత్యస్య తాపస ఋషిః, సమ్రాట్ దేవతా, జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునః క్వ కీదృశం రాజానం కుర్యురిత్యుపదిశ్యతే.

ఎచ్చట ఎట్టివానిని ప్రజాజనము రాజుగా నొనర్చవలయు నను దీ మంత్రమందు

పరమేశ్వరు డుపదేశించుచున్నాడు.

౩౦. దేవస్య త్వా సవితుః ప్రసవే౨ఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్।
సరస్వత్యై వాచో యన్తు ర్యన్త్రియే దధామి బృహస్పతేష్ట్వా
సామ్రాజ్యే నాభిషించామ్యసౌ॥౩౦॥

**ప.విః-** దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు +భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, సరస్వత్యై, వాచః, యన్తుః, యన్త్రియే, దధామి, బృహస్పతేః, త్వా, సామ్రాజ్యేనేతి సామ్+రాజ్యేన, అభి, సించామి, అసౌ.॥౩౦॥

**పదార్థః-**(దేవస్య) ప్రకాశమానస్య (త్వా) త్వామ్ (సవితుః) సకలజగత్ప్రసవితురీశ్వరస్య (ప్రసవే) జగదుత్పాదే (అశ్వినోః) సూర్యాచంద్రమసోర్బలాకర్షణాభ్యామివ (బాహుభ్యాం) భుజాభ్యాం (పూష్ణః) పోషకస్య వాయోర్ధారణపోషణాభ్యామివ (హస్తాభ్యామ్) కరాభ్యామ్ (సరస్వత్యై) విజ్ఞానసుశిక్షాయుక్తాయాః

అత్ర షష్ఠ్యర్థే చతుర్థీ (వాచః) వేదవాణ్యాః (యంతుః) నియంతుః (యంత్రియే) శిల్పవిద్యాసిద్ధానాం యంత్రాణామర్థే యోగ్యే నిష్పాదనే (దధామి) ధరామి (బృహస్పతేః) పరమవిదుషః (త్వా)(సామ్రాజ్యేన) సమ్రాజో భావేన. (అభి) అభిముఖ్యే (సించామి) సుగంధేన రసేన మార్జ్మి (అసౌ) అదో నామా. అయమ్మన్త్రః శత. ౫.౨.౨.౧౨-౧౫. వ్యాఖ్యాతః. ॥30॥

**అన్వయః** :- హే అఖిలశుభగుణకర్మస్వభావయుక్త విద్వన్నసావహం సవితుర్దేవస్య జగదీశ్వరస్య ప్రసవే సరస్వత్యై వాచోఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వా దధామి. యంతు ర్బృహస్పతే ర్యంత్రియే సామ్రాజ్యేన త్వాభిషించామి. ॥30॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైరీశ్వరప్రియం బలవీర్యపుష్టియుక్తం ప్రగల్భం సత్యవాదినం జితేంద్రియం ధార్మికం ప్రజాపాలనక్షమం విద్వాంసం సుపరీక్ష్య సభాయా అధిష్ఠాత్వత్వే నాభిషిచ్య రాజ్యధర్మ ఉన్నేయః. ॥30॥

**పదార్థము** :- సమస్త శుభగుణకర్మస్వభావయుక్తుడవగు విద్వాంసా! (అసౌ) ఈ నేను (సవితుః) సమస్త జగత్తునుత్పన్నమొనర్చిన పరమేశ్వరుడు (దేవస్య) ప్రకాశస్వరూపుడగు జగదీశ్వరునిచే (ప్రసవే) సృష్టించబడిన విశ్వమునందు (సరస్వత్యై) చక్కని శిల్పవిద్యచే గూడిన (వాచః) వేదవాణిద్వారా (అశ్వినోః) సూర్యచంద్రులవలె ధారణ పోషణగుణములతో గూడిన (హస్తాభ్యామ్) హస్తములచే (త్వా) నిన్ను (దధామి) ధారణమొనర్చుచున్నాను. మరియు (బృహస్పతేః) మహావిద్వాంసుల (యన్త్రియే) శిల్పవిద్యచే సాధించబడిన రాజ్యమునందు (సామ్రాజ్యేన) చక్రవర్తిరాజువంటి గుణములతో గూడిన (త్వా) నిన్ను (అభి) సకల దిశలనుండి (సించామి) సుగంధరసములచే పరిశుద్ధమొనర్చుచున్నాను. ॥30॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఈశ్వరభక్తుడు, బలవీర్య పరాక్రమములు గలవాడు, చతురుడు, సత్యవంతుడు, జితేంద్రియుడు ధర్మాత్ముడు, ప్రజాపాలన సమర్థత గలవాడునగు విద్వాంసుని చక్కగా పరీక్షించి రాజ్యసభకు అధిపతిగా నభిషేకించి రాజధర్మమునుద్ధరించుట మానవుల కర్తవ్యము. ॥30॥

30. O good-natured educated person, I, in this world created by the Effulgent God, appoint thee as King with the knowledge of the Vedas, with arms strong like the sun and the moon, with hands swift like the wind. I annoint thee with supreme kingship in this state well organised by the learned!.

308. అగ్నిరేకేత్యస్య తాపస ఋషిః, అగ్న్యాదయో మంత్రోక్తా దేవతాః, అత్యష్టిశ్ఛందః, గాంధారః స్వరః.

రాజా ప్రజాః, ప్రజాశ్చ రాజానం సతతం వర్ధయేయురిత్యాహ.

రాజు ప్రజలను, ప్రజలు రాజును నిరంతరము అభివృద్ధిపరచుకొనుచుండవలయు నను

విషయ మీ మంత్రమున చెప్పబడినది.

౩౮౭ అగ్ని రేకాక్షరేణ ప్రాణముదజయత్ తముజ్జేషమశ్వినౌ ద్వ్యక్షరేణ
ద్విపదో మనుష్యా నుదజయతాం తానుజ్జేషం విష్ణు స్త్ర్యక్షరేణ
త్రీఌల్లోకా నుదజయత్తానుజ్జేషగ్ం సోమ శ్చతురక్షరేణ చతుష్పదః
పశూనుదజయత్తాను జ్జేషమ్ ॥౩౧॥

ప.వి:-అగ్నిః, ఏకాక్షరేణేత్యేక + అక్షరేణ, ప్రాణమ్, ఉత్, అజయత్, తమ్, ఉత్, జేషమ్, అశ్వినౌ, ద్వ్యక్షరేణేతి ద్వి + అక్షరేణ, ద్విపద ఇతి ద్వి + పదః, మనుష్యాన్, ఉత్, అజయతామ్, తాన్, ఉత్, జేషమ్, విష్ణుః, త్ర్యక్షరేణేతి త్రి + అక్షరేణ, త్రీన్, లోకాన్, ఉత్, అజయత్, తాన్, ఉత్, జేషమ్, సోమః, చతురక్షరేణేతి చతుః + అక్షరేణ, చతుష్పదః, చతుఃపద ఇతి చతుః + పదః, పశూన్, ఉత్, అజయత్, తాన్, ఉత్, జేషమ్.॥౩౧॥

పదార్థః :-(అగ్నిః) అగ్నిరివ వర్తమానో రాజా (ఏకాక్షరేణ) ఓమిత్యనేన విజ్ఞాపకేన దైవ్యా గాయత్ర్యా ఛందసా (ప్రాణమ్) శరీరస్థం వాయుమివ ప్రజాజనమ్ (ఉత్) ఉత్కృష్టయా నీత్యా (అజయత్) జయేదుత్కృష్టేత్ (తమ్) (ఉత్) (జేషమ్) జయేయముత్కృష్టేయమ్ (అశ్వినౌ) సూర్యాచంద్రమసావివ రాజరాజపురుషౌ (ద్వ్యక్షరేణ) దైవ్యా ఉష్ణిహా (ద్విపదః) (మనుష్యాన్) మననశీలాన్ (ఉత్)(అజయతామ్) (తాన్) (ఉత్) (జేషమ్) (విష్ణుః) పరమేశ్వర ఇవ న్యాయకారీ (త్ర్యక్షరేణ) దైవ్యాఽనుష్టుభా (త్రీన్) జన్మస్థాననామవాచ్యాన్ (లోకాన్) దర్శనీయాన్ (ఉత్) (అజయత్) (తాన్) (ఉత్) (జేషమ్) (సోమః) ఐశ్వర్యమిచ్ఛుః (చతురక్షరేణ) దైవ్యా బృహత్యా (చతుష్పదః) (పశూన్) హిరణ్యాదీనారణ్యాన్ (ఉత్) (అజయత్) (తాన్) (ఉత్) (జేషమ్). అయమ్మన్త్రః శత. ౫.౨.౨.౧౭. వ్యాఖ్యాతః.॥౩౧॥

**అన్వయః**:-హే రాజన్నగ్నిర్భవాన్ యథా ఏకాక్షరేణ ప్రాణమివ యం ప్రజాజనముదజయత్తథా తమహమప్యుజ్జేషమ్. హే రాజజనావశ్వినౌ భవంతౌ. యథా ద్వ్యక్షరేణ యాన్ ద్విపదో మనుష్యానుద జయతామ్. తథా తానహమప్యుజ్జేషమ్. హే సర్వప్రధానపురుష విష్ణుర్భవాన్ యథాత్ర్యక్షరేణ యాన్

త్రీల్లోకానుదజయత్. తథా తానహమప్యుజ్జేషమ్. న్యాయాధీశ సోమో భవాన్యథా చతురక్షరేణ యాశ్చతుష్పదః పశూనుదజయత్ తథా తానహమప్యుజ్జేషమ్. ॥30॥

**భావార్థః:**- యది రాజా సర్వాన్ ప్రజాజనానున్నయేత్తర్హి ప్రజాపురుషాస్తం కథం నోన్నయేయుర్నో చేన్న. ॥30॥

**పదార్థము :**- ఓ రాజా! (అగ్నిః) అగ్నివలెనున్న నీ వెట్లు (ఏకాక్షరేణ) చైతన్యవంతమైన ఏకాక్షరముతో గూడిన దైవీగాయత్రీ ఛందస్సుతో (ప్రాణమ్) శరీరమందున్న వాయువు వలె ప్రజలను (ఉత్ జేషమ్) ఉత్తమనీతిచే (అజయత్) ఉత్తములుగ నొనర్చునట్లు (తమ్) ఆతనిని నేనుసైతము (ఉత్ జేషమ్) ఉత్తమునిగనొనర్చెదను. ఓ రాజ ప్రజలారా! (అశ్వినౌ) సూర్యచంద్రులవలె మీరెట్లు (ద్వ్యక్షరేణ) రెండక్షరముల దైవీఉష్ణిక్ ఛందస్సుతో (ద్విపదః) రెండుపాదములుగల (మనుష్యాన్) మననశీలురగు మానవులను (ఉజ్జయతామ్) ఉత్తములనుగ జేయునట్లు (తాన్) వారిని నేనుకూడ (ఉజ్జేషమ్) ఉత్తములనూగా జేయుదును. ఓ సర్వప్రదాతా! (విష్ణుః) పరమేశ్వరునివలె న్యాయకారివగు నీవు (త్ర్యక్షరేణ) మూడక్షరములుగల దైవీఅనుష్టుప్ ఛన్దస్సుతో (త్రీన్) జన్మస్థాన నామ వాచకములు గలిగి (లోకాన్) దర్శించదగిన ముల్లోకములను (ఉదజయత్) ఉత్తమముగ నొనర్చునట్లు (తాన్) వానిని నేనును (ఉజ్జేషమ్) ఉత్తములుగ నొనర్చెదను. (సోమః) ఐశ్వర్యముల కాంక్షించు రాజాధీశా! నీవు (పశూన్) హరిణములు మున్నగు మృగములను (ఉదజయత్) ఉత్తమములుగ నొనర్చునట్లు (తాన్) వానిని నేనుకూడ (ఉజ్జేషమ్) ఉత్తమునిగా జేయుదునుగాక!. ॥30॥

**భావార్థము:**- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ప్రజల నెల్లరను రాజు పెంపొందించుచుండునట్లే ప్రజలును రాజును అభివృద్ధినొందించవలెను. ఆతడట్లు జేయజాలకుండిన ప్రజలును ఆతని నేమాత్రము బలపరచరని యెంచవలెను. ॥30॥

31.O King, just as thou, with the monosyllabic Om elevatest thy subjects, so may I elevate them. Just as the King and his men like the sun and moon, with dissyllabic metre, elevate bipeds, so may I elevate them. Just as the just King, with trisyllabic metre elevates the three worlds, so may I elevate them. Just as a King desirous of prosperity, with quadrisyllabic metre subdues the four-footed cattle, so may I subdue them!

3౮౮. పూషేత్యస్య తాపస ఋషిః, పూషాదయో మంత్రోక్తా దేవతాః, కృతిశ్ఛందః, నిషాదః స్వరః.

పునా రాజప్రజాజనాః కింవత్కిం కుర్యురిత్యాహ.

ఎవరి దృష్టాంతముచే రాజా ప్రజలు ఏమేమి చేయవలెను విషయ మిందు గలదు.

3౮౮ పూషా పంచాక్షరేణ పంచ దిశ ఉదజయత్తా ఉజ్జేషస్స

సవితా షడక్షరేణ షడృతూనుదజయత్తానుజ్జేషమ్

మరుతః సప్తాక్షరేణ సప్త గ్రామ్యాన్ పశూనుదజయ్ంస్తానుజ్జేషమ్ ।
బృహస్పతిరష్టాక్షరేణ గాయత్రీముదజయత్తాముజ్జేషమ్ ॥౩౨॥

**ప.వి:-** పూషా, పంచాక్షరేణేతి పంచ + అక్షరేణ, పంచ, దిశః, ఉత్, అజయత్, తాః, ఉత్, జేషమ్, సవితా, షడక్షరేణేతి షట్ + అక్షరేణ, షట్, ఋతూన్, ఉత్, అజయత్, తాన్, ఉత్, జేషమ్, మరుతః, సప్తాక్షరేణేతి సప్త + అక్షరేణ, సప్త, గ్రామ్యాన్, పశూన్, ఉత్, అజయన్, తాన్, ఉత్, జేషమ్, బృహస్పతిః, అష్టాక్షరేణేత్యష్ట + అక్షరేణ, గాయత్రీమ్, ఉత్, అజయత్, తామ్, ఉత్, జేషమ్ ॥౩౨॥

**పదార్థః:-** (పూషా) చంద్ర ఇవ సర్వస్య పోషకః (పంచాక్షరేణ) దైవ్యా పంక్త్యా (పంచ) చతస్రః పార్శ్వస్థా ఏకా అధ ఊర్ధ్వస్థా (దిశః) (ఉత్) (అజయత్) (తాః) (జేషమ్)(సవితా) సూర్య ఇవ (షడక్షరేణ) దైవ్యా త్రిష్టుభా (షట్, ఋతూన్) వసంతాదీన్ (ఉత్) (అజయత్) (తాన్) (ఉత్) (జేషమ్) (మరుతః) వాయవ ఇవ (సప్తాక్షరేణ) దైవ్యా జగత్యా (సప్త) గోఽశ్వమహిషోష్ట్రాజావిగర్దభాన్ (గ్రామ్యాన్) గ్రామే భవాన్ (పశూన్) గవాదీన్ (ఉత్) (అజయన్) (తాన్) (ఉత్) (జేషమ్) (బృహస్పతిః) అనూచానో విద్వానివ (అష్టాక్షరేణ) యాజుష్యాఽనుష్టుభా (గాయత్రీమ్) యయా గాయంతం త్రాయతే తాం నీతిమ్ (ఉత్) (అజయత్) (తామ్) (ఉత్) (జేషమ్).॥౩౨॥

**అన్వయః :-** హే రాజన్! పూషా భవాన్ యథా పంచాక్షరేణ యాః పంచ దిశ ఉదజయత్తథాఽహమపి తా ఉజ్జేషమ్. హే రాజన్! సవితా భవాన్ యథా షడక్షరేణ యాన్ షడృతూనుదజయత్తథా తానహమప్యుజ్జేషమ్. హే సభ్యా జనాః! మరుతో భవంతో యథా సప్తాక్షరేణ యాన్ గ్రామ్యాన్ సప్త పశూనుదజయత్తథా తానహమప్యుజ్జేషమ్. హే విద్వన్ సభాధ్యక్ష! బృహస్పతిర్భవాన్ యథాఽష్టాక్షరేణ యాం గాయత్రీ ముదజయత్తామహమప్యుజ్జేషమ్.॥౩౨॥

**భావార్థః :-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. యో రాజా సర్వస్య పోషకః సమస్తదిక్షుకీర్తిరైశ్వర్యవాన్ సుసభ్యః పశుపాలకో వేదవిద్భవేత్తం సర్వే రాజప్రజాసేనాజనా ఉత్కర్షయేయుః.॥౩౨॥

**పదార్థము :-** ఓ రాజా! (పూషా) చంద్రునివలె ఎల్లరను పుష్టివంతమొనర్చు నీవు (పంచాక్షరేణ)

ఐదక్షరముల దైవీపంక్తిచే (పఞ్చ) తూర్పుమొదలు నాలుగు మరియు క్రిందిమీదనొకటియగు (దిశః) దిశలను (ఉదజయత్) ఉత్తమకీర్తితో నింపుచున్నట్లు (తాః) వానిని నేనుకూడ (ఉజ్జేషమ్) శ్రేష్ఠమగు కీర్తితో నింపుదునుగాక! ఓ రాజా! (సవితా) సూర్యునివలె నీవు (షడక్షరేణ) ఆరక్షరములుగల దైవీత్రిష్టుప్ ఛందముతో ఏ (షట్) ఆరు (ఋతూన్) వసంతము మొదలగు ఋతువులను (ఉదజయత్) శుద్ధపరచుచున్నావో అట్లే (తాన్) వానిని నేనును (ఉజ్జేషమ్) శుద్ధమొనర్చెదనుగాక! ఓ సభాసదులారా! (మరుతః) వాయువువలె మీరెట్లు (సప్తాక్షరేణ) ఏడక్షరముల దైవీజగతీ ఛందస్సుతో (సప్త) గోవు, అశ్వము, గేదె, ఒంటె, మేక, గొఱ్ఱె, గాడిద ఈ ఏడు (గ్రామ్యాన్) గ్రామ (పశూన్) పశువులను (ఉదజయత్) అభివృద్ధిపరచుచున్నారో (తాన్) నేనును వానిని వృద్ధియొనర్తునుగాక! ఓ సభాధ్యక్షా! (బృహస్పతిః) సకలవిద్యల నెరిగినట్టి విద్వాంసునివలె నీవు (అష్టాక్షరేణ) ఎనిమిదక్షరములుగల యాజుషీ అనుష్టుప్ ఛందముచేత (గాయత్రీమ్) గానమొనర్చువారి రక్షణమొనర్చు విదుషీమణిని (ఉదజయత్) ప్రతిష్ఠ యొనర్చుచున్నటులనే (తామ్) ఆమెను నేనును (ఉజ్జేషమ్) ప్రతిష్ఠింతును.॥32॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. సర్వజనపోషకుడు, సకల దిశలందు కీర్తిమంతుడు, ఐశ్వర్యశాలి, సభాకార్యములందు చతురుడు, పశుపాలకుడు, వేదజ్ఞాతయైయుండు రాజాను ప్రజలు సేన మొదలగు నెల్లరును తమకు యధిష్ఠాతగా జేసికొని ఉన్నతిచెందవలయును.॥32॥

32.O king, the nourisher of all, with penta syllabic metre, thou hast won the five regions, may I also win them. Resplendent like the sun, thou, O' King, with six syllabic metre hast controlled the six seasons, may I also control them. O' King, fast like the sun, as thou with hepta syllabic metre rearest the seven domestic animals, so may I also reag them. O' learned King, as thou with octosyllabic metre followest the self-preserving policy, so may I also follw it!.

**33. మిత్ర ఇత్యస్య తాపస ఋషిః, మిత్రాదయో మంత్రోక్తా దేవతాః, కృతి శ్ఛందః, నిషాదః స్వరః.**

**రాజ్ఞః సత్యాచారాఽనుకరణం ప్రజయా ప్రజయాశ్చ రాజ్ఞా కార్యమిత్యాహ.**

**రాజుయొక్క సత్యాచరణము ప్రజలు, ప్రజలను రాజు అనుసరించి యుండవలెను.**

## 33 మిత్రో నవాక్షరేణ త్రివృత్తస్తోమ ముదజయత్ తముజ్జేషమ్ ।

## వరుణో దశాక్షరేణ విరాజముదజయ త్తాముజ్జేషమింద్రఽ

## ఏకాదశాక్షరేణ త్రిష్టుభముదజయత్తాముజ్జేషమ్।

## విశ్వే దేవా ద్వాదశాక్షరేణ జగతీ ముదజయఀస్తా ముజ్జేషమ్ ॥33॥

ప.వి:- మిత్రః, నవాక్షరేణేతి నవ + అక్షరేణ, త్రివృత్తమితి త్రి + వృత్తమ్, స్తోమమ్, ఉత్, అజయత్, తమ్, ఉత్, జేషమ్, వరుణః, దశాక్షరేణేతి దశ + అక్షరేణ, విరాజమితి వి+ రాజమ్, ఉత్, అజయత్, తామ్, ఉత్, జేషమ్, ఇంద్రః, ఏకాదశాక్షరేణేత్యేకాదశ + అక్షరేణ, త్రిష్టుభమ్, త్రిస్తుభమితీ త్రి + స్తుభమ్, ఉత్, అజయత్, తామ్, ఉత్, జేషమ్, విశ్వే, దేవాః, ద్వాదశాక్షరేణేతి ద్వాదశ + అక్షరేణ, జగతీమ్, ఉత్, అజయన్, తామ్, ఉత్, జేషమ్ ॥33॥

పదార్థః:-(మిత్రః) సర్వస్య సుహృత్ (నవాక్షరేణ) యాజుష్యా బృహత్యా (త్రివృత్తమ్) కర్మోపాసనాజ్ఞానయుక్తమ్. (స్తోమమ్) స్తోతుం యోగ్యమ్ (ఉత్) (అజయత్) (తమ్) (ఉత్) (జేషమ్) (వరుణః) శ్రేష్ఠః (దశాక్షరేణ) యాజుష్యా పంక్త్యా (విరాజమ్) విరాట్ ఛందోవాచ్యమ్ (ఉత్) (అజయత్) (తామ్) (ఉత్) (జేషమ్) (ఇంద్రః) పరమైశ్వర్యవాన్ (ఏకాదశాక్షరేణ) ఆసుర్యా పంక్త్యా (త్రిష్టుభమ్) త్రిష్టుప్ఛందో వాచ్యమ్ (ఉత్) (అజయన్)(తామ్) (ఉత్) (జేషమ్) (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః (ద్వాదశాక్షరేణ) సామ్న్యాగాయత్ర్యా (జగతీమ్) ఏతచ్ఛందోఽభిహితాం నీతిమ్. (ఉత్) (అజయన్) (తామ్) (ఉత్) (జేషమ్).॥33॥

**అన్వయః** :-హే రాజన్! మిత్రో భవాన్ యథా నవాక్షరేణ ఛందసా యం త్రివృత్తం స్తోమముదజయత్తథా తమహమప్యుజ్జేషమ్. హే ప్రశంసనీయ సభేశ! వరుణో భవాన్ యథా దశాక్షరేణ ఛందసా యాం విరాజముదజయత్, తథాఽహమప్యుజ్జేషమ్. హే పరమైశ్వర్యప్రదేంద్రో భవాన్ యథైకాదశాక్షరేణ యాం త్రిష్టుభముదజయత్తథా తామహమప్యుజ్జేషమ్. హే సభాజనా విశ్వేదేవాః భవంతో యథా ద్వాదశాక్షరేణ యాం జగతీముదజయంస్తామహమప్యుజ్జేషమ్.॥33॥

**భావార్థః**:-రాజజనాః సర్వేషు ప్రాణిషు మైత్రీం విధాయ సుశిక్షయోత్కృష్టాన్ విదుషః సంపాదయేయుర్యతస్తే ఐశ్వర్యభాగినో భూత్వా రాజభక్తా భవేయుః.॥33॥

**పదార్థము** :-ఓ రాజా! (మిత్రః) సర్వజనహితకారివగు నీ వెట్లు (నవాక్షరేణ) తొమ్మిదక్షరములుగల యాజుషీ బృహతీఛందస్సుతో (త్రివృత్తమ్) జ్ఞాన కర్మ ఉపాసనలద్వారా (స్తోమమ్) స్తుతికి యోగ్యుడైనవానిని (ఉదజయత్) చక్కగా నెరుగుచున్నావో (తమ్) ఆతనిని నేనును (ఉజ్జేషమ్) చక్కగా నెరుగుదునుగాక! ప్రశంసించదగిన ఓ సభాధీశా! (వరుణః) సర్వ శ్రేష్ఠుడవగు నీవు (దశాక్షరేణ) పదియక్షరములుగల యాజుషీ

ఛందస్సుద్వారా (విరాజమ్) విరాట్ ఛందముతో ప్రతిపాదితమగు అర్థమును (ఉదజయత్) పొందియున్నట్లు (తామ్) దానిని నేనును (ఉజ్జేషమ్) పొందుదునుగాక (ఇన్ద్రః) పరమైశ్వర్యంజేయు నీ వెట్లు (ఏకాదశాక్షరేణ) పదకొండక్షరములుగల ఆసురీపంక్తిశ్ఛందస్సుతో (త్రిష్టుభమ్) త్రిష్టుప్ ఛందోవాణిని (ఉదజయత్) బాగుగా నెరుగుచున్నావో అట్లే (తామ్) నేనును దానిని (ఉజ్జేషమ్) చక్కగా నెరుగుదునుగాక! ఓ సభ్యజనులారా! (విశ్వేదేవాః) సమస్తవిద్వాంసులారా! ఎట్లు మీరు (ద్వాదశాక్షరేణ) పంన్రెండక్షరములుగల సామ్నీగాయత్రీ ఛందముతో (జగతీమ్) జగతిద్వారా చెప్పబడిన నీతిని (ఉదజయత్) ప్రచారమొనర్చుచున్నారో అట్లే (తామ్) దానిని నేనును (ఉజ్జేషమ్) ప్రచారమొనర్తునుగాక! ॥33॥

**భావార్థము** :-సకల ప్రజలు రాజభక్తిగలవారు, ఐశ్వర్యవంతులు, విద్యావంతులుగా నుండుటకొరకై రాజపురుషులు సర్వప్రాణులందు మైత్రిని, చక్కని శిక్షణను గరపి ప్రజలను ఉన్నతమైన గుణవంతులుగ నొనర్పవలయును.॥33॥

33.O King, the friend of all, just as thou knowest him, with nine-syllabicmetre, Him, deserving of praise with the aid of knowledge, action and meditation; Him may I know. O praiseworthy King, just as thou, with decasyllabic metre knowest Him mentioned in virat verses, so may I also know Him!.

O giver of riches, just as thou with hendecasyllabic metre knowest Him mentioned in Trishtup verses, so may I also know Him. O ye all learned persons, just as you with, dodecasyllabic metre. know the teaching conveyed in jagati metre, so may I also know it!.

౩౯౦.వసవ ఇత్యస్య తాపస ఋషిః, వస్వాదయో మంత్రోక్తా దేవతాః, వసవ ఇత్యస్య నిచృజ్జగతీ ఛందః, నిషాదః స్వరః, ఆదిత్యా ఇత్యస్య నిచృద్ధృతిశ్ఛందః, ఋషభః స్వరః.

పునరపి రాజప్రజాధర్మకృత్యమాహ.

రాజ మరియు ప్రజలయొక్క ధర్మకార్యముల గూర్చి ఉపదేశించబడినది.

౩౯౦ వసవ స్త్రయోదశాక్షరేణ త్రయోదశꣳ స్తోమముదజయꣲస్తముజ్జేషꣳ రుద్రా శ్చతుర్దశాక్షరేణ చతుర్దశꣳ స్తోమముదజయꣲ స్తముజ్జేషమ్ । ఆదిత్యాః పంచదశాక్షరేణ పంచదశꣳ స్తోమముదజయꣲ స్తముజ్జేష మదితిః షోడశాక్షరేణ షోడశꣳ స్తోమ ముదజయత్తముజ్జేషమ్ । ప్రజాపతిః సప్తదశాక్షరేణ సప్తదశꣳ స్తోమముదజయత్తముజ్జేషమ్ ॥౩౪॥

ప.వి:- వసవః, త్రయోదశాక్షరేణేతి త్రయోదశ + అక్షరేణ, త్రయోదశమితి త్రయః + దశమ్, స్తోమమ్, ఉత్, అజయన్, తమ్, ఉత్, జేషమ్, రుద్రాః, చతుర్దశాక్షరేణేతి చతుర్దశ + అక్షరేణ, చతుర్దశమితి చతుః + దశమ్, స్తోమమ్, ఉత్, అజయన్, తమ్, ఉత్, జేషమ్, ఆదిత్యాః, పంచదశాక్షరేణేతి పంచదశ + అక్షరేణ, పంచదశమితి పంచ + దశమ్, స్తోమమ్, ఉత్, అజయన్, తమ్, ఉత్, జేషమ్, అదితిః, షోడశాక్షరేణేతి షోడశ + అక్షరేణ, షోడశమితి షోడశమ్, స్తోమమ్, ఉత్, అజయత్, తమ్, ఉత్, జేషమ్, ప్రజాపతిరితి ప్రజాపతిః, సప్తదశాక్షరేణేతి సప్తదశ + అక్షరేణ, సప్త దశమితి సప్త+దశమ్, స్తోమమ్, ఉత్, అజయత్, తమ్, ఉత్, జేషమ్ ॥౩౪॥

పదార్థః :-(వసవః) కృతచతుర్వింశతివర్షబ్రహ్మచర్యేణ గృహీతవిద్యాః (త్రయోదశాక్షరేణ) ఆసుర్యాఽనుష్టుభా (త్రయోదశమ్) దశప్రాణజీవమహత్తత్వానాం సంఖ్యాపూరకమవ్యక్తం కారణమ్. (స్తోమమ్) స్తోతుం యోగ్యమ్ (ఉత్) (అజయన్) (తమ్) (ఉత్) (జేషమ్) (రుద్రాః) కృతేన చతుశ్చత్వారింశద్వర్షబ్రహ్మచర్యేణాధీతవిద్యాః (చతుర్దశాక్షరేణ) సామ్న్యుష్ణిహా (చతుర్దశమ్) దశేంద్రియమనోబుద్ధి చిత్తానాం సంఖ్యాపూరకమహఙ్కారమ్ (స్తోమమ్) స్తవనీయమ్ (ఉత్) (అజయన్) (తమ్) (ఉత్) (జేషమ్) (ఆదిత్యాః) సమాచరితేనాష్టచత్వారింశద్వర్షపరిమితబ్రహ్మచర్యేణ గృహీతసమస్త విద్యాః (పంచదశాక్షరేణ) ఆసుర్యా గాయత్ర్యా (పంచదశమ్) చత్వారో వేదాశ్చత్వార ఉపవేదాః షడంగాని చ మిలిత్వా చతుర్దశవిద్యాస్తాసాం సంఖ్యాపూరకం క్రియాకౌశలమ్ (స్తోమమ్) స్తోతుమర్హమ్ (ఉత్)(అజయన్) (తమ్) (ఉత్) (జేషమ్) (అదితిః) అవిద్యమానా దితిర్నాశో యస్యాః సా రాజపత్నీ (షోడశాక్షరేణ) సామ్న్యానుష్టుభా (షోడశమ్) ప్రమాణాది పదార్థసమూహమ్ (స్తోమమ్) ప్రశంసనీయమ్ (ఉత్) (అజయత్) (తమ్) (ఉత్) (జేషమ్) (ప్రజాపతిః) ప్రజాయాః పాలకః (సప్తదశాక్షరేణ) నిచృదార్ష్యా గాయత్ర్యా (సప్తదశమ్) చత్వారో వర్ణాశ్చత్వార ఆశ్రమాః శ్రవణమననిదిధ్యాసనాని చ కర్మాణి. అలబ్ధస్య లిప్సా, లబ్ధస్య ప్రయత్నేన రక్షణం, రక్షితస్య వృద్ధిః, వృద్ధస్య సన్మార్గే సర్వోపకారకే సత్కర్మణి వ్యయకరణమేవ చతుర్విధః పురుషార్థః, మోక్షాఽనుష్ఠానం చేతి సప్తదశమ్. (స్తోమమ్) అతి ప్రశంసనీయమ్

(ఉత్) ఉత్కృష్టరీత్యా (అజయత్) ఉత్కర్షేత్ (తమ్) (ఉత్) (జేషమ్) ఉత్కర్షేయమ్. మన్త్రోఽయం శత. ౫.౨.౨.౧౭ వ్యాఖ్యాతః. ॥౩౪॥

**అన్వయః** :-హే రాజాదయః సభ్యా వసవో విద్వాంసో జనా భవంతో యథా త్రయోదశాక్షరేణ యం త్రయోదశం స్తోమముదజయంస్తథాఽహముజ్జేషమ్. హే బలవీర్యవంతః పురుషార్థినో రుద్రా భవంతో యథా చతుర్దశాక్షరేణ యం చతుర్దశం స్తోమముదజయంస్తథా తమహమప్యుజ్జేషమ్. హే పూర్ణవిద్యయా శరీరాత్మాఖిలబలా ఆదిత్యాః! భవంతో యథా పంచదశాఽక్షరేణ యం పంచదశం స్తోమముదజయఁస్తథా తమహమప్యుజ్జేషమ్. హే సభాధ్యక్షస్య రాజ్ఞః పత్న్యదితే అఖండితైశ్వర్యా భవతీ యథా షోడశాక్షరేణ యం షోడశం స్తోమముదజయత్ తథా తమహమప్యుజ్జేషమ్. హే! సర్వాఽభిరక్షక! సజ్జన! నరేశ! ప్రజాపతిర్భవాన్ యథా సప్తదశాక్షరేణ యం సప్తదశం స్తోమముదజయత్ తథా తమహమప్యుజ్జేషమ్. ॥౩౪॥

**భావార్థః**:-హే మనుష్యాః! ఏతైశ్చతుర్భిర్మంత్రైర్యావాన్ రాజప్రజాధర్మో విహితస్తమనుష్ఠాయ యూయం సుఖినో భవత. ॥౩౪॥

**పదార్థము** :-రాజా! మరియు సభ్యజనులారా! (వసవః) ఇరువదినాలుగు సంవత్సరములవరకు బ్రహ్మచర్యము పాటించి విద్యనభ్యసించు విద్వాంసులారా! మీరెట్లు (త్రయోదశాక్షరేణ) పదమూడక్షరములుగల ఆసురీఅనుష్టుప్ అనువేదోక్త ఛందస్సుతో (త్రయోదశమ్) పదిప్రాణములు, జీవము, మహత్తత్త్వము, అవ్యక్తకారణరూపము అను నీ పదమూడు (స్తోమమ్) ప్రశంసించదగిన పదార్థ సమూహమును (ఉదజయన్) శ్రేష్ఠత్వముగ నెరుగునట్లు (తమ్) నేను కూడ (ఉజ్జేషమ్) చక్కగా నెరుగుదునుగాక! బలపరాక్రమములచే గూడిన పురుషార్థపరులునగు (రుద్రాః) నలువదినాలుగు సంవత్సరములవరకు కఠిన బ్రహ్మచర్యమునందుండి విద్యలనార్జించిన విద్వాంసులారా! మీరెట్లు (చుతర్దశాక్షరేణ) పదునాల్గక్షరములుగల సామ్నీఉష్ణిక్ ఛందస్సుతో (చతుర్దశమ్) దశేంద్రియములు, మనోబుద్ధి చిత్తాహంకారము లను పదునాలుగు (స్తోమమ్) ప్రశంసించదగిన పదార్థవిద్యను (ఉదజయన్) ప్రశంసించుచుండునట్లు నేనును (తమ్) దానిని (ఉజ్జేషమ్) ప్రశంసింతును. (ఆదిత్యా) నలుబదెనిమిది సంవత్సరముల బ్రహ్మచర్యముద్వారా సమస్తవిద్యలను పొందినవారును, సంపూర్ణవిద్యలచే శరీర, ఆత్మల బలవముతో గూడినవారును, సూర్యునివంటి ప్రకాశముగలవారును నగు విద్వాంసులారా! మీరెట్లు (పంచదశాక్షరేణ) నాలుగువేదములు, నాలుగు ఉపవేదములు అనగా ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము [గానవిద్య], అర్థవేదము [శిల్పశాస్త్రము]లు, షడంగము [శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిష్యము]లు ఆ సంఖ్యను పూర్తియొనర్చుటకు 'క్రియాకౌశలత్వము' దీనితో గలిసి పదిహేను (స్తోమమ్) స్తుతింపదగినవానిని (ఉదజయన్) చక్కగా నెరుగుదురో, అట్లే నేనును (తమ్) దానిని (ఉజ్జేషమ్) బాగుగా నెరుగుదునుగాక! (అదితిః) ఆత్మరూపముతో నాశరహితమైన సభాధ్యక్షుడగు రాజు పట్టమహిషీ, విదుషీ, అఖండైశ్వర్యవతివగు రాణీ! నీ వెట్లు (షోడశాక్షరేణ) పదహారక్షరములుగల సామ్నీ అనుష్టుప్ఛందముతో (షోడశమ్) పదహారు [అనగా ప్రమాణము, ప్రమేయము, సంశయము, ప్రయోజనము, దృష్టాంతము, సిద్ధాంతము, అవయవము, తర్కము,

నిర్ణయము, వాదము, జల్పము, వితండ, హేత్వాభాసము, ఛలము, జాతి' నిగ్రహస్థానము అను] పదార్థముల వ్యాఖ్యతో గూడిన (స్తోమమ్) ప్రశంసించదగినవానిని (ఉతజయత్) చక్కగా నెరుగునట్లు నేనును (తమ్) దానిని (ఉజ్జేషమ్) చక్కగా నెరుగుదునుగాక! ఓ నరేశా! (ప్రజాపతిః) ప్రజాపాలకుడవగు నీవలెనే (సప్తదశాక్షరేణ) పదునేడక్షరముల నిచ్చృదార్షీ ఛందముతో (సప్తదశమ్) పదునేడు [నాలుగువర్ణములు, నాలుగాశ్రమములు, మరియు వినుట, ఆలోచించుట, ధ్యానించుట అను] కర్మలు అప్రాప్తిని కాంక్షించుట, ప్రాప్తించినవానిని రక్షించుట, రక్షించినవానిని వృద్ధిపరచుట, వృద్ధినొందించినవానిని ఉత్తమమార్గములందు వ్యయపరచుట అను నీ నాలుగు విధములగు పురుషార్థముల నాచరించుట మరియు మోక్షానుష్ఠానరూపమగు (స్తోమమ్) చక్కని ప్రశంసనీయమగు దానిని బాగుగా నెరుగునట్లు నేనును (ఉజ్జేషమ్) ఉత్తమముగా నెరుగుదునుగాక! ॥34॥

భావార్థము :- ఓ మానవులారా! పై నాలుగుమంత్రము (31-34) లందు చెప్పబడిన రాజ, ప్రజాధర్మములను మీరును ఆచరించి సుఖముగానుండుడు. ॥34॥

34.just as the Vasus, by thirteen syllabic metre, know the thirteenfold collection of laudable objects, so may I also know them. Just as the Rudras by fourteen-syllabic metre know the fourteenfold collection of laudable objects, so may I also know them. Just as the Adityas with fifteen Syllabic metre know the fifteenfold collection of laudable objects, so may I also know them. Just as the Aditi, with sixteen-syllabic metre knows the sixteenfold collection of laudable objects, so may I also know them. Just as Prajapati, with seventeen-syllabic metre, knows the seventeenfold collection of laudable objects, so may I also know them.

35. ఏష త ఇత్యస్య వరుణఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృదుత్కృతిశ్ఛందః, షడ్జః స్వరః.

కీదృగ్జనః సామ్రాజ్యం సేవితుం యోగ్యో జాయత ఇత్యాహ.

చక్రవర్తిరాజ్యమును సేవించుటకెవరు యోగ్యు లను విషయము ఈ మంత్రమున గలదు.

35 ఏష తే నిరృతే భాగస్తం జుషస్వ స్వాహాఽగ్నినేత్రేభ్యో దేవేభ్యః పురఃసద్భ్యః స్వాహా యమనేత్రేభ్యో దేవేభ్యో దక్షిణాసద్భ్యః స్వాహా విశ్వదేవనేత్రేభ్యో దేవేభ్యః పశ్చాత్సద్భ్యః స్వాహా మిత్రావరుణనేత్రేభ్యో వా మరున్నేత్రేభ్యో వా దేవేభ్యఽ ఉత్తరాసద్భ్యః స్వాహా సోమనేత్రేభ్యో దేవేభ్యఽ ఉపరిసద్ భ్యో దువస్వద్భ్యః స్వాహా ॥ 35 ॥

ప.వి:- ఏషః, తే, నిర్ఋత ఇతి నిః + ఋతే, భాగః, తమ్, జుషస్వ స్వాహా, అగ్నినేత్రేభ్య ఇత్యగ్ని+నేత్రేభ్యః, దేవేభ్యః, పురఃసద్భ్య ఇతి పురః సత్ + భ్యః, స్వాహా, యమనేత్రేభ్య ఇతి యమ + నేత్రేభ్యః, దేవేభ్యః, దక్షిణాసద్భ్య ఇతి దక్షిణాసత్ + భ్యః, స్వాహా, విశ్వదేవనేత్రేభ్య ఇతి విశ్వదేవ+నేత్రేభ్యః, దేవేభ్యః, పశ్చాత్సద్భ్య ఇతి పశ్చాత్ సద్+భ్యః, స్వాహా, మిత్రావరుణనేత్రేభ్య ఇతి మిత్రావరుణ+నేత్రేభ్యః, వా, మరున్నేత్రేభ్య ఇతి మరుత్+నేత్రేభ్యః, వా, దేవేభ్యః, ఉత్తరాసద్భ్య ఇత్యుత్తరాసత్ + భ్యః, సోమనేత్రేభ్య ఇతి సోమ + నేత్రేభ్యః, దేవేభ్యః, ఉప రిసద్భ్య, ఇత్యుపరిసత్+భ్యః, దువస్వద్భ్య ఇతి దువస్వత్+భ్యః, స్వాహా॥౩౫॥

పదార్థః :-(ఏషః) పూర్వాపరప్రతిపాదితః (తే) తవ (నిర్ఋతే) నితరామృతం సత్యమాచరణం యస్మిన్ తత్సంబుద్ధౌ (భాగః) భజనీయః, సేవితుం యోగ్యః (తమ్)(జుషస్వ) సేవస్వ (స్వాహా) సత్యాం వాచమ్ (అగ్నినేత్రేభ్యః) అగ్నేః ప్రకాశ ఇవ నేత్రం నయనం యేషాం తేభ్యః (దేవేభ్యః) ధార్మికేభ్యో విద్వద్భ్యః (పురః సద్భ్యః) యే పురః పూర్వం సభాయాం రాష్ట్రే వా సీదంతి తేభ్యః (స్వాహా) ధర్మ్యాం క్రియామ్. (యమనేత్రేభ్యః) యమస్య వాయోర్నేత్రం నయనమివ. నీతిర్యేషాం తేభ్యః (దేవేభ్యః) విపశ్చిద్భ్యః (దక్షిణాసద్భ్యః) విశ్వేషాం దేవానాం విదుషాం నేత్రం నీతిరివ నీతిర్యేషాం తేభ్యః (స్వాహా) దానక్రియామ్ (విశ్వదేవనేత్రేభ్యః) సర్వవిద్వత్తుల్యా నేత్రా నీతిర్యేషాం తేభ్యః (దేవేభ్యః) దివ్యసుఖప్రదేభ్యః (పశ్చాత్సద్భ్యః) యే పశ్చాత్ సీదంతి తేభ్యః (స్వాహా) ఉత్సాహకారికాం వాచమ్ (మిత్రావరుణనేత్రేభ్యః) ప్రాణాపానతుల్యేభ్యః (వా) పక్షాంతరే (మరున్నేత్రేభ్యః) మరుతామృత్విజాం ప్రజాస్థానాం సజ్జనానాం వా నేత్రమివ నాయకత్వం యేషాం తేభ్యః (వా)(దేవేభ్యః) దివ్యన్యాయప్రకాశకేభ్యః (ఉత్తరాసద్భ్యః) య ఉత్తరస్యాం దిశి సీదంతి తేభ్యః (స్వాహా) దౌత్యకుశలతామ్ (సోమ నేత్రేభ్యః) సోమస్య చంద్రస్యైశ్వర్యవతీ నేత్రం నయనమివ నీతిర్యేషాం తేభ్యః (దేవేభ్యః) సకలవిద్యాప్రచారకేభ్యః (ఉపరిసద్భ్యః) సర్వోపరి విరాజమానేభ్యః (దువస్వద్భ్యః) విద్యావినయధర్మేశ్వరాన్ సేవమానేభ్యః (స్వాహా) ఆప్తవాణీమ్ అయమ్మన్త్రః శత. ౫.౨. ౩.౩-౧౦. ౫.౨.౪.౧-౫. వ్యాఖ్యాతః. ॥౩౫॥

**అన్వయః**:-హే నిర్ఋతే రాజ౯స్తే తవ య ఏష భాగో భజనీయో న్యాయోఽస్తి, తమగ్నినేత్రేభ్యో దేవేభ్యః స్వాహా పురః సద్భ్యో దేవేభ్యః స్వాహా. యమనేత్రేభ్యో దక్షిణాసద్భ్యో దేవేభ్యః స్వాహా. విశ్వదేవనేత్రేభ్యః

పశ్చాత్సద్భ్యో దేవేభ్యః స్వాహా. మిత్రావరుణనేత్రేభ్యో వా మరున్నేత్రేభ్యో వోత్తరాసద్భ్యో దేవేభ్యః స్వాహా. సోమనేత్రేభ్యః ఉపరిసద్భ్యో దువస్వద్భ్యో దేవేభ్యః స్వాహా చ ప్రాప్య త్వం ధర్మేణ రాజ్యం సదా జుషస్వ. ॥36॥

**భావార్థః** :- హే రాజన్ సభాధ్యక్ష! యదా భవాన్ సర్వతో విద్వద్వరేభ్యః పరివృతః ప్రాప్తశిక్షః కృతసభో రక్షితసేనః సుసహాయః సన్ సనాతన్యా వేదోక్తయా రాజధర్మనీత్యా ప్రజాః పాలయేత్తదైవేహాముత్ర సుఖమేవ ప్రాప్నుయాత్. ఏతద్విరుద్ధశ్చేత్తర్హి తే కుతః సుఖమితి, నహి మూర్ఖసహాయః సుఖమేధతే, న ఖలు విద్వదుపదేశానుగామీ కదాచిత్సుఖం జహాత్యస్మాద్రాజా సదైవ విద్యాధర్మాప్తసహాయేన రాజ్యం రక్షేత్. యస్య సభాయాం రాజ్యే వా పూర్ణవిద్యా ధార్మికా వర్తంతే మిథ్యావాదినో వ్యభిచారిణోఽజితేంద్రియాః పరుషవాచోఽన్యాయాచారాః స్తేనా దస్యవశ్చ న సంతి, స్వయమప్యేవం భూతోఽస్తి, స ఏవ చక్రవర్తిరాజ్యం కర్తుమర్హతి. నాతో విరుద్ధో జన ఇతి బోధ్యమ్. ॥36॥

**పదార్థము** :- (నిఋృతే) సదా సత్యాచరణముగల ఓ రాజా! (తే) నీయొక్క (ఏషః) ఈ (భాగః) సేవించదగిన భాగమును (అగ్నినేత్రేభ్యః) అగ్ని ప్రకాశమువంటి నీతియుక్తులగు (దేవేభ్యః) విద్వాంసులనుండి (స్వాహా) సత్యవాణిని (పురః సద్భ్యః) పూర్వపుసభలో, రాజ్యములో స్థితులైయున్న (దేవేభ్యః) న్యాయాధీశులగు విద్వాంసులనుండి (స్వాహా) ధర్మముతో గూడిన క్రియచే (యమనేత్రేభ్యః) వాయువువలె సకల ప్రదేశములందు ప్రవేశించువారు (దక్షిణాసద్భ్యః) దక్షిణదిశయందు రాజ్యప్రబంధములందు నియతులై యున్నవారు (దేవేభ్యః) విద్వాంసులునునగువారినుండి (స్వాహా) దానక్రియను (విశ్వదేవ నేత్రేభ్యః) సకల విద్వాంసులవంటి నీతినెరుగు (పశ్చాత్సద్భ్యః) పశ్చిమదిశయందుండు రాజకర్మచారులు (దేవేభ్యః) దివ్యసుఖములనిచ్చు విద్వాంసులనుండి (స్వాహా) ఉత్సాహమునుగలిగించు వాణిని (మిత్రావరుణ నేత్రేభ్యః) ప్రాణాపానములవంటి (మరున్నేత్రేభ్యః) ఋత్విజులు మరియు యజ్ఞకర్తలు (వా) సత్పురుషులవంటి న్యాయకారులు (ఉత్తరా సద్భ్యః) ఉత్తరదిశయందుగల న్యాయాధీశులు నగు (దేవేభ్యః) విద్వాంసులనుండి దౌత్యకర్మకుశల క్రియను (సోమనేత్రేభ్యః) ఐశ్వర్యయుక్తుడై చంద్రునివలె సర్వమునకు ఆనందమును ప్రసాదించువారు (ఉపరిసద్భ్యః) విద్యావినయ ధర్మములచే (దువస్వద్భ్యః) పరమేశ్వరుని సేవించువారును నగు (దేవేభ్యః) విద్వాంసులనుండి (స్వాహా) ఆప్తుల వాణిని పొంది నీవు నిరంతరము ధర్మమును (జుషస్వ) సేవించుచుండుము. ॥36॥

**భావార్థము** :- సభాధ్యక్షుడవగు నో రాజా! నీవు సకలదిశలనుండి ఉత్తమవిద్వాంసులచే గూడియుండి సమస్త శిక్షణములను పొందినవాడవు, రాజసభను నిర్వహించువాడవు, సైన్యములను నియుక్తపరచువాడవు, ఉత్తమసహాయముతో గూడినవాడవునై సనాతన వేదోక్త రాజధర్మము, రాజనీతితో ప్రజాపాలకుడవునై ఇహ పర సౌఖ్యముల ననుభవించుము. కర్తవ్యములకు విరుద్ధముగ నడచినచో సుఖము లభింపజాలదు. మూర్ఖుల సలహాసహాయములతో ఎవ్వడును ఎన్నడును సౌఖ్యములను వృద్ధిపరచలేడు. విద్వాంసుల మార్గమున నడచువా డెప్పుడును కష్టములపాలు గాజాలడు. కాబట్టి రాజైనవా డెప్పుడును విద్యాధర్మముల యాధారమున,

ఆప్తవిద్వాంసుల సహాయముచే రాజ్యమును రక్షించుకొనుచుండవలయును. పూర్ణవిద్వాంసులు, ధార్మికులునగువారు సభాసదులుగ నుండునట్టి రాజ్యమునందు మరియు మిథ్యావాదులు, వ్యభిచారులు, జితేంద్రియత్వములేనివారు, పరుషవాక్యములు బలుకువారు, అన్యాయకారులు, జారులు, చోరులు, బందిపోటుదొంగలు, జూదరులు త్రాగుబోతులు మొదలగువారు ఉండునట్టి (లేనట్టి) రాజ్యమునందు స్వయముగ ధార్మికుడగు విద్వాంసుడు మాత్రమే చక్రవర్తి సామ్రాజ్యమును పాలించుటకు తగినవాడగును. కాని ఇందుకు విరుద్ధమైనవాడు రాజ్యపాలనకు దగినవాడు గాజాలడు.॥౩౫॥

35.O King, the lover of truth, conduct thy rule with justice. Utter truthful words for the learned, whose policy shines like the fire. Behave in a religious spirit towards those lords of justice who work in the east. Be charitable to the learned, who are fast-witted like the wind and are put in charge of the southern part of the country. Use inspiring language towards the learned officials stationed in the west, who fully understand politics like all the wise. Behave respectfully like a state representative towards those officials appointed in the north, who are regular in their duty like the in-going, and out coming breath, and who give true lead to the subjects. Use the language of a sage towards those who brilliant like the moon, give happiness to all, and who acquire knowledge, cultivate humility, are religious-minded, and worship God!.

౩౬. యే దేవా ఇత్యస్య వరుణ ఋషిః, విశ్వేదేవా దేవతాః, వికృతిశ్ఛందః, మధ్యమః స్వరః.

మనుష్యాః సర్వత్ర భ్రమణం విధాయ విద్యాగ్రహ్ణీయురిత్యుపదిశ్యతే.

మనుష్యులు సర్వప్రదేశములందును విహరించుచు సమస్తవిద్యలను ఉపార్జించవలయు నని

ఈ మంత్రమునం దుపదేశించబడినది.

౩౬ యే దేవా౾ అగ్నినేత్రాః పురః సదస్తేభ్యః స్వాహా।

యే దేవా యమనేత్రా దక్షిణాసద స్తేభ్యః స్వాహా।

యే దేవా విశ్వదేవనేత్రాః పశ్చాత్సద స్తేభ్యః స్వాహా।

యే దేవా మిత్రావరుణనేత్రా వా మరున్నేత్రా వోత్తరా సదస్తేభ్యః స్వాహా।

యే దేవాః, సోమనేత్రా౾ ఉపరిసదో దువస్వంతస్తేభ్యః స్వాహా ॥౩౬॥

ప.వి:- యే, దేవాః, అగ్నినేత్రా ఇత్యగ్ని + నేత్రాః, పురః సద ఇతి పురః + సదః, తేభ్యః, స్వాహా, యే, దేవాః, యమనేత్రా ఇతి యమ + నేత్రాః, దక్షిణాసద ఇతి దక్షిణా + సదః, తేభ్యః, స్వాహా, యే, దేవాః, విశ్వదేవనేత్రా ఇతి విశ్వదేవ + నేత్రాః, పశ్చాత్సద ఇతి పశ్చాత్ + సదః, తేభ్యః, స్వాహా, యే, దేవాః, మిత్రావరుణనేత్రా ఇతి మిత్రావరుణ + నేత్రాః, వా, మరున్నేత్రా ఇతి మరుత్ + నేత్రాః, వా, ఉత్తరా సద ఇత్యుత్తరా + సదః, తేభ్యః, స్వాహా, యే, దేవాః, సోమనేత్రా ఇతి సోమ + నేత్రాః, ఉపరిసద ఇత్యుపరి + సదః, దువస్వంతః, తేభ్యః, స్వాహా ॥36॥

పదార్థః :-(యే) (దేవాః) విద్వాంసః (అగ్నినేత్రాః) అగ్నౌ విద్యుదాదౌ నేత్రం నయనం విజ్ఞానం యేషాం తే (పురఃసదః) యే సభాయాం రాష్ట్రే వా పురః పూర్వస్యాందిశి సీదంతి. (తేభ్యః) (స్వాహా) సత్యాం వాచమ్ (యే) (దేవాః) యోగినో న్యాయాధీశాః (యమనేత్రాః) యమేష్వహింసాదిషు యోగాంగేషు నీతిషు వా నేత్రం ప్రాపణం యేషాం తే (దక్షిణాసదః) యే దక్షిణస్యాం దిశ్యవతిష్ఠంతే. (తేభ్యః) (స్వాహా) సత్యాం క్రియామ్ (యే) (దేవాః) సర్వవిద్యావిదః (విశ్వదేవనేత్రాః) విశ్వేషు దేవేషు నేత్రం ప్రజ్ఞానం యేషాం తే (పశ్చాత్సదః) యే పశ్చిమాయాం దిశి సీదంతి. (తేభ్యః) (స్వాహా) ఆన్వీక్షికీం విద్యామ్ (యే) (దేవాః) సర్వేభ్యః సుఖదాతారః (మిత్రావరుణనేత్రాః) ప్రాణోదానవత్ సర్వాన్ ధర్మం నయంతః (వా) (మరున్నేత్రాః) మరుతి బ్రహ్మాండస్థే వాయౌ నేత్రం నయనం యేషాం తే (వా) అథ ఊర్ధ్వస్థాః (ఉత్తరాసదః) యే ప్రశ్నోత్తరాణి సమాదధానా ఉత్తరస్యాందిశి సీదంతి (తేభ్యః) (స్వాహా) సర్వోపకారిణీం విద్యామ్. (యే) (దేవాః) ఆయుర్వేదవిదః (సోమనేత్రాః) సోమలతాదిష్వోషధీషు నేత్రం నయనం యేషాం తే (ఉపరిసదః) యే ఉపరి ఉత్కృష్ట ఆసనే వ్యవహారే వా సీదంతి తే (దువస్వన్తః) దువో బహువిద్యాధర్మపరిచరణం విద్యతే యేషు (తేభ్యః) (స్వాహా) ధర్మౌషధి విద్యామ్. అయమ్మన్త్రః శత ౫.౨.౪. ౬. వ్యాఖ్యాతః ॥ 36॥

అన్వయః :-హే సభాధ్యక్ష! రాజంస్త్వం యోఽగ్నినేత్రాః పురఃసదో దేవాః సంతి, తేభ్యః స్వాహా జుషస్వ. యే యమనేత్రా దక్షిణాసదో దేవాః సంతి తేభ్యః స్వాహా జుషస్వ. యే పశ్చాత్సదో విశ్వదేవనేత్రా

దేవాః సంతి తేభ్యః స్వాహా జుహుస్వ. యే ఉత్తరాసదో వాఽఽ ధ ఊర్ధ్వస్థా మిత్రావరుణనేత్రా వా మరున్నేత్రా దేవాః సంతి తేభ్యః స్వాహా జుహుస్వ.॥36॥

**భావార్థః** :- హే రాజాదయో మనుష్యాః! యూయం సదా ధార్మికాః సుశీలా విద్వాంసో భూత్వా సర్వదిక్స్థానాం సర్వవిద్యావిదామాప్తానాం విదుషాం పరీక్షాసత్కారార్థం సర్వా విద్యాః ప్రాప్నుయాత. తథైతే భవత్సమీపమాగత్య యుష్మాభిః సహ సంగత్య ధర్మార్థకామమోక్షాణాం సిద్ధిం కుర్యుః. యే దేశదేశాంతరం ద్వీపద్వీపాంతరం విద్యావినయసుశిక్షయాకౌశలాని గృహ్ణంతి త ఏవ సర్వేషాం సుసుఖైరలంకర్తారః స్యుః. ॥36॥

**పదార్థము** :- సభాధ్యక్షుడవగు నో రాజా! నీవు (యే) ఎట్టి (అగ్నినేత్రాః) విద్యుత్తు మున్నగువాని విజ్ఞానము నెరుగు (పురః సదః) సభయందునో, దేశమునందునో, పూర్వదిశయందునో స్థిరమై (దేవాః) ఏ విద్వాంసులున్నారో (తేభ్యః) వారిచే (స్వాహా) సత్యవాణిని [జుహుస్వ] సేవించుము (యే) ఏ (యమనేత్రాః) అహింసాది యోగాంగరీతులందు నిపుణులు (దక్షిణాసదః) దక్షిణదిశయందు స్థిరపడిన (దేవాః) యోగులు, లేక న్యాయాధీశులు గలరో (తేభ్యః) వారిద్వార (స్వాహా) సత్యక్రియను [పొందుము] (యే) ఎవరైతే (పశ్చాత్సదః) పశ్చిమదిశయందు స్థితులు (విశ్వదేవనేత్రాః) పృథివి మున్నగు సకలపదార్థముల జ్ఞానము గలవారు (దేవాః) సకలవిద్యలనేర్చిన విద్వాంసులు గలరో (తేభ్యః) వారినుండి (స్వాహా) దండనీతిని [పొందుము] (యే) ఎవరైతే (ఉత్తరా సదః) శంకాసమాధానములనిచ్చువారు ఉత్తరదిశయందు గలరో (వా) క్రింది, పైని దిశలందుగల (మిత్రావరుణనేత్రాః) ప్రాణ ఉదానములవంటి సకలధర్మములను బోధించు (వా) లేక (మరున్నేత్రాః) బ్రహ్మాండమందు గల నేత్ర మరియు వాయువు విజ్ఞానము నెరిగినవారు (దేవాః) ఎల్లరకు సుఖములనిచ్చు ఏ విద్వాంసులు గలరో (తేభ్యః) వారినుండి (స్వాహా) సమస్త ఉపకారకమగు విద్యలను పొందుము (యే) ఎవరైతే (ఉపరిసదః) ఉన్నతాసనము మరియు ఉత్తమ వ్యవహారములందు స్థితమైయున్న (దువస్వన్తః) ధర్మసేవనముతోగూడినట్టి (సోమనేత్రాః) సోమము మున్నగు ఓషధుల గుణధర్మముల నెరుగువారు (దేవాః) ఆయుర్వేదమునెరుగు విద్వాంసులనుండి (స్వాహా) అమృతరూపమగు ఓషధీవిద్యను పొందుము. ॥36॥

**భావార్థము**:- రాజు మరియు ప్రజలారా! మీరు ధార్మికులు, సుశీలురు, విద్వాంసులు, పురుషార్థపరులునై సకల విద్యావేత్తలు, ఆప్తులునగు విద్వాంసుల పరీక్ష మరియు సత్కారములకై సమస్త విద్యలను ప్రాప్తించుకొనునప్పుడే వారు మిమ్ముచేరి మీతో సత్సంగమొనర్చి ధర్మార్థకామమోక్షముల సిద్ధిని గలుగజేయగలరు. దేశదేశాంతరములందును, ద్వీపద్వీపాంతరములందును విద్యావినయసంపదలను, ఉత్తమశిక్ష క్రియాకుశలత్వమును గ్రహించువారు మాత్రమే ఎల్లరకును చక్కని సుఖములను ఒనగూర్చువారు గాగలుగుదురు. ॥36॥

**36.O King, utter truthful words for the learned, who have mastered the science of electricity, and reside in the east, Behave in a religious spirit towards those yogis, who**

are well versed in the intricacies of the science of yoga, and reside in the south. Derive knowledge from the learned, who know the science of material objects, and reside in the west. Learn knowledge that benefits all, from those who grant hapiness to all and reside in the north, preach Dharma to those, who are swift-witted like the mind. Learn medical science from those who know the Ayur Veda, and the properties of medicinal herbs, are well placed in life and busy with their profession, and adore medical knowledge and religion!.

౩౯౩. అగ్నే సహస్వేత్యస్య దేవవాతఋషిః, అగ్నిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునరపి రాజాదిభిః కథం వర్తితవ్యమిత్యుపదిశ్యతే.

రాజ మున్నగువా రెట్లు ప్రవర్తించవలె ననునది మరల చెప్పబడుచున్నది.

౩౯౩ అగ్నే సహస్వ పృతనా౨ అభిమాతీ రపాస్య।
దుష్టరస్తరన్న రాతీ ర్వర్చో ధా యజ్ఞవాహసి ॥౩౭॥

ప.విః- అగ్నే, సహస్వ, పృతనాః, అభిమాతీరిత్యభి + మాతీః, అప, అస్య, దుష్టరః, దుస్తర ఇతి దుః+తరః, తరన్, అరాతీః, వర్చః, ధాః, యజ్ఞవాహసీతి యజ్ఞ + వాహసి॥౩౭॥

పదార్థః :-(అగ్నే) సకల విద్యావిద్విద్వన్ రాజన్! (సహస్వ) క్షమస్వ (పృతనాః) బలసుశిక్షాన్వితా వీరమనుష్య సేనాః (అభిమాతీః) అభిమానహర్షయుక్తాః (అప)(అస్య) దూరే ప్రక్షిప (దుష్టరః) దుఃఖేన తరితుం సంప్లవితుం యోగ్యః (తరన్) శత్రుబలం సంప్లవన్ (అరాతీః) అదాన శీలాన్ శత్రూన్ (వర్చః) విద్యాబలన్యాయదీపనమ్ (ధాః) ధేహి (యజ్ఞవాహసి) యజ్ఞాన్ సంగతాన్ రాజధర్మాదీన్ వహంతి యస్మిన్ రాజ్యే తస్మిన్ అయమ్మన్త్రః. శత. ౫.౨.౪.౧౬. వ్యాఖ్యాతః. ॥౩౭॥

**అన్వయః** :-హే అగ్నే! దుష్టరస్తరన్స్త్వం యజ్ఞవాహస్యభిమాతీరపాస్య వర్చోధాః.॥౩౭॥

**భావార్థః** :-రాజాదయః సభాసేనాదయః స్వకీయేన దృఢేన విద్యాసుశిక్షాయుక్తేన ధృతేన సైన్యేన సహితాః స్వయమజయాః సంతః శత్రూన్ విజయమానాః పృథివ్యాం కీర్తిం ప్రసారయేయుః.॥౩౭॥

**పదార్థము** :-(అగ్నే) సమస్త విద్యలనెరిగిన విద్వాంసుడవును ఓ రాజా! (దుష్టరః) దుఃఖములనుండి తరించయోగ్యుడవు (తరన్) శత్రుసైన్యములను చక్కగా తరించగలుగువాడవు (యజ్ఞవాహసి) రాజధర్మముతోగూడిన రాజ్యమునందు (అభిమాతీః) అభిమానము, ఆనందములతో గూడిన (పృతనాః) బలపరాక్రమవీరత్వము మరియు సుశిక్షణగలిగిన సైన్యమును (సహస్వ) సహించుము (అరాతీః) దుఃఖముల

గలిగించు శత్రువులను (అపాస్య) దూరము పారద్రోలుము. (వర్చః) విద్యాన్యాయముల బలములను (ధాః) ధారణ మొనర్చుము. ॥౩౭॥

**భావార్థము** :- రాజు, సభాపతులు, సైన్యాధిపతులు, సుదృఢ బలపరాక్రమ, విద్యాసుశిక్షగాతో గూడిన స్వంతసైన్యములుగలిగి, తాము అజేయులుగా నుండి శత్రుసైన్యములను జయించుచు రాజ్యమున ఉత్తమయజ్ఞములను విస్తరింపజేయవలెను. ॥౩౭॥

37. O King, oppose the proud, happy powerful, and trained army, and drive our enemies away, subduing powerful foes. In this State advance knowledge, gain strength and practice justice.

౩౮. దేవస్యత్వేత్యస్య దేవవాత ఋషిః, రక్షోఘ్నో దేవతా, స్వరాడ్ బ్రాహ్మీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

ప్రజాజనా ఇహ కీదృశం సభాధీశం రాజానం స్వీకుర్యురిత్యాహ.

ప్రజలు రాజ్యమునందు ఎట్టి సభాధీశుని ఎన్నుకొనవలెనను విషయమిందు గలదు.

౩౮ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్।
ఉపాంశోర్వీర్యేణ జుహోమి హతం రక్షః స్వాహా।
రక్షసాం త్వా వధాయావధిష్మ రక్షోఽవధిష్మాముమసౌ హతః ॥౩౮॥

ప. విః- దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర + సవే, అశ్వినోః, బాహుభ్యామితి, బాహుభ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ఉపాంశోరిత్యుప + అంశోః, వీర్యేణ, జుహోమి, హతమ్, రక్షః, స్వాహా, రక్షసామ్, త్వా, వధాయ, అవధిష్మ, రక్షః, అవధిష్మ, అముమ్, అసౌ, హతః ॥౩౮॥

**పదార్థః** :-(దేవస్య) ప్రకాశితన్యాయస్య (త్వా) త్వామ్ (సవితుః) ఐశ్వర్యోత్పాదకస్య సేనేశస్య (ప్రసవే) ఐశ్వర్యే (అశ్వినోః) సూర్యాచంద్రమసోరివ సభాసేనాపత్యోః (బాహుభ్యామ్) (పూష్ణః) పుష్టికర్తుర్వైద్యస్య (హస్తాభ్యామ్) (ఉపాంశోః) ఉప సమీపేఽనితి తస్య. అత్రానధాతోరుః శుగాగమశ్చ (వీర్యేణ) సామర్థ్యేన (జుహోమి) గృహ్ణామి (హతమ్) వినష్టమ్ (రక్షః) రాక్షసమ్. రక్షో రక్షితవ్యమస్మాద్రహసి

క్షణోతీతి వా రాత్రౌ న క్షత ఇతి వా. నిరు. ४. ౧౮. (స్వాహా) సత్యయా క్రియయా (రక్షసామ్) దుష్టానామ్ (త్వా) (త్వామ్) (వధాయ) వినాశాయ (అవధిష్మ) హన్యామ (రక్షః) దుష్టాచారమ్ (అవధిష్మ) తాడయే (అముమ్) పరోక్షమ్ (అసౌ) దూరస్థః (హతః) వినష్టః. అయమ్మన్త్రః. శత. ౫.౨.४.౧౭-౨౦. వ్యాఖ్యాతః. ॥౩౮॥

**అన్వయః**:-హే రాజన్నహం స్వాహా సవితుర్దేవస్య ప్రసవ ఉపాంశోర్వీర్యేణాశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం రక్షసాం వధాయ త్వా జుహోమి. యథా త్వయా రక్షో హతం, తథా వయమప్యవధిష్మ. యథా ఽసౌ హతః స్యాత్ తథా వయమేతమవధిష్మ. ॥౩౮॥

**భావార్థః** :- ప్రజాస్థజనాః స్వరక్షణాయ దుష్టనివారణాయ విద్యాధర్మప్రవృత్తయే చ సుశీలం రాజానం స్వీకుర్యుః. ॥౩౮॥

**పదార్థము** :- ఓ రాజా! నేను (స్వాహా) సత్యక్రియతో (సవితుః) ఐశ్వర్యములనుత్పన్నమొనర్చు [సేనానాయకుడు] (దేవస్య) న్యాయమును ప్రకాశపరచువాడును నగు నతని (ప్రసవే) ఐశ్వర్యమునందు (ఉపాంశోః) సమీపమందున్న సైన్య (వీర్యేణ) సామర్థ్యముచేతను (అశ్వినోః) సూర్యచంద్రులవంటి సేనాపతియొక్క (బాహుభ్యామ్) భుజబలముచేతను (పూష్ణః) పుష్టికారకుడగు వైద్యుని (హస్తాభ్యామ్) హస్తములతో (రక్షః) రాక్షసులను (వధాయ) సంహరించుటకై (త్వా) నిన్ను (జుహోమి) గ్రహించుచున్నాను. ఎటులనీవు (రక్షః) దుష్టులను (హతమ్) హతమొనర్చుదువో అట్లే మేమును (అవధిష్మ) దుష్టులను నాశనమొనర్చెదముగాక! ఎట్లు (అసౌ) దుష్టులు (హతః) నాశనమగుదురో అట్లే మేమును, వీరెల్లరును (అవధిష్మ) నాశమొనర్చెదముగాక! ॥౩౮॥

**భావార్థము**:- ప్రజలు తమ రక్షణము, దుష్టులనివారణము మరియు ఉత్తమ విద్యాధర్మముల విస్తారమునకై ఉత్తమస్వభావముగలిగి, విద్యాధర్మముల విస్తరింపజేయు వీరపరాక్రమ జితేంద్రియ సత్యవాదియునగు విద్వాంసుని మాత్రమే సభాపతి రాజుగా స్వీకరించవలయును. ॥౩౮॥

38.O King, rightly, I, with the glory of the just and prosperity bringing commander of the army, with the strength of the nearby army, with the general's arms stout like the sun and moon, and with the skilful hands of a physician, accept thee for slaying the demons. Just as thou hast slain the demon so may we slay the demon. Just as we have slain that so may we slay all others!.

**౩౯.సవితా త్వేత్యస్య దేవవాత ఋషిః, రక్షోఘ్నో దేవతా, అతి జగతీ ఛందః, నిషాదః స్వరః.**

**సభ్యైర్మనుష్యైరాజా క్వ క్వ ప్రేరయితవ్య ఇత్యాహ.**

**సభ్యమానవులు రాజునెట్టికార్యములకై ప్రేరేపించవలయు నను విషయము.**

౩౯॥ సవితా త్వా సవానాగ్ం సువతా మగ్ని గృహపతీనాగ్ం సోమో వనస్పతీనామ్। బృహస్పతిర్వాచఽ ఇంద్రోజ్యైష్ఠ్యాయ రుద్రః పశుభ్యో మిత్రః సత్యోవరుణో ధర్మపతీనామ్ ॥౩౯॥

ప.వి:- సవితా, త్వా, సవానామ్, సువతామ్, అగ్నిః, గృహపతీనామితి గృహపతీనామ్, సోమః, వనస్పతీనామ్, బృహస్పతిః, వాచే, ఇంద్రః, జ్యైష్ఠ్యాయ,రుద్రః, పశుభ్య ఇతి పశు+భ్యః, మిత్రః, సత్యః, వరుణః, ధర్మపతీనామితి ధర్మ + పతీనామ్ ॥౩౯॥

**పదార్థః** :-(సవితా) ఐశ్వర్యస్య ప్రసవితా (త్వా) త్వామ్ (సవానామ్) ఐశ్వర్యాణామ్ (సువతామ్) ప్రేర్తామ్. అత్ర వ్యత్యయేనాత్మనేపదమ్ (అగ్నిః) ప్రకాశయుక్తః (గృహపతీనామ్) గృహాఽఽశ్రమ పాలకానామ్ (సోమః) సౌమ్య గుణసంపన్నో వైద్యకవిషయ ఓషధీరాజః (వనస్పతీనామ్) పిప్పల్యాదీనామ్ (బృహస్పతిః) పూర్ణవిద్య ఆప్తః (వాచే) వేదాఽర్థసుశిక్షాయుక్తవాణీ విజ్ఞానాయ (ఇంద్రః) పరమైశ్వర్యయోగారూఢో వృద్ధః (జ్యైష్ఠ్యాయ) అతిశయేన వృద్ధస్య భావాయ (రుద్రః) శత్రూణాం రోదయితా శూరవీరః (పశుభ్యః) గవాదీనామ్ (మిత్రః) సర్వస్య సుహృత్ (సత్యః) సత్పురుషేషు భవః (వరుణః) ధర్మాఽఽచరణేషు శ్రేష్ఠః (ధర్మపతీనామ్) ధర్మస్య రక్షితౄణామ్. అయమ్మన్త్రః శత.౫.౩.౩. ౧౦.వ్యాఖ్యాతః. ॥౩౯॥

**అన్వయః**:-హే సభేశ! రాజన్! యతస్త్వం సవానాం సవితేవ, గృహపతీనా మగ్నిరివ, వనస్పతీనాం సోమ ఇవ, ధర్మపతీనాం సత్యో వరుణో మిత్ర ఇవ, వాచే బృహస్పతి రివ, జ్యైష్ఠ్యాయేంద్ర ఇవ, పశుభ్యో రుద్ర ఇవాసి తం త్వాఽఽప్త ఉపదేష్టా ప్రజాపాలనే సువతామ్. ॥౩౯॥

**భావార్థః** :-హే రాజన్! స్త్వం యే త్వామధర్మాన్నివర్త్య ధర్మానుష్ఠానే ప్రేరయేయుస్తేషామేవ సంగం సదా కురు, నేతరేషామ్. ॥౩౯॥

**పదార్థము** :-సభాపతివగు ఓ రాజా! నీవు (సవానామ్) ఐశ్వర్యమును (సవితా) సూర్యునివలె ప్రేరకుడవు (గృహపతీనామ్) గృహస్థులకు ఉపకారుడవగు (అగ్నిః) అగ్నివంటివాడవు (వనస్పతీనామ్) రావి మున్నగు వృక్షములలో (సోమః) సోమవల్లివంటివాడవు (ధర్మపతీనామ్) ధర్మమును పాలించువారియందు (సత్యః) సజ్జనులందు సజ్జనుడవు (వరుణః) శుభగుణకర్మస్వభావములందు శ్రేష్ఠుడవు (మిత్రః) స్నేహితునివంటివాడవు (వాచే) వేదవాణియందు (బృహస్పతిః) మహా విద్వాంసునివంటివాడవు (జ్యైష్ఠ్యాయ)

శ్రేష్ఠత్వమునందు (ఇన్ద్రః) పరమైశ్వర్యశాలివంటివాడవు (పశుభ్యః) గోవులు మున్నగు పశువులకొరకు (రుద్రః) శుద్ధవాయువువంటివాడవు. అట్టి (త్వా) నిన్ను ధర్మాత్ముడు, సత్యవాదివిద్వాంసుడు ధర్మముతో ప్రజారక్షణమందు (సువతామ్) ప్రేరేపించుగాక!. ॥౩౯॥

**భావార్థము** :- ఓ రాజా! అధర్మమునుండి మరల్చి ధర్మకార్యములకై ప్రేరణ నిచ్చువారి సాంగత్యమును సదాకాంక్షించుము. ధూర్తులను దూరమున నుంచుము. ॥౩౯॥

39.O King, thou art the creator of supremacy, useful like fire for the domestic people, the lord of the trees, the friend, faithful companion, and religious leader of the lovers of religion, the master of the Vedas, aged among the aged, and the protector of the cattle. May the religious, truthful, learned people urge thee to serve thy people !.

౩౯౬.ఇమం దేవా ఇత్యస్య దేవవాత ఋషిః, యజమానో దేవతా,భురిగ్బ్రాహ్మీ త్రిష్టుప్ ఛందః,ధైవతః స్వరః.

కస్మై కస్మై ప్రయోజనాయ కథంభూతో రాజా స్వీకార్య ఇత్యాహ.

ఏ యే ప్రయోజనములకొరకు ఎట్టి రాజును ఎన్నుకొనవలె నను విషయము.

౩౯౬ ఇమం దేవాऽ అసపత్న్ꣳసువధ్వం మహతే క్షత్రాయ మహతే
జ్యైష్ఠ్యాయ మహతే జానరాజ్యాయేంద్రస్యేంద్రియాయ ।
ఇమమముష్య పుత్ర మముష్యై పుత్రమస్యై విశऽ ఏష
వోऽమీ రాజా సోమోऽస్మాకం బ్రాహ్మణానాꣳరాజా ॥౪౦॥

**ప.విః**- ఇమమ్, దేవాః, అసపత్నమ్, సువధ్వమ్, మహతే, క్షత్రాయ, మహతే, జ్యైష్ఠ్యాయ, మహతే, జానరాజ్యాయేతి జాన + రాజ్యాయ, ఇంద్రస్య, ఇంద్రియాయ, ఇమమ్, అముష్య, పుత్రమ్, అముష్యై, పుత్రమ్, అస్యై, విశే, ఏషః, వః, అమీऽ ఇత్యమీ, రాజా, సోమః, అస్మాకమ్, బ్రాహ్మణానామ్, రాజా ॥౪౦॥

**పదార్థః** :-(ఇమమ్) సమక్షే వర్తమానమ్ (దేవాః) ధార్మికా విద్వాంసః. (అసపత్నమ్) అజాత శత్రుమ్ (సువధ్వమ్) నిష్పాదయత (మహతే) మహాగుణవిశిష్టాయ (క్షత్రాయ) క్షత్రియాణాం పాలనాయ

(మహతే) (జ్యైష్ఠ్యాయ) జ్యేష్ఠత్వాయ (మహతే) (జానరాజ్యాయ) జనానాం రాజసు భవాయ (ఇంద్రస్య) పరమైశ్వర్యయుక్తస్య పురుషస్య (ఇంద్రియాయ) ధనాయ (ఇమమ్)(అముష్యపుత్రమ్) ప్రతిష్ఠితస్య ధార్మికస్య విదుషః సంతానమ్ (అముష్యై) అముష్యై ధార్మికాయా విదుష్యాః (పుత్రమ్) పవిత్రమపత్యమ్ (అస్యై) వర్తమానాయాః (విశే) ప్రజాయాః (ఏషః) సర్వైః స్వీకృతః (వః) యుష్మాకం క్షత్రియాదీనామ్ (అమీ) పరోక్షే వర్తమానాః (రాజా) న్యాయప్రకాశకః (సోమః) సోమ ఇవ ప్రజాసు వర్తమానః (అస్మాకమ్) (బ్రాహ్మణానామ్) బ్రహ్మణః పరమేశ్వరస్య వేదచతుష్టయస్య వా సేవకానామ్ (రాజా) అయంమన్త్రః. శత. ౫. 3.3.౧౧. వ్యాఖ్యాతః.॥౪౦॥

**అన్వయః** :- హే ప్రజాస్థా దేవా యూయం త ఏష సోమో వోఽస్మాకం చ బ్రాహ్మణానాం రాజా యేఽమీ పరోక్షే వర్తంతే తేషాం చ రాజాఽస్తి, తమిమమముష్య పుత్రమముష్యై పుత్రమస్యై విశ ఇమమేవ మహతే క్షత్రాయ మహతే జ్యైష్ఠ్యాయ మహతే జానరాజ్యాయేంద్రస్యేంద్రియాయాఽసపత్నం సువధ్వమ్.॥౪౦॥

**భావార్థః** :- హే రాజప్రజాజనాః! యో విద్వద్భ్యాం మాతాపితృభ్యాం సుశిక్షితః కులీనో మహాగుణ కర్మస్వభావో జితేంద్రియత్వాదిగుణయుక్తః సేవితాఽష్టాచత్వారింశద్వర్షబ్రహ్మచర్యవిద్యాసుశిక్షః పూర్ణశరీరాత్మబలః ప్రజాపాలనప్రియో విద్వానస్తి తం సభాధ్యక్షం రాజానం కృత్వా సామ్రాజ్యం సేవధ్వమ్.॥౪౦॥

**పదార్థము** :- ప్రజలయందున్న నతడు (దేవాః) ఓ విద్వాంసులారా! మీరు (ఏషః) ఇట్టి (సోమః) చంద్రునివంటి ప్రజలయందు ప్రియస్వరూపుడు (వః) క్షత్రియులగు మీయెల్లరకు, బ్రాహ్మణులనగు మాకందరకు (అమీ) పరోక్షమందుగల యితరులకును వారెల్లరకును రాజైయున్నాడు. అట్టి (ఇమమ్) ఈ (అముష్య) ఉత్తముని (పుత్రమ్) పుత్రుని (అముష్యై) శ్రేష్ఠవిద్యాది గుణములందు విదుషీమణియగు తల్లి పుత్రుని (అస్యై) ఇట్టి (విశే) ప్రజలకై (మహతే) గొప్ప (జ్యైష్ఠ్యాయ) ప్రశంసించదగిన (మహతే) గొప్ప (జానరాజ్యాయ) ధార్మికులుగల రాజ్యపాలనకొరకు (ఇన్ద్రస్య) పరమైశ్వర్యవంతుని (ఇన్ద్రియాయ) ధనము కొరకు (అసపత్నమ్) శత్రురహితముగ (సువధ్వమ్) ఒనర్చివేయుడు.॥౪౦॥

**భావార్థము** :- ఓ రాజా! మరియు ప్రజలారా! మీరు విద్వాంసులగు తల్లిదండ్రులచే సుశిక్షితుడు, కులీనుడు, చక్కని గుణకర్మస్వభావములు గలవాడు, జితేంద్రియుడు, ౪౮ సంవత్సరముల బ్రహ్మచర్యముచే నార్జించిన పూర్ణవిద్యలచే సుశీలుడు, శారీరకాత్మిక బలసంపన్నుడు, గొప్ప విద్వాంసుడగువానిని మాత్రమే సభాపతి రాజుగా నెంచుకొని చక్రవర్తిరాజ్యమును సేవించుడు.॥౪౦॥

**40.O learned people, this lover of his subjects, is the King of you the Kshatriyas, and us the Brahmanas, and the people living afar. Him, the son of that father, and that mother, (for the protection of the people, for great supremacy), for soverignty over the virtuous, and for obtaining huge wealth, do ye render free from foes!.**

**అస్మిన్నధ్యాయే రాజధర్మ వర్ణనాదేతదర్థస్య పూర్వాధ్యాయార్థేన సహ సంగతిరస్తీతి జానంతు ॥**

ఈ యధ్యాయమునందు రాజధర్మమును గూర్చిన వర్ణనగలదు. దీని యర్థము పూర్వాధ్యాయముతో గలిసియున్నదని యెరుగవలయును.

ఇతి శ్రీయుత పరివ్రాజకాచార్య మహావిదుషాం శ్రీ విరజానన్ద సరస్వతీస్వామినాం శిష్యేణ శ్రీమద్దయానన్ద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే నవమోఽధ్యాయః సమాప్తిం గతః.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి తొమ్మిదవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వెంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్పబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య

'మల్లి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**తొమ్మిదవ అధ్యాయము సమాప్తము**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# యజుర్వేదభాష్యము

## దశమాధ్యాయము - విషయసూచిక

ఇందులో 34 మంత్రములు, 41 ఛందస్సులు, 2059 అక్షరములు

# అథ దశమోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే చతుస్త్రింశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం.విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

३८८. అపో దేవా ఇత్యస్య వరుణ ఋషిః, ఆపో దేవతాః,నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ మనుష్యైర్విదుషామనుకరణేన పదార్థేభ్య ఉపయోగో గ్రాహ్య ఇత్యాహ.

ఈ దశమాధ్యాయమునందలి మొదటి మంత్రమందు మానవులు విద్వాంసుల కనుకూలముగ నుండి పదార్థముల నుపయోగించుకొనవలెనని యుపదేశించబడెను.

३८८ అపో దేవా మధుమతీరగృభ్ణన్నూర్జస్వతీ రాజస్వశ్చితానాః।

యాభిర్మిత్రావరుణావభ్యషించన్యాభిరింద్రమనయన్నత్యరాతీః ॥1॥

**ప.విః-** అపః, దేవాః, మధుమతీరితి మధు + మతీః అగృభ్ణన్, ఊర్జస్వతీః, రాజస్వ ఇతి రాజ + స్వః, చితానాః, యాభిః, మిత్రావరుణౌ, అభి, అసించన్, యాభిః, ఇంద్రమ్, అనయన్, అతి, అరాతీః॥1॥

పదార్థః:-(అపః) జలాని ప్రాణాన్వా (దేవాః) విద్వాంసః (మధుమతీః) ప్రశస్త మధురాదిగుణయుక్తాః (అగృభ్ణన్) గృహ్ణీత (ఊర్జస్వతీః) బలపరాక్రమప్రదాః (రాజస్వః) రాజజనికాః (చితానాః) సంజ్ఞాకారిణ్యః. అత్ర వికరణ లుగ్ వ్యత్యయేనాత్మనేపదం చ (యాభిః)(మిత్రావరుణౌ) ప్రాణోదానౌ (అభి)(అసించన్) సించంతి (యాభిః) క్రియాభిః (ఇంద్రమ్) విద్యుతమ్ (అనయన్) ప్రాప్నువంతి (అతి)(అరాతీః) శత్రూన్. అయమన్త్రః. శత ౫.3.4.2-3 వ్యాఖ్యాతః.॥1॥

**అన్వయః:-**హే మనుష్యా! యూయం విపశ్చితో దేవా యాభిర్మిత్రావరుణావభ్యసించన్, యాభిరింద్రమరాతీశ్చానయన్, తాభిర్మధుమతీరూర్జస్వతీశ్చితానా రాజస్వ ఽపోఽగృభ్ణన్ గృహ్ణీత.॥1॥

**భావార్థః :-**మనుష్యైర్విద్వత్సహాయేనాఽపః సుపరీక్ష్యోపయుజ్యంతామ్. శత్రూన్నివర్త్య ప్రజయా సహ ప్రాణవత్ ప్రియత్వే వర్తితవ్యమాభ్య ఉపకారో నేయః.॥1॥

**పదార్థము :-**ఓ మానవులారా! (దేవాః) చతురవిద్వాంసులగు మీరు (యాభిః) ఎట్టి క్రియలచే (మిత్రావరుణౌ) ప్రాణోదానములను (అభ్యసించన్) సర్వవిధముల సేచన మొనర్చుచున్నారో మరియు

(అరాతీః) శత్రువులను (అనయన్) జయించుచున్నారో, అట్టి క్రియలచే (మధుమతీః) ప్రశంసించదగిన మధురము మున్నగు గుణయుక్తముల (ఊర్జస్వతీః) బలపరాక్రమముల వృద్ధిపరచు (చితానాః) చైతన్యము నిచ్చు (రాజస్వః) జ్ఞానప్రకాశముతో గూడిన రాజ్యమును ప్రాప్తింపజేయు (అపః) జలములను లేక ప్రాణములను (అగృభ్ణన్) పొందుడు.॥౧॥

**భావార్థము** :- మానవులు విద్వాంసుల సహాయముచే జలములను లేక ప్రాణములను పరీక్షించుకొని వానిచే నుపయోగమును పొందవలయును. శత్రువులను నాశపరచి ప్రజలను ప్రాణములవలె ప్రేమించవలయును. ఈ జలములతో ప్రాణములతో ఉపకారమును పొందుచుండవలయును.॥౧॥

1.O wise persons, the means through which ye control breath, create electric power, and conquer foes, should also be employed to qcquire sweet, strength-infusing, refreshing, and sovereignty-bestowing waters!.

౩౮౮. వృష్ణ ఊర్మిరిత్యస్య వరుణఋషిః, వృషా దేవతా, స్వరాడ్ బ్రాహ్మీ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

అథ విద్వాంసః కీదృశం రాజానం ప్రతి కిం కిం యాచేరన్నిత్యాహ.

విద్వాంసు లెట్టి రాజును ఏమి యాచించవలె నను విషయ మీ మంత్రమందు గలదు.

౩౮౮ వృష్ణ ఊర్మి రసి రాష్ట్రదా రాష్ట్రం మే దేహి స్వాహా।
వృష్ణ ఊర్మి రసి రాష్ట్రదా రాష్ట్ర మముష్మై దేహి।
వృషసేనోఽసి రాష్ట్రదా రాష్ట్రం మే దేహి స్వాహా।
వృషసేనోఽసి రాష్ట్రదా రాష్ట్ర మముష్మై దేహి ॥౨॥

ప.వి:- వృష్ణః, ఊర్మిః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర + దాః, రాష్ట్రమ్, మే, దేహి, స్వాహా, వృష్ణః, ఊర్మిః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర + దాః, రాష్ట్రమ్, అముష్మై, దేహి, వృషసేన ఇతి వృష+సేనః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర + దాః, రాష్ట్రమ్, మే, దేహి, స్వాహా, వృషసేన ఇతి వృష + సేనః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర + దాః, రాష్ట్రమ్, అముష్మై, దేహి ॥౨॥

**పదార్థః**:-(వృష్ణః) సుఖవర్షకస్య విజ్ఞానస్య (ఊర్మిః) ప్రాపకః. అర్తే రూచ్చ. ఉ.౪.౪౪. ఇతి ఋ ధాతోర్మిః (అసి) (రాష్ట్రదాః) రాష్ట్రం దదాతీతి (రాష్ట్రమ్) రాజ్యమ్ (మే) మహ్యమ్ (దేహి)(స్వాహా) సత్యయా నీత్యా (వృష్ణః) సుఖవర్షకస్య రాజ్యస్య (ఊర్మిః) జ్ఞాతా (అసి)(రాష్ట్రదాః) రాజ్యప్రదాః (రాష్ట్రమ్) న్యాయప్రకాశితమ్ (అముష్మై) రాజ్యపాలకాయ (దేహి) (వృషసేనః) వృషా బలయుక్తా సేనా యస్య సః (అసి) (రాష్ట్రదాః) రాజ్ఞాం కర్మప్రదాః (రాష్ట్రమ్) రాజ్యమ్ (మే) ప్రత్యక్షాయ మహ్యమ్ (దేహి) (స్వాహా) సుష్ఠువాచా (వృషసేనః) హృష్టపుష్టసేనః (అసి) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) పరోక్షాయ జనాయ. (దేహి) అయమ్మన్త్రః. శత. ౫.౩.౪. ౫-౬ వ్యాఖ్యాతః.॥౨॥

**అన్వయః** :-హే రాజన్! యతస్త్వం వృష్ణ ఊర్మీ రాష్ట్రదా అసి తస్మాన్మే స్వాహా రాష్ట్రం దేహి. వృష్ణ ఊర్మీ రాష్ట్రదా అసి, అముష్మై రాష్ట్రం దేహి. రాష్ట్రదా వృషసేనోఽసి స్వాహా రాష్ట్రం దేహి. రాష్ట్రదా వృషసేనోఽసి, త్వమముష్మై రాష్ట్రం దేహి.॥౨॥

**భావార్థః** :-యో మనుష్యో దుష్టాన్ జిత్వా ప్రత్యక్షాన్ శ్రేష్ఠాన్ సత్కృత్య రాజ్యాధికారం రాజ్యశ్రియం దదాతి స చక్రవర్తీ భవితుం యోగ్యో జాయతే.॥౨॥

**పదార్థము** :-ఓ రాజా! నీవు (వృష్ణః) సుఖముల వర్షింపజేయువాడవు, జ్ఞానప్రాప్తి గలిగించువాడవు (రాష్ట్రదాః) రాజ్యము నిచ్చువాడవునై (అసి) ఉన్నావు. అందువల్ల (మే) నాకు (స్వాహా) సత్యనీతిచే (రాష్ట్రమ్) రాజ్యమును (దేహి) ఇమ్ము (వృష్ణః) సుఖముల వర్షింపజేయు రాజ్యమును (ఊర్మిః) ఎరిగినవాడవు మరియు (రాష్ట్రదాః) రాజ్యమును ప్రసాదించువాడవునై (అసి) ఉన్నావు. కావున (అముష్మై) ఆ రాజ్యము నేలు సత్పురుషులకు (రాష్ట్రమ్) న్యాయముచే ప్రకాశించు రాజ్యమును (దేహి) ఇమ్ము (రాష్ట్రదాః) రాజుల కర్తవ్యకర్మల నిచ్చువాడవు (వృషసేనః) శక్తివంతమైన సైన్యములు గలిగిన సైన్యాధిపతివై (అసి) ఉన్నావు (మే) ప్రత్యక్షముగనున్న నాకొరకు (స్వాహా) చక్కని వాణిచే (రాష్ట్రమ్) రాజ్యమును (దేహి) ఇమ్ము. మరియు (రాష్ట్రదాః) ప్రత్యక్షముగ రాజ్యమునిచ్చువాడవు (వృషసేనః) ఆనందోత్సాహ వీరసైన్యములు గలవాడవై (అసి) ఉన్నావు. కావున నీవు (అముష్మై) ఆ పరోక్షమున నున్నవానికొరకు (రాష్ట్రమ్) రాజ్యమును (దేహి) ఇమ్ము. ॥౨॥

**భావార్థము** :-దుష్టప్రాణులను జయించి ప్రత్యక్ష, అప్రత్యక్షమునందున్న సత్పురుషులను సత్కరించి వారికి అధికారము మరియు శోభను గలిగించు వీరపరాక్రమవంతుడగు రాజపురుషునికే చక్రవర్తి రాజ్యాధికారము ఉండవలయును.॥౨॥

**2.O people, ye are the givers of Kingship, that brings knowledge and showers happiness, bestow on me the kingdom, in a righteous manner. Ye are the knowers of government that showers happiness, and the givers of Kingship, bestow Kingdom on him, who can protect it. Ye are the definers of the duties of Kings, and masters of a strong army, bestow on me the Kingdom, in a beautiful speech. Ye are the givers of Kingship, and masters of a strong army, bestow the Kingdom on the deserving!.**

౩౯. అర్థేత ఇత్యస్య వరుణ ఋషిః, ఆపాం పతిర్దేవతా, పూర్వస్యాభికృతిశ్ఛందః, ఋషభః, స్వరః, దేహీత్యస్య విచృజ్జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునా రాజాఽమాత్యాసేనా ప్రజాజనాః పరస్పరం కథం వర్తేరన్నిత్యుపదిశ్యతే.

రాజు, మంత్రులు, సేన, ప్రజలు పరస్పరమెట్లు మెలగవలయునను విషయము.

౩౯ అర్థేత స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహార్థేత స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్తౌజస్వతీ స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహౌజస్వతీ స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్తాపః పరివాహిణీ స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహాపః పరివాహిణీ స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్తాపాంపతిరసి రాష్ట్రదా రాష్ట్రం మే దేహి స్వాహాఽపాంపతిరసి రాష్ట్రదా రాష్ట్రమముష్మై దేహ్యపాం గర్భోఽసి రాష్ట్రదా రాష్ట్రం మే దేహి స్వాహాఽపాం గర్భోఽసి రాష్ట్రదా రాష్ట్రమముష్మై దేహి ॥౩॥

ప.వి:- అర్థేత, ఇత్యర్థ + ఇతః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, అర్థేత ఇత్యర్థ+ఇతః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, ఓజస్వతీః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, ఓజస్వతీః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, ఆపః, పరివాహిణీః, పరివాహినీరితి పరి +వాహినీః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, ఆపః, పరివాహిణీః, పరివాహినీరితి పరి+వాహినీః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్,

అముష్మై, దత్త, అపామ్, పతిః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దేహి,స్వాహా, అపామ్, పతిః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దేహి, అపామ్, గర్భః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దేహి, స్వాహా, అపామ్, గర్భః, అసి, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దేహి ॥౩॥

**పదార్థః** :-(అర్థేతః) యేఽర్థం యంతి (స్థ) భవత. (రాష్ట్రదాః) రాజ్యప్రదాః సభాసదః (రాష్ట్రమ్) రాజ్యమ్ (మే) మహ్యమ్ (దత్త)(స్వాహా) సత్యయా వాచా (అర్థేతః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (ఓజస్వతీః) విద్యాబలపరాక్రమయుక్తా రాజస్త్రియః (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) మహ్యమ్ (దత్త) (స్వాహా) న్యాయయుక్తయా నీత్యా (ఓజస్వతీః) జితేంద్రియాః (స్థ) రాష్ట్రదాః (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త)(అపామ్) పూర్వోక్తానామ్ (పతిః) పాలకః (అసి) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్)(మే) (దేహి) (స్వాహా) ప్రియయా వాచా (అపామ్) ప్రాణానామ్ (పతిః) రక్షకః (అసి) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దేహి) (అపామ్) (గర్భః) అంతర్హితః (అసి) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దేహి) (స్వాహా) యుక్తిమత్యా వాచా (అపామ్) (గర్భః) స్తోతుం యోగ్యః (అసి) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దేహి). అయమ్మన్త్రః శత. ౫.౩.౪.౭-౧౧ వ్యాఖ్యాతః ॥౩॥

**అన్వయః** :-హే మనుష్యా! యే యూయమర్థేతస్సంతః స్వాహా రాష్ట్రదాః స్థ, తే మే రాష్ట్రం దత్త. యే యూయమర్థేతః సంతో రాష్ట్రదాః స్థ, తేఽముష్మై రాష్ట్రం దత్త. యా యూయం స్వాహౌజస్వతీః సత్యో రాష్ట్రదాః స్థ తా మే రాష్ట్రం దత్త. యా ఓజస్వతీ రాష్ట్రదాః స్థ, తా అముష్మై రాష్ట్రం దత్త. యా యూయం స్వాహా పరివాహిణీ రాష్ట్రదాః స్థ, తా మే రాష్ట్రం దత్త. యా యూయం పరివాహిణీ రాపో రాష్ట్రదాః స్థ, తా అముష్మై రాష్ట్రం దత్త. యస్త్వం రాష్ట్రదా అపాం పతిరసి సోఽముష్మై రాష్ట్రం దేహి. యస్త్వం స్వాహా రాష్ట్రదా అపాం గర్భోఽసి స త్వం మే రాష్ట్రం దేహి. యస్త్వం రాష్ట్రదా అపాం గర్భోఽసి సోఽముష్మై రాష్ట్రం దేహి. ॥౩॥

**భావార్థః**:-యే పురుషా రాజానో యా రాజస్త్రియశ్చ స్యుస్తాః స్వోత్కర్షార్థం పరోత్కర్షసహనం సర్వాన్ మనుష్యాన్ విద్యాసుశిక్షాయుక్తాంశ్చ కృత్వా రాజ్యభాగినో రాజ్యసేవిన్యశ్చ స్యుః. న ఖల్వీర్ష్యయా పరేషాం హానికరణాత్ స్వరాజ్యభ్రంశమాకారయేయుః. ॥౩॥

**పదార్థము**:-ఓ మానవులారా! మీరు (అర్థేతః) ఉత్తమపదార్థముల బడయుచు (స్వాహా) సత్యనీతిచే (రాష్ట్రదాః) రాజ్యమునుసేవించు సభాసదులు (స్థ) ఐయున్నారు. అట్టి మీరు (మే) నాకు (రాష్ట్రమ్)

రాజ్యమును (దత్త) ప్రసాదించుడు. మరియు మీరు (అర్థేతః) పదార్థముల నెరుగువారు (రాష్ట్రదాః) రాజ్యమునొసగువారును నై (స్థ) ఉన్నారు. అట్టి మీరు (అముష్మై) రాజ్యపాలకుడగు నాతనికి (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఒసగుడు (స్వాహా) సత్యనీతితోగూడ (ఓజస్వతీః) విద్య, బలపరాక్రమములుగల రాణులారా! మీరు (రాష్ట్రదాః) రాజ్యము నొసగువారై (స్థ) ఉన్నారు. అట్టి మీరు (మే) నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ప్రసాదించుడు. మరియు మీరు (ఓజస్వతీః) ఇంద్రియముల జయించినవారై (రాష్ట్రదాః) రాజ్యము నిచ్చువారై (స్థ) ఉన్నారు. కావున మీరు (అముష్మై) విద్యాబలపరాక్రమములుగల పురుషార్థికి (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఒసగుడు. మీరు (స్వాహా) సత్యనీతితో (పరివాహిణీః) తమవంటి ప్రియమైనవారు (రాష్ట్రదాః) రాష్ట్రమునిచ్చువారలై (స్థ) ఉన్నారు (మే) నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఒసగుడు. మరియు మీరు (పరివాహిణీః) తమకు అనుకూలురగు భర్తలతోగూడ ప్రసన్నులగు (ఆపః) ఆత్మవంటి ప్రియురాండ్రు (రాష్ట్రదాః) రాజ్యమునిచ్చువారు (స్థ) ఐయున్నారు. అట్టి మీరు (అముష్మై) బ్రహ్మచారియగు యా వీరునకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ప్రసాదించుడు. ఓ సభాధ్యక్షా! నీవు (రాష్ట్రదాః) రాజ్యము నొసగువాడవు (అపామ్) జలాశయముల (పతిః) రక్షకుడవునై (అసి) ఉన్నావు. అట్టి నీవు (స్వాహా) సత్యనీతితోగూడ (రాష్ట్రమ్) రాజ్యమును (దేహి) ఇమ్ము. ఓ సభాపతీ! నీవు (స్వాహా) సత్యవాక్కులతో (రాష్ట్రదాః) రాజ్యము నొసగువాడవు. (అపామ్) ప్రాణుల (పతిః) రక్షకుడవై (అసి) ఉన్నావు. అట్టినీవు (అముష్మై) ప్రాణపోషకుడగు ఆ వీరునకు (రాష్ట్రమ్) రాజ్యమును (దేహి) ఇమ్ము. వీరుడవగు ఓ రాజా! నీవు (స్వాహా) సత్యనీతితో (రాష్ట్రదాః) రాజ్యమునొసగువాడవు (అపామ్) సైన్యములమధ్య (గర్భః) గర్భమువలె రక్షితుడవునై (అసి) ఉన్నావు. అట్టి నీవు (మే) ఆలోచనాపరుడనగు నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దేహి) ఇమ్ము. ఓ రాజా! నీవు (రాష్ట్రదాః) రాజ్యము నొసగెడువాడవు (అపామ్) ప్రజలవిషయమునందు (గర్భః) స్తుతించదగినవాడవునై (అసి) ఉన్నావు. అట్టి నీవు (అముష్మై) ఆ ప్రశంసనీయునకు (రాష్ట్రమ్) రాజ్యమును (దేహి) ఇమ్ము.॥3॥

**భావార్థము** :-రాజ్యాధికారులు, వారి స్త్రీలు తమ యున్నతికొరకు ఇతరుల యున్నతిని సహించి సకలప్రజలను రాజ్యమునకు యోగ్యులుగ జేయవలయును. వారును చక్రవర్తిరాజ్యభోగముల ననుభవించ వలయును. కాని ఈర్ష్యాసూయలచే ఇతరులకు హానిని గలిగించి రాజ్యమునకు భంగము గలుగనీయరాదు.॥3॥

**3.O wealthy people, givers of Kingship, bestow on me the Kingdom in a righteous manner. Ye, the masters of knowledge, and givers of Kingship, bestow Kingdom on him who can protect it!.**

**Ye royal women, imbued with knowledge, strength and supremacy, givers of Kingship, bestow kingdom on me in a righteous manner. Ye self-controlled ladies, the givers of Kingship, bestow kingdom on him, who deserves it.**

**Ye kind ladies, givers of kingship, bestow kingdom on me in a righteous manner!.**

**Ye' kind ladies, givers of kingship, bestow kingdom on the self controlled hero!.**

**O ye protectors of the people, givers of kingship, bestow kingdom on me in a righ-**

teous manner. Ye controllers of breath and givers of kingship, bestow kingdom on him, who protects his subjects!.

O valiant King, guarded by the armies which give thee women-like protection, and are the givers of Kingship, help me a considerate successor in the election as a king!.

O King, praised by the subjects, the electors of a ruler, help pass on the Kingship to the well-praised deserving person!.

౪౦౦. సూర్యత్వచస ఇత్యస్య వరుణ ఋషిః, సూర్యాదయో మంత్రోక్తా దేవతాః, పూర్వస్య జగతీ ఛందః, నిషాదః స్వరః, సూర్యవర్చస ఇతి ద్వితీయస్య స్వరాట్ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః, వ్రజక్షిత ఇతి తృతీయస్య శవిష్ఠా ఇతి చతుర్థస్య చ స్వరాట్ వికృతిశ్ఛందః, మధ్యమః స్వరః, వ్రజక్షితస్థేత్యస్య స్వరాట్ సంస్కృతిశ్ఛందః, గాంధారః స్వరః, శక్వరీస్థేత్యస్య భురిగాకృతి శ్ఛందః, పంచమః స్వరః, మధుమతీరిత్యస్య భురిక్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

మనుష్యాః కీదృశా భూత్వా కస్మై కస్మై కిం కిం ప్రదద్యురిత్యాహ.

మనుష్యు లెట్టి వారై ఎవరెవరి కే మేమి ఈయవలె నను విషయమిందు గలదు.

౪౦౦ సూర్యత్వచస స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా సూర్యత్వచస స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త సూర్యవర్చస స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా సూర్యవర్చస స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త మాందా స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా మాందా స్థ రాష్ట్రదా రాష్ట్ర మముష్మై దత్త వ్రజక్షిత స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా వ్రజ క్షిత స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త వాశా స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా వాశా స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త శవిష్ఠా స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా శవిష్ఠా స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త శక్వరీ స్థ

రాష్ట్రదా రాష్ట్ర మ్మే దత్త స్వాహా శక్వరీ స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త జనభృత స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా జనభృత స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త విశ్వభృత స్థ రాష్ట్రదా రాష్ట్రం మే దత్త స్వాహా విశ్వభృత స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్తాపః స్వరాజ స్థ రాష్ట్రదా రాష్ట్రమముష్మై దత్త । మధుమతీ ర్మధుమతీభిః పృచ్యంతామ్మహి క్షత్రం క్షత్రియాయ వన్వానాఽ అనాధృష్టాః సీదత సహౌజసో మహి క్షత్రం క్షత్రియాయ దధతీః॥౪॥

ప.వి:- సూర్యత్వచస ఇతి సూర్య+త్వచసః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, సూర్యత్వచస ఇతి సూర్య+త్వచసః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, సూర్యవర్చస ఇతి సూర్య+వర్చసః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, సూర్యవర్చస ఇతి సూర్య+వర్చసః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, మాందాః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, మాందాః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, వ్రజక్షిత ఇతి వ్రజ+క్షితః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, వ్రజక్షిత ఇతి వ్రజ+క్షితః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, వాశాః, స్థ, రాష్ట్రదా

ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, వాశాః, స్థ, రాష్ట్రదా, ఇతి, రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, శవిష్ఠాః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, శవిష్ఠాః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, శక్వరీః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, శక్వరీః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, జనభృత ఇతి జన+భృతః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, జనభృత ఇతి జన+భృతః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, విశ్వభృత ఇతి విశ్వ+భృతః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, మే, దత్త, స్వాహా, విశ్వభృత ఇతి విశ్వ+భృతః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, ఆపః, స్వరాజ ఇతి స్వ+రాజః, స్థ, రాష్ట్రదా ఇతి రాష్ట్ర+దాః, రాష్ట్రమ్, అముష్మై, దత్త, మధుమతీరితి మధు+మతీః, మధుమతీభిరితి మధు+మతీ+భిః, పృచ్యంతామ్, మహి, క్షత్రమ్, క్షత్రియాయ, వన్వానాః, అనాధృష్టాః, సీదత, సహౌజస ఇతి సహ+ఓజసః, మహి, క్షత్రమ్, క్షత్రియాయ, దధతీః ॥౪॥

పదార్థః-(సూర్యత్వచసః) సూర్యస్య త్వచః సంవార ఇవ త్వచో యేషాం తే (స్థ) భవథ (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (సూర్యత్వచసః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (సూర్యవర్చసః) సూర్యస్య ప్రకాశ ఇవ వర్చో విద్యాధ్యయనం యేషాం తే (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (సూర్యవర్చసః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (మాందాః) యే జనాన్ మందయంత్యానందయంతి త ఏవ మాందాః (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (మాందాః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (వ్రజక్షితః) వ్రజాన్

గవాదిష్విత్యర్థాన్ దేశాన్ క్షియంతి నివాసయంతి తే (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (వ్రజక్షితః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (వాశాః) య ఉశంతి కామయంతే తే (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (వాశాః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (శవిష్ఠాః) అతిశయేన బలవంతః (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (శవిష్ఠాః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (శక్వరీః) శక్తిమత్యః (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (శక్వరీః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (జనభృతః) యే జనాన్ బిభ్రతి తే (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (జనభృతః) (స్థ)(రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (విశ్వభృతః) యే విశ్వం బిభ్రతి తే (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (మే) (దత్త) (స్వాహా) (విశ్వభృతః) (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (ఆపః) సకలవిద్యాధర్మవ్యాపినః (స్వరాజః) యే స్వం రాజంతే తే (స్థ) (రాష్ట్రదాః) (రాష్ట్రమ్) (అముష్మై) (దత్త) (మధుమతీః) మధురాదిగుణయుక్తా ఓషధ్యః (మధుమతీభిః) మధురాది గుణయుక్తాభిర్వసంతాదిభిరృతుభిః (పృచ్యంతామ్) పరిపచ్యంతామ్ (మహి) మహత్పూజ్యం (క్షత్రమ్) క్షత్రియాణాం రాజ్యమ్ (క్షత్రియాయ) క్షత్రస్య పుత్రాయ (వన్వానాః) యాచమానాః (అనాధృష్టాః) శత్రుభిరధర్షితాః (సీదత) (సహౌజసః) ఓజసా బలేన సహ వర్తమానాః (మహి) (క్షత్రమ్) (క్షత్రియాయ) (దధతీః) ధరమాణాః. అయమ్మన్త్రః. శత. ౫.౩.౪.౧౨-౨౧. వ్యాఖ్యాతః.॥౪॥

అన్వయః :- హే రాజపురుషాః! యతో యూయం సూర్యత్వచసః సంతః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతః సూర్యత్వచసః సంతో యూయం రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయం సూర్యవర్చసః సంతః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయం సూర్యవర్చసో రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయం వ్రజక్షితః సంతః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయం వ్రజక్షితః సంతో రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయం వాశాః సంతః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయం వాశా రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయం శవిష్ఠాః సంతః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయం శవిష్ఠా రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయం శక్వరీః సత్యః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయం శక్వరీ రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయం జనభృతః సంతః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయం జనభృతో రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయం విశ్వభృతః సంతః స్వాహా రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయం విశ్వభృతో రాష్ట్రదా స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. యతో యూయమాపః స్వరాజః సంతో రాష్ట్రదా స్థ తస్మాన్మే రాష్ట్రం దత్త. యతో యూయమాపః స్వరాజః స్థ తస్మాదముష్మై రాష్ట్రం దత్త. హే సజ్జనాః స్త్రియో! యుష్మాభిః క్షత్రియాయ మహి క్షత్రం వన్వానాః

సహౌజసః క్షత్రియాయ మహిక్షత్రం దధతీరనాధృష్టా మధుమతీర్మధుమతీభిః సుఖాని పృచ్యంతామ్. హే సజ్జనాః పురుషాః! యూయ మీదృశీః స్త్రియః సీదత ప్రాప్నుత.॥౮॥

**భావార్థః**:-హే స్త్రీపురుషాః! యే మనుష్యాః సూర్యవన్న్యాయప్రకాశకాః సూర్య ఇవ విద్యాదీపకాః సర్వేషామానందప్రదా గవాదిపశురక్షకాః శుభగుణైః కమనీయా బలవంతః స్వసదృశస్త్రియః విశ్వంభరాః స్వాధీనాః సంతి, తేఽన్యేభ్యో రాజ్యం దాతుం సేవితుం చ శక్నువంతి నేతర ఇతి యూయం విజానీత.॥౮॥

**పదార్థము** :- ఓ రాజపురుషులారా! మీరు (సూర్యత్వచసః) సూర్యునివలె మీ న్యాయప్రకాశముతో ఇతర తేజములన్నిటిని కప్పివేయువారగుచు (స్వాహా) సత్యన్యాయములద్వారా (రాష్ట్రదాః) రాజ్యము నిచ్చువారు (స్థ) అగుదురు. కావుననే (మే) నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. ఓ మానవులారా! (సూర్యత్వచసః) సూర్యప్రకాశమువంటి విద్యనభ్యసించువారగుచు మీరు (రాష్ట్రదాః) రాజ్యము నొసగువారు (స్థ) అగుచున్నారు. కావుననే (అముష్మై) ఆ విద్యయందు సూర్యునివలె ప్రకాశించు ఉత్తమునకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. ఓ విద్వాంసులారా! (సూర్యవర్చసః) సూర్యునివంటి తేజముగలవారగుచు మీరు (స్వాహా) సత్యవాణిచే (రాష్ట్రదాః) రాజ్యదాతలు (స్థ) అగుచున్నారు. కావున (మే) తేజోవంతుడనగు నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఒసగుడు. (సూర్యవర్చసః) సూర్యునివలె ప్రకాశముగలవారగుచు మీరు (రాష్ట్రదాః) రాజ్యము నొసగువారై (స్థ) ఉన్నారు. కావుననే (మాన్దాః) మానవులకు ఆనందము నిచ్చువారగు మీరు (స్వాహా) సత్యవాణితో (రాష్ట్రదాః) రాజ్యమునొసగువారై (స్థ) ఉన్నారు. కావున (మే) ఆనందము నిచ్చునట్టి నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. (మాన్దాః) ప్రాణులకు సుఖమునిచ్చువారై (రాష్ట్రదాః) రాజ్యదాతలై (స్థ) ఉన్నారు. కావున (అముష్మై) సుఖదాతయగు వీరునకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. (వ్రజక్షితః) గోవులు మున్నగు పశువులస్థానములను నిర్మింపజేయుచు (స్వాహా) సత్యక్రియలతోగూడ (రాష్ట్రదాః) రాజ్యదాతయ్యై (స్థ) ఉన్నారు. కావున (మే) పశురక్షకుడనగు నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ప్రసాదించుడు. మీరు (వ్రజక్షితః) స్థానములు మున్నగువానిద్వారా పశువుల రక్షించువారగుచు (రాష్ట్రదాః) రాజ్యమునిచ్చువారై (స్థ) ఉన్నారు. కావున (అముష్మై) అట్టి గోవులు మున్నగు పశువుల పోషకుడనగు నాకు రాజ్యమును (దత్త) ఈయుడు. మీరు (వాశాః) కోరుకొనువారై (స్వాహా) సత్యనీతి ద్వారా (రాష్ట్రదాః) రాజ్యదాతలై (స్థ) యున్నారు. కావున (మే) కోరికలతో గూడినవాడనగు నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ప్రసాదించుడు. మీరు (వాశాః) కోరికతో గూడి (రాష్ట్రదాః) రాజ్యమునిచ్చువారై (స్థ) ఉన్నారు (అముష్మై) ఆకాంక్షించు నాతనికి (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. మీరు (శవిష్ఠాః) అతిపరాక్రమశాలురై (స్వాహా) చక్కని పురుషార్థములచే (రాష్ట్రదాః) రాజ్యదాతలై (స్థ) ఉన్నారు. కావున (మే) శక్తిశాలినగు నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. మీరు (శవిష్ఠాః) అతి పరాక్రమశాలురగు (రాష్ట్రదాః) రాజ్యదాతలై (స్థ) ఉన్నారు. కావున (అముష్మై) అతిపరాక్రమశాలియగు నాతనికి (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఒసగుడు. ఓ రాణులారా! మీరు (శక్వరీః) సామర్థ్యవతులై (స్వాహా) సత్యపురుషార్థములతో (రాష్ట్రదాః) రాజ్యమునొసగువారై (స్థ) ఉన్నారు. కావున (మే) సామర్థ్యముగలవాడనగు

నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. మీరు (శక్వరీః) సమర్థవంతులగు (రాష్ట్రదాః) రాజ్యమునీయగలవారై (స్థ) ఉన్నారు. కావున (అముష్మై) సమర్థవంతుడగు నాతనికి (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ప్రసాదించుడు మీరు (జనభృతః) శ్రేష్ఠులను పోషించువారగుచు (స్వాహా) సత్యకర్మలతో (రాష్ట్రదాః) రాజ్యమును ఇచ్చువారై (స్థ) ఉన్నారు. కావున (మే) శ్రేష్ఠగుణములుగల నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. మీరు (జనభృతః) సజ్జనులను ధరించువారై (రాష్ట్రదాః) రాజ్యము నిచ్చువారుగ నున్నారు. కావున (అముష్మై) సత్యవంతుడగు నాతనికి (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ప్రసాదించుడు. ఓ సభాధ్యక్షా! రాజపురుషులారా! (విశ్వభృతః) సమస్తలోకములను పోషించువారగుచు మీరు (స్వాహా) సత్యవాణిచే (రాష్ట్రదాః) రాజ్యదాతలై (స్థ) ఉన్నారు. కావున (మే) సర్వమునుపోషించు నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. మీరు (విశ్వభృతః) విశ్వమును ధరించువార లగుచు (రాష్ట్రదాః) రాజ్యదాతలై (స్థ) ఉన్నారు. కావున (అముష్మై) ధారణమొనర్చు ఆ మనుష్యునకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఒసగుడు. మీరు (ఆపః) సమస్త విద్యాధర్మములందు మసలుచు (స్వాహా) సత్క్రియలచే (రాష్ట్రదాః) రాజ్యము నీయగలవారై (స్థ) ఉన్నారు. కావున (మే) శుభగుణములందు వ్యాప్తుడనై యున్న నాకు (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఈయుడు. మీరు (ఆపః) సర్వవిద్యలు మరియు ధర్మముల నెరుగువారలు (స్వరాజః) స్వయం ప్రకాశవంతులై (రాష్ట్రదాః) రాజ్యదాతలుగ నున్నారు. కావున (అముష్మై) ధర్మయుక్తుడగు నాతనికి (రాష్ట్రమ్) రాజ్యమును (దత్త) ఒసగుడు. సజ్జనతగల ఓ మహిళామణులారా! మీరు(క్షత్రియాయ) క్షత్రియులకొరకు (మహి) గొప్పగా పూజించదగిన (క్షత్రమ్) క్షత్రియుల రాజ్యమును (వన్వానాః) కోరుకొనుచు (సహౌజసః) బలపరాక్రమాదులచే గూడియున్న (క్షత్రియాయ) రాజపుత్రులకొరకు (మహి) గొప్పదగు (క్షత్రమ్) రాజ్యమును (దధతీః) ధారణమొనర్చుచు (అనాధృష్టాః) శత్రువులకు లోబడిపోకుండ (మధుమతీః) మధురరసములతో నిండిన ఓషధులవలె (మధుమతీభిః) మధురము మున్నగు గుణములతో గూడిన వసంతాది ఋతువులద్వారా సుఖములను (పృచ్యన్తామ్) సిద్ధపరచుచుండుడు. ఓ సజ్జనులారా! మీరును ఇట్టి స్త్రీలను (సీదత) పొందుడు. ॥౪॥

**భావార్థము** :- ఓ స్త్రీపురుషులారా! సూర్యునివలె న్యాయమును, విద్యను ప్రకాశపరచువారు, సర్వమునకు ఆనందమును సమకూర్చువారు, గోవులు మున్నగు పశువులను గాపాడువారు, శుభగుణములచే శోభాయమానులు, బలశాలురు, తమ గుణకర్మస్వభావములకు సరిపడినట్టి స్త్రీలను వివాహ మాడినవారు, ప్రపంచమును పోషించి పాలించువారు మరియు స్వతంత్రులునై యుండునట్టివారు మాత్రమే ఇతరులకు రాజ్యము నొసగుటకును, స్వయముగ సేవించుటకును సమర్థవంతులగుదురు గాని అన్యులు మాత్రము కాజాలరు. ॥౪॥

**4.O people, protectors like the sun, with your spirit of ture jusitce. ye are the givers of kingship, bestow Kingdom on me!.**

**Ye, protectors like the sun, ye, seekers after knowledge, are the givers of Kingship, bestow Kingdom on the deserving person. Ye people educationally brilliant like the sun, the givers of Kingship, bestow Kingdom on me in a befitting manner!.**

O people, ye are educationally brilliant like the sun and are the givers of Kingship, bestow Kingdom on the deserving person. Ye, bringers of joy, and givers of Kingship, bestow Kingdom on me in a befitting manner. Ye bringers of joy and givers of Kingship, bestow kingdom on him who is deserving!.

Ye, builders of cow-sheds, and bestowers of kingship, bestow Kingdom on me in a befitting manner. Ye builders of cow-sheds and givers of Kingship, bestow Kingdom on him who is deserving. Ye high-aimed people, and givers of Kingship, bestow Kingdom on me in a befitting manner. Ye high-aimed people, and givers of kingship, bestow kingdom on him who is deserving. Most powerful are ye, and givers of kingship, bestow kingdom on me in a befitting manner!.

Most powerful are ye, and givers of kingship, bestow kingdom on him who is deserving.

Endowed with might are ye and givers of kingship, bestow kingdom on me in a befitting manner.

Endowed with might are ye, and givers of Kingship, bestow kingdom on him who is deserving.

Man-nourishing are ye, and givers of Kingship, bestow Kingdom on me in a befitting manner. Man-nourishing are ye, and givers of Kingship, bestow kingdom on him who is deserving.

All-nourishing are ye, and givers of Kingship, bestow kingdowm on me in a befittine manner. All - nourishing are ye, and givers of kingship, bestow kingdom on him, who is deserving. O people, full of knowledge and virtue, enjoying independence, ye are the givers of kingship, bestow kingdom on him who is most deserving. Let the sweet medicinal herbs, ripen in the spring and other seasons. O people procuring mighty power for the Kshatriya, rest in your place. involate and potent bestowing on the Kshatriya mighty power!.

౪౦౧.సోమస్యేత్యస్య వరుణఋషిః, అగ్న్యాదయో మంత్రోక్తా దేవతాః, భురిగ్ ధృతిశ్ఛందః, ఋషభః స్వరః.

రాజన్యైరాప్త రాజ్ఞామేవాఽనుకరణం కార్యం నేతరేషాం క్షుద్రాశయ
లుబ్ధాన్యాయాజితేంద్రియాణామిత్యుపదిశ్యతే.

రాజులు సత్యవాదులు, ధర్మాత్ములు కర్తవ్య పరాయణులై యుండవలెను. క్షుద్రగుణములుగలవారు,
లోభులు, అన్యాయలంపటుల ననుకరించరాదు.

౪౦౧ సోమస్య త్విషిరసి తవేవ మే త్విషిర్భూయాత్। అగ్నయే స్వాహా
సోమాయ స్వాహా సవిత్రే స్వాహా సరస్వత్యై స్వాహా పూష్ణే స్వాహా

బృహస్పతయే స్వాహేంద్రాయ స్వాహా ఘోషాయ స్వాహా

శ్లోకాయ స్వాహాంశాయ స్వాహా భగాయ స్వాహార్యమ్ణే స్వాహా॥౫॥

**ప.పా:-** సోమస్య, త్విషిః, అసి, తవేవేతి తవ+ఇవ, మే, త్విషిః, భూయాత్, అగ్నయే, స్వాహా, సోమాయ, స్వాహా, సవిత్రే, స్వాహా, సరస్వత్యై, స్వాహా, పూష్ణే, స్వాహా, బృహస్పతయే, స్వాహా, ఇంద్రాయ, స్వాహా, ఘోషాయ, స్వాహా, శ్లోకాయ, స్వాహా, అంశాయ, స్వాహా, భగాయ, స్వాహా, అర్యమ్ణే, స్వాహా ॥౫॥

పదార్థః :-(సోమస్య) ఐశ్వర్యస్య (త్విషిః) జ్యోతిః (అసి) (తవేవ) యథా భవతస్తథా (మే) మమ (త్విషిః) విజ్ఞానప్రకాశః (భూయాత్) (అగ్నయే) విద్యుదాదయే (స్వాహా) సత్యావాక్ క్రియాచరణయుక్తా విద్యా (సోమాయ) ఔషధవిజ్ఞానాయ (స్వాహా) వైదికపురుషార్థవిద్యా (సవిత్రే) సూర్యవిజ్ఞానాయ (స్వాహా) జ్యోతిర్విద్యా (సరస్వత్యై) వేదార్థసుశిక్షావిజ్ఞాపికాయై వాచే (స్వాహా) వ్యాకరణాద్యంగవిద్యా (పూష్ణే) ప్రాణపశుపాలనాయ (స్వాహా) యోగవ్యవహారవిద్యా (బృహస్పతయే) బృహతాం ప్రకృత్యాదీనాం పత్యురీశ్వరస్య విజ్ఞానాయ (స్వాహా) బ్రహ్మవిద్యా (ఇంద్రాయ) ఇంద్రియాధిష్ఠాతుర్జీవస్య బోధాయ (స్వాహా) వివేకవిద్యా (ఘోషాయ) సత్ప్రియభాషణాదియుక్తాయై వాణ్యై (స్వాహా) తథ్యోపదేశే వక్తృత్వవిద్యా (శ్లోకాయ) తత్త్వసంఘాత సత్కావ్యగద్యపద్యఛందోనిర్మాణాదివిజ్ఞానాయ (స్వాహా) తత్త్వకావ్య శాస్త్రాదివిద్యా (అంశాయ) పరమాణ్వవగమాయ (స్వాహా) సూక్ష్మపదార్థవిద్యా (భగాయ) ఐశ్వర్యాయ (స్వాహా) పురుషార్థవిద్యా (అర్యమ్ణే) న్యాయాధీశత్వాయ (స్వాహా) రాజనీతివిద్యా. అయమ్మంత్రః. శత. ౫.3.౫.3-౯. వ్యాఖ్యాతః ॥౫॥

**అన్వయః:-** హే రాజన్! యథా త్వం సోమస్య త్విషి రసి తథాऽహమపి భవేయమ్. యతస్తవేవ మే త్విషిర్భూయాద్యథా భవతాऽగ్నయే స్వాహా, సోమాయ స్వాహా, సవిత్రే స్వాహా, సరస్వత్యై స్వాహా, పూష్ణే స్వాహా, బృహస్పతయే స్వాహేంద్రాయ స్వాహా, ఘోషాయ స్వాహా, శ్లోకాయ స్వాహాంశాయ స్వాహా, భగాయ స్వాహాऽర్యమ్ణే చ స్వాహా గృహ్యతే తథా మయాऽపి గృహ్యతే. ॥౫॥

భావార్థః:- మనుష్యైరిదమాశంసితవ్యం యథాఽఽప్తానాం రాజ్ఞాం శుభగుణస్వభావాః సంతితథైవ నో భూయాసు రితి. ॥౫॥

**పదార్థము** :- ఓ రాజా! నీ వెట్లు (సోమస్య) ఐశ్వర్యములను (త్విషిః) ప్రకాశమొనర్చువాడవై (అసి) ఉన్నావో నేనును అట్లేయగుదునుగాక! దానివల్ల (తవేవ) నీవలెనే (మే) నా (త్విషిః) విద్యలు మున్నగు సంపదలు ప్రకాశవంతమగునుగాక! నీ వెట్లు (అగ్నయే) విద్యుత్తు మున్నగువానికొరకు (స్వాహా) సత్యవాణి ప్రియాచరణముతోగూడిన విద్యను (సోమాయ) ఓషధుల జ్ఞానముకొరకు (స్వాహా) వైద్యక పురుషార్థయుక్త విద్యను (సవిత్రే) సూర్యుని గుణప్రభావముల నెరుగుటకై (స్వాహా) భూగోళము మున్నగు జ్యోతిర్విద్యలను (సరస్వత్యై) వేదార్థములను, చక్కని శిక్షణను దెలిసికొనదగు వాణికొరకు (స్వాహా) వ్యాకరణము మున్నగు వేదాంగముల విద్యావిజ్ఞానమును (పూష్ణే) ప్రాణరక్షణము మరియు పశుపోషణమునకై (స్వాహా) యోగవ్యాకరణవ్యవహారాది విద్యలను (బృహస్పతయే) మహాన్ ప్రకృతి మున్నగువానికి పతియైన పరమేశ్వరు నెరుగుటకై (స్వాహా) బ్రహ్మవిద్యను (ఇన్ద్రాయ) ఇంద్రియములకు స్వామియగు జీవాత్మ నెరుగుటకై (స్వాహా) వివేకవిద్యను (ఘోషాయై) సత్యప్రియంభాషణములతో గూడిన వాణికొరకు(స్వాహా) సత్యోపదేశ ప్రవచనములనొనర్చు విద్యను (శ్లోకాయ) తత్త్వజ్ఞాన సాధకశాస్త్రములను, సత్కావ్యములను, గద్యపద్యములు మున్నగు ఛందస్సుల రచనకై (స్వాహా) తత్త్వకావ్య శాస్త్రముల విద్యను (అంశాయ) పరమాణువిద్య నెరుగుటకై (స్వాహా) సూక్ష్మ పదార్థవిద్యాది విజ్ఞానమును (భగాయ) ఐశ్వర్యముకై (స్వాహా) పురుషార్థజ్ఞానమును (అర్యమ్ణే) న్యాయాధీశు లగుటకై (స్వాహా) రాజనీతి చతురతను నీవు దెలిసికొనునట్లే నేనును తప్పక దెలిసికొందునుగాక! ॥౫॥

**భావార్థము**:- సత్యశీలురు, ధర్మాత్ములునగు రాజుల గుణకర్మస్వభావములవలెనే మా గుణకర్మ స్వభావములును ఉండవలెనని మానవులు సదా కోరుచుండవలెను. ॥౫॥

5.O king, thou art the light of greatness, may my light of knowledge grow like thine. Acquire truthful speech and knowledge coupled with practice for learning the science of eletricity, and laborious nature of a doctor for learning medicine. Learn astronomy for acquiring the knowledge of sun. Learn grammar for understanding the vedas, Learn Yoga for the control of breath. Study the vedas for the knowledge of God. Acquire discrimination for the knowledge of soul. Acquire the art of eloquence for a good speech. Learn prosody for composing poems. Learn science for understanding the attributes of atoms. Learn to lead an active life fof acquiring wealth. learn politics for becoming a king!.

**౪౦౨. పవిత్రే స్థ ఇత్యస్య వరుణ ఋషిః, ఆపో దేవతాః, స్వరాడ్ బ్రాహ్మీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.**

**యథా కుమారా బ్రహ్మచర్యేణ విద్యా గృహ్ణీయుస్తథైవ కుమార్యోఽపి పఠేయురిత్యాహ.**

**పురుషకుమారులవలె కన్యలును బ్రహ్మచర్యపూర్వకముగ విద్యనభ్యసించవలెను.**

౪౦౨ పవిత్రే స్థో వైష్ణవ్యౌ సవితుర్వః ప్రసవ ఉత్పునామ్యచ్ఛిద్రేణ
పవిత్రేణ సూర్యస్య రశ్మిభిః। అనిభృష్టమసి వాచో బంధుస్తపోజాః
సోమస్య దాత్రమసి స్వాహా రాజస్వః॥౬॥

**ప.వి:–** పవిత్రేఽఇతి పవిత్రే, స్థః, వైష్ణవ్యౌ, సవితుః, వః, ప్రసవ ఇతి ప్ర+సవే, ఉత్, పునామి, అచ్ఛిద్రేణ, పవిత్రేణ, సూర్యస్య, రశ్మిభిరితి రశ్మి+భిః, అనిభృష్టమిత్యని+భృష్టమ్, అసి, వాచః, బంధుః, తపోజా ఇతి తపః+జాః, సోమస్య, దాత్రమ్, అసి, స్వాహా, రాజస్వ ఇతి రాజ+స్వః ।౬॥

**పదార్థః :**–(పవిత్రే) శుద్ధాచరణే (స్థః) స్యాతామ్ (వైష్ణవ్యౌ) సకలవిద్యాసుశిక్షాశుభగుణస్వభావవ్యాపినౌ (సవితుః) సకలజగత్ప్రసవితురీశ్వరస్య (వః) యుష్మాన్ బ్రహ్మచారిణో బ్రహ్మచారిణీర్వ్యార్థినీః కుమారికాః (ప్రసవే) ప్రసూతేఽస్మిన్ జగతి (ఉత్) ఉత్కృష్టతయా (పునామి) పవిత్రీ కరోమి. (అచ్ఛిద్రేణ) అవిచ్ఛిన్నేన నిరంతరేణ (పవిత్రేణ) విద్యాసుశిక్షాజితేంద్రియత్వబ్రహ్మచర్యాదిభిః పవిత్రీకారకేణ వ్యవహారేణ (సూర్యస్య) అర్కస్య (రశ్మిభిః)కిరణైరివ (అనిభృష్టమ్) నిత్యం భృష్టం పాపరహితమాచరితవాన్ (అసి)(వాచః) వేదవాణ్యాః (బంధుః) భ్రాతా (తపోజాః) బ్రహ్మచర్యాది తపసా జాతః (సోమస్య) ఓషధిగణస్య (దాత్రమ్) దాతి రోగాన్ యేన తద్వాన్ (అసి) (స్వాహా) సత్యక్రియయా (రాజస్వః) రాజవీరప్రసవికాః. అయమ్మన్త్రః. శత. ౫.౩.౫.౧౬-౧౭. వ్యాఖ్యాతః. ।౬॥

**అన్వయః :**–హే సభేశ! రాజన్! యతస్త్వం వాచో నిభృష్టం బంధురసి. సోమస్య దాత్రం తపోజా అసి. తవాజ్ఞయా సవితుః ప్రసవే వైష్ణవ్యౌ పవిత్రే స్థః. హే అధ్యాపిక పరిచారికా అధ్యేత్ర్యశ్చ స్త్రియో! యథాఽహం సవితుః ప్రసవే సూర్యస్య రశ్మిభిరివాచ్ఛిద్రేణ పవిత్రేణ వ ఉత్పునామి తథా యూయం స్వాహా, రాజస్వో భవత.।౬॥

**భావార్థః :**–అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే రాజాదయో రాజపురుషాః! యూయమస్మిన్ జగతి యథా కుమారాధ్యాపనే సజ్జనా నియుజ్యంతే తథా పవిత్రవిద్యా పరీక్షాకారికాః స్త్రియః కన్యానామధ్యాపనే నియుఙ్ గ్ధ్వమ్. యత ఏత ఇమాశ్చ విద్యాసుశిక్షాః ప్రాప్య యువత్యః సత్యః స్వసదృశైః ప్రియైర్వరైః పురుషైః సహ స్వయంవరం వివాహం కృత్వా వీరపురుషాన్ జనయేయుః.।౬॥

పదార్థము :-సభాపతివగు నో రాజపురుషా! నీ వెట్లు (వాచః) వేదవాణియొక్క (అనిభృష్టమ్) భ్రష్టరహితమగు ఆచరణముచే (బంధుః) బంధువువై (అసి) ఉన్నావో (సోమస్య) ఓషధుల సంపాదన పరుడవై (తపోజాః) బ్రహ్మచర్యము మున్నగు తపములచే ప్రసిద్ధుడవై (అసి) ఉన్నావో అట్టి నీ యాజ్ఞచే (సవితుః) సృష్టికర్తయగు ఈశ్వరునిచే (ప్రసవే) సృష్టింపబడిన జగత్తులో (వైష్ణవ్యౌ) సకలవిద్యలందు, చక్కని శిక్షణ శుభగుణకర్మస్వభావములందు వ్యాపనశీలురును (పవిత్రే) పవిత్రాచరణముగల మీ రిరువురును (స్థ) ఉన్నారు. కావున అధ్యాపక, పరీక్షక, విద్యార్థినులగు మహిళామణులారా! నే నెట్లు (సవితుః) జగదీశ్వరునిచే ఉత్పన్నమొనర్పబడిన ఈ జగమునందు (సూర్యస్య) సూర్యుని (రశ్మిభిః) కిరణములవలె (అచ్ఛిద్రేణ) ఛిద్రము [లోపము]లు లేని (పవిత్రేణ) విద్య, చక్కనిశిక్షణ, ధర్మము, జ్ఞానము, జితేంద్రియత్వము, బ్రహ్మచర్యము మున్నగువాని నాచరించుటచే పవిత్రపరచబడినదానితో (వః) మిమ్ము (ఉత్పునామి) బాగుగ పవిత్రమొనర్చుచున్నట్లు మీరును (స్వాహా) సత్యక్రియలచే (రాజస్వః) రాజులందు వీరుల నుత్పన్నమొనర్చువా రగుదురు గాక! ॥౬॥

భావార్థము:-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ రాజా! మరియు రాజపురుషులారా! మీరు బాలుర విద్యలవలెనే ఈ ప్రపంచమునందు కన్యారత్నములను చదివించుటకై శుద్ధమగు విద్యలను పరీక్షించగల మహిళామణులను నియుక్తమొనర్చుడు. ఇందువలన ఆ కన్యామణులు విద్యాశిక్షణలను పొంది యువతులై తమకు దగిన ప్రియమైన శ్రేష్ఠబ్రహ్మచారులను స్వయంవర విధిగా వివాహమాడి వీరసంతతి నుత్పన్నమొనర్చెదరుగాక! ॥౬॥

6.O King, thou art the flawless friend of the Vedas. thou, with the use of disease healing herbs, leadest the life of a Brahmchari. In this world created by God, ye, male and female students, engaged in study, lead a life of high morals. I purify ye, like the beams of the sun, with your unbroken pledge of celibacy. Ye are the producers of brave Kings in a nice way!.

౪౦౩. సధమాద ఇత్యస్య వరుణ ఋషిః, వరుణో దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

రాజ్ఞామిద మావశ్యకం యత్సర్వస్యాః ప్రజాయాః స్వకులస్య చాపత్యాని

బ్రహ్మచర్యేణ విద్యానుశిక్షాన్వితాని కార్యాణీత్యాహ.

ప్రజల సంతానమును తమ సంతానమును బ్రహ్మచర్యముతో విద్యా సుశిక్షితులుగా

నొనర్చుట రాజుల కవశ్యకర్తవ్యము.

౪౦౩ సధమాదో ద్యుమ్నినీరాపఽఏతా అనాధృష్టాఽఅపస్యో వసానాః।

పస్త్యాసు చక్రే వరుణః సధస్థమపాᳪ శిశుర్మాతృతమాస్వంతః ॥౭॥

**ప.వి:- సధమాద ఇతి సధ + మాదః, ద్యుమ్నినీః, ఆపః, ఏతాః, అనాధృష్టాః, అపస్యః, వసానాః, పస్త్యాసు, చక్రే, వరుణః, సధస్థమితి సధ + స్థమ్, అపామ్. శిశుః, మాతృతమాస్వితి మాతృ + తమాసు, అంతరిత్యంతః. ॥౭॥**

**పదార్థః** :-(సధమాదః) యాః సహమాద్యంతి హృష్యంతి తాః (ద్యుమ్నినీః) ప్రశస్తం ద్యుమ్నం ధనం యశో వా విద్యతే యాసాం తాః (ఆపః) జలానీవ శాంతాః(ఏతాః) ప్రాప్తవిద్యాసుశిక్షాః (అనాధృష్టాః) ధర్షితుమయోగ్యాః (అపస్యః) ఆపః సు కర్మసు సాధ్వ్యః. అత్ర సుపాం సులుగితి జసః స్థానే సుః (వసానాః) వస్త్రభూషణైరాచ్ఛాదితాః (పస్త్యాసు) గృహశాలాసు (చక్రే) కుర్యాత్ (వరుణః) వరో రాజా (సధస్థమ్) సహస్థానమ్ (అపామ్) వ్యాప్తవిద్యానాం స్త్రీణామ్ (శిశుః) బాలకః (మాతృతమాసు) అతిశయేన శాస్త్రోక్తశిక్షయా మానకర్త్రీషు ధాత్రీషు (అంతః) సమీపే. అయమ్మన్త్రః శత. ౫.౩.౫.౧౯. వ్యాఖ్యాతః.॥౭॥

**అన్వయః** :-యో వరుణో రాజా భవేత్ స ఏతాః సధమాదో ద్యుమ్నినీరనాధృష్టా ఆపో వసానాః పస్త్యాస్వపస్యః స్త్రియో విదుష్యో భవేయుస్తాసామపాం యః శిశుస్తం మాతృతమాస్వంతః సధస్థం సమీపస్థం శిక్షార్థం రక్షేత్. ॥౭॥

**భావార్థః** :-రాజ్ఞా ప్రయత్నేన స్వరాజ్యే సర్వాః స్త్రియో విదుష్యః కార్యాస్తాసాం సకాశాజ్జాతా బాలకా విద్యాయుక్తధాత్ర్యధీనాః కార్యాః. యతో న కస్యాప్యపత్యం విద్యాసుశిక్షాహీనం స్త్రీ నిర్బలా చ స్యాత్.॥౭॥

**పదార్థము** :-(వరుణః) శ్రేష్ఠుడగు రాజు (ఏతాః) విద్యాసుశిక్షణలను పొందినవారు (సధమాదః) కలిసియుండి ప్రసన్నులగువారు (ద్యుమ్నినీః) ప్రశంసనీయములగు ధనకీర్తులచే గూడినవారు (అనాధృష్టాః) ఎవరికిని లొంగిపోనివారు (ఆపః) జలములవలె శాంతస్వభావులు (వసానాః) వస్త్రములు, ఆభూషణాదులచే అలంకృతులు (పస్త్యాసు) గృహముల (అపస్యః) కార్యములందు చతురులు, విదుషీమణులు నగు స్త్రీలు వారికి (అపామ్) విద్యలందు వ్యాప్తులైయుండు నా స్త్రీలకు (శిశుః) సంతాన శిశువులను (మాతృతమాసు) పరిపూర్ణ విద్యాశిక్షణలిచ్చి పోషించు దాదుల (అన్తః) సమీపమున (సధస్థమ్) ఒకే సమీపస్థానమునందు శిక్షణనిమిత్త ముంచవలయును. ॥౭॥

**భావార్థము** :-రాజు తన రాజ్యమందు సమస్త స్త్రీలను ప్రయత్నపూర్వకముగ విదుషీమణులనుగా నొనర్చుట శ్రేష్ఠము. ఎవరి బాలబాలికలును విద్యా, సుశిక్షారహితులై యుండకుండునట్లు మరియు స్త్రీలు శక్తిహీనులు గాకుండునట్లు, వారి సంతానములకు విద్యావంతులగు దాదుల యధీనమున పోషణ శిక్షణల నీయవలెను.॥౭॥

**7.A good King should put in charge of educated and respectable nurses the children of women, well, bred, ever, happy, rich, famous, inviolate, calm like water, well dressed and decorated with ornaments, expert in domestic affairs and advanced in Knowledge.**

౪౦౪. క్షత్రస్యేత్యస్య వరుణ ఋషిః, యజమానో దేవతా, స్వరాట్ కృతిశ్ఛందః, నిషాదః స్వరః.
సర్వాః ప్రజాః సర్వథా యోగ్యం సభేశం రాజానం సతతం సర్వతో రక్షేయురిత్యాహ.
యోగ్యుడును, సభేశుడును నగు రాజును ప్రజలందర నన్ని విధముల,
అన్నివైపులనుండి సతతము రక్షించవలయును.

౪౦౪ క్షత్రస్యోల్బమసి క్షత్రస్య జరాయ్వసి క్షత్రస్య యోనీ రసి క్షత్రస్య
నాభిరసీంద్రస్య వార్త్రఘ్నమసి మిత్రస్యాసి వరుణస్యాసి త్వయాయం
వృత్రం వధేత్। దృవాసి రుజాసి క్షుమాసి। పాతైనం ప్రాంచం
పాతైనం ప్రత్యఞ్చం పాతైనం తిర్యఞ్చం దిగ్భ్యః పాత ॥౮॥

ప.వి:- క్షత్రస్య, ఉల్బమ్, అసి, క్షత్రస్య, జరాయు, అసి, క్షత్రస్య, యోనిః, అసి, క్షత్రస్య, నాభిః, అసి, ఇంద్రస్య, వార్త్రఘ్నమితి వార్త్ర+ఘ్నమ్, అసి, మిత్రస్య, అసి, వరుణస్య, అసి, త్వయా, అయమ్, వృత్రమ్, వధేత్, దృవా, అసి, రుజా, అసి, క్షుమా, అసి, పాత, ఏనమ్, ప్రాఞ్చమ్, పాత, ఏనమ్, ప్రత్యఞ్చమ్, పాత, ఏనమ్, తిర్యఞ్చమ్, దిగ్భ్య ఇతి దిక్ + భ్యః, పాత ॥౮॥

పదార్థః:-(క్షత్రస్య) రాజకులస్య (ఉల్బమ్) బలమ్ (అసి) (క్షత్రస్య) క్షత్రియస్య (జరాయు) వృద్ధావస్థాప్రాపకమ్ (అసి)(క్షత్రస్య) రాజన్యస్య (యోనిః) నిమిత్తమ్ (అసి) (క్షత్రస్య) రాజ్యస్య (నాభిః) బంధనమ్ (అసి) (ఇంద్రస్య) సూర్యస్య (వార్త్రఘ్నమ్) మేఘవినాశకమ్ (అసి) (మిత్రస్య) సుహృదః (అసి) (వరుణస్య) శ్రేష్ఠస్య (అసి) (త్వయా) రాజ్ఞా (అయమ్) వీరః (వృత్రమ్) మేఘమివ న్యాయావరకం శత్రుమ్ (వధేత్) హన్యాత్ (దృవా) యః శత్రూన్ దృణాతి. అత్రాన్యేభ్యోపి దృశ్యంత ఇతి క్వనిప్ (అసి) (రుజా) శత్రూణాం రోగకారకః. అత్రౌణాదికః కనిన్ (అసి) (క్షుమా) సత్యోపదేశకః. అత్రౌణాదికో మనిన్ కిచ్చ (అసి) (పాత) రక్షత (ఏనమ్) రాజానమ్ (ప్రాంచమ్) ప్రాక్ప్రబంధస్య

కర్తారమ్. (పాత) (ఏనమ్) సేనాధ్యక్షమ్ (ప్రత్యంచమ్) పశ్చాత్ స్థితమ్ (పాత) (ఏనమ్) పార్శ్వస్థం వీరమ్ (తిర్యంచమ్) తిరశ్చీనమ్ (దిగ్భ్యః) సర్వాభ్య ఆశాభ్యః (పాత). అయమ్మన్త్రః. శత. ౫. 3. ౫. ౨౦-30 వ్యాఖ్యాతః. ॥౮॥

**అన్వయః** :- హే రాజన్! యస్త్వం క్షత్రస్యోల్బమసి, క్షత్రస్య జరాయ్వసి, క్షత్రస్య యోనిరసి, క్షత్రస్య నాభిరసీంద్రస్య వార్త్రఘ్నమసి, మిత్రస్య మిత్రోఽసి, వరుణస్య వరోఽసి, ద్రవాసి, రుజాసి, క్షుమాసి. యస్త్వయాసహ వృత్రం వధేత్. తమేనం ప్రాంచం సర్వే యూయం దిగ్భ్యః పాత. తమేనం ప్రత్యంచం పాత. తమేనం తిర్యంచం పాత.॥౮॥

**భావార్థః** :- యత్పుత్రీపుత్రేషు స్త్రీనరేషు చ విద్యావర్ధనం కర్మాఽస్తి, తదేవ రాజ్యవర్ధకం శత్రువినాశకం ధర్మాదిప్రవర్తకం చ భవతి. అనేనైవ సర్వేషు కాలేషు సర్వాసు దిక్షు రక్షణం భవతి.॥౮॥

**పదార్థము** :- ఓ రాజా! నీవు (క్షత్రస్య) మీ రాచకులమందు (ఉల్బమ్) బలశాలివై (అసి) ఉన్నావు (క్షత్రస్య) క్షత్రియునకు (జరాయు) వృద్ధావస్థను గలిగించువాడవై (అసి) ఉన్నావు (క్షత్రస్య) రాజ్యమునకు (యోనిః) నిమిత్తమువునై (అసి) ఉన్నావు (క్షత్రస్య) రాజ్యమునకు (నాభిః) ప్రబంధకర్తవునై (అసి) ఉన్నావు (ఇన్ద్రస్య) సూర్యుని (వార్త్రఘ్నమ్) మేఘముల నాశమొనర్చువానివలె కర్మకార్యకర్తవునై (అసి) ఉన్నావు. (మిత్రస్య) మిత్రులకు మిత్రుడవై (అసి) ఉన్నావు (వరుణస్య) శ్రేష్ఠులందు శ్రేష్ఠుడవై (అసి) ఉన్నావు (ద్రవా) శత్రునాశకుడవునై (అసి) ఉన్నావు (రుజా) శత్రువులను రోగిష్టులుగ నొనర్చువాడవునై (అసి) ఉన్నావు (క్షుమా) సత్యమును ఉపదేశించువాడవై (అసి) ఉన్నావు (అయమ్) ఇట్టి వీరపురుషుడవు (త్వయా) రాజువగునీతో గలిసి (వృత్రమ్) మేఘమువలె న్యాయమును గప్పిపెట్టు శత్రువును (వధేత్) వధింతుముగాక! (ఏనమ్) ఇట్టి (ప్రాఞ్చమ్) మొదటి ప్రబంధమొనర్చువా రగు (ఏనమ్) రాజపురుషుని మీరెల్లరును (దిగ్భ్యః) అన్నిదిశలనుండి (పాత) కాపాడుడు. (తిర్యఞ్చమ్) అడ్డుగా నిలిచిన (ఏనమ్) ఈ రాజపురుషుని (పాత) కాపాడుడు. ॥౮॥

**భావార్థము** :- బాలబాలికలకు, స్త్రీపురుషులకు విద్యలను వృద్ధిపరచునట్టి కర్మయే రాజ్యమును పెంపొందించునదియు, శత్రువులను నష్టపరచునదియు, ధర్మము మున్నగువానిని ప్రవర్తింపజేయునదియు నగుచున్నది. ఈ కర్మద్వారానే అన్ని కాలములందు, అన్నిదిశలయందును రక్షణ జరుగుచున్నది.॥౮॥

**8.** O King thou art the strength of the royal family, the giver of longevity to the warrior, the mainstay of princely power, and the administrator of your Kingdom. Thou art the destroyer of foes, as the sun is of clouds!.

Thou art the friend of friends, the gentleman with gentlemen. Thou art the cleaver and tormentor of foes. Thou art the preacher of truth. With thee to aid may this hero slay like cloud the foe that dissembless justice. May the warrior protect the King in front, protect him rearwards; protect him sidewards; guard him from all quarters.

౪౦౫. ఆవిర్మర్యా ఇత్యస్య వరుణః ఋషిః, ప్రజాపతి ర్దేవతా, భురిగష్టిశ్ఛందః, మధ్యమః స్వరః.
మనుష్యైః, సుశీలతయాఽఽప్తవిద్వాదాదయోఽవశ్యం ప్రాప్తవ్యా ఇత్యాహ.
మానవులు సుశీలురై ఆప్తవిద్వాంసుల నవశ్యము సేవించవలయును.

౪౦౫ ఆవిర్మర్యా ఽఆవిత్తో ఽఅగ్నిర్ గృహపతి రావిత్తఽ ఇంద్రో వృద్ధశ్రవాఽఆవిత్తౌ మిత్రావరుణౌ ధృతవ్రతా వావిత్తః పూషా విశ్వ వేదాఽ ఆవిత్తే ద్యావాపృథివీ విశ్వశంభువా వావిత్తాదితి రురుశర్మా॥౯॥

ప.విః- ఆవిః, మర్త్యాః, ఆవిత్త ఇత్యా+విత్తః. అగ్నిః, గృహపతిరితి గృహ+పతిః, ఆవిత్త ఇత్యాఽవిత్తః, ఇంద్రః, వృద్ధశ్రవా ఇతి వృద్ధ+శ్రవాః, ఆవిత్తా విత్యా+విత్తౌ, మిత్రావరుణౌ, ధృతవ్రతావితి ధృత+వ్రతౌ, ఆవిత్త ఇత్యా+విత్తః, పూషా, విశ్వవేదా ఇతి విశ్వ + వేదాః, ఆవిత్తే ఇత్యా+విత్తే, ద్యావాపృథివీ ఇతి ద్యావా+పృథివీ, విశ్వశంభువావితి విశ్వ+శంభువౌ, ఆవిత్తేత్యా+విత్తా, అదితిః, ఉరుశర్మేత్యురు+శర్మా॥౯॥

**పదార్థః** :-(ఆవిః) ప్రాకట్యే (మర్త్యాః) మర్యా ఇతి మనుష్య నా....నిఘం. ౨. ౫. (ఆవిత్తః) ప్రాప్తపూర్ణభోగో లబ్ధప్రతీతో వా. విత్తో భోగప్రత్యయయోః అ.౮.౨.౫౮. అనేనాయం నిపాతితః. (అగ్నిః) పావక ఇవ విద్వాన్ (గృహపతిః) గృహాణాం పాలకః (ఆవిత్తః)(ఇంద్రః) శత్రువిదారకః సేనాధీశః (వృద్ధశ్రవాః) వృద్ధం శ్రవః సర్వశాస్త్రశ్రవణం యస్య సః (ఆవిత్తౌ) (మిత్రావరుణౌ) సుహృద్వరౌ (ధృతవ్రతౌ) ధృతాని వ్రతాని సత్యాదీని యాభ్యాం తౌ. (ఆవిత్తః) (పూషా) పోషకో వైద్యః (విశ్వవేదాః) విశ్వం సర్వమౌషధం విదితం యేన సః (ఆవిత్తే) (ద్యావాపృథివీ) విద్యుద్భూమీ (విశ్వశంభువౌ) విశ్వస్మై శం సుఖం భావుకే (ఆవిత్తా) (అదితిః) విదుషీ మాతా (ఉరుశర్మా) ఉరూణి బహూని సుఖాని యస్యాః సా. అయమ్మన్త్రః. ౫.౩. ౫. ౩౧-౩౭. వ్యాఖ్యాతః. ॥౯॥

**అన్వయః** :-హే మర్యా యుష్మాభిర్యది గృహపతిరగ్నిరావిరావిత్తో, వృద్ధశ్రవా ఇంద్ర ఆవిరావిత్తో, ధృతవ్రతౌ మిత్రావరుణావావిరావిత్తౌ, విశ్వవేదాః పూషాఽఽవిరావిత్తో, విశ్వశంభువౌ ద్యావాపృథివీ ఆవి రావిత్తే. ఉరుశర్మాఽదితిశ్చావిరావిత్తాస్యాత్తర్హి సర్వాణి సుఖాని ప్రాప్యంతే.॥౯॥

**భావార్థః** :- యావన్మనుష్యాః సద్విదుషః సతీం విదుషీం మాతరం సత్యపదార్థవిజ్ఞానం చ నాప్నువంతి, తావత్సుఖవృద్ధిం దుఃఖనివృత్తిం చ కర్తుం న శక్నువంతి.॥౯॥

**పదార్థము** :-(మర్త్యాః) ఓ మానవులారా! మీరు (గృహపతిః) గృహములను పాలనమొనర్చు (అగ్నిః) ప్రసిద్ధమగు అగ్నివంటి విద్వాంసుని (ఆవిః) స్పష్టముగ (అవిత్తః) ప్రాప్తించుకొని, నిశ్చయమును దెలిసికొని (వృద్ధశ్రవాః) శ్రేష్ఠముగ సకల శాస్త్రములను వినియున్నట్టి (ఇన్ద్రః) శత్రునాశకుడగు సేనానాయకుని (ఆవిః) సుస్పష్టముగ (అవిత్తః) ప్రాప్తించుకొనినను, లేక తెలిసికొనినను (ధృతవ్రతౌ) సత్యము మున్నగు వ్రతముం ధారణమొనర్చువారగు (మిత్రావరుణౌ) మిత్రులను, శ్రేష్ఠులను (ఆవిః) స్పష్టముగ (అవిత్తా) ప్రాప్తించుకొనినను, లేక తెలిసికొనినను (విశ్వవేదాః) సమస్త ఔషధముల నెరిగిన (పూషా) పోషణకర్తయగు వైద్యుని (ఆవిః) స్పష్టముగ (అవిత్తః) ప్రాప్తించుకొనినను (విశ్వశమ్భువౌ) సకలమునకు సుఖమునొసగు (ద్యావాపృథివీ) విద్యుత్తును, భూమిని (ఆవిః) సుస్పష్టముగ (అవిత్తే) తెలిసికొనినను (ఉరుశర్మా) అధిక సౌఖ్యముల నొసగు (అదితిః) విద్వాంసురాలగు తల్లిని భక్తితో (అవిత్తా) ప్రాప్తించుకొనినను, తెలిసికొనినను మీకు సకల సుఖప్రాప్తి గలుగును. ॥౯॥

**భావార్థము** :- మానవులు ఉత్తమ విద్వాంసులను, విద్వాంసురాలగు తల్లిని, ప్రసిద్ధ పదార్థముల జ్ఞానమును ప్రాప్తించుకొననంతవరుకు సుఖప్రాప్తికి, దుఃఖనివృత్తికి సమర్థులు గాజాలరు.॥౯॥

9.O men, know ye fully well, the learned householder, approach properly, the commander of the army who slays the foes, and has listened to the recitation of all the sacred religious books. Know fully well the friendly and noble persons, devoted to truth. Befriend fastly the doctor expert in the science of medicine. Understand thoroughly the uses of electrictiy and land. the giver of happiness for all. Get turly a learned mother, the giver of comforts.

౪౦౬. అవేష్టా ఇత్యస్య వరుణ ఋషిః, యజమానో దేవతా, విరాడార్షీ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

పునర్మనుష్యైః కిం కృత్వా కిం కిం ప్రాప్తవ్యమిత్యుపదిశ్యతే. మానవులేమి యొనర్చి యే మేమి పొందవలయును?

౪౦౬ అవేష్టా దందశూకాః ప్రాచీ మారోహ గాయత్రీ త్వావతు రథంతరగ్ంసామ

త్రివృత్ స్తోమో వసంతఋతుర్బ్రహ్మ ద్రవిణమ్ ॥౧౦॥

ప.విః- అవేష్టా ఇత్యవ+ఇష్టాః, దందశూకాః, ప్రాచీమ్, ఆ, రోహ, గాయత్రీ, త్వా, అవతు, రథంతర మితి రథమ్+తరమ్, సామ, త్రివృదితి త్రి+వృత్, స్తోమః, వసంతః, ఋతుః, బ్రహ్మ, ద్రవిణమ్ ॥౧౦॥

**పదార్థః** :-(అవేష్టాః) విరుద్ధస్య సంగంతారః (దందశూకాః) పరస్మైదుఃఖప్రదానాయ దంశనశీలాః (ప్రాచీమ్) పూర్వాం దిశమ్ (అ)(రోహ) ప్రసిద్ధో భవ (గాయత్రీ) పఠితం గాయత్రీఛందః (త్వా) త్వామ్ (అవతు) ప్రాప్నోతు (రథంతరమ్) రథైస్తరంతి యేన తత్ (సామ) సామవేదః (త్రివృత్) త్రిభిర్మనోవాక్శరీరబలానాం బోధకారకః (స్తోమః) స్తూయమానః (వసంతః) (ఋతుః) (బ్రహ్మ) వేదో జగదీశ్వరో బ్రహ్మవిత్కులం వా (ద్రవిణమ్) విద్యాద్రవ్యమ్ అయమన్త్రః. శత. ౫. ౪. ౧. ౧-౩. వ్యాఖ్యాతః. ॥౧౦॥

**అన్వయః** :-హే రాజన్! యస్త్వం యేఽవేష్టా దందశూకాః సంతి తాన్ జిత్వా ప్రాచీం దిశమారోహ తం త్వా గాయత్రీ రథంతరం సామ త్రివృత్ స్తోమ ఋతుర్వసంతో బ్రహ్మ ద్రవిణం చావతు.॥౧౦॥

**భావార్థః** :-యే మనుష్యాః విద్యాసు ప్రాదుర్భవంతి, తే శత్రూన్ విజిత్యైశ్వర్యం ప్రాప్నువంతి. ॥౧౦॥

**పదార్థము** :-ఓ రాజా! (అవేష్టాః) శత్రుపక్షమువారిని (దన్దశూకాః) ఇతరులకు దుఃఖము గలిగించటకై విదీర్ణమొనర్చువారిని జయించి (ప్రాచీమ్) తూర్పుదిశయందు (ఆరోహ) ప్రసిద్ధుడవగు (త్వా) నీకు (గాయత్రీ) చదివినట్టి గాయత్రీ ఛన్దము (రథన్తరమ్) రథములచే తరించదగిన (సామ) సామవేదము (త్రివృత్) మనస్సు, వాణి, శరీరములు ఈ మూడింటి బలముల బోధింపజేయునది (స్తోమః) స్తుతించదగినది (వసంతః, ఋతుః) వసంతఋతువు మరియు (బ్రహ్మ) వేదము, ఈశ్వరుడు, బ్రహ్మజ్ఞాని (ద్రవిణమ్) విద్య, ధనము (అవతు) లభించునుగాక! ॥౧౦॥

**భావార్థము** :-సకలవిద్యలందు ప్రసిద్ధులగుచున్న మనుష్యులు శత్రువులను జయించి ఐశ్వర్యములను ప్రాప్తించుకొనగలరు.॥౧౦॥

10.O King, conquer the opposing creatures who bite and torment others; and go forward to the East. May thou obtain Gayatri, the psalm of Rathantra, the triple praise-song, the spring season, God and the rich treasure of knowledge!.

౪౦౭. దక్షిణామిత్యస్య వరుణ ఋషిః, యజమానో దేవతా, ఆర్షీ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

పునః స సభేశః కిం కృత్వా కిం కుర్యాదిత్యాహ. ఆ సభాపతి యేమిచేసి, యేది యొనర్చవలయును?

౪౦౭ దక్షిణా మారోహ త్రిష్టుప్ త్వావతు బృహత్సామ పంచదశ స్తోమో

గ్రీష్మఋతుః క్షత్రం ద్రవిణమ్ ॥౧౧॥

ప.వి:- దక్షిణామ్, ఆ, రోహ, త్రిష్టుప్, త్రిస్తుబితి త్రి+స్తుప్, త్వా, అవతు, బృహత్, సామ, పంచదశ ఇతి పంచ+దశః, స్తోమః, గ్రీష్మః, ఋతుః, క్షత్రమ్, ద్రవిణమ్ ॥౧౧॥

**పదార్థః** :-(దక్షిణామ్) దిశమ్ (ఆ) (రోహ) (త్రిష్టుప్) ఏతచ్ఛందోఽభిహితం విజ్ఞానమ్. (త్వా) త్వామ్ (అవతు) ప్రాప్నోతు. (బృహత్) మహత్ (సామ) సామవేద భాగః (పంచదశః) ప్రాణేంద్రియభూతానాం పంచదశానాం పూరకః (స్తోమః) స్తోతుం యోగ్యః (గ్రీష్మః) (ఋతుః) (క్షత్రమ్) క్షత్రియధర్మరక్షకం కులమ్ (ద్రవిణమ్) రాజ్యోద్భవం ద్రవ్యమ్. అయమ్మన్త్రః. శత. ౫.౪.౧.౪. వ్యాఖ్యాతః. ॥౧౧॥

**అన్వయః**:- హే విద్వన్ రాజన్! యం త్వా త్రిష్టుప్ ఛందో బృహత్సామ పంచదశ స్తోమో గ్రీష్మఋతుః క్షత్రం ద్రవిణం చావతు, స త్వం దక్షిణాం దిశమారోహ శత్రూన్ విజయస్వ. ॥౧౧॥

**భావార్థః**:- యో రాజా ప్రాప్తవిద్యః క్షత్రియకులం వర్ధయేత్ స ఏవ శత్రుభిః కదాపి న తిరస్క్రియేత. ॥౧౧॥

**పదార్థము** :- విద్వాంసుడవగు ఓ రాజా! (త్వా) నీకు (త్రిష్టుప్) త్రిష్టుప్ పేరుగల ఛన్దస్సుతో ప్రసిద్ధమగు విజ్ఞానము (బృహత్) గొప్పదగు (సామ) సామవేదభాగము (పఞ్చదశః) పంచప్రాణములు అనగా ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములు. పంచేంద్రియములు అనగా నేత్రములు, కర్ణములు, నాసిక, జిహ్వ, చర్మములు. పంచభూతములు అనగా; భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము. ఈ పదిహేనింటిని పూర్తిచేయునది (స్తోమః) స్తుతి. (గ్రీష్మః) గీష్మమను (ఋతుః) ఋతువు (క్షత్రమ్) క్షాత్రధర్మరక్షకమగు క్షత్రియవర్ణము (ద్రవిణమ్) రాజ్యముద్వారావచ్చు ధనము (అవతు) ప్రాప్తమగుగాక! అట్టి నీవు (దక్షిణామ్) దక్షిణదిశయందు (ఆరోహ) ప్రసిద్ధుడవైయుండి శత్రువులను నాశమొందించుము. ॥౧౧॥

**భావార్థము** :- సకలవిద్యలను బడసి క్షత్రియవంశము నభివృద్ధిపరచు రాజును శత్రువు లెప్పుడును తిరస్కరించ సాహసించరు. ॥౧౧॥

11. O King, conquer foes by advancing towards the south. May thou obtain the knowledge conveyed in the Trishtup verse, the Brihat Sam, the fifteenfold praise-song, the summer season, the military force and riches!.

౪౦౮. ప్రతీచీమిత్యస్య వరుణ ఋషిః, యజమానో దేవతా, విచృదార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

రాజపురుషైర్నిత్యం వైశ్యకులం వర్ధనీయమిత్యాహ.

నిత్యము వైశ్యకులమును వృద్ధిపరచుట రాజపురుషుల కుచితము.

౪౦౮ ప్రతీచీ మారోహ జగతీ త్వావతు వైరూపఌ సామ సప్తదశ

స్తోమో వర్షాఽఋతుర్విడ్ ద్రవిణమ్ ॥౧౨॥

ప.వి:- ప్రతీచీమ్, ఆ, రోహ, జగతీ, త్వా, అవతు, వైరూపమ్, సామ, సప్తదశ ఇతి సప్త+దశః, స్తోమః, వర్షాః, ఋతుః, విట్, ద్రవిణమ్.॥౧౨॥

పదార్థః :-(ప్రతీచీమ్) పశ్చిమాం దిశమ్ (ఆ) (రోహ) (జగతీ) ఏతచ్ఛందోఽభిహితమర్థమ్ (త్వా) త్వామ్ (అవతు) (వైరూపమ్) వివిధాని రూపాణి యస్మిన్ తత్ (సామ) సామవేదాంశః (సప్తదశః) పంచకర్మేంద్రియాణి పంచ విషయాః, పంచ మహాభూతాని, కార్యం, కారణం చేతి సప్తదశానాం పూరకః, (స్తోమః) స్తుతిసమూహః (వర్షాః) (ఋతుః) (విట్) వైశ్యజనః (ద్రవిణమ్) ద్రవ్యమ్. అయమ్మన్త్రః ౫.౪.౧.౫. వ్యాఖ్యాతః. ॥౧౨॥

అన్వయః :-హే రాజన్! యం త్వా జగతీ వైరూపం సామ సప్తదశ స్తోమ ఋతుర్వర్షా ద్రవిణం విట్ చావతు, స త్వం ప్రతీచీం దిశమారోహ ధనం చ లభస్వ.॥౧౨॥

భావార్థః :-యే రాజపురుషాః రాజనీత్యా వైశ్యానున్నయేయుస్తే శ్రియమాప్నుయుః.॥౧౨॥

పదార్థము :- ఓ రాజపురుషా! (త్వా) నీకు (జగతీ) జగతీఛందమునందుగల అర్థము (వైరూపమ్) అనేక రూపములు గలిగినది (సామ) సామవేదాంశము (సప్తదశః) కర్మేంద్రియములైదు అనగా; శబ్ద స్పర్శ రూప రస గంధములు. పంచవిషయములు, పంచమహాభూతములు [సూక్ష్మభూతములు] మరియు కార్యము, కారణము అనబడు నీ పదునేడు (స్తోమః) స్తుతుల సమూహము (వర్షాఋతుః) వర్షఋతువు (ద్రవిణమ్) ధనము (విట్) వైశ్యులు (అవతు) ప్రాప్తించెదరుగాక! అట్టి నీవు (ప్రతీచీమ్) పడమరదిశయందు (ఆరోహ) ఆరూఢుడవై ధనములను పొందుదువుగాక! ॥౧౨॥

భావార్థము:-రాజనీతిద్వారా వైశ్యుల నున్నతిపరచు రాజపురుషుడు మాత్రమే లక్ష్మీసంపన్నుడు కాగలడు.॥౧౨॥

12.O King advance towards the West. May thou obtain the knowledge conveyed in Jagati verse, the manifold knowledge of Sama Veda, the seventeenfold praise-song, the Rainy season, the store of wealth and the Vaishyas!.

౪౦౯.ఉదీచీమిత్యస్య వరుణ ఋషిః, యజమానో దేవతా, ఆర్షీ పంక్తిశ్ఛందః,పంచమః స్వరః.

పునా రాజాదిన్రైః కిం లబ్ధవ్యమిత్యాహ. రాజాది పురుషు లేమి పొందవలయును?

౪౦౯ ఉదీచీ మారోహానుష్టుప్ త్వావతు వైరాజ్యꣳ సామైకవిꣳశ స్తోమః శరదృతుః ఫలం ద్రవిణమ్॥౧౩॥

ప.విః-ఉదీచీమ్, ఆ, రోహ, అనుష్టుప్, అనుస్తుబిత్యను+స్తుప్, త్వా, అవతు, వైరాజమ్, సామ, ఏక విగ్ంశ ఇత్యేక+విగ్ంశః, స్తోమః, శరత్, ఋతుః, ఫలమ్, ద్రవిణమ్ ॥౧౩॥

**పదార్థః** :-(ఉదీచీమ్) ఉత్తరామ్ (ఆ) (రోహ) (అనుష్టుప్) యయా పఠిత్వా పునః సర్వా విద్యా అన్యేభ్యః స్తువంతి సా (త్వా) (అవతు) (వైరాజమ్) యద్వివిధైరర్థై రాజతే తదేవ (సామ) (ఏకవింశః) షోడశకలాశ్చత్వారః పురుషార్థాఽవయవాః కర్తా చేతి. తేషామేకవింశతేః పూరణః (స్తోమః) స్తుతివిషయః (శరత్) (ఋతుః) (ఫలమ్) సేవాఫలదం శూద్రకులమ్ (ద్రవిణమ్). అయమ్మన్త్రః. శత. ౫.౪. ౧. ౬. వ్యాఖ్యాతః. ॥౧౩॥

**అన్వయః** :-హే సభాపతే! త్వముదీచీం దిశమారోహ. యతోఽనుష్టుప్ వైరాజం సామైకవింశస్తోమ ఋతుః శరద్ద్రవిణం ఫలం చ త్వాఽవతు. ॥౧౩॥

**భావార్థః** :-యే జనాః ఆలస్యం విహాయ సర్వదా పురుషార్థమేవానుతిష్ఠంతే, తే సచ్ఛూద్రాన్ ప్రాప్య ఫలవంతో జాయంతే. ॥౧౩॥

**పదార్థము** :-సభాపతివగు ఓ రాజా! నీవు (ఉదీచీమ్) ఉత్తరదిశయందు (ఆరోహ) ప్రసిద్ధిని ప్రాప్తించు కొనుము. దానివల్ల (అనుష్టుప్) నీవు చదివి, సకలవిద్యల నితరుల కుపదేశించగల అనుష్టుప్ ఛందస్సు (వైరాజమ్) అనేకార్థములచే శోభాయమానమగు (సామ) సామవేదభాగము (ఏకవింశః) షోడశ [పదహారు] కళలు, చతుర్విధ పురుషార్థములు, ఒక కర్త ఈ ఇరువదొకటిని పూర్ణపరచు (స్తోమః) స్తుతివిషయము (శరత్ ఋతుః) శరదృతువు (ద్రవిణమ్) ధనము, ఐశ్వర్యము సేవా (ఫలమ్) ఫలరూప శూద్రకులము (త్వా) నీకు (అవతు) ప్రాప్తించుగాక! ॥౧౩॥

**భావార్థము** :-సోమరితనమును వదలివేసి ఎల్లకాలములందును పురుషార్థము నాచరించు ధీరులు మాత్రమే ఉత్తమఫలములను భోగించగలుగుదురు. ॥౧౩॥

13.O King, advance towards the North. May thou obtain the knowledge conveyed in the Anushtup verse, the manifold knowledge of Samaveda, the twentyonefold praise - song, the Autumn season, the rich treasures, and Shudras (servants for service)!.

౪౧౦. ఊర్ధ్వామిత్యస్య వరుణ ఋషిః, యజమానో దేవతా, భురిగ్జగతీ ఛందః, నిషాదః స్వరః.

మనుష్యైరుత్కృష్టవిద్యయాఽనేకే పదార్థా విజ్ఞాతవ్యా ఇత్యాహ.

మానవులు ప్రబలవిద్యచే పనేక పదార్థముల నెఱుగవలయును.

౪౧౦ ఊర్ధ్వా మారోహ పఙ్క్తిస్త్వావతు శాక్వర రైవతే సామనీ
త్రిణవత్రయ స్త్రింశౌ స్తోమౌ హేమన్త శిశిరా వృతూ వర్చో
ద్రవిణం ప్రత్యస్తం నముచేః శిరః॥౧౪॥

ప.వి:- ఊర్ధ్వామ్, ఆ, రోహ, పఙ్క్తిః, త్వా, అవతు, శాక్వర రైవతేఽ ఇతి శాక్వర రైవతే, సామనీఽ ఇతి సామనీ, త్రిణవత్రయస్త్రింశౌ, త్రినవత్రయస్త్రింశావితి త్రినవ+ త్రయస్త్రింశౌ, స్తోమౌ, హేమన్తశిశిరౌ, ఋతూ ఇత్యృతూ,వర్చః,ద్రవిణమ్, ప్రత్యస్తమితి ప్రతి+అస్తమ్, నముచేః, శిరః ॥౧౪॥

**పదార్థః** :-(ఊర్ధ్వామ్) దిశమ్ (ఆ) (రోహ) (పఙ్క్తిః) (త్వా)(అవతు) (శాక్వరరైవతే) శాక్వరం చ రైవతం చ తే. (సామనీ) (త్రిణవత్రయస్త్రింశౌ) యే త్రయశ్చ కాలాః నవాంకవిద్యాశ్చ త్రయశ్చ త్రింశచ్చ వస్వాదయః పదార్థా వ్యాఖ్యాతా యాభ్యాం. తయోః పూరణౌ. తౌ (స్తోమౌ) స్తుతివిశేషౌ (హేమన్తశిశిరౌ) (ఋతూ) (వర్చః) విద్యాధ్యయనమ్ (ద్రవిణమ్) ద్రవ్యమ్ (ప్రత్యస్తమ్) ప్రతీక్షితమ్ (నముచేః) న ముంచతి పరపదార్థాన్ దుష్టాచారాన్ వా యః స్తేనస్తస్య (శిరః) ఉత్తమాంగమ్. అయమ్మన్త్రః శత. ౫.౪.౧.౭ వ్యాఖ్యాతః. ॥౧౪॥

**అన్వయః**:-హే రాజన్ యదుర్వ్యూర్ధ్వాం దిశమారోహ తర్హి త్వా పఙ్క్తిః శాక్వరరైవతే సామనీ త్రిణవత్రయస్త్రింశౌ స్తోమౌ హేమన్తశిశిరావృతూ వర్చో ద్రవిణం చావతు నముచేః శిరశ్చ ప్రత్యస్తం స్యాత్.॥౧౪॥

**భావార్థః**:- యే మనుష్యాః అన్వృతు యోగ్యాఽఽహారవిహారాన్సంతో విద్యాయోగాభ్యాససత్సంగాన్సమాచరంతి, తే సర్వేష్వృతుషు సుఖం భుంజతే. న చైభ్యో కశ్చిచ్చోరః పీడాం దాతుం శక్నోతి. ॥౧౪॥

**పదార్థము** :-ఓ రాజా! నీవు (ఊర్ధ్వామ్) ఊర్ధ్వదిశ [పైదిశ] యందు (ఆరోహ) ప్రసిద్ధుడవగుచో (త్వా) నీకు (పఙ్క్తిః) పఙ్క్తిపేరు గల ఛందస్సు (శాక్వరరైవతే) శక్వరీ మరియు రేవతీ ఛందస్సులతో గూడిన (సామనీ) సామవేద [పూర్వార్చిక, ఉత్తరార్చికలను] ద్వివిధముల (త్రిణవత్రయస్త్రింశౌ) మూడుకాలములు, తొమ్మిదంకముల విద్య, వసువు మొదలగు ముప్పదిమూడు పదార్థములు ఏ రెండింటిచే వ్యాఖ్యాన

మొనర్చబడినవో వానిని పూర్ణపరచు (స్తోమా) స్తోత్రముల రెండువిధములగు భేదములు (హేమన్తశిశిరా) హేమంత, శిశిర (ఋతూ) ఋతువులు (వర్చః) బ్రహ్మచర్యముద్వారా విద్యాధ్యయనము మరియు (ద్రవిణమ్) ఐశ్వర్యము (అవతు) ప్రాప్తించును. (నముచేః) దుష్టులగు చోరులు మున్నగువారి (శిరః) శిరస్సులు (ప్రత్యస్తమ్) నష్టభ్రష్టమగు గాక!॥౧౪॥

**భావార్థము** :- సకల ఋతువులందును సమయమునకు అనుకూలమగు ఆహారవిహారాదులతో విద్య, యోగాభ్యాసము, సత్సంగము మున్నగు వానిని చక్కగా నాచరించు మానవులు మాత్రమే సకల ఋతువులందును సౌఖ్యముల ననుభవించగలరు. ఇట్టి వీరిని చోరులు, వ్యాధులు మున్నగునవి బాధించజాలవు.॥౧౪॥

14.O king, aseend the zenith. May thou obtain the Knowledge conveyed in the . Pankti Shakvari and Rewati verses of the Sam Veda, the thrity-threefold praise-song, three divisions of time, both seasons, Winter and Dews, Arithmetic, the science of nine digits; thirtythree gods, the study through Brahmcharya and riches. Cast aside the head of a thief!.

౪౧౧. సోమేత్యస్య వరుణ ఋషిః, పరమాత్మా దేవతా, నిచృదార్షీ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

రాజప్రజాజనైరీశ్వరవద్వర్తిత్వా పరస్పరేషాం రక్షణం విధేయమిత్యాహ.

రాజు, ప్రజలు పరమాత్మునివలె న్యాయాధీశులై పరస్పర రక్షణ మొనర్చుకొనవలెను.

౪౧౧ సోమస్య త్విషి రసి తవేవ మే త్విషి ర్భూయాత్।

మృత్యోః పాహ్యోజోఽసి సహోఽస్యమృతమసి ॥౧౫॥

**ప.వి:- సోమస్య, త్విషిః, అసి, తవేవేతి, తవ+ఇవ, మే త్విషిః, భూయాత్, మృత్యోః, పాహి, ఓజః, అసి, సహః, అసి, అమృతమ్, అసి ॥౧౫॥**

**పదార్థః** :-(సోమస్య) ఐశ్వర్యస్య (త్విషిః) దీప్తిః (అసి) (తవేవ) (మే) (త్విషిః) (భూయాత్) (మృత్యోః) మరణాత్ (పాహి) (ఓజః) పరాక్రమయుక్తః (అసి) (సహః) బలవాన్ (అసి) (అమృతమ్) మరణధర్మరహితమ్ (అసి). అయమ్మన్త్రః. శత.౫.౪.౧. ౧౧-౧౪. వ్యాఖ్యాతః. ॥౧౫॥

**అన్వయః** :-హే పరమాప్త! యథా త్వం సోమస్య త్విషిరస్యోజోఽసి. సహోఽస్యమృతమసి. తథాఽహం భవేయమ్. తవేవ మే త్విషిరోజః సహోఽమృతం చ భూయాత్. త్వం మృత్యో ర్మాం పాహి.॥౧౫॥

భావార్థః :- ఓ పురుషాః! యథాఽఽప్తాః స్వేష్టం ప్రజాభ్యోఽపీచ్ఛేయుః. యథా ప్రజా రాజ పురుషాన్ రక్షేయు స్తథా రాజపురుషా ప్రజాజనాన్ సతతం రక్షంతు.॥౧౫॥

పదార్థము :- ఓ పరమ ఆప్తవిద్వాంసా! నీ వెట్లు (సోమస్య) ఐశ్వర్యమును (త్విషిః) ప్రకాశపరచువాడవై (అసి) యున్నావో మరియు (ఓజః) పరాక్రమశాలివై (అసి) ఉన్నావో అట్లే నేనును అగుదునుగాక! మరియు (తవేవ) నీవలెనే (మే) నాకు (త్విషిః) విద్యాప్రకాశములచే భాగ్యోదయము (భూయాత్) కలుగునుగాక! కావున నీవు నన్ను (మృత్యోః) మృత్యువునుండి (పాహి) రక్షించుము.॥౧౫॥

భావార్థము :- ఓ సజ్జనులారా! ధార్మికవిద్వాంసులు తమకిష్టమైన వేవి కావలయునని వాంఛింతురో ప్రజలెల్లరకును అవి సమకూరునట్లు ప్రయత్నించవలెను. రాజపురుషులను ప్రజలు కాపాడుచుండునట్లే రాజపురుషులును ప్రజలను కాపాడుచుండవలెను.॥౧౫॥

15.O God! Thou art the brilliance of supremacy, may my knowledge shine like Thine. Save me from death. Thou art vigour and victory.

౪౧౬. హిరణ్యరూపావిత్యస్య వరుణ ఋషిః, మిత్రావరుణౌ దేవతే, స్వరాడార్షీ జగతీ ఛందః, నిషాదః స్వరః.

అథ విద్వద్భిర్నిష్కపటతయాఽజ్ఞాః సత్యముపదిశ్య విద్వాంసో మేధావినః సంపాదనీయా ఇత్యాహ.

విద్వాంసులు నిష్కపటులై, అజ్ఞానులకు సత్యోపదేశమొనర్చి బుద్ధిమంతులుగా

విద్వాంసులుగా నొనర్చవలయును.

౪౧౬ హిరణ్యరూపాఽ ఉషసో విరోకఽ ఉభావింద్రాఽ ఉదిథః సూర్యశ్చ।

ఆరోహతం వరుణ మిత్ర గర్తం తతశ్చాక్షాథామదితిం దితిం చ ।

మిత్రోఽసి వరుణోఽసి ॥౧౬॥

ప.విః-హిరణ్యరూపావితి హిరణ్య+రూపౌ, ఉషసః, విరోక ఇతి వి+రోకే, ఉభౌ, ఇంద్రా, ఉత్, ఇథః, సూర్యః, చ, ఆ, రోహతమ్, వరుణ, మిత్ర, గర్తమ్, తతః, చక్షాథామ్, అదితిమ్, దితిమ్, చ, మిత్రః, అసి, వరుణః అసి.॥౧౬॥

పదార్థః :-(హిరణ్యరూపౌ) జ్యోతిః స్వరూపౌ (ఉషసః) ప్రభాతాన్ (విరోకే) వివిధతయా రుచికరే వ్యవహారే (ఉభౌ) (ఇంద్రౌ) పరమైశ్వర్యకారకౌ(ఉత్) (ఇథః) ప్రాప్నుథః (సూర్యః) (చ) చంద్ర ఇవ

(ఆ) (రోహతమ్) (వరుణ) శత్రుచ్ఛేదక! ఉత్కృష్ట సేనాపతే! (మిత్ర) సర్వస్య సుహృత్ (గర్తమ్) ఉపదేశక గృహమ్. గర్త ఇతి గృహ నా... నిఘం. 3.४. (తతః) తదనంతరమ్ (చక్షాథామ్) ఉపదిశేతామ్ (అదితిమ్) అవినాశినం పదార్థమ్ (దితిమ్) నాశవంతమ్ (చ)(మిత్రః) సుఖప్రదః (అసి) (వరుణః) సర్వోత్తమః (అసి). అయమ్మన్త్రః. శత. ౫.४.౧. ౧౫-౧౭. వ్యాఖ్యాతః. ॥౧౬॥

**అన్వయః** :-హే ఉపదేశక మిత్ర! యతస్త్వం మిత్రోఽసి. హే వరుణ! యతస్త్వం వరుణోఽసి. యత స్తౌ యువాం గర్తమారోహతమ్. అదితిం దితిం చ చక్షాథామ్. హే హిరణ్యరూపావుభావింద్రౌ! యథా విరోకే సూర్యశ్చంద్రశ్చోషసో విభాతస్తథా యువాముదిథో విద్యాః ప్రభాతమ్. ॥౧౬॥

**భావార్థః** :-యత్ర దేశే సూర్యచంద్రవదుపదేశకా వ్యాఖ్యానైః సర్వా విద్యాః ప్రకాశయంతి. తత్ర సత్యాఽసత్య పదార్థబోధేన సహితత్వాత్ కశ్చిదప్యవిద్యయా న విముహ్యతి. యత్రేదం న భవతి, తత్రాఽన్ధపరంపరాగ్రస్తా జనాః ప్రత్యహమవనతిం ప్రాప్నువంతి. ॥౧౬॥

**పదార్థము** :-(మిత్ర) ఉపదేశక మిత్రుడా! నీవు (మిత్రః) సుఖమునొసగు మిత్రుడవై (అసి) ఉన్నావు. మరియు (వరుణ) శత్రునాశకుడవగు నో సేనానాయకా! నీవు (వరుణః అసి) సర్వోత్తముడవు. కావున మీ యిరువురును (గర్తమ్) ఉపదేశకుల గృహములకు (ఆరోహతమ్) వెళ్లుడు (అదితిమ్) అవినాశి (చ) మరియు (దితిమ్) నాశమగు పదార్థముల (చక్షాథామ్) ఉపదేశమును పొందుడు. (హిరణ్యరూపౌ) ప్రకాశ స్వరూపులగు (ఉభౌ) ఇరువురు (ఇన్ద్రౌ) పరమైశ్వర్యములనిచ్చువారు (విరోకే) అనేకవిధముల రుచికర వ్యవహారముల నొనర్చుటలో (సూర్యః) సూర్యుడు (చ) మరియు చంద్రుడు (ఉషసః) ప్రాతఃసాయంకాలములను ప్రకాశపరచుచున్నట్లు మీ రిరువురును (ఉదిథః) విద్యలను ఉపదేశించుడు. ॥౧౬॥

**భావార్థము** :-సూర్యచంద్రులవలె సకల విద్యలను వ్యాఖ్యతోసహ ప్రకాశపరచు విద్వాంసులుండు దేశమందు సత్యాసత్యముల నెరిగిన ప్రజలు భ్రమలయందు జిక్కుకొనజాలరు. అట్టి యుపదేశకులు లేనిచో ప్రజలు అంధపరంపరలయందు జిక్కుకొని సదా క్లేశములనే పొందుచుందురు. ॥౧౬॥

16.O Preacher! the friend of all and O commander! the destroyer of foes, ye both go to the house of a seeker after truth, and dilate upon the immortal and the mortal substances. Just as the sun and moon bring day and night, for the transaction of our various desirable dealings, so should ye both full of lustre and supremacy spred knowledge.

४౧3. సోమస్యేత్యస్య వరుణ ఋషిః, క్షత్రపతిర్దేవతా, ఆర్షీ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

ఏతత్ప్రవృత్తయే కీదృశో రాజాఽభిషేచనీయ ఇత్యాహ.

పూర్వోక్త కార్యముల ప్రవృత్తికై యెటువంటి పురుషునకు రాజ్యాధికార మొసగవలయును?

౪౧౩ సోమస్య త్వా ద్యుమ్నేనాభిషిఞ్చామ్యగ్నే ర్భ్రాజసా సూర్యస్య వర్చ
సేంద్రస్యేంద్రియేణ। క్షత్రాణాం క్షత్రపతి రేధ్యతి దిద్యూన్ పాహి॥౧౭॥

**ప.వి:-** సోమస్య, త్వా, ద్యుమ్నేన, అభి, సించామి, అగ్నేః, భ్రాజసా, సూర్యస్య వర్చసా, ఇంద్రస్య, ఇంద్రియేణ, క్షత్రాణామ్, క్షత్రపతిరితి క్షత్ర+పతిః, ఏధి, అతి, దిద్యూన్, పాహి.॥౧౭॥

**పదార్థః :-** (సోమస్య) చంద్రస్యేవ (త్వా) ద్యుమ్నేన యశఃప్రకాశేన (అభి) ఆభిముఖ్యే (సించామి) అధికరోమి (అగ్నేః) అగ్నితుల్యేన (భ్రాజసా) తేజసా (సూర్యస్య) సవితురివ (వర్చసా) అధ్యయనేన (ఇంద్రస్య) విద్యుత ఇవ (ఇంద్రియేణ) మన ఆదినా (క్షత్రాణామ్) క్షత్రకులోద్గతానామ్. (క్షత్రపతిః) (ఏధి) భవ (అతి) (దిద్యూన్) విద్యాధర్మప్రకాశకాన్ వ్యవహారాన్ (పాహి) సతతం రక్ష. అయమ్మన్త్రః. శత. ౫.౪.౨.౨. వ్యాఖ్యాతః. ॥౧౭॥

**అన్వయః:-** హే ప్రశస్తగుణకర్మస్వభావయుక్త రాజన్! యథాఽహం యం త్వాం సోమస్యేవ ద్యుమ్నేనాగ్నే రివ భ్రాజసా సూర్యస్యేవ, వర్చసేంద్రస్యేవేంద్రియేణ త్వాఽభిషించామి. తథా స త్వం క్షత్రాణాం క్షత్రపతిరత్యేధి దిద్యూన్ పాహి.॥౧౭॥

**భావార్థః:-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా యః సోమాదిగుణయుక్తో విద్వాన్ జితేంద్రియో జనో భవేత్తం రాజత్వే స్వీకుర్వంతు. స చ రాజ్యం ప్రాప్యాతిప్రవృద్ధః సన్ విద్యాధర్మ ప్రకాశకాదీన్ రాజప్రజాజనాన్ సతతమతివర్ధయేత్. ॥౧౭॥

**పదార్థము :-** ప్రశంసనీయ గుణకర్మస్వభావములుగల నో రాజా! నేను నిన్నెట్లు (సోమస్య) చంద్రునివలె (ద్యుమ్నేన) యశోరూపమగు ప్రకాశముతో (అగ్నేః) అగ్నివలె (భ్రాజసా) తేజస్సుతో (సూర్యస్య) సూర్యునివలె (వర్చసా) అధ్యయనముచేతను మరియు (ఇన్ద్రస్య) విద్యుత్తువలె (ఇన్ద్రియేణ) మనస్సు మున్నగు ఇంద్రియముల చేతను (త్వా) నిన్ను (అభిషించామి) రాజ్యాధికారిగా నొనర్చుచున్నానో అట్లే నీవు (క్షత్రాణామ్) క్షత్రియులందు ఉత్తములైనవారి మధ్య (క్షత్రపతిః) రాజ్యమును పాలించువాడవై (దిద్యూన్) విద్యలను, ధర్మమును ప్రకాశపరచు వ్యవహారములను (పాహి) సదా రక్షించుచుండుము. ॥౧౭॥

**భావార్థము :-** ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ప్రజలు శాంతి శమదమాది గుణయుక్తుడు, జితేంద్రియుడు నగు విద్వాంసునకు రాజ్యాధికారము నీయవలెను. అట్టి రాజు

రాజ్యాధికారమును పొంది అతిశ్రేష్ఠు డగుచు విద్యాధర్మములను ప్రకాశపరచు ప్రజలను నిరంతరము ఇట్టి కార్యనిర్వహణమునందు ప్రోత్సహించుచు పెంపొందింపజేయుచుండవలెను.॥౧౭॥

17.O King, I install thee with brilliance like the moon, lustre like the fire, splendour of knolcdge like the sun, and the might of mind like the lightning, Be lord of princes. Guard constantly all acts conducive to knowledge and religion!.

౪౧౪. ఇమం దేవా ఇత్యస్య దేవాత ఋషిః, యజమానో దేవతా, స్వరాట్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

సత్యోపదేశకై ర్విద్వద్భిర్బాల్యాఽవస్థామారభ్య సుశిక్షయా సర్వే రాజకన్యాకుమారాః

శ్రేష్ఠాచారాః సంపాదనీయా ఇత్యాహ.

సత్యోపదేశకులైన విద్వాంసులు బాల్యావస్థనుండియు మంచిశిక్షణచే రాజులయొక్క

పుత్రపుత్రికలను శ్రేష్ఠాచారయుక్తులుగ నొనర్పవలయునను విషయ మీ మంత్రమందుచెప్పబడెను.

౪౧౪ ఇమన్దేవాఽ అసపత్నꣳసువధ్వం మహతే క్షత్రాయ మహతే జ్యైష్ఠ్యాయ

మహతే జానరాజ్యాయేన్ద్ర స్యేన్ద్రియాయ। ఇమమముష్య

పుత్రమముష్యై పుత్ర మస్యై విశఽఏష వోఽమీ రాజా

సోమోఽస్మాకం బ్రాహ్మణానాꣳరాజా ॥౧౮॥

ప.వి:- ఇమమ్, దేవాః, అసపత్నమ్, సువధ్వమ్, మహతే, క్షత్రాయ, మహతే, జ్యైష్ఠ్యాయ, మహతే. జానరాజ్యాయేతి జాన + రాజ్యాయ, ఇన్ద్రస్య, ఇన్ద్రియాయ, ఇమమ్, అముష్య, పుత్రమ్, అముష్యై, పుత్రమ్, అస్యై, విశే, ఏషః, వః, అమీఇత్యమీ, రాజా, సోమః, అస్మాకమ్, బ్రాహ్మణానామ్, రాజా ॥౧౮॥

పదార్థః :-(ఇమమ్)(దేవాః) వేదశాస్త్రవిదః సేనాపతయః (అసపత్నమ్) అజాతశత్రుమ్ (సువధ్వమ్) ప్రేర్యమ్ (మహతే) సత్కర్తవ్యాయ (క్షత్రాయ) క్షత్రియకులాయ (మహతే)(జ్యైష్ఠ్యాయ) విద్యాధర్మవృద్ధానాం భావాయ (మహతే) (జానరాజ్యాయ) జనానాం రాజ్ఞాం మాణ్డలికానాముపరి

ప్రభావాయ. (ఇన్ద్రస్య) ఐశ్వర్యయుక్తస్య ధనికస్య (ఇంద్రియాయ) ధనవర్ధనాయ (ఇమమ్)(అముష్య) సద్గుణసంపన్నస్య రాజపూతస్య (పుత్రమ్) తనయమ్ (అముష్యై) ప్రశంసనీయాయా రాజపుత్ర్యాః. అత్ర షష్ఠ్యర్థే చతుర్థీ. (పుత్రమ్) పవిత్రగుణకర్మస్వభావైర్మాతాపితృపాలకమ్ (అస్యై) వర్తమానాయాః సుశిక్షితవ్యాయాః (విశే) ప్రజాయాః (ఏషః)(వః) యుష్మాకం పాలనాయ (అమీ) ధార్మికా రాజపురుషాః (రాజా) సర్వత్ర విద్యాధర్మసుశిక్షాప్రకాశకః (సోమః) శుభగుణః ప్రసిద్ధః (అస్మాకమ్)(బ్రాహ్మణానామ్) బ్రహ్మవేదభక్తానామ్ (రాజా) వేదేశ్వరోపాసనయా ప్రకాశమానః. అయమ్మన్త్రః. శత.౫.౩.౩.౧౨ తథా ౫.౪.౨.౩. వ్యాఖ్యాతః.॥౧౦॥

**అన్వయః** :- హే దేవాః! యూయం య ఏష ఉపదేశకః సేనేశో వా వోఽస్మాకం చ బ్రాహ్మణానాం రాజాఽస్తి. యేఽమీ రాజపురుషాః సన్తి తేషాం సోమో రాజాఽస్తి తమిమమముష్య పుత్రమముష్యై పుత్రమస్యై విశే మహతే క్షత్రాయ మహతే జ్యైష్ఠ్యాయ మహతే జానరాజ్యాయేన్ద్రస్యేన్ద్రియాయాసపత్నం సువధ్వమ్.॥౧౦॥

**భావార్థః**:- యద్యుపదేశకా రాజపురుషాశ్చ సర్వస్యోన్నతిం చికీర్షేయుస్తర్హి ప్రజారాజజనా రాజపురుషోన్నతిం కుతో న కర్తుమిచ్ఛేయుః? యది రాజప్రజాజనా వేదేశ్వరాజ్ఞాం విహాయ స్వేచ్ఛయా ప్రవర్తేరన్, తర్హ్యేషామనున్నతిః కుతో న భవేత్? ॥౧౦॥

**పదార్థము** :-(దేవాః) వేదశాస్త్రములు చదివినట్టి సేనానాయకులారా! మీరు (ఏషః) ఏ యీ ఉపదేశకుడు లేక సేనాపతి (వః) మీయొక్క (అస్మాకమ్) మాయొక్క (బ్రాహ్మణానామ్) ఈశ్వరుని మరియు వేదములనుసేవించు బ్రాహ్మణులయొక్క (రాజా) వేదములచే, ఈశ్వరోపాసనచే ప్రకాశవంతుడై అధిష్ఠాతయై యున్నాడో, ఎవరు (అమీ) ధర్మాత్ములగు రాజపురుషులున్నారో వారెల్లరకును అతడే (సోమః) శుభగుణములచే ప్రసిద్ధుడు (రాజా) అంతటను విద్య, ధర్మశిక్షాప్రకాశకుడు రాజైయున్నాడు (ఇమమ్) ఇట్టి (అముష్య) ఈ శ్రేష్ఠగుణయుక్తురాలగు రాజపుత్రిని (పుత్రమ్) పుత్రుని (అముష్యై) ప్రశంసనీయ రాజకన్యయొక్క (పుత్రమ్) శుభగుణకర్మస్వభావములతో తల్లిదండ్రులనుపోషించు పుత్రుని (అస్యై) ఉత్తమశిక్షణ నొసగదగు (విశే) ఈ ప్రజలకొరకును (మహతే) సత్కరించదగిన (క్షత్రాయ) క్షత్రియవర్గముకొరకును (మహతే) గొప్ప (జ్యైష్ఠ్యాయ) విద్యాధర్మవిషయములందు శ్రేష్ఠులగువారికిని (మహతే) శ్రేష్ఠులగు (జానరాజ్యాయ) మాండలిక రాజులపై చక్కని ప్రభావము నుంచదగిన సమర్థునికొరకును (ఇన్ద్రస్య) సమస్తైశ్వర్యములతో పూర్ణుడగు ధనికునియొక్క (ఇన్ద్రియాయ) ధనాభివృద్ధి నిమిత్తము (అసపత్నమ్) శత్రురహితుడగు పుత్రుని (సువధ్వమ్) ఉత్పన్నమొనర్పుడు.॥౧౦॥

**భావార్థము** :- ఉపదేశకులగు విద్వాంసులు, రాజపురుషులు సమస్త ప్రజల ఉన్నతికొరకు ప్రయత్నించునప్పుడు ప్రజలు రాజును, రాజపురుషులను ఉన్నతిపరచుటకు ప్రయత్నపూర్వకముగ సహాయ మొనర్చుచుండవలయును. రాజు, రాజపురుషులు, ప్రజలు ఈశ్వరుని వేదముల ఆజ్ఞనుల్లంఘించి యథేచ్ఛగా ప్రవర్తించునప్పుడు వారు తమ యున్నతితో సహా నష్టమొందుదురు.॥౧౦॥

18.O learned generals, this is your King and of us Brahmanas, the devotees of God and of the Vedas. He is the well-qualified King of the subjects!.

Produce such a foeless King, the son of such-a-man, and such a woman, for healthy teaching of his people, for adorable warrior-class, for mighty lordship, for mighty domination over princes, and for enhancing the wealth of the wealthy.

౪౧౫. ప్రపర్వతస్యేత్యస్య దేవావాత ఋషిః, విరాట్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునరత్ర రాజప్రజాజనైః కీదృశాని యానాని రచనీయానీత్యాహ.

మరల నీ జగత్తునందు రాజా, ప్రజలు నెట్టియానములను నిర్మాణమొనర్చవలయునను

విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౪౧౫ ప్ర పర్వతస్య వృషభస్య పృష్ఠాన్నావశ్చరన్తి స్వసిచ ఽఇయానాః।

తా ఽఆవ వృత్రన్నధరాగుదక్తా ఽఅహిం బుధ్న్యమనురీయమాణాః।

విష్ణోర్విక్రమణమసి విష్ణోర్విక్రాన్తమసి విష్ణోః క్రాన్తమసి ॥౧౯॥

ప.వి:- ప్ర, పర్వతస్య, వృషభస్య, పృష్ఠాత్, నావః, చరన్తి, స్వసిచ ఇతి స్వ + సిచః, ఇయానాః, తాః, ఆ, అవవృత్రన్, అధరాక్, ఉదక్తా ఇత్యుత్ + అక్తాః, అహిమ్, బుధ్న్యమ్, అను, రీయమాణాః, విష్ణోః, విక్రమణమితి వి+క్రమణమ్, అసి, విష్ణోః, విక్రాన్తమితి వి+క్రాన్తమ్, అసి, విష్ణోః, క్రాన్తమ్, అసి ॥౧౯॥

పదార్థః :-(ప్ర) (పర్వతస్య) మేఘస్య. పర్వత ఇతి మేఘ నా....నిఘం. ౧. ౧౦. (వృషభస్య) వర్షకస్య (పృష్ఠాత్) ఉపరిభాగాత్ (నావః) సాగరోపరి నావ ఇవ విమానాని (చరన్తి) (స్వసిచః) యాః స్వైర్జలైర్జలేన సిచ్యన్తే తాః (ఇయానాః) గన్త్ర్యః (తాః)(ఆ)(అవవృత్రన్) అర్వాచీనో వృత్ర ఇవాచరన్. అత్రాచారే సుబన్తాత్క్విప్ (అధరాక్) మేఘాదధస్తాత్ (ఉదక్తాః) పునరూర్ధ్వమ్ గచ్ఛన్త్యః (అహిమ్) మేఘమ్ (బుధ్న్యమ్) బుధ్నేఽన్తరిక్షే భవమ్ (అను) పశ్చాత్ (రీయమాణాః) చాలనేన గచ్ఛన్త్యః (విష్ణోః) వ్యాపకస్యేశ్వరస్య (విక్రమణమ్) విక్రమతేఽస్మింస్తత్ (అసి) (విష్ణోః) వ్యాపకస్య వాయోః (విక్రాన్తమ్)

వివిధతయా క్రాన్తమ్. (అసి) (విష్ణోః) వ్యాపకస్య విద్యుద్వస్తునః (క్రాన్తమ్) క్రమాధికరణమ్ (అసి). అయమ్మన్త్రః. శత. ౫.౪.౨. ౫-౬ వ్యాఖ్యాతః.॥౧౯॥

**అన్వయః**:-హే రాజశిల్పిన్ యది త్వయా యాః స్వసిచ ఇయానా ఉదక్తా అహిం బుధ్న్యమనురీయమాణా నావో వృషభస్య ప్రపర్వతస్య పృష్ఠాత్ ప్రచరన్తి, యాభిస్త్వం విష్ణోర్విక్రాన్తమసి, విష్ణోర్విక్రమణమసి, విష్ణోః క్రాన్తమసి, యా అధరాగావవృత్రంస్తాస్త్వం సాధ్నుహి.॥౧౯॥

**భావార్థః**:-యథా మేఘా వర్షిత్వా భూమితలం ప్రాప్యాకాశమాప్నోతి, తజ్జలం నదీర్గత్వాఽన్తతః సముద్రం ప్రాప్నోతి, తత్పృష్ఠే నావో గచ్ఛన్తి. యా అప్స్వన్తరర్థాద్యాసాముపర్యధో జలం భవతి. తద్వత్సర్వైః శిల్పిభిర్విమానాని నావశ్చ యానాని రచయిత్వా భూమిజలాఽన్తరిక్షమార్గేణాభీష్టే దేశే గమనాగమనే యథేష్టే కార్యే. యావదేతాని న సాధ్నువన్తి తావద్ద్వీపద్వీపాన్తరం గన్తుం కశ్చిదపి న శక్నోతి. యథా పక్షిణ ఇదం శరీరమయం సంఘాతం గమయన్తి తథైవ విచక్షణైః శిల్పిభిరేతదాకాశం యానైర్విక్రమణీయమ్.॥౧౯॥

**పదార్థము** :- ఓ రాజశిల్పీ [కళాకారుడా]! నీద్వారా (స్వసిచః) మన ప్రజలు జలముచే దేనిని సేచనమొనర్చుచున్నారో, ఏవి (ఇయానాః) నడచుచున్నవియో (ఉదక్తాః) తిరిగి తిరిగి పైకి పోవుచున్నవియో (అహింబుధ్న్యమ్) ఆకాశమునందున్న మేఘములు (అనురీయమాణాః) వెంట వెంట నడుపుటవల్ల నడుచుచున్నవియో (నావః) నౌకలవలె సముద్రముపై నడచు నే విమానములుగలవో (వృషభస్య) వర్షించునట్టి (పర్వతస్య) మేఘముయొక్క (పృష్ఠాత్) పైభాగమందు (ప్ర చరన్తి) నడచుచున్నవియో, వేనిద్వారా నీవు (విష్ణోః) సర్వవ్యాపకుడగు పరమేశ్వరు నెరిగి ఈ సృష్టియందు (విక్రమణమ్) పరాక్రమవంతుడవు (అసి) అగుచున్నావో (విష్ణోః) వ్యాపకవాయువు మధ్య (విక్రాన్తమ్) అనేక విధములుగ నడచువాడవు (అసి) అగుచున్నావో మరియు (విష్ణోః) వ్యాపకవిద్యుత్తుమధ్య (క్రాన్తమ్) నడచుట కాధారమై (అసి) ఉన్నావో (అధరాక్) మేఘములకు క్రింద (అవవృత్రన్) మేఘములవలె నడచుచున్నట్టి విమానములు మున్నగు యానములను నీవు సిద్ధమొనర్చుము.॥౧౯॥

**భావార్థము** :- మేఘములు వర్షించిన జలములు భూమిని సేచనమొనర్చి తిరిగి ఆకాశమునకు చేరునట్లు, ఆ జలము నదులద్వారా ప్రవాహరూపమున సముద్రమును పొందుచున్నట్లు, జలములోపల అనగా క్రిందమీద జలములే యుండునట్లు సకల శిల్పులు (ఇంజినీర్లు) నః నౌకలు, విమానములు మున్నగు యానములను నిర్మించి భూమిపైనున్న జలముపైనను, ఆకాశమునందును అభీష్ట దేశములకు, ప్రాంతములకు యథేచ్ఛగా రాకపోకలను జరుపవలయును. అట్టి యానసౌకర్యములు గలుగనంతవర కెవ్వరును ద్వీపద్వీపాంతరములకు వెళ్లజాలరు. పక్షి పక్షము(రెక్క)ల సహాయమున తన శరీరమును ఆకాశమున నెగిరించి నడిపించునట్లు చతురులగు విద్వాంసులు తమ శరీరాదులను యానములద్వారా ఆకాశమున విహరింపజేతురు.॥౧౯॥

**19.O royal skilled engineer, construct sea-boats, propelled on water by our experts, and aeroplanes, moving and flying up-ward, after the clouds that reside in the wind-re-**

gion, that fly as the boats move on the sea, that fly high over and below the watery clouds. Be thou, thereby, prosperous in this world created by the Omnipresent God, and a flier in both air, and lightning.

౪౧౬. ప్రజాపత ఇత్యస్య దేవాత ఋషిః, ప్రజాపతిర్దేవతా, స్వరాడతి ధృతిశ్ఛన్దః, షడ్జః స్వరః.

మనుష్యైరీశ్వరోపాసనాऽऽజ్ఞాపాలనేన సర్వాః కామనాః ప్రాప్తవ్యా ఇత్యాహ.

మానవు లీశ్వరోపాసన నాచరించి ఆతని యాజ్ఞలను పాలించుటవలన సమస్త కోరికలు

నెరవేరగల వను విషయ మీమంత్రమం దుపదేశించబడినది.

౪౧౬ ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా రూపాణి పరి తా బభూవ।

యత్కామాస్తే జుహుమస్తన్నోऽఅస్త్వయమముష్య పితాऽసావస్య

పితా వయꣳస్యామ పతయో రయీణాꣳస్వాహా। రుద్ర యత్తే

క్రివి పరం నామ తస్మిన్ హుతమస్యమేష్టమసి స్వాహా ॥౨౦॥

ప. వి:- ప్రజాపత ఇతి ప్రజా + పతే, న, త్వత్, ఏతాని, అన్యః, విశ్వా, రూపాణి, పరి, తా, బభూవ, యత్కామా ఇతి యత్+కామాః, తే, జుహుమః, తత్, నః, అస్తు, అయమ్, అముష్య, పితా, అసౌ, అస్య, పితా, వయమ్, స్యామ, పతయః, రయీణామ్, స్వాహా, రుద్ర, యత్, తే, క్రివీ, పరమ్, నామ, తస్మిన్, హుతమ్, అసి, అమేష్టమిత్యమా + ఇష్టమ్, అసి, స్వాహా ॥౨౦॥

పదార్థః :-(ప్రజాపతే) ప్రజాయాః స్వామిన్నీశ్వర! (న) నిషేధే (త్వత్) తవ సకాశాత్ (ఏతాని) జీవప్రకృత్యాదీని వస్తూని (అన్యః) భిన్నః పదార్థః (విశ్వా) సర్వాణి (రూపాణి) ఇచ్ఛారూపాదిగుణవిశిష్టాని (పరి) (తా) తాని (బభూవ) అస్తి (యత్కామాః) యస్య యస్య కామః కామనా యేషాన్తే (తే) తవ (జుహుమః) గృహ్ణీమః (తత్)(నః) అస్మభ్యమ్ (అస్తు) భవతు (అయమ్)(అముష్య) ప్రత్యక్షస్య జనస్య.

(పితా) పాలకః (అసౌ) సః (అస్య) ప్రత్యక్షవర్తమానస్య (పితా) రక్షకః (వయమ్)(స్యామ) భవేమ (పతయః) స్వామినః పాలకాః (రయీణామ్) విద్యాచక్రవర్తిరాజ్యోత్పన్నశ్రియామ్ (స్వాహా) సత్యయా క్రియయా (రుద్ర) దుష్టానాం రోదయితః (యత్) (తే) తవ (క్రివి) కృణోతి హినస్తి యేన తత్. నకారస్థానే వర్ణవ్యత్యయేనేకారః (పరమ్) ప్రకృష్టమ్ (నామ) (తస్మిన్) (హుతమ్) (అసి)(అమేష్టమ్) అమాయాం గృహే ఇష్టమ్ (అసి) (స్వాహా) సత్యయా వాచా. అయమ్మన్త్రః. శత. ౫.౪.౩. ౮-౧౦. వ్యాఖ్యాతః. ॥౨౦॥

**అన్వయః** :-హే ప్రజాపతే! యాన్యేతాని విశ్వా రూపాణి సన్తి తాని త్వదన్యో న పరిబభూవ. తే తవ సకాశాద్యత్కామాః సన్తో వయం జుహుమస్తత్తవ కృపయా నోఽస్తు యథా త్వమముష్య పరోక్షస్య జగతః పితాఽసౌ భవానస్య సమక్షస్య విశ్వస్య పితాఽసి, తథా వయం స్వాహా రయీణాం పతయః స్యామ. హే రుద్ర! తే తవ యత్ క్రివి పరం నామాఽస్తి యస్మింస్త్వం హుతమస్యమేష్టమసి, తం వయం స్వాహా జుహుమః. ॥౨౦॥

**భావార్థః** :-అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. హే మనుష్యాః యః సర్వస్మిన్ జగతి వ్యాప్తః సర్వాన్ప్రతి మాతాపితృ వద్వర్తమానో దుష్టదణ్డక ఉపాసితుమిష్టోఽస్తి, తం జగదీశ్వరమేవోపాధ్వమేవమనుష్ఠానేన యుష్మాకం సర్వే కామా అవశ్యం సేత్స్యన్తి. ॥౨౦॥

**పదార్థము** :-(ప్రజాపతే) ప్రజాస్వామివగు నో పరమేశ్వరా! (ఏతాని) జీవులు, ప్రకృతి మున్నగు వస్తువులు (విశ్వా) సమస్తము (రూపాణి) ఇచ్ఛారూపాది ఏ గుణములుగలవో (తా) వానిని నీవుగాక (అన్యః) ఇతరు లెవ్వరును (న పరిబభూవ) తెలిసికొనజాలరు (తే) నిన్ను (యత్కామాః) ఏ యే పదార్థములను కోరుచు (వయమ్) మేము (జుహుమః) సేవించుచున్నామో ఆ యా పదార్థములు నీ కృపచే (నః) మాకు (అస్తు) ప్రాప్తించునుగాక! నీ వెట్లు (అముష్య) అట్టి పరోక్షజగమునకు (పితా) రక్షకుడవై యున్నావో అట్లే (అసౌ) నీ నీ ప్రత్యక్ష జగత్తునకును రక్షకుడవై యున్నావు. అటులనే మేమును (స్వాహా) సత్యవాణిచే (రయీణామ్) విద్య మరియు చక్రవర్తిరాజ్యము మున్నగువానిద్వారా యుత్పన్నమైన లక్ష్మిని (పతయః) రక్షించువారము (స్యామ) అగుదుముగాక! (రుద్ర) దుష్టుల నేడ్పించు ఓ పరమేశ్వరా! (తే) నీయొక్క (క్రివి) దుఃఖవిముక్తిని గలిగించు కారణముచే (పరమ్) ఉత్తమమైన (నామ) నామమును (తస్మిన్) అందున (హుతమ్) స్వీకరించి (అసి) ఉన్నావు (అమేష్టమ్) అట్టి గృహములందు ఇష్టుడవై (అసి) ఉన్ననిన్ను మేము (స్వాహా) సత్యవాణితో పొందుచున్నాము. ॥౨౦॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! సమస్త ప్రపంచమున వ్యాపకుడై సర్వమునకు తల్లిదండ్రులవలె వర్తమానుడై యుండి దుష్టుల నేడ్పించుచు ఉపాసించుట కిష్టుడైయున్నట్టి యా జగదీశ్వరుని ఉపాసించుడు. ఇట్లనుష్ఠించుటవల్ల మీ కోరిక లవశ్యముగ సిద్ధించును. ॥౨౦॥

**20.O God, Thou only comprehendest all these created forms, and none besides Thee! give us our heart's desire, when we invoke Thee. Just as Thou art the Lord of that invisible world, and this visible world, so may we be righteous lords of rich possessions.**

O God! the Tormentor of the wicked, Thy remembrance relieves us of miseries. For that we worship Thee. We worship Thee at home in truthful words.

౪౧౭. ఇన్ద్రస్యేత్యస్య దేవవాత ఋషిః, క్షత్రపతిర్దేవతా, భురిగ్బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునర్విద్వద్భిః కిం కర్తవ్యమిత్యాహ.

విద్వాంసు లేమి చేయువలయునను విషయము మరల ఈ మంత్రమందు చెప్పబడెను.

౪౧౭ ఇన్ద్రస్య వజ్రో౭సి మిత్రావరుణయోస్త్వా ప్రశాస్త్రోః ప్రశిషా యునజ్మి।
అవ్యథాయై త్వా స్వధాయై త్వా౭రిష్టో అర్జునో మరుతాం ప్రసవేన
జయాపామ మనసా సమిన్ద్రియేణ ॥౨౧॥

ప.వి:- ఇన్ద్రస్య, వజ్రః, అసి, మిత్రావరుణయోః. త్వా, ప్రశాస్త్రోరితి ప్ర+శాస్త్రోః, ప్రశిషేతి ప్ర+శిషా, యునజ్మి, అవ్యథాయై, త్వా, స్వధాయై, త్వా, అరిష్టః, అర్జునః, మరుతామ్, ప్రసవేనేతి ప్ర+సవేన, జయ, అపామ, మనసా, సమ్, ఇన్ద్రియేణ.॥౨౧॥

**పదార్థః** :-(ఇన్ద్రస్య) పరమైశ్వర్యస్య (వజ్రః) విజ్ఞాపకః (అసి)(మిత్రావరుణయోః) సభాసేనేశయోః (త్వా) తామ్ (ప్రశాస్త్రోః) సర్వస్య ప్రకాశనకర్త్రోః (ప్రశిషా) ప్రశాసనేన (యునజ్మి) సమాదధే (అవ్యథాయై) అవిద్యమానపీడాయై క్రియాయై (త్వా) (స్వధాయై) స్వవస్తుధారణలక్షణాయై రాజనీత్యై (త్వా)(అరిష్టః) అహింసితః (అర్జునః) ప్రశస్తం రూపం విద్యతే౭స్య సః. అర్శ ఆదిత్వాదచ్. అర్జునమితి రూప నామ... నిఘం.౩.౭. (మరుతామ్) ఋత్విజామ్ (ప్రసవేన) ప్రేరణేన (జయ) ఉత్కృష్ట (అపామ) ఆప్నుయామ (మనసా) మననశీలేన (సమ్) (ఇన్ద్రియేణ) ఇన్ద్రేణ జీవేన జుష్టేన ప్రీతేన వా. అయం మన్త్రః. శత. ౫.౪.౩.౪-౧౦. వ్యాఖ్యాతః.॥౨౧॥

**అన్వయః**:-హే రాజన్! యస్త్వమరిష్టో౭ర్జున ఇన్ద్రస్య వజ్రో౭సి యం త్వా౭వ్యథాయై ప్రశాస్త్రోర్మిత్రా వరుణయోః ప్రశిష్టా౭హం యునజ్మి. మరుతాం ప్రసవేన స్వధాయై యం త్వా యునజ్మి. మనసేంద్రియేణ యం త్వా వయం సమాపామ స త్వం జయ దుష్టాన్ జిత్వోత్కృష్ట.॥౨౧॥

**భావార్థః**:-విద్వద్భీరాజా ప్రజాపురుషైశ్చ ధర్మార్థం సదా ప్రశాసనీయాః. యత ఏతే పీడాం రాజనీతివిరుద్ధం కర్మ నాచరేయుః. సర్వతః ప్రాప్తబలాః శత్రూన్ జయేయుః. యేన కదాప్యైశ్వర్యస్య హానిర్న స్యాత్. ॥౨౧॥

**పదార్థము:**- ఓ రాజా! నీవు (అరిష్టః) ఎవరి హింసకును అందనివాడవు (అర్జునః) ప్రశంసనీయరూపు గలవాడవు (ఇన్ద్రస్య) పరమైశ్వర్యవంతులగు (వజ్రః) శత్రువులకు వజ్రమువంటివాడవై (అసి) ఉన్నావు. అట్టి (త్వా) నీకు (అవ్యథాయై) పీడగలుగకుండుటకొరకు (ప్రశాస్త్రోః) సర్వమునకు శిక్షణనిచ్చువారగు (మిత్రావరుణయోః) సభయొక్క సేనాపతియొక్క (ప్రశిషా) శిక్షణద్వారా నేను (యునజ్మి) సంయుక్తపరచుచున్నాను. (మరుతామ్) ఋత్విజులు తమ (ప్రసవేన) ప్రేరణచే (స్వధాయై) స్వంతవస్తువులను ధరించుటవంటి రాజనీతికై (త్వా) నిన్ను ఏ యోగాభ్యాసముచే చింతనమొనర్చుచున్నారో (మనసా) ఆలోచనాపరమగు మనస్సుతో (ఇన్ద్రియేణ) జీవనమునకై సేవించు ఇంద్రియములచే (త్వా) నిన్ను నేను (సమాపామ) చక్కగా పొందుచున్నానో, అట్టి నీవు (జయ) దుష్టుల జయించి చింతారహితముగ అభివృద్ధిని పొందుదము. ॥౨౧॥

**భావార్థము :**- ప్రజలకు, ఎవ్వరికిని అన్యాయము, పీడను గలిగించి రాజనీతికి విరుద్ధమగు కర్మల నొనర్చకుండునట్లు విద్వాంసులు రాజునకు, రాజపురుషులకు ధర్మార్థసిద్ధికొరకు సదా చక్కని శిక్షణ నొసంగుచుండవలయును. తమ రాజ్యమునకు, ఐశ్వర్యములకు హాని గలుగకుండునట్లు వీరు సకల విధముల శక్తియుక్తులుగలవారై శత్రువులను జయింతురుగాక! ॥౨౧॥

21.O King, thou art invincible, admirably handsome, and a mighty bolt for the foes. I apppoint thee for alleviating the miseries of humanity, for imparting instructions to all, for presiding over the Assembly and the army, and for government. I enjoin thee to guard thy state politically, with the advice of wise statesmen. May we be attached to thee with heart and soul. May thou be victorious!.

౪౧౮.మా త ఇత్యస్య దేవవాత ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

ప్రజాజనై రాజప్రసంగే కథం వర్తితవ్యమిత్యాహ.

ప్రజలు రాజుయెడ నెట్లు ప్రవర్తించవలయు నను విషయ మిందుగలదు.

౪౧౮ మా తఽ ఇన్ద్ర తే వయం తురాషాడ యుక్తాసోఽ అబ్రహ్మతా వి

దసామ। తిష్ఠా రథమధి యం వజ్రహస్తా రశ్మీన్దేవ యమసే స్వశ్వాన్ ॥౨౨॥

ప.వి:-మా, తే, ఇన్ద్ర, తే, వయమ్, తురాషాట్, అయుక్తాసః, అబ్రహ్మతా, వి, దసామ, తిష్ఠ, రథమ్, అధి, యమ్, వజ్రహస్తేతి వజ్ర+హస్త, ఆ, రశ్మీన్, దేవ, యమసే, స్వశ్వానితి సు+అశ్వాన్ ॥౨౨॥

**పదార్థః** :-(మా) నిషేధే (తే) తవ (ఇన్ద్ర) సభేశ రాజన్! (తే) తవ (వయమ్) రాజప్రజాజనాః (తురాషాట్) తురాన్ త్వరితాన్ శత్రూన్ సహతే (అయుక్తాసః) అధర్మకారిణః (అబ్రహ్మతా) వేదేశ్వరనిష్ఠారహితతా (వి) (దసామ) ఉపక్షయేమ (తిష్ఠ) అత్ర ద్వ్యచోతస్తిఙ ఇతి దీర్ఘః. (రథమ్)(అధి)(యమ్) (వజ్రహస్త) వజ్రతుల్యాని శస్త్రాణి హస్తయోర్యస్య తత్సంబుద్ధౌ (ఆ)(రశ్మీన్) అశ్వనియమార్థా రజ్జూః (దేవ) (యమసే) నియచ్ఛసి (స్వశ్వాన్) శోభనాశ్చ తేఽశ్వాశ్చ తాన్. అయమ్మన్త్రః. శత. ౫.౪.౩.౧౪. వ్యాఖ్యాతః.॥౨౨॥

**అన్వయః** :-హే దేవేన్ద్ర రాజన్ వజ్రహస్త! వయం తే తవ సమ్బన్ధేఽయుక్తాసో మా భవామ, తే తవాబ్రహ్మతా మాఽస్తు విదసామ, యస్తురాషాట్ త్వం యాన్ రశ్మీన్ స్వశ్వాన్ యమసే, యం రథమధితిష్ఠ తాంస్తం చ వయమప్యధితిష్ఠేమ.॥౨౨॥

**భావార్థః** :-రాజప్రజాజనా రాజ్ఞా సహాయోగ్యం వ్యవహారం కదాచిన్న కుర్యుః. రాజా చైతైః సహాన్యాయం న కుర్యాత్. వేదేశ్వరాజ్ఞానుష్ఠానాః సన్తః సర్వే సమానయానాసనవ్యవహారాః స్యుః. న కదాచిదాలస్యే ప్రమాదే వేదేశ్వరనిన్దామయే నాస్తికత్వే వా వర్తేరన్.॥౨౨॥

**పదార్థము** :-(దేవ) ప్రకాశవంతుడవగు (ఇన్ద్ర) సభాపతిరాజా! (వజ్రహస్త) వజ్రమువంటి శస్త్రముల ధరించిన నీతో (వయమ్) రాజుయొక్క ప్రజలమగు మేము (తే) నీ తోడిసంబంధమున (అయుక్తాసః) అధర్మవంతులము (మా) కాకుందుముగాక! (తే) నీకు (అబ్రహ్మతా) వేద మరియు ఈశ్వర నిష్ఠరహితమగు మనస్సు (మా) కలుగకుండునుగాక! మరియు (విదసామ) ధర్మమును నష్టపరచకుందుముగాక! (తురాషాట్) శీఘ్రకారులగు శత్రువులను సహించు నీవు (రశ్మీన్) గుఱ్ఱపుకళ్లెములత్రాళ్లను మరియు (స్వశ్వాన్) చక్కని గుఱ్ఱములను (యమసే) నియంత్రణమున నుంచునట్లు మరియు (రథమ్) రథముపై (అధితిష్ఠ) ఆసీనుడవగునట్లు గుఱ్ఱములను, రథములను మేమును చక్కగా అధిష్ఠించుచుందుముగాక!॥౨౨॥

**భావార్థము** :-ప్రజలు రాజుయెడ నెన్నడును అయోగ్యముగ వ్యవహరించరాదు. రాజుకూడ ప్రజలయెడ అన్యాయముగ వ్యవహరించకూడదు. వేదాజ్ఞను, ఈశ్వరాజ్ఞను శిరసావహించుచు ప్రజలెల్లరును ఒకే వాహనముపై నెక్కినట్లుండవలెను. ఒకే పడకపై కూర్చుండియున్నట్లుండవలయును. సమానరూపమున వ్యవహరించవలెను. కాని ఆలస్యప్రమాదములందుగాని, ఈశ్వరుని, వేదములను నిందించుట యందుగాని, నాస్తికత్వమునందుగాని చిక్కుపడి పతనమైపోరాదు.॥౨౨॥

22.O renowned King, equipped with arms, may we never behave unrighteously towards thee. May thou never shaken thy belief in the Vedas and God. May we never die in poverty. O conqueror of foes, ascend the chariot. Thou controllest the reins and noble horses!.

**౪౧౯. అగ్నయ ఇత్యస్య దేవవాత ఋషిః, అగ్న్యాదయో మన్త్రోక్తా దేవతాః, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.**

**అథ మాతాఽపత్యాని పరస్పరం కీదృశం సంవదేయురిత్యాహ.**

తల్లి పుత్రులకెట్లి శిక్షణనీయవలయును? పుత్రులును తల్లియాజ్ఞయం దెట్లు ప్రవర్తించవలయునను విషయ మీ మంత్రమం దుపదేశించబడినది.

౪౧౯ అగ్నయే గృహపతయే స్వాహా సోమాయ వనస్పతయే స్వాహా మరుతామోజసే స్వాహేన్ద్ర స్యేన్ద్రియాయ స్వాహా।
పృథివి మాతర్మా మాహిꣳసీర్మో ౧ అహం త్వామ్ ॥౨౩॥

ప.వి:- అగ్నయే, గృహపతయ ఇతి గృహ + పతయే, స్వాహా, సోమాయ, వనస్పతయే, స్వాహా, మరుతామ్, ఓజసే, స్వాహా, ఇన్ద్రస్య, ఇన్ద్రియాయ, స్వాహా, పృథివి, మాతః, మా, మా, హిꣳసీః, మోఽ ఇతి మో, అహమ్, త్వామ్. ॥౨౩॥

**పదార్థః** :-(అగ్నయే) ధర్మవిజ్ఞానాఢ్యాయ (గృహపతయే) గృహాశ్రమస్వామినే (స్వాహా) సత్యాం నీతిమ్ (సోమాయ) సోమలతాద్యాయౌషధిగణాయ (వనస్పతయే) వనానాం పాలకాయాశ్వత్థప్రభృతయే (స్వాహా) వైద్యకశాస్త్రబోధజనితాం క్రియామ్ (మరుతామ్) ప్రాణానామృత్విజాం వా (ఓజసే) బలాయ (స్వాహా) యోగశాన్తిదాం వాచమ్ (ఇన్ద్రస్య) జీవస్య (ఇన్ద్రియాయ) నేత్రాద్యాయ అన్తఃకరణాయ వా (స్వాహా) సుశిక్షాయుక్తాం వాచముపదిష్టిమ్ (పృథివి) భూమివత్ప్రభుశుభలక్షణే (మాతః) మాన్యకర్త్రి జనని (మా) నిషేధే (మా) మామ్ (హింసీః) కుశిక్షయా మా హింస్యాః (మో) (అహమ్) (త్వామ్). అయమ్మన్త్రః శత. ౫.౪.౩. ౧౫-౨౧ వ్యాఖ్యాతః.॥౨౩॥

**అన్వయః**:-హే ప్రజాజనా! యథారాజజనా వయం గృహపతయేఽగ్నయే స్వాహా, సోమాయ వనస్పతయే స్వాహా, మరుతామోజసే స్వాహేన్ద్రస్యేన్ద్రియాయ స్వాహా చరేమ, తథా యూయమప్యాచరత. హే పృథివి మాతస్త్వం మా మా హింసీస్త్వామహం చ మో హింస్యామ్.॥౨౩॥

**భావార్థః**:-రాజాదిరాజజనైః ప్రజాహితాయ ప్రజాజనైరేతేషాం సుఖాయ సర్వస్యోన్నతయే చ పరస్పరం వర్తితవ్యమ్. మాతా కుశిక్షయాఽవిద్యాదానేన స్వసన్తానాన్భ్రష్టబుద్ధీన్ కదాచిన్న కుర్యాత్ సన్తానాశ్చ మాతురప్రియం నాచరేయుః.॥౨౩॥

**పదార్థము** :-ఓ ప్రజలారా! రాజు మరియు రాజపురుషులవంగు మే మెట్లు (గృహపతయే) గృహాశ్రమస్వామియగు (అగ్నయే) ధర్మవిజ్ఞానములతో గూడిన విద్వాంసునికై (స్వాహా) సత్యనీతిని

(సోమాయ) సోమలత మున్నగు ఓషధులకు మరియు (వనస్పతయే) వనములను రక్షించు రావి మున్నగు వృక్షములకొరకు (స్వాహా) వైద్యశాస్త్రబోధనచే నుత్పన్నమైన క్రియను (మరుతామ్) ప్రాణుల మరియు ఋత్విజులయొక్క (ఓజసే) బలముకొరకు (స్వాహా) యోగాభ్యాసము, శాంతిని ప్రసాదించు వాణిని మరియు (ఇన్ద్రస్య) జీవునియొక్క (ఇన్ద్రియాయ) మనస్సు మరియు ఇంద్రియములకొరకు (స్వాహా) చక్కని శిక్షణతో గూడిన యుపదేశమును జేయుచున్నట్లు మీరును చేయుడు (పృథివి) పృథివివలె బహుగుణయుక్తురాలవై (మాతః) మాన్యతను ప్రసాదించు జననీ! నీవు (మా) నాకు (మా హింసీః) చెడుశిక్షణలచే దుఃఖముల గలిగించకుము. మరియు (త్వామ్) నీకు(అహమ్) నేనుకూడ (మా) దుఃఖములను గలుగజేయకుండుదును గాక! ॥౨౩॥

**భావార్థము** :- రాజు మరియు రాజకర్మచారులు ప్రజల శ్రేయస్సునకు, ప్రజలు రాజు రాజ్య సుఖములకై, సకలోన్నతికొరకై కలిసిమెలిసి వ్యవహరించవలయును. మూర్ఖత్వమును పెంపొందజేయు అజ్ఞానయుతమగు శిక్షణచే సంతానమును మూర్ఖుల నొనర్చకుండుట తల్లి కర్తవ్యమైయున్నది. సంతానము సైతము తల్లిదండ్రులయెడ ద్వేషబుద్ధిని గలిగియుండరాదు. ॥౨౩॥

23.We should behave righteously towards the religious-minded and learned householder, derive medical benefit from herbs and trees, inculcate the practice of yoga for the vigour of the priests, follow noble instructions for the improvement of physical organs controlled by the soul. O mother endowed with noble qualities like the Earth, don't injure me by wrong instructions. May I never injure thee!.

౪౨౦. హంస ఇత్యస్య వామదేవ ఋషిః, సూర్యో దేవతా, భురిగార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

మనుష్యైరీశ్వరోపాసనేన న్యాయసుశిక్షే కార్యే ఇత్యాహ.

మానవులు ఈశ్వరోపాసనచేయువారై సర్వమునకు న్యాయమును గలుగజేయుచు

ఉత్తమశిక్షణలను పొందుచు వానిని ఇతరులకును కలుగజేయవలెను.

౪౨౦ హ్గ్ంసః శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్।

నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజాఽ ఋతజాఽ

అద్రిజాఽఋతం బృహత్ ॥౨౪॥

ప.వి:- హ్గ్ంసః, శుచిషత్, శుచిసదితి శుచి+సత్, వసుః, అన్తరిక్షసదిత్యన్తరిక్ష+సత్, హోతా, వేదిషత్, వేదిసదితి వేది+సత్, అతిథిః, దురోణసదితి దురోణ+సత్, నృషత్,

నృసదితి నృ+సత్, వరసదితి వర+సత్, ఋతసదిత్యృత+సత్, వ్యోమసదితి వ్యోమ+సత్, అబ్జాఇత్యప్+జాః, గోజా ఇతి గో+జాః, ఋతజా ఇత్యృత+జాః, అద్రిజా ఇత్యద్రి+జాః, ఋతమ్, బృహత్ ॥౨౪॥

**పదార్థః** :-(హ౦సః) యః సంహన్తి సర్వాన్ పదార్థాన్ స జగదీశ్వరః (శుచిషత్) యః శుచిషు పవిత్రేషు పదార్థేషు సీదతి సః (వసుః) వస్తా వాసయితా వా (అన్తరిక్షసద్) యోఽన్తరిక్షేఽవకాశే సీదతి (హోతా) దాతాగ్రహీతాఽత్తా వా (వేదిషత్) వేద్యాం పృథివ్యాం సీదతి (అతిథిః) అవిద్యమానా తిథిర్యస్య తద్వన్మాన్యః (దురోణసత్) యో దురోణే గృహే సీదతి సః. దురోణ ఇతి గృహ నా.... నిఘం.౩.౪. (నృషత్) యో నృషు సీదతి సః (వరసత్) యో వరేషూత్తమేషు పదార్థేషు సీదతి సః (ఋతసత్) య ఋతేషు సత్యేషు ప్రకృత్యాదిషు సీదతి సః (వ్యోమసత్) యో వ్యోమని సీదతి సః (అబ్జాః) యోఽపో జనయతి (గోజాః) యో గాః పృథివ్యాదీన్ జనయతి (ఋతజాః) యః సత్యవిద్యామయం వేదం జనయతి (అద్రిజాః) యో మేఘపర్వతవృక్షాదీన్ జనయతి సః (ఋతమ్) సత్యస్వరూపమ్ (బృహత్) మహద్బ్రహ్మ. అయమ్మన్త్రః. శత. ౫.౪.౩.౨౨. వ్యాఖ్యాతః. ॥౨౪॥

**అన్వయః** :-హే మనుష్యా భవన్తో యః పరమేశ్వరో హంసః శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసన్నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహదస్తి తమేవోపాసీరన్.॥౨౪॥

**భావార్థః** :-మనుష్యైః సర్వవ్యాపకం పవిత్రకరం బ్రహ్మైవోపాస్యమస్తి. న ఖల్వేతస్యోపాసనేన వినా కించిదపి పూర్ణం ధర్మార్థకామమోక్షజం సుఖం భవితుం శక్యమ్.॥౨౪॥

**పదార్థము** :-ఓ మానవులారా! పరమేశ్వరుడు (హంసః) సకల పదార్థములను స్థూల మొనర్చువాడు (శుచిసత్) పవిత్రపదార్థములందు స్థిరమైనవాడు (వసుః) నివసించి, నివసింపజేయువాడు (అన్తరిక్షసత్) ఆకాశమునందు వ్యాపకుడు (హోతా) సకల పదార్థములను ఆదాన ప్రదానము చేయువాడు మరియు ప్రళయకర్త (వేదిషత్) పృథివియందును వ్యాపకుడు (అతిథిః) అభ్యాగతునివలె సత్కరించదగినవాడు (దురోణసత్) గృహమందును స్థితుడు (నృషత్) మనుష్యులందును నుండువాడు (వరసత్) ఉత్తమ పదార్థములందు వసించువాడు (ఋతసత్) సత్యప్రకృతి మొదలగు నామములు గలవాడు, కారణమందు స్థితుడు (వ్యోమసత్) ఆకాశమందు వ్యాపకుడు (అబ్జాః) జలములను ప్రసిద్ధపరచువాడు (గోజాః) పృథివిమున్నగు తత్త్వముల నుత్పన్నముచేయువాడు (ఋతజాః) సత్యవిద్యలగ్రంథములగు వేదములను ప్రసిద్ధపరచువాడు (అద్రిజాః) మేఘములు, పర్వతములు, వృక్షములు మున్నగువానిని నిర్మాణమొనర్చువాడు

(ఋతమ్) సత్యస్వరూపుడు (బృహత్) సర్వముకన్న గొప్పవాడు, అనంతుడునై యున్నట్టి యీ పరమేశ్వరునే మీరు ఉపాసించవలయును. ॥౨౪॥

**భావార్థము** :- సర్వవ్యాపకుడు, సకల పదార్థములను పరిశుద్ధపరచువాడును నగు నా పరబ్రహ్మ పరమేశ్వరునే సకల మానవులును ఉపాసించవలయును. ఏలన! యాతని నుపాసించనిచే ధర్మార్థ కామమోక్షములవలన గలుగు సుఖమెన్నడును గలుగుజాలదు. ॥౨౪॥

24.Worship God alone, Who solidifies material objects, resides in the hearts of yogis, is Omnipresent, pervades the atmosphere, is the Giver of all gifts, pervades the earth, is Adorable, Ubiqutious. Present in the hearts of godly persons, and infinte objects; dwels in space; is the Creator of waters, and earth, Revealer of the Vedas, and Maker of clouds, mountains and trees. He is true in His nature and Mighty.

౪౨౧. ఇయదిత్యస్య వామదేవ ఋషిః, సూర్యో దేవతా, ఆర్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

మనుష్యైః కిమర్థం బ్రహ్మోపాసనీయమిత్యుపదిశ్యతే.

మానవు డీశ్వరోపాసన నేల యొనర్చవలయు నను విషయ మిందుపదేశించబడినది.

౪౨౧ ఇయదస్యాయురస్యాయుర్మయి ధేహి యుఙ్ ఙసి వర్చోఽసి

వర్చోమయి ధేహ్యూర్గస్యూర్జం మయిధేహి।

ఇన్ద్రస్య వాం వీర్యకృతో బాహూఽ అభ్యుపావహరామి ॥౨౫॥

ప.వి:- ఇయత్, అసి, ఆయుః, అసి, ఆయుః, మయి, ధేహి, యుఙ్, అసి, వర్చః, అసి, వర్చః, మయి, ధేహి, ఊర్క్, అసి, ఊర్జమ్, మయి, ధేహి, ఇన్ద్రస్య వామ్, వీర్యకృత ఇతి వీర్య+కృతః, బాహూ ఇతి బాహూ, అభ్యుపావహరామీత్యభి+ఉపావహరామి॥౨౫॥

**పదార్థః** :-(ఇయత్) ఏతావత్పరిమాణమ్ (అసి) (ఆయుః) జీవనమ్ (అసి)(ఆయుః)(మయి) జీవాత్మని (ధేహి)(యుఙ్) సమాధాతా (అసి) (వర్చః) స్వప్రకాశమ్ (అసి) (వర్చః) (మయి) (ధేహి) (ఊర్క్) బలవాన్ (అసి) (ఊర్జమ్) (మయి) (ధేహి) (ఇన్ద్రస్య) పరమైశ్వర్యస్య (వామ్) యువయో రాజప్రజాజనయోః (వీర్యకృతః) యో వీర్యం కరోతి తస్య (బాహూ) బాధతే యాభ్యాం బలవీర్యాభ్యాం

తౌ (అభ్యుపావహరామి) అభితః సామీప్యేఽర్వాక్ స్థాపయామి. అయమ్మన్త్రః శత. ౫.౪.౩.౨౫-౨౭. వ్యాఖ్యాతః. ॥౨౫॥

**అన్వయః** :-హే బ్రహ్మంస్త్వమాయురసీయదాయుర్మయి ధేహి. త్వం యుఙ్ఙసి వర్చోఽసి యోగజం వర్చోమయి ధేహి. త్వమూర్గస్యూర్జం మయి ధేహి. హే రాజప్రజాజనౌ వీర్యకృత ఇన్ద్రస్యేశ్వరస్యాశ్రయేణ వాం యువయోర్బాహూ బలవీర్యే అహమభ్యుపావహరామి.॥౨౫॥

**భావార్థః**:-య ఆత్మస్థం బ్రహ్మోపాసతే తే శోభనం జీవనాదికమశ్నువతే. నహి కేనచిదీశ్వరస్యాశ్రయమన్తరా పూర్ణౌ బలపరాక్రమౌ లభ్యేతే.॥౨౫॥

**పదార్థము** :-ఓ పరమేశ్వరా! నీవు (ఇయత్) ఇంతటి (ఆయుః) ఆయువును (మయి) నాయందు (ధేహి) ధరింపజేయుము. దీనిచే నీవు (యుఙ్) సర్వమును సమాధిచేయువాడవై (అసి) ఉన్నావు (వర్చః) స్వయంప్రకాశస్వరూపుడవై (అసి) ఉన్నావు. ఈ కారణమున (ఊర్క్) అత్యన్తశక్తిశాలివై (అసి) ఉన్నావు. కావుననే (ఊర్జమ్) బలపరాక్రమములను (మయి) నాయందు (ధేహి) ధరింపజేయుము. ఓ రాజా! మరియు ప్రజలారా! (వీర్యకృతః) బలపరాక్రమాదుల పెంపొందజేయు (ఇన్ద్రస్య) ఐశ్వర్యము మరియు పరమాత్ముని ఆశ్రయముచే (వామ్) మీ రాజపురుషుల (బాహూ) బలపరాక్రమములను (అభ్యుపావహరామి) సకలవిధముల మీద్గరనే స్థాపించుచున్నాను.॥౨౫॥

**భావార్థము** :-పరమేశ్వరుని తమ హృదయములందు స్థిరపరచుకొని ఉపాసించువారు ఆనందప్రద జీవనాదుల సౌఖ్యముల ననుభవించుచుందురు. ఈశ్వరుని ఆశ్రయములేక ఏ మానవుడును పూర్ణ బలపరాక్రమములను పొందలేడు.॥౨౫॥

25.O God, so great art Thou; life art thou, give me life. Thou yokest all in noble deeds: thou art splendour, give me splendour. Strength art thou: give me strength. O King and subjects, I amkc the strength of your arms depend upon God, the Fountain of strength!.

౪౨౬.స్యోనాసీత్యస్య వామదేవ ఋషిః, ఆసన్దీ రాజపత్నీ దేవతా, భురిగనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

స్త్రీణాం న్యాయో విద్యానుశిక్షే చ స్త్రీభిరేవ కార్యే నరాణాం నరైశ్చేత్యాహ.

న్యాయవిద్యానుశిక్షలను స్త్రీలకు స్త్రీలును, పురుషులకు పురుషులును గరుపవలెను.

౪౨౬ స్యోనాసి సుషదాసి క్షత్రస్య యోనిరసి।

స్యోనామాసీద సుషదామాసీద క్షత్రస్య యోనిమాసీద ॥౨౬॥

10.O vedic speech, thou art the bestower of knowledge, beneficial for the people like woman. Through thee, in this place of knowledge, may we be able to explore learning. With a life of celibacy for 48 years, may we improve our learning!.

౪౪౧.హస్త ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, సవితా దేవతా, భురిక్పంక్తిః ఛందః, పఞ్చమః స్వరః.

పునః స ఏవ విషయ ఉచ్యతే. పై విషయమే మరల ఈ మంత్రమందు గలదు.

౪౪౧ హస్త౽ ఆధాయ సవితా విభ్రదభ్రిꣳ హిరణ్యయీమ్। అగ్నేర్జ్యోతి
ర్నిచాయ్య పృథివ్యా౽ అధ్యాభరదానుష్టుభేన ఛన్దసాఙ్గిరస్వత్ ॥౧౧॥

ప.వి:- హస్తే అధాయేత్యాఽధాయ, సవితా, బిభ్రత్, అభ్రిమ్, హిరణ్యయీమ్, అగ్నేః, జ్యోతిః, నిచాయ్యేతి నిఽచాయ్య, పృథివ్యాః, అధి, ఆ, అభరత్, ఆనుష్టుభేన, ఆనుస్తుభేనేత్యాను+ ఉస్తుభేన ఛన్దసా, అఙ్గిరస్వత్ ॥౧౧॥

**పదార్థః** :-(హస్తే) కరే (అధాయ) (సవితా) ఐశ్వర్యవాన్ (బిభ్రత్) ధరన్ (అభ్రిమ్) ఖననసాధకం శస్త్రమ్ (హిరణ్యయీమ్) తేజోమయీమ్ (అగ్నేః) విద్యుదాదేః (జ్యోతిః) ద్యోతమానమ్ (నిచాయ్య) (పృథివ్యాః) (అధి) (ఆ) (అభరత్) ధరేత్ (ఆనుష్టుభేన) అనుష్టుభ్‌విహితార్థయుక్తేన (ఛన్దసా) (అఙ్గిరస్వత్) అఙ్గిరసా ప్రాణేన తుల్యస్య. ॥ ౧౧ ॥

**అన్వయః** :-సవితా ఐశ్వర్యప్రసాధకః శిల్ప్యానుష్టుభేన ఛన్దసా హిరణ్యయీమభ్రిం హస్తే ఆధాయ బిభ్రత్సన్నఙ్గిరస్వదగ్నేర్జ్యోతిర్నిచాయ్య పృథివ్యా అధ్యాభరత్ ॥ ౧౧ ॥

**భావార్థః** :-మనుష్యైర్యథాఽయసి పాషాణే చ విద్యుద్వర్తతే తథైవ సర్వత్ర పదార్థేషు ప్రవిష్టాస్తి, తద్విద్యాం విజ్ఞాయ కార్యేషూపయుజ్య భూమావాగ్న్యేయాదీన్యస్త్రాణి విమానాదీని యానాని వా సాధనీయాని.॥౧౧॥

**పదార్థము** :-(సవితా) ఐశ్వర్యముల నుత్పన్నమొనర్చు శిల్పి నీవు (అనుష్టుభేన) అనుష్టుప్ ఛందస్సునందు చెప్పబడిన (ఛన్దసా) స్వతంత్రార్థయోగముచే (హిరణ్యయీమ్) తేజోవంతమగు శుద్ధధాతువుచే నిర్మించబడిన (అభ్రిమ్) ఖనన సాధనమును (హస్తే) చేతియందు (ఆధాయ విభ్రత్) ధరించి (అంగిరస్వత్) ప్రాణములవంటి (అగ్నేః) విద్యుత్తు మున్నగు అగ్నియొక్క (జ్యోతిః) తేజస్సును (నిచాయ్య) నిశ్చయపరచి (పృథివ్యాః) పృథివి (అధి) పైన (ఆభరత్) ఉత్తమముగా ధారణ మొనర్చవలెను.॥౧౧॥

**భావార్థము** :- విద్యుత్తు లోహమునందు, ప్రస్తరము [రాళ్ళ రత్నములందు, జలము మున్నగువాని] యందును నిండియున్నది. విద్వాంసులట్టి విద్యను సమగ్రముగా నెరిగి దానిని యితరకార్యములందుపయోగి పరచుకొని యీ ప్రపంచమునందు ఆగ్నేయాది దివ్యాస్త్రములను, విమానము మున్నగు యానములను సిద్ధింప జేసికొనవలయును. ॥౧౧॥

11.The skilled artisan, following the instructions given in the Anushtap verses, firmly taking in hand the shining implement and measuring the power of electricity, hidden in substances, should use it carefully on the earth.

౪౪౨. ప్రతూర్తమిత్యస్య నాభానేదిష్ఠ ఋషిః, వాజీ దేవతా, ఆస్తారపంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మరలనదే విషయమిందు గలదు.

౪౪౨ ప్రతూర్తం వాజిన్నాద్రవ వరిష్ఠామను సంవ్వతమ్।

దివి తే జన్మ పరమమన్తరిక్షే తవ నాభిః పృథివ్యామధి యోనిరిత్ ॥౧౨॥

ప.వి:- ప్రతూర్తమితి ప్ర+తూర్తమ్, వాజిన్, ఆ, ద్రవ, వరిష్ఠామ్ అను, సంవ్వతమితి సమ్+వతమ్, దివి, తే, జన్మ, పరమమ్, అన్తరిక్షే, తవ, నాభిః, పృథివ్యామ్, అధి, యోనిః ఇత్. ॥౧౨॥

పదార్థః:-(ప్రతూర్తమ్) అతితూర్ణమ్ (వాజిన్) ప్రశస్తజ్ఞానయుక్త విద్వన్! (ఆ) (ద్రవ) ఆగచ్ఛ (వరిష్ఠామ్) అతిశయేన వరాం గతిమ్ (అను) (సంవ్వతమ్) సమ్యగ్విభక్తామ్! (దివి) సూర్యప్రకాశే (తే) తవ (జన్మ) ప్రాదుర్భావః (పరమమ్) (అంతరిక్షే) అవకాశే (తవ) (నాభిః) (పృథివ్యామ్) (అధి) ఉపరి (యోనిః) నిమిత్తం ప్రయోజనమ్ (ఇత్) ఏవ ॥౧౨॥

**అన్వయః**:-హే వాజిన్! యస్య తే తవ శిల్పవిద్యయా దివి పరమం జన్మ తవాఽన్తరిక్షే నాభిః పృథివ్యాం యోనిరస్తి స త్వం విమానాన్యధిష్ఠాయ వరిష్ఠాం సంవ్వతం గతిం ప్రతూర్తమిదన్వాద్రవ. ॥౧౨॥

**భావార్థః** :-యదా మనుష్యా విద్యాహస్తక్రియయోర్మధ్యే పరమప్రయత్నేన ప్రాదుర్భూతా విమానాదీని యానాని విధాయ గతానుగతం శీఘ్రం కుర్వన్తి తదా తేషాం శ్రీః సులభా భవతి. ॥౧౨॥

**పదార్థము** :-(వాజిన్) ప్రశంసనీయ జ్ఞానవంతుడవగు విద్వాంసుడా! (తే) నీకు శిల్పవిద్యయందు (దివి) సూర్యప్రకాశమునందు (పరమమ్) ఉత్తమమగు (జన్మ) ప్రసిద్ధి (తవ) నీకు (అన్తరిక్షే) ఆకాశమున

(నాభిః) బంధనము (పృథివ్యామ్) ఈ పృథివియందుగల (యోనిః) నిమిత్త ప్రయోజనముద్వారా నీవు విమానాదులయందు కూర్చుండి (వరిష్ఠామ్) అత్యంత ఉత్తమగతితో (ప్రతూర్తమ్) అతిశీఘ్రముగను (ఇత్) (అను) ఆ తరువాతను (ఆద్రవ) ఉత్తమముగా ప్రయాణమొనర్చుము.॥౧౨॥

**భావార్థము :-** మానవులు విద్యాప్రక్రియల సమన్వయముతో పరమప్రయత్నముతో ప్రసిద్ధులై సర్వమునందు ప్రస్తారమై [ఇమిడి] యున్న విద్యుత్తును మరియు ధాతువిద్యల మర్మమును చక్కగా తెలిసికొని విమానము మున్నగు యానముల సిద్ధపరచుకొని తమరాకపోకలను అతి శీఘ్రముగ జేసికొనినప్పుడు వారికి ధనప్రాప్తి మున్నగునవి సుగమమైపోవును.॥౧౨॥

12.O learned person, with the skill of art, thou hast attained to fame under the sun, thou art connected with air's mid-realm through electiricty, thy asylum is on earth. Being the master of aeroplanes, go ahead with nice well-balanced speed!.

౪౪౩. యుంజాథామిత్యస్య కుశ్రిఋషిః, వాజీ దేవతా గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునర్మనుష్యైః కిం క్వ యోజనీయమిత్యాహ.

మానవులు దేనిని ఎక్కడ నుంచవలె నను విషయమిందు గలదు.

## ౪౪౩ యుంజాథాగ్౦ రాసభం యువమస్మిన్ యామే వృషణ్వసూ।

## అగ్నిం భరన్తమస్మయుమ్ ॥౧౩॥

**ప. వి:-యుంజాథామ్, రాసభమ్, యువమ్, అస్మిన్, యామే, వృషణ్వసూ ఇతి వృషణ్ + వసూ, అగ్నిమ్, భరన్తమ్, అస్మయుమిత్యస్మ+యుమ్ ॥౧౩॥**

**పదార్థః :-** (యుంజాథామ్) (రాసభమ్) జలాగ్న్యోర్వేగగుణాఖ్యమశ్వమ్ (యువమ్) యువాం శిల్పితత్ స్వామినౌ (అస్మిన్) (యామే) యాన్తి యేన యానేన తస్మిన్ (వృషణ్వసూ) వర్షకౌ వసన్తౌ చ (అగ్నిమ్) ప్రసిద్ధం విద్యుతం వా (భరన్తమ్) ధరన్తమ్ (అస్మయుమ్) అస్మాన్‌పాయయితారమ్. అత్రాస్మదుపపదాద్యాధాతో రౌణాదికః కుః. ఛాన్దసో వర్ణలోపో వేతి దలోపః. ॥ ౧౩ ॥

**అన్వయః :-**హే వృషణ్వసూ! సూర్యవాయూఇవ శిల్పినౌ! యువమస్మిన్ యామే రాసభమస్మయుం భరన్తమగ్నిం యుంజాథామ్.॥ ౧౩॥

**భావార్థః:-** యైర్మనుష్యైరస్మిన్ యానే యన్త్రకలాజలాగ్నిప్రయోగాః క్రియన్తే తే సుఖేన దేశాన్తరం గన్తుం శక్నువన్తి. ॥౧౩॥

**పదార్థము** :-(వృషణ్వసూ) సూర్య వాయువులవలె సుఖవర్షముల గలిగింపజేయు మరియు సుఖమునందుండు శిల్పులారా! స్వాములారా! (యువమ్) మీ రిరువురును (అస్మిన్) ఇట్టి ప్రయాణమొనర్చదగు (యామే) యానమునందు (రాసభమ్) జలము అగ్నియొక్క వేగగుణయుక్తమగు అశ్వమును (అస్మయుమ్) మమ్ముగొనిపోవునట్టియు (భరన్తమ్) ధారణమొనర్చునట్టిదియు నగు (అగ్నిమ్) ప్రసిద్ధమైన విద్యుద్రూపాగ్నిని (యుఞ్జాథామ్) సంయుక్తమొనర్చుడు.॥౧౩॥

**భావార్థము** :-మనుష్యులు విమానములు మున్నగు యానములందు యంత్రకళను జలము మరియు అగ్నియొక్క ప్రయోగమొనర్చి నడుపుకొను నేర్పరులు దేశదేశాంతరములకు రాకపోకలొనర్చుటకు సమర్థులగుదురు.॥౧౩॥

13.O artisan and his master, ye both, the bestowers of happiness like the sun and air, harness electricity in this aeroplane, possessing the speed of fire and water, seating and taking us afar!.

౪౪౪. యోగేయోగ ఇత్యస్య శునఃశేప ఋషిః, క్షత్రపతిర్దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

ప్రజాజనాః కీదృశం రాజానమఙ్గీకుర్యు రిత్యాహ.

ప్రజలు ఎట్టివానిని రాజుగా స్వీకరించవలయునను విషయ మిందు గలదు.

౪౪౪ యోగేయోగే తవస్తరం వాజేవాజే హవామహే।
సఖాయ ఇన్ద్రమూతయే ॥౧౪॥

ప.వి:-యోగేయోగ ఇతి యోగే + యోగే, తవస్తరమితి తవః + తరమ్, వాజేవాజ ఇతి వాజే + వాజే, హవామహే, సఖాయః, ఇన్ద్రమ్, ఊతయే ॥౧౪॥

**పదార్థః** :-(యోగేయోగే) యుంజతే యస్మిన్ యస్మిన్ (తవస్తరమ్) అత్యన్తం బలయుక్తమ్ తవ ఇతి బల నా... నిఘం౨.౯ తతస్తరప్ (వాజేవాజే) సఙ్గ్రామే సఙ్గ్రామే (హవామహే) ఆహ్వయామహే (సఖాయః) పరస్పరం సుహృదః సన్తః (ఇన్ద్రమ్) పరమైశ్వర్యయుక్తం రాజానమ్ (ఊతయే) రక్షణాద్యాయ. ॥౧౪॥

**అన్వయః** :-హే సఖాయో! యథా వయమూతయే యోగేయోగే వాజేవాజే తవస్తరమిన్ద్రం హవామహే తథా యూయమప్యేతమాహ్వయత.॥౧౪॥

**భావార్థః**:-యే పరస్పరం మిత్రా భూత్వాఽన్యోన్యస్య రక్షార్థం బలిష్ఠం ధార్మికం రాజానం స్వీకుర్వన్తి తే నిర్విఘ్నాః సన్తః సుఖమేధన్తే.॥౧౪॥

పదార్థము :-(సఖాయః) పరస్పరము మిత్రభావముతో నుండు మానవులారా! మావలె (ఊతయే) రక్షణ మున్నగువానికొరకు (యోగే యోగే) ప్రతికార్యమునందును (వాజేవాజే) ప్రతియుద్ధమునందును (తవస్తరమ్) మహాబలశాలి (ఇన్ద్రమ్) పరమైశ్వర్యవంతుడు నగువానిని రాజుగ (హవామహే) స్వీకరించు చున్నట్లు మీరును స్వీకరించి సమస్త విఘ్నములనుండి దూరముగ నుండుడు.॥౧౪॥

భావార్థము :-సకలమానవులు పరస్పరము మిత్రులై అన్యోన్యముగ రక్షణకార్యములకొరకు విద్వాంసుడు, ధర్మాత్ముడు, శక్తిశాలియగువానిని రాజుగ నెన్నుకొని సమస్తవిఘ్నములను దొలగించుకొని సుఖముగ నుండవలెను. ॥౧౪॥

14. O friends, in every deed and battle, we call for succour, our King, the mightiest of all!.

౪౪౫. ప్రతూర్వన్నిత్యస్య శునఃశేప ఋషిః, గణపతిర్దేవతా, ఆర్షీ జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునా రాజా కిం కృత్వా కిం ప్రాప్నుయాదిత్యాహ.

రాజు ఏ యే కార్యములొనర్చుచు ఏ మేమి పొందవలెనను విషయము గలదు.

౪౪౫ ప్రతూర్వన్నేహ్యవక్రామన్నశస్తీ రుద్రస్య గాణపత్యం
మయోభూరేహి। ఉర్వన్తరిక్షం వీహి స్వస్తిగవ్యూతిరభయాని
కృణ్వన్పూష్ణా సయుజా సహ ॥౧౫॥

ప. వి:-ప్రతూర్వన్నితి ప్ర+తూర్వన్, ఆ, ఇహి, అవక్రామన్నిత్యవ+క్రామన్, అశస్తీః, రుద్రస్య, గాణపత్యమితి గాణ+పత్యమ్, మయోభూరితి మయః+భూః, ఆ, ఇహి, ఉరు, అన్తరిక్షమ్, వి, ఇహి, స్వస్తిగవ్యూతిరితి స్వస్తి+ గవ్యూతిః, అభయాని, కృణ్వన్, పూష్ణా, సయుజేతి స+యుజా సహ ॥౧౫॥

పదార్థః :-(ప్రతూర్వన్) హింసన్ (ఆ) (ఇహి) ఆగచ్ఛ (అవక్రామన్) దేశదేశాన్తరానుల్లంఘయన్ (అశస్తీః) అప్రశస్తాః శత్రుసేనాః (రుద్రస్య) శత్రురోదకస్య స్వసేనాపతేః (గాణపత్యమ్) గణానాం సేనాసమూహానాం పతిత్వమ్ (మయోభూః) మయః సుఖం భావయన్ (ఆ) (ఇహి) (ఉరు)

(అన్తరిక్షమ్) ఆకాశమ్ (వి) (ఇహి) వివిధతయా గచ్ఛ (స్వస్తిగవ్యూతిః) స్వస్తి సుఖేన సహ గవ్యూతిర్మార్గో యస్య సః (అభయాని) స్వరాజ్యే సేనాయాం చావిద్యమానం భయం యేషు తాని (కృణ్వన్) (సమ్పాదయన్ (పూష్ణా) పుష్టేన స్వకీయేన సైన్యేన (సయుజా) యత్సమానం యునక్తి తేన సహితః (సహ) సాకమ్. ॥౧౫॥

**అన్వయః**:-హే రాజన్! స్వస్తిగవ్యూతిస్త్వం పూష్ణా సయుజా సహాశస్తీః ప్రతూర్వన్నేహి శత్రుదేశానవక్రామన్నేహి. మయోభూస్త్వం రుద్రస్య గాణపత్యమేహి. అభయాని కృణ్వన్ సన్నన్తరిక్షమురు వీహి. ॥౧౫॥

**భావార్థః** :-రాజా సదైవ స్వసేనాం సుశిక్షితాం హృష్టాం పుష్టాం రక్షేత్. యదాऽరిభిః సహయోద్ధు మిచ్ఛేత్తదా స్వరాజ్యమనుపద్రవం సంరక్ష్య యుక్త్యా బలేన చ శత్రూన్ హింసేత్, నా శ్రేష్ఠాన్ పాలయిత్వా సర్వత్ర సత్కీర్తిం ప్రసారయేత్. ॥౧౫॥

**పదార్థము** :-ఓ రాజా! (స్వస్తిగవ్యూతిః) సుఖముతో గూడిన మార్గమునందు నీవు (సయుజా) ఒక రీతిలో కలియునదియు (పూష్ణా) శక్తిసామర్థ్యములతో గూడిన నీ సైన్యములతో (సహ) కూడి (అశస్తీః) నిందనీయ శత్రుసైన్యముల (ప్రతూర్వన్) సంహరించుచు (ఏహి) ముందుకు సాగుచు శత్రుదేశములను (అవక్రామన్) ఉల్లంఘించుచు (ఏహి) రమ్ము (మయోభూః) సుఖముల నుత్పన్నమొనర్చుచు నీవు (రుద్రస్య) శత్రువుల నేడ్పింపజేయు నీ సేనాపతియొక్క (గాణపత్యమ్) సేనానాయకత్వమును (ఏహి) ప్రాప్తించుకొనుము (అభయాని) నీ రాజ్యములో సమస్త ప్రాణులను భయరహితులుగ (కృణ్వన్) ఒనర్చుచు (అన్తరిక్షమ్ ఉరు) సంపూర్ణాకాశమును (వీహి) అనేకవిధముల ప్రాప్తించుకొనుము. ॥౧౫॥

**భావార్థము** :-తన సైన్యములను అనుక్షణము ఉత్తమశిక్షణ, హర్షోత్సాహముగా శక్తి సంపన్నముగ నొనర్చుచు సంసిద్ధముగనుంచుట రాజునకు అతి ఉచితమైయున్నది. శత్రువులతో యుద్ధము జేయుట తటస్థించినప్పుడు తన రాజ్యమును ఉపద్రవరహితముగ జేసికొని యుక్తి బలములతో శత్రునాశమొనర్చవలెను. సజ్జనులను స్వజనులను రక్షించుచు సర్వత్రా చక్కని కీర్తి నార్జించవలెను. ॥౧౫॥

15.O King, thou whose paths are pleasant, with thy powerful and devoted army, come, destroying the forces of thy wicked foes. Come overtaking the territories of the enemies. Spreading gladness all around, accept the chieftainship of thy commander of the army, who makes the enemies weep. Granting fearlessness to all thy subjects, speed through the wide air!.

**౪౪౬.పృథివ్యా ఇత్యస్య శునఃశేప ఋషిః, అగ్నిర్ దేవతా, భురిక్ పంక్తిశ్ఛన్దః ఛందః, పఞ్చమః స్వరః.**

**మనుష్యైః కస్మాద్విద్యుత్ స్వీకార్యేత్యాహ.**

**మనుష్యు లే యే పదార్థములనుండి విద్యుత్తును గ్రహించవలయునను విషయము.**

౪౪౬ పృథివ్యాః సధస్థాదగ్నిం పురీష్యమఙ్గిరస్వదాభరాగ్నిం పురీష్యమఙ్గిర స్వదచ్ఛేమోఽగ్నిం పురీష్యమఙ్గిరస్వద్భరిష్యామః ॥౧౬॥

ప.వి:-పృథివ్యాః, సధస్థాదితి సధ+స్థాత్, అగ్నిమ్, పురీష్యమ్, అఙ్గిరస్వత్, ఆ, భర, అగ్నిమ్,పురీష్యమ్ అఙ్గిరస్వత్,అచ్ఛ,ఇమః,అగ్నిమ్,పురీష్యమ్,అఙ్గిరస్వత్, భరిష్యామః॥౧౬॥

**పదార్థః** :-(పృథివ్యాః) భూమేరన్తరిక్షస్య వా (సధస్థాత్) సహస్థానాత్ (అగ్నిమ్) భూమిస్థం విద్యుతం వా (పురీష్యమ్) యః సుఖం పృణాతి స పురీషస్తత్ర సాధుమ్ (అఙ్గిరస్వత్) అఙ్గిరసా సూర్యేణ తుల్యమ్ (ఆ) (భర) ధర (అగ్నిమ్) అంతరిక్షే వాయ్వాదిస్థమ్ (పురీష్యమ్) (అఙ్గిరస్వత్) (అచ్ఛ) ఉత్తమరీత్యా (ఇమః) ప్రాప్నుమః (అగ్నిమ) (పురీష్యమ్) (అఙ్గిరస్వత్) (భరిష్యామః) ధరిష్యామః ॥౧౬॥

**అన్వయః** :-హే విద్వన్! యథా వయం పృథివ్యాః సధస్థాదఙ్గిరస్వత్పురీష్యమగ్నిమచ్ఛేమః, యథా చాఽఙ్గిరస్వత్పురీష్యమగ్నిం భరిష్యామస్తథా త్వమప్యఙ్గిరస్వత్పురీష్యమగ్నిమాభర. ॥౧౬॥

**భావార్థః** :-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. మనుష్యైర్విదుషామేవాఽనుకరణం కర్తవ్యమ్ నాఽవిదుషామ్. సర్వదోత్సాహేనాగ్న్యాదిపదార్థవిద్యాం గృహీత్వా సుఖం వర్ధనీయమ్. ॥౧౬॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! మే మెట్లు (పృథివ్యాః) భూమ్యంతరిక్షముల (సధస్థాత్) ఏకస్థానము నుండి (అఙ్గిరస్వత్) ప్రాణవములవంటి (పురీష్యమ్) ఉత్తమ సుఖములనిచ్చునదియు (అగ్నిమ్) భూమియందుండు విద్యుత్తును (అచ్ఛ) ఉత్తమరీతిలో (ఇమః) ప్రాప్తించుకొనునట్లు (అఙ్గిరస్వత్) ప్రాణములవంటి (పురీష్యమ్) శ్రేష్ఠ సుఖదాయక (అగ్నిమ్) అంతరిక్షమందుండు విద్యుత్తును (భరిష్యామః) ధారణమొనర్చుకొనునట్లు నీవును (అఙ్గిరస్వత్) సూర్యునివంటి (పురీష్యమ్) ఉత్తమసుఖముల నిచ్చునట్టి (అగ్నిమ్) పృథివిపైనున్న భౌతికాగ్నిని (ఆ భర) ఉత్తమముగ ధారణమొనర్చుము.॥౧౬॥

**భావార్థము** :- ఈ మంత్రములో ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారము లున్నవి. మానవులు మూర్ఖులవలెగాక విద్వాంసులవలె సకలకాలములందును అత్యుత్సాహముగ కార్యములొనర్చుచు అగ్ని మున్నగు పదార్థవిద్యను గ్రహించి సకల సౌఖ్యములను పెంపొందించవలయును.॥౧౬॥

**16.O learned person, just as we skilfully evolve from a part of the earth, electricity, dear as breath, and the giver of comfort, and just as we procure atmospheric electricity, dear as breath, and the giver of comfort, so shouldst thou skillfully prepare electricity which like the sun conduces to our comforts!.**

౪౪౭. అన్వగ్నిరిత్యస్య పురోధా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

విద్వాంసః కింవత్కిం కుర్యు రిత్యుపదిశ్యతే.

విద్వాంసు లెవరివలె నేమి చేయవలెను విషయ మీ మంత్రమునం దుపదేశము గలదు.

౪౪౭ అన్వగ్నిరుషసామగ్రమఖ్యదన్వహాని ప్రథమో జాతవేదాః।

అను సూర్యస్య పురుత్రా చ రశ్మీననుద్యావాపృథివీ ఆ తతన్థ ।౧౭॥

ప.విః- అను, అగ్నిః, ఉషసామ్, అగ్రమ్, అఖ్యత్, అను, అహాని+ప్రథమః, జాతవేదా ఇతి జాత+వేదాః, అను, సూర్యస్య, పురుత్రేతి పురు+త్రా,చ,రశ్మీన్ అను ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ,ఆ, తతన్థ ।౧౭॥

**పదార్థః** :-(అను) (అగ్నిః) పావకః (ఉషసామ్) (అగ్రమ్) పూర్వమ్ (అఖ్యత్) ప్రఖ్యాతో భవతి (అను) (అహాని) దినాని (ప్రథమః) (జాతవేదాః) యో జాతేషు విద్యతే స సూర్యః (అను) (సూర్యస్య) (పురుత్రా) బహూన్ (చ) (రశ్మీన్) (అను) (ద్యావా పృథివీ) (ఆ) (తతన్థ) తనోతి.।౧౭॥

**అన్వయః** :-హే విద్వన్! త్వం యథా ప్రథమో జాతవేదా అగ్నిరుషసామగ్రమహాన్యన్వఖ్యత్. సూర్యస్యాగ్రం పురుత్రా రశ్మీనన్వాతతన్థ. ద్యావాపృథివీ చ తథా విద్యావ్యవహారానన్వాతనుహి.।౧౭॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా కారణకార్యాఖ్యో విద్యుదగ్నిరనుపూర్వం సవిత్రుషో దినాని కృత్వా పృథివ్యాదీని ప్రకాశయతి తథా విద్వద్భిః సుశిక్షాం కృత్వా బ్రహ్మచర్య విద్యాధర్మానుష్ఠానసుశీలాని సర్వత్ర ప్రచార్య సర్వే జ్ఞానాన్వాభ్యాం ప్రకాశనీయాః ।౧౭॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! నీ వెట్లు (ప్రథమః, జాతవేదాః) ఉత్పన్న పదార్థములందు మొదటి నుండియే యున్న సూర్యలోకము మరియు (అగ్నిః) భౌతికాగ్ని (ఉషసామ్) ఉషః కాలమునకు (అగ్రమ్) మొదటనే (అహాని) దినముల [పగళ్ల] ను (అన్వఖ్యత్) ప్రసిద్ధపరచుచున్నదో (సూర్యస్య) సూర్యునికన్న (అగ్రమ్) మొదటనే (పురుత్రా) అసంఖ్యాక (రశ్మీన్) కిరణములను (అన్వాతతన్థ) వ్యాప్తపరచుచున్నదో మరియు (ద్యావాపృథివీ చ) సూర్య పృథివీలోకములను ప్రసిద్ధమొనర్చునో అట్లే నీవును విద్యావ్యవహారములను ప్రవహింప జేయుము.।౧౭॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. కారణరూప విద్యుత్తు కార్యరూప ప్రసిద్ధాగ్నిని, సూర్యుని, ఉషఃకాలమును, దినములు మున్నగు పదార్థములను ప్రకాశితమొనర్చుచున్నట్లు

విద్వాంసులు ఉత్తమశిక్షలను నేర్పుచు బ్రహ్మచర్యము, విద్య, ధర్మానుష్ఠానముచే సుశీలత్వమును ప్రచారమొనర్చుచు సకల మానవులను జ్ఞానానందములచే ప్రకాశపరచవలెను.॥౧౭॥

17.The First and Foremost God illuminates the sun before twilight.He also illuminates the days, and multiple beams of the sun. He alone establishes the Heaven and Earth.

౪౪౮.ఆగత్యేత్యస్య మయోభూర్ఋషిః, అగ్నిర్దేవతా, నివృదనుష్టుప్ఛందః, గాన్ధారః స్వరః.

అథ సభేశః కింవత్ కిం కుర్యాదిత్యాహ.

సభాపతియగు రాజు ఎట్టివారివలె నేమి చేయవలెనను విషయ మిందుగలదు.

౪౪౮ ఆగత్య వాజ్యధ్వానఀ సర్వా మృధో విధూనుతే। అగ్నిఀ

సధస్థే మహతి చక్షుషా నిచికీషతే ॥౧౮॥

ప.వి:-ఆగత్యేత్యా+గత్య, వాజీ, అధ్వానమ్, సర్వాః, మృధః, వి, ధూనుతే, అగ్నిమ్ సధస్థ ఇతి సధ+స్థే, మహతి, చక్షుషా, ని, చికీషతే, ॥ ౧౮ ॥

**పదార్థః** :-(ఆగత్య) (వాజీ) వేగవానశ్వః (అధ్వానమ్) మార్గమ్ (సర్వాః) మృధః) సఙ్గ్రామాన్ (వి) (ధూనుతే) కమ్పయతి (అగ్నిమ్) (సధస్థే) సహస్థానే (మహతి) విశాలే (చక్షుషా) నేత్రేణ (ని) (చికీషతే) చేతుమిచ్ఛతి. ॥ ౧౮॥

**అన్వయః** :-హే విద్వన్రాజన్! భవాన్ యథా వాజ్యశ్వోఽధ్వానమాగత్య సర్వా మృధో విధూనుతే యథా గృహస్థశ్చక్షుషా మహతి సధస్థేఽగ్నిం నిచికీషతే తథా సర్వాన్సంగ్రామాన్ విధూనోతు. గృహే గృహే విద్యానిచయం చ కరోతు. ॥ ౧౮ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. గృహస్థా అశ్వవద్గత్వాగత్య శత్రూన్ జిత్వాగ్నేయాస్త్రాది విద్యాం సంపాద్య బలాబలం పర్యాలోచ్య రాగద్వేషాదీన్ శమిత్వాఽధార్మికాన్ శత్రూన్ జయేయుః. ॥౧౮॥

**పదార్థము** :-ఓ రాజా! (వాజీ) వేగవంతమగు అశ్వము (అధ్వానమ్) తన మార్గమును (ఆగత్య) ప్రాప్తించుకొని (సర్వాః) సమస్త (మృధః) సంగ్రామములను (విధూనుతే) కంపింపజేయునట్లు మరియు గృహస్థుడెట్లు (చక్షుషా) కన్నులతో (మహతి) సుందరమగు (సధస్థే) స్థానమందు (అగ్నిమ్) అగ్నిని (నిచికీషతే) చయనము [ప్రోగు] చేయదలచునో, అటులనే నీవు సంగ్రామములను కంపింపజేయుము. ఇంటింటా విద్యలను ప్రచారమొనర్చుము.॥౧౮॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. గృహస్థులు అశ్వములవలె రాకపోకల నొనర్చుచు, శత్రువులను జయించి ఆగ్నేయాది అస్త్రవిద్యలను సిద్ధింపజేసికొని తన బలాబలమును దృష్టియందుంచుకొని, రాగద్వేషము మున్నగు దోషములను వదలి అధర్మాత్ములగు శత్రువుల జయించవలెను.।౧౮॥

18.O learned King, just as a swift horse, having started on his way, causes terror in all battles, and just as a householder wants to see with his eyes, fire arranged in a beautiful place, so shouldst thou shake all battles and spread knowledge to each house!.

౪౪౯. ఆక్రమ్యేత్యస్య మయోభూర్ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృదనుష్టుప్ఛందః, గాన్ధారః స్వరః.

మనుష్యజన్మ ప్రాప్య విద్యా అధీత్యాతః కిం కర్తవ్యమిత్యాహ.

మానవజన్మను పొంది, విద్యల నభ్యసించినప్పుడు మనుష్యు లేమి చేయవలెనను విషయము.

౪౪౯ ఆక్రమ్య వాజిన్పృథివీమగ్నిమిచ్ఛ రుచా త్వమ్।

భూమ్యా వృత్వాయ నో బ్రూహి యతః ఖనేమ తం వయమ్ ।౧౯॥

ప. వి:- ఆక్రమ్యేత్యా+క్రమ్య, వాజిన్, పృథివీమ్, అగ్నిమ్, ఇచ్ఛ, రుచా, త్వమ్, భూమ్యాః, వృత్వాయ, నః, బ్రూహి, యతః, ఖనేమ, తమ్, వయమ్।౧౯॥

**పదార్థః** :-(ఆక్రమ్య) (వాజిన్) ప్రశస్తవిజ్ఞానవన్ (పృథివీమ్) భూమిరాజ్యమ్ (అగ్నిమ్) అగ్నివిద్యామ్ (ఇచ్ఛ) (రుచా) ప్రీత్యా (త్వమ్) (భూమ్యాః) క్షితేర్మధ్యే (వృత్వాయ) స్వీకృత్య. అత్ర క్త్వో యగితి యగాగమః (నః) అస్మాన్ (బ్రూహి) భూగర్భాగ్నివిద్యాముపదిశ (యతః) (ఖనేమ) (తమ్) భూగోలమ్ (వయమ్) ।౧౯॥

**అన్వయః**:-హే వాజిన్ విద్వన్సభేశ రాజ౯ స్త్వం రుచా శత్రూనాక్రమ్య పృథివీమగ్నిం చేచ్ఛ భూమ్యా నో వృత్వాయ బ్రూహి యతో వయం తం ఖనేమ. ।౧౯॥

**భావార్థః** :-మనుష్యైర్భూగర్భాగ్నివిద్యయా. పార్థివాన్ పదార్థాన్ సుపరీక్ష్య సువర్ణాదీని రత్నాన్యుత్సాహేన ప్రాప్తవ్యాని. యే ఖనితారో భృత్యాః సన్తి తాన్ ప్రతి తద్విద్యోపదేష్టవ్యా.।౧౯॥

**పదార్థము** :-(వాజిన్) ప్రశంసనీయ విద్యాజ్ఞానములుగల ఓ సభాపతి రాజా! (త్వమ్) నీవు (రుచా) శత్రువులను ప్రీతిచే. (ఆక్రమ్య) పాదాక్రాంతులనొనర్చి (పృథివీమ్) పృథివీస్థరాజ్యమును (అగ్నిమ్) విద్యను

(ఇచ్ఛ) అపేక్షించుము (భూమ్యాః) పృథివియందు (నః) మమ్ము (వృత్వాయ) స్వీకారమొనర్చి మా కొరకు (బ్రూహి) భూగర్భవిద్య మరియు అగ్నివిద్యల నుపదేశించుము (యతః) వానివల్ల (వయమ్) మేము (తమ్) ఆ విద్యలందు (ఖనేమ) సుపరిచితులము [ప్రవీణులము] అగుదుముగాక.॥౧౯॥

భావార్థము :- మనుష్యులు భూగర్భ అగ్నివిద్యలను నేర్చి పృథివిలోనున్న పదార్థములను చక్కగా పరీక్షించి సువర్ణము, రత్నములు మున్నగు విలువైన పదార్థములను ఉత్సాహముగా ప్రాప్తించుకొని భూమిని త్రవ్వునట్టి పరిజనమునకును అట్టి విద్యలను మనస్ఫూర్తిగా ఉపదేశింపవలయును.॥౧౯॥

19.O learned King, according to thy desire, trample upon the foes, hanker after sovereignty and knowledge, and having accepted us as thy subjects on the earth, instruct us in geology and electricity; so that we may use that knowledge!.

౪౫౦.ద్యౌస్త ఇత్యస్య మయోభూర్ఋషిః క్షత్రపతిర్ దేవతా, నిచృదార్షీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

మనుష్యైః కిం సాధ్నుయ రిత్యాహ.

మనుష్యులేమిచేసి ఏమి సాధించవలెను విషయ మీ మంత్రమునందు గలదు.

౪౫౦ ద్యౌస్తే పృష్ఠం పృథివీ సధస్థమాత్మాన్తరిక్షꣳ సముద్రో యోనిః।

విఖ్యాయ చక్షుషా త్వమభి తిష్ఠ పృతన్యతః ॥౨౦॥

ప.విః-ద్యౌః, తే, పృష్ఠమ్, పృథివీ, సధస్థమితి సధ+స్థమ్, ఆత్మా, అన్తరిక్షమ్, సముద్రః, యోనిః, విఖ్యాయేతి వి + ఖ్యాయ, చక్షుషా, త్వమ్, అభి, తిష్ఠ, పృతన్యతః ॥౨౦॥

పదార్థః :- (ద్యౌః) ప్రకాశ ఇవ వినయః (తే) తవ (పృష్ఠమ్) అర్వాగ్వ్యవహారః (పృథివీ) భూమిరివ (సధస్థమ్) సహస్థానమ్ (ఆత్మా) స్వస్వరూపం (అన్తరిక్షం) ఆకాశ ఇవాక్షయోఽ క్షోభః (సముద్రః) సాగర ఇవ (యోనిః) నిమిత్తమ్ (విఖ్యాయ) ప్రసిద్ధీకృత్య (చక్షుషా) లోచనేన (త్వమ్) (అభి) అభిముఖ్యే (తిష్ఠ) (పృతన్యతః) ఆత్మనః పృతనామిచ్ఛతో జనస్య. ॥౨౦॥

అన్వయః :-హే విద్వన్ రాజన్! యస్య తే తవ ద్యౌః పృష్ఠం పృథివీ సధస్థమన్తరిక్షమాత్మా సముద్రో యోనిరస్తి స త్వం చక్షుషా విఖ్యాయ పృతన్యతోఽభితిష్ఠ. ॥౨౦॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యో న్యాయపథానుగామీ దృఢోత్సాహస్థానాత్మా యస్య ప్రయోజనాని వివేకసాధ్యాని సన్తి తస్య వీరసేనా జాయతే, స ధ్రువం విజయం కర్తుం శక్నుయాత్.॥౨౦॥

**పదార్థము** :- విద్వాంసుడవగు ఓ రాజా! (తే) ఏ నీకు (ద్యౌః) ప్రకాశమువంటి వినయము మరియు (పృష్ఠమ్) ఈవలి వ్యవహారము (పృథివీ) భూమివలె (సధస్థమ్) కూడియున్న స్థితి (అన్తరిక్షమ్) ఆకాశమువంటి అవినాశియగు ధైర్యముతో గూడిన (ఆత్మా) స్వ [నిజ] స్వరూపము మరియు (సముద్రః) సముద్రమువంటి (యోనిః) నిమిత్తము గలదో, అట్టి (త్వమ్) నీవు (చక్షుషా) ఆలోచనాశక్తితో (విఖ్యాయ) నీ యైశ్వర్యమును ప్రసిద్ధపరచి (పృతన్యతః) యుద్ధమొనర్పులకై నీ సైన్యములచే దాడి చేయించదలచినవారిని (అభి) ఎదిరించి (తిష్ఠ) స్థిరముగ నిలిచియుండుము.॥౨౦॥

**భావార్థము** :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎవడు న్యాయమార్గమున నడచుచు దృఢమగు స్థానము, ఉత్సాహవంతమగు ఆత్మను గలిగియుండునో, ఎవని ప్రయోజనములు వివేకసాధ్యములో అతని సైన్యములు వీరత్వములు గలవియై నిశ్చయముగ విజయమును సాధించుటకు సమర్థములగును. ॥౨౦॥

20. O learned King, thy humility and dealings are resplendent like the sun, thy seat is firm like the Earth, thy soul is indestructible, like the space, thy goal is vast like the ocean. Having measured thy strength carefully attack the enemy with thy army!.

౪౨౧. ఉత్క్రామేత్యస్య మయోభూర్ఋషిః ద్రవిణోదా దేవతా, ఆర్షీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

మనుష్యైరిహ పరమపురుషార్థేనైశ్వర్యం జనితవ్యమిత్యాహ.

ప్రపంచమునందు పరమపురుషార్థముతో ఐశ్వర్యముల నుత్పన్నపరచుట మానవుల కర్తవ్యమని

ఈ మంత్రమం దుపదేశింపబడినది.

౪౨౧ ఉత్క్రా॑మ మహ॒తే సౌభ॑గాయా॒స్మాదా॒స్థానా॑ద్ ద్రవి॒ణోదా॑ వా॒జిన్ । వ॒యꣳ స్యా॑మ సుమ॒తౌ పృ॑థి॒వ్యా౨ ఌ॒గ్నిం ఖన॑న్త౨ ఉ॒పస్థే॑౨ అస్యాః ॥౨౧॥

**ప.వి**:- ఉత్, క్రా॒మ, మ॒హ॒తే, సౌభ॑గాయ, అ॒స్మాత్, ఆ॒స్థా॒నా॒దిత్యా॒ + స్థా॑నాత్, ద్ర॒వి॒ణో॒దా ఇతి॑ ద్రవి॒ణః + దాః, వా॒జి॒న్ వ॒యమ్, స్యా॒మ, సు॒మ॒తావితి॑ సు + మ॒తౌ, పృ॒థి॒వ్యాః, అ॒గ్నిమ్, ఖన॑న్తః, ఉ॒పస్థ॒ ఇత్యు॒ప + స్థే॑, అ॒స్యాః ॥౨౧॥

**పదార్థః** :- (ఉత్) (క్రామ) (మహతే) (సౌభగాయ) శోభనైశ్వర్యాయ (అస్మాత్) (ఆస్థానాత్) నివాసస్థానస్య సకాశాత్ (ద్రవిణోదాః) ధనప్రదః (వాజిన్) ప్రాప్తైశ్వర్య (వయమ్) (స్యామ) (సుమతౌ) శోభనప్రజ్ఞాయామ్ (పృథివ్యాః) భూమేః (అగ్నిమ్) (ఖనన్తః) (ఉపస్థే) సామీప్యే (అస్యాః).॥౨౧॥

అన్వయః :-హే వాజిన్ విద్వన్! యథా ద్రవిణోదా అస్యాః పృథివ్యా అస్మాదాస్థానాదుపస్థేఽగ్నిం ఖనన్తో వయం మహతే సౌభాగాయ సుమతౌ ప్రవృత్తాః స్యామ తథా త్వముత్క్రామ. ॥ ౨౧ ॥

భావార్థః :- మనుష్యా ఇహైశ్వర్యప్రాప్తయే సతతముత్తిష్ఠేరన్, పరస్పరం సమ్మత్యా పృథివ్యాదేః సకాశాద్రత్నాని ప్రాప్నుయుః. ॥ ౨౧ ॥

పదార్థము :-(వాజిన్) ఐశ్వర్యశాలివగు ఓ విద్వాంసుడా! (ద్రవిణోదాః) ధనదాతవలె (అస్యాః) ఈ (పృథివ్యాః) భూమియొక్క (అస్మాత్) ఈ (ఆస్థానాత్) నివాసస్థానమునకు (ఉపస్థే) సమీపమున (అగ్నిమ్) అగ్నివిద్యను (ఖనన్తః) అన్వేషించుచు (వయమ్) మేము (మహతే) గొప్ప (సౌభగాయ) సుందర ఐశ్వర్యముకొరకు (సుమతౌ) చక్కని బుద్ధిగలవారము (స్యామ) అగునట్లు నీవును (ఉత్క్రామ) ఉన్నతిని ప్రాప్తించుకొనుము. ॥౨౧॥

భావార్థము:-మానవులు ఐశ్వర్యప్రాప్తికై ప్రపంచమునందు నిరంతరము పురుషార్థవంతులై యుండవలెను. పరస్పరము అన్యోన్యముగనుండి పృథివి మున్నగువానినుండి సువర్ణము, రత్నాదులను ప్రాప్తించుకొనవలెను. ॥౨౧॥

21.O prosperous, learned person, just as we, the givers of wealth, from the surrounding of each dwelling place of ours, exploring the science of fire, acquire wisdom for worldly prosperity, so shouldst thou elevate thy self!.

౪౨౨. ఉదక్రమీదిత్యస్య మయోభూర్ఋషిః, ద్రవిణోదా దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

మనుష్యా ఇహ కింవదృత్వా కిం ప్రాప్నుయు రిత్యాహ.

మానవు డీ లోకమునందు యెట్లుండి యేమి సాధించవలయునను విషయము.

౪౨౨ ఉదక్రమీద్ ద్రవిణోదా వాజ్యర్వాకః సులోకꣳ సుకృతం పృథివ్యామ్।
తతః ఖనేమ సుప్రతీకమగ్నిꣳ స్వో రుహాణాఽఅధి నాకముత్తమమ్ ॥౨౨॥

ప. విః-ఉత్, అక్రమీత్, ద్రవిణోదా ఇతి ద్రవిణః + దాః, వాజీ, అర్వా, అకరిత్యకః, సు, లోకమ్, సుకృతమితి సు + సుకృతమ్, పృథివ్యామ్, తతః, ఖనేమ, సుప్రతీకమితి సు + ప్రతీకమ్, అగ్నిమ్, స్వ ఇతి స్వః, రుహాణాః, అధి, నాకమ్, ఉత్తమమిత్యుత్+తమమ్ ॥౨౨॥

పదార్థః :-(ఉత్) (అక్రమీత్) ఉత్తమతయా క్రమణం కుర్యాత్ (ద్రవిణోదాః) ధనదాతా (వాజీ) వేగవాన్ (అర్వా) అశ్వ ఇవ (అకః) కుర్యాత్ (సు) (లోకమ్) ద్రష్టవ్యమ్ (సుకృతమ్) ధర్మాచరేణ ప్రాప్యమ్

(పృథివ్యామ్) (తతః) (ఖనేమ) (సుప్రతీకమ్) శోభా ప్రీతిర్యస్య తమ్ (అగ్నిమ్) వ్యాపకం విద్యుదాఖ్యమ్ (స్వః) సుఖమ్ (రుహాణాః) ప్రాదుర్భవన్తః (అధి) (నాకమ్) అవిద్యమానదుఃఖమ్ (ఉత్తమమ్) అతిశ్రేష్ఠమ్. ॥౨౨॥

**అన్వయః**:-హే భూగర్భవిద్యావిద్విద్వన్! ద్రవిణోదా భవాన్ యథా వాజ్యర్వా తథా పృథివ్యాము ధ్యుదక్రమీత్ సులోకం సుకృతముత్తమం నాకమకః సిద్ధం కుర్యాత్. తతః స్వో రుహాణా వయమస్యాం సుప్రతీకమగ్నిం ఖనేమ. ॥౨౨॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యాః! సర్వే వయం మిలిత్వా యథా పృథివ్యా మశ్వో విక్రమతే తథా పురుషార్థినో భూత్వా పృథివ్యాదివిద్యాం ప్రాప్య దుఃఖాన్యుత్క్రామ్య సర్వోత్తమం సుఖం ప్రాప్నుయామ. ॥౨౨॥

**పదార్థము** :-భూగర్భవిద్యలనెరుగు విద్వాంసుడా! (ద్రవిణోదాః) ధనదాతవగు నీవు (వాజీ) బలముగల (అర్వా) అశ్వముపైకి దుముకునట్లు (పృథివ్యామ్) పృథివియందు (అధి) అధిక (ఉదక్రమీత్) సర్వాధిక ఉన్నతిని పొందుము (సుకృతమ్) ధర్మాచరణద్వారా ప్రాప్తించుకొనదగిన (సులోకమ్) చక్కగా చూడదగిన (ఉత్తమమ్) అతిశ్రేష్ఠమైనదియునగు (నాకమ్) ఎట్టి దుఃఖములులేనట్టి సుఖమును (అకః) సిద్ధింపజేసికొనుము (తతః) ఆ పిదప (స్వః) సుఖపూర్వకముగ (రుహాణాః) ప్రఖ్యాతవగుచు మేముకూడా ఈ పృథివిపై (సుప్రతీకమ్) చక్కని ప్రీతితో గూడిన (అగ్నిమ్) వ్యాపకమైయున్న విద్యుత్ రూప అగ్నిని (ఖనేమ) అన్వేషించెదముగాక! ॥౨౨॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! భూమిపై అశ్వములు ఏవిధముగ చిత్ర విచిత్ర గతులతో పరుగెత్తునో అట్లే మనమెల్లరమును గలిసి పురుషార్థపరులమై పృథివి మున్నగు పదార్థవిద్యలను పొంది సకల దుఃఖములను దూరమొనర్చి సర్వోత్తమ సుఖములను పొందెదముగాక! ॥౨౨॥

22.O learned geologist, wealth-giver, just as a strong horse jumps up, so should'st thou attain to greatness in this world; acquire absolute, beautiful happiness free from pain, derivable from a saintly life. May we, in the enjoyment of happiness, explore the pervading electricity full of brilliance.

౪౨౩.ఆత్వేత్యస్య గృత్సమద ఋషిః, ప్రజాపతిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

మనుష్యా వ్యాపినం వాయుం కేన జానీయురిత్యాహ.

మనుష్యులు వ్యాపకమైన వాయువు నే సాధనముచే గ్రహించవలయునను విషయము.

౪౨౩ ఆ త్వా జిఘర్మి మనసా ఘృతేన ప్రతిక్షియన్తం భువనాని విశ్వా।

పృథుం తిరశ్చా వయసా బృహన్తం వ్యచిష్ఠమన్నై రభసం దృశానమ్ ॥౨౩॥

ప.వి:- ఆ, త్వా, జిఘర్మి, మనసా, ఘృతేన, ప్రతిక్షియన్తమితి ప్రతి + క్షియన్తమ్, భువనాని, విశ్వా, పృథుమ్, తిరశ్చా, వయసా, బృహన్తమ్, వ్యచిష్ఠమ్, అన్నైః, రభసమ్, దృశానమ్ ॥౨౩॥

**పదార్థః** :-(ఆ) (త్వా) త్వామ్ (జిఘర్మి) (మనసా) (ఘృతేన) ఆజ్యేన (ప్రతిక్షియన్తమ్) ప్రత్యక్షం నివసన్తం (భువనాని) భవన్తి యేషు తాని వస్తూని, (విశ్వా) సర్వాణి (పృథుమ్) విస్తీర్ణమ్ (తిరశ్చా) యేన తిరోఽఞ్చతి తేన (వయసా) జీవనేన (బృహన్తమ్) మహాన్తమ్ (వ్యచిష్ఠమ్) అతిశయేన విచితారం ప్రక్షేప్తారమ్. (అన్నైః) యవాదిభిః (రభసమ్) వేగవన్తమ్ (దృశానమ్) సంప్రేక్షణీయమ్ ॥౨౩॥

**అన్వయః** :- హే జిజ్ఞాసో! యథాఽహం మనసా ఘృతేన సహ విశ్వా భువనాని ప్రతిక్షియన్తం తిరశ్చా వయసా పృథుం బృహన్తమన్నైః సహ రభసం వ్యచిష్ఠం దృశానం వాయుమాజిఘర్మి తథా త్వా త్వామప్యేనం ధారయామి. ॥౨౩॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా అగ్నిద్వారా సుగన్ధ్యాదీని ద్రవ్యాణి వాయౌ ప్రక్షిప్య తేన యుక్తసుగంధేనారోగీకృత్య దీర్ఘం జీవనం ప్రాప్నువన్తు. ॥౨౩॥

**పదార్థము** :- జ్ఞానమునాశించు విద్వాంసుడా! నే నెట్లు (మనసా) మనస్సుతోను మరియు (ఘృతేన) ఘృతముతోను (విశ్వా) సమస్త (భువనాని) లోకములోని సకల వస్తువులను (ప్రతిక్షియన్తమ్) ప్రత్యక్షముగ నివాసమునకై నిశ్చయమొనర్చునది (తిరశ్చా) వంకరగనడచు (వయసా) జీవనముచే (పృథుమ్) విస్తారముతో గూడిన (బృహన్తమ్) గొప్ప (అన్నైః) యవలుమున్నగు అన్నములతోగూడ (రభసమ్) బలవముగలది (వ్యచిష్ఠమ్) బాగుగా విసరివేయునది (దృశానమ్) చూడదగిన వాయువుగుణములను (ఆజిఘర్మి) చక్కగా ప్రకాశింపజేయునట్లు (త్వా) నిన్నును ఈ వాయువుగుణములద్వారా ధారణమొనర్తును. ॥౨౩॥

**భావార్థము** :- ఈ మంత్రమందును వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులెల్లరును అగ్నిద్వారా సుగంధాది ద్రవ్యములను [యజ్ఞమొనర్చి] వాయువునందు ప్రవేశింపజేసి ఆ సుగంధముద్వారా అనేక వ్యాధులను దూరమొనర్చుకొని దీర్ఘాయువును పొందవలయును. ॥౨౩॥

23.O seeker after knowledge, just as I with learning and ghee, clearly manifest the properties of air, that pervades all substances, that moves transversely, is vast in vitality, highly powerful with the oblations of corn, vast in velocity, and visible, so I make thee also understand the properties of air!.

౨౪. ఆవిశ్వత ఇత్యస్య గృత్సమద ఋషిః, అగ్నిర్ దేవతా, ఆర్షీపంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

పునః కీదృశౌ వాయ్వగ్నీ స్త ఇత్యాహ.

వాయువు అగ్ని లెటువంటి గుణములు గలవి యను విషయమిందు గలదు.

౪౨౪ ఆ వి॒శ్వతః॑ ప్ర॒త్యఞ్చం॑ జిఘ॒ర్మ్యర॒క్షసా॒ మన॑సా॒ తజ్జు॑షేత।

మర్య॑శ్రీః స్పృహ॒యద్వ॑ర్ణో అ॒గ్నిర్నా॑భి॒మృశే॑ త॒న్వా॒ జర్భు॑రాణః॥౭౪॥

ప.విః- ఆ వి॒శ్వత॑ః, ప్ర॒త్యఞ్చ॑మ్, జి॒ఘ॒ర్మి॒, అ॒ర॒క్షసా॑, మన॑సా, తత్, జు॒షే॒త॒, మర్య॑శ్రీ॒రితి॒ మర్య॑ + శ్రీః,స్పృ॒హ॒యద్వ॑ర్ణ॒ ఇతి॑ స్పృ॒హ॒యత్ + వ॑ర్ణః, అ॒గ్నిః, న, అ॒భి॒మృ॒శ ఇత్య॑భి॒ + మృ॒శే॑ త॒న్వా॑, జర్భు॑రాణః॥ ౭౪ ॥

**పదార్థః** :-(ఆ) (విశ్వతః) సర్వతః (ప్రత్యఞ్చమ్) ప్రత్యగఞ్చతీతి శరీరస్థం వాయుమ్ (జిఘర్మి) (అరక్షసా) రక్షోవద్ దుష్టతారహితేన (మనసా) చిత్తేన (తత్) తేజః (జుషేత) (మర్యశ్రీః) మర్త్యానాం మనుష్యాణాం శ్రీరివ (స్పృహయద్వర్ణః) యః స్పృహయద్భిర్వర్ణ్యతే స్వీక్రియతే స ఇవ (అగ్నిః) శరీరస్థా విద్యుత్ (న) ఇవ (అభిమృశే) అభిముఖ్యేన మృశన్తి సహన్తే యేన తస్మై (తన్వా) శరీరేణ (జర్భురాణః) భృశం గాత్రాణి వినామయత్. అత్ర జృభీధాతోరౌణాదిక ఉరానన్ ప్రత్యయః. ॥౭౪॥

**అన్వయః** :-మనుష్య! న యథా విశ్వతోఽగ్నిర్వాయుశ్చాభిమృశేఽస్తి యథా తన్వా జర్భురాణః స్పృహయద్వర్ణో మర్యశ్రీరహం యం ప్రత్యఞ్చమరక్షసా మనసా ఽఽజిఘర్మి తథా తజ్జుషేత.॥౭౪॥

**భావార్థః** :-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. హే మనుష్యాః! యూయం లక్ష్మీప్రాప్తైరగ్న్యాది పదార్థైర్విదితైః కార్యేషు సంయుక్తైః శ్రీమన్తో భవత.॥౭౪॥

**పదార్థము** :- ఓ మానవా! (న) ఏవిధముగ (విశ్వతః) సకలదిశలందు (అగ్నిః) విద్యుత్తు మరియు ప్రాణవాయువు వ్యాప్తమై (అభిమృశే) సహనమొనర్చుకొనువారికి హితకరములై యున్నవియో ఎట్లు (తన్వా) శరీరము (జర్భురాణః) కరచరణాద్యంగములను శీఘ్రగతిలో నడిపించుచు (స్పృహయద్వర్ణః) ఆకాంక్షించువారిచే స్వీకరించినవారివలె (మర్యశ్రీః) మనుష్యుని శోభవంటి వాయువువలె వేగవంతుడనై నేను (ప్రత్యఞ్చమ్) శరీరస్థవాయువును నిరంతరము నడిపించునట్టి విద్యుత్తును (అరక్షసా) రాక్షసుల దౌష్ట్యమునుండి విముక్తమైన (మనసా) మనస్సుతో (ఆ జిఘర్మి) ప్రకాశితమొనర్చుచున్నానో అట్లే (తత్) ఆ తేజస్సును (జుషేత) సేవనమొనర్చుము. ॥౭౪॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఓ మానవులారా! మీరు లక్ష్మిని అగ్ని మున్నగు పదార్థములను తెలిసికొని వానిని కార్యములందు సంయుక్తమొనర్చుకొని ధనవంతులగుడు. ॥౭౪॥

24.O man, just as heat and air pervading the body are useful to their sustainer, who fastly moves the organs fo the body, like one attempting to fulfil his desire; So I, for the grandeur of man, manifest, with immaculate reason, the properti es of the heat that sets in motion the air inside the body; so shouldst thou enjoy that heat!.

౪౨౫.పరివాజపతిరిత్యస్య సోమక ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునర్గృహస్థః కీదృశో భవేదిత్యాహ.

గృహస్థు డెటువంటివాడుగా నుండవలయునను విషయ మీ మంత్రమునందు గలదు.

౪౨౫ పరి వాజపతిః కవిరగ్నిర్హవ్యాన్యక్రమీత్ । దధద్రత్నాని దాశుషే ॥౨౫॥

ప.వి:-పరి, వాజపతిరితి వాజ+పతిః,కవిః, అగ్నిః, హవ్యాని, అక్రమీత్, దధత్, రత్నాని దాశుషే ॥౨౫॥

**పదార్థః** :-(పరి) సర్వతః (వాజపతిః) అన్నాదిరక్షకో గృహస్థ ఇవ (కవిః) క్రాన్తదర్శనః (అగ్నిః) ప్రకాశమానః (హవ్యాని) హోతుం గ్రహీతుం యోగ్యాని వస్తూని (అక్రమీత్) క్రామతి (దధత్) ధరన్ (రత్నాని) సువర్ణాదీని (దాశుషే) దాతుం యోగ్యాయ విదుషే. ॥౨౫॥

**అన్వయః** :-హే విద్వన్! యో వాజపతిః కవిర్దాతా గృహస్థో దాశుషే రత్నాని దధదివాగ్నిర్హవ్యాని పర్యక్రామీత్తం త్వం జానీహి.॥౨౫॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. విద్వానగ్నినా పృథివీస్థపదార్థేభ్యో ధనం ప్రాప్య సుమార్గే సత్పాత్రేభ్యో దత్త్వా విద్యాప్రచారేణ సర్వాన్ సుఖయేత్.॥౨౫॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! (వాజపతిః) అన్నము మున్నగు పదార్థములను రక్షించు గృహస్థులవలె (కవిః) చక్కగా నెరుగు, దాతయగు గృహస్థుడు (దాశుషే) దానమునీయ యోగ్యుడగు విద్వాంసునకు (రత్నాని) సువర్ణము మున్నగు ఉత్తమపదార్థములను (దధత్) ధారణమొనర్చువారివలె (అగ్నిః) ప్రకాశవంతుడు (హవ్యాని) ఈయదగిన వస్తువులను (పరి) సకలదిశలనుండి (అక్రమీత్) పొందునట్టివానిని నీవు దెలిసికొనుము. ॥౨౫॥

**భావార్థము** :-ఇందు వాచకలుప్తోపమాలంకారము గలదు. అగ్నివిద్యా సహాయమున పృథివియందలి పదార్థములనుండి ధనములను పొంది ఉత్తమమార్గమున వ్యయపరచుచు ధర్మాత్ములకు దానము నిచ్చుచు విద్యాప్రచారములచే మానవులందరకు సుఖములొనగూర్చుట విద్వాంసుల కర్తవ్యమై యున్నది.॥౨౫॥

25.O learned person, know thou, the handsome, charitably - disposed renowned person, giving in charity gold to the learned person who acquires from all sides substances fit for charity, like the householders who preserve foodstuffs!.

౪౩౬. పరిత్వేత్యస్య పాయుర్ఋషిః, అగ్నిర్దేవతా, అనుష్టుప్ఛందః, గాన్ధారః స్వరః.

కీదృశః సేనాపతిః కార్య ఇత్యాహ.

ఎటువంటి వానిని సేనాపతిగ నొనర్చవలయునను విషయ మీ మంత్రమునందు గలదు.

౪౩౬ పరి త్వాగ్నే పురం వయం విప్రం సహస్య ధీమహి।

ధృషద్వర్ణం దివేదివే హన్తారం భఙ్గురావతామ్ ॥౨౬॥

ప. విః-పరి, త్వా, అగ్నే, పురమ్, వయమ్, విప్రమ్, సహస్య, ధీమహి, ధృషద్వర్ణమితి ధృషత్+వర్ణమ్, దివేదివ ఇతి దివే+దివే, హన్తారమ్, భఙ్గురావతామ్, భఙ్గురావతామితి భఙ్గుర+వతామ్ ॥౨౬॥

**పదార్థః** :-(పరి) (త్వా) త్వామ్ (అగ్నే) విద్యయా ప్రకాశమాన (పురమ్) యేన సర్వాన్ పిపర్తి తత్ (వయమ్) (విప్రమ్) విద్వాంసమ్ (సహస్య) య ఆత్మనః సహో బలమిచ్ఛతి తత్సంబుద్ధౌ (ధీమహి) ధరేమ. అత్ర డుధాఞ్ ధాతోర్లిఙ్యార్ధధాతుకత్వాచ్ఛబభావః (ధృషద్వర్ణమ్) ధృషద్ప్రగల్భో దృఢో వర్ణో యస్య తమ్ (దివేదివే) ప్రతిదినమ్ (హన్తారమ్) (భఙ్గురావతామ్) కుత్సితా భఙ్గురాః ప్రహతాః ప్రకృతయో విద్యన్తే యేషాం తేషామ్. ॥౨౬॥

**అన్వయః** :-హే సహస్యాగ్నే! యథా వయం దివేదివే భఙ్గురావతాం పురమగ్నిమివ హన్తారం ధృషద్వర్ణం విప్రం త్వా పరిధీమహి తథా త్వమస్మాన్ధర. ॥౨౬॥

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. రాజప్రజాజనైర్న్యాయేన ప్రజారక్షకోఽగ్నివచ్ఛత్రుహన్తా సర్వదా సుఖప్రదః సేనేశో విధేయః. ॥ ౨౬ ॥

**పదార్థము** :-(సహస్య) స్వంత బలవృద్ధినిగోరువాడు (అగ్నే) విద్యయందు అగ్నివలె ప్రకాశించు విద్వాంసుని వలె (వయమ్) మేము (దివేదివే) నిరంతరము [ప్రతిదినము] (భంగురావతామ్) దుష్టస్వభావుల (పురమ్) నగరమునకు అగ్నివంటివారమై (హన్తారమ్) హతమార్చుటకు (ధృషద్వర్ణమ్) దృఢము, చక్కని వర్ణముగలవాడవు (విప్రమ్) విద్వాంసుడవునగు (త్వా) నిన్ను (పరి) సకలవిధముల (ధీమహి) ధారణమొనర్చునట్లు నీవు మమ్ము ధారణమొనర్చుము. ॥౨౬॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు, రాజు మరియు ప్రజలు అగ్నివలె శత్రుదాహకుడు, సర్వకాలములందు ప్రజలను సుఖవంతులుగా నుంచువాడును నగు విక్రమ పురుషునే సేనాపతిగ నొనర్చవలయును.॥౨౬॥

26.O learned person, aspirant after power, we unanimously select thee, as our commander, the day by day destroyer of the citadel of our treacherous foes, possessing iron determination, good looking features, and vast knowledge!.

౪౫౭. త్వమగ్నే ఇత్యస్య గృత్సమద ఋషిః, అగ్నిర్దేవతా, పంక్తిశ్ఛందః. పఞ్చమః స్వరః.

పునః సభేశః కీదృశో భవేదిత్యాహ.

సభాధ్యక్షు డెటువంటివాడుగా నుండవలయునను విషయ మీ మంత్రమున గలదు.

౪౫౭ త్వమగ్నే ద్యుభిస్త్వమాశుశుక్షణిస్త్వమద్భ్యస్త్వమశ్మనస్పరి।

త్వం వనేభ్యస్త్వమోషధీభ్యస్త్వం నృణాం నృపతే జాయసే శుచిః ॥౨౭॥

**ప.వి:**–త్వమ్, అగ్నే ద్యుభిరితి ద్యు + భిః, త్వమ్, ఆశుశుక్షణిః, త్వమ్, అద్భ్య ఇత్యత్ + భ్యః, త్వమ్, అశ్మనః, పరి, త్వమ్, వనేభ్యః, త్వమ్, ఓషధీభ్యః, త్వమ్, నృణామ్, నృపత ఇతి నృ+పతే, జాయసే, శుచిః ॥౨౭॥

**పదార్థః** :-(త్వమ్) (అగ్నే) అగ్నివత్ప్రకాశమాన న్యాయాధీశ రాజన్! (ద్యుభిః) దినైరివ ప్రకాశమానై ర్న్యాయాదిగుణైః (త్వమ్) (ఆశుశుక్షణిః) శీఘ్రం శీఘ్రం దుష్టాన్ క్షిణోతి హినస్తీవ (త్వమ్) (అద్భ్యః) వాయుభ్యో జలేభ్యో వా (త్వమ్) (అశ్మనః) మేఘాత్పాషాణాద్వా. అశ్మేతి మేఘనా- నిఘం ౧.౧౦ (పరి) సర్వతోభావే (త్వమ్) (వనేభ్యః) జఙ్గలేభ్యో రశ్మిభ్యో వా (త్వమ్) (ఓషధీభ్యః) సోమలతాదిభ్యః (త్వమ్) (నృణామ్) మనుష్యాణామ్ (నృపతే) నృణాం పాలక (జాయసే) ప్రాదుర్భవసి (శుచిః) పవిత్రః.

ఇమం మంత్రం యాస్కముని రేవం వ్యాచష్టే. త్వమగ్నే ద్యుభిరహోభిస్త్వమాశుశుక్షణిరాశు ఇతి చ శుం ఇతి చ క్షిప్రనామనీ భవతః క్షణిరుత్తరః. క్షణోతేరాశు శుచా క్షణోతీతి వా సనోతీతి వా శుక్ శోచతేః పఞ్చమ్యర్థే వా ప్రథమా తథాహి వాక్యసంయోగ ఆ ఇత్యాకార ఉపసర్గః పురస్తాచ్చికీర్షితేఽనుత్తర ఆశుశోచయిషు రితి శుచిః శోచతేర్జ్వలతికర్మణోఽయమపీతరః. శుచిరేతస్మాదేవ నిష్షిక్తమస్మాత్పాపకమితి నైరుక్తాః. నిరు ౬.౧.॥౨౭॥

**అన్వయః**:-హే నృపతే అగ్నే సభాధ్యక్ష రాజన్! యస్త్వం ద్యుభిః సూర్య ఇవ త్వమాశుశుక్షణి స్త్వమద్భ్యస్త్వమశ్మనస్త్వం వనేభ్యస్త్వమోషధీభ్యస్త్వం నృణాం మధ్యే శుచిః పరిజాయసే, తస్మాత్త్వామాశ్రిత్య వయమప్యేవంభూతా భవేమ. ॥౨౭॥

**భావార్థః**:-యో రాజా సభ్యః ప్రజాజనో వా సర్వేభ్యః పదార్థేభ్యో గుణగ్రహణవిద్యా క్రియాకౌశలాభ్యాముపకారాన్ గ్రహీతుం శక్నోతి ధర్మాచరణేన పవిత్రః శీఘ్రకారీ చ భవతి, స సర్వాణి సుఖాని ప్రాప్నోతి నేతరోఽలసః ॥౨౭॥

**పదార్థము** :-(నృపతే) మానవులను పాలించువాడా! (అగ్నే) అగ్నివంటి ప్రకాశవంతుడవు, న్యాయాధీశుడవునగు ఓ రాజా! (త్వమ్) నీవు (ద్యుభిః) పగళ్లవలె ప్రకాశవంతుడవు, న్యాయాది గుణములచే సూర్యునివంటివాడవు (త్వమ్) నీవు (ఆశుశుక్షణిః) అతి శీఘ్రగతిని దుష్టులను సంహరించు వాడవు (త్వమ్) నీవు (అద్భ్యః) వాయువు మరియు జలములచే (త్వమ్) నీవు (అశ్మనః) మేఘములు మరియు పాషాణాదులచే (త్వమ్) నీవు (వనేభ్యః) వనములు మరియు కిరణములచే (త్వమ్) నీవు (ఓషధీభ్యః) సోమలత మున్నగు ఓషధులచే (త్వమ్) నీవు (నృణామ్) మానవులందు (శుచిః) పవిత్రుడవు (పరి) సకలవిధముల (జాయసే) ప్రసిద్ధుడవగుదువు. కావుననే నీయాశ్రయమును పొంది మేమును అట్టివారమే [ప్రసిద్ధులము] అగుదుము గాక! ॥౨౭॥

**భావార్థము** :-రాజు, సభాసదులు, ప్రజలయందెవ్వరైనను సకల పదార్థములనుండి గుణముల గ్రహించి విద్య, క్రియాకుశలత్వములచే ఉపకారమును పొందుటకు సమర్థులగుదురు. ధర్మాచరణముచే పవిత్రుడు మరియు ఏమరిపాటు లేనివాడు మాత్రమే సుఖములను పొందగలడు. కాని సోమరులు పొందలేరు. ॥౨౭॥

27.Thou, Sovereign Lord of men, just King, resplendent like fire, brilliant like the sun, speedy destroyer of the wicked, with air and waters, with clouds and sotnes, with forests and beams, with medicinal herbs, art adorned in every way, being pure amongst the subjects.

౨౮.దేవస్య త్వేత్యస్య గృత్సమదఋషిః, అగ్నిర్దేవతా, ప్రకృతిశ్ఛందః, ధైవతః స్వరః.

మనుష్యాః కిం కృత్వా కస్మాద్విద్యుతం గృహ్ణీయురిత్యాహ.

మానవులేమి యొనర్చి ఏ పదార్థమునుండి విద్యుత్తును గ్రహించవలెననువిషయము.

౨౮ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్।
పృథివ్యాః సధస్థాదగ్నిం పురీష్యమఙ్గిరస్వత్ ఖనామి।
జ్యోతిష్మన్తం త్వాగ్నే సుప్రతీకమజస్రేణ భానునా దీద్యతమ్।

శివం ప్రజాభ్యోఽహింసన్తం పృథివ్యాః సధస్థాదగ్నిం
పురీష్యమఙ్గిరస్వత్ ఖనామః ॥౨౨॥

ప.వి:-దేవస్య, త్వా, సవితుః ప్రసవ ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామ్, పూష్ణః హస్తాభ్యామ్, పృథివ్యాః, సధస్థాదితి సధ + స్థాత్, అగ్నిమ్, పురీష్యమ్ అఙ్గిరస్వత్, ఖనామి, జ్యోతిష్మన్తమ్, త్వా, అగ్నే, సుప్రతీకమితి సు+ప్రతీకమ్, అజస్రేణ భానునా, దీద్యతమ్, శివమ్, ప్రజాభ్య ఇతి ప్ర+జాభ్యః, అహింసన్తమ్, పృథివ్యాః, సధస్థాదితి సధ+స్థాత్, అగ్నిమ్, పురీష్యమ్, అఙ్గిరస్వత్ ఖనామః ॥౨౨॥

పదార్థః :-(దేవస్య) ప్రకాశమానస్య (త్వా) త్వామ్ (సవితుః) సర్వస్యోత్పాదకస్యేశ్వరస్య (ప్రసవే) ప్రసూతేఽస్మిన్ సంసారే (అశ్వినోః) ద్యావాపృథివ్యోరాకర్షణ ధారణాభ్యామివ (బాహుభ్యామ్) (పూష్ణః) ప్రాణస్య బలపరాక్రమాభ్యామివ (హస్తాభ్యామ్) (పృథివ్యాః) (సధస్థాత్) సహస్థానాత్ (అగ్నిమ్) విద్యుతమ్ (పురీష్యమ్) సుఖైః పూరకేషు భవమ్ (అఙ్గిరస్వత్) వాయువద్వర్తమానమ్ (ఖనామి) నిష్పాదయామి, (జ్యోతిష్మన్తమ్) బహూని జ్యోతీంషి విద్యన్తే యస్మింస్తమ్ (త్వా) త్వామ్ (అగ్నే) భూగర్భాది విద్యావిద్విద్వన్ (సుప్రతీకమ్) సుష్ఠు ప్రతియన్తి సుఖాని యస్మాత్తమ్ (అజస్రేణ) నిరంతరేణ (భానునా) దీప్త్యా (దీద్యతమ్) దేదీప్యమానమ్ (శివమ్) మఙ్గలమయమ్, (ప్రజాభ్యః) ప్రసూతాభ్యః (అహింసన్తమ్) అతాడయన్తమ్ (పృథివ్యాః) అన్తరిక్షాత్ (సధస్థాత్) సహస్థానాత్ (అగ్నిమ్) వాయుస్థం విద్యుతమ్ (పురీష్యమ్) పాలకేషు సాధనేషు సాధుమ్ (అఙ్గిరస్వత్) సూత్రాత్మవాయువద్వర్తమానమ్ (ఖనామః) విలిఖామః.॥౨౨॥

అన్వయః :-హే అగ్నే శిల్పవిద్యావిద్విద్వన్! యథాఽహం సవితుర్దేవస్య ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వా పురస్కృత్య పృథివ్యాః సధస్థాత్పురీష్యం జ్యోతిష్మన్తమజస్రేణ భానునా దీద్యతం పురీష్యమగ్నిమఙ్గిరస్వత్ఖనామి. యథా త్వా త్వామాశ్రితా వయం పృథివ్యాః సధస్థాదఙ్గిరస్వదహింసన్తం పురీష్యం ప్రజాభ్యః శివమగ్నిం ఖనామస్తథా సర్వ ఆచరన్తు.॥౨౨॥

భావార్థః:-యే రాజప్రజాజనాః సర్వత్ర స్థితం విద్యుద్రూపమగ్నిం సర్వేభ్యః పదార్థేభ్యః సాధనోపసాధనైః ప్రసిద్ధీకృత్య కార్యేషు ప్రయుఞ్జతే తే శంకరమైశ్వర్యం లభన్తే. నహి కించిదపి ప్రజాతం వస్తు విద్యుద్వ్యాప్త్యా వినా వర్తత ఇతి విజానన్తు.॥౨౨॥

**పదార్థము** :-(అగ్నే) భూగర్భ మరియు శిల్పవిద్యాప్రవీణుడవగు విద్వాంసుడా! నే నెట్లు (సవితుః) సమస్త జగదుత్పాదకుడు (దేవస్య) ప్రకాశస్వరూపుడగు పరమేశ్వరుడు (ప్రసవే) సృష్టించిన యీ విశ్వమందు (అశ్వినోః) ఆకాశము మరియు పృథివియొక్క (బాహుభ్యామ్) ఆకర్షణ, ధారణరూప బాహువులవలె (పూష్ణః) ప్రాణముల (హస్తాభ్యామ్) బలపరాక్రమములవలె (త్వా) నిన్ను ముందుంచుకొని (పృథివ్యాః) భూమియొక్క (సధస్థాత్) ఒకస్థానమునుండి (పురీష్యమ్) పూర్ణసుఖములనిచ్చునట్టి (జ్యోతిష్మన్తమ్) అధిక ప్రకాశముగల (అజస్రేణ) నిరంతరము (భానునా) దీప్తితో (దీద్యతమ్) అత్యంత ప్రకాశవంతమగు (పురీష్యమ్) చక్కని సుఖములనిచ్చు (అగ్నిమ్) వాయువునందున్న విద్యుత్తును (అఙ్గిరస్వత్) వాయువువలె (ఖనామి) సిద్ధపరచుకొనుచున్నానో మరియు నెట్లు (త్వా) నీ యాశ్రయముచే మేము (పృథివ్యాః) అంతరిక్షముయొక్క (సధస్థాత్) ఒక ప్రదేశమునుండి (అఙ్గిరస్వత్) సూత్రాత్మవాయువువలె గల (అహింసన్తమ్) తాడనమొనర్చనట్టి (పురీష్యమ్) పాలనపదార్థములలో నుత్తమమైన (ప్రజాభ్యః) ప్రజలకొరకు (శివమ్) మంగళప్రదమగు (అగ్నిమ్) అగ్నిని (ఖనామః) ప్రకటించుచున్నామో అట్లే మీరెల్లరును చేయవలయును. ॥౨౮॥

**భావార్థము** :-రాజు మరియు ప్రజలు సకలప్రదేశములందుగల విద్యుద్రూపాగ్నిని సమస్త పదార్థములనుండి సాధనోపసాధనములద్వారా ప్రసిద్ధపరచి సకల కార్యములం దుపయోగపరచికొనినప్పుడు వారు కల్యాణప్రదమగు నైశ్వర్యములను పొందుదురు. ఉత్పన్న పదార్థమేదియును విద్యుత్తు లేకుండా యుండదని మీ రెరుగుడు.॥౨౮॥

28.O geologist and artisa, just as I, in this world created by the Effulgent Lord, like the powers of attraction and retention of the atmosphere and earth, and like the force and swiftness of air, following in your wake, explore from a part of the earth, electricity, giver of full comfort, luminous, resplendent with imperishable lustre, gracious like air; and just as, with your assisrance, we, explore from a part of the atmosphere, electricity, pervading like refined air, doing no harm, excellent amongst all nourishing substances, and administering to the prosperity of the people, so should all do!.

౨౯.అపాం పృష్ఠమిత్యస్య గృత్సమద ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాట్పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

పునర్మనుష్యైః కీదృశం విద్యుతం గృహ్ణీయురిత్యాహ.

మానవు లెటువంటి విద్యుత్తును గ్రహించవలెనను విషయ ముపదేశింపబడినది.

౨౯ అపాం పృష్ఠమసి యోనిరగ్నేః సముద్రమభితః పిన్వమానమ్। వర్ధమానో మహాఀ२ ఆ చ పుష్కరే దివో మాత్రయా వరిమ్ణా ప్రథస్వ ॥౨౯॥

ప.విః- అపామ్, పృష్ఠమ్, అసి, యోనిః, అగ్నేః, సముద్రమ్, అభితః, పిన్వమానమ్ వర్ధమానః, మహాన్, ఆ, చ, పుష్కరే, దివః, మాత్రయా, వరిమ్ణా, ప్రథస్వ ॥౨౯॥

**పదార్థః** :-(అపామ్) జలానామ్ (పృష్ఠమ్) ఆధారః (అసి) యోనిః) సంయోగవిభాగవిత్ (అగ్నేః) సర్వతోఽభివ్యాప్తస్య విద్యుద్రూపస్య సకాశాత్ ప్రచలన్తమ్ (సముద్రమ్) సమ్యగూర్ధ్వం ద్రవన్త్యాపో యస్మాత్సాగరాత్తమ్ (అభితః) సర్వతః (పిన్వమానమ్) సిఞ్చన్తమ్ (వర్ధమానః) యో విద్యయా క్రియాకౌశలేన నిత్యం వర్ధతే (మహాన్) పూజ్యః (ఆ) (చ) సర్వమూర్తద్రవ్యసముచ్చయే (పుష్కరే) అన్తరిక్షే వర్తమానాయాః. పుష్కరమిత్యన్తరిక్షనా. నిఘ. ౧.౩.(దివః) దీప్తేః (మాత్రయా) విభాగేన (వరిమ్ణా) ఉరోర్బహోర్భావేన (ప్రథస్వ) విస్తృతసుఖో భవ. ॥౨౯॥

**అన్వయః** :-హే విద్వన్! యతోఽగ్నే ర్యోనిర్మహాన్ వర్ధమానస్త్వమసి, తస్మాదభితః పిన్వమానమపాం పృష్ఠం పుష్కరే దివో మాత్రయా వర్ధమానం సముద్రం తత్స్థాన్ పదార్థాంశ్చ విదిత్వా వరిమ్ణాఽఽ ప్రథస్వ. ॥౨౯॥

**భావార్థః** :-హే మనుష్యాః! యూయం యథా మూర్తేషు పృథివ్యాదిషు పదార్థేషు విద్యుద్వర్తతే తథాఽప్స్వపి మత్వా తాముపకృత్య విస్తృతాని సుఖాని సంపాదయత. ॥౨౯॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! (అగ్నేః) సర్వత్ర అభివ్యాప్తమైయున్న విద్యుద్రూపాగ్నియొక్క (యోనిః) సంయోగ వియోగముల నెరిగినవాడవు (మహాన్) పూజనీయుడవు (వర్ధమానః) విద్యాక్రియా కౌశలములచే సదా అభివృద్ధిజెందువాడవునై (అసి) ఉన్నావు. కావుననే (అభితః) సకల దిశలనుండి (పిన్వమానమ్) జలముల వర్షింపజేయుచు (అపామ్) జలములకు (పృష్ఠమ్) ఆధారభూతమగు (పుష్కరే) అంతరిక్షమున వర్తమానమైయున్న (దివః) దీప్తియొక్క (మాత్రయా) విభాగముచే నభివృద్ధి జెందినదియునగు (సముద్రమ్) అద్భుతముగ జలములను పైకి లేపునట్టి సముద్రమును (చ) మరియు నచ్చటి సమస్త పదార్థములను చక్కగా నెరిగి (వరిమ్ణా) అధికాధికముగ (ఆ ప్రథస్వ) అత్యుత్తమ సుఖములను విస్తరింప జేయువాడ వగుము. ॥౨౯॥

**భావార్థము** :- ఓ మానవులారా! పృథివి మున్నగు స్థూలపదార్థములందు విద్యుత్తు వ్యాప్తమైయున్నట్లే జలములందును గలదు అని తెలిసికొని దానిచే నుపకారమును పొంది మీరు అపరిమిత సౌఖ్యముల ననుభవించుడు. ॥౨౯॥

**29.O learned person, thou knowest the qualities of integration and disintegration of the All pervading electricity, thou art worthy of respect. Mayest thou progress with the aid of knowledge and scientific skill, having known the all round raining clouds, the support of water, the ocean and the material substances embedded in it, from which sun, residing in the atmosphere, takes up with its beams; and adds amply to thy comforts!.**

౪౬౦.శర్మ చేత్యస్య గృత్సమద ఋషిః, దమ్పతీ దేవతే, విరాడార్ష్యనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ స్త్రీపురుషాభ్యాం గృహే స్థిత్వా కిం సాధనీయమిత్యాహ.

స్త్రీపురుషులు గృహము నందుండి ఏ మేమి సాధించ వలయునను విషయమించు గలదు.

౪౬౦ శర్మ చ స్థో వర్మ చ స్థోఽఛిద్రే బహులేఽ ఉభే।

వ్యచస్వతీ సంవసాథాం భృతమగ్నిం పురీష్యమ్ ॥30॥

ప.విః-శర్మ, చ, స్థః, వర్మ, చ, స్థః, అఛిద్రేఽ ఇత్యఛిద్రే, బహులేఽ ఇతి బహులే, ఉభేఽ ఇత్యుభే, వ్యచస్వతీఽ ఇతి వ్యచస్వతీ, సమ్, వసాథామ్, భృతమ్, అగ్నిమ్, పురీష్యమ్ ॥30॥

**పదార్థః** :-(శర్మ) గృహమ్ (చ) తత్సామగ్రీమ్ (స్థః) భవతః (వర్మ) సర్వతో రక్షణమ్ (చ) తత్సహాయాన్ (స్థః) (అచ్ఛిద్రే) అదోషే (బహులే) బహూనర్థాన్ లాన్తి యాభ్యాం తే (ఉభే) ద్వే (వ్యచస్వతీ) సుఖవ్యాప్తియుక్తే (సమ్) (వసాథామ్) ఆచ్ఛాదయతమ్ (భృతమ్) ధృతమ్ (అగ్నిమ్) (పురీష్యమ్) పాలనేషు సాధుమ్. ॥30॥

**అన్వయః** :-హే స్త్రీపురుషౌ! యువాం శర్మ చ ప్రాప్తౌ స్థః. వర్మ చోభే బహులే వ్యచస్వతీ అచ్ఛిద్రే విద్యుదన్తరిక్ష ఇవ స్థః. తత్ర గృహే పురీష్యమగ్నిం గృహీత్వా సంవసాథామ్. ॥30॥

**భావార్థః** :-గృహస్థైర్బ్రహ్మచర్యేణ సత్కారణోపకరణక్రియాకుశలాం విద్యాం సంగృహ్య బహుద్వారాణి సర్వర్తు సుఖప్రదాని సర్వతోఽభిరక్షాన్వితాన్యగ్న్యాదిసాధనోపేతాని గృహాణి నిర్మాయ. తత్ర సుఖేన వసితవ్యమ్. ॥30॥

**పదార్థము** :- ఓ స్త్రీపురుషులారా! మీ రుభయులు (శర్మ) గృహాశ్రమము (చ) మరియు దాని సామగ్రిని సమకూర్చుకొని (స్థ) ఉన్నారు (వర్మ) అన్నివైపులనుండి రక్షణను (చ) మరియు దాని సహకార పదార్థములను (ఉభే) ఉభయ [రెండు] (బహులే) బహుళార్థములను గ్రహించునవి (వ్యచస్వతీ) సుఖప్రాప్తితో గూడిన (ఛిద్రే) దోషరహిత విద్యుత్తు అంతరిక్షములవలె నుండు ధర్మకార్యములు ఏ గృహమున (స్థ) సున్నవో ఆ గృహమందు (భృతమ్) పోషణ (పురీషమ్) రక్షణయందుత్తమమగు (అగ్నిమ్) అగ్నిని గ్రహించి (సంవసాథామ్) చక్కగా నాచ్ఛాదనమొనర్చుకొని వసించుడు. ॥30॥

**భావార్థము** :-గృహస్థులు బ్రహ్మచర్యముతోగూడ సత్కార, ఉపకార, క్రియాకౌశలవిద్యలను గ్రహించి అనేక ద్వారములుగల, సకల దిశలనుండి, అన్ని ఋతువులందును రక్షించు అగ్ని మున్నగు సాధనములతో గూడియున్న గృహములను నిర్మించుకొని వానియందు సుఖపూర్వకముగ నివసించుడు. ॥30॥

30.O wife husband, ye have entered the domestic life with all its responsibilities, like the two faultless objects which are full of comforts, fit for service in many ways. There are in your house deeds of virtue and worldly gain which are the props of your domestic life.

Dwell peacefully in that house, making full use of the nourishing and protecting electricity.

४६०.సంవసాథామిత్యస్య గృత్సమద ఋషిః, జాయాపతీ దేవతే, విచృదనుష్టుప్ ఛందః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మదియే చెప్పబడినది.

४६० సంవసాథాం స్వర్విదా సమీచీఽఉరసా త్మనా। అగ్నిమన్తర్భరిష్యన్తీ జ్యోతిష్మన్తమజస్రమిత్ ॥30॥

ప.వి:- సమ్, వసాథామ్, స్వర్విదేతి స్వః + విదా, సమీచీఽ ఇతి సమీచీ, ఉరసా, త్మనా, అగ్నిమ్, అన్తః, భరిష్యన్తీఽ ఇతి భరిష్యన్తీ, జ్యోతిష్మన్తమ్, అజస్రమ్, ఇత్ ॥30॥

**పదార్థః** :- (సమ్) సమ్యక్ (వసాథామ్) ఆచ్ఛాదయతమ్ (స్వర్విదా) యౌ సుఖం విన్దతస్తౌ (సమీచీ) యౌ సమ్యగఞ్చతో విజానీతిస్తౌ (ఉరసా) అంతఃకరణేన (త్మనా) ఆత్మనా (అగ్నిమ్) విద్యుతమ్ (అన్తః) సర్వేషాం మధ్యే వర్తమానమ్. (భరిష్యన్తీ) సర్వాన్ పాలయన్తౌ (జ్యోతిష్మన్తమ్) ప్రశస్తజ్యోతిర్యుక్తమ్ (అజస్రమ్) నిరన్తరమ్ (ఇత్) ఏవ. ॥30॥

**అన్వయః** :- హే స్త్రీపురుషౌ! యువాం యది సమీచీ భరిష్యన్తీ స్వర్విదా సన్తౌ జ్యోతిష్మన్తమన్తరగ్నిమిత్ త్మనోరసాఽజస్రం సంవసాథాం తర్హి శ్రియమశ్నువాతామ్. ॥30॥

**భావార్థః**:- యే మనుష్యా విద్యుతముత్పాద్య స్వీకర్తుం శక్నువన్తి, న చ తే వ్యవహారే దరిద్రా భవన్తి. ॥30॥

**పదార్థము** :- ఓ స్త్రీ పురుషులారా! మీరిరువురు (సమీచీ) ఉత్తమముగ పదార్థములనెరిగి (భరిష్యన్తీ) సర్వమును పాలించువారలై (స్వర్విదా) సుఖములను పొందువారలై (జ్యోతిష్మన్తమ్) చక్కగా కలిసియున్న (అన్తః) సకల పదార్థములలో నున్న (అగ్నిమ్) విద్యుత్తును (ఇత్) మాత్రము (త్మనా) ఆత్మతోగూడ (ఉరసా) అంతఃకరణముతో (అజస్రమ్) నిరంతరము (సంవసాథామ్) చక్కగా వాచ్ఛాదనమొనర్చుకొనినచో సకలభాగ్యముల ననుభవించగలరు. ॥30॥

**భావార్థము** :- గృహస్థులగు మనుష్యులెల్లరును విద్యుత్తు నుత్పన్నమొనర్చి వినియోగించుకొనినవారు ఎప్పుడును దరిద్రులు గాజాలరు. ॥30॥

3. O wife and husband, ye full well knowers of objects, protectors of all, enjoyers of happiness, make use with your thinking faculty, of ceaseless, ever flowing brilliant, and all pervading electricity.

౪౬౨.పురీష్య ఇత్యస్య భారద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

విద్వాన్విద్యుతం కథముత్పాదయేదిత్యాహ.

విద్వాంసుడు విద్యుత్తును ఎటుల ఉత్పన్న మొనర్పవలెనను విషయమిందు గలదు.

౪౬౨ పురీష్యో౭సి విశ్వభరా౭ అథర్వా త్వా ప్రథమో నిరమన్థదగ్నే ।

త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత। మూర్ధ్నో విశ్వస్య వాఘతః ॥౩౨॥

ప.వి:- పురీష్యః, అసి, విశ్వభరా ఇతి విశ్వ+భరాః అథర్వా, త్వా, ప్రథమః, నిః, అమన్థత్ అగ్నే, త్వామ్, అగ్నే, పుష్కరాత్, అధి, అథర్వా, నిః, అమన్థత, మూర్ధ్నః, విశ్వస్య, వాఘతః॥౩౨॥

పదార్థః :- (పురీష్యః) పురీషేషు పశుషు సాధుః (అసి) (విశ్వభరాః) యో విశ్వం బిభర్తి సః (అథర్వా) అహింసకో విద్వాన్ (త్వా) త్వామ్ (ప్రథమః) ఆద్యః (నిః) నితరామ్ (అమన్థత్) (అగ్నే) సంపాదిత క్రియాకౌశల (త్వామ్) (అగ్నే) విద్వన్ (పుష్కరాత్) అన్తరిక్షాత్ (అధి) అథర్వా) హింసాదిదోషరహితః (నిః) అమన్థత) (మూర్ధ్నః) మూర్ధేవ వర్తమానస్య విశ్వస్య సమగ్రస్య సంసారస్య (వాఘతః) మేధావీ. వాఘత ఇతి మేధావి నామసు పఠితమ్ నిఘం. ౩.౧౫ ॥౩౨॥

అన్వయః :-హే అగ్నే విద్వన్! యో వాఘతో భవాన్ పురీష్యో౭సి, తం త్వా౭థర్వా ప్రథమో విశ్వభరా విశ్వస్య మూర్ధ్నో వర్తమానాత్పుష్కరాదధ్యగ్నిం నిరమన్థత్స ఐశ్వర్యమాప్నోతి. ॥౩౨॥

భావార్థః :- యే౭స్మిన్జగతి విద్వాంసో భవేయుస్తే సువిచారపురుషార్థాభ్యామగ్న్యాదివిద్యాం ప్రసిద్ధీకృత్య సర్వేభ్యః శిక్షేరన్.॥౩౨॥

పదార్థము:-(అగ్నే) క్రియాకౌశలమును సాధించిన విద్వాంసుడా! నీవు (వాఘతః) శాస్త్రవేత్తవు (పురీష్యః) పశువులకు సుఖమునిచ్చువాడవునై (అసి) ఉన్నావు. అట్టి (త్వా) నీకు (అథర్వా) రక్షకుడు (ప్రథమః) ఉత్తముడు (విశ్వభరాః) సర్వపోషకుడు నగు విద్వాంసుడు (విశ్వస్య) విశ్వమంతటనుండ

(మూర్ధ్నః) నున్న (పుష్కరాత్) అంతరిక్షమునుండి (అధి) సమీపమునవున్న అగ్నిని (నిరమన్థత్) సదా మంథన [మథన] మొనర్చి గ్రహించుచున్నట్లు ఆతడును ఐశ్వర్యముల పొందగలడు.॥32॥

భావార్థము :-ఈ ప్రపంచమున విద్వాంసులగువారు ఉత్తమ ఆలోచనలు మరియు పురుషార్థములచే అగ్ని మున్నగు పదార్థవిద్యను ప్రసిద్ధపరచి సకల మానవులకు శిక్షణ నీయవలయును.॥32॥

32.O learned person, well versed in religious lore, thou art the caretaker of cattle. The harmless, and advanced well read person, the nourisher of all, accepts thee, having derived electricity from the sky, high above the world.

౪౬౩. తముత్వేత్యస్య భారద్వాజ ఋషిః; అగ్నిర్దేవతా, నిచృద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౪౬౩ తము త్వా, దధ్యఙ్ఙృషిః పుత్రఽఈధేఽఅథర్వణః।

వృత్రహణం పురన్దరమ్ ॥33॥

ప.విః- తమ్, ఊ ఇత్యవ్యయం, త్వా, దధ్యఙ్, ఋషిః, పుత్రః ఈధే, అథర్వణః, వృత్రహణమ్, వృత్రహనమితి వృత్ర+హనమ్, పురన్దరమితి పురమ్+దరమ్ ॥33॥

పదార్థః:-(తమ్) (ఉ) వితర్కే (త్వా) త్వామ్ (దధ్యఙ్) యో దధీన్ సుఖధారకానగ్న్యాది పదార్థానఞ్చతి సః (ఋషిః) వేదార్థవిత్ (పుత్రః) పవిత్రః శిష్యః (ఈధే) ప్రదీపయేత్, అత్ర లోపస్త ఆత్మనేపదేష్వితి తకారలోపః (అథర్వణః) అహింసకస్య విదుషః (వృత్రహణమ్) యథా సూర్యో వృత్రం హన్తి తథా శత్రుహన్తారమ్ (పురందరమ్) యః శత్రూణాం పురాణి దృణాతి తమ్.॥33॥

అన్వయః:-హే రాజన్! యథాఽథర్వణః పుత్రో దధ్యఙ్ఙృషిరు సకలవిద్యావిద్వృత్రహణం పురన్దరమీధే తథాతం త్వా సర్వే విద్వాంసో విద్యావినయాభ్యాం వర్ధయన్తు.॥33॥

భావార్థః:-యే యాశ్చ సాఙ్గోపాఙ్గాన్వేదానధీత్య విద్వాంసో విదుష్యశ్చ భవేయుస్తే తాశ్చ రాజపుత్రాదీన్ రాజకన్యాదీంశ్చ విదుషో విదుషీంశ్చ సంపాద్య తాభిర్ధర్మేణ రాజప్రజావ్యవహారాన్ కారయేయుః.॥33॥

పదార్థము :- ఓ రాజా! ఎట్లు (అథర్వణః) రక్షకుడగు విద్వాంసుని (పుత్రః) పవిత్రశిష్యుడు (దధ్యఙ్) సుఖదాయకమగు అగ్ని మున్నగు పదార్థముల ప్రాప్తించుకొనినవాడు (ఋషిః) వేదార్థముల నెరిగినవాడు (ఉ) తర్కవితర్కములతోగూడ సంపూర్ణవిద్యల నెరిగినట్టి (వృత్రహణమ్) సూర్యునివలె శత్రుసంహారమున

భావార్థము:- కుమార కుమారీమణులు దీర్ఘబ్రహ్మచర్యమును సేవించి వేదవేదాంగములను సాంగోపాంగముగ చదివి తమప్రసన్నతా పూర్వకముగ స్వయంవర వివాహమాడి ఐశ్వర్యములకై ప్రయత్నించవలెను. ధర్మయుక్త వ్యవహారముచే వ్యభిచారములను దరిజేరనీయక ఉత్తమ సంతానము నుత్పన్నపరచి పరోపకారపరాయణులై యుండవలయును. అట్టివారే ఇహపరసౌఖ్యముల ననుభవించగలరు. ఇందుకు వ్యతిరిక్తముగ ప్రవర్తించువారికి ఆనందసుఖములు లభించజాలవు. ॥౫౬॥

**56.O men and women, just as all vedic sacred speech, deep like the sea, protector of the vedas and noble souls, master of supremacy, magnifies on battlefields, the best amongst the warriors, and adds to his glory, so shouldst ye magnify all!.**

౫౭౦.సమితమిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ వివాహం కృత్వా కథం వర్తితవ్యమిత్యాహ. వివాహమాడి ఎటుల ప్రవర్తింప వలెను?

౫౭౦ సమితꣳసంకల్పేథా॒ꣳ సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ।
ఇషమూర్జమభి సంవసానౌ॥౫౭॥

ప.వి:-సమ్, ఇతమ్, సమ్, కల్పేథామ్, సంప్రియావితి సమ్ + ప్రియౌ, రోచిష్ణూఇతి రోచిష్ణూ, సుమనస్య మానావితి సు + మనస్యమానౌ, ఇషమ్, ఊర్జమ్, అభి, సంవసానావితి సమ్ + వసానౌ ॥౫౭॥

పదార్థః:-(సమ్) ఏకీభావమ్ (ఇతమ్) ప్రాప్నుతమ్ (సమ్) సమానాభిప్రాయే (కల్పేథామ్) సమర్థయతామ్ (సంప్రియౌ) పరస్పరం సమ్యక్ప్రీతియుక్తౌ (రోచిష్ణూ) విషయాసక్తివిరహత్వేన దేదీప్యమానౌ (సుమనస్యమానౌ) సుమనసౌ సఖాయౌ విద్వాంసావివాచరన్తౌ (ఇషమ్) ఇచ్ఛామ్ (ఊర్జమ్) పరాక్రమమ్ అభి (సంవసానౌ) సమ్యక్ సువస్త్రాలంకారేణాచ్ఛాదితౌ.॥౫౭॥

అన్వయః:-హే వివాహితౌ స్త్రీ పురుషౌ! యువాం సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ సంవసానౌ సన్తావిషం సమితమూర్జమభి సంకల్పేథామ్.॥౫౭॥

భావార్థః :-యది స్త్రీపురుషౌ సర్వథా విరోధం విహాయాన్యోన్యస్య ప్రియాచరణే రతౌ విద్యావిచారయుక్తౌ సువస్త్రాలంకృతౌ భూత్వా ప్రయతేతాం తదా గృహే కల్యాణమారోగ్యం వర్ధేతామ్ యది చ విద్వేషిణౌ భవేతాం తదా దుఃఖసాగరే సంమగ్నౌ భవేతామ్.॥౫౭॥

**పదార్థము :-** వివాహిత స్త్రీపురుషులారా! మీరు (సం(ప్రియౌ) పరస్పరప్రేమగలవారు (రోచిష్ణూ) విషయాసక్తికి దూరముగనుండి ప్రకాశమానులు (సుమనస్యమానౌ) మిత్రులగు విద్వాంసులవలె నుండువారు (సంవసానౌ) సుందర వస్త్రాభూషణములతో గూడినవారై (ఇషమ్) కోరికలను (సమితమ్) సముచ్చయముగ పొందుడు. మరియు (ఊర్జమ్) పరాక్రమమును (అభి) సమ్ముఖమునదే (సంకల్పేథామ్) ఏకాభిప్రాయముగ సమర్పించుడు.॥౫౭॥

**భావార్థము :-** స్త్రీపురుషులు సదా వైరద్వేషములను వదలి పరస్పరము ప్రేమతత్పరులై యుండవలెను. విద్యాసమాలోచనలచే, సుందర వస్త్రాభూషణముల ధారణచే పురుషార్థపరులై ప్రయత్నము లొనర్చినచో గృహమునందు కల్యాణము, ఆరోగ్యములు పెంపొందును. ఇట్లుగాక పరస్పరము విరోధులై యుండినచో అవశ్యముగ దుఃఖసాగరమున మునిగెదరు.॥౫౭॥

57.O husband and wife, be dear to each other, shun sensuality, be one-minded, dress nicely. Attain together to your goal, and use your vigour for a common cause!.

౫౮.సంవామిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగుపరిష్టాద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అధ్యాపకోపదేశకా యావత్సామర్థ్యం తావద్ వేదార్థయుపదేశౌ కుర్యు రిత్యాహ.

అధ్యాపకోపదేశకులు శక్తికొలది వేదములను చదివించుము, ఉపదేశించవలెను.

౫౮ సం వాం మనా᳚ꣳసి సం వ్రతా సము చిత్తాన్యాకరమ్। అగ్నే పురీష్యాధిపా భవ త్వం నః ఇషమూర్జం యజమానాయ ధేహి ॥౫౮॥

ప. విః-సమ్, వామ్, మనా᳚ꣳ సి, సమ్, వ్రతా, సమ్, ఊం ఇత్యూం, చిత్తాని, ఆ, అకరమ్, అగ్నే, పురీష్య, అధిపా ఇత్యధి + పాః, భవ, త్వమ్, నః, ఇషమ్ ఊర్జమ్, యజమానాయ, ధేహి ॥౫౮॥

**పదార్థః :-**(సమ్) ఏకస్మిన్ ధర్మే (వామ్) యువయోః (మనాంసి) సంకల్పవికల్పాద్యా అంతఃకరణ వృత్తయః (సమ్) (వ్రతా) సత్యభాషణాదీని (సమ్) (ఉ) సముచ్చయే (చిత్తాని) సంజ్ఞప్తాని ధర్మ్యాణి కర్మాణి (ఆ) సమన్తాత్ (అకరమ్) కుర్యామ్ (అగ్నే) ఉపదేశకాచార్య (పురీష్య) పురీషేషు పాలకేషు వ్యవహారేషు భవస్తత్సంబుద్ధౌ (అధిపాః) అధికః పాలకః (భవ) (త్వమ్) (నః) అస్మాకమ్ (ఇషమ్) అన్నాదికమ్ (ఊర్జమ్) శరీరాత్మబలమ్ (యజమానాయ) ధర్మేణ సంగంతుం శీలాయ (ధేహి).॥౫౮॥

**అన్వయః** :- హే స్త్రీపురుషౌ! యథాఽహమాచార్యో వాం సంమనాంసి సంవ్రతా సంచిత్తాన్యాకరం తథా యువాం మమ ప్రియమాచరేతమ్, హే పురీష్యాగ్నే! త్వం నోఽధిపా భవ యజమానాయేషమూర్జం చ ధేహి. ॥౫౮॥

**భావార్థః** :- ఉపదేశకా యావచ్ఛక్యంతావత్ సర్వేషామేకధర్మమేకకర్మమేకనిష్ఠం తుల్యసుఖదుఃఖే యథా స్యాత్తథా శిక్షయేయుః. సర్వే స్త్రీపురుషా ఆప్తవిద్వాంసమేవోపదేష్టారమధ్యాపకం సేవేరన్ స చైతేషామైశ్వర్యపరాక్రమవృద్ధిం కుర్యాత్. నైకధర్మాదిభిర్వినాఽత్మసు సౌహార్దం జాయతే. నైతేన వినా సతతం సుఖం చ. ॥౫౮॥

**పదార్థము** :- ఓ స్త్రీపురుషులారా! ఆచార్యుడనగు నే నెట్లు (వామ్) మీ యిరువురి (సంమనాంసి) ఒకేధర్మమందు సంకల్ప వికల్పములు మున్నగు అంతఃకరణ వృత్తులను (సంవ్రతా) సత్యభాషణాదులు (ఉ) మరియు (సమ్, చిత్తాని) చక్కగా నెరిగిన కర్మలందు (అ) శ్రేష్ఠముగ (అకరమ్) ఒనర్చునట్లు మీరిరువురును నాకోరికప్రకారముగ నడుచుకొనుడు (పురీష్య) రక్షాయోగ్య వ్యవహారములందుండువాడా! (అగ్నే) ఉపదేశకా! ఆచార్యా, రాజా! (త్వమ్) నీవు (నః) మమ్ము (అధిపాః) ఉత్తమముగ రక్షించువాడవు (భవ) కమ్ము (యజమానాయ) ధర్మయుక్త సత్సంగ స్వభావశీలురగు స్త్రీపురుషులకై (ఇషమ్) అన్నాదులగు ఉత్తమ పదార్థములను మరియు (ఊర్జమ్) శారీరక, ఆత్మిక బలములను (ధేహి) ధారణమొనర్చుము. ॥౫౮॥

**భావార్థము** :- ఉపదేశకులు సాధ్యమైనంతవరకు మానవులెల్లరును ఒకే విధమగు ధర్మకర్మచిత్తవృత్తులు, సమాన సుఖదుఃఖములు గల్గియుండునట్లు ప్రయత్నించవలెను. స్త్రీపురుషులెల్లరును ఆప్తవిద్వాంసునే ఉపదేశకుడుగను, అధ్యాపకుడుగను స్వీకరించి సేవించవలయును. ఉపదేశకులగు ఆచార్యులు వీరి ఐశ్వర్యములను, పరాక్రమములను వృద్ధిపరచవలెను. మానవులందరకు ఒకేవిధమగు ధర్మము మున్నగునవి లేనిదే ఆత్మలందు మిత్రత్వము గలుగదు. మైత్రిలేనిదే సదా సుఖములు గలుగజాలవు. ॥౫౮॥

*58.* **Together have I brought your minds, your vows, and your thoughts. O teacher, our protector, be thou our guardian; give food, physical and spiritual strength to the sacrificer.**

**౫౯. అగ్నే త్వమిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.**

**కేఽధ్యాపనోపదేశాయ వియోజనీయా ఇత్యాహ.**

**చదివించుటకు, ఉపదేశించుటకు ఎవరిని వియుక్తపరచవలెను?**

## ౫౯. అగ్నే త్వం పురీష్యో రయిమాన్ పుష్టిమాఀ౨॥ఽ అసి శివాః కృత్వా దిశః సర్వాః స్వం యోనిమిహాసదః ॥౫౯॥

ప.వి:- అగ్నే, తమ్, పురీష్యః, రయిమానితి రయి + మాన్, పుష్టిమానితి పుష్టి + మాన్ అసి, శివాః, కృత్వా, దిశః, సర్వాః, స్వమ్, యోనిమ్, ఇహ, ఆ, అసదః ॥౫౯॥

**పదార్థః:-** (అగ్నే) ఉపదేశక విద్వన్! (త్వమ్) (పురీష్యః) ఏకమత్యపాలనేషు భవః (రయిమాన్) విద్యావిజ్ఞానధనయుక్తః (పుష్టిమాన్) ప్రశస్తశరీరాత్మబలసహితః (అసి) (శివాః) కల్యాణోపదేశయుక్తాః (కృత్వా) (దిశః) ఉపదేష్టవ్యాః ప్రజాః (సర్వాః) సమగ్రాః (స్వమ్) స్వకీయమ్ (యోనిమ్) సుఖసాధకం దుఃఖవిచ్ఛేదకముపదేశమ్ (ఇహ) అస్మిన్ సంసారే (ఆ) (అసదః) ఆస్వ.॥౫౯॥

**అన్వయః:-** హే అగ్నే! యతస్త్వమిహ పురీష్యో రయిమాన్ పుష్టిమానసి తస్మాత్సర్వా దిశః శివాః కృత్వా స్వం యోనిమాసదః.॥౫౯॥

**భావార్థః:-** రాజప్రజాజనైర్యేఽత్ర జితేన్ద్రియా ధార్మికాః పరోపకారప్రియా విద్వాంసో భవేయుస్తే ప్రజాసు ధర్మోపదేశాయ నియోజనీయాః. ఉపదేశకాశ్చ ప్రయత్నేన సర్వాన్ శిక్షయైకధర్మయుక్తాన్ సతత మవిరోధినః సుఖినః సంపాదయేయుః.॥౫౯॥

**పదార్థము :-** ఓ ఉపదేశకుడవగు విద్వాంసుడా! ఎవ్వనిచే (త్వమ్) నీవు (ఇహ) ఈ ప్రపంచమున (పురీష్యః) ఏకమతమును పాలించుటయందు తత్పరుడవు (రయిమాన్) విద్యా, విజ్ఞాన, ధనములతో గూడినవాడవు మరియు (పుష్టిమాన్) ప్రశంసనీయమగు శారీరక, ఆత్మిక బలములతో గూడి (అసి) ఉన్నావు. కావున (సర్వాః) సకల (దిశః) ఉపదేశించదగిన ప్రజలను (శివాః) కల్యాణప్రదమగు ఉపదేశముచే గూడిన వారుగ (కృత్వా) ఒనర్చి (స్వమ్) స్వంతమైన (యోనిమ్) సుఖదాయక, దుఃఖనాశక ఉపదేశగ్రహమును (ఆసదః) పొందుము.॥౫౯॥

**భావార్థము :-** ప్రజలకు ధర్మోపదేశము నొనర్చుటకొరకు జితేంద్రియుడు, ధర్మాత్ముడు, పరోపకారమునందు ప్రీతిగలిగియున్నట్టి విద్వాంసునిమాత్రమే రాజు మరియు ప్రజలు నియుక్తపరచవలెను. ఉపదేశకులు ప్రయత్న పూర్వకముగ సర్వప్రజలకు ఉత్తమ శిక్షను గరపి ఒకే ధర్మమునందుండి విరోధరహితులై నిరంతరము సుఖవంతులై యుండునట్లుజేయుట వారి ముఖ్యవిధియై యున్నది.॥౫౯॥

**59.O learned preacher, in this world, thou art the follower of one principle, wealthy, physically and spiritually strong. Having made all the people blest, stick to thy duty of preaching; thou giver of happiness, and the dispeller of miseries!.**

**౫౬౩. భుతన్న ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, దమ్పతీ దేవతా, ఆర్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.**

**పునః సర్వైర్విద్వత్ప్రదానాయాప్తా విద్వాంసః ప్రార్థనీయా ఇత్యాహ.**

**విద్యలను గఱపుటకై ఆప్తవిద్వాంసులను అందరు ప్రార్థించ వలయును.**

౨౭౩ భవతన్నః సమనసౌ సచేతసావరేపసౌ। మా యజ్ఞꣳ హిꣳసిష్టం మా యజ్ఞపతిం జాతవేదసౌ శివౌ భవతమద్య నః॥౬౦॥

ప.వి:- భవతమ్, నః, సమనసావితి స+మనసౌ, సచేతసావితి స+చేతసౌ, అరేపసౌ, మా, యజ్ఞమ్ హిꣳసిష్టమ్, మా, యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, జాతవేదసావితి జాత+వేదసౌ, శివౌ, భవతమ్, అద్య, నః॥౬౦॥

పదార్థః :-(భవతమ్) (నః) అస్మభ్యమ్ (సమనసౌ) సమానవిచారౌ (సచేతసౌ) సమానసంజ్ఞానౌ (అరేపసౌ) అనపరాధినౌ (మా) (యజ్ఞమ్) సంగంతవ్యం ధర్మమ్ (హింసిష్టమ్) హింస్యాతమ్ (మా) (యజ్ఞపతిమ్) ఉపదేశేన ధర్మరక్షకమ్ (జాతవేదసౌ) ఉత్పన్నాఽఖిలవిజ్ఞానౌ (శివౌ) మంగళకారిణౌ (భవతమ్) (అద్య) (నః) అస్మభ్యమ్. ॥౬౦॥

అన్వయః :-హే వివాహితౌ స్త్రీపురుషౌ! యువాం నః సమనసౌ సచేతసావరేపసౌ భవతమ్, యజ్ఞం మా హింసిష్టం యజ్ఞపతిం మా హింసిష్టమ్. అద్య నో జాతవేదసౌ శివౌ భవతమ్. ॥౬౦॥

భావార్థః :-స్త్రీపురుషజనైః సత్యోపదేశాయాధ్యాపనాయ పూర్ణవిద్యాః ప్రగల్భాః నిష్కపటా ఆప్తా నిత్యం ప్రార్థనీయా విద్వాంసస్తు సర్వేభ్య ఏవముపదిశేయుర్యతః సర్వే ధర్మాచారిణః స్యుః. ॥౬౦॥

పదార్థము:- వివాహితులగు స్త్రీపురుషులారా! మీరిరువురు (నః) మాకొరకు (సమనసౌ) ఏకమనస్సుగలవారు (సచేతసౌ) ఒకే జ్ఞానముగలవారు (అరేపసౌ) అపరాధరహితులు (భవతమ్) అగుడు, (యజ్ఞమ్) పొందదగిన ధర్మమును (మాహిꣳసిష్టమ్) నష్టపరచకుడు (యజ్ఞపతిమ్) ధర్మరక్షణ మొనర్చువారిని ఉపదేశములచే (మా) హింసించకుడు (అద్య) నేడే (నః) మాకొరకు (జాతవేదసౌ) సంపూర్ణ విజ్ఞానమును పొందువారలు (శివౌ) మంగళ ప్రదులు (భవతమ్) అగుడు. ॥౬౦॥

భావార్థము :- స్త్రీ పురుషులు సత్యోపదేశము మరియు అధ్యాపనముకొరకు సకల విద్యాప్రపూర్ణులు, ప్రతిభగలవారు నిష్కపటులునగు ధర్మాత్ములు, సత్యప్రియులగు విద్వాంసులను సదా ప్రార్థించుచు సేవించుచుండ వలయును. విద్వాంసులు సకలజనులు ధర్మాచరణగలవారగునట్లు ఉపదేశించుట యోగ్యము. ॥౬౦॥

**60.Be ye one-mined unto us, both of one thought, free from fault. Harm not the Dharma woth-attaining. Harm no him who preaches religion. Be ever gracious unto us, ye knowers of all knowledge.**

౫౨౪.మాతేవేత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, వహ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

మాతా కింవత్సంతానాన్ పాలయతీత్యాహ. తల్లులు తమ సంతానముల నెట్లు పాలకవలెను?

౫౨౪ మాతేవ పుత్రం పృథివీ పురీష్యమగ్నిꣳ స్వే యోనావభారుఖా। తాం విశ్వైర్దేవైర్ఋతుభిః సంవిదానః ప్రజాపతిర్విశ్వకర్మా వి ముఞ్చతు ॥౬౧॥

ప. విః-మాతేవేతి మాతా+ఇవ, పుత్రమ్, పృథివీ, పురీష్యమ్, అగ్నిమ్, స్వే, యోనౌ, అభాః, ఉఖా, తామ్, విశ్వైః, దేవైః ఋతుభిరిత్యృతు + భిః, సంవిదాన ఇతి సమ్+విదానః, ప్రజాపతిరితి ప్రజా + పతిః, విశ్వకర్మేతి విశ్వ + కర్మా, వి, ముఞ్చతు ॥౬౧॥

పదార్థః :-(మాతేవ) (పుత్రమ్) (పృథివీ) భూమివద్వర్తమానా విదుషీ స్త్రీ (పురీష్యమ్) పుష్టికరేషు గుణేషు భవమ్ (అగ్నిమ్) విద్యుతమివ సుప్రకాశమ్ (స్వే) స్వకీయే (యోనౌ) గర్భాశయే (అభాః) పుష్ణాతి ధరతి వా (ఉఖా) జ్ఞాతుమర్హా (తామ్) (విశ్వైః) సర్వైః (దేవైః) దివ్యైర్గుణైః సహ (ఋతుభిః) వసన్తాద్యైః (సంవిదానః) సమ్యగ్జ్ఞాపయన్ (ప్రజాపతిః) పరమేశ్వరః (విశ్వకర్మా) అఖిలోత్తమక్రియః (వి) విరుద్ధార్థే (ముఞ్చతు).॥౬౧॥

అన్వయః :-యోఖా పృథివీవద్వర్తమానా స్త్రీ స్వే యోనౌ పురీష్యమగ్నిం పుత్రం మాతేవాభా ధరతి తాం సంవిదానో విశ్వకర్మా ప్రజాపతిర్విశ్వైర్దేవైర్ఋతుభిః సహ సతతం దుఃఖాద్విముఞ్చతు పృథగ్రక్షతు.॥౬౧॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యథా జననీ స్వాపత్యముత్పాద్య పాలయతి తథైవ పృథివీ కారణస్థాం విద్యుతం ప్రకటయ్య రక్షతి. యథా పరమేశ్వరో యాథాతథ్యేన పృథివ్యాదిగుణాన్ జానాతి ప్రతినియతసమయమృత్వాదీన్ పృథివ్యాదీంశ్చ ధృత్వా స్వస్వనియతపరిధౌ చాలయిత్వా ప్రలయసమయే భినత్తి తథైవ విద్వద్భిర్యథాబుద్ధ్యైతాన్ విదిత్వా కార్యసిద్ధయే ప్రయతితవ్యమ్.॥౬౧॥

పదార్థము :-(ఉఖా) తెలిసికొనదగినదగు (పృథివీ) భూమివంటి క్షమాగుణముగల విదుషీస్త్రీ (స్వే) తన (యోనౌ) గర్భాశయమునందు (పురీష్యమ్) పుష్టికారకగుణములు గల (అగ్నిమ్) విద్యుత్తువంటి ఉత్తమ ప్రకాశముచే గూడిన గర్భరూపముగం (పుత్రమ్) పుత్రుని (మాతేవ) తల్లివలె (అభాః) పుష్టిపరచి ధారణమొనర్చునట్లు (తామ్) ఆమెను (సంవిదానః) ఉత్తమముగ బోధించుచు (విశ్వకర్మా) సర్వోత్తమ కర్మలొనర్చు (ప్రజాపతిః) పరమేశ్వరుడు (విశ్వైః) సమస్త (దేవైః) దివ్యగుణములను మరియు (ఋతుభిః)

వసంత ఋతువు మున్నగు సకల ఋతువులతోగూడ నిరంతరము దుఃఖములనుండి (వి ముఞ్చతు) విముక్తిగలిగించుగాక! ॥౬౧॥

భావార్థము :-ఈ మంత్రమందు ఉపమాలంకారము గలదు. తల్లి సంతానము నుత్పన్నమొనర్చి పోషించునట్లు పృథివి కారణరూప విద్యుత్తును ప్రసిద్ధపరచి రక్షణచేయును. పరమేశ్వరుడు పృథివి మున్నగువాని గుణములను చక్కగా నెరిగి నియతసమయములందు ఋతువులు ఏర్పరచి పృథివి మున్నగు వానిని ధారణమొనర్చి వానిని నియతపరిధులందు నడుపును ప్రళయకాలమునందు సర్వమును ఛిన్నాభిన్నముగ నొనర్చునట్లు విద్వాంసులు తమ బుద్ధిబలము ననుసరించి ఈ పదార్థములన్నిటి తత్త్వములను చక్కగా దెలిసికొని కార్యసిద్ధికొరకు చక్కని ప్రయత్నము నొనర్చవలెను.॥౬౧॥

61.The learned woman, calm like the earth, preserves in her womb. like a mother, the healthy and beautiful son.

May the Omniscient Gad, the source of all noble actions, relieve the child from pain, in all seasons, with His divine powers.

౫౭౨. అసున్వన్తమిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, నిర్ఋతిర్దేవతా, విచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

స్త్రియః కీదృశాన్పతీన్నేచ్ఛేయురిత్యాహ. స్త్రీ లెటువంటి పతిని స్వీకరించకూడదు?

౫౭౨ అసున్వన్తమయజమానమిచ్ఛ స్తేనస్యేత్యామన్విహి తస్కరస్య।

అన్యమస్మదిచ్ఛ సా త ఇ॒త్యా నమో దేవి నిర్ఋతే తుభ్యమస్తు ॥౬౨॥

ప. విః-అసున్వన్తమ్, అయజమానమ్, ఇచ్ఛ, స్తేనస్య, ఇత్యామ్, అను, ఇహి, తస్కరస్య, అన్యమ్, అస్మత్, ఇచ్ఛ, సా, తే, ఇత్యా, నమః, దేవి, నిర్ఋత ఇతి నిః + ఋతేః, తుభ్యమ్, అస్తు ॥౬౨॥

పదార్థః :-(అసున్వన్తమ్) అభిషవాదిక్రియానుష్ఠానరహితమ్ (అయజమానమ్) అదాతారం (ఇచ్ఛ) (స్తేనస్య) అప్రసిద్ధచోరస్య (ఇత్యామ్) ఏతుమర్హాం క్రియాం (అను) (ఇహి) గచ్ఛ (తస్కరస్య) ప్రసిద్ధచోరస్య (అన్యమ్) భిన్నం (అస్మత్) (ఇచ్ఛ) (సా) (తే) తవ (ఇత్యా) ఏతుమర్హా క్రియా (నమః) అన్నం (దేవి) విదుషి (నిర్ఋతే) నిత్యే సత్యాచారే పృథివీవద్వర్తమానే (తుభ్యం) (అస్తు) భవతు.॥౬౨॥

అన్వయః:-హే నిర్ఋతే దేవి! త్వమస్మత్స్తేనస్య తస్కరస్య సమ్బన్ధినం విహాయాన్యమిచ్ఛాసున్వన్తమయజమానం మేచ్ఛ. యామిత్యామన్విహి సేత్యా తేఽస్తు నమశ్చ తస్త్వై తుభ్యమస్తు.॥౬౨॥

భావార్థః :-హే స్త్రియః! యూయమపురుషార్థినః స్తేనస్యప్తినః పురుషాన్ పతీన్ మేచ్ఛత. అపినీతీన్ గృహ్ణీత యథా పృథివ్యనేకోత్తమఫలప్రదానేన జనాన్ రక్షయతి తథా భవత. ఏవంభూతాభ్యో యుష్మభ్యం వయం నమః కుర్మః.యథా వయమలసేభ్యః స్తేనేభ్యశ్చ పృథగ్ వర్తేమహి తథా యూయమపి వర్తధ్వమ్.॥౬౨॥

పదార్థము :-(నిఋుతే) పృథివివలె సదా సత్కారమున నుండు (దేవి) విదుషీమణీ! నీవు (అస్మత్)మాకు భిన్నముగనుండు (స్తేనస్య) అప్రసిద్ధుడగు దొంగను మరియు (తస్కరస్య) ప్రసిద్ధ చోరుని, వానితో సంబంధముగలవానిని వదలి (అన్యమ్) ఇతరుని (ఇచ్ఛ) వరించుము. మరియు (అసున్వన్తమ్) అభిషవము [యజ్ఞము] మున్నగు క్రియానుష్ఠానరహితుడు (అయజమానమ్) దానధర్మరహితుడగువానిని (ఇచ్ఛ) కోరకుము. మరియు (ఇత్యామ్) ఏ పొందదగిన క్రియను (అన్విహి) వెదకుదువో (సా) అట్టి (ఇత్యా) క్రియ (తే) నీదే యగుగాక! (తుభ్యమ్) నీకొరకు (నమః) అన్నము మరియు సత్కారము (అస్తు) కలుగుగాక!॥౬౨॥

భావార్థము :-ఓ స్త్రీలారా! మీరు పురుషార్థరహితుని, చోరసంబంధముగలవానిని పతిగా స్వీకరించకుడు. అట్టివంటి నీతిగల పురుషులను వరించుడు. పృథివి అనేక ఉత్తమ ఫలముల దానముచే మానవులను సంతృప్తిపరచునట్లు మీరును అగుడు. ఈ గుణములుగల మీకు మేము నమస్కరించుచున్నాము. మే మెట్లు చోరులు, సోమరులతో గలిసియుండమో మీరును అట్లేయుండుడు.॥౬౨॥

62.O learned woman, calm like the earth, seek some one else besides our relatives of thievish and plundering nature. Don't wish for an irreligious or uncharitable husband. Whatever course of action thou choosest, may that succeed. To thee be homage!.

౫౮౬.నమః సు త ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, నిరృతిర్దేవతా, భురిగార్షీ పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తాః కథం భవేయురిత్యాహ. ఈ స్త్రీలెట్లుండవలయును?

౫౮౬. నమః సు తే నిరృతే తిగ్మతేజోఽయస్మయం విచృతా బన్ధమేతమ్।

యమేన త్వం యమ్యా సంవిదానోత్తమే నాకేఽ అధి రోహయైనమ్ ॥౬౩॥

ప.విః-నమః, సు, తే, నిర్ఋత, ఇతి నిః+ఋతే, తిగ్మతేజ ఇతి తిగ్మ+తేజః, అయస్మయమ్, వి, చృత, బన్ధమ్, ఏతమ్, యమేన, త్వమ్, యమ్యా, సంవిదానేతి సమ్ + విదానా, ఉత్తమ ఇత్యుత్ + తమే, నాకే, అధి, రోహయ, ఏనమ్ ॥౬౩॥

పదార్థః :-(నమః) అన్నాదికమ్ (సు) (తే) తవ (నిఋృతే) నితరామృతం సత్యం యస్యాం తత్సమ్బుద్ధౌ (తిగ్మతేజః) తీవ్రాణి తేజాంసి యస్మాత్తత్ (అయస్మయమ్) సువర్ణాదిప్రకృతమ్. అయ ఇతి హిరణ్యనా... నిఘం. ౧.౨ (వి) (చృత) విముఞ్చ. ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (బన్ధమ్) బధ్నాతి యేన తం (ఏతమ్) యమేన న్యాయాధీశేన (త్వమ్) (యమ్యా) న్యాయకర్త్ర్యా (సంవిదానా) సమ్యక్కృతప్రతిజ్ఞా (ఉత్తమే) (నాకే) ఆనన్దే భోక్తవ్యే పతి (అధి) (రోహయ) (ఏనమ్).॥౬౩॥

అన్వయః :-హే నిరృతే! యస్యాస్తే తిగ్మతేజోఽయస్మయం నమోఽస్తి సా త్వమేతం బన్ధం సువిచృత. యమేన యమ్యా సహ చ సంవిదానా సత్యేనం పతిముత్తమే నాకేఽధిరోహయ.॥౬౩॥

భావార్థః :-హే స్త్రియః! యూయం యథేయం పృథివీ తేజః సువర్ణాన్నాదిసంబన్ధాస్తి తథా భవత యథా యుష్మాకం పతయో న్యాయాధీశా భూత్వా సాపరాధానపరాధినాం సత్యన్యాయేన వివేచనం కృత్వా సాపరాధాన్ దణ్డయంతి నిరపరాధినః సత్కుర్వన్తి యుష్మానుత్తమానానన్దాన్ ప్రదదతి తథా యూయమపి భవత. ॥౬౩॥

పదార్థము :-(నిఋృతే) సదా సత్యాచరణగల ఓ మహిళామణీ! (తే) ఏ నీకు (తిగ్మతేజః) తీవ్రమగు తేజస్సుగల (అయస్మయమ్) సువర్ణము మున్నగు (నమః) అన్నాదిపదార్థములు గలవో (త్వమ్) నీవు (ఏతమ్) ఈ (బంధమ్) బంధనహేతువగు అజ్ఞానమును (సు విచృత) చక్కగాఛేదించుము [తొలగించుము] (యమేన) న్యాయాధీశుడు మరియు (యమ్యా) న్యాయాధీశురాలితోగూడ (సంవిదానా) ఉత్తమ బుద్ధిగలదానవై (ఏనమ్) ఈ నీ పతితో (ఉత్తమే) ఉత్తమ (నాకే) ఆనందానుభవములందు (అధిరోహయ) ఆరూఢురాల వగుము. ॥౬౩॥

భావార్థము :-ఓ మహిళామణులారా! పృథివి అగ్ని, సువర్ణము, అన్నము మున్నగు పదార్థములతో సంబంధముంచుకొనునట్లు మీరును అగుడు. మీ పతులు న్యాయాధీశులై అపరాధులు, అనపరాధులునగు మనుష్యులను సత్యన్యాయములచే విచారించి అపరాధులను దండించి అనపరాధులను సత్కరించుచు మిమ్మత్యంతానందపరచునట్లు మీరును చేయుడు. ॥౬౩॥

63. O woman, the emodiment of true conduct, thine are the foodstuffs, and substances brilliant like gold; cut asunder ignorance, the source of bondage. In unanimity with yama and yami, uplift thy husband to the sublimest vault of happiness!.

౫౬౪. యస్యాస్త ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, నిఋృతిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

కస్మై ప్రయోజనాయ దమ్పతీ భవేతామిత్యుపదిశ్యతే.

ఎట్టి ప్రయోజనముకొరకై స్త్రీపురుషులు దంపతులుగా నుండవలయును?

౫౭౭ యస్యాస్తే ఘోర ఆసన్ జుహోమ్యేషాం బద్ధానామవసర్జనాయ। యాం త్వా జనో భూమిరితి ప్రమన్దతే నిర్ఋతిం త్వాహం పరి వేద విశ్వతః ॥౬౪॥

ప.వి:-యస్యాః, తే, ఘోరే, ఆసన్, జుహోమి ఏషామ్, బద్ధానామ్, అవసర్జనాయేత్యవ + సర్జనాయ, యామ్, త్వా, జనః, భూమిః, ఇతి, ప్రమన్దత ఇతి ప్ర + మన్దతే, నిర్ఋతిమితి నిః + ఋతిమ్, త్వా, అహమ్, పరి, వేద, విశ్వతః ॥౬౪॥

పదార్థః :-(యస్యాః) సువ్రతాయాః స్త్రియాః (తే) తవ (ఘోరే) భయానకే (ఆసన్) ఆస్యే ముఖే (జుహోమి) దదామి (ఏషామ్) వర్తమానానామ్ (బద్ధానామ్) దుఃఖకారకత్వేన నిరోధకానామ్ (అవసర్జనాయ) త్యాగాయ (యామ్)(త్వా) త్వామ్ (జనః)(భూమిః) (ఇతి) ఇవ (ప్రమన్దతే) ఆనన్దయతి (నిర్ఋతిమ్) భూమి మివ (త్వా) (అహమ్) (పరి) సర్వతః (వేద) జానీయామ్ (విశ్వతః) సర్వతః ॥౬౪॥

అన్వయః :-హే ఘోరే పత్ని! యస్యాస్త ఆసన్నేషాం బద్ధానామవసర్జనాయామృతాత్మకమన్నాదికం జుహోమి యో జనో భూమిరితి యాం త్వా ప్రమన్దతే తామహం విశ్వతో నిర్ఋతిమివ త్వా పరి వేద సా త్వమిత్థం మాం విద్ధి.॥౬౪॥

భావార్థః :-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా పతయః స్వానన్దాయ స్త్రియో గృహ్ణన్తి తథైవ తాస్మై స్త్రియోఽపి పతీన్ గృహ్ణీయుః, అత్ర గృహాశ్రమే పతివ్రతా స్త్రీ స్త్రీవ్రతః పతిశ్చ సుఖనిధిరివ భవతి. క్షేత్రభూతా స్త్రీ బీజరూపః పుమాన్ యద్యేతయోః శుద్ధయోర్బలవతోః సమాగమేనోత్తమా వివిధాః ప్రజా జాయేరఀస్తర్హి సర్వదా భద్రం భవతీతి వేద్యమ్.॥౬౪॥

పదార్థము :-(ఘోరే) దుష్టులకు భయమును గలిగించు ఓ మహిళా! (యస్యాః) ఏ చక్కని నియమములు గల (తే) నీయొక్క (ఆసన్) ముఖమునందు (ఏషామ్) ఇట్టి (బద్ధానామ్) దుఃఖదాయకులగు నీయడ్డుదగులువారిని (అవసర్జనాయ) త్యాజ్యమునకై అమృతరూప అన్నాదిపదార్థములను (జుహోమి) ఇచ్చుచున్నానో (జనః) మనుష్యులు (భూమిరితి) భూమివలె (యామ్) ఏ (త్వా) నిన్ను (ప్రమన్దతే) ఆనందపరచుదురో అట్టి నిన్ను (అహమ్) నేను (విశ్వతః) అన్నివైపులనుండి (నిర్ఋతిమ్) పృథివివలె (త్వా) నిన్ను (పరి) అన్నివిధముల (వేద) ఎరుగుదుముగాక! ఐతే నీవును ఈ విధముగనే నన్ను ఎరుగుము.॥౬౪॥

భావార్థము :-ఈ మంత్రమునందు ఉపమా వాచకలుప్తోపమాలంకారములు గలవు. పతులు తమ ఏ యానందముకొరకు స్త్రీలను గ్రహించుచున్నారో, అట్లే స్త్రీలును పతులను గ్రహించవలెను. ఈ

గృహస్థాశ్రమమువ పతివ్రతయగు స్త్రీ, స్త్రీవ్రతుడగు పతి సుఖవంతులైయుందురు. స్త్రీ పృథివిరూపము మరియు పురుషుడు బీజరూపుడైయుందురు. శుద్ధులు, బలవంతులువగు నీ దంపతుల సమాగమముచే ఉత్తములగు వివిధ సంతానము గలుగునప్పుడు సర్వదా కల్యాణము వృద్ధియగువని యెరుగవలయును.౹౬౪॥

64.O woman, awe-inspiring to the wicked, I put in thy mouth palatable food for the removal of thy physical ailments. People please thee invoking thee as Bhoomi. May I know thee in every way as the producer of good progeny, as earth produces foodstuffs!.

౧౨౬౫.యం తే దేవీత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, యజమానో దేవతా, ఆర్షీజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

వివాహసమయే కీదృశీః ప్రతిజ్ఞాః కుర్యురిత్యాహ. వివాహసమయమునందే యే ప్రతిజ్ఞల నొనర్పవలయును?

౧౨౬౫ యన్తే దేవీ నిర్ఋతిరాబబన్ధ పాశం గ్రీవాస్వవిచృత్యమ్।

తం తే విష్యామ్యాయుషో న మధ్యాదథైతం పితుమద్ధి ప్రసూతః।

నమో భూత్యై యేదం చకార ౹౬౫॥

ప.విః-యమ్, తే, దేవీ, నిర్ఋతిరితి నిః+ఋతిః, ఆబబన్ధేత్యా+బబన్ధ, పాశమ్, గ్రీవాసు, అవిచృత్యమిత్యవి + చృత్యమ్, తమ్, తే, వి, స్యామి, ఆయుషః, న, మధ్యాత్, అథ, ఏతమ్, పితుమ్, అద్ధి, ప్రసూత ఇతి ప్ర + సూతః, నమః, భూత్యై, యా, ఇదమ్, చకార ౹౬౫॥

పదార్థః :-(యమ్) (తే) తవ (దేవీ) దివ్యా స్త్రీ (నిర్ఋతిః) పృథివీవ (ఆబబన్ధ) సమన్తాద్బధ్నామి (పాశమ్) ధర్మ్యం బన్ధనమ్ (గ్రీవాసు) కణ్ఠేషు (అవిచృత్యమ్) అమోచనీయమ్ (తమ్) (తే) తవ (వి) (స్యామి) ప్రవిశామి (ఆయుషః) జీవనస్య (న) ఇవ (మధ్యాత్) (అథ) ఆనన్తర్యే (ఏతమ్) (పితుమ్) అన్నాదికమ్ (అద్ధి) భుఙ్క్ష్వ (ప్రసూతః) ఉత్పన్నః సన్ (నమః) సత్కారే (భూత్యై) ఐశ్వర్యకారికాయై (యా) (ఇదమ్) ప్రత్యక్షం నియమనమ్ (చకార) కుర్యాత్.౹౬౫॥

అన్వయః :-హే పతే! నిర్ఋతి రివాహం తే తవ యం గ్రీవాస్వవిచృత్యం పాశమాబబన్ధ తం తే తవాప్యహం విష్యామి, ఆయుషోఽన్నస్య న విష్యామి. అథావయోర్మధ్యాత్కశ్చిదపి నియమాత్ పృథఙ్ న గచ్ఛేత్. యథాఽహమేతం పితుమద్మి తథా ప్రసూతః సంస్త్వమేనమద్ధి. హే స్త్రి! యా దేవీ త్వమిదం పతివ్రతాధర్మేణ సుసంస్కృతం చకార తస్యై భూత్యై నమోఽహం కరోమి.౹౬౫॥

భావార్థః :-అత్రోపమాలంకారః. వివాహసమయే యావ్యభిచారాఖ్యాదీన్ నియమాన్ కుర్యు స్తేభ్యోఽన్యథా కదాచి న్నాచరేయుః. కుతః యదా పాణిం గృహ్ణాతి తదా పురుషస్య యావత్ స్వం తావత్సర్వం స్త్రియా యావత్ స్త్రియాస్తావదఖిలం పురుషస్యైవ భవతి, యది పురుషో వివాహితాం విహాయాఽన్యస్త్రీగో భవేత్ స్త్రీ చ పరపురుషగామినీ స్యాత్తావుభౌ స్తేనవత్పాపాత్మానౌ స్యాతామ్. అత స్త్రియా అనుమతిమన్తరా పురుషః పురుషాజ్ఞయా చ వినా స్త్రీ కించిదపి కర్మ న కుర్యాత్. ఇదమేవ స్త్రీపురుషయోః ప్రీతికరం కర్మ యదవ్యభిచరణమితి.॥౬౫॥

పదార్థము :-వధువు ఇట్లుచెప్పును:- (విబ్రుతిః) ఓ ఆర్యపుత్రా! పృథివివంటిదానను నేను (తే) నీయొక్క (గ్రీవాసు) కంఠమున (అవిచృత్యమ్) వదలివేయదగని (యమ్) ఎట్టి (పాశమ్) ధర్మయుక్త బంధనమును (ఆయుషః) ఆయువునకు సాధనమగు అన్నము (న) వలె (వి. స్యామి) ప్రవేశించుచున్నానో అట్లు (అథ) దీనితరువాత (మధ్యాత్) మనమిరువురమును ఎప్పుడును నియమవిరుద్ధముగ నడవరాదు. నే నెట్లు (ఏతమ్) ఇట్టి (పితుమ్) అన్నాది పదార్థముల ననుభవించుచుందునో అట్లే (ప్రసూతః) ఉత్పన్నమైన నీ యన్నాదిపదార్థములను నీవును (అద్ధి) అనుభవించుము. ఓ మహిళామణీ! (యా) ఏ (దేవీ) దివ్యగుణములు గలిగిన నీవు (ఇదమ్) ఇట్టి పతివ్రతరూప ధర్మముచే సంస్కరింపబడిన ప్రత్యక్షనియమములను (చకార) ఆచరించెదవో అట్టి (భూత్యై) ఐశ్వర్యవంతురాలవగు నీకొరకు (నమః) అన్నాది పదార్థముల నిత్తును.॥౬౫॥

భావార్థము :- ఈ మంత్రమునందుపమాలంకారము గలదు. వివాహకాలమున వ్యభిచారత్యాగము మున్నగు నియమములగూర్చి చేసిన ప్రతిజ్ఞల నెన్నడును మరువగూడదు. వివాహమున పాణిగ్రహణమున స్త్రీ హస్తమును పురుషుడు గ్రహించునప్పుడే పురుషునకున్న సకలసంపత్తి యంతయు స్త్రీది, మరియు స్త్రీకున్న సర్వసంపదలన్నియు పురుషునివిగా పెంచబడినవి. వివాహితస్త్రీని వదలి పురుషుడు, పురుషుని వదలి స్త్రీయును, పరస్త్రీ పర పురుషుల నభిలషించినచో వారిరువురు చోరులవలె పాపాత్ము లగుచున్నారు. కావున ఇట్టివానికి దూరముగానుండి ఇరువురును పరస్పరానుమతి లేనిదే ఏ కార్యమును చేయకూడదు. స్త్రీపురుషులు ఎల్లవేళలందును మనోవాక్కాయకర్మలద్వారా వ్యభిచరించకుండుటయే పరస్పరప్రేమను వృద్ధిపరచునవిగా యున్నవి.॥౬౫॥

65.O husband, clam like the earth, I fasten on thy neck, the unbreakable binding noose of pure married life. The same do I fasten unto me for thee. I enter this life for longevity. Let none of us disobey the law of domestic life. Eat thou young man this food, which I eat!.

O wife, the embodiment of virtue, follow stricly the duties of married life. I give thee foodstuffs for the prosperity!.

**౬౬. యేనేద ఇత్యస్య విశ్వామిత్రఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.**

**కీదృశౌ స్త్రీపురుషౌ గృహాశ్రమం కర్తుం యోగ్యౌ భవేతామిత్యాహ.**

ఎట్టి స్త్రీపురుషులు గృహాశ్రమ మొనర్చుటకు యోగ్యులు?

౨౫౫ నివేశనః సఙ్గమనో వసూనాం విశ్వా రూపాఽభిచష్టే శచీభిః॥

దేవఽ ఇవ సవితా సత్యధర్మేన్ద్రో న తస్థౌ సమరే పథీనామ్ ॥౬౬॥

ప.వి:- నివేశన ఇతి నిఽవేశనః, సఙ్గమన ఇతి సమ్ + గమనః వసూనామ్, విశ్వా, రూపా, అభి, చష్టే, శచీభిః దేవ ఇవేతి దేవః + ఇవ, సవితా, సత్యధర్మేతి సత్యధర్మా, ఇన్ద్రః, న, తస్థౌ, సమర ఇతి సమ్ + అరే, పథీనామ్ ॥౬౬॥

పదార్థః :-(నివేశనః) యః స్త్రియాం నివిశతే (సంగమనః) సమ్యగ్గన్తా (వసూనామ్) పృథివ్యాదీనాం పదార్థానాం (విశ్వా) సర్వాణి (రూపా) రూపాణి (అభి) (చష్టే) పశ్యతి (శచీభిః) ప్రజ్ఞాభిః కర్మభిర్వా (దేవ ఇవ) యథేశ్వరః (సవితా) సకలజగతః ప్రసవితా (సత్యధర్మా) సత్యో ధర్మో యస్య సః (ఇన్ద్రః) సూర్యః (న) ఇవ (తస్థౌ) తిష్ఠేత్ (సమరే) సంగ్రామే. సమర ఇతి సంగ్రామ నా. ౨..౧౭. (పథీనామ్) గచ్ఛతామ్. ॥౬౬॥

అన్వయః:- యః సత్యధర్మా సవితా దేవ ఇవ నివేశనః సంగమనః శచీభిర్వసూనాం విశ్వా రూపాఽభిచష్టే, ఇన్ద్రో న సమరే పథీనాం సమ్ముఖే తస్థౌ స ఏవ గృహాశ్రమాయ యోగ్యో జాయతే. ॥౬౬॥

భావార్థః:- అత్రోపమాలంకారః. మనుష్యా యథేశ్వరేణ మనుష్యోపకారాయ కారణాత్కార్యాఖ్యా అనేకే పదార్థా రచితా ఉపయుజ్యన్తే యథా సూర్యో మేఘేన సహ యుద్ధాయ వర్తతే తథా సృష్టిక్రమవిజ్ఞానేన సుక్రియయా చ భూమ్యాదిపదార్థేభ్యో ఽనేకే వ్యవహారాః సంపాదనీయాః. ॥౬౬॥

పదార్థము :- ఎవడు (సత్యధర్మా) సత్యధర్మములతో గూడి (సవితా) సకలజగదుత్పాదకుడగు (దేవ ఇవ) పరమేశ్వరునివలె (నివేశనః) స్త్రీకి సఖుడు (సఙ్గమనః) శీఘ్రగతిగలవాడునై (శచీభిః) బుద్ధి మరియు కర్మలచే (వసూనామ్) పృథివి మున్నగు పదార్థముల (విశ్వా) సమస్త (రూపా) రూపములను (అభిచష్టే) చూచుచుండునో (ఇన్ద్రః) సూర్యుని (న) వలె (సమరే) యుద్ధములందు (పథీనామ్) తిరుగుచుండు మనుష్యులవలె (తస్థౌ) స్థిరముగలవాడై యుండునో అట్టివాడే గృహాశ్రమమునకు యోగ్యుడగుచున్నాడు. ౬౬॥

భావార్థము :- ఈ మంత్రములో రెండుపమాలంకారములు గలవు. పరమేశ్వరుడు సకల ప్రాణుల ఉపకారమునకై కారణమునుండి కార్యరూపమగు అనేక పదార్థములను సృజించి ఎట్లుపకార మొనర్చుచున్నాడో,

సూర్యుడు మేఘముతో పోరాడి జగత్తున కుపకార మెట్లొనర్చుచుండునో, అట్లే మానవులెల్లరును రచనాక్రమముయొక్క విజ్ఞానముద్వారా, చక్కని క్రియలద్వారా పృథివి నున్నగు పదార్థములచే అనేక వ్యవహారముల సిద్ధిపరచుకొని ప్రజలకు సౌఖ్యముల గలిగించవలెను. ॥౬౬॥

**66.He alone is fit to lead a married life, who, like God, the Creator of the universe, and master of eternal laws, keeps constant company with his wife and behaves properly, who, like the sun, opposes the warriors on the battle-fields.**

౫౮౦.సీరా ఇత్యస్య విశ్వామిత్రఋషిః, కృషీవలాః కవయో వా దేవతాః, గాయత్రీఛన్దః, షడ్జః స్వరః.

అథ కృషియోగవిద్యా ఆహ.

వ్యవసాయయోగ విద్యను చెప్పుచున్నాడు.

౫౮౦ సీరా యుఞ్జన్తి కవయో యుగా వితన్వతే పృథక్।

ధీరా దేవేషు సుమ్నయా ॥౬౭॥

ప.వి:-సీరా, యుఞ్జన్తి, కవయః, యుగా, వి, తన్వతే, పృథక్, ధీరాః, దేవేషు, సుమ్నయేతి సుమ్న + యా॥౬౭॥

పదార్థః :- (సీరా) సీరాణి హలాని (యుఞ్జన్తి) యుఞ్జన్తు (కవయః) మేధావినః కవిరితి మేధావి నా..3.౧౫॥ (యుగా) యుగాని (వి)(తన్వతే) విస్తృణన్తి (పృథక్)(ధీరాః) ధ్యానవన్తః (దేవేషు) విద్వత్సు (సుమ్నయా) సుమ్నేన సుఖేన. అత్ర తృతీయైకవచనస్యాయాదేశః. ॥౬౭॥

అన్వయః :-హే మనుష్యాః! యథా ధీరాః కవయః సీరా యుగా చ యుఞ్జన్తి సుమ్నయా దేవేషు పృథగ్ వితన్వతే తథా సర్వైరేతదనుష్ఠేయమ్ ॥౬౭॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. మనుష్యైరిహ విద్వచ్ఛిక్షయా కృషికర్మానుష్ఠేయం యథా యోగినో నాడీషు పరమేశ్వరం సమాధియోగేనోపకుర్వన్తి తథైవ కృషికర్మద్వారా సుఖోపయోగః కర్తవ్యః. ॥౬౭॥

పదార్థము :- ఓ మానవులారా! ఎట్లు (ధీరాః) ధ్యానశీలురు (కవయః) బుద్ధిశాలురు (సీరాః) నాగళ్లను (యుగా) కాడి మున్నగువానివి (యుఞ్జన్తి) కూర్చుచున్నారో మరియు (సుమ్నయా) సుఖముగా (దేవేషు) విద్వాంసులందు (పృథక్) వేరుగ (వితన్వతే) విస్తారపరచుచున్నారో అట్లే ఎల్లరును ఈ కృషి [వ్యవసాయ] కర్మను చక్కగా నమష్ఠించవలయును. ॥౬౭॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. యోగులు నాడులందు సమాధి యోగముచే పరమాత్మను పొందునట్లు మానవులు విద్వాంసుల శిక్షణచే భూమియందు కృషి కర్మను వృద్ధిపరచుట వారి ముఖ్యవిధియై యున్నది. ౬౭॥

67.The intelligent ply the ploughs. The wise for the comfort of the learned, carry the yokes in different directions.

౬౮. యునక్తేత్యస్య విశ్వావసుర్ఋషిః, కృషీవలాః కవయో వా దేవతాః, విరాడార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మంత్రం పైవిషయమే.

౬౮ యునక్త సీరా వి యుగా తనుధ్వం కృతే యోనౌ వపతేహ బీజమ్।

గిరా చ శ్రుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్సృణ్యః పక్వమేయాత్ ॥౬౮॥

ప.వి:- యునక్త, సీరా, వి, యుగా, తనుధ్వమ్, కృతే, యోనౌ, వపత, ఇహ, బీజమ్, గిరా, చ, శ్రుష్టిః, సభరా ఇతి స + భరాః, అసత్, నః, నేదీయః, ఇత్, సృణ్యః, పక్వమ్, ఆ, ఇయాత్॥౬౮॥

పదార్థః :-(యునక్త) యుఙ్క్తమ్ (సీరా) హలాదీని కృష్యుపకరణాని నాడీర్వా (వి) వివిధార్థే (యుగా) యుగాని (తనుధ్వమ్) విస్తృణీత (కృతే) హలాదిభిః కర్షితే యోగాఙ్గైర్నిష్పాదితేఽన్తఃకరణే వా (యోనౌ) క్షేత్రే (వపత) (ఇహ) అస్యాం భూమౌ బుద్ధౌ వా (బీజమ్) యవాదికం సిద్ధిమూలం వా (గిరా) కృషి యోగ కర్మోపయుక్తయా సుశిక్షితయా వాచా (చ) స్వనువిచారేణ (శ్రుష్టిః) శీఘ్రమ్. శ్రుష్టీతి క్షిప్రనామాసు అష్టీతి. నిరు. ౬.౧౨. (సభరాః) సమానధారణపోషణాః (అసత్) అస్తు (నః) అస్మాన్ (నేదీయః) అతిశయేనాన్తికమ్ (ఇత్) ఏవ (సృణ్యః) యాః క్షేత్రయోగాన్ గతా యవాదిజాతయః (పక్వమ్) (ఆ) (ఇయాత్) ప్రాప్నుయాత్ ॥౬౮॥

అన్వయః :- హే మనుష్యాః యూయమిహ సాధనాని వితనుధ్వం సీరా యుగా యునక్త. కృతే యోనౌ బీజం వపత గిరా చ సభరాః శ్రుష్టిర్భవత యాః సృణ్యః సన్తి తాభ్యో యన్నేదీయోఽసత్ పక్వం భవేత్తదిదేవ న ఏయాత్. ౬౮॥

భావార్థః :- హే మనుష్యాః యూయం విద్వద్భ్యః కృషీవలేభ్యశ్చ కృషియోగకర్మశిక్షాం ప్రాప్యానేకాని సాధనాని సంపాద్య కృషిం యోగం చ కురుత. యస్మాద్యద్యత్పక్వం స్యాత్తత్తద్ గృహీత్వోపభుఙ్క్ష్వం భోజయత వా. ౬౮॥

పదార్థము :- ఓ మానవులారా! మీరు (ఇహ) ఈభూమి మరియు బుద్ధియందు సాధనములను (వితనుధ్వమ్) అనేకవిధములుగ విస్తారపరచుడు (సీరా) కృషిసాధనములగు నాగళ్ళు, నాడులు ము్న్నగువానిని (యుగా) కాడులకు (యునక్త) పూన్పుడు [కలుపుడు] (కృతే) హలము మున్నగు వానిచే దున్నిన లేక యోగాంగములతో శుద్ధపరచబడిన అంతఃకరణమను (యోనౌ) భూమియందు (బీజమ్) యవలు [గోధుమలు] లేక సిద్ధియొక్క మూలమును (వపత) నాటుడు (గిరా) క్షేత్ర [కృషి] విషయక కర్మల కుపయోగమగు సుశిక్షిత వాణి (చ) మరియు ఉత్తమాలోచనంద్వారా (సభరాః) ఒకేవిధమగు ధారణపోషణములతో గూడినవారుగ (శ్రుష్టిః) శీఘ్రముగ నగుడు (సృణ్యః) చేలయందుత్పన్నమైన యవాది అన్నజాతుల పదార్థములనుండి (నేదీయః) అతిసమీపస్థ (పక్వమ్) పక్వమగు (ఆసత్) దానిని (ఇత్) మాత్రమే (నః) మాకొరకు (అ ఇయాత్) లభింపజేయుదురుగాక!॥౬౮॥

భావార్థము :- ఓ మానవులారా! విద్వాంసులద్వారా యోగాభ్యాసము, కర్షక నిపుణులద్వారా కర్షకవిద్యను పొంది అనేక సాధనోపసాధనములను నిర్మించుకొని వ్యవసాయ, యోగాభ్యాసముల నొనర్చుడు. అందుత్పన్నమైన పక్వపదార్థములను పొంది మీరు భుజించి, ఇతరుల భుజింపజేయుడు. ॥౬౮॥

68.O people, use various implements fot cultivating the earth. Employ poughs and yokes. Sow seed in a well prepared field. With the knowledge of the science of agriculture and full consideration, be quick to sustain and nourish yourselves. May we get the corn fully grown and ripened in the near fields!.

౬౯.శునమిత్యస్య కుమారహారిత ఋషిః, కృషీవలా దేవతాః, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యదియే.

౬౯ శునం౯ సు ఫాలా వి కృషన్తు భూమి౯ం శునం కీనాశా౨ఽ అభి యన్తు వాహైః॥
శునాసీరా హవిషా తోశమానా సుపిప్పలా౨ఽ ఓషధీః కర్తనాస్మే ॥౬౯॥

ప.విః-శునమ్, సు, ఫాలాః, వి, కృషన్తు, భూమిమ్, శునమ్, కీనాశాః, అభి, యన్తు, వాహైః, శునాసీరా, హవిషా, తోశమానా, సుపిప్పలా ఇతి సు౹పిప్పలాః, ఓషధీః, కర్తన, అస్మే ఇత్యస్మే॥౬౯॥

పదార్థః :-(శునమ్) సుఖమ్, శునమితి సుఖనా.. నిఘం.౩.౬ (సు) (ఫాలాః) ఫలన్తి విస్తీర్ణాం భూమిం కుర్వన్తి యైస్తే (వి) (కృషన్తు) విలిఖన్తు (భూమిమ్) (శునమ్) సుఖమ్ (కీనాశాః) యే క్రమేణ

క్లిశ్యన్తి తే కృషీవలాః అత్ర క్లిశేరిచ్చోపధాయాః కన్ లోపశ్చ లోనామ్ చ.ఉ. ౫.౫౬ ఇతి క్లిశధాతోః కని ప్రత్యయే లోప ఉపధాయా ఈత్వం ధాతోర్నామాగమశ్చ (అభి) (యన్తు) ప్రాప్నువన్తు (వాహైః) వహన్తి యైస్తై ర్వృషభాదివాహనైః (శునాసీరా) యథా వాయుసూర్యౌ, శునాసీరా శునో వాయుః సరత్యన్తరిక్షే సీర ఆదిత్యః సరణాత్, నిరు, ౯-౪౦ (హవిషా) సంస్కృతేన ఘృతాదినా సంస్కృతౌ (తోశమానా) సన్తుష్టికారౌ. అత్ర వర్ణవ్యత్యయేన శః, వికరణాత్మనేపదవ్యత్యయౌ చ (సుపిప్పలాః) శోభనాని పిప్పలాని ఫలాని యాసు తాః (ఓషధీః) యవాదీన్ (కర్తన) కుర్వన్తు (అస్మై) అస్మభ్యమ్. ॥౬౯॥

అన్వయః :-యే కీనాశాస్తే ఫాలా వాహైః సహ వర్తమానైర్హలాదిభిర్భూమిం వికృషన్తు శునమభియన్తు. హవిషా తోశమానా శునాసీరావస్మై సుపిప్పలా ఓషధీః కర్తన తాభిః సు శునం చ. ॥౬౯॥

భావార్థః :- యే చతురాః కృషికారా గోవృషభాదీన్ సంరక్ష్య విచారేణ కృషిం కుర్వన్తి తేఽత్యన్తం సుఖం లభన్తే. నాత్ర క్షేత్రేఽమేధ్యం కించిత్ప్రక్షేప్యమ్. కింతు బీజాన్యపి సుగన్ధ్యాదియుక్తాని కృత్వైవ వపన్తు యతో ఉన్నాన్యారోగ్యకరాణి భూత్వా బలబుద్ధీ వర్ధయేయుః. ॥౬౯॥

పదార్థము :-(కీనాశాః) పరిశ్రమచే క్లేశమనుభవించు కృషీవలురు (ఫాలాః) భూమినిదున్ను నాగళ్లచే (వాహైః) ఎద్దులుమున్నగువానితో గూడిన నాగళ్లచే (భూమిమ్) భూమిని (వికృషన్తు) దున్నెదరుగాక! మరియు (శునమ్) సుఖమును (అభి యన్తు) పొందెదరుగాక! (హవిషా) శుద్ధపరచబడిన ఘృతాదులచే శుద్ధము (తోశమానా) సంతసముగలిగించు (శునాసీరా) వాయువు, సూర్యులవంటి కృషిసాధనములు (అస్మై) మాకొరకు (సుపిప్పలాః) మధురఫలములతోగూడ (ఓషధీః) యవలు మున్నగువానిని (కర్తన) పండించి, ఆ యోషధులచే (సు) చక్కని (శునమ్) సుఖముల ననుభవించవలెను. ॥౬౯॥

భావార్థము :- చతురులగు కృషీవలురు గోవులు, ఎద్దులు మున్నగువానిని చక్కగా రక్షించి ఆలోచనా పూర్వకముగ కృషియొనర్చినవారు అత్యంతసుఖమును పొందుదురు. ఈ పంటచేలయందు విష్ఠ [మలాదులు] మున్నగు మలినపదార్థములను వేయవలదు. కాని బీజములు సుగంధాదులచే గూడినవైనవి విత్తవలయును. వానిచే నుత్పన్నమగు అన్నాదులు రోగరహితమై బుద్ధిబలములను పెంపొందించును. ॥౬౯॥

69.Happily let the plughshares turn up the plough land, happily go the hard-working ploughеds with the oxen. O air and sun, nourishing the earth with water, cause ye our plants bear abundant fruit!.

౫౭౩. ఘృతేనేత్యస్య కుమారహారిత ఋషిః, కృషీవలా దేవతాః ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౫౭౩ ఘృతేన సీతా మధునా సమజ్యతాం విశ్వైర్దేవైరనుమతా మరుద్భిః।

ఊర్జస్వతీ పయసా పిన్వమానాస్మాన్త్సీతే పయసాభ్యా వవృత్స్వ ॥౭౦॥

ప.వి:-ఘృతేన, సీతా, మధునా, సమ్, అజ్యతామ్, విశ్వైః, దేవైః, అనుమతేత్యను + మతా, మరుద్భిరితి మరుత్ + భిః, ఊర్జస్వతీ, పయసా, పిన్వమానా అస్మాన్, సీతే, పయసా, అభి, ఆ, వవృత్స్వ ॥౭౦॥

పదార్థః :- (ఘృతేన) ఆజ్యేన (సీతా) సాయన్తి క్షేత్రస్థలోష్ఠాన్ క్షయన్తి యయా సా కాష్ఠపట్టికా (మధునా) క్షౌద్రేణ శర్కరాదినా వా (సమ్) ఏకీభావే (అజ్యతామ్) సంయుజ్యతామ్ (విశ్వైః) సర్వైః (దేవైః) అన్నాది కామయమానైర్విద్వద్భిః (అనుమతా) అనుజ్ఞాపితా (మరుద్భిః) మనుష్యైః (ఊర్జస్వతీ) ఊర్జః పరాక్రమసమ్బన్ధో విద్యతే యస్యాః సా (పయసా) జలేన దుగ్ధేన వా (పిన్వమానా) సిక్తా సేవితా (అస్మాన్) (సీతే) సీతా (పయసా) జలేన (అభి) (ఆ) (వవృత్స్వ) వర్తితా భవతు ॥ ౭౦ ॥

అన్వయః:-విశ్వైర్దేవైర్మరుద్భిర్యస్మాభిరనుమతా పయసోర్జస్వతీ పిన్వమానా సీతా ఘృతేన మధునా సమజ్యతామ్. సా సీతే సీతాస్మాన్ ఘృతాదినా సంయోజ్యతీతి పయసాఽభ్యావవృత్స్వ అభ్యావర్త్యతామ్. ॥౭౦॥

భావార్థః :-సర్వే విద్వాంసః కృషీవలా విద్యయానుజ్ఞాతా ఘృతమధుజలాదినా సుసంస్కృతా మనుమతాం క్షేత్రభూమిమన్నసుసాధికాం కుర్వన్తు యథా సుగన్ధాదియుక్తాని బీజాని కృత్వా వపన్తి తథైవ తామపి సుగన్ధేన సంస్కృతాం కుర్వన్తు. ॥ ౭౦ ॥

పదార్థము :-(విశ్వైః) సమస్త (దేవైః) అన్నాదిపదార్థముల వివ్వగించు విద్వాంసులగు (మరుద్భిః) మానవుల (అనుమతా) ఆజ్ఞచే ప్రాప్తించిన (పయసా) జలముల మరియు దుగ్ధములచే (ఊర్జస్వతీ) పరాక్రమ సంబంధముగల (పిన్వమానా) సేచనము, సేవన మొనర్చబడిన (సీతా) నాగలిచాలును (ఘృతేన) నేయి, (మధునా) తేనె మరియు శర్కరాదులచే (సమజ్యతామ్) సంయుక్తపరచుడు (సీతే) నాగటిచాలు (అస్మాన్) మనలను ఘృతాది పదార్థములచే సంయుక్తపరచగలదు. కావున (పయసా) జలములచే (అభ్యావవృత్స్వ) మాటిమాటికి వర్తింపజేయుడు. ॥౭౦॥

భావార్థము :-విద్వాంసులగు సమస్త కృషీవలురు విద్యల కనుకూలముగ ఘృతము, మధువు, జలాదులచే సంస్కరించి సిద్ధపరచిన పంటభూమిని ఉత్తమాన్నముల నుత్పన్నమొనర్చునదిగా జేయవలెను. విత్తనములను సుగంధాదులచే మిశ్రితపరచి విత్తునట్లు ఈ భూమినికూడ సంస్కారయుక్త మొనర్చుడు. ॥౭౦॥

**70.Approved by all the learned persons, strengthened and sprinkled with water and milk, the furrow be balmed with butter and honey. The furrow will give us ghee so we should water it again and again.**

౨౮. లాఙ్గలమిత్యస్య కుమారహారిత ఋషిః, కృషీవలా దేవతా, విరాట్పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మరల విషయ మదియే.

౨౮ లాఙ్గలం పవీరవత్సుశేవꣳ సోమపిత్సరు। తదుద్వపతి
గామవిం ప్రఫర్వ్యం చ పీవరీం ప్రస్థావద్రథవాహనమ్ ॥౨౮॥

ప. వి:- లాఙ్గలమ్, పవీరవత్, సుశేవమితి సు+శేవమ్, సోమపిత్సర్వితి సోమపిత్ + సరు, తత్, ఉత్, వపతి, గామ్, అవిమ్, ప్రఫర్వ్యమితి ప్ర + ఫర్వ్యమ్, చ, పీవరీమ్, ప్రస్థావదితి ప్రస్థ + వత్, రథవాహనమ్, రథవాహనమితి రథ + వాహనమ్ ॥౨౮॥

పదార్థః :-(లాఙ్గలమ్) సీరాపశ్చాద్భాగే దార్ఢ్యాయ సంయోజ్యం కాష్ఠమ్ (పవీరవత్) ప్రశస్తః పవీరః ఫాలో విద్యతే యస్మిన్ తత్ (సుశేవమ్) సుష్ఠు సుఖకరమ్ (సోమపిత్సరు) యే సోమయవాద్యోషధీః పాలయన్తి తాన్సరయతి కుటిలం గమయతి (తత్) (ఉత్) (వపతి) (గామ్) పృథివీమ్ (అవిమ్) రక్షణాదిహేతుమ్ (ప్రఫర్వ్యమ్) ప్రఫర్వితుం గమయితుం యోగ్యమ్ (చ) (పీవరీమ్) యయా పాయయన్తి తాం స్థూలామ్ (ప్రస్థావత్) ప్రశస్తం ప్రస్థానం యస్యాస్తి తత్ (రథవాహనమ్) రథం వహతి యేన తత్. ॥౨౮॥

అన్వయః :- హే కృషీవలాః! యూయం యత్ సోమపిత్సరు పవీరవత్సుశేవం లాంగలం ప్రఫర్వ్యం ప్రస్థావద్రథవాహనం చాస్తి యేనావిం పీవరీం గాముద్వపతి తద్యూయం సాధ్నుత. ॥౨౮॥

భావార్థః :-కృషీవలైః స్థూలమృత్సూమన్నాద్యుత్పాదమేవ రక్షాం సుపరీక్ష్య హలాదిసాధనైః సంకృష్య సమీకృత్య సుసంస్కృతాని బీజాని సముప్యోత్తమాని ధాన్యాన్యుత్పాద్య భోక్తవ్యాని. ॥౨౮॥

పదార్థము :-కృషీవలులారా! మీరు (సోమపిత్సరు) యవాదిఓషధుల రక్షకులను వంకరగా వడువు (పవీరవత్) ప్రశంసమగు కఱ్ఱులో గూడిన (సుశేవమ్) సుందరము, సుఖముమగలిగించు (లాఙ్గలమ్) కఱ్ఱను బిగపట్టి దున్నువట్టి దుంపను (చ) మరియు (ప్రఫర్వ్యమ్) వడువదగిన (ప్రస్థావత్) చక్కగా వడుమువట్టి (రథవాహనమ్) రథమును వడుపు ఏ సాధనము గలదో, దేనిచే (అవిమ్) రక్షణ మున్నగువానికి హేతువు (పీవరీమ్) సమస్త పదార్థముల ననుభవింప జేయుటకు హేతువగు స్థూలమైన (గామ్) పృథివిని (ఉద్వపతి) పెల్లగించు (తత్) దానిని మీరును సిద్ధమొనర్పుడు. ॥౨౮॥

భావార్థము :-కర్షకులు స్థూలమగు మట్టిని అన్నము మున్నగువానిచే రక్షించు భూమిని చక్కగా పరీక్షించి నాగలి మున్నగు సాధనములచే దున్ని మృదువుపరచి చక్కగా సంస్కారింపబడిన విత్తనముల నలికి ఉత్తమధాన్యముల నుత్పన్నపరచి భోగింపవలెను. ॥౨౮॥

71.O farmers, the keen-sheared plough, the bringer of bliss, the protector of food-stuffs, moves away. It is the giver of fast, comfortable conveyances. With it dig the solid earth for protection's sake!.

౭౨.కామమిత్యస్య కుమారహారిత ఋషిః, మిత్రాదయో లిఙ్గోక్తా దేవతాః,ఆర్చీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పాచికా స్త్రీ ప్రయత్నేన సుసంస్కృతాన్యన్నాని వ్యంజనాని కుర్యాదిత్యాహ.

వంటగత్తె మంచి ప్రయత్నముతో సుసంస్కృతమైన అన్నము వ్యంజనములను సిద్ధమొనర్పవలెను.

౭౨ కామం కామదుఘే ధుక్ష్వ మిత్రాయ వరుణాయ చ।

ఇన్ద్రాయాశ్విభ్యాం పూష్ణే ప్రజాభ్య ఓషధీభ్యః ॥౭౨॥

ప.వి:- కామమ్, కామదుఘ ఇతి కామ + దుఘే, ధుక్ష్వ, మిత్రాయ, వరుణాయ, చ, ఇన్ద్రాయ, అశ్విభ్యా మిత్యశ్వి+భ్యామ్, పూష్ణే, ప్రజాభ్య ఇతి ప్రజా+ భ్యః, ఓషధీభ్యః॥౭౨॥

పదార్థః :-(కామమ్) ఇచ్ఛామ్ (కామదుఘే) ఇచ్ఛాపూరికే (ధుక్ష్వ) పిపూర్ధి (మిత్రాయ) సుహృదే (వరుణాయ) ఉత్తమాయ విదుషే (చ) అతిథయే (ఇన్ద్రాయ) పరమైశ్వర్యయుక్తాయ (అశ్విభ్యామ్) ప్రాణాపానాభ్యామ్ (పూష్ణే) పుష్టికరాయ (ప్రజాభ్యః) స్వసన్తానేభ్యః (ఓషధీభ్యః) సోమయవాదిభ్యః ॥ ౭౨ ॥

అన్వయః :-హే కామదుఘే పాచికే! త్వం భూమిరివ సుసంస్కృతైరన్నైర్మిత్రాయ వరుణాయ చేన్ద్రాయాశ్విభ్యాం పూష్ణే ప్రజాభ్య ఓషధీభ్యః కామం ధుక్ష్వ. ॥ ౭౨ ॥

భావార్థః :-యా స్త్రీ వా పురుషః పాకం కుర్యాత్తాం తం చ పాకవిద్యాం సుశిక్ష్య హృద్యాన్యన్నాని నిర్మాయ సంభోజ్య సర్వాన్ రోగాన్ దూరీకుర్యాత్. ॥ ౭౨ ॥

పదార్థము :- (కామదుఘే) ఇష్టపూర్వకముగా వంటలు సిద్ధపరచు ఓ స్త్రీ! నీవు భూమివలె చక్కగా సంస్కరింపబడిన వంటకములచే (మిత్రాయ) మిత్రుడు (వరుణాయ) శ్రేష్ఠవిద్వాంసునకు (చ) మరియు అతిథి అభ్యాగతులకు (ఇన్ద్రాయ) పరమైశ్వర్యములతో గూడిన (అశ్విభ్యామ్) ప్రాణాపానములకు (పూష్ణే) పుష్టికారక జనులకు (ప్రజాభ్యః) సంతానములు (ఓషధీభ్యః) సోమలత మున్నగు ఓషధులచే (కామమ్) కోరికను (ధుక్ష్వ) పూర్ణమొనర్పుము.॥౭౨॥

భావార్థము :-వంటలువండు స్త్రీపురుషులు పాకవిద్యను నేర్చుకొని ప్రియమగు పదార్థముల వండి, వాని భోజనమొనర్పజేసి ఎల్లరను రోగరహితుల నొనర్పవలెను. ॥౭౨॥

72.O cook, the preparer of palatable meals, please with thy vagetarian preparations, thy friends, the learned, the guests, the officials, and the Pranas and Apanas, the protecting parents, and the children!.

౨౦౬. విముచ్యధ్వమిత్యస్య కుమారహారిత ఋషిః, అఘ్న్యా దేవతాః, భురిగార్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

మనుష్యైర్గవాదిపశువృద్ధిం కృత్వా పయోఘృతాదీని వర్ధయిత్వా వర్తితవ్యమిత్యాహ.

మనుష్యులు గవాది పశువులను బెంచి, వానినుండి ఘృతక్షీరాది వానిని వృద్ధిజేసి

ఆనందముగా నుండవలయును.

౨౦౬. వి ముచ్యధ్వమఘ్న్యా దేవయానా అగన్మ తమసస్పారమస్య।

జ్యోతిరాపామ ॥౨౩॥

ప.విః-వి, ముచ్యధ్వమ్, అఘ్న్యాః, దేవయానా ఇతి దేవ+యానాః, అగన్మ, తమసః, పారమ్, అస్య, జ్యోతిః, ఆపామ ॥౨౩॥

పదార్థః :-(వి) (ముచ్యధ్వమ్) త్యజత (అఘ్న్యాః) హన్తుమయోగ్యా గాః (దేవయానాః) యాభిర్దేవాన్ దివ్యాన్ భోగాన్ ప్రాప్నువన్తి తాః (అగన్మ) గచ్ఛేమ (తమసః) రాత్రేః (పారమ్) (అస్య) సూర్యస్య (జ్యోతిః) ప్రకాశమ్ (ఆపామ) వ్యాప్నుయామ.॥౨౩॥

అన్వయః :-హే మనుష్యాః! యథా యూయం అఘ్న్యా దేవయానాః ప్రాప్య సుసంస్కృతాన్యన్నాని భుక్త్వా రోగేభ్యో విముచ్యధ్వం తథా వయమపి విముచ్యేమహి. యథా యూయం తమసః పారం ప్రాప్నుత తథా వయమప్యగన్మ. యథా యూయమస్య జ్యోతిర్వ్యాప్నుత తథా వయమప్యాపామ. ॥౨౩॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా గవాదీన్ పశూన్ కదాచిన్న హన్యుర్న ఘాతయేయుశ్చ యథా సూర్యోదయాద్రాత్రిర్నివర్తతే తథా వైద్యకశాస్త్రరీత్యా పథ్యాన్యన్నాని సంసేవ్య రోగేభ్యో నివర్తంతామ్.॥౨౩॥

పదార్థము :- ఓ మానవులారా! మీరెట్లు (అఘ్న్యాః) రక్షణకు యోగ్యమగు (దేవయానాః) దివ్యభోగముల ప్రాప్తింపజేయు గోవులను పొందుదురో, చక్కగా సంస్కరింపబడిన అన్నములను భుజించి రోగములనుండి (విముచ్యధ్వమ్) వేరైయుందురో అట్లే మేమును కాపాడబడుదుముగాక! మీరెట్లు (తమసః) రాత్రియందలి (పారమ్) విశ్రాంతిపారమును పొందెదరో, మేమును నట్లే (అగన్మ)

పొందుదుముగాక! మీరెట్లు (అస్య) ఈ సూర్యుని (జ్యోతిః) ప్రకాశమందు వ్యాప్తులగుచున్నారో, అట్లే మేమును (ఆ పామ) వ్యాప్తులమగుదుముగాక. ॥౭౩॥

భావార్థము :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు గోవులు మున్నగు పశువులను ఎప్పుడును హింసించవలదు. చంపవలదు. చంపించకూడదు. చంపనీయకూడదు. సూర్యోదయముచే రాత్రి తొలగిపోవునట్లు వైద్యశాస్త్రపద్ధతితో పథ్యము, అన్నాదిపదార్థసేవనముచే రోగరహితులై యుండవలెను. ॥౭౩॥

73.O persons, just as ye become free from ailments by getting food good from inviolable cows, the source of prosperity, so should, we. Just as ye attain to the end of night at dawn, so should we. Just as ye receive the light of this sun, so should we!.

౫౦౭౪.సజూరబ్ద ఇత్యస్య కుమారహారిత ఋషిః, అశ్వినౌ దేవతే, ఆర్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

మనుష్యైః కథం కృత్వా సుఖయితవ్యమిత్యాహ. మానవు లెటుల పరస్పర సుఖవంతులై యుండవలెను?

౫౦౭౪ సజూరబ్దో౨ అయవోభిః సజూరుషా౨ అరుణీభిః।

సజోషసావశ్వినా దంసోభిః సజూః సూర౨ ఏతశేన

సజూర్వైశ్వానర౨ ఇడయా ఘృతేన స్వాహా ॥౭౪॥

ప.వి:-సజూరితి స + జూః, అబ్దః, అయవోభిరిత్యయవః + భిః, సజూరితి స+జూః, ఉషాః, అరుణీభిః, సజోషసావితి సజోష+సౌ, అశ్వినా, దంసోభిరితి దంసః+భిః, సజూరితి స+జూః, సూరః, ఏతశేన, సజూరితి స+జూః, వైశ్వానరః, ఇడయా, ఘృతేన, స్వాహా॥౭౪॥

పదార్థః :-(సజూః) సంయుక్తః, (అబ్దః) సంవత్సరః (అయవోభిః) మిశ్రితామిశ్రితైర్దినైః క్షణాదిభిః కాలావయవైః (సజూః) సహ వర్తమానాః (ఉషాః) ప్రభాతః (అరుణీభిః) రక్తప్రభాభిః (సజోషసౌ) సమానసేవినౌ (అశ్వినా) ప్రాణాపానావివ దమ్పతీ (దంసోభిఃకర్మభిః) (సజూః) సహితః (సూరః) సూర్యః (ఏతశేన) అశ్వేనేవ వ్యాప్తిశీలేన వేగేన కిరణనిమిత్తేన వాయునా, ఏతశ ఇత్యశ్వనా...నిఘ. ౧.౧౪ (సజూః) సంయుక్తః (వైశ్వానరః) విద్యుదగ్నిః (ఇడయా) అన్నాదినిమిత్తరూపయా పృథివ్యా (ఘృతేన) జలేన (స్వాహా) సత్యేన వాగింద్రియేణ.॥౭౪॥

అన్వయః :-హే మనుష్యా! వయం సర్వే స్త్రీపురుషా యథాఽయవోభిః సజూరబ్దోఽరుణీభిః సజూరుషా దంసోభిః సజోషసావశ్వినేవ ఏతశేన సజూః సూర ఇడయా ఘృతేన స్వాహా సజూర్వైశ్వానరశ్చ వర్తతే తథైవ ప్రీత్యా వర్తేమహి. ॥౭౪॥

భావార్థః :-మనుష్యేషు యావత్పరస్పరం సౌహార్ద్రం తావదేవ సుఖమ్. యావద్ద్వేషో హార్ద్రం తావదేవ దుఃఖం చ జాయతే, తస్మాత్సర్వైః స్త్రీపురుషైః పరోపకారక్రియయా సహైవ సదా వర్తితవ్యమ్. ॥౭౪॥

పదార్థము :-ఓ మానవులారా! మేము స్త్రీపురుషుల మందర మెట్లు (అయవోభిః) ఒకే విధమగు క్షణములు మున్నగు కాలముయొక్క అవయవములతో (సజూః) కలిగియున్న (అబ్దః) సంవత్సరము (అరుణీభిః) ఎఱ్ఱనికాంతులతో (సజూః) కలిసియున్న (ఉషాః) ప్రభాత సమయ (దంసోభిః) కర్మలచే (సజోషసౌ) ఒకే విధముగు నడకగల (అశ్వినా) ప్రాణాపానములవంటి స్త్రీపురుషులు (ఏతశేన) పరుగులిడు అశ్వములవలె వ్యాప్తశీలము, వేగవంతమునగు కిరణకారణ పవనముతో (సజూః) కలిసియున్న (సూరః) సూర్యుడు (ఇడయా) అన్నాదుల నిమిత్తరూపమగు భూమితో (ఘృతేన) జలములతో (స్వాహా) సత్యవాణి (సజూః) తో కూడియున్న (వైశ్వానరః) విద్యుత్తురూపాగ్నితో నున్నట్లు మేము ప్రేమతో నుందుముగాక! ॥౭౪॥

భావార్థము :-మానవులందు పరస్పరము ఎంత ప్రేమయున్న అంతసుఖము, ఎంతవిరోధమున్న అంతదుఃఖములు కలుగుచుండును. కావున స్త్రీపురుషులెల్లరును పరస్పరము ఉపకారమొనర్చు కొనుచు సదా సుఖులైయుండవలెను. ॥౭౪॥

74.We all should live together amicably, as the year lives with its parts, the dawn with its ruddy beams, the husband and wife with their wonderful achievements, the sun together with his dappled courser, the air, the earth with water, and the lightning with its exact thunder.

౭౫.యా ఓషధీరిత్యస్య భిషగృషిః, వైద్యో దేవతా, అనుష్టుప్ఛందః, గాన్ధారః స్వరః.

మనుష్యైరపథ్యమౌషధసేవనం కృత్వాఽరోగైర్భవితవ్యమిత్యాహ.

మనుష్యులు మందులను తప్పక సేవించి రోగములనుండి రక్షణ పొందవలయును.

౭౫ యా ఓషధీః పూర్వా జాతా దేవేభ్యస్త్రియుగం పురా।

మనై ను బభ్రూణామహం శతం ధామాని సప్త చ ॥౭౫॥

ప.వి:-యాః, ఓషధీః, పూర్వాః, జాతాః, దేవేభ్యః, త్రియుగమితి త్రి + యుగమ్, పురా,

మనై, ను, బభ్రూణామ్, అహమ్, శతమ్, ధామాని, సప్త, చ ॥౭౫॥

**పదార్థః** :-(యాః) (ఓషధీః) సోమాద్యాః (పూర్వాః) (జాతాః) ప్రసిద్ధాః (దేవేభ్యః) పృథివ్యాదిభ్యః (త్రియుగమ్) వర్షత్రయమ్ (పురా) (మనై) మన్యే. అత్ర వికరణవ్యత్యయేన శప్ (ను) శీఘ్రమ్ (బభ్రూణామ్) భరణానాం ధారకాణాం రోగిణామ్ (అహమ్) (శతమ్) అనేకాని (ధామాని) మర్మస్థానాని (సప్త) (చ).॥౭౫॥

**అన్వయః** :-అహం యా ఓషధీర్దేవేభ్యస్త్రియుగం పురా పూర్వా జాతా యా బభ్రూణాం శతం సప్త చ ధామాని మర్మాణి వ్యాప్నువన్తి తా ను మనై శీఘ్రం జానీయామ్.॥౭౫॥

**భావార్థః** :-మనుష్యైః యాః పృథివ్యామప్సు చౌషధయో జాయన్తే గతత్రివర్షా భవేయుస్తాః సంగృహ్య యథావైద్యకశాస్త్రవిధి సంసేవ్యాః తా భుక్తాః సత్యః సర్వాణి మర్మాణ్యభివ్యాప్య రోగాన్నివార్య శరీరసుఖాని సద్యో జనయన్తి.॥౭౫॥

**పదార్థము** :-(అహమ్) నేను (యాః) ఏ (ఓషధీః) సోమలత మున్నగు ఓషధులు (దేవేభ్యః) పృథివి మున్నగువానినుండి (త్రియుగమ్) మూడువత్సరములకు (పురా) పూర్వము (పూర్వాః) పూర్ణ సుఖము గలిగించుటయం దుత్తమము (జాతాః) ప్రసిద్ధమైనవో, ఏవి (బభ్రూణామ్) సేవనమొనర్చు రోగులయొక్క (శతమ్) నూరు (చ) మరియు (సప్త) ఏడు (ధామాని) జన్మముల లేక నాడుల మర్మములందు వ్యాప్తమైయుండునో వానిని (ను) శీఘ్రముగ (మనై) తెలిసికొందునుగాక! ॥౭౫॥

**భావార్థము** :-పృథివిపైనను, జలములందును పుట్టుచున్నట్టి మరియు మూడు సంవత్సరములకు పూర్వము చక్కగా పక్వమైయున్న ఓషధులను గ్రహించి వైద్యశాస్త్రానుకూల పద్ధతిలో సిద్ధపరచి సేవించినట్లైన ఆ యౌషధములు శరీరమునందలి సర్వాంగములందును వ్యాపించి శారీరక వ్యాధులనుండి శీఘ్రముగ విముక్తిని గలిగించి సౌఖ్యములను లభింపజేయును. ॥౭౫॥

**75.May I know the herbs that were born three years ago in the earth, that pervade all the 107 vital parts of the body of the patients.**

**౫౮౯.శతం వ ఇత్యస్య భిషగ్ఋషిః, వైద్యో దేవతా, అనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.**

**మనుష్యాః కిం కృత్వా కిం సాధయేయురిత్యాహ. మానవు లేమి చేసి దేనిని సాధింపవలయును?**

**౫౮౯ శతం వో॰ఽ అమ్బ ధామాని సహస్రముత వో రుహః।**

**అధా శతక్రత్వో యూయమిమం మే॰ఽ అగదం కృత ॥౭౬॥**

**ప.వి:- శతమ్, వః, అమ్బ, ధామాని, సహస్రమ్, ఉత, వః రుహః, అధ, శతక్రత్వ ఇతి శత + క్రత్వః యూయమ్, ఇమమ్, మే, అగదమ్, కృత ॥౭౬॥**

పదార్థః :-(శతమ్) (వః) యుష్మాకమ్ (అమ్బ) మాతః (ధామాని) మర్మస్థానాని (సహస్రమ్) అసంఖ్యాః (ఉత) అపి (వః) యుష్మాకమ్ (రుహః) నాడ్యఙ్కురాః (అధా) అథ. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (శతక్రత్వః) శతం క్రతవః ప్రజ్ఞాః క్రియా వా యేషాంతత్సమ్బుద్ధౌ (యూయమ్) (ఇమమ్) దేహమ్ (మే) మమ (అగదమ్) రోగరహితమ్ (కృత) కురుత. అత్ర వికరణలుక్.॥౭౬॥

అన్వయః :-హే శతక్రత్వో! యూయం యాసాం శతముత సహస్రం రుహః సన్తి తాభిర్మే మమేమం దేహమగదం కృత. అధ స్వయం వో దేహానగదాన్ కురుత. యాని వోఽసంఖ్యాని ధామాని తాని ప్రాప్నుత. హే అమ్బ! త్వమప్యేవమాచర. ॥౭౬॥

భావార్థః :-మనుష్యాణామిదమాదిమం కర్తవ్యం కర్మాస్తి యదోషధిసేవనం పథ్యాచరణం సునియమ వ్యవహరణం చ కృత్వా శరీరారోగ్యసంపాదనమ్. నహ్యే తేన వినా ధర్మార్థకామమోక్షాణామనుష్ఠానం కర్తుం కశ్చిదపి శక్నోతి. ॥౭౬॥

పదార్థము :-(శతక్రత్వః) వందలాది బుద్ధుల మరియు క్రియలచే గూడిన ఓ మానవులారా! (యూయమ్) మీరు ఎట్టి (శతమ్) వందలు (ఉత) మరియు (సహస్రమ్) వేలకొలది (రుహః) నాడుల అంకురములలో నుండు యోషధులచే (మే) నాయొక్క (ఇమమ్) ఈ శరీరమును (అగదమ్) రోగరహితము (కృత) చేయునో (అధ) ఆ తరువాత (వః) మీరు మీ శరీరములను సైతము రోగరహితమొనర్చుకొనుడు (వః) మీయొక్క అసంఖ్యాక (ధామాని) ఏ మర్మస్థానములు గలవో వానినిప్రాప్తించుకొనుడు. (అమ్బ) ఓ మాతా! నీవును ఈ విధముగనే యాచరించుము. ॥౭౬॥

భావార్థము :-మానవులు సర్వప్రథమము ఓషధుల సేవనము మరియు పథ్యముగ నుండి నియమపూర్వక వ్యవహారముచే శరీరములను రోగరహితమొనర్చుకొనుట విధియై యున్నది. ఏలన ఆరోగ్యములేకున్న ధర్మార్థ కామమోక్షముల ననుష్ఠించజాలరు. ॥౭౬॥

76.O physicians imbued with manifold wisdom and deeds, protect my body from disease, with medicines having hundred, and thousand growths. Cure your bodies as well. Know the innumerable vital parts of your body. O mother thou shouldst also do like this!.

౭౭. ఓషధీరిత్యస్య భిషగృషిః, వైద్యో, దేవతాః నిచృదనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

కీదృశా ఓషధయః సేవ్యా ఇత్యాహ. ఎట్టి ఓషధులను సేవింపవలయును?

౭౭ ఓషధీః ప్రతిమోదధ్వం పుష్పవతీః ప్రసూవరీః।

అశ్వాఽఇవ సజిత్వరీర్వీరుధః పారయిష్ణ్వః ॥౭౭॥

ప.వి:- ఓషధీః, ప్రతి, మోదధ్వమ్, పుష్పవతీరితి పుష్ప+వతీః, ప్రసూవరీరితి ప్ర + సూవరీః, అశ్వా ఇవేత్యశ్వాః+ఇవ, సజిత్వరీరితి స+జిత్వరీః, వీరుధః, పారయిష్ణ్వః॥౭౭॥

పదార్థః :-(ఓషధీః) సోమాదీన్ (ప్రతి) (మోదధ్వమ్) ఆనన్దయత (పుష్పవతీః) ప్రశస్తాని పుష్పాణి యాసాం తాః (ప్రసూవరీః) సుఖప్రసావికాః (అశ్వా ఇవ) యథా తురఙ్గాః (సజిత్వరీః) శరీరైః సహ సంయుక్తా రోగాన్ జేతుం శీలాః (వీరుధః) సోమాదీన్ (పారయిష్ణ్వః) రోగజదుఃఖేభ్యః పారం నేతుం సమర్థాః ॥౭౭ ॥

అన్వయః :-హే మనుష్యాః! యూయమశ్వా ఇవ సజిత్వరీర్వీరుధః పారయిష్ణ్వః పుష్పవతీః ప్రసూవరీ రోషధీః సంసేవ్య ప్రతిమోదధ్వమ్. ॥ ౭౭ ॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యథాఽశ్వారూఢా వీరాః శత్రూన్ జిత్వా విజయం ప్రాప్యాఽఽనన్దన్తి తథా సదౌషధసేవినః పథ్యకారిణో జితేన్ద్రియా జనా ఆరోగ్యమవాప్య నిత్యం మోదన్తే.॥ ౭౭ ॥

పదార్థము :-ఓ మానవులారా! మీరు (అశ్వా ఇవ) అశ్వములవలె (సజిత్వరీః) శరీరముతో గలసియుండు రోగముల జయించునట్టి (వీరుధః) సోమలత మున్నగు ఓషధులను (పారయిష్ణ్వః) దుఃఖములనుండి తరింపజేయుటకు యోగ్యమైన (పుష్పవతీః) ప్రశంసనీయ పుష్పములతో నున్న (ప్రసూవరీః) సుఖములగలిగించు (ఓషధీః) ఓషధులను పొంది (ప్రతిమోదధ్వమ్) సదా ఆనందము ననుభవించుడు. ॥౭౭॥

భావార్థము :- ఈ మంత్రమందు ఉపమాలంకార మున్నది. అశ్వముపై స్వారియొనర్చిన వీరుడు శత్రువులను జయించి విజయమును పొంది ఆనందముగ నుండునట్లు శ్రేష్ఠ ఓషధుల సేవనము మరియు పథ్యాహారమొనర్చు జితేంద్రియుడగు కర్మిష్ఠి రోగవిముక్తుడై ఆరోగ్యముగా సదా ఆనందము ననుభవించు చుండును. ॥౭౭॥

77.O people derive happiness by the use of herbs full of blossoms and fruits, conquerors of diseases like horses, and assuagers of physical discomforts!.

౭౮. ఓషధీరితీత్యస్య భిషగృషిః, చికిత్సుర్దేవతా, అనుష్టుప్ఛందః, గాన్ధారః స్వరః.

పునః పిత్రపత్యాని పరస్పరం కథం వర్తేరన్నిత్యాహ. పితాపుత్రు లెటుల పరస్పరము మెలగవలయును?

౭౮ ఓషధీరితి మాతరస్తద్వో దేవీరుప బ్రువే।

సనేయమశ్వం గాం వాసఽఆత్మానం తవ పూరుష ॥౭౮॥

ప. పా:- ఓష॑ధీః, ఇతి॑, మా॒త॒రః॒, తత్, వః॒, దే॒వీః॒, ఉప॑, బ్రు॒వే॒, స॒నేయ॑మ్, అశ్వ॑మ్, గామ్, వాసః॑, ఆ॒త్మాన॑మ్, తవ॑, పూ॒రు॒ష॒, పూరు॑షేతి॒ పురుష ॥౭౮॥

పదార్థః :-(ఓషధీః) (ఇతి) ఇవ (మాతరః) జనన్యః (తత్) కర్మ (వః) యుష్మాన్ (దేవీః) దివ్యా విదుషీః (ఉప) సమీపస్థః సన్ (బ్రువే) ఉపదిశేయమ్ (సనేయమ్) సంభజేయమ్ (అశ్వమ్) తురఙ్గాదికమ్ (గామ్) ధేన్వాదికం పృథివ్యాదికం వా (వాసః) వస్త్రాదికం నికేతనం వా (ఆత్మానమ్) జీవమ్ (తవ) (పూరుష) ప్రయత్నశీల. ॥౭౮॥

అన్వయః :-హే ఓషధీరితి దేవీర్మాతరోఽహం తనయో వస్తత్పథ్యం వచ ఉపబ్రువే. హే పూరుష సుసన్తానాఽహం మాతా తవాశ్వం గాం వాస ఆత్మానం చ సతతం సనేయమ్. ॥ ౭౮ ॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యథా యవాదయ ఓషధయః సేవితాః శరీరాణి పుష్యన్తి తథైవ జనన్యో విద్యాసుశిక్షోపదేశేనాఽపత్యాని సుపోషయేయుః యన్మాతురైశ్వర్యం తద్దాయోఽపత్యస్య యదపత్యస్వం తన్మాతురస్తి. ఏవం సర్వే సుప్రీత్యా వర్తిత్వా పరస్పరస్య సుఖాని సతతం వర్ధయేయుః.॥౭౮॥

పదార్థము :- (ఓషధీః) ఓషధుల (ఇతి) వలె సుఖదాయకములైన (దేవీః) చక్కని విదుషీమణులారా! (మాతరః) తల్లులారా! పుత్రుడనగు నేను (వః) మీకు (తత్) శ్రేష్ఠమగు పథ్యరూప కర్మలను (ఉపబ్రువే) సమీపమునకు చేరి ఉపదేశించెదను (పురుష) పురుషార్థ పరులునగు ఓ శ్రేష్ఠ సంతానమా! తల్లినగు నేను (తవ) నీయొక్క (అశ్వమ్) గుఱ్ఱములు మున్నగు (గామ్) గోవులు, పృథివి మున్నగు (వాసః) వస్త్రములు మరియు గృహాదులను (ఆత్మానమ్) జీవాత్మను నిరంతరము (సనేయమ్) సేవింతును. ॥౭౮॥

భావార్థము :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. యవలు (గోధుమలు) మున్నగు ఓషధుల సేవనముచే శరీరము పుష్టివంతమగునట్లు తల్లి విద్య మరియు ఉత్తమ శిక్షణ, ఉపదేశము మున్నగువానిచే తన సంతానమును పుష్టివంతమొనర్చవలెను. తల్లివద్దగల ధనమునందలి భాగము సంతానము, సంతానము వద్దగల ధనము తల్లిదండ్రులదై యుండును. ఇట్లు ఎల్లరును ప్రీతిపూర్వకముగ వర్తించినచో నిరంతరము సుఖము, ఆనందము గలుగుచుండును. ॥౭౮॥

78.O learned mother comforting like the herbs, may I speak unto thee in proximity, wholesome words. O active, virtuous son, may I, your mother, enjoy your horse, cow, land, home, clothes and soul-force!.

అ౭౯. అశ్వత్థ ఇత్యస్య భిషగృషిః, వైద్యో దేవతా, అనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

మనుష్యైః ప్రత్యహం కీదృశం విహారం కుర్య ఇత్యాహ.

మానవులు ప్రతిదినము ఎటువంటి విహారము చేయవలెను?

**పదార్థః** :-(అగ్నే) పావక ఇవ వర్తమాన విద్వన్ (తవ) శ్రవః (శ్రవణమ్) (వయః) జీవనమ్ (మహి) పూజ్యం మహత్ (భ్రాజన్తే) (అర్చయః) దీప్తయః (విభావసో) యో వివిధాయాం భాయాం వసతి తత్సమ్బుద్ధౌ (బృహద్భానో) అగ్నివద్బృహన్తో మహాన్తో భానవో విద్యాప్రకాశా యస్య తత్సమ్బుద్ధౌ (శవసా) బలేన (వాజమ్) విజ్ఞానమ్ (ఉక్థ్యమ్) వక్తుం యోగ్యమ్ (దధాసి) (దాశుషే) దాతుం యోగ్యాయ విద్యార్థినే (కవే) విక్రాన్తప్రజ్ఞ. ॥౧౦౬॥

**అన్వయః** :-హే బృహద్భానో విభావసో కవేఽగ్నే విద్వన్! యతస్త్వం శవసా దాశుష ఉక్థ్యం వాజం దధాసి తస్మాత్తవాగ్నేరివ మహి శ్రవో వయోఽర్చయశ్చ భ్రాజన్తే. ॥౧౦౬॥

**భావార్థః** :-యే మనుష్యా అగ్నివద్గుణేన ఆప్తవత్సత్కీర్త్యః ప్రకాశన్తే తే పరోపకారాయాన్యేభ్యో విద్యావినయధర్మాన్ సతతముపదిశేయుః. ॥౧౦౬॥

పదార్థము :-(బృహద్భానో) అగ్నివలె అధికవిద్యలందు ప్రకాశమానుడవు (విభావసో) అనేక ప్రకారములగు కాంతులందుండువాడవు (కవే) అత్యంత బుద్ధిశాలివి (అగ్నే) అగ్నివలె తేజస్వివగు ఓ విద్వాంసా! నీవు (శవసా) బలముతో గూడ (దాశుషే) దానమున కర్హుడగు విద్యార్థి కొరకు (ఉక్థ్యమ్) చెప్పుకొనదగిన (వాజమ్) విజ్ఞానమును (దధాసి) ధారణమొనర్చుచున్నావు. దీనియందు (తవ) నీయొక్క అగ్నివంటి (మహి) గౌరవించదగిన గొప్ప యోగ్యత (శ్రవః) వినదగిన శబ్దము (వయః) యువ్వనము (అర్చయః) దీప్తి (భ్రాజన్తే) ప్రకాశితములగుచున్నవి. ॥౧౦౬॥

భావార్థము :-అగ్నివంటి గుణము, ఆప్తులవలె శ్రేష్ఠకీర్తులచే ప్రకాశితుడైయుండువాడు పరోపకారమున ఇతరులకు విద్య, వినయము, ధర్మమును గూర్చి నిరంతరము ఉపదేశమొనర్చుచుండవలయును. ॥౧౦౬॥

106.O learned person, possessing the light of knowledge blazing like fire, brilliancy of diverse forms, and height of wisdom; thou art the giver of laudable knowledge to a worthy disciple. Thereby shine forth, thy lustre, life strength, and knowledge worthy of adoration and hearing!.

౧౦౭.పావకవర్చాఇత్యస్య పావకాగ్నిర్ఋషిః, విద్వాన్ దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

జనకజనన్యౌ సన్తానాన్ ప్రతి కిం కిం కుర్యాతామిత్యాహ.

తల్లిదండ్రులు సంతానముగూర్చి యే మేమి చేయవలెను?

౧౦౭ పావకవర్చాః శుక్రవర్చాఽ అనూనవర్చాఽ ఉదియర్షి భానునా।

పుత్రో మాతరా విచరన్నుపావసి పృణక్షి రోదసీఽ ఉభే ॥౧౦౭॥

ప.వి:-పావకవర్చా ఇతి పావక + వర్చాః, శుక్రవర్చా ఇతి శుక్ర + వర్చాః, అనూనవర్చా ఇత్యనూన + వర్చాః, ఉత్, ఇయర్షి, భానునా, పుత్రః, మాతరా, విచరన్నితి వి + చరన్, ఉప, అవసి, పృణక్షి, రోదసీ ఇతి రోదసీ, ఉభే ఇత్యుభే ॥౧౦౭॥

**పదార్థః** :-(పావకవర్చాః) పవిత్రీకారికయా విద్యుతో వర్చో దీప్తిరివ వర్చోఽధ్యయనం యస్య సః (శుక్రవర్చాః) శుక్రస్య సూర్యస్య ప్రకాశ ఇవ వర్చో న్యాయాచరణం యస్య సః (అనూనవర్చాః) న విద్యతే ఊనం న్యూనం వర్చోఽధ్యయనం యస్య సః (ఉత్) (ఇయర్షి) ప్రాప్నోషి (భానునా) ధర్మప్రకాశేన (పుత్రః) (మాతరా) మాతాపితరౌ (విచరన్) (ఉప) (అవసి) రక్షసి (పృణక్షి) సంబధ్నాసి (రోదసీ) ద్యావాపృథివ్యౌ (ఉభే).॥ ౧౦౭ ॥

**అన్వయః** :-హే జన! యస్త్వం యథా పుత్రో బ్రహ్మచర్యాదిషు విచరన్ సన్ విద్యామాప్నోతి యథా సూర్యవిద్యుతౌ భానునా పావకవర్చాః శుక్రవర్చాః అనూనవర్చా న్యాయం కరోతి యథా ఉభే రోదసీ సంబధ్నీతః తథా విద్యాముదియర్షి రాజ్యం పృణక్షి, మాతరోపాఽవసి తస్మాద్ధార్మికోఽసి. ॥౧౦౭॥

**భావార్థః** :-మాతాపితౄణామిదమత్యుచితమస్తి యత్సన్తానానుత్పాద్య బాల్యావస్థాయాం స్వయం సుశిక్ష్య బ్రహ్మచర్యం కారయిత్వాఽచార్యకులే విద్యాగ్రహణాయ సంప్రేష్య విద్యాయోగకరణమ్. అపత్యానాం చేదం సముచితం వర్తతే యద్విద్యాసుశిక్షాయుక్తా భూత్వా పురుషార్థేనైశ్వర్యమున్నీయ నిరభిమానమత్సరయా ప్రీత్యా మాతాపితౄణాం మనసా వాచా కర్మణా యథావత్ పరిచర్యానుష్ఠానం కర్తవ్యమితి.॥౧౦౭॥

**పదార్థము** :- ఓ మానవా! ఎట్లు (పుత్రః) పుత్రుడు బ్రహ్మచర్య ఆశ్రమమునందు (విచరన్) చరించుచు ఎట్లు విద్యలను పొందుచున్నాడో (భానునా) ప్రకాశముచే (పావకవర్చాః, శుక్రవర్చాః) విద్యుత్తు, సూర్యప్రకాశమువంటి న్యాయకారియో మరియు (అనూనవర్చాః) పూర్ణవిద్యాగ్రహణ మొనర్చినవాడై, నెట్లు (ఉభే) రెండు యే (రోదసీ) పృథివీ ఆకాశము లెట్లు సంబంధము గలిగియుండునో, అట్లు (ఉత్, ఇయర్షి) విద్యలను పొందిన హోతవై రాజ్యమునకు (పృణక్షి) సంబంధము గలిగియుందువు. మరియు (మాతరా) తల్లిదండ్రుల (ఉపావసి) రక్షణ యొనర్చుచున్నావు. కావుననే నీవు ధర్మాత్ముడవై యున్నావు. ॥౧౦౭॥

**భావార్థము** :-జననీజనకులు సంతానమును ఉత్పన్నపరచి వారి కీ బాల్యావస్థయందు తామే స్వయముగ శిక్షణనిచ్చి బ్రహ్మచర్యము, విద్యాభ్యాసమునకు ఆచార్యగురుకులములకు పంపించి విద్యావంతుల నొనర్చజేయుట ఎంతయోతగును. సంతానములు విద్య మరియు ఉత్తమ శిక్షణలతో గూడి పురుషార్థపరులై ఐశ్వర్యమును వృద్ధిపరచవలెను. సంతానము అభిమానము, మాత్సర్యమును వదలి తల్లిదండ్రులను మనసా, వాచా, కర్మణా యథావతుగ సేవించవలెను. ॥౧౦౭॥

107.O man, just as a son, passing through Brahmcharya Ashram (student life) acquires knowledge and with the light of his learning, imparts justice like the lustre of the sun, carries on his studies uninterruptedly, just as the sky and earth are allied together, so shoulds't thou receive education, manage the affairs of the State, and serve thy father and mother!.

౬౨౧. ఊర్జో నపాదిత్యస్య పావకాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

మాతాపితృసంతానాః కీదృశా భవేయురిత్యాహ. తల్లిదండ్రులు, సంతానము లెట్టులుండవలెను?

౬౨౧ ఊర్జో నపాజ్జాతవేదః సుశస్తిభిర్మన్దస్వ ధీతిభిర్హితః।
త్వేఽఇషః సందధుర్భూరివర్పసశ్చిత్రోతయో వామజాతాః ॥౧౦౮॥

ప.వి:- ఊర్జః, నపాత్, జాతవేద ఇతి జాత + వేదః, సుశస్తిభిరితి సుశస్తి+భిః, మన్దస్వ, ధీతిభిరితి ధీతి+భిః, హితః, త్వే ఇతి త్వే, ఇషః, సమ్, దధుః, భూరివర్పస ఇతి భూరి + వర్పసః చిత్రోతయ ఇతి చిత్ర + ఊతయః, వామజాతా ఇతి వామ + జాతాః॥౧౦౮॥

పదార్థః :-(ఊర్జః) పరాక్రమస్య (నపాత్) న విద్యతే పాతో ధర్మాత్పతనం యస్య సః (జాతవేదః) జాతప్రజ్ఞాన జాతవిత్త (సుశస్తిభిః) శోభనాభిః ప్రశంసాభిః క్రియాభిః సహ (మన్దస్వ) ఆనన్ద (ధీతిభిః) స్వాఙ్గులీభిః. ధీతయ ఇత్యఙ్గులినామ.. నిఘం. ౨.౫ (హితః) సర్వస్య హితం దధత్ (త్వే) త్వయి (ఇషః) అన్నాదీని (సమ్) (దధుః) దధతు (భూరివర్పసః) బహూని ప్రశంసనీయాని వర్పాంసి రూపాణి యాసు తాః. వర్ప ఇతి రూపనా.. నిఘం. 3.౭ (చిత్రోతయః) చిత్రా ఆశ్చర్యవద్రక్షణాద్యాః క్రియా యాసు తాః. (వామజాతాః) వామేషు ప్రశస్యేషు కర్మసు వా జాతాః ప్రసిద్ధాః. వామ ఇతి ప్రశస్యనా.. నిఘం, 3.౮.॥౧౦౮॥

అన్వయః :-హే జాతవేదస్తనయ! యస్మిన్ త్వే త్వయి భూరివర్పసశ్చిత్రోతయో వామజాతా మాత్రాదయోఽధ్యాపికా ఇషః సందధుః స సుశస్తిభిర్ధీతిభిరాహూత ఊర్జో నపాద్ధితః సదా మన్దస్వ.॥౧౦౮॥

భావార్థః :-యేషాం కుమారాణాం కుమారీణాం మాతరో విద్యాప్రియా విదుష్యః సన్తు. త ఏవ సతతం సుఖమాప్నువన్తి. యాసాం మాతౄణాం యేషాం పితౄణాం చాపత్యాని విద్యాసుశిక్షాబ్రహ్మచర్యైః శరీరాత్మబలయుక్తాని ధర్మాచారీణి సన్తి త ఏవ సదా సుఖినః స్యుః.॥౧౦౮॥

పదార్థము :-(జాతవేదః) బుద్ధిశాలివి, ధనశాలివి నగు నో పుత్రా! (త్వే) నీయందు ఏ (భూరివర్పసః) అత్యంత ప్రశంసనీయ రూపములు, యోగ్యతలచే గూడిన (చిత్రోతయః) ఆశ్చర్యజనక రక్షణ మున్నగు కర్మలొనర్చు (వామజాతాః) ప్రశంసనీయ యోగ్యత, కులము మరియు కర్మలయందు ప్రసిద్ధులు విద్యాప్రియులగు అధ్యాపికలైన మాత మున్నగు విదుషీమణులు (ఇషః) అన్నములను (సందధుః) ధరించి భోజనమొనర్చజేయుదురో, అట్టినీవు (సుశస్తిభిః) శ్రేష్ఠప్రశంసలతో గూడిన క్రియలతో (ధీతిభిః) వ్రేళ్లతో పిలువబడినవాడవై (ఊర్జః, నపాత్) ధర్మానుకూల పరాక్రమశాలివై (హితః) సర్వహితకారివై (మద్యస్వ) ఆనందితుడవై యుండుము. ॥౧౦౮॥

భావార్థము :- ఏ పుత్రీపుత్రుల (బాలబాలికల) తల్లులు విద్యాప్రియులగు విదుషీమణులై యుందురో వారే నిరంతరము సుఖము ప్రాప్తించుకొనగలరు. మరియు ఏ తల్లిదండ్రుల సంతానము విద్య, చక్కని శిక్షణ, బ్రహ్మచర్యసేవనముచే శారీరక ఆత్మల బలముచే గూడినవారై ధర్మాచరణమొనర్చువారై యుందురో అట్టివారే సదా సుఖవంతులై యుందురు.॥౧౦౮॥

108.O son, imbued with wisdom and wealth, to thee, the learned teachress and the mother nobly born, doing wondrous deeds for thy protection, and master of admirable qualities, give good to eat. Rejoice thy self, always occupied with thy own praiseworthy hands in serving others, and never swerwing from the path of rectitude.

౬౨౨. ఇరజ్యన్నిత్యస్య పావకాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా నిచృదార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

మనుష్యః కీదృశో భవేదిత్యాహ. మనుష్యు డెటువంటివాడుగ నుండవలయును?

౬౨౨ ఇరజ్యన్నగ్నే ప్రథయస్వ జన్తుభిరస్మే రాయో౭ అమర్త్య।
స దర్శతస్య వపుషో విరాజసి పృణక్షి సానసిం క్రతుమ్ ॥౧౦౯॥

ప.వి:-ఇరజ్యన్, అగ్నే, ప్రథయస్వ జన్తుభిరితి జన్తు + భిః, అస్మే౭ ఇత్యస్మే, రాయః, అమర్త్య, సః, దర్శతస్య, వపుషః, వి, రాజసి, పృణక్షి, సానసిమ్, క్రతుమ్ ॥౧౦౯॥

పదార్థః :-(ఇరజ్యన్) ఐశ్వర్యం కుర్వన్. ఇరజ్యతీతి ఐశ్వర్యకర్మసు పఠితమ్....ని.౨.౨౧. (అగ్నే) అగ్నివత్ప్రాప్తపురుషార్థ (ప్రథయస్వ) విస్తారయ (జన్తుభిః) మనుష్యైరిభిః (అస్మే) అస్మభ్యమ్ (రాయః) శ్రియః (అమర్త్య) నాశప్రాకృతమనుష్యస్వభావరహిత (సః) (దర్శతస్య) ద్రష్టుం యోగ్యస్య (వపుషః) రూపస్య. వపు రితిరూపనా. నిఘం. 3.2. (వి) (రాజసి) పృణక్షి సంబధ్నాసి (సానసిమ్) సనాతనీమ్ (క్రతుమ్) ప్రజ్ఞామ్. ॥ ౧౦౯ ॥

**అన్వయః** :-హే అమర్త్యాగ్నే! య ఇరజ్యంస్త్వం దర్శతస్య వపుషః సానసిం క్రతుం పృణక్షి తత్రైవ విరాజసి సోఽస్మే జన్తుభి రాయః ప్రథయస్వ. ॥౧౦౯॥

**భావార్థః** :-యో మనుష్యేభ్యః సనాతనీం వేదవిద్యాం దదాతి సురూపాచారే విరాజతే స ఏషైశ్వర్యం లబ్ధ్వాఽన్యేభ్యః ప్రాపయితుం శక్నోతి. ॥౧౦౯॥

**పదార్థము** :-(అమర్త్య) నాశము, సాంసారిక మనుష్యుల స్వభావములేని వాడా! (అగ్నే) అగ్నివంటి పురుషశ్రేష్ఠ! ఏ (ఇరజ్యన్) ఐశ్వర్యసంచయమొనర్చుచు నీవు (దర్శతస్య) చూడదగిన (వపుషః) రూపమును (సానసిమ్) సనాతన (క్రతుమ్) బుద్ధితో (పృణక్షి) సంబంధము నుంచుదువో, అదే బుద్ధియందు విశేషించి (విరాజసి) శోభించుచున్నావో (సః) అట్టి నీవు (అస్మే) మాకొరకు (జన్తుభిః) మనుష్యులు మొదలగు ప్రాణులతో (రాయః) ధనములను (ప్రథయస్వ) విస్తారపరచుము ॥౧౦౯॥

**భావార్థము** :-ఎవడు మానవులకు సనాతన వేదవిద్య నిచ్చునో మరియు ఉత్తమ ఆచారమునందు విరాజిల్లుచుండునో అట్టి పుణ్యపురుషుడే ఐశ్వర్యముల పొంది ఇతరులకును ప్రాప్తింప జేయుచుండును. ॥౧౦౯॥

109.O man, active like fire, possessing unusual strength unlike mortals, gaining power, possessing beautiful appearance, and preserving ancient wisdom, thou acquirest splendour thereby. Increase our wealth with the cooperation of other persons!.

ఒ౨౩.ఇష్కర్తారమిత్యస్య పావకాగ్నిర్ఋషిః, విద్వాన్ దేవతా, ఆర్షీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

కః పరోపకారీ జాయత ఇత్యాహ. ఎవడు పరోపకారి కాగలడు?

ఒ౨౩ ఇష్కర్తారమధ్వరస్య ప్రచేతసం క్షయన్తꣳ రాధసో మహః।
రాతిం వామస్య సుభగాం మహీమిషం దధాసి సానసిꣳ రయిమ్ ॥౧౧౦॥

ప.వి:-ఇష్కర్తారమ్, అధ్వరస్య, ప్రచేతసమితి ప్ర + చేతసమ్, క్షయన్తమ్, రాధసః, మహః, రాతిమ్, వామస్య, సుభగామితి సు + భగామ్, మహీమ్, ఇషమ్, దధాసి, సానసిమ్, రయిమ్॥౧౧౦॥

**పదార్థః** :-(ఇష్కర్తారమ్) నిష్కర్తారం సంపాదకమ్. అత్ర ఛాన్దసో వర్ణలోప ఇతి నలోపః (అధ్వరస్య) అహింసనీయస్య వర్ధితుం యోగ్యస్య యజ్ఞస్య (ప్రచేతసమ్) ప్రకృష్టప్రజ్ఞమ్. చేతా ఇతి ప్రజ్ఞా వా...వి..3.౯. (క్షయన్తమ్) నివసన్తమ్ (రాధసః) ధనస్య (మహః) మహతః (రాతిమ్) దాతారమ్

(వామస్య) ప్రశస్యస్య (సుభగామ్) సుష్ఠ్వైశ్వర్యప్రదామ్ (మహీమ్) పృథివీమ్ (ఇషమ్) అన్నాదికమ్ (దధాసి) (సానసిమ్) పురాణమ్ (రయిమ్) ధనమ్. ॥౧౧౦॥

అన్వయః :-హే విద్వన్! యస్త్వమధ్వరస్యేష్కర్తారం ప్రచేతసం వామస్య మహో రాధసో రాతిం క్షయన్తం సుభగాం మహీమిషం సానసిం రయిం చ దధాసి. తస్మాదస్మాభిః పూజ్యోఽసి. ॥౧౧౦॥

భావార్థః :-మనుష్యో యథా స్వార్థం సుఖమిచ్ఛేత్తథా పరార్థం చ. స ఏవాప్తః పూజ్యో భవేత్. ॥౧౧౦॥

పదార్థము :-ఓ విద్వాంసుడా! నీవు (అధ్వరస్య) పెంపొందించదగిన యజ్ఞమును (ఇష్కర్తారమ్) సిద్ధియొనర్చువానిని (ప్రచేతసమ్) ఉత్తమబుద్ధిశాలిని (వామస్య) ప్రశంసిత (మహః) గొప్ప (రాధసః) ధనములను (రాతిమ్) ఇచ్చువానిని (క్షయన్తమ్) నివసించునట్టివానిని (సుభగామ్) చక్కని ఐశ్వర్యములనిచ్చు (మహీమ్) పృథివి, (ఇషమ్) అన్నాదులను (సానసిమ్) ప్రాచీన (రయిమ్) ధనములను (దధాసి) ధారణమొనర్చుచున్నావు. కావుననే మేము సత్కరించదగినవాడవై యున్నావు. ॥౧౧౦॥

భావార్థము :-తన సుఖముల నభిలషించునట్లే ఇతరుల సౌఖ్యములకు ప్రయత్నించువాడే ఆప్తుడు మరియు సత్కారయోగ్యుడు. ॥౧౧౦॥

110.O learned person, thou art the performer of prosperous sacrifice (yajna), exceedingly wise, laudable, giver of huge riches, nice dweller, protector of foodstuffs and earth, and preserver of immemorial vedic wealth, hence thou art fit for veneration!.

౧౧౧.ఋతావానమిత్యస్య పావకాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

మనుష్యైః కేషామనుకరణం కార్యమిత్యాహ. మనుష్యులెట్టివారి ననుకరించవలయును?

౧౧౧ ఋతావానం మహిషం విశ్వదర్శతమగ్నిꣳ సుమ్నాయ దధిరే పురో జనాః।

శ్రుత్కర్ణꣳ సప్రథస్తమం త్వా గిరా దైవ్యం మానుషా యుగా ॥౧౧౧॥

ప.వి:-ఋతావానమ్, ఋతవానమిత్యృత + వానమ్, మహిషమ్, విశ్వదర్శతమితి విశ్వ + దర్శతమ్, అగ్నిమ్, సుమ్నాయ, దధిరే, పురః, జనాః, శ్రుత్కర్ణమితి శ్రుత్ + కర్ణమ్, సప్రథస్తమమితి సప్రథః + తమమ్, త్వా, గిరా, దైవ్యమ్, మానుషా, యుగా ॥౧౧౧॥

పదార్థః :-(ఋతావానమ్) ఋతం బహు సత్యం విద్యతే యస్మింస్తమ్. అత్ర ఛన్దసీవనిపావితి వార్తికేన వనిప్ (మహిషమ్) మహాన్తమ్ (విశ్వదర్శతమ్) సర్వవిద్యాబోధస్య ద్రష్టారమ్ (అగ్నిమ్) విద్వాంసమ్

(సుమ్నాయ) సుఖాయ (దధిరే) హితవన్తః (పురః) పురస్తాత్ (జనాః) విద్యావిజ్ఞానేన ప్రాదుర్భూతా మనుష్యాః (శ్రుత్కర్ణమ్) శ్రుతౌ శ్రవణసాధకౌ కర్ణౌ యస్య బహుశ్రుతస్య తమ్ (సప్రథస్తమమ్) ప్రథసా విస్తరేణ సహ వర్తమానః సప్రథాస్తమతిశయితమ్ (త్వా) త్వామ్ (గిరా) వాచా (దైవ్యమ్) దేవేషు విద్వత్సు కుశలమ్ (మానుషా) మనుష్యాణామిమాని (యుగా) యుగాని వర్షాణి. ॥౧౧౧॥

**అన్వయః** :-హే మనుష్య! యథా జనా గిరా సుమ్నాయ దైవ్యం శ్రుత్కర్ణం విశ్వదర్శతం సప్రథస్తమమృతావానం మహిషమగ్నిం విద్వాంసం మానుషా యుగా చ పురో దధిరే తథైవంభూతం విద్వాంసమేతాని చ త్వం ధేహీతి త్వాం శిక్షయామి. ॥౧౧౧॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః, యే సత్పురుషా అతీతాస్తేషామేవానుకరణం మనుష్యాః కుర్యు ర్నేతరేషామధార్మికాణామ్. ॥౧౧౧॥

**పదార్థము** :-ఓ మానవా! ఎట్లు (జనాః) విద్యావిజ్ఞానములచే ప్రసిద్ధుడైనవాడు (గిరా) వాణులచే (సుమ్నాయ) సుఖములకొరకు (దైవ్యమ్) విద్వాంసులందుశ్రేష్ఠుడు (శ్రుత్కర్ణమ్) బహుశ్రుతుడు (విశ్వదర్శతమ్) సర్వమును జూచువాడు (సప్రథస్తమమ్) అత్యధిక విద్యల విస్తారముతో గూడియున్న (ఋతావనమ్) అధిక సత్యాచరణముతో గూడినవాడు (మహిషమ్) మహా (అగ్నిమ్) విద్వాంసుని (మానుషా) మనుష్యులు ఏ (యుగా) వత్సరము లేక కృత [సత్య] యుగాదులను (పురః) ప్రథమమున (దధిరే) ధారణమొనర్చుచుందురో అదేతీరు ఈ విద్వాంసులను, ఈ సంవత్సరములను నీవును ధారణమొనర్చుము ఇది (త్వా) నీకు నేర్పుచున్నాను. ॥౧౧౧॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు ధర్మాత్ములైన సత్పురుషుల ననుకరించవలెను. కాని అధర్మియుల ననుకరించరాదు. ॥౧౧౧॥

111. O man, just as learned persons accept with praise songs for their happiness, the auspicious amongst the wise, the well-read, the expounder of all sciences, the master of vast learning, the embodiment of truth, and the leader of scholars, so shouldst thou do. They revere the past generations of man. Thus do I instruct thee!.

ఓ౨౫. ఆప్యాయస్వేత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

రాజజనాః కిం కృత్వా కీదృశా భవేయురిత్యాహ. రాజపురుషు లేమియొనర్చి యెట్టి వారుకావలెను?

**ఓ౨౫ ఆప్యాయస్వ సమేతు తే విశ్వతః సోమ వృష్ణ్యమ్। భవా వాజస్య సఙ్గథే ॥౧౧౨॥**

**ప.వి:-ఆ, ప్యాయస్వ, సమ్, ఏతు, తే, విశ్వతః, సోమ, వృష్ణ్యమ్, భవ, వాజస్య, సఙ్గథ ఇతి సమ్ + గథే ॥౧౧౨॥**

పదార్థః :-(ఆ) (ప్యాయస్వ) వర్ధస్వ (సమ్) (ఏతు) సంగచ్ఛతామ్ (తే) తుభ్యమ్ (విశ్వతః) సర్వతః (సోమ) చంద్ర ఇవ వర్తమాన (వృష్ణ్యమ్) వృష్ణౌ వీర్యవతః కర్మ (భవ) ద్వ్యచో౽తస్తిఙ ఇతి దీర్ఘః (వాజస్య) విజ్ఞానవేగయుక్తస్య స్వామిన ఆజ్ఞయా (సంగథే) సంగ్రామే. ॥౧౧౨॥

అన్వయః :-హే సోమ! తాదృశస్య విదుషః సంగాత్తే వృష్ణ్యం విశ్వతః సమేతు తేన త్వమాప్యాయస్వ వాజస్య వేత్తా సన్ సంగథే విజయీ భవ. ॥౧౧౨॥

భావార్థః :-రాజపురుషైర్నిత్యం వీర్యం వర్ధయిత్వా విజయేన భవితవ్యమ్.॥౧౧౨॥

పదార్థము :-(సోమ) చంద్రునివంటి చల్లని కాంతిగల రాజపురుషా! సోమగుణములతో గూడిన విద్వాంసుల సాంగత్యమున (తే) నీకొరకు (వృష్ణ్యమ్) వీర్యపరాక్రమశాలి కర్మలు (విశ్వతః) సకలదిశలనుండి (సమేతు) సమకూరుగాక! దానిచే నీవు (ఆప్యాయస్వ) వృద్ధి జెందుము (వాజస్య) విజ్ఞానముచే వేగవంతుడవై సంగ్రామము వెరుగుటకై స్వామియాజ్ఞచే (సంగథే) యుద్ధమునందు విజయమును పొందువాడవు (భవ) అగుము. ॥౧౧౨॥

భావార్థము :-రాజపురుషులు సదా పరాక్రమమును వృద్ధిపరచుకొనుచు శత్రువులపై విజయమును పొందవలయును. ॥౧౧౨॥

112.O king, may thy power spread in all directions. May thou advance. May thou. The master of knowledge and the science of fighting, succeed in all battles!.

౧౧౩.స న్త ఇత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

శరీరాత్మబలయుక్తాః కిమాప్నువన్తీత్యాహ. శరీరాత్మబలయుక్తులగు వా రెవ్వానిని పొందుచున్నారు?

౧౧౩. స న్తే పయాꣳసి సము యన్తు వాజాః సం వృష్ణ్యాన్యభిమాతిషాహః।ఆప్యాయమానో౽ అమృతాయ సోమ దివి శ్రవాꣳస్యుత్తమాని ధిష్వ॥౧౧౩॥

ప.విః-సమ్, తే, పయాꣳసి, సమ్, ఊఀ ఇత్యూఀ, యన్తు, వాజాః, సమ్, వృష్ణ్యాని, అభిమాతిషాహః, అభిమాతిసహ ఇత్యభిమాతి+సహః, ఆప్యాయమాన ఇత్యా+ప్యాయమానః, అమృతాయ, సోమ, దివి, శ్రవాꣳసి, ఉత్తమానీత్యుత్ + తమాని, ధిష్వ ॥౧౧౩॥

పదార్థః :-(సమ్) (తే) తుభ్యమ్ (పయాంసి) జలాని దుగ్ధాని వా (సమ్) (ఉ) (యన్తు) ప్రాప్నువన్తు (వాజాః) ధనుర్వేదబోధజా వేగాః (సమ్)(వృష్ణ్యాని) వీర్యాణి (అభిమాతిషాహః)

యేఽభిమాతీనభిమానయుక్తాన్ శత్రూన్ సహన్తే విదారయన్తి (ఆప్యాయమానః) సమన్తాద్వర్ద్ధమానః (అమృతాయ) మోక్షసుఖాయ (సోమ) ఐశ్వర్యయుక్త (దివి) ద్యోతనాత్మకే పరమేశ్వరే (శ్రవాంసి) అన్నాని శ్రవణాని వా (ఉత్తమాని) (ధిష్వ) ధత్స్వ. ॥113॥

అన్వయః :- హే సోమ! యస్మై తే పయాంసి సంయంత్వభిమాతిషాహో వాజాః సంయన్తు వృష్ణ్యాని సంయన్తు స ఆప్యాయమానస్త్వం దివ్యమృతాయోత్తమాని శ్రవాంసి ధిష్వ. ॥113॥

భావార్థః :- యే మనుష్యాః శరీరాత్మబలం నిత్యం వర్ధయన్తి తే యోగాభ్యాసేన పరమాత్మని మోక్షానందం లభన్తే. ॥113॥

పదార్థము :- (సోమ) శాంతశీలుడా! (తే) నీకొరకు (పయాంసి) ఏ జలములు, క్షీరములు (సంయన్తు) ప్రాప్తమగునో (అభిమాతిషాహః) అభిమానవంతులగు శత్రువుల నిర్జించువారు (వాజాః) ధనుర్వేద విజ్ఞానమును (సమ్) పొందుదురో (ఉ) మరియు (వృష్ణ్యాని) పరాక్రమము (సమ్) లభించునో, అట్టి (ఆప్యాయమానః) చక్కగా వృద్ధియగుచు నీవు (దివి) ప్రకాశస్వరూపుడగు పరమేశ్వరునియందు (అమృతాయ) మోక్షముకొరకు (ఉత్తమాని, శ్రవాంసి) ఉత్తమముగా వినదగిన వానిని (ధిష్వ) ధారణమొనర్చుము. ॥113॥

భావార్థము:- సదా శారీరక, ఆత్మిక బలములను పెంపొందించుకొనును యోగాభ్యాసముచే పరమేశ్వరుని యందు మోక్షానందమును ధీరవరులు ప్రాప్తించుకొందురు. ॥113॥

113.O man of peaceful nature may juicy nutriments be procured by thee, may thou learn military science for subduing the arrogant foes. May thou amass strength. May thou, thus progress, win immortality, following the noble teachings of God!.

114. ఆప్యాయస్వేత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, అనుష్టుప్ ఛన్దః, ఋషభః స్వరః.

కోఽత్ర వర్ధత ఇత్యాహ, ఈలోకమున వృద్ధి పొందువ దెవరు?

114 ఆప్యాయస్వ మదిన్తమ సోమ విశ్వేభిరంశుభిః।

భవా నః సప్రథస్తమః సఖా వృధే ॥114॥

ప.వి:- ఆ, ప్యాయస్వ, మదిన్తమేతి మదిన్ + తమ, సోమ, విశ్వేభిః, అంశుభి రిత్యంశు + భిః, భవ, నః, సప్రథస్తమ ఇతి సప్రథః + తమః, సఖా, వృధే ॥114॥

పదార్థః :-(ఆ)(ప్యాయస్వ) (మదిన్తమ) అతిశయేన మదితుం హర్షితుం శీల (సోమ) ఐశ్వర్యయుక్త

(విశ్వేభిః) సర్వైః (అంశుభిః) కిరణైః (భవ) ద్వ్యచో ఽతస్తిఙ ఇతి దీర్ఘః (నః) అస్మాకమ్ (సప్రథస్తమః) అతిశయేన విస్తృతసుఖకారకః (సఖా) మిత్రః (వృధే) వర్ధనాయ. ॥౧౧౪॥

అన్వయః :-హే మదిన్తమ సోమ త్వమంశుభిః కిరణైః సూర్య ఇవ విశ్వేభిః సాధనైరాప్యాయస్వ సప్రథస్తమః సఖా సన్ నో వృధే భవ. ॥౧౧౪॥

భావార్థః :-ఇహ సర్వహితకారీ సర్వతో వర్ధతే నేర్ష్యకః. ॥౧౧౪॥

పదార్థము :-(మదిన్తమ) మహానందముగలవాడా! (సోమ) ఐశ్వర్యవంతుడా! నీవు (అంశుభిః) కిరణములతో గూడిన సూర్యునివలె (విశ్వేభిః) సకల సాధనములతో (ఆప్యాయస్వ) వృద్ధిని పొందుము (సప్రథస్తమః) అత్యంత విస్తారయుక్త సుఖముల గలిగించువాడవు (సఖా) మిత్రుడవునై (నః) మాయొక్క (వృధే) వృద్ధికొరకు (భవ) తత్పరుడవగుము. ॥౧౧౪॥

భావార్థము :-ఈ విశ్వమునందు సర్వహితకారియగువాడే సకల విధములుగ వృద్ధిజెందుచుండును. కాని ఈర్ష్యాసూయలుగలవాడు వృద్ధి జెందలేడు. ॥౧౧౪॥

104.O most gladdening, prosperous fellow, make progress through different means, like the sun with its beams. Strive for our prosperity, O friend of vast happiness!.

౬౨౫.ఆ త ఇత్యస్య వత్సార ఋషిః, అగ్నిర్దేవతా, నివృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

మనుష్యాః కిం కిం వశీకృత్యానన్దం ప్రాప్నువన్త్విత్యాహ.

మానవులు ఏ యేమి వశమునందుంచుకొని ఆనందమును పొందవలయును?

౬౨౫ ఆ తే వత్సో మనో యమత్పరమాచ్చిత్సధస్థాత్।

అగ్నే త్వాఙ్కామయా గిరా ॥౧౧౫॥

ప.వి:- ఆ, తే, వత్సః, మనః, యమత్, పరమాత్, చిత్, సధస్థాదితి సధ+స్థాత్, అగ్నే, త్వాఙ్కామయేతి త్వామ్ + కామయా, గిరా ॥౧౧౫॥

పదార్థః :-(ఆ) (తే) తవ (వత్సః) (మనః) చిత్తమ్ (యమత్) ఉపరమేత్ (పరమాత్) ఉత్కృష్టాత్ (చిత్) అపి (సధస్థాత్) సమానస్థానాత్ (అగ్నే) విద్వన్ (త్వాఙ్కామయా) యయా త్వాం కామయతే తయా. అత్ర ద్వితీయైకవచనస్యాలుక్ (గిరా) ॥౧౧౫॥

అన్వయః :-హే అగ్నే సోమ! విద్వంస్త్వాంకామయా గిరా యస్య తే మనః పరమాత్సధస్థాచ్చిద్వత్సో గోరివాయమత్స త్వం ముక్తిం కథన్నాప్నుయాః. ॥౧౧౫॥

భావార్థః :- మనుష్యైః సదైవ మనః స్వవశం విధేయం వాణీ చ. ॥౧౧౫॥

పదార్థము :-(అగ్నే) అగ్నివంటి తేజోవంతుడవగు ఓ విద్వాంసా! (త్వాజ్కామయా) నీవు కామించుటకే హేతువగు (గిరా) వేదవాణులచే ఏ (తే) నీయొక్క (మనః) మనస్సు ఎట్లు (పరమాత్) ఉత్తమమగు (సధస్థాత్) ఒకే విధమగు స్థానమునుండి (చిత్) కూడ (వత్సః) లేగ తల్లియగు గోవును పొందునట్లు (ఆ యమత్) స్థిరమైపోవుచున్నదో అట్లే నీవును ముక్తిని ప్రాప్తించుకొనెదవు. ॥౧౧౫॥

భావార్థము :- మానవులు సదా మనస్సును వాణిని వశమున నుంచుకొని వృద్ధిచెందవలెను. ॥౧౧౫॥

115.O learned person, just as a calf is fastened with its mother, the cow, so thou, desirous for spiritual advancement, concentrate thy mind with vedic speech obtained from God, the Support of all!.

ఓమ్. తుభ్యన్తా ఇత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ రాజా కిం కుర్యాదిత్యాహ. రాజా ఏమి చేయవలయును.

ఓమ్ తుభ్యం తాఽ అఙ్గిరస్తమ విశ్వాః సుక్షితయః పృథక్।

అగ్నే కామాయ యేమిరే ॥౧౧౬॥

ప.వి:- తుభ్యమ్, తాః, అఙ్గిరస్తమేత్యఙ్గిరః+తమ, విశ్వాః, సుక్షితయ ఇతి సు+క్షితయః, పృథక్, అగ్నే, కామాయ, యేమిరే ॥౧౧౬॥

పదార్థః:-(తుభ్యమ్) (తాః) (అఙ్గిరస్తమ) అతిశయేన సారగ్రాహిన్ (విశ్వాః) అఖిలాః (సుక్షితయః) శ్రేష్ఠమనుష్యాః ప్రజాః (పృథక్) (అగ్నే) ప్రకాశమాన రాజన్! (కామాయ) ఇచ్ఛాసిద్ధయే (యేమిరే) ప్రాప్నువన్తు. ॥ ౧౧౬ ॥

అన్వయః :-హే అంగిరస్తమాగ్నే రాజన్! యా విశ్వాః సుక్షితయః ప్రజాః పృథక్ కామాయ తుభ్యం యేమిరే తాస్త్వం సతతం రక్ష ॥ ౧౧౬ ॥

భావార్థః :-యత్ర ప్రజా ధార్మికం రాజానం ప్రాప్య స్వం స్వమభిలాషం ప్రాప్నువన్తి తత్ర రాజా కథం న వర్ధేత? ॥ ౧౧౬ ॥

పదార్థము :-(అఙ్గిరస్తమ) అత్యధికముగ సారము గ్రహించువాడా! (అగ్నే) ప్రకాశవంతుడవగు ఓ రాజా! ఏ (విశ్వాః) సమస్త (సుక్షితయః) శ్రేష్ఠమగు మానవులుగల ప్రజలు (పృథక్) వేర్వేరుగా (కామాయ)

కోరికలను సాధింపబూనిన సాధకులు (తుభ్యమ్) నీకు (యేమిరే) ప్రాప్తించుదురుగాక! (తాః) అట్టి ప్రజలను నీవు సదా రక్షించుచుండుము. ॥౧౧౬॥

భావార్థము :- ప్రజలు ధర్మాత్ముడగు రాజును పొందినవారైనప్పుడు, తమ తమ కోరికల పూర్తిజేసికొని నప్పుడప్పటి రాజు తప్పక వృద్ధిగలవాడగును. ॥౧౧౬॥

116.O King, the foremost realiser of the essence of problems, all loyal subjects turn to thee for the fulfilment of their wishes. Always protect them!.

౬౩౦. అగ్నిరిత్యస్య ప్రజాపతిర్ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునర్మనుష్యాః కీదృశా భూత్వా కిం కుర్యు రిత్యాహ.

మనుష్యు లెటువంటివారై ఏ మేమి చేయవలెను?

౬౩౦ అగ్నిః ప్రియేషు ధామసు కామో భూతస్య భవ్యస్య।
సమ్రాడేకో విరాజతి ॥౧౧౭॥

ప.వి:- అగ్నిః, ప్రియేషు, ధామస్వితి ధామ+సు, కామః, భూతస్య, భవ్యస్య, సమ్రాడితి సమ్ + రాట్, ఏకః, వి, రాజతి ॥౧౧౭॥

పదార్థః:- (అగ్నిః) పావక ఇవ వర్తమానః (ప్రియేషు) ఇష్టేషు (ధామసు) జన్మస్థాననామసు (కామః) యః కామ్యతే సః (భూతస్య) అతీతస్య (భవ్యస్య) ఆగామిసమయస్య (సమ్రాట్) సమ్యక్ ప్రకాశకః (ఏకః) అద్వితీయః పరమేశ్వరః (వి) (రాజతి) ॥ ౧౧౭ ॥

అన్వయః :- యో మనుష్యః సమ్రాడేకః కామోఽగ్నిః సభేశః పరమేశ్వర ఇవ భూతస్య భవ్యస్య ప్రియేషు ధామసు విరాజతి స ఏవ రాజ్యాభిషేచనీయః. ॥ ౧౧౭ ॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే మనుష్యాః పరమాత్మనో గుణకర్మస్వభావాను కూలాన్ స్వగుణకర్మస్వభావాన్ కుర్వన్తి త ఏవ సామ్రాజ్యం భోక్తుమర్హన్తీతి. ॥ ౧౧౭ ॥

పదార్థము :- ఏ మనుష్యుడు (సమ్రాట్) సమ్యక్ప్రకాశకుడు (ఏకః) ఒక్కడేయగు [అసహాయుడు] పరమేశ్వరునివలె (కామః) స్వీకరించదగిన (అగ్నిః) అగ్నివంటి తేజశ్శాలియగు సభాపతి (భూతస్య) గడచిన కాలపు (భవ్యస్య) రానున్న కాలపు (ప్రియేషు) ఇష్టములగు (ధామసు) జన్మ స్థానము, నామములందు (విరాజతి) ప్రకాశవంతుడగు నాతడు మాత్రమే రాజ్యాధికారియగుటకు తగినవాడై యుండును. ॥౧౧౭॥

భావార్థము :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మనుష్యుడు పరమేశ్వరుని గుణ కర్మ స్వభావముల కనుకూలముగ తన గుణ కర్మ స్వభావములను జేసికొనునో ఆతడు మాత్రమే చక్రవర్తి రాజ్యమును భోగించుటకు తగినవాడగుచున్నాడు. ॥౧౧౭॥

117.He alone is fit to rule, who, full of brilliance, like the One Self sufficient Lord, is worthy of homage, self-resplendent, and shines forth in God's attributes in the past and future.

అత్ర స్త్రీపురుషరాజప్రజాకృష్యధ్యయనాధ్యాపనాదికర్మవర్ణనాదేతదర్థస్య పూర్వాఽధ్యాయార్థేన సహ సఙ్గతిరస్తీతి బోధ్యమ్.

ఈ యధ్యాయమందు స్త్రీ, పురుషుడు; రాజ, ప్రజలు; కర్తకత్వము (వ్యవసాయము); పఠనము, పాఠనము మున్నగు కర్మల వర్ణనము గలదు. కావున ఈ యధ్యాయము యొక్క అర్థమునకు పూర్వాధ్యాయార్థముతో సంగతము గలదని ఎఱుగవలెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీపరమవిదుషాం విరజానన్దసరస్వతీస్వామినాం శిష్యేణ దయానన్దసరస్వతీస్వామినా నిర్మితే సంస్కృతభాషాఽఽర్యభాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే ద్వాదశోఽధ్యాయః సంపూర్ణః.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామివిరచిత సంస్కృతార్యభాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి పన్నెండవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ.శ్రీ.శ్రీ.లోకా లక్ష్మయ్య, వెంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్పబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ.శివసింహ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ,అర్థవిద్యావినోద ఆచార్య
'మల్లె కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన
పన్నెండవ అధ్యాయము సమాప్తము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# వేదగిరిపై 'వేదపీఠ, వేదమందిర, వేదాశ్రమ' నిర్మాణం

నాలుగు వేదములలోని మంత్రములను సంపూర్ణముగా శిలలపై చెక్కించి వేదమందిరము నిర్మించుట

**వేదగిరి, తూంపల్లి గ్రా॥, కొందుర్గు మం॥, మహబూబ్‌నగర్ జి॥**



వేదగిరి పీఠాధిపతి

వేదభాష్యానువాదభాస్కర బిరుదాంకితులు, శతాధిక గ్రంథకర్త

**బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య**

వేదగిరి స్థాపకులు

ఆచార్య డా॥ **మర్రి కృష్ణారెడ్డి**, M.A., M.Ed., Ph.D.

ओ३म्

परमहंसपरिव्राजकाचार्येण
श्रीमन्महर्षिदयानन्दसरस्वतीस्वामिना निर्मितम्

# यजुर्वेद - भाष्यम्

संस्कृतान्ध्राङ्गलभाषासमन्वितम्

## तृतीयो भागः

*( त्रयोदशाध्यायादारभ्य सप्तदशाध्यायपर्यन्तम् )*

आन्ध्रानुवादकः
'चतुर्वेदभाष्यानुवादभास्करः'
**ब्रह्मश्री पण्डितलोकमलहरिसिद्धान्ताचार्यः**

परिष्कर्ता - सम्पादकश्च
सिद्धान्तालङ्कारः, विद्याभूषणः, आर्षविद्याविनोदः
**आचार्य डॉ. मर्रि कृष्णारेड्डी**

वैदिकसाहित्यप्रचारसमितिः, भाग्यनगरम्-६०, आन्ध्रप्रदेशः

2007

ॐ

# THE YAJURVEDA BHASHYAM

With

MAHARSHI DAYANANDA SARASWATHI'S
COMMENTARY

## VOLUME - 3
**(13-17 Chapters)**

Translated in English by : **DEVI CHAND M.A.**

***Translated in to Telugu***

***By***

BRAHMASRI **PANDITA LOKA MALAHARI**
SIDDHANTACHARYA

***Editor***

**Acharya Dr. MARRI KRISHNA REDDY,** M.A; M.Ed, Ph.D

**Vaidika Sahitya Prachara Samithi, Hyderabad - 60.**

**2007**

ఓ౩మ్

పరమహంసపరివ్రాజకాచార్యేణ
శ్రీమన్మహర్షిదయానందసరస్వతీస్వామినా నిర్మితమ్

# యజుర్వేద భాష్యమ్

(సంస్కృతభాష్యం, ఆంధ్రటీకాతాత్పర్యం, ఆంగ్లభావార్థసహితం)

## తృతీయ సంపుటము

(13-17 అధ్యాయములు)


అనువాదకర్త

'చతుర్వేదభాష్యానువాదభాస్కర' - శతాధికగ్రంథకర్త

బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య

పరిష్కర్త - సంపాదకులు

సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద

ఆచార్య డా॥ మర్రి కృష్ణారెడ్డి M.A., M.Ed., Ph.D.



వైదిక సాహిత్య ప్రచార సమితి, హైదరాబాద్-60

2007

## "వైదిక సాహిత్య ప్రచారసమితి" ప్రచురణలు


సంపూర్ణ "యజుర్వేదభాష్యమ్" : 6 సంపుటములు

ద్వితీయ ముద్రణ : శ్రీ వ్యయ పుష్యం, జనవరి - 2007.

ప్రతులు : 1000

వెల : **రూ. 1800/- లు** మాత్రమే.(6 సంపుటములకు కలిపి)

(పోస్టేజి అదనము)





డి.టి.పి. : **వి. రామలింగారెడ్డి (బాలు)**

ముద్రణ : **సాయిలిఖిత ప్రింటర్స్**, ఖైరతాబాద్, హైదరాబాదు.

ఫోన్ : 98490 05182


### ప్రతులకు :

1. **వైదికసాహిత్య ప్రచారసమితి**, 3-30; హనుమాన్ నగర్, ఆర్యసమాజం ఎదురువీధి, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 60. ఆం.ప్ర., ఫోన్ : 040 - 24051322, 9849583929

2. **దిల్‌సుఖ్‌నగర్ ఆర్యసమాజం**, బాదంకాంప్లెక్స్, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060, ఫోన్ : 9849468084, 9395376410

3. వేదగిరి, తూంపల్లి గ్రామం, కొందుర్గు మండలం, మహబూబ్‌నగర్ జిల్లా. ఫోన్ : 9441200322, 9849583929

4. **భీమాస్ డీలక్స్ హోటల్**, 34-38, జి.కార్ స్ట్రీట్, రైల్వేస్టేషన్ ఎదురుగా, తిరుపతి. ఫోన్ : 0877-2225521

5. **విశాలాంధ్ర బుక్‌హౌస్** (అన్ని బ్రాంచిలలో) హైదరాబాద్, విశాఖపట్టణం, విజయవాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి, కాకినాడ.

# తృతీయ సంపుటము

## 13-17 అధ్యాయములు

### అధ్యాయసూచిక

# యజుర్వేదభాష్యము

## 13వ అధ్యాయము - విషయసూచిక

# అథ త్రయోదశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే అష్టపఞ్చాశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్.

ఓం.విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్నఽ ఆ సువ ॥య.30.3॥

౬౩౧.తత్ర మయి గృహ్ణామీత్యస్య వత్సార ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్చీపంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

మనుష్యైరాదిమా ఽవస్థాయాం కిం కిం కార్యమిత్యాహ. మానవుడు ఆరంభావస్థలో నే మేమి యొనర్చవలయును?

౬౩౧ మయి గృహ్ణామ్యగ్రేఽఅగ్నిꣳ రాయస్పోషాయ సుప్రజాస్త్వాయ
సువీర్యాయ। మాము దేవతాః సచన్తామ్ ॥౧॥

**ప.వి:-మయి, గృహ్ణామి, అగ్రే, అగ్నిమ్, రాయః, పోషాయ సుప్రజాస్త్వాయేతి సుప్రజాః + త్వాయ, సువీర్యాయేతి సు + వీర్యాయ, మామ్, ఉఇత్యూ౦ దేవతాః, సచన్తామ్ ॥౧॥**

**పదార్థః** :- (మయి) ఆత్మని (గృహ్ణామి) (అగ్రే) (అగ్నిమ్) పరమవిద్వాంసమ్ (రాయః) విజ్ఞానాది ధనస్య (పోషాయ) పుష్టయే (సుప్రజాస్త్వాయ) శోభనాశ్చ తాః ప్రజాః సుప్రజాస్తాసాం భావాయ (సువీర్యాయ) ఆరోగ్యేణ సుష్ఠుపరాక్రమాయ (మామ్) (ఉ) (దేవతాః) దివ్యా విద్వాంసో గుణా వా (సచన్తామ్) సమవయన్తు. ॥ ౧ ॥

**అన్వయః** :-హే కుమారాః కుమార్యశ్చ! యథాఽహమగ్రే మయి రాయస్పోషాయ సుప్రజాస్త్వాయ సువీర్యాయాగ్నిం గృహ్ణామి యేన మాము దేవతాః సచన్తాం తథా యూయమపి కురుత. ॥ ౧ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యాణామిదం సముచితమస్తి బ్రహ్మచర్య కుమారావస్థాయాం వేదాధ్యయనేన పదార్థవిద్యా బ్రహ్మకర్మ బ్రహ్మోపాసనాం బ్రహ్మజ్ఞానం స్వీకుర్యుర్యేన దివ్యాన్ గుణానాప్తాన్ విదుషశ్చ ప్రాప్యోత్తమ శ్రీ ప్రజాపరాక్రమాన్ ప్రాప్నుయురితి.॥౧॥

**పదార్థము** :-ఓ కుమారీ కుమారులారా! నే నెట్లు (అగ్రే) పూర్వము (మయి) నాయందు (రాయః) విజ్ఞానము మున్నగు ధనముల (పోషాయ) పుష్టికొరకు (సుప్రజాస్త్వాయ) ఉత్తమసంతానము పొందుటకై మరియు (సువీర్యాయ) రోగరహితమైన చక్కని పరాక్రమముకొరకు (అగ్నిమ్) ఉత్తమవిద్వాంసుని (గృహ్ణామి) పొందుచున్నానో, దేనివలన (మామ్) నాకు (ఉ) మాత్రమే (దేవతాః) ఉత్తమవిద్వాంసులు, గుణములు (సచన్తామ్) లభించుచున్నవియో మీరును నట్లే యొనర్పుడు.॥౧॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. బ్రహ్మచర్యముతో గూడిన కుమారావస్థయందు వేదాది సచ్ఛాస్త్రములను చదువుటద్వారా పదార్థవిద్య, ఉత్తమకర్మలు, ఈశ్వరోపాసన మరియు బ్రహ్మజ్ఞానమును పొందవలెను. దీనివల్ల శ్రేష్ఠగుణముల మరియు ఆప్తవిద్వాంసుల ప్రాప్తి గలిగి శ్రేష్ఠమగు ధన, సంతాన, పరాక్రమములు పొందుచుండవలెను. ॥౧॥

1.I realise within me God first of all, for increase of my knowledge, good offspring and manly strength. So may noble virtues wait upon me.

**౬౩౨. అపాం పృష్ఠమిత్యస్య వత్సార ఋషిః, అగ్నిర్దేవతా, విరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.**

**అథ పరమేశ్వరోపాసనావిషయమాహ. పరమేశ్వరోపాసనా విషయము.**

**౬౩౨ అపాం పృష్ఠమసి యోనిరగ్నేః సముద్రమభితః పిన్వమానమ్। వర్ధమానో**

**మహాఀ౨॥ఽఆ చ పుష్కరే దివో మాత్రయా వరిమ్ణా ప్రథస్వ॥౨॥**

**ప.వి:-** అపామ్, పృష్ఠమ్, అసి, యోనిః, అగ్నేః సముద్రమ్, అభితః, పిన్వమానమ్, వర్ధమానః, మహాన్, ఆ,చ, పుష్కరే, దివః, మాత్రయా, వరిమ్ణా, ప్రథస్వ ॥౨॥

**పదార్థః** :-(అపామ్) వ్యాపకానాం ప్రాణానాం జలానాం వా (పృష్ఠమ్) అధికరణమ్ (అసి) (యోనిః) కారణమ్ (అగ్నేః) విద్యుదాదేః (సముద్రమ్) అన్తరిక్షమివ సాగరమ్ (అభితః) సర్వతః (పిన్వమానమ్) సిఞ్చమానమ్ (వర్ధమానః) సర్వతోత్కృష్టః (మహాన్) సర్వేభ్యో వరీయాన్ సర్వైః పూజ్యశ్చ (ఆ) (చ) (పుష్కరే) అన్తరిక్షే పుష్కరమిత్యన్తరిక్షనామ. నిఘ... ౧.౩ (దివః) ద్యోతమానస్య (మాత్రయా) యయా సర్వం మిమీతే (వరిమ్ణా) అతిశయేనోరుర్బహుస్తేన వ్యాపకత్వేన (ప్రథస్వ) ప్రఖ్యాతో భవ. ॥ ౨ ॥

**అన్వయః**:-హే విద్వన్! యస్త్వమభితోఽపాం పృష్ఠం సముద్రం పిన్వమానమగ్నేర్యోనిర్దివో మాత్రయా పుష్కరే వర్ధమానో మహాఀశ్చాసి సోఽస్మాసు వరిమ్ణాఽఽ ప్రథస్వ. ॥ ౨ ॥

**భావార్థః**:-మనుష్యైర్యత్ సచ్చిదానన్దస్వరూపమఖిలస్య జగతో నిర్మాతృ సర్వత్రాభివ్యాప్తం సర్వేభ్యో వరం సర్వశక్తిమద్ బ్రహ్మైవోపాస్య సకలవిద్యాః ప్రాప్యన్తే తత్ కథం న సేవితవ్యం స్యాత్. ॥ ౨ ॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! ఏ నీవు (అభితః) అన్నిదిశలనుండి (అపామ్) సర్వత్రావ్యాపకమైయున్న ప్రాణములకు, జలములకు (పృష్ఠమ్) ఆధారమైయున్న (సముద్రమ్) ఆకాశమువంటి సాగరము

(పిన్వమానమ్) సేచనమొనర్చు సముద్రమును (అగ్నేః) విద్యుత్తు మున్నగు అగ్నుల (యోనిః) కారణము (దివః) ప్రకాశితపదార్థముల (వాత్రయా) నిర్మాణమొనర్చు బుద్ధిచే (పుష్కరే) హృదయరూప అంతరిక్షమునందు (వర్ధమానః) ఉన్నతిని పొందుచు (చ) మరియు (మహాన్) సర్వశ్రేష్ఠుడవు, సర్వపూజనీయుడవునై (అసి) ఉన్న నీవు మాకొరకు (వరిమ్ణా) వ్యాపకశక్తిచే (అప్రథస్వ) ప్రసిద్ధశాలి వగుము. ॥2॥

**భావార్థము :-** సత్, చిత్, ఆనంద (సచ్చిదానంద) స్వరూపుడు, సమస్త సృష్టిని రచించినవాడు, సర్వత్రా వ్యాపకమైయున్నవాడు, సర్వోత్తముడు, సర్వశక్తిమంతుడును నగు నా పరబ్రహ్మ పరమేశ్వరుని యుపాసనచేతనే సమస్త విద్యలు, అనంత గుణములు ప్రాప్తించును. అట్టి బ్రహ్మాండనాయకునే సేవించి తరించవలెను. కాని అన్యముల పూజించుట అజ్ఞానాంధకారమే యగును. ॥2॥

2.O God, Thou art the Support of waters, the Cause of fire, the Enveloper of ocean as it swells and surges, the Loftiest of all, Worthy of adoration by humanity, and full of Majesty in space. Shine forth for us with Omnipresence and Omniscience.

633. బ్రహ్మ జజ్ఞానమిత్యస్య వత్సార ఋషిః, ఆదిత్యో దేవతా, నిచృత్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

కిం స్వరూపం బ్రహ్మ జనైరుపాస్యమిత్యాహ. మానవులే స్వరూపముగల బ్రహ్మ నుపాసించ యోగ్యుడు?

**633 బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తాద్వి సీమతః సురుచో వేన ఆవః।**

**స బుధ్న్యా ఉపమా అస్య విష్ఠాః సతశ్చ యోనిమసతశ్చ వివః॥3॥**

**ప. విః-** బ్రహ్మ, జజ్ఞానమ్, ప్రథమమ్, పురస్తాత్, వి, సీమతః, సురుచ ఇతి సు + రుచః, వేనః, ఆవరిత్యావః, సః, బుధ్న్యాః, ఉపమా ఇత్యుపఽమాః, అస్య, విష్ఠాః, విష్ఠా ఇతి వి + స్థాః, సతః, చ, యోనిమ్, అసతః, చ, వి, వరితి వః ॥3॥

**పదార్థః :-** (బ్రహ్మ) సర్వేభ్యో బృహత్ (జజ్ఞానమ్) సర్వస్య జనకం విజ్ఞాతృ (ప్రథమమ్) విస్తృతం విస్తారయితృ (పురస్తాత్) సృష్ట్యాదౌ (వి) (సీమతః) సీమాతో మర్యాదాతః (సురుచః) సుప్రకాశమానః సుష్ఠురుచి విషయశ్చ (వేనః) కమనీయః. వేనతీతి కాన్తికర్మా. నిఘం. 2.6. (ఆవః) ఆవృణ్వన్తి స్వవ్యాప్త్యాచ్ఛాదయన్తి తాః (సః) బుధ్న్యాః బుధ్నే జలసమ్బద్ధేఽన్తరిక్షే భవాః సూర్యచంద్రపృథివీతారకాదయో లోకాః (ఉపమాః) ఉపమిమతే యాభిస్తాః (అస్య) జగదీశ్వరస్య (విష్ఠాః) యా వివిధేషు స్థానేషు తిష్ఠన్తి తాః (సతః) విద్యమానస్య వ్యక్తస్య (చ) అవ్యక్తస్య (యోనిమ్) స్థానమాకాశమ్ (అసతః) అవిద్య

మానస్యాదృశ్యస్యావ్యక్తస్య కారణస్య (చ) మహత్తత్త్వాదేః (వివః) వివృణోతి. అత్ర మంత్రే ఘసేతి శ్లేర్లుగడభావశ్చ. ॥3॥

**అత్రాహ యాస్కమునిః:-** విసీమతః సురుచో వేన ఆవరితి వ వ్యవృణోత్సర్వత ఆదిత్యః సురుచ ఆదిత్యరశ్మయః సురోచనాదపి వా సీమేత్యేతదనర్థకముపబన్ధమాదదీత పంచమీకర్మాణం సీమ్నః సీమతః సీమాతో మర్యాదాతః సీమా మర్యాదా విషీవ్యతి దేశావితి. నిరు.౧.౭.॥3॥

**అన్వయః:-** యత్ పురస్తాజ్జజ్ఞానం ప్రథమం బ్రహ్మ యః సురుచో వేనో యస్యాస్య బుధ్న్యా విష్ఠా ఉపమాః సన్తి స సర్వమానః స విసీమతః సతశ్చాసతశ్చ యోనిం వివస్తత్సర్వైరుపాసనీయమ్. ॥3॥

**భావార్థః:-** యస్య బ్రహ్మణో విజ్ఞానాయ ప్రసిద్ధాఽప్రసిద్ధలోకా దృష్టాన్తాః సన్తి తత్సర్వత్రాభివ్యాప్తం సత్సర్వమావృణోతి సర్వం వికాశయతి సునియమేన స్వస్వకక్షాయాం విచాలయతి తదేవాన్తర్యామి బ్రహ్మ సర్వై ర్మనుష్యైరుపాస్యం నాతో పృథగ్వస్తు భజనీయమ్. ॥3॥

**పదార్థము :-** (పురస్తాత్) సృష్ట్యాదియందు (జజ్ఞానమ్) సమస్త ఉత్పాదకుడు, సర్వమునెరిగినవాడు (ప్రథమమ్) విస్తారముతో గూడిన మరియు విస్తారకర్త (బ్రహ్మ) సర్వోన్నతుడు (సురుచః) చక్కని ప్రకాశకుడు, సుందరమైన రుచికి విషయము (వేనః) గ్రహించదగినవాడు ఏ (అస్య) ఈతడు (బుధ్న్యా) జలసంబంధమగు ఆకాశమునందు వర్తమానమైయున్న పృథివి సూర్యచంద్రనక్షత్రాదులు (విష్ఠాః) వివిధ ప్రదేశములందుండు (ఉపమాః) ఈశ్వరజ్ఞానమునకు దృష్టాంతరూపమున లోకమునగ గల ఆ సమస్తమును (సః) యీశ్వరుడు (ఆవః) తనవ్యాపకముచే ఆచ్ఛాదితమొనర్చుచున్నాడు. (విసీమతః) మర్యాదచే (సతః) వ్యక్తము, విద్యమానము, దర్శించయోగ్యమై (చ) మరియు (అసతః) అవ్యక్తము (వ) మరియు అదృశ్యమగు కారణముయొక్క (యోనిమ్) ఆకాశరూప స్థానమును (వివః) గ్రహించుచున్నట్టి యూ పరబ్రహ్మ పరమేశ్వరునే సర్వకాలములందు సర్వజనులు ఉపాసించవలెను. కాని అన్యమును సేవించరాదు. ॥3॥

**భావార్థము :-** ఏ పరబ్రహ్మను దెలిసికొనుటకై ప్రసిద్ధ, అప్రసిద్ధ సకలలోకములు దృష్టాంతములై యున్నవియో, ఎవడు సర్వత్రా వ్యాప్తుడైయుండి సర్వమున కావరణమైయుండి సర్వమును ప్రకాశితపరచుచున్నాడో, చక్కని నియమముతో సమస్త లోకలోకాంతరములను తమ తమ కక్షలయందుంచి నడుపుచున్నాడో అట్టి అంతర్యామియగు పరమాత్మయే సకల మానవులకు నిరంతరము ఉపాసించదగినవాడు. కాని ఇంతకన్న అన్యపదార్థమేదియును సేవించయోగ్యమైనదిగాదు. ॥3॥

3.That God alone is Adorable, Who, in the beginning of the universe, created everything, is wide in expansion. Highest of all. Effulgent and Worthy of worship. The sun, moon and other worlds in the atmosphere, stationed in their orbits, testify to His knowledge. He pervades them all through His Omnipresence and comprehends the visible and the invisible in space.

౬౩౪.హిరణ్యగర్భ ఇత్యస్య హిరణ్యగర్భ ఋషిః, ప్రజాపతిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తత్ కీదృశ మిత్యాహ. మరల నాతడెట్లున్నాడను విషయము.

౬౩౪ హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేకఽ ఆసీత్।

స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ ॥౪॥

ప. విః- హిరణ్యగర్భ ఇతి హిరణ్య + గర్భః, సమ్, అవర్తత, అగ్రే, భూతస్య, జాతః, పతిః, ఏకః, ఆసీత్, సః, దాధార, పృథివీమ్, ద్యామ్, ఉత, ఇమామ్, కస్మై దేవాయ, హవిషా, విధేమ॥౪॥

పదార్థః :- (హిరణ్యగర్భః) హిరణ్యాని సూర్యాదీని తేజాంసి గర్భే మధ్యే యస్య సః, జ్యోతిర్వై హిరణ్యమ్ (శత) హిరణ్యం కస్మాద్ధ్రియత ఆయమ్యమానమితి వా హ్రియతే జనాజ్జనమితి వా హితరమణం భవతీతి వా హర్యతేర్వా స్యాత్ ప్రేప్సాకర్మణః నిరు. ౨.౧౦. (సమ్) (అవర్తత) (అగ్రే) సృష్టేః ప్రాక్ (భూతస్య) ఉత్పన్నస్య (జాతః) జనకః (పతిః) పాలకః (ఏకః) అసహాయోఽద్వితీయః (ఆసీత్) (సః) (దాధార,) ధృతవాన్ (పృథివీమ్) ప్రకాశరహితం భూగోలాదికమ్ (ద్యామ్) ప్రకాశమయం సూర్యాదికమ్ (ఉత) (ఇమామ్) వర్తమానాం సృష్టిమ్ (కస్మై) సుఖస్వరూపాయ ప్రజాపతయే (దేవాయ) ప్రకాశమానాయ (హవిషా) ఆత్మాది సామగ్ర్యా (విధేమ) పరిచరేమ. విధేమేతి పరిచరణకర్మా, నిఘం. ౩.౫. నిరుక్తకార ఏవమాహ హిరణ్యగర్భో హిరణ్యమయో గర్భో హిరణ్మయో గర్భోఽస్యేతి వా గర్భో గృభేర్గృ ణాత్యర్థే గిరత్యనర్థానితి వా యదా హి స్త్రీ గుణాన్ గృహ్ణాతి గుణాశ్చాస్యా గృహ్యన్తేఽథ గర్భో భవతి. సమభవదగ్రే భూతస్య జాతః పతిరేకో బభూవ స ధారయతి పృథివీం దివం చ కస్మై దేవాయ హవిషా విధేమేతి వ్యాఖ్యాతం విధతిర్దానకర్మా, నిరు. ౧౦.౨౩. ॥ ౪ ॥

అన్వయః:- హే మనుష్యాః! యథా వయం యోఽస్య భూతస్య జాతః పతిరేకో హిరణ్యగర్భోఽగ్రే సమవర్తతాసీత్స ఇమాం సృష్టిం రచయిత్వోతాపి పృథివీం ద్యాం దాధార తస్మై కస్మై సుఖస్వరూపాయ దేవాయ పరమేశ్వరాయ హవిషా విధేమ తథా యూయమప్యేనం సేవధ్వమ్. ॥ ౪ ॥

భావార్థః :- హే మనుష్యాః! యూయమస్యావ్యక్తాయాః సృష్టేః ప్రాక్ పరమేశ్వర ఏవ జాగరూక ఆసీద్. జీవా మూర్ఛితా ఇవాసన్ కారణం చాకాశవత్ సుస్థిరం చాసీత్ యేన సర్వా సృష్టీ రచితా ధృతా ప్రలయసమయే భిద్యతే తమేవోపాస్యం మన్యధ్వమ్. ॥ ౪ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఈ (భూతస్య) ఉత్పన్నమైన ప్రపంచమును (జాతః) రచించువాడు (పతిః) పాలనమొనర్చువాడు (ఏకః) అన్యసహాయ మవసరములేనివాడు (హిరణ్యగర్భః) సూర్యుడు మున్నగు తేజోమయ పదార్థములకు ఆధారుడు (అగ్రే) జగద్రచనకు పూర్వమే (సమవర్తత) వర్తమానమై (ఆసీత్) ఉండువాడు (సః) ఆతడు (ఇమామ్) ఈ సృష్టిని రచించి (ఉత) మరియు (పృథివీమ్) ప్రకాశరహిత (ద్యామ్) ప్రకాశసహిత సూర్యాదిలోకములను (దాధార) ధారణమొనర్చుచున్న ఆ (కస్మై) సుఖస్వరూపుడు, ప్రజాపాలకుడు (దేవాయ) ప్రకాశవంతుడునగు పరమాత్మను (హవిషా) ఆత్మ మున్నగు సామగ్రిచే (విధేమ) సేవించుటయందు మే మెట్లు తత్పరులమై యున్నామో అట్లే మీరెల్లరును ఇట్టి పరమాత్మను సేవించుడు.॥౪॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఈ ప్రసిద్ధ సృష్టిని రచించుటకు పూర్వము పరమేశ్వరుడే జాగ్రదవస్థయందు విద్యమానుడై యుండెను. జీవులన్ని గాఢనిద్రయను సుషుప్తియందు లీనమైయుండెను. జగత్కారణమైన ప్రకృతి అత్యంత సూక్ష్మావస్థయందు ఆకాశమువలె ఏకరసముగ స్థిరమై యుండెను. ఈ సమస్తలోక లోకాంతరముల నెవడు సృష్టించి, ధరించియుండి ప్రళయకాలమునందు నాశమొనర్చుచుండునో ఆ పరమాత్ముని యుపాసనయే యోగ్యమని యెంచుడు. ॥౪॥

4.God is the Creator of the universe, its one Lord, the Sustainer of luminous objects like the sun. He war present before the creation of the world. He sustains the earth, the sun and this world. Let us worship with full devotion of our soul, Him, the Embodiment of happiness.

౬౩౫. ద్రప్స ఇత్యస్య హిరణ్యగర్భ ఋషిరీశ్వరో దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. ఆత డెట్లున్నాడు?

**౬౩౫ ద్రప్సశ్చస్కన్ద పృథివీమను ద్యామిమం చ యోనిమను యశ్చ పూర్వః।**

**సమానం యోనిమను సంచరన్తం ద్రప్సం జుహోమ్యను సప్త హోత్రాః ॥౫॥**

**ప.వి:-ద్రప్సః, చస్కన్ద, పృథివీమ్, అను, ద్యామ్, ఇమమ్, చ, యోనిమ్, అను, యః, చ, పూర్వః, సమానమ్, యోనిమ్, అను, సంచరన్తమితి, సమ్ + చరన్తమ్, ద్రప్సమ్, జుహోమి, అను, సప్త, హోత్రాః.॥౫॥**

**పదార్థః** :- (ద్రప్సః) హర్ష ఉత్సాహః. అత్ర దృప విమోహనహర్షణయోరిత్యత ఔణాదికః సః కిచ్చ (చస్కన్ద) ప్రాప్నోతి (పృథివీమ్) భూమిమ్ (అను) (ద్యామ్) ప్రకాశమ్ (ఇమమ్) (చ) (యోనిమ్) కారణమ్ (అను) (యః) (చ) (పూర్వః) పూర్ణః (సమానమ్) (యోనిమ్) స్థానమ్ (అను)

(సంచరన్తమ్) (ద్రప్సమ్) ఆనన్దమ్ (జుహోమి) గృహ్ణామి (అను) (సప్త) పఞ్చ ప్రాణా మన ఆత్మా చేతి (హోత్రాః) ఆదాతారః. ॥౫॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథాహం యస్య సప్త హోత్రాఽను గ్రహీతారో య ఇమాం పృథివీం ద్యాం యోనిం చాను యః పూర్వో ద్రప్సోఽను చస్కన్ద తస్య యోనిమను సంచరన్తం సమానం ద్రప్సం సర్వత్రాభివ్యాప్తమానందమను జుహోమి తథైనమాదత్త. ॥౫॥

**భావార్థః** :-హే మనుష్యాః! యూయం యస్య జగదీశ్వరస్య సానన్దం స్వరూపం సర్వత్రోపలభ్యతే తత్ ప్రాప్తయే యోగమభ్యస్యత. ॥౫॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎవనిచేత (సప్త) ఏడు పంచప్రాణములు, మనస్సు, ఆత్మ (హోత్రాః) అనుగ్రహించబడినవియో (యః) ఏ (ఇమామ్) ఇట్టి (పృథివీమ్) పృథివికి (ద్యామ్) ప్రకాశమునకు (చ) మరియు (యోనిమ్) కారణమునకు (అను) అనుకూలము (యః) ఎవడు (పూర్వః) సంపూర్ణస్వరూపుడో (ద్రప్సః) ఆనందోత్సాహములను (అను) అనుకూలముగ (చస్కన్ద) ప్రాప్తించునో అట్టి (యోనిమ్) స్థానమును (అను) అనుసరించి (సంచరన్తమ్) సంచరించుచు (సమానమ్) ఒకేవిధముగ (ద్రప్సమ్) సర్వత్ర అభివ్యాప్తమైన ఆనందమును నే నెట్లు (అనుజుహోమి) అనుకూలముగ గ్రహణ మొనర్చుచున్నానో అట్లే మీరును గ్రహణమొనర్చుడు. ॥౫॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఏ జగదీశ్వరుని ఆనందము మరియు స్వరూపముచే సర్వత్ర లాభము గలుగుచున్నదో దానిని పొందుటకై మీరును యోగాభ్యాసమొనర్చుడు. ॥౫॥

5. Even forces realise Him. He engulfs this earth, the sun and the sky. In His fullness, He favourably possesses happiness and energy. Moving in Him, I willingly perceive complete pleasure.

౬౩౬. నమోఽస్త్విత్యస్య హిరణ్యగర్భ ఋషిర్దేవతా చ, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

మనుష్యైరత్ర కథం వర్తితవ్యమిత్యాహ. మానవులిట నెటుల ప్రవర్తించవలయును?

**౬౩౬ నమోఽస్తు సర్పేభ్యో యే కే చ పృథివీమను।**

**యేఽ అన్తరిక్షే యే దివి తేభ్యః సర్పేభ్యో నమః ॥౬॥**

**ప.వి:- నమః, అస్తు, సర్పేభ్యః, యే, కే, చ, పృథివీమ్, అను, యే, అన్తరిక్షే, యే, దివి, తేభ్యః, సర్పేభ్యః, నమః ॥౬॥**

**పదార్థః** :-(నమః) అన్నమ్. నమ ఇత్యన్ననామ. నిఘం. ౨.౭. (అస్తు) (సర్పేభ్యః) యే సర్పన్తి గచ్ఛన్తి తే లోకాస్తేభ్యః. ఇమే వై లోకాః సర్పాస్తే హానేన సర్వేణ సర్పన్తి. శత, ౭.౩.౧.౨౫ (యే) (కే) (చ) (పృథివీమ్) భూమిమ్ (అను) (యే) (అంతరిక్షే) ఆకాశే (యే) (దివి) సూర్యాదిలోకే (తేభ్యః) (సర్పేభ్యః) ప్రాణిభ్యః (నమః) అన్నమ్. ॥౬॥

**అన్వయః** :- యే కే చాత్ర సర్పాః సన్తి తేభ్యః సర్పేభ్యో నమోఽస్తు. యేఽన్తరిక్షే యే దివి యే చ పృథివీమనుసర్పన్తి తేభ్యః సర్పేభ్యో నమోఽస్తు.॥ ౬ ॥

**భావార్థః** :- యావన్త ఇమే లోకా దృశ్యన్తే యేచ న దృశ్యన్తే తే సర్వే స్వస్వకక్షాయామీశ్వరేణ నియతాః సన్త ఆకాశే భ్రమన్తి తేషు సర్వేషు లోకేషు యే ప్రాణినశ్చలన్తి తదర్థమన్నమపీశ్వరేణ రచితం యత ఏతేషాం జీవనం భవతీతి యూయం విజానీత. ॥ ౬ ॥

**పదార్థము** :-(యే కే) ఈ విశ్వమునం దే యే లోకలోకాంతరములు, ప్రాణులు గలవో, (తేభ్యః) అట్టి (సర్పేభ్యః) లోకముల మరియు జీవులకొరకు (నమః) అన్నము (అస్తు) లభించుగాక! (యే) ఏ (అన్తరిక్షే) ఆకాశమునందు (యే) ఏ (దివి) ప్రకాశవంతమైన సూర్యాదిలోకములందు (చ) మరియు (యే) ఏ (పృథివీమ్) భూమి (అను) పైన నడచునో అట్టి (సర్పేభ్యః) ప్రాణులకొరకు (నమః) అన్నము ప్రాప్తించుగాక! ॥౬॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఈ కనబడుచున్న, కనిపించని లోకములు ఈశ్వరనియమముచే తమ తమ కక్షలయందు స్థితమైయున్న ఆకాశమార్గమున భ్రమణ మొనర్చుచున్నవి. ఆ యన్నిటియం దే యే ప్రాణులు నివసించుచున్నవియో వానియాహారమును ఈశ్వరుడు సృష్టించియుంచినాడు. దానివల్ల ఆ సకల జీవుల జీవితములు జరుగుచున్నవి. ఈ విషయమును మీరెరుగుడు. ॥౬॥

6.May the denizens of all planets of the universe obtain food. May all the living creatures residing in the atmosphere, the sun and roaming on the earth obatain food.

**౬౩౭. యా ఇషవ ఇత్యస్య హిరణ్యగర్భ ఋషిః, స ఏవ దేవతా చ, అనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.**

**పునస్తైః కథం భవితవ్యమిత్యుపదిశ్యతే. మానవు లెటు లుండవలయును?**

**౬౩౭ యాఽ ఇషవో యాతుధానానాం యే వా వనస్పతీఁ॥౧॥రను।**

**యే వావటేషు శేరతే తేభ్యః సర్పేభ్యో నమః ॥౭॥**

**ప. వి:- యాః, ఇషవః, యాతుధానానామితి యాతు + ధానానామ్, యే, వా, వనస్పతీన్, అను, యే, వా, అవటేషు, శేరతే, తేభ్యః, సర్పేభ్యః, నమః ॥౭॥**

**పదార్థః** :-(యాః) (ఇషవః) గతయః (యాతుధానానామ్) యే యాన్తి పరపదార్థాన్ దధతి తేషామ్ యే) (వా) (వనస్పతీన్) వటాదీన్ (అను) (యే) (వా) (అవటేషు) అపరిభాషితేషు మార్గేషు (శేరతే) (తేభ్యః) (సర్వేభ్యః) (నమః) వజ్రమ్. ॥ ౭ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యూయం యా యాతుధానానామిషవో యే వా వనస్పతీ ననువర్తన్తే యే వాఽవటేషు శేరతే తేభ్యః సర్వేభ్యో నమః ప్రక్షిపత. ॥ ౭ ॥

**భావార్థః** :-మనుష్యా యే మార్గేషు వనేషూత్కోచకా దివసే ఏకాన్తే స్వపన్తి తాన్ దస్యూన్సర్పాంశ్చ శస్త్రౌషధాదినా నివారయన్తు. ॥ ౭ ॥

**పదార్థము** :-మానవులారా! మీరు (యాః) ఏ (యాతుధానానామ్) ఇతరుల పదార్థములను పొంగిలించి దాచుకొనువారి (ఇషవః) ఏ గతులు గలవో (వా) లేక (యే) ఏవి (వనస్పతీన్) మట్టి మున్నగు వనస్పతి వృక్షములను (అను) ఆశ్రయించు జీవులు గలవో (యే) ఏవి (వా) లేక (అవటేషు) గుప్తమార్గములందు (శేరతే) నిద్రించుచుండునో (తేభ్యః) అట్టి (సర్వేభ్యః) చంచల దుష్టప్రాణులకై (నమః) వజ్రమును ప్రయోగించుడు. ॥౭॥

**భావార్థము** :-మార్గములందు, అరణ్యములందు దోపిడికాండ్రు, దొంగలు పగలు నిద్రించుచు రాత్రులందు మనుష్యులను బాధించువారిని దుష్టులను, సర్పములు మున్నగువానిని శస్త్రములు, ఓషధులు మున్నగు వానిచే తొలగించవలయును. ॥౭॥

7.Suppress through arms the movements of dacoits and plunderers who live in forsts; and lie hidden in unknown paths.

**౬౩౮. యే వామీత్యస్య హిరణ్యగర్భ ఋషిః, సూర్యో దేవతా, నిచృదనుష్టుప్ఛన్దః, గాంధారః స్వరః.**

**పునర్మనుష్యైః కణ్టకాః కథం బాధనీయా ఇత్యాహ.**

**మానవులు కంటకములను, దుష్టప్రాణుల నెట్లు తొలగించవలయును?**

**౬౩౮ యే వామీ రోచనే దివో యే వా సూర్యస్య రశ్మిషు।**

**యేషామప్సు సదస్కృతం తేభ్యః సర్వేభ్యో నమః ॥౮॥**

**ప.వి:- యే, వా, అమీఽ ఇత్యమీ, రోచనే, దివః, యే, వా, సూర్యస్య, రశ్మిషు, యేషామ్, అప్స్విత్యప్సు, సదః, కృతమ్, తేభ్యః సర్వేభ్యః, నమః ॥౮॥**

పదార్థః :-(యే) (వా) (అమీ) (రోచనే) దీప్తౌ (దివః) విద్యుతః (యే) (వా) (సూర్యస్య) (రశ్మిషు) (యేషామ్) (అప్సు) (సదః) సదనమ్ (కృతమ్) నిష్పన్నమ్ (తేభ్యః) (సర్వేభ్యః) దుష్టప్రాణిభ్యః (నమః) వజ్రమ్. ॥ ౮ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యేఽమీ దివో రోచనే యే వా సూర్యస్య రశ్మిషు యేషాం వాఽప్సు సదస్కృతమస్తి తేభ్యః సర్వేభ్యో నమో దత్త. ॥ ౮ ॥

**భావార్థః** :-మనుష్యైర్యే జలేష్వన్తరిక్షే సర్పా నివసన్తి తే వజ్రప్రహారేణ నివర్తనీయాః. ॥ ౮ ॥

**పదార్థము** :-మానవులారా! (యే) ఏవి (అమీ) పరోక్షమునందుండునో (దివః) విద్యుత్ప్రకాశము (రోచనే) ప్రకాశమునందు (వా) లేక (యే) ఏవి (సూర్యస్య) సూర్యుని (రశ్మిషు) కిరణములందు (వా) లేక (యేషామ్) వేనికి (అప్సు) జలములందు (సదః) స్థానము (కృతమ్) చేయబడియున్నదో (తేభ్యః) అట్టి (సర్వేభ్యః) దుష్టప్రాణులను (నమః) వజ్రముచే సంహరించుడు. ॥౮॥

**భావార్థము** :- మనుష్యులు జలములందు, ఆకాశమునందుండు దుష్టప్రాణులను శస్త్రములచే సంహరించుచుండవలయును. ॥౮॥

8.Subdue with arms, all these evil-minded persons, who generally remain hidden and now and then appear in the day time, or walk freely in the light of the sun, or dwell in waters.

౬౩౯. కృణుష్వేత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, భురిక్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

రాజపురుషైః కథం శత్రవో బన్ధనీయా ఇత్యాహ. రాజపురుషులు శత్రువుల నెటుల బంధించవలెను?

**౬౩౯ కృణుష్వ పాజః ప్రసితిం న పృథ్వీం యాహి రాజేవామవాఁ ఇభేన। తృష్వీమను ప్రసితిం ద్రూణానోఽస్తాసి విధ్య రక్షసస్తపిష్ఠైః ॥౯॥**

**ప.విః-కృణుష్వ, పాజః, ప్రసితిమితి ప్ర+సితిమ్, న, పృథ్వీమ్, యాహి, రాజేవేతి రాజాఽఇవ, అమవానిత్యమ + వాన్, ఇభేన, తృష్వీమ్, అను, ప్రసితిమితి ప్ర + సితిమ్, ద్రూణానః, అస్తా, అసి, విధ్య, రక్షసః తపిష్ఠైః॥౯॥**

పదార్థః :-(కృణుష్వ) కురుష్వ (పాజః) బలమ్. పాతేర్బలే జుట్ చ. ఉ. ౪.౨౧౦. ఇత్యసున్ (ప్రసితిమ్) జాలమ్. ప్రసితిః ప్రసయనాత్తన్తుర్వా జాలం వా.ని. ౬.౧౨. (న) ఇవ (పృథ్వీమ్) భూమిమ్

(యాహి) ప్రాప్నుహి (రాజేవ) (అమవాన్) బహవః సచివా విద్యన్తే యస్య తద్వత్ (ఇభేన) హస్తినా (తృష్వీమ్) క్షిప్రగతిమ్ తృష్వీతి క్షిప్రనామ. నిఘం ౨.౧౫. తతో వోతో గుణవచనాదితి జీష్ (అను) (ప్రసితిమ్) బన్ధనం జాలమ్ (ద్రూణానః) హింసన్ (అస్తా) ప్రక్షేప్తా (అసి) (విధ్య) తాడయ (రక్షసః) శత్రూన్ (తపిష్ఠైః) అతిశయేన సంతాపకరైః శస్త్రైః, అయం మన్త్రః, నిఘం. ౬.౧౨ వ్యాఖ్యాతః. ॥ ౯ ॥

**అన్వయః** :- హే సేనాపతే! త్వం పాజః కృణుష్వ ప్రసితిం న పృథ్వీం యాహి. యతస్త్వమస్తాసి తస్మాదిభేనామవాన్ రాజేవ తపిష్ఠైః ప్రసితిం సంసాధ్య రక్షసశ్చ ద్రూణానస్తృష్వీమనువిధ్య. ॥ ౯ ॥

**భావార్థః** :- అత్రోపమాలంకారః. రాజవత్సేనాపతిః పూర్ణం బలం సంపాద్యాన్నైః పాశైః శత్రూన్ బధ్వా శరాదిభిరివిధ్వా కారాగృహే సంస్థాప్య శ్రేష్ఠాన్ పాలయేత్. ॥ ౯ ॥

**పదార్థము** :- ఓ సేనాపతీ! నీవు (పాజః) శక్తిని (కృణుష్వ) పెంచుకొనుము (ప్రసితిమ్) వల (న) వలె (పృథివీమ్) భూమిని (యాహి) పొందుము. దానిచే నీవు (అస్తా) విసరివేయువాడవు (అసి) అగుచున్నావు. దీనిచే (ఇభేన) ఏనుగుతోగూడ (అమవాన్) అనేక దూతలుగల(రాజేవ) రాజువలె (తపిష్ఠైః) అత్యంత దుఃఖదాయకములగు శస్త్రములచే (ప్రసితిమ్) ఉరిత్రాళ్లను సిద్ధపరచి (రక్షసః) శత్రువులను (ద్రూణానః) సంహరించుచు (తృష్వీమ్) శీఘ్రముగా (అను) ఎదురుపడి (విధ్య) తాడనమొనర్చుము సంహరించుము. ॥౯॥

**భావార్థము** :- ఈ మంత్రమున ఉపమాలంకార మున్నది. సేనాపతి రాజువలె పూర్ణశక్తిచే గూడి అనేక ఉచ్చుత్రాళ్లచే శత్రువులను బంధించి వారిని బాణములు మున్నగు శస్త్రములచే దండించి కారాగారమున బంధించి శ్రేష్ఠులరక్షించవలెను. ॥౯॥

9.O Commander of the army, increase thy vigour, master the earth well-ordered like a net. Thou art the extirpator of foes, attack them like a king equipped with ministers and military paraphernalia. Strengthening thy hold with most deadly weapons, facing and killing the fiends, subdue them soon!.

**౬౪౦.తవ భ్రమాస ఇత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్ దేవతా, భురిక్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.**

పునః స కిం కుర్యాదిత్యుపదిశ్యతే. ఆ సేనాపతి కర్తవ్య మేమిటి?

**౬౪౦ తవ భ్రమాస॒ ఆశు॒యా ప॑త॒న్త్యను॑ స్పృశ ధృష॒తా శోశు॑చానః।**

**తపూం॑ష్యగ్నే జు॒హ్వా పత॒ఙ్గానస॑న్దితో॒ విసృ॑జ॒ విష్వ॑గు॒ల్కాః ॥౧౦॥**

**ప.విః- తవ, భ్రమాసః, ఆశుయేత్యాశు॒యా, ప॒త॒న్తి॒, అను, స్పృ॒శ॒, ధృ॒ష॒తా, శోశు॑చానః,**

తపూం॑షి, అగ్నే, జుహ్వా, పతఙ్గాన్, అసన్దిత ఇత్యసమ్ + దితః, వి, సృజ, విష్వక్, ఉల్కాః॥౧౦॥

**పదార్థః** :- (తవ) (భ్రమాసః) భ్రమణశీలా వీరాః (ఆశుయా) శీఘ్రగమనాః. అత్ర జసః స్థానే యాదేశః (పతన్తి) శ్యేనవచ్ఛత్రుదలే సంచరన్తి (అను) (స్పృశ) అనుగతో భవ (ధృషతా) దృఢేన సైన్యేన (శోశుచానః) భృశం పవిత్రాచరణః (తపూంషి) తాపాః (అగ్నే) అగ్నిరివ వర్తమాన (జుహ్వా) ఆజ్యహవనసాధనయా (పతఙ్గాన్) అశ్వాన్. పతఙ్గా ఇత్యశ్వనా. నిఘం. ౧.౧౪ (అసందితః) అఖణ్డితః (వి) (సృజ) నిష్పాదయ (విష్వక్) సర్వతః (ఉల్కాః) విద్యుత్పాతాః ॥ ౧౦॥

**అన్వయః** :- హే సేనాపతేఽగ్నే! శోశుచానస్త్వం యే తవ భ్రమాసో యథా విశ్వాగాశుయోల్కాస్తథా శత్రుషు పతన్తి తాన్ ధృషతాఽనుస్పృశ. అసందితోఽఖణ్డితః సన్ జుహ్వాగ్నేస్తపూంషీవ శత్రూణాముపరి సర్వతో విద్యుతో విసృజ పతఙ్గాన్ సుశిక్షితానశ్వాన్ కురు. ॥ ౧౦ ॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. రాజసేనాపతిసేనాభృత్యైః పరస్పరం ప్రీత్యా బలం సంవర్ధ్య వీరాన్ హర్షయిత్వా సంయోధ్యాగ్న్యాద్యస్త్రైః శతఘ్న్యాదిభిశ్చ శత్రూణాముపరి విద్యుద్వృష్టిః కార్యా యతః సద్యో విజయః స్యాత్.॥౧౦॥

**పదార్థము** :- (అగ్నే) అగ్నివలె తేజస్వివగు ఓ సేనాపతీ! (శోశుచానః) అతి పవిత్రాచరణము ననుష్ఠించు నీవు (తవ) నీయొక్క (భ్రమాసః) భ్రమణశీలురగు వీరసైనికులు ఎట్లు (విష్వక్) అన్నివైపులనుండి (ఆశుయా) శీఘ్రకారియగు (ఉల్కాః) పిడుగువంటి నడకగల (పతన్తి) డేగపక్షివలె శత్రుదళములందు బడుచుందురో వారిని (ధృషతా) దృఢసేనలతో (అను) అనుకూలముగ (స్పృశ) ప్రాప్తించుకొనుము. మరియు (అసన్దితః) అఖండితవగు (జుహ్వా) ఘృతాహుతిచే ప్రజ్వరిల్లు అగ్ని (తపూంషి)తేజమువలె శత్రువులపై అన్నివైపులనుండి విద్యుత్తును (విసృజ) ప్రయోగించుము మరియు (పతఙ్గాన్) అశ్వములకు చక్కని శిక్షణను యొసగుము. ॥౧౦॥

**భావార్థము** :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. రాజు, సేనాపతి, సైనికులు పరస్పర ప్రీతితో శక్తిని పెంచుకొనవలెను. వీరులకు హర్షము గలుగునట్లు పట్టుదలతో యుద్ధమొనర్చి ఆగ్నేయాది శస్త్రములు, భుశుండి (తుపాకి, ఫిరంగి) మున్నగు శస్త్రములచే శత్రువులపై విద్యుద్వృష్టి గలిగించి శీఘ్రముగా విజయమును పొందవలయును.॥౧౦॥

10.O Commander the specimen of morality, keep thy fast moving brave soldiers, well disciplined in the army. Like the swift movements of lightning. Let them fall falcon-like on the enemies. With uninterrupted force, let fire-arms, brilliant like the flames of fire fed with ghee, rain over the foes; and train well thy horses!.

౬౪౧. ప్రతిస్పశ ఇత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునః స కీదృశో భవేదిత్యుపదిశ్యతే. ఆతడెటుల నుండవలయును?

౬౪౧ ప్రతి స్పశో విసృజ తూర్ణితమో భవా పాయుర్విశోఽ అస్యా

అదబ్ధః। యో నో దూరేఽ అఘశꣳసో యోఽ అన్త్యగ్నే

మాకిష్టే వ్యథిరాదధర్షీత్ ॥౧౧॥

ప.విః- ప్రతి, స్పశః, వి, సృజ, తూర్ణితమ ఇతి తూర్ణి+తమః, భవ, పాయుః, విశః అస్యాః, అదబ్ధః, యః, నః, దూరే, అఘశꣳస ఇత్యఘశꣳసః, యః, అన్తి, అగ్నే, మాకిః, తే, వ్యథిః, ఆ, దధర్షీత్ ॥౧౧॥

**పదార్థః** :-(ప్రతి) (స్పశః) బాధనాని (వి) (సృజ) (తూర్ణితమః) అతిశయేన త్వరితా (భవ) ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (పాయుః) రక్షకః (విశః) ప్రజాయాః (అస్యాః) వర్తమానాయాః (అదబ్ధః) అహింసకః (యః) (నః) అస్మాకమ్ (దూరే) విప్రకృష్టే (అఘశంసః) యోఽఘం పాపం కర్తుం శంసతి స స్తేనః (యః)(అన్తి) నికటే (అగ్నే) అగ్నివచ్ఛత్రుదాహక (మాకిః) నిషేధే. అత్ర మకి ధాతోర్బాహుల కాదిన్ నుమభావశ్చ. (తే) తవ (వ్యథిః) వ్యథకః శత్రుః (ఆ)(దధర్షీత్) ధర్షేత్. అత్ర వాచ్ఛన్దసీతి ద్విర్వచనమ్. ॥ ౧౧ ॥

**అన్వయః** :-హే అగ్నే! తే తవ నోఽస్మాకం చ యో వ్యథిరఘశంసో దూరే యోఽన్త్యస్తి యథా సోఽస్మాన్మాకిరాదధర్షీత్ తం ప్రతి త్వం తూర్ణితమః సన్ స్పశో విసృజ. అస్యా విశః పాయురదబ్ధో భవ.॥౧౧॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే నికటదూరస్థాః ప్రజాభ్యో దుఃఖప్రదా దస్యవః సన్తి తాన్ రాజాదయః సామదామదణ్డభేదైః సద్యో వశం నీత్వా దయాన్యాయాభ్యాం ధార్మికీః ప్రజాః సతతం పాలయేయుః. ॥౧౧॥

**పదార్థము** :- (అగ్నే) అగ్నివలె శత్రువులను జయించువాడా! (తే) నీయొక్క (నః) మాయొక్క (వ్యథిః) బాధలనుగలిగించు (యః) ఏ (అఘశంసః) పాపవృత్తిగల చోరులు, శత్రువులు (దూరే) దూరమందు (యః) ఎవరు (అన్తి) సమీపమందు గలరో వారు మమ్ము (మాకిః ఆ దధర్షీత్) దుఃఖములు

గలిగించకుండునట్లు ఆ శత్రువుల (ప్రతి) యెడ నీవు (తూర్ణితమః) శీఘ్రముగ దండించువాడవై (స్పశః) బంధనములను (విసృజ) రచించుము. మరియు (అస్యాః) ఈ వర్తమాన (విశః) ప్రజల (పాయుః) రక్షకుడవు (అదబ్ధః) హింసారహితుడవు అగుము. ॥౧౧॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. సమీపమందును, దూరమందును ఉండి ప్రజలకు దుఃఖములను గలిగించు బందిపోటులు, చోరులు మున్నగువారిని రాజు, రాజపురుషులు సామదానభేదదండోపాయములచే శీఘ్రముగా వశపరచుకొని దయాన్యాయములచే ధర్మయుక్తులగు ప్రజలను నిరంతరము రక్షించుచుండుట కర్తవ్యమై యున్నది. ॥౧౧॥

11. O destroyer of foes like fire, put shackles on and speedily punish the troublesome evil-minded enemy of yours and ours, may he be far or near, so that he may not harm us. May thou be the harmless guardian of the people of thine!.

**౬౪౨.** ఉదగ్న ఇత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

పునః స కిం కుర్యాదిత్యాహ. అతడేమి చేయవలెను?

**౬౪౨ ఉదగ్నే తిష్ఠ ప్రత్యాతనుష్వ న్యమిత్రాఁ॥ ఓషతాత్తిగ్మహేతే ।యో నోఽ అరాతిꣳ సమిధాన చక్రే నీచా తం ధక్ష్యతసం న శుష్కమ్ ।౧౨॥**

**ప. వి:-ఉత్, అగ్నే, తిష్ఠ, ప్రతి, ఆ, తనుష్వ, ని, అమిత్రాన్, ఓషతాత్, తిగ్మహేత ఇతి తిగ్మ+హేతే, యః, నః, అరాతిమ్, సమిధానేతి సమ్ + ఇధాన, చక్రే, నీచా, తమ్, ధక్షి, అతసమ్, న, శుష్కమ్॥౧౨॥**

**పదార్థః** :-(ఉత్) (అగ్నే) సభాధ్యక్ష (తిష్ఠ) (ప్రతి) (ఆ) (తనుష్వ) (ని) (అమిత్రాన్) ధర్మద్వేష్టౄన్ శత్రూన్ (ఓషతాత్) దహ (తిగ్మహేతే) తిగ్మస్తీవ్రో హేతిర్వజ్రో దణ్డో యస్య సః. హేతిరితి వజ్రనా. నిఘం. ౨.౨౦ (యః) (నః) అస్మాకమ్ (అరాతిమ్) శత్రుమ్ (సమిధాన) సమ్యక్ తేజస్విన్ (చక్రే) కరోతి (నీచా) న్యగ్భూతం కృత్వా (తమ్) (ధక్షి) దహ. అత్ర వికరణలుక్ (అతసమ్) కాష్ఠమ్ (న) ఇవ (శుష్కమ్) అనార్ద్రమ్. ॥ ౧౨ ॥

**అన్వయః**:-హే అగ్నే! త్వం రాజధర్మం ఉత్తిష్ఠ. ధార్మికాన్ ప్రత్యాతనుష్వ. హే తిగ్మహేతేఽమిత్రాన్న్యోషతాత్, హే సమిధాన! యో నోఽరాతిం చక్రే తం నీచా శుష్కమతసం న ధక్షి. ॥ ౧౨ ॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. రాజాదయః సభ్యా ధర్మే వినయే సమాహితా భూత్వా జలమివ మిత్రాన్ శీతయేయుః. అగ్నిరివ శత్రూన్ దహేయుః. య ఉదాసీనః స్థిత్వాఽస్మాకం శత్రూనుత్పాదయేత్తం దృఢం బన్ధం బధ్వా నిష్కణ్టకం రాజ్యం కుర్యుః. ॥౧౨॥

**పదార్థము** :- (అగ్నే) తేజోవంతుడవగు సభాధ్యక్షా! నీవు రాజధర్మమునందు (ఉత్తిష్ఠ) ఉన్నతిని పొంది ధర్మాత్ముల (ప్రతి) కొరకు (ఆ తనుష్వ) సుఖములను విస్తరింపజేయుము (తిగ్మహేతే) తీవ్రముగ దండించు రాజపురుషా! (అమిత్రాన్) ధర్మద్వేషులగు శత్రువులను (న్యోషతాత్) నిరంతరము కాల్చివేయుము. (సమిధాన) సమ్యక్ తేజోవంతులారా! (యః) ఎవడు (నః) మాయొక్క (అరాతిమ్) శత్రువునకు ప్రోత్సాహము (చక్రే) కలిగించునో (తమ్) వానిని (నీచా) నీచదశయందు బడవేసి (శుష్కమ్) ఎండిపోయిన (అతసమ్) కాష్ఠము (న) వలె (ధక్షి) కాల్చివేయుము. ॥౧౨॥

**భావార్థము** :-ఈ మంత్రమం దుపమాలంకారము గలదు. రాజు మొదలగు సభాజనులు ధర్మము, వినయములతో గూడి జలములవలె మిత్రులకు శీతలత్వమును ప్రసాదించుచు అగ్నివలె శత్రువులను భస్మమొనర్పవలెను. చాటుగానుండి శత్రువుల నుసిగొల్పు నీచుని దృఢబంధనములచే బంధించి నిష్కంటకముగ రాజ్యమేలవలెను. ॥౧౨॥

12.O king, make progress in thy duty of administration, extend happiness to the virtuous. O terrible chastiser, burn down the irreligious foes. O splendid person, humiliate and consume utterly like dried up stubble, him, who encourages our foe!.

౬౪౩. ఊర్ధ్వో భవేత్యస్య వామదేవ ఋషిః అగ్నిర్దేవతా, నిచృదార్ష్యతిజగతీ ఛందః, నిషాదః స్వరః.

పునః స కీదృశో భవేదిత్యాహ. ఆ రాజు ఎటుల నుండవలయును?

౬౪౩ ఊర్ధ్వో భవ ప్రతి విధ్యాధ్యస్మదావిష్కృణుష్వ దైవ్యాన్యగ్నే।
అవ స్థిరా తనుహి యాతుజూనాం జామిమజామిం
ప్రమృణీహి శత్రూన్ అగ్నేష్ట్వా తేజసా సాదయామి॥౧౩॥

ప.వి:-ఊర్ధ్వః, భవ, ప్రతి, విధ్య, అధి, అస్మత్, ఆవిః, కృణుష్వ, దైవ్యాని, అగ్నే, అవ, స్థిరా, తనుహి, యాతుజూనామితి యాతు+జూనామ్, జామిమ్, అజామిమ్, ప్ర, మృణీహి, శత్రూన్, అగ్నేః, త్వా, తేజసా, సాదయామి ॥౧౩॥

**పదార్థః**:-(ఊర్ధ్వః) ఉత్కృష్టః (భవ) (ప్రతి) (విధ్య) తాడయ (అధి) (అస్మత్) (ఆవిః) ప్రాకట్యే (కృణుష్వ) (దైవ్యాని) దేవైర్విద్వద్భిర్నివృత్తాని వస్తూని (అగ్నే) (అవ) (స్థిరా) నిశ్చలాని (తనుహి) విస్తృణుహి (యాతుజూనామ్) యే యాంతి యే చ జవన్తే తేషామ్ (జామిమ్) భోజనయుక్తమ్ (అజామిమ్) భోజనరహితం స్థానమ్. అత్ర జముధాతోర్వపాదిభ్య ఇతీఞ్ (ప్ర) (మృణీహి) హిన్ధి (శత్రూన్) అరీన్ (అగ్నేః) పావకస్య (త్వా) త్వామ్ (తేజసా) ప్రకాశేన సహ (సాదయామి) స్థాపయామి. ॥౧౩॥

**అన్వయః**:-హే అగ్నే! విద్వన్రాజన్! యతస్త్వమూర్ధ్వో భవ. శత్రూన్ ప్రతి విధ్యాస్మత్ స్థిరా దైవ్యాన్యావిష్కృణుష్వ. సుఖాని తనుహి యాతుజూనాం జామిమజామిమనవతనుహి వినాశయ. శత్రూన్ ప్రమృణీహి తస్మాదహం త్వాఽగ్నేస్తేజసాధి సాదయామి. ॥ ౧౩ ॥

**భావార్థః** :-మనుష్యా రాజ్యైశ్వర్యం ప్రాప్యోత్తమగుణకర్మస్వభావా భవేయుః ప్రజాభ్యో దరిద్రేభ్యశ్చ సతతం సుఖం దద్యుః, ధర్మే స్థిరాః సన్తో దుష్టాధర్మాచారిణో మనుష్యాన్ సతతం శిక్షయేయుః. సర్వోత్కృష్టం సభాపతిం చ మన్యేరన్. ॥ ౧౩ ॥

**పదార్థము** :-(అగ్నే) తేజోవంతుడవగు విద్వాంసుడా! నీవు (ఊర్ధ్వః) ఉత్తముడవు (భవ) అగుము. ధర్మమునకు (ప్రతి) అనుకూలముగనుండి (విధ్య) దుష్టశత్రువులను తాడనమొనర్పుము. (అస్మత్) మాయొక్క (స్థిర) నిశ్చలమైన (దైవ్యాని) విద్వాంసులు సృష్టించిన పదార్థములను (ఆవిః) ప్రకటనము (కృణుష్వ) చేయుము. సుఖములను (తనుహి) విస్తారపరచుము (యాతుజూనామ్) పరధనములను దోచుకొను వేగవంతులగు శత్రువుల (జామిమ్) భోజనమును (అజామిమ్) ఇతర పదార్థముల స్థానమును (అవ) చక్కగా విస్తారముగ నష్టపరచుము, (శత్రూన్) శత్రువులను (ప్రమృణీహి) బలపూర్వకముగ నాశమొందించుము. అందుకే నేను (త్వా) నిన్ను (అగ్నేః) అగ్నియొక్క (తేజసా) ప్రకాశము (అధి) ఎదుట [సమ్ముఖమున] (సాదయామి) స్థాపన మొనర్చుచున్నాను. ॥౧౩॥

**భావార్థము** :- మానవులు రాజ్యైశ్వర్యములను పొంది ఉత్తమ గుణ, కర్మ, స్వభావయుక్తులై ప్రజలకు, ప్రత్యేకించి దరిద్రులకు సుఖములను గలిగించవలెను. ధర్మమునందు స్థిరముగానుండి నిరంతరము శిక్షణలను గరపుచు అందరిలో ఉత్తముడైన వానిని సభాపతి రాజుగ నెంచుకొనవలెను. ॥౧౩॥

13.O King, rise high, punish the wicked foes righteously, manifest the objects prepared by our steady scholars, enhance pleasures. Destroy the kitchens and other places of plundering of the vigorous enemies. Kill the foes, I settle thee with fire's ardour!.

**౭౪౪. అగ్నిర్మూర్ధేత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.**

**పునః స కీదృశో భవేదిత్యాహ.**

**ఆ రాజపురుషు లెటులుండవలయును?**

౬౪౪ అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా౨ అయమ్।
అపా౯ం రేతాంసి జిన్వతి ఇన్ద్రస్య త్వౌజసా సాదయామి ॥౧౪॥

**ప.వి:-** అగ్నిః, మూర్ధా, దివః, కకుత్, పతిః, పృథివ్యాః అయమ్, అపామ్, రేతా౯ంసి, జిన్వతి, ఇన్ద్రస్య, త్వా, ఓజసా, సాదయామి ॥౧౪॥

**పదార్థః :-**(అగ్నిః) సూర్యః (మూర్ధా) సర్వేషాం శిర ఇవ (దివః) ప్రకాశయుక్తస్యాకాశస్య మధ్యే (కకుత్) మహాన్. కకుహ ఇతి మహన్నా. నిఘం. 3.3. అస్యాన్త్యలోపో వర్ణవ్యత్యయేన హస్య దః (పతిః) పాలకః (పృథివ్యాః) భూమేః (అయమ్) (అపామ్) జలానామ్ (రేతాంసి) వీర్యాణి (జిన్వతి) ప్రీణాతి తర్పయతి (ఇన్ద్రస్య) సూర్యస్య (త్వా) త్వామ్ (ఓజసా) పరాక్రమేణ (సాదయామి).॥౧౪॥

**అన్వయః:-** హే రాజన్! యథా౨యమగ్నిర్దివః పృథివ్యా మూర్ధా కకుత్పతిరపాం రేతాంసి జిన్వతి తథా త్వం భవ. అహం త్వా త్వామిన్ద్రస్యౌజసా సహ రాజ్యాయ సాదయామి. ॥ ౧౪ ॥

**భావార్థః:-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. యో మనుష్యః సూర్యవద్ గుణకర్మస్వభావో న్యాయేన ప్రజాపాలనతత్పరో ధార్మికో విద్వాన్ భవేత్తం రాజత్వేన సర్వే మనుష్యాః స్వీకుర్యుః ॥ ౧౪ ॥

**పదార్థము :-** ఓ రాజా! (అయమ్) ఈ (అగ్నిః) సూర్యుడు (దివః) ప్రకాశముతోగూడ ఆకాశమధ్యన మరియు (పృథివ్యాః) భూమియొక్క (మూర్ధా) సకలప్రాణుల శిరమువలె ఉత్తముడు (కకుత్) ఉన్నతుడు (పతిః) సకలపదార్థముల రక్షకుడు (అపామ్) జలముల (రేతాంసి) సారముచే ప్రాణులను (జిన్వతి) తృప్తిపరచుచున్నట్లు నీవును అగుము. నేను (త్వా) నిన్ను (ఇన్ద్రస్య) సూర్యుని (ఓజసా) పరాక్రమముతోగూడ రాజ్యమునకై (సాదయామి) స్థాపనమొనర్చుచున్నాను. ॥౧౪॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యునివంటి గుణకర్మ స్వభావములు గలిగి న్యాయయుక్తముగా ప్రజాపాలనమందు ధర్మాత్ముడగు విద్వాంసుని రాజ్యాధికారిగా ఎల్లరును నమ్మవలెను. ॥౧౪॥

14.O king, just as this sun, in the midst of luminous sky, as the head of earth, foremost of all, the protector of all, satisfies men with the strength of waters, so shouldst thou be. I appoint thee for kingship, with the strength of the sun!.

౬౪౫. భువో యజ్ఞస్యేత్యస్య త్రిశిరా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః స కీదృశో భవేదిత్యాహ. ఆతడెట్లుండవలయును?

౬౪౫ భువో యజ్ఞస్య రజసశ్చ నేతా యత్రా నియుద్భిః సచసే శివాభిః।

దివి మూర్ధానం దధిషే స్వర్షాం జిహ్వామగ్నే చకృషే హవ్యవాహమ్॥౧౫॥

ప.వి:- భువః, యజ్ఞస్య, రజసః, చ, నేతా, యత్ర, నియుద్భిరితి నియుత్ + భిః, సచసే, శివాభిః, దివి, మూర్ధానమ్, దధిషే, స్వర్షామ్, స్వఃసామితి స్వః+సామ్, జిహ్వామ్, అగ్నే, చకృషే హవ్యవాహమితి హవ్య + వాహమ్ ॥౧౫॥

**పదార్థః** :-(భువః) పృథివ్యాః (యజ్ఞస్య) రాజధర్మస్య (రజసః) లోకస్యైశ్వర్యస్య వా (చ) పశ్వాదీనామ్ (నేతా) నయనకర్తా (యత్ర) రాజ్యే. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (నియుద్భిః) వాయోర్వేగాదిగుణైః సహ (సచసే) సమవైషి (శివాభిః) కల్యాణకారికాభిర్నీతిభిః (దివి) న్యాయప్రకాశే (మూర్ధానమ్) శిరః (దధిషే) ధరసి (స్వర్షామ్) స్వః సుఖాని సనన్తి భజన్తి యయా తామ్ (జిహ్వామ్) జోహవీతి యయా తాం వాచమ్ (అగ్నే) విద్వన్ (చకృషే) కరోషి (హవ్యవాహమ్) హవ్యాని హోతుం దాతుమర్హాణి ప్రజ్ఞానాని యయా తామ్. ॥౧౫॥

**అన్వయః** :-హే అగ్నే విద్వన్! యథాఽగ్నిర్నియుద్భిః సహ వాయూ రజసో నేతా సన్ దివి మూర్ధానం ధరతి తథా యత్ర శివాభిః సహ భువో యజ్ఞస్య సచసే రాజ్యం దధిషే హవ్యవాహం స్వర్షాం జిహ్వాఞ్చకృషే తత్ర సర్వాణి సుఖాని వర్ధన్త ఇతి విజానీహి.॥౧౫॥

**భావార్థః** :-యస్మిన్ రాజ్యే రాజాదయః సర్వే ధార్మికా మఙ్గలచారిణో ధర్మేణ ప్రజాః పాలయేయుస్తత్ర విద్యాసుశిక్షాజాని సుఖాని కుతో న వర్ధేరన్? ॥ ౧౫ ॥

**పదార్థము** :-ఓ విద్వాంసుడా! (యత్ర) ఏ రాజ్యమందు నీవలె (నియుద్భిః) వేగము మున్నగు గుణములచే వాయువు (రజసః) లోకముల, ఐశ్వర్యముల (నేతా) నడపునదై (దివి) న్యాయప్రకాశమునందు (మూర్ధానమ్) శిరస్సును ధారణమొనర్చునట్లు (యత్ర) ఎచ్చట (శివాభిః) కల్యాణప్రదమగు నీతులతో (భువః) తన రాజ్యమునందు (యజ్ఞస్య) రాజధర్మపాలనయందు (సచసే) సంయుక్తమైయుండి ఉత్తమప్రజలతో రాజ్యమును (దధిషే) ధారణమొనర్చి మరియు (హవ్యవాహమ్) ఈయదగిన విద్వాంసులను పొందుటకు (స్వర్షామ్) సుఖములను సేవింపజేయు (జిహ్వామ్) చక్కని విషయములను గ్రహించు వాణిని (చకృషే) ప్రయోగింపబడు చోట సకలసుఖములు వర్ధిల్లుచుండును. ॥౧౫॥

**భావార్థము :-** ఏ రాజ్యమునందు రాజు, రాజపురుషు లెల్లరును శుభాచరణ, ధర్మాచరణపరులైయుండి ప్రజాపాలనమొనర్చు నప్పు డచ్చట ఉత్తమ విద్యాశిక్షణల ద్వారా అనేక సుఖములు వృద్ధియగును. ।౧౫॥

15.O learned person, know, that country flourishes, in which, there are men like thee active as air, leaders of supremacy, and heads of justice; where there are men to carry on the administration of the land with good statesmanship; where the country is preserved by efficient officials; and where the wisdom inspiring and pleasure - giving speech is used!.

౬౪౬. ధ్రువాసీత్యస్య త్రిశిరా ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడార్ష్యనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యాహ. రాజపత్ని ఎటు లుండవలయును?

**౬౪౬ ధ్రువాసి ధరుణాస్తృతా విశ్వకర్మణా । మా త్వా సముద్రఽ**

**ఉద్వధీన్మా సుపర్ణోఽ అవ్యథమానా పృథివీం దృꣳహ ॥౧౬॥**

**ప. విః- ధ్రువా, అసి, ధరుణా, ఆస్తృతేత్యా+స్తృతా, విశ్వకర్మణేతి విశ్వ+కర్మణా, మా, త్వా, సముద్రః, ఉత్, వధీత్, మా, సుపర్ణ ఇతి సు+పర్ణః, అవ్యథమానా, పృథివీమ్, దృꣳహ॥౧౬॥**

**పదార్థః :-** (ధ్రువా) నిష్కమ్పా (అసి) (ధరుణా) విద్యాధర్మధర్త్రీ (ఆస్తృతా) వస్త్రాలంకారశుభగుణైః సమ్యగాచ్ఛాదితా (విశ్వకర్మణా) విశ్వాని సమగ్రాణి ధర్మ్యకర్మాణి యస్య పత్యుస్తేన (మా) (త్వా) త్వామ్ (సముద్రః) సముద్రవన్తి కాముకా యస్మిన్ వ్యవహారే సః (ఉత్) (వధీత్) హన్యాత్ (మా) (సుపర్ణః) శోభనాని పర్ణాని పాలితాన్యఙ్గాని యస్య సః (అవ్యథమానా) పీడామప్రాప్తా (పృథివీమ్) స్వరాజ్యభూమిమ్ (దృꣳహ) వర్ధయ.॥ ౧౬ ॥

**అన్వయః :-** హే రాజపత్ని! యతో విశ్వకర్మణా పత్యా సహ వర్తమానాఽఽస్తృతా ధరుణా ధ్రువాఽసి, సాఽవ్యథమానా సతీ త్వం పృథివీముద్దృం హ త్వా సముద్రో మా వధీత్ సుపర్ణశ్చ మా వధీత్. ॥౧౬॥

**భావార్థః :-** యాదృశీం రాజనీతివిద్యాం రాజాఽధీతవాన్ భవేత్ తాదృశీమేవ రాజ్ఞ్యప్యధీతవతీ స్యాత్ సదైవోభౌ పతివ్రతాస్త్రీవ్రతౌ భూత్వా న్యాయేన పాలనం కుర్యాతామ్. వ్యభిచారకామవ్యథారహితౌ భూత్వా ధర్మేణ సన్తానానుత్పాద్య స్త్రీన్యాయం స్త్రీ, పురుషన్యాయం పురుషశ్చ కుర్యాత్. ॥౧౬॥

**పదార్థము :-** ఓ రాజపత్నీ! ఏకారణమున (విశ్వకర్మణా) సకలధర్మకార్యములనొనర్చు నీ పతితో గూడనుండు నీవు (ఆస్తృతా) వస్త్రాభూషణములు, శ్రేష్ఠగుణములతో నలంకరించుకొని (ధరుణా)

విద్యాధర్మములను ధారణమొనర్చుకొని (ధ్రువా) నిశ్చలమై (అసి) ఉన్నావో అట్టినీవు (అవ్యథమానా) ఎట్టి బాధలును లేక (పృథివీమ్) స్వరాజ్యమునందు (ఉద్దృంహ) చక్కగానభివృద్ధి నొందుము (త్వా) నిన్ను (సముద్రః) జారుల దుర్వ్యవహారములు (మావధీత్) బాధించకుండునుగాక! (సుపర్ణః) ఉత్తమరక్షణలను అవయవములచే నీ పతి (మా) బాధించకుండునుగాక! ॥౧౬॥

**భావార్థము** :- రాజు మరియు రాణి ఒకేవిధముగు రాచవిద్యల నేర్చినవారైయుండవలెను. వారిరువురు. ఎల్లప్పుడును పతివ్రత, పత్నీవ్రతులై న్యాయపాలనమొనర్చవలెను. వ్యభిచారాది కాముక వ్యథలచే దూరముగనుండి ధర్మానుకూలముగ సంతానవంతులై స్త్రీలకు రాణి; పురుషులకు రాజు న్యాయమొనర్చుచుండవలెను. ॥౧౬॥

16.O queen, living in the company of thy religious-minded husband, and adorned with dress, ornaments and good qualities, acquiring knowledge and practising religion, remain steadfast. Being free from distress, advance the country under thy rule. Let no lascivious person torment thee, let not thy husband with beautiful body, harm thee!.

**౬౪౭. ప్రజాపతిష్ట్వేత్యస్య త్రిశిరా ఋషిః, ప్రజాపతిర్దేవతా, అనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.**

**పునః పతిస్తాం కథం వర్తయేదిత్యాహ. రాజు నామె నెటుల ప్రవర్తింపజేయవలెను?**

## ౬౪౭ ప్రజాపతిష్ట్వా సాదయత్వపాం పృష్ఠే సముద్రస్యేమన్।
## వ్యచస్వతీం ప్రథస్వతీం ప్రథస్వ పృథివ్యసి ॥౧౭॥

**ప. విః- ప్రజాపతిరితి ప్రజా+పతిః, త్వా, సాదయతు, అపామ్, పృష్ఠే, సముద్రస్య, ఏమన్, వ్యచస్వతీమ్, ప్రథస్వతీమ్, ప్రథస్వ, పృథివీ, అసి ॥౧౭॥**

**పదార్థః** :- (ప్రజాపతిః) ప్రజాయాః స్వామీ (త్వా) త్వామ్ (సాదయతు) స్థాపయతు (అపామ్) జలానామ్ (పృష్ఠే) ఉపరి (సముద్రస్య) సాగరస్య (ఏమన్) ప్రాప్తవ్యే స్థానే. అత్ర సప్తమ్యా లుక్, అత్ర ఏమన్నాదిషు ఛన్దసి పరరూపమితి వార్తికేన పరరూపమ్. (వ్యచస్వతీమ్) బహూ వ్యచో వ్యఞ్చనం విద్యాగమనం సత్కారణం వా విద్యతే యస్యాస్తామ్ (ప్రథస్వతీమ్) ప్రథః ప్రఖ్యాతా కీర్తిర్విద్యతే యస్యాస్తామ్ (ప్రథస్వ) ప్రఖ్యాతా భవ (పృథివీ) భూమిరివ సుఖప్రదా (అసి) ॥ ౧౭ ॥

**అన్వయః** :- హే విదుషి ప్రజాపాలికే రాజ్ఞి! యథా ప్రజాపతిః సముద్రస్యాపామేమన్ పృష్ఠే నౌకేవ వ్యచస్వతీం ప్రథస్వతీం త్వా త్వాం సాదయతు. యతస్త్వం పృథివ్యసి తస్మాత్ స్త్రీన్యాయకరణే ప్రథస్వ. తథా తే పతిర్భవేత్ ॥ ౧౭ ॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. రాజపురుషాదయః స్వయం యస్మిన్ రాజకర్మణి ప్రవర్తేరం స్తస్మిన్ స్వాం స్వాం స్త్రియం స్థాపయేయుః. యః పురుషః పురుషాణాం న్యాయాధికారే తిష్ఠేత్తస్య స్త్రీ స్త్రీణాం న్యాయాసనే స్థితా భవేత్ ॥ ౧౭ ॥

**పదార్థము** :- ఓ విదుషీ! ప్రజాపాలికరాణీ! (ప్రజాపతిః) ప్రజలస్వామియగు పరమాత్మ (సముద్రస్య) సముద్ర (అపామ్) జలములు (ఏమన్) ప్రాప్తించదగిన స్థానమునందు (పృష్ఠే) వానిపై నౌకవలె (వ్యచస్వతీమ్) అనేక విద్యల సత్కారములతో గూడిన (ప్రథస్వతీమ్) ప్రశంసనీయ కీర్తిగల (త్వా) నిన్ను (సాదయతు) స్థిరపరచుగాక! నీవు (పృథివీ అసి) భూమివలె సుఖముల గలిగించుదానవై (అసి) ఉన్నావు. కావుననే స్త్రీలకు న్యాయము చేకూర్చుటయందు (ప్రథస్వ) ప్రసిద్ధురాలవగునట్లు నీ పతియును పురుషులకు న్యాయము గలిగించుగాక! ॥౧౭॥

**భావార్థము** :- ఈ మంత్రములో వాచకలుప్తోపమాలంకార మున్నది. రాజపురుషులు మున్నగువారు తామే యే కార్యములందు ప్రవృత్తులగుచుందురో ఆ యా కార్యములందు తమతమ పత్నులను స్థిరపరచవలెను. ఏ యే రాజపురుషులు పురుషులకు న్యాయము గలిగించుచుందురో వారి పత్నులు స్త్రీలకు న్యాయములను గలిగించుటయందు సదా మగ్నులై యుండవలెను.॥౧౭॥

17.O learned queen, the King establishes thee, full of knowledge, reverence, and wide fame, on the seat of justice, like a conoe at a suitable place on the waters of the ocean. Thou art comforting like the Earth. Be famous in doing justice unto females, as thy husband does unto men!.

౬౪౮. భూరసీత్యస్య త్రిశిరా ఋషిః, అగ్నిర్దేవతా, ప్రస్తారపఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యాహ. ఆ రాణి యెటులుండవలయును?

౬౪౮ భూరసి భూమిరస్యదితిరసి విశ్వధాయా విశ్వస్య భువనస్య ధర్త్రీ।

పృథివీం యచ్ఛ పృథివీం దృꣳహ పృథివీం మా హిꣳసీః ॥౧౮॥

ప.వి:- భూః, అసి, భూమిః, అసి, అదితిః, అసి, విశ్వధాయా ఇతి విశ్వ + ధాయాః, విశ్వస్య, భువనస్య, ధర్త్రీ, పృథివీమ్, యచ్ఛ, పృథివీమ్, దృꣳహ, పృథివీమ్, మా, హిꣳసీః.॥౧౮॥

**పదార్థః**:-(భూః) భవతీతి భూః (అసి) (భూమిః) పృథివీవత్ (అసి) అదితిః అఖణ్డితైశ్వర్య మన్తరిక్ష మివాక్షుబ్ధా (అసి) (విశ్వధాయాః) యా విశ్వం సర్వం గృహ్ణాతి గృహాశ్రమీయ రాజవ్యవహారం దధాతి సా (విశ్వస్య) సర్వస్య (భువనస్య) భవన్తి భూతాని యస్మిన్రాజ్యే తస్య (ధర్త్రీ) ధారికా (పృథివీమ్) (యచ్ఛ) నిగృహాణ (పృథివీమ్) (దృంహ) వర్ధయ (పృథివీమ్) (మా) (హింసీః) హింస్యాః. ॥౧౮॥

**అన్వయః** :-హే రాజపత్ని! యతస్త్వం భూరివాసి తస్మాత్ పృథివీం యచ్ఛ. యతస్త్వం విశ్వధాయా విశ్వస్య భువనస్య ధర్త్రీ భూమిరివాసి తస్మాత్ పృథివీం దృంహ. యతస్త్వమదితిరివాసి తస్మాత్ పృథివీం మా హింసీః. ॥ ౧౮ ॥

**భావార్థః**:-యా రాజకులస్త్రియః పృథివ్యాదివద్ధైర్యాదిగుణయుక్తాః సన్తి తా ఏవ రాజ్యం కర్తుమర్హన్తి. ॥ ౧౮ ॥

**పదార్థము** :-ఓ రాణీ! నీవు (భూః) భూమివలె (అసి) ఉన్నావు. కావున (పృథివీమ్) పృథివిని (యచ్ఛ) నిరంతరము గ్రహణమొనర్చుము. నీవు (విశ్వధాయాః) సమస్త గృహాశ్రమ, రాజ్యసంబంధ వ్యవహారముల మరియు (విశ్వస్య) సమస్త (భువనస్య) రాజ్యమును (ధర్త్రీ) ధారణమొనర్చు (భూమిః) పృథివివలె (అసి) ఉన్నావు. కావున (పృథివీమ్) భూమిని (దృంహ) వృద్ధిపరచుము. నీవు (అదితిః) అఖండైశ్వర్యవంతమగు ఆకాశమువలె దుఃఖరహితవై(అసి) ఉన్నావు. కావున (పృథివీమ్) భూమిని (మా హింసీః) నష్టపరచకుము. ॥౧౮॥

**భావార్థము** :-రాజవంశస్త్రీలు పృథివ్యాదులవలె ధీరగుణములతో గూడినవారై రాజ్యపాలన మొనర్చుటకు అర్హులై యుందురు. ॥౧౮॥

18.O Queen, thou art patient like the earth, hence control the earth. Thou, the organiser of house hold affairs, and the conductor of full administration, art firm like the earth, hence steady the earth. Thou art unagitated like the. glorious sky, hence do the earth no injury!.

**౫౪౯. విశ్వస్మై ఇత్యస్య త్రిశిరా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.**

పునస్తౌ పరస్పరం కథం వర్తేయాతామిత్యాహ. వారు పరస్పరమెటుల ప్రవర్తించవలెను?

౫౪౯ విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై

చరిత్రాయ। అగ్నిష్ట్వాభిపాతు మహ్యా స్వస్త్యా ఛర్దిషా శన్తమేన తయా

దేవతయాఙ్గిరస్వద్ ధ్రువా సీద॥౧౯॥

**ప.విః-విశ్వస్మై ప్రాణాయ, అపానాయేత్యప + ఆనాయ, వ్యానాయేతి వి + ఆనాయ, ఉదానాయేత్యుత్ + ఆనాయ, ప్రతిష్ఠాయై, ప్రతిష్ఠాయా ఇతి ప్రతి + స్థాయై, చరిత్రాయ, అగ్నిః, త్వా, అభి, పాతు, మహ్యా, స్వస్త్యా, ఛర్దిషా, శన్తమేనేతి శమ్ + తమేన, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువా, సీద ॥౧౯॥**

**పదార్థః** :-(విశ్వస్మై) సంపూర్ణాయ (ప్రాణాయ) జీవనహేతవే (అపానాయ) దుఃఖనివారణాయ (వ్యానాయ) వివిధోత్తమవ్యవహారాయ (ఉదానాయ) ఉత్కృష్టాయ బలాయ (ప్రతిష్ఠాయై) సత్కృతయే (చరిత్రాయ) ధర్మాచరణాయ (అగ్నిః) విజ్ఞానవాన్ పతిః (త్వా) త్వామ్ (అభి) ఆభిముఖ్యతయా (పాతు) రక్షతు (మహ్యా) మహత్యా (స్వస్త్యా) ప్రాపకసుఖక్రియయా (ఛర్దిషా) ప్రదీప్తేన (శన్తమేన) అత్యన్తసుఖరూపేణ కర్మణా (తయా) (దేవతయా) వివాహితపతిరూపయా సుఖప్రదయా (అఙ్గిరస్వత్) కారణవత్ (ధ్రువా) నిశ్చలస్వరూపా (సీద) అవస్థితా భవ.॥౧౯ ॥

**అన్వయః** :-హే స్త్రి! యోఽగ్నిస్తే పతిర్మహ్యా స్వస్త్యా శన్తమేన ఛర్దిషా విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై చరిత్రాయ యాం త్వాభిపాతు సా త్వం తయా దేవతయా సహాఽఙ్గిరస్వద్ ధ్రువా సీద. ॥ ౧౯ ॥

**భావార్థః** :-పురుషాః స్వస్వస్త్రీణాం సత్కారసుఖాభ్యామవ్యభిచారేణ చ ప్రియాచరణం పాలనాదికం చ సతతం కుర్యుః, స్త్రియోఽప్యేవమేవ, న స్వస్త్రియం విహాయాన్యాం పురుషః స్వపురుషం విహాయాన్యం స్త్రీ చ సంగచ్ఛేత్. ఏవం పరస్పరస్య ప్రియాచరణావుభౌ సదా వర్తేయాతామ్. ॥ ౧౯ ॥

**పదార్థము** :-ఓ మహిళామణీ! (అగ్నిః) విజ్ఞానవంతుడగు నీ పతి (మహ్యా) గొప్ప (స్వస్త్యా) సుఖకారక క్రియల మరియు (ఛర్దిషా) ప్రకాశయుక్తము (శన్తమేన) అత్యంత సుఖదాయక కర్మలతో (విశ్వస్మై) సంపూర్ణ (ప్రాణాయ) జీవనహేతువగు ప్రాణములు (అపానాయ) దుఃఖనివృత్తికొరకు (వ్యానాయ) అనేకవిధములగు ఉత్తమ వ్యవహారముల సిద్ధికొరకు (ఉదానాయ) ఉత్తమబలముకొరకు (ప్రతిష్ఠాయై) సత్కారముకొరకు (చరిత్రాయ) ధర్మాచరణమునకు (త్వా) నిన్ను (అభిపాతు) అభిముఖుడై రక్షించును (తయా) అట్టి (దేవతయా) దివ్యస్వరూపుడగు పతితోగూడ (అఙ్గిరస్వత్) కార్యకారణ సంబంధమువలె (ధ్రువా) నిశ్చల చిత్తురాలవై (సీద) ప్రతిష్ఠావంతురాలవగుము. ॥౧౯॥

**భావార్థము** :-పురుషులు తమ తమ భార్యలను సత్కారసుఖములచేతను, వ్యభిచారరాహిత్యముచేతను ప్రతిష్ఠవంతమగు పవిత్రాచరణచేతను నిరంతరము పాలన మొనర్చవలయును. ఇదేవిధముగ స్త్రీలును

నొనర్చవలెను. పురుషుడు తన స్త్రీనిగాక అన్యస్త్రీని, స్త్రీ తన పురుషుని వదలి పరపురుషుని కామించవలదు. ఇట్లిరువురును పరస్పరము ప్రీతిపూర్వకముగ సదా వర్తించవలెను. ॥౧౯॥

19.O woman, may thy learned husband, protect thee, with pleasure-giving deeds and beautiful peaceful acts, for full longevity, removal of misery, acquisition of various noble performances, vigour, veneration, and religious duties. May thou attain to fame, living permanently with thy husband, as cause and effect are inseparable!.

౬౫౦.కాండాత్కాండాదిత్యస్యాఽగ్నిర్ఋషిః, పత్నీ దేవతా, అనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యాహ. పతివ్రతాస్త్రీ యెటులుండవలయును?

**౬౫౦ కాణ్డాత్కాణ్డాత్ప్రరోహన్తీ పరుషః పరుషస్పరి।**

**ఏవా నో దూర్వే ప్రతను సహస్రేణ శతేన చ ॥౨౦॥**

**ప. విః-కాణ్డాత్కాణ్డాదితి కాణ్డాత్ + కాణ్డాత్, ప్రరోహన్తీతి ప్ర + రోహన్తీ, పరుషః పరుష ఇతి పరుషః + పరుషః, పరి, ఏవ, నః, దూర్వే, ప్ర, తను, సహస్రేణ, శతేన, చ ॥౨౦॥**

**పదార్థః** :-(కాణ్డాత్కాణ్డాత్) గ్రన్థేర్గ్రన్థేః (ప్రరోహన్తీ) ప్రకృష్టతయా వర్ధమానా (పరుషః పరుషః) మర్మణో మర్మణః (పరి) సర్వతః (ఏవా) నిపాతస్య చేతి దీర్ఘః (నః) అస్మాన్ (దూర్వే) దూర్వావద్వర్తమానే (ప్ర) (తను) విస్తృణుహి (సహస్రేణ) అసంఖ్యాతేన (శతేన) అనేకైః (చ) ॥౨౦॥

**అన్వయః** :-హే స్త్రి! త్వం యథా సహస్రేణ శతేన చ కాణ్డాత్కాణ్డాత్పరుషః పరుషస్పరి ప్రరోహన్తీ దూర్వే దూర్వౌషధీ వర్తతే తథైవ నోఽస్మాన్ పుత్రపౌత్రైశ్వర్యాదిభిః ప్రతను. ॥౨౦॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా దూర్వౌషధీ రోగప్రణాశికా సుఖవర్ధికా సువిస్తీర్ణా చిరం స్థాత్రీ సతీ వర్ధతే తథా సతీ విదుషీ స్త్రీ కులం శతధా సహస్రధా వర్ధయేత్. తథా పురుషోఽపి ప్రయతేత. ॥౨౦॥

**పదార్థము** :-ఓ స్త్రీ! నీవు (సహస్రేణ) అసంఖ్యాక (చ) మరియు (శతేన) అనేకవిధములుగ (కాణ్డాత్కాణ్డాత్) సమస్తావయవములనుండి (పరుషః పరుషః) కణుపు కణుపునుండి ప్రతి గనెనుండి (పరి) అన్నివైపులనుండి (ప్రరోహన్తి) అతిగా వృద్ధి జెందుచు (దూర్వే) దూర్వ [గరిక] గడ్డి (ఏవ) వలెనే (నః) మమ్ము పుత్రపౌత్ర ఐశ్వర్యములతో (ప్రతను) విస్తృతమొనర్చుము. ॥౨౦॥

**భావార్థము** :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకార మున్నది. దూర్వా (గరిక) తృణము ఓషధిగ

అనేక వ్యాధులను దొలగించుచు సుఖవృద్ధిగలిగించుచు చక్కని విస్తారముగలదై చిరస్థాయియగుచు వృద్ధిజెందునట్లు విద్వాంసురాం(డ్రగు స్త్రీలు అనేక విధములుగ తమ కుటుంబమును, వంశమును వృద్ధిపరచవలెను. ॥౨౦॥

20.O woman, just as the grass increases widely from all sides, with hundreds and thousands of joints and knots, so lengthen out our line of descendants with sons and grandsons!.

౬౫౧. యా శతేనేత్యస్యాగ్నిర్ఋషిః, పత్నీ దేవతా, నిచృదనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యాహ. ఆమె ఎటువంటిదిగ నుండవలయును?

**౬౫౧ యా శతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి।**

**తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషా వయమ్ ॥౨౧॥**

**ప. విః- యా, శతేన, ప్రతనోషీతి ప్ర+తనోషి, సహస్రేణ, విరోహసీతి వి+రోహసి, తస్యాః, తే, దేవి, ఇష్టకే, విధేమ, హవిషా, వయమ్ ॥౨౧॥**

**పదార్థః** :-(యా) (శతేన) అసంఖ్యాతేన (ప్రతనోషి) (సహస్రేణ) అసంఖ్యాతేన (విరోహసి) వివిధతయా వర్ధసే (తస్యాః) (తే) తవ (దేవి) దేదీప్యమానే (ఇష్టకే) ఇష్టకేవ శుభైర్గుణైః సుశోభితే (విధేమ) పరిచరేమ (హవిషా) హోతుమర్హేణ (వయమ్). ॥ ౨౧ ॥

**అన్వయః** :-హే ఇష్టకే! ఇష్టకావద్దృఢాంగే దేవి స్త్రి! యథేష్టకా శతేన ప్రతనోతి సహస్రేణ విరోహతి తథా యా త్వమస్మాన్ శతేన ప్రతనోషి సహస్రేణ చ విరోహసి తస్యాస్తే తవ హవిషా వయం విధేమ త్వాం పరిచరేమ. ॥౨౧॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా శతశః సహస్రాణీష్టకా గృహాకారా భూత్వా సర్వాన్ సుఖయన్తి తథైవ యాః సాధ్వ్యః స్త్రియః పుత్రపౌత్రభృత్యాదిభిః సర్వానానన్దయేయుస్తాః పురుషైః సతతం సత్కుర్య ర్నహి సత్పురుషస్త్రీసమాగమేన వినా శుభగుణాఢ్యాన్యపత్యాని జాయేరన్. ఏవం భూతైః సన్తానైర్వినా మాతాపితౄణాం కుతః సుఖం జాయేత? ॥ ౨౧ ॥

**పదార్థము** :- (ఇష్టకే) ఇటుకవంటి దృఢమగు అవయవములతో, శుభగుణములతో శోభనంతమగు (దేవి) ప్రకాశయుక్తురాలవగు మహిళామణీ! ఇటుకలు వందల, వేలసంఖ్యతో గూడి భవనాదులను విస్తృతపరచునట్లు (యా) నీవు మమ్ము (శతేన) వందలాది పుత్రపౌత్రాది సంపదలచే (ప్రతనోషి) ఎట్లు విస్తారవంతమొనర్తువో మరియు (సహస్రేణ) వేలాది పదార్థములచే (విరోహసి) అనేక విధములుగ

వృద్ధిపరచుచున్నావో (తస్యాః) అట్టి (తే) నీకు (హవిషా) ఈయదగిన పదార్థములచే (వయమ్) మేము (విధేమ) సేవించెదముగాక! ॥౨౧॥

**భావార్థము :-** ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. శతాధిక విధముల వేలాది ఇటుకలు గృహమును నిర్మించి సుఖము నొనగూర్చునట్లు ఉత్తమస్త్రీలు పుత్రపౌత్ర భృత్యాదులతో, సకలైశ్వర్యములతో కుటుంబమును ఆనందమునం దుంచవలెను. అట్టివారిని పురుషులు సదా సత్కరించవలెను. ఏలన శ్రేష్ఠులగు స్త్రీపురుషులుగానిచో శుభగుణయుక్తమగు సంతానమెప్పుడును నిర్మింపబడదు. అట్టి సంతానములేకున్న తల్లిదండ్రులకు సుఖములభించదు. ॥౨౧॥

21.O beautiful, well-built woman, just as hundreds and thousands of bricks build and magnify a house, so dost thou increase our family with hundreds of sons and grandsons, and profusely enrich it with thousands of articles. We serve thee with nice presents!.

౬౫౨. యాస్త ఇత్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, అగ్నిర్దేవతా, భురిగనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యుపదిశ్యతే. ఆ స్త్రీ ఎటువంటిదై యుండవలయును?

**౬౫౨ యాస్తేఽఅగ్నే సూర్యే రుచో దివమాతన్వన్తి రశ్మిభిః।**

**తాభి ర్నోఽఅద్య సర్వాభీ రుచే జనాయ నస్కృధి ॥౨౨॥**

**ప.విః-యాః, తే, అగ్నే, సూర్యే, రుచః, దివమ్, ఆతన్వన్తీత్యాతన్వన్తి, రశ్మిభిరితి రశ్మి + భిః, తాభిః, నః, అద్య, సర్వాభిః, రుచే, జనాయ, నః, కృధి ॥౨౨॥**

పదార్థః :-(యాః) (తే) తవ (అగ్నే) అగ్నిరివ వర్తమానే (సూర్యే) అర్కే (రుచః) దీప్తయః (దివమ్) ప్రకాశమ్ (ఆతన్వన్తి) సమన్తాద్విస్తృణ్వన్తి (రశ్మిభిః) కిరణైః (తాభిః) రుచిభిః (నః) అస్మాన్ (అద్య) (సర్వాభిః) (రుచే) రుచికారకాయ (జనాయ) ప్రసిద్ధాయ (నః) అస్మాన్ (కృధి) కురు. అత్ర వికరణలుక్. ॥ ౨౨ ॥

**అన్వయః :-** హే అగ్నే విదుష్యధ్యాపికే స్త్రి! యాస్తే రుచయః సన్తి తాభిః సర్వాభిర్నో యథా రుచః సూర్యే రశ్మిభిర్దివమాతన్వన్తి తథా త్వమాతను అద్య రుచే జనాయ నః ప్రీతాన్ కృధి. ॥ ౨౨ ॥

**భావార్థః :-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా బ్రహ్మాణ్డే సూర్యస్య దీప్తయః సర్వాణి వస్తూని ప్రకాశ్య రోచయన్తి తథైవ విదుష్యః సాధ్వ్యః పతివ్రతాః స్త్రియః సర్వాణి గృహకర్మాణి ప్రకాశయన్తి. యత్ర స్త్రీపురుషౌ పరస్పరం ప్రీతిమన్తౌ స్యాతాం తత్ర సర్వం కల్యాణమేవ. ॥ ౨౨ ॥

**పదార్థము :-** (అగ్నే) అగ్నివంటి తేజస్సుగలిగి అధ్యాపికవగు ఓ విదుషీమణీ! (యాః) ఏది (తే) నీకు అభిరుచికరమో (తాభిః) అట్టి (సర్వాభిః) సకల యభిరుచులతో గూడ (నః) మాకెల్ల (రుచః) ప్రకాశములు (సూర్యే) సూర్యునియందు (రశ్మిభిః) కిరణములచే (దివమ్) ప్రకాశమును (ఆతన్వన్తి) ఉత్తమరీతిలో విస్తారపరచునట్లు నీవును శ్రేష్ఠముగ విస్తృతసుఖములను గలిగించుము. మరియు (అద్య) నేడే (రుచే) అభిరుచిని గలిగించు (జనాయ) ప్రసిద్ధమనుష్యులకొరకు (నః) మమ్ము ప్రీతియుక్తులనుగ (కృధి) చేయుము.॥౨౨॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. బ్రహ్మాండమునందు సూర్యుని దీప్తి సకలపదార్థములను తన ప్రకాశముచే రుచికరమొనర్చునట్లు విదుషీరత్నములగు శ్రేష్ఠపతివ్రతామతల్లులు గృహస్థ సకలకార్యములను ప్రకాశపరతురు. ఏ కుటుంబమునందు స్త్రీపురుషులు పరస్పరము ప్రీతియుక్తముగ నుందురో అచ్చట సకలవిషయములందును కల్యాణమే జరుగుచుండును. ॥౨౨॥

22.O brilliant learned teachress, gladden us with all thy tastes, just as lights in the sun, with their beams, spread brilliance all around. With all those tastes make us always friendly towards the lovely famous person!.

౬౫౩.యా వో దేవా ఇత్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, బృహస్పతిర్దేవతా, అనుష్టుప్ఛందః, గాన్ధారః స్వరః.

స్త్రీపురుషైః కథం విజ్ఞానం సంపాద్యమిత్యాహ? స్త్రీపురుషులు విజ్ఞానము నెటుల పొందవలయును?

౬౫౩ యా వో దేవాః సూర్యే రుచో గోష్వశ్వేషు యా రుచః।

ఇన్ద్రాగ్నీ తాభిః సర్వాభీ రుచం నో ధత్త బృహస్పతే ॥౨౩॥

**ప.విః-** యాః, వః, దేవాః, సూర్యే, రుచః, గోషు, అశ్వేషు, యాః, రుచః, ఇన్ద్రాగ్నీ, తాభిః, సర్వాభిః, రుచమ్, నః, ధత్త, బృహస్పతే ॥౨౩॥

**పదార్థః :-** (యాః) (వః) యుష్మాకమ్ (దేవాః) విద్వాంసః (సూర్యే) సవితరి (రుచః) రుచయః (గోషు) ధేనుషు (అశ్వేషు) గవాదిషు (యాః) (రుచః) ప్రీతయః (ఇన్ద్రాగ్నీ) విద్యుత్సూర్యవదధ్యాపకోపదేశకౌ (తాభిః) (సర్వాభిః) (రుచమ్) కామనామ్ (నః) అస్మాకం మధ్యే (ధత్త) (బృహస్పతే) బృహతాం విదుషాం పాలక. ॥ ౨౩ ॥

**అన్వయః :-** హే దేవాః! యూయం యా వః సూర్యే రుచో యా గోష్వశ్వేషు రుచశ్చేవ రుచః సన్తి తాభిః సర్వాభీ రుగ్భిర్నో రుచమిన్ద్రాగ్నీ ఇవ ధత్త. హే బృహస్పతే పరీక్షక! భవానస్మాకం పరీక్షాం కురు.॥౨౩॥

**భావార్థః** :- యావన్మనుష్యాణాం విద్వత్సఙ్గ ఈశ్వరేఽస్య సృష్టౌ చ రుచిః పరీక్షా చ న జాయతే తావద్విజ్ఞానం న వర్ధతే. ॥ ౨౩ ॥

**పదార్థము** :- (దేవాః) విద్వాంసులారా! మీరెల్లరును (యాః) ఏ (వః) మీయొక్క (సూర్యే) సూర్యునియందు (రుచః) దీప్తి [ప్రకాశము] (యాః) ఏ (గోషు) గోవుల (అశ్వేషు) గుఱ్ఱములు మున్నగు వానియందు (రుచః) ప్రకాశమువంటి ప్రీతిగలదో (తాభిః) అట్టి (సర్వాభిః) సమస్తయభిరుచులతో (నః) మా మధ్య (రుచమ్) కామితములను (ఇన్ద్రాగ్నీ) విద్యుత్తు సూర్యులవలె అధ్యాపకోపదేశకులు ధారణమొనర్చునట్లు (ధత్త) ధారణమొనర్చుడు (బృహస్పతే) నిష్పక్షికముగ, పరీక్షాదులొనర్చు పూర్ణవిద్వాంసుడవగు నీవు (నః) మమ్ము పరీక్షింపుము. ॥౨౩॥

**భావార్థము** :- మానవులు విద్వాంసుల సాంగత్యమున ఈశ్వరుడు మరియు యాతని సృష్టిరచనను అనుభవపూర్ణముగ దెలిసికొననంతవరకు విజ్ఞాన మెప్పుడును వృద్ధి గాజాలదు. ॥౨౩॥

23.O learned persons, whatever love ye have got for the sun, the cows and horses, with all that inculcate love in us, just as the teacher and preacher incite our love for learning. O unbiassed learned examiner examine us!.

౬౨౪. విరాడ్జ్యోతిరిత్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, ప్రజాపతిర్దేవతా, నిచృద్బృహతీఛందః, ఋషభః, స్వరః.

దమ్పతీ అన్యోఽన్యం కథం వర్తేయాతామిత్యాహ. స్త్రీపురుషులు పరస్పరమెటుల వర్తించవలయును?

౬౨౪ విరాడ్ జ్యోతిరధారయత్ స్వరాడ్ జ్యోతిరధారయత్।

ప్రజాపతిష్ట్వా సాదయతు పృష్ఠే పృథివ్యా జ్యోతిష్మతీమ్।విశ్వస్మై

ప్రాణాయాపానాయ వ్యానాయ విశ్వం జ్యోతిర్యచ్ఛ।

అగ్నిష్టేఽధిపతిస్తయా దేవతయాఙ్గిరస్వద్ ధ్రువా సీద ॥౨౪॥

ప.విః- విరాడితి వి + రాట్, జ్యోతిః, అధారయత్, స్వరాడితి స్వ + రాట్, జ్యోతిః, అధారయత్, ప్రజాపతిరితి ప్రజా + పతిః, త్వా, సాదయతు, పృష్ఠే, పృథివ్యాః, జ్యోతిష్మతీమ్, విశ్వస్మై, ప్రాణాయ, అపానాయేత్యప + ఆనాయ, వ్యానాయేతి వి + ఆనాయ,

విశ్వమ్, జ్యోతిః, యచ్ఛ, అగ్నిః, తే, అధిపతిరిత్యధి + పతిః, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువా, సీద ॥ ౨౪ ॥

**పదార్థః** :- (విరాట్) యా వివిధాసు రాజతే (జ్యోతిః) విద్యాప్రకాశమ్ (అధారయత్) ధారయేత్ (స్వరాట్) సర్వేషు ధర్మాచరణేషు స్వయం రాజతే (జ్యోతిః) విద్యుదాదిప్రకాశమ్ (అధారయత్) (ప్రజాపతిః) ప్రజాయాః పాలకః (త్వా) త్వామ్ (సాదయతు) సంస్థాపయతు (పృష్ఠే) తలే (పృథివ్యాః) భూమేః (జ్యోతిష్మతీమ్) ప్రశస్తం జ్యోతిర్విద్యావిజ్ఞానం విద్యతే యస్యాస్తామ్ (విశ్వస్మై) అఖిలాయ (ప్రాణాయ) ప్రాణితి సుఖం యేన తస్మై (అపానాయ) అపానితి దుఃఖం యేన తస్మై (వ్యానాయ) వ్యానితి సర్వాన్ శుభగుణకర్మస్వభావాన్ యేన తస్మై (విశ్వమ్) సమగ్రమ్ (జ్యోతిః) విజ్ఞానమ్ (యచ్ఛ) గృహాణ (అగ్నిః) విజ్ఞానవాన్ (తే) తవ (అధిపతిః) స్వామీ (తయా) (దేవతయా) దివ్యయా (అఙ్గిరస్వత్) సూత్రాత్మవత్ (ధ్రువా) నిష్కమ్పా (సీద) స్థిరా భవ. ॥ ౨౪ ॥

**అన్వయః** :- యా విరాట్ స్త్రీ జ్యోతిరధారయత్ యః స్వరాట్ పురుషో జ్యోతిరధారయత్ సా స వాఽఖిలం సుఖం ప్రాప్నుయాత్. హే స్త్రి! యోఽగ్ని స్తేఽధిపతిరస్తి తయా దేవతయా సహ త్వమఙ్గిరస్వద్ ధ్రువా సీద. హే పురుష! యాఽగ్ని స్తవాఽధిపత్న్యస్తి తయా దేవతయా సహ త్వమఙ్గిరస్వద్ ధ్రువః సీద. హే స్త్రి! యః ప్రజాపతిః పృథివ్యాః పృష్ఠే విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయ జ్యోతిష్మతీం విద్యుత మివ త్వా సాదయతు, సా త్వం విశ్వం జ్యోతిర్యచ్ఛైతస్మై ఏనం పతిం త్వం సాదయ. ॥ ౨౪ ॥

**భావార్థః** :- యే స్త్రీపురుషాః సత్సంగవిద్యాభ్యాసాభ్యాం విద్యుదాదిపదార్థవిద్యాం వర్ధయన్తే త ఇహ సుఖినో భవన్తి. పతిః స్త్రియం సదా సత్కుర్యాత్. స్త్రీ పతిఞ్చ కుర్యాత్. ఏవం పరస్పరం ప్రీత్యా సహైవ సుఖం భుఞ్జాతామ్.॥౨౪॥

**పదార్థము** :-(విరాట్) అనేకవిధములగు విద్యలచే ప్రకాశమానమగు స్త్రీ (జ్యోతిః) విద్యాయున్నతిని (అధారయత్) తాను ధరించి ధరింపజేయవలెను (స్వరాట్) సమస్త ధర్మవ్యవహారములందు పవిత్రాచరణగల పురుషుడు (జ్యోతిః) విద్యుత్తు మున్నగువాని ప్రకాశమును (అధారయత్) ధరించి ధరింపజేయవలయును. అట్టిస్త్రీ పురుషు లిరువురును సంపూర్ణ సుఖములను ప్రాప్తించుకొనగలరు. ఓ స్త్రీరత్నమా! ఏ (అగ్నిః) అగ్నివంటి తేజస్వి, విజ్ఞానయుక్తుడగు (తే) నీ (అధిపతిః) స్వామిగలడో (తయా) ఆ (దేవతయా) చక్కని దేవతాస్వరూపుడగు నీ పతితోగూడ నీవు (అఙ్గిరస్వత్) సూత్రాత్మ వాయువువలె (ధ్రువా) దృఢత్వముచే (సీద) స్థిరముగా నుందువుగాక! ఓ పురుషవరా! అగ్నివంటి తేజధారిణి, నీ రక్షకురాలయిన ఏ స్త్రీగలదో ఆ దేవితోగూడ నీవు ప్రాణములవలె ప్రీతిపూర్వకముగ స్థిరచిత్తుడవైయుండుము. ఓ స్త్రీ! (ప్రజాపతిః) ప్రజారక్షకుడగు నీ పతి (పృథివ్యాః) పృథివి (పృష్ఠే) పైన (విశ్వస్మై) సమస్త (ప్రాణాయ) సుఖములకు

హేతువు (అపానాయ) దుఃఖముల దొలగించు సాధనము (వ్యానాయ) సకలసుందర గుణ, కర్మ, స్వభావముల హేతువగు ప్రాణవిద్యకై (జ్యోతిష్మతీమ్) ప్రశంసనీయ విద్యాజ్ఞానములచే నున్న (త్వా) (సాదయతు) ఉత్తమాధికారమును స్థాపించుగాక! ఐతే నీవు (విశ్వమ్) సమగ్ర (జ్యోతిః) విజ్ఞానమును (యచ్ఛ) గ్రహణమొనర్చి, దాని ప్రాప్తికొరకు నీ పతిదేవుని స్థిరముగా నుంచుము. ।౨౪॥

**భావార్థము :-** స్త్రీపురుషులు సత్సంగములు, విద్యాభ్యాసముచే విద్యుత్తు మున్నగు పదార్థవిద్య, మరియు ప్రీతిని సదా వృద్ధిపరచుకొనుచుండవలయును. అట్లగుచో వారీ ప్రపంచమునందు సుఖములననుభవించగలరు. సతిపత్నులిరువురును సదా పరస్పరము ప్రీతిపూర్వకముగ సత్కరించుకొనుచు సౌఖ్యముల ననుభవించవలెను. ।౨౪॥

24.The woman, who, filled with the light of different sorts of knowledge, spreads learning, and the morally advanced person, who shines like lightning, may both these husband and wife attain to happiness.

Live permanently like soul, with thy husband, who is learned and godly in nature. O woman, thy husband, the guardian of his progeny, establishes thee, endowed with learning on this earth, in a place of responsibility, for the acquisition of happiness, removal of suffering, and the practice of yoga for preaching noble qualities, actions and attributes. Imbibe thou full knowledge I.

౨౫.మధుశ్చేత్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, ఋతవో దేవతాః, పూర్వస్య భురిగతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

యే అగ్నయ ఇత్యుత్తరస్య భురిగ్బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ వసన్తర్తువర్ణనమాహ. వసంత ఋతువు వర్ణనము.

౨౫ మధుశ్చ మాధవశ్చ వాసన్తికావృతూఽ అగ్నేరన్తః శ్లేషోఽసి కల్పేతాం
ద్యావాపృథివీ కల్పన్తామాప ఓషధయః కల్పన్తామగ్నయః పృథఙ్
మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః। యేఽ అగ్నయః సమనసోఽన్తరా
ద్యావాపృథివీఽ ఇమే వాసన్తికావృతూఽ అభి కల్పమానాఽ ఇన్ద్రమివ
దేవాఽ అభిసంవిశన్తు తయా దేవతయాఙ్గిరస్వద్ ధ్రువే సీదతమ్ ।౨౫॥

**ప.వి:-** మధుః, చ, మాధవః, చ, వాసన్తికౌ, ఋతూఽఇత్యృతూ, అగ్నేః, అన్తః శ్లేష ఇత్యన్తః

+ శ్లేషః, అసి, కల్పేతామ్, ద్యావాపృథివీఽ ఇతి ద్యావాపృథివీ, కల్పన్తామ్, ఆపః, ఓషధయః, కల్పన్తామ్, అగ్నయః, పృథక్, మమ, జ్యైష్ఠ్యాయ, సవ్రతా ఇతి స + వ్రతాః, యే, అగ్నయః, సమనస ఇతి స + మనసః, అన్తరా, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, ఇమేఽ ఇతీమే, వాసన్తికౌ, ఋతూఽ ఇత్యృతూ, అభికల్పమానా ఇత్యభి+కల్పమానాః, ఇన్ద్రమివేతీన్ద్రమ్+ఇవ, దేవాః అభిసంవిశన్త్విత్యభి + సంవిశన్తు, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువేఽ ఇతి ధ్రువే, సీదతమ్॥25॥

**పదార్థః** :- (మధుః) మధురసుగన్ధయుక్తశ్చైత్రః (చ) (మాధవః) మధురాదిఫలనిమిత్తో వైశాఖః (చ) (వాసన్తికౌ) వసన్తే భవౌ (ఋతూ) సర్వాన్ ప్రాపకౌ (అగ్నేః) ఉష్ణత్వనిమిత్తస్య (అన్తః శ్లేషః) ఆభ్యన్తరే సమ్బన్ధః (అసి) భవతి. అత్ర వ్యత్యయః (కల్పేతామ్) సమర్థయతః (ద్యావాపృథివీ) సూర్యభూమీ (కల్పన్తామ్) సమర్థయన్తు (ఆపః) జలాని (ఓషధయః) యవాదయః సోమాదయశ్చ (కల్పన్తామ్) (అగ్నయః) పావకాః (పృథక్) (మమ) (జ్యైష్ఠ్యాయ) జ్యేష్ఠే మాసి భవాయ వ్యవహారాయ మమ వృద్ధత్వాయ వా (సవ్రతాః) వ్రతైః సత్యైర్వ్యవహారైః సహ వర్తమానాః (యే) (అగ్నయః) పావక ఇవ కాలవిదో విద్వాంసః (సమనసః) (సమానవిజ్ఞానాః) (అన్తరా) మధ్యే (ద్యావాపృథివీ) ప్రకాశాన్తరిక్షే (ఇమే) ప్రత్యక్షే (వాసన్తికౌ) (ఋతూ) (అభికల్పమానాః) ఆభిముఖ్యేన సమర్థయన్తః (ఇన్ద్రమివ) యథా పరమైశ్వర్యమ్ (దేవాః) అభిసంవిశన్తు) (తయా) (దేవతయా) పరమపూజ్యయా పరమేశ్వరాఖ్యయా (అఙ్గిరస్వత్) ప్రాణవత్ (ధ్రువే) నిశ్చితే దృఢే (సీదతమ్) భవేతామ్. అత్ర పురుషవ్యత్యయః. ॥ 25 ॥

**అన్వయః** :- యథా మమ జ్యైష్ఠ్యాయ యావగ్నేరుత్పద్యమానౌ యయోరన్తః శ్లేషోఽసి భవతి తౌ మధుశ్చ మాధవశ్చ వాసన్తికౌ సుఖాయర్తూ కల్పేతాం యాభ్యాం ద్యావాపృథివీ చాపః కల్పన్తామ్ పృథగోషధయః కల్పన్తామగ్నయశ్చ. హే సవ్రతాః సమనసో దేవా! వాసన్తికావృతూ యేఽత్రాన్తరాగ్నయశ్చ సన్తి తాంశ్చాభికల్పమానాః సన్తో భవన్త ఇన్ద్రమివాభిసంవిశంతు యథేమే ద్యావాపృథివీ తయా దేవతయా సహాఙ్గిరస్వద్ ధ్రువే వర్తేతే తథా యువాం స్త్రీపురుషౌ నిశ్చలౌ సీదతమ్. ॥ 25 ॥

**భావార్థః** :- హే మనుష్యాః! యూయం యస్మిన్ వసన్తర్తౌ శ్లేష్మోత్పద్యతే యస్మిన్ తీవ్రప్రకాశః పృథివీ శుష్కా ఆపో మధ్యస్థా ఓషధయో నూతనపుష్పపత్రాన్వితా అగ్నిజ్వాలా ఇవ భవన్తి తం యుక్త్యా సేవిత్వా

పురుషార్థేన సర్వాణి సుఖాన్యాప్నుత. యథా విద్వాంసః పరమప్రయత్నేనాన్వృతు సుఖాయైశ్వర్యమున్నయన్తి తథైవ ప్రయతధ్వమ్. ॥౨౫॥

**పదార్థము** :- ఎట్లు (మమ) నాయొక్క (జ్యైష్ఠ్యాయ) జ్యేష్ఠమాసమునందలి వ్యవహారములు నా శ్రేష్ఠత్వమునకై (అగ్నేః) ఉష్ణత్వముకొరకు అగ్నినుండి యుత్పన్నమైన (అన్తః శ్లేషః) అనేక విధముల అంతర్వాయు సంబంధమై (అసి) యున్నదో యది (మధుః) మధుర సుగంధముతో గూడిన చైత్రము (చ) మరియు (మాధవః) మధురము మున్నగు గుణములతో వైశాఖము (చ) వీని సంబంధ పదార్థములతో (వాసంతికౌ) వసంతమాసములందు జరిగిన (ఋతూ) సమస్తమునకు సుఖప్రాప్తికి సాధనమగు ఋతువులు సుఖ సాధనమునకు (కల్పేతామ్) సమర్థవంతమగునుగాక! చైత్రవైశాఖమాసముల ఆశ్రయముచే (ద్యావాపృథివీ) సూర్యుడు, భూమి (ఆపః) జలములును అనుభవమునందు (కల్పన్తామ్) ఆనందదాయకములగుగాక! (పృథక్) భిన్నభిన్న (ఓషధయః) యవలు, సోమలత మున్నగు ఓషధులు (అగ్నయః) విద్యుత్తు మున్నగు అగ్నులును (కల్పన్తామ్) కార్యసాధకములగు గాక! (సవ్రతాః) నిరంతరము సత్యభాషణము మున్నగు వ్రతములతో గూడిన (సమనసః) విజ్ఞానవంతులగు (దేవాః) విద్వాంసులారా! (యే) ఎవరు (వాసన్తికౌ ఋతూ) వసంతఋతువునందుండు చైత్ర వైశాఖమాసములు మరియు (యే) ఏ (అన్తరా) మధ్యననుండు (అగ్నయః) అగ్నులుగలవో వానికి (అభికల్పమానాః) చేరువయై కార్యములందు నిమగ్నములగుచు మీరు (ఇన్ద్రమివ) ఉత్తమైశ్వర్యముల ప్రాప్తించుకొనునట్లు (అభిసంవిశన్తు) అన్నివైపులనుండి ప్రవేశమొనర్పుదురో (ఇమే) ఈ (ద్యావాపృథివీ) పృథివీ ఆకాశములు (తయా) అట్టి (దేవతయా) పరమపూజనీయ పరమేశ్వరరూప దేవత సామర్థ్యముతో (అఙ్గిరస్వత్) ప్రాణములవలె (ధ్రువే) దృఢముగ వర్తించునట్లు సతీపతులగు మీరిరువురును సదా సంయుక్తులై (సీదతమ్) స్థిరముగనుండుడు. ॥౨౫॥

**భావార్థము** :- మానవులారా! వసంతఋతువునందు ఫలపుష్పాదు లుత్పన్నమగును. ఆ కాలమందు తీవ్రప్రకాశము, ఎండినభూమి, మధ్యమజలములు, ఓషధులు, ఫలపుష్పములచే గూడియుండి అగ్నిజ్వాలవలె నుండును. దానిని యుక్తిపూర్వకముగ సేవించుచు పురుషార్థముతో సకలసుఖముల పొందవలెను. విద్వాంసులగువారు అత్యంత ప్రయత్నముతో సకల ఋతువులందు సుఖములకొరకు సంపదలను వృద్ధిపరచుకొనునట్లు మీరును ప్రయత్నించుడు. ॥౨౫॥

25.Let the Chetra and Baisakh months, parts of spring, born of heat, mutually inter-related, contribute to my prosperity. Let these months be the source of happiness to all. In those months let sun and earth, and water be pleasure-giving. Let medicinal herbs grow in them, and heat be useful to us. O learned persons, wedded to truth, keeping before ye in spring time, the fervent seekers after knowledge, attain to prosperity. Just as the sun and earth, through the dispensation of God, steadfastly work together like breath, so should you wife and husband live constantly together.

**౨౬. అషాఢాసీత్యస్య సవితా ఋషిః, క్షత్రపతిర్దేవతా, నిచృదనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.**

**పునః సా కీదృశీ భవేదిత్యాహ. రాజపత్ని ఎటువంటిదిగ నుండవలయును?**

౨౬. అషాఢాసి సహమానా సహస్వారాతీః సహస్వ పృతనాయతః।

సహస్రవీర్యాసి సా మా జిన్వ ॥౨౬॥

**ప. వి:-** అషాఢా, అసి, సహమానా సహస్వ, అరాతీః, సహస్వ, పృతనాయత ఇతి పృతనా + యతః, సహస్రవీర్యేతి సహస్ర + వీర్యా, అసి, సా, మా, జిన్వ ॥౨౬॥

**పదార్థః:-** (అషాఢా) శత్రుభిరసహ్యమానా (అసి) (సహమానా) పత్యాదీన్ సోఢుమర్హా (సహస్వ) (అరాతీః) శత్రూన్ (సహస్వ) (పృతనాయతః) ఆత్మనః పృతనాం సేనామిచ్ఛతః (సహస్రవీర్యా) అసంఖ్యాత పరాక్రమా (అసి) (సా) (మా) మామ్ (జిన్వ) ప్రీణీహి. ॥ ౨౬ ॥

**అన్వయః:-** హే పత్ని! యా త్వమషాఢాసి సా త్వం సహమానా సతీ పతిం మాం సహస్వ. యా త్వం సహస్రవీర్యాఽసి సా త్వం పృతనాయతోఽరాతీః సహస్వ. యథాహం త్వాం ప్రీణామి పతిం తథా మా చ జిన్వ. ॥ ౨౬ ॥

**భావార్థః:-** యా కృతదీర్ఘబ్రహ్మచర్యబలిష్ఠా జితేంద్రియా వసన్తాద్యృతుకృత్యవిలక్షణా పత్యపరాధక్షమాకారిణీ శత్రునివారికోత్తమపరాక్రమా స్త్రీ నిత్యం స్వస్వామినం ప్రీణాతి తాం పతిరపి నిత్యమానన్దయేత్. ॥ ౨౬ ॥

**పదార్థము :-** ఓ పత్నీ! నీవు (అషాఢా) శత్రువులకు సహించరానిదానవై (అసి) ఉన్నావు. నీవు (సహమానా) పతినగు నన్ను సహించుచు నా యుపదేశములను (సహస్వ) సహించుము. ఏ నీవు (సహస్రవీర్యా) అసంఖ్యాక ప్రకారములగు పరాక్రమములచే గూడినదానవై (అసి) ఉన్నావో (సా) అట్టి నీవు (పృతనాయతః) తమంతటతామే యుద్ధమునకై దాడిజేయనిచ్ఛగల (అరాతీః) శత్రువులను (సహస్వ) ఎదిరించుము. మరియు నే నెట్లు నిన్ను ప్రసన్నముగ నుంచుదునో అట్లే (మా) పతినగు నన్ను (జిన్వ) ప్రసన్నముగ నుంచి తృప్తిని గలిగించుము. ॥౨౬॥

**భావార్థము :-** దీర్ఘకాలము బ్రహ్మచర్యాశ్రమమును సేవించి అత్యంత శక్తిసంపన్నురాలు, జితేంద్రియవతి, వసంతఋతువు మున్నగు ఋతుకార్యముల చక్కగా నెరిగి పతి యపరాధములను క్షమించి శత్రువుల నిర్జించగల ఉత్తమ పరాక్రమముచే యుక్తురాలగు స్త్రీ తన స్వామియగు పతిని తృప్తిపరచును. పతియును అట్టి పత్నిని నిరంతరము ప్రసన్నురాలిగ నుంచవలెను. ॥౨౬॥

26.O wife, thou art unconquerable by foes. Being patient, tolerate me thy husband. Possessing a thousand manly powers, anxious to oppose an army, overpower the ofes. Just as I keep thee satisfied so shouldst thou keep me pleased!.

౨౭.మధువాతా ఇత్యస్య గోతమ ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృద్గాయత్రీఛందః,షడ్జః స్వరః.

అథ వసన్తర్తోర్గుణాన్తరానాహ. వసన్త ఋతువుయొక్క ఇతరగుణముల జెప్పుచున్నాడు.

౨౭ మధు వాతా౨ ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః।

మాధ్వీర్నః సన్త్వోషధీః ॥౨౭॥

ప.వి:-మధు, వాతాః, ఋతాయతే, ఋతయత ఇత్యృత + యతే, మధు, క్షరన్తి, సిన్ధవః, మాధ్వీః నః, సన్తు, ఓషధీః ॥౨౭॥

**పదార్థః** :-(మధు) మధురం యథా స్యాత్తథా (వాతాః) వాయవః (ఋతాయతే) ఋతముదకమివాచరన్తి. అత్ర వచనవ్యత్యయేన బహువచనస్థాన ఏకవచనమ్. ఋతమిత్యుదకనామసు పఠితమ్. నిఘం. ౧.౧౨. న ఛన్దస్యపుత్రస్యేతీత్వాభావః. అన్యేషామపీతి దీర్ఘః (మధు) (క్షరన్తి) వర్షన్తి (సిన్ధవః) నద్యః సముద్రా వా. సిన్ధవ ఇతి నదీనామ... నిఘం. ౧.౧౩ (మాధ్వీః) మాధ్వ్యో మధురగుణయుక్తాః. అత్ర ఋత్వ్యావాస్త్వ్య.. ఇతి మధుశబ్దాదణియణాదేశనిపాతః(నః)అస్మభ్యమ్ (సన్తు)(ఓషధీః) ఓషధయః.॥౨౭॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథా వాతా వసన్తే నో మధు ఋతాయతే సిన్ధవో మధు క్షరన్తి ఓషధీర్నో మాధ్వీః సన్తు తథా వయమనుతిష్ఠేమ. ॥ ౨౭ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యదా వసన్త ఆగచ్ఛతి తదా పుష్పాదిసుగన్ధయుక్తా వాయవాదయః పదార్థా భవన్తి తస్మిన్ భ్రమణం పథ్యం వర్తత ఇతి వేద్యమ్. ॥ ౨౭ ॥

**పదార్థము** :-ఓ మానవులారా! వసంతఋతువునం దెట్లు (నః) మనకొరకై (వాతాః) వాయువు (మధు) మధురముగ (ఋతాయతే) జలములవలె నడచునో (సిన్ధవః) నదులు మరియు సముద్రములు (మధు) కోమలత్వముగ (క్షరన్తి) వర్షించునో మరియు (ఓషధీః) ఓషధులు (మాధ్వీః) మధురరస గుణములతో (సన్తు) నుండునో అట్లు మనమెల్లరమును ప్రయత్నించుచుండవలయును. ॥౨౭॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. వసంతఋతువు వచ్చినప్పుడు సమస్త పుష్పాదుల సుగంధముతో వాయువు మున్నగు పదార్థములు పూర్ణమై యుండును. ఆ ఋతువునందు వాహ్యాళి, ఊయలలూగుట మున్నగునవి పథ్యకరమైయుండును. ఇట్లని నిశ్చితముగ నెరుగవలయును.॥౨౭॥

27.In spring the zephyrs blow coolly like water, the rivers and oceans flow calmly, and medicinal herbs are filled with sweet juice.

౨౮. మధునక్తమిత్యస్య గోతమ ఋషిః, విశ్వేదేవా దేవతాః, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునః స ఏవ విషయ ఉపదిశ్యతే. మఱల పై విషయమే.

౨౮ మధు నక్తముతోషసో మధుమత్పార్థివ౯ం రజః।

మధు ద్యౌరస్తు నః పితా ॥౨౮॥

ప. విః–మధు నక్తమ్, ఉత, ఉషసః, మధుమదితి మధు + మత్ పార్థివమ్ రజః, మధు, ద్యౌః అస్తు, నః, పితా ॥౨౮॥

**పదార్థః** :-(మధు) (నక్తమ్) రాత్రిః (ఉత) అపి (ఉషసః) ప్రాతర్ముఖాని దినాని (మధుమత్) మధురగుణ యుక్తమ్ (పార్థివమ్) పృథివ్యా వికారః (రజః) ద్వ్యణుకాదిరేణు (మధు) (ద్యౌః) ప్రకాశః (అస్తు) (నః) అస్మభ్యమ్ (పితా) పాలకః. ॥ ౨౮ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథా వసన్తే నక్తం మధూతాప్యుషసో మధు పార్థివం రజో మధుమద్ ద్యౌర్మధు పితా నో ऽస్తు తథా యూయమప్యేతం యుక్త్యా సేవధ్వమ్. ॥ ౨౮ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. ప్రాప్తే వసన్తే పక్షిణో ऽపి మధురం స్వనన్తి, హర్షితాః ప్రాణినశ్చ జాయన్తే.॥ ౨౮ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! వసంతఋతువు (నక్తమ్) రాత్రి (మధు) కోమలత్వముగ (ఉత) మరియు (ఉషసః) ప్రాతఃకాలమునుండి పగలంతయు మధురముగ (పార్థివమ్) పృథివియొక్క (రజః) ద్వ్యణుక మరియు త్రసరేణువు మున్నగునవి (మధుమత్) మధురగుణములతో మరియు (ద్యౌః) ప్రకాశము సైతము (మధు) మధురయుక్తముగ (పితా) రక్షించువానివలె (నః) మాకొరకు (అస్తు) అగునను యుక్తితో ఆ వసంతఋతువును మీరును సేవించుడు. ॥౨౮॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకార మున్నది. వసంతఋతువు వచ్చినప్పుడు పక్షులును తమ కోమల మధురధ్వనులతో పలుకుచుండును. మరియు సమస్తప్రాణులును ఆనందము ననుభవించుచుండును. ॥౨౮॥

28.In spring the nights are sweet, the days are sweet, the terrestrial atmosphere is sweet, and light, our protector, is sweet unto us.

౨౯. మధుమానిత్యస్య గోతమ ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృద్గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.

అథ వసంతే జనైః కిమాచరణీయమిత్యాహ. వసంతమునందు మానవులెట్లాచరించవలెను.

౨౯. మధుమాన్నో వనస్పతిర్మధుమాం ऽ॥ అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవన్తు నః॥౨౯॥

ప.వి:- మధుమానితి మధు+మాన్, నః, వనస్పతిః, మధుమానితి మధు + మాన్, అస్తు, సూర్యః, మాధ్వీః, గావః, భవన్తు, నః ॥౨౯॥

**పదార్థః** :-(మధుమాన్) ప్రశస్తా మధవో గుణా విద్యన్తే యస్మిన్ సః (నః) అస్మభ్యమ్ (వనస్పతిః) అశ్వత్థాదిః (మధుమాన్) ప్రశస్తో మధుః ప్రతాపో విద్యతే యస్య సః (అస్తు) భవతు (సూర్యః) సవితా (మాధ్వీః) మధురా గుణా విద్యన్తే యాసు తాః (గావః) ధేనవ ఇవ కిరణాః (భవన్తు) (నః) అస్మభ్యమ్.॥౨౯॥

**అన్వయః** :-హే విద్వాంసః! యథా వసన్తే నో వనస్పతిర్మధుమాన్ సూర్యశ్చ మదుమానస్తు. నో గావో మాధ్వీర్భవన్తు తథోపదిశత. ॥ ౨౯ ॥

**భావార్థః** :-హే మనుష్యాః! యూయం వసన్తమృతుం ప్రాప్య యాదృగ్ద్రవ్యహోమేన వనస్పత్యాదయో మధురాదిగుణాః స్యుః తాదృశం యజ్ఞమాచరతేత్థం వాసన్తికం సుఖం సర్వే యూయం ప్రాప్నుత.॥౨౯ ॥

**పదార్థము** :-విద్వాంసులారా! వసంతఋతువునందు (నః) మాకొరకై (వనస్పతిః) రావి మున్నగు వనస్పతులు (మధుమాన్) ప్రశంసనీయమగు మార్దవగుణములుగలవి. మరియు (సూర్యః) సూర్యుడును (మధుమాన్) ప్రశంసనీయ కోమలత్వముగలవాడు (అస్తు) అగుగాక! (నః) మాకొరకు (గావః) గోవులవలె (మాధ్వీః) కోమలగుణములుగల కిరణములు (భవన్తు) ఉండుగాక యని ఉపదేశించుడు. ॥౨౯॥

**భావార్థము**:-ఓ మానవులారా! మీరు వసంతఋతువు వచ్చినప్పుడు ఏ పదార్థములతో హోమమొనర్చిన వనస్పత్యాదులు కోమలగుణములు గలిగినవగునో అట్టి యజ్ఞము ననుష్ఠించుడు. ఇట్టి వసంతఋతు సుఖమును మీరెల్లరును పొందుడు. ॥౨౯॥

29.In spring,let trees give us sweet fruits, sun physical strength and cows sweet milk.

౩౦. అపామిత్యస్య గోతమ ఋషిః, ప్రజాపతిర్దేవతా, ఆర్షీపఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నవ్విషయమే.

౩౦ అపాం గమ్భన్త్సీద మా త్వా సూర్యోऽభితాప్సీన్మాऽగ్నిర్వైశ్వానరః। అచ్ఛిన్నపత్రాః ప్రజాऽ అనువీక్షస్వాను త్వా దివ్యా వృష్టిః సచతామ్॥౩౦॥

ప.వి:- అపామ్, గమ్భన్, సీద, మా, త్వా, సూర్యః, అభి, తాప్సీత్, మా, అగ్నిః, వైశ్వానరః, అచ్ఛిన్నపత్రా ఇత్యచ్ఛిన్న + పత్రాః, ప్రజా ఇతి ప్ర + జాః, అనువీక్షస్వేత్యను + వీక్షస్వ, అను, త్వా, దివ్యా, వృష్టిః సచతామ్ ॥30॥

**పదార్థః** :- (అపామ్) జలానామ్ (గమ్భన్) గమ్భని ధారకే మేఘే. అత్ర గమధాతోరౌణాదికో బాహులకాద్ భనిః ప్రత్యయః సప్తమ్యా లుక్ చ (సీద) ఆస్స్వ (మా) (త్వా) (సూర్యః) మార్తణ్డః (అభి) (తాప్సీత్) తపేత్ (మా) (అగ్నిః) (వైశ్వానరః) విశ్వేషునరేషు రాజమానః (అచ్ఛిన్నపత్రాః) అచ్ఛిన్నాని పత్రాణి యాసాం తాః (ప్రజాః) (అనువీక్షస్వ) ఆనుకూల్యేన విశేషతః సంప్రేక్షస్వ (అను) (త్వా) త్వామ్ (దివ్యా) శుద్ధగుణసమ్పన్నా (వృష్టిః) (సచతామ్) సమవైతు. ॥ 30 ॥

**అన్వయః** :- హే మనుష్య! త్వం వసన్తేఽపాం గమ్భన్నివ సీద. యతః సూర్యస్త్వా మాఽభితాప్సీత్. వైశ్వానరోఽగ్నిస్త్వా మాభితాప్సీదచ్ఛిన్నపత్రాః ప్రజా అను త్వా దివ్యా వృష్టిః సచతాం తథా త్వమనువీక్షస్వ. ॥30॥

**భావార్థః** :- వసన్తగ్రీష్మయోర్మధ్యే మనుష్యా జలాశయస్థం శీతలం స్థానం సంసేవన్తామ్. యేన తాపాఽభితప్తా న స్యుః యేన యజ్ఞేన పుష్కలా వృష్టిః స్యాత్ ప్రజాస్తశ్చ తం సేవధ్వమ్. ॥ 30 ॥

**పదార్థము** :- ఓ మానవా! నీవు వసంతఋతువునందు (అపామ్) జలముల (గమ్భన్) ఆధారకర్తయగు మేఘమునందు (సీద) స్థిరుడవుగమ్ము. అందువల్ల (సూర్యః) సూర్యుడు (త్వా) నిన్ను (మా అభితాప్సీత్) తపింపజేయకుండుగాక! (వైశ్వానరః) మానవులందరయందు ప్రకాశవంతుడు (అగ్నిః) భౌతికాగ్ని, విద్యుత్తు (త్వా) నీకు (మా అభి తాప్సీత్) తాపము గలిగించకుండుగాక! (అచ్ఛిన్నపత్రాః) చక్కని పూర్ణావయవములు గలిగిన (ప్రజాః) ప్రజలు (అనుత్వా) నీకు అనుకూలము మరియు (దివ్యా) శుద్ధగుణములతో (వృష్టిః) వర్షములు (సచతామ్) ప్రాప్తింపజేయుదురుగాక! ఇట్లే (అనువీక్షస్వ) అనుకూలత్వముచే విశేషముగ ఆలోచించుము. ॥30॥

**భావార్థము** :- సూర్యకిరణములచే గల్గిన తాపము దూరమగుటకై మనుష్యులు వసంత, గ్రీష్మ ఋతువుల మధ్యకాలమునందు జలాశయమందలి శీతలస్థానముల నాశ్రయించవలెను. ఏ యజ్ఞములచే వర్షములు ఉత్తమముగ కురిసి ప్రజావర్గము ఆనందితులగునో అట్టి హోమములను ప్రజలెల్లరును సేవించవలెను. ॥30॥

30.O man, in spring, seat thyself in the deepness of waters, lest sun, lest heat burning in all men, should afflict thee. Let well-built subjects be under thy control. Let highly useful rain pour. Think deeply and favourably over these points!.

౬౬౧. త్రీన్త్సముద్రానిత్యస్య గోతమ ఋషిః, వరుణో దేవతా, త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

అథ జనైస్తత్ర సుఖప్రాప్తయే కిమాచరణీయమిత్యాహ. జనులు సుఖప్రాప్తికై ఏమి ఆచరించవలయును?

**౬౬౧ త్రీన్త్సముద్రాన్త్సమసృపత్ స్వర్గానపాం పతిర్వృషభఽఇష్టకానామ్।**

**పురీషం వసానః సుకృతస్య లోకే తత్ర గచ్ఛ యత్ర పూర్వే పరేతాః ॥౩౧॥**

**ప. వి:-** త్రీన్, సముద్రాన్, సమ్, అసృపత్, స్వర్గానితి స్వః+గాన్, అపామ్, పతిః, వృషభః, ఇష్టకానామ్, పురీషమ్, వసానః, సుకృతస్యేతి, సు + కృతస్య, లోకే, తత్ర, గచ్ఛ, యత్ర, పూర్వే, పరేతా ఇతి పరా + ఇతాః ॥౩౧॥

**పదార్థః :-** (త్రీన్) అధోమధ్యోర్ధ్వస్థాన్ (సముద్రాన్) సముద్ద్రవన్తి పదార్థా యేషు తాన్ భూతభవిష్య ద్వర్తమానాన్ సమయాన్ (సమ్) (అసృపత్) సర్పతి (స్వర్గాన్) స్వః సుఖం గచ్ఛన్తి ప్రాప్నువన్తి యేభ్యస్తాన్ (అపామ్) ప్రాణానామ్ (పతిః) రక్షకః (వృషభః) వర్షకః శ్రేష్ఠో వా (ఇష్టకానామ్) ఇజ్యన్తే సంగమ్యన్తే కామా యైః పదార్థైస్తేషామ్ (పురీషమ్) పూర్ణసుఖకరముదకమ్ (వసానః) వాసయన్ (సుకృతస్య) సుష్ఠు కృతో ధర్మో యేన తస్య (లోకే) ద్రష్టవ్యే స్థానే (తత్ర) (గచ్ఛ) ధర్మ్యే మార్గే (పూర్వే) ప్రాక్తనా జనాః (పరేతాః) సుఖం ప్రాప్తాః. ॥ ౩౧ ॥

**అన్వయః :-** హే విద్వంస్త్వం! యథాఽపాంపతిర్వృషభః పురీషం వసానః సన్నిష్టకానాం త్రీన్ సముద్రాంల్లోకాన్ స్వర్గాన్ సమసృపత్. సంసర్పతి తథా సర్ప యత్ర సుకృతస్య లోకే మార్గే పూర్వే పరేతాస్తత్ర త్వమపి గచ్ఛ. ॥౩౧॥

**భావార్థః :-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్ధార్మికాణాం మార్గేణ గచ్ఛద్భిః శారీరికవాచిక మానసాని త్రివిధాని సుఖాని ప్రాప్తవ్యాని. యత్ర కామా అలం స్యుస్తత్ర ప్రయతితవ్యం యథా వసన్తాదయ ఋతవః క్రమేణ వర్తిత్వా స్వాని స్వాని లింగాన్యభిపద్యన్తే తథర్త్వనుకూలాన్ వ్యవహారాన్ కృత్వాఽఽ న్నయితవ్యమ్. ॥౩౧॥

**పదార్థము :-** ఓ విద్వాంసుడా! నీ వెట్లు (అపామ్) ప్రాణముల (పతిః) రక్షకుడు (వృషభః) వర్షహేతువు (పురీషమ్) పూర్ణసుఖములనిచ్చు జలములను (వసానః) ధారణమొనర్చు సూర్యుడు (ఇష్టకానామ్) కామితముల ప్రాప్తింపజేయుటకు హేతువగు పదార్థముల ఆధారరూపుడు (త్రీన్) క్రింద, మీద, మధ్యన

నుండునట్టి ముప్విధములగు (సముద్రాన్) సకల పదార్థముల స్థానమగు భూతభవిష్యద్వర్తమానవములు (స్వర్గాన్) సుఖప్రాప్తిని గలిగించు లోకములకు (సమస్పృత్) ప్రాప్తించుకొనునట్లు నీవును ప్రాప్తించుకొనుము (యత్ర) ధర్మయుక్తమగు ఏ వసంతమార్గమునందు (సుకృతస్య) చక్కని ధర్మాచరణగలవారు (లోకే) దర్శించదగిన స్థానము, లేక మార్గమందు (పూర్వే) మనప్రాచీనులు (పరేతాః) సుఖప్రాప్తినొందియుండిరో (తత్ర) అట్టి వసంతఋతువుయొక్క సేవించదగిన మార్గమందు నీవును (గచ్ఛ) నడువుము. ॥30॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు ధర్మాత్ములు నడచిన మార్గమున నడచుచు శారీరక, వాచిక, మానసికములనబడు ముప్విధ సుఖములను పొందవలెను. కామితములు నెరవేరు ప్రయత్నములనే యొనర్చవలయును. వసంతము మొదలగు ఋతువులు అనుక్రమముగ ప్రవర్తితములై తమ చిహ్నములను పొందుచున్నట్లు ఋతువులకనుకూలముగ వ్యవహరించుచు ఆనందించవలయును. ॥30॥

31.O learned person, as sun, the protector of our vital organs, the cause of rain, the sustainer of pleasant water, attains to all pleasure-giving regions, the mainstay of achiev-ing our desires on earth, space and sky, in past, present and futrure, so shouldst thou. Tread thou the path of virtue, as did thy ancestors!.

**౬౬౨.మహీ ద్యౌరిత్యస్య గోతమ ఋషిః, ద్యావాపృథివ్యౌ దేవతే, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.**

**మాతాపితృభ్యాం స్వసన్తానాః కథం శిక్ష్యా ఇత్యాహ.**

**తల్లిదండ్రులు స్వసంతానమునకు యెట్టి శిక్షణ గఱపవలయును ?**

**౬౬౨ మహీ ద్యౌః పృథివీ చ న ఇమం యజ్ఞం మిమిక్షతామ్।**

**పిపృతాం నో భరీమభిః ॥32॥**

**ప. విః-మహీ, ద్యౌః, పృథివీ, చ, నః, ఇమమ్, యజ్ఞమ్, మిమిక్షతామ్, పిపృతామ్, నః, భరీమభిరితి భరీమ + భిః ॥32॥**

**పదార్థః :-**(మహీ) మహతీ (ద్యౌః) సూర్యః (పృథివీ) భూమిః (చ) (నః) అస్మాకమ్ (ఇమమ్) (యజ్ఞమ్) సఙ్గన్తవ్యం గృహాశ్రమవ్యవహారమ్ (మిమిక్షతామ్) సేక్తుమిచ్ఛేతామ్ (పిపృతామ్) పాలయతమ్ (నః) అస్మాన్ (భరీమభిః) ధారణపోషణాద్యైః కర్మభిః. ॥32॥

**అన్వయః :-**హే మాతా పితరౌ! యథా మహీ ద్యౌః పృథివీ చ సర్వం సిఞ్చతః పాలయతస్తథా యువాం న ఇమం యజ్ఞం మిమిక్షతాం భరీమభిర్నః పిపృతామ్. ॥32॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా వసన్తర్తౌ భూమిసూర్యౌ సర్వేషాం ధారణం ప్రకాశం పాలనఞ్చ కురుతస్తథా మాతాపితరః స్వసన్తానేభ్యో వసన్తాదిష్వృతుష్వన్నం విద్యాదానం సుశిక్షాం చ కృత్వా పూర్ణాన్ విదుషః పురుషార్థినః సంపాదయేయుః. ॥ 32 ॥

**పదార్థము** :- తల్లిదండ్రులారా! ఎట్లు (మహీ) గొప్ప (ద్యౌః) సూర్యలోకము (చ) మరియు (పృథివీ) పృథివి సమస్త ప్రపంచమును సేచనము మరియు పాలనమొనర్చునో అట్లు మీ రుభయులును (నః) మాయొక్క (ఇమమ్) ఈ (యజ్ఞమ్) సేవనీయ విద్యాగ్రహణరూప వ్యవహారమును (మిమిక్షతామ్) సేచనము, అనగా పూర్ణమొనర్చుటను కోరుకొనుడు (భరీమభిః) ధారణము, పోషణము మున్నగు కర్మలచే (నః) మమ్ము (పిపృతామ్) పాలనమొనర్చుడు. ॥32॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. వసంతఋతువునందు పృథివీ సూర్యులు విశ్వమంతటిని ధారణము, పాలనము, ప్రకాశనమొనర్చునట్లు మాతాపితరులు తమ సంతానములకు వసంతాది ఋతువులందు ఉత్తమ ఆహార, విద్యాదాన ఉత్తమశిక్షణలచే పురుషార్థులగు విద్వాంసులనుగ నొనర్చవలయును. ॥32॥

32.O mother and father just as the Mighty Sun and Earth nourish the world, so shouldst ye desire for the completion of our noble task of getting education and rear us full with nourishments!.

౬౬౩.విష్ణోః కర్మాణీత్యస్య గోతమ ఋషిః. విష్ణుర్దేవతా, నిచృద్గాయత్రీ ఛందః,షడ్జః స్వరః.

విద్వద్విదితరైర్జనైరాచరణీయమిత్యాహ. విద్వాంసులవలె నితరు లాచరించవలయును.

**౬౬౩ విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే। ఇన్ద్రస్య యుజ్యః సఖా॥33॥**

**ప.విః-విష్ణోః, కర్మాణి, పశ్యత, యతః, వ్రతాని, పస్పశే, ఇన్ద్రస్య, యుజ్యః, సఖా॥33॥**

**పదార్థః**:-(విష్ణోః) వ్యాపకేశ్వరస్య (కర్మాణి) జగత్సృష్టిపాలనప్రలయకరణన్యాయాదీని (పశ్యత) సంప్రేక్షధ్వమ్ (యతః) (వ్రతాని) నియతాని సత్యభాషణాదీని (పస్పశే) స్పృశతి (ఇన్ద్రస్య) పరమైశ్వర్యమిచ్ఛుకస్య జీవస్య యుక్తస్య (యుజ్యః) ఉపయుక్తానన్దప్రదః (సఖా) మిత్రఇవ వర్తమానః.॥33॥

**అన్వయః**:-హే మనుష్యాః! య ఇన్ద్రస్య జీవస్య యుజ్యః సఖాస్తి యతోఽయం విష్ణోః కర్మాణి వ్రతాని చ పస్పశే తస్మాదేతస్యైతాని యూయమపి పశ్యత. ॥ 33 ॥

**భావార్థః**:-యథా పరమేశ్వరస్య సుహృదుపాసకో ధార్మికో విద్వానస్య గుణకర్మస్వభావ క్రమానుసారాణి సృష్టిక్రమాణి కుర్యాజ్జానీయాత్ తథైవేతరే మనుష్యాః కుర్యుర్జానీయుశ్చ. ॥ 33 ॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎవడు (ఇన్ద్రస్య) పరమైశ్వర్యములను గోరునట్టి జీవునకు (యుజ్యః) ఉపాసనీయుడు (సఖా) మిత్రునివలెనున్నాడో (యతః) ఎవనిశక్తి ప్రతాపములచే నీ జీవుడు (విష్ణోః) వ్యాపకుడగు పరమేశ్వరుని (కర్మాణి) జగత్తుయొక్క సృష్టి స్థితిలయములను మరియు న్యాయాదికర్మలను (వ్రతాని) సత్యభాషణము మున్నగు నియమములను (పస్పశే) స్పర్శించుచున్నాడో అట్టి పరమేశ్వరుని యా కర్మలను వ్రతములను మీరును (పశ్యత) చూడుడు, ఆచరించుడు. ॥33॥

**భావార్థము** :- పరమేశ్వరునకు మిత్రుడు, ఉపాసకుడు, ధర్మాత్ముడు, విద్వాంసుడునగువాడే పరమాత్మయొక్క గుణకర్మ స్వభావములననుసరించి సృష్టిక్రమముల కనుగుణ్యముగ తెలిసికొని ఆచరించును. అట్లే మానవులెల్లరును ఆచరించవలెను. ॥33॥

33.God is the Adorable, inseparable Companion of the soul; which realises through His grace the actions and laws of the Omnipresent God. O man, ye should also observe them!.

౬౬౪. ధ్రువాసీత్యస్య గోతమ ఋషిః, జాతవేదా దేవతా, భురిక్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

విద్వద్వత్స్త్రీభిరప్యుపదేష్టవ్యమిత్యాహ. విద్వాంసులవలె విదుషీమణులును ఉపదేశకులు గావలయును.

౬౬౪ ధ్రువాసి ధరుణేతో జజ్ఞే ప్రథమమేభ్యో యోనిభ్యోఽ

అధి జాతవేదాః। స గాయత్ర్యా త్రిష్టుభాఽనుష్టుభా చ దేవేభ్యో

హవ్యం వహతు ప్రజానన్ ॥౩౪॥

**ప. విః**- ధ్రువా, అసి, ధరుణా, ఇతః, జజ్ఞే, ప్రథమమ్, ఏభ్యః, యోనిభ్య ఇతి యోని + భ్యః, అధి, జాతవేదా ఇతి జాత + వేదాః, సః, గాయత్ర్యా, త్రిష్టుభా, త్రిస్తుభేతి త్రి + స్తుభా, అనుష్టుభా, అనుస్తుభేత్యను + స్తుభా, చ, దేవేభ్యః, హవ్యమ్, వహతు, ప్రజానన్నితి ప్ర + జానన్. ॥౩౪॥

**పదార్థః** :- (ధ్రువా) (స్థిరా) (అసి) (ధరుణా) ధర్త్రీ (ఇతః) కర్మణః (జజ్ఞే) ప్రాదుర్భవతి (ప్రథమమ్) ఆదిమం కార్యమ్ (ఏభ్యః) (యోనిభ్యః) కారణేభ్యః (అధి) (జాతవేదాః) యో జాతేషు విద్యతే సః (సః) (గాయత్ర్యా) గాయత్రీనిష్పాదితయా విద్యయా (త్రిష్టుభా) (అనుష్టుభా) (చ)

(దేవేభ్యః) దివ్యగుణేభ్యో విద్వద్భ్యో వా (హవ్యమ్) హోతుమాదాతుమ్మర్హం విజ్ఞానమ్ (వహతు) ప్రాప్నోతు (ప్రజానన్) ప్రకృష్టతయా జానన్. ॥ 34 ॥

**అన్వయః** :- హే స్త్రి! యథా త్వం ధరుణా ధ్రువాసి యథైభ్యో యోనిభ్యః స జాతవేదాః ప్రథమమధిజజ్ఞే తథేతోఽధిజాయస్వ. యథా స తవ పతిర్గాయత్ర్యా త్రిష్టుభానుష్టుభా చ ప్రజానన్ దేవేభ్యో హవ్యం వహతు తథైతయా ప్రజానన్తీ బ్రహ్మచారిణీ కన్యా భవన్తీభ్యః స్త్రీభ్యో విజ్ఞానం ప్రాప్నోతు. ॥34 ॥

**భావార్థః** :- మనుష్యా జగదీశ్వరస్సృష్టిక్రమనిమిత్తాని విదిత్వా విద్వాంసో భూత్వా యథా పురుషేభ్యః శాస్త్రోపదేశాన్ కుర్వంతి తథైవ స్త్రియోఽప్యేతాని విదిత్వా స్త్రీభ్యో వేదార్థనిష్కర్షోపదేశాన్ కుర్వన్తు. ॥34॥

**పదార్థము** :- ఓ మహిళామణీ! నీవు (ధరుణా) శుభగుణములను ధారణమొనర్చుదానవై (ధ్రువా) స్థిరమై (అసి) ఉన్నావు (ఏభ్యః) ఈ (యోనిభ్యః) కారణములచే (సః) అట్టి (జాతవేదాః) ప్రసిద్ధ పదార్థములందు విద్యమానమై యున్న వాయువు (ప్రథమమ్) పూర్వమే (అధిజజ్ఞే) ఆధిక్యముతో ప్రకటిత మగుచున్నట్లు (ఇతః) ఈ కర్మల అనుష్ఠానముద్వారా సర్వోపరి ప్రసిద్ధురాలవు గమ్ము. నీ పతి యెట్లు (గాయత్ర్యా) గాయత్రి (త్రిష్టుభా) త్రిష్టుప్ (చ) మరియు (అనుష్టుభా) అనుష్టుప్ మంత్రముచే సిద్ధించిన విద్యచే (ప్రజానన్) బుద్ధిశాలియై (దేవేభ్యః) శ్రేష్ఠగుణముల లేక విద్వాంసులనుండి (హవ్యమ్) ఇచ్చిపుచ్చుకొనదగిన విజ్ఞానమును (వహతు) పొందునట్లు ఈ విద్యచే బుద్ధిశాలినివై నీవు స్త్రీలనుండి బ్రహ్మచారిణీ కన్యా విజ్ఞానమును ప్రాప్తిజేసికొనుము. ॥34॥

**భావార్థము** :- మానవులు ప్రపంచమందు పరమేశ్వరుని సృష్టిక్రమముల, నిమిత్తముల నెరిగి విద్వాంసులై పురుషులకు ఉపదేశించునట్లే స్త్రీలును ఈ సృష్టిక్రమము నిమిత్తములను చక్కగానెరిగి విద్వాంసురాండ్రై స్త్రీలకు వేదార్థసారములను ఉపదేశించవలయును. ॥34॥

34.O woman, thou art firm, and the master of noble qualities. A learned person is first born of thee, and afterwards is born of virtuous, talented gurus. Thy husband, equipped with the knowledge conveyed by the Gyatri, Trishtup, and Anushtup vedic verses; improving his talent thereby, derives learning worthy of exchange!.

**౬౬౫.**ఇషే రాయ ఇత్యస్య గోతమ ఋషిః, జాతవేదా దేవతాః, నిచృద్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ జాయాపతీ ఉద్వాహం కృత్వా కథం వర్తేయాతామిత్యాహ.

స్త్రీపురుషులు వివాహమాడి యెటుల ప్రవర్తించవలయును?

**౬౬౫ ఇషే రాయే రమస్వ సహసే ద్యుమ్నఽ ఊర్జేఽ అపత్యాయ।**

**సమ్రాడసి స్వరాడసి సారస్వతౌ త్వోత్సౌ ప్రావతామ్ ॥35॥**

**ప.వి:-ఇషే, రాయే, రమస్వ, సహసే, ద్యుమ్నే, ఊర్జే, అపత్యాయ, సమ్రాడితి సమ్ + రాట్ అసి, స్వరాడితి, స్వరాట్, అసి, సారస్వతౌ, త్వా, ఉత్సౌ, ప్ర, అవతామ్ ॥౩౫॥**

**పదార్థః** :-(ఇషే) విజ్ఞానాయ (రాయే) శ్రియే (రమస్వ) క్రీడస్వ (సహసే) బలాయ (ద్యుమ్నే) యశసేఽన్నాయ వా. ద్యుమ్నం ద్యోతతేర్యశో వాఽన్నం వా. నిరు. ౫.౫ (ఊర్జే) పరాక్రమాయ (అపత్యాయ) సంతానాయ (సమ్రాట్) యః సమ్యగ్రాజతే సః (అసి) (స్వరాట్) యా స్వయం రాజతే సా (అసి) (సారస్వతౌ) సరస్వత్యాం వేదవాచి కుశలావుపదేశకోపదేష్ట్రౌ (త్వా) త్వామ్ (ఉత్సౌ) కూపోదక మివార్ద్రీభూతౌ (ప్ర) (అవతామ్) రక్షణాదికం కురుతామ్. ॥ ౩౫ ॥

**అన్వయః** :-హే పురుష! యస్త్వం సమ్రాడసి. హే స్త్రి! యా త్వం స్వరాడసి స త్వం చేషే రాయే సహసే ద్యుమ్న ఊర్జేఽపత్యాయ రమస్వ. ఉత్సావివ సారస్వతౌ సన్తావేతాని ప్రావతామితి త్వా త్వాం పురుషం స్త్రియం చోపదిశామి. ॥౩౫॥

**భావార్థః** :- కృతవివాహౌ స్త్రీపురుషౌ పరస్పరం ప్రీత్యా విద్వాంసౌ సన్తౌ వసన్తే పురుషార్థేన శ్రీమన్తౌ సద్గుణౌ పరస్పరస్య రక్షాం కుర్వన్తౌ ధర్మేణాపత్యాన్యుత్పాద్యాస్మిన్ సంసారే నిత్యం క్రీడేతామ్. ॥ ౩౫ ॥

**పదార్థము** :- ఓ పురుషుడా ఏ నీవు (సమ్రాట్) విద్యాది శుభగుణములచే స్వయం ప్రకాశమానుడవై (అసి) ఉన్నావో, ఓ స్త్రీ నీవు (స్వరాట్) స్వయముగ విజ్ఞానసత్యాచారములచే శోభాయమానవై (అసి) ఉన్నావో నీరిరువురును (ఇషే) విజ్ఞానము (రాయే) ధనము (సహసే) బలశక్తులు (ద్యుమ్నే) యశస్సు మరియు అన్నము (ఊర్జే) పరాక్రమము (అపత్యాయ) సంతానప్రాప్తి కొరకు (రమస్వ) ప్రయత్నించుడు. మరియు (ఉత్సౌ) కూప ఉదకమువంటి కోమలత్వమును పొంది (సారస్వతౌ) వేదవాణుల ఉపదేశములందు కుశలురై స్త్రీపురుషులిరువురును తమ శరీరములను, అన్నము మున్నగు పదార్థములను (ప్రావతామ్) రక్షణమున్నగునవి జేయవలెనని (త్వా) మీకు ఉపదేశించుచున్నాను. ॥౩౫॥

**భావార్థము** :-వివాహితులగు స్త్రీపురుషు లిరువురును పరస్పరము ప్రీతియుక్తులు, విద్వాంసులునై వసంతఋతువునందు పురుషార్థముతో ధనవంతులు, శ్రేష్ఠగుణయుక్తులునై పరస్పరము రక్షించుకొనుచు ధర్మానుకూలముగ వర్తించి ఉత్తమసంతానముల గని ప్రపంచమునందు సదా ఆనందించవలెను. ॥౩౫॥

35.O man thou art self-effulgent through knowledge. O woman thou art graceful through learning and virtuous conduct. Strive together for knowledge, riches, strength, fame, food, heroism and offspring. I enjoin ye, to protect your bodies and foodstuffs, being sweet like the water of a well, and observing the teachings of the vedas!.

**౬౬౬. అగ్నే యుష్వా ఇత్యస్య భరద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.**

**అథ శత్రువిజయః కథం కర్తవ్య ఇత్యాహ. శత్రువుల నెటుల జయించవలయును?**

౬౬౬ అగ్నే యుక్ష్వా హియే తవాశ్వాసో దేవ సాధవః।అరం వహన్తి మన్యవే ॥౩౬॥

ప.విః- అగ్నే, యుక్ష్వ, హి, యే, తవ, అశ్వాసః, దేవ, సాధవః, అరమ్, వహన్తి, మన్యవే॥౩౬॥

**పదార్థః**:-(అగ్నే) విద్వన్ (యుక్ష్వ) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః. వికరణస్య లుక్చ (హి) ఖలు (యే) (తవ) (అశ్వాసః) సుశిక్షితాస్తురఙ్గాః (దేవ) దివ్యవిద్యాయుక్త (సాధవః) అభీష్టం సాధ్నువన్తః (అరమ్) అలమ్ (వహన్తి) రథాదీని యానాని ప్రాపయన్తి (మన్యవే) శత్రూణాముపరి క్రోధాయ.॥౩౬॥

**అన్వయః**:-హే దేవాఽగ్నే! యే తవ సాధవోఽశ్వాసో మన్యవేఽరం వహన్తి తాన్ హి త్వం యుక్ష్వ.॥౩౬॥

**భావార్థః**:-రాజమనుష్యైర్వసంతే ప్రథమమశ్వాన్ సుశిక్ష్య సారథీంశ్చ రథేషు నియోజ్య శత్రు విజయాయ గన్తవ్యమ్. ॥ ౩౬ ॥

**పదార్థము** :-(దేవ) శ్రేష్ఠవిద్వాంసుడా! (అగ్నే) తేజోవంతుడవగువాడా! (యే) ఏ (తవ) నీయొక్క (సాధవః) అభీష్టమును సాధించగల (అశ్వాసః) అశ్వములు (మన్యవే) శత్రువులపై క్రోధముతో (అరమ్) సామర్థ్యముతో (వహన్తి) రథములు మున్నగు యానములను చేర్పించునో అట్టివానిని మాత్రమే (హి) నిశ్చయించుకొని (యుక్ష్వ) సంయుక్తపరచుము [కట్టుము].॥౩౬॥

**భావార్థము** :- రాజులు మున్నగువారు వసంతఋతువులో మొదట తమ యశ్వములకు చక్కని శిక్షణనిచ్చి రథికులను రథములపై నియుక్తమొనర్చి శత్రువులపై విజయము సాధించుటకై యాత్రల నొనర్చవలయును.॥౩౬॥

36.O learned, powerful person, verily harness thou thy steeds, which are well disciplined and trained, and carry the conveyance with full force in thy attacks on the foe with righteous indignation!.

౬౬౭.యుక్ష్వా హిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ రాజపురుషకృత్య మాహ. రాజపురుషు లేమి చేయవలెను?

౬౬౭ యుక్ష్వా హి దేవహూతమాం౨॥ఽ అశ్వాం౨॥ఽ

అగ్నే రథీరివ। ని హోతా పూర్వ్యః సదః॥౩౭॥

**ప. వి:-** యుక్ష్వ, హి, దేవహూతమానితి దేవ + హూతమాన్, అశ్వాన్, అగ్నే, రథీరివేతి రథీః + ఇవ, ని, హోతా, పూర్వ్యః, సదః ॥౩౭॥

**పదార్థః:-** (యుక్ష్వ) అత్రాపి దీర్ఘః (హి) కిల (దేవహూతమాన్) దేవైర్విద్వద్భిః స్పర్ధితాన్ (అశ్వాన్) (అగ్నే) (రథీరివ) యథా శత్రుభిః సహ బహురథాదిసేనాఙ్గవాన్ యోద్ధా యుధ్యతి తథా (ని) నితరామ్ (హోతా) దాతా (పూర్వ్యః) పూర్వైర్విద్వద్భిః కృతశిక్షః (సదః) సీద. అత్ర లఙ్వ్యడభావః. ॥౩౭॥

**అన్వయః:-** హే అగ్నే! పూర్వ్యో హోతా త్వం దేవహూతమానశ్వాన్ రథీరివ యుక్ష్వ. హి న్యాయాసనే నిషదః. ॥ ౩౭ ॥

**భావార్థః :-** సేనాపత్యాది రాజపురుషైర్మహారథివదశ్వాదీని సేనాఙ్గాని కార్యేషు సంయోజనీయాని. సభాపత్యాదయో న్యాయాసనే స్థిత్వా ధర్మ్యం న్యాయమాచరన్తు. ॥ ౩౭ ॥

**పదార్థము :-** (అగ్నే) ఓ విద్వాంసుడా (పూర్వ్యః) పూర్వపు విద్వాంసులచే శిక్షణలను పొందిన (హోతా) దానశీలుడ వగు నీవు (దేవహూతమాన్) విద్వాంసులచే పోటీపద్ధతిలో శిక్షింపబడిన (అశ్వాన్) అశ్వములను (రథీరివ) శత్రువుల అనేక రథములు, సైన్యములు, అంగయుక్తములగు యోధులవలె (యుక్ష్వ) యుక్తపరచుము. [పూన్చుము] (హి) నిశ్చితమనస్కుడవై న్యాయాసనముపై (నిషదః) సదా స్థితమై యుండుము॥౩౭॥

**భావార్థము :-** సేనాపతి మున్నగు రాజపురుషులు గొప్పసైన్యములు అంగయుక్తములగు రథికులవలె అశ్వములు మున్నగు రణాంగములను సంయుక్తపరచవలయును. సభాపతి మున్నగునారు న్యాయాసనముపై గూర్చిండి ధర్మయుక్తముగా సదా న్యాయమునే యొనర్చుచుండవలయును. ॥౩౭॥

37.O learned person, trained by ancient scholars, and charitable in nature; yoke like a charioteer thy steeds, well disciplined by the experts. Seat thy self on the seat of justice!.

౬౬౮. సమ్యక్ స్రవన్తీత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః కిం భూత్వా వాగ్ధార్యేత్యాహ.

మానవు లెట్టివారలై వాణిని ధరించవలెను?

౬౬౮ సమ్యక్ స్రవన్తి సరితో న ధేనా౨ అన్తర్హృదా మనసా పూయమానాః। ఘృతస్య ధారా౨ అభి చాకశీమి హిరణ్యయో వేతసో మధ్య౨ అగ్నేః ॥౩౮॥

**ప. విః-సమ్యక్, స్రవన్తి, సరితః, న, ధేనాః, అన్తః,హృదా, మనసా, పూయమానాః, ఘృతస్య, ధారాః, అభి, చాకశీమి, హిరణ్యయః, వేతసః మధ్యే, అగ్నేః ॥౩౮॥**

**పదార్థః** :-(సమ్యక్) (స్రవన్తి) గచ్ఛన్తి (సరితః) నద్యః, సరిత ఇతి నదీనామ... నిఘం.. ౧.౧౩ (న) ఇవ (ధేనాః) వాచః. ధేనా ఇతి వాఙ్ నామ. నిఘం..౧.౧౧ (అన్తః) ఆభ్యన్తరే (హృదా) హృదయేన (మనసా) విజ్ఞానవతా చిత్తేన (పూయమానాః) పవిత్రాః (ఘృతస్య) ఉదకస్య (ధారాః) (అభి) ఆభిముఖ్యే (చాకశీమి) భృశం ప్రాప్నోమి (హిరణ్యయః) యశస్వీ (వేతసః) వేగవత్యః. అత్ర పీథాతోర్బాహులకాదౌణాదికస్తసిః ప్రత్యయః (మధ్యే) (అగ్నేః) విద్యుతః. ॥ ౩౮॥

**అన్వయః** :- హే మనుష్యాః ! యథాఽగ్నేర్మధ్యే హిరణ్యయ ఇవ వర్తమానోఽహం యా ఘృతస్య వేతసో ధారాః సరితో నాన్తర్హృదా మనసా పూయమానా ధేనాః సమ్యక్ స్రవన్తి తా అభిచాకశీమి తథా యూయమప్యేతాః ప్రాప్నుత॥ ౩౮॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. మనుష్యై ర్యథా సమం విషమం చలన్త్యః శుద్ధాః సత్యో నద్యః సముద్రం ప్రాప్య స్థిరత్వం ప్రాప్నువన్తి తథైవ విద్యాసుశిక్షాధర్మైః పవిత్రీభూతా వాణ్యో నిశ్చలాః ప్రాప్తవ్యాః ప్రాపయితవ్యాశ్చ. ॥ ౩౮ ॥

**పదార్థము** :-మానవులారా! ఎట్లు (అగ్నేః) విద్యుత్తులో (మధ్యే) మధ్యయందుండు (హిరణ్యయః) తేజోభాగమువలె ప్రకాశవంతమగు కీర్తిని కామించు మరియు విద్యను కాంక్షించు నేను (ఘృతస్య) జలములచే (వేతసః) వేగవంతమగు (ధారాః) ప్రవాహరూప (సరితః) నదుల (న) వలె (అన్తః) లోపల (హృదా) అన్తఃకరణముయొక్క (మనసా) విజ్ఞానరూపమగు చిత్తముతో (పూయమానాః)పవిత్రమైన (ధేనాః) వాణులు (సమ్యక్) ఉత్తమముగ (స్రవన్తి) నడచుచున్నట్లు వానిని (అభిచాకశీతి) ఎదుటపడి ఎల్లరకొరకు ఎట్లు ప్రకాశపరచుచున్నానో అట్లే మీరును పొంది ఇతరులకు ప్రాప్తింప జేయుడు. ॥౩౮॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. నదులు కొద్దిగనో, గొప్పగనో నడచుచు శుద్ధియై సముద్రమునకు చేరి స్థిరపడునట్లు విద్యాశిక్షణలచే మరియు ధర్మముచే పవిత్రమై నిశ్చలమైన వాణులను ప్రాప్తించుకొని ఇతరులకును ప్రాప్తింపజేయుడు. ॥౩౮॥

38.Just as rivers flow, so do speeches, purified in the inmost recesses of the heart and mind, come out of the mouth of a learned person. I full of brilliance, aquire those speeches, coming like the fast-moving showers of rain from the midst of lightning.

**౮౬౯. ఋచే త్వేత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్బృహతీ ఛందః, మధ్యమః స్వరః.**

**విద్వద్భ్య ఇతరైరపి విజ్ఞానం ప్రాప్యమిత్యాహ. విద్వాంసులనుండి ఇతరులెల్లరును జ్ఞానమును పొందవలయును.**

౬౬౯ ఋచే త్వా రుచే త్వా భాసే త్వా జ్యోతిషే త్వా।
అభూదిదం విశ్వస్య భువనస్య వాజినమగ్నేర్వైశ్వానరస్య చ ॥౩౯॥

ప.వి:-ఋచే, త్వా, రుచే త్వా, భాసే, త్వా, జ్యోతిషే, త్వా, అభూత్, ఇదమ్, విశ్వస్య, భువనస్య, వాజినమ్, అగ్నేః, వైశ్వానరస్య, చ ॥౩౯॥

**పదార్థః** :-(ఋచే) స్తుతయే (త్వా) త్వామ్ (రుచే) ప్రీతయే (త్వా) (భాసే) విజ్ఞానాయ (త్వా) (జ్యోతిషే) న్యాయప్రకాశాయ (త్వా) (అభూత్) భవేత్ (ఇదమ్) విశ్వస్య సమగ్రస్య (భువనస్య) సర్వాధికారస్య జగతః (వాజినమ్) వాజినాం విజ్ఞానవతామిదమవయవభూతం విజ్ఞానమ్ (అగ్నేః) విద్యుదాఖ్యస్య (వైశ్వానరస్య) అఖిలేషు నరేషు రాజమానస్య (చ).॥ ౩౯॥

**అన్వయః**:-హే విద్వన్! యస్య తవ విశ్వస్య భువనస్య వైశ్వానరస్యాగ్నేశ్చ వాజినమిదం విజ్ఞానమభూత్ జాతం తమృచే త్వా రుచే త్వా భాసే త్వా జ్యోతిషే త్వా వయమాశ్రయేమ. ॥ ౩౯ ॥

**భావార్థః**:-యస్య మనుష్యస్య సర్వేషాం జగత్పదార్థానాం యథార్థో బోధః స్యాత్తమేవ సేవిత్వా పదార్థ విజ్ఞానం సర్వైర్మనుష్యైః ప్రాప్తవ్యమ్.

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! ఏ నీకు (విశ్వస్య) సమస్త (భువనస్య) విశ్వమందలి సకలపదార్థముల (చ) మరియు (వైశ్వానరస్య) సర్వమానవులందు శోభాయమానమగు (అగ్నేః) విద్యుద్రూపమగు (వాజినమ్) జ్ఞానుల అవయవరూపమగు (ఇదమ్) ఈ విజ్ఞానము (అభూత్) ప్రసిద్ధమైనదో (ఋచే) స్తుతికొరకు అట్టి (త్వా) నిన్ను (రుచే) ప్రీతికొరకు (త్వా) నిన్ను (భాసే) విజ్ఞాన ప్రాప్తికై (త్వా) నిన్ను ఇంకా (జ్యోతిషే) న్యాయప్రకాశముకొరకును (త్వా) నిన్ను మేము ఆశ్రయించెదము. ॥౩౯॥

**భావార్థము** :-సమస్త జగత్పదార్థముల జ్ఞానమును గల్గిన విద్వాంసుని మానవులెల్లరును సేవించుచు పదార్థవిద్యను పొందవలయును. ॥౩౯॥

39.O learned person, thou hast acquired the knowledge of all objects. of the universe, and the wisdom of lightning-like brilliant persons, being lovely of all human beings. We resort to thee for praise, for love for the acquisition of spiritual knowledge, and for the light of justice!.

౬౭౦.అగ్నిర్జ్యోతిషేత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా,నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః స ఏవ విషయ ఉపదిశ్యతే. మఱల నా విషయమే.

౬౭౦ అగ్నిర్జ్యోతిషా జ్యోతిష్మాన్ రుక్మో వర్చసా వర్చస్వాన్।

సహస్రదాऽ అసి సహస్రాయ త్వా ॥౪౦॥

ప.వి:- అగ్నిః, జ్యోతిషా, జ్యోతిష్మాన్, రుక్మః, వర్చసా, వర్చస్వాన్, సహస్రదా ఇతి సహస్ర+దాః, అసి, సహస్రాయ, త్వా॥౪౦॥

పదార్థః:-(అగ్నిః) పావకః! (జ్యోతిషా) దీప్త్యా (జ్యోతిష్మాన్) ప్రశస్తప్రకాశయుక్తః (రుక్మః) సువర్ణమివ (వర్చసా) విద్యాదీప్త్యా (వర్చస్వాన్) విద్యావిజ్ఞానవాన్ (సహస్రదాః) సహస్రమసంఖ్యం సుఖం దదాతీతి (అసి) (సహస్రాయ) అతులవిజ్ఞానాయ (త్వా) త్వామ్. ॥ ౪౦ ॥

అన్వయః:-హే విద్వన్! యస్త్వం జ్యోతిషా జ్యోతిష్మానగ్నిరివ వర్చసా వర్చస్వాన్ రుక్మ ఇవ సహస్రదా అసి తం త్వా సహస్రాయ వయం సత్కుర్యామ్. ॥ ౪౦ ॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యోఽగ్ని సూర్యవద్ విద్యయా ప్రకాశమానో విద్వాన్ భవేత్ తస్మాదధీత్య పుష్కలా విద్యాః స్వీకార్యాః. ॥ ౪౦ ॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! ఏ నీవు (జ్యోతిషా) విద్యాప్రకాశముచే (అగ్నిః) అగ్నివలె (జ్యోతిష్మాన్) ప్రశంసించదగిన ప్రకాశముతో (వర్చసా) నీ తేజస్సుతో (వర్చస్వాన్) జ్ఞానము నిచ్చు (రుక్మః) సువర్ణమువలె సుఖమునిచ్చువాడవై (సహస్రదా) అసంఖ్యాక సుఖముల నిచ్చువాడవునునై (అసి) ఉన్నావో అట్టి (త్వా) నిన్ను (సహస్రాయ) అతులవిజ్ఞానప్రాప్తికై మేము సత్కరించెదముగాక! ॥౪౦॥

భావార్థము :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. అగ్ని, సూర్యులవలె విద్యలచే ప్రకాశవంతుడగు విద్వాంసునిచే సకలవిద్యల నభ్యసించి పూర్ణవిద్వాంసులై భాసిల్లుట మానవులెల్లరకును యోగ్యమై యున్నది.॥౪౦॥

40.O learned person, thou art luminous like fire, with the light of thy knowledge. Thou art the giver of knowledge with thy splendour. Like gold thou art the giver of innumerable comforts. We pay homage to thee for acquiring vast knowledge!.

౬౭౧. ఆదిత్యం గర్భమిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తే కిం కుర్యు రిత్యాహ.

విద్వాంసులగు స్త్రీపురుషు లేమి చేయవలయును?

౬౭౧ ఆదిత్యం గర్భం పయసా సమఙ్గ్ధి సహస్రస్య ప్రతిమాం విశ్వరూపమ్।
పరివృఙ్గ్ధి హరసా మాభి మంస్థాః శతాయుషం కృణుహి చీయమానః॥౪౧॥

ప.వి:- ఆదిత్యమ్, గర్భమ్, పయసా, సమ్, అఙ్గ్ధి, సహస్రస్య, ప్రతిమామితి ప్రతి + మామ్, విశ్వరూపమితి విశ్వ + రూపమ్, పరి, వృఙ్గ్ధి, హరసా, మా, అభి, మంస్థాః, శతాయుషమితి శత + ఆయుషమ్, కృణుహి, చీయమానః ॥౪౧॥

**పదార్థః** :-(ఆదిత్యమ్) సూర్యమ్ (గర్భమ్) స్తుతివిషయమ్ (పయసా) జలేనేవ (సమ్) (అఙ్గ్ధి) శోధయ (సహస్రస్య) అసంఖ్యపదార్థసమూహస్య (ప్రతిమామ్) ప్రతీయన్తే సర్వే పదార్థా యయా తామ్ (విశ్వరూపమ్) సర్వరూపవత్పదార్థదర్శకమ్ (పరి) సర్వతః (వృఙ్గ్ధి) వర్జయ (హరసా) జ్వలితేన తేజసా. హర ఇతి జ్వలతో నామ., నిఘం. ౧.౧౭ (మా) (అభి) (మంస్థాః) మన్యేథాః (శతాయుషమ్) శతవర్షపరిమితజీవనమ్ (కృణుహి) (చీయమానః) వృధ్యమానః. ॥ ౪౧ ॥

**అన్వయః** :-హే విద్వంస్త్వం యథా విద్యుత్పయసా సహస్రస్య ప్రతిమాం విశ్వరూపం గర్భమాదిత్యం ధరతి తథాన్తఃకరణం సమఙ్గ్ధి. హరసా రోగాన్ పరివృఙ్గ్ధి చీయమానః సన్ శతాయుషం తనయం కృణుహి కదాచిన్మాఽభిమంస్థాః. ॥ ౪౧ ॥

**భావార్థః** :-హే స్త్రీపురుషాః! యూయం సుగన్ధ్యాదిహోమేన సూర్యప్రకాశం జలం వాయుఞ్చ శోధయిత్వా అరోగా భూత్వా శతాయుషస్తనయాన్ కురుత. యథా విద్యున్నిర్మితేన సూర్యేణ రూపవతాం పదార్థానాం దర్శనం పరిమాణం చ భవతి తథా విద్యావన్త్యపత్యాని భవన్తి తస్మాత్ కదాచిదభిమానినో భూత్వా ప్రమాదేన విద్యాయా ఆయుషశ్చ వినాశం మా కురుత. ॥ ౪౧ ॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! నీవు విద్యుత్తు (పయసా) జలములనుండి (సహస్రస్య) అసంఖ్యాక పదార్థములను (ప్రతిమామ్) పరిమాణమొనర్చు సూర్యునివలె నిశ్చయపరమునట్టి బుద్ధిని (విశ్వరూపమ్) సమస్త రూపములను, విషయములను జూపు (గర్భమ్) స్తుతించదగిన (ఆదిత్యమ్) సూర్యునిధారణ మొనర్చునట్లు అంతఃకరణమును (సమఙ్గ్ధి) చక్కగా శోధించుము (హరసా) ప్రజ్వలిత తేజముతో రోగములను (పరి) అన్నివైపులనుండి (వృఙ్గ్ధి) తొలగించుము. మరియు (చీయమానః) వృద్ధినిపొంది (శతాయుషమ్) నూరు సంవత్సరముల ఆయువుగల సంతానమును (కృణుహి) పొందుము (మా అభిమంస్థాః) అభిమానము నుంచకుము [వదలుము].॥ ౪౧ ॥

**భావార్థము** :- ఓ స్త్రీపురుషులారా! మీరు సుగంధిత పదార్థములచే హోమములజేయుచు సూర్యప్రకాశము, జలము మరియు వాయువులను శుద్ధిపరచుకొని రోగరహితులై నూరు సంవత్సరములు జీవించునట్టి ఉత్తమసంతానము నుత్పన్నపరచుడు. విద్యుత్తు అగ్నిచే నిర్మాణమైన సూర్యునిచే రూపముగల పదార్థములన్నియును పరిమాణయుక్తముగ దర్శనమగునట్లు విద్యావంతులగు సంతానము సుఖమును దర్శింపజేయును. దీనివల్ల అభిమానివై విషయాసక్తియందు జిక్కుకొని, విద్య మరియు ఆయుష్యమును వినాశపరచుకొనకుము. ॥౪౧॥

41.O learned person, just as lightning supports with water, the sun, that measures innumerable objects, and exhibits the whole universe, and is worthy of praise, so shouldst thou purify the inmost recesses of thy heart. With thy glowing strength keep afar all diseases. Making due progress, make your son live for a hundred years. Always shun pride!.

౬౭౨.వాతస్య జూతిమిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

పునస్తేన కిం కార్య మిత్యాహ. విద్వాంసుడేమి చేయవలెను?

**౬౭౨ వాతస్య జూతిం వరుణస్య నాభిమశ్వం జజ్ఞానꣳ సరిరస్య మధ్యే।**

**శిశుం నదీనాꣳ హరిమద్రిబుధ్నమగ్నే మా హిꣳసీః పరమే వ్యోమన్ ॥౪౨॥**

**ప.విః**-వాతస్య, జూతిమ్, వరుణస్య, నాభిమ్, అశ్వమ్, జజ్ఞానమ్, సరిరస్య, మధ్యే, శిశుమ్, నదీనామ్, హరిమ్, అద్రిబుధ్నమిత్యద్రిబుధ్నమ్, అగ్నే, మా, హిꣳసీః, పరమే, వ్యోమన్నితి వి + ఓమన్ ॥౪౨॥

**పదార్థః** :-(వాతస్య) వాయోః (జూతిమ్) వేగమ్ (వరుణస్య) జలసమూహస్య (నాభిమ్) బంధనమ్ (అశ్వమ్) వ్యాప్తుం శీలమ్ (జజ్ఞానమ్) ప్రాదుర్భూతమ్ (సరిరస్య) సలిలస్యోదకస్య. సలిలమిత్యుదకనా..నిఘం.. ౧.౧౨ కపిలకాదిత్వాద్రేఫః (మధ్యే) (శిశుమ్) బాలకమ్ (నదీనామ్) (హరిమ్) హరమాణమ్ (అద్రిబుధ్నమ్) మేఘాకాశమ్ (అగ్నే) పావకవద్వర్తమాన (మా) (హింసీః) (పరమే) ప్రకృష్టే వ్యోమన్ (వ్యోమ్ని) వ్యాప్తే ఆకాశే. ॥ ౪౨ ॥

**అన్వయః** :-హే అగ్నే! విద్వꣳస్త్వం పరమే వ్యోమన్ వాతస్య మధ్యే జూతిమశ్వం సరిరస్య వరుణస్య నాభిం నదీనాం జజ్ఞానం శిశుం బాలమివ వర్తమానం హరిమద్రిబుధ్నం మా హింసీః. ॥ ౪౨ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైః ప్రమాదేనావకాశే వర్తమానం వాయువేగం వృష్టిప్రబంధం మేఘమహత్వా జీవనం వర్ధనీయమ్.॥౪౨॥

**పదార్థము** :-(అగ్నే) తేజశ్శాలివగు నో విద్వాంసుడా! నీవు (పరమేవ్యోమన్) సర్వవ్యాప్తమైయున్న ఉత్తమాకాశమందు (వాతస్య) వాయువు (మధ్యే) మధ్య (జూతిమ్) వేగరూపమగు (అశ్వమ్) అశ్వమును (సరిరస్య) జలమయమగు (వరుణస్య) ఉత్తమసముద్రముయొక్క (నాభిమ్) బంధనమును (నదీనామ్) నదులప్రభావముచే (జజ్ఞానమ్) ప్రకటమైనట్టి (శిశుమ్) బాలకునివలెనున్న (హరిమ్) నీలవర్ణముగల (అద్రిబుధ్నమ్) సూక్ష్మమేఘములను (మా హింసీః) నష్టపరచకుము.॥౪౨॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు ఆలస్య ప్రమాదములను వదలి ఆకాశమందలి వాయువేగము, వర్షములకు ప్రబంధరూపములగు మేఘములను నష్టపరచక తమ ఆయువుల వృద్ధిపరచుకొనవలెను. ॥౪౨॥

42.O learned person, in the vast space, harm not the wind's impetuous rush, the bond of ocean-wide water, and the cloud the tawny child of rivers!.

౬౭౩.అజస్రమిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునరయం కిం కుర్యాదిత్యాహ, ఆ విద్వాంసు డేమి చేయవలెను?

౬౭౩ అజస్రమిన్దుమరుషం భురణ్యుమగ్నిమీడే పూర్వచిత్తిం నమోభిః।
స పర్వభిర్ఋతుశః కల్పమానో గాం మా హింసీరదితిం విరాజమ్ ॥౪౩॥

**ప.వి:**-అజస్రమ్, ఇన్దుమ్, అరుషమ్, భురణ్యుమ్, అగ్నిమ్, ఈడే, పూర్వచిత్తిమితి, పూర్వ + చిత్తిమ్, నమోభిరితి నమః + భిః, సః, పర్వభిరితి పర్వ + భిః, ఋతుశ ఇత్యృతు + శః, కల్పమానః, గామ్, మా, హింసీః, అదితిమ్, విరాజమితి, వి + రాజమ్ ॥౪౩॥

**పదార్థః** :-(అజస్రమ్) నిరన్తరమ్ (ఇన్దుమ్) జలమ్ (అరుషమ్) (అశ్వమ్) (భురణ్యుమ్) పోషకమ్. అత్ర భురణధాతోర్యుః ప్రత్యయః (అగ్నిమ్) విద్యుతమ్ (ఈడే) అధ్యన్విచ్ఛామి (పూర్వచిత్తిమ్) పూర్వా చిత్తిశ్చయనం యస్య తమ్ (నమోభిః) అన్నైః (సః) (పర్వభిః) పూర్ణైః సాధనాఙ్గైః (ఋతుశః) బహూన్ఋతూన్ (కల్పమానః) సమర్థః సన్ (గామ్) పృథివీమ్ (మా) (హింసీః) హింస్యాః (అదితిమ్) అఖణ్డితామ్ (విరాజమ్) వివిధైః పదార్థై రాజమానామ్. ॥ ౪౩ ॥

**అన్వయః** :-హే విద్వన్! యథాహం పర్వభిర్నమోభిః సహ వర్తమానమిన్ద్రమరుషం భురణ్యుం పూర్వచిత్తిమగ్నిమజస్రమీడే తమృతుశః కల్పమానః సన్నదితిం విరాజం గాం న నాశయామి; తథైవ సత్వమేతమేనాం చ మా హింసీః ॥ ४३ ॥

**భావార్థః** :-మనుష్యైర్ఋత్వనుకూలతయా క్రియయాఽగ్నిర్జలమన్నం చ సంసేవ్య రాజభూమిః సదైవ రక్షణీయా. యతః సర్వాణి సుఖాని స్యుః. ॥ ४३ ॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! నే నెట్లు (పూర్వభిః) పూర్ణసాధనయుక్తమునైన (నమోభిః) అన్నముతో గూడిన (ఇన్ద్రమ్) జలములరూప (అరుషమ్) అశ్వములవంటి (భురణ్యుమ్) పోషించునట్టి (పూర్వచితిమ్) ప్రథమముగ నిర్మితమైన (అగ్నిమ్) విద్యుత్తును (అజస్రమ్) నిరంతరము (ఈడే) అధికముగ నన్వేషించుచున్నానో, దానిని (ఋతుశః) ప్రతిఋతువునందు (కల్పమానః) సమర్థుడనై యొనర్చుచు (అదితిమ్) అఖండితము (విరాజమ్) వివిధ రకముల పదార్థములచే శోభాయమానమైయున్న (గామ్) పృథివిని నష్టపరచనట్లు (సః) ఆ మీరును అగ్ని మరియు నీ పృథివిని (హింసీః) (మా) నష్టపరచుట వలదు. ॥४३॥

**భావార్థము** :- మానవులు ఋత్వనుకూల క్రియలద్వారా అన్నమును జలములను సేవించుచు, పృథివి మరియు రాష్ట్రములను సదా రక్షణయొనర్చవలయును. అందువల్ల ఎల్లరకును సుఖప్రాప్తి గలుగగలదు. ॥४३॥

43.O learned person just a I constantly search for electricity, newly produced, full of accomplishments, creator of foodstuffs, pure like water, powerful like the horse, knowable by the highly learned, and using it skilfully in each season, do not harm the indivisible beautiful earth, so thou shouldst not harm electricity and this earth!.

ఽ౭४.వరూత్రీమిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తేన కిం న కార్యమిత్యాహ. విద్వాంసు డేమి చేయగూడదు?

**ఽ౭४ వరూత్రీం త్వష్టుర్వరుణస్య నాభిమవిం జజ్ఞానాం౿ రజసః పరస్మాత్।**
**మహీం౿ సాహస్రీమసురస్య మాయామగ్నే మా హి౿్సీః పరమే వ్యోమన్॥४४॥**

**ప.విః-వరూత్రీమ్, త్వష్టుః, వరుణస్య, నాభిమ్, అవిమ్, జజ్ఞానామ్, రజసః, పరస్మాత్, మహీమ్, సాహస్రీమ్, అసురస్య, మాయామ్, అగ్నే, మా, హి౿్సీః, పరమే, వ్యోమన్నితి వి + ఓమన్ ॥४४॥**

**పదార్థః** :-(వరూత్రీమ్) వరయిత్రీమ్ (త్వష్టుః) ఛేదకస్య సూర్యస్య (వరుణస్య) జలస్య (నాభిమ్) బంధికామ్ (అవిమ్) రక్షణాదినిమిత్తామ్ (జజ్ఞానామ్) ప్రజాతామ్ (రజసః) లోకాత్ (పరస్మాత్) శ్రేష్ఠాత్ (మహీమ్) మహతీం భూమిమ్ (సాహస్రీమ్) అసంఖ్యాతాం బహుఫలప్రదామ్ (అసురస్య) మేఘస్య (మాయామ్) ప్రజ్ఞాపికాం విద్యుతమ్ (అగ్నే) విద్వన్ (మా) (హింసీః) హింస్యాః (పరమే) సర్వోత్కృష్టే (వ్యోమన్) ఆకాశవద్ వ్యాప్తే బ్రహ్మణి. ॥ ౪౪ ॥

**అన్వయః** :-హే అగ్నే! త్వం త్వష్టుర్వరూత్రీం వరుణస్య నాభిం పరస్మాద్రజసో జజ్ఞానామసురస్య మాయాం సాహస్రీ మవిం పరమే వ్యోమన్వర్తమానాం మహీం మా హింసీః ॥ ౪౪ ॥

**భావార్థః** :-సర్వై ర్మనుష్యైర్యేయం పృథివీ పరస్మాత్కారణాజ్జాతా సూర్యాకర్షణసమ్బద్ధినీ జలాధారా మేఘనిమిత్తా బహుభూగోలాకారాఽసంఖ్య సుఖప్రదా పరమేశ్వరేణ నిర్మితాఽస్తి తాం గుణకర్మస్వభావతో విజ్ఞాయ సుఖాయ సముపయోక్తవ్యా.॥౪౪॥

**పదార్థము** :-(అగ్నే) ఓ విద్వాంసుడా! నీవు (త్వష్టుః) ఛేదనకర్తయగు సూర్యుని (వరూత్రీమ్) గ్రహణమొనర్పదగిన (వరుణస్య) జలములను (నాభిమ్) నిలుపుజేయునట్టి (పరస్మాత్) శ్రేష్ఠమగు (రజసః) లోకమునుండి (జజ్ఞానామ్) పుట్టినట్టి (అసురస్య) మేఘముయొక్క (మాయామ్) ఉనికిని దెలుపు మెరుపును మరియు (సాహస్రీమ్) అసంఖ్యాక గోళములచే గూడి అనేక ఫలములనిచ్చు (అవిమ్) రక్షణమున్నగువానికొరకు (పరమే) సర్వోత్తముడు (వ్యోమన్) ఆకాశమువలె వ్యాపకుడైయున్న జగదీశ్వరునియందుగల (మహీమ్) విస్తారమైయున్నపృథివిని (మా హింసీః) నష్టపరచవలదు.॥౪౪॥

**భావార్థము** :-పరమేశ్వరుడీ పృథివిని ఉత్తమకారణముచే ఉత్పన్నపరచినాడు. సూర్యునిచే ఆకర్షింపబడుచు జలాధారమగు మేఘమునకు నిమిత్తమై అగణితమగు సుఖములను ప్రసాదించునట్టి ఈ భూమిని దాని గుణ కర్మ స్వభావములను మానవులు తెలిసికొని సుఖప్రాప్తికై వినియోగపరచుకొనవలెను.॥౪౪॥

44.O learned person, residing in the supreme Lord, vast like the space, harm not the vast Earth, attracted by the sun, the repository of water, created by the Pre-eminent God, the Giver of countless fruits, and the Cause of our protection, nor harm the lightning, the precursor of the clouds!.

౪౫.యో అగ్నిరిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

పునరనేన కిం కార్యమిత్యాహ. మరల విద్వాంసు డేమి చేయవలయును?

౪౫ యోఽ అగ్నిరగ్నేరధ్యజాయత శోకాత్పృథివ్యాఽ ఉత వా దివస్పరి।
యేన ప్రజా విశ్వకర్మా జజాన తమగ్నే హేడః పరి తే వృణక్తు ॥౪౫॥

**ప.వి:-యః, అగ్నిః, అగ్నేః, అధి, అజాయత, శోకాత్, పృథివ్యాః, ఉత, వా, దివః, పరి, యేన, ప్రజా ఇతి ప్ర + జాః, విశ్వకర్మేతి విశ్వ + కర్మా, జజాన, తమ్, అగ్నే, హేడః, పరి, తే, వృణక్తు ॥45॥**

**పదార్థః :-** (యః) (అగ్నిః) చాక్షుషః (అగ్నేః) విద్యుదాఖ్యాత్ (అధి) (అజాయత) జాయతే (శోకాత్) శోషకాత్ (పృథివ్యాః) (ఉత) (వా) (దివః) సూర్యాత్ (పరి) సర్వతః (యేన) (ప్రజాః) (విశ్వకర్మా) విశ్వాని కర్మాణి యస్య సః (జజాన) జనయతి (తమ్) (అగ్నే) విద్వన్ (హేడః) అనాదరః (పరి) (తే) తవ (వృణక్తు) ఛిన్నోభవతు, ॥ 45॥

**అన్వయః:-** హే అగ్నే విద్వన్! యః పృథివ్యాః శోకాదుత వా దివోఽగ్నేరగ్నిరధ్యజాయత. యేన విశ్వకర్మా ప్రజాః పరిజజాన తం తే హేడః పరివృణక్తు ॥ 45 ॥

**భావార్థః:-** హే విద్వాంసః! యుూయం యోఽగ్నిః పృథివీం భిత్వోత్పద్యతే యశ్చ సూర్యాదేస్తస్మాద్విఘ్నకారిణోఽగ్నేః సర్వాన్ ప్రాణినః పృథగ్రక్షత. యేనాగ్నినేశ్వరః సర్వాన్ రక్షతి తద్విద్యాం విజానీత. ॥ 45 ॥

**పదార్థము :-** (అగ్నే) ఓ విద్వాంసుడా! (యః) ఏ (పృథివ్యాః) పృథివిని (శోకాత్) శోషింప [ఎండింప] జేయునట్టి అగ్ని (ఉత వా) లేక (దివః) సూర్యునిచే (అగ్నేః) విద్యుద్రూపాగ్నిచే (అగ్నిః) ప్రత్యక్ష భౌతికాగ్ని (అధ్యజాయత) ఉత్పన్నమగునో (యేన) దేనినుండి (విశ్వకర్మా) సమస్త కర్మల కాధారమగు పరమేశ్వరుడు (ప్రజాః) ప్రజలను (పరి) సకల దిశలనుండి (జజాన) రచనజేయునో (తమ్) అట్టి యగ్నిని (తే) నీయొక్క (హేడః) క్రోధము (పరివృణక్తు) అన్నివైపులనుండి చిందరవందర మొనర్చుగాక! ॥45॥

**భావార్థము :-** ఓ విద్వాంసులారా! పృథివిని చీల్చుకొని ఏ యగ్ని బయటికివచ్చి సూర్యప్రకాశముచే ఏ విద్యుత్తు వెడలుచున్నదో, అట్టి విఘ్నకారి యగు [అగ్ని పర్వతమునుండి వెడలి అనేకప్రాణులను నాశమొనర్చు] లావాగ్ని నుండి సకల ప్రాణులను రక్షించుడు. ఏ యగ్నిచే ఈశ్వరుడు సకల ప్రాణుల రక్షణ యొనర్చుచున్నాడో అట్టి అగ్నివిద్యను మీరు బాగుగా దెలిసికొనుడు. ॥45॥

45.O learned person, may thy displeasure spare the fire that has it being from the heat of the Earth, or from the lightning of the sun, whereby the Omnific Lord engenders creatures!.

**౬౭౬. చిత్రం దేవానామిత్యస్య విరూప ఋషిః, సూర్యో దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.**

**అథేశ్వరః కీదృశోఽస్తీత్యాహ. ఈశ్వరు డెట్టి వాడు?**

౬౨౬ చి॒త్రం దే॒వానా॒ముద॑గా॒దనీ॑కం॒ చక్షు॑ర్మి॒త్రస్య॒ వరు॑ణస్యా॒గ్నేః। ఆప్రా

ద్యావా॑పృథి॒వీ౨ అ॒న్తరి॑క్ష॒గ్ం॒ సూర్య॑౨ ఆ॒త్మా జగ॑తస్త॒స్థుష॑శ్చ॥౪౬॥

ప. వి:- చి॒త్రమ్, దే॒వానా॑మ్, ఉత్, అ॒గా॒త్, అనీ॑కమ్, చక్షుః, మి॒త్రస్య॑, వరు॑ణస్య, అ॒గ్నేః,

ఆ, అ॒ప్రాః, ద్యావా॑పృథి॒వీ౨ ఇతి॒ ద్యావా॑పృథి॒వీ, అ॒న్తరి॑క్షమ్, సూర్యః॑, ఆ॒త్మా, జగ॑తః, త॒స్థుషః॑,

చ ॥౪౬॥

**పదార్థః** :- (చిత్రమ్) అద్భుతమ్ (దేవానామ్) పృథివ్యాదీనాం మధ్యే (ఉత్) (అగాత్) ఉదితోఽస్తి (అనీకమ్) సేనేవ కిరణసమూహమ్ (చక్షుః) దర్శకమ్ (మిత్రస్య) ప్రాణస్య (వరుణస్య) ఉదానస్య (అగ్నేః) ప్రసిద్ధస్య (ఆ) (అప్రాః) వ్యాప్నోతి (ద్యావాపృథివీ) ప్రకాశాప్రకాశే జగతీ (అన్తరిక్షమ్) ఆకాశమ్ (సూర్యః) సవితా (ఆత్మా) సర్వస్యాన్తర్యామీ (జగతః) జఙ్గమస్య (తస్థుషః) స్థావరస్య (చ) ॥ ౪౬ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! భవన్తో యద్ బ్రహ్మ దేవానాం చిత్రమనీకం మిత్రస్య వరుణస్యాగ్నేశ్చక్షుః సూర్య ఇవోదగాజ్జగతస్తస్థుషశ్చాత్మా సద్ ద్యావాపృథివీ అన్తరిక్షం చాప్రాస్తజ్జగన్నిర్మాతృ పాతృ సంహర్తృ వ్యాపకం సతతముపాసీరన్. ॥ ౪౬ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. న ఖల్విదం నిష్కర్తృకమనధిష్ఠాతృకమనీశ్వరం జగదస్తి. యద్ బ్రహ్మ సర్వాన్తర్యామి సర్వేషాం జీవానాం పాపపుణ్యఫలదానవ్యవస్థాపకమనన్తజ్ఞానప్రకాశం వర్తతే తదేవోపాస్య ధర్మార్థకామమోక్షఫలాని మనుష్యైరాప్తవ్యాని.॥ ౪౬ ॥

**పదార్థము** :-ఓ మానవులారా! మీరు ఏ జగదీశ్వరుడు (దేవానామ్) పృథివి మున్నగు దివ్యపదార్థముల మధ్య (చిత్రమ్) ఆశ్చర్యరూపమగు (అనీకమ్) సైన్యమువంటి కిరణములతో గూడిన (మిత్రస్య) ప్రాణ (వరుణస్య) ఉదాన మరియు (అగ్నేః) ప్రసిద్ధాగ్నులను (చక్షుః) చూపించువాడగు (సూర్యః) సూర్యుడు (ఉదగాత్) ఉదయించుచున్నాడో ఆతనివలె (జగతః) చేతనము (చ) మరియు (తస్థుషః) జడజగత్తునందు (ఆత్మా) అంతర్యామియై (ద్యావాపృథివీ) ప్రకాశ, అప్రకాశరూప జగత్తు మరియు (అన్తరిక్షమ్) ఆకాశమును (ఆ) ఉత్తమరీతిలో (అప్రాః) వ్యాప్తమగుచున్నాడు. అట్టి జగత్తు సృష్టించి, పాలించి, సంహార [ప్రలయ] మొనర్చు సర్వవ్యాపకుడగు పరబ్రహ్మను నిరంతరము ఉపాసించవలెను. ॥౪౬॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఈ జగత్తు ఏ కర్త, అధిష్ఠాత, ఈశ్వరుడు లేకుండా నిర్మాణము గాలేదు. ఏ జగదీశ్వరుడు సర్వమునం దంతర్యామియైయుండి సకల జీవులకు

పాపపుణ్య కర్మలకు ఫలము నిచ్చు వ్యవస్థ నొనర్చునో అట్టి అనంతజ్ఞానప్రకాశకుడగు నా పరమేశ్వరునే యుపాసించి మానవులెల్లరును ధర్మార్థకామమోక్ష ఫలముల బడయగలరు. ॥౪౬॥

46.God is Wonderful and Powerful amongst all material objects. He is the Manifestor of Pran, Udan, and fire. He pervades the air, earth and heaven. He is the Creator and Sustainer of all that moveth and moveth not.

౬౭౭.ఇమం మేత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, విరాడ్బ్రాహ్మీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునర్మనుష్యేణ కిం కార్యమిత్యాహ. మానవు లేమి చేయవలెను?

౬౭౭ ఇమం మా హిꣳసీర్ద్విపాదం పశుꣳ సహస్రాక్షో మేధాయ చీయమానః।

మయుం పశుం మేధమగ్నే జుషస్వ తేన చిన్వానస్తన్వో నిషీద।

మయుం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥౪౭॥

ప.విః- ఇమమ్, మా, హిꣳసీః, ద్విపాదమితి ద్వి + పాదమ్, పశుమ్, సహస్రాక్ష ఇతి సహస్ర + అక్షః, మేధాయ, చీయమానః, మయుమ్, పశుమ్, మేధమ్, అగ్నే, జుషస్వ, తేన, చిన్వానః తన్వః, ని, సీద, మయుమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు॥౪౭॥

పదార్థః :- (ఇమమ్) (మా) (హిꣳసీః) హింస్యాః (ద్విపాదమ్) మనుష్యాదికమ్ (పశుమ్) చతుష్పాదం గవాదికమ్ (సహస్రాక్షః) అసంఖ్యదర్శనః (మేధాయ) సుఖసంగమాయ (చీయమానః) వర్ధమానః (మయుమ్) జాఙ్గలమ్ (పశుమ్) ప్రసిద్ధమ్ (మేధమ్) పవిత్రకారకమ్ (అగ్నే) పావక ఇవ మనుష్యజన్మప్రాప్త (జుషస్వ) ప్రీణీహి (తేన) (చిన్వానః) వర్ధమానః (తన్వః) శరీరస్య మధ్యే పుష్టః సన్ (ని) నితరామ్ (సీద) తిష్ఠ (మయుమ్) శస్యాదిహింసకం పశుమ్ (తే) తవ (శుక్) శోకఃభావే క్విప్ (ఋచ్ఛతు) ప్రాప్నోతు (యమ్) శత్రుమ్ (ద్విష్మః) అప్రీతయామః (తమ్) (తే) తవ సకాశాత్ (శుక్) శోకః (ఋచ్ఛతు) ॥ ౪౭ ॥

**అన్వయః** :-హే అగ్నే! పావక ఇవ మనుష మేధాయ చీయమానః సహస్రాక్షస్త్వమిమం ద్విపాదం

మేధం మయుం పశుం చ మా హింసీః తం పశుం జుషస్వ తేన చిన్వానః సన్ తన్వో మధ్యే నిషీద. ఇయం తే శుఙ్మయుమృచ్ఛతు. తే తవ యం శత్రుం వయం ద్విష్మస్తం శుగృచ్ఛతు.॥ ౪౭ ॥

**భావార్థః :-** కేనాపి మనుష్యేణోపకారకాః పశవః కదాచిన్న హింసనీయాః కిన్త్వేతాన్ సంపాల్యైతేభ్య ఉపకారం సంగృహ్య సర్వే మనుష్యా ఆనన్దయితవ్యా యైర్జాంగలైర్హింస్రైః పశుశస్యమనుష్యాణాం హానిః స్యాత్తే తు రాజపురుషైర్హన్తవ్యా నిగ్రహీతవ్యాశ్చ.॥౪౭॥

**పదార్థము :-** (అగ్నే) ఓ మానవజన్మధారీ! (మేధాయ) సుఖప్రాప్తికొరకు (చీయమానః) ముందుకు సాగువాడవునగు (సహస్రాక్షః) వేలాది విధములగు దృష్టులుగల ఓ రాజా! నీవు (ఇమమ్) ఈ (ద్విపాదమ్) రెండు పాదములుగల మనుష్యాదులను మరియు (మేధమ్) పవిత్రకారక, ఫలప్రద (మయుమ్) సస్యాదులను (పశుమ్) గోవులు మున్నగు పశుజీవులను (మా హింసీః) హింసించకుము (పశుమ్) పశుపక్ష్యాదులను (జుషస్వ) సేవించుము (తేన) ఆ పశువులనుండి (చిన్వానః) వృద్ధియగుచు నీవు (తన్వః) శరీరమునందు (నిషీద) నిరంతరము స్థిరముగా నుండుము. ఇట్టి (తే) నీనుండి (శుక్) శోకము (మయుమ్) సస్యాదుల నాశమొనర్చు ఆటవిక పశువులకు (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! (తే) నీయొక్క (యమ్) ఏ శత్రువును మేము (ద్విష్మః) ద్వేషించెదమో (తమ్) ఆతనికి (శుక్) శోకము (ఋచ్ఛతు) సంప్రాప్తమగుగాక! ॥౪౭॥

**భావార్థము :-** ఏ మనుష్యుడును ఎల్లర కుపకారకమగు పశువులను చంపగూడదు. వానిని చక్కగా రక్షించుచు వానిచే ఉపకారమును పొంది మానవులెల్లరను ఆనందపరచవలయును. ఏ ఆటవిక పశువులచే గ్రామపశువులకు, పంటలకు, మానవులకు హానిగలుగునో అట్టివానిని రాజపురుషులు చంపుట, లేక బంధించుట చేయవలెను.॥౪౭॥

47.O King, born as man, and wide-awake, possessing thousand-fold vision, progressing for the attainment of happiness, don't destroy the dipeds and quadrupeds, and useful denizens of the forest; but protect them. Increase thy wealth with those cattle, and possess a strong body. The injurious beast of the forest should be put to grief by thee. Let thy enemy, whom we dislike, be put to grief!.

**౬౭౮. ఇమం మేత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్బ్రాహ్మీ పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.**

**పునరయం మనుష్యః కిం కుర్యాదిత్యాహ. ఇట్టి మనుష్యుడేమి చేయవలెను!**

**౬౭౮ ఇమం మా హింసీరేకశఫం పశుం కనిక్రదం వాజినం వాజినేషు।**

**గౌరమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తన్వో నిషీద।**

**గౌరం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥౪౮॥**

ప.వి:-ఇమమ్, మా, హింసీః, ఏకశఫమిత్యేక + శఫమ్, పశుమ్, కనిక్రదమ్, వాజినమ్, వాజినేషు, గౌరమ్, ఆరణ్యమ్, అను, తే, దిశామి, తేన, చిన్వానః, తన్వః, ని, సీద, గౌరమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు ॥౪౮॥

**పదార్థః** :-(ఇమమ్) (మా) (హింసీః) హింస్యాః (ఏకశఫమ్) ఏకఖురమశ్వాదికమ్ (పశుమ్) ద్రష్టవ్యమ్ (కనిక్రదమ్) భృశం వికలం ప్రాప్తవ్యథమ్ (వాజినమ్) వేగవన్తమ్ (వాజినేషు) వాజినానాం సంగ్రామాణామవయవేషు కర్మసు కార్యసిద్ధికరమ్ (గౌరమ్) గౌరవర్ణమ్ (ఆరణ్యమ్) అరణ్యే భవమ్ (అను) (తే) తుభ్యమ్ (దిశామి) ఉపదిశామి (తేన) (చిన్వానః) వర్ధమానః (తన్వః) శరీరస్య మధ్యే (ని) (సీద) (గౌరమ్) (తే) ఇత్యాది పూర్వవత్. ॥ ౪౮ ॥

**అన్వయః**:-హే మనుష్య! త్వం వాజినేష్విమమేకశఫం కనిక్రదం వాజినం పశుం మా హింసీః. ఈశ్వరో౽హం తే తుభ్యం యమారణ్యం గౌరం పశుమనుదిశామి తేన చిన్వానః సఞ్ స్తన్వో మధ్యే నిషీద. తే తవ సకాశాద్ గౌరం శుగృచ్ఛతు యం వయం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు. ॥ ౪౮ ॥

**భావార్థః** :-మనుష్యైరేకశఫా అశ్వాదయః పశవః కదాచిన్నో హింస్యాః. న చోపకారకా ఆరణ్యాః యేషాం హననేన జగతో హానీ రక్షణేనోపకారశ్చ భవతి తే సదైవ పాలనీయా హింస్రాశ్చ హన్తవ్యాః. ॥ ౪౮ ॥

**పదార్థము** :- ఓ రాజా! నీవు (వాజినేషు) యుద్ధకార్యములందు (ఇమమ్) ఈ (ఏకశఫమ్) ఒక డెక్క-[గిట్ట] గలదియు (కనిక్రదమ్) శీఘ్రముగ వికలమై వ్యాకులము జెందునదియు (వాజినమ్) వేగవంతము (పశుమ్) చూడదగిన అశ్వములు మున్నగు పశువులను (మా హింసీః) చంపవలదు. ఈశ్వరుడనగు నేను (తే) నీకొరకు (యమ్) ఎట్టి (ఆరణ్యమ్) ఆటవిక (గౌరమ్) గౌరపశువులకు (దిశామి) శిక్షణనిచ్చుచున్నానో (తేన) వానిరక్షణద్వారా (చిన్వానః) వృద్ధినిపొందుచు (తన్వః) శరీరమునందు (నిషీద) నిరంతరము స్థిరుడవై యుండుము (యమ్) యేశత్రువును (ద్విష్మః) ద్వేషించెదమో (తమ్) వానికి (తే) నీద్వారా (శుక్) శోకము (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! ॥౪౮॥

**భావార్థము** :- మనుష్యులు ఒంటిడెక్క-గల అశ్వాదులను మరియు ఉపకారక అరణ్య పశువులను సైతము ఎప్పుడును చంపవలదు. ఏ జంతువులను చంపుటచే జగత్తునకు హాని, చంపకుండుటచే ఎల్లరకుపకారము జరుగుచుండునో అట్టివానిని సదా పోషించవలెను. హానికారక జంతువులను నష్టపరచవలెను. ॥౪౮॥

48.O King, don't destroy this one-hoofed beautiful horse, soon agitated and wirithing with pain in battlefields. I point out to thee the forest rhinoceros. with his protection add to thy prosperity and physical strength. Let the wild and uncontrolled rhinoceros be put to grief by thee. Let thy enemy, whom we detest, be put to grief!.

౪౯.ఇమం సాహస్రమిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, కృతిశ్ఛన్దః, నిషాదః స్వరః.

పునర్మనుష్యైః కే పశవో నో హింసనీయా హింసనీయాశ్చేత్యాహ.

మానవు లే పశువులను చంపి ఎట్టివానిని రక్షించవలయును?

౪౯ ఇమꣳ సాహస్రꣳ శతధారముత్సం వ్యచ్యమానꣳ సరిరస్య మధ్యే।
ఘృతం దుహానామదితిం జనాయాగ్నే మా హిꣳసీః పరమే వ్యోమన్।
గవయమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తన్వో నిషీద।
గవయ న్తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥౪౯॥

ప.వి:- ఇమమ్, సాహస్రమ్, శతధారమితి శత + ధారమ్, ఉత్సమ్, వ్యచ్యమానమితి వి + అచ్యమానమ్, సరిరస్య, మధ్యే, ఘృతమ్, దుహానామ్, అదితిమ్, జనాయ, అగ్నే, మా, హిꣳసీః, పరమే, వ్యోమన్నితి వి + ఓమన్, గవయమ్, ఆరణ్యమ్, అను, తే, దిశామి, తేన, చిన్వానః, తన్వః, ని, సీద, గవయమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే శుక్ ఋచ్ఛతు ॥౪౯॥

పదార్థః :-(ఇమమ్) (సాహస్రమ్) సహస్రస్యాసంఖ్యాతానాం సుఖానామయం సాధకస్తమ్ (శతధారమ్) శతమసంఖ్యాతా దుగ్ధధారా యస్మాత్తమ్ (ఉత్సమ్) కూపమివ పాలకం గవాదికమ్ (వ్యచ్యమానమ్) వివిధప్రకారేణ పాలనీయమ్ (సరిరస్య) అన్తరిక్షస్య (మధ్యే) (ఘృతమ్) ఆజ్యమ్ (దుహానామ్) ప్రపూరయన్తీమ్ (అదితిమ్) అఖండనీయాం గామ్ (జనాయ) మనుష్యాద్యాయ ప్రాణినే (అగ్నే) వివేకప్రాప్తోపకారప్రకాశక రాజన్ (మా) హింసీః (పరమే) ప్రకృష్టే (వ్యోమన్) వ్యోమ్ని వ్యాప్తేఽన్తరిక్షే వర్తమానామ్ (గవయమ్) గోసదృశమ్ (ఆరణ్యమ్) (అను) (తే) (దిశామి) (తేన) (చిన్వానః) పుష్టః సన్ (తన్వః) (ని) (సీద) (గవయమ్) (తే) (శుక్) శోకః (ఋచ్ఛతు) (యమ్) (ద్విష్మః) తమ్ (తే) (శుక్) (ఋచ్ఛతు).॥౪౯॥

**అన్వయః** :- హే అగ్నే! త్వం జనాయేమం సాహస్రం శతధారం వ్యచ్యమానముత్సమివ వీర్యసేచకం వృషభం ఘృతం దుహానామదితిం ధేనుం చ మా హింసీస్తే తుభ్యమపరమారణ్యం గవయమనుదిశామి తేన పరమే వ్యోమన్ సరిరస్య మధ్యే చిన్వానః సంస్తన్వో నిషీద. తం గవయం తే శుగృచ్ఛతు యన్తే శత్రుం వయంద్విష్మస్తమతి శుగృచ్ఛతు శోకః ప్రాప్నోతు ॥ ౪౯ ॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. రాజమనుష్యా యేభ్యో వృషాదిభ్యః కృష్యాదీని కర్మాణి భవన్తి. యాభ్యో గవాదిభ్యో దుగ్ధాదిపదార్థా జాయన్తే యైః సర్వేషాం రక్షణం భవతి తే కదాచిన్నైవ హింసనీయాః య ఏతాన్ హింస్యుస్తేభ్యో రాజాదిన్యాయేశా అతిదణ్డం దద్యుర్యే చ జాఙ్గలా గవయాదయో ప్రజాహానిం కుర్యు స్తే హన్తవ్యాః. ॥ ౪౯ ॥

**పదార్థము** :- (అగ్నే) దయశాలి, పరోపకారివగు ఓ రాజా! నీవు (జనాయ) మనుష్యులు మున్నగు ప్రాణులకొరకు (ఇమమ్) ఈ (సాహస్రమ్) అసంఖ్యాక సుఖముల సాధనము (శతధారమ్) అసంఖ్యాత క్షీరధారల నిమిత్తము (వ్యచ్యమానమ్) అనేక విధములుగ పాలించదగిన (ఉత్సమ్) కూపమువలె రక్షించు వీర్యసేచకము ఎద్దులు (ఘృతమ్) నేతిని (దుహానామ్) పూర్ణమొనర్చు (అదితిమ్) చంపగూడనట్టి గోవును (మా హింసీః) చంపకుము (తే) నీ రాజ్యమందు ఏవి (ఆరణ్యమ్) వనములందుండు (గవయమ్) గోవురూపములోనుండు ఒక విధమగు జింకలచే పంటలకు హానిజరుగుచుండినచో వానిని (అనుదిశామి) ఉపదేశించుచున్నాను (తేన) వానిని చంపుటచే అన్నము సురక్షితమై (పరమే) సర్వోన్నతుడు (వ్యోమన్) సర్వత్రవ్యాపకుడైయున్న పరమాత్మ మరియు (సరిరస్య) వ్యాపకమైన ఆకాశ (మధ్యే) మధ్యన (చిన్వానః) వృద్ధిజెందినట్టి నీవు (తన్వః) శరీరమధ్యన (నిషీద) నివసించుము (తే) నీయొక్క (శుక్) శోకము (తమ్) ఆ (గవయమ్) అడవిగోవుకు (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! మరియు (తమ్) ఏ (తే) నీ శత్రువును (ద్విష్మః) మేము ద్వేషించుచుందుమో వానికికూడ (శుక్) శోకము (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! ॥౪౯॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఓ రాజపురుషులారా! ఎద్దులచే భూములు సాగుచేయబడి పంటలుపండును. ఆవులరక్షణ ద్వారా పాలు, పెరుగు, వెన్న, నేయి మున్నగు ఉత్తమపదార్థములు లభ్యమగును. వాని పాడి మున్నగువానిద్వారా ప్రజారక్షణ జరుగును. కావున వానినెప్పుడును వధపకుడు, హింసించకుడు. ఎవరైన ఈ యుపకారక పశువులను వధించినచో వారికి కఠినాతికఠినమగు శిక్షను రాజు మున్నగు న్యాయాధీశు లీయవలెను. ఆటవిక సాధుజంతువులను సైతము రాజపురుషులు రక్షించవలెను. ప్రజలను, పంటలను నష్టపరచు ఆరణ్యక కారెనుపోతులు మున్నగువానిని చంపివేయవలెను. ॥౪౯॥

49.O sagacious King, in this world, don't harm this bull, the giver of thousands of comforts, the source of immense milk, and worthy of protection. Harm not in God's creation, the cow, the giver of milk for mankind, and inncocent in nature. I point out to thee the forest cow. With her destruction add to thy prosperity and physical strength in the midst of vast space and under God's guidance. Let the wild forests cow be put to grief by thee. Let thy foe, whom we dislike, be put to grief!.

౬౮౦. ఇమమూర్ణాయుమిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, భురిక్ కృతిశ్ఛన్దః నిషాదః స్వరః.

పునః కే పశవో న హింస్యా హింస్యాశ్చేత్యాహ.

ఎట్టి పశుజంతువులను చంపవలయును? ఎట్టివానిని చంపరాదు?

౬౮౦ ఇమమూర్ణాయుం వరుణస్య నాభిం త్వచం పశూనాం ద్విపదాం చతుష్పదామ్। త్వష్టుః ప్రజానాం ప్రథమం జనిత్రమగ్నే మా హిꣳసీః పరమే వ్యోమన్। ఉష్ట్రమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తన్వో నిషీద। ఉష్ట్రం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥౫౦॥

ప. వి:- ఇమమ్, ఊర్ణాయుమ్, వరుణస్య, నాభిమ్, త్వచమ్, పశూనామ్, ద్విపదామితి ద్వి + పదామ్, చతుష్పదామ్, చతుఃపదామితి చతుః + పదామ్, త్వష్టుః, ప్రజానామితి ప్ర + జానామ్, ప్రథమమ్, జనిత్రమ్, అగ్నే, మా, హిꣳసీః, పరమే, వ్యోమన్నితి వి + ఓమన్, ఉష్ట్రమ్, ఆరణ్యమ్, అను, తే, దిశామి, తేన, చిన్వానః, తన్వః, ని, సీద, ఉష్ట్రమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు ॥౫౦॥

పదార్థః :-(ఇమమ్) (ఊర్ణాయుమ్) అవిమ్ (వరుణస్య) వరస్య ప్రాప్తవ్యస్య సుఖస్య (నాభిమ్) నిబన్ధనమ్ (త్వచమ్) (పశూనామ్) (ద్విపదామ్) (చతుష్పదామ్) త్వష్టుః సుఖప్రకాశకస్య (ప్రజానామ్) (ప్రథమమ్) ఆదిమమ్ (జనిత్రమ్) ఉత్పత్తినిమిత్తమ్ (అగ్నే) (మా) (హింసీః) హింస్యాః (పరమే) (వ్యోమన్) (ఉష్ట్రమ్) (ఆరణ్యమ్) అరణ్యే భవమ్ (అను) (తే) (దిశామి) (తేన) (చిన్వానః) (తన్వః) (ని) (సీద) (ఉష్ట్రమ్) ఇత్యాది పూర్వవత్. ॥ ౫౦ ॥

**అన్వయః** :-హే అగ్నే! ప్రాప్తవిద్య రాజంస్త్వమిమం వరుణస్య నాభిం ద్విపదాం చతుష్పదాం పశూనాం త్వచం త్వష్టుః ప్రజానాం ప్రథమం జనిత్రం పరమే వ్యోమన్వర్తమానమూర్ణాయుం మా హింసీః. తే యం ధాన్యహింసకమారణ్యముష్ట్రం హన్తుమనుదిశామి తేన చిన్వానః సꣳస్తన్వో మధ్యే నిషీద. తే శుగారణ్య ముష్ట్రమృచ్ఛతు యం తే ద్వేష్టారం వయం ద్విష్మస్తం శుగృచ్ఛతు. ॥ ౫౦ ॥

**భావార్థః** :-హే రాజన్! యేషామవ్యాదీనాం లోమాని త్వగపి మనుష్యాణాం సుఖాయ ప్రభవతి య ఉష్ట్రా భారం వహన్తో మనుష్యాన్ సుఖయన్తి తాన్ యే హన్తుమిచ్ఛేయుస్తే జగత్పీడకా విజ్ఞేయాః సమ్యగ్ దణ్డనీయాశ్చ యే చారణ్యా ఉష్ట్రా హానికరా స్తేఽపి దణ్డనీయాః.॥ ౫౦ ॥

**పదార్థము** :-(అగ్నే) విద్యావంతుడవగు ఓ రాజా! నీవు (వరుణస్య) పొందదగినట్టి ఉత్తమ సుఖములను (నాభిమ్) సంయోగమైనట్టి (ఇమమ్) ఈ (ద్విపాదమ్) రెండుకాళ్ళుగల మనుష్యులు, పక్ష్యాదులు (చతుష్పదామ్) నాల్గుకాళ్ళుగల (పశూనామ్) గోవులు మున్నగు పశువుల (త్వచమ్) చర్మముతో కప్పివేయునట్టి (త్వష్టుః) సుఖముల ప్రసాదించు పరమేశ్వరుని (ప్రజానామ్) ప్రజల (ప్రథమమ్) ప్రథమ (జనిత్రమ్) ఉత్పత్తికొరకు (పరమే) ఉత్తమ (వ్యోమన్) ఆకాశమునందు విహరించు (ఊర్ణాయుమ్)గొఱ్ఱెలు మున్నగువానిని (మా హింసీః) చంపకుము. (తే) ఈశ్వరుడనగు నేను నీకొరకు (యమ్) ఏ (ఆరణ్యమ్) అటవిక (ఉష్ట్రమ్) పంటలనాశపరచు అడవి ఒంటెలను (అనుదిశామి) చూపుచున్నానో (తేన) వానినుండి రక్షింపబడిన అన్నాదులచే (చిన్వానః) వృద్ధియగుచు (తన్వః) శరీరమునందు (నిషీద) నివసించుము (తే) నీయొక్క (శుక్) శోకము ఆ యడవి (ఉష్ట్రమ్) ఒంటెకు (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! మరి ఏ ద్వేషించదగిన వారిని మేము (ద్విష్మః) ద్వేషించెదమో (తమ్) వారికి (తే) నీయొక్క (శుక్) శోకము (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! ॥౫౦॥

**భావార్థము** :-ఓ రాజా! గొఱ్ఱెలు మున్నగువాని ఉన్ని మరియు చర్మములచే మనుష్యులకు సుఖము గలుగుచున్నది. ఒంటెలు భారముల మోయుచు మానవులకు సుఖకారకము లగుచున్నవి. అట్టివానిని దుష్టులెవరైనను చంపదలచినచో వారిని అతి కఠినదండనచే శిక్షించవలెను. మరియు నష్టమొనర్చు ఆరణ్యక ఒంటెలున్నచో వానినికూడా చంపుట, లేక తరిమివేయుట చేయవలెను. ॥౫౦॥

50.O learned King, don't kill the two-footed men and birds, and four-footed cattle, the source of comforts. Don't kill the sheep that covers our bodies with blankets, and is foremost worthy of protection amongs God's creatures. I point out to thee the forest camel. With his protection add to thy prosperity and physical strength. Let the wild, uncontrollable camel be put to grief by thee. Let thy foe, whom we dislike be put to grief!.

ౕ౫౧. అజ ఇత్యస్య విరూప ఋషిః, అగ్నిర్దేవతా, భురిక్కృతిశ్ఛన్దః, నిషాదః స్వరః.

పునర్మనుష్యైః కే పశవో న హన్తవ్యా కే చ హన్తవ్యా ఇత్యాహ.

మానవులే పశువులను చంపకూడదు? వేనిని చంపవలెను?

ౕ౫౧ అజో హ్యగ్నేరజనిష్ట శోకాత్సోఽఅపశ్యజ్జనితారమగ్రే।

తేన దేవా దేవతామగ్రమాయంస్తేన రోహమాయన్నుప మేధ్యాసః।

శరభమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తన్వో నిషీద।

శరభం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥౫౧॥

**ప.వి:**-అజః, హి, అగ్నేః, అజనిష్ట, శోకాత్, సః, అపశ్యత్, జనితారమ్, అగ్రే, తేన, దేవాః, దేవతామ్, అగ్రమ్, ఆయన్, తేన, రోహమ్, ఆయన్, ఉప, మేధ్యాసః, శరభమ్, ఆరణ్యామ్, అను, తే, దిశామి, తేన, చిన్వానః, తన్వః, ని, సీద, శరభమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు ॥ ౫౧॥

**పదార్థః** :-(అజః) ఛాగః (హి) ఖలు (అగ్నేః) పావకాత్ (అజనిష్ఠ) జాయతే (శోకాత్) (సః) (అపశ్యత్) పశ్యతి (జనితారమ్) ఉత్పాదకమ్ (అగ్రే) (తేన) (దేవాః) విద్వాంసః (దేవతామ్) దివ్యగుణతామ్ (అగ్రమ్) ఉత్తమం సుఖమ్ (ఆయన్) యన్తి ప్రాప్నువన్తి (తేన) (రోహమ్) ప్రాదుర్భావమ్ (ఆయన్) ప్రాప్నువన్తు (ఉప) (మేధ్యాసః) పవిత్రాః సన్తః (శరభమ్) శల్యకమ్ (ఆరణ్యామ్) జంగలోత్పన్నమ్ (అను) (తే) (దిశామి) (తేన) (చిన్వానః) అగ్రే పూర్వవత్. ॥ ౫౧ ॥

**అన్వయః** :-హే రాజంస్త్వం యో హ్యజోఽజనిష్ట సోఽగ్రే జనితారమపశ్యత్. యేన మేధ్యాసో దేవా అగ్రం దేవతాం సుఖముపాయన్ యేన రోహముపాయన్ తేనోత్తమగుణతామగ్రం సుఖం తేన వృద్ధిం చ ప్రాప్నుహి యమారణ్యం శరభం తేఽనుదిశామి తేన చిన్వానః సంస్తన్వో నిషీద తం శరభం తే శుగృచ్ఛతు యం తే తవారిం వయం ద్విష్మస్తం శోకాద్నేః శుగృచ్ఛతు. ॥ ౫౧ ॥

**భావార్థః** :-రాజజనై రజాదీనహత్వా సంరక్ష్యైతే ఉపకారాయ సంయోజనీయాః. యే శుభపశుపక్షి హింసకా భవేయుస్తే భృశం తాడనీయాః. యది శల్యకీ హానికారికా స్యాత్తర్హి సా ప్రజాపాలనాయ హన్తవ్యా.॥౫౧॥

**పదార్థము** :-ఓ రాజా! నీవు ఏ (హి) నిశ్చయముగ (అజః) మేక (అజనిష్ట) పుట్టుచున్నదో (సః) అది (అగ్రే) ప్రథమ (జనితారమ్) ఉత్పాదకుని (అపశ్యత్) చూచుచున్నది. దానివల్ల (మేధ్యాసః) పవిత్రమైన (దేవాః) విద్వాంసులు (అగ్రమ్) ఉత్తమ సుఖముల మరియు (దేవతామ్) దివ్యగుణములను (ఉపాయన్) ఉపాయమును పొందుదురు. మరియు దేనిచే (రోహమ్) వృద్ధితో గూడిన ప్రసిద్ధిని (ఆయన్) పొందుదువుగాక! (తేన) దానివల్ల ఉత్తమ గుణములు, ఉత్తమ సుఖములు మరియు (తేన) దానిచే వృద్ధిని

పొందుము (అరణ్యమ్) ఆరణ్యక (శరభమ్) ఏ ఏదు [ముళ్ల] పంది (తే) నీ ప్రజలకు హానిగలిగించునదై యున్నదో, దానిని (అనుదిశామి) చూపుదును (తేన) దానినుండి కాపాడబడిన పదార్థములతో (చిన్వానః) వృద్ధిజెందుచు (తన్వః) శరీరమునందు (నిషీద) నివసించుము. మరియు (తమ్) అట్టి (శరభమ్) శల్యకి [ముళ్లపంది లేక శరములు, శస్త్రములు] కి (తే) నీయొక్క (శుక్) శోకము, బాధ (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! (తే) నీయొక్క (యమ్) ఏ శత్రువును మేము (ద్విష్మః) ద్వేషింతుమో వారికి (శోకాత్) శోకరూప (అగ్నేః) అగ్నిచే (శుక్) శోకము, అత్యంతశోకము, మహాశోకము (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! ॥౫౧॥

**భావార్థము** :- మనుష్యులు, రాజపురుషులు గొఱ్ఱె, మేకలు, లేళ్లు మున్నగు సాధు, ఉపయోగకర జంతువులను, నెమళ్లు మున్నగు పక్షులను చంపవలదు. వానిని కాపాడి వృద్ధిపరచి ఉపకారార్థము సంయుక్త పరచవలెను. ఉత్తమ పశుపక్ష్యాదులను చంపువారిని వెంటనే గట్టిగా తాడనమొనర్చవలెను. ఐనను ప్రజలకు, పంటలకు నష్టము గలిగించు ముళ్లపందులవంటివానిని నష్టపరచవలెను. ॥౫౧॥

51.The unborn soul is educated through the power of God. He then sees God, existing before the creation of the universe, and the Generator of all. The learned, through that soul, attain to pre-eminent godly life; and the virtuous to an exalted pisition. I point out to thee, O king, the forest porcupine. Utilising her add to thy prosperity and physical strength. Let the untamed porcupine be put to grief by thee. Let thy foe, whom we dislike be put to grief by thee.

౬౮౨. త్వం యవిష్ఠేత్యస్యోశనా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః కీదృశా రక్ష్యా హింసనీయాశ్చేత్యాహ. ఏవి రక్షణీయములు? ఏవి హంతవ్యములు?

## ౬౮౨ త్వం యవిష్ఠ దాశుషో నౄ౯ః పాహి శృణుధీ గిరః।

## రక్షా తోకముత త్మనా ॥౫౨॥

**ప. వి:- త్వమ్, యవిష్ఠ, దాశుషః, నౄన్, పాహి, శృణుధి, గిరః, రక్షా, తోకమ్, ఉత, త్మనా ॥౫౨॥**

**పదార్థః** :- (త్వమ్) (యవిష్ఠ) అతిశయేన యువన్ (దాశుషః) సుఖదాతౄన్ (నౄన్) ధర్మనేతౄన్ మనుష్యాన్. అత్ర నౄన్ పే ఇతి రురాదేశః పూర్వస్యానునాసికత్వం చ (పాహి) (శృణుధి) అత్ర హేర్ధ్యాదేశోఽన్యేషామపీతి దీర్ఘః (గిరః) సత్యా వాచః (రక్షా) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (తోకమ్) అపత్యమ్ (ఉత) అపి (త్మనా) ఆత్మనా. ॥ ౫౨ ॥

**అన్వయః** :- హే యవిష్ఠ! త్వం సంరక్షితైరేతైః పశుభిర్దాశుషో నౄన్పాహి. ఇమా గిరః శృణుధి త్మనా మనుష్యాణాముత పశూనాం తోకం రక్ష. ॥౫౨॥

**భావార్థః** :- యే మనుష్యా మనుష్యాదిరక్షకాన్ పశూన్ వర్ధయన్తే కరుణామయానుపదేశాన్ శృణ్వన్తి శ్రావయన్తి త ఆత్మజం సుఖం లభన్తే. ॥౫౨॥

**పదార్థము** :- (యవిష్ఠ) చక్కని యువకుడా! (త్వమ్) నీవు రక్షణసేసిన ఈ పశువులతో (దాశుషః) సుఖదాత (నౄన్) ధర్మరక్షకులగు మనుష్యులను (పాహి) రక్షించుము. ఈ (గిరః) సత్యవాణులను (శృణుధి) వినుము (త్మనా) నీ యాత్మతో మనుష్యుల (ఉత) మరియు పశుపక్ష్యాదుల (తోకమ్) పిల్లలను (రక్ష) కాపాడుము [రక్షించుము]. ॥౫౨॥

**భావార్థము** :- ఏ మనుష్యులు మున్నగు ప్రాణుల రక్షకములగు పశువులను వృద్ధిపరచుము, కృపామయ ఉపదేశములను వినుచుందురో వారు ఆంతరిక (ఆత్మిక) ఆనంద సుఖములను పొందుదురు. ॥౫౨॥

52.O most youthful leader, protect the pleasure-giving persons, hear their songs. With thy soul, protect their offspring!.

౫౩. అపాం త్వేమన్నిత్యస్యోశనా ఋషిః ఆపో దేవతాః, పూర్వస్య బ్రాహ్మీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

సరిరేత్వేతి మధ్యస్య బ్రాహ్మీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః

గాయత్రేణేత్యుత్తరస్య నిచృద్బ్రాహ్మీ పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః

అథాధ్యేతృజనానధ్యాపకాః కిముపదిశేయురిత్యాహ. విద్యార్థులకు అధ్యాపకుల ఉపదేశము.

౫౩ అపాం త్వేమన్త్సాదయామ్యపాం త్వోద్మన్త్సాదయామ్యపాన్త్వా భస్మన్త్సాద
యామ్యపాం త్వా జ్యోతిషి సాదయామ్యపాం త్వాయనే సాదయామ్యర్ణవే
త్వా సదనే సాదయామి సముద్రే త్వా సదనే సాదయామి ।
సరిరే త్వా సదనే సాదయామ్యపాం త్వా క్షయే సాదయామ్యపాం త్వా సధిషి
సాదయామ్యపాం త్వా సదనే సాదయామ్యపాం త్వా సధస్థే సాదయామ్యపాం
త్వా యోనౌ సాదయామ్యపాం త్వా పురీషే సాదయామ్యపాం త్వా పాథసి

సాదయామి గాయత్రేణ త్వా ఛన్దసా సాదయామి త్రైష్టుభేన త్వా ఛన్దసా
సాదయామి జాగతేన త్వా ఛన్దసా సాదయామ్యానుష్టుభేన త్వా ఛన్దసా
సాదయామి పాఙ్క్తేన త్వా ఛన్దసా సాదయామి ॥53॥

ప.వి:- అపామ్, త్వా, ఏమన్, సాదయామి, అపామ్, త్వా, ఓద్మన్, సాదయామి, అపామ్, త్వా, భస్మన్, సాదయామి, అపామ్, త్వా, జ్యోతిషి, సాదయామి, అపామ్, త్వా, అయనే, సాదయామి, అర్ణవే, త్వా, సదనే, సాదయామి, సముద్రే, త్వా, సదనే, సాదయామి, సరిరే, త్వా, సదనే, సాదయామి, అపామ్, త్వా, క్షయే, సాదయామి, అపామ్, త్వా, సధిషి, సాదయామి, అపామ్, త్వా, సదనే, సాదయామి, అపామ్, త్వా, సధస్థ ఇతి సధ + స్థే, సాదయామి, అపామ్, త్వా, యోనౌ, సాదయామి, అపామ్, త్వా, పురీషే, సాదయామి, అపామ్, త్వా, పాథసి, సాదయామి, గాయత్రేణ, త్వా, ఛన్దసా, సాదయామి, త్రైష్టుభేన, త్రైస్తుభేనేతి త్రై+స్తుభేన, త్వా, ఛన్దసా, సాదయామి, జాగతేన, త్వా, ఛన్దసా, సాదయామి, ఆనుష్టుభేన, ఆనుస్తుభేనేత్యాను + స్తుభేన, త్వా, ఛన్దసా, సాదయామి, పాఙ్క్తేన, త్వా, ఛన్దసా, సాదయామి ॥53॥

పదార్థః :-(అపామ్) ప్రాణానాం రక్షణే (త్వా) త్వామ్ (ఏమన్) ఏతి గచ్ఛతి తస్మిన్ వాయౌ (సాదయామి) స్థాపయామి (అపామ్) జలానామ్ (త్వా) (ఓద్మన్) ఓషధిషు (సాదయామి) (అపామ్) ప్రాప్తానాం కాష్ఠాదీనామ్ (త్వా) (భస్మన్) భస్మన్యగ్రే. అత్ర సర్వత్ర సప్తమీలుక్ (సాదయామి) (అపామ్) వ్యాప్నువతాం విద్యుదాదీనామ్ (త్వా) (జ్యోతిషి) విద్యుతి (సాదయామి) (అపామ్) అంతరిక్షస్య (త్వా)

(అయనే) భూమౌ (సాదయామి) (అర్ణవే) ప్రాణే (త్వా) (సదనే) స్థాతవ్యే (సాదయామి) (సముద్రే) మనసి (త్వా) (సదనే) గన్తవ్యే (సాదయామి) సరిరే వాచి (త్వా) (సదనే) ప్రాప్తవ్యే (సాదయామి) (అపామ్) ప్రాప్తవ్యానాం పదార్థానామ్ (త్వా) (క్షయే) చక్షుషి (సాదయామి) (అపామ్) (త్వా) (సధిషి) సమానాన్ శబ్దాన్ శృణోతి యేన తస్మిన్ శ్రోత్రే (సాదయామి) (అపామ్) (త్వా) (సదనే) దివి (సాదయామి) (అపామ్) (త్వా) (సధస్థే) అన్తరిక్షే (సాదయామి) (అపామ్) (త్వా) (యోనౌ) సముద్రే (సాదయామి) (అపామ్) (త్వా) (పురీషే) సికతాసు (సాదయామి) (అపామ్) (త్వా) (పాథసి) అన్నే (సాదయామి) (గాయత్రేణ) గాయత్రీనిర్మితేన (త్వా) (ఛన్దసా) స్వచ్ఛేనార్థేన (సాదయామి) (త్రైష్టుభేన) త్రిష్టుప్‌ప్రోక్తేన (త్వా) (ఛన్దసా) (సాదయామి) (జాగతేన) జగత్యుక్తేన (త్వా) (ఛన్దసా) (సాదయామి) (ఆనుష్టుభేన) అనుష్టుప్‌కథితేన (త్వా) (ఛన్దసా) సాదయామి (పాంక్తేన) పంక్తిప్రకాశితేన (త్వా) (ఛన్దసా) (సాదయామి) సంస్థాపయామి. ॥ ౫౩ ॥

**అన్వయః** :-హే మనుష్య! యథా శిక్షకోఽహమపామేమంస్త్వా సాదయామ్యపామోద్మం స్త్వా సాదయామ్యపాం భస్మంస్త్వా సాదయామ్యపాం జ్యోతిషి త్వా సాదయామ్యపామయనే త్వా సాదయామ్యర్ణవే సదనే త్వా సాదయామి సముద్రే సదనే త్వా సాదయామి సరిరే సదనే త్వా సాదయామ్యపాం క్షయే త్వా సాదయామ్యపాం సధిషి త్వా సాదయామ్యపాం సదనే త్వా సాదయామ్యపాం సదస్థే త్వా సాదయామ్యపాం యోనౌ త్వా సాదయామ్యపాం పురీషే త్వా సాదయామ్యపాం పాథసి త్వా సాదయామి. గాయత్రేణ ఛన్దసా త్వా సాదయామి త్రైష్టుభేన ఛన్దసా త్వా సాదయామి జాగతేన ఛన్దసా త్వా సాదయామ్యానుష్టుభేన ఛన్దసా త్వా సాదయామి పాంక్తేన ఛన్దసా త్వా సాదయామి తథైవ వర్తస్వ. ॥ ౫౩ ॥

**భావార్థః** :-విద్వద్భిః సర్వాన్ పురుషాన్ స్త్రియశ్చ వేదానధ్యాప్య జగత్స్థానాం వాయ్వాదిపదార్థానాం విద్యాసు నిపుణీకృత్య తేభ్యః ప్రయోజనసాధనే ప్రవర్తనీయాః. ॥ ౫౩ ॥

**పదార్థము** :-ఓ మానవా! శిక్షకుడనగు నే నెట్లు (అపామ్) ప్రాణరక్షణకొరకు (ఏమన్) గమనశీలమగు వాయువునందు (త్వా) నిన్ను (సాదయామి) స్థాపించుచున్నానో (అపామ్) జలముల (ఓద్మన్) ఆర్ద్రతతో గూడిన ఓషధులందు (త్వా) నిన్ను (సాదయామి) స్థాపించుచున్నానో (అపామ్) ప్రాప్తించిన కాష్ఠముల (భస్మన్) భస్మమునందు (త్వా) నిన్ను (సాదయామి) సంయుక్తమొనర్చుచున్నానో (అపామ్) వ్యాప్తమైన విద్యుత్తు మున్నగు అగ్నుల (జ్యోతిషి) ప్రకాశమునందు (త్వా) నిన్ను (సాదయామి) నియుక్తపరచుచున్నానో (అపామ్) అవకాశముగల (అయనే) స్థానమందు (త్వా) నిన్ను (సాదయామి) కూర్చుండబెట్టుచున్నానో (సదనే) నివాసయోగ్యమగు (అర్ణవే) ప్రాణవిద్యయందు (త్వా) నిన్ను (సాదయామి) సంయుక్త పరచుచున్నానో (సదనే) గమనశీల (సముద్రే) మనోవిషయమందు (త్వా) నిన్ను (సాదయామి) సంబద్ధపరచుచున్నానో (సదనే) పొందదగిన (సరిరే) వాణుల విషయమునందు (త్వా) నిన్ను (సాదయామి) సంయుక్తపరచుచున్నానో (అపామ్) ప్రాప్తించుకొనదగిన పదార్థసంబంధ (క్షయే) గృహమందు (త్వా) నిన్ను

ప్రహేతిస్తేభ్యోనమోఽఅస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే

యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥౧౬॥

ప.వి:- అయమ్, దక్షిణా, విశ్వకర్మేతి విశ్వ + కర్మా, తస్య, రథస్వన ఇతి రథ + స్వనః, చ, రథేచిత్ర ఇతి రథే + చిత్రః, చ, సేనానీగ్రామణ్యౌ, సేనానీగ్రామణ్యావితి సేనానీగ్రామణ్యౌ, మేనకా, చ,సహజన్యేతి సహ + జన్యా, చ అప్సరసౌ, యాతుధానా ఇతి యాతు + ధానాః హేతిః, రక్షాగ్ంసి, ప్రహేతిరితి ప్ర + హేతిః, తేభ్యః, నమః, అస్తు, తే, నః, అవన్తు, తే, నః, మృడయన్తు, తే, యమ్, ద్విష్మః, యః, చ, నః, ద్వేష్టి, తమ్, ఏషామ్, జమ్భే, దధ్మః॥౧౬॥

**పదార్థః** :-(అయమ్) (దక్షిణా) దక్షిణతః (విశ్వకర్మా) విశ్వాని సర్వాణి కర్మాణి యస్మాత్స వాయుః (తస్య) (రథస్వనః) రథస్య స్వనః శబ్ద ఇవ శబ్దో యస్య సః (చ) (రథేచిత్రః) రథే రమణీయే చిత్రాణ్యాశ్చర్య రూపాణి చిహ్నాని యస్య సః (చ) (సేనానీగ్రామణ్యౌ) (మేనకా) యయా మన్యతే సా (చ) (సహజన్యా) సహోత్పన్నా (చ) (అప్సరసౌ) యే అప్స్వన్తరిక్షే సరతస్తే (యాతుధానాః) ప్రజాపీడకాః (హేతిః) వజ్రః (రక్షాంసి) దుష్టకర్మకారిణః (ప్రహేతిః) (తేభ్యః) (నమః) వజ్రః (అస్తు) (తే) (నః) అస్మాన్ (అవన్తు) (తే) (నః) (మృడయన్తు) సుఖయన్తు (తే) (యమ్) (ద్విష్మః) (యః) (చ) (నః) (ద్వేష్టి) (తమ్) (ఏషామ్) వాయూనామ్ (జమ్భే) వ్యాఘ్రస్య ముఖ ఇవ కష్టే (దధ్మః).॥ ౧౬ ॥

**అన్వయః** :- హే మనుష్యాః! యథా యోఽయం విశ్వకర్మా వాయుర్దక్షిణా వాతి తస్య వాయో రథస్వనశ్చ రథేచిత్రశ్చ సేనానీగ్రామణ్యావివ వర్తమానే మేనకా చ సహజన్యా చాప్సరసౌ వర్తేతే. యే యాతుధానాః సన్తి తేషాముపరి హేతిర్యాని రక్షాంసి వర్తన్తే తేషాముపరి ప్రహేతిరివ తేభ్యో నమోఽస్త్వితి కృత్వా శిక్షా న్యాయాధీశాస్తే నోఽవన్తు తే నో మృడయన్తు తే వయం యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం వాయూనాం జమ్భే దధ్మస్తథా ప్రయతధ్వమ్. ॥ ౧౬ ॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే స్థూలసూక్ష్మమధ్యస్థస్య వాయోరుపయోగం కర్తుం జానన్తి తే శత్రూన్నివార్య సర్వానానన్దయన్తి. ఇదమపి గ్రీష్మర్తోః శిష్టం వ్యాఖ్యానం వేద్యమ్.॥ ౧౬ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎట్లు (అయమ్) ఈ (విశ్వకర్మా) సకల చేష్టరూప కర్మలకు హేతువగు

వాయువు (దక్షిణా) దక్షిణదిశనుండి నడచును (తస్య) ఆ వాయువుయొక్క (రథస్వనః) రథశబ్దము వంటి శబ్దము (చ) మరియు నీ రెండును (సేనానీ గ్రామణ్యౌ) సేనాపతి మరియు గ్రామాధ్యక్షులవలె నుండి (మేనకా) మనన సాధనముగు (చ) మరియు (సహజన్యా) తోడ్తో [కలిసి] జన్మించిన (చ) ఈ రెండు (అప్సరసౌ) అంతరిక్షమునందుండునట్టి కిరణములు అప్సరసలై యున్నవి. అవి (యాతుధానా) ప్రజలకు పీడలగలిగించువారిపై (హేతి) ఏ వజ్రము (రక్షాంసి) దుష్ట కర్మలొనర్చు వారిపై (ప్రహేతిః) ప్రకృష్ట [అతిశయ] వజ్రము పడునో (తేభ్యః) అట్టి ప్రజాపీడకులు మున్నగు వారికై (నమః) వజ్ర ప్రహారము (అస్తు) అగుగాక! ఇట్టి శిక్ష వేయు న్యాయాధీశుడు (తే) ఆయన (నః) మమ్ము (అవన్తు) రక్షణచేయుగాక! (తే) వారు (నః) మమ్ము (మృడయన్తు) సుఖవంతులనొనర్చుదురుగాక! (తే) అట్టి మేము (యమ్) ఏ దుష్టులను (ద్విష్మః) ద్వేషింతుమో (చ) మరియు (యః) ఏ దుష్టులు (నః) మమ్ము (ద్వేష్టి) ద్వేషింతురో (తమ్) వారిని (ఏషామ్) ఈ వాయువుల (జమ్భే) వ్యాఘ్రము వంటి ముఖమునందు (దధ్మః) ధరింపజేయ ప్రయత్నించుడు. ॥౧౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. స్థూల, సూక్ష్మ, మధ్యమ వాయువులను ఉపయోగపరచుకొనుట నెరుగువారు శత్రునివారణమొనర్చి ఎల్లరను ఆనంద పరతురు. ఇది గ్రీష్మర్తువుయొక్క విశేష వ్యాఖ్యానమని ఎరుగవలెను. ॥౧౬॥

16.O men, this vishvakarma breeze blows in the south. These two kinds of air, that give sound like the sound of a chariot, and are the doers of wonderous acts like a chariot, are like the head of an army and the chieftain of a village, which help meditation, and are born together, are called Apsaras which live in the atmosphere. Those who tease the people should be destroyed. Those who commit unrighteous deeds should be subdued through arms. Use weapons against those who torment mankind. Let just rulers protect us and make us comfortable. In the lion-like jaws of these airs we place the depraved man whom we hate and who hates us!.

౭౩౬. అయం పశ్చాదిత్యస్య పరమేష్ఠీ ఋషిః, వర్షర్తు ర్దేవతా, కృతిశ్ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తాదృశమేవ విషయమాహ. మఱల నట్టి విషయమే.

౭౩౬ అయం పశ్చాద్ విశ్వవ్యచాస్తస్య రథప్రోతశ్చాసమరథశ్చ సేనానీగ్రామణ్యౌ।
ప్రమ్లోచన్తీ చానుమ్లోచన్తీ చాప్సరసౌ। వ్యాఘ్రా హేతిః సర్పాః
ప్రహేతిస్తేభ్యో నమోఽ అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే యం
ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥౧౭॥

ప.విః-అయమ్, పశ్చాత్, విశ్వవ్యచా ఇతి విశ్వ + వ్యచాః, తస్య, రథప్రోత ఇతి రథ + ప్రోతః, చ, అసమరథ ఇత్యసమ + రథః, చ, సేనానీగ్రామణ్యౌ, సేనానీగ్రామన్యావితి సేనానీగ్రామన్యౌ, ప్రమ్లోచన్తీతి ప్ర + మ్లోచన్తీ, చ, అనుమ్లోచన్తీత్యను + మ్లోచన్తీ, చ, అప్సరసౌ, వ్యాఘ్రాః, హేతిః, సర్పాః, ప్రహేతి రితి ప్ర + హేతిః, తేభ్యః, నమః, అస్తు, తే, నః, అవన్తు తే, నః, మృడయన్తు, తే, యమ్, ద్విష్మః, యః, చ, నః, ద్వేష్టి, తమ్, ఏషామ్, జమ్భే, దధ్మః॥౧౭॥

**పదార్థః** :-(అయమ్) (పశ్చాత్) (విశ్వవ్యచాః) విశ్వం విచతి వ్యాప్నోతి స విద్యుద్రూపోఽగ్నిః. (తస్య) (రథప్రోతః) రథో రమణీయస్తేజః సమూహః ప్రోతో వ్యాపితో యేన సః (చ) (అసమరథః) అవిద్యమానః సమో రథో యస్య సః (చ) (సేనానీగ్రామణ్యౌ) ఏతావివ (ప్రమ్లోచన్తీ) ప్రకృష్టతయా సర్వానోషధ్యాదిపదార్థాన్ మ్లోచయన్తీ (చ) (అనుమ్లోచయన్తీ) అనుమ్లోచయన్తీ దీప్తిః (చ) (అప్సరసౌ) (వ్యాఘ్రాః) సింహాః (హేతిః) (సర్పాః) యే సర్పన్తి తేఽహయః (ప్రహేతిః) (తేభ్యః) (నమః) (అస్తు) (తే) (నః) (అవన్తు) (తే) (నః) (మృడయన్తు) (తే) (యమ్) (ద్విష్మః) (యః) (చ) (నః) (ద్వేష్టి) (తమ్) (ఏషామ్) (జమ్భే) (దధ్మః) ॥ ౧౭ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథాఽయం పశ్చాద్విశ్వవ్యచా అస్తి తస్య సేనానీగ్రామణ్యావివ రథప్రోతశ్చా సమరథశ్చ ప్రమ్లోచన్తీ చానుమ్లోచన్తీ చాప్సరసౌ స్తః. యథా హేతిః ప్రహేతి ర్వ్యాఘ్రాః సర్పాశ్చ సన్తి తేభ్యో నమోఽస్తు. య ఏతేభ్యో రక్షకాస్తే నోఽవన్తుతే నో మృడయన్తు తే వయం యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి యమేషాం జమ్భే దధ్మస్తం తేఽపి ధరన్తు. ॥ ౧౭ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. ఇదం వర్షర్తోః శిష్టం వ్యాఖ్యానమస్మిన్ యుక్తాహార విహారౌ మనుష్యైః కార్యౌ. ॥ ౧౭ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎట్లు (అయమ్) ఈ (పశ్చాత్) వెనకనుండి (విశ్వవ్యచాః) విశ్వమందు వ్యాప్తమైయున్న విద్యుద్రూప అగ్ని గలదో (తస్య) దీనికి (సేనానీగ్రామణ్యౌ) సేనాపతి, గ్రామాధ్యక్షులవలె (రథప్రోతః) రమణీయమైన తేజస్స్వరూపమందు వ్యాప్తము (చ) మరియు (అసమరథః) సాటిలేనట్టి ఏ రథముగలదో (చ) ఈరెండును (ప్రమ్లోచన్తీ) చక్కగా ఓషధులు మున్నగు పదార్థముల ఎండింపజేయునది (చ)

ఇంకను (అనుమ్లోచన్తీ) తరువాత జ్ఞానమునకు హేతువగు ప్రకాశము (చ) ఈరెండును (అప్సరసౌ) క్రియాకారక ఆకాశస్థ కిరణములు గలవో, ఎట్లు (హేతిః) సాధారణ వజ్రమువలె, మరియు (ప్రహేతిః) ఉత్తమ వజ్రమువలె (వ్యాఘ్రాః) సింహముల, మరియు (సర్పాః) సర్పములవంటి ప్రాణులకు దుఃఖముల గలిగించు ఏ జీవులు గలవో (తేభ్యః) వానిపై (నమః) వజ్రప్రహారము (అస్తు) అగుగాక! మరియు ఈ పైవానినుండి రక్షించు (తే) వారు (నః) మాకు (అవన్తు) రక్షకులగుదురుగాక! (తే) వారు (నః) మమ్ము (మృడయన్తు) సుఖవంతులజేయుదురుగాక! మరియు (తే) మేము (యమ్) వేనిని (ద్విష్మః) ద్వేషింతుమో (చ) మరియు (యః) ఏ దుష్టులు (నః) మమ్ము (ద్వేష్టి) ద్వేషింతురో, వారిని మేము (ఏషామ్) ఈ సింహాదుల (జమ్భే) ముఖములందు (దధ్మః) ధరింపజేయుదుముగాక! (తమ్) వారిని ఆ రక్షకులను సింహాదుల నోళ్లయందు త్రోయుదురుగాక! ॥౧౭॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఇది వర్షర్తువుయొక్క శేషవ్యాఖ్యయై యున్నది. ఇందు ''మానవులు నియమపూర్వకముగ ఆహార విహారాదుల నొనర్చవలయు''నని యున్నది. ॥౧౭॥

17.O men, there is all pervading lightning in the West. Like the head of the army and the village chieftain, are its Rathprota, and Asamaratha. Both these Apsaras, active beams in the atmosphere, dry all the medicinal plants, and shed lustre.

Those who like tigers and serpents torture mankind, should be subdued through arms. Let the rulers protect us from these animals and make us comfortable. In the jaws of these animals we place the degraded man whom we hate and who hates us.

౭౩౭. అయముత్తరాదిత్యస్య పరమేష్ఠీ ఋషిః, శరదృతుర్దేవతా, భురిగతిధృతిశ్ఛందః, షడ్జః స్వరః.

పునస్తాదృశమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౭౩౭ అయముత్తరాత్సంయద్వసుస్తస్య తార్క్ష్యశ్చారిష్టనేమిశ్చ సేనానీగ్రామణ్యౌ।
విశ్వాచీ చ ఘృతాచీ చాప్సరసావాపో హేతిర్వాతః ప్రహేతిస్తేభ్యో నమోఽ
అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే యం ద్విష్మో యశ్చ నో
ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥౧౮॥

ప.వి:- అయమ్, ఉత్తరాత్, సంయద్వసురితి సంయత్ + వసుః, తస్య, తార్క్ష్యః, చ,

అరిష్టనేమిరిత్యరిష్ట + నేమిః, చ, సేనానీగ్రామణ్యౌ, సేనానీగ్రామణ్యావితి సేనానీగ్రామన్యౌ, విశ్వాచీ, చ, ఘృతాచీ, చ, అప్సరసౌ, ఆపః, హేతిః, వాతః, ప్రహేతిరితి ప్ర + హేతిః, తేభ్యః, నమః, అస్తు, తే, నః, అవన్తు, తే, నః, మృడయన్తు, తే, యమ్, ద్విష్మః, యః, చ, నః, ద్వేష్టి, తమ్, ఏషామ్, జమ్భే, దధ్మః ॥౧౮॥

**పదార్థః** :-(అయమ్) (ఉత్తరాత్) (సంయద్వసుః) యజ్ఞస్య సంగతికరణః (తస్య) (తార్క్ష్యః) తీక్ష్ణతేజః ప్రాపక ఆశ్వినః (చ) (అరిష్టనేమిః) అరిష్టాని దుఃఖాని దూరే నయతి స కార్తికః (చ) (సేనానీగ్రామణ్యౌ) ఏతద్వద్వర్తమానౌ (విశ్వాచీ) యా విశ్వం సర్వం జగదఞ్చతి వ్యాప్నోతి సా (చ)(ఘృతాచీ) ఘృతమాజ్యముదకం వాఞ్చతి ప్రాప్నోతి సా దీప్తిః (చ) (అప్సరసౌ) అప్సు ప్రాణేషు సరన్త్యౌ గతీ (ఆపః) (హేతిః) వృద్ధిః (వాతః) ప్రియః పవనః (ప్రహేతిః) ప్రకర్షేణ వర్ధకః (తేభ్యః) (నమః) (అస్తు) (తే) (నః) (అవన్తు) (తే) (నః) (మృడయన్తు) (తే) (యమ్) (ద్విష్మః) (యః) (చ) (నః) (ద్వేష్టి) (తమ్) (ఏషామ్) (జమ్భే) (దధ్మః) ॥ ౧౮ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథాఽయముత్తరాత్సంయద్వసురివ శరదృతురస్తి తస్య సేనానీగ్రామణ్యావివ తార్క్ష్యశ్చారిష్టనేమిశ్చ విశ్వాచీ చ ఘృతాచీ చాప్సరసౌ స్తః యత్రాఽఽపో హేతిరివ వర్తికా వాతః ప్రహేతిరివాన్నప్రదో భవతి తం యే యుక్త్యా సేవన్తే తేభ్యో నమోఽస్తు. తే నోఽవన్తు తే నో మృడయన్తు తే వయం యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషామబ్వాతానాం జమ్భే దధ్మస్తథా యూాయం వర్తధ్వమ్ ॥ ౧౮ ॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. ఇదం శరదృతోః శిష్టం వ్యాఖ్యానమ్. అస్మిన్నపి మనుష్యైర్యుక్త్యా ప్రవర్తితవ్యమ్. ॥ ౧౮ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎట్లు (అయమ్) ఈ (ఉత్తరాత్) ఉత్తరదిశనుండి (సంయద్వసుః) యజ్ఞమును సంగతపరచు వారివలె శరదృతువుగలదో (తస్య) దాని (సేనానీగ్రామణ్యౌ) సేనాపతి మరియు గ్రామాధ్యక్షులవలె (తార్క్ష్యః) తీక్ష్ణ తేజమును ప్రాప్తించు ఆశ్వయుజమాసము (చ) మరియు (అరిష్టనేమిః) దుఃఖములను దూరయొనర్చు కార్తీకమాసము (చ) ఈరెండును (విశ్వాచీ) సకల జగత్తునందు వ్యాపకము (చ) మరియు (ఘృతాచీ) ఘృతము, జలములను ప్రాప్తింపజేయు దీప్తి (చ) ఈ రెండును ఏ (అప్సరసౌ) ప్రాణముల గతులుగలవో, ఎచ్చట (ఆపః) జలములు (హేతిః) వృద్ధివలెవర్తింపజేయు మరియు (వాతః) ప్రియమగు వాయువు (ప్రహేతిః) చక్కగా వృద్ధిపరచువానివలె ఆనందదాయకముగ నుండునో అట్టి వాయువును

యుక్తముగా సేవనమొనర్చునట్టి (తేభ్యః) వారికొరకు (నమః) నమస్కారము (అస్తు) అగుగాక! (తే) వారు (నః) మాయొక్క (అవన్తు) రక్షణ జేయుదురుగాక! (తే) వారు (నః) మమ్ము (మృడయన్తు) సుఖవంతుల నొనర్చుదురుగాక! (తే) వారు [మేము] (యమ్) ఎవనిని (ద్విష్మః) ద్వేషింతుమో (చ) మరియు (యః) ఎవడు (నః) మమ్ము (ద్వేష్టి) ద్వేషించునో (తమ్) అతని (ఏషామ్) ఈ జలవాయువుల (జమ్భే) దుఃఖదాయి గుణములుగల ముఖము [నోటి] యందు (దధ్మః) ఉంచెదము. మీరును అట్లే వర్తించుడు. ॥౧౮॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఇది శరదృతువు యొక్క శేష [మిగత] వ్యాఖ్యానము. మానవులు యుక్తముగా కార్యములందు ప్రవృత్తులు గావలయును. (అని ఉపదేశించబడినది) ॥౧౮॥

18.In the North, the autumn is associated with the yajna. Its Aswin and Kartik are like the head of the army and the village chieftain. The fire that pervades the universe and the fire that receives ghee (butter) are its Apsaras, i.e., the motion of the Pranas. In this season water is an abundance, and air highly pleasant. Those who enjoy this air properly deserve honour. May they protect us and make us comfortable. In the jaws of destructive power of water and air, we place the man whom we hate and who hates us.

౭౩౮. అయముపరీత్యస్య పరమేష్ఠీ ఋషిః, హేమన్తర్తుర్దేవతా, నిచృత్ప్రకృతిశ్ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తాదృశమేవ విషయ మాహ. మఱల నటువంటి విషయమే.

౭౩౮ అయముపర్యర్వాగ్వసుస్తస్య సేనజిచ్చ సుషేణశ్చ సేనానీగ్రామణ్యౌ।
ఉర్వశీ చ పూర్వచిత్తిశ్చాప్సరసావవస్ఫూర్జన్ హేతిర్విద్యుత్ప్రహేతిస్తేభ్యో
నమోఽ అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే యం ద్విష్మో
యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః॥౧౯॥

ప.వి:- అయమ్, ఉపరి, అర్వాగ్వసురిత్యర్వాక్ + వసుః, తస్య, సేనజిదితి సేన + జిత్, చ, సుషేణః, సుసేన ఇతి సు+సేనః, చ, సేనానీగ్రామణ్యౌ, సేనానీ గ్రామణ్యావితి సేనానీగ్రామణ్యౌ, ఉర్వశీ చ, పూర్వచిత్తిరితి పూర్వ + చిత్తిః, చ, అప్సరసౌ, అవస్ఫూర్జన్నిత్యవ

\+ స్ఫూర్జన్, హేతిః, విద్యుదితి వి + ద్యుత్, ప్రహేతిరితి ప్ర + హేతిః, తేభ్యః, నమః, అస్తు, తే, నః, అవన్తు, తే, నః, మృడయన్తు, తే, యమ్, ద్విష్మః, యః చ, నః, ద్వేష్టి, తమ్, ఏషామ్, జమ్భే, దధ్మః ॥౧౯॥

**పదార్థః** :-(అయమ్) (ఉపరి) వర్తమానః (అర్వాగ్వసుః) అర్వాగ్వృష్టేః పశ్చాద్వసు ధనం యస్మాత్స హేమన్తర్తుః (తస్య) (సేనజిత్) యః సేనయా జయతి సః. అత్ర జ్యాపోః సంజ్ఞాఛన్దసోర్బహులమితి హ్రస్వత్వం (చ) (సుషేణః) శోభనా సేనా యస్య సః (చ) (సేనానీగ్రామణ్యౌ) ఏతద్వద్వర్తమానౌ మార్గశీర్షపౌషౌ మాసౌ (ఉర్వశీ) ఉరు బహు అశ్నాతి యయా సా దీప్తిః (చ) (పూర్వచిత్తిః) పూర్వా ప్రథమా చిత్తిః సంజ్ఞానం యస్యాః సా (చ) (అప్సరసౌ) (అవస్ఫూర్జన్) అర్వాచీనం ఘోషం కుర్వన్ (హేతిః) వజ్రఘోషః (విద్యుత్) (ప్రహేతిః) ప్రకృష్టో వజ్రఇవ (తేభ్యః) (నమః) (అస్తు) (తే) (నః) (అవన్తు) (తే) (నః) (మృడయన్తు) (తే) (యమ్) (ద్విష్మః) (యః) (చ) (నః) (ద్వేష్టి) (తమ్) (ఏషామ్) (జమ్భే) (దధ్మః) ॥ ౧౯ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథాఽయముపరి వర్తమానోఽర్వాగ్వసుర్హేమన్తర్తు రస్తి తస్య సేనజిచ్చ సుషేణశ్చ సేనానీగ్రామణ్యావివ మార్గశీర్షపౌషౌ మాసావుర్వశీ చ పూర్వచిత్తిశ్చాప్సరసావవస్ఫూర్జన్ హేతి ర్విద్యుత్ప్రహేతిశ్చాస్తి తేభ్యో నమోఽన్నమస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే వయం యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మస్తం యూయమపి తథా విదధత ॥ ౧౯ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. ఇయమపి హేమన్తర్తోః శిష్టా వ్యాఖ్యా. ఇమమృతుం మనుష్యా యుక్త్యా సేవిత్వా బలిష్ఠా భవన్తు. ॥ ౧౯ ॥

**పదార్థము** :-ఓ మానవులారా! ఎట్లు (అయమ్) ఈ (ఉపరి) పైని (అర్వాగ్వసుః) వృష్టి తరువాత ధనములకు హేతువుయ్యై యున్నదో (తస్య) దాని (సేనజిత్) సైన్యములచే జయించు (చ) మరియు (సుషేణః) చక్కని సేనాపతి (చ) ఈ యిరువురును (సేనానీగ్రామణ్యౌ) సేనాధ్యక్ష, గ్రామాధ్యక్షులవలె నున్న మార్గశిర పుష్యమాసములు (ఉర్వశీ) అధికముగ దినుటకు హేతువగు అన్తర్యదీప్తి (చ) మరియు (పూర్వచిత్తిః) ఆది జ్ఞానమునకు హేతువు (చ) ఈ రెండును (అప్సరసౌ) ప్రాణములందుండు (అవస్ఫూర్జన్) భయంకర ఘోషణనొనర్చుచు (హేతిః) వజ్రమువంటి (విద్యుత్) విద్యుత్తును నడిపించునట్టి అశనిపాతము[పిడుగు]ను పడవేయునట్టి (ప్రహేతిః) ఉత్తమ వజ్రమువలె ఏ రక్షణప్రాణిగలదో (తేభ్యః) వారికై (నమః) అన్నము మున్నగు పదార్థములు (అస్తు) లభించుగాక! (తే) వారు (నః) మమ్ము (అవన్తు) రక్షింతురుగాక! (తే) వారు (నః) మమ్ము (మృడయన్తు) సుఖవంతులనొనర్చెదరు గాక! (తే) అట్టి మేము

(యమ్) ఏ దుష్టుని (ద్విష్మః) ద్వేషింతుమో (చ) మరియు (యః) ఎవరు (నః) మమ్ము (ద్వేష్టి) ద్వేషింతురో (తమ్) వారిని మేము (ఏషామ్) ఈ హింసకప్రాణుల (జమ్భే) ముఖమునందు (దధ్మః) చొనుపుదుముగాక! ఇదేవిధముగ మీరును యొనర్పుడు. ॥౧౯॥

**భావార్థము** :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఇదియును హేమంత ఋతువుయొక్క శేషవ్యాఖ్యయై యున్నది. మనుష్యులు ఈ ఋతువును యుక్తియుక్తముగ సేవనమొనర్చి శక్తిశాలురు గావలయును. ॥౧౯॥

19.This one direction above, is the source of wealth after rains. Its army conqueror and well-armed lords are both Margshirsh and Paush months of winter, like the head of an army and the village chieftain. The internal fire that is the cause of eating much, and intellect the recipient of eternal knowledge are two forces that reside in the Pranas. Thundering is its weapon and lightning its missile-weapon. We offer food to persons who are our guardians like them. May they protect us and make us comfortable. We place in the jaws of thunder and lightning the man whom we hate and who hates us!.

౭౩౯. అగ్నిర్మూ ర్ధేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీఛన్దః, షడ్జః స్వరః.

కథం జనైర్బలం వర్ధనీయమిత్యాహ. మానవు లెటుల బలమును పెంచుకొనవలయును.

౭౩౯ అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా౨ అయమ్।

అపాꣳరేతాꣳసి జిన్వతి ॥౨౦॥

**ప.వి:**- అగ్నిః, మూర్ధా, దివః, కకుత్ + పతిః, పృథివ్యాః, అయమ్, అపామ్, రేతాꣳసి, జిన్వతి॥౨౦॥

**పదార్థః** :-(అగ్నిః) ప్రసిద్ధః పావకః (మూర్ధా) శిర ఇవ సూర్యరూపేణ వర్తమానః (దివః) ప్రకాశస్య (కకుత్పతిః) దిశాం పాలకః (పృథివ్యాః) భూమేశ్చ (అయమ్) (అపామ్) ప్రాణానామ్ (రేతాంసి) వీర్యాణి (జిన్వతి) ప్రీణాతి.॥ ౨౦॥

**అన్వయః** :-యథా హేమన్తర్తావయమగ్నిర్దివః పృథివ్యాశ్చ మధ్యే మూర్ధా కకుత్పతిః సన్నపాం రేతాంసి జిన్వతి తథైవ మనుష్యైర్బలిష్ఠైర్భవితవ్యమ్. ॥ ౨౦ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యుక్త్యా జాఠరాగ్నిం వర్ధయిత్వా సంయమేనాహార విహారౌ కృత్వా సదా బలం వర్ధనీయమ్. ॥ ౨౦ ॥

పదార్థము :-హేమంతఋతువునం దెట్లు (అయమ్) ఈ ప్రసిద్ధ (అగ్నిః) అగ్ని (దివః) ప్రకాశము మరియు (పృథివ్యాః) భూమధ్యమునందు (మూర్ధా) శిరస్సువలె సూర్యరూపమున గలదో (కకుత్పతిః) దిశలను రక్షించునదై (అపామ్) ప్రాణముల (రేతాంసి) పరాక్రమములను (జిన్వతి) పూర్ణత్వముతో తృప్తిపరచునో అదేవిధముగ మనుష్యులు బలశాలురు గావలయును.॥౨౦॥

భావార్థము:-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు యుక్తాహార విహారములచే జఠరాగ్నిని పెంపొందించుకొని సంయమవంతులై సదా బలశక్తులను పెంపొందించుకొన వలయును.॥౨౦॥

20.This Agni, resides between the Earth and Heaven, like head in the shape of the Sun. Being the protector of all directions, it satisfies the forces of our breaths.

౭౪౦. అయమగ్నిరిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునర్మనుష్యః కిం కుర్యాదిత్యాహ. మానవు లేమి చేయవలెను?

౭౪౦ అయమగ్నిః సహస్రిణో వాజస్య శతినస్పతిః।
మూర్ధా కవీ రయీణామ్ ॥౨౧॥

ప. వి:-అయమ్, అగ్నిః, సహస్రిణః, వాజస్య, శతినః, పతిః, మూర్ధా, కవిః, రయీణామ్॥౨౧॥

పదార్థః :-(అయమ్) (అగ్నిః) హేమన్తే వర్తమానః (సహస్రిణః) ప్రశస్తాసంఖ్యపదార్థయుక్తస్య (వాజస్య) అన్నస్య (శతినః) ప్రశస్తైర్గుణైః సహ శతధా వర్తమానస్య (పతిః) పాలకః (మూర్ధా) ఉత్తమాంగవద్వర్తమానః (కవిః) క్రాన్తదర్శనః (రయీణామ్) ధనానామ్.॥౨౧॥

అన్వయః :-హే మనుష్యాః! యథాఽయమగ్నిః సహస్రిణః శతినో వాజస్య రయీణాం చ పతిర్మూర్ధా కవిరస్తి తథైవ యూయం భవత. ॥ ౨౧ ॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా విద్యాయుక్తిభ్యాం సేవితోఽగ్నిః పుష్కలే ధనధాన్యే ప్రయచ్ఛతి తథైవ సేవితః పురుషార్థో మనుష్యాన్ శ్రీమతః సంపాదయతి. ॥ ౨౧ ॥

పదార్థము :-ఓ మానవులారా! (అయమ్) ఈ (అగ్నిః) హేమంతఋతువునందుగల (సహస్రిణః) ప్రశస్తమగు అసంఖ్యాక పదార్థములచే (శతినః) ప్రశంసిత గుణములచే అనేక ప్రకారములతో (వాజస్య) అన్నము

(రయీణామ్) ధనముల (పతిః) రక్షకము (మూర్ధా) ఉత్తమాంగమువలె (కవిః) సమర్థవంతమైయున్నట్లు మీరును అగుడు. ॥౨౧॥

**భావార్థము** :- ఈ మంత్రమందును వాచకలుప్తోపమాలంకార మున్నది. విద్యాయుక్తి జ్ఞానములచే సేవించబడిన యగ్ని విరివిగా అన్నము, ధనములను ప్రాప్తింపజేయునట్లు సేవించబడిన పురుషార్థము మానవుల నైశ్వర్యవంతులుగ నొనర్చును. ॥౨౧॥

21.This fire in winter, present in thousands of nice objects, and possessing hundreds of characteristics, is the lord of foodgrains and riches, and beautiful like the head.

౭౪౧.త్వామగ్న ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః స కీదృశః స్యాదిత్యాహ. ఆత డెటువంటివాడు?

## ౭౪౧ త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత।
## మూర్ధ్నో విశ్వస్య వాఘతః ॥౨౨॥

**ప.వి:- త్వామ్ అగ్నే, పుష్కరాత్, అధి, అథర్వా, నిః, అమన్థత, మూర్ధ్నః విశ్వస్య, వాఘతః॥౨౨॥**

**పదార్థః** :-(త్వామ్) (అగ్నే) విద్వన్! (పుష్కరాత్) అన్తరిక్షాత్. పుష్కరమిత్యన్తరిక్షనామ...నిఘం. ౧.3 (అధి) (అథర్వా) అహింసకః (నిః) నితరామ్ (అమన్థత) మథిత్వా గృహ్ణీయాత్ (మూర్ధ్నః) శిరోవద్వర్తమానస్య (విశ్వస్య) సమగ్రస్య జగతో మధ్యే (వాఘతః) సుశిక్షితాభిర్వాగ్భిరవిద్యా హన్యతే తేన స మేధావీ, వాఘత ఇతి మేధావి.నా.. నిఘం..3.౧౫.

**అన్వయః** :-హే అగ్నే! యథాఽథర్వా వాఘతో విద్వాన్ పుష్కరాదధి మూర్ధ్నో విశ్వస్య చ మధ్యేఽగ్నిం విద్యుతం నిరమన్థత తథైవ త్వాం బోధయామి. ॥ ౨౨ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్విద్వదనుకరణేనాకాశాత్ పృథివ్యాశ్చ విద్యుతం సంగృహ్యైశ్వర్యాణి కర్మాణి సాధనీయాని. ॥ ౨౨ ॥

**పదార్థము** :-(అగ్నే) ఓ విద్వాంసుడా! (అథర్వా) రక్షకుడు (వాఘతః) ఉత్తమ శిక్షితమగు వాణిద్వారా అవిద్యను నాశమొనర్చు బుద్ధిశాలియగు విద్వాంసుడు (పుష్కరాత్) అంతరిక్షము (అధి) మధ్యన, (మూర్ధ్నః) శిరస్సువలెనుండి (విశ్వస్య) సంపూర్ణజగత్తునందు అగ్నిని (నిరమన్థత) నిరంతరము మథన పరచి గ్రహణమొనర్చునట్లు (త్వామ్) నీకు నేను బోధించుచున్నాను. ॥౨౨॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు విద్వాంసులవలె పృథివీ ఆకాశములనుండి విద్యుత్తును గ్రహణమొనర్చి ఆశ్చర్యజనకకర్మలను సాధించుట యోగ్యమై యున్నది. ॥౨౨॥

22.O learned person, I instruct thee that a harmless, wise scholar, disples ignorance with instructive speech, creates fire from the atmosphere, by churning, and is mighty like the head!.

౨౪౨. భువ ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః స కీదృశః స్యాదిత్యాహ. మరల నత డెట్లుండును?

౨౪౨ భువో యజ్ఞస్య రజసశ్చ నేతా యత్రా నియుద్భిః సచసే శివాభిః।

దివి మూర్ధానం దధిషే స్వర్షాం జిహ్వామగ్నే చకృషే హవ్యవాహమ్ ॥౨౩॥

ప.వి:-భువః, యజ్ఞస్య, రజసః, చ, నేతా, యత్ర, నియుద్భిరితి ని + యుద్భిః, సచసే, శివాభిః, దివి, మూర్ధానమ్, దధిషే, స్వర్షామితి స్వః + సామ్, జిహ్వామ్, అగ్నే, చకృషే, హవ్య+వాహమ్ ॥౨౩॥

**పదార్థః** :-(భువః) భవతీతి తస్య (యజ్ఞస్య) సంగతస్య కార్యసాధకస్య వ్యవహారస్య (రజసః) లోకసమూహస్య (చ) (నేతా) నయనకర్తా (యత్ర) అత్ర ఋచితును.. ఇతి దీర్ఘః. (నియుద్భిః) మిశ్రికామిశ్రికాభిః క్రియాభిః (సచసే) యునక్షి (శివాభిః) మంగలకారిణీభిః (దివి) ద్యోతనాత్మకే స్వస్వరూపే (మూర్ధానమ్) మూర్ధేవ వర్తమానం సూర్యమ్ (దధిషే) ధరసి (స్వర్షామ్) స్వ సుఖం సనోతి దదాతి యయా తామ్ (జిహ్వామ్) వాచమ్. జిహ్వేతి వాఙ్నా.. నిఘం ౧.౧౧ (అగ్నే) విద్వన్ (చకృషే) కరోతి (హవ్యవాహమ్) యో హవ్యాన్ దాతుమాదాతుం చ యోగ్యాన్ రసాన్ వహతి తమ్. ॥ ౨౩ ॥

**అన్వయః** :-హే అగ్నే! యథాఽయమగ్నిర్నియుద్భిః శివాభిః సహ వర్తమానః భువో యజ్ఞస్య రజసశ్చ నేతా సన్ సచతే. యత్ర దివి మూర్ధానం దధాతి హవ్యవాహం స్వర్షాం జిహ్వాం చకృషే తథా తత్ర త్వం దివి సచసే విద్యాం దధిషే ॥ ౨౩ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథాగ్నిరీశ్వరేణ నియుక్తః సన్ సర్వస్య జగతః సుఖకారీ వర్తతే తథైవ విద్యాగ్రాహకా అధ్యాపకాః సర్వేషాం జనానాం సుఖకారిణః సన్తీతి జ్ఞేయమ్. ॥ ౨౩ ॥

**పదార్థము** :-(అగ్నే) ఓ విద్వాంసుడా! ఎట్లే ప్రత్యక్షాగ్ని (నియుద్భిః) సంయోగమును విభాగమొనర్చుక్రియ మరియు (శివాభిః) మంగళప్రదమగు దీప్తులతో గూడ (భువః) ప్రకటితమైన (యజ్ఞస్య) కార్యసాధకమగు సంగతవ్యవహారములను (చ) మరియు (రజసః) లోకముల సమూహములను (నేతా) ఆకర్షింపజేయుచు సంబంధపరచునో మరియు (యత్ర) ఏ (దివి) ప్రకాశవంత స్వస్వరూపమందు (మూర్ధానమ్) ఉత్తమాంగమువలె వర్తమానమైయున్న సూర్యుని ధారణమొనర్చునో మరియు (హవ్యవాహమ్) ఇచ్చిపుచ్చుకొనయోగ్యమగు రసములను ప్రాప్తిగలిగించు (స్వర్షామ్) సుఖదాయక (జిహ్వామ్) వాణిని (చక్రషే) ప్రవృత్తపరచునో, అట్లే నీవు శుభగుణములచే (సచసే) యుక్తమగుచు మరియు సకలవిద్యలను (దధిషే) ధారణమొనర్పజేయుము. ॥౨౩॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఈశ్వరుడు నియుక్తపరచిన అగ్ని విశ్వమంతటికి సుఖదాయకమగునట్లు విద్యలను గ్రహించిన అధ్యాపకులు సమస్త మానవులకు సుఖదాయకు లగుదురు. ఇట్లని ఎల్లరును ఎరుగువలెను. ॥౨౩॥

23.O learned person, this visible fire, with its properties of alliance and division, full of blissful flames, helps in the performance of yajna, and wordly deeds. It imbibes in its lustrous nature the lofty sun!.

It stimulates the pleasant speech, worthy of acceptance and giver of enjoyments.

Like fire, the learned person, full of noble qualities should preach all sciences.

౭౪౩.అబోధీత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

పునః స కీదృశో భవేదిత్యాహ. మఱల నత డెట్టివాడు?

౭౪౩ అబోధ్యగ్నిః సమిధా జనానాం ప్రతి ధేనుమివాయతీముషాసమ్ ।

యహ్వా౨ ఇవ ప్ర వయాముజ్జిహానాః ప్ర భానవః సిస్రతే నాకమచ్ఛ ॥౨౪॥

ప.విః-అబోధి, అగ్నిః, సమిధేతి సమ్ + ఇధా, జనానామ్, ప్రతి, ధేనుమివేతి ధేనుమ్ + ఇవ, ఆయతీ మిత్యా + యతీమ్, ఉషాసమ్, ఉషసమిత్యుషసమ్, యహ్వా ఇవేతి యహ్వాః + ఇవ, ప్ర, వయామ్, ఉజ్జిహానా ఇత్యుత్ + జిహానాః, ప్ర, భానవః, సిస్రతే, నాకమ్, అచ్ఛ ॥౨౪॥

**పదార్థః** :-(అబోధి) ప్రబుధ్యతే (అగ్నిః) (సమిధా) ప్రదీపనసాధనైః (జనానామ్) మనుష్యాణామ్ (ప్రతి) (ధేనుమివ) యథా దుగ్ధదాం గాం తథా (ఆయతీమ్) ప్రాప్నువతీమ్ (ఉషాసమ్) ఉషసం ప్రభాతమ్.

అత్రాన్యేషామపీతి దీర్ఘః (యహ్వా ఇవ) మహాంతో ధార్మికా జనా ఇవ (ప్ర) (వయామ్) వ్యాపికాం సుఖనీతిమ్ (ఉజ్జిహానాః) ఉత్కృష్టతయా ప్రాప్నువన్తః (ప్ర) (భానవః) కిరణాః (సిస్రతే) ప్రాపయన్తి. అత్ర స్పృధాతో ర్లటి శపః శ్లుర్వ్యత్యయేనాత్మనేపదమన్తర్గతో ణ్యర్థశ్చ (నాకమ్) అవిద్యమానదుఃఖమాకాశమ్ (అచ్ఛ) సమ్యక్. ॥ ౨౪ ॥

**అన్వయః** :- హే మనుష్యాః! యథా సమిధాయమగ్నిరబోధ్యాయతీముషాసం ప్రతి జనానాం ధేనుమివాస్తి. యస్య యహ్వా ఇవ ప్రవయాముజ్జిహానాః ప్రభానవో నాకమచ్ఛ సిస్రతే తం సుఖాయ యూయం సంప్రయుఙ్గ్ధ్వమ్. ॥ ౨౪ ॥

**భావార్థః** :- అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా దుగ్ధదాత్రీ ధేనుర్గౌః సంసేవితా సతీ దుగ్ధాదిభిః ప్రాణినః సుఖయతి యథాఽఽప్తా విద్వాంసో విద్యాదానేనావిద్యాం నివార్య మనుష్యానున్నయన్తి తథైవాయ మగ్నిర్వర్తత ఇతి వేద్యమ్. ॥ ౨౪ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎట్లు (సమిధా) ప్రజ్వలితపరచు సాధనములచే ఈ (అగ్నిః) అగ్ని (అబోధి) ప్రకాశితమగునో (ఆయతీమ్) ప్రాప్తించుచు (ఉషాసమ్) ప్రభాత సమయమున (ప్రతి) సమీపమున (జనానామ్) మనుష్యుల (ధేనుమివ) పాడిగోవువలె గలదో, ఏ యగ్నియొక్క (యహ్వా ఇవ) మహాధార్మిక జనులవలె (ప్ర) ఉత్తమమగు (వయామ్) వ్యాపకసుఖములనీతిని (ఉజ్జిహానః) చక్కగా పొందుచు (ప్ర) ఉత్తమమమగ (భానవః) కిరణముల (నాకమ్) సుఖములను (అచ్ఛ) శ్రేష్ఠరూపమున (సిస్రతే) ప్రాప్తిజేసికొందురో మీరును సుఖముకొరకై సంయుక్తపరచుడు. ॥౨౪॥

**భావార్థము** :- ఈ మంత్రములో ఉపమా, వాచకలుప్తోపమాలంకారములు గలవు. చక్కగా సేవించబడిన క్షీరములనిచ్చుగోవు పాలు మున్నగు పదార్థములచే ప్రాణులకు సుఖము గలిగించునట్లు, మరియు ఆప్తవిద్వాంసులు విద్యా దానముచే అవిద్యను దొలగించి మనుష్యులను ఉన్నత పరచునట్లు ఈయగ్నియును గలదని సకల మానవులును ఎరుగదగును. ॥౨౪॥

24. With fuel the fire is kindled. Juist as calf is pleased seeing the cow coming, so are people delighted by seeing the Dawn. Just as highly religious people fairly. well resort to permanent devices of happiness, so do the rays wholly attain to heaven.

౭౪౪. అవోచామేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్స కీదృశ ఇత్యాహ. మఱల నాత డెట్టివాడు?

౭౪౪ అవోచామ కవయే మేధ్యాయ వచో వన్దారు వృషభాయ వృష్ణే।

గవిష్ఠిరో నమసా స్తోమమగ్నౌ దివీవ రుక్మమురువ్యంచమశ్రేత్ ॥౨౫॥

ప. వి:- అవోచామ, కవయే, మేధ్యాయ, వచః, వన్దారు, వృషభాయ, వృష్ణే, గవిష్ఠిరః, గవిష్ఠిర ఇతి గవి + స్థిరః, నమసా, స్తోమమ్, అగ్నౌ, దివీవేతి దివి + ఇవ, రుక్మమ్, ఉరువ్యంచమిత్యురు + వ్యంచమ్, అశ్రేత్ ॥౨౫॥

**పదార్థః** :-(అవోచామ) ఉచ్యామ (కవయే) మేధావినే (మేధ్యాయ) సర్వశుభలక్షణసంగతాయ పవిత్రాయ (వచః) వచనమ్ (వన్దారు) ప్రశంశనీయం (వృషభాయ) బలిష్ఠాయ (వృష్ణే) వృష్టికర్త్రే (గవిష్ఠిరః) గోషు కిరణేషు తిష్ఠతీతి (నమసా) అన్నాదినా (స్తోమమ్) స్తుత్యం కార్యమ్ (అగ్నౌ) పావకే (దివీవ) యథా సూర్యప్రకాశే (రుక్మమ్) ఆదిత్యమ్ (ఉరువ్యఞ్చమ్) ఉరుషు బహుషు విశేషేణాంచతి తమ్ (అశ్రేత్) శ్రయేత్. అత్ర వికరణస్య లుక్. లఙ్ప్రయోగశ్చ ॥ ౨౫ ॥

**అన్వయః** :-వయం యథా గవిష్ఠిరో దివీవోరువ్యఞ్చం రుక్మమశ్రేత్తథా మేధ్యాయ వృషభాయ వృష్ణే కవయే వన్దారు వచోఽగ్నౌ నమసా స్తోమం చావోచామ. ॥ ౨౫ ॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. విద్వద్భిః సుశీలాయ శుద్ధధియే విద్యార్థినే పరమప్రయత్నేన విద్యా దేయా యతోఽసౌ విద్యామధీత్య సూర్యప్రకాశే ఘటపటాదీన్ పశ్యన్నివ సర్వాన్ యథావజ్జ్ఞాతుం శక్నుయాత్. ॥ ౨౫ ॥

**పదార్థము** :-మేమెట్లు (గవిష్ఠిరః) కిరణములందుండు విద్యుత్తు (దివీవ) సూర్యప్రకాశమువలె (ఉరువ్యఞ్చమ్) విశేషముగ అనేకములందు గమన శీలమైన (రుక్మమ్) సూర్యుని (అశ్రేత్) ఆశ్రయించుదుమో అట్లే (మేధ్యాయ) సకల శుభలక్షణములతో పవిత్రమగు (వృషభాయ) బలశాలి (వృష్ణే) వర్షహేతువైన (కవయే) బుద్ధిశాలునకు (వన్దారు) ప్రశంసనీయములగు (వచః) వచనములను (అగ్నౌ) జఠరాగ్నియందు (నమసా) అన్నాదులచే (స్తోమమ్) ప్రశస్తకార్యములను (అవోచామ్) వచింతుముగాక! ॥౨౫॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. సుశీలుడు, శుద్ధబుద్ధిగల విద్యార్థికి పరమ ప్రయత్నముచే విద్వాంసులు విద్యలనీయవలెను. ఇందువల్ల నాతడు విద్యలనేర్చి సూర్యప్రకాశమందు ఘటపటాదులను జూచునట్లు సర్వమును యథావతుగ జూచి తెలిసికొనగల సమర్థుడగును. ॥౨౫॥

25.Let us use respectful language for a person, who is pure, instellignet, wise, strong, and virtuous. Let him who expounds the vedic lore, humbly divulge the praises of the Effulgent God, as the sun seated in its rays, sheds in heaven the lustre that spreads to various places.

**౨౬. అయమిహేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.**

**పునః స కీదృశ ఇత్యాహ. మఱల నాత డెట్టివాడు?**

౨౬॥ అయమిహ ప్రథమో ధాయి ధాతృభిర్హోతా యజిష్ఠో౽ అధ్వరేష్వీడ్యః।
యమప్నవానో భృగవో విరురుచుర్వనేషు చిత్రం విభ్వం విశేవిశే ॥౨౬॥

ప.వి:- అయమ్, ఇహ, ప్రథమః, ధాయి, ధాతృభిరితి ధాతృ + భిః, హోతా, యజిష్ఠః, అధ్వరేషు, ఈడ్యః, యమ్, అప్నవానః, భృగవః, విరురుచురితి వి + రురుచుః, వనేషు, చిత్రమ్, విభ్వమితి వి + భ్వమ్, విశేవిశ ఇతి విశే + విశే ॥ ౨౬ ॥

పదార్థః :-(అయమ్) (ఇహ) (ప్రథమః) విస్తీర్ణో౽గ్నిః (ధాయి) ధ్రియతే (ధాతృభిః) ధారకైః (హోతా) ఆదాతా (యజిష్ఠః) అతిశయేన యష్టా (అధ్వరేషు) అహింసనీయవ్యవహారేషు (ఈడ్యః) అన్వేషితుం యోగ్యః (యమ్) (అప్నవానః) రూపవన్తః. అప్నమితి రూపనా.. నిఘం. ౩.౭. అత్ర ఛాన్దసో వర్ణలోప ఇతి మతో స్తలోపః (భృగవః) పరిపక్వవిజ్ఞానాః (విరురుచుః) విరోచన్తే ప్రకాశన్తే (వనేషు) రశ్మిషు (చిత్రమ్) అద్భుతమ్ (విభ్వమ్) వ్యాపకమ్ (విశేవిశే) ప్రజాయై ప్రజాయై ॥ ౨౬ ॥

**అన్వయః** :-య ఇహాధ్వరేష్వీడ్యో యజిష్ఠో హోతా ప్రథమో౽యమగ్నిర్ధాతృభిర్ధాయి. యం వనేషు చిత్రం విభ్వం విశేవిశే౽ప్నవానో భృగవో విరురుచుస్తం సర్వే మనుష్యా అఙ్గీకుర్యుః. ॥ ౨౬ ॥

**భావార్థః** :-విద్వాంసో౽గ్నిర్విద్యాం ధృత్వా౽న్యేభ్యః ప్రదద్యుః ॥ ౨౬ ॥

**పదార్థము** :-ఎవరు (ఇహ) ఈ ప్రపంచములో (అధ్వరేషు) రక్షాయోగ్యమగు వ్యవహారములందు (ఈడ్యః) అన్వేషించదగిన (యజిష్ఠః) అతిశయముగ యజ్ఞసాధకమగు (హోతా) ఘృతము మున్నగువాని గ్రహణకర్త (ప్రథమః) అంతటను విస్తృతమైయున్న (అయమ్) ఈ ప్రత్యక్షాగ్ని (ధాతృభిః) ధారణమొనర్చు వారిచే (ధాయి) ధారణమొనర్చబడెనో (యమ్) ఎద్దానిచే (వనేషు) కిరణములందు (చిత్రమ్) ఆశ్చర్యరూపమున (విభ్వమ్) వ్యాపకాగ్నిని (విశే విశే) సకల ప్రజలకొరకై (అప్నవానః) రూపవంతులు (భృగవః) పూర్ణజ్ఞానులు (విరురుచుః) విశేషముగ ప్రకాశపరచుచున్నారో అట్టియగ్నిని ఎల్లరును స్వీకరించ వలయును. ॥౨౬॥

**భావార్థము** :-విద్వాంసులు అగ్నివిద్యను సంపూర్ణముగ తా మెరిగి సకలమానవులకును అట్టి విద్యను నేర్పవలయును. ॥౨౬॥

26.In this world, this visible fire, serviceable in works of protection, worthy of investigation, the paramount accomplisher of sacrifice (yajna), the recipient of ghee, and ubiquitous, is acknowledged by the learned. The beautiful persons, adequately advanced in knowledge expound for all people this fire pervading the beams wondrously.

౭౪౬. జనస్యేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, విచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. మఱల నాత డెట్టివాడు?

౭౪౬ జనస్య గోపా ఉ అజనిష్ట జాగృవిరగ్నిః సుదక్షః సువితాయ నవ్యసే।

ఘృతప్రతీకో బృహతా దివిస్పృశా ద్యుమద్విభాతి భరతేభ్యః శుచిః॥౨౭॥

ప. విః- జనస్య, గోపాః, అజనిష్ట, జాగృవిః, అగ్నిః, సుదక్ష ఇతి సు + దక్షః, సువితాయ, నవ్యసే, ఘృత ప్రతీక ఇతి ఘృత + ప్రతీకః, బృహతా, దివిస్పృశేతి దివి + స్పృశా, ద్యుమదితి ద్యు + మత్, వి, భాతి, భరతేభ్యః, శుచిః ॥ ౨౭ ॥

**పదార్థః** :-(జనస్య) జాతస్య (గోపాః) రక్షకః (అజనిష్ట) జాతః (జాగృవిః) జాగరూకః (అగ్నిః) విద్యుత్ (సుదక్షః) సుష్ఠుబలః (సువితాయ) ఉత్పాదనీయాయైశ్వర్యాయ (నవ్యసే) అతిశయేన నవీనాయ. అత్ర ఛాన్దసో వర్ణలోపో వేతి ఈలోపః (ఘృతప్రతీకః) ప్రతీతికరం జలమాజ్యం వా యస్య సః (బృహతా) మహతా (దివిస్పృశా) దివి ప్రకాశే స్పృశతి యేన తేన (ద్యుమత్) ద్యౌః ప్రకాశోఽస్త్యస్మిన్ తద్వత్ (వి) (భాతి) (భరతేభ్యః) ఆదిత్యేభ్యః భరత ఆదిత్యాః నిఘ. ౧.౧౩. (శుచిః) పవిత్రః. ॥ ౨౭ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యో జనస్య గోపా జాగృవిః సుదక్షో ఘృతప్రతీకః శుచిరగ్నిర్నవ్యసే సువితాయాఽజనిష్ట బృహతా దివిస్పృశా భరతేభ్యో ద్యుమద్విభాతి తం యూయం విజానీత. ॥ ౨౭ ॥

**భావార్థః** :-మనుష్యైర్యదైశ్వర్యప్రాప్తేరసాధారణం నిమిత్తం సృష్టిస్థానాం సూర్యాణాం కారణం విద్యుత్తేజ స్తద్విజ్ఞాయోపయోక్తవ్యమ్. ॥ ౨౭ ॥

**పదార్థము** :-ఓ మానవులారా! (జనస్య) ఉత్పన్నమైన విశ్వముయొక్క (గోపాః) రక్షకుడు (జాగృవిః) ఎరుగగల స్వభావముగల (సుదక్షః) ఉత్తమ బలమునకు హేతువు (ఘృతప్రతీకః) ఘృతముచే వృద్ధియగు (శుచిః) పవిత్రమైన (అగ్నిః) విద్యుత్తు (నవ్యసే) అత్యంత నవీనము (సువితాయ) ఉత్పన్నమొనర్చదగిన ఐశ్వర్యము కొరకు (అజనిష్ట) ఏది ప్రకటమై యున్నదో మరియు (బృహతా) గొప్ప (దివిస్పృశా) ప్రకాశమునందలి స్పర్శముచే (భరతేభ్యః) సూర్యులనుండి (ద్యుమత్) ప్రకాశముతో గూడినదగుచున్నదో (విభాతి) సుశోభితమగుచున్నదో అట్టి దానిని మీరు తెలిసికొనుడు. ॥౨౭॥

**భావార్థము** :-ఐశ్వర్యప్రాప్తికి విశేషకారణమును, సృష్టియందలి సకల సూర్యులకు నిమిత్తమునగు విద్యుద్రూప తేజస్సును మానవులెల్లరును తెలిసికొని ఉపయోగించుకొనవలెను. ॥౨౭॥

27.Fire, the guardian of the created world, ever active, full of strength, developing with ghee, and pure, is born for fresh prosperity. Illumined by the suns, it glitters with the intense touch of light.

౭౪౭.త్వామగ్న ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్షీ జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. మఱల నాత డెట్టివాడు?

౭౪౭ త్వామగ్నఽ అఙ్గిరసో గుహా హితమన్వవిన్దఞ్ఛిశ్రియాణం వనేవనే జాయసే మథ్యమానః సహో మహత్త్వామాహుః సహసస్పుత్రమఙ్గిరః ॥౨౮॥

ప.వి:-త్వామ్, అగ్నే, అఙ్గిరసః, గుహా, హితమ్ అను, అవిన్దన్, శిశ్రియాణమ్, వనేవన ఇతి వనే + వనే, సః, జాయసే, మథ్యమానః, సహః, మహత్, త్వామ్, ఆహుః, సహసః, పుత్రమ్, అఙ్గిరః ॥౨౮॥

**పదార్థః** :-(త్వామ్) (అగ్నే) విద్వన్! (అఙ్గిరసః) విద్వాంసః (గుహా) గుహాయాం బుద్ధౌ. అత్ర సుపాం సులుగితి ఙేర్లుక్ (హితమ్) హితకారిణమ్ (అను) (అవిన్దన్) ప్రాప్నుయుః (శిశ్రియాణమ్) శ్రయన్తమ్ (వనే వనే) రశ్మౌ రశ్మౌ పదార్థే పదార్థే వా (సః) (జాయసే) (మథ్యమానః) సంఘృష్యమాణః (సహః) బలమ్ (మహత్) (త్వామ్) తమ్ (ఆహుః) కథయన్తి (సహసః) బలవతో వాయోః (పుత్రమ్) ఉత్పన్నమ్ (అఙ్గిరః) ప్రాణవత్ ప్రియ! ॥ ౨౮ ॥

**అన్వయః** :-హేఽఙ్గిరోఽగ్నే! త్వం స మథ్యమానోఽగ్నిరివ విద్యయా జాయసే యథా మహత్సహో యుక్తం సహసస్పుత్రం వనే వనే శిశ్రియాణం గుహా హితం త్వామాహురఙ్గిరసోఽన్వవిన్దం స్తథా త్వామహం బోధయామి॥ ౨౮॥

**భావార్థః** :- ద్వివిధోఽగ్నిర్మానసో బాహ్యశ్చాస్తి తయోరాభ్యన్తరం యుక్తాభ్యామాహారవిహారాభ్యాం బాహ్యం మన్థనాదిభ్యః సర్వే విద్వాంసః సేవన్తామ్, తథోత్తరే భజన్తు. ॥ ౨౮ ॥

**పదార్థము** :-(అఙ్గిరః) ప్రాణమువంటి ప్రియమైన (అగ్నే) విద్వాంసుడా! ఎట్లు (సః)ఆ (మథ్యమానః) మథనమొనర్చిన యగ్ని ప్రసిద్ధమగుచున్నదో, అట్లునీవు విద్యచే (జాయసే) ప్రకటమగుచున్నావు. ఎట్లు (మహత్) గొప్ప (సహః) శక్తివంతమగు (సహసః) బలవంతమగు వాయువుచే (పుత్రమ్) ఉత్పన్నపుత్రునివలె (వనే వనే) ప్రతికిరణము లేక ప్రతి పదార్థమునందు (శిశ్రియాణమ్) ఆశ్రితము (గుహా) బుద్ధియందు

(హితమ్) స్థిరముగు హితకారియని (త్వామ్) అట్టియగ్నిని (ఆహుః) అందురో (అఙ్గిరసః) విద్వాంసులు (అన్వవిన్దన్) పొందుచున్నట్టి జ్ఞానమును (త్వామ్) నీకు గలిగించెదను. ॥౨౮॥

**భావార్థము** :- అగ్ని రెండు విధములుగ నుండును. ఒకటి మానసము, రెండవది బాహ్యము. వీనియందు ఆన్తరాగ్నిని ఆహార విహారములచే, బాహ్యాగ్నిని మంథనము మున్నగువానిచే విద్వాంసులు సేవింతురు. అట్లే మానవులందరును సేవించవలయును. ॥౨౮॥

28.O learned person,dear like life,thou shinest with knowledge,like fire with attrition!.

Fire, highly serviceable, residing in the inmost recesses of our heart, present in all rays and objects, is called the son of highly strong and powerful air. The learned master it. I preach unto thee its significance.

౭౪౮.సఖాయ ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః,అగ్నిర్దేవతా, విరాడనుష్టుప్ఛన్దః,గాంధారః స్వరః.

మనుష్యాః కీదృశా భూత్వాగ్నిం విజానీయురిత్యాహ. మానవు లెటువంటివారలై అగ్నిని ఎఱుగవలెను?

౭౪౮ సఖాయః సం వః సమ్యఞ్చమిషస్తోమం చాగ్నయే ।

వర్షిష్ఠాయ క్షితీనామూర్జో నప్త్రే సహస్వతే ॥౨౯॥

ప.విః- సఖాయః, సమ్, వః, సమ్యఞ్చమ్, ఇషమ్, స్తోమమ్, చ, అగ్నయే, వర్షిష్ఠాయ, క్షితీనామ్, ఊర్జః, నప్త్రే, సహస్వతే ॥ ౨౯ ॥

పదార్థః :-(సఖాయః) సుహృదః (సమ్) (వః) యుష్మాకమ్ (సమ్యఞ్చమ్) యః సమీచీనమఞ్చతి తమ్ (ఇషమ్) అన్నమ్ (స్తోమమ్) స్తుతిసమూహమ్ (చ) (అగ్నయే) పావకాయ (వర్షిష్ఠాయ) అతివృద్ధాయ (క్షితీనామ్) మనుష్యాణామ్ (ఊర్జః) బలస్య (నప్త్రే) పౌత్ర ఇవ వర్తమానాయ (సహస్వతే) బహుబలయుక్తాయ. ॥ ౨౯ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథా విద్వాంసః సఖాయః సన్తః క్షితీనాం వో యుష్మాక మూర్జో నప్త్రే సహస్వతే వర్షిష్ఠాయాగ్నయే యం సమ్యఞ్చమిషం స్తోమం చ సమాహుస్తథా యూయమనుతిష్ఠత.॥౨౯॥

**భావార్థః** :-అత్ర పూర్వమంత్రాదాహురిత్యనువర్తతే. శిల్పినః సుహృదో భూత్వా విద్వదుక్తానుకూలతయా పదార్థవిద్యామనుతిష్ఠేయుః యా విద్యుత్ కారణాఖ్యాద్ బలాజ్జాయతే సా పుత్రవత్ యా సూర్యాదేః సకాశాదుత్పద్యతే సా పౌత్రవదస్తీతి వేద్యమ్. ॥౨౯॥

**పదార్థము :-** (సఖాయః) ఓ మిత్రులారా! (క్షితీనామ్) మననశీలురగు మనుష్యులు (వః) మీయొక్క (ఊర్జః) బలమునందు (నప్త్రే) పౌత్రునివలెనున్నారు (సహస్వతే) అధిక బలయుక్తులు (వర్షిష్ఠాయ) చాలపెద్దదగు(అగ్నయే) అగ్నికొరకు ఏది (సమఞ్చమ్) చక్కని సత్కారమునకు హేతువైన (ఇషమ్) అన్నమును (చ) మరియు (స్తోమమ్) స్తుతులను (సమాహుః) చక్కగా ఎట్లొనర్చుచున్నారో అట్లే మీరును దానిని చక్కగా ననుష్ఠించుడు. ॥౨౯॥

**భావార్థము :-** ఇచ్చట పూర్వ మంత్రమునుండి ''ఆహుః'' అను పదము అనువృత్తమైనది. నైపుణ్యముగల చేతిపనివారు ఎల్లరకు మిత్రులై విద్వాంసుల కథనానుసారము పదార్థవిద్యల ననుష్ఠించవలెను. విద్యుత్కారణరూప శక్తిచే నుత్పన్నమగునది పుత్రునివలె, సూర్యాదుల ప్రకాశముచే నుత్పన్నమగునది పౌత్రునివంటిదని దెలియ వలెను. ॥౨౯॥

29.O men, just as the learned, your associates, offer seemly oblations and praises to fire, supreme, and highly powerful, behaving as your grandson, so should your proceed with it!.

౭౪౯.సంసమిదిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

వైశ్యేన కిం కార్యమిత్యుపదిశ్యతే. వైశ్యు డేమి చేయవలయును ?

౭౪౯ సꣳసమిద్యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య౨ ఆ।

ఇడస్పదే సమిధ్యసే స నో వసూన్యాభర ॥30॥

ప.విః–సꣳసమితి సమ్ + సమ్, ఇత్, యువసే, వృషన్, అగ్నే, విశ్వాని, అర్యః, ఆ, ఇడః, పదే, సమ్, ఇధ్యసే, సః, నః, వసూని, ఆ, భర ॥30॥

**పదార్థః :-** (సంసమ్) సమ్యక్ (ఇత్) ఏవ (యువసే) మిశ్రయ. అత్ర వికరణాత్మనే పదవ్యత్యయః (వృషన్) బలవన్ (అగ్నే) ప్రకాశమాన (విశ్వాని) అఖిలాని (అర్యః) వైశ్యః. అర్యః స్వామివైశ్యయోరితి వైశ్యార్థే నిపాతితః (ఆ) (ఇడః) ప్రశంసనీయస్య. ఇడ ఇతి పదనా... నిఘం. ౫.౨ అత్రేడధాతో ర్బాహులకాదౌణాదికః క్విప్. ఆదేర్లస్యళ్చ (పదే) ప్రాపణీయే (సమ్) (ఇధ్యసే) ప్రదీప్యసే (సః) (నః) అస్మభ్యమ్ (వసూని) (ఆ) (భర) ధర ॥ 30 ॥

**అన్వయః :-** హే వృషన్నగ్నే! అర్యస్త్వం సంసమాయువసే ఇడస్పదే సమిధ్యసే స త్వమిదగ్నినా నో విశ్వాని వసూన్యాభర. ॥ 30 ॥

**భావార్థః** :-రాజభిః సంరక్షితా వైశ్యా అగ్న్యాదివిద్యాభ్యః స్వేభ్యో రాజపురుషేభ్యశ్చాఖిలాని ధనాని సంభరేయుః. ॥ 30 ॥

**పదార్థము** :-(వృషన్) బలశాలివి (అగ్నే) ప్రకాశవంతుడవునగు (అర్యః) ఓ వైశ్యుడా! ఏ నీవు (సంసమిద్యువసే) చాలచక్కగా సంబంధమొనర్చుచున్నావో (ఇడః) ప్రశంసనీయ (పదే) పొందదగిన అధికారమునందు (సమిధ్యసే) సుశోభితుడవగుచుందువో (సః) అట్టి నీవు (ఇత్) మాత్రమే అగ్నియోగముచే (నః) మాకొరకు (విశ్వాని) సమస్త (వసూని) ధనములను (ఆభర) శ్రేష్ఠరూపమున ధరించుము.॥30॥

**భావార్థము** :-రాజులచే రక్షణను పొందుచు వైశ్యులు అగ్ని మున్నగు విద్యలచే స్వంతముకొరకు, రాజపురుషులకొరకును సంపూర్ణ ధనములను ధరించవలెను. ॥30॥

30| O mighty, enlightened vaishya, having adequate trade relations with others, and worthy of adoration, thou lookest graceful, seated in a desirable position of vantage; bring us all riches!.

౭౫౦. త్వామిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

మనుష్యైరగ్నినా కిం సాధ్యమిత్యుపదిశ్యతే. మానవు లగ్నిచే నేమి సిద్ధింప జేయవలెను?

**౭౫౦ త్వాం చిత్రశ్రవస్తమ హవన్తే విక్షు జన్తవః।**

**శోచిష్కేశం । పురుప్రియాగ్నే హవ్యాయ వోఢవే ॥30॥**

**ప. విః**-త్వామ్, చిత్రశ్రవస్తమేతి చిత్ర శ్రవః + తమ, హవన్తే, విక్షు, జన్తవః, శోచిష్కేశమ్, శోచిః కేశమితి శోచిః + కేశమ్, పురుప్రియేతి పురు + ప్రియ, అగ్నే, హవ్యాయ, వోఢవే ॥30॥

**పదార్థః** :-(త్వామ్) (చిత్రశ్రవస్తమ) చిత్రాణ్యద్భుతాని శ్రవాంస్యతిశయితాన్యన్నాని వా యస్య (హవన్తే) స్వీకుర్వన్తు (విక్షు) ప్రజాసు (జన్తవః) జనాః (శోచిష్కేశమ్) శోచిషః కేశాః సూర్యస్య రశ్మయ ఇవ తేజాంసి యస్య తమ్ (పురుప్రియ) బహూన్ ప్రీణాతి బహూనాం ప్రియో వా తత్సంబుద్ధౌ (అగ్నే) విద్వన్ (హవ్యాయ) స్వీకర్తవ్యమన్నాదిపదార్థమ్. అత్ర సుబ్వ్యత్యయేన ద్వితీయైకవచనస్య చతుర్థ్యేకవచనమ్ (వోఢవే) వోఢుమ్. అత్ర తుమర్థే తవేన్ ప్రత్యయః ॥ 30 ॥

**అన్వయః** :-హే పురుప్రియ చిత్రశ్రవస్తమాగ్నే! విక్షు హవ్యాయ వోఢవే యం శోచిష్కేశం త్వాం జన్తవో హవన్తే తం వయమపి హవామహే ॥ 30 ॥

**భావార్థః** :- మనుష్యా యమగ్నిం జీవాః సేవన్తే తేన భారవహనాదీని కార్యాణ్యపి సాధ్నువన్తు. ॥30॥

**పదార్థము** :-(పురుప్రియ) అనేకులను ప్రసన్నమొనర్చు మరియు ననేకులకు ప్రియమైన (చిత్రశ్రవస్తమ) ఆశ్చర్యరూపములగు అన్నము మున్నగు పదార్థములచే నున్న (అగ్నే) తేజోవంతుడవగు ఓ విద్వాంసా! (విక్షు) ప్రజలయందు (హవ్యాయ) స్వీకరించదగిన అన్నము మున్నగు ఉత్తమ పదార్థములను (వోఢవే) ప్రాప్తికొరకు, (శోచిష్కేశమ్) శుష్కింపజేయు సూర్యకిరణములవంటి తేజశ్శాలివగు (త్వామ్) నిన్ను (జన్తవః) ఏ మనుష్యులు (హవన్తే) స్వీకరింతురో, దానిని మేమును స్వీకరింతుము. ॥30॥

**భావార్థము** :- జీవులే యగ్నిని సేవించుచున్నవో మానవులా యగ్నిచే భారవాహనాది కార్యములను సాధించుకొనుట పురుషార్థపరులకు యోగ్యమైనది. ॥30॥

31.O noble learned person, loved of many people invoke thee, powerful like the scorching rays of the sun acquiring necessary nice foodstuffs for the subjects!.

2131. ఏనా వ ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడ్ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. మఱల నది యెట్టిది?

## 2131 ఏనా వో॑ఽ అ॒గ్నిం నమ॑సో॒ర్జో నపా॑త॒మాహు॑వే।
## ప్రి॒యం చేతి॑ష్ఠమర॒తిꣳ స్వ॑ధ్వ॒రం విశ్వ॑స్య దూ॒తమ॒మృత॑మ్ ॥31॥

**ప.విః**- ఏ॒నా, వః॒, అ॒గ్నిమ్, నమ॑సా, ఊ॒ర్జః, నపా॑తమ్, ఆ, హు॒వే॒, ప్రి॒యమ్, చేతి॑ష్ఠమ్, అ॒ర॒తిమ్, స్వ॒ధ్వ॒రమితి॑ సు + అ॒ధ్వ॒రమ్, విశ్వ॑స్య, దూ॒తమ్, అ॒మృత॑మ్. ॥31॥

పదార్థః :-(ఏనా) ఏనేన పూర్వోక్తేన. అత్రాకారాదేశః (వః) యుష్మభ్యమ్ (అగ్నిమ్) (నమసా) గ్రాహ్యేణాన్నేన (ఊర్జః) పరాక్రమాన్ (నపాతమ్) అపతనశీలమ్ (ఆ) (హువే) ఆహ్వయే (ప్రియమ్) ప్రీత్యుత్పాదకమ్ (చేతిష్ఠమ్) అతిశయేన చేతయితారం సంజ్ఞాపకమ్ (అరతిమ్) నాస్తి రతిశ్శ్రాన్తిర్యస్మింస్తమ్ (స్వధ్వరమ్) సుష్ఠ్వధ్వరా అహింసనీయా వ్యవహారా యస్మాత్తమ్ (విశ్వస్య) సమగ్రస్య జగతః (దూతమ్) సర్వత్రాభిగన్తారం విద్యుతమ్ (అమృతమ్) కారణరూపేణ నిత్యమ్. ॥ 31 ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథాఽహం వో యుష్మభ్యమేనా నమసా నపాతం ప్రియం చేతిష్ఠం స్వధ్వరమరతిమమృతం విశ్వస్యదూతమగ్నిమూర్జశ్చాహువే తథా యూయం మహ్యం జుహుత. ॥31॥

**భావార్థః** :-హే మనుష్యాః! వయం యుష్మదర్థం యా అగ్న్యాదివిద్యాః ప్రకటయేమ తా యూయం స్వీకురుత. ॥31॥

**పదార్థము :-** ఓ మానవులారా! నేనెట్లు (వః) మీకొరకు (ఏనా) పూర్వోక్త (నమసా) గ్రహణమొనర్చదగిన అన్నముచే (నపాతమ్) దృఢస్వభావము (ప్రియమ్) ప్రీతికారకము (చేతిష్ఠమ్) అత్యంత చేతనత్వత గలిగించునది (అరతిమ్) చైతన్యరహితము (స్వధ్వరమ్) చక్కని రక్షణీయ వ్యవహారయుక్తము (అమృతమ్) కారణరూపముచే సదా (విశ్వస్య) సమస్త జగమున (దూతమ్) అన్నిదిశలకు నడచు (అగ్నిమ్) విద్యుత్తును (ఊర్జః) పరాక్రమమును (ఆహువే) స్వీకరించునట్లు నాకొరకు మీరును స్వీకరించుడు. ॥32॥

**భావార్థము :-** ఓ మానవులారా! మేము మీకొరకు ఎట్టి అగ్ని యున్నగువాని విద్యలను ప్రసిద్ధ పరచియున్నామో వానిని మీరును స్వీకరించుడు. ॥32॥

32.O men, just as I acknowledge for ye, through desirable foodgrains. Agni, steadfast in nature, lovely, giver of life, devoid of consciousness, united with harmless usages, eternal in nature, world's messenger, and your enterprises, so should ye do for me!.

**౭౩౨. విశ్వస్య దూతమిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.**

**పునః స కీదృశః స్యాదిత్యాహ. మరల నది యెట్టిది?**

౭౩౨ విశ్వస్య దూతమమృతం విశ్వస్య దూతమమృతమ్।

స యోజతేఽ అరుషా విశ్వభోజసా స దుద్రవత్స్వాహుతః ॥33॥

**ప. విః-** విశ్వస్య, దూతమ్, అమృతమ్, విశ్వస్య, దూతమ్, అమృతమ్, సః, యోజతే, అరుషా, విశ్వభోజసేతి విశ్వ + భోజసా, సః, దుద్రవత్, స్వాహుత ఇతి సు + ఆహుతః॥33॥

**పదార్థః :-** (విశ్వస్య) సమగ్రస్య భూగోలసమూహస్య (దూతమ్) పరితాపకం విద్యుదాఖ్యమగ్నిమ్ (అమృతమ్) కారణరూపేణావినాశిస్వరూపమ్ (విశ్వస్య) అఖిలపదార్థజాతస్య (దూతమ్) పరితాపేన దాహకమ్ (అమృతమ్) ఉదకేఽపి వ్యాపకం కారణమ్. అమృతమిత్యుదకనా... నిఘం. 1.12 (సః) (యోజతే) యునక్తి. అత్ర వ్యత్యయేన శప్ (అరుషా) రూపవతా పదార్థసమూహేన (విశ్వభోజసా) విశ్వస్య పాలకేన (సః) (దుద్రవత్) శరీరాదౌ ద్రవతి గచ్ఛతి. అత్ర వర్తమానే లఙ్. మాఙ్యోగమన్తరేణాప్యడభావః (స్వాహుతః) సుష్ఠు సమన్తాద్ధుత ఆదత్తః సన్. ॥ 33 ॥

**అన్వయః :-** హే మనుష్యాః! యథాఽహం విశ్వస్య దూతమమృతం విశ్వస్య దూతమమృతమగ్నిమాహువే తథా విశ్వభోజసాఽరుషా సర్వైః పదార్థైః సహ వర్తతే స యోజతే. యః స్వాహుతః సన్ దుద్రవత్స యుష్మాభిర్వేద్యః. ॥ 33 ॥

**భావార్థః** :-అత్ర పూర్వమన్త్రాదాహువ ఇతి పదమనువర్తతే. విశ్వస్య దూతమమృతమితి ద్విరావృత్త్యా ద్వివిధస్య స్థూలసూక్ష్మ స్యాగ్నేర్గ్రహణమ్, స సర్వః కారణరూపేణ నిత్య ఇతి వేద్యమ్. ॥ 33 ॥

**పదార్థము** :- ఓ మానవులారా! నే నెట్లు (విశ్వస్య) సమస్త పదార్థములను (దూతమ్) తాపముచే కాల్చునట్టి (అమృతమ్) జలములందును వ్యాప్తమైయున్న కారణరూప అగ్నిని స్వీకరించుచున్నానో, అట్లే (విశ్వభోజసా) జగద్రక్షకుడు (అరుషే) రూపవంతమగు సమస్త పదార్థములలో గూడ నుండు దానిని (సః) ఆ (యోజతే) యుక్తపరచుచు, ఏది (స్వాహుతః) చక్కగా గ్రహణ మొనర్చబడిన (దుద్రవత్) శరీరాదులందు నడచుచున్నదో (సః) దానిని మీరుగూడ తెలిసికొనదగును. ॥33॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు పూర్వమంత్రమునుండి ''ఆహువే'' అను పదము అనువృత్తి వచ్చినది. మరియు (విశ్వస్య, దూత, మమృతమ్) ఈమూడు పదములు రెండు తడవలు ఆవృతమగుటచే స్థూలము, సూక్ష్మము అను రెండు విధములగు అగ్నుల గ్రహణము జరుగుచున్నది. అవి యన్నియును అగ్ని కారణరూపమువల్ల నిత్యములైయున్నవని తెలిసికొనదగును. ॥33॥

I acknowledge the immortal sun, the warmer of the universe. I acknowledge the immortal fire present in water, the scorcher of all objects of the world.

The protector of the universe, this beautiful fire is present in all things. It acts as a uniting forec. Well-comprehended, it courses through the body. The learned should realise it.

౭౫౩.స దుద్రవదిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్చ్యనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. మఱల నది యెట్టిది?

౭౫౩ స దుద్రవత్ స్వాహుతః స దుద్రవత్ స్వాహుతః।

సుబ్రహ్మా యజ్ఞః సుశమీ వసూనాం దేవగ్ంరాధో జనానామ్ ॥౩౪॥

**ప.వి:**-సః, దుద్రవత్ స్వాహుత ఇతి సు + ఆహుతః, సః, దుద్రవత్, స్వాహుత ఇతి సు + ఆహుతః, సుబ్రహ్మా, యజ్ఞః, సుశమీతి సు + శమీ, వసూనామ్, దేవమ్, రాధః, జనానామ్॥౩౪॥

**పదార్థః** :-(సః) అగ్నిః (దుద్రవత్) ద్రవతి (స్వాహుతః) సుష్ఠు కృతాహ్వానః సఖా (సః) (దుద్రవత్) గచ్ఛతి (స్వాహుతః) సుష్ఠు నిమన్త్రితో విద్వాన్ (సుబ్రహ్మా) సుష్ఠుతయా చతుర్వేదవిత్

(యజ్ఞః) సంగంతుంయోగ్యః (సుశమీ) సుష్ఠు శమయితుమ్హః (వసూనామ్) పృథివ్యాదీనామ్ (దేవమ్) కమనీయమ్ (రాధః) సుఖసాధనం ధనమ్ (జనానామ్) ॥ ౩౪ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! స స్వాహుతః సఖివద్ దుద్రవత్ స స్వాహుతో విద్వానివ దుద్రవత్ సుబ్రహ్మా యజ్ఞః సుశమీవ యో వసూనాం జనానాం చ దేవం రాధోఽస్తి తం యూయం సంప్రయుఙ్గ్ ధ్వమ్ ॥ ౩౪ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యో వేగవానన్యేభ్యో వేగప్రదః శాన్తికరః పృథివ్యాదీనాం ప్రకాశకోఽగ్నిర్వర్తతే స కథం న విజ్ఞేయః? ॥ ౩౪ ॥

**పదార్థము** :-ఓ మానవులారా! (సః) ఆ యగ్ని (స్వాహుతః) చక్కగా పిలువబడిన మిత్రునివలె (దుద్రవత్) నడచును. మరియు (సః) అది (స్వాహుతః) సాదరముగ నాహ్వానింపబడిన విద్వాంసునివలె (దుద్రవత్) వెళ్లును. (సుబ్రహ్మా) సాంగోపాంగముగ నాల్గు వేదములను చదివినట్టి (యజ్ఞః) సమాగమ యోగ్యుడు (సుశమీ) శ్రేష్ఠుడు, శాంతిశీలునివంటి (వసూనామ్) పృథివి మున్నగు అష్టవసువుల మరియు (జనానామ్) మానవుల (దేవమ్) అభీప్సిత [కోరిన] (రాధః) ధనరూపాగ్నిని మీరు ఉపయోగించుకొనుడు. ॥౩౪॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. స్వయముగ వేగవంతమునై ఇతర పదార్థములకు వేగమునిచ్చు శాంతికారకము, పృథివిమున్నగు పదార్థములకు ప్రకాశమునైన అగ్నిని సర్వజనులును ఆలోచనాపూర్వకముగ దెలిసికొనవలెను. ॥౩౪॥

34.Agni moves like an invited friend. It goes like an invited scholar. Use properly the fire, that is the desired treasure of persons and material objects, like the master of the four vedas, companionable and calm in nature.

౭౫౪. అగ్నే వాజస్యేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, ఉష్ణిక్ఛందః, ఋషభః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. ఆ యగ్ని ఎటువంటిది?

౭౫౪ అగ్నే వాజస్య గోమతఽఈశానః సహసో యహో।

అస్మే ధేహి జాతవేదో మహి శ్రవః ॥౩౫॥

**ప.వి:-** అగ్నే, వాజస్య, గోమత ఇతి గో+ మతః, ఈశానః, సహసః, యహో ఇతి యహో, అస్మే, ఇత్యస్మే, ధేహి, జాతవేద ఇతి జాత + వేదః, మహి, శ్రవః ॥౩౫॥

**పదార్థః** :-(అగ్నే) విద్వన్! (వాజస్య) అన్నస్య (గోమతః) ప్రశస్తధేనుపృథివీయుక్తస్య (ఈశానః) సాధకః సమర్థః (సహసః) బలవతః(యహో) సుసంతాన (అస్మే) అస్మభ్యమ్ (ధేహి) (జాతవేదః) జాతం విజ్ఞానం యస్య సః (మహి) మహత్ (శ్రవః) ధనమ్. ॥ 35 ॥

**అన్వయః** :-హే సహసో యహో జాతవేదోఽగ్నే! త్వమగ్నిరివ వాజస్య గోమత ఈశానః సన్నస్మే మహి శ్రవో ధేహి.॥35॥

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలంకారః సాధురీత్యోపయుక్తోఽగ్నిః పుష్కలం ధనం ప్రయచ్ఛతీతి వేద్యమ్. ॥ 35 ॥

**పదార్థము** :- (సహసః) బలశాలియొక్క (యహో) సంతానమా! (జాతవేదః) విజ్ఞానవంతుడా! (అగ్నే) తేజస్వివగు విద్వాంసుడా! నీవు అగ్నివంటి (గోమతః) ప్రశస్తమగు గోవులు, పృథివితో గూడిన (వాజస్య) అన్నముయొక్క (ఈశానః) స్వామివి, సమర్థుడవు (అస్మే) మా కొరకు (మహి) మహా (శ్రవః) ధనములను (ధేహి) ధరింపజేయుము. ॥35॥

**భావార్థము** :-ఈమంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఉత్తమరీతిలో ఉపయుక్తపరచుకొనిన అగ్ని అనేక ధనముల నీయగలదని ఎరుగుడు.॥35॥

35.O son of a strong man, possessing knowledge of the objects created, dignified and well-read, thou like fire, with land and laudable cow, art the master of foodgrains. Vouchsafe great wealth unto us!.

36.స ఇధాన ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ? మరల నది యెట్టిది?

36 స ఇధానో వసుష్కవిరగ్నిరీడేన్యో గిరా।

రేవదస్మభ్యం పుర్వణీక దీదిహి ॥36॥

**ప.విః**–సః, ఇధానః, వసుః, కవిః, అగ్నిః, ఈడేన్యః, గిరా, రేవత్, అస్మభ్యమ్ పుర్వణీక, పుర్వణీకేతి పురు + అనీక, దీదిహి ॥36॥

**పదార్థః** :-(సః) పూర్వోక్తః (ఇధానః) ప్రదీప్తః (వసుః) వాసయితా (కవిః) సమర్థః (అగ్నిః) పావకః (ఈడేన్యః) అన్వేషణీయః (గిరా) వాణ్యా (రేవత్) ప్రశస్తధనయుక్తమ్ (అస్మభ్యమ్) (పుర్వణీక) పురు బహు అనీకం సైన్యం యస్య తత్సంబుద్ధౌ (దీదిహి) ప్రకాశయ. ॥ 36 ॥

**అన్వయః** :-హే పుర్వణీక విద్వన్! స గిరేడేన్యో వసుః కవిరిధానః సోఽగ్ని రివాఽస్మభ్యం రేవద్దీదిహి ప్రకాశయ. ॥ ౩౬ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. విదుషాఽగ్నిగుణకర్మస్వభావప్రకాశనేన మనుష్యేభ్య ఐశ్వర్యమున్నేయమ్. ॥ ౩౬ ॥

**పదార్థము** :-(పుర్వణీక) అనేక సేనలుగల విద్వాంసుడవగు రాజపురుషా! (గిరా) వాణిచే (ఈడేన్యః) అన్వేషించదగిన (వసుః) నివాస హేతువు (కవిః) సమర్థము (ఇధానః) ప్రదీప్తము (సః) అట్టి పూర్వోక్తమైన (అగ్నిః) అగ్నివలె (అస్మభ్యమ్) మాకొరకు (రేవత్) ధనముతో గూడిన ప్రశంసితపదార్థములను (దీదిహి) ప్రకాశపరచుము. ॥౩౬॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులు అగ్నియొక్క గుణ కర్మ స్వభావముల ప్రకాశనముచే మనుష్యులకొరకు ఐశ్వర్యముల నున్నతి యొనర్చుట యోగ్యమై యున్నది. ॥౩౬॥

36.O ruler equipped with a good army, worthy of praise with words, provider of dwelling to his subjects, affluent, brilliant, and resembling fire, grant us laudable riches!.

౭౩౬. క్షపో రాజన్నిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృదుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. మఱల నది యెట్టిది?

౭౩౬ క్షపో రాజన్నుత త్మనాగ్నే వస్తోరుతోషసః।
స తిగ్మజమ్భ రక్షసో దహ ప్రతి ॥౩౭॥

**ప.విః-క్షపః, రాజన్, ఉత, త్మనా, అగ్నే, వస్తోః, ఉత, ఉషసః, సః, తిగ్మజమ్భేతి తిగ్మ + జమ్భ, రక్షసః, దహ, ప్రతి ॥౩౭॥**

**పదార్థః** :-(క్షపః) రాత్రీః (రాజన్) రాజమాన (ఉత) (త్మనా) ఆత్మనా. అత్ర ఛాన్దసో వర్ణలోప ఇత్యాకారలోపః (అగ్నే) విద్వన్! (వస్తోః) దినమ్ (ఉత) (ఉషసః) ప్రాతః సాయం సమయాన్ (సః) ఉక్తః (తిగ్మజమ్భ) తిగ్మం తీవ్రం జమ్భో గాత్రవినామనం యస్మాత్తత్సమ్బుద్ధౌ (రక్షసః) దుష్టాన్ (దహ) భస్మీకురు. (ప్రతి) ప్రత్యక్షే. ॥ ౩౭ ॥

**అన్వయః** :-హే తిగ్మజమ్భ రాజన్నగ్నే! స త్వం యథా తీక్ష్ణతేజా అగ్నిః క్షప ఉత వస్తోరుతోషసో జనయతి తథా సుశిక్షాం జనయ రక్షసస్తమ ఇవ తీవ్రత్మనా ప్రతి దహ. ॥ ౩౭ ॥

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యథా ప్రభాతస్య దినస్య రాత్రేశ్చ నిమిత్తమగ్ని ర్విజ్ఞాయతే తథా రాజా న్యాయప్రకాశస్యాన్యాయనివృత్తేశ్చ హేతురస్తీతి వేద్యమ్. ॥౩౭॥

**పదార్థము** :-(తిగ్మజమ్భ) తీక్ష్ణముగ అవయవములను నడుపునట్టి (రాజన్) ప్రకాశమానులునగు (అగ్నే) విద్వజ్జనమా! (సః) పూర్వోక్త గుణయుక్తుడవగు నీవంటి తీక్ష్ణతేజముతోగూడిన అగ్ని (క్షపః) రాత్రులు (ఉత) మరియు (వస్తోః) పగళ్లు (ఉత) మాత్రమే (ఉషసః) ప్రభాత సాయంకాలముల ప్రకాశము నుత్పన్నపరచునట్లు (త్మనా) తీక్ష్ణ స్వభావయుక్తమైన స్వాత్మచే (రక్షసః) రాత్రులవంటి దుష్టజనులను (ప్రతిదహ) నిశ్చయముగ భస్మమొనర్చుము. ॥౩౭॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారమున్నది. ప్రభాతము, దినము, రాత్రులకు నిమిత్తమగు అగ్ని నెరుగుచున్నట్లు రాజును గూడ న్యాయము ప్రకాశపరచుటకు, అన్యాయనివృత్తికి హేతువని యెరుగుట ప్రజలకు యోగ్యము.॥౩౭॥

37.O resplendent learned person, with powerful limbs, just as the sharp fire creates the night, day, morning and evening, so shouldst thou spread good instruction. Like fire burn the wicked with the force of thy soul!.

౭౫౭. భద్రో న ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్ దేవతా, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః స కీదృశ ఇత్యుపదిశ్యతే. మఱల నది యెట్టిది?

౭౫౭ భద్రో నో౽ అగ్నిరాహుతో భద్రా రాతిః సుభగ భద్రో౽ అధ్వరః।
భద్రా౽ ఉత ప్రశస్తయః ॥౩౮॥

**ప. విః**- భద్రః, నః, అగ్నిః, ఆహుత ఇత్యా + హుతః, భద్రా, రాతిః, సుభగేతి సు + భగ, భద్రః, అధ్వరః, భద్రాః, ఉత, ప్రశస్తయ ఇతి ప్ర + శస్తయః ॥౩౮॥

**పదార్థః** :-(భద్రః) భజనీయః (నః) అస్మభ్యమ్ (అగ్నిః) పావకః (ఆహుతః) సంగృహీతో ధర్మ ఇవ (భద్రా) సేవనీయా (రాతిః) దానమ్ (సుభగ) శోభనైశ్వర్య (భద్రః) కల్యాణకరః (అధ్వరః) అహింసనీయో వ్యవహారః (భద్రాః) కల్యాణప్రతిపాదికాః (ఉత) (ప్రశస్తయః) ప్రశంసాః ॥ ౩౮ ॥

**అన్వయః** :-హే సుభగ విద్వన్! యథా౽౽హుతః సఖాగ్నిర్భద్రః రాతిర్భద్రా౽ధ్వరో భద్ర ఉత ప్రశస్తయో భద్రాః స్యుః తథా త్వం నో భవ. ॥ ౩౮ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యథా విద్యయా సుసేవితా జగత్స్థాః పదార్థాః సుఖకారిణో భవన్తి తథా౽౽ప్తా విద్వాంసః సన్తీతి వేద్యమ్. ॥ ౩౮ ॥

**పదార్థము** :-(సుభగ) ఉత్తమైశ్వర్యశాలివగు నో విద్వాంసుడా! (ఆహుతః) ధర్మముగా సేవలొనర్చిన మిత్రరూపమగు (అగ్నిః) అగ్ని (భద్రః) సేవించదగిన (భద్రా) కల్యాణకారి (రాతిః) దానము (భద్రః) కల్యాణకారి (అధ్వరః) రక్షించదగిన వ్యవహారము (ఉత) మరియు (భద్రాః) కల్యాణప్రదమగు (ప్రశస్తయః) ప్రశంసలుండునట్లు నీవు (నః) మాకొరకై అగుము. ॥౩౮॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్యలచే ఉత్తమముగ సేవనమొనర్చబడిన పదార్థములు సుఖప్రదము లగునట్లు ఆప్తవిద్వాంసులనుగూడ ఎరుగుట మానవులకు యోగ్యము. ॥౩౮॥

38.O man of power and supremacy, just as lovely Agni through oblations brings us bliss, just as gift brings bliss, just as harmless dealing brings bliss, just as our praises bring us bliss, so shouldst thou be blissful unto us!.

౭౩౯.భద్రా ఉతేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృదుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునః స విద్వాన్ కీదృశ ఇత్యాహ. మఱల నా విద్వాంసు డెట్టివాడు?

౭౩౯ భద్రా౨ ఉత ప్రశస్తయో భద్రం మనః కృణుష్వ।

వృత్రతూర్యే। యేనా సమత్సు సాసహః ॥౩౯॥

**ప.విః**-భద్రాః, ఉత, ప్రశస్తయ ఇతి ప్ర + శస్తయః, భద్రమ్, మనః, కృణుష్వ, వృత్రతూర్య ఇతి వృత్ర + తూర్యే, యేన, సమత్స్వితి సమత్ + సు, సాసహః, ససహ ఇతి ససహః ॥౩౯॥

**పదార్థః** :-(భద్రాః) భజనీయాః (ఉత) అపి (ప్రశస్తయః) ప్రశంసనీయాః ప్రజాః (భద్రమ్) భజనీయం కల్యాణకరమ్ (మనః) మననాత్మకమ్ (కృణుష్వ) కురు (వృత్రతూర్యే) సంగ్రామే (యేన) అత్రాన్యేషామపీతి దీర్ఘః (సమత్సు) సంగ్రామేషు (సాసహః) అతిశయేన సోఢా. ॥౩౯॥

**అన్వయః** :-హే సుభగ! త్వం యేన నోఽస్మాకం వృత్రతూర్యే భద్రం మన ఉతాపి భద్రాః ప్రశస్తయో యేన చ సమత్సు సాసహః స్యాత్తత్కృణుష్వ. ॥౩౯॥

**భావార్థః** :-అత్ర (సుభగ) (నః) ఇతి పదద్వయం పూర్వమన్త్రాదనువర్తతే. విదుషా రాజ్ఞా తత్కర్మానుష్ఠేయం యేన ప్రజాః సేనాశ్చోత్తమాః స్యుః. ॥౩౯॥

**పదార్థము** :-(సుభగ) శోభన సంపదలుగలవాడా! నీవు (యేన) దేనిచే మాయొక్క (వృత్రతూర్యే) యుద్ధమునందు (భద్రమ్) కల్యాణకారి (మనః) ఆలోచనాశక్తిచే గూడిన చిత్తము (ఉత) మరియు (భద్రాః)

కల్యాణమునొనగూర్చు ((ప్రశస్తయః) ప్రశంసమొనర్చదగిన ప్రజలు మరియు నెవరిచే (సమత్సు) సంగ్రామములందు (సాసహః) అత్యంత సహన శీలురు, వీరపురుషులు కాగలుగునట్టి కర్మల (కృణుష్వ) నొనర్చుము.॥౩౯॥

**భావార్థము** :-ఇచ్చట (సుభగ, నః) అను నీ రెండు పదముల యనువృత్తి పూర్వమంత్రమునుండి వచ్చినది. ప్రజలు, సైన్యములు, ఉత్తములగునట్టి శ్రేష్ఠకర్మలొనర్చుట విద్వాంసుడగు రాజునకు యోగ్యము.॥౩౯॥

39.O man of power and supremacy behave in a manner, wherewith we may get in battles, optimistic mind, praiseworthy followers, and calm, determined soldiers!.

౪౦. యేనేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః స కీదృశ ఇత్యాహ. మఱల నాత డెట్టివాడు?

౪౦ యేనా సమత్సు సాసహోऽవ స్థిరా తనుహి భూరి శర్ధతామ్ ।
వనేమా తేऽఅభిష్టిభిః ॥౪౦॥

ప. విః-యేన, సమత్స్వితి సమత్ + సు, సాసహః, ససహ ఇతి ససహః, అవ, స్థిరా, తనుహి, భూరి, శర్ధతామ్ వనేమ, తే, అభిష్టిభిరిత్యభిష్టి + భిః ॥౪౦॥

పదార్థః :-(యేన) అత్ర సంహితాయామితి దీర్ఘః (సమత్సు) సంగ్రామేషు (సాసహః) భృశం సోఢా (అవ) (స్థిరా) స్థిరాణి సైన్యాని (తనుహి) విస్తృణు (భూరి) బహు (శర్ధతామ్) బలం కుర్వతామ్. బలవాచి శర్ధశబ్దాత్కరోత్యర్థే క్విప్ తతః శతృ (వనేమ) సంభజేమ. అత్ర సంహితాయామితి దీర్ఘః (తే) తవ (అభిష్టిభిః) ఇష్టాభిరిచ్ఛాభిః ॥ ౪౦ ॥

**అన్వయః** :-హే సుభగ! యేన త్వం సమత్సు సాసహః స్యాత్స త్వం భూరి శర్ధతామస్మాకం స్థిరావత నుహి తేऽభిష్టిభిః సహ వర్తమానా వయం తాని వనేమ. ॥ ౪౦ ॥

**భావార్థః** :-అత్రాపి (సుభగ) (నః) ఇతి పదద్వయం పూర్వతోऽనువర్తతే. విద్వద్భిర్బహుబల యుక్తానాం వీరాణాం నిత్యముత్సాహో వర్ధనీయః. యేనోత్సాహితాః సన్తో రాజప్రజాహితాని కర్మాణి కుర్యుః.॥ ౪౦ ॥

**పదార్థము** :- (సుభగ) చక్కని లక్ష్మియుక్తుడా! (యేన) ఏద్దాని ప్రతాపముచే మాయొక్క (సమత్సు) యుద్ధములందు (సాసహః) ఉత్తమ సహనశీలుడవగుదువో అట్లే (భూరి) అనేక విధములుగ (శర్ధతామ్)

బలప్రదర్శనమొనర్చుచు మాయొక్క (స్థిరా) స్థిరసైన్యముల సాధనములను (అవతనుహి) చక్కగా వృద్ధిపరచుము (తే) నీయొక్క (అభిష్టిభిః) ఇచ్ఛానుసారము వర్తించు మేము అట్టి సేనల సాధనములను (వనేమ) సేవింతుము [ఉపయోగించుకొందుము]గాక! ॥౪౦॥

**భావార్థము** :-ఇచ్చటను (సుభగ, నః) అనునీరెండు పదముల యావృత్తి జరిగినది. విద్వాంసులగువారు బలపరాక్రమ వీర్యవంతుల ఉత్సాహమును ఎప్పుడును పెంపొందించు చుండవలయును. ఇందువల్ల ద్విగుణోత్సాహముతో రాజ్య మరియు ప్రజల హితకారక కార్యములను సదా యొనర్చుచుందురు.॥౪౦॥

40.O man of power and supremacy, with thy strength. grant us daring courage in battles, add to the resources of our resolute army, exerting to its utmost for victory. Acting in obedience to thy desires, let us utilise the resources of the army!.

౭౬౦.అగ్నిం తమిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునః స కిం కుర్యాదిత్యాహ. మఱల నాత డేమి చేయవలెను?

౭౬౦ అగ్నిం తం మన్యే యో వసురస్తం యం యన్తి ధేనవః। అస్తమర్వన్త ఆశవోఽస్తం నిత్యాసో వాజిన ఇషꣳ స్తోతృభ్య ఆ భర ॥౪౧॥

**ప.విః-** అగ్నిమ్, తమ్, మన్యే, యః, వసుః, అస్తమ్, యమ్, యన్తి, ధేనవః, అస్తమ్, అర్వన్తః, ఆశవః, అస్తమ్, నిత్యాసః, వాజినః, ఇషమ్, స్తోతృభ్య ఇతి స్తోతృ+భ్యః, ఆ, భర ॥౪౧॥

పదార్థః :-(అగ్నిమ్) (తమ్) పూర్వోక్తమ్ (మన్యే) (యః) (వసుః) సర్వత్ర నివస్తా (అస్తమ్) గృహమ్ (యమ్) (యన్తి) గచ్ఛన్తి (ధేనవః) గావః (అస్తమ్) గృహమ్ (అర్వన్తః) అశ్వాః (ఆశవః) ఆశుగామినః (అస్తమ్) (నిత్యాసః) కారణరూపేణావినాశినః (వాజినః) వేగవన్తః (ఇషమ్) అన్నాదికమ్ (స్తోతృభ్యః) స్తావకేభ్యః విద్వద్భ్యః (ఆభర) ॥ ౪౧॥

**అన్వయః** :-హే విద్వన్! యో వసురస్తి యమగ్నిం ధేనవోఽస్తం యన్తీవ నిత్యాసో వాజిన ఆశవోఽర్వన్తోఽస్తమివాహం తం మన్యే స్తోతృభ్య ఇషమాభరామి తథైవ త్వం తమగ్నిమస్తం మన్యస్వేషం చాభర. ॥ ౪౧ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. విద్యార్థినః ప్రత్యధ్యాపక ఏవం వదేద్యథాఽహ మాచరేయం తథా యూయమప్యాచరత. యథా గవాదయః పశవః ఇతస్తతో దినే భ్రాంత్వా సాయం స్వగృహం ప్రాప్య మోదన్తే తథైవ విద్యాగృహం ప్రాప్య యూయమపి మోదధ్వమ్. ॥ ౪౧ ॥

**పదార్థము :-** ఓ విద్వాంసుడా! (యః) ఎట్లు (వసుః) అంతటనుండు అగ్నిగలదో (యమ్) ఏ (అగ్నిమ్) వాణివంటి అగ్నిని (ధేనవః) గోవులు (అస్తమ్) గృహములకు (యన్తి) వెళ్ళుచున్నట్లు (నిత్యాసః) కారణరూపముతో నాశరహితము (వాజినః) వేగవంతముగల (ఆశవః) శీఘ్రగామియగు (అర్వన్తః) అశ్వములు (అస్తమ్) గృహములకు చేరుచున్నట్లు నేనును (తమ్) అట్టి పూర్వోక్తమగు అగ్నిని (మన్యే) సేవింతును. మరియు (స్తోతృభ్యః) స్తుతికారకులగు విద్వాంసులకొరకు (ఇషమ్) శ్రేష్ఠమగు అన్నము మున్నగు పదార్థములను ధారణమొనర్తును. అట్లే నీవును ఆ యగ్నిని (అస్తమ్) ఆశ్రయమముగ నెరుగుము. మరియు అన్నాది పదార్థములను (ఆభర) ధారణమొనర్చుము.॥౪౧॥

**భావార్థము :-** ఈ మంత్రమునందును వాచకలుప్తోపమాలంకారము గలదు. అధ్యాపకులు విద్యార్థులతో ''మే మెట్లాచరించుచున్నామో మీరును ఆచరించుడు. గోవులు మున్నగు పశువులు పగలంతయు ఇటునటు భ్రమణమొనర్చి సాయంకాలము తమ నివాసమునకు చేరి ప్రసన్నముగ నుండునట్లు విద్యాస్థానములను పొంది మీరును ప్రసన్నముగ నుండు''డని యుపదేశించవలయును. ॥౪౧॥

41.O learned person, I value the omnipresent fire, led by which the king go to their home. The fleet-foot, steady and active steeds seek the indestructible fire, as their home. I bring food to the learned who sing thy glory. So shouldst thou realise that fire!.

౭౬౧.సో అగ్నిరిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునః సః కీదృశ ఇత్యుపదిశ్యతే. మరల నాత డెట్టివాడుగ నుండవలయును?

౭౬౧ సో౨ అగ్నిర్యో వసుర్గృణే సం యమాయన్తి ధేనవః। సమర్వన్తో

రఘుద్రువః సఀ సుజాతాసః సూరయః ఇషఀ స్తోతృభ్య౨ ఆ భర ॥౪౨॥

ప.విః-సః, అగ్నిః, యః, వసుః, గృణే, సమ్, యమ్, ఆయన్తీత్యా + యన్తి, ధేనవః, సమ్ అర్వన్తః, రఘుద్రువ ఇతి రఘు + ద్రువః, సమ్, సుజాతాస ఇతి సు + జాతాసః, సూరయః, ఇషమ్, స్తోతృభ్య ఇతి స్తోతృ + భ్యః, ఆ, భర ॥౪౨॥

**పదార్థః :-** (సః) (అగ్నిః) (యః) (వసుః) (గృణే) స్తువే (సమ్) (యమ్) (ఆయన్తి) (ధేనవః) వాణ్యః (సమ్) (అర్వన్తః) ప్రశస్తవిజ్ఞానవన్తః (రఘుద్రువః) యే రఘు లఘు ద్రవన్తి గచ్ఛన్తి తే. అత్ర కపిలకాదిత్వాల్లత్వమ్ (సమ్) (సుజాతాసః) విద్యాసు సుష్ఠు జాతాః ప్రసిద్ధాః (సూరయః) విద్వాంసః (ఇషమ్) జ్ఞానమ్ (స్తోతృభ్యః) స్తావకేభ్యో విద్యార్థిభ్యః (ఆ) (భర).॥౪౨॥

**అన్వయః** :-హే విద్వన్! యథాఽహం యో వసురగ్నిరస్తి తం గృణే యం ధేనవః సమాయన్తి రఘుద్రువోఽర్వన్తః సుజాతాసః సూరయః స్తోతృభ్య ఇషం సమాభరన్తి స స్తౌతి చ తథా త్వమేతాని సమాభర.॥ ౪౨ ॥

**భావార్థః** :-అధ్యాపకా యథా ధేనవో వత్సాన్ ప్రీణయన్తి తథా విద్యార్థిన ఆనన్దయేయుః. యథాఽశ్వాః శీఘ్రం గమయన్తి తథా సర్వవిద్యాపారగాన్ కుర్యుః. ॥ ౪౨ ॥

**పదార్థము** :- ఓ విద్యార్థీ! విద్వాంసుడా! (యః) ఏది (వసుః) నివాసమునకు హేతువగు (అగ్నిః) అగ్నిగలదో దానిని (గృణే) ఉత్తమవిధిగా స్తుతింతును (యమ్) ఎద్దానిని (ధేనవః) వాణులు (సమాయన్తి) ఉత్తమముగా పొందుచున్నవియో మరియు (రఘుద్రువః) ధైర్యముగ నడచువారు (అర్వన్తః) ప్రశంసనీయ జ్ఞానులు (సుజాతాసః) విద్యలందు చక్కని ప్రసిద్ధిగలవారు (సూరయః) విద్వాంసులు (స్తోతృభ్యః) స్తుతియొనర్చు విద్యార్థులకొరకు (ఇషమ్) జ్ఞానమును (సమ్) చక్కగా ధారణమొనర్తురో మరియు నెట్లు (సః) చదివించువారు ఈశ్వరుడు మున్నగు పదార్థముల గుణవర్ణన మెట్లు జేయుదురో అట్లే నీవును ఈ పూర్వోక్త (సమాభర) జ్ఞానముచే ధారణమొనర్చుము.॥౪౨॥

**భావార్థము** :- గోవులు తమ లేగలను తృప్తిపరచునట్లు, అధ్యాపకులు విద్యార్థులను తృప్తి పరచవలెను. మరియు అశ్వములు శీఘ్రముగా నడచి లక్ష్యస్థానమునకు జేరునట్లు విద్యార్థులను సమస్త విద్యలందు శీఘ్రముగ నిష్ణాతుల నొనర్చవలెను.॥౪౨॥

42.O learned person, I laud fire, that provides shelter; whom the speeches attain to. Just as the praiseworthy scholars walk slowly, and the learned, famous for their knowledge, thoroughly imbibelearning for the pupils who sing their praise, and just as the teacher explains the merits of God and other objects, so shouldst thou acquire the knowledge of all these things.

౭౬౨.ఉభే ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునః సః కిం కుర్యాదిత్యాహ. అత డేమి చేయవలయును?

౭౬౨ ఉభే సుశ్చన్ద్ర సర్పిషో దర్వీ శ్రీణీషఽ ఆసని। ఉతో నఽ

ఉత్పుపూర్యా ఉక్థేషు శవసస్పతఽ ఇషగ్గ్ స్తోతృభ్యఽ ఆ భర ॥౪౩॥

ప.వి:- ఉభే ఇత్యుభే, సుశ్చన్ద్ర, సుచంద్రేతి సు + చన్ద్ర, సర్పిషః, దర్వీ ఇతి దర్వీ, శ్రీణీషే, ఆసని, ఉతో ఇత్యుతో, నః, ఉత్, పుపూర్యాః, ఉక్థేషు, శవసః, పతే, ఇషమ్, స్తోతృభ్య ఇతి

స్తోతృ + భ్యః, ఆ, భర ॥43॥

పదార్థః :-(ఉభే)ద్వే అధ్యయనాధ్యాపనక్రియే (సుశ్చన్ద్ర) శోభనశ్చాసౌ చన్ద్ర ఆహ్లాదకారకశ్చ తత్సమ్బుద్ధౌ (సర్పిషః) ఘృతస్య (దర్వీ) గ్రహణాగ్రహణ సాధనే (శ్రీణీషే) పచసి (ఆసని) ఆస్యే (ఉతో) అపి (నః) అస్మభ్యమ్ (ఉత్) (పుపూర్యాః) పూర్ణం కుర్యాః (ఉక్థేషు) వక్తుం శ్రోతుమర్హేషు వేదవిభాగేషు (శవసః) బలస్య (పతే) పాలక (ఇషమ్) అన్నమ్ (స్తోతృభ్యః) విద్వద్భ్యః (ఆ) (భర).॥43॥

అన్వయః :-హే సుశ్చన్ద్ర! త్వం సర్పిషో దర్వీ శ్రీణీష ఇవాసన్యుభే ఆ భర. హే శవసస్పతే! త్వముక్థేషు నోఽస్మభ్యముతో అపి స్తోతృభ్య ఇషం చోత్పుపూర్యాః.॥ 43 ॥

భావార్థః :-యథర్త్విజో ఘృతం సంశోధ్య దర్వ్యాఽగ్నౌ హుత్వా వాయువృష్టిజలే రోగనాశకే కృత్వా సర్వాన్ సుఖయన్తి. తథైవాధ్యాపకా విద్యార్థిమనాంసి సుశిక్షయా సంశోధ్య తత్ర విద్యా హుత్వాఽత్మనః పవిత్రీ కృత్య సర్వాన్ ప్రాణినః సుఖయేయుః ॥ 43 ॥

పదార్థము :-(సుశ్చన్ద్ర) చక్కని ఆనందదాతవగు అధ్యాపకా! నీవు (సర్పిషః) నేయిని [నేతిని] (దర్వీ) కలుపుటకు, పట్టుకొనుటకు తగిన రెండుగరిటెలచే (శ్రీణీషే) పాకమొనర్చునట్లు (ఆసని) ముఖమునందు (ఉభే) చదువుట, చదివించుటయను రెండు క్రియలను (ఆభర) ధారణమొనర్చుము (శవసః) బలమును (పతే) రక్షించువాడా! నీవు (ఉక్థేషు) చెప్పదగిన, వినదగిన వేదవిభాగములందు (నః) మాకొరకు (ఉతో) మరియు (స్తోతృభ్యః) విద్వాంసులకొరకు (ఇషమ్) అన్నము మున్నగు పదార్థములను (ఉత్పుపూర్యాః) చక్కగా పూర్ణపరచుము.॥43॥

భావార్థము :- ఋత్విజులు నేతిని శుద్ధపరచి స్రువలతో హోమమొనర్చి వాయువు మరియు వర్ష జలములను రోగనాశకముగ నొనర్చి ఎల్లరను సుఖవంతుల నొనర్చునట్లు అధ్యాపకులు విద్యార్థులను చక్కని శిక్షణచే విద్యాదానమొనర్చి పవిత్రాత్మవంతులుగ నొనర్చవలెను. ॥43॥

43.O beautiful, pleasurable teacher, just as two ladels of ghee cook food, so fill in the mouth both the practices of reading and teaching. O lord of strength, teach us the vedic lore, and give food to us and the learned!.

౭౬౩.అగ్నే తమిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః సః కీదృశః స్యాదిత్యాహ. మఱల వాత డెట్టివాడు?

౭౬౩ అగ్నే తమద్యాశ్వం న స్తోమైః క్రతుం న భద్రం హృదిస్పృశమ్।

ఋధ్యామా తఽ ఓహైః ॥44॥

**ప.వి:-** అగ్నే, తమ్, అద్య, అశ్వమ్, నః, స్తోమైః, క్రతుమ్, న, భద్రమ్, హృదిస్పృశమితి హృది + స్పృశమ్, ఋధ్యామ, తే, ఓహైః ॥౪౪॥

**పదార్థః :-** (అగ్నే) అధ్యాపక! (తమ్) విద్యాబోధమ్ (అద్య) అస్మిన్ వర్తమానే సమయే (అశ్వమ్) సుశిక్షితం తురఙ్గమ్ (న) ఇవ (స్తోమైః) విద్యాస్తుతివిశేషైర్వేదభాగైః (క్రతుం) ప్రజ్ఞాతమ్ (న) ఇవ (భద్రమ్) కల్యాణకరం (హృదిస్పృశమ్) యో హృద్యాత్మని స్పృశతి తమ్ (ఋధ్యామ) వర్ధేమహి. అత్రాన్యేషామపీతి దీర్ఘః (తే) తవ సకాశాత్ (ఓహైః) విద్యాసుఖప్రాపకైః. ॥ ౪౪ ॥

**అన్వయః :-** హే అగ్నేఽధ్యాపక! వయం తే తవ సకాశాదోహైః స్తోమైరద్యాశ్వం న భద్రం క్రతుం న తం హృదిస్పృశం ప్రాప్య సతతమృధ్యామ. ॥ ౪౪ ॥

**భావార్థః :-** అత్రోపమాలంకారౌ. అధ్యేతారో యథా సుశిక్షితేనాశ్వేన సద్యోఽభీష్టం స్థానం గచ్ఛన్తి; యథా విద్వాంసః సర్వశాస్త్రబోధసంపన్నయా కల్యాణకర్త్ర్యా ప్రజ్ఞయా ధర్మార్థకామమోక్షాన్ ప్రాప్నువన్తి తథా తేభ్యోఽధ్యాపకేభ్యో విద్యాపారం గత్వా ప్రశస్తాం ప్రజ్ఞాం ప్రాప్య స్వయం వర్ధేరన్నన్యాంశ్చ వేదాధ్యాపనోపదేశాభ్యాం మేధయేయుః. ॥ ౪౪ ॥

**పదార్థము :-** (అగ్నే) అధ్యాపకా! మేము (తే) నీతో (ఓహైః) విద్యాసుఖములనిచ్చు (స్తోమైః) విద్యాస్తుతిరూపము వేదభాగములనుండి (అద్య) నేడు (అశ్వమ్) గుఱ్ఱము (న) వలె (భద్రమ్) కల్యాణప్రద (క్రతుమ్) బుద్ధి (న) వలె (తమ్) ఆ (హృదిస్పృశమ్) ఆత్మతో సంబంధమొనర్చు విద్యాబోధనను పొంది నిరంతరము (ఋధ్యామ) అభివృద్ధిని చెందుదుముగాక! ॥౪౪॥

**భావార్థము :-** ఈ మంత్రములో రెండుపమాలంకారము లున్నవి. ఉత్తమ శిక్షితాశ్వములద్వారా లక్ష్యస్థానమునకు శీఘ్రముగ జేరుకొనునట్లు, విద్వాంసులు సకలశాస్త్రముల బోధనద్వారా, కల్యాణప్రదమగు బుద్ధితో ధర్మార్థకామ మోక్షములు అను ఫలముల ప్రాప్తిజేసికొనునట్లు అధ్యాపకులగువారు పూర్ణవిద్యలను పొంది ప్రశంసనీయబుద్ధి గలిగి స్వయముగ ఉన్నతిని పొందుటతో బాటు వేదముల అధ్యయనాధ్యాపనములచే సకల మానవుల నున్నతి పరచవలెను. ॥౪౪॥

44.O teacher, we derive today from thee like a disciplined horse, the pleasant knowledge of the vedas. May we always make progress, having received the knowledge which touches our soul, and is blissful like intellect!.

౭౬౪.అథా హేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.

పునః స కీదృశః స్యాదిత్యాహ. మఱల నాత డెట్టివాడు?

౭౬౪ అధా హ్యగ్నే క్రతోర్భద్రస్య దక్షస్య సాధోః।
రథీర్ఋతస్య బృహతో బభూథ ॥౪౫॥

ప.వి:-అధ, హి, అగ్నే, క్రతోః, భద్రస్య, దక్షస్య, సాధోః, రథీః, ఋతస్య, బృహతః, బభూథ ॥౪౫॥

**పదార్థః** :-(అధ) అథ మఙ్గలే. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. వర్ణవ్యత్యయేన థస్య ధశ్చ. (హి) ఖలు (అగ్నే) విద్వన్ (క్రతోః) ప్రజ్ఞాయాః (భద్రస్య) ఆనన్దకరస్య (దక్షస్య) శరీరాత్మబలయుక్తస్య (సాధోః) సన్మార్గే వర్తమానస్య (రథీః) ప్రశస్తా రథా రమణసాధనాని యానాని విద్యన్తే యస్య సః (ఋతస్య) ప్రాప్తసత్యస్య (బృహతః) మహావిషయస్య (బభూథ) భవేః. ॥ ౪౫ ॥

**అన్వయః** :-హే అగ్నే! యథా త్వం భద్రస్య దక్షస్య సాధోర్ఋతస్య బృహతః క్రతోః సకాశాద్రథీర్బభూథ తథాఽధ హి వయమపి భవేమ. ॥ ౪౫ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా శాస్త్రయోగజాం ధియం ప్రాప్య విద్వాంసో వర్ధన్తే తథైవాధ్యేతృభిరపి వర్ధితవ్యమ్. ॥ ౪౫ ॥

**పదార్థము** :-(అగ్నే) విద్వాంసుడా! నీ వెట్లు (భద్రస్య) ఆనందకారక (దక్షస్య) శరీర, ఆత్మల బలముతో గూడి (సాధోః) ఉత్తమమార్గమున నడచు (ఋతస్య) సత్యమును పొందినవాని (బృహతః) గొప్ప విషయము లేక జ్ఞానరూప (క్రతోః) బుద్ధితో (రథీః) ప్రశంసనీయ, రమణీయ సాధనములగు యానములతో గూడినవాడవు (బభూథ) అగుదువో, అట్లే (అధ) శుభాచరణపూర్వకముగ (హి) నిశ్చయముగ మేము అగుదుము. ॥౪౫॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకార మున్నది. శాస్త్రములు మరియు యోగముచే నుత్పన్నమగు బుద్ధిని పొంది విద్వాంసులు వృద్ధిని ప్రాప్తించుకొనునట్లు అధ్యేత (విద్యార్థు)లును అభివృద్ధిని సాధించవలయును. ॥౪౫॥

45.O learned person, just as thou art in the possession of conveyances for journey, having the intellectual wisdom of a truthful person, following the noble path of virtue, filled with pleasurable, physical and spiritual strength, so shouldst we blissfully and certainly be!.

౭౬౫. ఏభిర్న ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యాదియే.

౪౬॥ ఏభిర్నో॒ అ॒ర్కైర్భవా॑ నో అ॒ర్వాఙ్ స్వ॒ర్ణ జ్యోతిః॑।
అగ్నే॒ విశ్వే॑భిః సు॒మనా॒ అనీ॑కైః ॥౪౬॥

ప.వి:- ఏభిః, నః అర్కైః, భవ, నః, అర్వాఙ్, స్వః, న, జ్యోతిః, అగ్నే, విశ్వేభిః, సుమనా ఇతి సు + మనాః, అనీకైః ॥౪౬॥

పదార్థః :- (ఏభిః) పూర్వోక్తైః (నః) అస్మభ్యమ్ (అర్కైః) పూజ్యైర్విద్వద్భిః (భవ) ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (నః) అస్మభ్యమ్ (అర్వాఙ్) యోఽర్వాచీనాననుత్కృష్టానుత్కృష్టాన్ కర్తుమంచతి జానాతి సః (స్వః) సుఖమ్ (న) ఇవ (జ్యోతిః) ప్రకాశకః (అగ్నే) (విద్యాప్రకాశాఢ్య) (విశ్వేభిః) సమగ్రైః (సుమనాః) సుఖకారిమనాః (అనీకైః) సైన్యైరివ॥౪౬॥

అన్వయః :- హే అగ్నే! త్వం నోఽస్మభ్యం విశ్వేభిరనీకై రాజేవ సుమనా భవ. ఏభిరర్కైర్నోఽస్మభ్యం జ్యోతిరర్వాఙ్ స్వర్ణ భవ. ॥ ౪౬ ॥

భావార్థః :- అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా రాజా సుశిక్షితైర్బలాఢ్యైః సైన్యైః శత్రూన్ జిత్వా సుఖీ భవతి తథైవ ప్రజ్ఞాదిభిర్గుణైరవిద్యాక్లేశాన్ జిత్వా మనుష్యాః సుఖినః సన్తు. ॥ ౪౬ ॥

పదార్థము :- (అగ్నే) విద్యాప్రకాశముగలవాడా! నీవు (నః) మాకొరకు (విశ్వేభిః) సమస్త (అనీకైః) సైన్య సమేతుడవై రాజువలె (సుమనాః) సుఖప్రదమగు మనస్సు గలవాడవు (భవ) అగుము (ఏభిః) ఈ పూర్వోక్తమగు (అర్కైః) పూజించదగిన విద్వాంసునితో గూడ (నః) మాకొరకు (జ్యోతిః) జ్ఞానప్రకాశకుడవు నగు నీవు (అర్వాఙ్) పతనమైనవారిని [నీచులను] ఉత్తములుగ నొనర్చుట నెరిగిన వాడవునై (స్వః) సుఖముతోకూడినవాడవు (న) అగుము. ॥౪౬॥

భావార్థము:- ఈ మంత్రమున ఉపమా, వాచకలుప్తోపమాలంకారములు గలవు. రాజు ఉత్తమ శిక్షా బలములతో నుండి సేనలతో శత్రువుల పరాజితమొనర్చి సుఖవంతుడగునట్లు బుద్ధి మున్నగు సుగుణములతో అవిద్యద్వారా గలిగిన క్లేశములను దొలగించుకొని మానవులు సుఖముల ననుభవించవలెను. ॥౪౬॥

46.O learned person, be thou well-disposed towards, us, like a king with his armies. With these worshipful learned persons be thou for us the expositor of knowledge; and the uplifter of the down-trodden, granting us pleasure!.

౪౭. అగ్నిర్హోతారమిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడ్బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల నవ్విషయమే యిందు చెప్పబడెను.

౭౬౬ అగ్నిం హోతారం మన్యే దాస్వన్తం వసుం సూనుం సహసో జాతవేదసం విప్రం న జాతవేదసమ్। య ఊర్ధ్వయా స్వధ్వరో దేవో దేవాచ్యా కృపా। ఘృతస్య విభ్రాష్టిమను వష్టి శోచిషాऽऽజుహ్వానస్య సర్పిషః ॥౪౭॥

ప.వి:- అగ్నిమ్, హోతారమ్, మన్యే, దాస్వన్తమ్, వసుమ్, సూనుమ్, సహసః, జాతవేదసమితి జాత + వేదసమ్, విప్రమ్, న, జాత + వేదసమితి జాత + వేదసమ్, యః, ఊర్ధ్వయా, స్వధ్వర ఇతి సు + అధ్వరః, దేవః దేవాచ్యా, కృపా, ఘృతస్య, విభ్రాష్టిమితి వి + భ్రాష్టిమ్, అను, వష్టి, శోచిషా, ఆజుహ్వానస్యేత్యా + జుహ్వానస్య, సర్పిషః ॥ ౪౭॥

పదార్థః :-(అగ్నిమ్) (హోతారమ్) సుఖదాతారమ్ (మన్యే) సత్కరోమి (దాస్వన్తమ్) దాతారమ్ (వసుమ్) ధనప్రదమ్ (సూనుమ్) పుత్రమివ (సహసః) బలిష్ఠస్య (జాతవేదసమ్)సర్వేషు జాతేషు పదార్థేషు విద్యమానమ్ (విప్రమ్) ఆప్తం మేధావినమ్ (న) ఇవ (జాతవేదసమ్) ప్రసిద్ధ ప్రజ్ఞమ్) (యః) (ఊర్ధ్వయా) ఉపరిగత్యా (స్వధ్వరః) శోభనకారిత్వాది అహింసనీయః (దేవః) దివ్యగుణః (దేవాచ్యా) దేవానఞ్చతి తయా (కృపా) సమర్థయా క్రియయా (ఘృతస్య) ఉదకస్య (విభ్రాష్టిమ్) వివిధా భ్రాష్టయః ప్రకాశాని యస్మింస్తమ్ (అను) (వష్టి) ప్రకాశతే (శోచిషా) దీప్త్యా (ఆజుహ్వానస్య) సమన్తాద్ధూయమానస్య (సర్పిషః) ఆజ్యస్య ॥ ౪౭ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! య ఊర్ధ్వయా స్వధ్వరో దేవాచ్యా కృపా దేవః శోచిషా ఽఽజుహ్వానస్య సర్పిషో ఘృతస్య విభ్రాష్టిమనువష్టి తం హోతారం జాతవేదసం సహసః సూనుమివ వసుం దాస్వంతం జాతవేదసమగ్నిం విప్రం న యథాऽహం మన్యే తథా యూయమపి మన్యధ్వమ్. ॥ ౪౭ ॥

**భావార్థః** :-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా సుసేవితా విద్వాంసో విద్యాధర్మసుశిక్షాభిః సర్వానార్యాన్ సంపాదయన్తి తథా యుక్త్యా సేవితోऽగ్నిః స్వగుణకర్మస్వభావైః సర్వానున్నయతి ॥ ౪౭ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! (యః) ఎవడు (ఊర్ధ్వయా) ఊర్ధ్వగతితోగూడ (స్వధ్వరః) శుభకర్మలచే అహింసాకరముగు (దేవాచ్యా) విద్వాంసుల సత్కారమునకు హేతువగు (కృపా) సమర్థమైన క్రియచే (దేవః) దివ్యగుణయుక్తుడు (శోచిషా) దీప్తితోగూడ (ఆజుహ్వానస్య) ఉత్తమముగా హవనమొనర్చిన (సర్పిషః)

ఘృతము మరియు (ఘృతస్య) జలముతో గూడ (వి(భ్రాష్టిమ్) వివిధ ప్రకారముల జ్యోతులను (అనుష్వి) ప్రకాశపరచుచున్నాడో, అట్టి (హోతారమ్) సౌఖ్యదాత (జాతవేదసమ్) ఉత్పన్నమైన సకలపదార్థములందును ప్రకాశమైయున్న (సహసః) వీర్యవంతుని (సూనుమ్) పుత్రునివలె (వసుమ్) ధనదాత (దాస్వన్తమ్) దానశీలుడు (జాతవేదసమ్) బుద్ధిశాలురందు ప్రసిద్ధుడు (అగ్నిమ్) తేజోవంతమగు అగ్ని (న) వలె (విప్రమ్) ఆప్తజ్ఞానిని నేను (మన్యే) సత్కారమొనర్తును. మీరును అట్లే ఓనర్చుడు. ॥౪౭॥

**భావార్థము** :- ఈ మంత్రమున ఉపమా, వాచకలుప్తోపమాలంకారములు గలవు. చక్కగా సేవించబడిన విద్వాంసులు విద్య, ధర్మము, ఉత్తమ శిక్షణలచే ఎల్లరను ఆర్యులుగ నొనర్చునట్లే యుక్తియుక్తముగ సేవించబడిన యగ్ని తన గుణకర్మస్వభావములచే సకల ప్రాణులకు సుఖవృద్ధి గలిగించును. ॥౪౭॥

47 He, who with his superior knowledge, deserves harmlessness, is fit to be honoured by the learned, is powerful in deeds, is imbued with noble qualities, and displays diverse kinds of lusture, with extreme loveliness, by performing Haven, using ghee and water, him do I honour. He is the giver of happiness, the knower of all created objects, charitably disposed like the son of a great man, giver of gifts, foremost amongst the wise, and a trustworthy, highly learned person, brilliant like fire.

౭౬౭. అగ్నే త్వన్న ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడ్బ్రాహ్మీ బృహతీఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమునే యిందు జెప్పెను.

౭౬౭ అగ్నే త్వన్నో అన్తమఽ ఉత త్రాతా శివో భవా వరూథ్యః।

వసురగ్నిర్వసుశ్రవాఽ అచ్ఛా నక్షి ద్యుమత్తమఀరయిన్దాః।

తం త్వా శోచిష్ఠ దీదివః సుమ్నాయ నూనమీమహే సఖిభ్యః ॥౪౮॥

**ప. విః**- అగ్నే, త్వమ్, నః, అన్తమః, ఉత, త్రాతా, శివః, భవ, వరూథ్యః, వసుః, అగ్నిః, వసుశ్రవా ఇతి వసు + శ్రవాః, అచ్ఛ, నక్షి, ద్యుమత్తమమితి ద్యుమత్ + తమమ్, రయిమ్, దాః, తమ్, త్వా, శోచిష్ఠ, దీదివ ఇతి దీది + వః, సుమ్నాయ, నూనమ్, ఈమహే, సఖిభ్య ఇతి సఖి + భ్యః ॥౪౮॥

పదార్థః :- (అగ్నే) విద్వన్ (త్వమ్) (నః) అస్మాకమ్ (అన్తమః) అతిశయేనాన్తికః. అన్తమానామిత్యన్తిక నా.. నిఘం.. ౨.౧౬ (ఉత) అపి (త్రాతా) రక్షకః (శివః) మఙ్గలకారీ (భవ) ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (వరూథ్యః) వరః (వసుః) ధనప్రదః (అగ్నిః) ప్రాపకః (వసుశ్రవాః) వసూని ధనాని శ్రవాంస్యన్నాని చ యస్మాత్సః (అచ్ఛ) అత్ర సంహితాయామితి దీర్ఘః (నక్షి) ప్రాప్నోమి. అత్ర ణక్ష గతావిత్యస్మాల్లడుత్తమైకవచనేఽడ్ వికరణయోరభావః (ద్యుమత్తమమ్) ప్రశస్తా దివః ప్రకాశా కామనా వా విద్యంతే యస్మిన్ సోఽతిశయిత స్తమ్ (రయిమ్) ధనమ్ (దాః) దదాతి. అత్రాప్యడభావః (తమ్) (త్వా)త్వామ్ (శోచిష్ఠ) అతిశయేన తేజస్విన్ (దీదివః) యే దీదయన్తి తే దీదయః ప్రకాశాస్తే బహవో విద్యన్తే యస్మిన్ తత్సంబుద్ధౌ (సుమ్నాయ) సుఖాయ (నూనమ్) నిశ్చితమ్ (ఈమహే) యాచామహే (సఖిభ్యః) మిత్రేభ్యః.॥౪౮॥

అన్వయః :-హే అగ్నే! త్వం యథాఽయం వసుర్వసుశ్రవా అగ్నీ రయిన్దా దదాతి తథా నోఽస్మాక మన్తమస్త్రాతా వరూథ్య ఉతాపి శివో భవ. హే శోచిష్ఠ దీదివో విద్వన్! యథా వయం త్వా సఖిభ్యః సుమ్నాయ నూనమీమహే తథా తం త్వాం సర్వే మనుష్యా యాచన్తామ్. యథాఽహం ద్యుమత్తమం త్వామచ్ఛ నక్షి ప్రాప్నోమి తథా త్వమస్మాన్ప్రాప్నుహి. ॥ ౪౮॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా సుహృదో మిత్రాణీచ్ఛన్త్యున్నయన్తి తథా విద్వాన్ సర్వస్య మిత్రః సర్వాన్సుఖినః సమ్పాదయేత్. ॥ ౪౮ ॥

పదార్థము :-(అగ్నే) విద్వాంసుడా! (త్వమ్) నీ వెట్లు ఈ (వసుః) ధనదాత (వసుశ్రవాః) అన్నము మరియు ధనములకు హేతువునగు (అగ్నిః) అగ్ని (రయిమ్) ధనములను (దాః) ఇచ్చునో, అట్లే (నః) మాయొక్క (అన్తమః) అత్యంత సమీపస్థుడవు (త్రాతా) రక్షకుడవు (వరూథ్యః) శ్రేష్ఠుడవు (ఉత) మరియు (శివః) మంగళకారివి (భవ) అగుము. (శోచిష్ఠ) అతితేజస్వి (దీదివః) అతిప్రకాశయుక్తుడా, కామితములు గల విద్వాంసుడా మే మెట్లు (త్వా) నిన్ను (సఖిభ్యః) మిత్రులచే (సుమ్నాయ) సుఖములకొరకు (నూనమ్) నిశ్చయముగ (ఈమహే) ఆకాంక్షి[యాచి]స్తున్నామో, అట్లే (తమ్) అట్టి నిన్ను మానవులెల్లరును కోరుదురుగాక! నే నెట్లు (ద్యుమత్తమమ్) ప్రశంసనీయ ప్రకాశములతో గూడిన నిన్ను (అచ్ఛ) ఉత్తమరీతిలో (నక్షి) ప్రాప్తించుకొనుచున్నానో, అట్లేనీవును మమ్ము పొందుము. ॥౪౮॥

భావార్థము :-ఈ మంత్రములో వాచకలుప్తోపమాలంకార మున్నది. ఒక సన్మిత్రుడు తన మిత్రుల శ్రేయస్సును గోరుచు వారికి ఉన్నతిని కలిగించునట్లు విద్వాంసులు సర్వజనమిత్రులై సకల జనమునకు సుఖముల నొనగూర్చవలెను. ॥౪౮॥

48.O learned person, be thou nearest friend, our protector, most prosperous, and blissful unto us, like fire that gives us riches, food-grains, and wealth. O learned person, actuated by noble aspirations, just as we pray unto thee with our friends for happiness, so may all pray. Just a I goodly meet thee full of desirable intentions, shouldst thou meet us!.

౭౬౮. యేన ఋషయ ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయమునే యిందు జెప్పెను.

౭౬౮ యేనఽ ఋషయస్తపసా స॒త్రమాయ॒న్నిన్ధానాఽ అ॒గ్నిం స్వ॒రాభరన్తః।
తస్మిన్నహం నిదధే నాకేఽ అ॒గ్నిం యమా॒హుర్మనవ స్తీ॒ర్ణబర్హిషమ్ ॥౪౯॥

ప. విః-యేన, ఋషయః, తపసా, స॒త్రమ్, ఆయన్, ఇన్ధానాః, అ॒గ్నిమ్, స్వః, ఆ॒ + భరన్తః, తస్మిన్, అ॒హమ్, ని, ద॒ధే, నాకే, అ॒గ్నిమ్, యమ్, ఆ॒హుః, మనవః, స్తీ॒ర్ణబర్హిషమితి స్తీ॒ర్ణ + బర్హిషమ్ ॥౪౯॥

**పదార్థః** :-(యేన) కర్మణా (ఋషయః) వేదార్థవేత్తారః (తపసా) ధర్మాఽనుష్ఠానేన (సత్రమ్) సత్రా సత్యం విద్యతే యస్మిన్ విజ్ఞానే తత్ (ఆయన్) ప్రాప్నుయుః (ఇన్ధానాః) ప్రకాశమానాః (అగ్నిమ్) విద్యుదాదిమ్ (స్వః) సుఖం (ఆభరన్తః) సమన్తాద్ధరన్తః (తస్మిన్) (అహమ్) (నిదధే) (నాకే) అవిద్యమానదుఃఖే సుఖే ప్రాప్తవ్యే సతి (అగ్నిమ్) ఉక్తమ్ (యమ్) (ఆహుః) వదన్తి (మనవః) మనన శీలా విద్వాంసః (స్తీర్ణబర్హిషమ్) స్తీర్ణమాచ్ఛాదితం బర్హిరన్తరిక్షం యేన తమ్. ॥ ౪౯ ॥

**అన్వయః** :-యేన తపసేన్ధానాః స్వరాభరన్త ఋషయః సత్రమగ్నిమాయంస్తస్మిన్నాకే మనవో యం స్తీర్ణబర్హిషమగ్నిమాహుస్తమహం నిదధే. ॥ ౪౯ ॥

**భావార్థః** :-యేన ప్రకారేణ వేదపారగాః సత్యమనుష్ఠాయ విద్యుదాదిపదార్థాన్ సమ్ప్రయుజ్య సమర్థా భవన్తి తేనైవ మనుష్యైః సమృద్ధియుక్తైర్భవితవ్యమ్. ॥ ౪౯ ॥

**పదార్థము** :-(యేన) ఎట్టి (తపసా) ధర్మానుష్ఠానరూప కర్మద్వారా (ఇన్ధానాః) ప్రకాశవంత (స్వః) సుఖములను (ఆభరన్తః) చక్కగా ధారణమొనర్చుచు (ఋషయః) వేదార్థములను చక్కగా నెరుగు ఋషులు (సత్రమ్) సత్యవిజ్ఞానముతో గూడిన (అగ్నిమ్) విద్యుత్తు మున్నగు అగ్నులు (ఆయన్) ప్రాప్తించుకొందురో (తస్మిన్) అట్టి కర్మద్వారా (నాకే) దుఃఖరహితము, ప్రాప్తించుకొనదగిన సుఖముల నిమిత్తము (మనవః) ఆలోచనా పరులగు విద్వాంసులు (యమ్) ఏది (స్తీర్ణబర్హిషమ్) ఆకాశమును కప్పివేయునట్టి (అగ్నిమ్) అగ్నిని (ఆహుః) చెప్పుదురో, దానిని (అహమ్) నేను (ని, దధే) ధరించెదను. ॥౪౯॥

**భావార్థము** :-వేదపారంగతులగు విద్వాంసులు సత్యము ననుష్ఠించి విద్యుత్తు మున్నగు పదార్థములను ఉపయోగపరచు సమర్థు లగునట్లు మనుష్యులు సమృద్ధవంతులు గావలెను. ॥౪౯॥

49.With whatever penance, the sages, well-read in vedic lore, securing illuminating pleasure, and full of true knowledge, explore fire; with similart devotion, for the acquisition of happiness, do I grasp the fire, described by the thoughtful learned persons as pervader of the atmosphere.

౫౦.తం పత్నీభిరిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

విద్వద్భిః కథం భవితవ్యమిత్యాహ. విద్వాంసు లెటు యుండవలయును?

౫౦ తం పత్నీభిరను గచ్ఛేమ దేవాః పుత్రైర్భ్రాతృభిరుత వా హిరణ్యైః। నాకం గృభ్ణానాః సుకృతస్య లోకే తృతీయే పృష్ఠేఽఅధి రోచనే దివః॥౫౦॥

ప.విః-తమ్, పత్నీభిః, అను, గచ్ఛేమ, దేవాః, పుత్రైః, భ్రాతృభిరితి భ్రాతృ + భిః, ఉత, వా, హిరణ్యైః, నాకమ్, గృభ్ణానాః, సుకృతస్యేతి సు + కృతస్య, లోకే, తృతీయే, పృష్ఠే, అధి, రోచనే, దివః ॥౫౦॥

**పదార్థః** :-(తమ్) అగ్నిమ్ (పత్నీభిః) స్వస్వస్త్రీభిః (అను) (గచ్ఛేమ) (దేవాః) విద్వాంసః (పుత్రైః) వృద్ధావస్థాజన్యదుఃఖాత్త్రాతృభిః (భ్రాతృభిః) బన్ధుభిః (ఉత) (వా) అన్యైరనుక్తైః సమ్బన్ధిభిః (హిరణ్యైః) సువర్ణాదిభిః (నాకమ్) ఆనన్దమ్ (గృభ్ణానాః) గృహ్ణన్తః (సుకృతస్య) సుష్ఠుకృతస్య వేదోక్తకర్మణః (లోకే) ద్రష్టవ్యే స్థానే (తృతీయే) విజ్ఞానజే (పృష్ఠే) జ్ఞీప్సితే (అధి) ఉపరిభాగే (రోచనే) రుచికరే (దివః) ద్యోతనకర్మణః. ॥ ౫౦ ॥

**అన్వయః** :-హే దేవా విద్వాంసో! యథా యూయం తం గృభ్ణానా దివః సుకృతస్యాధిరోచనే తృతీయే పృష్ఠే లోకే వర్తమానాః పత్నీభిః పుత్రైర్భ్రాతృభిరుత వా హిరణ్యైః సహ నాకం గచ్ఛత తథైతైః సహితా వయమను గచ్ఛేమ.॥౫౦॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః యథా విద్వాంసః స్వస్త్రీపుత్రభ్రాతృదుహితృమాతృపితృ భృత్యపార్శ్వస్థాన్ విద్యాసుశిక్షాభ్యాం ధార్మికాన్ పురుషార్థినః కృత్వా సన్తుష్టా భవన్తి తథైవ సర్వైరప్యనువర్త్యమ్.॥౫౦॥

**పదార్థము** :-(దేవాః) విద్వాంసులారా! మీరెట్లు (తమ్) అట్టి పూర్వోక్తాగ్నిని (గృభ్ణానాః) గ్రహణమొనర్చుచు (దివః) ప్రకాశవంతులై (సుకృతస్య) చక్కని కర్మల (అధి) యందు లేక (రోచనే) రుచికారక (తృతీయే) విజ్ఞానముచేనైన (పృష్ఠే) తెలిసికొనయోగ్యమగు (లోకే) ఆలోచించదగిన లేక దర్శించదగిన

స్థానములందున్నట్టి (పత్నీభిః) తమ తమ స్త్రీలు (పుత్రైః) వృద్ధావస్థయందు గలుగు దుఃఖములనుండి రక్షించు పుత్రులు (భ్రాతృభిః) బంధువులు (ఉత, వా) మరియు ఇతర సంబంధీయులు (హిరణ్యైః) సువర్ణము మున్నగు ధనములతో గూడ (నాకమ్) ఆనందమును పొందునట్లు ఈ సమస్తముతోగూడ మేమును (అను, గచ్ఛేమ) అనుసరింతుముగాక! (క్రమాభివృద్ధిని సంపాదించుకొందుముగాక)! ॥౫౦॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులు తమ భార్యాపుత్రాదులు, మాతాపితరులు, బంధుమిత్రాదులు, ఇరుగు పొరుగువారెల్లరకును విద్య మరియు ఉత్తమ శిక్షణలచే ధర్మాత్ములు, పురుషార్థ పరులనుగజేసి తృప్తి, ఆనందములనొందునట్లు సకలమానవులును అట్లేనర్తవలెను. ॥౫౦॥

50.O learned person, just as ye, mastering that fire, engaged in the performance of virtuous vedic deeds, residing in a beautiful, knowable, pleasant place, built scientifically, attain to happiness with your wives, sons, brothers, other relatives, and with gold, so may we also be happy in all these respects!.

౭౭౦. ఆ వాచ ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

ఈశ్వరవద్రాజ్ఞా కిం కార్యమిత్యాహ. ఈశ్వరుని వలె రాజేమి యొనర్ప వలయును?

౭౭౦ ఆ వాచో మధ్యమరుహద్ భురణ్యురయమగ్నిః సత్పతిశ్చేకితానః। పృష్ఠే పృథివ్యా నిహితో దవిద్యుతదధస్పదం కృణుతాం యే పృతన్యవః ॥౫౧॥

**ప.వి:**– ఆ, వాచః, మధ్యమ్, అరుహత్, భురణ్యుః, అయమ్, అగ్నిః, సత్పతిరితి సత్ + పతిః, చేకితానః, పృష్ఠే, పృథివ్యాః, నిహిత ఇతి ని+హితః, దవిద్యుతత్, అధస్పదమ్, అధః పదమిత్యధః + పదమ్, కృణుతామ్, యే, పృతన్యవః ॥౫౧॥

**పదార్థః** :-(ఆ) (వాచః) (మధ్యమ్) మధ్యే భవమ్ (అరుహత్) రోహతి (భురణ్యుః) పోషకః (అయమ్) (అగ్నిః) విద్వాన్ (సత్పతిః) సతాం పాలకః (చేకితానః) విజ్ఞానయుక్తః (పృష్ఠే) ఉపరిభాగే (పృథివ్యాః) భూమేః (నిహితః) నితరాం ధృతః (దవిద్యుతత్) ప్రకాశయతి (అధస్పదమ్) నీచాధికారమ్ (కృణుతామ్) కరోతు (యే) (పృతన్యవః) యుద్ధాయాత్మనః పృతనాం సేనామిచ్ఛవః.॥ ౫౧ ॥

**అన్వయః** :-హే విద్వన్! చేకితానః సత్పతిర్భవాన్ వాచో మధ్యం ప్రాప్య యథాఽయం భురణ్యు రగ్నిః పృథివ్యాః పృష్ఠే నిహితో దవిద్యుతదారుహత్తేన యే పృతన్యవస్తానన్నధస్పదం కృణుతామ్.॥ ౫౧ ॥

**భావార్థః** :- విద్వాంసో రాజానో యథేశ్వరో బ్రహ్మాణ్డస్య మధ్యే సూర్యం నిధాయ సర్వాన్ సుఖేనోపకరోతి తథైవ రాజ్యమధ్యే విద్యాబలే ధృత్వా శత్రూన్ జిత్వా ప్రజాస్థాన్ మనుష్యానుపకుర్యుః ॥౫౧॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! (చేకితానః) విజ్ఞానివి (సత్పతిః) శ్రేష్ఠుల రక్షకుడవునగు నీవు (వాచః) వాణియొక్క (మధ్యమ్) మధ్యన జరిగిన యుపదేశములను పొంది యెట్లు (అయమ్) ఈ (భురణ్యుః) పుష్టికర్తయగు (అగ్నిః) విద్వాంసుడు (పృథివ్యాః) భూమి (పృష్ఠే) పైన (నిహితః) నిరంతరము స్థిరపరచెనో (దవిద్యుతత్) ఉపదేశములచే ఎల్లరను ప్రకాశపరచునో మరియు ధర్మముపై (ఆ, అరుహత్) ఆరూఢమగు చున్నాడో, ఆతనితో (యే) ఎవరు (పృతన్యవః) యుద్ధముకొరకు సైన్యములను గోరుదురో వారిని (అధస్పదమ్) తమ అధికారమునుండి పతనము జెందునట్లు (కృణుతామ్) చేయుము. ॥౫౧॥

**భావార్థము** :- పరమేశ్వరుడు విశ్వమునందు సూర్యలోకమును స్థాపనమొనర్చి సకల ప్రాణులకు సుఖము ప్రసాదించునట్లు, రాజు రాజ్యమునందు విద్య, ధనము, బలములను ధరింపజేసి, శత్రువులను జయించి ప్రజలకు సుఖము గలిగించునట్టి ఉపకారముల నొనర్చునట్లు విద్వాంసులు ప్రయత్నించవలెను. ॥౫౧॥

51.O learned person, full of knowledge, protector of the virtuous, having understood the essence of vedic speech, cast under foot those who would fight against him, who is well read, firmly established on the earth, benefits all with his advice, and sticks to religion!.

౨౨౧. అయమగ్నిరిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

ధార్మికజనవదితరైర్వర్తితవ్యమిత్యాహ. ధర్మాత్ములవలె నితరులును ప్రవర్తించవలయును.

౨౨౧ అయమగ్నిర్వీరతమో వయోధాః సహస్రియో ద్యోతతామప్రయుచ్ఛన్ ।
విభ్రాజమానః సరిరస్య మధ్యఽఉప ప్ర యాహి దివ్యాని ధామ ॥౫౨॥

**ప. విః**- అయమ్, అగ్నిః, వీరతమ ఇతి వీర+తమః, వయోధా ఇతి వయః+ధాః, సహస్రియః, ద్యోతతామ్, అప్రయుచ్ఛన్నిత్య ప్ర+యుచ్ఛన్, విభ్రాజమాన ఇతి వి+భ్రాజమానః, సరిరస్య, మధ్యే, ఉప, ప్ర, యాహి, దివ్యాని, ధామ ॥౫౨॥

**పదార్థః** :-(అయమ్) (అగ్నిః) పావక ఇవ సేనాపతిః (వీరతమః) వేతి స్వబలేన శత్రుబలం వ్యాప్నోతి సోఽతిశయితః (వయోధాః) యః సర్వేషాం జీవనం దధాతి సః (సహస్రియః) సహస్రేణాసఙ్ఖ్యాతేన యోద్ధృసమూహేన సమ్మితస్తుల్యః (ద్యోతతామ్) ప్రకాశతామ్ (అప్రయుచ్ఛన్) అప్రమాద్యన్

(విభ్రాజమానః) విశేషేణ విద్యాన్యాయాభ్యాం దేదీప్యమానః (సరిరస్య) అంతరిక్షస్య (మధ్యే) (ఉప) (ప్ర) (యాహి) ప్రాప్నుహి (దివ్యాని) (ధామ) జన్మకర్మస్థానాని. ॥ ౫౨ ॥

**అన్వయః**:- యోఽయం వీరతమో వయోధాః సహస్రియః సరిరస్య మధ్యే విభ్రాజమానోఽప్రయుచ్ఛన్నగ్ని రివ స భవాన్ ద్యోతతామ్. దివ్యాని ధామ ధామాని త్వముపప్రయాహి. ॥ ౫౨ ॥

**భావార్థః** :- మనుష్యా ధార్మికైర్జనైః సహోషిత్వా ప్రమాదం విహాయ జితేన్ద్రియత్వేన జీవనం వర్ధయిత్వా విద్యాధర్మానుష్ఠానేన పవిత్రా భూత్వా పరోపకారిణః సన్తు. ॥ ౫౨ ॥

**పదార్థము** :- ఏ (అయమ్) ఈతడు (వీరతమః) స్వశక్తిచే శత్రువులందు వ్యాప్తుడో మరియు నీవు (వయోధాః) సకల ప్రాణుల జీవనమును ధారణమొనర్చువాడవు (సహస్రియః) అసంఖ్యాక యోధులవంటి యోధుడవు (సరిరస్య) ఆకాశము (మధ్యే) మధ్యన (విభ్రాజమానః) విశేషముగ విద్యలు మరియు న్యాయముచే ప్రకాశితుడవు (అప్రయుచ్ఛన్) ప్రమాదరహితుడవు (అగ్నిః) అగ్నివంటి సేనాపతివగు నీవు (ద్యోతతామ్) ప్రకాశితుడవుగమ్ము. మరియు (దివ్యాని) ఉత్తమ (ధామ) జన్మ, కర్మ, స్థానములను (ఉప, ప్ర యాహి) ప్రాప్తింపజేయుము. ॥౫౨॥

**భావార్థము** :- మానవులు ధర్మాత్ములతో నివసించుచు, ఆలస్యప్రమాదములను వదలి, జితేంద్రియత్వముతో ఆయువును వృద్ధిపరచుకొని విద్యాధర్మములను చక్కగా ననుష్ఠించుచు పవిత్రనంతులై పరోపకారులై యుండవలయును. ॥౫౨॥

52.May this commander of the army, most manly, supporter of the lives of all, powerful like thousand soldiers, shining with knowledge and justice like sun in the midst of heaven free from carelessness, shine, and attain to nice birth, deeds and position.

౽౨౩.సంప్రచ్యవధ్వమిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

కథం వివాహం కృత్వా కిం కుర్యాతామిత్యాహ.

స్త్రీ పురుషులు వివాహమాడి ఏమి యొనర్చవలెను?

౽౨౩ సంప్రచ్యవధ్వముప సంప్రయాతాగ్నే పథో దేవయానాన్ కృణుధ్వమ్। పునః కృణ్వానా పితరా యువానాఽన్వాతాꣳसీత్ త్వయి తన్తుమేతమ్ ॥౫౩॥

**ప.విః**–సంప్రచ్యవధ్వమితి సమ్ + ప్రచ్యవధ్వమ్, ఉప, సంప్రయాతేతి సమ్ + ప్రయాత, అగ్నే, పథః, దేవయానానితి దేవ + యానాన్, కృణుధ్వమ్, పునరితి పునః, కృణ్వానా పితరా,

యువానా, అన్వాతాఙ్సీదిత్యను + అతాఙ్సీత్, త్వయి, తన్తుమ్, ఏతమ్ ॥౫౩॥

**పదార్థః** :-(సంప్రచ్యవధ్వమ్) సమ్యగ్గచ్ఛత (ఉప) (సంప్రయాత) సమ్యక్ ప్రాప్నుత (అగ్నే) విద్వన్! (పథః) మార్గాన్ (దేవయానాన్) దేవా ధార్మికా యాన్తి యేషు తాన్ (కృణుధ్వమ్) కురుత (పునః) (కృణ్వానా) కుర్వన్తౌ (పితరా) పాలకౌ మాతాపితరౌ (యువానా) పూర్ణయువావస్థౌ. అత్ర సర్వత్ర విభక్తేరాకారాదేశః (అన్వాతాంసీత్) పశ్చాత్ సమన్తాత్తనుతామ్. అత్ర వచనవ్యత్యయేన ద్వివచనస్థాన ఏకవచనమ్ (త్వయి) పితామహే విద్యమానే సతి (తన్తుమ్) సన్తానమ్ (ఏతమ్) గర్భాధానాదిరీత్యా యథోక్తమ్. ॥౫౩॥

**అన్వయః** :-హే మనుష్యాః! యూయం విద్యా ఉపసంప్రయాత దేవయానాన్ పథః సంప్రచ్యవధ్వం ధర్మం కృణుధ్వమ్. హే అగ్నే! త్వయి పితామహే విద్యమానే సతి పితరా బ్రహ్మచర్యం కృణ్వానా యువానా భూత్వా స్వయంవరం వివాహం కృత్వా పునరేతం తన్తుమన్వాతాంసీత్ ॥ ౫౩ ॥

**భావార్థః** :-కుమారా ధర్మ్యేణ సేవితబ్రహ్మచర్యేణ పూర్ణా విద్యా అధీత్య స్వయం ధార్మికా భూత్వా పూర్ణయువావస్థాయాం ప్రాప్తాయాం కన్యానాం పురుషాః పురుషాణాం చ కన్యాః పరీక్షాం కృత్వాఽత్యన్తప్రీత్యాఽఽకర్షితహృదయాః స్వేచ్ఛయా వివాహం విధాయ ధర్మేణ సంతానానుత్పాద్య సేవయా మాతాపితరౌ చ సన్తోష్యాప్తానాం విదుషాం మార్గం సతతమన్వాయయుః. యథా సరలాన్ ధర్మమార్గాన్కుర్యుస్తథైవ భూమి జలాన్తరిక్షమార్గానపి నిష్పాదయేరన్. ॥ ౫౩ ॥

**పదార్థము** :-ఓ మానవులారా! మీరు విద్యలను (ఉపసంప్రయాత) చక్కగా పొందుడు (దేవయానాన్) ధార్మికుల (పథః) మార్గములందు (సంప్రచ్యవధ్వమ్) చక్కగా నడుపుడు. ధర్మమును (కృణుధ్వమ్) చక్కగా అవలంబించుడు (అగ్నే) విద్వాంసుడవగు పితామహా! (త్వయి) నీ వుండుకాలమందే (పితరా) రక్షణయొనర్చు మాతాపితరులు, నీయొక్క పుత్రాదులు బ్రహ్మచర్యమును (కృణ్వానా) ఆచరించుచు (యువానా) పూర్ణయువావస్థను పొంది, స్వయంవర వివాహమొనర్చుకొని (పునః) తరువాత (ఏతమ్) గర్భాధానాది రీతులచే (తన్తుమ్) సంతానమును (తన్వాతాంసీత్) అనుకూలవంతముగ నుత్పన్నపరచి సుయోగ్యుల నొనర్చ వలయును. ॥౫౩॥

**భావార్థము** :-యువతీయువకులు ధర్మయుక్తముగ సేవించిన బ్రహ్మచర్యముచే పూర్ణ విద్యలను పొంది ధర్మాత్ములై పూర్ణయువావస్థయందు కన్యలుపురుషులు పరస్పరము పరీక్షించుకొని అత్యంత ప్రీతి, మనస్సులచే పరస్పరము ఆకర్షించుకొని ఇచ్ఛాపూర్తిగ వివాహముచేసికొనవలయును. ధర్మానుకూలముగ సంతానములను గని సేవాశుశ్రూషల ద్వారా తమ తల్లిదండ్రులను సంతోషపరచవలెను. ఆప్తవిద్వాంసుల మార్గమున నిరంతరము నడచుచు ధర్మమార్గమును సుగమ మొనర్చవలెను. అదే విధముగ స్థల, జల, అంతరిక్ష మార్గములను సైతము సరళమొనర్చవలెను. ॥౫౩॥

53.O people, learn well all sciences, follow the path of the virtuous, be religious - minded. O learned grandfather, in thy lifetime, let thy sons, leading a life of

Brahmcharya, in the bloom of their youth, marry according to their own selection, and produce afterwards children according to the rules of eugenics!.

౭౭౩.ఉద్బుధ్యస్వేత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౭౭౩ ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టాపూర్తే సꣳ సృజేథామయం చ ।

అస్మిన్త్సధస్థేఽ అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥౫౪॥

ప.విః-ఉత్, బుధ్యస్వ, అగ్నే, ప్రతి, జాగృహి, త్వమ్, ఇష్టాపూర్తే ఇతీష్టా + పూర్తే,సమ్, సృజేథామ్, అయమ్, చ, అస్మిన్, సధస్థ ఇతి సధ + స్థే, అధి, ఉత్తరస్మిన్నిత్యుత్ + తరస్మిన్, విశ్వే, దేవాః, యజమానః, చ, సీదత ॥౫౪॥

**పదార్థః** :- (ఉత్) ఉత్కృష్టరీత్యా (బుధ్యస్వ) జానీహి (అగ్నే) విద్యయా సుప్రకాశితే స్త్రీ పురుష వా (ప్రతి) (జాగృహి) అవిద్యానిద్రాం త్యక్త్వా విద్యయా చేత (త్వమ్) స్త్రీ (ఇష్టాపూర్తే) ఇష్టం సుఖం విద్వత్సత్కారణమీశ్వరారాధనం సత్సంగతికరణం సత్యవిద్యాదిదానం చ పూర్తం పూర్ణం బలం బ్రహ్మచర్యం విద్యాలంకరణం పూర్ణం యౌవనం పూర్ణం సాధనోపసాధనం చ తే (సమ్) సమ్యక్ (సృజేథామ్) నిష్పాదయేతమ్. అత్ర వ్యత్యయేనాత్మనేపదమ్ (అయమ్) పురుషః (చ) (అస్మిన్) వర్తమానే (సధస్థే) సహస్థానే (అధి) ఉపరి (ఉత్తరస్మిన్) ఆగామిని (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః (యజమానః) పురుషః (చ) స్త్రీ (సీదత) అవస్థితా భవత ॥ ౫౪ ॥

**అన్వయః** :-హే అగ్నే! త్వముద్బుధ్యస్వ, సర్వాన్ ప్రతి జాగృహి, త్వమయం చాస్మిన్త్సధస్థ ఉత్తరస్మింశ్చ సదేష్టాపూర్తే సంసృజేథామ్. విశ్వే దేవా యజమానశ్చాతస్మిన్నధి సీదత. ॥ ౫౪ ॥

**భావార్థః** :-యథాఽగ్నియజమానౌ సుఖం పూర్ణాం సామగ్రీం చ సాధ్నుతస్తథా కృతవివాహాః స్త్రీ పురుషా అస్మిన్ జగతి సమాచరన్తు. యదా వివాహాయ దృఢప్రీతీ స్త్రీపురుషౌ భవేతాం తదా విదుష ఆహూయైతేషాం సన్నిధౌ వేదోక్తాః ప్రతిజ్ఞాః కృత్వా పతిః పత్నీ చ భవేతామ్. ॥ ౫౪ ॥

**పదార్థము** :-(అగ్నే) ఉత్తమ విద్యలచే ప్రకాశితులగు స్త్రీ పురుషులారా! [స్త్రీ మరియు పురుషుడా] (ఉద్బుధ్యస్వ) ఉత్తమ జ్ఞానమును పొంది ఎల్లరయెడ (ప్రతి, జాగృహి) అవిద్య [అజ్ఞాన] రూప నిద్రను వదలి విద్యద్వారా చేతనమునొందుము (త్వమ్) స్త్రీవగు నీవు (చ) మరియు (అయమ్) ఈ పురుషుడు

ఇరువురును (అస్మిన్) ఇప్పటి కలిసియున్న ఏక స్థానమున మరియు (ఉత్తరస్మిన్) రాబోవు కాలమందును సదా (ఇష్టాపూర్తే) ఇష్టాపూర్తములనగా:- విద్వాంసుల సత్కారము, ఈశ్వరారాధన, సత్సాంగత్యము, సత్యవిద్యలు మున్నగువాని దానము ఇవి ఇష్టములు. సంపూర్ణబలము, బ్రహ్మచర్యము, విద్యయొక్క శోభను వృద్ధిపరచుట, పూర్ణయువావస్థ మరియు సాధనోపసాధనములు ఇవన్నియు పూర్తములు. ఈ రెండింటిని (సం, సృజేథామ్) సాధించుకొనుడు (విశ్వే) సకల (దేవాః) విద్వాంసులు (చ) మరియు (యజమానః) యజ్ఞమొనర్చువాడు, నీవును ఈ యేక స్థానమందు (అధి, సీదత) ఉన్నత పూర్వకముగ స్థిరపడుదురుగాక. ॥౫౪॥

**భావార్థము** :- అగ్నిద్వారా సుగంధితమగు హోమముచే ఇష్టసుఖములనిచ్చుచు యజ్ఞకర్తయొక్క యజ్ఞ సామగ్రిని పూర్ణపరచునట్లు ఉత్తమవివాహమొనర్చుకొనిన స్త్రీపురుషులు ఉత్తమాచరణ గలవారై యుండవలెను. వివాహముకొరకు దృఢప్రీతిగల స్త్రీపురుషులు విద్వాంసులను బిలుచుకొని వారి సమక్షమున వేదోక్త ప్రతిజ్ఞల నొనర్చి పతీపత్నులు గానగును. ॥౫౪॥

54.O highly learned man or woman acquire knowledge thoroughly, avoid ignorance, and be full of learning. Thou wife and this husband both, in this present place and in future, should acquire desired happiness, honour the learned, pray to God, keep good company, give true knowledge as a free gift, possess full strength, cultivate Brahmcharya, acquire the glory of knowledge, attain to puberty, and try for the attainment of final beatitude through helpful means!.

Let all the learned and the sacrificers be seated in this place.

౭౭౪. యేన వహసీత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౭౭౪ యేన వహసి సహస్రం యేనాగ్నే సర్వవేదసమ్।

తేనేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే ॥౫౫॥

**ప.విః- యేన, వహసి, సహస్రమ్, యేన, అగ్నే, సర్వవేదసమితి సర్వ + వేదసమ్, తేన, ఇమమ్, యజ్ఞమ్, నః, నయ, స్వః, దేవేషు, గన్తవే ॥౫౫॥**

**పదార్థః** :-(యేన) ప్రతిజ్ఞాతేన కర్మణా (వహసి) (సహస్రమ్) అసంఖ్యం గృహాశ్రమవ్యవహారం (యేన) విజ్ఞానేన (అగ్నే) విద్వన్ విదుషి వా (సర్వవేదసమ్) సర్వైర్వేదైరుక్తం కర్మ (తేన) (ఇమమ్) గృహాశ్రమమ్ (యజ్ఞం) సంగంతవ్యమ్ (నః) అస్మాన్ (నయ) (స్వః) సుఖమ్ (దేవేషు) విద్వత్సు (గన్తవే) గన్తుం ప్రాప్తుమ్ ॥ ౫౫ ॥

**అన్వయః** :-హే అగ్నే! త్వం దేవేషు స్వర్గన్తవే యేన సహస్రం వహసి యేన సర్వవేదసం వహసి తేనేమం యజ్ఞం నోఽస్మాన్నయ. ॥ ౫౫ ॥

**భావార్థః** :-వివాహప్రతిజ్ఞా స్త్రియమపి ప్రతిజ్ఞా కారయితవ్యా. హే స్త్రీపురుషౌ! యువాం యథా స్వహితాయాచరతం తథాస్మాకం మాతాపిత్రాచార్యాతిథీనాం సుఖాయాపి సతతం వర్తేయాథామితి. ॥౫౫॥

**పదార్థము** :-(అగ్నే) విద్వాంస, విదుషీ స్త్రీ లేక పురుషుడా! నీవు (దేవేషు) విద్వాంసులందు (స్వః) సుఖముల (గన్తవే) ప్రాప్తికొరకు (యేన) ప్రతిజ్ఞాయుక్తమైన ఏ కర్మచే (సహస్రమ్) గృహాశ్రమముయొక్క అసంఖ్యాక వ్యవహారములను (వహసి) పొందుచున్నావో మరియు (యేన) ఏ విజ్ఞానముచే (సర్వవేదసమ్) సకల వేదోక్తకర్మలను యథావతుగ నొనర్చుచున్నావో (తేన) దానిచే (ఇమమ్) ఈ గృహాశ్రమరూప (యజ్ఞమ్) సంగతియోగ్యమగు యజ్ఞమును (నః) మాకు (నయ) ప్రాప్తింప జేయుము.॥౫౫॥

**భావార్థము**:-''ఓ వధూవరులారా! మీ రుభయులును మీ హితమునకై యాచరించునట్లే తల్లిదండ్రులు, ఆచార్యులు, అతిథులమగు మా సుఖముకొరకును మీరు నిరంతరము యత్నించు''డని పురోహితుడు వివాహకాలమున వధూవరులచే ప్రతిజ్ఞ జేయించవలయును.॥౫౫॥

55.O learned man or woman, just as thou, for the happiness of the wise, with a resolute vow, solvest the thousand problems of domestic life, and with knowledge observest the injunction of the vedas, so help us in discharging our domestic duties!.

౫౬. అయం త ఇత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౫౬ అయం తే యోనిర్ఋత్వియో యతో జాతోఽ అరోచథాః।

తఞ్జానన్నగ్నఽ ఆ రోహాథా నో వర్ధయా రయిమ్ ॥౫౬॥

**ప.వి:-** అయమ్, తే, యోనిః ఋత్వియః, యతః, జాతః, అరోచథాః, తమ్, జానన్, అగ్నే, ఆ, రోహ, అథ, నః, వర్ధయ, రయిమ్ ॥౫౬॥

**పదార్థః** :-(అయమ్) (తే) తవ (యోనిః) గృహమ్ (ఋత్వియః) ఋతుః ప్రాప్తోఽస్య సః (యతః) యస్య విద్యాధ్యయనస్యాధ్యాపనస్య చ సకాశాత్ (జాతః) జాతా చ (అరోచథాః) ప్రదీప్యేథాః (తమ్) (జానన్) జానన్తి చ (అగ్నే) విద్వన్ విదుషి చ (ఆ) (రోహ) (అథ) ఆనన్తర్యే. నిపాతస్య చేతి దీర్ఘః (నః) అస్మాకమ్ (వర్ధయ) అన్యేషామపీతి దీర్ఘః (రయిమ్) సంపత్తిమ్ ॥ ౫౬ ॥

**అన్వయః** :- హే అగ్నే! యో౽యం తే తవ ఋత్వియో యోనిరస్తి యతో జాతో జాతా త్వం చారోచథాస్తం జానన్ జానన్తీ చారోహాథ నో రయిం వర్ధయ ॥ ౫౬ ॥

**భావార్థః** :- వివాహే స్త్రీపురుషాభ్యామియమపి ద్వితీయా ప్రతిజ్ఞా కారయితవ్యా, యేన బ్రహ్మచర్యేణ యయా విద్యయా చ యువాం స్త్రీపురుషౌ కృతకృత్యౌ భవథస్తత్తాం చ సదైవ ప్రచారయతమ్. పురుషార్థేన ధనాదికం చ వర్ధయిత్వైతత్ సన్మార్గే నీతమ్. ఇత్యేతత్ సర్వం హేమన్తస్య ఋతోర్వ్యాఖ్యానం సమాప్తమ్. ॥ ౫౬ ॥

**పదార్థము** :- (అగ్నే) విదుషీ, లేక విద్వాంసా! (అయమ్) ఈ (తే) నీయొక్క (ఋత్వియః) ఋతువు [ఋతుకాలము] లేక సమయము ప్రాప్తించిన (యోనిః) ఏ గృహము గలదో (యతః) ఏ విద్యల నభ్యసించుటచే (జాతః) ప్రసిద్ధుడవు లేక ప్రసిద్ధురాలివగు నీవు (అరోచథాః) ప్రకాశిత (రాలి)వగుచున్నావో (తమ్) దానిని (జానన్) ఎరుగుచు (ఆ, రోహ) ధర్మముపై ఆరూఢులై (అథ) ఆ పిదప (నః) మాయొక్క (రయిమ్) సంపదలను (వర్ధయ) వృద్ధిపరచవలెను. ॥ ౫౬ ॥

**భావార్థము** :- "ఓ దంపతులారా! ఏ బ్రహ్మచర్యము, ఏ విద్యల ద్వారా మీరిరువురు కృతకృత్యులగుదురో వానిని సదా ప్రజలందు ప్రచారమొనర్పుడు. మరియు పురుషార్థముతో ధనము మున్నగు పదార్థములను సంపాదించి వానిని సన్మార్గములందు వ్యయపరచుచుండు" డనియును ప్రతిజ్ఞ చేయించవలెను. (ఇది హేమంతఋతువ్యాఖ్యానము పూర్తియైనదని ఎరుగవలెను). ॥ ౫౬ ॥

56.O learned man or woman, this is thy house comfortable in all seasons. Stick fast to religion keeping in mind the education received, whereby thou hast attained to name and fame. Cause then our riches to increase!.

౫౭. తపశ్చేత్యస్య పరమేష్ఠీ ఋషిః, శిశిరర్తుర్దేవతా. స్వరాడుత్కృతిశ్ఛందః, షడ్జః స్వరః.

అథ శిశిరస్య ఋతోర్వర్ణనమాహ. ఇందు శిశిర ఋతువు వర్ణన చేయబడుచున్నది.

౫౭ తపశ్చ తపస్యశ్చ శైశిరావృతూ౽ అగ్నేరన్తః శ్లేషో౽సి కల్పేతాం ద్యావాపృథివీ కల్పన్తామాప ఓషధయః కల్పన్తామగ్నయః పృథఙ్మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః। యే౽ అగ్నయః సమనసో౽న్తరా ద్యావాపృథివీ౽ ఇమే। శైశిరావృతూ౽ అభికల్పమానా౽ ఇన్ద్రమివ దేవా అభిసంవిశన్తు తయా దేవతయా౽ఙ్గిరస్వద్ ధ్రువే సీదతమ్ ॥ ౫౭ ॥

**ప.వి:-** తపః, చ, తపస్యః, చ, శైశిరౌ, ఋతూ ఇత్యృతూ, అగ్నేః, అన్తఃశ్లేష ఇత్యన్తః + శ్లేషః, అసి, కల్పేతామ్, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, కల్పన్తామ్, ఆపః, ఓషధయః, కల్పన్తామ్, అగ్నయః పృథక్, మమ, జ్యైష్ఠ్యాయ, సవ్రతా ఇతి స + వ్రతాః, యే, అగ్నయః, సమనస ఇతి స + మనసః, అన్తరా, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, ఇమే ఇతీమే, శైశిరౌ, ఋతూ ఇత్యృతూ, అభికల్పమానా ఇత్యభి + కల్పమానాః, ఇన్ద్రమివేతీన్ద్రమ్ + ఇవ, దేవాః, అభిసంవిశన్త్విత్యభిసమ్+విశన్తు, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువే ఇతి ధ్రువే, సీదతమ్॥౨౭॥

**పదార్థః :-** (తపః) యస్తాపహేతుః స మాఘో మాసః (చ) (తపస్యః) తపో ధర్మో విద్యతేఽస్మిన్ స ఫాల్గునో మాసః (చ) (శైశిరౌ) శిశిరర్తౌ భవౌ (ఋతూ) స్వలిఙ్గప్రాపకౌ (అగ్నేః) (అన్తఃశ్లేషః) మధ్యప్రవేశః (అసి) (కల్పేతామ్) (ద్యావాపృథివీ) (కల్పన్తామ్) (ఆపః) (ఓషధయః) (కల్పన్తామ్) (అగ్నయః) పావకాః (పృథక్) (మమ) (జ్యైష్ఠ్యాయ) (సవ్రతాః) సమాననియమాః (యే) (అగ్నయః) (సమనసః) సమానమనో నిమిత్తాః (అన్తరా) మధ్యే (ద్యావాపృథివీ) ప్రకాశభూమీ (ఇమే) (శైశిరౌ) శిశిర ఋతుసంపాదకౌ (ఋతూ) (అభికల్పమానాః) సంపాదయన్తః (ఇన్ద్రమివ) ఐశ్వర్యమివ (దేవాః) విద్వాంసః (అభిసంవిశన్తు) (తయా) (దేవతయా) పూజ్యతమయా వ్యాప్తయా బ్రహ్మాఖ్యయా సహ (అఙ్గిరస్వత్) ప్రాణవత్ (ధ్రువే) దృఢే (సీదతమ్) సీదతః. ॥ ౨౭ ॥

**అన్వయః :-** హే ఈశ్వర! మమ జ్యైష్ఠ్యాయ తపశ్చ తపస్యశ్చ శైశిరావృతూ సుఖకారకౌ భవతః. త్వం యయోరగ్నే రన్తఃశ్లేషోఽసి తాభ్యాం ద్యావాపృథివీ కల్పేతామాప ఓషధయశ్చ కల్పన్తామ్. సవ్రతా అగ్నయః పృథక్ కల్పన్తాం యే సమనసోఽగ్నయ ఇమే ద్యావాపృథివీ అన్తరా శైశిరావృతూ అభికల్పమానాః సన్తి తానిన్ద్రమివ దేవా అభిసంవిశన్తు. హే స్త్రీపురుషౌ! యువాం తయా దేవతయా సహాఙ్గిరస్వద్ వర్తమానౌ ధ్రువే ద్యావా పృథివీ ఇవ సీదతమ్. ॥ ౨౭ ॥

**భావార్థః :-** అత్రోపమాలంకారః. మనుష్యైః ప్రత్యృతుసుఖమీశ్వరాదేవ యాచనీయమ్. ఈశ్వరస్య విద్యుదన్తః ప్రవిష్టత్వాత్సర్వే పదార్థాః స్వస్వనియమేన సమర్థా భవన్తి. విద్వాంసః సర్వపదార్థగతవిద్యుదగ్నీనాం గుణదోషాన్ విజానన్తు. స్త్రీపురుషౌ గృహాశ్రమే స్థిరమతీ శైశిరం సుఖం భుఞ్జాతామ్. ॥ ౨౭ ॥

**పదార్థము :**- ఓ పరమేశ్వరా! (మమ) నాయొక్క (జ్యైష్ఠ్యాయ) జ్యేష్ఠత్వముకొరకు (తపః) తాపమును పెంపొందించుటకు హేతువగు మాఘమాసము (చ) మరియు (తపస్యః) తాపముచే గూడిన ఫాల్గుణమాసము (చ) ఈ రెండును (శైశిరౌ) శిశిరఋతువునందు ప్రఖ్యాతము (ఋతూ) తమ చిహ్నములను ప్రాప్తిని గలిగించు సుఖదాయకములై యుండును. నీవు ఏ రెండింటికి (అగ్నేః) అగ్నికిగూడ (అన్తఃశ్లేషః) మధ్యన ప్రవిష్టమై (అసి) ఉన్నావో, ఆ రెండింటిచే (ద్యావాపృథివీ) ఆకాశము, భూమి (కల్పేతామ్) సమర్థవంతమగు గాక! (ఆపః) జలము (ఓషధయః) ఓషధులు (కల్పన్తామ్) సమర్థవంతమగుగాక! (సవ్రతాః) ఒకేవిధమగు నియమమందుగల (అగ్నయః) విద్యుత్తు మున్నగు అగ్నులు (పృథక్) వేర్వేరుగా (కల్పన్తామ్) సమర్థవంతములగుగాక! (యే) ఏవి (సమనసః) ఒకేవిధముగ మనస్సునకు నిమిత్తములై యున్నవియో అవి (అగ్నయః) విద్యుత్తు మున్నగు అగ్నులు (ఇమే) ఈ (ద్యావాపృథివీ) ఆకాశము మరియు భూమికి (అన్తరా) మధ్యన జరుగునట్టి (శైశిరా) శిశిరఋతు సాధకములగు (ఋతూ) మాఘ, ఫాల్గుణమాసములను (అభికల్పమానాః) సమర్థవంతమొనర్చునో అట్టి యగ్నులందు (ఇన్ద్రమివ) ఐశ్వర్యములవలె (దేవాః) విద్వాంసులు (అభిసంవిశన్తు) జ్ఞానపూర్వకముగ ప్రవేశించెదరుగాక! ఓ స్త్రీపురుషులారా! మీరిరువురును (తయా) ఆ (దేవతయా) పూజాయోగ్యుడు, సర్వవ్యాపకుడు జగదీశ్వరుడగు నా దేవతతోగూడ (అఙ్గిరస్వత్) ప్రాణములవలె నుండి ఈ భూమ్యాకాశములవలె (ధ్రువే) దృఢముగా (సీదతమ్) స్థిరమైయుండుడు. ॥౫౭॥

**భావార్థము :**- ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు. మానవులు సకల ఋతువులందును ఈశ్వరునితో మాత్రమే సుఖముల నర్థించవలయును. ఆయన విద్యుదగ్నులందును వ్యాప్తమైయున్నాడు. కావుననే సకల పదార్థములు తమనియమకార్యములందు సమర్థవంతమగుచున్నవి. విద్వాంసులు సమస్త వస్తువులందు వ్యాప్తమైయున్న విద్యుద్రూపాగ్నుల గుణదోషముల నెరుగవలయును. స్త్రీపురుషులు గృహాశ్రమమందు స్థిరచిత్తులై శిశిరఋతువు సుఖముల ననుభవించవలెను. ॥౫౭॥

57.O God, for my prosperity, the Magh (January-February) an Phagan (February-March) these two months constituting the dewy-winter, add to my pleasure. Thou pervadest them and fire!. In those months let sky and earth, and water be pleasure-giving. Let medicinal plants grow in them. Let lightning-fires, following the same laws, be separately useful to us. These lightening-fires residing in between the Sky and Earth, unanimously the cause of Dewy-winter, create the Magh and Phagam months. The learned should use these mighty fires. Just as the Sky and Earth, through the dispensation of God work to gether like breath, so should you wife and husband live constantly to gether.

౭౭౭.పరమేష్ఠీత్యస్య పరమేష్ఠీ ఋషిః, విదుషీ దేవతా, భురిక్ బ్రాహ్మీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

స్త్రియా కిం కార్యమిత్యాహ. స్త్రీ ఏమి చేయవలయును?

౭౭౭ పరమేష్ఠీ త్వా సాదయతు దివస్పృష్ఠే జ్యోతిష్మతీమ్ ।
విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయ విశ్వం జ్యోతిర్యచ్ఛ ।
సూర్యస్తేఽధిపతిస్తయా దేవతయాఽఙ్గిరస్వద్ ధ్రువా సీద ॥౫౮॥

**ప.వి:**–పరమేష్ఠీ, పరమేష్ఠీతి పరమే+స్థీ, త్వా, సాదయతు, దివః, పృష్ఠే, జ్యోతిష్మతీమ్, విశ్వస్మై, ప్రాణాయ, అపానాయేత్యప + ఆనాయ, వ్యానాయేతి వి + ఆనాయ, విశ్వమ్, జ్యోతిః, యచ్ఛ, సూర్యః, తే, అధిపతిరిత్యధి + పతిః, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువా, సీద ॥౫౮॥

**పదార్థః** :-(పరమేష్ఠీ) పరమ ఆకాశేఽభివ్యాప్య స్థితః (త్వా) (సాదయతు) స్థాపయతు (దివః) ప్రకాశస్య (పృష్ఠే) ఉపరి (జ్యోతిష్మతీమ్) ప్రశస్తాని జ్యోతీంషి జ్ఞానాని విద్యన్తేఽస్యాం తామ్ (విశ్వస్మై) సర్వస్మై (ప్రాణాయ) (అపానాయ) (వ్యానాయ) (విశ్వమ్) సర్వమ్ (జ్యోతిః) ప్రకాశమ్ (యచ్ఛ) (సూర్యః) సూర్య ఇవ వర్తమానః (తే) తవ (అధిపతిః) స్వామీ (తయా) పత్యాఖ్యయా (దేవతయా) దివ్యగుణయుక్తయా (అఙ్గిరస్వత్) (ధ్రువా) దృఢా (సీద) స్థిరా భవ. ॥౫౮॥

**అన్వయః** :-హే స్త్రి! పరమేష్ఠీ జ్యోతిష్మతీం త్వా దివస్పృష్ఠే విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయ సాదయతు త్వం విశ్వం జ్యోతిః సర్వాభ్యః స్త్రీభ్యో యచ్ఛ. యస్యాస్తే తవ సూర్య ఇవాధిపతిరస్తి తయా దేవతయా సహ వర్తమానాఽఙ్గిరస్వద్ ధ్రువా సీద. ॥౫౮॥

**భావార్థః**:-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యేన పరమేశ్వరేణ యః శరద్ఋతూ రచితస్తస్యోపాసనా పురస్సరం తం యుక్త్యా సేవిత్వా స్త్రీపురుషాః సుఖం సదా వర్ధయన్తు. ॥౫౮॥

**పదార్థము** :-ఓ స్త్రీ! (పరమేష్ఠీ) మహదాకాశమునందు వ్యాప్తమై, స్థితమైయున్న పరమేశ్వరుడు (జ్యోతిష్మతీమ్) ప్రశస్తజ్ఞానముగల (త్వా) నిన్ను (దివః) ప్రకాశము యొక్క (పృష్ఠే) ఉత్తమ భాగమున (విశ్వస్మై) సర్వ (ప్రాణాయ) ప్రాణము (అపానాయ) అపానము (వ్యానాయ) వ్యానము మున్నగు వాయువుల యథార్థ క్రియ జరుగుటకై (సాదయతు) స్థిరపరచుగాక. నీవు సకల స్త్రీల కొరకు (విశ్వమ్) సమస్త (జ్యోతిః) జ్ఞానప్రకాశమును (యచ్ఛ) ఇచ్చుచుండుము. ఏ (తే) నీయొక్క (సూర్యః) సూర్యునివంటి తేజస్వియగు

(అధిపతిః) స్వామిగలడో (తయా) అట్టి (దేవతయా) శ్రేష్ఠగుణములుగల పతితో గూడ వర్తమానమైయుండి (అఙ్గిరస్వత్) సూర్యునివలె (ధ్రువా) దృఢముగా (సీద) స్థిరముగ నుండుము. ॥౫౭॥

భావార్థము :- ఈ మంత్రమునందు ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. పరమేశ్వరుడు ఏ ఋతువులను మానవకల్యాణమునకై రచించినాడో అట్టి పరమేశ్వరుని యుపాసనా పూర్వకముగ ఈ ఋతువులను యుక్తిపూర్వకముగ సేవించుచు స్త్రీ పురుషులు సదా సుఖముల వృద్ధి పరచవలెను. ॥౫౭॥

58.O woman, may God seat thee, full of admirable knowledge, on the back of learning, for strengthening the Pran, Apan and Vyan breaths of all thy family members. Diffuse the full light of knowledge to all women!.

Remain tenaciously firm like the sun, with thy husband, endowed with noble traits, and lustrous like the sun.

౭౭౮. లోకం పృణేత్యస్య పరమేష్ఠీ ఋషిః, ఇంద్రాగ్నీ దేవతే, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౭౭౮ లోకం పృణ ఛిద్రం పృణాథో సీద ధ్రువా త్వమ్ ।

ఇన్ద్రాగ్నీ త్వా బృహస్పతిరస్మిన్ యోనావసీషదన్ ॥౫౮॥

ప.వి:- లోకమ్, పృణ, ఛిద్రమ్, పృణ, అథో ఇత్యథో, సీద, ధ్రువా, త్వమ్, ఇన్ద్రాగ్నీ, ఇతీన్ద్రాగ్నీ, త్వా, బృహస్పతిః, అస్మిన్, యోనౌ, అసీషదన్నిత్యసీసదన్ ॥౫౮॥

పదార్థః :-(లోకమ్) ఇమం పరం చ (పృణ) సుఖయ (ఛిద్రమ్) (పృణ) పిపూర్ధి (అథో) (సీద) (ధ్రువా) నిశ్చలా (త్వమ్) (ఇన్ద్రాగ్నీ) ఇన్ద్రః పరమైశ్వర్యశ్చాగ్నిర్విజ్ఞాతా చ తౌ (త్వా) త్వామ్ (బృహస్పతిః) అధ్యాపకః (అస్మిన్) (యోనౌ) గృహాశ్రమే (అసీషదన్) సాదయన్తు. ॥౫౮॥

అన్వయః :- హే స్త్రి! త్వం లోకం పృణ ఛిద్రం పృణ ధ్రువా సీదాథో ఇన్ద్రాగ్నీ బృహస్పతిశ్చాస్మిన్ యోనౌ త్వాఽసీషదన్. ॥౫౮॥

భావార్థః :- సుదక్షయా స్త్రియా గృహకృత్య సాధనాని పూర్ణాని కృత్వా కార్యాణి సాధనీయాని. విదుషాం విదుషీణాం చ గృహాశ్రమకృత్యేషు ప్రీతి ర్యథా స్యాత్తథోపదేష్టవ్యమ్. ॥౫౮॥

పదార్థము :- ఓ మహిళామణీ! (త్వమ్) నీవు(లోకమ్) ఇహపరలోకములను (పృణ) సుఖవంతమొనర్చుము (ఛిద్రమ్) నీ లోపములను (పృణ) సవరించుకొనుము (ధ్రువా) నిశ్చలత్వముతో

(సీద) గృహమందుండుము (అథో) ఆ తరువాత (ఇన్ద్రాగ్నీ) ఉత్తమ జ్ఞాన ధనముల కధిపతి మరియు (బృహస్పతిః) అధ్యాపక విద్వాంసుడు (అస్మిన్) ఈ (యోనౌ) గృహాశ్రమమందు (త్వా) నిన్ను (అసీషదన్) స్థిరపరచుగాక. ॥౫౯॥

**భావార్థము** :-చతురురాండ్రగు ఉత్తమ మహిళలు ఉత్తమ సాధనములను సమకూర్చుకొని సకల గృహకార్యములను సాధించవలయును. విదుషీ, విద్వాంసులు గృహాశ్రమ కర్తవ్యములను గూర్చి వారికి ఉపదేశించవలయును. ॥౫౯॥

59.O woman, make this life and the next comfortable, Remove thy weaknesses; and stay at home with firmness of purpose May the glorious, learned teachers establish thee in this domestic life!.

౭౭౯.తా అస్యేత్యస్య ప్రియమేధా ఋషిః, ఆపో దేవతాః, విరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

అథ రాజప్రజా ధర్మ మాహ. రాజప్రజా ధర్మమును చెప్పెను.

౭౭౯ తా౨ అస్య సూదదోహసః సోమ౯ శ్రీణన్తి పృశ్నయః।

జన్మన్దేవానాం విశస్త్రిష్వారోచనే దివః ॥౬౦॥

**ప.విః-తాః, అస్య, సూదదోహస ఇతి సూద + దోహసః, సోమమ్, శ్రీణన్తి, పృశ్నయః,**

**జన్మన్, దేవానామ్, విశః, త్రిషు, ఆ, రోచనే, దివః ॥౬౦॥**

**పదార్థః** :-(తాః) (అస్య) సభాధ్యక్షస్య (సూదదోహసః) సూదాః పాకకర్తారో దోహసః ప్రపూరకాశ్చ యాసు తాః (సోమమ్) సోమవల్ల్యాద్యోషధిరసాన్వితం పాకమ్ (శ్రీణన్తి) పచన్తి (పృశ్నయః) ప్రష్టుః (జన్మన్) జన్మని (దేవానామ్) విదుషామ్ (విశః) యా విశన్తి (త్రిషు) వేదరీత్యా కర్మోపాసనాజ్ఞానేషు (ఆ) (రోచనే) ప్రకాశనే (దివః) ద్యోతనాత్మకస్య పరమాత్మనః ॥౬౦॥

**అన్వయః** :-యా విద్యాసుశిక్షాన్వితా దేవానాం జన్మన్ పృశ్నయః సూదదోహసస్త్రిషు దివో రోచనే చ ప్రవర్తమానా విశః సన్తి తా అస్య సోమమాశ్రీణన్తి. ॥౬౦॥

**భావార్థః** :-ప్రజాపతిభిః సర్వాః ప్రజాః విద్యాసుశిక్షాగ్రహణే నియోజనీయాః ప్రజాశ్చ నియుఞ్జన్తు. నహ్యే తేన వినా కర్మోపాసనాజ్ఞానేశ్వరాణాం యథార్థో బోధో భవితుమ్మర్హతి. ॥౬౦॥

**పదార్థము** :-ఉత్తమ విద్యా శిక్షణలతో గూడిన (దేవానామ్) విద్వాంసుల (జన్మన్) జన్మవిషయమున (పృశ్నయః) ప్రశ్నించువారు (సూదదోహసః) పాచకులు, కార్యనిర్వహణా చతురులు (త్రిషు) వేదోక్త జ్ఞాన,

కర్మ, ఉపాసనముల మరియు (దివః) సకలజనుల అంతఃకరణములందు ప్రకాశించు పరమాత్మయొక్క (రోచనే) ప్రకాశమునందు (విశః) ఏ ప్రజలుగలరో (తాః) వారు (అస్య) ఈ సభాధ్యక్షుడగు రాజుకై (సోమమ్) సోమవల్లి మున్నగు ఓషధీరసములచే గూడిన భోజ్యపదార్థములను (ఆ) అన్నివైపులనుండి (శ్రీణన్తి) పాకమొనర్చెదరు. ॥౬౦॥

**భావార్థము :-** ప్రజాపాలకులు సకల ప్రజలను విద్య మరియు ఉత్తమశిక్షణలను పొందుటకై నియుక్త పరచుట యోగ్యము. ప్రజలును స్వయముగా నియుక్తులు గావలయును. ఇట్లుగానిచో జ్ఞాన కర్మోపాసనలు మరియు ఈశ్వరుని పొందు యథార్థ బోధ (జ్ఞానము) కలుగజాలదు. ॥౬౦॥

60.The subjects endowed with knowledge and good training, enquiring about the birth of the learned, equipped with cooks and servants expert in the performance of their duties, devoted to vedic action, worship, and knowledge, living in the presence of the Effulgent God, provide every where, for their ruler edible foods mixed with the juices of medicinal herbs.

౭౮౦.ఇంద్రం విశ్వా ఇత్యస్య మధుచ్ఛందా ఋషిః, ఇంద్రో దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౭౮౦ ఇన్ద్రం విశ్వా అవీవృధన్ త్సముద్రవ్యచసం గిరః ।

రథీతమꣳ రథీనాం వాజానాꣳ సత్పతిం పతిమ్ ॥౬౧॥

ప. విః-ఇన్ద్రమ్, విశ్వాః, అవీవృధన్, సముద్రవ్యచసమితి సముద్ర + వ్యచసమ్, గిరః, రథీతమమ్, రథితమమితి రథి + తమమ్, రథీనామ్, రథినామితి రథి + నామ్, వాజానామ్, సత్పతిమితి సత్ + పతిమ్, పతిమ్. ॥౬౧॥

పదార్థః :- (ఇన్ద్రమ్) పరమైశ్వర్యయుక్తం సభేశమ్ (విశ్వాః) అఖిలాః (అవీవృధన్) వర్ధయన్తు (సముద్రవ్యచసమ్) సముద్రస్యాన్తరిక్షస్య వ్యచో వ్యాప్తిర్యస్య తమ్ (గిరః) విద్యాసుశిక్షాన్వితా వాణ్యః (రథీతమమ్) అతిశయితో రథీ. అత్ర ఈద్రథినః ౮.౨.౧౭. ఇతి వార్తికేన ఈకారాదేశః (రథీనామ్) శూరవీరాణామ్ మధ్యే. అత్రాన్యేషామితి దీర్ఘః (వాజానామ్) విజ్ఞానవతామ్ (సత్పతిమ్) సతాం వ్యవహారాణాం విదుషాం వా పాలకమ్ (పతిమ్) స్వామినమ్. ॥౬౧॥

**అన్వయః** :- విశ్వా గిరః సముద్రవ్యచసం రథీనాం రథీతమం వాజానాం సత్పతిం ప్రజానాం పతిమిన్ద్రమవీ వృధన్॥ ౬౧ ॥

**భావార్థః** :-రాజప్రజాజనా రాజధర్మయుక్తమీశ్వరమివ వర్తమానం న్యాయాధీశం సభాపతిం సతతం ప్రోత్సాహయన్తు, ఏవం సభాపతిరేతాంశ్చ.॥ ౬౧ ॥

**పదార్థము** :-(విశ్వా) సమస్త (గిరః) విద్య మరియు శిక్షణతో గూడిన వాణులు (సముద్రవ్యచసమ్) ఆకాశమువలె వ్యాప్తులగు (రథీనామ్) శూరవీరులందు (రథీతమమ్) ఉత్తమ శూరపరాక్రమశాలురు (వాజానామ్) విజ్ఞానశాలుర (సత్పతిమ్) సత్యవ్యవహారములను, విద్వాంసుల రక్షకుడు మరియు ప్రజల (పతిమ్) స్వామియు (ఇన్ద్రమ్) శ్రేష్ఠసంపదలయుక్తుడగు సభాపతి రాజును (అవీవృధన్) అభివృద్ధి నొందించవలయును.।౬౧॥

**భావార్థము** :-రాజు మరియు ప్రజలు రాజధర్మయుక్తుడు ఈశ్వరునివలె న్యాయకారియగు సభాపతిని నిరంతరము ప్రోత్సాహపరచుచుండవలయును. ఇదేవిధముగ సభాపతియును ప్రజలను, రాజపురుషులను ప్రోత్సహించవలెను.।౬౧॥

61.May all sacred songs coupled with knowledge and learning, magnify the king, full of wealth, protector of the doings of the learned, and master of the people, most valiant among the valorous, extensive in fame like the sky.

౭౮౧. ప్రోథదశ్వ ఇత్యస్య వశిష్ఠ ఋషిః, అగ్నిర్దేవతా, విరాట్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౭౮౧ ప్రోథదశ్వో న యవసేऽవిష్యన్యదా మహః సంవరణాద్వ్యస్థాత్।

ఆదస్య వాతోऽఅను వాతి శోచిరధ స్మ తే వ్రజనం కృష్ణమస్తి ।౬౨॥

**ప.విః**-ప్రోథత్, అశ్వః, న, యవసే, అవిష్యన్, యదా, మహః, సంవరణాదితి సమ్ + వరణాత్, వి, అస్థాత్, ఆత్, అస్య, వాతః, అను, వాతి, శోచిః, అధ, స్మ, తే, వ్రజనమ్, కృష్ణమ్, అస్తి ।౬౨॥

**పదార్థః** :- (ప్రోథత్) పర్యాప్నుయాత్ (అశ్వః) వాజీ (న) ఇవ (యవసే) బుసాద్యాయ (అవిష్యన్) రక్షణాదికం కుర్వన్ (యదా) (మహః) మహతః (సంవరణాత్) ఆచ్ఛాదనాత్ (వి) (అస్థాత్) తిష్ఠేత్ (ఆత్)(అస్య) (వాతః) గన్తా (అను) (వాతి) గచ్ఛతి (శోచిః) ప్రకాశః (అధ) అథ (స్మ) ఏవ (తే) తవ (వ్రజనమ్) గమనమ్ (కృష్ణమ్) కర్షకమ్ అస్తి.।౬౨॥

**అన్వయః** :- హే రాజన్! భవాన్ యవసేఽశ్వో న ప్రజాః ప్రోథత్. యదా మహః సంవరణాదవిష్యన్ వ్యస్థాదాదస్య తే తవ ప్రజనం కృష్ణం శోచిరస్తి. అధ స్మాస్య తవ వాతోఽనువాతి. ॥62॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యథా పాలనాత్తురంగాః పుష్టా భూత్వా కార్యసిద్ధిక్షమా భవన్తి తథైవ న్యాయేన సంపాలితాః ప్రజాః సన్తుష్టా భూత్వా రాజ్యం వర్ధయన్తి. ॥ 62 ॥

**పదార్థము** :- ఓ రాజన్! నీవు (యవసే) దాణా మున్నగువానికొరకు (అశ్వః) అశ్వము (న) వలె ప్రజలను (ప్రోథత్) సమర్థపరచుము (యదా) ఎప్పుడైతే (మహః) గొప్ప (సంవరణాత్) ఆచ్ఛాదనము [పరదా, కప్పు] నుండి (అవిష్యన్) రక్షణజేయుచు (వ్యస్థాత్) స్థిరపడుదువో (ఆత్) మరల (అస్య) ఇట్టి (తే) నీయొక్క (ప్రజనమ్) నడచు మరియు (కృష్ణమ్) ఆకర్షించునట్టి (శోచిః) ఏ ప్రకాశము (అస్తి) కలదో (అధ) ఆ తరువాత(స్మ) నిశ్చయముగ నీ (వాతః) కాల్బలములు(అను, వాతి) నిన్ననుసరించి నడతురు గాక. ॥62॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. రక్షించ(శిక్షించ)బడిన అశ్వములు పుష్టివంతములై కార్యములను సాధించునట్లు న్యాయముచే రక్షించబడిన ప్రజలు సంతుష్టులై రాజ్యమును పెంపొందించుచుందురు. ॥62॥

62 O King, just as thou makest the horse strong with fodder, so shouldst thou make thy subjects strong, so that they may be well established, shielded and protected by thee. When thou marchest forth with thy attractive splendour; thy followers march in thy wake!.

౭౮౨.ఆయోష్ట్వేత్యస్య వశిష్ఠ ఋషిః, విదుషీ దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

విదుష్యా కిం కర్తవ్యమిత్యాహ. విదుషీస్త్రీ ఏమి చేయువలయును?

౭౮౨ ఆయోష్ట్వా సదనే సాదయామ్యవతశ్ఛాయాయాᳪ సముద్రస్య హృదయే।
రశ్మీవతీం భాస్వతీమా యా ద్యాం భాస్యా పృథివీమోర్వన్తరిక్షమ్ ॥63॥

**ప.విః**-ఆయోః, త్వా, సదనే, సాదయామి, అవతః, ఛాయాయామ్, సముద్రస్య, హృదయే, రశ్మీవతీమ్, రశ్మివతీమితి, రశ్మివతీమ్, భాస్వతీమ్, ఆ, యా, ద్యామ్, భాసి, ఆ, పృథివీమ్, ఆ, ఉరు, అన్తరిక్షమ్ ॥63॥

**పదార్థః** :-(ఆయోః) న్యాయానుగామినో దీర్ఘజీవితస్య (త్వా) త్వామ్ (సదనే) స్థానే (సాదయామి) (అవతః) రక్షణాది కుర్వతః (ఛాయాయామ్) ఆశ్రయే (సముద్రస్య) (హృదయే) మధ్యే (రశ్మీవతీమ్)

ప్రశస్తవిద్యాప్రకాశయుక్తామ్. అత్రాన్యేషామపీతి దీర్ఘః (భాస్వతీమ్) దేదీప్యమానామ్ (ఆ) (యా) (ద్యామ్) ప్రకాశమ్ (భాసి) దీపయసి (ఆ) (పృథివీమ్) భూమిమ్ (ఆ) (ఉరు) (అన్తరిక్షమ్) ఆకాశమ్. ।౬౩ ॥

**అన్వయః** :- హే స్త్రి! యా త్వం ద్యాం పృథివీమన్తరిక్షముర్వాభాసి తాం రశ్మివతీం భాస్వతీం వా త్వామాయోః సదనేఽవతశ్ఛాయాయామాసాదయామి సముద్రస్య హృదయేఽహమాసాదయామి.।౬౩॥

**భావార్థః** :- హే స్త్రి! సమ్యక్పాలకస్య పత్యుః సదనే తదాశ్రయే సముద్రవదక్షోభాం హృద్యాం త్వాం స్థాపయామి త్వం గృహాశ్రమధర్మం ప్రకాశ్య పత్యాదీన్ సుఖయ త్వాం చైతే సుఖయన్తు. ॥ ౬౩ ॥

**పదార్థము** :- ఓ మహిళామణీ! (యా) ఏ నీవు (ద్యామ్) ప్రకాశము (పృథివీమ్) భూమి (అన్తరిక్షమ్) ఆకాశమును (ఉరు) గొప్పగ (ఆ, భాసి) ప్రకాశమొనర్చుచున్నావో, అట్టి (రశ్మివతీమ్) శుద్ధ విద్యాప్రకాశములతో గూడ (భాస్వతీమ్) శోభించుదానవగు (త్వా) నిన్ను (ఆయోః) న్యాయానుకూలముగ నడచు చిరంజీవియగు పురుషుని (సదనే) స్థానమునందు మరియు (అవతః) రక్షణ మున్నగునవి యొనర్చువాని (ఛాయాయామ్) ఆశ్రయమునందు (ఆ, సాదయామి) చక్కగా స్థిరపరచుచున్నాను. మరియు (సముద్రస్య) అంతరిక్షము (హృదయే) మధ్య (ఆ) అన్నివిధములుగా నేను స్థిరపరచుచున్నాను. ।౬౩॥

**భావార్థము** :- ఓ మహిళారత్నమా! చక్కగా పాలించునట్టి పతియొక్క ఆశ్రయమున సముద్రమునంటి చంచలరహితువు, గంభీరయుక్తురాలవు, ప్రియవతివి యగు నిన్ను స్థిరపరతును. నీవు గృహాశ్రమమునందు ధర్మమును ప్రకాశపరచుచుండుము పతి మున్నగు వారిని సుఖముగ నుంచుము. నీ పతియును నిన్ను సుఖవంతురాలిగా నుంచును గాక! ।౬౩॥

63.O woman, thou illuminest the Sky, the Earth, and airs broad realm between them. Thou art full of grace, and the light of pure knowledge, I set thee in the house of thy husband, who will live long, I place thee under his care thy protector. I set thee in his heart, deep like the ocean.

౭౮౩.పరమేష్ఠీత్యస్య వశిష్ఠ ఋషిః, పరమాత్మా దేవతా, ఆకృతిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

దమ్పతీభ్యాం కథం భవితవ్యమిత్యాహ.

స్త్రీ పురుషులు పరస్పర మెటు లుండవలయును?

౭౮౩ పరమేష్ఠీ త్వా సాదయతు దివస్పృష్ఠే వ్యచస్వతీం ప్రథస్వతీం దివం యచ్ఛ దివం దృꣳహ దివం మా హిꣳసీః। విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై చరిత్రాయ। సూర్యస్త్వాఽభిపాతు

మహ్యా స్వస్త్యా ఛర్దిషా శన్తమేన తయా దేవతయాऽఙ్గిరస్వద్

ధ్రువే సీదతమ్॥౬౪॥

ప.వి:-పరమేష్ఠీ, పరమేష్ఠీతి పరమే + స్థీ, త్వా, సాదయతు, దివః, పృష్ఠే, వ్యచస్వతీమ్, ప్రథస్వతీమ్, దివమ్, యచ్ఛ, దివమ్, దృꣳహ, దివమ్, మా, హిꣳసీః, విశ్వస్మై, ప్రాణాయ, అపానాయేత్యప + అనాయ, వ్యానాయేతి వి + అనాయ, ఉదానాయేత్యుత్ + అనాయ, ప్రతిష్ఠాయై, ప్రతిష్ఠాయా ఇతి ప్రతి + స్థాయై, చరిత్రాయ, సూర్యః, త్వా, అభి, పాతు, మహ్యా, స్వస్త్యా, ఛర్దిషా, శన్తమేనేతి శమ్+ తమేన, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువే, సీదతమ్॥౬౪॥

**పదార్థః** :-(పరమేష్ఠీ) పరమాత్మా (త్వా) త్వాం సతీం స్త్రియమ్ (సాదయతు) (దివః) కమనీయస్య గృహస్థవ్యవహారస్య (పృష్ఠే) ఆధారే (వ్యచస్వతీమ్) ప్రశస్తవిద్యావ్యాపికామ్ (ప్రథస్వతీమ్) బహ్వః ప్రథః ప్రఖ్యాతిః ప్రశంసా విద్యతే యస్యాం తామ్ (దివమ్) న్యాయప్రకాశమ్ (యచ్ఛ) దేహి (దివమ్) విద్యాసూర్యమ్ (దృంహ) (దివమ్) ధర్మప్రకాశమ్ (మా) (హింసీః) హింస్యాః (విశ్వస్మై) సమగ్రాయ (ప్రాణాయ) జీవనసుఖాయ (అపానాయ) దుఃఖనివృత్తయే (వ్యానాయ) వివిధవిద్యావ్యాప్తయే (ఉదానాయ) ఉత్కృష్టబలాయ (ప్రతిష్ఠాయై) సర్వత్ర సత్కారాయ (చరిత్రాయ) సత్కర్మానుష్ఠానాయ (సూర్యః) చరాచరాత్మేశ్వరః (త్వా) త్వామ్ (అభి) సర్వతః (పాతు) రక్షతు (మహ్యా) మహత్యా (స్వస్త్యా) సత్క్రియయా (ఛర్దిషా) సత్యాసత్యదీప్తేన (శన్తమేన) అతిశయసుఖేన (తయా) (దేవతయా) (అఙ్గిరస్వత్) (ధ్రువే) పురుషః స్త్రీ చ (సీదతమ్) ॥ ౬౪ ॥

**అన్వయః** :- హే స్త్రి! పరమేష్ఠీ విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై చరిత్రాయ దివస్పృష్ఠే ప్రథస్వతీం వ్యచస్వతీం యాం త్వా త్వాం సాదయతు సా త్వం దివం యచ్ఛ. దివం దృంహ. దివం మా హింసీః. సూర్యో మహ్యా స్వస్త్యా శన్తమేన ఛర్దిషా త్వాऽభిపాతు. స పతిస్త్వం చ తయా దేవతయాऽఙ్గిరస్వద్ ధ్రువే సీదతమ్. ॥ ౬౪ ॥

**భావార్థః** :- పరమేశ్వర ఆజ్ఞాపయతి యథా శిశిరర్తుః సుఖప్రదో భవతి తథా స్త్రీపురుషౌ పరస్పరం సంతుష్టౌ భూత్వా సర్వాణ్యుత్తమాని కర్మాణ్యనుష్ఠాయ దుష్టాని త్యక్త్వా పరమేశ్వరోపాసనయా చ సతతం ప్రమోదేతామ్.॥ ౬౪ ॥

**పదార్థము** :- ఓ మహిళామణీ! (పరమేష్ఠీ) పరమాత్మ (విశ్వస్మై) సమగ్ర (ప్రాణాయ) జీవన సుఖము (అపానాయ) దుఃఖనివృత్తి (వ్యానాయ) నానావిధములగు విద్యలప్రాప్తి (ఉదానాయ) ఉత్తమబలము (ప్రతిష్ఠాయై) సర్వత్ర సత్కారము (చరిత్రాయ) శ్రేష్ఠకర్మల యనుష్ఠానములకై (దివః) మనోహరమగు గృహస్థ వ్యవహారముల (పృష్ఠే) ఆధారమున (ప్రథస్వతీమ్) ప్రసిద్ధమగు గొప్ప ప్రశంసగల (వ్యచస్వతీమ్) ప్రశంసనీయ విద్యలందు వ్యాప్తమైన ఏ (త్వా) నిన్ను (సాదయతు) స్థిరపరచెనో, అట్టి నీవు (దివమ్) న్యాయప్రకాశమును (యచ్ఛ) ఇచ్చుచుండుము (దివమ్) విద్యారూప సూర్యుని (దృంహ) దృఢపరచుము (దివమ్) ధర్మప్రకాశమును (మా, హింసీః) నష్టపరచకుము (సూర్యః) చరాచర విశ్వనాయకుడగు ఈశ్వరుడు (మహ్యై) మహా ఉత్తమ (స్వస్త్యై) సత్కారము (శన్తమేన) అత్యంత సుఖము మరియు (ఛర్దిషా) సత్యాసత్యముల ప్రకాశముచే (త్వా) నిన్ను (అభిపాతు) అన్నివైపులనుండి రక్షించుగాక! అట్టి నీ పతి, నీవు మీయిరువురును (తయా) (దేవతయా) పరమేశ్వర దేవతతో (అఙ్గిరస్వత్) ప్రాణములవలె (ధ్రువే) దృఢముగ [నిశ్చలముగ] (సీదతమ్) స్థిరముగ నుండుడు. ॥౬౪॥

**భావార్థము** :- పరమేశ్వరు డిట్లాజ్ఞాపించుచున్నాడు. ''ఓ స్త్రీపురుషులారా! శిశిరఋతువు సుఖదాయకముగ నుండునట్లు మీరిరువురును పరస్పరము సుఖసంతోషములతో నలరారుచుండుడు. సమస్త శ్రేష్ఠకర్మల ననుష్ఠాన మొనర్చుచు, దుష్టకర్మలను పరిత్యజించుచు పరమేశ్వరోపాసనల ద్వారా నిరంతరము ఆనందముగ నుండుడు''. ॥౬౪॥

64.O woman, God places thee, worthy of praise and well-read, in charge of the house, for the full enjoyment of life, for the eradication of misery, for the acquisition of knowledge, for amassing strength, for eliciting universal respect, and for the improvement of character!.

Spread thou the light of justice, strengthen the lustre of learning. Violate not the truths of religion.

God guards thee on all sides, bestowing due respect and extreme delight; and distinguishing truth from untruth.

May thou and thy husband live constantly together, holding God dear as life.

౭౮౪.సహస్రస్యేత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, విద్వాన్ దేవతా, విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మరల మానవు లేమి చేయవలెను.

౭౮౪ సహస్రస్య ప్రమాసి సహస్రస్య ప్రతిమాసి సహస్రస్యోన్మాసి

సాహస్రోఽసి సహస్రాయ త్వా ॥౬౫॥

**ప. విః-సహస్రస్య ప్రమేతి ప్ర + మా, అసి, సహస్రస్య ప్రతిమేతి ప్రతి + మా, అసి, సహస్రస్య, ఉన్మేత్యుత్ + మా,అసి, సాహస్రః, అసి, సహస్రాయ, త్వా ॥౬౫॥**

**పదార్థః** :-(సహస్రస్య) అసంఖ్యపదార్థయుక్తస్య జగతః (ప్రమా) ప్రమాణం యథార్థవిజ్ఞానమ్ (అసి) (సహస్రస్య) అసంఖ్యపదార్థవిశేషస్య (ప్రతిమా) ప్రతిమీయన్తే పరిమీయన్తే సర్వే పదార్థా యయా సా (అసి) (సహస్రస్య) అసంఖ్యాతస్య స్థూలవస్తునః (ఉన్మా) ఊర్ధ్వం మినోతి యయా తులయా తద్వత్ (అసి) (సాహస్రః) సహస్రమసంఖ్యాతాః పదార్థా విద్యా వా విద్యన్తే యస్య సః (అసి) (సహస్రాయ) అసంఖ్యప్రయోజనాయ (త్వా) త్వామ్. ॥౬౫॥

**అన్వయః**:-హే విద్వన్! విదుషి వా యతస్త్వం సహస్రస్య ప్రమేవాసి సహస్రస్య ప్రతిమేవాసి సహస్రస్యోన్మే వాసి సాహస్రోఽసి తస్మాత్సహస్రాయ త్వా త్వాం పరమేష్ఠీ సత్యే వ్యవహారే సాదయతు॥౬౫॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః! పూర్వమన్త్రాత్పరమేష్ఠీ సాదయత్వితి పదద్వయమనువర్తతే. మనుష్యాణాం త్రిభిః సాధనైర్వ్యవహారాః సిధ్యన్తి. ఏకం ప్రమా యద్యథార్థవిజ్ఞానమ్. ద్వితీయా ప్రతిమా యాని పరిమాణసాధనాని పదార్థతోలనార్థాని తృతీయమున్మా తులాదికం చేతి.॥౬౫॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా, లేక విదుషీమణీ! నీవు (సహస్రస్య) అసంఖ్యాత పదార్థములచే గూడిన జగత్తున (ప్రమా) ప్రమాణవంతమగు యథార్థ జ్ఞానమువలె (అసి) ఉన్నావు. (సహస్రస్య) అసంఖ్యాత విశేష పదార్థముల (ప్రతిమా) తులామాన [తూచు] సాధనమువలె (అసి) ఉన్నావు. (సాహస్రః) అసంఖ్యాక పదార్థముల మరియు విద్యలచే గూడి (అసి) ఉన్నావు. ఈ కారణముననే (సహస్రాయ) అసంఖ్యాక ప్రయోజనముల కొరకు (త్వా) నిన్ను పరమేశ్వరుడు వ్యవహారములందు స్థిరపరచునుగాక!॥౬౫॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఇచ్చట పూర్వమంత్రమునుండి (పరమేష్ఠీ, సాదయతు) అను నీ రెండు పదముల అనువృత్తి జరిగినది. మూడు సాధనములద్వారా మానవుల వ్యవహారములు సాధింపబడుచుండును. అనగా ఒకటి యథార్థవిజ్ఞానము. రెండవది పదార్థములతూనిక యొనర్చుటకు తూనికరాళ్లు మున్నగునవి. మూడవది త్రాసు [తక్కెడ] మున్నగునవి. ఇంతటితో శిశిరఋతువర్ణనము సమాప్తమైనది. ॥౬౫

65.O learned man or woman, thou knowest the world full of countless objects; thou measurest the intrinsic worth of countless precious objects, thou servest as balance for judging the nature of countless mateiral objects. Thou art the master of innumerable sciences. God sets thee in life for numberless achievements!.

**ఇతి శిశిరర్తో ర్వర్ణనమ్. అత్రర్తువిద్యాప్రతిపాదనా దేతదర్థస్య పూర్వాధ్యాయార్థేన సహ సంగతిరస్తీతి వేద్యమ్**

ఈ యధ్యాయమున ఋతువిద్యాప్రతిపాదన మున్నందున ఈ యధ్యాయముయొక్క అర్థమునకు పూర్వాధ్యాయార్థముతో సంగతి గలదని ఎరుగవలయును.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీపరమవిదుషాం విరజానన్దసరస్వతీస్వామినాం శిష్యేణ దయానన్దసరస్వతీస్వామినా నిర్మితే సంస్కృతభాషాఽఽర్యభాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే పఞ్చదశోఽధ్యాయః సంపూర్ణః.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి పదియైదవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశ్లో ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునునగు '**చతుర్వేదభాష్యానువాదభాస్కర**' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన '**పం. లోకవులహరి సిద్ధాంతాచార్యుల**'చే నొనర్పబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
'**మల్లి కృష్ణారెడ్డి**' సంపాదకత్వమున పరిష్కరింపబడిన
**పదియైదవ అధ్యాయము సమాప్తము**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# యజుర్వేదభాష్యము

## 16వ అధ్యాయము - విషయసూచిక

# అథ శోడషోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే షట్షష్టిర్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం.విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్నఽ ఆ సువ ॥య.30.3॥

౭౮౫. నమస్త ఇత్యస్య పరమేష్ఠీ వా కుత్స ఋషిః, రుద్రో దేవతా, ఆర్షీగాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ రాజధర్మ ఉపదిశ్యతే. ఈ ప్రథమ మంత్రమందు రాజధర్మ ముపదేశింపబడినది.

౭౮౫ నమస్తే రుద్ర మన్యవఽ ఉతో తఽ ఇషవే నమః।

బాహుభ్యాముత తే నమః ॥౧॥

**ప.విః-నమః, తే, రుద్ర, మన్యవే, ఉతోఽ ఇత్యుతో, తే, ఇషవే, నమః, బాహుభ్యామితి బాహు + భ్యామ్, ఉత, తే, నమః ॥౧॥**

**పదార్థః** :-(నమః) వజ్రమ్. నమ ఇతి వజ్రనా.. నిఘం. ౨.౨౦ (తే) తవోపరి (రుద్ర) దుష్టానాం శత్రూణాం రోదయితః. కతమే తే రుద్రా ఇతి దశేమే పురుషే ప్రాణా ఏకాదశ ఆత్మా. ఏకాదశ రుద్రాః కస్మాదేతే రుద్రా యదస్మాన్మర్త్యాచ్ఛరీరాదుత్క్రామన్త్యథ రోదయన్తి యత్తద్రోదయన్తి తస్మాద్రుద్రాః. ఇతి శతపథబ్రాహ్మణే. రోదేర్ణిలుక్ చ. అనేనోణాదిగణసూత్రేణ రోదిధాతో రక్ ప్రత్యయో ణి లుక్ చ (మన్యవే) క్రోధయుక్తాయ వీరాయ (ఉతో) అపి (తే) తవ (ఇషవే) ఇష్ణాత్యభీక్ష్ణం హినస్తి శత్రూన్ యేన తస్మై (నమః) అన్నమ్. నమ ఇత్యన్ననా.. నిఘం. ౨.౭. (బాహుభ్యామ్) భుజాభ్యామ్. (ఉత) అపి (తే) తవ (నమః) వజ్రమ్.॥౧॥

**అన్వయః** :-హే రుద్ర! తే మన్యవే నమోఽస్తు. ఉతో ఇషవే తే నమోఽస్తు. ఉత తే బాహుభ్యాం నమోఽస్తు.॥౧॥

**భావార్థః** :-యే రాజ్యం చికీర్షేయుస్తే బాహుబలం యుద్ధశిక్షాశస్త్రాస్త్రాణి చ సంపాదయేయుః.॥౧॥

**పదార్థము** :- (రుద్ర) దుష్టశత్రువులనేడ్పించునట్టి ఓ రాజా! (తే) నీవంటి (మన్యవే) క్రోధయుక్త వీరపురుషునకు (నమః) వజ్రము [వజ్రాయుధము] ప్రాప్తించుగాక! (ఉతో) మరియు (ఇషవే) శత్రువులనాశమొనర్చు (తే) నీకు (నమః) అన్నము సంప్రాప్తముగుగాక! (ఉత) మరియు (తే) నీయొక్క (బాహుభ్యామ్) భుజములనుండి (నమః) వజ్రము శత్రువులనుతాకి సంహరించునుగాక!॥౧॥

**భావార్థము :-** రాజ్యమునర్భగోరువారు బాహుబలము, యుద్ధవిద్య మరియు శస్త్రాస్త్రములను చక్కగా సంగ్రహించుకొనవలయును.౹౧॥

1.O King, the chastiser of the wicked,may thy indignant soldiers get arms. May thou, the destroyer of foes, get food. May the enemies be attacked with weapons by thy arms!.

౭౮౬.యా త ఇత్యస్య పరమేష్ఠీ వా కుత్స ఋషిః, రుద్రో దేవతా, ఆర్షీస్వరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

అథ శిక్షకశిష్యవ్యవహారమాహ. శిక్షక శిష్యుల వ్యవహార మిందు జెప్పబడినది.

**౭౮౬ యా తే రుద్ర శివా తనూరఘోరాऽపాపకాశినీ ।**

**తయా నస్తన్వా శన్తమయా గిరిశన్తాభి చాకశీహి॥౨॥**

**ప.విః-** యా, తే, రుద్ర, శివా, తనూః, అఘోరా, అపాపకాశినీత్యపాప + కాశినీ, తయా, నః, తన్వా, శన్తమయేతి శమ్ + తమయా, గిరిశన్తేతి గిరి + శన్త, అభి, చాకశీహి.౹౨॥

**పదార్థః :-** (యా) (తే) తవ (రుద్ర) దుష్టానాం భయంకర శ్రేష్ఠానాం సుఖకర (శివా) కల్యాణకారిణీ (తనూః) శరీరం విస్తృతోపదేశనీతిర్వా (అఘోరా) అవిద్యమానో ఘోర ఉపద్రవో యయా సా (అపాపకాశినీ) అపాపాన్సత్యధర్మాన్ కాశితుం శీలమస్యాః సా (తయా) (నః) అస్మాన్ (తన్వా) విస్తృతయా (శన్తమయా) అతిశయేన సుఖప్రాపికయా (గిరిశన్త) యో గిరిణా మేఘేన సత్యోపదేశేన వా శం సుఖం తనోతి తత్సమ్బుద్ధౌ, గిరిరితి మేఘనా... నిఘం. ౧.౧౦. (అభి) సర్వతః (చాకశీహి) భృశం కశ్య పునః పునః శాధి. అయం కశధాతోర్యఙ్‌లుగన్తః ప్రయోగః. వా ఛన్దసీతి అ.౩.౪.౮౮. ఇతి పిత్వాదీట్.౹౨॥

**అన్వయః :-** హే గిరిశన్త రుద్ర! యా తే తవాఘోరాऽపాపకాశినీ శివా తనూరస్తి తయా శన్తమయా తన్వా న స్త్వ మభిచాకశీహి.౹౨॥

**భావార్థః :-** శిక్షకాః శిష్యేభ్యః ధర్మ్యాం నీతిం శిక్షిత్వా నిష్పాపాన్ కల్యాణాచరణాన్ సమ్పాదయన్తు.౹౨॥

**పదార్థము :-** (గిరిశన్త) మేఘము (లేక) సత్య ఉపదేశముద్వారా సుఖముల నందించువాడా! (రుద్ర) దుష్టులను శిక్షించు, శిష్టులను రక్షించు విద్వాంసుడా! (యా) ఏ (తే) నీయొక్క (అఘోరా) ఘోర ప్రమాదరహిత (అపాపకాశినీ) సత్యధర్మము నుపదేశించునట్టి (శివా) కల్యాణకారిణియగు (తనూః) దేహము లేక విస్తృతమగు ఏ ఉపదేశ నీతి గలదో (తయా) అట్టి (శన్తమయా) అత్యంతసుఖప్రాప్తినిగలిగించు (తన్వా)

దేహము లేక విస్తృత ఉపదేశనీతితో (నః) మమ్ము నీవు (అభి, చాకశీహి) అన్నివైపులనుండి శీఘ్రముగా రక్షణ జేయుము.॥౨॥

**భావార్థము :-** శిక్షకులు శిష్యులకు ధర్మయుక్తనీతి నుపదేశించి, పాపములనుండి దూరముంచి, కల్యాణ ప్రదకర్మల నాచరించుటకై నియుక్త పరచవలెను.॥౨॥

2.O learned person, the comforter of people with thy noble teachings, the administrator of fear for the miscreants and happiness for the good, educate us again and again, with thy system of teaching, which is highly delightful, conducive to progress, expository of true principles, and free from violence!.

౨౮౭. యామిషుమిత్యస్య పరమేష్ఠీ వా కుత్స ఋషిః, రుద్రో దేవతా, విరాడార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ రాజపురుషైః కిం కర్తవ్యమిత్యాహ. రాజపురుషులు ఏమి చేయవలయును?

౨౮౭ యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే ।

శివాం గిరిత్ర తాం కురు మా హింసీః పురుషం జగత్ ॥౩॥

**ప.వి:-** యామ్, ఇషుమ్, గిరిశన్తేతి గిరి + శన్త, హస్తే, బిభర్షి, అస్తవే, శివామ్, గిరిత్రేతి గిరి + త్ర, తామ్, కురు, మా, హింసీః, పురుషమ్, జగత్. ॥౩॥

**పదార్థః :-** (యామ్) (ఇషుమ్) బాణావలిమ్ (గిరిశన్త) గిరిణా మేఘేన శం తనోతి తత్సమ్బుద్ధౌ (హస్తే) (బిభర్షి) ధరసి (అస్తవే) అసితుం ప్రక్షేప్తుమ్. అత్ర అస ధాతోస్తుమర్థే తవేన్ ప్రత్యయః (శివామ్) మఙ్గలకారిణీమ్ (గిరిత్ర) గిరీన్ విద్యోపదేశకాన్ మేఘాన్ వా త్రాయతే రక్షతి తత్సమ్బుద్ధౌ (తామ్) (కురు) (మా) నిషేధే (హింసీః) హింస్యాః (పురుషమ్) పురుషార్థయుక్తమ్ (జగత్) సంసారమ్.॥౩॥

**అన్వయః :-** హే గిరిషన్త సేనాపతే! యతస్త్వమస్తవే యామిషుం హస్తే బిభర్షి. అతస్తాం శివాం కురు. హే గిరిత్ర! త్వం పురుషం జగన్మా హింసీః.॥౩॥

**భావార్థః :-** రాజపురుషైః యుద్ధవిద్యాం బుధ్వా శస్త్రాణి ధృత్వా మనుష్యాదయః శ్రేష్ఠాః ప్రాణినో నో హింసనీయాః కిన్తు మఙ్గలాచారేణ రక్షణీయాః.॥౩॥

**పదార్థము :-** (గిరిశన్త) మేఘముద్వారా సుఖముల నందించు సేనాపతీ! ఏ కారణమున నీవు (అస్తవే) విసరివేయుటకై (యామ్) ఎట్టి (ఇషుమ్) బాణమును (హస్తే) చేతియందు (బిభర్షి) ధరించెదవో, అదేకారణమున (తామ్) దానిని (శివామ్) మంగళప్రదముగ (కురు) చేయుము (గిరిత్ర) విద్యోపదేశకులు

లేక మేఘముల రక్షణమొనర్చు రాజపురుషా! నీవు (పురుషమ్) పురుషార్థయుక్తులగు మనుష్యులు మున్నగు (జగత్) జగత్తును (మా హింసీః) నాశపరచకుము.॥3॥

**భావార్థము** :- రాజపురుషులు యుద్ధవిద్యాకుశలురై అస్త్రశస్త్రములధరించి మానవులు మున్నగు శ్రేష్ఠప్రాణులకు క్లేశములను గలిగించవలదు. వారిని చంపరాదు. కాని శుభప్రదమగు ఆచరణముచే ఎల్లరను రక్షింపవలయును.॥3॥

3.O commander of the army, the giver of comforts like a cloud, whatever shaft thou takest in hand to shoot, make that auspicious. O protector of the preachers of knowledge, destroy not this world full of enterprising men!.

౭౮౮. శివేనేత్యస్య పరమేష్ఠీ ఋషిః, రుద్రో దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ చికిత్సకకృత్యమాహ. వైద్యునికృత్య మిందు చెప్పబడినది.

౭౮౮ శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి ।

యథా నః సర్వమిజ్జగదయక్ష్మꣳ సుమనా౨ అసత్ ॥4॥

**ప. వి:**- శివేన, వచసా, త్వా, గిరిశేతి గిరి + శ, అచ్ఛ, వదామసి, యథా, నః, సర్వమ్, ఇత్, జగత్, అయక్ష్మమ్, సుమనా + ఇతి సు + మనాః, అసత్.॥4॥

**పదార్థః** :-(శివేన) కల్యాణకారకేణ (వచసా) వచనేన (త్వా) త్వామ్ (గిరిశ) యో గిరిషు పర్వతేషు మేఘేషు వా శేతే తత్సంబుద్ధౌ (అచ్ఛ) సమ్యక్. నిపాతస్య చేతి దీర్ఘః (వదామసి) వదేమ (యథా) (నః) అస్మాకమ్ (సర్వమ్) (ఇత్) ఏవ (జగత్) మనుష్యాదికం జఙ్గమం రాజ్యమ్ (అయక్ష్మమ్) యక్ష్మాదిరోగరహితమ్ (సుమనాః) శోభనమ్ మనో యస్య సః (అసత్) స్యాత్. ॥ 4 ॥

**అన్వయః** :-హే గిరిశ రుద్ర వైద్యరాజ! సుమనాస్త్వం యథా నః సర్వం జగదయక్ష్మమసత్ తథేచ్ఛివేన వచసా త్వా వయమచ్ఛ వదామసి. ॥ 4 ॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యో వైద్యకశాస్త్రమధీత్య పర్వతాదిషు స్థితా ఓషధీరపో వా సుపరీక్ష్య సర్వేషాం కల్యాణాయ నిష్కపటిత్వేన రోగాన్ నివార్య ప్రియస్వరూపయా వాచా వర్తేత తం వైద్యం సర్వే సత్కుర్యుః. ॥ 4 ॥

**పదార్థము** :- (గిరిశ) పర్వతముల లేక మేఘములలో శయనించు రోగనాశకుడవగు ఓ వైద్యరాజా! నీవు (సుమనాః) ప్రసన్నచిత్తుడవై (యథా) ఎట్లు (నః) మాయొక్క (సర్వమ్) మనుష్యులు మొదలగు స్థావర

జంగమములచే గూడిన రాజ్యము (అయక్ష్మమ్) క్షయ మున్నగు రాజరోగరహితమై (అసత్) ఉండునో, (ఇత్) అదేవిధముగ (శివేన) కల్యాణకారి (వచసా) వచనములద్వారా (త్వా) నిన్ను మేము (అచ్ఛ వదామసి) ఉత్తముడవని కీర్తింతుముగాక! ॥౪॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. వైద్యశాస్త్రమును చక్కగా చదివి పర్వతములందుండు ఓషధులను, జలములను పరీక్షించి సకల మానవకల్యాణమునకై నిష్కపటముతో రోగనివృత్తి యొనర్చి ప్రియవాక్కులతో పరామర్శించు వైద్యుని ఎల్లరును సత్కరించవలెను. ॥౪॥

4.O physician, dweller on the mountains, and analyser of waters, we praise thee with propitious speech. Full of happiness, let all our living beings be free from tuberculosis and well satisfied!.

**౭౮౫.అధ్యవోచదిత్యస్య బృహస్పతిర్ఋషిః, ఏకరుద్రో దేవతా, భురిగార్షీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.**

**౭౮౫ అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యో భిషక్। అహీఀశ్చ**

**సర్వాఞ్జమ్భయన్త్సర్వాశ్చ యాతుధాన్యోఽధరాచీః పరా సువ ॥౫॥**

**ప.వి:-అధి, అవోచత్, అధివక్తేత్యధి+వక్తా, ప్రథమః, దైవ్యః, భిషక్, అహీన్, చ, సర్వాన్, జమ్భయన్, సర్వాః, చ, యాతుధాన్య ఇతి యాతు + ధాన్యః, అధరాచీః, పరా, సువ ॥౫॥**

**పదార్థః** :-(అధి) (అవోచత్) ఉపదిశేత్ (అధివక్తా) సర్వేషాముపర్యధిష్ఠాతృత్వేన వర్తమానః సన్ వైద్యకశాస్త్రస్యాధ్యాపకః (ప్రథమః) ఆదిమః (దైవ్యః) దేవేషు విద్వత్సు భవః (భిషక్) నిదానాదివిజ్ఞానేన రోగనివారకః (అహీన్) సర్పవత్ ప్రాణాన్తకాన్ రోగాన్ (చ) (సర్వాన్) అఖిలాన్ (జమ్భయన్) ఔషధైర్నివారయన్ (సర్వాః) (చ) (యాతుధాన్యః) రోగకారిణ్యో వ్యభిచారిణ్యశ్చ స్త్రియః (అధరాచీః) యా అధరాన్ నీచా నఞ్చన్తి తాః (పరా) దూరే (సువ) ప్రక్షిప. ॥౫॥

**అన్వయః** :- హే రుద్ర! యః ప్రథమో దైవ్యోఽధివక్తా భిషగ్భవాన్ సర్వానహీన్ రోగాంశ్చ జమ్భయన్న ధ్యవోచత్ స త్వం యాశ్చ సర్వా యాతుధాన్యోఽధరాచీః సన్తి తాశ్చ పరాసువ ॥ ౫ ॥

**భావార్థః** :-రాజాదిసభాసదః సర్వేషామధిష్ఠాతారం ముఖ్యం ధార్మికం లబ్ధసర్వపరీక్షం వైద్యం రాజ్యే సేనాయాం చ నియోజ్య బలసుఖనాశకాన్ రోగాన్ వ్యభిచారిణో జనాన్ వ్యభిచారిణీః స్త్రీశ్చ నివార యేయుః. ॥౫॥

పదార్థము :- ఓ రుద్రా! రోగనాశకుడవగు వైద్యా! (ప్రథమః) ముఖ్యుడవు (దైవ్యః) విద్వాంసులందు ప్రసిద్ధుడవు (అధివక్తా) ఉన్నతశ్రేణికి చెందిన వైద్యశాస్త్రమును చదివించువాడవు మరియు (భిషక్) నిదానము మున్నగు వానినెరిగి వ్యాధినిర్మూలనమొనర్చు నీవు (సర్వాన్) సర్వ (అహీన్) సర్పమువంటి ప్రాణాంతకమగు వ్యాధులను (చ) నిశ్చయముగ (జమ్భయన్) ఓషధులచే దొలగింతువు (అధ్యవోచత్) అధిక ఉపదేశమొనర్చు నీవు (సర్వాః) సమస్త (అధరాచీః) నీచగతికి చేర్చునట్టి (యాతుధాన్యః) రోగకారక ఓషధులు లేక వ్యభిచారులగు ఏ స్త్రీపురుషులు గలరో, వారిని (పరా) దూరము (సువ) తొలగించివేయుము.॥౫॥

భావార్థము :- రాజు మున్నగు సభాసదులు సర్వాధిష్ఠాత, ముఖ్యధర్మాత్ముడు, సకలవ్యాధులను, ఓషధులను చక్కగా పరీక్షణమొనర్చునట్టి వైద్యుని రాజ్యమందు, సేనయందు నియుక్తపరచి సుఖములను, శక్తులను క్షీణపరచునట్టి, ప్రాణాంతకమగునట్టి రోగములను, వ్యభిచారులగు స్త్రీపురుషులను తొలగించి వేయవలయును.॥౫॥

5.O physician, the dispeller of ailments, chief amongst the learned, the teacher of the first class science of medicine, the remover of diseases by diangnosing them, the sure banisher of diseases deadly like serpents, with efficacious medicines, preach unto us the laws of health, cast away all drugs, that aggravate the disease, and lower our vitality!.

౭౯౦. అసావిత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రోదేవతా, నిచృదార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునః స ఏవ రాజధర్మః ప్రోచ్యతే మఱల నా రాజధర్మమే చెప్పబడుచున్నది.

౭౯౦ అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుః సుమంగలః। యే చైనꣳ రుద్రా అభితో దిక్షు శ్రితాః సహస్రశోऽవైషాꣳ హేడ ఈమహే॥౬॥

ప.విః-అసౌ, యః, తామ్రః, అరుణః, ఉత, బభ్రుః, సుమఙ్గల ఇతి సు + మఙ్గలః, యే, చ, ఏనమ్, రుద్రాః, అభితః, దిక్షు, శ్రితాః, సహస్రశ ఇతి సహస్ర + శః, అవ, ఏషామ్, హేడః, ఈమహే ।౬॥

పదార్థః :- (అసౌ) శ్రుతవిషయః (యః) (తామ్రః) తామ్రమివ కఠినాఙ్గః. అత్ర అమితమ్యోర్దీర్ఘశ్చ. ఉ. ౨.౧౬. అనేనాయం సిద్ధః (అరుణః) అగ్నిరివ తీవ్రతేజాః (ఉత) అపి (బభ్రుః) పిఙ్గధూమ్రవర్ణః (సుమఙ్గలః) శోభనాని కల్యాణకరాణి కర్మాణి యస్య సః (యే) (చ) (ఏనమ్) రాజానమ్ (రుద్రాః) శత్రూణాం రోదయితారః శూరవీరాః (అభితః) సర్వతః (దిక్షు) పూర్వాదిషు (శ్రితాః) సేవమానాః

(సహస్రశః) అసంఖ్యాతా బహవః (అవ) నిషేధే (ఏషామ్) వీరాణామ్ (హేడః) అనాదరకర్తా (ఈమహే) యాచామహే. ॥ ౬ ॥

**అన్వయః** :- హే మనుష్యాః! యోఽసౌ తామ్రో హేడోఽరుణో బభ్రురుత సుమఙ్గలో భవేత్. యే చ సహస్రశో రుద్రా అభితో దిక్ష్వేనం శ్రితాః స్యురేషామాశ్రయేణ వయమవేమహే. ॥ ౬ ॥

**భావార్థః** :- హే మనుష్యాః! యో రాజాగ్నివద్ దుష్టదాహకశ్చన్ద్రవచ్ఛ్రేష్ఠాహ్లాదకో న్యాయకారీ శుభలక్షణో యేఽస్యేదృశా భృత్యా రాజ్యే సర్వత్ర వసన్తు విచరన్తు వా సమీపే వర్తన్తామ్ తేషాం సత్కారేణ తైర్దుష్టానాం తిరస్కారం యూయం కారయత. ॥ ౬ ॥

**పదార్థము** :- ఓ ప్రజలారా! (యః) ఏ (అసౌ) ఆతడు (తామ్రః) తామ్రము [రాగి] వంటి దృఢమగు అంగములు గలిగి (హేడః) శత్రువులను కించపరచు (అరుణః) చక్కని గౌరవర్ణశరీరము (బభ్రుః) కొద్దిపాటి పసుపు లేక ధూమ్రవర్ణముగల (ఉత) మరియు (సుమఙ్గలః) చక్కని కల్యాణకారియగు రాజు గలడో (వ) మరియు (యే) ఎవడు (సహస్రశః) వేలాది (రుద్రాః) దుష్టులనేడ్పించువాడు (అభితః) నల్దిశలందు (దిక్షు) తూర్పు మున్నగు దిశలందు సైన్యములుగల (ఏనమ్) ఈరాజుయొక్క (శ్రితాః) ఆశ్రయమునందున్నారో (ఏషామ్) ఈ వీరుల నాశ్రయించి మేము (అవేమహే) విరుద్ధమగు ఆచరణమొనర్పుట నివృగించము. ॥౬॥

**భావార్థము** :- మానవులారా! ఏ రాజు అగ్నివలె దుష్టులను భస్మమొనర్చునో, చంద్రునివలె శ్రేష్ఠులకు సుఖముగలిగించునో, న్యాయకారి, శుభలక్షణయుక్తుడో మరియు నాతని భృత్యులును ఆతనివంటివారేయై రాజ్యమంతటను నసించుచు విచారించుదురో, సమీపస్థులై యుందురో అట్టివారిని సత్కరించుచు వారిద్వారా దుష్టులను మీరు నాశమును, అవమానమును గలిగింపజేయవలెను. ॥౬॥

6.O people, your king is most auspicious, with limbs strong like copper, brilliant like fire, slightly red and brown, Thousands of brave soldiers remain under his shelter in all directions. With these soldiers at our back, we never entertain any evil designs!.

౭౯౧. అసౌ య ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రో దేవతా, విరాడార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౭౯౧ అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః। ఉతైనం గోపా

అదృశ్రన్నదృశ్రన్నుదహార్యః స దృష్టో మృడయాతి నః ॥౭॥

**ప.విః**- అసౌ, యః, అవసర్పతీత్యవ + సర్పతి, నీలగ్రీవ ఇతి నీల + గ్రీవః, విలోహిత ఇతి వి + లోహితః, ఉత, ఏనమ్, గోపాః, అదృశ్రన్, అదృశ్రన్, ఉదహార్య ఇత్యుద + హార్యః, సః, దృష్టః, మృడయాతి, నః॥౭॥

**పదార్థః** :- (అసౌ) (యః) (అవసర్పతి) దుష్టేభ్యో విరుద్ధం గచ్ఛతి (నీలగ్రీవః) నీలమణియుక్తా గ్రీవా యస్య సః (విలోహితః) వివిధైః శుభగుణకర్మస్వభావైః రోహితో వృద్ధః (ఉత) (ఏనమ్) (గోపాః) రక్షకాః భృత్యాః (అదృశ్రన్) సమీక్షేరన్ (అదృశ్రన్) పశ్యేయుః (ఉదహార్యః) యా ఉదకం హరన్తి తాః (సః) (దృష్టః) సమీక్షితః (మృడయాతి) సుఖయతు (నః) అస్మాన్ సజ్జనాన్. ॥ ౭ ॥

**అన్వయః** :- యోఽసౌ నీలగ్రీవో విలోహితో రుద్రః సేనేశోఽవసర్పతి యమేనం గోపా అదృశ్రన్నుతాప్యుదహార్యోఽదృశ్రన్ స దృష్టః సన్ నోఽస్మాన్ మృడయాతి. ॥ ౭ ॥

**భావార్థః** :- యో దుష్టానాం విరోధీ శ్రేష్ఠప్రియో దర్శనీయః సేనాపతిః సర్వాః సేనా రక్షయేత్ స శత్రూన్ విజేతుం శక్నుయాత్. ॥ ౭ ॥

**పదార్థము** :- (యః) ఏ (అసౌ) అతడు (నీలగ్రీవాః) నీలమణుల హారమునుధరించినట్టి (విలోహితః) అనేకవిధములగు గుణకర్మస్వభావములచే శ్రేష్ఠుడు (రుద్రః) శత్రునాశకుడగు సేనాపతి (అవసర్పతి) దుష్టులకు విరుద్ధముగ నుండునో (ఏనమ్) ఎట్టి ఈతనిని (గోపాః) రక్షకభృత్యులు (అదృశ్రన్) చూచుచుందురో (ఉత) మరియు (ఉదహార్యః) జలములనుదెచ్చు స్త్రీలు (అదృశ్రన్) చూచెదరో (సః) అట్టి సేనాపతి (దృష్టః) చూడదగిన (నః) ధార్మికులమగు మా ఎల్లరను (మృడయాతి) సుఖవంతుల నొనర్చుగాక! ॥౭॥

**భావార్థము** :- దుష్టులకు విరోధి, శ్రేష్ఠులకు ప్రియుడు, దర్శనీయుడునగు సేనాపతిని మరియు సకల సైన్యముల నుంచువాడే శత్రువులపై విజయము సాధించును. ॥౭॥

7.The commander of the army, with necklace of precious gems round the neck full of good qualities, actions and disposition, goes against the vicious. The faithful servants and the girls who carry water behold him. May he when seen be kind to us.

౭౯౨.నమోఽస్త్విత్యస్య ప్రజాపతిరృషిః, రుద్రో దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల పై విషయమే.

**౭౯౨ నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే।**

**అథో యేఽఅస్య సత్వానోఽహం తేభ్యోఽకరన్నమః ॥ ౮ ॥**

**ప.విః-** నమః, అస్తు, నీలగ్రీవాయేతి నీల + గ్రీవాయ, సహస్రాక్షాయేతి సహస్ర + అక్షాయ, మీఢుషే, అథోఽ ఇత్యథో, యే, అస్య, సత్వానః, అహమ్, తేభ్యః, అకరమ్, నమః ॥౮॥

**పదార్థః** :- (నమః) అన్నమ్ (అస్తు) భవతు (నీలగ్రీవాయ) శుద్ధకణ్ఠస్వరాయ (సహస్రాక్షాయ) సహస్రేషు భృత్యేష్వక్షిణీ యస్య తస్మై (మీఢుషే) వీర్యవతే (అథో) అనన్తరమ్ (యే) (అస్య) సేనాపతేరధికారే (సత్వానః) సత్వగుణబలోపేతాః (అహమ్) ప్రజాసేనాపాలనాధికారేఽధికృతోఽమాత్యః (తేభ్యః) (అకరమ్) కుర్యామ్ (నమః) పుష్కలమన్నాదికమ్. ॥౮॥

**అన్వయః** :- నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే సేనాపతయే మద్దత్తం నమోఽస్తు. అథో యేఽస్య సత్వానః సన్తి తేభ్యోఽపి నమోఽహమకరం నిష్పాదయేయమ్. ॥౮॥

**భావార్థః** :- సభాపత్యాదిభిరన్నాద్యేన యాదృశః సత్కారః సేనాపతేః క్రియతే తాదృగేవ సేనాస్థానాం భృత్యానామపి కర్తవ్యః. ॥౮॥

**పదార్థము** :- (నీలగ్రీవాయ) శుద్ధకంఠము, సుస్వరముగలిగిన (సహస్రాక్షాయ) వేలాది భృత్యుల కార్యములను పర్యవేక్షించు (మీఢుషే) పరాక్రమశాలియగు సేనాపతికి నే నిచ్చు (నమః) అన్నము (అస్తు) ప్రాప్తించుగాక! (అథో) ఆ పిదప (యే) ఏ (అస్య) ఈ సేనాపతి అధికారమునందు (సత్వానః) సత్త్వగుణపరాక్రమముగలవారో (తేభ్యః) వారికొరకును (అహమ్) నేను (నమః) అన్నము మున్నగు పదార్థములను (అకరమ్) సిద్ధపరతునుగాక!॥౮॥

**భావార్థము** :- సభాపతి మున్నగు రాజపురుషులు అన్నము మున్నగు పదార్థములచే సేనాపతిని సత్కరించునట్లే సైనికులనుగూడ సత్కరించవలెను.॥౮॥

8.The commander-in-chief, with a clear throat and voice, who watches the actions of thousands of soldiers, and is full of valour, receives food from me. I offer food the well - behaved and brave soldiers as well, who work under him.

౨౬౩. ప్రముఞ్చేత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రో దేవతా, భురిగార్ష్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తదేవాహ. మఱల నద్దానినే చెప్పెను.

**౨౬౩ ప్రముఞ్చ ధన్వనస్త్వముభయోరార్త్న్యోర్జ్యామ్ ।**

**యాశ్చ తే హస్తఽఇషవః పరా తా భగవో వప ॥౯॥**

**ప.వి:- ప్ర, ముఞ్చ, ధన్వనః, త్వమ్, ఉభయోః, ఆర్త్న్యోః, జ్యామ్, యాః, చ, తే, హస్తే, ఇషవః, పరా, తాః, భగవ + ఇతి భగవః, వప ॥౯॥**

**పదార్థః** :-(ప్ర) ప్రకృష్టార్థే (ముఞ్చ) త్యజ (ధన్వనః) ధనుషః (త్వమ్) సేనేశః (ఉభయోః) (ఆర్త్న్యోః) పూర్వాపరయోః (జ్యామ్) బాణసన్ధానార్థమ్ (యాః) (చ) (తే) తవ (హస్తే) కరే (ఇషవః) బాణాః (పరా) దూరే (తాః) (భగవః) ఐశ్వర్యయుక్త (వప) నిక్షిప. ॥౯॥

**అన్వయః** :-హే భగవః సేనాపతే! తే తవ హస్తే యా ఇషవః సన్తి తా ధన్వన ఉభయోరార్త్న్యోర్జ్యామనుసన్ధాయ శత్రూణాముపరి త్వం ప్రముఞ్చ యాశ్చ స్వోపరి శత్రుభిః ప్రక్షిప్తాస్తాః పరా వప. ॥౯॥

**భావార్థః** :-సేనాపత్యాదిభిర్ధనుషా ప్రక్షిప్తైర్బాణైః శత్రవో విజేతవ్యాః శత్రుక్షిప్తాశ్చ నివారణీయాః॥౯॥

**పదార్థము** :-(భగవః) ఐశ్వర్యశాలివగు ఓ సేనాపతీ! (తే) నీ (హస్తే) చేతిలో (యాః) ఎట్టి (ఇషవః) బాణములు కలవో (తాః) వానిని (ధన్వనః) ధనుస్సుయొక్క (ఉభయోః) రెండు (ఆర్త్న్యోః) పూర్వాపర కొనలయందున్న (జ్యామ్) నింటినారిపై ఎక్కుపెట్టి శత్రువులపై (త్వమ్) నీవు (ప్ర, ముఞ్చ) బలముగా ప్రయోగింపుము (చ) మరియు నీపై శత్రువులు ప్రయోగించు బాణములను (పరావప) దూరమున బడునట్లు చెదరగొట్టుము. ॥౯॥

**భావార్థము** :-సేనాపతి మున్నగువారు శత్రువులపై బాణముల ప్రయోగించి జయించవలయును. శత్రువులు ప్రయోగించు బాణములను తొలగించుకొనవలెను. ॥౯॥

9.I powerful commander of the army, loosen both the extre mitles of the bow, put the arrows in thy hand, in the bowstring, throw them on the enemy, and ward off the arrows the enemy throws on thee !.

౭౯౪. విజ్యన్ధనురిత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రో దేవతా, భురిగార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తదేవాహ. మఱల నవ్విషయమే.

**౭౯౪ విజ్యన్ధనుః కపర్దినో విశల్యో బాణవాఀ२ ఉత ।**

**అనేశన్నస్య యా ఇషవ ఆభురస్య నిషఙ్గధిః ॥౧౦॥**

**ప. విః- విజ్యమితి వి + జ్యమ్, ధనుః, కపర్దినః, విశల్య ఇతి వి + శల్యః, బాణవానితి బాణ + వాన్, ఉత, అనేశన్, అస్య, యాః, ఇషవః, ఆభుః, అస్య, నిషఙ్గధిరితి నిషఙ్గ + ధిః.॥౧౦॥**

**పదార్థః** :-(విజ్యమ్) విగతా జ్యా యస్మాత్తత్ (ధనుః) (కపర్దినః) ప్రశంసితో జటాజూటో విద్యతే యస్య తస్య (విశల్యః) విగతాని శల్యాని యస్య సః (బాణవాన్) బహవో బాణా విద్యన్తే యస్య సః (ఉత) యది (అనేశన్) నశ్యేయుః. ణశ అదర్శనే లుఙి రూపమ్. నశిమన్యోరలిట్యేత్వం వక్తవ్యమ్. అనేన వార్తికేనా

త్రైత్వమ్ (అస్య) సేనాపతేః (యాః) (ఇషవః) బాణాః (ఆభుః) రిక్తః ఖడ్గాదిరహితః (అస్య) (నిషఙ్గధిః) నిషఙ్గాని శస్త్రాస్త్రాణి ధీయన్తే యస్మిన్ సః. ॥౧౦॥

**అన్వయః** :- హే ధనుర్వేదవిదో జనాః! అస్య కపర్దినః సేనాపతేర్ధనుర్విజ్యం మా భూదయం విశల్య ఆభుర్మా భూత్. ఉతాస్య శస్త్రాస్త్రధారకస్య నిషఙ్గధిర్విషా మా భూత్ బాణవాంశ్చాయం భవతు. యా అస్యేషవో౽నేశన్ తా అస్మై నవా దత్త. ॥౧౦॥

**భావార్థః** :- యుయుత్సునా నరేణ ధనుర్వేదయో దృఢా బహుబాణాశ్చ ధార్యాః సేనాపత్యాదిభి ర్యుధ్యమానాన్ విలోక్య పునశ్చ తేభ్యో బాణాదీని సాధనాని దేయాని. ॥౧౦॥

**పదార్థము** :- ధనుర్వేదజ్ఞాతలగు వీరులారా! (అస్య) ఇట్టి (కపర్దినః) ప్రశంసనీయ జటాజూటమును ధరించిన సేనాపతియొక్క (ధనుః) ధనుస్సు (విజ్యమ్) ప్రత్యఞ్చను [వింటినారి] లేనివాడుగా ఉండకుండుగాక! మరియు నీతడు (విశల్యః) బాణాగ్రభాగములేనివాడు మరియు (ఆభుః) ఆయుధములేనివాడు గాకుండుగాక! (ఉత) మరియు (అస్య) ఈ యన్త్రశస్త్రములను ధరించు సేనాపతియొక్క (నిషఙ్గధిః) అంబులపొది అస్త్రరహితముగాకుండుగాక! మరియు నిది (బాణవాన్) అక్షయ బాణయుక్తమగుగాక! (యాః) ఏ (అస్య) ఈ సేనాపతియొక్క (ఇషవః) బాణములు (అనేశన్) నష్టమైపోయినచో మీరు మరల క్రొత్త బాణములు సమకూర్చిపెట్టుడు. ॥౧౦॥

**భావార్థము** :- యుద్ధమొనర్చువీరులు వింటినారి మున్నగువానిని దృఢముగనుంచుకొని అనేక బాణములను ధరించియుంచుకొనవలెను. సేనాపతి మున్నగువారలపైని వీరులను పర్యవేక్షించుచు ఎవరి బాణములు సమాప్తమైపోయినచో వారికి బాణములు మున్నగు ఆయుధములను సమకూర్చుచుండవలెను. ॥౧౦॥

10. O masters of the science of archery, let not the bow of this commander with coiled and braided hair, be ever unstrung, let him never be devoid of arrows. and warlike instruments, let not the treasure of arrows and weapons of this commander who always keeps himself well-armed, be ever empty. May he possess many arrow. Equip him anew with arrows whenever they are destroyed!.

౭౯౨. యా త ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రో దేవతా, నిచృదనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

సేనాధీశాదయః కైః కథముపదేశ్యా ఇత్యుచ్యతే

సేనాపతి మున్నగువారు ఎవరిచే నెట్టి ఉపదేశము పొందవలయును?

౭౯౨ యా తే హేతిర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః ।

తయాస్మాన్విశ్వతస్త్వమయక్ష్మయా పరి భుజ ॥౧౧॥

**ప.విః-యా, తే, హేతిః, మీఢుష్టమ మీఢుస్తమేతి మీఢుః + తమ, హస్తే, బభూవ, తే, ధనుః, తయా, అస్మాన్, విశ్వతః, త్వమ్, అయక్ష్మయా, పరి, భుజ ॥౧౧॥**

**పదార్థః** :-(యా)సేనా (తే) తవ (హేతిః) వజ్రః. హేతిరితి వజ్రనా... నిఘ. ౨.౨౦ (మీఢుష్టమ) అతిశయేన వీర్యస్య సేచక సేనాపతే! (హస్తే) (బభూవ) భవేత్ (తే) (ధనుః) (తయా) (అస్మాన్) (విశ్వతః) సర్వతః (త్వమ్) (అయక్ష్మయా) పరాజయాదిపీడానివారికయా (పరి) సమన్తాత్ (భుజ) పాలయ.॥౧౧ ॥

**అన్వయః** :-హే మీఢుష్టమ సేనాపతే! యా తే సేనాఽస్తి యచ్చ తే హస్తే ధనుర్హేతిశ్చ బభూవ. తయాఽయక్ష్మయా సేనయా తేన చాస్మాన్ ప్రజాసేనాజనాన్ త్వం విశ్వతః పరి భుజ. ॥ ౧౧ ॥

**భావార్థః** :-విద్యావయోవృద్ధైరుపదేశకైర్విద్వద్భిః సేనాపత్యాదయ ఏవముపదేష్టవ్యా భవన్తో యావద్బలం తావతా సర్వే శ్రేష్ఠా సర్వథా రక్షణీయా దుష్టాశ్చ తాడనీయా ఇతి ॥ ౧౧ ॥

**పదార్థము** :-(మీఢుష్టమ) అత్యంతవీర్యవంతుడవగు ఓ సేనాపతీ! (యా) ఏ(తే)నీ సేనగలదో మరియు ఏ(తే) నీ (హస్తే) హస్తమునందు(ధనుః)ధనుస్సు మరియు (హేతిః) వజ్రము(బభూవ) ఉన్నదో (తయా) అట్టి (అయక్ష్మయా) పరాజయము మున్నగు పీడలను దొలగించు సేనలు మరియు ఆ ధనుర్బాణాదులచే (అస్మాన్) ప్రజలమగు మమ్ము మరియు మా సైన్యములను (త్వమ్) నీవు (విశ్వతః) అన్నివైపులనుండి (పరి) అతి శ్రేష్ఠముగ (భుజ) పాలించుచుండుము.॥౧౧॥

**భావార్థము** :-విద్యా వయోవృద్ధులగు ఉపదేశక విద్వాంసులు సేనాపతి మున్నగు వారికి ''మీ యధికారములందు ఎంతసైన్యము, ఆయుధశక్తిగలదో వానిద్వారా సర్వదాశ్రేష్ఠులను రక్షణజేయుచు దుష్టులశిక్షించు'' డని ఉపదేశించుచుండవలెను.॥౧౧॥

11.O virile commander, protect us well on all sides with thy army, the remover of the pain of defeat, with thy weapon, and the bow in thy hand!.

౭౫౬.పరీత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రో దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

రాజప్రజాజనైరితరేతరం కిం కార్యమిత్యుపదిశ్యతే.రాజు ప్రజలు పరస్పర మేమి చేయువలెను?

**౭౫౬ పరి తే ధన్వనో హేతిరస్మాన్వృణక్తు విశ్వతః ।**

**అథో య ఇషుధిస్తవారే అస్మన్నిధేహి తమ్ ॥౧౨॥**

**ప.విః-పరి, తే, ధన్వనః, హేతిః, అస్మాన్ వృణక్తు, విశ్వతః, అథోఽ ఇత్యథో, యః, ఇషుధిరితీషు + ధిః, తవ, ఆరే, అస్మత్, ని, ధేహి, తమ్ ॥౧౨॥**

**పదార్థః** :-(పరి) (తే) తవ (ధన్వనః) (హేతిః) గతిః (అస్మాన్) (వృణక్తు) పరిత్యజతు (విశ్వతః) (అథో) ఆనన్తర్యే (యః) (ఇషుధిః) ఇషవో ధీయన్తే యస్మిన్ సః (తవ) (ఆరే) సమీపే దూరే వా (అస్మత్) అస్మాకం సకాశాత్ (ని) (ధేహి) నితరాం ధర (తమ్).॥౧౨॥

**అన్వయః** :-హే సేనాపతే! యా తే ధన్వనో హేతిరస్తి, తయాఽస్మాన్ విశ్వత ఆరే భవాన్ పరివృణక్తు. అథో యస్తవేషుధిరస్తి తమస్మచ్చారే నిధేహి.॥౧౨॥

**భావార్థః** :-రాజప్రజాజనైర్యుద్ధశస్త్రాభ్యాసం కృత్వా శస్త్రాదిసామగ్ర్యః సదా సమీపే రక్షణీయాః తాభిః పరస్పరస్య రక్షా కార్యా, సుఖం చోన్నేయమ్. ॥౧౨॥

**పదార్థము** :-ఓ సేనాపతీ! ఏ (తే) నీ (ధన్వనః) ధనుస్సుయొక్క (హేతిః) గతిగలదో దానిచే (అస్మాన్) మమ్ము (విశ్వతః) అన్నివైపులనుండి (ఆరే) దూరమున (పరివృణక్తు) భద్రముగ నుంచుము (అథో) ఆ పిదప (యః) ఏ (తవ) నీ (ఇషుధిః) అమ్ములపొది [తూణీరము] గలదో (తమ్) దానిని (అస్మత్) మా సమీపమునుండి (ని,ధేహి) నిరంతరము ధారణమొనర్చుము.॥౧౨॥

**భావార్థము** :-రాజు మరియు ప్రజలు సమరము మరియు శస్త్రాస్త్ర ప్రయోగాభ్యాసమొనర్చుచు వానిని సదా తమ సమీపముననే యుంచుకొని ఆ యాయుధములచే పరస్పరము రక్షణ యొనర్చుకొను చుండవలయును. ॥౧౨॥

12.O commander of the army, protect us in all directions from the attack of bow. Lay thou the quiver that thou hast in place away from us!.

౭౯౭. అవతత్యేత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రో దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

రాజపురుషైః కథం భవితవ్యమిత్యాహ. రాజపురుషు లెటులుండ వలయును?

౭౯౭ అవతత్య ధనుష్ట్వꣳ సహస్రాక్ష శతేషుధే ।

నిశీర్య శల్యానా ముఖా శివో నః సుమనా భవ ॥౧౩॥

**ప.విః-అవతత్యేత్యవ + తత్య, ధనుః, త్వమ్, సహస్రాక్షేతి సహస్ర + అక్ష, శతేషుధ ఇతి**

శత+ఇషుధే, నిశీర్యేతి ని+శీర్య, శల్యానామ్, ముఖా, శివః, నః, సుమనా ఇతి సు + మనాః, భవ ॥౧౩॥

పదార్థః :- (అవతత్య) విస్తార్య (ధనుః) చాపమ్ (త్వమ్) (సహస్రాక్ష) సహస్రేష్వసంఖ్యాతేషు యుద్ధ కార్యేష్వక్షిణీ యస్య తత్సమ్బుద్ధౌ (శతేషుధే) శతమసంఖ్యాః శస్త్రాస్త్రప్రకాశా యస్య తత్సమ్బుద్ధౌ (నిశీర్య) నితరాం హింసిత్వా (శల్యానామ్) శస్త్రాణాం (ముఖా) ముఖాని (శివః) మఙ్గలకారీ (నః) అస్మభ్యమ్ (సుమనాః) సుహృద్భావః (భవ).॥౧౩॥

అన్వయః :- హే సహస్రాక్ష శతేషుధే సేనాధ్యక్ష త్వం ధనుః శల్యానాం ముఖా చావతత్య తైః శత్రూన్ని శీర్య నః సుమనాః శివో భవ.॥౧౩॥

భావార్థః :- రాజపురుషాః సామదానదండభేదాదిరాజనీత్యవయవకృత్యాని సర్వతో విదిత్వా పూర్ణాని శస్త్రాస్త్రాణి సమ్పాద్య తీక్ష్ణీకృత్య చ శత్రుషు దుర్మనసః దుఃఖప్రదాః ప్రజాసు సౌమ్యాః సుఖప్రదాశ్చ సతతం స్యుః.॥ ౧౩ ॥

పదార్థము :- (సహస్రాక్ష) అసంఖ్యాక యుద్ధకార్యములను జూచు (శతేషుధే) ప్రకాశవంతమగు అసంఖ్యాక అస్త్రశస్త్రములతోనున్న సేనాధ్యక్షా! (త్వమ్) నీవు (ధనుః) ధనువు మరియు (శల్యానామ్) శస్త్రముల (ముఖా) అగ్రభాగములను (అవతత్య) విస్తారమొనర్చి వానిచే శత్రువులను (నిశీర్య) సంపూర్ణముగ నాశనరచి (నః) మాకొరకు (సుమనాః) ప్రసన్నచిత్తుడవు (శివః) మంగళకారివి (భవ) అగుము.॥౧౩॥

భావార్థము :- రాజపురుషులు సామదానభేద దండనము మున్నగు రాజనీత్యాంగ కృత్యములను అన్నివిధములుగ నెరిగి సమస్త శస్త్రాస్త్రముల తీక్ష్ణమొనర్చి ప్రయోగించి శత్రువులను కఠోరచిత్తముచే దుఃఖముల పాల్జేయుచు తమ ప్రజలయెడ కోమల ప్రసన్నచిత్తముతో నిరంతరము సుఖముల గలిగించుచు రాజ్యమును సుఖవంత మొనర్చుచుండవలయును.॥౧౩॥

13.O commander of the army, the seer of countless scenes on the battlefield filled with the lustre for innumerable weapons and missiles, extend thy bow; sharpen the front edges of thy arms, kill thy foes, and be kind and gracious unto us!.

౭౫౮.నమస్త ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః రుద్రో దేవతా, స్వరాడార్ష్యుష్ణిక్ ఛన్దః,ఋషభః స్వరః.

పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౭౫౮ నమస్త౨ ఆయుధాయానాతతాయ ధృష్ణవే।

ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే ॥౧౪॥

**ప. విః-నమః, తే, ఆయుధాయ, అనాతతాయ, ధృష్ణవే, ఉభాభ్యామ్, ఉత, తే, నమః, బాహుభ్యామితి బాహు + భ్యామ్, తవ, ధన్వనే ॥౧౪॥**

**పదార్థః** :-(నమః) (తే) తుభ్యమ్ (ఆయుధాయ) యః సమన్తాద్ యుధ్యతే తస్మై. అత్ర ఇగుపధేతి కః (అనాతతాయ) అవిద్యమాన ఆతతో విస్తారో యస్య తస్మై (ధృష్ణవే) యో ధృష్ణోతి ధార్ష్ట్యం ప్రాప్నోతి తస్మై (ఉభాభ్యామ్) (ఉత) (తే) తుభ్యమ్ (నమః) (బాహుభ్యామ్) బలవీర్యాభ్యామ్ (తవ) (ధన్వనే). ॥౧౪॥

**అన్వయః** :-హే సభేశ! ఆయుధాయానాతతాయ ధృష్ణవే తే నమోఽస్తు. ఉత తే భోక్త్రే తుభ్యం నమః ప్రయచ్ఛామి. తవోభాభ్యాం బాహుభ్యాం ధన్వనే నమో నియోజయేయమ్. ॥౧౪॥

**భావార్థః** :-సేనాపత్యాద్యధికారిభిరుభయేభ్యోఽధ్యక్షయోద్ధృభ్యః శస్త్రాణి దత్వా శత్రుభిః సహైతే నిఃశఙ్కం సమ్యగ్ యోధనీయాః. ॥౧౪॥

**పదార్థము** :- ఓ సభాపతీ! (ఆయుధాయ) యుద్ధమొనర్చువాడవు (అనాతతాయ) నీ యాశయములను గుప్త సంకోచమునందుంచువాడవు (ధృష్ణవే) ప్రతిభావంతుడవు నగు (తే) నీకొరకు (నమః) అన్నము ప్రాప్తించుగాక! (ఉత) మరియు (తే) భోజనమొనర్చు నీకొరకు అన్నము నిచ్చుచున్నాను (తవ) నీయొక్క (ఉభాభ్యామ్) రెండు విధములగు (బాహుభ్యామ్) బలపరాక్రమములద్వారా (ధన్వనే) యోధాగ్రేసరుడగువానికై (నమః) అన్నమును నియుక్తపరతునుగాక! ॥౧౪॥

**భావార్థము** :-సేనాపతి మరియు రాజ్యాధికారులు అధ్యక్ష, సైన్యము లిరువురకు విరివిగా శస్త్రాస్త్రముల నిచ్చి శంకారహితులై శత్రువులతో తీక్ష్ణముగ యుద్ధమొనర్చునట్లు చేయవలెను. ॥౧౪॥

14.O King, skilled in fighting, keeper of thy designs in secret, full of eloquence, may thou get foodstuff. I offer food for thee to eat. I offer food to thy warriors acting as thy arms with their strength and valour!.

**౭౯౯. మా నో మహాంతమిత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతా, నిచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.**

: రాజజనైః కిం న కార్యమిత్యాహ. రాజపురుషులేమి చేయకూడదు?

**౭౯౯ మా నో మహాన్తముత మా నోఽ అర్భకమ్మా నఽ ఉక్షన్తముత మా నఽ ఉక్షితమ్। మా నో వధీః పితరమ్మోత మాతరమ్మా నః ప్రియాస్తన్వో రుద్ర రీరిషః ॥౧౫॥**

**ప.వి:-** మా, నః, మహాన్తమ్, ఉత, మా, నః, అర్భకమ్, మా, నః, ఉక్షన్తమ్, ఉత, మా, నః, ఉక్షితమ్, మా నః, వధీః, పితరమ్, మా, ఉత, మాతరమ్, మా, నః, ప్రియాః తన్వః, రుద్ర, రీరిష ఇతి రీరిషః.॥౧౫॥

**పదార్థః :-** (మా) నిషేధార్థే (నః) అస్మాకమ్ (మహాన్తమ్) మహాగుణవిశిష్టమ్ పూజ్యం జనమ్ (ఉత) అపి (మా) (నః) (అర్భకమ్) అల్పం క్షుద్రమ్ (మా) (నః) (ఉక్షన్తమ్) వీర్యసేక్తారమ్ (ఉత) (మా) (నః) (ఉక్షితమ్) సిక్తమ్ (మా) (నః) (వధీః) హింస్యాః (పితరమ్) పాలకం జనకమ్ (మా) (ఉత) (మాతరమ్) మాన్యప్రదాం జననీమ్ (మా) (నః) (ప్రియాః) స్త్ర్యాదేః ప్రీత్యుత్పాదకాని (తన్వః) శరీరాణి (రుద్ర) యుద్ధసేనాధికృతవిద్వన్ (రీరిషః) హింస్యాః. అత్ర లిఙర్థే లుఙడభావశ్చ ॥ ౧౫ ॥

**అన్వయః :-** హే రుద్ర! త్వం నో మహాన్తం మా వధీరుత నో ఽర్భకం మా వధీర్న ఉక్షన్తం మా వధీరుత న ఉక్షితం మా వధీః. నః పితరం మా వధీరుత నో మాతరం చ మా వధీః. నః ప్రియాస్తన్వో మా రీరిషః. ॥౧౫॥

**భావార్థః :-** యోద్ధృభిర్యుద్ధసమయే కదాచిద్ వృద్ధా బాలకా అయోద్ధారో యువానో గర్భా యోద్ధృణాం మాతరః పితరశ్చ సర్వేషాం స్త్రియః సంప్రేక్షితారో దూతాశ్చ నో హింసనీయాః. కింతు సదా శత్రుసంబన్ధినో వశే స్థాపనీయాః. ॥ ౧౫ ॥

**పదార్థము :-** (రుద్ర) యుద్ధసేనాధ్యక్షుడవగు ఓ విద్వాంసుడా! నీవు (నః) మాయొక్క (మహాన్తమ్) ఉత్తమ గుణశాలియగు పూజనీయుని (మా) చంపవలదు(ఉత) మరియు (అర్భకమ్) చిన్నవానిని, అల్పుని (మా) చంపవలదు (నః) మాయొక్క (ఉక్షన్తమ్) గర్భాధానమొనర్చువారిని (మా) చంపవలదు (ఉత) మరియు (నః) మాయొక్క (ఉక్షితమ్) గర్భమును (మా) నష్టపరచవలదు (నః) మాయొక్క (పితరమ్) పాలనమొనర్చు పితరుని (మా) హింసించవలదు (ఉత) మరియు (నః) మాయొక్క (మాతరమ్) మాన్యత నొసగు మాతను గూడ (మా) హింసించవలదు (వధీః) వధించుట మరియు (నః) మాయొక్క (ప్రియాః) ప్రియమగుభార్యలు మున్నగు స్త్రీల (తన్వః) శరీరములను (మా రీరిషః) హింసించకుడు.॥౧౫॥

**భావార్థము :-** యోధులగువారు యుద్ధకాలమందు వృద్ధులను, బాలకులను, యుద్ధమునుండి వైదొలగిన యువకులను, గర్భములను [గర్భిణులను], యోధుల మాతాపితరులను, సమస్తస్త్రీలను, యుద్ధమును జూచువారిని, ప్రబంధమొనర్చువారిని, దూతలను చంపవలదు. కాని శత్రుసంబంధీకులగువారిని సదా వశమందుంచుకొనవలెను. ॥౧౫॥

15.O commander of the army, kill not our revered elders, nor our children. Harm not our full grown youths, harm not our progeny in embryo. Slay not our rearing father, slay not our loving mother. Harm not the dear bodies of our women!.

౮౦౦.మానస్తోక ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతా,నిచృదార్షీ జగతీ ఛన్దః,నిషాదః స్వరః.

పున స్తదేవాహ. మఱల నా విషయమే.

౮౦౦ మా నస్తోకే తనయే మా న ఽ ఆయుషి మా నో గోషు మా నోఽ

అశ్వేషు రీరిషః। మా నో వీరాన్రుద్ర భామినో వధీర్హవిష్మన్తః

సదమిత్ త్వా హవామహే ॥౧౬॥

ప.వి:-మా, నః, తోకే, తనయే, మా, నః, ఆయుషి, మా, నః, గోషు, మా, నః, అశ్వేషు, రీరిష ఇతి రీరిషః, మా, నః, వీరాన్, రుద్ర, భామినః, వధీః, హవిష్మన్తః, సదమ్, ఇత్, త్వా, హవామహే ॥౧౬॥

**పదార్థః** :- (మా)(నః) అస్మాకమ్ (తోకే) సద్యోజాతేఽపత్యే (తనయే) పఞ్చమాద్వర్షాదూర్ధ్వం వయః ప్రాప్తే (మా) (నః) అస్మాకమ్ (ఆయుషి) వయసి (మా) (నః) అస్మాకమ్ (గోషు) గోజావ్యాదిషు (మా) (నః) (అశ్వేషు) తురఙ్గహస్త్యుష్ట్రాదిషు (రీరిషః) హింసకో భవేః (మా) (నః) (వీరాన్) శూరాన్ (రుద్ర) (భామినః) క్రుద్ధాన్ (వధీః) (హవిష్మన్తః) బహూని హవీంషి దాతుమాదాతుం యోగ్యాని వస్తూని విద్యన్తే యేషాం తే (సదమ్) యో న్యాయే సీదతి తమ్ (ఇత్) ఏవ (త్వా) త్వామ్ (హవామహే) స్వీకుర్మహే. ॥ ౧౬ ॥

**అన్వయః** :-హే రుద్ర సేనేశ! త్వం నస్తోకే మా రీరిషో నస్తనయే మా రీరిషో న ఆయుషి మా రీరిషో నో గోషు మా రీరిషో నోఽశ్వేషు మా రీరిషః నో భామినో వీరాన్ మా వధీరతో హవిష్మన్తో వయం సదం త్వేద్ధవామహే.॥ ౧౬ ॥

**భావార్థః** :-రాజపురుషైః కస్యాపి ప్రజాస్థస్య స్వస్య వా బాలకుమారగవాశ్వాదివీరహత్యానైవ కార్యా న బాల్యావస్థాయాం వివాహేన వ్యభిచారేణ చాయుర్హింసనీయమ్. గవాదిపశూనాం దుగ్ధాదిప్రదానేన సర్వోపకారకత్వాత్సదైవైతేషాం వృద్ధిః కార్యా. ॥ ౧౬ ॥

**పదార్థము** :-(రుద్ర) ఓ సేనాపతీ! నీవు (నః) మాయొక్క (తోకే) నవ్యజాతశిశు సంతానములను (మా) చంపవలదు (నః) మాయొక్క (తనయే) ఐదుసంవత్సరములకు పైబడిన బాలకులను (మా) చంపవలదు (నః) మాయొక్క (ఆయుషి) ఆయువును (మా) నష్టపరచవలదు (నః) మాయొక్క (గోషు)

గోవులు, గొఱ్ఱె మేకలు మున్నగువానిని (మా) చంపవలదు (నః) మాయొక్క (అశ్వేషు) అశ్వములు, గజములు, ఒంటెలు మున్నగువానిని (మా) చంపవలదు (రీరిషః) చంపుట మరియు (నః) మాయొక్క (భామినః) క్రుద్ధులగు (వీరాన్) శూరవీరులను (మా వధీః) వధించకుము. ఇందువల్ల (హవిష్మన్తః) అనేక ఇచ్చి పుచ్చుకొనదగిన వస్తువులతో మేము (సదమ్) న్యాయమునందు స్థిరమైయున్న (త్వా) నిన్ను (ఇత్) మాత్రమే (హవామహే) స్వీకరించెదము.॥౧౬॥

**భావార్థము :-** రాజపురుషులు తమ మరియు ప్రజల బాలబాలికలను, గోవులను, అశ్వములను, గొఱ్ఱెమేకలు మున్నగు ఉపకార జీవులను ఎప్పుడును హత్య యొనర్పరాదు. బాల్యావస్థయందు వివాహమాడి వ్యభిచరించి ఆయువును క్షీణింపజేసికొనరాదు. గోవులు మున్నగు పశువులు పాలు మున్నగు పదార్థముల నిచ్చి సర్వజనులకు ఉపకారమొనర్చును. కావున వానిని సదా వృద్ధిపరచుచుండవలయును.॥౧౬॥

16.O commander of the army, harm not our newly born child. nor him over five years in age. Make no attack on our life. our cows, sheep and goats and harm not our horses, elephants and camels. Kill not our heroes full of wrath. We with oblations ever call on thee, firm in justice!.

౮౦౧. నమో హిరణ్యబాహవ ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతా, నిచృదతిధృతిశ్ఛన్దః, షడ్జః స్వరః.

రాజప్రజాజనైః కిం కర్తవ్యమిత్యుపదిశ్యతే. రాజు ప్రజలు ఏమి చేయవలెను?

౮౦౧ నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం చ పతయే నమో నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాం పతయే నమో నమః। శష్పిఞ్జరాయ త్విషీమతే పథీనాం పతయే నమో నమో హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమః॥౧౭॥

ప. విః-నమః, హిరణ్యబాహవ ఇతి హిరణ్య + బాహవే, సేనాన్య ఇతి సేనా + న్యే, దిశామ్, చ, పతయే, నమః, నమః, వృక్షేభ్యః, హరికేశేభ్యః ఇతి హరి + కేశేభ్యః, పశూనామ్, పతయే, నమః, నమః, శష్పిఞ్జరాయ, త్విషీమతే, త్విషీమత ఇతి త్విషి + మతే, పథీనామ్, పతయే, నమః, నమః, హరికేశాయేతి హరి + కేశాయ, ఉపవీతిన + ఇత్యుప + వీతినే, పుష్టానామ్, పతయే, నమః ॥౧౭॥

**పదార్థః** :-(నమః) వజ్రః (హిరణ్య బాహవే) హిరణ్యం జ్యోతిరివ తీవ్రతేజస్కౌ బాహూ యస్య తస్మై (సేనాన్యే) యః సేనాం నయతి శిక్షాం ప్రాపయతి తస్మై (దిశామ్) సర్వాసు దిక్షు స్థితానాం రాజ్యప్రదేశానామ్ (చ) (పతయే) పాలకాయ. అత్ర షష్ఠీయుక్తశ్ఛన్దసి వేతి ఘిసంజ్ఞా (నమః)అన్నాదికమ్ (నమః) వజ్రాది శస్త్రసమూహః (వృక్షేభ్యః) ఆమ్రాదిభ్యః (హరికేశేభ్యః) హరయో హరణశీలాః సూర్యరశ్మయో యేషు తేభ్యః (పశూనామ్) గవాదీనామ్ (పతయే) రక్షకాయ (నమః) సత్కారణమ్ (నమః) (శష్పిఞ్జరాయ) శదుత్ప్లుతం పిఞ్జరం బన్ధనం యేన తస్మై (త్విషీమతే) బహ్వ్యస్త్విషయో న్యాయదీప్తయో విద్యన్తే యస్య తస్మై. శరాదీనాం చేతి దీర్ఘః (పథీనామ్) మార్గే గన్తౄణామ్ (పతయే) పాలకాయ (నమః) సత్కారణమన్నం చ (నమః) అన్నాదికమ్ (హరికేశాయ) హరితా కేశా యస్య తస్మై (ఉపవీతినే) ప్రశస్తముపవీతం యజ్ఞోపవీతం విద్యతే యస్య తస్మై (పుష్టానామ్) అరోగాణామ్ (పతయే) రక్షకాయ (నమః) సత్కారః. ॥౧౭॥

**అన్వయః** :-హే రుద్ర సేనాధీశ! హిరణ్యబాహవే సేనాన్యే తుభ్యం నమోఽస్తు దిశాం చ పతయే నమోఽస్తు త్వం హరికేశేభ్యో వృక్షేభ్యో నమో గృహాణ పశూనాం పతయే నమోఽస్తు శష్పిఞ్జరాయ త్విషీమతే నమోఽస్తు, పథీనాం పతయే నమోఽస్తు, హరికేశాయోపవీతినే నమోఽస్తు, పుష్టానాం పతయే నమో భవతు. ॥౧౭॥

**భావార్థః** :-మనుష్యైః శ్రేష్ఠానాం సత్కారేణ బుభుక్షితానా మన్నదానేన చక్రవర్తిరాజ్యశాసనేన పశూనాం పాలనేన గన్తుకానాం దస్యుచోరాదిభ్యో రక్షణేన యజ్ఞోపవీతధారణేన పుష్ట్యాచ సహాన్వితవ్యమ్.॥౧౭॥

**పదార్థము** :- శత్రునాశకుడవగు సైన్యాధీశా! (హిరణ్య బాహవే) జ్యోతివంటి తీవ్ర తేజోయుక్త బాహువులు గలవాడవు (సేనాన్యే) సైన్యములకు శిక్షణనిచ్చువాడవగు నీకు (నమః) వజ్రాయుధము ప్రాప్తించుగాక! (చ) మరియు (దిశామ్) సర్వదిశలయందలి రాజ్యభాగముల (పతయే) రక్షకుడవగు నీకు (నమః) అన్నాది పదార్థములు లభించుగాక! (హరికేశేభ్యః) హరణశీలమగు సూర్యకిరణములు ప్రాప్తించినట్టి (వృక్షేభ్యః) మామిడి మున్నగు వృక్షములను నరకకుండుటకై (నమః) వజ్రము మున్నగు శస్త్రములనుగైకొనుము (పశూనామ్) గోవులు మున్నగు పశువుల (పతయే) రక్షకుడవునగు నీకు (నమః) సత్కారము ప్రాప్తించుగాక! (శష్పిఞ్జరాయ) విషయాదుల బంధనములనుండి వేరుగానున్న (త్విషీమతే) ఉన్నతమగు న్యాయప్రకాశముచే గూడియున్న నీకు (నమః) నమస్కారము మరియు అన్నము కలుగుగాక! (పథీనామ్) బాటసారుల [యాత్రికుల] (పతయే) రక్షకుడవగు నీకు (నమః) ఆదరణముండుగాక! (హరికేశాయ) పచ్చనికేశములుగల (ఉపవీతినే) పవిత్రయజ్ఞోపవీత ధారివగు నీకు (నమః) అన్నాది పదార్థములు ప్రాప్తించుగాక! (పుష్టానామ్) ఆరోగ్యవంతుల (పతయే) రక్షకుడగు వానికై (నమః) నమస్కారములు ప్రాప్తించుగాక!॥౧౭॥

**భావార్థము** :- మానవులు శ్రేష్ఠులను సత్కరించుట, ఆకలిపీడితులకు అన్నము నిడుట, చక్రవర్తి రాజ్య శిక్షనుపొందుట, పశువులను రక్షించుట, ప్రయాణీకులను తస్కరులు, బందిపోటుల బారినుండి కాపాడుట, యజ్ఞోపవీతమును ధరించుట, శరీరములను పుష్టివంతముగ నుంచుకొని ప్రసన్నముగ నుండుట మున్నగునవి ఆచరించుట ఉత్తమము. ॥౧౭॥

17.O commander of the army, may thou with strong sparkling arms, and leader of hosts, get arms. May thou lord of the regions get food. Take thou in hand the axe to cut the mango trees exposed to the rays of the sun. Homage to thee, the protector of cattle like cows. Homage to thee, free from the bondage of passions, full of the light of justice. Homage to thee, the guardian of the way-farers. Food to thee, the golden-haired wearer of the yajnopavit (sacrificial cord). Homage to thee the protector of the healthy!.

౮౦౨.నమో బభ్లుశాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, నిచృదష్టిశ్ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౮౦౨ నమో బభ్లుశాయ వ్యాధినేఽన్నానాం పతయే నమో నమో భవస్య

హేత్యై జగతాం పతయే నమో నమో రుద్రాయాతతాయినే క్షేత్రాణాం

పతయే నమో నమః సూతాయాహన్త్యై వనానాం పతయే నమః ॥౧౮॥

ప.వి:-నమః, బభ్లుశాయ, వ్యాధినే, అన్నానామ్, పతయే, నమః, నమః, భవస్య, హేత్యై, జగతామ్, పతయే, నమః, నమః, రుద్రాయ, ఆతతాయిన ఇత్యాతత + ఆయినే, క్షేత్రాణామ్, పతయే, నమః, నమః, సూతాయ, అహన్త్యై, వనానామ్, పతయే, నమః.॥౧౮॥

**పదార్థః** :-(నమః) అన్నమ్ (బభ్లుశాయ) యో బభ్లుషు రాజ్యధారకేషు శేతే తస్మై (వ్యాధినే) రోగిణే (అన్నానామ్) గోధూమాదీనామ్ (పతయే) పాలకాయ (నమః) సత్కారః (నమః) అన్నమ్ (భవస్య) సంసారస్య (హేత్యై) వృద్ధ్యై (జగతామ్) జంగమానాం మనుష్యాదీనామ్ (పతయే) స్వామినే (నమః) సత్కారః (నమః) అన్నమ్ (రుద్రాయ) శత్రూణాం రోదకాయ (ఆతతాయినే) సమన్తాత్ తతం విస్తృతం శత్రుదలమేతుం శీలమస్య తస్మై (క్షేత్రాణామ్) ధాన్యోద్భవాధికరణానామ్ (పతయే) పాలకాయ (నమః) అన్నమ్ (నమః) అన్నమ్ (సూతాయ) క్షత్రియాద్విప్రకన్యాయాం జాతాయ వీరాయ ప్రేరకాయ వా

(అహన్త్యై) యా రాజపత్నీ కఞ్చన న హన్తి తస్యై (వనానామ్) జఙ్గలానామ్ (పతయే) పాలకాయ (నమః) అన్నమ్. ॥ ౧౮ ॥

**అన్వయః** :- రాజపురుషైర్మనుష్యైర్బభ్లుశాయ వ్యాధినే నమోఽన్నానాం పతయే నమో భవస్య హేత్యై నమో జగతాం పతయే నమో రుద్రాయాతతాయినే నమః క్షేత్రాణాం పతయే నమః సూతాయాహన్త్యై నమో వనానాం పతయే నమో దేయం కార్యం చ.॥౧౮॥

**భావార్థః** :- యేఽన్నాదినా సర్వాన్ ప్రాణినః సత్కుర్వన్తి తే జగతి ప్రశంసితా భవన్తి. ॥ ౧౮ ॥

**పదార్థము** :- రాజపురుషులు మున్నగువారు (బభ్లుశాయ) రాజ్యధారకులలో నివసించు (వ్యాధినే) రోగగ్రస్తులకు (నమః) అన్నము నీయవలెను (అన్నానామ్) గోధుమలు మున్నగు అన్నముల (పతయే) రక్షకులను (నమః) సత్కరించవలెను (భవస్య) ప్రపంచ (హేత్యై) వృద్ధికొరకు (నమః) అన్నము నీయవలెను (జగతామ్) మానవులు మున్నగు ప్రాణులకు (పతయే) స్వామియగువానిని (నమః) సత్కరించవలెను (రుద్రాయ) శత్రువుల నేడ్పించు మరియు (ఆతతాయినే) విస్తృత శత్రుసైన్యముల నెదిరించు వారికి (నమః) అన్నమునీయవలెను (క్షేత్రాణామ్) ధాన్యాదులతో నిండిన పంటచేల (పతయే) రక్షకునకు (నమః) అన్నము నీయవలెను (సూతాయ) క్షత్రియునిద్వారా బ్రాహ్మణకన్యకు జన్మించిన ప్రేరకుడగు నీరునకు మరియు (అహన్త్యై) ఎవ్వరినీ హింసించని రాజపత్నికి (నమః) అన్నము నీయవలెను (వనానామ్) అరణ్యముల (పతయే) రక్షించువారికి (నమః) అన్నాది పదార్థముల నీయవలయును.॥౧౮॥

**భావార్థము** :- అన్నము మున్నగు పదార్థములచే సకలప్రాణులను సత్కరించువారు ప్రపంచమునందు ప్రశంసింపబడుదురు.॥౧౮॥

18.Let the state-officials give food to the patient who lives in their midst. Let them pay homage to the growers of corn. Let them grant grain for the progress of the world. Let them offer homage to the lord of human beings. Let them give food to the tormentor of the foes, and the fighter from all directions against vast armed foes. Let them give food to the brave warrior and the queen who injures none. Let them give food to the Lord of forest.

౧౯.నమో రోహితాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతా, విరాడతిధృతిశ్ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల పై విషయమే.

**౧౯ నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమో నమో భువన్తయే వారివస్కృతాయౌషధీనాం పతయే నమో నమో మన్త్రిణే**

వాణిజాయ కక్షాణాం పతయే నమో నమ ఉచ్చై

ర్ఘోషాయాక్రన్దయతే పత్తీనాం పతయే నమః ॥౧౯॥

ప. వి:- నమః, రోహితాయ, స్థపతయే, వృక్షాణామ్, పతయే, నమః, నమః, భువన్తయే, వారివస్కృతాయ, వారివః కృతాయేతి వారివః + కృతాయ, ఓషధీనామ్, పతయే, నమః, నమః, మన్త్రిణే, వాణిజాయ, కక్షాణామ్, పతయే, నమః, నమః, ఉచ్చైర్ఘోషాయేత్యుచ్చైః + ఘోషాయ, ఆక్రన్దయత ఇత్యా + క్రన్దయతే పత్తీనామ్, పతయే, నమః. ॥౧౯॥

పదార్థః :- (నమః) అన్నమ్ (రోహితాయ) వృద్ధికరాయ (స్థపతయే) తిష్ఠన్తి యస్మిన్నితి స్థం తస్య పతయే పాలకాయ (వృక్షాణామ్) ఆమ్రాదీనామ్ (పతయే) స్వామినే (నమః) అన్నమ్ (నమః) అన్నమ్ (భువన్తయే) యో భవత్యాచారవాంస్తస్మై (వారివస్కృతాయ) వారివస్సేవనం కృతం యేన తస్మై. అత్ర స్వార్థేఽణ్ (ఓషధీనామ్) సోమాదీనామ్ (పతయే) పాలకాయ వైద్యాయ (నమః) అన్నమ్ (నమః) సత్కారః (మన్త్రిణే) విచారకర్త్రే రాజపురుషాయ (వాణిజాయ) వణిజాం వ్యవహారేషు కుశలాయ (కక్షాణామ్) గృహప్రాంతావయవేషు స్థితానామ్ (పతయే) రక్షకాయ (నమః) అన్నమ్ (నమః) సత్కారః (ఉచ్చైర్ఘోషాయ) ఉచ్చైర్ఘోషో యస్య తస్మై (ఆక్రన్దయతే) యో దుష్టానాక్రన్దయతే రోదయతి తస్మై న్యాయాధీశాయ (పత్తీనామ్) సేనాఙ్గానామ్ (పతయే) రక్షకాయ సేనాధ్యక్షాయ (నమః) సత్కారః ॥౧౯॥

అన్వయః :- రాజప్రజాజనై రోహితాయ స్థపతయే నమో వృక్షాణాం పతయే నమో భువన్తయే వారివస్కృతాయ నమ ఓషధీనాం పతయే నమో మంత్రిణే వాణిజాయ నమః కక్షాణాం పతయే నమ ఉచ్చైర్ఘోషాయాక్రన్దయతే నమః పత్తీనాం పతయే నమశ్చ దేయం కార్యం చ. ॥౧౯॥

భావార్థః :- మనుష్యైర్వనాదిపాలకేభ్యోఽన్నాదికం దత్వా వృక్షౌషధ్యాద్యున్నతిర్విధేయా. ॥౧౯॥

పదార్థము :- రాజు మరియు ప్రజలు (రోహితాయ) సుఖములను వృద్ధిపరచు (స్థపతయే) స్థానముల స్వామి, రక్షకుడును నగు సేనాపతికి (నమః) అన్నము (వృక్షానామ్) ఆమ్రమువు [మామిడి] మున్నగు వృక్షముల (పతయే) అధిష్ఠాతకు (నమః) అన్నము (భువన్తయే) ఆచారవంతుడు (వారివస్కృతాయ) సేవలొనర్చు భృత్యునకు (నమః) అన్నము మరియు (ఓషధీనామ్) సోమలతమున్నగు ఓషధుల (పతయే) రక్షకుడగు వైద్యునకు (నమః) అన్నము నీయవలెను (మంత్రిణే) ఆలోచనాపరుడగు రాజమంత్రి మరియు

(వాణిజాయ) వైశ్య వ్యవహారదక్షుని (నమః) సత్కరించవలెను (కక్షాణామ్) గృహములందుండువారి (పతయే) రక్షకునకు (నమః) అన్నము, (ఉచ్చైర్ఘోషాయ) ఉచ్చస్వరమున బోధించు మరియు (ఆక్రందయతే) దుష్టులనేడ్పించు న్యాయాధీశుని (నమః) సత్కారముచేయవలెను. మరియు (పత్తీనామ్) సైన్యముల అవయవ [విభాగ]ముల (పతయే) రక్షణ యొనర్చువారిని (నమః) సత్కరించవలయును.॥౧౯॥

**భావార్థము** :- వనాదులను రక్షించువారికి అన్నాది పదార్థములనిచ్చి వృక్షములు, ఓషధులు మున్నగు పదార్థముల నున్నతియొనర్చుట మానవులకు యోగ్యము.॥౧౯॥

19.Let the officials and the people give food to the commander of the army, the enhancer of delights. Let them give food to the lord of trees. Let them give food to sevants of good character. Let them give food to the physician, the guardian of medicinal herbs. Let them pay homage to the thoughtful minister, and the expert in trade. Let them give food to the protector of the hoseholders. Homage to the shouting lord of justice who makes the wicked weep. Homage to the guardian of different parts of the army.

౮౦౪.నమః కృత్స్నాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతా, అతిధృతిశ్ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమునే చెప్పెను.

౮౦౪ నమః, కృత్స్నాయతయా ధావతే సత్వనాం పతయే నమో నమః

సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే నమో నమో

నిషఙ్గిణే కకుభాయ స్తేనానాం పతయే నమో నమో నిచేరవే

పరిచరాయారణ్యానాం పతయే నమః ॥౨౦॥

ప.వి:-నమః, కృత్స్నాయతయేతి కృత్స్న + ఆయతయా, ధావతే, సత్వనామ్, పతయే, నమః, నమః, సహమానాయ, నివ్యాధిన ఇతి ని+ వ్యాధినే, ఆవ్యాధినీనామిత్యా + వ్యాధినీనామ్, పతయే, నమః, నమః, నిషఙ్గిణే, కకుభాయ, స్తేనానామ్, పతయే, నమః, నమః, నిచేరవ ఇతి ని + చేరవే, పరిచరాయేతి పరి + చరాయ, అరణ్యానామ్, పతయే,నమః.॥౨౦॥

**పదార్థః** :- (నమః) అన్నమ్ (కృత్స్నాయతయా) ఆయస్య లాభస్య భావ ఆయతా కృత్స్నా చాసావాయతా కృత్స్నాయతా తయా సమ్పూర్ణలాభతయా (ధావతే) ఇతస్తతో ధావనశీలాయ (సత్వనామ్) ప్రాప్తానాం పదార్థానామ్ (పతయే) రక్షకాయ (నమః) సత్కారః (నమః) అన్నమ్ (సహమానాయ) బలయుక్తాయ (నివ్యాధినే) నితరాం వ్యద్ధుం తాడయితుం శీలమస్య తస్మై (ఆవ్యాధినీనామ్) సమన్తాత్ శత్రుసేనాః వ్యద్ధుం శీలం యాసాం తాసాం స్వసేనానామ్ (పతయే) పాలకాయ సేనాపతయే (నమః) సత్కారణమ్ (నమః) అన్నమ్ (నిషఙ్గిణే) ప్రశస్తా నిషఙ్గా బాణాసిభుశుణ్డీశతఘ్నీతోమరాదయః శస్త్రసమూహా విద్యన్తే యస్య తస్మై (కకుభాయ) ప్రసన్నమూర్తయే (స్తేనానామ్) అన్యాయేన పరస్వాదాయినామ్ (పతయే) దణ్డాదిశోషకాయ (నమః) వజ్రమ్ (నమః) సత్కారణమ్ (నిచేరవే) యో నితరాం పురుషార్థే చరతి తస్మై (పరిచరాయ) యో ధర్మం విద్యాం మాతాపితరౌ స్వామిమిత్రాదీంశ్చ సేవతే తస్మై (అరణ్యానామ్) వనానామ్ (పతయే) పాలకాయ (నమః) అన్నాదికమ్.॥౨౦॥

**అన్వయః** :- మనుష్యః కృత్స్నాయతయా ధావతే నమః సత్వనాం పతయే నమః సహమానాయ నివ్యాధినే నమ ఆవ్యాధినీనాం పతయే నమో నిషఙ్గిణే నమో నిచేరవే పరిచరాయ కకుభాయ నమః స్తేనానాం పతయే నమోఽరణ్యానాం పతయే నమో దద్యుః కుర్యుశ్చ.॥౨౦॥

**భావార్థః** :- రాజపురుషైః పురుషార్థినాముత్సాహాయ సత్కారః ప్రాణినాముపరి దయా సుశిక్షితసేనా రక్షణం చౌరాదీనాం తాడనం సేవకానాం పాలనం వనానాముచ్ఛేదనం చ కృత్వా రాజ్యం వర్ధనీయమ్. ॥౨౦॥

**పదార్థము** :- మానవులు (కృత్స్నాయతయా) సంపూర్ణ ప్రాప్తికొరకు (ధావతే) ఇటునటు వచ్చిపోవువారికి (నమః) అన్నమునీయవలెను (సత్వనామ్) ప్రాప్తిగల పదార్థముల (పతయే) రక్షణయొనర్చువారిని (నమః) సత్కరించవలెను (సహమానాయ) శక్తిశాలురు (నివ్యాధినే) నిరంతరము శత్రువుల నష్టపరచువారికి (నమః) అన్నము నీయవలెను (ఆవ్యాధినీనామ్) బాగుగా శత్రుసైన్యముల నాశమొనర్చు స్వంతసైన్యముల (పతయే) రక్షకుడగు సేనాపతిని (నమః) ఆదరించవలెను (నిషఙ్గిణే) కొరతరాని ఉత్తమ బాణములు, ఖడ్గములు, భుశుండి [తోపు], శతఘ్ని [తుపాకి], బల్లెములు, ఈటెలు, తోమరములు మున్నగు శస్త్రములు గలవానికి (నమః) అన్నమునీయవలెను. (నిచేరవే) నిరంతరము పురుషార్థియై తిరుగు మరియు (పరిచరాయ) ధర్మము, విద్య మాతాపితరులు, యజమాని, మిత్రులు మున్నగువారికి అనేకరీతుల సేవలొనర్చువారిని (కకుభాయ) ప్రసన్నమూర్తివంతులను (నమః) సత్కరించవలెను (స్తేనానామ్) అన్యాయముగ పరధనముల గొనువారిని మరియు (పతయే) దండించుచు శుష్కింపజేయువారిని (నమః) వజ్రాయుధముచే నాశపరచవలెను (అరణ్యానామ్) వనముల, అరణ్యముల (పతయే) రక్షకులైనవారికి (నమః) అన్నము మున్నగు పదార్థముల నీయవలెను.॥౨౦॥

**భావార్థము** :- రాజపురుషులు పురుషార్థపరులను ప్రోత్సహించుచు సత్కరించుట, ప్రాణులయెడ దయగలిగియుండుట, చక్కని శిక్షిత సేనలనుంచుట, చోరులు మున్నగువారిని దండించుట, సేవకులను

రక్షించుట, వనములను నష్టపరచకుండుట మున్నగువానిని చక్కగా ఆచరించుచు రాజ్యమును వృద్ధిపరచ వలయును. ॥౨౦॥

20.Food for the person who is active for obtaining full conquest. Homage to the protector of the substances secured. Food for the powerful and chastiser of the foes. Homage to the general who subdues the arimes of the enemies with his own army. Food for the master of arrow, sword, gun and cannon. Homage to the self-contented, enterprising person who serves religion, knowledge, mother, master and friends. Arms for him who keeps the thieves under control and food for the forest-guard.

౧౦౫.నమో వఞ్చత ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, నిచృదతిధృతిశ్ఛన్దః,షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౫ నమో వఞ్చతే పరివఞ్చతే స్తాయూనాం పతయే నమో నమో నిషఙ్గిణఽ

ఇషుధిమతే తస్కరాణాం పతయే నమో నమః సృకాయిభ్యో

జిఘాంసద్భ్యో ముష్ణతాం పతయే నమో నమోఽసిమద్భ్యో నక్తం

చరద్భ్యో వికృన్తానాం పతయే నమః ॥౨౧॥

ప. విః–నమః, వఞ్చతే, పరివఞ్చత ఇతి పరి + వఞ్చతే, స్తాయూనామ్, పతయే, నమః, నమః, నిషఙ్గిణే, ఇషుధిమత ఇతీషుధి + మతే, తస్కరాణామ్, పతయే, నమః, నమః, సృకాయిభ్య ఇతిసృకాయి + భ్యః, జిఘాంసద్భ్య ఇతి జిఘాంసద్ + భ్యః, ముష్ణతామ్, పతయే, నమః, నమః, అసిమద్భ్య ఇత్యసిమత్ + భ్యః, నక్తమ్, చరద్భ్య ఇతి చరత్ + భ్యః, వికృన్తానామితి వి + కృన్తానామ్, పతయే, నమః ॥౨౧॥

పదార్థః :- (నమః) వజ్రప్రహారః (వఞ్చతే) ఛలేన పరపదార్థానాం హర్త్రే (పరివఞ్చతే) సర్వతః కాపట్యేన వర్తమానాయ (స్తాయూనామ్) చౌర్యేణ జీవతామ్ (పతయే) స్వామినే (నమః) వజ్రాదిశస్త్రప్రహరణమ్ (నమః) అన్నమ్ (నిషఙ్గిణే) రాజ్యపాలనే నిత్యం సజ్జితాయ (ఇషుధిమతే)

ప్రశస్తేషుధిధర్త్రే (తస్కరాణామ్) స్తేయకర్మకర్త్రూణామ్ (పతయే) పాతయిష్ణవే (నమః) వజ్రప్రహరణమ్ (నమః) (సృకాయిభ్యః) సృకేణ వజ్రేణ సజ్జనానేతుం ప్రాప్తుం శీలమేషాం తేభ్యః. సృక ఇతి వజ్రనా ...ని.ఘం. ౨.౨౦. (జిఘాంసద్భ్యః) హన్తుమిచ్ఛద్భ్యః (ముష్ణతామ్) స్తేయకర్మకారిణామ్ (పతయే) దండేన నిపాతయిత్రే (నమః) సత్కారణమ్ (నమః) వజ్ర ప్రహరణమ్ (అసిమద్భ్యః) ప్రశస్తా అసయః ఖడ్గాని విద్యన్తే యేషాం తేభ్యః (నక్తమ్) రాత్రౌ (చరద్భ్యః) (వికృన్తానామ్) వివిధోపాయైర్గ్రన్థిం ఛిత్వా పరస్వాపహర్త్రూణామ్ (పతయే) విఘాతకాయ (నమః) సత్కారః. ॥ ౨౧ ॥

**అన్వయః** :- రాజపురుషా వఞ్చతే పరివఞ్చతే నమః స్తాయూనాం పతయే నమో, నిషఙ్గిణ ఇషుధిమతే నమస్తస్కరాణాం పతయే నమః, సృకాయిభ్యో జిఘాంసద్భ్యో నమో. ముష్ణతాం పతయే నమోఽసిమద్భ్యో నక్తం చరద్భ్యో నమో వికృన్తానాం పతయే నమోఽనుసందధతు ॥ ౨౧ ॥

**భావార్థః** :- రాజజనైః కపటవ్యవహారేణ ఛలయతాం దివా రాత్రౌ చానర్థకారిణాం నిగ్రహం కృత్వా ధార్మికాణాం చ పాలనం సతతం విధేయమ్. ॥ ౨౧ ॥

**పదార్థము** :- రాజపురుషులు (వఞ్చతే) మోసగించి ఇతరుల పదార్థములను కాజేయువారిని (పరివఞ్చతే) సర్వవిధములుగ కపటముగ ప్రవర్తించువారిని (నమః) వజ్రములచే ప్రహరించవలెను (స్తాయూనామ్) చౌర్యవృత్తిచే జీవించువారిని (పతయే) వారి నాయకుని (నమః) వజ్రాఘాతముచే చంపవలెను (నిషఙ్గిణే) రాజ్యరక్షణ కార్యములందు నిరంతరము ఉద్యుతుడైయుండు (ఇషుధిమతే) ప్రశంసనీయమైన బాణములను ధరించువారికి (నమః) అన్నము నీయవలెను (తస్కరాణామ్) దొంగతనములొనర్చు దొంగల (పతయే) ఆ వృత్తియందే జీవించువారి నాయకుని వజ్రముచే చంపవలెను (సృకాయిభ్యః) వజ్రముతో సజ్జనులను పీడించదలచువారిని (జిఘాంసద్భ్యః) చంపదలచువారిని (నమః) వజ్రముచే చంపవలెను (ముష్ణతామ్) దొంగతనము చేయుచుండువారిని (పతయే) దండప్రహారముచే పృథివిపైబడవేయువారిని (నమః) సత్కరించవలెను (అసిమద్భ్యః) ఉత్తమ ఖడ్గములతోగూడ (నక్తమ్) రాత్రులందు (చరద్భ్యః) సంచరించు దోపిడికాండ్రను (నమః) శస్త్రములచే చంపవలెను. మరియు (వికృన్తానామ్) అనేక ఉపాయములతో పరపదార్థములనపహరించు జేబుదొంగలను (పతయే) చంపిపడవేయువారిని (నమః) సత్కరించవలయును. ॥౨౧॥

**భావార్థము** :- రాజపురుషులు కపటవ్యవహారములచే మోసగించు మరియు పగలు రాత్రులందు అనర్థమొనర్చువారిని దొలగించి నిరంతరము ధర్మాత్ముల రక్షణ యొనర్చుచుండవలయును. ॥౨౧॥

21.Thunderbolt to the cheat, to the arch-deceiver; and the lord of stealers. Food to the sword-bearer for the protection of the State. Thunderbolt to the lord of robbers; to the bolt-armed homicides. Homage to the chastiser of the pilferers. Thunderbolt to the roamers at night with arms. Homage to the killer of pieckpockets.

**౧౦౬.నమ ఉష్ణీషిణ ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, నిచృదష్టిశ్ఛన్దః,మధ్యమః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.**

౨౨. నమః ఉష్ణీషిణే గిరిచరాయ కులుఞ్చానాం పతయే నమో నమః ఇషుమద్భ్యో ధన్వాయిభ్యశ్చ వో నమో నమః ఆతన్వానేభ్యః ప్రతిదధానేభ్యశ్చ వో నమో నమః ఆయచ్ఛద్భ్యోఽస్యద్భ్యశ్చ వో నమః ॥౨౨॥

ప.వి:-నమః, ఉష్ణీషిణే, గిరిచరాయేతి గిరి + చరాయ, కులుఞ్చానామ్, పతయే, నమః, నమః, ఇషుమద్భ్య ఇతీషుమత్ + భ్యః, ధన్వాయిభ్య ఇతి ధన్వా + యిభ్యః, చ, వః, నమః, నమః, ఆతన్వానేభ్య ఇత్యా + తన్వానేభ్యః, ప్రతిదధానేభ్య ఇతి ప్రతి + దధానేభ్యః, చ, వః, నమః, నమః, ఆయచ్ఛద్భ్య ఇత్యాయచ్ఛత్ + భ్యః, అస్యద్భ్య ఇత్యస్యత్ + భ్యః, చ, వః, నమః.॥౨౨॥

**పదార్థః** :- (నమః) సత్కారణమ్ (ఉష్ణీషిణే) ప్రశస్తముష్ణీషం శిరోవేష్టనం విద్యతే యస్య తస్మై గ్రామణ్యే (గిరిచరాయ) యో గిరిషు పర్వతేషు చరతి తస్మై జాఙ్గలాయ (కులుఞ్చానామ్) యే కుశీలేన లుఞ్చన్తి అపనయన్తి పరపదార్థాం స్తేషామ్ (పతయే) ప్రపాతకాయ (నమః) సత్కారణమ్ (నమః) అన్నమ్ (ఇషుమద్భ్యః) బహవ ఇషవో విద్యన్తే యేషాం తేభ్యః (ధన్వాయిభ్యః) ధనూని ధనూంష్యేతుం శీలమేషాం తేభ్యః (చ) (వః) యుష్మభ్యమ్ (నమః) అన్నమ్ (నమః) సత్కారమ్ (ఆతన్వానేభ్యః) సమన్తాత్ సుఖవిస్తారకేభ్యః (ప్రతిదధానేభ్యః) యే శత్రూన్ ప్రతి శస్త్రాణి దధతి తేభ్యః (చ) (వః) యుష్మభ్యమ్ (నమః) సత్కారణమ్ (నమః) అన్నమ్ (ఆయచ్ఛద్భ్యః) నిగ్రహీతృభ్యః (అస్యద్భ్యః) ప్రక్షిపద్భ్యస్త్యజద్భ్యః (చ) (వః) యుష్మభ్యమ్ (నమః) సత్కారణమ్.॥౨౨॥

**అన్వయః** :-వయం రాజప్రజాజనా ఉష్ణీషిణే గిరిచరాయ నమః కులుఞ్చానాం పతయే నమ ఇషుమద్భ్యో నమో ధన్వాయిభ్యశ్చ వో నమ ఆతన్వానేభ్యో నమః ప్రతిదధానేభ్యశ్చ వో నమ ఆయచ్ఛద్భ్యో నమోఽస్యద్భ్యశ్చ వో నమః కుర్మో దద్మశ్చ. ॥౨౨॥

**భావార్థః** :-రాజప్రజాజనైః ప్రధానపురుషాదయః వస్త్రాన్నాదిదానేన సత్కరణీయాః. ॥౨౨॥

**పదార్థము** :- రాజు, ప్రజలముగువేము (ఉష్ణీషిణే) ఉత్తమ తలపాగను ధరించు గ్రామాధికారిని (గిరిచరాయ) పర్వతాదులందు చరించు ఆటవికులకు (నమః) సత్కారము (కులుఞ్చానామ్) దుస్స్వభావముచే ఇతరుల పదార్థములను కాజేయువారిని (పతయే) పతనమొనర్చువారిని (నమః) సత్కరించుట (ఇషుమద్భ్యః) అనేక బాణములు గలవారికి (నమః) అన్నము (చ) మరియు (ధన్వాయిభ్యః) ధనువులు ప్రాప్తించుకొనిన (వః) మీకొరకు (నమః) అన్నము (ఆతన్వానేభ్యః) ఉత్తమముగా సుఖములను వ్యాప్తపరచువారికి (నమః) సత్కారము (చ) మరియు (ప్రతిదధానేభ్యః) శత్రువుల నిమిత్తము శస్త్రముల ధరించువారగు (వః) మీకు (నమః) సత్కారము (ఆయచ్ఛద్భ్యః) దుష్టులను దుష్కర్మలనుండి నిలువువారికి (నమః) అన్నమునిచ్చుట (చ) మరియు (అస్యద్భ్యః) దుష్టులపై శస్త్రాదుల ప్రయోగించువారగు (వః) మీకు (నమః) సత్కారమొనర్తుము. ॥౨౨॥

**భావార్థము** :- రాజు మరియు ప్రజలు ప్రధానపురుషులను వస్త్రములు, అన్నము మున్నగువాని దానముచే సత్కరించుట ఉచితమై యున్నది. ॥౨౨॥

22. Homage to the turban-wearing villager, the haunter of mountains, the suppressor of the vil-minded dacoits. Food to you who bear arrows and to you who carry bows. Homage to you who add to our happiness, and take up arms against foes. Food to you who dissuade the wicked from evildeeds, and homage to you who use arms against them.

౮౦౭. నమో విసృజద్భ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, నిచృదతిజగతీ ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౮౦౭ నమో విసృజద్భ్యో విధ్యద్భ్యశ్చ వో నమో నమః స్వపద్భ్యో

జాగ్రద్భ్యశ్చ వో నమో నమః శయానేభ్య౨ ఆసీనేభ్యశ్చ

వో నమో నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః ॥౨౩॥

ప. విః- నమః విసృజద్భ్య ఇతి విసృజత్ + భ్యః, విధ్యద్భ్య ఇతి విధ్యత్ + భ్యః, చ, వః, నమః, నమః, స్వపద్భ్య ఇతి స్వపత్ + భ్యః, జాగ్రద్భ్య ఇతి జాగ్రత్ + భ్యః, చ, వః, నమః, నమః, శయానేభ్యః, ఆసీనేభ్యః, చ, వః, నమః, నమః, తిష్ఠద్భ్య ఇతి తిష్ఠత్ + భ్యః, ధావద్భ్య ఇతి ధావత్ + భ్యః, చ, వః, నమః. ॥ ౨౩॥

**పదార్థః** :- (నమః) అన్నాదికమ్ (విస్సృజద్భ్యః) శత్రూణాముపరి శస్త్రాదికం త్యజద్భ్యః (విద్ధ్యద్భ్యః) శస్త్రైః దుష్టాంస్తాడయద్భ్యః (చ) (వః) యుష్మభ్యమ్ (నమః) అన్నమ్ (నమః) వజ్రమ్ (స్వపద్భ్యః) శయానేభ్యః (జాగ్రద్భ్యః) ప్రబుద్ధేభ్యః (చ)(వః)(నమః) అన్నమ్ (నమః) అన్నమ్ (శయానేభ్యః) ప్రాప్తనిద్రేభ్యః (ఆసీనేభ్యః) ఆసనోపరిస్థితేభ్యః (చ) (వః) (నమః) అన్నమ్ (నమః) అన్నమ్ (తిష్ఠద్భ్యః) స్థితేభ్యః (ధావద్భ్యః) శీఘ్రగామిభ్యః (చ) (వః) యుష్మభ్యమ్ (నమః) అన్నమ్. ॥౨౩॥

**అన్వయః** :-హే మనుష్యాః! యూయమేవం సర్వేభ్య ఆజ్ఞాపయత వయం విస్సృజద్భ్యో నమో విద్ధ్యభ్యశ్చ వో నమః స్వపద్భ్యో నమో జాగ్రద్భ్యశ్చ వో నమః శయానేభ్యో నమ ఆసీనేభ్యశ్చ వో నమస్తిష్ఠద్భ్యో నమో ధావద్భ్యశ్చ వో నమః ప్రదాస్యామ ఇతి. ॥ ౨౩ ॥

**భావార్థః** :- గృహస్థైరానృశంస్యం ప్రయోజ్యాన్నాదికం దత్వా సర్వే ప్రాణినః సుఖనీయాః.॥౨౩ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! మీరు ఎల్లరకు ఈవిధముగ తెలియపరచుడు. మేము (విస్సృజద్భ్యః) శత్రువులపై శస్త్రాదులను ప్రయోగించువారికి (నమః) అన్నాది పదార్థములు (చ) మరియు (విద్ధ్యద్భ్యః) శత్రువులను శస్త్రములచే సంహరించు (వః) మీకు (నమః) అన్నము (స్వపద్భ్యః) నిదురించువారికి (నమః) వజ్రము (చ) మరియు (జాగ్రద్భ్యః) మేల్కొనియుండు (వః) మీకు (నమః) అన్నము (శయానేభ్యః) నిద్రాళువులకు (నమః) వజ్రము (చ) మరియు (ఆసీనేభ్యః) ఆసనముపై కూర్చున్న (వః) మీకు (నమః) అన్నము (తిష్ఠద్భ్యః) నిలువబడియున్నవారికి (నమః) అన్నము (చ) మరియు (ధావద్భ్యః) శీఘ్రముగా నడచునట్టి (వః) మీకు (నమః) అన్నము మున్నగువానిచే సత్కరించెదము.॥౨౩॥

**భావార్థము** :- గృహస్థులు కరుణామయవచనములు బలుకుచు అన్నము మున్నగు పదార్థములనిచ్చి యోగ్యులగు సకల ప్రాణులను సుఖపరచవలెను.॥౨౩॥

23.Food to you who use arms against the enemies, and you who kill them. Punishment to you who sleep on the battle field, and food to you who keep awake. Food to you who lie, and to you who sit. Food to you who stand and to you who run.

౨౪.నమః సభాభ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, శక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౨౪ నమః సభాభ్యః సభాపతిభ్యశ్చ వో నమో నమోఽశ్వేభ్యోఽశ్వపతిభ్యశ్చ వో నమో నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చ వో నమో నమఽ ఉగణాభ్యస్తృꣳహతీభ్యశ్చ వో నమః ॥౨౪॥

ప.వి:-నమః, సభాభ్యః, సభాపతిభ్య ఇతి సభాపతి + భ్యః, చ, వః, నమః, నమః, అశ్వేభ్యః, అశ్వపతిభ్య ఇత్యశ్వపతి + భ్యః, చ, వః, నమః, నమః, ఆవ్యాధినీభ్య ఇత్యా + వ్యాధినీభ్యః, వివిధ్యన్తీభ్య ఇతి వి + విధ్యన్తీభ్యః, చ, వః, నమః, నమః, ఉగణాభ్యః, తృꣳహతీభ్యః, చ, వః, నమః.॥౨౪॥

**పదార్థః** :-(నమః) సత్కారణమ్ (సభాభ్యః) యా న్యాయాదిప్రకాశేన సహ వర్తన్తే తాభ్యః సభాభ్యః స్త్రీభ్యః (సభాపతిభ్యః) సభానాం పాలకేభ్యో రాజభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్ (నమః) అన్నమ్ (అశ్వేభ్యః) హయేభ్యః (అశ్వపతిభ్యః) అశ్వానాం పాలకేభ్యః (చ) (వః) (నమః) అన్నమ్ (నమః) అన్నమ్ (ఆవ్యాధినీభ్యః) శత్రుసేనాం తాడనశీలాభ్యః స్వసేనాభ్యః (వివిధ్యన్తీభ్యః) శత్రువీరాన్నిహంత్రీభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్ (నమః) అన్నమ్) (ఉగణాభ్యః) వివిధతర్కయుక్తా గణా యాసు తాభ్యః (తృంహతీభ్యః) హంత్రీభ్యః (చ) (వః) (నమః) అన్నప్రదానమ్.॥౨౪॥

**అన్వయః** :-మనుష్యైః సర్వాన్ ప్రత్యేవం వక్తవ్యం వయం సభాభ్యో నమః సభాపతిభ్యశ్చ వో నమోఽశ్వేభ్యో నమోఽ శ్వపతిభ్యశ్చ వో నమ ఆవ్యాధినీభ్యో నమో వివిధ్యన్తీభ్యశ్చ వో నమ ఉగణాభ్యో నమస్తృంహతీభ్యశ్చ వో నమః కుర్యామ దద్యామ చ. ॥౨౪॥

**భావార్థః** :-మనుష్యైః సభయా సభాపతిభిశ్చైవ రాజ్యవ్యవస్థా కార్యా న ఖలు కదాచిదేకరాజాధీనత్వేన స్థాతవ్యం యతో నైకేన బహూనాం హితాహితసాధనం భవితుం శక్యమతః. ॥ ౨౪ ॥

**పదార్థము** :-మానవులు ఎల్లరకు ఇట్లు తెలుపవలెను. మేము (సభాభ్యః) న్యాయము మున్నగువాని ప్రకాశముచే స్త్రీలను (నమః) సత్కరించెదము (చ) మరియు (సభాపతిభ్యః) సభలను రక్షించు (వః) రాజులగు మిమ్ము (నమః) సత్కరించెదము (అశ్వేభ్యః) అశ్వములకు (నమః) అన్నము (చ) మరియు (అశ్వపతిభ్యః) అశ్వరక్షకులగు (వః) మీకు (నమః) అన్నము మరియు (ఆవ్యాధినీభ్యః) శత్రుసేనల సంహారము నొనర్పునట్టి మనసేనలకు (నమః) అన్నము నీయవలెను (చ) మరియు (వివిధ్యన్తీభ్యః) శత్రువీరులను సంహరించు (వః) మహిళలగు మిమ్ము (నమః) సత్కరించెదము (ఉగణాభ్యః) వివిధ తర్కముల నెరిగిన స్త్రీలకు (నమః) అన్నము (చ) మరియు (తృంహతీభ్యః) యుద్ధములందు శత్రువుల సంహరించు (వః) మహిళలగు మీకు (నమః) యథాయోగ్యముగ అన్నములనిచ్చి సత్కరించెదము.॥౨౪॥

**భావార్థము** :-మానవులు సభ మరియు సభాపతులగు రాజులచేతనే రాజ్యవ్యవస్థ నొనర్పజేయవలెను. ఎప్పుడును ఒకేరాజు యధీనమందుండరాదు. ఏలన ఒక్కనివల్లనే అనేకుల హితాహిత విషయముల నాలోచించుట జరుగదు. స్త్రీలను గూడ యథోచితముగ గౌరవించవలయును.॥౨౪॥

24.Homage to you ladies endowed with the display of justice, and to you Kings, lords of Assemblies. Food to horses and to you masters of horses. Food to our armies that kill the armies of the foes. Homage to you ladies, who kill the heroes of the enemies. Homage to you ladies, masters of the science of logic, and the ladies who kill foes in the battle.

౨౫.నమో గణేభ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, భురిక్ శక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమునే చెప్పెను.

౨౫ నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమో నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమో నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమో నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమః ॥౨౫॥

ప.విః-నమః, గణేభ్యః, గణపతిభ్య ఇతి గణపతి + భ్యః, చ, వః, నమః, నమః, వ్రాతేభ్యః, వ్రాతపతిభ్య ఇతి వ్రాతపతి + భ్యః, చ, వః, నమః, నమః, గృత్సేభ్యః,గృత్సపతిభ్య ఇతి గృత్సపతి + భ్యః, చ, వః నమః, నమః, విరూపేభ్య ఇతి వి + రూపేభ్యః, విశ్వరూపేభ్య ఇతి విశ్వ + రూపేభ్యః చ, వః, నమః.॥౨౫॥

**పదార్థః** :- (నమః) అన్నమ్ (గణేభ్యః) సేవకేభ్యః (గణపతిభ్యః) గణానాం సేవకానాం పాలకేభ్యః (చ) (వః) (నమః) అన్నమ్ (నమః) సత్కారణమ్ (వ్రాతేభ్యః) మనుష్యేభ్యః. వ్రాత ఇతి మనుష్యనా... నిఘం.. ౨.3 (వ్రాతపతిభ్యః) మనుష్యాణాం పాలకేభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్ (నమః) సత్కారణమ్ (గృత్సేభ్యః) యే గృణన్తి పదార్థగుణాన్ స్తువన్తి తేభ్యో విద్వద్భ్యః (గృత్సపతిభ్యః) మేధావిరక్షకేభ్యః (చ) (వః) (నమః) సత్కరణమ్ (నమః) సత్కరణమ్ (విరూపేభ్యః) వివిధాని రూపాణి యేషాం తేభ్యః (విశ్వరూపేభ్యః) అఖిలస్వరూపేభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్. ॥౨౫॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథా వయం గణేభ్యో నమో గణపతిభ్యశ్చ వో నమో వ్రాతేభ్యో నమో వ్రాతపతిభ్యశ్చ వో నమో గృత్సేభ్యో నమో గృత్సపతిభ్యశ్చ వో నమో విరూపేభ్యో నమో విశ్వరూపేభ్యశ్చ వో నమో దద్యామ కుర్యామ చ తథా యుష్మాభిరపి దాతవ్యం కర్తవ్యం చ.॥౨౫॥

**భావార్థః** :-సర్వే జనా అఖిలప్రాణ్యుపకారం విద్వత్సఙ్గం సమగ్రాం శ్రియం విద్యాశ్చ ధృత్వా సంతుష్యన్తు.॥౨౫॥

**పదార్థము** :-ఓ మనుష్యులారా! మేము (గణేభ్యః) సేవకులకు (నమః) అన్నము (చ) మరియు (గణపతిభ్యః) సేవకులరక్షకులగు (వః) మీకు (నమః) అన్నము నిత్తుము (వ్రాతేభ్యః) మానవుల (నమః) సత్కారము (చ) మరియు (వ్రాతపతిభ్యః) మానవరక్షకుడవగు (వః) మీకు (నమః) సత్కారము (గృత్సేభ్యః) పదార్థగుణములను ప్రకటపరచు విద్వాంసుల (నమః) సత్కారము (చ) మరియు (గృత్సపతిభ్యః) బుద్ధిశాలురరక్షకులగు (వః) మిమ్ము (నమః) సత్కరింతుముగాక! (విరూపేభ్యః) వివిధరూపములుగలవారిని (నమః) సత్కరించెదము (చ) మరియు (విశ్వరూపేభ్యః) సమస్తరూపములతో గూడిన (వః) మిమ్ము (నమః) సత్కరించుదుము. అట్లే మీరును సకల పదార్థములచే మమ్ము సత్కరించుడు.॥౨౫॥

**భావార్థము** :- మానవులెల్లరును సర్వప్రాణుల కుపకారము, విద్వాంసుల సాంగత్యము, సమగ్రశోభ మరియు విద్యలను ధారణమొనర్చి సుఖసంతోషములతో నుండవలెను.॥౨౫॥

Food to the servants, and to you their masters. Homage to the people and to you their guardians. Homage to the learned who expatiate on the qualities of objects, and to you the protectors of the wise. Homage to those who assume varions garbs, and to you who wear all forms.

౮౧౦.నమః సేనాభ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, భురిగతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమునే చెప్పెను.

౮౧౦ నమః సేనాభ్యః సేనానిభ్యశ్చ వో నమో నమో రథిభ్యో ఽఅరథేభ్యశ్చ
వో నమో నమః క్షత్తృభ్యః సంగ్రహీతృభ్యశ్చ వో నమో నమో
మహద్భ్యోఽఅర్భకేభ్యశ్చ వో నమః ॥౨౬॥

ప.వి:-నమః, సేనాభ్యః, సేనానిభ్య ఇతి సేనాని + భ్యః, చ, వః, నమః, నమః, రథిభ్య ఇతి రథి + భ్యః అరథేభ్యః, చ, వః, నమః, నమః, క్షత్తృభ్య ఇతి క్షత్తృ + భ్యః, సఙ్గ్రహీతృభ్య ఇతి సమ్ + గ్రహీతృభ్యః, చ, వః, నమః, నమః, మహత్ + భ్యః, అర్భకేభ్యః చ, వః నమః.॥౨౬॥

**పదార్థః** :- (నమః) సత్కారమ్ (సేనాభ్యః) సిన్వన్తి బధ్నన్తి శత్రూన్యాభిస్తాభ్యః (సేనానిభ్యః) యే సేనాం నయన్తి తేభ్యో నాయకేభ్యః ప్రధానపురుషేభ్యః. అత్ర వర్ణవ్యత్యయేన 'ఈ'కారస్య ఇకారః (చ) (వః) (నమః) అన్నమ్ (నమః) సత్కారణమ్ (రథిభ్యః) ప్రశస్తా రథా విద్యన్తే యేషాం తేభ్యః (అరథేభ్యః) అవిద్యమానా రథా యేషాం తేభ్యః పదాతిభ్యః (చ) (వః) (నమః) సత్క్రియామ్ (నమః) అన్నాదికమ్ (క్షత్తృభ్యః) శూద్రాత్ క్షత్రియాయాం జాతేభ్యః (సంగ్రహీతృభ్యః) యే యుద్ధార్థాన్సామగ్రీః సమ్యగ్ గృహ్ణన్తి తేభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్. (నమః) సుసంస్కృత మన్నాదికమ్ (మహద్భ్యః) మహాశయేభ్యో విద్యావయోభ్యాం వృద్ధేభ్యః పూజ్యేభ్యః (అర్భకేభ్యః) కనిష్ఠేభ్యః క్షుద్రాశయేభ్యః శిక్షణీయేభ్యో విద్యార్థిభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్. ॥౨౬॥

**అన్వయః** :- హే రాజప్రజాజనాః! యథా వయం సేనాభ్యో నమో వః సేనానిభ్యో నమశ్చ రథిభ్యో నమో వో ఽరథేభ్యో నమశ్చ క్షత్తృభ్యో నమో వః సంగ్రహీతృభ్యో నమశ్చ మహద్భ్యో నమో వో ఽర్భకేభ్యో నమశ్చ సతతం కుర్మో దద్మశ్చ తథైవ యూయమపి పూజేభ్యః కురుత దత్తచ. ॥౨౬॥

**భావార్థః** :- రాజపురుషైః సర్వాన్ భృత్యాన్ సత్కృత్య సుశిక్ష్యాన్నాదినా వర్ధయిత్వా ధర్మేణ రాజ్యం పాలనీయమ్. ॥౨౬॥

**పదార్థము** :- ఓ రాజా! ఓ ప్రజలారా! మే మెట్లు (సేనాభ్యః) శత్రువులను బంధించు సైనికవీరులను (నమః) సత్కరించెదమో (చ) మరియు (వః) మీరు (సేనానిభ్యశ్చ) సేనానాయకులగు ప్రధాన పురుషులకు (నమః) అన్నము నిచ్చుచున్నామో (రథిభ్యః) ప్రశంసనీయ రథికులను (నమః) సత్కరింతుమో(చ) మరియు (వః) మీరు మేము (అరథేభ్యః) రథికులను, పదాతిసైనికులను (నమః) సత్కారమొనర్తుమో (క్షత్తృభ్యః) క్షత్రియ స్త్రీకి శూద్రునిద్వారా ఉత్పన్నమైన వర్ణసంకరునకు (నమః) అన్నము మున్నగు పదార్థముల నిత్తుమో (చ) మరియు (వః) మీరును మేమును (సంగ్రహీతృభ్యః) చక్కగా యుద్ధసామగ్రిని సమకూర్చువారలను (నమః) సత్కరింతుమో (మహద్భ్యః) విద్యావయోవృద్ధులగు పూజనీయులకు (నమః) ఉత్తమముగ పాకమొనర్చిన అన్నాది పదార్థముల నిచ్చుచుందుమో (చ) మరియు (వః) మీరు (అర్భకేభ్యః) క్షుద్రాశయులు, శిక్షణ యోగ్యులునగు విద్యార్థులను (నమః) నిరంతరము సత్కరించునట్లు మీరును యొనర్చుడు. ॥౨౬॥

**భావార్థము** :- రాజపురుషులు భృత్యులను సత్కార శిక్షాపూర్వకముగ అన్నాది పదార్థములచే నున్నతియొనర్చి ధర్మయుక్తముగ రాజ్యపాలనమొనర్చవలెను. ॥౨౬॥

26.Homage to armies, and food to you the leaders of armies. Homage to you car-borne. and homage to you the pedestrians. Food to you born thorught intermarriage. Homage to you who collect materials for war. Food to the age and the learned. Homage to you the students.

**౨౧౧.నమ స్తక్షభ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, నిచృచ్ఛక్వరీ ఛన్దః,ధైవతః స్వరః.**

**విద్వద్భిః కే సత్కర్తవ్యా ఇత్యాహ. విద్వాంసు లెవరిని సత్కరించవలయును?**

౨౧౧ నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమో నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ

వో నమో నమో నిషాదేభ్యః పుఞ్జిష్ఠేభ్యశ్చ వో నమో నమః శ్వనిభ్యో

మృగయుభ్యశ్చ వో నమః ॥౨౭॥

**ప.వి:**–నమః, తక్షభ్య ఇతి తక్ష + భ్యః, రథకారేభ్య ఇతి రథ + కారేభ్యః, చ, వః, నమః, నమః, కులాలేభ్యః, కర్మారేభ్యః, చ, వః, నమః, నమః, నిషాదేభ్యః, నిసాదేభ్య ఇతి ని + సాదేభ్యః, పుఞ్జిష్ఠేభ్యః, చ, వః, నమః, నమః, శ్వనిభ్య ఇతిశ్వనిభ్యః, మృగయుభ్య ఇతి మృగయు + భ్యః, చ, వః, నమః॥౨౭॥

**పదార్థః** :- (నమః) అన్నమ్ (తక్షభ్యః) యే తక్ష్ణువన్తి తనూకుర్వన్తి తేభ్యః (రథకారేభ్యః) యే రథాన్ విమానాదియానసమూహాన్ కుర్వన్తి తేభ్యః శిల్పిభ్యః (చ) (వః) (నమః) వేతనాదిదానేన సత్కారణమ్ (నమః) అన్నాదికమ్ (కులాలేభ్యః) మృత్పాపాత్రాదిరచకేభ్యః (కర్మారేభ్యః) అసిభుశుణ్డీశతఘ్న్యాదినిర్మాతృభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్ (నమః) అన్నాదిదానమ్ (నిషాదేభ్యః) యే వనపర్వతాదిషు తిష్ఠన్తి తేభ్యః (పుఞ్జిష్ఠేభ్యః) యే పుఞ్జిషు వర్ణేషు భాషాసు వా తిష్ఠన్తి తేభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్ (నమః) అన్నాదిదానమ్ (శ్వనిభ్యః) యే శునో నయన్తి శిక్షయన్తి తేభ్యః (మృగయుభ్యః) య ఆత్మనో మృగాన్ కామయన్తే తేభ్యః (చ) (వః) (నమః) సత్కారణమ్. ॥౨౭॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథా వయం రాజాదయో వస్తక్షభ్యో నమో రథకారేభ్యో నమశ్చ వః కులాలేభ్యో నమః కర్మారేభ్యో నమశ్చ వో నిషాదేభ్యో నమః పుఞ్జిష్ఠేభ్యో నమశ్చ వః శ్వనిభ్యో నమో మృగయుభ్యో నమశ్చ దద్యామ కుర్యామ చ తథా యూయమపి దత్త కురుత చ. ॥౨౭॥

**భావార్థః** :-విద్వాంసో యే పదార్థవిద్యయాఽపూర్వాణి శిల్పకృత్యాని సాధ్నుయుస్తాన్ పారితోషికదానేన సత్కుర్యుః. యే శ్వాదిపశుభ్యోఽన్నాదిదానేన పరిపాల్య సుశిక్ష్యోపయోజయేయుస్తాన్ సుఖాని ప్రాపయేయుః ॥౨౭॥

**పదార్థము** :- ఓ మానవులారా! రాజాదులమగు మేము (తక్షభ్యః) పదార్థములను సూక్ష్మక్రియల ద్వారా నిర్మాణమొనర్చు మీకు (నమః) అన్నమునిత్తుమో (చ) మరియు (రథకారేభ్యః) అనేక విధములగు విమానములు మున్నగు యానములను సిద్ధపరచు (వః) మిమ్ము (నమః) పరిశ్రమ మున్నగువానికై ధనము

నిచ్చి సత్కరింతుమో (కులాలేభ్యః) ఉత్తమ మృణ్మయ [మట్టి] పాత్రలను సిద్ధపరచువారికి (నమః) అన్నాదిపదార్థముల నిత్తుమో (చ) మరియు (కర్మారేభ్యః) ఖడ్గములు, ఫిరంగులు మున్నగు శస్త్రాస్త్రాదియుద్ధ పరికరములను నిర్మాణమొనర్చు (వః) మిమ్ము (నమః) సత్కరించెదమో అట్లే (నిషాదేభ్యః) పర్వతారణ్య ప్రాంతములందు నివసించుచు దుష్ట హింసకారక ప్రాణులను అణచివేయు మీకు (నమః) అన్నాదుల నిచ్చునట్లు (చ) మరియు నెట్లు (పుఞ్జిష్ఠేభ్యః) శ్వేత [ఉన్నత] వర్ణములందు, భాషలందు ప్రవీణులగు (వః) మిమ్ము సత్కారమొనర్తుమో (శ్వనిభ్యః) కుక్కలకు శిక్షణనిచ్చు (వః) మీకు (నమః) అన్నాదులనిత్తుమో (చ) మరియు (మృగయుభ్యః) హృదయపూర్వకముగ వన్య హరిణములు మున్నగు సాధుప్రాణుల ప్రేమించునట్టి మిమ్ము (నమః) సత్కరించుచున్నామో మీరును అట్లే యొనర్చుడు.॥౨౭॥

**భావార్థము** :-పదార్థ పరికరముల విజ్ఞానము, విద్యను చక్కగా దెలిసికొని అపూర్వ నైపుణ్యమున పదార్థనిర్మాణమొనర్చువారికి విద్వాంసులు, రాజు మున్నగువారు పారితోషికముల నొసగుచు, ప్రసన్నముగా నుంచవలెను. కుక్కలు మున్నగువానికి చక్కని పోషకపదార్థములనిచ్చి ఉపయోగమునకు దెచ్చికొనవలెను. వానికి శిక్షణనిచ్చువారిని సత్కరించవలెను.॥౨౭॥

27.Food to the carpenters. Homage to you the manufacturers of acroplanes. Food to the potters. Homage to you the manufacturers of arms. Food to the denizens of forest who subdue wild creatures. Homage to the masters of different languages. Food to the trainers of dogs. Homage to you the lovers of deer.

౨౮.నమః శ్వభ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, ఆర్షీజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

మనుష్యైః కేభ్యః కథముపకారో గ్రాహ్య ఇత్యాహ.

మానవులు దేనినుండి యెటువంటి యుపకారమును గ్రహించవలయును?

౨౮ నమః శ్వభ్యః శ్వపతిభ్యశ్చ వో నమో నమో భవాయ చ రుద్రాయ చ నమః శర్వాయ చ పశుపతయే చ నమో నీలగ్రీవాయ చ శితికణ్ఠాయ చ ॥౨౮॥

**ప.వి:**-నమః, శ్వభ్య ఇతి శ్వ + భ్యః, శ్వపతిభ్య ఇతి శ్వపతి + భ్యః, చ, వః, నమః, నమః, భవాయ, చ, రుద్రాయ, చ, నమః, శర్వాయ, చ, పశుపతయ ఇతి పశు+పతయే, చ, నమః, నీలగ్రీవాయేతి నీల + గ్రీవాయ, చ, శితికణ్ఠాయేతి శితి + కణ్ఠాయ, చ ॥౨౮॥

**పదార్థః** :-(నమః) అన్నమ్ (శ్వభ్యః) కుక్కురేభ్యః (శ్వపతిభ్యః) శునాం పాలకేభ్యః (చ) (వః)

(నమః) అన్నం సత్కారణం చ (నమః) సత్కారణమ్ (భవాయ) యః శుభగుణాదిషు భవతి తస్మై (చ) (రుద్రాయ) దుష్టానాం రోదకాయ (చ) (నమః) అన్నాదికమ్ (శర్వాయ) దుష్టానాం హింసకాయ (చ)(పశుపతయే) గవాది పశుపాలకాయ (చ) (నమః) అన్నమ్ (నీలగ్రీవాయ) నీలః శోభనో వర్ణో గ్రీవాయాం యస్య తస్మై (చ) (శితికణ్ఠాయ) శితిస్తీక్ష్ణీభూతః కృష్ణో వా కణ్ఠో యస్య తస్మై (చ). ॥౨౮॥

**అన్వయః** :- హే మనుష్యాః! యథా వయం పరీక్షకాః శ్వభ్యో నమో వః శ్వపతిభ్యో నమశ్చ భవాయ నమశ్చ రుద్రాయ నమశ్చ శర్వాయ నమశ్చ పశుపతయే నమశ్చ నీలగ్రీవాయ నమశ్చ శితికణ్ఠాయ నమశ్చ దద్యామ కుర్యామ తథా యూయమపి దత్త కురుత చ. ॥౨౮॥

**భావార్థః** :-మనుష్యైః శ్వాదిపశూనన్నాదిదానేన వర్ధయిత్వా తై రుపకారో గ్రాహ్యః. పశుపాలకాదీనాం సత్కారశ్చ కార్యః. ॥౨౮॥

**పదార్థము** :- ఓ మానవులారా! పరీక్షకులమగు మే మెట్లు (శ్వభ్యః) శునకములకు (నమః) అన్నము నిచ్చుచున్నామో (చ) మరియు (వః) మీరు మేమును (శ్వపతిభ్యః) కుక్కలను పెంచువారికి (నమః) అన్నము నిచ్చెదమో మరియు సత్కరింతుమో (చ) మరియు నటులే (భవాయ) శుభగుణములందు ప్రసిద్ధులగువారిని (నమః) సత్కరింతుమో (చ) మరియు (రుద్రాయ) దుష్టులనేడ్పించువారిని సత్కరింతుమో (చ) అటులనే (శర్వాయ) దుష్టులను హతమార్చువారికి (నమః) అన్నాదుల నిత్తుమో (చ) మరియు (పశుపతయే) గోవులు మున్నగువాని సంరక్షకులకు అన్నము (చ) మరియు (నీలగ్రీవాయ) చక్కని వర్ణముగల కంఠముతోనున్న (చ) మరియు (శితికంఠాయ) తీక్ష్ణ మరియు నల్లని కంఠములు గలవారికి (నమః) అన్నమునిచ్చి సత్కరించెదమో, అట్లే మీరును ఇచ్చుచు సత్కరించుచుండుడు. ॥౨౮॥

**భావార్థము** :-మానవులు శునకములు మున్నగు పశువులకు అన్నాదులనిచ్చి పెంపొందించి వానిచే ఉపకారమును పొందవలెను. అట్లే వాని రక్షకులు, శిక్షకులును నగు వారినికూడ సత్కరించవలెను. ॥౨౮॥

28.Food to the dogs, and to you the rearers of dogs, Homage to him well -known for noble characteristics. Homage to him who makes the wicked weep. Food to those who kill the depraved, and to those who rear the cattle. Homage to him with a beautiful neck, and to him with a black throat.

౮౧౩.నమః కపర్దినే ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతా,భురిగతిజగతీ ఛన్దః,నిషాదః స్వరః.

గృహస్థైః కే సత్కర్తవ్యాః ఇత్యుచ్యతే. గృహస్థు లెవరిని సత్కరించవలయును?

౮౧౩ నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమః సహస్రాక్షాయ చ శతధన్వనే చ నమో గిరిశయాయ చ శిపివిష్టాయ చ నమో మీఢుష్టమాయ చేషుమతే చ ॥౨౯॥

**ప. వి:-** నమః, కపర్దినే, చ, వ్యుప్త కేశాయేతి వ్యుప్త+కేశాయ, చ, నమః, సహస్రాక్షాయేతి సహస్ర + అక్షాయ, చ, శతధన్వన ఇతి శత + ధన్వనే, చ, నమః, గిరిశయాయేతి గిరి + శయాయ, చ, శిపివిష్టాయేతి శిపి + విష్టాయ, చ, నమః, మీఢుష్టమాయ, మీఢుస్తమాయేతి మీఢుః + తమాయ, చ, ఇషుమత + ఇతీషు + మతే, చ ॥౨౯॥

**పదార్థః :-** (నమః) అన్నమ్ (కపర్దినే) జటిలాయ బ్రహ్మచారిణే (చ) (వ్యుప్తకేశాయ) విశేషత యోప్తాశ్ఛేదితాః కేశా యేన తస్మై సంన్యాసినే (చ) సంన్యాసమిచ్ఛవే వా (నమః) సత్కరణమ్ (సహస్రాక్షాయ) సహస్రేష్వసంఖ్యాతేషు శాస్త్రవిషయాదిష్వక్షిణీ యస్య తస్మై విదుషే బ్రాహ్మణాయ (చ) (శతధన్వనే) ధనుర్విద్యాద్యసంఖ్యశస్త్రవిద్యాశిక్షకాయ (చ) (నమః) సత్కారణమ్ (గిరిశయాయ) యో గిరిషు పర్వతేషు శ్రితః సన్ శేతే తస్మై వానప్రస్థాయ (చ) (శిపివిష్టాయ) శిపిషు పశుషు పాలకత్వేన విష్టాయ ప్రవిష్టాయ వైశ్య ప్రభృతయే (చ) శూద్రాయ (నమః) సత్కరణమ్ (మీఢుష్టమాయ) అతిశయేన వృక్షోద్యానక్షేత్రాదిసేచకాయ కృషీవలాద్యాయ (చ) (ఇషుమతే) ప్రశస్తా ఇషవో బాణా విద్యన్తే యస్య తస్మై వీరాయ (చ) భృత్యవర్గాయ ॥౨౯॥

**అన్వయః :-** గృహస్థా మనుష్యా నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమః సహస్రాక్షాయ చ శతధన్వనే చ నమో గిరిశయాయ చ శిపివిష్టాయ చ నమో మీఢుష్టమాయ చేషుమతే చ కుర్యుః ప్రదద్యుశ్చ. ॥౨౯॥

**భావార్థః :-** గృహస్థైర్బ్రహ్మచారిప్రభృతీన్ సత్కృత్య విద్యాదానం కర్తవ్యం కారయితవ్యం చ తథా సంన్యాస్యాదీన్ సంపూజ్య విశిష్టవిజ్ఞానం గ్రాహ్యమ్. ॥౨౯॥

**పదార్థము :-** గృహస్థులు (కపర్దినే) జటాధారి బ్రహ్మచారిని (చ) మరియు (వ్యుప్తకేశాయ) కేశములన్నియును గొరిగించుకొను సన్న్యాసిని (చ) సన్న్యాసమును గోరువారిని (నమః) అన్నాదులచే సత్కరించవలెను (చ) అటులనే (సహస్రాక్షాయ) అసంఖ్యాత శాస్త్ర పరిజ్ఞాతయగు, విద్వాంసుడగు బ్రాహ్మణుని (చ) మరియు (శతధన్వనే) ధనుర్విద్య మున్నగు అసంఖ్యాక శస్త్రాస్త్రవిద్యల శిక్షకుడగు క్షత్రియునకు (నమః) సత్కారమొనర్పవలెను. (గిరిశయాయ) పర్వతముల నాశ్రయించి శయనమొనర్చు వానప్రస్థులను (చ) మరియు (శిపివిష్టాయ) పశుపాలకులగు వైశ్యాదుల (చ) మరియు శూద్రులను (నమః) సత్కరించవలెను (మీఢుష్టమాయ) వృక్షములు, వాటికలు, పొలములు మున్నగువానిని చక్కగా సేచనమొనర్చి ఫలవంతమొనర్చు కర్షకులను (చ) మరియు తోటమాలి మున్నగు వారిని (ఇషుమతే) శ్రేష్ఠములగు బాణములుగల వీరపురుషులను (చ) కూడ (నమః) అన్నము మున్నగు పదార్థములచే సత్కరించవలయును. ॥౨౯॥

భావార్థము :-గృహస్థులు బ్రహ్మచారులు మున్నగువారికి సత్కారపూర్వకముగ విద్యాదానమొనర్చుట, అట్టి ఏర్పాట్లనుజేయుట మరియు సన్న్యాసులు మున్నగువారిని సేవించుటద్వారా విశేష విజ్ఞానము నార్జించవలయును. ॥౨౯॥

29.Food to the celibate with braided hair. Homage to the shavenhaired recluse. Homage to the scholar who keeps and eve on thousand subjects, and to the Kshatriya who teaches manifold sciences of armoury. Homage to the Banprasthi who lives in mountains, to the Vaisha who protects the cattle, and to the Suhdra. Homage to the gardener, and to the well-armed soldier.

౮౧౪.నమో హ్రస్వాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, విరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౮౧౪ నమో హ్రస్వాయ చ వామనాయ చ నమో బృహతే చ వర్షీయసే చ

నమో వృద్ధాయ చ సవృధే చ నమోఽగ్ర్యాయ చ ప్రథమాయ చ ॥30॥

ప. వి:-నమః, హ్రస్వాయ, చ, వామనాయ, చ, నమః, బృహతే, చ, వర్షీయసే, చ, నమః, వృద్ధాయ, చ, సవృధ ఇతి స + వృధే, చ, నమః, అగ్ర్యాయ, చ, ప్రథమాయ, చ ॥30॥

పదార్థః :- (నమః) అన్నమ్ (హ్రస్వాయ) బాలకాయ (చ)(వామనాయ) వామం ప్రశస్తం విజ్ఞానం విద్యతే యస్య తస్మై. వామ ఇతి ప్రశస్తనా... నిఘం. 3.౮. అత్ర పామాదిత్వాన్నః అ ౫.౨.౧౦౦ (చ) (నమః) సత్కరణమ్ (బృహతే) మహతే (చ) (వర్షీయసే) అతిశయేన విద్యావృద్ధాయ (చ) (నమః) సత్కరణమ్ (వృద్ధాయ) వయోఽధికాయ (చ) (సవృధే) యః సమానైః సహ వర్ధతే తస్మై (చ) సర్వమిత్రాయ (నమః) సత్కారణమ్ (అగ్ర్యాయ) అగ్రే భవాయ సత్కర్మసు పురఃసరాయ (చ) (ప్రథమాయ) ప్రఖ్యాతాయ (చ). ॥30॥

అన్వయః :-హే గృహస్థా మనుష్యా హ్రస్వాయ చ వామనాయ చ నమో బృహతే చ వర్షీయసే చ నమో వృద్ధాయ చ సవృధే చ నమోఽగ్ర్యాయ చ ప్రథమాయ నమశ్చ దదతి కుర్వన్తి చ తే సుఖినో భవన్తి. ॥30॥

భావార్థః :-గృహస్థైర్మనుష్యైరన్నాదినా బాలకాదీన్ సత్కృత్య సద్వ్యవహార ఉన్నేయః. ॥30॥

పదార్థము :-ఏ గృహస్థులు (హ్రస్వాయ) బాలురకు (చ) మరియు (వామనాయ) ప్రశంసనీయ జ్ఞానులకు (చ) మరియు మధ్యమ విద్వాంసులకు (నమః) అన్నము నొసగుదురో (బృహతే) గొప్ప (చ) మరియు (వర్షీయసే) విద్యలం దతివృద్ధులు (చ) అట్లే విద్యార్థులను (నమః) సత్కరించెదరో (వృద్ధాయ)

అధిక ఆయువుగలవారు (చ) మరియు (సవృధే) సమవయస్కులను (చ) మరియు సకల జనమిత్రుని (నమః) సత్కరించెదరో (చ) మరియు నగ్లే (అగ్ర్యాయ) సత్కర్మాచరణమునందు అందరికన్నముందుగా నుండువారిని (చ) మరియు (ప్రథమాయ) ప్రసిద్ధులగు వారిని (నమః) సత్కరించి సంతృప్తిజెందవలెను. ॥౩౦॥

**భావార్థము** :- గృహస్థులు, విద్యార్థులు (బ్రహ్మచారులు) మున్నగువారిని భోజనాది పదార్థములచే సత్కరించి పవిత్ర వ్యవహారముల నున్నతి పరచవలెను. ॥౩౦॥

30.Food to the child and the learned. Homage to the strong and those advanced in knowledge. Homage to the aged, and the eminent amongst the associates. Homage to the foremost in doing noble deeds and to the well-known.

**౩౧. నమ ఆశవ ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.**

**అథోద్యోగః కథం కార్య ఇత్యుపదిశ్యతే. ఉద్యోగ మెటు లొనర్చవలయును?**

**౩౧ నమఽ ఆశవే చాజిరాయ చ నమః శీఘ్ర్యాయ చ శీభ్యాయ చ నమఽ ఊర్మ్యాయ చావస్వన్యాయ చ నమో నాదేయాయ చ ద్వీప్యాయ చ ॥౩౧॥**

**ప.వి:-** నమః, ఆశవే, చ, అజిరాయ, చ, నమః, శీఘ్ర్యాయ, చ, శీభ్యాయ, చ, నమః, ఊర్మ్యాయ, చ, అవస్వన్యాయేత్యవ + స్వన్యాయ, చ, నమః నాదేయాయ, చ, ద్వీప్యాయ, చ ॥౩౧॥

**పదార్థః** :-(నమః) అన్నాదికమ్ (ఆశవే) వాయురివాధ్వానం వ్యాప్తాయాశ్వాయ (చ)(అజిరాయ) అశ్వవారం ప్రక్షేప్త్రే (చ) (నమః) అన్నమ్ (శీఘ్ర్యాయ) శీఘ్రగతౌ సాధవే (చ) (శీభ్యాయ) శీభేషు క్షిప్రకారిషు భవాయ. శీభమితి క్షిప్రనా... నిఘం. ౨.౧౫.(చ)(నమః) అన్నమ్ (ఊర్మ్యాయ) ఊర్మిషు జలతరఙ్గేషు భవాయ వాయురివ వర్తమానాయ (చ) (అవస్వన్యాయ) అర్వాచీనేషు స్వనేషు భవాయ (చ) (నమః) అన్నమ్ (నాదేయాయ) నద్యాం భవాయ (చ) (ద్వీప్యాయ) ద్వీపేషు ద్విర్గతజలేషు దేశేషు భవాయ (చ). ॥౩౧ ॥

**అన్వయః** :-హే మనుష్యాః! యది యూయమాశవే చాజిరాయ చ నమః శీఘ్ర్యాయ శీభ్యాయ చ నమశ్చోర్మ్యాయ చావస్వన్యాయ చ నమో నాదేయాయ చ ద్వీప్యాయ చ నమో దత్త తర్హి భవన్తోఽఖిలానందాన్ ప్రాప్నుత. ॥౩౧॥

**భావార్థః** :- యే క్రియాకౌశలేన రచితైర్విమానాదియానైరశ్వాదిభిశ్చ శీఘ్రం గతిమన్తః సన్తి తే కం కం ద్వీపం దేశం వా ఽఽగత్వా రాజ్యాయ ధనం చ నాప్నువన్తి? కిన్తు సర్వత్ర గత్వా సర్వమాప్నువన్తి.॥30॥

**పదార్థము** :- ఓ మనుష్యులారా! ఏ మీరు (ఆశవే) వాయువువలె మార్గమున పరుగెత్తు (చ) మరియు (అజిరాయ) స్వారికి యోగ్యముగానివారిని క్రిందపడవేయునట్టి అశ్వములకు (చ) అట్లే ఏనుగులు మున్నగు వానికి (నమః) అన్నము (శీఘ్ర్యాయ) శీఘ్రనడకయం దుత్తమ (చ) మరియు (శీభ్యాయ) శీఘ్రత్వమొనర్పుటయందు ప్రసిద్ధులు (చ) మరియు మధ్యస్థులు మున్నగువారికి (నమః) అన్నము (ఊర్మ్యాయ) జలతరంగములందు వాయువువంటి వేగవంతునకు (చ) మరియు (అవస్వన్యాయ) అత్యుత్తమశబ్దములందు ప్రసిద్ధులగు వారికి (చ) మరియు దూరశ్రవణునకు [దూరమునుండి వినువారికి] (నమః) అన్నము (నాదేయాయ) నదియందుండు (చ) మరియు (ద్వీప్యాయ) జలద్వీపములందు నివసించువారికి (చ) మరియు వారి సంబధీయులకు ఎవరు (నమః) అన్నాది పదార్థములనిచ్చుచుందురో అట్టి మీకు సంపూర్ణానందము ప్రాప్తించుగాక! ॥30॥

**భావార్థము** :- ఉత్తమ క్రియా కౌశలమున విమానములు మున్నగు యానములు మరియు అశ్వముల ద్వారా సమస్త ప్రదేశములకు, ద్వీప ద్వీపాంతరములకు ధైర్యసాహసములతో ప్రయాణమొనర్చువారు ధన ధాన్య సంపదలు మున్నగువానిని ప్రాప్తించుకొని తెచ్చి తాము సుఖముగనుండి రాజ్య ప్రజలను సుఖముగ నుంతురు.॥30॥

31.Food to the horse swift like air, and to the horse that throws down a novice rider. Food to the hasty and to the rapid mover. Food to the zealous and to the silent workers. Food to him who dwells in rivers and on islands.

౮౧౬.నమో జ్యేష్ఠాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః పరస్పరం కథం సత్కృతా భవేయురిత్యాహ. మానవులు పరస్పర మెటుల సత్కరించు కొనవలెను?

౮౧౬ నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః పూర్వజాయ చాపరజాయ చ నమో మధ్యమాయ చాపగల్భాయ చ నమో జఘన్యాయ చ బుధ్న్యాయ చ ॥31॥

ప.వి:-నమః, జ్యేష్ఠాయ,చ, కనిష్ఠాయ, చ, నమః, పూర్వజాయేతి పూర్వ + జాయ, చ, అపరజాయేత్యపర + జాయ, చ, నమః, మధ్యమాయ, చ, అపగల్భాయేత్యప + గల్భాయ, చ, నమః, జఘన్యాయ చ, బుధ్న్యాయ, చ.॥31॥

**పదార్థః** :-(నమః) సత్కరణమన్నం వా (జ్యేష్ఠాయ) అతిశయేన వృద్ధాయ (చ) (కనిష్ఠాయ) అతిశయేన బాలకాయ (చ) (నమః) సత్కరణమన్నం వా (పూర్వజాయ) పూర్వజాతాయ జ్యేష్ఠాయ భ్రాత్రే బ్రాహ్మణాయ వా (చ) (అపరజాయ) అపరే జాతాయ జ్యేష్ఠానుజాయన్త్యజాయ వా (చ) (నమః) సత్కారాదికమ్ (మధ్యమాయ) మధ్యే భవాయ బన్ధవే క్షత్రియాయ వైశ్యాయ వా (చ) (అపగల్భాయ) అపగతం దూరీకృతం గల్భం ధార్ష్ట్యం యేన తస్మై (చ) (నమః) సత్కరణమ్ (జఘన్యాయ) జఘనే నీచకర్మణి భవాయ శూద్రాయ మ్లేచ్ఛాయ వా (చ) (బుధ్న్యాయ) బుధ్నే జలబన్ధనేఽన్తరిక్షే భవాయ మేఘాయేవ వర్తమానాయ దాత్రే (చ). ॥౩౨॥

**అన్వయః** :-హే మనుష్యాః! యూయం జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః పూర్వజాయ చాపరజాయ చ నమో మధ్యమాయ చాపగల్భాయ చ నమో జఘన్యాయ చ బుధ్న్యాయ చ నమో దత్త. ॥౩౨॥

**భావార్థః** :- సత్కారే కర్తవ్యే నమస్తే ఇతి వాక్యోచ్చారణేన కనిష్ఠైర్జ్యేష్ఠా జ్యేష్ఠైః కనిష్ఠా నీచైరుత్తమా ఉత్తమైర్నీచాః క్షత్రియాద్యైర్బ్రాహ్మణా బ్రాహ్మణాద్యైః క్షత్రియాద్యాశ్చ సతతం సత్కర్తవ్యాః. ఏతదేవ వేదోక్త ప్రమాణేన శిష్టాచారే సర్వత్ర సర్వైరేతద్వాక్యం సంప్రయోజ్యాఽన్యోన్యేషాం సత్కరణాత్ప్రసన్నైర్భవితవ్యమ్.॥౩౨॥

**పదార్థము** :-ఓ మానవులారా! మీరు (జ్యేష్ఠాయ) అతివృద్ధులు (చ) మరియు (కనిష్ఠాయ) అతి బాలకులను (నమః) సత్కరించుడు. మరియు అన్నము నీయుడు (చ) మరియు (పూర్వజాయ) జ్యేష్ఠభ్రాత మరియు బ్రాహ్మణుని (చ) మరియు (అపరజాయ) తమ్ములు మరియు చిన్నవారికి (చ) కూడ (నమః) సత్కరించి అన్నము నిడుడు (మధ్యమాయ) బంధువులు, క్షత్రియ వైశ్యులకును (చ) మరియు (అపగల్భాయ) మొండితనమును వదలిన సరళస్వభావులను (చ) వీరందరను (నమః) సత్కరించుట మున్నగు వానిని (చ) మరియు (జఘన్యాయ) నీచకర్మలొనర్చు శూద్రుడు మరియు మ్లేచ్ఛునకు (చ) మరియు (బుధ్న్యాయ) అంతరిక్షమునందలి మేఘమువంటి దాతకును (నమః) అన్నాది పదార్థములచే సత్కారమొనర్చవలెను. ॥౩౨॥

**భావార్థము** :-మనుష్యులు పరస్పరము కలిసికొన్నప్పుడు సత్కరించుకొనుటకై ''నమస్తే'' అను వేదవాక్యము నుచ్చరించవలెను. ఇట్లు పిన్నలు పెద్దలను, పెద్దలు పిన్నలను, బ్రాహ్మణాది నాల్గు వర్ణములవారు స్త్రీపురుషులెల్లరును పరస్పర మిట్లే సన్మానించుకొనుట శ్రేష్ఠము. ఈ వేదోక్తప్రమాణముచే శిష్టాచారమునందు ఈ వాక్యమునే ప్రయోగించుకొని ఒకరినొకరు సత్కరించుకొని ప్రసన్నులై యుండవలెను. ॥౩౨॥

32.Namaste (Homage) to the aged and to the children. Homage to the first born and to the last born. Homage to the relatives and to the simpleminded. Homage to the Shudra and to the charitably disposed.

**౮౧౭.నమః సోభ్యాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.**

౮౧౭ నమః సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ నమఃశ్లోక్యాయ చావసాన్యాయ చ నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ॥33॥

ప.వి:-నమః, సోభ్యాయ, చ, ప్రతిసర్యాయేతి ప్రతి + సర్యాయ, చ, నమః, యామ్యాయ, చ, క్షేమ్యాయ, చ, నమః, శ్లోక్యాయ చ, అవసాన్యాయేత్యవ+సాన్యాయ, చ, నమః, ఉర్వర్యాయ, చ, ఖల్యాయ, చ.॥33॥

**పదార్థః** :-(నమః) అన్నమ్ (సోభ్యాయ) సోభేష్వైశ్వర్యయుక్తేషు భవాయ (చ) (పతిసర్యాయ) యే ప్రతీతే ధర్మే సరన్తి తేషు భవాయ (చ) (నమః) సత్కారణమ్ (యామ్యాయ) యో యమేషు న్యాయకారిషు సాధుస్తస్మై. అత్రాన్యేషామపీతి దీర్ఘః (చ) (క్షేమ్యాయ) క్షేమేషు రక్షకేషు సాధుస్తస్మై (చ) (నమః) సత్కారణమ్ (శ్లోక్యాయ) శ్లోకే వేదవాణ్యాం సాధవే. శ్లోక ఇతి వాఙ్నా. నిఘం. ౧.౧౧ (చ)(అవసాన్యాయ) అవసానవ్యవహారే సాధవే (చ) (నమః) సత్కారణమ్ (ఉర్వర్యాయ) ఉరూణాం మహతామర్యాయ స్వామినే (చ) (ఖల్యాయ) ఖలే సంచయాధికరణే సాధవే (చ).॥33॥

**అన్వయః** :-హే మనుష్యాః! సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ నమః శ్లోక్యాయ చావసాన్యాయ చ నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ నమః ప్రయోజ్య దత్వా చైతాన్ భవన్త ఆనన్దయన్తు. ॥33॥

**భావార్థః** :-అత్రానేకైశ్చకారైరన్యేప్యుపయోగినోఽర్థాః సంగ్రాహ్యాః సత్కర్తవ్యాశ్చ ప్రజాస్థైర్వ్యాయాధీశాదీనాం న్యాయాధీశాద్యైః ప్రజాస్థానాం చ సత్కారః పత్యాద్యైర్భార్యాద్యా భార్యాద్యైః పత్యాదయశ్చ ప్రసాదనీయాః. ॥33॥

**పదార్థము** :-ఓ మానవులారా! (సోభ్యాయ) ఐశ్వర్యవంతులందు ప్రసిద్ధుడు (చ) మరియు (ప్రతిసర్యాయ) ధర్మాత్ములకుటుంబమున జన్మించినవాడు (చ) మరియు ధనికులగు ధర్మాత్ములకు (నమః) అన్నము నిచ్చియును (యామ్యాయ) న్యాయకారులం దుత్తముడు (చ) మరియు (క్షేమ్యాయ) రక్షణ యొనర్చువారిలో చతురుడు (చ) మరియు న్యాయాధీశుడగువానికి (నమః) అన్నమునిచ్చియు (శ్లోక్యాయ) వేదవాణులందు ప్రవీణుడు (చ) మరియు (అవసాన్యాయ) కార్యసమాప్తి వ్యవహారమునందు కుశలుడు (చ) మరియు ఆరభించుటయందు ముఖ్యుడు నగువానిని (నమః) సత్కరించవలెను (ఉర్వర్యాయ) మహాపురుషులందు స్వామి (చ) మరియు (ఖల్యాయ) శ్రేష్ఠముగ అన్నము మున్నగు పదార్థసంచయమునందు

ప్రవీణుడు (చ) మరియు దానిని వ్యయపరచుటయందు చక్కని విచక్షత గలవానిని ఇట్టివారెల్లరను సత్కరించి ఆనందపరచుడు. ॥33॥

**భావార్థము** :-ఈ మంత్రమందు అనేక 'చ'కారము లున్నవి. వీని కింకను ఉపయోగవంతమగు అర్థములచే ప్రజలు న్యాయాధీశుని; న్యాయాధీశుడు రాజు, రాజపురుషులు మున్నగువారు ప్రజలను; భర్తలు భార్యలను; భార్యలు భర్తలను; పెద్దవారు పిన్నవారిని; పిన్నలు పెద్దవారిని ఇట్లనేకులు అనేకులను పరస్పరము సత్కరించుకొనుచు ప్రసన్నులుగ నుండవలయును. ॥33॥

33.Food to the prosperous and the virtuous. Food to the lovers of justice, and to the protectors. Homage to the scholars of the Vedas, and to the expert in finsihing projects. Homage to the great, and to the skilled in making collection of provisions.

౩౪.నమో వన్యాయేత్యస్య ప్రజాపతిర్ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

రాజపురుషైః కథః భవితవ్యమిత్యాహ. రాజపురుషులు ఏవిధముగ నుండవలయును?

౩౪ నమో వన్యాయ చ కక్ష్యాయ చ నమః శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ నమ ఆశుషేణాయ చాశురథాయ చ నమః శూరాయ చావభేదినే చ ॥౩౪॥

ప.వి:-నమః, వన్యాయ, చ, కక్ష్యాయ, చ, నమః, శ్రవాయ, చ, ప్రతిశ్రవాయేతి ప్రతి + శ్రవాయ, చ, నమః, ఆశుషేణాయ, ఆశుసేనాయేత్యాశు + సేనాయ, చ, ఆశురథాయేత్యాశు + రథాయ, చ, నమః, శూరాయ, చ, అవభేదిన ఇత్యవ + భేదినే, చ ॥౩౪॥

**పదార్థః** :- (నమః) అన్నమ్ (వన్యాయ) వనే జఙ్గలే భవాయ (చ) (కక్ష్యాయ) కక్షాసు భవాయ (చ) (నమః) సత్కరణమ్ (శ్రవాయ) శ్రోత్రే శ్రవణహేతవే వా (చ) (ప్రతిశ్రవాయ) యః ప్రతిశృణోతి ప్రతిజానీతే తస్మై (చ) (నమః) అన్నదానమ్ (ఆశుషేణాయ) ఆశు శీఘ్రగామినీ సేనా యస్య తస్మై (చ) (ఆశురథాయ) ఆశు శీఘ్రగామినో రథా యానాని యస్య తస్మై (చ) (నమః) సత్కారమ్ (శూరాయ) శత్రూణాం హింసకాయ (చ) (అవభేదినే) శత్రూన్ అవభేత్తుం విదారయితుం శీలాయ (చ). ॥౩౪॥

**అన్వయః** :-హే మనుష్యాః! యే వన్యాయ చ కక్ష్యాయ చ నమః శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ నమ ఆశుషేణాయ చాశురథాయ చ నమః శూరాయ చావభేదినే చ నమః ప్రదద్యుః కుర్యు స్తే సర్వత్ర విజయినో భవన్తు. ॥౩౪॥

**భావార్థః** :- రాజపురుషైః వనకక్షస్థాధ్యేత్రధ్యాపకబలిష్ఠసేనాశ్వగామియానస్థవీరదూతానన్నధనాదినా సత్కారేణ ప్రోత్సాహ్య సదా విజయిభిర్భవితవ్యమ్. ॥౩౪॥

**పదార్థము** :- ఓ మానవులారా! (వన్యాయ) అటవికులకు (చ) మరియు (కక్ష్యాయ) వనముల సమీప పర్ణశాలలందుండు (చ) మరియు గుహలందుండువారికి (నమః) అన్నము నెవరిచ్చెదరో (శ్రవాయ) వినుట లేక వినిపించుటకు హేతువగు (చ) మరియు (ప్రతి శ్రవాయ) ప్రతిజ్ఞ యొనర్చువారిని (చ) మరియు ప్రతిజ్ఞను పూర్తియొనర్చువారిని (నమః) సత్కరించవలెను (ఆశుషేణాయ) శీఘ్రమముగ నడచు సైన్యముగలవారిని (చ) మరియు (ఆశురథాయ) శీఘ్రముగా నడచు రథముల నాయకులను, సారథిమున్నగువారిని (చ) మరియు (నమః) అన్నము నిచ్చువారిని (శూరాయ) శత్రువులను హతమార్చు (చ) మరియు (అవభేదినే) శత్రువులను చిన్నాభిన్నమొనర్చు (చ) మరియు దూతలు మున్నగువారిని (నమః) సత్కరించువారికి సర్వత్రా విజయము ప్రాప్తించును. ॥౩౪॥

**భావార్థము** :- రాజపురుషులు వనములందు, వనప్రాంతపర్వతాదులందుండు గురుకులములు, బ్రహ్మచారులు, ఆచార్యులు మున్నగువారిని, బలిష్ఠమగు సైన్యములు, శీఘ్రగాములగు సైనికులు మరియు రథములు, వానియందు గూర్చుండు రథికవీరులను, దూతలను అన్నధనాదులచే సత్కరించుచు సదా ఉత్సాహ పరచుచు విజయములను పొందుచుండవలయును. ॥౩౪॥

34.Food to those who live in wood, bushes and caves, Homage to the teacher and the taught, and to him who fulfils his vow. Food to him with swift conveyances. Homage to the hero, and to him who rends asunder the foes.

౩౫. నమో బిల్మిన ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

యోద్ధ్రాణాం రక్షా కథం కార్యేత్యాహ? యోధుల నెటుల రక్షించవలయును?

౩౫ నమో బిల్మినే చ కవచినే చ నమో వర్మిణే చ వరూథినే చ నమః శ్రుతాయ చ శ్రుతసేనాయ చ నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ ॥౩౫॥

ప.విః- నమః, బిల్మినే, చ, కవచినే, చ, నమః, వర్మిణే, చ, వరూథినే, చ, నమః, శ్రుతాయ, చ, శ్రుతసేనాయేతి శ్రుత + సేనాయ, చ, నమః దన్దుభ్యాయ, చ, ఆహనన్యాయేత్యా + హనన్యాయ, చ. ॥౩౫॥

**పదార్థః :-** (నమః) సత్కారణమ్ (బిల్మినే) ప్రశస్తం బిల్మమ్ ధారణం వా విద్యతే యస్య తస్మై (చ) (కవచినే) సమ్బద్ధం కవచం శరీరరక్షాసాధనం విద్యతే యస్య తస్మై (చ) (నమః) అన్నాదిదానమ్ (వర్మిణే) బహూని వర్మాణి శరీరరక్షాసాధనాని విద్యన్తే యస్య (తస్మై) (చ) (వరూథినే) ప్రశస్తాని వరూథాని గృహాణి విద్యన్తే యస్య తస్మై, వరూథమితి గృహనా. నిఘం. 3.౪ (చ) (నమః) సత్కారణమ్ (శ్రుతాయ) యః శుభగుణేషు శ్రూయతే తస్మై (చ) (శ్రుతసేనాయ) శ్రుతా ప్రఖ్యాతా సేనా యస్య తస్మై (చ) (నమః) సత్కారణమ్ (దున్దుభ్యాయ) దున్దుభిషు వాదిత్రేషు సాధవే (చ) (ఆహనన్యాయ) వీరరసాయ వాదిత్రవాదనేషు సాధవే (చ).॥35॥

**అన్వయః :-** హే రాజ ప్రజాజనాధ్యక్షాః! భవన్తో బిల్మినే చ కవచినే చ నమో వర్మిణే చ వరూథినే చ నమః శ్రుతాయ చ శ్రుతసేనాయ చ నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ నమః కుర్యుర్యతో యుష్మాకం పరాజయః కదాపి న స్యాత్.॥35॥

**భావార్థః :-** రాజప్రజాజనైర్యోద్ధౄణాం సర్వతో రక్షా సర్వతః సుఖప్రదాని గృహాణి భోజ్యపేయాని వస్తూని ప్రశంసితజనానాం సఙ్గోఽత్యుత్తమాని వాదిత్రాణి చ దత్వా స్వాభీష్టాని సాధనీయాని. ॥35॥

**పదార్థము :-** ఓ రాజా! మరియు ప్రజాధ్యక్షులారా! మీరు (బిల్మినే) ప్రశంసముగ ధారణ, పోషణము లొనర్చు (చ) మరియు (కవచినే) శరీర రక్షణమునకు కవచములను ధరించు (చ) మరియు వారి సహాయకారులను (నమః) సత్కరించుడు (వర్మిణే) శరీరరక్షణసంబంధ అనేక సాధనములను ధరించిన (చ) మరియు (వరూథినే) ప్రశంసిత గృహములుగల (చ) మరియు గృహాదులను రక్షణయొనర్చువారికి (నమః) అన్నాదులనీయుడు (శ్రుతాయ) శుభగుణములందు ప్రఖ్యాతులు (చ) మరియు (శ్రుతసేనాయ) ప్రసిద్ధ సైన్యములు గలిగిన (చ) మరియు అట్టి సైన్యములను (నమః) అన్నాదులచే సత్కరించుడు (చ) మరియు (దున్దుభ్యాయ) వాద్యములను, రణభేరులు, దుందుభులను చక్కగా వాయించు భజంత్రీలను (చ) మరియు (ఆహనన్యాయ) రణరంగమునందు వీరులనుత్సాహపరచుటకు మ్రోగించెడు రణదుంధుభీ చతురులను (నమః) సత్కరించినట్లైన మీకెప్పుడును పరాజయముండదు.॥35॥

**భావార్థము :-** రాజు మరియు ప్రజాపురుషులు యోధులను అన్నివిధముల రక్షణయొనర్చుమువారికి సుఖదాయకమగు గృహములు ఆహారపానీయముల ఉత్తమ పదార్థములు, ఉన్నత మహావీరుల సాంగత్యము, అత్యుత్తమ రణభేరీభాంకృతదుందుభ్యాదులు, మున్నగువానిని సమకూర్చుచు అభీష్టకార్యముల సిద్ధించుకొనవలెను. ॥35॥

35.Homage to him who wears a helmet, and to him who wears a cuirass. Food to him who wears mail and defensive armour, and to him who possesses a nice house. Homage to the renowned and to him whose army is renowned. Homage to the skilled drummer, and to the eifficient player on military musical instruments that encourage the soldiers.

౮౨౦.నమో ధృష్ణవ ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల పై విషయమే.

౮౨౦ నమో ధృష్ణవే చ ప్రమృశాయ చ నమో నిషఙ్గిణే చేషుధిమతే చ నమస్తీక్ష్ణేషవే చాయుధినే చ నమః స్వాయుధాయ చ సుధన్వనే చ ॥౩౬॥

ప.విః-నమః, ధృష్ణవే, చ, ప్రమృశాయేతి ప్ర + మృశాయ, చ, నమః, నిషఙ్గిణే, చ, ఇషుధిమత ఇతీషుధి + మతే, చ, నమః, తీక్ష్ణేషవ ఇతి తీక్ష్ణ + ఇషవే, చ, ఆయుధినే, చ, నమః, స్వాయుధాయేతి సు + ఆయుధాయ, చ, సుధన్వన ఇతి సు + ధన్వనే, చ.॥౩౬॥

పదార్థః :-(నమః) అన్నాదిదానమ్ (ధృష్ణవే) యో ధృష్ణోతి దృఢో నిర్భయో భవతి తస్మై (చ) (ప్రమృశాయ) ప్రకృష్టవిచారశీలాయ (చ) మృదుస్వభావజనాయ (నమః) సత్కారణమ్ (నిషఙ్గిణే) బహవో నిషఙ్గాః శస్త్రసమూహా విద్యన్తే యస్య తస్మై (చ) (ఇషుధిమతే) ప్రశస్తశస్త్రాస్త్రకోశాయ (చ) (నమః) సత్కారణమ్ (తీక్ష్ణేషవే) తీక్ష్ణాస్తీవ్రా ఇషవోఽస్త్రశస్త్రాణి యస్య తస్మై (చ) (ఆయుధినే) యే శతఘ్న్యాదిభిః సమన్తాద్యుధ్యన్తే తే ప్రశస్తా విద్యన్తే యస్య తస్మై (చ) (నమః) అన్నదానమ్ (స్వాయుధాయ) శోభనాని ఆయుధాని యస్య తస్మై (చ) (సుధన్వనే) శోభనాని ధన్వాని ధనూంషి యస్య తస్మై (చ) తేషాం రక్షకాయ. ॥౩౬॥

అన్వయః :- యే రాజప్రజాజనాధ్యక్షా ధృష్ణవే చ ప్రమృశాయ చ నమో నిషఙ్గిణే చేషుధిమతే చ నమస్తీక్ష్ణేషవే చాయుధినే చ నమః స్వాయుధాయ చ సుధన్వనే చ నమః ప్రదద్యుః కుర్యుశ్చ తే సదా విజయినో భవన్తు. ॥ ౩౬ ॥

భావార్థః :- మనుష్యైర్యత్కించిత్కర్మ కార్యం తత్సువిచారేణ దృఢోత్సాహేనేతి నహి శరీరాత్మబలమన్తరేణ శస్త్రప్రహరణం శత్రువిజయశ్చ కర్తుం శక్యతే తస్మాత్సతతం సేనా వర్ధనీయా.॥౩౬॥

పదార్థము :- ఏ రాజు మరియు ప్రజాధికారులు (ధృష్ణవే) దృఢమగు (చ) మరియు (ప్రమృశాయ) ఉత్తమ ఆలోచనాపరులు (చ) మరియు కోమల స్వభావముగలవారికి (నమః) అన్నము నిత్తురో (నిషఙ్గిణే) అనేక శస్త్రములుగల (చ) మరియు (ఇషుధిమతే) ప్రశంసమగు శస్త్రాస్త్రములు మరియు కోశముగలవారిని (చ) కూడ (నమః) సత్కరించెదరో (తీక్ష్ణేషవే) తీక్ష్ణమగు శస్త్రాస్త్రయుక్తుడు (చ) మరియు (ఆయుధినే) శ్రేష్ఠముగా తోపులు మున్నగువానిచే రణమొనర్చు వీరులతో గూడిన అధ్యక్షుని (చ) సైతము (నమః)

**పదార్థము** :-మేము (యే) ఏ (పథామ్) మార్గముల సంబంధ (పథిరక్షయః) మార్గములందు నడచు వారి రక్షకులవలె (ఐలవృదాః) పృథివికి సంబంధించిన పదార్థముల వృద్ధిపరచు (ఆయుర్యుధః) పూర్ణాయువు పర్యంతము యుద్ధము నొనర్చు భృత్యులెవరు గలరో (తేషామ్) వారి (సహస్రయోజనే) అసంఖ్యాత యోజనముల పర్యంతముగల ప్రదేశమందు (ధన్వాని) ధనుస్సులను (అవ, తన్మసి) విస్తృతమొనర్చు చున్నాము. ।౬౦॥

**భావార్థము** :- రాజపురుషులు రేయింబవళ్లు ప్రజలను ఎట్లు యథావతుగ రక్షణజేయుచుందురో, ఎట్లు పృథివి జీవులు మున్నగు వానిని రక్షించునో, వాయువు ప్రాణధారణమొనర్చజేయునో దీనిని మానవులు చక్కగా దెలిసికొని ప్రాణులరక్షించవలెను. ।౬౦॥

60.For them, who are the protectors of paths and pedestrians, the producers of corn on the earth, who fight with full force, against their enemies. we transport our weapons to places a thousands leagues afar.

౧౪౫౫.యే తీర్థానీత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౧౪౫౫ యే తీర్థాని ప్రచరన్తి సృకాహస్తా నిషఙ్గిణః।

తేషాం సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ।౬౧॥

ప.విః-యే, తీర్థాని, ప్రచరన్తీతి, ప్ర + చరన్తి, సృకాహస్తా ఇతి, సృకా + హస్తాః, నిషఙ్గిణః, తేషామ్, సహస్రయోజన ఇతి, సహస్ర + యోజనే, అవ, ధన్వాని, తన్మసి. ।౬౧॥

పదార్థః :-(యే) (తీర్థాని) యాని వేదాచార్యసత్యభాషణబ్రహ్మచర్యాదిసునియమాదీన్య విద్యాదుఃఖేభ్య స్తారయన్తి యద్వా యైః సముద్రాదిభ్యస్తారయన్తి తాని (ప్రచరన్తి) (సృకాహస్తాః) సృకా వజ్రాణి హస్తేషు యేషాం తే. సృక ఇతి వజ్రనా... నిఘం ... ౨.౨౦ (నిషఙ్గిణః) ప్రశస్తబాణకోశయుక్తాః. తేషామితి పూర్వవత్. ।౬౧॥

**అన్వయః** :-వయం యే సృకాహస్తా నిషఙ్గిణ ఇవ తీర్థాని ప్రచరన్తి తేషాం సహస్రయోజనే ధన్వాన్యవ తన్మసి. ।౬౧॥

**భావార్థః** :-మనుష్యాణాం ద్వివిధాని తీర్థాని వర్తన్తే. తేష్వాద్యాని బ్రహ్మచర్యాచార్యసేవావేదాద్య

ధ్యయనాధ్యాపన సత్సఙ్గేశ్వరోపాసనాసత్యభాషణాదీని దుఃఖసాగరాజ్జనాన్ పారం నయన్తి. అపరాణి యైః సముద్రాదిజలాశయేభ్యః పారావారం గన్తుం శక్యాశ్చేతి. ।౬౧॥

**పదార్థము** :- మనము (యే) ఏ (సృకాహస్తాః) హస్తములందు వజ్రములను ధరించియున్న (నిషఙ్గిణః) ప్రశంసనీయ బాణములు మరియు కోశముతో గూడిన జనులవలె (తీర్థాని) దుఃఖములనుండి తరింపజేయు వేదము, ఆచార్యులు, సత్యభాషణము, బ్రహ్మచర్యము మున్నగు ఉత్తమ నియమముల లేక సముద్రములు మున్నగు వానిని దాటుట కుపయోగించుకొను నౌకలు మున్నగువానిద్వారా (ప్రచరన్తి) ప్రచారమొనర్చుదుమో (తేషామ్) వారి (సహస్రయోజనే) వేలాది యోజనములుగల దేశమందు (ధన్వాని) శస్త్రములను (అవ తన్మసి) విస్తృత మొనర్చుచున్నాము. ।౬౧॥

**భావార్థము** :- మానవులకు రెండురకములగు తీర్థము లున్నవి. మొదటిది:- బ్రహ్మచర్యము, ఆచార్యసేవ, వేదాది శాస్త్రములను చదువుట చదివించుట, సత్సంగ స్వాధ్యాయములు, ఈశ్వరోపాసన, సత్యభాషణము ఇవి మనుష్యులను దుఃఖసాగరమునుండి తరింపజేయును. రెండవది:- సముద్రము మున్నగు జలాశయములను ఒక తీరమునుండి మరొక తీరమునకు జేర్చునట్టి నౌకలు మున్నగునవి. వీనిని మానవులు చక్కగా దెలిసికొని ఉపయోగమొనర్చుకొని సుఖములను పొందవలెను. ।౬౧॥

61.For them, who with arrows in their hand, and armed with sword, preach the study of the vedas and the use of ships, we send our weapons to places a thousand leagues afar.

౧౪౬. యేఽన్నేష్విత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తద్విషయ మాహ. పునస్తదేవాహ. మణిల నా విషయమే.

**౧౪౬ యేఽన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్ ।**

**తేషాం సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ।౬౨॥**

**ప.విః- యే, అన్నేషు, వివిధ్యన్తీతి వి + విధ్యన్తి, పాత్రేషు, పిబతః, జనాన్, తేషామ్, సహస్రయోజన, ఇతి సహస్ర + యోజనే, అవ, ధన్వాని, తన్మసి ।౬౨॥**

**పదార్థః** :-(యే) (అన్నేషు) అత్తవ్యేషు పదార్థేషు (వివిధ్యన్తి) బాణా ఇవ సాక్షాత్ కుర్వన్తి (పాత్రేషు)పానసాధనేషు(పిబతః)పానం కుర్వతః(జనాన్)మనుష్యాదిప్రాణినః. తేషా మితి పూర్వవత్. ।౬౨॥

**అన్వయః** :- వయం యేఽన్నేషు వర్తమానాన్ పాత్రేషు పిబతో జనాన్ వివిధ్యన్తి తేషాం ప్రతీకారాయ సహస్రయోజనే ధన్వాన్యవతన్మసి. ॥౬౨॥

**భావార్థః** :- యోఽన్నాహారం జలాదిపానం కుర్వతో విషాదినా ఘ్నన్తి తేభ్యః సర్వైర్దూరే వసనీయమ్. ॥౬౨॥

**పదార్థము** :- మనము (యే) ఏ (అన్నేషు) తినదగిన పదార్థములందుండు (పాత్రేషు) పాత్రలందు (పిబతః) త్రాగుచుండునట్టి (జనాన్) మనుష్యులు మున్నగు ప్రాణులను (వివిధ్యన్తి) బాణములవలె గాయపరచుచుందురో (తేషామ్) వారిని దొలగించుటకై (సహస్రయోజనే) అసంఖ్యాక యోజనముల దేశమునందు (ధన్వాని) ధనుస్సులను (అవతన్మసి) విస్తృతపరచుచున్నాము. ॥౬౨॥

**భావార్థము** :- అన్నము దినుచున్న, జలాదులను త్రాగుచున్న జీవులను విషాదులచే జంపివేయువారినుండి ఎల్లరును దూరముగ నివసించవలెను. ॥౬౨॥

62.The degraded persons, who harm the men taking food and drink from their cups, deserve to be uprooted by the use of our arms, though they by a thousand leagues afar.

౧౪౭౭.య ఏతావన్త ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, భురిగార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౧౪౭౭ యఽఏతావన్తశ్చ భూయాꣳసశ్చ దిశో రుద్రా వితస్థిరే।
తేషాꣳసహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥౬౩॥

**ప.విః**- యే, ఏతావన్తః, చ, భూయాꣳసః, చ, దిశః, రుద్రాః, వితస్థిర ఇతి వి + తస్థిరే, తేషామ్, సహస్రయోజన ఇతి సహస్ర + యోజనే, అవ, ధన్వాని, తన్మసి ॥౬౩॥

**పదార్థః** :- (యే) (ఏతావన్తః) యావన్తో వ్యాఖ్యాతాః (చ) (భూయాంసః) తేభ్యోఽప్యధికాః (చ) (దిశః) పూర్వాద్యాః (రుద్రాః) ప్రాణజీవాః (వితస్థిరే) వివిధతయా తిష్ఠన్తి (తేషామ్) (సహస్రయోజనే) ఏతత్సంఖ్యాపరిమితే దేశే (అవ) విరోధార్థే (ధన్వాని) అన్తరిక్షావయవాన్. ధన్వేత్యన్తరిక్షనా.. నిఘంటౌ ౧.3 (తన్మసి). ॥౬౩॥

**అన్వయః** :- వయం య ఏతావన్తశ్చ భూయాంసశ్చ రుద్రా దిశో వితస్థిరే తేషాం సహస్రయోజనే ధన్వాన్యవతన్మసి. ॥౬౩॥

**భావార్థః** :-యే మనుష్యాః సర్వాసు దిక్షు స్థితాన్ జీవాన్ వాయూన్వా యథావదుపయుఞ్జతే తేషాం సర్వకార్యాణి సిద్ధాని భవన్తి. ॥౬౩॥

**పదార్థము** :- మేము (యే) ఏ (ఏతావన్తః) ఇంతవ్యాఖ్యానమొనర్చిన (చ) మరియు (రుద్రాః) ప్రాణము లేక జీవము (భూయాంసః) వీనికన్ననధికమగు (చ) సకల ప్రాణులు మరియు జీవులు (దిశః) తూర్పు మున్నగుదిశలందు (వితస్థిరే) అనేకరీతుల స్థితములై యున్నవియో (తేషామ్) వాని (సహస్రయోజనే) వేలాది యోజనముల ప్రదేశమందు (ధన్వాని) ఆకాశ అవయువములను (అవ,తన్మసి) విరుద్ధముగ విస్తృతపరచుచున్నాము. ॥౬౩॥

**భావార్థము** :- సకల ప్రదేశములందు స్థితమ్మైయున్న జీవులను, వాయువులను యథావతుగ ఉపయోగమునకు దెచ్చుకొనువారి సర్వకార్యములు సిద్ధించును. ॥౬౩॥

63.We use the forces of nature against the creatures, mentioned above and still more, logdged in different directions, though they be a thousand leagues afar.

౮౪౮.నమోఽస్తు రుద్రేభ్య ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః,రుద్రా దేవతాః, నిచృద్ధృతిశ్ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౮౪౮ నమోఽస్తు రుద్రేభ్యో యే దివి యేషాం వర్షమిషవః। తేభ్యో దశ

ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాః। తేభ్యో నమోఽ అస్తు

తే నోఽవన్తు తే నో మృడయన్తు తే యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి

తమేషాం జమ్భే దధ్మః॥౬౪॥

ప.వి:-నమః, అస్తు, రుద్రేభ్యః, యే, దివి, యేషామ్, వర్షమ్, ఇషవః, తేభ్యః, దశ ప్రాచీః, దశ, దక్షిణాః, దశ, ప్రతీచీః, దశ, ఉదీచీః, దశ, ఊర్ధ్వాః, తేభ్యః, నమః, అస్తు, తే, నః, అవన్తు, తే, నః, మృడయన్తు, తే, యమ్, ద్విష్మః, యః, చ, నః, ద్వేష్టి, తమ్, ఏషామ్ జమ్భే, దధ్మః ॥౬౪॥

**పదార్థః** :- (నమః) సత్క్రియా (అస్తు) భవతు (రుద్రేభ్యః) ప్రాణేభ్య ఇవ వర్తమానేభ్యః (యే) (దివి) సూర్యప్రకాశాదావివ విద్యావినయే వర్తమానా వీరాః (యేషామ్) (వర్షమ్) వృష్టిరివ (ఇషవః) బాణాః (తేభ్యః) (దశ) (ప్రాచీః) పూర్వాదిశః (దశః) (దక్షిణాః) (దశ) (ప్రతీచీః) పశ్చిమాః (దశ) (ఉదీచీః) ఉత్తరాః (దశ) (ఊర్ధ్వాః) ఉపరిస్థాః (తేభ్యః) (నమః) అన్నాదికమ్ (అస్తు) (తే) (నః) అస్మాన్ (అవన్తు) రక్షన్తు (తే) (నః) అస్మాన్ (మృడయన్తు) సుఖయన్తు (తే)(యమ్) (ద్విష్మః) అప్రీతిం కుర్యామ (యః) (చ) (నః) అస్మాన్ (ద్వేష్టి) న ప్రీణయతి (తమ్) (ఏషామ్) వాయూనామ్ (జమ్భే) మార్జారముఖే మూషక ఇవ పీడాయామ్ (దధ్మః) నిఃక్షిపామ. ॥౬౪॥

**అన్వయః** :- యే రుద్రా దివి వర్తన్తే యేషాం వర్షమిషవస్తేభ్యో రుద్రేభ్యోఽస్మాకం నమోఽస్తు యే దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాః ప్రాప్నువన్తి తేభ్యో రుద్రేభ్యోఽస్మాకం నమోఽస్తు య ఏవం భూతాస్తే నోఽవన్తు తే నో మృడయన్తు తే వయం యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥ ౬౪ ॥

**భావార్థః** :- యథా వాయూనాం సకాశాద్వర్షా జాయన్తే తథా యే సర్వత్రాధిష్ఠాతారః స్యుస్తే వీరాః పూర్వాదిషు దిక్ష్వస్మాకం రక్షకాః సన్తు వయం యం విరోధినం జానీమస్తం సర్వత ఆవృత్య వాయు వద్బన్ధయేమేతి ॥ ౬౪ ॥

**పదార్థము** :- (యే) ఏ సర్వహితకారులు (దివి) సూర్యప్రకాశాదులవలె విద్యావినయములందు వర్తమానమైయున్నారో (యేషామ్) ఎవనివి (వర్షమ్) వృష్టితుల్యమగు (ఇషవః) బాణములో (తేభ్యః) అట్టి (రుద్రేభ్యః) ప్రాణాదులవలె నున్నవారకై మే మొనర్చు (నమః) సత్కారము (అస్తు) ప్రాప్తించుగాక! ఎవరు (దశ) పదివిధములగు (ప్రాచీః) పూర్వదిశలు (దశ) పదిప్రకారముల (దక్షిణాః) దక్షిణదిశలు (దశ) పదివిధముల (ప్రతీచీః) పడమరదిశలు (దశ) పదివిధముల (ఉదీచీః) ఉత్తరదిశలు మరియు (దశ) పదివిధముల (ఊర్ధ్వాః) పైదిశలను ప్రాప్తించుకొందురో (తేభ్యః) అట్టి సర్వహితకారులగు రాజపురుషులకు మాయొక్క (నమః) అన్నము మున్నగు పదార్థములు (అస్తు) ప్రాప్తించుగాక. ఎవరిట్టివారుగలరో (తే) వారు (నః) మమ్ము (అవన్తు) రక్షింతురుగాక! (తే) వారు (నః) మమ్ము (మృడయన్తు) సుఖవంతులజేయుదురుగాక (తే) అట్టి మేము (యమ్) ఎవరితో (ద్విష్మః) అప్రీతిగా నుండెదమో (చ) మరియు (యః) ఎవరు (నః) మాకు (ద్వేష్టి) దుఃఖముల గలిగించెదరో (తమ్) వారిని (ఏషామ్) ఈ వాయువులు (జమ్భే) బిడాల [పిల్లి] ముఖమునందలి మూషకమువలె పీడలయందు (దధ్మః) పడవేయుగాక! ॥౬౪॥

**భావార్థము** :- ఏ విధముగ వాయు సంబంధముచే వర్షము గలుగునో అదేవిధముగ అన్నిదిశలయందధిష్ఠాతలై యున్న వీరవరులు తూర్పు మున్నగుదిశలందు మాకు రక్షకులగుదురుగాక! మే మెవరిని ద్వేషింతుమో వారి నన్నిదిశలనుండి చుట్టుకొని వాయువువలె బంధింతురు గాక! ॥౬౪॥

Homage to the heroes, who work selflessly like vital breaths, who like sun's light are shining in humility and knowledge, who are powerful like the rain. To them ten east-

ward, southward ten, ten to the west, ten to the north, ten to the region uppermost. To them we offer food. May they guard and delight us. Within their jaws we lay the man who dislikes us and whom we dislike.

౧౪౯.నమోఽస్తు రుద్రేభ్య ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, ధృతిశ్ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౧౪౯ నమోఽస్తు రుద్రేభ్యో యేఽన్తరిక్షే యేషాం వాతఽ ఇషవః।
తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాః।
తేభ్యో నమోఽ అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే
యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥౬౫॥

ప.విః-నమః, అస్తు, రుద్రేభ్యః, యే, అన్తరిక్షే, యేషామ్, వాతః, ఇషవః, తేభ్యః, దశ, ప్రాచీః, దశ, దక్షిణాః, దశ, ప్రతీచీః, దశ ఉదీచీః, దశ, ఊర్ధ్వాః, తేభ్యః, నమః, అస్తు, తే, నః, అవన్తు, తే, నః, మృడయన్తు, తే, యమ్, ద్విష్మః, యః, చ, నః, ద్వేష్టి, తమ్, ఏషామ్, జమ్భే, దధ్మః ।౬౫ ॥

**పదార్థః** :- (నమః) (అస్తు) రుద్రేభ్యః (యే) (అన్తరిక్షే) ఆకాశే (యేషామ్) (వాతః) (ఇషవః) (తేభ్యః) ఇతి పూర్వవత్. ।౬౫॥

**అన్వయః** :-యే విమానాదిషు స్థిత్వాఽన్తరిక్షే విచరన్తి యేషాం వాత ఇవేషవః సన్తి తేభ్యో రుద్రేభ్యోఽస్మాకం నమోఽస్తు యే దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వా ఆశా వ్యాప్తవన్తస్తేభ్యో నమోఽస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే వయం చ యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే వశే దధ్మః. ।౬౫॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యా ఆకాశస్థాన్ శుద్ధాన్ శిల్పినః సేవన్తే తానేతే సర్వతో బలయిత్వా శిల్పవిద్యాః శిక్షేరన్. ।౬౫॥

**పదార్థము** :- (యే) ఎవరు విమానాది యానములందు గూర్చుండి (అన్తరిక్షే) ఆకాశములో విహరించెదరో (యేషామ్) ఎవనికి (వాతః) వాయువువంటి (ఇషవః) బాణములు గలవో (తేభ్యః) అట్టి (రుద్రేభ్యః) ప్రాణాదులవలె నున్నవారికి మే మొనర్చు (నమః) సత్కారము (అస్తు) ప్రాప్తించుగాక! ఏ (దశ) పదివిధములగు (ప్రాచీః) తూర్పు (దశ) పదివిధములగు (దక్షిణాః) దక్షిణము (దశ) పదివిధములగు (ప్రతీచీః) పడమర (దశ) పదివిధములగు (ఉదీచీః) ఉత్తరము మరియు (దశ) పదివిధములగు (ఊర్ధ్వాః) పైదిశలందు వ్యాప్తమైనవియో (తేభ్యః) అట్టి సకలహితకారులకు (నమః) అన్నాది పదార్థములు (అస్తు) ప్రాప్తించుగాక! ఎవరెట్టివారో (తే) వారు (నః) మమ్ము (అవన్తు) రక్షింతురుగాక! (తే) వారు (నః) మమ్ము (మృడయన్తు) సుఖవంతులనొనర్తురుగాక! (తే) వారు మరియు మేము (యమ్) ఎవరితో (ద్విష్మః) అప్రీతిగా నుందుమో (చ) మరియు (యః) ఎవరు (నః) మాకు (ద్వేష్టి) దుఃఖములగలిగింతురో (తమ్) వారిని (ఏషామ్) ఈ వాయువు లనే (జమ్భే) బిడాలము ముఖములో మూషికమువంటి పీడలయందు (దధ్మః) పడవేయుదుము గాక! ॥౬౫॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఆకాశమునందుండునట్టి (ఆకాశవిద్యల నెరిగినట్టి) నిపుణుల సేవలొనర్చువారిని వారు అన్నివైపులనుండి శక్తిశాలురుగ నొనర్చి శిల్పవిద్యయొక్క శిక్షణను ప్రసాదించెదరు. ॥౬౫॥

65.Homage to the heroes, who sitting in planes fly in the airs, who work selflessly like vital breaths, who are powerful like the wind. To them ten eastward, wouthward ten, to the west, ten to the north, ten to the region uppermost. To them we offer food. May they guard and delight us. Within their jaws we lay the man who dislikes us and whom we dislike.

౬౬.నమోఽస్తు రుద్రేభ్య ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, ధృతిశ్ఛందః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౬౬ నమోఽస్తు రుద్రేభ్యో యే పృథివ్యాం యేషామన్నమిషవః।
తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాః।
తేభ్యో నమోఽ అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు
తే యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥౬౬॥

**ప.విః**-నమః, అస్తు, రుద్రేభ్యః, యే, పృథివ్యామ్, యేషామ్, అన్నమ్, ఇషవః, తేభ్యః, దశ, ప్రాచీః, దశ, దక్షిణాః, దశ, ప్రతీచీః, దశ, ఉదీచీః, దశ, ఊర్ధ్వాః, తేభ్యః, నమః అస్తు, తే, నః, అవన్తు, తే, నః, మృడయన్తు, తే, యమ్, ద్విష్మః, యః, చ, నః, ద్వేష్టి, తమ్, ఏషామ్, జమ్భే, దధ్మః ॥౬౬॥

**పదార్థః** :-(నమః) (అస్తు) (రుద్రేభ్యః) (యే) (పృథివ్యామ్) విస్తృతాయాం భూమౌ (యేషామ్) (అన్నమ్) తణ్డులాదికమత్తవ్యమివ (ఇషవః) శస్త్రాస్త్రాణి. తేభ్యః ఇతి పూర్వవత్. ॥౬౬॥

**అన్వయః** :- యే భూవిమానాదిషు స్థిత్వా పృథివ్యాం విచరన్తి యేషామన్నమిషవస్తేభ్యో రుద్రేభ్యోఽస్మాకం నమోఽస్తు యే దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వా వ్యాప్తవన్తః సన్తి తేభ్యోఽస్మాకం నమోఽస్తు తే నః సర్వతోఽవన్తు తే నో మృడయన్తు తే వయం చ యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః. ॥౬౬॥

**భావార్థః** :- యే పృథివ్యామన్నార్థినస్తాన్ సంపోష్య వర్ధనీయాః. ॥౬౬॥

**పదార్థము** :-(యే) ఎవరు భూవిమానాదులందు గూర్చుండి (పృథివ్యామ్) విస్తృత భూమిపై విహరించుచుందురో (యేషామ్) ఎవరి (అన్నమ్) భుజించదగిన తండులములు మున్నగునవి (ఇషవః) బాణరూపములో (తేభ్యః) అట్టి (రుద్రేభ్యః) ప్రాణాదులవలె వర్తమానమైయున్నవారికై మేము చేయుచున్న (నమః) సత్కారము (అస్తు) ప్రాప్తించుగాక! ఎవరు (దశ) పదివిధముల (ప్రాచీః) పూర్వదిశ (దశ) పది విధముల (దక్షిణాః) దక్షిణదిశ (దశ) పదివిధముల (ప్రతీచీః) పశ్చిమదిశ (దశ) పదివిధముల (ఉదీచీః) ఉత్తరదిశ మరియు (దశ) పదిప్రకారముల (ఊర్ధ్వాః) పైనున్నదిశలకు వ్యాప్తమగుదురో (తేభ్యః) అట్టి సర్వహితకారులగు రాజపురుషులకై మాయొక్క (నమః) అన్నాది పదార్థములు (అస్తు) ప్రాప్తమగునుగాక! ఎవరిట్టివారో (తే) వారు (నః) మమ్ము అన్నిదిశలనుండి (అవన్తు) రక్షణజేయుదురుగాక! (తే) వారు (నః) మమ్ము (మృడయన్తు) సుఖవంతులజేయుదురుగాక! (తే) వారు మరియు మేము (యమ్) ఎవరిని (ద్విష్మః) ద్వేషించెదమో (చ) మరియు (యః) ఎవరు (నః) మమ్ము (ద్వేష్టి) దుఃఖములపాలుజేసెదరో [ద్వేషించెదరో] (తమ్) వారిని (ఏషామ్) ఈ వాయువులనే (జమ్భే) బిడాలముఖమందు మూషికమువంటి పీడలయందు (దధ్మః) పడవేయుదుముగాక! ॥౬౬॥

**భావార్థము** :-ఈ పృథివిపై నున్న అన్నార్థులను, దుఃఖితులను ఉత్తమరీతిలో పోషణమొనర్చుచు ఉన్నతిని గలిగించువారు ఆనంద సౌఖ్యములననుభవింతురు. ॥౬౬॥

66.Homage to the heroes who sitting in conveyances travel on the earth, who work selflessly like the vital breaths, whose arms are foodstuffs. To them ten eastward, scuthward ten, ten to the west, ten to the north, ten to the region uppermost To them we offer food. May they guard and delight us. Within their jaws we lay the man who dislikes us and whom. we dislike.

అస్మిన్నధ్యాయే వాయుజీవేశ్వరవీరగుణకృత్యవర్ణనాదేతదర్థస్య

పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతిరస్తీతి వేద్యమ్.

ఈ యధ్యాయమునందు వాయువు, జీవుడు, ఈశ్వరుడు మరియు వీరులగువారి గుణముల మరియు కృత్యముల వర్ణన యున్నందున ఈ యధ్యాయముయొక్క అర్థము పూర్వాధ్యాయమునందు జెప్పబడిన అర్థముతో సంగతిగలదని యెరుగవలయును.

ఇతి శ్రీమద్విద్వద్వరపరమహంసపరివ్రాజకాచార్యాణాం పరమవిదుషాం శ్రీయుత విరజానన్దసర్వస్వతీ స్వామినాం శిష్యేణ దయానన్దసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే షోడశోఽధ్యాయః సమాప్తిమగాత్.

శ్రీ మత్పరమహంసపరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామివిరచిత సంస్కృతార్యభాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి పదునారవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఖందూరు మండ

లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడునునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య

'మల్లె క్రిష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**పదునారవ అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతి: శాంతి: శాంతి:.**

# యజుర్వేదభాష్యము

## 17వ అధ్యాయము - విషయసూచిక

# అథ సప్తదశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే ఏకోనశతమన్త్రాః సన్తీతివేదితవ్యమ్

ఓం. విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౮౫౧. అశ్మన్నూర్జమిత్యస్య మేధాతిథిర్ఋషిః, మరుతో దేవతాః, భురిగతిశక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ వృష్టివిద్యోపదిశ్యతే. వృష్టివిద్యా యుపదేశము.

౮౫౧ అశ్మన్నూర్జం పర్వతే శిశ్రియాణామద్భ్యఽ ఓషధీభ్యో వనస్పతిభ్యోఽ

అధి సమ్భృతం పయః। తాన్నఽఇషమూర్జం ధత్త మరుతః సꣳరరాణాః

అశ్మꣳస్తే క్షున్మయి తఽఊర్గ్య ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥౧॥

ప. విః-అశ్మన్, ఊర్జమ్, పర్వతే, శిశ్రియాణామ్, అద్భ్య ఇత్యత్ + భ్యః, ఓషధీభ్యః, వనస్పతిభ్యః ఇతి వనస్పతి + భ్యః, అధి, సమ్భృతమితి సమ్ + భృతమ్, పయః, తామ్, నః, ఇషమ్, ఊర్జమ్, ధత్త, మరుతః, సꣳరరాణా ఇతి సమ్ + రరాణాః, అశ్మన్, తే, క్షుత్, మయి, తే, ఊర్క్, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు ॥౧॥

**పదార్థః**:-(అశ్మన్) అశ్మని మేఘే. అశ్మేతి మేఘనా.. నిఘం.. ౧.౧౦ (ఊర్జమ్) పరాక్రమమ్ (పర్వతే) పర్వతాకారే (శిశ్రియాణామ్) మేఘావయవానాం మధ్యే స్థితాం విద్యుతమ్ (అద్భ్యః) జలాశయేభ్యః (ఓషధీభ్యః) యవాదిభ్యః (వనస్పతిభ్యః) అశ్వత్థాదిభ్యః (అధి) (సమ్భృతమ్) సమ్యగ్ ధృతం (పయః) రసయుక్తం జలమ్ (తామ్) (నః) అస్మభ్యమ్ (ఇషమ్) అన్నమ్ (ఊర్జమ్) పరాక్రమమ్ (ధత్త) ధరత(మరుతః) వాయవ ఇవ క్రియాకుశలా మనుష్యాః (సంరరాణాః) సమ్యగ్ రాన్తి దదతి తే (అశ్మన్) అశ్మని (తే) తవ (క్షుత్) బుభుక్షా (మయి) (తే) తవ (ఊర్క్) పరాక్రమోఽన్నం వా (యమ్) దుష్టమ్ (ద్విష్మః) న ప్రసాదయేమ (తమ్) (తే) తవ (శుక్) శోకః (ఋచ్ఛతు) ప్రాప్నోతు. ॥౧॥

**అన్వయః**:-హే సంరరాణా మరుతో! యూయం పర్వతేఽశ్మన్ శిశ్రియాణామూర్జం

నో౽ధిధత్తాద్భ్య ఓషధీభ్యో వనస్పతిభ్యః సమ్భృతం పయ ఇషమూర్జం చ తాశ్చ ధత్త. హే మనుష్య! తే౽శ్మన్నూర్గ్ వర్తతే సా మయ్యస్తు యా తే క్షుత్ సా మయి భవతు. యం వయం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు.॥౧॥

**భావార్థః** :-మనుష్యైర్యథా సూర్యో జలాశయౌషధ్యాదిభ్యో రసం హృత్వా మేఘమణ్డలే సంస్థాప్య పునర్వర్షయతి తతో౽న్నాదికం జాయతే తదశనేన క్షున్నివృత్యా బలోన్నతిస్తయా దుష్టానాం నివృత్తిరేతయా సజ్జనానాం శోకనాశో భవతి తథా సమానసుఖదుఃఖసేవనాః సుహృదో భూత్వా పరస్పరేషాం దుఃఖం వినాశ్య సుఖం సతతమున్నేయమ్.॥౧॥

**పదార్థము** :-(సంరరాణాః) చక్కని దానశీలురు (మరుతః) వాయువులవంటి క్రియాకుశలురగు మానవులారా! మీరు (పర్వతే) పర్వతమువంటి ఆకారముగల (అశ్మన్) మేఘముయొక్క (శిశ్రియాణామ్) అవయవములందు స్థిరమైయున్న విద్యుత్తు (ఊర్జమ్) పరాక్రమము మరియు అన్నమును (నః) మాకొరకు (అధి, ధత్త) అధికముగా ధారణమొనర్చుడు. మరియు (అద్భ్యః) జలాశయముల (ఓషధీభ్యః) యవలు మున్నగు ఓషధులను (వనస్పతిభ్యః) రావి మున్నగు వనస్పతులనుండి (సమ్భృతమ్) చక్కగాధారణమొనర్చిన (పయః) రసయుక్తమగు జలములు (ఇషమ్) అన్నము (ఊర్జమ్) పరాక్రమము మరియు (తామ్) ఆ పూర్వోక్త విద్యుత్తును ధారణమొనర్చుడు. ఓ మానవా! ఏ (తే) నీయొక్క (అశ్మన్) మేఘవిషయమునందు (ఊర్క్) రసము మరియు పరాక్రమము గలదో, దానిని (మయి) నాయందు మరియు ఏ (తే) నీయొక్క (క్షుత్) క్షుత్తు [ఆకలి] గలదో, అది నాలోను యుండుగాక! [అనగా సుఖదుఃఖములు సమానమేయని యెంచి] మేము పరస్పరము సహకరించుకొనెదముగాక మరియు (యమ్) మేము ఏ దుష్టులను (ద్విష్మః) ద్వేషించుచున్నామో (తమ్) వారికి (తే) నీ (శుక్) శోకము (ఋచ్ఛతు) ప్రాప్తించుగాక! ॥౧॥

**భావార్థము** :-సూర్యుడెట్లు జలాశయములు మరియు వనస్పతులనుండి రసమును హరించి మేఘమండలమున స్థాపించి మరల వర్షింపజేయునో, దానిచే అన్నాది పదార్థములుత్పన్నమై వానిని భుజించుటచే క్షుధానివృత్తి, దానివల్ల బలము వృద్ధియగునో ఆ బలముతో దుష్టుల నాశనము, దానివల్ల సజ్జనుల శోకము దొలగిపోవునో, అట్లే ఇతరుల దుఃఖములను తనవిగా భావించి ఎల్లరకుమిత్రులై ఒకరిదుఃఖమునొకరు దొలగించుకొని నిరంతరము సౌఖ్యములను వృద్ధిపరచుకొనుట మానవులకు యోగ్యము. ॥౧॥

1.O fully charitably disposed persons, ever active like the wind, grant us food and strength contained in lightning and clouds, formidable in appearance mountain-like!.

Grant us food, strength and juice gathered from the plants, trees and waters. O man may I possess thy cloudwise strength and thy appetite. Let thy pain reach the man we dislike.

౧౭.౨.ఇమా మ ఇత్యస్య మేధాతిథిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్వికృతిశ్ఛన్దః,మధ్యమః స్వరః.

అథేష్టకాదిచయనదృష్టాంతేన గణితవిద్యోపదిశ్యతే.

ఇటుకల దృష్టాంతములచే గణితవిద్య ఉపదేశించబడుచున్నది.

౧౭।౨ ఇమా మే౽ అగ్న౽ ఇష్టకా ధేనవః సంత్వేకా చ దశ చ దశ చ శతం చ శతం చ సహస్రం చ సహస్రం చాయుతం చాయుతం చ నియుతం చ నియుతం చ ప్రయుతం చార్బుదం చ న్యర్బుదం చ సముద్రశ్చ మధ్యం చాన్తశ్చ పరార్ధశ్చైతా మే౽అగ్న౽ ఇష్టకా ధేనవః సన్త్వముత్రాముష్మింల్లోకే ।౨॥

**ప.వి:-** ఇమాః, మే, అగ్నే, ఇష్టకాః, ధేనవః, సన్తు, ఏకా, చ, దశ, చ, దశ, చ, శతమ్, చ, శతమ్, చ, సహస్రమ్, చ, సహస్రమ్, చ, అయుతమ్, చ, అయుతమ్, చ, నియుతమితి ని + యుతమ్, చ, నియుతమితి ని + యుతమ్, చ, ప్రయుతమితి ప్ర + యుతమ్, చ, అర్బుదమ్, చ, న్యర్బుదమితి ని + అర్బుదమ్, చ, సముద్రః, చ, మధ్యమ్, చ, అన్తః, చ, పరార్ధః, చ, ఏతాః, మే, అగ్నే, ఇష్టకాః, ధేనవః, సన్తు, అముత్ర, అముష్మిన్, లోకే ।౨॥

**పదార్థః** :-(ఇమాః) వక్ష్యమాణాః (మే) మమ (అగ్నే) విద్వన్ (ఇష్టకాః) ఇష్టసుఖం సాధికాః (ధేనవః) దుగ్ధదాత్ర్యో గావ ఇవ (సన్తు) (ఏకా) (చ) (దశ)(చ) (దశ)(చ) (శతమ్) (చ) (శతం) (చ) (సహస్రమ్) (చ) (సహస్రమ్) (చ) (అయుతమ్) దశసహస్రాణి (చ) (అయుతమ్) (చ) (నియుతమ్) లక్షమ్ (చ) (నియుతమ్) (చ) (ప్రయుతమ్) దశ లక్షాణి ప్రయుతమితి కోటేరప్యుపలక్షకమ్ (చ) (అర్బుదమ్) దశ కోటయః (చ) (న్యర్బుదమ్) అబ్జమ్. న్యర్బుదమితి ఖర్బనిఖర్బమహాపద్మశఙ్కుసంఖ్యానామప్యుపలక్షకమ్ (చ) (సముద్రః) (చ) (మధ్యమ్) (చ) (అన్తః) (చ) (పరార్ధః) (చ) (ఏతాః) (మే) మమ (అగ్నే) (ఇష్టకాః) (ధేనవః) (సన్తు) (అముత్ర) పరస్మిన్ జన్మని (అముష్మిన్) పరస్మిన్ (లోకే) ద్రష్టవ్యే.।౨॥

**అన్వయః** :-హే అగ్నే విద్వన్! యా మే మమేమా ఇష్టకా ధేనవ ఇవ సన్తు తాస్తవాపి భవన్తు యా ఏకా చ దశ చ దశ చ శతం చ శతం చ సహస్రం చ సహస్రం చాయుతం చాయుతం చ నియుతం చ నియుతం

చ ప్రయుతం చార్బుదం చ న్యర్బుదం చ సముద్రశ్చ మధ్యం చాన్తశ్చ పరార్ధశ్చైతా మే అగ్న ఇష్టకా ధేనవ ఇవాముత్రాముష్మింల్లోకేఽస్మిన్ పరజన్మని వా సన్తు. ॥౨॥

**భావార్థః** :- యథా సుసేవితా గావో దుగ్ధాదిదానేన సర్వాన్ సంతోషయన్తి తథైవ వేద్యాం సఞ్చితా ఇష్టకా వృష్టిహేతుకా భూత్వా వృష్ట్యాదిద్వారా సర్వానానన్దయన్తి మనుష్యైరేకా సంఖ్యా దశవారం గుణితా సతీ దశ సంజ్ఞాం లభతే దశ దశవారం సంఖ్యాతాః శతం. శతం దశవారం సంఖ్యాతం సహస్రం సహస్రం దశవారం సంఖ్యాత మయుతమయుతం దశవారం సంఖ్యాతం నియుతం నియుతం దశవారం సంఖ్యాతం ప్రయుతం ప్రయుతం దశవారం సంఖ్యాతం కోటిః కోటిర్దశవారం సంఖ్యాతా దశ కోటయస్తా దశవారం సంఖ్యాతాః ఖర్బః ఖర్బో దశవారం సంఖ్యాతో నిఖర్బో నిఖర్బో దశవారం సంఖ్యాతో మహాపద్మో మహాపద్మో దశవారం సంఖ్యాతఃశఙ్కుః శఙ్కుర్దశవారం సంఖ్యాతః సముద్రః సముద్రో దశవారం సంఖ్యాతో మధ్యం మధ్యం దశవారం సంఖ్యాత మన్తరన్తో దశవారం సంఖ్యాతః పరార్ధ ఏతాః సంఖ్యా ఉక్తా ఉక్తైరనేకైశ్చకారైరన్యా అపి అఙ్కబీజరేఖాప్రభృతయో యథావద్ విజ్ఞేయా యథాఽస్మింల్లోక ఇమాః సంఖ్యాః సన్తి తథాన్యేష్వపి లోకేషు వర్తన్తే. యథాత్రైతత్సంఖ్యాభిః సంఖ్యాతా ఇష్టకాః సుశిల్పిభిశ్చితా గృహాకారా భూత్వా శీతోష్ణవర్షావాయ్వాదిభ్యో మనుష్యాన్ రక్షిత్వాఽఽనన్దయన్తి తథైవాహుతయో జలవాయ్వోషధీభిః సంహత్య సర్వాన్ప్రాణిన ఆనన్దయన్తి. ॥౨॥

**పదార్థము** :- (అగ్నే) ఓ విద్వాంసుడా! ఎట్లు (మే) నాయొక్క (ఇమాః) ఈ (ఇష్టకాః) ఇష్టసుఖములను సిద్ధింపజేయు యజ్ఞసామగ్రి (ధేనవః) పాలనిచ్చు ఆవులవలె (సన్తు) అగునో మీకొరకును అట్లే యగుగాక! ఏ (ఏకా) ఒకటి (చ) దశగుణములు [పదిరెట్లు] (దశ) పది (చ) మరియు (దశ) పది (చ) పదిరెట్లు (శతమ్) నూరు (చ) మరియు (శతమ్) నూరు (చ) పదిరెట్లు (సహస్రమ్) వేయి (చ) మరియు (సహస్రమ్) వేయి (చ) పదిరెట్లు (అయుతమ్) పదివేలు (చ) మరియు (అయుతమ్) పదివేలు (చ) పదిరెట్లు (నియుతమ్) లక్ష (చ) మరియు (నియుతమ్) లక్ష (చ) పదిరెట్లు (ప్రయుతమ్) పదిలక్షలు, (చ) దీని పదిరెట్లు కోటి, దీని పదిరెట్లు (అర్బుదమ్) పదికోట్లు, దీని పదిరెట్లు (న్యర్బుదమ్) అర్బుదము (చ) దీని పదిరెట్లు (ఖర్బుదము) దీని పదిరెట్లు (నిఖర్బుదము) దీని పది [రెట్లు] మహా పద్మము, దీని పదిరెట్లు శంకు, దీని పదిరెట్లు (సముద్రః) సముద్రము (చ) దీని పదిరెట్లు (మధ్యమ్) మధ్యమము (చ) దీని పదిరెట్లు (అన్తః) అన్తము మరియు (చ) దీని పదిరెట్లు (పరార్ధశ్చ) పరార్ధము (ఏతాః) ఇవి (మే) నాయొక్క (అగ్నే) ఓ విద్వాంసుడా! (ఇష్టకాః) వేదికయొక్క ఇటికలు (ధేనవః) గోవులవలె (అముష్మిన్) పరోక్షమగు (లోకే) చూడదగినవి (అముత్ర) రాబోవుజన్మలో (సన్తు) అగుగాక! అట్టి ప్రయత్న మొనర్చుము. ॥౨॥

**భావార్థము** :- ఏవిధముగ చక్కగా సేవించిన [పోషించిన] గోవు, పాలు మున్నగువాని దానముచే ఎల్లరను ప్రసన్నమొనర్చునో అట్లే వేదియందు చయనమొనర్చబడిన ఇటుకలు వర్షములకు హేతువులై వర్షములద్వారా

ఎల్లరను సుఖపరచునో, అట్లే మానవులు ఒకటి (౧) సంఖ్యను పదిసార్లు గుణించుటచే పది (౧౦), పదిని పదితడవలు గుణించుటచే నూరు (౧౦౦), దీనిని పదిసార్లు గుణించుటవల్ల వేయి (౧౦౦౦), దీనిని పదిసార్లు గుణించుటచే పదివేలు (౧౦,౦౦౦) దానిని పదిసార్లు గుణించుటచే లక్ష (౧,౦౦,౦౦౦) దానిని పదితడవలు గుణించుటవల్ల పదిలక్షలు, (౧౦,౦౦,౦౦౦) దీనిని పదితడవలు గుణించుటద్వారా కోటి (౧,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటవల్ల పది కోట్లు (౧౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటచే అర్బుదము (అర్వము) (౧,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటద్వారా పది అర్బుద [అర్వ]ములు (౧౦, ౦౦, ౦౦, ౦౦, ౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటచే ఖర్బుదము లేక ఖర్వము (౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటచే పది ఖర్బుదములు (౧౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటవల్ల నీలము (౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటచే పది నీలములు (౧౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటవల్ల పద్మము (౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదిసార్లు గుణించుటచే దశ పద్మము (౧౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదితడవలు గుణించుటద్వారా ఒక శంఖము, (౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) దీనిని పదితడవలు గుణించుటద్వారా దశ శంఖము. (౧౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦) అని ఈ సంఖ్యల పేర్లు గలవు. ఇచ్చట నింతవరకు చెప్పబడినది. కాని అనేక చకారములుండుటచే ఇంకను అంకగణితము, బీజగణితము, రేఖాగణితము మున్నగువాని సంఖ్యలను యథావతుగ నెరుగవలయును. భూలోకమునం దీ సంఖ్యలున్నట్లే ఇతరలోకములందును గలవు. ఇచ్చట నెట్లీ సంఖ్యలచే లెక్కించి శిల్పులు ఇటుకలచే నిర్మించిన గృహాకారము చలి, ఉష్ణము, వర్షము వాయువు మున్నగువానినుండి మనుష్యాదులను రక్షించి ఆనందపరచునట్లు అగ్నియందిడిన ఆహుతులు జలవాయువు ఓషధులచే గలిసి సర్వప్రాణుల నానందపరచుచున్నవి. ॥౨॥

2.O learned person, may the materials of my yajna, like milch kine, be the givers of happiness to me!.

They may be one, and ten, and ten tens, a hundred, and ten hundred, a thousand and ten thousand and a hundred thousand, a lac and ten lacs, a million, and ten millions, a crore, ten crores, hundred crores, thousand crores, its ten times Maha Padma, its ten times Shankh, its ten times Samudra, its ten times Madhya, its ten times Prardh. May these bricks of my altrar be a source of happiness to me, like milch-kine in this world and the nest world.

౧౭॥౩. ఋతవ ఇత్యస్య మేధాతిథిర్ఋషిః అగ్నిర్ దేవతా, విరాడార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

స్త్రియః పత్యాదిభిః సహ కథం వర్త్తేరన్నిత్యాహ.

స్త్రీలు భర్తలు మొదలైనవారితో నెటుల మెలగవలయును?

౮౨।౩ ఋతవః స్థఽఋతావృధఽఋతుష్ఠాః స్థఽఋతావృధః।ఘృతశ్చ్యుతో మధుశ్చ్యుతో విరాజో నామ కామదుఘాఽఅక్షీయమాణాః ॥౩॥

ప.వి:- ఋతవః, స్థ, ఋతావృధః, ఋతవృధ, ఇత్యృత + వృధః, ఋతుష్ఠాః, ఋతుస్థా ఇత్యృతు + స్థాః, స్థ, ఋతావృధః, ఋతవృధ ఇత్యృత + వృధః, ఘృతశ్చ్యుత ఇతి ఘృత + శ్చ్యుతః, మధుశ్చ్యుత ఇతి మధు + శ్చ్యుతః, విరాజ ఇతి వి + రాజః, నామ, కామదుఘా ఇతి కామ + దుఘా, అక్షీయమాణాః ॥౩॥

పదార్థః :-(ఋతవః) యథా వసన్తాదయస్తథా (స్థ) భవత (ఋతావృధః) యా ఋతేన జలేన నద్య ఇవ సత్యేన వర్ద్ధన్తే తాః అత్రాన్యేషామపి దృశ్యత ఇతి దీర్ఘః (ఋతుష్ఠాః) యా ఋతుషు వసన్తాదిషు తిష్ఠన్తి తాః (స్థ) భవత (ఋతావృధః) యా ఋతం సత్యం వర్ద్ధయన్తి తాః (ఘృతశ్చ్యుతః) ఘృతమాజ్యం శ్చ్యుతం నిస్సృతం యాభ్యస్తాః (మధుశ్చ్యుతః) యా మధునో మధురాత్ రసాత్ ప్రాప్తాః (విరాజః) వివిధై ర్గుణై రాజమానాః ప్రకాశమానాః (నామ) ప్రసిద్ధాః (కామదుఘాః) యాః కామాన్ దుహన్తి ప్రపిపురతి తాః (అక్షీయమాణాః) క్షేతుమనర్హాః.॥౩॥

అన్వయః :- హే స్త్రియో! యా యూయం ఋతవః స్థ యా ఋతావృధ ఋతుష్ఠా ఋతావృధః స్థ యాశ్చ యూయం ఘృతశ్చ్యుతో మధుశ్చ్యుతోఽక్షీయమాణా విరాజః కామదుఘా నామ ధేనవ ఇవ స్థ తా అస్మాన్సుఖయత.॥౩॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా ఋతవో గావశ్చ స్వస్వసమయానుకూలతయా సర్వాన్ ప్రాణినః సుఖయన్తి తథైవ సత్యస్త్రియః ప్రతిసమయం స్వపత్యాదీన్ సర్వాన్ సంతర్ప్యానన్దయన్తు.॥౩॥

పదార్థము :- ఓ మహిళామణులారా! మీరు (ఋతవః) వసంతాది ఋతువులవలె (స్థ) ఉందురో మరియు నే (ఋతావృధః) జలనదులవలె సత్యముతో ఉన్నతిని ప్రాప్తించుకొను లేక (ఋతుష్ఠాః) వసంతము మున్నగు ఋతువులందు స్థితమైయుండు మరియు (ఋతావృధః) సత్యమును పెంపొందించువారలు (స్థ) అగుడు. మరియు మీరు (ఘృతశ్చ్యుతః) నేయివెడలునట్టి ఆ (మధుశ్చ్యుతః) మధురరసముచే ప్రాప్తించినట్టి (అక్షీయమాణాః) రక్షించదగిన (విరాజః) అనేకవిధములగు గుణములచే ప్రకాశమానములు మరియు (కామదుఘాః) కామితములను పూర్ణమొనర్చునది (నామ) ప్రసిద్ధ గోవులవంటి మీరు మమ్ము సుఖవంతులుగ నొనర్చుడు.॥౩॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఋతువులు మరియు గోవులు తమతమ సమయములపై అనుకూలముగ సకలప్రాణులకు సుఖములనిచ్చుచున్నట్లు ఉత్తమ స్త్రీలు తమ పతులు మున్నగు కుటుంబీకులను సర్వకాలములందు అన్నాదులచే సంతుష్టుల నొనర్చవలయును.॥3॥

4.O woman, ye are pleasant like the spring, season full of truth like canals with water, enjoyers of seasons like spring, advancers of truth, givers of butter, givers of sweet juices, worthy of protection, full of various noble qualities, fulfillers of our desires like kine, make us happy!.

౧౫౪.సముద్రస్యేత్యస్య మేధాతిథిర్ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

సభాపతినా కిం కార్యమిత్యుపదిశ్యతే. సభాపతి ఏమి చేయవలయును?

౧౫౪ సముద్రస్య త్వావకయాగ్నే పరి వ్యయామసి ।

పావకో౽ అస్మభ్యꣳ శివో భవ ॥౪॥

ప. విః-సముద్రస్య,త్వా, అవకయా, అగ్నే పరి, వ్యయామసి, పావకః, అస్మభ్యమ్, శివః, భవ॥౪॥

**పదార్థః** :-(సముద్రస్య) అన్తరిక్షస్య మధ్యే (త్వా) త్వామ్ (అవకయా) యయా అవన్తి రక్షన్తి తయా క్రియయా (అగ్నే) అగ్నివత్ వర్తమాన సభాపతే (పరి) సర్వతః (వ్యయామసి) ప్రాప్తాః స్మః (పావకః) పవిత్రకారకః (అస్మభ్యమ్) (శివః) మఙ్గలకారీ (భవ). ॥౪॥

**అన్వయః** :-హే అగ్నే! యథా వయం సముద్రస్యావకయా సహ వర్తమానం త్వా పరివ్యయామసి తథా పావకస్త్వమస్మభ్యం శివో భవ.॥ ౪ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా మనుష్యాః సముద్రస్థాన్ జన్తూన్ రక్షిత్వా సుఖయన్తి తథా ధార్మికో రక్షకః సభేశః స్వకీయాః ప్రజాః సంరక్ష్య సతతం సుఖయేత్. ॥ ౪ ॥

**పదార్థము** :- (అగ్నే) అగ్నివంటి తేజోవంతుడవగు ఓ సభాపతీ! మే మెట్లు (సముద్రస్య) ఆకాశము మధ్య (అవకయా) రక్షణనొనర్చు క్రియతో గూడ (త్వా) నీకు (పరి వ్యయామసి) అన్నివైపులనుండి లభించుచున్నట్లు (పావకః) పవిత్రకర్తవగు నీవు (అస్మభ్యమ్) మాకొరకు (శివః) మంగళకారివి (భవ) అగుము.॥౪॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు సముద్రజీవులను

రక్షించుచు సుఖవంతమొనర్చునట్లు ధర్మాత్ముడు, రక్షకుడునగు సభాపతి తమ ప్రజలను రక్షించుచు సదా సుఖవంతులునుగ నుంచును. ॥౫॥

5.O ruler, just as we conversant with the knowledge of self protection in space, approach thee from all sides, be thou our purifier and auspicious unto us!.

౬. హిమస్యేత్యస్య మేధాతిథిర్ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తదేవాహ. మరల నా విషయమే.

౬. హిమస్య త్వా జరాయుణాఽగ్నే పరి వ్యయామసి ।
పావకోఽ అస్మభ్యꣳ శివో భవ ॥౬॥

ప. విః- హిమస్య, త్వా, జరాయుణా, అగ్నే, పరి, వ్యయామసి, పావకః, అస్మభ్యమ్, శివః, భవ. ॥౬॥

**పదార్థః** :-(హిమస్య) శీతస్య (త్వా) త్వామ్ (జరాయుణా) జరాయేతి యేన జరాయు స్తేన వస్త్రేణాగ్నినా వా (అగ్నే) అగ్నివత్ తేజస్విన్ (పరి) సర్వతః (వ్యయామసి) సంవృణోమి (పావకః) పవిత్రః (అస్మభ్యమ్) (శివః) మఙ్గలమయః (భవ). ॥౬॥

**అన్వయః** :-హే అగ్నే సభేశ! వయం హిమస్య జరాయుణా త్వా పరివ్యయామసి పావకస్త్వమస్మభ్యం శివో భవ. ॥౬॥

**భావార్థః** :-హే సభేశ! యథాగ్నిర్వస్త్రం వా శీతాతురాన్ ప్రాణినః శైత్యాద్ వియోజ్య ప్రసాదయతి తథైవ త్వదాశ్రితా వయం దుఃఖాన్ముక్తాః సన్తః సుఖభాజినః స్యామ. ॥౬॥

**పదార్థము** :-(అగ్నే) అగ్నివంటి తేజస్వివగు సభాపతీ! మేము (హిమస్య) శీతలమును (జరాయుణా) జీర్ణపరచు వస్త్రము లేక అగ్నిచే (త్వా) నిన్ను (పరి వ్యయామసి) అన్నివిధముల ఆచ్ఛాదితమొనర్చునట్లు (పావకః) పవిత్ర స్వరూపుడవగు నీవు (అస్మభ్యమ్) మాకొరకు (శివః) మంగళమయుడవు (భవ) అగుము. ॥౬॥

**భావార్థము** :- ఓ సభాపతీ! అగ్ని మరియు వస్త్రము శీతలపీడితులకు రక్షణనిచ్చి ప్రసన్నుల నొనర్చునట్లు మీ యాశ్రయమునమేము దుఃఖములనుండి తొలగి సుఖవంతులమగుదుము గాక! ॥౬॥

6.O ruler, we rally round thee for safety, just as fire or cloth removes cold. Be thou our purifier, and auspicious un to us!.

౧౨౬. ఉప జ్మన్నిత్యస్య మేధాతిథిరృషిః, అగ్నిర్దేవతా, ఆర్చీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.
అథ దమ్పతీ కథం వర్త్తేయాతామిత్యుపదిశ్యతే. దంపతులు పరస్పర మెటుల వర్తించవలెను?

౧౨౬. ఉప జ్మన్నుప వేతసేఽవతర నదీష్వా। అగ్నే పిత్తమపామసి

మణ్డూకి తాభిరాగహి సేమం నో యజ్ఞం పావకవర్ణꣳ శివం కృధి ।౬॥

ప.వి:- ఉప, జ్మన్, ఉప, వేతసే, అవ, తర, నదీషు, ఆ, అగ్నే, పిత్తమ్, అపామ్, అసి, మణ్డూకి, తాభిః, ఆ, గహి, సా, ఇమమ్, నః, యజ్ఞమ్, పావకవర్ణమితి పావక + వర్ణమ్, శివమ్, కృధి ।౬॥

**పదార్థః** :-(ఉప) (జ్మన్) జ్మని భూమౌ. అత్ర సుపాం సులుగితి సప్తమ్యేకవచనస్య లుక్. జ్మేతి పృథివీ నా.. నిఘం.. ౧.౧. (ఉప) (వేతసే) పదార్థవిస్తారే (అవ) (తర) (నదీషు) (ఆ) (అగ్నే) వహ్నిరివ తేజస్విని విదుషి (పిత్తమ్) తేజః (అపామ్) ప్రాణానాం జలానాం వా (అసి) (అస్తి) (మణ్డూకి) సుభూషితే (తాభిః) అద్భిః ప్రాణైర్వా (ఆ) (గహి) ఆగచ్ఛ (సా) (ఇమమ్) (నః) అస్మాకమ్ (యజ్ఞమ్) గృహాశ్రమాఖ్యమ్ (పావకవర్ణమ్) అగ్నివత్ప్రకాశమానమ్. (శివమ్) కల్యాణకారకమ్ (కృధి) కురు.।౬॥

**అన్వయః** :-హే అగ్నే! వహ్ని రివ విదుషి మణ్డూకి స్త్రీ।త్వం జ్మన్ నదీషు వేతసేఽవతర యథాఽగ్ని రపాం పిత్తమసి తథా త్వం తాభిరూపాగహి సా త్వం న ఇమం పావకవర్ణం యజ్ఞం శివముపాకృధి.।౬॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. స్త్రీపురుషౌ గృహాశ్రమే ప్రయత్నేన సర్వాణి కార్యాణి సంసాధ్య శుద్ధాచరణేన కల్యాణం ప్రాప్నుయాతామ్. ।౬॥

**పదార్థము** :- (అగ్నే) అగ్నివంటి తేజస్వినివగు ఓ విదుషీమణీ! (మణ్డూకి) ఉత్తమ అలంకారములచే శోభితురాలవు, విదుషివగు నీవు (జ్మన్) పృథివిపై (నదీషు) నదులు మరియు (వేతసే) పదార్థముల విస్తారమును (అవ,తర) దాటుము. అగ్నియెట్లు (అపామ్) ప్రాణముల, జలముల (పిత్తమ్) తేజోరూపము (అసి) ఐయున్నదో అట్లు నీవు (తాభిః) ఆ జలములు లేక ప్రాణములతో గూడ (ఉప, ఆ, గహి) మాకు సమీపమునందే లభించుము (సా) కావున నీవు (నః) మాయొక్క (ఇమమ్) ఇట్టి (పావకవర్ణమ్) అగ్నివలె ప్రకాశమానమగు (యజ్ఞమ్) గృహాశ్రమరూపయజ్ఞమును (శివమ్) కల్యాణప్రదమును (ఉప, ఆ, కృధి) శ్రేష్ఠరూపమున నొనర్చుము.।౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. గృహస్థాశ్రమమున స్త్రీపురుషులు ప్రయత్నపూర్వకముగ సకల కార్యములను సాధించుకొని శుద్ధ ఆచరణముతో గూడ కల్యాణమును పొందవలయును. ॥౬॥

6.O noble and well-decorated woman, live on this earth in the midst of riches, enhancing thy resources. Just as fire is the emblem of the essence of life, so should'st thou approach us with sweetness and vigour. Make our resplendent domestic life successful!.

౧౫౭. అపామిదమిత్యస్య మేధాతిథి ఋషిః, అగ్నిర్ దేవతా, ఆర్షీ బృహతీ ఛన్దః,మధ్యమః స్వరః.

గృహస్థైన కిం కార్య మిత్యాహ. గృహస్థుల కర్తవ్యములు.

౧౫౭ అపామిదం న్యయనꣳ సముద్రస్య నివేశనమ్। అన్యాꣳస్తేఽ

అస్మత్తపన్తు హేతయః పావకోఽ అస్మభ్యꣳ శివో భవ ॥౭॥

**ప.వి:**–అపామ్, ఇదమ్, న్యయనమితి ని + అయనమ్, సముద్రస్య, నివేశనమితి ని + వేశనమ్, అన్యాన్, తే, అస్మత్, తపన్తు, హేతయః, పావకః, అస్మభ్యమ్, శివః, భవ ॥౭॥

**పదార్థః** :-(అపామ్) జలానాం ప్రాణానాం వా (ఇదమ్) అన్తరిక్షమ్ (న్యయనమ్) నిశ్చితమయనం స్థానమ్ (సముద్రస్య) సాగరస్య (నివేశనమ్) నివిశన్తి యస్మింస్తత్ (అన్యాన్) (తే) తవ (అస్మత్) అస్మాకం సకాశాత్. (తపన్తు) దుఃఖయన్తు (హేతయః) వజ్రా వృద్ధయో వా (పావకః) పవిత్రకారీ (అస్మభ్యమ్) (శివః) సుఖప్రదః (భవ). ॥౭॥

**అన్వయః** :- హే విద్వన్! యదిదమపాం న్యయనమస్తి తస్య సముద్రస్య నివేశనమివ గృహాశ్రమం ప్రాప్య పావకః సంస్త్వమస్మభ్యం శివో భవ తే హేతయోఽస్మదన్యాంస్తపన్తు. ॥ ౭ ॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా యథాఽపామాధారః సాగరః సముద్రస్యాధిష్ఠానం భూమిర్భూమేరధిష్ఠానమన్తరిక్షం తథా గార్హపత్యపదార్థానామాధారం గృహం నిర్మాయ మంగలమాచర్య శ్రేష్ఠపాలనం దస్యుతాడనఞ్చ కుర్వన్తు. ॥ ౭ ॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! (ఇదమ్) ఈ యాకాశము (అపామ్) జలములు మరియు ప్రాణములకు (న్యయనమ్) నిశ్చితస్థానమైయున్న యా ఆకాశస్థ (సముద్రస్య) సముద్రముయొక్క (నివేశనమ్) స్థితివంటి గృహస్థాశ్రమమును పొంది (పావకః) పవిత్ర కర్మల నొనర్చువాడవునై నీవు (అస్మభ్యమ్) మాకొరకు (శివః) మంగళప్రదుడవు (భవ) అగుము (తే) నీయొక్క (హేతయః) వజ్రము లేక ఉన్నతి (అస్మత్) మానుండి (అన్యాన్) ఇతర దుష్టులను (తపన్తు) దుఃఖపరచుగాక!॥౭॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ జలముల కాధారము సముద్రము, సముద్రమున కాధారము భూమి, భూమికి ఆకాశమాధారమైయున్నట్లు మానవులు గృహస్థాశ్రమమున కాధారమగు పదార్థముల స్థితికొరకు గృహమును నిర్మించుకొని మంగళప్రదమగు ఆచరణలచే శ్రేష్ఠులకు రక్షణ మరియు తస్కరాది దుష్టులకు పీడను గలిగించుచు సుఖులై యుండవలెను.॥౭॥

7.O learned person, this space in full is the decided home of waters and creatures. Lead the life of a domestic person with certainty like the ocean of vaporous in space. Doing virtuous deeds, be propitious unto us. Let thy shafts trouble others different from us!.

**౭౫౮.** అగ్నే పావకేత్యస్య వసుయుర్ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

ఆప్తైర్విద్వద్భిః కిం కార్యమిత్యాహ. ఆప్తవిద్వాంసు లేమి చేయవలయును?

## ౭౫౮ అగ్నే పావక రోచిషా మన్ద్రయా దేవ జిహ్వయా। ఆ దేవాన్వక్షి యక్షి చ ॥౮॥

## ప.విః- అగ్నే, పావక, రోచిషా, మన్ద్రయా, దేవ, జిహ్వయా ఆ, దేవాన్, వక్షి, యక్షి, చ॥౮॥

**పదార్థః** :-(అగ్నే) విద్యాప్రకాశకోపదేశక (పావక) జనాన్తఃకరణశోధక! (రోచిషా) ప్రకాశేన (మన్ద్రయా) ఆనందసాధికయా (దేవ) కమనీయ (జిహ్వయా) సత్యప్రియయా వాచా (ఆ) (దేవాన్) విదుషో దివ్యగుణాన్ వా (వక్షి) ఉపదిశసి (యక్షి) సంగచ్ఛసే. అత్ర బహులం ఛన్దసీతి శపో లుక్ (చ). ॥౮॥

**అన్వయః** :-హే పావక దేవాగ్నే! త్వం మన్ద్రయా జిహ్వయా రోచిషా దేవానావక్షి యక్షి చ.॥౮॥

**భావార్థః** :-యథా సూర్యః స్వప్రకాశేన సర్వం జగద్రోచయతి తథైవాప్తోపదేశకాః సర్వాఞ్జనాన్ ప్రీణీయుః ॥ ౮॥

**పదార్థము** :- (పావక) మానవుల హృదయములను శుద్ధపరచునట్టి (దేవ) చక్కని (అగ్నే) విద్యా ప్రకాశము, ఉపదేశమునొనర్చువాడా! నీవు (మన్ద్రయా) ఆనందమును ప్రసాదించు (జిహ్వయా) సత్యప్రియవాణి లేక (రోచిషా) ప్రకాశముచే (దేవాన్) విద్వాంసుల లేక దివ్యగుణముల (ఆ, వక్షి) ఉపదేశించుచు (చ) మరియు (యక్షి) పొందుచున్నావు.॥౮॥

**భావార్థము** :-సూర్యుడు తన ప్రకాశముతో సమస్త జగత్తును ప్రసన్నపరచునట్లు ఆప్త ఉపదేశక విద్వాంసులు సకల ప్రాణులను ప్రసన్నముగ నుంచవలయును.॥౮॥

8.O excellent diffuser ans preacher of knowledge, the gratifier. of the hearts of men, with thy pleasant and truthful tongue; and thy light of knowledge, preach unto the learned, and associate with them!.

౮౫౯.స న ఇత్యస్య మేధాతిథిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౮౫౯ స నః పావక దీదివోఽగ్నే దేవాఁ2॥ఇహావహ।
ఉప యజ్ఞఁ్హవిశ్చ నః॥౯॥

ప.వి:-సః, నః, పావక, దీదివ ఇతి దీది + వః, అగ్నే దేవాన్, ఇహ, ఆ, వహ, ఉప, యజ్ఞమ్, హవిః, చ, నః ॥౯॥

**పదార్థః** :-(సః) విద్వాన్ (నః) అస్మభ్యమ్ (పావక) పవిత్ర (దీదివః) తేజస్విన్ శత్రుదాహక వా. దీదయతి జ్వలతికర్మా.. నిఘం.. ౧.౧౬. అత్ర తుజాదీనామిత్యభ్యాసస్య దీర్ఘః (అగ్నే) సత్యాసత్యవిభాజక (దేవాన్) విదుషః (ఇహ) (ఆ) (వహ) (ఉప) (యజ్ఞమ్) గృహాశ్రమమ్ (హవిః) హుతం ద్రవ్యమ్ (చ) (నః) అస్మభ్యమ్. ॥౯॥

**అన్వయః** :-హే పావక దీదివోఽగ్నే! స త్వం యథాఽయమగ్ని ర్నోహవిరావహతి తథేహ యజ్ఞం దేవాంశ్చ న ఉపావహ. ॥౯॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా సూర్యాదిరూపేణాయమగ్నిః సర్వేభ్యో రస మూర్ధ్వం నీత్వా వర్షయిత్వా దివ్యాని సుఖాని జనయతి తథైవ విద్వాంసో విద్యారసమున్నతం కృత్వా సర్వాణి సుఖాని జనయేయుః. ॥౯॥

**పదార్థము** :-(పావక) ఓ పవిత్రుడా! (దీదివః)తేజస్వివి, శత్రుదాహకుడవు (అగ్నే) సత్యాసత్య నిరూపణ నొనర్చు విద్వాంసుడా! (సః) పైదెలిపిన గుణములుగల నీవంటి ఈ యగ్ని (నః) మాకొఱకై దివ్యగుణములుగల (హవిః) హవనమొనర్చిన సుగంధితద్రవ్యములను ప్రాప్తించుకొనునట్లు (ఇహ) ఈ విశ్వమునందు (యజ్ఞమ్) గృహాశ్రమము (చ) మరియు (దేవాన్) విద్వాంసులను (నః) మాకొఱకై (ఉప, ఆ, వహ) ఉత్తమముగ ప్రాప్తింపజేయుము. ॥౯॥

**భావార్థము** :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఈ యగ్ని తన సూర్యాది రూపములచే సమస్త పదార్థములనుండి రసములను పైకిగొనిపోయి వర్షమువంటి ఉత్తమ సుఖములను అందించునట్లు విద్వాంసులు విద్యారూపరసమునకు ఔన్నత్యమునిచ్చి సకల సుఖములను ఉత్పన్నమొనర్చ వలయును.॥౯॥

9.O learned person; pure, foe-destroyer, distinguisher of truth from untruth: just as fire carries afar our fragrant oblations. so dost thou in this world bring hather for us domestic life and learned persons!.

౮౬౦. పావకేత్యస్య భారద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

సేనాపతినా కథమ్భవితవ్యమిత్యుపదిశ్యతే. సేనాపతి యెటు లుండవలయును?

౮౬౦ పావకయా యశ్చితయన్త్యా కృపా క్షామన్ రురుచఽ ఉషసో
న భానునా। తూర్వన్న యామన్నేతశస్య ను రణఽ ఆ యో ఘృణే
న తతృషాణోఽ అజరః॥౧౦॥

**ప. విః**-పావకయా, యః, చితయన్త్యా, కృపా, క్షామన్, రురుచే, ఉషసః, న, భానునా, తూర్వన్, న, యామన్, ఏతశస్య, ను, రణే, ఆ, యః, ఘృణే, న, తతృషాణః, అజరః॥౧౦॥

**పదార్థః** :-(పావకయా) పవిత్రకారికయా (యః) (చితయన్త్యా) చేతనతాయాః కర్త్ర్యా (కృపా) సామర్థ్యేన (క్షామన్) క్షామని రాజ్యభూమౌ క్షామేతి పృథివీనా.. నిఘం.. ౧.౧. (రురుచే) రోచతే (ఉషసః) ప్రభాతాః (న) ఇవ (భానునా) దీప్త్యా (తూర్వన్) హింసన్ (న) ఇవ (యామన్) యామని మార్గే ప్రహరే వా (ఏతశస్య) అశ్వస్య సంబంధీని బలాని ఏతశ ఇత్యశ్వనా.. నిఘం. ౧.౧౪ (ను) క్షిప్రమ్. అత్ర ఋచితును..ఇతి దీర్ఘః (రణే) (ఆ) (యః) (ఘృణే) ప్రదీప్తే (న) ఇవ (తతృషాణః) పిపాసితః (అజరః) జరారహితః.॥౧౦॥

**అన్వయః** :-యః పావకయా చితయన్త్యా కృపా సహ వర్తమానః సేనాపతిర్భానునోషసో న క్షామన్ రురుచే యా వా యామన్నేతశస్య ను తూర్వన్ న ఘృణే రణే తతృషాణో నాజర ఆరురుచే స రాజ్యఙ్కర్తు మర్హతి.॥౧౦॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యథా సూర్యశ్చన్ద్రశ్చ దీప్త్యా సుశోభేతే తథైవోత్తమయా స్త్రియా సుపతిః సేనయా సేనాపతిశ్చ సుప్రకాశతే. ॥౧౦॥

**పదార్థము** :- (యః) ఏ (పావకయా) పవిత్రపరచు మరియు (చితయన్త్యా) చైతన్య పరచునట్టి (కృపా) శక్తితో గలసియుండు సేనాపతి ఎట్లు (భానునా) దీప్తిచే (ఉషసః) ప్రభాతవేల శోభించునో (న) అట్లే (క్షామన్) రాజ్యభూమియందు (రురుచే) శోభించునో (యః) ఏ (యామన్) మార్గము లేక ఝాము [వేళ] నందెట్లు (ఏతశస్య) అశ్వసంబంధబలమును (ను) శీఘ్రముగ (తూర్వన్) హింసించునో (న) అట్లే (ఘృణే) ప్రదీప్తమగు (రణే) యుద్ధమందు (తతృషాణః) పిపాసకుని (న) వలె (అజరః) అజరుడు, అజేయుడు,

యువకుడు, నిర్భయుడునై (ఆ) ఉత్తమవిధముగా నుండువాడే రాజ్యమును పాలించుటకు తగినవాడై యుండును. ॥౧౦॥

భావార్థము :-ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు. సూర్యచంద్రులు తమ దీప్తిచే శోభితమగుచున్నట్లు సతియగు స్త్రీతో ఉత్తముడగు పతి మరియు ఉత్తమ సేవలచే సేనాపతి ఉత్తమ రీతిలో ప్రకాశితమగుచుందురు. ॥౧౦॥

10.The Commander of the army, who with purifying conscious force shines upon the earth like dawns with sun's light, who kills speedily like strong horses, the foes that come in the way; who in the heat of battle tolerate thirst, whom old age does not touch, is fit for rule.

౮౬౧.నమస్తే హరస ఇత్యస్య లోపాముద్రా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

న్యాయాధీశేన కథం భవితవ్యమిత్యాహ. న్యాయాధీశుడెటులుండవలెను?

౮౬౧ నమస్తే హరసే శోచిషే నమస్తేऽ అస్త్వర్చిషే। అన్యాంస్తే
అస్మత్తపన్తు హేతయః పావకోऽ అస్మభ్యం శివో భవ ॥౧౧॥

ప.వి:-నమః, తే, హరసే, శోచిషే, నమః,తే,అస్తు,అర్చిషే, అన్యాన్, తే, అస్మత్, తపన్తు, హేతయః, పావకః, అస్మభ్యమ్, శివః, భవ ॥౧౧॥

పదార్థః :-(నమః) సత్కారణమ్ (తే) తుభ్యమ్ (హరసే) యో దుఃఖం హరతి తస్మై (శోచిషే) పవిత్రాయ (నమః) (తే) (అస్తు) (అర్చిషే) పూజ్యాయ (అన్యాన్) భిన్నాన్ శత్రూన్ (తే) తవ (అస్మత్) (తపన్తు) సన్తాపయన్తు (హేతయః) ప్రజాదిశస్త్రాస్త్రయుక్తాః సేనాః (పావకః) శోధకః (అస్మభ్యమ్) (శివః) న్యాయకారీ (భవ). ॥౧౧॥

**అన్వయః** :- హే సభాపతే! తే హరసేऽస్మత్కృతం నమోऽస్తు శోచిషేऽర్చిషే తేऽస్మత్ప్రయుక్తం నమోऽస్తు యస్తే హేతయస్తా అస్మదన్యాంస్తపన్తు పావకస్త్వమస్మభ్యం శివో భవ. ॥౧౧॥

భావార్థః :-మనుష్యైః పవిత్రాన్ జనాన్న్యాయాధీశాన్ కృత్వా దుష్టాన్ నివార్య సత్యోన్యాయః ప్రకాశయితవ్యః. ॥౧౧॥

పదార్థము :- ఓ సభాపతీ! (హరసే) దుఃఖములను హరింపజేయు (తే) నీకు మే మొనర్చిన (నమః)

సత్కారము చెందునుగాక! మరియు (శోచిషే) పవిత్ర (అర్చిషే) సత్కారార్హుడవునగు (తే) నీకు మే మొనర్చిన (నమః) నమస్కారము (అస్తు) చెందునుగాక! ఏ (తే) నీయొక్క (హేతయః) వజ్రాది శస్త్రయుక్తమగు సైన్యముచే (అస్మత్) మాకు భిన్నమగు (అన్యాన్) ఇతరశత్రువులను (తపన్తు) దుఃఖితుల నొనర్చుము (పావకః) శుద్ధిపరచు నీవు (అస్మభ్యమ్) మాకొరకు (శివః) న్యాయకారివి (భవ) అగుము.॥౧౧॥

**భావార్థము** :- మానవులు అంతఃకరణపవిత్రులను న్యాయాధీశులుగ నొనర్చి ఇతరదుష్టులను నివృత్తియొనర్చి సత్యన్యాయములను ప్రకాశపరచవలెను.॥౧౧॥

11.O ruler, our obeisance to thee, the remover of afflictions. Our obeisance to thee pure and worthy of respect. may thy armed forces trouble others than us. Be thou our purifier, and propitious unto us!.

**౮౬౨.నృషద ఇత్యస్య లోపాముద్రా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.**

**పునస్తదేవాహ. మఱల పై విషయమే.**

## ౮౬౨ నృషదే వేడప్సుషదే వేడ్ బర్హిషదే వేడ్వనసదే వేట్ స్వర్విదే వేట్ ॥౧౨॥

**ప.విః-నృషదే, నృసద ఇతి నృ + సదే, వేట్, అప్సుషదే, అప్సుసద ఇత్యప్సు + సదే, వేట్, బర్హిషదే, బర్హిసద ఇతి బర్హి + సదే, వేట్, వనసద ఇతి వన+స దే, వేట్, సర్విద ఇతి స్వః + విదే, వేట్ ॥౧౨॥**

**పదార్థః** :-(నృషదే) యో నాయకేషు సీదతి తస్మై (వేట్) యో న్యాయాసనే విశతి సః అత్ర విశ ధాతోరన్యేభ్యోఽపి దృశ్యన్త ఇతి విచ్ ప్రత్యయః (అప్సుషదే) యో జలేషు నౌకాదిషు సీదతి తస్మై (వేట్) (బర్హిషదే) యః ప్రజాయా వర్ధకే వ్యవహారే తిష్ఠతి తస్మై (వేట్) అధిష్ఠాతా (వనసదే) యో వనేషు సీదతి తస్మై (వేట్) (స్వర్విదే) యః సుఖం వేత్తితస్మై (వేట్).॥౧౨॥

**అన్వయః** :-హే సభేశ! త్వం నృషదే వేట్ భవాప్సుషదే వేడ్ భవ బర్హిషదే వేడ్ భవ వనసదే వేడ్ భవ స్వర్విదే చ వేడ్ భవ. ॥౧౨॥

**భావార్థః** :-యస్మిన్ దేశే న్యాయాధీశనౌయాయిప్రజావర్ధకారణ్యస్థనాయకసుఖప్రాపకా విద్వాంసో వర్తన్తే తత్రైవ సర్వాణి సుఖాని వర్ధన్తే. ॥౧౨॥

**పదార్థము** :- ఓ సభాపతీ! నీవు (నృషదే) నాయకులందు స్థిరుడవగుటకై (వేట్) న్యాయాసనముపై గూర్చుండి (అప్సుషదే) జలములమధ్య స్థిరముగ నుండువారికై (వేట్) న్యాయపీఠము పై గూర్చుండి (బర్హిషదే)

ప్రజల నున్నతపరచు వ్యవహారములందు స్థిరముగుటకొరకు (వేట్) అధిష్ఠాతవగుటకు (వనసదే) అరణ్యములందుండువారికై (వేట్) న్యాయమునందు ప్రవేశించుటకు మరియు (స్వర్విదే) సుఖముల నెరుగువారికై (వేట్) ఉత్సాహమునందు ప్రవేశించువాడ వగుము. ॥౧౨॥

**భావార్థము :-** ఏ దేశమునందు ఉత్తమ న్యాయాధీశుడు, నౌకల నడుపు నేర్పరులు, ప్రజలను వృద్ధిపరచు విద్వాంసులు, వనములందుండు వీరులు, సేనానాయకులు, సౌఖ్యముల వృద్ధిపరచు విద్వాంస, విదుషీమణులుందురో అచ్చటనే సకలసుఖములు వృద్ధియగును. ॥౧౨॥

12.O King, the leader of men, occupy the seat of justice. Administer justice unto sailors in ships. Thou art the chief for impriving thy subjects. Be thou a dweller in the solitude of forests, and a lover of justice. Be thou the enjoyer of pleasure, full of perseverance!.

౮౬3. యే దేవా ఇత్యస్య లోపాముద్రా ఋషిః, ప్రాణో దేవతా, నిచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ సంన్యాసిభిః కిం కార్యమిత్యాహ. సంన్యాసు లేమి చేయవలయును?

౮౬3 యే దేవా దేవానాం యజ్ఞియా యజ్ఞియానాᳬ సంవత్సరీణముప

భాగమాసతే। అహుతాదో హవిషో యజ్ఞేఽ అస్మిన్

త్స్వయమ్పిబన్తు మధునో ఘృతస్య ॥౧3॥

ప.వి:- యే, దేవాః, దేవానామ్, యజ్ఞియాః, యజ్ఞియానామ్, సంవత్సరీణమ్, ఉప, భాగమ్, ఆసతే, అహుతాద ఇత్యహుత+అదః, హవిషః, యజ్ఞే, అస్మిన్, స్వయమ్, పిబన్తు, మధునః, ఘృతస్య ॥౧3॥

**పదార్థః :-** (యే) (దేవాః) విద్వాంసః (దేవానాం) విదుషామ్ (యజ్ఞియాః) యే యజ్ఞమ్మర్హన్తి తే (యజ్ఞియానామ్) యజ్ఞసంపాదనకుశలానామ్ (సంవత్సరీణమ్) యః సంవత్సరం భృతస్తమ్. సంపరిపూర్వాత్ ఖచ. అ. ౫. ౧.౯౨ ఇతి భూతార్థే ఖః (ఉప) (భాగమ్) సేవనీయమ్ (ఆసతే) (అహుతాదః) యేఽహుత మదన్తితే (హవిషః) హోతవ్యస్య (యజ్ఞే) సంగంతవ్యే (అస్మిన్) (స్వయమ్) (పిబన్తు) (మధునః) క్షౌద్రస్య (ఘృతస్య) ఆజ్యస్య జలస్య వా. ॥౧3॥

**అన్వయః :-** యే దేవానాం మధ్యేఽహుతాదో దేవా యజ్ఞియానాం మధ్యే యజ్ఞియా విద్వాంసః సంవత్సరీణం భాగముపాసతే తేఽస్మిన్ యజ్ఞే మధునో ఘృతస్య హవిషో భాగం స్వయం పిబన్తు. ॥౧3॥

**భావార్థః** :- యేఽస్మిన్ సంసారే అనగ్నయోఽర్థా దాహవనీయగార్హపత్యదక్షిణాగ్నిసమ్బన్ధి బాహ్యకర్మాణి విహాయాన్తరగ్నయః సంన్యాసినః సన్తి తే హోమమకుర్వన్తో భుఞ్జానాః సర్వత్ర విహృత్య సర్వాన్ జనాన్ వేదార్థాన్ బోధయేయుః.॥౧౩॥

**పదార్థము** :-(యే) ఎవరు (దేవానామ్) విద్వాంసులందు (అహుతాదః) యజ్ఞము జేయకుండ పదార్థములను భుజించు (దేవాః) విద్వాంసుడు (యజ్ఞియానామ్) యజ్ఞకుశలురందు (యజ్ఞియాః) యోగాభ్యాసమను యజ్ఞమునందు యోగ్య విద్వాంసులు (సంవత్సరీణమ్) సంవత్సరమంతయు ఆచరణ పుష్టిగల (భాగమ్) సేవించదగిన శ్రేష్ఠపరమాత్ముని (ఉపాసతే) ఉపాసించెదరో, వారు (అస్మిన్) ఇట్టి (యజ్ఞే) సమాగమరూప యజ్ఞమునందు (మధునః) మధువు [తేనె] (ఘృతస్య) జలములు మరియు (హవిషః) హవనయోగ్యమగు పదార్థముల భాగమును (స్వయమ్) స్వయముగ (పిబన్తు) సేవించవలెను. ॥౧౩॥

**భావార్థము** :-ఈ జగత్తునందు అగ్నిక్రియారహితులై అనగా ఆహవనీయ, గార్హపత్య, దాక్షిణాగ్నుల సంబంధముగల బాహ్యకర్మలను త్యజించిన సన్న్యాసులు అభ్యంతరాగ్నిని ధరించి హోమమొనర్చకయే భోజనమొనర్చుచు సర్వత్ర విహరించుచు సమస్త మానవులకు వేదార్థముల నుపదేశించుచుండవలయును.॥౧౩॥

13.The hermits (Sanyasis) learned of the learned, who take their meals withou performing Havan, lead a life of sacrifice, and contemplation amongst the performers of usual sacrifice (yajna), and worship the Adorable God, after a year's penance, take themselves the honey and butter of oblations in this yajna.

౮౬౪.యే ఇత్యస్య లోపాముద్రా ఋషిః, ప్రాణో దేవతా, ఆర్షీజగతీ ఛందః, నిషాదః స్వరః.

అథోత్తమా విద్వాంసః కీదృశా భవన్తీత్యాహ. ఉత్తమ విద్వాంసు లెటులగుదురు?

౮౬౪ యే దేవా దేవేష్వధి దేవత్వమాయన్యే బ్రహ్మణః పురఽ

ఏతారోఽ అస్య। యేభ్యో నఽ ఋతే పవతే ధామ

కిం చన న తే దివో న పృథివ్యాఽ అధి స్నుషు ॥౧౪॥

ప.విః-యే, దేవాః, దేవేషు, అధి, దేవత్వమితి దేవ + త్వమ్, ఆయన్, యే, బ్రహ్మణః, పుర + ఏతార ఇతి పురః + ఏతారః, అస్య, యేభ్యః, న, ఋతే, పవతే, ధామ, కిమ్, చన, న, తే, దివః, న, పృథివ్యాః, అధి, స్నుషు ॥౧౪॥

పదార్థః :-(యే) (దేవాః) పూర్ణవిద్వాంసః (దేవేషు) విద్వత్సు (అధి) ఉపరివిరాజమానాః (దేవత్వమ్) విదుషాం కర్మ భావం వా (ఆయన్) ప్రాప్నువన్తి (యే) (బ్రహ్మణః) పరమేశ్వరస్య (పురఏతారః) పూర్వం ప్రాప్తారః (అస్య) (యేభ్యః) (న) నిషేధే (ఋతే) వినా (పవతే) పవిత్రీభవతి (ధామ) దధతి సుఖాని యస్మింస్తత్ (కిమ్) (చన) (న) (తే) విద్వాంసః (దివః)సూర్యస్య (న) (పృథివ్యాః) భూమేః (అధి) (స్నుషు) ప్రాన్తేషు. ॥౧౪॥

అన్వయః :-యే దేవా దేవేష్వధి దేవత్వమాయన్ యేఽస్య బ్రహ్మణః పురఏతారః సన్తి యేభ్య ఋతే కిం చన ధామ న పవతే తే న దివః స్నుషు న చ పృథివ్యాః అధి స్నుష్వాయన్ నాధివసన్తీతి యావత్. ॥౧౪॥

భావార్థః :- యేఽత్ర జగతి విద్వత్తమా యోగాధిరాజా యాథాతథ్యేన పరమేశ్వరం జానన్తి తే నిఖిలజన శోధకాః సన్తో జీవన్ముక్తిదశాయాం పరోపకారమాచరన్తో విదేహముక్తిదశాయాం న సూర్యలోకే న చ పృథివ్యాం నియతం వసన్తి కిన్తు బ్రహ్మణి స్థిత్వాఽవ్యాహతగత్యా సర్వత్రాభివిహరన్తి. ॥౧౪॥

పదార్థము :- (యే) ఏ (దేవాః) పూర్ణవిద్వాంసులు (దేవేషు, అధి) విద్వాంసులలో అందరికన్న ఉత్తమ శ్రేణిలోనుండి (దేవత్వమ్) దివ్యమైన గుణ కర్మ స్వభావములను (ఆయన్) పొందుచుందురో మరియు (యే) ఎవరు (అస్య) ఈ (బ్రహ్మణః) పరమేశ్వరుని (పుర ఏతారః) ముందుగా పొందుదురో (యేభ్యః) ఎవరు (ఋతే) లేకున్న (కిమ్, చన) ఎవ్వరును (ధామ) సుఖస్థానమును (న, పవతే) పవిత్రపరచ [పొంద] జాలరో, (తే) అట్టి విద్వాంసులు (న దివః) సూర్యలోక ప్రదేశములందుగాని (న పృథివ్యాః) పృథివియందలి (అధి, స్నుషు) ఏ భాగమునందును ఎక్కువ వసింపజాలరు. ॥౧౪॥

భావార్థము :-ఈ విశ్వమునందు ఎవరు ఉత్తమ విద్వాంసులు, యోగేశ్వరులో వారు యథార్థముగ పరమేశ్వరు నెరుగుదురు. వారు సర్వప్రాణులను శుద్ధపరచుటకు, జీవన్ముక్తిదశయందు పరోపకారమొనర్చుచు విదేహముక్త్యావస్థలో సూర్యలోకమందుగాని, పృథివిపైనగాని నియమముగ వసింపరు. వారు ఈశ్వరునియందు స్థితులై అవ్యాహత [ఆటంకములేని] గతిద్వారా సర్వత్ర విహరించుచుండెదరు. ॥౧౪॥

14.The learned yogis who amongst the learned attain to Godhead, who first of all acquire communion with God, without Whose aid no place of happiness is sanctified, dwell neither on heaven's heights nor on the face of the earth.

౧౫. ప్రాణదా ఇత్యస్య లోపాముద్రా ఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

విద్వద్రాజానౌ కీదృశౌ స్యాతామిత్యాహ. విద్వాంసుడు రాజు ఎట్టులుండవలెను?

౧౫ ప్రాణదా౽ అపానదా వ్యానదా వర్చోదా వరివోదాః। అన్యాꣳస్తే అస్మత్తపన్తు హేతయః పావకో౽ అస్మభ్యꣳ శివో భవ ॥౧౫॥

**ప.వి:-** ప్రాణదా ఇతి ప్రాణ + దాః, అపానదా + ఇత్యపాన + దాః, వ్యానదా ఇతి వ్యాన + దాః, వర్చోదా ఇతి వర్చః + దాః, వరివోదా ఇతి వరివః + దాః, అన్యాన్, తే, అస్మత్, తపన్తు, హేతయః, పావకః, అస్మభ్యమ్, శివః భవ ॥౧౫॥

**పదార్థః :-** (ప్రాణదాః) యాః ప్రాణం జీవనం బలం చ దదతి తాః (అపానదాః) యా అపానం దుఃఖదూరీకరణసాధనం ప్రయచ్ఛన్తి తాః (వ్యానదాః) యా వ్యాప్తివిజ్ఞానం దదతి (వర్చోదాః) సకల విద్యాధ్యయనప్రదాః (వరివోదాః) సత్యధర్మవిద్వత్సేవాప్రాపికాః (అన్యాన్) (తే) తవ (అస్మత్) (తపన్తు) (హేతయః) వజ్రవద్వర్తమానా శస్త్రాస్త్రోన్నతయః (పావకః) శుద్ధిప్రచారకః (అస్మభ్యమ్) (శివః) (భవ) ॥౧౫॥

**అన్వయః :-** హే విద్వన్ రాజన్! తే తవ యా అస్మభ్యం ప్రాణదా అపానదా వ్యానదా వర్చోదా వరివోదా హేతయో భూత్వాఽస్మదన్యాంస్తపన్తు తాభిః పావకః సంస్త్వమస్మభ్యం శివో భవ. ॥౧౫॥

**భావార్థః :-** స ఏవ రాజా యో న్యాయస్య వర్ధకః స్యాత్. స ఏవ విద్వాన్ యో విద్యయా న్యాయస్య విజ్ఞాపకో భవేత్. న స రాజా యః ప్రజాః పీడయేత్, న స విద్వాన్ యోఽన్యాన్ విదుషో న కుర్యాత్ న తాః ప్రజాః యా నీతిజ్ఞం రాజానం న సేవేరన్. ॥౧౫॥

**పదార్థము :-** విద్వాంసుడవగు నో రాజా! (తే) నీయొక్క ఉన్నతి మరియు శస్త్రాదులు (అస్మభ్యమ్) మాకొరకు (ప్రాణదాః) జీవనము మరియు శక్తిని ప్రసాదించునవి (అపానదాః) దుఃఖముల దొలగించు సాధనముల నిచ్చునవి మరియు (వ్యానదాః) వ్యాప్తి మరియు విజ్ఞానముల నిచ్చునవి (వర్చోదాః) సకల విద్యల నభ్యసించుటకు హేతువును గలిగించునవి మరియు (వరివోదాః) సత్యము, ధర్మము మరియు విద్వాంసుల సేవలను వ్యాప్తమొనర్పజేయునవియై యున్నవి (హేతయః) వజ్రము మున్నగు శస్త్రముల ఉన్నతులు (అస్మత్) మాద్వారా (అన్యాన్) ఇతర దుష్టశత్రువులను (తపన్తు) దుఃఖితుల నొనర్తురుగాక! వానితోబాటు (పావకః) శుద్ధి ప్రచారమొనర్చుచు నీవు మాకొరకు (శివః) మంగళకారివి (భవ) అగుము. ॥౧౫॥

**భావార్థము :-** న్యాయమును వృద్ధిపరచి పాలించువాడే రాజు. విద్యద్వారా న్యాయము నెరుగువాడే విద్వాంసుడు. ప్రజాపీడకుడు రాజుగాడు. మరియు ఇతరులను విద్వాంసులనొనర్పనివాడు విద్వాంసుడుగాడు. నీతియుక్తముగ రాజ్యము మరియు రాజును సేవించనివారు ప్రజలును గాజాలరు. ॥౧౫॥

15.O King, thy powers are the givers of life and strength unto us, the givers of resources for the removal of affliction, the givers of knowledge, the helpers for studying all sciences, the preachers of true religion and service of the learned. May thy weapons trouble others than us. Be thou our purifier and propitious unto us!.

మిత్రాణ్యేషాం తాన్ (అపబాధమానః) అపబాధతే సః (ప్రభఞ్జన్) యః ప్రభగ్నాన్ కరోతి సః (సేనాః) (ప్రమృణః) యే ప్రకృష్టతయా మృణన్తి హింసన్తి తాన్ (యుధా) యుద్ధే (జయన్) ఉత్కర్షం ప్రాప్నువన్ (అస్మాకమ్) (ఏధి) భవ (అవితా) రక్షితా (రథానామ్) రమణీయానాం యానానామ్. ॥౩౬॥

**అన్వయః** :-హే బృహస్పతే! యో రక్షోహాఽమిత్రానపబాధమానః ప్రమృణః సేనాః ప్రభఞ్జన్స్త్వం రథేన యుధా శత్రూన్ పరిదీయా స జయన్నస్మాకం రథానామవితైధి. ॥౩౬॥

**భావార్థః**:-రాజా సేనాపతిం స్వసేనాం చ వర్ధయన్ శత్రుసేనాం హింసన్ ధార్మికీం ప్రజాం సతతమున్నయేత్. ॥౩౬॥

**పదార్థము** :- (బృహస్పతే) ధార్మికులను, వృద్ధజనులను, సైన్యములను రక్షించువాడా! (రక్షోహా) దుష్టులను సంహరించు (అమిత్రాన్) శత్రువులను (అపబాధమానః) దూరమొనర్చు (ప్రమృణః) వారిని చక్కగా సంహరించు (సేనాః) వారి సైన్యములను (ప్రభఞ్జన్) భగ్నమొనర్చువాడవగు నీవు (రథేన) రథసమూహములచే (యుధా) సమరరంగమున శత్రువులను (పరిదీయా) అన్నివైపులనుండి నరుకుచున్నట్టి నీవు (జయన్) ఉత్కర్షమును, అనగా జయమును పొందుచు (అస్మాకమ్) మాయొక్క (రథానామ్) రథములను (అవితా) రక్షించువాడవు (ఏధి) అగుము. ॥౩౬॥

**భావార్థము** :-రాజు మరియు సేనాపతి తమసైన్యములను ప్రోత్సాహపరచుచు, శత్రుసైన్యముల సంహరించుచు ధర్మాత్ములగు ప్రజలను సదా రక్షించుచుండవలెను. ॥౩౬॥

36. O protector of the religious minded, the aged and the forces, the slayer of demons, the remover of our foes, their killer, the breaker - up of the enemy's forces, their destroyer in the battle with military accoutrements, be thou protector of our conveyances that are used on the earth, the sea, and in the air!.

౮౮౭. బలవిజ్ఞాయ ఇత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౮౮౭ బలవిజ్ఞాయః స్థవిరః ప్రవీరః సహస్వాన్ వాజీ సహమానఽ ఉగ్రః।
అభివీరోఽ అభిసత్వా సహోజా జైత్రమిన్ద్ర రథమాతిష్ఠ గోవిత్ ॥౩౭॥

**ప. వి:**-బలవిజ్ఞాయ ఇతి బల + విజ్ఞాయః, స్థవిరః, ప్రవీర ఇతి ప్ర + వీరః, సహస్వాన్, వాజీ, సహమానః, ఉగ్రః, అభివీర ఇత్యభి + వీరః, అభిసత్వేత్యభి సత్వా, సహోజా ఇతి సహః + జాః, జైత్రమ్, ఇన్ద్ర, రథమ్, ఆ, తిష్ఠ, గోవిదితి, గో + విత్ ॥౩౭॥

**పదార్థః** :-(బలవిజ్ఞాయః) యో బలం బలయుక్తం సైన్యం కర్తుం జానాతి సః (స్థవిరః) వృద్ధో విజ్ఞాతరాజధర్మవ్యవహారః (ప్రవీరః) ప్రకృష్టశ్చాసౌ వీరశ్చ (సహస్వాన్) సహో బహుబలం విద్యతే యస్య సః (వాజీ) ప్రశస్తో వాజః శాస్త్రబోధో విద్యతే యస్య సః (సహమానః) యః సుఖదుఃఖాదికం సహతే (ఉగ్రః) దుష్టానాం వధే తీవ్రతేజాః (అభివీరః) అభీష్టా వీరా యస్య సః (అభిసత్వా) అభితః సర్వతః సత్వానో యుద్ధవిద్వాంసో రక్షకా భృత్యా వా యస్య సః (సహోజాః) సహసా బలేన జాతః ప్రసిద్ధః (జైత్రమ్) జేతృభిః పరివృతం రథమ్ (ఇన్ద్ర) యుద్ధస్య పరమసామగ్రీసహిత (రథమ్) రమణీయం భూసముద్రాకాశయానమ్ (ఆ) (తిష్ఠ) (గోవిత్) యో గా వాచో ధేనుః పృథివీం వా విన్దతి సః.॥౩౭॥

**అన్వయః**:-హే ఇన్ద్ర సేనాపతే! బలవిజ్ఞాయః స్థవిరః ప్రవీరః సహస్వాన్ వాజీ సహమాన ఉగ్రో౨భివీరో౨భిసత్వా సహోజా గోవిత్సంస్త్వం యుద్ధాయ జైత్రం రథమాతిష్ఠ.॥౩౭॥

**భావార్థః** :- సేనాపతిః సేనావీరా వా యదా శత్రుభిః యోద్ధుమిచ్ఛేయుస్తదా పరస్పరం సర్వతో రక్షాం రక్షాసాధనాని వా సంగృహ్య బుద్ధ్యుత్సాహేన సహ వర్తమానా అనలసః సన్తః శత్రువిజయతత్పరా భవేయుః.॥౩౭॥

**పదార్థము** :-(ఇన్ద్ర) ఉత్తమయుద్ధసాధనాయుక్తుడవగు ఓ సేనాపతీ! (బలవిజ్ఞాయః) నీ సైన్యములను శక్తి సంపన్నపరచుట నెరిగినవాడవు (స్థవిరః) వృద్ధుడవు [అనుభవజ్ఞుడవు] (ప్రవీరః) ఉత్తమ వీరుడవు (సహస్వాన్) అత్యంత శక్తిశాలివి (వాజీ) ప్రశంసనీయ శాస్త్రజ్ఞానము గలిగినవాడవు (సహమానః) సుఖదుఃఖములను సహించువాడవు మరియు (ఉగ్రః) దుష్టసంహారమున తీవ్రతేజస్సుగలిగినవాడవు (అభివీరః) తలచిన కార్యమును తత్కాలమే పూర్ణమొనర్చువాడవు (అభిసత్వా) సకలదిశలనుండి యుద్ధవిద్యానిపుణులు, రక్షకులు, వీరులుగలవాడవు (సహోజాః) బలముచే ప్రసిద్ధుడవు (గోవిత్) వాణులు, గోవులు మరియు పృథివిని పొందుచుండు నీవు యుద్ధమునకై (జైత్రమ్) విజేతలగు వీరులచే చుట్టబడిన (రథమ్) భూమి సముద్రము, ఆకాశములందు నడచునట్టి రథములను (ఆ, తిష్ఠ) వచ్చి అధిరోహించుము. అనగా దానిపై కూర్చుండుము.॥౩౭॥

**భావార్థము** :-సేనాపతి మరియు సైనికవీరులకు శత్రువులతో సమరమొనర్పవలసి వచ్చునప్పుడు అన్నివైపులనుండి రక్షణము, రక్షణసాధనములను సంగ్రహమొనర్చుకొని ద్విగుణోత్సాహముచే ఆలస్యరహితులై శత్రువులను జయించుటయందు తత్పరులై యుండవలయును.॥౩౭॥

37.O Commander of the army, well-equipped with military warfare, thou knowest how to strengthen thy army, art an experienced statesmen, a foremost fighter, mighty, the master of the science of war, the endurer of pleasure and pain, the fierce slayer of the wicked, the possessor of nice warriors, and martial intelligent employees, famous for strength, conquering land, surrounded by victorious heroes, mount thy couquering conveyance!.

౮౮. గోత్రభిద మిత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, భురిగార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౮౮ గోత్రభిదఙ్గోవిదం వజ్రబాహుఞ్జయన్తమజ్మ ప్రమృణన్తమోజసా। ఇమఀ సజాతాఽ అను వీరయధ్వమిన్ద్రఀ సఖాయోఽ అను సఀరభధ్వమ్ ॥౩౮॥

ప. విః- గోత్రభిదమితి గోత్ర + భిదమ్, గోవిదమితి గో + విదమ్, వజ్రబాహుమితి వజ్ర + బాహుమ్, జయన్తమ్, అజ్మ, ప్రమృణన్తమితి ప్ర + మృణన్తమ్, ఓజసా, ఇమమ్, సజాతా ఇతి స + జాతాః, అను, వీరయధ్వమ్, ఇన్ద్రమ్, సఖాయః, అను, సమ్, రభధ్వమ్. ॥౩౮॥

**పదార్థః** :-(గోత్రభిదమ్) యః శత్రూణాం గోత్రాణి భినత్తి తమ్ (గోవిదం) యోఽరీణాంగాం భూమిం విన్దతి తమ్ (వజ్రబాహుమ్) వజ్రాః శస్త్రాణి బాహ్వోర్యస్య తమ్ (జయన్తమ్) శత్రూన్ పరాజయమానమ్ (అజ్మ) అజన్తి ప్రక్షిపన్తి శత్రూన్ యేన యస్మిన్ వా. అత్ర సుపాం సులుగితి విభక్తేర్లుక్. అజ్మేతి సంగ్రామ నా... నిఘం. ౨.. ౧౭. (ప్రమృణన్తమ్) ప్రకృష్టతయా శత్రూన్ హింసన్తమ్ (ఓజసా) స్వస్య శరీరబుద్ధిబలేన సైన్యేన వా (ఇమమ్) (సజాతాః) సమానదేశే జాతా ఉత్పన్నాః (అను) పశ్చాదర్థే (వీరయధ్వమ్) విక్రమయధ్వమ్ (ఇన్ద్రమ్) శత్రుదలవిదారకమ్ (సఖాయః) పరస్పరస్య సహాయినః (అను) సుహృదః సన్తః అనుకూల్యే (సమ్) సమ్యక్ (రభధ్వమ్) యుద్ధారమ్భం కురుత. ॥౩౮॥

**అన్వయః** :- హే సజాతాః సఖాయో! యూయమోజసా గోత్రభిదం గోవిదం వజ్రబాహుం ప్రమృణన్త మజ్మ జయన్తమిమమిన్ద్రం సేనాపతిమనువీరయధ్వమనుసంరభధ్వం చ. ॥౩౮॥

**భావార్థః** :- సేనాపతయో భృత్యాశ్చ పరస్పరం సుహృదో భూత్వాఽన్యోన్యమనుమోద్య యుద్ధారమ్భవిజయౌ కృత్వా శత్రురాజ్యం లబ్ధ్వా న్యాయేన ప్రజాః పాలయిత్వా సతతం సుఖినః స్యుః. ॥౩౮॥

**పదార్థము** :-(సజాతాః) ఒకే దేశమున బుట్టినవారలారా! (సఖాయః) పరస్పర సహాయమొనర్చుకొను మిత్రులారా! మీరు (ఓజసా) శరీరబుద్ధిబలములతోను, సైనికులతోను, (గోత్రభిదమ్) శత్రువుల గోత్ర సముదాయమును ఛిన్నాభిన్న మొనర్చువాడు, వారిని ఉన్మూల మొనర్చువాడు (గోవిదమ్) శత్రుభూమిని తీసికొనువాడు (వజ్రబాహుమ్) తన భుజములయందు శస్త్రములనుధరించువాడు (ప్రమృణంతమ్) శత్రువులను బాగుగా చంపువాడు (అజ్మ) శత్రువులను క్రింద పడద్రోయుటకు సాధనమగు యుద్ధమునందు (జయంతమ్) వైరులను జయించువాడు (ఇమమ్ ఇంద్రమ్) శత్రువులను విదీర్ణమొనర్చువాడునగు నీ

సేనాపతిని (అను వీరయధ్వమ్) ప్రోత్సాహిత మొనర్చుడు. మఱియు. (అను సంరభధ్వమ్) బాగుగ యుద్ధమును ఆరంభించుడు. ॥౩౮॥

**భావార్థము :-** సేనాపతులు, భృత్యులు పరస్పర మిత్రులై పరస్పరము అనుమోదన మొనర్చుచు యుద్ధము నారంభించి, విజయమును పొంది, శత్రురాజ్యములను పొంది, న్యాయముతో ప్రజాపాలన మొనరించి నిరంతరము సుఖముగ నుండవలయును.॥౩౮॥

38.O friendly countrymen, encourage the commander of the army, and begin the battle with him, who with his physical, mental and military strength, cleaves the enemies' families, usurps their land, is armed with weapons, slays the foes, subdues the enemy in the battle, and conquers him!.

**౮౮. అభిగోత్రాణీత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.**

## ౮౮ అభి గోత్రాణి సహసా గాహమానోఽదయో వీరః శతమన్యురిన్ద్రః దుశ్చ్యవనః పృతనాషాడయుధ్యోఽస్మాకꣳ సేనా అవతు ప్ర యుత్సు ॥౩౯॥

**ప.విః-అభి, గోత్రాణి, సహసా, గాహమానః, అదయః, వీరః, శతమన్యురితి శత + మన్యుః, ఇన్ద్రః, దుశ్చ్యవన ఇతి దుః + చ్యవనః, పృతనా + షాట్, అయుధ్యః, అస్మాకమ్, సేనాః, అవతు, ప్ర, యుత్స్వితి యుత్సు.॥౩౯॥**

**పదార్థః :-** (అభి) సర్వతః (గోత్రాణి) శత్రుకులాని (సహసా) బలేన (గాహమానః) విలోడనం కుర్వన్ (అదయః) అవిద్యమానా దయా కరుణా యస్య సః (వీరః) శత్రూణాం దరితా (శతమన్యుః) శతధా మన్యుః క్రోధో యస్య సః (ఇన్ద్రః) సేనేశః (దుశ్చ్యవనః) శత్రుభిర్దుఃఖేన చ్యోతుం యోగ్యః (పృతనాషాట్) యః పృతనాం సహతే (అయుధ్యః) శత్రుభిర్యోద్ధుమయోగ్యః (అస్మాకమ్) (సేనాః) (అవతు) రక్షతు (ప్ర) ప్రయత్నేన (యుత్సు) మిశ్రితామిశ్రితకరణేషు యుద్ధేషు. ॥౩౯॥

**అన్వయః :-** హే విద్వాంసో! యో యుత్సు సహసా గోత్రాణి ప్రగాహమానోఽదయః శతమన్యుర్దుశ్చ్యవనః పృతనాషాడయుధ్యో వీరోఽస్మాకం సేనా అభ్యవతు, స ఇన్ద్రః సేనాపతిర్భవత్విత్యాజ్ఞాపయత. ॥౩౯॥

**భావార్థః** :- ధార్మికేషు కరుణాకరః దుష్టేషు నిర్దయః సర్వాభిరక్షకో నరో భవేత్ స ఏవ సేనాపాలనేఽధికర్తవ్యః. ॥౩౯॥

**పదార్థము** :- ఓ విద్వాంసులారా! (యుత్కృ) ఎవడు అనేక పదార్థములను సంయోగ వియోగములొనర్చు యుద్ధములందు (సహసా) బలముద్వారా (గోత్రాణి) శత్రువంశములను (ప్ర, గాహమానః) చక్కని ప్రయత్నముచే చిక్కబట్టుకొనునో (అదయః) దయారహితుడో (శతమన్యుః) అనేక విధముల క్రోధము గలవాడో (దుశ్చ్యవనః) దుఃఖముచే శత్రువులను పతనమొనర్చువాడో (పృతనాషాట్) శత్రుసైన్యముల సహించువాడో (అయుధ్యః) ఎవనిచే శత్రువులు యుద్ధమొనర్చగనివారో (వీరః) శత్రువులను విదీర్ణపరచువాడో అతడు (అస్మాకమ్) మాయొక్క (సేనాః) సైన్యములను (అభి, అవతు) అన్నివైపులనుండి పాలించుగాక! అతడు మాకు (ఇన్ద్రః) సేనాధిపతియగుగాక. అట్టి యాజ్ఞను మీరును ఈయుడు. ॥౩౯॥

**భావార్థము** :- ధర్మాత్ములయెడ దయగలవాడు, దుష్టులయెడ దయజూపనివాడు, అందరిని అన్నివైపులనుండి రక్షించువాడు మాత్రమే సైనికపాలన విషయమున అధికారిగా నుండదగినవాడు. ॥౩౯॥

39.May the commander of the army, who with surpassing vigour pierces in the battles the families of the enemies, is pitiless, wild with anger, unconquerable by foes, conqueror of the enmy's forces, unequalled in fight, and victor, protect our armies.

౪౦. ఇంద్ర ఆసా మిత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౪౦ ఇన్ద్రఽ ఆసాం నేతా బృహస్పతిర్దక్షిణా యజ్ఞః పురఽ ఏతు సోమః।
దేవసేనానామభిభఞ్జతీనాం జయన్తీనాం మరుతో యన్త్వగ్రమ్ ॥౪౦॥

ప.వి:- ఇన్ద్రః, ఆసామ్, నేతా, బృహస్పతిః, దక్షిణా, యజ్ఞః, పురః, ఏతు, సోమః, దేవసేనానామితి దేవ + సేనానామ్, అభిభఞ్జతీనామిత్యభి + భఞ్జతీనామ్, జయన్తీనామ్, మరుతః, యన్తు, అగ్రమ్ ॥౪౦॥

**పదార్థః** :- (ఇన్ద్రః) పరమైశ్వర్యయుక్తః సేనాపతిః శిక్షకః (ఆసామ్) ప్రత్యక్షాణామ్ (నేతా) నాయకః (బృహస్పతిః) బృహతామధికారాణామధ్యక్షః (దక్షిణా) దక్షిణస్యాం దిశి (యజ్ఞః) సంగంతా (పురః) పూర్వమ్ (ఏతు) గచ్ఛతు (సోమః) సేనాప్రేరకః (దేవసేనానామ్) విదుషాం సేనానామ్ (అభిభఞ్జతీనామ్)

శత్రుసేనా మభితో మర్దనమాచరన్తీనామ్ (జయన్తీనామ్) శత్రువిజయేనోత్కర్షన్తీనామ్ (మరుతః) వాయువద్ బలిష్ఠాః శూరవీరాః (యన్తు) గచ్ఛన్తు అగ్రమ్. ॥౪౦॥

**అన్వయః** :- యుద్ధేఽభిభఞ్జతీనాం జయన్తీనామాసాం దేవసేనానాం నేతేన్ద్రః పశ్చాద్యజ్ఞః పురో బృహస్పతి ర్దక్షిణా సోమ ఉత్తరస్యాం చైతు మరుతోఽగ్రం యన్తు. ॥౪౦॥

**భావార్థః** :- యదా రాజపురుషాః శత్రుభిర్యుయుత్సేయుస్తదా సర్వాసు దిక్ష్వధ్యక్షాన్ శూరవీరానగ్రతో భీరూనన్తః సంస్థాప్య భోజనాచ్ఛాదనవాహనాస్త్రశస్త్రయోగేన యుధ్యేరన్. తత్ర విద్వత్సేనాధీనా మూర్ఖసేనాః కార్యాః. తా విద్వాంసో వక్ష్యత్స్వోత్సాహయేయురధ్యక్షాశ్చపద్మవ్యూహాదిభిర్యోధయేయుః. ॥౪౦॥

**పదార్థము** :- యుద్ధములందు (అభిభంజతీనామ్) శత్రుసైన్యములను అన్నివైపులనుండి సంహరించుచు (జయన్తీనామ్) శత్రువులను జయించుటకొరకు ఉత్సాహమును పొందుచు (ఆసామ్) ఉన్నట్టి ఈ (దేవాసేనానామ్) విద్వాంసుల సైన్యముల (నేతా) నాయకుడు (ఇన్ద్రః) ఉత్తమైశ్వర్యశాలియగు ఉత్తమశిక్షకుడగు సేనాపతి వెనుక (యజ్ఞః) ఎల్లరను గలసికొనువాడు (పురః) ముందుగ (బృహస్పతిః) అధికారులెల్లరకును అధికారి (దక్షిణా) కుడివైపున మరియు (సోమః) సైన్యములకు ప్రేరణ అనగా ప్రోత్సాహము నిచ్చువాడు ఎడమవైపున (ఏతు) నడువవలెను. మరియు (మరుతః) వాయువేగముగల బలశాలురగు శూరవీరులు (అగ్రమ్) ముందుకు (యన్తు) పోవలెను. ॥౪౦॥

**భావార్థము** :- రాజపురుషులు శత్రువులతో యుద్ధమొనర్చదలచినప్పుడు అన్ని దిశలందు అధ్యక్షుడు, శూరవీరులను మున్ముందు, పిరికివారిని మధ్యననుంచుకొని భోజనాచ్ఛాదన, వాహన అస్త్ర శస్త్రాదులను పుష్కలముగ సమకూర్చుకొని యుద్ధమొనర్చవలెను విద్వాంసులగు వీరుల యధీనమున మూర్ఖసైన్యములనుంచి చక్కని యుపదేశవములచే, పద్మవ్యూహము మున్నగువాని రచనల నొనర్చి శత్రువులను నాశనమొనర్చ వలయును. ॥౪౦॥

40.In battle, the commander, the leader of these armies of the learned, the conqueror and demolisher of the enemies should march behind. The organiser of the army should march in front. The leader of big bands should march on the right. The encourager of the army should march on the left. The warriors swift like air should march ahead.

౪౧. ఇంద్రస్యేత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౪౧ ఇన్ద్రస్య వృష్ణో వరుణస్య రాజ్ఞఽ ఆదిత్యానా మ్మరుతాఌశర్ధఽ ఉగ్రమ్ ।

మహామనసాం భువనచ్యవానాం ఘోషో దేవానాం జయతాముదస్థాత్ ॥౪౧॥

ప.వి:- ఇన్ద్రస్య, వృష్ణః, వరుణస్య, రాజ్ఞః, ఆదిత్యానామ్ మరుతామ్, శర్ధః, ఉగ్రమ్, మహామనసామితి మహా + మనసామ్, భువనచ్యవానామితి భువన + చ్యవానామ్, ఘోషః, దేవానామ్, జయతామ్, ఉత్ అస్థాత్.॥౪౧॥

పదార్థః :-(ఇన్ద్రస్య) సేనాపతేః (వృష్ణః) వీర్యవతః (వరుణస్య) సర్వోత్కృష్టస్య (రాజ్ఞః) న్యాయవినయాదిభిః ప్రకాశమానస్య సర్వాధిష్ఠాతుః (ఆదిత్యానామ్) కృతాష్టాచత్వారింశద్వర్షప్రమిత బ్రహ్మచర్యాణామ్ (మరుతామ్) పూర్ణవిద్యాబలయుక్తానాం పురుషాణామ్ (శర్ధః) బలం సైన్యమ్ (ఉగ్రమ్) శత్రుభిః సోఢుమశక్యమ్ (మహామనసామ్) మహాన్తి మనాంసి విజ్ఞానాని యేషాం తేషామ్ (భువనచ్యవానామ్) యే భువనాన్యుత్తమాని గృహాణి చ్యవన్తే ప్రాప్నువన్తి తేషామ్, (ఘోషః) శౌర్యోత్సాహజనకో విచిత్రవాదిత్రస్వరాలాపశబ్దః (దేవానామ్) విదుషామ్ (జయతామ్) శత్రూన్ విజేతుం సమర్థానామ్ (ఉత్) (అస్థాత్) ఉత్తిష్ఠతు.॥౪౧॥

అన్వయః :-వృష్ణ ఇన్ద్రస్య వరుణస్య రాజ్ఞో భువనచ్యవానాం మహామనసాం జయతామాదిత్యానాం మరుతాం దేవానాముగ్రం శర్ధో ఘోషో యుద్ధారంభాత్ పూర్వముదస్థాత్.॥౪౧॥

భావార్థః :- సేనాధ్యక్షైః శిక్షాసమయే యుద్ధసమయే చ మనోహరైర్నిర్భయాదిభావజనకైః శబ్దితైర్వాదిత్రై ర్వీరా హర్షణీయాః యే దీర్ఘబ్రహ్మచర్యేణాధికవిద్యయా శరీరాత్మబలాస్త ఏవ యుద్ధసేనాస్వధికర్తవ్యాః.॥౪౧॥

పదార్థము :- (వృష్ణః) వీర్యవంతుడు (ఇన్ద్రస్య) సేనాపతి (వరుణస్య) సర్వోత్తముడు (రాజ్ఞః) న్యాయ, వినయములు మున్నగు ఉత్తమగుణములతో ప్రకాశించు సర్వాధిపతియగు రాజుయొక్క (భువనచ్యవానామ్) ఉత్తమ గృహములను ప్రాప్తించుకొను (మహామనసామ్) గొప్ప భావములుగలవారు (జయతామ్) శత్రువులను జయించుటకు సమర్థులు (ఆదిత్యానామ్) ౪౮ సంవత్సరముల పర్యంతము కఠినబ్రహ్మచర్యపాలన మొనర్చినవారు (మరుతామ్) పూర్ణ విద్యాబలయుక్తులైనవారు (దేవానామ్) విద్వాంసులు (ఉగ్రమ్) ఎవరు శత్రువులకు అసహాయశూరులో, వారి (శర్ధః) బలము (ఘోషః) శూరత్వము, ఉత్సాహము నుత్పన్నమొనర్చునట్టి విచిత్రమగు రణదుందుభి, భేరీ స్వరాలాపములు యుద్ధారంభమునకు పూర్వమే (ఉదస్థాత్) భయంకరముగ మ్రోగునుగాక! ॥౪౧॥

భావార్థము :- శిక్షణ మరియు యుద్ధ సమయమున మనోహర వీరభావముల నుత్పన్నమొనర్చు సమర వాద్యముల శబ్దములచే వీరుల నుత్సాహపరచవలెను. దీర్ఘకాల బ్రహ్మచర్యముచే శరీరాత్మల బలములను పుష్టిగా చేసికొనినవారిని మాత్రమే యోధసైన్యముల కధికారులుగ నియుక్తపరచబడవలెను. ॥౪౧॥

41. Musical instruments, to infuse valour and energy should be played upon before the commencement of the battle, by the learned soldiers of the powerful commander, and mighty king, who possess decent homes, lofty ideas, are able to conquer the enemies, have led a life of celibacy for forty eight years, are highly learned and strong, full of terrible power.

౮౯౨. ఉద్ధర్షయేత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తదేవాహ. మఱల నా విషయమే.

౮౯౨ ఉద్ధర్షయ మఘవన్నాయుధాన్యుత్సత్వనాం మామకానాం మనాంసి ।ఉద్వృ త్రహన్ వాజినాం వాజినాన్యుద్రథానాం జయతాం యన్తు ఘోషాః ॥౪౨॥

ప.విః-ఉత్, హర్షయ, మఘవన్నితి మఘ + వన్, ఆయుధాని, ఉత్, సత్వనామ్, మామకానామ్, మనాంసి, ఉత్, వృత్రహన్నితి వృత్ర + హన్, వాజినామ్, వాజినాని, ఉత్, రథానామ్, జయతామ్, యన్తు, ఘోషాః.॥౪౨॥

**పదార్థః** :-(ఉత్) (హర్షయ) ఉత్కర్షయ (మఘవన్) ప్రశస్తాని మఘాని ధనాని విద్యన్తే యస్య తత్సంబుద్ధౌ (ఆయుధాని) సమన్తాద్యుధ్యన్తే యైస్తాని (ఉత్) (సత్వనామ్) సేనాయాం సీదతాం ప్రాణినామ్ (మామకానామ్) మదీయానాం వీరాణామ్ (మనాంసి) అన్తఃకరణాని (ఉత్) (వృత్రహన్) మేఘహన్తా సూర్య ఇవ శత్రుహన్తః సేనాపతే (వాజినామ్) తురఙ్గాణామ్ (వాజినాని) శీఘ్రగమనాని (ఉత్) (రథానామ్) (జయతామ్) (యన్తు) గచ్ఛన్తు (ఘోషాః) శబ్దాః. ॥౪౨॥

**అన్వయః**:-సేనాస్థా జనాః స్వాధీశమేవం బ్రూయుః. హే వృత్రహన్! మఘవంస్త్వం మామకానాం సత్వ నామాయుధాన్యుద్ధర్షయ. మామకానాం సత్వానాం మనాంస్యుద్ధర్షయ. మామకానాం వాజినాం వాజినాన్యుద్ధర్షయ, భవత్కృపాతో మామకానాం జయతాం రథానాం ఘోషా ఉద్యన్తు ॥౪౨॥

**భావార్థః** :-సేనాపతిభిః శిక్షకైశ్చ యోద్ధౄణాం చిత్తాని నిత్యం హర్షణీయాని. సేనాఙ్గాని సమ్యగున్నీయ శత్రవో జేతవ్యాశ్చ. ॥౪౨॥

**పదార్థము** :- సైనికవీరులు తమ యధ్యక్షునితో నిట్లనవలెను :-(వృత్రహన్) మేఘములను సూర్యునివగిది శత్రువులను ఛిన్నాభిన్నమొనర్చు (మఘవన్) ప్రశంసనీయ శక్తియుక్తుడవగు ఓ సేనాపతీ! నీవు (మామకానామ్) మాయొక్క (సత్వానామ్) సైనికవీరులు (ఆయుధాని) చక్కగా యుద్ధమొనర్చగల

అస్త్రశస్త్రముల (ఉద్ధర్షయ) అభివృద్ధిపరచుము. మా సైనికుల (మనాంసి) మనస్సులను (ఉత్) ఉత్తమ హర్షవంతమైనదర్చుము. మాయొక్క (వాజినామ్) అశ్వముల (వాజినాని) శీఘ్రనడకలను (ఉత్) వృద్ధినొందించుము. మరియు మీ కృపచే మమ్ము (జయతామ్) విజయవంతులనుగ జేయునట్టి (రథానామ్) రథముల (ఘోషాః) గర్జనములు (ఉద్యన్తు) ధ్వనించుగాక! ॥౪౨॥

**భావార్థము :-** సేనాపతులు, శిక్షకులు సైనిక యోధుల చిత్తములను సదా హర్షితముగ నుంచవలెను. సేనాంగములను దృఢముగ ఉన్నతపరచి శత్రువుల జయించవలెను. ॥౪౨॥

O adorable commander, the slayer of foes, like the sun of clouds, make the weapons of our soldiers flourish, excite the spirits of our warring heroes, increase the speed of our horses, and let the din of conquering cars go upward!.

**౪౩. అస్మాకమిత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.**

**౪౩ అస్మాకమిన్ద్రః సమృతేషు ధ్వజేష్వస్మాకం యాఽ ఇషవస్తా జయన్తు ।**

**అస్మాకం వీరా ఉత్తరే భవన్త్వస్మాఁ౨॥ ఉ ఉ దేవా అవతా హవేషు ॥౪౩॥**

**ప. వి:- అస్మాకమ్, ఇన్ద్రః, సమృతేష్వితి సమ్ + ఋతేషు, ధ్వజేషు, అస్మాకమ్, యాః, ఇషవః, తాః, జయన్తు, అస్మాకమ్, వీరాః, ఉత్తర + ఇత్యుత్ + తరే, భవన్తు, అస్మాన్, ఊఁ ఇత్యూఁ, దేవాః, అవత, హవేషు ॥౪౩॥**

**పదార్థః :-** (అస్మాకమ్) (ఇన్ద్రః) ఐశ్వర్యకారకః సేనేశః (సమృతేషు) సమ్యక్ సత్యన్యాయప్రకాశక చిహ్నేషు (ధ్వజేషు) స్వవీరప్రతీతయే రథాద్యుపరి స్థాపితేషు విజాతీయచిహ్నేషు (అస్మాకమ్) (యాః)(ఇషవః) ప్రాప్తాః సేనాః (తాః) (జయన్తు) విజయిన్యో భవన్తు (అస్మాకమ్) (వీరాః) (ఉత్తరే) విజయానన్తరసమయే కుశలా విద్యమానజీవనాః (భవన్తు) (అస్మాన్) (ఉ) వితర్కే (దేవాః) విజిగీషవః (అవత) రక్షత (హవేషు) హ్వాయన్తి స్పర్ధన్తే పరస్పరం యేషు సంగ్రామేషు తేషు. ॥౪౩॥

**అన్వయః :-** హే దేవా! విద్వాంసో యూయమస్మాకం సమృతేషు ధ్వజేష్వధోదేశే య ఇన్ద్రోఽస్మాకం యా ఇషవః స తాశ్చ హవేషు జయన్త్వస్మాకం వీరా ఉత్తరే భవన్తు. అస్మాను సర్వత్రావత. ॥౪౩॥

**భావార్థః :-** సేనాజనైః సేనాపత్యాదిభిః స్వస్వరథాదిషు భిన్నం భిన్నం చిహ్నం సంస్థాపనీయమ్. యతోఽస్యాయం రథాదిరితి సర్వే జానీయుః. యథా వీరాణామశ్వానాం చాధికః క్షయో న

స్యాత్తథానుష్ఠాతవ్యమ్. కుతః? పరస్పరస్య పరాక్రమక్షయేణ ధ్రువో విజయో న భవతీతి విజ్ఞేయమ్.॥౪౩॥

**పదార్థము** :- (దేవాః) విజయము నాకాంక్షించు విద్వాంసులారా! మీరు (అస్మాకమ్) మా యొక్క (సమృతేషు) విజయవంతముగ సత్యన్యాయముల ప్రకాశపరచు చిహ్నముగల (ధ్వజేషు) స్వంత వీరవరుల నిశ్చయమునకై రథములు మున్నగు యానములపై ఒండొంటికి భిన్నరూపమున స్థాపించుకొనిన ధ్వజము మున్నగు చిహ్నముల క్రింద అనగా వాని ఛాయయందున్న ఏ (ఇన్ద్రః) సేనాపతి గలడో (అస్మాకమ్) ఆయన మాయొక్క (యాః) ఎట్టి (ఇషవః) సేనలు గలవో (తాః) అట్టి సేనలు (హవేషు) ద్వేషముతో శత్రువులను ఆహ్వానించు సంగ్రామములందు (జయన్తు) విజయమునొందుదుముగాక! (అస్మాకమ్) మాయొక్క (వీరాః) వీరులు (ఉత్తరే) విజయము తరువాత కుశలజీవనముగలవారు (భవన్తు) అగుదురుగాక! (అస్మాన్) మమ్ము (ఉ) నిశ్చయముగ సకల సమరసమయములందు (అవత) రక్షించుచుండుడు.॥౪౩॥

**భావార్థము** :-ఎవరిది ఏ వాహనమో తెలియుటకై సేనాపతులు మున్నగువారు తమ తమ రథాదులపై భిన్న భిన్నగుర్తులధ్వజములను స్థాపించవలెను. మరియు వీరులు, గజాశ్వములు అధికముగ నష్టముగా కుండునట్లు ప్రయత్నించవలయును. పరస్పర బలక్షయమువల్ల నిశ్చలవిజయము సంప్రాప్తించజాలదు. ॥౪౩॥

43.O learned persons desirous of victory, may the commander and our forces, under different flags, the emblems of justice and truth, win in the battle. May our brave men enjoy after war. May ye protect us every where at the time of war!.

౮౯౪. అమీషామిత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౮౯౪ అమీషాం చిత్తం ప్రతిలోభయన్తీ గృహాణాఙ్గాన్యప్వే పరేహి ।

అభి ప్రేహి నిర్దహ హృత్సు శోకైరన్ధేనామిత్రాస్తమసా సచన్తామ్ ॥౪౪॥

**ప. వి:-అమీషామ్, చిత్తమ్, ప్రతిలోభయన్తీతి ప్రతి + లోభయన్తీ, గృహాణ, అఙ్గాని, అప్వే, పరా, ఇహి, అభి, ప్ర, ఇహి, నిః, దహ హృత్స్వితి హృత్ + సు, శోకైః, అన్ధేన, అమిత్రాః, తమసా, సచన్తామ్. ॥౪౪॥**

**పదార్థః** :-(అమీషామ్) పరోక్షాణామ్ (చిత్తమ్) స్వాంతమ్ (ప్రతిలోభయన్తీ) ప్రత్యక్షే మోహయన్తీ (గృహాణ) (అఙ్గాని) సేనావయవాన్ (అప్వే) యాపవాతి శత్రుప్రాణాన్ హినస్తి తత్సమ్బుద్ధౌ. అపపూర్వాద్వాతే ర్వ్యేభ్యోఽపి దృశ్యత ఇతి క్విప్ అకారలోపశ్ఛాన్దసః (పరా) (ఇహి) దూరం గచ్ఛ (అభి)

(ప్ర)(ఇహి) అభిప్రాయం దర్శయ (నిర్దహ) నితరాం భస్మీకురు (హృత్సు) హృదయేషు (శోకైః) (అన్ధేన) ఆవరకేణ (అమిత్రాః) శత్రవః (తమసా) రాత్ర్యన్ధకారేణ (సచన్తామ్) సంయుజ్జన్తు.॥౪౪॥

**అన్వయః** :-హే అప్వే శూరవీరే రాజస్త్రి క్షత్రియే! అమీషాం చిత్తం ప్రతిలోభయన్తీ యాస్వసేనాస్తి తస్యా అఙ్గాని త్వం గృహాణ. అధర్మాత్ పరేహి స్వసేనామభిప్రేహి శత్రూన్ నిర్దహ యత ఇమేఽమిత్రా హృత్సు శోకైరన్ధేన తమసా సహ సచన్తాం సంయుక్తాస్తిష్ఠన్తు.॥౪౪॥

**భావార్థః** :-సభాపత్యాదిభిర్యథాఽతిప్రశంసితా హృష్టపుష్టా సాఙ్గోపాఙ్గా పురుషసేనా స్వీకార్యా తథా స్త్రీసేనా చ. యత్రావ్యభిచారిణ్యః స్త్రియస్తిష్ఠేయుస్తయా సేనయా శత్రవో వశే స్థాపనీయాః.॥౪౪॥

**పదార్థము** :-(అప్వే) శత్రువులప్రాణములహరించు రణచండికయగు క్షత్రియ వీరాంగణమణీ! (అమీషామ్) ఆ సేనల (చిత్తమ్) మనస్సులను (ప్రతిలోభయన్తీ) ప్రత్యక్షముగ మోహింపజేయు నీ సేనలయొక్క (అంగాని) అంగములను నీవు (గృహాణ) గ్రహించుము. అధర్మమునకు (పరేహి) దూరముగనుండి స్వసైన్యములకు (అభిప్రేహి) నీ స్వ అభిప్రాయమును చూపుము. మరియు శత్రువులను (నిర్దహ) నిరంతరము దహించుము. ఇందుచే ఈ (అమిత్రాః) శత్రుజనము (హృత్సు) తమ హృదయములలో (శోకైః) శోకములతో (అన్ధేన) ఆవరింపబడిన (తమసా) రాత్రియందలి అంధకారముతో గూడ (సచన్తామ్) కలిసిపోవుదురుగాక!॥౪౪॥

**భావార్థము** :-అతి ప్రశంసనీయ, శక్తిసామర్థ్యయుక్త, శూరవీరపురుష సైనికులను స్వీకరించున సభాపతి మున్నగువారు శూరవీరలగు మహిళాసైన్యమును గూడ స్వీకరించవలయును. వ్యభిచారిణులు లేనట్టి స్త్రీసైన్యముచే శత్రువులను వశమునందుంచుకొనవలయును. ॥౪౪॥

44.O queen, the slayer of foes, organise the bands of thy army, that bewilders the hearts of the forces of the enemy, remain aloof from sin, convey thy aim to thy soldiers, burn down the foes, whereby thy may abide in utter darkness with hearts full of griefs!.

౪౫. అవసృష్టేత్యస్యాప్రతిరథ ఋషిః, ఇషుర్దేవతా, ఆర్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౪౫ అవసృష్టా పరా పత శరవ్యే బ్రహ్మసంశితే ।

గచ్ఛామిత్రాన్ ప్ర పద్యస్వ మామీషాం కఞ్చనోచ్ఛిషః ॥౪౫॥

ప.వి:-అవసృష్టేత్యవ + సృష్టా, పరా, పత, శరవ్యే, బ్రహ్మసంశితే ఇతి బ్రహ్మ + సంశితే, గచ్ఛ, అమిత్రాన్, ప్ర, పద్యస్వ, మా, అమీషామ్, కమ్, చన, ఉత్, శిషః ॥౪౫॥

**పదార్థః** :-(అవసృష్టే) ప్రేరితా (పరా) (పత) యాహి (శరవ్యే) శరేషు బాణేషు సాధ్వీ స్త్రీ తత్సమ్బుద్ధౌ (బ్రహ్మసంశితే) బ్రహ్మభిశ్చతుర్వేదవిద్భిః ప్రశంసితే శిక్షయా సమ్యక్ తీక్ష్ణీకృతే (గచ్ఛ) (అమిత్రాన్) శత్రూన్ (ప్ర) (పద్యస్వ) ప్రాప్నుహి (మా) నిషేధే (అమీషామ్) దూరస్థానాం విరోధినామ్ (కమ్) (చన) కంచిదపి (ఉత్) (శిషః) ఊర్ధ్వం శిష్టం త్యజేత్. ॥౪౫॥

**అన్వయః** :-హే శరవ్యే బ్రహ్మసంశితే సేనాపిపత్ని! త్వమవసృష్టా సతీ పరాపతామిత్రాన్ గచ్ఛ తేషాం హననేన విజయం ప్రపద్యస్వామీషాం శత్రూణాం మధ్యే కంచన మోచ్ఛిషో హననేన వినా కంచిదపి మా త్యజేః. ॥౪౫॥

**భావార్థః** :- సభాపత్యాదిభిః యథా యుద్ధవిద్యయా పురుషాః శిక్షణీయాస్తథా స్త్రియశ్చ యథా వీరపురుషా యుద్ధం కుర్యు స్తథా స్త్రియో౽పి కుర్వన్తు యే శత్రవో యుద్ధే హతాః స్యుస్తదవశిష్టాశ్చ శాశ్వతే బన్ధనే కారాగృహే స్థాపనీయాః ॥౪౫॥

**పదార్థము** :- (శరవ్యే) విలువిద్యాకుశలుడు (బ్రహ్మసంశితే) వేదవేత్తలగు విద్వాంసులచే ప్రశంసలను, శిక్షణను పొందిన సేనాధిపతి పత్నీ, మహిళామణీ! నీవు (అవసృష్టా) ప్రేరణను ప్రాప్తించుకొని (పరా, పత) దూరమునకేగుము (అమిత్రాన్) శత్రువులతో (గచ్ఛ) తలపడి వారిని సంహరించి విజయమును (ప్ర, పద్యస్వ) ప్రాప్తించుకొనుము (అమీషామ్) ఆ దూరప్రదేశములందు నిలిచియున్న శత్రువులను చంపకుండా (కంచన) ఎవ్వరిని (మా, ఉచ్ఛిషః) వదలివేయకుము. ॥౪౫॥

**భావార్థము** :-సభాపతి మున్నగువారు యుద్ధవిద్యలందు పురుషులకు శిక్షణనిచ్చునట్లే మహిళలకును శిక్షణనిచ్చి వీరాంగనలనుగా నొనర్చవలెను. శత్రువులందు చావగా మిగిలిపోయినవారిని (పిరికివారిని) నిరంతరము కారాగారమున బంధించి యుంచవలెను. ॥౪౫॥

45.O wife of the commander-in-chief, expert in the art of archery, trained by a learned person knowing the vedas, on persuasion, go afar, encounter the foes, achieve victory by slaying them. Let not even one of those distant foes escape!.

**౪౬. ప్రేతా జయతేత్యస్యాప్రతిరథ ఋషిః, యోద్ధా దేవతా, విరాడార్ష్యనుష్టుప్ ఛన్దః గాంధారః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మఱల విషయమదియే.**

**౪౬ ప్రేతా జయతా నర౽ ఇన్ద్రో వః శర్మ యచ్ఛతు ।**

**ఉగ్రా వః సన్తు బాహవో౽నాధృష్యా యథా౽సథ ॥౪౬॥**

**ప. విః**– ప్ర, ఇత, జయత, నరః, ఇన్ద్రః, వః, శర్మ, యచ్ఛతు, ఉగ్రాః, వః, సన్తు, బాహవః, అనాధృష్యాః, యథా, అసథ ॥౪౬॥

**పదార్థః** :-(ప్ర)(ఇత) శత్రూన్ ప్రాప్నుత. అత్ర ద్వ్యచోఽతస్తిజ ఇతి దీర్ఘః (జయత) విజయధ్వమ్. అత్రాన్యేషామపి దృశ్యత ఇతి దీర్ఘః (నరః) నాయకాః (ఇన్ద్రః) శత్రూణాం దారయితా సేనాపతిః (వః) యుష్మభ్యమ్ (శర్మ) గృహమ్ (యచ్ఛతు) దదాతు (ఉగ్రాః) దృఢాః (వః) యుష్మాకమ్ (సన్తు) (బాహవః) భుజాః (అనాధృష్యాః) శత్రుభిర్ధర్షితుమయోగ్యాః (యథా) (అసథ) భవత.॥౪౬॥

**అన్వయః** :-హే నరో! యూయం యథా శత్రూనిత జయత ఇన్ద్రో వః శర్మ ప్రయచ్ఛతు వో బాహవ ఉగ్రాః సన్తు. అనాధృష్యా అసథ తథా ప్రయతధ్వమ్.॥౪౬॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యే శత్రూణాం విజేతారో వీరాస్స్యుస్తాన సేనాపతిర్ధనాన్నగృహ వస్త్రాదిభిః సతతం సత్కుర్యాత్ సేనాస్థా జనాశ్చ యథా బలిష్ఠాః స్యుస్తథా వ్యవహరేయుః.॥౪౬॥

**పదార్థము** :-(నః) అనేక విధములగు వ్యవహారములను నిర్వర్తించుకొను మానవులారా! మీరు (యథా) శత్రువుల నెట్లు (ఇత) ప్రాప్తించుకొందురో అట్లే వారిని (జయత) జయించుడు. మరియు (ఇన్ద్రః) శత్రువుల విదీర్ణ [నిస్తేజ] మొనర్చు సేనాపతి (వః) మీకొరకు (శర్మ) గృహము (ప్ర, యచ్ఛతు) ఇచ్చుగాక! (వః) మీయొక్క (బాహవః) భుజవములు (ఉగ్రాః) దృఢవముగా (సన్తు) అగుగాక! (అనాధృష్యాః) శత్రుతిరస్కారములేనట్లు (అసథ) అగుడు. అట్టి ప్రయత్నము నొనర్చుడు.॥౪౬॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు. శత్రువులనిర్జించగలవీరులను సేనాపతి అన్నము, వస్త్రములు, ధనాదులనిచ్చి నిరంతరము సత్కరించుచుండవలయును, సైనికులెల్లరును బలపరాక్రమ వంతులగునట్లు వ్యాయామము, అస్త్ర శస్త్రప్రయోగమునందు నేర్పరులగునట్లు ప్రయత్నించ వలెను.॥౪౬॥

46.Advance, O heroes, win the day. May the commander of the army provide ye with shelter, food and clothes, Exceeding mighty be your arms, that none may threaten or injure you!.

౪౭. అసౌ యేత్యస్యాప్రతిరథ ఋషిః, మరుతో దేవతాః, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౪౭ అసౌ యా సేనా మరుతః పరేషామభ్యైతి న ఓజసా స్పర్ధమానా। తాం గూహత తమసాపవ్రతేన యథామీ అన్యో అన్యన్న జానన్॥౪౭॥

ప.వి:-అసౌ, యా, సేనా, మరుతః, పరేషామ్, అభి, ఆ, ఏతి, నః, ఓజసా, స్పర్ధమానా, తామ్, గూహత, తమసా, అపవ్రతేనేత్యప + వ్రతేన, యథా, అమీ ఇత్యమీ, అన్యః, అన్యమ్, న, జానన్ ॥౪౭॥

**పదార్థః** :-(అసౌ) (యా) (సేనా) (మరుతః) ఋత్విజో విద్వాంసః (పరేషామ్) శత్రూనామ్ (అభి) ఆభిముఖ్యే (ఆ) సర్వతః (ఏతి) ప్రాప్నోతి (నః)(అస్మాకమ్) (ఓజసా) బలేన (స్పర్ధమానా) ఈర్ష్యన్తీ (తామ్) (గూహత) సంవృణుత (తమసా) అన్ధకారేణ శతఘ్న్యాద్యుత్థధూమేన మేఘపర్వతాకారేణాస్త్రాది ధూమేన వా (అపవ్రతేన) అనియమేన పరుషకర్మణా (యథా) (అమీ) (అన్యః) (అన్యమ్) (న) నిషేధే (జానన్).॥౪౭॥

**అన్వయః** :-హే మరుతో! యూయం యాసౌ పరేషాం స్పర్ధమానా సేనౌజసా నోఽస్మానభ్యేతి తామపవ్రతేన తమసా గూహత. అమీ శత్రుసేనాస్థా జనా యథా అన్యోఽన్యం న జానన్ తథా విక్రమధ్వమ్.॥౪౭॥

**భావార్థః** :-యదా యుద్ధాయ శత్రుసేనాసు ప్రాప్తాసు యుద్ధమాచరేత్ తదా సర్వతః శస్త్రాస్త్రప్రహారోత్థ ధూమధూల్యాదినా తా ఆచ్ఛాద్య యథైతే పరస్పరమపి న జానీయుస్తథా సేనాపత్యాదిభిర్విధేయమ్.॥౪౭॥

**పదార్థము** :-(మరుతః) ప్రతి ఋతువునందు యజ్ఞముల నొనర్చు విద్వాంసులారా! మీరు (యా) ఏ (అసౌ) అట్టి (పరేషామ్) శత్రువుల (స్పర్ధమానా) ద్వేషించుకొనుచు (సేనా) సైన్యములు (ఓజసా) బలముతో (నః) మా (అభి,ఆ,ఏతి) అన్నివైపులనుండి మా ఎదుటికి వచ్చునో అప్పుడు (తామ్) వారిని (అపవ్రతేన) ఛేదనరూప కఠినచర్యద్వారా మరియు (తమసా) తోపులు మున్నగు శస్త్రములవల్ల రేపిన ధూళి, ధూమ్రమేఘములచే (గూహత) కప్పివేయుడు (అమీ) ఈ శత్రుసైనికులు (యథా) ఎట్లు (అన్యః అన్యమ్) ఒండొరులు (న జానన్) గుర్తించకుండునట్లు పరాక్రమించుడు.॥౪౭॥

**భావార్థము** :-యుద్ధము జరుగునప్పుడు శత్రువులపై వివిధ అస్త్రశస్త్రములు ప్రయోగించి వాని ధూళి, ధూమముల పొగచే శత్రువులు ఉక్కిరిబిక్కిరియై పరస్పరము గుర్తించుకొనకుండునట్టి అస్త్రప్రయోగములను సేనాధ్యక్షుడొనర్పజేయవలెను. ॥౪౭॥

47.O learned persons, the army of our enemies, that comes against us in a jealous mood, with its might, meet ye and enwrap it harshly in the darkness of the smoke arising out of the use of cannons so that they may not recognise one another!.

**౪౮. యత్రబాణా ఇత్యస్యాప్రతిరథ ఋషిః, ఇన్ద్రబృహస్పత్యాదయో దేవతాః, పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మళల వా విషయమే.**

**౪౮ యత్ర బాణాః సమ్పతన్తి కుమారా విశిఖాఽఇవ। తన్నఽఇన్ద్రో**

**బృహస్పతిరదితిః శర్మ యచ్ఛతు విశ్వాహా శర్మ యచ్ఛతు ॥౪౮॥**

ప.విః-యత్ర, బాణాః, సంపతన్తీతి సమ్ + పతన్తి, కుమారాః, విశిఖా ఇవేతి విశిఖాః + ఇవ, తత్, నః, ఇన్ద్రః, బృహస్పతిః, అదితిః, శర్మ, యచ్ఛతు, విశ్వాహా, శర్మ, యచ్ఛతు ॥౪౮॥

**పదార్థః** :-(యత్ర) యస్మిన్ సంగ్రామే (బాణాః) యే బణన్తి శబ్దాయన్తే తే శస్త్రాస్త్రసమూహాః (సంపతన్తి) (కుమారాః) అతిచపలా వేగవన్తో బాలకాః (విశిఖా ఇవ) యథా విగతశిఖా వివిధశిఖా వా (తత్) తత్ర (నః) అస్మభ్యమ్ (ఇన్ద్రః) సేనాపతిః (బృహస్పతిః) బృహత్యాః సభాయాః సేనాయా వా పాలకః (అదితిః) అఖణ్డితా సభాసదలఙ్కృతా సభా (శర్మ) శరణం సుఖమ్ (యచ్ఛతు) (విశ్వాహా) సర్వాణ్యహాని దినాని (శర్మ) సుఖసాధకం గృహమ్. (యచ్ఛతు) దదాతు.॥౪౮॥

**అన్వయః** :-యత్ర సంగ్రామే విశిఖా కుమారా ఇవ బాణాః సంపతన్తి తద్ బృహస్పతిరిన్ద్రఃశర్మ యచ్ఛత్వదితిశ్చ విశ్వాహా నః శర్మ యచ్ఛతు.॥౪౮॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యథా బాలకా ఇతస్తతో ధావన్తి తథా యుద్ధసమయే యోద్ధారోఽపి చేష్టన్తామ్. యే యుద్ధే క్షతాః క్షీణాః శ్రాన్తాః క్లాన్తాశ్ఛిన్నభిన్నాంగా మూర్ఛితాశ్చ భవేయుస్తాన్ యుద్ధభూమేః సద్య ఉత్థాప్య సుఖాలయం నీత్వౌషధాదీని కృత్వా స్వస్థాన్ కుర్యుః. యే చ మ్రియేరం స్తాన్విధివద్దహేయుః రాజజనాస్తేషాం మాతృపితృస్త్రీబాలకాదీనాం సదా రక్షాం కుర్యుః.॥౪౮॥

**పదార్థము** :-(యత్ర) ఏ సంగ్రామమున (విశిఖా ఇవ) పిలక [జుట్టు] లేని లేక అనేక పిలకలు గలిగిన (కుమారాః) బాలురవలె (బాణాః) బాణములు మున్నగు అస్త్రశస్త్రముల సమూహము (సమ్పతన్తి) చక్కగా కురియునో (తత్) అచ్చట (బృహస్పతిః) మహాసభను లేక సైన్యమును పాలించునట్టి (ఇన్ద్రః) సేనాపతి (శర్మ) ఆశ్రయము మరియు సుఖములను (యచ్ఛతు) ఇచ్చుగాక! (అదితిః) సభాసదులచే సదా శోభాయమాన మగు సభ (విశ్వాహా) ఎల్లకాలములందును (నః) మాకొరకు (శర్మ) సుఖములను సిద్ధింపజేయు గృహమును (యచ్ఛతు) ఇచ్చునుగాక!॥౪౮॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు. బాలురు అటునిటు పరుగెత్తునట్లు యోధులు యుద్ధసమయమందట్టి చేష్టల నొనర్చవలెను. రణభూమియందు గాయపడిన, క్షీణించిన, అలసిపోయిన, రక్తసిక్తమైన, ఛిన్నాభిన్నమైన, తెగిన, ఛేదించబడిన అంగములుగలవారైన, మూర్ఛితులైనవారి నెల్లరను సత్వరమే యుద్ధభూమినుండి తొలగించి చికిత్సాలయమునకు చేర్చి ఔషధములు, కట్లు, పట్లు మున్నగు పరిచర్యలద్వారా స్వస్థ్యపరచవలెను. మరణించినవారికి విధిపూర్వకముగ దహనసంస్కారముల నొనర్చవలెను. రాజపురుషులు వారి వృద్ధమాతాపితరులు, భార్య, సంతానము మున్నగువారిని చక్కగా పోషించవలయును. ॥౪౮॥

**48.There where the flights of arrows fall like boys whose locks are unshorn, may the Commander, the protector of the big army grant us shelter, may the entire Assembly adorned with members, grant us happy home through all our days.**

౪౯.మర్మాణీత్యస్యాప్రతిరథ ఋషిః, సోమవరుణదేవా దేవతాః, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౪౯ మర్మాణి తే వర్మణా ఛాదయామి సోమస్త్వా రాజామృతేనాను వస్తామ్।
ఉరోర్వరీయో వరుణస్తే కృణోతు జయన్తం త్వాను దేవా మదన్తు ॥౪౯॥

ప.విః-మర్మాణి, తే, వర్మణా, ఛాదయామి, సోమః, త్వా, రాజా, అమృతేన, అను, వస్తామ్, ఉరోః, వరీయః, వరుణః, తే, కృణోతు జయన్తమ్, త్వా, అను, దేవాః, మదన్తు ॥౪౯॥

పదార్థః :-(మర్మాణి) యాని తాడితాని సన్తి సద్యో మరణజనకాన్యఙ్గాని (తే) తవ (వర్మణా) దేహ రక్షకేన (ఛాదయామి) అపవృణోమి (సోమః) సోమ్యగుణైశ్వర్యసంపన్నః (త్వా) త్వామ్ (రాజా) విద్యాన్యాయవినయాదిభిః ప్రకాశమానః (అమృతేన) సర్వరోగనివారకేణామృతాత్మకేనౌషధేన (అను) పశ్చాత్ (వస్తామ్) ఆచ్ఛాదయతామ్ (ఉరోః) బహుగుణైశ్వర్యాత్ (వరీయః) అతిశయితం బహ్వైశ్వర్యమ్ (వరుణః) సర్వత ఉత్కృష్టః (తే) తుభ్యమ్ (కృణోతు) (జయన్తమ్) దుష్టాన్ పరాజయన్తమ్ (త్వా) త్వామ్ (అను) (దేవాః) విద్వాంసః (మదన్తు) ఉత్సాహయన్తు.॥౪౯॥

అన్వయః :-హే యోద్ధః శూరవీర! అహం తే మర్మాణి వర్మణా ఛాదయామి, అయం సోమో రాజాఽమృతేన త్వానువస్తామ్. వరుణస్త ఉరోర్వరీయః కృణోతు జయన్తం త్వా దేవా అను మదన్తు.॥౪౯॥

భావార్థః :-సేనాపత్యాదిభిః సర్వేషాం యోద్ధౄణాం శరీరాదిరక్షణం సర్వతః కృత్వైతే సతతం ప్రోత్సాహనీయా అనుమోదనీయాశ్చ యతో విశ్వతో విజయం లభేరన్.॥౪౯॥

పదార్థము :-సమరమొనర్చు శూరవీరులారా! నేను (తే) నీయొక్క (మర్మాణి) మర్మస్థలములను [దెబ్బతగిలిన తక్షణమే మరణము ప్రాప్తించు అంగములను] (వర్మణా) దేహరక్షణనొనర్చు కవచముతో (ఛాదయామి) కప్పివేయుదును. ఈ (సోమః) శాంతి మున్నగు గుణములతోగూడిన (రాజా) విద్య, వినయము, న్యాయము మున్నగు గుణములతో ప్రకాశవంతుడగు రాజు (అమృతేన) సకలరోగముల నివారించు, అమృత రూప ఓషధులచే (త్వా) నిన్ను (అనువస్తామ్) తరువాత కప్పివేయునుగాక! (వరుణః) సర్వోత్తమగుణ సహితుడగు రాజు (తే) నిన్ను (ఉరోః) అనేక గుణములు, ఐశ్వర్యములచేతను (వరీయః) సంపూర్ణైశ్వర్యవంతునిగ (కృణోతు) ఒనర్చునుగాక! మరియు (జయన్తమ్) దుష్టులను పరాజయమొనర్చుచు (త్వా) నిన్ను (దేవాః) విద్వాంసులు (అనుమదన్తు) ఆమోదింతురుగాక! అనగా ప్రోత్సాహపరతురుగాక!॥౪౯॥

**భావార్థము** :- సేనాపతి మున్నగువారు యుద్ధకర్తలెల్లర అన్నివిధముల శరీరశక్తులను పెంపొందించ వలయును. మరియు వారిని సదా ఉత్సాహపరచుచుండినచో నిశ్చయముగ విజయప్రాప్తికలుగును. ॥౪౯॥

49.O valiant warrior, thy vital parts I cover with armour. May this calm, considerate king protect thee with effeacious medicine. May the exalted King give thee what is more than ample. May the learned encourage thee in thy triumph over the wicked!.

**౫౦౦. ఉదేనమిత్యస్యాప్రతిరథ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.**

౫౦౦ ఉదేనముత్తరాం నయాగ్నే ఘృతేనాహుత। రాయస్పోషేణ
సగ్ంసృజ ప్రజయా చ బహుం కృధి ॥౫౦॥

**ప. వి:- ఉత్, ఏనమ్, ఉత్తరామిత్యుత్ + తరామ్, నయ, అగ్నే, ఘృతేన, ఆహుతేత్యా + హుత, రాయః, పోషేణ, సమ్, సృజ, ప్రజయేతి ప్ర + జయా, చ, బహుమ్, కృధి ॥౫౦॥**

**పదార్థః** :-(ఉత్) (ఏనమ్) విజేతారమ్ (ఉత్తరామ్) ఉత్కృష్టతయా తరన్తి యయా సేనయా తాం ప్రాప్తవిజయామ్ (నయ) (అగ్నే) ప్రకాశమయ (ఘృతేన) ఆజ్యేన (ఆహుత) తృప్తిం ప్రాప్త (రాయః) రాజ్యశ్రియః (పోషేణ) పోషణేన (సమ్) సమ్యక్ (సృజ) యోజయ (ప్రజయా) బహుసన్తానైః (చ) (బహుమ్) అధికం కర్మ (కృధి) కురు. ॥౫౦॥

**అన్వయః** :-హే ఘృతేనాహుతాగ్నే సేనాపతే! త్వమేనముత్తరామున్నయ రాయస్పోషేణ సంసృజ ప్రజయా చ బహుం కృధి. ॥౫౦॥

**భావార్థః** :-యః సేనాధికారీ భృత్యో వా ధర్మ్యేణ యుద్ధేన దుష్టాన్ విజయేత తం సభాసేనాపతయో ధనాదినా బహుధా సత్కుర్యుః. ॥౫౦॥

**పదార్థము** :-(ఘృతేన, ఆహుత) ఘృతముచే తృప్తిజెందిన (అగ్నే) ప్రకాశయుక్తుడవగు ఓ సేనాపతీ! నీవు (ఏనమ్) ఈ విజయమునొందిన వీరుని (ఉత్తరామ్) ఉత్తమముగ రణక్షేత్రమునందు తెగించిపోరాడి విజయమును సాధించిన సైన్యములను (ఉత్ నయ) ఉన్నతఅధికారమునకు చేర్చుము (రాయః, పోషేణ) రాజ్యలక్ష్మియొక్క పుష్టితో (సమ్, సృజ) చక్కగా సంయుక్తమొనర్చుము (చ) మరియు (ప్రజయా) ఉత్తమసంతానముతో (బహుమ్) ఆధిక్యతతో ప్రాప్తిని (కృధి) కలిగించుము. ॥౫౦॥

**భావార్థము** :- ధర్మయుక్తముగ యుద్ధమొనర్చి దుష్టులపై విజయము సాధించిన సేనాపతులను, సైన్యములను రాజా, సభాసదులు ఉత్తమముగ సత్కరించవలెను. ॥౫౦॥

50.O Commander of the army, well satisfied with ghee, lead this conquering hero to a high position; vouchsafe him growth of riches and multiply his progeny!.

౯౦౧. ఇంద్రేమమిత్యస్యాప్రతిరథ ఋషిః, ఇంద్రో దేవతా, ఆర్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే

౯౦౧ ఇన్ద్రేమం ప్రతరాం నయ సజాతానామసద్వశీ ।

సమేనం వర్చసా సృజ దేవానాం భాగదా౨ అసత్ ॥౫౧॥

ప. విః– ఇన్ద్ర, ఇమమ్, ప్రతరామితి ప్ర + తరామ్, నయ, సజాతానామితి స + జాతానామ్, అసత్, వశీ, సమ్, ఏనమ్, వర్చసా, సృజ, దేవానామ్, భాగదా ఇతి భాగ + దాః, అసత్. ॥౫౧॥

పదార్థః :-(ఇన్ద్ర) సుఖానాం ధారక (ఇమమ్) విజయమానమ్ (ప్రతరాం) ప్రతరన్త్యుల్లఙ్ఘయన్తి శత్రుబలాని యయా నీత్యా తామ్ (నయ) ప్రాపయ (సజాతానామ్) సమానజన్మనామ్ (అసత్) భవేత్ (వశీ) జితేన్ద్రియః (సమ్) సమ్యక్ (ఏనమ్) (వర్చసా) విద్యాప్రకాశేన (సృజ) యుఙ్గ్ధి (దేవానామ్) విదుషాం యోద్ధౄణాం మధ్యే (భాగదాః) అంశప్రదః (అసత్). ॥౫౧॥

**అన్వయః** :-హే ఇన్ద్ర! త్వం సజాతానాం దేవానామిమం ప్రతరాం నయ యతోఽయం వశ్యసత్. ఏనం వర్చసా సంసృజ యతోఽయం భాగదా అసత్. ॥౫౧॥

**భావార్థః** :-యుద్ధే భృత్యాః శత్రూణాం యాన్ పదార్థాన్ ప్రాప్నుయుః తాన్ సర్వాన్ సభాపతీ రాజా న స్వీకుర్యాత్. కింతు తేషాం మధ్యాద్ యథాయోగ్యం సత్కారాయ యోద్ధృభ్యో షోడశాంశంప్రదద్యాద్యావతః పదార్థాన్ భృత్యాః ప్రాప్నుయుస్తావతాం షోడశాంశం రాజ్ఞే ప్రదద్యుః. యది సర్వే సభేశాదయో జితేన్ద్రియాః స్యుస్తర్హ్యేతేషాం కదాపి పరాజయో న స్యాత్. యది సభేశః స్వహితం చికీర్షేత్తర్హి యోద్ధౄణామంశం స్వయం న స్వీకుర్యాత్. ॥౫౧॥

**పదార్థము** :-(ఇన్ద్ర) సుఖముల ధారణమొనర్చు ఓ సేనాపతీ! నీవు (సజాతానామ్) సమవయస్కులు (దేవానామ్) విద్వాంసులగు యోధులందు (ఇమమ్) విజయమును పొందిన ఈ వీరజనమును (ప్రతరామ్) శత్రుబలమును క్షీణింపజేయు నీతిని (నయ) సాధించుము. దీనిచే వీరు (వశీ) జితేంద్రియులు (అసత్) అగుదురుగాక! మరియు (ఏనమ్) వీరిని (వర్చసా) విద్యాప్రకాశముచే (సమ్, సృజ) సంబంధపరచుము. ఇందుచే వీరు (భాగదాః) వేర్వేరుగా యథాయోగ్యముగ భాగములనిచ్చువారు (అసత్) అగుదురుగాక! ॥౫౧॥

**భావార్థము** :- యుద్ధములందు సైనిక భృత్యజనము శత్రువులనుండి పొందిన ధనములను రాజు, సభాపతి మున్నగువారు స్వీకరించరాదు. కాని దానినుండి యోధజనులకు సత్కారపూర్వకముగ పదహారవభాగమును పంపిణీ జేయవలెను. ఆ భృత్యజనము పొందినభాగమునుండి పదునారవభాగమును రాజునకీయవలెను జితేంద్రియుడగు సభాపతి మున్నగువారికి పరాజయ మెన్నడును గలుగదు. తమహితమును గోరు సభాపతులు పోరాడిన భృత్యవర్గపు భాగము నెప్పుడును స్వీకరించరాదు. ॥౫౧॥

51.O Commander, lead to eminence, this hero amongst the learned of the same age. May he have control over his passions. Vouchsafe him lustre of knowledge, so that he may give each his share!.

౯౦౨. యస్య కుర్మ ఇత్యస్యాప్రతిరథ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ పురోహితర్త్విగ్యజమానకృత్యమాహ.

పురోహిత ఋత్విగ్యజమానుల కృత్యములు చెప్పబడుచున్నవి.

౯౦౨ యస్య కుర్మో గృహే హవిస్తమగ్నే వర్ధయా త్వమ్।
తస్మై దేవా అధిబ్రువన్నయం చ బ్రహ్మణస్పతిః ॥౫౨॥

**ప. వి**:- యస్య, కుర్మః, గృహే, హవిః, తమ్, అగ్నే, వర్ధయ, త్వమ్, తస్మై, దేవాః, అధి, బ్రువన్, అయమ్, చ, బ్రహ్మణః, పతిః ॥౫౨॥

**పదార్థః** :-(యస్య) రాజ్ఞః (కుర్మః) సమ్పాదయామః (గృహే) (హవిః) హోమమ్ (తమ్) (అగ్నే) విద్వన్ పురోహిత (వర్ధయ) అత్రాన్యేషామపీతి దీర్ఘః (త్వమ్) (తస్మై) తం యజమానమ్, అత్ర వ్యత్యయేన చతుర్థీ (దేవాః) దివ్యగుణా ఋత్విజః (అధి) (బ్రువన్) అధికం బ్రువన్తు. లేట్ప్రయోగోఽయమ్ (అయమ్) (చ) (బ్రహ్మణః) వేదస్య (పతిః)పాలకో యజమానః. ॥౫౨॥

**అన్వయః** :-హే అగ్నే! వయం యస్య గృహే హవిష్కుర్మస్తం త్వం వర్ధయ. దేవాస్తస్మా అధి బ్రువన్. అయం బ్రహ్మణస్పతిశ్చ తానధిబ్రవీతు. ॥౫౨॥

**భావార్థః** :- పురోహితస్య తత్ కర్మాస్తి యతో యజమానస్యోన్నతిస్స్యాద్యో యస్య యాదృశం యావచ్చ కర్మ కుర్యాత్ తస్మై తాదృశం తావదేవ మాసికం వేతనం దేయమ్ సర్వే విద్వాంసః సర్వాన్ ప్రతి సత్యముపదిశేయూ రాజా చ ॥౫౨॥

**పదార్థము** :- (అగ్నే) విద్వాంసుడవగు ఓ పురోహితా! మేము (యస్య) ఏ రాజుయొక్క (గృహే)

గృహమునందు (హవిః) హోమము (కుర్మః) చేయుదుమో (తమ్) దానిని (త్వమ్) నీవు (వర్ధయ) వృద్ధిపరచుము [ప్రోత్సహించుము]. మరియు (దేవాః) దివ్యగుణములు గల ఋత్విజులు (తస్మై) వానికి (అధి, బ్రువన్) అధికముగ ఉపదేశించవలెను (చ) మరియు (అయమ్) ఇట్టి (బ్రహ్మణః) వేదములను (పతిః) యజమానియును వారికి శిక్షణను ఈయవలయును.॥౫౨॥

**భావార్థము** :- పురోహితుడు యజమానికి ఉన్నతి గలుగునట్టి కార్యములనే చేయవలయును. ఎవడు ఎవనికి ఎంత ఎట్టి పనిని యొనర్చునో వారికి అదేవిధముగ నియమపూర్వకముగ అంతకు తగిన మాసిక వేతనము నీయవలయును. విద్వాంసులెల్లరును సర్వజనులకు సత్యమునుగూర్చి ఉపదేశించవలయును. రాజు సైతము ప్రజలకు సత్యోపదేశ మొనర్చవలయును.॥౫౨॥

52.O learned Family priest prosper the King in whose house we perform Homa (offer oblation). Mat ye learned teach him, and may the master of the vedas teach them!.

౯౦౩.ఉదుత్వేత్యస్యాప్రతిరథ ఋషిః, అగ్నిర్ దేవతా, విరాడార్ష్యనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ సభాపతివిషయమాహ. సభాపతి విషయము.

౯౦౩ ఉదు త్వా విశ్వే దేవా౨ అగ్నే భరన్తు చిత్తిభిః ।
స నో భవ శివస్త్వ౧ సుప్రతీకో విభావసుః ॥౫౩॥

ప.విః- ఉత్, ఊం ఇత్యూం, త్వా, విశ్వే, దేవాః, అగ్నే, భరన్తు, చిత్తిభిరితి చిత్తి + భిః, సః, నః, భవ, శివః, త్వమ్, సుప్రతీక ఇతి సు + ప్రతీకః, విభావసురితి విభా + వసుః ॥౫౩॥

**పదార్థః** :-(ఉత్)(ఉ)(త్వా) త్వామ్ (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః(అగ్నే) విద్వన్ (భరన్తు) ధరన్తు (చిత్తిభిః) సంజ్ఞానైః (సః) (నః) అస్మభ్యమ్ (భవ) (శివః) మఙ్గలకారీ (త్వమ్) (సుప్రతీకః) సుష్ఠు ప్రతీకం ప్రతీతికరం జ్ఞానం యస్య (విభావసుః) యో వివిధాసు భాసు విద్యాప్రకాశేషు వా వసతి సః.॥౫౩॥

**అన్వయః** :-హే అగ్నే సభేశ! యం త్వా విశ్వే దేవాశ్చిత్తిభిరుద్భరన్తు స ఉ త్వం నః శివః సుప్రతీకో విభావసుర్భవ.॥౫౩॥

**భావార్థః** :-యే యేభ్యో విద్యాం దద్యుస్తే తేషాం సేవకాః స్యుః.॥౫౩॥

**పదార్థము** :-(అగ్నే) విద్వాంసుడవగు ఓ సభాపతీ! (త్వా) నిన్ను ఏ (విశ్వే) సకల (దేవాః) విద్వాంసులు (చిత్తిభిః) ఉత్తమోత్తమ జ్ఞానములచే (ఉద్భరన్తు) ఉత్కృష్టముగ ధారణము మరియు

ఉద్ధారణమొనర్తురో, అనగా తమ శిక్షణచే ఈ యజ్ఞానమును దూరమొనర్చెదరో (సః, ఉ) (త్వమ్) నీవు (నః) మాకొరకు (శివః) శుభకారకుడవు.(సుప్రతీకః) ఉత్తమముగ ప్రసిద్ధపరచునట్టి జ్ఞానముతో (విభావసుః) పలు విధములగు విద్యాసిద్ధాంతములందు స్థిరుడవు (భవ) అగుము.॥౫౩॥

భావార్థము :- విద్యలను గరపువారికి విద్యార్థులు సేవకులైయుండుట యోగ్యము.॥౫౩॥

53.O learned King, may all the intellectuals bear and lift thee up ward. May thou endowed with convincing knowledge, shining with the light of mastery of various subjects, be propitious unto us!.

౬౦౪.పఞ్చ దశ ఇత్యస్యాప్రతిరథ ఋషిః, దిగ్ దేవతా, స్వరాడార్షీఛన్దః, ధైవతః స్వరః.

అథ స్త్రీపురుషకృత్యమాహ. స్త్రీ పురుషుల కర్తవ్యములు.

౬౦౪ పఞ్చ దిశో దైవీర్యజ్ఞమవన్తు దేవీరపామతిం దుర్మతిం బాధమానాః।రాయస్పోషే యజ్ఞపతిమాభజన్తీ రాయస్పోషేఽ అధి యజ్ఞోఽ అస్థాత్ ॥౫౪॥

ప.విః- పఞ్చ, దిశః, దైవీః, యజ్ఞమ్, అవన్తు, దేవీః, అప, అమతిమ్, దుర్మతిమితి దుః + మతిమ్, బాధమానాః, రాయః, పోషే, యజ్ఞపతిమితి యజ్ఞ + పతిమ్, ఆభజన్తీరిత్యా + భజన్తీః, రాయః, పోషే, అధి, యజ్ఞః, అస్థాత్.॥౫౪॥

పదార్థః :-(పఞ్చ) పూర్వాదిచతస్రో మధ్యస్థా చైకా (దిశః) ఆశాః (దైవీః) దేవానామిమాః (యజ్ఞమ్) సంగంతవ్యం సత్కర్తవ్యం వా గృహాశ్రమమ్. (అవన్తు) కామయన్తామ్ (దేవీః) దివ్యా విదుష్యో బ్రహ్మచారిణ్యః స్త్రియః (అప) (అమతిమ్) అజ్ఞానమ్ (దుర్మతిమ్) దుష్టాం ప్రజ్ఞామ్ (బాధమానాః) నిస్సారయన్త్యః (రాయః) ధనస్య (పోషే) పోషణే (యజ్ఞపతిమ్) రాజ్యపాలకమ్ (ఆభజన్తీః) సమన్తాత్ సేవమానాః (రాయః) శ్రియః (పోషే) పుష్టౌ (అధి)(యజ్ఞః) గృహాశ్రమః (అస్థాత్) తిష్ఠేత్.॥౫౪॥

అన్వయః :- అపామతిం దుర్మతిం బాధమానా దైవీర్దేవీః పఞ్చ దిశ ఇవ విస్తృతా రాయస్పోషే యజ్ఞపతిం స్వామినమాభజన్తీర్యజ్ఞమవన్తు యతోఽయం యజ్ఞో రాయస్పోషేఽధ్యస్థాదధితిష్ఠేత్.॥౫౪॥

భావార్థః :- అత్ర లుప్తోపమాలంకారః. యత్ర గృహాశ్రమే ధార్మికా విద్వాంసః ప్రశంసితా విదుష్య స్త్రియశ్చ సన్తి, తత్ర దుర్వ్యసనాని న జాయన్తే యది సర్వాసు దిక్షు ప్రశంసితాః ప్రజాభవేయుస్తర్హి రాజ్ఞః సమీపేఽన్యేభ్యోఽధికైశ్వర్యం స్యాత్. ॥౫౪॥

**పదార్థము** :-(అప, అవుతిమ్) అత్యంత అజ్ఞానము మరియు (దుర్మతిమ్) దుష్టబుద్ధిని (బాధమానాః) తొలగించుచు (దైవీః) విద్వాంసుల ఈః (దేవీః) దివ్యగుణవంతురాండ్రు, పండిత బ్రహ్మచారిణులగు మహిళలు (పఞ్చ, దిశః) తూర్పు మున్నగు నాల్గుదిశలు మధ్యదిశను కలిపి ఐదుదిశలవలె వేర్వేరు కార్యములందు అగ్రేసరులై యుండి (రాయఃపోషే) ధనముల వృద్ధిపరముటకొరకు (యజ్ఞపతిమ్) గృహకృత్యములొనర్చు లేక రాజ్యపాలనమొనర్చు తమ పతులను (ఆ భజన్తీః) సకల విధములుగ సేవించుచు (యజ్ఞమ్) సంగతియొనర్చదగిన గృహస్థాశ్రమమును (అవన్తు) కాంక్షించవలెను. దానివలన నీ (యజ్ఞః) గృహాశ్రమము (రాయః, పోషే) ధన ధాన్యముల పటిష్ఠతయందు (అధి, అస్థాత్) ఆధిక్యతతో స్థిరముగు గాక! ॥౫౪॥

**భావార్థము** :-ఈ మంత్రమందు లుప్తోపమాలంకారము గలదు ధార్మిక విద్వాంసులు, ప్రశంసనీయ పండితులగు విదుషీరత్నములు గల గృహమందు దుష్టకార్యములు జరుగవు. రాజ్యమందంతట ప్రశంసిత ప్రజలున్నచో ఆ రాజువద్ద ఇతరుల కన్న అధిక ఐశ్వర్యసంపదలుండుట సహజము. ॥౫౪॥

54.Casting aside dense ignorance and evil genius, these educated wives of the learned, engaged in different duties like the five regions, for the growth of riches, serving their husbands should yearn for domestic life, whereby this domestic life be made firm in the aquisition of wealth.

౫౫ సమిద్ధ ఇత్యస్యాప్రతిరథ ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః,పఞ్చమః స్వరః.

యజ్ఞః కథం కర్తవ్య ఇత్యుపదిశ్యతే. యజ్ఞ మెటుల చేయవలయును?

**౫౫ సమిద్ధేఽ అగ్నావధి మామహానఽ ఉక్థపత్రఽ ఈడ్యో గృభీతః।**

**తప్తం ఘర్మం పరిగృహ్యాయజన్తోర్జా యద్యజ్ఞమయజన్త దేవాః ॥౫౫॥**

**ప.వి:-సమిద్ధ ఇతి సమ్ + ఇద్ధే, అగ్నౌ, అధి, మామహానః, మమహాన ఇతి మమహానః, ఉక్థపత్ర ఇత్యుక్థ + పత్రః, ఈడ్యః, గృభీతః, తప్తమ్, ఘర్మమ్, పరిగృహ్యేతి పరి + గృహ్య, అయజన్త, ఊర్జా, యత్, యజ్ఞమ్ అయజన్త, దేవాః॥౫౫॥**

**పదార్థః** :- (సమిద్ధే) సమ్యక్ ప్రదీప్తే (అగ్నౌ) పావకే (అధి) (మామహానః) అతిశయేన మహాన్ పూజనీయః (ఉక్థపత్రః) ఉక్థాని వక్తుం యోగ్యాని వేదస్తోత్రాణి పత్రాణి విద్యాగమకాని యస్య సః (ఈడ్యః) ఈడితుం స్తోతుమధ్యేషితుం యోగ్యః (గృభీతః) గృహీతః (తప్తమ్) తాపాన్వితమ్ (ఘర్మమ్)

అగ్నిహో[త్రాదికం యజ్ఞమ్, ఘర్మ ఇతి యజ్ఞనామ... నిఘం.. 3.౧౭. (పరిగృహ్య) సర్వతో గృహీత్వా (అయజన్త) యజన్తు (ఊర్జా) బలేన (యత్) యమ్ (యజ్ఞమ్) అగ్నిహో[త్రాదికమ్ (అయజన్త) యజన్తే (దేవాః) విద్వాంసః.॥౫౫॥

**అన్వయః** :- హే మనుష్యాః! యూయం యథా దేవా సమిద్ధేఽగ్నౌ యద్యం యజ్ఞమయజన్త తథా యోఽధి మామహాన ఉక్థపత్ర ఈడ్యో గృభీతోఽస్తి తం తప్తం ఘర్మమూర్జా పరిగృహ్యాయజన్త.॥౫౫॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః మనుష్యైర్జగదుపకారాయ యథా విద్వాంసోఽగ్ని హో[త్రాదికం యజ్ఞమనుతిష్ఠన్తి తథాఽయమనుష్ఠాతవ్యః.॥౫౫॥

**పదార్థము** :- ఓ మానవులారా! మీరు ఎట్లు (దేవాః) విద్వాంసులు (సమిద్ధే) చక్కగా ప్రజ్వరిల్లుచున్న (అగ్నౌ) అగ్నియందు (యత్) ఏ (యజ్ఞమ్) అగ్నిహో[త్రము మున్నగు యజ్ఞములను (అయజన్త) చేయుదురో, అట్లే ఏది (అధి, మామహానః) అత్యధిక సత్కారము నొనర్చదగిన (ఉక్థపత్రః) చెప్పుకొనదగిన వైదిక స్తోత్రములు గలదియో (ఈడ్యః) ఏది స్తుతించ మరియు వాంఛించదగినదియో (గృభీతః) సజ్జను లెద్దానిని గ్రహించిరో, అట్టి (తప్తమ్) తాపయుక్తము (ఘర్మమ్) అగ్నిహో[త్రము మున్నగు యజ్ఞములను (ఊర్జా) బలముతో (పరిగృహ్య) గ్రహణమొనర్చి (అజయన్త) చేయుచుండుడు.॥౫౫॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. జగదుపకారమునకై విద్వాంసులు అగ్నిహో[త్రము మున్నగు యజ్ఞముల నాచరించునట్లు మానవులెల్లరును అనుష్ఠించవలయును.॥౫౫॥

55.Just as the learned, in enkindled fire, perform Agnihotra yajna, so should a highly revered person, the singer of vedic hymns, adorable, lovable sacrificer perform the well lighted yajna, accepting it with vigour.

౯౦౬. దైవ్యాయేత్యస్యాప్రతిరథ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ యజ్ఞం కథం కర్తవ్య ఇత్యాహ. యజ్ఞ మెటుల చేయవలెను?

**౯౦౬ దైవ్యాయ ధర్త్రే జోష్ట్రే దేవశ్రీః శ్రీమనాః శతపయాః। పరిగృహ్య దేవా యజ్ఞమాయన్ దేవా దేవేభ్యోఽఅధ్వర్యన్తోఽ అస్థుః ॥౫౬॥**

**ప.విః-** దైవ్యాయ, ధర్త్రే, జోష్ట్రే, దేవశ్రీరితి దేవ + శ్రీః, శ్రీమనా ఇతి శ్రీ + మనాః, శతపయా ఇతి శత + పయాః, పరిగృహ్యేతి పరి + గృహ్య, దేవాః, యజ్ఞమ్, ఆయన్, దేవాః, దేవేభ్యః, అధ్వర్యన్తః, అస్థుః ॥౫౬॥

**పదార్థః** :-(దైవ్యాయ) దివ్యేషు గుణేషు భవాయ (ధర్త్రే) ధారణశీలాయ (జోష్ట్రే) జుషమాణాయ (దేవశ్రీః) శ్రీయతే యా సా శ్రీర్దేవేషు విద్యతే యస్య సః (శ్రీమనాః) శ్రియి మనో యస్య సః (శతపయాః) శతాని పయాంసి దుగ్ధాదీని వస్తూని యస్య సః (పరిగృహ్య) (దేవాః) కామయమానాః (యజ్ఞమ్) సంగంతవ్యమ్ గృహాశ్రమమగ్నిహోత్రాదికం వా (ఆయన్) ప్రాప్నువన్తు (దేవాః) విద్యాదాతారః (దేవేభ్యః) విద్వద్భ్యః (అధ్వర్యన్తః) ఆత్మనోఽధ్వరమిచ్ఛన్తః (అస్థుః) తిష్ఠేయుః. ॥౫౬॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథాఽధ్వర్యన్తో దేవా విద్వాంసో దేవేభ్యో యజ్ఞేఽస్థుర్యథా దైవ్యాయ ధర్త్రే జోష్ట్రే హోత్రే దేవశ్రీః శ్రీమనాః శతపయా యజమానో వర్తతే తథా దేవా యూయం విద్యాః పరిగృహ్య యజ్ఞమాయన్. ॥౫౬॥

**భావార్థః** :- మనుష్యైః శ్రీప్రాప్తయ ఉద్యోగః సదైవ కర్తవ్యో యథా విద్వాంసో ధనలబ్ధయే ప్రయతేరం స్తద్వదనుప్రయతితవ్యమ్. ॥౫౬॥

**పదార్థవము** :-మానవులారా! ఎట్లు (అధ్వర్యన్తః) తనను యజ్ఞముగ భావించువారు (దేవాః) విద్యాదాతలగు విద్వాంసులు (దేవేభ్యః) విద్వాంసుల ప్రసన్నతకొరకు గృహాశ్రమము మరియు అగ్నిహోత్రము మున్నగు యజ్ఞములందు (అస్థుః) స్థిరులగుదురో లేక ఎట్లు (దైవ్యాయ) ఉత్తమోత్తమ గుణములందు ప్రసిద్ధుడు (ధర్త్రే) ధారణశీలుడు (జోష్ట్రే) ప్రీతిగల హోతకొరకు (దేవశ్రీః) సేవించదగిన విద్యారూపలక్ష్మి గల విద్వాంసులో (శ్రీమనాః) లక్ష్మియందు మనస్సుగల (శతపయాః) దుగ్ధము మున్నగు వందలాది వస్తువులుగల యజమానునివలె (దేవాః) విద్యాదాతలగు మీరు విద్యలను (పరిగృహ్య) గ్రహణమొనర్చి (యజ్ఞమ్) సేవించదగిన గృహాశ్రమము లేక అగ్నిహోత్రాదులను (ఆయన్) ప్రాప్తించుకొనుడు. ॥౫౬॥

**భావార్థవము** :-ధనప్రాప్తికై మానవులు సదా పురుషార్థమొనర్చవలయును. విద్వాంసులు ధనప్రాప్తికై ప్రయత్నించునట్లు వారి కనుకూలముగ ఇతరులును ధర్మానుసారముగా ప్రయత్నమొనర్చుట యోగ్యమై యున్నది. ॥౫౬॥

56.Just as learned persons, desirous of performing yajna, engage themselves in the performance of Agni Hotra yajna for the happiness of the learned, and just as for the loving, benign, and virtuous priest, the wealth of knowledge, and a sacrificer (Yajman) intent on acquiring riches, and lord of a hundred drinkable objects like mikk and itsilk? are there, so should ye the imparters of knowledge, having acuquired learning perform the Agni-Hotra yagna.

**౫౭. వీతమిత్యస్యాప్రతిరథ ఋషిః, యజ్ఞో దేవతా, నిచృదార్షీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.**

౯౦౭ వీతఀ హవిః శమితఀ శమితా యజధ్యై తురీయో యజ్ఞో
యత్ర హవ్యమేతి। తతో వాకాఽ ఆశిషో నో జుషన్తామ్ ॥౫౭॥

ప.వి:- వీతమ్, హవిః, శమితమ్, శమితా, యజధ్యై, తురీయః, యజ్ఞః, యత్ర, హవ్యమ్, ఏతి, తతః, వాకాః, ఆశిష ఇత్యా + శిషః, నః, జుషన్తామ్ ॥౫౭॥

**పదార్థః** :-(వీతమ్) గమనశీలమ్ (హవిః) హోతవ్యమ్ (శమితమ్) ఉపశాన్తమ్ (శమితాః) ఉపశమాది గుణయుక్తా (యజధ్యై) యష్టుమ్ (తురీయః) చతుర్థః (యజ్ఞః) సంగంతవ్యః (యత్ర) (హవ్యమ్) (ఏతి) గచ్ఛతి (తతః) తస్మాత్ (వాకాః) ఉచ్యన్తే యాస్తాః (ఆశిషః) ఇచ్ఛాసిద్ధయః (నః) అస్మాన్ (జుషన్తామ్) సేవన్తామ్. ॥౫౭॥

**అన్వయః** :-హే మనుష్యాః! యః శమితా యజధ్యై వీతం శమితం హవిరగ్నౌ ప్రక్షిపతి యస్తురీయో యజ్ఞోఽస్తి యత్ర హవ్యమేతితతో వాకా ఆశిషశ్చ నో జుషన్తామితీచ్ఛత. ॥౫౭॥

**భావార్థః** :- అగ్నిహోత్రాదౌ చత్వారః పదార్థాః సన్తి పుష్కలం పుష్టిసుగన్ధిమిష్టగుణయుక్తం రోగనాశకం హవిః, తచ్ఛోధనం యజ్ఞకర్తా, వేద్యగ్న్యాదికం చేతి. యథావద్ధుతః పదార్థ ఆకాశం గత్వా పునరావృత్త్యేష్టసాధకో భవతీతి మనుష్యైర్మన్తవ్యమ్. ॥౫౭॥

**పదార్థము** :-ఓ మానవులారా! (శమితా) శాంతి మున్నగు గుణములతో గూడిన ఏ గృహస్థాశ్రమవాసి (యజధ్యై) యజ్ఞమొనర్చుటకై (వీతమ్) గమనశీలము (శమితమ్) దుర్గుణములను శమింపజేయు (హవిః) హోమమొనర్పదగిన శ్రేష్ఠపదార్థములను అగ్నియందాహుతుల నిచ్చుచుండునో (తురీయః) నాలుగవదియు (యజ్ఞః) ప్రాప్తించుకొనదగిన ఏ యజ్ఞము గలదో మరియు (యత్ర) ఎచ్చట (హవ్యమ్) హోమమొనర్పదగిన పదార్థములు (ఏతి) లభ్యమగునో (తతః) ఆ యన్నిటిచే (వాకాః) ఉచ్చరించుచున్న (ఆశిషః) కోరిన సిద్ధులు (నః) మాకు (జుషన్తామ్) లభించవలెనని కోరుకొనుడు. ॥౫౭॥

**భావార్థము** :- అగ్నిహోత్రము మున్నగు యజ్ఞములందు అధికపుష్టినిచ్చునవి, పుష్టిని గలిగించునవి, మిష్టము, రోగనాశకమను నాల్గు విధములగు సామగ్రులతో ఆహుతు లీయబడును. యజ్ఞమొనర్చువారు దీనిని శోధించి, వేది (కుండము), సమిధలు మున్నగునవి సమకూర్చుకొందురు. యథావిధిగ హవన మొనర్చిన పదార్థములు ఆకాశమునకు చేరి పవనము, మేఘవర్షములద్వారా పృథివికి తిరిగివచ్చి ఇష్టకామ్యసిద్ధిని గలిగించును. ఈ విధముగ జరుగు కార్యమును మానవులెల్లరును దెలిసికొనదగును. ॥౫౭॥

The householder, who with a tranquil mind, puts into the fire, for performing the yajna, the oblation which moves above and removes foul smell, performs the fourth yajna. May prayers and the fulfilment of our desires bless us in the yajna where we get material fit for Homa.

౯౦౮.సూర్యరశ్మిరిత్యస్యాప్రతిరథ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః,ధైవతః స్వరః.

అథ సూర్యలోకస్వరూపమాహ. సూర్యలోక స్వరూపము వర్ణించబడుచున్నది.

౯౦౮ సూర్యరశ్మిర్హరికేశః పురస్తాత్సవితా జ్యోతిరుదయాఁ॥ అజస్రమ్।

తస్య పూషా ప్రసవే యాతి విద్వాన్త్సమ్పశ్యన్విశ్వా భువనాని గోపాః॥౫౮॥

ప.విః-సూర్యరశ్మిరితి సూర్య + రశ్మిః, హరికేశ ఇతి హరి + కేశః, పురస్తాత్, సవితా, జ్యోతిః, ఉత్, అయాన్, అజస్రమ్, తస్య, పూషా, ప్రసవ ఇతి ప్ర + సవే, యాతి విద్వాన్, సంపశ్యన్నితి సమ్ + పశ్యన్, విశ్వా, భువనాని, గోపాః.॥౫౮॥

**పదార్థః** :-(సూర్యరశ్మిః) (హరికేశః) హరితవర్ణః (పురస్తాత్) ప్రథమతః (సవితా) సూర్యలోకః (జ్యోతిః) ద్యుతిమ్ (ఉత్) (అయాన్) (అజస్రమ్) నిరన్తరమ్ (తస్య) (పూషా) పుష్టికర్తా (ప్రసవే) ప్రసూతే జగతి (యాతి) ప్రాప్నోతి (విద్వాన్) విద్యాయుక్తః (సంపశ్యన్) సమ్యక్ ప్రేక్షమాణః (విశ్వా) సర్వాన్. (భువనాని) లోకాన్ (గోపాః) పృథివ్యాదయో జగద్రక్షకాః.॥౫౮॥

**అన్వయః** :- హే మనుష్యాః! యః పురస్తాత్ సవితా జ్యోతిః ప్రయచ్ఛతి యస్మిన్ హరికేశః సూర్యరశ్మిర్వర్తతే యః ప్రసవేఽజస్రం పూషాఽస్తి యం విద్వాన్ సంపశ్యన్ సన్ తద్విద్యాం యాతి తస్య సకాశాద్ గోపా విశ్వా భువనాన్యుదయాన్ స సూర్యమణ్డలోఽతిప్రకాశమయ ఇతి యూయం విత్త. ॥౫౮॥

**భావార్థః** :-యోఽయం సూర్యలోకస్తత్ప్రకాశే శుక్లహరితాదయోఽనేకే కిరణాః సన్తి యే సర్వాఁల్లోకానభిరక్షన్తి. అతఏవ సర్వస్య సర్వథా సర్వదా రక్షణం భవతీతి వేద్యమ్.॥౫౮॥

**పదార్థము** :- ఓ మానవులారా! (పురస్తాత్) పూర్వమునుండి (సవితా) సూర్యలోకము (జ్యోతిః) ఏ ప్రకాశము నిచ్చుచున్నదో, దేనియందు (హరికేశః) పసరు రంగుగల (సూర్యరశ్మిః) సూర్యకిరణములు గలవో (ప్రసవే) ఉత్పన్నజగత్తునందు (అజస్రమ్) నిరంతరము (పూషా) పుష్టియొనర్చునదో, దేనిని (విద్వాన్) విద్వాంసులు (సంపశ్యన్) చక్కగా నవలోకించుచు నా విద్యను (యాతి) పొందుచున్నారో (తస్య) అదియే (గోపాః) విశ్వరక్షకవములగు పృథివ్యాదిలోకవములు మరియు తారాగణము (విశ్వా) సమస్త (భువనాని) లోకలోకాంతరవములను (ఉదయాన్) ప్రకాశితమొనర్చుచున్నది. ఆ సూర్యమండలము అతి ప్రకాశమయమైనదని మీరెరుగుడు. ॥౫౮॥

**భావార్థము** :- ఈ సూర్యలోకప్రకాశమునందుగల శ్వేత, హరిత మున్నగు యనేక వర్ణముల కిరణములు సర్వలోకములను రక్షించుచుండును. వీనిచేతనే సర్వమునకు సర్వవిధముల రక్షణగలుగుచున్నదని మీరు దెలిసికొనుట యోగ్యము. ॥౫౮॥

58.Sun gives us light from the beginning of creation. Its rays are green. In the created world it incessantly gives us strength. A learned person perceiving fully realises its science. With its light, the Earth, planets and stars, the protectors of the world, manifest all regions.

౯౦౯. విమాన ఇత్యస్య విశ్వావసుర్ఋషిః, ఆదిత్యో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వరేణ కిమర్థః సూర్యో నిర్మిత ఇత్యుపదిశ్యతే. ఈశ్వరుడు సూర్యుని ఎందులకు సృజించెను?

౯౦౯ విమానఽ ఏష దివో మధ్యఽ ఆస్తఽ ఆపప్రివా(న్రోదసీఽ అన్తరిక్షమ్।

స విశ్వాచీరభిచష్టే ఘృతాచీరన్తరా పూర్వమపరం చ కేతుమ్ ॥౫౯॥

ప. విః- విమాన ఇతి వి + మానః, ఏషః, దివః, మధ్యే, ఆస్తే, ఆపప్రివానిత్యాఽపప్రివాన్, రోదసీ ఇతి రోదసీ, అన్తరిక్షమ్, సః, విశ్వాచీః, అభి, చష్టే, ఘృతాచీః, అన్తరా, పూర్వమ్, అపరమ్, చ, కేతుమ్ ॥౫౯॥

**పదార్థః** :-(విమానః) విమానమివ స్థితః (ఏషః) సూర్యః (దివః) ప్రకాశస్య (మధ్యే) (ఆస్తే) తిష్ఠతి (ఆపప్రివాన్) స్వతేజసా వ్యాప్తవాన్ (రోదసీ) ప్రకాశభూమీ (అన్తరిక్షమ్) అవకాశమ్ (సః) (విశ్వాచీః) యా విశ్వమఞ్చన్తి ప్రాప్నువన్తి తా ద్యుతీః (అభి) (చష్టే) పశ్యతి చష్ట ఇతి పశ్యతికర్మా నిఘం 3.౧౧. (ఘృతాచీః) యా ఘృతముదకమఞ్చన్తి తాః (అన్తరా) ద్వయోర్మధ్యే (పూర్వమ్) (అపరమ్) (చ) (కేతుమ్) ప్రజ్ఞాపకం తేజః. ॥౫౯॥

**అన్వయః** :-విద్వాన్ య ఏష దివో మధ్యే విమానో రోదసీ అన్తరిక్షమాపప్రివాన్ సన్నాస్తే స విశ్వాచీ ర్ఘృతాచీర్ద్యు తీర్విస్తారయతి పూర్వమపరమన్తరా చ కేతుమభిచష్టే తం విజానీయాత్. ॥౫౯॥

**భావార్థః** :- యః సూర్యలోకో బ్రహ్మాణ్డమధ్యే స్థితఃసన్ స్వప్రకాశేన సర్వమభివ్యాప్నోతి స సర్వాభికర్షకో వర్తత ఇతి మనుష్యైర్వేద్యమ్. ॥౫౯॥

**పదార్థము** :-(ఏషః) ఈ సూర్యమండల (దివః) ప్రకాశము (మధ్యే) మధ్యన (విమానః) విమానము [అనగా ఆకాశ మార్గమున ఆశ్చర్యకరముగా నడచునట్టి యానము]వలె (రోదసీ) ప్రకాశమును, భూమిని

(అన్తరిక్షమ్) ఆకాశమును (ఆప్రివాన్) తనతేజముతో వ్యాప్తమై (ఆస్తే) స్థిరముగుచున్నదో (సః) అది (విశ్వాచీః) ప్రపంచవమునకు ప్రాప్తించుచు, అనగా తన ఉదయమచే ప్రకాశితమొనర్చుచు (ఘృతాచీః) జలములను ప్రాప్తింపజేయుచు తన కాంతులను విస్తృతమొనర్చుచున్నదో (పూర్వమ్) రాబోవు దినము (అపరమ్) గడచిన రాత్రి (చ) మరియు (అన్తరా) రెండింటి మధ్య (కేతుమ్) సర్వలోకప్రకాశమగు తేజస్సును (అభిచష్టే) చూచునో దానిని మీ రెరుగుడు.।౫౯॥

**భావార్థము** :- ఏ సూర్యలోకము బ్రహ్మాండమునడుమ స్థితమై తన ప్రకాశముచే సర్వమునకు వ్యాప్తమగుచున్నదో మరియు సర్వమును ఆకర్షణ మొనర్చుచున్నదో, దానిని మానవులెల్లరును దెలిసికొనదగును.।౫౯॥

59.This sun, in the midst of heaven like an aeroplane, sits, filling the earth, sky and air's mid region, with its light. It spreads its beams that illumine the world and give us water. It sheds its lustre on the day, the night and the intervening period.

౯౧౦.ఉక్షా ఇత్యస్యాప్రతిరథ ఋషిః, ఆదిత్యో దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. ఉపరోక్తవిషయమే.

౯౧౦ ఉక్షా సముద్రో౽అరుణః సుపర్ణః పూర్వస్య యోనిం పితురావివేశ ।
మధ్యే దివో నిహితః పృశ్నిరశ్మా వి చక్రమే రజసస్పాత్యన్తౌ ।౬౦॥

**ప.విః**- ఉక్షా, సముద్రః, అరుణః, సుపర్ణ ఇతి సు + పర్ణః, పూర్వస్య, యోనిమ్, పితుః, ఆ, వివేశ, మధ్యే, దివః, నిహిత ఇతి ని + హితః, పృశ్నిః, అశ్మా, వి, చక్రమే, రజసః, పాతి, అన్తౌ।౬౦॥

**పదార్థః** :-(ఉక్షా) వృష్ట్యా సేచకః (సముద్రః) సమ్యగ్ ద్రవన్త్యాపో యస్మాత్సః (అరుణః) ఆరక్తః (సుపర్ణః) శోభనాని పర్ణాని పాలనాని యస్మాత్ (పూర్వస్య) పూర్ణస్య (యోనిమ్) కారణమ్ (పితుః) ఉత్పాదికాయా విద్యుతః (ఆ) (వివేశ) ప్రవిశతి (మధ్యే) (దివః) ప్రకాశమయస్య (నిహితః) ఈశ్వరేణ స్థాపితః (పృశ్నిః) విచిత్రవర్ణః సూర్యః (అశ్మా) అశ్నుతే వ్యాప్నోతి స మేఘః అశ్మేతి మేఘనా.. నిఘం. ౧.౧౦. (వి) (చక్రమే) వివిధతయా క్రమతే (రజసః) లోకాన్ (పాతి) రక్షతి (అన్తౌ) బన్ధనే. ।౬౦॥

**అన్వయః** :-హే మనుష్యాః! య ఈశ్వరేణ దివో మధ్యే నిహిత ఉక్షా సముద్రో౽రుణః సుపర్ణః పృశ్నిరశ్మా మేఘశ్చ రజసో౽న్తౌ విచక్రమే పాతి చ పూర్వస్య పితుర్యోనిమావివేశ స సమ్యగుపయోక్తవ్యః. ।౬౦॥

**భావార్థః**:-మనుష్యైరీశ్వరస్యానేకే ధన్యవాదా వాచ్యాః. కుతో? యేన స్వవిజ్ఞాపనాయ జగత్పాలననిమిత్తః సూర్యాదిదృష్టాంతః ప్రదర్శితః స కథం న సర్వశక్తిమాన్ భవేత్? ॥౬౦॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎయ్యది పరమేశ్వరునిచే (దివః) ప్రకాశము (మధ్యే) మధ్యన (నిహితః) స్థాపితమొనర్చబడినదో (ఉక్షా) వర్షజలములచే సేచన మొనర్చునది (సముద్రః) దేనినుండి జలములు చక్కగా గురియునో, ఏది (అరుణః) ఎఱ్ఱని వర్ణముగల (సుపర్ణః) చక్కని పాలనమొనర్చునది (పృశ్నిః) అతివిచిత్ర వర్ణములుగల సూర్యరూప తేజము (అశ్మా) మేఘము (రజసః) లోకములను (అన్తా) బంధనములకొరకు (వి, చక్రమే) అనేక విధముల దిరుగుచు (పాతి) రక్షణయొనర్చును (పూర్వస్య) పూర్ణముగల (పితుః) ఈ సూర్యమండలముయొక్క తేజము నుత్పన్నమొనర్చు ఏ విద్యుత్తురూపాగ్ని గలదో, దాని (యోనిమ్) కారణమునందు (ఆ, వివేశ) ప్రవేశమొనర్చుచున్నదో, అట్టి సూర్యుని మేఘములను చక్కగా ఉపయోగించుకొనవలయును. ॥౬౦॥

**భావార్థము** :-సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుడు తననువ్యక్తపరచుటకై జగత్పాలనకు నిమిత్తకారణమగు సూర్యుడు మున్నగువానిని దృష్టాంతముగా ప్రకటపరచినాడు. కావున మానవులాతనికి అనేక ధన్యవాదముల నర్పించవలయును. ॥౬౦॥

60.God has set the sun in the midst of heaven. It attracts rain-water and pours it down is red, protects us thoroughly, possesses diverse coloured rays, rotates, keeps under check the clouds and different worlds, and guards them. It pervades lightning, the efficient cause of light.

౯౧౧. ఇన్ద్రం విశ్వేత్యస్య మధుచ్ఛన్దాః సుతజేతా ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునర్జగత్స్రష్టురీశ్వరస్య గుణానాహ. జగత్కర్తయైన యీశ్వరుని గుణములను జెప్పెను.

౯౧౧ ఇన్ద్రం విశ్వా అవీవృధన్త్సముద్రవ్యచసం గిరః।

రథీతమꣳ రథీనాం వాజానాꣳసత్పతిం పతిమ్ ॥౬౧॥

**ప.వి**:- ఇన్ద్రమ్, విశ్వాః, అవీవృధన్, సముద్రవ్యచసమితి సముద్ర + వ్యచసమ్, గిరః, రథీతమమ్, రథీతమమితి రథి + తమమ్, రథీనామ్, రథినామితి రథినామ్, వాజానామ్, సత్పతిమితి సత్ + పతిమ్, పతిమ్ ॥౬౧॥

**పదార్థః** :-(ఇన్ద్రమ్) పరమాత్మానమ్ (విశ్వాః) సర్వాః (అవీవృధన్) వర్ధయన్తు (సముద్రవ్యచసమ్)

సముద్రస్యాన్తరిక్షస్య వ్యచా వ్యాప్తిరివ వ్యాప్తిర్యస్య తమ్ (గిరః) వాచః (రథీతమమ్) ప్రశస్తా రథా సుఖహేతవః పదార్థా విద్యన్తే యస్మిన్సోఽతిశయితస్తమ్ (రథీనామ్) ప్రశస్తరథయుక్తానామ్ (వాజానామ్) జ్ఞానాదిగుణయుక్తానాం జీవానామ్ (సత్పతిమ్) సదవినాశీ చాసౌ పతిః పాలకశ్చ యద్వా సతామవినాశినాం కారణానామ్ జీవానామ్ చ పాలకస్తమ్ (పతిమ్) స్వామినమ్. ॥౬౧॥

**అన్వయః** :-హే మనుష్యాః! యూయం యం సముద్రవ్యచసం రథీనాం రథీతమం వాజానాం పతింసత్పతి మిన్ద్రం పరమాత్మానం విశ్వా గిరోఽవీవృధన్ తం సతతముపాధ్వమ్. ॥౬౧॥

**భావార్థః** :-సర్వైర్మనుష్యైర్యం సర్వే వేదాః ప్రశంసన్తి యం యోగిన ఉపాసతే యం ప్రాప్యముక్తా ఆనన్దం భుఞ్జతే స ఏవ ఉపాస్య ఇష్టో దేవో మన్తవ్యః. ॥౬౧॥

**పదార్థము** :- ఓ మానవులారా! మీరు (సముద్రవ్యచసమ్) అంతరిక్షవ్యాపకమువలె వ్యాప్తి గలిగియున్నవాడు (రథీనామ్) ప్రశంసించదగిన సుఖహేతువులగు పదార్థములుగల వానియందు (రథీతమమ్) అతి ప్రశంసనీయ సుఖహేతువులగు పదార్థములతో నుండి (వాజానామ్) జ్ఞానులు మున్నగు సద్గుణవంతుల (పతిమ్) స్వామి (సత్పతిమ్) వినాశరహితుడు [వినాశరహిత కారణమగు ప్రకృతి, జీవులను పాలనమొనర్చు వాడు]నగు (ఇన్ద్రమ్) పరమాత్మను (విశ్వాః) సమస్త (గిరః) వాణులచే (అవీవృధన్) పెంపొందించుచు అనగా విస్తారవర్ణనచే యాతనిని నిరంతరము ఉపాసించుడు. ॥౬౧॥

**భావార్థము** :- సకలవేదము లెవనిని ప్రశంసించుచున్నవో, యోగు లెవని నుపాసించుచుందురో, ముక్తాత్మ లెవని బొంది ఆనందము ననుభవించుచుండునో, ఆతనినే ఇష్టదైవముగా నెంచి మానవులెల్లరును ఉపాసించుచుండ వలయును. ॥౬౧॥

61 All vedic songs glorify God, expansive like the space, the most delightful of all pleasant objects, the Lord of the wise, the Guardian of eternal matter and souls.

౬౧౨. దేవహూరిత్యస్య విధృతిర్ఋషిః, యజ్ఞో దేవతా, విరాడార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునరీశ్వరః కీదృశోఽస్తీత్యాహ ఈశ్వరు డెట్టివాడు?

౬౧౨ దేవహూర్య్యజ్ఞఽ ఆ చ వక్షత్సుమ్నహూర్య్యజ్ఞఽ ఆ చ వక్షత్।

యక్షదగ్నిర్దేవో దేవాఀ॥ ఽ ఆ చ వక్షత్ ॥౬౨॥

ప.వి:-దేవహూరితి దేవ + హూః, యజ్ఞః, ఆ, చ, వక్షత్, సుమ్నహూరితి సుమ్న + హూః, యజ్ఞః, ఆ, చ, వక్షత్, యక్షత్, అగ్నిః దేవః, దేవాన్, ఆ, చ, వక్షత్ ॥౬౨॥

**పదార్థః** :-(దేవహూః) దేవాన్ విదుష ఆహ్వాయతి సః (యజ్ఞః) పూజనీయః (ఆ) (చ) (వక్షత్) ప్రాపయేత్ (సుమ్నహూః) యః సుమ్నాని సుఖాన్యాహ్వాయతి సః (యజ్ఞః) సంగన్తవ్యః ( ఆ) (చ) (వక్షత్) (యక్షత్) యజేద్దద్యాత్ (అగ్నిః) స్వయంప్రకాశః (దేవః) సకలసుఖదాతేశ్వరః (దేవాన్) దివ్యాన్ గుణాన్ భోగాన్ వా (ఆ) (చ) (వక్షత్) ప్రాపయేత్.।౬౨॥

**అన్వయః** :-హే మనుష్యాః! యో దేవహూర్యజ్ఞ ఈశ్వరోఽస్మాన్ సత్యమావక్షత్ చాదసత్యాదుద్ధరేత్ యః సుమ్నహూర్యజ్ఞోఽస్మభ్యం సఖాన్యావక్షత్ దుఃఖాని చ నాశయేత్ యోఽగ్ని ర్దేవోఽస్మాన్ దేవాన్ యక్షదావక్షచ్చ తం భవన్తః సతతం సేవన్తామ్.।౬౨॥

**భావార్థః** :-య ఆప్తైర్విద్వద్భిరుపాస్యతే యశ్చ సుఖస్వరూపో మఙ్గలప్రదః పరమేశ్వరోఽస్తి తం సమాధియోగేన మనుష్యా ఉపాసీరన్.।౬౨॥

**పదార్థము** :- ఓ మనుష్యులారా! (దేవహూః) విద్వాంసులను పిలుచువాడు (యజ్ఞః) పూజనీయుడగు ఏ పరమేశ్వరుడు మనకు సత్యమును (ఆ, వక్షత్) ఉపదేశించెనో (చ) మరియు అసత్యమునుండి మన నుద్ధరించునో (సుమ్నహూః) సుఖములను ఆహ్వానించువాడు (యజ్ఞః) పూజించదగిన పరమేశ్వరుడు మనకొరకై సౌఖ్యములను (ఆ, వక్షత్) ప్రాప్తింపజేయుగాక! (చ) మరియు దుఃఖములను వినాశపరచుగాక! (అగ్నిః) స్వయంప్రకాశకుడు (దేవః) సమస్త సుఖములను ప్రసాదించు ఈశ్వరుడు మనకొరకు (దేవాన్) ఉత్తమ గుణములను మరియు భోగములను (యక్షత్) ప్రసాదించుగాక! (చ) మరియు (ఆ, వక్షత్) ఎవడు వానిని మనకు అందించునో, కార్యాంతరముచే లభింపజేయునో అట్టి ఈశ్వరునే మీరు నిరంతరము సేవించుడు.।౬౨॥

**భావార్థము** :-ఉత్తమ శాస్త్రజ్ఞులగు విద్వాంసులచే నెవడు ఉపాసించబడునో మరియు ఎవడు సుఖస్వరూపుడో, మంగళకార్యములను ప్రసాదించువాడో వానినే మానవులు సమాధియోగముద్వారా ఉపాసించవలయును. ।౬౨॥

62.God is the Invoker of the learned, Adorable, our Instructor in truth and Relinquisher from untruth, the Bestower of pleasures, Worshipful, the giver of comfort and remover of discomforts. May the Effulgent God grant and procure us noble qualities.

౬౧౩.వాజస్యేత్యస్య విధృతిరృషిః, ఇన్ద్రో దేవతా, విరాడార్ష్యనుష్టుప్, ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౬౧౩ వాజస్య మా ప్రసవఽ ఉద్గ్రాభేణోదగ్రభీత్।

అధా సపత్నానిన్ద్రో మే నిగ్రాభేణాధరాం౨॥ ౨౦ అకః ।౬౩॥

**ప.విః-వాజస్య, మా, ప్రసవ ఇతి ప్ర+సవః, ఉద్గ్రాభేణేత్యుత్+గ్రాభేణ, ఉత్, అగ్రభీత్, అధ, సపత్నానితి స+పత్నాన్, ఇన్ద్రః, మే,నిగ్రాభేణేతి ని+గ్రాభేణ, అధరాన్,అకరిత్యకః.౹౬౩॥**

**పదార్థః** :-(వాజస్య) విజ్ఞానస్య (మా) మామ్ (ప్రసవః) ఉత్పాదకః (ఉద్గ్రాభేణ) ఉత్కృష్టతయా గృహ్ణాతి యేన తేన (ఉత్) (అగ్రభీత్) (అధ) అథ. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (సపత్నాన్) శత్రూన్ (ఇన్ద్రః) పతిః (మే) మమ (నిగ్రాభేణ) నిగ్రహేణ (అధరాన్) అధఃపతితాన్ (అకః) కుర్యాత్. ౹౬౩॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథేన్ద్రో వాజస్య ప్రసవో మా మాముద్గ్రాభేణోదగ్రభీత్ తథాఽధాఽథ యో మే మమ సపత్నాన్ నిగ్రాభేణాధరానకస్తం యూయమపి సేనాపతిం కురుత. ౹౬౩॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథేశ్వరాస్తథా యే మనుష్యాః పాలనాయ ధార్మికాన్ మనుష్యాన్ సంగృహ్ణంతి తాడనాయ దుష్టాంశ్చ నిగృహ్ణన్తి త ఏవ రాజ్యం కర్తుం శక్నువన్తి. ౹౬౩॥

**పదార్థము** :-ఓ మానవులారా! ఎట్లు (ఇన్ద్రః) పాలనమొనర్చువాడు (వాజస్య) విశేషజ్ఞానమును (ప్రసవః) ఉత్పన్నమొనర్చువాడునగు పరమేశ్వరుడు (మా) నన్ను (ఉద్గ్రాభేణ) చక్కగా గ్రహణమొనర్చుటకు సాధనమైన దానిచే (ఉద్, అగ్రభీత్) గ్రహించునట్లు (అధ) ఆయన తరువాత దానిననుసరించి పాలనమొనర్చుచు మరియు విశేషజ్ఞానమును నేర్పువాడు (మే) నాయొక్క (సపత్నాన్) శత్రువులను (నిగ్రాభేణ) పరాజితులనుజేసి (అధరాన్) క్రింద పడవేయునట్టి (అకః) వానిని మీరు సేనాపతిగా నొనర్చుడు. ౹౬౩॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. పరమేశ్వరుని పరిపాలనవలె ధర్మ న్యాయమును తప్పక దుష్టులను శిక్షించుచు, ధర్మాత్ములను రక్షించు విద్వాంసులే రాజ్యపరిపాలనకు సమర్థులగుదురు. ౹౬౩॥

**63.** Just as God, the Sustainer, the Producer of Knowledge, through devices of elevation lifts me up, so elect him as General of the army who with his subjugating power keeps my foemen down.

**౬౧౪. ఉద్గ్రాభమిత్యస్య విధృతిరృషిః ఇన్ద్రాగ్నీ దేవతే, ఆర్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.**

**పునరగ్రే రాజధర్మ ఉపదిశ్యతే. రాజధర్మము ఉపదేశించబడినది.**

౬౧౪ ఉద్గ్రాభం చ నిగ్రాభం చ బ్రహ్మ దేవాఽ అవీవృధన్।
అధా సపత్నానిన్ద్రాగ్నీ మే విషూచీనాన్వ్యస్యతామ్ ౹౬౪॥

ప.విః-ఉద్గ్రాభమిత్యుత్ + గ్రాభమ్, చ, నిగ్రాభమితి, ని + గ్రాభమ్, చ, బ్రహ్మ, దేవాః, అవీవృధన్, అధ, సపత్నానితి, స + పత్నాన్, ఇన్ద్రాగ్నీఇతీన్ద్రాగ్నీ, మే, విషూచీనాన్, వి, అస్యతామ్ ।౬౪॥

**పదార్థః** :-(ఉద్గ్రాభమ్) ఉత్కృష్టతయా గ్రహణమ్ (చ) (నిగ్రాభమ్) నిగ్రహమ్ (చ) (బ్రహ్మ) ధనమ్ (దేవాః) విద్వాంసః (అవీవృధన్) వర్ధయన్తు (అధ) అథ, అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (సపత్నాన్) అరీన్ (ఇన్ద్రాగ్నీ) విద్యుత్పావకావివ సేనాపతీ (మే) మమ (విషూచీనాన్) విరుద్ధమాచరతః (వి) (అస్యతామ్).।౬౪॥

**అన్వయః** :-దేవా ఉద్గ్రాభం చ నిగ్రాభం చ కృత్వా బ్రహ్మావీవృధన్ అధాథ సేనాపతీ ఇన్ద్రాగ్నీ ఇవ మే విషూచీనాన్సపత్నాన్ వ్యస్యతాముత్క్షిపతామ్.।౬౪॥

**భావార్థః** :-యే మనుష్యాః! సజ్జనాన్ సత్కృత్య దుష్టాన్ నిహత్య బ్రహ్మ వర్ధయిత్వా నిష్కణ్టకం రాజ్యం సంపాదయన్తి త ఏవ ప్రశంసితాః. యో రాజా రాష్ట్రవాసినః సజ్జనాన్ సత్కృత్య దుష్టాన్నిరస్యైశ్వర్యం వర్ధయతి తస్యైవ సభాసేనాపతీ శత్రునాశం కర్తుం శక్నుయాతామ్.।౬౪॥

**పదార్థము** :- (దేవాః) విద్వాంసులు (ఉద్గ్రాభమ్) అత్యంతోత్సాహముతో గ్రహించి (చ) మరియు (నిగ్రాభమ్,చ) త్యాగము నొనర్చి (బ్రహ్మ) ధనములను (అవీవృధన్) పెంపొందించవలెను (అధ) ఆ తరువాత (ఇన్ద్రాగ్నీ) విద్యుత్తు మరియు అగ్నివంటి సేనాపతులిరువురును (మే) నాతో (విషూచీనాన్) విరోధభావముగ వర్తించు (సపత్నాన్) వైరుల [శత్రువుల] ను (వ్యస్యతామ్) లేవకుండా పడవేయవలెను. ।౬౪॥

**భావార్థము** :- సజ్జనుల సత్కరించుచు, దుష్టులను గట్టిగా మృదులించుచు, ధనములవృద్ధిపరచుచు, నిష్కపట పక్షపాతరహితముగ రాజ్యసంపాదనమొనర్చువారే ప్రశంసించబడుదురు. రాజ్యవాసులగు సజ్జనులను సత్కరించుచు దుష్టులను నిరాదరణమొనర్చుచు, తన రాజ్యప్రజల యైశ్వర్యములను వృద్ధిపరచు రాజుయొక్క సభను, సేనలను రక్షించువారు శత్రువులను నాశనమొనర్చివేయుదురు.।౬౪॥

64.May the learned increase wealth through strenuous exertion and renunciation; and may the military and civil heads of the State, drive away my opposing foes.

౬౫. క్రమధ్వమిత్యస్య విధృతిర్ఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్ష్యనుష్టుప్ ఛన్దః,గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౬౫ క్రమధ్వమగ్నినా నాకముఖ్యꣳహస్తేషు బిభ్రతః।

దివస్పృష్ఠꣳ స్వర్గత్వా మిశ్రా దేవేభిరాధ్వమ్ ।౬౫॥

**ప.విః-క్రమధ్వమ్, అగ్నినా, నాకమ్, ఉఖ్యమ్ హస్తేషు, బిభ్రతః, దివః, పృష్ఠమ్, స్వః, గత్వా, మిశ్రాః, దేవేభిః, ఆధ్వమ్.॥౬౫॥**

**పదార్థః** :-(క్రమధ్వమ్) పరాక్రమం కురుత (అగ్నినా) విద్యుతా (నాకమ్) అవిద్యమానదుఃఖమ్ (ఉఖ్యమ్) ఉఖాయాం సంస్కృతం భక్ష్యమోదనాదికమ్. అత్ర శూలోఖాద్యత్.అ.౪.౨.౧౬ అనేన సంస్కృతం భక్షా ఇత్యర్థే యత్ (హస్తేషు) (బిభ్రతః) ధరన్తః (దివః) న్యాయవినయాదిప్రకాశజాతస్య (పృష్ఠమ్) జ్ఞీప్సితమ్ (స్వః) సుఖమ్ (గత్వా) ప్రాప్య (మిశ్రాః) మిలితాః (దేవేభిః) విద్వద్భిః (ఆధ్వమ్) ఉపవిశత. ॥౬౫॥

**అన్వయః** :-హే వీరాః! యూయమగ్నినా నాకముఖ్యం చ హస్తేషు బిభ్రతో ధరన్తః క్రమధ్వం దేవేభిర్మిశ్రాః సన్తో దివస్పృష్ఠం స్వర్గత్వాధ్వమ్.॥౬౫॥

**భావార్థః** :-రాజపురుషా విద్వద్భిః సహ సంప్రయోగేణాగ్నేయాస్త్రాదినా శత్రుషు పరాక్రమన్తాం స్థిరం సుఖం ప్రాప్య పునః పునః ప్రయతేరన్. ॥౬౫॥

**పదార్థము** :- వీరులారా! మీరు (అగ్నినా) విద్యుత్తుతో (నాకమ్) అత్యంత సుఖము (ఉఖ్యమ్) మరియు పాత్రలందు పాకమొనర్చిన వంటకములు మున్నగువాని భోజనమును (హస్తేషు) హస్తములందు (బిభ్రతః) ధారణమొనర్చుకొని (క్రమధ్వమ్) పరాక్రమించుడు (దేవేభిః) విద్వాంసులతో (మిశ్రాః) కలిసియుండి (దివః) న్యాయ, వినయాదిగుణముల ప్రకాశముచే నుత్పన్నమైన (పృష్ఠమ్) కామిత (స్వః) సుఖములను (గత్వా) పొంది (ఆధ్వమ్) స్థిరమైయుండుడు.॥౬౫॥

**భావార్థము** :- రాజపురుషులు విద్వాంసుల సంబంధమున ఆగ్నేయాది దివ్యఅస్త్రశస్త్రములచే పరాక్రమించవలెను. స్థిరసుఖమును పొంది సదా పురుషార్థపరులై యుండవలెను.॥౬౫॥

65.Ye heroes, with spiritual force in your hand, attain to happiness through the science of electricity. Having procured the desired happiness resulting from justice and humility, live in the company of the learned!.

౬౬. ప్రాచీమిత్యస్య విధృతిరృషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

**౬౬ ప్రాచీమను ప్రదిశం ప్రేహి విద్వానగ్నేరగ్నే పురో అగ్నిర్భవేహ।విశ్వా ఆశా దీద్యానో వి భాహ్యూర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే॥౬౬॥**

ప.వి:- ప్రాచీమ్, అను, ప్రదిశమితి ప్ర + దిశమ్, ప్ర, ఇహి, విద్వాన్, అగ్నేః, అగ్నే, పురోఽఅగ్నిరితి పురః + అగ్నిః, భవ, ఇహ, విశ్వాః, ఆశాః, దీద్యానః, వి, భాహి, ఊర్జమ్, నః, ధేహి, ద్వి + పదే, చతుష్పదే, చతుఃపద ఇతి చతుః + పదే ।౬౬॥

**పదార్థః** :-(ప్రాచీమ్) పూర్వామ్ (అను) (ప్రదిశమ్) ప్రకృష్టాం దిశమ్ (ప్ర) (ఇహి) ప్రాప్నుహి (విద్వాన్) (అగ్నేః) ఆగ్నేయాస్త్రాదియోగాత్ (అగ్నే) శత్రుదాహక (పురోఅగ్నిః) అగ్రగన్తా పావక ఇవ (భవ) (ఇహ) అస్మిన్ రాజ్యకర్మణి (విశ్వాః) అఖిలాః (ఆశాః) దిశః ఆశా ఇతి దిఙ్నా నిఘం. ౧.౬. (దీద్యానః) దేదీప్యమానః సూర్య ఇవ (వి,భాహి) ప్రకాశయ (ఊర్జమ్) అన్నాదికమ్ (నః) అస్మాకమ్ (ధేహి) (ద్విపదే) మనుష్యాద్యాయ (చతుష్పదే) గవాద్యాయ.।౬౬॥

**అన్వయః** :- హే అగ్నే సభేశ! త్వం ప్రాచీం ప్రదిశమనుప్రేహి, త్వమిహాగ్నేః పురో అగ్నిరివ విద్వాన్ భవ. విశ్వా ఆశా దీద్యానః సన్ నోఽస్మాకం ద్విపదే చతుష్పదే ఊర్జం ధేహి విద్యావినయపరాక్రమైరభయం విభాహి.।౬౬॥

**భావార్థః** :-యే పూర్ణేన బ్రహ్మచర్యేణ సర్వా విద్యా అభ్యస్య యుద్ధవిద్యాం విదిత్వా సర్వాసు దిక్షు స్థాయన్తే తే మనుష్యాణాం పశ్వాదీనాం చ భక్ష్యభోజ్యమున్నీయ రక్షాం విధాయానన్దితా భవన్తు. ।౬౬॥

**పదార్థము** :-(అగ్నే) శత్రువులను భస్మమొనర్చు ఓ సభాపతీ! నీవు (ప్రాచీమ్) పూర్వ [తూర్పు] (ప్రదిశమ్) వైపు దిశను (అను, ప్ర, ఇహి) అనుకూలపరచుకొనుము (ఇహ) ఈ రాజ్యకార్యములందు (అగ్నేః) ఆగ్నేయాద్యస్త్రముల యోగముతో (పురోఅగ్నిః) అగ్నివంటి అగ్రగామిని (విద్వాన్) కార్యములనెరిగినట్టి విద్వాంసుడవు (భవ) అగుము (విశ్వాః) సమస్త (ఆశాః) దిశలను (దీద్యానః) నిరంతరము ప్రకాశితమొనర్చుచు సూర్యునివలె (నః) మాయొక్క (ద్విపదే) మనుష్యాదులు మరియు (చతుష్పదే) గోవులు మున్నగు పశువుల కొరకు (ఊర్జమ్) అన్నము మున్నగు పదార్థములను (ధేహి) ధరించుము. మరియు విద్యావినయ పరాక్రమములచే అభయమును (వి, భాహి) ప్రకాశపరచుము.।౬౬॥

**భావార్థము** :-పూర్ణబ్రహ్మచర్యముతో సకలవిద్యలను గ్రహించి, యుద్ధవిద్యలనెరిగి అన్నివైపులనుండి కీర్తింపబడు విద్వాంసవీరులు మనుష్యుల మరియు పశువుల ఆహారపదార్థములను సమృద్ధమొనర్చి, రక్షణ విధానమునొనర్చి ఆనందముతో గూడినవా రగుదురు.।౬౬॥

**66.O King, go forward to the eastern region. In thy state, with the use of fiery weapons, be a skilled leader full of passion like fire. Illumining all the quarters, shine with splendour; supply food to our quadrupeds and bipeds!.**

౯౧౭.పృథివ్యా ఇత్యస్య విధృతిర్ఋషిః, అగ్నిర్దేవతా, పిపీలికామధ్యా బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
పునర్యోగిగుణా ఉపదిశ్యన్తే. యోగి గుణములు ఉపదేశించబడుచున్నవి.

౯౧౭ పృథివ్యాऽ అహముదన్తరిక్షమారుహమన్తరిక్షాద్దివమారుహమ్ ।
దివో నాకస్య పృష్ఠాత్ స్వర్జ్యోతిరగామహమ్ ॥౬౭॥

**ప. విః-పృథివ్యాః, అహమ్, ఉత్ అన్తరిక్షమ్ ఆ, అరుహమ్, అన్తరిక్షాత్, దివమ్, ఆ, అరుహమ్, దివః, నాకస్య, పృష్ఠాత్, స్వః, జ్యోతిః, అగామ్, అహమ్ ॥౬౭॥**

**పదార్థః** :-(పృథివ్యాః) భూమేర్మధ్యే (అహమ్) (ఉత్) (అన్తరిక్షమ్) ఆకాశమ్ (ఆ) (అరుహమ్) రోహేయమ్ (అన్తరిక్షాత్) ఆకాశాత్ (దివమ్) ప్రకాశమానం సూర్యమ్ (ఆ) (అరుహమ్) సమన్తాద్రోహేయమ్ (దివః) ద్యోతమానస్య (నాకస్య) సుఖనిమిత్తస్య (పృష్ఠాత్) సమీపాత్ (స్వః) సుఖమ్ (జ్యోతిః) జ్ఞానప్రకాశమ్ (అగామ్) ప్రాప్నుయామ్ (అహమ్). ॥౬౭॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథా కృతయోగాఙ్గానుష్ఠానసంయమసిద్ధోऽహం పృథివ్యా అన్తరిక్షముదారుహమన్తరిక్షాద్దివ మారుహం నాకస్య దివః పృష్ఠాత్ స్వర్జ్యోతిశ్చాహమగాం తథా యూయమప్యాచరత. ॥౬౭॥

**భావార్థః** :-యదా మనుష్యః స్వాత్మనా సహ పరమాత్మానం యుఙ్క్తే తదాऽణిమాదయః సిద్ధయః ప్రాదుర్భవన్తి తతోऽవ్యాహతగత్యాభీష్టాని స్థానాని గన్తుం శక్నోతి నాన్యథా ॥౬౭॥

**పదార్థము** :-మానవులారా! యోగాంగానుష్ఠానములచే సంయమసిద్ధి అనగా ధారణ, ధ్యాన, సమాధులయందు పరిపూర్ణుడనగు (అహమ్) నే నెట్లు (పృథివ్యాః) పృథివినుండి (అన్తరిక్షమ్) ఆకాశమునకు (ఉద్, ఆ, అరుహమ్) ఎగిరిపోవుదునో మరియు (అన్తరిక్షాత్) ఆకాశమునుండి (దివమ్) ప్రకాశవంతమగు సూర్యలోకమునకు (ఆ, అరుహమ్) ఎక్కిపోవుదునో మరియు (నాకస్య) సుఖములప్రసాదించు (దివః) ప్రకాశవంతమగు నా సూర్యలోకము (పృష్ఠాత్) సమీపమునుండి (స్వః) అత్యంతసుఖముగల (జ్యోతిః) జ్ఞాన ప్రకాశమును (అహమ్) నేను (అగామ్) పొందునట్లు మీరును ఆచరించుడు. ॥౬౭॥

**భావార్థము** :-మనుష్యుడు తనయాత్మతో పరమాత్మయోగమును ప్రాప్తించుకొనునప్పుడు అణిమాది సిద్ధులుత్పన్నమగును. ఆ పిదప అచ్చట నిలిచియుండునట్టి గమనముద్వారా అభీష్టస్థానములకు చేరగలుగును. కాని అన్యత్ర అట్లు సాధ్యముగాదు. ॥౬౭॥

67.Through yoga,from physical force I rise higher to mental force;from mental force I rise higher to spiritual force; from spiritual force I rise higher to God, the Blissful Light.

౬౮.స్వర్యన్త ఇత్యస్య విధృతిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౬౮ స్వర్యన్తో నాపేక్షన్త ఆ ద్యాంరోహన్తి రోదసీ ।

యజ్ఞం యే విశ్వతోధారంసువిద్వాంసో వితేనిరే ॥౬౮॥

ప.వి:-స్వః, యన్తః, న, అప, ఈక్షన్తే, ఆ, ద్యామ్, రోహన్తి, రోదసీ ఇతి రోదసీ, యజ్ఞమ్, యే, విశ్వతోధారమితి విశ్వతః + ధారమ్, సువిద్వాంస ఇతి సు + విద్వాంసః, వితేనిర ఇతి వి + తేనిరే.॥౬౮॥

**పదార్థః** :-(స్వః) సుఖమ్ (యన్తః) ఉపయన్తః (న) ఇవ (అప) (ఈక్షన్తే) సమాలోకన్తే (ఆ) సమన్తాత్ (ద్యామ్) ప్రకాశమయీం యోగవిద్యామ్ (రోహన్తి) (రోదసీ) ద్యావాపృథివ్యౌ (యజ్ఞమ్) సంగంతవ్యమ్ (యే) (విశ్వతోధారమ్) విశ్వతః సర్వతో ధారాః సుశిక్షితా వాచో యస్మింస్తమ్ (సువిద్వాంసః) శోభనాశ్చ తే యోగినః (వితేనిరే) విస్తృతం కుర్వన్తి. ॥౬౮॥

**అన్వయః** :-యే సువిద్వాంసో యన్తో న స్వరపేక్షన్తే రోదసీ ఆరోహన్తి ద్యాం విశ్వతోధారం యజ్ఞం వితేనిరే తేఽక్షయం సుఖం లభన్తే. ॥౬౮॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యథా సారథిరశ్వాన్ సుశిక్ష్యాభీష్టే మార్గే చాలయిత్వా సుఖేనాభీష్టం స్థానం సద్యో గచ్ఛతి తథైవ శోభనా విద్వాంసో యోగినో జితేన్ద్రియా భూత్వా సంయమేన స్వేష్టం పరమాత్మానం ప్రాప్యానన్దం విస్తారయన్తి. ॥౬౮॥

**పదార్థము** :- (యే) ఏ (సువిద్వాంసః) ఉత్తమ విద్వాంసులు (యన్తః) యోగాభ్యాసమునందలి సంపూర్ణ నియమముల నాచరించువారి (న) వలె (స్వః) అత్యంతసుఖములను (అప ఈక్షన్తే) కోరుచుందురో మరియు (రోదసీ) పృథివీ ఆకాశములకు (ఆ, రోహన్తి) అధిరోహించెదరో, అనగా లోక లోకాంతరములకు ఇచ్ఛాపూర్వకముగా వెళ్లుచుందురో మరియు (ద్యామ్) ప్రకాశమయయోగవిద్య (విశ్వతోధారమ్) అన్ని వైపులనుండి సుశిక్షాయుక్తమగు వాణులు గలవో, వేనియందు (యజ్ఞమ్) ప్రాప్తించుకొనదగిన ఆ యజ్ఞాది కర్మలను (వితేనిరే) విస్తారమొనర్చెదరో, అట్టివారే నాశరహిత సుఖములను పొందుదురు. ॥౬౮॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు. చతురుడగు సారథి అశ్వములకు చక్కని శిక్షణనిచ్చి అభీష్టమార్గమున నడిపించి శీఘ్రమే సుఖముగా గమ్యస్థానమునకు చేరుకొనునట్లు శ్రేష్ఠవిద్వాంసులగు యోగులు జితేంద్రియులై నియమపూర్వకముగా తమ యభీష్టదైవమగు పరమాత్మను పొంది ఆనందమును విస్తారపరచుకొనెదరు. ౹౬౮౹౹

68.The learned yogis, who attain to God, the Sustainer of the universe, on their march to salvation, pay no attention to worldly pleasures, but rise to salvation, that frees them from birth and death.

౬౯. అగ్న ఇత్యస్య విధృతిర్‌ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునర్విద్వద్వ్యవహార ఉపదిశ్యతే. విద్వాంసుని వ్యవహార ముపదేశింపబడుచున్నది.

౬౯ అగ్నే ప్రేహి ప్రథమో దేవయతాం చక్షుర్దేవానాముత మర్త్యానామ్ ।
ఇయక్షమాణా భృగుభిః సజోషాః స్వర్యన్తు యజమానాః స్వస్తి ౹౬౯౹౹

ప. విః-అగ్నే, ప్ర, ఇహి, ప్రథమః, దేవయతామితి దేవ + యతామ్, చక్షుః, దేవానామ్, ఉత, మర్త్యానామ్, ఇయక్షమాణాః, భృగుభిరితి భృగు + భిః, సజోషా ఇతి స + జోషాః, స్వః, యన్తు; యజమానాః స్వస్తి. ౹౬౯౹౹

**పదార్థః** :-(అగ్నే) విద్వన్ (ప్ర) (ఇహి) ప్రాప్నుహి (ప్రథమః) ఆదిమః (దేవయతామ్) కామయమానానామ్ (చక్షుః) దర్శకమ్ (దేవానామ్) విదుషామ్ (ఉత) అపి (మర్త్యానామ్) అవిదుషామ్ (ఇయక్షమాణాః) యజ్ఞం చికీర్షమాణాః (భృగుభిః) పరిపక్వవిజ్ఞానైర్విపశ్చిద్భిః (సజోషాః) సమానప్రీతిసేవనాః (స్వః) సుఖమ్ (యన్తు) ప్రాప్నువన్తు (యజమానాః) సర్వేభ్యః సుఖదాతారః (స్వస్తి) కల్యాణమ్. ౹౬౯౹౹

**అన్వయః** :-హే అగ్నే! దేవయతాం మధ్యే ప్రథమః పూర్వం ప్రేహి యతో దేవానాముత మర్త్యానాం త్వం చక్షురసి యథేయక్షమాణాః సజోషా యజమానా భృగుభిః సహ స్వస్తి స్వర్యన్తు తథా త్వమపి భవ. ౹౬౯౹౹

**భావార్థః** :-హే మనుష్యాః! విద్వద్భిరవిద్వద్భిశ్చ సహ ప్రీత్యోపదేశేన యూయం సుఖం ప్రాప్నుత. ౹౬౯౹౹

పదార్థము :-(అగ్నే) విద్వాంసుడా! (దేవయతామ్) కామితజనులమధ్య నీవు (ప్రథమః) మొదటనే (ప్రేహి) ప్రాప్తించుము. దానివల్ల (దేవానామ్) విద్వాంసుల (ఉత) మరియు (మర్త్యానామ్) అవిద్వాంసులందు నీవు (చక్షుః) వ్యవహారములను జూచువాడవు. దీనివల్ల (ఇయక్షమాణాః) యజ్ఞమునుగోరునట్టి (సజోషాః) సమానప్రీతిగల (యజమానాః) సకలజనులకు సుఖమునిచ్చువారు (భృగుభిః) పరిపూర్ణ విజ్ఞానముగల విద్వాంసులతోగూడ (స్వస్తి) సామాన్యసుఖముల మరియు (స్వః) అత్యంతసుఖములను (యన్తు) పొందుచుండునట్లు నీవును అగుము. ॥౬౯॥

భావార్థము :-మానవులారా! మీరు విద్వాంసులతోను, అవిద్వాంసులతోను ప్రేమతో సంభాషించు కొనుచు సుఖములను పొందుచుండుడు. ॥౬౯॥

69.Foremost of those who exert, O learned person, come forward, thou art the eye of the literate and the illiterate!.

The sacrificers, fain to worship, friendly to all, accordant with the highly learned persons, atrain to ordianary and extreme happiness.

౭౦ నక్తోషాసేత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కథం వర్తితవ్యమిత్యాహ. మానవు లెటుల వర్తించవలయును?

౭౦ నక్తోషాసా సమనసా విరూపే ధాపయేతే శిశుమేకꣳ సమీచీ। ద్యావాక్షామా

రుక్మోఽ అన్తర్విభాతి దేవాఽ అగ్నిం ధారయన్ ద్రవిణోదాః ॥౭౦॥

ప.వి:-నక్తోషాసా, నక్తోషసేతి నక్తోషసా, సమనసేతి స + మనసా, విరూపే ఇతి విఽరూపే, ధాపయేతే ఇతి ధాపయేతే, శిశుమ్, ఏకమ్, సమీచీ ఇతి సమ్ + ఈచీ, ద్యావాక్షామా, రుక్మః, అన్తః, వి, భాతి, దేవాః, అగ్నిమ్, ధారయన్, ద్రవిణోదా ఇతి ద్రవిణః + దాః.॥౭౦॥

పదార్థః :-(నక్తోషాసా) రాత్ర్యుషసావివ (సమనసా) సమానం మనో విజ్ఞానం యయోస్తే (విరూపే) విరుద్ధస్వరూపే (ధాపయేతే) పాయయతః (శిశుమ్) బాలకమివ వర్తమానం జగత్ (ఏకమ్) అసహాయమ్ (సమీచీ) యే ఏకీభావమిచ్ఛన్తస్తే (ద్యావాక్షామా) (రుక్మః) దేదీప్యమానోఽగ్నిః (అన్తః) మధ్యే (వి,భాతి) విశేషేణ ప్రకాశతే (దేవాః) విద్వాంసః (అగ్నిమ్) (ధారయన్) అధారయన్ అత్రాడభావః (ద్రవిణోదాః) ద్రవ్యప్రదాతారః.॥౭౦॥

**అన్వయః** :- హే మనుష్యాః! యూయం యథా సమనసా సమీచీ విరూపే మాతృధాత్ర్యౌ వైకం శిశుమివ నక్తోషాసా జగద్ధాపయేతే యథా వా ద్యావాక్షామాన్తో రుక్మో విభాతి ద్రవిణోదా దేవా తమగ్నిం ధారయన్ స్తథా వర్తధ్వమ్.॥౭౦॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యథా రాత్ర్యుషసౌ విరుద్ధరూపే వర్తతే యథా చ విద్యుత్ సర్వపదార్థేషు వ్యాప్తా యథా వా ద్యావాభూమీ అతిసహనశీలే వర్తేతే తద్వత్ వివేచకైః శుభగుణేషు వ్యాపకైర్భూత్వా పుత్రవజ్జగత్పాలనీయమ్. ॥౭౦॥

**పదార్థము** :- మానవులారా! ఎట్లు (సమనసా) ఒకేవిధముగు విజ్ఞానము గలిగినవారు (సమీచీ) ఏకత్వము నభిలషించువారు (విరూపే) వేర్వేరు రూపములుగల కన్నతల్లి, దాది [ధాత్రి] ఇరువురును (ఏకమ్) ఒకే (శిశుమ్) శిశువునకు పాలను ద్రాపుదురో, అట్లే (నక్తోషాసా) రాత్రి మరియు ప్రాతఃకాలవేళలను విశ్వమునకు (ధాపయేతే) పాలవలె ద్రావించుచున్నవి. అనగా అత్యన్తానందము నిచ్చుచున్నవి. లేక ఎట్లు (రుక్మః) ప్రకాశవంతమగు అగ్ని (ద్యావా క్షామా, అన్తః) బ్రహ్మాండమునందు (వి,భాతి) విశేషముగ ప్రకాశించుచున్నదో అట్టి (అగ్నిమ్) అగ్నిని (ద్రవిణోదాః) ద్రవ్యము నిచ్చువారు (దేవాః) శాస్త్రాధ్యయనమొనర్చిన విద్వాంసులు (ధారయన్) ధారణమొనర్చుచున్నారో అట్టి యాచరణమునే మీ రనుష్ఠించుడు.॥౭౦॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము కలదు. ప్రపంచమునందు రాత్రి మరియు ప్రాతఃసమయములు వేర్వేరురూపమునందుండియును విద్యుత్తు, అగ్ని సమస్త పదార్థములందు వ్యాప్తమై యుండియును, ప్రకాశము మరియు పృథివి అత్యంత సహనశీలములై యున్నట్లు మానవులును అత్యన్త వివేచనమొనర్చువారు శుభగుణములందు వ్యాపకులునై పుత్రునివలె విశ్వమును పాలించవలెను.॥౭౦॥

70.Just as the nurse and mother with different characteristcis, but with one mind, working in harmony suckle the same child, so do the night and dawn, with different hues nourish the world. Just as the brilliant sun shines between the Heaven and Earth, so do the imparters of knowledge imbibe that glow of knowledge.

**౭౧. అగ్న ఇత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.**

**పునర్యోగికర్మఫలముపదిశ్యతే. యోగి కర్మల ఫలితము ఉపదేశించబడుచున్నవి.**

౭౧ అగ్నే సహస్రాక్ష శతమూర్ధఞ్ఛతం తే ప్రాణాః సహస్రం వ్యానాః। త్వꣳ సాహస్రస్య రాయꣳ ఈశిషే తస్మై తే విధేమ వాజాయ స్వాహా ॥౭౧॥

**ప.వి:-** అగ్నే, సహస్రాక్షేతి సహస్ర + అక్ష, శతమూర్ధన్నితి శత + మూర్ధన్, శతమ్, తే,

ప్రాణాః, సహస్రమ్, వ్యానా ఇతి వి + ఆనాః, త్వమ్, సాహస్రస్య, రాయః, ఈశిషే, తస్మై, తే, విధేమ,వాజాయ, స్వాహా.॥౭౧॥

**పదార్థః**:-(అగ్నే) పావక ఇవ ప్రకాశమయ (సహస్రాక్ష) సహస్రేష్వసంఖ్యాతేషు వ్యవహారేష్వక్షివిజ్ఞానం యస్య తత్సమ్బుద్ధౌ (శతమూర్ధన్) శతేష్వసంఖ్యాతేషు మూర్ధా మస్తకం యస్య తత్సమ్బుద్ధౌ (శతమ్) అసంఖ్యాతాః (తే) తవ (ప్రాణాః) జీవనసాధనాః (సహస్రమ్) అసంఖ్యాః (వ్యానాః) చేష్టానిమిత్తాః సర్వశరీరస్థా వాయవః (త్వమ్) (సాహస్రస్య) సహస్రాణామసంఖ్యాతానామిదమధికరణం జగత్ తస్య (రాయః) ధనస్య (ఈశిషే) ఈశోఽసి (తస్మై) (తే) తుభ్యమ్ (విధేమ) పరిచరేమ (వాజాయ) విజ్ఞానవతే (స్వాహా) సత్యయా వాచా. ॥౭౧॥

**అన్వయః** :-హే సహస్రాక్ష శతమూర్ధన్నగ్నే యోగిరాజ! యస్య తే శతం ప్రాణాః సహస్రం వ్యానాః సన్తి యస్త్వం సాహస్రస్య రాయ ఈశిషే తస్మై వాజాయ తే వయం స్వాహా విధేమ.॥౭౧॥

**భావార్థః** :-యో యోగీ తప - ఆదిసాధనైర్యోగబలం ప్రాప్యాసంఖ్యప్రాణిశరీరాణి ప్రవిశ్యానేక నేత్రాదిభిరఙ్గైర్దర్శనాదికార్యాణి కర్తుం శక్నోతి. అనేకేషాం పదార్థానాం ధనానాం చ స్వామీ భవతి సోఽస్మాభి రవశ్యం పరిచరణీయః.॥౭౧॥

**పదార్థము** :-(సహస్రాక్ష) వేలాది వ్యవహారములందు తమ విశేషజ్ఞానము మరియు (శతమూర్ధన్) వందలకొలది ప్రాణుల మస్తకమువంటివాడు (అగ్నే) అగ్నివంటి ప్రకాశమానుడగు యోగిరాజా (తే) నీయొక్క (శతమ్) అనేకములగు (ప్రాణాః) జీవనసాధనములను (సహస్రమ్, వ్యానాః) సకలక్రియలకు నిమిత్తములగు శరీరస్థవాయువులను (త్వమ్) నీవు (సాహస్రస్య) అసంఖ్యాక జీవులు మరియు పదార్థములకాధారమగు నీ జగత్తుయొక్క (రాయః) ధనములకు (ఈశిషే) స్వామివి (తస్మై) అట్టి (వాజాయ) విశేషజ్ఞానముగల (తే) నీకొరకు మేము (స్వాహా) సత్యవాణితో (విధేమ) సత్కారపూర్వకముగా వ్యవహరించుచుందుము గాక.॥౭౧॥

**భావార్థము** :-ఏ యోగి తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము మున్నగు యోగసాధనములచే, ధారణ, ధ్యాన, సమాధిరూప సంయమములచే యోగశక్తిని ప్రాప్తించుకొనునో, అనేక ప్రాణుల శరీరములందు ప్రవేశించి అనేక శిరములు, నేత్రములు మున్నగు అంగములతో చూచుట మున్నగు కార్యములవంటివి యొనర్చునో, అనేక పదార్థముల మరియు ధనముల స్వామియును గాజాలునో అట్టివానిని మనమెల్లరమును అవశ్యముగా సేవించవలయును. ॥౭౧॥

71.O yogi, thou hast the knowledge of innumerable usages, immense power of meditation, hundreds of accomplishments of life, and thousands of modes of acctivity. Thou art the Lord of thousandfold possessions. To thee full of knowledge may we offer our obeisance in truthful words!.

౯౨౨.సుపర్ణ ఇత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ పంక్తిశ్ఛందః, పఞ్చమః స్వరః.

పునర్విద్వాన్ కీదృశః స్యాదిత్యాహ. విద్వాంసు డెటు లుండవలయును?

౯౨౨ సుపర్ణో౽సి గరుత్మాన్ పృష్ఠే పృథివ్యాః సీద। భాసాన్తరిక్షమా పృణ జ్యోతిషా దివముత్తభాన తేజసా దిశ ఉద్దృꣳహ ॥౭౨॥

ప. విః-సుపర్ణః, అసి, గరుత్మానితి గరుత్మాన్, పృష్ఠే, పృథివ్యాః, సీద, భాసా, అన్తరిక్షమ్, ఆ, పృణ, జ్యోతిషా, దివమ్, ఉత్, స్తభాన, తేజసా, దిశః, ఉత్, దృꣳహ.॥౭౨॥

**పదార్థః**:-(సుపర్ణః) శోభనాని పర్ణాని పూర్ణాని శుభలక్షణాని యస్య సః (అసి) (గరుత్మాన్) గుర్వాత్మా (పృష్ఠే) ఉపరి (పృథివ్యాః) (సీద) (భాసా) ప్రకాశేన (అన్తరిక్షమ్) ఆకాశమ్ (ఆ) సమన్తాత్ (పృణ) సుఖయ (జ్యోతిషా) న్యాయప్రకాశేన (దివమ్) ప్రకాశమయమ్ (ఉత్) ఊర్ధ్వమ్ (స్తభాన) (తేజసా) తీక్ష్ణీకరణేన (దిశః) (ఉత్) (దృంహ) ఉద్వర్ధయ.॥౭౨॥

**అన్వయః** :-హే విద్వన్! యోగిరాజస్త్వం భాసా సుపర్ణో గరుత్మానసి యథా సవితాన్తరిక్షస్య మధ్యే వర్తతే తథా పృథివ్యాః పృష్ఠే సీద! వాయురివ ప్రజా ఆపృణ సవితా జ్యోతిషా దివమన్తరిక్షమివ రాజ్యముత్తభాన అగ్నిస్తేజసా దిశ ఇవ ప్రజా ఉద్దృంహ.॥౭౨॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యదా మనుష్యో రాగద్వేషరహితః పరోపకారీశ్వర ఇవ ప్రాణిభిః సహ వర్తేత తదా సిద్ధిం లభేత.॥౭౨॥

**పదార్థము** :- విద్వాంసుడవగు నో యోగిరాజా! నీవు (భాసా) ప్రకాశముచే (సుపర్ణః) ఉత్తమోత్తమ పూర్ణ శుభలక్షణములతో యుండి (గరుత్మాన్) గొప్పమనస్సు మరియు ఆత్మ బలములతో గూడ (అసి) ఉన్నావు. అతిప్రకాశమైన ఆకాశమునందు వర్తమానమైయున్న సూర్యమండలమువలె (పృథివ్యాః) పృథివి (పృష్ఠే) పైన (సీద) స్థిరుడవు అగుము. మరియు వాయువువలె ప్రజలకు (ఆ, పృణ) సుఖములనిమ్ము. మరియు సూర్యుడు (జ్యోతిషా) తన ప్రకాశముచే (దివమ్) ప్రకాశమయ (అన్తరిక్షమ్) అంతరిక్షమును వృద్ధిపరచుచున్నట్లు నీవును రాజనీతి ప్రకాశముచే రాజ్యమును (ఉత్, స్తభాన) ఉన్నతపరచుము మరియు అగ్నియెట్లు తన (తేజసా) అతి తీక్ష్ణమగు తేజముతో (దిశః) దిశలను [ప్రకాశపరచుచున్నదో] అట్లే నీ తీక్ష్ణతేజముతో ప్రజాజనమునకు (ఉద్, దృంహ) ఉన్నతిని గలిగించుము.॥౭౨॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మనుష్యులు రాగము (ప్రీతి) ద్వేషము (వైరము)లను వదలి పరోపకారవంతులై ఈశ్వరునివలె సకలప్రాణుల యెడ వర్తించుచుండినట్లైన సకలసిద్ధులను సాధించుకొనగలరు.॥౭౨॥

72. O learned yogi, with thy light, thou art endowed with excellent noble qualities, yoked with high soul-power. Just as the sun shines in the midst of heaven, so do thou be seated on earth. Grant happiness to the poeple like air. As the sun fills air's mid-region with its glow, so shouldst thou strengthen soverignty with thy statesmanship. Just as fire with its intense heat fills the quarters, so shouldst thou elevate the people!.

౯౨౩. ఆజుహ్వాన ఇత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్విద్వాన్ కీదృశః స్యాదిత్యాహ. విద్వాంసు డెటు ఉండవలయును?

౯౨౩ ఆజుహ్వానః సుప్రతీకః పురస్తాదగ్నే స్వం యోనిమాసీద సాధుయా।

అస్మిన్త్సధస్థే౨అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥౨౩॥

ప.వి:- ఆజుహ్వాన ఇత్యాజు + హ్వానః, సుప్రతీక ఇతి సు + ప్రతీకః, పురస్తాత్, అగ్నే, స్వమ్, యోనిమ్, ఆ, సీద, సాధుయేతి సాధు + యా, అస్మిన్, సధస్థే, అధి, ఉత్తరస్మిన్, విశ్వే, దేవాః, యజమానః, చ, సీదత.॥౨౩॥

**పదార్థః** :-(ఆజుహ్వానః) సత్కారేణాహూతః (సుప్రతీకః) ప్రాప్తశుభగుణః (పురస్తాత్) ప్రథమతః (అగ్నే) యోగాభ్యాసేన ప్రకాశితాత్మన్ (స్వమ్) స్వకీయమ్ (యోనిమ్) పరమాత్మాఖ్యం గృహమ్ (ఆ) (సీద) సమన్తాత్ స్థిరో భవ (సాధుయా) శ్రేష్ఠైః కర్మభిః (అస్మిన్) (సధస్థే) సహస్థానే (అధి) ఉపరిభావే (ఉత్తరస్మిన్) (విశ్వే) సర్వే (దేవాః) దివ్యాత్మానో యోగినః (యజమానః) యోగప్రద ఆచార్యః (చ) (సీదత).॥ ౨౩ ॥

**అన్వయః** :- హే అగ్నే! పురస్తాదాజుహ్వానః సుప్రతీకో యజమానస్త్వం సాధుయాస్మిన్ సధస్థే స్వం యోని మాసీద. హే విశ్వే దేవాః! యూయం సాధుయోత్తరస్మిన్ సధస్థే చాధి సీదత.॥౨౩॥

**భావార్థః** :-యే సాధూని కర్మాణి కృత్వా కృతయోగాభ్యాసస్య విదుషః సఙ్గప్రీతిభ్యాం పరస్పరం సంవాదం కుర్వన్తి తే సర్వాధిష్ఠానమీశం ప్రాప్య సిద్ధా జాయన్తే.॥ ౨౩ ॥

**పదార్థము** :-యోగాభ్యాసముచే ప్రకాశితమైన ఆత్మతో గూడిన (పురస్తాత్) ప్రథమమునుండియే (ఆజుహ్వానః) సత్కారపూర్వకముగ పిలువబడిన (సుప్రతీకః) శుభగుణములతో గూడిన (యజమానః) యోగవిద్యలను ప్రసాదించు ఆచార్యా! నీవు (సాధుయా) శ్రేష్ఠకర్మలచే (అస్మిన్) ఇట్టి (సధస్థే) ఒకేచోట గలసియున్న స్థానమునందు (స్వమ్) స్వంతమైన (యోనిమ్) పరమాత్మరూపమగు గృహమందు (ఆ, సీద)

స్థిర మగుము (చ) మరియు (విశ్వే) సమస్త (దేవాః) దివ్యాత్మలుగల యోగులారా! మీరు (శ్రేష్ఠకర్మలచే (ఉత్తర స్మిన్) ఉత్తర [తరువాత] సమయములో ఒక్కుమ్మడిగ సత్యసిద్ధాంతములపై (అధి,సీదత) అధికముగ స్థిరముగలవా రగుడు.॥౨౩॥

**భావార్థము :-** శుభకర్మలనొనర్చుచు యోగాభ్యాసమొనర్చు విద్వాంసుల సాంగత్యము మరియు ప్రీతిచే పరస్పర సంవాదమొనర్చువారు సర్వాధిష్ఠాతయగు పరమేశ్వరప్రాప్తిని పొంది సిద్ధిని పొందుచుందురు.॥౨౩॥

Thou, whose soul is enlightened with yoga, who invites respect from those who contact thee, the master of good traits, the teacher of the science of yoga, through thy virtuous deeds, seat thyself firmly in God thy nearest home. Ye all yogis, with laudable acts, stick fast to truth after discussion!.

౯౨౪. తాఌ సవితురిత్యస్య కణ్వ ఋషిః, సవితా దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ క ఈశ్వరం ప్రాప్తుం శక్నోతీత్యాహ?. ఈశ్వరుని ఎవరు పొందగలరు?

౯౨౪ తాఌ సవితుర్వరేణ్యస్య చిత్రామాహం వృణే సుమతిం విశ్వజన్యామ్। యామస్య కణ్వో అదుహత్ప్రపీనాఌ సహస్రధారాం పయసా మహీం గామ్॥౨౪॥

ప. విః-తామ్, సవితుః, వరేణ్యస్య, చిత్రామ్, ఆ, అహమ్, వృణే, సుమతిమితి సు + మతిమ్, విశ్వజన్యామ్, యామ్, అస్య, కణ్వః, అదుహత్, ప్రపీనామితి, ప్ర+ పీనామ్, సహస్రధారామితి సహస్ర + ధారామ్, పయసా, మహీమ్, గామ్ ॥౨౪॥

**పదార్థః :-** (తామ్) వక్ష్యమాణామ్ (సవితుః) యోగైశ్వర్యసంప్రదస్యేశ్వరస్య (వరేణ్యస్య) వరితుమర్హస్య (చిత్రామ్) అద్భుతవిషయామ్ (ఆ) (అహమ్) (వృణే) స్వీకుర్వే (సుమతిమ్) శోభనాం యథావిషయాం ప్రజ్ఞామ్ (విశ్వజన్యామ్) యా విశ్వమఖిలం జగజ్జనయతి ప్రకటయతి తామ్ (యామ్) (అస్య) (కణ్వః) మేధావీ (అదుహత్) పరిపూరయతి (ప్రపీనామ్) ప్రవృద్ధామ్ (సహస్రధారామ్) సహస్రమసంఖ్యానర్థాన్ ధరతి తాం సర్వజ్ఞానప్రదామ్ (పయసా) అన్నాదినా (మహీమ్) మహతీమ్ (గామ్) వాచమ్. గౌరితి వాఙ్నా. ని. ౧.౧౧.॥౨౪॥

**అన్వయః :-** యథా కణ్వోఽస్య వరేణ్యస్య సవితురీశ్వరస్య యాం చిత్రాం విశ్వజన్యాం ప్రపీనాం సహస్రధారాం సుమతిం పయసా మహీం గాం చాదుహత్ తథా తామహమావృణే.॥౨౪॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా మేధావీ జగదీశ్వరస్య విద్యాం ప్రాప్యైధతే తథైవైతాం లబ్ధ్వాఽన్యేనాపి విద్యాయోగవృద్ధ్యై భవితవ్యమ్. ॥౭౪॥

**పదార్థము** :-ఎట్లు (కణ్వః) బుద్ధిశాలి (అస్య) ఈ (వరేణ్యస్య) స్వీకరించదగిన [వరించదగిన] (సవితుః) యోగైశ్వర్యములను ప్రసాదించు పరమేశ్వరుని (యామ్) ఏ (చిత్రామ్) అద్భుత ఆశ్చర్యరూపము, లేక (విశ్వజన్యామ్) సమస్త జగత్తునుత్పన్నముచేయుచు (ప్రపీనామ్) అత్యున్నతముగ యభివృద్ధి గాంచుచు (సహస్రధారామ్) వేలాది పదార్థములను ధారణమొనర్పునదియు (సుమతిమ్) యథార్థవిషయములను ప్రకాశపరచు ఉత్తమ బుద్ధియు (పయసా) అన్నము మున్నగు పదార్థములతోగూడ (మహీమ్) గొప్ప (గామ్) వాణిని (అదుహత్) పరిపూర్ణముచేయుచు, అనగా క్రమముగ దెలిసికొని తనజ్ఞానవిషయకమొనర్చుకొనునట్లు (తామ్) దానిని (అహమ్) నేను (ఆ,వృణే) చక్కగా స్వీకరించుచున్నాను. ॥౭౪॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మేధావి జగదీశ్వరుని విద్యలను పొంది వృద్ధిని ప్రాప్తించుకొనునట్లు సర్వజనులును దీనిని ప్రాప్తిజేసికొని విద్యయోగములవృద్ధికై ఉద్యుక్తులై యుండవలయును. ॥౭౪॥

74.Just as a wise person, know the exalted vedic speech of God, the Adorable, the Giver of the glory of yoga, and enhances his knowledge with that speech, that is wondrous, explains the creation of the universe, is full of knowledge, explains each topic lucidly and gives us wisdom and food. so do I rightly accept it.

౭౫. విధేమేత్యస్య గృత్సమద ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౭౫ విధేమ తే పరమే జన్మన్నగ్నే విధేమ స్తోమైరవరే సధస్థే। యస్మా

ద్యోనేరుదారిథా యజే తం ప్ర త్వే హవీꣳషి జుహురే సమిద్ధే ॥౭౫॥

ప.విః-విధేమ తే, పరమే, జన్మన్, అగ్నే, విధేమ, స్తోమైః, అవరే, సధస్థ ఇతి సధ + స్థే, యస్మాత్, యోనేః, ఉదారిథేత్యుత్ + ఆరిథ, యజే, తమ్, ప్ర, త్వ ఇతి త్వే, హవీꣳషి జుహురే సమిద్ధ ఇతి సమ్ + ఇద్ధే ॥౭౫॥

**పదార్థః** :-(విధేమ) పరిచరేమ (తే) తవ (పరమే) సర్వోత్కృష్టే యోగసంస్కారజే (జన్మన్) జన్మని. అత్ర సుపాం సులుగితి జేర్లుక్ (అగ్నే) యోగసంస్కారేణ దుష్టకర్మదాహక (విధేమ) సేవేమహి (స్తోమైః) స్తుతిభిః (అవరే) అర్వాచీనే (సధస్థే) సహస్థానే (యస్మాత్) (యోనేః) స్థానాత్ (ఉదారిథ)

ఉత్కృష్టైః సాధనైః ప్రాప్నుహి అత్రాన్యేషామపీతి దీర్ఘః (యజే) సంగచ్ఛే (తమ్) (ప్ర) (త్వే) త్వయి (హవీంషి) హోతవ్యాని (జుహురే) జుహ్వతి (సమిద్ధే) సమ్యక్ ప్రదీప్తే. ॥౭౫॥

**అన్వయః** :-హే అగ్నే యోగిన్! తే తవ పరమే జన్మన్ త్వే వర్తమానేఽవరే సధస్థే వర్తమానా వయం స్తోమైర్విధేమ త్వమస్మాన్ యస్మాద్యోనేరుదారిథ తం యోనిమహం ప్రయజే యథా హోతారః సమిద్ధేఽగ్నౌ హవీంషి జుహురే తథా యోగాగ్నౌ దుఃఖసమూహస్య హోమం విధేమ.॥౭౫॥

**భావార్థః** :-ఇహ యస్య యోగసంస్కారయుక్తస్య జీవస్య పవిత్రోపచితం జన్మ జాయతే స సంస్కారబలాత్ యోగజిజ్ఞాసురేవ భవతి, యే తం సేవన్తే తేఽపి యోగజిజ్ఞాసవో సర్వ ఏతేఽగ్నిరిన్ధనానీవ సర్వామశుద్ధిం యోగేన దహన్తి. ॥౭౫॥

**పదార్థము** :-(అగ్నే) ఓ యోగీ! (తే) నీయొక్క (పరమే) అత్యుత్తమ యోగసంస్కారముచే ఉత్పన్నమైన (జన్మన్) జన్మయందు (త్వే) నీ యీ వర్తమాన జన్మయందు (అవరే) ఇప్పటి నవీనమైన (సధస్థే) ఒకే స్థానమందు ఈ వర్తమానమున గలిసియున్న మేము (స్తోమైః) స్తుతులద్వారా (విధేమ) సత్కారపూర్వకముగా నీ సేవయొనర్చెదముగాక! నీవు మాకు (యస్మాత్) ఆ (యోనేః) స్థానమునుండి (ఉదారిథ) ఉత్తమోత్తమ సాధనములతో ప్రాప్తించుము. (తమ్) అట్టి స్థానమును నేను (ప్ర, యజే) చక్కగా ప్రాప్తించుకొందునుగాక! మరియు హోమము నొనర్చువా రెట్లు (సమిద్ధే) చక్కగా ప్రజ్వరిల్లు అగ్నియందు (హవీంషి) హోమమొనర్పదగిన సామగ్రులను (జుహురే) హోమమొనర్చుచున్నారో, అదేవిధముగ యోగాగ్నియందు మేము దుఃఖములను (విధేమ) ఆహుతుల నిచ్చెదము [హోమమొనర్చెదము].॥౭౫॥

**భావార్థము** :- ఈ ప్రపంచమునందు యోగసంస్కారముచే ఏ జీవులు పవిత్రభావములతో జన్మింతురో అవి పూర్వసంస్కార ప్రాబల్యముతో యోగమునే దెలిసికొని ఆకాంక్ష గలవియై యుండును. మరియు వానిని సేవించు ప్రాణులును యోగమును గోరువారే యగుదురు. పైన దెలిపిన యోగి జనులెల్లరును అగ్ని సమిధలను భస్మమొనర్చునట్లు తమ సమస్తదుఃఖములను కుసంస్కార భావములను తమ యోగశక్తిద్వారా భస్మమొనర్చి వేయుదురు.॥౭౫॥

75.O Yogi, we adore thee with praise-songs for thy past life, and for thy present life, in which we live with thee. May we worship God through whose shelter thou hast risen. Just as the performers of Homa. put oblations in the well kindled fire, so do we remove over moral weaknesses through the fire of yoga!.

౯౭౬. ప్రేద్ధ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్ష్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౯౭౬ ప్రేద్ధోఽఅగ్నే దీదిహి పురో నోఽజస్రయా సూర్మ్యా యవిష్ఠ ।

త్వాం శశ్వన్తఽ ఉపయన్తి వాజాః ॥౭౬॥

**ప.విః- ప్రేద్ధ ఇతి ప్ర + ఇద్ధః, అగ్నే, దీదిహి, పురః, నః, అజస్రయా, సూర్మ్యా, యవిష్ఠ, త్వామ్ శశ్వన్తః, ఉప, యన్తి, వాజాః ॥౭౬॥**

**పదార్థః** :- (ప్రేద్ధః) ప్రకృష్టతయా ప్రదీప్తః (అగ్నే) అగ్నిరివ దుఃఖదాహక యోగిన్ (దీదిహి) కామయస్వ (పురః) ప్రథమమ్ (నః) అస్మాన్ (అజస్రయా) అనుపక్షీణయా (సూర్మ్యా) ఐశ్వర్యేణ (యవిష్ఠ) అతిశయేన యువన్ (త్వామ్) (శశ్వన్తః) నిరంతరం వర్తమానాః (ఉప,యన్తి) ప్రాప్నువన్తు (వాజాః) విజ్ఞానవన్తో జనాః.॥౭౬॥

**అన్వయః** :-హే యవిష్ఠాగ్నే! త్వం పురః ప్రేద్ధః సన్నజస్రయా సూర్మ్యా నోఽస్మాన్ దీదిహి శశ్వన్తో వాజా స్త్వాముపయన్తి.॥౭౬॥

**భావార్థః** :- యదా మనుష్యాః శుద్ధాత్మానో భూత్వాఽన్యానుపకుర్వన్తి తదా తేఽపి సర్వత్రోపకృతా భవన్తి.॥౭౬॥

**పదార్థము** :- (యవిష్ఠ) నవయువకుడా! (అగ్నే) అగ్నివలె దుఃఖముల దగ్ధమొనర్చు యోగీ! నీవు (పురః) పూర్వము (ప్రేద్ధః) చక్కని తేజస్సుతో ప్రకాశవంతుడవగుచు (అజస్రయా) నాశరహితమగు స్థిరమగు (సూర్మ్యా) ఐశ్వర్యప్రవాహముచే (నః) మేము (దీదిహి) కోరినట్టి (శశ్వన్తః) సదా యుండునట్టి (వాజాః) విశేషజ్ఞానముగలవారు (త్వామ్) నిన్ను (ఉపయన్తి) పొందుదుముగాక.॥౭౬॥

**భావార్థము** :-మానవులు శుద్ధ ఆత్మగలవారై ఇతరుల కుపకార మొనర్చు గుణము గలవా రగునప్పుడు వారును సర్వత్రా ఉపకారయుక్తు లగుదురు.॥౭౬॥

76 O most youthful yogi, first enkindled with dignity, with continuous supremacy, long for us. Constantly unto thee come the learned.

౬౨౭.అగ్నే తమిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

**౬౨౭ అగ్నే తమద్యాశ్వన్న స్తోమైః క్రతున్న భద్రꣳ హృదిస్పృశమ్।**
**ఋధ్యామా తఽ ఓహైః॥౭౭॥**

**ప.విః-అగ్నే, తమ్, అద్య అశ్వమ్, న, స్తోమైః, క్రతుమ్, న, భద్రమ్, హృది + స్పృశమ్, ఋధ్యామ, తే, ఓహైః ॥౭౭॥**

**పదార్థః** :-(అగ్నే) విద్వన్ (తమ్) పూర్వమన్త్రోక్తమ్ (అద్య) (అశ్వమ్) తురఙ్గమ్ (న) ఇవ (స్తోమైః) స్తుతిభిః (క్రతుమ్) ప్రజ్ఞానమ్ (న) ఇవ(భద్రమ్) భజనీయం కల్యాణకరమ్ (హృదిస్పృశం) యో హృదయే స్పృశతి తమ్ (ఋధ్యామ) వర్ద్ధేమ అత్రాన్యేషామితిదీర్ఘః (తే) తవ (ఓహైః) రక్షణాదిభిః.॥౭౭॥

**అన్వయః** :-హే అగ్నే! విద్యుత్సదృశపరాక్రమిన్నశ్వం న క్రతుం న భద్రం హృదిస్పృశం తం త్వాం స్తోమైరద్య ప్రాప్య తే తవౌహైర్వయం సతతమృధ్యామ.॥౭౭॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యథా శరీరస్థేన విద్యుదాదినా వృద్ధివేగౌ ప్రజ్ఞాసుఖాని చ వర్ద్ధన్తే స్తథా విద్వచ్ఛిక్షారక్షాదిభిర్మనుష్యాదయో వర్ద్ధన్తే.॥౭౭॥

**పదార్థము** :-(అగ్నే) విద్యుత్తువంటి పరాక్రమముగల విద్వాంసుడా! (అశ్వమ్) అశ్వము (న) వలె (క్రతుమ్) బుద్ధి (న) వలె (భద్రమ్) కల్యాణము (హృదిస్పృశమ్) హృదయమునందు స్పర్శకలిగించునది (తమ్) ఆ పూర్వమంత్రమునజెప్పబడిన నిన్ను (స్తోమైః) స్తుతులతో (అద్య) నేడే ప్రాప్తించుకొని (తే) నీయొక్క (ఓహైః) పాలనము మున్నగు గుణములచే (ఋధ్యామ) వృద్ధిని పొందుదుముగాక!॥౭౭॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు శరీరాదులందు స్థిరమైయుండు విద్యుత్తు మున్నగువానిచే వృద్ధివేగములు మరియు బుద్ధి సుఖములు పెంపొందునట్లు విద్వాంసుల శిక్షణము మరియు పాలనములచే మనుష్యులు వృద్ధిజెందుదురు.॥౭౭॥

77.O learned person, just as a horse is fed with fodder, and intellect sharpened with prayers, so art thou beneficent and pleasing to our heart; may we approach thee with praises, and advacne under thy protections.

౭౮. చిత్తిమిత్యస్య వసిష్ఠ ఋషిః, విశ్వకర్మా దేవతా, విరాడతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౭౮ చిత్తిం జుహోమి మనసా ఘృతేన యథా దేవా ఇహాగమన్వీతిహోత్రా ఋతావృధః పత్యే విశ్వస్య భూమనో జుహోమి విశ్వకర్మణే విశ్వాహాదాభ్యꣳ హవిః ॥౭౮॥

ప.వి:-చిత్తిమ్, జుహోమి, మనసా, ఘృతేన, యథా, దేవాః, ఇహ, ఆగమన్నిత్యా + గమన్, వీతిహోత్రా ఇతి వీతి + హోత్రా, ఋతావృధః, ఋతవృధ ఇత్యృత + వృధః, పత్యే,

విశ్వస్య, భూమనః, జుహోమి, విశ్వకర్మణ, ఇతి విశ్వ + కర్మణే, విశ్వాహా, అదాభ్యమ్, హవిః॥౭౮॥

**పదార్థః** :-(చిత్తిమ్) చిన్వన్తి యయా తామ్ (జుహోమి) గృహ్ణామి (మనసా) విజ్ఞానేన (ఘృతేన) ఆజ్యేన (యథా) (దేవాః) కామయమానా విద్వాంసః (ఇహ) (ఆగమన్) ఆగచ్ఛన్తి (వీతిహోత్రాః) వీతిః సర్వతః ప్రకాశితో హోత్రా యజ్ఞో యేషాం తే (ఋతావృధః) యే ఋతేన సత్యేన వర్ధన్తే. అత్రాన్యేషామపీతి పూర్వపదస్య దీర్ఘః (పత్యే) పాలకాయ (విశ్వస్య) సమగ్రస్య జగతః (భూమనః) బహురూపస్య (జుహోమి) దదామి (విశ్వకర్మణే) విశ్వం కర్మ క్రియమాణం కృతం యేన తస్మై (విశ్వాహా) సర్వాణి దినాని (అదాభ్యమ్) అహింసనీయమ్ (హవిః) హోతవ్యం శుద్ధం సుఖకరం ద్రవ్యమ్. ॥౭౮॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథాఽహం మనసా ఘృతేన చిత్తిం జుహోమి యథేహ వీతిహోత్రా ఋతావృధో దేవా భూమనో విశ్వస్య విశ్వకర్మణే పత్యే జగదీశ్వరాయాదాభ్యం హవిర్విశ్వాహా హోతుమాగమన్నహం హవిర్జుహోమి తథా యూయమప్యాచరత.॥౭౮॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యథా కాష్ఠచితోఽగ్నిరాజ్యేన వర్ధతే తథా విజ్ఞానేనాహం వర్ధేయం యథేశ్వరోపాసకా విద్వాంసశ్చ జగతః కల్యాణాయ ప్రయతన్తే తథాహమపి ప్రయతేయ ॥౭౮॥

**పదార్థము** :-మానవులారా! (యథా) నే నెట్లు (మనసా) విజ్ఞానము మరియు (ఘృతేన) నేతితోను (చిత్తిమ్) సంచయమునొనర్చు క్రియతో (జుహోమి) పొందుచున్నటులనే (ఇహ) ఈ జగమునందు (వీతిహోత్రాః) అన్ని దిశలందు యజ్ఞముచే ప్రకాశవంతుడగువాడు (ఋతావృధః) సత్యముచే వృద్ధి నొందుము (దేవాః) కామితములుగల విద్వాంసులు (భూమనః) బహురూపములుగల (విశ్వస్య) సర్వజగత్తునందు (విశ్వకర్మణే) ఎల్లరును జేయదగిన కార్యములనొనర్చువాడు (పత్యే) పాలించునట్టి జగదీశ్వరునికొరకు (అదాభ్యమ్) నష్టపరచరాని మరియు (హవిః) హోమమొనర్చు మరియు సుఖప్రాప్తిగలిగించు పదార్థములను (జుహోమి) నేను హోమమొనర్చునట్లు మీరును యాచరించుడు.॥౭౮॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు ఉపమాలంకార మున్నది. కాష్ఠము (సమిధ) లయందుంచబడిన యగ్ని ఘృతముచే వృద్ధియై ప్రజ్వలించునట్లు విజ్ఞానముచే నేను వృద్ధిజెందుదునుగాక! మరియు పరమేశ్వరు నుపాసించు విద్వాంసులు విశ్వకల్యాణమునకై ప్రయత్నమొనర్చునట్లు నేనును యత్నింతును గాక!॥౭౮॥

78.Just as an oblation is put with butter, into the fire, filled with fuel, so with a contemplative mind do I acquire discernment so that the learned, who strengthen truth, and are devoted to knowledge, may come here. To God, Lord of the Earth, and Master of all deeds, I offer-up day after day the inviolable sacrifice of knowledge.

౮౭. సప్త త ఇత్యస్య సప్తఋషయ ఋషయః, అగ్నిర్దేవతా, ఆర్షీజగతీ ఛన్దః, నిషాదః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమునే చెప్పెను.

౮౭ సప్త తేऽఅగ్నే సమిధః సప్త జిహ్వాః సప్తऽఋషయః సప్త
ధామ ప్రియాణి। సప్త హోత్రాః సప్తధా త్వా యజన్తి సప్త
యోనీరాపృణస్వ ఘృతేన స్వాహా ॥౮౭॥

**ప. వి:**-సప్త, తే, అగ్నే, సమిధ, ఇతి సమ్ + ఇధః, సప్త, జిహ్వాః, సప్త, ఋషయః, సప్త, ధామ, ప్రియాణి, సప్త, హోత్రాః సప్త + ధా, త్వా, యజన్తి, సప్త, యోనీః, ఆ, పృణస్వ, ఘృతేన, స్వాహా ॥౮౭॥

**పదార్థః** :-(సప్త) సప్త సంఖ్యాకాని గాయత్ర్యాదీని ఛందాంసి (తే) తవ (అగ్నే) తేజస్విన్ విద్వన్ (సమిధః) ప్రదీపకాః (సప్త, జిహ్వాః) కాల్యాదయః సప్త సంఖ్యాకా జ్వాలాః (సప్త, ఋషయః) ప్రాణాదయః పఞ్చ దేవదత్తధనంజయౌ చ (సప్త, ధామ) జన్మనామస్థానధర్మార్థకామమోక్షాఖ్యాని ధామాని (ప్రియాణి) (సప్త, హోత్రాః) సప్త, ఋత్విజః (సప్తధా) సప్తభిః ప్రకారైః (త్వా) త్వామ్ (యజన్తి) సంగచ్ఛన్తే (సప్త, యోనీః) చితీః (ఆ) (పృణస్వ) సుఖీ భవ (ఘృతేన) ఆజ్యేన (స్వాహా). ॥౮౭॥

**అన్వయః** :-హే అగ్నే విద్వన్! యథాగ్నేః సప్త సమిధః సప్త జిహ్వాః సప్తర్షయః సప్త ప్రియాణి ధామ సప్త హోత్రాశ్చ సన్తి తథా తే తవ సన్తు యథా విద్వాంసస్తమగ్నిం సప్తధా యజన్తి తథా త్వా యజన్తు యథాऽయమగ్నిర్ఘృతేన స్వాహా సప్త యోనీరాపృణతే తథా త్వమాపృణస్వ. ॥౮౭॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః యథేన్ధనైరగ్నిర్వర్ధతే తథా విద్యాదిశుభగుణైః సర్వే మనుష్యా వర్ధన్తామ్. యథా విద్వాంసోऽగ్నౌ ఘృతాదికం హుత్వా జగదుపకుర్వన్తి తథా వయమపి కుర్యామ. ॥౮౭॥

**పదార్థము** :-(అగ్నే) తేజస్వివగు విద్వాంసుడా! ఎట్లు అగ్నికి (సప్త, సమిధః) ప్రజ్వలనమొనర్చు ఏడు సమిధలు (సప్త, జిహ్వాః) కాలీ, కరాలీ మున్నగు ఏడు జ్వాలారూప జిహ్వలు (సప్తఋషయః) ఏడు ప్రాణములు [ప్రాణ, అపాన, ఉదాన, సమాన, వ్యాన, దేవదత్త, ధనంజయ] మనునవి (సప్త, ప్రియాణి, ధామ) ఏడు ప్రియధామములు [జన్మ, స్థాన, నామ, ధర్మ, అర్థ, కామ, మోక్షములు] (సప్త, హోత్రాః)

ఋతువులందు ఏడు విధములగు యజ్ఞముల నొనర్చువారివలె (తే) నీకును కలుగును గాక! విద్వాంసు లెట్లు ఆ యగ్నిని (సప్తధా) ఏడు విధములుగ (యజన్తి) పొందుచున్నారో అట్లే (త్వా) నీకును ప్రాప్తించుగాక! ఎట్లు ఈ యగ్ని (ఘృతేన) ఘృతముచే మరియు (స్వాహా) ఉత్తమవాణిద్వారా (సప్త, యోనీః) ఏడు సంచయములను సుఖముచే ప్రాప్తించుకొనునో అట్లే నీవును (ఆ, పృణస్వ) సుఖమును పొందుము.॥౭౯॥

**భావార్థము** :- ఈ మంత్రములో వాచకలుప్తోపమాలంకారము గలదు. ఇంధనములచే యగ్ని వృద్ధిజెందునట్లు విద్య మున్నగు శుభగుణములచే సకలమానవులును వృద్ధిని పొందుదురుగాక! విద్వాంసులగువారు అగ్నియందు ఘృతము, హవ్యసామగ్రి మున్నగువానిని హోమమొనర్చుచు జగమున కుపకారమొనర్చునటులనే మన మెల్లరమును యజ్ఞాదుల నొనర్చవలయును.॥౭౯॥

79.O Sage, seven breaths are thy fuel, seven flames are thy flames of knowledge, seven organs of perception are thy sources of wisdom. thou hast seven belpved mansions. Seven priests in sevenfold manner pay thee worship. With knoledge and fine speech fill full these seven sources of learning!.

**౮౦.శుక్రజ్యోతిరిత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, ఆర్ష్యుష్ణిక్ ఛన్దః, నిషాదః స్వరః.**

**అథేశ్వరః కీదృశోఽస్తీత్యాహ. ఈశ్వరు డెట్టివాడు?**

**౮౦ శుక్రజ్యోతిశ్చ చిత్రజ్యోతిశ్చ సత్యజ్యోతిశ్చ జ్యోతిష్మాఀశ్చ।**

**శుక్రశ్చఽఋతపాశ్చాత్యꣳహాః ॥౮౦॥**

**ప.వి:- శుక్రజ్యోతిరితి శుక్ర + జ్యోతిః, చ, చిత్రజ్యోతిరితి చిత్ర + జ్యోతిః, చ, సత్యజ్యోతిరితి సత్య + జ్యోతిః, చ, జ్యోతిష్మాన్, చ, శుక్రః, చ, ఋతపా ఇత్యృత + పాః, చ, అత్యꣳహా ఇత్యతి + అꣳహాః.॥౮౦॥**

**పదార్థః** :- (శుక్రజ్యోతిః) శుక్రం శుద్ధం జ్యోతిర్యస్య సః (చ) (చిత్రజ్యోతిః) చిత్రమద్భుతం జ్యోతిర్యస్య సః (చ) (సత్యజ్యోతిః) సత్యమవినాశి జ్యోతిః ప్రకాశో యస్య సః (చ)(జ్యోతిష్మాన్) బహూని జ్యోతీంషి ప్రకాశా విద్యన్తే యస్య సః (చ) (శుక్రః) శీఘ్రకర్తా శుద్ధస్వరూపో వా (చ) (ఋతపాః) య ఋతం సత్యం పాతి (చ) (అత్యంహాః) అతిక్రాన్తమంహో దుష్కృతం యేన సః. ॥౮౦॥

**అన్వయః**:- హే మనుష్యాః! యథా శుక్రజ్యోతిశ్చ చిత్రజ్యోతిశ్చ సత్యజ్యోతిశ్చ జ్యోతిష్మాఀశ్చ శుక్రశ్చాత్యంహా ఋతపాశ్చేశ్వరోఽస్తి తథా యూయం భవత. ॥౮౦॥

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథేహ విద్యుత్సూర్యాదీన్ ప్రభాకరాన్ శుద్ధికరాన్ పదార్థాన్నిర్మాయేశ్వరేణ జగచ్ఛోధ్యతే తథైవ శుచిసత్యవిద్యోపదేశక్రియాభి ర్మనుష్యాదయో విద్వద్భిః శోధనీయాః అత్రానేకేషాం చకారాణాం పాఠాత్సర్వేషాముపరి ప్రీత్యాదయోఽపి విధేయాః ॥౮౦॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎట్లు (శుక్రజ్యోతిః) ఎవని ప్రకాశము శుద్ధమైనదో (చ) మరియు (చిత్రజ్యోతిః) ఎవని ప్రకాశము అద్భుతమైనదో (చ) మరియు (సత్యజ్యోతిః) ఎవని ప్రకాశము వినాశరహితమైనదో (చ) మరియు (జ్యోతిష్మాన్) ఎవని ప్రకాశము లనేకములో (చ) మరియు (శుక్రః) శీఘ్రకారి మరియు శుద్ధస్వరూపుడు (చ) మరియు (అత్యంహాః) ఎవడు దుష్టకర్మలను దూరపరచునో (చ) మరియు (ఋతపాః) ఎవడు సత్యరక్షణ మొనర్చువాడో అట్టి పరమేశ్వరునివలె మీరును అగుడు. ॥౮౦॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఈ విశ్వమునందు విద్యుత్తు మరియు సూర్యాదులు ప్రజలకు శుద్ధిని గలిగించునట్టి పదార్థములను జేసి ఈశ్వరుడు ఎట్లు జగత్తును శుద్ధిపరచినాడో, అదేవిధముగ శుద్ధి మరియు సత్యవిద్యల ఉపదేశముచే విద్వాంసులు మానవులను శుద్ధపరచవలయును. ఈ మంత్రమునందు అనేక 'చ'కారము లుండుటచే అందరిపట్ల ప్రీతి మున్నగునవి జూపవలయునని జ్ఞాతమగుచున్నది. ॥౮౦॥

80.God is Purely Bright. Wonderfully Bright, Eternally Bright, All Luminous, Bright, Truth's Protector, and free from Sin.

౯౩౧.ఈదృఙ్ చేత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునర్విద్వాన్ కీదృశో భవేదిత్యాహ. విద్వాంసు డెటు లుండవలయును?

౯౩౧ ఈదృఙ్ చాన్యాదృఙ్ చ సదృఙ్ చ ప్రతిసదృఙ్ చ।

మితశ్చ సంమితశ్చ సభరాః ॥౮౧॥

**ప.వి**:-ఈదృఙ్, చ, అన్యాదృఙ్, చ, సదృఙ్,సదృఙితి స + దృఙ్, చ, ప్రతిసదృఙితి ప్రతి + సదృఙ్, చ, మితః, చ, సమ్మిత ఇతి సమ్ + మితః, చ, సభరా ఇతి స + భరాః. ॥౮౧॥

**పదార్థః** :-(ఈదృఙ్) అనేన తుల్యః (చ)(అన్యాదృఙ్) అన్యేన సమానః (చ)(సదృఙ్) సమానం పశ్యతి స సదృఙ్ (చ) (ప్రతిసదృఙ్) తం తం ప్రతి సదృశం పశ్యతి (చ) (మితః) మానం ప్రాప్తః (చ) (సమ్మితః) సమ్యక్ పరిమితః (చ) (సభరాః) సమానం బిభర్తీతి సభరాః ॥౮౧॥

**అన్వయః** :-యే పురుషా ఈ దృఙ్ చాన్యాదృఙ్ చ సదృఙ్ చ ప్రతిసదృఙ్ చ మితశ్చ సంమితశ్చ సభరాశ్చ వర్తన్తే తే వ్యావహారికీం కార్యసిద్ధిం కర్తుం శక్నువన్తి. ॥౮౧॥

**భావార్థః** :-యో మనుష్య ఈశ్వరతుల్య ఉత్తమస్తదనుకరణం కృత్వా సత్యం ధరత్యసత్యం త్యజతి స ఏవ యోగ్యోऽస్తి. ॥౮౧॥

**పదార్థము** :-ఏ మనుష్యుడు (ఈదృఙ్) ఈతనివలె (చ) కూడ (అన్యాదృఙ్) ఇతరునివలె (చ) కూడ (సదృఙ్) సమముగా జూచువాడు (చ) కూడ (ప్రతిసదృఙ్) వారివారియెడ సమభావముతో జూచువాడు (చ) కూడ (మితః) మర్యాదను ప్రాప్తించుకొనినవాడు (చ) మరియు (సంమితః) శ్రేష్ఠముగ పరిణామము [మార్పు, ఫలితము] ఒనర్చబడిన (చ) మరియు (సభరాః) సమానధారణమొనర్చువారే వ్యవహారసంబంధ కార్యసిద్ధి నొందగలరు.॥౮౧॥

**భావార్థము** :- ఈశ్వరునివలె ఉత్తమ కర్మలు మరియు నాతడుజేయు కార్యములవంటి ఉత్తమ (తుల్య) కర్మలొనర్చు మనుష్యులు సత్యధారణము, అసత్యత్యాగముచే సఫలీకృతు లగుదురు.॥౮౧॥

81.Persons, who are excellent like God, noble like other good people, cqual towards all, affectionate towards all, respectable, wellbalanced and possessors of worldly objects, succeed in life.

౮౩౨.ఋతశ్చేత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునరీశ్వరః కీదృశోऽస్తీత్యాహ. ఈశ్వరు డెట్టివాడు?

**౮౩౨ ఋతశ్చ సత్యశ్చ ధ్రువశ్చ ధరుణశ్చ ధర్తా చ విధర్తా చ విధారయః ॥౮౨॥**

**ప. విః–ఋతః, చ, సత్యః, చ, ధ్రువః, చ, ధరుణః, చ, ధర్తా, చ, విధర్తేతి వి + ధర్తా, చ, విధారయ ఇతి వి + ధారయః. ॥౮౨॥**

**పదార్థః** :-(ఋతః) సత్యజ్ఞానః (చ) (సత్యః) సత్సు సాధుః (చ) (ధ్రువః) దృఢనిశ్చయః (చ) (ధరుణః) ఆధారః (చ) (ధర్తా) (చ) (విధర్తా) (చ) (విధారయః) యో విశేషేణ ధారయతి సః.॥౮౨॥

**అన్వయః** :-హే మనుష్యాః! య ఋతశ్చ సత్యశ్చ ధ్రువశ్చ ధరుణశ్చ ధర్తా చ విధర్తా చ విధారయః పరమాత్మాऽస్తి తమేవ సర్వ ఉపాసీరన్. ॥౮౨॥

**భావార్థః** :-యే మనుష్యా విద్యోత్సాహసత్సఙ్గపురుషార్థైః సత్యవిజ్ఞానే ధృత్వా సుశీలతాం ధరన్తి త ఏవ సుఖినో భవితుమన్యాంశ్చ కర్తుం శక్నువన్తి. ॥౮౨॥

**పదార్థము** :- ఓ మానవులారా! (ఋతః) సత్యము నెరుగువాడు (చ) కూడ (సత్యః) శ్రేష్ఠులందు శ్రేష్ఠుడు (చ) కూడ (ధ్రువః) దృఢనిశ్చయముతో గూడినవాడు (చ) కూడ (ధరుణః) సర్వాధారుడు (చ) కూడ (ధర్తా) ధారణమొనర్చువాడు (చ) కూడ (విధర్తా) విశేషించి ధారణమొనర్చువాడు [ధారకుల

ధారకుడు] (చ) కూడ మరియు (విధారయః) విశేషముగ సమస్తవ్యవహారముల ధారణమొనర్చువాడునగు పరమాత్మను సకలజనులును ఉపాసించవలెను.।౮౨॥

**భావార్థము :-** విద్యావంతుడై ఉత్సాహపూర్వకముగా సజ్జనసాంగత్యము మరియు పురుషార్థములచే సత్యము, విశేష జ్ఞానము గల స్వభావము గలవాడు తాను సుఖముగ నుండుటయేగాక ఇతరులకును సుఖమును గలిగించువా డగుచున్నాడు.।౮౨॥

82.God is the shower of truth, Most Excellent amongst the excellent, Resolute, the Support of all, the Sustainer, the Owner of all owners, and efficient Administrator.

౯౩౩.ఋతజిదిత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః,భురిగార్ష్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ విద్వాంసః కీదృశా భవేయురిత్యుచ్యతే. విద్వాంసు లెటు లుందురు?

౯౩౩ ఋతజిచ్చ సత్యజిచ్చ సేనజిచ్చ సుషేణశ్చ।

అన్తిమిత్రశ్చ దూరేఽఅమిత్రశ్చ గణః ।౮౩॥

**ప.వి:-** ఋతజిదిత్యృత + జిత్, చ, సత్యజిదితి సత్య + జిత్, చ, సేనజిదితి సేన + జిత్, చ, సుషేణః, సుసేన ఇతి సు + సేనః, చ, అన్తిమిత్ర ఇత్యన్తి + మిత్రః, చ, దూరేఽ అమిత్ర ఇతి దూరే + అమిత్రః,చ, గణః ।౮౩॥

**పదార్థః :-**(ఋతజిత్) య ఋతం విజ్ఞానముత్కర్షతి సః (చ) (సత్యజిత్) సత్యం కారణం ధర్మం చోన్నయతి (చ) (సేనజిత్) యః సేనాం జయతి సః (చ) (సుషేణః) శోభనా సేనా యస్య సః (చ) (అన్తిమిత్రః) అన్తౌ సమీపే మిత్రాః సహాయకారిణో యస్య సః (చ) (దూరే అమిత్రః) దూరే అమిత్రాః శత్రవో యస్య సః (చ) (గణః) గణనీయః.।౮౩॥

**అన్వయః :-**య ఋతజిచ్చ సత్యజిచ్చ సేనజిచ్చ సుషేణశ్చాన్తిమిత్రశ్చ దూరేఽఅమిత్రశ్చ భవేత్ స ఏవ గణో గణనీయో జాయతే. ।౮౩॥

**భావార్థః :-** యే మనుష్యా విద్యాసత్యాదీని కర్మాణ్యున్నయేయుర్మిత్రసేవినః శత్రుద్వేషిణశ్చ భవేయుస్త ఏవ లోకే ప్రశంసనీయాః స్యుః. ।౮౩॥

**పదార్థము :-**ఎవడు (ఋతజిత్) విశేష జ్ఞానమును వృద్ధిపరచువాడో (చ) మరియు (సత్యజిత్) కారణము, ధర్మమును ఉన్నతిపరచువాడో (చ) మరియు (సేనజిత్) సేనలను జయించువాడో (చ) మరియు

(సుషేణః) చక్కని సైన్యములు గలవాడో (చ) మరియు (అన్తిమిత్రః) సమీపమునందే సహాయకారులగు మిత్రులు గలవాడో (చ) మరియు (దూరే అమిత్రః) ఎవని నుండి శత్రువులు దూరముగ పారిపోయినారో (చ) మరియు ఇతరులతోను ఈవిధముగా నుండునో, యాతడు (గణః) గణనీయు డగుచున్నాడు.।౮౩॥

**భావార్థము** :- విద్య మరియు సత్యకార్యముల నున్నతిపరచుచు మిత్రులను సేవించుచు శత్రువుల దరిమివేయు మానవులే లోకమునందు ప్రశంసాపాత్రు లగుదురు.।౮౩॥

83.He, who is the advancer of knowledge, elevator of religion, Conqueror of armies, lord of goodly forces, keeper of friends near at hand; driver afar of foes, is worthy of estimation.

౯౩౪.ఈదృఙాస ఇత్యస్య సప్తఋషయ ఋషయః మరుతో దేవతాః,నిచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౯౩౪ ఈదృఙాసఽ ఏతాదృఙాసఽ ఊ షు ణః సదృఙాసః
ప్రతిసదృఙాసఽ ఏతన। మితాసశ్చ సమ్మితాసో నోఽఅద్య
సభరసో మరుతో యజ్ఞేఽఅస్మిన్ ।౮౪॥

**ప.విః**-ఈదృఙాసః, ఏతాదృఙాసః, ఊఀ ఇత్యూఀ, సు, నః, సదృఙాస ఇతి స + దృఙాసః, ప్రతిసదృఙాస ఇతి ప్రతి + సదృఙాసః, ఆ, ఇతన, మితాసః, చ, సమ్మితాస ఇతి, సమ్ + మితాసః, నః, అద్య, సభరస ఇతి స + భరసః, మరుతః, యజ్ఞే, అస్మిన్. ।౮౪॥

**పదార్థః** :-(ఈదృఙాసః) ఏతల్లక్షణసహితాః (ఏతాదృఙాసః) ఏతైః పూర్వోక్తైస్సదృశాః (ఉ) వితర్కే (సు) సుష్ఠు (నః) అస్మాన్ (సదృఙాసః) పక్షపాతం విహాయ సమానదృష్టయః (ప్రతిసదృఙాసః) ఆప్తసదృశాః (ఆ) (ఇతన) సమన్తాత్ప్రాప్నుత (మితాసః) పరిమితవిజ్ఞానాః (చ) (సమ్మితాసః) తులావత్ సత్యవివేచకాః (నః) అస్మాన్ (అద్య) (సభరసః) స్వసమానపోషకాః (మరుతః) ఋత్విజో విద్వాంసః (యజ్ఞే) సంగంతవ్యే వ్యవహారే (అస్మిన్).।౮౪॥

**అన్వయః** :-హే మరుతో విద్వాంసో! య ఈదృఙాసఏతాదృఙాసస్సదృఙాసః ప్రతిసదృఙాసో నోఽస్మాన్ స్వేతన ఉ మితాసః సమ్మితాసశ్చాస్మిన్ యజ్ఞే సభరసో భవతాఽద్య నో రక్షత తాన్ వయమపి సతతం సత్కుర్యామ ।౮౪॥

**భావార్థః** :- యదా ధార్మికా విద్వాంసః క్వాపి మిలేయుర్యానుపాగచ్ఛేయురధ్యాపయేయుః సుశిక్షేరంశ్చ తదేమే సర్వైః సత్కర్తవ్యాః. ।౮౪॥

**పదార్థము** :- (మరుతః) ప్రతి ఋతువునందును యజ్ఞమునొనర్చు విద్వాంసులారా! (ఈదృక్షాసః) ఈ లక్షణములతో గూడిన (ఏతాదృక్షాసః) ఈ మొదటచెప్పినవారివంటి (సదృక్షాసః) పక్షపాతములేని సామ్యదృష్టి గలవాడవు (ప్రతి సదృక్షాసః) శాస్త్రాధ్యయన మొనర్చి సత్యమునే పలుకు ధర్మాత్ములవంటివాడవగు నీవు (నః) మాకు (సు, ఆ, ఇతన) బాగుగా లభింతువుగాక! (ఉ) లేక (మితాసః) పరిమాణయుక్తముగ నెరుగగలిగినవారు (సంమితాసః) త్రాసు [తులా] సదృశముగ సత్యాసత్యములను వేర్వేరుగా నొనర్చువారు (చ) మరియు (అస్మిన్) ఇట్టి (యజ్ఞే) యజ్ఞమునందు (సభరసః) తన యాత్మవలె సమస్త ప్రాణులను పోషించువారు (అద్య) నేడు (నః) మా యెల్లరను రక్షింతురుగాక! మేమును అట్టివారిని సదా సత్కరింతుముగాక. ।౮౪॥

**భావార్థము** :- ధార్మికులగు విద్వాంసులు ఎచ్చటనైనను కలిసినప్పుడును, ఎవరి వద్దికైనను వచ్చినప్పుడును, చదివించినను, శిక్షణను గరపినను అట్టివారెల్లరును సర్వజనులకు సత్కారార్హులగుదురని దెలియదగును. ।౮౪॥

84.O learned person, the performers of seasonwise sacrifice (Yajna), well-qualified, resembling the aforesaid sacrificers, free from partiality, similar in nature to the highly learned, truthful and religious, come near unto us!.

May the knowers of reality, discriminators of truth from untruth like a balance, the supporters and nourishers of their companions, protect us to-day in this sacrifice.

౮౫. స్వతవానిత్యస్య సప్తర్షయ ఋషయః, చాతుర్మాస్యా మరుతో దేవతాః, స్వరాడార్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్స విద్వాన్ కీదృశో భవేదిత్యాహ. విద్వాంసు డెటువంటివాడై యుండవలయును?

**౮౫ స్వతవాంశ్చ ప్రఘాసీ చ సాంతపనశ్చ గృహమేధీ చ।**

**క్రీడీ చ శాకీ చోజ్జేషీ ।౮౫॥**

**ప. విః**– స్వతవానితి స్వ + తవాన్, చ, ప్రఘాసీతి ప్ర + ఘాసీ, చ, సాన్తపన ఇతి సామ్ + తపనః, చ, గృహమేధీతి గృహమేధీ, చ, క్రీడీ, చ, శాకీ, చ, ఉజ్జేషీత్యుత్ + జేషీ ।౮౫॥

**పదార్థః** :- (స్వతవాన్) యః స్వాన్ తౌతి వర్ధయతి సః. అత్ర తు ధాతోరౌణాదిక ఆనిః ప్రత్యయః (చ) (ప్రఘాసీ) బహవః ప్రకృష్టా ఘాసా భోజ్యాని విద్యన్తే యస్య సః (చ) (సాన్తపనః) సమ్యక్ శత్రూన్

తాపయతి తస్యాయమ్ (చ) (గృహమేధీ) ప్రశస్తో గృహే మేధః సంగమోఽస్యాస్తీతి సః (చ) (క్రీడీ) (చ) అవశ్యం క్రీడితుం శీలః (శాకీ) అవశ్యం శక్తుం శీలః (చ)(ఉజ్జేషీ) ఉత్కృష్టతయా జేతుం శీలః.॥౮౫॥

**అన్వయః** :-యః స్వతవాంశ్చ ప్రఘాసీ చ సాన్తపనశ్చ గృహమేధీ చ క్రీడీ చ శాకీ చ భవేత్ స ఉజ్జేషీ స్యాత్.॥౮౫॥

**భావార్థః** :- యో బహుబలాన్నసామర్థ్యో గృహస్థో భవతి స సర్వత్ర విజయమాప్నోతి. ॥౮౫॥

**పదార్థము** :-(సత్యవాన్) తన వారిని వృద్ధియొనర్చువాడు (చ) మరియు (ప్రఘాసీ) భోజన సామగ్రిని పుష్కలముగా నుంచువాడు (చ) మరియు (సాన్తపనః) శత్రువులను బాగుగా తపింపజేయువాడు (చ) మరియు (గృహమేధీ) ప్రశంసనీయమగు సాంగత్యము గృహమందుగలవాడు (చ) మరియు (క్రీడీ) చక్కగా క్రీడ [ఆట] లొనర్చు స్వభావముగలవాడు (చ) మరియు (శాకీ) ఆవశ్యకతానుసారము తనశక్తిని ప్రదర్శించు స్వభావముగలవాడు (చ) ఐ యెవడుండునో యాతడు (ఉజ్జేషీ) మనస్సుద్వారా అత్యంతముగా జయించువాడై యున్నాడు. ॥౮౫॥

**భావార్థము** :- ఏ గృహస్థుడు శక్తిసామర్థ్యములు, భోజనసామగ్రులు పుష్కలముగ నుంచువాడో యాతడు సకల ప్రదేశములందును విజయసాధకు డగుచున్నాడు. ॥౮౫॥

85.He who exalts his men, feasts on dainty dishes, torments the foes is and admirable hoseholder, lover of games, and mighty, becomes a nice conqueror.

౮౬.ఇంద్రమిత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, నిచృచ్ఛక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

పునా రాజప్రజాః కథం పరస్పరం వర్తేరన్నిత్యాహ. రాజు ప్రజలు పరస్పర మెటుల మెలగవలెను?

**౮౬ ఇన్ద్రం దైవీర్విశో మరుతోఽనువర్త్మానోఽభవన్యథేన్ద్రం**

**దైవీర్విశో మరుతోఽనువర్త్మానోఽభవన్। ఏవ మిమం**

**యజమానం దైవీశ్చ విశో మానుషీశ్చానువర్త్మానో భవన్తు ॥౮౬॥**

**ప.విః**-ఇన్ద్రమ్, దైవీః, విశః, మరుతః, అనువర్త్మాన ఇత్యను + వర్త్మానః, అభవన్, యథా ఇన్ద్రమ్, దైవీః, విశః, మరుతః, అనువర్త్మాన ఇత్యను + వర్త్మానః, అభవన్, ఏవమ్, ఇమమ్, యజమానమ్, దైవీః, చ, విశః, మానుషీః, చ, అనువర్త్మాన ఇత్యను+వర్త్మానః, భవన్తు.॥౮౬॥

**పదార్థః** :-(ఇంద్రమ్) పరమైశ్వర్యయుక్తం ధార్మికం రాజానమ్ (దైవీః) దేవానాం విదుషామిమాః (విశః) ప్రజాః (మరుతః) ఋత్విజో విద్వాంసః (అనువర్త్మానః) అనుకూలోవర్త్మా మార్గో యేషాం తే (అభవన్) భవన్తు (యథా) యేన ప్రకారేణ (ఇన్ద్రమ్) అఖిలైశ్వర్యమ్ పరమేశ్వరమ్ (దైవీః) (విశః) (మరుతః) ప్రాణా ఇవ ప్రియాః (అనువర్త్మానః) అనుకూలాచరణాః (అభవన్) (ఏవమ్) (ఇమమ్) (యజమానమ్) విద్యాసుశిక్షాభ్యాం సుఖదాతారమ్ (దైవీః) (చ) (విశః) (మానుషీః) మానుషాణామ విదుషామిమాః (చ) (అనువర్త్మానః) (భవన్తు) ।౮౬॥

**అన్వయః** :- హే రాజన్స్త్వం తథా వర్తస్వ యథేమా దైవీర్విశో మరుతశ్చేన్ద్రమనువర్త్మానోఽభవన్ యథా మరుతో దైవీర్దివ్యా విశశ్చేన్ద్రమనువర్త్మానోఽభవన్. ఏవం దైవీశ్చ విశో మానుషీశ్చ విశ ఇమం యజమాన మనువర్త్మానో భవన్తు. ।౮౬॥

**భావార్థః**:-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా ప్రజా రాజాదీనాం రాజపురుషాణా మనుకూలా వర్తేరంస్తథైతేఽపి ప్రజానుకూలా వర్తన్తామ్. యథాధ్యాపకోపదేశకాః సర్వేషాం సుఖాయ ప్రయతేరంస్తథైవ సర్వ ఏతేషాం సుఖాయ ప్రయతన్తామ్. ।౮౬॥

**పదార్థము** :-ఓ రాజా! నీ ప్రవర్తన నీ విధముగ నుంచుము; (యథా) ఎట్లు (దైవీః) విద్వాంసుల యీ (విశః) ప్రజలు (మరుతః) సకలఋతువులందును ఋత్వానుకూల యజ్ఞముల నొనర్చు విద్వాంసులు (ఇన్ద్రమ్) పరమైశ్వరశాలియగు రాజునకు (అనువర్త్మానః) అనుకూలమార్గమున నడచువారుగ (అభవన్) ఐ యుందురో, లేక ఎట్లు (మరుతః) ప్రాణప్రియులు (దైవీః) శాస్త్రముల నెరుగు మరియు దివ్యగుణములు గల (విశః) ప్రజలు (ఇన్ద్రమ్) సకలైశ్వర్య యుక్తుడగు పరమేశ్వరునకు (అనువర్త్మానః) అనుకూలాచరణముగలవారు (అభవన్) అగుదురో (ఏవమ్) ఈ విధముగానే (దైవీః) శాస్త్రజ్ఞులు (చ) మరియు (మానుషీః) మూర్ఖులు (చ) ఈ యిరువిధముల (విశః) ప్రజలు (ఇమమ్) ఈ (యజమానమ్) విద్య మరియు ఉత్తమశిక్షణలద్వారా సుఖములనిచ్చు నీ సజ్జనునకు (అనువర్త్మానః) అనుకూలాచరణ గలవారై యుండునట్లు (భవన్తు) అగుదురు గాక! ।౮౬॥

**భావార్థము** :-ఈ మంత్రములో ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఏవిధముగ ప్రజలు రాజున కనుకూలముగ వర్తింతురో అదేవిధముగ రాజు మరియు రాజపురుషులును ప్రజలయెడ వర్తించవలెను. అధ్యాపకులు, ఉపదేశకులు సకలప్రజల సుఖమునకై ప్రయత్నింతురో! ప్రజలును వారి సుఖమునకు ప్రయత్నించవలెను. ।౮౬॥

86.O King, behave so that thy learned subjects regular performers of yajna, may become thy followers, Just as learned people, dear as breath, follow God, so should the literate and the illiterate persons follow this King, the giver of happiness through knowledge and teaching!.

౯౩౭. ఇమమిత్యస్య సప్తర్షయ ఋషయః, అగ్నిర్దేవతా, ఆర్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కథం వర్తితవ్యమిత్యాహ. మానవు లెట్లు మెలగవలయును?

౯౩౭ ఇమꣳస్తనమూర్జస్వన్తం ధయాపాం ప్రపీనమగ్నే సరిరస్య మధ్యే ।

ఉత్సం జుషస్వ మధుమన్తమర్వన్త్సముద్రియꣳ సదనమావిశస్వ ॥౮౭॥

ప. విః- ఇమమ్, స్తనమ్, ఊర్జస్వన్తమ్, ధయ, అపామ్, ప్రపీనమితి ప్ర + పీనమ్, అగ్నే, సరిరస్య, మధ్యే ఉత్సమ్, జుషస్వ, మధుమన్తమితి మధు + మన్తమ్, అర్వన్, సముద్రియమ్, సదనమ్, ఆ, విశస్వ ॥౮౭॥

**పదార్థః** :-(ఇమమ్) (స్తనమ్) దుగ్ధాధారమ్ (ఊర్జస్వన్తమ్) ప్రశస్తబలకారకమ్ (ధయ) పిబ (అపామ్) జలానామ్ (ప్రపీనమ్) ప్రకృష్టతయా స్థూలమ్ (అగ్నే) పావక ఇవ వర్తమాన (సరిరస్య) బహోః. సరిర మితి బహునా.. నిఘం.. 3.౧. (మధ్యే) (ఉత్సమ్) ఉన్దన్తి యేన తం కూపమ్. ఉత్సమితి కూపనా.. నిఘం. 3.౨౩. (జుషస్వ) సేవస్వ (మధుమన్తమ్) ప్రశస్తం మధు మాధుర్యం విద్యతే యస్మింస్తమ్ (అర్వన్) అశ్వ ఇవ వర్తయన్ (సముద్రియమ్) సాగరే భవమ్ (సదనమ్) సీదన్తి గచ్ఛన్తి యత్తత్ (ఆ) (విశస్వ) అత్ర వ్యత్యయేనాత్మనేపదమ్. ॥౮౭॥

**అన్వయః** :-హే అగ్నే! పాలక! త్వం ప్రపీనం స్తనమివేమమూర్జస్వన్తమపాం రసం ధయ. సరిరస్య మధ్యే మధుమంతముత్సం జుషస్వ. హే అర్వంస్త్వం సముద్రియం సదనమావిశస్వ. ॥౮౭॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా బాలకా వత్సాశ్చ స్తనదుగ్ధం పీత్వా వర్ధన్తే యథా వాఽశ్వః శీఘ్రం ధావతి తథా మనుష్యా యుక్తాహారవిహారేణ వర్ధమానా వేగేన గచ్ఛన్తు యథాఽద్భిః పూర్ణే సముద్రే నౌకాయాం స్థిత్వా గచ్ఛన్తః సుఖేన పారావారే యాన్తి తథైవ సుసాధనైర్వ్యవహారస్య పారావారౌ ప్రాప్నువన్తు. ॥ ౮౭ ॥

**పదార్థము** :-(అగ్నే) అగ్నివంటి మానవా! నీవు (ప్రపీనమ్) చక్కని పాలతోనిండియున్న (స్తనమ్) స్తనముల [పాలిండ్ల] వలె (ఇమమ్) ఇట్టి (ఊర్జస్వన్తమ్) ప్రశంసనీయ బలమును గలిగించు (అపామ్) జలముల రసమును (ధయ) త్రాగుము (సరిరస్య) అనేకుల (మధ్యే) మధ్య (మధుమన్తమ్) ప్రశంసనీయ మాధుర్యగుణములతో గూడిన (ఉత్సమ్) పదార్థములను ఆర్ద్రపరచునట్టి కూపమును (జుషస్వ)

సేవనమొనర్చుము. మరియు (అర్వన్) అశ్వమువలె వేగశాలివగు ఓ మానవా! నీవు (సముద్రియమ్) సముద్రసంబంధముగల స్థానమున [ఓడయొక్క] (సదనమ్) పయనించగల దానియందు (ఆ,విశ్వస్య) శ్రేష్ఠముగ ప్రవేశ మొనర్చుము. ౹౮౭॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. బాలురు మరియు లేగదూడలు ఏ మాతృస్తనము పాలనుద్రావి వృద్ధియగుదురో మరియు అశ్వములు శీఘ్రగతిలో ఎట్లు పరుగిడునో అట్లే మనుష్యులును యథాయోగ్యముగు భోజనము, శయనము, విశ్రాంతి మున్నగువాని సేవనమున పుష్టిగలవారై వేగవంతముగ కార్యనిర్వహణ మొనర్చుకొనవలెను. సముద్రజలములలో నౌకలందు సుఖపూర్వకముగ పారావారము, అనగా ఈ తీరమునుండి ఆవలితీరమునకు జేరునట్లు ఉత్తమ సాధనములద్వారా పారము మరియు అపారమును పొందవలెను. ౹౮౭॥

87.O man resplendent like fire, drink as from a teat filled with milk, this invigorating juice of waters, In the midst of many welcome this well full of sweet water. Fast like a horse, enter thy oceanic dwellings!.

౯౩౮. ఘృతమిత్యస్య గృత్సమద ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైరగ్నిః క్వ క్వాన్వేషణీయ ఇత్యాహ. మానవు లగ్నిని ఎచ్చటెచ్చట అన్వేషించవలెను?

౯౩౮ ఘృతం మిమిక్షే ఘృతమస్య యోనిర్ఘృతే శ్రితో ఘృతమ్వస్య ధామ ।

అనుష్వధమావహ మాదయస్వ స్వాహాకృతం వృషభ వక్షి హవ్యమ్ ౹౮౮॥

ప.విః- ఘృతమ్, మిమిక్షే, ఘృతమ్, అస్య, యోనిః, ఘృతే, శ్రితః, ఘృతమ్, ఊం॰ ఇత్యూ॰, అస్య, ధామ, అనుష్వధమ్ అనుష్వధమిత్యను+స్వధమ్, ఆ,వహ, మాదయస్వ, స్వాహాకృతమితి స్వాహా + కృతమ్, వృషభ, వక్షి, హవ్యమ్. ౹౮౮॥

**పదార్థః :-**(ఘృతమ్) ఉదకమ్ (మిమిక్షే) సిఞ్చతుమిచ్ఛ (ఘృతమ్) జలమ్ (అస్య) (యోనిః) గృహమ్ (ఘృతే) (శ్రితః) (ఘృతమ్) ఉదకమ్ (ఉ) వితర్కే (అస్య) పావకస్య (ధామ) అధికరణమ్ (అనుష్వధమ్) స్వధాన్నస్యానుకూలమ్ (ఆ) (వహ) ప్రాపయ (మాదయస్వ) హర్షయస్వ (స్వాహాకృతమ్) వేదవాణీనిష్పాదితమ్ (వృషభ) యో వర్షతి తత్సమ్బుద్ధౌ (వక్షి) కామయసే ప్రాప్నోషి వా (హవ్యమ్) హోతుమాదాతుమర్హమ్. ౹౮౮॥

**అన్వయః** :-హే సముద్రయాయిన్! త్వం ఘృతం మిమిక్షే ఉ అస్యాగ్నేర్ఘృతం యోనిరస్తి. యో ఘృతే శ్రితో ఘృతమస్య ధామ తమగ్నిమనుష్వధమావహ. హే వృషభ! త్వం యతః స్వాహాకృతం హవ్యం వక్షి తేనాస్మాన్ మాదయస్వ. ।౮౮॥

**భావార్థః** :-యావానగ్నిర్జలేఽస్తి తావాన్ జలాధికరణ ఉచ్యతే యథాజ్యేన వహ్నిర్వర్ధతే తథా జలేన సర్వే పదార్థా వర్ధన్తే. అన్నమనుకూలమాజ్యం చానన్దకారి జాయతే తస్మాత్సర్వైరేతత్కామనీయమ్. ।౮౮॥

**పదార్థము** :-సముద్రమున పయనించు మానవా! నీవు (ఘృతమ్) జలమును (మిమిక్షే) సించనమొనర్చ దలచుము (ఉ) మరియు (అస్య) ఈ యగ్నికి (ఘృతమ్) నేయి (యోనిః) గృహమై యున్నది. ఎయ్యది (ఘృతే) నేతియందు (శ్రితః) ఆశ్రయమును పొందుచున్నదో మరియు (ఘృతమ్) జలము (అస్య) ఈ యగ్నికి (ధామ) ధామమైయున్నదో అట్టి యగ్నిని నీవు (అనుష్వధమ్) అన్నముయొక్క అనుకూలత్వమునకు (ఆ,వహ) చేర్చుము (వృషభ) వర్షింపజేయు ఓ మానవా! నీవు (స్వాహాకృతమ్) వేదవాణిచే ప్రాప్తిజేసికొనిన (హవ్యమ్) పొందదగిన పదార్థమును (వక్షి) కోరుచున్నావు [పొందుచున్నావు] కావుననే మాకును (మాదయస్వ) ఆనందమును గలిగించుము. ।౮౮॥

**భావార్థము** :-జలములందెంతయగ్ని గలదో అదంతయు జలాధికరణము, అనగా జలము నందుండునది అని యనబడును. ఘృతాహుతులచే అగ్ని తీక్ష్ణమగునట్లు జలములచే పదార్థములన్నియును వృద్ధియగును. మరియు అన్నమున కనుకూలముగా నేయి ఆనందదాయకమగుచున్నది. కావున దాని నెల్లరును కామించ (కోర) వలయును. ।౮౮॥

88.O sailor, wish thou to master water.Ghee is the home of fire.It rests in ghee. Ghee is its proper province. Utilise that fire for producing food-stuffs. O giver of pleasures; thou receivest the oblation consecrated through vedic incantations, hence gladden us!.

౯౩౯.సముద్రాదిత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కథం వర్తితవ్యమిత్యాహ. మానవు లెటుల మెలగవలయును?

౯౩౯ సముద్రాదూర్మిర్మధుమాꣳ౨॥ఉదారదుపాꣳశునా
సమమృతత్వమానట్। ఘృతస్య నామ గుహ్యం యదస్తి
జిహ్వా దేవానామమృతస్య నాభిః ।౮౯॥

**ప.వి:-సముద్రాత్, ఊర్మిః, మధుమానితి మధు + మాన్, ఉత్, ఆరత్, ఉప, అꣳశునా,**

సమ్, అమృతత్వమిత్యమృతత్వమ్, ఆనట్, ఘృతస్య నామ, గుహ్యమ్, యత్, అస్తి, జిహ్వా, దేవానామ్, అమృతస్య, నాభిః ॥౮౯॥

**పదార్థః :-** (సముద్రాత్) అన్తరిక్షాత్ (ఊర్మిః) తరఙ్గః (మధుమాన్) మధురగుణయుక్తః (ఉత్) (ఆరత్) ఊర్ధ్వం ప్రాప్నోతి (ఉప) (అంశునా) కిరణసమూహేన (సమ్) (అమృతత్వమ్) అమృతస్య భావమ్ (ఆనట్) సమన్తాద్ వ్యాప్నోతి (ఘృతస్య) జలస్య (నామ) సంజ్ఞా (గుహ్యమ్) రహస్యమ్ (యత్) (అస్తి) (జిహ్వా) వాణీ (దేవానామ్) విదుషామ్ (అమృతస్య) మోక్షస్య (నాభిః) స్తమ్భనం స్థిరీకరణం ప్రబన్ధనమ్. ॥౮౯॥

**అన్వయః :-** హే మనుష్యాః! భవన్తో యత్సముద్రాదంశునా మధుమానూర్మిరుదారత్ సమమృతత్వ ముపానట్ యద్ ఘృతస్య గుహ్యం నామాస్తి, యా దేవానాం జిహ్వాఽమృతస్య నాభిరస్తి తత్సర్వం సేవన్తామ్. ॥౮౯॥

**భావార్థః :-** హే మనుష్యాః! యథాఽగ్నిర్మిలితయోర్జలభూమ్యోర్విభాగేన మేఘమండలం ప్రాపయ్య మధురం జలం సంపాదయతి యత్కారణాఖ్యమపాం నామ తద్ గుహ్యమస్తి మోక్షశ్చైతత్సర్వముపదేశేనైవ లభ్యమితి వేద్యమ్. ॥౮౯॥

**పదార్థము :-** మానవులారా! మీరు ఏ (సముద్రాత్) అంతరిక్షమునుండి (అంశునా) కిరణ సమూహముతో గూడ (మధుమాన్) మధురత్వము గలిగియున్న (ఊర్మిః) జలతరంగము (ఉదారత్) పైకి చేరుచున్నదో యది (సమమృత్వమ్) ఉత్తమపద్ధతిలో అమృతరూప ఆస్వాదమును (ఉపానట్) సమీపమందే పొందుదుముగాక, అనగా అత్యంతరుచిని ప్రాప్తిజేసికొందుముగాక! (యత్) ఏ (ఘృతస్య) జలముల (గుహ్యమ్) గుప్తమైన (నామ) నామము (అస్తి) కలదో మరియు నే (దేవానామ్) విద్వాంసుల (జిహ్వా) వాణి (అమృతస్య) మోక్షమునకు (నాభిః) ప్రబంధమొనర్చునదై యున్నదియో ఆ యన్నిటిని పొందుడు. ॥౮౯॥

**భావార్థము :-** మానవులారా! అగ్ని యెట్లు భూమియందు గలిసియున్న జలములను విడదీసి జలములను సూక్ష్మరూపమున మేఘమండలమునకు జేర్చి, అచ్చట దానిని మధురముగ నొనర్చునో, అనగా జలములకుగల కారణరూపనామము గుప్తమై యున్నది. గుహ్యమైయున్న జములవలెనే అతిగుహ్యమైయున్న మోక్షమును విద్వాంసుల యుపదేశము వల్లనే దెలిసికొని సాధనద్వారా సాధించవలెను. ॥౮౯॥

89.O men, know that forth from the ocean springs the watery wave of sweetness with rays of the sun. Being divine it is extremely pleasant in taste. The real cause of water is hidden. Salvation is the result of the teachings of the learned!.

౯౪౦. వయమిత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౯౪౦ వయం నామ ప్ర బ్రవామా ఘృతస్యాస్మిన్ యజ్ఞే ధారయామా నమోభిః।

ఉప బ్రహ్మా శృణవచ్ఛస్యమానం చతుఃశృఙ్గోऽవమీద్ గౌర ఏతత్ ॥౯౦॥

**ప.విః**-వయమ్, నామ, ప్ర, బ్రవామ, ఘృతస్య, అస్మిన్, యజ్ఞే, ధారయామ, నమోభిరితి నమః + భిః, ఉప బ్రహ్మా, శృణవత్, శస్యమానమ్, చతుః శృఙ్గ ఇతి చతుః + శృఙ్గః, అవమీత్, గౌరః, ఏతత్.॥౯౦॥

**పదార్థః** :-(వయమ్) (నామ) పదార్థానాం సఞ్జ్ఞామ్ (ప్ర బ్రవామ) ఉపదిశేమ (ఘృతస్య) ఆజ్యస్య జలస్య వా (అస్మిన్) (యజ్ఞే) గృహాశ్రమవ్యవహారే (ధారయామ) అత్రాన్యేషామపీతి దీర్ఘః (నమోభిః) అన్నాదిభిః (ఉప) (బ్రహ్మా) చతుర్వేదవిత్ (శృణవత్) శృణుయాత్, (శస్యమానమ్) ప్రశంసితం సత్ (చతుఃశృఙ్గః) చత్వారో వేదాః శృఙ్గవదుత్తమా యస్య సః (అవమీత్) ఉపదిశేత్ (గౌరః) యో వేదవిద్యావాచి రమతే స ఏవ (ఏతత్). ॥౯౦॥

**అన్వయః** :-యచ్చతుఃశృఙ్గో గౌరో బ్రహ్మాऽవమీదుపశృణవత్తద్ ఘృతస్య శస్యమానం గుహ్యం నామాస్త్యేతద్వయమన్యాన్ ప్రతి ప్రబ్రవామాస్మిన్ యజ్ఞే నమోభి ర్ధారయామ చ.॥౯౦॥

**భావార్థః** :-మనుష్యాః! మనుష్యదేహం ప్రాప్య సర్వేషాం పదార్థానాం నామాన్యర్థాంశ్చాధ్యాపకేభ్యః శ్రుత్వాన్యేభ్యో బ్రూయుః ఏతైః సృష్టిస్థైః పదార్థైః సర్వాణి కార్యాణి చ సాధయేయుః.॥౯౦॥

**పదార్థము** :-(చతుఃశృఙ్గః) ఎవనికి నాలుగువేదములు ఉత్తమ శృంగముల (కొమ్ముల) వలె గలవో, ఆ (గౌరః) వేదవాణులందు రమణామైయుండు లేక వేదవాణిని ప్రసాదించు మరియు (బ్రహ్మా) నాల్గువేదముల నధ్యయనమొనర్చిన విద్వాంసులు (అవమీత్) ఉపదేశమొనర్తురో లేక (ఉప,శృణవత్) సమీపమునందుండి విందురో యది (ఘృతస్య) ఘృతము లేక జలముల (శస్యమానమ్) ప్రశంసించబడిన గుప్త (నామ) నామమై యున్నది (ఏతత్) దీనిని (వయమ్) మనము ఇతరులకు (ప్ర, బ్రవామ) ఉపదేశమొనర్చవలయును. మరియు (అస్మిన్) ఇట్టి (యజ్ఞే) గృహాశ్రమ వ్యవహారములయందు (నమోభిః) అన్నము మున్నగు పదార్థములతో గూడ (ధారయామ) ధరించవలెను.॥౯౦॥

**భావార్థము** :- మానవులు ఈ శ్రేష్ఠమగు మానుషదేహమును పొందినప్పుడు సమస్త పదార్థముల నావయవములు, మరియు అర్థములను చదివించువారినుండి చదివి మరియు విని ఇతరులకును తెలియపరచవలయును. మరియు నీ సృష్టియందలి సకల పదార్థములనుండి సమస్త కార్యములను సాధించుకొనవలెను. ।౯౦॥

90.He,whose knowledge of the four vedas is like four horns,who studies and enjoys the vedas, is perfectly well versed in them all, preaches them to humanity, and listens to their teachings from others, is the praiseworthy embodiment of knowledge. It is our duty to propagate it to others, and act upon it in our domestic life with words of veneration.

౯౪౧.చత్వారీత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, విరాడార్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ యజ్ఞాదిగుణానాహ. యజ్ఞాది గుణములను జెప్పెను.

౯౪౧ చత్వారి శృఙ్గా త్రయోఽ అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసోఽ అస్య।
త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాంఽ॥ఽ ఆవివేశ॥౯౧॥

ప. విః-చత్వారి, శృఙ్గా, త్రయః, అస్య, పాదాః, ద్వేఽ ఇతి ద్వే, శీర్షేఽ ఇతి శీర్షే, సప్త, హస్తాసః, అస్య, త్రిధా, బద్ధః, వృషభః, రోరవీతి, మహః, దేవః, మర్త్యాన్, ఆ, వివేశ ॥౯౧॥

పదార్థః :-(చత్వారి) (శృఙ్గా) శృఙ్గాణీవ చత్వారో వేదా నామాఖ్యాతోపసర్గనిపాతా వా (త్రయః) ప్రాతర్మధ్య సాయం సవనాని, భూతభవిష్యద్వర్తమానాః కాలా వా (అస్య) యజ్ఞస్య శబ్దస్య వా (పాదాః) అధిగమసాధనాని (ద్వే) (శీర్షే) శిరసీ ప్రాయణీయోదయనీయే నిత్యః కార్యశ్చ శబ్దాత్మానౌ వా (సప్త) ఏతత్సంఖ్యాకాని గాయత్ర్యాదీని ఛందాంసి విభక్తయో వా (హస్తాసః) హస్తేన్ద్రియమివ (అస్య) (త్రిధా) త్రిభిః ప్రకారైర్మన్త్రబ్రాహ్మణకల్పైః. ఉరసి కణ్ఠే శిరసి వా (బద్ధః) (వృషభః) సుఖానామభివర్షకః (రోరవీతి) ఋగ్వేదాదినా సవనక్రమేణ వా శబ్దాయతే (మహః) మహాన్ (దేవః) సంగమనీయః ప్రకాశకో వా (మర్త్యాన్) మనుష్యాన్ (ఆ,వివేశ) ఆవిశతి. ॥౯౧॥

అత్రాముర్నైరుక్తాః - చత్వారి శృఙ్గేతి వేదా వా ఏత ఉక్తాస్త్రయోఽస్య పాదా ఇతి సవనాని త్రీణి ద్వే శీర్షే ప్రాయణీయోదయనీయే సప్త హస్తాసః సప్త ఛన్దాంసి త్రిధా బద్ధస్త్రేధా బద్ధో మన్త్రబ్రాహ్మణకల్పైర్వృషభో రోరవీతి. రోరవణమస్య సవనక్రమేణ ఋగ్భిర్యజుర్భిస్సామభిర్యదేనమృగ్భిః శంసంతి యజుర్భిర్యజన్తి. సామభిః స్తువన్తి. మహో దేవ ఇత్యేష హి మహాన్ దేవో యద్యజ్ఞో మర్త్యాఀ ఆ వివేశేత్యేష హి మనుష్యానావిశతి యజనాయ. నిరు. అ. ౧౩. ఖం. ౭. ॥౯౧॥

పక్షాన్తరం పతఞ్జలిమునిరేవమాహ :-చత్వారి శృఙ్గాణి చత్వారి పదజాతాని నామాఖ్యాతోపసర్గ నిపాతాశ్చ. త్రయో అస్య పాదాః. త్రయః కాలా భూతభవిష్యద్వర్తమానాః. ద్వే శీర్షే ద్వౌ శబ్దాత్మానౌ నిత్యః కార్యశ్చ. సప్తహస్తాసో అస్య. సప్త విభక్తయః. త్రిధా బద్ధః త్రిషు స్థానేషు బద్ధ ఉరసి కణ్ఠే శిరసీతి. వృషభో వర్షణాత్ రోరవీతి శబ్దం కరోతి. కుత ఏతత్? రౌతిః శబ్దకర్మా మహో దేవో మర్త్యాం ఆవివేశేతి. మహాన్దేవః శబ్దో మర్త్యా మరణధర్మాణో మనుష్యాస్తానావివేశ. మహాభాష్యమ్.అ.౧.పా.౧.ఆ.౧.॥౯౧॥

**అన్వయః** :-హే మనుష్యాః! యూయం యస్యాస్య త్రయః పాదాశ్చత్వారి శృఙ్గా ద్వే శీర్షే, యస్యాస్య సప్త హస్తాసః సన్తి, యస్త్రిధా బద్ధో మహోదేవో వృషభో యజ్ఞః శబ్దో వా రోరవీతి మర్త్యా నావివేశ తమనుష్ఠాయాభ్యస్య చ సుఖినో విద్వాంసో భవత.॥౯౧॥

**భావార్థః** :-అత్రోభయోక్త్యా రూపకః శ్లేషాఽలంకారశ్చ. యే మనుష్యా యజ్ఞవిద్యాం శబ్దవిద్యాం చ జానన్తి తే మహాశయా విద్వాంసో భవన్తి. ॥౯౧॥

**పదార్థము** :-ఓ మానవులారా! మీరు (అస్య) దీనియొక్క (త్రయః) ప్రాతఃసవనము [యజ్ఞము] మధ్యందిన సవనము, సాయంసవనము, అను నీ మూడింటి (పాదాః) ప్రాప్తిసాధనములు (చత్వారి) నాలుగువేదములు (శృంగా) శృంగములు [కొమ్ములు] (ద్వే) రెండు (శీర్షే) ఉదయాస్తమయము లను రెండు శిరములు లేక (త్రిధా) మంత్రము, బ్రాహ్మణము, కల్పము అను నీ మూడు విధములచే (బద్ధః) బంధించబడియున్న (మహః) గొప్ప (దేవః) పొందదగిన (వృషభః) అన్నివైపులనుండి సుఖములను వర్షింపజేయు యజ్ఞము (రోరవీతి) ప్రాతః, మధ్య, సాయంసవన క్రమముతో శబ్దమొనర్చుచు (మర్త్యాన్) మానవులందు (ఆ, వివేశ) చక్కగా ప్రవేశించుచున్నది. దాని ననుష్ఠించి సుఖవంతులగుడు.[ఇది మొదటి పక్షము]॥౯౧॥

**రెండవపక్ష పదార్థము** :- ఓ మానవులారా! మీరు ఏ (అస్య) దీని (త్రయః) భూతభవిష్యద్వర్తమానకాలములు (పాదాః) పాదములో (చత్వారి) నామము, ఆఖ్యాతము, ఉపసర్గము నిపాతము అను నాలుగు (శృఙ్గా) కొమ్ములు (ద్వే) రెండు (శీర్షే) నిత్యము, కార్యములు అను రెండు శిరములు (అస్య) దీనికి (సప్త, హస్తాసః) ప్రథమమొదలు ఏడు విభక్తు లను ఏడు చేతులు లేక (త్రిధా, బద్ధః) హృదయము, కంఠము, శిరము అను నీ మూడు స్థానములందు బంధించబడి (మహః) గొప్ప (దేవః) శుద్ధ, అశుద్ధముల ప్రకాశపరచునది (వృషభః) సుఖముల వర్షింప జేయుశబ్దశాస్త్రము (రోరవీతి) ఋగ్యజుస్సామాథర్వము లను వేదములచే శబ్దమొనర్చుచు (మర్త్యాన్) మనుష్యులందు (ఆ, వివేశ) ప్రవేశమొనర్చునో దాని నభ్యసించి మీరు విద్వాంసులగుడు. ॥౯౧॥

**భావార్థము** :- ఈ మంత్రమునం దుభయోక్తి గలదు. అనగా ఉపమానముయొక్క న్యూనాధిక్య ధర్మముల కథనముతో రూపక మరియు శ్లేషాలంకారములు గలవు. ఏ మనుష్యులు యజ్ఞవిద్య మరియు శబ్దవిద్యల నెరుగుదురో వారు మహావిద్వాంసులగుదురు.॥౯౧॥

91.This yajna has got four horns, three feet, two heads, and seven hands, This migty, attainable yajna, the giver of happiness, bound with a triple bond. roars loudly and enters into mortals.

౯౪౨. త్రిధేత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ మనుష్యైః కథం వర్తితవ్యమిత్యాహ. మానవు లెటుల మెలగ వలయును?

౯౪౨ త్రిధా హితం పణిభిర్గుహ్యమానం గవి దేవాసో ఘృతమన్వవిన్దన్।

ఇన్ద్ర ఏకꣳ సూర్య ఏకఞ్జజాన వేనాదేకꣳ స్వధయా నిష్టతక్షుః॥౯౨॥

ప.విః- త్రిధా, హితమ్, పణిభిరితి పణి + భిః గుహ్యమానమ్, గవి, దేవాసః, ఘృతమ్, అను, అవిన్దన్, ఇన్ద్రః, ఏకమ్, సూర్యః, ఏకమ్, జజాన, వేనాత్, ఏకమ్, స్వధయా, నిః, తతక్షుః.॥౯౨॥

**పదార్థః** :-(త్రిధా) త్రిభిః ప్రకారైః (హితమ్) స్థితమ్ (పణిభిః) వ్యవహారజ్ఞైః స్తావకైః (గుహ్యమానమ్) రహసి స్థితమ్ (గవి) వాచి (దేవాసః) విద్వాంసః (ఘృతమ్) ప్రదీప్తం విజ్ఞానమ్ (అను) (అవిన్దన్) లభన్తే (ఇన్ద్రః) విద్యుత్ (ఏకమ్) (సూర్యః) సవితా (ఏకమ్) (జజాన) జనయతి (వేనాత్) కమనీయాత్ మేధావినః వేన ఇతి మేధావినా.. నిఘం. 3.౧౫ (ఏకమ్) విజ్ఞానమ్ (స్వధయా) స్వేనధారితయా క్రియయా (నిః) నితరామ్ (తతక్షుః) తనూకుర్యుః.॥౯౨॥

**అన్వయః** :-హే మనుష్యాః! యథా దేవాః పణిభిస్త్రిధా హితం గవి గుహ్యమానం ఘృతమన్వవిన్దన్ యదీన్ద్ర ఏకం సూర్య ఏకం జజాన వేనాచ్చ స్వధయైకం నిష్టతక్షుస్తథా యూయమప్యాచరత.॥౯౨॥

**భావార్థః** :-త్రిప్రకారకం స్థూలసూక్ష్మకారణవిజ్ఞాపకం తం విద్యుత్సూర్యప్రకాశమివ ప్రకాశిత మాప్తేభ్యో యే మనుష్యాః ప్రాప్నుయుస్తే స్వకీయం జ్ఞానం వ్యాప్తం కుర్యుః.॥౯౨॥

**పదార్థము** :-ఓ మానవులారా! (దేవాసః) విద్వాంసులెట్లు (పణిభిః) వ్యవహారజ్ఞాతలు, స్తుతులనొనర్చువారు (త్రిధా) ముప్విధములుగ (హితమ్) స్థిరపరచబడిన మరియు (గవి) వాణియందు (గుహ్యమానమ్) దాగియున్న (గుప్తమైయున్న) (ఘృతమ్) ప్రకాశిత జ్ఞానమును (అను, అవిన్దన్) పరిశోధన (అన్వేషణ) తరువాత పొందుదురో (ఇన్ద్రః) విద్యుత్తు (ఏకమ్) ఏకవిజ్ఞానమును (సూర్యః) సూర్యుడు (ఏకమ్) ఏకవిజ్ఞానమును (జజాన) ఉత్పన్నమొనర్చునో మరియు (వేనాత్) అతిసుందర మనోహర

బుద్ధిశాలియగు విద్వాంసునిచే మరియు (స్వధయా) స్వయముగ ధారణమొనర్చిన క్రియచే (ఏకమ్) అద్వితీయ విజ్ఞానమును (నిః) నిరంతరము (తతక్షుః) అతి తీక్ష్ణరూపమున సూక్ష్మమొనర్చునట్లు మీరును ఆచరించుడు.॥౯౨॥

భావార్థము :- మువ్విధములగు స్థూల, సూక్ష్మ, కారణముల జ్ఞానమొనర్చుజేయు విద్యుత్తు మరియు సూర్యుని ప్రకాశమువంటి ప్రకాశముయొక్క బోధను ఆప్తులు మరియు ఉత్తమ శాస్త్రజ్ఞులగు విద్వాంసులచే మానవులు పొంది వారు తమ జ్ఞానమును ఇతరులకు దెలిపి వ్యాప్తమొనర్చవలయును.॥౯౨॥

92.The learned, masters of the wordly affairs, acquire after research the knowledge hidden in the vedas, and laid three-wise. Electricity exposes a part of that knowledge, sun another part, and the learned the third part by their wisdom and experience.

౯౪౩. ఏతా ఇత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కీదృశీ వాక్ ప్రయోజ్యేత్యాహ. మానవు లెటువంటివాణిని ప్రయోగించవలయును.

౯౪౩ ఏతా౨ అర్షన్తి హృద్యాత్సముద్రాచ్ఛతవ్రజా రిపుణా నావచక్షే ఘృతస్య

ధారా౨ అభిచాకశీమి హిరణ్యయో వేతసో మధ్య౨ ఆసామ్ ॥౯౩॥

ప.విః- ఏతాః, అర్షన్తి, హృద్యాత్, సముద్రాత్, శతవ్రజా ఇతి శత + వ్రజాః, రిపుణా, న, అవచక్ష ఇత్య +వచక్షే, ఘృతస్య, ధారాః అభి,చాకశీమి, హిరణ్యయః, వేతసః, మధ్యే, ఆసామ్॥౯౩॥

పదార్థః :-(ఏతాః) (అర్షన్తి) గచ్ఛన్తి నిస్సరన్తి (హృద్యాత్) హృదయే భవాత్ (సముద్రాత్) అన్తరిక్షాత్ (శతవ్రజాః) శతమసంఖ్యాతా వ్రజా మార్గా యాసాం తాః (రిపుణా) శత్రుణా స్తేనేన. రిపురితి స్తేననా... నిఘం. ౩.౨.౪ (న) నిషేధే (అవచక్షే) అవఖ్యాతవ్యాః (ఘృతస్య) ఆజ్యస్య (ధారాః) (అభి) (చాకశీమి) సర్వతోఽనుశాస్మి (హిరణ్యయః) తేజః స్వరూపః (వేతసః) కమనీయః (మధ్యే) (ఆసామ్) వేదధర్మ యుక్తావాణీనామ్. ॥౯౩॥

అన్వయః :-యా రిపుణా నావచక్షే శతవ్రజా ఏతా వాచో హృద్యాత్సముద్రాదర్షన్త్యాసాం మధ్యే యా అగ్నౌ ఘృతస్య ధారా ఇవ జనేషు పతితాః ప్రకాశన్తే తా హిరణ్యయో వేతసోఽహ మభిచాకశీమి. ॥౯౩॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథోపదేశకా విద్వాంసో యాః పవిత్రా విజ్ఞానయుక్తా

అనేకమార్గాః శత్రుభిరఖణ్డ్యా ఘృతస్య ప్రవాహో<u>ఽ</u>గ్నిమివ శ్రోతౄన్ ప్రసాదయన్తి తా వాచః ప్రాప్నువన్తి. తథా సర్వే మనుష్యాః ప్రయత్నేనైతాః ప్రాప్నుయుః.।౯౩॥

**పదార్థము** :-(రిపుణా) శత్రువు, చోరునిచే (న,అవచక్షే) కోయదగని (శతవ్రజాః) వందలాది మార్గములు గల (ఏతాః) ఆ వాణులు (హృద్యాత్, సముద్రాత్) హృదయాకాశమునుండి (అర్షన్తి) బయలుదేరును (ఆసామ్) ఈ వైదిక ధర్మయుక్తవాణుల (మధ్యే) మధ్యన అగ్నియందు (ఘృతస్య) ఘృతముయొక్క (ధారాః) ధారలవలె మానవులందు బడియుండి ప్రకాశితమగుచున్నది. వాని (హిరణ్యయః) తేజోవంతుడను (వేతసః) అతిసుందరుడనగు నేను (అభిచాకశీమి) సకల దిశలనుండి శిక్షణ నిచ్చుచున్నాను.।౯౩॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఉపదేశకులగు విద్వాంసులు పవిత్రము, విజ్ఞానయుక్తమగు వాణులు అనేక మార్గములుగలవి, శత్రువులకు అఖండ్యములు (దుర్భేద్యములు) నై మరియు ఘృతప్రవాహము అగ్ని నుత్తేజితమొనర్చునట్లు శ్రోతలను ప్రసన్నుల నొనర్చునట్టి వాణులను పొందుదురు. అట్లే సమస్త మానవులును చక్కని ప్రయత్నముచే వీనిని పొందవలయును.।౯౩॥

93.These vedic speeches which flow from the inmost reservoirr of the heart are incontrovertible by the thievish foe. I realise these speeches full of knowledge and see in their midst the Resplendent, Beautiful God.

౯౪౪.సమ్యగిత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౯౪౪ సమ్యక్ స్రవన్తి సరితో న ధేనా<u>ఽ</u>అన్తర్హృదా మనసా పూయమానాః।ఏతే<u>ఽ</u>

అర్షన్త్యూర్మయో ఘృతస్య మృగా<u>ఽ</u> ఇవ క్షిపణోరీషమాణాః ।౯౪॥

**ప.విః-సమ్యక్, స్రవన్తి, సరితః, న, ధేనాః, అన్తః, హృదా, మనసా పూయమానాః, ఏతే, అర్షన్తి, ఊర్మయః, ఘృతస్య, మృగాః, ఇవ, క్షిపణోః, ఈషమాణాః ।౯౪॥**

**పదార్థః** :-(సమ్యక్) (స్రవన్తి) క్షరన్తి (సరితః) నద్యః సరిత ఇతి నదీనా.. నిఘం. ౧.౧౩ (న) ఇవ (ధేనాః) వాచః ధేనేతి వాఙ్ నా.. నిఘం. ౧.౧౧ (అన్తః) శరీరాన్తర్వ్యవస్థితేన (హృదా) విషయహారకేణ (మనసా) శుద్ధాంతఃకరణేన (పూయమానాః) పవిత్రాః సత్యః (ఏతే) (అర్షన్తి) గచ్ఛన్తి ప్రాప్నువన్తి (ఊర్మయః) తరఙ్గాః (ఘృతస్య) ప్రకాశితస్య విజ్ఞానస్య (మృగా ఇవ) (క్షిపణోః) హింసకస్య భయాత్ (ఈషమాణాః) భయాత్పలాయమానాః.।౯౪॥

**అన్వయః :**-హే మనుష్యాః! యా అన్తర్హృదా మనసా పూయమానా ధేనాః సరితో న సమ్యక్ స్రవన్తి తా యే చైతే ఘృతస్యోర్మయః క్షిపణోరీషమాణా మృగా ఇవ హర్షన్తి తాంశ్చ యూయం విజానీత.॥౯౪॥

**భావార్థః :**-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా నద్యః సముద్రాన్ గచ్ఛన్తి తథైవాన్తరిక్షస్థా చ్ఛబ్ద సముద్రా ద్వాచో విచరన్తి. యథా సముద్రస్య తరఙ్గాశ్చలన్తి యథా చ వ్యాధాద్భీతా మృగో ధావన్తి తథైవ సర్వేషాం ప్రాణినాం శరీరస్థేన విజ్ఞానేన పవిత్రాః సత్యో వాణ్యః ప్రచరన్తి. యే శాస్త్రాభ్యాససత్యవచనాదిభిర్వాచః పవిత్రయన్తి త ఏవ శుద్ధా జాయన్తే. ॥౯౪॥

**పదార్థము :**-మానవులారా! (అన్తః హృదా) శరీరమధ్యన (మనసా) శుద్ధాంతఃకరణముచే (పూయమానాః) పవిత్రమైన (ధేనాః) వాణి (సరితః) నదుల (న) వలె (సమ్యక్) చక్కగా (స్రవన్తి) ప్రవృత్త [ప్రవాహ] మగుచున్నవి. వానిని (ఏతే) ఈ వాణులద్వారా (ఘృతస్య) ప్రకాశిత ఆంతరిక జ్ఞానముయొక్క (ఊర్మయః) తరంగములు (క్షిపణోః) హింసకుల (వేటగాండ్ర) భయముచే (ఈషమాణాః) పారిపోవుచున్న (మృగా ఇవ) భీతహరిణమువలె (అర్షన్తి) లేచుచు ఎల్లరకు ప్రాప్తించుచున్నది. అట్టి వానినికూడ మీరు తెలిసికొనుట యోగ్యము.॥౯౪॥

**భావార్థము :**-ఈ మంత్రమునందు రెండు ఉపములు మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. నదులు సముద్రమును పొందునట్లు, అదేవిధముగ ఆకాశస్థ శబ్దసముద్రమునుండి (ఆకాశమునకు శబ్దగుణము గలదు) వాణి సంచారముజరుగును. మరియు సముద్రతరంగము లెట్లు సంచరించునో మరియు కిరాతకులచే భయభీతినొందిన హరిణము ఇటు నటు పరుగెత్తుచుండునో అదేవిధముగ సమస్త మానవుల శరీరస్థ విజ్ఞానముచే పవిత్రమైన వాణి ప్రచారమును పొందుచుండును. శాస్త్రాభ్యాస మరియు సత్యవచనము మున్నగు వానిద్వారా వాణులను పవిత్రమొనర్చువారు మాత్రమే శుద్ధాంతఃకరణము గలవా రగుచుందురు. ॥౯౪॥

౯౪. From the inmost recesses of the heart, purified by mind, flow together our speeches as streams flow to the ocean. These waves of knoledge pour swiftly like the deer running through the fear of a tiger.

౯౫. సిన్ధోరిత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, ఆర్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౯౫ సిన్ధోరివ ప్రాధ్వనే శూఘనాసో వాతప్రమియః పతయన్తి యహ్వాః।
ఘృతస్య ధారా అరుషో న వాజీ కాష్ఠా భిన్దన్నూర్మిభిః పిన్వమానః ॥౯౫॥

ప.వి:-సిన్ధోరివేతి సిన్ధోః ఇవ, ప్రాధ్వన ఇతి ప్ర + అధ్వనే, శూఘనాసః, వాతప్రమియ ఇతి

**వాత + ప్రమియః, పతయన్తి, యహ్వాః, ఘృతస్య, ధారాః, అరుషః, న, వాజీ, కాష్ఠాః, భిన్దన్, ఊర్మిభిరిత్యూర్మి + భిః, పిన్వమానః ॥౯౫॥**

**పదార్థః** :-(సిన్ధోరివ) నద్యా ఇవ (ప్రాధ్వనే) ప్రకృష్టశ్చాసావధ్వా చ తస్మిన్. సప్తమ్యర్థే చతుర్థీ (శూఘనాసః) క్షిప్రగమనాః. శూఘనాస ఇతి క్షిప్రనా.. నిఘం. ౨.౧౫. (వాతప్రమియః) వాతేన ప్రమాతుం జ్ఞాతుం యోగ్యాః (పతయన్తి) పతన్తి గచ్ఛన్తి చురాదిత్వాత్ స్వార్థే ణిచ్ (యహ్వాః) మహత్యః. యహ్వ ఇతి మహన్నా... నిఘం. 3.3. (ఘృతస్య) విజ్ఞానస్య (ధారాః) వాచః (అరుషః) య ఋచ్ఛత్యధ్వానం సః (న) ఇవ (వాజీ) వేగవానశ్వః (కాష్ఠాః) సంగ్రామప్రదేశాన్. కాష్ఠా ఇతి సంగ్రామనా.. నిఘం. ౨.౧౭. (భిన్దన్) విదారయన్ (ఊర్మిభిః) శత్రుభేదనోత్థశ్రమస్వేదోదకైః (పిన్వమానః) సిఞ్చన్. ॥౯౫॥

**అన్వయః** :-హే మనుష్యాః! ప్రాధ్వనే సిన్ధోరివ శూఘనాసా వాతప్రమియః కాష్ఠా భిన్దన్నూర్మిభిర్భూమిం పిన్వమానోఽరుషో వాజీ న యా యహ్వా ఘృతస్య ధారాః పతయన్తి తా యూయం విజానీత. ॥౯౫॥

**భావార్థః** :-అత్రాప్యుపమాద్వయమ్ యే నదీవత్ కార్యసిద్ధయే తూర్ణగామినోఽశ్వవద్వేగవన్తః సర్వాసు దిక్షు ప్రవృత్తకీర్త్తయో జనాః పరోపకారాయోపదేశేన మహాన్తి దుఃఖాని సహన్తే తే తేషాం శ్రోతారశ్చ జగత్స్వామినో భవన్తి నేతరే. ॥౯౫॥

**పదార్థము** :- ఓ మానవులారా! (ప్రాధ్వనే) జలములు ప్రవహించు ఉత్తమమార్గమందు (సిన్ధోరివ) నదివలె (శూఘనాసః) శీఘ్రముగనడచునట్టి (వాతప్రమియః) వాయువుచే దెలిసికొనదగిన తరంగములు పడుచున్నట్లు (న) ఏవిధముగ (కాష్ఠాః) యుద్ధప్రాంతములను (భిన్దన్) చీల్చుచు (ఊర్మిభిః) శత్రువుల నిర్మూలించు శ్రమబడలికచే ఉబికిన స్వేదరూప జలములతో భూమిని (పిన్వమానః) సించనమొనర్చుచు (అరుషః) నేర్పుగల (వాజీ) వేగవంతమగు అశ్వము పడునో అట్లు (యహ్వాః) మహాగంభీర (ఘృతస్య) విజ్ఞాన (ధారాః) వాణులు (పతయన్తి) ఉపదేశకుల ముఖములనుండి వెడలి శ్రోతలపై బడుచున్నవని మీరు దెలిసికొనుడు. ॥౯౫॥

**భావార్థము** :- ఈ మంత్రమందును రెండు ఉపమాలంకారములు గలవు. కార్యసిద్ధికై నదులవలె శీఘ్రముగ పరుగెత్తువారు లేక అశ్వమువలె వేగవంతమైనవారు, సకలదిశలందు తమ కీర్తి వ్యాప్తమైనవారును, పరోపకారార్థము యుపదేశముల నొనర్చుచు దుఃఖములను సహించువారును మరియు వారి శ్రోతలును ప్రపంచమునకు స్వాములగుదురు కాని ఇతర నటకులు మాత్రము గాజాలరు. ॥౯౫॥

**95.**just as rushing down the rapids of a river, fall swifter than the wind the vogorous currents, just as the swift fleeting horse, breaking aside the battlefields, falls upon the

enemy, watering the earth with perspiration arising our of his endeavour to kill the foe, so do the exalted speeches, full of knowledge, fall on the audience from the mouth of a preacher.

౯౪౬. అభిప్రవన్తేత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, నిచృదార్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౯౪౬ అభిప్రవన్త సమనేవ యోషాః కల్యాణ్యః స్మయమానాసోఽ అగ్నిమ్ ।

ఘృతస్య ధారాః సమిధో నసన్త తా జుషాణో హర్యతి జాతవేదాః ॥౯౬॥

ప.విః- అభి, ప్రవన్త, సమనేవేతి సమనాఽ ఇవ, యోషాః, కల్యాణ్యః, స్మయమానాసః, అగ్నిమ్, ఘృతస్య, ధారాః, సమిధ ఇతి సమ్ఽ ఇధః, నసన్త, తాః, జుషాణః, హర్యతి, జాతవేదాః ॥౯౬॥

**పదార్థః** :-(అభి)(ప్రవన్త) గచ్ఛన్తి. లజ్యడభావః. (సమనేవ) సమానం మనో యాసాం తా ఇవ. సుపాం సులుగితి విభక్తేర్ఢాదేశః (యోషాః) స్త్రియః (కల్యాణ్యః) కల్యాణాచరణశీలాః (స్మయమానాసః) కించిద్ధా సేన ప్రసన్నతాకారిణ్యః (అగ్నిమ్) తేజస్వినం విద్వాంసమ్ (ఘృతస్య) శుద్ధస్య జ్ఞానస్య (ధారాః) వాచః (సమిధః) శబ్దార్థసంబంధైః సమ్యగ్ దీపితాః (నసన్త) ప్రాప్నువన్తి. నసత ఇతి గతికర్మా. నిఘం. ౨.౧౪. (తాః) (జుషాణః) సేవమానః (హర్యతి) కామయతే. హర్యతీతి కాన్తికర్మా. నిఘం. ౨.౬. (జాతవేదాః) జాతం వేదో విజ్ఞానం యస్య సః ॥౯౬॥

**అన్వయః** :-స్మయమానాసః కల్యాణ్యః సమనేవ యోషా యాః సమిధో ఘృతస్య ధారా అగ్నిమభిప్రవన్త నసన్త చ తా జుషాణో జాతవేదా హర్యతి. ॥౯౬॥

**భావార్థః** :-అత్రోపమాలంకారః. యథా ప్రసన్నచిత్తా హర్షం ప్రాప్తాః సౌభాగ్యవత్యః స్త్రియః స్వస్వపతీన్ ప్రాప్నువన్తి తథైవ విద్యావిజ్ఞానాభరణభూషితా వాచో విద్వాంసం ప్రాప్నువన్తి.॥౯౬॥

**పదార్థము** :- (స్మయమానాసః) చిరునగవుచే ప్రసన్నత నొందువారు (కల్యాణ్యః) సుఖ సౌభాగ్యములకై ఆచరణ మొనర్చువారు మరియు (సమనేవ, యోషా) ఏకచిత్తముగల స్త్రీలు పతులను పొందునట్లు (సమిధః) శబ్దార్థములను మరియు వాని సంబంధములచే చక్కగా ప్రకాశపరచు (ఘృతస్య) శుద్ధజ్ఞానముగల (ధారాః) వాణులు (అగ్నిః) తేజస్వియగు విద్వాంసుని (అభి, ప్రవన్త) సకలదిశలనుండి చేరుచుండును. మరియు

(నసన్త) ప్రాప్తించును (తాః) ఆ వాణులను (జుషాణః) సేవనమొనర్చుచు (జాతవేదాః) జ్ఞానులగు విద్వాంసులు (హర్యతి) కాంతిని [ప్రకాశమును] పొందుదురు. ॥౯౬॥

**భావార్థము** :- ఈ మంత్రమందు ఉపమాలంకారము గలదు. ప్రసన్నచిత్తులు, ఆనందప్రాప్తిగలిగిన సౌభాగ్యవంతురాండ్రగు మహిళామణులు తమ తమ పతులను జేరునట్లు విద్య మరియు విజ్ఞానరూప ఆభూషణములచే శోభించు వాణులు విద్వాంసులను ప్రాప్తించును. ॥౯౬॥

96.Just as women of high character, of one mind, gently smiling, incline towards their husbands, so do the speeches of pure knowledge, glowing with apt use, meaning, and relation of words, reach a learned person, who enjoying them attains to brilliance.

౬౪౭ కన్యాఽ ఇవత్యేస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౬౪౭ కన్యాఽ ఇవ వహతుమేతవాఽ ఉఽ అఞ్జ్యఞ్జానాఽ అభి చాకశీమి। యత్ర సోమః సూయతే యత్ర యజ్ఞో ఘృతస్య ధారాఽ అభి తత్పవన్తే ॥౯౭॥

ప. వి:- కన్యాఽ ఇవేతి కన్యాః ఇవ, వహతుమ్, ఏతవై, ఊం ఇత్యూం, అఞ్జి, అఞ్జానాః, అభి, చాకశీమి, యత్ర, సోమః, సూయతే, యత్ర, యజ్ఞః, ఘృతస్య, ధారాః, అభి, తత్, పవన్తే ॥౯౭॥

**పదార్థః** :-(కన్యాఽఇవ) కుమార్య ఇవ (వహతుమ్) వహతి ప్రాప్నోతి స్త్రియమితి వహతుర్భర్తా తమ్ (ఏతవై) ఏతుం ప్రాప్తుమ్ (ఉ) వితర్కే (అఞ్జి) కమనీయరూపమ్ (అఞ్జానాః) జ్ఞాపయన్త్యః (అభి) (చాకశీమి) పునః పునః ప్రాప్నోమి. (యత్ర) (సోమః) ఐశ్వర్యసమూహః (సూయతే) ఉత్పద్యతే (యత్ర) (యజ్ఞః) (ఘృతస్య) విజ్ఞానస్య (ధారాః) (అభి) సర్వతః (తత్) (పవన్తే) పవిత్రీభవన్తి. ॥౯౭॥

**అన్వయః** :- అఞ్జ్యఞ్జానా వహతుమేతవై కన్యా ఇవ యత్ర సోమః సూయతే ఉ యత్ర చ యజ్ఞస్తద్యా ఘృతస్య ధారా అభిపవన్తే తా అహమభి చాకశీమి. ॥౯౭॥

**భావార్థః** :- అత్రోపమాలంకారః. యథా కన్యాః స్వయంవరవిధానేన స్వాభీష్టాన్ పతీన్ స్వీకృత్య శోభన్తే తథా ఐశ్వర్యోత్పత్త్యవసరే యజ్ఞసమృద్ధౌ చ విదుషాం వాచః పవిత్రాస్సత్యః శోభన్తే. ॥౯౭॥

**పదార్థము** :-(అంజి) కోరదగిన రూపమును (అఞ్జానాః) ప్రకటపరచుచు (వహతుమ్) ప్రాప్తించునట్టి

పతిని (ఏతవై) ప్రాప్తించుకొరకు (కన్యా ఇవ) కన్యవలె శోభించుచు (యత్ర) ఎచ్చట (సోమః) మహదైశ్వర్యములను (సూయతే) ఉత్పన్నపరచు (ఉ) మరియు (యత్ర) ఎచ్చట (యజ్ఞః) యజ్ఞములొనర్చబడుచుండునో (తత్) అచ్చట ఏవిధమగు (ఘృతస్య) జ్ఞానముయొక్క (ధారాః) వాణులు (అభి, పవన్తే) సకలదిశలనుండి పవిత్రమగుచుండునో వానిని నేను (అభిచాకశీమి) చక్కగా పదేపదే ప్రాప్తించుకొందును.॥౯౭॥

**భావార్థము** :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. కన్యలు స్వయంవరవిధిగా తాము కోరిన అనుకూల పతులను పొందుచు శోభించునట్లు ఐశ్వర్యముల నుత్పన్నపరచు నవసరమున, యజ్ఞసిద్ధియందును విద్వాంసుల వాణి పవిత్రవంతముగా నుండి శోభను గలిగించును.॥౯౭॥

97.As maidens deck themselves with gay adornements and exhibit their beauty to join their husbands, so, where prosperity reigns, where yajna is performed, there the intellectual speeches are sanctified on all sides, which I enjoy again and again.

౯౮. అభ్యర్షతేత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

వివాహితైః స్త్రీపురుషైః కిం కార్యమిత్యాహ. వివాహితదంపతు లేమి చేయవలయును?

**౯౮ అభ్యర్షత సుష్టుతిం గవ్యమాజిమస్మాసు భద్రా ద్రవిణాని ధత్త । ఇమం యజ్ఞం నయత దేవతా నో ఘృతస్య ధారా మధుమత్పవన్తే ॥౯౮॥**

**ప. వి:– అభి, అర్షత, సుష్టుతిమ్ సుస్తుతిమితి సు + స్తుతిమ్, గవ్యమ్, ఆజిమ్, అస్మాసు, భద్రా, ద్రవిణాని, ధత్త, ఇమమ్, యజ్ఞమ్, నయత, దేవతా, నః, ఘృతస్య, ధారాః, మధుమదితి మధు + మత్, పవన్తే.॥౯౮॥**

పదార్థః :-(అభి) సర్వతః (అర్షత) ప్రాప్నుత (సుష్టుతిమ్) శోభనాం ప్రశంసామ్ (గవ్యమ్) గవి వాచి భవం బోధం ధేనౌ భవం దుగ్ధాదికం వా (ఆజిమ్) అజన్తి జానన్తి సుకర్మాణి యేన తం సంగ్రామమ్. ఇణజాదిభ్య ఇతీణ్ ప్రత్యయః (అస్మాసు) (భద్రా) కల్యాణకరాణి (ద్రవిణాని) (ధత్త) (ఇమమ్) (యజ్ఞమ్) సంగంతవ్యం గృహాశ్రమవ్యవహారమ్ (నయత) ప్రాపయత (దేవతా) విద్వాంసః. అత్ర సుపాం సులుగితి జసో లుక్ (నః) అస్మాన్ (ఘృతస్య) ప్రదీప్తస్య విజ్ఞానస్య సమ్బన్ధిన్యః (ధారాః) సుశిక్షితా వాచః (మధుమత్) బహు మధు విద్యతే యస్మింస్తద్ యథా స్యాత్తథా (పవన్తే) ప్రాప్నువన్తి.॥౯౮॥

**అన్వయః** :- హే స్త్రీపురుషాః! యూయముత్తమాచారేణ సుష్టుతిమాజిం గవ్యం చాభ్యర్షత దేవతా స్మాసు భద్రా ద్రవిణాని ధత్త న ఇమం యజ్ఞం నయత యా ఘృతస్య ధారా విదుషో మధుమత్పవన్తే తా అస్మాన్నయత.॥౯౮॥

**భావార్థః** :-స్త్రీపురుషైః సఖిభిర్భూత్వా జగతి ప్రఖ్యాతైర్భవితవ్యమ్. యథా స్వేభ్యస్తథాన్యేభ్యోఽపి కల్యాణకారకాణి ద్రవ్యాణ్యున్నేయాని పరమపురుషార్థేన గృహాశ్రమస్య శోభా కర్తవ్యా. వేదవిద్యా సతతం ప్రచారణీయా చ.॥౯౮॥

**పదార్థము** :-వివాహిత స్త్రీపురుషులారా! మీరు శ్రేష్ఠవర్తనులై (సుష్టుతిమ్) చక్కని ప్రశంస మరియు (ఆజిమ్) శ్రేష్ఠకర్మలను దెలిసికొనదగిన సంగ్రామమును మరియు (గవ్యమ్) వాణిచే లభ్యమగు జ్ఞానము, గోవుచే లభించు క్షీరదధిఘృతాదులను (అభ్యర్షత) అన్నిదిశలనుండియును పొందుడు (దేవతా) విద్వాంసులారా! (అస్మాసు) మాకొరకై (భద్రా) అత్యానందమును గలిగించు (ద్రవిణాని) ధనములను (ధత్త) స్థాపనమొనర్చుడు (నః) మా నిమిత్తము (ఇమమ్) ఇట్టి (యజ్ఞమ్) పొందదగిన గృహస్థాశ్రమ వ్యవహారములను (నయత) ప్రాప్తింపజేయుడు (ఘృతస్య) ప్రకాశిత విజ్ఞానముతో (ధారాః) చక్కని శిక్షాయుక్త వేదవాణులు విద్వాంసులకు (మధుమత్) మధురాలాపములగునట్లు, (పవన్తే) ప్రాప్తించునట్లు ఆ వాణులు మాకు లభించునట్లొనర్చుడు.॥౯౮॥

**భావార్థము** :-పతీపత్నులిరువురును అన్యోన్య మిత్రత్వముద్వారా ప్రపంచమున విఖ్యాతులై యుండవలెను. తమ కవసరమగునట్లే ఇతరులకును ధనము, సుఖము అవసరమని తలచి ఉన్నతిపరచ వలయును. ఉభయులును పరమ పురుషార్థపరులై గృహాశ్రమ శోభను వృద్ధిపరచవలెను. నిరంతరము వేద విద్యలను ప్రచారమొనర్ప వలెను.॥౯౮॥

98.O married couple, welcome the laudable struggle for existence, procure the wisdom of speech, milk, curd and butter. May the learned bestow on us excellent possessions, and grant us this domestic life. The learned receive the instructive, sweet words of knowledge!.

**౯౯. ధామన్నిత్యస్య వామదేవ ఋషిః, యజ్ఞపురుషో దేవతా, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.**

**అథేశ్వరరాజవిషయమాహ. ఈశ్వరుడు మరియు, రాజును గురించియు చెప్పబడినది.**

**౯౯ ధామఀన్తే విశ్వం భువనమధి శ్రితమన్తః సముద్రే హృద్యన్తరాయుషి।**

**అపామనీకే సమిథే యఽఆభృతస్తమశ్యామ మధుమన్తం తఽఊర్మిమ్ ॥౯౯॥**

**ప.విః-ధామన్, తే, విశ్వమ్, భువనమ్, అధి, శ్రితమ్, అన్తరిత్యన్తః, సముద్రే, హృది,**

అన్తరిత్యన్తః, ఆయుషి, అపామ్, అనీకే, సమిథ ఇతి సమ్ + ఇథే, యః, ఆభృత ఇత్యా + భృతః, తమ్, అశ్యామ, మధుమన్తమితి మధు + మన్తమ్, తే, ఊర్మిమ్ ॥౯౯॥

**పదార్థః** :- (ధామన్) దధాతి యస్మింస్తస్మిన్ (తే) తవ (విశ్వమ్) సర్వమ్ (భువనమ్) భవన్తి భూతాని యస్మిన్ (అధి) (శ్రితమ్) (అన్తః) మధ్యే (సముద్రే) ఆకాశమివ వ్యాప్తస్వరూపే (హృది) హృదయే (అన్తః) మధ్యే (ఆయుషి) జీవనహేతౌ (అపామ్) ప్రాణానామ్ (అనీకే) సైన్యే (సమిథే) సంగ్రామే (యః) సంభారః (ఆభృతః) సమన్తాద్ధృతః (తమ్) (అశ్యామ) ప్రాప్నుయామ (మధుమన్తమ్) ప్రశస్తమధురాదిగుణోపేతమ్ (తే) తవ (ఊర్మిమ్) బోధమ్.॥౯౯॥

**అన్వయః** :- హే జగదీశ! యస్య తే౽ధామన్నన్తః సముద్రే విశ్వం భువన మధిశ్రితం తద్వయమశ్యామ. హే సభాపతే! తే౽పామన్తర్హృద్యాయుష్యపామనీకే సమిథే యః సమ్భార ఆభృతస్తం మధుమన్తమూర్మిం చ వయమశ్యామ.॥౯౯॥

**భావార్థః** :- మనుష్యైర్జగదీశ్వరసృష్టౌ పరమప్రయత్నేన సఖ్యున్నతిః కార్యా. సర్వాః సామగ్రీర్ధృత్వా యుక్తాహార విహారేణ శరీరారోగ్యం సంతత్య స్వేషామన్యేషాం చోపకారః కార్య ఇతి శమ్.॥౯౯॥

**పదార్థము** :- ఓ జగదీశ్వరా! (తే) నీయొక్క (ధామన్) సమస్త పదార్థముల నుంచు నే గృహమునందు (అన్తః, సముద్రే) ఆకాశమువలె సర్వమునకు మధ్య వ్యాప్తమైయున్న స్వరూపమునందు (విశ్వమ్) సమస్త (భువనమ్) ప్రాణులకు ఉత్పత్తి స్థానమగు విశ్వము (అధి, శ్రితమ్) ఆశ్రితమై స్థిరమైయున్నదానిని మేము (అశ్యామ) ప్రాప్తించుకొందుముగాక! ఓ సభాపతీ! (తే) నీయొక్క ఏ (అపామ్) ప్రాణుల (అన్తః) మధ్యనగల (హృది) హృదయమునందు మరియు (ఆయుషి) జీవనహేతువులగు ప్రాణాధారుల (అనీకే) సైన్యములు మరియు (సమిథే) సంగ్రామములందు (యః) ఈ భారము [వస్తుచయము] (ఆభృతః) ఉత్తమముగ సమకూర్చి పెట్టబడియున్నదో (తమ్) దానిని, మరియు (మధుమన్తమ్) ప్రశంసనీయ మధురగుణములతో పూర్ణమైయున్న (ఊర్మిమ్) బోధను మేము పొందుదుముగాక!॥౯౯॥

**భావార్థము** :- ఈ పరమేశ్వరసృష్టియందు మానవులు పరమప్రయత్నపూర్వకముగా మిత్రులనున్నతి పరచవలెను. మరియు సమస్త ఆవశ్యక సామగ్రులను సమకూర్చుకొని తగు విధముగ ఆహార, విహార, పరిశ్రమ, ప్రయత్నములద్వారా శారీరకారోగ్యమును చక్కగా నుంచుకొని పరోపకారులై యుండవలయును.॥౯౯॥

99.O God, this whole universe depends upon Thy power and might vast like the atmosphere. May we realise Thee!.

O king may we acquire the strength that lies in thy breaths, thy heart, thy lively soldiers and thy battalefield, and thy wisdom full of admirable characteristics!.

అత్ర సూర్యమేఘగృహాశ్రమగణితవిద్యేశ్వరాదిపదార్థవిద్యావర్ణనా దేతదధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతిరస్తీతి బోద్ధవ్యమితి.

ఈ అధ్యాయమునందు సూర్యుడు, మేఘములు, గృహాశ్రమము, గణితవిద్య, ఈశ్వరుడు మున్నగు పదార్థముల మరియు విద్యల వర్ణనముండుటచే ఈ అధ్యాయముయొక్క అర్థములకు గత అధ్యాయముయొక్క అర్థములతో సంబంధము గలదని దెలిసికొనవలయును.

ఇతి శ్రీమద్విద్వద్వరపరమహంసపరివ్రాజకాచార్యాణాం పరమవిదుషాం శ్రీయుత విరజానన్దసరస్వతీ స్వామినాం శిష్యేణ దయానన్దసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే సప్తదశోఽధ్యాయః సమాప్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామివిరచిత సంస్కృతార్యభాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి పదునేడవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడునునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివసీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య

'మల్లి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**పదునేడవ అధ్యాయము సమాప్తము.**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ओ३म्

परमहंसपरिव्राजकाचार्येण
श्रीमन्महर्षिदयानन्दसरस्वतीस्वामिना निर्मितम्

# यजुर्वेद - भाष्यम्

संस्कृतान्ध्राङ्ग्लभाषासमन्वितम्

## चतुर्थो भागः

*( अष्टादशाध्यायादारभ्य द्वाविंशतितमाध्यायपर्यन्तम् )*


आन्ध्रानुवादकः
'चतुर्वेदभाष्यानुवादभास्करः'
**ब्रह्मश्री पण्डितलोकमलहरिसिद्धान्ताचार्यः**

परिष्कर्ता - सम्पादकश्च
सिद्धान्तालङ्कारः, विद्याभूषणः, आर्षविद्याविनोदः
**आचार्य डॉ. मर्रि कृष्णारेड्डी**



वैदिकसाहित्यप्रचारसमितिः, भाग्यनगरम्-६०, आन्ध्रप्रदेशः

2007

ओ३म्

# THE YAJURVEDA BHASHYAM

With

## MAHARSHI DAYANANDA SARASWATHI'S COMMENTARY

# VOLUME - 4

## (18-22 Chapters)

Translated in English by : **DEVI CHAND M.A.**

***Translated in to Telugu***

***By***

**BRAHMASRI PANDITA LOKA MALAHARI**
**SIDDHANTACHARYA**

***Editor***

**Acharya Dr. MARRI KRISHNA REDDY,** M.A; M.Ed, Ph.D

**Vaidika Sahitya Prachara Samithi, Hyderabad - 60.**

**2007**

ఓ౩మ్

పరమహంసపరివ్రాజకాచార్యేణ
శ్రీమన్మహర్షిదయానందసరస్వతీస్వామినా నిర్మితమ్

# యజుర్వేద భాష్యమ్

(సంస్కృతభాష్యం, ఆంధ్రటీకాతాత్పర్యం, ఆంగ్లభావార్థసహితం)

## చతుర్థ సంపుటము

( 18-22 అధ్యాయములు )


అనువాదకర్త
'చతుర్వేదభాష్యానువాదభాస్కర' - శతాధికగ్రంథకర్త
బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య

పరిష్కర్త - సంపాదకులు
సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద
ఆచార్య డా॥ మర్రి కృష్ణారెడ్డి M.A., M.Ed., Ph.D.



వైదిక సాహిత్య ప్రచార సమితి, హైదరాబాద్-60

2007

# "వైదిక సాహిత్య ప్రచారసమితి" ప్రచురణలు


| | | |
|---|---|---|
| సంపూర్ణ "యజుర్వేదభాష్యమ్" | : | 6 సంపుటములు |
| ద్వితీయ ముద్రణ | : | శ్రీ వ్యయ పుష్యం, జనవరి - 2007. |
| ప్రతులు | : | 1000 |
| వెల | : | **రూ. 1800/- లు** మాత్రమే.(6 సంపుటములకు కలిపి) (పోస్టేజి అదనము) |
| సర్వస్వామ్యములు | : | అనువాదక సంపాదకులవి |
| డి.టి.పి. | : | **వి. రామలింగారెడ్డి (బాలు)** |
| ముద్రణ | : | **సాయిలిఖిత ప్రింటర్స్**, ఖైరతాబాద్, హైదరాబాదు. ఫోన్ : 98490 05182 |


## ప్రతులకు :

1. **వైదికసాహిత్య ప్రచారసమితి,** 3-30; హనుమాన్ నగర్, ఆర్యసమాజం ఎదురువీధి, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 60. ఆం.ప్ర., ఫోన్ : 040 - 24051322, 9849583929

2. **దిల్‌సుఖ్‌నగర్ ఆర్యసమాజం,** బాదంకాంప్లెక్స్, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060, ఫోన్ : 9849468084, 9395376410

3. వేదగిరి, తూంపల్లి గ్రామం, కొందుర్గు మండలం, మహబూబ్‌నగర్ జిల్లా. ఫోన్ : 9441200322, 9849583929

4. **భీమాస్ డీలక్స్ హోటల్,** 34-38, జి.కార్ స్ట్రీట్, రైల్వేస్టేషన్ ఎదురుగా, తిరుపతి. ఫోన్ : 0877-2225521

5. **విశాలాంధ్ర బుక్‌హౌస్** (అన్ని బ్రాంచిలలో) హైదరాబాద్, విశాఖపట్టణం, విజయవాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి, కాకినాడ.

# చతుర్థ సంపుటము

## 18-22 అధ్యాయములు

అధ్యాయసూచిక

# యజుర్వేదభాష్యము

## 18వ అధ్యాయము - విషయసూచిక

# అథ అష్టాదశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే సప్తసప్తతిర్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం.విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ। యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౬౨౦.వాజశ్చ మ ఇత్యస్య దేవా ఋషయః, అగ్నిర్దేవతా, శక్వరీఛన్దః, ధైవతః స్వరః.

తత్రాదౌ మనుష్యైర్యజ్ఞేన కిం కిం సాధనీయమిత్యాహ.

మానవులు యజ్ఞముతో యే మేమి సాధించవలయును?

౬౨౦ వాజశ్చ మే ప్రసవశ్చ మే ప్రయతిశ్చ మే ప్రసితిశ్చ మే ధీతిశ్చ మే

క్రతుశ్చ మే స్వరశ్చ మే శ్లోకశ్చ మే శ్రవశ్చ మే శ్రుతిశ్చ మే

జ్యోతిశ్చ మే స్వశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥౧॥

**ప.విః**–వాజః, చ, మే, ప్రసవ ఇతి ప్ర + సవః, చ, మే, ప్రయతిరితి ప్ర + యతిః, చ, మే, ప్రసితి రితి ప్ర + సితిః, చ, మే, ధీతిః, చ, మే, క్రతుః, చ, మే, స్వరః, చ, మే, శ్లోకః, చ, మే, శ్రవః, చ, మే, శ్రుతిః, చ, మే, జ్యోతిః, చ, మే, స్వరితి స్వః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్ ॥౧॥

పదార్థః :- (వాజః) అన్నమ్ (చ) విజ్ఞానాదికమ్ (మే) మమ (ప్రసవః) ఐశ్వర్యమ్ (చ) తత్సాధనాని (మే) (ప్రయతిః) ప్రయతతే యేన సః, అత్ర సర్వధాతుభ్య... ఇత్యౌణాదిక ఇప్రత్యయః (చ) తత్సాధనమ్ (మే) ప్రసితిః (ప్రబన్ధః) (చ) రక్షణమ్ (మే) (ధీతిః) ధారణా (చ) ధ్యానమ్ (మే) (క్రతుః) ప్రజ్ఞా (చ) ఉత్సాహః (మే) (స్వరః) స్వయం రాజమానం స్వాతంత్ర్యమ్ (చ) పరం తపః (మే) (శ్లోకః) ప్రశంసితా శిక్షితా వాక్. శ్లోక ఇతి వాఙ్ నా.. నిఘం. ౧.౧౧. (చ) వక్తృత్వమ్ (మే) (శ్రవః) శ్రవణమ్ (చ) శ్రావణమ్ (మే) (శ్రుతిః) శృణ్వన్తి సకలా విద్యా యయా సా వేదాఖ్యా (చ) తదనుకూలా స్మృతిః (మే) (జ్యోతిః)

విద్యాప్రకాశః (చ) అన్యస్మై విద్యాప్రకాశనమ్ (మే) (స్వః) సుఖమ్ (చ) పరమసుఖమ్ (మే) (యజ్ఞేన) పూజనీయేన పరమేశ్వరేణ జగదుపకారకేణ వ్యవహారేణ వా (కల్పన్తామ్) సమర్థా భవన్తు.॥౧॥

**అన్వయః** :-మే వాజశ్చ మే ప్రసవశ్చ మే ప్రయతిశ్చ మే ప్రసితిశ్చ మే ధీతిశ్చ మే క్రతుశ్చ మే స్వరశ్చ మే శ్లోకశ్చ మే శ్రవశ్చ మే శ్రుతిశ్చ మే జ్యోతిశ్చ మే స్వశ్చ యజ్ఞేన కల్పన్తామ్.॥౧॥

**భావార్థః** :-హే మనుష్యాః! యుష్మాభిరన్నాద్యేన సర్వసుఖాయ యజ్ఞ ఉపాసనీయః సాధనీయశ్చ యతః సర్వేషాం మనుష్యాదీనాముున్నతిర్భవేత్.॥౧॥

**పదార్థము** :-(మే) నాయొక్క (వాజః) అన్నము (చ) విశేషజ్ఞానము (మే) నాయొక్క (ప్రసవః) ఐశ్వర్యము (చ) మరియు దాని సాధనము (మే) నాయొక్క (ప్రయతిః) చక్కని వ్యవహారములు సమకూరు (చ) మరియు దాని సాధనములు (మే) నాయొక్క (ప్రసితిః) ప్రబంధములు (చ) మరియు రక్షణ (మే) నాయొక్క (ధీతిః) ధారణము (చ) మరియు ధ్యానము (మే) నా (క్రతుః) శ్రేష్ఠబుద్ధి (చ) మరియు ఉత్సాహము (మే) నాయొక్క (స్వరః) స్వతంత్రత (చ) ఉత్తమతేజము (మే) నాయొక్క (శ్లోకః) పదరచన నొనర్చువాణి (చ) వక్తృత్వము (మే) నా (శ్రవః) శ్రవణము [వినుట] (చ) మరియు వినిపించుట (మే) నాయొక్క (శ్రుతిః) సకల విద్యలను దెలిసికొన [విన] దగిన ఆ వేదవిద్యలు (చ) మరియు దానికనుకూలమగు శ్రుతి [ధర్మశాస్త్రము] (మే) నాయొక్క (జ్యోతిః) విద్యాప్రకాశము (చ) మరియు ఇతరులకు విద్యాప్రకాశమును గలిగించుట (మే) నా (స్వః) సుఖము (చ) మరియు ఇతరుల సుఖము (యజ్ఞేన) సేవించదగిన పరమేశ్వరుని జగదుపకారక వ్యవహారములచే (కల్పన్తామ్) సమర్థవంతములగుగాక.॥౧॥

**భావార్థము** :- ఓ మానవులారా! మీరు అన్నము మున్నగు పదార్థములచే సకలప్రాణుల సుఖముకొరకు ఈశ్వరోపాసన మరియు జగదుపకార వ్యవహారములను సాధించవలయును. దానివల్ల సమస్త మానవాది ప్రాణుల ఉన్నతియగును.॥౧॥

1.May my food and my prosperity, my exertion and my influence, my thought and my mental power, my independence and my speech, my hearing and my vedic knowledge, the light of my learning and my pleasure prosper through the contemplation of Adorable God, and the performance of philanthropic deeds for the good of humanity.

౧౮౨. ప్రాణశ్చేత్యస్య దేవా ఋషయః, ప్రజాపతిర్దేవతా, అతిజగతీఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౨ ప్రాణశ్చ మేఽపానశ్చ మే వ్యానశ్చ మేఽసుశ్చ మే చిత్తం చ మఽ
ఆధీతం చ మే వాక్ చ మే మనశ్చ మే చక్షుశ్చ మే శ్రోత్రం చ
మే దక్షశ్చ మే బలం చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥౨॥

**ప.వి:-** ప్రాణః, చ, మే, అపాన ఇత్యప + అనః, చ, మే, వ్యాన ఇతి వి + అనః, చ, మే, అసుః, చ, మే, చిత్తమ్, చ, మే, ఆధీతమిత్యా + ధీతమ్, చ, మే, వాక్, చ, మే, మనః, చ, మే, చక్షుః, చ, మే, శ్రోత్రమ్, చ, మే, దక్షః, చ, మే, బలమ్, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్॥౨॥

**పదార్థః :-** (ప్రాణః) హృదిస్థో వాయుః (చ) ఉదానః కణ్ఠదేశస్థః పవనః (మే) (అపానః) నాభేరధోగామీ వాతః (చ) సమానో నాభిసంస్థితో వాయుః (మే) (వ్యానః) శరీరస్య సర్వేషు సంధిషు వ్యాప్తః పవనః (చ) ధనంజయః (మే) (అసుః) నాగాదిర్మరుత్ (చ) అన్యే వాయవః (మే) (చిత్తమ్) స్మృతిః (చ) బుద్ధిః (మే) (ఆధీతమ్) సమన్తాద్ధృతిర్నిశ్చయవృత్తిః (చ) రక్షితమ్ (మే) (వాక్) వాణీ (చ) శ్రవణమ్ (మే) (మనః) సంకల్పవికల్పాత్మికా వృత్తిః (చ) అహంకారః (మే) (చక్షుః) చక్షే పశ్యామి యేన తన్నేత్రమ్ (చ) ప్రత్యక్షప్రమాణమ్ (మే) (శ్రోత్రమ్) శృణోమి యేన తత్ (చ) ఆగమప్రమాణమ్ (మే) (దక్షః) చాతుర్యమ్ (చ) సామయికం భానమ్ (మే) (బలమ్) (చ) పరాక్రమః (మే) (యజ్ఞేన) ధర్మానుష్ఠానేన (కల్పన్తామ్).॥౨॥

**అన్వయః :-** మే ప్రాణశ్చ మేఽపానశ్చ మే వ్యానశ్చ మేఽసుశ్చ మే చిత్తం చ మే ఆధీతం చ మే వాక్ చ మే మనశ్చ మే చక్షుశ్చ మే శ్రోత్రం చ మే దక్షశ్చ మే బలం చ మే యజ్ఞేన కల్పన్తాం సమర్థా భవన్తు.॥౨॥

**భావార్థః :-** మనుష్యాః ససాధనాన్ ప్రాణాదీన్ ధర్మానుష్ఠానాయ నియోజయన్తు.॥౨॥

**పదార్థము :-** (మే) నాయొక్క (ప్రాణః) హృదయస్థ జీవనమూలమగు వాయువు (చ) మరియు కంఠమందుండు పవనము (మే) నాయొక్క (అపానః) నాభినుండి క్రిందికి వెళ్ళు (చ) మరియు నాభియందు నిలిచియుండు పవనము (మే) నాయొక్క (వ్యానః) శరీరసంధులందు వ్యాప్తమైయున్న (చ) శరీరస్థరక్తమును వృద్ధిపరచు ధనంజయవాయువు (మే) నాయొక్క (అసుః) నాగము మున్నగు ప్రాణభేదములు (చ) మరియు ఇతర పవనములు (మే) నాయొక్క (చిత్తమ్) స్మృతి అనగా జ్ఞాపకశక్తి (చ) మరియు బుద్ధి (మే) నాయొక్క (ఆధీతమ్) చక్కగా దృఢపరచుకొనిన నిశ్చితజ్ఞానము (చ) మరియు రక్షించుకొనబడిన విషయము (మే) నాయొక్క (వాక్) వాణి (చ) మరియు వినుట (మే) నాయొక్క (మనః) సంకల్పవికల్పరూపమగు అంతఃకరణవృత్తి (చ) అహంకారవృత్తి (మే) నాయొక్క (చక్షుః) నేను చూచు నేత్రములు (చ) మరియు ప్రత్యక్ష ప్రమాణము (మే) నాయొక్క (శ్రోత్రమ్) నేను వినునట్టి కర్ణములు (చ) మరియు ప్రతి విషయముపై వేదప్రమాణము (మే) నాయొక్క (దక్షః) దక్షత [చాతుర్యము] (చ) మరియు తాత్కాలిక స్ఫురణశక్తి (మే) నా (బలమ్) బలము (చ) మరియు పరాక్రమము ఈ సర్వము (యజ్ఞేన) ధర్మానుష్ఠానముద్వారా (కల్పన్తామ్) సమర్థవంతము లగుగాక!॥౨॥

౧౦౦౪ విశ్వస్య మూర్ధన్నధి తిష్ఠసి శ్రితః సముద్రే తే హృదయమప్స్వాయురపో
దత్తోదధిం భిన్త। దివస్పర్జన్యాదన్తరిక్షాత్పృథివ్యాస్తతో నో వృష్ట్యావ॥౫౫॥

ప.వి:–విశ్వస్య, మూర్ధన్, అధి, తిష్ఠసి, శ్రితః, సముద్రే, తే, హృదయమ్, అప్సు, ఆయుః, అపః, దత్త, ఉదధిమిత్యుద + ధిమ్, భిన్త, దివః, పర్జన్యాత్, అన్తరిక్షాత్, పృథివ్యాః, తతః, నః, వృష్ట్యా, అవ ॥౫౫॥

పదార్థః :-(విశ్వస్య) సర్వస్య జగతః (మూర్ధన్) మూర్ధని (అధి) ఉపరి (తిష్ఠసి) (శ్రితః) (సముద్రే) అన్తరిక్షవద్వ్యాప్తే పరమేశ్వరే (తే) తవ (హృదయమ్) (అప్సు) ప్రాణేషు (ఆయుః) జీవనమ్ (అపః) ప్రాణాన్ (దత్త) దదాసి (ఉదధిమ్) ఉదకధారకం సాగరమ్ (భిన్త) భినత్సి (దివః) ప్రకాశాత్ (పర్జన్యాత్) మేఘాత్ (అన్తరిక్షాత్) ఆకాశాత్ (పృథివ్యాః) భూమేః (తతః) తస్మాత్ (నః) (వృష్ట్యా) (అవ) రక్ష ॥౫౫॥

**అన్వయః** :-హే విద్వన్! యస్త్వం విశ్వస్య మూర్ధన్ శ్రితః సూర్య ఇవాధితిష్ఠసి యస్య తే సముద్రే హృదయమప్స్వాయురస్తి స త్వమపో దత్తోదధిం భిన్త యతః సూర్యో దివోఽన్తరిక్షాత్పర్జన్యాత్పృథివ్యా వృష్ట్యా సర్వానవతి తతో నోఽస్మానవ.॥ ౫౫ ॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యవత్సుఖవర్షకా ఉత్తమాచారిణో భవన్తి తే సర్వాన్ సుఖినః కర్తుం శక్నువన్తి ॥ ౫౫ ॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! నీవు ఏ (విశ్వస్య) విశ్వమంతటి (మూర్ధన్) శిరముపై (శ్రితః) విరాజమానమైయున్న సూర్యునివలె (అధి, తిష్ఠసి) అధికారమును పొందియున్నావో (తే) నీయొక్క (సముద్రే) అంతరిక్షమువలె వ్యాపకమైయున్న పరమేశ్వరునియందు (హృదయమ్) మనస్సును (అప్సు) ప్రాణములందు (ఆయుః) జీవము గలదో, అట్టి (అపః) ప్రాణములు (దత్త) ఇచ్చెదవో (ఉదధిమ్) సముద్రమును (భిన్తు) భేదనమొనర్చెదవో, దేనిచే సూర్యుడు (దివః) ప్రకాశము (అన్తరిక్షమ్) ఆకాశము (పర్జన్యాత్) మేఘము మరియు (పృథివ్యాః) భూమినుండి (వృష్ట్యా) వర్షముయొక్క యోగముచే సమస్త చరాచర ప్రాణుల రక్షణ యొనర్చుచున్నాడో (తతః) అందుచే అనగా సూర్యునివలె (నః) మమ్ము (అవ) రక్షణ చేయుము. ॥౫౫॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యునివలె సుఖములను వర్షింపజేయు మరియు ఉత్తమ కర్మలనొనర్చు మనుష్యులు మాత్రమే సకలప్రాణులకు సుఖముల నీయగలుగుదురు. ॥౫౫॥

55.O learned person, like the sun thou standest at the head of the whole world. Thy heart is fixed on God. Spend thy life for the betterment of the people. Preach noble deeds and knowledge. Advance irrigation by cutting canals out of rivers. Help us with rain sent from thy sky, cloud, firmament, earth or any other source of water!.

౧౦౦౫. ఇష్ట ఇత్యస్య గాలవ ఋషిః, యజ్ఞో దేవతా ఆర్ష్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౦౫ ఇష్టో యజ్ఞో భృగుభిరాశీర్దా వసుభిః ।

తస్య న ఇష్టస్య ప్రీతస్య ద్రవిణేహా గమేః॥౫౬॥

ప.వి:-ఇష్టః, యజ్ఞః, భృగుభిరితి భృగు + భిః, ఆశీర్దా ఇత్యాశీః + దాః, వసుభిరితి వసు + భిః, తస్య, నః, ఇష్టస్య, ప్రీతస్య, ద్రవిణ, ఇహ, ఆ, గమేః.॥౫౬॥

**పదార్థః** :- (ఇష్టః) కృతః (యజ్ఞః) యష్టుమర్హః (భృగుభిః) పరిపక్వవిజ్ఞానైః (ఆశీర్దాః) యః ఇచ్ఛాసిద్ధిం దదాతి (వసుభిః) ప్రాథమకల్పికైర్విద్వద్భిః (తస్య) (నః) అస్మాకమ్ (ఇష్టస్య) (ప్రీతస్య) కమనీయస్య (ద్రవిణ) ధనమ్. అత్ర సుపాం సులుగితి విభక్తేర్లుక్ (ఇహ) సంసారే (ఆ,గమేః) సమన్తాద్ గచ్ఛ. వాచ్ఛన్దసి సర్వే విధయో భవన్తీతి ఛత్వాభావః.॥౫౬॥

**అన్వయః** :- హే విద్వన్! యో వసుభిర్భృగుభిరాశీర్దా యజ్ఞ ఇష్టస్తస్యేష్టస్య ప్రీతస్య యజ్ఞస్య సకాశాదిహ త్వన్నో ద్రవిణ ఆ గమేః.॥౫౬॥

**భావార్థః** :- యే విద్వద్వత్ ప్రయతన్తే త ఇహ పుష్కలాం శ్రియమాప్నువన్తి.॥౫౬॥

**పదార్థము** :-ఓ విద్వాంసుడా! ఏ (భృగుభిః) పరిపూర్ణ విజ్ఞానులు (వసుభిః) ప్రథమశ్రేణికి చెందిన విద్వాంసులు (ఆశీర్దాః) ఇచ్ఛాసిద్ధిని గలిగించువారు (యజ్ఞః) యజ్ఞముల (ఇష్టః) నొనర్చెదరో (తస్య)అట్టి (ఇష్టస్య) చేయబడిన (ప్రీతస్య) మనోహర యజ్ఞములద్వారా (ఇహ) ఈ ప్రపంచములో నీవు (నః) మాకు (ద్రవిణ) ధనమును (ఆ,గమేః) ప్రాప్తింపగజేయుము. ॥౫౬॥

**భావార్థము** :- విద్వాంసులవలె ఎవరు చక్కని ప్రయత్నముల, పురుషార్థముల నొనర్చెదరో, వారు మాత్రమే ధనప్రాప్తిని పొందుదురు.॥౫౬॥

56.O learned person, desire-fulfilling sacrifice (yajna) has been performed by hghly learned persons and by Vasu Brahmcharis. With this well performed and beloved sacrifice accept thou our Dakshina!.

౧౦౦౬. ఇష్ట ఇత్యస్య గాలవ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీగాయత్రీ ఛందః, షడ్జః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౦౬ ఇష్టోఽఅగ్నిరాహుతః పిపర్తు నఽఇష్టగ్ంహవిః।
స్వగేదన్దేవేభ్యో నమః।౫౭॥

ప.విః- ఇష్టః, అగ్నిః, ఆహుత ఇత్యాహుతః, పిపర్తు, నః, ఇష్టమ్, హవిః, స్వగేతి స్వ + గా, ఇదమ్, దేవేభ్యః, నమః ।౫౭॥

**పదార్థః** :- (ఇష్టః) సత్కృత ఆహుతిభిర్వర్ధితో వా (అగ్నిః) సభాద్యధ్యక్షో విద్వాన్ పావకో వా (ఆహుతః) సమన్తాత్ తర్పితో హుతో వా (పిపర్తు) పాలయతు పూరయతు వా (నః) అస్మానస్మాకం వా (ఇష్టమ్) సుఖం తత్సాధనం వా (హవిః) హవిషా. సంస్కృతద్రవ్యేణ విభక్తివ్యత్యయః (స్వగా) యత్స్వాన్ గచ్ఛతి ప్రాప్నోతి తత్ స్వగా. అత్ర విభక్తేః సుపాం సులుగిత్యాకారాదేశః (ఇదమ్) (దేవేభ్యః) విద్వద్భ్యః (నమః) అన్నం సత్కారో వా.।౫౭॥

**అన్వయః** :- హవిరాహుత ఇష్టోఽగ్నిర్న ఇష్టం పిపర్తు నః పిపర్తు వా ఇదం స్వగా నమో దేవేభ్యోఽస్తు.।౫౭॥

**భావార్థః** :- మనుష్యైరగ్నౌ యత్ సుసంస్కృతం ద్రవ్యం హూయతే యదిహ బహ్వన్నకారి జాయతేఽతోఽత్ర విద్వదాదీనాం సత్కారః కర్తవ్యః.।౫౭॥

**పదార్థము** :-(హవిః) సంస్కరించబడిన పదార్థములతో (ఆహుతః) ఉత్తమముగ తృప్తి లేక హవనమొనర్చబడిన (ఇష్టః) సత్కరించబడిన లేక ఆహుతులచే పెంపొందించబడిన (అగ్నిః) ఈ సభలు మున్నగు వాని అధ్యక్షులగు విద్వాంసులు లేక అగ్ని (నః) మాయొక్క సుఖముల లేక సుఖసాధనముల (పిపర్తు) పూర్ణపరచెదరుగాక లేక మా రక్షణ నొనర్తురుగాక! (ఇదమ్) ఇట్టి (స్వగా) మేము పొందుచున్న (నమః) అన్నము లేక సత్కారము (దేవేభ్యః) విద్వాంసులకును చెందునుగాక! ।౫౭॥

**భావార్థము** :- మనుష్యులు అగ్నియందు శ్రేష్ఠముగా సంస్కరించి చేయబడిన పదార్థములచే హోమమొనర్చినచో ఈ జగమునందు అన్నమును విరివిగా ఉత్పన్నపరచినవారగుదురు. కావుననే వానిచే విద్వాంసులు మున్నగు సత్పురుషులను సత్కరించుచుండవలెను.।౫౭॥

57.May fire developed through Homa with oblations and purified substances, enhance our happiness. May this food acquired by us be offered to the sages.

౧౦౦౨. యదేత్యస్య విశ్వకర్మా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ విద్వద్విషయే సత్యనిర్ణయమాహ. విద్వాంసుల విషయములో సత్యనిర్ణయము.

౧౦౦౨ యదాకూతాత్సమసుస్రోద్ధృదో వా మనసో వా సంభృతం చక్షుషో

వా। తదనుప్రేత సుకృతాము లోకం యత్రఽఋషయో

జగ్ముః ప్రథమజాః పురాణాః ॥౫౮॥

ప.వి:-యత్, ఆకూతాదిత్యా + కూతాత్, సమసుస్రోదితి సమ్ + అసుస్రోత్, హృదః, వా, మనసః, వా, సంభృతమితి సమ్ + భృతమ్, చక్షుషః, వా, తత్, అనుప్రేతేత్యను + ప్రేత, సుకృతామితి సుకృతామ్, ఊఇ ఇత్యూం, లోకమ్, యత్ర, ఋషయః, జగ్ముః, ప్రథమజాః, పురాణాః ॥౫౮॥

**పదార్థః** :- (యత్) (ఆకూతాత్) ఉత్సాహాత్ (సమసుస్రోత్) సమ్యక్ ప్రాప్నుయాత్. అత్ర బహులం ఛన్దసీతి శపః శ్లుః (హృదః) ఆత్మనః (వా) ప్రాణాత్ (మనసః) సంకల్పవికల్పాత్మకాత్ (వా) బుద్ధ్యాదేః (సంభృతమ్) సమ్యగ్ ధృతమ్ (చక్షుషః) ప్రత్యక్షాదేరిన్ద్రియోత్పన్నాత్ (వా) శ్రోత్రాదిభ్యః (తత్) (అనుప్రేత) ఆనుకూల్యేన ప్రాప్నుత (సుకృతామ్) ముముక్షూణామ్ (ఉ) (లోకమ్) దర్శనసుఖసంఘాతం మోక్షపదం వా (యత్ర) యస్మిన్ (ఋషయః) వేదవిద్యాపురస్సరాః పరమయోగినః (జగ్ముః) గతాః (ప్రథమజాః) అస్మదాదౌ జాతాః (పురాణాః) అస్మదపేక్షయాం ప్రాచీనాః. ॥౫౮॥

**అన్వయః** :-హే సత్యాసత్యజిజ్ఞాసవో జనాః! యూయం యదాకూతాద్ధృదో వా మనసో వా చక్షుషో వా సంభృతమస్తి తత్సమసుస్రోదతః ప్రథమజాః పురాణా ఋషయో యత్ర జగ్ముస్తం సుకృతాము లోకమను ప్రేత. ॥౫౮॥

**భావార్థః** :- యదా మనుష్యాః సత్యాసత్యనిర్ణయం జిజ్ఞాసేయుస్తదా యద్యదీశ్వరగుణకర్మస్వభావాత్ సృష్టిక్రమాత్ప్రత్యక్షాదిప్రమాణేభ్య ఆప్తాచారాదాత్మమనోభ్యామనుకూలం స్యాత్తత్తత్సత్యమితరదసత్యమితి నిశ్చినుయుర్య ఏవం ధర్మం పరీక్ష్యాచరన్తి తేఽతి సుఖం ప్రాప్నువన్తి. ॥౫౮॥

**పదార్థము :-** సత్యాసత్యముల జ్ఞానమును గోరు మానవులారా! మీరు (యత్) ఏ (ఆకూతాత్) ఉత్సాహము (హృదః) ఆత్మ (వా) లేక ప్రాణము (మనసః) మనస్సు (వా) లేక బుద్ధి మున్నగు మరియు (చక్షుషః) నేత్రములు మున్నగు ఇంద్రియములచే నుత్పన్నమైన ప్రత్యక్షాది ప్రమాణములద్వారా (వా) లేక కర్ణములు మున్నగు ఇంద్రియములద్వారా (సంభృతమ్) చక్కగా ధారణమొనర్చిన, అనగా నిశ్చయముగా ఉన్నదున్నట్లు తెలిసికొనిన చూచిన మరియు అనుమానముచే దృఢపరచుకొనినదై యున్నదో (తత్) అట్టిది (సమసుస్రోత్) చక్కగా ప్రాప్తించుగాక! ఈ కారణమున (ప్రథమజాః) మాకన్నముందుగా నుత్పన్నమైన (పురాణాః) మాకన్న ప్రాచీనులు (ఋషయః) వేదవిద్యల నెరిగిన పరమయోగులగు మహర్షులు (యత్ర) ఎచ్చటికి (జగ్ముః) చేరుదురో (సుకృతామ్) అట్టి సుకృతి యగు మోక్షమును గోరు సజ్జనులు (ఉ) మాత్రమే (లోకమ్) ప్రత్యక్ష సుఖసమూహము లేక మోక్షపదమును (అనుప్రేత) అనుకూలతతో చేరుదురుగాక! ॥౫౮॥

**భావార్థము :-** మానవులు సత్యాసత్య నిర్ణయ జ్ఞానమును గోరునప్పుడు పరమేశ్వరుని ఏ యే గుణ కర్మ స్వభావములచే సృష్టిక్రమము ప్రత్యక్షము మున్నగు ఎనిమిది విధములగు ప్రమాణములద్వారా శ్రేష్ఠులగు సజ్జనుల ఆచారవిచారములద్వారా ఆత్మ మరియు మనస్సునకు అనుకూలమైనది సత్యమనియు మరియు దానికి భిన్నమైనది అసత్యమనియు నిశ్చయించవలెను. ఇట్టిపరీక్షలద్వారా ధర్మాచరణము నొనర్చువారు మాత్రమే అత్యంత సుఖములను పొందగలుగుదురు. ॥౫౮॥

58.O discriminators between truth and untruth; hold fast the knowledge ye have gathered through exertion, soul-force, control of breath, mind, intellect, eyes, and ears. Follow the path of the aspirants after salvation where have gone the first-born ancient sages!.

౧౦౦౮. ఏతమిత్యస్య విశ్వకర్మా ఋషిః, ప్రజాపతిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౦౮ ఏతꣳసధస్థ పరి తే దదామి యమావహాచ్ఛేవధిం జాతవేదాః।

అన్వాగన్తా యజ్ఞపతిర్వోऽ అత్ర తꣳస్మ జానీత పరమే వ్యోమన్ ॥౫౯॥

ప.విః- ఏతమ్, సధస్థేతి సధऽస్థ, పరి, తే, దదామి, యమ్, ఆవహాదిత్యాऽవహాత్, శేవధిమితి శేవ + ధిమ్, జాతవేదా ఇతి జాత + వేదాః, అన్వాగన్తేత్యనుऽ ఆ + గన్తా, యజ్ఞపతిరితి యజ్ఞ + పతిః, వః, అత్ర, తమ్, స్మ, జానీత, పరమే, వ్యోమన్నితి వి+ ఓమన్॥౫౯॥

**పదార్థః** :-(ఏతమ్) పూర్వోక్తమ్ (సధస్థ) సమానస్థాన (పరి) సర్వతః (తే) తుభ్యమ్ (దదామి) (యమ్) (ఆవహాత్) సమన్తాత్ప్రాప్నుయాత్ (శేవధిమ్) శేవం సుఖం ధీయతే యస్మింస్తం నిధిమ్ (జాతవేదాః) జాతప్రజ్ఞో వేదార్థవిత్ (అన్వాగన్తా) ధర్మమన్వాగచ్ఛతి. (యజ్ఞపతిః) యజ్ఞస్య పాలక ఇవ వర్తమానః (వః) యుష్మభ్యమ్ (అత్ర) (తమ్) (స్మ) ఏవ (జానీత)(పరమే) ప్రకృష్టే (వ్యోమన్) వ్యోమ్న్యాకాశే.॥౫౯॥

**అన్వయః** :-హే ఈశ్వరం జిజ్ఞాసవో మనుష్యాః! హే సధస్థ! చ జాతవేదా యజ్ఞపతిర్యం శేవధిమావహా దేతమత్ర పరమే వ్యోమన్ వ్యాప్తం పరమాత్మానమహం తే యథా పరిదదామ్యన్వాగన్తాఽహం యం వో యుష్మభ్యముపదిశాని స్మ తం యూయం విజానీత.॥౫౯॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యా విద్వదనుకూలమాచరన్తి తే సర్వవ్యాపిన మన్తర్యామిణమీశ్వరం ప్రాప్తుమర్హన్తి.॥౫౯॥

**పదార్థము** :- ఈశ్వరజ్ఞానము నాకాంక్షించు జిజ్ఞాసువులారా! మరియు (సధస్థ) సమాన స్థానముగల మనుష్యులారా! (జాతవేదాః) వేదార్థజ్ఞానము నెరుగువారు (యజ్ఞపతి) యజ్ఞపాలనమొనర్చువారివలెనున్న పురుషుని (యమ్) ఏ (శేవధిమ్) సుఖనిధియగు పరమేశ్వరుని (ఆవహాత్) చక్కగా ప్రాప్తించుకొనిన (ఏతమ్) ఈతనికి (అత్ర) ఇట్టి (పరమే) పరమోత్తమమగు (వ్యోమన్) ఆకాశము మరియు సర్వత్రవ్యాపకమై యున్న పరమేశ్వరుని నేను (తే) నీకొరకు ఎట్లు (పరి, దదామి) అన్నివిధముల ఇచ్చుచున్నానో, ఉపదేశించుచున్నానో (అన్వాగన్తా) ధర్మానుకూలముగ నడచుకొను నేను (వః) సుఖములకొరకు ఏ పరమాత్మను గూర్చిన (స్మ) ఉపదేశమొనర్చుచున్నానో (తమ్) దానిని మీ రెల్లరును (జానీత) తెలిసికొనుడు.॥౫౯॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసుల ననుసరించి అనుకూలాచరణ మొనర్చు మనుష్యులు సర్వవ్యాపి, అంతర్యామి యగు పరమాత్మను పొందుటకు తగినవారగుదురు. ॥౫౯॥

59.Ye seekers after God, and common run of mankind, I, the knower of the meanings of the vedas, and guardian of sacrifice, having realised God, the treasure of happiness, preach unto ye, the true nature of God pervading this highest heaven. Know Him about Whom, I, the follower of religion, instruct thee!.

౧౦౦౯. ఏతమిత్యస్య విశ్వకర్మర్షిః, ప్రజాపతిర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౦౯ ఏతం జానాథ పరమే వ్యోమన్ దేవాః సధస్థా విద రూపమస్య ।
యదాగచ్ఛాత్ పథిభిర్దేవయానైరిష్టాపూర్తే కృణవాథావిరస్మై ॥౬౦॥

**ప. విః**-ఏతమ్, జానాథ, పరమే, వ్యోమన్నితి వి + ఓమన్, దేవాః, సధస్థా ఇతి సధ +స్థాః, విద, రూపమ్, అస్య, యత్, ఆగచ్ఛాదిత్యా + గచ్ఛాత్, పథిభిరితి పథిభిః, దేవయానైరితి దేవ + యానైః, ఇష్టాపూర్తే ఇతీష్టా + పూర్తే, కృణవాథ, ఆవిః, అస్మై ॥౬౦॥

**పదార్థః** :-(ఏతమ్) పరమాత్మానమ్ (జానాథ) విజానీత లేట్‌ప్రయోగోऽయమ్ (పరమే) (వ్యోమన్) (దేవాః) విద్వాంసః (సధస్థాః) సహస్థానాః (విద) బుద్ధ్యధ్వమ్ (రూపమ్) సచ్చిదానన్దస్వరూపమ్ (అస్య) (యత్) (ఆగచ్ఛాత్) సమన్తాత్ ప్రాప్నుయాత్ (పథిభిః) మార్గైః (దేవయానైః) దేవా ధార్మికా విద్వాంసో గచ్ఛన్తి యేషు తైః (ఇష్టాపూర్తే) ఇష్టం శ్రౌతం కర్మ చ పూర్తం స్మార్తం కర్మ చ తే (కృణవాథ) కురుథ (ఆవిః) ప్రాకట్యే (అస్మై) పరమాత్మనే.॥౬౦॥

**అన్వయః** :-హే సధస్థా దేవాః! యూయం పరమే వ్యోమన్ వ్యాప్తమేతం జానాథాస్య రూపం విదయద్దేవ యానైః పథిభిరాగచ్ఛాదస్మై పరమాత్మనే ఇష్టాపూర్తే ఆవిః కృణవాథ.॥౬౦॥

**భావార్థః** :-సర్వే మనుష్యా విద్వత్సఙ్గయోగాభ్యాసధర్మాచారైః పరమేశ్వరమవశ్యం జానీయుర్నో చేదిష్టాపూర్తే సాధయితుం న శక్నుయుః. న చ ముక్తిం ప్రాప్నుయుః.॥౬౦॥

**పదార్థము** :-(సధస్థాః) ఒకేచోటకలిసియుండు (దేవాః) విద్వాంసులారా! మీరు (పరమే) పరమోత్తముడు (వ్యోమన్) ఆకాశమందు వ్యాప్తమైయున్న (ఏతమ్) ఈ పరమాత్మను (విద) ఎరుగుడు (యత్) ఆ సచ్చిదానంద లక్షణుడగు పరమేశ్వరుని (దేవయానైః) ధార్మిక విద్వాంసుల (పథిభిః) మార్గములద్వారా మానవులు (ఆగచ్ఛాత్) చక్కగా ప్రాప్తించుకొందురుగాక! (అస్మై) ఇట్టి పరమేశ్వరునికొరకు (ఇష్టాపూర్తే) వేదోక్తముగు యజ్ఞము మున్నగు కర్మలు మరియు వాని సాధకముగు స్మార్తకర్మలను (ఆవిః) ప్రకాశము [ఆవిష్కారము] (కృణవాథ) చేయుచుండుడు.॥౬౦॥

**భావార్థము** :- మానవులెల్లరును విద్వాంసుల సత్సంగములు, యోగాభ్యాసము మరియు ధర్మాచరణముల ద్వారా అవశ్యముగా పరమేశ్వరుని దెలిసికొనవలెను. అట్లు జేయజాలకున్నచో యజ్ఞము మున్నగు శ్రౌత, స్మార్త కర్మలను సాధించజాలరు. మరియు ముక్తినికూడా పొందలేరు.॥౬౦॥

60.O learned person living together, know this God spread in the highest heaven, and realise His true nature. He, who reaches Him through yogic paths of the sages, should reveal to Him pious acts pertaining to vedic injunctions and public utility!.

౧౦౧౧. ఉద్బుధ్యస్వేత్యస్య గాలవః ఋషిః, ప్రజాపతిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునః స ఏవ విషయః ప్రోచ్యతే. మరల నా విషయమే.

౧౦౧౦ ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టాపూర్తే సꣳసృజేథామయం చ।
అస్మిన్త్సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥౬౧॥

**ప.వి:-** ఉత్, బుధ్యస్వ, అగ్నే ప్రతి, జాగృహి, త్వమ్, ఇష్టాపూర్తే ఇతీష్టా+పూర్తే, సమ్, సృజేథామ్, అయమ్, చ, అస్మిన్, సధస్థ ఇతి సధ + స్థే, అధి, ఉత్తరస్మిన్నిత్యుత్ + తరస్మిన్, విశ్వే, దేవాః, యజమానః, చ, సీదత.॥౬౧॥

**పదార్థః :-** (ఉత్) ఊర్ధ్వమ్ (బుధ్యస్వ) జానీహి (అగ్నే) అగ్నిరివ వర్తమాన పురుష (ప్రతి) (జాగృహి) యజమానం ప్రబోధయావిద్యానిద్రాం పృథక్కృత్య విద్యాయాం జాగరూకం కురు (త్వమ్) (ఇష్టాపూర్తే) ఇష్టం చ పూర్తం చ తే (సమ్) సంసర్గే (సృజేథామ్) నిష్పాదయేతామ్ (అయమ్) బ్రహ్మవిద్యోపదేష్టా (చ) (అస్మిన్) (సధస్థే) సహస్థానే (అధి) ఉపరి (ఉత్తరస్మిన్) ఉత్తమాసనే (విశ్వే) సమగ్రాః (దేవాః) విద్యాయాః కామయితారః (యజమానః) విద్యాప్రదాతా యజ్ఞకర్తా (చ) (సీదత) తిష్ఠత.॥౬౧॥

**అన్వయః :-** హే అగ్నే! త్వముద్బుధ్యస్వ ప్రతి జాగృహి త్వం చాయం ఇష్టాపూర్తే సంసృజేథాం హే విశ్వేదేవా! కృతేష్టాపూర్తో యజమానశ్చ యూయం సధస్థేఽస్మిన్నుత్తరస్మిన్నధి సీదత. ॥౬౧॥

**భావార్థః :-** యే సచేతనా ధీమన్తో విద్యార్థినః స్యుస్తేఽధ్యాపకైః సమ్యగధ్యాపనీయాః స్యుర్యే విద్యాభీప్సవోఽధ్యాపకానుకూలాచరణాః స్యుర్యే చ తదధీనా అధ్యాపకాస్తే పరస్పరం ప్రీత్యా సతతం విద్యోన్నతిం కుర్యు ర్యేఽతోన్యే ప్రశస్తా విద్వాంసః స్యుస్త ఏతేషాం సతతం పరీక్షాం కుర్యుర్యత ఏతే విద్యావర్ధనే సతతం ప్రయతేరꣳస్తథర్త్విగ్యజమానాదయో భవేయుః.॥౬౧॥

**పదార్థము :-** (అగ్నే) అగ్నివంటి ఋత్విగ్వరా! (త్వమ్) నీవు (ఉద్బుధ్యస్వ) లెమ్ము, ప్రబోధమును పొందుము (ప్రతి, జాగృహి) యజమానుని అవిద్యయను నిద్రనుండి విముక్తపరచి విద్యయందు చేతనునిగా జేయుము. నీవు (చ) మరియు (అయమ్) ఈ బ్రహ్మవిద్యనుపదేశించు యజమానుడు మీరిరువురును (ఇష్టాపూర్తే) యజ్ఞసిద్ధికర్మ మరియు దాని సామగ్రిని (సంసృజేథామ్) ఉత్పన్నమొనర్పుడు (విశ్వే) ఓ సమస్త (దేవాః) విద్వాంసులారా! (చ) మరియు (యజమానః) విద్యలనిచ్చు మరియు యజ్ఞముల నొనర్పు యజమానులారా! మీరెల్లరును (అస్మిన్) ఇట్టి (సధస్థే) కలిసి ఒకే స్థానమునందు (ఉత్తరస్మిన్) ఉత్తమాసనములపై (అధి, సీదత) ఆసీనులగుడు.॥౬౧॥

**భావార్థము** :- చైతన్యవంతులు, బుద్ధిశాలురునగు విద్యార్థులను అధ్యాపకులు చక్కగా చదివించవలయును. విద్యల నభ్యసింప కుతూహలముగలవారు చదివించు వారికి అనుకూలముగ నాచరించుచుండవలెను. అధ్యాపకులు, విద్యార్థులు పరస్పరము ప్రీతితో నిరంతరము విద్యలను వృద్ధిపరచవలయును. ఈ అధ్యాపక, విద్యార్థులకన్న వేరైన ఉత్తమ విద్వాంసులగువారు ఈ విద్యార్థులను సదా పరీక్షించుచుండవలెను. దీనివల్ల నీ అధ్యాపక విద్యార్థిజనులు విద్యల నభివృద్ధిపరచుటయందు నిరంతరము ప్రయత్నవెుునర్చవలెను. ఇదేవిధముగ ఋత్విజులు, యజమానులు మరియు సభ్యులగు పరీక్షక విద్వాంసులును యజ్ఞముల నున్నతపరచవలయును. ॥౬౧॥

61.O learned priest, wake up, attain to light, expel the sleep of ignorance from your sacrificer (yajman) and bestow knowledge on him. Together with this sacrificer arrange for the yajna (sacrifice) and collect its materials!.

Let all the learned priests and the sacrificer sit together in the yajna on nice seats.

౧౦౧౧. యేనేత్యస్య దేవశ్రవదేవవాతావృషీ, విశ్వకర్మాగ్ని ర్వా దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునః స ఏవ విషయః ప్రకాశ్యతే. మఱల నా విషయమే.

౧౦౧౧ యేన వహసి సహస్రం యేనాగ్నే సర్వవేదసమ్ ।

తేనేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే ॥౬౨॥

ప. విః- యేన వహసి, సహస్రమ్, యేన, అగ్నే, సర్వవేదసమితి సర్వ + వేదసమ్, తేన ఇమమ్, యజ్ఞమ్, నః, నయ, స్వః, దేవేషు, గన్తవే ॥౬౨॥

**పదార్థః** :- (యేన) అధ్యాపనేన (వహసి) ప్రాప్నోషి (సహస్రమ్) అసంఖ్యమతులం బోధమ్ (యేన) అధ్యయనేన (అగ్నే) అధ్యాపకాధ్యేతర్వా (సర్వవేదసమ్) సర్వే వేదసో వేదా విజ్ఞాయన్తే యస్మిం స్తమ్ (తేన) (ఇమమ్) వక్ష్యమాణమ్ (యజ్ఞమ్) అధ్యయనాధ్యాపనాఖ్యమ్ (నః) అస్మాన్ (నయ) ప్రాప్నుహి ప్రాపయ వా (స్వః) సుఖమ్ (దేవేషు) దివ్యేషు గుణేషు విద్వత్సు వా (గన్తవే) గన్తుం ప్రాప్తుమ్. ॥౬౨॥

**అన్వయః** :- హే అగ్నే! త్వం యేన సహస్రం సర్వవేదసం వహసి ప్రాప్నోషి యేన చ ప్రాపయసి తేనేమం యజ్ఞం నో దేవేషు స్వర్గన్తవే నయ. ॥౬౨॥

**భావార్థః** :- యే ధర్మాచరణనిష్కపటత్వాభ్యాం విద్యాం ప్రయచ్ఛన్తి గృహ్ణన్తి చ త ఏవ సుఖభాగినో భవన్తి. ॥౬౨॥

**పదార్థము :-** (అగ్నే) అధ్యాపక విద్వాంసుడా! (యేన) ఏది చదివించుటచే (సహస్రమ్) వే విధములగు అతులబోధలను (సర్వవేదసమ్) సకల వేదములనెరుగుదానిని (వహసి) పొందుచున్నావో (యేన) ఏది నేర్చిన నీవు ఇతరులకును లభింపజేయు చున్నావో (తేన) దానిచే (ఇమమ్) ఇట్టి (యజ్ఞమ్) చదువుట, చదివించుటయును యజ్ఞములను (నః) మాయందరకును (దేవేషు) దివ్యగుణవంతులగువారు లేక విద్వాంసులందు (స్వర్గన్తవే) సుఖప్రాప్తికొరకు (నయ) చేర్పుము. ।౬౨॥

**భావార్థము :-** ధర్మాచరణము మరియు, నిష్కాపట్యముచే విద్యలను చదివించు మరియు చదువు వారు మాత్రమే సుఖభాగులు గాగలుగుదురు. ।౬౨॥

62.Through teaching one acquires vast knowledge. Through study the teacher and the taught acquire the knowledge of the vedas. Let this process of study and teaching be carried unto us for the attainment of happiness by the learned.

౧౦౧౨. ప్రస్తరేణేత్యస్య విశ్వామిత్ర ఋషిః, యజ్ఞో దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునర్మనుష్యైః క్రియాయజ్ఞః కథం సాధనీయ ఇత్యుపదిశ్యతే.

మానవులు క్రియాయజ్ఞము నెటుల సాధించవలయును?

౧౦౧౨ ప్రస్తరేణ పరిధినా స్రుచా వేద్యా చ బర్హిషా ।

ఋచేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే ।౬౩॥

**ప. విః-** ప్రస్తరేణేతి ప్ర + స్తరేణ, పరిధినేతి పరి + ధినా, స్రుచా, వేద్యా చ, బర్హిషా, ఋచా, ఇమమ్, యజ్ఞమ్, నః, నయ, స్వః, దేవేషు, గన్తవే. ।౬౩॥

**పదార్థః :-** (ప్రస్తరేణ) ఆసనేన (పరిధినా) యః పరితః సర్వతోఽధీతే తేన (స్రుచా) యేన యజ్ఞః సాధ్యతే (వేద్యా) యస్యాం హూయతే తయా (చ) (బర్హిషా) ఉత్తమేన కర్మణా (ఋచా) స్తుత్యా ఋగ్వేదాదినా వా (ఇమమ్) పదార్థమయమ్ (యజ్ఞమ్) అగ్నిహోత్రాదికమ్ (నః) అస్మాన్ (నయ) (స్వః) సాంసారికం సుఖమ్ (దేవేషు) దివ్యేషు పదార్థేషు విద్వత్సు వా (గన్తవే) గన్తుం ప్రాప్తుమ్. ।౬౩॥

**అన్వయః :-** హే విద్వంస్త్వం వేద్యా స్రుచా బర్హిషా ప్రస్తరేణ పరిధినర్చా చేమం యజ్ఞం దేవేషు గన్తవే స్వర్నో నయ. ।౬౩॥

**భావార్థః :-** యే మనుష్యా ధర్మేణ ప్రాప్తైర్ద్రవ్యైర్వేదరీత్యా చ సాఙ్గోపాఙ్గం యజ్ఞం సాధ్నువన్తి తే సర్వప్రాణ్యుపకారిణో భవన్తి. ।౬౩॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! నీవు (వేద్యా) యజ్ఞమునొనర్చునట్టి వేది మరియు (స్రుచా) హోమ మొనర్చు సాధనమగు స్రువచేతను (బర్హిషా) ఉత్తమక్రియ (ప్రస్తరేణ) ఆసనము (పరిధినా) అన్నిదిశలనుండి ధారణమొనర్చగల యీ యజుర్వేదము (చ) మరియు (ఋచా) స్తుతి మరియు ఋగ్వేదాదులద్వారా (ఇమమ్) ఇట్టి పదార్థమయ, అనగా భుజించదగిన ఉత్తమ పదార్థములను హోమమొనర్చుదానియందు (యజ్ఞమ్) అగ్నిహోత్రము మున్నగు యజ్ఞములను (దేవేషు) దివ్యపదార్థముల లేక విద్వాంసులందు (గన్తవే) ప్రాప్తించుటకై (స్వః) ప్రపంచసంబంధ సుఖములను (నః) మాకు (నయ) అందజేయుము.॥౬౩॥

**భావార్థము** :- ధర్మయుక్తముగా పొందినట్టి పదార్థములచే మరియు వేదోక్తముగ సాంగోపాంగముగా యజ్ఞమును సాధించువారు సకలప్రాణులకు ఉపకారకులగుదురు.॥౬౩॥

63.With a handful of Darbha-grass, with the Yajur veda, with spoon, with altar, with nice execution, with the Rig Veda, O learned priest, conduct this sacrifice of ours with the support of the learned for acquiring worldly happiness!.

౧౦౧౩. యద్దత్తమిత్యస్య విశ్వకర్మర్షిః, యజ్ఞో దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

## ౧౦౧౩ యద్దత్తం యత్పరాదానం యత్పూర్తం యాశ్చ దక్షిణాః ।
## తదగ్నిర్వైశ్వకర్మణః స్వర్దేవేషు నో దధత్ ॥౬౪॥

**ప. విః**- యత్, దత్తమ్, యత్, పరాదానమితి పరా + దానమ్, యత్, పూర్తమ్, యాః, చ దక్షిణాః, తత్, అగ్నిః, వైశ్వకర్మణ ఇతి వైశ్వ + కర్మణః, స్వః, దేవేషు, నః, దధత్.॥౬౪॥

**పదార్థః** :-(యత్) (దత్తమ్) సుపాత్రేభ్యః సమర్పితమ్ (యత్) (పరాదానమ్) పరేభ్య ఆదానమ్ (యత్) (పూర్తమ్) పూర్ణాం సామగ్రీమ్ (యాః) (చ) (దక్షిణాః) కర్మానుసారేణ దానాని (తత్) (అగ్నిః) పావక ఇవ గృహస్థో విద్వాన్ (వైశ్వకర్మణః) విశ్వాని సమగ్రాణి కర్మాణి యస్య స ఏవ (స్వః) ఐన్ద్రియం సుఖమ్ (దేవేషు) దివ్యేషు ధర్మ్యేషు వ్యవహారేషు (నః) అస్మాన్ (దధత్) దధాతు.॥౬౪॥

**అన్వయః** :- హే గృహస్థ! త్వయా యద్దత్తం యత్పరాదానం యత్పూర్తం యాశ్చ దక్షిణా దీయన్తే తత్స్వశ్చ వైశ్వకర్మణోఽగ్నిరివ భవాన్ దేవేషు నో దధత్.॥౬౪॥

**భావార్థః** :- యే యాశ్చ! గృహాశ్రమం చికీర్షేయుస్తే పురుషాస్తాః స్త్రియశ్చ వివాహాత్ ప్రాక్ పాగల్భ్యాదిసామగ్రీం కృత్వైవ యువావస్థాయాం స్వయంవరం వివాహం కృత్వా ధర్మేణ దానాదానమానాది వ్యవహారం కుర్యుః.॥౬౪॥

**పదార్థము:**-గృహస్థుడవగు ఓ విద్వాంసుడా! నీవు (యత్) ఏది (దత్తమ్) ఉత్తమ ధర్మాత్ములకిచ్చియున్న లేక (యత్) ఎయ్యది (పరాదానమ్) ఇతరులనుండి పొందిన లేక (యత్) ఏది (పూర్తమ్) పూర్ణసామగ్రి (యాశ్చ) ఎయ్యది కర్మానుసారముగ (దక్షిణాః) దక్షిణలనీయబడునో (తత్) అట్టి సమస్త (స్వః) ఇంద్రియ సుఖములను (వైశ్వకర్మణః) సమస్త కర్మలచే గూడియున్న (అగ్నిః) అగ్నివంటి గృహస్థుడవగు విద్వాంసుడా! నీవు (దేవేషు) దివ్యమగు ధర్మసంబంధ వ్యవహారములందు (నః) మమ్ము (దధత్) స్థాపించుము (స్థిరపరచుము). ।౬౪॥

**భావార్థము** :- గృహస్థాశ్రమము నొనర్చదలచు స్త్రీపురుషులు వివాహమునకు పూర్వమే ప్రగల్భము, అనగా విద్యావినయబలపరాక్రమాదులను పూర్ణమొనర్చుకొని యువావస్థయందు స్వయంవరవిధి ననుసరించి వివాహ మొనర్చుకొని ధర్మయుక్తముగ ఆదాన ప్రదానము, మానసన్మానము మున్నగు వ్యవహారముల నొనర్చవలెను. ।౬౪॥

64.Our gifts, our receiving of charitable grants, our pious works, our fees to priests, may the Omnific learned householder set all this for our happiness in religious usages.

**౧౦౧౪. యత్ర ధారా ఇత్యస్య విశ్వకర్మర్షిః, యజ్ఞో దేవతా, విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.**

పునర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మానవులు ఏమి చేయవలయును?

**౧౦౧౪ యత్ర ధారా అనపేతా మధోర్ఘృతస్య చ యాః।**

**తదగ్నిర్వైశ్వకర్మణః స్వర్దేవేషు నో దధత్ ।౬౫॥**

**ప. విః**-యత్ర, ధారాః, అనపేతా ఇత్యనప + ఇతాః, మధోః, ఘృతస్య, చ, యాః, తత్, అగ్నిః, వైశ్వకర్మణ ఇతి వైశ్వ + కర్మణః, స్వః, దేవేషు, నః, దధత్. ।౬౫॥

**పదార్థః** :-(యత్ర) యజ్ఞే (ధారాః) ప్రవాహాః (అనపేతాః) నాపేతాః పృథగ్భూతాః (మధోః) మధురగుణాన్వితస్య ద్రవ్యస్య (ఘృతస్య) ఆజ్యస్య (చ) (యాః) (తత్) తాభిః (అగ్నిః) పావకః (వైశ్వకర్మణః) విశ్వాన్యఖిలాని కర్మాణి యస్మాత్ స ఏవ (స్వః) సుఖమ్ (దేవేషు) దివ్యేషు వ్యవహారేషు (నః) అస్మభ్యమ్ (దధత్) దధాతి, దధాతేర్లేటో రూపమ్.॥ ౬౫ ॥

**అన్వయః** :-యత్ర మధోర్ఘృతస్య చ యా అనపేతా ధారా విద్వద్భిః క్రియన్తే తద్వైశ్వకర్మణోఽగ్నిర్నో దేవేషు స్వర్దధత్, ॥ ౬౫ ॥

**భావార్థః** :- యే మనుష్యా వేద్యాదికం నిర్మాయ సుగన్ధిమిష్టాదియుక్తం బహుఘృతమగ్నౌ జుహ్వతి తే సర్వాన్ రోగాన్నిహత్యాతులం సుఖం జనయన్తి. ॥ ౬౫ ॥

పదార్థము :- (యత్ర) ఏ యజ్ఞమునందు (మధోః) మధురము మున్నగు గుణయుక్తములగు సుగంధిత పదార్థముల (చ) మరియు (ఘృతస్య) ఘృతమును (యాః) ఏ (అనపేతాః) సంయుక్త (ధారాః) ప్రవాహములను విద్వాంసులొనర్చెదరో (తత్) అట్టి ధారలచే (వైశ్వకర్మణః) సకల కర్మలు జరుగు నిమిత్తము (అగ్నిః) అగ్ని (నః) మాకొరకు (దేవేషు) ద్వివ్యవ్యవహారములందు (స్వః) సుఖములను (దధత్) ధారణమొనర్చును. ॥౬౫॥

భావార్థము :- వేది మున్నగు వాని నేర్పరచుకొని సుగంధ హవనసామగ్రి, మృష్టాన్నయుక్త అధికఘృతమును అగ్నియందు హోమమొనర్చువారు సర్వవ్యాధి రహితులై సుఖించెదరు. ॥౬౫॥

65.There where all never-failing streams of honey and butler flow may the learned knower of all actions grant us happiness for acquiring noble traits.

౧౦౧౫. అగ్నిరస్మీత్యస్య దేవశ్రవోదేవవాతావృషీ, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

యజ్ఞేన కిం జాయత ఇత్యాహ. యజ్ఞముచే నేమేమి యగును?

౧౦౧౫ అగ్నిరస్మి జన్మనా జాతవేదా ఘృతం మే చక్షురమృతం మఽఆసన్।
అర్కస్త్రిధాతూ రజసో విమానోఽజస్రో ఘర్మో హవిరస్మి నామ॥౬౬॥

ప. విః- అగ్నిః, అస్మి, జన్మనా, జాతవేదా ఇతి జాత + వేదాః, ఘృతమ్, మే, చక్షుః, అమృతం, మే, ఆసన్, అర్కః, త్రిధాతురితి త్రి + ధాతుః, రజసః, విమాన, ఇతి వి + మానః, అజస్రః, ఘర్మః, హవిః, అస్మి, నామ. ॥౬౬॥

పదార్థః :-(అగ్నిః) పావక ఇవ (అస్మి) (జన్మనా) ప్రాదుర్భావేన (జాతవేదాః) యో జాతేషు విద్యతే సః (ఘృతమ్) ఆజ్యమ్ (మే) మహ్యమ్ (చక్షుః) దర్శకం ప్రకాశకమ్ (అమృతమ్) అమృతాత్మకం భోజ్యం వస్తు (మే) మమ (ఆసన్) ఆస్యే (అర్కః) సర్వాన్ ప్రాణినోఽర్చన్తి యేన సః (త్రిధాతుః) త్రయో ధాతవో యస్మిన్ సః (రజసః) లోకసమూహస్య (విమానః) విమానయానమివ ధర్తా (అజస్రః) అజస్రం గమనం విద్యతే యస్య సః. అత్రార్శఽ ఆదిభ్యోఽజిత్యచ్ (ఘర్మః) జిఘ్రతి యేన సః ప్రకాశ ఇవ యజ్ఞః (హవిః) హోతవ్యం ద్రవ్యమ్ (అస్మి) (నామ) ఖ్యాతిః. ॥౬౬॥

అన్వయః :- అహం జన్మనా జాతవేదా అగ్నిరివాస్మి యథాఽగ్నేర్ఘృతం చక్షురస్తి తథా మేఽస్తు. యథా పావకం సంస్కృతం హవిర్ఘృతం సదమృతం జాయతే తథా మ ఆసన్ ముఖేఽస్తు. యథా త్రిధాతూ రజసో విమానోఽజస్రో ఘర్మోఽర్కో యస్య నామ సంశోధితం హవిశ్చాస్తి తథాఽహమస్మి. ॥౬౬॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథాగ్నిర్ఘృతం హవిర్వాయౌ ప్రసార్య దుర్గన్ధం నివార్య సుగన్ధం ప్రకటయ్య రోగాన్ సమూలఘాతం నిహత్య సర్వాన్ ప్రాణినః సుఖయతి తథైవ మనుష్యైర్భవితవ్యమ్.।౬౬॥

**పదార్థము** :- నేను (జన్మనా) జన్మముతో(జాతవేదాః) ఉత్పన్న పదార్థములందును (అగ్నిః) అగ్నివలె (అస్మి) ఉన్నాను. ఎట్లు అగ్నికి (ఘృతమ్) ఘృతాదులు (చక్షుః) ప్రకాశములై యున్నట్లు (మే) నాకొరకును యగుగాక. అగ్నియందు చక్కగా సంస్కార పరచినట్లు (హవిః) హవనమొనర్పదగిన ద్రవ్యములను హోమమొనర్చిన (అమృతమ్) సమస్త రోగములునశించి, ఆనందదాయకమగునట్లు (మే) నాయొక్క (ఆసన్) ముఖమునందు ప్రాప్తించుగాక! ఎట్లు (త్రిధాతుః) వేనియందు సత్వరజస్తమోగుణములుండునో, అట్టి (రజసః) లోకలోకాంతరములకు (విమానః) విమానయానమువలె ధారణమొనర్చుచు (అజస్రః) నిరంతరము గమనశీలము (ఘర్మః) ప్రకాశమువలె యజ్ఞముయొక్క సుగంధము గ్రహించునట్టి (అర్కః) సత్కార సాధనమైయున్నట్టి (నామ) ప్రసిద్ధమై శ్రేష్ఠముగ శోధించబడినట్టి, ఏ హవనమొనర్పదగిన పదార్థములు గలవో అట్లే నేనును (అస్మి) ఐ యున్నాను.।౬౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. అగ్నియందు హోమమొనర్చిన పదార్థములను సూక్ష్మీ కరించి వాయువునందు వ్యాపింపజేసి దుర్గంధమును తొలగించి సుగంధమును ప్రకటపరచును. సకలవ్యాధులను నిర్మూలన మొనర్చి సకలప్రాణులకు సుఖము గలిగించునట్లు మానవులెల్లరు నొనర్పవలెను. ।౬౬॥

66.I, the Revealer of the vedas, am Omniscient by nature. Sun is My eye, everlasting happiness of salvation is My mouth. I am Adorable, Iam the Master of triple light; the Creator of regions, External, Lustrous, and Cupplier of food at all places.

౧౦౧౬ ఋచో నామేత్యస్య దేవశ్రవోదేవవాతావృషీ, అగ్నిర్దేవతా, ఆర్షీ జగతీ ఛందః, నిషాదః స్వరః.

అథర్గాదివేదాధ్యయనేన కిం కార్యమిత్యుపదిశ్యతే. ఋగ్వేదాదుల జదివి యేమి చేయవలెను?

౧౦౧౬ ఋచో నామాస్మి యజూꣳషి నామాస్మి సామాని నామాస్మి।

యే అగ్నయః పాఞ్చజన్యా అస్యాం పృథివ్యామధి।

తేషామసి త్వముత్తమః ప్ర నో జీవాతవే సువ ।౬౭॥

ప.విః-ఋచః, నామ, అస్మి, యజూꣳషి, నామ, అస్మి, సామాని, నామ, అస్మి, యే,

అగ్నయః, పాఞ్చజన్యా ఇతి పాఞ్చజన్యాః, అస్యామ్, పృథివ్యామ్, అధి, తేషామ్, అసి, త్వమ్, ఉత్తమ ఇత్యుత్ + తమః, ప్ర, నః, జీవాతవే, సువ. ।౬౭।।

**పదార్థః** :-(ఋచః) ఋగ్వేదశ్రుతయః (నామ) ప్రసిద్ధో (అస్మి) భవామి (యజూంషి) యజుర్మన్త్రాః (నామ) (అస్మి) (సామాని) సామవేదమన్త్రగానాని (నామ) (అస్మి) (యే) (అగ్నయః) ఆహవనీయాదయః పావకాః (పాఞ్చజన్యాః) పఞ్చజనేభ్యో హితాః పఞ్చజనా ఇతి మనుష్యనా.. నిఘం. ౨.౩ (అస్యామ్) (పృథివ్యామ్) (అధి) ఉపరి (తేషామ్) (అసి) (త్వమ్) (ఉత్తమః) (ప్ర) (నః) అస్మాకమ్ (జీవాతవే) జీవనాయ (సువ) ప్రేరయ. ।౬౭।।

**అన్వయః** :- హే విద్వన్! యోఽహమృచో నామాస్మి యజూంషి నామాస్మి సామాని నామాస్మి తస్మాన్మత్తో వేదవిద్యాం గృహాణ. యేఽస్యాం పృథివ్యాం పాఞ్చజన్యా అగ్నయోఽధిషన్తి తేషాం మధ్యే త్వముత్తమోఽసి స త్వం నో జీవాతవే శుభకర్మసు ప్రసువ. ।౬౭।।

**భావార్థః** :- యో మనుష్య ఋగ్వేదమధీతే స ఋగ్వేదీ యో యజుర్వేదమధీతే స యజుర్వేదీ యః సామవేదమధీతే స సామవేదీ యోఽథర్వవేదం చాధీతే సోఽథర్వవేదీ. యో ద్వౌ వేదావధీతే స ద్వివేదీ యస్త్రీన్ వేదానధీతే స త్రివేదీ యశ్చతురో వేదానధీతే స చతుర్వేదీ యశ్చ కమపి వేదం నాఽధీతే స కామపి సంజ్ఞాం న లభతే, యే వేదవిదస్తేఽగ్నిహోత్రాదియజ్ఞైః సర్వహితం సంపాదయేయుర్యత ఉత్తమా కీర్తిః స్యాత్ సర్వే ప్రాణినో దీర్ఘాయుషశ్చ భవేయుః. ।౬౭।।

**పదార్థము** :- ఓ విద్వాంసా! ఏ నేను (ఋచః) ఋక్కుల (నామ) ప్రసిద్ధకర్తను (అస్మి) ఐ యున్నానో, (యజూంషి) యజుర్వేద (నామ) ప్రఖ్యాతకర్తను (అస్మి) ఐ యున్నానో (సామాని) సామవేద మంత్రగానముల (నామ) ప్రకాశకర్తను (అస్మి) ఐ యున్నానో అట్టి నాద్వారా వేదవిద్యను గ్రహణమొనర్పుము (యే) ఏ (అస్యామ్) ఇట్టి (పృథివ్యామ్) పృథివియందు (పాఞ్చజన్యాః) మానవహితకారి (అగ్నయః) అగ్నులు (అధి) సర్వోన్నతమై యున్నవియో (తేషామ్) వానిమధ్య (త్వమ్) నీవు (ఉత్తమః) అత్యుత్తముడవై (అసి) ఉన్నావు. అట్టి నీవు (నః) మా (జీవాతవే) జీవన సత్కార్మలందు (ప్ర, సువ) ప్రేరణనిమ్ము. ।౬౭।।

**భావార్థము** :- ఋగ్వేదమును చదివినవాడు ఋగ్వేది, యజుర్వేదాధ్యయనమొనర్చినవాడు యజుర్వేది, సామవేదమునధ్యయన మొనర్చినవాడు సామవేది, అథర్వవేదముననధ్యయ మొనర్చినవాడు అథర్వవేది యనబడును. రెండు వేదములను చదివిన ద్వివేది, మూడువేదముల నధ్యయనమొనర్చిన త్రివేది, నాలుగువేదములను చదివినవాడు చతుర్వేది యనబడును. ఏ వేదమును చదువనివాడు ఏ సంజ్ఞకును అర్హుడు గాజాలడు. వేదవేత్తలు అగ్నిహోత్రము మున్నగు యజ్ఞములచే సకల మానవులకు హితమును గలిగించవలెను. అందుచే వానికి ఉత్తమ కీర్తి మరియు సకల ప్రాణులకు దీర్ఘాయువు గలుగును. ।౬౭।।

67.O learned person I reveal the Rig-veda, the Yajur-veda, and the Sama-Veda. Learn from Me the vedic lore. O God, out of all the forces on the earth, that conduce to the welfare of humanity, Thou art the Foremost. Speed Thou us on to lengthened life!.

౧౦౧౭.వార్త్రహత్యాయేత్యస్య ఇన్ద్ర ఋషిః, అగ్ని ర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

సేనాధ్యక్షః కథం విజయీ భవేదిత్యాహ. సేనాధ్యక్షు డెటుల విజయవంతుడు కావలయును?

౧౦౧౭ వార్త్రహత్యాయ శవసే పృతనాషాహ్యాయ చ। ఇన్ద్ర త్వావర్తయామసి ।౬౮॥

ప. విః-వార్త్రహత్యాయేతి వార్త్ర + హత్యాయ, శవసే, పృతనాషాహ్యాయ, పృతనాసహ్యాయేతి పృతనా + సహ్యాయ, చ, ఇన్ద్ర, త్వా, ఆ, వర్తయామసి.।౬౮॥

**పదార్థః** :- (వార్త్రహత్యాయ) విరుద్ధభావేన వర్తతేఽసౌ వృత్రః వృత్ర ఏవ వార్త్రః వార్త్రస్య వర్తమానస్య శత్రోర్హత్యా హననం తత్ర సాధుస్తస్మై (శవసే) బలాయ (పృతనాషాహ్యాయ) యే మనుష్యాః పృతనాః సహన్తే తే పృతనాసాహస్తేషు సాధవే. (చ) (ఇన్ద్ర) పరమైశ్వర్యయుక్త సేనేశ (త్వా) త్వామ్ (ఆ) సమన్తాత్ (వర్తయామసి) ప్రవర్తయామః.।౬౮॥

**అన్వయః**:-హే ఇన్ద్ర! యథా వయం వార్త్రహత్యాయ శవసే పృతనాషాహ్యాయ తేనాన్యేన యోగ్యసాధనేన చ త్వాఽఽవర్తయామసి తథా త్వం వర్తస్వ.।౬౮॥

**భావార్థః**:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యో విద్వాన్ సూర్యో మేఘమివ శత్రూన్ హన్తుం శూరవీరసేనాం సత్కరోతి స సతతం విజయీ భవతి. ।౬౮॥

**పదార్థము** :- (ఇన్ద్ర) పరమైశ్వర్యశాలివగు సేనాపతీ! మే మెట్లు (వార్త్రహత్యాయ) విరుద్ధభావన గల శత్రువును నాశపరచుటలో కుశలుడు (శవసే) ఉత్తమ బలము (పృతనాషాహ్యాయ) శత్రుసైన్యముల బలమును సహించగల చతురుడగు వానిచే (చ) మరియు ఇతర యోగ్యమగు సాధనములుగల (త్వా) నిన్ను (ఆ, వర్తయామసి) మేము మెట్లు నలువైపులనుండి వర్తింపజేయుదుమో, అట్లే నీవును యథాయోగ్యముగ వర్తించుము.।౬౮॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యుడు మేఘములను తొలగించునట్లు ఏ వీరవిద్వాంసుడు శత్రుసంహారకమునకై శూరవీరులుగల సైన్యములను సత్కరించునో అతడు సదా విజయశీలుడగును.।౬౮॥

68.O Commander of the army, for the strength that slays the foes and conquers in the fight, and other resources, we turn thee hitherward to us!.

౧౦౧౮.సహదానుమిత్యస్యత్రవిశ్వామిత్రావృషి, ఇంద్రో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునర్జనైః కథం భవితవ్యమిత్యుపదిశ్యతే. మానవు లెటు లుండవలయును?

౧౦౧౮ సహదానుమ్పురుహూత క్షియన్తమహస్తమిన్ద్ర సంపిణక్ కుణారుమ్ ।

అభి వృత్రం వర్ధమానం పియారుమపాదమిన్ద్ర తవసా జఘన్థ ॥౬౮॥

ప.వి:-సహదానుమితి సహ+దానుమ్, పురుహూతేతి పురు +హూత, క్షియన్తమ్, అహస్తమ్, ఇన్ద్ర, సమ్, పిణక్, కుణారుమ్, అభి, వృత్రమ్, వర్ధమానమ్, పియారుమ్, అపాదమ్, ఇన్ద్ర, తవసా, జఘన్థ.॥౬౮॥

**పదార్థః** :-(సహదానుమ్) యః సహైవ దదాతి తమ్ (పురుహూత) బహుభిస్సజ్జనైః సత్కృత (క్షియన్తమ్) గచ్ఛన్తమ్ (అహస్తమ్) అవిద్యమానౌ హస్తౌ యస్య తమ్. (ఇన్ద్ర) శత్రువిదారక సేనేశ (సమ్) (పిణక్) పిన్ఢి (కుణారుమ్) శబ్దయన్తమ్. అత్ర ''క్వణ శబ్దే'' ఇత్యస్మాద్ధాతోరౌణాదిక ఆరుః ప్రత్యయః (అభి) (వృత్రమ్) మేఘమివ (వర్ధమానమ్) (పియారుమ్) పానకారకమ్ (అపాదమ్) పాదేన్ద్రియరహితమ్ (ఇన్ద్ర) సభేశ (తవసా) బలేన. తవ ఇతి బలనా.. నిఘం. ౨.౯. (జఘన్థ) జహి.॥౬౮॥

**అన్వయః** :-హే పురుహూతేన్ద్ర! యథా సూర్యః సహదానుం క్షియన్తం కుణారుమహస్తం పియారుమపాదమభివర్ధమానం వృత్రం సమ్పిణక్ తథా హే ఇన్ద్ర! శత్రూఀ స్తవసా జఘన్థ.॥౬౮॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యవత్ప్రతాపినో భవన్తి తేఽజాతశత్రవో జాయన్తే.॥౬౮॥

**పదార్థము** :- (పురుహూత) అనేక విద్వాంసులచే సత్కరించబడి (ఇన్ద్ర) శత్రునాశనమొందించు సేనాపతీ! సూర్యుడెట్లు (సహదానుమ్) సహకరించునట్టి (క్షియన్తమ్) ఆకాశమందు నివసించు (కుణారుమ్) శబ్దమొనర్చునట్టి (అహస్తమ్) చేతులులేక (ప్రియారుమ్) పానమొనర్చు (అపాదమ్) పాదములులేక (అభి) అన్నిదిశలనుండి (వర్ధమానమ్) వృద్ధిపొందినట్టిదగు (వృత్రమ్) మేఘమును (సం, పిణక్) చక్కగా చూర్ణీభూతమొనర్చునో అట్లే (ఇన్ద్ర) ఓ సభాపతీ! నీవు శత్రుమూకలను (తవసా) వీరత్వము, బలముద్వారా (జఘన్థ) సంహరించుము. ॥౬౮॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యునివలె ప్రతాపశాలియగు వీరుడు శత్రురహితుడై యుండును. ॥౬౮॥

70.O Commander, much invoked, kill thou the foes with thy strength, as the sun slays its companion the advancing cloud, that moves in the atmosphere, roars, is without hands, imbibes water and is without feet!.

౧౦౧౯. వి న ఇత్యస్య శాస ఋషిః, ఇంద్రో దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ సేనాపతిః కీదృశో భవేదిత్యుపదిశ్యతే. సేనాపతి యెటు లుండవలయును?

౧౦౧౯ వి న॑ ఇన్ద్ర మృధో॑ జహి నీ॒చా య॑చ్ఛ పృతన్య॒తః।

యో అ॒స్మాꣳ అ॑భి॒దాస॒త్యధ॑రం గమయా॒ తమః ॥౭౦॥

ప.విః- వి, న॒ః, ఇ॒న్ద్ర, మృ॒ధః, జ॒హి, నీ॒చా, య॒చ్ఛ, పృ॒త॒న్య॒తః, యః, అ॒స్మాన్, అ॒భిదా॒స॒తీత్య॒భి + దాసతి, అధరమ్, గ॒మ॒య, తమః ॥౭౦॥

**పదార్థః** :- (వి) (నః) అస్మాకమ్ (ఇన్ద్ర) సేనేశ (మృధః) మర్ద్యన్త్యార్ద్రీభవన్తి యేషు తాన్ సంగ్రామాన్. మృధఇతి సంగ్రామనా... నిఘం. ౨.౧౭. (జహి) (నీచా) న్యగ్భూతాన్నమ్రాన్. అత్ర సుపాం సులుగిత్యాకారః (యచ్ఛ) నిగృహ్ణీహి (పృతన్యతః) ఆత్మనః పృతనాం సేనామిచ్ఛతః (యః) విరోధీ (అస్మాన్) (అభిదాసతి) అభిముఖేనోపక్షయతి (అధరమ్) అధోగతిమ్ (గమయ) ప్రాపయ. అత్రాన్యేషామపీతి దీర్ఘః (తమః) అన్ధకారం కారాగృహమ్.॥౭౦॥

**అన్వయః**:-హే ఇన్ద్రసేనేశ! త్వం మృధో వి జహి పృతన్యతో నః శత్రూన్నీచా యచ్ఛ. యో ఽస్మానభిదాసతి తమధరం తమో గమయ. ॥౭౦॥

**భావార్థః**:-సేనేశేన సంగ్రామా జేతవ్యాస్తేన నీచకర్మకారిణాం నిగ్రహః కర్తవ్యో రాజప్రజా విరోధకారయితా భృశం దణ్డనీయశ్చ.॥౭౦॥

**పదార్థము** :- (ఇన్ద్ర) అత్యంత శక్తియుక్తుడవగు ఓ సేనాపతీ! నీవు (మృధః) యుద్ధములను (వి,జహి) విశేషముగా జయించుము (పృతన్యతః) సైన్యములతోగూడ (నః) మా శత్రువులను (నీచా) నీచగతికి (యచ్ఛ) చేర్చుము (యః) ఏ శత్రువు (అస్మాన్) మమ్ము (అభిదాసతి) నష్టపరచు కోరికతోనున్నాడో, వానిని (అధరమ్) అధోగతిరూప (తమః) అంధకారమును (గమయ) ప్రాప్తింపజేయుము. ॥౭౦॥

**భావార్థము** :- యుద్ధములందు విజయమును పొందుట సేనాపతికి యోగ్యమైయున్నది. అట్టి విజయకారక సంగ్రామములద్వారా నీచకర్మలనొనర్చు క్రూరులను నిరోధించవలయును. రాజు మరియు ప్రజలమధ్య స్పర్ధలను గలిగించువారికి అతికఠోర దండనము నీయవలయును.॥౭౦॥

70.O Commander of the army, win battles, humble the men who challenge us, send down to nether darkness him who seeks to enslave us!.

౧౦౭౦.మృగో నేత్యస్య జయ ఋషిః, ఇంద్రో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

రాజజనైః కీదృశైర్భవితవ్యమిత్యుపదిశ్యతే. రాజపురుషు లెటులుండవలయును?

౧౦౭౦ మృగో న భీమః కుచరో గిరిష్ఠాః పరావత ఆ జగన్థా పరస్యాః।

సృకꣳ సꣳశాయ పవిమిన్ద్ర తిగ్మం వి శత్రూన్తాఢి వి మృధో నుదస్వ॥౭౧॥

ప.విః-మృగః, న, భీమః, కుచర ఇతి కు + చరః, గిరిష్ఠాః, గిరిస్థా ఇతి గిరి + స్థాః, పరావతః, ఆ, జగన్థ పరస్యాః, సృకమ్, సꣳశాయేతి సమ్ + శాయ, పవిమ్, ఇన్ద్ర, తిగ్మమ్, వి, శత్రూన్, తాఢి, వి, మృధః, నుదస్వ.॥౭౧॥

**పదార్థః :**-(మృగః) మృగేన్ద్రః సింహః (న) ఇవ (భీమః) బిభేత్యస్మాత్ సః (కుచరః) యః కుత్సితాం గతిం చరతి సః (గిరిష్ఠాః) యో గిరౌ తిష్ఠతి సః (పరావతః) దూరదేశాత్ (ఆ) సమన్తాత్ (జగన్థ) గచ్ఛ. అత్ర పురుషవ్యత్యయః. అన్యేషామపీతి దీర్ఘశ్చ (పరస్యాః) శత్రూణాం సేనాయా ఉపరి (సృకమ్) వజ్రతుల్యం శస్త్రమ్. సృక ఇతి వజ్రనా.. నిఘం.. ౨..౨౦ (సంశాయ) సమ్యక్ సూక్ష్మబలాన్ కృత్వా (పవిమ్) పునాతి దుష్టాన్ దణ్డయిత్వా యేన తమ్ (ఇన్ద్ర) సేనాధ్యక్ష (తిగ్మమ్) తీక్ష్ణీకృతమ్ (వి) (శత్రూన్) (తాఢి) ఆ జహి (వి) (మృధః) (నుదస్వ).॥౭౧॥

**అన్వయః :**- హే ఇన్ద్ర! త్వం కుచరో గిరిష్ఠా భీమో మృగో న పరావత ఆజగన్థ పరస్యాస్తిగ్మం పవిం సృకం సంశాయ శత్రూన్ వితాఢి మృధో వినుదస్వ చ.॥౭౧॥

**భావార్థః :**- యే సేనాపురుషాః సింహవత్ పరాక్రమ్య తీక్ష్ణైః శస్త్రైః శత్రుసేనాఙ్గాని ఛిత్వా సంగ్రామాన్ విజయన్తే తేஉతులాం ప్రశంసాం ప్రాప్నువన్తి నేతరే క్షుద్రాశయా భీరవః.॥౭౧॥

**పదార్థము :**- (ఇన్ద్ర) సేనాధ్యక్షా! నీవు (కుచరః) కుటిలనడకగల (గిరిష్ఠాః) పర్వతములందుండు (భీమః) భయంకర (మృగః) సింహము (న) వలె (పరావతః) దూరప్రాంతములందున్న శత్రువులను (ఆ, జగన్థ) నలువైపులనుండి దిగ్బంధనమొనర్చి (పరస్యాః) శత్రుసైన్యములపై (తిగ్మమ్) అతితీవ్రముగ (పవిమ్) దుష్టులను దండనముద్వారా పవిత్రమొనర్చు (సృకమ్) వజ్రమువంటి శస్త్రములను (సంశాయ) చక్కగా పదును పరచి (శత్రూన్) శత్రువులను (వి,తాడి) తాడనమొనర్చి (మృధః) సంగ్రామములను (వి, నుదస్వ) జయించి శ్రేష్ఠకర్మలందు ప్రేరణనిమ్ము.॥౭౧॥

**భావార్థము :-** సింహమువలె శత్రుసైన్యములపై పరాక్రమించి తీక్ష్ణ శస్త్రములచే శత్రువుల సేనాంగములను ఛేదించి యుద్ధక్షేత్రములందు విజయమునార్జించువారు అతులప్రశంసలను ప్రాప్తించుకొందురు. ఇతర క్షుద్రాశయు లగువారు ఎప్పుడును విజయమును పొందజాలరు.॥౭౧॥

71.O commander of the army, like a dreadful wild tiger roaming in the mountains with a crooked pace, encircle the distant foes. Crush thou the enemies, whetting thy shrp bolt, thou chastener of the wicked through punishment, and win battles!.

౧౦౭౨.వైశ్వానరో న ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, అర్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నావిషయమే.

## ౧౦౭౨ వైశ్వానరో న ఊతయ ఆ ప్ర యాతు పరావతః।
## అగ్నిర్నః సుష్టుతీరుప ॥౭౨॥

**ప.విః**–వైశ్వానరః, నః, ఊతయే, ఆ, ప్ర, యాతు, పరావత ఇతి పరా + వతః, అగ్నిః, నః, సుష్టుతీః, సుస్తుతీరితి సు + స్తుతీః, ఉప.॥౭౨॥

**పదార్థః :-**(వైశ్వానరః) విశ్వేషు నరేషు యో రాజతే స ఏవ (నః) అస్మాకమ్ (ఊతయే) రక్షాద్యాయ (ఆ) (ప్ర) (యాతు) ప్రాప్నోతు (పరావతః) దూరదేశాత్ (అగ్నిః) సూర్యః (నః) అస్మాకమ్ (సుష్టుతీః) యా శోభనాః స్తుతయస్తాః (ఉప).॥౭౨॥

**అన్వయః :-** హే సేనేశ సభేశ! యథా వైశ్వానరోఽగ్నిః సూర్యః పరావతః సర్వాన్ పదార్థాన్ ప్రాప్నోతి తథా భవానూతయే న ఆ ప్ర యాతు. యథాఽగ్నిర్విద్యుత్ సంహితాస్తి తథా త్వం నః సుష్టుతీరుపశృణు. ॥౭౨॥

**భావార్థః :-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. యః సూర్యవద్దూరస్థోఽపి న్యాయేన సర్వాన్ పదార్థాన్ ప్రకాశయతి యథా చ దూరస్థోఽపి సద్గుణాఢ్యో జనః ప్రశస్యతే తథా రాజపురుషైర్భవితవ్యమ్. ॥౭౨॥

**పదార్థము :-** ఓ సేనాపతి సభాధ్యక్షా! ఎట్లు (వైశ్వానరః) సమస్తనరులందు తేజరిల్లుచున్న (అగ్నిః) సూర్యరూపాగ్ని (పరావతః) దూరప్రదేశములందలి సకల పదార్థములకును ప్రాప్తించునట్లే నీవును (ఊతయే) రక్షణము మున్నగువానికై (నః) మా సమీపమునకు (ఆ,ప్ర,యాతు) చక్కగా ప్రాప్తించుము. విద్యుత్తు అన్నిటియందును వ్యాప్తమైయుండి సన్నిహితమైయుండునట్లు (నః) మాయొక్క (సుష్టుతీః) ఉత్తమస్తుతులను (ఉప) చక్కగా ఆలకించుము.॥౭౨॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యుడు దూరమందుండియు న్యాయముగా సకలవ్యవహారములను ప్రకాశపరచునట్లు, సద్గుణయుక్తుడగు సత్పురుషుడు దూరముననుండియు ప్రశంసింపబడునట్లు రాజపురుషు లుండవలయును.॥౭౨॥

72.O ruler, just as the heat of the sun, being present in all creatures reaches the distant objects, so shouldst thou, come near us for our protection. Just as electricity being present in all objects lives near us, so shouldst thou listen to our eulogies!.

౧౦౭౨.పృష్టో దివీత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ఛందః ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమునే చెప్పెను.

౧౦౭౨ పృష్టో దివి పృష్టోఽఅగ్నిః పృథివ్యాం పృష్టో విశ్వా ఓషధీరావివేశ।

వైశ్వానరః సహసా పృష్టోఽ అగ్నిః స నో దివా స రిషస్పాతు నక్తమ్ ॥౭౩॥

ప.వి:-పృష్టః దివి, పృష్టః, అగ్నిః, పృథివ్యామ్, పృష్టః, విశ్వాః, ఓషధీః, ఆ, వివేశ, వైశ్వానరః సహసా, పృష్టః, అగ్నిః, సః, నః, దివా, సః, రిషః, పాతు, నక్తమ్.॥౭౩॥

**పదార్థః :-**(పృష్టః) జ్ఞాతుమిష్టః (దివి) సూర్యే (పృష్టః) (అగ్నిః) ప్రసిద్ధః పావకః (పృథివ్యామ్) (పృష్టః) (విశ్వాః) అఖిలాః (ఓషధీః) సోమయవాద్యాః (ఆ) (వివేశ) విష్టోఽస్తి (వైశ్వానరః) విశ్వస్య నేతా స ఏవ (సహసా) బలేన (పృష్టః) (అగ్నిః) విద్యుత్ (సః) (నః) అస్మాన్ (దివా) దివసే (సః) (రిషః) హింసకాత్ (పాతు) రక్షతు (నక్తమ్) రాత్రౌ.॥౭౩॥

**అన్వయః :-**మనుష్యైర్యో దివి పృష్టోఽగ్నిః పృథివ్యాం పృష్టోఽగ్నిర్జలే వాయౌ చ పృష్టోఽగ్నిః సహసా వైశ్వానరః పృష్టోఽగ్నిర్విశ్వా ఓషధీరావివేశ స దివా స చ నక్తం యథా పాతి తథా సేనేశో భవాన్నోఽస్మాన్ రిషః సతతం పాతు. ॥౭౩॥

**భావార్థః :-** యే మనుష్యా! ఆకాశస్థం సూర్యం పృథివీస్థం జ్వలితం సర్వపదార్థవ్యాపినం విద్యుదగ్నిం చ విద్వద్భ్యో నిశ్చిత్య కార్యేషు సంయుఞ్జతే తే శత్రుభ్యో నిర్భయా జాయన్తే.॥౭౩॥

**పదార్థము :-** మనుష్యులచే నే (దివి) ప్రకాశస్వరూపుడగు సూర్యుడు (పృష్టః) తెలిసికొనదగిన (అగ్నిః) అగ్ని (పృథివ్యామ్) పృథివియందు (పృష్టః) గ్రహించదగిన అగ్ని మరియు జలము వాయువులందు (పృష్టః) గ్రహించదగిన సూర్యాగ్ని [పావకము] (సహసా) బలము మున్నగుగుణములతోగూడ (వైశ్వానరః) విశ్వమున ప్రకాశవంతమై (పృష్టః) తెలిసికొనదగిన (అగ్నిః) విద్యుదగ్ని (విశ్వాః) సమస్త (ఓషధీః) ఓషధులందు (ఆ,

వివేశ) ఏది ప్రవేశించుచున్నదో (సః) అట్టి యగ్ని (దివా) పగలు మరియు (సః) ఆ యగ్ని (నక్తమ్) రాత్రులం దెట్లు రక్షణయొనర్చునో, అట్లే సేనాపతివగు నీవు (నః) మమ్ము (రిషః) హింసకజనమునుండి నిరంతరము (పాతు) రక్షించుచుండుము.॥౭౩॥

**భావార్థము** :- ఆకాశస్థ సూర్యాగ్ని, పృథివీస్థభౌతికాగ్ని, సకల పదార్థములందును వ్యాపకములైయున్న విద్యుద్రూపాగ్నులను విద్వాంసులద్వారా నిశ్చయించి తెలిసికొని కార్యములందు ప్రయోగమొనర్చుకొను ధీశాలురు నిర్భయులై యుందురు. ॥౭౩॥

73.Men should know fire in the brilliant sun, fire in the earth, air and water. The knowable fire in the shape of lightning, shining in the universe, has entered all the plants with vigour. Just as this fire preserves us by day and by night, so may thou the Commander preserve us always from a ferocious person.

౧౦౨౩. అశ్యామేత్యస్య భరద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

అథ ప్రజారాజజనైరితరేతరం కిం కార్యమిత్యాహ. ప్రజలు రాజపురుషులు పరస్పర మెట్టుల మెలగవలయును?

౧౦౨౩ అశ్యామ తం కామమగ్నే తవోతీఽఅశ్యామ రయిꣳ రయివః సువీరమ్।

అశ్యామ వాజమభి వాజయన్తోఽశ్యామ ద్యుమ్నమజరాజరం తే॥౭౪॥

**ప. వి:-** అశ్యామ, తమ్, కామమ్, అగ్నే, తవ, ఊతీ, అశ్యామ రయిమ్ రయివ ఇతి రయి + వః, సువీరమితి సు + వీరమ్, అశ్యామ, వాజమ్, అభి, వాజయన్తః, అశ్యామ, ద్యుమ్నమ్, అజర, అజరమ్, తే.॥౭౪॥

**పదార్థః** :- (అశ్యామ) ప్రాప్నుయామ (తమ్) (కామమ్) (అగ్నే) యుద్ధవిద్యావిత్సేనేశ (తవ) (ఊతీ) రక్షాద్యయా క్రియయా. అత్ర సుపాం సులుగితి పూర్వసవర్ణః (అశ్యామ) (రయిమ్) రాజ్యశ్రియమ్ (రయివః) ప్రశస్తా రయయో విద్యన్తే యస్య తత్సమ్బుద్ధౌ. అత్ర ఛన్దసీర ఇతి మస్య వః (సువీరమ్) శోభనా వీరాః ప్రాప్యన్తే యస్మాత్తమ్ (అశ్యామ) (వాజమ్) సఙ్గ్రామవిజయమ్ (అభి) (వాజయన్తః) సంగ్రామయన్తో యోధయన్తః (అశ్యామ) (ద్యుమ్నమ్) యశో ధనం వా (అజర) జరాదోషరహిత (అజరమ్) జరాదోషరహితమ్ (తే) తవ.॥౭౪॥

**అన్వయః** :- హే అగ్నే! వయం తవోతీ తం కామమశ్యామ. హే రయివః సువీరం రయిమశ్యామ వాజయన్తో వయం వాజమభ్యశ్యామ. హే అజర! తేఽజరం ద్యుమ్నమశ్యామ. ॥౭౪॥

**భావార్థః** :- ప్రజాస్థైర్మనుష్యై రాజపురుషరక్షయా రాజపురుషైః ప్రజాజనరక్షణేన చ పరస్పరం సర్వే కామాః ప్రాప్తవ్యాః.॥౭౪॥

**పదార్థము** :- (అగ్నే) యుద్ధవిద్యాకుశలుడవగు సేనాపతీ! మేము (తవ) నీయొక్క (ఊతీ) రక్షణమున్నగు విద్యలచే (తమ్) ఆ (కామమ్) కామితములను (అశ్యామ) పొందుదుము గాక! (రయివః) ప్రశస్తధనయుక్తుడా! (సువీరమ్) శ్రేష్ఠవీరులను ప్రాప్తింపజేయుగల (రయిమ్) ధనములను (అశ్యామ) పొందుదుముగాక! (వాజయన్తః) యుద్ధముల నొనర్చుచు ఒనర్పజేయించుచున్న మేము (వాజమ్) సంగ్రామములందు విజయమును (అభ్యశ్యామ) చక్కగా పొందుదుముగాక! (అజర) వృద్ధరహితుడవగు ఓ సేనాపతీ! మేము (తే) నీ ప్రతాపముచే (అజరమ్) అక్షయమగు (ద్యుమ్నమ్) ధనమును మరియు కీర్తిని (అశ్యామ) పొందుదుముగాక!॥౭౪॥

**భావార్థము** :- ప్రజలు రాజపురుషుల రక్షణమున, రాజపురుషులు ప్రజలరక్షణమున పరస్పరము సర్వాభీష్ట కార్యములను సాధించుకొనవలయును.॥౭౪॥

74.O commander of the army, may we fulfil our desires through thy protection. O Lord of wealth, may we get the riches which give us valiant sons. Waging fight may we succeed in battles. O Commander free from old age, with thy aid, may we win undecaying wealth and glory!.

౧౦౭౫.వయమిత్యస్యోత్కీల ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పురుషార్థేన కిం సాధ్యమిత్యాహ. పురుషార్థముతో నేమేమి సాధించవలయును?

౧౦౭౫ వయం తేఽ అద్య రరిమా హి కామముత్తానహస్తా నమసోపసద్య।
యజిష్ఠేన మనసా యక్షి దేవానస్రేధతా మన్మనా విప్రోఽ అగ్నే ॥౭౫॥

ప.విః-వయమ్, తే, అద్య, రరిమ, హి, కామమ్, ఉత్తానహస్తా ఇత్యుత్తాన + హస్తాః, నమసా, ఉపసద్యేత్యుప + సద్య, యజిష్ఠేన, మనసా, యక్షి, దేవాన్, అస్రేధతా, మన్మనా, విప్రః, అగ్నే.॥౭౫॥

**పదార్థః** :- (వయమ్) (తే) తవ (అద్య) అస్మిన్దినే (రరిమ) దద్మః. రా దానే లిట్. అన్యేషామపి దృశ్యత ఇతి దీర్ఘః. (హి)ఖలు (కామమ్) (ఉత్తానహస్తాః) ఉత్తానావూర్ధ్వగతావభయదాతారౌ హస్తౌ యేషాం తే (నమసా) సత్కారేణ (ఉపసద్య) సామీప్యం ప్రాప్య (యజిష్ఠేన) అతిశయేన యష్టృ సంగన్తృ తేన

(మనసా) విజ్ఞానేన (యక్షి) యజసి (దేవాన్) విదుషః (అస్రేధతా) ఇతస్తతో గమనరహితేన స్థిరేణ (మన్మనా) యేన మన్యతే విజానాతి తేన (విప్రః) మేధావీ (అగ్నే) విద్వన్.॥౭౫॥

**అన్వయః :**-హే అగ్నే! ఉత్తానహస్తా వయం తే నమసోపసద్యాద్య కామం హి రరిమ యథా విప్రోఽస్రేధతా మన్మనా యజ్ఞ్యేన మనసా దేవాన్ యజతి సంగచ్ఛతే యథా చ త్వం యక్షి తథా వయ మపి యజేమ.॥౭౫॥

**భావార్థః :**-యే మనుష్యాః పురుషార్థేనాలంకామాః స్యుస్తే విద్వత్సంగేనైతత్ ప్రాప్తుం శక్నుయుః.॥౭౫॥

**పదార్థము :**-(అగ్నే) ఓ విద్వాంసుడా! (ఉత్తానహస్తాః) ఉత్తమరీతిలో అభయప్రదానమొనర్చు హస్తములుగలవాడా! (వయమ్) మేము (తే) నీ (నమసా) సత్కారముద్వారా (ఉపసద్య) సమీపమునకుచేరి (అద్య) నేడే (కామమ్) కామితములను (హి) నిశ్చయముగ (రరిమ) ఇచ్చుచున్నాము. ఎట్లు (విప్రః) బుద్ధిశాలి (అస్రేధతా) చంచలత్వములేని స్థిరమైన (మన్మనా) బలము మరియు (యజ్ఞ్యేన) అతిగా కలిసిపోయిన (మనసా) మనస్సు [చిత్తము] ద్వారా (దేవాన్) విద్వాంసులను మరియు శుభగుణములను పొందుచున్నాడో మరియు నీవెట్లు (యక్షి) శుభకర్మలందు నిమగ్నుడవై యున్నావో మేమును అట్లే సాంగత్యముగలవార మగుదుముగాక! ॥౭౫॥

**భావార్థము :**- ఏ మనుష్యులు పురుషార్థముచే పవిత్రమగు పూర్ణకాములగుదురో అట్టివారు సత్సాంగత్యముల ద్వారా ఈ విషయములను పొందుటకు సమర్థవంతులగుచుందురు. ॥౭౫॥

75.O learned person, approaching with raised hands and adoration, we have this day fulfilled for thee thy longing!.

O wise man, with undeviating fixed purpose, contemplative mood, and absolute restraint thou cultivates good qualities!.

౧౦౭౫.ధామచ్ఛదగ్నిరిత్యస్యోత్కీల ఋషిః, విశ్వేదేవాః దేవతాః, నిచృదనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.

అథ సర్వవిద్వత్కర్తవ్యమాహ. సకల విద్వాంసుల కర్తవ్యమును జెప్పెను.

౧౦౭౬ ధామచ్ఛదగ్నిరిన్ద్రో బ్రహ్మా దేవో బృహస్పతిః।

సచేతసో విశ్వే దేవా యజ్ఞం ప్రావన్తు నః శుభే ॥౭౬॥

ప.విః-ధామచ్ఛదితి ధామ + ఛత్, అగ్నిః, ఇన్ద్రః, బ్రహ్మా, దేవః, బృహస్పతిః సచేతస ఇతి స + చేతసః, విశ్వే, దేవాః, యజ్ఞమ్, ప్ర, అవన్తు, నః, శుభే.॥౭౬॥

పదార్థః:-(ధామచ్ఛత్) యో ధామాని ఛాదయతి సంవృణోతి సః (అగ్నిః) విద్వాన్ (ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్ (బ్రహ్మ) చతుర్వేదవిత్ (దేవః) విద్యాదాతా (బృహస్పతిః) అధ్యాపకః (సచేతసః) యే చేతసా ప్రజ్ఞయా సహ వర్తన్తే (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః (యజ్ఞమ్) ఉక్తమ్ (ప్ర) (అవన్తు) కామయన్తామ్ (నః) అస్మాకమ్ (శుభే) కల్యాణాయ.॥౨౬॥

**అన్వయః** :-హే మనుష్యాః! దేవో ధామచ్ఛదగ్నిరిన్ద్రో బ్రహ్మ బృహస్పతిశ్చేమే సచేతసో విశ్వే దేవాః నః శుభే యజ్ఞం ప్రావన్తు.॥౨౬॥

**భావార్థః** :-సర్వే విద్వాంసః సర్వేషాం సుఖాయ సతతం సత్యోపదేశాన్ కుర్వన్తు.॥౨౬॥

**పదార్థము** :- ఓ మానవులారా! (దేవః) విద్వాంసులు (ధామచ్ఛత్) జన్మ స్థాన నామములను విస్తృతమొనర్చువారు (అగ్నిః) అగ్ని (ఇన్ద్రః) విద్యుత్తువంటి అమాత్యుడు మరియు రాజు (బ్రహ్మ) చతుర్వేద విజ్ఞులు (బృహస్పతిః) వేదవాణిని పఠన పాఠనముద్వారా భద్రముగా కాపాడు (సచేతసః) విజ్ఞానవంతులు (విశ్వే, దేవాః) సమస్త విద్వాంసులు (నః) మాయొక్క (శుభే) శుభ [కల్యాణ] ములకై (యజ్ఞమ్) విజ్ఞానయోగ రూపక్రియలను (ప్ర, అవన్తు) చక్కగా కాంక్షించెదరుగాక! ॥౨౬॥

**భావార్థము** :-విద్వాంసులెల్లరును సమస్త మనుష్యులు మున్నగు ప్రాణుల కల్యాణార్థము నిరంతరము సత్యోపదేశముల నొనర్చుచుండవలయును. ॥౨౬॥

May the learned subduer of all places, the King, the knower of all the four vedas, the scholarly teacher, and the wise, guard our knowledge for our welfare.

౧౦౨౬ త్వమిత్యస్యోశనా ఋషిః, విశ్వేదేవాః దేవతాః, నిచృదనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.

అథ సభేశసేనేశయోః కర్తవ్యమాహ. సభాపతి సేనాపతుల కర్తవ్యము.

**౧౦౨౬ త్వం యవిష్ఠ దాశుషో నౄ్ః పాహి శృణుధీ గిరః।**

**రక్షా తోకముత త్మనా॥౨౭॥**

**ప.వి:-త్వమ్, యవిష్ఠ, దాశుషః, నౄన్, పాహి, శృణుధి, గిరః, రక్ష, తోకమ్, ఉత, త్మనా.॥౨౭॥**

**పదార్థః** :-(త్వమ్) సభేశ (యవిష్ఠ) అతిశయేన యువన్ (దాశుషః) విద్యాదాతౄన్ (నౄన్) అధ్యాపకాన్ మనుష్యాన్ (పాహి) (శృణుధి) అత్రాన్యేషామపి దృశ్యత ఇతి దీర్ఘః. (గిరః) విదుషాం

విద్యాసుశిక్షితా వాచః (రక్ష) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః. (తోకమ్) పుత్రాదికమ్ (ఉత) (త్మనా) ఆత్మనా.॥౭౭॥

**అన్వయః** :- హే యవిష్ఠ రాజన్! త్వం దాశుషో నౄన్ పాహ్యేతేషాం గిరః శృణుధి యో వీరో యుద్ధే మ్రియేత తస్య తోకం త్మనా రక్షోతాపి స్త్రియాదికం చ.॥౭౭॥

**భావార్థః** :- సభేశసేనేశయోర్ద్వే కర్మణీ అవశ్యం కర్తవ్యే స్త ఏకం విదుషాం పాలనం తదుపదేశ శ్రవణఞ్చ ద్వితీయం యుద్ధే హతానామపత్యస్త్ర్యాదిపాలనఞ్చైవం సమాచరతాం పురుషాణాం సదైవ విజయః శ్రీః సుఖాని చ భవన్తీతి విద్వద్భిర్వేద్యమ్. ॥౭౭॥

**పదార్థము** :- (యవిష్ఠ) పూర్ణయువావస్థయందున్నరాజా! (త్వమ్) నీవు (దాశుషః) విద్యాదాతవు (నౄన్) మానవులను (పాహి) రక్షించుము. మరియు వీరి (గిరః) విద్యాశిక్షణలతో గూడిన వాణులను (శృణుధి) వినుము. యుద్ధమున హతులైన వీరుల (తోకమ్) బాలబాలికలగు సంతానములను (ఉత) మరియు వారి కుటుంబమును (త్మనా) ఆత్మతో (రక్ష) రక్షించుము.॥౭౭॥

**భావార్థము** :-సభ మరియు సేనాధ్యక్షులకు రెండు కార్యములు అవశ్యకర్తవ్యములై యున్నవి. ఒకటి విద్వాంసుల పాలించుట, వారియుపదేశములవిని ఆచరించుట. రెండవది యుద్ధమున మరణించిన వారి స్త్రీలు, సంతానములను పాలించుట. ఇట్టి యాచరణగలవారు సదావిజయులై ధనములను, సుఖములను వృద్ధిపరచగలుగుదురు.॥౭౭॥

O most youthful king, guard the teachers who impart knowledge and listen to their sermons.

Protect with all thy force the offspring and the ladies of those who have died in war!.

అత్ర గణితవిద్యారాజప్రజాపఠకపాఠకకర్మాదివర్ణనాదేతదధ్యాయోక్తార్థానాం పూర్వాధ్యాయోక్తార్థైః సహ సంగతిరస్తీతి బోధ్యమ్.

ఈ పదునెనిమిదవ యధ్యాయమందు గణితవిద్య, రాజు, ప్రజలు మరియు చదువుట, చదివించుట, అనగా అధ్యాపక అధ్యేతల కర్మలు మున్నగువాని వర్ణనము మండుటచే ఈ యధ్యాయమునందుగల అర్థములకు, పూర్వాధ్యాయమునందు చెప్పబడిన అర్థములతో సంగతిగలదని యెరుగవలయును.

ఇతి శ్రీమద్విద్వద్వరపరమహంసపరివ్రాజకాచార్యాణాం పరమవిదుషాం శ్రీయుత విరజానన్దసరస్వతీ స్వామినాం శిష్యేణ దయానన్దసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యేఽష్టాదశోఽధ్యాయః. సమాప్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామివిరచిత సంస్కృతార్యభాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి పదునెనిమిదవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
'మఱ్ఱి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన
**పదునెనిమిదవ అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

# యజుర్వేదభాష్యము

## 19వ అధ్యాయము - విషయసూచిక

# అథైకోనవింశోऽధ్యాయః

## అస్మిన్నధ్యాయే పఞ్చానవతి మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥యు.౩౦.౩॥

౧౦౨౭.స్వాద్వీమిత్యస్య ప్రజాపతిరృషిః, సోమో దేవతా, నిచృచ్ఛక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైర్ధర్మార్థకామమోక్షసిద్ధయే కిం కర్తవ్యమిత్యాహ?

మానవులు ధర్మార్థకామమోక్షముల సిద్ధికై యేమి యొనర్పవలయును?

౧౦౨౭ స్వాద్వీం త్వా స్వాదునా తీవ్రాం తీవ్రేణామృతామమృతేన

మధుమతీమ్మధుమతా సృజామి సꣳసోమేన సోమోऽస్యశ్విభ్యాం

పచ్యస్వ సరస్వత్యై పచ్యస్వేన్ద్రాయ సుత్రామ్ణే పచ్యస్వ ॥౧॥

ప.విః-స్వాద్వీమ్,త్వా, స్వాదునా, తీవ్రామ్, తీవ్రేణ,అమృతామ్, అమృతేన, మధుమతీమితి మధు + మతీమ్, మధుమతేతి మధు + మతా, సృజామి, సమ్, సోమేన, సోమః, అసి, అశ్విభ్యామిత్యశ్వి + భ్యామ్, పచ్యస్వ, సరస్వత్యై, పచ్యస్వ, ఇన్ద్రాయ, సుత్రామ్ణ ఇతి సు + త్రామ్ణే, పచ్యస్వ.॥౧॥

పదార్థః:- (స్వాద్వీమ్) సుస్వాదుయుక్తామ్ (త్వా) త్వామ్ (స్వాదునా) మధురాదినా (తీవ్రామ్) తీక్ష్ణస్వభావామ్ (తీవ్రేణ) ఆశుకారిగుణేన (అమృతామ్) అమృతాత్మికామ్ (అమృతేన) సర్వరోగప్రహారకేణ గుణేన (మధుమతీమ్) ప్రశస్తమధురగుణయుక్తామ్ (మధుమతా) స్వాదిష్ఠగుణేన (సృజామి) నిష్పాదయామి (సమ్) (సోమేన) సోమలతా ద్యోషధిసమూహేన (సోమః) ఐశ్వర్యయుక్తః (అసి)(అశ్విభ్యామ్) వ్యాప్తవిద్యాభ్యాం స్త్రీపురుషాభ్యామ్ (పచ్యస్వ) పరిపక్వాం కురు (సరస్వత్యై) విద్యాసుశిక్షితవాణీయుక్తాయై

**అన్వయః:-యో విద్వానర్ద్ధఋచైరుక్థానాం రూపం పదైః ప్రణవైః శస్త్రాణాం రూపం నివిద శ్చాప్నోతి యేన విదుషా పయసా సోమ ఆప్యతే స వేదవిత్కథ్యతే.॥౨౫॥**

**భావార్థః:-యే విదుషః సకాశాదధీత్య వేదస్థానాం పదవాక్యమన్త్రవిభాగ శబ్దార్థ సమ్బన్ధానాం యథార్థం విజ్ఞానం కుర్వన్తి తేఽత్రాఽధ్యాపకా భవన్తి.॥౨౫॥**

పదార్థము :- ఏ విద్వాంసుడు (అర్ధఋచైః) ఋక్కుల అర్ధభాగములతో (ఉక్థానామ్) కథనమొనర్చదగిన వైదిక స్తోత్రముల (రూపమ్) స్వరూపము (పదైః) సుబంత, తిఙన్త, పదములతో మరియు (ప్రణవైః) ఓంకారములతో (శస్త్రాణామ్) శస్త్రముల (రూపమ్) స్వరూపము మరియు (నివిదః) నిశ్చయముగ ప్రాప్తించువానిని (ఆప్నోతి) ప్రాప్తించుకొనునో లేక ఏ విద్వాంసునిచే (పయసా) జలముతో గూడ (సోమః) సోమౌషధీరసము (ఆప్యతే) పొందుచున్నవాడో ఆతడే వేదవేత్తయనబడును. ॥౨౫॥

భావార్థము :-విద్వాంసునియొద్దనుండి చదువుచు వేదముల పదములు, వాక్యములు, మంత్ర విభాగములను, శబ్దార్థములను మరియు వాని సంబంధములను యథావతుగ తెలిసికొనువారు ఈ ప్రపంచమున అధ్యాపకులగుదురు. ॥౨౫॥

25. A learned person gets songs of praise by verse-halves, short detached formulae by case-terminations. By Om exclamations he gets the mode of praise, prayer and contemplation. By water is got the soma juice.

౧౦౫౬. అశ్విభ్యామిత్యస్య హైమవర్చిరృషిః, యజ్ఞో దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

సత్పురుషైః కథం భవితవ్యమిత్యాహ.

సత్పురుషు లెటు లుండవలయును?

౧౦౫౬ అశ్విభ్యాం ప్రాతఃసవనమిన్ద్రేణైన్ద్రం మాధ్యన్దినమ్।

వైశ్వదేవꣳ సరస్వత్యా తృతీయమాప్తꣳ సవనమ్ ॥౨౬॥

ప.వి:-అశ్విభ్యామిత్యశ్వి + భ్యామ్, ప్రాతః సవనమితి ప్రాతఃఽ సవనమ్, ఇన్ద్రేణ, ఐన్ద్రమ్, మాధ్యన్దినమ్, వైశ్వదేవమితి వైశ్వ+దేవమ్, సరస్వత్యా, తృతీయమ్, ఆప్తమ్, సవనమ్.॥౨౬॥

**పదార్థః:-(అశ్విభ్యామ్) సూర్యాచన్ద్రమోభ్యామ్ (ప్రాతస్సవనమ్) ప్రాతఃకాలే సవనం యజ్ఞా క్రియా ప్రేరణమ్ (ఇన్ద్రేణ) విద్యుతా (ఐన్ద్రమ్) ఐశ్వర్యకారకమ్ (మాధ్యన్దినమ్) మధ్యాహ్నే భవమ్ (వైశ్వదేవమ్) విశ్వేషాం దేవానామిదమ్ (సరస్వత్యా) సత్యయా వాచా**

(తృతీయమ్) త్రయాణాం పూరకమ్ (ఆప్తమ్) వ్యాప్తం ప్రాప్తం (సవనమ్) ఆరోగ్యకరం హోమాదికమ్.॥౨౬॥

అన్వయః:-యైరశ్విభ్యాం ప్రథమం ప్రాతఃసవనమిన్ద్రే ణైన్ద్రం ద్వితీయం మాధ్యన్దినం సేవనం సరస్వత్యా వైశ్వదేవం తృతీయం సవనమాప్తన్తే జగదుపకారకాః సన్తి.॥౨౬॥

భావార్థః:-యే త్రిషు కాలేషు సార్వజనికహితమాచరన్తి తేஉత్ర సత్పురుషాస్సన్తి॥౨౬॥

పదార్థము:-ఏ మనుష్యులు (అశ్విభ్యామ్) సూర్యచంద్రులచే ప్రథమముగ (ప్రాతఃసవనమ్) ప్రాతఃకాలము యజ్ఞక్రియయొక్క ప్రేరణను (ఇన్ద్రేణ) విద్యుత్తుచే (ఐన్ద్రమ్) ఐశ్వర్యకారకముగు రెండవ (మాధ్యన్దినమ్) మధ్యాహ్నసమయమున జరుపబడు మరియు (సవనమ్) ఆరోగ్యమును గలిగించు హోమము మున్నగు కర్మలు మరియు (సరస్వత్యా) సత్యవాణితో (వైశ్వదేవమ్) సంపూర్ణ విద్వాంసుల సత్కారరూప (తృతీయమ్) మూడవసవనము. అనగా సాయంకాల క్రియను యథావతుగ (ఆప్తమ్) ప్రాప్తించు కొందురో వారు జగదుపకారకు లగుచుందురు. ॥౨౬॥

భావార్థము :-భూతభవిష్యద్వర్తమానము లను మూడు కాలములందును మనుష్యులు మున్నగు సమస్త ప్రాణులకు హితమొనర్చువారు ప్రపంచములో సత్పురుషులై యుందురు.॥౨౬॥

26. They are the benefactors of humanity, who perform the morning yajna with the sun and moon, the glorious mid-day prosperity bringer yajna through lightning, the evening yajna, the giver of health, through true vedic speech, for reverence of the learned.

౧౦౫౩.వాయవ్యైరిత్యస్య హైమవర్చిరృషిః, యజ్ఞో దేవతా, భురిగనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

విదుషాం కథం భవితవ్యమిత్యాహ. విద్వాంసు లెటులుండవలయును?

౧౦౫౩ వాయవ్యైర్వాయవ్యాన్యాప్నోతి సతేన ద్రోణకలశమ్।
కుమ్భీభ్యామమ్భృణౌ సుతే స్థాలీభిః స్థాలీరాప్నోతి॥౨౭॥

ప.వి:-వాయవ్యైః, వాయవ్యాని, ఆప్నోతి, సతేన, ద్రోణకలశమితి ద్రోణ + కలశమ్, కుమ్భీభ్యామ్, అమ్భృణౌ, సుతే, స్థాలీభిః, స్థాలీః, ఆప్నోతి. ॥౨౭॥

పదార్థః:-(వాయవ్యైః) వాయుషు భవైర్వాయుదేవతాకైర్వా (వాయవ్యాని) వాయుషు భవాని వాయుదేవతాకాని వా (ఆప్నోతి) (సతేన) విభక్తేన కర్మణా (ద్రోణకలశమ్) ద్రోణశ్చ కలశశ్చ తత్ (కుమ్భీభ్యామ్) ధాన్యజలాధారాభ్యామ్ (అమ్భృణౌ) అపో బిభర్తి

యాభ్యాం తౌ (సుతే) నిష్పాదితే. లిఙ్గవ్యత్యయశ్ఛాన్దసః(స్థాలీభిః)యాసు పదార్థాన్ స్థాపయన్తి పాచయన్తి వా తాభిః(స్థాలీః)(ఆప్నోతి)॥౨౭॥

అన్వయః:-యో విద్వాన్ వాయవ్యైర్వాయవ్యాని సతేన ద్రోణకలశమాప్నోతి కుమ్భీభ్యామమ్భృణౌ సుతే స్థాలీభిః స్థాలీరాప్నోతి స ఆఢ్యో జాయతే.॥౨౭॥

భావార్థః:-కశ్చిదపి మనుష్యో వాయుకార్యాణ్యవిదిత్వైతత్కారణేన వినా పరిమాణ విద్యామనయా వినా పాకవిద్యాం తామన్తరాన్నసంస్కారక్రియాఞ్చ ప్రాప్తున్న శక్నోతి.॥౨౭॥

పదార్థము :-ఏ విద్వాంసుడు (వాయవ్యైః) వాయువునందుగల గుణముల లేక వాయువు దేవత గల దివ్యోత్పాదక పదార్థములచే (వాయవ్యాని) వాయువునందు గలుగు లేక వాయుదేవతగల కర్మలను (సతేన) విభాగముతో గూడిన కర్మలచే (సుతే) సిద్ధపరచబడిన రెండు విధములగు రసములను (స్థాలీభిః) పాకమొనర్చునట్టి పాత్రలు లేక పళ్లెములచే (స్థాలీః) పాత్రలను [పళ్లెములను] (ఆప్నోతి) పొందునో వాడే ధనాఢ్యుడగును.॥౨౭॥

భావార్థము :-ఏ మనుష్యులైనను వాయువుయొక్క కర్మలనెరుగక, వానికారణములెరుగక పరిమాణవిద్యను, పాకవిద్యను మరియు దీని జ్ఞానములేక అన్నముయొక్క సంస్కారక్రియను పొందజాలరు.॥౨౭॥

27.He is wealthy, who with the attributes of air gains the objects residing in air, by the process of separation gains the Drona and Kalash, vessels for Soma, by two jars of corn and water gains two cleansing vessels, and by the cooking pot gains the pots for cooking.

౧౦౫౪. యజుర్భిరిత్యస్య హైమవర్చిర్ఋషిః, యజ్ఞో దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

సర్వే వేదమభ్యస్యేయురిత్యాహ. అందరు వేదమును అభ్యసించవలయును

౧౦౫౪ యజుర్భిరాప్యన్తే గ్రహా గ్రహైః స్తోమాశ్చ విష్టుతీః।

ఛన్దోభిరుక్థాశస్త్రాణి సామ్నావభృథఽ ఆప్యతే ॥౨౮॥

ప.వి:-యజుర్భిరితి యజుః + భిః, ఆప్యన్తే, గ్రహాః, గ్రహైః, స్తోమాః, చ, విష్టుతీః, విస్తుతీరితి వి + స్తుతీః, ఛన్దోభిరితి ఛన్దః + భిః ఉక్థాశస్త్రాణి, ఉక్థశస్త్రాణీత్యుక్థ + శస్త్రాణి, సామ్నా, అవభృథః ఇత్యవ + భృథః, ఆప్యతే.॥౨౮॥

పదార్థః:- (యజుర్భిః) యజన్తి సఙ్గచ్ఛన్తే యైర్యజుర్వేదవిద్యావయవైస్తైః (అప్యన్తే) (గ్రహాః) యైః సర్వం క్రియాకాణ్డం గృహ్ణన్తి తే వ్యవహారాః (గ్రహైః) (స్తోమాః) పదార్థగుణ ప్రశంసాః (చ)(విష్టుతీః) వివిధాశ్చ తాః స్తుతయశ్చ తాః (ఛన్దోభిః) గాయత్ర్యాది భిర్విద్వద్భిః స్తోతృభిర్వా. ఛన్ద ఇతి స్తోతృ నా... నిఘం. 3.౧౬ (ఉక్థాశస్త్రాణి) ఉక్థాని చ తాని శస్త్రాణి చ. అత్రాన్యేషామపీతి పూర్వపదస్య దీర్ఘః (సామ్నా) సామవేదేన (అవభృథః) శోధనమ్ (అప్యతే) ప్రాప్యతే.॥౨౮॥

అన్వయః:-హే మనుష్యాః! యుష్మాభిర్యైర్యజుర్భిర్గ్రహాః గ్రహైః స్తోమా విష్టుతీశ్చ ఛన్దోభిరుక్థాశస్త్రాణి చాప్యన్తే సామ్నావభృథ అప్యతే తేషాముపయోగో యథావత్కర్తవ్యః॥౨౮॥

భావార్థః:-కశ్చిదపి మనుష్యో వేదాభ్యాసేన వినా అఖిలాః సాఙ్గోపాఙ్గవిద్యాః ప్రాప్తుం నార్హతి.॥౨౮॥

పదార్థము :- ఓ మానవులారా! మీకు ఏ (యజుర్భిః) యజుర్వేదోక్త విద్యయొక్క అవయవములచే (గ్రహా) సమస్త క్రియాకాండ నెరుగు వ్యవహారములు (గ్రహైః) గ్రహములచే (స్తోమాః) పదార్థగుణముల ప్రశంస (చ) మరియు (విష్టుతీః) వివిధ స్తుతులు (ఛన్దోభిః) గాయత్రి మున్నగు ఛన్దములు లేక విద్వాంసుల మరియు గుణముల స్తుతించువారిచే (ఉక్థాశస్త్రాణి) వర్ణించదగిన వేదస్తోత్రములు మరియు శస్త్రములు (అప్యన్తే) ప్రాప్తించునో మరియు (సామ్నా) సామవేదముచే (అవభృథః) శోధనము (అప్యతే) ప్రాప్తించునో వాని యుపయోగమును యథావతుగ పొందవలయును.॥౨౮॥

భావార్థము :- ఏ మనుష్యుడును వేదాభ్యాస మొనర్చక సంపూర్ణముగ సాంగోపాంగ వేదవిద్యలను పొందుటకు యోగ్యుడు గాజాలడు. ॥౨౮॥

28.The recitation of the Yajur Veda gives us the knowledge of ceremonies (Sanskaras). The knowledge of ceremonies (Karma-Kanda) teaches us the attributes of objects and different praise-songs. Through Gayatri metres, and learned singers of the praise of fine traits are obtained the vedic verses worthy of recitation and weapons. The recitation of Sama veda gives us purification.

౧౦౫౫.ఇడాభిరిత్యస్య, హైమవర్చిరృషిః ఇడా దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

గృహస్థైః పురుషైః కిం కర్తవ్యమిత్యాహ. గృహస్థు లేమి చేయువలయును?

౧౦౫౫ ఇడాభిర్భక్షానాప్నోతి సూక్తవాకేనాశిషః।

శమ్యునా పత్నీసంయాజాన్త్సమిష్టయజుషా సంస్థామ్ ॥౨౯॥

ప.వి:-ఇడాభిః, భక్షాన్, ఆప్నోతి, సూక్తవాకేనేతి సూక్త + వాకేన ఆశిష ఇత్యా + శిషః, శంయునేతి శమ్+ యునా, పత్నీసంయాజానితి పత్నీ + సంయాజాన్ సమిష్టయజుషేతి సమిష్ట + యజుషా, సంస్థామితి సమ్ + స్థామ్.॥౨౯॥

పదార్థః:- (ఇడాభిః) పృథివీభిః. ఇడేతి పృథివీనా... నిఘం..౧.౧. (భక్షాన్) భక్షితుమర్హాన్ భోజ్యాన్ పదార్థాన్ (ఆప్నోతి) (సూక్తవాకేన) సుష్ఠూచ్యతే తత్ సూక్తవాకస్తేన (ఆశిషః) ఇచ్ఛాః (శంయునా) సుఖమయేన (పత్నీసంయాజాన్) యే పత్న్యా సహ సమిజ్యన్తే తాన్ (సమిష్టయజుషా) సమ్యగిష్టం యేన భవతి తేన (సంస్థామ్) సమ్యక్ తిష్ఠన్తి యస్యాం తామ్.॥౨౯॥

అన్వయః:-యో విద్వాన్నిడాభిర్భక్షాన్ సూక్తవాకేనాశిషః శంయునా పత్నీసంయాజాన్ సమిష్టయజుషా సంస్థామాప్నోతి స సుఖీ కథం న స్యాత్.॥౨౯॥

భావార్థః:- గృహస్థా వేదవిజ్ఞానేనైవ పృథివీరాజ్యభోగేచ్ఛాం తత్సిద్ధిసంస్థితిం చాప్నువన్తు.॥౨౯॥

పదార్థము :-ఏ విద్వాంసుడు (ఇడాభిః) పృథువులచే (భక్షాన్) భక్షించదగిన అన్నాదిపదార్థములను (సూక్తవాకేన) చక్కగా జెప్పువారి పలుకులచే (ఆశిషః) ఇష్టకామ్యముల సాధనకొరకు (శంయునా) దేనివలన సుఖప్రాప్తి గలుగునో (పత్నీసంయాజాన్) పత్నితో గలయువారికి (సమిష్టయజుషా) యజుర్వేదకర్మద్వారా శ్రేష్ఠ ఇష్టసిద్ధిగలుగునో దాని (సంస్థామ్) నివాస స్థానమును చక్కగా (ఆప్నోతి) ప్రాప్తించుకొనునోవాడు సుఖుడై యుండును. ॥౨౯॥

భావార్థము :- గృహస్థులు వేదవిజ్ఞానముచేతనే పృథివీరాజ్యభోగములను కాంక్షించుచు వాని సిద్ధిని అవశ్యముగ పొందగలరు. ॥౨౯॥

29.A learned person, obtains eatable foodstuffs from parts of the earth, and fulfils desires by the utterance of true noble words. From a peaceful deed is derived good relation between husband and wife. Consummation is obtained by performing the ceremonioes (Karma - kanda) of the yajur Veda.

౧౦౫౬. వ్రతేనేత్యస్య హైమవర్చిర్ఋషిః, యజ్ఞో దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

మనుష్యైః సత్యం గ్రాహ్యమసత్యఞ్చ త్యాజ్యమిత్యాహ.

మానవులు సత్యగ్రహణము అసత్యత్యాగమొనర్చవలయును.

౧౦౨౮. వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్।
దక్షిణా శ్రద్ధామాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే ॥30॥

ప.వి:- వ్రతేన, దీక్షామ్, ఆప్నోతి, దీక్షయా, ఆప్నోతి, దక్షిణామ్, దక్షిణా, శ్రద్ధామ్, ఆప్నోతి, శ్రద్ధయా, సత్యమ్, ఆప్యతే.॥30॥

పదార్థః:-(వ్రతేన) సత్యభాషణబ్రహ్మచర్యాదినియమేన (దీక్షామ్) బ్రహ్మచర్యవిద్యాది సుశిక్షాప్రజ్ఞాం (ఆప్నోతి) (దీక్షయా) (ఆప్నోతి) (దక్షిణామ్) ప్రతిష్ఠాం శ్రియం వా (దక్షిణా) దక్షిణయా. అత్ర విభక్తిలోపః. (శ్రద్ధామ్) శత్సత్యం దధాతి యయేచ్ఛయా తామ్. శ్రదితి సత్యనా... నిఘం...3.౧౦. (ఆప్నోతి) (శ్రద్ధయా) (సత్యమ్) సత్సు నిత్యేషు పదార్థేషు వ్యవహారేషు వా సాధుస్తం పరమేశ్వరం ధర్మం వా (ఆప్యతే) ప్రాప్యతే.॥30॥

అన్వయః:-యో బాలకః కన్యకా మనుష్యో వా వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయా దక్షిణామాప్నోతి దక్షిణా శ్రద్ధామాప్నోతి తథా శ్రద్ధయా వా యేన సత్యమాప్యతే స సుఖీ భవతి.॥30॥

భావార్థః:- కశ్చిదపి మనుష్యో విద్యాసుశిక్షాశ్రద్ధాభిర్వినా సత్యాన్ వ్యవహారాన్ ప్రాప్తుమసత్యాంశ్చ త్యక్తుం న శక్నోతి. ॥ 30 ॥

పదార్థము :- ఏ బాలబాలికలు, మనుష్యులు (వ్రతేన) బ్రహ్మచర్యము మున్నగు నియమములచే (దీక్షామ్) బ్రహ్మచర్యము మున్నగు సత్కర్మల ప్రారంభరూప దీక్షను (ఆప్నోతి) పొందుచున్నారో (దీక్షయా) అట్టివారే దీక్షద్వారా (దక్షిణామ్) ప్రతిష్ఠను ధనములను (ఆప్నోతి) పొందుచున్నారు (దక్షిణా) అట్టి ప్రతిష్ఠ మరియు ధనరూపముద్వారా (శ్రద్ధామ్) సత్యధారణమందు ప్రీతిరూప శ్రద్ధను (ఆప్నోతి) పొందుచున్నారు అట్టి (శ్రద్ధయా) శ్రద్ధద్వారా ఎవరు (సత్యమ్) నిత్యపదార్థముల లేక వ్యవహారములందు పరమేశ్వరుడు లేక ధర్మమును (ఆప్నోతి) పొందుదురో, అట్టివారే సుఖవంతులై యుందురు.॥30॥

భావార్థము :- ఏ మనుష్యుడు విద్య, ఉత్తమశిక్షణ మరియు శ్రద్ధలేకున్న సత్యవ్యవహారములను సాధించుట, దుష్టవ్యవహారములను త్యజించుటయందు సమర్థుడు గాజాలడు. ॥30॥

30.By the vow of celibacy one gains consecration, by consecration one gains wealth and position. By wealth and position one gains faith, by faith comes the knowledge of truth.

౧౦౫౭. ఏతావద్రూపమిత్యస్య హైమవర్చిర్‌ఋషిః యజ్ఞో దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మానవు లేమి చేయవలయును?

౧౦౫౭ ఏతావద్రూపం యజ్ఞస్య యద్దేవైర్బ్రహ్మణా కృతమ్।

తదేతత్సర్వమాప్నోతి యజ్ఞే సౌత్రామణీ సుతే ॥౩౧॥

ప.వి:- ఏతావత్, రూపమ్, యజ్ఞస్య, యత్, దేవైః, బ్రహ్మణా, కృతమ్, తత్, ఏతత్, సర్వమ్, ఆప్నోతి, యజ్ఞే, సౌత్రామణీ, సుతే.॥౩౧॥

పదార్థః:-(ఏతావత్) ఏతత్ పరిమాణమస్య తత్ (రూపమ్) స్వరూపమ్ (యజ్ఞస్య) యజనకర్మణః (యత్) (దేవైః) విద్వద్భిః (బ్రహ్మణా) పరమేశ్వరేణ వేదచతుష్టయేన వా (కృతమ్) నిష్పాదితం ప్రకాశితం వా (తత్) పరోక్షమ్ (ఏతత్) ప్రత్యక్షమ్ (సర్వమ్) (ఆప్నోతి) (యజ్ఞే) (సౌత్రామణీ) సూత్రాణి యజ్ఞోపవీతాదీని మణినా గ్రన్థినా యుక్తాని ధ్రియన్తే యస్మింస్తస్మిన్ (సుతే) సమ్పాదితే.॥౩౧॥

అన్వయః:- యో మనుష్యో యద్దేవైర్బ్రహ్మణా యజ్ఞస్యైతావద్ రూపం కృతం తదేతత్ సర్వం సౌత్రామణీ సుతే యజ్ఞ ఆప్నోతి స ద్విజత్వారమ్భం కరోతి.॥౩౧॥

భావార్థః:-విద్వద్భిర్మనుష్యైర్యావద్యజ్ఞానుష్ఠానానుసన్ధానం క్రియేత తావదేవానుష్ఠాయ మహోత్తమం యజ్ఞఫలమాప్తవ్యం. ॥౩౧॥

పదార్థము :- ఏ మనుష్యుడు (యత్) ఎట్టి (దేవైః) విద్వాంసుల మరియు (బ్రహ్మణా) పరమేశ్వరుడు లేక నాలుగువేదముల (యజ్ఞస్య) యజ్ఞముయొక్క (ఏతావత్) ఇంతటి (రూపమ్) స్వరూపమును (కృతమ్) సిద్ధపరచెనో లేక ప్రకాశితమొనర్చెనో (తత్) అట్టి (ఏతత్) ఈ (సర్వమ్) సర్వమును (సౌత్రామణీ) యజ్ఞోపవీతము మున్నగు గ్రంధియుక్త సూత్రధారణమొనర్చబడు, ఆ (సుతే) సాధించబడిన (యజ్ఞే) యజ్ఞమునందు (ఆప్నోతి) పొందుచున్నాడో యాతడు ద్విజుడగుటను ప్రారంభించుచున్నాడు. ॥౩౧॥

భావార్థము :- విద్వాంసులు యజ్ఞానుష్ఠాన అనుసంధానమెంతగా నొనర్చెదరో, ఒనర్చుచున్న గొప్ప ఉత్తమ యజ్ఞఫలమును పొందుట యోగ్యమై యున్నది.॥౩౧॥

31.He commences his second birth, who wearing the yajnopavit, joins a well arranged yajna, the nature of which has been explained by the learned, the vedas and God.

౧౦౫౮.సురావన్తమిత్యస్య హైమవర్చిరృషిః, ఇంద్రో దేవతా, నిచృదతిజగతీ ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౫౮ సురావన్తం బర్హిషదꣳ సువీరం యజ్ఞꣳ హిన్వన్తి మహిషా నమోభిః।

దధానాః సోమన్దివి దేవతాసు మదేమేన్ద్రం యజమానాః స్వర్కాః॥౩౨॥

ప.వి:-సురావన్తమితి సురా + వన్తమ్, బర్హిషదమ్, బర్హిషదమితి బర్హి + సదమ్, సువీరమితి సు + వీరమ్, యజ్ఞమ్, హిన్వన్తి, మహిషాః, నమోభిరితి నమః + భిః, దధానాః, సోమమ్, దివి, దేవతాసు, మదేమ, ఇన్ద్రమ్, యజమానాః, స్వర్కా ఇతి సు + అర్కాః.॥౩౨॥

పదార్థః:-(సురావన్తమ్) సురాః ప్రశస్తాః సోమా విద్యన్తే యస్మింస్తమ్ (బర్హిషదమ్) యో బర్హిష్యాకాశే సీదతి తమ్ (సువీరమ్) శోభనా వీరాః శరీరాత్మబలయుక్తా యస్మాత్తమ్ (యజ్ఞమ్) (హిన్వన్తి) వర్ధయన్తి (మహిషాః) మహాన్తః పూజనీయాః (నమోభిః) అన్నైః (దధానాః) ధరన్తః (సోమమ్) ఐశ్వర్యమ్ (దివి) శుద్ధే వ్యవహారే (దేవతాసు) విద్వత్సు (మదేమ) హర్షేమ (ఇన్ద్రమ్) పరమైశ్వర్యయుక్తజ్జనమ్ (యజమానాః) యే యజన్తి తే విద్వాంసః (స్వర్కాః) శోభనా అర్కా అన్నాదయః పదార్థా యేషాంతే. ॥౩౨॥

అన్వయః:-హే మనుష్యాః! యే మహిషాస్స్వర్కా యజమానా నమోభిః సురావన్తం బర్హిషదం సువీరం యజ్ఞం హిన్వన్తి తే దివి దేవతాసు సోమమిన్ద్రం దధానాః సన్తో వయఞ్చ మదేమ. ॥౩౨॥

భావార్థః:-యే మనుష్యా! అన్నాద్యైశ్వర్యం సఞ్చిత్య తేన విదుషః సన్తోష్య సద్విద్యాసు శిక్షాః సంగృహ్య సర్వహితైషిణః స్యుస్తేఽత్ర పుత్రకలత్రానన్దమాప్నువన్తు.॥౩౨॥

పదార్థము :- ఓ మానవులారా! ఏ (మహిషాః) మహాపూజనీయులు (స్వర్కాః) ఉత్తమ అన్నము మున్నగు పదార్థములతో గూడిన (యజమానాః) యజ్ఞమునొనర్చు విద్వాంసులు (నమోభిః) అన్నాదులతో (సురావన్తమ్) ఉత్తమ సోమరసముతో (బర్హిషదమ్) ప్రశస్త ఆకాశమందు స్థిరమైన యా (సువీరమ్) ఉత్తమ శరీర, ఆత్మబలముతో గూడిన వీరులను ప్రాప్తింపజేయు (యజ్ఞమ్) యజ్ఞమును (హిన్వన్తి) అభివృద్ధి పరచువారు, మరియు (దివి) శుద్ధవ్యవహారములందు మరియు (దేవతాసు) విద్వాంసులయందు (సోమమ్)

ఐశ్వర్యము మరియు (ఇన్ద్రమ్) పరమైశ్వర్యవంతుని (...) ... (...)
ఆనందమయుల మగుదుముగాక. ॥32॥

భావార్థము :- ఏ మనుష్యులు అన్నము మున్నగు ఐశ్వర్యముల సంచయమొనర్చి వానిద్వారా విద్వాంసులను ప్రసన్నులుగనొనర్చుచు సత్యవిద్యలయందు శిక్షణను పొందుచు సర్వమానవుల హితకారులగుదురో వా రీ ప్రపంచమునందు ఆనందప్రాప్తినొందెదరు. ॥32॥

32.The exalted adorable sacrificers, equipped with food-stuffs, make prosperous with oblations the yajna, great like the sun in the sky, full of Soma juice, giver of heroes, the masters of physical and spiritual forces. May we be happy, doing noble deeds, befriending the dignified and learned persons, and gaining power.

౧౦౫౯ యస్తే రస ఇత్యస్య హైమవర్చిర్ఋషిః, ఇంద్రో దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః, స్వరః.

కిమ్భూతా జనా ధన్యా ఇత్యాహ. ఎవరు ధన్యవాదార్హులు?

౧౦౫౯ యస్తే రసః సమ్భృతఽ ఓషధీషు సోమస్య శుష్మః సురయా సుతస్య ।
తేన జిన్వ యజమానం మదేన సరస్వతీమశ్వినావిన్ద్రమగ్నిమ్ ॥33॥

ప.వి:- యః, తే, రసః, సమ్భృత ఇతి సమ్ + భృతః, ఓషధీషు, సోమస్య, శుష్మః, సురయా, సుతస్య, తేన, జిన్వ, యజమానమ్, మదేన, సరస్వతీమ్, అశ్వినౌ, ఇన్ద్రమ్, అగ్నిమ్. ॥33॥

పదార్థః:- (యః) (తే) తవ (రసః) ఆనన్దః (సమ్భృతః) సమ్యగ్ధృతః (ఓషధీషు) సోమలతాదిషు (సోమస్య) అంశుమదాదిసంజ్ఞస్య చతుర్వింశతిధా భిద్యమానస్య (శుష్మః) శుష్మం బలం విద్యతే యస్మిన్ సః (సురయా) శోభనదానశీలయా స్త్రియా (సుతస్య) నిష్పాదితస్య (తేన) (జిన్వ) ప్రీణీహి (యజమానమ్) సర్వేభ్యః సుఖం దదమానమ్ (మదేన) ఆనన్దప్రదేన (సరస్వతీమ్) ప్రశస్తవిద్యాయుక్తాం స్త్రియమ్ (అశ్వినౌ) విద్యావ్యాప్తావధ్యాపకోపదేశకౌ (ఇన్ద్రమ్) ఐశ్వర్యయుక్తం సభాసేనేశమ్ (అగ్నిమ్) పావకవచ్ఛత్రుదాహకం యోద్ధారమ్.॥33॥

అన్వయః:- హే విద్వన్! యస్త ఓషధీషు వర్తమానస్య సుతస్య సోమస్య సురయా సమ్భృతః శుష్మీ రసోఽస్తి తేన మదేన యజమానం సరస్వతీమశ్వినావిన్ద్రమగ్నిఞ్చ జిన్వ.॥33॥

**భావార్థః:- యే విద్వాంసో జనా మహౌషధిసారం స్వయం సంసేవ్యాన్యాన్సేవయిత్వా సతతమానన్దం వర్ధయేయుస్తే ధన్యాః సన్తి.॥33॥**

పదార్థము :- ఓ విద్వాంసుడా! (యః) ఏ (తే) నీయొక్క (ఓషధీషు) సోమలత మున్నగు ఓషధులందున్నట్టి (సుతస్య) సిద్ధపరచినట్టి (సోమస్య) అంశమంతము మున్నగు ఇరువదినాలుగు విధములగు సోమముయొక్క (సురయా) ఉత్తమ దానశీలయగు మహిళచే (సమ్భృతః) చక్కగా ధారణమొనర్చబడిన (శుష్మః) బలకారి (రసః) రసము గలదో (తేన) అట్టి (మదేన) ఆనందదాయక రసముచే (యజమానమ్) ఎల్లరను సుఖవంతులుగ నొనర్చు యజమానుని (సరస్వతీమ్) ఉత్తమ విద్యావంతురాలగు మహిళను (అశ్వినౌ) విద్యలవ్యాప్తపరచు అధ్యాపకోపదేశకులను (ఇన్ద్రమ్) ఐశ్వర్యవంతులుగల సభను మరియు సేనాపతులను (అగ్నిమ్) అగ్నివలె శత్రువుల దహించివేయు యోధులను (జిన్వ) ప్రసన్నపరచుము.॥33॥

భావార్థము :- మహౌషధముల సారమును తాము సేవించుచు ఇతరుల సేవింపజేయుచు నిరంతరము ఆనందపరచు విద్వాంసులు ధన్యవాదార్హు లగుదురు.॥33॥

33.O learned person, the strong essence of Soma, duly collected by a charitable lady is drawn from plants. With that glanddening essence impel with joy, the sacrificer, the learned lady, the scholarly teachers and preachers, the supreme king and Commander, and the hero that burns the foe like

౧౦౬౦. యమశ్వినేత్యస్య హైమవర్చిర్ఋషిః, సోమో దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

కీదృశాః జనాః సుఖినో భవన్తీత్యాహ. ఏ పురుషులు సుఖులు కాగలరు?

**౧౦౬౦ యమశ్వినా నముచేరాసురాదధి సరస్వత్యసునోదిన్ద్రియాయ ।**

**ఇమన్తꣳ శుక్రమ్మధుమన్తమిన్దుꣳ సోమꣳ రాజానమిహ భక్షయామి ॥34॥**

**ప. విః- యమ్, అశ్వినా, నముచేః, ఆసురాత్, అధి, సరస్వతీ, అసునోత్, ఇన్ద్రియాయ, ఇమమ్, తమ్, శుక్రమ్, మధుమన్తమ్, ఇన్దుమ్, సోమమ్, రాజానమ్, ఇహ, భక్షయామి.॥34॥**

**పదార్థః:-(యమ్) (అశ్వినా) సభాసేనేశౌ (నముచేః) యో జలం న ముఞ్చతి తస్మాత్ (ఆసురాత్) అసురస్య మేఘస్యాయం తస్మాత్ (అధి) (సరస్వతీ) విదుషీ స్త్రీ (అసునోత్) సునోతి (ఇన్ద్రియాయ) ధనాయేన్ద్రియబలాయ వా (ఇమమ్) (తమ్) (శుక్రమ్) శీఘ్రం బలకరమ్ (మధుమన్తమ్) ప్రశస్తమధురాదిగుణ యుక్తమ్ (ఇన్దుమ్) పరమైశ్వర్యకారకమ్**

(సోమమ్) పురుషార్థే ప్రేరకమ్ (రాజానమ్) ప్రకాశమానమ్ (ఇహ) అస్మిన్ సంసారే (భక్షయామి) భుఞ్జే భోజయామి వా.॥౩౪॥

అన్వయః:-హే మనుష్యాః! ఇహేన్ద్రియాయ యం నముచేరాసురాదధి శుక్రం మధుమన్తమిన్దుం రాజానం సోమం సరస్వత్యసుషోదశ్వినా సునుతాం తమిమమహం భక్షయామి.॥౩౪॥

భావార్థః:-యే మనుష్యాః! సారాన్నరసభోజినో భవన్తి తే బలిష్ఠేన్ద్రియాః సన్తః సదానన్దం భుఞ్జతే.॥౩౪॥

పదార్థము :- ఓ మానవులారా! (ఇహ) ఈ జగములో (ఇన్ద్రియాయ) ధనము మరియు ఇంద్రియ బలమునకై (యమ్) ఏ (నముచే) జలములవదలనట్టి (ఆసురాత్) మేఘవ్యవహారములకన్న (అధి) అధికము (శుక్రమ్) శీఘ్రబలకారి (మధుమన్తమ్) శ్రేష్ఠ మధురాది గుణములతో గూడిన (ఇన్దుమ్) పరమైశ్వర్యవంత మొనర్చునట్టి (రాజానమ్) ప్రకాశవంతమునగు (సోమమ్) పురుషార్థమందు ప్రేరణనిచ్చు సోమోషధిని (సరస్వతీ) విదుషీరత్నము (అసుషోత్) సిద్ధపరచునో, (అశ్వినా) సేనాపతి, సభాపతులు సిద్ధపరచెదరో (తమ్, ఇమమ్) అట్టి దీనిని నేను (భక్షయామి) సేవించుచు, సేవింపజేయుదును.॥౩౪॥

భావార్థము :-శ్రేష్ఠమగు అన్నరసములను భుజించువారు బలిష్ఠులు, ఇంద్రియబలములచే సదా ఆనందముల ననుభవించెదరు.॥౩౪॥

In this world, for wealth and physical strength, I drink and feed on Soma plant, producer of activity, brilliant, giver of glory, full of sweetness, highly invigorating, acquired by a learned lady and the King and Commander from clouds that do not release water.

౧౦౬౧. యదత్ర ఇత్యస్య హైమవర్చిర్ఋషిః, సోమో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః సర్వ ఆనన్దయితవ్య ఇత్యాహ. మానవు లందఱిని ఆనందింపజేయవలయును.

౧౦౬౧ యదత్ర రిప్తꣳ రసినః సుతస్య యదిన్ద్రో౾అపిబచ్ఛచీభిః।
అహన్తదస్య మనసా శివేన సోమꣳ రాజానమిహ భక్షయామి ॥౩౫॥

ప.వి:-యత్, అత్ర, రిప్తమ్, రసినః, సుతస్య, యత్, ఇన్ద్రః, అపిబత్, శచీభిః, అహమ్, తత్, అస్య, మనసా, శివేన, సోమమ్, రాజానమ్, ఇహ, భక్షయామి. ॥౩౫॥

పదార్థః:-(యత్) (అత్ర) అస్మిన్సంసారే (రిప్తమ్) లిప్తం ప్రాప్తమ్. అత్ర లకారస్య

రేఫాదేశః (రసినః) ప్రశస్తో రసో విద్యతే యస్మింస్తస్య (సుతస్య) నిష్పాదితస్య (యత్) యమ్ (ఇన్ద్రః) సూర్యః (అపిబత్) (శచీభిః) క్రియాభిః, శచీతి కర్మనా... నిఘం. ౨.౧ (అహమ్) (తత్) తమ్ (అస్య) (మనసా) (శివేన) మఙ్గలమయేన (సోమమ్) ఓషధీరసమ్ (రాజానమ్) దేదీప్యమానమ్ (ఇహ) (భక్షయామి).॥౩౫॥

అన్వయః:- హే మనుష్యాః! యథాఽహమిహాస్య సుతస్య రసినో యదత్ర రిప్తమస్తీన్ద్రశ్శచీభిర్యదపిబత్తద్ రాజానం సోమం చ శివేన మనసా భక్షయామి తథా యూయమపి భక్షయత.॥౩౫॥

భావార్థః:- హే మనుష్యాః యథా సూర్యః స్వకిరణైర్జలాన్యాకృష్య వర్షిత్వా సర్వాన్ సుఖయతి తథైవానుకూలాభిః క్రియాభీ రసాన్ సంసేవ్య బలమున్నీయ యశో వృష్ట్వా సర్వాన్ యూయమానన్దయత.॥౩౫॥

పదార్థము :- ఓ మానవులారా! ఎట్లు (అహమ్) నేను (ఇహ) ఈ జగమందు (అస్య) ఇట్టి (సుతస్య) సిద్ధపరచబడిన (రసినః) ప్రశంసనీయ రసయుక్త పదార్థముయొక్క (యత్) ఏ భాగమును (అత్ర) ఈ లోకమునందే (రిప్తమ్) అనురక్తమై యున్నదో లేక (ఇన్ద్రః) సూర్యుడు (శచీభిః) ఆకర్షణము మున్నగు క్రియలతో (యత్) దేనిని (అపిబత్) త్రావునో (తత్) దానిని మరియు (రాజానమ్) ప్రకాశవంతమగు (సోమమ్) ఓషధుల రసమును (శివేన) కల్యాణకారకమగు (మనసా) మనస్సుతో (భక్షయామి) నేను భక్షింతునో, గ్రోలుదునో అదేవిధముగ మీరును భక్షించుచు సేవించుచు నుండుడు. ॥౩౫॥

భావార్థము :- ఓ మానవులారా! సూర్యుడెట్లు తన కిరణములద్వారా జలముల నాకర్షించి, వర్షింపజేసి సకలప్రాణులను సుఖవంతమొనర్చునో అదేవిధముగ అనుకూల క్రియలద్వారా ఓషధీరసముల సేవించుచు చక్కని ఆరోగ్యబలములను పెంపొందించుకొని కీర్తివంతముగ యందర నానందపరచుచుండుడు. ॥౩౫॥

35.Whatever portion of this savoury fluid is clinging here, what the sun drnak with his powers of attraction, I drink and feed on that brilliant Soma juice, with a pure mind.

౧౦౬౨.పితృభ్య ఇత్యస్య ప్రజాపతిరృషిః, పితరో దేవతాః, నిచృదష్టిశ్ఛన్దః, మధ్యమః స్వరః.

పిత్రపత్యాదిభిరితరేతరం కథం వర్తితవ్యమిత్యాహ. తల్లిదండ్రులు, బిడ్డలు పరస్పర మెటుల మెలగవలయును?

౧౦౬౨ పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః పితామహేభ్యః స్వధాయిభ్యః

స్వధా నమః ప్రపితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః। అక్షన్

పితరోఽమీమదన్త పితరోఽతీతృపన్త పితరః పితరః శున్ధధ్వమ్ ॥౩౬॥

ప.వి:-పితృభ్య ఇతి పితృ + భ్యః, స్వధాయిభ్య ఇతి స్వధాయి + భ్యః, స్వధా, నమః, పితామహేభ్యః, స్వధాయిభ్య ఇతి స్వధాయి + భ్యః, స్వధా, నమః, ప్రపితామహేభ్య ఇతి ప్ర + పితామహేభ్యః, స్వధాయిభ్య ఇతి స్వధాయిభ్యః, స్వధా, నమః, అక్షన్, పితరః, అమీమదన్త, పితరః, అతీతృపన్త, పితరః, పితరః, శున్ధధ్వమ్.॥౩౬॥

పదార్థః:-(పితృభ్యః) పాలకేభ్యో జనకాధ్యాపకాదిభ్యః (స్వధాయిభ్యః) యే స్వధాముదకమన్నం వైతం ప్రాప్తుం శీలాస్తేభ్యః. స్వధేత్యుదకనా... నిఘం.౧.౧౨. స్వధేత్యన్ననా.. నిఘ. ౨. ౭.(స్వధా) అన్నమ్ (నమః) సత్కారణమ్ (పితామహేభ్యః) యే పితౄణాం పితరస్తేభ్యః (స్వధాయిభ్యః) (స్వధా) స్వాన్ దధాతి యయా సా క్రియా (నమః) నమనమ్ (ప్రపితామహేభ్యః) యే పితామహానాం పితరస్తేభ్యః (స్వధాయిభ్యః) (స్వధా) స్వేన ధారితా సేవా (నమః) అన్నాదికమ్ (అక్షన్) అదన్తు. యోఽద్యాతోః స్థానే ఘస్ ఐ ఆదేశస్తస్య లుఙిరూపమ్ (పితరః) జ్ఞానినః (అమీమదన్త) అతిశయేన హర్షయత (పితరః) (అతీతృపన్త) అతిశయేన తర్పయత (పితరః) (పితరః) (శున్ధధ్వమ్) పవిత్రీకురుత.॥౩౬॥

అన్వయః:-అస్మాభిః పుత్రశిష్యాదిమనుష్యైర్యేభ్యః స్వధాయిభ్యః పితృభ్యః స్వధా నమః స్వధాయిభ్యః పితామహేభ్యః స్వధా నమః స్వధాయిభ్యః ప్రపితామహేభ్యః స్వధా నమః క్రియతే. హే పితరస్తే భవన్తోఽస్మ త్ప్రసంస్కృతాన్యన్నాదీన్యక్షన్. హే పితరో! యూయమానన్దితా భూత్వాఽస్మానమీమదన్త. హే పితరో! యూయం తృప్తా భూత్వాఽస్మానతీతృపన్త. హే పితరో! యూయం శుద్ధా భూత్వాఽస్మాన్ శున్ధధ్వమ్.॥౩౬॥

భావార్థః:-హే పుత్రశిష్యస్నుషాదయో జనాః యూయముత్తమైరన్నాదిభిః పిత్రాదీన్వృద్ధాన్సతతం సత్కురుత, పితరో యుష్మాన్సాయానావర్ధయేయుః. యథా మాతాపిత్రాదయో బాల్యావస్థాయాం యుష్మాన్ సేవన్తే తథైవ యూయం వృద్ధావస్థాయాం తేషాం సేవాం యథావత్కురుత.॥౩౬॥

పదార్థము :-పుత్రులము, శిష్యులము నగు మేము (స్వధాయిభ్యః) చక్కని అన్నజలములను ప్రాప్తించుకొను స్వభావముగలవారగు (పితృభ్యః) జ్ఞానులకు ఎట్లు (స్వధా) అన్నము నిచ్చెదమో మరియు

(నమః) సత్కారించెదమో (స్వధాయిభ్యః) బహుళాన్నములనభిలషించు (పితామహేభ్యః) తండ్రియొక్క తండ్రులకు (స్వధా) చక్కని అన్నము నిత్తుమో మరియు (నమః) సత్కారింతుమో మరియు (స్వధాయిభ్యః) ఉత్తమాన్నముల నభిలషించువారు (ప్రపితామహేభ్యః) పితామహుల తండ్రులకు (స్వధా) అన్నము నిచ్చెదమో మరియు వారిని (నమః) సత్కారించెదమో, అట్టి (పితరః) పితరులు మున్నగు జ్ఞానులారా! మీరు మేము చక్కగా సిద్ధపరచినట్టి అన్నాది పదార్థములను (అక్షన్) భుజించుడు (పితరః) ఓ అధ్యాపకులారా! మీరు సంతృప్తులై మమ్ము (అమీమదన్త) ఆనందితుల నొనర్చుడు (పితరః) ఉపదేశకులారా! మీరు తృప్తులై మమ్ము (అతీతృపన్త) తృప్తుల నొనర్చుడు (పితరః) ఓ విద్వాంసులారా! మీరు శుద్ధులై మమ్ము (శున్ధధ్వమ్) శుద్ధులుగ నొనర్చుడు. ॥౩౬॥

భావార్థము :- ఓ పుత్రులు, శిష్యులు, పుత్రవధువు (కోడలు) మున్నగువారలారా! మీరు ఉత్తమ అన్నము మున్నగు పదార్థములచే తలిదండ్రులు, తాతలు, గురువులు మున్నగు వృద్ధులను నిరంతరము సత్కారించుచుండుడు. మరియు అట్టి పితరులును మిమ్ము ఆశీర్వదించుచు ఆనందపరచుచుందురుగాక! తల్లిదండ్రులు మున్నుగువా రెట్లు బాల్యావస్థయందు మిమ్ము సేవించియుండిరో, అదేవిధముగ వారివృద్ధావస్థయందు యథావతుగ సేవలొనర్చుచుండుడు. ॥౩౬॥

36. We offer food and homage to our fathers who desire food and water. We offer food and homage to our grandfathers, who desire food and water. We offer food and homage to our great-grandfathers, who desire food and water. O parents eat the food we have prepared. O parents and teachers rejoice and make us full of joy. O preachers be satisfied and satisfy us. O learned persons be purified and purify us!.

౧౦౬౩. పునన్తు మా పితర ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, సరస్వతీ దేవతా, భురిగ్త్రిష్టుప్ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౬౩ పునన్తు మా పితరః సోమ్యాసః పునన్తు మా పితామహాః।

పునన్తు ప్రపితామహాః పవిత్రేణ శతాయుషా।

పునన్తు మా పితామహాః పునన్తు ప్రపితామహాః।

పవిత్రేణ శతాయుషా విశ్వమాయుర్వ్యశ్నవై ॥౩౭॥

ప.వి:- పునన్తు, మా, పితరః, సోమ్యాసః, పునన్తు, మా, పితామహాః, పునన్తు, ప్రపితామహా

ఇతి ప్ర + పితామహాః, పవిత్రేణ, శతాయుషేతి శత + ఆయుషా, పునన్తు, మా, పితామహాః, పునన్తు, ప్రపితామహా ఇతి ప్ర + పితామహాః, పవిత్రేణ, శతాయుషేతి శత + ఆయుషా, విశ్వమ్, ఆయుః, వి, అశ్నవై.॥౩౭॥

పదార్థః:-(పునన్తు) అశుద్ధాద్వ్యవహారాన్నివర్త్య శుద్ధే ప్రవర్త్య పవిత్రీకుర్వన్తు (మా) మామ్ (పితరః) జ్ఞానప్రదానేన పాలకాః (సోమ్యాసః) సోమే ఐశ్వర్యే భవాః సోమవచ్ఛాన్తా వా (పునన్తు) (మా) (పితామహాః) (పునన్తు) (ప్రపితామహాః) (పవిత్రేణ) శుద్ధాచరణయుక్తేన (శతాయుషా) శతం వర్షాణి యస్మిన్నాయుషి తేవ (పునన్తు) (మా) (పితామహాః) (పునన్తు) (ప్రపితామహాః) (పవిత్రేణ) బ్రహ్మచర్యాదిధర్మాచరణయుక్తేన (శతాయుషా) (విశ్వమ్) పూర్ణమ్ (ఆయుః) జీవనమ్ (వి) వివిధార్థే (అశ్నవై) ప్రాప్నుయామ్. లోట్ ప్రయోగోఽయమ్.॥౩౭॥

అన్వయః:-సోమ్యాసః పితరః పవిత్రేణ శతాయుషా మా పునన్తు సోమ్యాసః పితామహాః పవిత్రేణ శతాయుషా మ పునన్తు సోమ్యాసః ప్రపితామహాః పవిత్రేణ శతాయుషా మా పునన్తు సోమ్యాసః పితామహాః పవిత్రేణ శతాయుషా మా పునన్తు సోమ్యాసః ప్రపితామహాః పవిత్రేణ శతాయుషా మా పునన్తు యతోఽహం విశ్వమాయుర్వ్యశ్నవై ప్రాప్నుయామ్.॥౩౭॥

భావార్థః:- పితృపితామహప్రపితామహైః స్వకన్యాః పుత్రాంశ్చ బ్రహ్మచర్యసు శిక్షాధర్మోపదేశేన సంయోజ్య విద్యాసుశీలయుక్తాః కార్యాః సన్తానైః సేవానుకూలాచరణాభ్యాం సర్వే నిత్యం సేవనీయాః. ఏవం పరస్పరోపకారేణ గృహాశ్రమే ఆనన్దేన వర్తితవ్యమ్.॥౩౭॥

పదార్థము :-(సోమ్యాసః) ఐశ్వర్యవంతులు లేక చంద్రునివంటి శాంతస్వభావులు (పితరః) జ్ఞానమునిచ్చుచు పాలించు పితరులు (పవిత్రేణ) శుద్ధమైన (శతాయుషా) నూరు వత్సరముల ఆయుష్యముచే (మా) నన్ను (పునన్తు) పవిత్రపరతురుగాక! అతిబుద్ధిశాలియగు చంద్రునివలె ఆనందమునిచ్చు (పితామహాః) పితరులకు తండ్రికి తండ్రి శుద్ధ నూరేళ్ల ఆయువుతో (మా) నన్ను (పునన్తు) పవిత్రపరతురుగాక! ఐశ్వర్యదాతయగు చంద్రునివంటి శీతలస్వభావముగల (ప్రపితామహాః) పితామహుని తండ్రులు శుద్ధమగు నూరుసంవత్సరముల పర్యంతజీవనముతో (మా) నన్ను (పునన్తు) పవిత్రమొనర్తురుగాక! విద్య మున్నగు ఐశ్వర్యయుక్తులు లేక శాంతస్వభావులగు (పితామహాః) తండ్రుల తండ్రులు (పవిత్రేణ) అత్యన్తశుద్ధానంద యుక్తముగ (శతాయుషా) నూరుసంవత్సరముల ఆయువుగానన్ను (పునన్తు) పవిత్రాచరణవంతునిగ నొనర్తురుగాక! చక్కని ఐశ్వర్యదాత లేక శాంతితో గూడ (ప్రపితామహాః) పితామహుల తండ్రులు పవిత్ర

ధర్మాచరణముతో గూడ నూరేళ్ల ఆయువుతో నన్ను (పునన్తు) పవిత్రపరచెదరుగాక! దానిచే నేను (విశ్వమ్) సంపూర్ణమగు (ఆయుః) జీవనమును (వ్యశ్నవై) ప్రాప్తించుకొందునుగాక! ॥౩౭॥

భావార్థము :- పితరులు, పితామహులు, ప్రపితామహులు తమ పుత్రులను, పుత్రికలను బ్రహ్మచర్యము, ఉత్తమ విద్య, ధర్మోపదేశములతో సంయుక్తపరచి చక్కని విద్య, ఉత్తమసౌశీల్యవంతులుగ నొనర్చవలయును. సంతానములును పితరులసేవలు మరియు అనుకూలాచరణములద్వారా పితరులెల్లరను భక్తి శ్రద్ధలచే సేవించవలయును. ఇట్టి పరస్పర ఉపకారములద్వారా గృహాశ్రమమును ఆనందము, సౌఖ్యవంతముగ నొనర్చవలయును. ॥౩౭॥

37.May fathers, full of glory and mental peace, purify me with a pure life of a hundred years. May grandfathers, purify me with a pure life of a hundred years. May great grandfathers purify me with a pure life of a hundred years. May learned and calm grandfathers purify me with a happy, pure life of a hundred years. May sedate great-grandfathers purify me with a pure life of a hundred years. May I obtain full length of life.

౧౦౬౪. అగ్న ఆయూంషి ఇత్యస్య వైఖానస ఋషిః, ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౦౬౪ అగ్న॒ ఆయూ᳖ఁషి పవస॒ ఆ సు॒వోర్జ॒మిషం॑ చ నః।

ఆ॒రే బాధస్వ దు॒చ్ఛునా᳖మ్ ॥౩౮॥

ప. వి:- అగ్నే, ఆయూ᳖ఁషి, ప॒వ॒సే, ఆ, సు॒వ, ఊర్జమ్, ఇషమ్, చ॒, నః॒, ఆ॒రే, బా॒ధ॒స్వ, దు॒చ్ఛునా᳖మ్. ॥౩౮॥

పదార్థః:-(అగ్నే) విద్వన్ పితః పితామహ ప్రపితామహ (ఆయూంషి) అన్నాదీని (పవసే) పవిత్రీకుర్యాః. లేట్ప్రయోగోఽయమ్ (ఆ) సమన్తాత్ (సువ) ప్రేర్య (ఊర్జమ్) పరాక్రమమ్ (ఇషమ్) ఇచ్ఛాసిద్ధిమ్ (చ) (నః) అస్మాకమ్ (ఆరే) దూరే నికటే (బాధస్వ) నివర్తయ (దుచ్ఛునామ్) దుతో దుష్టాశ్వాన ఇవ వర్తమానాస్తేషామ్. ॥౩౮॥

అన్వయః:-హే అగ్నే! యస్త్వం న ఆయూంషి పవసే స త్వమూర్జమిషం చాసువ. ఆరే దుచ్ఛునాం సంగం బాధస్వ. ॥౩౮॥

భావార్థః:-పిత్రాదయోఽపత్యేషు దీర్ఘాయుః పరాక్రమంశుభేచ్ఛా ధారయిత్వా స్వసన్తానాన్ దుష్టానాం సఙ్గాన్నివార్య శ్రేష్ఠానాం సఙ్గే ప్రవర్త్య ధార్మికాన్ దీర్ఘాయుషః కుర్వన్తు యతస్తే వృద్ధావస్థాయామప్యప్రియాచరణం కదాచిన్న కుర్యుః. ॥౩౮॥

పదార్థము :-(అగ్నే) విద్వాంసులగు పితా, పితామహా, ప్రపితామహులారా! ఏ మీరు (నః) మాయొక్క (ఆయూంషి) ఆయువులను (పవసే) పవిత్రపరచుచుందురో అట్టి మీరు (ఊర్జమ్) పరాక్రమము (చ) మరియు (ఇషమ్) కామితార్థములను (ఆ,సువ) నలువైపులనుండి సిద్ధినొందించుడు. మరియు (ఆరే) దూర, సమీపములందు వసించునట్టి (దుచ్ఛునామ్) దుష్టశునకములవంటి మనుష్యుల సాంగత్యమును (బాధస్వ) వదలించుడు.॥౩౮॥

భావార్థము :-పితరులు మున్నగువారు తమ సంతానములను దీర్ఘాయువు, పరాక్రమము, శుభకామితములను ధరింపజేసి దుష్టుల సాంగత్యమునుండి దూరముగ నుంచవలయును. సత్సంగము, ధార్మిక శిక్షణలచే చిరంజీవు లగునట్లు, వృద్ధాప్యమందును అప్రియాచరణము లొనర్చకుండునట్లొనర్చవలెను.॥౩౮॥

38.O learned perents, ye purify the age-prolonging foodgrains, send down upon us food and vigorous strength. Drive ye far away from us the company of evil persons!.

౧౦౬౫.పునన్తు మా దేవజనా ఇత్యస్య వైఖానస ఋషిః, విద్వాంసో దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౦౬౫ పునన్తు మా దేవజనాః పునన్తు మనసా ధియః।

పునన్తు విశ్వా భూతాని జాతవేదః పునీహి మా ॥౩౯॥

ప.విః-పునన్తు, మా, దేవజనా ఇతి దేవ + జనాః, పునన్తు, మనసా, ధియః, పునన్తు, విశ్వా, భూతాని, జాతవేద ఇతి జాత + వేదః, పునీహి, మా.॥౩౯॥

పదార్థః:-(పునన్తు) (మా) (దేవజనాః) దేవా విద్వాంసశ్చ తే జనా ధర్మే ప్రసిద్ధాశ్చ (పునన్తు) (మనసా) విజ్ఞానేన (ధియః) బుద్ధీః (పునన్తు) (విశ్వా) సర్వాణి (భూతాని) (జాతవేదః) జాతేషు జనేషు జ్ఞానిన్ విద్వన్ (పునీహి) (మా) మామ్.॥౩౯॥

అన్వయః:- హే జాతవేదో విద్వన్! యథా దేవజనా మనసా మా పునన్తు మమ ధియశ్చ పునన్తు మమ విశ్వా భూతాని మా పునన్తు తథా త్వం మా పునీహి. ॥౩౯॥

భావార్థః:-విదుషాం విదుషీణాం చేదమేవ ముఖ్యం కృత్యమస్తి యత్ పుత్రాః పుత్ర్యశ్చ బ్రహ్మచర్యసుశిక్షాభ్యాం విద్వాంసః విదుష్యశ్చ సుశీలాః సతతం సంపాదనీయా ఇతి.॥౩౯॥

పదార్థము :- (జాతవేదః) ఉత్పన్నజనులందు జ్ఞానివగు విద్వాంసుడా! ఎట్లు (దేవజనాః) విద్వాంసులు (మనసా) విజ్ఞానము మరియు ప్రీతితో (మా) నన్ను (పునన్తు) పవిత్రపరచెదరో మరియు మాయొక్క (ధియః) బుద్ధులను (పునన్తు) పవిత్రపరచెదరో మరియు (విశ్వా) సంపూర్ణ (భూతాని) ప్రాణిమాత్రులు నన్ను (పునన్తు) పవిత్రపరతురో అట్లే నీవు (మా) నన్ను (పునీహి) పవిత్రపరచుము.॥౩౯॥

భావార్థము :- విద్వాంసులగు తల్లిదండ్రులు తమ పుత్రీ పుత్రులను బ్రహ్మచర్యము, ఉత్తమ శిక్షణలచే శీలయుక్త విద్వాంసులుగ, విదుషీమణులుగ నొనర్చుట ముఖ్యము.॥౩౯॥

39.O learned amongst the born, just as the wise purify me with knowledge and love, and purify our intellect, just as all material things purify me, so shouldst thou purify me!.

౧౦౬౬.పవిత్రేణేత్యస్య వైఖానస ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౦౬౬ పవిత్రేణ పునీహి మా శుక్రేణ దేవ దీద్యత్।

అగ్నే క్రత్వా క్రతూ౨ఁ॥ ౨ఁ రను ॥౪౦॥

ప. విః-పవిత్రేణ, పునీహి, మా, శుక్రేణ, దేవ, దీద్యత్, అగ్నే, క్రత్వా, క్రతూన్, అను.॥౪౦॥

పదార్థః:-(పవిత్రేణ) శుద్ధేన (పునీహి) (మా) (శుక్రేణ) వీర్యేణ పరాక్రమేణ (దేవ)విద్యాదాతః (దీద్యత్) ప్రకాశమాన (అగ్నే) విద్వన్ (క్రత్వా) క్రతునా ప్రజ్ఞయా కర్మణా వా (క్రతూన్) ప్రజా కర్మాణి వా (అను).॥౪౦॥

అన్వయః:-హే దీద్యద్దేవాగ్నే! త్వం పవిత్రేణ శుక్రేణ స్వయం పవిత్రో భూత్వా మా మాశ్చైతే నానుపునీహి స్వస్య క్రత్వా ప్రజ్ఞయా కర్మణా వా స్వాం ప్రజ్ఞాం స్వం కర్మ చ పవిత్రీకృత్యాస్మాకం క్రతూ నను పునీహి. ॥౪౦॥

భావార్థః:-పిత్ర ధ్యాపకోపదేశకాః స్వయం ధార్మికా విద్వాంసో భూత్వా స్వసన్తానానపి దృశానేవ యోగ్యా న్ధార్మికాన్ విదుషః కుర్యుః.॥౪౦॥

పదార్థము :- (దీద్యత్) ప్రకాశవంతుడా! (దేవ) విద్యాదాతా! (అగ్నే) విద్వాంసుడా! నీవు (పవిత్రేణ) శుద్ధమగు (శుక్రేణ) వీర్యపరాక్రమములద్వారా స్వయముగా నీవు పవిత్రుడవై (మా) నన్ను (అను పునీహి) ఆ పిదప పవిత్రపరచుము. నీయొక్క (క్రత్వా) బుద్ధి లేక కర్మలద్వారా నీ ప్రజ్ఞాకర్మలను పవిత్రమొనర్చుకొని మాయొక్క (క్రతూన్) బుద్ధులను లేక కర్మలను మాటిమాటికి పవిత్రపరచుచుండుము.॥౪౦॥

భావార్థము :- తండ్రి మరియు అధ్యాపకోపదేశకులు స్వయముగ ధార్మికులు, విద్వాంసులునై తమ సంతానములను కూడ ధార్మిక, యోగ్యవిద్వాంసులనుగ నొనర్చవలెను.॥౪౦॥

40.O refulgent learned person, imparter of knowledge, first purify thyself with noble spiritual force, and then purify me. Purifying thyself with intellect and acts purify my intellect and acts again and again!.

౧౦౬౭. యత్తే ఇత్యస్య వైఖానస ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

జనైః కథం శుద్ధైర్భవితవ్యమిత్యాహ. మానవు లెటుల పరిశుద్ధులు కావలయును?

౧౦౬౭ యత్తే పవిత్రమర్చిష్యగ్నే వితతమన్తరా। బ్రహ్మ తేన పునాతు మా ॥౪౧॥

ప.విః-యత్, తే, పవిత్రమ్ అర్చిషి, అగ్నే, వితతమితి వి + తతమ్, అన్తరా, బ్రహ్మ, తేన, పునాతు, మా.॥౪౧॥

పదార్థః:- (యత్) (తే) తవ (పవిత్రమ్) శుద్ధమ్ (అర్చిషి) అర్చితుం యోగ్యే శుద్ధే తేజసి (అగ్నే) స్వప్రకాశస్వరూపేశ్వర (వితతమ్)వ్యాప్తమ్ (అన్తరా) (బ్రహ్మ) బృహద్విద్యం వేదచతుష్టయమ్ (తేన) (పునాతు) (మా) మామ్.॥౪౧॥

అన్వయః:-హే అగ్నే! తే తవార్చిష్యన్తరా యత్ వితతం పవిత్రం బ్రహ్మాస్తి తేన మా మాం భవాన్ పునాతు. ॥౪౧॥

భావార్థః:-హే మనుష్యాః! యూయం యో దేవానాం దేవః పవిత్రాణాం పవిత్రో వ్యాప్తేషు వ్యాప్తోఽన్తర్యామీశ్వరస్తద్విద్యా వేదశ్చాఽస్తి తదనుకూలాచరణేన సతతం పవిత్రా భవత.॥౪౧॥

పదార్థము :-(అగ్నే) స్వయంప్రకాశ స్వరూపుడవగు ఓ జగదీశ్వరా! (తే) నీయొక్క (అర్చిషి) సత్కరించదగిన శుద్ధ తేజస్వరూపమునందు (అన్తరా) సర్వముకన్న భిన్నము (యత్) ఎట్టి (వితతమ్) విస్తృతము, సర్వమునందు వ్యాప్తమైయుండు (పవిత్రమ్) శుద్ధస్వరూపము (బ్రహ్మ) ఉత్తమ వేదవిద్యగలదో (తేన) దానిచే (మా) నన్ను నీవు (పునాతు) పవిత్రపరచుము.॥౪౧॥

భావార్థము :-మానవులారా! దేవదేవుడు, పవిత్రాతిపవిత్రుడు, వ్యాప్తములందు వ్యాప్తుడు, అంతర్యామియగు పరమేశ్వరుడు మరియు నాతడు ప్రసాదించిన వేదవిద్యల కనుకూలముగ ఆచరించి మీరు నిరంతరము పవిత్రులగుడు. ॥౪౧॥

41.O God purify me with Thy pure vedic knowledge diffused by Thy pure lustrous nature!.

౧౦౬౮.పవమాన ఇత్యస్య వైఖానస ఋషిః, సోమో దేవతా, గాయత్రీ ఛందః షడ్జః స్వరః.

పునర్మనుష్యైః పుత్రాదయః కథం పవిత్రాః కరణీయా ఇత్యాహ.

మానవులు పుత్రాదుల నెటుల పవిత్రపఱచవలయును?

౧౦౬౮ పవమానః సోఽఅద్య నః పవిత్రేణ విచర్షణిః।

యః పోతా స పునాతు మా ॥౪౨॥

ప.వి:-పవమానః, సః అద్య, నః, పవిత్రేణ, విచర్షణిరితి వి + చర్షణిః, యః, పోతా, సః, పునాతు, మా.॥౪౨॥

పదార్థః:-(పవమానః) పవిత్రః (సః) (అద్య) (నః) అస్మాకం మధ్యే (పవిత్రేణ) శుద్ధాచరణేన (విచర్షణిః) వివిధవిద్యాప్రద ఈశ్వరః (యః) (పోతా) పవిత్రకర్తా (సః) (పునాతు) (మా) మామ్.॥౪౨॥

అన్వయః:-యో నో మధ్యే పవిత్రేణ పవమానో విచర్షణిరస్తి సోఽద్యాస్మాకం పవిత్రకర్త్రోపదేశకశ్చాస్తి స పోతా మా పునాతు.॥౪౨॥

భావార్థః:-మనుష్యా ఈశ్వరవద్ధార్మికా భూత్వా స్వసన్తానాన్ ధర్మాత్మనః కుర్యు రీదృశానన్తరాఽన్యానపి తే పవిత్రయితుం న శక్నువన్తి.॥౪౨॥

పదార్థము :- (యః) ఏ జగదీశ్వరుడు (నః) మా మధ్యన (పవిత్రేణ) శుద్ధాచరణముద్వారా (పవమానః) పవిత్రమగు (విచర్షణిః) వివిధవిద్యల దాతయై యున్నాడో (సః) ఆయన (అద్య) నేడు మమ్ము పవిత్ర పరచువాడు, మరియు మా యుపదేశకుడునై యున్నాడు (నః) అట్టి (పోతా) పవిత్రస్వరూపుడగు పరమాత్మ (మా) నన్ను (పునాతు) పవిత్రమొనర్చుగాక!॥౪౨॥

భావార్థము :- మానవులు పరమేశ్వరునివలె ధర్మాత్ములై తమ సంతానములను ధర్మాత్ములనుగ నొనర్చవలెను. అట్లు జేయజాలరేని వా రితరులను గూడా పవిత్రమొనర్చజాల రని యెరుగవలయును.॥౪౨॥

42.God, Who is our midst, by His immaculate nature, is Pure and Giver of different sciences, is ever our Purifier and Preacher. May He, the Cleanser, make me clean.

౧౦౭౯. ఉభాభ్యామిత్యస్య వైఖానస ఋషిః సవితా దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

మనుష్యైరధర్మాత్కథం భేతవ్యమిత్యాహ? అధర్మమునకు మానవు లెటుల భయపడవలెను?

౧౦౭౯ ఉభాభ్యాన్దేవ సవితః పవిత్రేణ సవేన చ। మా పునీహి విశ్వతః ॥౪౩॥

ప. విః-ఉభాభ్యామ్, దేవ, సవితరితి సవితః, పవిత్రేణ, సవేన, చ, మామ్, పునీహి విశ్వతః॥౪౩॥

పదార్థః:-(ఉభాభ్యామ్) విద్యాపురుషార్థాభ్యామ్ (దేవ) సుఖప్రదాతః (సవితః) సత్కర్మసు ప్రేరకేశ్వర (పవిత్రేణ) శుద్ధాచరణేన (సవేన) ఐశ్వర్యేణ (చ) (మామ్) (పునీహి) (విశ్వతః) సర్వతః.॥౪౩॥

అన్వయః:-హే దేవ సవితర్జగదీశ్వర! త్వం పవిత్రేణ సవేన చోభాభ్యాం విశ్వతో మాం పునీహి.॥౪౩॥

భావార్థః:-హే మనుష్యాః! య ఈశ్వరః సర్వాన్ శుద్ధిం ధర్మం చ గ్రాహయతి తమాశ్రిత్యాఽధర్మాచరణాత్సదా భయం కురుత.॥౪౩॥

పదార్థము :-(దేవ) సుఖప్రదాతవు (సవితః) సత్కర్మల ప్రేరకుడవు నగు ఓ జగదీశ్వరా! నీవు (పవిత్రేణ) పవిత్రవర్తనము (చ) మరియు (సవేన) సకలైశ్వర్యముల (ఉభాభ్యామ్) విద్యాపురుషార్థములతో (విశ్వతః) అన్నివైపులనుండి (మామ్) నన్ను (పునీహి) పవిత్రమొనర్చుము. ॥౪౩॥

భావార్థము :-మానవులారా! ఏ పరమేశ్వరుడు మనుష్యులను పవిత్రతను మరియు ధర్మగ్రహణమునొనర్ప జేయుచున్నాడో అట్టి యీశ్వరు నాశ్రయించి అధర్మాచరణముచే సదా భయభీతులై యుండుడు. ॥౪౩॥

43.O God, the Giver of happiness, Impeller for virtuous deeds, with true behaviour, full glory, knowledge and exertion, purify me on every side!.

౧౦౮౦.వైశ్వదేవీత్యస్య వైఖానస ఋషిః, విశ్వేదేవా దేవతాః, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

కథం రాజ్ఞా రాజ్యం వర్ధనీయమిత్యాహ. రాజెటుల రాజ్యమును వృద్ధి యొనర్పవలయును?

౧౦౮౦ వైశ్వదేవీ పునతీ దేవ్యాగాద్యస్యామిమా బహ్వ్యస్తన్వో వీతపృష్ఠాః।

తయా మదన్తః సధమాదేషు వయꣳ స్యామ పతయో రయీణామ్ ॥౪౪॥

ప.విః-వైశ్వదేవీతి వైశ్వ + దేవీ, పునతీ, దేవీ, ఆ, అగాత్, యస్యామ్, ఇమాః, బహ్వ్యః, తన్వః, వీతపృష్ఠా, ఇతి వీత + పృష్ఠాః, తయా, మదన్తః, సధమాదేష్వితి సధఽమాదేషు, వయమ్, స్యామ, పతయః, రయీణామ్.॥౪౪॥

పదార్థః:- (వైశ్వదేవీ) విశ్వాసాం దేవీనాం విదుషీణాం మధ్య ఇయం విదుషీ (పునతీ) పవిత్రతాం కుర్వతీ (దేవీ) సకలవిద్యాధర్మాచరణేన ప్రకాశమానా (ఆ) సర్వతః (అగాత్) ప్రాప్నుయాత్ (యస్యామ్)(ఇమాః) (బహ్వ్యః) అనేకాః (తన్వః) విస్తృతవిద్యాః (వీతపృష్ఠాః) వివిధాని ఇతాని విదితాని పృష్ఠాని ప్రచ్ఛన్నాని యాభిస్తాః (తయా) (మదన్తః) హృష్యన్తః (సధమాదేషు) సహస్థానేషు (వయమ్) (స్యామ) (పతయః) (రయీణామ్) ధనానామ్.॥౪౪॥

అన్వయః:- హే మనుష్యాః! యా వైశ్వదేవీ పునతీ దేవ్యధ్యాపికా బ్రహ్మచారిణీ కన్యాఽస్మానాగాత్ యస్యాం సత్యామిమా బహ్వ్యస్తన్వో వీతపృష్ఠాః స్యుస్తయా సుశిక్షితా భార్యాః ప్రాప్య వయం సధమాదేషు మదన్తో రయీణాం పతయః స్యామ.॥౪౪॥

భావార్థః:- యథా రాజా సర్వకన్యాఽధ్యాపనాయ పూర్ణవిద్యావతీః స్త్రీర్నియోజ్య సర్వా బాలికాః పూర్ణ విద్యాసుశిక్షాయుక్తాః కుర్యాత్ తథైవ బాలకానపి కుర్యాద్యదైతే యౌవనస్థాః స్యుస్తదైవ స్వయంవరం వివాహం కారయేదేవం రాజ్యవృద్ధిం సదా కుర్యాత్.॥౪౪॥

పదార్థము :- ఓ మానవులారా! (వైశ్వదేవీ) సమస్త విదుషీమణులయందు ఉత్తమురాలు (పునతీ) ఎల్లరను పవిత్రపరచునట్టి (దేవీ) సకల విద్యలందు, ధర్మాచరణమున ప్రకాశవంతురాలు, విద్యలనభ్యసించు బ్రహ్మచారిణి కన్య మాకు (ఆ, అగాత్) ప్రాప్తించుగాక! (యస్యామ్) ఎవరి యునికిచే (ఇమాః) ఈ (బహ్వ్యః) అనేక (తన్వః) విస్తృతవిద్యలచే (వీతపృష్ఠాః) అనేక విధములగు ప్రశ్నల నెరుగువా రగుచుందురో (తయా) వారిచే ఉత్తమ శిక్షలను పొందిన పత్నులను పొంది (వయమ్) మేము (సధమాదేషు) సమానస్థానములందు (మదన్తః) ఆనందములతో గూడ (రయీణామ్) ధనములు మున్నగు ఐశ్వర్యములకు (పతయః) స్వాములము అధికారులము (స్యామ) అగుదుముగాక! ॥౪౪॥

భావార్థము :- రాజు ఏ విధముగ కన్యలందరను చదివించుటకొరకై పూర్ణవిద్యావంతురాండ్రగు స్త్రీలను నియుక్తపరచి సమస్త బాలికలను పూర్ణవిద్యావంతురాండ్రు, ఉత్తమ శిక్షితురాండ్రుగ నొనర్చునో, అట్లే బాలురను గూడ నొనర్పవలయును. వీరు పూర్ణయువావస్థకు జేరునప్పుడే స్వయంవరవిధిగా వివాహముల నొనర్పజేయవలెను. ఇట్లే సదా రాజ్యాభివృద్ధి నొనర్చుచుండవలయును.॥౪౪॥

44.Vedic speech, the benefactor of humanity and the repository of knowledge comes unto us and purifies us.

Through her may we in sacrificial banquets taking our pleasure be the lords of riches.

౧౦౭౧. యే సమానా ఇత్యస్య వైఖానస ఋషిః, పితరో దేవతాః, నిచృదనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.

కుత్ర జనాః సుఖం నివసన్తీత్యాహ. జను లెక్కడ సుఖపూర్వకముగ నివసించుదురు?

౧౦౭౧ యే సమానాః సమనసః పితరో యమరాజ్యే।

తేషాం లోకః స్వధా నమో యజ్ఞో దేవేషు కల్పతామ్ ॥౪౫॥

ప.వి:-యే, సమానాః, సమనస ఇతి స + మనసః, పితరః, యమరాజ్య ఇతి యమ + రాజ్యే, తేషామ్, లోకః, స్వధా, నమః, యజ్ఞః, దేవేషు, కల్పతామ్.॥౪౫॥

పదార్థః:-(యే) (సమానాః) సదృశాః (సమనసః) సమానం మనో విజ్ఞానం యేషాం తే (పితరః) ప్రజాపాలకాః (యమరాజ్యే) యమస్య సభాధీశస్య రాష్ట్రే (తేషాం) (లోకః) సభాదర్శనం వా (స్వధా) (అన్నమ్) (నమః) సత్కారణమ్ (యజ్ఞః) సంగన్తవ్యో న్యాయః (దేవేషు) విద్వత్సు (కల్పతామ్) సమర్థితోఽస్తు.॥౪౫॥

అన్వయః:-యే సమానాః సమనసః పితరో యమరాజ్యే సన్తి తేషాం లోకః స్వధా నమో యజ్ఞశ్చ దేవేషు కల్పతామ్.॥ ౪౫ ॥

భావార్థః:- యత్ర బహుదర్శినామన్నాద్యైశ్వర్యయుక్తానాం సజ్జనైః సత్కృతానాం ధర్మైకనిష్ఠానాం విదుషాం సభా సత్యం న్యాయం కరోతి తత్రైవ సర్వే మనుష్యా ఐశ్వర్యే సుఖే చ నివాసం కుర్వన్తి.॥౪౫॥

పదార్థము :- (యే) ఎవరు (సమానాః) సమానులో [సదృశులో] (సమనసః) సమవిజ్ఞానముగలవారో (పితరః) ప్రజారక్షకులో (యమరాజ్యే) ఏ రాజు రాజ్యమందు యథావతు న్యాయకారులగు సభాధీశులుందురో (తేషామ్) అట్టివారి (లోకః) సభాదర్శనము (స్వధా) అన్నము (నమః) సత్కారము మరియు (యజ్ఞః) పొందదగిన న్యాయము (దేవేషు) విద్వాంసులందు (కల్పతామ్) సమర్థవంతమగుగాక!.॥౪౫॥

భావార్థము :- ఏ రాజ్యమునందు బహుదర్శిత్వము, అన్నము మున్నగు ఐశ్వర్యములతో గూడిన సజ్జనుల ద్వారా సత్కారప్రాప్తినొందిన ధర్మము మాత్రమే నిష్ఠతో ఆచరింపబడు విద్వాంసుల సభ సత్యన్యాయములను ప్రసాదించునో అట్టి రాజ్యమునందే ప్రజలెల్లరును ఐశ్వర్య సుఖములతో నివసించగలరు.॥౪౫॥

45.The officials, who in the realm of a just king, are equal in status and knowledge, have their dwelling place, food, reverence and sense of fairness approved by the learned.

౧౦౭౨.యే సమానా ఇత్యస్య వైఖానస ఋషిః, శ్రీర్దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పితృసన్తానాః పరస్పరం కథం వర్తేరన్నిత్యాహ. మాతాపితృసంతానములు పరస్పర మెట్లుల మెలగవలయును?

౧౦౭౨ యే సమానాః సమనసో జీవా జీవేషు మామకాః।

తేషాశ్ శ్రీర్మయి కల్పతామస్మింల్లోకే శతశ్ సమాః॥౪౬॥

ప.విః-యే, సమానాః, సమనస ఇతి స + మనసః, జీవాః, జీవేషు, మామకాః, తేషామ్, శ్రీః, మయి, కల్పతామ్, అస్మిన్, లోకే, శతమ్, సమాః.॥౪౬॥

పదార్థః:- (యే) (సమానాః) సదృగ్గుణకర్మస్వభావాః (సమనసః) సమానే ధర్మే మనో యేషాన్తే (జీవాః) యే జీవన్తి తే (జీవేషు) (మామకాః) మదీయాః (తేషామ్) (శ్రీః) రాజ్యలక్ష్మీః (మయి) (కల్పతామ్) (అస్మిన్) (లోకే) (శతమ్) (సమాః) సంవత్సరాః.॥౪౬॥

అన్వయః:- యేఽస్మింల్లోకే జీవేషు సమానాః సమనసో మామకా జీవాస్సన్తి తేషాం శ్రీర్మయి శతం సమాః కల్పతామ్.॥౪౬॥

భావార్థః:-సన్తానా యావత్పితరో జీవేయుస్తావత్తాన్ సేవన్తామ్. పుత్రా యావత్పితృసేవకాః స్యుస్తావత్తే సత్కర్తవ్యాః స్యుర్యత్ పితౄణాం ధనాదివస్తు తత్పుత్రాణాం యత్పుత్రాణాం తత్పితౄణాఞ్చాస్తు.॥౪౬॥

పదార్థము :-(యే) ఎవరు (అస్మిన్) ఈ (లోకే) లోకమందు (జీవేషు) జీవనము గడుపువారియందు (సమానాః) సమాన గుణ కర్మ స్వభావములు గలవారు (సమనసః) సమాన ధర్మమునందు మనస్సునుంచునట్టి (మామకాః) నాయొక్క (జీవాః) జీవించియున్న పితరులుందురో (తేషామ్) వారి ((శ్రీః) లక్ష్మి [ఐశ్వర్యములు] (మయి) నా సమీపమందు (శతమ్) నూరు (సమాః) సంవత్సరములవరకు (కల్పతామ్) సమర్థవంతముగ నుండుగాక! ॥౪౬॥

భావార్థము :- పితరులు జీవించియుండునంతవరకు సంతానములు వారి సేవలను శ్రద్ధతో జేయవలెను. పితృదేవతలు జీవించియుండునంతవరకును సత్కారార్హులేయగుదురు. పితరుల ధనాదిపదార్థములు పుత్రులవి మరియు పుత్రుల ధనాది వస్తువులు పిత్రాదులవియై యుండుట శ్రేయస్కరము.॥౪౬॥

46.My folk yet living among those who live, are of one mind and similar attributes. On me be set their wealth through a hundred years in this world.

౧౦౭౩.ద్వే సృతీ ఇత్యస్య వైఖానస ఋషిః, పితరో దేవతాః, స్వరాట్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

జీవానాం ద్వౌ మార్గౌ స్త ఇత్యాహ, జీవులకు రెండు మార్గము లున్నవి?

౧౦౭౩ ద్వే సృతీఽఅశృణవం పితౄణామహం దేవానాముత మర్త్యానామ్ ।

తాభ్యామిదం విశ్వమేజత్సమేతి యదన్తరా పితరం మాతరం చ ॥౪౭॥

ప.వి:-ద్వేఽ ఇతి ద్వే, సృతీఽ ఇతి సృతీ, అశృణవమ్, పితౄణామ్, అహమ్, దేవానామ్, ఉత, మర్త్యానామ్, తాభ్యామ్, ఇదమ్, విశ్వమ్, ఏజత్, సమ్, ఏతి, యత్, అన్తరా, పితరమ్, మాతరమ్, చ.॥౪౭॥

పదార్థః:- (ద్వే) (సృతీ) సరన్తి గచ్ఛన్త్యాఽఽగచ్ఛన్తి జీవా యయోస్తే (అశృణవమ్) శృణోమి (పితౄణామ్) జనకాదీనామ్ (అహమ్) (దేవానామ్) ఆచార్యాదీనాం విదుషామ్ (ఉత) అపి (మర్త్యానామ్) మనుష్యాణామ్ (తాభ్యామ్) (ఇదమ్) (విశ్వమ్) సర్వం జగత్ (ఏజత్) చలత్సత్ (సమ్) (ఏతి) గచ్ఛతి (యత్) (అన్తరా) మధ్యే (పితరమ్) జనకమ్ (మాతరమ్) జననీమ్ (చ).॥౪౭॥

అన్వయః:- హే మనుష్యాః! అహం యే పితౄణాం మర్త్యానాం దేవానాం చ ద్వే సృతీ అశృణవం శృణోమి తాభ్యామిదం విశ్వమేజత్సమేత్యత్ర యత్ పితరం మాతరమన్తరా శరీరాన్తరేణాన్యౌ మాతాపితరౌ ప్రాప్నోతి తదేతద్ యూయం విజానీత.॥౪౭॥

భావార్థః:-ద్వే ఏవ జీవానాం గతీ వర్తతే ఏకా మాతాపితృభ్యాం జన్మ ప్రాప్య సంసారే విషయ సుఖభోగరూపా. ద్వితీయా విద్వత్సంగాదినా ముక్తిసుఖభోగాఖ్యాఽస్తి ఆభ్యాం సహైవ సర్వే ప్రాణినశ్చరన్తి.॥౪౭॥

పదార్థము :- ఓ మానవులారా! (అహమ్) నేను ఏ (పితౄణామ్) పితరులు మున్నగు (మర్త్యానామ్) మనుష్యుల (చ) మరియు (దేవానామ్) విద్వాంసుల (ద్వే) రెండుగతులు [మార్గములను] (సృతీ) వేనియందు రాకపోకలు, అనగా జననమరణముల పొందుచుండునో, వానిని (అశృణవమ్) వినిపించెదను (తాభ్యామ్) ఏ రెండుమార్గములయందే (ఇదమ్) ఈ (విశ్వమ్) జగత్తంతయును (ఏజత్) చలాయమానమై

యున్నదో (సమేతి) చక్కగా పొందబడుచున్నదో (ఉత) మరియు (యత్) ఎయ్యది (పితరమ్) జనకుడు (మాతరమ్) జననినుండి (అన్తరా) వేరైపోయి మరొక శరీరముతో అన్యజననీ జనకులను ప్రాప్తించుకొనునో అట్టి దీనిని మీరు తెలిసికొనుడు.॥౪౭॥

భావార్థము :- జీవులకు రెండే గతులు గలవు. ఒకటి : మాతా పితరులనుండి జన్మను పొంది ఈ ప్రపంచమున విషయసుఖముల అను భోగరూపము. రెండవది : విద్వాంసుల సత్సంగము మున్నగు వానిద్వారా ముక్తిసుఖముల అను భోగరూపము. ఈరెండు గతులయందే సకల ప్రాణులు విచరించుచుండును.॥౪౭॥

47.I have heard the mention of two pathways of birth and death, the ways of parents, the learned and the mortals. On these two roads each moving creature travels. Each soul leaves the present parents and assumes new ones.

౧౦౭౪.ఇదం హవిరిత్యస్య వైఖానస ఋషిః, అగ్నిర్దేవతా నిచృదష్టిశ్ఛన్దః, మధ్యమః స్వరః.

సన్తానైః కిం కర్తవ్యమిత్యాహ. సంతానము నేమి చేయవలయును?

౧౦౭౪ ఇదం హవిః ప్రజననం మేఽఅస్తు దశవీర౨ం సర్వగణ౨ం స్వస్తయే।

ఆత్మసని ప్రజాసని పశుసని లోకసన్యభయసని। అగ్నిః ప్రజాం

బహులాం మే కరోత్వన్నం పయో రేతోఽఅస్మాసు ధత్త.॥౪౮॥

ప.వి:- ఇదమ్, హవిః, ప్రజననమితి ప్ర + జననమ్, మే, అస్తు, దశవీరమితి దశ + వీరమ్, సర్వ+గణమ్, స్వస్తయే, ఆత్మసనీత్యాత్మ+సని, ప్రజాసనీతి ప్రజా+సని, పశుసనీతి పశు+సని, లోకసనీతి లోక+సని, అభయసనీత్యభయ+సని అగ్నిః, ప్రజామితి ప్ర +జామ్, బహులామ్, మే, కరోతు, అన్నమ్, పయః, రేతః, అస్మాసు, ధత్త.॥౪౮॥

పదార్థః:- (ఇదమ్) (హవిః) హోతుమర్హమ్ (ప్రజననమ్) ప్రజనయన్తి యేన తత్ (మే) మమ (అస్తు) (దశవీరమ్) దశ వీరాః పుత్రా యస్మాత్ తత్ (సర్వగణమ్) సర్వే గణాః గణ్యాః ప్రశంసనీయాః పదార్థా యస్మాత్ (స్వస్తయే) సుఖాయ (ఆత్మసని) ఆత్మానం సనతి సమ్భజతి యేన తత్ (ప్రజాసని) ప్రజాఃసనతి యేన తత్ (పశుసని) పశూన్ సనతి

సమ్భజతి యేన (లోకసని) లోకాన్ సనతి సమ్భజతి యేన (అభయసని) అభయం సనతి సమ్భజతి యేన (అగ్నిః) అగ్నిరివ దేదీప్యమానః పతిః (ప్రజామ్) పుత్రపౌత్రప్రభృతిమ్ (బహులామ్) బహూని సుఖాని దదాతి యా తామ్ (మే) మహ్యమ్ (కరోతు) అన్నమ్) (పయః) దుగ్ధమ్ (రేతః) వీర్యమ్ (అస్మాసు) (ధత్త).॥౪౮॥

అన్వయః:-అగ్నిర్మే బహులాం ప్రజాం కరోతు మే యదిదం ప్రజననం హవిర్దశవీరం సర్వగణ మాత్మసని ప్రజాసని పశుసని లోకసన్యభయసన్యపత్యం కరోతు తత్ స్వస్తయేఽస్తు. హే మాతాపిత్రాదయో యూయమస్మాసు ప్రజామన్నం పయో రేతో ధత్త.॥౪౮॥

భావార్థః:-యే స్త్రీపురుషాః పూర్ణేన బ్రహ్మచర్యేణ సర్వా విద్యాశిక్షాః సఙ్గృహ్య పరస్పరం ప్రీత్యా స్వయంవరం వివాహం కృత్వా ఋతుగామినో భూత్వా విధివత్ ప్రజాముత్పాదయన్తి తేషాం సా ప్రజా శుభ గుణయుక్తా భూత్వా పితౄన్ సతతం సుఖయతి. ॥౪౮॥

పదార్థము :-(అగ్నిః) అగ్నివలె ప్రకాశమానుడగు భర్త (మే) నాకొరకు (బహులామ్) అధిక సుఖములనిచ్చు (ప్రజామ్) సంతానమును (కరోతు) కలిగించుగాక! (మే) నాయొక్క (ఏ) ఇదమ్) ఈ (ప్రజననమ్) ఉత్పత్తియొనర్చు నిమిత్తము (హవిః) ఇచ్చి పుచ్చుకొనదగిన (దశవీరమ్) పదుగురు [పదిమంది] సంతానముల నుత్పన్నమొనర్చు (సర్వగణమ్) సకల సముదాయములతో (ఆత్మసని) ఆత్మసేవనము (ప్రజాసని) ప్రజా [సంతాన] సేవనము (పశుసని) పశుసేవనము (లోకసని) లోకములను చక్కగా సేవించు మరియు (అభయసని) అభయసంబంధ దానరూపకర్మనిరతి సంతోషము గలిగించుగాక! అట్టి (స్వస్తయే) సుఖముకొరకు (అస్తు) అగుగాక! ఓ జననీ జనకులారా, పితరులారా! మీరు (అస్మాసు) మా యందు సంతానమును, (అన్నమ్) అన్నమును (పయః) క్షీరాదులను (రేతః) వీర్యములను (ధత్త) ధరింపజేయుడు.॥౪౮॥

భావార్థము :- ఏ స్త్రీపురుషులు బ్రహ్మచర్యముద్వారా సకల విద్యాశిక్షణల సంగ్రహించుకొని పరస్పరము ప్రేమతో స్వయంవరవివాహమొనర్చుకొని, ఋతుగాములై విధిపూర్వకముగ సంతానోత్పత్తి నొనర్చెదరో అట్టివారి సంతానము శుభగుణలక్షణవంతమై నిరంతరము జననీ జనకులు మున్నగువారిసేవ జేయును. ॥౪౮॥

48.May my fiery husband make my progeny abundant. May this my married life bring me tne brave children all good objects, physical strength, good progeny, cattle, spiritual force and fearlessness, for my welfare. O parents do ye confer on us food, milk, and manly vigour.

**౧౦౭౫.ఉదీరతామిత్యస్య శఙ్ఖఋషిః, పితరో దేవతాః, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః,**

**ధైవతః స్వరః. పితృభిః కిమ్భూతైః కిం కార్యమిత్యాహ. పిత్రాదులు ఎటువంటివారలై యుండవలయును?**

౧౦౭౫ ఉదీరతామవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితరః సోమ్యాసః।అసుం

యఈయురవృకా ఋతజ్ఞాస్తే నోఽవన్తు పితరో హవేషు ॥౪౯॥

ప.వి:-ఉత్, ఈరతామ్, అవరే, ఉత్, పరాసః, ఉత్, మధ్యమాః, పితరః, సోమ్యాసః అసుమ్, యే, ఈయుః, అవృకాః ఋతజ్ఞా ఇత్యృత +జ్ఞాః, తే, నః, అవన్తు, పితరః, హవేషు.॥౪౯॥

పదార్థః:- (ఉత్) (ఈరతామ్) ప్రేరతామ్ (అవరే) అర్వాచీనాః (ఉత్) (పరాసః) ప్రకృష్టాః (ఉత్) (మధ్యమాః) మధ్యే భవాః (పితరః) పాలకాః (సోమ్యాసః) సౌమ్యగుణసంపన్నాః (అసుమ్) ప్రాణమ్ (యే) (ఈయుః) ప్రాప్నుయుః (అవృకాః) అవిద్యమానాః వృకాశ్చోరా యేషు యే (ఋతజ్ఞాః) యే ఋతం సత్యం జానన్తి (తే) (నః) అస్మాన్ (అవన్తు) రక్షన్తు (పితరః) రక్షితారః (హవేషు) సంగ్రామాదిషు వ్యవహారేషు.॥౪౯॥

అన్వయః:-హే మనుష్యాః! యేఽవృకా ఋతజ్ఞాః పితరో హవేష్వసుముదీయుస్తే న ఉదవన్తు యే సోమ్యాసోఽవరే పరాసో మధ్యమాః పితరస్సన్తి తేఽస్మాన్ హవేషూదీరతామ్.॥౪౯॥

భావార్థః:-యే జీవన్తో నికృష్టమధ్యమోత్తమాః స్తేయాదిదోషరహితా విదితవేదితవ్యా అధిగత యాథాతథ్యా విద్వాంసస్సన్తి తే విద్యాభ్యాసోపదేశాభ్యాం సత్యధర్మగ్రాహకత్వేన బాల్యావస్థాయాం వివాహనిషేధేన సర్వాః ప్రజాః పాలయన్తు.॥౪౯॥

పదార్థము :- ఓ మానవులారా! (యే) ఎవరు (అవృకాః) చౌర్యము మున్నగు దోషములు లేనివారో (ఋతజ్ఞాః) సత్యము నెరుగువారో (పితరః) అట్టి తల్లిదండ్రులు మున్నగువారు (హవేషు) సంగ్రామము మున్నగు వ్యవహారములందు (అసుమ్) ప్రాణములను (ఉదీయుః) ఉత్తమత్వముతో ప్రాప్తించుకొందురో (తే) వారు (నః) మాయొక్క (ఉత్, అవన్తు) రక్షణను చక్కగా యొనర్చెదరుగాక! మరియు (సోమ్యాసః) శాంతి మున్నగు గుణములు గలవారు (అవరే) ప్రథమ వయోజనులు (పరాసః) ఉత్కృష్టవయస్కులు (మధ్యమాః) మధ్యతరగతి విద్వాంసులగు (పితరః) ఏ పితరులు మున్నగువారు గలరో వారు మమ్ము సంగ్రామము మున్నగు కార్యములందు (ఉదీరతామ్) చక్కగా ప్రేరణ నొనర్చుదురుగాక!॥౪౯॥

భావార్థము :-జీవితులైయున్న, ప్రథమ, మధ్యమ, ఉత్తములు, చౌర్యము మున్నగు దోషములు లేనివారు,

తెలిసికొనదగిన విద్యలను సంపూర్ణముగ నెరిగిన తత్త్వజ్ఞానులు నగు విద్వాంసులు విద్యాభ్యాస ఉపదేశములచే సత్యధర్మముల గ్రహింపజేయు కర్మలద్వారా బాల్యవివాహముల నిషేధించి ప్రజాపాలనమొనర్చవలయును. ॥౪౯॥

49.May our parents, who do not steal, know the truth, gain strength of battles, through control of breath, protect us well, May the lowest, highest, midmost elders calm and peaceful in nature, urge us on to battle.

౧౦౭౬. అఙ్గిరస ఇత్యస్య శంఖ ఋషిః, పితరో దేవతాః, నిచృదనుష్టుప్ ఛందః, ధైవతః స్వరః,

పితృసన్తానైరితరేతరం కిం కర్తవ్యమిత్యాహ. తల్లిదండ్రులు సంతానము ఒకరికొరకు ఏమి చేయవలయును?

౧౦౭౬ అఙ్గిరసో నః పితరో నవగ్వా అథర్వాణో భృగవః సోమ్యాసః।

తేషాం వయꣳ సుమతౌ యజ్ఞియానామపి భద్రే సౌమనసే స్యామ ॥౫౦॥

ప.వి:- అఙ్గిరసః నః, పితరః నవగ్వా ఇతి నవ +గ్వాః, అథర్వాణః భృగవః, సోమ్యాసః, తేషామ్, వయమ్, సుమతావితి సు+మతౌ, యజ్ఞియానామ్, అపి, భద్రే, సౌమనసే, స్యామ. ॥౫౦॥

పదార్థః:-(అఙ్గిరసః) సర్వవిద్యాసిద్ధాన్తవిదః (నః) అస్మాకమ్ (పితరః) పాలకాః (నవగ్వాః) (అథర్వాణః) అహింసకాః (భృగవః) పరిపక్వవిజ్ఞానాః, (సోమ్యాసః) యే సోమమైశ్వర్యమర్హన్తి తే (తేషామ్) (వయమ్) (సుమతౌ) శోభనా చాసౌ మతిశ్చ తస్యామ్ (యజ్ఞియానామ్) యే యజ్ఞమర్హన్తి తేషామ్ (అపి)(భద్రే) కల్యాణకరే (సౌమనసే) శోభనం మనః సుమనస్తస్య భావే (స్యామ) భవేమ. ॥౫౦॥

అన్వయః:- హే మనుష్యాః! యే నోఽఙ్గిరసో నవగ్వా అథర్వాణో భృగవః సోమ్యాసః పితరఃసన్తి తేషాం యజ్ఞియానాం సుమతౌ భద్రే సౌమనసే వయం ప్రవృత్తాస్స్యామైవం యూయమపి భవత. ॥౫౦॥

భావార్థః:- అపత్యైర్యద్యత్ పితౄణాం ధర్మ్యం కర్మ తత్తత్సేవనీయం యద్యదధర్మ్యం తత్తత్త్యక్తవ్యం పితృభిరప్యేవం సమాచరణీయమ్. ॥౫౦॥

పదార్థము :- ఓ మానవులారా! (నః) మాయొక్క (అఙ్గిరసః) సమస్త విద్యల సిద్ధాంతముల నెరిగినట్టి (నవగ్వాః) క్రొత్తక్రొత్త జ్ఞానోపదేశముల నొనర్చు (అథర్వాణః) అహింసకులు (భృగవః) పరిపక్వవిజ్ఞానవంతులు

భావార్థము :- యుక్తాహారవిహారాదుల నొనర్చుచు వేదాభ్యాసమొనర్చి అవిద్య మున్నగు క్లేశములను త్యజించి యోగసిద్ధులను పొంది వాని యభిమానమును దరికి రానీయక కైవల్యమును పొందువారుమాత్రమే బ్రహ్మానందమును అనుభవించగలరు. ॥౭౪॥

74.He, who enjoys the company of pure. learned persons, is a discriminator, willingly drinks Soma juice out of waters, purifies food with vedic knowledge, is a cleanser of soul, equipped with the power of protection, knows God, is procurer of supremacy through the knowledge of yoga, acquires the happiness of soul, sweet like honey, salvation, and the apparent essence of knowledge.

౧౫౦౧. అన్నాత్పరిస్రుత ఇత్యస్య శంఖ ఋషిః, ప్రజాపతిర్దేవతా, భురిగతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

కథం రాజ్యమున్నేయమిత్యాహ. రాజ్యోన్నతి యెటు లొనర్చవలయును?

౧౧౦౧ అన్నాత్పరిస్రుతో రసం బ్రహ్మణా వ్యపిబత్క్షత్రం పయః సోమం

ప్రజాపతిః। ఋతేన సత్యమిన్ద్రియం విపానꣳ శుక్ర మన్ధసꣳ

ఇన్ద్రస్యేన్ద్రియమిదం పయోఽమృతం మధు॥౭౫॥

ప.వి:- అన్నాత్, పరిస్రుత ఇతి + పరిస్రుతః, రసమ్, బ్రహ్మణా, వి, అపిబత్, క్షత్రమ్, పయః, సోమమ్, ప్రజాపతిరితి ప్రజా + పతిః, ఋతేన, సత్యమ్, ఇన్ద్రియమ్, విపానమితి వి + పానమ్, శుక్రమ్, అన్ధసః, ఇన్ద్రస్య, ఇన్ద్రియమ్, ఇదమ్, పయః, అమృతమ్, మధు.॥౭౫॥

పదార్థః:- (అన్నాత్) యవాదేః (పరిస్రుతః) సర్వతః స్రుతః పక్వాత్ (రసమ్) సారభూతమ్ (బ్రహ్మణా) అధీతచతుర్వేదేన (వి) (అపిబత్) గృహ్ణీయాత్ (క్షత్రమ్) క్షత్రియకులమ్ (పయః) దుగ్ధమివ (సోమమ్) ఐశ్వర్యయుక్తమ్ (ప్రజాపతిః) ప్రజాపాలకః సభేశో రాజా (ఋతేన) విద్యావినయయుక్తేన న్యాయేన (సత్యమ్) సత్సు వ్యవహారేషు సాధు (ఇన్ద్రియమ్) ఇన్ద్రేణేశ్వరేణ దత్తమ్ (విపానమ్) వివిధం పానం రక్షణం యస్మాత్ తత్ (శుక్రమ్) వీర్యకరమ్ (అన్ధసః) అన్ధకారరూపస్యాఽన్యాయస్య నివర్తకమ్ (ఇన్ద్రస్య) సమగ్రైశ్వర్యప్రదస్య రాజ్యస్య (ఇన్ద్రియమ్) ఇన్ద్రై రాజభిర్జుష్టం న్యాయాఽఽచరణమ్ (ఇదమ్) (పయః) పాతుమర్హమ్ (అమృతమ్) అమృతమివ సుఖప్రదమ్ (మధు) మాధుర్యగుణోపేతమ్.॥౭౫॥

**అన్వయః:- యో బ్రహ్మణా సహ ప్రజాపతిః పరిస్రుతోఽన్నాన్నిఃసృతం పయః సోమం రసం క్షత్రం చ వ్యపిబత్ స ఋతేనాఽన్ధసో నివర్తకం శుక్రం విపానం సత్యమిన్ద్రియమిన్ద్రస్య ప్రాపకమిదం పయోఽమృతం మధ్విన్ద్రియం చ ప్రాప్నుయాత్ స సదా సుఖీ భవేత్.॥౭౫॥**

**భావార్థః:- యే విద్వదనుమత్యా రాజ్యం వర్ధితుమిచ్ఛన్తి తేఽన్యాయం నివర్తయితుం రాజ్యం వర్ధయితుం చ శక్నువన్తి.॥౭౫॥**

పదార్థము :-(బ్రహ్మణా) నాలుగువేదములను చదివిన విద్వాంసునితోగూడ (ప్రజాపతిః) ప్రజారక్షకుడు, సభాధ్యక్షుడగు రాజు (పరిస్రుతః) అన్నివైపులనుండి పక్వమైనట్టి (అన్నాత్) యవలు మున్నగు ధాన్యములనుండి వచ్చిన (పయః) దుగ్ధములవంటి (సోమమ్) ఐశ్వర్యయుక్త (రసమ్) సారరూపరసము మరియు (క్షత్రమ్) క్షత్రియవంశములను (వ్యపిబత్) గ్రహణమొనర్చునాతడు (ఋతేన) విద్యావినయములతో గూడిన న్యాయముతో (అన్ధసః) అంధకారరూప అన్యాయమును దొలగించు (శుక్రమ్) పరాక్రమశాలి (విపానమ్) అనేక విధములగు రక్షణహేతువు (సత్యమ్) సత్యవ్యవహారములందు శ్రేష్ఠుడు (ఇన్ద్రియమ్) ఇన్ద్రనామకుడగు పరమాత్మ ప్రసాదించిన (ఇన్ద్రస్య) సమగ్ర ఐశ్వర్యములనిచ్చు, రాజ్యమును ప్రాప్తినొందించు (ఇదమ్) ఈ ప్రత్యక్ష (పయః) పానయోగ్యమగు (అమృతమ్) అమృతమువంటి సుఖదాయక రసమును (మధు) మధురము మున్నగు గుణములతో గూడిన (ఇన్ద్రియమ్) రాజులు మున్నగువారు సేవించిన న్యాయాచరణమును ప్రాప్తించుకొనువాడు సదా సుఖవంతుడై యుండగలడు. ॥౭౫॥

భావార్థము :- విద్వాంసుల అనుమతిచే రాజ్యాభివృద్ధిని గోరువారే అన్యాయము నణచివేసి రాజ్యమును విస్తృతమొనర్ప సమర్థులగుదురు.॥౭౫॥

75.A king, who along with one knowing all the four vedas,enjoys his birth in a royal family and the milk wise invigorating essence of a well-cooked food, and with justice coupled with learning and decorum, administers his rule, the giver of glory, a gift from God, pre-eminent in all dealings, the remover of the darkness of injustice, the bestower of valour, and the source of diverse kinds of protection, always derives happiness from this his administration fit for enjoyment, inbued with justice, sweetness, and delightfulness.

౧౧౦౨.రేత ఇత్యస్య శంఖ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిగతిశక్వరీ ఛందః, పఞ్చమః స్వరః.

శరీరాత్కథం వీర్యముత్పద్యత ఇత్యాహ. శరీరమునుండి వీర్య మెటుల యుత్పన్న మగుచున్నది?

౧౧౦౨ రేతో మూత్రం విజహాతి యోనిం ప్రవిశదిన్ద్రియమ్। గర్భో

జరాయుణావృత ఉల్వం జహాతి జన్మనా। ఋతేన సత్యమిన్ద్రియం

విపానꣳ శుక్ర మన్ధసఽఇన్ద్రస్యేన్ద్రియమిదం పయోఽమృతం మధు॥౭౬

ప.వి:-రేతః, మూత్రమ్, వి, జహోతి, యోనిమ్, ప్రవిశదితి ప్ర + విశత్, ఇన్ద్రియమ్, గర్భః, జరాయుణా, ఆవృత ఇత్యా + వృతః, ఉల్వమ్, జహోతి, జన్మనా, ఋతేన, సత్యమ్, ఇన్ద్రియమ్, విపానమితి వి + పానమ్, శుక్రమ్, అన్ధసః, ఇన్ద్రస్య, ఇన్ద్రియమ్, ఇదమ్, పయః, అమృతమ్, మధు.॥౭౬॥

పదార్థః:-(రేతః) వీర్యమ్ (మూత్రమ్) ప్రస్రావః (వి) (జహోతి) (యోనిమ్) జన్మస్థానమ్ (ప్రవిశత్) ప్రవేశం కుర్వత్ సత్ (ఇన్ద్రియమ్) ఉపస్థః పురుషలిఙ్గమ్ (గర్భః) యో గృహ్యతే సః (జరాయుణా) బహిరాచ్ఛాదనేన (ఆవృతః) (ఉల్వమ్) ఆవరణమ్ (జహోతి) త్యజతి (జన్మనా) ప్రాదుర్భావేన (ఋతేన) బహిస్థేన వాయునా సహ (సత్యమ్) వర్తమానే సాధు(ఇన్ద్రియమ్) జిహ్వాదికమ్ (విపానమ్) వివిధం పానం యేన తత్ (శుక్రమ్) పవిత్రమ్ (అన్ధసః) ఆవరణస్య (ఇన్ద్రస్య) జీవస్య (ఇన్ద్రియమ్) ధనమ్ (ఇదమ్) (పయః) రసవత్ (అమృతమ్) నాశరహితమ్ (మధు) యేన మన్యతే తత్.॥౭౬॥

అన్వయః:-ఇన్ద్రియం యోని ప్రవిశత్సద్ రేతో విజహోతి. అతోఽన్యత్ర మూత్రం విజహోతి. తజ్జరాయుణా వృతో గర్భో జాయతే జన్మనోల్వం జహోతి స ఋతేనాన్ధసో నివర్తకం విపానం శుక్రం సత్యమిన్ద్రస్యేన్ద్రియ మిదం పయోఽమృతం మధ్విన్ద్రియం చైతి.॥౭౬॥

భావార్థః:-ప్రాణినా యత్ కించిద్ భుజ్యతే పీయతే తత్ పరంపరయా శుక్రం భూత్వా శరీరకారణం జాయతే పురుషస్యోపస్థేన్ద్రియం స్త్రీసంయోగేన శుక్రం ముఞ్చతి. అతోఽన్యత్ర మూత్రం త్యజతి తేన జ్ఞాయతే శరీరే మూత్రస్థానాదన్యత్ర రేతస్తిష్ఠతి తద్ యస్మాత్సర్వేభ్యోఽఙ్గేభ్య ఉత్పద్యతే. తస్మాత్సర్వాంగాకృతిర్వర్తతే అతఏవ యస్య శరీరాద్ వీర్యముత్పద్యతే తదాకృతిరేవ సన్తానో జాయతే. ॥౭౬॥

పదార్థము :-(ఇన్ద్రియమ్) పురుషుని లింగముద్వారా ఇంద్రియము (యోనిమ్) స్త్రీయోనియందు (ప్రవిశత్) ప్రవేశించుచు (రేతః) వీర్యమును (వి, జహోతి) విశేషించి వదలును. ఇదియుగాక (మూత్రమ్) మూత్రమును గూడ వదలివేయును. ఆ వీర్యము (జరాయుణా) జరాయువు [మావి] తో (ఆవృతః) కప్పబడియుండి (గర్భః) గర్భరూపమై జన్మించును (జన్మనా) జన్మముచే (ఉల్వమ్) ఆవరణమును (జహోతి) వదలివేయును. అది (ఋతేన) బాహ్యవాయువుతో (అన్ధసః) ఆవరణమును నివృత్తపరచు (విపానమ్) వివిధ పానముల సాధనము (శుక్రమ్) పవిత్రము (సత్యమ్) వర్తమానములందుత్తమము (ఇన్ద్రస్య) జీవునికి

సంబంధమగు (ఇన్ద్రియమ్) ధనముల మరియు (ఇన్ద్రమ్) ఈ (పయః) రసమువంటి (అమృతమ్) నాశరహితము (మధు) ప్రత్యక్షము మున్నగు జ్ఞానసాధనములైన (ఇన్ద్రియమ్) చక్షువులు మున్నగు ఇంద్రియములను పొందుచున్నాడు. ॥౭౬॥

భావార్థము :- ప్రాణుల ఆహారపానీయముల పరంపరద్వారా వీర్యనిర్మాణము జరిగి శరీరమునకు కారణరూప మగుచున్నది. పురుషలింగమైన ఇంద్రియము స్త్రీసంయోగముచే వీర్యము గర్భకోశమునకు వదలును. ఈలింగము మూత్రమును గూడ వదలును. ఇందువల్ల మానవశరీరమందు మూత్రస్థానమునకు భిన్నముగానే వీర్యస్థానముగలదని బోధపడుచున్నది. ఆ వీర్యమునందు శరీరాంగములన్నింటి యాకృతి యుండుకారణమున ఏ శరీరమునుండి వీర్యముత్పన్నమగునో అట్టి యాకృతిగలిగిన సంతానమే యుత్పన్నమగు చుండును. ॥౭౬॥

76.The generative organ releases urine, but when it enters the womb, it releases semen. The caul-invested embryo leaves by its birth the covering folds. The child, by the removal of covering folds, in their contact with external air, acquires the wealth of soul, pure, excellent and enjoyable; and is endowed with these eyes, sweet like juice, and source of everlasting knowledge.

౧౧౦౩. దృష్ట్వేత్యస్య శఙ్ఖ ఋషిః, ప్రజాపతిర్దేవతా, అతిశక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ ధర్మాధర్మౌ కీదృశావిత్యుపదిశ్యతే. ధర్మాధర్మము లెటు లున్నవి?

౧౧౦౩ దృష్ట్వా రూపే వ్యాకరోత్సత్యానృతే ప్రజాపతిః। అశ్రద్ధామనృతేऽదధాచ్ఛ్రద్ధాం సత్యే ప్రజాపతిః। ఋతేన సత్యమిన్ద్రియం విపానం శుక్రమన్ధసऽ ఇన్ద్రస్యేన్ద్రియమిదం పయోऽమృతం మధు ॥౭౭॥

ప.వి:- దృష్ట్వా, రూపేऽ ఇతి రూపే, వి, ఆ, అకరోత్, సత్యానృతే ఇతి సత్య + అనృతే, ప్రజాపతిరితి ప్రజా + పతిః, అశ్రద్ధామ్, అనృతే, అదధాత్, శ్రద్ధామ్, సత్యే, ప్రజాపతిరితి ప్రజా + పతిః, ఋతేన, సత్యమ్, ఇన్ద్రియమ్, విపానమితి వి + పానమ్, శుక్రమ్, అన్ధసః, ఇన్ద్రస్య, ఇన్ద్రియమ్, ఇదమ్, పయః, అమృతమ్, మధు. ॥౭౭॥

పదార్థః:-(దృష్ట్వా) సంప్రేక్ష్య (రూపే) నిరూపితే (వి) (అ) (అకరోత్) కరోతి (సత్యానృతే) సత్యం చానృతం చ తే (ప్రజాపతిః) ప్రజాయాః పాలకః (అశ్రద్ధామ్) అప్రీతిమ్ (అనృతే) అవిద్యమానమృతం యస్మింస్తస్మిన్నధర్మే (అదధాత్) దధాతి (శ్రద్ధామ్) శ్రత్ సత్యం దధాతి యయా తామ్ (సత్యే) సత్సు భవే (ప్రజాపతిః) పరమేశ్వరః (ఋతేన) యథార్థేన (సత్యమ్) (ఇన్ద్రియమ్) చిత్తమ్ (విపానమ్) వివిధరక్షణమ్ (శుక్రమ్) శుద్ధికరమ్ (అన్ధసః) అధర్మాఽఽచరణస్య నాశకమ్ (ఇన్ద్రస్య) పరమైశ్వర్యవతో ధర్మస్య ప్రాపకమ్ (ఇన్ద్రియమ్) విజ్ఞానసాధకమ్ (ఇదమ్) (పయః) సుఖప్రదమ్ (అమృతమ్) మృత్యురోగాత్ పృథక్కరమ్ (మధు) మన్తవ్యమ్.॥౭౭॥

అన్వయః:-యః ప్రజాపతిరృతేన స్వకీయేన సత్యేన విజ్ఞానేన సత్యానృతే రూపే దృష్ట్వా వ్యాకరోత్ యోఽనృతేఽశ్రద్ధామదధాత్ సత్యే శ్రద్ధాం చ యశ్చాఽన్ధసో నివర్తకం శుక్రం విపానం సత్యమిన్ద్రియం యశ్చేన్ద్రస్య ప్రాపకమిదం పయోఽమృతం మధ్విన్ద్రియం చాఽదధాత్ స ఏవ ప్రజాపతిః సర్వైరుపాసనీయః.॥౭౭॥

భావార్థః:-యే మనుష్యా ఈశ్వరాజ్ఞాపితం ధర్మమాచరన్తి. అధర్మం న సేవన్తే తే సుఖం లభన్తే యదీశ్వరో ధర్మాఽధర్మౌ న జ్ఞాపయేత్తర్హ్యేతయోః స్వరూపవిజ్ఞానం కస్యాపి న స్యాత్. య ఆత్మానుకూలమాచరణం కుర్వన్తి ప్రతికూలం చ త్యజన్తి తే హి ధర్మాఽధర్మ బోధయుక్తా భవన్తి నేతరే. ॥౭౭॥

పదార్థము :-(ప్రజాపతిః) ప్రజారక్షకుడగు నే పరమేశ్వరుడు (ఋతేన) తన యథార్థమగు సత్యవిజ్ఞానముద్వారా (సత్యానృతే) ఏ సత్యాసత్యములను (రూపే) రూపొందించియున్నాడో, వానిని (దృష్ట్వా) జ్ఞానదృష్టిచే దెలిసికొని (వ్యాకరోత్) అనేక విధముల యుపదేశించునో (అనృతే) ఏ మిథ్యాభాషణములందు (అశ్రద్ధామ్) ప్రీతిరహితము (అదధాత్) ధారణమొనర్చుచు (సత్యే) సత్యమునందు (శ్రద్ధామ్) ప్రీతిని ధరింపజేయించునో మరియు నే (అన్ధసః) అధర్మాచరణమును నివర్తింపజేసి (శుక్రమ్) శుద్ధిపరమునట్టి (విపానమ్) వివిధరక్షణముల సాధనమగు (సత్యమ్) సత్యస్వరూపము (ఇన్ద్రియమ్) చిత్తమును మరియు ఏ (ఇన్ద్రస్య) పరమైశ్వర్యముతో గూడిన ధర్మమును ప్రాప్తింపజేయునో (ఇదమ్) ఇట్టి (పయః) అమృతరూప సుఖదాయకము (అమృతమ్) మృత్యురోగనివారకము (మధు) మన్నించదగిన (ఇన్ద్రియమ్) విజ్ఞానసాధనమును ధారణమొనర్చునట్టి (ప్రజాపతిః) పరమేశ్వరుడే ఎల్లరకును ఉపాసనీయదైవమై యున్నాడు. ॥౭౭॥

భావార్థము :-పరమేశ్వరు డాజ్ఞాపించిన ధర్మము నాచరించుచు, నిషేధించినట్టి అధర్మమును సేవించకుండ నుండువాడు సుఖప్రాప్తి నొందుచున్నాడు. ఈశ్వరుడు ధర్మాధర్మముల జ్ఞానము గలిగించకున్న అట్టి ధర్మాధర్మముల స్వరూపజ్ఞానము ఎవ్వరికిని గలుగకుండెడిది. ఎవరు ఆత్మకు అనుకూలమగు

ఆచరణమునొనర్చుచు, ప్రతికూలమగు ఆచరణమును వదలివేయుదురో వారే ధర్మాధర్మముల నెరిగినవా రగుదురు. కాని ఇతరులు మాత్రము కాజాలరు. ॥౭౭॥

77.God through His pure knowledge, viewing both forms has explaind truth and falsehood. He has assigned the lack of faith to falsehood, and faith to truth. He alone is worthy of worship by all, Who is thc Abolisher of irreligiousness, Purifier, Sustainer, Truth personified, Path-indicator of mind, Revealer of manly vedic truth, Giver of salvation, Adorable, and source of knowledge.

౧౧౦౪.వేదేనేత్యస్య శఙ్ఖ ఋషిః, ప్రజాపతిర్దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ వేదజ్ఞాః కీదృశా ఇత్యుపదిశ్యతే. వేదజ్ఞు లెటులుందురు?

౧౧౦౪ వేదేన రూపే వ్యపిబత్సుతాసుతౌ ప్రజాపతిః। ఋతేన సత్యమిన్ద్రియం
విపానꣳ శుక్రమన్ధసఽ ఇన్ద్రస్యేన్ద్రియమిదం పయోఽమృతం మధు॥౭౮॥

ప.విః-వేదేన, రూపేఽ ఇతి రూపే, వి, అపిబత్, సుతాసుతౌ, ప్రజాపతిరితి ప్రజా + పతిః, ఋతేన, సత్యమ్, ఇన్ద్రియమ్, విపానమితి వి + పానమ్, శుక్రమ్, అన్ధసః, ఇన్ద్రస్య, ఇన్ద్రియమ్, ఇదమ్, పయః, అమృతమ్, మధు.॥౭౮॥

పదార్థః:-(వేదేన) ఈశ్వరప్రకాశితేన వేదచతుష్టయేన (రూపే) సత్యానృతస్వరూపే (వి) (అపిబత్) గృహ్ణీయాత్ (సుతాసుతౌ) ప్రేరితాప్రేరితౌ ధర్మాధర్మౌ (ప్రజాపతిః) ప్రజాపాలకో జీవః (ఋతేన) సత్యవిజ్ఞానయుక్తేన (సత్యమ్) సత్సు ధర్మాచరణేషు సాధు (ఇన్ద్రియమ్) ధనమ్ (విపానమ్) వివిధపాననిమిత్తమ్ (శుక్రమ్) పరాక్రమప్రదమ్ (అన్ధసః) అన్నాదేః (ఇన్ద్రస్య) ఐశ్వర్యయుక్తస్య జీవస్య (ఇన్ద్రియమ్) ఇన్ద్రేణేశ్వరేణ దత్తం జ్ఞానమ్ (ఇదమ్) జలాది (పయః) దుగ్ధాది (అమృతమ్) మృత్యుధర్మరహితం విజ్ఞానమ్ (మధు) మాధుర్యగుణోపేతమ్.॥౭౮॥

అన్వయః:-యః ప్రజాపతిర్ఋతేన వేదేన సుతాసుతౌ రూపే వ్యపిబత్ స ఇన్ద్రస్యాన్ధసో విపానం శుక్రం సత్యమిన్ద్రియమిదం పయోఽమృతం మధ్విన్ద్రియం చాప్నుయాత్.॥౭౮॥

భావార్థః:-వేదవిత్ ఏవ ధర్మాధర్మౌ జ్ఞాతుం ధర్మాచరణేనాఽధర్మత్యాగేన చ సుఖినో భవితుం శక్నువన్తి.॥౭౮॥

పదార్థము :- ( (ప్రజాపతిః) ప్రజాపాలన మొనర్చు నే జీవుడు (ఋతేన) సత్యవిజ్ఞాన పూర్ణములగు (వేదేన) ఈశ్వరుడు ప్రకాశపరచిన నాల్గువేదములనుండి (సుతాసుతౌ) ప్రేరిత, అప్రేరిత ధర్మాధర్మముల (రూపే) స్వరూపములను (వ్యపిబత్) గ్రహించునో, యా (ఇన్ద్రస్య) ఐశ్వర్యశాలియగు జీవుని (అన్ధసః) అన్నాదుల (విపానమ్) వివిధ పానములకొరకు (శుక్రమ్) పరాక్రమమునిచ్చు (సత్యమ్) సత్యధర్మాచరణమునందు ఉత్తమమగు (ఇన్ద్రియమ్) ధనము మరియు (ఇదమ్) జలాదులు (పయః) క్షీరాదులు (అమృతమ్) మృత్యుధర్మములేని విజ్ఞానము (మధు) మధురగుణములతో గూడిన పదార్థములు మరియు (ఇన్ద్రియమ్) ఈశ్వరప్రసాదితమగు జ్ఞానప్రాప్తిని పొందుదురు.॥౭౮॥

భావార్థము :-వేదవిద్యనెరిగినవారు మాత్రమే ధర్మాధర్మములనెరిగినవారై ధర్మము నాచరించుచు అధర్మ త్యాజ్యమునొనర్చుటకు సమర్థులై సుఖించెదరు.॥౭౮॥

78.The soul, full of real knowledge, with the help of all the four vedas, realises the essence of Truth and Untruth. It acquires for itself foodstuffs as meals, riches, the givers of valour and righteous character, water, milk, immperishable knowledge, sweet delicious articles, and the knowledge bestowed by God.

౧౧౦౫. దృష్ట్వేత్యస్య శఙ్ఖ ఋషిః, ప్రజాపతిర్దేవతా, భురిగతిజగతీ ఛందః నిషాదః స్వరః.

కీదృగ్జనో బలమున్నేతుం శక్నోతీత్యాహ. ఎటువంటివాడు బలమును పెంపొందించ గలడు?

౧౧౦౫ దృష్ట్వా పరిస్రుతో రసꣳశుక్రేణ శుక్రం వ్యపిబత్ పయః

సోమం ప్రజాపతిః। ఋతేన సత్యమిన్ద్రియం విపానꣳ శుక్రమన్ధసఽ

ఇన్ద్రస్యేన్ద్రియమిదం పయోఽమృతం మధు॥౭౯॥

ప. విః-దృష్ట్వా, పరిస్రుత ఇతి పరిఽస్రుతః, రసమ్, శుక్రేణ, శుక్రమ్, వి, అపిబత్, పయః, సోమమ్, ప్రజాపతిరితి ప్రజా + పతిః, ఋతేన, సత్యమ్, ఇన్ద్రియమ్, విపానమితి వి + పానమ్, శుక్రమ్, అన్ధసః, ఇన్ద్రస్య, ఇన్ద్రియమ్, ఇదమ్ పయః, అమృతమ్, మధు.॥౭౯॥

పదార్థః:- (దృష్ట్వా) పర్యాలోచ్య (పరిస్రుతః) సర్వతః ప్రాప్తః (రసమ్) విద్యానన్దమ్ (శుక్రేణ) శుద్ధేన భావేన (శుక్రమ్) శీఘ్రం సుఖకరమ్ (వి) (అపిబత్) పిబేత్ (పయః) పాతుమర్హమ్ (సోమమ్) మహౌషధిరసమ్ (ప్రజాపతిః) ప్రజాయాః స్వామీ (ఋతేన)

యథార్థేన (సత్యమ్) సతీష్వోషధీషు భవమ్ (ఇన్ద్రియమ్) ఇన్ద్రేణ విదుషా జుష్టమ్ (విపానమ్) విశిష్టేన పానేన యుక్తమ్ (శుక్రమ్) వీర్యవత్ (అన్ధసః) సంస్కృతస్యాన్నాదేః (ఇన్ద్రస్య) పరమైశ్వర్యస్య (ఇన్ద్రియమ్) ఇన్ద్రేణేశ్వరేణ సృష్టమ్ (ఇదమ్) (పయః) సురసమ్ (అమృతమ్) మృత్యునిమిత్తరోగనివారకమ్ (మధు) జ్ఞాతం సత్.॥౭౯॥

అన్వయః:-యః పరిస్రుతః ప్రజాపతిరృతేన సత్యం దృష్ట్వా శుక్రేణ శుక్రం పయః సోమం రసం వ్యపిబత్ సోఽన్ధసః ప్రాపకం విపానం శుక్రమిన్ద్రియమిన్ద్రస్యేదం పయోఽమృతం మధ్విన్ద్రియఞ్చ ప్రాప్నుయాత్.॥౭౯॥

భావార్థః:-యో వైద్యకశాస్త్రరీత్యోత్తమానోషధీరసాన్నిర్మాయ యథాకాలం యథాయోగ్యం పిబేత్ స రోగేభ్యః పృథగ్భూత్వా శరీరాత్మబలం వర్ధయితుం శక్నుయాత్.॥౭౯॥

పదార్థము :-(పరిస్రుతః) అన్నివైపులనుండి ప్రాప్తించగల (ప్రజాపతిః) ప్రజాస్వామియగు రాజు మున్నగువారు (ఋతేన) యథార్థ వ్యవహారముచే (సత్యమ్) వర్తమానమైయున్న ఓషధులందుత్పన్నమైన రసమును (దృష్ట్వా) ఆలోచనాపూర్వకముగ జూచి (శుక్రేణ) శుద్ధభావముతో (శుక్రమ్) శీఘ్రముగ సుఖమునొనర్చు (పయః) పానమొనర్చదగిన (సోమమ్) మహౌషధములరసమును మరియు (రసమ్) విద్యానందరూప రసమును (వ్యపిబత్) విశేష రూపమున గ్రహించి పానమునొనర్చువారు (అన్ధసః) శుద్ధమగు అన్నాదులను ప్రాప్తింపజేయు వానిని (విపానమ్) విశేషముగ పానమొనర్చు (శుక్రమ్) వీర్యవంతులు (ఇన్ద్రియమ్) విద్వాంసుడు సేవించినట్టి ఇంద్రియమును మరియు (ఇన్ద్రస్య) పరమైశ్వర్యవంతుడగువానికి (ఇదమ్) ఈ (పయః) ఉత్తమ రసవంతమగు (అమృతమ్) మృత్యునివారకము రోగనివారకము నగు (మధు) మధురాది గుణయుక్తమైన (ఇన్ద్రియమ్) ఈశ్వరనిర్మిత ధనప్రాప్తిగలుగును.॥౭౯॥

భావార్థము :- వైద్యశాస్త్రపద్ధతిలో ఉత్తమోషధీరసములను సిద్ధపరచి కాలోచితముగ, ఉచితరీతిని సేవించునాతడు రోగరహితుడై శారీరకాత్మికబలముల పెంపొందజేసికొని సుఖముల ననుభవించుటకు సమర్థుడగును. ॥౭౯॥

79.The King, who is easily accessible to all, and in a just manner, having carefully examined the juice of efficacious medicines, with pure intention, drinks the delight - giving, drinkable juice of medicines and enjoys the pleasure of knowledge, acquires God-given wealth, the procurer of pure food, and the giver of good drinks, the strength of a her, and the sweet, disease-healing nectar of a glorious person.

౧౧౦౬. సీసేనేత్యస్య శఙ్ఖ ఋషిః, సవితా దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

విద్వద్వద్విద్వద్భిరాచరణీయమిత్యాహ. విద్వాంసులతో సమానముగ నితరులును ఆచరించవలెను.

౧౧౦౬ సీసే॑న త॒న్త్రం మన॑సా మనీ॒షిణ॑ ఊర్ణాసూ॒త్రేణ॑ క॒వయో॑ వయన్తి ।
అ॒శ్వినా॑ య॒జ్ఞꣳ స॑వి॒తా సర॑స్వ॒తీన్ద్ర॑స్య రూ॒పం వ॑రు॒ణో భి॑ష॒జ్యన్ ॥౮౦॥

ప.వి:-సీసే॑న, త॒న్త్రమ్, మన॑సా, మ॒నీ॒షిణః॑, ఊ॒ర్ణా॒సూ॒త్రేణేత్యూ॑ర్ణా + సూ॒త్రేణ॑, క॒వయః॑, వ॒య॒న్తి॒, అ॒శ్వినా॑, య॒జ్ఞమ్, స॒వి॒తా, సర॑స్వతీ, ఇన్ద్ర॑స్య, రూ॒పమ్, వ॑రుణః, భి॒ష॒జ్యన్.॥౮౦॥

పదార్థః:- (సీసేన) సీసకధాతుపాత్రేణేవ (తన్త్రమ్) కుటుమ్బధారణమివ తన్త్రకలానిర్మాణమ్ (మనసా) అన్తఃకరణేన (మనీషిణః) మేధావినః (ఊర్ణాసూత్రేణ) ఊర్ణాకమ్బలేనేవ (కవయః)విద్వాంసః (వయన్తి) నిర్మిమతే (అశ్వినా) విద్యావ్యాప్తావధ్యాపకోపదేశకౌ (యజ్ఞమ్) సంగన్తుమర్హం వ్యవహారమ్ (సవితా) విద్యావ్యవహారేషు ప్రేరకః (సరస్వతీ)ప్రశస్తవిజ్ఞానయుక్తా స్త్రీ (ఇన్ద్రస్య) పరమైశ్వర్యస్య (రూపమ్) స్వరూపమ్ (వరుణః) శ్రేష్ఠః (భిషజ్యన్) చికిత్సుః సన్.॥౮౦॥

అన్వయః:- హే మనుష్యాః! యథా కవయో మనీషిణః సీసేనోర్ణాసూత్రేణ మనసా తన్త్రం వయన్తి యథా సవితా సరస్వత్యశ్వినా చ యజ్ఞం కురుతో యథా భిషజ్యన్ వరుణ ఇన్ద్రస్య రూపం విదధాతి తథా యూయమప్యాచరత.॥౮౦॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా విద్వాంసోఽనేకైర్ధాతుభిః సాధనవిశేషైర్వస్త్రాదీని నిర్మాయ కుటుమ్బం పాలయన్తి యజ్ఞం చ కృత్వౌషధాని చ దత్త్వాఽరోగయన్తి శిల్పక్రియాభిః ప్రయోజనాని సాధ్నువన్తి తథాఽన్యైరప్యనుష్ఠేయమ్.॥౮౦॥

పదార్థము :-ఓ మానవులారా! ఎట్లు (కవయః) విద్వాంసులు (మనీషిణః) బుద్ధిశాలురు (సీసేన) సీస లేక గాజుపాత్రవలె కోమలము (ఊర్ణాసూత్రేణ) ఉన్నికంబళివలె ప్రయోజన సాధకము నగు (మనసా) అంతఃకరణముచే (తన్త్రమ్) కుటుంబధారణమువలె యంత్ర కళలను (వయన్తి) రచించెదరో, ఎట్లు (సవితా) అనేక విద్యావ్యవహారములందు ప్రేరణనొనర్చువాడు (సరస్వతీ) ఉత్తమ విద్యావంతురాలగు స్త్రీ మరియు (అశ్వినా) విద్యావ్యాప్తులగు అధ్యాపకోపదేశకులు ఇరువురు (యజ్ఞమ్) సాంగత్య యోగ్యవ్యవహారముల నొనర్చెదరో, ఎట్లు (భిషజ్యన్) చికిత్సను గోరుచు (వరుణః) శ్రేష్ఠుడు (ఇన్ద్రస్య) పరమైశ్వర్య (రూపమ్) స్వరూపమును విధాన మొనర్చునో అదేవిధముగ మీరును నొనర్చుచుండుడు.॥౮౦॥

భావార్థము :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసు లేవిధముగ ధాతువులతో, సాధన విశేషములతో వస్త్రాదులను సిద్ధమొనర్చి తమ కుటుంబములను పోషించెదరో మరియు

పదార్థముల సమ్మిళితరూప యజ్ఞమునొనర్చి పథ్యకర ఓషధుల నిచ్చి వ్యాధులనుండి విముక్తి గలిగింతురో మరియు శిల్పక్రియలద్వారా ప్రయోజనముల సాధించుకొనెదరో అట్లే ఇతరులును నొనర్చవలయును. ।౮౦॥

80.Just as wise sages understand problems with mental force, prepare bullets with lead, and cloths with woollen thread, so do the learned, an educated wife, teachers and preachers perform sacrifice (yajna), and a skilled physician arranges for the elegance of affluence.

౧౧౦౭.తదిత్యస్య శంఖ ఋషిః, వరుణో దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

కే యజ్ఞమర్హన్తీత్యాహ. ఎవడు యజ్ఞ మొనర్చుటకు యోగ్యుడు?

౧౧౦౭ తదస్య రూపమమృతꣳ శచీభిస్తిస్రో దధుర్దేవతాః సꣳ రరాణాః।

లోమాని శష్పైర్బహుధా న తోక్మభిస్త్వగస్య మాꣳసమభవన్న లాజాః॥౮౧॥

ప.విః- తత్, అస్య, రూపమ్, అమృతమ్, శచీభిః, తిస్రః, దధుః, దేవతాః, సꣳరరాణా ఇతి సమ్ + రరాణాః, లోమాని, శష్పైః, బహుధా, న, తోక్మభిరితి తోక్మ + భిః, త్వక్, అస్య, మాꣳసమ్, అభవత్, న, లాజాః.॥ ౮౧॥

పదార్థః-(తత్) పూర్వోక్తం సత్యాదికమ్ (అస్య) యజ్ఞస్య (రూపమ్) స్వరూపమ్ (అమృతమ్) నాశరహితమ్ (శచీభిః) ప్రజ్ఞాభిః కర్మభిర్వా (తిస్రః) అధ్యాపకాఽధ్యేతృ పరీక్షకాః (దధుః) దధ్యుః (దేవతాః) దేవా విద్వాంసః (సంరరాణాః) సమ్యగ్దాతారః (లోమాని) రోమాణి (శష్పైః) దీర్ఘైర్లోమభిః (బహుధా) బహుప్రకారైః (న) (తోక్మభిః) బాలకైః (త్వక్) (అస్య) (మాంసమ్) (అభవత్) భవేత్ (న) నిషేధార్థే (లాజాః).।౮౧॥

అన్వయః:- హే మనుష్యాః! యం సంరరాణాస్తిస్రో దేవతాః శచీభిర్బహుధా యం యజ్ఞం శష్పైః సహ లోమాని చ దధుస్తదస్యామృతం రూపం యూయం విజానీత. అయం తోక్మభిర్నానుష్ఠేయః. అస్య మధ్యే త్వఙ్మాంసం లాజా వా హవిర్నాభవదితి చ విత్త.।౮౧॥

భావార్థః:- యే దీర్ఘసమయావధిజటిలా బ్రహ్మచారిణో వా పూర్ణవిద్యా జితేన్ద్రియా భద్రా జనాః సన్తి త ఏవ యజధాతోరర్థం జ్ఞాతుమర్హన్తి న బాలా అవిద్వాంసో వా స హోమాఖ్యో యజ్ఞో యత్ర మాంసక్షారామ్లతిక్తగుణాదిరహితం కిన్తు సుగన్ధిపుష్టమిష్టం రోగనాశకాది గుణసహితం హవిః స్యాత్ తదేవ హోతవ్యం చ స్యాత్.।౮౧॥

పదార్థము :- మానవులారా! (సంరరాణాః) ఉత్తమముగ నిచ్చు (తిస్రః) చదివించుట, చదువుట, పరీక్షించుటను జేయు ముగ్గురు (దేవతాః) విద్వాంసుల (శచీభిః) శ్రేష్ఠ ప్రజ్ఞా కర్మలద్వారా (బహుధా) అనేక విధములుగ నే యజ్ఞమును మరియు (శష్పైః) దీర్ఘరోమములతో (లోమాని) రోమములను మరియు (తత్) అట్టి (అస్య) ఈ యజ్ఞముయొక్క (అమృతమ్) నాశరహిత (రూపమ్) రూపమును మీరు దెలిసికొనుడు. ఈ (తోక్మభిః) బాలకులచే (న) అనుష్ఠింపదగని మరియు (అస్య) దీనిమధ్య (త్వక్) త్వచ [చర్మము] (మాంసమ్) మాంసము మరియు (లాజాః) వేయించిన, శుష్క అన్నాదులు హోమమొనర్చదగినవి (న, అభవత్) కావు అని మీరెరుగుడు.।౮౧॥

భావార్థము :- చాలాకాలపర్యంతము మీసములు, గడ్డములు గలిగియున్న బ్రహ్మచారులు మరియు పూర్ణ విద్వాంసులు, జితేంద్రియులునగు భద్రజనులు మాత్రమే 'యజ' ధాతు శబ్దమునకర్థముదెలిసికొనదగినవారు. అనగా యజ్ఞమునొనర్చయోగ్యులగుదురు. కాని బాలబుద్ధి గలవారు, అవిద్వాంసులు అర్హులుగాజాలరు. అట్టి హవనరూప యజ్ఞమునందు మాంసాదులు, క్షార, ఆమ్ల, తిక్తాది గుణయుక్తములగు పదార్థముల హవిస్సుల నీయరాదు. సుగంధిత, పుష్ట, మిష్ట, వ్యాధినాశక గుణములతో గూడిన పదార్థములే హవనమొనర్చదగినవై యుండును. ।౮౧॥

81.Teacher, pupil and examiner, these three divine forces, impart and receive education. With wisdom and deed, they with long hair, perform the sacrifice in diverse ways. We should understand the eternal nature of this sacrifice. Illiterate youths are not entitled to perform sacrifice (yajna). Hide, meat, parched grain should not be used in the yajna for oblation.

౧౧౦౮. తదిత్యస్య శంఖ ఋషిః, అశ్వినౌ దేవతే, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

విదుషీభిః కిం కర్తవ్యమిత్యాహ. విదుషీమణు లేమి చేయువలయును?

౧౧౦౮ తదశ్వినా భిషజా రుద్రవర్తనీ సరస్వతీ వయతి పేశో౭అన్తరమ్ ।
అస్థి మజ్జానం మాసరైః కారోతరేణ దధతో గవాం త్వచి ।౮౨॥

ప.విః- తత్, అశ్వినా, భిషజా, రుద్రవర్తనీ ఇతి రుద్ర + వర్తనీ, సరస్వతీ, వయతి, పేశః, అన్తరమ్, అస్థి, మజ్జానమ్, మాసరైః, కారోతరేణ, దధతః, గవామ్, త్వచి. ।౮౨॥

పదార్థః-(తత్) పూర్వోక్తం హవిః (అశ్వినా) విద్యావ్యాపినౌ (భిషజా) వైద్యకశాస్త్రవిదౌ (రుద్రవర్తనీ) రుద్రస్య ప్రాణస్య వర్తనిరివ వర్తనిర్మార్గో యయోస్తౌ (సరస్వతీ) ప్రశస్తజ్ఞానయుక్తా పత్నీ (వయతి) సంతనోతి (పేశః) (అన్తరమ్) మధ్యస్థమ్ (అస్థి)

(మజ్జానమ్) (మాసరైః) పరిపక్వౌషధిసంస్రావైః (కారోతరేణ) కూపేనేవ. కారోతర ఇతి కూపనామసు... నిఘం. 3.23 (దధతః) ధరతః (గవామ్) పృథివ్యాదీనామ్ (త్వచి) ఉపరి భాగే. ॥౮౨॥

అన్వయః:-యత్సరస్వతీ వయతి తత్పేశో౽స్థి మజ్జానమన్తరం మాసరైః కారోతరేణ గవాం త్వచి రుద్రవర్తనీ భిషజా౽శ్వినా దధతో దధ్యాతామ్.॥౮౨॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా వైద్యకశాస్త్రవిదః పతయః శరీరారోగ్యాదికం విధాయ స్త్రియః సతతం సుఖయేయుస్తథైవ విదుష్యః స్త్రియః స్వపతీన్ రోగరహితాన్ కుర్యుః.॥౮౨॥

పదార్థము :-ఎద్దానిని (సరస్వతీ) శ్రేష్ఠజ్ఞానవంతురాలగు పత్ని (వయతి) ఉత్పన్నమొనర్చునో (తత్) అట్టి (పేశః) సుందరస్వరూపము (అస్థి) ఎముక (మజ్జానమ్) మజ్జ [మూలుగ] (అన్తరమ్) అంతస్థమును (మాసరైః) పరిపక్వ ఓషధీసారములచే (కారోతరేణ) కూపముచే సకల కార్యముల సాధించునట్లు (గవామ్) పృథివి మున్నగువాని (త్వచి) చర్మ [బెరుడు] రూప పైభాగమునందు (రుద్రవర్తనీ) ప్రాణమార్గమువంటి మార్గముతో గూడిన (భిషజా) వైద్యవిద్యావిదులు (అశ్వినా) విద్యలందు పరిపూర్ణులగు ఇరువురు పురుషులు (దధతః) ధారణమొనర్చెదరు. ॥౮౨॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. వైద్యశాస్త్ర ప్రవీణులగు పతులు శరీరము నారోగ్యవంతముగ నొనర్చి తమ పత్నులను నిరంతరము సుఖవంతులుగ నుంచునట్లు విదుషీరత్నములును తమ పతులను రోగరహితుల నొనర్చవలెను.॥౮౨॥

82.Whomsoever child, a good, intelligent mother gives birth to, that handsome baby with its internal organs, bones and marrow, should be protected on this earth with medicinal juices, like a well, by a physician and his wife, the infusers of life like vital airs.

౧౧౨౯.సరస్వతీత్యస్య శంఖ ఋషిః, సరస్వతీ దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛందః,ధైవతః స్వరః.

విద్వద్వదితరైరాచరణీయమిత్యాహ. విద్వాంసులవలె అన్యులు ఆచరించవలయును?

౧౧౨౯ సరస్వతీ మనసా పేశలం వసు నాసత్యాభ్యాం వయతి దర్శతం వపుః।

రసం పరిస్రుతా న రోహితం నగ్నహుర్ధీరస్తసరం న వేమ ॥౮౩॥

ప.వి:-సరస్వతీ, మనసా, పేశలమ్, వసు, నాసత్యాభ్యామ్, వయతి, దర్శతమ్, వపుః, రసమ్, పరిస్రుతేతి పరి + స్రుతా, న, రోహితమ్, నగ్నహుః, ధీరః, తసరమ్, న, వేమ. ॥౮౩॥

పదార్థః:-(సరస్వతీ) ప్రశస్తం సరో విజ్ఞానం విద్యతే యస్యాః సా (మనసా) విజ్ఞానేన (పేశలమ్) ఉత్తమాఙ్గవత్ (వసు) ద్రవ్యమ్ (నాసత్యాభ్యామ్) న విద్యతే అసత్యం యయోస్తాభ్యాం మాతాపితృభ్యామ్ (వయతి) విస్తృణాతి (దర్శతమ్) దర్శనీయమ్ (వపుః) శరీరముదకం వా. వపురిత్యుదకనా.. నిఘం. ౧.౧౨. (రసమ్) ఆనన్దమ్ (పరిస్రుతా) పరితః సర్వతః స్రుతమ్ - అత్ర సుపాం సులుగిత్యాకారాదేశః (న) ఇవ (రోహితమ్) ప్రాదుర్భూతమ్ (నగ్నహుః) నగ్నం శుద్ధం జుహోతి గృహ్ణాతి సః (ధీరః) ధ్యానశీలః (తసరమ్) తస్యత్యుపక్షయతి దుఃఖాని యేన తమ్ (న) ఇవ (వేమ) ప్రజనమ్.॥౮౩॥

అన్వయః:-సరస్వతీ మనసా వేమ న యత్ పేశలం దర్శతం వపుస్తసరం రోహితం పరిస్రుతా రసం న వసు వయతి నా సత్యాభ్యాం నగ్నహుర్ధీరశ్చాఽస్తి తౌ ద్వౌ వయం ప్రాప్నుయామ.॥౮౩॥

భావార్థః:-యథా విద్వాంసావధ్యాపకోపదేశకౌ సారం సారం వస్తు గృహ్ణీతస్తథైవ సర్వైః స్త్రీపురుషై ర్గ్రాహ్యమ్. ॥౮౩॥

పదార్థము :- (సరస్వతీ) ఉత్తమవిజ్ఞానయుక్తురాలగు స్త్రీ (మనసా) విజ్ఞానముతో (వేమ) ఉత్పత్తికి (న) సమముగా ఏ (పేశలమ్) ఉత్తమాంగములతోగూడ (దర్శతమ్) చూడదగిన (వపుః) శరీరము లేదా జలములను మరియు (తసరమ్) దుఃఖముల నశింపజేయునట్టి (రోహితమ్) ప్రకటమైన (పరిస్రుతా) అన్నిదిశలనుండి ప్రాప్తించిన (రసమ్) ఆనందమునిచ్చురసమునకు (న) సమమగు ద్రవ్యమును (వయతి) సిద్ధపరచునో (నాసత్యాభ్యామ్) అసత్యవ్యవహారరహితులగు జననీజనకు లిరువురనుండి (నగ్నహుః) శుద్ధమును గ్రహించునట్టి (ధీరః) ధ్యానవంతుడగు ఏ నీ పతిగలడో అట్టి మీ యుభయులను మేము ప్రాప్తించుకొనెదము గాక! ॥౮౩॥

భావార్థము :- విద్వాంసులగు అధ్యాపకోపదేశకులు ఉత్తమసారవస్తువులను గ్రహించునట్లు సకల స్త్రీ పురుషులు గ్రహించుకొనుట యోగ్యమై యున్నది. ॥౮౩॥

The learned wife, with her knowledge, like birth, adorns her beautiful, well built body, and prepares meals, the removers of physical discomforts, available from all sides, ready at hand, the givers of delight like nectar. Her thoughtful husband receives pure ideas from his father and mother free from untruth.

౧౧౧౦.పయసేత్యస్య శంఖ ఋషిః, సోమో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః ధైవతః స్వరః.

స్వకులం ప్రశస్తం కర్తవ్యమిత్యాహ. స్వకులమును శ్రేష్ఠమైనదిగ నొనర్చవలయును?

౧౧౧౦ పయసా శుక్రమమృతం జనిత్రꣳ సురయా మూత్రాజ్జనయన్త రేతః।అపా
మతిం దుర్మతిం బాధమానా ఊవధ్యం వాతꣳసబ్వం తదారాత్॥౭౪॥

ప.విః–పయసా, శుక్రమ్, అమృతమ్, జనిత్రమ్, సురయా, మూత్రాత్, జనయన్త, రేతః, అప, అమతిమ్, దుర్మతిమితి దుః + మతిమ్, బాధమానాః, ఊవధ్యమ్, వాతమ్, సబ్వమ్, తత్, ఆరాత్.॥౭౪॥

పదార్థః:-(పయసా) జలేన దుగ్ధేన వా (శుక్రమ్) శుద్ధమ్ (అమృతమ్) అల్పమృత్యురోగనివారకమ్ (జనిత్రమ్) అపత్యజన్మనిమిత్తమ్ (సురయా) సోమలతాదిరసేన (మూత్రాత్) మూత్రాధారేన్ద్రియాత్ (జనయన్త) ఉత్పాదయేయుః. అత్ర లఙ్వ్యడభావః (రేతః) వీర్యమ్ (అప) (అమతిమ్) నష్టా మతిరమతిస్తామ్ (దుర్మతిమ్) దుష్టా చాసౌ మతిశ్చ తామ్ (బాధమానాః) నివర్తయన్తః (ఊవధ్యమ్) ఊరూ వధ్యే యేన తత్. అత్ర ఛాన్దసో వర్ణలోపో వేతి రులోపః (వాతమ్) ప్రాప్తమ్ (సబ్వమ్) సమవేతమ్. అత్ర సప సమవాయే ధాతోరౌణాదికో వః ప్రత్యయః (తత్) (ఆరాత్) నికటాత్.॥౭౪॥

అన్వయః:-యే విద్వాంసోఽమతిం దుర్మతిమపబాధమానాః సన్తో యదూవధ్యం వాతం సబ్వం పయసా సురయోత్పన్నం మూత్రాత్ జనిత్రమమృతం శుక్రం రేతోఽస్తి. తదారాజ్జనయన్త తే ప్రజావన్తో భవన్తి.॥౭౪॥

భావార్థః:-యే దుర్గుణాన్ దుష్టసఙ్గాꣳ స్త్యక్త్వా వ్యభిచారాదద్దూరే నివసన్తో వీర్యం వర్ధయిత్వా సన్తానా నుత్పాదయన్తి తే స్వకులం ప్రశస్తం కుర్వన్తి.॥౭౪॥

పదార్థము :-ఏ విద్వాంసులు (అమతిమ్) నష్టబుద్ధిని లేక (దుర్మతిమ్) లేక దుష్టబుద్ధిని (అప, బాధమానాః) తొలగించుచు (ఊవధ్యమ్) తొడలు, అంగుళీయములు మున్నగువానిని నరికివేయు అనగా అత్యంత వినాశకర సాధనము (వాతమ్) ప్రాప్తించుకొన్న (సబ్వమ్) సకల పదార్థములందు సంబంధము గలిగియున్న (పయసా) జలములు, దుగ్ధములు లేదా (సురయా) సోమలత మున్నగు ఓషధీరసములచే నుత్పన్నమగు (మూత్రాత్) మూత్రాధారమగు ఇంద్రియమునుండి(జనిత్రమ్) సంతానోత్పత్తికి నిమిత్తము (అమృతమ్) అల్పమృత్యురోగనివారకము (శుక్రమ్) శుద్ధమునగు నే (రేతః) వీర్యముగలదో (తత్) దానిని (ఆరాత్) సమీపమునుండి (జనయన్త) ఉత్పన్నమొనర్తురో అట్టివారే సంతానము గలవా రగుదురు.॥౭౪॥

భావార్థము :- దుర్గుణము, దురాచారము, దుర్జనసాంగత్యము, దుష్కర్మలను, వ్యభిచారమును వదలివేసి వీర్యమును వృద్ధిపరచుకొని సంతానోత్పత్తి నొనర్చు ఉత్తములుమాత్రమే తమవంశమును ప్రశంసనీయ మొనర్చుకొందురు.।౮౪॥

84.Those learned persons get progeny, who chase afar folly and ill intention, generate near at hand, by milk and medicinal juices, through generative organ, pure, disease-destroying, children-producing semen, that is present in all substances, and causes harm through excessive discharge.

౧౧౧౧.ఇన్ద్ర ఇత్యస్య శఙ్ఖ ఋషిః, సవితా దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యై రోగాత్ పృథక్ భవితవ్యమిత్యాహ. మానవులు రోగములనుండి వేరుగనుండవలెను.

౧౧౧౧ ఇన్ద్రః సుత్రామా హృదయేన సత్యం పురోడాశేన సవితా జజాన। యకృత్ క్లోమానం వరుణో భిషజ్యన్ మతస్నే వాయవ్యైర్న మినాతి పిత్తమ్ ।౮౫॥

ప.విః- ఇన్ద్రః, సుత్రామేతి సు + త్రామా, హృదయేన, సత్యమ్, పురోడాశేన, సవితా, జజాన, యకృత్, క్లోమానమ్, వరుణః, భిషజ్యన్, మతస్నేఇ ఇతి మత + స్నే, వాయవ్యైః, న, మినాతి, పిత్తమ్.।౮౫॥

పదార్థః- (ఇన్ద్రః) రోగవిచ్ఛేదకః (సుత్రామా) యః సుష్ఠు త్రాయతే రోగచ్ఛరీరం సః (హృదయేన) స్వాత్మనా (సత్యమ్) యథార్థమ్ (పురోడాశేన) సుసంస్కృతేనాన్నేన (సవితా) ప్రేరకః (జజాన) జనయంతి. అత్ర వ్యత్యయేన పరస్మైపదమ్. (యకృత్) హృదయాద్ దక్షిణే స్థితం మాంసపిండమ్ (క్లోమానమ్) కణ్ఠనాడికామ్ (వరుణః) శ్రేష్ఠః (భిషజ్యన్) చికిత్సాం కుర్వన్ (మతస్నే) హృదయోభయపార్శ్వస్థే అస్థినీ (వాయవ్యైః) వాయుషు సాధుభిర్మార్గైః (న) (మినాతి) హినస్తి (పిత్తమ్).।౮౫॥

అన్వయః:-హే మనుష్యాః! యథా సుత్రామా సవితేన్ద్రో వరుణో విద్వాన్ భిషజ్యన్ సన్ హృదయేన సత్యం జజాన పురోడాశేన వాయవ్యైశ్చ యకృత్ క్లోమానం మతస్నే పిత్తం చ న మినాతి తథైతత్సర్వం యూయం మా హింస్త.।౮౫॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. సద్వైద్యాః స్వయమరోగా భూత్వాన్యేషాం రోగం విజ్ఞాయారోగాన్ సతతం కుర్యుః. ।౮౫॥

పదార్థము :- ఓ మానవులారా! ఏ విధముగా (సుత్రామా) వ్యాధులనుండి శరీరమును చక్కగా రక్షణచేసికొనువాడు (సవితా) ప్రేరకుడు (ఇన్ద్రః) రోగనాశకుడు (వరుణః) శ్రేష్ఠవిద్వాంసుడు (భిషజ్యన్) చికిత్స యొనర్చుచు (హృదయేన) తనయాత్మనుండి (సత్య) యథార్థభావమును (జజాన) ప్రసిద్ధపరచుచు (పురోడాశేన) చక్కగా సంస్కరింపబడిన అన్నము మరియు (వాయవ్యైః) పవనములందుత్తమ అనగా సుఖప్రద మార్గములద్వారా (యకృత్) హృదయమునకు కుడివైపున నుండు, ఒక మాంసపిండ విశేషము (క్లోమానమ్) కంఠనాడి (మతస్నే) హృదయమున కిరువైపుల నుండు ఎముకలు మరియు (పిత్తమ్) పిత్తమును (న,మినాతి) నష్టమొనర్చడో అదేవిధముగా ఆ యన్నిటిని మీరును హింసించకుడు. ।౮౫॥

భావార్థము :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. సద్వైద్యులగువారు స్వయముగ రోగరహితులైయుండి ఇతరుల శరీరములందు గలిగిన రోగముల నెరిగి నిరంతరము వారిని రోగరహితుల నొనర్చవలయును. ।౮౫॥

85.A learned doctor, guarding the body against disease, giving us medical directions, removing sickness, realises through his soul the exact nature of disease, and with prescribed food, does not allow our lungs, liver, throat-artery, kidney and bile to be affected.

౧౧౧౭. ఆన్త్రాణీత్యస్య శఙ్ఖ ఋషిః, సవితా దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౧౧౭ ఆన్త్రాణి స్థాలీర్మధు పిన్వమానా గుదాః పాత్రాణి సుదుఘా న ధేనుః ।
శ్యేనస్య పత్రం న ప్లీహా శచీభిరాసన్దీ నాభిరుదరం న మాతా ।౮౬॥

ప.వి:- ఆన్త్రాణి, స్థాలీః, మధు, పిన్వమానాః, గుదాః, పాత్రాణి, సుదుఘేతి సు + దుఘా, న, ధేనుః, శ్యేనస్య, పత్రమ్, న, ప్లీహా, శచీభిః, ఆసన్దీత్యా + సన్దీ, నాభిః, ఉదరమ్, న, మాతా. ।౮౬॥

పదార్థః:- (ఆన్త్రాణి) ఉదరస్థా అన్నపాకాధారా నాడీః (స్థాలీః) యాసు పచ్యన్తేఽన్నాని (మధు) మధురగుణాన్వితమన్నమ్ (పిన్వమానాః) సేవమానాః ప్రీతిహేతవః. పివి సేవనే చ (గుదాః) గుహ్యేన్ద్రియాణి (పాత్రాణి)యైః పిబంతి తాని (సుదుఘా) సుష్ఠు సుఖేన దుహ్యత ఇతి. దుహః కప్ ఘశ్చేతి కర్మణి కప్. (న) ఇవ (ధేనుః) గౌః (శ్యేనస్య)

(పత్రమ్) పక్షః (న) ఇవ (ప్లీహా) (శచీభిః) ప్రజ్ఞాకర్మభిః (ఆసన్దీ) సమన్తాత్ రసప్రాపికా (నాభిః) శరీరమధ్యస్థా (ఉదరమ్) (న) ఇవ (మాతా).॥౮౬॥

అన్వయః:-యుక్తిమతా పురుషేణ శచీభిః స్థాలీరగ్నేరుపరి నిధాయౌషధిపాకాన్విధాయ తత్ర మధు ప్రక్షిప్య భుక్త్వాఽన్త్రాణి పిన్వమానా గుదాః పాత్రాణి భోజనార్థాని సుదుఘా ధేనుర్న ప్లీహా శ్యేనస్య పత్రం న మాతా నాసన్దీ నాభిరుదరం పుష్యేత్.॥౮౬॥

భావార్థః:-అత్రోపమాలఙ్కారః. యే మనుష్యా ఉత్తమైః సుసంస్కృతైరన్నై రసైః శరీరమరోగీకృత్య ప్రయతన్తే తేఽభీష్టం సుఖం లభన్తే.॥౮౬॥

పదార్థము :-యుక్తిశాలురు (శచీభిః) ఉత్తమ బుద్ధిచే, కర్మలచే (స్థాలీః) పాకపాత్రలను అగ్నిపైనుంచి ఓషధులను పాకమొనర్చి (మధు) అందు తేనెనుంచి భుజించి (ఆన్త్రాణి) ఉదరమునందలి భుజించిన అన్నాదులను జీర్ణమొనర్చునాడులను (పిన్వమానాః) సేవనమొనర్చుచు ప్రీతిహేతువులగు (గుదాః) గుదేంద్రియాదులు మరియు (పాత్రాణి) తినుత్రాగునట్టి [భుజించునట్టి] పాత్రలను (సుదుఘా) క్షీరములు మున్నగువానిచే కామితముల దీర్చు (ధేనుః) ఆవు (న) వలె (ప్లీహా) రక్తశోధకమొనర్చు రక్తపిండము [ప్లీహము] (శ్యేనస్య) శ్యేనపక్షి [డేగ] యొక్క (పత్రమ్) పక్షము [రెక్క] (న) వలె (మాతా) తల్లి (న) వలె (ఆసన్దీ) అన్ని వైపులనుండి రసమును గ్రహింపజేయు (నాభిః) నాభియును నాడి (ఉదరమ్) ఉదరమును పుష్టివంతమొనర్చుచున్నది. ॥౮౬॥

భావార్థము :-ఈ మంత్రమునం దుపమాలంకారము గలదు. శ్రేష్ఠముగా సంస్కరించబడిన ఉత్తమాన్నములను, రసములను సేవించి శరీరమును రోగరహితమొనర్చుకొని ప్రయత్నమొనర్చువారు అభీష్ట సుఖముల ప్రాప్తించుకొందురు.॥౮౬॥

86.Entrails in the body are the cauldron for cooking food in which honey is mixed, bowels are the pans. This earth the bestower of glory is like a well-milking cow. A hawk's wing is the spleen. Navel, the centre of all strength is like the king's cushion. Belly is like a mother.

౧౧౧౩.కుమ్భ ఇత్యస్య శఙ్ఖ ఋషిః, పితరో దేవతాః, భురిక్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

దమ్పతీ కీదృశావిత్యాహ. స్త్రీపురుషు లెటు లుండవలయును?

౧౧౧౩ కుమ్భో వనిష్ఠుర్జనితా శచీభిర్యస్మిన్నగ్రే యోన్యాం గర్భోఽఅన్తః।
ప్లాశిర్వ్యక్తః శతధార ఉత్సో దుహే న కుమ్భీ స్వధాం పితృభ్యః॥౮౭॥

ప. వి:- కువ్మ్యః, వనిష్ఠః, జనితా, శచీభిః, యస్మిన్, అగ్రే, యోన్యామ్, గర్భః, అన్తరిత్యన్తః, ప్లాశిః, వ్యక్తఇతి వి + అక్తః, శతధార ఇతి శత + ధారః, ఉత్సః, దుహే, న, కుమ్భీ, స్వధామ్, పితృభ్య ఇతి పితృ + భ్యః.॥౮౭॥

పదార్థః:- (కువ్మ్యః) కలశ ఇవ వీర్యాదిధాతుభిః పూర్ణః (వనిష్ఠః) సమ్భాజీ. అత్ర వన సమ్భక్తా విత్యస్మాదౌణాదిక ఇష్ఠప్ ప్రత్యయః. (జనితా) ఉత్పాదకః (శచీభిః) కర్మభిః (యస్మిన్) (అగ్రే) పురా (యోన్యామ్) గర్భాధారే (గర్భః) (అన్తః) అభ్యన్తరే (ప్లాశిః) యః ప్రకృష్టతయాఽశ్నుతే సః (వ్యక్తః) వివిధాభిః పుష్టిభిః ప్రసిద్ధః (శతధారః) శతశో ధారా వాచో యస్య సః (ఉత్సః) ఉన్దన్తి యస్మాత్ స కూప ఇవ (దుహే) ప్రపూర్తికరే వ్యవహారే (న) ఇవ (కుమ్భీ) ధాన్యాధారా స్వధామ్ (అన్నమ్) (పితృభ్యః) పాలకేభ్యః.॥౮౭॥

అన్వయః:- యః కువ్మ్యో వనిష్ఠర్జనితా ప్లాశిర్వ్యక్తః శచీభిః శతధార ఉత్సో దుహేన పురుషో యా చ కుమ్భీవ స్త్రీ తౌ పితృభ్యః స్వధాం ప్రదద్యాతాం యస్మిన్నగ్రే యోన్యా మన్తర్గర్భో ధీయేత తం సతతం రక్షేతామ్.॥౮౭॥

భావార్థః:- అత్రోపమాలంకారః. స్త్రీపురుషౌ వీర్యవన్తౌ పురుషార్థినౌ భూత్వా అన్నాదిభిర్విద్వాంసం సన్తోష్య ధర్మేణ సన్తానోత్పత్తిం కుర్యాతామ్.॥౮౭॥

పదార్థము :- (కువ్మ్యః) కలశమువలె వీర్యము మున్నగు ధాతువులచే పరిపూర్ణుడు (వనిష్ఠః) సనువిభాగమొనర్చువాడు (జనితా) సంతానము నుత్పన్నమొనర్చువాడు (ప్లాశిః) తృప్తిగా భుజించువాడు (వ్యక్తః) అనేక పుష్టులందు ప్రసిద్ధుడు (శచీభిః) ఉత్తమ కర్మలనొనర్చి (శతధారః) నందలాది వాణులతో నున్నవాడు (ఉత్సః) సేచనమొనర్చు కూపమువలె (దుహే) పూర్తియొనర్చు వ్యవహారములందు స్థిరమైనవాని (న) వలె నున్నవాడు మరియు (కుమ్భీ) కలశమువలె నున్న స్త్రీ వారిరువురకు యోగ్యమేమన (పితృభ్యః) పితరులకు (స్వధామ్) అన్నము నీయవలెను. మరియు (యస్మిన్) ఏ (అగ్రే) నవీన (యోన్యామ్) గర్భాశయ (అన్తః) మధ్యన (గర్భః) గర్భధారణమొనర్చబడునో దానిని, నిరంతరము రక్షించుకొనుచుండవలయును.॥౮౭॥

భావార్థము:- ఈ మంత్రమునందుపమాలంకారము గలదు. స్త్రీ పురుషులు వీర్యవంతులు, పురుషార్థులునై అన్నాదులచే విద్వాంసులను ప్రసన్నపరచి ధర్మయుక్తముగా సంతానోత్పత్తి నొనర్చవలయును.॥౮౭

87.A husband full of semen like a pitcher, enjoyer, progenitor of children, taker of good meals, full of nourishments, doer of noble deeds, master of hundreds of speeches, deep like a large pitcher, is like one who is engaged in the execution of his duty. A wife is a small jar of water. It is incumbent upon both to give food to their parents and protect the embryo in the womb.

౧౧౧౪.ముఖమిత్యస్య శఙ్ఖ ఋషిః, సరస్వతీ దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయమాహ.మఅల నా విషయమే.

౧౧౧౪ ముఖ౯ం సదస్య శిర ఇత్ సతేన జిహ్వా పవిత్రమశ్వినాసన్త్సరస్వతీ।
చప్యన్న పాయుర్భిషగస్య వాలో వస్తిర్న శేపో హరసా తరస్వీ ॥౮౮॥

ప.వి:–ముఖమ్, సత్, అస్య, శిరః, ఇత్, సతేన, జిహ్వా, పవిత్రమ్, అశ్వినా, ఆసన్, సరస్వతీ, చప్యమ్, న, పాయుః, భిషక్, అస్య, వాలః, వస్తిః, న, శేపః, హరసా, తరస్వీ.॥౮౮॥

పదార్థః:-(ముఖమ్) (సత్) (అస్య) పురుషస్య (శిరః) (ఇత్) ఏవ (సతేన) ఉత్తమావయవైర్విభక్తేన శిరసా. సత్ ఇత్యుత్తరనా...నిఘం. 3.29 (జిహ్వా) జుహోతి గృహ్ణాతి యయా సా (పవిత్రమ్) శుద్ధమ్ (అశ్వినా) గృహాశ్రమవ్యవహారవ్యాపినౌ (ఆసన్) ఆస్యే (సరస్వతీ) వాణీవ జ్ఞానవతీ స్త్రీ (చప్యమ్) చపేషు సాన్త్వనేషు భవమ్. చప సాన్త్వనే ధాతోరేచ్ తతో యత్. (న) ఇవ (పాయుః) రక్షకః (భిషక్) వైద్యః (అస్య) (బాలః) బాలకః (వస్తిః) వాసహేతుః (న) ఇవ (శేపః) ఉపస్థేన్ద్రియమ్. (హరసా) హరతి యేన తేన బలేన (తరస్వీ) ప్రశస్తం తరో విద్యతే యస్య సః.॥౮౮॥

అన్వయః:-హే మనుష్యాః! యథా జిహ్వా సరస్వతీ స్త్ర్యస్య పత్యుః సతేన శిరసా సహ శిరః కుర్యా దాసన్ పవిత్రం ముఖం కుర్యాదేవమశ్వినా ద్వావిద్వర్తేతాం యదస్య పాయుర్భిషగ్ బాలో న వస్తిః శేపో హరసా తరస్వీ భవతి స చప్యన్న సద్ భవేత్తత్సర్వం యథావత్కుర్యాత్.॥౮౮॥

భావార్థః:- స్త్రీపురుషౌ గర్భాధానసమయే పరస్పరాఙ్గవ్యాపినౌ భూత్వా ముఖేన ముఖం చక్షుషా చక్షుః మనసా మనః శరీరేణ శరీరం చానుసంధాయ గర్భం దధ్యాతాం యతః కురూపం వక్రాఙ్గం వాఽపత్యన్న స్యాత్.॥౮౮॥

పదార్థము :- మానవులారా! ఎట్లు (జిహ్వా) రసగ్రహణమొనర్చు నాలుక (సరస్వతీ) వాణివంటి మహిళామణి (అస్య) ఈ పతియొక్క (సతేన) సుందర అవయవములతో విభక్తమైయున్న శిరస్సుతోగూడ (శిరః) శిరమునుంచునట్లు మరియు (ఆసన్) ముఖము సమీపమున (పవిత్రమ్) పవిత్రమగు (ముఖమ్) ముఖము నుంచవలెను. అదేవిధముగ (అశ్వినా) గృహాశ్రమ వ్యవహారములలో వ్యాప్తులైయున్న స్త్రీ పురుషులిరువురును (ఇత్) మాత్రమే వర్తించవలెను. మరియు ఏ (అస్య) ఈ వ్యాధినుండి (పాయుః) రక్షకుడగు

(భిషక్) వైద్యుడు (వాలః) బాలకుని (న) వలె (వస్తిః) వసించుటకు హేతువైనవాడు (శేపః) ఉపస్థేంద్రియమును (హరసా) బలముగ (తరస్వీ) ఒనర్చువాడగుచున్నాడో మరియు నాతడు (చప్యమ్) శాంతియొనర్చువాని (న) వలె (సత్) వర్తమానమందు సంతానోత్పత్తికి హేతువగునో దానినంతను యథావతుగ నొనర్చవలెను. ॥౮౮॥

**భావార్థము:-** స్త్రీ పురుషులు గర్భాధాన సమయమున పరస్పరము ప్రేమపూరితులైయుండి ముఖముతో ముఖము, కన్నులతో కన్నులు, మనస్సుతో మనస్సు, శరీరముతో శరీరము ననుసంధానపరచి గర్భధారణమొనర్చవలెను. అందువల్ల కురూపులు వక్రాంగములగు సంతానముగాక ఉత్తమ సుందర సంతానము గలుగగలదు. ॥౮౮॥

88.Just as a wife, the recipient of semen, at the time of cohabitation keeps her head opposite to the head of the husband, and her face opposite to that of his, so should both husband and wife perform together their domesitc duties. A husband is a protector like a physician. He lives happily like a child, and with tranquility produces progeny with penis keen with ardour.

౧౧౧౫.అశ్విభ్యామిత్యస్య శఙ్ఖ ఋషిః, అశ్వినౌ దేవతే, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః .

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౧౫ అశ్విభ్యాం చక్షురమృతం గ్రహాభ్యాం ఛాగేన తేజో హవిషా శృతేన।

పక్ష్మాణి గోధూమైః కువలైరుతాని పేశో న శుక్రమసితం వసాతే ॥౮౯॥

**ప.విః-**అశ్వి భ్యామిత్యశ్వి + భ్యామ్, చక్షుః, అమృతమ్, గ్రహాభ్యామ్, ఛాగేన, తేజః, హవిషా, శృతేన, పక్ష్మాణి, గోధూమైః, కువలైః, ఉతాని, పేశః, న, శుక్రమ్, అసితమ్, వసాతే ఇతి వసాతే. ॥౮౯॥

పదార్థః:-(అశ్విభ్యామ్) బహుభోజిభ్యాం స్త్రీపురుషాభ్యాం (చక్షుః) నేత్రమ్ (అమృతమ్) అమృతాత్మకమ్ (గ్రహాభ్యామ్) యౌ గృహ్ణీతస్తాభ్యామ్ (ఛాగేన) అజాదిదుగ్ధేన (తేజః) ప్రకాశయుక్తమ్ (హవిషా) ఆదాతుమర్హేణ (శృతేన) పరిపక్వేన (పక్ష్మాణి) పరిగృహీతాన్యన్నాని (గోధూమైః) (కువలైః) సుశబ్దైః (ఉతాని) సంతతాని వస్త్రాణి (పేశః) రూపమ్ (న) ఇవ (శుక్రమ్) శుద్ధమ్ (అసితమ్) కృష్ణమ్ (వసాతే) వసేతామ్. ॥౮౯॥

అన్వయః:-యథా గ్రహాభ్యామశ్విభ్యాం సహ కౌచిద్విద్వాంసౌ స్త్రీపురుషావుతాని పక్ష్మాణి వసాతే యథా వా భవన్తోఽపి ఛాగేనాఽజాదిదుగ్ధేన శృతేన హవిషా సహ తేజోఽమృతం చక్షుః కువలైర్గోధూమైః శుక్రమసితం పేశో న స్వీక్రియేరంస్తథాఽన్యే గృహస్థా అపి కుర్యుః.॥౮౯॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా కృతక్రియౌ స్త్రీపురుషౌ ప్రియదర్శనౌ ప్రియభోజినౌ గృహీతపూర్ణసామగ్రీకౌ భవతస్తథాన్యే గృహస్థా అపి భవేయుః.॥౮౯॥

పదార్థము :- ఏవిధముగా (గ్రహాభ్యామ్) గ్రహించువారు (అశ్విభ్యామ్) బహుభోజులగు స్త్రీ పురుషులతోగూడ విదుషీవిద్వాంసులు (ఉతాని) నేసియున్న అనేక వస్త్రములను (పక్ష్మాణి) పొందియున్న ఇతర పట్టు మరియు దుశ్శాలువలు మున్నగువానిని (వసాతే) ఎటుల ధరించెదరో, కప్పుకొనెదరో మీరును (ఛాగేన) మేకలు మున్నగువాని క్షీరములతో (శృతేన) పాకమొనర్చియున్న (హవిషా) గ్రహించదగిన హోమపదార్థములతోగూడ (తేజః) ప్రకాశముతో గూడిన (అమృతమ్) అమృతస్వరూపము (చక్షుః) నేత్రములను (కువలైః) ఉత్తమ శబ్దముల మరియు (గోధూమైః) గోధుమలతోగూడ (శుక్రమ్) శుద్ధమగు (అసితమ్) నల్లని (పేశః) రూపము (న) వలె స్వీకరించగలరో అదేవిధముగ ఇతర గృహస్థులును చేయవలయును.॥౮౯॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. క్రియలనొనర్చు స్త్రీపురుషులు ప్రియదర్శనులు, ప్రియభోజనశీలురు, పూర్ణ సాధనములను గ్రహించువారలునై యుండునట్లు అన్యగృహస్థులును ఉండవలయును. ॥౮౯॥

౮౯. The immortal eyes are like the planets of the sun and moon. The goat's milk and cooked food give them keenness. Eyelashes are like wheat, and eyebrows are jujube. The white and black parts of the eye spread its beauty.

౧౧౧౬. అవిరిత్యస్య శఙ్ఖ ఋషిః, సరస్వతీ దేవతా, భురిక్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ యోగికృత్యమాహ. యోగి కర్తవ్య మిందు జెప్పబడినది.

౧౧౧౬ అవిర్న మేషో నసి వీర్యాయ ప్రాణస్య పన్థాఽ అమృతో గ్రహాభ్యామ్ ।
సరస్వత్యుపవాకైర్వ్యానం నస్యాని బర్హిర్బదరైర్జజాన ॥౯౦॥

ప.వి:- అవిః, న, మేషః, నసి, వీర్యాయ, ప్రాణస్య, పన్థాః, అమృతః, గ్రహాభ్యామ్, సరస్వతీ, ఉపవాకై రిత్యుప + వాకైః, వ్యానమితి వి + ఆనమ్, నస్యాని, బర్హిః, బదరైః, జజాన.॥౯౦॥

పదార్థః:-(అవిః) యోఽవతి రక్షతి సః (న) ఇవ (మేషః) యో మిషతి స్పర్ధతే సః (నసి) నాసికా యామ్ (వీర్యాయ) యోగబలాయ (ప్రాణస్య) (పన్థాః) మార్గః (అమృతః) మృత్యుధర్మరహితః (గ్రహాభ్యామ్) యౌ గృహ్ణీతస్తాభ్యామ్ (సరస్వతీ) ప్రశస్తవిజ్ఞానయుక్తా స్త్రీ (ఉపవాకైః) ఉపయన్తి యైః స్తైః (వ్యానమ్) వివిధమనన్తి యేన తమ్ (నస్యాని) నాసికాయై హితాని (బర్హిః) వర్ధనమ్ (బదరైః) బదరీఫలైః (జజాన) జనయతి.౹౯౦॥

అన్వయః:-యథా గ్రహాభ్యాం సహ సరస్వతీ బదరైరుపవాకైర్జజాన తథా వీర్యాయ నసి ప్రాణస్యాఽమృతః పన్థా అవిర్న మేషో వ్యానం నస్యాని బర్హిశ్చ ఉపయుజ్యతే.౹౯౦॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా ధార్మికో న్యాయాధీశః ప్రజా రక్షతి తథైవ ప్రాణాయామాదిభిః సంసాధితాః ప్రాణా యోగినం సర్వేభ్యో దుఃఖేభ్యస్త్రాయన్తే, యథా విదుషీ మాతా విద్యాసుశిక్షాభ్యాం స్వసన్తానాన్ వర్ధయతి తథాఽనుష్ఠితాని యోగకర్మాణి యోగినో వర్ధయన్తి. ౹౯౦॥

పదార్థము :-ఏవిధముగ (గ్రహాభ్యామ్) గ్రహణమొనర్చువారితోగూడ (సరస్వతీ) ప్రశస్త విజ్ఞానవంతురాలగు మహిళామణి (బదరైః) రేగుపండ్లవలె (ఉపవాకైః) సామీప్యభావమును పొందదగిన కర్మలచే (జజాన) ఉత్పత్తియొనర్చునో, ఆవిధముగా (వీర్యాయ) ఏ వీర్యముకొరకు (నసి) నాసికయందు (ప్రాణస్య) ప్రాణముయొక్క (అమృతః) నిత్య (పన్థాః) మార్గము లేక (మేషః) ఇతరులతో స్పర్ధయొనర్చువాడు (అవిః) రక్షించుదాని (న) వలె (వ్యానమ్) శరీరమందు వ్యాప్తమైయున్న వాయువు (నస్యాని) నాసికకు హితమునొనగూర్చు ధాతువులను (బర్హిః) వృద్ధికై ఉపయోగపరచబడుచున్నది.౹౯౦॥

భావార్థము :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ధార్మికుడగు న్యాయాధీశుడు ప్రజలను రక్షించునట్లును, ప్రాణాయామాది క్రియలచే చక్కగా సిద్ధపరచిన ప్రాణములు యోగులను సకల దుఃఖములనుండి రక్షణజేయునట్లును విదుషీమణియగు తల్లి విద్య మరియు ఉత్తమశిక్షణచే తమ సంతానమును వృద్ధిపరమనట్లు అనుష్ఠానమొనర్చబడిన యోగాంగములు యోగుల నభివృద్ధిపరచును.౹౯౦॥

90.Just as a learned lady with her husband, through mutaual close relations, gives birth to a child, charming like jujibes, so for vigour in the nostril is made the immortal path of breath. The vyan breath goes through the body, guarding it and vying with other breaths, adds to the forces of the nostril.

౧౧౧౭. ఇన్ద్రస్యేత్యస్య శఙ్ఖ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౧౭ ఇన్ద్రస్య రూపమృషభో బలాయ కర్ణాభ్యాం శ్రోత్రమమృతం గ్రహాభ్యామ్।
యవా న బర్హిర్భ్రువి కేసరాణి కర్కన్ధు జజ్ఞే మధు సారఘం ముఖాత్॥౯౧॥

ప.వి:- ఇన్ద్రస్య, రూపమ్, ఋషభః, బలాయ, కర్ణాభ్యామ్, శ్రోత్రమ్, అమృతమ్, గ్రహాభ్యామ్, యవాః, న, బర్హిః, భ్రువి, కేసరాణి, కర్కన్ధు, జజ్ఞే, మధు, సారఘమ్, ముఖాత్.॥౯౧॥

పదార్థః:-(ఇన్ద్రస్య) పరమైశ్వర్యస్య (రూపమ్) స్వరూపమ్ (ఋషభః) విజ్ఞానవాన్ (బలాయ) యోగసామర్థ్యాయ (కర్ణాభ్యామ్) కుర్వన్తి శ్రవణం యాభ్యామ్ (శ్రోత్రమ్) శబ్దవిషయమ్ (అమృతమ్) అమృతాత్మకముదకమ్ (గ్రహాభ్యామ్) యాభ్యాం గృహ్ణీతస్తాభ్యామ్ (యవాః) ధాన్యవిశేషాః (న) ఇవ (బర్హిః) వర్ధనమ్ (భ్రువి) నేత్రలలాటయోర్మధ్యే (కేసరాణి) విజ్ఞానాని. అత్ర కిం జ్ఞానే ఇత్యస్మాదౌణాదికః సరన్ ప్రత్యయః (కర్కన్ధు) యేన కర్మ దధాతి (జజ్ఞే) జాయతే (మధు) విజ్ఞానమ్ (సారఘమ్) యదారఘ్యతే స్వాద్యతే తదారఘం సమానం చ తదారఘం చ తత్ (ముఖాత్).॥౯౧॥

అన్వయః:-యథా గ్రహాభ్యాం సహర్షభో బలాయ యవా న కర్ణాభ్యాం శ్రోత్రమమృతం కర్కన్ధు సారఘం మధు బర్హిర్భ్రువి కేసరాణి ముఖాత్ జనయతి తథైతత్ సర్వమిన్ద్రస్య రూపం జజ్ఞే.॥౯౧॥

భావార్థః:-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా నివృత్తిమార్గే పరమయోగీ యోగబలేన సర్వాః సిద్ధీః ప్రాప్నోతి తథైవాత్ర గృహస్థైరపి ప్రవృత్తిమార్గే సర్వమైశ్వర్యం ప్రాప్తవ్యమితి.॥౯౧॥

పదార్థము :-ఏవిధముగ (గ్రహాభ్యామ్) గ్రహణమొనర్చు వ్యవహారములతో బాటు (ఋషభః) జ్ఞానవంతుడు (బలాయ) యోగసామర్థ్యముకొరకు (యవాః) యవల [గోధుమల] (న) వలె (కర్ణాభ్యామ్) కర్ణములచే (శ్రోత్రమ్) శబ్దాదివిషయములను (అమృతమ్) రోగరహిత జలములను (కర్కన్ధు) కర్మను ధారణమొనర్చుదానిని (సారఘమ్) ఒక విధమగు స్వాదిష్టతతో (మధు) తేనె (బర్హిః) వృద్ధికారకవ్యవహారము మరియు (భ్రువి) నేత్రములు, లలాటముల మధ్య (కేసరాణి) విజ్ఞానముల, అనగా సుషుమ్నానాడియందు ప్రాణవాయువును నిలిపి పరమాత్మ విషయమగు విశేష జ్ఞానమును (ముఖాత్) ముఖమునుండి ఉత్పన్నమొనర్చునో అట్లే ఈ సమస్త (ఇన్ద్రస్య) పరమైశ్వర్యముల (రూపమ్) స్వరూపము (జజ్ఞే) ఉత్పన్నమగును.॥౯౧॥

భావార్థము :-ఈ మంత్రములో ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఏవిధముగ నివృత్తి మార్గమున పరమయోగీశ్వరులు యోగబలముతో సకల సిద్ధులను పొందుదురో, ఆవిధముగనే ఇతర గృహస్థులును ప్రవృత్తి మార్గమున సకలైశ్వర్యములను ప్రాప్తిజేసికొనుట యోగ్యము.॥౯౧॥

91.A learned person, acquires yoga, through acts of comprehnsion, like barley, hears with both ears, uses pure water, exercises of action, like sweet honey, performs acts of advancement, controls breath in Sushumna and concentrates thought in the midst of eye-brows, utters from his mouth God's knowledge. All this is the manifestation of His divine power.

౧౧౧౮. ఆత్మన్నిత్యస్య శఙ్ఖ ఋషిః, ఆత్మా దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౧౮ ఆత్మన్నుపస్థే న వృకస్య లోమ ముఖే శ్మశ్రూణి న వ్యాఘ్రలోమ।
కేశా న శీర్షన్యశసే శ్రియై శిఖా సింహస్య లోమ త్విషిరిన్ద్రియాణి ॥౯౨॥

ప.వి:-ఆత్మన్, ఉపస్థఇ ఇత్యుపస్థే, న, వృకస్య, లోమ, ముఖే, శ్మశ్రూణి, న, వ్యాఘ్రలోమేతి వ్యాఘ్ర + లోమ, కేశాః, న, శీర్షన్, యశసే, శ్రియై, శిఖా, సింహస్య, లోమ, త్విషిః, ఇన్ద్రియాణి.॥౯౨॥

పదార్థః:-(ఆత్మన్) ఆత్మని (ఉపస్థే) ఉపతిష్ఠన్తి యస్మింస్తస్మిన్ (న) ఇవ (వృకస్య) యో వృశ్చతి ఛినత్తి తస్య (లోమ) (ముఖే) (శ్మశ్రూణి) (న) ఇవ (వ్యాఘ్రలోమ) వ్యాఘ్రస్య లోమ వ్యాఘ్రలోమ (కేశాః) (న) ఇవ (శీర్షన్) శిరసి (యశసే) (శ్రియై) (శిఖా) (సింహస్య) (లోమ) (త్విషిః) దీప్తిః (ఇన్ద్రియాణి) శ్రోత్రాదీని.॥౯౨॥

అన్వయః:-హే మనుష్యాః! యస్యాత్మన్నుపస్థే సతి వృకస్య లోమ న వ్యాఘ్రలోమ న ముఖే శ్మశ్రూణి శీర్షన్ కేశా న శిఖా సింహస్య లోమేవ త్విషిరిన్ద్రియాణి సన్తి స యశసే శ్రియై ప్రభవతి.॥౯౨॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యే పరమాత్మానముపతిష్ఠన్తే తే యశస్వినో భవన్తి. యే యోగ మభ్యస్యన్తి తే వృకవద్వ్యాఘ్రవద్ సింహవదేకాన్తదేశం సేవిత్వా పరాక్రమిణో జాయన్తే. యే పూర్ణ బ్రహ్మచర్యం కుర్వన్తి తే క్షత్రియాః పూర్ణోపమా భవన్తి.॥౯౨॥

పదార్థము :- మానవులారా! ఎవని (ఆత్మన్) ఆత్మయందు (ఉపస్థే) సమీపమున స్థిరముగుటకు (వృకస్య) తోడేలు (లోమ) వెంట్రుకల (న) వలె లేక (వ్యాఘ్రలోమ) పెద్దపులి వెంట్రుకల (న) వలె (ముఖే) ముఖముపై (శ్మశ్రూణి) గడ్డము మీసములు (శీర్షన్) శిరమునందు (కేశాః) వెంట్రుకల (న) వలె (శిఖా) శిఖ [జుట్టు] (సింహస్య) సింహముయొక్క (లోమ) వెంట్రుకలవలె (త్విషిః) కాంతి మరియు (ఇన్ద్రియాణి) శ్రోత్రములు మున్నగు శుద్ధ ఇంద్రియములుగలవో ఆతడు (యశసే) కీర్తి మరియు (శ్రియై) సమస్తైశ్వర్యములను ప్రాప్తిజేసికొనుటయందు సమర్థుడగుచున్నాడు. ॥౯౨॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. పరమాత్మ సామీప్యమును పొందువాడు యశోవంతుడు, కీర్తివంతుడగును. యోగాభ్యాసమొనర్చువాడు తోడేలు, పెద్దపులి, సింహములవలె ఏకాంత ప్రదేశమును సేవించుచు పరాక్రమశాలి యగును. పూర్ణబ్రహ్మచర్యమును సాధించినవాడు క్షత్రియుడు తోడేలు, పులి, సింహముల వలె పరాక్రమ వంతుడగుచున్నాడు. ॥౯౨॥

92.When a yogi visualises God in his soul at the time of Samadhi (concentration) his hair grow long like those of the wolf. His beard and moustache grow like the hair of a tiger. The hair of his head and tonsure grow like those of a lion. He organs are endowed with lustre, glory and royal power.

౧౧౧౯. అఙ్గానిత్యస్య శఙ్ఖ ఋషిః, అశ్వినౌ దేవతే, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౧౯ అఙ్గాన్యాత్మన్ భిషజా తదశ్వినాత్మానమఙ్గైః సమధాత్ సరస్వతీ।
ఇన్ద్రస్య రూపꣳ శతమానమాయుశ్చన్ద్రేణ జ్యోతిరమృతం దధానాః ॥౯౩॥

ప. విః- అఙ్గాని, ఆత్మన్, భిషజా, తత్, అశ్వినా, ఆత్మానమ్, అఙ్గైః, సమ్ అధాత్, సరస్వతీ, ఇన్ద్రస్య, రూపమ్, శతమానమితి శత + మానమ్, ఆయుః, చన్ద్రేణ, జ్యోతిః, అమృతమ్, దధానాః. ॥౯౩॥

పదార్థః:-(అఙ్గాని) యోగాఙ్గాని (ఆత్మన్) ఆత్మని (భిషజా) సద్వైద్యవదరోగౌ (తత్) (అశ్వినా) సిద్ధసాధకౌ (ఆత్మానమ్) (అఙ్గైః) యోగాఙ్గైః (సమ్) (అధాత్) సమాదధాతి (సరస్వతీ) యోగినీ స్త్రీ (ఇన్ద్రస్య) పరమైశ్వర్యస్య (రూపమ్) (శతమానమ్) శతముసంఖ్యం మానం యస్య తత్ (ఆయుః) జీవనమ్ (చన్ద్రేణ) ఆనన్దేన (జ్యోతిః) ప్రకాశమ్ (అమృతమ్) (దధానాః) ధరన్తః. ॥౯౩॥

అన్వయః:-హే మనుష్యాః! భిషజాఽశ్వినా సిద్ధసాధకౌ విద్వాంసౌ యథా సరస్వత్యాత్మన్స్థిరా సత్యజ్గాని యోగాజ్గాన్యనుష్ఠాయాత్మానం సమధాత్ తథైవాఙ్గైర్యదిన్ద్రస్య రూపమస్తి తత్ సందధ్యాతామ్. యథా యోగం దధానాఃశతమానమాయుర్ధరన్తి తథా చన్ద్రేణాఽమృతం జ్యోతిర్దధ్యాత్.।౯౩॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా రోగిణః సద్వైద్యం ప్రాప్యౌషధం పథ్యం చ సేవిత్వా నీరోగా భూత్వాఽనన్దన్తి తథా యోగజిజ్ఞాసవో యోగిన ఇమమవాప్య యోగాంగాన్యనుష్ఠాయ నిష్క్లేశా భూత్వా సతతం సుఖినో భవన్తి.।౯౩॥

పదార్థము :- ఓ మానవులారా!(భిషజా) ఉత్తమవైద్యునివలె రోగరహితుడు మరియు (అశ్వి) సిద్ధిసాధకుడు ఈ ఇరువురు విద్వాంసు లెట్లు (సరస్వతీ) యోగినియగు స్త్రీ (ఆత్మన్) తమ యాత్మయందు స్థిరమైయున్న (అజ్గాని) యోగాంగముల ననుష్ఠించి (ఆత్మానమ్) తమ యాత్మను (సమధాత్) సమాధానపరచుచుందురో అటులనే (అఙ్గైః) యోగాంగములచే ఏ (ఇన్ద్రస్య) ఐశ్వర్య (రూపమ్) రూపములుగలవో (తత్) వానిని సమాధానపరచవలయును. ఏవిధముగ యోగమును (దధానాః) ధారణమొనర్చు జనులు (శతమానమ్) నూరుసంవత్సరముల పర్యంతము (ఆయుః) ఆయుష్యమును ధరించువారైయున్నారో, ఆవిధముగనే (చన్ద్రేణ) ఆనందముతో (అమృతమ్) అవినాశి (జ్యోతిః) ప్రకాశస్వరూపుడగు పరమాత్మను ధారణమొనర్చుడు.।౯౩॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. రోగులు ఉత్తమవైద్యునాశ్రయించి ఔషధ పథ్యములను సేవించి రోగరహితులై ఆనందము ననుభవించుచుండునట్లు యోగేచ్ఛగల యోగులు దీనిని ప్రాప్తిజేసికొని యోగాంగముల ననుష్ఠించి, అవిద్యమున్నగు క్లేశములనుండి వైదొలగి నిరంతరము సౌఖ్యవంతులై యుందురు.।౯౩॥

93.Just as a woman devoted to yoga, engrossed in deep meditation, practising the limbs of yoga puts her soul in contemplation, so should husband and wife free from disease like a good physician, practise the parts of yoga and attain to the beauty of supremacy. As men practising yoga live for a hundered years, so should we, full of happiness, realise the immortal nature of the soul.

౧౧౨౦.సరస్వతీత్యస్య శఙ్ఖ ఋషిః, సరస్వతీ దేవతా, విరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౨౦ సరస్వతీ యోన్యాం గర్భమన్తరశ్విభ్యాం పత్నీ సుకృతం బిభర్తి।

అపాꣳ రసేన వరుణో న సామ్నేన్ద్రꣳ శ్రియై జనయన్నప్సు రాజా॥౯౪॥

ప.విః-సరస్వతీ, యోన్యామ్, గర్భమ్, అన్తః, అశ్విభ్యామిత్యశ్వి + భ్యామ్, పత్నీ, సుకృతమితి సు + కృతమ్, బిభర్తి, అపామ్, రసేన, వరుణః, న, సామ్నా, ఇన్ద్రమ్, శ్రియై, జనయన్, అప్స్విత్యప్సు, రాజా.॥౯౪॥

పదార్థః-(సరస్వతీ) విదుషీ (యోన్యామ్) (గర్భమ్)(అన్తః) ఆభ్యన్తరే (అశ్విభ్యామ్) అధ్యాపకోపదేశకాభ్యామ్ (పత్నీ) (సుకృతమ్) పుణ్యాత్మకమ్ (బిభర్తి) (అపామ్) జలానామ్ (రసేన) (వరుణః) శ్రేష్ఠః (న) ఇవ (సామ్నా) సన్ధినా (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (శ్రియై) శోభాయై (జనయన్) ఉత్పాదయన్ (అప్సు) ప్రాణేషు (రాజా) ప్రకాశమానః.॥౯౪॥

అన్వయః-హే యోగిన్! యథా సరస్వతీ పత్నీ స్వపత్యుర్యోన్యామన్తస్సుకృతం గర్భం బిభర్తి యథా వా వరుణో రాజాऽశ్విభ్యామపాం రసేనాప్సు సామ్నా న సుఖేనేన్ద్రం శ్రియై జనయన్విరాజతే తథా త్వం భవేః.॥౯౪॥

భావార్థః-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా ధర్మపత్నీ పతిం శుశ్రూషతే యథా చ రాజా సామాదిభీ రాజ్యైశ్వర్యమున్నయతి తథైవ విద్వాన్ యోగోపదేశకం సంసేవ్య యోగాఙ్గైర్యోగసిద్ధిమున్నయేత్.॥౯౪ ॥

పదార్థము :- ఓ యోగాభ్యాసీ! ఎట్లు (సరస్వతీ) విదుషీమణియగు (పత్నీ) పత్ని తన పతితో (యోన్యామ్) యోని (అన్తః) లోపల (సుకృతమ్) పుణ్యరూపమగు (గర్భమ్) గర్భమును (బిభర్తి) ధారణమొనర్చుకొనుచున్నదో లేక ఎట్లు (వరుణః) ఉత్తముడగు (రాజా) రాజు (అశ్విభ్యామ్) అధ్యాపకోపదేశకులతో గూడ (అపామ్) జలముల (రసేన) రసముచే (అప్సు) ప్రాణములందు (సామ్నా) కలియుట (న) వలె సుఖముతో (ఇన్ద్రమ్) ఐశ్వర్యమును (శ్రియై) లక్ష్మికొరకు (జనయన్) ప్రకటపరచుచు ప్రకాశమానుడైయున్నాడో, అట్లే నీవును అగుము.॥౯౪॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగా ధర్మపత్ని తన పతిసేవ నొనర్చునో, రాజు సామ, దాన, భేద, దండోపాయములచే రాజ్యముయొక్క ఐశ్వర్యముల వృద్ధిపరచునో, అదేవిధముగ విద్వాంసుడు, యోగోపదేశకుని సేవించి యోగాంగసిద్ధులను వృద్ధిపరచుకొనవలెను. ॥౯౪॥

94.O yogi, just as an educated wife bears in her womb the noblyfashioned infant, and an excellent king with the help of the teacher and preacher and the spiritual force of the self-abnegating, learned persons (Aptas) controlling the breaths. manifests his sovereignty of wealth, so shouldst thou do.

పదార్థః:-(ఏధః) వర్ధకః (అసి) (ఏధిషీమహి) వర్ధిషీమహి (సమిత్) అగ్నేరిన్ధనమివ మనుష్యాణా మాత్మనాం ప్రకాశకః (అసి) (తేజః) తీవ్రప్రజ్ఞః (అసి) (తేజః) జ్ఞానప్రకాశమ్ (మయి) (ధేహి) (సమావవర్తి) సమ్యగ్వర్తేత. అత్ర వ్యత్యయేన పరస్మైపదం శపః శ్లుశ్చ (పృథివీ) భూమిః (సమ్) (ఉషాః) ప్రభాతః (సమ్) (ఉ) ఇతి వితర్కే (సూర్యః) (సమ్) (ఉ) (విశ్వమ్) (ఇదమ్) (జగత్) (వైశ్వానరజ్యోతిః) విశ్వేషు నరేషు ప్రకాశమానం వైశ్వానరం వైశ్వానరం చ తజ్జ్యోతిశ్చ వైశ్వానరజ్యోతిః (భూయాసమ్) (విభూన్) వ్యాపకాన్ (కామాన్) సంకల్పితాన్ (వి) వివిధతయా (అశ్నవై) ప్రాప్నుయామ్ (భూః) సత్తాత్మికామ్ (స్వాహా) సత్యయా వాచా క్రియయా చ.॥23॥

అన్వయః:- హే జగదీశ్వర! త్వమేధోఽసి సమిదసి తేజోఽసి తస్మాత్ తేజో మయి ధేహి యో భవాన్ సర్వత్ర సమావవర్తి యేన భవతా పృథివ్యుషాశ్చ సంసృష్టా సూర్యః సంసృష్ట,ఇదం విశ్వం జగత్ సంసృష్టం తదు వైశ్వానరజ్యోతిర్బ్రహ్మ ప్రాప్య వయమేధిషీమహి యథాఽహం స్వాహా భూర్విభూన్ కామాన్ వ్యశ్నవై సుఖీ చ భూయాసమ్ తథైవ యూయమపి సిద్ధకామాః సుఖినః స్యాత.॥23॥

భావార్థః:-హే మనుష్యాః! యచ్ఛుద్ధం సర్వత్ర వ్యాపకం సర్వప్రకాశకం జగత్ స్రష్టృధర్తృప్రలయకృద్ బ్రహ్మోపాస్య యూయమానన్దితా యథా భవత తథైతల్లబ్ధ్వా వయమప్యానన్దితా భవేమాఽఽకాశకాలదిశోపి విభూన్ జానీయామ. ॥23॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! నీవు (ఏధః) వృద్ధిపరచువాడవై (అసి) ఉన్నావు (సమిత్) అగ్నికి ప్రకాశము ఇంధనమైయున్నట్లు మానవుల ఆత్మలను ప్రకాశపరచువాడవునై (అసి) ఉన్నావు. మరియు (తేజః) తీవ్రబుద్ధి గలవాడవై (అసి) ఉన్నావు. కావున (తేజః) జ్ఞానప్రకాశమును (మయి) నాయందు (ధేహి) ధారణమొనర్పుము. ఏ నీవు సర్వత్ర (సమావవర్తి) చక్కగా వ్యాప్తుడవైయున్నావో అట్టి నీవు (పృథివీ) భూమి మరియు (ఉషాః) ఉషస్సును (సమ్) చక్కగా ఉత్పన్నమొనర్చితివో (సూర్యః) సూర్యుని (సమ్) చక్కగా నుత్పన్నముచేసితివో (ఇదమ్) ఈ (విశ్వమ్) సమస్త (జగత్) జగత్తును (సమ్) ఉత్పన్నమొనర్చినావో (ఉ) అదే (వైశ్వానరజ్యోతిః) అట్టి విశ్వనాయకుడవు, ప్రకాశస్వరూపుడవు, బ్రహ్మమగు నిన్ను ప్రాప్తించుకొనిన మేము (ఏధిషీమహి) సదావృద్ధి నొందుదుముగాక! అదే విధముగా నేను (స్వాహా) సత్యవాణి మరియు క్రియద్వారా (భూః) శక్తిగల ప్రకృతి (విభూన్) వ్యాపకపదార్థము మరియు (కామాన్) కామములను (వ్యశ్నవై) పొందుదునుగాక! మరియు సుఖవంతుడను (భూయాసమ్) అగుదునుగాక! (ఉ) మరియు నటులనే మీరును సిద్ధకాములు, సుఖవంతులును అగుడు.॥23॥

**భావార్థము :-** ఓ మానవులారా! మీరు శుద్ధుడు, సర్వవ్యాపకుడు, సర్వప్రకాశకుడు, జగదుత్పాదకుడు, ధారకుడు, పాలకుడు, ప్రలయకర్తయునగు పరబ్రహ్మనే యుపాసించి ఆనందితులగునట్లు మేమును ఆనందితుల మగుదుముగాక! ఆకాశము, కాలము మరియు దిశలనుగూడ వ్యాపకమని ఎరుగుదుముగాక!॥23॥

23.O God, Thou conducest to our prosperity. Just as fuel illumines fire, so dost Thou illumine our souls. Thou art wisdom personified. Grant me the light of knowledge. Thou art omnipresent. Thou hast nicely created the Earth, Dawn, Sun, and this entire world. May we always prosper, having realized the Effulgent Lord, the Guide of the universe. May I achieve various big ambitions. May I realise God and Matter through truthful speech, and

౧౧౪౫.అభ్యాదధామీత్యస్యాశ్వతరాశ్వి ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౪౫ అభ్యాదధామి సమిధమగ్నే వ్రతపతే త్వయి।

వ్రతం చ శ్రద్ధాం చోపైమీన్ద్ధే త్వా దీక్షితోఽఅహమ్ ॥౨౪॥

ప.విః-అభి, ఆ, దధామి, సమిధమితి సమ్ + ఇధమ్, అగ్నే, వ్రతపత ఇతి వ్రత + పతే, త్వయి, వ్రతమ్, చ, శ్రద్ధామ్, చ, ఉప, ఏమి, ఇన్ద్ధే, త్వా, దీక్షితః, అహమ్.॥౨౪॥

పదార్థః:-(అభి) (ఆ) (దధామి) (సమిధమ్) సమిధమివ ధ్యానమ్ (అగ్నే) స్వప్రకాశ స్వరూప జగదీశ్వర (వ్రతపతే)సత్యభాషణాదీనాం వ్రతానాం కర్మణాం వా పాలక. వ్రతమితి కర్మనా.. నిఘం ౨.౧. (త్వయి) (వ్రతమ్) సత్యభాషణాదికం కర్మ (చ) (శ్రద్ధామ్) సత్యధారికాం క్రియామ్ (చ) (ఉప) (ఏమి) ప్రాప్నోమి (ఇన్ద్ధే) ప్రకాశయామి (త్వా) త్వామ్ (దీక్షితః) బ్రహ్మచర్యాదిదీక్షాం ప్రాప్య జాతవిద్యః (అహమ్).॥౨౪॥

అన్వయః:-హే వ్రతపతేఽగ్నే!త్వయి స్థిరీభూయాహం సమిధమివ ధ్యానమభ్యాదధామి యతో వ్రతం చ శ్రద్ధాం చోపైమి దీక్షితః సంస్త్వా త్వామిన్ద్ధే.॥౨౪॥

భావార్థః:-యే మనుష్యాః పరమేశ్వరాజ్ఞప్తాని సత్యభాషణాదీని వ్రతాని ధరన్తి తేఽతులాం శ్రద్ధాం ప్రాప్య ధర్మాఽర్థకామమోక్షసిద్ధిం కర్తుం శక్నువన్తి.॥౨౪॥

పదార్థము :- (వ్రతపతే) సత్యభాషణాది కర్మలను పాలనమొనర్చు (అగ్నే) స్వయంప్రకాశస్వరూపుడవగు ఓ జగదీశ్వరా! (త్వయి) నీయందు స్థిరమై (అహమ్) నేను (సమిధమ్) అగ్నియందలి సమిధవలె ధ్యానమును (అభ్యాదధామి) ధరింతును. ఇందుచే (వ్రతమ్) సత్యభాషణము మున్నగు వ్యవహారములు (చ) మరియు (శ్రద్ధామ్) సత్యధారణ నియమమును (చ) కూడ (ఉపైమి) పొందుదును (దీక్షితః) బ్రహ్మచర్యము మున్నగు దీక్షల ద్వారా విద్యలను ప్రాప్తించుకొనిన నేను (త్వా) నిన్ను (ఇన్ద్ధే) ప్రకాశితమొనర్చుచున్నాను.॥౨౪॥

**భావార్థము** :- పరమేశ్వరుడు ఆచరించుట కాజ్ఞాపించిన సత్యభాషణాది నియమముల నెవరాచరించెదరో వారు అతులశ్రద్ధను ప్రాప్తించుకొని ధర్మార్థకామమోక్షములను సాధించుటకు సమర్థులగుదురు.॥౨౪॥

24.O God, the Fulfiller of vows, concentrationg myself on Thee, I plunge in divine meditation like fuel in fire, whereby I acquire the vow of truth and faith!.

Being initiated in celibacy and gaining knowledge, I kindle Thee.

౧౧౪౬. యత్ర బ్రహ్మేత్యస్యాశ్వతరాశ్విఋషిః, అగ్నిర్దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౪౬ యత్ర బ్రహ్మ చ క్షత్రం చ సమ్యఞ్చౌ చరతః సహ ।

తం లోకం పుణ్యం ప్రజ్ఞేషం యత్ర దేవాః సహాగ్నినా ॥౨౫॥

ప.విః-యత్ర, బ్రహ్మ, చ, క్షత్రమ్, చ, సమ్యఞ్చౌ, చరతః, సహ, తమ్, లోకమ్, పుణ్యమ్, ప్ర, జ్ఞేషమ్, యత్ర, దేవాః, సహ, అగ్నినా.॥౨౫॥

పదార్థః:-(యత్ర) యస్మిన్ బ్రహ్మణి (బ్రహ్మ) బ్రాహ్మణకులవంర్థాద్విద్వత్కులమ్ (చ) (క్షత్రమ్) క్షత్రియకులవంర్థాద్విద్యాశౌర్యాదిగుణోపేతమ్ (చ) వైశ్యాదికులాని (సమ్యఞ్చౌ) సమ్యగేకీభావేనాఞ్చతస్తౌ (చరతః) వర్త్తేతే (సహ) సార్ధమ్ (తమ్) (లోకమ్) ద్రష్టవ్యమ్ (పుణ్యమ్) నిష్పాపం సుఖస్వరూపమ్ ((ప్ర) (జ్ఞేషమ్) జానీయామ్. జానాతేర్లేటి సిపి రూపమ్ (యత్ర) (దేవాః) దివ్యాః పృథివ్యాదయో విద్వాంసో వా (సహ) (అగ్నినా) విద్యుతా.॥ ౨౫ ॥

అన్వయః:-హే మనుష్యాః! యథాఽహం యత్ర బ్రహ్మ చ క్షత్రం సహ సమ్యఞ్చౌ చ చరతో యత్ర దేవా అగ్నినా సహ వర్త్తన్తే తం లోకం పుణ్యం ప్రజ్ఞేషమ్. తథా యూయమప్యేతం విజానీత.॥ ౨౫ ॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యద్ బ్రహ్మైకచేతనమాత్రం సర్వేషామధికారి నిష్పాపం జ్ఞానేన ద్రష్టుం యోగ్యం సర్వత్రాఽభివ్యాప్తం సహచరితం వర్త్తతే తదేవ సర్వైరుపాస్యమ్.॥ ౧౫ ॥

పదార్థము :- ఓ మానవులారా! నేనెట్లు (యత్ర) ఏ పరమాత్మయందు (బ్రహ్మ) బ్రాహ్మణులు, అనగా విద్వాంసులు (చ) మరియు (క్షత్రమ్) విద్య, శౌర్యము మున్నగు గుణములతో గూడిన క్షత్రియ

వర్ణములు ఈ రెండును (సహ) కలిసి (సమ్యంచౌ) చక్కని ప్రీతితో (చ) మరియు వైశ్యులు మున్నగు వర్ణములు (చరతః) కలిసి వ్యవహరింతురో మరియు (యత్ర) ఏ బ్రహ్మయందు (దేవాః) దివ్యగుణములుగల పృథివ్యాదిలోకములు లేక విద్వాంసులు (అగ్నినా) విద్యుద్రూపాగ్నితో (సహ) కలిసి వర్తింతురో (తమ్) అట్టి (లోకమ్) చూడదగిన (పుణ్యమ్) సుఖస్వరూపుడు, పాపరహితుడగు పరమాత్మను (ప్ర, జ్ఞేషమ్) తెలిసికొందునో, అట్లే మీరును తెలిసికొనుడు. ॥౨౫॥

భావార్థము :- ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ఏ పరమాత్మ ఒక్కడే చేతనమాత్ర స్వరూపుడు, సర్వాధికారి, పాపరహితుడు, జ్ఞానముద్వారానే దెలిసికొనదగినవాడు, సర్వవ్యాపకుడు, సహచరుడునై యున్నాడో, యాతడే సర్వమానవులకు ఉపాస్య దేవుడైయున్నాడు. ॥౨౫॥

25.I consider that society or country to be the ideal, where the civil and military forces work together harmoniously, where the learned civil administrators cooperate with the commanders of the army.

౧౧౪౭. యత్రేత్యస్యాశ్వతరాశ్విఋషిః, అగ్నిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౪౭ యత్రేన్ద్రశ్చ వాయుశ్చ సమ్యఞ్చౌ చరతః సహ ।

తం లోకం పుణ్యం ప్రజ్ఞేషం యత్ర సేదిర్న విద్యతే ॥౨౬॥

ప.వి:- యత్ర, ఇన్ద్రః, చ, వాయుః, చ, సమ్యఞ్చౌ, చరతః, సహ, తమ్, లోకమ్, పుణ్యమ్, ప్ర, జ్ఞేషమ్, యత్ర, సేదిః, న, విద్యతే ॥౨౬॥

పదార్థః:- (యత్ర) యస్మిన్నీశ్వరే (ఇన్ద్రః) సర్వత్రాఽభివ్యాప్తా విద్యుత్ (చ) (వాయుః) ధనఞ్జయాదిస్వరూపః పవనః (చ) (సమ్యఞ్చౌ) (చరతః) (సహ) (తమ్) (లోకమ్) సర్వస్య ద్రష్టారమ్ (పుణ్యమ్) పుణ్యజన్యజ్ఞానేన జ్ఞాతుమర్హమ్ (ప్ర) (జ్ఞేషమ్) జానీయామ్ (యత్ర) యస్మిన్ (సేదిః) నాశ ఉత్పత్తిర్వా (న) నిషేధే (విద్యతే). ॥౨౬॥

అన్వయః:- హే మనుష్యాః! యథాఽహం యత్రేన్ద్రశ్చ వాయుః సహ సమ్యఞ్చౌ చరతశ్చ యత్ర సేది ర్న విద్యతే తం పుణ్యం లోకం ప్రజ్ఞేషం తథైతం యూయం విజానీత. ॥౨౬॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది కశ్చిద్విద్వాన్ వాయువిద్యుదాకాశాదీ

నామియంత్తాం జిజ్ఞాసేత తత్ఫ్యన్తం న ప్రాప్నోతి యత్ర చైతే వ్యాప్యాః సన్తి తస్య బ్రహ్మణోఽన్తం జ్ఞాతుం కః శక్నుయాత్?॥౨౬॥

**పదార్థము :-** ఓ మానవులారా! నేనెట్లు (యత్ర) ఏ యీశ్వరునందు (ఇన్ద్రః) సర్వత్రవ్యాప్తమైయున్న విద్యుత్తు (చ) మరియు (వాయుః) ధనంజయాది వాయువులు (సహ) తోడ్తో [కలిసి] (సమ్యంచౌ) చక్కగా కలిసి (చరతః) విహరించుచుండునో (చ) మరియు (యత్ర) ఏ బ్రహ్మయందు (సేదిః) నాశము లేక ఆపదలు (న, విద్యతే) ఉండజాలవో (తమ్) అట్టి (పుణ్యమ్) పుణ్యముచే నుత్పన్నమైన జ్ఞానముద్వారా దెలిసికొనదగిన (లోకమ్) సర్వమునుగాంచుచున్న పరమాత్మను (ప్ర, జ్ఞేషమ్) ఎరుగుదునో, అదేవిధముగా దీనిని మీరును దెలిసికొనుడు.॥౨౬॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ విద్వాంసుడైనను వాయువు, విద్యుత్తు, ఆకాశము మున్నగువాని యంతము నెరుగదలచిన అది సాధ్యము గాజాలదు. ఏ పరబ్రహ్మయందు తః యాకాశాది విభుపదార్థములన్నియు వ్యాప్తమైయున్నవియో? వాని యంతము నెరుగ సమర్థుడెవడుండ గలడు?॥౨౬॥

26.Fain would I know that holy God, where birth and death unknown, where in complete accordance reside soul and God side by side.

౧౧౪౮. అంశునేత్యస్య ప్రజాపతిర్ఋషిః, సోమో దేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౪౮ అంశునా తే అంశుః, పృచ్యతాం పరుషా పరుః।

గన్ధస్తే సోమమవతు మదాయ రసోఽ అచ్యుతః॥౨౭॥

ప. విః- అంశునా, తే, అంశుః, పృచ్యతామ్, పరుషా, పరుః, గన్ధః, తే, సోమమ్, అవతు, మదాయ, రసః, అచ్యుతః.॥౨౭॥

**పదార్థః:-** (అంశునా) భాగేన (తే) తవ (అంశుః) భాగః (పృచ్యతామ్) సంబధ్యతామ్ (పరుషా) మర్మణా (పరుః) మర్మ (గన్ధః) (తే) తవ (సోమమ్) ఐశ్వర్యమ్ (అవతు) (మదాయ) ఆనన్దాయ (రసః) సారః (అచ్యుతః) నాశరహితః.॥౨౭॥

**అన్వయః:-** హే విద్వన్! తే తవాఽంశునాఽంశుః పరుషా పరుః పృచ్యతాం తేఽచ్యుతో గన్ధో రసశ్చ మదాయ సోమమవతు.॥౨౭॥

భావార్థః:- యదా ధ్యానావస్థితస్య మనుష్యస్య మనసా సహేన్ద్రియాణి ప్రాణాశ్చ బ్రహ్మణి స్థిరా భవన్తి తదా స నిత్యమానన్దతి.॥౨౭॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! (తే) నీయొక్క (అంశునః) భాగమునుండి (అంశుః) భాగము మరియు (పరుషా) మర్మముతో (పరుః) మర్మము (పృచ్యతామ్) కలియవలెను మరియు (తే) నీయొక్క (అచ్యుతః) నాశరహితమైన (గన్ధః) గంధము (రసః) రసపదార్థసారము (మదాయ) ఆనందముకొరకు (సోమమ్) ఐశ్వర్యముల (అవతు) రక్షించుగాక!॥౨౭॥

**భావార్థము :-** ధ్యానావస్థయందున్న మనుష్యుని మనస్సుతోగూడ ఇంద్రియములు మరియు ప్రాణము పరబ్రహ్మయందు స్థిరమైనప్పుడే నిత్యానందము ప్రాప్తించును.॥౨౭॥

27.Let thy soul be united with God. Let each joint of thine be full of vigour. Let thy noble nature guard thy wealth. Let the imperishable sap of God's devotion be for thy joy.

౧౧౪౯.సిఞ్చన్తీత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ విద్వద్విషయే శారీరికవిషయమాహ. విద్వాంసుల విషయమందు శరీరసంబంధ విషయము చెప్పబడినది.

౧౧౪౯ సిఞ్చన్తి పరి షిఞ్చన్త్యుత్సిఞ్చన్తి పునన్తి చ।
సురాయై బభ్ర్వై మదే కిన్త్వో వదతి కిన్త్వః॥౨౮॥

ప. విః-సిఞ్చన్తి, పరి, సిఞ్చన్తి, ఉత్, సిఞ్చన్తి, పునన్తి, చ, సురాయై, బభ్ర్వై, మదే, కిన్త్వః, వదతి, కిన్త్వః.॥౨౮॥

పదార్థః:-(సిఞ్చన్తి) (పరి) సర్వతః (సిఞ్చన్తి) (ఉత్) (సిఞ్చన్తి) (పునన్తి) పవిత్రీభవన్తి (చ) (సురాయై) సోమాయ (బభ్ర్వై) బలధారకాయ (మదే) అనన్దాయ (కిన్త్వః)కిమసౌ (వదతి) (కిన్త్వః) కిమన్యః.॥౨౮॥

అన్వయః:- యే బభ్ర్వై సురాయై మదే మహౌషధిరసం సిఞ్చన్తి పరిసిఞ్చన్త్యుత్సిఞ్చన్తి పునన్తి చ తే శరీరాత్మబల మాప్నువన్తి. యః కిన్త్వః కిన్త్వశ్చేతి వదతి స కించిదపి నాప్నోతి.॥౨౮॥

భావార్థః:-యేఽన్నాదీని పవిత్రీకృత్య సంస్కృత్యోత్తమరసైఃపరిషిచ్య యుక్తాహారవిహారేణ భుఞ్జతే తే బహు సుఖం లభన్తే యో మూఢతయైవం నాచరతి స బలబుద్ధిహీనః సతతం దుఃఖం భుఙ్క్తే.॥౨౮॥

**పదార్థము :-** ఎవరైతే (బభ్రవే) బలమును ధారణమొందజేయు (సురాయై) సోమము లేక (మదే) ఆనందమునకై మహౌషధుల రసమును (సించన్తి) జఠరాగ్నియందు సేచనమొనర్తురో, సేవింతురో (పరి, సించన్తి) అన్నివైపులనుండి పానమొనర్తురో (ఉత్సించన్తి) ఉత్కృష్టతతో గ్రహణమొనర్చెదరో (చ) మరియు (పునన్తి) పవిత్రులగుదురో వారు శరీరాత్మల బలమును పొందుదురు. మరియు (కిన్త్వః) ఇదేమి? (కిన్త్వః) అదేమి? అని అవహేళన మొనర్చు వారేమియును పొందజాలరు.॥౨౮॥

**భావార్థము :-** అన్నాదులను పవిత్రముగా సంస్కరించి ఉత్తమ రసములతో యుక్తాహార విహారాదులతో నుండువారు అనేక సుఖములను పొందగలరు. కాని మూర్ఖత్వముతో ఇట్లొనర్చుకున్న, ఆరోగ్యహీనుడు, బలబుద్ధిరహితుడై సదా దుఃఖితుడై యుండును.॥౨౮॥

28.Those who aspire after power, for delight pour in the stomach the sap of medicines, drink it, receive it excellently, and purify themselves, strengthen their body and soul. He who says 'What is this', 'What is that', gains nothing.

౧౧౫౦. ధానావన్తమిత్యస్య విశ్వామిత్ర ఋషిః, ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౫౦ ధానావన్తం కరమ్భిణమపూపవన్తముక్థినమ్। ఇన్ద్ర ప్రాతర్జుషస్వ నః ॥౨౯॥

ప. విః- ధానావన్తమితి ధానాఽవన్తమ్, కరమ్భిణమ్, అపూపవన్తమిత్యపూప + వన్తమ్, ఉక్థినమ్, ఇన్ద్ర, ప్రాతః, జుషస్వ, నః.॥౨౯॥

పదార్థః:-(ధానావన్తమ్) సుసంస్కృతైర్ధాన్యైర్యుక్తమ్ (కరమ్భిణమ్) సుష్ఠుక్రియయా నిష్పన్నమ్ (అపూపవన్తమ్) సుష్ఠు సంపాదితాపూపసహితమ్ (ఉక్థినమ్) ప్రశస్తోక్థవాక్యజన్య బోధనిష్పాదితమ్ (ఇన్ద్ర) సుఖేచ్ఛో విద్యైశ్వర్యయుక్త జన (ప్రాతః) ప్రభాతే (జుషస్వ) సేవస్వ (నః) అస్మాకమ్.॥౨౯॥

అన్వయః:-హే ఇన్ద్ర! త్వం నో ధానావన్తం కరమ్భిణమపూపవన్తముక్థినం భక్ష్యాద్యన్వితం భోజ్యమన్నరసాదికం ప్రాతర్జుషస్వ.॥౨౯॥

భావార్థః:- యే విద్యాధ్యాపనోపదేశైః సర్వేషామలఙ్కర్తారో విశ్వోద్ధారకా విద్వాంసో జనాః సుసంస్కృతై రసాదిభిర్యుక్తాన్యన్నాదీని యథాసమయం భుఞ్జతే. యే చ తాన్ విద్యాసుశిక్షా యుక్తాం వాచం గ్రాహయేయు స్తే ధన్యవాదార్హా జాయన్తే.॥౨౯॥

**పదార్థము :-** (ఇన్ద్ర) సుఖముల కాంక్షించు విద్యైశ్వర్యవంతుడా! నీవు (నః) మాయొక్క (ధానావన్తమ్)

చక్కగా సంస్కరింపబడిన ధాన్యములు, అన్నములతోగూడ (కరమ్భిణమ్) మరియు చక్కని క్రియద్వారా సిద్ధపరచిన (అపూపవన్తమ్) చక్కగా సమకూర్చబడిన పిండివంటలతోగూడ (ఉక్థినమ్) మరియు ఉత్తమవాక్యములతో నుత్పన్నమైన బోధలను సాధింపజేయు మరియు భక్ష్యాదులతో గూడ భుజించదగిన అన్నరసాదులను (ప్రాతః) ప్రాతఃకాలమున (జుషస్వ) సేవించుచుండుము.॥౨౯॥

భావార్థము :- విద్యల గరపుచు, ఉపదేశములచే ఎల్లరను సుభూషితులుగ నొనర్చువారు మరియు విశ్వము నుద్ధరించు విద్వాంసులు చక్కగా సంస్కరించబడిన, రసాది పదార్థములతో గూడిన అన్నాదులను సరియైన సమయములందు భుజించువారు మరియు విద్య, సుశిక్షణలద్వారా వాణిని గ్రహింపజేయు దాతలు ధన్యవాదముల పొందదగినవా రగుచుందురు.॥౨౯॥

29.O learned person, desirous of happiness, at morn accept our cake accompanied with grain and groats, with wheaten bread and hymns of praise!.

౧౧౫౧.బృహదిత్యస్య నృమేధపురుషమేధావృషీ, ఇన్ద్రో దేవతా, బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ మఱల నా విషయమే.

౧౧౫౧ బృహదిన్ద్రాయ గాయత మరుతో వృత్రహన్తమమ్।

యేన జ్యోతిరజనయన్నృతావృధో దేవం దేవాయ జాగృవి ॥30॥

ప.వి:-బృహత్, ఇన్ద్రాయ, గాయత, మరుతః, వృత్రహన్తమమితి వృత్రహన్ + తమమ్, యేన, జ్యోతిః, అజనయన్, ఋతావృధః, ఋతవృధ ఇత్యృత + వృధః, దేవమ్, దేవాయ, జాగృవి.॥30॥

పదార్థః:-(బృహత్) మహత్ సామ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యయుక్తాయ (గాయత) ప్రశంసత (మరుతః) విద్వాంసః (వృత్రహన్తమమ్) యో వృత్రం మేఘం హన్తి తమతిశయితం సూర్యమివ (యేన) (జ్యోతిః) తేజః (అజనయన్) ఉత్పాదయన్తు (ఋతావృధః) యే ఋతం సత్యం వర్ధయన్తి తే (దేవమ్) దివ్యసుఖప్రదమ్ (దేవాయ) దివ్యగుణాయ (జాగృవి) జాగరూకమ్.॥30॥

అన్వయః:-హే మరుతః! ఋతావృధో భవన్తో యేన దేవాయేన్ద్రాయ దేవం జాగృవి జ్యోతిరజనయంస్తద్ వృత్రహన్తమం బృహత్ తస్మై గాయత.॥30॥

భావార్థః:-మనుష్యైః సదైవ యుక్తాహారవిహారేణ శరీరాత్మరోగాన్ నివార్య పురుషార్థమున్నీయ పరమేశ్వర ప్రతిపాదకం గానం కర్తవ్యమ్.॥30॥

**పదార్థము :-** (మరుతః) విద్వాంసులారా! (ఋతావృధః) సత్యమును పెంపొదించునీవు (యేన) ఎద్దానిచే (దేవాయ) దివ్యగుణవంతుడు (ఇన్ద్రాయ) పరమైశ్వర్యశాలియగు ఈశ్వరునకై (దేవమ్) దివ్యసుఖములనిచ్చు (జాగృవి) జాగరూకత, అనగా అతిప్రసిద్ధ (జ్యోతిః) తేజ పరాక్రమమును (అజనయన్) ఉత్పన్నపరచుము. అట్టి (వృత్రహన్తమమ్) అతిశయముగ మేఘహన్తయగు సూర్యునివలె (బృహత్) మహాసామగానమును పై దెలిపిన యా పరమేశ్వరునికై (గాయత) గానమొనర్చుము. ॥30॥

**భావార్థము :-** సర్వజనులు సదా యుక్తాహార, విహార, వ్యవహారాదులచే శారీరక, ఆత్మిక రోగముల దొలగించుకొని, పురుషార్థపరులై పరమేశ్వరుని ప్రతిపాదనమొనర్చు గానము (కీర్తన)ల నొనర్చుచు కృతార్థ పరులై యుండవలయును.॥30॥

30.O learned person, advancers of truth, whereby ye create pleasant highly known spiritual power, for the attainment of Holy God, like sun the dispeller of cloud, chant the great Sama hymns in praise of God!.

౧౧౫౭.అధ్వర్యో ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః ప్రకారాన్తరేణోక్తవిషయమాహ. మఱల ప్రకారాంతరముగ నుక్త విషయమునే చెప్పెను.

౧౧౫౭ అధ్వర్యోఽఅద్రిభిః సుతꣳసోమం పవిత్రఽ ఆ నయ।
పునీహీన్ద్రాయ పాతవే ॥31॥

ప.వి:-అధ్వర్యోఽ ఇత్యధ్వర్యో అద్రిభిరిత్యద్రి + భిః, సుతమ్, సోమమ్, పవిత్రే, ఆ,నయ, పునీహి, ఇన్ద్రాయ, పాతవే.॥31॥

పదార్థః:-(అధ్వర్యో) యో ఽధ్వరం యజ్ఞం యునక్తి తత్సమ్బుద్ధౌ (అద్రిభిః) మేఘైః. అద్రిరితి మేఘ నా.. నిఘం 1.10. (సుతమ్) నిష్పన్నమ్ (సోమమ్) సోమవల్ల్యాద్యోషధిసారం రసమ్ (పవిత్రే) శుద్ధే వ్యవహారే (ఆ)(నయ)(పునీహి) పవిత్రయ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (పాతవే) పాతుమ్.॥31॥

అన్వయః:-హే అధ్వర్యో! త్వమిన్ద్రాయ పాతవే అద్రిభిః సుతం సోమం పవిత్ర ఆనయ తేన త్వం పునీహి.॥31॥

భావార్థః:-వైద్యరాజైః శుద్ధదేశోత్పన్నౌషధిసారాన్ నిర్మాయైతద్దానేన సర్వేషాం రోగనివృత్తిః సతతం కార్యా. ॥30॥

పదార్థము :- (అధ్వర్యో) యజ్ఞకార్యమును సంపన్నమొనర్చువాడా! నీవు ( ఇన్ద్రాయ) పరమైశ్వర్యవంతునికొరకు (పాతవే) పానమొనర్చుటకు (అద్రిభిః) మేఘములనుండి (సుతమ్) ఉత్పన్నమైన (సోమమ్) సోమలతాది ఓషధుల సారరూపరసమును (పవిత్రే) శుద్ధ వ్యవహారమునందు (ఆనయ) తీసికొనిరమ్ము. దానిచే నీవు (పునీహి) పవిత్రుడవగుము. ॥30॥

భావార్థము :- వైద్యరత్నములు శుద్ధప్రదేశములందుత్పన్నమగు ఓషధుల సారమును సిద్ధపరచి దాని దానముచే సర్వజనుల వ్యాధులను దొలగించుట వారి కత్యంత యోగ్యమైయున్నది.॥30॥

31.O Adhvaryu, bring into the sacred yajna, Soma, born of clouds. Purify it for king's drink!.

1143.యో భూతానామిత్యస్య కౌణ్డిన్య ఋషిః, పరమాత్మా దేవతా, పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునర్విద్వద్విషయమాహ. మరల విద్వాంసులను గూర్చి చెప్పెను.

1143 యో భూతానామధిపతిర్యస్మింల్లోకా అధి శ్రితాః। య ఈశే మహతో మహాంస్తేన గృహ్ణామి త్వామహం మయి గృహ్ణామి త్వామహమ్ ॥31॥

ప.వి:-యః, భూతానామ్, అధిపతిరిత్యధి + పతిః, యస్మిన్, లోకాః, అధి, శ్రితాః, యః, ఈశే, మహతః, మహాన్, తేన, గృహ్ణామి, త్వామ్, అహమ్, మయి, గృహ్ణామి, త్వామ్, అహమ్.॥31॥

పదార్థః:-(యః) పరమేశ్వరః (భూతానామ్) పృథివ్యాదితత్త్వానాం తత్కార్యాణాం లోకానామ్ (అధిపతిః) అధిష్ఠాతా (యస్మిన్) (లోకాః) సంఘాతాః (అధి) (శ్రితాః) (యః) (ఈశే) ఈష్టే. అత్ర లోపస్త ఆత్మనేపదేష్వితి తలోపః (మహతః) ఆకాశాదేః (మహాన్) (తేన) (గృహ్ణామి) (త్వామ్) (అహమ్) (మయి) (గృహ్ణామి) (త్వామ్) (అహమ్).॥31॥

అన్వయః:-హే సర్వహితేచ్ఛో! యో భూతానామధిపతిర్మహతో మహానస్తి య ఈశే యస్మిన్ సర్వే లోకా అధిశ్రితాస్తేన త్వామహం గృహ్ణామి మయి త్వామహం గృహ్ణామి.॥31॥

భావార్థః:-య ఉపాసకోఽనన్తబ్రహ్మనిష్ఠో బ్రహ్మభిన్నముపాస్యం కించిద్వస్తు న జానాతి స ఏవాత్ర విద్వాన్మన్తవ్యః. ॥32॥

పదార్థము :-సకలజనుల హితమును కాంక్షించువాడా! (యః) ఎవడు (భూతానామ్) పృథివ్యాదితత్త్వముల మరియు వానినుండి యుత్పన్నమైన కార్యరూప లోకముల (అధిపతిః) అధిష్ఠాత (మహతః) మహదాకాశాదులకన్న (మహాన్) గొప్పవాడో (యః) ఎవడు (ఈశే) సర్వమున కీశ్వరుడైయున్నాడో (యస్మిన్) ఎవనియందు సమస్త (లోకాః) లోకములు (అధిశ్రితాః) అధిష్ఠితములు, ఆశ్రితములునై యున్నవియో (తేన) వానినుండి (త్వామ్) నిన్ను (అహమ్) నేను (గృహ్ణామి) గ్రహణమొనర్చుచున్నాను. ॥32॥

భావార్థము :-ఏ యుపాసకుడు అనంత బ్రహ్మయందు నిష్ఠగలవాడో, ఎవడు ఆ బ్రహ్మకన్న భిన్నమగు ఏ యితర వస్తువును ఉపాస్యమని దలచడో యాతడే ఈ జగత్తునందు విద్వాంసుడుగ నెంచబడుచున్నాడు. ॥32॥

32.He is the Lord of living beings, upon Whom the worlds depend. God is mighty. He is greater than space. Hence I realise Him, I realise Him in my heart.

౧౧౫౪. ఉపయామగృహీతోసీత్యస్య కాక్షీవతసుకీర్తిర్ఋషిః, సోమో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవాహ. మఱల నా విషయమే.

౧౧౫౪ ఉపయామగృహీతోఽస్యశ్విభ్యాం త్వా సరస్వత్యై త్వేన్ద్రాయ త్వా సుత్రామ్ణ

ఏష తే యోనిరశ్విభ్యాం త్వా సరస్వత్యై త్వేన్ద్రాయ త్వా సుత్రామ్ణే ॥33॥

ప. వి:-ఉపయామగృహీత ఇత్యుపయామ + గృహీతః, అసి, అశ్విభ్యామిత్యశ్వి + భ్యామ్, త్వా, సరస్వత్యై, త్వా, ఇన్ద్రాయ, త్వా, సుత్రామ్ణ ఇతి సు + త్రామ్ణే, ఏషః, తే, యోనిః, అశ్విభ్యామిత్యశ్వి + భ్యామ్, త్వా, సరస్వత్యై, త్వా, ఇన్ద్రాయ, త్వా, సుత్రామ్ణ ఇతి సు + త్రామ్ణే. ॥33॥

పదార్థః:-(ఉపయామగృహీతః) ఉపయామైరుత్తమనియమైః సంగృహీతః (అసి) (అశ్విభ్యామ్) పూర్ణవిద్యాఽధ్యాపకోపదేశకాభ్యామ్. (త్వా) త్వామ్ (సరస్వత్యై) సుశిక్షితాయై వాచే (త్వా) త్వామ్ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (త్వా) (సుత్రామ్ణే) సుష్ఠురక్షకాయ. అత్ర కృతో బహులమిత్యనేన కరణే మనిన్ (ఏషః) (తే) తవ (యోనిః)

విద్యాసంబన్ధః (అశ్విభ్యామ్) (త్వా) (సరస్వత్యై) ప్రశస్తగుణాయై విదుష్యై (త్వా) (ఇన్ద్రాయ) పరమోత్తమవ్యవహారాయ (త్వా) (సుత్రామ్ణే) సుష్ఠు రక్షకాయ. ॥33॥

అన్వయః:-హే విద్వన్! యస్త్వమశ్విభ్యాముపయామగృహీతోఽసి యస్య త ఏషోఽశ్విభ్యాం సహ యోనిరస్తి తం త్వా సరస్వత్యై త్వేన్ద్రాయ త్వా సుత్రామ్ణే చాహం గృహ్ణామి సరస్వత్యై త్వేన్ద్రాయ త్వా సుత్రామ్ణే త్వా గృహ్ణామి.॥33॥

భావార్థః:- యో విద్వద్భిః శిక్షితః స్వయం సుప్రజ్ఞో జితేన్ద్రియో వివిధవిద్యో విద్వత్ప్రియః స్యాత్ స ఏవ విద్యాధర్మప్రవృత్తయేఽధిష్ఠాతా కర్తవ్యో భవేత్.॥33॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! నీవు ఏ (అశ్విభ్యామ్) పూర్ణవిద్వాంసులగు అధ్యాపకోపదేశకులచే (ఉపయామగృహీతః) ఉత్తమ నియమములతో గ్రహణమొనర్చబడినవాడవై (అసి) ఉన్నావో, ఏ (తే) నీయొక్క (ఏషః) ఈ (అశ్విభ్యామ్) అధ్యాపకోపదేశకులతోగూడ (యోనిః) విద్యాసంబంధముగలదో, అట్టి (త్వా) నిన్ను (సరస్వత్యై) చక్కని శిక్షాయుక్త వాణికొరకు (త్వా) నిన్ను (ఇన్ద్రాయ) శ్రేష్ఠైశ్వర్యములకొరకు (త్వా) నిన్ను (సుత్రామ్ణే) చక్కగా రక్షణయొనర్చుటకై నేను గ్రహించుచున్నాను. (సరస్వత్యై) ఉత్తమగుణ శీలవతియగు విదుషీమణికొరకు (త్వా) నిన్ను (ఇన్ద్రాయ) పరమోత్తమ వ్యవహారమునకై (త్వా) నిన్ను మరియు (సుత్రామ్ణే) ఉత్తమ రక్షణకొరకు (త్వా) నిన్ను గ్రహణమొనర్చుచున్నాను. ॥33॥

భావార్థము :-విద్వాంసులచే శిక్షితుడు, ఉత్తమబుద్ధిశాలి, జితేంద్రియుడు, విద్యలతో గూడియుండి విద్వాంసులను ప్రేమించువాడే విద్యాధర్మముల నడుపుట కధిష్ఠాతయగును.॥33॥

33.O learned person, thou art trained in nice rules of conduct, by the teacher and the preacher. Thou art educationally connected with them. I accept thee for didactic speech, for lofty supremacy, for effective guardianship, for thy possessing a noble, learned wife, for noble behaviour, and for full protection!.

౧౧౫౫. ప్రాణపా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః లిఙ్గోక్తా దేవతాః, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౫౫ ప్రాణపా మేఽఅపానపాశ్చక్షుష్పాః శ్రోత్రపాశ్చ మే।

వాచో మే విశ్వభేషజో మనసోఽసి విలాయకః ॥34॥

ప. వి:-ప్రాణపా ఇతి ప్రాణ + పాః, మే, అపానపా ఇత్యపాన + పాః, చక్షుష్పాః, చక్షుః పా

ఇతి చక్షుః + పాః, శ్రోత్రపా ఇతి శ్రోత్ర + పాః, చ, మే, వాచః, మే, విశ్వభేషజ ఇతి విశ్వ + భేషజః, మనసః, అసి, విలాయక ఇతి వి + లాయకః.॥౩౪॥

పదార్థః:-(ప్రాణపాః)యః ప్రాణం పాతి రక్షతి (మే) మమ (అపానపాః) యోఽపానం పాతి (చక్షుష్పాః)యశ్చక్షుః పాతి (శ్రోత్రపాః) యః శ్రోత్రం పాతి (చ) (మే) మమ (వాచః) (మే) (విశ్వభేషజః) (మనసః) (అసి) (విలాయకః) యేన వివిధతయా లీయంతే శ్లిష్యతే.॥౩౪॥

అన్వయః:-హే విద్వన్! యతస్త్వం మే ప్రాణపా అపానపా మే చక్షుష్పాః శ్రోత్రపాశ్చ మే వాచో విశ్వ భేషజో మనసో విజ్ఞానసాధకస్య విలాయకోఽసి తస్మాత్ త్వం పితృవత్ సత్కర్తవ్యోఽసి.॥౩౪॥

భావార్థః:- మనుష్యైర్యే బాల్యాఽవస్థామారభ్య విద్యాసుశిక్షాభ్యాం జితేన్ద్రియత్వం విద్యాసత్పురుష సఙ్గప్రియత్వం ధర్మాత్మపరోపకారిత్వం చ గ్రాహయన్తి తే మాతృవత్ మిత్రవచ్చ విజ్ఞేయాః.॥౩౪॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! నీవు (మే) నాయొక్క (ప్రాణపాః) ప్రాణరక్షకుడవు (అపానపాః) అపానరక్షకుడవు (మే) నాయొక్క (చక్షుష్పాః) నేత్రముల రక్షకుడవు (శ్రోత్రపాః) శ్రోత్రముల రక్షకుడవు (చ) మరియు (మే) నాయొక్క (వాచః) వాణికి (విశ్వభేషజః) సంపూర్ణ ఓషధీరూప (మనసః) విజ్ఞానసిద్ధిని గలిగించు మనస్సునకు (విలాయకః) అనేక విధములుగ సంబంధపరచువాడవై (అసి) ఉన్నావు. కావున నీవు మా తండ్రివలె సత్కరించదగినవాడవై యున్నావు.॥౩౪॥

భావార్థము :-ఎవరు బాల్యావస్థారంభమునుండియే ఉత్తమ విద్యాశిక్షణలచే, జితేంద్రియత్వము, సత్పురుషులయెడ ప్రీతి, గౌరవములు, సత్సంగములు, ధర్మము, పరోపకారము గ్రహింపజేయుదురో వారిని మాతాపితరులు మిత్రులవలె నెంచవలెను.॥౩౪॥

34.O God, Thou art the guardian of my inner breath and outward breath, the guardian of my eye and ear. All-healer of my voice, Thou art the Mollifer of my mind!.

౧౧౩౫. అశ్వినకృతస్యేత్యస్య ప్రజాపతిర్ఋషిః, లిఙ్గోక్తా దేవతాః,నిచృదుపరిష్టాద్ బృహతీ ఛన్దః,మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౧౧౩౫ అశ్వినకృతస్య తే సరస్వతికృతస్యేన్ద్రేణ సుత్రామ్ణా కృతస్య।

ఉపహూత ఉపహూతస్య భక్షయామి ॥35॥

ప. వి:- అశ్వినకృతస్యేత్యశ్విన + కృతస్య, తే, సరస్వతికృతస్యేతి సరస్వతి + కృతస్య, ఇన్ద్రేణ, సుత్రామ్ణేతి సు + త్రామ్ణా, కృతస్య, ఉపహూత ఇత్యుప + హూతః, ఉపహూతస్యేత్యుప + హూతస్య, భక్షయామి. ॥35॥

పదార్థః:- (అశ్వినకృతస్య) యౌ సద్గుణవంశ్నువాతే తావశ్వినౌ తావేవాశ్వినౌ తాభ్యాం కృతస్య. అత్రాశ్విన్ శబ్దాత్ స్వార్థేఽణ వృద్ధ్యభావస్త్వార్షః (తే) తవ (సరస్వతికృతస్య) విదుష్యా స్త్రియా కృతస్య. అత్ర స్వార్థేఽణ సంజ్ఞాఛన్దసోర్బహులమితి పూర్వపదస్య హ్రస్వః (ఇన్ద్రేణ) విద్యైశ్వర్యేణ రాజ్ఞా (సుత్రామ్ణా) సుష్ఠుతయా రక్షకేణ (కృతస్య) (ఉపహూతః) సత్కృత్యాహూతః (ఉపహూతస్య) (భక్షయామి). ॥35॥

అన్వయః:- హే విద్వ న్నుపహూతోఽహం తేఽశ్వినకృతస్య సరస్వతికృతస్య సుత్రామ్ణేన్ద్రేణ కృతస్యోపహూత స్యాన్నాదికం భక్షయామి. ॥35॥

భావార్థః:- మనుష్యైర్విద్వదైశ్వర్యయుక్తైర్జనైరనుష్ఠేయమ్. సుశిక్షితనిష్పాదిత మన్నమత్తవ్యం సత్కర్తుః సత్కారశ్చ కార్యః. ॥35॥

**పదార్థము :-** ఓ విద్వాంసుడా! (ఉపహూతః) పిలువబడిన నేను (తే) నీయొక్క (అశ్వినకృతస్య) సద్గుణముల వ్యాప్తపరచువారికొరకు (సరస్వతి కృతస్య) విదుషీమణి యొనర్చినట్టి (సుత్రామ్ణా) చక్కగా రక్షణజేయువాడు (ఇన్ద్రేణ) విద్యా, ఐశ్వర్యవంతుడగు రాజుచే (కృతస్య) యొనర్చబడిన (ఉపహూతస్య) సమీపమునకు దేబడిన అన్నము మున్నగువానిని (భక్షయామి) భుజించుచున్నాను. ॥35॥

**భావార్థము :-** విద్వాంసులు, ఐశ్వర్యశాలు రనుష్ఠించు దాని ననుష్ఠించుము, ఉత్తమ పాకశాస్త్రజ్ఞులచే పాకమొనర్చిన అన్నాదులను భుజించుచు, సత్కారార్హులైన వారిని సత్కరించుట సమస్త ప్రజలకు యోగ్యమైయున్నది. ॥35॥

35.O learned person, invited, do I feed upon thee food brought near, prepared by the experts and learned ladies, under instructions from the protecting king!.

౧౧౫౭. సమిద్ధ ఇత్యస్యాఙ్గిరస ఋషిః, ఇంద్రో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౧౫౪౭ సమిద్ధఽఇన్ద్రఽఉషసామనీకే పురోరుచా పూర్వకృద్వావృధానః।
త్రిభిర్దేవైస్త్రింశతా వజ్రబాహుర్జఘాన వృత్రం వి దురో వవార ॥౩౬॥

ప.వి:-సమిద్ధ ఇతి సమ్ + ఇద్ధః, ఇన్ద్రః, ఉషసామ్, అనీకే, పురోరుచేతి పురః రుచా, పూర్వకృదితి పూర్వ+కృత్, వావృధాన ఇతి వవృధానః, త్రిభిరితి త్రి + భిః, దేవైః త్రిం॰శతా, వజ్రబాహురితి వజ్ర + బాహుః, జఘాన, వృత్రమ్, వి, దురః, వవార.॥౩౬॥

పదార్థః:- (సమిద్ధః) ప్రదీప్తః (ఇన్ద్రః) సూర్యః (ఉషసామ్) ప్రభాతానామ్ (అనీకే) సైన్యే (పురోరుచా) ప్రాక్ ప్రసృతయా దీప్త్యా (పూర్వకృత్) పూర్వం కరోతీతి పూర్వకృత్ (వావృధానః) వర్ధమానః (త్రిభిః) (దేవైః) (త్రింశతా) త్రయస్త్రింశత్సంఖ్యాకైః పృథివ్యాదిభిర్దివ్యైః పదార్థైః (వజ్రబాహుః) వజ్రో బాహౌ యస్య సః (జఘాన) హన్తి (వృత్రమ్) ప్రకాశావరకం మేఘమ్ (వి) విగతార్థే (దురః) ద్వారాణి (వవార) వివృణోతి.॥౩౬॥

అన్వయః:- హే విద్వన్! పూర్వకృద్వావృధానో వజ్రబాహుః సన్నుషసామనీకే యథా పురోరుచా సమిద్ధ ఇన్ద్రస్త్రిభిరధికైః త్రింశతా దేవైః సహ వర్తమానః సన్ వృత్రం జఘాన దురో వి వవార తథాతిబలైర్యోద్ధృభిః సహ శత్రూన్ హత్వా విద్యాధర్మద్వారాణి ప్రకాశితాని కురు.॥౩౬॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. విద్వాంసః సూర్యవద్విద్యాధర్మప్రకాశకాః స్యుర్విద్వద్భిః సహ శాన్త్యా ప్రీత్యా సత్యాఽసత్యయోర్వివేకాయ సంవాదాన్కృత్వా సునిశ్చిత్య సర్వాన్నిఃసంశయాఞ్జనాన్ కుర్యుః.॥౩౬॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! (పూర్వకృత్) మొదటజేయువాడు (వావృధానః) అభివృద్ధియగుచు (వజ్రబాహుః) హస్తమున వజ్రము ధరించినవాడు (ఉషసామ్) ప్రభాత సమయములందు (అనీకే) సేనలోవలె (పురోరుచా) మొదట వ్యాప్తమైన దీప్తిచే (సమిద్ధః) ప్రకాశితమైన (ఇన్ద్రః) సూర్యుడు (త్రిభిః) మూడు అధికముగ (త్రింశతా) ముప్పది (దేవైః) పృథివి మున్నగు దివ్యపదార్థములతోనున్న (వృత్రమ్) మేఘములను (జఘాన) చంపునట్లు (దురః) ద్వారములను (వి, వవార) ప్రకాశమొనర్చునట్లు అతి బలశాలురగు యోధులతోగూడ శత్రుసంహారమొనర్చి విద్యాధర్మముల ద్వారములను ప్రకాశపరచుము.॥౩౬॥

భావార్థము :-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులు సూర్యునివలె విద్యాధర్మముల ప్రకాశకులు గావలెను. విద్వాంసులతోగూడ శాంతి ప్రేమలచే సత్యాసత్యముల వివేచనముకై సంవాద [శాస్త్రార్థ] మొనర్చి శ్రేష్ఠమైన దానిని నిశ్చయమొనర్చి సకల మానవులును సంశయరహితులు గావలెను.॥౩౬॥

36.O learned person, just as the sun kindled in forefront of Mornings, with forward light, long-active, waxing mighty, with thirty three supernatural powers of nature, the Thunder-wielder, smites dead the cloud, and throws light on the portals, so do thou with the help of warriors kill the foes. and open the doors of knowledge and religion!.

౧౧౫౮.నరాశంస ఇత్యస్యాఙ్గిరస ఋషిః, తనూనపాద్దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ ప్రకారాన్తరేణ విద్వద్విషయమాహ. ప్రకారాంతరముగ విద్వాంసులను గురించి చెప్పెను.

౧౧౫౮ నరాశఀసః ప్రతి శూరో మిమానస్తనూనపాత్ప్రతి యజ్ఞస్య ధామ।
గోభిర్వపావాన్మధునా సమఞ్జన్హిరణ్యైశ్చన్ద్రీ యజతి ప్రచేతాః॥౩౭॥

ప.విః-నరాశఀసః, ప్రతి, శూరః, మిమానః, తనూనపాదితి తనూఽనపాత్, ప్రతి, యజ్ఞస్య, ధామ, గోభిః, వపావానితి వపా + వాన్, మధునా, సమఞ్జన్నితి సమ్ + అఞ్జన్, హిరణ్యైః, చన్ద్రీ, యజతి, ప్రచేతా ఇతి ప్ర + చేతాః.॥౩౭॥

పదార్థః-(నరాశంసః) యో నరైరాశస్యతే స్తూయతే సః (ప్రతి) వ్యాప్తౌ (శూరః) సర్వతో నిర్భయః (మిమానః) యోఽనేకానుత్తమాన్ పదార్థాన్మిమీతే (తనూనపాత్) యస్తనూం న పాతయతి (ప్రతి) (యజ్ఞస్య) సత్యవ్యవహారస్య (ధామ) (గోభిః) ధేనువృషభైః (వపావాన్) వపన్తి యయా క్రియయా సా వపా సా ప్రశస్తా విద్యతే యస్య సః (మధునా) మధురగుణేన రసేన (సమఞ్జన్) వ్యక్తీకుర్వన్ (హిరణ్యైః) సువర్ణాదిభిః (చన్ద్రీ) చన్ద్రం బహుసువర్ణం విద్యతే యస్య సః. (యజతి) (ప్రచేతాః) ప్రకృష్టం చేతః ప్రజ్ఞా యస్య సః.॥౩౭॥

అన్వయః:-హే మనుష్యాః! యో నరాశంసో యజ్ఞస్య ధామ ప్రతి మిమానః శూరస్తనూనపాద్ గోభి ర్వపావాన్ మధునా సమఞ్జన్ హిరణ్యైశ్చన్ద్రీ ప్రచేతాః ప్రతి యజతి సోఽస్మాభిరాశ్రయితవ్యః.॥౩౭॥

భావార్థః:-మనుష్యైః కశ్చిన్నిన్దితో భీరుః స్వశరీరనాశక ఉద్యమహీనోఽలసో మూఢో దరిద్రశ్చ నైవ సంగన్తవ్యః.॥౩౭॥

**పదార్థము** :-మానవులారా! (నరాశంసః) మనుష్యులచే ప్రశంసించబడువాడు (యజ్ఞస్య) సత్యవ్యవహార (ధామ) స్థానమును మరియు (ప్రతి, మిమానః) అనేక ఉత్తమ పదార్థముల నిర్మించువాడు (శూరః) సర్వదిశలనుండియు భయరహితుడు (తనూనపాత్) శరీరపతనము గానీయనివాడు (గోభిః) గోవులు, వృషభములచే (వపావాన్) క్షేత్రములందు పంటల పండించునట్టి ప్రశంసనీయ ఉత్తమ క్రియగలవాడు (మధునా) మాధుర్య రసములచే (సమఞ్జన్) ప్రకటపరచుచు (హిరణ్యైః) సువర్ణాది పదార్థములచే (చన్ద్రీ) అధిక సువర్ణముగలవాడు (ప్రచేతాః) ఉత్తమ ప్రజ్ఞానవంతుడగు నే విద్వాంసుడు (ప్రతి యజతి) యజ్ఞముచేయుచు, చేయించుచుండునో, యాతడు మాకు ఆశ్రయించదగినవాడై యున్నాడు.॥౩౭॥

**భావార్థము** :- నిందితుడు, భీరువు, స్వశరీరనాశకుడు, ఉద్యమహీనుడు, సోమరి, మూఢుడు మరియు దరిద్రుడగువాని సాంగత్యము మనుష్యులెన్నడునుచేయరాదు.॥౩౭॥

37.He, who is praised by the public, is the discoverer of different objects, is the master of just behaviour, is fearless, maintains the vitality of his body, is engaged in agriculture with oxen, is full of knowledge. is wealthy with gold, is extremely wise, and performs yajna. is fit for us to seek shelter under.

౧౧౫౯. ఈడిత ఇత్యస్యాఙ్గిరస ఋషిః, ఇంద్రో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ, మఱల విషయ మయ్యదియే.

౧౧౫౯ ఈడితో దేవైర్హరివాఁ॥ఽఅభిష్టిరాజుహ్వానో హవిషా శర్ధమానః।
పురన్దరో గోత్రభిద్వజ్రబాహురాయాతు యజ్ఞముప నో జుషాణః ॥౩౮॥

ప.వి:-ఈడితః, దేవైః, హరివానితి హరి + వాన్, అభిష్టిః, ఆజుహ్వాన ఇత్యా + జుహ్వానః, హవిషా, శర్ధమానః, పురన్దర ఇతి పురమ్ + దరః, గోత్రభిదితి గోత్ర + భిత్, వజ్రబాహురితి వజ్ర+ బాహుః, ఆ, యాతు, యజ్ఞమ్, ఉప, నః, జుషాణః.॥౩౮॥

పదార్థః:-(ఈడితః) స్తుతః (దేవైః) విద్వద్భిః (హరివాన్) ప్రశస్తా హరయోఽశ్వా విద్యన్తే యస్య సః (అభిష్టిః) అభితః సర్వత ఇష్టయో యజ్ఞా యస్య సః. అత్ర ఛాన్దసో వర్ణలోపో వేతి ఇకారలోపః (ఆజుహ్వానః) సర్వతో విద్వద్భిః కృతాహ్వానః (హవిషా)

సద్విద్యాదానాఽఽదానేన (శర్ధమానః) సహమానః (పురన్దరః) యో రిపుపురాణి దృణాతి సః (గోత్రభిత్) యో గోత్రం మేఘం భినత్తి సః (వజ్రబాహుః) వజ్రహస్తః (ఆ) (యాతు) ఆగచ్ఛతు (యజ్ఞమ్) (ఉప) (నః) (జుషాణః) ప్రీతః సన్.॥38॥

అన్వయః:-హే విద్వన్! యథా హరివాన్ వజ్రబాహుః పురన్దరః సేనేశో గోత్రభిత్సూర్యో రసానివ స్వసేనాం సేవతే తథా దేవైరీడితోఽభిష్టిరాజుహ్వానో హవిషా శర్ధమానో జుషాణో భవాన్నో యజ్ఞముపాయాతు.॥38॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా సేనాపతిః సేనాం సూర్యో మేఘం చ వర్ధయిత్వా సర్వం జగద్రక్షతి తథా ధార్మికైరధ్యాపకైరధ్యేతృభిః సహాఽధ్యాపనాధ్యయనే కృత్వా విద్యయా సర్వప్రాణినో రక్షణీయాః. ॥38॥

పదార్థము :-ఓ విద్వాంసుడా! నీ వెట్లు (హరివాన్) ఉత్తమాశ్వములు గలవాడవు (వజ్రబాహుః) హస్తములందు వజ్రమును ధరించినవాడవు (పురన్దరః) శత్రురాజ్యములను విదీర్ణమొనర్చు సేనాపతివి (గోత్రభిత్) మేఘములను దొలగించు సూర్యుడు రసముల సేవించునట్లు స్వంతసైన్యముల సేవించువాడవు (దేవైః) విద్వాంసులచే (ఈడితః) ప్రశంసితుడవు (అభిష్టిః) అన్నివైపులనుండి యజ్ఞముల నొనర్చువాడవు (ఆజుహ్వానః) విద్వాంసులచే సత్కార పూర్వకముగా బిలువబడిన (హవిషా) సద్విద్యాదానము మరియు గ్రహణముద్వారా (శర్ధమానః) ఓరిమిగల (జుషాణః) ప్రసన్నతగల నీవు (నః) మాయొక్క (యజ్ఞమ్) యజ్ఞమున (ఉప, ఆ, యాతు) శ్రేష్ఠరూపమున పొందుము.॥38॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగా సేనాపతి సైన్యమును, సూర్యుడు మేఘములను పెంపొందించి సర్వజగత్తును రక్షించునో, అదేవిధముగ ధార్మికులగు అధ్యాపకులు అధ్యయన పరులను చదువుట, చదివించుటద్వారా విద్యచే సకల ప్రాణుల రక్షణయొనర్చవలయును.॥38॥

38.O Commander of the army may thou approach our sacrifice (yajna) rejoicing. Thou art lauded by the learned, lord of bay steeds, the performer of sacrifice, invited by the wise, advancest with giving and receiving knowledge. Fort - render, enjoyer of thy soldiers as the sun enjoys after rending asunder the cloud, and Thunder-wielder art thou!.

౧౧౬౦.జుషాణ ఇత్యస్యాఙ్గిరస ఋషిః, ఇంద్రో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః,ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమునే చెప్పెను.

౧౧౬౦ జుషాణో బర్హిర్హరివాన్నఽ ఇన్ద్రః ప్రాచీనꣳ సీదత్ప్రదిశా పృథివ్యాః।

ఉరుప్రథాః ప్రథమానꣳ స్యోనమాదిత్యైరక్తం వసుభిః సజోషాః॥39॥

ప.వి:-జుషాణః, బర్హిః, హరివానితి హరి + వాన్, నః, ఇన్ద్రః, ప్రాచీనమ్, సీదత్, ప్రదిశేతి ప్ర + దిశా, పృథివ్యాః, ఉరుప్రథా ఇత్యురు + ప్రథాః, ప్రథమానమ్, స్యోనమ్, ఆదిత్త్యైః, అక్తమ్, వసుభిరితి వసు + భిః, సజోషా ఇతి స + జోషాః.॥౩౯॥

పదార్థః:-(జుషాణః) సేవమానః (బర్హిః) అన్తరిక్షమ్. బర్హిరిత్యన్తరిక్షనా... నిఘం ౧.౩ (హరివాన్) బహవో హరయో హరణశీలాః కిరణా విద్యన్తే యస్య సః (నః) అస్మాకమ్ (ఇన్ద్రః) జలానాం ధర్తా (ప్రాచీనమ్) ప్రాక్తనమ్ (సీదత్) సీదతి (ప్రదిశా) ఉపదిశా (పృథివ్యాః) భూమేః (ఉరుప్రథాః) బహువిస్తారః (ప్రథమానమ్) (స్యోనమ్) సుఖకారకం స్థానమ్ (ఆదిత్త్యైః) మాసైః (అక్తమ్) ప్రసిద్ధమ్ (వసుభిః) పృథివ్యాదిభిః (సజోషాః) సహ వర్తమానః. ॥౩౯॥

అన్వయః:-హే విద్వన్! యథా బర్హిర్జుషాణో హరివాన్ ఉరుప్రథా ఆదిత్త్యైర్వసుభిః సజోషా ఇన్ద్రః పృథివ్యాః ప్రదిశా ప్రథమానమక్తం ప్రాచీనం స్యోనం సీదత్ తథా త్వం నోఽస్మాకం మధ్యే భవ.॥౩౯॥

భావార్థః:-మనుష్యైరహర్నిశం ప్రయత్నాదాదిత్యవదవిద్యాన్ధకారం నివార్య జగతి మహత్సుఖం కార్యం యథా పృథివ్యాః సకాశాత్ సూర్యో మహాన్వర్తతే తథాఽవిదుషాం మధ్యే విద్వానితి బోధ్యమ్.॥౩౯॥

పదార్థము :-విద్వాంసుడా! ఎట్లు (బర్హిః) అంతరిక్షమును (జుషాణః) సేవించుచు (హరివాన్) హరణశీలమగు అనేక కిరణములు గల (ఉరుప్రథాః) అధికవిస్తారవంతుడు (ఆదిత్త్యైః) మాసముల మరియు (వసుభిః) పృథివి మున్నగు లోకముల (సజోషాః) తో బాటు ఉన్నట్టి (ఇన్ద్రః) జలముల ధారణకర్తయగు సూర్యుడు (పృథివ్యాః) పృథివియొక్క (ప్రదిశా) ఉపదిశలతోగూడ (ప్రథమానమ్) విస్తీర్ణము (అక్తమ్) ప్రసిద్ధము (ప్రాచీనమ్) పురాతనము (స్యోనమ్) సుఖకారక స్థానమున (సీదత్) స్థితుడగునట్లు నీవును (నః) మా మధ్యన స్థిరుడవై యుండుము.॥౩౯॥

**భావార్థము** :-మనుష్యులు దివారాత్రములు ప్రయత్నమొనర్చుచు ఆదిత్యునివలె అవిద్యాంధకారమును నివారణమొనర్చి ప్రపంచమునందు గొప్ప సుఖములను పొందవలయును. పృథివికన్న సూర్యుడు మహోన్నతుడై యున్నట్లు అవిద్వాంసులందు విద్వాంసులు మహా గొప్పవారని దెలిసికొనవలయును.॥౩౯॥

39.O learned person, just as the sun, residing in space, full of rays, vast in extent, accompanied by months and worlds like the Earth, stationed in an intermediate quarter

from the Earth, full of expanse, famous and ancient, is occupying is pleasant orbit, so shouldst thou be amongst us!.

౧౧౬౧. ఇన్ద్రమిత్యస్యాఙ్గిరస ఋషిః, ఇంద్రో దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః ప్రకారాన్తరేణోపదేశవిషయమాహ. మరల ప్రకారాంతరముగ ఉపదేశించెను.

౧౧౬౧ ఇన్ద్రం దురః కవష్యో ధావమానా వృషాణం యన్తు జనయః సుపత్నీఃద్వారో దేవీరభితో విశ్రయన్తాం సువీరా వీరం ప్రథమానా మహోభిః॥౪౦॥

ప. విః- ఇన్ద్రం, దురః, కవష్యః, ధావమానాః, వృషాణమ్, యన్తు, జనయః, సుపత్నీరితి సు + పత్నీః, ద్వారః, దేవీః, అభితః, వి, శ్రయన్తామ్, సువీరా, ఇతి సు + వీరాః, వీరమ్, ప్రథమానాః, మహోభిరితి మహః + భిః. ॥౪౦॥

పదార్థః:-(ఇన్ద్రమ్) పరమైశ్వర్యవన్తమ్ (దురః) ద్వారాణి (కవష్యః) శబ్దేసాధవః (ధావమానాః) శీఘ్రం గచ్ఛన్త్యః (వృషాణమ్) అతివీర్యవన్తమ్. (యన్తు) ప్రాప్నువన్తు (జనయః) జనికాః (సుపత్నీః) శోభనాః (ద్వారః) (దేవీః) విద్యాదిగుణైః ప్రకాశమానాః (అభితః) (వి) (శ్రయన్తామ్) (సువీరాః) శోభనాశ్చ వీరాశ్చ తే (వీరమ్) బలవన్తమ్ (ప్రథమానాః) ప్రఖ్యాతాః (మహోభిః) సుపూజితైర్గుణైః. ॥౪౦॥

అన్వయః:- హే మనుష్యాః! యథా కవష్యో వృషాణం వీరమిన్ద్రన్ధావమానాః జనయో దురో యన్తు యథా ప్రథమానాః సువీరా మహోభిర్ద్వారో దేవీః సుపత్నీరభితో విశ్రయన్తాం తథా యూయమప్యాచరత. ॥౪౦॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యత్ర పరస్పరస్య ప్రీత్యా స్వయంవరం వివాహం కుర్వంతి తత్ర మనుష్యాః సదా నన్దన్తి. ॥౪౦॥

పదార్థము :- ఓ మానవులారా! ఏవిధముగ (కవష్యః) మాట్లాడుటలో చతురుడు (వృషాణమ్) అతి పరాక్రమశాలి (ఇన్ద్రమ్) పరమైశ్వర్యశాలి (వీరమ్) వీరునివైపు (ధావమానాః) పరుగెత్తుచు (జనయః) సంతానము నుత్పన్నమొనర్చు మాతృమూర్తులు (దురః) ద్వారములను (యన్తు) చేరునట్లు లేక ఎట్లు (ప్రథమానాః) ప్రఖ్యాతుడు (సువీరాః) అత్యుత్తమవీరవరుడు (మహోభిః) చక్కని పూజనీయ గుణములతో (ద్వారః) ద్వారమువంటి (దేవీః) విద్య మున్నగు శ్రేష్ఠగుణములతో ప్రకాశవంతులగు (సుపత్నీః) ఉత్తమ

మహిళామణులను (అభితః) అన్నివైపులనుండి (వి, శ్రయన్తామ్) విశేషముగా ఆశ్రయించునట్లు మీరును నొనర్పుడు. ॥౪౦॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ వర్ణమున, వర్గమున మరియు దేశమునందు పరస్పర ప్రీతిచే స్వయంవర వివాహములొనర్చబడునో యచ్చట మానవులు సదా ఆనందోత్సాహములచే నుందురు. ॥౪౦॥

40.O people, just as glib-tongued, chil-bearing ladies moving fast, reach the gates of lustrous, majestic and heroic husbands, and just as reputed, valiant, well-mannered, vigilant husbands, seek from all sides the asylum of wives, advanced in knowledge, so shouldst ye do!.

౧౧౬౨.ఉషాసానక్తేత్యస్యాఙ్గిరస ఋషిః, ఉషాసానక్తా దేవతే, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౧౬౨ ఉషాసానక్తా బృహతీ బృహన్తం పయస్వతీ సుదుఘే శూరమిన్ద్రమ్।

తన్తుం తతం పేశసా సంవయన్తీ దేవానాం దేవం యజతః సురుక్మే ॥౪౧॥

ప. వి:-ఉషాసానక్తా, ఉషసానక్తేత్యుషసా + నక్తా, బృహతీఽఇతి బృహతీ, బృహన్తమ్, పయస్వతీఽఇతి పయస్వతీ, సుదుఘేఽఇతి సుదుఘే, శూరమ్, ఇన్ద్రమ్, తన్తుమ్, తతమ్, పేశసా,సంవయన్తీ ఇతి సమ్ + వయన్తీ, దేవానామ్, దేవమ్, యజతః, సురుక్మే ఇతి సు + రుక్మే. ॥౪౧॥

పదార్థః:-(ఉషాసానక్తా)ఉషాశ్చ నక్తం చ తే(బృహతీ) వర్ధమానే (బృహన్తమ్) మహాన్తమ్ (పయస్వతీ) రాత్ర్యంధకారయుక్తే (సుదుఘే) సుష్ఠుప్రపూరికే (శూరమ్) నిర్భయమ్ (ఇన్ద్రమ్) సూర్యమ్ (తన్తుమ్) విస్తారకమ్ (తతమ్) విస్తృతమ్ (పేశసా) రూపేణ (సంవయన్తీ) ప్రాపయన్త్యౌ. అత్ర సర్వత్ర బృహతీ ఇత్యాదౌ సుపాం సు లుగితి పూర్వసవర్ణదీర్ఘః (దేవానామ్) పృథివ్యాదీనామ్ (దేవమ్) ద్యోతకమ్ (యజతః) సంగచ్ఛేతే (సురుక్మే) సుష్ఠుదీప్యమానే. ॥౪౧॥

అన్వయః:- హే మనుష్యాః! యథా పేశసా సంవయన్తీ పయస్వతీ సుదుఘే బృహతీ సురుక్మే ఉషాసానక్తా తతం దేవానాం దేవం బృహన్తమిన్ద్రం సూర్యం యజతస్తథైవ తన్తుం శూరం పురుషం యూయం సఙ్గచ్ఛధ్వమ్.॥౪౧॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా సర్వే లోకా అఖిలేభ్యో బృహత్తమం సూర్యలోకమాశ్రయన్తి తథైవ సర్వే శ్రేష్ఠతమం పురుషమాశ్రయన్తు.॥౪౧॥

పదార్థము :- ఓ మానవులారా! (పేశసా) రూపముతో (సంవయన్తీ) ప్రాప్తింపజేయునవి (పయస్వతీ) రాత్రియొక్క చీకటితో గూడిన (సుదుఘే) చక్కగా పూర్ణపరచునట్టి (బృహతీ) అభివృద్ధియగునవి (సురుక్మే) చక్కని ప్రకాశముగల (ఉషాసానక్తా) రాత్రింబగళ్లు (తతమ్) విస్తారయుక్తమగు (దేవానామ్) పృథివి మున్నగువాని (దేవమ్) ప్రకాశకమునగు (బృహన్తమ్) మహాగొప్ప (ఇన్ద్రమ్) సూర్యమండలమును (యజతః) సంగతమొనర్చునట్లే (తన్తుమ్) విస్తారమొనర్చునట్టి (శూరమ్) శూర, వీర, పరాక్రమ శాలిని మీరును పొందుడు.॥౪౧॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. సమస్త ప్రజలు సర్వోన్నతమగు సూర్యలోకము నాశ్రయించునట్లు శ్రేష్ఠపురుషు నాశ్రయించవలెను. ॥౪౧॥

41.O people, just as Dawn and Night fair in appearance, coupled with the darkness of night, richly - yielding, with growing light, accompany the sun, long-extended, illuminator of worlds like the Earth, lofty, so should ye keep contact with an expressive heroic person!.

౧౧౬౩.దైవ్యేత్యస్యాఙ్గిరస ఋషిః, దైవ్యాధ్యాపకోపదేశకా దేవతే, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౬౩ దైవ్యా మిమానా మనుషః పురుత్రా హోతారావిన్ద్రం ప్రథమా సువాచా।
మూర్ధన్యజ్ఞస్య మధునా దధానా ప్రాచీనం జ్యోతిర్హవిషా వృధాతః॥౪౨॥

ప.వి:-దైవ్యా, మిమానా, మనుషః, పురుత్రేతి పురు + త్రా, హోతారౌ, ఇన్ద్రమ్, ప్రథమా, సువాచేతి సు + వాచా, మూర్ధన్, యజ్ఞస్య, మధునా, దధానా, ప్రాచీనమ్, జ్యోతిః, హవిషా, వృధాతః.॥౪౨॥

పదార్థః:-(దైవ్యా) దేవేషు భవౌ (మిమానా) నిర్మాతారౌ (మనుషః) మనుష్యాన్ (పురుత్రా) బహూన్ (హోతారౌ) దాతారౌ (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (ప్రథమా) ఆదిమౌ విద్వాంసౌ (సువాచా) సుశిక్షితా వాగ్యయోస్తౌ (మూర్ధన్) మూర్ధని (యజ్ఞస్య) సంగంతవ్యస్య (మధునా) మధురేణ (దధానా) ధరన్తౌ (ప్రాచీనమ్) పురాతనమ్ (జ్యోతిః) ప్రకాశమ్ (హవిషా) హోతవ్యేన ద్రవ్యేణ (వృధాతః) వర్ధేతామ్. అత్ర లేటి వికరణవ్యత్యయేన శః పరస్మైపదం చ. ॥ ౪౨ ॥

అన్వయః:-యౌ దైవ్యా మిమానా హోతారౌ సువాచా యజ్ఞస్య మూర్ధన్ ప్రథమా వర్తమానౌ పురుత్రా మనుషో దధానా మధునా హవిషా ప్రాచీనం జ్యోతిరిన్ద్రం వృధాతస్తౌ సర్వైర్మనుష్యైః సత్కర్తవ్యౌ.॥౪౨ ॥

భావార్థః:-యే విద్వాంసోఽధ్యాపనోపదేశాభ్యాం సర్వాన్ మనుష్యానున్నయన్తి తేఽఖిలజనసుభూషకాః సన్తి. ॥౪౨॥

పదార్థము :-(దైవ్యా) దివ్యపదార్థములు మరియు విద్వాంసులందు గలిగిన(మిమానా) నిర్మాణమొనర్చునట్టి (హోతారౌ) దాతలు (సువాచా) ఉత్తమ శిక్షితవాణులు గల విద్వాంసులు (యజ్ఞస్య) సాంగత్యమొనర్పదగిన వ్యవహారముల (మూర్ధన్) పైన (ప్రథమా) మొదటనున్న (పురుత్రా) అధికులగు (మనుషః) మనుష్యులను (దధానా) ధారణమొనర్చుచు (మధునా) మధురాది గుణముల యుక్తను (హవిషా) హోమమొనర్పదగిన పదార్థములచే (ప్రాచీనమ్) పురాతన (జ్యోతిః) ప్రకాశను మరియు (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమును (వృధాతః) వృద్ధిపరచువారే సత్కరించదగినవారు. ॥౪౨॥

**భావార్థము** :-ఏ విద్వాంసుడు చదివించుట, ఉపదేశించుటద్వారా సర్వజనుల నున్నతి నొందించునో ఆతడు మానవులెల్లరను సుభూషితులనొనర్చువా డగుచున్నాడు. ॥౪౨॥

42.Teacher and Preacher, companions of the learned, good organisers, charitabe, pleasant-voiced, first to officiate on a yajna, leaders of multitude of people, who with sweet oblation increase the ancient light and glory, are fit to be adored by all.

౧౧౬౪.తిస్రో దేవీరిత్యస్యాఙ్గిరస ఋషిః,తిస్రో దేవ్యో దేవతాః, త్రిష్టుప్ ఛన్దః,ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౧౬౪ తిస్రో దేవీర్హవిషా వర్ధమానా ఇన్ద్రం జుషాణా జనయో న పత్నీః।

అచ్ఛిన్నం తన్తుం పయసా సరస్వతీడా దేవీ భారతీ విశ్వతూర్తిః॥౪౩॥

ప.విః-తి॒స్రః, దే॒వీః, హ॒విషా, వర్ధమానాః, ఇన్ద్రమ్, జు॒షా॒ణాః, జనయః, న, పత్నీః, అచ్ఛిన్నమ్, తన్తుమ్, పయసా, సరస్వతీ, ఇడా, దేవీ, భారతీ, వి॒శ్వతూర్తి॒రితి వి॒శ్వ + తూర్తిః.॥౪౩॥

పదార్థః:-(తిస్రః) త్రిత్వసంఖ్యాకాః (దేవీః) దేదీప్యమానాః (హవిషా) దానాఽఽదానేన ప్రాణేన వా (వర్ధమానాః) (ఇన్ద్రమ్) విద్యుతమ్ (జుషాణాః) సేవమానాః (జనయః) జనిత్ర్యః (న) ఇవ (పత్నీః) స్త్రియః (అచ్ఛిన్నమ్) ఛేదభేదరహితమ్ (తన్తుమ్) విస్తీర్ణమ్ (పయసా) శబ్దార్థసంబంధరసేన (సరస్వతీ) ప్రశస్తవిజ్ఞానవతీ (ఇడా) శుభైర్గుణైః స్తోతుం యోగ్యా (దేవీ) దేదీప్యమానా (భారతీ) ధారణపోషణకర్త్రీ (విశ్వతూర్తిః) విశ్వస్మిన్ త్వరమాణా.॥౪౩॥

అన్వయః:-హే మనుష్యాః! యా విశ్వతూర్తిర్దేవీ సరస్వతీడా భారతీ చ తిస్రో దేవీర్దేవ్యః పయసా హవిషా వర్ధమానా జనయః పత్నీర్నేవాఽచ్ఛిన్నం తన్తుమిన్ద్రం జుషాణాః సన్తి తా యూయం సేవధ్వమ్.॥౪౩॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యా విద్వత్సంయుక్తా వాఙ్నాడీధారణశక్తయస్త్రివిధాః సర్వాభివ్యాప్తాః సర్వదా ప్రసూతా వ్యవహారహేతవః సన్తి తా మనుష్యైర్వ్యవహారేషు యథావత్సంయోక్తవ్యా. ॥౪౩॥

పదార్థము :-ఓ మానవులారా! ఏ (విశ్వతూర్తిః) జగమునందు శీఘ్రత్వమొనర్చునట్టి (దేవీ) ప్రకాశవంతమగు (సరస్వతీ) ఉత్తమ విజ్ఞానవంతురాలు లేక (ఇడా) శుభగుణములచే స్తుతించదగిన మరియు (భారతీ) ధారణ, పోషణముల నొనర్చునట్టి ఈ (తిస్రః) ముల్వురు (దేవీః) ప్రకాశవంతమగు శక్తులు (పయసా) శబ్దము, అర్థము, సంబంధరూప రసములచే (హవిషా) ఇచ్చిపుచ్చుకొను వ్యవహారము మరియు ప్రాణములతో (వర్ధమానా) వృద్ధియగుచు (జనయః) సంతానోత్పత్తి నొనర్చు (పత్నీః) మహిళల (న) వంటి (అచ్ఛిన్నమ్) ఛేదన భేదనములు [పొరపొచ్చములు] లేని (తన్తుమ్) విస్తారవంతమగు (ఇన్ద్రమ్) విద్యుత్తును (జుషాణాః) సేవించువారిని మీరును సేవించుడు.॥౪౩॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. విద్వాంసులతో గూడిన వాణి, నాడి, ధారణము నొనర్చుశక్తి ఈ ముల్విధములగు శక్తులు సర్వత్ర వ్యాప్తములు, సర్వదా ఉత్పన్నమైన వ్యవహారములకు హేతువులై యున్నవి. వీనిని మనుష్యులు తమ వ్యవహారములందు యథావతుగ ఉపయోగించు కొనవలయును.॥౪౩॥

43.Vidya Sabha, Dharma Sabha and Rajya Sabha, all three bent on speedily solving problems, well-qualified and duly constituted, thriving through knowledge and authority, like wedded dames, taking charge of State's administration, with prowers, skill and affluence, preserve the government like the unbroken thread of progeny.

౧౧౬౫. త్వష్టేత్యస్యాఙ్గిరస ఋషిః, త్వష్టా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్విద్వద్విషయమాహ. మరల విద్వజ్జనుల విషయమే.

౧౧౬౫ త్వష్టా దధచ్ఛుష్మమిన్ద్రాయ వృష్ణేఽపాకోఽచిష్టుర్యశసే పురూణి।

వృషా యజన్వృషణం భూరిరేతా మూర్ధన్యజ్ఞస్య సమనక్తు దేవాన్ ॥౪౪॥

ప.వి:-త్వష్టా, దధత్, శుష్మమ్, ఇన్ద్రాయ, వృష్ణే, అపాకః, అచిష్టుః, యశసే, పురూణి, వృషా, యజన్, వృషణమ్, భూరిరేతా ఇతి భూరి + రేతాః, మూర్ధన్, యజ్ఞస్య, సమ్, అనక్తు, దేవాన్.॥౪౪॥

పదార్థః:- (త్వష్టా) విద్యుదివ వర్తమానో విద్వాన్ (దధత్) దధన్ (శుష్మమ్) బలమ్ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (వృష్ణే) పరశక్తిబన్ధకాయ (అపాకః) అప్రశస్యః. పాక ఇతి ప్రశస్యనా... నిఘం. 3.౮. (అచిష్టుః) గమనకర్తా (యశసే) కీర్త్యై (పురూణి) బహూని (వృషా) సేక్తా (యజన్) సంగచ్ఛమానః (వృషణమ్) (మేఘమ్ (భూరిరేతాః) బహువీర్యః (మూర్ధన్) మూర్ధని (యజ్ఞస్య) సంగతస్య జగతః (సమ్) (అనక్తు) కామయతామ్ (దేవాన్) విదుషః.॥౪౪॥

అన్వయః:- హే విద్వన్! యథా త్వష్టా వృషేన్ద్రాయ వృష్ణే శుష్మమపాకోఽచిష్టుర్యశసే పురూణి దధద్ భూరిరేతా వృషణం యజన్ యజ్ఞస్య మూర్ధన్ దేవాన్ సమనక్తు తథా త్వమపి కురు.॥౪౪॥

భావార్థః:- యావన్ మనుష్యః శుద్ధాన్తఃకరణో న భవేత్ తావద్విద్వత్సఙ్గ సత్యశాస్త్రప్రాణాయామాభ్యాసం చ కుర్యాద్ యతః శీఘ్రం శుద్ధాన్తఃకరణః స్యాదితి. ॥౪౪॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! ఎట్లు (త్వష్టా) విద్యుత్తువలెనుండు విద్వాంసుడు (వృషా) సేచనకర్త (ఇన్ద్రాయ) పరమైశ్వర్యము (వృష్ణే) మరియు నితరుల సామర్థ్యము నిరోధించుటకొరకు (శుష్మమ్) బలమును

(అపాకః) ప్రశంసించదగిన (అచిష్టః) ప్రాప్తించునట్టి (యశసే) కీర్తికొరకు (పురూణి) అధిక పదార్థములను (దధత్) ధారణ మొనర్చునో (భూరిరేతాః) అత్యంత పరాక్రమవంతమగు (వృషణమ్) మేఘములను (యజన్) సంగతపరచుచు (యజ్ఞస్య) సంగతిద్వారా యుత్పన్నమైన జగత్తుయొక్క (మూర్ధన్) ఉత్తమ భాగమునందు (దేవాన్) విద్వాంసులను (సమనక్తు) కాంక్షించునో అట్లు నీవును ఒనర్చుము.॥౪౪॥

**భావార్థము** :- మానవులు శుద్ధాంతఃకరణము గలవారుగా కావలయును. విద్వాంసుల సాంగత్యము, సత్యశాస్త్రాధ్యయనము, ప్రాణాయామములను అభ్యసించుచుండవలయును. ఇందువల్ల శీఘ్రముగా శుద్ధాంతఃకరణము గలవా రగుదురు.॥౪౪॥

44.O learned person, just as an active scholar, full of vigour, gathers strength for a strong glorious Commander, being most famous, and adored throughout the land, masters various objects for glory, full of vitality, showering happiness like the cloud, acquires full might, and wishes for the sages in a well known place on the earth, so shouldst thou do!.

౧౧౬౬. వనస్పతిరిత్యస్యాఙ్గిరస ఋషిః, వనస్పతిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౬౬ వనస్పతిరవసృష్టో న పాశైస్త్మన్యా సమఞ్జఞ్ఛమితా న దేవః।
ఇన్ద్రస్య హవ్యైర్జఠరం పృణానః స్వదాతి యజ్ఞం మధునా ఘృతేన ॥౪౫॥

**ప. విః**-వనస్పతిః, అవసృష్ట ఇత్యవ + సృష్టః, న, పాశైః, త్మన్యా, సమఞ్జన్నితి సమ్ + అఞ్జన్, శమితా, న, దేవః, ఇన్ద్రస్య, హవ్యైః, జఠరమ్, పృణానః, స్వదాతి, యజ్ఞమ్, మధునా, ఘృతేన.॥౪౫॥

పదార్థః:-(వనస్పతిః) వనస్య వృక్షసమూహస్య పతిః పాలకః (అవసృష్టః) ఆజ్ఞప్తః పురుషః (న) ఇవ (పాశైః) దృఢబంధనైః (త్మన్యా) ఆత్మనా. అత్ర సుపాం సులుగితి టాస్థానే యాదేశః (సమఞ్జన్) సంపృచానః (శమితా) యజ్ఞః (న) ఇవ (దేవః) దివ్యసుఖదాతా (ఇన్ద్రస్య) ఐశ్వర్యస్య (హవ్యైః) అత్తుమర్హైః (జఠరమ్) ఉదరమివ కోశమ్ (పృణానః) పూర్ణం కుర్వన్ (స్వదాతి) ఆస్వదేత. అత్ర లేటి వ్యత్యయేన పరస్మైపదమ్. (యజ్ఞమ్) అనుష్ఠేయమ్ (మధునా) క్షౌద్రేణ (ఘృతేన) ఆజ్యేన.॥౪౫॥

అన్వయః:- యః పాశైర్వనస్పతిరవసృష్టో న త్మన్యా సమఞ్జన్ దేవః శమితా నేన్ద్రస్య జఠరం పృణానో హవ్యైర్మధునా ఘృతేన చ సహ యజ్ఞం కుర్వన్ స్వదాతి స రోగహీనః స్యాత్.॥౪౫॥

భావార్థః:- అత్రోపమాలంకారః. యథా వనస్పతిః వర్ధమానః సన్ ఫలాని దదాతి యథా పాశైర్బద్ధ శ్చోరః పాపాన్నివర్తతే యథా వా యజ్ఞః సర్వం జగద్రక్షతి తథా యజ్ఞసేవీ యుక్తా ఉహారవిహారీ జనో జగదుపకారకో భవతి.॥౪౫॥

పదార్థము :-(పాశైః) ఎవడు గట్టి బంధనములతో (వనస్పతిః) వృక్షసమూహములను పాలనమొనర్చువాడు (అవసృష్టః) ఆజ్ఞాపించినవాని (న) వలె (త్మన్యా) ఆత్మతో (సమఞ్జన్) సంపర్కమొనర్చుచు (దేవః) దివ్యసుఖములనిచ్చు (శమితా) యజ్ఞము (న) వలె (ఇన్ద్రస్య) ఐశ్వర్యముయొక్క (జఠరమ్) ఉదరమువంటి కోశమును (పృణానః) పూర్ణపరచుచు (హవ్యైః) భుజించదగిన (మధునా) తేనె మరియు (ఘృతేన) ఘృతము మున్నగు పదార్థములచే (యజ్ఞమ్) అనుష్ఠించదగిన యజ్ఞమునొనర్చుచు (స్వదాతి) ఉత్తమ రీతిలో సేవించునో వాడు రోగరహితుడగును.॥౪౫॥

భావార్థము :-ఈ మంత్రమునం దుపమాలంకారము గలదు. ఏవిధముగా మఱ్ఱి మున్నగు వనస్పతులు వృద్ధియగుచు ఫలములనిచ్చునో, బంధనములచే బంధించబడిన చోరుడు ఎట్లు పాపములనుండి నివృత్తుడగునో, మరియు నేవిధముగా యజ్ఞము సకల జగమును రక్షించునో, అదేవిధముగ యజ్ఞకర్త యుక్తాహార విహారాదుం నొనర్చుచుండినచో మానవలోకమున కుపకారమొనర్చువాడగును.॥౪౫॥

45.He, who rears the trees by erecting strong barriers round them, creating contact with the soul, like one under orders, conduces to our happiness, fills the treasure of fame, as one fills the belly with sacrifice, performs sacrifice with edible objects like honey and butter, and tastes them well, remains immune from disease.

౧౧౬౭. స్తోకానామిత్యస్యాఙ్గిరస ఋషిః, స్వాహాకృతయో దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౬౭ స్తోకానామిన్దుం ప్రతి శూర ఇన్ద్రో వృషాయమాణో

వృషభస్తురాషాట్ ఘృతప్రుషా మనసా మోదమానాః

స్వాహా దేవా అమృతా మాదయన్తామ్ ॥౪౬॥

ప.వి:-స్తోకానామ్, ఇన్దుమ్, ప్రతి, శూరః, ఇన్ద్రః, వృషాయమాణః, వృషయమాణ ఇతి

వృషయ + మాణః, వృషభః, తురాషాట్, ఘృతప్రుషేతి ఘృత+ ప్రుషా, మనసా, మోదమానాః, స్వాహా, దేవాః, అమృతాః, మాదయన్తామ్.॥౪౬॥

పదార్థః:-(స్తోకానామ్) అల్పానామ్ (ఇన్దుమ్) ఆర్ద్రస్వభావినం జనమ్ (ప్రతి) (శూరః) శత్రూణాం హింసకః (ఇన్ద్రః) ఐశ్వర్యవాన్ (వృషాయమాణః) బలిష్ఠః సన్ (వృషభః) ఉత్తమః (తురాషాట్) తురాన్ హింసకాన్ సహతే (ఘృతప్రుషా) ప్రకాశసేవినా (మనసా) విజ్ఞానేన (మోదమానాః) ఆనన్దితాః సన్తః (స్వాహా) సత్యయా క్రియయా (దేవాః) విద్వాంసః (అమృతాః) ఆత్మనా స్వస్వరూపేణ మృత్యురహితాః (మాదయన్తామ్) తృప్తా భూత్వాఽస్మానానన్దయన్తు. ॥౪౬॥

అన్వయః:- యథా వృషాయమాణో వృషభస్తురాషాట్ శూర ఇన్ద్ర స్తోకానామిన్దుం ప్రత్యాఽఽనన్దతి తథా ఘృతప్రుషా మనసా స్వాహా చ మోదమానా అమృతా దేవా మాదయన్తామ్.॥౪౬॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే జనా అల్పగుణమపి జనం దృష్ట్వార్ద్రచిత్తా భవన్తి తే సర్వతః సర్వాన్ సుఖయన్తి.॥౪౬॥

పదార్థము :- ఏవిధముగ (వృషాయమాణాః) బలిష్ఠుడగుచును (వృషభః) ఉత్తమ (తురాషాట్) హింసక శత్రువుల సహించు (శూరః) శూరవీరుడు (ఇన్ద్రః) ఐశ్వర్యశాలి (స్తోకానామ్) కొందరితో ( ఇన్దుమ్) కోమల స్వభావులగు మానవుల (ప్రతి) యెడ ఆనందితుడగుచుండునో, అదేవిధముగ (ఘృతప్రుషా) ప్రకాశమును సేవన మొనరర్చువారు (మనసా) విజ్ఞానముతో మరియు (స్వాహా) సత్యక్రియతో (మోదమానాః) ఆనందితులగుచు (అమృతాః) ఆత్మస్వరూపముచే మృత్యుధర్మరహితులగు (దేవాః) విద్వాంసులు (మాదయన్తామ్) తాము తృప్తిపరులై మమ్మానందపరతురుగాక!॥౪౬॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. అల్పగుణవంతులగువారినైనను ద్వేషించక స్నేహయుక్తులగు విద్వాంసులు అన్నివైపులనుండి సర్వమానవులను సుఖవంతుల నొనర్ప గలరు.॥౪౬॥

46.Just as a strong, exalted, heroic person, overpowers the violent foe, but is pleased with an upright, straight-forward man with little merit, so with brilliant knowledge, and truthful deeds, let the immortal sages, full of joy and contentement contribute to our happiness.

౧౧౬౮. ఆయాత్విత్యస్య వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిక్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ రాజధర్మవిషయమాహ. మజల విషయ మయ్యదియే.

౧౧౬౮ ఆయాత్విన్ద్రోఽవసఽ ఉప నఽ ఇహ స్తుతః సధమాదస్తు శూరః।

వావృధానస్తవిషీర్యస్య పూర్వీర్ద్యౌర్న క్షత్రమభిభూతి పుష్యాత్ ॥౪౭॥

ప.వి:-ఆ, యాతు, ఇన్ద్రః, అవసే, ఉప, నః, ఇహ, స్తుతః, సధమాదితి సధ + మాత్, అస్తు, శూరః, వావృధానః, వవృధానఽ ఇతి వవృధానః, తవిషీః, యస్య, పూర్వీః, ద్యౌః, న, క్షత్రమ్, అభిభూతీత్యభి + భూతి, పుష్యాత్.॥౪౭॥

పదార్థః:-(ఆ)(యాతు) ఆగచ్ఛతు (ఇన్ద్రః) పరమైశ్వర్యధారకః (అవసే) రక్షణాద్యాయ (ఉప) (నః) అస్మాన్. (ఇహ) అస్మిన్ కాలే (స్తుతః) ప్రశంసితః (సధమాత్) సమానస్థానాత్ (అస్తు) (శూరః) (వావృధానః) అత్యన్తం వర్ధయమానో జనః (తవిషీః) సేనాః (యస్య) (పూర్వీః) పూర్వైర్విద్వద్భిః సుశిక్షయోత్తమాః కృతాః (ద్యౌః) సూర్యప్రకాశః (న) ఇవ (క్షత్రమ్) రాజ్యమ్ (అభిభూతి) శత్రూణామభిభవకర్త్రీ (పుష్యాత్) పుష్టిఙ్ కుర్యాత్.॥౪౭॥

అన్వయః:-య ఇన్ద్ర ఇహ స్తుతః శూరః పూర్వీస్తవిషీర్వావృధానో యస్యాభిభూతి క్షత్రం ద్యౌర్న వర్తతే యో నః పుష్యాత్ సోఽస్మాకమవస ఉపాయాతు సధమాదస్తు.॥౪౭॥

భావార్థః:-యే మనుష్యాః సూర్యవత్ న్యాయవిద్యోభయప్రకాశకాః సత్కృతహృష్టపుష్టసేనాః ప్రజాపోషకా దుష్టవినాశకాః స్యుస్తే రాజ్యాధికారిణః సన్తు.॥౪౭॥

పదార్థము :- ఎవడు (ఇన్ద్ర) పరమైశ్వర్యముల ధారణమొనర్చినవాడో (ఇహ) ఈ వర్తమానకాలమునందు (స్తుతః) ప్రశంసించబడినవాడో (శూరః) నిర్భయవీరుడో (పూర్వీః) పూర్వవిద్వాంసులచే సుశిక్షణనొంది ఉత్తమునిగా నొనర్పబడినవాడో (తవిషీః) సైన్యములను (వావృధానః) అపారముగ వృద్ధిపరచునో (యస్య) ఎవడు (అభిభూతి) శత్రు తిరస్కారమొనర్చువాడో (క్షత్రమ్) ఎవని రాజ్యము (ద్యౌః) సూర్యప్రకాశము (న) వలె తేజరిల్లుచున్నదో, ఎవడు (నః) మమ్ము (పుష్యాత్) పుష్టిపరచునో, యాతడు మాకు (అవసే) రక్షణ మున్నగువానికొరకై (ఉప, ఆ, యాతు) సమీపమందే ప్రాప్తించుగాక! మరియు (సధమాత్) సమానస్థానస్థుడు (అస్తు) అగుగాక! ॥౪౭॥

**భావార్థము** :- ఏ మానవులు సూర్యునివలె విద్య, న్యాయము రెండింటిని ప్రకాశపరచువారో, సత్కృతులై

**భావార్థము** :- విద్వాంసులు చదివించి, ఉపదేశించి ఎల్లరను దుష్టకర్మలనుండి దొలగించి శుభకర్మలందు ప్రవృత్తపరతురు. కావున అట్టి విద్వాంసుల నెల్లరును సదా రక్షించుచుండవలయును. ॥౭౪॥

74.May both teacher and preacher, fair of form, rolling in wealth, an educated wife, possessing serviceable objects, and thou a learned fellow, help us in all our acts.

౧౧౯౬. తాభిషజేత్యస్య విదర్భిర్ఋషిః, అశ్విసరస్వతీన్ద్రా దేవతాః, అనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౧౯౬ తా భిషజా సుకర్మణా సా సుదుఘా సరస్వతీ ।

స వృత్రహా శతక్రతురిన్ద్రాయ దధురిన్ద్రియమ్ ॥౭౫॥

ప.విః-తా, భిషజా, సుకర్మణేతి సు + కర్మణా, సా, సుదుఘేతి సు + దుఘా, సరస్వతీ, సః, వృత్రహేతి వృత్ర + హా శతక్రతుః, ఇన్ద్రాయ, దధుః, ఇన్ద్రియమ్.॥౭౫॥

పదార్థః:- (తా) తౌ (భిషజా) శరీరాత్మరోగనివారకౌ (సుకర్మణా) సుష్ఠుధర్మ్యయా క్రియయా (సా) (సుదఘా) కామాన్ యా సుష్ఠు దోగ్ధి ప్రపూర్తి సా (సరస్వతీ) పూర్ణవిద్యాయుక్తా (సః) (వృత్రహా) యో వృత్రం మేఘం హన్తి స సూర్యః (శతక్రతుః) అతులప్రజ్ఞః (ఇన్ద్రాయ) ఐశ్వర్యాయ (దధుః) దధ్యాసుః (ఇన్ద్రియమ్) ధనమ్.॥౭౫॥

అన్వయః:-హే మనుష్యాః! యథా తా భిషజా సుకర్మణా సా సుదుఘా సరస్వతీ స వృత్రహేవ శతక్రతు శ్చేన్ద్రాయేన్ద్రియం దధుస్తథా యూయమప్యాచరత.॥౭౫॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. అస్మిఞ్జగతి యథా విద్వాంసః శ్రేష్ఠాచారివత్ప్రయత్య విద్యాధనే సమున్నయన్తి తథా సర్వే మనుష్యాః కుర్యుః.॥౭౫॥

**పదార్థము** :-మానవులారా! ఏవిధముగ (తా) వారు (భిషజా) శారీరిక, ఆత్మిక రోగములను నివారించువారు (సుకర్మణా) ఉత్తమ ధర్మయుక్త క్రియలచే నున్న వైద్యులిరువురు (సా) ఆ (సుదుఘా) ఉత్తమరీతిలో వాంఛలను పూర్ణపరచు (సరస్వతీ) పూర్ణవిద్యావంతురాలు మరియు (సః) అట్టి స్త్రీ (వృత్రహా) మేఘములను నష్టపరచు సూర్యునివలె (శతక్రతుః) అత్యంత బుద్ధిశాలురు (ఇన్ద్రాయ) ఐశ్వర్యముకొరకు (ఇన్ద్రియమ్) ధనములను (దధుః) ధారణమొనర్చుచున్నట్లు మీరును ఆచరించుడు. ॥౭౫॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ప్రపంచమునందలి విద్వాంసులు ఉత్తమాచరణగలవారివలె ప్రయత్నమొనర్చి విద్యాధనముల పెంపొందింప జేయునట్లు మానవులెల్లరును యొనర్చవలయును. ॥౭౫॥

75.May both the healers of the body and soul, righteous in their deeds, an educated woman, who imparts knowledge just as a cow yields milk, and a highly sagacious person, like the sun that tears asunder the cloud, possess riches for the sake of prosperity.

౧౧౯౭. యువమిత్యస్య విదర్భిర్ఋషిః, అశ్వినసరస్వతీన్ద్రా దేవతాః, విరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునః ప్రకారాన్తరేణ విద్వద్విషయమాహ. ప్రకారాంతరముగ విద్వాంసులను గురించి చెప్పెను.

౧౧౯౭ యువꣳ సురామమశ్వినా నముచావాసురే సచా ।

విపిపానాః సరస్వతీన్ద్రం కర్మస్వావత ॥౭౬॥

ప. వి:- యువమ్, సురామమ్, అశ్వినా, నముచౌ, ఆసురే, సచా, విపిపానా ఇతి వి + పిపానాః సరస్వతి, ఇన్ద్రమ్, కర్మస్వితి కర్మ + సు, ఆవత. ॥౭౬॥

పదార్థః:- (యువమ్) యువామ్ (సురామమ్) సుష్ఠు రమ్యమ్ (అశ్వినా) రక్షాదికర్మవ్యాపినౌ (నముచౌ) ప్రవాహేణ నిత్యస్వరూపే (ఆసురే) అసురో మేఘ ఏవ తస్మిన్ (సచా) సమవేతాః (విపిపానాః) వివిధరక్షాదికర్తారః. అత్ర వ్యత్యయేన లుగ్విషయే శ్లురాత్మనేపదం చ బహులం ఛన్దసీతీత్వమ్ (సరస్వతి) యా ప్రశస్తవిజ్ఞానయుక్తా ప్రజా తత్సమ్బుద్ధౌ (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (కర్మసు) (ఆవత) పాలయత.॥ ౭౬ ॥

అన్వయః:- హే అశ్వినా! సచా యువం హే సరస్వతి త్వం చ యథా నముచావాసురే కర్మసు సురామ మిన్ద్రమావత తథా విపిపానా అప్యాచరత.॥ ౭౬ ॥

భావార్థః:- యే పురుషార్థేన మహదైశ్వర్యం ప్రాప్య ధనం సురక్ష్యాऽన్నం భుఞ్జతే తే సదైవ వర్ధన్తే.॥౭౬॥

పదార్థము :- (అశ్వినా) పాలనాది కర్మలనొనర్చు అధ్యాపకోపదేశకులారా! (సచా) కలసియుండు (యువమ్) మీ రిరువురు మరియు (సరస్వతి) అతిశ్రేష్ఠ విజ్ఞానవంతులగు ప్రజలారా! మీరెట్లు (నముచౌ) ప్రవాహముచే నిత్యరూపమగు (ఆసురే) మేఘములందు మరియు (కర్మసు)కర్మలందు (సురామమ్)అతి సుందరమగు (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమును (ఆవత) పాలనమొనర్తురో, అట్లే (విపిపానాః) నానావిధముల రక్షణయొనర్చువారలై ఆచరించుడు.॥౭౬॥

భావార్థము :- పురుషార్థముద్వారా గొప్ప ఐశ్వర్యమును పొంది ధనమును రక్షించుచు ఆనందము ననుభవించువారు సదా వృద్ధియగుచుందురు.॥౭౬॥

76.O teacher and preacher, ye both co-operating together, and learned subjects, like the uniterrupted eternal cloud, behave most beautifully in sovereign deeds, and so act as our protectors in diverse ways!.

౧౧౯౦.పుత్రమిత్రస్య విదర్భిరృషిః, అశ్వినసరస్వతీన్ద్రా దేవతాః, భురిక్పఙ్క్తిశ్ఛన్దః, గాంధారః స్వరః.

పునః ప్రకారాంతరేణ విద్వద్విషయమాహ. మరల ప్రకారాంతరముగ విద్వాంసులను గురించి చెప్పెను.

౧౧౯౦ పుత్రమివ పితరావశ్వినోభేన్ద్రావథుః కావ్యైర్దంసనాభిః।

యత్సురామం వ్యపిబః శచీభిః సరస్వతీ త్వా మఘవన్నభిష్ణక్ ॥౭౭॥

ప.విః-పుత్రమివేతి పుత్రమ్ + ఇవ, పితరౌ, అశ్వినా, ఉభా, ఇన్ద్ర, ఆవథుః, కావ్యైః, దంసనాభిః, యత్ సురామమ్, వి, అపిబః, శచీభిః, సరస్వతీ, త్వా, మఘవన్నితి మఘ + వన్, అభిష్ణక్.॥౭౭॥

పదార్థః:-(పుత్రమివ) (పితరౌ) (అశ్వినౌ) అధ్యాపకోపదేశకౌ (ఉభా) (ఇన్ద్ర) విద్యైశ్వర్యయుక్త విద్వన్ (ఆవథుః) రక్షతామ్. పురుషవ్యత్యయః (కావ్యైః) కవిభిర్నిర్మితైః (దంసనాభిః) కర్మభిః (యత్) (సురామమ్) సుష్ఠు రమన్తే యస్మిన్ తత్ (వి) (అపిబః) పిబేః (శచీభిః) ప్రజ్ఞాభిః (సరస్వతీ) సుశిక్షితా స్త్రీ (త్వా) త్వామ్ (మఘవన్) పూజితధనయుక్త (అభిష్ణక్) ఉపసేవేత. అత్ర భిష్ణజ్ ఉపసేవాయామిత్యస్య కణ్వాదేర్లజి యకో వ్యత్యయేన లుక్.॥౭౭॥

అన్వయః:-హే మఘవన్నిన్ద్ర! త్వం శచీభిర్యత్ సురామం వ్యపిబస్తత్ సరస్వతీ త్వాభిష్ణగుభాశ్వినా కావ్యైర్దంసనాభిః పితరౌ పుత్రమివ త్వావమావథుః.॥౭౭॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా మాతాపితరౌ స్వసన్తానాన్ రక్షిత్వా నిత్యమున్నయేతాం తథాఽధ్యాపకోపదేశకాః శిష్యాన్ సురక్ష్య విద్యయా వర్ధయేయుః.॥౭౭॥

**పదార్థము** :- (మఘవన్) ఉత్తమధనము (ఇన్ద్ర) విద్యాఐశ్వర్యయుక్తుడవగు విద్వాంసుడా! నీవు (శచీభిః) బుద్ధితో (యత్) దేనిచే (సురామమ్) అతిరమణీయమగు మహౌషధీరసమును (వ్యపిబః) త్రాగుదువో దానిచే (సరస్వతీ) ఉత్తమవిద్వాంసురాలు (త్వా) నిన్ను (అభిష్ణక్) సమీపమునుండి సేవించుగాక! (ఉభా) ఇరువురు (అశ్వినా) అధ్యాపకోపదేశకులు (కావ్యైః) కవీశ్వరులొనర్చిన (దంసనాభిః) కర్మలచే సెట్లు

(పితరౌ) మాతాపితరులు (పుత్రమివ) పుత్రులను పాలనమొనర్చుదురో అట్లు నీయొక్క (అవథుః) రక్షణయొనర్తురు గాక! ॥౭౭॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఏవిధముగా తల్లిదండ్రులు తమ సంతానములను రక్షణయొనర్చుచు సదా వృద్ధిపరచుచుందురో, అదేవిధముగా అధ్యాపకులు మరియు ఉపదేశకులు తమ శిష్యుల రక్షణయొనర్చుచు విద్యాభివృద్ధుల నొనర్చవలయును. ॥౭౭॥

77.O learned person, full of wealth, knowledge and affluence, thou wisely drinkest the juice of efficacious medicines, thou art served by thy educated wife, may thou be protected by the teacher and preacher with the works of the poets, just as father and mother rear their son!.

౧౧౯౯. యస్మిన్నిత్యస్య విదర్భిర్ఋషిః, అగ్నిర్దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౧౯౯ యస్మిన్నశ్వాస ఋషభాస ఉక్షణో వశా మేషా అవసృష్టాస

ఆహుతాః। కీలా లపే సోమపృష్ఠాయ వేధసే హృదా మతిం

జనయ చారు మగ్నయే॥౭౮॥

ప.విః- యస్మిన్, అశ్వాసః, ఋషభాసః, ఉక్షణః, వశాః మేషాః, అవసృష్టాస ఇత్యవ + సృష్టాసః, ఆహుతా ఇత్యా+హుతాః, కీలాలప ఇతి కీలాల+ పే, సోమపృష్ఠాయేతి సోమఽపృష్ఠాయ, వేధసే, హృదా, మతిమ్, జనయ, చారుమ్, అగ్నయే. ॥౭౮॥

పదార్థః:- (యస్మిన్) వ్యవహారే (అశ్వాసః) వాజినః (ఋషభాసః) వృషభాః (ఉక్షణః) సేక్తారః (వశాః) బన్ధ్యా గావః (మేషాః) అవయః (అవసృష్టాసః) సుశిక్షితాః (ఆహుతాః) సమన్తాద్గృహీతాః (కీలాలపే) యః కీలాల మన్నరసం పిబతి తస్మై (సోమపృష్ఠాయ) సోమః పృష్ఠో యేన తస్మై (వేధసే) మేధావినే (హృదా) అన్తఃకరణేన (మతిమ్) బుద్ధిమ్ (జనయ) (చారుమ్) శ్రేష్ఠామ్ (అగ్నయే) అగ్నివత్ ప్రకాశమానాయ జనాయ. ॥౭౮॥

అన్వయః:- హే విద్వన్నశ్వాస ఋషభాస ఉక్షణో వశా మేషా అవసృష్టాస ఆహుతాస్సన్తో యస్మిన్ కార్యకరా స్యుస్తస్మిం స్త్వం హృదా సోమపృష్ఠాయ కీలాలపే వేధసేఽగ్నయే చారుం మతిం జనయ. ॥౭౮॥

భావార్థః:- పశవోఽపి సుశిక్షితాస్సన్త ఉత్తమాని కార్యాణి కుర్వన్తి కిం పునర్విద్యాశిక్షా యుక్తా జనాః సర్వాన్యుత్తమాని కార్యాణి సాద్ధుం న శక్నువన్తి?॥౭౮॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! (అశ్వాసః) అశ్వములు మరియు (ఋషభాసః) ఉత్తమమగు ఎద్దులు (ఉక్షణః) అతిబలము గలిగి వీర్యసేచనమొనర్చు ఆబోతులు (వశాః) గొడ్డు ఆవులు మరియు (మేషాః) గొఱ్ఱెపొట్టేళ్లు (అవసృష్టాసః) చక్కగా శిక్షణను పొందిన (ఆహుతాః) అన్నివైపులనుండి గ్రహణమొనర్చబడిన (యస్మిన్) కార్యములొనర్చు వ్యవహారములందు నీవు (హృదా) అంతఃకరణముచే [శ్రద్ధచే, మనస్ఫూర్తిగ] (సోమపృష్ఠాయ) సోమవిద్య నడిగి తెలిసికొను (కీలాలపే) ఉత్తమాన్నరసముల పానమొనర్చు (వేధసే) బుద్ధిశాలుడు (అగ్నయే) అగ్నివలె ప్రకాశమానుడగు వానికొరకు (చారుమ్) అత్యుత్తమ (మతిమ్) బుద్ధిని (జనయ) ప్రకట పరచుము.॥౭౮॥

భావార్థము :- ఉత్తమశిక్షణచే పశువులు సైతము ఉత్తమ కార్యము లొనర్చునపుడు విద్యాశిక్షణచే గూడిన మనుష్యులు సమస్త ఉత్తమకార్యములు సులభముగా, నైపుణ్యముగా జేయగలుగుదురు గదా!॥౭౮॥

78.He, who collects, trains and takes useful service from horses, bulls, oxen, barren cows and rams, is the protector of food grains, is imbued with an amiable disposition, and is a wise, brilliant person, deserves hearty respect.

౧౨౦౦. అహావీత్యస్య విదర్భిర్ఋషిః, అగ్నిర్దేవతా, భురిక్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౨౦౦ అహా॑వ్యగ్నే హ॒వి॒రా॒స్యే తే స్రు॒చీ॑వ ఘృ॒తం చ॒మ్వీ॑వ॒ సోమః॑।

వా॒జ॒స॒నిꣳ ర॒యిమ॒స్మే సు॒వీ॑రం ప్ర॒శ॒స్తం॑ ధేహి య॒శసం॑ బృహ॒న్తమ్॥౭౯॥

ప.విః-అహా॑వి, అ॒గ్నే, హ॒విః, ఆ॒స్యే, తే॒, స్రు॒చీవేతి॑ స్రుచి + ఇ॑వ, ఘృ॒తమ్, చ॒మ్వీ॑వేతి చ॒మ్వి + ఇ॑వ, సో॑మః, వా॒జ॒స॒ని॒మితి వాజ + సనిమ్, ర॒యిమ్, అ॒స్మే ఇత్య॒స్మే, సు॒వీ॒రమితి॑ సు॒ + వీ॑రమ్, ప్ర॒శ॒స్తమితి॑ ప్ర + శ॒స్తమ్, ధే॒హి॒, య॒శ॑సమ్, బృ॒హ॒న్తమ్.॥౭౯॥

పదార్థః:- (అహావి) హూయతే (అగ్నే) విద్వన్ (హవిః) హోతుమర్హమ్ (ఆస్యే) ముఖే (తే) తవ (స్రుచీవ) యథా స్రుగ్ముఖే (ఘృతమ్) ఆజ్యమ్ (చమ్వీవ) యథా చమ్వో యజ్ఞపాత్రే (సోమః) ఐశ్వర్యసమ్పన్నః (వాజసనిమ్) వాజస్య సనిర్విభాగో యస్య తస్మిన్ (రయిమ్) రాజ్యశ్రియమ్ (అస్మే) అస్మాసు (సువీరమ్) శోభనా వీరా యస్మాత్తమ్

(ప్రశస్తమ్) ఉత్కృష్టమ్ (ధేహి) (యశసమ్) కీర్తికరమ్ (బృహన్తమ్) మహాన్తమ్.॥౭౯॥

అన్వయః:-హే అగ్నే విద్వన్! యేన త్వయా సోమో హవిస్త ఆస్యే ఘృతం స్రుచీవ చమ్వీవ హవి రహావి స త్వమస్మే ప్రశస్తం సువీరం వాజసనిం యశసం బృహన్తం రయిం ధేహి.॥౭౯॥

భావార్థః:- అత్రోపమాలంకారః. గృహస్థైస్తేషామేవ భోజనాదినా సత్కారః కర్తవ్యో యేఽధ్యాపనోపదేశను కర్మానుష్ఠానైర్జగతి బలవీర్యకీర్తిధనవిజ్ఞానాని వర్ధయేయుః.॥౭౯॥

పదార్థము :-(అగ్నే) ఉత్తమ విద్వాంసుడా! ఏ నీవు (సోమః)ఐశ్వర్యవంతముగు (హవిః) హోమమొనర్పదగిన వస్తువు (తే) నీయొక్క (ఆస్యే) ముఖమందు (ఘృతమ్ స్రుచీవ) స్రువ [ఘృతాహుతులనీయదగు చిన్నగరిటె, స్రుచ] ముఖమందేవిధముగ ఘృతము మరియు (చమ్వీవ) యజ్ఞపాత్రయందు హోమమొనర్పదగు వస్తువులవలె (అహావి) హోమమొనర్చినట్టి నీవు (అస్మే) మాయందు (ప్రశస్తమ్) మహా ఉత్తమ (సువీరమ్) చక్కని వీరులకుపకరించు మరియు (వాజసనిమ్) అన్నము, విజ్ఞానము మున్నగువాని గుణముల విభాగము (యశసమ్) కీర్తిని గలిగించునదియునగు (బృహన్తమ్) గొప్ప (రయిమ్) రాజ్యలక్ష్మిని (ధేహి) ధారణమొనర్పుము. ॥౭౯॥

భావార్థము:-ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు. విద్యల జదివించుట, ఉపదేశమొనర్పుట, శ్రేష్ఠకర్మల అనుష్ఠానముచే ప్రపంచమునందు బలపరాక్రమ యశోకీర్తులను, ధనాదులు మరియు విజ్ఞానమును వృద్ధిపరచుటకు ప్రయత్నమొనర్చు విద్వాంసులను గృహస్థులు భోజనాదులచే సత్కరించవలెను. ॥౭౯॥

79.O learned person, within thy mouth is poured the offering, as Soma into cup, ghee into ladle.

Vouchsafe us wealth, strength-winning, blest with heroes, and wealth lofty, praised by men, and full of splendour.

౧౨౦౧. అశ్వినేత్యస్య విదర్భిర్‌ఋషిః, అశ్విసరస్వతీంద్రా దేవతాః, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమునే చెప్పెను.

౧౨౦౧ అశ్వినా తేజసా చక్షుః ప్రాణేన సరస్వతీ వీర్యమ్ ।

వాచేన్ద్రో బలేనేన్ద్రాయ దధురిన్ద్రియమ్ ॥౮౦॥

ప.విః-అశ్వినా, తేజసా, చక్షుః, ప్రాణేన, సరస్వతీ, వీర్యమ్, వాచా, ఇన్ద్రః, బలేన, ఇన్ద్రాయ, దధుః, ఇన్ద్రియమ్.॥౮౦॥

పదార్థః:- (అశ్వినా) అధ్యాపకోపదేశకౌ (తేజసా) ప్రకాశేన (చక్షుః) ప్రత్యక్షం చక్షుః (ప్రాణేన) జీవనేన (సరస్వతీ) విద్యావతీ (వీర్యమ్) పరాక్రమమ్ (వాచా) వాణ్యా (ఇన్ద్రః) సభేశః (బలేన) (ఇన్ద్రాయ) జీవాయ (దధుః) ధరేయుః (ఇన్ద్రియమ్) ఇన్ద్రస్య జీవస్య లిఙ్గమ్.॥౮౦॥

అన్వయః:-హే మనుష్యాః! యథా సరస్వతీ అశ్వినేన్ద్రశ్చేన్ద్రాయ ప్రాణేన వీర్యం తేజసా చక్షుర్వాచా బలేనేన్ద్రియం దధుస్తథా ధరన్తు.॥౮౦॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా యథా యథా విద్వత్సంగేన విద్యాం వర్ధయేయు స్తథా తథా విజ్ఞానరుచయః స్యుః.॥౮౦॥

పదార్థము :- ఓ మానవులారా! ఎట్లు (సరస్వతీ) విద్వాంసురాలు (అశ్వినా) అధ్యాపకోపకోపదేశకులు మరియు (ఇన్ద్రః) సభాధిపతి (ఇన్ద్రాయ) జీవులకొరకు (ప్రాణేన) జీవనముతోగూడ (వీర్యమ్) పరాక్రమము మరియు (తేజసా) ప్రకాశముచే (చక్షుః) ప్రత్యక్షనేత్రములు (వాచా) వాణి మరియు (బలేన) బలముతో (ఇన్ద్రియమ్) జీవచిహ్నమును (దధుః) ధారణమొనర్చెదరో, అట్లు మీరును చేయుడు.॥౮౦॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులెట్లెట్లు విద్వాంసుల సాంగత్యమున విద్యల నభివృద్ధిపరచుకొనెదరో, అట్లట్లే విజ్ఞానమునందును అభిరుచిగలవారు గావలయును.॥౮౦॥

80.Teacher and preacher, an educated lady, the leader of the Assembly give to the soul, sight with lustre, manly strength with breath, vigorous power with voice and might.

౧౨౦౨.గోమధూ షు ణేత్యస్య గృత్సమద ఋషిః, అశ్వినా దేవతే, ఆర్చ్యుష్ణిక్ ఛన్దః, షడ్జః స్వరః.

అథ విద్వద్విషయే పశ్వాదిభిః పాలనావిషయమాహ.

విద్వాంసులవిషయములో పశ్వాదులద్వారా పాలించువిషయమును జెప్పెను.

౧౨౦౨ గోమదూ షు ణాసత్యాశ్వావ ద్యాతమశ్వినా। వర్తీ రుద్రా నృపాయ్యమ్ ॥౮౧॥

ప.వి:-గోమదితి గో + మత్, ఊం ఇత్యూం, సు, నాసత్యా,అశ్వావత్, అశ్వవదితి అశ్వ + వత్, యాతమ్, అశ్వినా, వర్తిః, రుద్రా, నృపాయ్యమితి నృ + పాయ్యమ్. ॥౮౧॥

పదార్థః:-(గోమత్) గావో విద్యన్తే యస్మింస్తత్ (ఉ) వితర్కే (సు) (నాసత్యా) సత్యవ్యవహారయుక్తౌ (అశ్వావత్) ప్రశస్తతురఙ్గయుక్తమ్. అత్ర సోమాశ్వేన్ద్రియ ... ఇతి దీర్ఘః

(యాతమ్) ప్రాప్నుతమ్ (అశ్వినా) విద్యావృద్ధౌ (వర్తిః) వర్తమానం మార్గమ్ (రుద్రా) దుష్టానాం రోదయితారౌ (నృపాయ్యమ్) నృణాం పాయ్యం మానమ్.॥౮౧॥

అన్వయః:-హే నాసత్యా రుద్రాశ్వినా! యథా యువాం గోమద్వర్తి రుద్రా అశ్వావన్నృపాయ్యం సుయాతం తథా వయమపి ప్రాప్నుయామ.॥౮౧॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. గోఽశ్వహస్తిప్రభృతిభిః పాలితైః పశుభిః స్వకీయమన్యదీయం చ పాలనం మనుష్యైః కార్యమ్.॥౮౧॥

పదార్థము :- (నాసత్యా) సత్యవ్యవహారవంతులారా! (రుద్రా) దుష్టులనేడ్పించువారలారా! (అశ్వినా) విద్యోన్నతులగు మీరెట్లు (గోమత్) గోవులున్నట్టి యా (వర్తిః) నడకయందున్నమార్గమును (ఉ) మరియు (అశ్వావత్) ఉత్తమాశ్వములతో గూడ (నృపాయ్యమ్) మానవుల మాన్యతలను (సుయాతమ్) చక్కగా పొందుదురో అట్లు మేమును ప్రాప్తించుకొందుముగాక!॥౮౧॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. గోవులు, అశ్వములు, ఏనుగులు, మేకలు మున్నగు పెంపుడు జంతువులచే స్వంత మరియు ఇతర మనుష్యుల పాలనమొనర్పవలయును.॥౮౧॥

81.O highly educated people,wedded to truth,chastisers of the wicked,equipped with horses and pasture-land for cows,just as ye command respest from men,so should we!.

౧౨౦౩.న యదిత్యస్య గృత్సమద ఋషిః, అశ్వినౌ దేవతే, విరాడ్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ రాజధర్మవిషయమాహ. రాజధర్మ విషయము.

౧౨౦౩ న యత్పరో నాన్తరఽఆదధర్షద్వృషణ్వసూ।దుఃశꣳసో మర్త్యో రిపుః ॥౮౨॥

ప.విః-న, యత్, పరః, న, అన్తరః, ఆదధర్షదిత్యా + దధర్షత్, వృషణ్వఽసూ ఇతి వృషన్ + వసూ, దుఃశꣳస ఇతి దుఃశꣳసః, మర్త్యః, రిపుః.॥౮౨॥

పదార్థః:-(న) (యత్) యస్మాత్ (పరః) (న) (అన్తరః) మధ్యస్థః (ఆదధర్షత్) ఆదధర్షిత్వమన్తాద్ ధృష్ణుయాత్ (వృష్వసూ) యౌ వృష్ణౌ వాసయతస్తౌ (దుఃశంసః) దుఃఖేన శాసితుం యోగ్యః (మర్త్యః) మనుష్యః (రిపుః) శత్రుః.॥౮౨॥

అన్వయః:- హే వృషణ్వసూ సభాసేనేశౌ!యువాం యత్ యస్మా ద్దుః శంసః పరో మర్త్యో రిపుర్న స్యాత్ నాన్తరశ్చ యోఽస్మానాదధర్షత్ తం పయత్నతో వశం నయతమ్.॥౮౨॥

భావార్థః:-రాజపురుషైర్యైః ప్రబలో దుష్టతమః శత్రుర్భవేత్స ప్రయత్నేన విజేతవ్యః.॥౮౨॥

**పదార్థము** :-(వృషణ్వసూ) శ్రేష్ఠులు నివసింపజేయు సభ మరియు సేనాపతులారా మీరు (యత్) దేనివల్ల (దుఃశంసః) దుఃఖముచే స్తుతింపదగిన (పరః) అన్య (మర్త్యః) మనుష్యులెవరును (రిపుః) శత్రువులు (న) కాకుండునట్లు (న అన్తరః) మధ్యస్థుడుగాకుండునట్లు (ఆదధర్షత్) మమ్మన్నివైపులనుండి తిరస్కరించువారిని మంచి ప్రయత్నముచే వశమొనర్చజేయుడు.॥౮౨॥

**భావార్థము** :-అతిబలవంతుడు, అత్యంత దుష్టుడునగు శత్రువును రాజపురుషులు అతిప్రయత్నమొనర్చి లోబరచుకొనవలయును.॥౮౨॥

82.O head of the State and Chief of the Staff administer the State in a way that no internal or external malicious mortal foe be able to harm it!.

౧౨౦౪.తా న ఇత్యస్య గృత్సమద ఋషిః, అశ్వినౌ దేవతే, నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౨౦౪ తా న॒ఽఆ వో॑ఢమశ్వినా ర॒యిం పి॒శఙ్గస॑న్దృశమ్।ధిష్ణ్యా॑ వరి॒వో॑విదమ్ ॥౮౩॥

ప.విః-తా, న॒ః, ఆ, వో॑ఢ॒మ్, అ॒శ్వి॒నా॒, ర॒యిమ్, పి॒శఙ్గస॑న్దృ॒శమితి పి॒శఙ్గ + సందృశమ్, ధిష్ణ్యా॑, వ॒రి॒వో॑ వి॒దమితి వరివ॒ః + విదమ్.॥౮౩॥

పదార్థః:- (తా) తౌ (నః) అస్మాన్ (ఆ) (వోఢమ్) వహతమ్ (అశ్వినా) సభాసేనేశౌ (రయిమ్) ధనమ్ (పిశఙ్గసందృశమ్) యః పిశఙ్గవత్సువర్ణవత్సమ్యగ్ దృశ్యతే సః (ధిష్ణ్యౌ) ధిషణయా ధియా (వరివోవిదమ్) యేన వరివః పరిచరణం విన్దన్తి తమ్.॥౮౩॥

అన్వయః:-హేఽశ్వినా ధిష్ణ్యౌ తా యువాం నో వరివోవిదం పిశఙ్గసందృశం రయిమావోఢమ్.॥౮౩॥

భావార్థః:-సభాసేనేశౌ రాజ్యసుఖాయ సర్వమైశ్వర్యం సంపాదనీయం యేన సత్యధర్మాచరణం వర్ధేత.॥౮౩॥

**పదార్థము** :- (అశ్వినా) సభా మరియు సైన్యపాలనమందు (ధిష్ణ్యౌ) బుద్ధిగలవారగు (తా) మీరు (నః) మాకు (వరివోవిదమ్) సేవలను ప్రాప్తింపజేయు మరియు (పిశఙ్గ సందృశమ్) సువర్ణమువలె గాన్పించునట్టి ఆ (రయిమ్) ధనమును (ఆ, వోఢమ్) సర్వదిశలనుండి మాకు ప్రాప్తి గలిగించుడు.॥౮౩॥

**భావార్థము** :-రాజ్యసుఖముకొరకు, సత్యధర్మాచరణము పెంపొందుటకు సకలైశ్వర్యములను సాధించుట సభాపతి, సేనాపతుల ముఖ్యకర్తవ్యము.॥౮౩॥

83.O wise Head of the State and Chief of the Staff lead us on to wealth. glittering like gold and highly serviceable!.

౧౨౦౫.పావకా న ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, సరస్వతీ దేవతా, గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.

పునరధ్యాపకోపదేశకవిషయమాహ. అధ్యాపకోపదేశకుల విషయమును జెప్పెను.

౧౨౦౫ పావకా నః సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। యజ్ఞం వష్టు ధియావసుః॥౮౪॥

ప.వి:-పావకా, నః, సరస్వతీ, వాజేభిః, వాజినీవతీతి వాజినీ + వతీ, యజ్ఞమ్, వష్టు, ధియావసు రితి ధియా + వసుః.॥౮౪॥

పదార్థః:-(పావకా) పవిత్రకారికా (నః) అస్మాకమ్ (సరస్వతీ) సుసంస్కృతా వాక్ (వాజేభిః) విజ్ఞానాదిభి ర్గుణైః (వాజినీవతీ) ప్రశస్తవిద్యాయుక్తా (యజ్ఞమ్) (వష్టు) (ధియావసుః) ధియా వసుర్ధనం యస్యాః. తృతీయాయా అలుక్.॥౮౪॥

అన్వయః:-హే అధ్యాపకోపదేశకౌ! యథా వాజేభిర్వాజినీవతీ పావకా ధియావసుః సరస్వతీ నో యజ్ఞం వష్టు తథా యువామస్మాన్ శిక్షేతామ్.॥౮౪॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్ధార్మికాణామధ్యాపకోపదేశకానాం సకాశాత్ విద్యాసుశిక్షే సంగృహ్య విజ్ఞానవృద్ధిర్నిత్యం కార్యా.॥౮౪॥

పదార్థము :- విద్యల గరపు మరియు ఉపదేశించువారలారా! ఎట్లు (వాజేభిః) విజ్ఞానాదిగుణములచే (వాజినీవతీ) చక్కని శ్రేష్ఠవిద్యలతో (పావకా) పవిత్రపరచు (ధియావసుః) బుద్ధితో గూడిన ధనము (సరస్వతీ) ఉత్తమ సంస్కారవంతమగు వాణి (నః) మాయొక్క (యజ్ఞమ్) యజ్ఞమును (వష్టు) శోభింపజేయునట్లు మీరు మాకు ఉత్తమ శిక్షణ నీయుడు.॥౮౪॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ధర్మాత్ములగు అధ్యాపకోపదేశకులచే చక్కని శిక్షణతో గూడిన విద్యలను పొంది సదా విజ్ఞానమును వృద్ధిపరచుట మానవులకు యోగ్యమై యున్నది.॥౮౪॥

84.May vedic speech, our purifier, powerful through the force of diverse forms of knowledge, with wisdom and riches acquired through enterprise, beautify our yajna.

౧౨౦౬.చోదయిత్రీత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, సరస్వతీ దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ స్త్రీశిక్షావిషయమాహ.స్త్రీ శిక్షావిషయమును జెప్పెను.

౧౨౦౬. చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్ । యజ్ఞం దధే సరస్వతీ ।౮౫॥

ప.వి:-చోదయిత్రీ, సూనృతానామ్, చేతన్తీ, సుమతీనామితి సు + మతీనామ్, యజ్ఞమ్, దధే, సరస్వతీ.।౮౫॥

పదార్థః:-(చోదయిత్రీ) ప్రేరయిత్రీ (సూనృతానామ్) సుశిక్షితానాం వాణీనాం (చేతన్తీ) సంజ్ఞాపయన్తీ (సుమతీనామ్) శోభనానాం బుద్ధీనామ్ (యజ్ఞమ్) (దధే) ధరామి (సరస్వతీ) ప్రశస్తవిజ్ఞానయుక్తా.।౮౫॥

అన్వయః:-హే స్త్రియో యథా సూనృతానాం చోదయిత్రీ సుమతీనాం చేతన్తీ సరస్వతీ సత్యహం యజ్ఞం దధే తథాయం యుష్మాభిరప్యనుష్ఠేయః.।౮౫॥

భావార్థః:-యా స్త్రీణాం మధ్యే విదుషీ స్త్రీ స్యాత్సా సర్వాః స్త్రియః సదా సుశిక్షేత యతః స్త్రీణాం మధ్యే విద్యావృద్ధిస్స్యాత్.।౮౫॥

పదార్థము :- మహిళామణులారా! ఎట్లు (సూనృతానామ్) చక్కని శిక్షణను పొందిన వాణులను (చోదయిత్రీ) ప్రేరేపించు (సుమతీనామ్) సద్బుద్ధులకు (చేతన్తీ) చక్కగా జ్ఞాపకమొనర్చుదాన్నై (సరస్వతీ) ఉత్తమ విజ్ఞానవతినగు నేను (యజ్ఞమ్) యజ్ఞమును (దధే) ధారణమొనర్చునట్లే మీరును ఒనర్చుట యోగ్యము. ।౮౫॥

భావార్థము :- స్త్రీలమధ్య విదుషీరత్నమున్నట్లైన సకల స్త్రీలు విద్యాసంతురాం(డ్రగునట్లు సదా చక్కని శిక్షణనిచ్చి విద్యాభివృద్ధి నొనర్చవలెను. ।౮౫॥

85.Vedic text, the impeller of truthful speeches, the inspirer of perceptions, expatiates on God.

౧౨౦౭.మహో అర్ణ ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, సరస్వతీ దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౨౦౭ మహో౨ అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా।ధియో విశ్వా విరాజతి।౮౬॥

ప.వి:-మహః, అర్ణః, సరస్వతీ, ప్ర, చేతయతి, కేతునా, ధియః, విశ్వా,వి,రాజతి.।౮౬॥

పదార్థః:- (మహః) మహత్ (అర్ణః) అన్తరిక్షస్థం శబ్దసముద్రమ్ (సరస్వతీ) వాణీ (ప్ర,చేతయతి) ప్రజ్ఞాపయతి (కేతునా) ప్రజ్ఞానేన (ధియః) బుద్ధయః (విశ్వాః) సర్వాః (వి) (రాజతి) ప్రకాశయతి ॥౮౬॥

అన్వయః:- హే స్త్రియో! యథా సరస్వతీ కేతునా మహో అర్ణః ప్రచేతయతి విశ్వా ధియో విరాజతి తథా విద్యాసు యూయం ప్రవృత్తా భవత.॥౮౬॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. కన్యాభిర్బ్రహ్మచర్యేణ విద్యాసుశిక్షేపూర్ణే సంగృహ్య బుద్ధయో వర్ధయితవ్యాః.॥౮౬॥

**పదార్థము :-** మహిళామణులారా! ఎట్లు (సరస్వతీ) వాణి (కేతునా) ఉత్తమజ్ఞానముచే (మహః) గొప్ప (అర్ణః) ఆకాశమందు స్థిరమైయున్న శబ్దరూప సముద్రమును (ప్ర చేతయతి) ఉత్తమ రీతిలో తెలియజెప్పునో మరియు (విశ్వాః) సకల (ధియః) బుద్ధులను (వి,రాజతి) నానా ప్రకారములుగా ప్రకాశిత మొనర్చునో, అట్లే విద్యలందు మీరును ప్రవృత్తులగుడు.॥౮౬॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. కన్యారత్నములు బ్రహ్మచర్యముతో విద్య మరియు ఉత్తమ శిక్షణను సమగ్రముముగా గ్రహణమొనర్చి తమ బుద్ధులను వృద్ధిపరచుకొనుట యోగ్యము. ॥౮౬॥

86.Vedic text, with its store of knowledge, illuminates the vast ocean of words, and brightens all pius thoughts.

౧౨౦౮.ఇన్ద్రాయాహీత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ సామాన్యోపదేశవిషయమాహ. సామాన్యోపదేశము జెప్పెను.

౧౨౦౮ ఇన్ద్రాయాహి చిత్రభానో సుతాఇమే త్వాయవః।

అణ్వీభిస్తనా పూతాసః ॥౮౭॥

ప.వి:-ఇన్ద్ర, ఆ, యాహి, చిత్రభానో ఇతి చిత్ర + భానో, సుతాః, ఇమే, త్వాయవ ఇతి త్వా + యవః, అణ్వీభిః, తనా, పూతాసః.॥ ౮౭॥

పదార్థః:-(ఇన్ద్ర) సభేశ (ఆ) (యాహి) ఆగచ్ఛ (చిత్ర భానో) చిత్రా భానవో విద్యాప్రకాశా యస్య తత్ సంబుద్ధౌ (సుతాః) నిష్పాదితాః (ఇమే) (త్వాయవః) యే త్వాం యువన్తి మిలన్తి తే(అణ్వీభిః)అఙ్గులీభిః(తనా) విస్తృత గుణేన(పూతాసః)(పవిత్రాః).॥౮౭॥

అన్వయః:-హే చిత్రభానో ఇన్ద్ర! త్వం య ఇమే అణ్వీభిస్సుతాస్తనా పూతాస స్త్వాయవః పదార్థాః సన్తి తానాయాహి.౹౮౭॥

భావార్థః:- మనుష్యైః సత్క్రియయా పదార్థాన్ సంశోధ్య భుఞ్జతామ్.౹౮౭॥

పదార్థము :-(చిత్రభానో) చిత్రవిచిత్ర విద్యాప్రకాశములుగల (ఇన్ద్ర) సభాపతీ! నీవు (ఇమే) ఈ (అణ్వీభిః) అంగుళీయములు [వ్రేళ్ల] తో (సుతా) సిద్ధపరచిన (తనా) విస్తారగుణములతో (పూతాసః) పవిత్రమైన (త్వాయవః) నీకు లభించిన పదార్థములను (ఆ, యాహి) పొందుచుండుము.౹౮౭॥

భావార్థము :-మానవులు చక్కని క్రియలతో పదార్థములను ఉత్తమముగా శుద్ధపరచుకొని భోజనాదుల నొనర్చవలయును. ౹౮౭॥

87.O king, marvellously bright, enjoy these fine objects, full of qualities, prepared and purified by gingers for thee!.

౧౨౯. ఇన్ద్రాయాహి ధియేత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునర్విద్వద్విషయమాహ విద్వద్విషయము.

౧౨౯ ఇన్ద్రాయాహి ధియేషితో విప్రజూతః సుతావతః।

ఉప బ్రహ్మాణి వాఘతః ౹౮౮॥

ప.విః-ఇన్ద్ర, ఆ, యాహి, ధియా, ఇషితః, విప్రజూత ఇతి విప్ర + జూతః, సుతావతః, సుతవత ఇతి సుత + వతః, ఉప, బ్రహ్మాణి, వాఘతః.౹౮౮॥

పదార్థః:-(ఇన్ద్ర) విద్యైశ్వర్యయుక్త (ఆ) (యాహి) (ధియా) ప్రజ్ఞయా (ఇషితః) ప్రేరితః (విప్రజూతః) విప్రైర్మేధావిభిర్జ్ఞాతః శిక్షితః (సుతావతః) నిష్పాదితవతః (ఉప) (బ్రహ్మాణి) అన్నాని ధనాని వా (వాఘతః) యశ్శిక్షయా వాచా హన్తి జానాతి సః.౹౮౮॥

అన్వయః:-హే ఇన్ద్ర! ఇషితో విప్రజూతో వాఘతస్త్వం ధియా సుతావతో బ్రహ్మాణ్యుపాయాహి.౹౮౮॥

భావార్థః:-విద్వాంసో జిజ్ఞాసూన్ జనాన్ సంగత్యైతేషు విద్యాకోశం స్థాపయన్తు.౹౮౮॥

పదార్థము :- (ఇన్ద్ర) విద్యా ఐశ్వర్యములతో (ఇషితః) ప్రేరితుడవు మరియు (విప్రజూతః) బుద్ధిశాలుర ద్వారా శిక్షణ నొందిన వేగవంతుడవు (వాఘతః) శిక్షణనొందిన వాణిచే దెలిసికొనజాలిన నీవు (ధియా)

చక్కని బుద్ధితో (సుతావతః) సిద్ధపరచినట్టి (బ్రహ్మణి) అన్నము మరియు ధనములను (ఉప, ఆ, యాహి) అన్ని విధములుగ సమీపముననే పొందుము. ॥౮౮॥

భావార్థము :- విద్వాంసులు జిజ్ఞాసువు లగువారితో గలిసి వారియందు విద్యానిధిని స్థాపిత మొనర్పవలయును. ॥౮౮॥

88.O learned and renowned king, well urged and taught by the wise, impelled by intellect, enjoy food-grains and riches prepared with skill and wisdom!.

౧౨౧౦. ఇన్ద్రాయాహి తూతుజాన ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౨౧౦ ఇన్ద్రాయాహి తూతుజానఽఉప బ్రహ్మణి హరివః।

సుతే దధిష్వ నశ్చనః ॥౮౯॥

ప. విః- ఇన్ద్ర, ఆ, యాహి, తూతుజానః, ఉప, బ్రహ్మణి, హరివ ఇతి హరి + వః, సుతే, దధిష్వ, నః, చనః. ॥౮౯॥

పదార్థః:- (ఇన్ద్ర) విద్యైశ్వర్యవర్ధక (ఆ) (యాహి) (తూతుజానః) క్షిప్రకారీ. తూతుజాన ఇతి క్షిప్రకారి నా... నిఘం.. ౨.౧౫. (ఉప) (బ్రహ్మణి) ధర్మ్యేణ ప్రాప్తవ్యాని (హరివః) ప్రశస్తా హరయోఽశ్వా విద్యన్తే యస్య తత్సంబుద్ధౌ (సుతే) నిష్పన్నే వ్యవహారే (దధిష్వ) ధర (నః) అస్మాన్ (చనః) భోగ్యమన్నమ్. ॥౮౯॥

అన్వయః:- హే హరివ ఇన్ద్ర! త్వముపాయాహి తూతుజానో నః సుతే బ్రహ్మణి చనశ్చ దధిష్వ. ॥౮౯॥

భావార్థః:- విద్యాధర్మవృద్ధయే కేనాప్యాలస్యం న కార్యమ్. ॥౮౯॥

పదార్థము :- (హరివః) చక్కని ఉత్తమాశ్వములుగల (ఇన్ద్ర) విద్య మరియు ఐశ్వర్యములను అభివృద్ధి నొందించు విద్వాంసుడా! నీవు (ఉపాయాహి) సమీపమునకు రమ్ము (తూతుజానః) శీఘ్రముగ కార్యము నొనర్చువాడవై (నః) మాకొరకు (సుతే) ఉత్పన్నమైన వ్యవహారములందు (బ్రహ్మణి) ధర్మయుక్త కర్మలద్వారా పొందదగిన ధనములు మరియు (చనః) భుజించదగిన అన్నమును (దధిష్వ) ధారణమొనర్చుకొనుము. ॥౮౯॥

భావార్థము : విద్య మరియు ధర్మముల నభివృద్ధి పరచుకొనుటకు ఎవ్వరును, ఏమాత్రమును ఆలస్యము నొనర్పరాదు. ॥౮౯॥

89.O vital soul, expeditious in action, attain to vedic knowledge, For our thriving transaction produce edible corn!.

౧౨౧౧. అశ్వినేత్యస్య మధుశ్ఛన్దా ఋషిః, అశ్విసరస్వతీన్ద్రా దేవతాః, నిచృదనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౨౧౧ అశ్వినా పిబతాం మధు సరస్వత్యా సజోషసా ।

ఇన్ద్రః సుత్రామా వృత్రహా జుషన్తాం సోమ్యం మధు ॥౯౦॥

ప.విః- అశ్వినా, పిబతామ్, మధు, సరస్వత్యా, సజోషసేతి స + జోషసా, ఇన్ద్రః, సుత్రామేతి సు + త్రామా, వృత్రహేతి వృత్ర + హా, జుషన్తామ్, సోమ్యమ్, మధు. ॥౯౦॥

పదార్థః:-(అశ్వినా) అధ్యాపకోపదేశకౌ (పిబతామ్) (మధు) మధురాదిగుణయుక్తమన్నమ్ (సరస్వత్యా) సుసంస్కృతయా వాచా (సజోషసా) సమానం జోషః సేవనం యయోస్తౌ (ఇన్ద్రః) ఐశ్వర్యవాన్ (సుత్రామా) సుష్ఠు రక్షకః (వృత్రహా) యో వృత్రం మేఘం హన్తి స సూర్యస్తద్వద్వర్తమానః (జుషన్తామ్) సేవన్తామ్ (సోమ్యమ్) సోమే సోమలతాద్యోషధిగణే భవమ్ (మధు) మధురవిజ్ఞానమ్. ॥౯౦॥

అన్వయః:-హే మనుష్యాః! యథా సజోషసాఽశ్వినా సరస్వత్యా మధు పిబతాం యథా చేన్ద్రః సుత్రామా వృత్రహా చ సోమ్యం మధు జుషన్తాం తథా యుష్మాభిరప్యనుష్ఠేయమ్. ॥౯౦॥

భావార్థః:-అధ్యాపకోపదేశకాః స్వాత్మవత్సర్వేషాం విద్యాసుఖం వర్ధాయితుమిచ్ఛేయుర్యతః సర్వే సుఖినః స్యుః. ॥౯౦॥

**పదార్థము** :- ఓ మానవులారా! (సజోషసా) సమానముగా సేవనమొనర్చువారలై (అశ్వినా) అధ్యాపకోపదేశకులు (సరస్వత్యా) చక్కగా సంస్కారమును పొంది వాణిద్వారా (మధు) మధురము మున్నగు గుణములతో గూడిన విజ్ఞానమును (పిబతామ్) పానమొనర్చవలెను. మరియు నేవిధముగ (ఇన్ద్రః) ఐశ్వర్యవంతులు (సుత్రామా) చక్కగా రక్షించునట్టి (వృత్రహా) సూర్యునివంటి నడకగల [నడవడిగల] వాడు (సోమ్యమ్) సోమలత మున్నగు ఓషధీ గణమునందుగల మధురాది గుణములతో గూడిన అన్నమును (జుషన్తామ్) సేవన మొనర్చునో అట్లు మీరును సేవించవలయును. ॥౯౦॥

**భావార్థము** :-అధ్యాపక, ఉపదేశకులు సకలమానవులును తమవలెనే విద్య మరియు సుఖములను సంపొందించుకొను నిచ్ఛగలవారై, దానివలన సుఖములను వృద్ధిపరచుకొనునట్లు సదా ప్రయత్నించవలెను. ॥౯౦॥

90.O people, just as loving teacher and preacher, with chastened speech, enjoy sweet knowledge, and as a glorious king, good guardian, slayer of foes as the sun is of clouds, eats the sweet corn grown in the midst of Soma herbs, so should ye do.

ఈ యధ్యాయమునందు రాజు, ప్రజలు, ధర్మముయొక్క అంగములు, మరియు అంగీభావములు, గృహస్థాశ్రమవ్యవహారములు, బ్రాహ్మణులు, క్షత్రియులు, సత్యవ్రతము, దేవతలగుణములు, ప్రజాపాలనము, అభయము, పరస్పర సమ్మతి, మహిళామణుల గుణములు, ధనము మున్నగు పదార్థముల వృద్ధి మొదలగు వర్ణన గలిగియున్నందున ఈ యధ్యాయముయొక్క అర్థమునకు దీనికి పూర్వపు అధ్యాయమున జెప్పబడిన అర్థముతో సంగతి గలదని ఎరుగవలయును.

అత్ర రాజప్రజాధర్మాఙ్గాఙ్గిగృహాశ్రమవ్యవహారబ్రహ్మక్షత్రసత్యవ్రతదేవగుణప్రజారక్షకాఽభయ పరస్పర సంమతిస్త్రీగుణధనాదివృద్ధ్యాదివర్ణనాదేతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతి రస్తీతి బోధ్యమ్

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యాణాం పరమవిదుషాం శ్రీయుతవిరజానన్ద సరస్వతీస్వామినాం శిష్యేణ పరమహంసపరివ్రాజకాచార్యేణ శ్రీమద్దయానన్దసరస్వతీస్వామినా నిర్మితే సుప్రమాణయుక్తే సంస్కృతార్యభాషాభ్యాం విభూషితే యజుర్వేదభాష్యే వింశతితమోఽధ్యాయః పూర్తిమగాత్.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామివిరచిత సంస్కృతార్యభాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి ఇరువదియవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడునునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్పబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య

'మల్లారెడ్డి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**ఇరువదియవ అధ్యాయము సమాప్తము.**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# యజుర్వేదభాష్యము

## 21వ అధ్యాయము - విషయసూచిక

ఇందులో 61 మంత్రములు, 69 ఛందస్సులు, 1440 పదములు, 3610 అక్షరములు

| క్ర.సం. | విషయము | మంత్రములు |
| --- | --- | --- |
| 1. | విద్వద్విషయము | ౧-౫,౧౦-౧౫,౧౯,౨౦ |
| 2. | భూమాతను గురించి | ౫ |
| 3. | జలయాన విషయము | ౬-౮ |
| 4. | వాయ్వాది పదార్థముల ప్రయోజనము | ౧౭,౧౭ |
| 5. | వైద్యునివలె సామాన్యమానవులు ఆచరించవలయును | ౧౮ |
| 6. | ప్రజల విషయము | ౨౧-౨౩ |
| 7. | మధ్యమ బ్రహ్మచర్యము | ౨౪ |
| 8. | ఉత్తమ బ్రహ్మచర్యము | ౨౫-౪౭ |
| 9. | విద్వాంసు లెటుల ప్రవర్తించ వలెను | ౪౮ |
| 10. | విద్వాంసుల యుపదేశ మెటు లుండును | ౪౯ |
| 11. | మానవులెటుల మెలగవలయును | ౫౦,౫౨,౫౩,౫౬-౫౯,౬౧ |
| 12. | మానవు లెటులుందురు? | ౫౧ |
| 13. | మాతా పితరులు స్వసంతానమును ఎటువంటి వారిగా నొనర్చ వలయును? | ౫౪,౫౫ |
| 14. | మానవులేమి యెనరిచి యేమి చేయవలయును? | ౬౦ |

# అథైకవింశతితమోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే ఏకషష్టిర్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౧౨౧౨. ఇమమిత్యస్య శునఃశేప ఋషిః, వరుణో దేవతా, నిచృద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ విద్వద్విషయమాహ. ప్రథమ మంత్రమందు విద్వాంసుల విషయము వర్ణించబడినది.

౧౨౧౨ ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురా చకే ॥౧॥

**ప.వి:-** ఇమమ్, మే, వరుణ, శ్రుధి, హవమ్, అద్య, చ, మృడయ, త్వామ్, అవస్యుః, ఆ, చకే. ॥౧॥

పదార్థః:-(ఇమమ్) (మే) మమ (వరుణ) ఉత్తమవిద్వన్ (శ్రుధి) శృణు. అత్ర సంహితాయామితి దీర్ఘః. (హవమ్) స్తవనమ్. (అద్య) అస్మిన్నహని. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః, (చ) (మృడయ) (త్వామ్) (అవస్యుః) ఆత్మనోఽవఇచ్ఛుః (ఆ) (చకే) కామయే. ఆచక ఇతి కాంతికర్మా. నిఘం. ॥౧॥

అన్వయః:- హే వరుణ! యోఽవస్యురహమిమం త్వామాచకే. స త్వం మే హవం శ్రుధి. అద్య మాం మృడయ చ. ॥౧॥

భావార్థః:-సర్వైర్విద్యాకామైరనూచానో విద్వాన్ కమనీయః స విద్యార్థినాం స్వాధ్యాయం శ్రుత్వా సుపరీక్ష్య సర్వానానన్దయేత్. ॥౧॥

**పదార్థము :-** (వరుణ) ఓ ఉత్తమవిద్వాంసుడా! (అవస్యుః) ఆత్మరక్షణను గోరు నేను (ఇమమ్) ఇట్టి (త్వామ్) నిన్ను (ఆ,చకే) కోరుచున్నాను. అట్టి నీవు (మే) నా యొక్క (హవమ్) స్తుతిని (శ్రుధి) వినుము (చ) మరియు (అద్య) నేడే నన్ను (మృడయ) సుఖవంతునిగ నొనర్చుము. ॥౧॥

**భావార్థము :-** విద్యల నభిలషించువారెల్లరును క్రమబద్ధముగ నుపదేశించునట్టి మహా విద్వాంసులను గోరవలయును. వారు విద్యార్థుల స్వాధ్యాయమును వినుచు ఉత్తమ పరీక్షణముద్వారా ఎల్లరనానందపరచ-వలయును. ॥౧॥

1. O God, hear this prayer of mine, be ever gracious unto us. Longing for help I yearn for Thee!

౧౨౧౩. తదిత్యస్య శునఃశేప ఋషిః, వరుణో దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే చెప్పబడినది.

౧౨౧౩ తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః।
అహేడమానో వరుణేహ బోధ్యురుశꣳస మా న ఆయుః ప్రమోషీః॥౨॥

ప.వి:-తత్, త్వా, యామి, బ్రహ్మణా, వందమానః, తత్, ఆ, శాస్తే, యజమానః, హవిర్భిరితి హవిః+భిః, అహేడమానః, వరుణ, ఇహ, బోధి, ఉరుశꣳసేత్యురు+శꣳస, మా, నః, ఆయుః, ప్ర, మోషీః.॥౨॥

పదార్థః :-(తత్) తమ్ (త్వా) త్వామ్ (యామి) ప్రాప్నోమి (బ్రహ్మణా) వేదవిజ్ఞానేన (వన్దమానః) స్తువన్ (తత్) (ఆ) (శాస్తే) ఇచ్ఛతి (యాజమానః) (హవిర్భిః) హోతుం దాతుమర్హైః పదార్థైః (అహేడమానః)సత్క్రియమాణః (వరుణ) అత్యుత్తమ (ఇహ) అస్మిన్ సంసారే (బోధి) బోధయ (ఉరుశంస) బహుభిః ప్రశంసిత (మా) (నః) అస్మాకమ్ (ఆయుః) జీవనం విజ్ఞానం వా (ప్ర) (మోషీః) చోరయేః.॥౨॥

అన్వయః:-హే వరుణ విద్వజ్జన! యథా యజమానో హవిర్భిస్తదాశాస్తే, తథా బ్రహ్మణా వన్దమానోఽహం తత్త్వా యామి. హే ఉరుశంస! మయాఽహేడమానస్త్వమిహ న ఆయుర్మా ప్రమోషీః. శాస్త్రం బోధి.॥౨॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యో యస్మాద్విద్యామాప్నుయాత్ స తం పూర్వ మభివాదయేత్. యో యస్యాధ్యాపకః స్యాత్స తస్మై విద్యాదానాయ కపటం న కుర్యాత్, కదాచిత్కేనచిదాచార్యో నాఽవమంతవ్యః.॥౨॥

పదార్థము :- (వరుణ) ఓ అత్యుత్తమ విద్వాంసుడా! (యజమానః) యజమానులు (హవిర్భిః) ఈయదగిన పదార్థములచే (తత్) దానిని (ఆ, శాస్తే) ఆకాంక్షించునట్లు (బ్రహ్మణా) వేదవిజ్ఞానముద్వారా (వన్దమానః) స్తుతియొనర్చు నేను (తత్) అట్టి (త్వా) నిన్ను (యామి) ప్రాప్తించుకొందును (ఉరుశంస) అనేకులచే ప్రశంసింపబడినవాడా! నాచే (అహేడమానః) సత్కారమును పొందుచు నీవు (ఇహ) ఈ జగత్తునందు (నః) మాయొక్క (ఆయుః) జీవనమును లేక విజ్ఞానమును (మా, ప్ర, మోషీః) దొంగిలించకుందువు గాక! మరియు శాస్త్రముయొక్క (బోధి) బోధన గలిగింతువుగాక!॥౨॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్యనేర్చువారికి మొట్టమొదట నమ్రతాపూర్వకముగ నమస్కరించవలయును. ఆచార్యుడును విద్య గరపుటయందు విద్యార్థియెడ నిష్కపటముగ విద్యలనేర్పవలయును. ఎవ్వడును ఆచార్యుల నేమాత్రమును అవమాన పరచకూడదు.॥2॥

2. O Worshipful God, with my prayer, I attin unto Thee through vedic knowledge. A worshipper longs to realise Thee with his oblations. O praise worthy God, worthy of respect, give us Thy knowledge in this world, steal not our life from us!.

1214. త్వమిత్యస్య వామదేవ ఋషిః, అగ్నివరుణౌ దేవతే, స్వరాట్పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నావిషయమే చెప్పబడెను.

1214 త్వం నో॑ఽఅగ్నే వరు॑ణస్య వి॒ద్వాన్ దే॒వస్య॒ హేడో॑ఽఅవ యాసిసీష్ఠాః ।
యజి॑ష్ఠో వహ్ని॑తమః॒ శోశు॑చానో॒ విశ్వా॒ ద్వేషా॑ꣳసి॒ ప్ర ము॑ముగ్ధ్య॒స్మత్ ॥3॥

ప.వి:- త్వమ్, నః, అగ్నే, వరుణస్య, విద్వాన్, దేవస్య, హేడః, అవ, యాసిసీష్ఠాః, యజిష్ఠః, వహ్నితమ ఇతి వహ్ని+తమః శోశుచానః, విశ్వా, ద్వేషాꣳసి, ప్ర, ముముగ్ధి, అస్మత్.॥3॥

పదార్థః:- (త్వమ్) (నః) అస్మాకమ్ (అగ్నే) పావకవత్ప్రకాశమాన (వరుణస్య) శ్రేష్ఠస్య (విద్వాన్) విద్యాయుక్తః (దేవస్య) విదుషః (హేడః) అనాదరః (అవ) నిషేధే (యాసిసీష్ఠాః) యాయాః ప్రాప్నుయాః (యజిష్ఠః) అతిశయేన యష్టా (వహ్నితమః) అతిశయేన వోఢా (శోశుచానః) శుద్ధః శోధయన్ సన్. (విశ్వా) సర్వాణి (ద్వేషాంసి) ద్వేషాదియుక్తాని కర్మాణి. (ప్ర) (ముముగ్ధి) ప్రమోచయ, (అస్మత్) అస్మాకం సకాశాత్.॥3॥

అన్వయః:- హే అగ్నే! యజిష్ఠో వహ్నితమః, శోశుచానో విద్వాంస్త్వం వరుణస్య దేవస్య యో హేడ స్తమవ యాసిసీష్ఠా మా కుర్యాః. హే అగ్నే! త్వం యో నోఽస్మాకం హేడో భవేత్తం మా స్వీకుర్యాః. హే శిక్షక! త్వమస్మద్ విశ్వా ద్వేషాంసి ప్రముముగ్ధి.॥3॥

భావార్థః:- కోపి మనుష్యో విదుషామనాదరం, కోఽపి విద్వాన్ విద్యార్థినామసత్కారం చ న కుర్యాత్సర్వే మిలిత్వేర్ష్యాక్రోధాదిదోషాంస్త్యక్త్వా సర్వేషాం సఖాయో భవేయుః.॥3॥

పదార్థము :- (అగ్నే) అగ్నివంటి ప్రకాశమానుడవు (యజిష్ఠః) శ్రద్ధగా యజ్ఞమునొనర్చువాడవు (వహ్నితమః) చక్కగా ప్రాప్తిగలిగించు మరియు (శోశుచానః) శుద్ధపరచువాడవు (విద్వాన్) విద్వాంసుడవునగు

(త్వమ్) నీవు (వరుణస్య) శ్రేష్ఠులు (దేవస్య) విద్వాంసులగువారిని (హేడః) అనాదరము (అవ, యాసిసీష్ఠాః) చేయకుము. మరియు ఓ తేజోవంతుడా! నీవు (నః) మాకు అనాదరము జరుగనున్నట్లైన దాని నంగీకరించకుము. ఓ ఆధ్యాపకా! నీవు (అస్మత్) మానుండి (విశ్వా) సమస్త (ద్వేషాంసి) ద్వేషాదులతో గూడిన కర్మలను (ప్ర, ముముగ్ధి) తొలగించుము.॥3॥

**భావార్థము** :- ఏ మనుష్యుడును విద్వాంసుల ననాదరణమొనర్చవలదు. ఏ విద్వాంసుడును విద్యార్థులను అవమానమొనర్చగూడదు. ఎల్లరును కలిసిమెలిసియుండి క్రోధము, ఈర్ష్యాద్వేషాదులను వదలి పరస్పరమిత్రులై యుండవలయును.॥3॥

3. O Omniscient God, Thou art the Master of all branches of knowledge, put far away from us disrespect to a learned person. Extremely venerable, Effulgent and Purifier, remove Thou far from us all feelings of hatred!.

౧౨౧౪. స త్వమిత్యస్య వామదేవ ఋషిః, అగ్నివరుణౌ దేవతే. స్వరాట్పంక్తిశ్ఛందః, పంచమః స్వరః

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మదియే.

౧౨౧౪ స త్వం నో॑ఽ అగ్నేఽవమో భ॑వో॒తీ నేది॑ష్ఠోఽ అ॒స్యాఽ ఉ॒షసో॒ వ్యు॑ష్టౌ।

అవ॑ యక్ష్వ నో॒ వరు॑ణ॒ꣳ రరా॑ణో వీ॒హి మృ॑డీ॒కꣳ సు॒హవో॑ నఽ ఏధి॥4॥

ప.వి:- సః, త్వమ్, నః అగ్నే, అవమః, భవ, ఊతీ, నేదిష్ఠః, అస్యాః, ఉషసః, వ్యుష్టావితి వి+ ఉష్టౌ, అవ, యక్ష్వ, నః, వరుణమ్, రరాణః, వీహి, మృడీకమ్, సుహవ ఇతి సు+హవః, నః, ఏధి.॥4॥

పదార్థః:-(సః) (త్వమ్) (నః) అస్మాకమ్ (అగ్నే) (అవమః) రక్షకః (భవ) (ఊతీ) ఊత్యా (నేదిష్ఠః) అతిశయేనాంతికః (అస్యాః) (ఉషసః) ప్రత్యూషవేలాయాః (వ్యుష్టౌ) వివిధే దాహే (అవ) (యక్ష్వ) సంగమయ. అత్ర బహులం ఛందసీతి వికరణభావః. (నః) అస్మాకమ్ (వరుణమ్) ఉత్తమమ్ (రరాణః) రమమాణః (వీహి) వ్యాప్నుహి (మృడీకమ్) సుఖప్రదమ్ (సుహవః) శోభనో హవో దానం యస్య సః (నః) అస్మాన్ (ఏధి) భవ.॥4॥

అన్వయః:-హే అగ్నే! యథాఽస్యా ఉషసో వ్యుష్టౌ వహ్నిర్నేదిష్ఠో రక్షకశ్చ భవతి తథా స త్వమూతీ నోఽవమో భవ, నో వరుణమవయక్ష్వ, రరాణః సన్ మృడీకం వీహి, నః సుహవ ఏధి.॥4॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా ప్రాతః సమయే సూర్యః సన్నిహితః సన్ సర్వాన్ సన్నిహితాన్ మూర్తాన్ పదార్థాన్ వ్యాప్నోతి, తథాఽన్తేవాసినాం సన్నిధావధ్యాపకో భూత్వైతానాత్మనో విద్యయా వ్యాప్నుయాత్.॥ ౪ ॥

పదార్థము :-(అగ్నే) అగ్నివంటి విద్వాంసుడా! (అస్యాః) ఇట్టి (ఉషసః) ప్రభాతవేళయందలి (వ్యుష్టౌ) అనేక విధములగు దహనకార్యములందు అగ్ని యెట్లు (నేదిష్ఠః) అతిసమీపమునుండి రక్షణ యొనర్చునదై యున్నదో, అట్లే (సః) అట్టి (త్వమ్) నీవు (ఊతీ) ప్రీతితో (నః) మమ్ము (వరుణమ్) రక్షణ జేయువాడవై (భవ) ఉండుము (నః) మాకు (వరుణమ్) ఉత్తమగుణములు లేక ఉత్తమ విద్వాంసుల లేక శ్రేష్ఠగుణవంతుల (అవ, యక్ష్వ) సాంగత్యమొనర్పజేయుము (రరాణః) రమణీయత నొనర్చుచు నీవు (మృడీకమ్) సుఖము నిచ్చువానిని (వీహి) వ్యాప్తపరచుము (నః) మాకు (సుహవః) శుభదానము నిచ్చువాడవు (ఏధి) అగుము.॥౪॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారము గలదు. ప్రాతఃకాలమునందు సూర్యుడు సమీపస్థితుడైయుండి సమస్త మూర్తవ్య పదార్థములందు వ్యాప్తుడై యుండునట్లు అధ్యాపకులు శిష్యులకు సమీపస్థులై వారిని తమ విద్యలద్వారా వ్యాప్తపరచవలయును. ॥౪॥

4. O God, be thou the nearest unto us. Protect us with Thy power of protection, while now this Morn is breaking. Reconcile the learned to us; be Bounteous, give us happiness and nice charity!.

౧౨౧౬.మహీమిత్యస్య వామదేవ ఋషిః, ఆదిత్యా దేవతాః, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ పృథివ్యా విషయమాహ. పృథ్వీవిషయము చెప్పబడినది.

౧౨౧౬ మహీమూ షు మాతరꣳ సువ్రతానామృతస్య పత్నీమవసే హువేమ।

తువిక్షత్రామజరన్తీమురూచీꣳ సుశర్మాణమదితిꣳ సుప్రణీతిమ్ ॥౫॥

ప.వి:- మహీమ్, ఊఀ ఇత్యూఀ, సు, మాతరమ్, సువ్రతానామ్, ఋతస్య, పత్నీమ్, అవసే, హువేమ, తువిక్షత్రామితి తువి+క్షత్రామ్, అజరంతీమ్, ఉరూచీమ్, సుశర్మాణమితి సు+శర్మాణమ్, అదితిమ్, సుప్రణీతిమ్, సుప్రణీతిమితి సు+ప్రణీతిమ్.॥౫॥

పదార్థః:-(మహీం) భూమిమ్ (ఉ) ఉత్తమే (సు) శోభనే (మాతరమ్) మాతరమివ వర్తమానామ్ (సువ్రతానామ్) శోభనాని వ్రతాని సత్యాచరణాని యేషామ్ తేషామ్

(ఋతస్య) ప్రాప్తసత్యస్య (పత్నీమ్) స్త్రీవద్వర్తమానామ్ (అవసే) రక్షణాద్యాయ (హువేమ) ఆదద్యామ (తువిక్షత్రామ్) తువిర్బహు క్షత్రం ధనం యస్యాం తామ్ (అజరంతీమ్) వయోహానిరహితామ్ (ఉరూచీమ్) యా ఉరూణి బహూన్యంచతి ప్రాప్నోతి తామ్ (సుశర్మాణమ్) శోభనాని శర్మాణి గృహాణి యస్యాస్తామ్ (అదితిమ్) అఖండితామ్ (సుప్రణీతిమ్) శోభనాః ప్రకృష్టా నీతయో యస్యాం తామ్.॥౫॥

అన్వయః:-హే మనుష్యాః! యథా వయం మాతరమివ సువ్రతానామృతస్య పత్నీం తువిక్షత్రా మజరంతీమురూచీం సుశర్మాణం సుప్రణీతిమ మహీమదితిమవసే సుహువేమ తథా యూయమపి గృహ్ణీత.॥౫॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా మాతాऽపత్యాని పతివ్రతా పతిం చ పాలయతి, తథేయం భూమిః సర్వాన్ రక్షతి.॥౫॥

పదార్థము :-ఓ మానవులారా! మే మెట్లు (మాతరమ్) మాతవలెనుండి (సువ్రతానామ్) శుభసత్యాచరణముతో (ఋతస్య) ప్రాప్తించిన సత్యమును (పత్నీమ్) భార్యవలెనుండి (తువిక్షత్రామ్) అపరిమితధనము గలది (అజరన్తీమ్) జీర్ణత్వము లేని (ఉరూచీమ్) అనేక సదార్థముల ప్రాప్తినొందించు (సుశర్మాణమ్) ఉత్తమ అనుకూలమగు గృహముచే (సుప్రణీతిమ్) ఉత్తమ నీతియుక్తముగ (ఉ) ఉత్తమ (అదితిమ్) అఖండితమగు (మహీమ్) పృథివిని (అవసే) రక్షణాదులకొరకై (సు, హువేమ) గ్రహణ మొనర్చుమున్నామో, అట్లే మీరును గ్రహించుడు [పొందుడు].॥౫॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ విధముగ మాతృదేవత తన సంతానములను మరియు పతివ్రత తన భర్తను పాలన మొనర్చునో, అదేవిధముగ పృథివి సకల ప్రాణులను పాలనమొనర్చును. ॥౫॥

5. We call to protect us, this unimpaired Earth, the mother of those who stick steadfastly to their vow, the rearer of truth, full of wealth, free from decay, the giver of various objects, equipped with excellent houses and pleasureable politics.

౧౨౧౬.సుత్రామాణమిత్యస్య గయప్లాత ఋషిః, అదితిర్దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ జలయానవిషయమాహ. జలయాన విషయము చెప్పెను.

౧౨౧౬ సుత్రామాణం పృథివీం ద్యామనేహసꣳ సుశర్మాణ మదితిꣳ సుప్రణీతిమ్।

దైవీం నావꣳ స్వరిత్రామనాగసమస్రవన్తీమా రుహేమా స్వస్తయే ॥౬॥

ప.వి:- సుత్రామాణమితి సు+త్రామాణమ్, పృథివీమ్, ద్యామ్, అనేహసమ్, సుశర్మాణమితి సు+శర్మాణమ్, అదితిమ్, సుప్రణీతిమ్, సుప్రణీతిమితి సు+ప్రణీతిమ్, దైవీమ్, నావమ్, స్వరిత్రామితి సు+అరిత్రామ్, అనాగసమ్, అస్రవన్తీమ్, ఆ, రుహేమ, స్వస్తయే.॥౬॥

పదార్థః:-(సుత్రామాణమ్)శోభనాని త్రామాణి రక్షణాదీని యస్యాస్తామ్ (పృథివీమ్) విస్తీర్ణామ్ (ద్యామ్) సుప్రకాశామ్ (అనేహసమ్)అహంతవ్యామ్. నఞి హన ఏహ చ. ఉ.పా. ౪. ౨౨౪. (సుశర్మాణమ్) సుశోభితగృహామ్ (అదితిమ్) (సుప్రణీతిమ్) బహురాజ ప్రజాఽఖండితనీతియుక్తామ్ (దైవీమ్) దేవానా మాప్తానాం విదుషామియం తామ్ (నావమ్) నోదయంతి ప్రేరయంతి యయా తామ్ (స్వరిత్రామ్) శోభనాన్యరిత్రాణి యస్యాం తామ్. (అనాగసమ్) అవిద్యమానాఽపరాధామ్ (అస్రవంతీమ్) అచ్ఛిద్రామ్ (ఆ) (రుహేమ) అధితిష్ఠేమ. అత్ర సంహితాయామితి దీర్ఘః, (స్వస్తయే) సుఖాయ.॥౬॥

అన్వయః:-హే శిల్పినో! యథా వయం స్వస్తయే సుత్రామాణం పృథివీం ద్యామనేహసం సుశర్మాణ మదితిం సుప్రణీతిం స్వరిత్రామనాగసమస్రవంతీం దైవీం నావమారుహేమ, తథా యూయమిమా మారోహత.॥౬॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా యస్యాం బహూని గృహాణి బహూని సాధనాని బహూని రక్షణాని బహువిధః ప్రకాశో బహవో విద్వాంసశ్చ స్యుస్తస్యామచ్ఛిద్రాయాం మహత్యాం నావి స్థిత్వా, సముద్రాది జలాశయేష్వవారపారౌ దేశాంతర ద్వీపాంతరౌ చ గత్వాఽగత్య భూగోలస్థాన్ దేశాన్ ద్వీపాంశ్చ విజ్ఞాయ శ్రీమంతో భవంతు.॥౬॥

పదార్థము :-ఓ శిల్పులారా! ఎట్లు మేము (స్వస్తయే) సుఖముకొరకు (సుత్రామాణమ్) చక్కని రక్షణాదులచే గూడిన (పృథివీమ్) విస్తారము మరియు (ద్యామ్) శుభప్రకాశముగల (అనేహసమ్) అహింసనీయము (సుశర్మాణమ్) చక్కని గృహములు గల యా (అదితిమ్) అఖండితముగు (సుప్రణీతిమ్) రాజు మరియు ప్రజలయొక్క పూర్ణమగు అనేక నీతులతో గూడిన (స్వరిత్రామ్) అనేక తెడ్డుపలకలు గలిగినట్టి (అనాగసమ్) లోపములులేని (అస్రవన్తీమ్) ఛిద్రములులేని (దైవీమ్) విద్వాంసుల (నావమ్) ప్రేరణను గలిగించు నావపై (ఆ, రుహేమ) అధిరోహించుచున్నామో అట్లు మీరును అధిరోహించుడు.॥౬॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! మీరు ఎద్దానియందు అధికగృహములు గలవో, అనేక సాధనములు, రక్షణవ్యవస్థలు అనేక విధములగు ప్రకాశము

[వెలుతురు] అనేకమంది విద్వాంసులుందురో అట్టి ఛిద్రరహితమగు పెద్దనావయందు స్థిరమైయుండి సముద్రములు మున్నగు జలస్థానముల ఆవలిలీర్థ దూర, సమీపములందు గల ద్వీపాంతర, దేశాంతరములకు వచ్చుచు పోవుచు భూగోళమందలి, దేశముల ద్వీపముల స్థితి-గతులను దెలిసికొనుచు లక్ష్మీవంతు లగుడు.॥౬॥

6. May we ascend, for weal, this vessel, affording protection, vast in size, well renowned, flawless, highly accommodating, complete in construction, used by the king and his subjects for political purposes, rowed with good rudders, comfortable, free from leakage, and built by skilled architects.

౧౭౧౮. సునావమిత్యస్య గయప్లాత ఋషిః, స్వర్గ్యా నౌర్దేవతా, యవమధ్యా గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మలిల నావిషయమే.

౧౭౧౮ సునావమా రుహేయమస్రవన్తీమనాగసమ్। శతారిత్రాం స్వస్తయే ॥౭॥

ప. వి:- సునావమితి సు+నావమ్, ఆ, రుహేయమ్, అస్రవన్తీమ్, అనాగసమ్, శతారిత్రామితి శత+అరిత్రామ్, స్వస్తయే. ॥౭॥

పదార్థః :-(సునావమ్) శోభనాం సునిర్మితాం నావమ్ (ఆ) (రుహేయమ్) (అస్రవంతీమ్) ఛిద్రాది దోషరహితామ్ (అనాగసమ్) నిర్మాణదోషరహితామ్ (శతారిత్రామ్) శతమరిత్రాణి యస్యాస్తామ్ (స్వస్తయే) సుఖాయ.॥౭॥

అన్వయః:-హే మనుష్యాః! యథాఽహం స్వస్తయేఽస్రవంతీమనాగసం శతారిత్రాం సునావ మారుహేయం తథాస్యాం యూయమప్యారోహత.॥౭॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా మహతీర్నావః సుపరీక్ష్య తాసు స్థిత్వా సముద్రాదిపారావారౌ గచ్ఛేయుః. యత్ర బహూన్యరిత్రాదీని స్యుస్తా నావోఽతీవోత్తమాః స్యుః.॥౭॥

పదార్థము :-ఓ మానవులారా! నే నెట్లు (స్వస్తయే) సుఖములకొరకు (అస్రవన్తీమ్) ఛిద్రము మున్నగు దోషములు, లేక (అనాగసమ్) నిర్మాణదోషములు లేనట్టి (శతారిత్రామ్) అనేకలంగరులు [నావలను నిలిపియుంచు సాధనములు] గల (సునావమ్) ఉత్తమముగ నిర్మింపబడిన నావపై (ఆ, రుహేయమ్) ఎక్కునట్లు మీరును అధిరోహించుడు.॥౭॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు చక్కగా

పరీక్షింపబడిన పెద్దనావల నధిరోహించి సముద్రములు మున్నగు పారావారములను దాటి వెళ్లవలెను. అట్టి నావలందు అనేకమంది లంగరులు, చుక్కానులు కూడ చక్కగా చేర్చియుంచుకొనవలయును.॥౭॥

7. May I ascend for welfare the goodly ship, free from defect in construction, that leaketh not, and is equipped with manifold anchors.

౧౨౧౯. ఆ న ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, మిత్రావరుణౌ దేవతే, నిచృద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయమదియే.

౧౨౧౯ ఆ నో మిత్రావరుణా ఘృతైర్గవ్యూతిముక్షతమ్।

మధ్వా రజాంసి సుక్రతూ ॥౮॥

ప.వి:- ఆ నః, మిత్రావరుణా, ఘృతైః, గవ్యూతిమ్, ఉక్షతమ్, మధ్వా, రజాంసి, సుక్రతూ ఇతి సు+క్రతూ.॥౮॥

పదార్థః:- (ఆ) సమంతాత్ (నః) అస్మాకమ్ (మిత్రావరుణా) ప్రాణోదానావివ (ఘృతైః) ఉదకైః (గవ్యూతిమ్) క్రోశద్వయమ్ (ఉక్షతమ్) సించతమ్ (మధ్వా) మధునా జలేన (రజాంసి) లోకాన్ (సుక్రతూ) శోభనాః ప్రజ్ఞాః కర్మాణి వా యయోస్తౌ.॥౮॥

అన్వయః:- హే మిత్రావరుణా ప్రాణోదానవద్వర్తమానౌ సుక్రతూ శిల్పినౌ! యువాం ఘృతైర్నో గవ్యూతిముక్షతమా మధ్వా రజాంస్యుక్షతమ్.॥౮॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యంది శిల్పినా యానాని జలాదినా చాలయేయుస్తర్హి త ఊర్ధ్వాఽధోమార్గేషు గంతుం శక్నుయుః.॥౮॥

పదార్థము :- (మిత్రావరుణా) ప్రాణ ఉదానవాయువుల వలె వర్తించు వారలారా! (సుక్రతూ) పవిత్రబుద్ధి కర్మలు గలిగిన శిల్పులారా! మీరు (ఘృతైః) జలములతో (నః) మాయొక్క (గవ్యూతిమ్) రెండుక్రోశముల [నాల్గుమైళ్ల] దూరమును (ఉక్షతమ్) సేచనమొనర్చుడు [పయనించుడు] మరియు (ఆ, మధ్వా) అన్నివైపులనుండి మధుర జలములతో (రజాంసి) లోకములను సేచన మొనర్చుడు.॥౮॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. శిల్పవిద్య [ఇంజినీరింగ్] మున్నగు నిపుణత్వముగలవారు చక్కగా నిర్మింపబడిన నావలపై జలమార్గములందు క్రిందు, మీదు మార్గములందు వెళ్లుటకు సమర్థులగుదురు.॥౮॥

8. O intellectual and industrious pair of artisans, behaving like pran and udan, sprinkle with water our walking - path for two miles, and provide all places with sweet water!.

౧౨౨౦. ప్ర బాహవేత్యస్య వసిష్ఠ ఋషిః, అగ్నిర్దేవతా; త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునర్విద్వద్విషయమాహ. విద్వాంసుల విషయము.

౧౨౨౦ ప్ర బాహవా సిస్పృతం జీవసే నఉ ఆ నో గవ్యూతిముక్షతం ఘృతేన।

ఆ మా జనే శ్రవయతం యువానా శ్రుతం మే మిత్రావరుణా హవేమా ॥౯॥

ప.వి:- ప్ర, బాహవా, సిస్పృతమ్, జీవసే, నః, ఆ, నః, గవ్యూతిమ్, ఉక్షతమ్, ఘృతేన, ఆ, మా, జనే, శ్రవయతమ్, యువానా, శ్రుతమ్, మే, మిత్రావరుణా, హవా, ఇమా.॥౯॥

పదార్థః:-(ప్ర) (బాహవా) బాహూ ఇవ. అత్ర సుపాం సులుగిత్యాకారాదేశః (సిస్పృతమ్) ప్రాప్నుతమ్ (జీవసే) జీవితుమ్ (నః) అస్మాన్ (ఆ) (నః) అస్మాకమ్ (గవ్యూతిమ్) క్రోశయుగ్మమ్ (ఉక్షతమ్) సించేతామ్ (ఘృతేన) జలేన (ఆ) (మా) మామ్ (జనే) (శ్రవయతమ్) శ్రావయతమ్. వృద్ధ్యభావశ్ఛాందసః (యువానా) యువానౌ మిశ్రితామిశ్రితయోః కర్తారౌ (శ్రుతమ్) శృణుతమ్. (మే) మమ (మిత్రావరుణా) మిత్రశ్చ వరుణశ్చ తౌ. (హవా) హవాని హవనాని (ఇమా) ఇమాని.॥౯॥

అన్వయః:-హే మిత్రావరుణా బాహవా యువానా యువాం నో జీవసే మా ప్రసిస్పృతం, ఘృతేన నో గవ్యూతిమోక్షతం,నానా కీర్తిమాశ్రవయతం మే జన ఇమా హవా శ్రుతమ్.॥౯॥

భావార్థః:-అధ్యాపకోపదేష్టారౌ ప్రాణోదానవత్సర్వేషాం జీవనహేతూ భవేతాం, విద్యోపదేశాభ్యాం సర్వేషామాత్మనో జలేన వృక్షానివ సించేతామ్.॥౯॥

**పదార్థము** :-(మిత్రావరుణా) మిత్రమా, వరుణా, ఉత్తములారా! రెండుభుజములవలెనుండు (యువానా) కలుపుచు, విడదీయుచుండునట్టి మీరు (నః) మా (జీవసే) జీవితముకొరకు (మా) నాకు (ప్ర, సిస్పృతమ్) ప్రాప్తించుడు (ఘృతేన) జలములతో (నః) మాయొక్క (గవ్యూతిమ్) రెండు క్రోశముల పర్యంత[మార్గ]ము (ఆ, ఉక్షతమ్) అన్నిదిక్కుల నుండి సేచన మొనర్చుడు. నానావిధములగు కీర్తిని (ఆ, శ్రవయతమ్) చక్కగా వినిపించుడు. మరియు (మే) నాయొక్క (జనే) మనుష్యగణమునందలి (ఇమా) ఇట్టి (హవా) వాదవివాదములను (శ్రుతమ్) వినుడు.॥౯॥

భావార్థము :- అధ్యాపకోపదేశకులు ప్రాణోదానములవలె సకలజనుల జీవనకారణము గావలెను. విద్య, ఉపదేశములచే అందరియాత్మలను జలముచే వృక్షములవలె సేచనమొనర్చవలయును.॥౯॥

9. O teacher and preacher, ye, uniters and disuniters like both the arms, come unto me for improving my life. Arrange water to be sprinkled for us for two miles. Give us the nice lessons of glory, and hear our mutual discussions!.

౧౨౧౦.శమిత్యస్యాత్రేయ ఋషిః, ఋత్విజో దేవతాః, భురిక్ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయమదియే.

౧౨౧౦ శన్నో భవన్తు వాజినో హవేషు దేవతాతా మితద్రవః స్వర్కాః।

జమ్భయన్తోఽహిం వృకఀరక్షాంసి సనేమ్యస్మద్యుయవన్నమీవాః॥౧౦॥

ప.వి:- శమ్, నః, భవంతు, వాజినః, హవేషు, దేవతాతేతి, దేవ+తాతా, మితద్రవ ఇతి మిత+ద్రవః, స్వర్కాఇతి సు + అర్కాః, జమ్భయన్తః, అహిమ్,వృకమ్, రక్షాంసి, సనేమి, అస్మత్, యుయవన్, అమీవాః.॥౧౦॥

పదార్థః :-(శమ్) సుఖకారకాః (నః) అస్మభ్యమ్ (భవంతు) (వాజినః) ప్రశస్త విజ్ఞానయుక్తాః (హవేషు) దానాఽదానేషు (దేవతాతా) దేవతా విద్వాంస ఇవ వర్తమానాః (మితద్రవః) యే మితం ద్రవంతి తే (స్వర్కాః) సుష్ఠ్వర్కా అన్నాని వజ్రో వా యేషాంతే (జంభయంతః) వినాశయంతః (అహిమ్) మేఘం సూర్య ఇవ (వృకమ్) స్తేనమ్ (రక్షాంసి) దుష్టాన్ జీవాన్ (సనేమి) సనాతనం పురాణం. సనేమి ఇతి పురాణనామ....నిఘం, 3, ౨౭ (అస్మత్) (యుయవన్) పృథక్కుర్వంతు. (అమీవాః) రోగాన్.॥౧౦॥

అన్వయః:-హే స్వర్కామితద్రవో దేవతాతా వాజినో హవేషు విద్వాంసో భవంతోఽహిం సూర్య ఇవ వృకం రక్షాంసి చ జంభయంతో నః సనేమి శం భవంతు.అస్మదమీవా యుయవన్.॥౧౦॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా సూర్యోఽంధకారం నివర్త్య సర్వాన్ సుఖయతి. తథా విద్వాంసః ప్రాణినాం సర్వాన్ శరీరాత్మరోగాన్ నివార్యానందయేయుః.॥౧౦॥

పదార్థము :-(సర్కాః) ఉత్తమాన్నము, వజ్రములు గలవారలారా! (మితద్రవః) ప్రమాణపూర్వకముగ నడచువారలారా! మరియు (దేవతాతా) విద్వాంసులవలె వర్తించువారలారా! (వాజినః) అత్యుత్తమ

విజ్ఞానముతో గూడిన (హవేషు) ఇచ్చిపుచ్చుకొనుటయందు చతురులగు మీరు (అహిమ్) మేఘములను సూర్యునివలె (వృకమ్) చోరుల మరియు (రక్షాంసి) దుష్టజీవులను (జమ్భయన్తః) వినాశమొనర్చుచు (నః) మాకొరకు (సనేమి) సనాతనముగ (శమ్) సుఖములగలిగించువారలు (భవన్తు) అగుడు (అస్మత్) మాయొక్క (అమీవాః) వ్యాధులను (యుయవన్) దూరమొనర్చుడు.॥౧౦॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యుడు అంధకారమును దొలగించి ఎల్లరకు సుఖమును గలిగించునట్లు విద్వాంసులు ప్రాణుల శారీరక, ఆత్మిక వ్యాధులను తొలగించి ఆనందయుక్తుల నొనర్చవలయును.॥౧౦॥

10. O highly learned person, possessing arms and foodstuffs, slow mover, behaving like scholars, wordly wise, crushing the thief and ignoble souls, as sun crushes the cloud, become for us an ancient pleasure-giver, and completely banish our afflictions!.

౧౨౨౨.వాజేవాజ ఇత్యస్య ఆత్రేయ ఋషిః, విద్వాంసో దేవతాః, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ.మలుల విషయ మదియే

౧౨౨౨ వాజేవాజేऽవత వాజినో నో ధనేషు విప్రా అమృతా ఋతజ్ఞాః।

అస్య మధ్వః పిబత మాదయధ్వం తృప్తా యాత పథిభిర్దేవయానైః॥౧౧॥

ప.వి:-వాజేవాజऽఇతి వాజే+వాజే, అవత, వాజినః, నః, ధనేషు, విప్రాః, అమృతాః, ఋతజ్ఞాऽఇత్యృతజ్ఞాః, అస్య, మధ్వః, పిబత, మాదయధ్వమ్, తృప్తాః, యాత, పథిభిరితి పథి+భిః, దేవయానైరితి దేవ+యానైః.॥౧౧॥

పదార్థః :-(వాజేవాజే) యుద్ధే యుద్ధే (అవత) రక్షత (వాజినః) విజ్ఞానవంతః (నః) అస్మాన్ (ధనేషు) (విప్రాః) మేధావినః (అమృతాః) ఆత్మస్వరూపేణ నిత్యాః (ఋతజ్ఞాః) య ఋతం సత్యం జానంతి తే (అస్య)(మధ్వః) మధురస్య రసస్య. అత్ర కర్మణి షష్ఠీ (పిబత) (మాదయధ్వమ్) ఆనందయత (తృప్తాః) ప్రీతాః (యాత) గచ్ఛత (పథిభిః) (దేవయానైః) దేవా విద్వాంసో యాంతి యేషు తైః.॥౧౧॥

అన్వయః:-హే అమృతా ఋతజ్ఞా వాజినో విప్రాః! యూయం వాజేవాజే ధనేషు నోऽవతాస్య మధ్వః, పిబత తేన మాదయధ్వమనేన తృప్తాః సంతో దేవయానైః పథిభిర్యాత.॥౧౧॥

భావార్థః:- యథా విద్వాంసో విద్యాదానోపదేశాభ్యాం సర్వాన్ సుఖయంతి తథైవ రాజపురుషా రక్షాఽభయదానాభ్యాం సర్వాన్ సుఖయంతు. ధర్మ్యమార్గేషు గచ్ఛంతోఽర్థకామమోక్షాన్ ప్రాప్నువంతు.॥౧౧॥

పదార్థము :-(అమృతాః) ఆత్మస్వరూపమున అవినాశులు (ఋతజ్ఞాః) సత్యము నెరిగిన (వాజినః) విజ్ఞానవంతులు నగు (విప్రాః)బుద్ధిశాలులారా! మీరు (వాజే వాజే) ప్రతి యుద్ధమందును మరియు (ధనేషు) ధనములందును (నః) మమ్ము (అవత) రక్షణ జేయుడు. మరియు (అస్య) ఈ (మధ్వః) మధురరసమును (పిబత) పానమొనర్చుడు. మరియు దానివల్ల (మాదయధ్వమ్) విశేషానందప్రాప్తినొందుడు. మరియు దీనిచే (తృప్తాః) తృప్తివంతులై (దేవయానైః) విద్వాంసులు పయనించు (పథిభిః) మార్గములద్వారా (యాత) పయనించుడు [వెళ్లుడు].॥౧౧॥

భావార్థము :-విద్వాంసులు విద్యాదానము మరియు ఉపదేశములచే ఎల్లరను సుఖవంతుల నొనర్చునట్లు, రాజపురుషులు రక్షణ మరియు అభయప్రదానములచే సకలప్రజలను సుఖవంతులుగ నుంచవలెను. మరియు ధర్మయుక్తమార్గములందు నడచుచు ధర్మార్థకామమోక్షములను పురుషార్థఫలములను పొందవలెను. ॥౧౧॥

11. O immortal, truth-knowing, learned, and wise people, help us in each fray, and our efforts to earn wealth. Drink deep the easence of knowledge, be joyful, be satisfied: then follow the paths which the sages are wont to tread!.

౧౨౨౩.సమిద్ధ ఇత్యస్య స్వస్త్యాత్రేయ ఋషిః,అగ్నిర్దేవతా,విరాడనుష్టుప్ ఛందః,గాంధారః,స్వరః.

పునర్విద్వద్విషయమాహ. విద్వాంసుని గురించి చెప్పెను.

౧౨౨౩ సమిద్ధోఽఅగ్నిః సమిధా సుసమిద్ధో వరేణ్యః।
గాయత్రీ ఛన్దఽఇన్ద్రియం త్ర్యవిర్గౌర్వయో దధుః॥౧౨॥

ప.వి:-సమిద్ధఽఇతి సమ్+ఇద్ధః, అగ్నిః, సమిధేతి సమ్+ఇధా, సుసమిద్ధ ఇతి సు+సమిద్ధః, వరేణ్యః, గాయత్రీ, ఛందః, ఇంద్రియమ్, త్ర్యవిరితి, త్రి+అవిః, గౌః, వయః, దధుః.॥౧౨॥

పదార్థః:-(సమిద్ధః) సమ్యక్ ప్రదీప్తః (అగ్నిః) వహ్నిః (సమిధా) సమ్యక్ ప్రకాశేన. (సుసమిద్ధః) సుష్ఠుప్రకాశితః సూర్యః (వరేణ్యః) వరణీయో జనః (గాయత్రీ) (ఛందః) (ఇంద్రియమ్) మనః (త్ర్యవిః) త్రయాణాం శరీరేంద్రియాత్మనామవీ రక్షణం యస్మాత్ సః. (గౌః) స్తోతా (వయః) జీవనమ్ (దధుః) దధీరన్.॥౧౨॥

**పదార్థము :**- ఏ మనుష్యులు (కాయ) సుఖసాధనముకొరకు (స్వాహా) సత్యక్రియ (కస్మై) సుఖ స్వరూపముకొరకు (స్వాహా) సత్యక్రియ (కతమస్మై) అనేకులందున్నవానికొరకై (స్వాహా) సత్యక్రియ (ఆధిమ్) ఉత్తమరీతిలో పదార్థములను ధారణమొనర్చుటకై (స్వాహా) సత్యక్రియను (ఆధీతాయ) అన్నిదిశలనుండి విద్యావృద్ధికొరకు (స్వాహా) సత్యక్రియను (ప్రజాపతయే) ప్రజాపాలకునికొరకు (మనః) మనస్సుయొక్క (స్వాహా) సత్యక్రియను (విజ్ఞాతాయ) విశేషముగా ఎరిగినవానికొరకు (చిత్తమ్) స్మృతిని సాధించు, అనగా చేతనమును గలిగించు చైతన్య మనస్సు (అదిత్యై) పృథివికొరకు (స్వాహా) సత్యక్రియను (మహ్యై) గొప్ప (అదిత్యై) వినాశరహితమగు వాణికొరకు (స్వాహా) సత్యక్రియను (సుమృడీకాయై) చక్కని సుఖములనిచ్చు (అదిత్యై) మాల కొరకై (స్వాహా) సత్యక్రియను (సరస్వత్యై) నదికొరకు (స్వాహా) సత్యక్రియను (పావకాయై) పవిత్రమొనర్చునట్టి (సరస్వత్యై) విద్యుత్ గూడిన వాణికొరకై (స్వాహా) సత్యక్రియను (బృహత్యై) మహా (సరస్వత్యై) విద్వాంసుల వాణికొరకై (స్వాహా) ఉత్తమ క్రియను (పూష్ణే) పుష్టియొనర్చువానికై (స్వాహా) ఉత్తమక్రియను (ప్రపథ్యాయ) ఉత్తమవిశ్రాంతయోగ్యమగు భోజనమొనర్చు మరియు (పూష్ణే) పుష్టికొరకు (స్వాహా) సత్యక్రియను (నరన్ధిషాయ) మానవుల కుపదేశమొనర్చునాతని (పూష్ణే) పుష్టి నొనర్చువానికొరకు (స్వాహా) సత్యక్రియను (త్వష్ట్రే) విద్యాప్రకాశ మొనర్చువానికొరకు (స్వాహా) సత్య క్రియను (తురీపాయ) నౌకలను పాలించు (త్వష్ట్రే) విద్యలనుప్రకాశపరచువారికొరకు (స్వాహా) సత్యక్రియను (పురురూపాయ) అనేకరూపములను (త్వష్ట్రే) ప్రకాశమొనర్చువారికొరకు (స్వాహా) సత్యక్రియను (విష్ణవే) వ్యాప్తమగువానికై (స్వాహా) సత్యక్రియను (నిభూయపాయ) నిరంతరము స్వయముగా రక్షితుడై ఇతరులను పాలించువానికొరకు (విష్ణవే) సర్వవ్యాపకుని కొరకు (స్వాహా) సత్యక్రియను మరియు (శిపివిష్టాయ) వచనములదెలుపుచు చైతన్యప్రాణులందు వ్యాప్తిచే ప్రవేశమ్మైయున్న (విష్ణవే) వ్యాపకుడగు పరమేశ్వరునికొరకు (స్వాహా) సత్యక్రియనొనర్చువారు అధికసుఖవంతులై యుందురు. ॥౨౦॥

**భావార్థము :**- విద్వాంసుల సుఖముకొరకు, చదువుటకొరకు అంతఃకరణముయొక్క జ్ఞానము, వాణి మరియు వాయువు మున్నగు పదార్థముల శుద్ధికొరకు యజ్ఞక్రియలను చక్కగా నొనర్చువారు సుఖవంతులై యుందురు. ॥౨౦॥

20. Reverence for him who brings happiness, reverence for God the Embodiment of joy, reverence for the king who is foremost amongst the many. Show respect to him who makes a collection of objects, and him who studies different sciences. Have respect for the deep-thinker, and the protector of the subjects. Show respect to him whose mind is contemplative, who is the master of knowledge. Have respect for the mother Earth, for the mighty, immortal word of God, for the mother, the supplier of happiness. Make full use of the streams. Revere the speech full of knowledge which purifies us. Respect the noble saying of the learned. respect a strong man. Resepct him who takes hygienic meals for the maintenance of his vitality. Respect the preacher who sermonises and makes us spiritually strong. Have respect for the diffuser of light, for the builder of boats, for him who spreads education. Wroship God, who creates objects of variegated forms. Pray unto the All - pervading providence. Meditate on Iniversal God, Who Self-protected, protects others. Contemplate upon Him Who is present in every sentient being.

౧౭౬౩ విశ్వో దేవస్యేత్యస్య స్వస్త్యాత్రేయ ఋషిః, విద్వాన్ దేవతా, ఆర్ష్యనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మానవుల కర్తవ్యమేమిటి?

౧౭౬౩ విశ్వో దేవస్య నేతుర్మర్తో వురీత సఖ్యమ్ ।

విశ్వో రాయఽఇషుధ్యతి ద్యుమ్నం వృణీత పుష్యసే స్వాహా॥౨౧॥

ప.వి:- విశ్వః, దేవస్య, నేతుః, మర్తః, వురీత, సఖ్యమ్, విశ్వః, రాయే, ఇషుధ్యతి, ద్యుమ్నమ్, వృణీత, పుష్యసే, స్వాహా.॥౨౧॥

పదార్థః :-(విశ్వః) సర్వః (దేవస్య) విదుషః (నేతుః) (నాయకస్య) (మర్తః) మనుష్యః (వురీత) వృణుయాత్. అత్ర వ్యత్యయేనాత్మనేపదమ్ 'బహులం ఛందసీ' తి శపో లుక్., లిఙ్ప్రయోగో ఉయుమ్ (సఖ్యమ్) మిత్రత్వమ్ (విశ్వః) (రాయే) ధనాయ (ఇషుధ్యతి) యాచతే శరాన్ ధరతి వా (ద్యుమ్నమ్) ధనం యశో వా (వృణీత) (పుష్యసే) పుష్టయే (స్వాహా).॥౨౧॥

అన్వయః :-యథా విశ్వో మర్తో నేతుర్దేవస్య సఖ్యం వురీత యథా వా విశ్వో మర్త్యో రాయ ఇషుధ్యతి తథా స్వాహా పుష్యసే ద్యుమ్నం వృణీత.॥౨౧॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. సర్వే మనుష్యా విద్వద్భిః సహ సుహృదో భూత్వా విద్యాం యశశ్చ గృహీత్వా శ్రీమన్తో భూత్వా సుపథ్యేన పుష్టాః సంతు.॥౨౧॥

పదార్థము :-ఎట్లు (విశ్వః) సమస్త (మర్తః) మనుష్యులు (నేతుః) నాయకత్వము, అనగా సకలవ్యవహారముల ప్రాప్తిని గలిగించు (దేవస్య) విద్వాంసుని (సఖ్యమ్) మిత్రత్వమును (వృణీత) స్వీకరించెదరో లేక ఎట్లు (విశ్వః) సకల మానవులు (రాయే) ధనములకొరకు (ఇషుధ్యతి) యాచించుదురో లేక తమ తమ ధనుస్సులందు బాణములను ధరించెదరో, అటులనే (స్వాహా) సత్యక్రియ లేక సత్యవాణిచే (పుష్యసే) పుష్టికొరకు (ద్యుమ్నమ్) ధనము మరియు యశస్సును (వృణీత) స్వీకరించెదరు గాక! ॥ ౨౧ ॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులెల్లరును విద్వాంసులతో మిత్రులైయుండి విద్యలను, యశస్సును గ్రహించవలయును. దానిద్వారా ధనవంతుడు, కాంతిమంతుడై యోగ్యమగు ఉత్తమ ఆహారములను గ్రహించుచు సన్మార్గవర్తనులై పుష్టివంతులై యుండవలయును. ॥౨౧॥

21. May every mortal man contract the friendship of the guiding God. Each one solicits Him for wealth, and for strength, aspires after fame and riches through noble deeds.

౧౭౨౨. ఆ బ్రహ్మన్నిత్యస్య ప్రజాపతిర్ఋషిః. లింగోక్తా దేవతాః. స్వరాడుత్కృతిశ్ఛందః, షడ్జః స్వరః
పునర్మనుష్యైః కిమేష్టవ్యమిత్యాహ. మానవు లేమేమి యభిలషించవలయును?

౧౭౨౨ ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతామా రాష్ట్రే రాజన్యః
శూరఽఇషవ్యోఽతివ్యాధీ మహారథో జాయతాం దోగ్ధ్రీ ధేనుర్వో
ఢానడ్వానాశుః సప్తిః పురన్ధిర్యోషా జిష్ణూ రథేష్ఠాః సభేయో యువాఽస్య
యజమానస్య వీరో జాయ తాం నికామే నికామే నః పర్జన్యో వర్షతు
ఫలవత్యో నఽఓషధయః పచ్యన్తాం యోగ క్షేమో నః కల్పతామ్ ॥౨౨॥

ప.విః- ఆ, బ్రహ్మన్, బ్రాహ్మణః, బ్రహ్మవర్చసీతి బ్రహ్మ+వర్చసీ, జాయతామ్, ఆ, రాష్ట్రే, రాజన్యః, శూరః, ఇషవ్యః, అతివ్యాధీత్యతి+వ్యాధీ, మహారథ ఇతి మహా+రథః, జాయతామ్, దోగ్ధ్రీ, ధేనుః, వోఢా, అనడ్వాన్, ఆశుః సప్తిః, పురన్ధిరితి పురమ్+ధిః, యోషా, జిష్ణుః, రథేష్ఠాః, రథేష్ఠా ఇతి రథే +స్థాః, సభేయః యువా, ఆ, అస్య, యజమానస్య, వీరః, జాయతామ్, నికామే నికామ ఇతి నికామే+ నికామే, నః, పర్జన్యః, వర్షతు, ఫలవత్య ఇతి ఫల + వత్యః, నః, ఓషధయః, పచ్యన్తామ్ యోగక్షేమ ఇతి యోగ + క్షేమః, నః, కల్పతామ్. ॥౨౨॥

పదార్థః :-(ఆ) సమన్తాత్ (బ్రహ్మన్) విద్యాదినా సర్వేభ్యో మహాన్ పరమాత్మన్ (బ్రాహ్మణః) వేదేశ్వరవిత్ (బ్రహ్మవర్చసీ) వేదవిద్యాప్రదీప్తః (జాయతామ్) ఉత్పద్యతామ్ (ఆ) (రాష్ట్రే) రాజ్యే (రాజన్యః) రాజపుత్రః (శూరః) నిర్భయః (ఇషవ్యః) ఇషుషు సాధుః (అతివ్యాధీ) అతిశయేన వ్యద్ధుం శత్రూన్ తాడయితుం శీలం యస్య సః (మహారథః) మహాన్తో రథా వీరా వా యస్య సః (జాయతామ్) (దోగ్ధ్రీ) ప్రపూరికా (ధేనుః) గౌః (వోఢా) వాహకః (అనడ్వాన్) వృషభః (ఆశుః) శీఘ్రగామీ (సప్తిః) అశ్వః (పురన్ధిః) యా పురూన్

బహూన్ దధాతి సా (యోషా) (జిష్ణుః) జయశీలః (రథేష్ఠాః) యో రథే తిష్ఠతి సః (సభేయః) సభాయాం సాధుః (యువా) ప్రాప్తయౌవనః (ఆ) (అస్య) (యజమానస్య) యో యజేత దేవాన్ విదుషః సత్కరోతి సంగచ్ఛతే సుఖాని దదాతి వా తస్య (వీరః) విజ్ఞానవాన్ శత్రూణాం ప్రక్షేప్తా (జాయతామ్) (నికామే నికామే) నిశ్చితే ప్రత్యేకకామనాయామ్ (నః) అస్మాకమ్ (పర్జన్యః) మేఘః (వర్షతు) (ఫలవత్యః) బహూత్తమఫలాః (నః) అస్మభ్యమ్ (ఓషధయః) యవాదయః (పచ్యంతామ్) పరిపక్వా భవంతు (యోగక్షేమః) అప్రాప్తస్య ప్రాప్తిలక్షణో యోగస్తస్య రక్షణం క్షేమః (నః) అస్మభ్యమ్ (కల్పతామ్) సమర్థో భవతు.॥22॥

అన్వయః:-హే బ్రహ్మన్! యథా నో రాష్ట్రే బ్రహ్మవర్చసీ బ్రాహ్మణ ఆజాయతామిషవ్యోఽతివ్యాధీ మహారథః శూరో రాజన్య ఆజాయతాం దోగ్ధ్రీ ధేనుర్వోఢాఽనడ్వానాశుః సప్తిః పురంధిర్యోషా రథేష్ఠా జిష్ణుః సభేయో యువాఽఽజాయతామస్య యజమానస్య రాష్ట్రే వీరో జాయతాం నో నికామే నికామే పర్జన్యో వర్షత్వోషధయః ఫలవత్యో నః పచ్యన్తాం నో యోగక్షేమః కల్పతాం తథా విధేహి.॥22॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః.విద్వద్భిరీశ్వరప్రార్థనయా సహైవమనుష్ఠేయం యతః పూర్ణ విద్యాః శూరవీరా మనుష్యాః స్త్రియశ్చ సుఖప్రదాః పశవః సభ్యా మనుష్యా ఇష్టా వృష్టిర్మధురఫలయుక్తా అన్నౌషధయో భవంతు కామశ్చ పూర్ణః స్యాదితి.॥22॥

పదార్థము :-(బ్రహ్మన్) విద్యాదిగుణములచే సర్వశ్రేష్ఠుడవైయున్న ఓపరమేశ్వరా! (రాష్ట్రే) మా రాజ్యము నందు (బ్రహ్మవర్చసీ) వేదవిద్యాప్రకాశమును ప్రాప్తిజేసికొనిన (బ్రాహ్మణః) వేదము మరియు పరమేశ్వరుని చక్కగా నెరిగిన బ్రాహ్మణుడు (ఆ, జాయతామ్) అన్నివిధములుగ ఉత్పన్నమగుగాక! (ఇషవ్యః) విలువిద్యయందు ఉత్తమగుణవంతులు (అతివ్యాధీ) శత్రువులకు అత్యధికవ్యధను, అనగా తాడనమొనర్చు స్వభావము గలవారు (మహారథః) ఉత్తమ రథములు, మహారథికులైన శూరవీరులగు సైన్యములు గలవారు (శూరః) నిర్భయుడగు (రాజన్యః) రాజపుత్రుడు (ఆ, జాయతామ్) అన్నివిధములుగ ఉత్పన్నమగుగాక! (దోగ్ధ్రీ) కామితములను మరియు దుగ్ధములచే పూర్ణపరచునట్టి (ధేనుః) వాణి లేక గోవులు (వోఢా) భారముల మోయుటయందు సమర్థవంతమగు (అనడ్వాన్) గొప్పబలిష్ఠమైన ఎద్దులు (ఆశుః) శీఘ్రముగా పయనించు (సప్తిః) అశ్వములు (పురన్ధిః) అనేక వ్యవహారములను ధారణ మొనర్చు (యోషా) మహిళామణులు (రథేష్ఠాః) రథములపై స్థిరమగుట, మరియు (జిష్ణుః) శత్రువులనిర్జించునట్టివారు (సభేయః) సభయందుత్తమ సభ్యులు (యువా) యువకరత్నములు (ఆ, జాయతామ్) ఉత్పన్నమగుదురుగాక! (అస్య,యజమానస్య) విద్వాంసులు సత్కరించువారు, సుఖముల సంగతమొనర్చువారు మరియు సుఖముల నిచ్చువారు. ఈ రాజుయొక్క రాజ్యమునందు (వీరః) విశేషజ్ఞాన వంతులు, శత్రుహంతకులగు వీరు లుత్పన్నమగుదురుగాక! (నః) మాయొక్క (నికామే నికామే) నిశ్చయవంతమగు ప్రతి కామితమందును అనగా

ఏ కార్యములందు కోరుచుందుమో, అట్టి కార్యములందు (పర్జన్యః) మేఘములు (వర్షతు) వర్షించునుగాక! (ఓషధయః) ఓషధులు (ఫలవత్యః) అధిక ఉత్తమ ఫలవంతములు (నః) మాకొరకు (పచ్యన్తామ్) పక్వమగుగాక! (నః) మాకొరకు అప్రాప్త వస్తువుల ప్రాప్తి గలిగించు యోగ రక్షణ మొనర్చు, అనగా నిర్వాహకయోగ్యమగు పదార్థముల ప్రాప్తి (కల్పతామ్) సమర్థవంత మగునట్లు విధానమొనర్చుము, అనగా వ్యవహార ప్రకటనమొనర్చుము. ॥౨౨॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులు ఈశ్వర ప్రార్థనా సహితముగ ఇట్టి యనుష్ఠాన మొనర్చవలయును అనగా దీనివల్ల పూర్ణవిద్యావంతులగు శూరవీరులు నగు మనుష్యులు, మరియు నట్టి గుణములే గలిగియున్న మహిళలు, సుఖములను గలిగించు పశువులు, సభ్యులగు ప్రజలు కోరినపుడెల్లను గురియుచుండు వర్షములు, మధుర ఫలయుక్తమగు అన్నము మరియు ఓషధులుండు గాక! మరియు కామితములు పూర్ణమగుచుండుగాక! ॥౨౨॥

22. O God let there be born in our country the Brahmana, illustrious for the knowledge of the vedas; let there be born the prince, heroic, skilled archer, piercing the foe with shafts, mighty warrior; the cow giving abundant milk, the ox good at carring burden; the swift courser; the woman skilled in domestic affairs. May this sacrificer be blessed, with sons, conquering, equipped with convyances, civilised, young, and heroic. May cloud send rain according to our desire; may our fruitbearing trees ripen; may acquisition and preservation of property be secured to us.

౧౨౯౫. ప్రాణాయేత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రాణాదయో దేవతాః స్వరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః కిమర్థో హోమో విధేయ ఇత్యాహ. హోమము నెందుకు విధాన మొనర్చవలయును?

**౧౨౯౫ ప్రాణాయ స్వాహాఽపానాయ స్వాహా వ్యానాయ స్వాహా చక్షుషే స్వాహా శ్రోత్రాయ స్వాహా వాచే స్వాహా మనసే స్వాహా ॥౨౩॥**

**ప.వి:-** ప్రాణాయ, స్వాహా, అపానాయ, స్వాహా, వ్యానాయేతి వి + ఆనాయ, స్వాహా, చక్షుషే, స్వాహా, శ్రోత్రాయ, స్వాహా, వాచే, స్వాహా, మనసే, స్వాహా. ॥౨౩॥

పదార్థః :- (ప్రాణాయ) య ఆభ్యంతరాద్బహిర్నిస్సరతి తస్మై (స్వాహా) యోగయుక్తా క్రియా, (అపానాయ) యో బహిర్దేశాదాభ్యంతరం గచ్ఛతి తస్మై (స్వాహా) (వ్యానాయ) యో వివిధేష్వఙ్గేష్వనితి వ్యాప్నోతి తస్మై (స్వాహా) వైద్యకవిద్యాయుక్తా వాక్ (చక్షుషే) చష్టే పశ్యతి యేన తస్మై (స్వాహా) ప్రత్యక్షప్రమాణయుక్తా వాణీ (శ్రోత్రాయ) శృణోతి యేన తస్మై

(స్వాహా) ఆప్తోపదేశయుక్తా గీః (వాచే) వక్తి యయా తస్యై (స్వాహా) సత్యభాషణాదియుక్తా భారతీ (మనసే) మనననిమిత్తాయ సంకల్పవికల్పాత్మనే (స్వాహా) విచారయుక్తా వాణీ.॥23॥

అన్వయః :- యైర్మనుష్యైః ప్రాణాయ స్వాహాఽపానాయ స్వాహా, వ్యానాయ స్వాహా, చక్షుషే స్వాహా, శ్రోత్రాయ స్వాహా, వాచే స్వాహా, మనసే స్వాహా, చ ప్రయుజ్యతే తే విద్వాంసో జాయన్తే.॥23॥

భావార్థః :- యే మనుష్యా యజ్ఞేన శోధితాని జలౌషధివాయ్వన్నపత్రపుష్పఫలరసకందాదీన్యశ్నన్తి తేఽరోగా భూత్వా ప్రజ్ఞాబలారోగ్యాయుష్మన్తో జాయన్తే.॥23॥

పదార్థము :- ఏ మనుష్యులు (ప్రాణాయ) లోపలినుండి వెలుపలకు వెడలు వాయువు (స్వాహా) యోగవిద్యచే గూడిన క్రియను (అపానాయ) వెలుపలినుండి లోపలికి ప్రవేశించు వాయువుకొరకు(స్వాహా) వైద్యవిద్యతో గూడిన క్రియను (వ్యానాయ) అనేక విధములగు వ్యాప్తమగునట్టి వాయువుకొరకు (స్వాహా) వైద్యవిద్యతో గూడిన వాణి (చక్షుసే) ప్రాణులు చూచునట్టి నేత్రేంద్రియములకొరకు (స్వాహా) ప్రత్యక్ష ప్రమాణయుక్త వాణి (శ్రోత్రాయ) సకల ధ్వనులను వినునట్టి కర్ణేంద్రియములకొరకు (స్వాహా) శాస్త్రజ్ఞుడగు విద్వాంసుని ఉపదేశముతో గూడిన వాణి (వాచే) ఉచ్చరించునట్టి వాణికొరకు (స్వాహా) సత్యభాషణము మున్నగు వ్యవహారములతో గూడిన సంభాషణ కొరకు మరియు (మనసే) ఆలోచించునిమిత్తము సంకల్ప వికల్పములు గల మనస్సుకొరకు (స్వాహా) ఆలోచనలతో పూర్ణమగు వాణిని ప్రయోగ మొనర్చు - అనగా చక్కగా ఉచ్చరించువాడే విద్వాంసుడు. ॥23॥

భావార్థము :- యజ్ఞముద్వారా శుద్ధపరచబడిన జలము, ఓషధులు, వాయువు, అన్నము పత్రము, ఫలము, పుష్పము, రసము, కందములు - అనగా చేమ, బంగాళాదుంపలు, తుంగముస్తెలు, పెండలము, చిలగడదుంపలు మున్నగు పదార్థములను భోజనమొనర్చువారు రోగరహితులై బుద్ధి, బలము, ఆరోగ్యము, ఆయువు వృద్ధి గలిగి సుఖముగా నుందురు. ॥23॥

23. Control the out- going, in - going and diffusive breaths through yogic practices. Take care of your eyesight. Enhance your power of hearing. Use your speech nicely. Concentrate your mine.

౧౨౯౬. ప్రాచ్యై దిశే ఇత్యస్య ప్రజాపతిరృషిః, దిశో దేవతాః, నిచృదతిధృతిశ్ఛందః, షడ్జః స్వరః.

పునః కిమర్థో హోమః కర్తవ్య ఇత్యాహ. హోమ మెందుల కొనర్చవలయును?

౧౨౯౬ ప్రాచ్యై దిశే స్వాహార్వాచ్యై దిశే స్వాహా దక్షిణాయై దిశే స్వాహార్వాచ్యై దిశే స్వాహా ప్రతీచ్యై దిశే స్వాహార్వాచ్యై దిశే స్వాహోదీచ్యై దిశే

స్వాహోర్వాచ్యై దిశే స్వాహోర్ధ్వాయై దిశే స్వాహోర్వాచ్యై దిశే స్వాహావాచ్యై

దిశే స్వాహోర్వాచ్యై దిశే స్వాహా ॥౨౪॥

ప.వి:- ప్రాచ్యై, దిశే, స్వాహా, అర్వాచ్యై, దిశే, స్వాహా, దక్షిణాయై, దిశే, స్వాహా అర్వాచ్యై, దిశే, స్వాహా, ప్రతీచ్యై, దిశే, స్వాహా, అర్వాచ్యై దిశే, స్వాహా, ఉదీచ్యై, దిశే, స్వాహా, అర్వాచ్యై, దిశే, స్వాహా, ఊర్ధ్వాయై, దిశే, స్వాహా, అర్వాచ్యై, దిశే, స్వాహా, అవాచ్యై, దిశే, స్వాహా, అర్వాచ్యై, దిశే, స్వాహా.॥౨౪॥

పదార్థః :-(ప్రాచ్యై) యా ప్రాఞ్చతి ప్రథమమాదిత్య సంయోగాత్తస్యై (దిశే) (స్వాహా) జ్యోతిః శాస్త్రవిద్యాయుక్తా వాక్ (అర్వాచ్యై) యాఽర్వాగధోఽఞ్చతి తస్యై (దిశే) (స్వాహా) (దక్షిణాయై) యా పూర్వముఖస్య పురుషస్య దక్షిణబాహుసన్నిధౌ వర్తతే తస్యై (దిశే) (స్వాహా) (అర్వాచ్యై) అధస్తాద్వర్తమానాయై (దిశే) (స్వాహా) (ప్రతీచ్యై) యా ప్రత్యక్ అంచతి పూర్వముఖస్థితపురుషస్య పృష్ఠభాగా తస్యై (దిశే) (స్వాహా) (అర్వాచ్యై) (దిశే) (స్వాహా) (ఉదీచ్యై) యోదక్ పూర్వాభిముఖస్య జనస్య వామభాగమఞ్చతి తస్యై (దిశే) (స్వాహా) (అర్వాచ్యై) (దిశే) (స్వాహా) (ఊర్ధ్వాయై) ఊర్ధ్వం వర్తమానాయై (దిశే) (స్వాహా) (అర్వాచ్యై) యా అవవిరుద్ధ మంచతి తస్యై ఉపదిశే (దిశే) (స్వాహా) (అవాచ్యై) (దిశే) (స్వాహా) (అర్వాచ్యై) (దిశే) (స్వాహా).॥౨౪॥

అన్వయః :-యైర్విద్వద్భిః ప్రాచ్యై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహా, దక్షిణాయై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహా, ప్రతీచ్యై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహోదీచ్యై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహోర్ధ్వాయై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహాఽవాచ్యై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహా చ విధీయతే తే సర్వతః కుశలినో భవన్తి.॥౨౪॥

భావార్థః :-హే మనుష్యాశ్చతస్రో ముఖ్యా దిశః సన్తి తథా చతస్ర ఉపదిశోఽపి వర్తన్త ఏవమూర్ధ్వాఽర్వాచీ చ దిశౌ వర్తేతే. తా మిలిత్వా దశ జాయంత ఇతి వేద్యమ్. అనవస్థితా ఇమా విభ్వాశ్చ సన్తి యత్ర స్వయం స్థితో భవేత్ తద్దేశమారభ్య సర్వాసాం కల్పనా భవతీతి విజానీత.॥౨౪॥

**పదార్థము** :- ఏ విద్వాంసులు (ప్రాచ్యై) మొదట ప్రాప్తించు - అనగా సూర్యమండల సంయోగముగల (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిశ్శాస్త్రవిద్యతో గూడిన వాణి(అర్వాచ్యై) క్రిందినుండి సూర్యమండలమును పొందు, అనగా విషువరేఖనుండి ఉత్తర ప్రాంతమునుండి సూర్యుడు మెలమెల్లగా దిగుచుండు (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిః శాస్త్రయుక్తవాణి (దక్షిణాయై) పూర్వదిశకు ముఖముంచిన మనుష్యుని కుడివైపున నుండు ఆ దక్షిణ (దిశే) దిశకొరకు (స్వాహా) ఉక్తవాణి (అర్వాచ్యై) క్రిందనున్నట్టి యా (దిశే) దిశకొరకు (స్వాహా) ఉక్తవాణి (ప్రతీచ్యై) సూర్యుడుదయించు వైపునకు ముఖముంచినమనుష్యుని వీపు ఉండు పశ్చిమ [పడమర] (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిః శాస్త్రముతో గూడిన వాణి (అర్వాచ్యై) పశ్చిమమునకు దిగువ గల (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిఃశాస్త్రయుక్తవాణి (ఉదీచ్యై) తూర్పుముఖముగలవానికి ఎడమ నున్న ఉత్తర (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిశ్శాస్త్రముతో గూడిన వాణి (అర్వాచ్యై) గుండ్రని పృథివికి ఉత్తరదిశకు క్రిందగల (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిః శాస్త్రయుక్తవాణి (ఊర్ధ్వాయై) దానికి పైనున్నట్టి (దిశే) దిశకకొరకు (స్వాహా) జ్యోతిఃశాస్త్ర యుక్తవాణి (అర్వాచ్యై) విరుద్ధముగా గాన్పించు పైనుండుదిశకు క్రింద, అనగా ఒకప్పుడు పూర్వము, మరొకప్పుడు పశ్చిమము, ఒకప్పుడు ఉత్తరము, వేరొకప్పుడు దక్షిణముగా నెంచబడుచుండునో అట్టి (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిఃశాస్త్రయుక్తవాణి, మరియు (అవాచ్యై) అన్నిటిక్రిందనున్న (దిశే) దిశకొరకు (స్వాహా) జ్యోతిః శాస్త్రాలోచనతో గూడిన వాణి మరియు (అర్వాచ్యై) పృథివియొక్క గుండ్రదనముచే పైదెలిపిన ప్రతి కోణముయొక్క దిశల యడుగునగల (దిశే) దిశలకొరకు (స్వాహా) జ్యోతిశ్శాస్త్రవిద్యతో గూడిన వాణిని ప్రయోగించువారెల్లరును కుశలురు, ఆనందయుక్తులునై యుందురు. ॥౨౪॥

**భావార్థము** :- ఓ మానవులారా! నాలుగు ముఖ్యదిశలు మరియు నాలుగు ఉపదిశలు, అనగా మూలదిశలుయై యున్నవి. ఇట్లే పైన, దిగువను గూడ రెండు దిశలు గలిసి పది దిశలగును. వీనిని దెలిసికొనవలెను. ఇవి ఒక క్రమముగా నిర్ణయింపజాలనివి యైనను వాని కల్పనకు సమర్థములునునై యున్నవి. వానిని స్థిరపరచుకొనుటకై మనుష్యుడు తాను నిలబడియున్న తావునుండియే సకలదిశలను కల్పన మొనర్చుకొను పద్ధతిని మానవులు చేపట్టవలయును. ॥౨౪॥

24. Have scientific knowledge and make use of the Eastern Region, and its hitherward Region; the Southern Region, and its hitherward Region; the Western Region and its hitherward Region; the Northern Region and its hitherward Region; the Upward Region and its hitherwrd Region; the Downward Region and its hitherwrd Region.

౧౨౯౭. అద్భ్య ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, జలాదయో దేవతాః, అష్టిశ్ఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౨౯౭ అద్భ్యః స్వాహా, వార్భ్యః స్వాహోదకాయ స్వాహా తిష్ఠన్తీభ్యః స్వాహా

స్రవన్తీభ్యః స్వాహా స్యన్దమానాభ్యః స్వాహా కూప్యాభ్యః స్వాహా

సూద్యాభ్యః స్వాహా, ధార్యాభ్యః స్వాహా ర్ణవాయ స్వాహా

సముద్రాయ స్వాహా సరిరాయ స్వాహా॥25॥

ప.వి:- అద్భ్య ఇత్యత్ + భ్యః, స్వాహా, వార్భ్య ఇతి వాః+భ్యః, స్వాహా, ఉదకాయ, స్వాహా, తిష్ఠన్తీభ్యః, స్వాహా, స్రవన్తీభ్యః, స్వాహా, స్యన్దమానాభ్యః, స్వాహా, కూప్యాభ్యః, స్వాహా, సూద్యాభ్యః, స్వాహా, ధార్యాభ్యః, స్వాహా, అర్ణవాయ, స్వాహా, సముద్రాయ, స్వాహా, సరిరాయ, స్వాహా.॥25॥

పదార్థః :-(అద్భ్యః) జలేభ్యః (స్వాహా) శుద్ధికారికా క్రియా (వార్భ్యః) వరణీయేభ్యః (స్వాహా) (ఉదకాయ) ఆర్ద్రీకారకాయ (స్వాహా) (తిష్ఠన్తీభ్యః) స్థిరాభ్యః (స్వాహా) (స్రవన్తీభ్యః) సద్యోగామినీభ్యః (స్వాహా) (స్యన్దమానాభ్యః) ప్రస్రుతాభ్యః (స్వాహా) (కూప్యాభ్యః) కూపేషు భవాభ్యః (స్వాహా) సూద్యాభ్యః సుష్ఠుక్లేదికాభ్యః (స్వాహా) (ధార్యాభ్యః) ధర్తుం యోగ్యాభ్యః (స్వాహా) (అర్ణవాయ) బహూన్యర్ణాంసి విద్యన్తే యస్మిఀస్తస్మై (స్వాహా) (సముద్రాయ) సముద్రవన్త్యాపో యస్మింస్తస్మై (స్వాహా) (సరిరాయ) కమనీయాయ (స్వాహా).॥25॥

అన్వయః :- య్యైర్మనుష్యైర్యజ్ఞేషు సుగన్ధ్యాదిద్రవ్యహవనాయాఽద్భ్యః స్వాహా, వార్భ్యః స్వాహోదకాయ స్వాహా, తిష్ఠన్తీభ్యః స్వాహా, స్రవన్తీభ్యః స్వాహా, స్యన్దమానాభ్యః స్వాహా, కూప్యాభ్యః స్వాహా, సూదాభ్యః స్వాహా, ధార్యాభ్యః స్వాహాఽర్ణవాయ స్వాహా, సముద్రాయ స్వాహా, సరిరాయ స్వాహా చ విధీయతే, తే సర్వేషాం సుఖప్రదా జాయన్తే.॥25॥

భావార్థః :-యే మనుష్యా అగ్నౌ సుగన్ధ్యాదిద్రవ్యాణి జుహుయుస్తే జలాదిశుద్ధికారకా భూత్వా పుణ్యాత్మానో జాయన్తే జలశుద్ధ్యైవ సర్వేషాం శుద్ధిర్భవతీతి వేద్యమ్ ॥25॥

**పదార్థము :-** ఏ మనుష్యులు యజ్ఞకర్మలందు సుగంధ, రోగనాశక, పుష్టివర్ధకము మున్నగు పదార్థములను హోమమొనర్చుటకై (అద్భ్యః) సామాన్య జలములకై (స్వాహా) వానిని శుద్ధపరచు క్రియను (వార్భ్యః) స్వీకరించదగిన అత్యుత్తమజలములకై (స్వాహా) వానిని శుద్ధమొనర్చు క్రియను (ఉదకాయ) పదార్థములను తడుపు లేక సూర్యకిరణముల కంటే పైకెగసిపోవు జలములకొరకు (స్వాహా) వానిని శుద్ధపరచునట్టి క్రియను (తిష్ఠన్తీభ్యః) ప్రవహించు జలములకై (స్వాహా) పైక్రియను (స్రవన్తీభ్యః) వడిగా ప్రవహించు జలములకై

(స్వాహా) ఉక్తక్రియను (స్యన్దమానాభ్యః) నిలుకడగా ప్రవహించు జలములకై (స్వాహా) ఉక్తక్రియను (కూప్యాభ్యః) కూపమునందుండు జలములకై (స్వాహా) పైన దెలిపిన క్రియను (సూద్యాభ్యః) బాగుగాసేచనపరచు వర్షము మున్నగు జలములకై (స్వాహా) పైక్రియను (ధార్యాభ్యః) ధరించదగు జలములకై (స్వాహా) వానిని శుద్ధపరచుక్రియను (అర్ణవాయ) గొప్పజీవనదులకొరకు (స్వాహా) పై క్రియను (సముద్రాయ) నదీ, నద, మహానదములు, సెలయేరు, సరస్సులు మున్నగువాని జలములు చివరకు చేరు సాగర మహాసాగరములకొరకు (స్వాహా) శుద్ధపరచుక్రియను (సరిరాయ) అతిసుందర, మనోహర తటాక జలములకై (స్వాహా) వానిని రక్షణజేయు క్రియావిధానమగు ప్రయోగముల నొనర్చువారెల్లరును సమస్త ప్రాణులకును సుఖమును గలిగించువా రగుచున్నారు. ॥౨౫॥

భావార్థము :- అగ్నియందు సుగంధాది పదార్థములను హోమమొనర్చు పుణ్యాత్ములు జలములు మున్నగు పదార్థములను శుద్ధి యొనర్చువారలగుదురు. జలముల శుద్ధిచేతనే సమస్త పదార్థములు శుద్ధియగును అని అందరెరుగవలెను. ॥౨౫॥

25. Purify, utilise, and use ordinary waters, excellent healing waters, waters rising above in vapours through sun's heat; stading waters, fast flowing waters, slowly moving waters; well-waters, rain - waters; tank - waters, sea - waters, waters in the ocean; and charming and beautiful waters.

౧౨౬. వాతాయేత్యస్య ప్రజాపతిర్ఋషిః, వాతాదయో దేవతాః, విరాడభికృతి శ్ఛందః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౨౬ వాతాయ స్వాహా ధూమాయ స్వాహాభ్రాయ స్వాహా మేఘాయ స్వాహా
విద్యోతమానాయ స్వాహా స్తనయతే స్వాహాఽవస్ఫూర్జతే స్వాహా
వర్షతే స్వాహాఽవవర్షతే స్వాహోగ్రం వర్షతే స్వాహా శీఘ్రం వర్షతే
స్వాహోద్గృహ్ణతే స్వాహో ద్గృహీతాయ స్వాహా ప్రుష్ణతే స్వాహా శీకాయతే
స్వాహా ప్రుష్వాభ్యః స్వాహా హ్రాదునీభ్యః స్వాహా నీహారాయ స్వాహా॥౨౬॥

ప. వి:- వాతాయ, స్వాహా, ధూమాయ, స్వాహా, అభ్రాయ, స్వాహా, మేఘాయ, స్వాహా, విద్యోతమానాయేతి వి + ద్యోతమానాయ, స్వాహా, స్తనయతే, స్వాహా, అవస్ఫూర్జత

ఇత్యవ+స్ఫూర్జతే, స్వాహా, వర్షతే, స్వాహా, అవవర్షత ఇత్యవ + వర్షతే, స్వాహా, ఉగ్రమ్, వర్షతే, స్వాహా, శీఘ్రమ్, వర్షతే, స్వాహా, ఉద్గృహ్ణత ఇత్యుత్ + గృహ్ణతే, స్వాహా, ఉద్గృహీతాయేత్యుత్ + గృహీతాయ, స్వాహా, ప్రుష్ణతే,స్వాహా, శీకాయతే, స్వాహా, ప్రుష్వాభ్యః, స్వాహా, హ్రాదునీభ్యః, స్వాహా, నీహారాయ, స్వాహా.॥౨౬॥

పదార్థః :-(వాతాయ) యో వాతి తస్మై (స్వాహా) (ధూమాయ) (స్వాహా) (అభ్రాయ) మేఘనిమిత్తాయ (స్వాహా) (మేఘాయ) యో మేహతి సిఞ్చతి తస్మై (స్వాహా) (విద్యోతమానాయ) విద్యుతః ప్రవర్తకాయ (స్వాహా) (స్తనయతే) దివ్యం శబ్దం కుర్వతే (స్వాహా) (అవస్ఫూర్జతే) అధో వజ్రవద్ ఘాతం కుర్వతే (స్వాహా) (వర్షతే) యో వర్షతి తస్మై (స్వాహా) (అవవర్షతే) (స్వాహా) (ఉగ్రమ్) తీవ్రమ్ (వర్షతే) (స్వాహా) (శీఘ్రమ్) తూర్ణమ్ (వర్షతే) స్వాహా (ఉద్గృహ్ణతే) య ఊర్ధ్వం గృహ్ణాతి తస్మై (స్వాహా) (ఉద్గృహీతాయ) ఊర్ధ్వం గృహీతం జలం యేన తస్మై (స్వాహా) (ప్రుష్ణతే) పుష్టిం పూరయతే (స్వాహా) (శీకాయతే) యః శీకం సేచనం కరోతి తస్మై (స్వాహా) (ప్రుష్వాభ్యః) పూర్ణాభ్యః (స్వాహా) (హ్రాదునీభ్యః) అవ్యక్తం శబ్దం కుర్వతీభ్యః (స్వాహా) (నీహారాయ) కుహకాయ (స్వాహా).॥౨౬॥

అన్వయః :- యైర్మనుష్యైర్వాతాయ స్వాహా, ధూమాయ స్వాహాఽభ్రాయ స్వాహా, మేఘాయ స్వాహా, విద్యోతమానాయ స్వాహా, స్తనయతే స్వాహాఽవస్ఫూర్జతే స్వాహా, వర్షతే స్వాహాఽవవర్షతే స్వాహోగ్రం వర్షతే స్వాహా, శీఘ్రం వర్షతే స్వాహోద్గృహ్ణతే స్వాహోద్గృహీతాయ స్వాహా, ప్రుష్ణతే స్వాహా, శీకాయతే స్వాహా, ప్రుష్వాభ్యః స్వాహా హ్రాదునీభ్యః స్వాహా, నీహారాయ స్వాహా, చ ప్రయుజ్యతే తే ప్రాణప్రియా జాయన్తే.॥౨౬॥

భావార్థః :- యే యథావిధ్యగ్నిహోత్రాదీన్ కుర్వన్తి తే వాయ్వాదిశోధకా భూత్వా సర్వేషాం హితకరా భవన్తి. ॥౨౬॥

పదార్థము :- ఏ మనుష్యులు (వాతాయ) ప్రవాహక [వీచుచున్న] పవనముకొరకు (స్వాహా) దానిని శుద్ధపరచునట్టి యజ్ఞక్రియను (ధూమాయ) ధూమముకొరకై (స్వాహా) యజ్ఞ క్రియను (అభ్రాయ) మేఘకారణముకొరకై (స్వాహా) యజ్ఞక్రియను (మేఘాయ) మేఘములకై (స్వాహా) యజ్ఞక్రియను (విద్యోతమానాయ) విద్యుత్తును ప్రవృత్తపరచు కారుమబ్బులకై (స్వాహా) యజ్ఞక్రియను (స్తనయతే) ఉత్తమ

శబ్దము నొనర్చు విద్యుత్తుకై (స్వాహా) యజ్ఞక్రియను (అవస్ఫూర్జతే) పరస్పర ఒరిపిడివల్ల వజ్రమువలె క్రిందవడి దెబ్బతీయు విద్యుత్ [ఆశని, పిడుగు] పాతముకొరకు (స్వాహా) శుద్ధపరచునట్టి యజ్ఞక్రియ (వర్షతే) వర్షించు మేఘములకై (స్వాహా) యజ్ఞ క్రియను (అవవర్షతే) కలిసిపోయి క్రిందమీదులై క్రిందచేరిన మేఘములకై (స్వాహా) యజ్ఞక్రియను (ఉగ్రమ్) తీక్ష్ణముగ (వర్షతే) వర్షించుమేఘములకై (స్వాహా) యజ్ఞ క్రియను (శీఘ్రమ్) అతి శీఘ్రము [ఉగ్రము] గా జడిగా విసరికొట్టుచు (వర్షతే) వర్షించు మేఘములకై (స్వాహా) ఉక్త క్రియను (ఉద్గృహ్ణతే) పైపైగానే మేఘములను మేఘములు గ్రహణమొనర్చు మేఘములకొరకై (స్వాహా) యజ్ఞక్రియను (ఉద్గృహీతాయ) పై పైననే జలములను గ్రహించునట్టి మేఘములకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (ప్రుష్ణతే) పుష్టిపరచునట్టి మేఘములకై (స్వాహా) యజ్ఞక్రియను (శీకాయతే) జల్లుజల్లులుగా వర్షించుమేఘములకై (స్వాహా) యజ్ఞక్రియను (ప్రుష్వాభ్యః) పరిపూర్ణ భయంకరముగా వర్షించు మేఘావయవములకై (స్వాహా) యజ్ఞక్రియను (హ్రాదునీభ్యః) అవ్యక్తముగ గడగడమని గర్జించు మేఘములకై (స్వాహా) శుద్ధపరచునట్టి యజ్ఞక్రియను (నీహారాయ) పొగమంచు కొరకు (స్వాహా) దానిని శుద్ధపరచు యజ్ఞకర్మ నొనర్చువారు ప్రపంచ ప్రాణులకు ప్రియమైనవా రగుచున్నారు. ॥౨౬॥

**భావార్థము** :-యథావిధిగా అగ్నిహోత్రము మున్నగు యజ్ఞకర్మల నొనర్చువారు వాయువు మున్నగు పదార్థములను శోధనమొనర్చువారలై సర్వప్రాణుల హితకారకులగుదురు. ॥౨౬॥

26. Perform yajna for the purification of air; for the purification of misty air, for purifying fine cloud; for purifying the cloud; for purifying the dense shining cloud; for purifying the thundering lightning; for purifying the bursting cloud, for purifying the raining clud, for purifying the pourings cloud; for purifying the violently raining cloud; for purifying the high cloud that has held water; for purifying the sprinkling cloud, for purifying the drizzling cloud; for purifying the clouds that rain cats and dogs; for purifying the thundering clouds; and for purifying the hoar-frost.

౧౨౯౯. అగ్నయే స్వాహేత్యస్య ప్రజాపతిర్ఋషిః, అగ్న్యాదయో దేవతాః, జగతీచ్ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరియు విషయ మదియే.

౧౨౯౯ అగ్నయే స్వాహా సోమాయ స్వాహేన్ద్రాయ స్వాహా పృథివ్యై

స్వాహాఽన్తరిక్షాయ స్వాహా దివే స్వాహా, దిగ్భ్యః స్వాహాఽఽశాభ్యః

స్వాహోర్వ్యై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహా ॥౨౭॥

ప.వి:- అగ్నయే, స్వాహా, సోమాయ, స్వాహా, ఇన్ద్రాయ, స్వాహా, పృథివ్యై, స్వాహా,

అన్తరిక్షాయ, స్వాహా, దివే, స్వాహా, దిగ్భ్య ఇతి దిక్ + భ్యః, స్వాహా, ఆశాభ్యః, స్వాహా, ఉర్వ్యై, దిశే, స్వాహా, అర్వాచ్యై దిశే, స్వాహా.॥౨౭॥

పదార్థః :-(అగ్నయే) జాఠరాగ్నయే (స్వాహా) (సోమాయ) ఉత్తమాయ రసాయ (స్వాహా) (ఇంద్రాయ) జీవాయ విద్యుతే పరమైశ్వర్యాయ వా (స్వాహా) (పృథివ్యై) (స్వాహా) (అన్తరిక్షాయ) ఆకాశాయ (స్వాహా) (దివే) ప్రకాశాయ (స్వాహా) (దిగ్భ్యః) (స్వాహా) (ఆశాభ్యః) వ్యాపికాభ్యః (స్వాహా) (ఉర్వ్యై) బహురూపాయై (దిశే) (స్వాహా) (అర్వాచ్యై) నిమ్నాయై (దిశే) (స్వాహా).॥౨౭

అన్వయః :-మనుష్యైరగ్నయే స్వాహా, సోమాయ స్వాహేంద్రాయ స్వాహా, పృథివ్యై స్వాహాఽన్తరిక్షాయ స్వాహా, దివే స్వాహా, దిగ్భ్యః స్వాహాఽఽశాభ్యః స్వాహోర్వ్యై దిశే స్వాహాఽర్వాచ్యై దిశే స్వాహా చాఽవశ్యం విధేయాః.॥౨౭

భావార్థః :-యే మనుష్యా అగ్నిద్వారా ఓషధ్యాదిషు సుగంధ్యాదిద్రవ్యం విస్తారయేయుస్తే జగద్ధితకరాః స్యుః ॥౨౭॥

పదార్థము :-మానవులు (అగ్నయే) జాఠరాగ్ని, అనగా అన్నమును జీర్ణపరచునట్టి జఠరాగ్నికొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (సోమాయ) ఉత్తమరసముకొరకు (స్వాహా) చక్కని క్రియను (ఇన్ద్రాయ) జీవముకొరకు, పరమైశ్వర్యముకొరకు మరియు విద్యుత్తుకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (పృథివ్యై) పృథివికొరకు (స్వాహా) శ్రేష్ఠక్రియను (అన్తరిక్షాయ) ఆకాశముకొరకు (స్వాహా) చక్కని క్రియను (దివే) ప్రకాశముకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (దిగ్భ్యః) పూర్వాది దిశలకొరకు (స్వాహా) శ్రేష్ఠక్రియను (ఆశాభ్యః) ఒకదానియందొకటి వ్యాప్తమగుచున్న అనగా ఈశాన్యము మొదలగు కోణ [మూల] దిశలకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (ఉర్వ్యై) సమయముననుసరించి అనేక రూపములను చూపు, అనగా వేసవి, వర్ష, శీతకాలములను వేర్వేరుగా దోపజేయు (దిశే) దిశలకొరకు (స్వాహా) ఉత్తమ క్రియలను (అర్వాచ్యై) క్రిందనున్న (దిశే) దిశకై (స్వాహా) ఉత్తమ క్రియను అవశ్యముగా విధానమొనర్చవలయును. ॥౨౭॥

**భావార్థము** :-అగ్నిద్వారా, అనగా అగ్నియందు హోమమొనర్చి ఓషధులు మున్నగు పదార్థములందు సుగంధ్యాదిగుణములను విస్తరింపజేయువారు జగమున కుపకారమొనర్చినవా రగుచున్నారు. ॥౨౭॥

27. Improve your digestive faculty; make full use of efficacious juices. Elevate your soul. Till the soil. Enjoy the firmament, and light in the sky. Utilise the quarters and subquarters. Understand the significance of the upward region, and the downward region.

౧౩౦౦. నక్షత్రేభ్య ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, నక్షత్రాదయో దేవతాః, భురిగష్టి ఛందసీ, మధ్యమౌ స్వరౌ.

పునస్తమేవ విషయమాహ. మఱల నదేవిషయము.

౧౩౦౦ నక్షత్రేభ్యః స్వాహా నక్షత్రియేభ్యః స్వాహా ఽహోరాత్రేభ్యః
స్వాహాఽర్ధమాసేభ్యః స్వాహా మాసేభ్యః స్వాహా ఽఋతుభ్యః స్వాహార్తవేభ్యః
స్వాహా సంవత్సరాయ స్వాహా ద్యావాపృథివీభ్యాం స్వాహా చన్ద్రాయ
స్వాహా సూర్యాయ స్వాహా రశ్మిభ్యః స్వాహా వసుభ్యః స్వాహా రుద్రేభ్యః
స్వాహాఽదిత్యేభ్యః స్వాహా మరుద్భ్యః స్వాహా విశ్వేభ్యో దేవేభ్యః
స్వాహా మూలేభ్యః స్వాహా శాఖాభ్యః స్వాహా వనస్పతిభ్యః
స్వాహా పుష్పేభ్యః స్వాహా ఫలేభ్యః స్వాహౌషధీభ్యః స్వాహా॥౨౮॥

ప.వి:- నక్షత్రేభ్యః, స్వాహా, నక్షత్రియేభ్యః, స్వాహా, అహోరాత్రేభ్యః, స్వాహా, అర్ధమాసేభ్య ఇత్యర్ధ + మాసేభ్యః, స్వాహా, మాసేభ్యః, స్వాహా, ఋతుభ్య ఇత్యృతు + భ్యః, స్వాహా, ఆర్తవేఽభ్యః, స్వాహా, సంవత్సరాయ, స్వాహా, ద్యావాపృథివీభ్యామ్, స్వాహా, చన్ద్రాయ, స్వాహా, సూర్యాయ, స్వాహా, రశ్మిభ్య ఇతి రశ్మి + భ్యః, స్వాహా, వసుభ్య ఇతి వసు + భ్యః, స్వాహా, రుద్రేభ్యః, స్వాహా, ఆదిత్యేభ్యః, స్వాహా, మరుద్భ్య ఇతి మరుత్ + భ్యః, స్వాహా, విశ్వేభ్యః, దేవేభ్యః, స్వాహా, మూలేభ్యః, స్వాహా, శాఖాభ్యః, స్వాహా, వనస్పతిభ్య ఇతి వనస్పతి + భ్యః, స్వాహా, పుష్పేభ్యః, స్వాహా, ఫలేభ్యః, స్వాహా, ఓషధీభ్యః, స్వాహా. ॥౨౮॥

పదార్థః :-(నక్షత్రేభ్యః) అక్షీణేభ్యః (స్వాహా) (నక్షత్రియేంభ్యః) నక్షత్రాణాం సమూహేభ్యః (స్వాహా) (అహోరాత్రేభ్యః) అహర్నిశేభ్యః (స్వాహా) (అర్ధమాసేభ్యః) (స్వాహా) (మాసేభ్యః)(స్వాహా) (ఋతుభ్యః) (స్వాహా) (ఆర్తవేభ్యః) ఋతుజాతేభ్యః (స్వాహా) (సంవత్సరాయ) (స్వాహా) (ద్యావాపృథివీభ్యామ్) భూమిప్రకాశాభ్యామ్ (స్వాహా) (చన్ద్రాయ) (స్వాహా) (సూర్యాయ) (స్వాహా) (రశ్మిభ్యః) కిరణేభ్యః (స్వాహా) (వసుభ్యః) పృథివ్యాదిభ్యః (స్వాహా) (రుద్రేభ్యః) ప్రాణజీవేభ్యః (స్వాహా) (ఆదిత్యేభ్యః) అవినాశిభ్యః కాలావయవేభ్యః (స్వాహా) (మరుద్భ్యః) (స్వాహా) (విశ్వేభ్యః) సర్వేభ్యః (దేవేభ్యః) దివ్యగుణేభ్యః (స్వాహా) (మూలేభ్యః) (స్వాహా) (శాఖాభ్యః) (స్వాహా) (వనస్పతిభ్యః) (స్వాహా) (పుష్పేభ్యః) (స్వాహా) (ఫలేభ్యః) (స్వాహా) (ఓషధీభ్యః) (స్వాహా).॥౨౮॥

అన్వయః :- మనుష్యైర్నక్షత్రేభ్యః స్వాహా నక్షత్రియేంభ్యః స్వాహాఽహోరాత్రేభ్యః స్వాహాఽర్ధమాసేభ్యః స్వాహా మాసేభ్యః స్వాహర్తుభ్యః స్వాహాఽఽర్తవేభ్యః స్వాహా, సంవత్సరాయ స్వాహా, ద్యావాపృథివీభ్యాం స్వాహా, చన్ద్రాయ స్వాహా, సూర్యాయ స్వాహా, రశ్మిభ్యః స్వాహా, వసుభ్యః స్వాహా, రుద్రేభ్యః స్వాహాఽఽదిత్యేభ్యః స్వాహా, మరుద్భ్యః స్వాహా, విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా, మూలేభ్యః స్వాహా, శాఖాభ్యః స్వాహా, వనస్పతిభ్యః స్వాహా, పుష్పేభ్యః స్వాహా, ఫలేభ్యః స్వాహౌషధీభ్యః స్వాహాచావశ్యమనుష్ఠేయాః.॥౨౮॥

భావార్థః :-మనుష్యా నిత్యం సుగన్ధ్యాదిద్రవ్యమగ్నౌ ప్రక్షిప్య తద్వాయురశ్మిద్వారా వనస్పత్యోషధి మూలశాఖాపుష్పఫలాదిషు ప్రవేశ్య సర్వేషాం పదార్థానాం శుద్ధిం కృత్వాఽఽరోగ్యం సంపాదయన్తు.॥౨౮॥

పదార్థము :-మానవులు (నక్షత్రేభ్యః) ఎప్పుడును నష్టముగాని పదార్థములకొరకు (స్వాహా) ఉత్తమయజ్ఞ క్రియ (నక్షత్రియేభ్యః) ఉక్తపదార్థ సమూహములకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (అహోరాత్రేభ్యః) పగలు రాత్రులకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (అర్ధమాసేభ్యః) శుక్ల కృష్ణపక్షములు అనగా పక్షములకొరకు (స్వాహా) పై క్రియను (మాసేభ్యః) మాసములకొరకు (స్వాహా) పై దెలిపినయజ్ఞక్రియను (ఋతుభ్యః) వసంతము మున్నగు షడృతువులకై (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (సంవత్సరాయ) సంవత్సరములకొరకు (స్వాహా) శ్రేష్ఠయజ్ఞక్రియను (ద్యావాపృథివీభ్యామ్) ప్రకాశము మరియు భూమికొరకు (స్వాహా) శ్రేష్ఠ యజ్ఞక్రియను (చన్ద్రాయ) చంద్రలోకమునకై (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (సూర్యాయ) సూర్యలోకమునకై (స్వాహా) యజ్ఞక్రియను (రశ్మిభ్యః) సూర్యాదుల కిరణములకై (స్వాహా) యజ్ఞక్రియను (వసుభ్యః) పృథివ్యాది లోకములకై (స్వాహా) ఉక్త క్రియను (రుద్రేభ్యః) దశప్రాణములకొరకై (స్వాహా) యజ్ఞక్రియను (ఆదిత్యేభ్యః) అవినాశియైన కాలావయవములకై (స్వాహా) యజ్ఞక్రియను (మరుద్భ్యః) పవనములకై (స్వాహా) ఉత్తమ అనుకూల యజ్ఞ క్రియను (విశ్వేభ్యః) సమస్త (దేవేభ్యః) దివ్యగుణములకొరకు

(స్వాహా) చక్కని క్రియను (మూలేభ్యః) సమస్త మూలముల [వ్రేళ్ల] కై (స్వాహా) తదనుకూలక్రియను (శాఖాభ్యః) శాఖలకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (వనస్పతిభ్యః) వనస్పతులకై (స్వాహా) ఉత్తమగుణవర్ధక యజ్ఞక్రియను (పుష్పేభ్యః) పుష్పములకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (ఫలేభ్యః) ఫలములకొరకు (స్వాహా) ఉత్తమక్రియను (ఓషధీభ్యః) ఓషధులకొరకు (స్వాహా) సదా ఉత్తమ యజ్ఞక్రియలను జేయుచుండుట మానవయోగ్యమైయున్నది.॥౨౮॥

**భావార్థము** :- మానవులెల్లరును సదా సుగంధ్యాది పదార్థములను అగ్నియందాహుతుల నిచ్చి వానిని ఆ యగ్ని వాయువు మరియు సూర్యుని కిరణములద్వారా వనస్పతి, ఓషధి, కంద, మూల, పత్ర, పుష్ప, ఫలములు మున్నగు అన్నాదులయందు ప్రవేశపరచి సమస్త పదార్థముల శుద్ధపరచి ఆరోగ్యమును సాధించవలెను.॥౨౮॥

28. Perform yajna for indestructible objects and for their assemblage; for day and night, for the half months; for the months; for the seasons and for the objects produced in them and for the yar to dervive happiness, perform yajna for the purification of Heaven and Earth; for the moon, for the Sun, and his rays. Perform yajna for the betterment of the Vasus, the Rudras and the Adityas. Perform yajna for purifying the airs; for the acquisition of noble qualities, for improving the roots and branches of forest trees, flowers, fruits and herbs.

౧౩౦౧.పృథివ్యా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, లిఙ్గోక్తా దేవతాః, నిచృదత్యష్టిశ్ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మదియే.

౧౩౦౧ పృథివ్యై స్వాహాఽన్తరిక్షాయ స్వాహా దివే స్వాహా సూర్యాయ స్వాహా

చన్ద్రాయ స్వాహా నక్షత్రేభ్యః స్వాహాఽద్భ్యః స్వాహౌషధీభ్యః

స్వాహా వనస్పతిభ్యః స్వాహా పరిప్లవేభ్యః స్వాహా చరాచరేభ్యః

స్వాహా సరీసృపేభ్యః స్వాహా॥౨౯॥

ప.వి:- పృథివ్యై, స్వాహా, అన్తరిక్షాయ, స్వాహా, దివే, స్వాహా, సూర్యాయ, స్వాహా,

చన్ద్రాయ, స్వాహా, నక్షత్రేభ్యః, స్వాహా, అద్భ్య ఇత్యప్ + భ్యః, స్వాహా, ఓషధీభ్యః, స్వాహా,

వనస్పతిభ్య ఇతి వనస్పతి + భ్యః, స్వాహా, పరిప్లవేభ్య ఇతి పరి + ప్లవేభ్యః, స్వాహా, చరాచరేభ్యః, స్వాహా, సరీసృపేభ్యః, స్వాహా.॥౨౯॥

పదార్థః :-(పృథివ్యై) విస్తృతాయై ధరిత్ర్యై (స్వాహా) ఉత్తమయజ్ఞక్రియా (అన్తరిక్షాయ) ఆకాశాయ (స్వాహా) ఉక్తా క్రియా (దివే) విద్యుతః శుద్ధయే (స్వాహా) యజ్ఞక్రియా (సూర్యాయ) ఆదిత్యమండలాయ (స్వాహా) తదనంతరాపా క్రియా (చన్ద్రాయ) చన్ద్రమణ్డలాయ (స్వాహా) ఉత్తమక్రియా (నక్షత్రేభ్యః) తారకేభ్యః (స్వాహా) (అద్భ్యః) (స్వాహా) (ఓషధీభ్యః) (స్వాహా) (వనస్పతిభ్యః) (స్వాహా) (పరిప్లవేభ్యః) తారకేభ్యః (స్వాహా) (చరాచరేభ్యః) స్థావరజంగమేభ్యః (స్వాహా) (సరీసృపేభ్యః) సర్పాదిభ్యః (స్వాహా).॥౨౯॥

అన్వయః :-యది మనుష్యాః పృథివ్యై స్వాహాఽన్తరిక్షాయ స్వాహా, దివే స్వాహా, సూర్యాయ స్వాహా, చన్ద్రాయ స్వాహా, నక్షత్రేభ్యః స్వాహాఽద్భ్యః స్వాహౌషధీభ్యః స్వాహా, వనస్పతిభ్యః స్వాహా, పరిప్లవేభ్యః స్వాహా, చరాచరేభ్యః స్వాహా, సరీసృపేభ్యః స్వాహా ప్రయుఞ్జీరఀస్తర్హి సర్వం శుద్ధం కర్తుం ప్రభవేయుః.॥౨౯॥

భావార్థః :- యే సుగన్ధ్యాదిద్రవ్యం పృథివ్యాదిష్వగ్నిద్వారా విస్తార్య వాయుజలద్వారా ఓషధీషు ప్రవేశ్య సర్వం సంశోధ్యాఽఽరోగ్యం సంపాదయన్తి త ఆయుర్వర్ధకా భవన్తి.॥౨౯॥

**పదార్థము :-** ఏ మనుష్యులు (పృథివ్యై) విశాలమైన ఈ పృథివికొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞ క్రియను (అన్తరిక్షాయ) అవకాశము, అనగా పదార్థములమధ్య ఖాళీగనున్న భాగము [ఆకాశము] కొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (దివే) విద్యుత్తు శుద్ధికొరకు (స్వాహా) యజ్ఞ క్రియను (సూర్యాయ) సూర్యమండలముయొక్క ఉత్తమ తత్వముకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (చంద్రాయ) చంద్రమండలమునకై (స్వాహా) శ్రేష్ఠక్రియను (నక్షత్రేభ్యః) అశ్వినీ మున్నగు నక్షత్రలోకముల ఉత్తమతత్వముకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (అద్భ్యః) జలములకొరకు (స్వాహా) శ్రేష్ఠ యజ్ఞక్రియను (ఓషధీభ్యః) ఓషధులకొరకు (స్వాహా) పై క్రియను (వనస్పతిభ్యః) వటవృక్షాదులకొరకై (స్వాహా) ఉత్తమ యజ్ఞ క్రియను (పరిప్లవేభ్యః) అన్నివైపులనుండి వచ్చి పోవుచుండు తారాగణములకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞ క్రియను (చరాచరేభ్యః) స్థావర జంగమ జీవులు మరియు జడపదార్థములకొరకై (స్వాహ) ఉత్తమ యజ్ఞక్రియను (సరీసృపేభ్యః) ప్రాకుచునడచు సర్పములు మున్నగు జీవులకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను బాగుగా ప్రయుక్త మొనర్చుచుండినచో యది సర్వమును శుద్ధియొనర్చుటకు సమర్థవంత మగుచుండును.॥౨౯॥

**భావార్థము :-** సుగంధ్యాది పదార్థములను పృథివ్యాది పదార్థములందు అగ్నిద్వారా వ్యాప్తపరచి జలవాయువులద్వారా ఓషధులు మున్నగు పదార్థములందు ప్రవేశ మొనర్చజేసి ఆ సర్వములను శుద్ధపరచి ఆరోగ్యత్వమును, మనుష్యుల ఆయుర్దాయమును పెంపొందించువారలు ధన్యజీవు లగుచున్నారు. ॥౨౯॥

29. Perform yajna for the improvement of the Earth, the Firmament, the sky, the sun, the Moon and the Stars.

Perform yajna for the improvement of waters, herbs and forest trees. Perform yajna for meteors, animate and inanimate things, and things that creep and crawl for our comfort.

౧౩౦౨. అసవ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, వస్వాదయో దేవతాః, కృతిశ్ఛందః నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౧౩౦౨ అసవే స్వాహా వసవే స్వాహా విభువే స్వాహా వివస్వతే స్వాహా గణశ్రియే స్వాహా గణపతయే స్వాహా౽భిభువే స్వాహాధిపతయే స్వాహా శూషాయ స్వాహా సꣳసర్పాయ స్వాహా చన్ద్రాయ స్వాహా జ్యోతిషే స్వాహా మలిమ్లుచాయ స్వాహా దివా పతయే స్వాహా॥30॥

ప.వి:- అసవే, స్వాహా, వసవే, స్వాహా, విభువ ఇతి వి + భువే, స్వాహా, వివస్వతే, స్వాహా, గణశ్రియ ఇతి గణ + శ్రియే, స్వాహా, గణపతయ ఇతి గణ + పతయే, స్వాహా, అభిభువ ఇత్యభి + భువే, స్వాహా, అధిపతయ ఇత్యధి + పతయే, స్వాహా, శూషాయ, స్వాహా, సꣳసర్పాయేతి సమ్+సర్పాయ, స్వాహా, చన్ద్రాయ, స్వాహా జ్యోతిషే, స్వాహా, మలిమ్లుచాయ, స్వాహా, దివా, పతయే, స్వాహా.॥30॥

పదార్థః :-(అసవే) ప్రాణాయ (స్వాహా) (వసవే) యో౽స్మిన్ శరీరే వసతి తస్మై జీవాయ (స్వాహా) (విభువే) వ్యాపకాయ వాయవే (స్వాహా) (వివస్వతే) సూర్యాయ (స్వాహా) (గణశ్రియే) యా గణానాం సమూహానాం శ్రీః శోభా తస్యై విద్యుతే (స్వాహా) (గణపతయే) సమూహానాం పాలకాయ వాయవే (స్వాహా) (అభిభువే) అభిముఖం భావుకాయ (స్వాహా) (అధిపతయే) సర్వస్వామినే రాజ్ఞే (స్వాహా) (శూషాయ) బలాయ సైన్యాయ (స్వాహా)

(సంసర్పాయ) యః సమ్యక్ సర్పతి గచ్ఛతి తస్మై (స్వాహా) (చన్ద్రాయ) సువర్ణాయ. చన్ద్రమితి హిరణ్య నామ.. నిఘం. ౧.౨. (స్వాహా) (జ్యోతిషే) ప్రదీపనాయ (స్వాహా) (మలిమ్లుచాయ) స్తేనాయ. మలిమ్లుచ ఇతి స్తేన నామ.. ని.. 3. ౨౪. (స్వాహా) (దివా,పతయే) దినస్య పాలకాయ సూర్యాయ (స్వాహా).॥30॥

అన్వయః :-హే మనుష్యాః! యూయమసవే స్వాహా వసవే స్వాహా, విభువే స్వాహా, వివస్వతే స్వాహా గణశ్రియే స్వాహా, గణపతయే స్వాహాఽభిభువే స్వాహాఽధిపతయే స్వాహా, శూషాయ స్వాహా, సంసర్పాయ స్వాహా, చన్ద్రాయ స్వాహా, జ్యోతిషే స్వాహా, మలిమ్లుచాయ స్వాహా, దివాపతయే స్వాహా చ ప్రయుఙ్ధ్వమ్.॥30॥

భావార్థః :-మనుష్యైః ప్రాణాదిశుద్ధయేఽగ్నౌ పుష్టికరాది ద్రవ్యం హోతవ్యం.॥30॥

పదార్థము :- ఓ మానవులారా! మీరు (అసవే) ప్రాణములకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (వసవే) శరీరములందు వసించుజీవునికొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను. (విభువే) వ్యాప్తమగుచుండు పవనము కొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (వివస్వతే) సూర్యునికొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (గణశ్రియే) పదార్థసమూహములశోభకు కారణభూతమగు విద్యుత్తుకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞ క్రియను (గణపతయే) పదార్థసమూహములను పాలనమొనర్చు వాయువుకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (అభిభువే) సమ్ముఖమున నుండువానికై (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (అధిపతయే) అందరకు స్వామియగు రాజుకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (శూషాయ) బలము మరియు తీక్ష్ణత్వముకొరకై (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (సంసర్పాయ) చక్కగా ప్రాకుచు నడుచు జీవులకొరకై (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను (చన్ద్రాయ) సువర్ణముకై (స్వాహా) ఉత్తమ యజ్ఞ క్రియను (జ్యోతిషే) జ్యోతి అనగా సూర్య, చంద్ర, తారాగణముల ప్రకాశముకొరకు (స్వాహా) ఉత్తమ యజ్ఞ క్రియను (మలిమ్లుచాయ) చోరులకై (స్వాహా) వారిని ప్రబంధమొనర్చుక్రియ మరియు (దివాపతయే) దినము పాలించునట్టి సూర్యునకు (స్వాహా) ఉత్తమ యజ్ఞక్రియను చక్కగా ప్రయుక్త మొనర్చుము. ॥30॥

భావార్థము :-మానవులు సమస్తప్రాణులు మున్నగువాని శుద్ధికొరకై అగ్నియందు పుష్టికొరకు మున్నగు పదార్థములను హోమమొనర్చవలయును. ॥30॥

30. Perform yajna for the purification of vital breaths; the soul that resides in the body, the pervading air, the sun, the lightning, the air that protects multitude of object, for the hero who chastises the wicked, for the king, for acquiring strength, for the reptiles, for gold, for light of the Sun, Moon and stars; for keeping the thieves under control, and for the Sun that nourishes the day.

౧303. మధవే స్వాహేత్యస్య ప్రజాపతిర్ఋషిః, మాసా దేవతాః, భురిగత్యష్టిశ్ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఆల నావిషయమే.

౧303 మధవే స్వాహా మాధవాయ స్వాహా శుక్రాయ స్వాహా శుచయే స్వాహా
నభసే స్వాహా నభస్యాయ స్వాహేషాయ స్వాహోర్జాయ స్వాహా
సహసే స్వాహా సహస్యాయ స్వాహా తపసే స్వాహా తపస్యాయ
స్వాహాంహసస్పతయే స్వాహా॥3౧॥

ప.వి:- మధవే, స్వాహా, మాధవాయ, స్వాహా, శుక్రాయ, స్వాహా, శుచయే, స్వాహా నభసే, స్వాహా, నభస్యాయ, స్వాహా, ఇషాయ, స్వాహా, ఊర్జాయ, స్వాహా, సహసే, స్వాహా, సహస్యాయ, స్వాహా, తపసే, స్వాహా, తపస్యాయ, స్వాహా, అంహసః, పతయే, స్వాహా.॥3౧॥

పదార్థః :- (మధవే) మధురాదిగుణోత్పాదకాయ చైత్రాయ (స్వాహా) (మాధవాయ) వైశాఖాయ (స్వాహా) (శుక్రాయ) శుద్ధికరాయ జ్యేష్ఠాయ (స్వాహా) (శుచయే) పవిత్రకరాయాఽఽషాఢాయ (స్వాహా) (నభసే) జలవర్షకాయ శ్రావణాయ (స్వాహా) (నభస్యాయ) నభసి భవాయ భాద్రాయ (స్వాహా) (ఇషాయ) అన్నోత్పాదకాయాఽఽశ్వినాయ (స్వాహా) (ఊర్జాయ) బలాన్నోత్పాదకాయ కార్త్తికాయ (స్వాహా) (సహసే) బలప్రదాయ మార్గశీర్షాయ (స్వాహా) (సహస్యాయ) సహసి సాధవే పౌషాయ (స్వాహా) (తపసే) తప ఉత్పాదకాయ మాఘాయ (స్వాహా) (తపస్యాయ) తపసి సాధవే ఫాల్గునాయ (స్వాహా) (అంహసః) శ్లిష్టస్య (పతయే) పాలకాయ (స్వాహా).॥3౧॥

అన్వయః :- హే మనుష్యాః! భవంతో మధవే స్వాహా, మాధవాయ స్వాహా, శుక్రాయ స్వాహా, శుచయే స్వాహా, నభసే స్వాహా, నభస్యాయ స్వాహేషాయ స్వాహోర్జాయ స్వాహా, సహసే స్వాహా, సహస్యాయ స్వాహా, తపసే స్వాహా, తపస్యాయ స్వాహాఽంహసస్పతయే స్వాహా చానుతిష్ఠన్తు.॥3౧॥

భావార్థః :- యే ప్రతిదినమగ్నిహోత్రాదియజ్ఞం యుక్తాహారవిహారం చ కుర్వంతి తేఽరోగా భూత్వా దీర్ఘాయుషో భవన్తి. ॥3౧॥

**పదార్థము** :- ఓ మానవులారా! మీరు (మధవే) మధురత్వాదుల నుత్పన్నపరచు చైత్రమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (మాధవాయ) మధురత్వమునందుత్తమమైన వైశాఖమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (శుక్రాయ) జలాదులను వాయువేగముచే నిర్మలపరచునట్టి జ్యేష్ఠమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (శుచయే) వర్షయోగముచే భూమి మున్నగు వానిని పవిత్రమొనర్చు ఆషాఢమాసమునకై (స్వాహా) యజ్ఞక్రియను (నభసే) చక్కగా ఘనమగు కారుమేఘములచే గర్జనము [ఉరుము]లను వినిపించు శ్రావణమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (నభస్యాయ) ఆకాశమందు వర్షముచే ప్రసిద్ధమగు భాద్రపదమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (ఇషాయ) అన్నమునుత్పన్నపరచునట్టి ఆశ్వయుజమునకు (స్వాహా) యజ్ఞక్రియను (ఊర్జాయ) బలము, అన్నము నుత్పన్నపరచునదియు మరియు ఆశ్వయుజమాసము పుష్టించినట్టి సజ్జలు మున్నగు పంటలను పక్వపరచి పుష్టివంతమొనర్చు కార్తీకమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (సహసే) బలమును గలిగించునట్టి మార్గశిరమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (సహస్యాయ) బలమునుగలిగించు వానియందుత్తమమైన పుష్యమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (తపసే) ఋతుపరివర్తనమువల్ల మెల్లమెల్లగా శీతలమును ద్రోలుచు ప్రాణుల శరీరములందు ఉష్ణప్రవృత్తిని గలిగించునట్టి మాఘమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (తపస్యాయ) ప్రాణుల శరీరములందు వేడిమిని ప్రవృత్తపరచుటయందు ఉత్తమమగు ఫాల్గుణమాసముకొరకు (స్వాహా) యజ్ఞక్రియను (అంహసః) మాసములందు లీనమైయున్న అధికమాసము కొరకు (పతయే) పాలించువానికొరకును (స్వాహా) యజ్ఞక్రియను అవశ్యముగా అనుష్ఠించుడు. ॥౩౧॥

**భావార్థము** :- ఏ మనుష్యుడు ప్రతిదినము అగ్నిహోత్రము మున్నగు యజ్ఞముల నొనర్చుచు తన ప్రకృతికి అనుకూలమగు ఆహారవిహారాదులను జేయుచుండునో నాతడు రోగరహితుడై దీర్ఘకాలము జీవించువాడగును. ॥౩౧॥

31. Perform yajna to make comfortable and pleasant the month Chetra (March - April0, the Baisakh (April - May), the Jeshtha, (May-June), the Asharh (June-Jly), the Shravan (July-August), the Bhadra (August-September), the Aswin (September - October), the Kartika (October - November), the Margshish (November-December), the Paush (December-January), the Magh (January - February), the Phalgun (February-March), the thirteenth or intercalary month.

౧౩౦౪. వాజాయేత్యస్య ప్రజాపతిర్ఋషిః, వాజాదయో దేవతాః, అత్యష్టిశ్ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నవ్విషయ మిచట చెప్పబడుచున్నది.

౧౩౦౪ వాజాయ స్వాహా ప్రసవాయ స్వాహాపిజాయ స్వాహా క్రతవే స్వాహా స్వః స్వాహా మూర్ధ్నే స్వాహా వ్యశ్నువినే స్వాహాన్త్యాయ స్వాహాఽన్త్యాయ భౌవనాయ

స్వాహా భువనస్య పతయే స్వాహాధిపతయే స్వాహా ప్రజాపతయే స్వాహా ॥32॥

ప.వి:- వాజాయ, స్వాహా, ప్రసవాయేతి ప్ర + సవాయ, స్వాహా, అపిజాయ, స్వాహా, క్రతవే, స్వాహా, స్వరితి స్వః, స్వాహా, మూర్ధ్నే, స్వాహా, వ్యశ్నువిన ఇతి వి+అశ్నువినే, స్వాహా, ఆన్త్యాయ, స్వాహా, ఆన్త్యాయ, భౌవనాయ, స్వాహా, భువనస్య, పతయే, స్వాహా, అధిపతయ ఇత్యధిపతయే, స్వాహా, ప్రజాపతయ ఇతి ప్రజా + పతయే, స్వాహా.॥32॥

పదార్థః :-(వాజాయ) అన్నాయ (స్వాహా) (ప్రసవాయ) ఉత్పాదకాయ (స్వాహా) (అపిజాయ) ఉత్పన్నాయ (స్వాహా) (క్రతవే) ప్రజ్ఞాయై కర్మణే వా (స్వాహా) (స్వః) సుఖాయ (స్వాహా) (మూర్ధ్నే) మస్తకశుద్ధయే (స్వాహా) (వ్యశ్నువినే) వ్యాపినే వీర్యాయ (స్వాహా) (ఆన్త్యాయ) (స్వాహా) (ఆన్త్యాయ) అన్తే భవాయ (భౌవనాయ) భువనే భవాయ (స్వాహా) (భువనస్య, పతయే) సర్వజగత్స్వామినే (స్వాహా) (అధిపతయే) సర్వాధిష్ఠాత్రే (స్వాహా) (ప్రజాపతయే) సర్వప్రజాపాలకాయ (స్వాహా).॥32॥

అన్వయః :- భో మనుష్యాః! యూయం వాజాయ స్వాహా, ప్రసవాయ స్వాహాఽపిజాయ స్వాహా, క్రతవే స్వాహా, స్వః స్వాహా, మూర్ధ్నే స్వాహా, వ్యశ్నువినే స్వాహా, ఽఽన్త్యాయ స్వాహా ఽఽన్త్యాయ భౌవనాయ స్వాహా, భువనస్య పతయే స్వాహాఽధిపతయే స్వాహా, ప్రజాపతయే, స్వాహా, చ సదా ప్రయుఞ్జీధ్వమ్.॥32॥

భావార్థః :- యే మనుష్యా అన్నాపత్యగృహప్రజ్ఞామూర్ధాదిశోధనేన సుఖవర్ధనాయ సత్యాం క్రియాం కుర్వన్తి తే పరమాత్మానముపాస్య ప్రజాఽధిపతయో భవన్తి.॥32॥

పదార్థము :- ఓ మానవులారా! మీరు (వాజాయ) అన్నముకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (ప్రసవాయ) పదార్థముల ఉత్పత్తికొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (అపిజాయ) గృహముకొరకు (స్వాహా) ఉత్తమక్రియను (క్రతవే) బుద్ధి లేక కర్మకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (స్వః) అత్యంత సుఖముకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (మూర్ధ్నే) శిరస్సు శుద్ధియగుటకు (స్వాహా) ఉత్తమ క్రియను (వ్యశ్నువినే) వ్యాప్తమగునట్టి వీర్యము [పరాక్రమము] కొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (ఆన్త్యాయ) వ్యవహారముల అంతమందు జరుగు వ్యవహారము కొరకు (స్వాహా) ఉత్తమక్రియను (ఆన్త్యాయ) చివరకు జరుగు (భౌవనాయ) విశ్వమునందు ప్రసిద్ధమగుదానికొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (భువనస్య) జగమును (పతయే)

పాలనమొనర్చు స్వామికొరకై (స్వాహా) ఉత్తమక్రియను (అధిపతయే) సర్వాధిష్ఠాత, అనగా అందరికి శిక్షణనిచ్చువానికొరకు (స్వాహా) ఉత్తమక్రియను మరియు (ప్రజాపతయే) సకల ప్రజలను పాలనమొనర్చువానికొరకు (స్వాహా) ఉత్తమ క్రియను ఎల్లప్పుడును యొనర్చుచుండుడు. ॥32॥

**భావార్థము :-** ఏ మనుష్యులు అన్నము, సంతానము, గృహమును, శిరస్సును, బుద్ధి మొదలగు వానిని శోధించుటద్వారా సుఖమును వృద్ధిపరచుటకు సత్యక్రియనొనర్చుచుండెదరో వారు పరమాత్మ నుపాసించి ప్రజలను చక్కగా పాలించువా రగుదురు. ॥32॥

32. Produce good foodstuffs. Manufacture artciles. Protect the foodstuffs produced. Devlop intellect and perform noble deeds. Arrange for, comforts. Purify your head. Don't waste your semen. Exert for final beatitude. Worhsip God, the final living entity in the universe. Adore God, the protector of the world. Serve God, the Preacher of the Vedas to humanity. Pray to God, the Protector of all created beings.

౧౩౦౫. ఆయుర్యజ్ఞేనేత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఆయురాదయో దేవతాః, ప్రకృతి శ్ఛందః, ధైవతః స్వరః.

మనుష్యైః స్వకీయం సర్వస్వం కస్యానుష్ఠానాయ సమర్పణీయమిత్యాహ.

మానవులు తమ సర్వస్వమును, కలిగియున్న సకల పదార్థములను దేనిననుష్ఠించుటకై సమర్పించవలయును?

౧౩౦౫ ఆయుర్యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా ప్రాణో యజ్ఞేన కల్పతాగ్ంస్వాహాఽపానో యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా వ్యానో యజ్ఞేన కల్పతాగ్ంస్వాహోదానో యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా సమానో యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా చక్షుర్యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా శ్రోత్రం యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా వాగ్యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా మనో యజ్ఞేన కల్పతాగ్ంస్వాహాఽఽత్మా యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా బ్రహ్మ యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా జ్యోతిర్యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా స్వర్యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా పృష్ఠం యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా యజ్ఞో యజ్ఞేన కల్పతాగ్ంస్వాహా ॥33॥

ప.వి:- ఆయుః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, ప్రాణః, యజ్ఞేన కల్పతామ్, స్వాహా, అపాన ఇత్యప + ఆనః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా,వ్యాన ఇతి వి + ఆనః, యజ్ఞేన కల్పతామ్, స్వాహా, ఉదాన ఇత్యుత్ + ఆనః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, సమాన ఇతి సమ్ + ఆనః, యజ్ఞేన + కల్పతామ్, స్వాహా,చక్షుః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, శ్రోత్రమ్, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, వాగ్, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, మనః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, ఆత్మా, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, బ్రహ్మా, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, జ్యోతిః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, స్వరితి స్వః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, పృష్ఠమ్, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా, యజ్ఞః, యజ్ఞేన, కల్పతామ్, స్వాహా.॥33॥

పదార్థః :- (ఆయుః) ఏతి జీవనం యేన తత్ (యజ్ఞేన) పరమేశ్వరస్య విదుషాం చ సత్కారణేన సఙ్గతేన కర్మణా విద్యాదిదానేన సహ (కల్పతామ్) సమర్థ్యయతు (స్వాహా) సత్క్రియయా (ప్రాణః) జీవనమూలో వాయుః (యజ్ఞేన) యోగాభ్యాసాదినా (కల్పతామ్) (స్వాహా) (అపానః) అపానయతి దుఃఖం యేన సః (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (వ్యానః) సర్వసన్ధిషు వ్యాప్తశ్చేష్టానిమిత్తః (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (ఉదానః) ఉదానితి బలయతి యేన సః (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (సమానః) సమానయతి రసం యేన సః (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (చక్షుః) నేత్రమ్ (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (శ్రోత్రమ్) జ్ఞానేంద్రియాణా ముపలక్షణమ్ (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (వాక్) కర్మేంద్రియాణాముపలక్షణమ్ (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (మనః) అంతఃకరణమ్ (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (ఆత్మా) జీవః (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (బ్రహ్మా) చతుర్వేదవిత్ (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (జ్యోతిః) జ్ఞానప్రకాశః (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (స్వః) సుఖమ్ (యజ్ఞేన) (కల్పతామ్) (స్వాహా) (పృష్ఠమ్) ప్రశ్నం శిష్టం చ (యజ్ఞేవ) (కల్పతామ్) (స్వాహా) (యజ్ఞః) వ్యాపకః పరమేశ్వరః. ''యజ్ఞో వై విష్ణుః'' ఇతి శతపథే (యజ్ఞేన) పరమాత్మనా (కల్పతామ్) (స్వాహా). ॥33॥

అన్వయః :-హే మనుష్యాః! యుష్మాభిరేవమేషితవ్యమస్మాకమాయుః స్వాహా యజ్ఞేన సహ కల్పతాం. ప్రాణః స్వాహా యజ్ఞేన సహ కల్పతామపానః స్వాహా యజ్ఞేన సహ కల్పతాం వ్యానః స్వాహా, యజ్ఞేన సహ కల్పతాముదానః స్వాహా, యజ్ఞేన సహ కల్పతాం, సమానః స్వాహా యజ్ఞేన సహ కల్పతాం చక్షుః స్వాహా యజ్ఞేన సహ కల్పతాం శ్రోత్రం స్వాహా యజ్ఞేన సహ కల్పతాం వాక్స్వాహా యజ్ఞేన సహ కల్పతాం మనః స్వాహా యజ్ఞేన సాకం కల్పతామాత్మా స్వాహా యజ్ఞేన సహ కల్పతాం బ్రహ్మ స్వాహా యజ్ఞేన సహ కల్పతాం జ్యోతిః స్వాహా, యజ్ఞేన సహ కల్పతాం స్వః స్వాహా యజ్ఞేన సహ కల్పతాం పృష్ఠం స్వాహా యజ్ఞేన సహ కల్పతాం యజ్ఞః, స్వాహా యజ్ఞేన సహ కల్పతామితి. ॥33॥

భావార్థః:-మనుష్యైర్యావజ్జీవనం శరీరం ప్రాణా అంతఃకరణమింద్రియాణి సర్వోత్తమా సామగ్రీ చ యజ్ఞాయ విధేయా యేన నిష్పాపాః కృతకృత్యా భూత్వా పరమాత్మానం ప్రాప్యేహాఽముత్ర సుఖంప్రాప్నుయుః. ॥33॥

పదార్థము :- ఓ మానవులారా! మీరెట్టి కోరికను గలిగియుండవలెననగా! మాయొక్క (ఆయుః) జీవనమగు ఆయువు (స్వాహా) చక్కనిక్రియచే (యజ్ఞేన) పరమేశ్వరుని, విద్వాంసుల సత్కారముచే గలసియున్న కర్మలు మరియు విద్య మున్నగువాని నిచ్చుటతో గూడ (కల్పతామ్) సమర్పితమగుగాక! (ప్రాణః) జీవనమునకు ముఖ్యకారణమగు వాయువు (స్వాహా) శ్రేష్ఠక్రియద్వారా (అపానః) దుఃఖములను దూరమొనర్చు పవనము (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) శ్రేష్ఠకార్యముతో గూడ (కల్పతామ్) సమర్పితమగుగాక! (వ్యానః) సంధులందు వ్యాప్తమైయున్న అనగా శరీరమును నడుపు కర్మనొనర్చు మున్నగువానికి నిమిత్తమగు వాయువు (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) ఉత్తమ కార్యముతో గూడ (కల్పతామ్) సమర్పితమగు గాక! (ఉదానః) బలమును గలిగించు పవనము (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) ఉత్తమకర్మతో గూడ (కల్పతామ్) సమర్పితమగుగాక! (సమానః) శరీరమునందు ప్రతి అంగములకును ఆహారమునందజేయు వాయువు (స్వాహా) ఉత్తమ క్రియతో (యజ్ఞేన) యజ్ఞముతో గూడ (కల్పతామ్) సమర్పితమగుగాక! (చక్షుః) నేత్రములు (స్వాహా) ఉత్తమ క్రియచే (యజ్ఞేన) సత్కర్మతో గూడ (కల్పతామ్) సమర్పితమగుగాక! (శ్రోత్రమ్) శబ్దములను విను కర్ణేంద్రియములు (స్వాహా) శ్రేష్ఠక్రియచే (యజ్ఞేన) సత్కర్మతో గూడ (కల్పతామ్) సమర్పితమగుగాక! (వాక్) వాణి మున్నగు కర్మేంద్రియములు (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) ఉత్తమ కర్మతో గూడ (కల్పతామ్) సమర్పితమగు గాక! (మనః) మనసు అనగా అంతఃకరణము (స్వాహా) ఉత్తమ క్రియచే (యజ్ఞేన) సత్కర్మతో గూడ (కల్పతామ్) సమర్పితమగునుగాక! (ఆత్మా) ప్రాణము [జీవుడు] (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) సత్కర్మతో గూడ (కల్పతామ్) సమర్పితమగును గాక! (బ్రహ్మ) నాల్గువేదములనెరిగినవాడు (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) యజ్ఞము మున్నగు సత్కర్మలద్వారా (కల్పతామ్) సమర్పణమగుగాక! (జ్యోతిః) జ్ఞానప్రకాశము (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) యజ్ఞముతో గూడ (కల్పతామ్) సమర్పణమగుగాక! (స్వః) సుఖము (స్వాహా) ఉత్తమ క్రియద్వారా

(యజ్ఞేన) యజ్ఞముతో గూడ (కల్పతామ్) సమర్పణమగుగాక! (పృష్ఠమ్) అడుగుట [ప్రశ్నించుట] మిగిలిపోయిన పదార్థములు (స్వాహా) ఉత్తమ క్రియచే (యజ్ఞేన) యజ్ఞముతో గూడ (కల్పతామ్) సమర్పితమగు గాక! (యజ్ఞః) యజ్ఞము, అనగా సర్వవ్యాపకుడగు పరమాత్మ (స్వాహా) ఉత్తమ క్రియద్వారా (యజ్ఞేన) తనతో గూడ (కల్పతామ్) సమర్పితుడగును గాక! ॥33॥

**భావార్థము :-** మనుష్యుడు తన జీవనము, శరీరము, ప్రాణము, అంతఃకరణము, దశేంద్రియములు, మరియు తన ఉత్తమ సామగ్రి ఏది గలదో దానిని యజ్ఞముకొరకు సమర్పణమొనర్చవలయును. దానివల్ల పాపరహితుడు, కృతకృత్యుడునై పరమాత్మను పొంది ఈ జన్మ మరియు పరజన్మలందును సుఖములను పొందవలయును. ॥33॥

33. May life be devoted to the service of God, the learned and the spreadh of knowledge in a noble manner. May breath improve through yoga and physical practices. May downward breath, diffusive breath, upward breath, digestive breath, improve through necessary precautions. May vision, hearing, speech, mind, soul, the master of the four Vedas, light of knowledge and happiness, and questionings advance through sacrifice performed in a right way.

May God be pleased with us through sacrifice performed in a spirit of devotion.

౧౩౦౬. ఏకస్మై ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, యజ్ఞో దేవతా, భురిగుష్ణిక్ ఛందః, ధైవతః స్వరః.

పునః కిమర్థో యజ్ఞోఽనుష్ఠాతవ్య ఇత్యాహ. ఎందులకు యజ్ఞానుష్ఠాన మొనర్చవలయును?

౧౩౦౬ ఏకస్మై స్వాహా ద్వాభ్యాꣳస్వాహా శతాయ స్వాహైకశతాయ స్వాహా

వ్యుష్ట్యై స్వాహా స్వర్గాయ స్వాహా ॥3౪॥

ప.విః- ఏకస్మై, స్వాహా, ద్వాభ్యామ్, స్వాహా, శతాయ, స్వాహా, ఏకశతాయేత్యేక+శతాయ, స్వాహా, వ్యుష్ట్యా ఇతి వి+ ఉష్ట్యై, స్వాహా, స్వర్గాయేతి స్వః+గాయ, స్వాహా.॥3౪॥

పదార్థః :-(ఏకస్మై) అద్వితీయాయ పరమాత్మనే (స్వాహా) సత్యా క్రియా (ద్వాభ్యామ్) కార్యకారణాభ్యామ్ (స్వాహా) (శతాయ) అసంఖ్యాతాయ పదార్థాయ (స్వాహా) (ఏకశతాయ) ఏకాధికాయ శతాయ (స్వాహా) (వ్యుష్ట్యై) ప్రదీప్తాయై దాహక్రియాయై (స్వాహా) (స్వర్గాయ) సుఖగమకాయ పురుషార్థాయ (స్వాహా).॥3౪॥

అన్వయః :-హే మనుష్యాః! యుష్మాభిరేకస్మై స్వాహా ద్వాభ్యాం స్వాహా శతాయ స్వాహైకశతాయ స్వాహా వ్యుష్ట్యై స్వాహా స్వర్గాయ స్వాహా చ సంప్రయోజ్యా.॥3౪॥

**భావార్థః :-** మనుష్యైర్భక్తివిశేషేణాఽద్వితీయ ఈశ్వరః ప్రేమపురుషార్థాభ్యామసంఖ్యాతా జీవాశ్చ ప్రసన్నాః కార్యా యేనాఽభ్యుదయికనైఃశ్రేయసికే సుఖే ప్రాప్యేతామితి.॥34॥

**పదార్థము :-** ఓ మానవులారా! మీరు (ఏకస్మై) ఒకే అద్వితీయుడగు పరమాత్మకొరకు (స్వాహా) సత్యక్రియను (ద్వాభ్యామ్) రెండు, అనగా కార్యకారణములకొరకు (స్వాహా) సత్యక్రియను (శతాయ) అనేక పదార్థములకొరకు (స్వాహా) ఉత్తమ క్రియను (ఏకశతాయ) నూటొక్క వ్యవహారములు లేక పదార్థములకై (స్వాహా) ఉత్తమక్రియను (వ్యుష్ట్యై) ప్రకాశితములైన పదార్థములను దహించివేయు క్రియకొరకు (స్వాహా) ఉత్తమక్రియను (స్వర్గాయ) సుఖప్రాప్తికై (స్వాహా) శ్రేష్ఠక్రియను చక్కగా ప్రయుక్తమొనర్చవలయును. ॥34॥

**భావార్థము :-** మానవులు అత్యంత భక్తి శ్రద్ధలచే అద్వితీయుడగు పరమేశ్వరుని యెడ ప్రీతి మరియు పురుషార్థముచే అసంఖ్యాక ప్రాణులను ప్రసన్నపరచుచుండినచో ఇహపరసుఖములను ప్రాప్తిజేసికొనగలరు.॥34॥

34. Worship one God. Have knowledge of Cause and Effect. Please hundreds of souls. Practise hundred and one trades. Acquire the power to burn down sins. Attain to final beatitude full of happiness.

అత్రాయుర్వృద్ధ్యగ్నియజ్ఞగాయత్ర్యర్థపదార్థశోధనవిధానాదివర్ణనాదేతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతిర్వేద్యా.

ఈ యధ్యాయమందు ఆయుర్వృద్ధి, అగ్నిగుణములు, కర్మ, యజ్ఞము, గాయత్రీ మంత్రార్థము మరియు సకలపదార్థముల శోధించు విధానము మున్నగు వర్ణన యున్నందున ఈ యధ్యాయముయొక్క అర్థమునకు పూర్వాధ్యాయార్థముతో గూడ సంగతిగలదని యెరుగవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానంద సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే ద్వావింశోఽధ్యాయః పూర్తిమగాత్

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచితసంస్కృతార్య భాషావిభూషిత యజుర్వేదభాష్యమునందలి ఇరువదిరెండవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండలాంతర్గత బీబిపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు, శిష్యుడునునగు **'చతుర్వేదభాష్యానువాదభాస్కర'** బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ పీఠాధిపతులునైన **'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'** చే నొనర్చబడిన ఆంధ్రానువాదము; పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వవేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకులునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య **'మల్లెం కృష్ణారెడ్డి'** సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**ఇరువదిరెండవఅధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

ॐ

THE

# YAJURVEDA BHASHYAM

With

MAHARSHI DAYANANDA SARASWATHI'S
COMMENTARY

## VOLUME - 5

**(23-30 Chapters)**

Translated in English by : **DEVI CHAND M.A.**

***Translated in to Telugu***

***By***

**BRAHMASRI PANDITA LOKA MALAHARI**
**SIDDHANTACHARYA**

***Editor***

**Acharya Dr. MARRI KRISHNA REDDY,** M.A; M.Ed, Ph.D

**Vaidika Sahitya Prachara Samithi, Hyderabad - 60.**

**2007**

ఓ౩మ్

పరమహంసపరివ్రాజకాచార్యేణ
శ్రీమన్మహర్షిదయానందసరస్వతీస్వామినా నిర్మితమ్

# యజుర్వేద భాష్యమ్

(సంస్కృతభాష్యం, ఆంధ్రటీకాతాత్పర్యం, ఆంగ్లభావార్థసహితం)

## పంచమ సంపుటము

( 23-30 అధ్యాయములు )


అనువాదకర్త

'చతుర్వేదభాష్యానువాదభాస్కర' - శతాధికగ్రంథకర్త

బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య

పరిష్కర్త - సంపాదకులు

సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద

ఆచార్య డా॥ మట్టి కృష్ణారెడ్డి M.A., M.Ed., Ph.D



వైదిక సాహిత్య ప్రచార సమితి, హైదరాబాద్-60

2007

# "వైదిక సాహిత్య ప్రచారసమితి" ప్రచురణలు


సంపూర్ణ "యజుర్వేదభాష్యమ్" : 6 సంపుటములు

ద్వితీయ ముద్రణ : శ్రీ వ్యయ పుష్యం, జనవరి - 2007.

ప్రతులు : 1000

వెల : **రూ. 1800/- లు** మాత్రమే.(6 సంపుటములకు కలిపి)

(పోస్టేజి అదనము)





డి.టి.పి. : **వి. రామలింగారెడ్డి (బాలు)**

ముద్రణ : **సాయిలిఖిత ప్రింటర్స్**, ఖైరతాబాద్, హైదరాబాదు.

ఫోన్ : 98490 05182


## ప్రతులకు :

1. **వైదికసాహిత్య ప్రచారసమితి**, 3-30; హనుమాన్ నగర్, ఆర్యసమాజం ఎదురువీధి, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 60. ఆం.ప్ర., ఫోన్ : 040 - 24051322, 9849583929

2. **దిల్‌సుఖ్‌నగర్ ఆర్యసమాజం**, బాదంకాంప్లెక్స్, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060, ఫోన్ : 9849468084, 9395376410

3. వేదగిరి, తూంపల్లి గ్రామం, కొందుర్గు మండలం, మహబూబ్‌నగర్ జిల్లా. ఫోన్ : 9441200322, 9849583929

4. **భీమాస్ డీలక్స్ హోటల్**, 34-38, జి.కార్ స్ట్రీట్, రైల్వేస్టేషన్ ఎదురుగా, తిరుపతి. ఫోన్ : 0877-2225521

5. **విశాలాంధ్ర బుక్‌హౌస్** (అన్ని బ్రాంచిలలో) హైదరాబాద్, విశాఖపట్టణం, విజయవాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి, కాకినాడ.

# పంచమ సంపుటము

## 23-30 అధ్యాయములు

### అధ్యాయసూచిక

# అథత్రయోవింశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే పఞ్చషష్టిర్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ। యద్భద్రం తన్న ఆ సువ ॥యు.30.3॥

౧౩౦౭.హిరణ్యగర్భ ఇత్యస్య ప్రజాపతిరృషిః, పరమేశ్వరో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వరః కిం కరోతీత్యాహ. ఈశ్వరుడేమి చేయుచున్న దిందు చెప్పబడినది.

౧౩౦౭ హిరణ్యగర్భః సమవర్త్తతాగ్రే భూతస్య జాతః పతిరేకఽఆసీత్।

స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ ॥౧॥

ప.వి:- హిరణ్యగర్భ ఇతి హిరణ్య+గర్భః, సమ్, అవర్త్తత, అగ్రే, భూతస్య, జాతః, పతిః, ఏకః, ఆసీత్, సః, దాధార, పృథివీమ్, ద్యామ్, ఉత, ఇమామ్, కస్మై, దేవాయ, హవిషా, విధేమ.॥౧॥

పదార్థః :- (హిరణ్యగర్భః) హిరణ్యాని సూర్యాదీని జ్యోతీంషి గర్భే యస్య కారణరూపస్య సః (సమ్) సమ్యక్ (అవర్త్తత) (అగ్రే) సృష్టేః ప్రాక్ (భూతస్య) ఉత్పన్నస్య కార్యరూపస్య (జాతః)ప్రాదుర్భూతః (పతిః) స్వామీ (ఏకః) అసహాయోఽద్వితీయేశ్వరః (ఆసీత్) (సః) (దాధార) ధృతవాన్ ధరతి ధరిష్యతి వా. అత్ర ''తుజాదీనా''మిత్యభ్యాసదైర్ఘ్యమ్. (పృథివీమ్) విస్తీర్ణాం భూమిమ్ (ద్యామ్) సూర్యాదికాం సృష్టిమ్ (ఉత) (ఇమామ్) ప్రత్యక్షామ్. (కస్మై) సుఖస్వరూపాయ (దేవాయ) సర్వసుఖప్రదాత్రే పరమాత్మనే (హవిషా) ఆత్మాది సర్వస్వదానేన (విధేమ) పరిచరేమ సేవేమహి. విధేమేతి పరిచరణకర్మా..నిఘం. 3.౪.॥౧॥

అన్వయః :-హే మనుష్యాః! యో భూతస్య జగతోఽగ్రే హిరణ్యగర్భః సమవర్త్తతాఽస్య సర్వస్యైకో జాతః పతిరాసీత్స ఇమాం పృథివీముత ద్యాం దాధార తస్మై కస్మై దేవాయ యథా వయం హవిషా విధేమ తథా యూయమపి విధత్త.॥౧॥

**భావార్థః :-** అత్ర వాచకలుప్తోపమాలంకారః. యదా సృష్టిః ప్రలయం గత్వా ప్రకృతిస్థా భవతి పునరుత్పద్యతే. తస్యా అగ్రే య ఏకః పరమాత్మా జాగ్రన్ సన్ భవతి. తదానీం సర్వే జీవా మూర్ఛితా ఇవ భవంతి. స కల్పాంతే ప్రకాశరహితాం పృథివ్యాదిరూపాం ప్రకాశసహితాం సూర్యాదిలోకప్రభృతిం సృష్టిం విధాయ ధృత్వా సర్వేషాం కర్మానుకూలతయా జన్మాని దత్వా సర్వేషాం నిర్వాహాయ సర్వాన్పదార్థాన్ విధత్తే. స ఏవ సర్వై రుపాసనీయో దేవోఽస్తీతి వేద్యమ్.॥౧॥

**పదార్థము :-** ఓ మానవులారా! ఎవడు ( భూతస్య) ఉత్పన్నమైన కార్యరూప జగత్తును ( అగ్రే) మొదట (హిరణ్యగర్భః) సూర్య చంద్ర తారలు మున్నగు జ్యోతులు గర్భరూపమున ఎవని లోపలనున్నవో, ఆ సూర్యుడు మున్నగు కారణరూప పదార్థములందు గర్భము వలె వ్యాపకుడు, స్తుతింపదగినవాడు (సమవర్తత) చక్కగా వర్తమానమైయున్న మరియు నీ సమస్త విశ్వమునకు ( ఏకః) ఒక్కడే ( జాతః) ప్రసిద్ధమైన ( పతిః) పాలనమొనర్చువాడై (ఆసీత్) ఉండునో (సః) అట్టి (ఇమామ్) ఈ (పృథివీమ్) విస్తారముతో గూడిన పృథివి ( ఉత) మరియు (ద్యామ్) సూర్యాది లోకములను రచించి దీనిని ( దాధార) ముక్కాలములందును ధరించియున్నాడో, అట్టి ( కస్మై) సుఖస్వరూపుడు (దేవాయ) సుఖములను ప్రసాదించు పరమాత్మకు మే మెట్లు (హవిషా) సర్వస్వము దానమొనర్చి యాతని ( విధేమ) సేవాపరిచర్యలొనర్చు చున్నామో, మీరును అట్లే యొనర్చు చుండుడు.॥౧॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సృష్టి ప్రలయమును పొందినప్పుడు ప్రకృతియందుగలిసి స్థిరమై యుండును. మరల యుత్పన్నమగును. అంతకు పూర్వమే పరమాత్మ ఒక్కడే జాగరూకుడై యుండును. అప్పుడు జీవులన్నియును మూర్ఛవంటి స్థితిలో చేరియుండును. కల్పాంతమునందు ప్రకాశరహితమగు పృథివ్యాదుల సృష్టి, ప్రకాశయుక్త సూర్యాదిలోకముల సృష్టియొక్క విధానము మరియు సకల ప్రాణులకు కర్మాను సారము జన్మలనిచ్చును, వీని నిర్వాహకమునకై సకల పదార్థముల విధానము జరుగును. అట్టి పరమాత్మయే సర్వజనులకు ఉపాసనీయదేవుడై యున్నాడని తెలిసకొనవలయును.॥౧॥

1. God is te Creator of the universe, its one Lord, the Sustainer of luminous objects like the sun. He was present before the creation of the world. He sustains this Earth and the sun in past, present and future. Let us worship with self dedication of our soul, Him, the Embodiment of happiness.

౧౩౦౮. ఉపయామగృహీత ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, పరమేశ్వరో దేవతా, నిచృదాకృతిశ్ఛందః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నవ్విషయమే.

౧౩౦౮ ఉపయామగృహీతోఽసి ప్రజాపతయే త్వా జుష్టం గృహ్ణామ్యేష తే యో

నిః సూర్యస్తే మహిమా యస్తేఽహన్త్సంవత్సరే మహిమా సమ్బభూవ

యస్తే వాయావన్తరిక్షే మహిమా సమ్బభూవ యస్తే దివి సూర్యే

మహిమా సమ్బభూవ తస్మై తే మహిమ్నే ప్రజాపతయే స్వాహా దేవేభ్యః॥౨॥

ప.వి:- ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, ప్రజాపతయ ఇతి ప్రజా + పతయే, త్వా,జుష్టమ్, గృహ్ణామి, ఏషః, తే, యోనిః సూర్యః తే, మహిమా, యః, తే,అహన్, సంవత్సరే, మహిమా, సమ్బభూ వేతి సమ్+బభూవ, యః, తే వాయౌ అన్తరిక్షే, మహిమా, సమ్బభూవేతి సమ్+బభూవ, యః, తే,దివి, సూర్యే, మహిమా, సమ్బభూవేతి సమ్+బభూవ, తస్మై, తే, మహిమ్నే, ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, స్వాహా, దేవేభ్యః॥౨॥

పదార్థః :-(ఉపయామగృహీతః) యో యామైశ్వర్యమసంబంధిభిః కర్మభిరుప సమీపే గృహీతః సాక్షాత్కృతః (అసి) (ప్రజాపతయే) ప్రజాపాలకాయ రాజ్ఞే (త్వా) త్వామ్ (జుష్టమ్) ప్రీతం సేవితం వా (గృహ్ణామి) (ఏషః) (తే) తవ (యోనిః) జగత్కారణం ప్రకృతిః (సూర్యః) సవితృమండలమ్ (తే) తవ (మహిమా) మహాత్మ్యమ్ (యః) (తే) తవ (అహన్) దినే (సంవత్సరే) వర్షే (మహిమా) (సంబభూవ) సంభూతోఽస్తి (యః) (తే) (వాయౌ) (అంతరిక్షే) (మహిమా) (సంబభూవ) (యః) (తే) (దివి) విద్యుతి సూర్యప్రకాశే వా (సూర్యే) (మహిమా) (సంబభూవ) (తస్మై) (తే) తుభ్యమ్ (మహిమ్నే) మహితో భావాయ (ప్రజాపతయే) ప్రజాపాలకాయ (స్వాహా) సద్విద్యాయుక్తా ప్రజ్ఞా (దేవేభ్యః) విద్వద్భ్యః.॥౨॥

అన్వయః :-హే భగవన్ జగదీశ్వర! యస్త్వముపయామగృహీతోఽసి, తం జుష్టం త్వా ప్రజాపతయేఽహం గృహ్ణామి. యస్య తే ఏష యోనిరస్తి, యస్తే సూర్యో మహిమా, యస్తే ఽహన్ సంవత్సరే మహిమా సంబభూవ. యస్తే వాయావంతరిక్షే మహిమా సంబభూవ, యస్తే దివి సూర్యే మహిమా సంబభూవ. తస్మై మహిమ్నే ప్రజాపతయే తే దేవేభ్యశ్చ స్వాహా సర్వైః సంగ్రాహ్యా.॥౨॥

భావార్థః :-హే మనుష్యాః! యస్య పరమేశ్వరస్యేదం సర్వం జగన్మహిమానం ప్రకాశయతి తస్యోపాసనాం విహాయాన్యస్య కస్యచిత్తస్య స్థానే చోపాసనా నైవ కార్యా. యః కశ్చిద్ బ్రూయాత్

**పరమేశ్వరస్య సత్త్వే కిం ప్రమాణమితి తం ప్రతి యదిదం జగద్వర్తతే తత్సర్వం పరమేశ్వరం ప్రమాణయతీత్యుత్తరం దేయమ్.॥౨॥**

పదార్థము :- భగవంతుడవగు ఓ జగదీశ్వరా! ఏ నీవు (ఉపయామగృహీతః) యమాది యోగాభ్యాస సంబంధ కర్మలచే సమీపమందే సాక్షాత్కరింపబడి, అనగా హృదయాకాశమున ప్రకటితమై (అసి) ఉన్నావో, అట్టి (జుష్టమ్) సేవించబడిన లేక ప్రసన్నమొనర్చబడిన (త్వా) నిన్ను (ప్రజాపతయే) ప్రజాపాలకుడగు రాజు యొక్క రక్షణకై నేను (గృహ్ణామి) గ్రహణమొనర్చు చున్నాను. ఏది (తే) నీయొక్క (ఏషః) ఈ (యోనిః) ప్రకృతి జగత్తునకు కారణమై యున్నదో, ఏది (తే) నీ యొక్క (సూర్యః) సూర్యమండలము (మహిమా) మహద్రూపము మరియు (యః) ఏది (తే) నీయొక్క (అహన్) దినము (సంవత్సరే) సంవత్సరమునందు నియమ బంధనముద్వారా (మహిమా) గొప్పదనము (సమ్బభూవ) సంభావితమైయున్నదో (యః) ఏది (తే) నీయొక్క (వాయౌ) వాయువు మరియు (అన్తరిక్షే) అంతరిక్షము నందు (మహిమా) గొప్పదనము (సమ్బభూవ) ప్రసిద్ధమైయున్నదో (యః) ఏది (తే) నీయొక్క (దివి) విద్యుత్తు, అనగా సూర్యాదుల ప్రకాశము మరియు (సూర్యే) సూర్యునియందు (మహిమా) మహత్త్వము (సమ్బభూవ) ప్రత్యక్షమైయున్నదో (తస్మై) అట్టి (మహిమ్నే, ప్రజాపతయే) ప్రజాపాలనరూప మహత్వమున (తే) నీకొరకు మరియు (దేవేభ్యః) విద్వాంసులకొరకు (స్వాహా) ఉత్తమ విద్యతో గూడిన బుద్ధి ఎల్లరును పొందుట యోగ్యమై యున్నది. ॥౨॥

భావార్థము :- మానవులారా! ఏ పరమేశ్వరుని మహిమను ఈ విశ్వమంతయును ప్రకాశ మొనర్చు చున్నదో, యా పరమేశ్వరుని ఉపాసనను వదలి యాతని స్థానమున ఇతరముల నుపాసించవలదు. పరమేశ్వరునియునికిని గూర్చి ప్రమాణమేమి? యని ఎవడైన ప్రశ్నించినచో, దానికి ఈ వర్తమానమై యున్న జగత్తే పరమేశ్వరుని యునికికి ప్రమాణ మని సమాధాన మీయవలయును. ॥౨॥

2. O God, Thou art realisable through yoga. I serve Thee and accept Thee as protector of the King who takes care of his subjects. This primordial mater and the sun testify to Thy Greatness. Thy Majesty is discernible in the day and year. The Majesty is seen in the wind and firmament. Thy majesty is traceable in the luminous sun. For all that, for Thy protecting greatness and for the learned persons, we always sing praises!.

౧౩౦౯. యః ప్రాణత ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, పరమేశ్వరో దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. వెండియు విషయ మదియే.

**౧౩౦౯ యః ప్రాణతో నిమిషతో మహిత్వైకఽఇద్రాజా జగతో బభూవ। యఽఈశేఽఅస్య ద్విపదశ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ॥౩॥**

ప.వి:- యః, ప్రాణతః, నిమిషత ఇతి ని+మిషతః, మహిత్వేతి మహి+త్వా, ఏకః, ఇత్, రాజా, జగతః, బభూవ, యః, ఈశే, అస్య, ద్విపద ఇతి ద్వి+పదః, చతుష్పదః, చతుఃపద ఇతి చతుః+పదః, కస్మై, దేవాయ, హవిషా, విధేమ.॥3॥

పదార్థః :-(యః) పరమాత్మా (ప్రాణతః) ప్రాణినః (నిమిషతః) నేత్రాదినా చేష్టాం కుర్వతః (మహిత్వా) స్వమహిమ్నా (ఏకః) అద్వితీయోఽసహాయః (ఇత్) ఏవ (రాజా) అధిష్ఠాతా (జగతః) సంసారస్య (బభూవ) (యః) (ఈశే) ఈష్టే (అస్య) (ద్విపదః) మనుష్యాదేః (చతుష్పదః) గవాదేః (కస్మై) ఆనందరూపాయ (దేవాయ) కమనీయాయ (హవిషా) భక్తివిశేషేణ (విధేమ) పరిచరేమ. ॥3॥

అన్వయః-హే మనుష్యాః యథా వయం య ఏక ఇన్మహిత్వా నిమిషతః ప్రాణతో ద్విపదశ్చతుష్పదోఽస్య జగతో రాజా బభూవ, యోఽస్యేశే, తస్మై కస్మై దేవాయ హవిషా విధేమ, తథాఽస్య భక్తివిశేషో భవద్భిర్విధేయః. ॥3॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా! య ఏక ఏవ సర్వస్య జగతో మహారాజాధిరాజోఽఖిలజగన్నిర్మాతా సకలైశ్వర్యయుక్తో మహాత్మా న్యాయాధీశోఽస్తి తస్యైవోపాసనేన ధర్మార్థకామమోక్షఫలాని ప్రాప్య సర్వే భవంతః సంతుష్యంతు.॥3॥

పదార్థము :- ఓ మానవులారా! మే మెట్లు (యః) ఏ (ఏకః,ఇత్) ఒక్కడు మాత్రమే (మహిత్వా) తన మహిమతో (నిమిషతః) నేత్రాదులచే చేష్టల నొనర్చుచు (ప్రాణతః) ప్రాణిరూప (ద్విపదః) రెండు కాళ్ళగల మనుష్యాదులు మరియు (చతుష్పదః) నాల్గుకాళ్ళగల గొవులు మున్నగు పశుసంబంధమగు ఈ (జగతః) జగత్తు యొక్క (రాజా) అధిష్ఠాత (బభూవ) యగుచున్నాడో మరియు (యః) ఎవడు (అస్య) ఈ ప్రపంచమునకు (ఈశే) సర్వోపరిస్వామియైయున్నాడో, అట్టి (కస్మై) ఆనందస్వరూపుడును (దేవాయ) అతి మనోహరుడగు పరమేశ్వరుని (హవిషా) విశేషభక్తిభావముచే (విధేమ) సేవింతుమో అటులనే విశేషభక్తిభావముతో మీరును సేవించుడు. ॥3॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఈ జగత్తంతటికిని ఒక్కడే ఎవడు మహారాజాధిరాజు, సమస్త జగదుత్పాదకుడు,సకలైశ్వర్య యుక్తుడు, మహాత్ముడు, న్యాయాధీశుడునై యున్నాడో అతనినే యుపాసించి మీరెల్లరును ధర్మార్థ కామమోక్షముల ఫలములను పొంది సంతుష్టులగుడు. ॥3॥

3. God by His grandeur is the sole Ruler of the moving world that breathes and slumbers. He is the Sovereign Lord of these men and cattle. Let us worship with devotion, Him, the Embodiment of happiness.

౧౩౧౦. ఉపయామగృహీత ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, పరమేశ్వరో దేవతా. వికృతిశ్ఛందః, మధ్యమః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౩౧౦ ఉపయామగృహీతో౽సి ప్రజాపతయే త్వా జుష్టం గృహ్ణామ్యేష తే యోని
శ్చన్ద్రమాస్తే మహిమా। యస్తే రాత్రౌ సంవత్సరే మహిమా సమ్బభూవ యస్తే
పృథివ్యామగ్నౌ మహిమా సమ్బభూవ యస్తే నక్షత్రేషు చన్ద్రమసి మహిమా
సమ్బభూవ తస్మై తే మహిమ్నే ప్రజాపతయే దేవేభ్యః స్వాహా॥౪॥

ప.విః- ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, త్వా జుష్టమ్, గృహ్ణామి, ఏషః, తే, యోనిః, చన్ద్రమాః, తే, మహిమా, యః, తే, రాత్రౌ, సంవత్సరే, మహిమా, సమ్బభూవేతి సమ్+బభూవ, యః, తే, పృథివ్యామ్, అగ్నౌ, మహిమా, సమ్బభూవేతి సమ్+బభూవ, యః తే, నక్షత్రేషు, చన్ద్రమసి, మహిమా, సమ్బభూవేతి సమ్+బభూవ, తస్మై, తే, మహిమ్నే, ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, దేవేభ్యః, స్వాహా.॥౪॥

పదార్థః :-(ఉపయామగృహీతః) ఉపయామేన సత్కర్మణా యోగాభ్యాసేన గృహీతః స్వీకృతః (అసి) (ప్రజాపతయే) ప్రజాపాలకాయ (త్వా)త్వామ్ (జుష్టమ్) సేవితమ్ (గృహ్ణామి) (ఏషః)(తే) తవ సృష్టౌ (యోనిః) జలమ్. యోనిరిత్యుదకనా..నిఘం. ౧.౧౨. (చంద్రమాః) చంద్రలోకః (తే) తవ (మహిమా) (యః) (తే) తవ (రాత్రౌ) (సంవత్సరే) (మహిమా) సంబభూవ (యః) (తే) (పృథివ్యామ్) అంతరిక్షే భూమౌ వా (అగ్నౌ) విద్యుతి (మహిమా) (సంబభూవ) (యః) (తే) తవ (నక్షత్రేషు) కారణరూపేణ నాశరహితేషు లోకాంతరేషు. (చంద్రమసి) చంద్రలోకే (మహిమా) (సంబభూవ) (తస్మై) (తే) తవ (మహిమ్నే) ప్రజాపతయే (దేవేభ్యః) (స్వాహా) సత్యాచరణ యుక్తా క్రియయా.॥౪॥

అన్వయః :-హే జగదీశ్వర! యస్త్వముపయామగృహీతో౽సి,తం త్వా జుష్టం ప్రజాపతయే ౽హం గృహ్ణామి. యస్య తే సృష్టావేష యోనిర్జలం యస్య తే సృష్టౌ చంద్రమా మహిమా యస్య

తే యో రాత్రా సంవత్సరే మహిమా చ సంబభూవ, యస్తే సృష్టౌ పృథివ్యామగ్నౌ మహిమా సంబభూవ. యస్య తే సృష్టౌ యో నక్షత్రేషు చంద్రమసి చ మహిమా సంబభూవ, తస్య తే తస్మై మహిమ్నే ప్రజాపతయే దేవేభ్యశ్చ స్వాహాఽస్మాభి రనుష్ఠేయా.॥౪॥

భావార్థః:-హే మనుష్యా! యస్య మహిమ్నా సామర్థ్యేన సర్వం జగద్విరాజతే యస్యానంతో మహిమాఽస్తి యస్య సిద్ధౌ రచనావిశిష్టం సర్వం జగద్దృష్టాంతమస్తి తమేవ సర్వే మనుష్యా ఉపాసీరన్.॥౪॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! (ఉపయామగృహీతః) సత్కర్మ అనగా యోగాభ్యాసము మున్నగు ఉత్తమ కర్మలచే ఏ నీవు స్వీకరించబడినవాడవై (అసి) ఉన్నావో, అట్టి (త్వాజుష్టమ్) సేవించబడిన నిన్ను (ప్రజాతయే) ప్రజాపాలకుడగు రాజు రక్షణకై నేను (గృహ్ణామి) గ్రహణమొనర్తును, అనగా మనస్సునందు స్థిరపరతును. ఏ (తే) నీయొక్క ప్రపంచములో (ఏషః) ఏ ఇట్టి (యోనిః) జలముగలదో (తే) నీ జగత్తునందు (చన్ద్రమాః) చంద్రలోకము (మహిమా) గొప్పతనము ఏ (తే) నీయొక్క (యః) ఏ (రాత్రా) రాత్రి (సంవత్సరే) సంవత్సరమునందు, అది (మహిమా) గొప్పదనము (సమ్బభూవ) సంభవ మైనది, అగును, అవగలదు (యః, తే) ఏ నీ సృష్టియందు (పృథివ్యామ్) అంతరిక్షము, భూమి, మరియు (అగ్నౌ) అగ్నియందు (మహిమా) గొప్పదనము (సమ్బభూవ) సంభవించినదో, సంభవించుచున్నదో, సంభవించునో మరియు ఏ (తే) నీసృష్టియందు (యః) ఏ(నక్షత్రేషు)కారణరూపముచే నశించని లోకలోకాంతరములందు మరియు (చన్ద్రమసి) చంద్రలోకమందు అది (మహిమా) మహత్వము (సమ్బభూవ) సంభవమైనది, అగుచున్నది, కాగలదు. అట్టి (తే) నీయొక్క (తస్మై) ఆ (మహిమ్నే) గొప్పతనము (ప్రజాపతయే) ప్రజాపాలకుడగు రాజు (దేవేభ్యః) విద్వాంసులకొరకు (స్వాహా) సత్యాచరణముతో గూడిన క్రియను మనమెల్లరమును అనుష్ఠించవలసి యుండును. ॥౪॥

భావార్థము :-ఓ మానవులారా! ఎవని మహిమ, సామర్థ్యములచే విశ్వము విరాజిల్లు చున్నదో, ఎవని మహిమలు అనంతములో దానిని సిద్ధిపరచుటకై రచనాత్మకముగ పూర్ణమైయున్న ఈ విశ్వమే దృష్టాంతమై యున్నది. కావున నాతని యుపాసనయే ఎల్లరకును యోగ్యమై యున్నది. ॥౪॥

4. O God, Thou art realisable through yoga. I serve Thee and accept Thee as Protector of the king who takes care of his subjects. This water and moon testify to Thy greatness. Thy Mjesty is seen in the night and year. Thy majesty is found in the Erth and fire. Thy Majesty is discernible in the immortal worlds and the moon. For all tht, for Thy protecting greatness and for the learned persons, we always sing praises!.

౧౩౧౧. యుంజంతీత్యస్య ప్రజాపతిరృషిః, పరమేశ్వరో దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునరీశ్వరః కీదృశోఽస్తీత్యాహ. మఱల నా యీశ్వరు డెటులున్నాడు?

౧౩౧౧ యుఞ్జన్తి బ్రధ్నమరుషం చరన్తం పరి తస్థుషః। రోచన్తే రోచనా దివి॥౫॥

ప.వి:- యుఞ్జన్తి, బ్రధ్నమ్, అరుషమ్, చరన్తమ్, పరి, తస్థుషః, రోచన్తే, రోచనాః, దివి.॥౫॥

పదార్థః :-(యుంజంతి) యుక్తం కుర్వంతి (బ్రధ్నమ్) మహాంతమ్ (అరుషమ్) అరుఃషు మర్మసు సీదంతమ్ (చరంతమ్) ప్రాప్నువంతమ్ (పరి) సర్వతః (తస్థుషః) స్థావరాన్ (రోచంతే) ప్రకాశంతే (రోచనాః) దీప్తయః (దివి).॥౫॥

అన్వయః :-యే పరితస్థుషశ్చరంతం విద్యుతమివ వర్తమానమరుషం బ్రధ్నం పరమాత్మానమాత్మనా సహ యుంజంతి. తే దివి సూర్యే రోచనాః కిరణా ఇవ రోచంతే.॥౫॥

భావార్థః:-హే మనుష్యాః! యథా ప్రతిబ్రహ్మాండే సూర్యః ప్రకాశతే తథా సర్వస్మిన్ జగతి పరమాత్మా ప్రకాశతే. యే యోగాభ్యాసేనాఽన్తర్యామిణం పరమాత్మానం స్వమాత్మనా యుంజతే తే సర్వతః ప్రకాశితా జాయంతే.॥౫॥

పదార్థము :-ఎవడు (పరి) అన్నివైపులనుండి (తస్థుషః) స్థావరజీవులను (చరన్తమ్) పొందుచు విద్యుత్తువలె నుండునో (అరుషమ్) ఏదేని దెబ్బదగిలినంతమాత్రముననే శీఘ్రముగ ప్రాణములు వెడలునట్టి మర్మ స్థానముల రక్షణకై స్థిరమగుచు (బ్రధ్నమ్) సర్వోన్నతుడగు పరమాత్మకు తనయాత్మతో (యుఞ్జన్తి) సంయుక్తపరచుకొనెదరో వారు (దివి) సూర్యునియందు (రోచనాః) కిరణములవలె (రోచన్తే) పరమాత్మయందు ప్రకాశమాను లగుదురు.॥౫॥

భావార్థము :-మానవులారా! ప్రతి బ్రహ్మాండమునందును సూర్యుడు ప్రకాశించుచున్నటులనే సర్వజగత్తునందును పరమాత్మ ప్రకాశమానుడై యున్నాడు. యోగాభ్యాసముచే ఆ యంతర్యామి యగు పరమేశ్వరుని తమయాత్మయందు యుక్తపరుచుకొనువారు అన్నివైపులనుండి ప్రకాశమును పొందగలరు.॥౫॥

5. They, who unite their souls with God, Who pervades all stationary objects, and protects the vital parts of our body, shine in Him like beams in the Sun.

౧౩౧౨.యుంజంత్యస్యేత్యస్య ప్రజాపతిర్ఋషిః, సూర్యో దేవతా, విరాడ్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

అథ కేనేశ్వరః ప్రాప్తవ్య ఇత్యాహ. ఎవడీశ్వరుని పొందగలడు?

౧౩౧౨ యుఞ్జన్త్యస్య కామ్యా హరీ విపక్షసా రథే। శోణా ధృష్ణూ నృవాహసా॥౬॥

ప.వి:- యుఞ్జన్తి, అస్య, కామ్యా, హరీఽ ఇతి హరీ, విపక్షసేతి వి+పక్షసా, రథే, శోణా, ధృష్ణూఽ ఇతి ధృష్ణూ, నృవాహసేతి నృ+వాహసా.॥౬॥

పదార్థః :- (యుంజంతి) (అస్య) జీవస్య (కామ్యా) కమనీయౌ (హరీ) హరణశీలౌ (విపక్షసా) వివిధైః పరిగృహీతౌ (రథే) యానే (శోణా) రక్తగుణవిశిష్టౌ (ధృష్ణూ) దృఢౌ (నృవాహసా) నృణాం వాహకౌ.॥౬॥

అన్వయః :-హే మనుష్యాః యథా శిక్షకాః కామ్యా హరీ విపక్షసా శోణా ధృష్ణూ నృవాహసా రథే యుంజంతి, తథా యోగినోఽస్య పరమేశ్వరస్య మధ్య ఇంద్రియాణి మనః ప్రాణాంశ్చ యుంజంతి.॥౬॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా మనుష్యాః సుశిక్షితైర్ధ్యశ్వైర్యుక్తైన యానేన స్థానాంతరం సద్యః ప్రాప్నువంతి తథైవ విద్యాసత్సంగయోగాభ్యాసైః పరమాత్మానం శీఘ్రం ప్రాప్నువంతి.॥౬॥

పదార్థము :- ఓ మానవులారా! శిక్షణ నిచ్చు సజ్జను లెట్లు (కామ్యా) మనోహరములు (హరీ) కొనిపోవునట్టి (విపక్షసా) అనేక విధముల చక్కగా గ్రహించబడిన (శోణా) రక్తవర్ణముతో గూడిన (ధృష్ణూ) అతిదృఢమగు (నృవాహసా) మానవుల నొక చోటునుండి వేరొక చోటునకు జేర్చు రెండశ్వములను (రథే) రథమునందు (యుఞ్జన్తి) జోడించునట్లు యోగులు (అస్య) ఈ పరమేశ్వరునియందు ఇంద్రియములు, అంతఃకరణము, ప్రాణములను సంయుక్తమొనర్తురు. ॥౬॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. చక్కగా శిక్షణనిచ్చిన అశ్వములతో గూడిన రథముపై మానవులు ఒక చోటునుండి వేరొక చోటికి శీఘ్రముగ, క్షేమముగ జేరునట్లు, మానవులు విద్య, సజ్జనసాంగత్యము, యోగాభ్యాసముల ద్వారా పరమాత్మను శీఘ్రముగా పొందగలుగుదురు.॥౬॥

6. Just as experts yoke to the chariot two beautiful horses, controlled with difficulty and through diverse devices; tawny, stout, our bearers from one place to the other, so do the yogis yoke their organs of sense, mind, and vital breaths to God.

౧౩౧౩. యద్వాత ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఇంద్రో దేవతా, నిచృద్ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునర్మనుష్యః కస్య సంగం కుర్యాదిత్యాహ. మనుష్యుడెవనితో సంగమొనర్చవలయును?

౧౩౧౩ యద్వాతోఽఅపోఽఅగనీగన్ప్రియామిన్ద్రస్య తన్వమ్।
ఏతꣳస్తోతరనేన పథా పునరశ్వమావర్తయాసి నః॥౭॥

ప. వి:- యత్, వాతః, అపః, అగనీగన్, ప్రియామ్, ఇన్ద్రస్య, తన్వమ్, ఏతమ్, స్తోతః, అనేన, పథా, పునః, అశ్వమ్, ఆ, వర్తయాసి, నః.॥౭॥

పదార్థః :-(యత్) యం కలాయంత్రాశ్వం (వాతః) వాయుః (అపః) జలాని (అగనీగన్) ప్రాప్నువంతి (ప్రియామ్) కమనీయమ్ (ఇంద్రస్య) విద్యుతః (తన్వమ్) విస్తృతం శరీరమ్ (ఏతమ్) (స్తోతః) స్తావక (అనేన) (పథా) మార్గేణ(పునః) (అశ్వమ్) ఆశుగామినమ్ (ఆ) (వర్తయాసి) వర్తయేః (నః) అస్మాన్.॥౭॥

అన్వయః :-హే స్తోతర్యథా శిల్పిజనా ఇంద్రస్య ప్రియాం తన్వం వాత ఇవ ప్రాప్య యద్ యమపోఽగనీగ న్త్సతైతమశ్వమనేన పథా త్వం ప్రాప్నోషి. పునర్నోఽస్మానావర్తయాఽసి. తం భవంతం వయం సత్కుర్యామ. ॥౭॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యాః! యే యుష్మాన్ సుమార్గేణ గమయంతి తత్సంగేన యూయం వాయువిద్యుదాదివిద్యాం ప్రాప్నుత.॥౭॥

పదార్థము :-(స్తోతః) ఓ స్తుతించువాడా! శిల్పులెట్లు (ఇంద్రస్య) విద్యుత్తుయొక్క (ప్రియమ్) అతిసుందరమైన (తన్వమ్) విస్తారమగు శరీరమును (వాతః) వాయువువలె పొంది (యత్) ఏ కళాయంత్రరూపమగు అశ్వమును మరియు (అపః) జలములను (అగనీగన్) ప్రాప్తించుకొందురో, అట్లే (ఏతమ్) ఇట్టి (అశ్వమ్) శీఘ్రముగా నడచు ఈ కళాయంత్రరూపాశ్వమును (అనేన) పై దెలిపిన విద్యుద్రూప (పథా) మార్గమును నీవు పొందుదువు (పునః) మరల (నః) మమ్ము (ఆ, వర్తయాసి)చక్కగా అటునిటు గొనిపోవుదువు. అట్టి నీకు మేము సత్కార మొనర్తుము. ॥౭॥

భావార్థము :-ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! మిమ్ము ఉత్తమ మార్గమున కొనిపోవువారి సాంగత్యముచే మీరు వాయువు, విద్యుత్తు మున్నగు విద్యలను చక్కగా పొందుడు॥౭॥

7. O laudable learned person, just as artisans control the beautiful diffused from of electricity, swift like the wind, an erect electrical contrivances worked with water, so do ye prepare with the aid of electricity a fast moving machine, tht takes us from on place to the other!.

౧౩౧౪.వసవ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, వాయ్వాదయో దేవతాః, అత్యష్టి శ్ఛందః, గాంధారః స్వరః.

పునర్విద్వాంసః కిం కుర్వంతీత్యాహ. విద్వాంసు లేమి యొనర్తురు?

౧౩౧౪ వసవస్త్వాఽఞ్జన్తు గాయత్రేణ ఛన్దసా రుద్రాస్త్వాఽఞ్జన్తు త్రైష్టుభేన ఛన్దసాదిత్యాస్త్వాఽఞ్జన్తు జాగతేన ఛన్దసా । భూర్భువః స్వర్లాజీ౩ ఞ్ఛాచీ౩న్యవ్యే గవ్యఽఏతదన్నమత్త దేవాఽఏతదన్నమద్ధి ప్రజాపతే ॥౮॥

ప.వి:- వసవః, త్వా, అఞ్జన్తు, గాయత్రేణ, ఛన్దసా, రుద్రాః, త్వా, అఞ్జన్తు, త్రైష్టుభేన, త్రైష్టుభేనేతి త్రై+స్తుభేన, ఛన్దసా, ఆదిత్యాః, త్వా, అఞ్జన్తు, జాగతేన, ఛన్దసా, భూః, భువః, స్వః లాజీ3న్, శాచీ3న్, యవ్యే, గవ్యే, ఏతత్, అన్నమ్, అత్త, దేవాః, ఏతత్, అన్నమ్, అద్ధి, ప్రజాపత ఇతి ప్రజా+పతే.॥౮॥

పదార్థః :-(వసవః) ప్రథమకల్పా విద్వాంసః (త్వా) త్వామ్ (అంజంతు) కామయంతామ్ (గాయత్రేణ) గాయత్రీఛందోవాచ్యేన (ఛందసా) అర్థేన (రుద్రాః) మధ్యమకల్పా విద్వాంసః (త్వా) త్వామ్ (అంజంతు) (త్రైష్టుభేన) త్రిష్టుప్ప్రకాశితేనార్థేన (ఛందసా) (ఆదిత్యాః) ఉత్తమా విద్వాంసః (త్వా) (అంజంతు) (జాగతేన) జగతీఛందఃప్రకాశితేనార్థేన (ఛందసా) స్వచ్ఛందేన (భూః) ఇమం లోకమ్ (భువః) అంతరిక్షస్థాన్ (స్వః) ప్రకాశస్థాంల్లోకాన్ (లాజీన్) స్వస్వకక్షాయాం చలితాన్ (శాచీన్)వ్యక్తాన్ (యవ్యే) యవానాం భవనే క్షేత్రే జాతమ్ (గవ్యే) గోర్వికారే (ఏతత్) (అన్నమ్) (అత్త) భక్షయత (దేవాః) (విద్వాంసః) (ఏతత్) (అన్నమ్) (అద్ధి) భుంక్ష్వ (ప్రజాపతే) ప్రజారక్షక!॥౮॥

అన్వయః :-హే ప్రజాపతే! వసవో గాయత్రేణ ఛందసా యం త్వాఽఞ్జంతు, రుద్రాస్త్రైష్టుభేన ఛందసా యం త్వాఽఞ్జంత్వాదిత్యా జాగతేన ఛందసా యం త్వాఽఞ్జంతు, స త్వమేతదన్నమద్ధి. హే దేవాః! యూయం యవ్యే గవ్య ఏతదన్నమత్త. లాజీన్ శాచీన్ భూర్భువః స్వర్లోకాన్ ప్రాప్నుత చ.॥౮॥

భావార్థః :-యే విద్వాంసః సాంగోపాంగాన్ వేదాన్ మనుష్యానధ్యాపయంతి తే ధన్యవాదార్హా భవంతి.॥౮॥

పదార్థము :-(ప్రజాపతే) ప్రజాపాలనమొనర్చు ఓ రాజా! (వసవః) మొదటి శ్రేణికి చెందిన విద్వాంసులు (గాయత్రేణ) గాయత్రీ ఛన్దస్సుతో పఠించదగిన (ఛన్దసా) స్వచ్ఛందమగు అర్థముతో ఏ (త్వా) నిన్ను (అఞ్జన్తు) కోరెదరో (రుద్రాః) మధ్యమకక్షకు చెందిన విద్వాంసులు (త్రైష్టుభేన) త్రిష్టుప్ ఛందస్సుతో ప్రకాశపరచబడిన (ఛన్దసా) స్వచ్ఛందమగు అర్థముచే, ఏ (త్వా) నిన్ను (అఞ్జన్తు) కోరెదరో (ఆదిత్యాః) ఉత్తమ శ్రేణికి చెందిన విద్వాంసులు (జాగతేన) జగతీ ఛన్దముచే ప్రకాశితమొనర్చబడిన (ఛన్దసా) స్వచ్ఛందమగు అర్థముతో, ఏ (త్వా) నిన్ను (అఞ్జన్తు) కోరెదరో అట్టి నీవు (ఏతత్) ఇట్టి (అన్నమ్) అన్నమును (అద్ధి) భుజించుము (దేవాః) ఓ విద్వాంసులారా! మీరు (యవ్యే) యవలచేలలోనుత్పన్నమగు (గవ్యే) గోక్షీరములు పెరుగు మున్నగు ఉత్తమ

పదార్థములందు గలసియున్న (ఏతమ్) ఇట్టి (అన్నమ్) అన్నమును (అత్త) భుజించుడు. మరియు (లాజీన్) స్వంతకక్షలందు నడచుచు (శాచీన్) ప్రకటితములునగు (భూః) ఈ ప్రత్యక్షలోకము (భువః) అంతరిక్ష మందలి లోకములు (స్వః) ప్రకాశమునందు స్థిరమై యున్న సూర్యాది లోకములను పొందుడు. ॥౮॥

భావార్థము :- సాంగోపాంగముగ నాలుగువేదములను మానవులకు చదివించు విద్వాంసులు ధన్యవాదార్హులై యుందురు. ॥౮॥

8. O king, the protector of his subjects, the Vasus approach thee with Vedic verses in Gayatri Metre, Rudras approach thee with verses in Trishtup metre, Adityas approach thee with verses in jagati metre, eat thou this food, O learned people eat ye this food prepared from barley and co'w milk and its products, and move in Earth, ether, Heaven, and distinct planets moving in their orbits!.

౧౩౧౫. కః స్విదిత్యస్య ప్రజాపతిర్ఋషిః జిజ్ఞాసుర్దేవతా, నిచృదత్యష్టి శ్ఛందః, గాంధారః స్వరః.

అథ విద్వాంసః కిం కిం ప్రష్టవ్యా ఇత్యాహ. విద్వాంసుల నేనేమి ప్రశ్నించవలయును?

౧౩౧౫ కః స్విదేకాకీ చరతి కఉ స్విజ్జాయతే పునః ।

కిꣳస్విద్ధిమస్య భేషజం కిమ్వావపనం మహత్॥౯॥

ప.వి:- కః స్విత్, ఏకాకీ, చరతి, కః, ఊꣳ ఇత్యూꣳ స్విత్, జాయతే, పునరితి పునః, కిమ్, స్విత్, హిమస్య, భేషజమ్, కిమ్, ఊꣳ ఉ ఇత్యూꣳ, ఆవపనమిత్యా+వపనమ్, మహత్.॥౯॥

పదార్థః:-(కః) (స్విత్) ప్రశ్నే (ఏకాకీ) అసహాయః (చరతి) గచ్ఛతి (కః)(ఉ) వితర్కే (స్విత్) (జాయతే) (పునః) (కిమ్)(స్విత్) (హిమస్య) శీతస్య (భేషజమ్) ఔషధమ్ (కిమ్) (ఉ) (ఆవపనమ్) సమంతాద్వపతి యస్మింస్తత్ (మహత్) విస్తీర్ణమ్. ॥౯॥

అన్వయః :-హే విద్వాంసో వయం యుష్మాన్ కః స్విదేకాకీ చరతి; క ఉ స్విత్ పునః పునర్జాయతే? కిం స్విద్ధిమస్య భేషజం? కిము మహదావపనమస్తీతి పృచ్ఛామః ॥౯॥

భావార్థః :-ఏతేషాం ప్రశ్నానాముత్తరస్మిన్మంత్ర ఉత్తరాణి కథితానీతి వేద్యమ్. మనుష్యా ఈదృశానేవ ప్రశ్నాన్ కుర్యుః.॥౯॥

**పదార్థము** :-విద్వాంసులారా! మేము మిమ్ము అడుగుచున్నాము. ఏమన (కః స్విత్) ఎవడు (ఏకాకీ) ఏకాకీయై అనగా ఒంటరిగా (చరతి) తిరుగును? (ఉ) మరియు (కః స్విత్) ఎవడు (పునః) మాటి మాటికి (జాయతే) ప్రకటమగు చున్నాడు? (కిమ్, స్విత్) ఏది (హిమస్య) శీతమునకు (భేషజమ్) ఔషధము, మరియు (కిమ్ ఉ) ఏది (మహత్) గొప్ప (ఆవపనమ్) బీజావాపనమునకు స్థానము? ॥౯॥

**భావార్థము** :- పై ప్రశ్నలకు సమాధానము క్రింది మంత్రమున తెలుపబడినదని దెలియవలయును. మనుష్యు లట్టి ప్రశ్నలను సదా విద్వాంసుల నడిగి తెలిసికొనవలెను. ॥౯॥

9. Who moveth singly and alone? Who is brought forth to life again? What is the remedy of cold? What is the vast field for production?

౧౩౧౬. సూర్య ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, సూర్యో దేవతా, అనుష్టుప్, ఛందః, గాంధారః స్వరః.

అథ పూర్వోక్తప్రశ్నానాముత్తరాణ్యాహ. పూర్వమంత్రమునందలి ప్రశ్నలకు సమాధానమిచ్చుచున్నాడు.

౧౩౧౬ సూర్య॑ ఏకా॒కీ చ॑రతి చ॒న్ద్రమా॑ జాయతే॒ పున॑ః।

అ॒గ్నిర్హి॒మస్య॑ భే॒షజం॒ భూమి॑రా॒వప॑నం మ॒హత్॥౧౦॥

ప.విః- సూర్య॑ః, ఏ॒కా॒కీ, చ॒ర॒తి, చ॒న్ద్రమా॑ః, జా॒య॒తే॒,పునరితి॒ పున॑ః, అ॒గ్నిః, హి॒మస్య॑, భే॒షజమ్, భూమి॑ః, ఆ॒వప॑నమిత్యా॒+వప॑నమ్, మ॒హత్.॥౧౦॥

**పదార్థః** :-(సూర్యః) సవితా (ఏకాకీ) (చరతి) (చంద్రమాః) చంద్రలోకః (జాయతే) (పునః) (అగ్నిః) పావకః (హిమస్య) (భేషజమ్) (భూమిః) (ఆవపనమ్) (మహత్).॥౧౦॥

**అన్వయః** :-హే జిజ్ఞాసవో మనుష్యాః! సూర్య ఏకాకీ చరతి. పునశ్చంద్రమాః ప్రకాశితో జాయతే. అగ్ని ర్హిమస్య భేషజం, భూమిర్మహదావపనమస్తీతి యూయం విత్త.॥౧౦॥

**భావార్థః** :-అస్మిన్ సంసారే సూర్యః స్వాకర్షణేన స్వస్యైవ కక్షాయాం వర్తతే. తస్యైవ ప్రకాశేన చంద్రాదయో లోకాః ప్రకాశితా భవంతి. అగ్నినా తుల్యం శీతనివారకం వస్తు, పృథివ్యా తుల్యం మహత్ క్షేత్రం కిమపి నాస్తీతి మనుష్యైర్వేదితవ్యమ్.॥౧౦॥

**పదార్థము** :-తెలిసికొనయోగ్యులగు జిజ్ఞాసువులారా! (సూర్యః) సూర్యుడు (ఏకాకీ) ఇతర సహాయములేక ఒంటరిగా తన కక్షయందే (చరతి) నడచును (పునః) మరల ఈ సూర్యుని ప్రకాశముచే (చన్ద్రమాః) చంద్రలోకము (జాయతే) ప్రకాశిత మగుచుండును (అగ్నిః) అగ్ని (హిమస్య) శీతమునకు

(భేషజమ్) ఔషధము (భూమిః) భూమి (మహత్) గొప్ప (ఆవపనమ్) బీజావాపన స్థానమని వీరెల్లరును దెలిసికొనుడు.॥౧౦॥

భావార్థము :-ఈ విశ్వమునందు సూర్యలోకము తన యాకర్షణశక్తిచే తన కక్ష్యయందే వర్తమానమై యున్నది. మరియు దాని ప్రకాశముచేతనే చంద్రుడు మున్నగు లోకములు ప్రకాశితములై యున్నవి. శీతలమును దొలగించుటకు అగ్ని మరియు బీజావాపనమునకు భూమికి సమమైన పెద్దస్థానములు లేవని మనుష్యులు దెలిసికొనవలయును. ॥౧౦॥

10. The sun moves singly and alone. The Moon is brought to life again. Fire is the remedy of cold. The Earth is the vast field for production.

౧౩౧౭.కా స్విదాసీ దిత్యస్య ప్రజాపతిర్ఋషిః, జిజ్ఞాసుర్దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః ప్రశ్నానాహ. మఱల ప్రశ్నల జెప్పుచున్నాడు.

౧౩౧౭ కా స్విదాసీత్పూర్వచిత్తిః కిస్విదాసీద్బృహద్వయః।
కా స్విదాసీత్పిలిప్పిలా కా స్విదాసీత్పిశఙ్గిలా॥౧౧॥

ప.విః-కా, స్విత్, ఆసీత్, పూర్వచిత్తిరితి పూర్వ+చిత్తిః, కిమ్, స్విత్, ఆసీత్, బృహత్, వయః, కా, స్విత్, ఆసీత్, పిలిప్పిలా, కా,స్విత్, ఆసీత్, పిశఙ్గిలా.॥౧౧॥

పదార్థః :-(కా) (స్విత్) (ఆసీత్) అస్తి (పూర్వచిత్తిః) పూర్వా చాసౌ చిత్తిః ప్రథమా స్మృతివిషయా (కిమ్) (స్విత్) (ఆసీత్) (బృహత్)మహత్ (వయః) యో వేతి గచ్ఛతి స పక్షీ (కా) (స్విత్) (ఆసీత్) (పిలిప్పిలా) ఆర్ద్రీభూతా చిక్కణా శోభనా. శ్రీర్వై పిలిప్పిలా. శ. ౧౩. ౨. ౬.౧౬. (కా) (స్విత్) (ఆసీత్) (పిశంగిలా) యా పిశం ప్రకాశరూపం గిలతి సా. పిశమితి రూపనామ. ॥౧౧॥

అన్వయః :- హే విద్వాంసః! వయం యుష్మాన్ ప్రతి కా స్విత్ పూర్వచిత్తిరాసీత్? కింస్విత్ బృహద్వయ ఆసీత్? కా స్విత్ పిలిప్పిలాఽఽసీత్కా స్విత్ పిశంగిలాఽఽసీదితి పృచ్ఛామః.॥౧౧॥

భావార్థః:-ఏతేషాముత్తరాణ్యుత్తరత్ర మంత్రే సంతి. యది విదుషః ప్రతి ప్రశ్నాన్న కుర్యుస్తర్హి విద్వాంసోఽపి న భవేయుః.॥౧౧॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! మేము మిమ్ము ప్రశ్నించుచున్నాము (కా,స్విత్) ఏది (పూర్వచిత్తిః) స్మరణమునకు మొట్టమొదటి విషయము (ఆసీత్) ఐ యున్నది? (కిమ్ స్విత్) ఎయ్యది (బృహత్) గొప్పగా

(వయః) ఎగురునట్టి పక్షి (ఆసీత్) ఐయున్నది? (కా,స్విత్) ఏది (పిలిప్పిలా) మిక్కిలి మృదువు, నున్నని వస్తువు (ఆసీత్) ఐ యున్నది. మరియు (కా, స్విత్) ఎయ్యది (పిశఙ్గిలా) ప్రకాశస్వరూపమును మ్రింగివేయు వస్తువై (ఆసీత్) ఉన్నది? ॥౧౧॥

భావార్థము :-ఈ మంత్రమునకు సమాధానము తరువాయి మంత్రమున గలదు. ఇట్లు విద్వాంసులను ప్రశ్నించకున్న తాము విద్వాంసులు గాజాలరు.॥౧౧॥

11. What is the primary thought? What is the bird of mighty size? What is the majestic beautiful thing? What absorbs light?

౧౩౧౮.ద్యౌరాసీదిత్యస్య ప్రజాపతి ఋషిః, విద్యుదాదయో దేవతాః, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ ప్రాక్ప్రశ్నోత్తరాణ్యాహ. పూర్వ ప్రశ్నలకు ప్రత్యుత్తరములు.

౧౩౧౮ ద్యౌరాసీత్పూర్వచిత్తిరశ్వఽ ఆసీద్బృహద్వయః ।

అవిరాసీత్ పిలిప్పిలా రాత్రిరాసీత్ పిశఙ్గిలా॥౧౨॥

ప.విః- ద్యౌః, ఆసీత్, పూర్వచిత్తిరితి పూర్వ+చిత్తిః, అశ్వః, ఆసీత్, బృహత్, వయః, అవిః, ఆసీత్, పిలిప్పిలా, రాత్రిః, ఆసీత్, పిశఙ్గిలా.॥౧౨॥

పదార్థః :-(ద్యౌః) దివ్యగుణప్రదా వృష్టిః. ద్యౌర్వై వృష్టిః, శత. కాం. ౧౩. ౨. ౬. ౧౬, (అసీత్) అస్తి (పూర్వచిత్తిః) ప్రథమస్మృతివిషయా (అశ్వః) యోఽశ్నుతే మార్గాన్ సోఽగ్నిః (ఆసీత్) (బృహత్) మహత్ (వయః) యో వేతి గచ్ఛతి సః (అవిః) రక్షణాదికర్త్రీ పృథివీ (ఆసీత్) (పిలిప్పిలా) (రాత్రిః) (ఆసీత్) (పిశంగిలా). ॥౧౨॥

అన్వయః :-హే జిజ్ఞాసవః! పూర్వచిత్తిర్ద్యౌరాసీద్ బృహద్వయోఽశ్వ ఆసీత్. పిలిప్పిలా ఽవి రాసీత్పిశంగిలా రాత్రిరాసీదితి యూయం బుధ్యధ్వమ్.॥౧౨॥

భావార్థః :-హవనసూర్యరూపాద్యగ్నితాపేన సర్వగుణసంపన్నాఽన్నాదినా సంసారస్థితి నిమిత్తా వృష్టి ర్జాయతే తతః సర్వరత్నాఢ్యా భూర్భవతి. సూర్యాగ్నినిమిత్తేనైవ ప్రాణినాం శయనాయ రాత్రిర్జాయతే.॥౧౨॥

పదార్థము :-తెలిసికొను నిచ్ఛగల జిజ్ఞాసువులారా! (పూర్వచిత్తిః) మొట్టమొదటి స్మృతి విషయము (ద్యౌః) దివ్యగుణముల నిచ్చు వృష్టియై (ఆసీత్) ఉన్నది (బృహత్) గొప్పగా (వయః) ఎగురునట్టి (అశ్వః)

మార్గములందు వ్యాప్తమగు, పక్షితుల్యము అగ్ని (ఆసీత్) ఐ యున్నది. (పిలిప్పిలా) వర్షమువల్ల మిక్కిలిమెత్తగా, మృదువుగా, శోభాయమానము (అవిః) మున్నగు రక్షణాదులకు ఉత్తమ గుణములను ప్రకటించునట్టి పృథివి (ఆసీత్) ఐ యున్నది. మరియు (పిశఙ్గిలా) ప్రకాశస్వరూపమును మ్రింగివేయు, అనగా అంధకారమును గలిగించు (రాత్రీః) రాత్రి (ఆసీత్) ఐ యున్నదని మీ రెరుగవలయును. ॥౧౨॥

**భావార్థము** :-హవనము మరియు సూర్యరూపాది యగ్నులు తాపముచే సర్వగుణములతో గూడిన అన్నాధులద్వారా విశ్వస్థితిని గలిగించు వర్షము గలుగును. అట్టి వర్షముచే సర్వ ఓషధాదుల శ్రేష్ఠపదార్థములతో గూడిన పృథివి యగును. సూర్యరూపాగ్నిచేతనే ప్రాణుల విశ్రాంతికొరకు రాత్రియగు చున్నది.॥౧౨॥

12. Rain is the primary thought. Fire is like the mighty bird, Earth is the majestic, beautiful objects that protects us with corn. Night absorbs light.

౧౩౯.వాయురిత్యస్య ప్రజాపతిర్ఋషిః, బ్రహ్మాదయో దేవతాః, భురిగతిజగతీ ఛందః, నిషాదః స్వరః.

అథ విద్వద్భి ర్మనుష్యాః క్వ యోజనీయా ఇత్యాహ. మానవులు విద్వాంసుల నెక్కడ నియోగించవలయును?

౧౩౯ వాయుష్ట్వా పచతైరవత్వసితగ్రీవశ్ఛాగైర్న్యగ్రోధశ్చమసైః శల్మలి ర్వృద్ధ్యా।

ఏష స్య రాథ్యో వృషా పడ్భిశ్చతుర్భిరేదగన్బ్రహ్మాకృష్ణశ్చ

నో౽వతు నమో౽గ్నయే ॥౧౩॥

ప.విః- వాయుః , త్వా, పచతైః, అవతు, అసితగ్రీవ ఇత్యసిత+గ్రీవః, ఛాగైః, న్యగ్రోధః, చమసైః, శల్మలిః, వృద్ధ్యా, ఏషః, స్యః రాథ్యః, వృషా, పడ్భిరితి పడ్+భిః, చతుర్భిరితి చతుః+భిః, ఆ, ఇత్, అగన్, బ్రహ్మా, అకృష్ణః, చ, నః, అవతు, నమః, అగ్నయే.॥౧౩॥

పదార్థః :-(వాయుః) ఆదిమః స్థూలః కార్యరూపః (త్వా) త్వామ్ (పచతైః) పరిపాక పరిణామైః (అవతు) రక్షతు (అసితగ్రీవః) అసితా కృష్ణా గ్రీవా శిఖా యస్య సః (ఛాగైః) ఛేదనైః (న్యగ్రోధః) వటః (చమసైః) మేఘైః (శల్మలిః) వృక్షవిశేషః (వృద్ధ్యా) వర్ధనేన (ఏషః) (స్యః) సః (రాథ్యః) రథేషు హితా రథ్యాస్తాసు కుశలః (వృషా) వర్షకః (పడ్భిః) పాదైః. అత్ర వర్ణవ్యత్యయేన దస్య డః. (చతుర్భిః) (ఆ) (ఇత్) ఏవ (అగన్) గచ్ఛతి. (బ్రహ్మా) చతుర్వేదవిత్ (అకృష్ణః) అవిద్యాంధకారరహితః (చ) (నః) అస్మాన్ (అవతు) ప్రవేశయతు (నమః) అన్నమ్ (అగ్నయే) ప్రకాశమానాయ విదుషే. ॥౧౩॥

అన్వయః:-హే విద్యార్థిన్! పచతైర్వాయుశ్ఛాగైరసితగ్రీవశ్చమసైర్న్యగ్రోధో వృద్ధ్యా శల్మలి స్త్వాఽవతు. య ఏష రాథ్యో వృషస్య చతుర్భిః పద్భిరిత్త్వాఽగన్ యోఽకృష్ణో బ్రహ్మ చ నోఽస్మానవతు. తస్మై అగ్నయే విద్యయా ప్రకాశమానాయ నమో దేయమ్. ॥౧౩॥

భావార్థః :-హే మనుష్యాః! వాయుః ప్రాణేనాగ్నిః పాచనేన సూర్యో వృష్ట్యా వృక్షాః ఫలాదిభిరశ్వాదయో గత్యా విద్వాంసః శిక్షయా యుష్మాన్ రక్షంతి. తాన్ యూయం విజానీత విదుషస్సత్కురుత చ.॥౧౩॥

పదార్థము :-విద్యార్థీ (పచతైః) ఉత్తమ పాకములచే (వాయుః) స్థూలకార్యరూప పవనము (ఛాగైః) కోయునట్టి క్రియలచే (అసితగ్రీవః) నల్లని శిఖలు గలిగిన అగ్ని (చమసైః) మేఘములచే (న్యగ్రోధః) వటవృక్షము (వృద్ధ్యా) ఉన్నతితో గూడ (శల్మలిః) బూరుగుచెట్టు (త్వా) నిన్ను (అవతు) పాలించుగాక! ఏ (ఏషః) ఇట్టి (రాథ్యః) [రాచ] మార్గములందు నడచుటయందు యోగ్యము (వృషా) సుఖవర్షములను గలిగించు (స్యః) అట్టి (చతుర్భిః,పద్భిః;ఇత్) నాలుగు కాళ్లచేనడచునట్టిది నీకు (ఆఽగన్) ప్రాప్తించుగాక! (చ) మరియు నేది (అకృష్ణః) అవిద్యారూప అంధకారము నుండి వేరైయున్న (బ్రహ్మ) చతుర్వేదపారంగతుడగు విద్వాంసుడు (నః) మమ్ము సమస్త సద్గుణములందు (అవతు) చేర్పించుగాక! అట్టి (అగ్నయే) విద్యాప్రకాశకుడు నాల్గువేదముల నిష్ణాతుడును నగు విద్వాంసునకు (నమః) అన్నము నీయవలయును.॥౧౩॥

భావార్థము :-మానవులారా! వాయువు శ్వాస మున్నగు వానిని నడుపుట, అగ్ని అన్నాదులను పాకమొనర్చుట, సూర్యమండలము వర్షము, వృక్షములు ఫలాదులను,అశ్వములు మున్నగునవి ప్రయాణము ద్వారా మరియు విద్వాంసులు శిక్షణచే మీ రక్షణను యొనర్చుచుందురు. దానిని మీరు ఎరుగుడు. విద్వాంసులను సత్కరించుడు. ॥౧౩॥

13. O student, may air help thee with cooked viands black - necked fire with powers of digestion, fig tree with clouds, Shalmali tree with its increase. May the stallion, tht moves on the roads the chariot, bestower of happiness come unto thee on his four feet. May the learned scholar of the four Vedas, free from the darkness of ignorance fill us with virtues. May we offer him food!.

౧౩౨౦.సశ్శితో రశ్మినేత్యస్య ప్రజాపతిర్ఋషిః, బ్రహ్మ దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునర్విద్వాంసః కిం కుర్యు రిత్యాహ. విద్వాంసు లేమి చేయువలయును?

౧౩౨౦ సశ్శితో రశ్మినా రథః సశ్శితో రశ్మినా హయః ।

సశ్శితో అప్స్వప్సుజా బ్రహ్మ సోమపురోగవః ॥౧౪॥

ప.వి:-సంశిత ఇతి సమ్+శితః, రశ్మినా, రథః, సంశిత ఇతి సమ్+శితః, రశ్మినా, హయః, సంశిత ఇతి సమ్+శితః, అప్స్విత్యప్+సు, అప్సుజా ఇత్యప్సు+జా, బ్రహ్మా, సోమపురోగవ ఇతి సోమ+పురోగవః.॥౧౪॥

పదార్థః :-(సంశితః) సమ్యక్ సూక్ష్మీకృతః (రశ్మినా) కిరణసమూహేన (రథః) రమణసాధనః (సంశితః) (రశ్మినా) (హయః)అశ్వః (సంశితః) స్తుతః (అప్సు) ప్రాణేషు (అప్సుజాః) ప్రాణేషు జాయమానాః (బ్రహ్మా) మహాన్‌యోగీ విద్వాన్ (సోమపురోగవః) సోమ ఓషధిగణబోధ ఐశ్వర్యయోగో వా పురోగామీ యస్య సః.॥౧౪॥

అన్వయః:-యది మనుష్యై రశ్మినా రథః సంశితో రశ్మినా హయః సంశితోఽప్స్వప్సుజాః సోమపురోగవో బ్రహ్మా సంశితః క్రియేత తర్హి కిం కిం సుఖం న లభ్యేత?॥౧౪॥

భావార్థః:-యే మనుష్యాః పదార్థవిజ్ఞానేన విద్వాంసో భవంతి తేఽన్యాన్ కారయిత్వా ప్రశంసాం ప్రాప్నువంతు.॥౧౪॥

పదార్థము :-ఏ మనుష్యులు (రశ్మినా) కిరణ సమూహముద్వారా (రథః) ఆనందమును సాధించునట్టి యానము (సంశితః) శ్రేష్ఠముగా సూక్ష్మనిపుణత్వముచే సిద్ధపరచబడిన (రశ్మినా) కళ్లెపు పగ్గము మున్నగు వానిచే (హయః) అశ్వము (సంశితః) బహుబాగుగా నడచుటయందు తీక్ష్ణత, అనగా ఉత్తమ క్రియ మరియు (అప్సు) ప్రాణములందు (అప్సుజాః) ప్రాణవాయువురూపమున సంచరించునట్టి పవనము లేక భాష్పము (సోమపురోగవః) ఓషధులబోధ మరియు ఏ ఐశ్వర్య యోగము ఇంతకు పూర్వము ప్రాప్తియగునో, అట్టి (బ్రహ్మా) విద్వాంసుడగు మహాయోగి (సంశితః) అతి ప్రశంసారూపమున నొనర్చబడినచో సర్వసుఖములు ప్రాప్తించును. ॥౧౪॥

భావార్థము :-పదార్థవిజ్ఞానముతో విద్వాంసులగువారు ఇతరులను గూడ విద్వాంసులుగ నొనర్చి ప్రశంసనీయులు గావలయును. ॥౧౪॥

14. Body is strengthened through penance, warm like the sun's rays. Organs are also strengthened through penance. Vital breaths are invigorated through penance. A learned yogi advances spiritually through the attainment of love for God.

౧౩౨౧.స్వయమిత్యస్య ప్రజాపతిర్ఋషిః, విద్వాన్ దేవతా, నిచృదనుష్టుప్ ఛందః,గాంధారః స్వరః.

అథ జిజ్ఞాసవః కీదృశా భవేయురిత్యాహ.

చదువవలయునని ఉత్తమ విద్య నభ్యసించవలయునని కోరువా రెటులుందురు?

౧౩.౨౧ స్వయం వాజింస్తన్వం కల్పయస్వ స్వయం యజస్వ స్వయం జుషస్వ।
మహిమా తేఽన్యేన న సన్నశే ॥౧౫॥

ప.వి:- స్వయమ్, వాజిన్, తన్వమ్, కల్పయస్వ, స్వయమ్, యజస్వ, స్వయమ్, జుషస్వ, మహిమా, తే, అన్యేన, న, సన్నశ ఇతి సమ్+నశే.॥౧౫॥

పదార్థః:-(స్వయమ్) (వాజిన్) జిజ్ఞాసో (తన్వమ్) శరీరమ్ (కల్పయస్వ) సమర్థయస్వ (స్వయమ్) (యజస్వ) సంగచ్ఛస్వ (స్వయమ్) (జుషస్వ) సేవస్వ (మహిమా) ప్రతాపః (తే) తవ (అన్యేన) (న) (సన్నశే) సమ్యక్ నశ్యేత్. ॥౧౫॥

అన్వయః :-హే వాజింస్త్వం స్వయం తన్వం కల్పయస్వ. స్వయం విదుషో యజస్వ. స్వయం జుషస్వ చ యతస్తే మహిమా ఽన్యేన సహ న సంనశే.॥౧౫॥

భావార్థః :-యథాఽగ్నిః స్వయం ప్రకాశః స్వయం సంగతః స్వయం సేవమానోఽస్తి తథా యే జిజ్ఞాసవః స్వయం పురుషార్థయుక్తా భవంతి తేషాం మహిమా కదాచిన్న నశ్యతి.॥౧౫॥

పదార్థము :-(వాజిన్) బోధను కోరువాడా! నీవు (స్వయమ్) స్వంతముగ (తన్వమ్) నీ శరీరమును (కల్పయస్వ) సమర్థపరచుము (స్వయమ్) నీవు ఉత్తమ విద్వాంసులను (యజస్వ) సందర్శించుము (స్వయమ్) స్వయముగా వారి (జుషస్వ) సేవలనొనర్చుము. అందువల్ల (తే) నీయొక్క (మహిమా) గొప్పతనము మరియు నీ ప్రతాపము (అన్యేన) ఇతరులతో గూడ (న సంనశే) నష్టపరచుకొనకుము. ॥౧౫॥

భావార్థము :-ఏవిధముగ అగ్ని స్వయముగా ప్రకాశితమగునో, స్వయం లబ్ధమగునో మరియు స్వయముగా సేవకుప్రాప్తమగునో, అదేవిధముగ జ్ఞానమునాకాంక్షించువారు స్వయముగా పురుషార్థవంతుడగును. వారి ప్రతాపము, గౌరవము నష్టమెప్పుడునుగాదు. ॥౧౫॥

15. O seeker after knowledge, thyself strengthen the body, thyself walk in the company of the learned, and thyself serve them. Let not thy greatness be marred by any one!.

౧౩.౨౨.న వా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, సవితా దేవతా, విరాడ్ జగతీ ఛందః, నిషాదః స్వరః.

అథ మనుష్యాః కీదృశా భవేయురిత్యాహ. మానవు లెటులుండవలయును?

౧౩.౨౨ న వా ఉ॰ ఏతన్మ్రియసే న రిష్యసి దేవా॰ ఇదేషి పథిభిః సుగేభిః।
యత్రాసతే సుకృతో యత్ర తే యయుస్తత్ర త్వా దేవః సవితా దధాతు॥౧౬॥

ప.వి:- న, వై, ఊం ఇత్యూం, ఏతత్, మ్రియసే, న, రిష్యసి, దేవాన్ ఇత్, ఏషి, పథిభిరితి పథి+భిః, సుగేభిరితి సు+గేభిః, యత్ర, ఆసతే, సుకృత ఇతి సు+కృతః, యత్ర, తే, యయుః, తత్ర, త్వా, దేవః, సవితా, దధాతు.॥౧౬॥

పదార్థః :-(న) నిషేధే (వై) నిశ్చయేన (ఉ) వితర్కే (ఏతత్) (మ్రియసే) (న) (రిష్యసి) హింధి (దేవాన్) దివ్యాన్ గుణాన్ విదుషో వా (ఇత్) ఏవ (ఏషి) ప్రాప్నోషి (పథిభిః) మార్గైః (సుగేభిః) సుఖేన గంతుం యోగ్యైః (యత్ర) (ఆసతే) ఉపవిశంతి (సుకృతః) ధర్మాత్మానః (యత్ర) (తే) యోగినో విద్వాంసః (యయుః) యాంతి. (తత్ర) (త్వా) త్వామ్(దేవః)స్వప్రకాశః(సవితా)సకలజగదుత్పాదకః పరమేశ్వరః(దధాతు)ధరతు.॥౧౬॥

అన్వయః :-హే విద్యార్థిన్! యత్ర తే సుకృత ఆసతే, సుఖం యయుర్యత్ర సుగేభిః పథిభిస్త్వం దేవానేషి, యత్రైతదు వర్తతే స్థితస్త్వం న మ్రియసే న వై రిష్యసి, తత్రేత్ త్వా సవితా దేవో దధాతు.॥౧౬॥

భావార్థః :-యది మనుష్యా స్వస్వరూపం జానీయుస్తర్హి తేఽవినాశిత్వం విద్యుః. యది ధర్మ్యేణ మార్గేణ గచ్ఛేయుస్తర్హి సుకృతామానందం ప్రాప్నుయుః. యది పరమాత్మానం సేవేరంస్తర్హి సత్యే మార్గే జీవాన్ దధ్యుః. ॥౧౬॥

పదార్థము :-ఓ విద్యార్థీ! (యత్ర) ఎచ్చట (తే) అట్టి (సుకృతః) విద్వాంసులు, ధర్మాత్ములు నగు యోగులు (అసతే) కూర్చుందురో (యయుః) సుఖప్రాప్తినొందెదరో (యత్ర) ఎచ్చట (సుగేభిః) సుఖముగ పయనించదగిన (పథిభిః) మార్గములందు నీవు (దేవాన్) ఉత్తమోత్తమ దివ్యగుణములను లేక విద్వాంసులను (ఏషి) పొందుదువో మరియు నెచ్చట (ఏతత్) ఈ పై దెలిపిన వృత్తాంతములన్నియు (ఉ) ఉన్నవియో మరియు వానియందు స్థిరమైయున్న నీవు (న, మ్రియసే) నష్టమునొందవో (న,వైష్యసి) ఇతరులను నష్టపరచవో (తత్ర) అచ్చట (ఇత్) మాత్రమే (త్వా) నిన్ను (సవితా) సమస్త సృష్టినిర్మాతయగు పరమేశ్వరుడు (దేవః) స్వయంప్రకాశకుడగు నాతడు (దధాతు) స్థాపనమొనర్చుగాక!॥౧౬॥

**భావార్థము** :-ఏ మనుష్యులు తమ తమ నిజరూపముల నెరిగెదరో వారే అవినాశ భావము నెరుగ గలరు. ధర్మయుక్తమార్గమున నడచువారు సత్కర్మలనాచరించువారు పొందు యానందమును పొందగలరు. పరమాత్మను సేవించువారు జీవులను సత్యమార్గమున నడపగలుగుదురు. ॥౧౬॥

**16. O Soul, thou art immortal and indestructible. By fair pths thou cultivatest noble qualities. May the resplendent God place thee in that place, where the godly yogis dwell, and derive pleasure!.**

౧౩౨౩. అగ్నిరిత్యస్య ప్రజాపతిర్ఋషిః, అగ్న్యాదయో దేవతాః, అతిశక్వర్యౌ ఛందసీ, పంచమో స్వరః.

అథ కే పశవ ఇత్యాహ. పశు వేదియను విషయము చెప్పబడుచున్నది.

౧౩౨౩ అగ్నిః పశురాసీత్తేనాయజన్త సఽ ఏతం లోకమజయద్ యస్మిన్నగ్నిః
స తే లోకో భవిష్యతి తజ్జేష్యసి పిబైతాఽ అపః। వాయుః
పశురాసీత్తేనాయజన్త స ఏతం లోకమజయద్యస్మిన్ వాయుః
స తే లోకో భవిష్యతి తం జేష్యసి పిబైతాఽఅపః।
సూర్యః పశురాసీత్తేనాయజన్త సఽ ఏతం లోకమజయద్ యస్మిన్త్సూర్యః
స తే లోకో భవిష్యతి తం జేష్యసి పిబైతాఽఅపః॥౧౭॥

ప.వి:- అగ్నిః, పశుః, ఆసీత్, తేన, అయజంత, సః, ఏతమ్, లోకమ్, అజయత్, యస్మిన్, అగ్నిః, సః, తే, లోకః, భవిష్యతి, తమ్, జేష్యసి, పిబ, ఏతాః, అపః, వాయుః, పశుః, ఆసీత్, తేన, అయజంత, సః, ఏతమ్, లోకమ్, అజయత్, యస్మిన్, వాయుః, సః, తే, లోకః, భవిష్యతి, తమ్, జేష్యసి, పిబ, ఏతాః, అపః, సూర్యః, పశుః, ఆసీత్, తేన, అయజంత, సః, ఏతమ్, లోకమ్, అజయత్, యస్మిన్, సూర్యః, సః, తే, లోకః, భవిష్యతి, తమ్, జేష్యసి, పిబ, ఏతాః, అపః.॥౧౭॥

పదార్థః :-(అగ్నిః) వహ్నిః (పశుః) దృశ్యః (ఆసీత్) అస్తి (తేన) (అయజంత) యజంతు (సః) (ఏతమ్) (లోకమ్) ద్రష్టవ్యమ్ (అజయత్) జయతి (యస్మిన్) లోకే (అగ్నిః) (సః) (తే) తవ (లోకః) (భవిష్యతి) (తమ్) (జేష్యసి) (పిబ) (ఏతాః) (అపః) జలాని (వాయుః) (పశుః) ద్రష్టవ్యః (ఆసీత్) (తేన) (అయజంత) (సః) (ఏతమ్) వాయ్వధిష్ఠాతృకమ్

(లోకమ్) (అజయత్) జయతి (యస్మిన్ (వాయుః) (సః) (తే) (లోకః) (భవిష్యతి) (తమ్) (జేష్యసి) ఉత్కర్షయసి (పిబ) (ఏతాః) (అపః) ప్రాణాన్ (సూర్యః) (పశుః) దృశ్యః (ఆసీత్) (తేన) (అయజంత) (సః) (ఏతమ్) సూర్యాధిష్ఠితమ్ (లోకమ్) (అజయత్) జయతి (యస్మిన్) (సూర్యః) (సః) (తే) (లోకః) (భవిష్యతి) (తమ్) (జేష్యసి) (పిబ) (ఏతాః) (అపః) వ్యాప్తాన్ ప్రకాశాన్.॥౧౭॥

అన్వయః :-హే జిజ్ఞాసో! యస్మిన్ సోఽగ్నిః పశురాసీత్తేనాఽయజంత. తేన త్వం యజ. యథా స విద్వాంస్తేనైతం లోకమజయత్తథైతం జయ, తం చేజ్జేష్యసి తర్హి సోఽగ్నిస్తే లోకో భవిష్యతి, అతస్త్వమేతా యజ్ఞేన శోధితా అపః పిబ. యస్మిన్ స వాయుః పశురాసీద్యేన యజమానా అయజంత. తేన త్వం యజ తథా స ఏతం లోకమజయత్తథా త్వం జయ, యది తం జేష్యసి తర్హి స వాయుస్తే లోకో భవిష్యతి. అతస్త్వమేతా అపః పిబ. యస్మిన్స సూర్యః పశురాసీత్తేనాఽయజన్త యథా స ఏతం లోకమజయత్ తథా త్వం జయ, యది త్వం తం జేష్యసి తర్హి స సూర్యస్తే లోకో భవిష్యతి. తస్మాత్త్వమేతా అపః పిబ.॥౧౭॥

భావార్థః:- హే మనుష్యాః! సర్వేషు యజ్ఞేష్వగ్న్యాదీనేవ పశూన్ జానంతు నైవ ప్రాణినోఽత్ర హింసనీయా హోతవ్యా వా సంతి య ఏవం విదిత్వా సుగంధ్యాదిద్రవ్యాణి సుసంస్కృత్యాఽగ్నౌ జుహ్వతి తాని వాయుం సూర్యం చ ప్రాప్య వృష్టిద్వారా నివర్త్య ఓషధీః ప్రాణాన్ శరీరం బుద్ధిం చ క్రమేణ ప్రాప్య సర్వాన్ప్రాణిన ఆహ్లాదయంతి. ఏతత్కర్తారః పుణ్యస్య మహత్త్వేన పరమాత్మానం ప్రాప్య మహీయంతే.॥౧౭॥

పదార్థము :- విద్యాభ్యాసజిజ్ఞాసూ! (యస్మిన్) చూడదగిన ఏ లోకమందు (సః) ఆ (అగ్నిః)అగ్ని (పశుః) చూడదగినదియై (ఆసీత్) ఉన్నదియో (తేన) దానిచే ఏవిధముగ యజ్ఞమును జేయువారు (అయజన్త) యజ్ఞమును జేయుదురో అదేవిధముగ నీవును యజ్ఞమునొనర్చుము ఎట్లు (సః) ఆ విద్వాంసుడు (ఏతమ్) ఈ (లోకమ్) చూడదగిన స్థానమును (అజయత్) జయించునో అట్లే దీనిని జయించుము (తమ్) దానిని (జేష్యసి) జయించితివేని ఆ (అగ్నిః) అగ్ని (తే) నీకు (లోకః) చూడదగినది (భవిష్యతి) కాగలదు. దీనిచే నీవు (ఏతాః) ఈ యజ్ఞముచే శుద్ధపరచబడిన (అపః) జలములను (పిబ) త్రాగుము (యస్మిన్) ఎందులో (సః) అట్టి (వాయుః) పవనము (పశుః) చూడదగినది (అసీత్) ఐయున్నదో మరియు దేనిచే యజ్ఞమునొనర్చువారు (అయజన్త) యజ్ఞము నొనర్చెదరో (తేన) దానిచే నీవు యజ్ఞము నొనర్చుము. ఎట్లు (సః) ఆ విద్వాంసుడు (ఏతమ్) ఈ వాయుమండలమున నుండునట్టి (లోకమ్) లోకమును (అజయత్) జయించునో, అట్లే నీవు జయించుము (తమ్) దానిని (జేష్యసి) జయించితివేని, ఆ (వాయుః) వాయువు (తే) నీకు (లోకః) చూడదగినది (భవిష్యతి) అగును. దీనిచే నీవు (ఏతాః) ఈ (అపః) యజ్ఞముద్వారా శుద్ధపరచబడిన ప్రాణరూప పవనమును (పిబ) ధారణ మొనర్చుము (యస్మిన్) దానియందు ఆ (సూర్యః)

సూర్యమండలము (పశుః) చూడదగినదై (ఆసీత్) ఉండును (తేన) దానిచే (అయజన్త) యజ్ఞమొనర్చువారు యజ్ఞమును జేయవలెను. ఎట్లు (సః) ఆ విద్వాంసుడు (ఏతమ్) ఈ సూర్యమండలము నిలుచునట్టి (లోకమ్) లోకమును (అజయత్) జయించునో అదేవిధముగ నీవు జయించుము. అట్టినీవు (తమ్) దానిని (జేష్యసి) జయింతువేని (సః) ఆ (సూర్యః) సూర్యమండలము (తే) నీకు (లోకః) చూడదగిన (భవిష్యతి) కాగలదు. దీనిచే నీవు (ఏతాః) యజ్ఞముచే శుద్ధపరచబడిన (అపః) విశ్వమునందు వ్యాప్తమగుచున్న సూర్యప్రకాశములను (పిబ) గ్రహించుము. ॥౧౭॥

**భావార్థము** :- ఓ మానవులారా! సకల యజ్ఞములందును అగ్ని మున్నగు వానినే పశువులని యెంచుడు. కాని ఏప్రాణియు ఈ యజ్ఞముల మిషతో చంపవలదు. అవి చంపదగినవి, హోమమొనర్చదగినవి ఎంతమాత్రమును కావు. ఇట్లు దెలిసికొనినవారు సుగంధము, రోగనాశకము, పుష్టి వర్ధకము, క్రిమినాశకము మున్నగు ఉత్తమోత్తమ పదార్థములను ఉత్తమముగా సేకరించి, శోధించి అగ్నియందు హోమమొనర్చవలెను. అట్టివి సూక్ష్మాతి సూక్ష్మరూపము దాల్చి వాయువు మరియు సూర్యుని ప్రాప్తిజేసికొని వర్షముద్వారా ఆ ప్రదేశమునుండి విడివడి క్రమముగా జలము, ఓషధులు, ప్రాణము, శరీరము మరియు బుద్ధిని పొంది సకల ప్రాణులకు ఆనందము ప్రసాదించగలవు ఈ యజ్ఞకర్మనాచరించు పుణ్యాత్ములు దీనిఫలితముగా పరమాత్మను ప్రాప్తిజేసికొని సత్కారార్హులగుదురు. ॥౧౭॥

17. O seeker after knowledge, in this world, fire is a thing of beauty. Just as learned persosns perform yajnas with it, so shouldst thou do. Just as a learned persons masters this beutiful place of sacrifice, so shouldst thou do. If thou wilt properly manage the place of yajna, fire will manifest itself as a thing worth seeing. Drink thou the waters purified by the yajna!.

Air is a thing of beauty. Just as learned person perform yajnas with it, so shouldst thou do. Just as a learned person msters the atmosphere, the home of air, so shouldst thou do. If thou wilt master the atmosphere, air will look as a beautiful thing. Breathe thou the air purified by the yajna. Sun is a thing of beauty. The learned perform yajnas with its aid. Just as a learned person acquires full knowledge about the sun, so shouldst thou do. If thou wilt do it, sun will appear as a beautiful thing unto thee. Enjoy thou the beams of the sun purified through the yajna, and reigning of the universe.

౧౩౨౪. అథ ప్రాణాయేత్యస్య మంత్రస్య ప్రజాపతి ఋషిః ప్రాణాదయో దేవతాః, విరాడ్ జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునర్మనుష్యైః కిం కిం విజ్ఞేయమిత్యాహ. మానవు లేమేమి తెలుసుకొనవలయును?

౧౩౨౪ ప్రాణాయ స్వాహాఽపానాయ స్వాహా వ్యానాయ స్వాహా ।

అమ్బేఽఅమ్బికేఽమ్బాలికే న మా నయతి కశ్చన ।

ససస్త్యశ్వకః సుభద్రికాం కామ్పీలవాసినీమ్ ॥౧౮॥

ప.వి:-ప్రాణాయ, స్వాహా, అపానాయ, స్వాహా, వ్యానాయేతి వి+ ఆనాయ,స్వాహా అమ్బే, అమ్బికే, అమ్బాలికే, న,మా, నయతి,కః, చన, ససస్తి,అశ్వకః, సుభద్రికామితి సు+భద్రికామ్, కామ్పీలవాసినీమితి కామ్పీల+వాసినీమ్.॥౧౮॥

పదార్థః :-(ప్రాణాయ) ప్రాణపోషణాయ (స్వాహా) సత్యా వాక్ (అపానాయ) (స్వాహా) (వ్యానాయ) (స్వాహా) (అంబే) మాతః (అంబికే) పితామహి (అంబాలికే) ప్రపితామహి (న)నిషేధే (మా) మామ్ (నయతి) వశే స్థాపయతి (కః) (చన) కోఽపి (ససస్తి) స్వపితి (అశ్వకః) అశ్వ ఇవ గంతా జనః (సుభద్రికామ్) సుష్ఠుకల్యాణకారికామ్. (కాంపీలవాసినీమ్) కం సుఖం పీలతి బధ్నాతి గృహ్ణాతీతి కంపీలః, స్వార్థేఽణ్, తం వాసయితుం శీలమస్యాస్తాం లక్ష్మీమ్.॥౧౮॥

అన్వయః :-హే అంబేఽంబికేఽమ్బాలికే కశ్చనాశ్వకో యాం కాంపీలవాసినీం సుభద్రికామాదాయ ససస్తి న మా నయతి, అతోఽహం ప్రాణాయ స్వాహాఽపానాయ స్వాహా వ్యానాయ స్వాహా చ కరోమి. ॥౧౮॥

భావార్థః :- హే మనుష్యాః! యథా మాతా పితామహీ ప్రపితామహ్యాఽపత్యాని సుశిక్షాం నయంతి తథా యుష్మాభిరపి స్వసంతానాః శిక్షణీయాః ధనస్య స్వభావోఽస్తి యత్రేదం సంచీయతే తాన్నిద్రాలూనలసాన్ కర్మహీనాన్ కరోతి. అతో ధనం ప్రాప్యాపి పురుషార్థ ఏవ కర్తవ్యః.॥౧౮॥

పదార్థము :-(అమ్బే) ఓ మాతా! (అమ్బికే) నాయనమ్మా! (అమ్బాలికే) ముని నాయనమ్మా! [తాతమ్మ] (కశ్చన) ఎవడు (అశ్వకః) అశ్వమువంటి శీఘ్రగామి మనుష్యుడో వాడు (కామ్పీల వాసినీమ్) సుఖమును పొందు మనుష్యులను వసింపజేయునట్టి (సుభద్రికామ్) ఉత్తమ కల్యాణమును ప్రసాదించు లక్ష్మిని గ్రహణమొనర్చుకొనును (ససస్తి) నిద్రించువాడు (మా) నన్ను (న, నయతి) వశపరచుకొన జాలడు. దీనిచే నేను (ప్రాణాయ) ప్రాణపోషణమునకై (స్వాహా) సత్యవాణి (అపానాయ) దుఃఖనాశనమునకై (స్వాహా) సుశిక్షితవాణి మరియు (వ్యానాయ) శరీరమందంతటను వ్యాప్తమై యుండు ఆత్మకై (స్వాహా) సత్యవాణిని యుక్తపరచుచున్నాను.॥౧౮॥

భావార్థము :- ఓ మానవులారా! ఏవిధముగ తల్లి, నాయనమ్మ, తాతమ్మ తమ తమ సంతానములను ఉత్తమ విద్యలద్వార పురుషార్థపరులనుగా జేయుదురో అట్లు మీరును మీ సంతానములకు చక్కని శిక్షణ నీయుడు. ధనముయొక్క స్వభావమేమన! ఇది సంచయమై యున్నచోట ఆ వ్యక్తులను నిద్రాళువులు,

సోమరిపోతులు, కర్మహీనులనుగ జేసి వేయును. కావున ధనముల నార్జించియును మానవులు పురుషార్థపరులై ధర్మమార్గమున నడువవలయును.॥౧౮॥

18. O mother, grandmother, great - grandmother, I cannot be subdued by a man, who, though he be quick like a horse, and in full possession of wealth, the bringer of good fortune, and sustainer o an easeloving person, but lies in idle slumber. I utter truthful speech for the sustenance of vital breth. I use instructive speech for warding off misery I speak the truth for the preservation of my soul that pervades the body!.

౧౩౭౫. గణానాం త్వేత్యస్య ప్రజాపతిర్ఋషిః, గణపతిర్దేవతా, శక్వరీ ఛందః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కీదృశః పరమాత్మోపాసనీయ ఇత్యాహ. మానవు లెటువంటి పరమాత్మ నుపాసించవలయును?

౧౩౭౫ గణానాం త్వా గణపతిꣳహవామహే ప్రియాణాం త్వా ప్రియపతిꣳహ

వామహే నిధీనాం త్వా నిధిపతిꣳహవామహే వసో మమ ఆహ

మజాని గర్భధమా త్వమజాసి గర్భధమ్ ॥౧౯॥

ప.వి:- గణానామ్, త్వా, గణపతిమితి గణ+పతిమ్, హవామహే, ప్రియాణామ్, త్వా, ప్రియపతిమితి ప్రియ+పతిమ్, హవామహే, నిధీనామితి ని+ధీనామ్, త్వా, నిధిపతిమితి, నిధి+పతిమ్, హవామహే, వసోఽఇతి వసో, మమ, ఆ, అహమ్, అజాని, గర్భధమితి గర్భ+ధమ్, ఆ, త్వమ్, అజాసి, గర్భధమితి గర్భ+ధమ్.॥౧౯॥

పదార్థః :-(గణానామ్) సమూహానామ్ (త్వా) త్వామ్ (గణపతిమ్) సమూహపాలకమ్ (హవామహే) స్వీకుర్మహే (ప్రియాణామ్) కమనీయానామ్ (త్వా) (ప్రియపతిమ్) కమనీయం పాలకమ్. (హవామహే) (నిధీనామ్) విద్యాదిపదార్థః పోషకాణామ్ (త్వా) (నిధిపతిమ్) నిధీనాం పాలకమ్ (హవామహే) (వసో) వసంతి భూతాని యస్మిన్స్త్వ వసుస్తత్సంబుద్ధౌ (మమ) (ఆ) (అహమ్) (అజాని) జానీయామ్ (గర్భధమ్) యో గర్భం దధాతి తమ్. ఆ (త్వమ్) (అజాసి) ప్రాప్నుయాః (గర్భధమ్) ప్రకృతిమ్.॥౧౯॥

అన్వయః :- హే జగదీశ్వర! వయం గణానాం గణపతిం త్వా హవామహే, ప్రియాణాం

ప్రియపతిం త్వా హవామహే. నిధీనాం నిధిపతిం త్వా హవామహే. హే వసో! మమ న్యాయాధీశో భూయాః. యం గర్భధం త్వమాజాసి, తం గర్భధమహమాజాని.॥౧౯॥

భావార్థః :- హే మనుష్యాః! యః సర్వస్య జగతో రక్షక ఇష్టానాం నిధానామైశ్వర్యాణాం ప్రదాతా ప్రకృతేః పతిః సర్వేషాం బీజాని విదధాతి తమేవ జగదీశ్వరం సర్వ ఉపాసీరన్.॥౧౯॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! మేము (గణానామ్) [ప్రాణి] గణములమధ్య (గణపతిమ్) గణములను పాలించునట్టి (త్వా) నిన్ను (హవామహే) స్వీకరించుచున్నాము (ప్రియాణామ్) అతిప్రియమగు సుందరుల మధ్య (ప్రియపతిమ్)అతిప్రియ సుందర ప్రాణులను పాలించు (త్వా) నిన్ను (హవామహే) ప్రశంసింతుము. (నిధీనామ్) విద్య మున్నగు పదార్థములను పుష్టిపరచువాని మధ్య (నిధిపతిమ్) విద్యాదిపదార్థములను రక్షించునట్టి (త్వా) నిన్ను (హవామహే) స్వీకారమొనర్తుము (వసో) ఓ పరమాత్మా! ఏ నీయందు సకల ప్రాణులు వసించునో అట్టి నీవు (మమ) మాకు న్యాయాధీశుడవగుము (గర్భధమ్) గర్భమువలె విశ్వమును ధారణమొనర్చునట్టి ప్రకృతిని ధరించు (త్వమ్) నీవు (ఆ అజాసి) జన్మములు మున్నగు దోషములు లేనివాడవై చక్కగా ప్రాప్తింతువో అట్టి (గర్భధమ్) ప్రకృతిని ధరించునట్టి నిన్ను (అహమ్) నేను (ఆ, అజాని) బాగుగానెరుగుదునుగాక.॥౧౯॥

భావార్థము :- ఓ మానవులారా! ఎవడు సకల జగత్తును రక్షించువాడో, కాంక్షించిన సుఖములను ప్రసాదించువాడో, ఉత్తమరీతిలో ఐశ్వర్యములను ప్రసాదించునో, ప్రకృతి పాలనము మరియు సకల బీజములను విధానపరచుచున్నాడో అట్టి పరమేశ్వరునే ఎల్లరును ఉపాసించవలెను. ॥౧౯॥

19. O God, we invoke Thee, the troop-lord of troops. We invoke Thee, the Lord of the beloved ones. We invoke Thee, the Lord of the treasure of knowledge. I God, all beings reside in Thee. Thou art my judge. I know Thee full well free from birth, the Sustainer of matter that keeps the universe in its womb. Thou knowest matter!.

౧౩౨౬.తా ఉభావిత్యస్య ప్రజాపతిర్ఋషిః, రాజప్రజే దేవతే, స్వరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ రాజప్రజాజనాః పరస్పరం కథం వర్తేరన్నిత్యాహ. రాజు ప్రజలు పరస్పర మెటుల మెలగవలయును?

౧౩౨౬ తా౨ ఉభౌ చతురః పదః స్మ్రసారయావ స్వర్గే లోకే

ప్రోర్ణువాథాం వృషా వాజీ రేతోధా రేతో దధాతు ॥౨౦॥

ప.వి:- తౌ, ఉభౌ, చతురః, పదః, సమ్ప్రసారయావేతి సమ్+ప్రసారయావ, స్వర్గ ఇతి స్వః +గే, లోకే, ప్ర, ఊర్ణువాథామ్, వృషా, వాజీ, రేతోధా ఇతి రేతః+ధాః, రేతః, దధాతు.॥౨౦॥

పదార్థః:-(తౌ) ప్రజారాజానౌ (ఉభౌ) (చతురః) ధర్మార్థకామమోక్షాన్ (పదః) ప్రాప్తవ్యాన్ (సంప్రసారయావ) విస్తారయావః (స్వర్గే) సుఖమయే (లోకే) ద్రష్టవ్యే ((ప్ర) (ఊర్ణువాథామ్) ప్రాప్నుయాథామ్, (వృషా) దుష్టానాం శక్తిబంధకః (వాజీ) విజ్ఞానవాన్ (రేతోధాః) యో రేతఃశ్లేషమాలింగనం దధాతి సః (రేతః) వీర్యం పరాక్రమమ్ (దధాతు).॥౨౦॥

అన్వయః :-హే రాజప్రజే! యువాం ఉభౌ తౌ యథా స్వర్గే లోకే చతురః పదః ప్రోర్ణువాథాం తథైతానావామధ్యాపకోపదేశకౌ సంప్రసారయావ. యథా రేతోధా వృషా వాజీ రాజా ప్రజాసు రేతో వీర్యం దధ్యాత్తథా ప్రజాపి దధాతు. ॥౨౦॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది రాజప్రజే పితాపుత్రవద్వర్తేయాతాం తర్హి ధర్మార్థకామమోక్షఫలసిద్ధిం యథావత్ప్రాప్నుయాతాం యథా రాజా ప్రజాసుఖబలే వర్ధయేత్తథా ప్రజా అపి రాజ్ఞః సుఖబలే ఉన్నయేత్. ॥౨౦॥

పదార్థము :- ఓ రాజా! ప్రజలారా! మీరు (ఉభా) ఇరువురు (తౌ) ప్రజలు రాజపురుషులు, ఎట్లు (స్వర్గే) సుఖపూర్ణమగు (లోకే) దర్శించదగిన వ్యవహారములు లేక పదార్థములందు (చతురః) నాలుగు, ధర్మ, అర్థ, కామ, మోక్షములు (పదః) పొందదగిన వానిని (ప్రోర్ణువాథామ్) పొందెదరో, అట్లే వీనిని అధ్యాపకోపదేశకులమగు మే మిరువురము (సంప్రసారయావ) విస్తారపరచెదముగాక! (రేతోధాః) ఆలింగనము, అనగా ఇతరులను గలిసికొనుటకు మరియు (వృషా) దుష్టుల సామర్థ్యమును నీరుగార్చజేయుటకు అనగా వారి శక్తిని నిరోధించుటకు (వాజీ) విశేషజ్ఞానవంతులగు రాజు మరియు ప్రజలయందు (రేతః) తమ పరాక్రమమును స్థాపించెదరో, అదే విధముగ ప్రజలును (దధాతు) స్థాపించవలయును. ॥౨౦॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ రాజు మరియు ప్రజలు పితాపుత్రులవలె వర్తించెదరో వారు ధార్మార్థకామమోక్షముల ఫలమును యథా వతుగ పొందగలరు. రా జెట్లు ప్రజల సుఖము, బలములను వృద్ధిపరుచునో, అట్లే ప్రజలును రాజుయొక్క బలము, సుఖములను వృద్ధి పరచవలయును. ॥౨౦॥

20. The King and his subjects in unison, magnify the four stages of Dharma, Arth, Kama, Moksha, wherewith they reside happily in their country. The King, the chastiser of the wicked, full of knowledge, the possessor of strength and prowess, lends valour to his subjects.

౧౩౨౭. ఉత్సక్థ్యా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః న్యాయాధీశో దేవతా, భురిగ్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునా రాజ్ఞా దుష్టాచారాః సమ్యగ్ దండనీయా ఇత్యాహ.

దుష్టాచారులను రాజు బాగుగా దండించవలయును.

౧౩౨౭ ఉత్సక్థ్యా అవ గుదం ధేహి సమ్ఞ్జిం చారయా వృషన్।

యః స్త్రీణాం జీవభోజనః ॥౨౧॥

ప.వి:-ఉత్సక్థ్యా ఇత్యుత్ + సక్థ్యాః, అవ, గుదమ్, ధేహి, సమ్, అఞ్జిమ్, చారయ, వృషన్, యః, స్త్రీణామ్, జీవభోజన ఇతి జీవ+భోజనః.॥౨౧॥

పదార్థః :-(ఉత్సక్థ్యాః) ఊర్ధ్వం సక్థినీ యస్యాస్తస్యాః ప్రజాయాః (అవ) (గుదమ్) క్రీడామ్ (ధేహి) (సమ్) (అంజిమ్) ప్రసిద్ధన్యాయమ్ (చారయ) ప్రాపయ. అత్ర సంహితాయామితి దీర్ఘః (వృషన్) శక్తిమన్ (యః) (స్త్రీణామ్) (జీవభోజనః) జీవా భోజనం భక్షణం యస్య సః.॥౨౧॥

అన్వయః :-హే వృషన్! యః స్త్రీణాం జీవభోజనో వ్యభిచారీ వ్యభిచారిణీ వా స్త్రీ వర్తేత, తం తాం చ నిగృహ్యోత్సక్థ్యాస్తాడయ స్వప్రజాయాం చ గుదమవ ధేహ్యఞ్జిం సంచారయ. ॥౨౧॥

భావార్థః:-హే రాజన్! యే విషయసేవాయాం క్రీడంతో జనాః క్రీడంత్యః స్త్రియో వా వ్యభిచారం వర్ధయేయుస్తే తాశ్చ తీవ్రేణ దండేన శాసనీయాః.॥౨౧॥

పదార్థము :-(వృషన్) ఓ శక్తిశాలీ! (యః) ఏ (స్త్రీణామ్) స్త్రీలమధ్య (జీవభోజనః) ప్రాణుల మాంసమును భుజించు వ్యభిచారుడు లేక పురుషుల మధ్య పై దెలిపినట్టి వ్యభిచారిణి, మాంసాహారిణి యగు స్త్రీ యున్నచో, అట్టి స్త్రీపురుషులను చక్కగా బంధించి (ఉత్సక్థ్యాః) తలక్రిందుల వ్రేలాడదీసి దండించి తన ప్రజలమధ్య (అవ, గుదమ్) ఉత్తమసుఖములను (ధేహి) ధారణమొనర్పుము. మరియు (అంజిమ్) ప్రకటించబడిన తన చక్కని న్యాయమును (సంచారయ) శ్రేష్ఠముగా నడిపించుము.॥౨౧॥

భావార్థము :- ఓ రాజా! విషయాదుల సేవనమందు రమించుచు వ్యభిచారమును వ్యాపింపజేయు స్త్రీ పురుషులను ప్రబలదండనముచే గట్టిగా శిక్షించుము.॥౨౧॥

21. O powerful king, punish the immoral person residing amongst women, and the degraded woman living amongst men, with feet upwards, and head downwards; spread happiness amongst your people, and establish your well established reign of justice!.

౧౩౨౮. యకాసకావిత్యస్య ప్రజాపతిర్ఋషిః రాజప్రజే దేవతే, విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళ్లీ అదే విషయమే.

౧౩.౨౨ యకాసకౌ శకున్తికాహలగితి వఞ్చతి।
ఆహన్తి గభే పసో నిగల్గలీతి ధారకా ॥౨౨॥

ప.వి:- యకా, అసకౌ, శకున్తికా, ఆహలక్, ఇతి, వఞ్చతి, ఆ, హన్తి, గభే, పసః, నిగల్గలీతి, ధారకా.॥౨౨॥

పదార్థః :-(యకా) యః (అసకౌ) అసౌ ప్రజా (శకుంతికా) అల్పా పక్షిణీవ నిర్బలా (ఆహలక్) సమంతాద్దలం విలేఖనమఞ్చతి సః (ఇతి) అనేన ప్రకారేణ (వంచతి) ప్రలంభతే (ఆ)(హంతి) (గభే) ప్రజాయామ్ (పసః) రాష్ట్రమ్ (నిగల్గలీతి) భృశం నిగలతీవ వర్తతే (ధారకా) సుఖస్య ధర్త్రీ.॥౨౨॥

అన్వయః :-యస్యాం గభే రాజా పసో రాష్ట్రమాహంతి సా ధారకా ప్రజా నిగల్గలీతి యతో యకాఽసకౌ శకుంతికా శకుంతికేవ వర్తతే తస్మాదిమామాహలగ్రాజా వఞ్చతీతి.॥౨౨॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది రాజా న్యాయేన ప్రజాయా రక్షణం న కుర్యాదకృత్వా కరం గృహ్ణీయాత్తర్హి యథా ప్రజాః క్రమశః క్షీణా భవంతి తథా రాజాఽపి నష్టో భవతి. యది విద్యావినయాభ్యాం ప్రజాః సంరక్షేత్తర్హి రాజప్రజే సర్వతో వర్ద్ధేతామ్.॥౨౨॥

పదార్థము :-ఏ (గభే) ప్రజలలో రాజు తన (పసః) రాజ్యమును (అహన్తి) తెలిసికొనునో లేక ప్రాప్తించుకొనునో అట్టి (ధారకా) సుఖముల ధారణ మొనర్చునట్టి ప్రజలు (నిగల్గలీతి) నిరంతర సుఖములను మింగుచున్నట్లుండును. మరియు దానివల్ల (యకా) అట్టి (అసకౌ) ఈ ప్రజలు (శకున్తికా) చిన్నపిచ్చుకలవలె దుర్బలులైయున్నారు. నీ ప్రజలను (ఆ హలక్) చక్కగా నాగలిచే భూమిని దున్నించు అనగా పంటచేలకు కప్పము (శిస్తు)ను పొందురాజు (వఞ్చతి) ప్రజలకు ఇబ్బందులు గలుగని విధముగా తమ శిస్తు ధనమును పొందుచున్నాడు.॥౨౨॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. రాజు న్యాయయుక్తముగ ప్రజలను రక్షించక పీడించి కప్పమునుగ్రహించుచుండినచో ప్రజలు నష్టపోవునట్లే రాజుకూడ నష్టమగును. అట్లుగాక విద్యావినయములతో ప్రజలను ఉత్తమముగా రక్షణచేయుచుండిన రాజు మరియు ప్రజలు అన్నివిధములుగ వృద్ధి యగుదురు. ॥౨౨॥

22. The king establishes his rule over his subjects, which aspiring after happiness, acquire it bit by bit. His subjects are weak like the tiny sarrow. ealises land revenue from the people to be spent on their advancement.

౧౩౫. యకోऽసకావిత్యస్య ప్రజాపతిర్ఋషిః, రాజప్రజే దేవతే, బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళ్లీ అదే విషయమే.

౧౩౫ యకోऽసకౌ శకున్తకఽ ఆహలగితి వఞ్చతి ।
వివక్షతఽ ఇవ తే ముఖమధ్వర్యో మా నస్త్వమభిభాషథాః॥౨౩॥

ప.వి:- యకః, అసకౌ, శకున్తకః, ఆహలక్, ఇతి, వఞ్చతి, వివక్షతఽ ఇవేతి వివక్షతః+ఇవ, తే, ముఖమ్, అధ్వర్యోఽ ఇత్యధ్వర్యో, మా, నః, త్వమ్, అభి, భాషథాః.॥౨౩॥

పదార్థః:-(యకః) యః (అసకౌ) అసౌ రాజా (శకుంతకః) నిర్బలః పక్షీవ (ఆహలక్) సమంతాద్విలిఖితం యథా స్యాత్తథా (ఇతి) (వఞ్చతి) వంచితో భవతి (వివక్షత ఇవ) వక్తుమిచ్ఛోరివ (తే) తవ (ముఖమ్) ఆస్యమ్ (అధ్వర్యో) యోऽధ్వరమివాచరతి తత్సంబుద్ధౌ (మా) (నః) అస్మాన్ (త్వమ్) (అభి) (భాషథాః) వదేః.॥౨౩॥

అన్వయః :-హే అధ్వర్యో! త్వం నో మాభిభాషథా మిథ్యాభాషణం వివక్షత ఇవ తే ముఖం మా భవతు. యద్యేవం యకోऽసకౌ కరిష్యసి తర్హి శకుంతక ఇవ రాజాऽऽహలగితి న వంచతి.॥౨౩॥

భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. రాజా కదాచిన్మిథ్యాప్రతిజ్ఞః పరుషవాదీ న స్యాన్న కంచిద్వంచయేత్. యద్యయమన్యాయం కుర్యాత్తర్హి స్వయమపి ప్రజాభిర్వంచితః స్యాత్.॥౨౩॥

పదార్థము :-(అధ్వర్యో) యజ్ఞమువంటి ఉత్తమాచరణముగల ఓ రాజా! (త్వమ్) నీవు (నః) మా యెడ (మా, అభిభాషథాః) అసత్యమాడకుము. మరియు (వివక్షతః, ఇవ) అధిక ప్రసంగి [కోతలరాయడు] వదరుబోతు ముఖమువలె (తే) నీయొక్క (ముఖమ్) ముఖము గారాదు. ఒక వేళ ఈ విధముగ (యకః) ఏదైన (అసకౌ) ఈ రాజు ప్రగల్భము లాడుచున్నట్లైన (శకున్తకః) దుర్బలపక్షివలె (ఆహలక్) బాగుగా లోకువైపోవును (ఇతి) ఈ విధముగ (వఞ్చతి) వంచింపబడగలడు.॥౨౩॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకారము గలదు. రాజు ఎన్నడును అసత్యపు ప్రతిజ్ఞల నొనర్చుట, కటువచనముల పలుకుటవంటివి చేయరాదు. ఎవ్వరిని గూడ వంచించగూడదు. రాజు అన్యాయ కారియగుచో ఒకప్పుడు తాను కూడ ప్రజలద్వారా తప్పక వంచితుడు గాగలడు. ॥౨౩॥

23. O harmless King, don't utter untruth before us. Let not thy tongue utter meaningless words like a prattler. A King who has got not control over his tongue will be extirpated like a weak sparrow, and defrauded by his subjects!.

౧౩౩౦.మాతా చేత్యస్య ప్రజాపతిర్ఋషిః, భూమిసూర్యౌ దేవతే, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౩౩౦ మాతా చ తే పితా చ తేఽగ్రం వృక్షస్య రోహతః।
ప్రతిలామీతి తే పితా గభే ముష్టిమతంసయత్ ॥౨౪॥

ప.వి:- మాతా, చ తే, పితా, చ, తే, అగ్రమ్, వృక్షస్య, రోహతః, ప్రతిలామి, ఇతి, తే, పితా, గభే, ముష్టిమ్, అతంసయత్.॥౨౪॥

పదార్థః :- (మాతా)పృథివీవ వర్తమానా మాతా (చ) (తే) తవ (పితా) సూర్య ఇవ వర్తమానః పితా (చ) (తే) తవ (అగ్రమ్) ముఖ్యశ్రియమ్ (వృక్షస్య) వ్రశ్చితుం ఛేత్తుం యోగ్యస్య సంసారాఖ్యస్య రాజ్యస్య (రోహతః) (ప్రతిలామి)స్నిహ్యామి. (ఇతి)(తే) తవ (పితా) (గభే) ప్రజాయామ్ (ముష్టిమ్) ముష్ట్యా ధనగ్రాహకం రాజ్యమ్ (అతంసయత్) తంసయత్యలంకరోతి. ॥౨౪॥

ఇయం వై మాతాఽసౌ పితాభ్యామేవైనం స్వర్గం లోకం గమయత్యగ్రం వృక్షస్య రోహత ఇతి.శ్రీర్వై రాష్ట్రస్యాగ్రంశ్రియమేవైనంరాష్ట్రస్యాగ్రం గమయతి ప్రతిలామీతి తే పితా గభే ముష్టి మతంసయదితి. విడ్ వై గభో రాష్ట్రం ముష్టీ రాష్ట్రమేవావిశ్యాహంతి తస్మాద్ రాష్ట్రీ విశం ఘాతుకః.॥శ. కాం. ౧౨;అ ౨, బ్రాహ్మ.౯,కం.౭.॥౨౪॥

అన్వయః:- హే రాజన్ యది తే పృథివీవ మాతా చ సూర్య ఇవ తే పితా చ వృక్షస్యాగ్రం రోహతః యది తే పితా గభే ముష్టి మతం సయత్తర్హి ప్రజానోఽహం ప్రతిమీతి.॥౨౪॥

భావార్థః:-యౌ మాతాపితరౌ పృథివీ సూర్య వద్ధైర్య విద్యా ప్రకాశితై న్యాయేన రాజ్యం పాలయిత్వాగ్ర్యాం శ్రియం ప్రాప్య ప్రజా భూషయిత్వా స్వస్య పుత్రం రాజనీత్యా యుక్తం కుర్యాతాం తై రాజ్యం కర్తు మర్హేతామ్.॥౨౪॥

పదార్థము :-ఓ రాజా! ఒక వేళ (తే) నీయొక్క (మాతా) పృథివివలె సహనశీలము, మన్ననయొనర్చు నట్టి తల్లి (చ) మరియు (తే) నీయొక్క (పితా) సూర్యుని వలె తేజోవంతుడు పాలనయొనర్చు నట్టి తండ్రి

(చ) కూడ (వృక్షస్య) ఛేదన మొనర్చదగిన జగద్రూప వృక్షమువంటి రాజ్యమును (అగ్రమ్) ముఖ్యమగు శ్రీ, శోభ, లక్ష్మిపై (రోహతః) ఆరూఢులు [అధికారులు] అగుచో (తే) నీయొక్క (పితా) తండ్రి (గభే) ప్రజలయందు (ముష్టిమ్) పిడికిళ్లచే ధనము దీసికొను రాజ్యమును, ధనమును దీసికొని (అతంసయత్) ప్రకాశపరచినట్లైన (ఇతి) ఈవిధముగ ప్రజనైన నేను (ప్రతిలామి) అట్టి రాజును చక్కగా ప్రేమింతును.॥౨౪॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. తల్లిదండ్రులు పృథివి సూర్యుని వలె ధైర్యము, విద్యద్వారా ప్రకాశమును న్యాయముగ రాజ్యపాలన మొనర్చి ఉత్తమ లక్ష్మి, మరియు శోభను పొంది, రాజును సుశోభితునిగ జేసి తన పుత్రుని రాజనీతిజ్ఞునిగ నొనర్చునో అట్టివాడే రాజ్యమొనర్చుటకు తగినవాడగును. ॥౨౪॥

24. O king, thy forbearing and loving mother, and thy father brilliant and nourishing like the sun, ruler over the prosperity and riches of the sovereignty of this mundane universe. Thy father has beautified his rule for his subjects. I, as his subjects, do love him dearly!.

౧౩౩౧.మాతా చేత్యస్య ప్రజాపతిర్ఋషిః, భూమిసూర్యౌ దేవతే, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునర్మాతాపితరౌ కీదృశౌ భవేతామిత్యాహ. తల్లిదండ్రు లెటులుండవలయును.

౧౩౩౧ మాతా చ తే పితా చ తేఽగ్రే వృక్షస్య క్రీడతః ।

వివక్షతఽఇవ తే ముఖం బ్రహ్మన్ మా త్వం వదో బహు ॥౨౫॥

ప.వి:- మాతా, చ, తే, పితా, చ, తే, అగ్రే, వృక్షస్య, క్రీడతః, వివక్షతఽఇవేతి వివక్షతః + ఇవ, తే, ముఖమ్, బ్రహ్మన్, మా, త్వమ్, వదః బహు.॥౨౫॥

పదార్థః :- (మాతా) పృథివీవజ్జననీ (చ) (తే) (పితా) సూర్యవద్వర్తమానః (చ) (తే) (అగ్రే) విద్యారాజలక్ష్మ్యం (వృక్షస్య) రాజ్యస్య మధ్యే (క్రీడతః) (వివక్షత ఇవ) (తే) తవ (ముఖమ్) (బ్రహ్మన్) చతుర్వేదవిత్ (మా) (త్వమ్) (వదః) వదేః (బహు).॥౨౫॥

అన్వయః :-హే బ్రహ్మన్! యస్య తే మాతా చ యస్య తే పితా చ వృక్షస్యాగ్రే క్రీడతస్తస్య తే వివక్షత ఇవ యన్ముఖం తేన త్వం బహు మా వదః.॥౨౫॥

భావార్థః :- యౌ మాతాపితరౌ సుశీలౌ ధర్మాత్మానౌ శ్రీమంతౌ కులీనౌ భవేతాం తాభ్యాం శిక్షిత ఏవ పుత్రో మితభాషీ భూత్వా కీర్తిమాప్నోతి.॥౨౫॥

**పదార్థము** :-(బ్రహ్మన్) చతుర్వేద పారంగతుడవగు సజ్జనుడా! (తే) సూర్యునివంటి తేజస్వివగు నీ యొక్క (మాతా) పృథివివంటి తల్లి (చ) మరియు (తే) ఏ నీయొక్క (పితా) తండ్రి (చ) యును (వృషస్య) జగద్రూపరాజ్యమందు (అగ్రే) విద్యా రాజ్యముల శోభయందు (క్రీడతః) రమించెదరో, అట్టి (తే) నీయొక్క (వివక్షత ఇవ) అధిక ప్రసంగియగు మనుష్యుని ముఖమువంటి (ముఖమ్) ముఖముగలదో వానితో (త్వమ్) నీవు (బహు) అధికముగ (మా, వద) మాటలాడకుము.॥౨౫॥

**భావార్థము** :- ఎవని తల్లిదండ్రులు, సుశీలురు, ధర్మాత్ములు, శ్రీమంతులు, ఉత్తమ వంశస్థులో అట్టి వారిచే శిక్షితులైన పుత్రులు, ప్రమాణయుక్తులు మిత భాషులునునై సత్కీర్తిని పొందగలుగుదురు. ॥౨౫॥

25. O master of all the four vedas, thy mother patient like the Earth, and thy father shining like the sun, enjoy with knowledge and grandeur the mastery of the universe. Thy mouth is eager to speak, but thou shouldst not talk much.

౧౩౩౨. ఊర్ధ్వమిత్యస్య ప్రజాపతిర్ఋషిః, శ్రీర్దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునా రాజపురుషః కాముత్కృష్టాం కుర్య రిత్యాహ. మరల రాజపురుషులు ఎవరిని అభివృద్ధి నెఱుపవలెను.

౧౩౩౨ ఊర్ధ్వామేనాముచ్ఛ్రాపయ గిరౌ భారꣳహరన్నివ।

అథాస్యై మధ్యమేధతాꣳ శీతే వాతే పునన్నివ ॥౨౬॥

ప. విః- ఊర్ధ్వామ్, ఏనామ్, ఉత్, శ్రాపయ, గిరౌ, భారమ్, హరన్నివేతి హరన్+ ఇవ, అథ, అస్యై, మధ్యమ్, ఏధతామ్, శీతే, వాతే పునన్నివేతి పునన్+ ఇవ. ॥౨౬॥

పదార్థః:-(ఊర్ధ్వామ్) ఉత్కృష్టామ్, (ఏనామ్) రాజ్యశ్రియా యుక్తాం ప్రజామ్, (ఉత్) (శ్రాపయ) ఊర్ధ్వం నయ, (గిరౌ) పర్వతే (భారమ్) (హరన్నివ) (అథ) (అస్యై) అస్యాః, (మధ్యమ్) (ఏధతామ్) వర్ధతామ్, (శీతే) (వాతే) వాయౌ, (పునన్నివ) పృథక్ కుర్వన్నివ. ॥౨౬॥

ఉర్ధ్వామేనాముచ్ఛ్రాపయేతి. శ్రీర్వై రాష్ట్రమశ్వమేధః శ్రియమేవాస్మై రాష్ట్రమూర్ధ్వముచ్ఛ్రయతి, గిరౌ భారꣳహరన్నివేతి, శ్రీర్వై రాష్ట్రస్య భారః శ్రియమేవాస్మై రాష్ట్రం సంనహ్యత్యథో శ్రియమేవాస్మిన్ రాష్ట్రమధినిదధాతి. అథాస్యై మధ్యమేధతామితి శ్రీర్వై రాష్ట్రస్య మధ్యంశ్రియమేవ రాష్ట్రే మధ్యతోఽన్నాద్యం దధాతి శీతే వాతే పునన్నివేతి, క్షేమో వై రాష్ట్రస్య శీతం క్షేమమేవాస్మై కరోతి. శత. కాం.౧౩.అ.౨.బ్రా.౯.కం. ౨,౩,౪.౫.॥౨౬॥

అన్వయః :-హే రాజన్! త్వం గిరౌ భారం హరన్నివైనామూర్ధ్వాముచ్ఛ్రాపయ. అథాస్యై మధ్యం ప్రాప్య శీతే వాతే పునన్నివ భవానేధతామ్.॥౨౬॥

భావార్థః:-అత్రోపమాలంకారౌ. యథా కశ్చిద్భారవాట్ శిరసి పృష్ఠే వా భారముత్థాప్య గిరిమారుహ్యోపరి స్థాపయేత్తథా రాజా శ్రియమున్నతిభావం నయేత్. యథా వా కృషీవలా బుసాదిభ్యోఽన్నం పృథక్కృత్య భుక్త్వా వర్ధంతే, తథా సత్యన్యాయేన సత్యాసత్యే పృథక్ కృత్య న్యాయకారీ రాజా నిత్యం వర్ధతే.॥౨౬॥

పదార్థము :- ఓ రాజా! (గిరౌ) పర్వతముపైకి (భారమ్) బరువును (హరన్నివ) చేర్చువాని వలె (ఏనామ్) ఈ రాజ్యలక్ష్మితో గూడిన (ఊర్ధ్వామ్) ఉత్తమశ్రేణికి చెందిన ప్రజలను (ఉచ్ఛ్రాపయ) ఎల్లప్పుడును అధికాధికముగ ఉన్నతి పరచుచుండుము (అథ) ఇప్పుడు (అస్యై) ఈ ప్రజలయొక్క (మధ్యమ్) మధ్యభాగమగు లక్ష్మిని పొంది (శీతే) శీతల (వాతే) పవనమునందు (పునన్నివ) కర్షకుల కృషిచే శుద్ధమగుచున్న అన్నాదులవలె, వాయువుయోగముచే స్వచ్ఛమగుచున్నజలములవలె నీవు (ఏధతామ్) వృద్ధిని ప్రాప్తిజేసికొను చుండుము.॥౨౬॥

భావార్థము :-ఈ మంత్రమున రెండు ఉపమాలంకారములు గలవు. బరువును మోయువాడు తన శిరము లేక వీపుపై భారమునెత్తుకొని పర్వతముపైకెక్కి భారమును పైన స్థాపించునట్లు లక్ష్మిని ఉన్నతమొనర్చుటకై ప్రయత్నించవలెను. కర్షకుడు పొల్లు, ఊక మున్నగువాని నుండి స్వచ్ఛమగు ధాన్యమును వేరుపరచి అట్టి యన్నమును తినుచు, తినిపించుచు వృద్ధియగునట్లు సత్యన్యాయములచే సత్యాసత్యములను వేరుపరచి న్యాయము నొనర్చు రాజు సదా యభివృద్ధినొందుచుండును. ॥౨౬॥

26. O king, like the man taking a load up to the mountain, always lift up these excellent subjects of thine full of sovereign wealth!.

౧333.ఊర్ధ్వమేనమిత్యస్య ప్రజాపతిర్ఋషిః, శ్రీర్దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నవ్విషయమే.

౧333 ఊర్ధ్వమేనముచ్ఛ్రయతాద్ గిరౌ భారꣳ హరన్నివ।

అథాస్య మధ్యమేజతు శీతే వాతే పునన్నివ ॥౨౭॥

ప.వి:- ఊర్ధ్వమ్, ఏనమ్, ఉత్, శ్రయతాత్, గిరౌ, భారమ్, హరన్నివేతి హరన్+ ఇవ, అథ, అస్య, మధ్యమ్, ఏజతు, శీతే, వాతే, పునన్నివేతి పునన్+ ఇవ.॥౨౭॥

పదార్థః:-(ఊర్ధ్వమ్) అగ్రగామినమ్, (ఏనమ్) రాజానమ్, (ఉచ్ఛ్రయతాత్) ఉచ్ఛ్రితం కుర్యాత్, (గిరౌ) పర్వతే, (భారమ్) (హరిన్నివ) (అథ) (అస్య) రాష్ట్రస్య (మధ్యమ్) (ఏజతు) సత్కర్మసు చేష్టతామ్ (శీతే) (వాతే) (పునన్నివ). ॥౨౭॥

అన్వయః :-హే ప్రజాస్థ విద్వన్! భవాన్ గిరౌ భారం హరన్నివైనం రాజానమూర్ధ్వ ముచ్ఛ్రయతాత్. అథాస్య మధ్యం ప్రాప్య శీతే వాతే పునన్నివైజతు. ॥౨౭॥

భావార్థః:-అత్రోపమాలంకారౌ. యథా సూర్యో మేఘమండలే జలభారం నీత్వావర్షయిత్వా సర్వానున్నయతి తథైవ ప్రజా రాజపురుషానున్నయేదధర్మాచరణాద్భిభియాచ్చ. ॥౨౭॥

పదార్థము :-ప్రజలయందుండు విద్వాంసుడా! నీవు (గిరౌ) పర్వతముపైకి (భారమ్) బరువును (హరన్నివ)చేర్చునట్లు (ఏనమ్) ఈ రాజ్యసంబంధ (ఊర్ధ్వమ్) సమస్త వ్యవహారముల ముందుండువానిగ (ఉచ్ఛ్రయతాత్) ఉన్నతి యుక్తునిగ నొనర్చుము (అథ) ఆ పిదప ఎట్లు (అస్య) ఈ రాజ్యముయొక్క (మధ్యమ్) మధ్యభాగమగు లక్ష్మిని ప్రాప్తించుకొని (శీతే) శీతల (వాతే)పవనమునందు (పునన్నివ) శుద్ధియగుచున్న అన్నాదులవలె (ఏజతు) ఉత్తమకర్మలందు ప్రయత్నమొనర్చుచుండుము. ॥౨౭॥

భావార్థము:-సూర్యుడు మేఘమండలమునకు జలములను చేర్చి అచ్చటినుండి వర్షింపజేసి సమస్తమును వృద్ధిపరచునట్లు ప్రజలు రాజపురుషులను ఉన్నత పరచవలయును. అధర్మాచరణమునందు వెరచియుండ వలయును. ॥౨౭॥

27. O learned persons among the subjects, elevate this king in all administrative designs, as a labourer taks a load up to the mountain. Having thus contibuted to the prosperity of the State, aspire after pure deeds, like the corn purified in a cool breeze!.

౧౩౩౪. యదస్యా ఇత్యస్య ప్రజాపతిరృషిః, ప్రజాపతిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౩౩౪ యదస్యాఽఅꣳహుభేద్యాః కృధు స్థూలముపాతసత్।

ముష్కావిదస్యా ఏజతో గోశఫే శకులావివ ॥౨౮॥

ప.వి:- యత్, అస్యాః, అꣳహుభేద్యాఽ ఇత్యꣳహు+భేద్యాః, కృధు, స్థూలమ్, ఉపాతసదిత్యుప + అతసత్, ముష్కౌ, ఇత్, అస్యాః, ఏజతః, గోశఫఽ ఇతి గో + శఫే, శకులావివేతి శకులౌ+ ఇవ. ॥౨౮॥

పదార్థః:- (యత్) యః, (అస్యాః) ప్రజాయాః, (అంహుభేద్యాః) అంహుమపరాధం యా భినత్తి తస్యాః, (కృధు) హ్రస్వమ్. కృధ్వితి హ్రస్వనామ....౩.౨. (స్థూలమ్) మహత్ కర్మ, (ఉపాతసత్) ఉపభూషయేత్ (ముష్కా) మూషకా, (ఇత్) ఏవ, (అస్యాః) (ఏజతః) కంపయతః, (గోశఫే) గోఖుర చిహ్నే, (శకులావివ) హ్రస్వౌ మత్స్యావివ. ॥౨౮॥

అన్వయః:- యద్యో రాజా రాజపురుషశ్చాస్యా అంహుభేద్యాః కృధు స్థూలం కర్మోపాతసత్తావస్యా ఏజతో గోశఫే శకులావివ ముష్కావిదేజతః.॥౨౮॥

భావార్థః:- అత్రోపమాలంకారః. యథా ప్రీతిమంతౌ మత్స్యావల్పేఽపి జలాశయే నివసతస్తథా రాజరాజపురుషావల్పేఽపి కరలాభే న్యాయేన ప్రీత్యా వర్తేయాతాం, యది దుఃఖచ్ఛేదికాయాః ప్రజాయాః స్వల్పమహదుత్తమం కర్మ ప్రశంసయేతాం తర్హి తౌ ప్రజా ఉపరక్తాః కృత్వా స్వవిషయే ప్రీతిం కారయేతామ్.॥౨౮॥

పదార్థము :-(యత్) ఏ రాజు లేక రాజపురుషుడు (అస్యాః) ఇట్టి (అంహుభేద్యాః) అపరాధములను వినాశపరచునట్టి ప్రజలయొక్క (కృధు) కొంచెము మరియు (స్థూలమ్) అధికములగు కర్మలను (ఉపాతసత్) సుశోభితమొనర్పవలయునో, ఆ యురువురును (అస్యాః) ఇట్టి (ఏజతః) కర్మలనొనర్ప జేయుదురో, అట్టి మీరు (గోశఫే) గోవుగిట్టలచే భూమి యందేర్పడిన గుంటలయందు (శకులావివ) రెండు చిన్నచేపలవలె (ముష్కా, ఇత్) ప్రజలనుండి సేకరించిన శిస్తుధనమును దొంగిలించుటకు భీతిల్లుదురు. ॥౨౮॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఒక దాని నొకటి ప్రేమించుకొను చేపలు చిన్నచెరువు లేక గుంటయందున్నను నిరంతరము ఉత్సాహముగనున్నట్లే రాజు మరియు రాజపురుషులు కొద్ది పాటి శిస్తు లాభమునందు న్యాయముచేగూడిన ప్రీతితో వర్తించవలయును. దుఃఖములను దూరపరచు ప్రజల యొక్క చిన్నవిగాని, పెద్దవిగాని, చేసిన సత్కర్మలను ప్రశంస యొనర్చుచు వారిరువురును ప్రజలను ప్రసన్నులనుగ జేసి తమయందు వారికి ప్రీతిగలునట్లు మెలగవలయును. ॥౨౮॥

28. The king and offcials, who contribute to the grandeur of their subjects in part of full, and both make them energetic, tremble when they unjustly realise taxes from them, just as tiny fishes tremble in the water below the cow's hooves.

౧౩౩౫. యద్దేవాస ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, విద్వాంసో దేవతాః, అనుష్టుప్ ఛందః గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౩౩౫ యద్దేవాసో లలామగుం ప్రవిష్టీమినమావిషుః సక్థ్నా।

దేదిశ్యతే నారీ సత్యస్యాక్షిభువో యథా ॥౨౯॥

ప.వి:- యత్, దేవాసః, లలామగుమితీ లలామ+గుమ్, ప్ర, విష్టిమినమ్, ఆవిషుః, సక్థ్నా, దేదిశ్యతే, నారీ, సత్యస్య అక్షిభువఇత్యక్షి+భువః, యథా.॥౨౯॥

పదార్థః:-(యత్) యమ్, (దేవాసః) విద్వాంసః, (లలామగుమ్) యేన న్యాయేనేప్సాం గచ్ఛంతి ప్రాప్నువంతి తమ్. (ప్ర) (విష్టిమినమ్) విశిష్టా బహవః ష్టిమా ఆర్ద్రీభూతాః పదార్థా విద్యంతే యస్మిన్ స్తమ్, (ఆవిషుః) వ్యాప్నుయుః, (సక్థ్నా) శరీరావయవేన, (దేదిశ్యతే) భృశముపదిశ్యేత, (నారీ) నరస్య స్త్రీ, (సత్యస్య) (అక్షిభువః) యదక్షిణి భవతి ప్రత్యక్షం తస్య. (యథా).॥౨౯॥

అన్వయః:-హే రాజన్! యథా సత్యస్యాక్షిభువో మధ్యేవర్తమానా దేవాసః సక్థ్నా నారీవ యద్విష్టిమినం లలామగుం న్యాయం ప్రావిషుర్యథా చాఽఽప్తేన సత్యమేవ దేదిశ్యతే తథా త్వమాచర.॥౨౯॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా శరీరాంగైః స్త్రీ పురుషౌ లక్ష్యేతే తథా ప్రత్యక్షాది ప్రమాణైః సత్యం లక్ష్యతే, తేన సత్యేన విద్వాంసో యథా ప్రాప్తవ్య మార్ద్రీభావం ప్రాప్నుయుస్తథేతరే రాజప్రజాస్థాః స్త్రీపురుషా విద్యయా వినయం ప్రాప్య సుఖ మన్విచ్ఛంతు.॥౨౯॥

పదార్థము :- ఓ రాజా! (యథా) ఎట్లు (సత్యస్య) సత్యము (అక్షిభువః) కన్నులయెదుట జరిగిన ప్రత్యక్షవ్యవహారమునందున్న (దేవాసః) విద్వాంసులు (సక్థ్నా)తొడ మరియు తన శరీరాంగముచే (నారీ) స్త్రీ వలె (యత్) ఏది (విష్టిమినమ్) సుందరము మరియు తడి గలిగిన పదార్థముగలదో (లలామగుమ్) మనోవాంఛితఫలమును పొందునట్టి న్యాయమును (ప్రావిషుః) వ్యాప్తి గలదో లేక ఏవిధముగ శాస్త్రవేత్తలగు విద్వాంసులు సత్యమును (దేదిశ్యతే) నిరంతరము ఉపదేశించుచుందురో అదేవిధముగ మీరును ఆచరణ మొనర్చుచుండుడు. ॥౨౯॥

భావార్థము :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. శరీరాంగములచే స్త్రీపురుషులు లక్షింపబడుచున్నట్లు ప్రత్యక్షాది ప్రమాణములద్వారా సత్యము లక్షింప బడును. ఆ సత్యముచే విద్వాంసులు పొందదగు కోమలత్వమును పొందునటులనే రాజా మరియు ప్రజలయొక్క స్త్రీపురుషులెల్లరును విద్యచే వినయము పొంది సుఖముల నపేక్షింతురుగా. ॥౨౯॥

**29. Just as we distinguish between man and woman from their organs, so we realise truth from visible evidence. Learned persons with the help of truth acquire humility and their desired objects.**

౧౩౩౬.యద్ధరిణ ఇత్యస్య ప్రజాపతిరృషిః, రాజా దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః స రాజా కథమాచరేదిత్యాహ ఆ రాజెటుల ఆచరించవలయును?

౧౩౩౬ యద్ధ॒రి॒ణో యవ॒మత్తి॒ న పు॒ష్టం ప॒శు మన్య॑తే ।

శూ॒ద్రా యదర్య॑జా॒రా న పోష॑య ధనాయతి ॥30॥

ప.విః- యత్, హ॒రి॒ణః, యవ॑మ్, అత్తి॒, న, పు॒ష్టమ్, ప॒శు, మన్య॑తే, శూ॒ద్రా, యత్, అర్య॑జా॒రేత్యర్య॑ + జారా, న, పోష॑య, ధ॒నా॒య॒తి.॥30॥

పదార్థః :-(యత్) యః, (హరిణః) పశుః, (యవమ్) (అత్తి) (న) (పుష్టమ్) (పశు) పశుమ్, (మన్యతే) (శూద్రా) శూద్రస్య స్త్రీ, (యత్) యా, (అర్యజారా) అర్యో స్వామివైశ్యో జారయతి వయసా హంతి సా, (న) నిషేధే, (పోషయ) పుష్టయే, (ధనాయతి) ఆత్మనో ధనమిచ్ఛతి. ॥30॥

అన్వయః :-యత్ యో రాజా హరిణో యవమత్తీవ పుష్టం పశు న మన్యతే స యదర్యజారా శూద్రేవ పోషయ న ధనాయతి.॥30॥

భావార్థః :-యో రాజా పశువద్వ్యభిచారే వర్తమానః ప్రజాపుష్టిం న కరోతి, స ధనాఢ్యా శూద్రా జారా దాసీవ సద్యో రోగీ భూత్వా పుష్టిం వినాశ్య ధనహీనతయా దరిద్రః సన్ మ్రియతే, తస్మాద్రాజా కదాచిదీర్ష్యాం వ్యభిచారం చ నాచరేత్. ॥30॥

పదార్థము :-(యత్) ఏ రాజు (హరిణః) హరిణము [జింక] ఎట్లు (యవమ్) పంటచేలయందు పెరిగినయవలు మున్నగువానిని (అత్తి) తినునో, అట్లే (పుష్టమ్) పుష్టి (పశు) చూడదగిన తన ప్రజలను (నమన్యతే) సరకు చేయదో, అనగా ప్రజలు బలపరాక్రమములతో నుండుటను లక్ష్యముంచక తినుచుండునో ఆ రాజు (యత్) ఎవడు (అర్యజారా) యజమానుని లేక వైశ్యవంశమును పడుచుదనమునుండి వృద్ధులనుగాజేయు దాసియగు (శూద్రా) శూద్రస్త్రీవలె (పోషయ) పుష్టికొరకు (న ధనాయతి) తన ధనమునే వాంఛించువాడు కాకుండును. ॥30॥

భావార్థము :-ఏ రాజు వ్యభిచారమునందు పశువువలె సంచరించుచు ప్రజలను పుష్టిపరచడో, ఆతడు ధనాఢ్యురాలగు శూద్రస్త్రీయొక్క జారకర్మనొనర్చు దాసివలె శీఘ్రముగానే రోగిష్టియై తన సర్వశక్తులను నష్టపరచుకొని ధనహీనతచే దరిద్రుడై మరణించును. కావున రాజు సదా ఈర్ష్య, వ్యభిచారములను ఆచరించవలదు. ॥30॥

30. A licentious king who squeezes money out of his subjects, like the deer who destroys the barley field, cannot see his people hrive. A Shudra maid servant who has got illicit connection with her master, does not desire the progress of her family.

౧౩౩౭. యద్ధరిణ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, రాజప్రజే దేవతే, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః స రాజా కేన హేతునా నశ్యతీత్యాహ. ఆ రా జేకారణముచే నశించిపోవును?

౧౩౩౭ యద్ధరిణో యవమత్తి న పుష్టం బహు మన్యతే।
శూద్రో యదర్యాయై జారో న పోషమను మన్యతే ॥౩౦॥

ప.వి:- యత్, హరిణః, యవమ్, అత్తి, న, పుష్టమ్, బహు, మన్యతే, శూద్రః, యత్, అర్యాయై, జారః, న, పోషమ్, అను, మన్యతే.॥౩౦॥

పదార్థః :- (యత్) యః, (హరిణః) (యవమ్) (అత్తి) భక్షయతి, (న) (పుష్టమ్) ప్రజాజనమ్ (బహు) అధికమ్ (మన్యతే) జానాతి (శూద్రః) మూర్ఖకులోత్పన్నః (యత్) యః (అర్యాయై) అర్యాయాః స్వామినో వైశ్యస్య వా స్త్రియాః (జారః) వ్యభిచారేణ వయోహంతా (న) నిషేధే (పోషమ్) పుష్టిమ్ (అను) (మన్యతే).॥౩౦॥

అన్వయః :- యద్యః శూద్రోఽర్యాయై జారో భవతి స యథా పోషం నాఽనుమన్యతే యత్ యో రాజా హరిణో యవమత్తీవ పుష్టం ప్రజాజనం బహు న మన్యతే. స సర్వతః క్షీణో జాయతే.॥౩౦॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది రాజా రాజపురుషాశ్చ పరస్త్రీవేశ్యాగమనాయ పశువద్వర్తంతే తాన్ సర్వే విద్వాంసః శూద్రావివ జానంతి, యథా శూద్ర ఆర్యకులే జారో భూత్వా సర్వాన్ సంకరయతి తథా బ్రాహ్మణక్షత్రియవైశ్యాః శూద్రకులే వ్యభిచారం కృత్వా వర్ణసంకరనిమిత్తా భూత్వా నశ్యంతి.॥౩౦॥

పదార్థము :-(యత్) ఎవడు (శూద్రః) మూర్ఖకులమున జన్మించిన మూఢుడు (అర్యాయై) తనస్వామి అనగా ఎవరిసేవకుడో ఆ యజమాని భార్యతోనో లేక వైశ్యస్త్రీతోనో (జారః) వ్యభిచరించుచు తన ఆయువును క్షీణపరచుకొనువాడగుచున్నాడో, వాడెట్లు (పోషమ్) పుష్టి, పర్యాదలను (న అనుమన్యతే) ఆలోచించడో, లేక (యత్) ఏ రాజు (హరిణః) హరిణమువలె (యవమ్) మొలిచిపెరుగుచున్న యవలు మున్నగు చేలను (అత్తి) తినుచుండునో, అట్లే (పుష్టమ్) ధనైశ్వర్యములు, స్త్రీ, సంతానము, సుఖము మున్నగు వానితో

పుష్టియైయున్న తన ప్రజలను (బహు) అధికముగ (న మన్యతే) మాన్యత నీయడో ఆతడన్ని దిశలనుండి హీన క్షీణుడు, నష్టభ్రష్టుడై పోవును. ॥30॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకార మున్నది. ఏ రాజా మరియు రాజపురుషులు పరస్త్రీ, వేశ్యాగమనములకై పశువులవలె వర్తింతురో, అట్టి వారిని విద్వాంసులు శూద్రునిగా భావించవలెను. శూద్రమూర్ఖజనము, శ్రేష్ఠులకులములందు వ్యభిచరించి ఎల్లరను వర్ణసంకర మొనర్చునట్లు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకులములవారు శూద్రులతో వ్యభిచరించి వర్ణసంకరమునకు కారకులైన వినాశముపొలగుదురు. ॥30॥

31. A King, who destroys his subjects, like the deer the barley field, cannot see his people thrive.

A Shudra servant who has got illicit connection with his mistress, does not desire the progress of his family.

1330.దధిక్రావ్ణ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, రాజా దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః స రాజా కస్యేవ కిం వర్ధయేదిత్యాహ. ఆ రాజు ఎవరివలె దేని నభివృద్ధి పఱచవలయును?

1330 దధిక్రావ్ణోఽ అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।
సురభి నో ముఖా కరత్ ప్రణఽ ఆయూఀషి తారిషత్ ॥31॥

ప.వి:- దధిక్రావ్ణ ఇతి దధి+క్రావ్ణః, అకారిషమ్, జిష్ణోః, అశ్వస్య, వాజినః, సురభి, నః, ముఖా, కరత్ ప్ర, నః, ఆయూంషి, తారిషత్.॥31॥

పదార్థః :-(దధిక్రావ్ణః) యో దధీన్ పోషకాన్ధారకాన్ వా క్రామ్యతి తస్య, (అకారిషమ్) కుర్యామ్ (జిష్ణోః) జయశీలస్య (అశ్వస్య) ఆశుగామినః (వాజినః) బహువేగవతః, (సురభి) ప్రశస్తసుగంధియుతాని, (నః) అస్మాకమ్ (ముఖా) ముఖాని, (కరత్) కుర్యాత్, ((ప్ర) (నః) (అస్మాకమ్) (ఆయూంషి) (తారిషత్) సంతారయేత్.॥31॥

అన్వయః :-హే రాజన్! యథాఽహం దధిక్రావ్ణో వాజినో జిష్ణోరశ్వస్యేవ వీర్యమకారిషం తథా భవాన్ నః సురభి ముఖేవ వీర్యం ప్రకరన్న ఆయూంషి తారిషత్.॥31॥

భావార్థః :-యథాఽశ్వశిక్షకా అశ్వాన్ వీర్యరక్షణవియమేన బలిష్ఠాన్ సంగ్రామే విజయనిమిత్తాన్ కుర్వంతి తథైవాధ్యాపకోపదేశకాః కుమారాన్ కుమారీంశ్చ పూర్ణేన బ్రహ్మచర్యసేవనేన విద్యాయుక్తాన్ విదుషీశ్చ కృత్వా శరీరాత్మబలాయ ప్రవర్త్య దీర్ఘాయుషో యుద్ధశాలీనాన్ సంపాదయేయుః.॥31॥

**పదార్థము** :- ఓ రాజా! నేను (దధిక్రావ్ణః) ధారణ పోషణ మొనర్చువారికి లభించునట్టి (వాజినః) అధిక వేగము గలది (జిష్ణోః) జయించునది మరియు (అశ్వస్య) త్వరగాపరుగిడు తురగమువంటి పరాక్రమమును (అకారిషమ్) నేను చేయుచున్నట్లు నీవును (నః) మాయొక్క (సురభి) సుగంధముతో గూడిన (ముఖా) ముఖములవంటి పరాక్రమమును (ప్ర, కరత్) ఉత్తమముగ నొనర్చుము. మరియు (నః) మా యొక్క (ఆయూంషి) ఆయుష్యములను (తారిషత్) వాని యవధి [హద్దు] ని దాటించుము.॥32॥

**భావార్థము** :- అశ్వశిక్షకులు అశ్వములను పరాక్రమ రక్షణ నియమములద్వార బలిష్ఠము మరియు రణక్షేత్రములందు విజయమును సాధించునవిగా నొనర్చునట్లే అధ్యాపకోపదేశకులు విద్యల నభ్యసించు బాలబాలికలను సంపూర్ణ బ్రహ్మచర్యసేవనమున విద్వాంస, విదుషీ రత్నములుగ, శరీరాత్మల బలముకొరకు ప్రవృత్తమొనర్చి దీర్ఘాయుష్మంతులుగను, రణవిద్యకోవిదులుగను నొనర్చవలయును.॥32॥

32. I sing the praise of God, obtainable by him who deeply meditates upon Him, the Remover of miseries, and full of splendour. May He strengthen our vital breaths, and prolong days we have to live.

౧౨౩౯. గాయత్రీత్యస్య ప్రజాపతి ఋషిః, విద్వాంసో దేవతాః, ఉష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౨౩౯ గాయత్రీ త్రిష్టుబ్జగత్యనుష్టుప్పఙ్క్త్యా సహ।

బృహత్యుష్ణిహా కకుప్సూచీభిః శమ్యన్తు త్వా ॥33॥

ప.విః- గాయత్రీ, త్రిష్టుప్, త్రిస్తుభితి త్రి+స్తుప్, జగతీ, అనుష్టుప్, అనుస్తుబిత్యను+స్తుప్, పంక్త్యా, సహ, బృహతీ ఉష్ణిహా, కకుప్, సూచీభిః, శమ్యన్తు, త్వా.॥33॥

**పదార్థః** :- (గాయత్రీ) గాయంతం త్రాయమాణా (త్రిష్టుప్) యయాఽధ్యాత్మికాధి భౌతికాధిదైవికాని త్రీణి సుఖాని స్తోభతే స్తభ్నాతి సా (జగతీ) జగద్వద్విస్తీర్ణా (అనుష్టుప్) యయాఽనుష్టోభతే సా.(పంక్త్యా) విస్తృతయా క్రియయా (సహ) (బృహతీ) మహదర్థా. (ఉష్ణిహా) యయా ఉషః స్నిహ్యతి తయా (కకుప్)లాలిత్యయుక్తా(సూచీభిః) సేవనసాధికాభిః. (శమ్యంతు) (త్వా) త్వామ్.॥33॥

**అన్వయః** :- హే విద్వన్! యే విద్వాంసః పంక్త్యా సహ గాయత్రీ త్రిష్టుబ్జగత్యనుష్టుబుష్ణిహా సహ బృహతీ కకుప్సూచీభిరివ త్వా త్వాం శమ్యంతు. తాంస్త్వం సేవస్వ. ॥33॥

**భావార్థః :-** యే విద్వాంసో గాయత్ర్యాదిఛందోఽర్థవిజ్ఞాపనేన మనుష్యాన్ విదుషః కుర్వంతి సూచ్యా ఛిన్నం వస్త్రమివ భిన్నమతావ్యవసందధత్యైకమత్యే స్థాపయంతి తే జగత్కల్యాణకారకా భవంతి.॥33॥

**పదార్థము :-** విద్వాంసుడా! ఏ విద్వాంసులు (పంక్త్యా) విస్తారవంతమగు పంక్తి ఛందస్సుతో (సహ) గూడ ఏ (గాయత్రీ) గానమొనర్చు వారిని రక్షించు గాయత్రీ ఛన్దస్సు (త్రిష్టుప్) ఆధ్యాత్మిక, ఆధిదైవిక, అధిభౌతిక మను నీ మూడు దుఃఖముల నిలిపివేయునట్టి త్రిష్టుప్ ఛన్దస్సు (జగతీ) జగత్తువలె వ్యాప్తమైయున్న జగతీ ఛన్దస్సు (అనుష్టుప్) ఎద్దానివెనకనుండి ప్రాపంచిక దుఃఖములను స్థగితమొనర్చబడునో అట్టి అనుష్టుప్ ఛందస్సు (ఉష్ణిహా) ప్రాతఃకాలమునందు ప్రాప్తించునట్టి ఉష్ణిక్ ఛందస్సుతో గూడ (బృహతీ) గంభీరాశయముగల బృహతీఛందము (కకుప్) లలితపదముల అర్థముతో గూడి యున్న కకుప్ఛందస్సుతో (సూచీభిః) సూదులతో వస్త్రములను కుట్టునట్లు (త్వా) నిన్ను (శమ్యన్తు) శాంతియుక్తులుగ నొనర్చెదరో లేక సకల విద్యలను బోధించెదరో వారిని నీవు సేవించుము. ॥33॥

**భావార్థము :-** ఏ విద్వాంసులు గాయత్రీ మున్నగు ఛందస్సుల అర్థములను జూపుచు మానవులను విద్వాంసులను గా జేయుదురో, చిరిగిన వస్త్రములను సూదితో కుట్టునట్లు వేర్వేరుభావములు [మతములు] గలవారిని సత్యమార్గమునందు కలిపివేసెదరో మరియు వారిని ఒక్కమతము [ఏకాభిప్రాయము] గలవారినిగ జేయుదురో, వారు జగత్కల్యాణ కారకు లగుచున్నారు. ॥33॥

33. O king, may the vedic verses in Gayatri, Trishtup, Jagati, Anushtup, Pankti, Brihati, Ushnik and Kakup metres uttered by the subjects, pacify thee!.

౧౩౪౦. ద్విపదా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రజా దేవతాః, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునర్విద్వాంసః కిం కుర్యురిత్యాహ. విద్వాంసు లేమి యొనర్చుదురు?

**౧౩౪౦ ద్విపదా యాశ్చతుష్పదాస్త్రిపదా యాశ్చ షట్పదాః ।**

**విచ్ఛన్దా యాశ్చ సచ్ఛన్దాః సూచీభిః శమ్యన్తు త్వా ॥34॥**

**ప.విః-** ద్విపదా ఇతి ద్వి+పదాః, యాః, చతుష్పదా ఇతి చతుః+పదాః, త్రిపదా ఇతి త్రి+పదాః, యాః, చ, షట్పదా ఇతి షట్+పదాః, విచ్ఛన్దా ఇతి వి+ఛందాః, యాః, చ, సచ్ఛందా ఇతి సచ్ఛన్దాః, సూచీభిః, శమ్యన్తు, త్వా.॥34॥

పదార్థః :- (ద్విపదాః) ద్వే పదే యాసు తాః (యాః) (చతుష్పదాః) చత్వారి పదాని యాసు తాః, (త్రిపదాః) త్రీణి పదాని యాసు తాః (యాః) (చ) (షట్పదాః) షట్పదాని యాసు తాః. (విచ్ఛందాః) వివిధాని ఛందాంస్యూర్జనాని యాసు తాః (యాః) (చ) (సచ్ఛందాః) సమానాని ఛందాంసి యాసు తాః,(సూచీభిః) అనుసంధానసాధికాభిః, క్రియాభిః, (శమ్యన్తు) (త్వా).॥౩౪॥

అన్వయః :- యే విద్వాంసః సూచీభిర్యా ద్విపదా యాశ్చతుష్పదా యాస్త్రిపదా యాశ్చ షట్పదా యా విచ్ఛందా యాశ్చ సచ్ఛందాస్త్వాం గ్రాహయిత్వా శమ్యంతు శమం ప్రాపయంతు తాన్ నిత్యం సేవస్వ.॥౩౪॥

భావార్థః :-యే విద్వాంసో మనుష్యాన్ బ్రహ్మచర్యనియమేన వీర్యవృద్ధిం ప్రాపయ్యారోగాన్ జితేంద్రియాన్ విషయాసక్తివిరహాన్ కృత్వా ధర్మ్యే వ్యవహారే చాలయంతి తే సర్వేషాం పూజ్యా భవంతి.॥౩౪॥

పదార్థము :- ఏ విద్వాంసులు (సూచీభిః) సంధులను గలిపివేయునట్టి క్రియలద్వారా (యాః) ఏ (ద్విపదాః) రెండేసి పాదములుగలవియు (చతుష్పదాః) నాలుగేసి పాదములుగలవియు (త్రిపదాః) మూడు పాదములు గలవియు (చ) మరియు (యాః) ఏవి (షట్పదాః) ఆరుపాదములు గల ఏ (విచ్ఛన్దాః) అనేక విధములగు పరాక్రమముగలవి (చ) మరియు (యాః) ఏవి (సచ్ఛన్దాః) ఒకే విధమగు ఛందస్సులు గలవియో, అట్టిక్రియలను (త్వా) నీకు లబ్ధపరచి (శమ్యన్తు) శాంతిసుఖములను గలిగింతురో అట్టివారిని నీవు సదా సేవించుచుండుము. ॥౩౪॥

భావార్థము :-ఏ విద్వాంసుడు మానవులను బ్రహ్మచర్య నియమమున వీర్యవంతులుగా, రోగరహితులుగా, జితేంద్రియులుగా, విషయాసక్తి రహితులుగా నొనర్చి ధర్మయుక్త వ్యవహారములందు నడిపించెదరో అట్టి వారు సర్వజనులకు పూజనీయులు, సత్కారయోగ్యులుగ నగుదురు. ॥౩౪॥

34. O king, may the two-footed, four footed, three-footed, sixfooted metrical divisions, with different metres or one uniform metre, uttered by the subjects pacify thee.

౧౩౪౧.మహానామ్న్య ఇత్యస్య ప్రజాపతిరృషిః, ప్రజా దేవతా, భురిగుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునర్విద్వాంసః కీదృశా భవేయురిత్యాహ. విద్వాంసు లెటులుండవలయును?

౧౩౪౧ మహానామ్న్యో రేవత్యో విశ్వా ఆశాః ప్రభూవరీః।

మైఘీర్విద్యుతో వాచః సూచీభిః శమ్యన్తు త్వా ॥౩౫॥

ప. విః- మహానామ్న్య ఇతి మహా+నామ్న్యః, రేవత్యః, విశ్వాః, ఆశాః, ప్రభూవరీరితి ప్ర+భూవరీః, మైఘీః. విద్యుత ఇతి వి+ద్యుతః, వాచః, సూచీభిః, శమ్యన్తు, త్వా.॥35॥

పదార్థః :-(మహానామ్న్యః) మహన్నామ యాసాం తాః, (రేవత్యః) బహుధనయుక్తాః (విశ్వాః) అఖిలాః, (ఆశాః) దిశః, (ప్రభూవరీః) ప్రభుత్వయుక్తాః (మైఘీః) మేఘానామిమాః, (విద్యుతః) (వాచః) (సూచీభిః) (శమ్యంతు) (త్వా) త్వామ్.॥35॥

అన్వయః :-హే జిజ్ఞాసో! సూచీభిర్యా మహానామ్న్యో రేవత్యః ప్రభూవరీర్విశ్వా ఆశా ఇవ మైఘీ ర్విద్యుత ఇవ చ వాచస్త్వా శమ్యంతు. తాస్త్వం గృహాణ.॥35॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యేషాం వాచో దిగ్వత్సర్వాసు విద్యాసు వ్యాపికా మేఘస్థా విద్యుదివ సర్వార్థప్రకాశికాః సంతి తే శాంత్యా జితేంద్రియత్వం ప్రాప్య మహాకీర్తయో జాయంతే.॥35॥

పదార్థము :-జ్ఞానార్జనము నొరనర్చు జిజ్ఞాసువా (సూచీభిః) సంధింపజేయు క్రియలతో ఏ (మహానామ్న్యః) గొప్ప పేరువహించిన (రేవత్యః) అనేక విధములగు ధనము మరియు (ప్రభూవరీః) ప్రభుత్వముతో గూడిన (విశ్వాః) సమస్త (ఆశాః) దిశల వలె (మైఘీః) మేఘముల కలవరము (విద్యుతః) విద్యుత్తు వలె గలదో, అట్టి (వాచః) వాణి (త్వా) నిన్ను (శమ్యన్తు) శాంతియుక్త మొనర్చు గాక! వానిని నీవు గ్రహించుము.॥35॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎవని వాణి దిశలవలె సకల విద్యలందు వ్యాప్తియగుచు మేఘములందు ఇమిడియున్న విద్యుత్తు వలె అర్థమును ప్రకాశపరచునదై యున్నదో అట్టి విద్వాంసుడు శాంతితో జితేంద్రియత్వమును పొంది గొప్ప కీర్తిప్రతిష్ఠలను పొందును. ॥35॥

35. May the Mahanamni and Revati vedic verses, all far spread Supreme Regions, the lightning in the clouds, and the voices uttered by the subjects, satisfy the king.

౧౩౪౨.నార్య ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, స్త్రియో దేవతాః, భురిగుష్ణిక్ ఛందః, ఋషభః, స్వరః.

అథ కన్యాః కియద్ బ్రహ్మచర్యం కుర్యు రిత్యాహ.

కన్య లెంత బ్రహ్మచర్యము ననుష్ఠించవలయును?

౧౩౪౨ నార్యస్తే పత్న్యో లోమ విచిన్వన్తు మనీషయా ।

దేవానాం పత్న్యో దిశః సూచీభిః శమ్యన్తు త్వా॥36॥

ప.వి:- నార్యః, తే, పత్న్యః, లోమ, వి, చిన్వన్తు, మనీషయా, దేవానామ్, పత్న్యః, దిశః, సూచీభిః, శమ్యన్తు, త్వా.॥౩౬॥

పదార్థః :-(నార్యః) నరాణాం స్త్రియః (తే)తవ,(పత్న్యః) స్త్రియః, (లోమ) అనుకూలం వచనమ్, (వి) (చిన్వంతు) సంచితం కుర్వంతు. (మనీషయా) మనస ఈషణకర్త్ర్యా ప్రజ్ఞయా, (దేవానామ్) విదుషామ్, (పత్న్యః) స్త్రియః (దిశః) (సూచీభిః) అనుసంధాన క్రియాభిః, (శమ్యంతు) (త్వా) త్వామ్.॥౩౬॥

అన్వయః :-హే విదుష్యధ్యాపికే! యాః కుమార్యో మనీషయా తే లోమ విచిన్వంతు తా దేవానాం నార్యః పత్న్యో భవంతు. హే కుమారి! యా దేవానాం పత్న్యో భూత్వా సూచీభిః దిశ ఇవ శుద్ధా విదుష్యః సంతి తాస్త్వా త్వాం శమ్యంతు.॥౩౬॥

భావార్థః:-యాః కన్యా ఆద్యే వయసి ఆషోడశాదాచతుర్వింశద్వర్షబ్రహ్మచర్యేణ విద్యాసుశిక్షాః ప్రాప్య స్వసదృశానాం పత్న్యః స్యుస్తాః దిశ ఇవ సుప్రకాశితకీర్తయో భవంతి. ॥౩౬॥

పదార్థము :- పండితురాలవు, అధ్యాపకురాలవునగు ఓ విదుషీమణీ! ఏ కుమారీరత్నములు (మనీషయాః) తీక్ష్ణబుద్ధిచే (తే) నీయొక్క (లోమ) అనుకూలమగు ఆజ్ఞలను (విచిన్వన్తు) సమకూర్చెదరో వారు (దేవానామ్) పండితులకు (నార్యః, పత్న్యః) పండితుల పత్నులగుదురు. ఓ కుమారీ ఏ పండితులకు (పత్న్యః) పత్నివగుదువో (సూచీభిః) సంధించు క్రియలద్వారా (దిశః) ఎవరు దిశలవలె శుద్ధ పాకవిద్యను చదివియున్నారో, అట్టివారు (త్వా) నీకు (శమ్యన్తు) శాంతిని, జ్ఞానమును ప్రాప్తింపజేయుదురుగాక!॥౩౬॥

భావార్థము :-ఏ కన్యలు మొదటి వయస్సునందు ౧౬ నుండి ౨౪ సంవత్సరముల వయస్సువచ్చు వరకు బ్రహ్మచర్యముద్వారా విద్య, ఉత్తమ శిక్షణలను పొంది తమకు సదృశులగు భర్తలకు పత్నులగుదురో వారు దిశలవలె ఉత్తమ ప్రకాశముతో గూడిన కీర్తిని పొందినవా రగుదురు. ॥౩౬॥

36. O learned teachress, the girls, who with sharp intellect, obey the order, become the wives of learned persons. O unmarried girl, the wives of learned persons, who through careful inspection learn the art of cooking, pure like the regions, grant thee knowledge and peace!.

౧౩౪౩.రజతా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః స్త్రియో దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తాః కీదృశో భవేయురిత్యాహ. ఆ కన్యలెటులుండవలెను?

౧౩౪౩ రజతా హరిణీః సీసా యుజో యుజ్యన్తే కర్మభిః ।
అశ్వస్య వాజినస్త్వచి సిమాః శమ్యన్తు శమ్యన్తీః॥౩౭॥

ప.వి:- రజతాః హరిణీః, సీసాః, యుజః యుజ్యన్తే, కర్మభిరితి కర్మ+భిః, అశ్వస్య, వాజినః, త్వచి, సిమాః, శమ్యన్తు, శమ్యన్తీః.॥౩౭॥

పదార్థః:-(రజతాః) అనురక్తాః, (హరిణీః) ప్రశస్తం హరణం విద్యతే యాసాం తాః, (సీసాః) ప్రేమబంధికాః. అత్ర 'షిఞ్ బంధనే' ఇత్యస్మాదౌణాదికః క్సః ప్రత్యయోఽన్యేషామపీతి దీర్ఘః (యుజః) సమాహితాః, (యుజ్యంతే) (కర్మభిః) ధర్మ్యైభిః క్రియాభిః (అశ్వస్య) వ్యాప్తుం శీలస్య (వాజినః) ప్రశస్తబలవతః (త్వచి) సంవరణే. (సిమాః) ప్రేమ్ణా బద్ధాః, (శమ్యంతు) ఆనందంతు, (శమ్యంతీః) శమం ప్రాప్నువతీః ప్రాపయంత్యో వా.॥౩౭॥

అన్వయః :- యథా స్వయంవరా వాజినోఽశ్వస్య త్వచి సంయుజ్యంతే తథా కర్మభీ రజతా హరిణీః సీసా యుజః శమ్యంతీః సిమా హృద్యాన్ పతీన్ ప్రాప్య శమ్యంతు.॥౩౭॥

భావార్థః :-హే మనుష్యాః! యే సుశిక్షితాః స్వయంవరా భూత్వా స్త్రీపురుషాః స్వేచ్ఛయా పరస్పరస్మిన్ ప్రీతా వివాహం కుర్వంతి తే భద్రాన్ లావణ్యగుణస్వభావయుక్తాన్ సంతానానుత్పాద్య సదానందంతి.॥౩౭॥

**పదార్థము** :-స్వయంవర విధానముగ వివాహితలగు స్త్రీ లెట్లు (వాజినః) ప్రశంసనీయబలముగలవాడు (అశ్వస్య) ఉత్తమ గుణశాలియగు తన పతిని (త్వచి) కప్పుకొనుట [సంవరణమొనర్చుట] యందు (యుజ్యన్తే) సంయుక్తమగుదురో, అనగా పతిని వస్త్రాదులతో అలంకరించుటవంటి సేవలందు లీనమగుదురో,అట్లే (కర్మభిః) ధర్మయుక్త క్రియలద్వారా (రజతాః) అనురాగము, అనగా ప్రీతిని పొందినవారు (హరిణీః) ప్రశంసిత స్వీకృతి గలవారు, అట్టి (సీసాః) ప్రేమగలవారు (యుజః) సావధానచిత్తులై, శ్రేష్ఠకర్మలొనర్చువారు (శమ్యన్తీః) శాంతిని పొందినవారు, శాంతిని గలిగించువారు (సిమాః) ప్రేమచే బంధితురాండ్రగు స్త్రీలు తమ హృదయములకన్న మిన్నగా తమ పతులను ప్రాప్తించుకొని (శమ్యన్తు) ఆనందము ననుభవింతురుగాక!॥౩౭॥

**భావార్థము** :- మానవులారా! విద్యాసుశిక్షణములు గలిగి స్వయంవర విధానముచే వివాహితులగు స్త్రీ పురుషులు స్వేచ్ఛగా పరస్పరప్రేమ గలిగినవారై, లావణ్యము, చక్కని గుణములు, ఉత్తమస్వభావముగల సంతానము నుత్పన్నపరచి సదా ఆనందముతో గూడినవారగుదురు. ॥౩౭॥

37. Affectionate, fascinating, a morous wives, well trained in domestic economy, according to religious rites, are united for life with powerful husbands full of noble qualities, and placed under their protection. May they tranquil and peaceful, bound by the ties of affection, enjoy life.

౧౩౪౪. కువిదంగేత్యస్య ప్రజాపతిర్ఋషిః, సభాసదో దేవతాః, నిచృత్పంక్తి శ్ఛందః, పంచమః స్వరః.

అథాఽధ్యాపకాఽధ్యేతారః కీదృశాః స్యురిత్యాహ.

చదువువారు, చెప్పువారు ఎటువంటివారుగ నుండవలయును.

౧౩౪౪ కువిదఙ్గ యవమన్తో యవఞ్చిద్యథా దాన్త్యనుపూర్వం వియూయ।

ఇహేహైషాం కృణుహి భోజనాని యే బర్హిషో నమఽఉక్తిం యజన్తి॥౩౮॥

ప.విః- కువిత్, అఙ్గ, యవమన్త ఇతి యవ+మంతః, యవమ్, చిత్, యథా, దాన్తి, అనుపూర్వ మిత్యను+పూర్వమ్, వియూయేతి వి+యూయ, ఇహేహేతీహ+ ఇహ, ఏషామ్, కృణుహి, భోజనాని, యే బర్హిషః, నమఽ ఉక్తిమితి నమః + ఉక్తిమ్, యజన్తి.॥౩౮॥

పదార్థః :-(కువిత్) బహువిజ్ఞానయుక్తః, (అంగ) మిత్ర (యవమంతః) బహుయవాది ధాన్యయుక్తాః (యవమ్) ధాన్యసమూహమ్, (చిత్) అపి,(యథా) (దాంతి) ఛిందంతి (అనుపూర్వమ్) అను కూల్యమనతిక్రమ్య, (వియూయ) వియోజ్య సమ్మిశ్ర్య చ, (ఇహేహ) అస్మిన్నస్మిన్వ్యవహారే, (ఏషామ్) జనానామ్, (కృణుహి) కురు, (భోజనాని) పాలనార్థాన్యన్నాని, (యే) (బర్హిషః) జలస్య (నమ ఉక్తిమ్) నమసోఽన్నస్య వచనమ్, (యజంతి) సంగచ్ఛంతే.॥౩౮॥

అన్వయః :-హే అంగ! కువిత్ త్వమిహేహైషాం యథా యవమంతో కృషీవ యవం వియూయ చిదప్యనుపూర్వం దాంతి యే చ బర్హిషో నమఉక్తిం యజంతి తేషాం భోజనాని కృణుహి. ॥౩౮॥

భావార్థః :- అత్రోపమాలంకారః. హే అధ్యాపకాధ్యేతారో! యూయం యథా కృషీవలాః పరస్పరస్య క్షేత్రాణి పర్యాయేణ లువంతి బుసాదిభ్యోఽన్నాని పృథక్ కృత్వాన్యాన్ భోజయిత్వా స్వయం భుంజతే, తథైవేహ విద్యావ్యవహారే నిష్కపటతయా విద్యార్థిభిరధ్యాపకానాం సేవామ

ధ్యాపకై ర్విద్యార్థినాం విద్యావృద్ధిం చ కృత్వా పరస్పరావ్ భోజనాదినా సత్కృత్య సర్వ ఆనందంతు. ॥38॥

పదార్థము :-(అఙ్గ) ఓ మిత్రవరా! (కువిత్) గొప్పవిద్వాంసుడవగు నీవు (ఇహేహ) ఈ వ్యవహారమందు (ఏషామ్) ఈ మనుష్యులతో (యథా) ఎట్లు (యవమన్తః) యవలు మున్నగు అనేక విధములగు పంటలను పండించువారు (యవమ్) యవలు మున్నగు వానిని ఊకమున్నగువానినుండి (వియూయ) వేరుపరచి (చిత్) మరియు (అనుపూర్వమ్) క్రమపద్ధతిలో (దాన్తి) ఛేదించువారి, (యే) ఎవరు (బర్హిషః) జలము మరియు (నమ ఉక్తిమ్) అన్నమునకు సంబంధించిన వచనములను (యజన్తి) చెప్పుచు సత్కరించెదరో, వారికి (భోజనాని) భోజనాదులను (కృణుహి) సమకూర్చుము. ॥38॥

భావార్థము :-ఈ మంత్రమునం దుపమాలంకారము గలదు. ఓ అధ్యాపకులారా! విద్యార్థులారా! ఏ విధముగా కృషీవలురు పంటచేలయందు పరస్పరము పంటలను కోయుట, నూర్చుట, తూర్పారబట్టుట మున్నగు క్రియలొనర్చి ఇతరులను భుజింపజేయుచు తామును భుజించు చుందురో, అదే విధముగ ఇచ్చట విద్యావ్యవహారములందు నిష్కపట భావముతో విద్యార్థులను చదివించువారికి సేవ మరియు చదివించువారు విద్యార్థుల విద్యలను అభివృద్ధిపరచుచు పరస్పరము భోజనాది సత్కారముల నొనర్చుకొనుచు ఎల్లరును ఆనందముల ననుభవించవలెను. ॥38॥

38. O king, just as farmers reap the barley - corn, winno and protect it; so shouldst thou arrange for food for those ngaged in the contemplation of God!.

౧౩౪౫.కస్త్వా వ్యతీత్యస్య ప్రజాపతిర్ఋషిః, అధ్యాపకో దేవతా, భురిగ్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునరధ్యాపకా విద్యార్థినాం కీదృశీం పరీక్షాం గృహ్ణీయురిత్యాహ.

శిక్షకులు విద్యార్థుల నెటుల పరీక్షించవలయును.

౧౩౪౫ కస్త్వాచ్ఛ్యతి కస్త్వా విశాస్తి కస్తే గాత్రాణి శమ్యతి। కఉ తే శమితా కవిః॥39॥

ప.వి:- కః, త్వా, ఆచ్ఛ్యతి, కః, త్వా, వి, శాస్తి, కః,తే, గాత్రాణి, శమ్యతి, కః, ఉ, ఇత్యూ, తే, శమితా, కవిః.॥39॥

పదార్థః :-(కః) (త్వా) త్వామ్, (ఆచ్ఛ్యతి) సమంతాచ్ఛినత్తి, (కః) (త్వా) త్వామ్, (వి)(శాస్తి) విశేషేణోపదిశతి. (కః) (తే) తవ,(గాత్రాణి) అంగాని, (శమ్యతి) శామ్యతి శమం ప్రాపయతి, అత్ర 'వా ఛందసీ'తి దీర్ఘత్వాభావః. (కః) (ఉ) వితర్కే (తే) తవ, (శమితా) యజ్ఞస్య కర్తా, (కవిః) సర్వశాస్త్రవిత్. ॥39॥

**అన్వయః :-** హే అధ్యేతస్త్వా త్వాం క ఆచ్ఛ్యతి. కస్త్వా విశాస్తి? కస్తే గాత్రాణి శమ్యతి? క ఉ తే శమితా? కవిరధ్యాపకోఽస్తి? ॥౩౯॥

**భావార్థః :-** అధ్యాపకా అధ్యేతౄన్ ప్రత్యేవం పరీక్షాయాం పృచ్ఛేయుః.కే యుష్మాక మధ్యయనం ఛిందంతి? కే యుష్మానధ్యయనాయోపదిశంతి?, కేఽఙ్గానాం శుద్ధిం యోగ్యాం చేష్టాం చ జ్ఞాపయన్తి కోఽధ్యాపకోఽస్తి కిమధీతం కిమధ్యేతవ్యమస్తీత్యాది పృష్ట్వా సుపరీక్ష్యోత్త మానుత్సాహ్యాధమాన్ ధిక్కృత్వా విద్యావున్నయేయుః. ॥౩౯॥

**పదార్థము :-** చదువుకొను విద్యార్థీ! (త్వా) నిన్ను (కః) ఎవడు (ఆచ్ఛ్యతి) ఛేదించుచున్నాడు? [విభాజనమొనర్చుచున్నాడు?] (కః) ఎవడు (త్వా) నిన్ను (విశాస్తి) బాగుగ చదివించుచున్నాడు? (కః) ఎవడు (తే) నీయొక్క (గాత్రాణి) అంగములకు (శమ్యతి) శాంతిని చేకూర్చుచున్నాడు? (కః) ఎవడు (ఉ) చక్కగా (తే) నీచే (శమితా) యజ్ఞమును జేయించువాడు? (కవిః) సకలశాస్త్రములజ్ఞాతయై చదివించువాడు?॥౩౯॥

**భావార్థము :-** ఓ విద్యార్థులారా! ఎవడు మీ చదువును నరకుచున్నారు? అనగా విఘ్నము కలిగించుచున్నారు? ఎవరు మీకు చదువుట ప్రోత్సహించుచున్నారు? ఎవరు అంగముల శుద్ధి మరియు యోగ్యచేష్టల నెరుగుదురు? ఎవరు మిమ్ము చదివించుచున్నారు? చదువదగిన దేది? ఇత్యాదిప్రశ్నలు శిష్యులను అధ్యాపకులు ప్రశ్నించి, పరీక్షించి ఉత్తమ విద్యార్థుల కుత్సాము గలిగించి, దుష్టస్వభావులను ధిక్కరించి విద్యాభ్యాసముల నున్నతినొందించవలయును. ॥౩౯॥

39. O student, who admonishes Thee? Who imparts thee sound instruction? Who pacifies thy orgns? Who is thy teaher who is well versed in religious lore and performs the Yajnas?

౧౩౪౬.ఋతవ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రజా దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః స్త్రీపురుషాః కథం వర్తేరన్నిత్యాహ. స్త్రీపురుషు లెటుల ప్రవర్తించవలయును?

౧౩౪౬ ఋతవస్తఽఋతుథా పర్వ శమితారో విశాసతు ।
సంవత్సరస్య తేజసా శమీభిః శమ్యన్తు త్వా ॥౪౦॥

ప.విః- ఋతవః, తే, ఋతుథేత్యృతు+థా, పర్వ, శమితారః, వి, శాసతు, సంవత్సరస్య, తేజసా, శమీభిః, శమ్యన్తు, త్వా.॥౪౦॥

**పదార్థః :-** (ఋతవః) వసంతాద్యాః, (తే)తవ, (ఋతుథా)ఋతుభ్యః, (పర్వ) పాలనమ్, (శమితారః) అధ్యయనాధ్యాపనాఖ్యే యజ్ఞే శమాదిగుణానాం ప్రాపకాః. (వి,శాసతు)

విశేషేణోపదిశంతు, (సంవత్సరస్య) (తేజసా) జలేన. తేజ ఇత్యుదకనా, నిఘం. ౧. ౧౨ (శమీభిః) కర్మభిః (శమ్యంతు) (త్వా) త్వామ్.॥౪౦॥

అన్వయః :-హే విద్యార్థిన్! యథా తే ఋతవ ఋతుథా పర్వేవ శమితారోఽధ్యేతారం విశాసతు. సంవత్సరస్య తేజసా శమీభిస్త్వా త్వాం శమ్యంతు తాంస్త్వం సదైవ సేవస్వ. ॥౪౦॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా ఋతవః పర్యాయేణ స్వాని స్వాని లింగాన్యభిపద్యంతే, తథైవ స్త్రీపురుషాః పర్యాయేణ బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థ సంన్యాసాశ్రమాన్ కృత్వా బ్రాహ్మణా బ్రాహ్మణ్యశ్చాఽధ్యాపయేయుః. క్షత్రియాః ప్రజా రక్షంతు. వైశ్యాః కృష్యాదికమున్నయంతు, శూద్రాశ్చైతాన్ సేవంతామితి.॥౪౦॥

పదార్థము :- ఓ విద్యార్థీ! ఎట్లు (తే) నీయొక్క (ఋతవః) వసంతము మున్నగు ఋతువులు (ఋతుథా) తమ స్వగుణములను (పర్వ) పాలించునో (శమితారః) అట్లే చదివి చదివించునట్టి యజ్ఞమునందు శమదమాది గుణములను ప్రాప్తిగలిగించు అధ్యాపకులు తమ శిష్యులకు (వి, శాసతు) విశేషముగ ఉపదేశించవలెను (సంవత్సరస్య) సంవత్సరపు (తేజసా) జలములు మరియు (శమీభిః) కర్మలచే (త్వా) నీకు (శమ్యన్తు) శాంతిని గలిగింతురుగాక! సదా నీవు వారిని సేవించుము. ॥౪౦॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఋతువులు తమ వంతుల ప్రకారము తమ చిహ్నముల నెట్లు పొందుచున్నవో, అట్లే స్త్రీ పురుషులు వరుసగా బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమ ధర్మములను నిర్వహించి వానప్రస్థులై వనములందు గడపి తపమునొనర్చుట మరియు సన్న్యాసాశ్రమమునందు బ్రాహ్మణ, బ్రాహ్మణీమణులు చదివించుచు ఉపదేశించవలయును. క్షత్రియులగు స్త్రీపురుషులు ప్రజారక్షకులై యుండవలయును. వైశ్యస్త్రీపురుషులు పాడిపంటల నభివృద్ధి పరచవలయును, శూద్రులగు స్త్రీపురుషులు పై వర్ణముల కృషియందు తోడ్పడుము, సేవించుచు అన్నివిధముల యభివృద్ధి నొందవలయును. ॥౪౦॥

40. May the truly learned persons, bestowers of peace, give necessary instructions for rearing the subjects. O people, may they paciy ye by means of king's dignity, and peaceful expedients!.

౧౩౪౭. అర్ధమాసా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రజా దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ బాలకేషు మాత్రాదయః కథం వర్తేరన్నిత్యాహ. బాలురందు మాత్రాదు లెటుల మెలగవలయును?

౧౩౪౭ అర్ధమాసాః పరూంషి తే మాసాఽఆ చ్ఛ్యన్తు శమ్యన్తః ।

అహోరాత్రాణి మరుతో విలిష్టꣳసూదయన్తు తే ॥౪౧॥

ప.వి:- అర్ధమాసా ఇత్యర్ధ+మాసాః, పరూంషి, తే, మాసాః, ఆ,చ్ఛ్యన్తు, శమ్యన్తః, అహోరాత్రాణి, మరుతః, విలిష్టమితి వి +లిష్టమ్, సూదయన్తు, తే.॥౪౧॥

పదార్థః:-(అర్ధమాసాః) కృష్ణశుక్లపక్షాః (పరూంషి) కఠోరాణి వచనాని, (తే) తవ, (మాసాః) చైత్రాదయః. (ఆ)సమంతాత్ (ఛ్యన్తు) ఛిందంతు, (శమ్యంతః) శాంతిం ప్రాపయంతః, (అహోరాత్రాణి) (మరుతః) మనుష్యాః, (విలిష్టమ్) విరుద్ధమల్పమపి వ్యసనమ్ (సూదయంతు) దూరీకారయంతు (తే) తవ. ॥౪౧॥

అన్వయః :- హే విద్యార్థిన్నహోరాత్రాణ్యర్ధమాసా మాసాశ్చాయూంషీవ తే తవ పరూంషి శమ్యంతో మరుతః దుర్వ్యసనాన్యాఛ్యన్తు. తే తవ మాసా విలిష్టం సూదయంతు.॥౪౧॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది మాతాపిత్రధ్యాపకోపదేశకాతిథయో బాలానాం దుర్గుణాన్న నివర్తయేయుస్తర్హి తే శిష్టాః కదాచిన్న భవేయుః. ॥౪౧॥

పదార్థము :- విద్యార్థులారా! (అహోరాత్రాణి) దివారాత్రములు (అర్ధమాసాః) శుక్ల, కృష్ణ పక్షములు మరియు (మాసాః) చైత్రము మున్నగు మాసములు ఎట్లు ఆయువును తగ్గించుచున్నవో అట్లే (తే) నీ యొక్క (పరూంషి) కఠోరవచనములకు (శమ్యన్తః) శాంతిని గలిగించుచు (మరుతః) ఉత్తమ మానవులు దుష్టకర్మలను (అచ్ఛ్యన్తు) వినాశపరచెదరుగాక! (తే) నీయొక్క (విలిష్టమ్) కొద్దిపాటి దుర్వ్యసనములున్నను (సూదయన్తు) దూరమొనర్చుదురుగాక! ॥౪౧॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. తల్లిదండ్రులు, అధ్యాపకులు, ఉపదేశకులు, అతిథులు మున్నగువారు బాలుర దుర్గుణములను తొలగించకున్న వారు శిష్టులు, అనగా ఉత్తములెప్పుడును కాజాలరు. ॥౪౧॥

41. O King, may day and night, half months and months, affording felicity, adorn the different periods o thy life. May the learned remove thy doubt!.

౧౩౪౮.దైవ్యా ఇత్యస్య ప్రజాపతి ఋషిః భురిగుష్ణిక్ ఛందః. ఋషభః. స్వరః.

అథాధ్యాపకాదయః కథం వర్తేరన్నిత్యాహ. చదివించువారు మొ॥ సజ్జను లెటుల ప్రవర్తించవలయును?

౧౩౪౮ దైవ్యా౭ అధ్వర్యవస్త్వాచ్ఛ్యన్తు వి చ శాసతు।
గాత్రాణి పర్వశస్తే సిమాః కృణ్వన్తు శమ్యన్తీః॥౪౨॥

ప.వి:- దైవ్యాః, అధ్వర్యవః, త్వా, ఆ, ఛ్యన్తు, వి, చ, శాసతు, గాత్రాణి, పర్వశ ఇతి పర్వ+శః, తే, సిమాః, కృణ్వన్తు, శమ్యన్తీః.॥42॥

పదార్థః :- (దైవ్యాః) దేవేషు విద్వత్సు కుశలాః, (అధ్వర్యవః) ఆత్మనోఽహింసాఖ్య యజ్ఞమిచ్ఛన్తః, (త్వా) త్వామ్ (ఆ) (ఛ్యన్తు) ఛిన్దన్తు, (వి) (చ) (శాసతు) ఉపదిశన్తు. (గాత్రాణి) అఙ్గాని (పర్వశః) సంధితః (తే) తవ, (సిమాః) ప్రేమబద్ధాః, (కృణ్వన్తు) (శమ్యన్తీః) దుష్టస్వభావం నివారయన్త్యః.॥42॥

అన్వయః :-హే విద్యార్థిన్ విద్యార్థిని వా! దైవ్యా అధ్వర్యవస్త్వా విశాసతు చ తే తవ దోషానాచ్ఛ్యన్తు పర్వశో గాత్రాణి పరీక్షన్తాం సిమాః శమ్యన్తీః సత్యో మాతరోఽప్యేవం శిక్షాం కృణ్వన్తు.॥42॥

భావార్థః :-అధ్యాపకోపదేశకాఽతిథయో యదా బాలకాన్ శిక్షయేయుస్తదా దుర్గుణాన్ వినాశ్య విద్యాం ప్రాపయేయురేవమధ్యాపికోపదేశికా విదుష్యః స్త్రియోఽపి కన్యాః ప్రత్యాచరేయుః వైద్యకశాస్త్రరీత్యా శరీరావయవాన్ సమ్యక్ పరీక్ష్యౌషధాన్యపి ప్రదద్యుః. ॥42॥

పదార్థము :-ఓ విద్యార్థీ విద్యార్థినులరా! (దైవ్యాః) విద్వాంసులలో కుశలురు (అధ్వర్యవః) తమ రక్షణా రూపయజ్ఞము నపేక్షించు అధ్యాపకోపదేశకులు (త్వా) నీకు (వి,శాసతు) విశేషరూపములో ఉపదేశమొనర్తురుగాక! (చ) మరియు (తే) నీ దోషములను (ఆ, ఛ్యన్తు) నాశమొనర్తురు గాక! (పర్వశః) ప్రతిసంధులనుండి (గాత్రాణి) అంగములను పరీక్షింతురుగాక! (సిమాః) ప్రేమచే బంధింపబడిన (శమ్యన్తీః) దుష్టస్వభావములను మాత మున్నగు స్త్రీలు దూరము (కృణ్వన్తు) చేయుదురుగాక! ॥42॥

భావార్థము :-అధ్యాపకులు, ఉపదేశకులు, అతిథులు మున్నగువారు బాలబాలికలకు శ్రేష్ఠముగ ఉపదేశించి నేర్పినప్పుడు వారు ఉత్తము లగుదురు. ఇట్లు విద్యాభ్యాసము, ఉపదేశముల నొనర్చి మహిళలు కన్యలను తీర్చిదిద్దవలెను. వైద్యశాస్త్రానుసారము వారి సర్వాంగముల పరీక్షించి ఓషధులద్వారా చక్కపరచ వలెను.॥42॥

42. O male and female students, may the learned teachers and preachers give ye special instructions; and thereby eliminate your weaknesses. May they examine each joint of your limbs. May your mother and other female relations bound in the ties of affection, give ye similar instrutions!.

1343. ద్యౌరిత్యస్య ప్రజాపతిర్ఋషిః, రాజా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునరధ్యాపకాదయః కీదృశా భవేయురిత్యాహ. అధ్యాపకాదు లెటువంటివారుగ నుండవలయును?

౧౩౪౫ ద్యౌస్తే పృథివ్యన్తరిక్షం వాయుశ్ఛిద్రం పృణాతు తే।
సూర్యస్తే నక్షత్రైః సహ లోకం కృణోతు సాధుయా॥౪౩॥

ప.వి:- ద్యౌః, తే, పృథివీ, అన్తరిక్షమ్, వాయుః, ఛిద్రమ్, పృణాతు, తే, సూర్యః, తే, నక్షత్రైః, సహ, లోకమ్, కృణోతు, సాధుయేతి సాధు+యా.॥౪౩॥

పదార్థః :-(ద్యౌః) ప్రకాశరూపా విద్యుత్ (తే) తవ, (పృథివీ) భూమిః, (అంతరిక్షమ్) ఆకాశమ్, (వాయుః) పవనః (ఛిద్రమ్) ఇంద్రియమ్ (పృణాతు) సుఖయతు (తే) తవ, (సూర్యః) సవితా (తే) తవ, (నక్షత్రైః) (సహ) (లోకమ్) దర్శనీయమ్, (కృణోతు)(సాధుయా)సాధు సత్యమ్. ॥౪౩॥

అన్వయః :-హే శిష్యేఽధ్యాపికే వా! యథా ద్యౌః పృథివ్యంతరిక్షం వాయుః సూర్యో నక్షత్రైః సహ చంద్రశ్చ తే ఛిద్రం పృణాతు. తే తవ వ్యవహారం సాధ్నోతు. తథా తే తవ సాధుయా లోకం కృణోతు.॥౪౩॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా పృథివ్యాదయః సుఖప్రదాః సూర్యాదయః ప్రకాశకాః పదార్థాః సంతి తథైవాధ్యాపకా ఉపదేశకాశ్చాఽధ్యాపికా అప్యుపదేశికాశ్చ సర్వాన్ సన్మార్గస్థాన్ కృత్వా విద్యాప్రకాశం జనయంతు. ॥౪౩॥

పదార్థము :-విద్యార్థినులారా! అధ్యాపకులారా! ఎట్లు (ద్యౌః) ప్రకాశరూప విద్యుత్తు (పృథివీ) భూమి (అన్తరిక్షమ్) ఆకాశము (వాయుః) వాయువు (సూర్యః) సూర్యలోకము మరియు (నక్షత్రైః) తారాగణముతో (సహ) కూడ చంద్రలోకము నీయొక్క (ఛిద్రమ్) ప్రతి ఇంద్రియమునకు (పృణాతు) సుఖమునిచ్చునో (తే) అట్లే నీ వ్యవహారమును సిద్ధింపజేయుగాక! (తే) నీయొక్క (సాధుయా) ఉత్తమ సత్యము (లోకమ్) దర్శింపదగిన లోకమును (కృణోతు) సాధింపజేయుగాక! ॥౪౩॥

భావార్థము :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ పృథివ్యాదులు సుఖముల నిచ్చునవి మరియు సూర్యాదిపదార్థములు ప్రకాశమునిచ్చునవియై యున్నవో, అదేవిధముగ చదివించు, మరియు ఉపదేశించు విద్వాంస, విదుషీమణులు బాలబాలికల నెల్లరను సన్మార్గమున నుంచి విద్యాప్రకాశమును వారియందుత్పన్నపరచవలయును. ॥౪౩॥

43. O female student or mistress, may Sky, Earth Space, Air, Sun and Moon with the stars of heaven, appease each organ of thine, grant success to thy undertaking; and prepare a nice, true, beautiful world for thee!.

౧౩౫౦. ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, రాజా దేవతా, ఉష్ణిక్ ఛందః ఋషభః స్వరః.

పునర్మాత్రాదిభిః కిం కర్తవ్యమిత్యాహ. మాత్రాదులేమి యొనర్చవలయును?

౧౩౫౦ శం తే పరేభ్యో గాత్రేభ్యః శమస్త్వవరేభ్యః।

శమస్థభ్యో మజ్జభ్యః శమ్వస్తు తన్వై తవ ॥౪౪॥

ప.విః- శమ్, తే, పరేభ్యః, గాత్రేభ్యః శమ్, అస్తు, అవరేభ్యః, శమ్, అస్థభ్య ఇత్యస్థ+భ్యః, మజ్జభ్య ఇతి మజ్జ+భ్యః, శమ్, ఉ౹ఁ ఇత్యూఁ౹ఁ, అస్తు, తన్వై తవ.॥౪౪॥

పదార్థః :-(శమ్) సుఖమ్, (తే) తుభ్యమ్, (పరేభ్యః) ఉత్కృష్టేభ్యః (గాత్రేభ్యః) (శమ్) (అస్తు) (అవరేభ్యః) మధ్యస్థేభ్యో నికృష్టేభ్యో వా, (శమ్)(అస్థభ్యః) అస్థిభ్యః, 'ఛందస్యపి దృశ్యత' ఇత్యనేన హలాదావప్యనఙ్, (మజ్జభ్యః) (శమ్) (ఉ) (అస్తు) (తన్వై) శరీరాయ (తవ).॥౪౪॥

అన్వయః:-హే విద్యామిచ్ఛో! యథా పృథివ్యాదితత్త్వం తవ తన్వై శమస్తు, పరేభ్యో గాత్రేభ్యః శమ్వవరేభ్యో గాత్రేభ్యః శమస్తు. అస్థభ్యో మజ్జభ్యః శమస్తు, తథా స్వకీయైరుత్తమ గుణకర్మస్వభావైరధ్యాపకాస్తే శంకరా భవంతు.. ॥౪౪॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః, యథా మాతాపిత్రాఽధ్యాపకోపదేశకైః సంతానానాం దృఢాంగాని దృఢా ధాతవశ్చ స్యుర్యైః కల్యాణం కర్తు మర్హేయుస్తథాఽ ధ్యాపనీయ ముపదేష్టవ్యం చ.॥౪౪॥

పదార్థము :-విద్యాభిలాషీ! ఏవిధముగ పృథివ్యాదితత్త్వములు (తవ) నీయొక్క (తన్వై) శరీరమునకు (శమ్ అస్తు) సుఖహేతువులగుచున్నవో లేక (పరేభ్యః) అత్యుత్తమ (గాత్రేభ్యః) అంగములకు (శమ్) సుఖమును (ఉ) మరియు (అవరేభ్యః) ఉత్తమములకన్న న్యూనమ్, మధ్యమము మరియు నికృష్టాంగములకు (శమ్) సుఖరూపములు (అస్తు) అగుగాక! మరియు (అస్థభ్యః) ఎముకలు (మజ్జభ్యః) శరీరమున నుండి క్రొవ్వునకు (శమ్) సుఖహేతువగుచున్నదో, అదేవిధముగ తమ ఉత్తమ గుణ కర్మ స్వభావములచే అధ్యాపకులు (తే) నీకు సుఖము నిచ్చువా రగుదురుగాక. ॥౪౪॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మాతాపితరులు, అధ్యాపకోపదేశకులు తమ సంతానముల బలపుష్ట్యంగములు మరియు పుష్టివంతమగు ధాతువు గలిగి, ఇతరుల కల్యాణమును గోరునట్టిరీతిలో వారికి విద్యాశిక్షణము, ఉపదేశముల నొనర్చవలయును. ॥౪౪॥

44. O student, just as the Erth contributes to the walfare of vital and minor organs of thy body, thy bones and marrow, so thy teachers with their qualitiecs, actions and noble nature add to thy pleasure!.

౧౩౫౧.కః స్విదిత్యస్య ప్రజాపతిర్ఋషిః, జిజ్ఞాసుర్దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

అథ విదుషః ప్రతి ప్రశ్నా ఏవం కర్తవ్యా ఇత్యాహ. విద్వాంసుల నిటుల ప్రశ్నల నడుగవలయును.

౧౩౫౧ కః స్విదేకాకీ చరతి క ఉ స్విజ్జాయతే పునః।

కిꣳస్విద్ధిమస్య భేషజం కిమ్వావపనం మహత్ ॥౪౫॥

ప.వి:- కః, స్విత్, ఏకాకీ, చరతి, కః, ఉ॥ ఇత్యూ॥ స్విత్, జాయతే, పునరితి పునః, కిమ్, స్విత్, హిమస్య, భేషజమ్, కిమ్, ఉ॥ ఇత్యూ॥ ఆవపన మిత్యా+వపనమ్, మహత్.॥౪౫॥

పదార్థః:-(కః) (స్విత్) (ఏకాకీ) అసహాయోఽద్వితీయః (చరతి) ప్రాప్నోతి (కః) (ఉ) (స్విత్) అపి, (జాయతే) (పునః)(కిమ్) (స్విత్) (హిమస్య) శీతస్య, (భేషజమ్) ఔషధమ్, (కిమ్) (ఉ) (ఆవపనమ్) సమన్తాత్సర్వాధారమ్; (మహత్).॥౪౫॥

అన్వయః :-హే విద్వన్! అస్మిన్ సంసారే కః స్విదేకాకీ చరతి? క ఉ స్విత్పునర్జాయతే? కిం స్విద్ధిమస్య భేషజం? కిము మహదావపనమస్తీతి? వదస్వ.॥౪౫॥

భావార్థః :-అసహాయః కో భ్రమతి? శీతనివారకః కః? కః పునః పునరుత్పద్యతే మహదుత్పత్తిస్థానమ్ కిమస్తీత్యేతేషాం ప్రశ్నానాముత్తరేణ మంత్రేణ సమాధానాని వేదితవ్యాని. ॥౪౫॥

పదార్థము :-ఓ విద్వాంసుడా! ఈ విశ్వమునందు (కః,స్విత్) ఎవడు (ఏకాకీ) ఒక్కడుమాత్రమే [తోడులేక] (చరతి) తిరుగును, నడచును లేక పొందును? (ఉ) మరియు (కః,స్విత్) ఎవడు (పునః) మాటిమాటికి (జాయతే) ఉత్పన్నమగును? (కిం,స్విత్) ఎయ్యది (హిమస్య) శీతమునకు [చలికి] (భేషజమ్) ఔషధము? (కిమ్, ఉ) మరియు నేది (మహత్) గొప్పదైన (ఆవపనమ్) ఉత్తమరూపములో సమస్త బీజములను విత్తుటకు గొప్ప ఆధారమో తెలుపుడు. ॥౪౫॥

**భావార్థము** :-నిస్సహాయముగా భ్రమించువాడెవడు? మాటిమాటికి ఉత్పన్నమగువా డెవడు? శీతనివృత్తి యొనర్చున దేది? మహా ఉత్పత్తిస్థానమేది? ఈ ప్రశ్నలకు సమాధానములు దిగువ మంత్రమున చూడవచ్చును.॥౪౫॥

45. Who moveth singly and alone? Who is brought forth to life again? What is the remedy of cold? What is the vast field for production.

౧౩౫౨.సూర్య ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, సూర్యాదయో దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః పూర్వోక్తప్రశ్నోత్తరాణ్యాహ. పూర్వోక్త ప్రశ్నలకిచ్చుట ప్రత్యుత్తరము లివ్వబడుచున్నవి.

౧౩౫౨ సూర్యఽ ఏకాకీ చరతి చంద్రమా జాయతే పునః।

అగ్నిర్హిమస్య భేషజం భూమిరావపనం మహత్ ॥౪౬॥

ప.విః- సూర్యః, ఏకాకీ, చరతి, చంద్రమాః జాయతే, పునరితిఽ పునః, అగ్నిః హిమస్య, భేషజమ్, భూమిః, ఆవపనమిత్యా+వపనమ్, మహత్.॥౪౬॥

పదార్థః :- (సూర్యః) సూర్యలోకః, (ఏకాకీ) అసహాయః (చరతి) (చంద్రమాః) ఆహ్లాదకరశ్చంద్రః, (జాయతే) ప్రకాశితో భవతి, (పునః) పశ్చాత్ (అగ్నిః) పావకః (హిమస్య) శీతస్య, (భేషజమ్) ఔషధమ్, (భూమిః) భవంతి భూతాని యస్యాం సా పృథివీ, (ఆవపనమ్) సమంతాద్వపంతి యస్మింస్తత్, (మహత్) విస్తీర్ణమ్.॥౪౬॥

అన్వయః:-హే జిజ్ఞాసో! సూర్య ఏకాకీ చరతి. చంద్రమాః పునర్జాయతేఽగ్నిర్హిమస్య భేషజం, మహదావపనం భూమిరస్తీతి.॥౪౬॥

భావార్థః :-హే విద్వాంసో! సూర్యః స్వస్యైవ పరిధౌ భ్రమతి న కస్యచిల్లోకస్య పరితః. చంద్రాదిలోకా స్తేనైవ ప్రకాశితా భవంతి. అగ్నిరేవ శీతవినాశకస్సర్వ బీజవపనార్థం మహత్ క్షేత్రం భూమిరేవాస్తీతి యూయం విజానీత.॥౪౬॥

పదార్థము :- ఓ జిజ్ఞాసువా! తెలియనిచ్ఛగించువాడా! (సూర్యః) సూర్యలోకము (ఏకాకీ) ఒంటరిగా (చరతి) తన పరిధియందు తిరుగును (చన్ద్రమాః) ఆనందప్రదాతయగు చంద్రుడు (పునః) మాటిమాటికి (జాయతే) ప్రకాశవంతుడగుచున్నాడు (అగ్నిః) అగ్ని (హిమస్య) శీతమునకు (భేషజమ్) ఓషధియై యున్నది (మహత్) గొప్ప (ఆవపనమ్) సకల వస్తువులను విత్తుట కాధారభూతమైనది (భూమి) అదియే భూమియై యున్నది.॥౪౬॥

భావార్థము :- ఓ విద్వాంసులారా! సూర్యుడు తన పరిధి [కక్ష] యందే తిరుగును కాని ఏ లోకాంతరములందో నలువైపుల దిరుగడు. చంద్రుడు మున్నగులోకములు ఆతని ప్రకాశముచేతనే ప్రకాశితములగుచున్నవి. అగ్నియే శీతమును దూరపరచు ఔషధము. సమస్త బీజముల నాటుటకు గొప్ప క్షేత్రము భూమియై యున్నదని దెలిసికొనుడు. ॥౪౬॥

46. The sun moves singly and alone. The moon is brought to life again. Fire is the remedy of cold. Earth is the vast field for production.

౧౩౫౩. కిం స్విదిత్యస్య ప్రజాపతిర్ఋషిః, జిజ్ఞాసుర్దేవతా, అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః ప్రశ్నానాహ. మఱల ప్రశ్నలను చెప్పెను.

౧౩౫౩ కిꣳస్విత్సూర్యసమం జ్యోతిః కిꣳసముద్రసమꣳసరః।

కిꣳస్విత్ పృథివ్యై వర్షీయః కస్య మాత్రా న విద్యతే ॥౪౭॥

ప.విః- కిమ్, స్విత్, సూర్యసమమితి సూర్య+సమమ్, జ్యోతిః, కిమ్, సముద్రసమమితి సముద్ర+సమమ్, సరః కిమ్, స్విత్, పృథివ్యై, వర్షీయః కస్య, మాత్రా, న విద్యతే.॥౪౭॥

పదార్థః :-(కిమ్) (స్విత్) (సూర్యసమమ్) సూర్యేణ తుల్యమ్, (జ్యోతిః) ప్రకాశస్వరూపమ్. (కిమ్) (సముద్రసమమ్) (సరః) సరంతి జలాని యస్మిన్ తడాగే తత్, (కిమ్) (స్విత్) (పృథివ్యై) పృథివ్యాః. అత్ర పంచమ్యర్థే చతుర్థీ. (వర్షీయః) వృద్ధమ్.(కస్య) (మాత్రా) మీయతే యయా సా (న) (విద్యతే) భవతి.॥౪౭॥

అన్వయః :-హే విద్వన్! కింస్విత్ సూర్యసమం జ్యోతిః? కిం సముద్రసమం సరః? కింస్విత్ పృథివ్యై వర్షీయః? కస్య మాత్రా న విద్యత ఇతి. ॥౪౭॥

భావార్థః :- ఆదిత్యవత్తేజస్వి, సముద్రవదుదధి, భూమేరధికం చ కిం, కస్య చ పరిమాణం నాస్తీత్యే తేషాం ప్రశ్నానాముత్తరాణి పరస్మిన్ మంత్రే వేదితవ్యాని.॥౪౭॥

పదార్థము :- ఓ విద్వాంసా! (కిం, స్విత్) ఎవడు (సూర్యసమమ్) సూర్యునివంటి (జ్యోతిః) ప్రకాశస్వరూపుడు? (కిమ్) ఎయ్యది (సముద్రసమమ్) సముద్రమువంటి (సరః) జలాశయము? [ఎద్దానియందు, జలప్రవాహము, జలపాతము మరియు జలముల రాకపోకలుగల తటాకము] (కిమ్, స్విత్) ఎయ్యది (పృథివ్యై) పృథివికంటె (వర్షీయః) అతిగొప్పది? మరియు (కస్య) ఎద్దానికి (మాత్రా) కొలత, తూకపరిమాణము (న, విద్యతే) లేదు? ॥౪౭॥

భావార్థము :-ఆదిత్యునివంటి తేజస్సు, సముద్రమువంటి జలాధారము, భూమికన్న గొప్ప ఏవియై యున్నవి? మరియు దేనికి పరిమాణములేదు? ఈ నాలుగు ప్రశ్నలకు సమాధానము దిగువ మంత్రమున గలవు. ॥౪౭॥

47. What lustre is like the suns' light? What lake is qual to the sea? What is more spacious than the Earth? What thing is tht which is beyond measure.

౧౩౫౪. బ్రహ్మేత్యస్య ప్రజాపతిర్ఋషిః, బ్రహ్మాదయో దేవతాః, అనుష్టుప్ ఛందః, గాంధారః, స్వరః.

అథైతేషాముత్తరాణ్యాహ. ఉక్తప్రశ్నలకు సమాధానము లిందు చెప్పబడుచున్నవి.

౧౩౫౪ బ్రహ్మ సూర్యసమం జ్యోతిర్ద్యౌః సముద్రసమ్ఙ్సరః।
ఇన్ద్రః పృథివ్యై వర్షీయాన్ గోస్తు మాత్రా న విద్యతే ॥౪౮॥

ప.వి:- బ్రహ్మ; సూర్యసమమితి సూర్య + సమమ్, జ్యోతిః, ద్యౌః, సముద్రసమమితి సముద్ర+సమమ్, సరః, ఇన్ద్రః, పృథివ్యై, వర్షీయాన్ గోః, తు, మాత్రా, న, విద్యతే.॥౪౮॥

పదార్థః :-(బ్రహ్మ) బృహత్ సర్వేభ్యో మహదనంతమ్, (సూర్యసమమ్) (జ్యోతిః) ప్రకాశకమ్, (ద్యౌః) అంతరిక్షమ్, (సముద్రసమమ్) సముద్రేణ సమానః, (సరః) (ఇంద్రః) సూర్యః (పృథివ్యై) పృథివ్యాః, (వర్షీయాన్) అతిశయేన వృద్ధో మహాన్, (గోః) వాచః, (తు) (మాత్రా) (న) (విద్యతే) భవతి.॥౪౮॥

అన్వయః:- హే జిజ్ఞాసో! త్వం సూర్యసమం జ్యోతిర్బ్రహ్మ, సముద్రసమం సరో ద్యౌః, పృథివ్యై వర్షీయానింద్రో గోస్తు మాత్రా న విద్యత ఇతి విజానీహి, ॥౪౮॥

భావార్థః :- న కించిత్ స్వప్రకాశేన బ్రహ్మణా సమం జ్యోతిర్విద్యతే, సూర్యప్రకాశేన యుక్తేన మేఘేన తుల్యో జలాశయః, సూర్యేణ తుల్యో లోకేశో, వాచా తుల్యం వ్యవహార సాధకం కించిదపి వస్తు న భవతీతి సర్వే నిశ్చిన్వంతు.॥౪౮॥

పదార్థము :- ఓ జ్ఞానజిజ్ఞాసూ! నీవు (సూర్యసమమ్) సూర్యునివంటి (జ్యోతిః) స్వయం ప్రకాశస్వరూపుడు (బ్రహ్మ) సర్వోన్నతుడు, అనంతుడునగు పరమేశ్వరుడు (సముద్రసమమ్) సముద్రమువంటి (సరః) తటాకము (ద్యౌః) అంతరిక్షము (పృథివ్యై) పృథివికంటే (వర్షీయాన్) గొప్ప (ఇన్ద్రః) సూర్యుడు మరియు (గోః) వాణికి (తు) మాత్రమే (మాత్రా) కొలతతూకములు (న, విద్యతే) లేవని తెలిసికొనుము. ॥౪౮॥

భావార్థము :-ఎప్పుడైనను స్వయంప్రకాశకుడగు పరబ్రహ్మవంటి జ్యోతి, సూర్యప్రకాశముతో యుక్తమైన మేఘమువంటి జలస్థానము, సూర్యమండలమువంటి లోకేశుడు, వాణికి సమానమైన వ్యవహార సాధనాపదార్థ మెద్దియును లేదని సమస్త మానవులునిశ్చయముగ తెలిసికొనవలయును. ॥౪౮॥

48. God is lustre like the sun. Heaven is a flood to match the sea. Su is vaster than the Earth. Beyond all meaure is speech.

౧౩౫౫. పృచ్ఛామీత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రష్టృసమాధాతారౌ దేవతే; అనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునః ప్రశ్నానాహ. మఱలి నీ మంత్రమందు ప్రశ్నలను చెప్పుచున్నాడు.

౧౩౫౫ పృచ్ఛామి త్వా చితయే దేవసఖ యది త్వమత్ర మనసా జగన్థ।

యేషు విష్ణుస్త్రిషు పదేష్వేష్టస్తేషు విశ్వం భువనమావివేశా౩ః॥౪౯॥

ప.వి:- పృచ్ఛామి, త్వా, చితయే, దేవసఖేతి దేవ+సఖ, యది, త్వమ్, అత్ర, మనసా, జగన్థ, యేషు, విష్ణుః, త్రిషు, పదేషు, ఆఇష్ట ఇతి ఆ ఇష్టః, తేషు, విశ్వమ్, భువనమ్, ఆ, వివేశ.॥౪౯॥

పదార్థః :-(పృచ్ఛామి)(త్వా) త్వామ్, (చితయే) చేతనాయ, (దేవసఖ) దేవానాం విదుషాం సుహృద్, (యది) (త్వమ్) (అత్ర) (మనసా) అంతఃకరణేన, (జగంథ) (యేషు) (విష్ణుః) వ్యాపకేశ్వరః (త్రిషు) త్రివిధేషు, (పదేషు) నామస్థానజన్మాఖ్యేషు, (ఏష్టః) (తేషు) (విశ్వమ్) (భువనమ్) (ఆ) (వివేశ) ఆవిష్టో వ్యాప్తోఽస్తి.॥౪౯॥

అన్వయః :- హే దేవసఖ! యది త్వమత్ర మనసా జగంథ, తర్హి త్వా చితయే పృచ్ఛామి యో విష్ణుర్యేషు త్రిషు పదేష్వేష్టోఽస్తి తేషు వ్యాప్తః సన్ విశ్వం భువనమావివేశ, తం చ పృచ్ఛామి.॥౪౯॥

భావార్థః :- హే విద్వన్! యశ్చేతనః సర్వవ్యాపీ పూజితుం యోగ్యః పరమేశ్వరోఽస్తి తం మహ్యముపదిశ.॥౪౯॥

పదార్థము :- (దేవసఖ) విద్వాంసుల మిత్రుడా! (యది) ఏదేని (త్వమ్) నీవు (అత్ర) ఇచ్చట (మనసా) అంతఃకరణమునుండి (జగన్థ) ప్రాప్తించుచో (త్వా) నిన్ను (చితయే) చైతన్యమునకై (పృచ్ఛామి) అడుగుదును (విష్ణుః) సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు (యేషు) ఎట్టి (త్రిషు) ముప్పిధములగు (పదేషు) పొందదగిన జన్మ నామ స్థానములందు (ఏష్టః) శ్రేష్ఠముగ ఇష్టుడైయున్నాడో (తేషు) వానియందువ్యాప్తమైన (విశ్వమ్) సంపూర్ణ (భువనమ్) పృథివ్యాదిలోకములందు (ఆ, వివేశ) చక్కగా ప్రవేశించుచుండు పరమాత్మను గూర్చి నిన్ను ప్రశ్నించుచున్నాను. ॥౪౯॥

భావార్థము :- ఓ విద్వాంసుడా! చేతన స్వరూపుడు, సర్వవ్యాపి, పూజ, స్తుతి, ప్రార్థన, ఉపాసనలనొనర్ప యోగ్యుడగు పరమేశ్వరుని గురించి నాకు ఉపదేశించుము. ।౪౯॥

49. O God, Friend of the learned, I ask for information, if Thou in spirit hast pervaded the universe! Is this created world contained in the three steps in which Vishnu is worshipped?

౧౩౫౬. అపీత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఈశ్వరో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథైతేషాముత్తరాణ్యాహ. వీనికి ప్రత్యుత్తరములు.

౧౩౫౬ అపి తేషు త్రిషు పదేష్వస్మి యేషు విశ్వం భువనమా వివేశ।

సద్యః పర్యేమి పృథివీముత ద్యామేకేనాఙ్గేన దివోऽఅస్య పృష్ఠమ్ ।౫౦॥

ప.వి:- అపి, తేషు, త్రిషు, పదేషు, అస్మి, యేషు, విశ్వమ్, భువనమ్, ఆవివేశేత్యా+వివేశ, సద్యః, పరి, ఏమి, పృథివీమ్, ఉత, ద్యామ్, ఏకేన, అఙ్గేన, దివః, అస్య, పృష్ఠమ్. ।౫౦॥

పదార్థః :-(అపి) (తేషు) పూర్వోక్తేషు, (త్రిషు) (పదేషు) ప్రాప్తుం యోగ్యేషు నామస్థానజన్మాఖ్యేషు (అస్మి) (యేషు) (విశ్వమ్) అఖిలమ్ (భువనమ్) జగత్, (ఆవివేశ) సమంతాద్విష్టమస్తి (సద్యః) (పరి) సర్వతః, (ఏమి) ప్రాప్తోఽస్మి. (పృథివీమ్) భూమిమంతరిక్షం వా (ఉత) (ద్యామ్) సర్వప్రకాశమ్ (ఏకేన) (అంగేన) కమనీయేన, (దివః) ప్రకాశమానస్య సూర్యాదిలోకస్య (అస్య) (పృష్ఠమ్) ఆధారమ్. ।౫౦॥

అన్వయః :-హే మనుష్యాః! యో జగత్స్రష్టేశ్వరోఽహం యేషు త్రిషు పదేషు విశ్వం భువనమావివేశ తేష్వప్యహం వ్యాప్తోఽస్మి. అస్య దివః పృష్ఠం పృథివీముత ద్యాంచైకేనాంగేన సద్యః పర్యేమి. తం మాం సర్వే యూయ ముపాధ్వమ్. ।౫౦॥

భావార్థః :-యథా సర్వాన్ జీవాన్ ప్రతీశ్వర ఉపదిశతి అహం కార్యకారణాత్మకే జగతి వ్యాప్తోఽస్మి, మయా వినైకః పరమాణురప్యవ్యాప్తో నాస్తి. సోఽహం యత్ర జగన్నాస్తి తత్రాప్యనంతస్వరూపేణ పూర్ణోఽస్మి. యదిదం జగదతివిస్తీర్ణం భవంతః పశ్యంతి, తదిదం మత్సన్నిధావేకాణుమాత్రమపి నాస్తీతి తథైవ విద్వాన్ విజ్ఞాపయేత్. ।౫౦॥

పదార్థము :- ఓ మానవులారా! జగత్తును సృష్టించు ఈశ్వరుడనగు నేను (యేషు) ఎట్టి (త్రిషు) మూడు (పదేషు) ప్రాప్తించుకొనదగిన జన్మ, స్థాన, నామములయందు (విశ్వమ్) సమస్త (భువనమ్) జగత్తు

(ఆవివేశ) అన్నివైపులనుండి ప్రవేశమును పొందుచున్న (తేషు) ఆ జన్మ స్థాన నామములందు (అపి) కూడ నేను వ్యాప్తమై (అస్మి) ఉన్నాను (అస్య) ఈ (దివః) ప్రకాశవంతమగు సూర్యాదిలోకముల (పృష్ఠమ్) ఉపరితలభాగమును (పృథివీమ్) భూమి మరియు అంతరిక్షమును (ఉత) మరియు (ద్యామ్) సమస్త ప్రకాశమును (ఏకేన) ఒకే (అఙ్గేన) పొందదగిన అతిమనోహర వ్యవహారము లేక ప్రదేశముచే (సద్యః) శీఘ్రమే (పరి, ఏమి) అన్నిదిశలనుండి ప్రాప్తించునట్టి నా యుపాసనమే మీరెల్లరను చేయుట యోగ్యము. ॥౫౦॥

**భావార్థము :-** సమస్త ప్రాణులను గూర్చి పరమేశ్వరు డిట్లుపదేశించుచున్నాడు. ''నేను కార్యకారణాత్మక జగత్తునందంతటను వ్యాప్తమైయున్నాను. నేను లేక ఒక్క పరమాణువుకూడ లేదు''. ఏతే ఎచ్చట ఈ జగత్తు లేదో అచ్చటయును అనంతస్వరూపములచే పరిపూర్ణుడనై యున్నాను. మీరు చూచుచున్నట్టి ఏ అతివిస్తారజగము గలదో ఇది నా యెదుట అణువు మాత్రమైనను గాదు. ఈ విషయము ఇట్లే విద్వాంసులెల్లరును దెలిసికొని, తెలియజెప్పవలెను. ॥౫౦॥

50. I pervade those three steps in which resides the whole of this universe. This Earth and Heaven I encircle in a moment with a part of My might. Even beyond Heaven am I.

౧౩౫౭. కేష్వంత ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, పరమేశ్వరో దేవతా, పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

అథేశ్వరవిషయే ప్రశ్నావాహ. ఈశ్వరుని గురించి రెండు ప్రశ్నలను చెప్పెను.

౧౩౫౭ కేష్వన్తః పురుషఽ ఆ వివేశ కాన్యన్తః పురుషేఽఅర్పితాని ।

ఏతద్ బ్రహ్మన్నుప వల్హామసి త్వా కిꣳస్విన్నః ప్రతి వోచాస్యత్ర ॥౫౧॥

ప.వి:- కేషు, అన్తరిత్యన్తః, పురుషః, ఆ, వివేశ, కాని, అన్తరిత్యన్తః, పురుషే, అర్పితాని, ఏతత్, బ్రహ్మన్, ఉప, వల్హామసి, త్వా, కిమ్, స్విత్, నః, ప్రతి, వోచాసి, అత్ర. ॥౫౧॥

పదార్థః:-(కేషు) (అంతః) మధ్యే, (పురుషః) సర్వత్ర పూర్ణః, (ఆ) (వివేశ) ప్రవిష్టోఽస్తి (కాని) (అంతః) మధ్యే, (పురుషే) (అర్పితాని) స్థాపితాని, (ఏతత్)(బ్రహ్మన్) (బ్రహ్మవిద్విద్వన్, (ఉప) (వల్హామసి) ప్రధానా భవామః (త్వా) త్వామ్, (కిమ్) (స్విత్) (నః) అస్మాన్, (ప్రతి) (వోచాసి) ఉచ్యాః, అత్ర లేటి మధ్యమైకవచనే 'వా ఛందసి సర్వే విధయో భవంతీ' త్యుమాగమః (అత్ర). ॥౫౧॥

అన్వయః:-హే బ్రహ్మన్! కేషు పురుషోఽన్తరావివేశ? కాని పురుషేఽన్తరర్పితాని? యేన వయ ముపవల్హామసి. ఏతత్త్వా త్వాం పృచ్ఛామస్తత్కింస్విదస్త్యత్ర నః ప్రతివోచాసి. ॥౫౧॥

భావార్థః :- చతుర్వేద విద్విద్వానితరైర్జనైరేవం ప్రష్టవ్యః. హే వేదవిద్విద్వన్! పూర్ణః పరమేశ్వరః కేషు ప్రవిష్టోఽస్తి? కాని చ తదంతర్గతాని సంతి. ఏతత్ పృష్టో భవాన్ యాథార్థ్యేన బ్రవీతు యేన వయం ప్రధానపురుషా భవేమ.॥౫౧॥

పదార్థము :- (బ్రహ్మన్) ఓ వేదవిద్వాంసుడా! (కేషు) వేనియందు (పురుషః) సర్వత్రా పరిపూర్ణుడై యున్న పరమేశ్వరుడు (అన్తః) లోపల (ఆ, వివేశ) ప్రవేశించు చున్నాడో మరియు (కాని) ఎవడు (పురుషే) పూర్ణ ఈశ్వరునియందు (అన్తః) లోపల (అర్పితాని) స్థాపించబడినవో, ఎట్టి జ్ఞానముచే మనము (ఉప, వల్హామసి) ప్రధానులమగుదుమో (ఏతత్) ఇవి (త్వా) మిమ్ము అడుగుచున్నాము (కిం, స్విత్) అది ఏదియో (అత్ర) దీనియందు (నః) మా (ప్రతి) యెడ (వోచాసి) ప్రకటించుడు.॥౫౧॥

భావార్థము :-వేదవిదులగు విద్వాంసులారా! పూర్ణుడగు పరమేశ్వరుడు వేనియందు ప్రవిష్టుడై యున్నాడు? ఆతనియందంతర్గతములై ఏవి కలవు? ఈ విషయము మిమ్ము అడుగుచున్నాము. మే మెట్టి జ్ఞానముతో ఉత్తమ పురుషులము కాగల మని చతుర్వేద పండితునితో ఇతరు లిట్లు ప్రశ్నించి తెలిసికొన వలెను.॥౫౧॥

51. What are the things which God hath entered in? What are the things which God hath contained withing im? This riddle we propose to thee, O knower of the vedas; whereby we become great. Pray tell us what mystery lies in it.

౧౩౫౨.పంచస్వంత ఇత్యస్య ప్రజాపతిరృషిః, పరమేశ్వరో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పూర్వమంత్రోక్తప్రశ్నయోరుత్తరమాహ. పూర్వమంత్రములో నడిగిన ప్రశ్నలకిందు ప్రత్యుత్తరములు.

౧౩౫౨ పఞ్చస్వన్తః పురుషఽఆవివేశ తాన్యన్తః పురుషేఽఅర్పితాని ।
ఏతత్త్వాత్ర ప్రతిమన్వానోఽఅస్మి న మాయయా భవస్యుత్తరో మత్ ॥౫౨॥

ప.వి:-పఞ్చస్వితి పఞ్చ+సు, అన్తరిత్యన్తః, పురుషః, ఆ, వివేశ, తాని, అన్తరిత్యన్తః, పురుషే, అర్పితాని, ఏతత్, త్వా, అత్ర, ప్రతిమన్వాన ఇతి ప్రతి+మన్వానః, అస్మి, న, మాయయా, భవసి, ఉత్తరఇత్యుత్+ తరః, మత్. ॥౫౨॥

పదార్థః :-(పంచసు) భూతేషు తన్మాత్రాసు వా (అంతః) (పురుషః) పూర్ణః పరమాత్మా, (ఆ)(వివేశ) స్వవ్యాప్త్యాఽఽవిష్టోఽస్తి (తాని) భూతాని తన్మాత్రాణి వా (అంతః) మధ్యే (పురుషే) పూర్ణే పరమాత్మని, (అర్పితాని) స్థాపితాని, (ఏతత్) (త్వా) త్వామ్, (అత్ర)

(ప్రతిమన్వానః) ప్రత్యక్షేణ విజానన్; (అస్మి) (న) (మాయయా) ప్రజ్ఞయా. మాయేతి ప్రజ్ఞానా...నిఘం.3,9.(భవసి) (ఉత్తరః) ఉత్కృష్టం తారయతి సమాదధాతి సః (మత్) మమ సకాశాత్.॥౫౨॥

**అన్వయః :-** హే జిజ్ఞాసో! పంచస్వంతః పురుష ఆ వివేశ. తాని పురుషేఽన్తరర్పితాని. ఏతదత్ర త్వా ప్రతిమన్వానోఽహం సమాధాతాఽస్మి యది మాయయా యుక్తస్త్వం భవసి తర్హి మదుత్తరః సమాధాతా కశ్చిన్నాస్తీతి విజానీహి. ॥౫౨॥

**భావార్థః :-** పరమేశ్వర ఉపదిశతి. హే మనుష్యాః! మదుత్తరః కోఽపి నాస్తి. అహమేవ సర్వేషామాధారః సర్వమభివ్యాప్య ధరామి. మయి వ్యాప్తే సర్వాణి వస్తూని స్వస్వనియమే స్థితాని సంతి. హే సర్వోత్తమా యోగినో విద్వాంసో భవంతో మమేదం విజ్ఞానం విజ్ఞాపయత.॥౫౨॥

**పదార్థము :-** తెలిసికొను నిచ్ఛగల ముముక్షువా! (పఞ్చసు) పంచమహాభూతములు మరియు వాని సూక్ష్మ తన్మాత్రలందు (అన్తః) లోపల (పురుషః) పరిపూర్ణుడగు పరమాత్మ (ఆ,వివేశ) తన వ్యాప్తిద్వారా ఉత్తమరీతిలో ప్రాప్తించుచున్నాడు (తాని) ఆ పంచభూతములు, వాని తన్మాత్రలు (పురుషే) పరిపూర్ణ పరమాత్మ (అన్తః) లోపల (అర్పితాని) స్థాపితములై యున్నవి (ఏతత్) ఇవి (అత్ర) ఈ జగత్తునందు (త్వా) నీకు (ప్రతిమన్వానః) ప్రత్యక్షముగ నెరుగుచు సమాధానము (అస్మి) చేయుచున్నాను (మాయయా) శ్రేష్ఠ బుద్ధితో గూడిన నీవు (భవసి) అగుదువేని (మత్) నా కంటే (ఉత్తరః) ఉత్తమముగ సమాధాన పరచువాడెవ్వడును (న) లేడని నీ వెరుగుము. ॥౫౨॥

**భావార్థము :-** పరమేశ్వరుడిట్లుపదేశించుచున్నాడు. ఓ మానవులారా! నా కన్న పైన ఎవ్వడును లేడు. నేను సర్వమున కాధారమై సర్వమునందు వ్యాప్తమై యుండి సర్వమును ధారణమొనర్చి యున్నాను. నేను వ్యాప్తుడనై యున్నందుననే సకల పదార్థములు తమ తమ నియమములందు స్థిరమై యున్నవి. సర్వోత్తములగు విద్వాంసులారా! యోగిపుంగవులారా! మీరు ఈ నా విజ్ఞానమును ప్రకటపరచుడు. ॥౫౨॥

52. Within five things hath God found entrane. These things hath God within Him established. O questioner, this is the thought which I return in answer. Though thou art wise, yet thou art not my superior in wisdom.

౧౩౫౯.కాస్విదిత్యస్య ప్రజాపతిరృషిః, ప్రష్టా దేవతా, అనుష్టుప్, ఛందః, గాంధారః స్వరః.

పునః ప్రశ్నానాహ. మరల ప్రశ్నలు.

౧౩౫౯ కా స్విదాసీత్పూర్వచిత్తిః కిꣳస్విదాసీద్ బృహద్వయః ।

కా స్విదాసీత్పిలిప్పిలా కా స్విదాసీత్ పిశఙ్గిలా॥౫౩॥

ప.వి:- కా, స్విత్, ఆసీత్, పూర్వచిత్తిరితి పూర్వ+చిత్తిః, కిమ్, స్విత్, ఆసీత్, బృహత్, వయః, కా, స్విత్, ఆసీత్, పిలిప్పిలా, కా, స్విత్, ఆసీత్, పిశఙ్గిలా.॥౫౩॥

పదార్థః:-(కా) (స్విత్) (ఆసీత్) (పూర్వచిత్తిః) పూర్వస్మిన్ననాదౌ సంచయవాఖ్యా (కిమ్) (స్విత్) (ఆసీత్) (బృహత్) మహత్, (వయః) ప్రజననాత్మకమ్,(కా) (స్విత్) (ఆసీత్) (పిలిప్పిలా) ఆర్ద్రీభూతా (కా) (స్విత్) (ఆసీత్) (పిశంగిలా) అవయవాంతః కర్త్రీ.॥౫౩॥

అన్వయః:-హే విద్వన్నత్ర జగతి కా స్విత్ పూర్వచిత్తిరాసీత్? కిం స్విద్ బృహద్వయ ఆసీత్? కాస్విత్ పిలిప్పిలా ఆసీత్? కాస్విత్ పిశంగిలా ఆసీదితి భవంతం పృచ్ఛామి.॥౫౩॥

భావార్థః:-అత్ర చత్వారః ప్రశ్నాస్తేషాం సమాధానాని పరస్మిన్మంత్రే ద్రష్టవ్యాని. ॥౫౩॥

పదార్థము:-ఓ విద్వాంసుడా! ఈ ప్రపంచమునందు (కా, స్విత్) ఎయ్యది (పూర్వచిత్తిః) పూర్వము అనాది కాలమున సంచితమగునదై (కిం, స్విత్) ఏది (బృహత్) గొప్ప (వయః) ఉత్పన్న స్వరూపమై (ఆసీత్) ఉన్నది? (కా,స్విత్) ఏది (పిలిప్పిలా) బురదగా, మెత్తగా (ఆసీత్) ఉన్నది? మరియు (కా,స్విత్) ఎయ్యది (పిశఙ్గిలా) అవయవములను లోపలికి దీసికొనునది [మ్రింగునది] (ఆసీత్) ఐ యున్నది? ఇట్లని నే నడుగుచున్నాను. ॥౫౩॥

భావార్థము:-ఈ మంత్రములో నాల్గు ప్రశ్నలు గలవు. వీని సమాధానములు దిగువ మంత్రమున విషదపరచబడినవి.॥౫౩॥

53. O learned person, I aks of thee.

What is accumulated in time without beginning? What is the great source of creation? What is the majestic thing?

What absorbs the bodies!.

౧౩౬౦.ద్యౌరాసీదిత్యస్య ప్రజాపతిరృషిః, సమాధాతా దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః, స్వరః.

పూర్వప్రశ్నానాముత్తరాణ్యాహ. పూర్వప్రశ్నలకు ప్రత్యుత్తరములు.

౧౩౬౦ ద్యౌరాసీత్పూర్వచిత్తిరశ్వఽఆసీద్ బృహద్వయః।

అవిరాసీత్పిలిప్పిలా రాత్రిరాసీత్పిశఙ్గిలా॥౫౪॥

**ప.విః- ద్యౌః, ఆసీత్,పూర్వచిత్తిరితి పూర్వ+చిత్తిః, అశ్వః, ఆసీత్, బృహత్, వయః, అవిః, ఆసీత్, పిలిప్పిలా, రాత్రిః, ఆసీత్, పిశఙ్గిలా.॥౫౪॥**

పదార్థః :- (ద్యౌః) విద్యుత్, (ఆసీత్)(పూర్వచిత్తిః)ప్రథమం చయనమ్, (అశ్వః) మహత్తత్త్వమ్, (ఆసీత్) (బృహత్) మహత్, (వయః)ప్రజననాత్మకమ్, (అవిః) రక్షికా ప్రకృతిః, (ఆసీత్), (పిలిప్పిలా) (రాత్రిః) రాత్రివద్వర్తమానః ప్రలయః (ఆసీత్) (పిశంగిలా) సర్వేషామవయవానాం నిగలికా.॥౫౪॥

అన్వయః :- హేజిజ్ఞాసో! ద్యౌః పూర్వచిత్తిరాసీదశ్వో బృహద్వయ ఆసీదవిః పిలిప్పిలాఽఽసీద్రాత్రిః పిశంగిలాఽఽసీదితి త్వం విజానీహి.॥౫౪॥

భావార్థః :- హే మనుష్యాః! యాఽతీవసూక్ష్మా విద్యుత్సా ప్రథమా పరిణతిర్మహదాఖ్యం ద్వితీయా పరిణతిః, ప్రకృతిర్మూలకారణపరిణతిః, ప్రలయః సర్వస్థూలవినాశకోఽస్తీతి విజానీత. ॥౫౪॥

పదార్థము :-జిజ్ఞాసువులగు మానవులారా! (ద్యౌః) విద్యుత్తు (పూర్వచిత్తిః) మొట్టమొదటసంచయమై (ఆసీత్) ఉన్నది (అశ్వః) మహత్తత్త్వము (బృహత్) గొప్ప (వయః) ఉత్పత్తి స్వరూపమై (ఆసీత్) ఉన్నది (అవిః) రక్షణ యొనర్చు ప్రకృతి (పిలిప్పిలా) మృదువైన బురదయై (ఆసీత్) ఉన్నది (రాత్రిః) రాత్రివలె నుండు ప్రళయము (పిశఙ్గిలా) సర్వావయవములను మ్రింగివేయునట్టిదై (ఆసీత్) ఉన్నది. అని మీరు తెలిసికొనుడు. ॥౫౪॥

భావార్థము :-ఓ మానవులారా! అతి సూక్ష్మమైన విద్యుత్తు మొదటి పరిణామమై యున్నది. మహత్తత్త్వరూపము ద్వితీయ పరిణామము. ఇక ప్రకృతి సర్వమునకు మూలకారణము, పరిణామరహితమై యున్నది. ప్రళయము సమస్త స్థూలజగత్తుకు వినాశరూపమై యున్నదని మీరు తెలిసికొనుడు. ॥౫౪॥

54. O questioner, know that, lightning is accumulated in the beginning. Intellect is the source of creation. Matter is the majestic thing. Dissolution absorbs all bodies!.

౧౩౬౧.కాఽఈమిత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రష్టా దేవతా, అనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.

పునః ప్రశ్నానాహ. మరల ప్రశ్నలను చెప్పుచున్నాడు.

**౧౩౬౧ కాఽఈమరే పిశఙ్గిలా కాఽఈం కురుపిశఙ్గిలా।**

**కఽఈమాస్కన్దమర్షతి కఽఈం పన్థాం విసర్పతి ॥౫౫॥**

ప.వి:- కా, ఈమ్, అరే, పిశంగిలా, కా, ఈమ్, కురుపిశంగిలేతి కురు+పిశఙ్గిలా, కః, ఈమ్, ఆస్కందమిత్యా+స్కందమ్, అర్షతి, కః, ఈమ్, పన్థామ్, వి, సర్పతి.॥౫౫॥

పదార్థః :-(కా) (ఈమ్) సముచ్చయే, (అరే) నీచసంబోధనే, (పిశంగిలా) రూపావరణకారిణీ (కా) (ఈమ్) (కురుపిశంగిలా) (కః) (ఈమ్) (ఆస్కందమ్) (అర్షతి) ప్రాప్నోతి (కః) (ఈమ్) ఉదకస్య, (పంథామ్) మార్గమ్, (వి) (సర్పతి).॥౫౫॥

అన్వయః:-అరే స్త్రీ కా ఈం పిశంగిలా? కా ఈం కురుపిశంగిలా? క ఈమాస్కంద మర్షతి? క ఈం పంథాం విసర్పతీతి సమాధేహి. ॥౫౫॥

భావార్థః :- కేన రూపమావ్రియతే? కేన కృష్యాదిర్నశ్యతే? కః శీఘ్రం ధావతి? కశ్చ మార్గే ప్రసరతీతి చత్వారః ప్రశ్నాస్తేషాముత్తరాణి పరస్మిన్మంత్రే వేదితవ్యాని. ॥౫౫॥

పదార్థము :-(అరే) ఓ విదుషీమణీ! (కా, ఈమ్) ఎయ్యది మాటిమాటికి (పిశఙ్గిలా) రూపమును ఆవరణమొనర్చు [కప్పుకొను]నది (కా, ఈమ్) ఎయ్యది మాటిమాటికి (కురుపిశఙ్గిలా) యవలు మున్నగు అన్నముల అవయవములను మ్రింగునది (కః, ఈమ్) ఎయ్యది మాటి మాటికి (ఆస్కన్దమ్) దూరదూరపు నడకను (అర్షతి) పొందును. మరియు (కః) ఎయ్యది (ఈమ్) జలముల (పన్థామ్) మార్గమున (వి, సర్పతి) విశేషముగ వ్యాప్తమై నడచుచున్నది? ॥౫౫॥

భావార్థము :-ఎద్దానిచే రూపమునకు ఆవరణము మరియు దేనిచే పైరుపంటలకు నష్టము సంభవించుచున్నది? ఎయ్యది శీఘ్రముగ పరుగిడి పోవుచున్నది? మరియు నేది వ్యాపించునది యను నాల్గు ప్రశ్నలకు దిగువమంత్రమునందు సమాధానములు గలవు. ॥౫౫॥

55. O learned persons! what appears and disappears again and again? Who eats the corn-fields again and again? What movew with rapid spring and bounds again and again? What glides and winds along the path of water?

౧౩౬౨. అజేత్యస్య ప్రజాపతిర్ఋషిః సమాధాతా దేవతా, స్వరాడుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పూర్వప్రశ్నానాముత్తరాణ్యాహ. పూర్వమంత్రములోని ప్రశ్నలకు సమాధానములు.

౧౩౬౨ అజారే పిశఙ్గిలా శ్వావిత్కురుపిశఙ్గిలా।

శశఽ ఆస్కన్దమర్షత్యహిః పన్థాం వి సర్పతి ॥౫౬॥

ప.వి:- అజా, అరే, పిశఙ్గిలా, శ్వావిత్, శ్వావిదితి శ్వా+విత్, కురుపిశఙ్గిలేతి కురు+పిశ ఙ్గిలా, శశః, ఆస్కన్దమిత్యా+స్కన్దమ్, అర్షతి, అహిః, పన్థామ్, వి, సర్పతి.॥౫౬॥

పదార్థః :-(అజా)జన్మరహితా ప్రకృతిః, (అరే) సంబోధనే, (పిశంగిలా) (శ్వావిత్) పశువిశేష ఇవ. (కురుపిశంగిలా) కురోః కృతస్య కృష్యాదేః పిశాన్యంగాని గిలతి సా, (శశః) పశువిశేష ఇవ వాయుః (ఆస్కన్దమ్) సమన్తాదుత్ప్లుత్య గమనమ్ (అర్షతి) ప్రాప్నోతి (అహిః) మేఘః, (పంథామ్)పంథానమ్, (వి,సర్పతి) వివిధతయా గచ్ఛతి. ॥౫౬॥

అన్వయః:-అరే మనుష్యాః! అజా పిశఙ్గిలా శ్వావిత్కురుపిశంగిలాఽస్తి, శశ ఆస్కందమర్షత్యహిః, పంథాం విసర్పతీతి విజానీత. ॥౫౬॥

భావార్థః:-హే మనుష్యాః! యాఽజా ప్రకృతిః సర్వకార్యప్రలయాధికారిణీ కార్యకారణాఖ్యా స్వకార్యం స్వస్మిన్ ప్రలాపయతి. యా సేధా కృష్యాదికం వినాశయతి యో వాయుః శశ ఇవ గచ్ఛన్ సర్వం శోషయతి, యో మేఘః సర్ప ఇవ గచ్ఛతి తాన్ విజానీత.॥౫౬॥

పదార్థము :-(అరే) ఓ మానవులారా! (అజా) జన్మరహితము ప్రకృతి (పిశఙ్గిలా) విశ్వముయొక్క రూపమును ప్రళయకాలమందు మింగివేయునది (శ్వావిత్) ఏదుపంది (కురుపిశఙ్గిలా) సిద్ధపరచబడిన పైరు పంటల అంగములను నష్టపరచును. (శశః) చెవులపిల్లి [కుందేలు] వలె వేగయుక్తముగ పంటలు మున్నగు వానియందు కరకరలాడించు వాయువు (ఆస్కన్దమ్) బాగుగా గంతులు వేయును, అనగా ఒకదాని నుండి రెండవ పదార్థమును శీఘ్రముగ (అర్షతి) పొందుచున్నది. మరియు (అహిః) మేఘము (పన్థామ్) మార్గమునందు (వి, సర్పతి) వివిధ ప్రకారములుగ పోవుచున్నది. దీనిని మీరు తెలిసికొనుడు. ॥౫౬॥

భావార్థము :-ఓ మానవులారా! ఏ ప్రకృతి సమస్త కార్యరూప జగమును ప్రళయమొనర్చి, కార్యకారణరూపముగు తన కార్యమును తనయందు లయమొనర్చు కొనునదైయున్నదో, ఏ యేదుపంది పైరు పంటలు మున్నగు వానిని వినాశపరచుచుండునో, ఏ వాయువు కుందేలు వలె వేగముగావీచుచు సర్వమును శుష్కింపజేయునో, మరియు ఏ మేఘము సర్పమువలె భూమిపై ప్రాకుచు పోవునో, ఆ యన్నిటిని మీరు తెలిసికొనుడు. ॥౫౬॥

56. O questioner know, that eternal matter resolves the world in itself at the time of dissolution, Porcupine destroys the corn-fields. Like hare, the air moves with leaps and bounds. Cloud creeps winding on the path.

౧౩౬౩.కత్యస్యేత్యస్య ప్రజాపతిర్ఋషిః. ప్రష్టా దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునః ప్రశ్నానాహ. మరల ప్రశ్నలు.

౧౩౬౩ కత్యస్య విష్ఠాః కత్యక్షరాణి కతి హోమాసః కతిధా సమిద్ధః। యజ్ఞస్య త్వా విదథా పృచ్ఛమత్ర కతి హోతారఋతుశో యజన్తి ॥౫౭॥

ప.వి:- కతి, అస్య, విష్ఠాః, విష్ఠా ఇతి వి+స్థాః, కతి, అక్షరాణి, కతి, హోమాసః, కతిధా, సమిద్ధ ఇతి సమ్+ ఇద్ధః, యజ్ఞస్య, త్వా, విదథా, పృచ్ఛమ్, అత్ర, కతి, హోతారః, ఋతుశ ఇత్యృతుఽశః, యజన్తి.॥౫౭॥

పదార్థః :-(కతి) (అస్య)(విష్ఠాః)విశేషేణ తిష్ఠతి యజ్ఞో యాసు తాః (కతి) (అక్షరాణి) ఉదకాని. అక్షరమిత్యుదక నా...నిఘం.౧. ౧౨. (కతి) (హోమాసః) దానాఽఽదానాని, (కతిధా) కతిప్రకారైః, (సమిద్ధః) జ్ఞానాదిప్రకాశకాః సమిద్రూపాః. అత్ర ఛాందసో వర్ణాగమస్తేన ధస్య ద్విత్వం సంపన్నమ్ (యజ్ఞస్య) సంయోగాదుత్పన్నస్య జగతః (త్వా) త్వామ్, (విదథా) విజ్ఞానాని, (పృచ్ఛమ్) పృచ్ఛామి, (అత్ర) (కతి) (హోతారః) (ఋతుశః) ఋతుమృతుం ప్రతి, (యజంతి) సంగచ్ఛంతే.॥౫౭॥

అన్వయః :-హే విద్వన్నస్య యజ్ఞస్య కతి విష్ఠాః? కత్యక్షరాణి? కతి హోమాసః? కతిధా సమిద్ధః? కతి హోతార ఋతుశో యజంతీత్యత్ర విషయే విదథా త్వాఽహం పృచ్ఛమ్. ॥౫౭॥

భావార్థః :-ఇదం జగత్ క్వతిష్ఠతి? కత్యస్య నిర్మాణసాధనాని? కతి వ్యాపారయోగ్యాని కతివిధం జ్ఞానాది ప్రకాశకం? కతి వ్యవహర్తార ఇతి పంచ ప్రశ్నాస్తేషాముత్తరాణ్యుత్తరత్ర వేద్యాని. ॥౫౭॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! (అస్య) ఈ (యజ్ఞస్య) సంయోగముద్వారా ఉత్పన్నమైన జగద్రూప యజ్ఞమునకు (కతి) ఎన్ని (విష్ఠాః) విశేషించి ప్రపంచరూప యజ్ఞము ఎద్దానియందు స్థిరమై (కతి) ఎన్ని (అక్షరాణి) జలము మున్నగు సాధనములు (కతి) ఎన్ని (హోమాసః) ఇచ్చిపుచ్చుకొనదగిన పదార్థములు (కతిధా) ఎన్నివిధములుగ (సమిద్ధః) జ్ఞానము మున్నగువాని ప్రకాశక పదార్థములు సమిధరూపము (కతి) ఎన్ని (హోతారః) హోత, అనగా ఇచ్చి పుచ్చుకొను మున్నగు వ్యవహారములకర్త (ఋతుశః) వసంతము మున్నగు ప్రతిఋతువునందును (యజన్తి) సంగతమొనర్చుచున్నారో, ఈ విధముగ (అత్ర) ఈ విషయమునందు (విదథా) విజ్ఞానములను (త్వా) నిన్ను నేను (పృచ్ఛమ్) ప్రశ్నించుచున్నాను. ॥౫౭॥

భావార్థము :- ఈ జగము ఎచ్చట స్థిరమై యున్నది? దీనియుత్పత్తి సాధనము లెన్ని? వ్యవహారయోగ్యవస్తువు లెన్ని? జ్ఞానాదుల ప్రకాశక వస్తువు లెన్నివిధములు? వ్యవహరించువారెందరు? ఈ యైదు ప్రశ్నల సమాధానములు తరువాయి మంత్రమున నున్నవి. ॥౫౭॥

57. Hom many supports hath this world got? How many are the means of its creation? Ho many things are worthy bartering? How many things kindle knowledge? How many Hotas worship due season? O learned fellow, here I ask thee of the knowledge of these subjects!

౧౩౬౪. షడస్యేత్యస్య ప్రజాపతిర్ఋషిః, సమిధా దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పూర్వప్రశ్నానాముత్తరాణ్యాహ. పూర్వమంత్ర కథిత ప్రశ్నలకు ప్రత్యుత్తరము.

౧౩౬౪ షడస్య విష్ఠాః శతమక్షరాణ్యశీతిర్హోమాః సమిధో హ తిస్రః।

యజ్ఞస్య తే విదథా ప్ర బ్రవీమి సప్త హోతార ఋతుశో యజన్తి ॥౫౮॥

ప. విః- షట్, అస్య, విష్ఠాః, విష్ఠా ఇతి వి+స్థాః, శతమ్, అక్షరాణి, అశీతిః, హోమాః, సమిధ ఇతి సమ్+ ఇధః, హ, తిస్రః, యజ్ఞస్య, తే, విదథా, ప్ర బ్రవీమి, సప్త, హోతారః, ఋతుశ ఇతి ఋతు+శః యజన్తి.॥౫౮॥

పదార్థః :-(షట్) ఋతవః,(అస్య) (విష్ఠాః) (శతమ్) (అక్షరాణి) ఉదకాని,(అశీతిః) ఉపలక్షణ మేతదసంఖ్యస్య, (హోమాః) (సమిధః) సమిధ్యతే, ప్రదీప్యతే జ్ఞానం యాభిస్తాః, (హ) కిల, (తిస్రః) (యజ్ఞస్య) (తే) తుభ్యమ్, (విదథా) (విజ్ఞానాని), ((ప్ర) ప్రకర్షేణ, (బ్రవీమి) (సప్త) పంచ ప్రాణా మన ఆత్మా చ, (హోతారః)దాతార ఆదాతారః, (ఋతుశః) (యజంతి). ॥౫౮॥

అన్వయః :-హే జిజ్ఞాసవోఽస్య యజ్ఞస్య షడ్ విష్ఠాః శతమక్షరాణ్యశీతిర్హోమాస్తిస్రో హ సమిధః సప్త హోతార ఋతుశో యజంతి తస్య విదథా తేఽహం ప్రబ్రవీమి.॥౫౮॥

భావార్థః :-హే జ్ఞానమీప్సవో జనాః యస్మిన్ యజ్ఞే షడ్ ఋతవః స్థితిసాధకా అసంఖ్యాని జలాదీని వస్తూని వ్యవహారసాధకాని బహవో వ్యవహారయోగ్యాః పదార్థాః సర్వేప్రాణ్యప్రాణివో హోత్రాదయః సంగచ్ఛంతే యత్ర చ జ్ఞానాదిప్రకాశికాః త్రివిధా విద్యాః సంతి తం యజ్ఞం యూయం విజానీత.॥౫౮॥

పదార్థము :- ఓ జిజ్ఞాసువులారా! (అస్య) ఈ (యజ్ఞస్య) సంగతజగమునందు (షట్) ఆరు ఋతువులు (విష్ఠాః) విశేష స్థితికి ఆధారములు (శతమ్) అసంఖ్యాక (అక్షరాణి) జలాదుల ఉత్పత్తుల సాధనములు (అశీతిః) అసంఖ్యాత (హోమాః) ఇచ్చి పుచ్చుకొనదగిన వస్తువులు (తిస్రః) ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములగు మూడు (హ) ప్రసిద్ధముగు (సమిధః) జ్ఞానాదుల ప్రకాశకమగు విద్యలు (సప్త) పంచప్రాణములు, మనస్సు, ఆత్మ లను ఏడు (హోతారః) ఇచ్చి పుచ్చుకొను మున్నగువ్యవహారముల కర్తలు (ఋతుశః) వసంతము మున్నగు ఋతువులందును (యజన్తి) సంగతమగునట్టి జగముయొక్క (విదథా) విజ్ఞానములను (తే) నీకొరకు నేను (ప్రబ్రవీమి) చెప్పుచున్నాను. ॥౫౮॥

భావార్థము :- జ్ఞానము నపేక్షించు జిజ్ఞాసువులారా! జగద్రూపయజ్ఞమునందు స్థితికి సాధకములగు ఆరుఋతువులు, అసంఖ్యాకములగు జలాదివస్తువులు, వ్యవహారసాధకములగు వస్తువులు, వ్యవహారయోగ్య పదార్థములు, సకలప్రాణులు, అప్రాణులు మరియు హోతలు మున్నగువారు ఎట్లు సంగతులగుచున్నారో మరియు దేనియందు జ్ఞానము మున్నగువానిని ప్రకాశపరచు ముప్విధములగు విద్యలు గలవో అట్టి యజ్ఞమును మీరెల్లరును తెలిసికొనుడు. ॥౫౮॥

58. This world has got six seasons as its supports. Hundreds of things like water etc. are the means of its creation. Countless things are worth using and bartering. Three things kindle knowledge. Seven Hotas perform yajna in due season.

O questioner I explain to thee these different topics of knowledge!.

౧౩౬౯.కోఽఅస్యేత్యస్య ప్రజాపతిర్ఋషిః, ద్రష్టా దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునః ప్రశ్నానాహ. మఱల ప్రశ్నల నడుగుచున్నాడు.

౧౩౬౯ కోఽఅస్య వేద భువనస్య నాభిం కో ద్యావాపృథివీఽఅన్తరిక్షమ్ ।

కః సూర్యస్య వేద బృహతో జనిత్రం కో వేద చన్ద్రమసం యతోజాః॥౫౯॥

ప.వి:- కః, అస్య, వేద, భువనస్య, నాభిమ్, కః, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, అన్తరిక్షమ్, కః, సూర్యస్య, వేద, బృహతః, జనిత్రమ్, కః, వేద, చన్ద్రమసమ్, యతోజా ఇతి యతః+జాః.॥౫౯॥

పదార్థః :-(కః) (అస్య) (వేద) జానాతి, (భువనస్య) సర్వాధికరణస్య సంసారస్య, (నాభిమ్) మధ్యమాంగం బంధనస్థానం,(కః) (ద్యావాపృథివీ) సూర్యభూమీ, (అంతరిక్షమ్)

ఆకాశమ్, (కః) (సూర్యస్య) సవితృమండలస్య (వేద) జానాతి, (బృహతః) మహతః, (జనిత్రమ్) కారణం జనకం వా (కః) (వేద) (చంద్రమసమ్) చంద్రలోకమ్, (యతోజాః) యస్మాజ్జాతః.॥౫౯॥

**అన్వయః** :- హే విద్వన్నస్య భువనస్య నాభిం కో వేద? కో ద్యావాపృథివీ అంతరిక్షం వేద? కో బృహతః సూర్యస్య జనిత్రం వేద? యో యతోజాస్తం చంద్రమసం చ కో వేదేతి సమాధేహి.॥౫౯॥

**భావార్థః** :-అస్య జగతో ధారకం బంధనం, భూమిసూర్యాంతరిక్షాణి మహతః సూర్యస్య కారణం యస్మాదుత్పన్నశ్చంద్రస్తం చ కో వేదేతి చతుర్ణాం ప్రశ్నానాముత్తరాణి పరస్మిన్మంత్రే సంతీతి వేదితవ్యమ్. ॥౫౯॥

**పదార్థము** :- విద్వాంసుడా! (అస్య, భువనస్య) సర్వమునకు ఆధారభూతమగు ఈ జగత్తుయొక్క (నాభిమ్) బంధనస్థానమగు మధ్యభాగమును (కః) ఎవడు (వేద) ఎరుగును (కః) ఎవడు (ద్యావాపృథివీ) సూర్యుడు మరియు పృథివి (అన్తరిక్షమ్) ఆకాశమును ఎరుగుచున్నాడు? (కః) ఎవడు (బృహతః) గొప్పదగు (సూర్యస్య) సూర్యమండలమునకు (జనిత్రమ్) ఉపాదానము లేక నిమిత్తకారణమును (వేద) ఎరుగుచున్నాడు మరియు నెవడు (యతోజాః) ఎద్దానినుండి ఉత్పన్నమైనాడో అట్టి చంద్రుని ఉత్పాదకుని మరియు (చంద్రమసమ్) చంద్రలోకమును (కః) ఎవడు (వేద) ఎరుగునో వీని సమాధానములు చెప్పుడు. ॥౫౯॥

**భావార్థము** :-ఈ జగత్తుయొక్క ధారణకర్త, బంధనము, భూమి, సూర్యుడు, అంతరిక్షములు, మహాన్ సూర్యుని కారణము, చంద్రు డెద్దానిచే నుత్పన్నమైనాడో, దానిని ఎవ్వరెరుగుదురు? ఈ నాల్గు ప్రశ్నల సమాధానములు దిగువ మంత్రమందున్నవి. ॥౫౯॥

59. Who knoweth the paramount lord of this world?

Who knoweth the Heaven, the Earth, and the wide space between them!.

Who knoweth the creator of the mighty Sun? Who knoweth the Moon, and whence she was generated?

౧౩౬౬.వేదాహమిత్యస్య ప్రజాపతిర్ఋషిః, సమాధాతా దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పూర్వప్రశ్నానాముత్తరాణ్యాహ. పూర్వమంత్రోక్త ప్రశ్నలకు సమాధానములు.

౧౩౬౬ వేదాహమస్య భువనస్య నాభిం వేద ద్యావాపృథివీ౨ అన్తరిక్షమ్।

వేద సూర్యస్య బృహతో జనిత్రమథో వేద చన్ద్రమసం యతోజాః॥౬౦॥

ప.విః- వేద, అహమ్, అస్య, భువనస్య, నాభిమ్, వేద, ద్యావాపృథివీ ఇతి ద్యావా+పృథివీ, అంతరిక్షమ్, వేద, సూర్యస్య, బృహతః, జనిత్రమ్, అథో ఇత్యథో, వేద, చంద్రమసమ్, యతోజా ఇతి యతః+జాః.॥౬౦॥

పదార్థః:-(వేద) (అహమ్) (అస్య) (భువనస్య) నాభిమ్ బంధనమ్. (వేద) (ద్యావాపృథివీ) ప్రకాశాప్రకాశౌ లోకసమూహౌ (అంతరిక్షమ్) ఆకాశమ్, (వేద) సూర్యస్య (బృహతః) బృహత్పరిమాణ యుక్తస్య. (జనిత్రమ్) (అథో) (వేద) (చంద్రమసమ్) (యతోజాః).॥౬౦॥

అన్వయః:-హే జిజ్ఞాసోఽస్య భువనస్య నాభిమహం వేద ద్యావాపృథివీ అంతరిక్షం వేద బృహతః సూర్యస్య జనిత్రం వేద. అథో యతోజాస్తం చంద్రమసఞ్చాహం వేద.॥౬౦॥

భావార్థః:- విద్వాన్ బ్రూయాత్ - దేహే జిజ్ఞాసదోఽస్య జగతో బంధనస్థితికారణం, లోకత్రయస్య కారణం, సూర్యాచంద్రమసోశ్చోపాదాననిమిత్తే ఏతత్సర్వమహం జానామి బ్రహ్మైవాస్య సర్వస్య నిమిత్తం కారణం ప్రకృతిశ్చోపాదానమితి ॥౬౦॥

పదార్థము :- ఓ జిజ్ఞాసువా! (అస్య) ఈ (భువనస్య) సర్వమున కధికరణమగు జగత్తుయొక్క (నాభిమ్) బంధనస్థానమగు కారణరూప మధ్యభాగమగు పరబ్రహ్మను (అహమ్) నేను (వేద) ఎరుగుచున్నాను. (ద్యావాపృథివీ) ప్రకాశక మరియు అప్రకాశక లోకసమూహములను మరియు (అన్తరిక్షమ్) ఆకాశమును గూడ (వేద) నే నెరుగుదును (బృహతః) గొప్ప (సూర్యస్య) సూర్యలోకముయొక్క (జనిత్రమ్) ఉపాదాన తైజసకారణము మరియు నిమిత్తకారణమగు బ్రహ్మను (వేద) నే నెరుగుదును (అథో) దీనితరువాత (యతోజాః) ఏ పరమాత్మనుండి ఏ చంద్రు డుదయించెనో, అట్టి పరమాత్మను మరియు (చన్ద్రమసమ్) చంద్రునికూడ (వేద) నే నెరుగుచున్నాను. ॥౬౦॥

భావార్థము :- ఓ జిజ్ఞాసూ! ఈ జగత్తుయొక్క బంధనము, అనగా స్థితికి కారణము, ప్రకాశితములు, అప్రకాశితములు, మధ్యస్థమగు ఆకాశములను నీ మూడులోకములకు కారణము, సూర్య చంద్రులకు ఉపాదానము మరియు నిమిత్త కారణములను ఈ యన్నిటిని నే నెరుగుదును. పరబ్రహ్మయే ఈ సమస్తమునకు నిమిత్తకారణము. మరియు ప్రకృతియే ఉపాదాన కారణమై యున్నదని విద్వాంసులు సమాధాన పరచ వలయును.॥౬౦॥

60. O questioner I know the paramount Lord of this world. I know the Heaven, the Earth, and the wide space between them. I know the efficient and physical causes of the mighty Sun. I know the Moon, and her Creator!.

౧౩౬౭౨.పృచ్ఛామీత్యస్య ప్రజాపతి ర్ఋషిః, ప్రష్టా దేవతా, విచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునః ప్రశ్నానాహ. మరల ప్రశ్నల వేయుచున్నాడు.

౧౩౬౭౨ పృచ్ఛామి త్వా పరమన్తం పృథివ్యాః పృచ్ఛామి యత్ర భువనస్య నాభిః।

పృచ్ఛామి త్వా వృష్ణో౽అశ్వస్య రేతఃపృచ్ఛామీ వాచః పరమం వ్యోమ॥౬౧॥

ప.విః-పృచ్ఛామి, త్వా, పరమ్, అంతమ్, పృథివ్యాః, పృచ్ఛామి, యత్ర, భువనస్య, నాభిః,

పృచ్ఛామి, త్వా, వృష్ణః, అశ్వస్య, రేతః, పృచ్ఛామి, వాచః, పరమమ్, వ్యోమేతి వి+ఓమ.।౬౧॥

పదార్థః :- (పృచ్ఛామి) (త్వా) త్వామ్, (పరమ్) పరభాగస్థమ్.(అంతమ్) సీమావమ్, (పృథివ్యాః) (పృచ్ఛామి) (యత్ర) (భువనస్య) (నాభిః)మధ్యాకర్షణేన బంధకమ్, (పృచ్ఛామి) (త్వా)త్వామ్, (వృష్ణః) సేచకస్య, (అశ్వస్య) బలవతః, (రేతః) వీర్యమ్, (పృచ్ఛామి) (వాచః) వాణ్యాః (పరమమ్) ప్రకృష్టమ్ (వ్యోమ) ఆకాశరూపం స్థానమ్.।౬౧॥

అన్వయః:-హే విద్వన్నహం త్వా త్వాం పృథివ్యా అంతం పరం పృచ్ఛామి యత్ర భువనస్య నాభిరస్తి తం పృచ్ఛామి, యద్ వృష్ణో౽శ్వస్య రేతో౽స్తి తత్ పృచ్ఛామి, వాచః పరమం వ్యోమ త్వా పృచ్ఛామీతి వదోత్తరాణి. ।౬౧॥

భావార్థః:-పృథివ్యాః సీమా, లోకస్యాకర్షణేన బంధనం, బలినో జనస్య పరాక్రమో వాక్ పారగశ్చ కో౽స్తీత్యేతేషాం ప్రశ్నానాముత్తరాణి పరస్మిన్ మంత్రే వేదితవ్యాని. ।౬౧॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! నేను (త్వా) నిన్ను (పృథివ్యాః) పృథివియొక్క (అన్తమ్, పరమ్) పరభాగావధిని (పృచ్ఛామి) అడుగు చున్నాను (యత్ర) ఎచ్చట నీ (భవనస్య) లోకముయొక్క (నాభిః) మధ్యనుండి లాగుచు బంధించుచున్నదానిని (పృచ్ఛామి) అడుగు చున్నాను. (వృష్ణః) సేచన మొనర్చి [వర్షంపజేసి]న (అశ్వస్య) పరాక్రమశాలియొక్క (రేతః) పరాక్రమమును గూర్చి (పృచ్ఛామి) అడుగుచున్నాను. మరియు (వాచః) ముప్విధములగు వేదరూపవాణియొక్క (పరమమ్) ఉత్తమమగు (వ్యోమ) ఆకాశరూప స్థానమునుగూర్చి (త్వా) నిన్ను (పృచ్ఛామి) అడుగుచున్నాను [దయతో సమాధాన పరచుడు].।౬౧॥

భావార్థము :-పృథివియొక్క సీమ [సరిహద్దు] ఏది? జగత్తును ఆకర్షణముద్వారా బంధించి బంధించునదేది? బలశాలియొక్క పరాక్రమము మరియు వాణియొక్క పారగతుడు [ఆరితేరిన విద్వాంసుడు] ఎవడు? ఈ నాలుగు ప్రశ్నలకు దిగువ మంత్రమున సమాధానములు గలవు. ।౬౧॥

61. I ask thee of Earth's extremest limit, Where is the centre of the world, I ask thee? I ask thee of the stength of the powerful stout person. I ask of the highest space where speech abideth.

౧౩౬౭.ఇయమిత్యస్య ప్రజాపతిర్ఋషిః, సమాధాతా దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః, స్వరః.

పూర్వప్రశ్నానాముత్తరాణ్యాహ. పూర్వమంత్రోక్త ప్రశ్నలకు సమాధానములు.

౧౩౬౭ ఇయం వేదిః పరో౽అన్తః పృథివ్యా౽అయం యజ్ఞో
భువనస్య నాభిః। అయꣳసోమో వృష్ణో౽అశ్వస్య రేతో
బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ ॥౬౨॥

ప.విః- ఇయమ్, వేదిః, పరః, అంతః, పృథివ్యాః, అయమ్, యజ్ఞః భువనస్య, నాభిః, అయమ్, సోమః, వృష్ణః, అశ్వస్య, రేతః, బ్రహ్మ, అయమ్, వాచః, పరమమ్, వ్యోమేతి వి+ఓమ.॥౬౨॥

పదార్థః:-(ఇయం) (వేదిః) మధ్యరేఖా (పరః) (అంతః) (పృథివ్యాః) భూమేః, (అయమ్) (యజ్ఞః) సర్వైః పూజనీయో జగదీశ్వరః, (భువనస్య) సంసారస్య, (నాభిః) (అయమ్) (సోమః) ఓషధిరాజః, (వృష్ణః) వీర్యకరస్య; (అశ్వస్య) బలేన యుక్తస్య జనస్య, (రేతః) (బ్రహ్మ) చతుర్వేదవిత్, (అయమ్) (వాచః) వాణ్యాః. (పరమమ్) (వ్యోమ) స్థానమ్.॥౬౨॥

అన్వయః:-హే జిజ్ఞాసో! ఇయం వేదిః పృథివ్యాః పరో౽న్తో౽యం యజ్ఞో భువనస్య నాభిరయం సోమో వృష్ణో౽శ్వస్య రేతో౽యం బ్రహ్మ వాచః పరమం వ్యోమా౽స్తీతి విద్ధి. ॥౬౨॥

భావార్థః :-హే మనుష్యాః! యద్యస్య భూగోలస్య మధ్యస్థా రేఖా క్రియతే తర్హి సా ఉపరిష్టాత్ భూమేరంతం ప్రాప్నువతీ సతీ వ్యాససంజ్ఞా లభతే. అయమేవ భూమేరంతో౽స్తి. సర్వేషాం మధ్యాకర్షణం జగదీశ్వరః. సర్వేషాం ప్రాణినాం వీర్యకర ఓషధిరాజః సోమో, వేదపారగో వాక్పారగో౽స్తీతి యూయం విజానీత. ॥౬౨॥

పదార్థము :- ఓ జిజ్ఞాసువా! (ఇయమ్) ఈ (వేదిః) మధ్యరేఖ (పృథివ్యాః) భూమియొక్క (పరః) పరభాగమునకు (అన్తః) అవధియైయున్నది (అయమ్) ఈ ప్రత్యక్షగుణములుగల (యజ్ఞః) సర్వమునకు పూజనీయుడగు జగదీశ్వరుడు (భువనస్య) విశ్వముయొక్క (నాభిః) నియత స్థితికి బంధకుడై యున్నాడు (అయమ్) ఈ (సోమః) ఓషధులందు ఉత్తమ ప్రకాశవంతమగు సోమము (వృష్ణః) పరాక్రమకర్త (అశ్వస్య) బలశాలియొక్క (రేతః) పరాక్రమము (అయమ్) ఇట్టి (బ్రహ్మ) చతుర్వేదజ్ఞానము నెరిగినట్టి (వాచః) వేద త్రయవాణియొక్క (పరమమ్) ఉత్తమమగు (వ్యోమ) స్థానముగలదు. దీనిని నీవు తెలిసికొనుము.॥౬౨॥

భావార్థము :- ఓ మానవులారా! ఈ భూమియొక్క మధ్యస్థరేఖను గుర్తించినచో నదిపైనుండి భూమి యొక్క అంతమునకు చేరుచు వ్యాస సంజ్ఞకమగుచున్నది. ఇది యే భూమికి సీమ [అవధి, పరిహద్దు]య్యై యున్నది. సమస్త లోకముల మధ్య ఆకర్షణకర్త జగదీశ్వరుడేయై యున్నాడు. సకల ప్రాణులకు పరాక్రమము నిచ్చునది, ఓషధులందుత్తమమైనది, అంశుమంతమునైనది సోమము. చతుర్వేదములను చక్కగా నెరిగినవాడు వాణీ పారంగతుడనియును మీరెరుగుడు. ॥౬౨॥

62. This equator is the Earth's extremest limit. This Adorable God imbued with qualitites is the controller of the world. This efficacious Soma, the King of medicines is the strength of a stout person, This master of all the four vedas is the highest abode for vedic speech.

౧౩౬౯.సుభూరిత్యస్య ప్రజాపతిర్‌ఋషిః, సమాధాతా దేవతా, విరాడనుష్టుప్ ఛందః, గాంధారః, స్వరః.

ఈశ్వరః కీదృశ ఇత్యాహ. ఈశ్వరు డెటువంటివాడు?

౧౩౬౯ సుభూః స్వయమ్భూః ప్రథమోఽన్తర్మహత్యర్ణవే।
దధే హ గర్భమృత్వియం యతో జాతః ప్రజాపతిః॥౬౩॥

ప.విః- సుభూరితి సు+భూః, స్వయమ్భూరితి స్వయమ్+భూః, ప్రథమః, అంతః, మహతి, అర్ణవే, దధే, హ, గర్భమ్, ఋత్వియమ్, యతః, జాతః, ప్రజాపతిరితి ప్రజా+పతిః.॥౬౩॥

పదార్థః :-(సుభూః) యః సుష్ఠు భవతీతి, (స్వయంభూః) యః స్వయంభవత్యుత్పత్తి నాశరహితః, (ప్రథమః) ఆదిమః, (అంతః) మధ్యే, (మహతి) (అర్ణవే) యత్రార్ణాంస్యుదకాని సంబద్ధాని సంతి తస్మిన్సంసారే (దధే) దధాతి,(హ) కిల, (గర్భమ్) బీజమ్, (ఋత్వియమ్) ఋతుః సమ్ప్రాప్తోఽస్య తమ్, (యతః) యస్మాత్, (జాతః) (ప్రజాపతిః) ప్రజాపాలకః సూర్యః.॥౬౩॥

**అన్వయః:- హే జిజ్ఞాసో! యతః ప్రజాపతిర్జాతో యశ్చ సుభూః స్వయంభూః ప్రథమో జగదీశ్వరో మహత్యర్ణవేఽన్తరృత్వియం గర్భం దధే తం హ సర్వే జనా ఉపాసీరన్. ॥౬3॥**

**భావార్థః:- యది యే మనుష్యాః సూర్యాదీనాం పరం కారణం ప్రకృతిం తత్ర బీజాధారకం పరమాత్మానం చ విజానీయుస్తర్హి తేఽస్మిన్సంసారే విస్తీర్ణసుఖా భవేయుః. ॥౬3॥**

పదార్థము :- ఓ జిజ్ఞాసూ! (యతః) ఏ జగదీశ్వరునిచే (ప్రజాపతిః) విశ్వమునకు రక్షకుడగు సూర్యుడు (జాతః) ఉత్పన్నమైనాడో మరియు నెవడు (సుభూః) చక్కగా విద్యమానమై యున్నాడో (స్వయంభూః) స్వయంప్రసిద్ధుడు, ఉత్పత్తి నాశరహితుడో అట్టి (ప్రథమః) సర్వోత్తముడగు పరమాత్మ (మహతి) మహాన్ వ్యాపకుడు (అర్ణవే) జలములచే సంబద్ధమైన విశ్వముయొక్క (అన్తః) మధ్యన (ఋత్వియమ్) సమయానుకూలముగ ప్రాప్తమగునట్టి (గర్భమ్) బీజమును (దధే) ఎవడు ధారణ మొనర్చుచున్నాడో (హ) ఆతనినే యెల్లరును ఉపాసించవలెను. ॥౬3॥

**భావార్థము** :- ఒకవేళ మానవులు సూర్యుడు మున్నగు లోకములు ఉత్తమ కారణ ప్రకృతిని మరియు నా ప్రకృతియందు ఉత్పత్తిశక్తిని ధారణ మొనర్చుచున్న పరమశక్తిమంతుడగు పరమాత్మను దెలిసికొనినచో వారు ఈ విశ్వమునందు విస్తృతసుఖవంతులగుదురు. ॥౬3॥

63. God, Who has produced the Sun, is Excellent, and Self-Existent, the First within the mighty world. He lays down the timely embryo. All should worship Him.

౧3౭౦.హోతా యక్షదిత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఈశ్వరో దేవతా, విరాడుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

ఈశ్వరః కథముపాస్య ఇత్యాహ. ఈశ్వరు నెటుల నుపాసించవలయును?

**౧3౭౦ హోతా యక్షత్ ప్రజాపతిꣳ సోమస్య మహిమ్నః ।**
**జుషతాం పిబతు సోమꣳ హోతర్యజ ॥౬౪॥**

**ప.వి:- హోతా, యక్షత్ ప్రజాపతిమితి ప్రజా+పతిమ్, సోమస్య, మహిమ్నః, జుషతామ్, పిబతు, సోమమ్, హోతః యజ. ॥౬౪॥**

**పదార్థః:-(హోతా) ఆదాతా,(యక్షత్) యజేత్ పూజయేత్, (ప్రజాపతిమ్) విశ్వస్య పాలకం స్వామినమ్. (సోమస్య) సకలైశ్వర్యయుక్తస్య (మహిమ్నః) మహతో భావస్య సకాశాత్, (జుషతామ్) (పిబతు) (సోమమ్) సర్వౌషధిరసమ్, (హోతః) దాతః,(యజ) పూజయ. ॥౬౪॥**

**అన్వయః** :-హే హోతర్యథా హోతా సోమస్య మహిమ్నః ప్రజాపతిం యక్షజ్జుషతాం చ, సోమం చ పిబతు తథా త్వం యజ పిబ చ. ॥౬౪॥

**భావార్థః** :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యాః! యథా విద్వాంసోఽస్మిఞ్జగతి రచనాదివిశేషైః పరమాత్మనో మహిమానం విదిత్వైనముపాసతే,తథైతం యూయముప్యాధ్వం యథేమే యుక్త్యౌషధాని సేవిత్వాఽరోగా జాయంతే తథా భవంతోఽపి భవంతు.॥౬౪॥

**పదార్థము** :-(హోతః) దానముల నొనర్చు దాతలారా! ఎట్లు (హోతా) గ్రహించువాడు (సోమస్య) సకలైశ్వర్యయుక్తుడు (మహిమ్నః) గొప్పవాడగుటవల్ల (ప్రజాపతిమ్) విశ్వపాలకుడగు స్వామియొక్క (యక్షత్) పూజనొనర్చవలెను. లేక యాతని (జుషతామ్) సేవలద్వారా ప్రసన్నుని జేసికొనవలెను. మరియు (సోమమ్) సమస్త ఉత్తమ ఓషధుల రసమును (పిబతు) ఎట్లు పానమునొనర్చెదరో అట్లు నీవు (యజ) ఆతనిని పూజింపుము. మరియు ఉత్తమ ఓషధీరసమును పానమొనర్చుము. ॥౬౪॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! విద్వాంసు లే విధముగ ఈ జగమునందు రచన మున్నగు చిహ్నములను జూచి పరమాత్మయొక్క మహిమను దెలిసికొని ఆతనినే యుపాసించెదరో, అదే ప్రకారముగ మీరును ఆతని యుపాసనయే యొనర్చుడు. విద్వాంసు లే విధముగ యుక్తిపూర్వక పథ్య పదార్థముల సేవన మొనర్చి ఆరోగ్యవంతులై యుండెదరో అట్లే మీరును యగుడు. ॥౬౪॥

64. O Charitably disposed person, just as a learned recipient, with the grandeur of his supremacy, worships the lord of the universe, pleases Him through service, and drinks the essence of medicinal herbs, so shouldst thou worship Him and drink the juice of medicinal herbs!.

౧౩౭౧. ప్రజాపతే నేత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఈశ్వరో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళ్లీ అదే విషయమే.

౧౩౭౧ ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా రూపాణి పరి తా బభూవ । యత్కామా

స్తే జుహుమస్తన్నోఽఅస్తు వయꣳస్యామ పతయో రయీణామ్ ॥౬౫॥

ప.విః- ప్రజాపత ఇతి ప్రజా+పతే, న, త్వత్, ఏతాని, అన్యః, విశ్వా, రూపాణి, పరి, తా, బభూవ, యత్కామా ఇతి యత్+కామాః, తే, జుహుమః, తత్, నః, అస్తు, వయమ్, స్యామ, పతయః, రయీణామ్. ॥౬౫॥

పదార్థః :-(ప్రజాపతే) సర్వస్యాః ప్రజాయాః పాలక స్వామిన్నీశ్వర! (న) (త్వత్) తవ సకాశాత్ (ఏతాని) పృథివ్యాదీని భూతాని (అన్యః) భిన్నః, (విశ్వా) సర్వాణి, (రూపాణి) స్వరూపయుక్తాని, (పరి) (తా) తాని, (బభూవ) భవతి (యత్కామాః) యః పదార్థః కామో యేషాం (తే) తవ, (జుహుమః) ప్రశంసామః, (తత్) కమనీయం వస్తు (నః) అస్మభ్యమ్, (అస్తు) భవతు (వయమ్) (స్యామ) భవేమ (పతయః) స్వామినః పాలకాః, (రయీణామ్) విద్యాసువర్ణాదిధనానామ్.।౬౫॥

అన్వయః :- హే ప్రజాపతే పరమాత్మన్న కశ్చిత్ త్వదన్యస్తా తాన్యేతాని విశ్వా రూపాణి వస్తూని న పరి బభూవ. యత్కామా వయం త్వాం జుహుమస్తన్నోఽస్తు తే కృపయా వయం రయీణాం పతయః స్యామ.।౬౫॥

భావార్థః :-యది పరమేశ్వరాదుత్తమం బృహదైశ్వర్యయుక్తం సర్వశక్తిమద్వస్తు కించిదపి నాస్తి తర్హి తుల్యమపి న. యో విశ్వాత్మా విశ్వస్రష్టాఽఖిలైశ్వర్యప్రద ఈశ్వరోఽస్తి తస్యైవ భక్తివిశేషేణ పురుషార్థేనైహిక మైశ్వర్యం యోగాభ్యాసేన పారమార్థికం సామర్థ్యం ప్రాప్నుయామ. ।౬౫॥

పదార్థము :-(ప్రజాపతే) సకలప్రాణిసముదాయ రక్షకుడవు స్వామివినగు పరమేశ్వరా! ఎవ్వరును (త్వత్) మీ కన్న (అన్యః) భిన్నముగు (తా) అటువంటి (ఏతాని) ఈ పృథివి మున్నగు భూతములను మరియు (విశ్వా) సకల (రూపాణి) స్వరూపములతో గూడిన వస్తువులపై (న, పరి, బభూవ) బలవంతుడు గాజాలడు (యత్కామాః) ఏ యే కామితములను గలిగినవారమై (వయమ్) మేము నీయొక్క (జుహుమః) ప్రశంస నొనర్చెదమో (తత్) ఆ యా కామించదగిన వస్తువులు (నః) మాకు (అస్తు) ప్రాప్తించుగాక! (తే) నీ కృపచే మేము (రయీణామ్) విద్య మరియు సువర్ణము మున్నగు ధనములకు (పతయః) రక్షక అధికారులము (స్యామ) అగుదుముగాక! ।౬౫॥

భావార్థము :-ఏ పరమేశ్వరునికన్న ఉత్తమ, ఉన్నత, ఐశ్వర్యయుక్త, సర్వశక్తిమంత పదార్థమెద్దియును లేదో అతనికి సమానమైనదియును ఏదియు లేదు. ఎవడు సర్వాత్ముడు, సమస్తమును రచించువాడు, సమస్తైశ్వర్యదాత ఈశ్వరుడై యున్నాడో అతని భక్తి విశేషము. మన పురుషార్థముద్వారా ఇహలోక ఐశ్వర్యములు మరియు యోగాభ్యాస సేవనముద్వారా పరలోకసామర్థ్యమును మనము పొందవలయును. ।౬౫॥

65. O God, none besides Thee, comprehendest all these created forms. Give us our heat's desire when we invoke Thee. May we be lords of rich possessions and knowledge!.

అత్ర పరమాత్మమహిమా, సృష్టిగుణవర్ణనం, యోగప్రశంసా, ప్రశ్నోత్తరాణి, సృష్టిపదార్థప్రశంసనం, రాజప్రజాగుణవర్ణనం, శాస్త్రాద్యుపదేశోఽధ్యయనమధ్యాపనం, స్త్రీపురుషగుణవర్ణనం, పునః ప్రశ్నోత్తరాణి

పరమేశ్వరగుణవర్ణనం, యజ్ఞవ్యాఖ్యా, రేఖాగణితాది చోక్తమత ఏతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతిరస్తీతి వేద్యమ్

ఈ యధ్యాయమునందు పరమేశ్వరుని మహిమ, సృష్టిగుణములు, యోగ ప్రశంస, ప్రశ్నోత్తరములు, సృష్టిపదార్థముల ప్రశంస, రాజ మరియు ప్రజల గుణములు, శాస్త్రాదుల యుపదేశము, పఠన పాఠనను, స్త్రీపురుషులు పరస్పర గుణములు, మరల ప్రశ్నోత్తరములు, ఈశ్వరగుణములు, యజ్ఞముయొక్క వ్యాఖ్య, రేఖాగణితము మున్నగువాని వర్ణము గలదు. ఇందువల్ల నీ యధ్యాయముయొక్క అర్థమునకు పూర్వాధ్యాయములోని యర్థములో సంగతి గలదని గ్రహించవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానందసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే త్రయోవింశోఽధ్యాయః పూర్తిమగాత్

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి ఇరువదిమూడవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడునునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య

'మల్లె కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**ఇరువదిమూడవ అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

# యజుర్వేదభాష్యము

## 24వ అధ్యాయము - విషయసూచిక

**ఇందులో 40 మంత్రములు, 40 ఛందస్సులు, 624 పదములు, 1823 అక్షరములు**

# అథ చతుర్వింశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే చత్వారింశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౧౩౭౨. అశ్వ ఇత్యస్య ప్రజాపతిరృషిః, ప్రజాపతిర్దేవతా, భురిక్సంకృతిశ్ఛందః, గాంధారః స్వరః.

అథ మనుష్యైః పశుభ్యః కీదృశ ఉపకారో గ్రాహ్య ఇత్యాహ.

మానవులు పశువులనుండి ఎటువంటి యుపకారమును గ్రహించవలయును?

౧౩౭౨ అశ్వస్తూపరో గోమృగస్తే ప్రాజాపత్యాః కృష్ణగ్రీవఽ ఆగ్నేయో రరాటే

పురస్తాత్ సారస్వతీ మేష్యధస్తాద్ధన్వోరాశ్వినావధోరామౌ బాహ్వోః

సౌమాపౌష్ణః శ్యామో నాభ్యాం సౌర్యయామౌ శ్వేతశ్చ కృష్ణశ్చ

పార్శ్వయోస్త్వాష్ట్రౌ లోమశ సక్థౌ సక్థ్యోర్వాయవ్యః శ్వేతః

పుచ్ఛఽ ఇన్ద్రాయ స్వపస్యాయ వేహద్వైష్ణవో వామనః॥౧॥

ప.వి:- అశ్వః, తూపరః, గోమృగ ఇతి గో+మృగః, తే, ప్రాజాపత్యా ఇతి ప్రాజా+పత్యాః, కృష్ణగ్రీవ ఇతి కృష్ణ+గ్రీవః, ఆగ్నేయః రరాటే, పురస్తాత్, సారస్వతీ, మేషీ, అధస్తాత్, హన్వోః, ఆశ్వినౌ, అధోరామావి త్యధః+రామౌ, బాహ్వోః, సౌమాపౌష్ణః శ్యామః, నాభ్యామ్, సౌర్యయామౌ, శ్వేతః, చ, కృష్ణః, చ, పార్శ్వయోః, త్వాష్ట్రౌ, లోమశసక్థావితి లోమశ+సక్థౌ, సక్థ్యోః, వాయవ్యః, శ్వేతః, పుచ్ఛే, ఇంద్రాయ, స్వపస్యా యేతి సు+అపస్యాయ, వేహత్, వైష్ణవః, వామనః.॥౧॥

పదార్థః :- (అశ్వః) ఆశుగామీ తురంగః, (తూపరః) హింసకః, (గోమృగః) గౌరివ వర్తమానో గవయః, (తే) (ప్రాజాపత్యాః) ప్రజాపతిః సూర్యో దేవతా యేషాం తే, (కృష్ణగ్రీవః) కృష్ణాగ్రీవా యస్య సః, (ఆగ్నేయః) అగ్నిదేవతాకః, (రరాటే) లలాటే, (పురస్తాత్) ఆదితః, (సారస్వతీ) సరస్వతీ దేవతా యస్యాః సా, (మేషీ) శబ్దకర్త్రీ మేషస్య స్త్రీ, (అధస్తాత్) (హన్వోః) ముఖావయవయోః, (ఆశ్వినౌ) అశ్విదేవతాకౌ, (అధోరామౌ) అధో రమణం యయోస్తౌ, (బాహ్వోః) (సౌమాపౌష్ణః) సోమపూషదేవతాకః, (శ్యామః) కృష్ణవర్ణః, (నాభ్యామ్) మధ్యే, (సౌర్యయామౌ) సూర్యయమసంబంధినౌ, (శ్వేతః) శ్వేతవర్ణః, (చ) (కృష్ణః) (చ) (పార్శ్వయోః)వామదక్షిణభాగయోః, (త్వాష్ట్రౌ) త్వష్టృదేవతాకౌ, (లోమశసక్థౌ) లోమాని విద్యంతే యస్య తల్లోమశం సక్థి యయోస్తౌ, (సక్థ్యోః) పాదావయవయోః, (వాయవ్యః) వాయుదేవతాకః, శ్వేతః)శ్వేతవర్ణః, (పుచ్ఛే) (ఇంద్రాయ) ఐశ్వర్యయుక్తాయ (స్వపస్యాయ) శోభనాన్యపాంసి కర్మాణి యస్య తస్మై (వేహత్) అకాలే వృషభోపగమనేన గర్భఘాతినీ, (వైష్ణవః) విష్ణుదేవతాకః, (వామనః) వక్రాంగః॥౧॥

అన్వయః :-హే మనుష్యాః! యూయమశ్వస్తూపరో గోమృగస్తే ప్రాజాపత్యాః కృష్ణగ్రీవ ఆగ్నేయః పురస్తాద్రరాటే మేషీ సారస్వతీ అధస్తాద్ధన్వోర్బాహ్వోరధోరామావాశ్వినౌ సౌమాపౌష్ణః శ్యామో నాభ్యాం పార్శ్వయోః శ్వేతశ్చ కృష్ణశ్చ సౌర్యయామౌ సక్థ్యోర్లోమశసక్థౌ త్వాష్ట్రౌ పుచ్ఛే శ్వేతో వాయవ్యో వేహద్వైష్ణవో వామనశ్చ స్వపస్యాయేంద్రాయ సంయోజయత.॥౧॥

భావార్థః:- యే మనుష్యా అశ్వాదిభ్యః కార్యాణి సంసాధ్యైశ్వర్యమున్నీయ ధర్మ్యాణి కర్మాణి కుర్యుస్తే సౌభాగ్యవంతో భవేయుః. అత్ర సర్వత్ర దేవతాపదేన తత్తద్గుణ యోగాత్పశవో వేదితవ్యాః.॥౧॥

పదార్థము :- ఓ మానవులారా! మీరు ఏ (అశ్వః) త్వరగానడుచు తురగము (తూపరః) హింసకారియైనట్టి పశువు (గోమృగః) మరియు గోవులవలెనుండు తెల్లపాదములజింక (తే) అవి (ప్రాజాపత్యాః) ప్రజాపాలకుడగు సూర్యుడు దేవతగా గలవి, అనగా సూర్యమండల గుణములుగలవి (కృష్ణగ్రీవః) నల్లని కంఠము గల పశువు (ఆగ్నేయః) అగ్ని దేవతగా గలవి (పురస్తాత్) మొదటి నుండియే (రరాటే) లలాటము [నొసలు] నిమిత్తముగ (మేషీ) ఆడగొఱ్ఱె (సారస్వతీ) సరస్వతి దేవతగా గల (అధస్తాత్) క్రిందనుండి (హన్వోః) కుడి యెడమ భాగములుగ నున్న గడ్డమువైపు (బాహ్వోః) భుజముల నిమిత్తమున (అధోరామౌ) దిగువభాగమున మనోహరముగనున్న (అశ్వినౌ) అశ్వినీదేవతలుగల పశువులు (సౌమాపౌష్ణః) సోముడు మరియు పూష [సూర్యుడు] దేవతలుగా గల (శ్యామః) నల్లని వర్ణముగల పశువులు (నాభ్యామ్) నాభి [బొడ్డు] నిమిత్తమున (పార్శ్వయోః) కుడియెడమ దిశలనియమము (శ్వేతః) తెలుపువర్ణము (చ) మరియు (కృష్ణః) నల్లని వర్ణముగల (చ) మరియు (సౌర్యయామౌ) సూర్యుడు, యమునికి సంబంధముగల పశువులు (సక్థ్యోః) కాళ్ల సంధుల

పదార్థము :- ఓ మానవులారా! పక్షిజాతులగుణముల నెరుగువారు ఎట్లు (అగ్నయే) అగ్నికొరకు (కుటరూన్) కోళ్లను (వనస్పతిభ్యః) వనస్పతులు, అనగా పుష్పఫలముల నీయని వృక్షములకొరకు (ఉలూకాన్) ఉలూకము [గుడ్లగూబ] లను (అగ్నీషోమాభ్యామ్) అగ్ని మరియు సోమములకై (చాషాన్) నీలకంఠపక్షులను (అశ్విభ్యామ్) సూర్య చంద్రులకొరకు (మయూరాన్) మయూరముల [నెమళ్లు] ను మరియు (మిత్రావరుణాభ్యామ్) మిత్రవరుణులకు (కపోతాన్) పావురములను (ఆ, లభతే) ఉత్తమముగా పొందుచున్నాడో, మీరును పొందుడు.॥23॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. కోళ్లు, నెమళ్లు మున్నగు పక్షిజాతుల గుణములనెరుగువారు సదా వానిని వృద్ధినొందింతురు.॥23॥

23. An experrt in the knowledge of birds finds cocks enjoying the warmth of fire; owls sitting on fruitless trees; blue jays enjoying the sun and Soma; peacocks sun and moon; pigeons fond of affection and mutual liking.

౧౩౯౫. సోమాయేత్యస్య ప్రజాపతిర్ఋషిః సోమాదయో దేవతాః, భురిక్ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౩౯౫ సోమాయ లబానాలభతే త్వష్ట్రే కౌలీకాన్గోషాదీర్దేవానాం పత్నీభ్యః కులీకా దేవజామిభ్యోఽగ్నయే గృహపతయే పారుష్ణాన్ ॥24॥

ప.వి:- సోమాయ, లబాన్,ఆ,లభతే, త్వష్ట్రే, కౌలీకాన్,గోషాదీః,గోషాదీరితి గో+సాదీః, దేవానామ్, పత్నీభ్యః, కులీకాః, దేవజామిభ్య ఇతి దేవ+జామిభ్యః, అగ్నయే, గృహపతయ ఇతి గృహ+పతయే, పారుష్ణాన్.॥24॥

పదార్థః :-(సోమాయ) ఐశ్వర్యాయ, (లబాన్) (ఆ) (లభతే) (త్వష్ట్రే) ప్రకాశకాయ (కౌలీకాన్) పక్షివిశేషాన్ (గోషాదీః) యా గాః సాదయంతి హింసంతి తాః పక్షిణీః (దేవానామ్) విదుషామ్ (పత్నీభ్యః) స్త్రీభ్యః (కులీకాః) పక్షిణీవిశేషాః (దేవజామిభ్యః) విదుషాం భగినీభ్యః (అగ్నయే)అగ్నిరివ వర్తమానాయ(గృహపతయే)గృహపాలకాయ(పారుష్ణాన్)పక్షివిశేషాన్.॥24॥

అన్వయః :- హే మనుష్యా యథా పక్షికర్మవిజ్ఞః సోమాయ లబాంస్త్వష్ట్రే కౌలీకాన్ దేవానాం పత్నీభ్యో గోషాదీర్దేవజామిభ్యః కులీకా అగ్నయే గృహపతయే పారుష్ణానాలభతే తథా యూయ మప్యాలభధ్వమ్.॥24॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః పక్షిణాం స్వభావజాని కర్మాణి విదిత్వా తదనుకరణం కుర్వంతి తే బహుశ్రుతవద్భవంతి.॥౨౪॥

పదార్థము :- ఓ మానవులారా! పక్షుల కార్యముల నెరుగువారు (సోమాయ) ఐశ్వర్యములకై (లబాన్) లావుక [బురక] పిట్టలను (త్వష్ట్రే) ప్రకాశమునకై (కౌలీకాన్) కౌలికము అను పక్షులను (దేవానామ్) విద్వాంసుల (పత్నీభ్యః) పత్నులకొరకు (గోసాదీః) గోవులను హింసించునట్టి పక్షులను (దేవజామిభ్యః) విద్వాంసుల తోబుట్టువులకై (కులీకాః) కులీకము [వజ్రము] అను పక్షులు (అగ్నయే) అగ్నివలెనుండు (గృహపతయే) గృహస్థులకై (పారుష్ణాన్) పారుష్ణము లను పక్షులను (ఆ, లభతే) ప్రాప్తించుకొనునట్లు మీరును పొందుడు. ॥౨౪॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. పక్షుల గుణగణముల, స్వభావముల నెరుగు మనుష్యులు వాని కర్మల ననుసరించి కర్మలొనర్చుచుండినట్లైన వారు బహుశ్రుతుని వంటివా రగుదురు.॥౨౪॥

24. An expert in the science of birds finds qualis for affuence; Kaulikas for fame; Goshadis for the Consorts of the learned; Kulikas for the sisters of learned; Parushnas for Lord of the Homestead, behaving like fire.

౧౩౯౬.అహ్నే ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, కాలావయవా దేవతాః, విరాట్పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౩౯౬ అహ్నే పారావతానాలభతే రాత్ర్యై సీచాపూరహోరాత్రయోః సన్ధిభ్యో జతూర్మాసేభ్యో దాత్యౌహాన్త్సంవత్సరాయ మహతః సుపర్ణాన్ ॥౨౫॥

ప.వి:- అహ్నే, పారావతాన్, ఆ, లభతే, రాత్ర్యై, సీచాపూః, అహోరాత్రయోః, సన్ధిభ్య ఇతి సన్ధి+భ్యః, జతూః, మాసేభ్యః, దాత్యౌహాన్, సంవత్సరాయ మహతః, సుపర్ణానితి సు+పర్ణాన్.॥౨౫॥

పదార్థః :- (అహ్నే) దివసాయ (పారావతాన్) కలరవాన్ (ఆ) (లభతే) (రాత్ర్యై) (సీచాపూః)పక్షివిశేషాన్ (అహోరాత్రయోః) (సంధిభ్యః) (జతూః) పక్షివిశేషాన్ (మాసేభ్యః) (దాత్యౌహాన్) కృష్ణకాకాన్ (సంవత్సరాయ) వర్షాయ (మహతః) (సుపర్ణాన్) శోభనపక్షాన్ పక్షిణః.॥౨౫॥

అన్వయః :-హే మనుష్యా యథా కాలవిజ్ఞనో ఽహ్నే పారావతాన్రాత్ర్యై సీచాపూరహో రాత్రయోః సన్ధిభ్యో జతూర్మాసేభ్యో దాత్యౌహాన్త్సంవత్సరాయ మహతః సుపర్ణానాలభతే తథా యూయమప్యేతానాలభధ్వమ్.॥౨౫॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః స్వస్వసమయానుకూల క్రీడకానాం పక్షిణాం స్వభావం కుర్యుస్తే బహువిదస్స్యుః. ॥౨౫॥

పదార్థము :- ఓ మానువులారా! ఎట్లు కాలము నెరుగువారు (అహ్నే) దినముకై (పారావతాన్) కోమల శబ్దము నొనర్పు పావురముల (రాత్రై) రాత్రికొరకు (సీచాపూః) సీచాపూ యను పేరుగల విహంగముల (అహోరాత్రయోః) రేబవళ్లకై (సన్ధిభ్యః) సంధుల అనగా ప్రాతఃసాయంసంధ్యలకై (జతూః) జతువులను పేరుగల పక్షులు (మాసేభ్యః) మాసముకొరకు (దాత్యౌహాన్) నల్లని కాకులు మరియు (సంవత్సరాయ) వత్సరముల కొరకు (మహతః) పెద్దపెద్ద (సుపర్ణాన్) సుందర రెక్కలు గల పక్షులు (ఆ,లభతే) చక్కగా పొందుదురో మీరును అట్లే పొందుడు. ॥౨౫॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మనుష్యులు తమతమ సమయమున కనుకూలమగునట్లు క్రీడలనొనర్పు పక్షుల స్వభావముల నెరిగి తమ స్వభావముల నట్లుజేసి కొనెదరో వారు గొప్ప జ్ఞానులగుదురు. ॥౨౫॥

25. An expert in the science of time should study pigeons in the beginning of the day; sichapus in the night; bats in the morning and evening, gallinules for the knowledge of months, birds with beautiful feathers for realizing the beauty of the year.

౧౩౯౭. భూమ్యా ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, భూమ్యాదయో దేవతాః, భురిగనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౧౩౯౭ భూమ్యా ఆఖూనాలభతే ఽన్తరిక్షాయ పాఙ్క్త్రాన్ దివే

కశాన్ దిగ్భ్యో నకులాన్ బభ్రుకానవాంతరదిశాభ్యః ॥౨౬॥

ప.వి:- భూమ్యై, ఆఖూన్, ఆ, లభతే, అన్తరిక్షాయ, పాఙ్క్త్రాన్, దివే, కశాన్, దిగ్భ్య ఇతి దిక్+భ్యః, నకులాన్, బభ్రుకాన్, అవాన్తరదిశాభ్య ఇత్యవాన్తర+దిశాభ్యః.॥౨౬॥

పదార్థః :-(భూమ్యై) (ఆఖూన్) మూషకాన్ (ఆ) (లభతే) (అంతరిక్షాయ) (పాంక్త్రాన్) పంక్తిరూపేణ గంతవ్యాన్ (పక్షివిశేషాన్) (దివే) ప్రకాశాయ (కశాన్) పక్షివిశేషాన్

(దిగ్భ్యః) పూర్వాదిభ్యః (నకులాన్) (బభ్రుకాన్) నకులజాతివిశేషాన్ (అవాంతరదిశాభ్యః) ఉపదిశాభ్యః.॥౨౬॥

అన్వయః :- హే మనుష్యా యథా భూమిజంతుగుణవిజ్ఞనో భూమ్యా ఆఖూనంతరిక్షాయ పాంక్త్రాన్ దివే కశాన్ దిగ్భ్యో నకులానవాంతరదిశాభ్యో బభ్రుకానాలభతే తథా యూయమప్యాలభధ్వమ్.॥౨౬॥

భావార్థః:-హే మనుష్యా! భూమ్యాదివన్మూషకాదిగుణాన్ విదిత్వోపకుర్యుస్తే బహువిజ్ఞానా జాయేరన్. ॥౨౬॥

పదార్థము :- ఓ మానవులారా! భూమిసంబంధ జంతువుల గుణముల నెరుగువా రేవిధముగ (భూమ్యై) భూమికొరకు (ఆఖూన్) మూషికములను (అన్తరిక్షాయ) అంతరిక్షమునకై (పాంక్త్రాన్) పంక్తులు పంక్తులుగా వెళ్ళునట్టి విశేష పక్షులను (దివే) ప్రకాశముకొరకు (కశాన్) కశము లను పక్షులను (దిగ్భ్యః) తూర్పుమున్నగు దిశలకొరకు (నకులాన్) ముంగిసలను మరియు (అవాన్తరదిశాభ్యః) దిశల సంధులగు మూల దిశలకొరకు (బభ్రూకాన్) గోధుమ వర్ణముగల విశేషమైన ముంగిసలను (ఆ, లభతే) ఉత్తమ రీతిలో ప్రాప్తించుకొనెదరో, ఆ విధముగ మీరెల్లరును పొందుడు.॥౨౬॥

భావార్థము :- ఏ మనుష్యులు భూమ్యాదుల వలె మూషికములు మున్నగువాని యుపకారమును దెలిసికొని గొప్ప ఉపకారవంతులు గావలెను. ॥౨౬॥

26. An expert in the science of Earth should study rats for understanding the nature of ground; birds who fly in groups, for firmament; voles for light; mungooses for the quarters; brownish ichneumons for the intermediate spaces.

౧౩౯౮.వసుభ్య ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః వస్వాదయో దేవతాః, నిచృద్ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౩౯౮ వసుభ్య ఋశ్యానాలభతే రుద్రేభ్యో రురూనాదిత్యేభ్యో న్యఙ్కూన్।
విశ్వేభ్యో దేవేభ్యః పృషతాన్త్సాధ్యేభ్యః కులుంగాన్ ॥౨౭॥

ప.వి:- వసుభ్య ఇతి వసు+భ్యః, ఋశ్యాన్, ఆ, లభతే, రుద్రేభ్యః, రురూన్, ఆదిత్యేభ్యః, న్యఙ్కూన్, విశ్వేభ్యః, దేవేభ్యః, పృషతాన్, సాధ్యేభ్యః, కులుఙ్గాన్.॥౨౭॥

పదార్థః :- (వసుభ్యః) అగ్న్యాదిభ్యః (ఋశ్యాన్) మృగజాతివిశేషాన్ పశూన్ (ఆ) (లభతే) (రుద్రేభ్యః) ప్రాణాదిభ్యః (రురూన్) మృగవిశేషాన్ (ఆదిత్యేభ్యః) మాసేభ్యః

(న్యంకూన్) పశువిశేషాన్ (విశ్వేభ్యః) (దేవేభ్యః) దివ్యేభ్యః పదార్థేభ్యో విద్వద్భ్యో వా (పృషతాన్) మృగవిశేషాన్ (సాధ్యేభ్యః)సాధితుం యోగ్యేభ్యః(కులుంగాన్)పశువిశేషాన్.॥౨౭॥

అన్వయః :-హే మనుష్యా యథా పశుగుణవిజ్ఞవో వసుభ్య ఋశ్యాన్ రుద్రేభ్యో రురూనాదిత్యేభ్యో న్యంకూన్ విశ్వేభ్యో దేవేభ్యః పృషతాన్సాధ్యేభ్యః కులుంగానాలభతే తథైతాన్ యూయమప్యాలభధ్వమ్.॥౨౭॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యా మృగాదీనాం వేగగుణాన్ విదిత్వోపకుర్యుస్తే ఉత్యంతం సుఖం లభేరన్.॥౨౭॥

పదార్థము :- ఓ మానవులారా! పశువుల గుణముల నెరుగువా రెట్లు (వసుభ్యః) అగ్ని మున్నగు వసువులకొరకు (ఋశ్యాన్) ఋశ్యజాతి జింకలను (రుద్రేభ్యః) ప్రాణము మున్నగు రుద్రులకొరకు (రురూన్) రురువను పశువు [నల్లచారలదుప్పి] లను (ఆదిత్యేభ్యః) పండ్రెండు నెలలకొరకు (న్యఙ్కూన్) న్యంకునామక పశువులను (విశ్వేభ్యః) సమస్త (దేవేభ్యః) దివ్యపదార్థముల మరియు విద్వాంసులకొరకు (పృషతాన్) పృషతజాతికి చెందిన మృగ లేడి విశేషముల మరియు (సాధ్యేభ్యః) సాధించదగినవానికై (కులుంగాన్) కులుంగము అను పశువిశేషములను (ఆ,లభతే) చక్కగా పొందునట్లు మీరును పొందుడు. ॥౨౭॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మనుష్యులు హరిణము మున్నగువాని వేగరూపగుణములను దెలిసికొని ఉపకారమొనర్చెదరో వా రత్యంత సుఖములను ప్రాప్తించుకొనెదరు.॥౨౭॥

27. An expert in the knowledge of animals should secure blackbucks for Vasu Brahmcharis; stags for Rudra Brahmcharis: Nayanku deer for Aditya Brahmcharis; spotted deer for all the learned; Kulinga antelopes for yogis engrossed in meditation.

౧౩౯౯.ఈశానాయేత్యస్య ప్రజాపతిర్ఋషిః, ఈశానాదయో దేవతాః, బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౩౯౯ ఈశానాయ త్వా పరస్వతఽఆ లభతే మిత్రాయ గౌరాన్।

వరుణాయ మహిషాన్ బృహస్పతయే గవయాంస్త్వష్ట్ర ఉష్ట్రాన్ ॥౨౮॥

ప.వి:-ఈశానాయ, త్వా, పరస్వతః, ఆ, లభతే, మిత్రాయ, గౌరాన్, వరుణాయ, మహిషాన్, బృహస్పతయే, గవయాన్, త్వష్ట్రే, ఉష్ట్రాన్.॥౨౮॥

పదార్థః :-(ఈశానాయ) సమర్థాయ జనాయ, (త్వా) త్వామ్ (పరస్వతః) మృగవిశేషాన్, (ఆ, లభతే) (మిత్రాయ) (గౌరాన్) (వరుణాయ) (మహిషాన్) (బృహస్పతయే) (గవయాన్) (త్వష్ట్రే) (ఉష్ట్రాన్). ॥౨౮॥

అన్వయః :-హే రాజన్! యో మనుష్య ఈశానాయ త్వా పరస్వతో మిత్రాయ గౌరాన్ వరుణాయ మహిషాన్ బృహస్పతయే గవయాన్ త్వష్ట్రే ఉష్ట్రానాలభతే స ధనధాన్యయుక్తో జాయతే.॥౨౮॥

భావార్థః :- యే పశుభ్యో యథావదుపకారాన్ గృహ్ణీయుస్తే సమర్థాః స్యుః.॥౨౮॥

పదార్థము :- ఓ రాజా! ఏ మనుష్యులు (ఈశానాయ) సమర్థుడగువానికై (త్వా) నిన్ను మరియు (పరస్వతః) పరస్వతము లనెడి మృగవిశేషములను (మిత్రాయ) మిత్రునికొరకు (గౌరాన్) గౌర [తెలుపు] వర్ణవిశేషమగు లేడి మున్నగు వానిని (వరుణాయ) అతిశ్రేష్ఠులకొరకు (మహిషాన్) మహిషములను (బృహస్పతయే) బృహస్పతి, అనగా మహాత్ముల రక్షకునకు (గవయాన్) గవయము [తెల్లపాదములు గల లేడి] విశేషములను (త్వష్ట్రే) త్వష్ట్ర, అనగా పదార్థవిద్యచే పదార్థముల సూక్ష్మపరచువారికొరకు (ఉష్ట్రాన్) ఒంటెలను (ఆ, లభతే) చక్కగా ప్రాప్తించుకొనెదరో, వారు ధనధాన్యములను పొందగలుగుదురు.॥౨౮॥

భావార్థము :-యథావతుగా పశుపక్ష్యాదులచే ఉపకారమును పొందువారు సమర్థులై యుందురు.॥౨౮॥

28. Praswan deer should be secured for the wealthy; Gaur deer for the friend; Buffaloes for the most prosperous; forest cows for the guardian of the virtuous; camels for the artisans.

౧౪౦౦. ప్రజాపతయ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రజాపత్యాదయో దేవతాః, విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౪౦౦ ప్రజాపతయే పురుషాన్ హస్తిన ఆ లభతే వాచే

ప్లుషీం శ్చక్షుషే మశకాఞ్ఛ్రోత్రాయ భృఙ్గాః ॥౨౯॥

ప.వి:- ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, పురుషాన్, హస్తినః, ఆ, లభతే, వాచే, ప్లుషీన్, చక్షుషే, మశకాన్, శ్రోత్రాయ, భృఙ్గాః.॥౨౯॥

పదార్థః :-(ప్రజాపతయే) ప్రజాస్వామినే,(పురుషాన్) (హస్తినః) కుంజరాన్, (ఆ, లభతే) (వాచే) (ప్లుషీన్) జంతువిశేషాన్,(చక్షుషే) (మశకాన్) (శ్రోత్రాయ) (భృంగాః).॥౨౯॥

**అన్వయః :-** యో మనుష్యః ప్రజాపతయే పురుషాన్ హస్తినో వాచే ప్లుషీంశ్చక్షుషే మశకాన్ఛ్రోత్రాయ భృంగా ఆలభతే స బలిష్ఠో దృఢేంద్రియో జాయతే. ॥౨౯॥

**భావార్థః :-** యే ప్రజారక్షణాయ చతురంగిణీం సేనాం జితేంద్రియతాం చ సమాచరంతి తే శ్రీమంతో భవంతి.॥౨౯॥

**పదార్థము :-** ఏ మనుష్యుడు (ప్రజాపతయే) ప్రజాపాలకుడగు రాజుకొరకు (పురుషాన్) పురుషులను మరియు (హస్తినః)గజములను (వాచే) వాణికొరకు (ప్లుషీన్) ప్లుషియను పేరు గల జీవులను (చక్షుషే) నేత్రములకొరకు (మశకాన్) మశకము-దోమలను మరియు (శ్రోత్రాయ) కర్ణములకొరకు (భృఙ్గాః) భ్రమరము [తుమ్మెద] లను (ఆ, లభతే) పొందువాడు బలశాలి, వీర్యవంతు డగుచున్నాడు. ॥౨౯॥

**భావార్థము :-** ప్రజారక్షకుడగు నే రాజు చతురంగబలముతో చతుర్దిశలను బలిష్ఠపరచు సైన్యములు మరియు జితేంద్రియత్వమును చక్కగా ఆచరణయందుంచునో యాతడు ధనశాలి మరియు కాంతి మంతుడగును. ॥౨౯॥

29. For the service of the king valiant soldiers and elephants should be secured; white ants for eloquence; mosquitoes for sight, black bees for hearing.

౧౪౦౧. ప్రజాపతయ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రజాపత్యాదయో దేవతాః, నిచృదతిధృతిశ్ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఞల నవ్విషయమే.

౧౪౦౧ ప్రజాపతయే చ వాయవే చ గోమృగో వరుణాయారణ్యో మేషో

యమాయ కృష్ణో మనుష్యరాజాయ మర్కటః శార్దూలాయ

రోహిదృషభాయ గవయీ క్షిప్రశ్యేనాయ వర్తికా నీలఙ్గోః

కృమిః సముద్రాయ శిశుమారో హిమవతే హస్తీ ॥౩౦॥

ప.వి:- ప్రజాపతయ ఇతి ప్రజా+పతయే, చ, వాయవే, చ, గోమృగ ఇతి గో+ మృగః, వరుణాయ, ఆరణ్యః, మేషః, యమాయ, కృష్ణః, మనుష్యరాజాయేతి మనుష్య+రాజాయ, మర్కటః, శార్దూలాయ, రోహిత్, ఋషభాయ, గవయీ, క్షిప్రశ్యేనాయేతి క్షిప్ర+శ్యేనాయ,

వర్తికా, నీలఙ్గోః, కృమిః, సముద్రాయ, శిశుమారఇతి శిశు+మారః, హిమవతఇ ఇతి హిమ+వతే, హస్తీ.॥30॥

పదార్థః :-(ప్రజాపతయే)ప్రజాపాలకాయ (చ) తత్సంబంధిభ్యః (వాయవే) (చ) తత్సంబంధిభ్యః, (గోమృగః) యో గాం మార్ష్టి శుంధతి సః, (వరుణాయ) (అరణ్యః) వనే భవః (మేషః) అవిజాతివిశేషః (యమాయ) న్యాయాధీశాయ (కృష్ణః) కృష్ణగుణవిశిష్టః (మనుష్యరాజాయ) నరేశాయ (మర్కటః) వానరః (శార్దూలాయ) మహాసింహాయ (రోహిత్) రక్తగుణవిశిష్టో మృగః (ఋషభాయ) శ్రేష్ఠాయ సభ్యాయ (గవయీ) గవయస్య స్త్రీ (క్షిప్రశ్యేనాయ) క్షిప్రగామినే శ్యేనాయేవ వర్తమానాయ (వర్తికా) (నీలంగోః) యో నీలం గచ్ఛతి తస్య (కృమిః) క్షుద్రజంతువిశేషః, (సముద్రాయ) (శిశుమారః) బాలహంతా, (హిమవతే) బహూని హిమాని విద్యంతే యస్య తస్మై, (హస్తీ).

అన్వయః:-హే మనుష్యాః! యుష్మాభిః ప్రజాపతయే చ వాయవే చ గోమృగో వరుణాయారణ్యో మేషో యమాయ కృష్ణో మనుష్యరాజాయ మర్కటః శార్దూలాయ రోహిదృషభాయ గవయీ క్షిప్రశ్యేనాయ వర్తికా నీలంగోః కృమిః సముద్రాయ శిశుమారో హిమవతే హస్తీ చ సంప్రయోక్తవ్యః.॥30॥

భావార్థః:-యే మనుష్యా మనుష్యసంబంధ్యుత్తమాన్ ప్రాణినో రక్షంతి తే సాంగోపాంగబలా జాయంతే. ॥30॥

పదార్థము :- ఓ మానవులారా! మీరు (ప్రజాపతయే) ప్రజాపాలకుడు (చ) మరియు వానికి సంబంధించినవారు(వాయవే) వాయువు (చ) మరియు వాయుసంబంధ పదార్థములకొరకు (గోమృగః) పృథివిని శుద్ధపరచునది (వరుణాయ) అత్యుత్తమముకొరకు (అరణ్యః) వనసంబంధ (మేషః) గొఱ్ఱె (యమాయ) న్యాయాధీశునకై (కృష్ణః) నల్లని జింక (మనుష్యరాజాయ) మనుష్యుల రాజుకొరకు (మర్కటః) వానరము (శార్దూలాయ) పెద్దపులి లేక సింహముకొరకు (రోహిత్) ఎఱ్ఱని లేడి (ఋషభాయ) శ్రేష్ఠుడగు సభ్యమానవునకు (గవయీ) నల్లని యావు లేక తెల్లపాదములుగల లేడి (క్షిప్రశ్యేనాయ) అతివేగముగా నెగిరిపోవు డేగపక్షివంటి దానికొరకు (వర్తికా) బాతు (నీలంగోః) నీలమును పొందునట్టి చిన్న కీటకమునకై (కృమిః) చిన్న కీటకము (సముద్రాయ) సముద్రముకొరకు (శిశుమారః) శిశువులను హింసించు శిశుమారకము మరియు (హిమవతే) అనేక హిమఖండములు గల పర్వతమునకై (హస్తీ) ఏనుగును చక్కగా యుక్తపరచవలెను.॥30॥

**భావార్థము :-** ఏ మనుష్యుడు మానవసంబంధ ఉత్తమ ప్రాణులను చక్కగా రక్షించు చుండునో యాతడు సాంగోపాంగముగ శక్తిమంతుడగును. ॥30॥

30. For swiftness like a king and air Gomriga should be known; a wild ram for an excellent person; a black deer for the Lord of justice; a monkey for the king; a red doe for the tiger; a female Goyal for a civilized person, aquail for the swift falcon; a worm for the Nilangu, a porpoise for the sea; an elephant for the snowy mountain.

౧౪౦౨.మయురిత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రాజాపత్యాదయో దేవతాః, స్వరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యాదియే.

౧౪౦౨ మయుః ప్రాజాపత్య ఉలో హలిక్ష్ణో వృషదꣳశ స్తే ధాత్రే దిశాం

కఙ్కో ధుఙ్క్షాగ్నేయీ కలవిఙ్కో లోహితాహిః పుష్కరసాదస్తే

త్వాష్ట్రా వాచే క్రుఞ్చః॥౩౧॥

ప.వి:- మయుః, ప్రాజాపత్య ఇతి ప్రాజా+పత్యః, ఉలః, హలిక్ష్ణః, వృషదꣳశః ఇతి వృష+దꣳశః, తే, ధాత్రే, దిశామ్, కఙ్కః, ధుఙ్క్షా, ఆగ్నేయీ, కలవిఙ్కః, లోహితాహిరితి లోహిత+అహిః, పుష్కరసాదః ఇతి పుష్కర+సాదః, తే, త్వాష్ట్రాః, వాచే, క్రుఞ్చః.॥౩౧॥

పదార్థః :- (మయుః) కిన్నరః (ప్రాజాపత్యః) ప్రజాపతిదేవతాకః, (ఉలః) క్షుద్రకృమిః (హలిక్ష్ణః) మృగేంద్రవిశేషః (వృషదంశః) మార్జాలః (తే) (ధాత్రే) ధారకాయ (దిశామ్) (కంకః) లోహపృష్ఠః (ధుఙ్క్షా) పక్షివిశేషః (ఆగ్నేయీ) (కలవింకః) చటకః (లోహితాహిః) లోహితశ్చాసావహిశ్చ (పుష్కరసాదః) యః పుష్కరే సీదతి, (తే) (త్వాష్ట్రాః) త్వష్టృదేవతాకాః (వాచే) (క్రుంచః).॥౩౧॥

అన్వయః :-హే మనుష్యాః! యుష్మాభిః ప్రాజాపత్యో మయురులోహలిక్ష్ణో వృషదంశశ్చ తే ధాత్రే కంకో దిశాం ధుంక్షా ఆగ్నేయీ కలవింకో లోహితాహిః పుష్కరసాదస్తే త్వాష్ట్రా వాచే క్రుంచశ్చ వేదితవ్యాః.॥౩౧॥

భావార్థః :- యే శృగాలసర్పాదీన్ వశం నయంతి తే ధురంధరాస్సంతి.॥౩౧॥

పదార్థము :-ఓ మానవులారా! మీకు (ప్రాజాపత్యా) ప్రజాపతి దేవతగల (మయుః) నిందితుడగు కిన్నరమనుష్యుడు మరియు నెవడు (ఉలః) చిన్న కీటకము (హలిక్ష్ణః) విశేషముగ సింహము మరియు (వృషదంశః) మార్జాలములు (తే) మున్నగునవి (ధాత్రే) ధారణ మొనర్చువారికొరకు (కఙ్కః) తెల్లగ్రద్ద

[రాబందు] (దిశామ్) దిశలనిమిత్తము (ధుంక్షా) దుంక్షయను పక్షివిశేషము (ఆగ్నేయీ) అగ్నిదేవతగా గలిగి నట్టి (కలవిఙ్కః) ఊరుపిచ్చుక లేక పావురము (లోహితాహిః) ఎఱ్ఱని సర్పము మరియు (పుష్కరసాదః) చెరువులందుండునట్టి వేవో (తే) అవియన్నియును (త్వాష్ట్రాః) త్వష్ట దేవతగా గలవి, మరియు (వాచే) వాణికొరకు (క్రుఞ్చః) సారసము [బెగ్గురుపక్షి] యని మీరు ఎరుగవలయును.॥30॥

భావార్థము :-శృగాలయు [నక్క]లను సర్పములను మున్నగు వానిని వశమొనర్చుకొనువారు ధురంధరులై యుందురు. ॥30॥

31. A despicable person belongs to the king; the tiny worm, the lion, the cat belong to one given to mental abstraction; the heron belongs to the quarters; the female bird named Dhunksha possesses the qualities of fire; sparrow, red snake, and the bird residing in the tank belong to Twashta (sun), the curlew belongs to speech.

౧౪౦౩.సోమాయేత్యస్య ప్రజాపతిర్ఋషిః, సోమాదయో దేవతాః, భురిగ్జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౪౦౩ సోమాయ కులుఙ్గ ఆరణ్యోఽజో నకులః శకా తే పౌష్ణాః

క్రోష్టా మాయోరిన్ద్రస్య గౌరమృగః పిద్వో న్యఙ్కుః కక్కటస్తేఽ

నుమత్యై ప్రతిశ్రుత్కాయై చక్రవాకః ॥31॥

ప.వి:- సోమాయ, కులుఙ్గః, ఆరణ్యః, అజః, నకులః, శకా, తే, పౌష్ణాః, క్రోష్టా, మాయోః, ఇన్ద్రస్య, గౌరమృగ ఇతి గౌర+మృగః, పిద్వః, న్యఙ్కుః, కక్కటః,తే, అనుమత్యా ఇత్యను+మత్యై, ప్రతిశ్రుత్కాయా ఇతి ప్రతి+శ్రుత్కాయై, చక్రవాక ఇతి చక్ర+వాకః.॥31॥

పదార్థః :- (సోమాయ) (కులుంగః) పశువిశేషః (ఆరణ్యః) అరణ్యే భవః, (అజః) ఛాగజాతివిశేషః (నకులః) (శకా) శకః శక్తిమాన్. అత్ర సుపాం సులుగిత్యాకారాదేశః (తే) (పౌష్ణాః) పుష్టికరసంబంధినః (క్రోష్టా) శృగాలః (మాయోః) శృగాలవిశేషస్య (ఇంద్రస్య) ఐశ్వర్యయుక్తస్య (గౌరమృగః) (పిద్వః) మృగవిశేషః (న్యంకుః) మృగవిశేషః (కక్కటః) అయమపి మృగవిశేషః (తే) (అనుమత్యై) (ప్రతిశుత్కాయై) ప్రతిశ్రావికాయై (చక్రవాకః) పక్షివిశేషః. ॥31॥

**అన్వయః :- హే మనుష్యా యది యుష్మాభిః సోమాయ కులుంగ ఆరణ్యోఽజో నకులః శకా చ తే పౌష్ణా మాయోః క్రోష్టేంద్రస్య గౌరమృగో యే పిద్వో న్యంకుః కక్కటశ్చ తేఽనుమత్యై ప్రతిశ్రుత్కాయై చక్రవాకశ్చ సంప్రయుజ్యతే తర్హి బహుకృత్యం కర్తుం శక్యేత.॥32॥**

**భావార్థః :- య ఆరణ్యేభ్యః పశ్వాదిభ్యో ఉప్యుపకారం కర్తుం జానీయుస్తే సిద్ధకార్యా జాయంతే.॥32॥**

పదార్థము :- ఓ మానవులారా! ఒక వేళ మీరు (సోమాయ) సోమునికొరకు (కులుఙ్గః) కులుంగమను పశువిశేషము లేక (ఆరణ్యః) ఆటవిక (అజః) మేక (నకులః) ముంగిస మరియు (శకా) శకమను సమర్థవంతమగు పశువిశేషము (తే) అవి (పౌష్ణాః) పుష్టినొసగు వాని సంబంధము లేక (మాయోః) నక్కజాతివిశేషమునకు (క్రోష్టా) సామాన్యమగు నక్కజాతి (ఇన్ద్రస్య) ఐశ్వర్యవంతునికొరకు (గౌరమృగః) తెల్లని మృగము లేక (పిద్వః) విశేషమృగము (న్యఙ్కుః) ఒక వేరుజాతి మృగము (కక్కటః) కక్కటమను మృగవిశేషములు ఏవి గలవో (తే) అవి (అనుమత్యై) అనుమతికొరకు మరియు (ప్రతిశ్రుత్కాయై) వినినపిదప వినిపించుదానికొరకు (చక్రవాకః) చకోరపక్షి మిథునము చక్కగా వినియోగపరచుకొనినచో అనేక కార్యము లొనర్చుటకు సమర్థులు గాగలుగుదురు. ॥32॥

**భావార్థము :-** వన్యపశువులచేతను ఉపకారమును పొందుటను ఎరిగినవారు కార్యసిద్ధులు కాగలుగుదురు.॥32॥

32. An antelope should be had for prosperity; wild goat, mungoose, saka (a strong animal) are meant for the powerful; an ordinary jackal is subservient to a superior jackal; white deer is meant for a wealthy person, Pidva; Nayanku, Kakkat are for Anumati; the chakravaka (ruddy goose) is for the Echo

౧౪౦౪.సౌరీత్యస్య ప్రజాపతిర్ఋషిః, మిత్రాదయో దేవతాః, భురిగ్జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౪౦౪ సౌరీ బలాకా శార్గః సృజయః, శయాణ్డకస్తే మైత్రాః।

సరస్వత్యై శారిః పురుషవాక్ శ్వావిద్భౌమీ శార్దూలో వృకః।

పృదాకుస్తే మన్యవే సరస్వతే శుకః పురుషవాక్ ॥33॥

ప.విః- సౌరీ, బలాకా, శార్గః, సృజయః, శయాణ్డక ఇతి శయ+అండకః, తే,మైత్రాః,

సరస్వత్యై, శారిః, పురుషవాగితి పురుష+వాక్, శ్వావిత్, శ్వావిదితి శ్వా+విత్,భౌమీ, శార్దూలః,

వృకః, పృదాకుః, తే, మన్యవే, సరస్వతే, శుకః, పురుషవాగితి పురుష+వాక్.॥33॥

పదార్థః:-(సౌరీ) సూర్యో దేవతా యస్యాః సా (బలాకా) విశేషపక్షిణీ (శార్గః) శార్గశ్చాతకః. అత్ర ఛాందసో వర్ణలోప ఇతి ఙలోపః (సృజయః) పక్షివిశేషః (శయాండకః) పక్షివిశేషః (తే) (మైత్రాః) ప్రాణదేవతాకాః (సరస్వత్యై) నద్యై (శారిః) శుకీ (పురుషవాక్) శుకః (శ్వావిత్) సేధా, (భౌమీ)పృథివీ దేవతాకాః (శార్దూలః) వ్యాఘ్రవిశేషః (వృకః) చిత్రకః (పృదాకుః) సర్పః (తే) (మన్యవే) క్రోధాయ (సరస్వతే) సముద్రాయ (శుకః) శుద్ధికృత్ పక్షివిశేషః (పురుషవాక్) పురుషస్య వాగివ వాగ్యస్య సః.॥33॥

అన్వయః:-హే మనుష్యా యుష్మాభిర్యా సౌరీ సా బలాకా యే శార్గః సృజయః శయాండకశ్చ తే మైత్రాః శారిః పురుషవాక్ సరస్వత్యై శ్వావిత్ భౌమీ శార్దూలో వృకః పృదాకుశ్చ తే మన్యవే శుకః పురుషవాక్ చ సరస్వతే విజ్ఞేయాః.॥33॥

భావార్థః :-యే బలాకాదయః పశుపక్షిణస్తేషాం మధ్యాత్ కేచిత్పాలనీయాః కేచిత్తాడనీయాః సంతీతి వేద్యమ్.॥33॥

పదార్థము :- ఓ మానవులారా! మీకు (సౌరీ) వేనికి సూర్యుడు దేవతగా గలదో (బలాకా) బకము మరియు (శార్గః) చాతకపక్షి (సృజయః) సృజయమను పేరుగల పక్షి (శయాణ్డకః) శయాండకమను పక్షి (తే) అవి (మైత్రాః) ప్రాణదేవతా సంబంధమైనవి (శారిః) పెంటి చిలుక (పురుషవాక్) పురుషునివలె పలుకు మగచిలుక (సరస్వత్యై) నదులకొరకు (శ్వావిత్) ఏదుపంది (భౌమీ) భూమిదేవతగాగలది (శార్దూలః) కేసరి సింహము (వృకః) తోడేలు (పృదాకుః) సర్పములు ఏవి గలవో (తే) అవి (మన్యవే) క్రోధముకొరకు మరియు (శుకః) శుద్ధియొనర్చు శుకపక్షివిశేషము (పురుషవాక్) మనుష్యుల పలుకులవంటి పలుకులు పలుకగల పక్షి (సరస్వత్యై) సముద్రముకొరకని మీరు చక్కగా తెలిసికొనవలయును.॥33॥

భావార్థము :- బలాక [బకము] మున్నగు పక్షులందు కొన్ని పాలించదగినవి, మరికొన్నితాడన మొనర్చ దగినవని మీరు తెలిసికొనవలెను. ॥33॥

33. The female crane belongs to the sun; Sarga, srijaya, Sayandaka, these three belong to breath, the human - voiced female parrot belongs to the strem; the porcupine belongs to the ground; tiger, wolf, viper belong to anger; the human voiced parrot belongs to the sea.

౧౪౦౫.సుపర్ణ ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, అగ్న్యాదయో దేవతాః, స్వరాట్ శక్వరీ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౪౦౫ సుపర్ణః పార్జన్యఽఆతిర్వాహసో దర్విదా తే వాయవే బృహస్పతయే
వాచస్పతయే పైఙ్గరాజోఽలజఽఆన్తరిక్షః ప్లవో మద్గుర్మత్స్యస్తే
నదీపతయే ద్యావాపృథివీయః కూర్మః ॥౩౪॥

ప.వి:- సుపర్ణ ఇతి సు+పర్ణః, పార్జన్యః, ఆతిః వాహసః,దర్విదేతి దర్వి+దా, తే, వాయవే, బృహస్పతయే, వాచః పతయే, పైంగరాజ ఇతి పైంగ+రాజః, అలజః, ఆంతరిక్షః, ప్లవః, మద్గుః, మత్స్యః, తే నదీపతయ ఇతి నదీ+పతయే, ద్యావాపృథివీయః, కూర్మః.॥౩౪॥

పదార్థః :- (సుపర్ణః) శోభనపతనః (పార్జన్యః) పర్జన్యవద్గుణః (ఆతిః) పక్షివిశేషః (వాహసః) అజగరః సర్పవిశేషః (దర్విదా) కాష్ఠచ్ఛిత్ పక్షివిశేషః (తే) (వాయవే) (బృహస్పతయే)బృహతాం పాలకాయ (వాచః) (పతయే) పాలకాయ (పైంగరాజః) పక్షివిశేషః (అలజః) పక్షివిశేషః (ఆంతరిక్షః) అంతరిక్షదేవతాకః (ప్లవః) వర్తికా (మద్గుః) జలకాకః (మత్స్యః) (తే) (నదీపతయే) సముద్రాయ (ద్యావాపృథివీయః) ప్రకాశభూమిదేవతాకః (కూర్మః) కచ్ఛపః॥౩౪॥

అన్వయః :-హే మనుష్యా! యుష్మాభిర్యః సుపర్ణః స పార్జన్యో య ఆతిర్వాహసో దర్విదా చ తే వాయవే పైంగరాజో బృహస్పతయే వాచస్పతయేఽలజ ఆంతరిక్షో యే ప్లవో మద్గుర్మత్స్యశ్చ తే నదీపతయే యః కూర్మః స ద్యావాపృథివీ యశ్చ విజ్ఞేయాః.॥౩౪॥

భావార్థః:- యే మేఘాదితుల్యగుణాః పశుపక్షివిశేషాః సంతి తే కార్యోపయోగాయ నియోజనీయాః. ॥౩౪॥

**పదార్థము** :- ఓ మానవులారా! (సుపర్ణః) చక్కగా పతనమగుట మరియు ఎగురుటగల పక్షి (పార్జన్యః) మేఘమువంటి గుణముగల (ఆతిః) అతి యను పేరుగల పక్షి (వాహసః) కొండచిలువ సర్పము (దర్విదా) వృక్షకాండముల దొలచు వడ్రంగిపిట్ట ఏవి గలవో (తే) అవి యన్నియును (వాయవే) వాయువు కొరకు (పైఙ్గరాజః) పైంగరాజమను నామముగల పక్షి (బృహస్పతయే) గొప్పగొప్ప పదార్థముల మరియు (వాచః, పతయే) వాణిని పాలించువానికొరకు (అలజః) అలజమను పక్షి (అన్తరిక్షః) అంతరిక్షము దేవతగాగలది (ప్లవః) జలములందు ఈదుచుండుబాతు (మద్గుః) నీటికాకి మరియు (మత్స్యః) చేపలు ఏవి గలవో (తే)అవి

యన్నియును (నదీపతయే) సముద్రముకొరకు మరియు నేది (కూర్మః) తాబేలు గలదో యది (ద్యావాపృథివీయః) ప్రకాశము, భూమి దేవతలుగా గలదని యెరుగుడు.॥34॥

**భావార్థము** :-మేఘము మున్నగువానివంటి గుణములుగల విశేష పశుపక్ష్యాదులు ఏవి గలవో వానిని కార్యములయం దుపయోగించవలయును. ॥34॥

34. The eagle belongs to the cloud; the Aati, the serpent, the wood pecker, these are for air; the Paingraja is for Brihaspati; the Alaja belongs to the Firmament; pelican, cormorant, fish, these belong to the ocean; the tortoise belongs to the Heaven and Earth.

౧౪౦౬.పురుషమృగ ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, చంద్రాదయో దేవతాః, విపృచ్ఛక్వరీ ఛందః,ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యాదియే.

౧౪౦౬ పురుషమృగ శ్చంద్రమసో గోధా కాలకా దార్వాఘాటస్తే వనస్పతీనాం

కృకవాకుః సావిత్రో హంసో వాతస్య నాక్రో మకరః

కులీపయస్తేఽకూపారస్య హ్రియై శల్యకః ॥35॥

ప.వి:- పురుషమృగ ఇతి పురుష+మృగః, చంద్రమసః, గోధా, కాలకా, దార్వాఘాటః, దార్వాఘాత ఇతి దారు+ ఆఘాతః, తే, వనస్పతీనామ్, కృకవాకురితి కృక+వాకుః, సావిత్రః, హంసః, వాతస్య, నాక్రః, మకరః, కులీపయః, తే అకూపారస్య, హ్రియై, శల్యకః.॥35॥

పదార్థః :- (పురుషమృగః) యః పురుషాన్ మార్ష్టి స పశువిశేషః (చంద్రమసః) చంద్రస్య (గోధా) (కాలకా) (దార్వాఘాటః) శతపత్రకః (తే) (వనస్పతీనామ్) (కృకవాకుః)కుక్కుటః (సావిత్రః) సవితృ దేవతాకః (హంస) (వాతస్య) (నాక్రః) వక్రాజ్జాతః (మకరః) (కులీపయః) జలజంతువిశేషః (తే) (అకూపారస్య) సముద్రస్య (హ్రియై) లజ్జాయై (శల్యకః) కంటకపక్ష యుక్తః శ్వావిత్. ॥35॥

అన్వయః :-హే మనుష్యా యుష్మాభిర్యః పురుషమృగః స చంద్రమసో యే గోధా కాలకా దార్వాఘాటశ్చ తే వనస్పతీనాం యః కృకవాకుః స సావిత్రో యో హంసః స వాతస్య యే నాక్రో మకరః కులీపయశ్చ తేఽకూపారస్య యః శల్యకః స హ్రియై చ విజ్ఞేయాః. ॥35॥

**భావార్థః** :-యే చంద్రాదిగుణాః పశుపక్షివిశేషాస్తే మనుష్యైర్విజ్ఞేయాః.॥35॥

**పదార్థము** :- ఓ మానవులారా! మీకు (పురుష మృగః) పురుషుల [మనుష్యుల] ను శుద్ధమొనర్చు ఒక విశేష పశువు (చన్ద్రమసః) చంద్రునికొరకు (గోధా) ఉడుము (కాలకా) కాలక మను పక్షి (దార్వాఘాటః) చెట్లుతొలుచు పక్షి లేవి గలవో (తే) అవి (వనస్పతీనామ్) వనస్పతుల సంబంధమగు (కృకవాకుః) కోడిపుంజు (సావిత్రః) సవితాదేవతగా గలది ఏ (హంసః) హంసగలదో యది (వాతస్య) పవనముకొరకు, ఏవి (నాక్రః) నక్రశిశివు (మకరః) మొసలి (కులీపయః) ఏ విశేష జలజంతువులు గలవో (తే) అవి (అకూపారస్య) సముద్రముకొరకు (శల్యకః) ముళ్లపంది. [ఏదుపంది] (హ్రియై) లజ్జకొరకని మీరు గ్రహింపవలయును. ॥35॥

**భావార్థము** :-చంద్రుడు మున్నగువాని గుణములతో గూడిన పశుపక్ష్యాదులను గూర్చి మనుష్యులు చక్కగా తెలిసికొనవలయును. ॥35॥

35. The buck that purifies men belongs to the moon; iguana, kalakaa, wood pecker, these belong to the trees; the cock belongs to the sun; the swan belongs to air; crocodile, dolphin, and watery birds, these belong to the sea; the porcupine to modesty.

౧౪౦౭. ఏణీత్యస్య ప్రజాపతిర్ఋషిః, అశ్వ్యాదయో దేవతాః, నిచృజ్జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౪౦౭ ఏణ్యహ్నో మణ్డూకో మూషికా తిత్తిరిస్తే సర్పాణాం లోపాశఆశ్వినః కృష్ణో రాత్ర్యా ఋక్షో జతూః సుషిలీకా త ఇతరజనానాం జహకా వైష్ణవీ ॥36॥

ప.వి:-ఏణీ, అహ్నః, మణ్డూకః, మూషికా, తిత్తిరిః, తే సర్పాణామ్, లోపాశః ఆశ్వినః, కృష్ణః, రాత్ర్యై, ఋక్షః, జతూః సుషిలీకేతి సుషి+లీకా, తే ఇతరజనానామితీతర+జనానామ్, జహకా, వైష్ణవీ.॥36॥

పదార్థ :-(ఏణీ) మృగీ (అహ్నః) దివస్య (మండూకః) (మూషికా) (తిత్తిరిః) (తే) (సర్పాణామ్) (లోపాశః) వనచరపశువిశేషః (ఆశ్వినః) అశ్విదేవతాకః (కృష్ణః) కృష్ణవర్ణః, (రాత్ర్యై) (ఋక్షః) భల్లూకః, (జతూః) (సుషిలీకా) ఏతా చ పక్షివిశేషా (తే) (ఇతర జనానామ్) ఇతరే చ తే జనా ఇతరజనాస్తేషామ్, (జహకా) గాత్రసంకోచినీ (వైష్ణవీ) విష్ణుదేవతాకా.॥36॥

అన్వయః :- హే మనుష్యా యుష్మాభిర్యైణీ సాఽహ్నో, యే మండూకో మూషికా తిత్తిరిశ్చ తే సర్పాణాం యో లోపాశః స ఆశ్వినో యః కృష్ణః స రాత్ర్యై య ఋక్షో జతూః సుషిలీకా చ త ఇతరజనానాం యా జహకా సా వైష్ణవీ చ విజ్ఞేయాః.॥౩౬॥

భావార్థః :- యే దివాదిగుణాః పశుపక్షివిశేషాస్తే తత్తద్ గుణతో విజ్ఞేయాః.॥౩౬॥

పదార్థము :- ఓ మానవులారా! మీకు ఏ (ఏణీ) హరిణముగలదో, అది (అహ్నః) పగటికొరకు, ఏ (మణ్డూకః) మండూకము [కప్ప] (మూషికా) మూషికము (తిత్తిరిః) ఆడతిత్తిరి [తీతువు] పక్షిగలవో (తే) అవి (సర్పాణామ్) సర్పములకొరకు (లోపాశః) లోపాశమను ఒకవనచర పశువిశేషము (ఆశ్వినః) అశ్విదేవతాగలది (కృష్ణః) నల్లనివర్ణపుజింక లేవి గలవో అవి (రాత్ర్యై) రాత్రికొరకు (ఋక్షః) ఎలుగుబంటు (జతూః) జతువనను పేరుగలది మరియు (సుషీలికా) సుశిలీక యను పక్షి (తే) ఇవి యన్నియును (ఇతరజనానామ్) ఇతరమనుష్యులకొరకు మరియు (జహకా) అవయవములను ముడుచుకొను పక్షివిశేషము (వైష్ణవీ) విష్ణుదేవతాగలవని యెరుగవలెను.॥౩౬॥

భావార్థము :- దినము (పగలు) మున్నగు గుణములుగల పశుపక్ష్యాదుల గుణములను దెలిసికొని వానియుపయోగముల నెరుగవలెను. ॥౩౬॥

36. The black-doe belongs to the day; frog, female -rat, partridge, these belong to the serpents; the jackal belongs to the Aswins, the balck buck to the night; bear, bat, sushilikaa, these belong to the other folk; the pole-cat belongs to vishnu.

౧౪౦౮. అన్యవాప ఇత్యస్య ప్రజాపతిర్ఋషిః, అర్ధమాసాదయో దేవతాః, భురిగ్జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౪౦౮ అన్యవాపో ఽర్ధమాసానామృశ్యో మయూరః సుపర్ణస్తే గన్ధర్వాణామపాముద్రో మాసాఙ్ కశ్యపో రోహిత్ కుణ్డృణాచీ గోలత్తికా తేఽప్సరసాం మృత్యవే ఽసితః॥౩౭॥

ప.వి:- అన్యవాప ఇత్యన్య+వాపః, అర్ధమాసానామిత్యర్ధ+మాసానామ్, ఋశ్యః, మయూరః, సుపర్ణ ఇతి సు+పర్ణః, తే, గన్ధర్వాణామ్, అపామ్, ఉద్రః, మాసాన్, కశ్యపః, రోహిత్, కుండృణాచీ, గోలత్తికా, తే, అప్సరసామ్, మృత్యవే, అసితః.॥౩౭॥

పదార్థః :- (అన్యవాపః) కోకిలాఖ్యః పక్షివిశేషః (అర్ధమాసానామ్) (ఋశ్యః) మృగవిశేషః, (మయూరః) (సుపర్ణః) పక్షివిశేషః (తే) (గంధర్వాణామ్) గాయకానామ్ (అపామ్) జలానామ్ (ఉద్రః) జలచరః కర్కటాఖ్యః (మాసాన్) మాసానామ్. అత్ర విభక్తివ్యత్యయః. (కశ్యపః) కచ్ఛపః (రోహిత్) మృగవిశేషః (కుండృణాచీ) వనచరీ (గోలత్తికా) వనచరవిశేషః (తే) (అప్సరసామ్) కిరణాదీనామ్ (మృత్యవే) (అసితః) కృష్ణగుణః పశువిశేషః.॥౩౭॥

అన్వయః :-హే మనుష్యా! యుష్మాభిర్యో ఽన్యవాపః సోఽర్ధమాసానాం య ఋశ్యో మయూరః సుపర్ణశ్చ తే గాంధర్వాణామపాం చ య ఉద్రః స మాసాన్ యే కశ్యపో రోహిత్ కుండృణాచీ గోలత్తికా చ తేఽప్సరసాం యోఽసితః స మృత్యవే చ విజ్ఞేయాః.॥౩౭॥

భావార్థః :-యే కాలాదిగుణాః పశుపక్షిణస్త ఉపకారిణః సంతీతి వేద్యమ్. ॥౩౭॥

పదార్థము :- ఓ మానవులారా! మీకు ఏ (అన్యవాపః) కోకిలపక్షి గలదో యది (అర్ధమాసానామ్) పక్షములకొరకు (ఋశ్యః) ఋశ్యజాతి మృగము (మయూరః) నెమలి మరియు (సుపర్ణః) చక్కని రెక్కలుగల పక్షివిశేషము గలవో (తే) అవి (గన్ధర్వాణామ్) గాయకులకు (అపామ్) జలములకొరకు (ఉద్రః) ఉద్రమను పేరుగల ఒక జలచరవిశేషము (మాసాన్) మాసములకొరకు (కశ్యపః) తాబేలు (రోహితః) ఒక విశేషమృగము (కుణ్రుణాచీ) కుంద్రుణాచి యను వనచర విశేషము (గొలత్తికా) గొలత్తిక మనుపేరుగల విశేషమగు పశువు జాతివి ఏవి గలవో (తే) అవి (అప్సరసామ్) కిరణములు మున్నగు పదార్థములకొరకు, మరియు (అసితః) నల్లని గుణము గల ఏ విశేష పశువు గలదో యది (మృత్యవే) మృత్యువుకొరకని కొనవలెను. ॥౩౭॥

భావార్థము :-కాలము మున్నగు గుణములు గల ఏ పశుపక్ష్యాదులు గలవో యవి ఉపకారక ప్రాణులని దెలిసికొన వలయును. ॥౩౭॥

37. The cuckoo belongs to the Half Months; antelope, peacock, swan are meant for the musicians; the other is an aquatic being; the tortoise belongs to the Months; doe-antelope kundrirachi, Golattikaa belong to the beam of the sun; the black snake belongs to death.

౧౪౦౯. వర్షాహూరిత్యస్య ప్రజాపతిర్ఋషిః, వర్షాదయో దేవతాః, స్వరాడ్ జగతీ ఛందః నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౧౪౦౯ వర్షాహూర్ఋతూనామాఖుః కశో మాన్థాలస్తే పిత్రూణాం

బలాయాజగరో వసూనాం కపిఞ్జలః కపోతఽ ఉలూకః శశస్తే

నిరృత్యై వరుణాయారణ్యో మేషః॥౩౮॥

ప.వి:- వర్షాహూరితి వర్ష+ ఆహూః, ఋతూనామ్, ఆఖుః, కశః మాన్థాలః, తే పితౄణామ్, బలాయ, అజగరః, వసూనామ్, కపిఞ్జలః, కపోతః, ఉలూకః, శశః, తే, నిర్‌ఋత్యా+ ఇతి నిః+ఋత్యై, వరుణాయ, ఆరణ్యః, మేషః.॥౩౮॥

పదార్థః :-(వర్షాహూః) యా వర్షా ఆహ్వయతి సా భేకీ (ఋతూనామ్) వసంతాదీనామ్, (ఆఖుః) మూషకః (కశః) శాసనీయః (మాంథాలః) జంతువిశేషః (తే) (పితౄణామ్) పాలకానామ్, (బలాయ) (అజగరః) మహాన్సర్పః (వసూనామ్) (కపింజలః) (కపోతః) (ఉలూకః) (శశః) పశువిశేషః (తే) (నిర్‌ఋత్యై) (వరుణాయ) (ఆరణ్యః) అరణ్యే భవః (మేషః) పశువిశేషః.॥౩౮॥

అన్వయః:-హే మనుష్యా! యుష్మాభిర్యా వర్షాహూః సా ఋతూనామాఖుః కశో మాంథాలశ్చ తే పితౄణాం బలాయాజగరో వసూనాం కపింజలః కపోత ఉలూకః శశశ్చ తే నిర్‌ఋత్యై య ఆరణ్యో మేషః స వరుణాయ చ విజ్ఞేయాః.॥౩౮॥

భావార్థః :-యే ఋత్వాదిగుణాః పశుపక్షిణస్తే తద్గుణా విజ్ఞేయాః.॥౩౮॥

పదార్థము :-ఓ మానవులారా! మీకు ఏ (వర్షాహూః) వర్షమునాహ్వానించు ఆడమండూకము (ఋతూనామ్) వసంతాది ఋతువులకొరకు (అఖుః) ఎలుక (కశః) నేర్పించదగిన కశనామక పశువిశేషము (మాన్థాలః) మాంథాలమను జంతువిశేషము లేవిగలవో (తే) అవి (పితౄణామ్) పాలనమొనర్చువారికొరకు (బలాయ) బలముకొరకు (అజగరః) కొండచిలువ (వసూనామ్) అగ్ని మున్నగు వస్తువులకొరకు (కపిఞ్జలః) కపింజలమను ఏ (కపోతః) పావురము గలదో (ఉలూకః) గుడ్లగూబ మరియు (శశః) కుందేలు మున్నగునవి ఏవి కలవో (తే) అవి (నిఋత్యై) నిఋతికొరకు (వరుణాయ) వరుణునికొరకు (ఆరణ్యః) ఆటవిక సంబంధ (మేషః) గొఱ్ఱెపొట్టేలు అని మీ రెరుగవలయును. ॥౩౮॥

భావార్థము :-ఏవి ఏ ఋతువుల మున్నగు వాని గుణములు గల పశువులుగలవో, అవి ఆ యా ఋతుస్వభావములు గలవిగా నెరుగవలయును. ॥౩౮॥

38. The frog belongs to the seasons; the rat, the kasha, the Manthal, these are the guardians; the python is for strength; Kapinjala is for the Vasus; pigeon, owl, hare are the harbingers of adversity; the wild ram serves as an example for the person trying to remove the foe.

౧౪౧౦. శ్విత్ర ఇత్యస్య ప్రజాపతిర్‌ఋషిః, ఆదిత్యాదయో దేవతాః, స్వరాట్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యాదియే.

౧౪౧౦ శ్విత్ర ఆదిత్యానాముష్ట్రో ఘృణీవాన్ వార్ధ్రీనసస్తే మత్యా అరణ్యాయ సృమరో రురూ రౌద్రః క్వయిః కుటరుర్దాత్యౌహస్తే వాజినాం కామాయ పికః॥౩౯॥

ప.వి:- శ్విత్రః, ఆదిత్యానామ్, ఉష్ట్రః, ఘృణీవాన్, ఘృణీవానితి ఘృణి+వాన్, వార్ధ్రీనసః, తే, మత్యై, అరణ్యాయ, సృమరః, రురుః, రౌద్రః, క్వయిః, కుటరుః, దాత్యౌహః, తే, వాజినామ్, కామాయ, పికః.॥౩౯॥

పదార్థః:-(శ్విత్రః) విచిత్రః పశువిశేషః (ఆదిత్యానామ్) కాలావయవానామ్ (ఉష్ట్రః) (ఘృణీవాన్) తేజస్విపశువిశేషః (వార్ధ్రీనసః) కంఠే స్తనవాన్మహానజః (తే) (మత్యై) ప్రజ్ఞాయై (అరణ్యాయ) (సృమరః) గవయః (రురుః) మృగవిశేషః (రౌద్రః) రుద్రదేవతాకః (క్వయిః) పక్షివిశేషః (కుటరుః) కుక్కుటః (దాత్యౌహః) కాకః (తే) (వాజినామ్) (కామాయ) (పికః) కోకిలః.॥౩౯॥

అన్వయః :- హే మనుష్యా యుష్మాభిర్యః శ్విత్రః స ఆదిత్యానామ్. య ఉష్ట్రో ఘృణీవాన్ వార్ధ్రీనసశ్చ తే మత్యై. యః సృమరః సోఽరణ్యాయ. యో రురుః స రౌద్రః. యే క్వయిః కుటరుర్దాత్యౌహశ్చ తే వాజినామ్. యః పికః స కామాయ చ విజ్ఞేయాః.॥౩౯॥

భావార్థః :- యే ఆదిత్యాదిగుణాః పశుపక్షిణస్తే తత్తత్ స్వభావాః సంతీతి వేద్యమ్.॥౩౯॥

పదార్థము :- ఓ మానవులారా! మీకు ఏ (శ్విత్రః) చిత్ర విచిత్రవర్ణముగల పశువిశేషము అది (ఆదిత్యానామ్) సమయముయొక్క అంగములకొరకు (ఉష్ట్రః) ఒంటె (ఘృణీవాన్) తేజముగల పశువిశేషము (వార్ధ్రీనసః) మెడయందు చన్నులవంటివిగల మేక (తే) అవి యన్నియు (మత్యై) బుద్ధికొరకు (సుమరః) గవయము [పాదములు తెలుపు గల జింక విశేషము] (అరణ్యాయ) వనముకొరకు(రురుః) మృగవిశేషము (రౌద్రః) రుద్రదేవతసంబంధము (క్వయిః) క్వయి యనుపేరుగల పక్షి (కుటరుః) కోడి పుంజు (దాత్యౌహః) కాకులు ఏవి గలవో (తే) అవి (వాజినామ్) అశ్వములకొరకు మరియు ఏ (పికః) కోకిల యున్నదో, అది (కామాయ) కామము [కోరిక] ల కొరకని మీరు చక్కగా దెలిసికొనుడు.॥౩౯॥

భావార్థము :-సూర్యుడు మున్నగు గుణములు గల ఏ యే పశుపక్ష్యాదులుగలవో అవి ఆ యా స్వభావములు గలవిగా నెరుగవలెను. ॥౩౯॥

39. The diverse coloured animal belongs to the Adityas (months) the camel, the Chriniwan, the big goat are for thought; Nil-Gaya is for the forest; the Ruru named deer is Rudra's Kvayi, cock, gallinule possess the qualities of horses; the cuckoo belongs to Passion.

౧౪౧౧. ఖడ్గ ఇత్యస్య ప్రజాపతి ర్ఋషిః, విశ్వేదేవాదయో దేవతాః,శక్వరీ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౪౧౧ ఖడ్గో వైశ్వదేవః శ్వా కృష్ణః కర్ణో గర్దభస్తరక్షుస్తే రక్షసామింద్రాయ
సూకరః సింహో మారుతః కృకలాసః పిప్పకా శకునిస్తే శరవ్యాయై
విశ్వేషాం దేవానాం పృషతః॥౪౦॥

ప.వి:- ఖడ్గః, వైశ్వదేవ ఇతి వైశ్వ+దేవః, శ్వా, కృష్ణః, కర్ణః గర్దభః, తరక్షుః, తే,రక్షసామ్, ఇంద్రాయ, సూకరః, సింహః, మారుతః, కృకలాసః, పిప్పకా, శకునిః, తే, శరవ్యాయై, విశ్వేషామ్, దేవానామ్, పృషతః.॥౪౦॥

పదార్థః :- (ఖడ్గః) తుండశృంగః పశువిశేషః (వైశ్వదేవః) విశ్వేషాం దేవానామయమ్ (శ్వా) కుక్కురః (కృష్ణః) కృష్ణగుణవిశేషః (కర్ణః) దీర్ఘకర్ణః (గర్దభః) పశువిశేషః (తరక్షుః) వ్యాఘ్రః (తే) (రక్షసామ్) (ఇంద్రాయ) విదారకాయ (సూకరః) యః సుష్ఠు శుద్ధిం కరోతి స బలిష్ఠో వరాహః (సింహః) హింసకో వ్యాఘ్రః (మారుతః) మరుద్దేవతాకః (కృకలాసః) సరటః (పిప్పకా) పక్షిణీ (శకునిః) (తే) (శరవ్యాయై) శరవీషు కుశలాయై (విశ్వేషామ్) అఖిలానామ్ (దేవానామ్) విదుషామ్ (పృషతః) మృగవిశేషః.॥౪౦॥

అన్వయః :-హే మనుష్యా యుష్మాభిర్యః ఖడ్గః స వైశ్వదేవో, యే కృష్ణః శ్వా కర్ణో గర్దభస్త రక్షుశ్చ తే రక్షసాం, యః సూకరః స ఇంద్రాయ, యః సింహః స మారుతో, యే కృకలాసః పిప్పకా శకునిశ్చ తే శరవ్యాయై, యే పృషతస్తే విశ్వేషాం దేవానాం విజ్ఞేయాః.॥౪౦॥

భావార్థః:-యే సర్వే పశుపక్షిణః సర్వగుణాః సంతి తాన్ విజ్ఞాయ వ్యవహారసిద్ధయే సర్వే మనుష్యా నియోజయంతామితి.॥౪౦॥

పదార్థము :- ఓ మానవులారా! మీకు (ఖడ్గః) ఎత్తైన, పదునైన కొమ్ములు గల ఏ ఖడ్గమృగము గలదో యది (వైశ్వదేవః) సకల విద్వాంసుల (కృష్ణః) నల్లని వర్ణముగల (శ్వా) శ్వానము [కుక్క] (కర్ణః)

పెద్దచెవులుగల (గర్దభః) గాడిద మరియు (తరక్షుః) వ్యాఘ్రమేదో గలవి (తే) అవి యన్నియు (రక్షసామ్) దుష్టహింసకులగు రాక్షసులకొరకు (సూకరః) సూకరము [పంది] (ఇన్ద్రాయ) శత్రువులను విదారపరచునట్టి రాజుకొరకు (సింహః) సింహము (మారుతః) మరుత్తు దేవతగా గలది (కృకలాసః) తొండ [ఊసరవెల్లి] (పిప్పకా) పిప్పకమను ఆడపక్షి (శకునిః) ఒక విధమగు పక్షివిశేషము ఏవి గలవో (తే) అవియన్నియు (శరవ్యాయై)శరవులయందు నేర్పరు లగువారికొరకు (పృషతః) పృషజాతి మృగవిశేషము (విశ్వేషామ్) అవియన్నియును (దేవానామ్) విద్వాంసులకొరకని యెరుగవలయును. ॥40॥

**భావార్థము** :- ఏ పశుపక్ష్యాదుల సమస్త గుణపూరములై యున్నవియో వానిని దెలిసికొని వ్యవహారమును సిద్ధించుకొను మనుష్యులు నిరంతరము సుఖులై యుందురు. ॥40॥

40. Rhinoceros serves all warriors in preparing their shield; the black dog, the long-eared ass, the hyena are used for protection, against the demons; the boar is for the king who wants to tear asunder the foes, the lion is swift like air; the chameleon, the Pippaka, the vultures are used for making arrows; the spotted antelope is used for preparing mrigshalas (seats of the deer'rs sking) for all the learned people.

అస్మిన్నధ్యాయే పశుపక్షిమృగసరీసృపజలజన్తు కృమ్యాదీనాం గుణవర్ణనాదేతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతిరస్తీతి బోద్ధవ్యమ్॥

ఈ యధ్యాయమునందు పశుపక్ష్యాదులు, మృగములు, ప్రాకుచు నడచునట్టిసరీసృపములు, సర్పాదులు, వన్యమృగములు, జలచరములు మరియు క్రిమికీటకాదులు మున్నగువాని గుణముల వర్ణన యుండుటచే ఈ యధ్యాయముయొక్క అర్థమునకు పూర్వాధ్యాయమందు చెప్పబడిన అర్థముతో సంగతి గలదని యెరుగవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానంద సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే చతుర్వింశోఽధ్యాయః పూర్తిమగాత్

శ్రీ మత్పరమహంసపరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి ఇరువదినాల్గవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత బీబిపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడుమగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన పం. లోకములహరి సిద్ధాంతాచార్యులచే నొనర్చబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదము నందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ.శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ

నేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ,ఆర్షవిద్యావినోద ఆచార్య

'మల్లె కృష్ణారెడ్డి' సంపాద కత్వమున పరిష్కరింపబడిన

**ఇరువదినాల్గవ అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

# యజుర్వేదభాష్యము

## ౨౯వ అధ్యాయము - విషయసూచిక

ఇందులో 48 మంత్రములు, 50 ఛందస్సులు, 1010 పదములు, 2499 అక్షరములు

| క్ర.సం. | విషయము | మంత్రములు |
|---|---|---|
| 1. | సాంసారిక పదార్థముల గుణములు | ౪-౯,౧౨ |
| 2. | పశ్వాది ప్రాణులకు నేర్పుట పాలించుట | ౨౬,౨౭ |
| 3. | స్వకీయాంగముల రక్షణ | ౧-౩,౩౪ |
| 4. | పరమేశ్వరుని ప్రార్థన | ౧౦,౧౧,౧౩,౧౮,౧౯ |
| 5. | యజ్ఞ ప్రశంస | ౧౪-౧౬,౧౮,౩౩ |
| 6. | బుద్ధిని ఇచ్చుట | ౨౧(౪౮) |
| 7. | ధర్మేచ్ఛ | ౨౨-౨౫,౨౮-౩౦,౪౭ |
| 8. | అశ్వగుణముల వర్ణన, అశ్వశిక్ష (దానికి నడక నేర్పుట) | ౩౧-౩౩,౩౫-౩౮,౪౧,౪౨ |

## అథ పంచవింశోఽధ్యాయః

### అస్మిన్నధ్యాయే అష్టచత్వారింశన్మన్త్రాః సన్తీతివేదితవ్యమ్.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ। యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౧౪౧౨.శాదమిత్యస్య ప్రజాపతిరృషిః। సరస్వత్యాదయో దేవతాః, పూర్వస్య భురిక్ ఛక్వరీ,

ఆదిత్యానిత్యుత్తరస్య నిచృదతి శక్వరీ ఛందః, ధైవతః స్వరః.

అథ కేన కిం కర్తవ్యమిత్యాహ. ఎవడేమి చేయవలయును?

౧౪౧౨ శాదం దద్భిరవకాం దన్తమూలైర్మృదం బర్స్వైస్తే గాన్దంష్ట్రాభ్యాంసరస్వ త్యాఽఅగ్రజిహ్వం జిహ్వాయా ఉత్సాదమవక్రన్దేన తాలు వాజంహను భ్యామప ఆస్యేన వృషణమాణ్డాభ్యామ్। ఆదిత్యాన్ శ్మశ్రుభిః పన్థానం భ్రూభ్యాం ద్యావాపృథివీ వర్తోభ్యాం విద్యుతం కనీనకాభ్యాం శుక్లాయ స్వాహా కృష్ణాయ స్వాహా పార్యాణి పక్ష్మాణ్యవార్యా ఇక్షవోఽ వార్యాణి పక్ష్మాణి పార్యాఽ ఇక్షవః॥౧॥

ప.వి:-శాదమ్, దద్భిరితి దత్+భిః, అవకామ్, దన్తమూలైరితి దన్త+మూలైః, మృదమ్, బర్స్వైః, తే, గామ్, దంష్ట్రాభ్యామ్, సరస్వత్యై, అగ్రజిహ్వమిత్యగ్ర+జిహ్వమ్, జిహ్వాయాః, ఉత్సాదమిత్యుత్+సాదమ్, అవక్రన్దేనేత్యవ+క్రన్దేన, తాలు, వాజమ్, హనుభ్యామితి హను+భ్యామ్, అపః, ఆస్యేన, వృషణమ్, ఆణ్డాభ్యామ్ ఆదిత్యాన్, శ్మశ్రుభిరితి శ్మశ్రు+భిః,

పన్థానమ్, భ్రూభ్యామ్, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, వర్త్మభ్యామితి వర్త్మ+భ్యామ్, విద్యుతమితి వి+ద్యుతమ్, కనీనకాభ్యామ్, శుక్లాయ, స్వాహా, కృష్ణాయ, స్వాహా, పార్యాణి, పక్ష్మాణి, అవార్యాః, ఇక్షవః, అవార్యాణి, పక్ష్మాణి, పార్యాః, ఇక్షవః.॥౧॥

పదార్థః :-(శాదమ్) శీయతేఛివత్తి యస్మిన్తం శాదమ్ (దద్భిః) దంతైః (అవకామ్) రక్షికామ్ (దన్తమూలైః) దంతానాం మూలైః (మృదమ్) మృత్తికామ్ (బర్స్వైః) దంతపృష్ఠైః (తే) తవ (గామ్) వాణీమ్ (దంష్ట్రాభ్యామ్) ముఖహంతాభ్యామ్ (సరస్వత్యై) ప్రశస్తవిజ్ఞానవత్యై వాచే (అగ్రజిహ్వమ్) జిహ్వాయా అగ్రమ్ (జిహ్వాయాః) (ఉత్సాదమ్) ఊర్ధ్వం సీదంతి యస్మిన్తమ్ (అవక్రన్దేన) వికలతారహితేన (తాలు) ఆస్యావయవమ్ (వాజమ్) అన్నమ్ (హనుభ్యామ్) ముఖైకదేశాభ్యామ్ (అపః) జలాని (ఆస్యేన) ఆస్యందంతి క్లేదీభవంతి యస్మింస్తేన(వృషణమ్) వర్షయితారమ్ (ఆండాభ్యామ్) వీర్యాధారాభ్యామ్ (ఆదిత్యాన్) ముఖ్యాన్ విదుషః (శ్మశ్రుభిః) ముఖాఽభితః కేశైః (పన్థానమ్)మార్గమ్ (భ్రూభ్యామ్) నేత్ర గోలకోర్ధ్వాఽవయవాభ్యామ్ (ద్యావాపృథివీ) సూర్యభూమీ (వర్త్మభ్యామ్) గమనాగమనాభ్యామ్ (విద్యుతమ్) తడితమ్ (కనీనకాభ్యామ్) తేజోమయాభ్యాం కృష్ణగోలకతారకాభ్యామ్ (శుక్లాయ) వీర్యాయ (స్వాహా) బ్రహ్మచర్యక్రియయా (కృష్ణాయ) విద్యాకర్షణాయ (స్వాహా) సుశీలతాయుక్తయా క్రియయా (పార్యాణి) పరితుం పూరయితుం యోగ్యాని (పక్ష్మాణి) పరిగ్రహీతుం యోగ్యాని కర్మాణి నేత్రోర్ధ్వలోమాని వా (అవార్యాః) అవారే భవాః (ఇక్షవః) ఇక్షుదండాః (అవార్యాణి) అవారేషు భవాని (పక్ష్మాణి) పరిగ్రహణాని లోమాని వా (పార్యాః) పరితుం పాలయితుం యోగ్యాః (ఇక్షవః) గుడాదినిమిత్తాః.॥౧॥

అన్వయః:- హే జిజ్ఞాసో విద్యార్థిన్! తే దద్భిః శాదం దంతమూలైర్బర్స్వైశ్చావకాం మృదం దంష్ట్రాభ్యాం సరస్వత్యై గాం జిహ్వాయా అగ్రజిహ్వమవక్రందేనోత్సాదం తాలు హనుభ్యాం వాజమాస్యేనాఽప ఆండాభ్యాం వృషణం శ్మశ్రుభిరాదిత్యాన్ భ్రూభ్యాం పంథానం వర్త్మభ్యాం ద్యావాపృథివీం కనీనకాభ్యాం విద్యుతమహం బోధయామి. త్వయా శుక్లాయ స్వాహా కృష్ణాయ స్వాహా పార్యాణి పక్ష్మాణ్యవార్యా ఇక్షవోఽవార్యాణి పక్ష్మాణి పార్యా ఇక్షవశ్చ సంగ్రాహ్యాః.॥౧॥

**భావార్థః :-అధ్యాపకాః శిష్యేణవంగాన్యుపదేశేన పుష్టాని కృత్వాఽఽహారవిహారాదికం సంబోధ్య సర్వా విద్యాః ప్రాపయ్యాఖండితం బ్రహ్మచర్యం సేవయిత్వైశ్వర్యం ప్రాపయ్య సుఖినః సంపాదయేయుః.॥1॥**

**పదార్థము :-** ఉత్తమజ్ఞానము నభిలషించు విద్యార్థీ! (తే) నీవు (దద్భిః) దంతములచే (శాదమ్) కొరుకు, లేక నమలు నట్టి వ్యవహారమును (దన్తమూలైః) దంతమూలములతో (బర్స్వైః) దంతముల ప్రక్కలచే (అవకామ్) రక్షణనొనర్పు (మృదమ్) మట్టిని (దంష్ట్రాభ్యామ్) దవడలచే (సరస్వత్యై) విశేషజ్ఞానవంతమగు వాణికొరకు (గామ్) వాణిని (జిహ్వయాః) నాలుకచే (అగ్రజిహ్వమ్) జిహ్వ [నాలుక] గ్రమున (అవక్రన్దేన) వ్యాకులత్వములేని వ్యవహారముచే (ఉత్సాదమ్) పై భాగమునుండు తాలువును (హనుభ్యామ్) దవడలచే (వాజమ్) అన్నమును (ఆస్యేన) భోజనము మున్నగు పదార్థములను ద్రవింపజేయు ముఖముచే (అపః) జలములను (ఆణ్డాభ్యామ్) వీర్యమును చక్కగా ధారణమొర్పు బీజాండములచే (వృషణమ్) వీర్యమును స్రవింపజేయు అంగమును (శ్మశ్రుభిః)ముఖమునందున్న గడ్డపువెంట్రుకలచే (ఆదిత్యాన్) ముఖ్య విద్వాంసులను (భ్రూభ్యామ్) కనుగ్రుడ్ల పై భాగపు కనుబొమ్మలచే (పన్థానమ్) మార్గమును (వర్త్రోభ్యామ్) రాక పోకలచే (ద్యావాపృథివీ) సూర్యుడు, భూమి మరియు (కనీనకాభ్యామ్) తేజస్సుతోనిండిన నల్లని నక్షత్రములవంటి కనుగ్రుడ్లచే (విద్యుతమ్) విద్యుత్తును నే నెరుగుదును. నీకు (శుక్లాయ) వీర్యముకొరకు (స్వాహా) బ్రహ్మచర్య క్రియద్వారా (కృష్ణాయ) విద్యనాకర్షించుటకై (స్వాహా) ఉత్తమ శీలముతొ గూడిన క్రియచే (పార్యాణి) పూర్ణపరచదగిన (పక్ష్మాణి) పరిగ్రహింపదగిన కర్మలను లేక కనురెప్ప వెంట్రుకలను (అవార్యాః) నదీతీరములందు పైరగు (ఇక్షవః) చెరుకుగెడలను (అవార్యాణి) నదీతీరములందు పండు పదార్థములు (పక్ష్మాణి) గ్రహించదగిన వాని రోమములను (పార్యాః) పాలించదగిన (ఇక్షవః) బెల్లము మున్నగు వాని నిమిత్తమగు చెరుకు మున్నగు పదార్థములను చక్కగా గ్రహించవలయును. ॥1॥

**భావార్థము :-**అధ్యాపకులు తమ విద్యార్థులకు [శిష్యులకు] ఉపదేశములద్వారా సర్వాంగములను పుష్టివంతముగ నుంచుటకు, ఆహారవిహారాదులందు అతిశ్రద్ధను చక్కగా బోధించుచు, సమస్త విద్యల నవగాహనమొనర్చుకొనుట, అఖండిత బ్రహ్మచర్యము నుత్తమముగా సేవించుట, వానిద్వారా ఉత్తమైశ్వర్యములచే సుఖయుక్తులగుటకు ప్రయత్నము నొనర్పవలయును.॥1॥

1. Learn from teeth the act of biting; from gums the method of protection; from tooth - sockets the way of pounding; sharpness from fangs. Ise the tongue-tip for a learned utterance; learn the act of uprooting from the tongue, the use of palate by crying slowly; chew food with both the jaws; drink waters with the mouth. Acquire the knowledge of oozing semen from testicles. Recognise the Aditya Brahmcharis from their beard; know the path from eyebrows; know the Sun and Earth from their motion; lightning from the pupils of eyes. Observe celibacy for the protection of semen, acquire knowledge through high character. Objects worth acceptance are worthy of preservation. Objects after one's desire should not be resisted. Don't show disrespect to your own men. Friends and relatives should be fostered.

౧౪౧౩.వాతమిత్యస్య ప్రజాపతిర్ఋషిః, ప్రాణాదయో దేవతాః, భురిగతిశక్వర్యా ఛందసి, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల నదియే.

౧౪౧౩ వాతం ప్రాణేనాపానేన నాసికేఽఉపయామమధరేణౌష్ఠేన సదుత్తరేణ
ప్రకాశేనాన్తరమనూకాశేన బాహ్యం నివేష్యం మూర్ధ్నా స్తనయిత్నుం నిర్బాధేనా
శనిం మస్తిష్కేణ విద్యుతం కనీనకాభ్యాం కర్ణాభ్యాఀ శ్రోత్రం శ్రోత్రాభ్యాం
కర్ణౌ తేదనీమధరకణ్ఠేనాపః శుష్కకణ్ఠేన చిత్తం మన్యాభి రదితిం శీర్ష్ణా నిర్ఋతిం
నిర్జర్జల్పేన శీర్ష్ణా సంక్రోశైః ప్రాణాన్ రేష్మాణఀ స్తుపేన ॥౨॥

ప.వి:- వాతమ్, ప్రాణేన, అపానేనేత్యప+ అనేన, నాసికే ఇతి నాసికే, ఉపయామ మిత్యుప+యామమ్, అధరేణ, ఓష్ఠేన సత్, ఉత్తరేణేత్యుత్+తరేణ, ప్రకాశేనేతి ప్ర+కాశేన, అన్తరమ్, అనూకాశేన, అనూకాశేనేత్యను+కాశేన, బాహ్యమ్, నివేష్యమితి ని+వేష్యమ్, మూర్ధ్నా, స్తనయిత్నుమ్, నిర్బాధేనేతి నిః+బాధేన, అశనిమ్, మస్తిష్కేణ, విద్యుతమితి వి+ద్యుతమ్, కనీనకాభ్యామ్, కర్ణాభ్యామ్, శ్రోత్రమ్, శ్రోత్రాభ్యామ్, కర్ణౌ తేదనీమ్ అధరకణ్ఠేనేత్యధరఽ కణ్ఠేన అపః, శుష్కకణ్ఠేనేతి శుష్క + కణ్ఠేన, చిత్తమ్, మన్యాభిః, అదితిమ్, శీర్ష్ణా, నిర్ఋతిమితి, నిః+ఋతిమ్, నిర్జర్జల్పేనేతి, నిః+జర్జల్పేన, శీర్ష్ణా, సంక్రోశైరితి సమ్+క్రోశైః, ప్రాణాన్, రేష్మాణమ్, స్తుపేన.॥౨॥

పదార్థః :-(వాతమ్) వాయుమ్ (ప్రాణేన) (అపానేన) (నాసికే) నాసికాఛిద్రే (ఉపయామమ్) ఉపగతం నియమమ్ (అధరేణ) ముఖాదధస్థేన (ఓష్ఠేన) (సత్)

(ఉత్తరేణ) ఉపరిష్ఠేన (ప్రకాశేన) (అంతరమ్) మధ్యస్థమాభ్యంతరమ్ (అనూకాశేన) అనుప్రకాశేన (బాహ్యమ్) బహిర్భవమ్ (నివేష్యమ్) నిశ్చయేన వ్యాప్తుం యోగ్యమ్ (మూర్ధ్నా) మస్తకేన (స్తనయిత్నుమ్) శబ్దనిమిత్తాం విద్యుతమ్ (నిర్బాధేన) నితరాం బాధేన హేతునా (అశనిమ్) వ్యాపికాం ఘోషయుక్తామ్ (మస్తిష్కేణ) శిరస్థమజ్జాతంతు సమూహేన (విద్యుతమ్) విశేషేణ ద్యోతమానమ్ (కనీనకాభ్యామ్) ప్రదీప్తాభ్యాం కమనీయాభ్యాం (కర్ణాభ్యామ్) శ్రవణసాధకాభ్యామ్ (శ్రోత్రమ్) శృణోతి యేన తత్ (శ్రోత్రాభ్యామ్) శృణోతి యాభ్యాం గోలకాభ్యాం తాభ్యాం (కర్ణౌ) కరోతి శ్రవణం యాభ్యాం తౌ (తేదనీమ్) శ్రవణక్రియామ్ (అధరకంఠేన) అధస్థేన కంఠేన (అపః) జలాని (శుష్కకంఠేన) (చిత్తమ్) విజ్ఞానసాధికామంతఃకరణవృత్తిమ్ (మన్యాభిః) విజ్ఞానక్రియాభిః (అదితిమ్) అవినాశికాం ప్రజ్ఞామ్ (శీర్ష్ణా) శిరసా, (నిర్‌ృతిమ్) భూమిమ్ (నిర్జర్జల్పేన) నితరాం జర్జరీభూతేన (శీర్ష్ణా) శిరసా (సంక్రోశైః) సమ్యగాహ్వానైః, (ప్రాణాన్) (రేష్మాణమ్) హింసకమ్ (స్తుపేన) హింసనేన.॥౨॥

అన్వయః:-హే జిజ్ఞాసో మదుపదేశగ్రహణేన త్వం ప్రాణేనాపానేన వాతం నాసికే ఉపయామమధరేణౌష్ఠేనోత్తరేణ ప్రకాశేన సదంతరమనూకాశేన బాహ్యం మూర్ధ్నా నివేష్యం నిర్బాధేన సహ స్తనయిత్నుమశనిం మస్తిష్కేణ విద్యుతం కనీనకాభ్యాం కర్ణాభ్యాం కర్ణౌ శ్రోత్రాభ్యాం చ శ్రోత్రం తేదనీమధరకంఠేనాపః శుష్కకంఠేన చిత్తం మన్యాభిరదితిం శీర్ష్ణా నిర్‌ృతిం నిర్జర్జల్పేన శీర్ష్ణా సంక్రోశైః ప్రాణాన్ ప్రాప్నుహి స్తుపేన హింసనేన రేష్మాణమవిద్యాదిరోగం హింధి.॥౨॥

భావార్థః:-సర్వైర్మనుష్యైః ప్రథమవయసి సర్వైః శరీరాదిభిః సాధనైః శరీరాత్మబలే సంసాధనీయే అవిద్యాకుశిక్షాకుశీలాదయో రోగాః సర్వథా హంతవ్యాః.॥౨॥

పదార్థము :-తెలిసికొనగోరు నో జిజ్ఞాసూ! నా యుపదేశమును గ్రహించిన నీవు (ప్రాణేన) ప్రాణము మరియు (అపానేన) అపానములచే (వాతమ్) వాయువు మరియు (నాసికే) నాసికారంధ్రముల (ఉపయామమ్) ప్రాప్తించిన నియమములను (అధరేణ) క్రింది (ఓష్ఠేన) పెదవిచే (ఉత్తరేణ) పైనున్న (ప్రకాశేన) ప్రకాశరూప పై పెదవిచే (సదన్తరమ్) మధ్యనున్న ముఖము మున్నగుస్థానములను (అనూకాశేన) వెనకనుండి ప్రకాశించు అంగముచే (బాహ్యమ్) బయటనున్న అంగములచే (మూర్ధ్నా) శిరస్సుతో (నివేష్యమ్) నిశ్చయముగా వ్యాప్తమునకు యోగ్యమగు దానిని (నిర్బాధేన) నిరంతరము తాడనముగు కారణమున (స్తనయిత్నుమ్) శబ్దమొనర్చు (అశనిమ్) విద్యుత్తును (కనీనకాభ్యామ్) దీప్తించుచు (కర్ణాభ్యామ్) శబ్దమునువినిపింపజేయు పవనముచే (కర్ణౌ) కర్ణములను (శ్రోత్రాభ్యామ్)శబ్దమును గ్రహించు కర్ణభేదములచే (శ్రోత్రమ్) శ్రవణేంద్రియము [చెవి] (తేదనీమ్) శ్రవణ మొనర్చు క్రియ (అధర కణ్ఠేన) కంఠముయొక్క

దిగువ భాగముచే (అపః) జలముల (శుష్కకంఠేన) ఎండిన కంఠముచే (చిత్తమ్) విశేషమగు జ్ఞానమును సాధించు అంతఃకరణముయొక్క నడవడిని (మన్యాభిః) విశేష జ్ఞానక్రియలద్వారా (అదితిమ్) నాశరహితమగు ఉత్తమ బుద్ధిని (శీర్ష్ణా) శిరస్సుతో (నిర్బుతిమ్) భూమిని (నిర్జర్జల్పేన) నిరంతరము జీర్ణమై అన్నివిధములుగ పరిపక్వము చెందిన (శీర్ష్ణా) శిరము మరియు (సంక్రోశైః) ఉత్తమాహ్వానములచే (ప్రాణాన్) ప్రాణములను ప్రాప్తించు గాక! మరియు (స్తుపేన) హింసతో గూడియున్న (రేష్మాణమ్) హింసాత్మకమగు అవిద్య [అజ్ఞానము] మున్నగు రోగములను నాశనమొనర్చుము.॥౨॥

**భావార్థము** :- మానవు లెల్లరును మొదటి వయస్సున సర్వశారీరక సాధనములచే శారీరక, ఆత్మిక శక్తులను చక్కగా సాధించుకొనవలెను. మరియు అవిద్య, చెడుశిక్షణ, నిందితస్వభావము మున్నగు రోగములను అన్నివిధముల నష్టమొనర్చుకొనవలెను.॥౨॥

2. Fill air with thy Pran; empty the nostrils with Apan; with upper and lower lips observe restraint, silence and control; with the light of knowledge purify thy soul; with the practice of cleanliness purify the exterior body; reflect upon God with Thy head; by constant thinking create your doubt to know the truth; understand with thy brain the internal fire; receivefull light with the pupils of thy eyes; advance hearing with thy ears; strengthen thy external ears with the internal organs of hearing; eat food with thy lower throat; drink water with thirsty throat; strengthen thy mind with practices of knowledge; develop indestructible wisdom with thy head; attin to mother Earth through death, with your ragged head; improve your vital breaths through loud roaring remove the disease of ignorance with full might.

౧౪౧౪.మశకానిత్యస్య ప్రజాపతిర్ఋషిః. ఇంద్రాదయో దేవతాః, భురిక్కృతిశ్ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. విషయ మయ్యదియే.

౧౪౧౪ మశకాన్కేశై రిన్ద్రꣳ స్వపసా వహేన బృహస్పతిꣳ శకునిసాదేన

కూర్మాఞ్ఛఫైరాక్రమణꣳ స్థూరాభ్యామృక్షలాభిః కపిఞ్జలాన్ జవం

జఙ్ఘాభ్యా మధ్వానం బాహుభ్యాం జామ్బీలేనారణ్యమగ్నిమతిరుగ్భ్యాం

పూషణం దోర్భ్యా మశ్వినావꣳసాభ్యాꣳ రుద్రꣳ రోరాభ్యామ్ ॥౩॥

ప.వి:- మశకాన్, కేశైః, ఇన్ద్రమ్, స్వపసేతి సు + అపసా, వహేన, బృహస్పతిమ్, శకునిసాదేనేతి శకుని + సాదేన, కూర్మాన్, శఫైః, ఆక్రమణమిత్యా+క్రమణమ్, స్థూరాభ్యామ్,

ఋక్షలాభిః, కపిఞ్జలాన్, జవమ్, జఙ్ఘాభ్యామ్, అధ్వానమ్, బాహుభ్యామితి బాహు+భ్యామ్, జాంబీలేన, అరణ్యమ్, అగ్నిమ్, అతిరుగ్భ్యామిత్యతిరుగ్ + భ్యామ్, పూషణమ్, దోర్భ్యామితి దోః+భ్యామ్, అశ్వినౌ, అంసాభ్యామ్ రుద్రమ్, రోరాభ్యామ్.॥3॥

పదార్థః :-(మశకాన్) (కేశైః) శిరస్థైర్వాలైః (ఇంద్రమ్) ఐశ్వర్యమ్ (స్వపసా) సుష్ఠుకర్మణా (వహేన) ప్రాపణేన (బృహస్పతిమ్) బృహత్యా వాచః స్వామినం విద్వాంసమ్ (శకునిసాదేన) యేన శకునీన్సాదయతి తేన (కూర్మాన్) కచ్ఛపాన్ (శఫైః) ఖురైః (ఆక్రమణమ్) (స్థూరాభ్యామ్) స్థూలాభ్యామ్ (ఋక్షలాభిః) గత్యాదానైః (కపింజలాన్) పక్షివిశేషాన్ (జవమ్) వేగమ్,(జంఘాభ్యామ్) (అధ్వానమ్) మార్గమ్ (బాహుభ్యామ్) భుజాభ్యామ్(జాంబీలేన)ఫలవిశేషేణ (అరణ్యమ్)వనమ్(అగ్నిమ్)పావకమ్ (అతిరుగ్భ్యామ్) రుచీచ్ఛాభ్యామ్ (పూషణమ్) పుష్టిమ్ (దోర్భ్యామ్) భుజదండాభ్యామ్ (అశ్వినౌ) ప్రజారాజానౌ (అంసాభ్యామ్) భుజమూలాభ్యామ్ (రుద్రమ్) రోదయితారమ్ (రోరాభ్యామ్) కథనశ్రవణాభ్యామ్.॥3॥

అన్వయః:-హే మనుష్యా యూయం కేశైరింద్రం శకునిసాదేన కూర్మాన్ మశకాన్ స్వపసా వహేన బృహస్పతిం స్థూరాభ్యామృక్షలాభిః కపింజలాఞ్ జంఘాభ్యామధ్వానం జవమంసాభ్యాం బాహుభ్యాం శఫైరాక్రమణం జాంబీలేనారణ్యమగ్నిమతిరుగ్భ్యాం పూషణం దోర్భ్యామశ్వినౌ ప్రాప్నుత రోరాభ్యాం రుద్రం చ.॥3॥

భావార్థః:-మనుష్యైర్బహుభిరుపాయైరుత్తమా గుణాః ప్రాపణీయా విఘ్నాశ్చ నివారణీయాః.॥3॥

పదార్థము :-ఓ మానవులారా! మీరు (కేశైః) తలవెంట్రుకలచే (ఇంద్రమ్) ఐశ్వర్యమును (శకుని సాదేన) పక్షులను స్థిరముగానుంచు వ్యవహారముచే (కూర్మాన్) తాబేళ్లను మరియు (మశకాన్) దోమలను (స్వపసా) ఉత్తమ కార్యముచే మరియు (వహేన) ప్రాప్తింపజేయుటచే (బృహస్పతిమ్) బృహద్వాణికి అధికారియైన విద్వాంసుని (స్థూరాభ్యామ్) స్థూలమగు (ఋక్షలాభిః) నడవడి మరియు గ్రహణమొనర్చుట మున్నగు క్రియలద్వారా (కపిఞ్జలాన్) కపింజమను పేరుగల పక్షులను (జఙ్ఘాభ్యామ్) పిక్కలచే (అధ్వానమ్) మార్గము మరియు (జవమ్) వేగమును (అంసాభ్యామ్) భుజముల మూలము, అనగా చంకల (బాహుభ్యామ్) భుజముల (శఫైః) డెక్కల [గిట్టల] చే (ఆక్రమణమ్)నడకను (జాంబీలేన) నేరేడు మున్నగు ఫలముచే (అరణ్యమ్) వనము మరియు (అగ్నిమ్) అగ్నిని (అతిరుగ్భ్యామ్) అత్యంత రుచి, ప్రీతి, మరియు కోరికచే

వర్తమానః (మరుద్భిః) మనుష్యైః సహ (అస్మభ్యమ్) (భేషజా) భేషజాని (కరత్) కుర్యాత్ (యజ్ఞమ్) విద్వత్సత్కారాదికమ్ (చ) (నః) (అస్మాకమ్) (తన్వమ్) శరీరమ్ (చ) (ప్రజామ్) సంతానాదికమ్ (చ) (ఆదిత్యైః) ఉత్తమైర్విద్వద్భిః సహ (ఇంద్రః) ఐశ్వర్యకారీ సభేశః (సహ) (సీషధాతి) సాధయేత్.॥౪౬॥

అన్వయః :-హే మనుష్యా యథేంద్రశ్చ విశ్వే దేవాశ్చేమా విశ్వా భువనా ధరంతి తథా వయం కం ను సీషధామ. యథా సగణ ఇంద్ర ఆదిత్యైః సహ సర్వాంల్లోకాన్ ప్రకాశయతి తథా మరుద్భిః సహ వైద్యోఽస్మభ్యం భేషజా కరత్. యథాఽఽదిత్యైః సహేంద్రో నో యజ్ఞం చ తన్వం చ ప్రజాం చ సీషధాతి తథా వయం సాధ్నుయామ.॥౪౬॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యవన్నియమేన వర్తిత్వా శరీరమరోగమాత్మానం విద్వాంసం సంసాధ్య పూర్ణం బ్రహ్మచర్యం కృత్వా స్వయం వృతాం హృద్యాం స్త్రియం స్వీకృత్య, తత్ర ప్రజా ఉత్పాద్య సుశిక్ష్య విదుషీః కుర్వంతి తే శ్రియః పతయో జాయంతే॥౪౬॥

పదార్థము :-ఓ మానవులారా! (ఇన్ద్రః) పరమైశ్వర్యవంతుడగు రాజు (చ) మరియు (విశ్వే) సమస్త (దేవాః) విద్వాంసులు (చ) కూడ (ఇమా) ఈ సర్వ (భువనా) లోకముల నెట్లు ధారణమొనర్తురో, అట్లే మనము (కమ్) సుఖములను (ను) శీఘ్రముగా (సీషధామ) సాధించవలెను లేక ఎట్లు (సగణః) తన సహచరులు మున్నగు వారితో గూడ నున్న (ఇన్ద్రః) సూర్యుడు (ఆదిత్యైః) మాసము [నెల] లతోగూడనుండి సర్వలోకములను ప్రకాశింపజేయునో, అట్లే (మరుద్భిః) మనుష్యులతో గూడ వైద్యులు (అస్మభ్యమ్) మనకొరకు (భేషజా) ఓషధులను (కరత్) చేయవలెను ఎట్లు (ఆదిత్యైః) ఉత్తమ విద్వాంసులతో (సహ) కూడ (ఇన్ద్రః) పరమైశ్వర్యశాలియగు సభాపతి (నః) మాయొక్క (యజ్ఞమ్) విద్వాంసుల సత్కారము మున్నగు కార్యములు (చ) మరియు (తన్వమ్) శరీరము (చ) మరియు (ప్రజామ్) సంతానాదులను కూడ (చ) మరియు (సీషధాతి) సాధించెదరో, అట్లే మనము కూడ సాధించవలయును. ॥౪౬॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యునివంటి నియమము, ఆరోగ్యప్రదమగు శరీరము, విద్వత్తాపూర్ణమగు ఆత్మ, పూర్ణబ్రహ్మచర్యము, స్వయంవరవిధి వివాహముద్వారా హృదయమునకు ప్రీతిని గలిగించు పత్నిని స్వీకరించుట, తద్వారా శ్రేష్ఠ సంతానము నుత్పన్నము చేసి వారికి ఉత్తమ శిక్షణనిచ్చి విద్వాంసులనొనర్చు ధీరులు ధనపతు లగుదురు. ॥౪౬॥

46. Just as the glorious king and all learned persons hold under control these worlds, so should we speedily gain happiness.

Just as the Sun with his satellites, and twelve months manifests all worlds, so should a physician helped by other persons give us medicines. May the king with learned persons regulate our sacrifice, our bodies and our progeny.

౧౪౫౮.అగ్నే త్వమిత్యస్య గోతమ ఋషిః, అగ్నిర్దేవతా, శక్వరీ ఛందః, ధైవతః స్వరః.

పునః కే సత్కర్తవ్యాః సంతీత్యాహ. సత్కరించుటకు తగినవా రెవరు?

౧౪౫౮ అగ్నే త్వన్నో అన్తమ ఉత త్రాతా శివో భవా వరూథ్యః ।
వసురగ్నిర్వసుశ్రవా అచ్ఛా నక్షి ద్యుమత్తమం రయిం దాః॥౪౭॥

ప.వి:- అగ్నే, త్వమ్, నః, అంతమః, ఉత, త్రాతా, శివః, భవ, వరూథ్యః, వసుః, అగ్నిః, వసుశ్రవా ఇతి వసు+శ్రవాః, అచ్ఛ, నక్షి, ద్యుమత్తమమితి ద్యుమత్+తమమ్, రయిమ్, దాః.॥౪౭॥

పదార్థః:-(అగ్నే) వేదవిదధ్యాపకోపదేశక! (త్వమ్) (నః) అస్మాకమ్ (అంతమః) నికటస్థః (ఉత) అపి (త్రాతా) పాలకః (శివః) కల్యాణకారీ (భవ) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః. (వరూథ్యః) వరూథేషు గృహేషు సాధుః (వసుః) విద్యాసు వాసయితా (అగ్నిః) పావక ఇవ (వసుశ్రవాః) వసూని ధనాని శ్రవణే యస్య సః (అచ్ఛ) అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. (నక్షి) ప్రాప్నోషి. ణక్షధాతోరయం ప్రయోగః (ద్యుమత్తమమ్) అతిశయేన ప్రకాశవంతమ్ (రయిమ్) ధనమ్ (దాః) దద్యాః.॥౪౭॥

అన్వయః :-హే అగ్నే! త్వమగ్నిరివ నోఽన్తమస్త్రాతా శివ ఉత వరూథ్యో వసుశ్రవా వసుర్భవ. యో ద్యుమత్తమం రయిమస్మభ్యమచ్ఛ దాః. అస్మాన్నక్షి స త్వమస్మాభిః సత్కర్తవ్యోఽసి.॥౪౭॥

భావార్థః:-మనుష్యైః సర్వోపకారిణో వేదాదిశాస్త్రవేత్తారోఽధ్యాపకోపదేశకా విద్వాంసః సదైవ సత్కర్తవ్యాః. తే చ సత్కృతాః సంతః సర్వేభ్యః సదుపదేశాద్యుత్తమగుణాన్ ధనాదికం చ సదా ప్రయచ్ఛేయుః. యేన పరస్పరస్య ప్రీత్యుపకారేణ మహాన్ సుఖలాభః స్యాదితి. ॥౪౭॥

పదార్థము :-(అగ్నే) వేదవేత్తవు, చదివించు, ఉపదేశించు విద్వాంసుడా! నీవు (అగ్నిః) అగ్ని వంటివాడవు (నః) మాయొక్క (అన్తమః) సమీపస్థ (త్రాతా) రక్షకుడవు (శివః) మంగళప్రదుడవు (ఉత) మరియు (వరూథ్యః) గృహములందుత్తమమైన (వసుశ్రవాః) శ్రవణమునందు అనేక ధనము మరియు

(వసుః) విద్యలందు వసింప జేయువాడవు (భవ) అగుము (ద్యుమత్తమమ్) అత్యంతప్రకాశవంతమగు (రయిమ్) ధనములను మాకొరకు (అచ్ఛ,ధాః) విరివిగానిమ్ము. మాకు(నక్షి) ప్రాప్తించుము(త్వమ్) నీవు మాకు సత్కారయోగ్యుడవగుము. ॥౪౭॥

**భావార్థము** :-సకలజనోపకారి, వేదాదిశాస్త్రములజ్ఞాత, అధ్యాపక ఉపదేశకులగు విద్వాంసులను ఎల్లప్పుడును సత్కరించుట మానవులెల్లరకును యోగ్యము. అట్లు సత్కారమున పొందిన విద్వాంసులు సర్వజనులకు ఉపదేశము మున్నగు సద్గుణములను మరియు శీలసంపదల నీయవలెను. దీనివల్ల పరస్పర ప్రీతి, మరియు ఉపకారములచే గొప్పగొప్ప సుఖములు ప్రాప్తించును. ॥౪౭॥

47. O teacher and preacher, with mastery over the vedas, become near us our protectors, welfarers, givers of knowledge and wealth in our homes. Give us wealth most splendidly renowned. Come nigh unto us, so that we may express reverence unto ye!.

౧౪౫౮.తంత్వేత్యస్య గోతమ ఋషిః, విద్వాన్ దేవతా, భురిగ్బృహతీ ఛందః, మధ్యమః, స్వరః.

పునర్మనుష్యైరిహ కథం వర్తితవ్యమిత్యాహ. మానవు లీ జగత్తునం దెట్లు ప్రవర్తింపవయులను?

౧౪౫౮ తం త్వా శోచిష్ఠ దీదివః సుమ్నాయ నూనమీమహే సఖిభ్యః ।

స నో బోధి శ్రుధీ హవమురుష్యా ణో౾ అఘాయతః సమస్మాత్॥౪౮॥

ప.వి:- తమ్, త్వా, శోచిష్ఠ, దీదివ ఇతి దీది౾వః, సుమ్నాయ, నూనమ్, ఈమహే సఖిభ్య ఇతి సఖి+భ్యః, సః, నః, బోధి, శ్రుధీ, హవమ్, ఉరుష్య, నః, అఘాయతః, అఘయత ఇత్యఘ+యతః, సమస్మాత్.॥౪౮॥

పదార్థః:-(తమ్)(త్వా)త్వామ్ (శోచిష్ఠ) సద్గుణైః ప్రకాశమాన (దీదివః) విద్యాదిగుణైః శోభావన్ (సుమ్నాయ) సుఖాయ (నూనమ్) నిశ్చితమ్ (ఈమహే) యాచామహే (సఖిభ్యః) మిత్రేభ్యః (సః) (నః) అస్మాన్ (బోధి) బోధయ (శ్రుధీ)శృణు (హవమ్) ఆహ్వానమ్ (ఉరుష్య) రక్ష (నః)అస్మాకమ్ (అఘాయతః) ఆత్మనో౾ఘ మాచరతః (సమస్మాత్) అధర్మేణ తుల్యగుణకర్మస్వభావాత్.॥౪౮॥

అన్వయః :-హే శోచిష్ఠ దీదివో విద్వన్ యస్త్వం నో బోధి.తంత్వా సుమ్నాయ సఖిభ్యో నూనం వయ మీమహే. స త్వన్నో హవం శ్రుధి సమస్మాదఘాయత ఉరుష్య చ.॥౪౮॥

**భావార్థః :- విద్యార్థినోऽధ్యాపకాన్ ప్రత్యేవం వదేయుర్యువంతో యదస్మాభిరధీతం తత్పరీక్షంతామ్. అస్మాన్ దుష్టాచారాత్ పృథగ్రక్షంతు యతో వయం సర్వైః సహ మిత్రవద్వర్తేమహి.॥౪౮॥**

**పదార్థము :-** (శోచిష్ఠ) ఉత్తమగుణములచే ప్రకాశమానుడా! (దీదివః) విద్య మున్నగు సద్గుణములచే శోభావంతుడవగు విద్వాంసుడా ఏ నీవు (నః) మాకొరకు (బోధి) బోధించెదవో (తమ్) అట్టి (త్వా) నిన్ను (సుమ్నాయ) సుఖములు మరియు (సఖిభ్యః) మిత్రులకొరకు (నూనమ్) నిశ్చయముగ మేము (ఈమహే) యాచించుచున్నాము (సః) అట్టినీవు (నః) మాయొక్క (హవమ్) పిలుపును (శ్రుధి) వినుము (సమస్మాత్) అధర్మములవంటి గుణకర్మస్వభావములు గల (అఘాయతః) ఆత్మయొక్క అపరాధాచరణముల నొనర్చు దుష్టచోరలంపటములనుండి మమ్ము (ఉరుష్య) రక్షించుము. ॥౪౮॥

**భావార్థము :-** విద్యార్థులు అధ్యాపకులతో నిట్లు కోరవలయును! హే పూజ్య ఆచార్యా! మేము తమ వద్ద అభ్యసించిన విద్యలను పరీక్షించుడు. మరియు మమ్ము దుష్టాచరణమునుండి దూరముంచుడు. అందుచే మేము అందరికి మిత్రులముగనుండుటకు అవకాశముండును. ॥౪౮॥

48. o virtuous learned person, grant us knowledge. We pray unto thee for our happiness and the good of our friends. Listen to our call; and protect us from evil - minded and sinful persons!.

**అస్మిన్నధ్యాయే సృష్టస్థపదార్థగుణవర్ణనం, పశ్వాదిప్రాణినాం శిక్షారక్షణం, స్వాఙ్గరక్షణం, పరమేశ్వరప్రార్థనం, యజ్ఞ ప్రశంసా, ప్రజ్ఞాప్రాపణం, ధర్మేచ్ఛాऽశ్వగుణకథనం తచ్ఛిక్షణమాత్మజ్ఞానధనప్రాపణయోర్విధానం చోక్తమత ఏతదధ్యా యోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతిరస్తీతి వేద్యమ్ ॥౪౮॥**

**ఈ యధ్యాయమునందు ప్రపంచమందలి పదార్థగుణముల వర్ణనము, పశువులు మున్నగు వానికి శిక్షణనిచ్చుట మరియు పాలించుట, తమ యంగములరక్షణము, పరమేశ్వరప్రార్థనము, యజ్ఞముయొక్క ప్రశంస, బుద్ధిని పొందుట, ధర్మమునందిచ్ఛ, అశ్వలక్షణములు, వానిగుణములు, వానిశిక్షణము, నడక మున్నగునవి నేర్పుట, ఆత్మజ్ఞానము, మరియు ధన ప్రాప్తిని పొందువిధానము చెప్పబడియున్నవి. ఇందువల్ల ఈ యధ్యాయమున చెప్పబడిన యర్థము, వెనకటియధ్యాయమున జెప్పబడిన యర్థముతో సంబంధము గలదని ఎరుగవలయును.**

**ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానందసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే షడ్వింశోऽధ్యాయః పూర్తిమగాత్.**

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి ఇరువదియైదవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశ్లో ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్పబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కులప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
'మల్లి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన
**ఇరువది యైదవ అధ్యాయము సమాప్తము.**

ఓం శాంతి: శాంతి: శాంతి:.

# యజుర్వేదభాష్యము

## 26వ అధ్యాయము - విషయసూచిక

ఇందులో 26మంత్రములు, 26ఛందస్సులు, 457పదములు, 1061అక్షరములు

# అథ షడ్వింశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే షడ్వింశన్మన్త్రాః సన్తీతివేదితవ్యమ్.

ఓం॥విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౧౪౬౦.అగ్నిరిత్యస్య యాజ్ఞవల్క్య ఋషిః. అగ్న్యాదయో దేవతాః. అభికృతిశ్ఛన్దః, ఋషభః స్వరః.

అథ మనుష్యైస్తత్త్వేభ్య ఉపకారా యథావత్సంగ్రాహ్యా ఇత్యాహ.

మానవులు తత్త్వములతో యథావతుగా నుపకారమును పొందవలయునను విషయము వర్ణించబడెను.

౧౪౬౦ అగ్నిశ్చ పృథివీ చ సన్నతే తే మే సన్నమతామదో వాయుశ్చాన్తరిక్షం చ సన్నతే తే మే సన్నమతామదఽఆదిత్యశ్చ ద్యౌశ్చ సన్నతే తే మే సన్నమతామదఽఆపశ్చ వరుణశ్చ సన్నతే తే మే సన్నమతామదః । సప్త సꣳసదో అష్టమీ భూతసాధనీ। సకామాꣳ॥ అధ్వనస్కురు సంజ్ఞానమస్తు మేఽముునా॥౧॥

ప.వి:-అగ్నిః, చ, పృథివీ, చ, సన్నతేఽ ఇతి సమ్+ నతే, తే ఇతి తే, మే, సమ్, నమతామ్, అదః, వాయుః, చ, అన్తరిక్షమ్, చ, సన్నతే ఇతి సమ్+నతే, తే ఇతి తే, మే, సమ్, నమతామ్, అదః, ఆదిత్యః, చ, ద్యౌః, చ, సన్నతే ఇతి సమ్+నతే, తే ఇతి తే, మే, సమ్, నమతామ్, అదః, ఆపః, చ, వరుణః చ, సన్నతే ఇతి సమ్+నతే, తే ఇతి తే, మే, సమ్, నమతామ్, అదః, సప్త, సꣳసద ఇతి సమ్+సదః, అష్టమీ, భూతసాధనీతి భూత+సాధనీ, సకామానితి స+కామాన్, అధ్వనః, కురు, సంజ్ఞానమితి సమ్+జ్ఞానమ్, అస్తు, మే, అమునా.॥౧॥

పదార్థః :-(అగ్నిః)పావకః (చ) (పృథివీ) (చ) (సన్నతే) (తే) (మే) మహ్యమ్, (సమ్) సమ్యక్ (నమంతామ్) అనుకూలం కుర్వాతామ్ (అదః) (వాయుః) (చ) (అన్తరిక్షమ్) (చ) (సన్నతే) అనుకూలే (తే) (మే) మహ్యమ్ (సమ్) (నమంతామ్) (అదః) (ఆదిత్యః) సూర్యః(చ)(ద్యౌః) తత్ప్రకాశః (చ) (సన్నతే) (తే) (మే) మహ్యమ్ (సమ్) (నమంతామ్) (అదః) (ఆపః) జలాని (చ) (వరుణః) తదవయవీ (చ) (సన్నతే) (తే) (మే) మహ్యమ్ (సమ్) (నమంతామ్) (అదః) (సప్త) (సంసదః) సమ్యక్ సీదన్తి యాసు తాః (అష్టమీ) అష్టానాం పూరణా (భూతసాధనీ) భూతానాం సాధికా (సకామాన్) సమానాస్తుల్యాః కామా యేషాం తాన్ (అధ్వనః) మార్గాన్ (కురు) (సంజ్ఞానమ్) సమ్యగ్జ్ఞానమ్ (అస్తు) (మే) మహ్యమ్ (అమునా) ఏవం ప్రకారేణ.॥౧॥

అన్వయః :-హే మనుష్యా! యథా యే మేఽగ్నిశ్చ పృథివీ చ సన్నతే తే అదః సన్నమతాం యే మే వాయుశ్చాన్తరిక్షం చ సన్నతే స్తస్తే అదః సన్నమతామ్. యే మే ఆదిత్యశ్చ ద్యౌశ్చ సన్నతే తే అదః సన్నమతామ్, యే మే ఆపశ్చ వరుణశ్చ సన్నతే స్తస్తే అదః సన్నమతామ్. యా అష్టమీ భూతసాధనీ సప్త సంసదః సకామానధ్వనః కుర్యాత్ తథా కురు. అమునా మే సంజ్ఞానమస్తు తథైతత్సర్వం యుష్మాకమప్యస్తు.॥౧॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యద్యగ్న్యాదిపఞ్చభూతాని యథావద్విజ్ఞాయ కశ్చిత్ప్రయుఞ్జీత తర్హి తాని వర్తమానమందః సుఖం ప్రాపయన్తి. ॥౧॥

పదార్థము :-ఓ మానవులారా! ఎట్లు (మే) నాకొరకు (అగ్నిః) అగ్ని (చ) మరియు (పృథివీ) భూమి (చ) కూడ (సన్నతే) అనుకూలములో (తే) అవి (అదః) వీనిని (సన్నమతామ్) అనుకూలమొనర్చుగాక! ఏవి (మే) నాకొరకు (వాయుః) పవనము (చ) మరియు (అన్తరిక్షమ్) ఆకాశము (చ) కూడా (సన్నతే) అనుకూలములో (తే) అవి (అదః) వీనిని (సన్నమతామ్) అనుకూలపరచుగాక! ఏవి(మే) నాకొరకు (ఆదిత్యః) సూర్యుడు (చ) మరియు (ద్యౌః) దాని ప్రకాశము (చ) కూడ (సన్నతే) అనుకూములో (తే) అవి (అదః) వీనికి (సన్నమతామ్) అనుకూలమొనర్చుగాక! ఏవి (మే) నాకొరకు (ఆపః) జలములు (చ) మరియు (వరుణః) జలములు దేనికి అవయవములో అవి (చ) కూడ (సన్నతే) అనుకూలములో (తే) ఆ రెండును (అదః) వీనిని (సన్నమతామ్) అనుకూలపరచుగాక! ఏవి (అష్టమీ) ఎనిమిదవ (భూతసాధనీ) ప్రాణుల కార్యముల సాధింప జేయునట్టి లేక (సప్త) ఏడవ (సంపదః) చక్కగా జనులు స్థిరమైయుండునట్టి ఏ సభ గలదో (సకామాన్) సమానమగు కోరికలుగల (అధ్వనః) మార్గములనేర్పరుతురో అట్లు మీరు (కురు) చేయుడు (అమునా) ఈవిధముగా (మే) నాకొరకు (సంజ్ఞానమ్) ఉత్తమజ్ఞానము (అస్తు) ప్రాప్తించునో అట్లే ఇవన్నియును మీకును ప్రాప్తించుగాక!॥౧॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. అగ్న్యాది పంచతత్త్వములను యథా తథముగ నెరిగినవారు వానిని చక్కగా నుపయోగమొనర్చుకొనినచో నవి వర్తమానమైయున్న అత్యుత్తమ సుఖముల లభింపజేయును. ॥౧॥

1. Fire and Earth are favourable to me; may they be subservient to me in the accomplishment of that aim of mine.

Air and firmament are favourable to me; may they be subservient to me in the accomplishment of that aim of mine. Sun and his light are favourable to me; may they be subservient to me in the accomplishment of that aim of mine. Waters and clouds are favourable to me, may they be subservient to me in the accomplishment of that aim of mine. Out of these seven forces are the mainstay of all beings, the eighth is Earth which keeps every one under its sway. O God make all our paths pleasant and comfortable!.

౧౪౬౧ యథేమామిత్యస్య లౌగాక్షిర్ఋషిః ఈశ్వరో దేవతా, స్వరాడత్యష్టిశ్ఛన్దః, గాన్ధారః స్వరః.

అథేశ్వరః సర్వేభ్యో మనుష్యేభ్యో వేదపఠనశ్రవణాధికారం దదాతీత్యాహ.

ఈశ్వరుడు సర్వమానవులకు వేదము చదువుటకు, వినుటకు అధికార మొసంగు చున్నాడు.

౧౪౬౧ యథేమాం వాచం కల్యాణీమావదాని జనేభ్యః। బ్రహ్మరాజన్యాభ్యాం

శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయచ। ప్రియో దేవానాం

దక్షిణాయై దాతురిహ భూయాసమయం మే కామః

సమృధ్యతాముప మాదో నమతు ॥౨॥

ప.వి:- యథా, ఇమామ్, వాచమ్, కల్యాణీమ్, ఆవదానీత్యా+వదాని, జనేభ్యః, బ్రహ్మరాజన్యాభ్యామ్, శూద్రాయ, చ, అర్యాయ, చ, స్వాయ, చ, అరణాయ, ప్రియః, దేవానామ్, దక్షిణాయై, దాతుః, ఇహ, భూయాసమ్, అయమ్, మే, కామః, సమ్, ఋధ్యతామ్, ఉప, మా, అదః, నమతు.॥౨॥

పదార్థః :-(యథా) యేన ప్రకారేణ (ఇమామ్) ప్రత్యక్షీకృతామ్ (వాచమ్) వేదచతుష్టయీం వాణీమ్ (కల్యాణీమ్) కల్యాణనిమిత్తామ్ (ఆవదాని) సమన్తాదుపదిశేయమ్ (జనేభ్యః) మనుష్యేభ్యః (బ్రహ్మరాజన్యాభ్యామ్) బ్రహ్మ బ్రాహ్మణశ్చ రాజన్యః క్షత్రియశ్చ తాభ్యామ్ (శూద్రాయ) చతుర్థవర్ణాయ (చ) (అర్యాయ) వైశ్యాయ. అర్యః స్వామివైశ్యయోరితి పాణినిసూత్రమ్ (చ) (స్వాయ) స్వకీయాయ (చ)(అరణాయ) సల్లక్షణాయ ప్రాప్తాయాన్త్యజాయ (ప్రియః) కమనీయః (దేవానామ్) విదుషామ్ (దక్షిణాయై) దానాయ (దాతుః) దానకర్తుః (ఇహ) అస్మిన్ సంసారే (భూయాసమ్) (అయమ్) (మే) మమ (కామః) (సమ్) (ఋధ్యతామ్) వర్ద్ధతామ్ (ఉప) (మా) మామ్ (అదః) పరోక్షసుఖమ్ (నమతు) ప్రాప్నోతు.॥౨॥

అన్వయః :-హే మనుష్యా యథాఽహమీశ్వరో బ్రహ్మరాజన్యాభ్యామర్యాయ శూద్రాయ చ స్వాయ చారణాయ చ జనేభ్య ఇహేమాం కల్యాణీం వాచమావదాని తథా భవన్తోఽ ప్యావదన్తు. యథాఽహం దాతుర్దేవానాం దక్షిణాయై ప్రియో భూయాసం, మేఽయం కామః సమృధ్యతాం, మాఽద ఉపనమతు తథా భవన్తోఽపి భవన్తు. తద్భవతామప్యస్తు. ॥౨॥

భావార్థః :-అత్రోపమాలఙ్కారః. పరమాత్మా సర్వాన్మనుష్యాన్ప్రతీదముపదిశతీయం వేదచతుష్టయీ వాక్ సర్వమనుష్యాణాం హితాయ మయోపదిష్టా నాఽత్ర కస్యాప్యనధి కారోఽస్తీతి. యథాఽహం పక్షపాతం విహాయ సర్వేషు మనుష్యేషు వర్తమానః సన్ ప్రియోఽ స్మి తథా భవన్తోఽపి భవన్తు. ఏవఙ్కృతే యుష్మాకం సర్వే కామాః సిద్ధా భవిష్యన్తీతి.॥౨॥

పదార్థము :-ఓ మానవులారా! ఈశ్వరుడను నేను (యథా) ఎట్లు (బ్రహ్మరాజన్యాభ్యామ్) బ్రాహ్మణ క్షత్రియులకొరకు (అర్యాయ) వైశ్యుల (శూద్రాయ) శూద్రుల (చ) మరియు (స్వాయ) వారిస్త్రీలు, సేవకులు మున్నగు (చ) మరియు (అరణాయ) ఉత్తమ లక్షణములతో గూడిన అంత్యజులకొరకు (చ) కూడ (జనేభ్యః) ఈ పై దెలిపిన మనుష్యులందరకొరకు (ఇహ) ఈ విశ్వమునందు (ఇమామ్) ఈ ప్రకటపరచబడిన (కల్యాణీమ్) సుఖములను ప్రసాదించు (వాచమ్) నాలుగువేదముల వాణిని (ఆవదాని) ఉపదేశించుచున్నాను. ఇదేవిధముగ మీరును ఉత్తమరీతిలో ఉపదేశించుచుండుడు. నే నెట్లు (దాతు) దానమొసగువారి సహవాసమున (దేవానామ్) విద్వాంసుల (దక్షిణాయై) దక్షిణ, అనగా దానాదులకొరకు (ప్రియః) మనోహర ప్రియుడను (భూయాసమ్) అగుదునో మరియు (మే) నాయొక్క (ఇయమ్) ఇట్టి (కామః) కామితము [కోరిక] (సమృధ్యతామ్) ఉత్తమముగా వృద్ధియగుగాక! మరియు (మా) నాకు (అదః) ఆ పరోక్షసుఖము ఎట్లు (ఉప, నమతు) ప్రాప్తమగుచున్నదియో, అట్లే మీకును అగును గాక! ఆ కోరికను మరియు సుఖములను మీకును ప్రాప్తమగునుగాక!॥౨॥

భావార్థము :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. పరమేశ్వరుడు సమస్తమానవులను గూర్చి ఇట్లుపదేశించుచున్నాడు. ఓ మానవులారా! ఈ చతుర్వేదరూప కల్యాణప్రదమగు వాణిని సకల మానవుల హితముకొరకై నే నుపదేశించియున్నాను. వీనియందెవ్వరును అనధికారులు గారు. నే నెట్లు పక్షపాతములేక సమస్త మానవులందు వర్తమానమై యుండి ప్రియతముడనై యున్నానో, అట్లే మీరును అగుడు. ఇట్లొనర్చుటచే మీ సకల కార్యములు సిద్ధించగలవు.॥౨॥

2. I do hereby address this slautary speech for the benefit of humanity, for the Brahmanas, the Kshatriyas, the Shudras, the Vaishas, the kinsfolk and the men of lowest position in society.

Dear may I be to the learned and the guerdon -giver in this world, Fulfilled be this desire of mine. May I achieve my aim.

౧౮౬౨.బృహస్పత ఇత్యస్య గృత్సమద ఋషిః. ఈశ్వరో దేవతా, భురిగత్యష్టిశ్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః స ఈశ్వరః కిం కరోతీత్యాహ.

మరల నా ఈశ్వరుడేమి చేయుచున్నాడను విషయ మీ మంత్రనుందు చెప్పబడెను.

౧౮౬౨ బృహస్పతే అతి యదర్యో అర్హాద్ద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు।

యద్దీదయచ్ఛవసఽఋతప్రజాత తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమ్।

ఉపయామగృహీతోఽసి బృహస్పతయే త్వైష తే

యోనిర్బృహస్పతయే త్వా॥౩॥

ప.వి:- బృహస్పతే, అతి, యత్, అర్యః, అర్హాత్, ద్యుమదితి ద్యు+మత్, విభాతీతి వి+భాతి, క్రతుమదితి క్రతు+మత్, జనేషు, యత్, దీదయత్, శవసా, ఋతప్రజాతేత్యృత +ప్రజాత, తత్, అస్మాసు, ద్రవిణమ్, ధేహి, చిత్రమ్, ఉపయామగృహీత ఇత్యుపయామ +గృహీతః, అసి, బృహస్పతయే, త్వా, ఏషః, తే, యోనిః, బృహస్పతయే, త్వా.॥౩॥

పదార్థః :-(బృహస్పతే) బృహతాం ప్రకృత్యాదీనాం జీవానాం చ పాలకేశ్వర (అతి) (యత్) (అర్యః) స్వామీశ్వరః. అర్యః స్వామివైశ్యయోః. అర్య ఇతీశ్వరనా....నిఘం. 2. 22. (అర్హాత్) యోగ్యాత్ (ద్యుమత్) ప్రశస్తప్రకాశయుక్తం మనః (విభాతి) విశేషతయా ప్రకాశతే (క్రతుమత్) ప్రశస్తప్రజ్ఞాకర్మయుక్తమ్ (జనేషు) మనుష్యేషు (యత్) (దీదయత్) ప్రకాశయత్స్యాత్ (శవసా) బలేన (ఋతప్రజాత) ఋతం సత్యం ప్రజాతం యస్మాత్తత్సంబుద్ధౌ (తత్) (అస్మాసు) (ద్రవిణమ్) ధనం యశశ్చ (ధేహి) (చిత్రమ్) ఆశ్చర్యమ్ (ఉపయామగృహీతః) ఉపగతయమైర్విదితః (అసి) (బృహస్పతయే) బృహత్యా వాచః పాలనాయ (త్వా) త్వామ్ (ఏషః) (తే) తవ (యోనిః) ప్రమాణమ్ (బృహస్పతయే) బృహతామాప్తానాం పాలకాయ (త్వా) త్వామ్.॥3॥

అన్వయః :-హే బృహస్పతే యస్త్వముపయామగృహీతోఽసి, తం త్వా బృహస్పతయే యస్యైష తే యోనిరస్తి తస్మై బృహస్పతయే త్వా వయం స్వీకుర్మః. హే ఋతప్రజాతార్యస్త్వం జనేష్వర్హాద్యద్ద్యుమత్ క్రతుమదతివిభాతి యచ్ఛవసా దీదయదస్తి తచ్చిత్రం విజ్ఞానం ద్రవిణం చాస్మాసు ధేహి.॥3॥

భావార్థః:-హే మనుష్యా! యస్మాన్మహాన్దయాలుర్న్యాయకార్యణీయాన్కశ్చిదపి పదార్థో నాస్తి యేన వేదావిర్భావద్వారా సర్వే మనుష్యా భూషితా, యేనాద్భుతం విజ్ఞానం ధనం చ విస్తారితం,యో యోగాభ్యాస గమ్యోఽస్తి,స ఏవేశ్వరోఽస్మాభిః సర్వైరుపాసనీయతమోఽస్తీతి విజానీత.॥3॥

పదార్థము :-(బృహస్పతే) మహాప్రకృత్యాది పదార్థముల మరియు జీవులను పాలించునట్టి పరమేశ్వరుడవగు నీవు (ఉపయామగృహీతః) ప్రాప్తించినట్టి నియమములు మున్నగు యోగసాధనములద్వారా దెలిసికొనబడువాడవై (అసి) ఉన్నావు. అట్టి (త్వా) నిన్ను (బృహస్పతయే) గొప్ప వేదవాణిని పాలించుకొరకు మరియు ఏ (తే) నీయొక్క (ఏషః) ఈ (యోనిః) ప్రమాణములుగలవో, ఆ (బృహస్పతయే) గొప్పగొప్ప ఆప్తవిద్వాంసులను పాలనమొనర్చువారికై (త్వా) నిన్ను మేము స్వీకరించుచున్నాము. ఓ జగదీశ్వరా! (ఋతప్రజాత) ఎవరిచే సత్యమగు ఉత్తమతత్త్వము ఉత్పన్నమైయున్నదో,అట్టి (అర్యః) పరమాత్మవగు నీవు (జనేషు) మానవులందు (అర్హాత్) యోగ్యమగు కార్యముచే (యత్) ఏ (ద్యుమత్) ప్రశంసనీయ, ప్రకాశయుక్తమగు మనస్సు లేక (క్రతుమత్) ప్రశంసనీయబుద్ధి మరియు కర్మతో గూడిన మనస్సు (అతివిభాతి) విశేషముగ ప్రకాశమానమై యున్నదియో లేక (యత్) ఎయ్యది (శవసా) బలముచే (దీదయత్) ప్రకాశవంతమై యున్నదియో (తత్) అట్టి (చిత్రమ్) ఆశ్చర్యరూప [విచిత్ర] మగు జ్ఞానము (ద్రవిణమ్) ధనము మరియు యశములను (అస్మాసు) మాయందు (ధేహి) స్థాపనమొనర్చుము. ॥3॥

భావార్థము :- ఓ మానవులారా! ఎవనికన్న గొప్ప దయాళువు న్యాయకారి, అత్యంత సూక్ష్మమగు పదార్థవేదియును లేదో మరియు నెవడు వేదమును ప్రకాశపరచుటద్వారా మానవులనెల్లరను సుశోభితమొనర్చినాడో, ఎవడు అద్భుతమగు జ్ఞానము, ధనము విశ్వమునందు విస్తృతపరచియున్నాడో, మరియు నెవడు యోగాభ్యాసముచేతనే పొందదగినవాడో, అట్టిపరమేశ్వరుడే మనందరకు అతిగా ఉపాసించదగినవాడని మీరు ఎరుగుడు. ॥3॥

3. O God, th guardian of mighty material objects and souls, Thou art realised through the practice of yoga. We accept Thee as the Protector of the Vedas, which symbolise The authority, and as the Nourisher of selfless scholars!.

O God, Truth is noble born of Thee. O God Thou adequately kindlest in men splendid refulgent mind, laudable wisdom and effectual active mind!.

Thou existest as a highly resplendent entity through self - force.

Grant us marvellous knowledge, riches and fame.

౧౪౮౩.ఇన్ద్రేత్యస్య రమ్యాక్షీ ఋషిః, ఇన్ద్రో దేవతా, స్వరాడ్జగతీ ఛన్దః నిషాదః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యురిత్యాహ. మరల మానవులేమి చేయవలయునను విషయము చెప్పబడెను.

౧౪౮౩ ఇన్ద్ర గోమన్నిహా యాహి పిబా సోమꣳశతక్రతో విద్యద్భిర్గ్రావభిః

సుతమ్ । ఉపయామగృహీతోఽసీన్ద్రాయ త్వా గోమత ఏష తే

యోనిరిన్ద్రాయ త్వా గోమతే॥౪॥

ప.వి:- ఇన్ద్ర, గోమన్నితి గో+మన్, ఇహ, ఆ, యాహి, పిబ, సోమమ్, శతక్రతో ఇతి శత +క్రతో, విద్యద్భిరితి విద్యత్+భిః, గ్రావభిరితి గ్రావ+భిః, సుతమ్, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, ఇన్ద్రాయ, త్వా, గోమత ఇతి గో+మతే, ఏషః, తే, యోనిః, ఇన్ద్రాయ, త్వా, గోమత ఇతి గో+మతే.॥౪॥

పదార్థః :-(ఇన్ద్ర)విద్వన్ మనుష్య (గోమన్) ప్రశస్తా గావ్యాణీ విద్యతే యస్య తత్సంబుద్ధౌ (ఇహ) అస్మిన్ సంసారే (ఆ) (యాహి) ప్రాప్నుహి (పిబ) అత్ర ద్వ్యచోఽతస్తిఙ

ఇతి దీర్ఘః (సోమమ్) రసమ్ (శతక్రతో) శతమసంఖ్యాః క్రతవః ప్రజ్ఞా యస్య తత్సంబుద్ధౌ (విద్యద్భిః) విద్యమానైః. అత్ర వ్యత్యయేన పరస్మైపదమ్ (గ్రావభిః) మేఘైః (సుతమ్) నిష్పన్నమ్ (ఉపయామగృహీతః) ఉపయామైర్గృహీతాని జితాని ఇన్ద్రియాణి యేన సః (అసి) (ఇన్ద్రాయ) ఐశ్వర్యాయ (త్వా) త్వామ్ (గోమతే) ప్రశస్తపృథివీరాజ్య యుక్తాయ (ఏషః) (తే) (యోనిః) నిమిత్తమ్ (ఇన్ద్రాయ) ప్రశస్తైశ్వర్యవతే (త్వా) త్వామ్ (గోమతే) ప్రశస్తవాగ్వతే.॥౪॥

అన్వయః :-హే శతక్రతో గోమన్నిన్ద్ర త్వమిహ యాహి విద్యద్భిర్గ్రావభిః సుతం సోమం పిబ యత స్త్వముపయామగృహీతోఽసి తస్మాద్గోమత ఇన్ద్రాయ త్వా యస్యైష తే యోనిరస్తి తస్మై గోమత ఇన్ద్రాయ త్వా చ వయం సత్కుర్మః.॥౪॥

భావార్థః :-యే వైద్యకశాస్త్రవిద్యాసిద్ధాని మేఘోత్పన్నాన్యోషధాని సేవన్తే యోగం చాభ్యస్యన్తి తే సుఖైశ్వర్యయుక్తా జాయన్తే.॥౪॥

పదార్థము :-(శతక్రతో) అనేక విధములగు సద్బుద్ధిగల (గోమన్) ప్రశంసితవాణిగల (ఇన్ద్ర) ఓ విద్వాంసుడా! నీవు (ఆ, యాహి) రమ్ము (ఇహ) ఈ ప్రపంచమునందు (విద్యద్భిః) విద్యమానమై యున్న (గ్రావభిః) మేఘములచే (సుతమ్) ఉత్పన్నమైన (సోమమ్) సోమవల్లి మున్నగు ఓషధుల రసమును (పిబ) త్రాగుము. దీనిచే నీవు (ఉపయామ గృహీతః) యమనియమాదులచే గ్రహించబడిన అనగా ఇంద్రియములను, జయించిన వాడవై (అసి) ఉన్నావు. కావుననే (గోమతే) ప్రశస్తమగు పృథివీరాజ్యముతో గూడిన ధీరునికొరకు (ఇన్ద్రాయ) ఉత్తమ ఐశ్వర్యములకొరకు (త్వా) నీయొక్క మరియు ఏ (తే) నీ (ఏషః) ఈ (యోనిః) నిమిత్తకారణము గలదో, అట్టి (గోమతే)ప్రశంసితవాణి (ఇన్ద్రాయ) ప్రశంసిత ఐశ్వర్యముతో గూడిన ఉత్తమునికొరకు (త్వా) నిన్ను మేము సత్కరించెదము. ॥౪॥

భావార్థము :-వైద్యవిద్యాసాధకులు మేఘములనుండి ఉత్పన్నమైన ఓషధులను సేవించి యోగాభ్యాస మొనర్చువారు సుఖము మరియు ఐశ్వర్యములను పొందుదురు.॥౪॥

4. O learend person, possessing vast wisdom and knowledge of the vedas, come here, and drink the juice of medicines ripened by clouds. Thou hast controlled thy senses through yamas and niyamas. We accept thee as the master of worldly kingship and grand supremacy. This is thy home of knowledge. We accept thee as protector of vedic speech, and as full of glory!.

౧౩౬౪.ఇన్ద్రేత్యస్య రమ్యాక్షీ ఋషిః, సూర్యో దేవతా, భురిక్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కిం క్రియేత ఇత్యాహ.

మరల మనుష్యులు ఏమి చేయవలయునను విషయము చెప్పబడెను.

౧౪౬౪ ఇన్ద్రాయాహి వృత్రహన్ పిబా సోమ్ఙ్శతక్రతో।

గోమద్భిః గ్రావభిః సుతమ్। ఉపయామగృహీతో౽సీన్ద్రాయ త్వా

గోమతఽఏష తే యోనిరిన్ద్రాయ త్వా గోమతే ॥౭౫॥

ప.వి:-ఇన్ద్ర, ఆ, యాహి, వృత్రహన్నితి వృత్ర+హన్, పిబ, సోమమ్, శతక్రతో ఇతి శత+క్రతో, గోమద్భిరితి గోమత్+భిః, గ్రావభిరితి గ్రావ+భిః, సుతమ్, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, ఇన్ద్రాయ, త్వా, గోమత ఇతి గో+మతే, ఏషః, తే, యోనిః, ఇన్ద్రాయ, త్వా, గోమత ఇతి గో+మతే. ॥౭౫॥

పదార్థః :-(ఇన్ద్ర) పరమైశ్వర్యయుక్త (ఆ) సమన్తాత్ (యాహి) గచ్ఛ (వృత్రహన్) యో వృత్రం మేఘం హన్తి స సూర్యస్తద్వత్ (పిబ) అత్ర ద్వ్యచో౽తస్తిఙ ఇతి దీర్ఘః. (సోమమ్) ఐశ్వర్యకారకం రసమ్ (శతక్రతో) బహుప్రజ్ఞాకర్మయుక్త (గోమద్భిః)బహవో గావః కిరణా విద్యన్తే యేషు తైః (గ్రావభిః) గర్జనాయుక్తైర్మేఘైః (సుతమ్) నిష్పాదితమ్ (ఉపయామగృహీతః) సునియమైర్నిగృహీతాత్మా (అసి) (ఇన్ద్రాయ) ఐశ్వర్యాయ (త్వా) త్వామ్ (గోమతే) బహుధేన్వాదియుక్తాయ (ఏషః) (తే) తవ (యోనిః) గృహమ్ (ఇన్ద్రాయ) ఐశ్వర్యమిచ్ఛుకాయ (త్వా) త్వామ్ (గోమతే) ప్రశస్తభూమిరాజ్యయుక్తాయ.॥౭౫॥

అన్వయః :-హే శతక్రతో వృత్రహన్నిన్ద్ర త్వం గోమద్భిర్గ్రావభిః సహాయాహి సుతం సోమం పిబ. యతస్త్వం గోమత ఇన్ద్రాయోపయామగృహీతో౽సి, తం త్వా యస్యైష తే గోమత ఇన్ద్రాయ యోనిరస్తి తం త్వా చ వయం సత్కుర్యామ.॥౭౫॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! యథా మేఘహన్తా సూర్యః సర్వస్య జగతో రసం పీత్వా వర్షయిత్వా సర్వం జగత్ప్రీణాతి తథైవ త్వం మహౌషధిరసాన్ పిబ, ఐశ్వర్యోన్నతయే ప్రయతస్వ చ.॥౭౫॥

పదార్థము :-(శతక్రతో) గొప్పబుద్ధి మరియు కర్మ యుక్తడవు (వృత్రహన్) మేఘహంతకుడగు సూర్యునివలె శత్రువుల నిర్జించు (ఇన్ద్ర) పరమైశ్వర్యశాలివగు విద్యాంసుడా! నీవు (గోమద్భిః) ప్రకాశవంతమగు

అనేక కిరణములచే దేదీప్యమగు పదార్థముల (గ్రావభిః) గర్జనములతో గర్జించు మేఘములతో గూడ (ఆ, యాహి) రమ్ము (సుతమ్) ఉత్పన్నమైన (సోమమ్) ఐశ్వర్యప్రదమగు రసమును (పిబ) పానమొనర్చుము. ఏ కారణమున నీవు (గోమతే) పుష్కలముగ క్షీరములనిచ్చు గోవులతో గూడ (ఇన్ద్రాయ) ఐశ్వర్యమునకై (ఉపయామ గృహీతః) ఉత్తమ నియమములచే ఆత్మను గ్రహణమొనర్చినవాడవై (అసి) ఉన్నావో, అట్టి (త్వా) నిన్ను మరియు ఏ (తే) నీయొక్క (ఏషః) ఈ (గోమతే) ప్రశంసనీయ పృథివీరాజ్యముతో గూడిన (ఇన్ద్రాయ) ఐశ్వర్యము నాకాంక్షించువారికి (యోనిః) గృహమైయున్నదో అట్టి నిన్ను మేము సత్కరించెదము.॥౫॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఎట్లు మేఘహంతకుడగు సూర్యుడు విశ్వమంతటినుండి రసమును గ్రాగి వర్షరూపమున జగత్తును ప్రసన్న పరచునో, అట్లే మీరను మహామహోషధీరసముల పానమొనర్చి ఐశ్వర్యోన్నతికై ఉత్తమ ప్రయత్నమొనర్చుడు.॥౫॥

5. O exalted learned person, full of wisdom and deeds, slayer of foes like the cloud - dispeller sun, come, and drink deep the essence of knowledge produced by the knowers of the vedas. Thou hast controlled thy soul by yogic practices. We accept thee as the master of milk - yielding kine and grand supremacy. This is thy home of knowledge. We accept thee as the master of worldly possessions, and desirous of glory.

౧౪౮౬. ఋతావానమిత్యస్య ప్రాదురాక్షిరృషిః. వైశ్వానరో దేవతా, జగతీ ఛందః. నిషాదః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ.

మఱల మానవులేమి చేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౮౬ ఋతావానం వైశ్వానరమృతస్య జ్యోతిషస్పతిమ్। అజస్రం ఘర్మమీమహే।

ఉపయామగృహీతో ఽసి వైశ్వానరాయ త్వైష తే యోనిర్వైశ్వానరాయ త్వా।౬॥

ప.వి:- ఋతావానమ్, ఋతవానమిత్యృత+వానమ్, వైశ్వానరమ్, ఋతస్య, జ్యోతిషః, పతిమ్, అజస్రమ్, ఘర్మమ్, ఈమహే, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, వైశ్వానరాయ, త్వా, ఏషః, తే, యోనిః, వైశ్వానరాయ, త్వా.।౬॥

పదార్థః :-(ఋతావానమ్) య ఋతం జలం వనతి సంభజతి తమ్ (వైశ్వానరమ్) విశ్వేషాం నరాణాం మధ్యే రాజమానమ్ (ఋతస్య) జలస్య (జ్యోతిషః) ప్రకాశస్య (పతిమ్) పాలకమ్ (అజస్రమ్) నిరన్తరమ్ (ఘర్మమ్) ప్రతాపమ్ (ఈమహే) యాచామహే

(ఉపయామగృహీతః) సునియమైర్నిగృహీతాన్తఃకరణః (అసి) (వైశ్వానరాయ) విశ్వస్య నాయకాయ (త్వా) (ఏషః) (తే)(యోనిః) గృహమ్(వైశ్వానరాయ)(త్వా)త్వామ్.॥౬॥

అన్వయః :-హే మనుష్యా యథా వయమృతావానం వైశ్వానరమృతస్య జ్యోతిషస్పతిం ఘర్మమజస్రమీమహే తథా యూయమప్యేనం యాచత. యస్త్వం వైశ్వానరాయోపయామగృహీతోఽసి తం త్వా యస్యైష తే యోనిరస్తి తం త్వా చ వైశ్వానరాయ సత్కుర్మస్తథా యూయమపి కురుత.॥౬॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యోఽగ్నిర్జలాదీని మూర్తాని ద్రవ్యాణి స్వతేజసా భినత్తి నిరన్తరం జలమాకర్షతి చ తం విదిత్వా మనుష్యాః సర్వర్తు సుఖకారకం గృహమలంకుర్యుః.॥౬॥

పదార్థము :- ఓ మానవులారా! మే మెట్లు (ఋతువానమ్) జలములను సేవించునట్టిది. (వైశ్వానరమ్) సమస్త మానవులందు ప్రకాశమానమై యున్న (ఋతస్య) జలము (జ్యోతిషః) ప్రకాశముయొక్క (పతిమ్) పాలనమొనర్చు (ఘర్మమ్) ప్రతాపమును (అజస్రమ్) నిరంతరము (ఈమహే) యాచించుచుందుమో, అట్లే మీరును దీనిని యాచించుడు. మీ రెట్లు (వైశ్వానరాయ) విశ్వప్రభువునకై (ఉపయామగృహీతః) చక్కని నియమములద్వారా మనస్సును జయించి (అసి) ఉన్నారో, అట్టి (త్వా) నిన్ను మరియు ఏ (తే) నీయొక్క (ఏషః) ఈ (యోనిః) గృహముగలదో, అట్టి (త్వా) నిన్ను (వైశ్వానరాయ) సమస్త విశ్వహితమునకై సత్కారవంతులుగ నొనర్చుచున్నామో, మీరును అటులనే చేయుడు.॥౬॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాంలకారము గలదు. అగ్ని, జలము మున్నగు మూర్తివంతమగు పదార్థములను తన తేజముతో భిన్నాభిన్నమొనర్చి నిరంతరము జలములను లాగుకొని వర్షింపజేయు సూర్యుని దెలిసికొని మానవులు సకల ఋతువులందును సుఖమును గలిగించునట్టి గృహమును నిర్మించుకొని పూర్ణులైయుండవలెను.॥౬॥

6. We daily pray for the light of knowledge, unto God, the Lord of learning, the leader of humnity, and the Embodiment of Truth. Thou art realised through yogic practices. I accept Thee as the Leader of humnity ! This hearts is Thy home.

I accept Thee as being the Lover of all people.

౧౪౭౬.వైశ్వానరస్యేత్యస్య కుత్సఋషిః, వైశ్వానరోఽగ్నిర్దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యురిత్యాహ.

మఱల మనుష్యులేమి చేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౮౬. వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీః। ఇతో జాతో విశ్వమిదం వి చష్టే వైశ్వానరో యతతే సూర్యేణ। ఉపయామ గృహీతోఽసి వైశ్వానరాయ త్వైష తే యోనిర్వైశ్వానరాయ త్వా॥౭॥

ప.వి:- వైశ్వానరస్య, సుమతావితి సు+మతౌ, స్యామ, రాజా, హి, కమ్, భువనానామ్, అభిశ్రీరిత్యభి+శ్రీః, ఇతః, జాతః, విశ్వమ్, ఇదమ్, వి, చష్టే, వైశ్వానరః, యతతే, సూర్యేణ, ఉపయామ గృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, వైశ్వానరాయ, త్వా, ఏషః, తే, యోనిః, వైశ్వానరాయ, త్వా.॥౭॥

పదార్థః :-(వైశ్వానరస్య) విశ్వస్య నాయకస్య (సుమతౌ) శోభనాయాం బుద్ధౌ (స్యామ) భవేమ (రాజా) ప్రకాశమానః (హి)ఖలు (కమ్) సుఖమ్ (భువనానామ్) (అభిశ్రీః) అభితః సర్వతః శ్రియో యస్య సః (ఇతః) అస్మాత్ కారణాత్ (జాతః) ప్రకటః సన్ (విశ్వమ్) సర్వం జగత్ (ఇదమ్) (వి, చష్టే) ప్రకాశయతి (వైశ్వానరః) విద్యుదగ్నిః (యతతే) (సూర్యేణ) సూర్యమండలేన (ఉపయామగృహీతః) సునియమైః స్వీకృతః (అసి) వైశ్వానరాయ) అగ్నయే (త్వా) త్వామ్ (ఏషః) (తే) తవ (యోనిః) గృహమ్ (వైశ్వానరాయ) అగ్నికార్యసాధనాయ (త్వా) త్వామ్.॥౭॥

అన్వయః :-వయం యథా రాజా భువనానామభిశ్రీః కం హి సాధ్నోతి ఇతో జాతః సన్ విశ్వమిదం విచష్టే. యథా సూర్యేణ సహ వైశ్వానరో యతతే తథా వయం వైశ్వానరస్య సుమతౌ స్యామ. హే విద్వన్ యతస్త్వముపయామగృహీతోఽసి తస్మాద్వైశ్వానరాయ త్వా యస్యైష తే యోనిరస్తి తం త్వా చ వైశ్వానరాయ సత్కరోమి.॥౭॥

భావార్థః:-యథా సూర్యేణ సహ చన్ద్రమా రాత్రిం సుభూషయతి తథా సురాజ్ఞా ప్రజా ప్రకాశితా భవతి విద్వాన్ శిల్పిజనశ్చ వహ్నినా సర్వోపయోగీని కార్యాణి సాధ్నోతి.॥౭॥

పదార్థము :-మే మెట్లు (రాజా) ప్రకాశమానుడు (భువనానామ్) లోకముల మధ్య (అభిశ్రీః) అన్నివైపులనుండి ఐశ్వర్య శోభావంతుడగు సూర్యుడు (కమ్) సుఖములను (హి) కూడ సిద్ధపరచుచున్నాడో (ఇతః) ఈ కారణమున (జాతః) ప్రసిద్ధుడైనాడో (ఇదమ్) ఈ (విశ్వమ్) విశ్వమును (వి, చష్టే)

ప్రకాశమొనర్చుచున్నాడో, ఎట్లు (సూర్యేణ) సూర్యునితో బాటు (వైశ్వానరః) విద్యుద్రూపాగ్ని (యతతే) యత్నమొనర్చునదై యున్నదో, అట్లే మేము (వైశ్వానరస్య) విశ్వపతియగు పరమేశ్వరుడు లేక ఉత్తమ సభాపతియొక్క (సుమతౌ) అత్యుత్తమముగ దేశకాలపరిస్థితుల నెరుగు కపటము, మోసము, టక్కరితనము లేని బుద్ధియందు (స్యామ) ఉందుముగాక! ఓ విద్వాంసుడా! దేనిచే నీవు (ఉపయామగృహీతః) చక్కని నియమములతో స్వీకృతుడవై (అసి) ఉన్నావో, దానిచే (వైశ్వానరాయ) అగ్నికొరకు (త్వా) నీకు మరియు ఏ (తే) నీ (ఏషః) ఈ (యోనిః) గృహము గలదో, అట్టి (త్వా) నీకును (వైశ్వానరాయ) అగ్నిసాధ్య కార్యమును సాధించుటకొరకు సత్కరించు చున్నాను. ॥౭॥

**భావార్థము** :-సూర్యునితో పాటు చంద్రుడును రాత్రులను సుశోభితమొనర్చునట్లు ఉత్తమరాజుతో గూడ ప్రజలు సుఖవంతులగుదురు. మరియు విద్వాంసులగు శిల్పులు (ఇంజనీయర్లు) అగ్నిద్వారా సర్వోపయోగ కార్యములను సాధింతురు. ॥౭॥

7. Just as the Sun, filled with the lustre of grandeur, in the midst of illuminated worlds, gives us pleasure, and therefore illuminates this world with his light, just as lightning exerts with the sun, so should we continue in God's grace.

O learned person thou art acceptable through beautiful restraints. I respect thee for thy knowledge of electricity. This is thy home. I respect Thee for thy accomplishing electrical projects!.

౧౪౬౭౮.వైశ్వానర ఇత్యస్య కుత్స ఋషిః, వైశ్వానరో దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునర్మనుష్యాః కింవత్ కిం కుర్యురిత్యాహ.

మఱల మానవులు దేనివలె నేమి చేయవలయునను విషయ మీ మంత్రమునందు చెప్పబడెను.

౧౪౬౭౮ వైశ్వానరో న ఊతయఽఆ ప్ర యాతు పరావతః।
అగ్నిరుక్థేన వాహసా। ఉపయామగృహీతోఽసి వైశ్వానరాయ
త్వైష తే యోనిర్వైశ్వానరాయ త్వా॥౮॥

ప.వి:- వైశ్వానరః, నః, ఊతయే, ఆ,ప్ర, యాతు, పరావతః, అగ్నిః, ఉక్థేన, వాహసా, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, వైశ్వానరాయ, త్వా, ఏషః, తే, యోనిః, వైశ్వానరాయ, త్వా.॥౮॥

పదార్థః :-(వైశ్వానరః) విశ్వేషు నాయకేషు విద్వత్సు రాజమానః (నః) అస్మాకమ్ (ఊతయే) రక్షణాద్యాయ (ఆ) ((ప్ర, యాతు) గచ్ఛతు (పరావతః) దూరదేశాత్ (అగ్నిః) పావకవద్వర్తమానః (ఉక్థేన) ప్రశంసనీయేన (వాహసా) ప్రాపణేన (ఉపయామగృహీతః) విద్యావిచారసంయుక్తః (అసి) (వైశ్వానరాయ) ప్రకాశమానాయ (త్వా) త్వామ్ (ఏషః) (తే) తవ (యోనిః) గృహమ్ (వైశ్వానరాయ)(త్వా) త్వామ్. ।౮॥

అన్వయః :-యథా వైశ్వానరః పరావతో న ఊతయ ఆ ప్రయాతు తథాఽగ్నిరుక్థేన వాహసా సహోప్నోతు, యస్త్వం వైశ్వానరాయోపయామగృహీతోఽసి తం త్వా యస్యైష తే వైశ్వానరాయ యోనిరస్తి తం త్వా చ స్వీకుర్మః.।౮॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా సూర్యో దూరదేశాత్స్వప్రకాశేన దూరస్థాన్ పదార్థాన్ ప్రకాశయతి తథా విద్వాంసః స్వసూపదేశేన దూరస్థాన్ జిజ్ఞాసూన్ ప్రకాశయన్తి.।౮॥

పదార్థము :-ఏవిధముగ (వైశ్వానరః) సకలనాయకులందు ప్రకాశవంతుడగు విద్వాంసుడు (పరావతః) దూరమునుండి (నః) మాయొక్క (ఊతయే) రక్షణకొరకు (ఆ, ప్ర,యాతు) ఉత్తమముగా వచ్చునో, అటులనే (అగ్నిః) అగ్నివంటి తేజశ్శాలియగు మనుష్యుడు (ఉక్థేన) ప్రశంసించదగిన (వాహసా) వ్యవహారముతో ప్రాప్తించుగాక! ఏ నీవు (వైశ్వానరాయ) ప్రకాశవంతునికొరకు (ఉపయామగృహీతః) విద్యల ఆలోచనలతో (అసి) ఉన్నావో అట్టి (త్వా) నీకు మరియు ఏ (తే) నీయొక్క (ఏషః) ఈ గృహము (వైశ్వానరాయ) సమస్తనాయకులందుత్తమునికొరకు (యోనిః) గృహము కలదో, అట్టి (త్వా) నిన్నుకూడ మేము స్వీకరించెదముగాక! ।౮॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ దూరప్రదేశమునుండి సూర్యుడు తన ప్రకాశముచే దూరమందుండు పదార్థములను ప్రకాశపరచుచున్నాడో, అదేవిధముగ విద్వాంసులును తమ శ్రేష్ఠమగు చక్కని ఉపదేశములచే దూరస్థజిజ్ఞాసువులను ప్రకాశితమొనర్చవలయును.।౮॥

8. Just as a learned person foremost amongst the leaders comes for our protection from far away, so should a person brilliant like fire come in a commendable conveyance.

We accept thee full of literary thought for a learned person. We accept Thee, whose this house is meant for the leader of the learned.

౧౪౬౯.అగ్నిరిత్యస్య కుత్స ఋషిః, వైశ్వానరో దేవతా,జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునః కైః కస్మాత్ కిం యాచనీయమిత్యాహ.

మఱల నెవరు ఎవనినుండి నేమి కోరవలయును?

౧౪౬౭ అగ్నిరృషిః పవమానః పాఞ్చజన్యః పురోహితః। తమీమహే మహాగయమ్। ఉపయామగృహీతోఽస్యగ్నయే త్వా వర్చస ఏష తే యోనిరగ్నయే త్వా వర్చసే॥౯॥

ప.వి:- అగ్నిః, ఋషిః, పవమానః, పాఞ్చజన్య ఇతి పాఞ్చ+జన్యః, పురోహిత ఇతి పురః+హితః, తమ్, ఈమహే, మహాగయమితి మహా+గయమ్, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, అగ్నయే, త్వా, వర్చసే, ఏషః, తే, యోనిః, అగ్నయే, త్వా, వర్చసే.॥౯॥

పదార్థః :- (అగ్నిః) పావకవద్విద్యయా ప్రకాశితః (ఋషిః) మన్త్రార్థవేత్తా (పవమానః) పవిత్రః (పాఞ్చజన్యః) పఞ్చానాం పఞ్చసు వా జనేషు సాధుః (పురోహితః) పురస్తాద్ధితకారీ (తమ్) (ఈమహే) యాచామహే (మహాగయమ్) మహాన్తో గయా గృహాణి ప్రజా ధనం వా యస్య తం. గయమితి గృహనా..నిఘం. 3.4. అపత్యనా....నిఘం. ౨.౨, ధననా..చ నిఘం. ౨.౧౦. (ఉపయామగృహీతః) (అసి) (అగ్నయే) విదుషే (త్వా) త్వామ్ (వర్చసే) అధ్యాపనాయ (ఏషః) తే) (యోనిః) నిమిత్తమ్ (అగ్నయే) (త్వా) త్వామ్ (వర్చసే) విద్యాప్రకాశాయ.॥౯॥

అన్వయః:-హే మనుష్యా! యః పాఞ్చజన్యః పురోహితః పవమాన ఋషిరగ్నిరస్తి తం మహాగయం యథా వయమీమహే తథా త్వం వర్చసేఽగ్నయే ఉపయామగృహీతోఽసి తస్మాత్ త్వా యస్యైష తే యోని ర్వర్చసేఽగ్నయేఽస్తి తం త్వా చ వయమీమహే తథైతం యూయమపీహధ్వమ్. ॥౯॥

భావార్థః:-సర్వైర్మనుష్యైర్వేదశాస్త్రవిద్భ్యో విద్వద్భ్యః సదా విద్యాప్రాప్తిర్యాచనీయా యేన మహత్త్వం ప్రాప్నుయుః. ॥౯॥

పదార్థము :-ఓ మనుష్యులారా! (పాంచజన్యః) ఐదుగురు మనుష్యుల, లేక పంచప్రాణముల క్రియలందుత్తముడు (పురోహితః) మొదటినుండియే హితమునుగూర్చువాడు. (పవమానః)పవిత్రమైన (ఋషిః)

మంత్రద్రష్ట [మంత్రార్థవేత్త] (అగ్నిః) అగ్నివలె విద్యాప్రకాశకుడు (తమ్) అట్టి (మహాగయమ్) గొప్పగొప్ప గృహము, సంతానము మరియు ధనవంతులవలె మేము ఎట్లు (ఈమహే) యాచింతుమో, అట్లు నీవు (వర్చసే) చదివించునట్టి (అగ్నయే) విద్వాంసులు గలరో, ఎట్లు (త్వా) నిన్ను మేము ప్రార్థన యొనర్పుచున్నామో అటులనే మీరును చేయుడు. ॥౯॥

**భావార్థము** :- మానవులెల్లరును వేదవేత్తలగు విద్వాంసులను సదా విద్యాప్రాప్తికై ప్రార్థించవలెను. అందువల్ల సకల మానవులు మహత్త్వమును పొందగలుగుదురు. ॥౯॥

9. We pray to him, the master of five senses and lover of five castes, affectionate to all, pure, the knower of the significance of vedic texts, glowing like fire with the warmth of knowledge; the lord of wealth, offspring and palatial buildings. Thou art imbued with religious laws. I accept thee as a dignified literary person. This is thy home of knowledge. I accept thee as a dignified, literary, religious person.

౧౪౬౯.మహానిత్యస్య వసిష్ఠ ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ రాజసత్కారమాహ. ఇపుడు రాజసత్కార విషయ మీ మంత్రమందు చెప్పబడుచున్నది.

౧౪౬౯ మహాఀ౨॥౨ ఇన్ద్రో వజ్రహస్తః షోడశీ శర్మ యచ్ఛతు హన్తు

పాప్మానం యోఽస్మాన్ ద్వేష్టి । ఉపయామగృహీతోఽసి

మహేన్ద్రాయ త్వైష తే యోనిర్మహేన్ద్రాయ త్వా ॥౧౦॥

ప.వి:-మహాన్, ఇన్ద్రః, వజ్రహస్త ఇతి వజ్ర+ హస్తః, షోడశీ, శర్మ, యచ్ఛతు హన్తు, పాప్మానమ్, యః, అస్మాన్, ద్వేష్టి, ఉపయామగృహీత ఇత్యుపయామ+గృహీతః, అసి, మహేన్ద్రాయేతి మహా+ ఇన్ద్రాయ, త్వా, ఏషః, తే, యోనిః, మహేన్ద్రాయేతి మహా+ ఇన్ద్రాయ, త్వా.॥౧౦॥

పదార్థః :-(మహాన్) బృహత్తమః (ఇన్ద్రః) పరమైశ్వర్యయుక్తో రాజా (వజ్రహస్తః) వజ్రో హస్తయోర్యస్య సః (షోడశీ) షోడశకలాయుక్తః (శర్మ) శృణ్వన్తి దుఃఖాని యస్మిన్ తద్గృహమ్. శర్మేతి గృహనా...నిఘం. 3.౧౪. (యచ్ఛతు) దదాతు (హన్తు) (పాప్మానమ్)

దుష్టకర్మకారిణమ్ (యః) (అస్మాన్) (ద్వేష్టి) అప్రీతయతి (ఉపయామగృహీతః) (అసి) (మహేన్ద్రాయ) మహద్గుణవిశిష్టాయ (త్వా) త్వామ్ (ఏషః) (తే) (యోనిః) నిమిత్తమ్ (మహేన్ద్రాయ) (త్వా) త్వామ్.॥౧౦॥

అన్వయః:-హే మనుష్యా! వజ్రహస్తః షోడశీ మహానింద్రః శర్మ యచ్ఛతు యోఽస్మాన్ ద్వేష్టి తం పాప్మానం హన్తు యస్త్వం మహేన్ద్రాయోపయామగృహీతోఽసి తం త్వా యస్యైష తే మహేన్ద్రాయ యోనిరస్తి తం త్వా చ వయం సత్కుర్యామ.॥౧౦॥

భావార్థః :-హే ప్రజాజనా యో యుష్మభ్యం సుఖం దద్యాత్ దుష్టాన్ హన్యాన్మహైశ్వర్యం వర్ధయేత్స యుష్మాభిః సదా సత్కర్తవ్యః.॥౧౦॥

పదార్థము :- ఓ మానవులారా! (వజ్రహస్తః) హస్తములందు వజ్రము గలవాడు (షోడశీ) షోడశకళలు [పదహారుకళలు] గలవాడు (మహాన్) మహోన్నతుడు (ఇన్ద్రః) పరమైశ్వర్యవంతుడగు రాజు (శర్మ) దుఃఖముల నష్టపరచునట్టి గృహమును (యచ్ఛతు) ఇచ్చుగాక! (యః) ఎవడు (అస్మాన్) మమ్ము (ద్వేష్టి) వైరభావముతో చూచునో, అట్టి (పాప్మానమ్) పాపాత్ముడగు దుష్కర్మలనొనర్చువారిని (హన్తు) చంపివేయుగాక! ఏ నీవు (మహేన్ద్రాయ) మహామహాగుణములతో గూడిన వానికై (ఉపయామగృహీతః) ప్రాప్తించిన నియమములచే గ్రహించబడినవాడవై (అసి) ఉన్నావో అట్టి (త్వా) నిన్ను మరియు ఏ (తే) నీయొక్క (ఏషః) ఇట్టి (మహేన్ద్రాయ) ఉత్తమ గుణశాలికొరకు (యోనిః) నిమిత్తమైయున్నదో, అట్టి (త్వా) నిన్నును సత్కరింతుముగాక!.॥౧౦॥

భావార్థము:-ఓ ప్రజలారా! దుష్టులను సంహరించి మీకు సుఖములను,ఐశ్వర్యములను పెంపొందజేయువానిని మీరు సదా సత్కరించుట యోగ్యమై యున్నది. ॥౧౦॥

10. May the mighty, thunder - armed, perfectly virtuous king grant us a comfortable home, may he slay the wicked man who hates us.

Thou art equipped with justice and statesmanship. We accept thee for the extreme supremacy. This is thy kingly palace. We accept thee as a paramount sovereign.

౧౪౭౦.తం వ ఇత్యస్య నోధా గోతమ ఋషిః, అగ్నిర్దేవతా,విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునా రాజా కిం కుర్యాదిత్యాహ.

మఱల రాజు యేమి చేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౭౦ తం వో దస్మమృతీషహం వసోర్మన్దానమన్ధసః ।

అభి వత్సన్న స్వసరేషు ధేనవఽఇన్ద్రం గీర్భిర్నవామహే ॥౧౧॥

ప.వి:-తమ్, వః, దస్మమ్, ఋతీషహమ్, ఋతిసహమిత్యృతి+సహమ్,వసోః మన్దానమ్, అన్ధసః, అభి, వత్సమ్, న, స్వసరేషు, ధేనవః, ఇన్ద్రమ్, గీర్భిరితి గీః+ భిః, నవామహే.॥౧౧॥

పదార్థః :-(తమ్) (వః)యుష్మభ్యమ్ (దస్మమ్) దుఃఖోపక్షయితారమ్ (ఋతీషహమ్) గతిసహమ్.అత్ర సంహితాయామితి దీర్ఘః (వసోః) ధనస్య (మన్దానమ్) ఆనన్దన్తమ్ (అన్ధసః) అన్నస్య (అభి) సర్వతః వత్సమ్ (న) ఇవ (స్వసరేషు) దినేషు (ధేనవః) గావః (ఇన్ద్రమ్) పరమైశ్వర్యవన్తమ్ (గీర్భిః)వాగ్భిః(నవామహే)స్తువీమహే. ॥౧౧॥

అన్వయః :-హే మనుష్యా వయం స్వసరేషు ధేనవో వత్సం న యం దస్మమృతీషహం వసోరన్ధసో మన్దానమిన్ద్రం వో గీర్భిరభి నవామహే తథా తం భవన్తోఽపి సదా ప్రీతిభావేన స్తువన్తు.॥౧౧॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యథా గావః ప్రతిదినం స్వం స్వం వత్సం పాలయన్తి తథైవ ప్రజారక్షకః పురుషః ప్రజా నిత్యం రక్షేత్, ప్రజాయై ధనధాన్యైః సుఖాని వర్ధయేత్. ॥౧౧॥

పదార్థము :- ఓ మానవులారా! మేము (స్వసరేషు) దినములందు (ధేనవః) గోవులు (వత్సమ్) దూడలనెట్లో (న) అట్లే (దస్మమ్) దుఃఖవినాశకుడు (ఋతీషహమ్) నడవడిని సహించువాడు (వసోః) ధనములను (అన్ధసః) అన్నమును మరియు (మన్దానమ్) ఆనందమును పొందియున్న (ఇన్ద్రమ్) పరమైశ్వర్య వంతుడగు సభాపతి (వః) మీకొరకు (గీర్భిః) వాణులతో (అభి, నవామహే) అన్నివైపుల నుండి స్తుతించునట్లు (తమ్) అట్టి సభాపతిని మీరు సదా ప్రీతిభావముతో స్తుతి యొనర్పుడు.॥౧౧॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. గోవులు తమ తమ బిడ్డలగు దూడలను ప్రతిదినము ఎట్లు పోషించుచున్నవియో, అట్లే ప్రజారక్షకుడగు రాజు ప్రజలను సదా రక్షించవలయును. ప్రజలను ధనధాన్యములు, అన్నము మున్నగువానిచే సుఖవంతులుగ నొనర్పవలెను.॥౧౧॥

11. O people, just as cows low to their calves all the day long, so with our songs we glorify for ye, this king the dispeller of affliction, the checker of assault, and the enjoyer of riches and foodgrains!.

౧౪౭౧.యద్వాహిష్ఠమిత్యస్య నోధా గోతమ ఋషిః,అగ్నిర్దేవతా,విరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునః సా రాజ్ఞీ కిం కుర్యాదిత్యాహ.

మఱల నా రాణి యేమి చేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౭౧ యద్వాహిష్ఠన్తదగ్నయే బృహదర్చ విభావసో।

మహిషీవ త్వద్రయిస్త్వద్వాజా ఉదీరతే ॥౧౨॥

ప.వి:- యత్,వాహిష్ఠమ్, తత్, అగ్నయే, బృహత్, అర్చ, విభావసో ఇతి విభా+వసో, మహిషీవేతి మహిషీ+ ఇవ, త్వత్, రయిః, త్వత్, వాజాః, ఉత్, ఈరతే.॥౧౨॥

పదార్థః :-(యత్) (వాహిష్ఠమ్) అతిశయేన వాహయితారమ్ (తత్) (అగ్నయే) పావకాయ (బృహత్) మహత్ (అర్చ) సత్కురు (విభావసో) ప్రకాశితధన (మహిషీవ) యథా రాజ్ఞీ తథా (త్వత్) తవ సకాశాత్ (రయిః) ధనమ్ (త్వత్) (వాజాః) అన్నాదీని (ఉత్) అపి (ఈరతే) ప్రాప్నువన్తి.॥౧౨॥

అన్వయః :-హే విభావసో అగ్నయే యద్ బృహద్వాహిష్ఠమస్తి తదర్చ. తద్వయమప్యర్చేమ మహిషీవ త్వద్రయిస్త్వద్వాజాశ్చోదీరతే తం వయం సత్కుర్యామ.॥౧౨॥

భావార్థః:-యథా రాజ్ఞీ సుఖప్రాపికా మహాధనప్రదా భవతి తథైవ రాజ్ఞః సకాశాత్సర్వే ధనమన్యాన్యుత్తమాని వస్తూని చ ప్రాప్నుయుః.॥౧౨॥

పదార్థము :-(విభావసో) ప్రకాశవంత ధనశాలివగు ఓ విద్వాంసుడా! (అగ్నయే) అగ్నికొరకు (యత్) ఎట్టి (బృహత్) గొప్పది మరియు (వాహిష్ఠమ్) అత్యంతముగ అందించునదియో, దానిని (అర్చ) సత్కరించుము (తత్) దానిని మేముకూడ సత్కరింతుముగాక! (మహిషీవ) రాణివంటి (త్వత్) నీచే (రయిః) ధనము (త్వత్) నీనుండి (వాజాః) అన్నాదిపదార్థములను కూడ (ఉత్, ఈరతే) లభించుచున్నవియో, అట్టి నిన్ను మేము సత్కరింతుముగాక! ॥౧౨॥

భావార్థము :-రాణి యెట్లు సుఖముల నందించునో, మరియు అనేక ధనముల నిచ్చునదగునో, అట్లే రాజువద్దనుండియు ఎల్లరును ధనాది ఉత్తమోత్తమ పదార్థముల పొందవలెను. ॥౧౨॥

12. O learned people honour the king who is great and giver of extreme comfort. Like the queen, riches and foodstuffs proceed from the King!.

౧౪౭౨.ఏహీత్యస్య భారద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, విరాడ్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

విద్వద్భిః కిం కార్యమిత్యాహ. విద్వాంసు లేమి చేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౭౨ ఏహ్యూషు బ్రవాణి తేఽగ్న ఇత్థేతరా గిరః। ఏభిర్వర్ధాస ఇన్దుభిః ॥౧౩॥

ప.వి:- ఆ, ఇహి, ఊఀఀ ఇత్యూఀ, సు,బ్రవాణి, తే, అగ్నే, ఇత్థా, ఇతరాః, గిరః, ఏభిః, వర్ధాసే, ఇన్దుభిరితీన్దు+భిః.॥౧౩॥

పదార్థః:-(ఆ) సమన్తాత్ (ఇహి) ప్రాప్నుహి (ఉ) వితర్కే (సు)శోభనే (బ్రవాణి) ఉపదిశేయమ్ (తే) తుభ్యమ్ (అగ్నే) ప్రకాశితప్రజ్ఞ (ఇత్థా) అస్మాద్ధేతోః (ఇతరాః) త్వయాఽజ్ఞాతాః (గిరః) వాచః (ఏభిః) (వర్ధాసే) వృద్ధో భవ (ఇన్దుభిః) జలాదిభిః.॥౧౩॥

అన్వయః:-హే అగ్నేఽహమిత్థా త ఇతరా గిరః సు బ్రవాణి యతస్త్వమేతా ఏహి ఉ ఏభిరన్దుభిర్వర్ధాసే. ॥౧౩॥

భావార్థః:-యయా శిక్షయా విద్యార్థినో విజ్ఞానేన వర్ధేరన్తామేవ విద్వాంస ఉపదిశేయుః. ॥౧౩॥

పదార్థము :-(అగ్నేః) ప్రకాశితబుద్ధిగల విద్వాంసుడా! నేను (ఇత్థా)ఈ హేతువుచే (తే) నీకొరకు (ఇతరాః) ఏద్దానిని నీవు తెలిసికొనలేదో అట్టి (గిరః) వాణులను (సు, బ్రవాణి) చక్కగా ఉపదేశింతును దీనివల్ల నీ వీ వాణులను (ఆ, ఇహి) చక్కగా పొందుము (ఉ) మరియు (ఏభిః) ఈ (ఇన్దుభిః) జలము మున్నగు పదార్థములచే (వర్ధాసే) వృద్ధిని పొందుము. ॥౧౩॥

భావార్థము :-ఎట్టి శిక్షణద్వారా విద్యార్థులు విజ్ఞానమును వృద్ధి చేసికొనగలరో అట్టి శిక్షణనే విద్వాంసులు ఉపదేశించుట యోగ్యమై యున్నది.॥౧౩॥

13. O wise, learned person, come, here I sing verily other songs to thee, With these praises shalt thou grow strong!.

౧౪౭౩.ఋతవ ఇత్యస్య భారద్వాజ ఋషిః, సంవత్సరో దేవతా. భురిగ్బృహతీ ఛన్దః. నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము చెప్పబడెను.

౧౪౭౩ ఋతవస్తే యజ్ఞం వితన్వన్తు మాసా రక్షన్తు తే హవిః।

సంవత్సరస్తే యజ్ఞం దధాతు నః ప్రజాం చ పరి పాతు నః॥౧౪॥

ప.వి:-ఋతవః, తే, యజ్ఞమ్, వి, తన్వన్తు, మాసాః, రక్షన్తు, తే, హవిః, సంవత్సరః, తే, యజ్ఞమ్, దధాతు, నః, ప్రజామితి ప్ర+జామ్, చ, పరి, పాతు, నః.॥౧౪॥

పదార్థః :-(ఋతవః) వసన్తాద్యాః (తే) తవ (యజ్ఞమ్) సత్కారాదివ్యవహారమ్ (వి) (తన్వన్తు) విస్తృణన్తు (మాసాః) కార్తికాదయః (రక్షన్తు) (తే) తవ (హవిః) హోతవ్యం వస్తు (సంవత్సరః) (తే) తవ (యజ్ఞమ్) (దధాతు) (నః) అస్మాకమ్ (ప్రజామ్) (చ) (పరి) (పాతు)రక్షతు (నః) అస్మాకమ్.॥౧౪॥

అన్వయః :-హే విద్వంస్తే యజ్ఞమృతవో వితన్వన్తు తే హవిర్మాసా రక్షన్తు. తే యజ్ఞం నః సంవత్సరో దధాతు. నః ప్రజాం చ పరిపాతు.॥౧౪॥

భావార్థః :-విద్వద్భిర్మనుష్యైః సర్వాభిః సామగ్రీభిర్విద్యావర్ధకో వ్యవహారః సదా వర్ధనీయో న్యాయేన ప్రజాశ్చ పాలనీయాః.॥౧౪॥

పదార్థము :-ఓ విద్వాంసుడా! (తే) నీయొక్క (యజ్ఞమ్) సత్కారము మున్నగు వ్యవహారములను (ఋతవః) వసంతము మున్నగు ఋతువులు (వి, తన్వన్తు) విస్తృతమగునుగాక! (తే) నీయొక్క (హవిః) హోమించదగిన వస్తువులను (మాసాః) కార్తీకము మున్నగు మాసములు (రక్షన్తు) రక్షించుగాక! (తే) నీ యొక్క (యజ్ఞమ్) యజ్ఞమును (నః) మాయొక్క (సంవత్సరః) సంవత్సరములు (దధాతు) పుష్టమొనర్చునుగాక! (చ, నః) మరియు మా (ప్రజామ్) ప్రజలను (పరి, పాతు) అన్ని వైపులనుండి నీవు రక్షించుము. ॥౧౪॥

భావార్థము :- విద్వాంసులగువారు సమస్త సామగ్రులతో విద్యావర్ధక వ్యవహారములను సదా చేయవలెను. వారు న్యాయయుక్తముగా ప్రజలను రక్షణ జేయుట యోగ్యమై యున్నది. ॥౧౪॥

14. O learned person, the seasons spread thy yajna, the months protect thy offering. May our year srengthen thy yajna. May thou keep our children safe in every way!.

౧౪౨౪.ఉపహ్వర ఇత్యస్య వత్స ఋషిః. విద్వాన్ దేవతా । విరాడ్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడినది.

౧౪౨౪ ఉపహ్వరే గిరీణాం సఙ్గమే చ నదీనామ్ । ధియా విప్రో అజాయత ॥౧౫॥

ప.వి:- ఉపహ్వర ఇత్యు+పహ్వరే, గిరీణామ్, సఙ్గమ ఇతి సమ్+గమే, చ, నదీనామ్, ధియా, విప్రః, అజాయత.॥౧౫॥

పదార్థః :-(ఉపహ్వరే) నికటే (గిరీణామ్) శైలానామ్ (సఙ్గమే) మేలనే (చ) (నదీనామ్) (ధియా) ప్రజ్ఞయా కర్మణా వా (విప్రః) మేధావీ. విప్ర ఇతి మేధావినామ. నిఘం. 3.౧౫ (అజాయత)జాయతే.॥౧౫॥

అన్వయః:-యో మనుష్యో గిరీణాముపహ్వరే నదీనాం చ సఙ్గమే యోగేనేశ్వరం విచారేణ విద్యాం చోపాసీత. స ధియా విప్రో అజాయత. ॥౧౫॥

భావార్థః:-యే విద్వాంసః పర్వతేష్వేకాన్తే విచారయన్తి తే యోగిన ఇవ ప్రాజ్ఞా భవన్తి.॥౧౫॥

పదార్థము :- ఏ మనుష్యుడు (గిరీణామ్) పర్వతముల (ఉపహ్వరే) సమీపమున (చ) మరియు (నదీనామ్) నదుల (సంగమే) కూడలియందు యోగాభ్యాసముచే పరమేశ్వరుని మనస్సునందుంచుకొని విద్య నుపాసించునో వాడు (ధియా) ఉత్తమబుద్ధి లేక కర్మతో గూడినవాడై (విప్రః) విచారశీలుడు మరియు బుద్ధిశాలి (అజాయత) కాగలడు. ॥౧౫॥

భావార్థము :-ఏ విద్వాంసులు స్వాధ్యాయమొనర్చి ఏకాంతమున గూర్చుండి మనన మొనర్చెదరో వారు యోగులవలె ఉత్తమ బుద్ధిశాలురగుదురు.॥౧౫॥

15. In the solitude of mountains and confluence of streams a sage develops his spiritual force, contemplating of God through yoga.

౧౪౭౫. ఉచ్చేత్యస్య మహీయవ ఋషిః అగ్నిర్దేవతా, నిచృద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల వదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౭౫ ఉచ్చా తే జాతమన్ధసో దివి సద్భూమ్యాదదే । ఉగ్రశ్శర్మ మహి శ్రవః॥౧౬॥

ప.వి:- ఉచ్చా, తే, జాతమ్, అన్ధసః, దివి, సత్, భూమి,ఆ, దదే, ఉగ్రమ్, శర్మ, మహి, శ్రవః.॥౧౬॥

పదార్థః :-(ఉచ్చా) ఉచ్చమ్ (తే) తవ (జాతమ్) నిష్పన్నమ్ (అన్ధసః) అన్నాత్ (దివి) ప్రకాశే (సత్) వర్తమానమ్ (భూమి) అత్ర సుపాం సులుగితి విభక్తేర్లుక్. (ఆ,దదే) గృహ్ణామి (ఉగ్రమ్) ఉత్కృష్టమ్ (శర్మ) గృహమ్ (మహి) మహత్ (శ్రవః) ప్రశంసనీయమ్.॥౧౬॥

అన్వయః:-హే విద్వన్నహం తే యదుచ్చాఽన్ధసో జాతం దివి సదుగ్రం మహి శ్రవః శర్మాదదే తద్ భూమీవ భవతు. ॥౧౬॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. విద్వద్భిర్మనుష్యైః సూర్యకిరణవాయు మనుష్యాన్నాదియుక్తాని మహాన్త్యుచ్చాని గృహాణి రచయిత్వా తత్ర నివాసేన సుఖం భోక్తవ్యమ్ ॥౧౬॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! నేను (తే) మీయొక్క ఏ (ఉచ్చ) ఉన్నత (అన్ధసః) అన్నముద్వారా (జాతమ్) ప్రసిద్ధమైన (దివి) ప్రకాశమున (సత్) ఉన్నట్టి (ఉగ్రమ్) ఉత్తమమగు (మహి) గొప్ప (శ్రవః) ప్రశంసనీయ (శర్మ) గృహమును (ఆ, దదే) ఉత్తమముగా గ్రహించుచున్నానో అది (భూమి) పృథివివలె దృఢముగ నుండుగాక!॥౧౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులైన వారు సూర్యుని ప్రకాశము మరియు వాయువులు చక్కగా ప్రవేశించుచుండు అన్నాదులతో సమృద్ధమగు గొప్పగృహములందు వసించి సుఖులై యుండవలెను.॥౧౬॥

16. O learned person, ! admire thy house, high in altitude, full of foodstuffs, well ventilated and airy, grand in sight and extremely commendable. May it be durable like the Earth!.

౧౪౨౬.స న ఇత్యస్య మహీయవ ఋషిః, ఇంద్రో దేవతాః, నిచృద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౨౬ స న ఇన్ద్రాయ యజ్యవే వరుణాయ మరుద్భ్యః। వరివోవిత్పరి స్రవ॥౧౭॥

ప.వి:- సః, నః, ఇన్ద్రాయ, యజ్యవే, వరుణాయ, మరుద్భ్య ఇతి మరుత్+భ్యః వరివోవిదితి వరివః+ విత్, పరి, స్రవ.॥౧౭॥

పదార్థః :-(సః) (నః) అస్మాకమ్ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (యజ్యవే) సంగతాయ (వరుణాయ) శ్రేష్ఠాయ (మరుద్భ్యః) మనుష్యేభ్యః (వరివోవిత్) పరిచరణవేత్తా (పరి) (స్రవ) ప్రాప్నుహి. ॥౧౭॥

అన్వయః :-హే విద్వన్స్ మరుద్భ్యో న ఇన్ద్రాయ యజ్యవే వరుణాయ వరివోవిత్ సంస్త్వం పరిస్రవ.॥౧౭॥

భావార్థః:-యేన విదుషా యావత్సామర్థ్యం ప్రాప్యేత తేన తావతా సర్వేషాం సుఖం వర్ధనీయమ్.॥౧౭॥

**పదార్థము** :-ఓ విద్వాంసుడా! (సః) ఆతడే (మరుద్భ్యః) మనుష్యులకొరకు (నః) మా (ఇన్ద్రాయ) పరమైశ్వర్యముయొక్క (యజ్యవే) సాంగత్యమునకై (వరుణాయ) శ్రేష్ఠజనులకొరకు (వరివోవిత్) సేవాకర్మలను దెలిసికొనుచు నీవు (పరిస్రవ) సకల దిశలనుండి ప్రాప్తించుము. ॥౧౭॥

భావార్థము :- విద్వాంసులగు వారు ఎవరెంతెంత సామర్థ్యము నార్జించియున్నారో, వారు తమ సామర్థ్యమును సమస్త మానవుల సుఖమునకై వినియోగించి సర్వప్రజల సుఖమును వృద్ధిపరచదగును. ॥౧౭॥

17. O amiable scholar, fully knownig the duty of service, flow the juice of lerning for the king, respectable sacrificer and us mortals!.

౧౪౭౭. ఏనేత్యస్య మహీయవ ఋషిః, విద్వాన్ దేవతా, స్వరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

ఈశ్వరః కథముపాస్య ఇత్యాహ.

ఈశ్వరు నెటు లుపాసించవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౭౭ ఏనా విశ్వాన్యర్య ఆ ద్యుమ్నాని మానుషాణామ్ । సిషాసన్తో వనామహే ॥౧౮॥

ప. వి:- ఏనా, విశ్వాని, అర్యః, ఆ, ద్యుమ్నాని, మానుషాణామ్, సిషాసన్తః, సిసాసన్త+ ఇతి సిసా+సన్తః, వనామహే. ॥౧౮॥

పదార్థః :-(ఏనా) ఏనాని (విశ్వాని) సర్వాణి (అర్యః) ఈశ్వరః (ఆ) (ద్యుమ్నాని) ప్రదీప్తాని యశాంసి (మానుషాణామ్) మనుష్యాణామ్(సిషాసన్తః) సేవితుమిచ్ఛన్తః (వనామహే) యాచామహే. ॥౧౮॥

అన్వయః:-యోఽర్యో మానుషాణామేనా విశ్వాని ద్యుమ్నాని శాస్తి తం సిషాసన్తో వయం సుఖాన్యావనామహే. ॥౧౮॥

భావార్థః:-యేనేశ్వరేణ మనుష్యాణాం సుఖాయ ధనాని వేదా భోజ్యాదీని వస్తూని చోత్పాదితాని తస్యైవోపాసనా సర్వైర్మనుష్యైః సదా కర్తవ్యా. ॥౧౮॥

పదార్థము :-(అర్యః) పరమేశ్వరుడు (మానుషాణామ్) మానవులయొక్క (ఏనా) ఈ (విశ్వాని) సమస్త (ద్యుమ్నాని) శోభావంతమగు కీర్తుల నుపదేశించుచున్నాడో నాతని (సిషాసన్తః) సేవించునిచ్ఛతో మేము (ఆ, వనామహే) సుఖములను వాంఛించుచున్నాము. ॥౧౮॥

భావార్థము :- ఏ పరమేశ్వరుడు మానవుల సుఖమునకై వేదజ్ఞానము, ధనము, ఆహార పానయోగ్యములైన పదార్థముల నుత్పన్నమొనర్చి యున్నాడో సమస్తమానవులు సదా యాతనినే యుపాసింపదగును. ॥౧౮॥

18. God gives instruction for all these graceful glories of men. Willing to serve God, we pray for pleasures.

౧౪౭౮.అనువీరైరిత్యస్య ముద్గల ఋషిః, విద్వాంసో దేవతాః, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ.

మరల మానవు లేమి చేయవలయు నను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౭౮ అను వీరైరను పుష్యాస్మ గోభిరన్వశ్వైరను సర్వేణ పుష్టైః।

అను ద్విపదాను చతుష్పదా వయన్దేవా నో యజ్ఞమృతుథా నయన్తు ॥౧౯॥

ప.వి:- అను, వీరైః, అను, పుష్యాస్మ, గోభిః, అను,అశ్వైః, అను, సర్వేణ, పుష్టైః, అను, ద్విపదేతి ద్వి+పదా, అను, చతుష్పదా, చతుఃపదేతి చతుః+ పదా, వయమ్, దేవాః నః, యజ్ఞమ్, ఋతుథేత్యృతు+ థా, నయన్తు.॥౧౯॥

పదార్థః :-(అను) (వీరైః) ప్రశస్తబలైః (అను) (పుష్యాస్మ) పుష్టా భవేమ (గోభిః) ధేనుభిః (అను) (అశ్వైః) (అను) (సర్వేణ) పుష్టైః (అను) ద్విపదా) మనుష్యాదినా (అను) (చతుష్పదా) గవాదినా (వయమ్) (దేవాః) విద్వాంసః (నః) అస్మాకమ్ (యజ్ఞమ్) ధర్మ్యంవ్యవహారమ్ (ఋతుథా) ఋతుభిః (నయన్తు) ప్రాపయన్తు.॥౧౯॥

అన్వయః :-హే విద్వాంసో యథా వయం పుష్టైర్వీరైరను పుష్యాస్మ పుష్టైర్గోభిరనుపుష్యేమ పుష్టైరశ్వైరనుపుష్యేమ, సర్వేణానుపుష్యేమ, ద్విపదాఽనుపుష్యేమ, చతుష్పదానుపుష్యేమ, తథా దేవా నో యజ్ఞమృతుథా నయన్తు.॥౧౯॥

భావార్థః :-మనుష్యైర్వీరపురుషాన్ పశూంశ్చ సంపోష్యానుపోషణీయమ్, సదా ఋత్వనుకూలో వ్యవహారః కర్తవ్యశ్చ.॥౧౯॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! ఎట్లు (వయమ్) మేము (పుష్టైః) పుష్టిగల (వీరైః) ప్రశంసనీయ బలశాలురగు వీరపురుషుల (అనుపుష్యాస్మ) పుష్టిద్వారా పుష్టివంతులమగుదుమో అట్టి పుష్టిచే (గోభిః) గోవులు (అను) పుష్టివంతమగుగాక! బలముగల (అశ్వైః) అశ్వములు మున్నగువాని పుష్టిచే (అను) పుష్టివంతమగుగాక! (సర్వేణ) అన్నివిధములుగ పుష్టిచే (అను) పుష్టివంతమగుగాక! (ద్విపదా) ద్విపాదులగు మనుష్యులు మున్నగు ప్రాణుల పుష్టిచే (అను) పుష్టివంతమగుగాక! (చతుష్పదా) చతుష్పాదులగు గోవులు మున్నగునవి (అను) పుష్టిచే పుష్టివంతమగునట్లే (దేవాః) విద్వాంసులు (నః) మాయొక్క (యజ్ఞమ్) ధర్మయుక్త వ్యవహారములను (ఋతుథా) ఋతువులద్వారా (నయన్తు) పొందుదురుగాక!॥౧౯॥

**భావార్థము** :-మానవులు వీరపురుషులను, పశువులను చక్కగా పుష్టివంతమొనర్చినపిదప తాము పుష్టివంతులు గావలయును. మరియు ఎల్లప్పుడును వసంతము మున్నగు ఋతువుల కనుకూలముగ వ్యవహరించ వలయును.॥౧౯॥

19. May we be prosperous with strong, brave sons, strong kine, strong horses, the strength of all, strong quadrupeds and strong men about us. May the learned guide our sacrifice (yajna) season - wise.

౧౪౭౯.అగ్న ఇత్యస్య మేధాతిథిర్ఋషిః, విద్వాన్ దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

కథమపత్యాని ప్రశస్తాని స్యురిత్యాహ. సంతాన మెటుల ఉత్తమము కాగలదు?

౧౪౭౯ అగ్నే పత్నీరిహా వహ దేవానాముశతీరుప। త్వష్టారꣳసోమపీతయే ॥౨౦॥

ప.వి:- అగ్నే, పత్నీః, ఇహ, ఆ, వహ, దేవానామ్ ఉశతీః, ఉప, త్వష్టారమ్, సోమపీతయ

ఇతి సోమ+పీతయే.॥౨౦॥

పదార్థః:-(అగ్నే) అధ్యాపకాఽధ్యాపికే వా (పత్నీః) (ఇహ) (ఆ) (వహ) ప్రాపయ (దేవానామ్) విదుషామ్ (ఉశతీః) కామయమానాః (ఉప) (త్వష్టారమ్) దేదీప్యమానమ్ (సోమపీతయే) సోమస్య పానాయ. ॥౨౦॥

అన్వయః:-హే అగ్నే త్వమిహ స్వసదృశాన్ పతీరుశతీర్దేవానాం పత్నీః సోమపీతయే త్వష్టారముపా వహ.॥౨౦॥

భావార్థః:-యది మనుష్యాః కన్యాః సుశిక్ష్య విదుషీః కృత్వా స్వయంవృతాన్ హృద్యాన్ పతీన్ ప్రాపయ్య ప్రేమ్ణా సన్తానానుత్పాదయేయుస్తర్హి తాన్యపత్యాన్యతీవ ప్రశంసితాని భవన్తి.॥౨౦॥

పదార్థము :-(అగ్నే) అధ్యాపక లేక అధ్యాపికా! నీవు (ఇహ) ఈ గృహస్థాశ్రమమున స్వంతగుణములవంటి గుణశీలురగు పతుల లేక (ఉశతీః) ఆకాంక్షాయుక్తులగు (దేవానామ్) విద్వాంసుల (పత్నీః) మహిళలను (సోమపీతయే) ఉత్తమ ఓషధీరసముల పానమొనర్చుటకై (త్వష్టారమ్) తేజోవంతుని (ఉప, ఆ, వహ) చక్కగా సమీపమున పొందెదరుగాక!॥౨౦॥

**భావార్థము** :-ఏ మనుష్యులు కన్యలకు ఉత్తమ శిక్షణనిచ్చి, విదుషీమణులనుగా జేసి, స్వయంవర విధిగా ప్రియపత్నులనుగా నొనర్చుకొని ప్రీతియుక్తముగ శ్రేష్ఠసంతానము నుత్పన్నమొనర్చెదరో అట్టి సంతానములు అత్యంత ప్రశంసనీయమగును.॥౨౦॥

20. O teachress bring thou near thee in this domestic life, for drinking the juice of medicines, husbands full of attributes like thee, and consorts of the learned; and may thy husband invite near him the lustrous scholars!.

౧౪౮౦.అభీత్యస్య మేధాతిథిర్ఋషిః, విద్వాన్ దేవతాః, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

కే విద్వాంసో భవేయురిత్యాహ. ఎవరు విద్వాంసు లగుదు రను విషయ మీ మంత్రమందు చెప్పడెను.

౧౪౮౦ అభి యజ్ఞం గృణీహి నో గ్నావో నేష్టః పిబ ఋతునా।
త్వꣳహి రత్నధా౽ అసి॥౨౧॥

ప.వి:- అభి, యజ్ఞమ్, గృణీహి,నః, గ్నావః, నేష్టరితి, నేష్టః, పిబ, ఋతునా, త్వమ్, హి, రత్నధా ఇతి రత్న+ధాః, అసి.॥౨౧॥

పదార్థః:- (అభి) ఆభిముఖ్యే (యజ్ఞమ్) ప్రశస్తవ్యవహారమ్ (గృణీహి)స్తుహి (నః) అస్మాకమ్ (గ్నావః) ప్రశస్తవాగ్మిన్. గ్నేతి వాఙ్ నా...నిఘం ౧. ౧౧. (నేష్టః)నేతః (పిబ) (ఋతునా) వసన్తాద్యేన సహ (త్వమ్) (హి) (రత్నధాః) రమణీయవస్తుధర్తా (అసి).॥౨౧॥

అన్వయః:-హే గ్నావో నేష్టస్త్వమృతునా సహ నో యజ్ఞమభి గృణీహి, యతస్త్వం హి రత్నధా అసి తస్మాత్సదోషధిరసాన్ పిబ. ॥౨౧॥

భావార్థః:-యే సుశిక్షితాయా వాచః సఙ్గతం వ్యవహారం జ్ఞాతుమిచ్ఛేయుస్తే విద్వాంసో భవేయుః.॥౨౧॥

పదార్థము :-(గ్నావః) ప్రశస్త వాణి గల (నేష్టః) నాయకా! నీవు (ఋతునా) వసంతము మున్నగు ఋతువులతో గూడ (నః) మాయొక్క (యజ్ఞమ్) ఉత్తమవ్యవహారములను (అభి, గృణీహి) ఎదుటనే స్తుతించుము. ఏలన (త్వం, హి) నీవే (రత్నదాః) ప్రసన్నతకు హేతువైన వస్తువుల ధారణమొనర్చు కర్తవై (అసి) ఉన్నావు. కావున ఉత్తమ ఓషధీరసములను (పిబ) పానమొనర్చుము.॥౨౧॥

భావార్థము :- ఉత్తమ శిక్షణలను పొంది వేదానుకూల వ్యవహారముల నెరుగు నిచ్ఛగల వారు మాత్రమే శ్రేష్ఠ విద్వాంసులగుదురు. ॥౨౧॥

21. O eloquent leader, make our fair dealings worthy of praise. Thou art the giver of wealth. Drink the juice of medicines!.

౧౪౮౧. ద్రవిణోదా ఇత్యస్య మేధాతిథిర్ఋషిః, సోమో దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునర్విద్వద్భిర్మనుష్యైః కిం కార్యమిత్యాహ.

విద్వాంసులైన మనుష్యు లేమిచేయవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౮౧ ద్రవిణోదాః పిపీషతి జుహోత ప్ర చ తిష్ఠత। నేష్ట్రాదృతుభిరిష్యత॥౨౨॥

ప.వి:- ద్రవిణోదా ఇతి ద్రవిణః+దాః పిపీషతి, జుహోత, ప్ర, చ, తిష్ఠత, నేష్ట్రాత్, ఋతుభిరిత్యృతు +భిః ఇష్యత.॥౨౨॥

పదార్థః:-(ద్రవిణోదాః) యో ద్రవిణో ధనం యశో వా దదాతి సః (పిపీషతి) పాతుమిచ్ఛతి (జుహోత) (ప్ర,చ) (తిష్ఠత) ప్రతిష్ఠాం లభధ్వమ్ (నేష్ట్రాత్) వినయాత్ (ఋతుభిః) వసన్తాదిభిః సహ (ఇష్యత) ప్రాప్నుత.॥౨౨॥

అన్వయః:-హే మనుష్యా యథా ద్రవిణోదా ఋతుభిః సహ నేష్ట్రాద్రసం పిపీషతి తథా యూయం రసమిష్యత జుహోత ప్రతిష్ఠత చ. ॥౨౨॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే విద్వాంసో మనుష్యా యథా సద్వైద్యాః పథ్యేనోత్తమవిద్యయా స్వయమరోగాః సన్తోఽన్యాన్ రోగాత్ పృథక్కృత్య ప్రశంసాం లభన్తే తథైవ యుష్మాభిరప్యాచరణీయమ్.॥౨౨॥

పదార్థము :- ఓ మానవులారా! ఎట్లు (ద్రవిణోదాః) ధనము లేక యశస్సు నిచ్చువాడు (ఋతుభిః) వసంతాది ఋతువులతో గూడ (నేష్ట్రాత్) వినయముగా రసమును (పిపీషతి) త్రాగదలచునో, అట్లే మీరును రసమును (ఇష్యత) పొందుడు (జుహోత) గ్రహణమొనర్చుడు లేక హవనమొనర్చుడు (చ) మరియు (ప్ర తిష్ఠత) ప్రతిష్ఠను పొందుడు.॥౨౨॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ విద్వాంసుడా! ఉత్తమ వైద్యుడు చక్కని పథ్యభోజనము మరియు ఉత్తమవిద్యలచే స్వయముగా రోగరహితుడై ఇతరుల రోగములను దొలగించి ప్రశంసలను పొందునో అట్లు మీరును ఆలోచనా పుర్వకముగ ఆచరించి, ఇతరుల నాచరిప జేయవలెను. ॥౨౨॥

22. O men, just as the giver of wealth and fame, according to seasons, humbly desires to drink the juice, so should ye procure this juice, perform havan, and attain to glory!.

౧౪౮౨.తవాయమిత్యస్య మేధాతిథిర్ఋషిః, విద్వాన్ దేవతా. భురిక్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౮౨ తవాయꣳ సోమస్త్వమేహ్యర్వాఙ్శశ్వత్తమꣳసుమనా అస్య పాహి।

అస్మిన్యజ్ఞే బర్హిష్యానిషద్యా దధిష్వేమం జఠరఽఇన్దుమిన్ద్ర ॥౨౩॥

ప.వి:- తవ, అయమ్, సోమః, త్వమ్, ఆ, ఇహి, అర్వాఙ్ శశ్వత్తమమితి శశ్వత్+తమమ్, సుమనా ఇతి సు+మనాః, అస్య, పాహి, అస్మిన్, యజ్ఞే, బర్హిషి, ఆ, నిషద్య, నిసద్యేతి ని+సద్య, దధిష్వ, ఇమమ్, జఠరే, ఇన్దుమ్, ఇన్ద్ర.॥౨౩॥

పదార్థః :-(తవ) (అయమ్) (సోమః) ఐశ్వర్యయోగః (త్వమ్) (ఆ, ఇహి) సమన్తాత్ప్రాప్నుహి (అర్వాఙ్) అభిముఖ్యం ప్రాప్తః (శశ్వత్తమమ్) అతిశయేన శశ్వదనాది భూతమ్ (సుమనాః) ధర్మకార్యే ప్రసన్నమనాః (అస్య) (పాహి) (అస్మిన్) (యజ్ఞే) సంగన్తవ్యే (బర్హిషి) ఉత్తమే సాధుని(ఆ) (నిషద్య) నితరాం స్థిత్వా. అత్ర సంహితాయామితి దీర్ఘః. (దధిష్వ) ధర (ఇమమ్) (జఠరే) ఉదరాగ్నౌ (ఇన్దుమ్) రోగహరౌషధిరసమ్ (ఇన్ద్ర) పరమైశ్వర్యమిచ్ఛో.॥౨౩॥

అన్వయః :-హే ఇన్ద్ర విద్వన్యస్తవాయం సోమోఽస్తి, తం త్వమేహి సుమనా అర్వాఙ్ సన్నస్య శశ్వత్తమం పాహి. అస్మిన్ బర్హిషి యజ్ఞే నిషద్య జఠర ఇమమిందుం చాదధిష్వ.॥౨౩॥

భావార్థః :-విద్వాంసః సర్వైః సహాభిముఖ్యం ప్రాప్య ప్రసన్నమనసః సన్తః సనాతనం ధర్మం విజ్ఞానఞ్చోపదిశేయుః పథ్యమన్నాది సేవేరన్ సదైవ పురుషార్థే ప్రయుతేరꣳశ్చ.॥౨౩॥

పదార్థము :-(ఇన్ద్ర) పరమైశ్వర్యముల నాకాంక్షించు విద్వాంసుడా! ఏ (తవ) నీయొక్క (అయమ్) ఏ (సోమః) ఐశ్వర్యయోగముగలదో దానిని (త్వమ్) నీవు (ఆ, ఇహి) చక్కగా ప్రాప్తించుకొనుము (సుమనాః) ధర్మకార్యములందు ప్రసన్నచిత్తము (అర్వాఙ్) ఎదుటనే ప్రాప్తించిన (అస్య) ఈ నీ యాత్మ యొక్క (శశ్వత్తమమ్) అధికతరమగు అనాదిధర్మమును (పాహి) కాపాడుము (అస్మిన్) ఇట్టి (బర్హిషి) ఉత్తమ (యజ్ఞే) పొందదగిన వ్యవహారములందు (నిషద్య) నిరంతరము స్థిరముగనుండి (జఠరే) జఠరాగ్నియందు (ఇమమ్) ఈ ప్రత్యక్ష (ఇన్దుమ్) రోగనాశక ఓషధులరసమును (ఆ, దధిష్వ) ఉత్తమరీతిలో ధారణమొనర్చుము.॥౨౩॥

భావార్థము :-విద్వాంసులగువారు సర్వజనుల ఎదుటకు చేరి ప్రసన్నచిత్తము గలవారై సనాతనధర్మము మరియు విజ్ఞానము నుపదేశించవలెను. పథ్యాన్నముల భుజించుచు సదా పురుషార్థములందు నిరతులై యుండవలయును. ॥౨౩॥

23. O learned person desirous of supremacy, secure well thy contact with powe.r In the performance of religious deeds, with a tranquil mind, protect this eternal soul of thine. Sitting steadfastly in this yajna, take into thy belly this efficacious medicinal juice!

౧౪౮౩. అమేవేత్యస్య గృత్సమద ఋషిః, విద్వాన్ దేవతా, జగతీ ఛందః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౮౩ అమేవ నః సుహవా ఆ హి గన్తన ని బర్హిషి సదతనా రణిష్టన ।

అథా మదస్వ జుజుషాణో అన్ధసస్త్వష్టర్దేవేభిర్జనిభిః సుమద్గణః॥౨౪॥

ప.వి:- అమేవేత్యమా+ఇవ, నః, సుహవా+ ఇతి సు+హవాః, ఆ, హి, గన్తన, ని, బర్హిషి, సదతన, రణిష్టన, అథ, మదస్వ, జుజుషాణః, అన్ధసః, త్వష్టః, దేవేభిః, జనిభిరితి జని+భిః, సుమద్గణ ఇతి సుమత్+గణః.॥౨౪॥

పదార్థః-(అమేవ) ఉత్తమం గృహమివ (నః) అస్మాన్ (సుహవాః) శోభనాహ్వానాః (ఆ) (హి) కిల (గన్తన) గచ్ఛత (ని) నితరామ్ (బర్హిషి) ఉత్తమే వ్యవహారే (సదతన) సీదత (రణిష్టన) వదత (అథ) అనంతరమ్. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. (మదస్వ) ఆనన్ద (జుజుషాణః) ప్రసన్నః సేవమానః (అన్ధసః) అన్నాదేర్మధ్యే (త్వష్టః) దేదీప్యమానః (దేవేభిః) దివ్యగుణైః (జనిభిః) జన్మభిః (సుమద్గణః) సుహర్షగణః. ॥౨౪॥

అన్వయః:-హే త్వష్టో జుజుషాణః సుమద్గణః సంస్త్వం దేవేభిర్జనిభిః సహాఽన్ధసో మదస్వాథాఽమేవాన్యానానన్దయ, హే విద్వాంసః సుహవా యూయమమేవ బర్హిషి న ఆ గన్తన. అత్ర హి నిషదతన రణిష్టన చ.॥౨౪॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యే స్వయముత్తమే వ్యవహారే స్థిత్వాఽన్యాన్ స్థాపయేయుస్తే సదాఽనన్దేయుః. స్త్రీపురుషాః ప్రీత్యా సంయుజ్య యాన్యపత్యాని జనయేయుస్తాని దివ్యగుణాని జాయన్తే. ॥౨౪॥

**పదార్థము** :-(త్వష్టః) తేజస్వివగు ఓ విద్వాంసుడా! (జాజాషాణః) ప్రసన్నచిత్తముతో గురుజనముల సేవలొనర్చుచు (సుమద్గణః) చక్కని ప్రసన్నమండలిగలిగిననీవు (దేవేభిః) ఉత్తమ గుణములతో (జనిభిః) జన్మములతో గూడ (అన్ధసః) అన్నాది పదార్థముల ప్రాప్తియందు (మదస్వ) ఆనందితుడవు కమ్ము (అథ) ఆ పిదప (అమేవ) ఉత్తమ గృహమువలె ఇతరుల కానందమును గలిగించుము. ఓ విద్వాంసులారా! (సుహవాః) చక్కగా పిలుచువారగు మీరు ఉత్తమ గృహమువలె (బర్హిషి) ఉత్తమ వ్యవహారమున (నః) మాకు (ఆ, గన్తన) ఉత్తమముగా ప్రాప్తించుడు. ఈ స్థానమునందు (హి) నిశ్చితులై (ని, సదతన) నిరంతరము కూర్చుండుడు మరియు (రణిష్టన) చక్కగా నుపదేశింపుడు.॥౨౪॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఉత్తమ వ్యవహారములందు స్థిరులైయుండి ఇతరులను స్థిరపరచువారు సదా ఆనందితులై యుందురు. పతీపత్నులు ఉత్కంఠపూర్వకముగ సంయోగమయి సంతానము నుత్పన్నమొనర్చిన అట్టి సంతానము ఉత్తమ గుణములతో గూడినదగును.॥౨౪॥

24. O majestic scholar, serving gladly thy preceptor, in gladsome company, with noble qualities, and with thy mother, sister and wife, be happy in the acquisition of nice foodsutffs!.

Afterwards make others happy like a comfortable house. O learned perople, well invoked establish us in fair dealings, sit near us at ease, and give us good insructions!.

౧౪౨౪.స్వాదిష్ఠయేత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, సోమో దేవతా, నిచృద్ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౨౪ స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమ ధారయా।

ఇన్ద్రాయ పాతవే సుతః ॥౨౫॥

ప.వి:- స్వాదిష్ఠయా, మదిష్ఠయా, పవస్వ, సోమ, ధారయా, ఇన్ద్రాయ, పాతవే, సుతః.॥౨౫॥

పదార్థః :-(స్వాదిష్ఠయా) అతిశయేన స్వాదుయుక్తయా (మదిష్ఠయా) అతిశయేనానన్దప్రదయా (పవస్వ) పవిత్రో భవ (సోమ) ఐశ్వర్యయుక్త (ధారయా) ధారణకర్త్ర్యా (ఇన్ద్రాయ) ఐశ్వర్యాయ (పాతవే) పాతుం రక్షితుమ్ (సుతః) నిష్పాదితః. ॥౨౫॥

అన్వయః:-హే సోమ! విద్వంస్త్వం య ఇంద్రాయ పాతవే సుతోఽస్తి తస్య స్వాదిష్ఠయా మదిష్ఠయా ధారయా పవస్వ.॥౨౫॥

భావార్థః :-యే విద్వాంసో మనుష్యాః సర్వరోగప్రణాశకమానందప్రదమోషధిరసం పీత్వా శరీరాత్మానౌ పవిత్రయన్తి తే ధనాఢ్యా జాయన్తే.॥౨౫॥

పదార్థము :-(సోమ) ఐశ్వర్యయుక్తుడవు నగునో విద్వాంసుడా! నీవు ఏ (ఇన్ద్రాయ) సంపత్తిని (పాతవే) రక్షణ యొనర్చుటకై (సుతః) తీయబడిన ఉత్తమరసము గలదో, దానిని (స్వాదిష్ఠయా) అతి స్వాదయుక్తముగా (మదిష్ఠయా) అత్యానందమును గలిగించునదియు (ధారయా) ధారణ మొనర్చదగిన క్రియచే (పవస్వ) పవిత్రుడవు అగుము.॥౨౫॥

భావార్థము :-విద్వాంసులగువారు సమస్త రోగములను నాశమొనర్చునట్టి ఓషధుల రసమును పానమొనర్చి తమ శరీరములు మరియు ఆత్మలను పవిత్రమొనర్చుకొని ధనాఢ్యులగుదురు. ॥౨౫॥

25. O mighty learned fellow, fro thee is this juice pressed, for the protection of riches. Purify thyself with its sweetest and most gladdening flow!.

౧౪౮౫.రక్షోహేత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౮౫ రక్షోహా విశ్వచర్షణిరభి యోనిమయోహతే। ద్రోణే సధస్థమాసదత్॥౨౬॥

ప.వి:- రక్షోహేతి రక్షః+హా, విశ్వచర్షణిరితి విశ్వ+చర్షణిః, అభి, యోనిమ్, అయః+హతే, ద్రోణే, సధస్థమితి సధ+స్థమ్, ఆ, అసదత్.॥౨౬॥

పదార్థః :-(రక్షోహా) యో రక్షాంసి దుష్టాన్ ప్రాణినో హన్తి సః (విశ్వచర్షణిః) విశ్వస్యాఽఖిలస్య ప్రకాశకః (అభి) అభితః (యోనిమ్) గృహమ్ (అయోహతే) అయసా సువర్ణేన ప్రాప్తే. అయ ఇతి హిరణ్యనా...నిఘం. ౧. ౨ (ద్రోణే) పాత్రవిశేషే (సధస్థమ్) సమానస్థానమ్ (ఆ) (అసదత్) తిష్ఠేత్.॥౨౬॥

అన్వయః:-యో రక్షోహా విశ్వచర్షణిర్విద్వానయోహతే ద్రోణే సధస్థం యోనిమభ్యాసదత్స సర్వం సుఖమాప్నుయాత్. ॥౨౬॥

భావార్థః:-యేఽవిద్యాహన్తారో విద్యాప్రకాశకాః సర్వర్తుసుఖకరేషు సువర్ణాదియుక్తేషు గృహేషు స్థిత్వా విచారం కుర్యుస్తే సుఖినో జాయన్త ఇతి.॥౨౬॥

పదార్థము :-(రక్షోహా) దుష్టప్రాణులను సంహరించునట్టి (విశ్వచర్షణిః) విశ్వమంతటను ప్రకాశపరచునట్టి ఏ విద్వాంసుడు (అయోహతే) సువర్ణముచే లభ్యమైన (ద్రోణే) ద్రోణము [ఇరువది సేర్ల అన్నమునుంచదగిన

పా[త్ర] యందు (సధస్థమ్) సమానస్థితిగల (యోనిమ్) గృహమునందు (అభి,ఆ,అసదత్) ఉత్తమ రీతిలో స్థిరమై యుండునో నాతడు సంపూర్ణ సుఖమును పొందును.॥౨౬॥

**భావార్థము** :- అవిద్యను నాశనమొనర్చి అజ్ఞానమును దొలగించి విజ్ఞానమును ప్రకాశపరచు విద్వాంసులు సకల ఋతువులందును సుఖమునిచ్చు సువర్ణాదులతో గూడియున్న గృహమున గూర్చుండి ఆలోచన (మనన) మొనర్చువారు సదా సుఖవంతులై యుందురు. ॥౨౬॥

**26. The fiend - queller, and the friend of all, in his country attains to reverence and a dignified position, and lives happily in his house filled with gold.**

అస్మిన్నధ్యాయే పురుషార్థఫలవర్ణనం సర్వేషాం మనుష్యాణాం వేదపఠనశ్రవణాధికారః పరమేశ్వరవిద్వత్సత్య నిరూపణమగ్న్యాదిపదార్థకథనం యజ్ఞవర్ణనం సుందరగృహనిర్మాణముత్తమస్థానే స్థితిశ్చోక్తాఽత ఏతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతిరస్తీతి వేద్యమ్.

ఈ యధ్యాయమునందు పురుషార్థముయొక్క ఫలము, సమస్త మానవులకు వేదమును చదువుటకు, వినుటకు అధికారము, పరమేశ్వరుడు, విద్వాంసుడు, సత్యనిరూపణము, అగ్ని మున్నగు పదార్థములు, యజ్ఞము, చక్కనిగృహము నిర్మించుట మరియు ఉత్తమ స్థానములందు స్థిరముగుట మున్నగు విషయములు చెప్పబడినవి. కావున ఈ యధ్యాయము యొక్క అర్థము పూర్వాధ్యాయమునందు చెప్పబడిన యర్థముతో సంగతిగలదని గ్రహించ వలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానందసరస్వతీస్వామినా విరచితే
సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే షడ్వింశోఽధ్యాయః పూర్తిమగాత్ ॥ ౨౬॥

శ్రీ మత్పరమహంసపరివ్రాజకాచార్యమహర్షిదయానందసరస్వతీస్వామివిరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి ఇరువదియారవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశ్ష ఇందూరు మండ
లాంతర్గత బీబిపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం.లోకములహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ.శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కులప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ,ఆర్షవిద్యావినోద ఆచార్య
'మర్రి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరించబడిన
**ఇరువది యారవఅధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

# యజుర్వేదభాష్యము

## 27వ అధ్యాయము - విషయసూచిక

ఇందులో 45మంత్రములు, 45ఛందస్సులు, 690పదములు, 1591అక్షరములు

# అథ సప్తవింశో౽ధ్యాయః

## అస్మిన్నధ్యాయే పఞ్చచత్వారింశన్మన్త్రాః సన్తీతివేదితవ్యమ్.

ఓం.విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న౽ ఆ సువ ॥య.30.3॥

౧౪౮౬.సమా ఇత్యస్యాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

అథాప్తైః కథమాచరణీయమిత్యాహ. ఆప్తు లెట్లు ప్రవర్తించవలయు నను విషయము చెప్పబడెను.

౧౪౮౬ సమాస్త్వాగ్న౽ ఋతవో వర్ధయన్తు సంవత్సరా౽ ఋషయో యాని సత్యా।

సం దివ్యేన దీదిహి రోచనేన విశ్వా ఆ భాహి ప్రదిశశ్చతస్రః ॥౧॥

ప.వి:- సమాః, త్వా, అగ్నే, ఋతవః, వర్ధయన్తు, సంవత్సరాః, ఋషయః, యాని, సత్యా, సమ్, దివ్యేన। దీదిహి, రోచనేన, విశ్వాః, ఆ, భాహి, ప్రదిశ ఇతి ప్ర + దిశః, చతస్రః ॥౧॥

పదార్థః :-(సమాః) వర్షాణి (త్వా) త్వామ్ (అగ్నే) విద్వన్ (ఋతవః) శరదాదయః (వర్ధయన్తు) (సంవత్సరాః) (ఋషయః) మంత్రార్థవిదః (యాని) (సత్యా) సత్సు సాధూని త్రైకాల్యాబాధ్యాని కర్మాణి (సమ్)(దివ్యేన) అతిశుద్ధేన (దీదిహి) కామయ (రోచనేన) ప్రదీపనేన (విశ్వాః) అఖిలాః (ఆ) సమన్తాత్ (భాహి) ప్రకాశయ ((ప్రదిశః) ప్రకృష్టగుణయుక్తా దిశః (చతస్రః) ఏతత్సంఖ్యాప్రమితాః.॥౧॥

అన్వయః :-హే అగ్నే! సమా ఋతవః సంవత్సరా ఋషయో యాని సత్యా సన్తి తే త్వా వర్ధయన్తు. యథా౽గ్నిర్దివ్యేన రోచనేన విశ్వాశ్చతస్రః ప్రదిశః ప్రకాశయతి తథా విద్యాం సందీదిహి. న్యాయ్యం ధర్మమా భాహి. ॥౧॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. ఆప్తైః సర్వదా సత్యా విద్యాః కర్మాణి చోపదిశ్య సర్వేషాం శరీరిణామారోగ్యపుష్టిర్విద్యాసుశీలే చ వర్ధనీయే. యథా సూర్యః స్వసంనిహితాన్ప్రకాశయతి తథా సర్వే మనుష్యాః సుశిక్షయా సదైవావర్ధయితవ్యాః.॥౧॥

పదార్థము :- ఓ (అగ్నే) విద్వాంసుడా! (సమాః) వర్ష (ఋతవః) శరదాది ఋతువులు (సంవత్సరాః) ప్రభవ, విభవ మున్నగు సంవత్సరములు (ఋషయః) మంత్రార్థముల నెరిగిన విద్వాంసులు మరియు

(యాని) ఏవి (సత్యా) సత్యకర్మలు గలవో, అవి (త్వా) నిన్ను (వర్ధయన్తు) వృద్ధిపరచుగాక! అగ్ని యెట్లు (దివ్యేన) శుద్ధమగు (రోచనేన) ప్రకాశముచే (విశ్వాః) సకల (ప్రదిశః) ఉత్తమగుణములతో గూడిన (చతస్రః) నాలుగుదిశల నెట్లు ప్రకాశపరచునో, అట్లే విద్యయొక్క (సం, దీదిహి) ఉత్తమరీతిని కాంక్షించుము మరియు న్యాయయుక్త ధర్మమును (సం,అ,భాహి) శ్రేష్ఠముగ ప్రకాశపరచుము.॥౧॥

భావార్థము :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఆప్తులగువారు సర్వకాలములయందు సత్యవిద్యలను, ఉత్తమ కర్మలను గూర్చి ఉపదేశించుచు సమస్త శరీరధారుల ఆరోగ్యము, పుష్టి,విద్య, సుశీలత్వములను పెంపొందించవలయును. సూర్యుడు తన సన్ముఖ పదార్థముల నెట్లు ప్రకాశపరచునో, అట్లే సకల మానవులను శిక్షణచే సదా ఆనందితుల నొనర్చవలయును. ॥౧॥

1. O learned person, may years, seasons, knowers of vedic interpretation and all the verities strenghten thee!.

Just as the sun with celestial effulgence illumines all the four efficacious regions so should thou long for knowledge, and manifest justice.

౧౪౮౭.సం చేత్యస్యాగ్నిర్ఋషిః, సామిధేన్యో దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

విద్వాంస ఏవోత్తమాధికారే యోజనీయా ఇత్యాహ.

విద్వాంసులనే ఉత్తమాధికారమునందు నియుక్తపరచవలయును.

౧౪౮౭ సం చేధ్యస్వాగ్నే ప్ర చ బోధయైనముచ్చ తిష్ఠ మహతే సౌభగాయ।
మా చ రిషదుపసత్తా తే అగ్నే బ్రహ్మాణస్తే యశసః సన్తు మాఽన్యే॥౨॥

ప.వి:- సమ్, చ, ఇధ్యస్వ, అగ్నే, ప్ర, చ, బోధయ, ఏనమ్, ఉత్, చ, తిష్ఠ, మహతే, సౌభగాయ, మా, చ, రిషత్, ఉపసత్తేత్యుప+సత్తా, తే, అగ్నే, బ్రహ్మాణః, తే, యశసః, సన్తు, మా, అన్యే.॥౨॥

పదార్థః :- (సమ్) సమ్యక్ (చ) (ఇధ్యస్వ) ప్రదీప్తో భవ (అగ్నే) అగ్నివద్వర్తమాన (ప్ర) (చ) (బోధయ) (ఏనమ్) జిజ్ఞాసుమ్ (ఉత్) (చ) (తిష్ఠ) (మహతే) (సౌభగాయ) శోభనస్య భగస్యైశ్వర్యస్య భావాయ (మా) (చ) (రిషత్) హింస్యాత్, (ఉపసత్తా) య ఉపసీదతి సః (తే) తవ (అగ్నే) (బ్రహ్మాణః) చతుర్వేదవిదః (తే) (యశసః) కీర్తేః (సన్తు) (మా) నిషేధే (అన్యే).॥౨॥

అన్వయః :-హే అగ్నే! త్వం సమిధ్యస్వైవం ప్రబోధయ చ మహతే సౌభగాయ చోత్తిష్ఠ. ఉపసత్తా భవాన్ సౌభగం మా రిషత్. హే అగ్నే! తే బ్రహ్మాణోఽన్యే చ మా సన్తు తే యశస ఉన్నతిం చ మా రిషత్.॥౨॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే విద్వద్భ్యో భిన్నాజ్ఞానానుత్తమాఽధికారేన యోజయన్తి సదోన్నతయే ప్రయతన్తేఽన్యాయేన కఞ్చిన్న హింసన్తి చ తే కీర్త్యైశ్వర్యయుక్తా భవన్తి.॥౨॥

పదార్థము :-(అగ్నే) అగ్నివంటి తేజోవంతుడవగు విద్వాంసుడా! నీవు (సమ్, ఇధ్యస్వ) చక్కగా ప్రకాశించుము (చ) మరియు (ఏనమ్) ఈ జిజ్ఞాసువులకు (ప్రబోధయ) చక్కని బోధను చేయుము (చ) మరియు (మహతే) గొప్ప) (సౌభగాయ)సౌభాగ్యవంతులగుటకై (ఉత్, తిష్ఠ) ఉద్యమించుము (ఉపసత్తా) సమీపమున గూర్చుండు సౌభాగ్యమును నీవు (మా, రిషత్) చెరచకుము (అగ్నే) ఓ తేజోవంతులు (తే) నీయొక్క (బ్రహ్మాణః) నాలుగు వేదముల నెరిగినవారు (అన్యే) భిన్నబుద్ధిగలవారు (చ) కూడ (మా, సన్తు) కాకుందురు గాక (చ)మరియు (తే) నీవు నీయొక్క (యశసః) యశోకీర్తులయున్నతిని చెరచివేయకుము.॥౨॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులకు భిన్నముగ అయోగ్యులను ఉత్తమాధికారములపై నియుక్త మొనర్చనివారు, సదా ఉన్నతికై ప్రయత్నించువారు, అన్యాయముగా ఎవ్వరినికూడ సంక్షోభపరచనివారు కీర్తి, ఐశ్వర్యయుక్తులు, యశోవంతు లగుదురు. ॥౨॥

2. Shine thou, O learned person lustrious like fire, make this seeker after knowledge, rise up erect for great and happy fortune. Be those uninjured who adore thee. Let not thy priests, the knowers of all the four vedas, turn against thee. Don't spoil thy glory and progress!.

౧౪౮౮.త్వామిత్యస్యాగ్నిరృషిః, అగ్నిర్దేవతా, విరాట్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

జిజ్ఞాసుభిః కిం కర్తవ్యమిత్యాహ. జిజ్ఞాసువు లేమి చేయవలయునను విషయము చెప్పబడెను.

౧౪౮౮ త్వామగ్నే వృణతే బ్రాహ్మణా ఇమే శివో అగ్నే సంవరణే భవా నః ।

సపత్నహా నో అభిమాతిజిచ్చ స్వే గయే జాగృహ్యప్రయుచ్ఛన్॥౩॥

ప.వి:- త్వామ్, అగ్నే, వృణతే, బ్రాహ్మణాః, ఇమే, శివః, అగ్నే, సంవరణ ఇతి సం + వరణే, భవ, నః, సపత్నహేతి సపత్న+హా, నః, అభిమాతిజిదిత్యభిమాతి+జిత్, చ, స్వే, గయే, జాగృహి, అప్రయుచ్ఛన్నిత్య ప్ర+యుచ్ఛన్.॥౩॥

పదార్థః :- (త్వామ్) (అగ్నే) విద్వన్ (వృణతే) స్వీకుర్వన్తి (బ్రాహ్మణాః) బ్రహ్మవిదః (ఇమే) (శివః) మఙ్గలకారీ (అగ్నే) పావకవత్ ప్రకాశమాన (సంవరణే) సమ్యక్ స్వీకరణే (భవ) అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః. (నః) అస్మాకమ్ (సపత్నహా) శత్రుదోషహన్తా (నః) అస్మాన్ (అభిమాతిజిత్) అభిమానజిత్, (చ) (స్వే) స్వకీయే (గయే) గృహే (జాగృహి) (అప్రయుచ్ఛన్) ప్రమాదమకుర్వన్.॥3॥

అన్వయః :-హే అగ్నే పావకవద్వర్తమాన య ఇమే బ్రాహ్మణాస్త్వాం వృణతే, తాన్ ప్రతి త్వం సంవరణే శివో భవ నోఽస్మాకం సపత్నహా భవ. హే అగ్నేఽప్రయుచ్ఛన్నభిమాతిజిచ్చ త్వం స్వే గయే జాగృహి నో ఽస్మాంశ్చ జాగృతాన్ కురు.॥3॥

భావార్థః :-యథా విద్వాంసో బ్రహ్మ స్వీకృత్య మఙ్గలమాప్నువన్తి. దోషాన్ ఘ్నన్తి తథా జిజ్ఞాసవో బ్రహ్మవిదః ప్రాప్య మఙ్గలాచరణాః సన్తః కుశీలతాం ఘ్నన్త్వాలస్యం విహాయ విద్యామున్నయన్తు చ.॥3॥

పదార్థము :-(అగ్నే) తేజస్వివగు ఓ విద్వాంసుడా! అగ్ని సమానముగ నున్నట్టి ఏ (ఇమే) ఈ (బ్రాహ్మణాః) బ్రహ్మవేత్తలు (త్వామ్) నిన్ను (వృణతే) స్వీకరించుచున్నారో వారియెడ నీవు (సంవరణే) చక్కగా స్వీకరించుటయందు (శివః) శుభప్రదాతవు (భవ) అగుము (నః) మాయొక్క (సపత్నహా) శత్రువుల దోషములను హననమొనర్చువాడవు అగుము (అగ్నే) అగ్నివలె ప్రకాశించువాడా! (అప్రయుచ్ఛన్) నిర్లక్ష్యము చేయక (చ) మరియు (అభిమాతిజిత్) అభిమానమును జయించువాడవగు నీవు (స్వే) స్వకీయ (గయే) గృహమునందు (జాగృహి) జాగరూకుడవై యుండుము అనగా అధిక నిద్ర, సోమరితనము మున్నగు వానిని వదలుము (నః) మమ్ము శీఘ్రముగా చైతన్యపరచుము.॥3॥

**భావార్థము** :- విద్వాంసులగువారు పరబ్రహ్మానుభూతిని ప్రాప్తించుకొని ఆనందశుభములను దోషములను నిర్మూలముగ నాశపరచుకొనునట్లు జిజ్ఞాసువులగువారు బ్రహ్మవేత్తలగు విద్వాంసులను ప్రాప్తించుకొని ఆనందమంగళముల నాచరించుచు కుసంస్కార, నీచస్వభావముల మూలమును ఛేదించి, సోమరితనమునువదలి విద్యల నున్నతపరచు చుండవలెను.॥3॥

3. O learned person, these masters of the vedas elect thee as their leader. Be thou propitious unto them in this election. Remove thou the errors of our foes. O learned personbeing free from sloth and pride, watch in thy house, and keep us also conscious!.

౧౪౦౯. ఇహైవేత్యస్యాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజధర్మవిషయమాహ. ఇపుడు రాజధర్మ విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౦౯ ఇహైవాగ్నేఽఅధి ధారయా రయిం మా త్వా ని క్రన్పూర్వచితో నికారిణః।
క్షత్రమగ్నే సుయమమస్తు తుభ్యముపసత్తా వర్ధతాం తేఽఅనిష్టృతః ॥4॥

ప.వి:- ఇహ, ఏవ, అగ్నే, అధి, ధారయ, రయిమ్, మా, త్వా, ని, క్రన్, పూర్వచిత ఇతి పూర్వ+చితః నికారిణ ఇతి ని+కారిణః, క్షత్రమ్, అగ్నే, సుయమమితి సు+యమమ్, అస్తు, తుభ్యమ్। ఉపసత్తేత్యుప+సత్తా, వర్ధతామ్, తే, అనిష్టృతః, అనిస్తృత ఇత్యని+స్తృతః.॥౮॥

పదార్థః :-(ఇహ) అస్మిన్ సంసారే (ఏవ) (అగ్నే) విద్యుద్వర్తమాన (అధి) ఉపరిభావే (ధారయ) అత్ర సంహితాయామితి దీర్ఘః. (రయిమ్) శ్రియమ్, (మా) (త్వా) త్వామ్(ని) నీచైః (క్రన్) కుర్యుః (పూర్వచితః) పూర్వైః ప్రాప్తవిజ్ఞానాదిభిర్వృద్ధైః (నికారిణః) నితరాం కర్తుం స్వభావాః (క్షత్రమ్) ధనం రాజ్యం వా (అగ్నే) వినయప్రకాశిత (సుయమమ్) సుష్ఠు యమా యస్మాత్తత్ (అస్తు) (తుభ్యమ్) (ఉపసత్తా) ఉపసీదన్ (వర్ధతామ్) (తే) తవ (అనిష్టృతః) అనుపహింసితః. ॥౮॥

అన్వయః :- హే అగ్నే! త్వమిహ రయిం ధారయ పూర్వచితో నికారిణస్త్వామా ని క్రన్. హే అగ్నే! తే సుయమం క్షత్రమస్తు యేనోపసత్తా సన్ననిష్టృతో భూత్వైవ భవానధివర్ధతామ్. తుభ్యం క్షత్రం సుఖదాతృ భవతు.॥౮॥

భావార్థః :-హే రాజన్నేవం వినయం ధరేర్యేన పూర్వవృద్ధా జనాస్త్వాం బహుమన్యేయు రాజ్యే సునియమాన్ ప్రవర్తయ, యేన స్వయం స్వరాజ్యం చ విఘ్నవిరహం భూత్వా సర్వతో వర్ధేత భవన్తం సర్వోపరి ప్రజా మన్యేత చ ॥౮॥

పదార్థము :-(అగ్నే) విద్యుత్తువలె వర్తమానమై యున్న విద్వాంసుడా! నీవు (ఇహ) ఈ జగత్తునందు (రయిమ్) లక్ష్మిని (ధారయ) ధారణమొనర్చుము. (పూర్వచితః) మొదటనే పొందిన విజ్ఞానాదులందు శ్రేష్ఠమైనవారు (నికారిణః) నిరంతరము కర్మల నొనర్చు స్వభావముగలవారు (త్వా) నీకు (మా, ని, క్రన్) నీచగతి ప్రాప్తిని గలిగించకుందురుగాక! (అగ్నే) వినయముచే శోభించు ఓ సభాపతీ! (తే) నీయొక్క (సుయమమ్) శ్రేష్ఠనియమములందు నడచుచు, వారు (క్షత్రమ్) ధనము, రాజ్యముగలవారు (అస్తు) అగుదురుగాక! దానిచే (ఉపసత్తా) సమీపమున గూర్చుండి (అనిష్టృతః) హింస మరియు విఘ్నములను పొంద కుండి (ఏవ) నీవు మాత్రము (అధి, వర్ధతామ్) అధికవృద్ధిని పొందుము (తుభ్యమ్) నీ కొరకు రాజ్యధనములు సుఖవంతముగుగాక!॥౮॥

భావార్థము :-ఓ రాజా! నీవు శ్రేష్ఠనియమములం దుండుము. దీనిచే ప్రాచీన వృద్ధజనులు నిన్నుగొప్పగా నెంచెదరు. రాజ్యమునందు ఉత్తమ నియమములను ప్రవృత్తపరచుము. అందువల్ల నీవు, నీ రాజ్యము విఘ్నరహితమై నల్దిశలలో కీర్తివంతము గాగలదు.॥౮॥

4. O learned person, amass wealth in this world, Let not the old, exalted, learned persons, ever devoted to action, tolerate thy moral degradation!.

O ruler, famous for thy humility, let thy administration be run by just laws. May thy adorers, following non-violence make thee strong. May the State riches make thee happy!.

౧౪౯౦. క్షత్రేణేత్యస్యాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాట్ పఙ్క్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౯౦ క్షత్రేణాగ్నే స్వాయుః సꣳరభస్వ మిత్రేణాగ్నే మిత్రధేయే యతస్వ।
సజాతానాం మధ్యమస్థా ఏధి రాజ్ఞామగ్నే విహవ్యో దీదిహీహ॥౫॥

ప.వి:-క్షత్రేణ, అగ్నే, స్వాయురితి సు౽ఆయుః, సమ్, రభస్వ, మిత్రేణ, అగ్నే, మిత్రధేయ ఇతి మిత్ర+ధేయే, యతస్వ, సజాతానామితి స+జాతానామ్, మధ్యమస్థా ఇతి మధ్యమ+స్థాః, ఏధి, రాజ్ఞామ్, అగ్నే, విహవ్య ఇతి, వి+హవ్యః, దీదిహి, ఇహ॥౫॥

పదార్థః :-(క్షత్రేణ) రాజ్యేన ధనేన వా (అగ్నే) పావకవత్తేజస్విన్ (స్వాయుః) శోభనం చ తదాయుశ్చ (సమ్) సమ్యక్ (రభస్వ) ఆరంభం కురు (మిత్రేణ) ధార్మికైర్విద్వద్భిర్మిత్రైః సహ (అగ్నే) విద్యావినయప్రకాశక (మిత్రధేయే) మిత్రైర్ధర్తవ్యే వ్యవహారే (యతస్వ) (సజాతానామ్) సమానజన్మనామ్(మధ్యమస్థాః)మధ్యే భవా మధ్యమాః పక్షపాతరహితాస్తేషు తిష్ఠతీతి (ఏధి) భవ(రాజ్ఞామ్) ధార్మికాణాం రాజాధిరాజానాం మధ్యే (అగ్నే) న్యాయప్రకాశక (విహవ్యః) విశేషేణ స్తోతుం యోగ్యః (దీదిహి) ప్రకాశితో భవ (ఇహ) అస్మిన్ సంసారే రాజ్యాధికారే వా.॥౫॥

అన్వయః:-హే అగ్నే! త్వమిహ క్షత్రేణ సహ స్వాయుః సంరభస్వ. హే అగ్నే! మిత్రేణ సహ మిత్రధేయే యతస్వ. హే అగ్నే! సజాతానాం రాజ్ఞాం మధ్యే మధ్యమస్థా ఏధి. విహవ్యః సన్ దీదిహి చ.॥౫॥

భావార్థః:-రాజా సదా బ్రహ్మచర్యేణ దీర్ఘాయుః సత్యధర్మప్రియైరమాత్యైః సహ మంత్రయిత్వా౽న్యై రాజభిః సహ సుసన్ధిః పక్షపాతం విహాయ న్యాయాధీశః సర్వైః సులక్షణైర్యుక్తః సన్ దుష్టవ్యసనవిరహో భూత్వా ధర్మార్థకామమోక్షాన్ ధైర్యేణ శాన్త్యా౽ప్రమాదేన చ శనైశ్శనైః సాధయేత్.॥౫॥

**పదార్థము** :-(అగ్నే) అగ్నివంటి తేజస్వివగు విద్వాంసుడా! నీవు (ఇహ) ఈ ప్రపంచమున లేక రాజ్యాధికారమునందు (క్షత్రేణ) రాజ్యము మరియు ధనముతో గూడ (స్వాయుః) చక్కని యువావస్థయొక్క (సమ్, రభస్వ) ప్రారంభమును ఉత్తమముగా నొనర్చుము (అగ్నే) విద్యావినయములచే శోభించునట్టి ఓ రాజా! (మిత్రేణ) ధర్మాత్ములగు విద్వాంస మిత్రులతో గూడ (మిత్రధేయే) మిత్రులద్వారా ధారణాయోగ్యమగు వ్యవహారమునందు (యతస్వ) ప్రయత్నమొనర్చుము (అగ్నే) న్యాయమును చక్కగా ప్రకాశపరచు ఓ సభాపతీ! (సజాతానామ్) ఏకకాలమందుత్పన్నమైన సమవయస్కులు (రాజ్ఞామ్) ధర్మాత్ములగు రాజాధిరాజులమధ్య (మధ్యమస్థాః) మధ్యస్థుడవు వాది ప్రతివాదులకు సాక్షివిగా (ఏధి) అగుము (విహవ్యః) విశేషించి స్తుతించదగినవాడవై (దీదిహి) ప్రకాశితుడవగుము.॥౫॥

**భావార్థము** :-సభాపతియగు రాజు బ్రహ్మచర్యముతో దీర్ఘాయువు, సత్యధర్మములందు ప్రీతిగల మంత్రులతో గూడ ఆలోచించువాడై ఇతర రాజులతో చక్కని సంధిగలిగియుండి పక్షపాతరహితుడై, న్యాయాధీశుడు సకల శుభలక్షణములతో గూడి యుండి దుర్వ్యసనములను దూరపరచి ధర్మ అర్థ కామ మోక్షములను ధైర్యముగా, శాంతియుక్తముగ, ప్రమాదరహితముగా, నిదానముగ సాధించవలెను. ॥౫॥

5. O learned person commence thy youth with wealth in this world!.

O king, flowing with knowledge and humility, exert to maintain friendship with the religious, learned friends!.

O justice-loving head of the state, act as an umpire in the midst of your coequal virtuous kings. Be renowned as worthy of praise!.

౧౪౯౧.అతి నిహ ఇత్యస్యాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, భురిగ్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౯౧ అతి నిహో అతి స్రిధోऽత్యచిత్తిమత్యరాతిమగ్నే ।

విశ్వా హ్యగ్నే దురితా సహస్వాథాస్మభ్యꣳసహవీరాꣳరయిన్దాః ॥౬॥

ప.వి:-అతి, నిహః, అతి, స్రిధః, అతి అచిత్తిమ్, అతి, అరాతిమ్, అగ్నే, విశ్వా, హి, అగ్నే, దురితేతి దుః+ ఇతా, సహస్వ, అథ, అస్మభ్యమ్, సహవీరామితి సహ+ వీరామ్, రయిమ్, దాః.॥౬॥

**పదార్థః** :-(అతి) అతిశయేన (నిహః) యోऽసత్యం నితరాం జహాతి సః (అతి) (స్రిధః)

దుష్టాచారాన్ (అతి) అతిక్రమ్య (అచిత్తిమ్) అజ్ఞానమ్ (అతి) (అరాతిమ్) అదానమ్. (అగ్నే) తేజస్విన్సభాపతే (విశ్వా) సర్వాణి (హి) ఖలు (అగ్నే) దృఢవిద్య (దురితా) దుష్టాచరణాని (సహస్వ) (అథ) (అస్మభ్యమ్) (సహవీరామ్) వీరైః సహ వర్తమానాం సేనామ్ (రయిమ్) ధనమ్ (దాః) దద్యాః.॥ ౬॥

అన్వయః:-హే అగ్నే! త్వమతి నిహః సన్ స్రిధోఽతి సహస్వాచిత్తిమత్యరాతిం సహస్వ. హే అగ్నే! త్వం హి విశ్వా దురితాఽతిసహస్వాఽథాఽస్మభ్యం సహవీరాం రయిం చ దాః॥౬॥

భావార్థః :-యే దుష్టాచారత్యాగినః కుత్సితానాం నిరోధకా అజ్ఞానమదానం చ పృథక్ కుర్వాణా దుర్వ్యసనేభ్యః పృథగ్భూతాః సుఖదుఃఖయోః సోఢారో వీరసేనాప్రియా యథాగుణానాం జనానాం యోగ్యం సత్కారం కుర్వన్తః సన్తో న్యాయేన రాజ్యం పాలయేయుస్తే సదా సుఖినో భవేయురితి. ॥ ౬॥

పదార్థము :-(అగ్నే) తేజస్వివగు ఓ సభాపతీ! నీవు (అతి, నిహః) నిశ్చయముగ అసత్యమును వదలినవాడవై (స్రిధః) దుష్టాచారులను (అతి, సహస్వ) అధికముగ సహించుము (అచిత్తిమ్)అజ్ఞానమును (అతి) అతిక్రమించి (అరాతిమ్) దాననిషేధము [లోభత్వము] ను సహనమొనర్చుకుము (అగ్నే) దృఢమగు విద్యలుగల్గి తేజోవంతుడవైన ఓ విద్వాంసుడా! నీవు (హి) మాత్రమే (విశ్వా) సర్వ (దురితా) దుష్టాచరణములను (అతి) అధికముగ సహించగలవు (అథ) ఆ తరువాత (అస్మభ్యమ్) మాకొరకు (సహవీరామ్) వీరులగు సైనికులను (రయిమ్) ధనమును(దాః) ఇమ్ము.॥ ౬॥

భావార్థము :-దుష్టాచారములను త్యజించి, కుత్సిత జనుల నదుపునందుంచి, అజ్ఞానము, పిసినారితనమును దూరపరచి, దుర్వ్యసనములను దరిజేరనీయక, సుఖ దుఃఖములను సహించుచు, వీరసైనికులపై ప్రీతి గలిగియుండి, అనుకూలగుణములు గల ప్రజలను సత్కరించుచు న్యాయపరిపాలనమొనర్చు రాజు సదా సుఖవంతుడైయుండును. ॥ ౬॥

6. O king, renouncing unruth, suppress fully the wicked persons, overcome spiritual ignorance, and banish miserliness. O learned person, drive away ll sins; vouchasafe us opulence with an army of heroic soldiers!.

౧౪౯౭.అనాధృష్య ఇత్యస్యాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౯౭ అనాధృష్యో జాతవేదా అనిష్టృతో విరాడగ్నే క్షత్రభృద్దీదిహీహ ।

విశ్వా ఆశాః ప్రముఞ్చన్మానుషీర్భియః శివేభిరద్య పరి పాహి నో వృధే ॥౭॥

ప.వి:- అనాధృష్యః, జాతవేదా+ ఇతి జాత+ వేదాః, అనిష్టృతః, అనిస్తృత ఇత్యని +స్తృతః, విరాడితి వి+రాట్, అగ్నే, క్షత్రభృదితి, క్షత్ర+భృత్, దీదిహి, ఇహ, విశ్వాః, ఆశాః, ప్రముఞ్చన్నితి ప్ర+ముఞ్చన్, మానుషీః, భియః, శివేభిః, అద్య, పరి, పాహి, నః, వృధే.॥౭॥

పదార్థః :-(అనాధృష్యః) అన్యైర్ధర్షితుమయోగ్యః (జాతవేదాః) జాతవిద్యః (అనిష్టృతః) దుఃఖాత్పృథగ్భూతః (విరాట్) విశేషేణ రాజమానః (అగ్నే) సుసంగృహీతరాజనీతే (క్షత్రభృత్) యః క్షత్రం రాజ్యం బిభర్తి సః (దీదిహి) కామయ (ఇహ)అస్మిన్ రాజ్యవ్యవహారే (విశ్వాః) సకలాః (ఆశాః) దిశః (ప్రముఞ్చన్) ప్రకర్షేణ ముక్తాః కుర్వన్ (మానుషీః) మనుష్యసంబంధినీః (భియః) రోగదోషాదికాః (శివేభిః) కల్యాణకారిభిః సభ్యైః (అద్య) ఇదానీమ్ (పరి) సర్వతః (పాహి) రక్ష (నః) అస్మాన్ (వృధే) వర్ధనాయ. ॥౭॥

అన్వయః :-హే అగ్నే! యోఽద్యేహ మనుషీర్భియో నాశయ శివేభిశ్చ సహానిష్టృతోఽనాధృష్యో జాతవేదా విరాట్ క్షత్రభృదస్తి. స త్వం నో దీదిహి విశ్వా ఆశాః ప్రముఞ్చన్త్సన్ త్వం నో వృధే పరి పాహి.॥౭॥

భావార్థః :- యే రాజరాజపురుషాః ప్రజాః సన్తోష్య మఙ్గలాచరణాః సర్వవిద్యాన్యాయప్రియాః సన్తః ప్రజాః పాలయేయుస్తే సర్వదిక్ ప్రవృత్తకీర్తయః స్యుః.॥౭॥

పదార్థము :-(అగ్నే) శ్రేష్ఠమైన రాజనీతిని సంగ్రహమొనర్చు రాజా! నీవు (అద్య) ఈ సమయమున (ఇహ) నీ వ్యవహారముతో (మానుషీః) మానవసంబంధమగు (భియః) రోగశోకాది భయములను వీడి (శివేభిః) కల్యాణకారులగు సభ్యసజ్జనులతో గూడ (అనిష్టృతః) దుఃఖములకు దూరముగనుండి (అనాధృష్యః) ఇతరుల బెదిరింపులకు లోనుగాక (జాతవేదాః) విద్యలను పొంది (విరాట్) విశేషప్రకాశముతో (క్షత్రభృత్) రాజ్యపాలకుడవై యున్నావు. అట్టి నీవు (నః) మమ్ము (దీదిహి) కోరుకొనుము (విశ్వాః) సకల (ఆశాః) దిశలను (ప్రముఞ్చన్) చక్కగా విముక్తపరచుచు మమ్ము (వృధే) వృద్ధికొరకై (పరిపాహి) అన్నివైపుల నుండి రక్షణ యొనర్చుము. ॥౭॥

**భావార్థము** :- ఏ రాజు లేక రాజపురుషులు ప్రజలను సంతుష్టపరచుచు సదాచారము గలవారై విద్యలతో గూడిన న్యాయములందు ప్రసన్నచిత్తులైయుండి ప్రజారక్షకులగుదురో, వారు సర్వదిశలందు వ్యాప్తిగలిగిన కీర్తిగలవా రగుదురు. ॥౭॥

**7. O king, invincible, full of knowledge, free from misery, refulgent, and an able administrator, be dear to us in this task of government. Illumine all regions. Chase human ills and griefs with the help of philanthropic persons. Guard us for prosperity!.**

౧౪౫౩. బృహస్పత ఇత్యస్య ప్రజాపతి ఋషిః, విశ్వేదేవా దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః
పునస్తమేవ విషయమాహ.
మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౫౩ బృహస్పతే సవితర్బోధయైన్ సంశితం చిత్సంతరాం సంశిశాధి।
వర్ధయైనం మహతే సౌభగాయ విశ్వ ఏనమను మదన్తు దేవాః॥౮॥

ప.వి:- బృహస్పతే, సవితః, బోధయ, ఏనమ్, సంశితమితి సమ్+శితమ్, చిత్, సన్తరామితి సమ్+తరామ్, సమ్, శిశాధి, వర్ధయ, ఏనమ్, మహతే, సౌభగాయ, విశ్వే, ఏనమ్, అను, మదన్తు, దేవాః.॥౮॥

పదార్థః :-(బృహస్పతే) బృహతాం పాలక (సవితః) విద్యైశ్వర్యయుక్త (బోధయ) సచేతనం కురు (ఏనమ్) రాజానమ్ (సంశితమ్) తీక్ష్ణబుద్ధిస్వభావమ్ (చిత్) (సన్తరామ్) అతితరామ్ (సం, శిశాధి) సమ్యక్ శిక్షస్వ (వర్ధయ) (ఏనమ్) (మహతే) (సౌభగాయ) ఉత్తమైశ్వర్యభావాయ (విశ్వే) సర్వే (ఏనమ్) (అను) పశ్చాత్ (మదన్తు) ఆనన్దన్తు (దేవాః) సుసభ్యా విద్వాంసః. ॥౮॥

అన్వయః :- హే బృహస్పతే! సవితః పూర్ణవిద్యోపదేశక! త్వమేనం సంశితం కుర్వన్ బోధయ సంశిశాధి చిదపి ప్రజాః సన్తరాం శిశాధ్యేనం మహతే సౌభగాయ వర్ధయ విశ్వే దేవా ఏనమను మదన్తు.॥౮॥

భావార్థః :- యో రాజసభోపదేశకః, స ఏతాన్ దుర్వ్యసనేభ్యో నివర్త్య సుశీలాన్ సంపాద్య మహైశ్వర్య వృద్ధయే ప్రవర్తయేత్.॥౮॥

పదార్థము :-(బృహస్పతే) గొప్ప సజ్జనరక్షకా! (సవితః) విద్యా ఐశ్వర్యములచే సంపూర్ణ విద్యలనుపదేశించు నీవు (ఏనమ్) ఈ రాజును (సంశితమ్) తీక్ష్ణబుద్ధి స్వభావము గలవానిగా జేయుచు (బోధయ) చైతన్యవంతునిగ జేయుము. మరియు (సమ్, శిశాధి) ఉత్తమ శిక్షణల నిమ్ము (చిత్) మరియు (సన్తరామ్) ప్రజలను అత్యంత శిక్షణ గలవారిగ నొనర్చుము (ఏనమ్) ఈ రాజును (మహతే) గొప్ప (సౌభగాయ) సౌభాగ్యైశ్వర్యవంతు డగుటకై (వర్ధయ) వృద్ధిపరచుము (విశ్వే) సమస్త (దేవాః) ఉత్తమ సభ్య విద్వాంసులు (ఏనమ్) ఈ రాజ్యమునకు (అను, మదన్తు) అనుకూలమై ప్రసన్నులగుదురు గాక!॥౮॥

భావార్థము :- రాజసభయొక్క ఉపదేశకులు ఈ రాజు, మరియు రాజపురుషుల దుర్వ్యసనములను దొలగించి సుశీలత్వమును గలుగజేసి మహదైశ్వర్యముల వృద్ధికై ప్రవృత్తులుగ నొనర్చవలయును.।౮॥

8. O learned fellow, the guardian of big persons, excellent preacher of learning, sharpening the intellect of this king, give him knowledge; instruct him well, instruct thoroughly his subjects. Exalt him to great and high felicity. Let all the learned persons rejoice following his good will!.

౧౪౯౪. అముత్రేత్యస్య ప్రజాపతిర్ఋషిః, అశ్వ్యాదయో దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథాధ్యాపకోపదేశకైః కిం కార్యమిత్యాహ.

అధ్యాపకుడు, ఉపదేశకుడు యేమి చేయవలయును?

౧౪౯౪ అముత్రభూయాదధ యద్యమస్య బృహస్పతే అభిశస్తేరముఞ్చః।
ప్రత్యౌహతామశ్వినా మృత్యుమస్మాద్దేవానామగ్నే భిషజా శచీభిః॥౯॥

ప.వి:- అముత్రభూయాదిత్యముత్ర+భూయాత్, అధ, యత్, యమస్య, బృహస్పతే, అభిశస్తే రిత్యభి+శస్తేః, అముఞ్చః, ప్రతి, ఔహతామ్, అశ్వినా, మృత్యుమ్, అస్మాత్, దేవానామ్, అగ్నే, భిషజా, శచీభిః.।౯॥

పదార్థః :-(అముత్రభూయాత్) పరజన్మని భావినః. అత్రాముత్రోపపదాద్ భూధాతోః క్యప్ (అధ) అథ (యత్) (యమస్య) నియన్తుః (బృహస్పతే) మహతాం పాలక (అభిశస్తేః) సర్వతోऽపరాధాత్ (అముఞ్చః) ముచ్యాః (ప్రతి) (ఔహతామ్) వితర్కేణ సాధ్నుతామ్ (అశ్వినా) అధ్యాపకోపదేశకౌ (మృత్యుమ్) (అస్మాత్) (దేవానామ్) (అగ్నే) సద్వైద్య (భిషజా) ఔషధావి (శచీభిః) కర్మభిః ప్రజ్ఞాభిర్వా.।౯॥

అన్వయః :- హే బృహస్పతే త్వమముత్రభూయాదభిశస్తేరేవమముఞ్చః. అథ యద్యో యమస్య శాసనే తిష్ఠేత్తస్య మృత్యుమముఞ్చః హే అగ్నే త్వం యథాऽశ్వినా శచీభిర్భిషజా ప్రత్యౌహతాం తథాऽస్మాద్దేవానా మారోగ్యం సమ్పాదయ.॥౯॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. త ఏవ శ్రేష్ఠా అధ్యాపకోపదేశకా యేऽత్ర పరత్ర చ సుఖాయ సర్వాన్ సుశిక్షయేయుర్యేన బ్రహ్మచర్యాదీని కర్మాణి సేవయిత్వా మనుష్యా అల్పమృత్యుమాపద్ధానిం చ నాప్నుయుః.।౯॥

పదార్థము :-(బృహస్పతే) గొప్పవారి రక్షకుడవగు విద్వాంసుడా! నీవు (అముత్రభూయాత్) పరజన్మమున గలుగు (అభిశస్తేః) అన్నివిధములగు అపరాధములనుండి (అముఞ్చః) విముక్తి నొందుము (అధ) ఆ తరువాత (యత్) ఎవడు (యమస్య) ధర్మాత్ములు, నియమకర్తల శిక్షణయందున్నవాడో వానిని (మృత్యుమ్) మృత్యువునుండి విడిపించుము (అగ్నే) ఓ ఉత్తమ వైద్యవరా! నీ వంటి (అశ్వినా) అధ్యాపక, ఉపదేశకుడు (శచీభిః) కర్మలు లేక బుద్ధులను (భిషజా) రోగనివారక పదార్థములను (ప్రతి ఔహతామ్) విశేష తర్కముద్వారా సాధించునట్లు (అస్మత్) దీనిద్వార (దేవానామ్) విద్వాంసుల ఆరోగ్యములను సాధించుము.౯॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎవడు ఇహలోక, పరలోక సుఖముల ప్రాప్తికై సర్వమానవులకు ఉత్తమ శిక్షణములనీయునో వానిద్వారా బ్రహ్మచర్యము మున్నగు శ్రేష్ఠకర్మలను సేవించుచు మానవులు అల్పాయుష్యము, మృత్యువు, దుఃఖములను పొందకుండునట్లు ఉపదేశించువారే శ్రేష్ఠమగు అధ్యాపకోపదేశకులు.౯॥

9. O learned fellow, the guardian of big persons, be free from the fruit of sins in the next birth. Chase death far from him who follows the instructions of the religious and law-abiding persons!.

O skilled physician, just as the teacher and preacher achieve their aim by dint of deeds and wisdom, so shouldst thou skilfully prepare efficacious medicines, whereby thou preservest the health of the people!.

౧౪౯౪. ఉద్వయమిత్యస్యాగ్నిరృషిః, సూర్యోదేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథేశ్వరోపాసనవిషయమాహ. ఇపు డీశ్వరోపాసన విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౯౪ ఉద్వయన్తమసస్పరి స్వః పశ్యన్త౨ ఉత్తరమ్।

దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥౧౦॥

ప.వి:- ఉత్, వయమ్, తమసః, పరి, స్వరితి స్వః, పశ్యన్తః, ఉత్తరమిత్యుత్+తరమ్, దేవమ్, దేవత్రేతి దేవ+త్రా, సూర్యమ్, అగన్మ, జ్యోతిః, ఉత్తమమిత్యుత్ +తమమ్.॥౧౦॥

పదార్థః :- (ఉత్) ఉత్కృష్టే (వయమ్) (తమసః) అన్ధకారాత్పృథగ్వర్తమానమ్ (పరి) సర్వతః (స్వః) సుఖసాధకమ్ (పశ్యన్తః) ప్రేక్షమాణాః (ఉత్తరమ్) సర్వేషాం లోకానా ముత్తారకమ్ (దేవమ్) ద్యోతమానమ్ (దేవత్రా) దేవేషు వర్తమానమ్ (సూర్యమ్) చరాఽచరాత్మానమ్ (అగన్మ) ప్రాప్నుయామ (జ్యోతిః) ప్రకాశమానమ్ (ఉత్తమమ్) అతిశ్రేష్ఠమ్ ॥౧౦॥

**అన్వయః :- హే మనుష్యా యథా వయం తమసః పృథగ్భూతం జ్యోతిః సవితృమణ్డలం పశ్యన్తః స్వరుత్తరం దేవత్రోత్తమం సూర్యం జగదీశ్వరం దేవం పర్యుదగన్మ తథా యూయమపి ప్రాప్నుత. ॥౧౦॥**

**భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యమివాऽవిద్యాన్ధకారాత్పృథగ్భూతం స్వప్రకాశం మహాదేవం సర్వోత్కృష్టం సర్వాన్తర్యామిణం పరమాత్మానమేవోపాసతే, తే ముక్తిసుఖమపి లభన్తే. ॥౧౦॥**

**పదార్థము :-** ఓ మానవులారా! ఎట్లు (వయమ్) మేము (తమసః) అంధకారమునకు దూరము [వేరు]గ నున్న (జ్యోతిః) ప్రకాశవంతమగు సూర్యమండలమును (పశ్యన్తః) చూచుచు (స్వః) సుఖసాధకులగు (ఉత్తమమ్) సకల జనులను దుఃఖముల నుండి తరింపజేయునట్టి (దేవత్రా) దివ్యపదార్థముల లేక విద్వాంసులందున్నట్టి (ఉత్తమమ్) అతిశ్రేష్ఠమగు (సూర్యమ్) చరాచరముల ఆత్మ (దేవమ్) ప్రకాశవంతుడగు జగదీశ్వరుని (పరి, ఉత్, అగన్మ) అన్నివైపులనుండి అత్యుత్తమముగ ప్రాప్తించుకొనెదమో అట్లే మీరును ప్రాప్తిజేసికొనుడు.॥౧౦॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యుడు చీకటిని వలె ఏ మనుష్యులు అవిద్యాంధకారమునుండి దూరముగా (వేరై) యుండి స్వయంప్రకాశకుడు, దేవదేవుడు, సర్వోత్తముడు సర్వాత్మల అంతర్యామి యగు పరమేశ్వరోపాసనయే నొనర్చువారు అవశ్యముగ, నిర్విఘ్నముగ, ప్రీతిపూర్వకముగ ముక్తి సుఖమును పొందగలుగుదురు. ॥౧౦॥

10. Looking upon the sun's light free from darkness, we fully realise God, the Giver of happiness, the Savious of humanity, Omnipresent, Excellent, the Soul of animate and inanimate objects, and Self-Effulgent.

౧౪౯౬. ఊర్ధ్వా ఇత్యస్యాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథాऽగ్నిః కీదృశ ఇత్యాహ. ఇపు డగ్ని యెటులున్నదను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౯౬ ఊర్ధ్వా అస్య సమిధో భవన్త్యూర్ధ్వా శుక్రా శోచీంష్యగ్నేః ।

ద్యుమత్తమా సుప్రతీకస్య సూనోః॥౧౧॥

ప.వి:- ఊర్ధ్వాః, అస్య, సమిధ ఇతి సమ్+ ఇధః, భవన్తి, ఊర్ధ్వా, శుక్రా, శోచీంషి, అగ్నేః, ద్యుమత్తమేతి ద్యుమత్+తమా, సుప్రతీకస్యేతి సు+ ప్రతీకస్య, సూనోః ॥౧౧॥

పదార్థః :-(ఊర్ధ్వాః) ఉత్తమాః (అస్య) (సమిధః) సమ్యక్ ప్రదీపికాః (భవన్తి) (ఊర్ధ్వా) ఊర్ధ్వాని (శుక్రా) శుద్ధాని (శోచీంషి) తేజాంసి (అగ్నేః) పావకస్య (ద్యుమత్తమా) అతిశయేన ప్రశస్తప్రకాశయుక్తాని (సుప్రతీకస్య) శోభనాని ప్రతీకాని ప్రతీతికరాణి కర్మాణి యస్య తస్య సూనోః ప్రాణిగర్భవిమోచకస్య.॥౧౧॥

అన్వయః:- హే మనుష్యా యస్యాఽస్య సుప్రతీకస్య సూనోరగ్నేరూర్ధ్వాః సమిధ ఊర్ధ్వా ద్యుమత్తమా శుక్రా శోచీంషి భవన్తి తం విజానీత.॥౧౧॥

భావార్థః :- హే మనుష్యా యోఽయమూర్ధ్వగన్తా సర్వదర్శనహేతుః సర్వేషాం పాలననిమిత్తోఽగ్ని రస్తి, తం విజ్ఞాయ కార్యాణి సతతం సాధ్నుత.॥౧౧॥

పదార్థము :- ఓ మానవులారా! (అస్య) ఈ (సుప్రతీకస్య) చక్కని ప్రఖ్యాతకర్మలతో గూడిన (సూనోః) ప్రాణుల గర్భములను విముక్తపరచు (అగ్నేః) అగ్నియొక్క (ఊర్ధ్వాః) ఉత్తమమగు (సమిధః) చక్కగా ప్రకాశపరచునట్టి సమిధ మరియు (ఊర్ధ్వాః) పైకి పోవునట్టి (ద్యుమత్తమా) అత్యుత్తమ ప్రకాశముతో గూడిన (శుక్రా) శుద్ధమైన (శోచీంషి) తేజస్సు (భవన్తి) గలదో దానిని మీరు తెలిసికొనుడు.॥౧౧॥

భావార్థము :- మానవులారా! పైకి లేచునట్టి, అందరును చూచుటకు హేతువు, సర్వప్రాణులరక్షణకు నిమిత్తమునగు ఏ యగ్ని గలదో దానిని మీరు దెలిసికొని కార్యములను నిరంతరము సాధించుకొనుడు.॥౧౧॥

11. This fire, the accomplisher of many mighty deeds, the discharger of children from wombs, has splendid faggots as its fuel; and uplifted, lofty and brilliant flames.

౧౪౯౭. తనూనపాదిత్యస్యాఽగ్నిర్ఋషిః, విశ్వేదేవా దేవతాః, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ వాయుః కింవత్ కార్యసాధకోఽస్తీత్యాహ. వాయు మెవనివలె కార్యసాధకమై యున్నది?

౧౪౯౭ తనూనపాదసురో విశ్వవేదా దేవో దేవేషు దేవః।

పథో అనక్తు మధ్వా ఘృతేన ॥౧౨॥

ప.వి:- తనూనపాదితి తనూ+నపాత్, అసురః, విశ్వవేదా ఇతి విశ్వ+వేదాః, దేవః, దేవేషు, దేవః, పథః, అనక్తు, మధ్వా, ఘృతేన.॥౧౨॥

పదార్థః :- (తనూనపాత్) యస్తనూషు శరీరేషు న పతతి సః (అసురః) ప్రకాశరహితో వాయుః (విశ్వవేదాః) యో విశ్వం విన్దతి సః (దేవః) దివ్యగుణః (దేవేషు) దివ్యగుణేషు

వస్తుషు (దేవః)కమనీయః (పథః) మార్గాన్ (అనక్తు) (మధ్వా) మధురేణ (ఘృతేన) ఉదకేన సహ.॥౧౨॥

అన్వయః :- హే మనుష్యా! యో దేవేషు దేవోఽసురో విశ్వవేదాస్తనూనపాద్దేవో మధ్వా ఘృతేన సహ పథోఽనక్తు, తం యూయం విజానీత.॥౧౨॥

భావార్థః :-యథా పరమేశ్వరో మహాదేవో విశ్వవ్యాపీ సర్వేషాం సుఖకరోఽస్తి తథా వాయురప్యస్తి నహ్యనేన వినా కశ్చిదపి కుత్రచిద్ గన్తుం శక్నోతి.॥౧౨॥

పదార్థము :- ఓ మానవులారా! (దేవేషు) ఉత్తమ గుణవంత పదార్థములందు (దేవః) ఉత్తమగుణముగల (అసురః) ప్రకాశరహితమగు వాయువు (విశ్వవేదాః) అందరకును లభించునది (తనూనపాత్) శరీరమునందు పతనము గానిది (దేవః) కామించదగిన (మధ్వా) మధురమగు (ఘృతేన) జలముతో గూడ (పథః) శ్రోత్రాదీంద్రియముల మార్గములను (అనక్తు) ప్రకటపరచుదానిని మీరు చక్కగా తెలిసికొనుడు. ॥౧౨॥

భావార్థము :- ఏవిధముగ పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైయుండి సర్వమునకు సుఖకారకుడై యున్నాడో, అట్లే వాయువునునై యున్నది. ఈ వాయువులేక ఎవ్వరును ఎచ్చటికి వెళ్లజాలరు. ॥౧౨॥

12. O men, know air as an object of usefulness amongst the useful objects. devoid of lustre, all - possessing, the protector of bodies, highly desirable, and the sprinkler of paths with sweet water through rain!.

౧౪౯౦.మధ్వేత్యస్యాగ్నిరృషిః, యజ్ఞో దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః కీదృశా జనాః సుఖినః స్యురిత్యాహ.

మరల నెటువంటి మనుష్యుడు సుఖవంతుడగునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౯౦ మధ్వా యజ్ఞం నక్షసే ప్రీణానో నరాశꣳసోఅగ్నే।

సుకృద్దేవః సవితా విశ్వవారః ॥౧౩॥

ప.వి:- మధ్వా, యజ్ఞమ్, నక్షసే, ప్రీణానః, నరాశꣳసః అగ్నే, సుకృదితి సు+కృత్, దేవః, సవితా, విశ్వవారఇతి విశ్వఽవారః ॥౧౩॥

పదార్థః :-(మధ్వా) మధురేణ వచనేన (యజ్ఞమ్) సంగతం వ్యవహారమ్ (నక్షసే) ప్రాప్నోషి (ప్రీణానః) కామయమానః (నరాశంసః) యో నరాన్ శంసతి సః (అగ్నే) విద్వన్ (సుకృత్) యః సుష్ఠు కరోతి సః (దేవః) వ్యవహర్తా (సవితా) ఐశ్వర్యమిచ్ఛుకః (విశ్వవారః) యో విశ్వం వృణోతి సః.॥౧౩॥

అన్వయః :-హే అగ్నే యో నరాశంసః సుకృద్విశ్వవారః ప్రీణానః సవితా దేవస్త్వం మధ్వా యజ్ఞం నక్షసే తం వయం ప్రసాదయేమ.॥౧౩॥

భావార్థః :- యే మనుష్యా యజ్ఞే సుగన్ధాదిహోమేన వాయుజలే శోధయిత్వా సర్వాన్ సుఖయన్తి, తే సర్వాణి సుఖాని ప్రాప్నువన్తి. ॥౧౩॥

పదార్థము :-(అగ్నే) ఓ విద్వాంసుడా! (నరాశంసః) మనుష్యులను ప్రశంసించువాడవు. (సుకృత్) ఉత్తమ కార్యము లొనర్చువాడవు మరియు (విశ్వవారః) ప్రశంసలను స్వీకరించువాడవు (ప్రీణానః) కోరికలు గలవాడవు (సవితా) ఐశ్వర్యములను కాంక్షించువాడవు (దేవః) వ్యవహారములందు చతురుడవు నగునీవు (మధ్వా) మధురవచనములతో (యజ్ఞమ్) సంగతీకరణవ్యవహారములను (నక్షసే) ఎట్లు పొందుచున్నాడో అట్టి నిన్ను మేము ప్రసన్నపరచెదముగాక!॥౧౩॥

భావార్థము :-మనుష్యులు యజ్ఞమునందు సుగంధాది పదార్థములను హోమమొనర్చినచో దానిచే వాయువు జలము శుద్ధమై సకల ప్రాణులకు సుఖము గలుగును. కావున వారు సకల సుఖములను ప్రాప్తించుకొందురు.।౧౩॥

13. O learned person, thou art the admirer of persons, doer of noble deeds, worthy of praise, full of ambition, desirous of supremacy, wise in dealings; and a comer to this sacrifice with sweet words!.

౧౪౯౯. అచ్ఛేత్యస్యాగ్నిరృషిః, వహ్నిర్దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథాఽగ్నినోపకారో గ్రాహ్య ఇత్యాహ.

ఇపు డగ్నివలన నుపకారమును పొందవలయునను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౪౯౯ అచ్ఛాయమేతి శవసా ఘృతేనేడానో వహ్నిర్నమసా ।
అగ్నిꣳ స్రుచో అధ్వరేషు ప్రయత్సు॥౧౪॥

ప.వి:- అచ్ఛ, అయమ్, ఏతి, శవసా, ఘృతేన, ఈడానః, వహ్నిః నమసా, అగ్నిమ్, స్రుచః, అధ్వరేషు, ప్రయత్స్వితి ప్రయత్ + సు॥౧౪॥

పదార్థః :-(అచ్ఛ) (అయమ్) (ఏతి) గచ్ఛతి (శవసా) బలేన (ఘృతేన) జలేన సహ (ఈడానః) స్తువన్ (వహ్నిః) విద్యాయా వోఢా (నమసా) పృథివ్యాద్యన్నేన (అగ్నిమ్) పావకమ్ (స్రుచః) హోమసాధనాని (అధ్వరేషు) అహింసనీయేషు (ప్రయత్సు) ప్రయత్నసాధ్యేషు వర్తమానేషు.॥౧౪॥

**అన్వయః:- హే మనుష్యా యోఽయమీడానో వహ్నిః ప్రయత్స్వధ్వరేషు శవసా ఘృతేన నమసా సహ వర్తమానమగ్నిం స్రుచశ్చాచ్ఛైతి తం యూయం సత్కురుత.॥౧౪॥**

**భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యోఽగ్నిరింధనైర్జలేన యుక్తో యానేషు ప్రయుక్తః సన్ బలేన సద్యో గమయతి. తం విజ్ఞాయోపకురుత.॥౧౪॥**

**పదార్థము** :- మానవులారా!(అయమ్) ఈ (ఈడానః) స్తుతియొనర్చుచు (వహ్నిః) విద్యలనందజేయు విద్వాంసుడు (ప్రయత్సు) ప్రయత్నముచే సాధించదగిన (అధ్వరేషు) విఘ్నములకు వేరుగనుండు యజ్ఞములందు (శవసా) బలముతో (ఘృతేన) జలము మరియు (నమసా) పృథివి యున్నగు అన్నములతోగూడ నున్నట్టి (అగ్నిమ్) అగ్ని (స్రుచః) హోమమునందు ఘృతాహుతినిచ్చు సాధనము నగు స్రువ [చెమస] యున్నగు వానిని (అచ్ఛ ఏతి) బాగుగా ప్రాప్తించుచున్నాడో అట్టి వానిని లోకులు సత్కరించవలయును.॥౧౪॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఓ మానవులారా! ఏ యగ్ని ఇంధనములతోను మరియు జలముతోను గలసి యానములందు ప్రయుక్తపరచబడిన శక్తిద్వారా శీఘ్రముగా నడచునో దానిని మీరు చక్కగా దెలిసికొని ప్రయోగించి ఉపకారమును పొందుడు. ॥౧౪॥

14. This extolling learned person, the carrier of knowledge, in non-violent sacrificce attainable through exertion, nicely procures ladles and fire accompanied by corn, water and power.

౧౫౦౦. సయక్షదిత్యస్యాగ్నిర్ఋషిః, వాయుర్దేవతా, స్వరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౫౦౦ స యక్షదస్య మహిమానమగ్నేః స ఈం మన్ద్రా
సుప్రయసః। వసుశ్చేతిష్ఠో వసుధాతమశ్చ॥౧౫॥

**ప.వి:-** సః, యక్షత్, అస్య, మహిమానమ్, అగ్నేః, సః, ఈమ్, మన్ద్రా, సుప్రయస ఇతి సు+ప్రయసః, వసుః, చేతిష్ఠః, వసుధాతమ ఇతి, వసు+ధాతమః, చ. ॥౧౫॥

**పదార్థః** :-(సః) (యక్షత్) యజేత్సఙ్గచ్ఛేత (అస్య) (మహిమానమ్) మహత్వమ్ (అగ్నేః) పావకస్య (సః) (ఈమ్) జలమ్ (మన్ద్రా) ఆనన్దప్రదాని హనీంషి (సుప్రయసః) శోభనాని ప్రయాంసి ప్రీతాన్యన్నాదీని యస్మాత్తస్య (వసుః) వాసయితా (చేతిష్ఠః) అతిశయేన

చేతా సంజ్ఞాతా (వసుధాతమః) యోఽతిశయేన వసూని దధాతి సః (చ)సముచ్చయే.॥౧౫॥

అన్వయః :-స మనుష్యః సుప్రయసోఽస్యాగ్నేర్మహిమానం యక్షత్స వసుశ్చేతిష్ఠో వసుధాతమశ్చ సన్నీం మన్ద్రా యక్షత్. ॥౧౫॥

భావార్థః :-య ఇత్థమగ్నేర్మహత్త్వం విజానీయాత్సోఽతిధనీ స్యాత్. ॥౧౫॥

పదార్థము :-(సః) ఆ పూర్వోక్తుడగు విద్వాంసుడు (సుప్రయసః) ప్రీతికారకమగు చక్కని అన్నాదులకు హేతువగు (అస్య) అట్టి (అగ్నేః) అగ్నియొక్క (మహిమానమ్) మహిమలను (యక్షత్) సంపూర్ణముగ ప్రాప్తించుగాక! మరియు (సః) ఆ (వసు) నివాసమునకు హేతువునై (చేతిష్ఠః) అతిశయముగ దెలిసికొనినవాడై (చ) మరియు (వసుధాతమః) అత్యధిక ధనమును ధారణమొనర్చువాడై (ఈమ్) జలము మరియు (మన్ద్రా) ఆనందదాయకమైన, హోమముచేయదగిన పదార్థములను పొందునుగాక! ॥౧౫॥

భావార్థము :- ఈ విధముగ అగ్ని యొక్క గొప్పదనమును దెలిసికొనిన విద్వాంసుడు అధిక ధన వంతుడు మరియు ఖ్యాతి గలవాడగును. ॥౧౫॥

15.That learned person, daintily fed, realises the greatness of this fire. He is the best wealth - giver, and wisest protector. He gets water and enjoyable oblations.

౧౫౦౧.ద్వారో దేవీరిత్యస్యాఽగ్నిర్ఋషిః, దేవ్యో దేవతాః, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౫౦౧ ద్వారో దేవీరన్వస్య విశ్వే వ్రతా దదన్తేఽ అగ్నేః।
ఉరువ్యచసో ధామ్నా పత్యమానాః॥౧౬॥

ప.వి:- ద్వారః, దేవీః, అను, అస్య, విశ్వే, వ్రతా, దదన్తే, అగ్నేః, ఉరువ్యచస ఇత్యురు+వ్యచసః, ధామ్నా, పత్యమానాః.॥౧౬॥

పదార్థః :-(ద్వారః) ద్వారాణి (దేవీః) దేదీప్యమానాని (అను) (అస్య) (విశ్వే) సర్వే (వ్రతా) సత్యభాషణాదీని (దదన్తే) (అగ్నేః) పావకస్య (ఉరువ్యచసః) బహువ్యాపకస్య (ధామ్నా) స్థానేన (పత్యమానాః) స్వామిత్వం కుర్వాణాః.॥౧౬॥

అన్వయః :- యే విశ్వే పత్యమానా ఉరువ్యచసోఽస్యాగ్నేర్ధామ్నా దేవీర్ద్వారో వ్రతాఽను దదన్తే తే స్వైశ్వర్యా జాయన్తే.॥౧౬॥

భావార్థః:-యేఽగ్నివిద్యాయా ద్వారాణి జానన్తి తే సత్యాచారాః సన్తోఽనుమోదన్తే॥౧౬॥

పదార్థము :- (విశ్వే) సకల (పత్యమానాః) ఆధిపత్యమును నెరపు విద్వాంసులు (ఉరువ్యచస) అనేకములందు వ్యాపకమైయున్న (అస్య) ఈ (అగ్నేః) అగ్నియొక్క (ధామ్నా) స్థానమునుండి (దేవీః) ప్రకాశము (ద్వారః) ద్వారమున మరియు (వ్రతా) సత్యభాషణము మున్నగు వ్రతముల గూర్చి (అను, దదన్తే) అనుకూలముగా నుపదేశించువారు చక్కని ఐశ్వర్యవంతు లగుదురు.॥౧౬॥

భావార్థము :- అగ్నివిద్యయొక్క ద్వారములను దెలిసికొనువారు సత్యాచరణము నొనర్చుచు అత్యానందమును పొందగలుగుదురు.॥౧౬॥

16. The learned persons, lording over all, with the splendour of that widely expansive fire, expound the vows of truthfulness, and the bright sources of the knowledge of fire.

౧౫౦౭.తే అస్యేత్యస్యాగ్ని ర్ఋషిః, యజ్ఞో దేవతా, విరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౫౦౭ తే అస్య యోషణే దివ్యే న యోనా ఉషాసానక్తా ।

ఇమం యజ్ఞమవతామధ్వరం నః ॥౧౭॥

ప.విః- తే ఇతి తే, అస్య, యోషణే ఇతి యోషణే, దివ్యే ఇతి దివ్యే, న, యోనౌ, ఉషాసానక్తా, ఉషసానక్తేత్యుషసానక్తా, ఇమమ్, యజ్ఞమ్, అవతామ్,అధ్వరమ్, నః.॥౧౭॥

పదార్థః :-(తే) (అస్య) (యోషణే) భార్యే వర్తమానే (దివ్యే) దివ్యస్వరూపే (న) ఇవ (యోనౌ) గృహే (ఉషాసానక్తా) రాత్రిదివౌ (ఇమమ్) (యజ్ఞమ్) (అవతామ్) రక్షేతామ్ (అధ్వరమ్) అహింసనీయమ్ (నః) అస్మాకమ్.॥౧౭॥

అన్వయః:-హే మనుష్యాస్తే ఉషాసానక్తాఽస్య యోనౌ దివ్యే యోషణే న నో యమిమ మధ్వరం యజ్ఞమవతాం తం యూయం విజానీత.॥౧౭॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యథా విదుషీ పత్నీ గృహకృత్యాని సాధ్నోతి తథా వహ్నినా జాతే రాత్ర్యహ్నీ సర్వం వ్యవహారం సాధ్నుతః. ॥౧౭॥

పదార్థము :-ఓ మానవులారా! (తే) అట్టి (ఉషాసానక్తా) రాత్రి మరియు పగలు (అస్య) ఈ వ్యక్తి యొక్క (యోనౌ) గృహమునందు (దివ్యే) ఉత్తమ రూపముగల (యోషణే) ఇరువురు మహిళలవలె నుండి

(నః)మాయొక్క ఏ (ఇమమ్) ఈ (అధ్వరమ్) వినాశమొనర్చదగని (యజ్ఞమ్) యజ్ఞమును ఎవరు (అవతామ్) రక్షించెదరో వారిని మీరు దెలిసికొనుడు.॥౧౭॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. విదుషీమణియగు స్త్రీ గృహ సంబంధకార్యముల నెట్లు సాధించునో, అదేవిధముగ అగ్నిద్వారా ఉత్పన్నమైన రాత్రింబవళ్లు సకల వ్యవహారములను సాధించును. ॥౧౭॥

17. May Dawn and Night, like two beautiful consorts, protect in our home this non-violent sacrificial worship of ours.

౧౫౦౩. దైవ్యేత్యస్యాగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, భురిగ్గాయత్రీ ఛన్దః, షడ్జః, స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౫౦౩ దైవ్యా హోతారా ఊర్ధ్వమధ్వరం నో౽అగ్నేర్జిహ్వామభి
గృణీతమ్। కృణుతం నః స్విష్టిమ్ ॥౧౮॥

ప.వి:- దైవ్యా, హోతారా, ఊర్ధ్వమ్, అధ్వరమ్, నః, అగ్నేః, జిహ్వామ్, అభి, గృణీతమ్, కృణుతమ్, నః, స్విష్టిమితి సు + ఇష్టిమ్॥౧౮॥

పదార్థః :-(దైవ్యా) దేవేషు విద్వత్సు భవౌ విద్వాంసౌ (హోతారా) సుఖస్య దాతారౌ (ఊర్ధ్వమ్) ప్రాప్తోన్నతిమ్ (అధ్వరమ్) అహింసనీయం వ్యవహారమ్ (నః) అస్మాకమ్ (అగ్నేః) పావకస్య (జిహ్వామ్) జ్వాలామ్ (అభి) (గృణీతమ్) ప్రశంసేతామ్ (కృణుతమ్) కురుతమ్ (నః) (స్విష్టిమ్) శోభనా ఇష్టిర్యస్యా స్తామ్.॥౧౮॥

అన్వయః:- యౌ దైవ్యా హోతారా న ఊర్ధ్వమధ్వరమభిగృణీతం తౌ నః స్విష్టిమగ్నేర్జిహ్వాం కృణుతమ్. ॥౧౮॥

భావార్థః :- యది జిజ్ఞాస్వధ్యాపకావగ్నివిద్యాం జానీయాతాం, తర్హి విశ్వస్యోన్నతిం కుర్యాతామ్.॥౧౮॥

పదార్థము :-(దైవ్యా) విద్వాంసులందు ప్రసిద్ధులగు ఏ ఇరువురు విద్వాంసులు (హోతారా) సుఖప్రదాత (నః) మాయొక్క (ఊర్ధ్వమ్) ఉన్నతమైన (అధ్వరమ్) చెడగొట్టదగని వ్యవహారములను (అభి, గృణీతమ్) సకల విధములుగ ప్రశంసించుచున్నారో, ఆ యిరువురును (నః) మాయొక్క (స్విష్టిమ్) సుందరమగు యజ్ఞముకొరకు (అగ్నేః) అగ్నియొక్క (జిహ్వామ్) జ్వాలలను (కృణుతమ్) సిద్ధపరచెదరు గాక!॥౧౮॥

భావార్థము :- ఏ జిజ్ఞాసువు మరియు అధ్యాపకులు అగ్నివిద్యనెరుగుదురో వారు విశ్వమునకు ఉన్నతిని చేకూర్చవలయును.॥౧౮॥

18. Ye two learned persons, givers of pleasure, greet with praises this lofty non-violent sacrifice of ours. Conduct well the flame of fire in connection with our beautiful sacrifice.

౧౫౦౪.తిస్రో దేవీరిత్యస్యాఽగ్నిర్ఋషిః, ఇడాదయో లిఙ్గోక్తా దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునర్మనుష్యైః కీదృశీ వాణీ సేవనీయా ఇత్యాహ.

మఱల మానవులెట్టి వాణిని సేవించవలయు నను విషయ మీ మంత్రమందు చెప్పబడెను.

౧౫౦౪ తిస్రో దేవీర్బర్హిరేదꣳ సదన్త్విడా సరస్వతీ భారతీ । మహీ గృణానా ॥౧౯॥

ప.విః- తిస్రః, దేవీః, బర్హిః, ఆ, ఇదమ్, సదన్తు, ఇడా, సరస్వతీ, భారతీ, మహీ, గృణానా॥౧౯॥

పదార్థః :-(తిస్రః) త్రిత్వసంఖ్యాకాః (దేవీః) కమనీయాః (బర్హిః) అన్తరిక్షమ్ (ఆ) సమన్తాత్ (ఇదమ్) (సదన్తు) ప్రాప్నువన్తు (ఇడా) స్తోతుమర్హా (సరస్వతీ) ప్రశస్తవిజ్ఞానవతీ (భారతీ) సర్వశాస్త్రధారిణీ (మహీ) మహతీ (గృణానా) స్తువన్తీ.॥౧౯॥

అన్వయః :-హే మనుష్యా యూయం యా మహీ గృణానేడా సరస్వతీ భారతీ చ తిస్రో దేవీరిదం బర్హిరాసదన్తు తాః సమ్యగ్విజానీత.॥౧౯॥

భావార్థః :-యే మనుష్యా వ్యవహారకుశలాం సర్వశాస్త్రవిద్యాన్వితాం సత్యాదివ్యవహారధర్త్రీం వాణీం ప్రాప్నుయుస్తే స్తుత్యాః సన్తో మహాన్తో భవేయుః.॥౧౯॥

పదార్థము :- ఓ మానవులారా! ఏ మీరు (మహీ) గొప్పదైన (గృణానా) స్తుతియొనర్చుచు (ఇడా) స్తుతియొనర్పదగిన (సరస్వతీ) ప్రశస్త విజ్ఞానవంతమగు మరియు (భారతీ)సకల శాస్త్రములను ధారణమొనర్చునట్టి ఏ (తిస్రః) మూడు (దేవీః) దివ్యమగు [కోరదగిన] వాణులు (ఇదమ్) ఈ (బర్హిః) అంతరిక్షమును (ఆ, సదన్తు) ఉత్తమముగా ప్రాప్తించునో అట్టి ముప్విధములగు వాణులను బాగుగా దెలిసికొనుడు. ॥౧౯॥

భావార్థము :- వ్యవహారచతురత్వము, సకల శాస్త్రవిద్యలతో గూడినదియు, సత్యవ్యవహారముల ధారణ మొనర్చునదియు నగు వాణిని పొందిన మానవులు ఎల్లరచే స్తుతించ దగినవారై ఉన్నతులగుదురు.॥౧౯॥

19. May Ida, Saraswati, Bharati, three mighty forms of eulogy fill this atmosphere.

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! లేక జిజ్ఞాసువా! నీవు (సంవత్సరః) సంవత్సరము వలె నియమముగా (అసి) ఉన్నావు (పరివత్సరః) త్యాజ్యవత్సరము వలె దురాచరణను వదలి (అసి) ఉన్నావు (ఇదావత్సరః) నిశ్చయముగ ఉత్తమ రీతిలో వర్తమానమైయున్న వత్సరమువలె (అసి) ఉన్నావు (ఇద్వత్సరః) నిశ్చిత సంవత్సరము వలె (అసి) ఉన్నావు (వత్సరః) సంవత్సరమువలె (అసి) ఉన్నావు. కావున (తే) నీకొరకు (ఉషసః) కల్యాణ ప్రదమగు ఉషః ప్రభాతవేళ (కల్పన్తామ్) సమర్థవంతమగు గాక! (తే) నీకొరకు (అహోరాత్రాః) దివారాత్రములు మంగళదాయకములు (కల్పన్తామ్) సమర్థవంతములగుగాక! (తే) నీకొరకు (అర్ధమాసాః) శుక్లకృష్ణ పక్షములు (కల్పన్తామ్) సమర్థవంతములగుగాక! (తే) నీకొరకు (మాసాః) చైత్రము మొదలగు మాసములు (కల్పన్తామ్) సమర్థవంతములగు గాక! (తే) నీ కొరకు (ఋతవః) వసంతాది ఋతువులు (కల్పన్తామ్) సమర్థవంతములగుగాక! (తే) నీకొరకు (సంవత్సరః) సంవత్సరములు (కల్పతామ్) సమర్థములగుగాక! (చ) మరియు నీకు (ప్రేత్యై) ఉత్తమ ప్రాప్తికొరకు (సమ్, అఞ్చ) చక్కగా ప్రాప్తించుగాక! (చ) మరియు నీవు (ఏత్యై) చక్కగా వెళ్లుటకై (ప్ర, సారయ) నీ ప్రభావమును విస్తారపరచుము. ఏ కారణమున నీవు (సుపర్ణచిత్) చక్కని రక్షణ సాధనముల సంచయకర్తవై (అసి) ఉన్నావో, దానిచే (తయా) అట్టి (దేవతయా) ఉత్తమ గుణములతో గూడిన సమయ, రూప దేవతతోగూడ (అఙ్గిరస్వద్) సూత్రాత్మయగు ప్రాణవాయువువలె (ధ్రువః) దృఢనిశ్చల శీలుడవై (సీద) స్థిరముగ నుండుము.॥౪౫॥

**భావార్థము** :- ఏ యాప్తులగు మానవులు కాలమును వ్యర్థపరచరో, ఉత్తమ నియమములచే వర్తించుచు కర్తవ్యకర్మలను జేయుచు, త్యజించదగినవానిని వదలివేయుదురో అట్టివారి సంధ్యా ప్రభాత కాలములు, దివారాత్రములు, పక్షములు, మాసములు ఋతువులు సర్వమును ఉత్తమరీతిలో వ్యతీతమగును. కావుననే మానవులెల్లరును ఉత్తమగతులకొరకు ప్రయత్న మొనర్చుచు శ్రేష్ఠమార్గమున నడచుచు శుభగుణముల మరియు సుఖములను విస్తరింపజేసికొనవలెను. సుందర లక్షణములు గల వాణి మరియు పత్నిసహితముగ ధర్మమును గ్రహించి, అధర్మమును త్యజించుటయందు సదాదృఢోత్సాహముగలవారై యుండవలయును. ॥౪౫॥

45. O aspirant after knowledge, thou art the follower or law like the year, renouncer of immorality like the relinquished year, definite like the year, steadfast like the year, and active like the year. Prosper the Dawns! Prosper they Days and Nights! Prosper thy Half-months (months, seasons and Years)!.

Combine them for their going and coming, and send them forward on their ordered courses.

Thou art the collector of the sources of protection. With that divinity lie steady like the vital breath.

అస్మిన్నధ్యాయే సత్యప్రశంసావిజ్ఞాపనం, సద్గుణస్వీకారో, రాజ్యవర్ధనమునిష్టనివారణం, జీవన వృద్ధిర్మిత్రవిశ్వాసః, సర్వత్ర కీర్తికరణమైశ్వర్యవర్ధనమల్పమృత్యునివారణం, శుద్ధికరణం, సుకృతానుష్ఠానం, యజ్ఞకరణం, బహుధనధారణం, స్వామిత్వప్రతిపాదనం, మహాగ్రహణం, సద్గుణేచ్ఛాఽగ్నిప్రశంసా, విద్యాధనవర్ధనం, కారణవర్ణనం, ధనోప యోగః, సర్వప్రేషాం రక్షణం, వాయుగుణవర్ణనమాధారాఽఽధేయ కథనమీశ్వరగుణవర్ణనం, శూరవీరకృత్యకథనం, ప్రమన్వతా

సమ్పాదనం, మిత్రరక్షణం, విద్వదాశ్రయః, స్వాత్మపాలనం వీర్యరక్షణం యుక్తాహారవిహారశ్చోక్తమత ఏత దధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతిరస్తీతి వేద్యమ్.

ఈ యధ్యాయమునందు సత్యప్రశంసను దెలిసికొనుట, ఉత్తమ గుణముల స్వీకారము, రాజ్యమును వృద్ధిపరచుట, అరిష్టముదొలగించుట, జీవనమును పెంపొందించుకొనుట, మిత్రునిపై విశ్వాసము, సర్వత్రకీర్తిని వ్యాపింపజేయుట, ఐశ్వర్యమును వృద్ధిపరచుట, అల్పమృత్యువును నివారించుట, శుద్ధి యొనర్చుట, సత్కర్మానుష్ఠానము, యజ్ఞముల నొనర్చుట, విశేషధనముల ధారణమొనర్చుట, యజమానిత్వ (స్వామిత్వ) ప్రతిపాదన, చక్కని వాణిని గ్రహించుట, సద్గుణముల నిచ్చగించుట, అగ్నిప్రశంస, విద్య మరియు ధనములను పెంపొందించుకొనుట, కారణవర్ణనము ధనము యొక్క ఉపయోగము, పరస్పరరక్షణము, వాయువుగుణముల వర్ణనము ఆధారము, ఆధేయముల కథనము, ఈశ్వరగుణవర్ణనము, శూరవీరులకర్తవ్యము, ప్రసన్నతాసంపాదన, మిత్రరక్షణము, విద్వాంసుల ఆశ్రయము, స్వాత్మరక్షణ, వీర్యరక్షణము యుక్తాహారవిహారాదులు మున్నగు విషయములు చెప్పబడియున్నందున ఈయధ్యాయమునచెప్పిన అర్థమునకు పూర్వాధ్యాయమునందు జెప్పిన అర్థముతో సంగతి గలదని యెరుగవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానంద సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే సప్తవింశోఽధ్యాయః పూర్తిమగాత్ ॥ ౨ ॥

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్యభాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి ఇరువదియేడవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
సాలమూరు (మహబూబ్‌నగర్) జనపదము నందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
'మల్లి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన
**ఇరువది యేడవలధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతి: శాంతి: శాంతి:.**

# యజుర్వేదభాష్యము

## 28వ అధ్యాయము - విషయసూచిక

ఇందులో 46 మంత్రములు, 46 ఛందస్సులు, 967 పదములు, 2504 అక్షరములు

| క్ర.సం. | విషయము | మంత్రములు |
|---|---|---|
| 1. | హోతృగుణములు | ౧-౩౪ |
| 2. | రాజపురుషులు | ౨-౪,౪౭ |
| 3. | సుఖముపొందుట కర్మలు | ౫-౮,౧౦,౧౩-౧౪,౨౪-౨౭,౨౯ |
| 4. | ఆప్తవైద్యుడు | ౯ |
| 5. | ధనప్రశంస | ౧౮,౩౦,౩౩ |
| 6. | సుగృహ నిర్మాణము | ౧౯,౨౮,౩౬ |
| 7. | విద్వాంసుల కర్తవ్యము | ౨౦-౨౩ |
| 8. | వాణీగుణములు | ౭౭,౩౮ |
| 9. | అశ్వినుల గుణములు | ౪౧ |
| 10. | హోతకర్తవ్యములు | ౩,౪౬ |
| 11. | యజ్ఞస్వరూపము | ౧,౪౬ |
| 12. | విద్వత్ప్రశంస | ౩౧,౩౨,౩౪,౩౫,౪౦,౪౨,౪౫ |

# అథాష్టావింశో౽ధ్యాయః

## అస్మిన్నధ్యాయే షట్చత్వారింశన్మన్త్రాః సన్తీతి వేదితవ్యమ్

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ। యద్భద్రం తన్న ఆ సువ ॥యజు.30.3॥

1॥31. హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రోదేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ మనుష్యైర్యజ్ఞేన కథం బలం వర్ధనీయమిత్యాహ.

మానవులు యజ్ఞమువలన నెట్లు బలమును పెంపొందజేయవలయును?

1॥31 హోతా యక్షత్సమిధేన్ద్రమిడస్పదే నాభా పృథివ్యా౽ అధి।

దివో వర్ష్మన్త్సమిధ్యత౽ ఓజిష్ఠశ్చర్షణీసహం వేత్వాజ్యస్య హోతర్యజ॥1॥

ప.విః- హోతా, యక్షత్, సమిధేతి సమ్+ ఇధా, ఇన్ద్రమ్, ఇడః, పదే, నాభా, పృథివ్యాః, అధి, దివః, వర్ష్మన్, సమ్, ఇధ్యతే, ఓజిష్ఠః, చర్షణీసహమ్, చర్షణీసహమితి చర్షణి+సహమ్, వేతు, ఆజ్యస్య, హోతః, యజ.॥1॥

పదార్థః :-(హోతా) ఆదాతా (యక్షత్) యజేత్ (సమిధా) జ్ఞానప్రకాశేన (ఇన్ద్రమ్) విద్యుదాఖ్యమగ్నిమ్ (ఇడః) వాణ్యాః. అత్ర జసాదిషు ఛన్దసి వా వచనమితి యాడభావః. (పదే)ప్రాప్తవ్యే (నాభా)నాభౌమధ్యే (పృథివ్యాః) భూమేః (అధి) ఉపరి (దివః) ప్రకాశస్య (వర్ష్మన్) వర్షకే మేఘమండలే (సమ్) (ఇధ్యతే) ప్రదీప్యతే (ఓజిష్ఠః) అతిశయేన బలీ (చర్షణీసహమ్) యే చర్షణీన్ మనుష్యసమూహాన్ సహన్తే తేషామ్ (వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య) ఘృతాదికమ్. అత్ర కర్మణి షష్ఠీ(హోతః) యజమాన (యజ) సంగచ్ఛస్వ.॥1॥

అన్వయః :-హే హోతస్త్వం యథా హోతా సమిధేడస్పతే పృథివ్యా నాభా దివో౽ధి వర్ష్మన్నిన్ద్రం యక్ష త్తేనౌ జిష్ఠః సన్ చర్షణీసహం మధ్యే సమిధ్యత ఆజ్యస్య వేతు తథా యజ.॥1॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్వేదమన్త్రైస్సుగన్ధ్యాదిద్రవ్యమగ్నౌ ప్రక్షిప్య మేఘమణ్డలం ప్రాపయ్య జలం శోధయిత్వా సర్వార్థం జలం వర్ధనీయమ్.॥౧॥

పదార్థము :-(హోతః) ఓ యజమానీ! నీ వెట్లు (హోతా) శుభగుణముల గ్రహణమొనర్చువాడవు? (సమిధా) జ్ఞాన ప్రకాశముతో (ఇడః) వాణి సంబంధమగు (పదే) పొందదగిన వ్యవహారమున (పృథివ్యాః) భూమియొక్క (నాభా) మధ్యన మరియు (దివః) ప్రకాశమునకు (అధి)పైన (వర్ష్మన్) వర్షించుమేఘ మండలమున (ఇన్ద్రమ్) విద్యుద్రూపాగ్నిని (యక్షత్) సంగతమొనర్చునో దానిచే (ఓజిష్ఠః) అధిక బలమును పొంది (చర్షణీసహామ్) మానవసమూహముల సహించు యోధులందు (సమ్, ఇధ్యతే) చక్కగా ప్రకాశించునో మరియు (ఆజ్యస్య) ఘృతాదులను (వేతు) పొందునట్లు (యజ) నీవును సమాగమ మొనర్చు చుండుము.॥౧॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు వేదమంత్రములతో సుగంధాది పదార్థములను అగ్నియందు హోమమొనర్చి మేఘమండలమునకు చేర్పించి జలవాయువులను శుద్ధపరచి సర్వమునకు బలము చేకూర్చవలెను. ॥౧॥

1. O sacrificer, just as the master of noble qualities, with the display of knowledge, concerning the laudable art of speech, on the earth;s centre, and on the height of heaven, in the midst of thundering clouds, kindles and perceives the fire and electiricty, and as the mightiest of the lords of men, properly manifests himslef and enjoys the butter, so shouldst thou keep company with him!.

౧౫౩౨.హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః ఇన్ద్రోదేవతా, విచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

రాజపురుషాః కీదృశాః స్యురిత్యాహ.

రాజపురుషు లెటు లుండవలయు నను విషయము.

౧౫౩౨ హోతా యక్షత్తనూనపాతమూతిభిర్జేతారమపరాజితమ్।

ఇన్ద్రం దేవꣳస్వర్విదం పథిభిర్మధుమత్తమైర్నరాశꣳసేన తేజసా

వేత్వాజ్యస్య హోతర్యజ॥౨॥

ప.వి:-హోతా, యక్షత్, తనూనపాతమితి తనూ+నపాతమ్, ఊతిభిరిత్యూతి+భిః, జేతారమ్, అపరాజిత మిత్యపరా+జితమ్, ఇన్ద్రమ్, దేవమ్, స్వర్విదమితి స్వః+విదమ్,

పథిభిరితి పథి+భిః, మధుమత్తమైరితి మధుమత్+తమైః, నరాశంసేన, తేజసా, వేతు, ఆజ్యస్య, హోతః, యజ.॥౨॥

పదార్థః :-(హోతా) సుఖస్య ప్రదాతా (యక్షత్) సంగచ్ఛేత్ (తనూనపాతమ్) యః శరీరాణి పాతి తమ్ (ఊతిభిః) రక్షాదిభిః (జేతారమ్) జయశీలమ్ (అపరాజితమ్) అన్యైః పరాజేతుమశక్యమ్ (ఇన్ద్రమ్) పరమైశ్వర్యకారకం రాజానమ్ (దేవమ్) విద్యావినయాభ్యాం సుశోభితమ్ (స్వర్విదమ్) ప్రాప్తసుఖమ్ (పథిభిః) ధర్మ్యైర్మార్గైః (మధుమత్తమైః) అతిశయేన మధురజలాదియుక్తైః (నరాశంసేన) నరైరాశంసితేన (తేజసా) ప్రాగల్భ్యేన (వేతు)ప్రాప్నోతు (ఆజ్యస్య) విజ్ఞేయమ్. అత్ర కర్మణి షష్ఠీ. (హోతః) (యజ).॥౨॥

అన్వయః :- హే హోతర్యథా హోతోతిభిర్మధుమత్తమైః పథిభిస్తనూనపాతం జేతారమపరాజితం స్వర్విదం దేవమిన్ద్రం యక్షత్ నరాశంసేన తేజసాఽఽజ్యస్య వేతు తథా యజ.॥౨॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది రాజానః స్వయం న్యాయమార్గేషు గచ్ఛన్తః ప్రజానాం రక్షా విదధ్యుస్తేఽపరాజితారః సన్తః శత్రూణాం విజేతారః స్యుః.॥౨॥

పదార్థము :-(హోతః) గ్రహణమొనర్చు మానవా! నీ వెట్లు (హోతా) సుఖదాత (ఊతిభిః) రక్షణల మరియు (మధుమత్తమైః) అతి మధుర జలములతో నున్న (పథిభిః) ధర్మమార్గములందు (తనూనపాతమ్) శరీరముల రక్షకుడు (జేతారమ్) జయశీలుడు (అపరాజితమ్) శత్రువులచే జయింపబడని వాడు (స్వర్విదమ్) సుఖప్రాప్తిని గలిగించు (దేవమ్) విద్యావినయ శోభితుడు (ఇన్ద్రమ్) పరమైశ్వర్య కారకుడగు రాజును (యక్షత్) సేవించగలవో (నరాశంసేన) మానవులచే ప్రశంసించబడిన (తేజసా) ప్రగల్భత్వము [ప్రతిభ] చే (ఆజ్యస్య) తెలిసికొనదగిన విషయమును (వేతు) ప్రాప్తించుకొందువో, అటులనే (యజ)సంగతమొనర్చుము.॥౨॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ రాజు స్వయముగ రాజ్యమున న్యాయమార్గమున నడచుచు ప్రజారక్షణమొనర్చునో అతడు పరాజయ మనునది ఎరుగక శత్రువుల నాశమొనర్చువాడగును. ॥౨॥

2. O sacrificer, just as the peasure-giving person, with due protections and religious paths, rich in valuable advice like sweet water, befriends the mighty king, the guardian of our bodies, the conqueror, unconquered, full of delight, adorned with knowledge and humility, and understands all knowable topics with his well-praised spiritual and moral power; so shouldst thou cultivate friendly intercourse with him!.

౧౫౩౩హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౩౩ హోతా యక్షదిడాభిరిన్ద్రమీడితమాజుహ్వానమమర్త్యమ్।

దేవో దేవైః సవీర్యో వజ్రహస్తః పురన్దరో వేత్వాజ్యస్య హోతర్యజ॥౩॥

ప.వి:- హోతా, యక్షత్, ఇడాభిః ఇన్ద్రమ్, ఈడితమ్, ఆజుహ్వానమిత్యా+జుహ్వానమ్, అమర్త్యమ్, దేవః, దేవైః, సవీర్య ఇతి స+వీర్యః, వజ్రహస్త ఇతి వజ్ర+హస్తః, పురన్దర ఇతి పురమ్+దరః, వేతు, ఆజ్యస్య, హోతః యజ.॥౩॥

పదార్థః:-(హోతా) (యక్షత్) (ఇడాభిః) సుశిక్షితాభిర్వాగ్భిః (ఇన్ద్రమ్) పరమవిద్యైశ్వర్యసమ్పన్నమ్ (ఈడితమ్) ప్రశస్తమ్ (ఆజుహ్వానమ్) స్పర్ధమానమ్ (అమర్త్యమ్) సాధారణైర్మనుష్యైరసదృశమ్ (దేవః) విద్వాన్ (దేవైః) విద్వద్భిః సహ (సవీర్యః) బలోపేతః (వజ్రహస్తః) వజ్రాణి శస్త్రాస్త్రాణి హస్తే యస్య సః (పురన్దరః) యోఽరిపురాణి దృణాతి సః (వేతు)ప్రాప్నోతు (ఆజ్యస్య) విజ్ఞానేన రక్షితుం యోగ్యస్య రాజ్యస్య (హోతః) (యజ).॥౩॥

అన్వయః :-హే హోతస్త్వం యథా హోతేడాభిరమర్త్యమాజుహ్వానమీడితమిన్ద్రం యక్షద్యథాఽయం వజ్రహస్తః పురన్దరః సవీర్యో దేవో దేవైః సహాజ్యస్యావయవాన్ వేతు తథా యజ.॥౩॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా రాజరాజపురుషాః పితృవత్ప్రజాః పాలయేయు స్తథైవ ప్రజా ఏతాన్ పితృవత్సేవేరన్. య ఆప్తవిద్వదనుమత్యా సర్వాణి కార్యాణి కుర్యుస్తే భ్రమం నాప్నుయుః.॥౩॥

పదార్థము :-(హోతః) ఓ గ్రహించువాడా! నీ వెట్లు (హోతా) సుఖదాత (ఇడాభిః) చక్కని శిక్షితవాణితో (అమర్త్యమ్) సాధారణమానవులందు విలక్షణుడు (ఆజుహ్వానమ్) పోటీపడుచు (ఈడితమ్) ప్రశంసనీయ (ఇన్ద్రమ్) ఉత్తమ విద్య మరియు ఐశ్వర్యములతోనున్న రాజపురుషుని (యక్షత్) పొందుదువో, ఎట్లు ఈ (వజ్రహస్తః) హస్తములందు శస్త్రాస్త్రములను ధరించిన (పురందరః) శత్రువుల నగరములనుగూల్చు నట్టి (సవీర్యః) బలశాలి (దేవః) విద్వాంసుడు (దేవైః) విద్వాంసులతో గూడ (ఆజ్యస్య) విజ్ఞానముచే రక్షించదగు రాజ్యాంగముల (వేతు) పొందునో అటులనే (యజ) సమాగమ మొనర్చుము.॥౩॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎట్లు రాజు మరియు రాజపురుషులు తండ్రివలె ప్రజలను పాలించెదరో, అదేవిధముగ ప్రజలును వారిని తండ్రివలె సేవించవలెను. ఆప్తవిద్వాంసుల అనుమతితో సమస్త కార్యముల నొనర్చువారు భ్రమలయందు బడజాలరు. ॥3॥

3. O sacrificer, just as the pleasure - giving person, with well - trained modes of speech, wins the king equipped with knowledge and supremacy, above the ordinary run of mankind, full of rivalry against foes, praised and just as he, the thunder - wielder, the breaker - down of the enemies, cities, full of power, learned, performs with the help of the learned, the duties of a ruler, so shouldst thou cultivate friendly inter - course with him!.

౧౫౩౪.హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః రుద్రో దేవతా, త్రిష్టుప్ ఛన్దః ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౫౩౪ హోతా యక్షద్బర్హిషీన్ద్రం నిషద్వరం వృషభం నర్యాపసమ్ ।

వసుభీ రుద్రైరాదిత్యైః సయుగ్భిర్బర్హిరాసదద్వేత్వాజ్యస్య హోతర్యజ ॥౪॥

ప.విః- హోతా, యక్షత్, బర్హిషి, ఇన్ద్రమ్, నిషద్వరమ్, నిసద్వరమితి నిసత్+వరమ్, వృషభమ్ నర్యాపసమితి నర్య+అపసమ్, వసుభిరితి వసు+భిః, రుద్రైః, ఆదిత్యైః, సయుగ్భిరితి సయుక్+భిః, బర్హిః, ఆ, అసదత్, వేతు, ఆజ్యస్య, హోతః, యజ.॥౪॥

పదార్థః :-(హోతా) (యక్షత్) (బర్హిషి) ఉత్తమాయాం విద్వత్సభాయామ్ (ఇన్ద్రమ్) నీత్యా సుశోభమానమ్ (నిషద్వరమ్) నిషీదన్తి వరాః శ్రేష్ఠా మనుష్యా యస్య సమీపే తమ్ (వృషభమ్) సర్వోత్కృష్టం బలిష్ఠమ్ (నర్యాపసమ్) నృషు సాధూన్యపాంసి కర్మాణి యస్య తమ్ (వసుభిః)ప్రథమకల్పైః (రుద్రైః) మధ్యకక్షాస్థైః (ఆదిత్యైః) ఉత్తమకల్పైశ్చ విద్వద్భిః (సయుగ్భిః)యే యుఞ్జన్తే తైః (బర్హిః) ఉత్తమాం సభామ్ (ఆసదత్) ఆసీదతి (వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య)కర్తవ్యస్య న్యాయస్య (హోతః) (యజ).॥౪॥

అన్వయః :-హే హోతర్హోతా యథా సయుగ్భిర్వసుభీ రుద్రై రాదిత్యైః సహ బర్హిషి నిషద్వరం వృషభం నర్యాపసమిన్ద్రం యక్షదాజ్యస్య బర్హిరాసదత్సుఖం వేతు తథా యజ.॥౪॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా పృథివ్యాదయో లోకాః ప్రాణాదయో వాయవః కాలావయవాః మాసాః సహ వర్తన్తే తథా యే రాజప్రజాజనాః పరస్పరానుకూల్యే

వర్తిత్వా సభయా ప్రజాపాలనం కుర్యుస్తే శ్రేష్ఠాం ప్రశంసాం ప్రాప్నువన్తి.॥౪॥

పదార్థము :-(హోతః) ఉత్తమ దానమొనర్చు ఓ దాతా! (హోతా) సుఖమును గోరువానితో (సయుగ్భిః) కలిసి యోగమునొనర్చువారితో (వసుభిః) మొదటిశ్రేణికి చెందినవారితో (రుద్రైః) మధ్యమశ్రేణికి చెందినవారితో (ఆదిత్యైః) ఉత్తమ శ్రేణికి చెందిన విద్వాంసులతో (బర్హిషి) ఉత్తమ విద్వాంసుల సభయందు (నిషద్వరమ్) శ్రేష్ఠుల సన్నిధిలో గూర్చుండు (వృషభమ్) అందరికన్న శ్రేష్ఠబలశాలి (నర్యాపసమ్) మానవుల ఉత్తమ కార్యముల సేవించునట్టి (ఇన్ద్రమ్) నీతిశోభితుడగు రాజును (యక్షత్) పొందుగాక! (ఆజ్యస్య) చేయదగిన న్యాయమును (బర్హిః) ఉత్తమ సభయందు (ఆ, అసదత్) స్థిరమగునట్లు మరియు (వేతు) సుఖమును ప్రాప్తించుకొను నట్లు (యజ) పొందుము.॥౪॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ పృథివి మున్నగు లోకములు, ప్రాణము మున్నగు వాయువులు, కాలమున కవయవములగు మాసములు ఎట్లుకలిసి యున్నవో, అట్లే ఏ రాజు మరియు ప్రజలు పరస్పరము అనుకూలవర్తనులై సభద్వారా ప్రజాపాలనమొనర్తురో వారు ఉత్తమ ప్రశంసలను పొందుదురు.॥౪॥

4. O giver of charity, just as a person desirous of happiness, with Vasus, Rudras and Adityas for companions, in the Assembly of the learned, wins the favour of the king, adorned with statesmanship, near whom are seated noble learned advisers, full of power, who appreciates the noble deeds of men, and sits in the court to administer justice, and acquires happiness, so shouldst thou be happy!.

౧౫౩౫. హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా. నిచృదతిజగతీ ఛన్దః నిషాదః స్వరః.

పునః కీదృశో జనాః సుఖినో భవన్తీత్యాహ. మఱల నదే విషయము.

౧౫౩౫ హోతా యక్షదోజో న వీర్య్ꣳసహో ద్వార ఇన్ద్రమవర్ధయన్।
సుప్రాయణా అస్మిన్ యజ్ఞే వి శ్రయన్తామృతావృధో ద్వారఽ
ఇన్ద్రాయ మీఢుషే వ్యన్త్వాజ్యస్య హోతర్యజ ॥౫॥

ప.వి:- హోతా, యక్షత్, ఓజః, న, వీర్యమ్, సహః, ద్వారః, ఇన్ద్రమ్, అవర్ధయన్, సుప్రాయణాః, సుప్రాయనా ఇతి సు+ప్రాయనాః అస్మిన్, యజ్ఞే, వి, శ్రయన్తామ్, ఋతావృధః, ఋతవృధ+ ఇత్యృత+వృధః, ద్వారః ఇన్ద్రాయ, మీఢుషే, వ్యన్తు ఆజ్యస్య, హోతః, యజ.॥౫॥

పదార్థః :- (హోతా) (యక్షత్) (ఓజః) జలవేగః. ఓజ ఇత్యుదకనా...నిఘం. ౧.౧౨ (న) ఇవ (వీర్యమ్) బలమ్ (సహః) సహనమ్ (ద్వారః)ద్వారాణి (ఇన్ద్రమ్) ఐశ్వర్యమ్ (అవర్ధయన్) వర్ధయన్తు (సుప్రాయణాః) శోభనాని ప్రకృష్టాన్యయనాని యాసు తాః (అస్మిన్) వర్తమానే (యజ్ఞే) సంగన్తవ్యే సంసారే (వి) (శ్రయన్తామ్) సేవన్తామ్ (ఋతావృధః) యా ఋతం సత్యం వర్ధయన్తి తాః (ద్వారః) విద్యావినయద్వారాణి (ఇన్ద్రాయ) పరమైశ్వర్య యుక్తాయ (మీఢుషే) స్నిగ్ధాయ సేచనసమర్థాయ (వ్యన్తు) ప్రాప్నువన్తు (ఆజ్యస్య) విజ్ఞేయస్య రాజ్యవిషయస్య (హోతః) (యజ).॥౫॥

అన్వయః :- హే హోతర్యథా యాః సుప్రాయణా ద్వార ఓజో న వీర్యం సహ ఇన్ద్రం చావర్ధయన్ తా ఋతావృధో ద్వారో మీఢుష ఇన్ద్రాయాస్మిన్ యజ్ఞే విద్వాంసో విశ్రయన్తామాజ్యస్య వ్యన్తు. హోతా చ యక్షత్తథా యజ.॥౫॥

భావార్థః :- అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యే మనుష్యా అస్మిన్ సంసారే విద్యాధర్మద్వారాణ్యుద్ఘాట్య పదార్థవిద్యాం సంసేవ్యైశ్వర్యం వర్ధయన్తి తేఽతులాని సుఖాని ప్రాప్నువన్తి. ॥౫॥

పదార్థము :-(హోతః) యజ్ఞమునొనర్చుజనులారా! ఎట్లు (సుప్రాయణాః) చక్కని అవకాశము గల వారు (ద్వారః) ద్వారము (ఓజః) జలవేగము (న) వలె (వీర్యమ్) బలము (సహః) సహనము మరియు (ఇన్ద్రమ్) ఐశ్వర్యమును (అవర్ధయన్) వృద్ధిపరచి అట్టి (ఋతావృధః) సత్యమును పెంపొందించు (ద్వారః) విద్యావినయముల ద్వారమును (మీఢుషే) మృదువగు వీర్యవంతుడు (ఇన్ద్రాయ) ఉత్తమైశ్వర్యశాలియగు రాజుకొరకు (అస్మిన్) ఈ (యజ్ఞే) సంగతి యోగ్యమగు జగమునందు విద్వాంసులు (వి, శ్రయన్తామ్) విశేషముగా సేవించవలెను. (ఆజ్యస్య) ఎరుగదగిన రాజ్యసంబధవిషయమును (వ్యన్తు) ప్రాప్తించుకొందురో మరియు (హోతా) పొందువారు ఎట్లు (యక్షత్) యజ్ఞమొనర్తురో అట్లే (యజ) యజ్ఞమొనర్చుడు.॥౫॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఏ మనుష్యులు ఈ విశ్వమునందు విద్య మరియు ధర్మము యొక్క ద్వారములను ప్రసిద్ధపరచి పదార్థవిద్యను చక్కగా సేవించి ఐశ్వర్యమును వృద్ధిపరతురో, వారు అతుల సౌఖ్యమును పొందుదురు. ॥౫॥

5. O sacrificer, just as spacious gates, like the fast flow of water, enhance power, lustre and dignity; so should the learned have access to the expedients of knowledge and humility in this sociable world, for the kind, heroic and mighty king. They should learn the art of administration. Hota should perform the yajna, so shouldst thou do!.

౧౫౩౬. హోతేత్యస్య బృహదుక్థో వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మఱల మానవు లేమి చేయవలయునను విషయము.

౧౫౩౬ హోతా యక్షదుషే ఇన్ద్రస్య ధేనూ సుదుఘే మాతరా మహీ ।

సవాతరౌ న తేజసా వత్సమిన్ద్రమవర్ధతాం వీతామాజ్యస్య హోతర్యజ॥౬॥

ప.వి:- హోతా, యక్షత్, ఉషే+ ఇత్యుషే, ఇన్ద్రస్య, ధేనూ ఇతి ధేనూ, సుదుఘే ఇతి సు+దుఘే, మాతరా, మహీ + ఇతి మహీ, సవాతరావితి, స+వాతరౌ, న, తేజసా, వత్సమ్, ఇన్ద్రమ్, అవర్ధతామ్, వీతామ్, ఆజ్యస్య, హోతః, యజ.।౬॥

పదార్థః :-(హోతా) (యక్షత్) (ఉషే) ప్రతాపయుక్తే (ఇన్ద్రస్య) విద్యుతః (ధేనూ) దుగ్ధదాత్ర్యౌ గావౌ (సుదుఘే) సుష్ఠు కామప్రపూరికే (మాతరా) మాతృవద్వర్తమానే (మహీ) మహత్యౌ (సవాతరౌ) వాయునా సహ వర్తమానౌ (న) ఇవ (తేజసా) తీక్ష్ణప్రతాపేన (వత్సమ్) (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (అవర్ధతామ్) వర్ధేత (వీతామ్) ప్రాప్నుతామ్ (ఆజ్యస్య) ప్రక్షేప్తుం యోగ్యస్య (హోతః) (యజ).।౬॥

అన్వయః:-హే హోతస్త్వం యథేన్ద్రస్య సుదుఘే మాతరా మహీ ధేనూ సవాతరౌ నోషే భౌతికసూర్యాఽగ్నీ స్వతేజసేన్ద్రం వత్సం వీతాం హోతాఽఽజ్యస్య యక్షద్ వర్ధతాం తథా యజ.।౬॥

భావార్థః :-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. హే మనుష్యా యూయం యథా వాయునా ప్రేరితౌ భౌమవిద్యుతావగ్నీ సూర్యలోకతేజో వర్ధయతో యథా ధేనువద్వర్తమానే ఉషే సర్వేషాం వ్యవహారాణా మారంభనివర్తికే భవతస్తథా ప్రయతధ్వమ్.।౬॥

పదార్థము :-(హోతః) ఓ సుఖదాతా! ఎట్లు (ఇన్ద్రస్య) విద్యుత్తు యొక్క (సుదుఘే) చక్కని కామితములను పూర్ణపరచు (మాతరా) తల్లివంటి (మహీ) గొప్ప (ధేనూ, సవాతరౌ) వాయువుతో క్షీరములనిచ్చు రెండు గోవుల (న) వలె (ఉషే) ప్రతాపవంతమగు భౌతిక మరియు సూర్యరూపాగ్నియొక్క (తేజసా) తీక్ష్ణ ప్రతాపముచే (ఇన్ద్రమ్) పరమైశ్వర్యముతో గూడిన (వత్సమ్) బాలకుని (వీతామ్) ప్రాప్తించుచున్నదో, మరియు (హోతా) దాత (ఆజ్యస్య) పారవేయదగు వస్తువుయొక్క (యక్షత్) సంగతమొనర్చునో, (అవర్ధతామ్) వృద్ధినొందునో, అదేవిధముగ (యజ) నీవు యజ్ఞము నొనర్చుము.।౬॥

భావార్థము :-ఈ మంత్రమునందు ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఓ మానవులారా! ఏ విధముగా మీరు వాయువుచే ప్రేరేపింపబడిన భౌతికాగ్ని మరియు విద్యుదగ్ని

సూర్యమండలముయొక్క తేజమును పెంపొందించు, దుగ్ధధాత్రీ గోమాతవలె నున్నట్టి ప్రతాపవంతమైన రాత్రింబగళ్లు సమస్తవ్యవహారములను ఆరంభము మరియు నివృత్తి యొనర్చునో అట్లే మీరును ప్రయత్నమొనర్చుడు.॥౬॥

6. O giver of happiness, just as two cows living in the open air, the fulfillers of our noble desires, behaving mother - like, noursih the highly developed calf, like material fire and sun's heart, the two aspects of lightning, and just as Hota performs the yajna with oblations, so shouldst thou do!.

౧౫౩౭.హోతేత్యస్య బృహదుక్థో గోతమ ఋషిః, అశ్వినౌ దేవతే, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౫౩౭ హోతా యక్షద్దైవ్యా హోతారా భిషజా సఖాయా హవిషేన్ద్రం
భిషజ్యతః। కవీ దేవౌ ప్రచేతసావిన్ద్రాయ ధత్తఽ ఇన్ద్రియం
వీతామాజ్యస్య హోతర్యజ ॥౭॥

ప.వి:- హోతా, యక్షత్, దైవ్యా, హోతారా, భిషజా, సఖాయా, హవిషా, ఇన్ద్రమ్ భిషజ్యతః కవీఽఇతి కవీ, దేవౌ, ప్రచేతసావితి ప్ర+చేతసౌ, ఇన్ద్రాయ, ధత్తః, ఇన్ద్రియమ్, వీతామ్, ఆజ్యస్య, హోతః, యజ.॥౭॥

పదార్థః :-(హోతా) సుఖప్రదాతా (యక్షత్) (దైవ్యా) దేవేషు విద్వత్సు సాధూ (హోతారా) రోగం నివర్త్య సుఖస్య ప్రదాతారౌ (భిషజా) చికిత్సకౌ (సఖాయా) సుహృదౌ (హవిషా) యథాయోగ్యేన గృహీత వ్యవహారేణ (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమిచ్ఛుకం జీవమ్ (భిషజ్యతః) చికిత్సాం కురుతః (కవీ) ప్రాజ్ఞౌ (దేవౌ) వైద్యకవిద్యయా ప్రకాశమానౌ (ప్రచేతసౌ) ప్రకృష్టవిజ్ఞానయుక్తౌ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (ధత్తః) దధ్యాతామ్ (ఇన్ద్రియమ్) ధనమ్ (వీతామ్) ప్రాప్నుతామ్ (ఆజ్యస్య) విదానాదేః (హోతః) యుక్తాహారవిహారకృత్ (యజ) ప్రాప్నుహి.॥౭॥

అన్వయః :-హే హోతస్త్వం యథా హోతాఽఽజ్యస్య యక్షద్దైవ్యా హోతారా సఖాయా కవీ ప్రచేతసౌ దేవౌ భిషజా హవిషేన్ద్రం భిషజ్యత ఇన్ద్రాయేన్ద్రియం ధత్త, అయుర్వీతాం తథా యజ.॥౭॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యా యథా సద్వైద్యా రోగిణోఽనుకంప్యౌషధాదినా రోగాన్నివార్యైశ్వర్యాయుషీ వర్ధయన్తి, తథా యూయం సర్వేషు మైత్రీం భావయిత్వా సర్వేషాం సుఖాయుషీ వర్ధయత.॥౭॥

పదార్థము :-(హోతః) యుక్తాహారవిహారముల నొనర్చు ఓ వైద్యవరా! ఎట్లు (హోతా) సుఖముల నొసగు నీవు (ఆజ్యస్య) తెలిసికొనదగిన నిదానము మున్నగు విషయములను (యక్షత్) సంగతియొనర్చెదవో (దైవ్యా) విద్వాంసులందుత్తముడు (హోతారా) రోగమును దొలగించి సుఖము నొసగు (సఖాయా) పరస్పరమైత్రి (కవీ బుద్ధిశాలి (ప్రచేతసౌ) ఉత్తమ విజ్ఞానవేత్తలు (దేవౌ) వైద్యవిద్యలచే ప్రకాశితుల (భిషజా) చికిత్సలొనర్చు వైద్యులిరువురు (హవిషా) యథాయోగ్యముగా గ్రహించదగిన వ్యహారములచే (ఇన్ద్రమ్) పరమైశ్వర్యము నాకాంక్షించు జీవునకు (భిషజ్యతః) చికిత్సచేయుదురో (ఇన్ద్రాయ) ఉత్తమ ఐశ్వర్యముకొరకు (ఇన్ద్రియమ్) ధనమును (ధత్తః) ధారణమొనర్తురో మరియు ఆయుష్యమును (వీతామ్) పెంపొందించు కొనెదరో (అట్లే) (యజ) నీవును పొందుము.॥౭॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఎట్లు శ్రేష్ఠవైద్యుడు రోగులపై అతిదయతో ఔషధాది ఉపాయముల, సేవలచే రోగముల నివృత్తియొనర్చి ఆయువు, ఐశ్వర్యముల వృద్ధిపరచునో అటులనే మీరు సకలప్రాణులను మిత్రదృష్టితో జూచుచు ఆయురైశ్వర్యములను పొందుడు. ॥౭॥

7. O physician, regular in thy meals and recreation, just as two physicians, givers of happiness, expert in the diagnosis of physical ills, excellent amongst the learned, dispellers of disease, friendly to each other, wise, full of the knowledge of medical science, experienced in the art of medicine, adepts in medical treatment, treat the ills of the soul, amass wealth for worldly progress, and attain to longevity, so shouldst thou do!.

౧౫౩౮.హోతేత్యస్య బృహదుక్థో వామదేవ్య ఋషిః. ఇన్ద్రో దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౫౩౮ హోతా యక్షత్తిస్రో దేవీర్న భేషజం త్రయస్త్రిధాతవోఽపస ఇడా సరస్వతీ భారతీ మహీః। ఇన్ద్రపత్నీర్హవిష్మతీర్వ్యన్త్వాజ్యస్య హోతర్యజ ॥౮॥

ప.వి:- హోతా, యక్షత్, తిస్రః, దేవీః, న, భేషజమ్, త్రయః, త్రిధాతవ ఇతి త్రి+ధాతవః, అపసః, ఇడా, సరస్వతీ, భారతీ, మహీః, ఇన్ద్రపత్నీరితీన్ద్ర+పత్నీః, హవిష్మతీః, వ్యన్తు, ఆజ్యస్య, హోతః, యజ.॥౮॥

**పదార్థః** :- (హోతా) విద్యాయా దాతాఽఽదాతా వా (యక్షత్) (తిస్రః) త్రిత్వసంఖ్యాకాః (దేవీః) సకలవిద్యాప్రకాశికాః (న) ఇవ (భేషజమ్) ఔషధమ్ (త్రయః) అధ్యాపకోపదేశక వైద్యాః (త్రిధాతవః) త్రయోఽస్థిమజ్జవీర్యాణి ధాతవో యేభ్యస్తే (అపసః) కర్మఠాః (ఇడా) ప్రశంసితుమర్హా (సరస్వతీ) బహువిజ్ఞానయుక్తా (భారతీ) సుష్ఠువిద్యాయాధారికా పోషికా వా వాణీ (మహీః) మహతీః పూజ్యాః (ఇన్ద్రపత్నీః) ఇన్ద్రస్య జీవస్య పత్నీః స్త్రీవద్వర్తమానాః (హవిష్మతీః) వివిధవిజ్ఞానసహితాః (వ్యన్తు) ప్రాప్నువన్తు (ఆజ్యస్య) ప్రాప్తుం యోగ్యస్యాఽధ్యాపనాఽధ్యయనవ్యవహారస్య (హోతః) (యజ).।౮॥

**అన్వయః** :- హే హోతర్యథా హోతాఽఽజ్యస్య యక్షత్. యథా త్రిధాతవోఽపసస్త్రయస్తిస్రో దేవీర్న భేషజం మహీ ఇడా సరస్వతీ భారతీ చ హవిష్మతీరిన్ద్రపత్నీర్వ్యన్తు తథా యజ.।౮॥

**భావార్థః** :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా ప్రశస్తా విజ్ఞానవతీ సుమేధా చ స్త్రియః స్వసదృశాన్ పతీన్ ప్రాప్య మోదన్తే తథాఽధ్యాపకోపదేశకవైద్యా మనుష్యాః స్తుతివిజ్ఞానయోగధారణాయుక్తాస్త్రివిధా వాచః ప్రాప్యాఽఽనన్దన్తి.।౮॥

**పదార్థము** :- (హోతః) సుఖమును గోరువాడెట్లు (హోతా) విద్యలనిచ్చిపుచ్చుకొను అధ్యాపకుల (ఆజ్యస్య) పొందదగిన పెంపొందజేయు వ్యవహారమును (యక్షత్) చేయునో, ఎట్లు (త్రిధాతవః) అస్థికలు, క్రొవ్వు, వీర్యము, ఈమూడు ధాతువులను వృద్ధి జేయునట్టి (అపసః) కర్మలందు చేష్టయొనర్చుచు (త్రయః) అధ్యాపకుడు, ఉపదేశకుడు వైద్యుడు (తిస్రః) మూడు (దేవీః) సకలవిద్యలను ప్రకాశింపజేయు వాణి (న) వలె (భేషజమ్) ఔషధమును (మహీః) గొప్పగ పూజించదగిన (ఇడా) ప్రశంసించదగిన (సరస్వతీ) గొప్పవిజ్ఞానవతి (భారతీ) చక్కని విద్యలను ధారణము లేక పోషణమొనర్చు (హవిష్మతీః) అనేక విధముల విజ్ఞానముతో గూడ (ఇన్ద్రపత్నీ) జీవాత్మకు పత్నివలెనున్న వాణిని (వ్యన్తు) పొందునో, అట్లే (యజ) అట్టి వాని సంగతిజేయుము.।౮॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ప్రశంసిత, విజ్ఞానవతి మరియు ఉత్తమ బుద్ధిగల స్త్రీలు తగిన పతులను గ్రహించి ప్రసన్నురాండ్రగునట్లు అధ్యాపకోపదేశకవైద్యులు స్తుతి, జ్ఞానము, యోగధారణ మను ముప్విధములగు వాణులను పొంది ఆనందితులగుదురు.।౮॥

8. O aspirant after happiness, just as a teacher, the imparter and recipient of learning, performs the duty of reading and teaching; just as a teacher, a preacher and a physician, developing the three humours, i.e. bone, marrow and semen, engrossed in actions, imbibe Ida, Saraswati and Bharati, the three efficacious and highly venerable speeches, the illuminators of knowledge, full of instructions and protectors of the soul, so shouldst thou cultivate them!.

౧౫౩౯. హోతేత్యస్య ప్రజాపతిర్ఋషిః ఇన్ద్రో దేవతా। నిచృదతిజగతీ ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౩౯ హోతా యక్షత్త్వష్టారమిన్ద్రం దేవం భిషజꣳసుయజం

ఘృతశ్రియమ్। పురురూపꣳసురేతసం మఘోనమిన్ద్రాయ

త్వష్టా దధదిన్ద్రియాణి వేత్వాజ్యస్య హోతర్యజ॥౯॥

ప.వి:- హోతా, యక్షత్, త్వష్టారమ్, ఇన్ద్రమ్, దేవమ్, భిషజమ్, సుయజమితి సు+యజమ్, ఘృత శ్రియమితి ఘృత+శ్రియమ్, పురురూపమితి పురు+ రూపమ్। సురేతసమితి సు+రేతసమ్, మఘోనమ్, ఇన్ద్రాయ త్వష్టా, దధత్ ఇన్ద్రియాణి, వేతు, ఆజ్యస్య, హోతః, యజ.॥౯॥

పదార్థః :-(హోతా) (యక్షత్) (త్వష్టారమ్) దోషవిచ్ఛేదకమ్ (ఇన్ద్రమ్) ఐశ్వర్యవన్తమ్ (దేవమ్) దేదీప్యమానమ్ (భిషజమ్) వైద్యమ్ (సుయజమ్) సుష్ఠుసంగన్తారమ్ (ఘృతశ్రియమ్) ఘృతేనోదకేన శోభమానమ్ (పురురూపమ్) బహురూపమ్ (సురేతసమ్) సుష్ఠువీర్యమ్ (మఘోనమ్) పరమపూజిత ధనమ్ (ఇన్ద్రాయ) జీవాయ (త్వష్టా) ప్రకాశకః (దధత్) ధరన్ సన్ (ఇన్ద్రియాణి) శ్రోత్రాదీని ధనాని వా (వేతు) ప్రాప్నోతు (ఆజ్యస్య) జ్ఞాతుం యోగ్యస్య (హోతః) (యజ)॥ ౯॥

అన్వయః:-హే హోతర్యథా హోతా త్వష్టారం సురేతసం మఘోనం పురురూపం ఘృతశ్రియం సుయజం భిషజం దేవమిన్ద్రం యక్షదాజ్యస్యేన్ద్రాయేన్ద్రియాణి దధత్సన్ త్వష్టా వేతు తథా యజ.॥౯॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యూయమాప్తం రోగనివారకం శ్రేష్ఠౌషధ దాయకం ధనైశ్వర్యవర్ధకం వైద్యం సేవిత్వా శరీరాత్మాఽన్తః కరణేన్ద్రియాణాం బలం వర్ధయిత్వా పరమైశ్వర్యం ప్రాప్నుత.॥౯॥

**పదార్థము** :-(హోతః) ఓ శుభగుణముల దాతా! ఎట్లు (హోతా) పథ్యాహార విహార కర్త (త్వష్టారమ్) ధాతువుల విషమత్వకారణమున గలుగు దోషముల నష్టమొనర్చు (సురేతసమ్) చక్కని పరాక్రమ శాలి (మఘోనమ్) పరమప్రశస్తమగు ధనాఢ్యుడు (పురురూపమ్) బహురూపవంతుడు (ఘృతశ్రియమ్) జలములతో శోభించువాడు (సుయజమ్) చక్కని సంగతియొనర్చువాడు (భిషజమ్) వైద్యుడు (దేవమ్) తేజస్వీ! (ఇన్ద్రమ్) ఐశ్వర్యవంతుని (యక్షత్) సాంగత్యమొనర్చుచున్నాడో మరియు (ఆజ్యస్య) తెలిసికొనదగిన వచనముయొక్క (ఇన్ద్రాయ) ప్రేరకుడగు జీవునికొరకు (ఇన్ద్రియాణి) కర్ణములు మున్నగు ఇన్ద్రియములను (దధత్) ధారణమొనర్చుచు (త్వష్టా) తేజశ్శాలియగుచు (వేతు) ప్రాప్తించునో, అట్లే నీవును (యజ) సంగతియొనర్చుము. ॥౯॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓమానవులారా! మీరు ఆప్తులు, సత్యవాదులు, రోగనివారకులు, శ్రేష్ఠమగు ఔషధములనిచ్చువారు. ధనైశ్వర్యములను పెంపొందజేయు వైద్యవరుల సేవించుచు శరీరము, ఆత్మ, అంతఃకరణము మరియు ఇంద్రియబలమును పెంపొందించుకొని పరమైశ్వర్యములను ప్రాప్తించుకొని సుఖముల ననుభవించుడు.॥౯॥

9. Inculcator of good virtues, just as an abstemious person, befriends a physician, the remover of physical maladies, the possessor of riches, full of many qualities, physically strong, highly social, brilliant, and supreme, and in obedience to the soul, the urger of knowledge, controlling his senses, gains power, so shouldst thou do!.

౧౫౪౦.హోతేత్యస్య ప్రజాపతిర్ఋషిః। బృహస్పతిర్దేవతా। స్వరాడతిజగతీ ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౪౦ హోతా యక్షద్వనస్పతిꣳ శమితారꣳ శతక్రతుం ధియో

జోష్టారమిన్ద్రియమ్। మధ్వా సమఞ్జన్పథిభిః సుగేభిః స్వదాతి

యజ్ఞం మధునా ఘృతేన వేత్వాజ్యస్య హోతర్యజ ॥౧౦॥

ప.వి:- హోతా, యక్షత్, వనస్పతిమ్, శమితారమ్, శతక్రతుమితి శత+క్రతుమ్ ధియః, జోష్టారమ్, ఇన్ద్రియమ్, మధ్వా, సమఞ్జన్నితి సమ్+అఞ్జన్, పథిభిరితి పథి+భిః సుగేభిరితి సు+గేభిః, స్వదాతి, యజ్ఞమ్, మధునా, ఘృతేన, వేతు, ఆజ్యస్య, హోతః, యజ.॥౧౦॥

పదార్థః :- (హోతా) (యక్షత్)(వనస్పతిమ్) వనానాం కిరణానాం స్వామినం సూర్యమ్ (శమితారమ్) యజమానమ్ (శతక్రతుమ్) అసంఖ్యాతప్రజ్ఞమ్ (ధియః)ప్రజ్ఞాయాః కర్మణో వా (జోష్టారమ్)ప్రీతం సేవమానమ్ (ఇన్ద్రియమ్) ధనమ్ (మధ్వా) మధురేణ విజ్ఞానేన (సమఞ్జన్) సమ్యక్ ప్రకటయన్ (పథిభిః) మార్గైః (సుగేభిః) సుఖేన గమనాధికరణైః (స్వదాతి) ఆస్వదేత. అత్ర వ్యత్యయేన పరస్మైపదమ్. (యజ్ఞమ్) సంగతం వ్యవహారమ్ (మధునా) మధురేణ (ఘృతేన) ఆజ్యేనోదకేన వా (వేతు) వ్యాప్నోతు (ఆజ్యస్య) విజ్ఞేయస్య సంసారస్య (హోతః)దాతర్జన (యజ) ప్రాప్నుహి.॥౧౦॥

అన్వయః :-హే హోతర్యథా హోతా వనస్పతిమివ శమితారం శతక్రతుం ధియో జోష్టారం యక్షన్మధ్వా సుగేభిః పథిభిరాజ్యస్యేన్ద్రియం సమఞ్జన్ స్వదాతి మధునా ఘృతేన యజ్ఞం వేతు తథా యజ.॥౧౦॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యవద్విద్యాప్రజ్ఞా ధర్మైశ్వర్యప్రాపక ధర్మమార్గైర్గచ్ఛన్తః సుఖాని భుఞ్జీరంస్తేఽన్యేషామపి సుఖప్రదా భవన్తి.॥౧౦॥

పదార్థము :-(హోతః) ఓ దాతా! ఎట్లు (హోతా) యజ్ఞకర్త [యజమాని] (వనస్పతిమ్) కిరణముల స్వామి సూర్యునివలె (శమితారమ్) యజమానుడు (శతక్రతుమ్) అనేక విధములగు బుద్ధిగల (ధియః) బుద్ధి లేక కర్మను (జోష్టారమ్) ప్రసన్నము లేక సేవల నొనర్చు వాని (యక్షత్) సంగతియొనర్చునో (మధ్వా) మధురమగు విజ్ఞానముద్వారా (సుగేభిః) సుఖపూర్వకముగ పయనించుట కాధారమగు (పథిభిః) మార్గముల ద్వారా (ఆజ్యస్య) తెలిసికొనదగిన విశ్వముయొక్క (ఇన్ద్రియమ్) ధనమును (సమఞ్జన్) చక్కగా ప్రకటపరచుచు (స్వదాతి) ఆస్వాదము పొందునో మరియు (మధునా) మధురమగు (ఘృతేన) ఘృతము [నేయి] లేక జలముతో (యజ్ఞమ్) సంగతియోగ్యమగు వ్యవహారమును (వేతు) పొందునో, అట్లే (యజ) నీవును పొందుము.॥౧౦॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మనుష్యులు సూర్యుని వలె విద్య, బుద్ధి, ధర్మము మరియు ఐశ్వర్యమును ప్రాప్తింపజేయు ధర్మయుక్త మార్గములందు పయనించుచు సుఖముల ననుభవించుదురో, వారు ఇతరులకును సుఖములను గలిగించువా రగుచున్నారు. ॥౧౦॥

10. O charitably disposed person, just as a performer of yajna, associates with a sacrificer, the provider of shelter like the sun, the master of manifold wisdom, the doer of deeds; and with practical rules of conduct, enjoys the wealth of the world, displayed by him, and performs yajna with savoury butter, so shouldst thou do!.

౨౮।౧౧.హోతేత్యస్య ప్రజాపతిర్ఋషిః। ఇన్ద్రో దేవతా। నిచృచ్ఛక్వరీ ఛన్దః। ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౪౧ హోతా యక్షదిన్ద్రగ్ంస్వాహాజ్యస్య స్వాహా మేదసః స్వాహా

స్తోకానాగ్ంస్వాహా స్వాహాకృతీనాగ్ంస్వాహా హవ్యసూక్తీనామ్ ।

స్వాహా దేవా ఆజ్యపా జుషాణా ఇన్ద్ర ఆజ్యస్య వ్యన్తు హోతర్యజ ॥౧౧॥

ప.వి:- హోతా, యక్షత్, ఇన్ద్రమ్, స్వాహా, ఆజ్యస్య, స్వాహా, మేదసః, స్వాహా, స్తోకానామ్, స్వాహా, స్వాహాకృతీనామితి స్వాహా+కృతీనామ్, స్వాహా, హవ్యసూక్తీనామితి హవ్య+సూక్తీనామ్, స్వాహా, దేవాః, ఆజ్యపా ఇత్యాజ్య+పాః, జుషాణాః, ఇన్ద్రః, ఆజ్యస్య, వ్యన్తు, హోతః, యజ.॥౧౧॥

పదార్థ ః :-(హోతా) (యక్షత్) (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (స్వాహా) సత్యాం వాచమ్ (ఆజ్యస్య) జ్ఞాతుమర్హస్య (స్వాహా) సత్యక్రియయా (మేదసః) స్నిగ్ధస్య (స్వాహా) (స్తోకానామ్) అపత్యానామ్(స్వాహా) (స్వాహాకృతీనామ్) సత్యవాక్క్రియయాఽనుష్ఠానానామ్ (స్వాహా) (హవ్యసూక్తీనామ్) బహూని హవ్యానాం సూక్తాని యాసు తాసామ్ (స్వాహా) (దేవాః) (విద్వాంసః) (ఆజ్యపాః) య ఆజ్యం పిబన్తి వాఽఽజ్యేన రక్షన్తి తే (జుషాణాః) ప్రీతాః (ఇన్ద్రః) పరమైశ్వర్యప్రదః (ఆజ్యస్య) (వ్యన్తు) (హోతః) (యజ).॥౧౧॥

అన్వయః :-హే హోతర్యథేన్ద్రో హోతాఽఽజ్యస్య స్వాహా, మేదసః స్వాహా, స్తోకానాం స్వాహా, స్వాహాకృతీనాం స్వాహా, హవ్యసూక్తీనాం స్వాహేన్ద్రం యక్షద్యథా స్వాహాఽఽజ్యస్య జుషాణా ఆజ్యపా దేవా ఇన్ద్రం వ్యన్తు తథా యజ.॥౧౧॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే పురుషాః శరీరాత్మాఽపత్యసత్క్రియా విద్యానాం వృద్ధిం చికీర్షన్తి తే సర్వతః సుఖాపన్నా భవన్తి.॥౧౧॥

పదార్థము :-(హోతః) ఓ విద్యాదాత! ఎట్లు (ఇన్ద్రః) పరమైశ్వర్యములదాత (హోత) విద్యలందున్నతిని పొందువాడు (ఆజ్యస్య) తెలిసికొన్నశాస్త్రపు (స్వాహా) సత్యవాణిని (మేదసః)స్నిగ్ధధాతువుయొక్క (స్వాహా) యథార్థ క్రియను (స్తోకానామ్) చిన్నబాలకులయొక్క (స్వాహా) ఉత్తమ ప్రియవాణిని (స్వాహాకృతీనామ్) సత్యవాణి, మరియు క్రియలయొక్క అనుష్ఠానముల (స్వాహా) హోమక్రియను మరియు (హవ్యసూక్తీనామ్)

అధికముగ గ్రహింపదగిన శాస్త్రముల సుందరవచనములతో గూడిన బుద్ధులయొక్క (స్వాహా) ఉత్తమ క్రియలతో (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమును (యక్షత్) పొందెదరో, ఎట్లు (స్వాహా) సత్యవాణియగు (ఆజ్యస్య) స్నిగ్ధ [మృదువు, నున్నని, మెత్తని] వచనములను (జుషాణాః) ప్రసన్నపరచబడిన (ఆజ్యపాః) ఘృతాదులను త్రాగువారు లేక దానిచే రక్షణ యొనర్చువారునగు (దేవాః) విద్వాంసులు ఐశ్వర్యములను (వ్యన్తు) ప్రాప్తించుకొందురో, అటులనే (యజ) యజ్ఞము నొనర్చుము.॥౧౧॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. శరీరము, ఆత్మ, సంతానము, సత్కారము మరియు విద్యలను వృద్ధినొందించదలచెదరో వారు అన్నివైపులనుండి సౌఖ్యవంతులగుదురు.॥౧౧॥

11. O imparter of knowledge, just as a person who acquires learning and prosperity, and grants us affluence, studies the truthful sayings of religious lore, understands the working of oily substances, listens to the excellent lovely words of little children, attends the performance of Homa by persons who speak the truth and act upon it, acquires the active, mighty supremacy of wisdom that emanates from the beautiful teachings of religious books; and just as learned persons, delighted with kind words of truth, and drinking clarified butter attain to greatness, so shouldst thou perform yajna!.

౧౨౪౨.దేవమిత్యస్యాశ్వినా ఋషీ ఇన్ద్రో దేవతా, నిచృదతిజగతీ ఛన్దః నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨౪౨ దేవం బర్హిరిన్ద్రꣳసుదేవం దేవైర్వీరవత్ స్తీర్ణం వేద్యామవర్ధయత్।

వస్తోర్వృతం ప్రాక్తోర్భృతꣳరాయా ।

బర్హిష్మతో౽ఉత్యగాద్వసువనే వసుధేయస్య వేతు యజ ॥౧౨॥

ప.వి:- దేవమ్, బర్హిః, ఇన్ద్రమ్, సుదేవమితి సు+దేవమ్, దేవైః, వీరవదితి వీర+వత్, స్తీర్ణమ్, వేద్యామ్, అవర్ధయత్, వస్తోః, వృతమ్, ప్ర, అక్తోః, భృతమ్, రాయా, బర్హిష్మతః, అతి, అగాత్, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+ధేయస్య, వేతు, యజ.॥౧౨॥

పదార్థః :-(దేవమ్) దివ్యగుణమ్ (బర్హిః) అన్తరిక్షమివ. బర్హిత్యన్తరిక్షనా...నిఘం ౧. 3. (ఇన్ద్రమ్) పరమైశ్వర్యకారకమ్ (సుదేవమ్) శోభనం విద్వాంసమ్ (దేవైః) విద్వద్భిః (వీరవత్) వీరైస్తుల్యమ్ (స్తీర్ణమ్) కాష్ఠైర్హవిషా చాఽఽచ్ఛాదనీయమ్ (వేద్యామ్) హవనాధారే

కుణ్డే (అవర్ధయత్) వర్ధయేత్ (వస్తోః) దినే (వృతమ్) స్వీకృతమ్ (ప్ర) (అక్తోః) రాత్రౌ (భృతమ్) ధృతమ్ (రాయా) ధనేన (బర్హిష్మతః) అన్తరిక్షస్య సమ్బన్ధో విద్యతే యేషాం తాన్ (అతి) (ఉల్లఙ్ఘనే) (అగాత్) గచ్ఛతి (వసువనే) ధనానాం సంవిభాగే (వసుధేయస్య) వసూని ధేయాని యస్మిఁస్తస్య జగతః (వేతు) (యజ).॥౧౨॥

అన్వయః :-హే విద్వన్ యథా బర్హిష్మతో౽త్యాగాద్వసుధేయస్య వసువనే వేద్యాం స్తీర్ణం వస్తోర్వృతమక్తో ర్భృతం హుతం ద్రవ్యం నైరోగ్యం ప్రావర్ధయత్సుఖం వేతు తథా బర్హిరివ రాయా స వా దేవం దేవైః సహ వీరవద్వర్తమానం సుదేవమిన్ద్రం యజ. ॥౧౨॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా యజమానో వేద్యాం సమిత్సు చితం హుతఘృతమగ్నిం వర్ధయిత్వా౽న్తరిక్షస్థాని వాయుజలాదీని శోధయిత్వా రోగనివారణేన సర్వాన్ ప్రాణినః ప్రీణయతి తథైవ సజ్జనా జనా ధనాదినా సర్వాన్ సుఖయన్తి.॥౧౨॥

**పదార్థము** :-ఓ విద్వాంసుడా! ఎట్లు (బర్హిష్మతః) అంతరిక్షములో సంబంధముగల జలము, వాయువును (అతి, అగాత్) ఉల్లంఘించునో (వసుధేయస్య) ధనమును ధారణమొనర్చు జగత్తుయొక్క (వసువనే) ధనమును సేవించుటకై మరియు (వేద్యామ్) హవనకుండమునందు (స్తీర్ణమ్) సమిధలు, మరియు ఘృతాదులచే రక్షించదగు (వస్తోః) పగటి వేళ (వృతమ్) స్వీకరించబడిన (అక్తోః) రాత్రియందు (భృతమ్) ధారణమొనర్చిన, హవనమొనర్చ బడిన ద్రవ్యముల నిరోగత్వమును (ప్ర, అవర్ధయత్) చక్కగా పెంపొందించునో, మరియు సుఖములను (వేతు) ప్రాప్తిజేసికొనునో, అట్లు (బర్హిః) అంతరిక్షమువలె (రాయా) ధనముతో గూడ (దేవమ్) ఉత్తమగుణశీలురు (దేవైః) విద్వాంసులతో గూడ (వీరవత్) వీరులవలెనున్న (ఇన్ద్రమ్) ఉత్తమ ఐశ్వర్యమును గలుగజేయువాడు నగు (సుదేవమ్) ఉత్తమవిద్వాంసుని (యజ) సంగతియొనర్చుకొనుము.॥౧౨॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ యజమానుడు వేదియందలి సమిధలను ఉత్తమరీతిలో హోమమొనర్చి ఘృతాహుతులచే అగ్నిని ప్రజ్వలింపజేసి అంతరిక్షమునందలి వాయువు జలములు మున్నగువానిని శుద్ధపరచి రోగనివారణముద్వారా సకల ప్రాణులకు తృప్తిని, సుఖమును గలిగించునట్లే సజ్జనులు ధనాదులచే అందరను సుఖపెట్టవలెను. ॥౧౨॥

12. O learned person, just as an oblation on Homa, performed in the day and at night, transgressing the air and water in the atmosphere, adds to the wealth of the world, and protected in the altr by ghee and fuel, contributes to health, and increases our happiness, so shouldst thou associate with a heroic, dignified man of learning, who is accompanied by well - mannered learned persons possessing riches vast like the space!.

౧౩॥ దేవీరిత్యస్యాశ్వినావృషీ, ఇన్ద్రో దేవతా, భురిక్ శక్వరీ ఛన్దః, పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౪౩ దేవీర్ద్వార ఇన్ద్రꣳసఙ్ఘాతే వీడ్వీర్యామన్నవర్ధయన్।
ఆ వత్సేన తరుణేన కుమారేణ చ మీవతాపార్వాణꣳరేణు
కకాటం నుదన్తాం వసువనే వసుధేయస్య వ్యన్తు యజ ॥౧౩॥

ప.వి:- దేవీః, ద్వారః, ఇన్ద్రమ్, సఙ్ఘాత ఇతి సమ్+ఘాతే, వీడ్వీః, యామన్, అవర్ధయన్, ఆ, వత్సేన, తరుణేన, కుమారేణ, చ, మీవతా, అప, అర్వాణమ్, రేణుకకాటమితి రేణు+కకాటమ్, నుదన్తామ్, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+ధేయస్య, వ్యన్తు, యజ.॥౧౩॥

పదార్థః :-(దేవీః) దేదీప్యమానాః (ద్వారః) ద్వారాణి (ఇన్ద్రమ్) ఐశ్వర్యమ్ (సంఘాతే) సంబంధే (వీడ్వీః) విశేషేణ స్తోతుం యోగ్యాః (యామన్) యామని మార్గే (అవర్ధయన్) వర్ధయన్తి (ఆ) (వత్సేన) వత్సవద్వర్తమానేన (తరుణేన) యువావస్థేన (కుమారేణ) అకృతవివాహేన (చ) (మీవతా) హింసతా (అప) (అర్వాణమ్) గచ్ఛన్తమశ్వమ్ (రేణుకకాటమ్) రేణుకైరవ్యక్తం కూపమ్ (నుదన్తామ్) ప్రేరయన్తు (వసువనే) (వసుధేయస్య) (వ్యన్తు) ప్రాప్నువన్తు (యజ).॥౧౩॥

అన్వయః :-హే విద్వన్ యథా వీడ్వీర్దేవీర్ద్వారో రేణుకకాటం యామన్ వర్జయిత్వా తరుణేన మీవతా కుమారేణ వత్సేన చ సహ వర్తమానమర్వాణ మిన్ద్రమావర్ధయన్, వసువనే సఙ్ఘాతే వసుధేయస్య విఘ్నమపనుదన్తాం వ్యన్తు, తథా యజ. ॥౧౩॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః హే మనుష్యా యథా పథికా మార్గే వర్తమానం కూపం నివార్య శుద్ధం మార్గం కృత్వా ప్రాణినః సుఖేన గమయన్తి తథా బాల్యావస్థాయాం వివాహాదీన్విఘ్నాన్నివార్య విద్యాం ప్రాపయ్య స్వసన్తానాన్ సుఖమార్గే గమయన్తు.॥౧౩॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! ఎట్లు (వీడ్వీః) విశేషముగ స్తుతించదగిన (దేవీః) ప్రకాశవంతమగు (ద్వారః) ద్వారము (రేణుకకాటమ్) ధూళితో గూడిన కూపము అనగా చీకటిగా నున్నబావిని (యామన్) మార్గమున వదలి వేసి (తరుణేన) యువకుడు (మీవతా) శూరుడు దుష్టులను అణచివేయుచు (చ) మరియు

(కుమారేణ) బ్రహ్మచారి (వత్సేన) దూడల [లేగ] లవంటి ప్రజలతో వర్తమానమైయుండి (అర్వాణమ్) నడుచు అశ్వములవలె (ఇన్ద్రమ్) ఐశ్వర్యమును (ఆ, అవర్ధయన్) వృద్ధిపరచునో (వసువనే) సేవించదగిన ధనము (సజ్జాతే) సంబంధములో (వసుధేయస్య) ధనమును ధరించు విశ్వముయొక్క విఘ్నమును (అప, నుదన్తామ్) ప్రేరేపించుచు (వ్యన్తు) పొందునో, అట్లే (యజ) పొందుడు. ॥౧౩॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఓ మానవులారా! మార్గదర్శకుడు మార్గమునకు కూపమును వదలి చక్కని మార్గము నేర్పరచి ప్రాణులను సుఖముగ దారిని చేర్చునో అదేవిధముగ బాల్యావస్థలో వివాహము మున్నగు విఘ్నములను తొలగించి విద్యాప్రాప్తిని గలిగించి తమ సంతానమును సుఖమార్గమున నడిపించవలెను. ॥౧౩॥

13. O learned person, just as excellent, brilliant doors, and a praise worthy, young, heroic boy, making the horse march on a path leaving aside the blind well add to our prestige, so shouldst thou acquiring wealth, and removing all impediments, enjoy this rich world and perform sacrifice!.

౧౪౪౪. దేవీత్యస్యాశ్వినావృషీ। అహోరాత్రే దేవతే। స్వరాట్ పఙ్క్తిశ్ఛన్దః। పంచమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౪౪౪ దేవీ ఉషాసానక్తేన్ద్రం యజ్ఞే ప్రయత్యహ్వేతామ్। దైవీర్విశః
ప్రాయాసిష్టాం సుప్రీతే సుధితే వసువనే వసుధేయస్య వీతాం యజ॥౧౪॥

ప.వి:- దేవీ ఇతి దేవీ, ఉషాసానక్తా, ఉషసానక్తేత్యుషసా +నక్తా, ఇన్ద్రమ్, యజ్ఞే ప్రయతీతి ప్ర+యతి, అహ్వేతామ్, దైవీః, విశః, ప్ర, అయాసిష్టామ్, సుప్రీతే ఇతి సు+ప్రీతే, సుధితే ఇతి సు+ధితే, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+ధేయస్య, వీతామ్, యజ.॥౧౪॥

పదార్థః :-(దేవీ) దేదీప్యమానే (ఉషాసానక్తా) రాత్రిదినే (ఇన్ద్రమ్) పరమైశ్వర్యవన్తం యజమానమ్ (యజ్ఞే) సంగంతవ్యే యజ్ఞాదివ్యవహారే (ప్రయతి) ప్రయతన్తే యస్మింస్తత్ర (అహ్వేతామ్)ఆహ్వయతః (దైవీః) దేవానాం న్యాయకారిణాం విదుషామిమాః (విశః) ప్రజాః (ప్ర) (అయాసిష్టామ్) ప్రాప్నుతః (సుప్రీతే) సుష్ఠు ప్రీతిర్యాభ్యాం తే(సుధితే) సుష్ఠు హితక రే (వసువనే) ధనవిభాగే (వసుధేయస్య)కోషస్య (వీతామ్) వ్యాప్నుతామ్ (యజ).॥౧౪॥

అన్వయః:-హే విద్వన్ యథా సుప్రీతే సుధితే దేవీ ఉషాసానక్తా ప్రయతి యజ్ఞే

ఇన్ద్రమహ్వేతాం వసుధేయస్య వసువనే దేవీర్విశః ప్రాయాసిష్టాం సర్వం జగద్వీతాం వ్యాప్నుతాం తథా యజ.॥౧౪॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యథాఽహర్నిశం నియమేన వర్తిత్వా ప్రాణినో వ్యవహారయంతి తథా యూయం నియమేన వర్తిత్వా ప్రజా ఆనన్ద్య సుఖయత. ॥౧౪॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! ఎట్లు (సుప్రీతే) చక్కని ప్రేమకు హేతువు (సుధితే) ఉత్తమ హితకారి (దేవీ) ప్రకాశవంతమగు (ఉషాసానక్తా) రాత్రింబగళ్లు (ప్రయతి) ప్రయత్నముకొరకు (యజ్ఞే) సంగతి యోగ్యమగు యజ్ఞము మున్నగు వ్యవహారములందు (ఇన్ద్రమ్) పరమైశ్వర్యయుక్తుడగు యజమానుడు (అహ్వేతామ్) శబ్దవ్యవహార మొనర్చునో (వసుధేయస్య) ధనమునుంచు కోశాగారముయొక్క (వసువనే) ధనవిభాగమునందు (దైవీః) న్యాయకారులగు విద్వాంసులు ఈ (విశః) ప్రజలను (ప్ర, అయాసిష్టామ్) పొందుచున్నారో మరియు సమస్త ప్రపంచమునకు (వీతామ్) ప్రాప్తించునో అటులనే నీవు (యజ) యజ్ఞమునొనర్చుము. ॥౧౪॥

భావార్థము :- ఈ మంత్రమునను వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులారా! ఏవిధముగ పగలు రాత్రులు నియమమునందు నడచుచు ప్రాణులకు శబ్దము మున్నగు వ్యవహారము నొనర్పజేయునో అదేవిధముగ మీరు నియముగా వర్తించుచు ప్రజలకు ఆనందమునిచ్చి సుఖప్రాప్తిని గలిగించుడు.॥౧౪॥

14. O learned person, just s pleasant, lovely and lustrous day and night, goad the sacrificer to action in a yajna, and just as they for proper use of wealth, approach the just and educated persons, nay the whole world, so shouldst thou perform yajna!.

౧౫౪౫.దేవీ ఇత్యస్యాశ్వినావృషీ ఇన్ద్రో దేవతా, భురిగతిజగతీ ఛన్దః నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౪౫ దేవీ జోష్ట్రీవసుధితీ దేవమిన్ద్రమవర్ధతామ్।

అయావ్యన్యాఘా ద్వేషాంస్యాన్యా వక్షద్వసు వార్యాణి

యజమానాయ శిక్షితే వసువనే వసుధేయస్య వీతాం యజ ॥౧౫॥

ప.వి:- దేవీ ఇతి దేవీ, జోష్ట్రీ, ఇతి జోష్ట్రీ, వసుధితీ ఇతి వసు+ధితీ, దేవమ్, ఇన్ద్రమ్, అవర్ధతామ్, అయావి, అన్యా, అఘా, ద్వేషాంసి, ఆ, అన్యా, వక్షత్, వసు, వార్యాణి,

యజమానాయ, శిక్షిత ఇతి శిక్షితే, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+ధేయస్య, వీతామ్, యజ.॥౧౫॥

పదార్థః :-(దేవీ) దేదీప్యమానే (జోష్ట్రీ) సేవమానే (వసుధితీ) ద్రవ్యధారికే (దేవమ్) ప్రకాశస్వరూపమ్ (ఇన్ద్రమ్) సూర్యమ్ (అవర్ధతామ్) వర్ధయతః (అయావి) పృథక్కురుతః (అన్యా) భిన్నా (అఘా) అన్ధకారరూపా (ద్వేషాంసి) ద్వేషయుక్తాని జన్తుజాతాని (ఆ) (అన్యా) భిన్నా ప్రకాశరూపోషాః (వక్షత్) వహేత్ (వసు)ధనమ్ (వార్యాణి) వారిషూద కేషుసాధూని (యజమానాయ) పురుషార్థినే (శిక్షితే) కృతశిక్షే సత్యౌ (వసువనే) పృథివ్యాదీనాం సంవిభాగే జగతి (వసుధేయస్య) అన్తరిక్షస్య మధ్యే (వీతామ్) వ్యాప్నుతామ్ (యజ) యజ్ఞం కురు.॥౧౫॥

అన్వయః :- హే విద్వన్ యథా వసుధితీ జోష్ట్రీ దేవీ ఉషాసనక్తేన్ద్రం దేవమవర్ధతామన్తయోరన్యాఽఘా ద్వేషాంస్యాయావ్యన్యా చ వసు వార్యాణి చ వక్షత్. యజమానాయ వసుధేయస్య వసువనే శిక్షితే వీతాం తథా యజ.॥౧౫॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యూయం యథా రాత్రిదినే విభక్తేసతీ మనుష్యాదీనాం సర్వం వ్యవహారం వర్ధయతస్తయో రాత్రిః ప్రాణినః స్వాపయిత్వా ద్వేషాదీన్నివర్తయతి. అన్యద్దినఞ్చ తాన్ ద్వేషాదీన్ ప్రాపయతి సర్వాన్ వ్యవహారాన్ ప్రద్యోతయతి చ తథా యోగాభ్యాసేన రాగాదీన్ నివార్య శాన్త్యాదీన్ గుణాన్ ప్రాప్య సుఖాని ప్రాప్నుత.॥౧౫॥

**పదార్థము**:- ఓ విద్వాంసుడా! ఎట్లు (వసుధితీ) ద్రవ్యమును ధారణమొనర్చునట్టి (జోష్ట్రీ) సకల పదార్థములను సేవనమొనర్చు (దేవీ) ప్రకాశవంతములగు దివారాత్రములు (దేవమ్) ప్రకాశరూపుడగు (ఇన్ద్రమ్) సూర్యుని (అవర్ధతామ్) వృద్ధియొనర్చునో, ఆ దివారాత్రముల మధ్య (అన్యా) ఒక (అఘా) అంధకారరూప రాత్రి (ద్వేషాంసి) ద్వేషమొనర్చు జంతువులను (ఆ, అయావి) చక్కగా వేరుపరచును. మరియు (అన్యా) ఆ రెండింటియందు ఒకటి ప్రాతఃకాలరూప ఉషా (వసు) ధనము మరియు (వార్యాణి) ఉత్తమ జలమును (వక్షత్) పొందజేయునో (యజమానాయ) పురుషార్థులగు మానవులకొరకు (వసుధేయస్య) ఆకాశమధ్యన (వసువనే) పృథివి మున్నగువాని విభాగము జరుగు జగత్తునందు (శిక్షితే) మానవులు శిక్షణ గరపునట్టి రాత్రి పగళులు (వీతామ్) వ్యాప్తి జెందునో, అదేవిధముగ నీవు (యజ) యజ్ఞము నొనర్చుము.॥౧౫॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! మీరు ఏవిధముగ దివారాత్రములు విభాగమును పొంది మనుష్యులు మున్నగు సకల ప్రాణుల సమస్త వ్యవహారములను

వృద్ధినొందించునో, వానియందు రాత్రి ప్రాణులను నిద్రయందుంచి ద్వేషాదులను దూరముంచి, పగలు అట్టి ద్వేషాదులను పొంది సకల వ్యవహారములను ప్రకట పరచునో, అదేవిధముగ ప్రాతః కాలమందు యోగాభ్యాసముచే రాగద్వేషాది దోషములను వదలి శాంతి మున్నగు గుణములను ప్రాప్తించుకొని సుఖముల ననుభవించుడు. ॥౧౫॥

15. O learned person, just as lustrous day and night, wealth - givers, engulfing all objects, heighten the radiant sun, and one of them the night drives away hatreds and sins; the other, the Dawn brings boons and treasures; and just as day and night in which me receive education, under the sky on this earth a part of the world, comprehend the active sacrificer, so shouldst thou perform yajna!.

౧౫౪౬. దేవీ ఇత్యస్యాశ్వినావృషీ, ఇన్ద్రో దేవతా। భురిగాకృతి ఛన్దః। నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౪౬ దేవీ ఊర్జాహుతీ దుఘే సుదుఘే పయసేన్ద్రమవర్ధతామ్। ఇషమూర్జ
మన్యా వక్షత్సగ్ధిం సపీతిమన్యా నవేన పూర్వం దయమానే పురాణేన నవ
మధాతామూర్జమూర్జాహుతీఽ ఊర్జయమానే వసు వార్యాణి
యజమానాయ శిక్షితే వసువనే వసుధేయస్య వీతాం యజ ॥౧౬॥

ప.వి:- దేవీఇతి దేవీ, ఊర్జాహుతీ ఇత్యూర్జా +ఆహుతీ, దుఘే, సుదుఘే ఇతి సు+దుఘే, పయసా, ఇన్ద్రమ్, అవర్ధతామ్, ఇషమ్, ఊర్జమ్, అన్యా, వక్షత్, సగ్ధిమ్, సపీతిమితి స+పీతిమ్, అన్యా, నవేన, పూర్వమ్, దయమానే ఇతి దయమానే, పురాణేన, నవమ్, అధాతామ్, ఊర్జమ్, ఊర్జాహుతీ ఇత్యూర్జా+ ఆహుతీ, ఊర్జయమానేఽ ఇత్యూర్జయమానే, వసు, వార్యాణి, యజమానాయ, శిక్షితేఽఇతి శిక్షితే, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు+ధేయస్య, వీతామ్, యజ.॥౧౬॥

పదార్థః :-(దేవీ) దివ్యగుణప్రాపికే (ఊర్జాహుతీ) బలప్రాణధారికే (దుఘే) సుఖానాం ప్రపూరికే (సుదుఘే) సుష్ఠుకామవర్ధికే (పయసా) జలేన (ఇన్ద్రమ్) ఐశ్వర్యమ్ (అవర్ధతామ్) వర్ధయతః (ఇషమ్) అన్నమ్ (ఊర్జమ్) బలమ్ (అన్యా) రాత్రిః (వక్షత్) ప్రాపయతి (సగ్ధిమ్) సమానం భోజనమ్ (సపీతిమ్) పానేన సహ వర్తమానమ్ (అన్యా) దినాఖ్యా (నవేన) నవీనేన (పూర్వమ్) (దయమానే) రాత్ర్యా (పురాణేన) ప్రాచీనేన స్వరూపేణ (నవమ్)నవీనం స్వరూపమ్ (అధాతామ్) దధ్యాతామ్ (ఊర్జమ్) ప్రాణనమ్ (ఊర్జాహుతీ) బలస్యాదాత్ర్యౌ (ఊర్జయమానే) బలం కుర్వాణే (వసు) ధనమ్ (వార్యాణి) వరితుమర్హాణి కర్మాణి (యజమానాయ) సఙ్గత్యై ప్రవర్తమానాయ జీవాయ (శిక్షితే) విద్వద్భిరుపదిష్టే (వసువనే) ధనదానాధికరణే (వసుధేయస్య) వస్వైశ్వర్యం ధేయం యత్ర తస్యైశ్వరస్య (వీతామ్) వ్యాప్నుతామ్ (యజ) సంగచ్ఛస్వ.॥౧౬॥

అన్వయః :- హే విద్వన్ యథా వసుధేయస్య వసువనే వర్తమానే విద్వద్భిర్వసు వార్యాణి శిక్షితే రాత్రిదినే యజమానాయ వ్యవహారం వీతాం తథోర్జాహుతీ దేవీ పయసా దుఘే సుదుఘే సత్యావిన్ద్రమవర్ధతాం తయోరన్యా ఇషమూర్జం వక్షదన్యా సపీతిం సగ్ధిం వక్షద్దయమానే సత్యౌ నవేన పూర్వం దయమానేపురాణేన నవమధాతామూర్జయమానే ఊర్జాహుతీ ఊర్జమధాతాం తథా యజ.॥౧౬॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యథా రాత్రిదినే వర్తమాన స్వరూపేణ పూర్వాపరస్వరూపజ్ఞాపికే ఆహారవిహారప్రాపికే వర్తేతే, తథాఽగ్నౌ హుతా ఆహుతయః సర్వసుఖప్రపూరికా జాయన్తే. యది మనుష్యాః కాలస్య సూక్ష్మమపి వేలాం వ్యర్థాం నయేయుర్వాయ్వాదిపదార్థాన్న శోధయేయు రదృష్టమనుమానేన న విద్యుస్తర్హి సుఖమపి నాప్నుయుః.॥౧౬॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! ఎట్లు (వసుధేయస్య) ఐశ్వర్యధారణ మొనర్చదగిన పరమేశ్వరుని (వసువనే) ధనదానముయొక్క స్థానమున వర్తమానమై యున్న విద్వాంసులు (వార్యాణి) గ్రహణమొనర్చదగిన (వసు) ధనముయొక్క (శిక్షితే) శిక్షణ నిచ్చునట్టి రాత్రిందివములు (యజమానాయ) సంగతికొరకు ప్రవృత్తమైన జీవునికొరకు వ్యవహారములను (వీతామ్) వ్యాప్తపరచునో, అట్లే (ఊర్జాహుతీ) బలమును, ప్రాణమును ధారణమొనర్చు మరియు (దేవీ) ఉత్తమ గుణములను ప్రాప్తింపజేయు రాత్రింబగళ్ళు (పయసా) జలముచే (దుఘే) సుఖముల పూర్ణపరచు, మరియు (సుదుఘే) చక్కని కామితములను వృద్ధిపరచునవగుచు (ఇన్ద్రమ్) ఐశ్వర్యమును (అవర్ధతామ్) వృద్ధిపరచునో, వానినుండి (అన్య) ఒక (ఇషమ్) అన్నము మరియు (ఊర్జమ్) బలమును (వక్షత్) చేర్చుచున్నది. మరియు (అన్య) దినరూప సమయము (సపీతిమ్) ప్రాణదానమొనర్చుటతో బాటు (సగ్ధిమ్) సరియగు వేళకు భోజనమును అందించుచున్నది (దయమానే)

ఆవాగమన గుణముగలిగి ముందు వెనుకలను గల రెండురాత్రులు ప్రవృత్తములై (నవేన) క్రొత్తపదార్థముతో గూడ (పూర్వమ్) ప్రాచీనము మరియు (పురాణేన) పురాతనముతో గూడ (నవమ్) క్రొత్తస్వరూప వస్తువును (అధాతామ్) ధారణమొనర్చునవియో (ఊర్జయమానే) బలమును గలిగించుచు (ఊర్జాహుతీ) ఆయువును తగ్గించుటచే బలమును దీసికొనునవియగు దినము రాత్రులు (ఊర్జమ్) జీవనము ధారణమొనర్చుచున్నవో, అట్లే నీవు (యజ) యజ్ఞమొనర్చుము. ॥౧౬॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఎట్లు పగలు రాత్రులు తమ వర్తమానరూపమున పూర్వాపర రూపమును దెలియజేయుచు మరియు ఆహార విహారములను ప్రాప్తింపజేయుచున్నవియో, అట్లే అగ్నియందు హోమమొనర్చబడిన ఆహుతులు సకల సుఖముల పూర్తిజేయునవి యగుచున్నవి. ఏ మనుష్యులు కాలముయొక్క సూక్ష్మభాగమును సైతము వ్యర్థపరచెదరో, వాయువు మున్నగు పదార్థములను శుద్ధపరచరో అనుమానములద్వారా అదృష్ట (కాన్పించని) పదార్థము (విషయము)ను తెలిసికొనలేరో వారు సుఖములను కూడ పొందజాలరు.॥౧౬॥

16. O learned person, just as educated persons, in this world, the creation of God, in day and night, comprehend the soul intent upon the acquisition of spiritual knowledge; and just as day and night the retainers of strength and breath, the givers of happiness, gladden us with water, impel our noble ambitions and add to our prosperity, one of which brings food and energy, the other feast and drinks, and just as the outgoing and in-coming nights blend the old energy with the new and new with the old, and day and night, the decreasers of life and dissipators of strength, preserve our existence so shouldst thou perform yajna!.

౧౫౪౭. దేవా ఇత్యస్యాశ్వినావృషీ । అశ్వినా దేవతే । భురిగ్జగతీ ఛన్దః । నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నదే విషయము.

౧౫౪౭ దేవా దైవ్యా హోతారా దేవమిన్ద్రమవర్ధతామ్। హతాఘశꣳ
సావాభార్ష్టాం వసు వార్యాణి యజమానాయ శిక్షితా
వసువనే వసుధేయస్య వీతాం యజ ॥౧౭॥

ప.వి:- దేవా, దైవ్యా, హోతారా, దేవమ్, ఇన్ద్రమ్, అవర్ధతామ్, హతాఘశꣳసావితి హత + అఘశꣳసౌ, ఆ, అభార్ష్టామ్, వసు, వార్యాణి, యజమానాయ, శిక్షితా, వసువన ఇతి వసు+వనే, వసుధేయస్యేతి వసు + ధేయస్య, వీతామ్, యజ.॥౧౭॥

పదార్థః :- (దేవా)సుఖప్రదాతారౌ (దైవ్యా) దేవేషు దివ్యేషు గుణేషు భవౌ (హోతారా) ధర్తారౌ వాయుపావకౌ (దేవమ్) దివ్యగుణమ్ (ఇన్ద్రమ్) సూర్యమ్ (అవర్ధతామ్) వర్ధయతామ్ (హతాఘశంసౌ) హతా అఘశంసాః స్తేనా యాభ్యాన్తౌ (ఆ) (అభార్ష్టామ్) దహతామ్ (వసు) ధనమ్ (వార్యాణి) వర్త్తుమర్హాణ్యుదకాని (యజమానాయ) (శిక్షితౌ) విజ్ఞాపితౌ (వసువనే) (వసుధేయస్య) (వీతామ్) వ్యాప్నుతామ్ (యజ).॥౧౭॥

అన్వయః :-హే విద్వన్యథా దైవ్యా హోతారా దేవా వాయువహ్నీ ఇన్ద్రం దేవమవర్ధతాం హతాఘశంసౌ రోగానాభార్ష్టాం యజమానాయ శిక్షితౌ సన్తౌ వసుధేయస్య వసువనే వసు వార్యాణి చ వీతాం తథా యజ.॥౧౭॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది మనుష్యా వాయువిద్యుతౌ సూర్యనిమిత్తే విజ్ఞాయోపయుజ్య ధనాని సఞ్చినుయుస్తర్హి స్తేననాశకాః స్యుః.॥౧౭॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! ఎట్లు (దైవ్యా) ఉత్తమగుణములందు ప్రసిద్ధమైన (హోతారా) జగత్తును ధరించు (దేవా) సుఖమునిచ్చువాయువు మరియు అగ్ని (దేవమ్) దివ్యగుణయుక్తములు (ఇన్ద్రమ్) సూర్యుని (అవర్ధతామ్) వృద్ధిపరచునో (హతాఘశంసౌ) చోరులను చంపుటకు హేతువగు రోగములను (ఆ, అభార్ష్టామ్) బాగుగా నష్టమొనర్చునో (యజమానాయ) కర్మలందు ప్రవృత్తమైన జీవునికొరకు (శిక్షితౌ) హెచ్చరించబడినదో (వసుధేయస్య) సకలైశ్వర్యములకు ఆధారమైన పరమేశ్వరుని (వసువనే) ధనధాన్యముల స్థానముగు జగమునందు (వసు) ధనము మరియు (వార్యాణి) గ్రహించదగిన జలములను (వీతామ్) వ్యాప్తపరచునో, అట్లు నీవు (యజ) యజ్ఞమొనర్చుము.॥౧౭॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మానవులు సూర్యలోకమునకు నిమిత్తమగు వాయువు మరియు విద్యుత్తును చక్కగా తెలిసికొని ఉపయోగమునకు తెచ్చి ధనములను సంచయ మొనర్చెదరో వారు చోరులను నాశమొనర్చువారగుదురు. ॥౧౭॥

17. O learned person, just as pleasant air and fire, celebrated for their excellent attributes, the sustainers of the world heighte radiant sun's might, exterminate the discases that kill the sinful thieves, and acting as monitors to the soul, procure us riches and drinkable water in God's wor!d, so shouldst thou perform yajna!.

౧౫౪౮.దేవీ ఇత్యస్యాశ్వినావృషీ। ఇన్ద్రో దేవతా। అతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౪౮ దేవీస్తిస్రస్తిస్రో దేవీః పతిమిన్ద్రమవర్ధయన్। అస్పృక్షద్భారతీ

దివఀ రుద్రైర్యజ్ఞఀ సరస్వతీడా వసుమతీ

బహువిధస్య సంసారస్య (కర్తారమ్) (ఇహ) అస్మిన్సంసారే (యక్షి) యజసి సఙ్గచ్ఛసే (హోతః) ఆదాతః. ॥౯॥

అన్వయః :- హే హోతస్త్వం యథా త్వష్టా విద్వాన్ దేవకామః వీరం జజాన, యథా త్వష్టురాశు రర్వాశ్వో జయతే, యథా త్వష్టేదం విశ్వం భువనం జజాన. తం బహోః కర్తార మిహయక్షి, తథా వయమపి కుర్యామ.॥౯॥

భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే విద్యాకామాన్మనుష్యాన్విదుషః కుర్యుర్యః సద్యోజాతశిక్షోఽశ్వ ఇవ తీవ్రవేగేన విద్యాః ప్రాప్నోతి. యథా బహువిధస్య సంసారస్య స్రష్టేశ్వరః సర్వాన్వ్యవస్థాపయతి. తథాఽధ్యాపకాఽధ్యేతారో భవన్తు.॥౯॥

పదార్థము :-(హోతః) గ్రహణమొనర్చువాడా! నీ వెట్లు (త్వష్టా) విద్య మరియు ఉత్తమగుణములతో శోభించు విద్వాంసుడు (దేవకామః) విద్యార్థులను కోరువాడు (వీరమ్) వీరవరుని (జజాన) ఉత్పన్నమొనర్చునో, ఎట్లు (త్వష్టుః) ప్రకాశరూప శిక్షణచే (ఆశుః) శీఘ్రగామి (అర్వా) వేగవంతమునగు (అశ్వః) అశ్వము (జాయతే) ఉండునో, ఎట్లు (త్వష్టా) తనరూపముచే ప్రకాశమానుడగు పరమేశ్వరుడు (ఇదమ్) ఇట్టి (విశ్వమ్) సమస్త (భువనమ్) లోకలోకాంతరములను (జజాన) ఉత్పన్నపరచునో, అట్టి (బహోః) బహువిధములగు విశ్వమును (కర్తారమ్) రచించునట్టి పరమాత్మను (ఇహ) ఈ జగమునందు (యక్షి) పూజించెదవో, అటులే మేమును పూజించెదముగాక! ॥౯॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులు విద్యలనుకాంక్షించు వారిని విద్వాంసులనుగ నొనర్చవలయును. శీఘ్రముగా శిక్షణనీయబడిన వేగవంతమగు అశ్వమువలె తీక్ష్ణత్వముతో విద్యలను పొందునో మరియు ఎట్లు అనేక విధముల ప్రపంచ మును నిర్మించిన పరమేశ్వరుడు ఈ యన్నిటి వ్యవస్థ నొనర్చునట్లు అధ్యాపకులు, విద్యార్థులు జేయవలెను.॥౯॥

9. Just as a learned person, produces a brave son devoted to scholars; just as a horse learns thorugh instruction how to run fast and remain active; just as Self-Effulgent God brings to life this universe; so shouldst thou Priest worship God, th Creator of the world!.

౧౫౮౬. అశ్వ ఇత్యస్య బృహదుక్థో వామదేవ్య ఋషిః, సూర్యో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౮౬ అశ్వో ఘృతేన త్మన్యా సమక్త ఉప దేవాఁ॥ ఋతుశః పాథ ఏతు । వనస్పతిర్దేవలోకం ప్రజానన్నగ్నినా హవ్యా స్వదితాని వక్షత్ ॥౧౦॥

ప.వి:- అశ్వః, ఘృతేన, త్మన్యా, సమక్త ఇతి సమ్+అక్తః, ఉప, దేవాన్, ఋతుశః

ఇత్యృతు+శః, పాథః, ఏతు, వనస్పతిః, దేవలోకమితి దేవ+లోకమ్, ప్రజానన్నితి ప్ర+జానన్,

అగ్నినా, హవ్యా, స్వదితాని, వక్షత్.॥10॥

పదార్థః :- (అశ్వః) ఆశుగామి వహ్నిః (ఘృతేన) ఉదకేన (త్మన్యా) ఆత్మనా. అత్రాకారలోపో విభక్తేర్యాదేశశ్చ. (సమక్తః) సమ్యక్ ప్రకటయన్ (ఉప) (దేవాన్) దివ్యాన్ వ్యవహారాన్ (ఋతుశః) ఋతావృతౌ (పాథః) అన్నం (ఏతు) ప్రాప్నోతు (వనస్పతిః) వనానాం కిరణానాం పాలకః సూర్యః (దేవలోకమ్) దేవానాం విదుషాం లోకం దర్శకం వ్యవహారం (ప్రజానన్) ప్రకర్షేణ విదన్సన్ (అగ్నినా) పావకేన (హవ్యా) అత్తుమర్హాణి (స్వదితాని) ఆస్వాదితాని (వక్షత్) వహేత్ ప్రాపయేత్.॥10॥

అన్వయః :-హే విద్వన్! దేవలోకం ప్రజానన్సన్ యథా ఘృతేన సంయోజితోఽశ్వస్త్మన్యా ఋతుశో దేవాన్సమక్తః సన్ పాథ ఉపైతు. అగ్నినా సహ వనస్పతిః స్వదితాని హవ్యా వక్షత్తథా త్మన్యా వర్తస్వ. ॥10॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే విద్వాంసో మనుష్యాః! యథా సూర్య ఋతూన్ విభజ్యోత్తమాని సేవితవ్యాని వస్తూని జనయతి తథోత్తమానధమాన్ విద్యార్థినో విద్యాశ్చాఽవిద్యాశ్చ పృథక్ పరీక్ష్య సుశిక్షితాన్ సంపాదయన్తు, అవిద్యాశ్చ నివర్తయన్తు. ॥10॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! (దేవలోకమ్) ఎల్లరకును మార్గమును జూపునట్టి విద్వాంసుల మార్గమును (ప్రజానన్) చక్కగానెరుగుచు ఎట్లు (ఘృతేన) జలముతో గలిపినట్టి (అశ్వః) శీఘ్రగామియగు అగ్ని(త్మన్యా) ఆత్మద్వారా (ఋతుషః) ప్రతి ఋతువునందును (దేవాన్) ఉత్తమ వ్యవహారములను (సమక్తః) చక్కగా ప్రకటపరచుచు (పాథః) అన్నమును (ఉప, ఏతు) సమీపముగా పొందునో (అగ్నినా) అగ్నితో గూడ (వనస్పతిః) కిరణముల రక్షకుడగు సూర్యుడు (స్వదితాని) స్వాదిష్టమగు (హవ్యా) భుజించదగిన అన్నమును (వక్షత్) ప్రాప్తించుకొనునో అదేవిధముగ మీరును ఆత్మతో వర్తించుడు. ॥10॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ విద్వాంసులారా! ఏవిధముగ సూర్యుడు ఋతువులను విభాజనమొనర్చి శ్రేష్ఠమైన సేవించదగిన వస్తువులనుత్పన్నమొనర్చునో అదేవిధముగ ఉత్తమ అధమ విద్యార్థులను మరియు విద్య అవిద్యలను వేరు వేరుగా పరీక్షించి ఉత్తమ శిక్షితులనుగా జేయ వలయును. మరియు అవిద్య [అజ్ఞానము]ను దొలగించవలయును. ॥10॥

10. O learned person, knowing well the path of the sages, the benfactors of humanity; just as fast -moving, fire, coupled with water, itself, in different seasons, performing useful deeds, gives us food, and just as the Sun, the protector or rays, carries away our sweet oblations, so shouldst thou deal properly with thy soul!.

౧౫౮౭. ప్రజాపతేరిత్యస్య బృహదుక్థో వామదేవ్యఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మరల మానవులేమి చేయవలయునను విషయము.

౧౫౮౭ ప్రజాపతేస్తపసా వావృధానః సద్యో జాతో దధిషే యజ్ఞమగ్నే ।

స్వాహాకృతేన హవిషా పురోగా యాహి సాధ్యా హవిరదన్తు దేవాః ॥౧౧॥

ప.వి:- ప్రజాపతేరితి ప్రజా+పతేః, తపసా, వావృధానః, వవృధానఇతి వవృధానః, సద్యః, జాతః, దధిషే, యజ్ఞం, అగ్నే, స్వాహాకృతేనేతి స్వాహా+కృతేన, హవిషా, పురోగాఽ ఇతి పురః+గాః, యాహి, సాధ్యా, హవిః, అదన్తు, దేవాః ॥౧౧॥

పదార్థ :- (ప్రజాపతేః) ప్రజాయాః పాలకస్య (తపసా) ప్రతాపేన (వావృధానః) వర్ధమానః (సద్యః, జాతః) శీఘ్రం ప్రసిద్ధః సన్ (దధిషే) ధరసి (యజ్ఞం) (అగ్నే) పావకవద్వర్తమాన విద్వన్! (స్వాహాకృతేన) సుష్ఠుసంస్కారక్రియయా నిష్పాదితేన (హవిషా) దాతుమర్హేణ (పురోగాః) అగ్రగణ్యా అగ్రగామినో వా (యాహి) ప్రాప్నుహి (సాధ్యా) సాధనసాధ్యాః (హవిః) అత్తవ్యమన్నం (అదన్తు) భుఞ్జతాం (దేవాః) విద్వాంసః.॥౧౧॥

అన్వయః :-హే అగ్నే! త్వం సద్యో జాతః ప్రజాపతేస్తపసా వావృధానః స్వాహాకృతేన హవిషా యజ్ఞం దధిషే యే పురోగాః సాధ్యా దేవా హవిరదన్తు తాన్యాహి ప్రాప్నుహి.॥౧౧॥

భావార్థః :-యే మనుష్యాః సూర్యవత్ప్రజాపాలకా ధర్మేణ ప్రాప్తస్య పదార్థస్య భోక్తారో భవన్తి తే సర్వోత్తమా గణ్యన్తే.॥౧౧॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! (అగ్నే) అగ్నివలే తేజోవంతుడా! నీవు (సద్యః) శీఘ్రముగా (జాతః) ప్రసిద్ధముగు (ప్రజాపతేః) ప్రజాపాలకుడగు పరమేశ్వరుని (తపసా) ప్రతాపముచే (వావృధానః) వృద్ధియగుచు (స్వాహాకృతేన) చక్కని సంస్కారరూప క్రియద్వారా సిద్ధించిన (హవిషా) హోమమునందాహుతి నీయదగిన పదార్థములచే (యజ్ఞమ్) యజ్ఞమును ధరించుచున్నావు! ఏది (పురోగాః) ముఖ్యులు లేక ప్రధానమైన వారు (సాధ్యా) సాధనలతో సాధించదగిన (దేవాః) విద్వాంసలు (హవిః) గ్రాహ్యాన్నమును (అదన్తు) భుజింతురో దానిని (యాహి) నీవును పొందుము.॥౧౧॥

భావార్థము :-సూర్యునివలె ప్రజారక్షకులు, ధర్మయుక్తముగా ప్రాప్తించిన పదార్థములను భుజించు మానవులు సర్వోత్తములుగా నెంచబడుదురు.॥౧౧॥

11. O learned person, brilliant like fire, progressing and soon attaining to fame, through God's grace, thou guardest the sacrifice with consecrated offering. Go unto those leading sages, who, achieving success through their accomplishments, eat our oblations!.

౧౨॥౧౨. యదక్రన్ద ఇత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, యజమానో దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨॥౧౨ యదక్రన్దః ప్రథమం జాయమాన ఉద్యన్త్సముద్రాదుత వా పురీషాత్। శ్యేనస్య పక్షా హరిణస్య బాహూ ఉపస్తుత్యం మహి జాతం తే అర్వన్ ॥౧౨॥

ప.వి:- యత్, అక్రన్దః, ప్రథమమ్, జాయమానః, ఉద్యన్నిత్యుత్+యన్, సముద్రాత్, ఉత, వా, పురీషాత్, శ్యేనస్య, పక్షా, హరిణస్య, బాహూ ఇతి బాహూ, ఉపస్తుత్యమిత్యుప+స్తుత్యమ్, మహి, జాతమ్, తే, అర్వన్. ॥౧౨॥

పదార్థః :- (యత్) యదా (అక్రన్దః) శబ్దం కురుషే (ప్రథమమ్) (జాయమానః) (ఉద్యన్) ఉదయం ప్రాప్నువన్ (సముద్రాత్) అన్తరిక్షాత్. సముద్ర ఇత్యన్తరిక్షనా..నిఘం ౧.౩. (ఉత) అపి (వా) (పురీషాత్) పాలకాత్ పరమాత్మనః (శ్యేనస్య) పక్షిణః (పక్షా) పక్షౌ (హరిణస్య) హర్తుం శీలస్య వీరస్య (బాహూ) భుజౌ (ఉపస్తుత్యం) ఉపగతస్తుతివిషయం (మహి) మహత్కర్మ (జాతమ్) (తే) తవ (అర్వన్) అశ్వ ఇవ వేగవద్విద్వన్.॥౧౨॥

అన్వయః :- హే అర్వన్ విద్వన్! యత్సముద్రాదుత వా పురీషాత్ప్రథమం జాయమానో వాయురివోద్యం స్త్వమక్రన్ద స్తదా తే హరిణస్య బాహూ శ్యేనస్య పక్షేవ ఏతత్ మహి జాతముపస్తుత్యం భవతి.॥౧౨॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా! యథాఽన్తరిక్షాత్ప్రకటో వాయుః కర్మాణి కారయతి తథా శుభాన్గుణాన్ యూయం స్వీకురుత. యథా పశూనాం మధ్యేఽశ్వో వేగవానస్తి తథా శత్రూణాం విగ్రహే వేగవన్తః శ్యేన ఇవ వీరసేనా ప్రగల్భా భవత యద్యేవం కురుత తర్హి సర్వం యుష్మాకం ప్రశంసితం స్యాత్. ॥౧౨॥

పదార్థము :- (అర్వన్) అశ్వమువలె వేగవంతుడవగు విద్వాంసుడా! (యత్) ఎప్పుడు (సముద్రాత్) అంతరిక్షము (ఉత, వా) లేక (పురీషాత్) రక్షకుడగు పరమాత్మచే (ప్రథమమ్) మొదట (జాయమానః)

ఉత్పన్నమైన వాయువువలె (ఉద్యన్) ఉదయించినట్టి (అక్రన్దః) శబ్దమొనర్చుచున్నావో, అపుడు (హరిణస్య) హరించువాడవు. వీరుడవునగు (తే) నీయొక్క (బాహూ) భుజములు (శ్యేనస్య) శ్యేనపక్షియొక్క (పక్షా) రెక్కలవలె బలవముగలిగియున్నవి. ఇట్టి (మహి) మహత్కర్మ (జాతమ్) ప్రసిద్ధమై (ఉపస్తుత్యమ్) సమీపమందున్న స్తుతి విషయమై యున్నది. ॥౧౨॥

**భావార్థము** :-ఈ మంత్రములో వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఏవిధముగా అంతరిక్షమునుండి ఉత్పన్నమైనవాయువు కర్మలనొనర్చుచున్నదో అదేవిధముగ మనుష్యుల శుభగుణములను మీరు గ్రహణమొనర్చుడు. ఎట్లు పశువులందు తురగము త్వరగామి యైయున్నదో అట్లే శత్రువులను నిరోధించుటలో వేగవంతమగు శ్యేన పక్షివలె వీరపురుషులసైన్యములు గలవారగుచు దృఢసాహసవంతులగుడు. ఇట్లొనర్చిన కర్మలన్నియును శుభప్రదములు, ప్రశంసితములగును. ॥౧౨॥

12. O learned person, active like a horse, when thou roarest with full splendour, like air created in the beginning by God from the atmosphere, and the arms of thy hero become strong like eagle - pinions, thou deservest applause for this glaring great deed!.

౧౫౪౯. యమేనేత్యస్య భార్గవో జమదగ్నిరృషిః, అగ్నిర్దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౪౯ యమేన దత్తం త్రిత ఏనమాయునగిన్ద్ర ఏణం ప్రథమో అధ్యతిష్ఠత్।
గన్ధర్వో అస్య రశనామగృభ్ణాత్సూరాదశ్వం వసవో నిరతష్ట ॥౧౩॥

ప.వి:- యమేన, దత్తమ్, త్రితః, ఏనమ్, ఆయునక్, ఆయునగిత్యాయునక్, ఇంద్రః, ఏనమ్, ప్రథమః, అధి, అతిష్ఠత్, గన్ధర్వః, అస్య, రశనామ్, అగృభ్ణాత్, సూరాత్, అశ్వమ్, వసవః, నిః, అతష్ట. ॥౧౩॥

పదార్థః :- (యమేన) నియన్త్రా వాయునా (దత్తమ్) (త్రితః) త్రిభ్యః పృథివీజలాన్తరిక్షేభ్యః (ఏనమ్) వహ్నిం (ఆయునక్) యునక్తి (ఇన్ద్రః) విద్యుత్ (ఏనమ్) అత్ర ఛాన్దసం ణత్వమ్ (ప్రథమః) విస్తీర్ణః ప్రఖ్యాతః (అధి) (అతిష్ఠత్) ఉపరి తిష్ఠతి (గన్ధర్వః) గోః పృథివ్యా ధర్తా (అస్య) సూర్యస్య (రశనామ్) రశనావత్కిరణగతిం (అగృభ్ణాత్) గృహ్ణాతి (సూరాత్) సూర్యాత్ (అశ్వమ్) ఆశుగామినం వాయుం (వసవః) విద్వాంసః (నిః)(అతష్ట) తక్ష్ణోతి తనూకరోతి. ॥౧౩॥

అన్వయః :- హే వసవో య ఇన్ద్రస్త్రితో యమేన దత్తమేనమాయునగేనం ప్రాప్య ప్రథమోఽధ్యతిష్ఠద్,గన్ధర్వః సన్నస్య రశనామగృభ్ణాదస్మాత్సూరాదశ్వం నిరతష్ట తం యూయం విస్తారయత.॥౧౩॥

భావార్థః :-హే మనుష్యా! ఈశ్వరేణేహ యస్మిన్ పదార్థే యాదృశీ పదార్థరచనా కృతా తాం యూయం విద్యయా సంవిత్తైతాం సృష్టివిద్యాం గృహీత్వాఽనేకాని సుఖాని సాధ్నుత చ.॥౧౩॥

పదార్థము :-(వసవః) ఓ విద్వాంసుడా! ఏ (ఇన్ద్రః) విద్యుత్తు (త్రితః) పృథివి, జలము, ఆకాశములచే (యమేన) నియమకర్తయగు వాయువు (దత్తమ్) ఇచ్చియున్న,అనగా ఉత్పన్నమొనర్చిన (ఏనమ్) ఈ యగ్నిని (ఆయునక్) యుక్తమొనర్చునో (ఏనమ్) దీనిని పొంది (ప్రథమః) విస్తీర్ణము, ప్రఖ్యాతము నగు విద్యుత్తు (అధ్యతిష్ఠత్) అన్నిటికి పైన స్థితమై యున్నదో (గన్ధర్వః) పృథివిని ధరించుచు (అస్య) ఈ సూర్యుని (రశనామ్) త్రాడువలె కిరణముల గతిని (అగృభ్ణాత్) గ్రహణమొనర్చుచున్నదో, ఇట్టి (సూరాత్) సూర్యరూపమునుండి (అశ్వమ్) శీఘ్రగామియగు వాయువును (నిరతష్ట) సూక్ష్మపరచు చున్నదో, దానిని నీవు విస్తృతపరచుము.॥౧౩॥

భావార్థము :- ఓ మానవులారా! ఈశ్వరుడీ ప్రపంచమందలి ఏ పదార్థమునందు దేనిని సృష్టించినాడో దానిని మీరు విద్యద్వారా తెలిసికొనుడు. మరియు ఈ సృష్టివిద్యను గ్రహించి అనేక సుఖములను సాధించుడు.॥౧౩॥

13. O learned person, air creates electricity from the Earth, water and space, and yokes it to useful ends. In conjunction with air, diffused, renowned electiricty assumes sway every where. It receives the rays of the Sun, the protector of the earth; and makes subtle with the Sun, the fast moving air!.

౧౫౯౦. అసీత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, విరాట్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫౯౦ అసి యమోఽఅస్యాదిత్యోఽఅర్వన్నసి త్రితో గుహ్యేన వ్రతేన ।
అసి సోమేన సమయా విపృక్తఽఆహుస్తే త్రీణి దివి బన్ధనాని ॥౧౪॥

ప.వి:-అసి, యమః, అసి, ఆదిత్యః, అర్వన్, అసి, త్రితః, గుహ్యేన, వ్రతేన, అసి, సోమేన, సమయా, విపృక్త ఇతి వి+పృక్తః, ఆహుః. తే, త్రీణి, దివి బన్ధనాని.॥౧౪॥

పదార్థః :-(అసి) (యమః) నియన్తా వాయురివ (అసి) (ఆదిత్యః) సూర్యవద్వి

ద్యయా ప్రకాశితః (అర్వన్) వేగవాన్ వహ్నిరివ వర్తమాన జన (అసి) ((త్రితః) త్రిభ్యః (గుహ్యేన) గుప్తేన (వ్రతేన) శీలేన (అసి) (సోమేన) ఐశ్వర్యేణ (సమయా) సమీపే (విపృక్తః) విశేషేణ సమ్పృక్తః (ఆహుః) కథయన్తి (తే) తవ (త్రీణి) (దివి) ప్రకాశే (బన్ధనాని).॥౧౪॥

అన్వయః :-హే అర్వన్! యతస్త్వం గుహ్యేన వ్రతేన త్రితో యమ ఇవాస్యాదిత్య ఇవాసి విద్వన్నివాసి సోమేన సమయా విపృక్తోఽసి తస్య తే దివి త్రీణి బన్ధనాన్యాహుః.॥౧౪॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యుష్మాభిర్న్యాయాదీశాదిత్య సోమాదిగుణైర్భవితవ్యమ్ యథాఽస్య సంసారస్య మధ్యే వాయుసూర్యాకర్షణైర్బన్ధనాని సన్తి తథైవ పరస్పరస్య శరీరవాఙ్మనఆకర్షణైః ప్రేమబన్ధనాని కర్తవ్యాని.॥౧౪॥

పదార్థము :-(అర్వన్) వేగవతియగు అగ్నివంటి వాడా! (గుహ్యేన) గుప్తమైన (వ్రతేన) స్వభావము మరియు (త్రితః) జ్ఞానకర్మోపాసనలచే గూడిన (యమః) నియమకర్తయగు న్యాయాధీశునివలె (అసి) ఉన్నావు. (ఆదిత్యః) సూర్యునివంటి విద్యాప్రకాశమువలె (అసి) ఉన్నావు. విద్వాంసునివంటి వాడవై (అసి) ఉన్నావు. (సోమేన) ఐశ్వర్యమునకు (సమయా) సమీపమున (విపృక్తః) విశేషసంబంధము గలవాడై (అసి) ఉన్నావు. అట్టి (తే) నీయొక్క (దివి) ప్రకాశమందు (త్రీణి) మూడు (బంధనాని) బంధనములను, అనగా ఋషిఋణము, దేవఋణము, పితృఋణముల బంధనములను (ఆహుః) చెప్పుచున్నారు.॥౧౪॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా మీరు న్యాయాధీశులగు సూర్యచంద్రాదుల గుణములు గలవారై యుండదగి యున్నది. ఏవిధముగ ఈ జగమునందు వాయువు, సూర్యుల ఆకర్షణముల బంధనములు గలవో, అదేవిధముగ పరస్పరము శరీరము, వాణి, మనస్సు యొక్క ఆకర్షణములచే ప్రేమబంధనము నొనర్పుడు.॥౧౪॥

14. O man, full of force like fire, by mysterious nature; thou art coupled with action, contemplation and knowledge; thou art disciplined like a just ruler; thou art resplendent with knowledge like the Sun; thou art like a learned person; thou art specially united with grandeur. They say there are three bonds in the spread of knowledge that hold thee.

౧౫. త్రీణీత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, భురిక్పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౫. త్రీణి తఽ ఆహుర్దివి బన్ధనాని త్రీణ్యప్సు త్రీణ్యన్తః సముద్రే।

ఉతేవ మే వరుణ శ్ఛన్త్స్యర్వన్యత్రా తఽ ఆహుః పరమం జనిత్రమ్॥౧౫॥

ప.వి:- త్రీణి, తే, ఆహుః, దివి, బన్ధనాని, త్రీణి, అప్స్విత్యప్+సు, త్రీణి, అన్తరిత్యన్తః,

సముద్రే, ఉతే వేత్యుత+ ఇవ, మే,వరుణః, ఛన్త్సి, అర్వన్, యత్ర, తే, ఆహుః, పరమమ్, జనిత్రమ్.॥౧౫॥

పదార్థః :- (త్రీణి) (తే) తవ (ఆహుః) కథయన్తి (దివి) విద్యాప్రకాశే (బన్ధనాని) (త్రీణి) (అప్సు) ప్రాణేషు (త్రీణి) (అన్తః) మధ్యే (సముద్రే) అన్తరిక్షే (ఉతేవ) యథోత్ప్రేక్షణం (మే) మమ (వరుణః) శ్రేష్ఠః (ఛన్త్సి) అర్చసి. ఛన్దతీత్యర్చతికర్మా....నిఘం. ౩.౧౪. (అర్వన్) విజ్ఞానయుక్త (యత్ర) యస్మిన్ జన్మని (తే) తవ. అత్ర ఋచితునుఘేతి దీర్ఘః। (ఆహుః) (పరమమ్) ప్రకృష్టం (జనిత్రమ్).॥౧౫॥

అన్వయః :- హే అర్వన్ విద్వన్! యత్ర దివి తే త్రీణి బన్ధనాని విద్వాంస ఆహుర్యత్రాప్సు త్రీణి యత్రాన్తర్మధ్యే సముద్రే చ త్రీణి బన్ధనాన్యాహుస్తే చ పరమం జనిత్రమాహుః. యేన వరుణః సన్ విదుషః ఛన్త్స్యుతేవ తాని మే సన్తు. ॥౧౫॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా! ఆత్మమనః శరీరైర్బ్రహ్మచర్యేణ విద్యాసు నియతా భూత్వా విద్యాసుశిక్షే సఞ్చినుత. ద్వితీయం విద్యాజన్మ ప్రాప్యార్చితా భవత. యేన యేన సహ యావాన్ స్వస్య సంబన్ధోఽస్తి తం విజానీత. ॥౧౫॥

పదార్థము :-(అర్వన్) విజ్ఞానవంతుడవగు ఓ విద్వాంసుడా! (యత్ర) ఎట్టి (దివి) విద్యాప్రకాశము నందు (తే) నీయొక్క (త్రీణి) మూడు (బన్ధనాని) బంధనములు విద్వాంసులను గురించి (ఆహుః) చెప్పుచున్నారో, ఎచ్చట (అప్సు) ప్రాణములందు (త్రీణి) మూడింటి (అన్తః) మధ్యన మరియు (సముద్రే) అంతరిక్షమునందు (త్రీణి) త్రివిధ బంధనములను (ఆహుః) చెప్పుదురో మరియు (తే) నీయొక్క (పరమమ్) ఉత్తమ (జనిత్రమ్) జన్మను చెప్పుచున్నారో, దేనిచే (వరుణః) శ్రేష్ఠులగు విద్వాంసులను (ఛన్త్సి) సత్కారమొనర్తురో (ఉతేవ) నిర్లక్ష్యమువలె వారెల్లరును (మే) నా వా రగుదురు గాక!॥౧౫॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఆత్మ, మనస్సు శరీరమునందు బ్రహ్మచర్యముతో గూడ విద్యలందు నియతులై యుండి విద్య మరియు ఉత్తమ శిక్షలను సంచయ మొనర్చుకొనుడు. రెండవవిద్యాజన్మను పొంది పూజనీయులగుడు. ఏ యే దానితో మనకెంతెంత సబంధము గలదో దానిని దెలిసికొనుడు.॥౧౫॥

15. O learned person, the sages say, there are three bonds in the spread of knowledge that hold thee; three bonds in the control of breath, three bonds in the atmosphere that cause rain; they speak of thy sublimest birth, and thou payest homage to those noble learned souls; may they all be connected with me through deliberation!.

౧౬. ఇమేత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైరశ్వరక్షణేన కిం సాధ్యమిత్యాహ. మానవులు గుఱ్ఱములనుంచుటవలన నేమిసాధించవచ్చును?

౧౪౫౨ ఇమా తే వాజిన్నవమార్జనానీమా శఫానాఀ సనితుర్నిధానా ।

అత్రా తే భద్రా రశనా అపశ్యమృతస్య యా అభిరక్షన్తి గోపాః॥౧౬॥

ప.వి:-ఇమా, తే, వాజిన్, అవమార్జనానీత్యవ+మార్జనాని, ఇమా, శఫానామ్, సనితుః, నిధానేతి ని+ధానా, అత్ర, తే, భద్రాః, రశనాః, అపశ్యమ్, ఋతస్య, యాః, అభిరక్షన్తీత్యభి+రక్షన్తి, గోపాః.॥౧౬॥

పదార్థః:-(ఇమా)ఇమాని ప్రత్యక్షాణి (తే) తవ (వాజిన్)అశ్వఇవ వేగాదిగుణ సేనాధీశ! (అవమార్జనాని) శుద్ధికరణాని (ఇమా) ఇమాని (శఫానామ్) ఖురాణాం (సనితుః) రక్షణాని యమస్య (నిధానా) నిధానాని స్థానాని (అత్ర) అస్మిన్ సైన్యే. అత్ర సంహితాయామితి దీర్ఘః. (తే) తవ (భద్రాః) శుభకరీః (రశనాః)రజ్జవః (అపశ్యమ్) పశ్యామి (ఋతస్య) యథార్థం. అత్ర కర్మణి షష్ఠీ (యాః) (అభిరక్షన్తి) సర్వతః పాన్తి (గోపాః) పాలికాః. ॥౧౬॥

అన్వయః :-హే వాజిన్! యథాఽహం తే తవేమాశ్వస్యావమార్జనానీమా శఫానాం సనితుర్నిధానాఽపశ్యమత్ర తేఽశ్వస్య యా భద్రా గోపా రశనా ఋతస్యాభిరక్షన్తి తా అపశ్యం తథా త్వం పశ్య.॥౧౬॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే స్నానేశ్వాదీనాం శుద్ధిం తచ్ఛఫానాం రక్షణాయాయసో నిర్మితస్య యోజనమన్యాని రశనాదీని చ సంయోజ్య సుశిక్ష్య రక్షన్తి తే యుద్ధాదిషు కార్యేషు కృతసిద్ధయో భవన్తి. ॥౧౬॥

పదార్థము :-(వాజిన్) అశ్వమువంటి వేగాది గుణములతో గూడిన ఓ సేనాధీశా! నే నెట్లు (తే) నీయొక్క (ఇమా) ఈ ప్రత్యక్ష అశ్వములయొక్క (అవమార్జనాని) శుద్ధిక్రియల మరియు (ఇమా) దీని (శఫానామ్) డెక్కలను (సనితుః) ఉంచునియమముల (నిధానా) స్థానములను (అపశ్యమ్) చూచుచుందునో (అత్ర) ఈ సైన్యములందు (తే) మీ హయముయొక్క (యాః) ఏ (భద్రాః) చక్కని శుభప్రదములు (గోపాః) ఉపద్రవములనుండి రక్షణ యొనర్చగల (రశనాః) కళ్లెపుత్రాడు (ఋతస్య) సత్యముయొక్క (అభిరక్షన్తి) రక్షణను అన్నివైపులనుండి నే నెట్లు చూచుచున్నానో, అట్లే నీవును శ్రద్ధతో చూడుము.॥౧౬॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. స్నానములద్వారా తమ అశ్వములు

మున్నగు వాని శుద్ధి మరియు వాని గిట్టల రక్షణకొరకు లోహముతో నిర్మించబడిన నాడములను స్థాపనమొనర్చి, కళ్లెపుత్రాడు మున్నగు సామగ్రులను సంయుక్తపరచుకొని చక్కని శిక్షణనిచ్చువారు యుద్ధము మున్నగు కార్యములందు విజయమును సాధించుకొనగలడు.॥౧౬॥

16. O enterprising commander of the army, just as I look after the bathing procedures of these horses of yours, and the places for the protection of their hooves; just as in this army, I see the auspicious reins of thy horses, which save us from misfortune, and direct their right usage, so shoulst thou see!.

౧౭౫౩. ఆత్మానమిత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః; అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

యానరచనేన కిం కార్యమిత్యాహ. యానరచనతో నేమి చేయవలయునను విషయము.

౧౭౫౩ ఆత్మానం తే మనసారాదజానామవో దివా పతయన్తం పతంగమ్।

శిరోఽఅపశ్యం పథిభిః సుగేభిరరేణుభిర్జేహమానం పతత్రి ॥౧౭॥

ప.వి:-ఆత్మానమ్, తే, మనసా, ఆరాత్, అజానామ్, అవః, దివా, పతయన్తమ్, పతఙ్గమ్, శిరః, అపశ్యమ్, పథిభిరితి పథి+భిః, సుగేభిరితి సు+గేభిః, అరేణుభిరిత్యరేణు+భిః, జేహమానమ్, పతత్రి. ॥౧౭॥

పదార్థః :-(ఆత్మానం) (తే) తవ (మనసా) విజ్ఞానేన (ఆరాత్) నికటే (అజానామ్) జానామి (అవః) అధస్తాత్ (దివా) అన్తరిక్షేణ సహ (పతయన్తమ్) పతన్తం గచ్ఛన్తం సూర్యం ప్రతి (పతఙ్గమ్) (శిరః) దూరాచ్ఛిర ఇవ లక్ష్యమాణం (అపశ్యమ్) (పథిభిః) మార్గైః (సుగేభిః) సుఖేన గమనాధికరణైః (అరేణుభిః) అవిద్యమానా రేణవో యేషు తైః (జేహమానమ్) ప్రయత్నేన గచ్ఛన్తం (పతత్రి) పతనశీలమ్.॥౧౭॥

అన్వయః :-హే విద్వన్నహం యథా మనసారాదవో దివా పతఙ్గం ప్రతిపతయన్తం తే పతత్రి శిర ఆత్మానమజానామ్ అరేణుభిః సుగేభిః పథిభిర్జేహమానం పతత్రి శిరోఽపశ్యం తథా త్వం పశ్య.॥౧౭॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా యూయం సర్వేభ్యో వేగవత్తమం సద్యో గమయితారం వహ్నిమివ చాత్మానం పశ్యత సంప్రయుక్తైరగ్న్యాదిభిస్సహితేషు యానేషు స్థిత్వా జలస్థలాన్తరిక్షేషు ప్రయత్నేన గచ్ఛతాఽఽగచ్ఛత యథా శిర

**ఉత్తమాఙ్గమస్తి తథైవ విమానయానముత్తమం మన్తవ్యమ్.॥౧౭॥**

**పదార్థము :-** ఓ విద్వాంసుడా! నే నెట్లు (మనసా) విజ్ఞానముచే (ఆరాత్) సమీపమున (అవః) క్రిందినుండి (దివా) ఆకాశముతో గూడ (పతయన్తమ్) నడచుచు (తే) నీ (ఆత్మానమ్) ఆత్మస్వరూపమును (అజానామ్) ఎరుగుచున్నానో మరియు (అరేణుభిః) ధూళిలేని నిర్మల (సుగేభిః) సుఖముగా నడువదగిన (పథిభిః) మార్గములద్వారా (జేహమానమ్) ప్రయత్నపూర్వకముగా వెళ్లుచు (పతత్రి) పక్షివలె ఎగురునట్టి (శిరః) దూరమునుండి శిరమువలె గుండ్రముగా గాన్పించు విమానము మున్నగు యానములను (అపశ్యమ్) ఎట్లు చూచుచున్నానో నీవు కూడ నట్లే చూడుము.॥౧౭॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! వేగమంతము, శీఘ్రముగా నడచునట్టి అగ్నివంటి మీ యాత్మను జూడుడు. సంప్రయుక్తపరచినట్టి అగ్ని మున్నగు వానితోగూడ యానములందు గూర్చుండి జల, స్థల, ఆకాశములందు ప్రయత్నపూర్వకముగ పోవుచు వచ్చుచునుండుడు. ఎట్లు శిరము ఉత్తమమైనదో, అట్లే, విమానయానమును ఉత్తమమని ఎంచుడు. ॥౧౭॥

17. O learned person I recognise thy soul going high up from below, like the Sun in heaven. Just as I see the aeroplanes from far, and round like the head, soaring striving upward by paths unsoiled by dust, and pleasant to travel, so shouldst thou see!.

౧౨౯౪. అత్రేత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ శూరవీరాః కిం కుర్వన్త్విత్యాహ. ఇపుడు శూరవీరు లేమి చేయవలయునను విషయము.

**౧౨౯౪ అత్రా తే రూపముత్తమమపశ్యం జిగీషమాణమిషఆ పదే గోః।**

**యదా తే మర్తోఽఅను భోగమానడాదిద్ గ్రసిష్ఠఽఓషధీరజీగః ॥౧౮॥**

**ప.వి:-** అత్ర, తే, రూపమ్ః, ఉత్తమమిత్యుత్+తమమ్, అపశ్యమ్, జిగీషమాణమ్, ఇషః, ఆ, పదే, గోః, యదా, తే, మర్తః, అను, భోగమ్, ఆనట్, ఆత్, ఇత్, గ్రసిష్ఠః, ఓషధీః, అజీగ రిత్యజీగః.॥౧౮॥

**పదార్థః :- (అత్ర) అస్మిన్ వ్యవహారే. అత్ర సంహితాయామితి దీర్ఘః. (తే) తవ (రూపమ్) (ఉత్తమమ్) (అపశ్యం) పశ్యేయం (జిగీషమాణమ్) శత్రూన్ విజయమానం (ఇషః) అన్నాని (ఆ) సమన్తాత్ (పదే) ప్రాపణీయే (గోః) పృథివ్యాః (యదా)(తే) తవ (మర్తః) మనుష్యః (అను) అనుకూల్యే (భోగమ్) (ఆనట్) వ్యాప్నోతి. ఆనడితి వ్యాప్తికర్మా**

నిఘం.౨.౧౮ (ఆత్) అనన్తరం (ఇత్) ఏవ (గ్రసిష్ఠః) అతిశయేన గ్రసితా (ఓషధీః) (అజీగః) నిగలసి.॥౧౮॥

అన్వయః :-హే వీర! తే జిగీషమాణముత్తమం రూపం గోః పదేఽత్ర ఇషశ్చాఽఽపశ్యం, తే మర్త్తో యదా భోగమానట్ తదాఽఽదిద్ గ్రసిష్ఠః సంస్త్వమోషధీరన్వజీగః.॥౧౮॥

భావార్థః :- హే మనుష్యాః! యథోత్తమాని పశ్వాదీని సేనాఙ్గాని విజయకరాణి స్యుస్తథా శూరవీరా విజయహేతవో భూత్వా భూమిరాజ్యే భోగాన్ ప్రాప్నువన్తు.॥౧౮॥

పదార్థము :- ఓ వీరుడా! (తే) నీ యొక్క (జిగీషమాణమ్) శత్రువులను జయించుచు (ఉత్తమమ్) ఉత్తమ (రూపమ్) రూపము మరియు (గోః) పృథివియొక్క (పదే) పొందదగిన (అత్ర) ఈ వ్యవహారము నందు (ఇషః) అన్నమును (ఆ,అపశ్యమ్) బాగుగాచూచునో (అనట్) వ్యాప్తిజెందునో, అపుడు (ఆత్) దీని (ఇత్) వెంటనే (గ్రసిష్ఠః) బాగుగాభుజించునట్టి నీవు (ఓషధీః) ఓషధులను (అను,అజీగః) అనుకూలమును బట్టి భుజించుచుండుము.॥౧౮॥

భావార్థము :- ఉత్తమమగు అశ్వములు మొదలగు సేనాంగములు విజయమును పొందునవిగా నగునట్లు శూరవీరులు విజయమునకు హేతువులునై భూమి రాజ్యమునందు భోగములను ప్రాప్తించుకొందురు గాక!॥౧౮॥

18. O brave person, I behold thy form matchless in beauty, eager to win foes and the food produced here from the Earth. Whenever a man brings thee thy eatables, thou, then, being the most voracious eater, swallowest medicines!.

౧౯. అను త్వేత్యస్య భార్గవో జమదగ్నిరృషిః, మనుష్యో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః కథం రాజప్రజాకార్యాణి సాధనీయానీత్యాహ.

మానవులెట్లు రాజప్రజా కార్యములను సాధించవలయును?

౧౯. అను త్వా రథోఽ అను మర్యోఽ అర్వన్ననుగావోఽను భగః

కనీనామ్। అను వ్రాతాసస్తవ సఖ్యమీయురను దేవా మమిరే వీర్యన్తే.॥౧౯॥

ప.వి:- అను, త్వా, రథః, అను, మర్యః, అర్వన్, అను, గావః, అను, భగః, కనీనామ్,

అను, వ్రాతాసః, తవ, సఖ్యమ్, ఈయుః, అను,దేవాః, మమిరే,వీర్యమ్, తే.॥౧౯॥

పదార్థః :-(అను) పశ్చాదనుకూల్యే వా (త్వా) త్వాం (రథః)యానాని (అను) (మర్యః) మనుష్యః (అర్వన్) అశ్వ ఇవ వర్త్తమాన (అను) (గావః)(అను) (భగః) ఐశ్వర్యం

(కనీనామ్) కమనీయానాం జనానాం (అను) (వ్రాతాసః) మనుష్యాః. వ్రాతా ఇతి మనుష్యనా...నిఘం. ౨.౩. (తవ) (సఖ్యమ్) మిత్రస్య భావం వా (ఈయుః) ప్రాప్నుయుః (అను) (దేవాః) విద్వాంసః (మమిరే) మిమయుః (వీర్యమ్) పరాక్రమం బలం (తే) తవ.॥౧౯॥

అన్వయః :-హే అర్వన్ విద్వన్! తే కనీనాం మధ్యే వర్తమానా దేవా వ్రాతాసోఽనువీర్యమనుమమిరే తవ సఖ్యం చాన్వీయుస్త్వాను రథో త్వాను మర్త్యో త్వాను గావో త్వాఽను భగశ్చ భవతు. ॥౧౯॥

భావార్థః :- యది మనుష్యాః సుశిక్షితా భూత్వాఽన్యాన్సుశిక్షితాన్కుర్యుస్తేషాం మధ్యాదుత్తమాన్సభాసదః సమ్పాద్య సభాసదాం మధ్యాదత్యుత్తమం సభేశం స్థాపయిత్వా రాజప్రజాప్రధానపురుషాణామేకానుమత్యా రాజకార్యాణి సాధయేయుస్తర్హి సర్వేషామనుకూలా భూత్వా సర్వాణి కార్యాణ్యలం కుర్యుః.॥౧౯॥

పదార్థము :-(అర్వన్) అశ్వమువలె వేగవంతుడవగు ఓ విద్వాంసుడా! (తే) నీయొక్క (కనీనామ్) శోభాయవంతులగు మానవులమధ్యనున్న (దేవాః) విద్వాంసులగు (వ్రాతాసః) మనుష్యులు (అనువీర్యమ్) బలపరాక్రమముల కనుకూలముగ (అనుమమిరే) ఊహించవలెను. వారు (తవ) నీయొక్క (సఖ్యమ్) మిత్రత్వమును (అను, ఈయుః) అనుకూలముగ పొందుదురుగాక! (త్వా) నీకు (అను) అనుకూలముగ (రథః) విమానము మున్నగు యానములు (త్వా) నీకు (అను) అనుకూలములుగ లేక వెంటనుండు (మర్త్యః) సాధారణమనుష్యులు (త్వా) నీకు (అను) అనుకూలముగ లేక నీ వెనుక (గావః) గోవులు మరియు (త్వా) నీకు (అను) అనుకూలమగు (భగః) ఐశ్వర్యము కలుగుగాక!॥౧౯॥

భావార్థము :-మానవులు ఉత్తమ శిక్షణగలవారై ఇతరులను ఉత్తమ శిక్షణ గలవారినిగ నొనర్చవలెను. వారినుండి ఉత్తములను సభాసదులుగ, మరియు నా సభాసదులనుండి అత్యుత్తముని సభాపతిగ నెన్నుకొనవలెను. రాజప్రజలందలి ముఖ్యులును ఏకాభిప్రాయముగ రాజకార్యమును సాధించుకొనునప్పుడు అందరును పరస్పరము అనుకూలముగ నుండి సర్వకార్యములను పూర్తిచేసికొనవలెను. ॥౧౯॥

19. O learned person, when the learned amongst the graceful persons, long for thy friendship, and educated persons favourably measure thy vigour, the aeroplanes, ordinary run of mankind, kine and supremacy follow thee!.

౧౫౯౬. హిరణ్యశృఙ్గ ఇత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైరగ్న్యాదిపదార్థగుణవిజ్ఞానేన కిం సాధ్యమిత్యాహ.

మానవులు అగ్న్యాదిపదార్థములయొక్క గుణజ్ఞానమువలన నేమిసాధించవలెను?

౧౩౯౬. హిరణ్యశృఙ్గోఽయోఽఅస్య పాదా మనోజవాఽఅవరఽఇన్ద్రఽ
ఆసీత్। దేవాఽఇదస్య హవిరద్యమాయన్యోఽఅర్వన్తం
ప్రథమోఽఅధ్యతిష్ఠత్ ॥౨౦॥

ప.వి:- హిరణ్యశృఙ్గ ఇతి హిరణ్య+శృఙ్గః, అయః, అస్య, పాదాః, మనోజవా ఇతి మనః+జవాః, అవరః, ఇన్ద్రః, ఆసీత్, దేవాః, ఇత్, అస్య, హవిరద్యమితి హవిః+అద్యమ్, ఆయన్, యః, అర్వన్తమ్, ప్రథమః, అధ్యతిష్ఠ దిత్యధి+అతిష్ఠత్.॥౨౦॥

పదార్థః :-(హిరణ్యశృఙ్గః) హిరణ్యాని తేజాంసి శృఙ్గాణీవ యస్య సః (అయః) సువర్ణమ్. అయ ఇతి హిరణ్య నా...నిఘం.౧.౨. (అస్య) (పాదాః) పద్యన్తే గచ్ఛన్తి యైస్తే (మనోజవాః) మనసో జవో వేగ ఇవ జవో వేగో యేషాన్తే (అవరః) నవీనః (ఇన్ద్రః) పరమైశ్వర్య హేతుర్విద్యుదివ సభేశః (ఆసీత్) భవేత్ (దేవాః) విద్వాంసః సభాసదః (ఇత్) ఏవ (అస్య) (హవిరద్యమ్) దాతుమత్తుమర్హం యోగ్యం చ (ఆయన్) ప్రాప్నుయుః (యః) (అర్వన్తమ్) అశ్వవత్ప్రాప్నువన్తం వహ్నిం (ప్రథమః) ఆదిమః (అధ్యతిష్ఠత్) ఉపరి తిష్ఠేత్.॥౨౦॥

అన్వయః :-హే మనుష్యా! యోఽవరో హిరణ్యశృఙ్గ ఇన్ద్ర ఆసీద్యః ప్రథమోఽర్వన్తమయంశ్చాధ్యతిష్ఠదస్య పాదా మనోజవాః స్యుర్దేవా అస్య హవిరద్యమిదాయన్ తం యూయమాశ్రయత.॥౨౦॥.

భావార్థః :-యే మనుష్యా అగ్న్యాదిపదార్థానాం గుణకర్మస్వభావాన్ యథావజ్జానీయుస్తే బహూన్యద్భుతాని కార్యాణి సాద్ధుం శక్నుయుః. యే ప్రీత్యా రాజకార్యాణి ప్రాప్నుయుస్తే సత్కారం యే నాశయేయుస్తే దణ్డం చావశ్యం ప్రాప్నుయుః.॥౨౦॥

పదార్థము :- ఓ మానవులారా! (యః) ఎవడు (అవరః) నవ్యమైన (హిరణ్యశృఙ్గః) బంగారు శృంగము వంటి తేజస్సుగల (ఇన్ద్రః) ఉత్తమైశ్వర్యవంతుడు, విద్యుత్తు వంటి సభాపతి (ఆసీత్) ఉండునో ఎవడు (ప్రథమః) మొదటి (అర్వన్తమ్) అశ్వమువలె మార్గమును ప్రాప్తించుకొను అగ్ని మరియు (అయః) సువర్ణమునకు (అధ్యతిష్ఠత్) అధిష్ఠాత అనగా అగ్నిని గలిసి యున్న యానముపై కూర్చుండి నడుపువాడై యుండునో (అస్య) అట్టి రాజు (పాదాః) పాదములు (మనోజవాః) మనోవేగము గలవి, అనగా కాలితో నడచు కార్యము విమానాదులచే తీసికొను (దేవాః) విద్వాంసులగు సభాసదులు (అస్య) ఈ రాజుయొక్క

(హవిరద్యమ్) ఈయదగిన, భుజించదగిన అన్నమును (ఇత్ ఆయన్) మాత్రమే పొందునో ఆయనను మీరు తెలిసికొనుడు.॥౨౦॥

భావార్థము :- ఏ మనుష్యులు అగ్ని మున్నగు పదార్థముల గుణకర్మ స్వభావములను యథావతుగ దెలిసికొందురో వారు అనేక అద్భుతకార్యములను సాధించెదరో వారి సత్కారములను ఎవరు నష్టమొనర్చెదరో వారు తప్పక దండనాపాత్రులగుదురు.॥౨౦॥

20. O people, know that the head of the state should be sharp and brilliant like horns, and lustrous like lightning. Like a horse marching on his path, the king should be the first lord of fire and gold. His feet should possess the velocity of mind. The members of his Cabinet should receive their maintenance allowance from him!

౧౫౯౨. ఈర్మాన్తాస ఇత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, మనుష్యా దేవతాః, భురిక్ పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

కీదృశా రాజపురుషా విజయమాప్నువన్తీత్యాహ.

ఎటువంటి రాజపురుషులు విజయము పొందుచున్నారను విషయము.

౧౫౯౨ ఈర్మాన్తాసః సిలికమధ్యమాసః సఌంశూరణాసో దివ్యాసోఽఅత్యాః ।
హంసాఽఇవ శ్రేణిశో యతన్తే యదాక్షిషుర్దివ్యమజ్మమశ్వాః॥౨౧॥

ప.వి:- ఈర్మాన్తాస ఇతీర్మ+అన్తాసః, సిలికమధ్యమాస ఇతి సిలిక+మధ్యమాసః, సమ్, శూరణాసః, దివ్యాసః, అత్యాః, హంసాఽఇవేతి హంసాః+ ఇవ, శ్రేణిశ ఇతి శ్రేణి+శః, యతన్తే, యత్, ఆక్షిషుః, దివ్యమ్, అజ్మమ్, అశ్వాః.॥౨౧॥

పదార్థః :-(ఈర్మాన్తాసః) ఈర్మః ప్రేరితః స్థితిప్రాన్తో యేషాన్తే (సిలికమధ్యమాసః) సిలికః సంలగ్నో మధ్యదేశో యేషాం తే (సమ్) (శూరణాసః) సద్యో రణో యుద్ధవిజయో యేభ్యస్తే (దివ్యాసః) ప్రాప్తదివ్యశిక్షాః (అత్యాః) సతతగామినః (హంసా ఇవ) హంసవద్ గన్తారః (శ్రేణిశః) బద్ధపఙ్క్తయః (యతన్తే) (యత్) యే (ఆక్షిషుః) ప్రాప్నుయుః (దివ్యమ్) శుద్ధమ్ (అజ్మమ్) అజన్తి గచ్ఛన్తి యస్మింస్తం మార్గమ్ (అశ్వాః) ఆశుగామినః. ॥౨౧॥

అన్వయః :-హే మనుష్యాః! యద్యేఽగ్న్యాదయ ఇవేర్మాన్తాసః సిలికమధ్యమాసః శూరణాసో దివ్యాసోఽత్యా అశ్వాః శ్రేణిశో హంసా ఇవ యతన్తే దివ్యమజ్మం సమాక్షిషుస్తాన్ యూయం ప్రాప్నుత.॥౨౧॥

**భావార్థః** :- అత్రోపమాలంకారః. యేషాం రాజపురుషాణాం సుశిక్షితా దివ్యగతయో విజయహేతవస్సద్యో గామినః ప్రేరణామనుగన్తారో హంసవద్ గతయోఽశ్వా అగ్న్యాదయః పదార్థా ఇవ కార్యసాధకాః సన్తి తే సర్వత్ర విజయమాప్నువన్తి. ॥౨౧॥

**పదార్థము** :- ఓ మానవులారా! (యత్) అగ్ని మున్నగు పదార్థముల వలె నేవి (ఈర్మాన్తాసః) ప్రేరణమొనర్చబడిన కూర్చుండు స్థానములుగల (సిలికమధ్యమాసః) గద మున్నగు వానిచే దగిలియున్న మధ్యస్థానము గలవి (శూరణాసః) యుద్ధమునందు శీఘ్రముగ విజయమును గలిగించుటకు హేతువగు (దివ్యాసః) ఉత్తమ శిక్షితములగు (అత్యాః) నిరంతరము నడచు (అశ్వాః) త్వరగాములగు తురగములు (శ్రేణిశః) పంక్తులుగా జేరి (హంసా ఇవ) హంసల వలె (యతన్తే) ప్రయత్నమొనర్చునో, మరియు (దివ్యమ్) శుద్ధమైన (అజ్మమ్) మార్గమున (సమ్, ఆక్షిషుః) వ్యాప్తమగునో వానిని మీరు పొందుడు. ॥౨౧॥

**భావార్థము** :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఏ రాజపురుషుల అశ్వములు చక్కని శిక్షణ, ఉత్తమగతి గలవిగ నుండునో మరియు అగ్ని మున్నగు వానివలె కార్యసాధకములో అవి సర్వత్ర విజయమును పొందును. ॥౨౧॥

21. O men possess horses fiery in spirit, with attractive places to sit on, thin bellied, qucik conquerors of battles, well trained, fast in motion, putting forth their strength like swans in lengthened order, and treading on pure paths!.

౧౫౯౮. తవేత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, వాయవో దేవతాః, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైరనిత్యం శరీరం ప్రాప్య కిం కార్య మిత్యాహ.

మానవు లనిత్య శరీరమును పొంది యేమిచేయవలెను?

**౧౫౯౮ తవ శరీరం పతయిష్ణ్వర్వన్తవ చిత్తం వాతఽఇవ ధ్రజీమాన్।**

**తవ శృఙ్గాణి విష్ఠితా పురుత్రారణ్యేషు జర్భురాణా చరన్తి॥౨౨॥**

**ప. వి:-** తవ, శరీరమ్, పతయిష్ణు, అర్వన్, తవ, చిత్తమ్, వాత ఇవేతి వాతః+ ఇవ, ధ్రజీమాన్, తవ, శృఙ్గాణి, విష్ఠితా, విష్ఠితేతి వి+ స్థితా, పురుత్రేతి పురు+ త్రా, అరణ్యేషు, జర్భురాణా, చరన్తి. ॥౨౨॥

**పదార్థః** :-(తవ) (శరీరమ్) (పతయిష్ణు) పతనశీలమ్ (అర్వన్) అశ్వ ఇవ వర్తమాన (తవ) (చిత్తమ్) అన్తఃకరణమ్ (వాత ఇవ) వాయువత్ (ధ్రజీమాన్) వేగవాన్ (తవ)

(శృఙ్గాణి) శృఙ్గాణీవోచ్ఛ్రితాని సేనాఙ్గాని (విష్ఠితా) విశేషేణ స్థితాని (పురుత్రా) పురుషు బహుషు (అరణ్యేషు) జఙ్గలేషు (జర్భురాణా) భృశం పోషకాని ధారకాణి (చరన్తి) గచ్ఛన్తి.॥౨౨॥

అన్వయః :-హే అర్వన్ వీర! యస్య తవ పతయిష్ణు శరీరం తవ చిత్తం వాత ఇవ ధ్రజీమాన్ తవ పురుత్రారణ్యేషు జర్భురాణా విష్ఠితా శృఙ్గాణి చరన్తి స త్వం ధర్మమాచర.॥౨౨॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యే మనుష్యా అనిత్యేషు శరీరేషు స్థిత్వా నిత్యాని కార్యాణి సాధ్నువన్తి తేఽతులం సుఖమాప్నువన్తి. యే వనస్థాః పశవ ఇవ భృత్యాః సేనాశ్చ వర్త్తన్తే తేఽశ్వవత్సద్యోగామినో భూత్వా శత్రూన్ విజేతుం శక్నువన్తి.॥౨౨॥

పదార్థము :- (అర్వన్) అశ్వమువంటి వేగవంతుడవగు వీరుడా! (తవ) నీయొక్క (పతయిష్ణు) నాశవంతమగు (శరీరమ్) శరీరము (తవ) నీయొక్క (చిత్తమ్) అంతఃకరణ వృత్తి (వాత ఇవ) వాయువువలె (ధ్రజీమాన్) వేగవంతమగు, అనగా శీఘ్రముగా దూరస్థ విషయముల తత్త్వమునెరుగు (తవ) నీయొక్క (పురుత్రా) అనేక (అరణ్యేషు) అడవులందు (జర్భురాణా) శీఘ్రముగా ధారణ, పోషణము నొనర్చునట్టి (విష్ఠితా) విశేషముగా స్థిరమై యున్న (శృఙ్గాణి) శృంగములవలె ఉన్నతమగు సేనాంగములు (చరన్తి)చరించునట్టి నీవు ధర్మము నాచరించుము. ॥౨౨॥

భావార్థము :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. అనిత్యశరీరములందుండియును నిత్యకార్యముల సాధించువారు అతుల సుఖములను పొందుదురు. వన్యపశువుల వంటి భృత్యులు మరియు సేనలు గలిగి అశ్వమువలె త్వరగామియైనవాడు శత్రువులను జయించుటకు సమర్థుడగును.॥౨౨॥

22. O brave person, thy body is mortal, but thy spirit is swift like the wind in motion. Thy soldiers are spread abroad in all directions, and being stout and strong move about in many wildernesses; follow thou the path of virtue!.

౧౫౯౯.ఉప ప్రేత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, మనుష్యా దేవతాః, భురిక్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

కీదృశా విద్వాంసో హితైషిణ ఇత్యాహ.

విద్వాంసు లెటుల హితైషు లగుచున్నారను విషయ మీ మంత్రమందుండెను.

౧౫౯౯ ఉప ప్రాగాచ్ఛసనం వాజ్యర్వా దేవద్రీచా మనసా దీధ్యానః ।

అజః పురో నీయతే నాభిరస్యాను పశ్చాత్కవయో యన్తి రేభాః ॥౨౩॥

ప.వి:- ఉప, ప్ర, అగాత్, శసనమ్, వాజీ, అర్వా, దేవద్రీచా, మనసా, దీధ్యానః, అజః, పురః, నీయతే, నాభిః, అస్య, అను, పశ్చాత్, కవయః, యన్తి, రేభాః.॥౨౩॥

పదార్థః :-(ఉప) సామీప్యే ((ప్ర) (అగాత్) గచ్ఛన్తి (శసనమ్) శంసన్తి హింసన్తియస్మిన్త్రి స్తద్యుద్ధమ్ (వాజీ) వేగవాన్ (అర్వా) గన్తాఽశ్వః (దేవద్రీచా) దేవానఞ్చతా ప్రాప్నువతా (మనసా) (దీధ్యానః ) దీప్యమానః సన్ (అజః) క్షేపణశీలః (పురః) (నీయతే) (నాభిః) మధ్యభాగః (అస్య) (అను) ఆనుకూల్యే (పశ్చాత్) (కవయః) మేధావినః(యన్తి) ప్రాప్నువన్తి (రేభాః) సర్వవిద్యాస్తోతారః. రేభ ఇతి స్తోతృనా...నిఘం. 3.౧౬. ॥౨౩॥

అన్వయః :-యో దీధ్యానోఽజో వాజ్యర్వా దేవద్రీచా మనసా శసనముప ప్రాగాత్ విద్వద్భిరస్య నాభిః పురో నీయతే తం పశ్చాత్ రేభాః కవయః అనుయన్తి. ॥౨౩॥

భావార్థః :-యే విద్వాంసో దివ్యేన విచారేణ తురఙ్గాన్ సుశిక్ష్యాగ్న్యాదీన్సంసాధ్యైశ్వర్యం ప్రాప్నువన్తి తే జగద్ధితైషిణో భవన్తి.॥౨౩॥

పదార్థము :-(దీధ్యానః)చక్కని ప్రకాశవంతము (అజః) విసరివేయు (వాజీ) వేగవంతము (అర్వా) చురుకుదనము గల అశ్వము (దేవద్రీచా) విద్వాంసులను పొందుచు (మనసా)మనస్సుతో (శసనమ్) హింసతో గూడిన యుద్ధమును (ఉప, ప్ర, అగాత్) ఏది చక్కగా సమీపమున ప్రాప్తించుచున్నదో, విద్వాంసులద్వారా (అస్య) దీనియొక్క (నాభిః) మధ్యభాగము, అనగా వీపు (పురః) ముందు (నీయతే) పొందబడుచున్నదో, అనగా దానిపై స్వారియొనర్చెదరో, దానిని (పశ్చాత్) ఆ తురువాత (రేభాః) సమస్త విద్యలను స్తుతించు (కవయః) బుద్ధిశాలురు (అను, యన్తి) అనుకూలముగ పొందుచున్నారు.॥౨౩॥

భావార్థము :- ఏ విద్వాంసులు ఉత్తమాలోచనలద్వారా అశ్వములకు ఉత్తమ శిక్షణ నిచ్చి అగ్ని మున్నగు పదార్థములను సాధించుకొని ఐశ్వర్యములను పొందుచున్నారో వారు జగత్తునకు హితైషులగుదురు. ॥౨౩॥

23. The beautiful, lustrous, active fast, dexterous horse, in the company of the learned, merrily goes to the battle-field, The valiant ride on its abck, and the wise singing the praise of knowledge follow it.

౧౬౦౦.ఉప ప్రేత్యస్య భార్గవో జమదగ్నిర్ఋషిః, మనుష్యో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః

కే జనా రాజ్యం శాసితుమర్హన్తీత్యాహ. ఏ జనులు రాజ్యశాసనము చేయుట కర్హు లను విషయము.

౧౬౦౦ ఉప ప్రాగాత్పరమం యత్సధస్థ మర్వాఀ౨॥ ఉఅచ్ఛా పితరం మాతరం చ। అద్యా దేవాఞ్జుష్టతమో హి గమ్యా౨

అథాశాస్తే దాశుషే వార్యాణి ॥౨౪॥

ప.వి:- ఉప, ప్ర, అగాత్, పరమమ్, యత్, సధస్థమితి సధ+స్థమ్, అర్వాన్, అచ్ఛ, పితరమ్, మాతరమ్, చ, అద్య, దేవాన్, జుష్టతమ ఇతి జుష్ట+తమః, హి, గమ్యాః, అథ, ఆ, శాస్తే, దాశుషే, వార్యాణి.॥౨౪॥

పదార్థః :- (ఉప) (ప్ర) (అగాత్) ప్రాప్నోతి (పరమమ్) (యత్) యః (సధస్థమ్) సహస్థానమ్ (అర్వాన్) జ్ఞానీ జనః. అత్ర నలోపాభావశ్ఛాన్దసః. (అచ్ఛ) సమ్యక్. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. (పితరమ్) జనకమ్ (మాతరమ్) జననీమ్ (చ) (అద్య) ఇదానీమ్. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. (దేవాన్) విదుషః (జుష్టతమః) అతిశయేన సేవితః (హి) ఖలు (గమ్యాః) ప్రాప్నుహి (అథ) (ఆ) సమన్తాత్ (శాస్తే) ఇచ్ఛతి (దాశుషే) దాత్రే (వార్యాణి) స్వీకార్యాణి భోగ్యవస్తూని.॥౨౪॥

అన్వయః :-హే విద్వన్! యద్యోఽర్వాన్ జుష్టతమస్సన్ పరమం సధస్థం పితరం మాతరం దేవాంశ్చాద్యా శాస్తేఽథ దాశుషే వార్యాణ్యుపప్రాగాత్ తం హి త్వమచ్ఛ గమ్యాః.॥౨౪॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే న్యాయవినయాభ్యాం పరోపకారాన్ కుర్వన్తి తే ఉత్తమం ఉత్తమం జన్మ శ్రేష్ఠాన్పదార్థాన్ విద్వాంసం పితరం విదుషీః మాతౄశ్చ ప్రాప్య విద్వద్భక్తా భూత్వా మహత్సుఖం ప్రాప్నుయుస్తే రాజ్యమనుశాసితుం శక్నుయుః.॥౨౪॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! (యత్) ఏ (అర్వాన్) జ్ఞాని (జుష్టతమః) గొప్పగాసేవించబడినవాడై (పరమమ్) ఉత్తమ (సధస్థమ్) స్నేహితుల స్థానమున (పితరమ్) తండ్రిని (మాతరమ్) తల్లిని (చ) మరియు (దేవాన్) విద్వాంసులను (అద్య) ఈ సమయమున (ఆ,శాస్తే) అధికముగా కాంక్షించునో (అథ) ఆ తరువాత (దాశుషే) దాతలకొరకు (వార్యాణి) స్వీకరించ మరియు భుజించదగిన పదార్థములను (ఉప, ప్ర, అగాత్) గౌరవముగా సమీపముననే పొందుచున్నాడో (హి) అటులనే (అచ్ఛా, గమ్యాః) మీరును చక్కగా పొందుడు.॥౨౪॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. న్యాయము, వినయములతో గూడ ఎవరు పరోపకారమొనర్చుచుందురో, వారు ఉత్తమోత్తమ జన్మలను, శ్రేష్ఠపదార్థములను, విద్వాంసులగు తల్లిదండ్రులను పొందినవారై విద్వాంసులను సేవించుచు గొప్ప సుఖములను పొందుచున్నారు. అట్టి వారే రాజ్యపరిపాలనకు అర్హులై యుందురు. ॥౨౪॥

24. The learned person, who being highly respected, longs for the eminent position of friends, educated father and mother and the sages, and exceedingly acquires eatables for the donor, deserves to be loved by all.

౧౬౦౧.సమిద్ధ ఇత్యస్య జమదగ్నిర్ఋషిః, విద్వాన్ దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

ధార్మికాః కిం కుర్వన్తీత్యాహ. ధార్మికు లేమి చేయవలయునను విషయము.

౧౬౦౧ సమిద్ధోఽఅద్య మనుషో దురోణే దేవో దేవాన్యజసి జాతవేదః ।

ఆ చ వహ మిత్రమహశ్చికిత్వాన్త్వం దూతః కవిరసి ప్రచేతాః ॥౧॥

**ప.వి:-** సమిద్ధ ఇతి సమ్ + ఇద్ధః, అద్య, మనుషః, దురోణే, దేవః, దేవాన్, యజసి, జాతవేద ఇతి జాత+వేదః, ఆ, చ, వహ, మిత్రమహ ఇతి మిత్ర+మహః, చికిత్వాన్, త్వమ్, దూతః, కవిః, అసి, ప్రచేతా ఇతి ప్ర+చేతాః.॥౧॥

పదార్థః :- (సమిద్ధః) సమ్యక్ ప్రకాశితః (అద్య) ఇదానీమ్ (మనుషః) మననశీలః (దురోణే) గృహే (దేవః) విద్వాన్ (దేవాన్) విదుషో దివ్యగుణాన్ వా (యజసి) జఙ్గచ్ఛసే (జాతవేదః) ప్రాప్తప్రజ్ఞ (ఆ) (చ) (వహ) ప్రాప్నుహి (మిత్రమహః) మిత్రాణి మహయతి పూజయతి తత్సంబుద్ధౌ (చికిత్వాన్) విజ్ఞానవాన్ (త్వమ్) (దూతః) యో దునోతి తాపయతి దుష్టాన్సః (కవిః) క్రాన్తప్రజ్ఞో మేధావీ (అసి) (ప్రచేతాః) ప్రకృష్టశ్చేతః సంజ్ఞానమస్య సః.॥౧॥

అన్వయః :-హే జాతవేదో మిత్రమహో విద్వం స్త్వమద్య సమిద్ధోఽగ్నిరివ మనుషో దేవః సన్ యజసి చికిత్వాన్దూతః ప్రచేతాః కవిర్దురోణేఽసి స త్వం దేవాంశ్చావహ. ॥౧॥

భావార్థః :-యథాఽగ్నిర్దీపాదిరూపేణ గృహాణి ప్రకాశయతి తథా ధార్మికా విద్వాంసః స్వాని కులాని ప్రదీపయన్తి. యే సర్వైః సహ మిత్రవద్వర్తన్తే త ఏవ ధార్మికాః సన్తి ॥౧॥

పదార్థము :-(జాతవేదః) ఉత్తమవిద్యలను పొందినట్టి (మిత్రమహః) మిత్రులను సత్కరించు విద్వాంసుడా! ఏ (త్వమ్) నీవు (అద్య) ఈ సమయమున (సమిద్ధః) చక్కగా ప్రకాశించు అగ్నివలె (మనుషః) మననశీలుడవు (దేవః) విద్వాంసుడవునై (యజసి) సంగతి యొనర్చుచున్నావో (చ) మరియు (చికిత్వాన్) విజ్ఞానవంతుడవు (దూతః) దుష్టులకు దుఃఖములను గలిగించువాడవు (ప్రచేతాః) ఉత్తమచైతన్యము గల(కవిః) సర్వవిషయములందును సాటిలేని బుద్ధి గలిగినవాడవై (అసి) ఉన్నావు. అట్టి నీవు (దురోణే) గృహమందు (దేవాన్) విద్వాంసులను లేక ఉత్తమ గుణములను (ఆ,వహ) చక్కగా పొందుము.॥౧॥

భావార్థము:- అగ్ని, దీపము యున్నగు వాని రూపములో గృహముల నెట్లు ప్రకాశితమొనర్చు చున్నదియో, అదేవిధముగ ధార్మిక విద్వాంసులు తమ వంశములను ప్రకాశపరచెదరు. అందరియెడల మిత్రులవలె వర్తించువారు ధర్మాత్ములైయుండెదరు. ॥౨౫॥

25. O wise person, respecter of friends, thou, this day, kindled like the illuminated fire, walkest in their company, as rellective, literary person. Rich in intellect, tormentor of the wicked, highly conscious, possessing unobstructed knowledge of all subjects, cultivate fully noble vitues in the house!

౧౬౦౨. తనూనపాదిత్యస్య జమదగ్నిర్ఋషిః, విద్వాన్ దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౬౦౨ తనూనపాత్పథ ఋతస్య యానాన్మధ్వా సమఞ్జన్త్స్వదయా సుజిహ్వ।
మన్మాని ధీభిరుత యజ్ఞమృన్ధన్దేవత్రా చ కృణుహ్యధ్వరం నః ॥౨౬॥

ప.వి:- తనూనపాదితి తనూ+నపాత్, పథః, ఋతస్య, యానాన్, మధ్వా, సమఞ్జన్నితి సమ్+అఞ్జన్, స్వదయ, సుజిహ్వేతి సు+జిహ్వ, మన్మాని, ధీభిః, ఉత, యజ్ఞమ్, ఋన్ధన్, దేవత్రేతి దేవ+త్రా, చ, కృణుహి, అధ్వరమ్, నః.॥౨౬॥

పదార్థః :- (తనూనపాత్) యస్తనూర్విస్తృతాన్ పదార్థాన్ న పాతయతి తత్సమ్బుద్ధౌ (పథః) (ఋతస్య) సత్యస్య జలస్య వా (యానాన్) యాంతి యేషు తాన్ (మధ్వా) మాధుర్యేణ (సమఞ్జన్) సమ్యక్ ప్రకటీకుర్వన్ (స్వదయ) ఆస్వాదయ. అత్ర సంహితాయామితి దీర్ఘః. (సుజిహ్వ) శోభనా జిహ్వా వాగ్వా యస్య తత్సమ్బుద్ధౌ (మన్మాని) యానాని (ధీభిః) ప్రజ్ఞాభిః కర్మభిర్వా (ఉత) అపి (యజ్ఞమ్) సఙ్గమనీయం వ్యవహారమ్ (ఋన్ధన్) సంసాధయన్ (దేవత్రా) దేవేషు విద్వత్సు స్థిత్వా (చ) (కృణుహి) కురు (అధ్వరమ్) అహింసనీయమ్ (నః) అస్మాకమ్.॥౨౬॥

అన్వయః :- హే సుజిహ్వ తనూనపాత్! త్వమృతస్య యానాన్పథోఽగ్నిరివ మధ్వా సమఞ్జన్స్వదయ ధీభిర్మన్మాన్యుత నోఽధ్వరం యజ్ఞమృన్ధన్దేవత్రా చ కృణుహి.॥౨౬॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. ధార్మికైర్మనుష్యైః పథ్యౌషధసేవనేన

సుప్రకాశితైర్భవితవ్యమ్. ఆప్తేషు విద్వత్సు స్థిత్వా ప్రజ్ఞాః ప్రాప్యాహింసాఖ్యో ధర్మః సేవితవ్యః.॥౨౬॥

**పదార్థము** :-(సుజిహ్వ) చక్కని జిహ్వ లేక వాణితో గూడిన (తనూనపాత్) విస్తారమగు పదార్థములను పారవేయునట్టి విద్వాంసుడా! నీవు (ఋతస్య) సత్యము లేక జలమునందు (యానాన్) నడచునట్టి (పథః) మార్గములను అగ్నివలె (మధ్వా) మాధుర్యము, అనగా కోమల భావనుచే (సమఞ్జన్) ఉత్తమముగా నొనర్చుచు (స్వదయ) ఆస్వాదించుము, అనగా ప్రసన్నపరచుము (ధీభిః) బుద్ధిచే లేక కర్మలచే (మన్మాని) యానములను (ఉత) మరియు (నః) మాయొక్క (అధ్వరమ్) నష్టపరచరాని మరియు (యజ్ఞమ్) సంగతమొనర్పదగిన వ్యవహారము లను (ఋన్ధన్) చక్కగా సాధించుచు (చ) కూడ (దేవత్రా) విద్వాంసులయందు స్థితిమంతుడవై (కృణుహి) చేయుచుండుము. ॥౨౬॥

**భావార్థము** :-ధర్మాత్ములగు వారు పథ్యకర ఔషధపదార్థములను సేవించి శ్రేష్ఠులుగ రాణించవలెను. ఆప్తవిద్వాంసుల సేవలు చక్కగా నొనర్చుచుండవలయును. చక్కని బుద్ధులను పొంది అహింసారూపధర్మమును సేవించవలయును. ॥౨౬॥

26. O fair -tongued, preserver of various objects, make pleasant for all, the commendable paths of rectitude, with thy sweet sermon and excellent exposition. Develop the society and philosophical subjects with thy holy thoughts, and strengthen our innocuous worship through learned persons!.

౧౯౦౩.నరాశంసస్యేత్యస్య జగదిగ్నిర్ఋషిః, విద్వాన్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవత స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౯౦౩ నరాశంసస్య మహిమానమేషాముప స్తోషామ యజతస్య యజ్ఞైః।
యే సుక్రతవః శుచయో ధియన్ధాః స్వదన్తి దేవా ఉభయాని హవ్యా ॥౨౭॥

ప.వి:- నరాశంసస్య, మహిమానమ్, ఏషామ్, ఉప, స్తోషామ, యజతస్య, యజ్ఞైః, యే, సుక్రతవ ఇతి సు+క్రతవః, శుచయః, ధియన్ధా ఇతి ధియమ్+ధాః, స్వదన్తి, దేవాః, ఉభయాని, హవ్యా.॥౨౭॥

**పదార్థః** :-(నరాశంసస్య) నరైః ప్రశంసితస్య (మహిమానమ్) మహత్త్వమ్ (ఏషామ్) (ఉప) (స్తోషామ్) ప్రశంసేమ. లేట్ ఉత్తమబహువచనే రూపమ్.(యజతస్య) సఙ్గన్తుం

యోగ్యస్య (యజ్ఞైః) సఙ్గాదిలక్షణైః (యే) (సుక్రతవః) శోభనప్రజ్ఞాకర్మాణః (శుచయః) పవిత్రాః (ధియన్ధాః) యే శ్రేష్ఠాం ప్రజ్ఞాముత్తమం కర్మ దధతి తే (స్వదన్తి) భుఞ్జతే (దేవాః) విద్వాంసః (ఉభయాని) శరీరాత్మ సుఖకరాణి (హవ్యా) హవ్యాని అత్తుమర్హాణి. ॥౨౭॥

అన్వయః :- హే మనుష్యా యథా వయం యే సుక్రతవః శుచయో ధియన్ధా దేవా ఉభయాని హవ్యా స్వదన్త్యేషాం యజ్ఞైర్నరాశంసస్య యజతస్య వ్యవహారస్య మహిమానముప స్తోషామ తథా యూయమపి కురుత. ॥౨౭॥

భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే స్వయం శుద్ధాః ప్రాజ్ఞా వేదశాస్త్రవిదో న భవన్తి తేఽన్యాన పి విదుషః పవిత్రాన్కర్తుం న శక్నువన్తి. యేషాం యాదృశా గుణా యాదృశాని కార్మాణి స్యుస్తాని ధర్మాత్మభిర్యథావత్ప్రశంసితవ్యాని. ॥౨౭॥

పదార్థము :- ఓ మానవులారా! మే మెట్లు (యే) ఏ (సుక్రతవః) శ్రేష్ఠమగు బుద్ధులు మరియు కర్మలు గల (శుచయః) పవిత్రమగు (ధియన్ధాః) శ్రేష్ఠమగు ధారణవతి యగు బుద్ధి మరియు కర్మను ధారణ మొనర్చునట్టి (దేవాః) విద్వాంసులు (ఉభయాని) శరీరము మరియు ఆత్మ రెండింటికి సుఖమును గలిగించు (హవ్యా) భుజించదగిన పదార్థములను (స్వదన్తి) భుజింతుమో (ఏషామ్) ఈ విద్వాంసుల (యజ్ఞైః) సత్సంగము అనెడి యజ్ఞములచే (నరాశంసస్య) మనుష్యులచే ప్రశంసనీయ (యజతస్య) సంగతియొనర్పదగిన వ్యవహారముల (మహిమానమ్) గొప్పదనమును (ఉపస్తోషామ్) సమీపమున ప్రశంసింతుమో, అట్లే మీరును నొనర్చుచుండుడు. ॥౨౭॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. స్వయముగా ఎవరు పవిత్రులు, బుద్ధిశాలురు, వేదశాస్త్రవేత్తలు నై యుండరో, వారు ఇతరులను విద్వాంసులు, పవిత్రులుగ నొనర్పజాలరు. ఎవని గుణ కర్మ స్వభావములు ఎట్లుండునో వానిని ధర్మాత్ములు యథార్థముగ ప్రశంసించవలెను. ॥౨౭॥

27. To these the pure, the most wise, the though - inspiring learned persons, who enjoy good conducive both to body and soul, who are worthy of veneration, respected by the people, and full of greatness, we offer admiration with deeds of devotion.

౧౬౦౪. ఆజుహ్వాన ఇత్యస్య జమదగ్నిర్ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడ్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౬౦౪ ఆజుహ్వానఽఈడ్యో వన్ద్యశ్చాయాహ్యగ్నే వసుభిః సజోషాః। త్వం దేవానామసి యహ్వ హోతా సఽఏనాన్యక్షీషితో యజీయాన్॥౨౮॥

ప.వి:- ఆజుహ్వాన ఇత్యా+జుహ్వానః, ఈడ్యః, వన్ద్యః, చ, ఆ, యాహి, అగ్నే, వసుభిరితి వసు+భిః సజోషా ఇతి స+జోషాః, త్వమ్, దేవానామ్, అసి, యహ్వ, హోతా, సః, ఏనాన్, యక్షి, ఇషితః, యజీయాన్ ॥౨౮॥

పదార్థః:-(ఆజుహ్వానః) సమన్తాత్ స్పర్ధమానః (ఈడ్యః) ప్రశంసితుం యోగ్యః (వన్ద్యః) నమస్కరణీయః (చ) (ఆ) (యాహి) ఆగచ్ఛ (అగ్నే) పావకవత్పవిత్ర విద్వన్! (వసుభిః) వాసహేతుభూతైర్విద్వద్భిస్సహ (సజోషాః) సమానప్రీతిసేవినః (త్వమ్) (దేవానామ్) విదుషామ్ (అసి) (యహ్వ) మహాగుణవిశిష్ట. యహ్వ ఇతి మహన్నామ...నిఘం. 3.3. (హోతా) దాతా (సః) (ఏనాన్) (యక్షి) సఙ్గచ్ఛ (ఇషితః) ప్రేరితః (యజీయాన్) అతిశయేన యష్టా సంగన్తా.॥౨౮॥

అన్వయః :- హే యహ్వాగ్నే! యస్త్వం దేవానాం హోతా యజీయానసి. ఇషితః సన్నేనాన్ యక్షి స త్వం వసుభిః సహ సజోషా ఆజుహ్వాన ఈడ్యో వన్ద్యశ్చైతానాయాహి.॥౨౮॥

భావార్థః :- యది మనుష్యాః పవిత్రాత్మానాం ప్రశంసితానాం విదుషాం సఙ్గేన స్వయం పవిత్రాత్మానో భవేయుస్తర్హి ధర్మాత్మానః సన్తః సర్వత్ర సత్కృతాః స్యుః.॥౨౮॥

పదార్థము :- (యహ్వ) మహా ఉత్తమగుణములతో గూడిన (అగ్నే) అగ్నివలె పవిత్రశాలివగు ఓ విద్వాంసుడా! ఏ (త్వమ్) నీవు (దేవానామ్) విద్వాంసులందు (హోతా) దానశీలుడవు (యజీయాన్) అతిగా కలిసియుండువాడవై (అసి) ఉన్నావో అట్టి (ఇషితః) ప్రేరణ మొనర్చబడిన (ఏనాన్) ఈ విద్వాంసుల (యక్షి) సాంగత్యమొనర్చుము (సః) అయితే నీవు (వసుభిః) నివసించుటకు హేతువగు విద్వాంసులతో గూడ (సజోషాః) సమానమగు ప్రీతిని నిర్వహించువారు (ఆజుహ్వానః) స్పర్ధ, ఈర్ష్యలు లేని (ఈడ్యః) ప్రశంసనీయులు (చ) మరియు (వన్ద్యః) నమస్కరించదగిన ఈ విద్వాంసుల వద్దకు (ఆ,యాహి) వచ్చుచు నుండుము.॥౨౮॥

**భావార్థము** :- ఏ మానవులు, పవిత్రాత్ములు ప్రశంసితులగు విద్వాంసుల సాంగత్యముచే స్వయముగా పవిత్రాత్ములైనచో వారు సర్వత్ర సత్కారమును పొందగలరు. ॥౨౮॥

28. O learned person, full of noble qualities, amongst scholars, thou art charitable and companionable. Walk in the company of these prompt scholars. Being lovely towards the learned, deserving praise and adoration, go near them!.

౧౬౦౨౯. ప్రాచీనమిత్యస్య జమదగ్నిర్ఋషిః, అన్తరిక్షం దేవతా, భురిక్ పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౬.౦౪ ప్రాచీనం బర్హిః ప్రదిశా పృథివ్యా వస్తోరస్యా వృజ్యతేఽఅగ్రేఽఅహ్నామ్।
వ్యు ప్రథతే వితరం వరీయో దేవేభ్యోఽఅదితయే స్యోనమ్॥౪॥

ప.వి:- ప్రాచీనమ్, బర్హిః, ప్రదిశేతి ప్ర+దిశా, పృథివ్యాః, వస్తోః, అస్యాః, వృజ్యతే, అగ్రే, అహ్నామ్, వి. ఊఀ ఇత్యూఀ, ప్రథతే, వితరమితి వి+తరమ్, వరీయః, దేవేభ్యః, అదితయే, స్యోనమ్.॥౪॥

పదార్థః :-(ప్రాచీనమ్) ప్రాక్తనమ్ (బర్హిః) అన్తరిక్షవద్ వ్యాపకం బ్రహ్మ (ప్రదిశా) ప్రకృష్టయా దిశా నిర్దేశేన (పృథివ్యాః) భూమేః (వస్తోః) దినాత్ (అస్యాః) (వృజ్యతే) త్యజ్యతే (అగ్రే) ప్రాతఃసమయే (అహ్నామ్) దినానామ్ (వి) (ఉ) (ప్రథతే) ప్రకటయతి (వితరమ్) విశేషేణ సన్తారకమ్ (వరీయః) అతిశయేన వరణీయం వరమ్ (దేవేభ్యః) విద్వద్భ్యః (అదితయే) అవినాశినే (స్యోనమ్) సుఖమ్. ॥౪॥

అన్వయః :-హే మనుష్యాః! యదస్యాః పృథివ్యా మధ్యే ప్రాచీనం బర్హిర్వస్తోర్వృజ్యతే అహ్నామగ్రే దేవేభ్య ఉ అదితయే వితరం వరీయః స్యోనం విప్రథతే తదస్మాభిః ప్రదిశా విజానీత ప్రాప్నుత చ. ॥౪॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే విద్వద్భ్యః సుఖం దదత్యస్తే సర్వోత్తమం సుఖం లభేరన్! యథాఽఽకాశం సర్వాసు దిక్షు పృథివ్యాదిషు చ వ్యాప్తమస్తి తథా జగదీశ్వరః సర్వత్ర వ్యాప్తోఽస్తి యే తమీదృశం పరమాత్మానం ప్రాతరుపాసతే తే ధర్మాత్మానః సన్తో విస్తీర్ణసుఖా జాయన్తే.॥౪॥

పదార్థము :- ఓ మానవులారా! ఎయ్యది (అస్యాః) ఈ (పృథివ్యాః) భూమిపైన (ప్రాచీనమ్) సనాతనము (బర్హిః) అంతరిక్షము వంటి వ్యాపకుడగు బ్రహ్మ (వస్తోః) పగటి ప్రకాశమునందు (వృజ్యతే) వేరగుచు (అహ్నామ్) దినముల (అగ్రే,) ప్రారంభము ప్రాతఃకాలమందు (దేవేభ్యః) విద్వాంసుల (ఉ) మరియు (అదితయే) అవినాశి యగు ఆత్మకొరకు (వితరమ్) విశేషించి దుఃఖములనుండి తరింపజేయునట్టి (వరీయః) అతిశ్రేష్ఠమగు (స్యోనమ్) సుఖములను (వి,ప్రథతే) విశేషించి ప్రకట మొనర్చునో దానిని మీరు (ప్రదిశా) వేదశాస్త్రముల నిర్దేశముతో తెలిసికొనుడు మరియు ప్రాప్తి జేసికొనుడు.॥౪॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులకు సుఖముల నొసగు వారు సర్వోత్తమ సుఖములను పొందగలరు. ఎట్లు ఆకాశము సర్వదిశలందును మరియు

పృథివ్యాదులందును వ్యాప్తమై యున్నదో అట్లే జగదీశ్వరుడు సర్వత్రా వ్యాప్తమైయున్నాడు. ఇట్టి పరమేశ్వరు నెవరు ప్రాతః సాయంకాలములందు ఉపాసించెదరో వారు ధర్మాత్ములై విశేష సుఖములందు విహరించు వారగుదురు. ॥౨౯॥

29. O men, in this world, the immortal God, All - pervading like space, beyond the light of day, early in the morning before dawn, grants to the learned and immortal soul happiness that removes miseries and is most excellent. Know and realise Him following the instructions of the vedas!

౧౬౦౬.వ్యచస్వతీరిత్యస్య జమదగ్నిర్ఋషిః, స్త్రియో దేవతాః, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః స్త్రీపురుషౌ కిం కుర్యాతామిత్యాహ.

మరల స్త్రీపురుషు లేమి చేయవలయునను విషయము.

౧౬౦౬ వ్యచస్వతీరుర్వియా విశ్రయన్తాం పతిభ్యో న జనయః శుమ్భమానాః।

దేవీర్ద్వారో బృహతీర్విశ్వమిన్వా దేవేభ్యో భవత సుప్రాయణాః॥30॥

ప.వి:- వ్యచస్వతీః, ఉర్వియా, వి, శ్రయన్తామ్, పతిభ్య ఇతి పతి+భ్యః, న, జనయః, శుమ్భమానాః, దేవీః, ద్వారః, బృహతీః, విశ్వమిన్వా ఇతి విశ్వమ్+ ఇన్వాః, దేవేభ్యః, భవత, సుప్రాయణాః, సుప్రాయనా ఇతి సు+ప్రాయనాః.॥30॥

పదార్థః :-(వ్యచస్వతీః) శుభగుణేషు వ్యాప్తివంతీః (ఉర్వియా) బహుత్వేన (వి) (శ్రయన్తామ్) సేవన్తామ్ (పతిభ్యః) గృహీతపాణిభ్యః (న) ఇవ (జనయః) జాయాః (శుమ్భమానాః) సుశోభాయుక్తాః (దేవీః) దేదీప్యమానాః (ద్వారః) ద్వారోఽవకాశరూపాః (బృహతీః) మహతీః (విశ్వమిన్వాః) విశ్వవ్యవహారవ్యాపిన్యః (దేవేభ్యః) దివ్యగుణేభ్యః (భవత) (సుప్రాయణాః) సుష్ఠుప్రకృష్టమయనం గృహం యాసు తాః.॥30॥

అన్వయః :-హే మనుష్యాః! యథా ఉర్వియా వ్యచస్వతీర్బృహతీర్విశ్వమిన్వాః సుప్రాయణా దేవీర్ద్వారో నేవ పతిభ్యో దేవేభ్యః శుమ్భమానా జనయః సర్వాన్ స్వస్వపతీన్ విశ్రయన్తాం తథా యూయం సర్వవిద్యాసు వ్యాపకా భవత.॥30॥

భావార్థః :- అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యథా వ్యాపికా దిశోఽవకాశప్రదానేన

**సర్వేషాం వ్యవహారసాధకత్వేనావన్దప్రదాః సన్తి తథైవ పరస్పరస్మిన్ప్రీతాః స్త్రీపురుషా దివ్యాని సుఖాని లబ్ధ్వాఽన్యేషాం హితకరాః స్యుః ॥30॥**

**పదార్థము :-** ఓ మానవులారా! ఎట్లు (ఉర్వియా) ఉత్తమ గుణములందాధిక్యతగల (వ్యచస్వతీః) వ్యాప్తిగల (బృహతీః) మహా (విశ్వమిన్వాః) సమస్త వ్యవహారములందు వ్యాప్తమైన (సుప్రాయణాః) ఉత్తమ గృహములు గలిగిన (దేవీః) ఆభూషణములచే ప్రకాశించు (ద్వారః) ద్వారములకు (న) సమముగు అవకాశముగల (పతిభ్యః) పాణిగ్రహణముచే వివాహమొనర్చుకొనిన (దేవేభ్యః) ఉత్తమ గుణవంతులగు పతులకొరకు (శుమ్భమానాః) ఉత్తమ శోభావంతముగ (జనయః) సమస్త మహిళారత్నములు తమతమ పతులను (వి, శ్రయన్తామ్) విశేషముగ సేవింతురో అట్లే మీరును సమస్త విద్యలందు వ్యాపకులు (భవత) అగుడు. ॥30॥

**భావార్థము :-** ఈ మంత్రమున ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఏ విధముగా వ్యాపకమైయున్న దిశలు అవకాశమిచ్చునవి మరియు అన్నిటి వ్యవహారములకు సాధకములగుటచే ఆనందమునిచ్చునవి యగుచున్నవియో అదేవిధముగ పరస్పరము ప్రసన్నముగ నుండు సతీపతులు ఇతరులకును హితకారులుగా నుండుట శ్రేయస్కరము. ॥30॥

30. O men, learn all sciences, just as wives, highly cultured and virtuous, well experienced in all domestic dealings, dwellers in nice houses, decorated with ornaments, tall like doors, deck their beauty for their noble husbands, and serve them!.

౧౬౦౭. ఆ సుష్వయన్తీత్యస్య జమదగ్నిర్ఋషిః, స్త్రియో దేవతాః, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజప్రజా ధర్మమాహ. ఇపుడు రాజప్రజాధర్మవిషయము.

**౧౬౦౭ ఆ సుష్వయన్తీ యజతేఽఉపాకేఽఉషాసానక్తా సదతాం ని యోనౌ ।**

**దివ్యే యోషణే బృహతీ సురుక్మేఽఅధి శ్రియꣳ శుక్రపిశం దధానే ॥౩౧॥**

**ప.వి:-** ఆ, సుష్వయన్తీ, సుష్వయన్తీ ఇతి సు+స్వయన్తీ, యజతే ఇతి యజతే, ఉపాకే+ఇత్యుపాకే, ఉషాసానక్తా, ఉషసానక్తేత్యుషసానక్తా, సదతామ్, ని, యోనౌ, దివ్యేఽఇతి దివ్యే, యోషణేఽఇతి యోషణే, బృహతీఽఇతి బృహతీ, సురుక్మే ఇతి సు+రుక్మే, అధి, శ్రియమ్, శుక్రపిశమితి శుక్ర+పిశమ్, దధానే ఇతి దధానే. ॥౩౧॥

ఏవ (జాతః) ప్రసిద్ధః (సః) (జనిష్యమాణః) ప్రసిద్ధిం ప్రాప్స్యమానః (ప్రత్యఙ్) ప్రతిపదార్థమఞ్చతి ప్రాప్నోతి (జనాః) విద్వాంసః (తిష్ఠతి) వర్తతే (సర్వతోముఖః) సర్వతో ముఖాద్యవయవా యస్య సః. ॥౪॥

అన్వయః :- హే జనాః! ఏషో హ దేవః సర్వాః ప్రదిశోఽనువ్యాప్య స ఉ గర్భేఽన్తః పూర్వో హ జాతః, స ఏవ జాతః, స జనిష్యమాణః, సర్వతోముఖః ప్రత్యఙ్ తిష్ఠతి, స యుష్మాభి రుపాసనీయో వేదితవ్యశ్చ॥౪॥

భావార్థః :-అయం పూర్వోక్త ఈశ్వరో జగదుత్పాద్య ప్రకాశితః సన్ సర్వాసు దిక్షు వ్యాప్యేన్ద్రియాణ్యన్తరేణ సర్వేన్ద్రియకర్మాణి సర్వగతత్వేన కుర్వన్ సర్వప్రాణినాం హృదయే తిష్ఠతి సోఽతీతానాగతేషు కల్పేషు జగదుత్పాదనాయ పూర్వం ప్రకటో భవతి, స ధ్యానశీలేన మనుష్యేణ జ్ఞాతవ్యో నాన్యేనేతి భావః ॥౪॥

పదార్థము :- (జనాః) విద్వాంసులారా! (ఏషః) ఈ (హ) ప్రసిద్ధుడగు పరమేశ్వరుడు (దేవః) ఉత్తమ స్వరూపుడు (సర్వాః) అన్నిదిశలు మరియు (ప్రదిశః) విదిశలలో (అను) అనుకూలత్వముతో వ్యాప్తమైనవాడు (సః, ఉ,) ఆతడే (గర్భే) అంతఃకరణము (అన్తః) లోపల (పూర్వః) ప్రథమ కల్పముయొక్క ఆదియందు (హ) యున్నవాడు (జాతః) ప్రసిద్ధుడైనవాడు (సః, ఏవ) ఆతడే (జాతః) ప్రసిద్ధుడైనవాడు (సః) ఆతడు (జనిష్యమాణః) ఆగామి కల్పములందును ప్రథమమున ప్రసిద్ధిని పొందగలడు (సర్వతోముఖః) అన్నివైపులనుండి ముఖము మున్నగు అవయవములకార్యముగలవాడు, అనగా ముఖము మున్నగు ఇంద్రియముల కార్యములు సర్వత్రమొనర్చువాడు (ప్రత్యఙ్) సకలపదార్థములను పొందువాడు (తిష్ఠతి) అచలుడు, సర్వత్ర స్థిరమైనవాడునై యున్నాడు ఆతడే మనందరకును ఉపాసించుటకు, తెలిసికొనుటకు యోగ్యుడై యున్నాడు.॥౪॥

భావార్థము :- ఈ పూర్వోక్త పరమేశ్వరుడు ప్రపంచము నుత్పన్నమొనర్చి, ప్రకాశితుడై సకల దిశలందు వ్యాపకుడై సర్వత్రవ్యాప్తుడై యుండుటచే ఇంద్రియములు లేకయే సకలేంద్రియముల కార్యములు ఒనరచుచుండును. సర్వప్రాణుల హృదయములందును స్థిరమై యున్నాడు. ఆతడు భూత, భవిష్యత్కాల్పములందు జగదుత్పత్తికన్న మొదటనే ప్రకటితుడై యున్నాడు. ఆతడు ధ్యానశీలురైన వారికి మాత్రమే తెలిసికొనదగినవాడు. కాని ఇతరులకు కాడు.॥౪॥

4. O learned person, this very God pervadeth all regions. He was present in the minds of all in the last cycle of creation; He is present now, and will be present in future cycles. He exists, controlling everything, with His power of facing all directions!.

౧౬౬౫. యస్మాదిత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమేశ్వరో దేవతా, భురిక్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౬౫౫॥ యస్మాజ్జాతం న పురా కిఞ్చనైవ య ఆబభూవ భువనాని విశ్వా ।
ప్రజాపతిః ప్రజయా సꣳరరాణస్త్రీణి జ్యోతీꣳషి సచతే స షోడశీ ॥౫॥

ప.వి:- యస్మాత్, జాతమ్, న, పురా, కిమ్, చన, ఏవ, యః, ఆబభూవేత్యా + బభూవ, భువనాని, విశ్వా, ప్రజాపతిరితి ప్రజా + పతిః, ప్రజయా, సꣳరరాణ ఇతి సమ్ + రరాణః, త్రీణి, జ్యోతీꣳషి, సచతే, సః షోడశీ.॥౫॥

పదార్థః :- (యస్మాత్) పరమేశ్వరాత్ (జాతమ్) ఉత్పన్నమ్ (న) నిషేధే (పురా) పురస్తాత్ (కిమ్) (చన) కిఞ్చిదపి (ఏవ) (యః) (ఆ బభూవ) సమన్తాద్భవతి (భువనాని) లోకజాతాని సర్వాఽధికరణాని (విశ్వా) సర్వాణి (ప్రజాపతిః) ప్రజాయాః పాలకోఽధిష్ఠాతా (ప్రజయా) ప్రజాతయా (సమ్) (రరాణః) సమ్యక్ రమమాణః (త్రీణి) విద్యుత్సూర్యచన్ద్రరూపాణి (జ్యోతీంషి) తేజోమయాని ప్రకాశకాని (సచతే) సమవైతి (సః) (షోడశీ) షోడశ కలా యస్మిన్ సన్తి సః.॥౫॥

అన్వయః :- హే మనుష్యాః! యస్మాత్ పురా కిఞ్చన న జాతం, యస్సర్వత ఆబభూవ, యస్మిన్ విశ్వా భువనాని వర్తన్తే, స ఏవ షోడశీ ప్రజయా సహ సంరరాణః ప్రజాపతిస్త్రీణి జ్యోతీంషి సచతే.॥౫॥

భావార్థః :- యస్మాదీశ్వరోఽనాదిర్వర్తతే తతస్తస్మాత్పూర్వం కిమపి భవితున్న శక్యమ్. స ఏవ సర్వాసు ప్రజాసు వ్యాప్తో జీవానాం కర్మాణి పశ్యన్ సంస్తదనుకూలఫలం దదన్న్యాయం కరోతి, యేన ప్రాణాదీని షోడశ వస్తూని సృష్టాన్యతః స షోడశీత్యుచ్యతే. ప్రాణః, శ్రద్ధాఽకాశం, వాయురగ్నిర్జలం, పృథివీన్ద్రియం మనోఽన్నం, వీర్యం, తపో, మన్త్రః, కర్మ, లోకాః నామ చ షోడశ కలాః. ప్రశ్నోపనిషది షష్ఠే ప్రశ్నే వర్ణితాః ఏతత్సర్వం షోడశాత్మకం జగత్ పరమాత్మని వర్తతే తేనైవ నిర్మితం పాల్యతే చ.॥౫॥

**పదార్థము** :- ఓ మానవులారా! (యస్మాత్) ఏ పరమేశ్వరునకు (పురా) పూర్వము (కిమ్, చన) ఏదియును (న జాతమ్) ఉత్పన్నము కానప్పుడును (యః) ఎవడన్ని దిశలందు (ఆబభూవ) చక్కగా వర్తమానుడైయున్నాడో, ఎవనియందు (విశ్వా) సకల (భువనాని) పదార్థముల కాధారములగు సకలలోకములు వెలయుచున్నవియో (సః, ఏవ) ఆతడే (షోడశీ) పదహారు కళలుగల (ప్రజయా) ప్రజలతో గూడ (సమ్,

రరాణః) చక్కగా రమణ మొనర్చుచు (ప్రజాపతిః) ప్రజారక్షకుడు, అధిష్ఠాతయునై (త్రీణి) మూడు (జ్యోతీంషి) తేజోమయ సూర్యచంద్ర విద్యుద్రూప ప్రకాశ జ్యోతులను (సచతే) సంయుక్తపరచును. ॥౫॥

**భావార్థము :-** పరమేశ్వరు డనాది యగు కారణమున ఆతనికన్న పూర్వమెద్దియును ఉండజాలదు. ఆతడే సర్వప్రజలందు వ్యాప్తమై జీవులకర్మలను జూచుచు వానికి తగిన ఫలములు నిచ్చుచు న్యాయము గలిగించుచుండును. ప్రాణము మున్నగు పదునారు (షోడశ) వస్తువులను రచించుటచే నాతడు ''షోడశీ'' యని పించుకొనును. ఆ షోడశ వస్తువులివి. ॥౫॥

''ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, ఇంద్రియములు, మనస్సు, అన్నము, వీర్యము, తపము, మంత్రము, కర్మ, లోకము, నామము'' అనునవి. ఈ షోడశ కళలు ప్రశ్నోపనిషత్తునందును గలవు. ఈ సమస్త షోడశ వస్తురూప జగత్తంతయు పరమాత్మయందు గలదు. ఆతడే దానిని నిర్మించినాడు. మరియు నాతడే పాలించుచున్నాడు. ॥౫॥

5. Before Whom, naught whatever sprang to being; Who with His presence aids all creatures. God, the Guardian of His subjects, rejoicing in His offspring, maintains the three great Lustres. He is Shodashi.

౧౬౹౬. యేనేత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, నిచృత్ త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౬౹౬ యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేన నాకః ।

యో అన్తరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥౬॥

ప.వి:- యేన, ద్యౌః, ఉగ్రా, పృథివీ, చ, దృఢా, యేన, స్వరితి స్వః, స్తభితమ్, యేన, నాకః, యః, అన్తరిక్షే, రజసః, విమాన ఇతి వి + మానః, కస్మై, దేవాయ, హవిషా, విధేమ ॥౬॥

పదార్థః :-(యేన) జగదీశ్వరేణ (ద్యౌః) సూర్యాదిప్రకాశవాన్ పదార్థః (ఉగ్రా) తీవ్రతేజస్కా (పృథివీ) భూమిః (చ) (దృఢా) దృఢీకృతా (యేన) (స్వః) సుఖమ్ (స్తభితమ్) ధృతమ్ (యేన) (నాకః) అవిద్యమానదుఃఖో మోక్షః (యః) (అన్తరిక్షే) మధ్యవర్త్యాకాశే (రజసః) లోకసమూహస్య. లోకారజాంస్యుచ్యన్త ఇతి నిరుక్తమ్. (విమానః) వివిధం మానం యస్మిన్ సః (కస్మై) సుఖస్వరూపాయ (దేవాయ) స్వప్రకాశాయ సకలసుఖదాత్రే (హవిషా) ప్రేమభక్తిభావేన (విధేమ) పరిచరేమ ప్రాప్నుయామ వా. ॥౬॥

అన్వయః :- హే మనుష్యాః! యేనోగ్రా ద్యౌః పృథివీ చ దృఢా, యేన స్వః స్తభితం, యేన నాకః స్తభితో యోఽన్తరిక్షే వర్తమానస్య రజసో విమానోఽస్తి, తస్మై కస్మై దేవాయ వయం హవిషా విధేమైవం యూయమప్యేనం సేవధ్వమ్.॥౬॥

భావార్థః :- హే మనుష్యాః! యః సకలస్య జగతో ధర్తా సర్వసుఖప్రదాతా మోక్షసాధక ఆకాశ ఇవ వ్యాప్తః పరమేశ్వరోఽస్తి, తస్యైవ భక్తిం కురుత ॥౬॥

పదార్థము :- ఓ మానవులారా! (యేన) ఏ జగదీశ్వరుడు (ఉగ్రా) తీవ్ర తేజోమయ (ద్యౌః) ప్రకాశయుక్తమగు సూర్యుడు మున్నగు పదార్థములను (చ) మరియు (పృథివీ) భూమిని (దృఢా) దృఢపరచినాడో (యేన) ఎవడు (స్వః) సుఖమును (స్తభితమ్) ధారణమొనర్చినాడో (యేన) ఎవడు (నాకః) సర్వదుఃఖరహితమగు మోక్షధారణమొనర్చినాడో (యః) ఎవడు (అన్తరిక్షే) అంతరిక్షమను ఆకాశమునందు నున్నాడో, (రజసః) లోకసమూహములను (విమానః) అనేకవిధములుగ రక్షించుచుండునో, అట్టి (కస్మై) సుఖస్వరూపుడు (దేవాయ) స్వయంప్రకాశకుడు, సకల సుఖదాతయునగు ఈశ్వరునికై మేము (హవిషా) ప్రేమ, భక్తులతో (విధేమ) సేవకులము లేక ప్రాప్తులము అగుదుముగాక! ఇట్లే అందరును ఆతనినే సేవించవలెను.॥౬॥

భావార్థము :- హే మానవులారా! సకలజగత్తును ధారణమొనర్చువాడు, సకలసుఖములనిచ్చువాడు, ముక్తి ధాముడు, ఆకాశమువలె వ్యాపకుడు నగు ఏ పరమేశ్వరుడు గలడో మన మాతని భక్తినే సలుప వలయును.॥౬॥

6. May we realise with love and devotion, God, the Embodiment of happiness; Who has made the heavens strong, and the beautiful Earth firm, is full of pleasure, and being free from all miseries is all Bliss is the Maker of all worlds in the space.

౧౬౮౭. యం క్రన్దసీత్యస్య స్వయం బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా; స్వరాడతిజగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౬౮౭ యం క్రన్దసీఽఅవసా తస్తభానేఽఅభ్యైక్షేతాం మనసా రేజమానే ।

యత్రాధి సూరఽఉదితో విభాతి కస్మై దేవాయ హవిషా విధేమ ।

ఆపో హ యద్ బృహతీర్యశ్చిదాపః ॥౭॥

ప.వి:- యమ్, క్రన్దసీఽఇతి క్రన్దసీ, అవసా, తస్తభానే ఇతి తస్త + భానే, అభి, ఐక్షేతామ్, మనసా, రేజమానేఽఇతి రేజమానే, యత్ర, అధి, సూరః, ఉదిత ఇత్యుత్ + ఇత, విభాతీతి

వి + భాతి, కస్మై, దేవాయ, హవిషా, విధేమ, ఆపః, హ, యత్, బృహతీః, యః, చిత్, ఆపః.॥౭॥

పదార్థః :- (యమ్) (క్రన్దసీ) గుణైః ప్రశంసనీయే (అవసా) రక్షణాదినా (తస్తభానే) ధారికే (అభి) ఆభిముఖ్యే (ఐక్షేతామ్) ఈక్షేతాం పశ్యతః (మనసా) విజ్ఞానేన (రేజమానే) చలన్త్యౌ భ్రమన్త్యౌ (యత్ర) యస్మిన్ (అధి) ఉపరి (సూరః) సూర్యః (ఉదితః) ఉదయం ప్రాప్తః (విభాతి) విశేషేణ ప్రకాశయన్ ప్రకాశయితా భవతి (కస్మై) సుఖసాధకాయ (దేవాయ) శుద్ధస్వరూపాయ (హవిషా) ఆదాతవ్యేన యోగాభ్యాసేన (విధేమ) (ఆపః) వ్యాప్తాః (హ) కిల (యత్) యాః (బృహతీః) మహత్యః (యః) (చిత్) అపి (ఆపః) ఆకాశః.॥౭॥

అన్వయః :- హే మనుష్యాః! యం పరమాత్మానం ప్రాప్తే తస్తభానే రేజమానే క్రన్దసీ ద్యావాపృథివ్యా వవసా సర్వం ధరతో యత్ర సూరోఽధ్యుదితో, యద్ యా బృహతీరాపో హ యశ్చిదాపః సన్తి తాశ్చిదపి విభాతి, తం తౌ చాఽధ్యాపకోపదేశకౌ మనసా అభ్యైక్షేతాం, తస్మై కస్మై దేవాయ హవిషా వయం విధేమైనం యూయమపి భజత.॥౭॥

భావార్థః :- హే మనుష్యాః! యత్ర సర్వాభివ్యాపకేశ్వరే సూర్యపృథివ్యాదయో లోకా భ్రమన్తః సన్తో దృశ్యన్తే యేన ప్రాణ ఆకాశోఽపి వ్యాప్తస్తం స్వాత్మస్థం యూయముపాసీధ్వమ్.॥౭॥

పదార్థము :- ఓ మానవులారా! (యమ్) ఏ పరమేశ్వరుని ప్రాప్తించునవి అనగా ఆతని అధికారమున నుండునట్టి నీ (తస్తభానే) సమస్తమును ధారణమొనర్చునట్టి (రేజమానే) చలాయమానములగు (క్రన్దసీ) స్వంతగుణములచే ప్రశంసించదగిన సూర్యచంద్ర పృథివీలోకములను (అవసా) రక్షణాదులతో సర్వమును ధారణమొనర్చుచున్నవి (యత్ర) ఏ యీశ్వరునందు (సూరః) సూర్యలోకము (అక్షి, ఉదితః) చక్కగా ఉదయమును పొందుచున్నదో (యత్) ఏది (బృహతీః) మహత్తరమగు (ఆపః) వ్యాప్తమగు ఏ జలముకలదో (హ,యః) నిశ్చితముగ ఏ (చిత్) కూడ (ఆపః) ఆకాశమున్నదో దానినికూడ (విభాతి) విశేషముగ ప్రకాశితమొనర్చుచు ప్రకాశకుడగుచున్నాడో, అట్టి పరమేశ్వరుని అధ్యాపకోపదేశకులు (మనసా) విజ్ఞానముద్వారా (అభి, ఐక్షే, తామ్) అభిముఖులై చూచుచుందురు. అట్టి (కస్మై) సుఖదాతయు (దేవాయ) శుద్ధస్వరూపుడునగు పరమేశ్వరునికై (హవిషా) పొందదగిన యోగాభ్యాసముద్వారా మేము (విధేమ) సేవించువారమగుదుముగాక! ఇదేవిధముగ మీరును ఆతనిని సేవించి సుఖించుడు.॥౭॥

**భావార్థము** :- మానవులారా! అన్నివైపులనుండి ప్రకాశకుడగు పరమేశ్వరునియందు సూర్యుడు, పృథివి మున్నగు లోకముల భ్రమణమొనర్చుచు గాన్పించునో ఎవడు ప్రాణము మరియు ఆకాశమునుకూడ

వ్యాపించియున్నాడో, అట్టి మనయాత్మలందే స్థితుడైయున్న పరమేశ్వరుని మీరు ఉపాసించుడు.॥౭॥

7. Whom, the Sun and Earth, the supporters of all, moving in their orbits, worthy of praise for their virtues, affording shelter to humanity, do acknowledge; in Whom the Sun shines in full; Who shines after manifesting great waters and vast space; Whom the teacher and preacher visualise through intellect; may we through concentration realise Him, who is full of lustre and happiness.

౧౬౮౮. వేన ఇత్యస్య స్వయమ్భు బ్రహ్మ ఋషిః; పరమాత్మా దేవతా; నిచృత్ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౬౮౮ వేనస్తత్పశ్యన్నిహితం గుహా సద్యత్ర విశ్వం భవత్యేకనీడమ్ ।

తస్మిన్నిదꣳ సం చ వి చైతి సర్వꣳ స ఓతః ప్రోతశ్చ విభూః ప్రజాసు ॥౮॥

ప.వి:- వేనః, తత్, పశ్యత్, నిహితమితి ని + హితమ్, గుహా, సత్, యత్ర, విశ్వమ్, భవతి, ఏకనీడమిత్యేక + నీడమ్, తస్మిన్, ఇదమ్, సమ్, చ, వి, చ, ఏతి, సర్వమ్, సః, ఓత ఇత్యా + ఉతః, ప్రోత ఇతి ప్ర + ఉతః, చ, విభూరితి వి + భూః, ప్రజాస్వితి ప్ర + జాసు.॥౮॥

పదార్థః :- (వేనః) పణ్డితో విద్వాన్ (తత్) చేతనబ్రహ్మ (పశ్యత్) పశ్యతి. (నిహితమ్) స్థితమ్ (గుహా) గుహాయాం బుద్ధౌ గుప్తే కారణే వా (సత్) నిత్యమ్ (యత్ర) యస్మిన్ (విశ్వమ్) సర్వం జగత్ (భవతి) (ఏకనీడమ్) ఏకస్థానమ్ (తస్మిన్) (ఇదమ్) జగత్ (సమ్) (చ) (వి) (చ) (ఏతి) (సర్వమ్) (సః) (ఓతః) ఊర్ధ్వతన్తుః పట ఇవ (ప్రోతః) తిర్యక్తన్తుషు పట ఇవ (చ) (విభూః) వ్యాపకః (ప్రజాసు) ప్రకృతిజీవాదిషు ॥౮॥

అన్వయః :- హే మనుష్యాః! యత్ర విశ్వమేకనీడం భవతి, తద్గుహా నిహితమ్ సద్ వేనః పశ్యత్. తస్మిన్నిదం సర్వం సమేతి చ వ్యేతి చ, స విభూః ప్రజాస్వోతః ప్రోతశ్చ, స ఏవ సర్వైరుపాసనీయోఽస్తి ॥౮॥

భావార్థః :- హే మనుష్యాః! విద్వానేవ యం బుద్ధిబలేన జానాతి యః సర్వేషామాకాశాదీనాం పదార్థానా మధికరణ మస్తి యత్ర సంహారకాలే సర్వం జగల్లీయతే, సర్గకాలే చ యతో నిస్సరతి, యేన వ్యాప్తేన వినా కిఞ్చిదపి వస్తున వర్తతే, తం విహాయాఽన్యం కఞ్చిదప్యుపాస్యమీశ్వరం మా విజానన్తు ॥౮॥

**పదార్థము** :- ఓ మానవులారా! (యత్ర) ఎవనియందు (విశ్వమ్) జగత్తంతయును (ఏకనీడమ్) ఒకే ఆశ్రమము గలదియైనది (భవతి) అగునో (తత్) అట్టి (గుహా) బుద్ధి, లేక గుప్తకారణమునందు (నిహితమ్) స్థితమైయున్నది (సత్) నిత్యచేతనుడగు బ్రహ్మను (వేనః) పండితుడగు విద్వాంసుడు (పశ్యత్) జ్ఞానదృష్టితో జూచును (తస్మిన్) ఆతనియందు (ఇదమ్) ఈ (సర్వమ్) సర్వజగత్తు (సమ్.ఏతి) ప్రళయకాలమున లీనమగును (చ) మరియు ఉత్పత్తి సమయమున (వి) వేరుగా స్థూలరూపము (చ) కూడ అగును (సః) ఆతడు (విభూః) అనేక రూపములందువ్యాప్తుడై (ప్రజాసు) ప్రజలయందు (ఓతః) పడుగునందలి పోగులవలె (చ) మరియు (ప్రోతః) పేకయందలి పోగులవలె, వస్త్రమునందలి పడుగుపేకలవలె ఓతప్రోత మగుచున్నాడు. ఆతడే అందరకు ఉపాసనీయుడని తెలిసికొనుడు.॥౮॥

**భావార్థము** :- మానవులారా! విద్వాంసులుమాత్రమే ఎవనిని బుద్ధిబలముచే నెరుగుదురో ఎవడు ఆకాశము మున్నగు పదార్థములకు ఆధారమో, ప్రళయకాలమున సర్వజగమెవనియందు లీనమై, ఉత్పత్తికాలమున ఎవనినుండి వెలువడుచున్నదో, సర్వవ్యాపకుడగు ఈశ్వరుడు లేక ఏ వస్తువునుండదో, ఆతనిని వదలి ఏ యితరులను ఉపాసనీయ ఈశ్వరుడుగా నెంచకుడు.॥౮॥

8. The sage beholdeth the eternal conscious God hidden in the inmost recesses of the heart; in Whom this world hath found a solitary abode. In Him is this universe dissolved and then created. He is ubiquitious, and pervades souls and matter like warp and woof.

౧౬౮౯. ప్ర తదిత్యస్య స్వయమ్భు బ్రహ్మ ఋషిః; విద్వాన్ దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మళల నా విషయమే.

౧౬౮౯ ప్ర తద్వోచేదమృతం ను విద్వాన్ గన్ధర్వో ధామ విభృతం గుహా సత్।
త్రీణి పదాని నిహితా గుహాస్య యస్తాని వేద స పితుః పితాసత్॥౯॥

ప.వి:- ప్ర, తత్, వోచేత్, అమృతమ్, ను, విద్వాన్, గన్ధర్వః ధామ, విభృతమితి వి + భృతమ్, గుహా, సత్, త్రీణి, పదాని, నిహితేతి ని + హితా, గుహా, అస్య, యః, తాని, వేద, సః, పితుః, పితా, అసత్.॥౯॥

పదార్థః :- ((ప్ర) (తత్) చేతనం బ్రహ్మ (వోచేత్) గుణకర్మస్వభావత ఉపదిశేత్ (అమృతమ్) నాశరహితమ్ (ను) సద్యః (విద్వాన్) పణ్డితః (గన్ధర్వః) యో గాం వేదవాచం

ధరతి సః (ధామ) ముక్తిసుఖస్య స్థానమ్ (విభృతమ్) విశేషేణ ధృతమ్ (గుహా) బుద్ధౌ (సత్) నిత్యమ్ (త్రీణి) ఉత్పత్తిస్థితిప్రలయాః కాలా వా (పదాని) జ్ఞాతుమర్హాణి (నిహితా) నిహితాని (గుహా) బుద్ధౌ (అస్య) అవినాశినః (యః) (తాని) (వేద) జానాతి (సః) (పితుః) జనకస్యేశ్వరస్య వా (పితా) జ్ఞానప్రదానేనాస్తికత్వేన వా రక్షకః ఇతి (అసత్) భవేత్.।౯॥

అన్వయః :- హే మనుష్యాః! యో గన్ధర్వో విద్వాన్ గుహా విభృతమమృతం ధామ తత్ సన్ను ప్రవోచేత్ యాన్యస్య గుహా నిహితాని పదాని త్రీణి సన్తి, తాని చ వేద, స పితుః పితాఽసత్.।౯॥

భావార్థః :-హే మనుష్యాః! య ఈశ్వరస్య ముక్తిసాధకం బుద్ధిస్థం స్వరూపముపదిశే యుర్యథార్థతయా పదార్థానాం పరమాత్మనశ్చ గుణకర్మస్వభావాన్ విజానీయుస్తే వయోవృద్ధానాం పితౄణామపి పితరో భవితుం యోగ్యాః సన్తీతి విజానీత ।౯॥

పదార్థము :- ఓ మానవులారా! (యః) ఎవడు (గన్ధర్వః) వేదవాణిని ధారణమొనర్చువాడు (విద్వాన్) పండితుడు (గుహా) బుద్ధిని (విభృతమ్) విశేషముగ ధారణమొనర్చిన (అమృతమ్) నాశరహితము (ధామ) ముక్తిస్థానము (తత్) అట్టి (సత్) నిత్యచేతనబ్రహ్మ (ను) శీఘ్రముగ (ప్ర,వోచేత్) గుణకర్మస్వభావముల సహితముగ ఉపదేశించునో మరియు నెవడు (అస్య) ఈ యవినాశి బ్రహ్మయొక్క (గుహా) జ్ఞానమునందు (నిహితా) స్థితమైన (పదాని) తెలిసికొనదగిన (త్రీణి) మూడు [ఉత్పత్తి, స్థితి, ప్రళయములు లేక భూత భవిష్యద్వర్తమాన కాలములు] గలవో (తాని) వానిని ఎవడు (వేద) ఎరుగునో (సః) ఆతడు (పితుః) తన తండ్రి లేక సర్వరక్షకుడగు పరమేశ్వరుని (పితా) జ్ఞానమునిచ్చు లేక ఆస్తికత్వమును రక్షించువారు (అసత్) అగుచున్నాడు. ।౯॥

**భావార్థము** :- మానవులారా! ఏ విద్వాంసులు ఈశ్వరునియొక్క ముక్తిసాధకమును బుద్ధియొక్క స్వరూపమును ఉపదేశించెదరో, శ్రేష్ఠ పదార్థములను మరియు పరమేశ్వరుని గుణకర్మస్వభావములను తెలిసికొందురో, వారు వయస్సునందును పెద్దవారగు పితరులు మున్నగువారనిపించుకొనుటకును రక్షణకును యోగ్యులగుదురని ఎంచవలయును.।౯॥

9. May the learned person, who knows the Vedas, soon expatiate upon the Eternal and Conscious God, the Imperishable abode of salvation, and hidden in intellect. There are three steps ro know the eternal God, placed in comprehension. He who knows them becomes the watchman of God through theism.

౧౬౫౦.స న ఇత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః,పరమాత్మా దేవతా,నిచృత్త్రిష్టుప్ ఛందః,ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౯౧౦ స నో బన్ధుర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా।

యత్ర దేవా ఉఅమృతమానశానాస్తృతీయే ధామన్నధ్యైరయన్త ॥౧౦॥

ప.వి:-సః, నః, బన్ధుః, జనితా, సః, విధాతేతి వి + ధాతా, ధామాని, వేద, భువనాని, విశ్వా, యత్ర, దేవాః, అమృతమ్, ఆనశానాః, తృతీయే,ధామన్, అధ్యైరయన్తేత్యధి + ఐరయన్త.॥౧౦॥

పదార్థః :-(సః) (నః) అస్మాకమ్ (బన్ధుః) భ్రాతేవ మాన్యః సహాయః (జనితా) జనయితా. అత్ర జనితా మన్త్ర ఇతి అ. ౬.౪.౫౩ ణిలోపః (సః) (విధాతా) సర్వేషాం పదార్థానాం కర్మఫలానాం చ విధానకర్తా (ధామాని) జన్మస్థాననామాని (వేద) జానాతి (భువనాని) లోకలోకాన్తరాణి (విశ్వా) సర్వాణి (యత్ర) యస్మిన్ జగదీశ్వరే (దేవాః) విద్వాంసః (అమృతమ్) మోక్షసుఖమ్ (ఆనశానాః) ప్రాప్నువన్తః (తృతీయే) జీవప్రకృతిభ్యాం విలక్షణే (ధామన్) ధామన్యాధారభూతే (అధ్యైరయన్త) సర్వత్ర స్వేచ్ఛయా విచరన్తి. ॥౧౦॥

అన్వయః :- హే మనుష్యాః! యత్ర తృతీయే ధామన్నమృతమానశానా దేవా అధ్యైరయన్త, యో విశ్వా భువనాని ధామాని చ వేద, స నో బన్ధుర్జనితా, స విధాతా ఽస్తీతి నిశ్చినుత ॥౧౦॥

భావార్థః :- హే మనుష్యాః! యస్మిఞ్ఛుద్ధస్వరూపే పరమాత్మని యోగినో విద్వాంసో ముక్తిసుఖం ప్రాప్య మోదన్తే స ఏవ సర్వజ్ఞః సర్వోత్పాదకః సర్వదా సహాయకారీ చ మన్తవ్యో నేతర ఇతి.॥౧౦॥

పదార్థము :- ఓ మానవులారా! (యత్ర) ఎవడు (తృతీయే) జీవుడు మరియు ప్రకృతులకు విలక్షణమై (ధామన్) ఆధారరూప జగదీశ్వరుని యందు (అమృతమ్) మోక్ష సుఖమును (ఆనశానాః) పొందుచున్నవాడై (దేవాః) విద్వాంసుడునై (అధ్యైరయన్త) సర్వత్ర స్వేచ్ఛగ విహరించుచుండునో, ఎవడు (విశ్వా) సకల (భువనాని) లోక లోకాంతరముల మరియు (ధామాని) జన్మ, స్థాన, నామములను (వేద) ఎరుగునో (సః) ఆ పరమాత్మ (నః) మాకు (బన్ధుః) సహోదరునివంటి మాన్య సహాయకుడు (జనితా) ఉత్పన్నమొనర్చువాడు (సః) ఆతడే (విధాతా) సకల పదార్థముల మరియు కర్మఫలముల విధానమొనర్చువాడని మీరు నిశ్చయముగ నెరుగుడు. ॥౧౦॥

**భావార్థము** :- ఏ పరమాత్మయందు యోగులు, విద్వాంసులు ముక్తిసుఖమును పొంది ఆనందము ననుభవించెదరో ఆతనినే సర్వజ్ఞుడు, సర్వోత్పాదకుడు, సర్వదా సహాయకారియని ఎంచవలయును. ఇతరుల విశ్వసించరాదు.॥౧౦॥

He is our Brother, our Father and Begetter. He knows all beings and all worlds. In Him, the third high stage, the learned obtaining the bliss of salvation, move at will.

౧౬౧.పరీత్యేత్యస్య స్వయంభు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా,నిచృత్త్రిష్టుప్ ఛందః, ధైవతః సర్వః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయమే.

౧౬౧ పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ ।

ఉపస్థాయ ప్రథమజామృతస్యాత్మనాఽత్మానమభి సం వివేశ ॥౧౧॥

ప.వి:- పరీత్యేతి పరి + ఇత్య, భూతాని, పరీత్యేతి పరి + ఇత్య, లోకాన్, పరీత్యేతి పరి + ఇత్య, సర్వాః, ప్రదిశ ఇతి ప్ర + దిశః, దిశః, చ, ఉపస్థాయేత్యుప + స్థాయ, ప్రథమజామితి ప్రథమ + జామ్, ఋతస్య, ఆత్మనా, ఆత్మానమ్; అభి, సమ్, వివేశ ॥౧౧॥

పదార్థః :- (పరీత్య) పరితః సర్వతోఽభివ్యాప్య (భూతాని) (పరీత్య) (లోకాన్) ద్రష్టవ్యాన్ పృథివీసూర్యాదీన్ (పరీత్య) (సర్వాః) (ప్రదిశః) ఆగ్నేయాద్యా ఉపదిశః (దిశః) పూర్వాద్యాః (చ) అధః ఉపరి చ (ఉపస్థాయ) పరిత్వా సంసేవ్య వా (ప్రథమజామ్) ప్రథమోత్పన్నాం వేదచతుష్టయీమ్ (ఋతస్య) సత్యస్య (ఆత్మనా) స్వస్వరూపేణాన్తః కరణేన చ (ఆత్మానమ్) స్వరూపమధిష్ఠానం వా (అభి) ఆభిముఖ్యే (సమ్) సమ్యక్ (వివేశ) ప్రవిశతి.॥౧౧॥

అన్వయః :-హే విద్వన్ ! త్వం యో భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ పరీత్య ఋతస్యాత్మానమభిసంవివేశ ప్రథమజాముపస్థాయాత్మనా తం ప్రాప్నుహి.॥౧౧॥

భావార్థః :-హే మనుష్యాః! యూయం ధర్మాచరణవేదయోగాభ్యాససత్సఙ్గాదిభిః కర్మభిః శరీరపుష్టి మాత్మాన్తఃకరణశుద్ధిం చ సంపాద్య సర్వత్రాభివ్యాప్తం పరమాత్మానం లబ్ధ్వా సుఖినో భవత.॥౧౧॥

పదార్థము :- ఓ విద్వాంసుడా! ఎవడు (భూతాని) సర్వప్రాణులందు (పరీత్య) అన్నివైపులనుండి వ్యాపకుడై (లోకాన్) పృథివి, సూర్యుడు మున్నగు లోకములయందు (పరీత్య) అన్నిదిశలనుండి వ్యాప్తుడై (చ) మరియు పైన, క్రింద (సర్వాః) సకల (ప్రదిశః) ఆగ్నేయము మున్నగు ఉపదిశలు, మరియు (దిశః) తూర్పుమున్నగు దిశలందును (పరీత్య) అన్నివైపులనుండి వ్యాపకుడై (ఋతస్య) సత్యముయొక్క

(ఆత్మానమ్) స్వరూపము లేక అధిష్ఠానమునందు (అభి, సమ్, వివేశ) సమ్ముఖమునుండియే చక్కగా ప్రవేశించుచుండునో (ప్రథమజామ్) మొదటి కల్పాదియందు ఉత్పన్నమైన చతుర్వేదరూప జ్ఞానమును (ఉపస్థాయ) చదివి లేక చక్కగా సేవించి (ఆత్మనా) నీ శుద్ధస్వరూపమును అంతఃకరణముద్వారా ప్రాప్తించుకొనుము.॥౧౧॥

**భావార్థము :-** ఓ మానవులారా! మీరు ధర్మాచరణము, వేదముయొక్క యోగముయొక్క అభ్యాసము మరియు సత్సంగము మున్నగు కర్మలచే శారీరక పుష్టి, ఆత్మ మరియు అంతఃకరణముల శుద్ధిని సాధించి సర్వత్ర అభివ్యాప్తమైయున్న పరమాత్మను ప్రాప్తించుకొని సుఖవంతులగుడు.॥౧౧॥

God manifests Himself pervading the five elements, all the worlds and all the Quarters and Mid-quarters. The learned person having studied the four Vedas created in the beginning, unites himself with God, the Embodiment of Truth.

౧౬౭౨.పరీత్యస్య స్వయమ్భు బ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా,నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౬౭౨ పరి ద్యావాపృథివీ సద్యఽఇత్వా పరి లోకాన్ పరి దిశః పరి స్వః।
ఋతస్య తన్తుం వితతం విచృత్య తదపశ్యత్తదభవత్తదాసీత్ ॥౧౨॥

ప.వి:- పరి, ద్యావాపృథివీ ఇతి ద్యావాఽపృథివీ, సద్యః, ఇత్వా, పరి, లోకాన్, పరి, దిశః, పరి, స్వరితి స్వః, ఋతస్య, తన్తుమ్, వితతమితి వి + తతమ్, విచృత్యేతి వి + చృత్య, తత్, అపశ్యత్, తత్, అభవత్, తత్, ఆసీత్.॥౧౨॥

పదార్థః :- (పరి) సర్వతః (ద్యావాపృథివీ) సూర్యభూమీ (సద్యః) శీఘ్రమ్ (ఇత్వా) ప్రాప్య (పరి) సర్వతః (లోకాన్) ద్రష్టవ్యాన్ సృష్టిస్థాన్ భూగోలాన్ (పరి) (దిశః) పూర్వాద్యాః (పరి) (స్వః) సుఖమ్ (ఋతస్య) సత్యస్య (తన్తుమ్) కారణమ్ (వితతమ్) విస్తృతమ్ (విచృత్య) వివిధతయా గ్రన్థిత్వా బధ్వా (తత్) (అపశ్యత్) పశ్యతి (తత్) (అభవత్) భవతి (తత్) (ఆసీత్) అస్తి ॥౧౨॥

అన్వయః :- హే మనుష్యా ! యః పరమేశ్వరో ద్యావాపృథివీ సద్య ఇత్వా పర్యపశ్యద్యో లోకాన్ సద్య ఇత్వా పర్యభవత్ యో దిశః సద్య ఇత్వా పర్యాసీద్యః స్వః సద్య ఇత్వా పర్యపశ్యద్య

ఋతస్య వితతం తన్తుం విచృత్య తత్సుఖమపశ్యద్యేన తత్సుఖమభవద్యతస్తద్విజ్ఞానమాసీత్తం యథావద్విజ్ఞాయోపాసీరన్ ॥౧౨॥

**భావార్థః** :-యే మనుష్యాః పరమేశ్వరమేవ భజన్తి, తన్నిర్మితాం సృష్టిం సుఖాయోపయుఞ్జతే, త ఐహికం పారమార్థికం విద్యాజన్యం సుఖం చ సద్యః ప్రాప్య సతతమానన్దన్తి ॥౧౨॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఏ పరమేశ్వరుడు (ద్యావాపృథివీ) సూర్యుడు మరియు భూమిని (సద్యః) వెంటనే (ఇత్వా) పొంది (పరి, అపశ్యత్) అన్నివైపులనుండి చూచుచున్నాడో, ఎవడు (లోకాన్) చూడదగినట్టి సృష్టియందలి భూగోళములను శీఘ్రముగ వ్యాపించి (పరి,అభవత్) అన్నివైపులనుండి ప్రకటముగుచున్నాడో, ఎవడు (దిశః) తూర్పు మున్నగు దిశలను శీఘ్రముగ వ్యాపించి (పరి, ఆసీత్) అన్నివైపుల విద్యమానుడై యున్నాడో, ఎవడు (స్వః) సుఖములకు ఆకరమై (పరి) అన్నివైపులనుండి చూచుచున్నాడో, ఎవడు (ఋతస్య) సత్యముయొక్క (వితతమ్) విస్తృత (తన్తుమ్) కారణములను (విచృత్య) అనేక విధములుగ బంధించి (తత్) ఆ సుఖమును జూచుచుండునో, ఎవనినుండి (తత్) ఆ సుఖముకలిగెనో, ఎవనిచే (తత్) ఆ విజ్ఞానము కలిగినదో ఆతనిని యథావతుగ దెలిసికొని ఉపాసనమొనర్చుడు.॥౧౨॥

**భావార్థము** :- ఏ మనుష్యులు పరమేశ్వరునే యుపాసించుచు, ఆతడు రచించిన సృష్టిని సుఖముకొరకు ఉపయోగించుకొందురో, వారి ఇహలోక పరలోకములు రెండును మరియు విద్యద్వారా సంప్రాప్తమైన సుఖములను శీఘ్రముగా పొంది నిరంతరము ఆనందము ననుభవించుచుందురు. ॥౧౨॥

12. God fully pervading the Heaven and Earth, the worlds, the Quarters, the eternal bliss; controlling the lengthened thread of Matter, views it, masters it, was its master and will remain so.

౧౬౯౩. సదసస్పతిమిత్యస్య మేధాకామ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిగ్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౬౯౩ సదసస్పతిమద్భుతం ప్రియమిన్ద్రస్య కామ్యమ్ ।

సనిం మేధామయాసిషగ్గ్స్వాహా ॥౧౩॥

**ప.వి:**– సదసః, పతిమ్, అద్భుతమ్, ప్రియమ్, ఇన్ద్రస్య, కామ్యమ్, సనిమ్, మేధామ్, అయాసిషమ్ స్వాహా.॥౧౩॥

**పదార్థః** :-(సదసః) సభాయా జ్ఞానస్య న్యాయస్య దణ్డస్య వా (పతిమ్) పాలకం స్వామినమ్ (అద్భుతమ్) ఆశ్చర్యగుణకర్మస్వభావమ్ (ప్రియమ్) ప్రీతివిషయం ప్రసన్నకరం

ప్రసన్నం వా (ఇన్ద్రస్య) ఇన్ద్రియాణాం స్వామినో జీవస్య (కామ్యమ్) కమనీయమ్ (సనిమ్) సనన్తి సంవిభజన్తి సత్యాఽసత్యే యయా తామ్ (మేధామ్) సజ్ఞతాం ప్రజ్ఞామ్ (అయాసిషమ్) ప్రాప్నుయామ్ (స్వాహా) సత్యయా క్రియయా వాచా వా ॥౧౩॥

అన్వయః :- హే మనుష్యాః! అహం స్వాహా యం సదసస్పతిమద్భుతమిన్ద్రస్య కామ్యం ప్రియం పరమాత్మాన ముపాస్య సంసేవ్య చ సనిం మేధామయాసిషం తం పరిచర్యైతాం యూయమపి ప్రాప్నుత. ॥౧౩॥

భావార్థః :- హే మనుష్యాః! సర్వశక్తిమన్తం పరమాత్మానం సేవన్తే, తే సర్వాః విద్యాః ప్రాప్య శుద్ధయా ప్రజ్ఞయా సర్వాణి సుఖాని లభన్తే.॥౧౩॥

పదార్థము :- ఓ మానవులారా! నేను (స్వాహా) సత్యక్రియ లేక వాణిద్వారా ఎట్టి (సదసః) సభా, జ్ఞానము, న్యాయము, దండనమునకు (పతిమ్) రక్షకుడను. (అద్భుతమ్) ఆశ్చర్యమగు గుణకర్మస్వభావములు గలవాడను (ఇన్ద్రస్య) ఇన్ద్రియములకు నాయకుడగు జీవుని (కామ్యమ్) కమనీయమగు (ప్రియమ్) ప్రీతివిషయమున ప్రసన్నపరచువాడు లేక ప్రసన్నరూపుడగు పరమాత్మ ఉపాసన లేక సేవల నొనర్చి (సనిమ్) సత్యాసత్యములను చక్కగా విభాజన మొనర్చు నా (మేధామ్) ఉత్తమ బుద్ధిని (అయాసిషమ్) ప్రాప్తించుకొనుచున్నానో మీరును అట్టి పరమేశ్వరుని సేవించి ఈ బుద్ధిని పొందుడు. ॥౧౩॥

భావార్థము :- ఏ మానవులు పరమాత్మను సేవించెదరో వారు సమస్త విద్యలను పొంది శుద్ధమగు బుద్ధిద్వారా సుఖప్రాప్తిని పొందగలరు. ॥౧౩॥

Having worshipped with - truthful action and speech, God Wondrous, the lovely Friend of soul, may I acquire wisdom which discriminates between truth and untruth.

౧౬౯౪. యామిత్యస్య మేధాకామ ఋషిః, పరమాత్మా దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

మానుష్యైరీశ్వరాద్ బుద్ధిర్యాచనీయేత్యాహ. మానవు లీశ్వరునినుండి బుద్ధిని యాచించవలయును.

౧౬౯౪ యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే ।

తయా మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా ॥౧౪॥

ప.వి:- యామ్, మేధామ్, దేవగణా ఇతి దేవ + గణాః, పితరః, చ, ఉపాసత ఇత్యుప + ఆసతే, తయా, మామ్, అద్య, మేధయా, అగ్నే, మేధావినమ్, కురు, స్వాహా.॥౧౪॥

పదార్థః :- (యామ్) (మేధామ్) ప్రజ్ఞాం ధనం వా. మేధేతి ధననా...నిఘం. ౨.౧౦. (దేవగణాః) దేవానాం విదుషాం సమూహాః (పితరః) పాలయితారో విజ్ఞానివః (చ) (ఉపాసతే) ప్రాప్య సేవన్తే (తయా) (మామ్) (అద్య) (మేధయా) (అగ్నే) స్వప్రకాశత్వేన విద్యావిజ్ఞాపక! (మేధావినమ్) ప్రశస్తా మేధా విద్యతే యస్య తమ్ (కురు) (స్వాహా) సత్యయా వాచా.॥౧౪॥

అన్వయః :-హే అగ్నే! విద్వన్నధ్యాపక! జగదీశ్వర! వా దేవగణాః పితరశ్చ యాం మేధాముపాసతే, తయా మేధయా మామద్య స్వాహా మేధావినం కురు.॥౧౪॥

భావార్థః :-మనుష్యాః! పరమేశ్వరముపాస్యాప్తం విద్వాంసం సంసేవ్య శుద్ధం విజ్ఞానం ధర్మజం ధనఞ్చ ప్రాప్తుమిచ్ఛేయురన్యాంశ్చైవం ప్రాపయేయుః.॥౧౪॥

పదార్థము :- (అగ్నే) స్వయంప్రకాశరూపుడ వగుటచే విద్యను స్మరణకుదెచ్చు ఈశ్వరా! లేక అధ్యాపకుడవునగు విద్వాంసుడా! (దేవగణాః) అనేకమంది విద్వాంసులు (చ) మరియు (పితరః) రక్షణయొనర్చు జ్ఞానులు (యామ్) ఎట్టి (మేధామ్) బుద్ధి, లేక ధనమును (ఉపాసతే) ప్రాప్తించుకొని సేవించెదరో (తయా) అట్టి (మేధయా) బుద్ధి లేక ధనముచే (మామ్) నన్ను (అద్య) ఇప్పుడు (స్వాహా) సత్యవాణిచే (మేధావినమ్) ప్రశంసనీయ బుద్ధి మరియు ధనము గలవానిగా (కురు) ఒనర్చుము.॥౧౪॥

**భావార్థము :-** మానవులు పరమేశ్వరునుపాసించుచు మరియు ఆప్త విద్వాంసులను చక్కగా సేవించుచు ధర్మయుక్తమగు ధనమును, పొందుట కిచ్ఛగించవలెను. మరియు ఇతరులకును దానిని ప్రాప్తింపజేయు వలెను.॥౧౪॥

That wisdom which the sages and scholars long for; with that wisdom, O God with Thy truthful speech, make me wise today.

౧౬౫౫. మేధామిత్యస్య మేధాకామ ఋషిః, పరమేశ్వరవిద్వాంసౌ దేవతే,నిచృద్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౬౫౫ మేధామ్మే వరుణో దదాతు మేధామగ్నిః ప్రజాపతిః ।

మేధామిన్ద్రశ్చ వాయుశ్చ మేధాం ధాతా దదాతు మే స్వాహా ॥౧౫॥

ప.వి:- మేధామ్, మే, వరుణః, దదాతు, మేధామ్, అగ్నిః, ప్రజాపతిరితి ప్రజా + పతిః, మేధామ్, ఇన్ద్రః, చ,వాయుః చ మేధామ్, ధాతా, దదాతు, మే, స్వాహా ॥౧౫॥

పదార్థః :- (మేధామ్) శుద్ధాం ధియం ధనం వా (మే) మహ్యమ్ (వరుణః) శ్రేష్ఠః (దదాతు) (మేధామ్) (అగ్నిః) విద్యాప్రకాశితః (ప్రజాపతిః) ప్రజాయాః పాలకః (మేధామ్) (ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్ (చ) (వాయుః) బలిష్ఠో బలప్రదః (చ) (మేధామ్) (ధాతా) సర్వస్య సంసారస్య రాజ్యస్య (దదాతు) (మే) మహ్యమ్ (స్వాహా) ధర్మ్యయా క్రియయా.॥౧౫॥

అన్వయః :- హే మనుష్యాః! యథా వరుణః పరమేశ్వరో విద్వాన్ వా స్వాహా మే మేధాం దదాతు, అగ్నిః ప్రజాపతిర్మేధాం దదాతు. ఇన్ద్రో మేధాం దదాతు. వాయుశ్చ మేధాం దదాతు. ధాతా చ మే మేధాం దదాతు తథా యుష్మభ్యమపి దదాతు.॥౧౫॥

భావార్థః :- మనుష్యా యథాఽఽత్మార్థం గుణకర్మస్వభావం సుఖం చేచ్ఛేయుస్తాదృశమేవాఽన్యార్థమ్. యథా స్వస్యోన్నతయే ప్రార్థయేయుస్తథా పరమేశ్వరస్య విదుషశ్చ సకాశాదన్యేషామపి ప్రార్థయేయుర్న కేవలం ప్రార్థనామేవ కుర్యుః; కిం తర్హి? సత్యాచరణమపి. యదా యదా విదుషాం సమీపం గచ్ఛేయుస్తదా తదా సర్వేషాం కల్యాణాయ ప్రశ్నోత్తరాణి కుర్యుః.॥౧౫॥

పదార్థము :- ఓ మానవులారా! ఏవిధముగ (వరుణః) అతిశ్రేష్ఠుడగు పరమేశ్వరుడు లేక విద్వాంసుడు (స్వాహా) ధర్మయుక్త క్రియద్వారా (మే) నాకొరకు (మేధామ్) శుద్ధబుద్ధిని లేక ధనమును (దదాతు) ఇచ్చెదరో (అగ్నిః) విద్యచేప్రకాశించువాడు (ప్రజాపతిః) ప్రజారక్షకుడు (మేధామ్) బుద్ధిని ప్రసాదించునో, (ఇన్ద్రః) పరమైశ్వర్యవంతుడు (మేధామ్) అట్టి బుద్ధినిచ్చుగాక! (చ) మరియు (వాయుః) బలదాత, బలవంతుడు (మేధామ్) బుద్ధిని ప్రసాదించుగాక (చ) మరియు (ధాతా) విశ్వమంతటిని లేక రాజ్యమును ధారణమొనర్చు ఈశ్వరుడు లేక విద్వాంసుడు (మే) నాకొరకు బుద్ధి ధనములను (దదాతు) ఇచ్చునో, అటులనే మీయందరకును ఇచ్చుగాక.॥౧౫॥

భావార్థము :- మానవులే విధముగ తమకొరకు చక్కని గుణకర్మస్వభావములను గోరెదరో అటులనే ఇతరులకొరకును కోరవలయును. ఏవిధముగా తమ యున్నతిని గోరెదరో అదేవిధముగా పరమేశ్వరుని మరియు విద్వాంసుల సాన్నిధ్యముచే ఇతరుల యున్నతికొరకును ప్రార్థించవలయును. కేవలము ప్రార్థనజేయుటయేకాదు. సత్యాచరణమును కూడ సలుపవలయును. ఎప్పుడెప్పుడు విద్వాంసుల సన్నిధికి వెళ్లుదురో, అప్పుడప్పుడు సర్వజనుల కల్యాణమును గూర్చియే ప్రశ్నోత్తరముల నొనర్చవలెను. ॥౧౫॥

15. May the Supreme God grant me wisdom, in consonance with the performance of religious duty. May the Omniscient God and rotector of man grant me wisdom. May the Omnipotent God grant me wisdom, May the Almighty Father grant me wisdom, May the Ruler of the universe grant me wisdom.

౧౬౯౬. ఇదం మ ఇత్యస్య శ్రీకామ ఋషిః, విద్వద్రాజానౌ దేవతే, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల విషయ మయ్యదియే.

౧౬౯౬ ఇదం మే బ్రహ్మ చ క్షత్రం చోభే శ్రియమశ్నుతామ్ ।
మయి దేవా దధతు శ్రియముత్తమాం తస్యై తే స్వాహా ॥౧౬॥

ప.వి:- ఇదమ్, మే, బ్రహ్మ, చ, క్షత్రమ్, చ, ఉభే ఇత్యుభే, శ్రియమ్, అశ్నుతామ్, మయి, దేవాః, దధతు, శ్రియమ్, ఉత్తమామిత్యుత్ + తమామ్, తస్యై, తే, స్వాహా ॥౧౬॥

పదార్థః :-(ఇదమ్) (మే) మమ (బ్రహ్మ) వేదేశ్వరవిజ్ఞానం తద్వత్కులమ్ (చ) (క్షత్రమ్) రాజ్యం ధనుర్వేదవిద్యా క్షత్రియకులమ్ (చ) (ఉభే) (శ్రియమ్) రాజలక్ష్మీమ్ (అశ్నుతామ్) ప్రాప్నుతామ్ (మయి) (దేవాః) విద్వాంసః (దధతు) ధరన్తు (ప్రియమ్) శోభాం లక్ష్మీం చ (ఉత్తమామ్) అతిశ్రేష్ఠామ్ (తస్యై) శ్రియై (తే) తుభ్యమ్ (స్వాహా) సత్యాచరణయా క్రియయా.॥౧౬॥

అన్వయః:-హే పరమేశ్వర! భవత్కృపయా, హే విద్వన్! తవ పురుషార్థేన చ స్వాహా మే మమేదం బ్రహ్మ చ క్షత్రం చోభే శ్రియమశ్నుతాం, యథా దేవా మయ్యుత్తమాం శ్రియం దధతు, తథాఽన్యేష్వపి. హే జిజ్ఞాసో! తే తుభ్యం తస్యై వయం ప్రయతేమహి.॥౧౬॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే మనుష్యాః పరమేశ్వరాజ్ఞాపాలనేన విదుషాం సేవయా సత్కారేణ సర్వేషాం మనుష్యాణాం మధ్యాద్బ్రాహ్మణక్షత్రియౌ సుశిక్ష్య విద్యాదిసద్గుణైః సంయోజ్య, సర్వేషా మున్నతిం విధాయ, స్వాత్మవత్సర్వేషు వర్తేరన్, తే సర్వపూజ్యాః స్యురితి.॥౧౬॥

పదార్థము:-ఓ పరమేశ్వర! తమ కృప మరియు ఓ విద్వాంసుడా! నీ పురుషార్థముచే (స్వాహా) సత్యాచరణరూపక్రియచే (మే) నాయొక్క (ఇదమ్) ఈ (బ్రహ్మ) వేదము ఈ శరీరవిజ్ఞానము మరియు వీనినెరుగువాడు (చ) మరియు (క్షత్రమ్) రాజ్యము, ధనుర్వేద విద్య మరియు వంశము (చ) కూడ ఈ (ఉభే) ఉభయులును (శ్రియమ్) రాజ్యలక్ష్మిని (అశ్నుతామ్) పొందుదురుగాక! (దేవాః) విద్వాంసులు (మయి) నాకొరకు (ఉత్తమామ్) అతిశ్రేష్ఠమగు (శ్రియమ్) శోభ, లేక లక్ష్మిని (దధతు) ధరింతురుగాక! ఓ జిజ్ఞాసువా! (తే) నీకొరకును (తస్యై) అట్టి శ్రీకొరకు మేమును ప్రయత్నింతుము. ॥౧౬॥

**భావార్థము:** - ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మానవులు ఈశ్వరాజ్ఞాపాలనము, విద్వాంసుల సేవాసత్కారములతో సర్వమానవుల మధ్య తమ జ్ఞానమును బ్రాహ్మణ, క్షత్రియులను ఉత్తమ శిక్ష, విద్యాదులచే సంయుక్తపరచి, ఉన్నతికొరకు విధానమొనర్చి సర్వాత్మలను తనయాత్మవలె నెంచుదురో వారెల్లరకును పూజించదగినవా రగుదురు. ॥౧౬॥

O God, through Thy grace, leading a life of truth, may these Brahmanas and Kshatriyas of my country enjoy the splendour and wealth of my government. Just as the learned persons bestow best splendour and wealth on me, so O seeker after truth may we try for that splendour and wealth for thee!.

అత్ర పరమేశ్వరవిద్వత్ప్రజ్ఞాధన ప్రాప్త్యుపాయగుణవర్ణ నాదేతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహసఙ్గతిర్వేద్యా.

ఈ యధ్యాయమునందు పరమేశ్వరుడు, విద్వాంసుడు, బుద్ధి, ధనప్రాప్తికి ఉపాయములను వర్ణింపబడినందున ఈ యధ్యాయమున చెప్పబడిన అర్థమునకు పూర్వాధ్యాయార్థముతో సంగతిగలదని యెంచవలయును.

ఇతి శ్రీమత్పరమ విద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానంద సరస్వతీస్వామి నా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభాషితే యజుర్వేదభాష్యే ద్వాత్రింశోఽధ్యాయః పూర్తిమగాత్

ఇతి ద్వితీయోఽధ్యాయః సమాప్తః

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత యజుర్వేదభాష్యమునందలి ముప్పదిరెండవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు, శిష్యుడునుగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ పీఠాధిపతులునైన పం. లోకమలహరి సిద్ధాంతాచార్యులచే నొనర్చబడిన ఆంధ్రానువాదము; పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదము నందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య 'మల్లి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**ముప్పదిరెండవ అధ్యాయము సమాప్తము.**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# యజుర్వేదభాష్యము

## 33వ అధ్యాయము - విషయసూచిక

| క్ర.సం. | విషయము | మంత్రములు |
|---|---|---|
| 1. | అగ్న్యాదిపదార్థములను తెలుసుకొని కార్యమును సాధించవలయును. | ౧,౨,౨౨ |
| 2. | విద్వాంసులేమి చేయవలయును? | ౩-౫,౭,౮,౧౨-౧౪,౧౮,౩౪, ౩౫,౪౨,౪౫,౪౬,౫౩-౫౮,౬౨ |
| 3. | రాత్రింబగళ్ళు జగమును రక్షించుచున్నవి. | ౫ |
| 4. | మానవుడు సూర్యునివలె దోషములను వినాశమొనర్చవలయును. | ౯,౧౦,౧౧ |
| 5. | రాజధర్మవిషయము | ౧౫-౧౭,౨౦,౨౬-౩౦,౩౨,౩౩,౩౬, ౫౦-౫౨,౬౩-౭౦,౮౨-౮౫ |
| 6. | మానవులు ఆభూషణాదులను రక్షించవలయును. | ౧౩ |
| 7. | మానవులీశ్వరునే పూజించవలయును. | ౨౩-౨౫,౩౭-౪౧,౭౯-౮౧,౯౭ |
| 8. | సూర్యమండల మెటులున్నది? | ౩౧,౪౩ |
| 9. | వాయుసూర్యులెటువంటివారు? | ౪౪,౭౧ |
| 10. | స్త్రీ ఏమి చేయవలయును? | ౫౯ |
| 11. | మానవులు మోక్షమును ఎట్లు పొందుచున్నారు? | ౬౦ |
| 12. | సభాసేనాపతులేమి చేయవలయును? | ౬౧ |
| 13. | అధ్యాపకోపదేశకుల విషయం | ౭౨,౭౪-౭౮,౯౨,౯౪,౯౫,౯౯ |
| 14. | యాననిర్మాణవిషయం | ౭౩ |
| 15. | మాతాపితరులు స్వసంతానమునకై ఏమి చేయవలయును | ౭౭ |
| 16. | ఉషఃకాలవిషయం | ౯౩ |

# అథ త్రయస్త్రింశత్తమాధ్యాయః

## అస్మిన్నధ్యాయే సప్తనవతిర్మన్త్రాఃసన్తీతివేదితవ్యమ్.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ। యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౧౯౭౭. అస్యేత్యస్య వత్సప్రీరృషిః, అగ్నయో దేవతాః, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథాగ్న్యాదిపదార్థాన్ విజ్ఞాయ కార్యం సాధ్యమిత్యాహ .

అగ్న్యాది పదార్థములను తెలిసికొని కార్యమును సాధించవలయును

౧౯౭౭ అస్యాజరాసో దమామరిత్రా అర్చద్ధూమాసో అగ్నయః పావకాః ।

శ్వితీచయః శ్వాత్రాసో భురణ్యవో వనర్షదో వాయవో న సోమాః ॥౧॥

ప.వి:- అస్య, అజరాసః, దమామ్, అరిత్రాః, అర్చద్ధూమాస ఇత్యర్చత్ + ధూమాసః, అగ్నయః, పావకాః, శ్వితీచయః, శ్వాత్రాసః, భురణ్యవః, వనర్షదః, వనసద ఇతి వన+సదః, వాయవః, న, సోమాః.॥౧॥

పదార్థః :-(అస్య) పరమేశ్వరస్య (అజరాసః) వయోహానిరహితాః (దమామ్) గృహాణామ్. అత్ర నుడభావే పూర్ణసవర్ణదీర్ఘః (అరిత్రాః) యేఽరిభ్యస్త్రాయన్తే తే (అర్చద్ధూమాసః) అర్చన్తః సుగన్ధియుక్తా ధూమా యేషాన్తే (అగ్నయః) విద్యుదాదయః (పావకాః) పవిత్రీకరాః (శ్వితీచయః) యే శ్వితిం శ్వేతవర్ణం చిన్వన్తి తే (శ్వాత్రాసః) శ్వాత్రం ప్రవృద్ధం ధనం యేభ్యస్తే, శ్వాత్రమితి ధననా... నిఘం. ౨.౧౦. (భురణ్యవః) ధర్తారో గతిమన్తశ్చ (వనర్షదః) యే వనేషు రశ్మిషు సీదన్తి తే, అత్ర వా ఛన్దసీతి రుడాగమః (వాయవః) పవనాః (న) ఇవ (సోమాః) ఐశ్వర్యప్రాపకాః ॥౧॥

అన్వయః :-హే మనుష్యాః! యేఽస్య జగదీశ్వరస్య సృష్టావజరాసోఽరిత్రా అర్చద్ధూమాసః పావకాః శ్వితీచయః శ్వాత్రాసో భురణ్యవః సోమా అగ్నయో వనర్షదో వాయవో న దమాం ధారకాః సన్తి, తాన్ యూయం విజానీత.॥౧॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యది మనుష్యా అగ్నివాయ్వాదీన్ సృష్టిస్థాన్ పదార్థాన్ విజానీయుస్తర్హ్యేతేభ్యో బహూనుపకారాన్ గ్రహీతుం శక్నుయుః ॥౧॥

పదార్థము :-ఓ మానవులారా (అస్య) ఈ పూర్వాధ్యాయమున చెప్పబడిన సృష్టియందు (అజరాసః) ఒకే వయస్సుగలవి (అరిత్రాః) శత్రువులనుండి గాపాడునవి (అర్చద్ధూమాసః) సుగంధిత ధూమముతోగూడి (పావకాః) పవిత్రకారకము (శ్వితీచయః) శ్వేత [తెల్లని] వర్ణములను సంచయమొనర్చునవి (శ్వాత్రాసః) ధనమును వృద్ధిపరచుహేతువులను (భురణ్యవః) ధారణమొనర్చునవి లేక గమనశీలమైన (సోమాః) ఐశ్వర్యములను పొందునవి యగు (అగ్నయః) విద్యుత్తు మున్నగువాని యగ్నులు (వనర్షదః) వనములలో లేక కిరణములలో నుండునట్టి (వాయవః) పవనముల (న) వలె (దమాన్) గృహములను మీరు తెలిసికొనుడు.॥౧॥

భావార్థము :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. మనుష్యులు అగ్ని వాయువు మున్నగు సృష్టియందలి పదార్థములను దెలిసికొనిన వానిచే అనేకోపకారములను సాధించుకొనవలయును.॥౧॥

1. In this God's creation, may the fires, ever active,protections against foes, coupled with fragrant somke, purifying, white wealth-producing, ever stirring, recipients of prosperity, seated in woods, rays and water, and potent like winds preserve our houses.

౧౬౫౮.హరయ ఇత్యస్య విశ్వరూప ఋషిః, అగ్నయో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౬౫౮ హరయో ధూమకేతవో వాతజూతాఉఉప ద్యవి। యతన్తే వృథగగ్నయః ॥౨॥

ప.వి:- హరయః, ధూమకేతవ ఇతి ధూమ+కేతవః, వాతజూతా ఇతి వాత + జూతాః, ఉప, ద్యవి, యతన్తే, వృథక్, అగ్నయః ॥౨॥

పదార్థః:-(హరయః) హరణశీలాః (ధూమకేతవః) కేతురివ ధూమో జ్ఞాపకో యేషాన్తే (వాతజూతాః) వాయునా ప్రాప్తతేజస్కాః (ఉప) (ద్యవి) ప్రకాశే (యతన్తే) (వృథక్) పృథక్ వర్ణవ్యత్యయః (అగ్నయః) పావకాః. ॥౨॥

అన్వయః:-హే మనుష్యాః! యే ధూమకేతవో వాతజూతా హరయోఽగ్నయో వృథక్ ద్యవి ఉపయతన్తే, తాన్ కార్యసిద్ధయే సంప్రయుఙ్గ్ధ్వమ్ ॥౨॥

భావార్థః :-హేమనుష్యాః యేషాం ధూమో విజ్ఞాపకో వాయుః ప్రదీపకో హరణశీలతా చ యేషు వర్తతే, తేఽగ్నయః సన్తీతి విజానీత.॥౨॥

**పదార్థము** :- ఓ మానవులారా! (ధూమకేతవః) తన్నుదెలియపరచు పతాకము ధూమము గల (వాతజూతః) వాయువుద్వారా తేజమును పొందునది (హరయః) హరణశీల మగు (అగ్నయః) అగ్నులు (పృథక్) అనేక విధములుగ (ద్యవి) ప్రకాశ నిమిత్తము (ఉప, యతన్తే) ఏవి యత్నమొనర్చునో వానిని కార్యసిద్ధికొరకు ఉపయోగమునకు తెండు. ॥౨॥

**భావార్థము** :- ఓ మానవులారా! వేనిని ధూమమే జ్ఞానము (గుర్తు) గలిగించునో, వాయువు ప్రజ్వలన మొనర్చునో, వేనియందు హరణశీలత్వము గలదో, వానిని అగ్నులుగా దెలిసికొనుడు.॥౨॥

2. Various flames of fire, moving in nature, bannered with the smoke, fanned by the wind, rise, aflot to heaven.

౧౬౬౯.యజాన ఇత్యస్య గోతమ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః।

విద్వద్భిర్మనుష్యైః కిం కార్య మిత్యాహ. విద్వాంసు లేమి చేయువలయును ?

౧౬౬౯ యజా నో మిత్రావరుణా యజా దేవా౯ ఋతం బృహత్।

అగ్నే యక్షి స్వం దమమ్ ॥౩॥

ప.వి:- యజ, నః, మిత్రావరుణా, యజ, దేవాన్, ఋతమ్, బృహత్, అగ్నే, యక్షి, స్వమ్, దమమ్ ॥౩॥

పదార్థః :-(యజ) సత్కురు (నః) అస్మాకమ్ (మిత్రావరుణా) సుహృచ్ఛ్రేష్ఠౌ (యజ) దేహ్యుపదిశ, అత్రోభయత్ర ద్వ్యచోఽతస్తిఙ్ ఇతి దీర్ఘః (దేవాన్) విదుషశ్చ (ఋతమ్) సత్యమ్ (బృహత్) మహత్ (అగ్నే) విద్వన్ (యక్షి) సంగమయ (స్వమ్) స్వకీయమ్ (దమమ్) గృహమ్ ॥౩॥

అన్వయః :-హే అగ్నే! త్వం నో మిత్రావరుణా దేవాంశ్చ యజ. బృహదృతం యజ. యేన స్వం దమం యక్షి. ॥౩॥

భావార్థః:-హే విద్వాంసో జనాః! అస్మాకం మిత్ర శ్రేష్ఠవిదుషాం సత్కర్తారః సత్యోపదేశకాః స్వగృహకార్యసాధకా యూయం భవత ॥౩॥

**పదార్థము** :- (అగ్నే) ఓ విద్వాంసుడా! నీవు (నః) మాయొక్క (మిత్రావరుణా) మిత్రులు, శ్రేష్ఠులు మరియు (దేవాన్) విద్వాంసులను (యజ) సత్కారమొనర్చుము (బృహత్) గొప్ప (ఋతమ్) సత్యమును గురించి (యజ) ఉపదేశమొనర్చుము. అందువల్ల (స్వమ్) స్వంత (దమమ్) గృహమును (యక్షి) సంబద్ధమొనర్చుము.॥౩॥

**భావార్థము** :- ఓ విద్వాంసులారా! మా మిత్రులు మరియు శ్రేష్ఠులనగు విద్వాంసుల సత్కార మొనర్చుచు, సత్యోపదేశకులు మరియు స్వంతగృహముల కార్యములను సాధింపజేయగలవారుగా మీ రగుడు.॥౩॥

3. O learned person, honour our friends, revere persons, and scholars. Preach grand truth unto us, and manage thy domestic affairs!.

౧౭౦౦. యుక్ష్వేత్యస్య విశ్వరూప ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరలనదే విషయము.

౧౭౦౦ యుక్ష్వా హి దేవహూతమాఀ ౨॥ఉ అశ్వాఀ ౨॥ఉ అగ్నే రథీరివ ।
ని హోతా పూర్వ్యః సదః ॥౪॥

**ప.వి:-** యుక్ష్వ, హి, దేవహూతమానితి దేవ + హూతమాన్, అశ్వాన్, అగ్నే, రథీరివేతి రథీః + ఇవ, ని, హోతా, పూర్వ్యః, సదః.॥౪॥

పదార్థః:- (యుక్ష్వ) యోజయ. అత్ర ద్వ్యచోఽత స్తిఙ్ ఇతి దీర్ఘః (హి) ఖలు (దేవహూతమాన్) యే దేవైర్విద్వద్భిర్హ్వాయన్తే స్తూయన్తే తేఽతిశయితాస్తాన్ (అశ్వాన్) ఆశుగామినోఽగ్న్యాదీన్ తురఙ్గాన్ వా (అగ్నే) విద్వన్ (రథీరివ) యథా సారథిస్తథా. అత్ర మత్వర్థే ఈర్ ప్రత్యయః (ని) నితరామ్ (హోతా) ఆదాతా (పూర్వ్యః) పూర్వైః కృతవిద్యః (సదః) అత్రాడభావః ॥౪॥

అన్వయః :-హే అగ్నే! త్వం రథీరివ దేవహూతమానశ్వాన్ యుక్ష్వ, హోతా పూర్వ్యః సన్ హి ని సదః ॥౪॥

భావార్థః:-అత్రోపమాలంకారః. యథా సుశిక్షితః సారథిరశ్వైరనేకాని కార్యాణి సాధ్నోతి తథా కృతవిద్యో జనోఽగ్న్యాదిభిరనేకాని కార్యాణి సాధ్నుయాత్ ॥౪॥

పదార్థము :- (అగ్నే) ఓ విద్వాంసుడా! నీవు (రథీరివ) సారథివలె (దేవహూతమాన్) విద్వాంసులచే అతిగా స్తుతించబడిన (అశ్వాన్) శీఘ్రగాములగు అగ్న్యాదులను లేక అశ్వములను (యుక్ష్వ) యుక్తపరచుము (పూర్వ్యః) పూర్వజులగు విద్వాంసులచే విద్యలను పొందిన (హోతా) గ్రహణమొనర్చుచు (హి) నిశ్చయముగ (ని, సదః) స్థిరముగలవాడ వగుము. ॥౪॥

**భావార్థము** :-ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఉత్తమ శిక్షితుడగు సారథి అశ్వములచే ఎట్లు అనేకకార్యములను సాధించుకొనునో అటులనే విద్వాంసులును అగ్న్యాదులద్వారా అనేక కార్యములను సాధించుకొనవలెను.॥౪॥

4.O learned person, just as a charioteer yokes fast horses higly praised by the experts, so shouldst thou arrange fast burning fires, and verily take thy seat as Hota instructed by the aged sages!.

౧౨౦౧.ద్వే ఇత్యస్య కుత్సఋషిః, అగ్నిర్దేవతా, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

రాత్రిదివసౌ జగత్పాలకావిత్యాహ. రాత్రింబగళ్ళు జగమును రక్షించుచున్నవి.

౧౨౦౧ ద్వే విరూపే చరతః స్వర్థేఽఅన్యాన్యా వత్సముప ధాపయేతే ।
హరిరన్యస్యాం భవతి స్వధావాఞ్ఛుక్రోఽఅన్యస్యాం దదృశే సువర్చాః॥౫॥

ప.వి:- ద్వే ఇతి ద్వే, విరూపే ఇతి వి+రూపే, చరతః, స్వర్థే ఇతి సు+అర్థే, అన్యాన్యేత్యన్యా + అన్యా, వత్సమ్, ఉప, ధాపయేతేఽఇతి ధాపయేతే, హరిః, అన్యస్యామ్, భవతి, స్వధావానితి స్వధా + వాన్, శుక్రః, అన్యస్యామ్, దదృశే, సువర్చా ఇతి సు + వర్చాః ॥౫॥

పదార్థః :- (ద్వే) (విరూపే) విరుద్ధస్వరూపే (చరతః) (స్వర్థే) సుష్ఠు అర్థః ప్రయోజనం యయోస్తే (అన్యాన్యా) భిన్నా భిన్నా ఏకైకా కాలభేదేన (వత్సమ్) వసన్తి భూతాన్యస్మింస్తం సంసారం వదతి సతతమితి వత్సో బాలస్తం వా (ఉప) (ధాపయేతే) పాయయతః (హరిః) మనోహరీ చన్ద్రో బాలో వా (అన్యస్యామ్) రాత్రౌ యోషితి వా (భవతి) (స్వధావాన్) ప్రశస్తస్వధా అమృతరూపా గుణా విద్యన్తే యస్మిన్ సః (శుక్రః) పావకః సూర్య ఆశుకారీ బాలశ్చ (అన్యస్యామ్) ప్రకాశరూపాయాం దివసవేలాయాం జాయాయాం వా (దదృశే) దృశ్యతే (సువర్చాః) సుష్ఠుతేజాః ॥ ౫ ॥

అన్వయః :-హే మనుష్యాః! యథా స్వర్థే ద్వే విరూపే స్త్రియౌ చరతోఽన్యాన్యా చ వత్సముపధాప యేతే తయోరన్యస్యాం స్వధావాన్ హరిర్భవతి శుక్రః సువర్చా అన్యస్యాం దదృశే తథా ద్వే రాత్ర్యహనీ వర్తేతే ఇతి జానీత. ॥౫॥

భావార్థః :-అత్రానుభయరూ భేదరూపకోఽలఙ్కారః :-యథా ద్వేస్త్రియౌ వా గావావపత్యప్రయోజనే పృథక్ పృథక్ వర్తమానే కాలభేదేనైకం బాలం పాలయేతాం తయోరేకస్యాం హృద్యో మహాగుణో శాన్తిశీలో బాలో జాయేత। ఏకస్యాశ్చ శీఘ్రకారీ తేజస్వీ శత్రుతాపకో బాలో జాయేత, తథా ద్వే రాత్ర్యహనీ భిన్నస్వరూపే కాలభేదేనైకం సంసారం పాలయతః. కథం

రాత్రిరమృతవర్షకం చిత్తప్రసాదకం చన్ద్రమసముత్పాద్య దివసరూపా చ పావకరూపం శోభనప్రకాశం సూర్యముత్పాద్యేతి పూర్వాన్వయః ॥౫॥

**పదార్థము :-** ఓ మానవులారా! (స్వర్థే) ఉత్తమ ప్రయోజనములుగల (ద్వే) ఇరువురు (విరూపే) భిన్న భిన్న రూపములుగల స్త్రీలు (చరతః) భోజనాదుల నొనర్చుచు (అన్యాన్యా) ఒక్కొక్కరు వేర్వేరు సమయములందు (వత్సమ్) నిరంతరము మాట్లాడునట్టి ఒక బాలకుని (ఉప, ధాపయేతే) చేరదీసికొని పాలను ద్రావింతురు. ఆ యిరువురినుండి (అన్యస్యామ్) ఒకర్తెయందు (స్వధావన్) ప్రశస్తమగు శాంతిమున్నగు అమృత మయమగు గుణములతో (హరిః) మనోహరుడగు పుత్రుడు (భవతి) అగును. మరియు (శుక్రః) శీఘ్రకారి (సువర్చాః) సుందరుడగు తేజస్వి (అన్యస్యామ్) రెండవయామెయందు గలిగినవాడెట్లు (దదృశే) కనబడుచున్నాడో, [అదేవిధముగ చక్కని ప్రయోజనకారులగు రెండు నల్లని, తెల్లని భిన్నరూపములుగల రాత్రి బవళులు వర్తమానములై యున్నవి. మరి యవి ఒక్కొక్క టి వేర్వేరు సమయములందు సంసార [ప్రపంచ] రూప బాలునొకనికి దుగ్ధాదులను ద్రాగించును. ఆ రెండింటినుండి ఒకటి రాత్రియందు అమృతరూప గుణములుగల మనస్సును ప్రసన్నపరచు చంద్రు డుత్పన్నమగును. మరియు రెండవదియగు పగలురూపమున దినమునందు పవిత్రకర్త, చక్కని తేజస్వియగు సూర్యరూప పుత్రుడు కాన్పించుచున్నాడని] మీరెరుగుడు. ॥౫॥

**భావార్థము :-** ఈ మంత్రమందు అనుభయాభేద రూపకాలంకారము గలదు. ఇరువురు స్త్రీలు లేక గోవులు సంతాన ప్రయోజనమును గోరి వేర్వేరుగానుండి వేర్వేరు సమయములందు ఒకబాలకుని రక్షించునట్లైన, ఆ యిరువుర నుండి ఒకర్తెయందు హృదయమునకు ప్రియముగలిగించు మహాగుణశాలి, శాంతిశీలుడగు బాలుడును, రెండవ యామెయందు శీఘ్రకారి, తేజస్వి, శత్రుభయంకరుడగు బాలుకుడుండునట్లే భిన్న స్వరూపములు గల దిన రాత్రములు వేర్వేరు సమయములందొక జగద్రూప బాలకుని పాలించుచున్నవి. ఎట్లన :- రాత్రి అమృతమును వర్షించు, చిత్తమును ప్రసన్న మొనర్చునట్టి చంద్రరూప బాలకుని ఉత్పన్నమొనర్చును. దిన [పగటి] రూప స్త్రీ తేజోమయుడు, ఉత్తమ ప్రకాశవంతుడునగు సూర్యరూప పుత్రుని ఉత్పన్నపరచును. [అని పూర్వమంత్రముతో అన్వయపరచుకొన వలెను]. ॥౫॥

5. Just as two women, with fair aim, unlike in semblance, feed themselves, and each in succession nourishes a child in embryo, and one bears a quiet, fascinating babe, and the other an active, fair, shining babe, so do dark and bright night and day exist, and work for upliftment of the world as a child. In one of them is born the peaceful Moon, pleasing the mind; and in the other is born the beautiful, purifying and lustrous Sun.

౧౭౦౨. అయమిత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, భురిక్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

విద్వద్భిః కిం కర్తవ్యమిత్యాహ. విద్వాంసు లేమి చేయవలయును?

౧౭౦౨ అయమిహ ప్రథమో ధాయి ధాతృభిర్హోతా యజిష్ఠోఽఅధ్వరేష్వీడ్యః।
యమప్నవానో భృగవో విరురుచుర్వనేషు చిత్రం విభ్వం విశేవిశే ॥౬॥

ప.వి:- అయమ్, ఇహ, ప్రథమః, ధాయి, ధాతృభిరితి ధాతృ + భిః, హోతా, యజిష్ఠః, అధ్వరేషు, ఈడ్యః, యమ్, అప్నవానః, భృగవః, విరురుచురితి వి + రురుచుః, వనేషు, చిత్రమ్, విభ్వమితి విభ్వమ్, విశేవిశ ఇతి విశే + విశే. ॥౬॥

పదార్థః :- (అయమ్) విద్యుదాదిస్వరూపః (ఇహ) అస్మిన్ సంసారే (ప్రథమః) విస్తీర్ణః (ధాయి) ధ్రియతే (ధాతృభిః) ధర్తృభిః (హోతా)సుఖదాతా (యజిష్ఠః) అతిశయేన యష్టా సఙ్గమయితా (అధ్వరేషు) అహింసనీయేషు వ్యవహారేషు (ఈడ్యః) అధ్యేషణీయః (యమ్) (అప్నవానః) సుసన్తానయుక్తాః సుశిష్యాః (భృగవః) పరిపక్వజ్ఞానాః (విరురుచుః) విశేషేణ దీపయేయుః (వనేషు) కిరణేషు వా (చిత్రమ్) అద్భుతగుణకర్మస్వభావమ్ (విభ్వమ్) విభుంవిద్యుదాఖ్యమగ్నిమ్ (విశే, విశే) ప్రజాయై, ప్రజాయై ॥౬॥

అన్వయః:-హే మనుష్యాః! యథా ధాతృభిరిహ విశే విశేఽయం ప్రథమో హోతా యజిష్ఠోఽధ్వరేష్వీడ్యో ధాయి, యథా భృగవశ్చాప్నవానో యం వనేషు చిత్రం విభ్వం విరురుచుస్తం యూయం ధరత ప్రకాశయత చ.॥౬॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే విద్వాంస ఇహ విద్యుద్విద్యాం జానన్తి తే సర్వాః ప్రజాః సర్వసుఖయుక్తాః కర్తుం శక్నువన్తి ॥౬॥

**పదార్థము** :- ఓ మానవులారా! (ధాతృభిః) ధారణమొనర్చువారిచే (ఇహ) ఈ జగమందు (విశేవిశే) ప్రజలందరకొరకు (అయమ్) ఈ (ప్రథమః) విస్తారముగల (హోతా) సుఖదాత (యజిష్ఠః) అధికముగ సాంగత్యమొనర్చునది (అధ్వరేషు) రక్షించదగినవ్యవహారములందు (ఈడ్యః) అన్వేషించదగిన విద్యుత్స్వరూపాగ్నులు మున్నగునవి (ధాయి) ఎట్లు ధారణమొనర్చబడుచున్నవో మరియు నెటుల (భృగవః) దృఢమగు జ్ఞానులు (అప్నవానః) శ్రేష్ఠసంతానములతోబాటు ఉత్తమ శిష్యులు (యమ్) ఏ (వనేషు) వనములు లేక కిరణములందు (చిత్రమ్) ఆశ్చర్యరూప గుణ కర్మ స్వభావములు గల (విభ్వమ్) వ్యాప్తమైయున్న విద్యుద్రూపాగ్నిని (విరురుచుః) విశేషముగ ప్రదీప్తపరచుచున్నారో, అదేవిధముగ దానిని మీరుగూడ ధారణము, ప్రకాశితము నొనర్చుడు. ॥౬॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఈ విశ్వమునందు విద్వాంసులగువారు విద్యుత్తు సంబంధముగల విద్యలను చక్కగా నెరగినట్టైన వారు సకల ప్రజలకు సకల సుఖముల గలిగించువా రగుచున్నారు. ॥౬॥

The explorers, in this world, hold for the people, this fire, vastly expanded, comfort-giving, praiseworthy, investigable in all useful projects.

The learned, and the householders with their disciples and children, specially kindle in woods this fire, wondrous in its attributes, actions and nature, spreading to every place.

౧౭౦౩. త్రీణి శతేత్యస్య విశ్వామిత్ర ఋషిః, విద్వాంసో దేవతాః, స్వరాట్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

శిల్పినో విద్వాంసః కిం కుర్యురిత్యాహ. శిల్పులు, విద్వాంసులు ఏమి చేయవలెను?

౧౭౦౩ త్రీణి శతా త్రీ సహస్రాణ్యగ్నిం త్రింశచ్చ దేవా నవ చాసపర్యన్।
ఔక్షన్ ఘృతైరస్తృణన్బర్హిరస్మా ఆదిద్ధోతారం న్యసాదయన్త ॥౭॥

ప. వి:- త్రీణి శతా, త్రీ,సహస్రాణి, అగ్నిమ్, త్రింశత్, చ, దేవాః, నవ, చ, అసపర్యన్, ఔక్షన్, ఘృతైః, అస్తృణన్, బర్హిః, అస్మై, ఆత్, ఇత్, హోతారమ్, ని, అసాదయన్త ॥౭॥

పదార్థః :- (త్రీణి) (శతా) శతాని (త్రీ) త్రీణి (సహస్రాణి) సహస్రకోశమార్గమ్ (అగ్నిమ్) (త్రింశత్) పృథివ్యాదీన్, (చ) (దేవాః) విద్వాంసః, (నవ) (చ) (అసపర్యన్) సేవేరన్ (ఔక్షన్) సిఞ్చేరన్ (ఘృతైః) ఘృతాదిభి రుదకేన వా (అస్తృణన్) ఆచ్ఛాదయన్తు (బర్హిః) అన్తరిక్షమ్ (అస్మై) అగ్నయే (ఆత్) అభితః (ఇత్) ఏవ (హోతారమ్) హవనకర్తారమ్ (ని) నితరామ్ (అసాదయన్త) స్థాపయన్తు ॥౭॥

అన్వయః :- హే మనుష్యాః! యథా త్రింశచ్చ నవ చ దేవాస్త్రీణి శతా త్రీ సహస్రాణ్యగ్నిమసపర్యన్ ఘృతైరౌక్షన్ బర్హిరస్తృణన్నస్మై హోతారమాదిన్న్యసాదయన్త, తథా యూయమపి కురుత ॥౭॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే శిల్పినో విద్వాంసోఽగ్నిజలాదిపదార్థాన్ యానేషు సంప్రయోజ్యోత్తమమధ్యమనికృష్టవేగైరనేకాని శతాని సహస్రాణి క్రోశాన్మార్గం గన్తుం శక్నుయుస్తేఽన్తరిక్షేఽపి యాతుం సమర్థా జాయన్తే. ॥౭॥

పదార్థము :- ఓ మానవులారా! ఏవిధముగ (త్రిశత్) పృథివి మున్నగు ముప్పదిని (చ) మరియు (నవ) తొమ్మిదివిధములన్నిటిని (చ) మరియు (దేవాః) విద్వాంసులు (త్రీణి) మూడు (శతా) వందలు

(త్రీ) మూడు (సహస్రాణి) వేల క్రోశముల మార్గమున (అగ్నిమ్) అగ్నిని (అసపర్యన్) సేవించెదరో, (ఘృతైః) ఘృతము లేక జలముతో (ఔక్షన్) సేచనమొనర్చెదరో [తడుపుదురో] (బర్హిః) అంతరిక్షమును (అస్తృణన్) ఆచ్ఛాదన మొనర్చెదరో [కప్పుకొందురో] (అస్మై) ఈ యగ్నికొరకు (హోతారమ్) హవనము [యజ్ఞము] నొనర్చు వారిని (ఆత్, ఇత్) అన్నివైపులనుండి (ని, అసాదయన్త) నిరంతరము స్థాపితమొనర్చెదరో, అదేవిధముగ మీరును నొనర్చుడు.॥౭॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ శిల్పులుగ [హస్తనైపుణ్యముగల వారగు] విద్వాంసులు అగ్ని, జలమువంటి పదార్థములను యానములందు సంయుక్తమొనర్చి ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ వేగములతో అనేకవందల,వేల క్రోశముల మార్గములందు రాకపోకల నొనర్చెదరో, వారు గగనమార్గమందును రాకపోకల నొనర్పగలరు.॥౭॥

7. The skilled mechanics should utilise fire in making automobiles travel for 3339 miles. Fire and water should be employed in making them cover the atmosphere. For this fire, the sacrificer should constantly be seated, to perform Havan.

౧౭౦౪.మూర్ధానమిత్యస్య విశ్వామిత్ర ఋషిః, విద్వాంసో దేవతాః, భురిక్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౭౦౪ మూర్ధానం దివో౾ అరతిం పృథివ్యా వైశ్వానరమృత౾ఆ జాతమగ్నిమ్।
కవిꣳసమ్రాజమతిథిం జనానామాసన్నా పాత్రం జనయన్త దేవాః॥౮॥

ప.వి:- మూర్ధానమ్, దివః, అరతిమ్, పృథివ్యాః, వైశ్వానరమ్, ఋతే, ఆ, జాతమ్, అగ్నిమ్, కవిమ్, సమ్రాజమితి సమ్ + రాజమ్, అతిథిమ్, జనానామ్, ఆసన్, ఆ, పాత్రమ్, జనయన్త, దేవాః.॥౮॥

**పదార్థః** :- (మూర్ధానమ్) శిరోవదున్నతప్రదేశే సూర్యరూపేణ వర్తమానమ్ (దివః) ఆకాశస్య (అరతిమ్) ప్రాప్తమ్ (పృథివ్యాః) (వైశ్వానరమ్) విశ్వేభ్యో నరేభ్యో హితమ్ (ఋతే) యజ్ఞనిమిత్తమ్ (ఆ) సమన్తాత్ (జాతమ్) ప్రాదుర్భూతమ్ (అగ్నిమ్) పావకమ్ (కవిమ్) క్రాంతదర్శకమ్, (సమ్రాజమ్) యః సమ్యగ్రాజతే తమ్ (అతిథిమ్) అతిథివద్వర్త మానమ్ (జనానామ్) మనుష్యాణామ్ (ఆసన్) ముఖే ఉత్పన్నమ్ (ఆ) సమన్తాత్, (పాత్రమ్) పాన్తి రక్షన్తి యేన తమ్ (జనయన్త) ప్రాదుర్భావయేయుః (దేవాః) విద్వాంసః ॥౮॥

అన్వయః:-హే మనుష్యాః! యథా దేవా దివో మూర్ధానం పృథివ్యా అరతిం వైశ్వానరమృత ఆజాతం కవిం సమ్రాజం జనానామతిథిం పాత్రమాసన్నగ్నిమాజనయన్త, తథా యూయమప్యేనం ప్రాదుర్భావయత. ॥ ౮ ॥

భావార్థః:-అత్ర వాచకలు...యే పృథివ్యప్వాయ్వాకాశేషు వ్యాప్తం విద్యుదాఖ్యమగ్నిం ప్రాదుర్భావ్య యన్త్రాదిభిర్యుక్త్యా చాలయేయుస్తే కిం కిం కార్యం న సాధయేయుః ॥ ౮ ॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎటుల (దేవాః) విద్వాంసులు (దివః) ఆకాశముయొక్క (మూర్ధానమ్) పైభాగమున సూర్యరూపమున నుండి వర్తమానమైయున్న (పృథివ్యాః) పృథివికి (అరతిమ్) ప్రాప్తించునట్టి (వైశ్వానరమ్) సకల మానవుల హితకారియగు (ఋతే) యజ్ఞముకొరకు (ఆ, జాతమ్) చక్కగా ప్రకటితమైన (కవిమ్) సర్వమును చూపించు వానిని (సమ్రాజమ్) చక్కగా ప్రకాశించు వానిని (జనానామ్) మనుష్యులయొక్క (అతిథిమ్) అతిథివలె మొదటిభోజన [ఆహుతి] భాగమును స్వీకరించువానిని (పాత్రమ్) రక్షణహేతువు (ఆసన్) ఈశ్వరుని ముఖరూప సామర్థ్యమునం దుత్పన్నమైన (అగ్నిమ్) అగ్నిని (ఆ, జనయన్త) ఉత్తమ విధముగా ప్రకట మొనర్చెదరో, అదే విధముగా మీరెల్లరును దీనిని ప్రకటించుడు.॥౮॥

**భావార్థము** :- ఏ విద్వాంసులు పృథివి, జలము, వాయువు, ఆకాశములయందు వ్యాప్తమైయున్న విద్యుద్రూప అగ్నిని ప్రకటమొనర్చి యంత్రాదులందు ప్రయోగించి యుక్తితో యంత్రాదులను నడిపించెదరో వారు అనేకానేక అద్భుతకార్యములను సాధించుకొనగలరు.॥౮॥

8. The learned manifest fire, the head of heaven, resident of Earth, the benefactor of humanity, properly employed in the Yajna, surpassing in beauty, blazing with lustre, the guest of men, created by the mouth-like power of God for the sake of protecion.

౧౭౦౫. అగ్నిరిత్యస్య భరద్వాజ ఋషిః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

మనుష్యః సూర్యవద్దోషాన్ హన్యాదిత్యాహ. మానవుడు సూర్యునివలె దోషములను వినాశ మొనర్పవలయును.

౧౭౦౫ అగ్నిర్వృత్రాణి జఙ్ఘనద్ద్రవిణస్యుర్విపన్యయా। సమిద్ధః శుక్ర ఆహుతః ॥౯॥

ప.విః- అగ్నిః, వృత్రాణి, జఙ్ఘనత్, ద్రవిణస్యుః, విపన్యయా, సమిద్ధ ఇతి సమ్ + ఇద్ధః, శుక్రః, ఆహుత ఇత్యాహుతః.॥౯॥

పదార్థః :- (అగ్నిః) సూర్యాదిరూపః (వృత్రాణి) మేఘావయవాన్ (జఙ్ఘనత్) భృశంహన్తి (ద్రవిణస్యుః) ఆత్మనో ద్రవిణమిచ్ఛుః. (విపన్యయా) విశేషవ్యవహారయుక్త్యా (సమిద్ధః) సమ్యక్ ప్రదీప్తః, (శుక్రః) శీఘ్రకర్తా (ఆహుతః) కృతాహ్వానః ॥౯॥

**భావార్థము** :- ఏ ఉత్పత్తి నాశరహితుడగు, మానవదేహధారియగు జీవుడు విజయముకొరకు ఉత్పత్తి నాశరహితుడు, జగత్స్వామియగు పరమాత్మ నుపాసించుచు వానికి భిన్నముగుదానిని తనవలె నెంచనివారు బంధవిముక్తులై మోక్షమును పొందెదరు.।౬౦॥

60. The divine immortal souls recognise none as their protector, but this loving and foremost God. For sovereignty of this land, they glorify with their praise, the Eternal God, the Friend of all.

౧౭౫౭.ఉగ్రేత్యస్య భరద్వాజ ఋషిః, ఇన్ద్రాగ్నీ దేవతే, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

సభాసేనేశౌ కిం కుర్యాతా మిత్యాహ. సభాసేనాపతు లేమి చేయవలెను?

౧౭౫౭ ఉగ్రా విఘనినా మృధఽ ఇన్ద్రాగ్నీ హవామహే।

తా నో మృడాతఽ ఈదృశే ।౬౧॥

ప.వి:- ఉగ్రా, విఘనినేతి వి + ఘనినా, మృధః, ఇన్ద్రాగ్నీఽఇతీన్ద్రాగ్నీ, హవామహే, తా, నః, మృడాతః, ఈదృశే.।౬౧॥

పదార్థః :- (ఉగ్రా) ఉగ్రబలౌ తేజస్విస్వభావౌ. అత్ర విభక్తేర్లుక్ సంహితాయా మితి దీర్ఘః. (విఘనినా) విశేషేణ హన్తారౌ (మృధః) హింసకాన్ (ఇన్ద్రాగ్నీ) సభాసేనాధీశౌ (హవామహే) ఆహ్వయామః (తా) తౌ (నః) అస్మాన్ (మృడాతః) సుఖయతః (ఈదృశే) ఈదృగ్ లక్షణే సఙ్గ్రామాది వ్యవహారే.।౬౧॥

అన్వయః :-హే మనుష్యాః! వయం యావుగ్రా మృధో విఘనినేన్ద్రాగ్నీ హవామహే తా ఈదృశే నోఽస్మాన్మృడాతః.।౬౧॥

భావార్థః :- యౌ సభాసేనాధ్యక్షౌ పక్షపాతం విహాయ బలం వర్ధయిత్వా శత్రూన్ విజయన్తే తౌ సర్వేషాం సుఖప్రదౌ భవతః.।౬౧॥

**పదార్థము** :- ఓ మానవులారా! మేము ఏ (ఉగ్రా) మహాబలి, తేజఃస్వభావముగల (మృధః) హింసకులను (విఘనినా) విశేషముగా సంహరించు (ఇన్ద్రాగ్నీ) సభాపతి, సేనాపతులను (హవామహే) పిలుచుచున్నామో (తా) వారిరువురు (ఈదృశే) ఈవిధమగు సంగ్రామాది వ్యవహారములందు (నః) మమ్ము (మృడాతః) సుఖులనుగ నొనర్చుచున్నారు.।౬౧॥

**భావార్థము** :- ఏ సభాసైనికాధ్యక్షులు పక్షపాతరహితులై బలమును వృద్ధిపరచుకొని శత్రువులను జయించెదరో వారెల్లరకును సుఖమును గలిగించువా రగుదురు.।౬౧॥

61. We invoke the head of the State and the commander-in-chief, strong, and dispellers of foes. May they be kind to us in the battle-field.

౧౭౫౮.ఉపాస్మై యిత్యస్య దేవత ఋషిః, సోమో దేవతా, నిచృద్ గాయత్రీ ఛన్దః షడ్జః స్వరః.

అథాధ్యాపకాధ్యేతారః కథం వర్తేరన్నిత్యాహ. ఉపాధ్యాయుడు విద్యార్థులు ఎట్లు ప్రవర్తించవలయును?

౧౭౫౮ ఉపాస్మైగాయతా నరః పవమానాయేన్దవే।

అభి దేవా౨ ఇయక్షతే॥౬౨॥

ప.వి:- ఉప, అస్మై, గాయత, నరః, పవమానాయ ఇన్దవే, అభి, దేవాన్, ఇయక్షతే.॥౬౨॥

పదార్థః :- (ఉప) (అస్మై) (గాయత) శాస్త్రాణి పాఠయత. అత్ర సంహితాయామితి దీర్ఘః. (నరః) నాయకాః (పవమానాయ) పవిత్రకర్త్రే (ఇన్దవే) ఋజవే విద్యార్థినే(అభి)(దేవాన్) విదుషః (ఇయంక్షతే) యష్టుం సత్కర్తు మిచ్ఛతే. అత్ర ఛాన్దసో వర్ణలోప ఇత్యభ్యాసయ కారలోపః.॥౬౨॥

అన్వయః :-హే నరో యూయం దేవానభియంక్షతే ఉస్మై పవమానాయేన్దవ ఉప గాయత.॥౬౨॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా జిజ్ఞాసవో ఉధ్యాపకాన్ సన్తుష్టాన్ కర్తుమిచ్ఛన్తి తథా ఉధ్యాపకా అపి తానధ్యాపయితు మిచ్ఛేయుః.॥౬౨॥

పదార్థము :- (నరః) నాయక, అధ్యాపకులారా! మీరు (దేవాన్) విద్వాంసులను (అభి) సర్వదిశలనుండి (ఇయక్షతే) సత్కారమొనర్చుచు (అస్మై) ఈ (పవమానాయ) పవిత్రమొనర్చునట్టి (ఇన్దవే) చిరుప్రాయుడగు [కోమలమగు] విద్యార్థికి (ఉపగాయత) సమీపస్థుడవై సకలశాస్త్రములను చదివించుచుండుము.॥౬౨॥

భావార్థము :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ జిజ్ఞాసువులు అధ్యాపకులను సంతుష్టపరచదలచెదరో, అదేవిధముగ అధ్యాపకులును వారిని చక్కగా చదివించుటకై ఆత్రత నొందవలెను.॥౬౨॥

62. O teacher! instruct in religious lore this student, anxious for maintaining good character, and willing to honour the learned!.

౧౭౫౯.యే త్వేత్యస్య విశ్వామిత్ర ఋషిః, ఇన్ద్రో దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజధర్మ విషయ మాహ. రాజధర్మ విషయము.

౧౭౫౫ యే త్వాహిహత్యే మఘవన్నవర్ద్ధన్యే శామ్బరే హరివో యే గవిష్టౌ ।
యే త్వా నూనమనుమదన్తి విప్రాః పిబేన్ద్ర సోమꣳ సగణో మరుద్భిః॥౬౩॥

ప.వి:- యే, త్వా, అహిహత్య ఇత్యహి + హత్యే, మఘవన్నితి మఘ + వన్, అవర్ద్ధన్, యే, శామ్బరే, హరివ ఇతి హరి + వః, యే, గవిష్టావితి గో + ఇష్టౌ, యే, త్వా, నూనమ్, అనుమదన్తీత్యను + మదన్తి, విప్రాః, పిబ, ఇన్ద్ర, సోమమ్, సగణ ఇతి స + గణః, మరుద్భిరితి మరుత్ + భిః.॥౬౩॥

పదార్థః :- (యే) (త్వా) త్వామ్ (అహిహత్యే) అహేర్మేఘస్య హత్యా హననం యస్మిం స్తస్మిన్ (మఘవన్) పరమపూజితధనయుక్త ! సేనాపతే (అవర్ద్ధన్) వర్ధయేయుః (యే) (శామ్బరే) శమ్బరస్య మేఘస్యాఽయం సఙ్గ్రామస్తస్మిన్ (హరివః) ప్రశస్తా హరయః కిరణా ఇవాఽశ్వా విద్యన్తే యస్య తత్సమ్బుద్ధౌ (యే) (గవిష్టౌ) గవాం కిరణానాం సఙ్గత్యామ్ (యే) (త్వా) త్వామ్ (నూనమ్)నిశ్చితమ్ (అనుమదన్తి) ఆనుకూల్యేన హృష్యన్తి (విప్రాః) మేధావినః (పిబ) (ఇన్ద్ర) పరమైశ్వర్యయుక్త విద్వన్! (సోమమ్) సదౌషధి రసమ్ (సగణః) గణైః సహ వర్తమానః (మరుద్భిః) వాయుభి రివ మనుష్యైః.॥౬౩॥

అన్వయః :- హే మఘవన్! యే విప్రా అహిహత్యే గవిష్టౌ సూర్యమివ త్వాఽవర్ధన్. హే హరివో! యే శామ్బరే విద్యుత మివ త్వాఽవర్ధన్, యే నూనం త్వామనుమదన్తి, యే చ త్వాం రక్షన్తి.హే ఇన్ద్ర!తై ర్మరుద్భిఃసహ సగణః సూర్యో రసమివ మనుష్యైః సహ సోమం పిబ॥౬౩॥

భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. యథా మేఘసూర్యసఙ్గ్రామే సూర్యస్యైవ విజయో జాయతే తథా మూర్ఖాణాం విదుషాఞ్చ సఙ్గ్రామే విదుషామేవ విజయో భవతి.॥౬౩॥

పదార్థము :-(మఘవన్) ఉత్తమపూజనీయ ధనవంతుడవగు నో సేనాపతీ! (యే) ఏ (విప్రాః) బుద్ధిశాలురు (అహిహత్యే) మేఘములను కోసివేయు (గవిష్టౌ) కిరణసంబంధముగల సంగరమందు కిరణములు సూర్యుని తేజస్సువలె (త్వా) నిన్ను (అవర్ద్ధన్) ఉత్సాహపరచునో, అట్టి (హరివః) ప్రశంసనీయ, కిరణములవలె తళుకులీను అశ్వములుగల ఓ శూరవీరులారా! (యే) ఎవరు (శామ్బరే) మేఘములు, సూర్యుని సంగ్రామమందలి విద్యుత్తువలె (త్వా) నిన్ను వృద్ధినొందించెదరో (యే) ఎవరు (నూనమ్) నిశ్చయముగ నీకు (అనుమదన్తి) అనుకూలతతో ఆనందితులగుదురో (యే) ని న్నెవరు రక్షణ యొనర్చెదరో (ఇన్ద్ర)

ఉత్తమైశ్వర్యశాలీ! (మరుద్భిః) వాయువువలె (సగణః) గణము[లతో] గూడియున్న సూర్యుడు రసమును గ్రహించుచున్నటుల రసమును గ్రహించవలెను. అదేవిధముగ నీవు మనుష్యులతోగూడ (సోమమ్) శ్రేష్ఠమగు ఓషధీరసమును (పిబ) పానమొనర్చుము. ।౬౩॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. సూర్యుడు మరియు మేఘముల సంగ్రామమందు సూర్యునకే విజయము లభించునట్లు మూర్ఖులు మరియు విద్వాంసుల సంగ్రామము [శాస్త్రార్థము]నందు విద్వాంసులకే విజయముగలుగును.।౬౩॥

63. O venerable wealthy commander of the army, just as in the conflict between the sun and the cloud, rays make the sun victorious, so learned persons encourage thee. O heroic person, possessing horses shining like the praiseworthy rays, the learned advance thee like lightning in the fight between the sun and the cloud. Verily do these persons rejoice following in thy wake and affording thee protection. O valorous person, just as the sun with its host of winds imbibes water. so do thou drink with thy man the juice of medicinal herbs!.

౧౯౬౦. జనిష్ఠా ఇత్యస్య గౌరీవితి ఋషిః, ఇన్ద్రో దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౯౬౦ జనిష్ఠాऽఉగ్రః సహసే తురాయ మన్ద్రఽఓజిష్ఠో బహులాభిమానః।

అవర్ధన్నిన్ద్రమ్మరుతశ్చిదత్ర మాతా యద్వీరన్దధనద్ధనిష్ఠా ।౬౪॥

ప.వి:- జనిష్ఠాః, ఉగ్రః, సహసే, తురాయ, మన్ద్రః, ఓజిష్ఠః, బహులాభిమాన ఇతి బహుల + అభిమానః, అవర్ధన్, ఇన్ద్రమ్, మరుతః, చిత్, అత్ర, మాతా, యత్, వీరమ్, దధనత్, ధనిష్ఠా.।౬౪॥

పదార్థః :-(జనిష్ఠాః) జనయేః. అత్ర లుఙ్యడభావః. (ఉగ్రః) తేజస్విస్వభావః (సహసే) బలాయ (తురాయ) శీఘ్రత్వాయ (మన్ద్రః) స్తుత ఆనన్దప్రదః (ఓజిష్ఠః) అతిశయేన ఓజస్వీ (బహులాభిమానః) బహులో బహువిధోఽభిమానో యస్య సః (అవర్ధన్) వర్ధయేయుః (ఇన్ద్రమ్) సూర్యమ్ (మరుతః) వాయవః (చిత్) ఇవ (అత్ర) అస్మిన్ రాజ్యపాలన వ్యవహారే (మాతా) జననీ (యత్) యమ్ (వీరమ్) శౌర్యాదిగుణయుక్తం పుత్రమ్ (దధనత్) అపోషయత్ అనకారాగమశ్ఛాన్దసః (ధనిష్ఠా) అతిశయేన ధనినీ.।౬౪॥

అన్వయః :- హే రాజన్ ధనిష్ఠా మాతా యద్వీరం దధనదిన్ద్రం మరుతశ్చిదివ సభ్యా యం త్వా మవర్ధన్త్స త్వమత్ర సహసే తురాయ ఉగ్రో మన్ద్ర ఓజిష్ఠో బహులాభిమానః సన్ సుఖం జనిష్ఠాః.॥౬౪॥

భావార్థః :- అత్రోపమాలఙ్కారః. యః స్వయం బ్రహ్మచర్యేణ శరీరాత్మబలయుక్తో విద్వాన్ స దుష్టాన్ ప్రత్యుగ్రః కఠినస్వభావః శ్రేష్ఠే సోఽన్యస్వభావః సన్ బహుసుసభ్యావృతో ధర్మాత్మా భూత్వా న్యాయవినయాభ్యాం రాజ్యం పాలయేత స సర్వతో ఽభివర్ధేత.॥౬౪॥

పదార్థము :- ఓ రాజా! (ధనిష్ఠా) అత్యంత ధనశాలిని (మాతా, యత్) వీరవతియగు తల్లి ఏ విధముగ (వీరమ్) శూరత్వము మున్నగు గుణములతో గూడిన పుత్రుని (దధనత్) పుష్టివంతునిగ నొనర్చుచున్నదో (చిత్) ఏవిధముగ (ఇన్ద్రమ్) సూర్యుని (మరుతః) వాయువులు పెంపొందజేయుచున్నవో, అదేవిధముగా సభాసదులు నిన్ను (అవర్ధన్) యోగ్యత్వము మున్నగువానిద్వారా పెంపొందజేయుదురుగాక! కావున నీవు (అత్ర) ఈ రాజ్యపరిపాలనారూప వ్యవహారమునందు (సహసే) బలము మరియు (తురాయ) శీఘ్రత్వము కొరకు (ఉగ్రః) తేజోవంత స్వభావుడుగ (ఇన్ద్రః) స్తుతి ప్రార్థనలను పొందిన ఆనందదాతయును (ఓజిష్ఠః) అతిపరాక్రమశాలి మరియు (బహులాభిమానః) అనేక విధములగు పదార్థముల అభిమానముగలవాడవై అనేక సుఖములను (జనిష్ఠాః) ఉత్పన్నమొనర్చుము.॥౬౪॥

భావార్థము :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఎవడు స్వయముగ బ్రహ్మచర్యముతో శరీరాత్మల బలయుక్తుడు, విద్వాంసుడై, దుష్టుల యెడ కఠిన స్వభావము గలవాడునై శ్రేష్ఠుల విషయమున మార్దవ స్వభావము గలిగియుండి అనేక ఉత్తమ సభ్యులతోగూడ ధర్మాత్ముడై న్యాయము వినయములతో రాజ్యపాలన మొనర్చునో యాతడన్ని దిశలనుండి పెంపొందును.॥౬౪॥

64. O King, thy most wealthy mother has been nourishing thee a hero, just as air strengthens the Sun, so learned persons strengthen thee. Create pleasure, being mighty for victorious valour, exulting, strongest, full of pride and courage!.

౧౨౬౧. ఆ తూన ఇత్యస్య వామదేవ ఋషిః ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨౬౧ ఆ తూ న౽ఇన్ద్ర వృత్రహన్నస్మాకమర్ధమా గహి।

మహాన్మహీభిరూతిభిః॥౬౫॥

ప.వి:- ఆ, తు, నః, ఇన్ద్ర, వృత్రహన్నితి వృత్ర + హన్, అస్మాకమ్, అర్ధమ్, ఆ, గహి, మహాన్, మహీభిః, ఊతిభిరిత్యూతి + భిః.॥౬౫॥

పదార్థః :- (ఆ) సమన్తాత్ (తు) క్షిప్రమ్. అత్ర ఋచి తును... ఇతి దీర్ఘః. (నః) అస్మాన్ (ఇన్ద్ర) పరమైశ్వర్యవన్ (వృత్రహన్) శత్రూణాం వినాశక (అస్మాకమ్) (అర్ధమ్) వర్ధనమ్ (ఆ) (గహి) ప్రాప్నుహి (మహాన్) పూజనీయతమః (మహీభిః) మహతీభిః (ఊతిభిః) రక్షాదిభిః.॥౬౫॥

అన్వయః :-హే వృత్రహన్నిన్ద్ర! త్వమస్మాకమర్ధ మాగహి. మహాన్ సన్మహీభిరూతిభిర్నోఽస్మాన్ త్వాఽఽదధనత్.॥౬౫॥

భావార్థః :-అత్ర పూర్వస్మాన్మన్త్రాద్ధనదితి పదమనువర్తతే. హే రాజన్! యథా భవానస్మాకం రక్షకోఽస్తి తథా వయమపి భవన్తం వర్ధయేమ. సర్వే వయం ప్రీత్యా మిలిత్వా దుష్టాన్నివార్య శ్రేష్ఠాన్ ధనాఢ్యాన్ కుర్యామ.॥౬౫॥

పదార్థము :- (వృత్రహన్) శత్రువినాశకా! (ఇన్ద్ర) ఉత్తమైశ్వర్యశాలివగు ఓ రాజా! నీవు (అస్మాకమ్) మాయొక్క (అర్ధమ్) వృద్ధి మరియు ఉన్నతులను (ఆ, గహి) బాగుగాపొందుము. మరియు (మహాన్) అత్యంత పూజనీయుడవై (మహీభిః) బహుళ (ఊతిభిః) రక్షణాది క్రియలతో (నః) మమ్ము (తు, ఆ, దధనత్) శీఘ్రమే బాగుగా పుష్టిపరచుము.॥౬౫॥

భావార్థము :- (ఈ మంత్రమున పూర్వమంత్రమునుండి 'దధనత్' అనుపదము అనువృత్తియైనది.) ఓ రాజా! మాయెడల మీరెట్లు రక్షకులు, వర్ధకులు నగుచున్నారో, మేముకూడా నిన్ను పెంపొందింతుము. మేమెల్లరము ప్రీతితో కలిసిమెలిసియుండి దుష్టులను దొలగించి శ్రేష్ఠులను ధనాఢ్యులనొనర్చెదము.॥౬౫॥

65. O King, the slayer of foes, work hard for our advancement. Mighty one, protect us with thy mighty aids!.

౧౨౬౬.త్వమిన్ద్రేత్యస్య నృమేధ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిగనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౨౬౬ త్వమిన్ద్ర ప్రతూర్త్తిష్వభి విశ్వాఽఅసి స్పృధః।
అశస్తిహా జనితా విశ్వతూరసి త్వన్తూర్య తరుష్యతః॥౬౬॥

ప.వి:-త్వమ్, ఇన్ద్ర, ప్రతూర్త్తిష్వితి ప్ర+తూర్త్తిషు, అభి, విశ్వాః, అసి, స్పృధః, అశస్తిహేత్యశస్తి+హా, జనితా, విశ్వతూరితి విశ్వ + తూః, అసి, త్వమ్, తూర్య, తరుష్యతః.॥౬౬॥

పదార్థః :- (త్వమ్) (ఇన్ద్ర) పరమైశ్వర్యప్రద (ప్రతూర్తిషు) హననకర్మసు సఙ్గ్రామేషు (అభి) (విశ్వాః) సర్వాః (అసి) భవసి (స్పృధః) స్పర్ధమానా ఈర్ష్యాయుక్తాః శత్రుసేనాః (అశస్తిహా) అప్రశంసానాం దుష్టానాం హన్తా (జనితా) సుఖాని ప్రాదుర్భావుకః (విశ్వతూః) విశ్వాన్ శత్రూన్ తూర్యతి హినస్తి సః (అసి) (త్వమ్) (తూర్య) హింధి (తరుష్యతః) హనిష్యతః శత్రూన్.॥౬౬॥

అన్వయః :- హే ఇన్ద్ర ! యత స్త్వం ప్రతూర్తిషు విశ్వా స్పృధోఽభ్యసి అశస్తిహా జనితా విశ్వతూస్స్త్వం విజయవానసి. తస్మాత్తరుష్యతస్తూర్య.॥౬౬॥

భావార్థః :- యే పురుషా అధర్మ్యకర్మనివర్తకాః సుఖానాం జనకా యుద్ధవిద్యాసు కుశలాః స్యు స్తే శత్రూన్ విజేతుం శక్నుయుః.॥౬౬॥

పదార్థము :-(ఇన్ద్ర) ఉత్తమైశ్వర్యప్రదాతవగు ఓ రాజా! ఏ కారణమున (త్వమ్) నీవు (ప్రతూర్తిషు) వినాశకరమగు సంగ్రామములందు (విశ్వాః) శత్రువుల సమస్త (స్పృధః) ఈర్ష్యాయుక్త సైన్యములను (అభి, అసి) తిరస్కరించుచున్నావో (అశస్తిహా) ఏ ప్రశంసలను పొందని దుష్టశత్రువుల సంహారకుడవు (జనితా) సుఖముల నుత్పన్నమొనర్చువాడవు (విశ్వతూః) సమస్త శత్రుసంహారకుడవగు (త్వమ్) నీవు విజయుడవునై (అసి) ఉన్నావు. కావున (తరుష్యతః) హననయోగ్యమగు శత్రువులను (తూర్య) సంహరించుము.॥౬౬॥

భావార్థము :-ఏ రాజు అధర్మముతో గూడిన కర్మలను దొలగించి సుఖముల నుత్పాదనమొనర్చునో, మరియు యుద్ధవిద్యలందు కుశలుడో, ఆతడు శత్రువులను జయించుటకు సమర్థుడగుచున్నాడు.॥౬౬॥

66. King, Thou in thy battles, art subduer of all hostile bands. Thou art the destroyer of the depraved, the genitor of happiness, the slayer of foes, the conqueror, vanquish the foes who wish to kill us!.

౧౨౬౩. అను తే శుష్మ మిత్యస్య నృమేధ ఋషిః, ఇన్ద్రో దేవతా, పిఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨౬౩ అను తే శుష్మం తురయన్తమీయతుః క్షోణీ శిశుం న మాతరా।

విశ్వాస్తే స్పృధః శ్నథయన్త మన్యవే వృత్రం యదిన్ద్ర తూర్వసి ॥౬౭॥

ప.వి:- అను, తే, శుష్మమ్, తురయన్తమ్, ఈయతుః, క్షోణీఽఇతి క్షోణీ, శిశుమ్, న, మాతరా, విశ్వాః, తే, స్పృధః, శ్నథయన్త, మన్యవే, వృత్రమ్, యత్, ఇన్ద్ర, తూర్వసి.॥౬౭॥

పదార్థః :-(అను) (తే) తవ (శుష్మమ్) శత్రూణాం శోషకం బలమ్ (తురయన్తమ్) హింసన్తమ్ (ఈయతుః) గచ్ఛతః (క్షోణీ) స్వపరభూమీ. క్షోణీతి పృథివీ నా... నిఘం. ౧.౧. (శిశుమ్) బాలకమ్ (న) ఇవ (మాతరా) మాతాపితరౌ (విశ్వాః) అఖిలాః (తే) తవ (స్పృధః) అరిసేనాః (శ్నథయన్త) శ్నథయన్తి హతా భవన్తి. అత్రాడభావః (మన్యవే) క్రోధాత్. పంచమ్యర్థే చతుర్థీ. (వృత్రమ్) న్యాయావరకం శత్రుమ్ (యత్) యమ్ (ఇన్ద్ర) శత్రువిదారక (తూర్వసి) హినస్తి.।౬౭॥

అన్వయః :- హే ఇన్ద్ర యస్య తే తురయన్తం శుష్మం శిశుం మాతరా న క్షోణీ అన్వీయతు స్తస్య తే మన్యవే విశ్వాః స్పృధః శ్నథయన్త యద్యం వృత్రం శత్రుం త్వం తూర్వసి స పరాజితో భవతి.।౬౭॥

భావార్థః :-అత్రోపమాలంకారః. యేషాం రాజపురుషాణాం హృష్టాః పుష్టా యుద్ధం ప్రతిజానానాః సేనాః స్యుస్తే సర్వత్ర విజయమాప్నుయుః.।౬౭॥

పదార్థము :- (ఇన్ద్ర) శత్రునాశకుడవునగు ఓ రాజా! (తే) నీయొక్క (తురయన్తమ్) శత్రువులను సంహరించు (శుష్మమ్) వారిని శుష్కింపజేయు బలమును (శిశుమ్) బాలురు (మాతరా) మాతాపితలకు (న) వలె (క్షోణీ) తమరి, ఇతరుల భూములు (అను, ఈయతుః) అనుకూలముగ ఎట్లు లభించుచున్నవో, అట్లే (తే) నీయొక్క (మన్యవే) క్రోధముచే (విశ్వః, స్పృధః) ఈర్ష్యాపరులగు సమస్త శత్రుసైన్యములు (శ్నథయన్త) నష్టభ్రష్టమగునట్లు వధించుము. (యత్) ఏ (వృత్రమ్) న్యాయవిరోధకులగు శత్రువులను నీవు (తూర్వసి) హతమొనర్చుచున్నావో, వారు పరాజితులగుచున్నారు. ।౬౭॥

**భావార్థము :-** ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. ఏ రాజులకు బలవీర్యపరాక్రమములుగలిగి యుద్ధనైపుణ్యముగలిగి ప్రతిజ్ఞయొనర్చు సైన్యము లుండునో వారు సర్వత్ర విజయప్రాప్తిని పొందెదరు.।౬౭॥

67. O King, just as sire and mother walk after the child, so do thy enemies and their terrotories fall into thy hands. When thou killest thy unjust foe, all his forces are weakened before thy indignation!.

౧౨౬౪.యజ్ఞ ఇత్యస్య కుత్స ఋషిః, ఆదిత్యా దేవతాః, స్వరాట్ పఙ్క్తిః ఛన్దః, నిషాదః స్వరః.

పున స్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨౬౪ యజ్ఞో దేవానాం ప్రత్యేతి సుమ్నమాదిత్యాసో భవతా మృడయన్తః। ఆ

వోఽర్వాచీసుమతిర్వవృత్యాదంహోశ్చిద్యా వరివోవిత్తరాసత్ ।౬౮॥

ప.విః- యజ్ఞః, దేవానామ్, ప్రతి, ఏతి, సుమ్నమ్, ఆదిత్యాసః, భవత, మృడయన్తః, ఆ, వః, అర్వాచీ, సుమతిరితి సు+మతిః, వవృత్యాత్, అంహోః, చిత్, యా, వరివోవిత్తరేతి వరివో విత్+తరా, అసత్.॥౬౮॥

పదార్థః :- (యజ్ఞః) సఙ్గన్తవ్యః సఙ్గ్రామాది వ్యవహారః (దేవానామ్) విదుషామ్ (ప్రతి) (ఏతి) ప్రాప్నోతి (సుమ్నమ్) సుఖం కర్తుమ్ (ఆదిత్యాసః) సూర్యవత్తేజస్వినః (భవత). అత్ర సంహితాయామితి దీర్ఘః. (మృడయన్తః) సుఖయన్తః (ఆ) (వః) యుష్మాకమ్ (అర్వాచీ) అస్మదభిముఖీ (సుమతిః) శోభనా ప్రజ్ఞా (వవృత్యాత్) ఆవర్తతామ్. వృతు ధాతోర్లిఙి వికరణాత్మనేపదం వ్యత్యయేన శ్లుర్ద్విత్వం చ. (అంహోః) అపరాధినః (చిత్) అపి (యా) (వరివోవిత్తరా) యాఽతిశయేన పరిచరణలబ్ధ్రీ (అసత్) స్యాత్.॥౬౮॥

అన్వయః :-హే ఆదిత్యాసః పూర్ణవిద్యా ! యూయం యథా దేవానాం యజ్ఞో సుమ్నం ప్రత్యేతి తథా మృడయన్తో భవత. యథా వో వరివో విత్తరాఽర్వాచీ సుమ తిరావవృత్యా దంహో శ్చిత్తథా సుఖకరీ అసత్ ॥౬౮॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యస్య దేశస్య మధ్యే పూర్ణవిద్యా రాజకర్మకరాః స్యు స్తత్ర సర్వేషామేకా మతిర్భూత్వా సుఖమత్యంతం వర్ధేత.॥౬౮॥

పదార్థము :-(ఆదిత్యాసః) సూర్యునివంటి తేజోవంతులగు పూర్ణ విద్వాంసులగు జనులారా! ఎట్లు (దేవానామ్) విద్వాంసుల (యజ్ఞః) సంగతి యోగ్యమగు సంగ్రామము మున్నగు వ్యవహారములు (సుమ్నమ్) సుఖమును గలిగించుటకు (ప్రత్యేతి) తారుమారుగా ప్రాప్తించుచున్నవో, అటులనే (మృడయన్తః) సుఖమును గలిగించువారు (భవత) అగుడు, ఎట్లు (వః) నీయొక్క (వరివోవిత్తరా) అత్యంతసేవను ప్రాప్తించుకొనిన (అర్వాచీ) మాకు అనుకూలమగు (సుమతిః) ఉత్తమ బుద్ధి (ఆ, వవృత్యాత్) ఉత్తమముగా వర్తించుచున్నదో (అంహోః) అపరాధులకు (చిత్) కూడ అటులనే సుఖమును గలుగజేయునట్టి అనుకూలమగు బుద్ధి (అసత్) మాకు కలుగునుగాక! ॥౬౮॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ దేశమునందు పూర్ణ విద్వాంసుడగు రాజు, మరియు కర్మచారిగణ ముండునో అందరు ఏకాభిప్రాయముగలవారై ఉందురో అక్కడ అత్యంత సుఖములు వర్ధిల్లును.॥౬౮॥

68. Struggle is a source of happiness for the learned. O well-read scholars remain firm in happiness. Let your favour be directed towards us; which may bring us riches even from the sinful foe!

౧౭౯. అదబ్ధేభి రిత్యస్య భరద్వాజ ఋషిః, సవితా దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౭౯ అదబ్ధేభిః సవితః పాయుభిష్ట్వꣳ శివేభిరద్య పరి పాహి నో గయమ్। హిరణ్యజిహ్వః సువితాయ నవ్యసే రక్షా మాకిర్నోఽఅఘశꣳస ఈశత॥౯॥

ప.వి:- అదబ్ధేభిః, సవితరితి సవితః, పాయుభిరితి పాయుభిః, త్వమ్, శివేభిః, అద్య, పరి, పాహి, నః, గయమ్, హిరణ్యజిహ్వ ఇతి హిరణ్య + జిహ్వః, సువితాయ, నవ్యసే, రక్ష, మాకిః, నః, అఘశంసః, ఈశత.॥౯॥

పదార్థః :- (అదబ్ధేభిః) అహింసితైః (సవితః) అనేకపదార్థోత్పాదక తేజస్విన్ ! విద్వన్ రాజన్ ! (పాయుభిః) రక్షణైః (త్వమ్) (శివేభిః) కల్యాణకారకైః (అద్య) (పరి) (పాహి) రక్ష (నః) అస్మాకమ్ (గయమ్) ప్రశంసనీయ మపత్యం ధనం గృహం వా. గయ ఇత్యపత్యనామ. నిఘం. ౨.౨. ధననామ. ౨.౧౦. గృహ నామ చ. ౩.౪. (హిరణ్యజిహ్వః) హిరణ్యం హితరమణీయా జిహ్వావాగ్యస్య సః. హితరమణమ్భవతీతి వా హృదయరమణమ్భవతీతి వా. నిరు... ౨.౧౦. జిహ్వేతి వాఙ్నామ. నిఘం. ౧.౧౧. (సువితాయ) ఐశ్వర్యాయ (నవ్యసే) అతిశయేన నవీనాయ (రక్ష). అత్రద్వచోఽతస్తిఙ ఇతి దీర్ఘః. (మాకిః) నిషేధే (నః) అస్మాన్ (అఘశంసః) అఘస్య పాపస్య స్తోతా చోరః (ఈశత) సమర్థో భవేత్.॥౯॥

అన్వయః :-హే సవిత స్త్వమదబ్ధేభిః శివేభిః పాయుభి రద్యనో గయం పరిపాహి హిరణ్యజిహ్వః సన్ నవ్యసే సువితాయ నో రక్ష యతోఽఘశంసో నో మాకిరీశత.॥౯॥

భావార్థః :- ప్రజాజనైః రాజపురుషా ఏవం సమ్బోధనీయా యూయ మస్మాక మపత్య ధన గృహాదీనాం పదార్థానాం రక్షణేన నవీనం నవీనమైశ్వర్యం ప్రాపయ్యాస్మభ్యం పీడా ప్రదానద్దారే రక్షత.॥౯॥

పదార్థము :- (సవితః) అనేక పదార్థముల ఉత్పాదకుడవు, తేజోవంతుడవు, విద్వాంసుడవునగు నో రాజా! (త్వమ్) నీవు (అదబ్ధేభిః) హింసించకూడనివి (శివేభిః) కల్యాణకారక (పాయుభిః) రక్షణలతో (అద్య) నేడు (నః) మాయొక్క (గయమ్) ప్రశంసనీయ సంతాన, ధన,గృహములను (పరిపాహి) అన్నివైపులనుండి

రక్షణయొనర్చుము (హిరణ్యజిహ్వః) అందరిహితమందే ఆనంద మొందదగిన వాక్కుగల నీవు (నవ్యసే) అతినూతనమగు (సువితాయ) ఐశ్వర్యముకొరకు (నః) మమ్ము (రక్ష) రక్షణనొనర్చుము. అందుచే (అఘశంసః) పాపముల ప్రశంస నొనర్చు దుష్టులు, చోరులు మాపై (మాకిః, ఈశత) దండెత్తుటకు కాకుందురుగాక! ॥౬౯॥

భావార్థము :- ఓ రాజపురుషులారా! మీరు సంతానము ధనము, గృహము, మరియు పదార్థములు మున్నగువానిని చక్కగా కాపాడుటద్వారా నవీన ఐశ్వర్యములను ప్రాప్తింపజేసి మమ్ము బాధలకు గురిజేయు దుష్టులను దూరపరచి, నాశమొందించుడని ప్రజలు రాజపురుషులను కోరవలెను. ॥౬౯॥

69. O King with non-violent, propitious aids, protect this day, on all sides, our progeny, riches and home. Master of speech conducive to the welfare of all, keep us for newest bliss; let no evil-wisher lord over us!.

౧౨౬౬. ప్ర వీరయేత్యస్య వసిష్ఠ ఋషిః, వాయు ర్దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨౬౬ ప్ర వీరయా శుచయో దద్రిరే వామధ్వర్యుభిర్మధుమన్తః సుతాసః।

వహ వాయో నియుతో యాహ్యచ్ఛా పిబా సుతస్యాన్ధసో మదాయ ॥౭౦॥

ప.వి:- ప్ర, వీరయేతి వీర + యా, శుచయః, దద్రిరే, వామ్, అధ్వర్యుభిరిత్యధ్వర్యు + భిః, మధుమన్త ఇతి మధు + మన్తః, సుతాసః, వహ, వాయోఽఇతి వాయో, నియుత ఇతి ని + యుతః, యాహి, అచ్ఛ, పిబ, సుతస్య, అన్ధసః, మదాయ. ॥౭౦॥

పదార్థః :- (ప్ర) (వీరయా) వీరయుక్తయా (శుచయః) పవిత్రాః (దద్రిరే) విదీర్ణాన్ కుర్వన్తి వ్యత్యయే నాత్రాత్మనేపదమ్ (వామ్) యువయోః రాజప్రజాజనయోః (అధ్వర్యుభిః) హింసాఽన్యాయవర్జితైః సహ (మధుమన్తః) ప్రశస్తవిజ్ఞానయుక్తాః (సుతాసః) విద్యాసు శిక్షాభ్యాం నిష్పన్నాః (వహ) ప్రాపయ (వాయో) వాయువద్వర్తమాన బలిష్ఠ రాజన్! (నియుతః) నితరాం మిశ్రితామిశ్రితాన్ వాయ్వాదిగుణాన్ (యాహి) ప్రాప్నుహి (అచ్ఛ) సమ్యక్. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. (పిబ) అత్రద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (సుతస్య) నిష్పన్నస్య (అన్ధసః) అన్నస్య (మదాయ) ఆనన్దాయ. ॥౭౦॥

అన్వయః :- హే రాజప్రజాజనౌ! యే వాం మధుమన్తః సుతాసః శుచయో జనా

అధ్వర్యుభిః వీరయా సేనయా శత్రూన్ ప్ర దద్రిరే తైః సహ. హే వాయో! త్వం నియుతః వహ అచ్ఛ యాహి మదాయ సుతస్యాన్ధసో రసం చ పిబ.॥౭౦॥

భావార్థః :- యే పవిత్రాచరణా రాజప్రజాభక్తా విజ్ఞానవన్తో వీరసేనయా శత్రూన్ విదృణన్తి తాన్ ప్రాప్య రాజాऽऽనన్దితో భవేత్. తథా స్వస్మా ఆనన్ద మిచ్ఛేత్తథా రాజప్రజాజనేభ్యోऽపి కాఙ్క్షేత.॥౭౦॥

పదార్థము :- ఓ రాజప్రజలారా! (వామ్) మీ యిరువురి (మధుమన్తః) ప్రశంసనీయ జ్ఞానయుక్తమగు (సుతాసః) విద్య మరియు ఉత్తమశిక్షణద్వారా సాధించబడినట్టి (శుచయః) పవిత్ర మానవులు (అధ్వర్యుభిః) హింసా మరియు అన్యాయములకు దూరముగ నుండువారితో గూడ (వీరాయ) వీరులగు సైన్యములతో శత్రువులను (ప్ర, దద్రిరే) ఎట్లు విదీర్ణపరచుచున్నారో, వారితోగూడ (వాయో) వాయువువంటి బలిష్ఠుడవగు ఓ రాజా! నీవు (నియుతః) నిరంతరము సంయుక్త వియుక్త మగునట్టి వాయువు మున్నగు వాని గుణములను (వహ) పొందుము. మరియు (అచ్ఛ, యాహి) చక్కగా ప్రాప్తించుము, మరియు (మదాయ) ఆనందముకొరకు (సుతస్య) సిద్ధపరచబడినట్టి (అన్ధసః) అన్నరసమును (పిబ) పానమొనర్చుము. ॥౭౦॥

భావార్థము :- పవిత్రాచరణమునందుండు రాజు ప్రజలకు హితమును సమకూర్చు వీరులగు సైన్యములతో శత్రువులను విదీర్ణపరచువారిని పొందిన రాజు ఆనందితుడై యుండవలెను. రాజు ఏవిధముగ తన కొరకు ఆనందమును కోరుకొనునో, అదేవిధముగ ప్రజలకును కోరుచుండవలయును.॥౭౦॥

70. O officials and people, your noble persons full of praiseworthy knowledge, education and nice instructions, with the help of the non-violent and just, rend asunder the foes with and army of brave soldiers!.

O King, strong like the wind, possess the qualities of joining and separating like the air, invade courageously thy enemies, and drink for thy rapture the sap of well-prepared food!.

౧౭౬౭. గావ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, మిత్రావరుణౌ దేవతే, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ పృథివీసూర్యౌ కీదృశావిత్యాహ. ధరణి సూర్య లెటులున్నవి?

౧౭౬౭ గావఉపావతావతం మహీ యజ్ఞస్య రప్సుదా।
ఉభా కర్ణా హిరణ్యయా॥౭౧॥

ప.వి:- గావః, ఉప, అవత, అవతమ్, మహీऽఇతి మహీ, యజ్ఞస్య, రప్సుదా, ఉభా, కర్ణా, హిరణ్యయా.॥౭౧॥

పదార్థః :- (గావః) కిరణాః (ఉప) (అవత) రక్షత (అవతమ్) కూపమ్ (మహీ) ద్యావాపృథివ్యౌ (యజ్ఞస్య) సఙ్గతస్య సంసారస్య (రప్సుదా) సురూపప్రదే (ఉభా) ఉభే (కర్ణా) కర్త్ర్యౌ. (హిరణ్యయా) జ్యోతిష్ప్రచురే.॥౭౧॥

అన్వయః :-హే మనుష్యా! యథా రప్సుదా ఉభా కర్ణా హిరణ్యయా మహీ యజ్ఞస్యావతమివ రక్షికే భవతో గావశ్చ రక్షకాః స్యు స్తథైతాన్ యూయమువావత.॥౭౧॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా కృషీవలాః కూపోదకేన క్షేత్రాణ్యారామాంశ్చ సంరక్ష్య శ్రీమన్తో భవన్తి తథా పృథివీసూర్యౌ సర్వేషాం శ్రీకారకే భవతః.॥౭౧॥

పదార్థము :- ఓ మానవులారా! ఎట్లు (రప్సుదా) చక్కనిరూపము నిచ్చునవి (ఉభా) రెండు (కర్ణా) కార్యసాధకములు (హిరణ్యయా) జ్యోతిః స్వరూపములునగు (మహీ) మహాపరిమాణముగల సూర్యుడు, భూమి (యజ్ఞస్య) స్నేహియగు విశ్వమును (అవతమ్) కూపమువలె రక్షణయొనర్చునవి యగుచున్నవో, మరియు (గావః) కిరణములెట్లు రక్షకము లగుచున్నవో, అట్లనే వానిని మీరు (ఉప, అవత) రక్షణయొనర్చుడు.॥౭౧॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఏవిధముగా కృషీవలురు [రైతులు] కూపజలములచే పంటచేలను, తోటలను చక్కగా రక్షణయొనర్చి ధనవంతు లగుదురో, అదేవిధముగ పృథివి, సూర్యులు అందరకును ధనకారకులు, ప్రాణదాతలు నగుచున్నారు.॥౭౧॥

71. O men, just as both immense Sun and Earth, full of brilliance, the fulfillers of all transactions, the bestowers of beauty, guard this organised world like a well, and ryas also guard it, so should ye guard them!.

౧౭౭౮.కావ్య యోరిత్యస్య దక్ష ఋషిః, విద్వాన్ దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథాఽధ్యాపకోపదేశక విషయమాహ. అధ్యాపకోపదేశకుల విషయము.

౧౭౭౮ కావ్యయోరాజానేషు క్రత్వా దక్షస్య దురోణే।రిశాదసా సధస్థఽఆ॥౭౨॥

ప.వి:- కావ్యయోః, ఆజానేష్విత్యా + జానేషు, క్రత్వా, దక్షస్య, దురోణే, రిశాదసా, సధస్థ ఇతి సధ + స్థే, ఆ.॥౭౨॥

పదార్థః :-(కావ్యయోః) కవిభిర్విద్వద్భిర్నిర్మితయోర్వ్యవహారపరమార్థ ప్రతిపాదకయోర్గ్రన్థయోః (ఆజానేషు) సమన్తాజ్జాయన్తే విద్వాంసో యైస్తేషు పఠనపాఠనాది వ్యవహారేషు

(క్రత్వా) ప్రజ్ఞయా కర్మణా వా (దక్షస్య) కుశలస్య జనస్య (దురోణే) గృహే (రిశాదసా) అవిద్యాది దోషనాశకావధ్యాపకోపదేశకౌ (సధస్థే) సహ తిష్ఠన్తి యత్ర (ఆ) సమన్తాత్.॥౭౨॥

అన్వయః :- హే రిశాదసా కావ్యయోరాజానేషు క్రత్వా దక్షస్య సధస్థే దురోణే యువామాగచ్ఛతమ్.॥౭౨॥

భావార్థః :- హే మనుష్యా ! యావధ్యాపకోపదేశకౌ రాజప్రజాజనాన్ ప్రాజ్ఞాన్ బలయుక్తానరోగాన్ పరస్పరస్మిన్ ప్రీతిమతో ధర్మాత్మనః పురుషార్థినః సంపాదయేతాం తౌ పితృవత్సత్కర్తవ్యౌ స్తః.॥౭౨॥

పదార్థము :- (రిషాదసా!) అవిద్య మున్నగుదోషముల నష్టమొనర్చు అధ్యాపకోపదేశకులారా! మీరిరువురు (కావ్యయోః) కవులు, విద్వాంసులు సృష్టించిన వ్యవహార పరమార్థముల ప్రతిపాదకములగు గ్రంథములందు (ఆజానేషు) విద్వాంసులనొనర్చు పఠనపాఠనాది వ్యవహారములందు (క్రత్వా) బుద్ధిద్వారానో కర్మయొనర్చుటద్వారానో (దక్షస్య) కుశలుడగువాని (సధస్థే) కలిసిమెలసియుండునట్టి (దురోణే) గృహమునకు మీరు (ఆ) వచ్చుచు నుండుడు.॥౭౨॥

భావార్థము :- మానవులారా! ఏ అధ్యాపక, ఉపదేశకులు రాజును, ప్రజలను బుద్ధిశాలురగ, శక్తివంతులుగ, ఆరోగ్యవంతులుగ, పరస్పర ప్రీతిగలవారుగ, ధర్మాత్ములుగ, పురుషార్థపరులుగ నొనర్చెదరో వారు తండ్రివలె సత్కారార్హులు.॥౭౨॥

72. O teacher and preacher, the dispellers of the sins of nescience, come ye with force of intellect to the study circles where are studied the works of poets on worldly and spiritual topics, to the meeting place and the dwelling of a scholarly person!.

౧౨౭౯.దైవ్యావిత్యస్య దక్ష ఋషిః, అధ్వర్యూ దేవతే, నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ యాననిర్మాణ విషయమాహ. యాననిర్మాణ విషయము.

౧౨౭౯ దైవ్యా వధ్వర్యూ ఆ గతꣳ రథేన సూర్యత్వచా। మధ్వా యజ్ఞꣳ సమఞ్జాథే॥ తమ్ప్రత్నథా। అయం వేనః ॥౭౩॥

ప.వి:- దైవ్యా, అధ్వర్యూ౨ఇత్యధ్వర్యూ, ఆ, గతమ్, రథేన, సూర్యత్వచేతి సూర్య + త్వచా, మధ్వా, యజ్ఞమ్, సమ్, అఞ్జాథ ఇత్యఞ్జాథే ॥౭౩॥

పదార్థః :- (దైవ్యౌ) దేవేషు విద్వత్సు కుశలౌ (అధ్వర్యూ) ఆత్మనోఽధ్వర మహింసా మిచ్ఛన్తౌ (ఆ) (గతమ్) ఆగచ్ఛతమ్ (రథేన) రమణహేతునా యానేన (సూర్యత్వచా) సూర్య ఇవ ప్రదీప్తా త్వగ్ యస్య తేన (మధ్వా) మధురభాషణేన (యజ్ఞమ్) గమనాఖ్యం వ్యవహారమ్ (సమ్) (అఞ్జాథే) ప్రకటయతమ్.॥23॥

అన్వయః :- హే దైవ్యా వధ్వర్యూ! యువాం సూర్యత్వచా రథేనాగతమాగత్య మధ్వా యజ్ఞం సమఞ్జాథే.॥23॥

భావార్థః :- మనుష్యైర్యాని భూజలాన్తరిక్ష గమకాని సుశోభితాని సూర్యవత్ప్రకాశితాని యానాని నిర్మాతవ్యాని తైరభీష్టాః కామాః సాధనీయాః.॥23॥

పదార్థము :- (దైవ్యౌ) విద్వాంసులందు కుశలురు, ప్రవీణులు (అధ్వర్యూ) స్వాత్మయందు అహింసా ధర్మములను గోరునట్టి విద్వాంసులారా! మీరిరువురును (సూర్యత్వచా) సూర్యునివలె కాంతిగలవారై (రథేన) ఆనందమునకు హేతువగు యానముతో (ఆ, గతమ్) వచ్చుచుండుడు. వచ్చిన పిదప (మధ్వా) మధురమగు భాషణముచే (యజ్ఞమ్) నడచుచున్న వ్యవహార రూపమును (సమ్, అఞ్జాథే) చక్కగా ప్రకటపరచుడు.॥23॥

భావార్థము :- మానవులు పృథివి, జలము, అంతరిక్షములందు చక్కగా విహరించగల ఉత్తమ శోభావంతములు, సూర్యునివలె ప్రకాశితములునగు యానములను నిర్మించుకొని ఇష్టకామ్యార్థములను సాధించుకొనవలెను. ॥23॥

73. Ye two learned persons, believers in non-violence, come hither in the sun - bright plane, and explain fully to us the conduct of life!.

౧౭౭౦. తిరశ్చీన ఇత్యస్య ప్రజాపతి ఋషిః, సూర్యో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ విద్వద్విషయ మాహ. విద్వాంసుని విషయము.

౧౭౭౦ తిరశ్చీనో వితతో రశ్మిరేషామధః స్విదాసీ3దుపరి స్విదాసీ3త్। రేతోధాఽ ఆసన్మహిమానఽఆసన్త్స్వధాఽఅవస్తాత్ప్రయతిః పరస్తాత్॥24॥

ప.వి:-తిరశ్చీనః, వితత ఇతి వి + తతః, రశ్మిః, ఏషామ్, అధః, స్విత్, ఆసీత్, ఉపరి, స్విత్, ఆసీత్, రేతోధా ఇతి రేతః + ధాః, ఆసన్, మహిమానః, ఆసన్, స్వధా, అవస్తాత్, ప్రయతిరితి ప్ర + యతిః, పరస్తాత్.॥24॥

పదార్థః :-(తిరశ్చీనః) తిర్యగ్గమనః (వితతః) విస్తృతః (రశ్మిః) కిరణోదీప్తిః (ఏషామ్) విద్యుత్సూర్యాదీనామ్ (అధః) అర్వాక్ (స్విత్) అపి (ఆసీత్) అస్తి (ఉపరి) (స్విత్) (ఆసీత్) అస్తి (రేతోధాః) యే రేతో వీర్యం దధతి తే (ఆసన్) సన్తు (మహిమానః) పూజ్యమానాః (ఆసన్) స్యుః (స్వధా) యే స్వం దధతి తే. అత్ర విభక్తిలోపః (అవస్తాత్) అవరస్మాత్ (ప్రయతిః) ప్రయతనశీలం (పరస్తాత్) పరస్మాత్.॥౭౪॥

అన్వయః :-హే మనుష్యా! ఏషాం తిరశ్చీనో వితతో రశ్మిరధః స్విదాసీదుపరి స్విదాసీదవస్తాత్పరస్తాచ్చ ప్రయతి రస్తి తద్విజ్ఞానేన రేతోధా ఆసన్ మహిమానః స్వధా సన్తో భవన్త ఉపకారకా ఆసన్.॥౭౪॥

భావార్థః :-హే మనుష్యా! యస్యా విద్యుతో దీప్తి రన్తస్థా సతీ సర్వాసు దిక్షు వ్యాప్తాఽస్తి సైవ సర్వం దధాతీతి యూయం విజానీత. ॥౭౪॥

పదార్థము :- ఓ మానవులారా! (ఏషామ్) ఈ విద్యుత్తు మరియు సూర్యాదుల (తిరశ్చీనః) వంకరనడకగల (వితతః) విస్తారయుక్తమగు (రశ్మిః) కిరణములు లేక దీప్తి (అధః) క్రింద (స్విత్) కూడ (ఆసీత్) ఉన్నవి (ఉపరి) పైన (స్విత్) కూడ (ఆసీత్) ఉన్నవి మరియు (అవస్తాత్) ఈ వైపునుండి మరియు (పరస్తాత్) ఆవైపునుండి (ప్రయతిః) ప్రయత్నశీలమైయున్నవి. వాని విజ్ఞానముచే (రేతోధాః) పరాక్రమమును ధరించువారలు (ఆసన్) అగుదురుగాక! మరియు (మహిమానః) పూజనీయుడు మరియు (స్వధా) తమ ధనాదిపదార్థముల ధారణమొనర్చు హేతువులగుచు మీరు ఉపకారశీలురు (ఆసన్) అగుడు. ॥౭౪॥

భావార్థము :- ఓ మానవులారా! ఏ విద్యుత్తు యొక్క దీప్తి సర్వమునందుండుచును, సకల దిశలందు వ్యాప్తమైయున్నదో, అదియే సర్వమును ధారణమొనర్చుచున్నది. దానినిమీరు చక్కగా తెలిసికొనుడు.॥౭౪॥

74. The transverse and extended light of the sun and lightning is found above and below. It is struggling from hither and thither. With its knowledge men should gain strength, and become venerable and philanthropic with their wealth.

౧౭౭౧.ఆ రోదసీత్యస్య విశ్వామిత్ర ఋషిః విద్వాన్ దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౭౭౧ ఆ రోదసీఽఅపృణదా స్వర్మహజ్జాతం యదేనమపసోఽఅధారయన్।

సోఽఅధ్వరాయ పరిణీయతే కవిరత్యో న వాజసాతయే చనోహితః॥౭౫॥

ప.వి:- ఆ, రోదసీఽఇతి రోదసీ, అపృణత్, ఆ, స్వః, మహత్, జాతమ్, యత్, ఏనమ్,

అపసః, అధారయన్, సః, అధ్వరాయ, పరి, నీయతే, కవిః, అత్యః, న, వాజసాతయఇతి వాజ + సాతయే, చనోహితఇతి చనః + హితః.॥౭౫॥

పదార్థః :- (ఆ) సమన్తాత్ (రోదసీ) ద్యావాపృథివ్యౌ (అపృణత్) పృణాతి వ్యాప్నోతి (ఆ) (స్వః) అన్తరిక్షమ్ (మహత్) (జాతమ్) (యత్) (ఏనమ్) (అపసః) కర్మాణి (అధారయన్) ధారయన్తి (సః) (అధ్వరాయ) అహింసాఖ్యాయ శిల్పమయాయ యజ్ఞాయ (పరి) సర్వతః (నీయతే) ప్రాప్యతే (కవిః) శబ్దహేతుః (అత్యః) యోఽతతి వ్యాప్నోత్యధ్వానం సోఽశ్వః (న) ఇవ (వాజసాతయే) వాజస్య వేగస్య సంభజనాయ (చనోహితః) చనసే పృథివ్యాద్యన్నాయ హితకారీ. చన ఇత్యన్ననామ...నిరు. ౬.౧౬.. ॥౭౫॥

అన్వయః :- హే మనుష్యా! యద్యో విద్యుద్రూపోఽగ్నీ రోదసీ మహజ్జాతం స్వశ్చాఽఽపృణదేనమపస అధారయన్ యశ్చ కవిరధ్వరాయ వాజసాతయే చాత్యోన విద్వద్భిః పరిణీయతే స చ నో హితోఽస్తీతి యూయం విజానీత.॥౭౫॥

భావార్థః :-మనుష్యై రనేకవిధై ర్విజ్ఞానకర్మభి ర్విద్యుద్విద్యాం లబ్ధ్వా భూమ్యాదిషు వ్యాప్తో విభాజకశ్చ సాధితః సన్ యానాదీనాం సద్యో గమయితాఽగ్నిః కార్యేషూపయోక్తవ్యః.॥౭౫॥

పదార్థము :- ఓ మానవులారా! (యత్) ఏ విద్యుద్రూపాగ్ని (రోదసీ) సూర్యుడు, పృథివి మరియు (మహత్) మహా (జాతమ్) ప్రసిద్ధమగు (స్వః) అంతరిక్షమున (ఆ,అపృణత్) చక్కగా వ్యాప్తమగుచున్నదో (ఏనమ్) ఈ యగ్నిని (అపసః) కర్మలు (ఆ, అధారయన్) బాగుగా ధారణమొనర్చుచున్నవియో, ఎయ్యది (కవిః) శబ్దము గలుగుటకు హేతువగుచున్నదో, అట్టి అగ్ని (అధ్వరాయ) అహింసానామక, శిల్పవిద్యారూప యజ్ఞమును మరియు (వాజసాతయే) వేగమును చక్కగా సేవించుటకొరకు (అత్యః) మార్గమును వ్యాప్తపరచునట్టి అశ్వముల (న) వలె విద్వాంసులు (పరి, నీయతే) పొందినారో (సః) అది (చనోహితః) పృథివి మున్నగు అన్నము కొరకు హితకారియై యున్నదని మీరు తెలిసికొనుడు.॥౭౫॥

భావార్థము :- మానవులు అనేక విధములగు విజ్ఞానము, మరియు కర్మలచే విద్యుత్తు రూపాగ్నియొక్క విద్యను చక్కగా ప్రాప్తిజేసికొని భూమ్యాదులందు వ్యాప్తము, విభాగకర్త, సాధించబడిన యానములను శీఘ్రముగా గమ్యమునకు చేర్చునట్టి అగ్నిని కార్యములందు ఉపయుక్త పరచవలయును.॥౭౫॥

75. Electricity hath filled the Heaven and Earth and the great apparent realm of light. This fire is utilised through application; being the cause of sound, it is used for non-violent industrial concerns. For fastness in battle it is used as a horse that covers distances quickly. It is helpful for the growth of food grains from the Earth.

౧౨౨౨. ఉక్థేభి రిత్యస్య వసిష్ఠ ఋషిః, ఇన్ద్రాగ్నీ దేవతే, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

కీదృశా జనాః సత్కారార్హాః స్యురిత్యాహ. ఎటువంటి జనులు సత్కరించ యోగ్యులు?

౧౨౨౨ ఉక్థేభిర్వృత్రహన్తమా యా మన్దానా చిదా గిరా।ఆఙ్గూషైరావివాసతః॥౭౬॥

ప.విః- ఉక్థేభిః, వృత్రహన్తమేతి వృత్రహన్ + తమా, యా, మన్దానా, చిత్, ఆ, గిరా, ఆఙ్గూషైః, ఆవివాసత ఇత్యా + వివాసతః.॥౭౬॥

పదార్థః :- (ఉక్థేభిః) ప్రశంసనీయైః స్తుతిసాధకై ర్వేదవిభాగైర్మన్త్రైః (వృత్రహన్తమా) అతిశయేన వృత్రాణామావరకాణాం పాపినాం హన్తారౌ (యా) యౌ (మన్దానా) ఆనన్దప్రదౌ. అత్ర సర్వత్ర విభక్తే ర్డాదేశః (చిత్)ఇవ (ఆ) సమన్తాత్ (గిరా) వాణ్యా (ఆఙ్గూషైః) సమన్తాద్ ఘోషైః (ఆవివాసతః) సమన్తాత్ పరిచరతః.॥౭౬॥

అన్వయః :- యా మన్దానా వృత్రహన్తమా సభాసేనాధ్యక్షౌ చిదివ గిరా ఆఙ్గూషై రుక్థేభిశ్చ శిల్పవిజ్ఞాన మావివాసతస్తావధ్యాపకోపదేశకౌ మనుష్యై రాసేవనీయౌ.॥౭౬॥

భావార్థః :- యే మనుష్యాః!సభాసేనాధ్యక్షవద్విద్యాదికార్యసాధకాః సూపదేశైః సర్వాన్ విదుషః సమ్పాదయన్తః ప్రవృత్తాః స్యుస్త ఏవ సర్వైః సత్కర్తవ్యా భవేయుః.॥౭౬॥

పదార్థము :-(యా) ఎవరు (మన్దానా) ఆనందదాయకములగు (వృత్రహన్తమా) ధర్మనిరోధకులగు పాపాత్ములను నాశమొనర్చు సభా, సేనాపతుల (చిత్) వంటి (గిరా) వాణిని (ఆఙ్గూషైః) చక్కగా ఘోషణమొనర్చు మరియు (ఉక్థేభిః) ప్రశంసనీయ స్తుతుల సాధకమగు వేదముయొక్క భాగరూప మంత్రములద్వారా శిల్పవిజ్ఞానమును (ఆవివాసతః) చక్కగా సేవనమొనర్చెదరో,అట్టి అధ్యాపక, ఉపదేశకులను (ఆ) ఉత్తమవిధిగా సేవించవలయును. ॥౭౬॥

భావార్థము :- సభాపతి, సేనాధిపతులవలె విద్య మున్నగు కార్యములను సాధించుచు చక్కని ఉపదేశములచే ఎల్లరను విద్వాంసులనుగ జేయుచు ప్రవృత్తులైయుందురో, వారు మాత్రమే అందరిచే సత్కరించదగినవారైయుందురు. ॥౭౬॥

76. The teacher and preacher are deserving of praise, who like the King and Commander of the army, the bestowers of happiness and chastisers of the irreligious sinners, spread technical knowledge through vedic verses, speech and proclamations.

౧౨౨౩.ఉప న ఇత్యస్య సుహోత్ర ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృద్గాయత్రీ ఛన్దః షడ్జః స్వరః.

అథ పితరౌ స్వసన్తానాన్ ప్రతి కిం కుర్యాతామిత్యాహ.మాతాపితరులు స్వసంతానమునకై యేమి యొనర్చవలెను?

౧౭౭౩ ఉప నః సూనవో గిరః శృణ్వన్త్వమృతస్య యేసువృడీకా భవన్తు నః॥౭౭॥

ప.వి:- ఉప, నః, సూనవః, గిరః, శృణ్వన్తు, అమృతస్య, యే, సుమృడీకా ఇతి సు + మృడీకాః, భవన్తు, నః.॥౭౭॥

పదార్థః:-(ఉప) (నః) అస్మాకమ్ (సూనవః) అపత్యాని (గిరః) (శృణ్వన్తు) (అమృతస్య) నాశరహితస్య పరమేశ్వరస్య నిత్యస్య వేదస్య వా (యే) (సుమృడీకాః) సుష్ఠు సుఖకరాః (భవన్తు) (నః) అస్మభ్యమ్.॥౭౭॥

అన్వయః :-యే నః సూనవోఽమృతస్య గిర ఉపశృణ్వన్తు తే నస్సుమృడీకా భవన్తు.॥౭౭॥

భావార్థః :- యది మాతాపితరౌ స్వపుత్రాన్ కన్యాశ్చ బ్రహ్మచర్యేణ వేదవిద్యయా సుశిక్షయా చ యుక్తాన్ కృత్వా శరీరాత్మబలవతః కుర్యాతాం తర్హి తేభ్యోఽత్యన్త సుఖకరౌ స్యాతామ్.॥౭౭॥

పదార్థము :-(యే) ఏ (నః) మాయొక్క (సూనవః) సంతానము (అమృతస్య) నాశరహిత పరమేశ్వరుని సంబంధిత మరియు సదా వేదముల (గిరః) వాణులను (ఉప, శృణ్వన్తు) అధ్యాపకుల సాన్నిధ్యమున వినెదరో, వారు (నః) మాయెడ (సుమృడీకాః) ఉత్తమసుఖము గలిగించువారు (భవన్తు) కాగలుగుదురు.॥౭౭॥

భావార్థము:- ఏ తల్లిదండ్రులు తమ పుత్రులను మరియు కన్యలగు పుత్రికలను బ్రహ్మచర్యముతోగూడ వేదవిద్యలను మరియు ఉత్తమ శిక్షణగలవారిగ జేసి, శరీరాత్మల బలశాలురుగ నొనర్చినచో వారు దేశము మరియు జాతికి అత్యంత హితకారులగుదురు.॥౭౭॥

77. May our sons listen about the Immortal God, to the eternal preachings of the Vedas from their teachers, and bring us joy.

౧౭౭౪. బ్రహ్మాణీత్యస్య అగస్త్య ఋషిః, ఇన్ద్రమరుతౌ దేవతే, విరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునర్విద్వాంసః కిం కుర్యు రిత్యాహ. మరల విద్వాంసు లేమి చేయవలెను ?

౧౭౭౪ బ్రహ్మాణి మే మతయః శ్సుతాసః శుష్మఽఇయర్తి ప్రభృతో మేఽఅద్రిః।
ఆ శాసతే ప్రతి హర్యన్త్యుక్థేమా హరీ వహతస్తా నోఽఅచ్ఛ ॥౭౮॥

ప. వి:- బ్రహ్మాణి, మే, మతయః, శమ్, సుతాసః, శుష్మః, ఇయర్తి, ప్రభృత ఇతి ప్రభృతః, మే, అద్రిః, ఆ, శాసతే, ప్రతి, హర్యన్తి, ఉక్థా, ఇమా, హరీఽఇతి హరీ, వహతః, తా, నః, అచ్ఛ.॥౭౮॥

పదార్థః :-(బ్రహ్మాణి) ధనాని (మే) మహ్యమ్ (మతయః) మేధావినః. మతయ ఇతి మేధావి నామ...నిఘం. 3.౧౫. (శమ్) సుఖమ్ (సుతాసః) విద్యాసుశిక్షాభ్యాం నిష్పన్నా ఐశ్వర్యవన్తః (శుష్మః) బలకరః (ఇయర్తి) అర్పయతి. అత్రాన్తర్గతో ణిచ్ (ప్రభృతః) ప్రకర్షేణ హవనాదినా పోషితః (మే) మహ్యమ్ (అద్రిః) మేఘః (ఆ) (శాసతే) ఆశాం కుర్వన్తి. (ప్రతి) (హర్యన్తి) కామయన్తే (ఉక్థా) ప్రశంసనీయాని వేదవచాంసి (ఇమా) ఇమాని (హరీ) హరణశీలావధ్యాపకాఽధ్యేతారౌ (వహతః) ప్రాపయతః (తా) తాని (నః) అస్మభ్యమ్ (అచ్ఛ).॥౭౮॥

అన్వయః :- సుతాసో మతయో మే యాని బ్రహ్మాణి ప్రతి హర్యన్తి ఇమోక్థాఽఽశాసతే శుష్మః ప్రభృతోఽద్రిర్మే యత్ శమియర్తి తా తాని నోఽస్మభ్యం హర్యచ్ఛ వహతః.॥౭౮॥

భావార్థః :- హే విద్వాంసో యేన కర్మణా విద్యామేధోన్నతిః స్యాత్తత్కురుత. యే యుష్మద్విద్యాసుశిక్షే కామయన్తే తాన్ ప్రీత్యా ప్రయచ్ఛత. యే భవద్భ్యోఽధికా స్తేభ్యో యూయం విద్యా గృహ్ణీత.॥౭౮॥

పదార్థము :- (సుతాసః) విద్యా ఉత్తమ శిక్షణలతో గూడిన ఐశ్వర్యశాలురు (మతయః) బుద్ధిశాలురు (మే) నాకొరకు ఏ (బ్రహ్మాణి) ధనములను (ప్రతి, హర్యన్తి) ప్రసిద్ధిగా కాంక్షించెదరో, (ఇమా) ఇట్టి (ఉక్థా) ప్రశంసనీయ వేదవచనముల (ఆ, శాసతే) అభిలాషించెదరో మరియు (శుష్మః) బలకారి (ప్రభృతః) శ్రేష్ఠంగ యజ్ఞాదులచే పుష్టపరచబడిన (అద్రిః) మేఘములు (మే) నాకొరకు నే (శమ్) సుఖములను (ఇయర్తి) అందించుచున్నవో (తా) వానిని (నః) మాకొరకు (హరీ) హరణశీలురగు అధ్యాపకులు, విద్యార్థి (అచ్ఛ, వహత్) చక్కగా లభింపజేయుచున్నారు. ॥౭౮॥

భావార్థము :- ఓ విద్వాంసులారా! ఏ కర్మద్వార విద్య మరియు మేధస్సు వృద్ధియగునో అట్టి క్రియలనే యొనర్చుడు. మీనుండి విద్య మరియు ఉత్తమ శిక్షణల నాశించువారికి ప్రేమపూర్వకముగ నొసగుడు. మీకన్న అధిక విద్వాంసులు తలస్తించిన వారిచే మీరు విద్యలను గ్రహించుడు.॥౭౮॥

78. Endowed with knowledge and good education, the prosperous, wise persons, expect riches, and desire for Vedic instructions from me. Just as the strong cloud well fed through Homa, brings me joy, so should the teacher and the taught teach us different sorts of Vedic knowledge.

౧౭౭౫. అనుత్తమిత్యస్య అగస్త్య ఋషిః, ఇన్ద్రో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వర విషయమాహ. ఈశ్వర విషయము చెప్పబడినది.

౧౭౭౫ అనుత్తమా తే మఘవన్నకిర్ను న త్వావాఀ౨॥౩॥ అస్తి దేవతా విదానః।
న జాయమానో నశతే న జాతో యాని కరిష్యా కృణుహి ప్రవృద్ధ ॥౭౯॥

ప.వి:- అనుత్తమ్, ఆ, తే, మఘవన్నితి మఘ + వన్, నకిః, ను, న, త్వావాన్నితి త్వా + వాన్, అస్తి, దేవతా, విదానః, న, జాయమానః, నశతే, న, జాతః, యాని, కరిష్యా, కృణుహి, ప్రవృద్ధేతి ప్ర + వృద్ధ.॥౭౯॥

పదార్థః :- (అనుత్తమ్) అప్రేరితమ్. నసత్త నిషత్తనుత్త...అ.౮.౨.౬౧. ఇతి నిపాతనమ్. (ఆ) స్మరణే (తే) (మఘవన్) బహుధనయుక్త! (నకిః) ఆకాఙ్క్షాయామ్ (ను) సద్యః(న) (త్వావాన్) త్వయా సదృశః (అస్తి) (దేవతా) దేవ ఏవ దేవతా. స్వార్థే తల్ (విదానః) విద్వాన్ (న) (జాయమానః) ఉత్పద్యమానః (నశతే) వ్యాప్నోతి. నశదితి వ్యాప్తి కర్మా. నిఘం. ౨.౧౮. (న) (జాతః) ఉత్పన్నః (యాని) జగదుత్పత్త్యాదికర్మాణి (కరిష్యా) కరిష్యసి. సిజ్ లోపో దీర్ఘశ్చాత్ర ఛాన్దసః. (కృణుహి) కరోషి. లడర్థే లోట్. (ప్రవృద్ధ).॥౭౯॥

అన్వయః :- హే ప్రవృద్ధ మఘవన్నీశ్వర! యస్య తేఽనుత్తం స్వరూపమస్తి న కోఽపి త్వావాన్ దేవతా విదానో స్వస్తి భవాన్ న జాయమానోఽస్తి న జాతోఽస్తి యాని కరిష్యా కృణుహి చ తాని కశ్చిన్నకిరానశతే స త్వం సర్వోపాస్యోఽసి.॥౭౯॥

భావార్థః :- హే మనుష్యా! యః పరమేశ్వరోఽఖిలైశ్వర్యోఽసదృశోఽనన్తవిద్యో నోత్పద్యతే నోత్పన్నో నోత్పత్స్యతే సర్వేభ్యో మహానస్తి తమేవ యూయం సతతము పాసీత.॥౭౯॥

**పదార్థము** :- (ప్రవృద్ధ) సర్వశ్రేష్ఠుడవు, సర్వపూజ్యుడవు (మఘవన్) అపరిమిత ధనములు గల పరమేశ్వరా! ఏ (తే) నీయొక్క (అనుత్తమ్) అప్రేరిత స్వరూపము గలదో, (త్వావాన్) నీకు సరియగు (దేవతా) పూజించదగిన ఇష్టదైవము (విదానః) విద్వాంసుడు (ను) నిశ్చయముగ ఎవ్వరును (న, అస్తి) లేరు. నీవు (జాయమానః) ఉత్పన్నమగువాడవు (న) కావు. మరియు (జాతః) ఉత్పన్నము (న) కాలేదు. ఏ నీవు (యాని) జగదుత్పత్తి మున్నగు కర్మలను (కరిష్యా) చేసి యున్నావో మరియు (కృణుహి) చేయుదువో,

అందునెవ్వరును (నకిః, ఆ, నశతే) స్మరణశక్తిద్వార వ్యాప్తుడు గాజాలడు. కావుననే నీవు సర్వమునకు ఉపాసనీయదేవుడవు.॥౭౯॥

**భావార్థము :-** మానవులారా! పరమేశ్వరుడు అనంత ఐశ్వర్యవంతుడు. ఆతడుత్పన్నముకాలేదు, కాడు, కాబోడు. ఆతని సమమెవ్వరునులేరు. ఆతనినే సేవించవలెను.॥౭౯॥

79. O Mighty God, The nature is matchless. Among the learned sages not one is found Thy equal!.

Thou wast never born, nor is born, None can comprehend what Thou hast done or shalt do.

౧౭౭౬. తదిత్యస్య బృహద్దివ ఋషిః, మహేన్ద్రో దేవతా, పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౭౭౬ తదిదాస భువనేషు జ్యేష్ఠం యతో జజ్ఞఉగ్రస్త్వేషనృమ్ణః।
సద్యో జజ్ఞానో నిరిణాతి శత్రూనను యం విశ్వే మదన్త్యూమాః॥౮౦॥

**ప.వి:–** తత్, ఇత్, ఆస, భువనేషు, జ్యేష్ఠమ్, యతః, జజ్ఞే, ఉగ్రః, త్వేషనృమ్ణ ఇతి త్వేష + నృమ్ణః, సద్యః, జజ్ఞానః, నిరిణాతి, శత్రూన్, అను, యమ్, విశ్వే, మదన్తి, ఊమాః.॥౮౦॥

పదార్థః :-(తత్) (ఇత్) (ఆస) అస్తి. అత్ర ఛన్దస్యుభయథేతి లిట ఆర్ధధాతుక సంజ్ఞాభావః. (భువనేషు) లోకలోకాన్తరేషు (జ్యేష్ఠమ్) వృద్ధం శ్రేష్ఠమ్ (యతః) యస్మాత్ (జజ్ఞే) (ఉగ్రః) తీక్ష్ణ స్వభావః (త్వేషనృమ్ణః) త్వేషం సుప్రకాశితం నృమ్ణం ధనం యస్య సః (సద్యః) (జజ్ఞానః) జాయమానః (నిరిణాతి) హినస్తి (శత్రూన్) (అను) (యమ్) (విశ్వే) సర్వే (మదన్తి) హృష్యన్తి (ఊమాః) రక్షాదికర్మకర్తారః.॥౮౦॥

అన్వయః :-హే మనుష్యా! యత ఉగ్రస్త్వేషనృమ్ణో వీరో జజ్ఞే యో జజ్ఞానః శత్రూన్ సద్యో నిరిణాతి విశ్వా ఊమా యమనుమదన్తి తదిదేవ బ్రహ్మ భువనేషు జ్యేష్ఠమాసేతి విజానీత.॥౮౦॥

భావార్థః :-హే మనుష్యా! యస్యోపాసనాచ్ఛూరా వీరత్వముపలభ్య శత్రూన్ హన్తుం శక్నువన్తి యముపాస్య విద్వాంస ఆనన్దితా భూత్వా సర్వానానన్దయన్తి తదేవ సర్వోత్కృష్టం సర్వోపాస్యం పరమేశ్వరం సర్వే నిశ్చిన్వన్తు. ॥౮౦॥

**పదార్థము** :- ఓ మానవులారా! (యతః) ఎవనినుండి (ఉగ్రః) తేజః స్వభావముగల (త్వేష నృమ్ణః) చక్కని ప్రకాశవంతమగు ధనయుక్తులగు వీరుడు (జజ్ఞే) ఉత్పన్నమైనాడో (జజ్ఞానః) ఎవడు ఈ సర్వము నుత్పన్నమొనర్చినాడో (శత్రూన్) శత్రువులను (సద్యః) శీఘ్రముగానే (నిరిణాతి) నిరంతరము చంపుచున్నాడో (విశ్వే) సమస్త (ఊమాః) రక్షణ మున్నగు కర్మలొనర్చువాడు (యమ్) ఎవని (అను) వెనుక (మదన్తి) ఆనంద మొందుచున్నారో (తత్, ఇత్) ఆ పరబ్రహ్మ పరమాత్మయే (భువనేషు) లోకలోకాంతరములందు (జ్యేష్ఠమ్) సర్వోన్నతుడు, శ్రేష్ఠుడు, మాన్యవరుడై (ఆస) ఉన్నాడని మీరు తెలిసికొనుడు.।౮౦॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఎవని ఉపాసనచే శూర వీరత్వమును పొంది శత్రుసంహారమొనర్చ గలుగుదురో, ఎవనిని యారాధించి విద్వాంసులానందితు లగుచుందురో మరియు సకలజనుల నానంద పరచుచుందురో, ఆతడే సర్వోత్కృష్టుడు, సకల మానవుల కుపాసనీయుడునగు పరమేశ్వరుడని సకల మానవులును నిశ్చయించుకొనవలయును.।౮౦॥

80. In all the worlds God is the Best and Highest whence sprang the valiant, wealthy hero. Quickly when born he overcomes his foemen. All benefactors of humanity who follow God derive joy.

౧౨౭౭. ఇమా ఇత్యస్య మేధాతిథి ర్ఋషిః, విశ్వే దేవా దేవతాః, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౨౭౭ ఇమాऽఉ త్వా పురూవసో గిరో వర్ద్ధన్తు యా మమ।
పావకవర్ణాః శుచయో విపశ్చితోऽభి స్తోమైరనూషత ॥౮౧॥

**ప.వి:**– ఇమాః, ఊం ఉ ఇతూం, త్వా, పురూవసో, పురువసో ఇతి పురు+వసో, గిరః, వర్ద్ధన్తు, యాః, మమ, పావకవర్ణా ఇతి పావక + వర్ణాః, శుచయః, విపశ్చిత ఇతి విపః + చితః, అభి, స్తోమైః, అనూషత.।౮౧॥

పదార్థః :- (ఇమాః) వక్ష్యమాణాః (ఉ) నిశ్చయార్థే (త్వా) త్వామ్(పురూవసో) పురుష బహుషు వాసకర్తః (గిరః) వాచః (వర్ధన్తు) వర్ధయన్తు (యాః) (మమ) (పావకవర్ణాః) పావకవత్ పవిత్రో గౌరో వర్ణో యేషాన్తే బ్రహ్మవర్చస్వినః (శుచయః) పవిత్రీభూతాః (విపశ్చితః) విద్వాంసః (అభి) (స్తోమైః) పదార్థ విద్యాప్రశంసనైః (అనూషత) ప్రశంసన్తు.।౮౧॥

అన్వయః :- హే పురూవసో పరమాత్మన్ ! యా ఇమా మమ గిర స్త్వా ఉ వర్ధన్తు తాః ప్రాప్య పావకవర్ణాః శుచయో విపశ్చిత స్తోమై రభ్యనూషత.।౮౧॥

భావార్థః :- మనుష్యైః సద్వైశ్వర స్తుతిప్రార్థనోపాసనాభిస్తదస్తిత్వప్రతిపాదనేనాఽభ్యాస సత్యభాషణాభ్యాఇ్చ స్వవాచః శుద్ధాః సంపాద్య విద్వాంసో భూత్వా సర్వాః పదార్థవిద్యాః ప్రాప్తవ్యాః.।౮౧॥

పదార్థము :-(పురూవసో) అనేక పదార్థములందువసించునట్టి పరమాత్మా! (యాః, ఇమాః) ఏ యీ (మమ) నాయొక్క (గిరః) వాణులు (త్వా) నిన్ను (ఉ) నిశ్చయముగ (వర్ధన్తు) వృద్ధిపరచుగాక! వానిని పొంది (పావకవర్ణాః) అగ్నివంటి వర్ణముగల తేజోవంతులు (శుచయః) పవిత్రమగు (విపశ్చితః) విద్వాంసులు (స్తోమైః) పదార్థ విద్యల ప్రశంసలతో (అభి అనూషత) అన్నివైపులనుండి ప్రశంసించెదరుగాక! ।౮౧॥

భావార్థము :- మానవులు సర్వధా పరమేశ్వరుని స్తుతి, ప్రార్థన, ఉపాసన మరియు నా యీశ్వరుని సత్తాను ప్రతిపాదనమొనర్చుట, యోగాభ్యాసము, సత్యభాషణములచే తమ వాణులను శుద్ధపరచుకొని విద్వాంసులునై సకల పదార్థవిద్యలను ప్రాప్తిజేసికొనవలయును.।౮౧॥

81. May these my songs of praise verily exalt Thee, God Who is Omnipresent.

Men, radiant like fire, pure, full of knowledge, sing Thy praises admiring material objects.

౧౭౭౮. యస్యేత్యస్య మేధాతిథి ర్ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ రాజధర్మవిషయమాహ. రాజధర్మ విషయము.

౧౭౭౮ యస్యాయం విశ్వఽఆర్యో దాసః శేవధిపాఽఅరిః।

తిరశ్చిదర్యే రుశమే పవీరవి తుభ్యేత్సోఽఅజ్యతే రయిః।౮౨॥

ప. వి:- యస్య, అయమ్, విశ్వః, ఆర్యః, దాసః, శేవధిపా ఇతి శేవధి + పాః, అరిః, తిరః, చిత్, అర్యే, రుశమే, పవీరవి, తుభ్య, ఇత్, సః, అజ్యతే, రయిః.।౮౨॥

పదార్థః:- (యస్య) (అయమ్) (విశ్వః) సర్వః (ఆర్యః) ధర్మ్యగుణకర్మస్వభావః (దాసః) సేవకః (శేవధిపాః) యః శేవధిం నిధిం పాతి రక్షతి ధర్మాదికార్యే కరే చ న వ్యేతి స శేవధిపాః. నిధిః శేవధిరితి యాస్కః. నిరు. ౨.౪ (అరిః) శత్రుః (తిరః) అన్తర్ధానం గతః (చిత్) అపి (అర్యే) ధనస్వామిని వైశ్యాదౌ (రుశమే) హింసకే (పవీరవి) యో ధనాదిరక్షాయై పవీరం

శస్త్రం వాతి ప్రాప్నోతి తస్మిన్ (తుభ్య) తుభ్యమ్. అత్ర వా ఛాన్దసో వర్ణలోపః (ఇత్) ఏవ (సః) (అజ్యతే) ప్రాప్యతే (రయిః) ధనమివ.॥౮౨॥

అన్వయః:-హే రాజన్! యస్య తవాయం విశ్వ ఆర్యో దాసః శేవధిపా అరిః పవీరవి రుశమేఽర్యే తిరశ్చిత్తుభ్యేత్స త్వం రయిరజ్యతే.॥౮౨॥

భావార్థః:- యస్య రాజ్ఞః సర్వ ఆర్యా రాజ్యరక్షకాః సేవకాః సన్తి ధనాదికరస్యాదాతా చ శత్రుస్తస్మాదపి యేన భవతా ధనాదికరో గృహ్యతే స సర్వోత్తమశ్రీః స్యాత్.॥౮౨॥

పదార్థము :- ఓ రాజా (యస్య) ఏ నీయొక్క (అయమ్) ఈ (విశ్వః) సమస్త (ఆర్యః) ధర్మముతో గూడిన గుణ కర్మ స్వభావములుగలవాడు (దాసః) సేవకునివంటి ఆజ్ఞకారి (శేవధిపాః) కుదువపెట్టిన ధనమును గాపాడువాడు, అనగా ధర్మాది కార్యములందుగాని లేక రాజసుంకము [పన్ను] చెల్లించుట యందుగాని ధనమును వ్యయపరచువాడు (అరిః) శత్రువులయు (పవీరవి) ధనాదులయు రక్షణకొరకు శస్త్రములను సమకూర్చువాడు (రుశమే) హింసక వ్యవహారముల లేక (అర్యే) ధనస్వాములగు వైశ్యాదులకొరకు (తిరః) దాగియుండువాడు (చిత్) కూడ (తుభ్య) నీకొరకు (ఇత్) నిశ్చయముగ నున్నాడో (సః) అట్టి నీవు (రయిః) ధనమువలె (అజ్యతే) ప్రాప్తమగుచున్నావు.॥౮౨॥

భావార్థము :- ఏ రాజునకు రాజ్యరక్షణకొరకు అందరు ఆర్యులుందురో మరియు ఆజ్ఞాపాలకులై యుందురో, రాజ్యకరము [పన్ను]ల నీయకుండు [ఎగబెట్టు] వారినుండి కూడా పన్నులను రాబట్టుకొనెదరో, వారందరికన్న నుత్తమ శోభావంతులగుదురు.॥౮౨॥

82. O King, this man of high character is obedient to thee. The miser who hides his treasure is thy enemy. The hidden wealth of wealthy trader, protected against arms and violence, is meant for thee!.

౧౨౭౫.అయమిత్యస్య మేధాతిథి ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృత్సతో బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨౭౫ అయꣳసహస్రమృషిభిః సహస్కృతః సముద్రఽఇవ పప్రథే।
సత్యః సో అస్య మహిమా గృణే శవో యజ్ఞేషు విప్రరాజ్యే ॥౮౩॥

ప.వి:- అయమ్, సహస్రమ్, ఋషిభిరిత్యృషి + భిః, సహస్కృతః, సహః కృత ఇతి సహః + కృతః, సముద్రఃఽఇవేతి సముద్రః + ఇవ, పప్రథే, సత్యః, సః, అస్య, మహిమా, గృణే,

శవః, యజ్ఞేషు, విప్రరాజ్య ఇతి విప్ర + రాజ్యే.॥౮౩॥

పదార్థః :- (అయమ్) రాజా (సహస్రమ్) (ఋషిభిః) వేదార్థవిద్భిః (సహస్కృతః) సహసా బలేన నిష్పన్నః (సముద్ర ఇవ) సాగర ఇవాఽన్తరిక్షమివ వా (పప్రథే) భవతి (సత్యః) సత్సు వ్యవహారేషు విద్వత్సు వా సాధుః (సః) (అస్య) (మహిమా) మాహాత్మ్యమ్ (గృణే) స్తౌమి (శవః) బలమ్ (యజ్ఞేషు) సఙ్గతేషు రాజకర్మసు (విప్రరాజ్యే) విప్రాణాం మేధావినాం రాజ్యే రాష్ట్రే.॥౮౩॥

అన్వయః :- హే మనుష్యా! యద్యయం సభేశో రాజా రాజర్షిభిః సహ సహస్ర మసఙ్ఖ్యం జ్ఞానం ప్రాప్తః సహస్కృతః సత్యోఽస్త్వస్య మహిమా సముద్రఇవ పప్రథే తర్హి స ప్రజాజనోఽహమస్య యజ్ఞేషు విప్రరాజ్యే చ శవో గృణే.॥౮౩॥

భావార్థః :- యే రాజాదయో రాజజనా విద్వత్సఙ్గప్రియాః సాహసినః సత్యగుణకర్మస్వభావా మేధావి రాజ్యేఽధికృతాః సఙ్గతాని న్యాయవినయయుక్తాని కర్మాణి కుర్వ్యస్తేషామాకాశమివ కీర్తిర్విస్తీర్ణా భవతి.॥౮౩॥

పదార్థము :- ఓ మానవులారా! (అయమ్) సభాపతియగు ఈ రాజు (ఋషిభిః) వేదార్థవేత్తలగు రాజర్షులతోగూడ (సహస్రమ్) అసంఖ్యాకవిధములగు జ్ఞానమును పొంది (సహస్కృతః) బలసంపన్నులై (సత్యః) శ్రేష్ఠవ్యవహారములందు, విద్వాంసులందు ఉత్తమ చతురులు (అస్య) వీరి (మహిమా) మహత్త్వము (సముద్ర ఇవ) సముద్రము, అంతరిక్షమువలె (పప్రథే) ప్రసిద్ధమైయుండును. (సః) అట్టి పూర్వము చెప్పియున్న ప్రజనగు నేను ఈ రాజుయొక్క (యజ్ఞేషు) సంగతములగు రాచకార్యములందు మరియు (విప్రరాజ్యే) బుద్ధిశాలుర రాజ్యములో (శవః) బలమును గూర్చి (గృణే) స్తుతియొనర్తును.॥౮౩॥

**భావార్థము** :- రాజు మున్నగు రాజపురుషులు విద్వాంసుల సాంగత్యమున ప్రీతినుంచువారు, సాహసులు, సత్యమగు గుణకర్మస్వభావములతో గూడినవారునై, బుద్ధిశాలుర రాజ్యమందు అధికారమునందుండి సాంగత్యము, న్యాయము మరియు వినయముతోగూడిన కార్యములొనర్చువారి కీర్తిఖ్యాతులు ఆకాశమువలె విస్తరించుచుండును. ॥౮౩॥

83. The King is endowed with innumerable branches of knowledge through sages, the knowers of the Vedas, possesses vast strength, and is famous for his noble actions, His greatness is spread vast like the ocean. I praise firmness in the administration of the wise and well-organised government functions.

౧౨౮౦. అదబ్ధేభి రిత్యస్య భరద్వాజ ఋషిః, సవితా దేవతా, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౭౮౦ అదబ్ధేభిః సవితః పాయుభిష్ట్వ౯ శివేభిరద్య పరి పాహి నో గయమ్హిరణ్యా జిహ్వః సువితాయ నవ్యసే రక్షా మాకిర్నో అఘశంస ఈశత ॥౮౪॥

ప.వి:- అదబ్ధేభిః, సవితరితి సవితః, పాయుభిరితి పాయు+భిః, త్వమ్, శివేభిః, అద్య, పరి, పాహి, నః, గయమ్, హిరణ్యజిహ్వ ఇతి హిరణ్య + జిహ్వః, సువితాయ, నవ్యసే, రక్ష, మాకిః, నః, అఘశంసః, ఈశత.॥౮౪॥

పదార్థః :- (అదబ్ధేభిః) అహింసనీయైః (సవితః) సకలైశ్వర్యయుక్త (పాయుభిః) వివిధై రక్షణోపాయైః (త్వమ్) (శివేభిః) మంగలకారకైః (అద్య) (పరి) సర్వతః (పాహి) రక్ష (నః) అస్మాకమ్ (గయమ్) ప్రజామ్ (హిరణ్యజిహ్వః) హిరణ్యా హితరమణీయా జిహ్వా వాగ్ యస్య (సువితాయ) ఐశ్వర్యాయ (నవ్యసే) అతిశయేన నవీనాయ (రక్ష) పాలయ. అత్ర ద్వ్యచోఽ తస్తిజ ఇతి దీర్ఘః. (మాకిః) నిషేధే (నః) అస్మాన్ (అఘశంసః) దుష్టః స్తేనః (ఈశత) సమర్థో భవేత్.॥౮౪॥

అన్వయః:-హే సవితా రాజం స్త్వమద్యాఽదబ్ధేభిః శివేభిః పాయుభిర్నో గయం పరిపాహి హిరణ్యజిహ్వః స నవ్యసే సువితాయ నోఽస్మాన్ రక్ష యతోఽఘశంసోఽస్మదుపరి మాకిరీశత.॥౮౪॥

భావార్థః:-రాజ్ఞాం యోగ్యతాఽస్తి సర్వస్యాః ప్రజాయాః సన్తానాన్ బ్రహ్మచర్యవిద్యాదాన స్వయంవర వివాహై ర్దస్యుభ్యో రక్షణేన చోన్నయేయు రితి.॥౮౪॥

**పదార్థము** :- (సవితః) సమగ్ర ఐశ్వర్యశాలివగు ఓ రాజా! (త్వమ్) నీవు (అద్య) నేడు (అదబ్ధేభిః) చెరిపివేయదగని (శివేభిః) శుభకరములగు (పాయుభిః) అనేక విధముల రక్షణోపాయములచే (నః) మాయొక్క (గయమ్) ప్రజలను (పరిపాహి) అన్నివైపులనుండి రక్షణయొనర్చుము (హిరణ్యజిహ్వః) సర్వజనహితమందు రమణమొనర్చదగిన వాణితో గూడియున్న (నవ్యసే) అతి నవీనమగు (సువితాయ) ఐశ్వర్యముకొరకు (నః) మమ్ము (రక్ష) రక్షణ యొనర్చుము. దానిచే మమ్ము (అఘశంసః) దుష్టులు, చోరులు బాధించ (ఈశత) సమర్థులు లేక శాసకులు (మాకిః) కాకుందురుగాక!॥౮౪॥

**భావార్థము** :- రాజు తన ప్రజల సంతానములను, బ్రహ్మచర్యము, విద్యాభ్యాసము, స్వయంవరవిధిగా వివాహమొనర్చజేయుట, మరియు చోరులు మున్నగు దుష్టులనుండి కాపాడుట తన పరమకర్తవ్యముగ నెంచవలయును.॥౮౪॥

84. O supreme King, protect this day our dependants from all sides with different kinds of harmless, lucky aids. Endowed with speech contribuing to the welfare of all, protect us for newest prosperity, whereby no evil-minded thief may have his sway over us!.

౧౭౮౧. ఆ నో ఇత్యస్య జమదగ్ని ర్ఋషిః, వాయు ర్దేవతా, విరాడ్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరలనదే విషయము.

౧౭౮౧ ఆ నో యజ్ఞం దివిస్పృశం వాయో యాహి సుమన్మభిః।

అన్తః పవిత్ర ఉపరి శ్రీణానోఽయఀశుక్రో అయామి తే।౮౫॥

ప.వి:-ఆ, నః, యజ్ఞమ్, దివిస్పృశమితి దివి + స్పృశమ్, వాయోఽఇతి వాయో, యాహి, సుమన్మభి రితి సుమన్మ+భిః, అన్తరిత్యన్తః, పవిత్రే, ఉపరి, శ్రీణానః, అయమ్, శుక్రః, అయామి, తే.।౮౫॥

పదార్థః :-(ఆ) సమన్తాత్ (నః) అస్మాకమ్ (యజ్ఞమ్) సఙ్గతం వ్యవహారమ్ (దివిస్పృశమ్) విద్యాప్రకాశయుక్తమ్ (వాయో) వాయువద్వర్తమాన (యాహి) ప్రాప్నుహి (సుమన్మభిః) శోభనై ర్విజ్ఞానైః (అన్తః) ఆభ్యన్తరే (పవిత్రః) శుద్ధాత్మా (ఉపరి) ఉత్కర్షే (శ్రీణానః) ఆశ్రయం కుర్వాణః (అయమ్) (శుక్రః) ఆశుకర్తా వీర్యవాన్ (అయామి) ప్రాప్నోమి (తే) తవ.।౮౫॥

అన్వయః :-హే వాయో రాజన్! యథాఽహమన్తః పవిత్ర ఉపరి శ్రీణానోఽయం శుక్రః సన్ సుమన్మభిస్తే దివిస్పృశం యజ్ఞమయామి తథా త్వం నో దివిస్పృశం యజ్ఞమా యాహి. ।౮౫॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యాదృశేన వర్తమానేన వృత్తేన రాజా ప్రజాసు చేష్టేత తాదృశేనైవ భావేన ప్రజా రాజని వర్తేత. ఏవ ముభౌ మిలిత్వా సర్వం న్యాయవ్యవహారమలం కుర్యాతామ్.।౮౫॥

పదార్థము :-(వాయో) వాయువువలె వర్తమానుడవగు నో రాజా! నే నెట్లు (అన్తః) అంతఃకరణమునందు (పవిత్రః) పవిత్రాత్ముడను (ఉపరి) ఉన్నతిని (శ్రీణానః) ఆశ్రయించువాడను

(అయమ్) ఇట్లు (శుక్రః) శీఘ్రవంతుడను, పరాక్రమశాలినినై (సుమన్మభిః) చక్కని విజ్ఞానములతో (తే) నీయొక్క (దివిస్పృశమ్) విద్యా ప్రకాశవములతో (యజ్ఞమ్) సాంగత్య వ్యవహారవములను (అయామి) పొందుచున్నానో, అటులనే నీవును (నః) మాయొక్క విద్యాప్రకాశముతో గూడిన ఉత్తమ వ్యవహారములను (ఆ, యాహి) ఉత్తమముగా పొందుము. ।౮౫॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎటువంటి ప్రవర్తనచే రాజు ప్రజలయెడ వర్తించునో, అదేభావముతో ప్రజలును రాజు విషయమున వర్తించవలయును. ఇదేవిధముగా రాజు మరియు ప్రజలు ఐకమత్యముచే న్యాయవ్యవహారములను పూర్ణపరచవలెను. ।౮౫॥

85. O king, qucik like air, just as I, enternally pure, believing in progress, active and valorous, with nice store of knowledge, attend thy literary conclaves, so shouldst thou ours!.

౧౭౮౬. ఇన్ద్రవాయూ ఇత్యస్య తాపస ఋషిః, ఇన్ద్రవాయూ దేవతే, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౭౮౬ ఇన్ద్రవాయూ సుసన్దృశా సుహవేహ హవామహే।
యథా నః సర్వఽఇజ్జనోఽనమీవః సఙ్గమే సుమనాఽఅసత్ ।౮౬॥

ప. వి:- ఇన్ద్రవాయూ ఇతీన్ద్ర + వాయూ, సుసన్దృశేతి సు+సన్దృశా, సుహవేతి సు + హవా, ఇహ, హవామహే, యథా, నః, సర్వః, ఇత్, జనః, అనమీవః, సఙ్గమ ఇతి సమ్ + గమే, సుమనా ఇతి సు + మనాః, అసత్. ।౮౬॥

పదార్థః :- (ఇన్ద్రవాయూ) రాజప్రజాజనౌ (సుసన్దృశా) సుష్ఠు సమ్యక్ ద్రష్టారౌ (సుహవా) సుష్ఠ్వాహవనీయౌ (ఇహ) (హవామహే) స్వీకుర్మహే (యథా) (నః) అస్మాకమ్ (సర్వః) (ఇత్) ఏవ (జనః) (అనమీవః) అరోగః (సఙ్గమే) సఙ్గ్రామే సమాగమే వా. సఙ్గమ ఇతి సఙ్గ్రామ నా... నిఘం.౨.౧౭ (సుమనాః) ప్రసన్న చిత్తః (అసత్) భవేత్. ।౮౬॥

అన్వయః:-వయం యౌ సుసన్దృశా సుహవా ఇన్ద్రవాయూ ఇహ హవామహే యథా సఙ్గమే నోఽనమీవః సుమనాః సర్వ ఇజ్జనో అసత్ తథా తౌ కుర్యాతామ్. ।౮౬॥

భావార్థః :- అత్రోపమాలఙ్కారః. తథైవ రాజప్రజాజనాః ప్రయతేరన్ యథా సర్వే మనుష్యాదయః ప్రాణినోఽరోగాః ప్రసన్నమనసో భూత్వా పురుషార్థినః స్యుః. ।౮౬॥

**పదార్థము** :-(సుసన్దృశా) సుందరముగ, చక్కగా జూచువారు (సుహవా) చక్కగా పిలువదగినవారు (ఇన్ద్రవాయూ) రాజు మరియు ప్రజలను (ఇహ) ఈ ప్రపంచమున (హవామహే) మేమెట్లు స్వీకరించుచున్నామో (యథా) ఎట్లు (సఙ్గమే) సంగ్రామము లేదా సమాగమమునందు (నః) మాయొక్క (సర్వః, ఇత్) సమస్త (జనః) మనుష్యులు (అనమీవః) ఆరోగ్యవంతులు (సుమనాః) ప్రసన్నచిత్తులు (అసత్) అగుచున్నారో, అదేవిధముగ వారౌనర్చవలయును.।౮౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున ఉపమాలంకారము గలదు. మానవులు మొదలుకొని సకల ప్రాణులు ఆరోగ్యవంతులు, ప్రసన్నచిత్తులు, పురుషార్థపరులుగా నుండునట్లు రాజు, రాజపురుషులు ప్రయత్నించవలయును. ।౮౬॥

86. We accept as our masters in this world, the knig and the Commander-in-chief, fair to see and fit to be invoked, so that in the Assembly and battle, all our men be happy and free from disease.

౧౨౮౩. బుధగిత్యస్య జమదగ్ని ఋషిః, మిత్రావరుణౌ దేవతే, నిచృద్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౨౮౩ బుధగిత్థా స మర్త్యః శశమే దేవతాతయే।

యో నూనం మిత్రావరుణావభిష్టయ ఆచక్రే హవ్యదాతయే।౮౭॥

**ప.వి:**– బుధక్, ఇత్థా, సః, మర్త్యః, శశమే, దేవతాతయ ఇతి దేవ + తాతయే, యః, నూనమ్, మిత్రావరుణౌ, అభిష్టయే, ఆచక్ర ఇత్యా + చక్రే, హవ్యదాతయ ఇతి హవ్య + దాతయే.।౮౭॥

పదార్థః :- (బుధక్) యా సమృధ్నోతి సః (ఇత్థా) అస్మాద్ధేతోః (సః) (మర్త్యః) మనుష్యః (శశమే) శామ్యతి నిరుపద్రవో భవతి. అత్ర ఏత్వాభ్యాసలోపాభావశ్ఛాన్దసః (దేవతాతయే) దేవేభ్యో విద్వద్భ్యోదివ్యగుణేభ్యో వా (యః) (నూనమ్) నిశ్చితమ్ (మిత్రావరుణౌ) ప్రాణోదానావివ రాజప్రజాజనౌ (అభిష్టయే) అభీష్ట సుఖప్రాప్తయే (ఆచక్రే) సేవతే. అత్ర గన్ధనావక్షేపణ...అ. ౧.౩. ౩౨ ఇతి కరోతేః సేవనార్థ ఆత్మనేపదమ్. (హవ్యదాతయే) హవ్యానా మాదాతు మర్హాణా మాదానాయ.।౮౭॥

అన్వయః :- యో దేవతాతయ బుధగ్మర్త్యోఽభీష్టయే హవ్యదాతయే చ మిత్రావరుణౌ నూనమాచక్రే స నర ఇత్థా శశమే ॥౮౭॥

భావార్థః :- యే శమదమాదిగుణాన్వితాః రాజప్రజాజనా ఇష్టసుఖసిద్ధయే ప్రయతేరం స్తేఽవశ్యం సమృద్ధిమన్తో భవేయుః. ॥౮౭॥

పదార్థము :- (యః) ఎవరు (దేవతాతయే) విద్వాంసులలేక దివ్యగుణములకొరకు (బుధక్) సమృద్ధిగల (మర్త్యః) మనుష్యులు (అభిష్టయే) అభీష్టసిద్ధిని పొందుటకు మరియు (హవ్యదాతయే) పొందదగిన పదార్థముల ప్రాప్తికొరకు (మిత్రావరుణౌ) ప్రాణోదానములవంటి రాజుప్రజలను (నూనమ్) నిశ్చితముగ (ఆచక్రే) సేవించునో (సః) అట్టివాడవుడు (ఇత్థా) ఈ పై హేతువుచే (శశమే) శాంతిగలవాడు, ఉపద్రవరహితుడు అగుచున్నాడు. ॥౮౭॥

భావార్థము :- శమదమాది గుణములతో గూడిన రాజు మరియు ప్రజలు ఇష్టసుఖముల సిద్ధికొరకు ప్రయత్నమొనర్చినట్లైన, వారు అవశ్యముగ సమృద్ధిగలవా రగుదురు. ॥౮౭॥

87. The prosperous person, who for the acquisition of noble traits, the acquirement of desired happiness, obtaining things worthy of possession, verily serves the king and public leaders, becomes thereby peaceful in mind and free from trouble.

౧౭౮౮. ఆ యాతమిత్యస్య వసిష్ఠ ఋషిః, అశ్వినౌ దేవతే, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౭౮౮ ఆ యాతముప భూషతం మధ్వః పిబతమశ్వినా।

దుగ్ధం పయో వృషణా జేన్యావసూ మా నో మర్ధిష్టమా గతమ్ ॥౮౮॥

ప. విః- ఆ, యాతమ్, ఉప, భూషతమ్, మధ్వః, పిబతమ్, అశ్వినా, దుగ్ధమ్, పయః, వృషణా, జేన్యావసూ ఇతి జేన్యా + వసూ, మా, నః, మర్ధిష్టమ్, ఆ, గతమ్. ॥౮౮॥

పదార్థః :- (ఆ) (యాతమ్) ప్రాప్నుతమ్ (ఉప) (భూషతమ్) అలం కురుతమ్ (మధ్వః) మధురం వైద్యకశాస్త్రసిద్ధం రసమ్. అత్ర కర్మణి షష్ఠీ (పిబతమ్) (అశ్వినా) విద్యాదిశుభగుణవ్యాపినౌ రాజప్రజాజనౌ (దుగ్ధమ్) పూర్ణం కురుతమ్ (పయః) ఉదకమ్. పయ ఇత్యుదక నా..నిఘం.౧.౧౨ (వృషణా) వీర్యవన్తౌ (జేన్యావసూ) యౌ జేన్యాన్ జయశీలాన్ వాసయతో యద్వా జైన్యం జేతవ్యం జితం వా వసు ధనం యాభ్యాం తౌ (మా) (నః) అస్మాన్ (మర్ధిష్టమ్) హింస్తమ్ (ఆ) (గతమ్) సమన్తాత్ప్రాప్నుతమ్. ॥౮౮॥

**అన్వయః :-** హే వృషణా జేన్యావసూ అశ్వినా! యువాం సుఖమాయాతం ప్రజా ఉపభూషతం మధ్వః పిబతం పయో దుగ్ధం నోఽస్మాన్మా మర్ధిష్టం ధర్మేణ విజయమాగతమ్. ॥౮౮॥

**భావార్థః :-** యే రాజప్రజాజనాః సర్వాన్ విద్యాసుశిక్షాభ్యామలం కుర్యుః సర్వత్ర కుల్యాదిద్వారా జలం గమయేయుః శ్రేష్ఠాన్న హింసిత్వా దుష్టాన్ హింస్యుస్తే విజేతారః సన్తోఽతులాం శ్రియం ప్రాప్య సతతం సుఖం లభేరన్ ॥౮౮॥

**పదార్థము :-** (వృషణా) ఓ పరాక్రమవంతులారా! (జేన్యావసూ) జయశీలురను వసింపజేయు లేక జయించదగిన లేక ధనమునెవరు జయించినారో, అట్లే (అశ్వినా) విద్య మున్నగు శుభగుణములందు వ్యాప్తులగు ఓ రాజా! ఓ ప్రజలారా! మీ యిరువురును సుఖములను (ఆ, యాతమ్) చక్కగా పొందుడు. ప్రజలను (ఉపభూషతమ్) సుశోభితుల నొనర్చుడు (మధ్వః) వైద్యశాస్త్రమున కనుగుణ్యముగ సిద్ధపరచినట్టి మధుర రసమును (పిబతమ్) పానమొనర్చుడు (పయః) జలములను (దుగ్ధమ్) పూర్ణమొనర్చుడు. ఎవ్వరును జలములులేక దుఃఖితులు గారాదు (నః) మమ్ము (మా, మర్ధిష్టమ్) బాధించకుడు మరియు ధర్మయుక్తముగ విజయమును (ఆ, గతమ్) చక్కగా పొందుడు. ॥౮౮॥

**భావార్థము :-** ఏ రాజు మరియు ప్రజలు అందరను విద్య, ఉత్తమ శిక్షణలచే సుశోభితులనుగ నొనర్తురో, అంతటను కాలువలు మున్నగు జలమార్గములద్వారా జలమునందింతురో, శ్రేష్ఠులను గౌరవించుచు, దుష్టులను లేకుండజేయుదురో అట్టివారు విజయవంతముగ అతులసంపదలుగలవారై నిరంతరము సుఖముల ననుభవించగలరు. ॥౮౮॥

88. O king and public leaders, valiant, conquerors of riches, immersed in knowledge, attain to happiness, adorn to subjects, drink the medically prepared juice, arrange for the supply of water, injure us not, and gain victory through righteousness!.

౧౭౮౯. ప్రైత్విత్యస్య కణ్వ ఋషిః, విశ్వే దేవా దేవతాః, భురిగనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును?

**౧౭౮౯ ప్రైతు బ్రహ్మణస్పతిః ప్ర దేవ్యేతు సూనృతా ।**

**అచ్ఛా వీరం నర్యం పఙ్క్తిరాధసం దేవా యజ్ఞం నయన్తు నః ॥౮౯॥**

**ప.వి:-** ప్ర, ఏతు, బ్రహ్మణః, పతిః, ప్ర, దేవీ, ఏతు, సూనృతా, అచ్ఛ, వీరమ్, నర్యమ్, పఙ్క్తిరాధసమితి పఙ్క్తి + రాధసమ్, దేవాః, యజ్ఞమ్, నయన్తు, నః. ॥౮౯॥

పదార్థః :- (ప్ర) (ఏతు) ప్రాప్నోతు (బ్రహ్మణస్పతిః) ధనస్య వేదస్య వా పాలకః స్వామీ (ప్ర) (దేవీ) శుభగుణై ర్దేదీప్యమానా (ఏతు) ప్రాప్నోతు (సూనృతా) సత్యలక్షణోజ్జ్వలితా వాక్ (అచ్ఛ). అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. (వీరమ్) (నర్యమ్) నృషు సాధుమ్ (పఙ్క్తిరాధసమ్) పఙ్క్తేః సమూహస్య రాధః సంసిద్ధిర్యస్మాత్తమ్ (దేవాః) విద్వాంసః (యజ్ఞమ్) సఙ్గతధర్మ్యం వ్యవహారకర్తారమ్ (నయన్తు) ప్రాపయన్తు వా (నః) అస్మాన్.।౮౯॥

అన్వయః:- హే మనుష్యా యథాయం యథా నోఽస్మాన్ బ్రహ్మణస్పతిః ప్రైతు సూనృతాదేవీ ప్రైతు నర్యం పఙ్క్తిరాధసం యజ్ఞం వీరం దేవాఽచ్ఛ నయన్తు తథాఽస్మాన్ ప్రాప్నుత.।౮౯॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే విదుషః సత్యాం వాచం సర్వోపకారాన్ వీరాంశ్చ ప్రాప్నుయుస్తే సమ్యక్ సుఖోన్నతిం కుర్యుః.।౮౯॥

పదార్థము :- ఓ మానవులారా! ఏ రీతిగ (నః) మాకు (బ్రహ్మణః, పతిః) ధనము మరియు వేదముల రక్షకుడు, అధిష్ఠాత యగు విద్వాంసుడు (ప్ర, ఏతు) ప్రాప్తింపునో (సూనృతా) సత్యలక్షణములతో ప్రజ్వలితమగు (దేవీ) శుభగుణములతో ప్రకాశవంతమగు వాణి (ప్ర, ఏతు) లభించునో (నర్యన్) మానవులందుత్తముడు (పంక్తి, రాధసమ్) సమూహమును సమకూర్చువాడు (యజ్ఞమ్) సంగతము, ధర్మయుక్త వ్యవహారకర్త (వీరమ్) శూరవీరుని (దేవాః) విద్వాంసులు (అచ్ఛ, నయన్తు) ఉత్తమముగా పొందుచున్నారో, అటులనే మీరు మాకు ప్రాప్తించుడు. ।౮౯॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. విద్వాంసులను, సత్యవాణిని, సర్వోపకారులగు వీరుల నెవరు ప్రాప్తింపజేసెదరో, వారు చక్కని సుఖముల నున్నతపరచగలరు.।౮౯॥

89. May the master of wealth and vedic lore come nigh unto us, may we cultivate truthful speech. May the learned associate with an exalted and brave person, the lover of humanity and follower of the path of rectitude.

౧౭౮౬. చన్ద్రమా ఇత్యస్య త్రిత ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౭౮౬ చన్ద్రమాఽఅప్స్వన్తరా సుపర్ణో ధావతే దివి। రయిం పిశఙ్గం బహులం పురుస్పృహఁ హరిరేతి కనిక్రదత్ ।౯౦॥

ప.వి:- చన్ద్రమాః, అప్స్విత్యప్ + సు, అన్తః, ఆ, సుపర్ణఃఽఇతి సు + పర్ణః, ధావతే, దివి,

రయిమ్, పిశఙ్గమ్, బహులమ్, పురుస్పృహమితి పురు + స్పృహమ్, హరిః, ఏతి, కనిక్రదత్.॥౯౦॥

పదార్థః :- (చన్ద్రమాః) శైత్యకరః (అప్సు) వ్యాప్తేఽన్తరిక్షే (అన్తః) మధ్యే (ఆ) (సుపర్ణః) శోభనాని పర్ణాని పతనాని యస్య సః (ధావతే) సద్యో గచ్ఛతి (దివి) సూర్యప్రకాశే (రయిమ్) శ్రియమ్ (పిశఙ్గమ్) సువర్ణాదివద్వర్ణయుతమ్ (బహులమ్) పుష్కలమ్ (పురుస్పృహమ్) బహుభిః స్పృహణీయమ్ (హరిః) అశ్వ ఇవ (ఏతి) గచ్ఛతి (కనిక్రదత్) భృశం శబ్దయన్.॥౯౦॥

అన్వయః :-హే మనుష్యా యూయం యథా సుపర్ణ శ్చన్ద్రమా కనిక్రదద్ధరి రివ దివ్యప్స్వన్తరా ధావతే పురుస్పృహం బహులం పిశఙ్గం రయిం చైతి తథా పురుషార్థినః సన్తో వేగేన శ్రియం ప్రాప్నుత.॥౯౦॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా యథా సూర్యేణ ప్రకాశితా శ్చన్ద్ర లోకా అన్తరిక్షే గచ్ఛన్త్యాగచ్ఛన్తి యథోత్తమోఽశ్వ ఉచ్చైః శబ్దయన్ సద్యో ధావతి తథా భూతా సన్తో యూయ మతీవోత్తమా మతులాం శ్రియం ప్రాప్య సర్వాన్ సుఖయత.॥౯౦॥

పదార్థము :- ఓ మానవులారా! (సుపర్ణః) సుందరనడకగల (చన్ద్రమాః) శీతలకారుడగు చంద్రుడు (కనిక్రదత్) శీఘ్రముగా శబ్దమొనర్చుచు, సకిలించుచున్న (హరిః) అశ్వమువలె (దివి) సూర్యప్రకాశమునందు (అప్సు) అంతరిక్షము (అన్తః) మధ్య (ఆ, ధావతే) అతిశీఘ్రముగ సుందరముగ ఎట్లు నడచుచున్నదో మరియు (పురుస్పృహమ్) అనేకులచే కాంక్షించదగినది (బహులమ్) అధికముగ (పిశఙ్గమ్) సువర్ణము మున్నగువానివంటి వర్ణములతో గూడిన (రయిమ్) శోభావంతమగు కాంతిని (ఏతి) ఎట్లు పొందుచున్నాడో, అటులనే మీరు పురుషార్థపరులై లక్ష్మిని పొందుడు.॥౯౦॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఏ విధముగ సూర్యునిచే ప్రకాశితమగు చంద్రుడు మున్నగు లోకములు అంతరిక్షమున రాకపోకలొనర్చుచుండునో, ఏవిధముగ ఉత్తమాశ్వము గొప్పగా ధ్వనియొనర్చుచు శీఘ్రముగ పరుగిడుచుండునో, అటులనే మీరును అత్యుత్తమము, అపూర్వమునగు శోభను పొంది సర్వమునకు సుఖము గలిగించుడు. ॥౯౦॥

90. The moon with beautiful gaits, like a loud-neighing horse, runs in the atmosphere, receiving light from the sun. Object of many a man's desire, abundantly golden-hued, she acquires beauty, lustre and grandeur.

౧౭౮౭.దేవస్త్వేవ మిత్యస్య మనుర్ఋషిః, విశ్వేదేవా దేవతాః, విరాట్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునారాజధర్మ విషయమాహ. మరల రాజధర్మ విషయము.

౧౨౮౨ దే॒వన్దే॑వం॒ వో॑ఽవ॒సే దే॒వన్దే॑వమ॒భిష్ట॑యే ।

దే॒వన్దే॑వꣳహువేమ॒ వాజ॑సాతయే గృ॒ణన్తో॑ దే॒వ్యా ధి॒యా ॥౯౧॥

ప.వి:- దే॒వన్దే॑వ॒మితి॑ దే॒వమ్ + దే॑వమ్, వ॒ః, అవ॑సే, దే॒వన్దే॑వ॒మితి॑ దే॒వమ్ + దే॑వమ్, అ॒భిష్ట॑యే, దే॒వన్దే॑వ॒మితి॑ దే॒వమ్ + దే॑వమ్, హు॒వే॒మ॒, వాజ॑సాత॒య॒ ఇతి॒ వాజ + సా॑తయే, గృ॒ణన్త॑ః, దే॒వ్యా, ధి॒యా.॥౯౧॥

పదార్థః :- (దేవన్దేవమ్) విద్వాంసం విద్వాంసం దివ్యం దివ్యం పదార్థం వా (వః) యుష్మాకమ్ (అవసే) రక్షణాద్యాయ (దేవన్దేవమ్) (అభిష్టయే) ఇష్టసుఖాయ (దేవన్దేవమ్) (హువేమ) ఆహ్వయామః స్వీకుర్యామ వా (వాజసాతయే) వాజానాం వేగాదీనాం సమ్భాగాయ (గృణన్తః) స్తువన్తః (దేవ్యా) దేదీప్యమానయా (ధియా) ప్రజ్ఞయా కర్మణా వా.॥౯౧॥

అన్వయః :- హే మనుష్యాః! దేవ్యా ధియా గృణన్తో వయం యథా వోఽవసే దేవన్దేవం హువేమ వోఽభిష్టయే దేవన్దేవం హువేమ వో వాజసాతయే చ దేవన్దేవం హువేమ. తథా యూయ మప్యేవ మస్మభ్యం కురుత. ॥౯౧॥

భావార్థః :- యే రాజపురుషాః సర్వేషాం ప్రాణినాం హితాయ విదుషః సత్కృత్యైతైః సత్యోపదేశాన్ ప్రచార్య సృష్టిపదార్థాన్ విజ్ఞాయ సర్వాభీష్టం సంసాధ్య సఙ్గ్రామాన్ జయన్తి తే దివ్యాం కీర్తిం ప్రజ్ఞాఞ్చ లభన్తే.॥౯౧॥

పదార్థము :- మానవులారా! (దేవ్యా) ప్రకాశవంతమగు (ధియా) బుద్ధి లేక కర్మచే (గృణన్తః) స్తుతియొనర్చుచు మే మెట్లు (వః) మీయొక్క (అవసే) రక్షణాదులకొరకు (దేవన్దేవమ్) ప్రతి విద్వాంసులను లేక ఉత్తమోత్తమ పదార్థములను (హువేమ) పిలుతుమో లేక గ్రహించుచున్నామో, మీయొక్క (అభిష్టయే) అభీష్ట సుఖములకొరకు (దేవన్దేవమ్) ప్రతి విద్వాంసుని లేక ఉత్తమమగు ప్రతి పదార్థమును మరియు మీయొక్క (వాజసాతయే) వేగాదులను చక్కగా పొందుటకై (దేవన్దేవమ్) ప్రతి విద్వాంసుని లేక ప్రతి ఉత్తమ పదార్థమును స్వీకరించెదమో, అదేవిధముగా మీరును మాకొరకు ఒనర్చుడు.॥౯౧॥

**భావార్థము** :- ఏ రాజపురుషులు సకల ప్రాణుల హితముకొరకు విద్వాంసులను సత్కరించి, వారిచే సత్యోపదేశములను ప్రచారమొనర్చుచు, సృష్టి పదార్థములను దెలిసికొని సకలాభీష్టములను సాధించుకొని సంగ్రామములందు విజయము పొందుదురో, వా రుత్తమకీర్తిని, బుద్ధిని ప్రాప్తిజేసికొనుచున్నారు.॥౯౧॥

91. Singing their praises with godlike wisdom, let us invoke each learned person for your protection; each scholar for the acquisition of desired happiness, and each sage for enjoying progress.

౧౭౮౮. దివీత్యస్య మేధ ఋషిః, వైశ్వానరో దేవతా, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పున ర్విద్వాంసః కిం కుర్యు రిత్యాహ. విద్వాంసు లేమి చేయవలెను?

౧౭౮౮ దివి పృష్టోఽఅరోచతాగ్నిర్వైశ్వానరో బృహన్।

క్ష్మయా వృధానఽఓజసా చనోహితో జ్యోతిషా బాధతే తమః॥౯౨॥

ప.వి:- దివి, పృష్టః, అరోచత, అగ్నిః, వైశ్వానరః, బృహన్, క్ష్మయా, వృధానః, ఓజసా, చనోహిత ఇతి చనః + హితః జ్యోతిషా, బాధతే తమః.॥౯౨॥

పదార్థః :-(దివి) ప్రకాశే (పృష్టః) సిక్తః స్థితః (అరోచత) రోచతే ప్రకాశతే (అగ్నిః) సూర్యాఖ్యః (వైశ్వానరః) విశ్వేషాం నరాణాం హితః (బృహన్) మహాన్ (క్ష్మయా) పృథివ్యా సహ. క్ష్మేతి పృథివీ నా...నిఘం. ౧.౧. (వృధానః) వర్ధమానః (ఓజసా) బలేన (చనోహితః) ఓషధిపాకసామర్థ్యేన అన్నాదీనాం హితః (జ్యోతిషా) స్వప్రకాశేన (బాధతే) నివర్తయతి (తమః) రాత్ర్యన్ధకారమ్. తమ ఇతి రాత్రి నా..నిఘం. ౧.౭.॥౯౨॥

అన్వయః:- హే విద్వాంసో మనుష్యా! యథా దివి పృష్టో వైశ్వానరో క్ష్మయా వృధాన ఓజసా బృహన్ చనోహితోఽగ్ని ర్జ్యోతిషా తమో బాధతేఽరోచత చ యథా శ్రేష్ఠైర్గుణైరవిద్యాన్ధకారం నివర్త్య యూయమపి ప్రకాశితకీర్తయో భవత.॥౯౨॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే విద్వాంసః సూర్యః తమ ఇవ దుష్టాచార మవిద్యాన్ధకారం చ నివర్త్య విద్యాం ప్రకాశయేయు స్తే సూర్య ఇవ సర్వత్ర ప్రకాశిత ప్రశంసా భవేయుః.॥౯౨॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! ఎట్లు (దివి) ఆకాశమునందు (పృష్టః) స్థిరము (వైశ్వానరః) సర్వమానవహితకారి (క్ష్మయా) పృథివితో గూడ (వృధానః) పెంపొందిన (ఓజసా) బలముతో (బృహన్) గొప్పదగు (చనోహితః) ఓషధులను పక్వమొనర్పగల సామర్థ్యముతో అన్నాదులను ధరించునదియు (అగ్నిః) సూర్యరూపాగ్ని (జ్యోతిషా) స్వప్రకాశముద్వారా (తమః) రాత్రిరూప అంధకారమును (బాధతే) నివృత్తపరచుచున్నదో మరియు (అరోచత) ప్రకాశించుచున్నదో, అట్టి ఉత్తమ గుణములచే అవిద్యయను అంధకారమును దూరపరచి మీరును ప్రకాశమయ కీర్తివంతులగుడు.॥౯౨॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ విద్వాంసులు సూర్యుడు అంధకారమును రూపుమాపునట్లు దుష్టాచారములను మరియు అవిద్యాంధకారమును దొలగించి విద్యను ప్రకాశపరచెదరో, వారు సూర్యునివలె సర్వత్ర ప్రకాశితులు, ప్రశంసనీయు లగుదురు.॥౯౨॥

92. O learned person, just as the Sun, set in heaven, the benefactor of humanity, increasing in his power on Earth, ripens medicines and grows food, removes darkness of the night with his lustre, and shines forth, so should ye dispell ignorance and gain glory!.

౧౭౮౯. ఇన్ద్రాగ్నీత్యస్య సుహోత్ర ఋషిః, ఇన్ద్రాగ్నీ దేవతే, భురిగనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథోషర్విషయ మాహ. ఉషఃకాల విషయము.

౧౭౮౯ ఇన్ద్రాగ్నీఽఅపాదియమ్పూర్వాగాత్పద్వతీభ్యః।

హిత్వీ శిరో జిహ్వయా వావదచ్చరత్త్రిꣳశత్పదా న్యక్రమీత్॥౯౩॥

**ప.వి**:- ఇన్ద్రాగ్నీ ఇతీన్ద్రాగ్నీ, అపాత్, ఇయమ్, పూర్వా, ఆ, అగాత్, పద్వతీభ్యఃఽఇతి పత్ + వతీభ్యః, హిత్వీ, శిరః, జిహ్వయా, వావదత్, చరత్, త్రిꣳశత్, పదా, ని, అక్రమీత్.॥౯౩॥

పదార్థః :-(ఇన్ద్రాగ్నీ) అధ్యాపకోపదేశకౌ (అపాత్) అవిద్యమానౌ పాదౌ యస్యాః సా (ఇయమ్) (పూర్వా) ప్రథమా (ఆ) (అగాత్) ఆగచ్ఛతి (పద్వతీభ్యః) బహవః పాదా యాసు ప్రజాసు తాభ్యః సుప్తాభ్యః ప్రజాభ్యః (హిత్వీ) హిత్వా త్యక్త్వా (శిరః) ఉత్తమాఙ్గమ్ (జిహ్వయా) వాచా (వావదత్) భృశం వదతి (చరత్) చరతి (త్రింశత్) ఏతత్సఙ్ఖ్యాకాన్ (పదా) ప్రాప్తిసాధకాన్ ముహూర్తాన్ (ని) (అక్రమీత్) క్రమతే.॥౯౩॥

అన్వయః :-హే ఇన్ద్రాగ్నీ! యే యువమపాద్పద్వతీభ్యః పూర్వా ఆఽగాచ్ఛిరో హిత్వీ ప్రాణినాం జిహ్వయా వావదచ్చరత్త్రింశత్పదాన్యక్రమీత్సేషా యువాభ్యాం విజ్ఞేయా.॥౯౩॥

భావార్థః :-హే మనుష్యా! యా వేగవతీ పాదశిర ఆద్యవయవరహితా ప్రాణి ప్రబోధాత్పూర్వభావనీ జాగరణహేతుః ప్రాణిముఖై ర్భృశం వదతీవ త్రింశన్ముహూర్తానన్తరం ప్రతి ప్రదేశమాక్రమీత్ సేషా యుష్మాభి ర్నిద్రాలస్యే విహాయ సుఖాయ సేవనీయా.॥౯౩॥

**పదార్థము** :- (ఇన్ద్రాగ్నీ) అద్యాపకోపదేశకులారా! (ఇయమ్) ఈ (అపాత్) పాదములు లేనిది

(పద్వతీభ్యః) అనేక పాదములుగల ప్రజలకన్న (పూర్వా) పూర్వమే ఉత్పన్నమై (ఆ, అగాత్) వచ్చుచున్నది (శిరః) శిరస్సును (హిత్వీ) వదలివేసి, అనగా శిరములేని ప్రాణుల (జిహ్వయా) వాణులతో (వావదత్) శీఘ్రమగ మాటలాడుచున్నది [అనగా; కుక్కుటము [కోడి] మున్నగువాని కూతలద్వార ఉషఃకాలము ప్రతీతమగుచున్నది. ఇందువల్ల మాటలాడు ధర్మము ఉషఃకాలమునందు ఆరోపణ మొనర్చబడుచున్నది] (చరత్) మరియు ఎట్లు విహరించుచున్నదో (త్రింశత్) ముప్పది (పదా) ప్రాప్తిసాధకములగు ముహూర్తములను (ని, అక్రమీత్) నిరంతరము ఆక్రమించుచున్నదో, అదియే ఉషః [ప్రాతః]కాలము అని మీరు తెలిసికొనవలయును.॥౯౩॥

భావార్థము :- మానవులారా! వేగవంతమైనది, పాదములు, శిరస్సు మున్నగు అవయవములు లేనిది, ప్రాణులు మేల్కొనుటకు పూర్వమే జాగృతికి హేతువు, ప్రాణులముఖములతో శీఘ్రముగా పలుకుచున్నట్లు (30) ముహూర్తము (౬౦ ఘడియ) లకు తరవాత ప్రతి స్థానము నేది ఆక్రమించునో అట్టి ఉషను నిద్ర, ఆలస్యములను వదలి (ఆ ప్రాతఃకాలమున) మీ సుఖముకొరకు సేవించవలయును.॥౯౩॥

93. O teacher and preacher; this footless Dawn, first comes to those with feet. Being headless, speaking loudly with the tongue of birds, she goes down for twenty four hours!.

౧౨౯౦. దేవాస ఇత్యస్య మనుర్ఋషిః, విశ్వేదేవా దేవతాః, పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

కే మనుష్యా విద్వాంసో భవితుమర్హన్తీత్యాహ. ఎట్టిమానవులు విద్వాంసులు కాగలరు?

౧౨౯౦ దేవాసో హి ష్మా మనవే సమన్యవో విశ్వే సాకꣳ సరాతయః।

తే నోఽ అద్య తే అపరన్తుచే తు నో భవన్తు వరివోవిదః॥౯౪॥

ప. వి:- దేవాసః, హి, స్మ, మనవే, సమన్యవ ఇతి స + మన్యవః, విశ్వే, సాకమ్, సరాతయ ఇతి స + రాతయః, తే, నః, అద్య, తే, ఽపరమ్, తుచే, తు, నః, భవన్తు, వరివోవిద ఇతి వరివః + విదః.॥౯౪॥

పదార్థః :- (దేవాసః) విద్వాంసః (హి) (స్మ) ప్రసిద్ధౌ. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః. షత్వం చ ఛాన్దసమ్ (మనవే) మనుష్యాయ (సమన్యవః) సమానో మన్యుః క్రోధో యేషాన్తే (విశ్వే) సర్వే (సాకమ్) సహ (సరాతయః) సమానా రాతయో దానాని యేషాన్తే (తే) (నః) అస్మాకమ్ (అద్య) (తే) (అపరమ్) భవిష్యతికాలే (తుచే) పుత్రపౌత్రాద్యాయాఽపత్యాయ.

తుగిత్యపత్య నా...నిఘం.౨.౨. (తు) (నః) అస్మాకమ్ (భవన్తు) (వరివోవిదః) యే వరివః పరిచరణం విదన్తి జానన్తి యద్వా వరివో ధనం వేదయన్తి ప్రాపయన్తి తే.॥౯౪॥

అన్వయః:-హే మనుష్యా! యే సరాతయః సమన్యవో విశ్వే దేవాసః సాకమద్య నో మనవే స్మ వరివోవిదో భవన్తు తే త్వపరం నస్తుచేఽస్మభ్యఞ్చ వరివోవిదో భవన్తు తే హి యుష్మభ్యం వరివోవిదః స్యుః.॥౯౪॥

భావార్థః :- యే మనుష్యాః! పరస్పరేభ్యః సుఖాని దద్యుర్యే సాకం దుష్టానాముపరి క్రోధం కుర్యస్తే పుత్రపౌత్రవన్తో భూత్వా మనుష్యసుఖోన్నతయే సమర్థా విద్వాంసో భవితుం మర్హన్తి.॥౯౪॥

పదార్థము :- ఓ మానవులారా! (సరాతయః) సమమైన దానము నొనర్చువారు (సమన్యవః) సమానక్రోధముగలవారు (విశ్వే) సమస్త (దేవాసః) విద్వాంసులు (సాకమ్) కలిసి మెలిసి (అద్య) నేడు (నః) మా (మనవే) మానవులకొరకు (స్మ) ప్రసిద్ధులైన (వరివోవిదః) సత్కారములనెరుగు, లేక ధనమును లభింపజేయువారు (భవన్తు) ఎట్లు అగుదురో (తు) మరియు (తే) వారు (అపరమ్) భవిష్యత్కాలములో (నః) మా (తుచే) పుత్ర పౌత్రాది సంతానములకొరకు మరియు మాకొరకును సత్కారములనెరుగువారు, మరియు ధనప్రాప్తి గలిగించువారగుదురో (తే,హి) అట్టివారే మీకొరకును సత్కారముల నెరుగు లేక ధనప్రాప్తిని గలిగించువా రగుదురుగాక! ॥౯౪॥

భావార్థము :- ఏ మనుష్యులు ఒండొరులకు సుఖముల గలిగించుకొందురో, ఎవరు కలిసిమెలిసి దుష్టులను దూరమొనర్చెదరో, వారే పుత్రపౌత్రాదులు గలవారలై మానవుల సుఖోన్నతికై సమర్థులు, విద్వాంసులుగా దగినవారు.॥౯౪॥

94. May all learned persons, equally charitably disposed, and equally full of righteous indignation, in unison, be the bringers of riches, today and hereafter, for a thoughtful person, for us and our progeny.

౧౭౫౧. అపాధమదిత్యస్య నృమేధ ఋషిః, ఇన్ద్రో దేవతా, భురిక్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ కే జనా దుంఖనివారణసమర్థాః సన్తీత్యాహ.

ఏ మానవులు దుఃఖనివారణ సమర్థులగుదురు?

౧౭౫౧ అపాధమదభిశస్తీరశస్తిహాథేన్ద్రో ద్యుమ్న్యాభవత్।
దేవాస్తఽ ఇన్ద్ర సఖ్యాయ యేమిరే బృహద్భానో మరుద్గణ ॥౯౫॥

ప.వి:- అప, అధమత్, అభిశస్తీరిత్యభి + శస్తీః, అశస్తిహేత్యశస్తి + హా, అథ, ఇన్ద్రః, ద్యుమ్నీ, ఆ, అభవత్, దేవాః, తే, ఇన్ద్ర, సఖ్యాయ, యేమిరే, బృహద్భానో ఇతి బృహత్ + భానో, మరుద్గణేతి మరుత్ + గణ.॥౯౫॥

పదార్థః:- (అప) దూరీకరణే (అధమత్) ధమంతి (అభిశస్తీః) అభితో హింసాః (అశస్తిహా) అప్రశస్తానాం దుష్టానాం హన్తా (అథ) (ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్ సభాపతీ రాజా (ద్యుమ్నీ) బహు ప్రశంసాధనయుక్తః (ఆ) (అభవత్) భవతు (దేవాః) విద్వాంసః (తే) తవ (ఇన్ద్ర) పరమైశ్వర్యప్రద సభాపతే! రాజన్! (సఖ్యాయ) మిత్రత్వాయ (యేమిరే) సంయమం కుర్వన్తి (బృహద్భానో) బృహన్తో భానవః కిరణా ఇవ కీర్తయో యస్య తత్సమ్బుద్ధౌ (మరుద్గణ) మరుతాం మనుష్యాణాం వాయూనాం వా గణః సమూహో యస్య తత్సమ్బుద్ధౌ.॥౯౫॥

అన్వయః:- యే బృహద్భానో మరుద్గణ ఇన్ద్ర! దేవా స్తే సఖ్యాయ యేమిరేఽథద్యుమ్నీన్ద్రో భవానభిశస్తీ రపాఽఽధమద శస్తిహాఽభవద్భవతు.॥౯౫॥

భావార్థః:- యే మనుష్యా! ధార్మికాణాం న్యాయాధీశానాం ధనాఢ్యానాం వా మిత్రతాం కుర్వన్తి తే యశస్వినో భూత్వా సర్వేషాం దుఃఖనివారణాయ సూర్యవద్భవన్తి.॥౯౫॥

**పదార్థము** :- (బృహద్భానో) మహాకిరణములవలె ప్రకాశమయకీర్తిగల (మరుద్గణ) మానవుల లేక పవనముల సమూహముతో కార్యసాధకుడవు (ఇన్ద్ర) పరమైశ్వర్యములను ప్రసాదించు నో సభాపతి రాజా! (దేవాః) విద్వాంసులు (తే) నీయొక్క (సఖ్యాయ) మైత్రికొరకు (యేమిరే) సంయమముగాను (అథ) మరియు (ద్యుమ్నీ) అనేక ప్రశంసనీయ ధనశాలివి (ఇన్ద్రః) పరమైశ్వర్యవంతుడవగు నీవు (అభిశస్తీః) అందరినుండి హింసలను (అప, ఆ, అధమత్) దూరమువరకు బెదిరించి పారద్రోలుచున్నావు (అశస్తిహా) దుష్ట నాశకుడవు (అభవత్) అగుము.॥౯౫॥

**భావార్థము** :- ఏ మనుష్యులు ధార్మిక న్యాయాధీశుల లేక ధనాఢ్యుల మిత్రత్వమొనర్తురో వారే యశోవంతులై సమస్త దుఃఖముల దొలగించుటయందు సూర్యునివంటి వా రగుచున్నారు.॥౯౫॥

95.O King refulgent with fame, lord of the hosts of men, the learned strive to win thy love. O supreme King, suppressor of violence from all sides, chastiser of the ignoble, be thou the master of riches!.

౧౭౬౬. ప్ర వ ఇత్యస్య నృమేధ ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ. మానవు లేమి యొనర్పవలెను?

౧౭౫౨ ప్ర వ ఇన్ద్రాయ బృహతే మరుతో బ్రహ్మార్చత।
వృత్రꣳ హనతి వృత్రహా శతక్రతుర్వజ్రేణ శతపర్వణా॥౯౬॥

ప.వి:- ప్ర, వః, ఇన్ద్రాయ, బృహతే, మరుతః, బ్రహ్మ, అర్చత, వృత్రమ్, హనతి, వృత్రహేతి వృత్ర+హా, శతక్రతురితి శత+క్రతుః, వజ్రేణ, శతపర్వణేతి శత+పర్వణా.॥౯౬॥

పదార్థః:-(ప్ర) (వః) యుష్మభ్యమ్ (ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (బృహతే) (మరుతః) మనుష్యాః (బ్రహ్మ) ధనమన్నం వా (అర్చత) సత్కురుత (వృత్రమ్) మేఘమ్ (హనతి) హన్తి. అత్ర బహులం ఛన్దసీతి శపో లుఙ్ న (వృత్రహా) యో వృత్రం హన్తి (శతక్రతుః) శతమసఙ్ఖ్యాతాః క్రతవః ప్రజ్ఞాః కర్మాణి వా యస్య సః (వజ్రేణ) శస్త్రాస్త్రవిశేషేణ (శతపర్వణా) శతస్యాసఙ్ఖ్యాతస్య జీవజాతస్య పర్వ పాలనం యస్మాత్తేన.॥౯౬॥

అన్వయః:- హే మరుతో మనుష్యా ! యః శతక్రతుః సేనాపతిః శతపర్వణా వజ్రేణ వృత్రహా సూర్యో వృత్ర మివ బృహత ఇన్ద్రాయ శత్రూన్ హనతి వో బ్రహ్మ ప్రాపయతి తం యూయం ప్రార్చత.॥౯౬॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా ! యే సూర్యో మేఘమివ శత్రూన్ హత్వా యుష్మదర్థ మైశ్వర్య మున్నయన్తి తేషాం సత్కారం యూయం కురుత సదా కృతజ్ఞా భూత్వా కృతఘ్నతాం త్యక్త్వా ప్రాజ్ఞాః సన్తో మహదైశ్వర్యం ప్రాప్నుత.॥౯౬॥

పదార్థము :- (మరుతః) ఓ మానవులారా! (శతక్రతుః) అసంఖ్యాక విధములగు బుద్ధి లేక కర్మలుగల సేనాధీశుడు (శతపర్వణా) ఎవనిచే అసంఖ్యాక జీవుల పాలనమొనర్చబడునో, అట్టి (వజ్రేణ) శస్త్రాస్త్రములచే (వృత్రహా) మేఘహంతకుడగు సూర్యుడు (వృత్రమ్) మేఘమునకు వలె (బృహతే) గొప్ప (ఇన్ద్రాయ) ఐశ్వర్యముకొరకు శత్రువులను (హనతి) సంహరించుచున్నాడో మరియు (వః) మీకొరకు (బ్రహ్మ) ధనము లేక అన్నమును ప్రాప్తింపజేయునో ఆతనిని మీరు (ప్ర, అర్చత) సత్కరించుడు. ॥౯౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులారా! సూర్యుడు మేఘములనువలె ఎవడు శత్రువులను నాశమొనర్చి మీకొరకు ఐశ్వర్యముల పెంపొందించునో, వానిని మీరు సత్కరించుడు. కృతఘ్నతను వదలి సదా కృతజ్ఞులై, ప్రాజ్ఞులై మహదైశ్వర్యములను పొందుడు.॥౯౬॥

96.O men, the Commander of the army with manifold acts, affording protection to the millions, with warlike weapons, like sun the slayer of clouds, slays the foes for mighty prestige, and secures wealth and food for ye, so should ye show him respect!.

౧౭౬౩. అస్యేత్యస్య మేధాతిథి ఋషిః, మహేన్ద్రో దేవతా, స్వరాట్ సతో బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ మనుష్యైః పరమాత్మా స్తోతవ్య ఇత్యుపదిశ్యతే. మానవులు పరమాత్మను స్తుతించవలెను.

౧౭౬౩ అస్యేదిన్ద్రో వావృధే వృష్ణ్య౨ం శవో మదే సుతస్య విష్ణవి।
అద్యా తమస్య మహిమానమాయవోऽను ష్టువన్తి పూర్వథా
ఇమా ఉ త్వా। యస్యాయమయ౨ం సహస్రమ్। ఊర్ధ్వఊ ఊ షు ణః॥౯౭॥

ప.విః- అస్య, ఇత్, ఇన్ద్రః, వావృధే, వవృధఇ ఇతి వవృధే, వృష్ణ్యమ్, శవః, మదే, సుతస్య, విష్ణవి, అద్య, తమ్, అస్య, మహిమానమ్, ఆయవః, అను, స్తువన్తి, పూర్వథేతి పూర్వ+థా.॥౯౭॥

పదార్థః:- (అస్య) సంసారస్య (ఇత్) ఏవ (ఇన్ద్రః) పరమైశ్వర్యయుక్తో రాజా (వావృధే) వర్ధయతి (వృష్ణ్యమ్) వృషే సమర్థ స్తస్యేమమ్ (శవః) బలముదకం వా. శవ ఇతి ఉదక నా... నిఘం. ౧.౧౨. (మదే) ఆనన్దాయ (సుతస్య) ఉత్పన్నస్య (విష్ణవి) వ్యాపకే పరమేశ్వరే. అత్ర వాచ్ఛన్దసీతి ఘి సంజ్ఞాకార్యాభావే గుణాదేశేऽవాదేశః. (అద్య) అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (తమ్) (అస్య) పరమాత్మనః (మహిమానమ్) మహత్త్వమ్ (ఆయవః) యే స్వకర్మఫలాని యాన్తి తే మనుష్యాః. ఆయవ ఇతి మనుష్య నా...నిఘం. ౨.౩ (అను) (స్తువన్తి) ప్రశంసన్తి (పూర్వథా) పూర్వే ఇవ.॥౯౭॥

అన్వయః:- హే మనుష్యా! య ఇన్ద్రో జీవో విష్ణవి సుతస్యాऽస్య మదే వృష్ణ్యం శవోऽద్య వావృధేऽస్య పరమాత్మన ఇన్మహిమానం పూర్వథా యమాయవోऽనుష్టువన్తి తం యూయమపి స్తువత.॥౯౭॥

భావార్థః:- హే మనుష్యా! యది యూయం సర్వత్ర వ్యాపకస్య సర్వజగదుత్పాదకస్యాఖిలాధారకస్య పరమైశ్వర్య ప్రాపకస్యాజ్ఞాం మహిమానం చ విజ్ఞాయ సర్వస్య సంసారస్యోపకారం కురుత. తర్హి యూయమ్ సతత మానన్దం ప్రాప్నుతేతి.॥౯౭॥

**పదార్థము** :- ఓ మానవులారా! (ఇన్ద్రః) పరమైశ్వర్యవంతుడగురాజు (విష్ణవి) సర్వవ్యాపకుడగు పరమాత్మయందు (సుతస్య) ఉత్పన్నమైనట్టి (అస్య) జగముయొక్క (మదే) ఆనందముకొరకు (వృష్ణ్యమ్) పరాక్రమము (శవః) బలము మరియు జలములను (అద్య) ఈ వర్తమాన సమయమందు (వావృధే) ఎట్లు

పెంపొందించుచున్నాడో (అస్య) ఈ పరమాత్మయొక్క (ఇత్ మహిమానమ్) మహిమలను (పూర్వథా) పూర్వజులవలె (ఆయవః) తమ కర్మఫలమును పొందునట్టి మానవులు (అను, స్తువన్తి) అనుకూలముగా ఎట్లు స్తుతియొనర్చుచున్నారో అట్లే (తమ్) వారిని కూడ మీరు స్తుతియొనర్పుడు. ॥౯౭॥

**భావార్థము** :- ఓ మానవులారా! మీరు ఏ సర్వవ్యాపకుడు, సమస్త జగత్తునుత్పన్నపరచినవాడు, సర్వాధారుడు, ఉత్తమ ఐశ్వర్యపాలకుడు, ప్రాపకుడునగు నా పరమేశ్వరుని ఆజ్ఞ మరియు మహిమలను దెలిసికొని సమస్త జగత్తున కుపకారమొనర్చినచో మీరు నిరంతరము ఆనందమును పొందుదురు. ॥౯౭॥

O men, the mighty king, always enhances his power and valour, and arranges for the supply of water, for the happiness of the world created by God. Human beings anxious for the fruit of their actions sing the glory of God like their forefathers. Praise ye alos Him!.

అత్రాగ్నిప్రాణోదానాఽహర్నిశసూర్యాగ్ని రాజైశ్వర్యోత్తమయాన విద్వచ్ఛ్రీవైశ్వానరేన్ద్ర ప్రజ్ఞావరుణాఽశ్వ్యన్న సూర్యరాజ ప్రజాపరీక్షకేన్ద్రవాయ్వాదిగుణవర్ణనాదేత దధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయేన సహ సఙ్గతిర్వేద్యా॥

ఈ యధ్యాయమునందు అగ్ని, ప్రాణము, ఉదానము, పగలు, రాత్రి, సూర్యుడు, విద్యుత్తు, రాజు, ఐశ్వర్యము, ఉత్తమ యానము, విద్వాంసుడు, లక్ష్మి, వైశ్వానరుడు, ఈశ్వరుడు, ఇంద్రుడు, బుద్ధి, వరుణుడు అశ్వినులు, అన్నము, చంద్రుడు, రాజు, ప్రజలు, పరీక్షకుడు, ఇంద్రవాయువులు మున్నగు పదార్థముల గుణముల వర్ణనమున్నది. ఇందుచే ఈ యధ్యాయమున చెప్పబడిన అర్థమునకు పూర్వాధ్యాయమందు చెప్పియున్న అర్థముతో సంబంధముగలదని యెరుగవలయును.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీయుత పరమవిదుషాం విరజానన్ద సరస్వతీస్వామినాం శిష్యేణ శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యేణ శ్రీమద్దయానన్ద సరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే త్రయస్త్రింశోఽధ్యాయః సమాప్తి మగమత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి ముప్పదిమూడవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత పిటిపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడుమునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల' చే నొనర్పబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివసీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ,ఆర్షవిద్యావినోద ఆచార్య

'మల్లె కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**ముప్పది మూడవఅధ్యాయము సమాప్తము.**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# యజుర్వేదభాష్యము

## 34వ అధ్యాయము - విషయసూచిక

# అథ చతుస్త్రింశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే అష్టపఞ్చాశన్మన్త్రాఃసన్తీతివేదితవ్యమ్.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ। యద్భద్రం తన్నఽఆ సువ ॥య.30.3॥

౧౮౭౪.యజ్జాగ్రత ఇత్యస్య శివసంకల్ప ఋషిః, మనో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ మనసో వశీకరణవిషయమాహ.

ఈ మంత్రమందిపుడు మనస్సును వశపరచుకొను విషయము వివరించబడును.

౧౮౭౪ యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి ।

దూరఙ్గమం జ్యోతిషాం జ్యోతిరేకన్తన్మే మనః శివసఙ్కల్పమస్తు॥౧॥

ప.వి:- యత్, జాగ్రతః, దూరమ్, ఉదైతీత్యుత్ + ఐతి, దైవమ్, తత్, ఊఀ ఇత్యూఀ, సుప్తస్య, తథా, ఏవ, ఏతి, దూరఙ్గమమితి దూరమ్ + గమమ్, జ్యోతిషామ్, జ్యోతిః, ఏకమ్, తత్, మే, మనః, శివసఙ్కల్పమితి శివ + సఙ్కల్పమ్ అస్తు. ॥౧॥

పదార్థః :-(యత్)(జాగ్రతః) (దూరమ్) (ఉదైతి) ఉద్గచ్ఛతి (దైవమ్) దేవ ఆత్మని భవం దేవస్య జీవాత్మనః సాధనమితి వా (తత్) యత్. వ్యత్యయః (ఉ) (సుప్తస్య) శయానస్య (తథా) తేనైవ ప్రకారేణ (ఏవ) (ఏతి) అన్తర్గచ్ఛతి (దూరఙ్గమమ్) యదుద్దూరం గచ్ఛతి గమయతి వాఽనేకపదార్థాన్ గృహ్ణాతి తత్ (జ్యోతిషామ్) శబ్దాదివిషయ ప్రకాశకానామిన్ద్రియాణామ్ (జ్యోతిః) ప్రకాశకం ప్రవర్తకమాత్మా మనసా సంయుజ్యతే మన ఇన్ద్రియేణేన్ద్రియమర్థేనేతి మహర్షివాత్స్యాయనోక్తేః (ఏకమ్) అసహాయమ్ (తత్) (మే) మమ (మనః) సంకల్పవికల్పాత్మకమ్ (శివసంకల్పమ్) శివః కల్యాణకారీ ధర్మవిషయః సంకల్ప ఇచ్ఛా యస్య తత్ (అస్తు) భవతు.॥౧॥

అన్వయః :- హే జగదీశ్వర విద్వన్ వా! భవదనుగ్రహేణ యద్ దైవం దూరఙ్గమం జ్యోతిషాం జ్యోతిరేకం జాగ్రతో దూరముదైతి. తదు సుప్తస్య తథైవాన్తరేతి, తన్మే మనః శివసంకల్పమస్తు.॥౧॥

**భావార్థః :-** యే మనుష్యాః పరమేశ్వరాజ్ఞాసేవనం విద్వత్సంగం కృత్వా అనేకవిధసామర్థ్య యుక్తం మనః శుద్ధం సమ్పాదయన్తి, యజ్జాగ్రతావస్థాయాం విస్తృతవ్యవహారం తత్సుషుప్తౌ శాన్తం భవతి యద్వేగవతాం వేగవత్తరం, జ్ఞానస్య సాధకత్వాదిన్ద్రియాణామపి ప్రవర్తకం నిగృహ్ణన్తి తేఽశుభవ్యవహారం విహాయ శుభాచరణే ప్రేరయితుం శక్నువన్తి. ॥౧॥

**పదార్థము :-** ఓ జగదీశ్వరా! రాజా! నీ కృపచే (యత్) ఏది (దైవమ్) ఆత్మయందున్న లేక జీవాత్మకు సాధనముగు (దూరఙ్గమమ్) అతిదూరము పయనించు మానవులను దూరమువరకు గొనిపోవునది లేక అనేక పదార్థములను గ్రహణమొనర్చునది (జ్యోతిషామ్) శబ్దాది ఇంద్రియములు ప్రకాశపరచునది శ్రోత్రాది ఇంద్రియములను (జ్యోతిః) ప్రవృత్తపరచునది (ఏకమ్) ఒంటరిది (జాగ్రతః) జాగ్రదావస్థయందు (దూరమ్) బహుదూరముదగువరకు (ఉత్, ఏతి) పరుగెత్తునది (ఉ) మరియు (తత్) ఎయ్యది (సుప్తస్య) నిదురించుచున్నవాని (తథా, ఏవ) అదేవిధముగా (ఏతి) లోపలి అంతఃకరణములోనికి చేరునదియైన (తత్) ఆ (మే) నాయొక్క (మనః) సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు (శివసంకల్పమ్) కల్యాణప్రదమైన ధర్మవిషయక ఆకాంక్షలు గలది (అస్తు) అగుగాక! ॥౧॥

**భావార్థము :-** ఏ మనుష్యులు పరమేశ్వరాజ్ఞలను సేవించుచు, విద్వాంసుల సాంగత్య మొనర్చుచు అనేక విధములగు సామర్థ్యములతో గూడిన మనస్సును శుద్ధపరచుకొందురో, ఎయ్యది జాగ్రదావస్థయందు విస్తృత వ్యవహారములు గల యా మనస్సే సుషుప్త్యవస్థయందు శాంతినిపొందుచున్నదో, ఎయ్యది వేగవంతమగు పదార్థములందు, అతి వేగముగలదియు, జ్ఞానమునకు సాధనమునగుటచే ఇన్ద్రియముల ప్రవర్తకము నగునదియగు మనస్సును ఎవరు వశమొనర్చుకొందురో, వారే అశుభవ్యవహారములను త్యజించి, శుభవ్యవహారములందు దానిని ప్రవృత్తమొనర్చగలుగుదురు. ॥౧॥

1. That which, divine, mounts far when man is waking, that which returns to him when he is sleeping.

The lights' one light that goeth to a distance, may that, my mind, be moved by auspicious resolve.

౧౭౫౫ యేన కర్మాణీత్యస్య శివసంకల్ప ఋషిః, మనో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౭౫౫ యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వన్తి విదథేషు ధీరాః।

యదపూర్వం యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥౨॥

**ప.వి:-** యేన, కర్మాణి, అపసః, మనీషిణః, యజ్ఞే, కృణ్వన్తి, విదథేషు, ధీరాః, యత్,

అపూర్వమ్, యక్షమ్, అన్తరిత్యన్తః, ప్రజానామితి ప్ర + జానామ్, తత్, మే, మనః, శివసంకల్పమితి శివ + సంకల్పమ్ అస్తు.॥2॥

పదార్థః :- (యేన) మనసా (కర్మాణి) కర్తురీప్సితతమాని క్రియమాణాని (అపసః) అపః కర్మ తద్వన్తః సదా కర్మనిష్ఠాః (మనీషిణః) మనస ఈషిణో దమనకర్తారః (యజ్ఞే) అగ్నిహోత్రాదౌ ధర్మేణ సఙ్గతవ్యవహారే యోగాభ్యాసే వా (కృణ్వన్తి) కుర్వన్తి (విదథేషు) విజ్ఞానయుద్ధాదివ్యవహారేషు (ధీరాః) ధ్యానవన్తో మేధావినః. ధీర ఇతి మేధావినా.. నిఘం. 3. 15. (యత్) (అపూర్వమ్) అనుత్తమగుణకర్మస్వభావమ్ (యక్షమ్) పూజనీయం సంగతం వా.. అత్రౌణాదికః సన్ ప్రత్యయః. (అన్తః) మధ్యే (ప్రజానామ్) ప్రాణిమాత్రాణామ్ (తత్) (మే) మమ (మనః) మననవిచారాత్మకమ్ (శివసఙ్కల్పమ్) ధర్మేష్టమ్ (అస్తు).॥2॥

అన్వయః:- హే పరమేశ్వర వా విద్వన్భవత్సఙ్గేన యేనాపసో మనీషిణో ధీరా యజ్ఞే విదథేషు చ కర్మాణి కృణ్వన్తి, యదపూర్వం ప్రజానామన్తర్యక్షం వర్తతే తన్మే మనః శివసఙ్కల్పమస్తు.॥2॥

భావార్థః:- మనుష్యైః పరమేశ్వరస్యోపాసనేన సువిచారవిద్యాసత్సఙ్గైరన్తః కరణమధర్మాచారాన్నివర్త్యధర్మాచారే ప్రవర్తనీయమ్.॥2॥

**పదార్థము** :- ఓ పరమేశ్వరా లేదా విద్వాంసుడా! ఎప్పుడైతే నీ సాంగత్యముచే (యేన) ఏ (అపసః) సదా ధర్మయుక్త కర్మనిష్ఠులు (మనీషిణః) మనస్సును అణచియుంచువారు (ధీరాః) ధ్యానమొనర్చునట్టి బుద్ధిశాలురు (యజ్ఞే) అగ్నిహోత్రాదులు, ధర్మసంయుక్త వ్యవహారములు, యోగయజ్ఞములందు, (విదథేషు) విజ్ఞాన సంబంధ యుద్ధము మున్నగు వ్యవహారములందు (కర్మాణి) అత్యంత ఇష్టకర్మలను (కృణ్వన్తి) చేయుచుందురో (యత్) ఏది (అపూర్వమ్) సర్వోత్తమ గుణకర్మస్వభావము గలది (ప్రజానామ్) ప్రాణిమాత్రుల (అన్తః) హృదయములందు (యక్షమ్) పూజనీయము, కలిసి ఏకీభూతమగుచున్నదో (తత్) అట్టి (మే) నాయొక్క (మనః) మననము మరియు ఆలోచనము నొనర్చు మనస్సు (శివసంకల్పమ్) శుభసంకల్పము గలది (అస్తు) అగుగాక!॥2॥

**భావార్థము** :- మానవులు పరమేశ్వరుని ఉపాసన, పవిత్రాలోచనలు, విద్య మరియు సత్సంగములచే తమ అంతఃకరణములను అధర్మాచరణమునుండి నివృత్తిమొనర్చి, ధర్మాచరణములందు ప్రవృత్త మొనర్చదగును. ॥2॥

2. Whereby the virtuous, thoughtful and wise persons, in religious performances, learned assemblies and battles, perform their duties. The peerless spirit stored in living creatures, may that, my mind be moved by auspicious resolve.

౧౨౮౬.యత్ ప్రజ్ఞానమిత్యస్య శివసఙ్కల్ప ఋషిః, మనో దేవతా, స్వరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౨౮౬ యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతిరన్తరమృత ప్రజాసు ।
యస్మాన్నఽఋతే కిఞ్చన కర్మ క్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు ॥౩॥

ప.విః- యత్, ప్రజ్ఞానమితి ప్ర + జ్ఞానమ్, ఉత, చేతః, ధృతిః, చ, యత్, జ్యోతిః, అన్తః, అమృతమ్, ప్రజాస్వితి ప్ర + జాసు, యస్మాత్, న, ఋతే, కిమ్, చన, కర్మ, క్రియతే, తత్, మే, మనః, శివసంకల్పమితి శివ + సఙ్కల్పమ్, అస్తు. ॥౩॥

పదార్థః :- (యత్) (ప్రజ్ఞానమ్) ప్రజానాతి యేన తద్బుద్ధిస్వరూపమ్ (ఉత) అపి (చేతః) చేతతి స్మరతి యేన తత్ (ధృతిః) ధైర్యరూపమ్ (చ) చకారాల్లజ్జాదీన్యపి కర్మాణి యేన క్రియన్తే (యత్) (జ్యోతిః) ద్యోతమానమ్ (అన్తః) అభ్యన్తరే (అమృతమ్) నాశరహితమ్ (ప్రజాసు) జనేషు (యస్మాత్) (మనసః) (నః) (ఋతే) వినా (కిమ్) (చన) కిఞ్చిదపి (కర్మ) (క్రియతే) (తత్) (మే) జీవాత్మనో మమ (మనః) సర్వకర్మసాధనమ్ (శివసంకల్పమ్) శివే కల్యాణకరే పరమాత్మని కల్ప ఇచ్ఛాఽస్య తత్ (అస్తు) భవతు ॥౩॥

అన్వయః:-హే జగదీశ్వర పరమయోగిన్ విద్వన్వా! భవజ్జ్ఞాపనేన యత్ప్రజ్ఞానం చతే ఉత చేతః ధృతి ర్యచ్చ ప్రజాస్వన్తరమృతం జ్యోతిర్యస్మాదృతే కిఞ్చన కర్మ న క్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు.॥౩॥

భావార్థః :- హే మనుష్యాః! యదన్తఃకరణబుద్ధిచిత్తమనోఽహఙ్కారవృత్తిత్వాచ్చతుర్విధ మన్తః ప్రకాశం ప్రజానాం సర్వకర్మసాధకం నాశరహితం మనోఽస్తి తన్న్యాయే సత్యాచరణే చ ప్రవర్త్య పక్షపాతాఽ న్యాయాఽధర్మాచరణాద్వ్యాయం నివర్తయత. ॥౩॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! పరమయోగినగు విద్వాంసుడా! నీవు హెచ్చరించుటచే (యత్) ఎయ్యది (ప్రజ్ఞానమ్) విశేషజ్ఞానము నుత్పన్నపరచు బుద్ధిరూపము (ఉత) మరియును (చేతః) స్మృతిసాధనమగు (ధృతి) ధైర్యస్వరూపమో (యత్,చ) మరియు నెయ్యది లజ్జ మున్నగు కర్మలకు హేతువో (ప్రజాసు) మానవుల (అన్తః) అంతఃకరణమందు ఆత్మకు తోడైయుండుటచే (అమృతమ్) నాశరహితము (జ్యోతిః) ప్రకాశకరూపము (యస్మాత్) ఏది (ఋతే, కిమ్,చన) లేకుండా ఎట్టి (కర్మ) కార్యములు (న,క్రియతే)

చేయబడవో (తత్) అట్టి (మే మనః) జీవాత్మనగు నా (మనః) సమస్త కర్మలందు సాధనరూపమగు మనస్సు (శివసంకల్పమ్) కల్యాణకారియగు పరమాత్మయందు ఇచ్ఛగలది (అస్తు) అగుగాక. ॥3॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఏ యంతఃకరణము, బుద్ధి, చిత్తము మరియు అహంకార రూపము గలదగుటచే నాలుగువిధములుగ అంతరంగమునందు ప్రకాశపరచునట్టి ప్రాణుల సకలకర్మల సాధకమగు ఏ యవినాశి మనస్సుగలదో దానిని న్యాయసత్యాచరణమునందు ప్రవృత్తమొనర్చి మీరు పక్షపాతము, అన్యాయము, అధర్మాచరణము నుండి నివృత్తి జేయుడు. ॥3॥

3. That which is wisdom, intellect, and firmness, immortal light which creatures have within them. That without which men can do no single action, may that, my mind, hanker after God and moved by noble resolve.

౧౯౯౭. యేనేదమిత్యస్య శివసంకల్ప ఋషిః మనో దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౯౯౭ యేనేదం భూతం భువనం భవిష్యత్పరిగృహీతమమృతేన సర్వమ్ ।

యేన యజ్ఞస్తాయతే సప్తహోతా తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥4॥

ప.వి:- యేన, ఇదమ్, భూతమ్, భువనమ్, భవిష్యత్, పరిగృహీతమితి పరి + గృహీతమ్, అమృతేన, సర్వమ్, యేన, యజ్ఞః, తాయతే, సప్తహోతేతి సప్త + హోతా, తత్, మే, మనః శివసఙ్కల్పమితి శివ + సఙ్కల్పమ్, అస్తు. ॥4॥

పదార్థః:- (యేన) మనసా (ఇదమ్) వస్తుజాతమ్ (భూతమ్) అతీతమ్ (భువనమ్) భవతీతి భువనమ్. వర్తమానకాలస్య సంబంధి. ఔణాదికః క్యుః (భవిష్యత్) యదుత్పత్స్యమానం భావి (పరిగృహీతమ్) పరితః సర్వతో గృహీతం జ్ఞాతమ్ (అమృతేన) నాశరహితేన పరమాత్మనా సహ యుక్తేన (సర్వమ్) సమగ్రమ్ (యేన) (యజ్ఞః) అగ్నిష్టోమాదిర్విజ్ఞానమయో వా వ్యవహారో వా (తాయతే) తన్యతే విస్తీర్యతే (సప్తహోతా) అగ్నిష్టోమేऽపి సప్తహోతారో భవన్తి (తత్) (మే) మమ (మనః) యోగయుక్తం చిత్తమ్ (శివసంకల్పమ్) శివో మోక్షరూపసంకల్పో యస్య తత్ (అస్తు) భవతు. ॥4॥

అన్వయః:- హే మనుష్యాః! యేనామృతేన భూతం భువనం భవిష్యత్సర్వమిదం పరిగృహీతం భవతి యేన సప్తహోతా యజ్ఞస్తాయతే, తన్మే మనః శివసంకల్పమస్తు. ॥4॥

భావార్థః: హే మనుష్యాః! యచ్చిత్తం యోగాభ్యాససాధనోపసాధనసిద్ధం భూతభవిష్యద్వర్తమానజ్ఞం సర్వసృష్టివిజ్ఞాతృకర్మోపాసనాజ్ఞానసాధకం వర్తతే తత్సదైవ కల్యాణప్రియం కురుత.॥౪॥

**పదార్థము** :- ఓ మనుష్యులారా! (యేన) ఏ (అమృతేన) అవినాశియగు పరమాత్మతో కూడియున్న మనస్సుతో (భూతమ్) గడచిపోయిన (భువనమ్) వర్తమానకాల (భవిష్యత్) జరుగనున్న (సర్వమ్, ఇదమ్) ఈ త్రికాలస్థ సమస్త వ్యవహారములను (పరిగృహీతమ్) అన్నిదిశలనుండి తెలిసికొన బడుచున్నవియో (యేన) దేనిచే (సప్తహోతా) ఏడుగురు హోతలు, పంచప్రాణములు, ఆరవది ఆత్మ, ఏడవది అవ్యక్తము అను నీ యేడు ఇచ్చి పుచ్చుకొను వ్యవహార మెందు జరుగునో, అట్టి (యజ్ఞః) అగ్నిష్టోమాదులు లేక విజ్ఞానరూప వ్యవహారములు (తాయతే) విస్తృతపరచబడునో (తత్) అట్టి (మే) నాయొక్క (మనః) యోగముతో గూడిన చిత్తము (శివసంకల్పమ్) మోక్షరూప సంకల్పముగలది (అస్తు) అగుగాక!॥౪॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఏ చిత్తము యోగాభ్యాసమునకు సాధనోపసాధనములచే సాధించబడునట్టి భూతభవిష్యద్వర్తమానకాలము జ్ఞాత, సమస్త సృష్టి విషయముల నెరుగునది, జ్ఞాన కర్మోపాసన లెద్దానికి సాధనములో దానిని ఎల్లప్పుడును కల్యాణప్రదమునకు ప్రియమైనదిగా నొనర్చుకొనుడు. ॥౪॥

4. Whereby, coupled with immortal God, the past, present and future all are comprehended, whereby spreads sacrifice by Seven Hotas, may that, my mind, aim at salvation.

౧౬౯౦. యస్మిన్నిత్యస్య శివసంకల్ప ఋషిః, మనో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవత స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౬౯౦ యస్మిన్నృచః సామ యజూꣳషి యస్మిన్ప్రతిష్ఠితా రథనాభావివారాః।

యస్మింశ్చిత్తꣳ సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥౫॥

ప.వి:- యస్మిన్, ఋచః, సామ, యజూꣳషి, యస్మిన్, ప్రతిష్ఠితా, ప్రతిష్ఠితేతి ప్రతి + స్థితా, రథనాభావివేతి రథనాభౌ + ఇవ, అరాః, యస్మిన్, చిత్తమ్, సర్వమ్, ఓతమిత్యా + ఉతమ్, ప్రజానామితి ప్ర + జానామ్, తత్, మే, మనః శివసఙ్కల్పమితి శివ + సఙ్కల్పమ్, అస్తు ॥౫॥

పదార్థః :-(యస్మిన్) మనసి (ఋచః) ఋగ్వేదః (సామ) సామవేదః (యజూꣳషి) యజుర్వేదః (యస్మిన్) (ప్రతిష్ఠితా) ప్రతిష్ఠితాని (రథనాభావివ) యథా రథస్య రథచక్రస్య మధ్యవే కాష్ఠే సర్వేఽవయవా లగ్నా భవన్తి తథా (అరాః) రథచక్రావయవా (యస్మిన్) (చిత్తమ్) సర్వపదార్థవిషయిజ్ఞానమ్ (సర్వమ్) సమగ్రమ్ (ఓతమ్) సూత్రే మణిగణా ఇవ ప్రోతమ్ (ప్రజానామ్) (తత్) (మే) మమ (మనః) (శివసఙ్కల్పమ్) శివః కల్యాణకారో వేదాదిసత్యశాస్త్రప్రచారసఙ్కల్పో యస్మింస్తత్ (అస్తు) భవతు.॥౫॥

అన్వయః :-రథనాభావివారా యస్మిన్మనసి ఋచః సామ యజూꣳషి ప్రతిష్ఠితా యస్మిన్నథర్వాణః ప్రతిష్ఠితా భవన్తి యస్మిన్ ప్రజానాం సర్వంచిత్తమోతమస్తి తన్మే మనః శివసఙ్కల్పమస్తు.॥౫॥

భావార్థః :-అత్రోపమావాచకలుప్తోపమాలఙ్కారౌ. హే మనుష్యా! యుష్మాభిర్యస్య స్వాస్థ్య ఏవ వేదాదిపఠనపాఠనవ్యవహారో ఘటతే తత్ మన ఏవ వేదాదివిద్యాధారం యత్ర సర్వేషాం వ్యవహారాణాం జ్ఞానం సఞ్చితం భవతి తదన్తఃకరణం విద్యాధర్మాచరణేన పవిత్రం సంపాదనీయమ్.॥౫॥

**పదార్థము :-** (యస్మిన్) ఏ మనస్సునందు (రథనాభావివ, అరాః) ఏ విధముగ రథచక్రముల మధ్యగల అడ్డలేక బుడ్డియందు ఆకులు తగిలియుండునో, అట్లే (ఋచః) ఋగ్వేదము (సామ) సామవేదము (యజూంషి) యజుర్వేదము (ప్రతిష్ఠితా) అన్నివైపులనుండి స్థితము మరియు (యస్మిన్) దేనియందు అథర్వవేదము స్థితమైయున్నదో (యస్మిన్) దేనియందు (ప్రజానామ్) ప్రాణుల (సర్వమ్) సమగ్ర (చిత్తమ్) సర్వ పదార్థసంబంధ జ్ఞానము (ఓతమ్) సూత్రము [దారము] నందలి మణులవలె సంయుక్తములై యున్నవియో (తత్) అట్టి (మే) నాయొక్క (మనః) మనస్సు (శివసంకల్పమ్) కల్యాణకారకములగు వేదములు మున్నగు సత్యశాస్త్రముల ప్రచారరూప సంకల్పము గలది (అస్తు) అగు గాక!॥౫॥

**భావార్థము :-** ఈ మంత్రములో ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఓ మానవులారా! ఏ మనస్సు ఆరోగ్యవంతముగ నుండుటచేతనే వేదములు మున్నగు విద్యలకు ఆధారము మరియు దేనియందు సమస్త వ్యవహారముల జ్ఞానము ఏకత్రితమైయుండునో అట్టి అంతఃకరణమును విద్య మరియు ధర్మాచరణములందు మీరు పవిత్రపరచుకొనుటయోగ్యమై యున్నది. ॥౫॥

5. wherein the Richas, Samans, Yajur-verses and the Atharva veda, like spokes within a cart's nave, are included, and all the knowledge of human beings is inwoven, may that, my mind, be actuated with the noble resolve of proapgating the Vedas.

**౧౭౮౯.సుషారథిరిత్యస్య శివసఙ్కల్ప ఋషిః, మనో దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.**

**పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.**

౧౫౫ సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్నేనీయతేఽభీశుభిర్వాజినఽఇవ ।
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥౬॥

ప.వి:- సుషారథిః సుసారథిరితి సు + సారథిః, అశ్వానివేత్యశ్వాన్ + ఇవ, యత్, మనుష్యాన్, నేనీయతే, అభీశుభిరిత్యభీశు + భిః, వాజినఽఇవేతి వాజినః + ఇవ, హృత్ప్రతిష్ఠమ్, హృత్ప్రతిష్ఠమితి హృత్ + ప్రతిష్ఠమ్, యత్, అజిరమ్, జవిష్ఠమ్, తత్, మే, మనః, శివసంకల్పమితి శివ + సంకల్పమ్, అస్తు ॥౬॥

పదార్థః :-(సుషారథిః) శోభనశ్చాసౌ సారథిర్యానచాలయితా (అశ్వానివ) యథాశ్వాన్ కశయా సర్వతశ్చాలయతి తథా (యత్) (మనుష్యాన్) మనుష్యగ్రహణముభయలక్షకం ప్రాణిమాత్రస్య (నేనీయతే) భృశమితస్తతో నయతి గమయతి (అభీశుభిః) రశ్మిభిః. అభీశవ ఇతి రశ్మినా...నిఘం. ౧.౫. (వాజినఇవ) సుశిక్షితానశ్వానివ (హృత్ప్రతిష్ఠమ్) హృది ప్రతిష్ఠా స్థితిర్యస్య తత్ (యత్) (అజిరమ్) విషయాదిషు ప్రక్షేపకం జరాద్యవస్థారహితం వా (జవిష్ఠమ్) అతిశయేన వేగవత్తరమ్ (తత్) (మే) మమ (మనః) (శివసఙ్కల్పమ్) మఙ్గల నియమేష్టమ్ (అస్తు) భవతు.॥౬॥

అన్వయః :-యత్ సుషారథిరశ్వానివ మనుష్యాన్నేనీయతేఽభీశుభిర్వాజినఇవ నియచ్ఛతి చ బలాత్ సారథిరశ్వానివ ప్రాణినో నయతి యద్ధృత్ప్రతిష్ఠమజిరం జవిష్ఠమస్తి తన్మే మనః శివసఙ్కల్పమస్తు.॥౬॥

భావార్థః :- అత్రోపమాలంకారః. యత్రాసక్తం తత్రైవ ప్రగ్రహైః సారథిః తురఙ్గానివ వశే స్థాపయతి సర్వేఽవిద్వాంసో యదనువర్తన్తే విద్వాంసశ్చ యత్స్వవశం కుర్వన్తి యచ్ఛుద్ధం సత్సుఖకార్యశుద్ధం సద్దుఃఖకారి యజ్జితం సిద్ధిం యదజితమసిద్ధిం ప్రయచ్ఛతి తన్మనో మనుష్యైః స్వవశం సదా రక్షణీయమ్.॥౬॥

పదార్థము :-(యత్) ఏ మనస్సు (సుషారథిః) ఏవిధముగ చతురుడు, ఉత్తముడునైన సారథి (అశ్వానివ) కళ్లెముద్వారా అశ్వములను అన్నివైపులనుండి నడుపుచుండునో, అదేవిధముగ (మనుష్యాన్) మనుష్యాది ప్రాణులను (నేనీయతే) త్వరత్వరగా అటు నిటు నడిపించుచున్నదో మరియు (అభీశుభిః)

ఏవిధముగ త్రాళ్లచే (వాజిన ఇవ) వేగవంతములగు అశ్వములను సారథి వశపరచుకొనునో నియమమునందుంచునో (యత్) ఏది (హృత్ప్రతిష్ఠమ్) హృదయమున స్థిరమై (అజిరమ్) విషయాదులందు ప్రేరకము లేక వృద్ధాప్యము మున్నగు వయోపరిమిత రహితము మరియు (జవిష్ఠమ్) అత్యంత వేగవంతమునై యున్నదో (తత్) అట్టి (మే) నా (మనః) మనస్సు (శివసంకల్పమ్) మంగళ ప్రదమగు నియమములందు ఇష్టపడునది (అస్తు) అగుగాక! ॥౬॥

**భావార్థము** :-ఈ మంత్రములో రెండుపమాలంకారములు గలవు. సారథి ఏ పదార్థములవైపు రథమును నడుపదలచునో, అచ్చోటికే అశ్వములను త్రోలునట్లు ప్రాణులను గొనిపోవునో నేవిధముగ చతురుడగు సారథి కళ్లెముద్వారా వేగవంతములగు అశ్వములను వశముననుంచునో మూర్ఖులెల్లరు దేనికి వశవర్తులైయుందురో, విద్వాంసు లెద్దానిని వశమున నుంచుకొనెదరో, ఎయ్యది శుద్ధమగు సుఖములను గలిగించుచు, అశుద్ధమగు దుఃఖములను సైతము గలిగించు సామర్థ్యము గలిగియున్నదో, మరియు నేది జయించబడిన సిద్ధిని, జయించజాలని అసిద్ధిని గలిగించుచుండునో, అట్టి మనస్సును మానవులు వశమున నుంచుకొన వలయును. ॥౬॥

6. As a skilful charioteer drives with reins the fleet-foot horses, so does the mind control men. It dwell within the heart, is free from old age, drives men into sensuality, and is most rapid. May that, my mind, be moved by right intention.

౧౮౦౦. పితుమిత్యస్యాగస్త్య ఋషిః, అన్నం దేవతా, ఉష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ కః శత్రూన్ విజేతుం శక్నోతీత్యాహ. ఎవరు శత్రువులను జయించగలరు?

౧౮౦౦ పితుం ను స్తోషమ్మహో ధర్మాణ తవిషీమ్ ।

యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వమర్దయత్ ॥౭॥

**ప. వి:- పితుమ్, ను, స్తోషమ్, మహః, ధర్మాణమ్, తవిషీమ్, యస్య, త్రితః, వి, ఓజసా, వృత్రమ్, విపర్వమితి వి + పర్వమ్, అర్దయత్ ॥౭॥**

పదార్థః :-(పితుమ్) అన్నమ్ (ను) సద్యః (స్తోషమ్) స్తువే (మహః) మహాన్తమ్ (ధర్మాణమ్) పక్షపాతరహితం న్యాయాచరణం ధర్మమ్ (తవిషీమ్) బలయుక్తాం సేనామ్. తవిషీతి బలనా...నిఘం. ౨.౯. (యస్య) (త్రితః) త్రిషు కాలేషు. సప్తమ్యర్థే తసిః. (వి) (ఓజసా) ఉదకేన సహ. ఓజస ఇత్యుదక నా...నిఘం.౧.౧౨. (వృత్రమ్) మేఘమ్ (విపర్వమ్) విగతాని పర్వాణి గ్రన్థయో యస్య తమ్ (అర్దయత్) అర్దయతి నాశయతి.॥౭॥

అన్వయః :- అహం యస్య పితుం మహో ధర్మాణం తవిషీం ను స్తోషం స రాజపురుషః త్రితః సూర్య ఓజసా సహ వర్తమానం విపర్వం వృత్రం వ్యర్ధయదివ శత్రూఞ్జేతుం శక్నోతి. ॥౭॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యేన సత్యో ధర్మో బలవతీ సేనా పుష్కలాన్నాదిసామగ్రీ చ ధ్రియతే, స సూర్యో మేఘమివ శత్రూన్ విజేతుం శక్నుయాత్.॥౭॥

పదార్థము :- నేను (యస్య) ఎవని (పితుమ్) అన్నమును (మహః) గొప్పదగు (ధర్మాణమ్) పక్షపాత రహితమగు న్యాయాచరణరూప ధర్మమును మరియు (తవిషీమ్) బలముతో గూడిన సైన్యమును (ను) శీఘ్రముగ (స్తోషమ్) స్తుతింతునో, ఆ రాజపురుషుడు (త్రితః) ముక్కాలములందును సూర్యునివలె (ఓజసా) జలములతో వర్తమానుడై (విపర్వమ్) భిన్నభిన్నమైన మేఘరూప గ్రంథులు [ముడులు] గల (వృత్రమ్) మేఘములను (వి, అర్దయత్) విశేషముగ నష్టపరచుచున్నదో, అటులనే శత్రుసంహారమునకు సమర్థుడగుచున్నాడు. ॥౭॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎవరు సత్యము, ధర్మము, శక్తిమంతమైన సేన, పుష్కలమగు అన్నాది ద్రవ్యములు ధారణమొనర్చి యుందురో వారు సూర్యుడు మేఘములనువలె శత్రువులను జయించగలరు. ॥౭॥

7. I glorify eagerly the king who possesses food, justice and a strong army. He conquers the foes, just as the sun rends limb by limb the cloud filled with water.

౧౮౦౧. అన్విదిత్యస్యాగస్త్య ఋషిః, అనుమతిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును?

౧౮౦౧ అన్విదనుమతే త్వం మన్యాసై శఞ్చ నస్కృధి ।

క్రత్వే దక్షాయ నో హిను ప్ర ణఽఆయూంషి తారిషః ॥౮॥

ప.వి:- అను, ఇత్, అనుమత ఇత్యను + మతే, త్వమ్, మన్యాసై, శమ్, చ, నః, కృధి, క్రత్వే, దక్షాయ, నః, హిను, ప్ర, నః, ఆయూంషి, తారిషః. ॥౮॥

పదార్థః :- (అను) (ఇత్) ఏవ (అనుమతే) అనుకూలా మతిర్యస్య తత్సమ్బుద్ధౌ (త్వమ్) (మన్యాసై) మన్యస్వ (శమ్) సుఖమ్ (చ) (నః) అస్మాన్ (కృధి) కురు (క్రత్వే) ప్రజ్ఞాయై (దక్షాయ) బలాయ చతురత్వాయ వా (నః) అస్మాన్ (హిను) వర్ధయ (ప్ర) (నః) అస్మాకమ్ (ఆయూంషి) జీవనాదీని (తారిషః) సన్తారయసి. ॥౮॥

అన్వయః :-హే అనుమతే సభాపతే విద్వంస్త్వం! యచ్ఛమనుమన్యాసై తేన యుక్తాన్నస్కృధి, క్రత్వే దక్షాయ నో హిను చ న ఆయూంషి చేత్ర్పతారిషః.॥౮॥

భావార్థః :-మనుష్యైర్యథా స్వార్థసిద్ధయే ప్రయత్యతే తథైవాన్యార్థేఽపి ప్రయత్నో విధేయః యథా స్వస్య కల్యాణవృద్ధీ అన్వేష్టవ్యే తథాఽన్యేషామపి. ఏవం సర్వేషాం పూర్ణమాయుః సమ్పాదనీయమ్.॥౮॥

పదార్థము :-(అనుమతే) అనుకూల బుద్ధిగల సభాపతివగు ఓ విద్వాంసుడా! (త్వమ్) నీవు ఎద్దానిని (శమ్) సుఖకరము (అను, మన్యాసై) అనుకూలమని అంగీకరింతువో, దానిచే (నః) మమ్ము (కృధి) అటులనే యొనర్పుము (క్రత్వే) బుద్ధి (దక్షాయ) బలము లేక చతురత్వముకొరకు (నః) మమ్ము (హిను) వృద్ధి నొందించుము. (చ) మరియు (నః) మాయొక్క (ఆయూంషి) ఆయువును (ఇత్) నిశ్చయముగ (ప్ర, తారిషః) చక్కగా పూర్ణ మొనర్పుము.॥౮॥

భావార్థము :- మానవు లేవిధముగ స్వార్థసిద్ధికొరకు ప్రయత్నమొనర్చెదరో, అటులనే అన్యార్థమునకు [ఇతరులకొరకు] ప్రయత్నమొనర్పవలయును. ఎట్లు తమ కల్యాణమును వాంఛించెదరో, ఎట్లు స్వంత వృద్ధిని కోరెదరో, అటులనే ఇతరులకొరకును కాంక్షించుచు సకలజనుల ఆయుష్యమును వృద్ధిపరచవలెను.॥౮॥

8. O learned king of favourable disposition, grant us happiness, which thou dost consider conducive. Urge us to wisdom, and strength; and prolong the days of our life!.

౧౮౦౨.అను న ఇత్యస్యాగస్త్య ఋషిః, అనుమతిర్దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౮౦౨ అను నోఽద్యానుమతిర్యజ్ఞం దేవేషు మన్యతామ్ ।

అగ్నిశ్చ హవ్యవాహనో భవతం దాశుషే మయః॥౯॥

ప.వి:-అను, నః, అద్య, అనుమతిరిత్యను + మతిః, యజ్ఞమ్, దేవేషు, మన్యతామ్, అగ్నిః, చ, హవ్యవాహన ఇతి హవ్య + వాహనః, భవతమ్, దాశుషే, మయః ॥౯॥

పదార్థః :-(అను) (నః) అస్మాకమ్ (అద్య) ఇదానీమ్ (అనుమతిః) అనుకూలం విజ్ఞానమ్ (యజ్ఞమ్) సుఖదానసాధనం వ్యవహారమ్ (దేవేషు) విద్వత్సు (మన్యతామ్) (అగ్నిః) పావకవత్తేజస్వీ తజ్జ్ఞో వా (చ) సముచ్చయే (హవ్యవాహనః) యో హవ్యాని గ్రహీతుం యోగ్యాని వస్తూని వహతి ప్రాపయతి (భవతమ్) (దాశుషే) దాత్రే (మయః)

సుఖకారిణౌ. మయ ఇతి సుఖనా..నిఘం. ౩.౬.॥౯॥

అన్వయః :- యో౽నుమతిరద్య దేవేషు నో యజ్ఞమనుమన్యతాం స హవ్యవాహనో౽గ్నిశ్చ యువాం దాశుషే మయః సుఖకారిణౌ భవతమ్.॥౯॥

భావార్థః :- యే మనుష్యా సత్కర్మానుష్ఠానే౽నుమతిదాతారో దుష్టకర్మానుష్ఠానస్య నిషేధకాస్తే౽గ్న్యాది విద్యయా సుఖం సర్వేభ్యః ప్రయచ్ఛన్తి.॥౯॥

పదార్థము :- (అనుమతిః) ఎవరు అనుకూల విజ్ఞానవంతులో (అద్య) నేడే (దేవేషు) విద్వాంసులందు (నః) మాయొక్క (యజ్ఞమ్) సుఖమునకు సాధనరూప వ్యవహారమును (అను మన్యతామ్) అనుకూలముగ నెంచెదరో వారు (చ) మరియు (హవ్యవాహనః) పొందదగిన పదార్థములను ప్రాప్తింపజేయునట్టి (అగ్నిః) అగ్నివంటితేజస్వి లేక అగ్నివిద్యనెరిగిన విద్వాంసులగు మీ రిరువురు (దాశుషే) దానశీలురగు మానవులకొరకు (మయః) సుఖకారులు (భవతమ్) అగుడు.॥౯॥

భావార్థము :- ఏ మనుష్యులు సత్కర్మల అనుష్ఠానములందు అనుమతి నిచ్చుచు మరియు దుష్కార్యాచరణమును నిషేధించెదరో వారు అగ్ని మున్నగు విద్యలద్వారా సకలమానవులకు సుఖముల నీయగలుగుదురు. ॥౯॥

9. May the man of favourable knowledge approve friendly this day our sacrifice among the learned. May he and master of the science of oblation bearing fire, bring bliss to the charitably disposed person.

౧౮౦౩.సినీవాలీత్యస్య గృత్సమద ఋషిః, సినీవాలీ దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ విదుష్యః కుమార్యః కిం కుర్యు రిత్యాహ. విదుషీమణులైన కుమారీరత్నము లేమి చేయవలయును?

౧౮౦౩ సినీవాలి పృథుష్టుకే యా దేవానామసి స్వసా ।

జుషస్వ హవ్యమాహుతం ప్రజాం దేవి దిదిడ్ఢి నః॥౧౦॥

ప.వి:- సినీవాలి, పృథుష్టుకే, పృథుస్తుక ఇతి పృథు + స్తుకే, యా, దేవానామ్, అసి, స్వసా, జుషస్వ, హవ్యమ్, ఆహుతమిత్యా + హుతమ్ ప్రజామితి ప్ర + జామ్, దేవి, దిదిడ్ఢి, నః.॥౧౦॥

పదార్థః :- (సినీవాలి) సినీ ప్రేమబద్ధా చాసౌ బలకారిణీ చ తత్సమ్బుద్ధౌ (పృథుష్టుకే) పృథుర్విస్తీర్ణాష్టుకా స్తుతిః కేశభారః కామో వా యస్య తత్సమ్బుద్ధౌ మహాస్తుతే పృథుకేశభారే పృథుకామే వా (యా) (దేవానామ్) విదుషామ్ (అసి) (స్వసా) భగినీ (జుషస్వ) సేవస్వ

(హవ్యమ్) ఆదాతువర్హమ్ (ఆహుతమ్) సమన్తాత్ వరదీక్షాదికర్మభిః స్వీకృతం పతిమ్ (ప్రజామ్) సుసన్తానరూపామ్ (దేవి) విదుషి (దిదిడ్ఢి) దిశ దేహి. అత్ర దిశ ధాతోర్బహులం ఛన్దసీతి శపః శ్లుః (నః) అస్మభ్యమ్.॥౧౦॥

అన్వయః :-హే సినీవాలి పృథుష్టుకే దేవి విదుషి కుమారి! యా త్వం దేవానాం స్వసాఽసి సా హవ్యమాహుతం పతిం జుషస్వ నః ప్రజాం దిదిడ్ఢి.॥౧౦॥

భావార్థః :-హే కుమార్యో! యూయం బ్రహ్మచర్యేణ సమగ్రా విద్యాః ప్రాప్య యువతయో భూత్వా స్వేష్టాన్ స్వపరీక్షితాన్ వర్తు వర్హాన్ పతీన్ స్వయం వృణుత తైః సహానన్ద్య ప్రజా ఉత్పాదయత.॥౧౦॥

పదార్థము :- (సినీవాలి) ప్రేమతోగూడిన బలము నొసగు (పృథుష్టుకే) విస్తృతమైనస్తుతించదగిన శిరోజనములుగల లేక కామితములు గలిగియున్న (దేవి) విదుషీ కుమారీరత్నమా! (యా) ఏ నీవు (దేవానామ్) విద్వాంసుల (స్వసా) సోదరివియై (అసి) ఉన్నావో, అట్టి నీవు (హవ్యమ్) గ్రహించదగిన (ఆహుతమ్) ఉత్తమ విధిగా వరించిన దీక్షాది కర్మలచే స్వీకరించిన పతిని (జుషస్వ) సేవించుము. మరియు (నః) మాకొరకు (ప్రజామ్) ఉత్తమ సంతాన రూప ప్రజను (దిదిడ్ఢి) ఇమ్ము.॥౧౦॥

భావార్థము :- ఓ కుమారీరత్నములారా! మీరు బ్రహ్మచర్యాశ్రమముతోగూడి సమస్త విద్యలను పొంది యువావస్థయందు స్వయముగ పరీక్షించి వరించదగిన పతులను వరించుడు. ఆ పతులతో ఆనందముగా నుండి ఉత్తమ సంతానము నుత్పన్నపరచుడు.॥౧౦॥

10. O lovely, strong, broad-stressed, famous, beautiful, educated virgin, sister of the learned, accept the desired husband, and grant us progeny!.

౧౮౦౪.పఞ్చేత్యస్య గృత్సమద ఋషిః, సరస్వతీ దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౮౦౪ పఞ్చ నద్యః సరస్వతీమపి యన్తి సస్రోతసః ।
సరస్వతీ తు పఞ్చధా సో దేశేఽభవత్సరిత్ ॥౧౧॥

ప.వి:- పఞ్చ, నద్యః, సరస్వతీమ్, అపి, యన్తి, సస్రోతస ఇతి స + స్రోతసః, సరస్వతీ, తు, పఞ్చధా, సా, ఊం ఇత్యూం, దేశే, అభవత్, సరిత్.॥౧౧॥

పదార్థః :-(పఞ్చ) పఞ్చజ్ఞానేన్ద్రియవృత్తయః (నద్యః) నదీవ ప్రవాహరూపాః (సరస్వతీమ్) ప్రశస్తవిజ్ఞానవతీం వాచమ్ (అపి) (యన్తి) ప్రాప్నువన్తి (సస్రోతసః) సమానం మనో రూపం స్రోతః ప్రవాహో యాసాన్తాః (సరస్వతీ) (తు) అవధారణే (పఞ్చధా) పఞ్చజ్ఞానేన్ద్రియశబ్దాదివిషయప్రతిపాదనేన పఞ్చప్రకారాః (సా) (ఉ) (దేశే) స్వనివాసే స్థానే (అభవత్) భవతి (సరిత్) యా సరతి గచ్ఛతి సా.॥11॥

అన్వయః :-మనుష్యైః సస్రోతసః పఞ్చ నద్యః యాం సరస్వతీమపి యన్తి సా ఉ సరిత్ సరస్వతీ దేశే పఞ్చధా త్వభవదితి విజ్ఞేయా.॥11॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైర్యా వాణీ పఞ్చశబ్దాదివిషయాశ్రితా సరిద్వర్తతే తాం విజ్ఞాయ యథావత్ప్రసార్య మధురా శ్లక్ష్ణా ప్రయోక్తవ్యా.॥11॥

పదార్థము :- మానవులు (సస్రోతసః) ఒకే మనస్సువంటి ప్రవాహముగల (పంచ) ఐదు (నద్యః) నదులవంటి ప్రవాహరూప జ్ఞానేంద్రియముల వృత్తిద్వారా (సరస్వతీమ్) ఏ ప్రశస్తమైన విజ్ఞానయుక్త వాణిని (అపి,యన్తి) పొందుచున్నారో (సా,ఉ) అట్టి (సరిత్) నడచునట్టి (సరస్వతీ) వాణి (దేశే) తన నివాసస్థానమునందు (పఞ్చధా) ఐదు జ్ఞానేంద్రియముల, శబ్దము మున్నగు ఐదువిషయముల ప్రతిపాదన మొనర్చుటచే ఐదువిధములు (తు) మాత్రమే (అభవత్) అగునని ఎరుగవలెను.॥11॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. మానవులు శబ్దము మున్నగు పంచవిషయముల నాశ్రయించి నదీప్రవాహమువలె నున్న వాణిని దెలిసికొని యథోక్తముగా ప్రచారమొనర్చి మధురము మరియు లక్షణయుక్తమగు వేదవాణిని ప్రచారమొనర్చవలయును.॥11॥

11. Five organs of cognition, emanating from their common source, the mind, like five rivers speed onward to speech. The flowing speech, in its dwelling place, the mouth, becomes fivefold.

1202.త్వమగ్న ఇత్యస్య హిరణ్యస్తూప ఆఙ్గిరస ఋషిః, అగ్నిర్దేవతా, విరాట్ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ జనైరీశ్వరాజ్ఞా పాల్యేత్యాహ. మానవు లీశ్వరాజ్ఞను పాలించవలయును.

1202 త్వమగ్నే ప్రథమో అఙ్గిరా ఋషిర్దేవో దేవానామభవః శివః సఖా।
తవ వ్రతే కవయో విద్మనాపసోఽజాయన్త మరుతో భ్రాజదృష్టయః ॥12॥

ప.వి:- త్వమ్, అగ్నే, ప్రథమః, అఙ్గిరాః, ఋషిః, దేవః, దేవానామ్, అభవః, శివః, సఖా,

తవ, వ్రతే, కవయః, విద్మనాపస ఇతి విద్మనా + అపసః, అజాయన్త, మరుతః, భ్రాజదృష్టయ ఇతి భ్రాజత్ + ఋష్టయః.॥౧౨॥

పదార్థః :-(త్వమ్) (అగ్నే) పరమేశ్వర విద్వన్ వా (ప్రథమః) ప్రఖ్యాతః (అఙ్గిరాః) అఙ్గానాం రస ఇవ వర్తమానో యద్వాఽఙ్గేభ్యో జీవాత్మభ్యో సుఖం రాతి దదాతి సః (ఋషిః) జ్ఞాతా (దేవః) దివ్యగుణ కర్మస్వభావః (దేవానామ్) విదుషామ్ (అభవః) భవేః (శివః) కల్యాణకారీ (సఖా) మిత్రః (తవ) (వ్రతే) శీలే నియమే వా (కవయః) మేధావినః (విద్మనాపసః) విద్మనాని విదితాన్యపాంసి కర్మాణి యేషాంతే (అజాయన్త) జాయన్తే (మరుతః) మనుష్యాః (భ్రాజదృష్టయః) భ్రాజన్త్యః శోభమానా ఋష్టయ ఆయుధాని యేషాన్తే.॥౧౨॥

అన్వయః:- హే అగ్నే! యతస్త్వమ్ ప్రథమోఽఙ్గిరా దేవానాం దేవః శివః సఖా ఋషిర భవస్తస్మాత్తవ వ్రతే విద్మనాపసో భ్రాజదృష్టయః కవయో మరుతోఽజాయన్త.॥౧౨॥

భావార్థః:-యది మనుష్యాః సర్వసుహృదం విద్వాంసం సర్వమిత్రం పరమాత్మానఞ్చ సఖాయం మత్వా విజ్ఞాన నిమిత్తాని కర్మాణి కృత్వా ప్రకాశితాత్మానో భవేయుస్తర్హి తే విద్వాంసో భూత్వా పరమేశ్వరస్యాజ్ఞాయాం వర్తితుం శక్నుయుః.॥౧౨॥

పదార్థము :-(అగ్నే) పరమేశ్వరా! లేదా విద్వాంసుడా! ఏ కారణమున (త్వమ్) నీవు (ప్రథమః) ప్రఖ్యాత (అఙ్గిరాః) అవయవముల సారభూతమగు రసమువలె, జీవాత్మలకు సుఖములనిచ్చు (దేవానామ్) విద్వాంసులమధ్య (దేవః) ఉత్తమ గుణకర్మస్వభావములతో గూడిన (శివః) కల్యాణకారి (సఖా) మిత్రుడు (ఋషిః) జ్ఞానివి (అభవః) కావలయును. అందువల్ల (తవ) నీయొక్క (వ్రతే) స్వభావము లేదా నియమమునందు (విద్మనాపసః) ప్రసిద్ధకర్మలుగల (భ్రాజదృష్టయః) ఉత్తమ ఆయుధములతోగూడిన (కవయః) బుద్ధిశాలురగు (మరుతః) మనుష్యులు (అజాయన్త) ఉత్పన్నమగుచుందురు. ॥౧౨॥

భావార్థము :-ఒకవేళ మనుష్యుడు సర్వప్రాణులకు మిత్రుడు, విద్వాంసుడునై సర్వమునకు హితకారియగు పరమేశ్వరునకు మిత్రునిగా విజ్ఞానముకొరకే కర్మలను ప్రకాశపరచు ఆత్మగలవాడగుచో నాతడు విద్వాంసుడై పరమేశ్వరుని ఆజ్ఞలందు ప్రవర్తించువాడు గాగలడు.॥౧౨॥

12. O God, may Thou the Most-renowned, the Assuager of souls, the Master of knowledge, the Scholar of scholars, be our Well-wisher and Friend!.

After Thy holy Law, sages and ordinary mortals, wise and prudent in actions with their splendid weapons, are born.

౧౩. త్వన్న ఇత్యస్య హిరణ్యస్తూప ఆఙ్గిరస ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

రాజేశ్వరౌ కథం సేవనీయావిత్యాహ. రాజును, ఈశ్వరుని ఎట్లు సేవించవలయును?

౧౮౦౬ త్వన్నో అగ్నే తవ దేవ పాయుభిర్మఘోనో రక్ష తన్వశ్చ వన్ద్య ।
త్రాతా తోకస్య తనయే గవామస్యనిమేషꣳ రక్షమాణస్తవవ్రతే ॥౧౩॥

ప.వి:- త్వమ్, నః, అగ్నే, తవ, దేవ, పాయుభిరితి పాయు + భిః, మఘోనః, రక్ష, తన్వః, చ, వన్ద్య, త్రాతా, తోకస్య, తనయే, గవామ్, అసి, అనిమేషమిత్యని + మేషమ్, రక్షమాణః, తవ వ్రతే.॥౧౩॥

పదార్థః :-(త్వమ్) (నః) అస్మాకమ్ (అగ్నే) రాజన్నీశ్వర వా (తవ) (దేవ) దివ్యగుణ కర్మస్వభావ (పాయుభిః) రక్షాదిభిః (మఘోనః) బహుధనయుక్తాన్ (రక్ష) (తన్వః) శరీరాణి (చ) (వన్ద్య) వన్దితుం స్తోతుం యోగ్య (త్రాతా) రక్షితా (తోకస్య) అపత్యస్య (తనయే) పౌత్రస్య. అత్ర విభక్తివ్యత్యయః (గవామ్) ధేన్వాదీనామ్ (అసి) (అనిమేషమ్) నిరన్తరమ్ (రక్షమాణః) (తవ) (వ్రతే) సునియమే.॥౧౩॥

అన్వయః :-హే అగ్నే! దేవ తవ వ్రతే వర్తమానాన్ మఘోనోఽస్మాన్ తవ పాయుభిస్త్వం రక్ష న స్తన్వశ్చ రక్ష. హేవన్ద్య! యతస్త్వమనిమేషం రక్షమాణస్తోకస్య తనయే గవాఞ్చ త్రాతాసి తస్మాదస్మాభిర్నిత్యం సత్కర్తవ్య ఉపాసనీయశ్చాసి.॥౧౩॥

భావార్థః :-అత్ర శ్లేషాలంకారః. య ఈశ్వరగుణకర్మస్వభావాజ్ఞానుకూలత్వే వర్తన్తే యేషామీశ్వరో విద్వాంసశ్చ సతతం రక్షకాః సన్తి తే శ్రియా దీర్ఘాయుషా ప్రజాభిశ్చ రహితా కదాచిన్న భవన్తి.॥౧౩॥

పదార్థము :- (దేవ) ఉత్తమ గుణ, కర్మ, స్వభావ యుక్తుడవగు (అగ్నే) నో పరమేశ్వరా! లేదా రాజా! (తవ) నీయొక్క (వ్రతే) ఉత్తమనియమములందు వర్తించు (మఘోనః) అనేక ధనయుక్తులమగు మాయొక్క (తవ) నీయొక్క (పాయుభిః) రక్షణాదులకు హేతువగు కర్మలచే (త్వమ్) నీవు (రక్ష) రక్షణనొనర్చుము (చ) మరియు (నః) మాయొక్క (తన్వః) శరీరములను కాపాడుము (వన్ద్య) స్తుతించదగిన ఈశ్వరా! నీవు (అనిమేషమ్) నిరంతరము (రక్షమాణః) రక్షణయొనర్చుచు (తోకస్య) సంతానములగు పుత్రీపుత్రులను (తనయే) పౌత్రీపౌత్రులను మరియు (గవామ్) గోవులు మున్నగు వాని (త్రాత) రక్షకుడవునై (అసి) ఉన్నావు. కావుననే మాకు సర్వదా సత్కారము మరియు ఉపాసనాయోగ్యుడవై యున్నావు.॥౧౩॥

**భావార్థము**:-ఈ మంత్రమున శ్లేషాలంకారము గలదు. ఏ మనుష్యుడు పరమేశ్వరుని గుణకర్మ స్వభావముల, మరియు ఆజ్ఞలకు అనుకూలముగా వర్తమానుడైయుండునో, ఎవనిని ఈశ్వరుడు మరియు

విద్వాంసులు నిరంతరము రక్షణయొనర్పువారై యుందురో వారు లక్ష్మి, దీర్ఘాయుష్యము, ఉత్తమ సంతానములచే సురక్షితులై సుఖముల ననుభవింతురు.॥౧౩॥

13. O God, noble in qualities, actions and nature, preserve our wealthy patrons and our bodies with Thy succours. O Venerable God, Guard art thou of our sons, grandsons and cows, incessantly protecting in Thy holy law!.

౧౮౦౭.ఉత్తానాయామిత్యస్య దేవశ్రవదేవవాతౌ భారతావృషీ, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునర్విద్వాన్ కిం కుర్యాదిత్యాహ. విద్వాంసు లేమి చేయువలయును?

౧౮౦౭ ఉత్తానాయామవ భరా చికిత్వాన్త్సద్యః ప్రవీతా వృషణం జజాన ।

అరుషస్తూపో రుశదస్య పాజ ఇడాయాస్పుత్రో వయునేఽజనిష్ట ॥౧౪॥

ప.వి:-ఉత్తానాయామ్, అవ, భర, చికిత్వాన్, సద్యః, ప్రవీతేతి ప్ర + వీతా, వృషణమ్, జజాన, అరుషస్తూప ఇత్యరుష + స్తూపః, రుశత్, అస్య, పాజః, ఇడాయాః, పుత్రః, వయునే, అజనిష్ట.॥౧౪॥

పదార్థః :- (ఉత్తానాయామ్) ఉత్కృష్టతయా విస్తీర్ణాయాం భూమావన్తరిక్షే వా (అవ) అర్వాచీనే (భర). అత్ర ద్వ్యచోఽత స్తిఙ ఇతి దీర్ఘః (చికిత్వాన్) జ్ఞానవాన్ (సద్యః) (ప్రవీతా) కమితా (వృషణమ్) వృష్టికరం యజ్ఞమ్ (జజాన) జనయతే. అత్రాన్తర్గతో ణిచ్ ప్రత్యయః. (అరుషస్తూపః) యోఽరుషానహింసకాన్ ఉచ్ఛ్రాయయతి సః (రుశత్) సురూపమ్ (అస్య) (పాజః) బలమ్ (ఇడాయాః) ప్రశంసితాయాః (పుత్రః) (వయునే) విజ్ఞానే (అజనిష్ట) జాయతే.॥౧౪॥

అన్వయః:-హే విద్వఁస్త్వం యథా చికిత్వాన్ ప్రవీతా విద్వానుత్తానాయాం వృషణం జజానాఽరుశస్తూప ఇడాయాః పుత్రో వయునేఽజనిష్టాఽస్య రుశత్పాజశ్చాఽజనిష్ట తథా సద్యోఽవభర. ॥౧౪॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యది మనుష్యా అస్యాం సృష్టౌ బ్రహ్మచర్యాదినా కుమారాన్ కుమారీంశ్చ ద్విజాన్ సమ్పాదయేయుస్తర్హ్యేతే సద్యో విద్వాంసః స్యుః.॥౧౪॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! ఎట్లు (చికిత్వాన్) జ్ఞానవంతుడు (ప్రవీతా) కామితవములుగల విద్వాంసుడు (ఉత్తానాయామ్) ఉత్కర్షముతో విస్తీర్ణమైయున్న భూమి లేక అంతరిక్షమునందు (వృషణమ్) వర్షమునకు హేతువగు యజ్ఞమును (జజాన) ప్రకటమొనర్చునో మరియు (అరుషస్తూపః) రక్షకులగువారి నున్నతమొనర్చునట్టి (ఇడాయాః) ప్రశంసనీయ మహిళామణియొక్క (పుత్రః,వయునే) విజ్ఞానమునందు (అజనిష్ట) ప్రసిద్ధమగుచున్నదో (అస్య) దీని (రుశత్) సుందర రూపముతో గూడిన (పాజః) బలము ప్రసిద్ధమగుచున్నదో, అటులనే నీవు (సద్యః) శీఘ్రముగానే (అవభర) నీ పక్షమును పుష్టియొనర్చు కొనుము. ॥౧౪॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఒకవేళ సృష్టియందు బ్రహ్మచర్యాదుల సేవనముద్వారా కన్యలను, కుమారులను ద్విజులుగ నొనర్చినట్లైన నీ రెల్లరును శీఘ్రముగానే విద్వాంసులు కాగలుగుదురు. ॥౧౪॥

14. O learned person, just as a well-versed, aspiring scholar performs sacrifice (yajna) for the sake of rain in this vast Earth and atmosphere, and the son of a praiseworthy woman, acting as the promoter of non-violent persons, becomes famous for his knowledge and establishes his beautiful strength, so shouldst thou nourish thyself!.

౧౮౦౮.ఇడాయా ఇత్యస్య దేవశ్రవదేవవాతా భారతావృషీ, అగ్నిర్దేవతా, విరాడనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

కింభూతో జనో రాజ్యాధికారే స్థాపనీయ ఇత్యాహ.

ఎట్టి మానవుడు రాజ్యాధికారమునందు నియమించబడుటకు యోగ్యుడు?

౧౮౦౮ ఇడాయాస్త్వా పదే వయం నాభా పృథివ్యా అధి ।
జాతవేదో ని ధీమహ్యగ్నే హవ్యాయ వోఢవే ॥౧౫॥

ప.వి:- ఇడాయాః, త్వా, పదే, వయమ్, నాభా, పృథివ్యాః, అధి, జాతవేద ఇతి జాత + వేదః, ని, ధీమహి, అగ్నే, హవ్యాయ, వోఢవే ॥౧౫॥

పదార్థః:-(ఇడాయాః) ప్రశంసితాయా వాచః (త్వా) త్వామ్ (పదే) ప్రతిష్ఠాయామ్ (వయమ్) అధ్యాపకోపదేశకాః (నాభా) నాభౌ మధ్యే (పృథివ్యాః) విస్తీర్ణాయా భూమేః (అధి) ఉపరి (జాతవేదః) జాతప్రజ్ఞాన (ని) నితరామ్ (ధీమహి) స్థాపయేమ (అగ్నే) అగ్నిరివ తేజస్విన్ విద్వన్ రాజన్!(హవ్యాయ)హోతుం దాతుమర్హమ్. అత్ర విభక్తివ్యత్యయః (వోఢవే) వోఢుం ప్రాప్తుం ప్రాపయితుం వా.॥౧౫॥

అన్వయః:-హే జాతవేదోఽగ్నే! వయమిడాయాః పదే పృథివ్యా అధి నాభా త్వా హవ్యాయ వోఢవే ని ధీమహి.॥౧౫॥

భావార్థః:-హే విద్వన్ రాజన్! యస్మిన్నధికారే త్వాం వయం స్థాపయేమ తమధికారం ధర్మపురుషార్థాభ్యాం యథావత్సాధ్నుహి.॥౧౫॥

పదార్థము :- (జాతవేదః) ఉత్పన్నబుద్ధిగలవాడా! (అగ్నే) అగ్నివంటి తేజస్విపి, విద్వాంసుడవునగు ఓరాజా! (వయమ్) అధ్యాపకులము మరియు ఉపదేశకులమునగు మేము (ఇడాయాః) ప్రశంసనీయ వాణియొక్క (పదే) వ్యవస్థకు మరియు(పృథివ్యాః) విస్తృతమగు భూమికి (అధి)పైన (నాభా) మధ్యభాగమందు (త్వా) నిన్ను (హవ్యాయ) ఈయదగిన పదార్థములను (వోఢవే) ప్రాప్తినొందుటకు, ప్రాప్తింపజేయుటకొరకు (నిధీమహి) నిరంతరము ఇతరులకు స్థాపించుచున్నాము.॥౧౫॥

భావార్థము :- విద్వాంసుడవగు ఓ రాజా! ఏ యధికారమునందు నిన్ను మేము స్థిరపరచుచున్నామో, అట్టి యధికారమును ధర్మము మరియు పురుషార్థముతో యథావతుగా సాధించుము.

15. O sagacious king, we establish thee on the Earth in its centre in the post of a ruler, for granting us valuable substances!.

౧౮౯. ప్రమన్మహ ఇత్యస్య నోధా ఋషిః, ఇన్ద్రో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
మనుష్యైర్విద్యాధర్మౌ వర్ధనీయావిత్యాహ. మానవులు విద్యను, ధర్మమును పెంపొందజేయవలయును.

౧౮౯ ప్ర మన్మహే శవసానాయ శూషమాఙ్గూషం గిర్వణసేఽఅఙ్గిరస్వత్।
సువృక్తిభిః స్తువత ఋగ్మియాయార్చామార్కం నరే విశ్రుతాయ ॥౧౬॥

ప.విః-ప్ర, మన్మహే, శవసానాయ, శూషమ్, ఆఙ్గూషమ్, గిర్వణసే, అఙ్గిరస్వత్, సువృక్తిభిరితి సువృక్తి + భిః, స్తువతే, ఋగ్మియాయ, అర్చామ, అర్కమ్, నరే, విశ్రుతాయేతి వి + శ్రుతాయ.॥౧౬॥

పదార్థః :-((ప్ర) (మన్మహే) యాచామహే. మన్మహ ఇతి యాఞ్చాకర్మా నిఘం. 3.౧౯. (శవసానాయ) విజ్ఞానాయ (శూషమ్) బలమ్ (ఆఙ్గూషమ్) విద్యాశాస్త్రబోధమ్. ఆఙ్గూష ఇతి పదనా. నిఘం. ४.౨. (గిర్వణసే) గిరః సుశిక్షితా వాచో వనన్తి సంభజన్తి వా తస్మై (అఙ్గిరస్వత్) ప్రాణవత్ (సువృక్తిభిః) సుష్ఠు వృజతే దోషాన్ యాసు క్రియాసు తాభిః (స్తువతే) యః శాస్త్రార్థాన్ స్తౌతి (ఋగ్మియాయ) యో ఋచో మినోత్యధీతే తస్మై (అర్చామ)

సత్కార్యాయ (అర్క్యమ్) అర్చనీయమ్ (నరే) నాయకాయ (విశ్రుతాయ) విశేషేణ శ్రుతా గుణా యస్మింస్తస్మై. ॥౧౬॥

అన్వయః:-హే మనుష్యాః! యథా వయం సువృక్తిభిః శవసానాయ గిర్వణస ఋగ్మియాయ విశ్రుతాయ స్తువతే నరేఽఙ్గిరస్వదాఙ్గూషం శూషం ప్రమన్మహ ఏవమర్క్యమర్చామ. తథైతం ప్రతి యూయమపి వర్తధ్వమ్.॥౧౬॥

భావార్థః:-అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. మనుష్యైః సత్కరణీయస్య సత్కారం నిరాదరణీయస్య నిరాదరం కృత్వా విద్యాధర్మౌ సతతం వర్ధనీయౌ.॥౧౬॥

**పదార్థము :-** ఓ మానవులారా! మే మెట్లు (సువృక్తిభిః) దోషరహితములగు క్రియలచే (శవసానాయ) విజ్ఞానముకొరకు (గిర్వణసే) సుశిక్షిత వాణులతోగూడ (ఋగ్మియాయ) ఋచల [ఋక్కుల] ను చదువువాడు (విశ్రుతాయ) ఉత్తమ గుణశాలియని చెప్పబడువాడు (స్తువతే) శాస్త్రముల అర్థములను తెలుపు (నరే) నాయకుడగువానికొరకు (అఙ్గిరస్వత్) ప్రాణములవంటి (అఙ్గూషమ్) విద్య మరియు శాస్త్రబోధనా రూపమగు (శూషమ్) బలమును (ప్ర, మన్మహే) కోరుచుందుమో మరియు (అర్క్యమ్) పూజనీయుడవగు నిన్ను (అర్చామ) సత్కరించు చున్నామో, అటులనే ఈ విద్వాంసునియెడ మీరును వర్తించుడు. ॥౧౬॥

**భావార్థము :-** ఈ మంత్రమున ఉపమా మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. మానవులు సత్కరించదగినవారిని సత్కరించుచు, నిరాదరణమొనర్చదగినవారిని నిరాదరణమొనర్చుచు విద్య మరియు ధర్మములను నిరంతరము వృద్ధిపరచుచుండవలయును.॥౧౬॥

16. O men, just as we, with sinless acts, for the ske of knowledge, the reciters in well-trained utterances of vedic verses, replete with instructions, expatiate on religious lore, and long for the hero, the force of knowledge, and scriptures, dear like vital breath, and honour this venerable person, so should ye!.

౧౮౧౦. ప్ర వ ఇత్యస్య నోధా ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృత్త్రిష్టుప్, ఛన్దః, ధైవతః స్వరః.

అథ కే పితరః సన్తీత్యాహ. ఎవరు పితరులు?

౧౮౧౦ ప్ర వో మహే మహి నమో భరధ్వమాఙ్గూష్య౨ం శవసానాయ సామ।
యేనా నః పూర్వే పితరః పదజ్ఞా అర్చన్తో అఙ్గిరసో గా అవిన్దన్ ॥౧౭॥

**ప.వి:-** ప్ర, వః, మహే, మహి, నమః, భరధ్వమ్, ఆఙ్గూష్యమ్, శవసానాయ, సామ, యేన, నః, పూర్వే, పితరః, పదజ్ఞా ఇతి పద + జ్ఞాః, అర్చన్తః అఙ్గిరసః, గాః, అవిన్దన్ ॥౧౭॥

పదార్థః :-((ప్ర) (వః) యుష్మభ్యమ్ (మహే) మహతే (మహి) మహత్సత్కారార్థమ్ (నమః) సత్కర్మాన్నం వా (భరధ్వమ్) ధరత (ఆఙ్గూషమ్) ఆఙ్గూషాయ సత్కారాయ బలాయ వా హితమ్ (శవసానాయ) బ్రహ్మచర్యసుశిక్షాభ్యాం శరీరాత్మబలయుక్తాయ (సామ) సామవేదమ్ (యేన) అత్ర సంహితాయామితి దీర్ఘః. (నః) అస్మాకమస్మాన్ వా (పూర్వే) పూర్వజాః (పితరః) పాలకా జ్ఞానినః (పదజ్ఞాః) యే పదం జ్ఞాతవ్యం ప్రాపణీయమాత్మ స్వరూపం జానన్తి తే (అర్చన్తః) సత్క్రియాం కుర్వన్తః (అఙ్గిరసః) సర్వస్యాః సృష్టేర్విద్యాఙ్గ విదః (గాః) సుశిక్షితా వాచః (అవిన్దన్) లమ్భయేరన్.॥౧౭॥

అన్వయః :- యే మనుష్యాః! యథా పదజ్ఞా నోఽస్మానర్చన్తోఽఙ్గిరసః పూర్వే నః పితరో యేన మహే శవసానాయ వశ్చాఽఽఙ్గూష్యం సామగాశ్చావిన్దన్ తేన తేభ్యో యూయం మహి నమః ప్రభరధ్వమ్.॥౧౭॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యాః! యే విద్వాంసో యుష్మాన్ విద్యాసుశిక్షాభ్యాం విపశ్చితో ధార్మికాన్ కుర్యుస్తానేవ పూర్వాఽధీతవిద్యాన్ పితౄన్ విజానీత.॥౧౭॥

పదార్థము :- ఓ మానవులారా! ఎట్లు (పదజ్ఞాః) తెలిసికొన లేదా పొందదగిన ఆత్మస్వరూపమును దెలిసికొనువారు (నః) మమ్ము (అర్చన్తః) సత్కారమొనర్చుచు (అఙ్గిరసః) సమస్త సృష్టి విద్యను, దాని అవయవాంగములను ఎరుగువారు (పూర్వే) పూర్వజులునగు (పితరః) రక్షకులైన జ్ఞానులు (యేన) ఎద్దానిచే (మహే) గొప్ప (శవసానాయ) బ్రహ్మచర్యము మరియు ఉత్తమ శిక్షణద్వారా శరీరాత్మల బలములచే గూడినవారు (వః) మీకొరకు (ఆఙ్గూషమ్) సత్కారము లేదా బలముకొరకు ఉపయోగించుకొను (సామ) సామవేదము మరియు (గాః) ఉత్తమశిక్షితమగు వాణులను (అవిన్దన్) ప్రాప్తించుకొందురో, వానివల్లనే మీరు (మహి) గొప్ప సత్కారముకొరకు (నమః) ఉత్తమ కర్మ లేదా అన్నమును ((ప్ర, భరధ్వమ్) ధారణ మొనర్చుడు. ॥౧౭॥

భావార్థము :-ఇందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ఓ మానవులారా! ఏ విద్వాంసులు మీకు విద్య మరియు ఉత్తమ శిక్షణచే పండితునిగ, ధర్మాత్మునిగ నొనర్చెదరో వారినే మొదట చెప్పుకొనదగిన పితరులని మీరు తెలిసికొనుడు.॥౧౭॥

17. O men, just as the knowers of the true nature of soul, showing respect unto us, knowing all the branches of the science of creation, and learned ancestors, for the great man imbued with physical and spiritual force, and for you, grant us disciplined speech and the knowledge of the Sama Veda, highly useful for the attainment of strength, unto them should ye show respect and offer food!.

౧౮౧౧.ఇచ్ఛన్తీత్యస్య దేవశ్రవా దేవవాతశ్చ భారతావృషీ,ఇన్ద్రో దేవతా,నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథాప్తలక్షణమాహ. ఆప్తుని లక్షణము?

౧౮౧౧ ఇచ్ఛన్తి త్వా సోమ్యాసః సఖాయః సున్వన్తి సోమం దధతి ప్రయాంసి ।

తితిక్షన్తే అభిశస్తిం జనానామిన్ద్ర త్వదా కశ్చన హి ప్రకేతః ॥౧౮॥

ప.విః-ఇచ్ఛన్తి, త్వా, సోమ్యాసః, సఖాయః సున్వన్తి, సోమమ్, దధతి, ప్రయాంసి, తితిక్షన్తే, అభిశస్తి మిత్యభి + శస్తిమ్, జనానామ్, ఇన్ద్ర, త్వత్, ఆ, కః, చన, హి, ప్రకేత ఇతి ప్ర + కేతః ॥౧౮॥

పదార్థః:-(ఇచ్ఛన్తి) (త్వా) త్వామ్ (సోమ్యాసః) సోమేష్వైశ్వర్యాదిషు సాధవః (సఖాయః) సుహృదః సన్తః (సున్వన్తి) నిష్పాదయన్తి (సోమమ్) ఐశ్వర్యాదికమ్ (దధతి) ధరన్తి (ప్రయాంసి) కమనీయాని విజ్ఞానాదీని (తితిక్షన్తే) సహన్తే (అభిశస్తిమ్) దుర్వచనవాదమ్ (జనానామ్) మనుష్యాణామ్ (ఇన్ద్ర) రాజన్! (త్వత్) తవ సకాశాత్ (ఆ) సమన్తాత్ (కః) (చన) అపి (హి) యతః (ప్రకేతః) ప్రకృష్టా కేతా ప్రజ్ఞా యస్య సః.॥౧౮॥

అన్వయః:-హే ఇన్ద్ర! హే సోమ్యాసః సఖాయః సోమం సున్వన్తి ప్రయాంసి దధతి, జనానామభిశస్తిమా తితిక్షన్తే చ తాంస్త్వం సతతం సత్కురు హి యతస్త్వత్ప్రకేతః కశ్చన నాస్తి తస్మాత్సర్వే త్వా త్వామిచ్ఛన్తి ॥౧౮॥

భావార్థః:-హే మనుష్యా! ఇహ నిన్దాస్తుతిహానిలాభాదీన్ తితిక్షవః పురుషార్థినః సర్వైః సహ మైత్రీమాచరన్త ఆప్తాః స్యుస్తే సర్వైః సేవనీయాః సత్కర్తవ్యాశ్చ త ఏవ సర్వేషామధ్యాపకా ఉపదేష్టారశ్చ స్యుః. ॥౧౮॥

**పదార్థము** :- (ఇన్ద్ర) సభాధ్యక్షుడవగు ఓ రాజా! ఎవరు (సోమ్యాసః) ఐశ్వర్యము పొందుటయందు ఉత్తమ స్వభావముగలవారు (సఖాయః) మిత్రులై (సోమమ్) ఐశ్వర్యాదులను (సున్వన్తి) సాధింతురో (ప్రయాంసి) కోరదగిన విజ్ఞానాది గుణములను (దధతి) ధరించుచున్నారో మరియు (జనానామ్) మానవులయొక్క (అభిశస్తిమ్) దుర్వ్యసనములను, వాదవివాదములను (ఆ, తితిక్షన్తే) చక్కగా సహించుచుండెదరో, వారిని నీవు నిరంతరము సత్కరించుచుండుము (హి) ఈ కారణమున (త్వత్) నీకన్న (ప్రకేతః) ఉత్తమబుద్ధిశాలురు (కః, చన) ఎవ్వరును ఉండరు. కావున (త్వా) సమస్త ప్రజలు నిన్ను (ఇచ్ఛన్తి) కోరుచుందురు. ॥౧౮॥

**భావార్థము** :-ఈ ప్రపంచములో ఏ మానవులు నిందాస్తుతులను, హానిలాభములు మున్నగువానిని సహించు పురుషార్థపరులై అందరియెడ మిత్రత్వము నాచరించుచు ఆప్తవరులైయుందురో, అట్టివారే అందరకు సేవించదగిన మరియు సత్కరించదగినవారై యుందురు. మరియు నట్టివారే అందరకు అధ్యాపకులు, ఉపదేశకులు నయియుండవలెను.॥౧౮॥

**18**.O king, honour those, who are affluent, friendly, gleaners of might, masters of knowledge, silent endurers of the abuses of the people. None is wiser than thee, hence all long for thee!.

౧౮౧౨.న త ఇత్యస్య దేవశ్రవా దేవవాతశ్చ భారతావృషీ, ఇన్ద్రో దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునః సభాధ్యక్షః కిం కుర్యాదిత్యాహ. సభాధ్యక్షుడైన రాజు ఏమి చేయవలయును?

౧౮౧౨ న తే దూరే పరమా చిద్రజాంస్యా తు ప్ర యాహి హరివో హరిభ్యామ్ ।

స్థిరాయ వృష్ణే సవనా కృతేమా యుక్తా గ్రావాణః సమిధానే అగ్నౌ ॥౧౯॥

**ప.వి:**- న, తే, దూరే, పరమా, చిత్, రజాంసి, ఆ, తు, ప్ర, యాహి, హరివ ఇతి హరి + వః, హరిభ్యామితి హరి + భ్యామ్, స్థిరాయ, వృష్ణే, సవనా, కృతా, ఇమా, యుక్తాః, గ్రావాణః, సమిధాన ఇతి సమ్ + ఇధానే, అగ్నౌ.॥౧౯॥

పదార్థః :-(న) నిషేధే (తే) తవ సకాశాత్ (దూరే) విప్రకృష్టే (పరమా) పరమాణి దూరస్థాని (చిత్) అపి (రజాంసి) స్థానాని (ఆ) (తు) హేతౌ (ప్ర) (యాహి) గచ్ఛ (హరివః) ప్రశస్తౌ హరీ విద్యేతే యస్య తత్సమ్బుద్ధౌ (హరిభ్యామ్) ధారణాకర్షణవేగగుణైర్యుక్తాభ్యాం తురఙ్గాభ్యాం జలాఽగ్నిభ్యాం వా (స్థిరాయ) (వృష్ణే) సుఖసేచకాయ పదార్థాయ (సవనా) ప్రాతఃసవనాదీని కర్మాణి (కృతా) కృతాని (ఇమా) ఇమాని (యుక్తాః) ఏకీభూతాః (గ్రావాణః) గర్జనాకర్తారో మేఘాః. గ్రావేతి మేఘనా.. నిఘం. ౧.౧౦. (సమిధానే) సమిధ్యమానే. అత్ర యకోలుక్ (అగ్నౌ). ॥౧౯॥

అన్వయః :- హే హరివో రాజన్! యథా సమిధానేఽగ్నౌ ఇమా సవనా కృతా తు గ్రావాణో యుక్తా భూత్వాఽఽగచ్ఛన్తి తథా స్థిరాయ వృష్ణే హరిభ్యామాప్రయాహి. ఏవం కృతే పరమా చిద్రజాంసి తే దూరే న భవన్తి.॥౧౯॥

**భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే విద్వాంసో! యథా పావకేనోత్పాదితా వర్షితా మేఘాః పృథివ్యాః సమీపే భవన్త్యాకర్షణేన దూరమపి గచ్ఛన్తి, తథాఽగ్న్యాదియానైర్గమనే కృతే కోపి దేశో దూరే న భవతి. ఏవం పురుషార్థం కృత్వాఽలమైశ్వర్యాణి జనయత.॥౧౯॥**

**పదార్థము:-**(హరివః) ప్రశస్తమగు అశ్వములు గలిగిన ఓ రాజా! ఎట్లు (సమిధానే) ప్రదీప్తమొనర్చబడిన (అగ్నౌ) అగ్నియందు (ఇమాః, సవనా) ఈ ప్రాతఃకాలసవనము మున్నగు యజ్ఞకర్మలు (కృతా) చేయబడుచుండునో (తు) ఈ హేతువుచేతనే (గ్రావాణః) గర్జనమొనర్చుచుండు మేఘములు (యుక్తాః) కలసికట్టుగా వచ్చుచుండునో, అదేవిధముగ (స్థిరాయ) దృఢమగు (వృష్ణే) సుఖదాయకములగు విద్య మున్నగు పదార్థములకై (హరిభ్యామ్) ధారణాకర్షణములచే, వేగవంతములగు అశ్వముల లేదా జలము మరియు అగ్నిచే (ఆ, ప్ర, యాహి) శ్రేష్ఠముగారమ్ము. ఇట్లొనర్చుటచే (పరమా) దూరస్థములు (చిత్) కూడ (రజాంసి) స్థానములు (తే) నీకు (దూరే) దూరము (న) కాజాలవు.॥౧౯॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచక లుప్తోపమాలంకారముగలదు. ఓ విద్వాంసులారా! ఏవిధముగా అగ్నిచే నుత్పన్నమైన వర్షమేఘములు పృథివికి సమీపస్థములై, ఆకర్షణముద్వారా దూరముకూడా వెళ్లుచుండునో, అటులనే అగ్నియానములద్వారా ప్రయాణమొనర్చుటచే ఏదేశమును దూరమైయుండదు. ఈ విధముగా పురుషార్థముల నొనర్చి సంపూర్ణైశ్వర్యముల నుత్పన్నమొనర్చుడు.॥౧౯॥

**19.** O king, just as in the kindled fire these morning yajnas are performed, whereby the clouds come together, so come thou hither in conveyances moved by water and fire for acquiring permanent happiness. In this way even the distant place are not far for thee!.

౧౮౧౩. అషాఢమిత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజధర్మవిషయమాహ. రాజధర్మ విషయము చెప్పెను.

౧౮౧౩ అషాఢం యుత్సు పృతనాసు పప్రిꣳ స్వర్షామప్సాం వృజనస్య గోపామ్।
భరేషుజాꣳసుక్షితిꣳ సుశ్రవసం జయన్తం త్వామను మదేమ సోమ ॥౨౦॥

**ప.వి:-**అషాఢమ్, యుత్స్వితి యుత్ + సు, పృతనాసు, పప్రిమ్, స్వర్షామ్, స్వఃసామితి స్వః + సామ్, అప్సామ్, వృజనస్య, గోపామ్, భరేషుజామితి భరేషు + జామ్, సుక్షితిమితి సు + క్షితిమ్, సుశ్రవసమితి సు + శ్రవసమ్, జయన్తమ్, త్వామ్, అను, మదేమ, సోమ॥౨౦॥

పదార్థః :-(అషాఢమ్) సోఢుమనర్హమ్ (యుత్సు) యుద్ధేషు (పృతనాసు) మనుష్యసేనాసు (పప్రిమ్) పూర్ణబలవిద్యం పాలకం వా (స్వర్షామ్) యః స్వః సుఖం సనతి సమ్భజతి తమ్ (అప్సామ్) యోఽపో జలాని ప్రాణాన్ సనోతి దదాతి తమ్ (వృజనస్య) బలస్య (గోపామ్) రక్షకమ్ (భరేషుజామ్) భరేషు భరణీయేషు సఙ్గ్రామేషు జేతారమ్ (సుక్షితిమ్) శోభనా క్షితిః పృథివీరాజ్యం యస్య తమ్. క్షితిరితి పృథివీ నా...నిఘం..౧.౧. (సుశ్రవసమ్) శోభనాని శ్రవాంస్యన్నాని యశాంసి వా యస్య తమ్ (జయన్తమ్) శత్రూణాం విజేతారమ్ (త్వామ్) (అను) పశ్చాత్ (మదేమ) (సోమ) సకలైశ్వర్యసమ్పన్న!.॥౨౦॥

అన్వయః:- హే సోమ రాజన్ సేనాపతే వా వయం యం యుత్స్వషాఢం పృతనాసు పప్రిం స్వర్షామప్సాం వృజనస్య గోపాం భరేషుజాం సుక్షితిం సుశ్రవసం జయన్తం త్వామను మదేమ.॥౨౦॥

భావార్థః:- యస్య రాజ్ఞః సేనాపతేర్వోత్తమస్వభావేన రాజసేనాః ప్రజాజనాః ప్రీతాః స్యుర్యేషు ప్రీతేషు రాజా ప్రీతః స్యాత్తత్ర ధ్రువో విజయో నిశ్చలం పరమైశ్వర్యం పుష్కలా ప్రతిష్ఠా చ భవతి.॥౨౦॥

పదార్థము :-(సోమ) సమస్తైశ్వర్యయుక్తుడవగు ఓ రాజా! లేదా సేనాపతీ! మేము (యుత్సు) యుద్ధములందు (అషాఢమ్) సహింపసాధ్యముగాని (పృతనాసు) మనుష్య సైన్యములందు (పప్రిమ్) విద్యాయుక్తమగు పూర్ణబలము గలవాడవు లేక రక్షకుడవు (స్వర్షామ్) సుఖముల సేవించువాడవు, లేక (అప్సామ్) జలములను లేక ప్రాణముల నిచ్చువాడవు (వృజనస్య) బలముయొక్క (గోపామ్) రక్షకుడవు (భరేషుజామ్) ధారణమొనర్చదగు సంగ్రామములందు జయించువాడవు (సుక్షితిమ్) సుందరమగు పృథివీరాజ్యముగలవాడవు (సుశ్రవసమ్) చక్కని అన్నము లేక కీర్తితోగూడ (జయన్తమ్) శత్రువులను జయించువాడవగు (త్వామ్) నిన్ను (అనుమదేమ) అనుమోదించెదముగాక!॥౨౦॥

**భావార్థము** :- ఏ రాజు మరియు సేనాపతియొక్క ఉత్తమ స్వభావములచే రాజపురుషులు, సైన్యములు, ప్రజలెల్లరును ప్రసన్నతతో నుందురో, నెవరిప్రసన్నతయందే రాజు ప్రసన్నుడై యుండగలడో అచ్చట దృఢవిజయము, ఉత్తమ నిశ్చలైశ్వర్యములు, మరియు చక్కని ప్రతిష్ఠ గలుగ గలదు.॥౨౦॥

20. Invincible in fight, saviour of armies, giver of happiness, giver of life, protector of might, winner of battles, sovereign lord of the Earth, exeeding famous, victor, in thee may we rejoice, O King!.

౨౧౧౪.సోమ ఇత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, భురిక్ పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౮౧౪ సోమో ధేనుగ్ం సోమో అర్వన్తమాశుగ్ం సోమో వీరం కర్మణ్యం దదాతి।
సాదన్యం విదథ్యగ్ం సభేయం పితృశ్రవణం యో దదాశదస్మై ॥౨౧॥

ప.వి:-సోమః, ధేనుమ్, సోమః, అర్వన్తమ్, ఆశుమ్, సోమః వీరమ్, కర్మణ్యమ్, దదాతి, సాదన్యమ్, సదన్యమితి సదన్యమ్, విదథ్యమ్, సభేయమ్, పితృశ్రవణమితి పితృ + శ్రవణమ్, యః, దదాశత్, అస్మై.॥౨౧॥

పదార్థః :- (సోమః) ఐశ్వర్యవాన్ (ధేనుమ్) విద్యాధారాం వాచమ్ (సోమః) సత్యాచారే ప్రేరకః (అర్వన్తమ్) వేగేన గచ్ఛన్తమశ్వమ్ (ఆశుమ్) మార్గాన్ సద్యోఽశ్నువన్తమ్ (సోమః) శరీరాత్మబలమ్ (వీరమ్) శత్రుబలాని వ్యాప్నువన్తమ్ (కర్మణ్యమ్) కర్మణా సమ్పన్నమ్ (దదాతి) (సాదన్యమ్) సాదనేషు స్థాపనేషు సాధుం (విదథ్యమ్) విదథే యజ్ఞే సాధుమ్ (సభేయమ్) సభాయాం సాధుమ్ (పితృశ్రవణమ్) పితుః సకాశాచ్ఛ్రవణం యస్య తమ్ (యః)(దదాశత్) దదాతి (అస్మై) సోమాయ రాజ్ఞేఽధ్యాపకాయోపదేశకాయ వా.॥౨౧॥

అన్వయః:-యో మనుష్యోఽస్మై సోమాయోచితం దదాశత్తస్మై సోమో ధేనుం దదాతి సోమోఽర్వన్తమాశుం దదాతి సోమః కర్మణ్యం సాదన్యం విదథ్యం పితృశ్రవణం సభేయం వీరం చ దదాతి.॥౨౧॥

భావార్థః:-యేఽధ్యాపకోపదేశకా! రాజపురుషా! వా సుశిక్షితాం వాచమగ్న్యాదితత్త్వవిద్యాం పురుషజ్ఞానం సభ్యతాఞ్చ సర్వేభ్యః ప్రదదత్యస్తే సర్వైః సత్కర్తవ్యాః స్యుః ॥౨౧॥

పదార్థము:- (యః) ప్రజలయందలి ఏ మనుష్యుడు (అస్మై) ధర్మిష్ఠుడగు ఈ రాజు లేదా అధ్యాపకుడు లేక ఉపదేశకునకు ఉచిత పదార్థములను (దదాతి) ఇచ్చుచున్నాడో, అతనికి (సోమః) సత్యాచరణమున ప్రేరణ నొనర్చునట్టి రాజు మున్నగువారు (అర్వన్తమ్) వేగముగా నడచునట్టి మరియు (ఆశుమ్) మార్గమును శీఘ్రముగా వ్యాప్తపరచు [శీఘ్రముగా దాటు] అశ్వము నిచ్చును. మరియు (సోమః) శారీరిక, ఆత్మిక బలములతో గూడిన రాజు మున్నగు (కర్మణ్యమ్) కర్మయుక్తుడగు పురుషార్థి (సాదన్యమ్) కూర్చుండజేయుటయందు ప్రవీణుడు (విదథ్యమ్) యజ్ఞకర్మలందు కుశలుడు (పితృశ్రవణమ్) ఆచార్యులు, పితరులచే విద్యనభ్యసించువాడు (సభేయమ్) సభయందు కూర్చుండదగిన (వీరమ్) శత్రువుల బలములందు వ్యాప్తమగు శూరవీరులను ఇచ్చుచున్నాడు.॥౨౧॥

**భావార్థము** :- ఏ అధ్యాపకుడు, ఉపదేశకుడు లేక రాజపురుషుడు సుశిక్షితవాణి, అగ్న్యాదుల తత్త్వవిద్య, పురుషజ్ఞానము మరియు సభ్యతను సమస్త ప్రజలకు ప్రదానమొనర్చెదరో, వారెల్లరును సత్కరించ యోగ్యులగుదురు. ॥౨౧॥

21. To him who reveres the king, teacher or preacher, he gives speech, full of learning, wealth, conducive to truthful conduct, a fleet steed, a brave son, active in duties, well-mannered, skilled in the performance of sacrifice (yajna), recipient of knowledge from his father, and competent in council.

౧౮౧౨. త్వమిత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౮౧౨ త్వమిమా ఓషధీః సోమ విశ్వాస్త్వమపో అజనయస్త్వఙ్గాః ।
త్వమా తతన్థోర్వన్తరిక్షం త్వం జ్యోతిషా వి తమో వవర్థ॥౨౨॥

**ప. విః**- త్వమ్, ఇమాః, ఓషధీః, సోమ, విశ్వాః, త్వమ్, అపః, అజనయః, త్వమ్, గాః, త్వమ్, ఆ, తతన్థ, ఉరు, అన్తరిక్షమ్, త్వమ్, జ్యోతిషా, వి, తమః, వవర్థ ॥౨౨॥

పదార్థః :-(త్వమ్) (ఇమాః) (ఓషధీః) సోమాద్యాః (సోమ) సోమవల్లీవ సర్వరోగవినాశక! (విశ్వాః) సర్వాః (త్వమ్) (అపః) జలాని కర్మ వా (అజనయః) జనయేః (త్వమ్) (గాః) పృథివీర్ధేనూః వా (త్వమ్) (ఆ) (తతన్థ) తనోషి (ఉరు) బహు (అన్తరిక్షమ్) జలమాకాశం వా (త్వమ్) (జ్యోతిషా) ప్రకాశేన (వి) (తమః) అన్ధకారం రాత్రిమ్ (వవర్థ) వృణోషి ॥౨౨॥

అన్వయః :-హే సోమ రాజన్! యస్త్వం విశ్వా ఇమా ఓషధీస్త్వం సూర్యఇవాఽపస్త్వం గాశ్చాఽజనయస్త్వం సూర్య ఉర్వన్తరిక్షమా తతన్థ సవితా జ్యోతిషా తమ ఇవ న్యాయేనాఽన్యాయం వివవర్థ, స త్వమస్మాభిర్మాననీయోఽసి. ॥౨౨॥

భావార్థః :- యే జనా ఓషధ్యో రోగానివ దుఃఖాని హరన్తి ప్రాణా ఇవ బలం జనయన్తి యే రాజజనాః సూర్యో రాత్రిమివాఽధర్మాఽవిద్యాఽన్ధకారం నివర్తయన్తి తే జగత్పూజ్యాః కుతో న స్యుః. ॥౨౨॥

**పదార్థము** :-(సోమ) ఉత్తమ సోమవల్లి ఓషధులవలె రోగనాశకుడవునగు నో రాజా! (త్వమ్) నీవు (ఇమాః) ఈ (విశ్వాః) సమస్త (ఓషధీః) సోమలత మున్నగు ఓషధులను (త్వమ్) నీవు సూర్యునివలె (అపః)

జలములను లేక కర్మలను మరియు (త్వమ్) నీవు (గాః) పృథివి లేక గోవులను (అజనయః) ఉత్పన్నము లేక ప్రకటమొనర్చుము (త్వమ్) నీవు సూర్యునివలె (ఉరు) అధికముగ (అన్తరిక్షమ్) అవకాశము [ఆకాశము]ను (ఆతతన్థ) ఎట్లు విస్తృతపరచుచున్నావో (త్వమ్) నీవు సూర్యునివలె (జ్యోతిషా) ప్రకాశముతో (తమః) అంధకారమును అణచివేయుదువో, అదేవిధముగ న్యాయముచే అన్యాయమును (వి, వవర్థ) ఆచ్ఛాదితమొనర్చెదవు కావున నీవు మాకు మాననీయుడవై యున్నావు.॥౨౨॥

**భావార్థము :-** ఏ మనుష్యులు ఔషధములు రోగములనువలె దుఃఖములను హరించెదరో, ప్రాణములవలె బలమును ప్రకటపరచెదరో మరియు ఏ రాజపురుషులు సూర్యుడు రాత్రినివలె అధర్మము, అవిద్యయను అంధకారమును నివారించెదరో అట్టివారు జగత్తునకు పూజనీయులగుదురు. ॥౨౨॥

22. These herbs, these milch-kine, and these running waters, all these, O Soma, Thou hast generated. The spacious firmament hast Thou expanded, and with light hast Thou dispelled the darkness!.

౧౮౧౬.దేవేనేత్యస్య గోతమ ఋషిః, సోమో దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యేదియే.

౧౮౧౬ దేవేన నో మనసా దేవ సోమ రాయో భాగꣳసహసావన్నభి యుధ్య ।

మా త్వా తనదీశిషే వీర్యస్యోభయేభ్యః ప్ర చికిత్సా గవిష్టౌ ॥౨౩॥

ప.వి:-దేవేన, నః, మనసా, దేవ, సోమ, రాయః, భాగమ్, సహసావన్నితి సహసా + వన్, అభి, యుధ్య, మా, త్వా, ఆ, తనత్, ఈశిషే, వీర్యస్య, ఉభయేభ్యః, ప్ర, చికిత్స, గవిష్టావితి గో+ఇష్టౌ ॥౨౩॥

పదార్థః:- (దేవేన) దివ్యగుణకర్మస్వభావయుక్తేన (నః) అస్మభ్యమ్ (మనసా) (దేవ) దివ్యగుణ సమ్పన్న (సోమ) అఖిలైశ్వర్యప్రాపక! (రాయః) ధనస్య (భాగమ్) సేవనీయమంశమ్ (సహసావన్) సహోఽధికం బలం విద్యతే యస్య తత్సమ్బుద్ధౌ. అత్ర ప్రథమార్థే తృతీయాయా అలుక్. (అభి) ఆభిముఖ్యే (యుధ్య) యోధయ గమయ. అత్ర అన్తర్భావితణ్యర్థః యుధ్యతిర్గతికర్మా. నిఘం ౨.౧౪ (మా) నిషేధే (త్వా) త్వామ్ (ఆ) (తనత్) సఙ్కుచేత్. అత్రోపసర్గాచ్ఛాన్దసైర్ఘ్య ఇత్యాద్యుష్షియపాఠా త్తనుధాతోః స్వగణే లేట్ ప్రయోగః (ఈశిషే) సమర్థో భవతి (వీర్యస్య) వీరకర్మణః. అత్రాధీగర్థదయేశాం కర్మణి

౨.౩.౨౨. ఇతి కర్మణి షష్ఠీ (ఉభయేభ్యః) ఐహికపారమార్థికసుఖేభ్యః ((ప్ర) (చికిత్స) రోగనివారణాయేవ విఘ్ననివారణోపాయం కురు. అత్ర సంహితాయామితి దీర్ఘః (గవిష్టౌ) గోః స్వర్గస్య సుఖవిశేషస్యేష్టావిచ్ఛాయాం సత్యామ్.॥౨౩॥

అన్వయః:- హే సహసావన్త్సోమదేవ రాజన్! యస్త్వం దేవేన మనసా రాయో భాగం నోఽభియుధ్య యతస్త్వం వీర్యస్యేశిషే త్వా కశ్చిన్మా ఆతనత్ స త్వం గవిష్టావుభయేభ్యః ప్రచికిత్స.॥౨౩॥

భావార్థః:- రాజాదివిద్వద్భిః కపటాదిదోషాన్ విహాయ శుద్ధేన భావేన సర్వేభ్యః సుఖమభిలష్య వీర్యం వర్ధనీయం యేన దుఃఖనివృత్తిః సుఖవృద్ధిరిహాముత్ర చ స్యాత్తత్ర సతతం ప్రయతితవ్యమ్.॥౨౩॥

**పదార్థము** :- (సహసావన్) అధికతమ సేనాబలములుగల (సోమ) సంపూర్ణైశ్వర్యములుగలిగిన (దేవ) దివ్యగుణయుక్తుడవగు నో రాజా! ఏ నీవు (దేవేన) ఉత్తమగుణకర్మస్వభావములతో గూడిన (మనసా) మనస్ఫూర్తిగా (రాయః) ధనముల (భాగమ్) అంశమును (నః) మాకొరకు (అభియుధ్య) అన్నివైపులనుండి లభింపజేయుము. అందువల్ల నీవు (వీర్యస్య) వీరకర్మలొనర్చుటకు (ఈశిషే) సమర్థవంతుడవగుదువు. దీనిచే (త్వా) నిన్నెవరును (మా, ఆ, తనత్) అణచివేయలేరు. కావున నీవు (గవిష్టౌ) సుఖేచ్ఛకు హేతువగు (ఉభయేభ్యః) ఇహ పరలోక సుఖములకై (ప్ర, చికిత్స) రోగనివారణమునకు వలె విఘ్నములను దొలగించుటకు ఉపాయముల నొనర్పుము. ॥౨౩॥

**భావార్థము** :- రాజు మున్నగు విద్వాంసులు కపటము మున్నగు దోషములను వదలి పవిత్రభావముతో అందరి సుఖములను వృద్ధిపరచుచు, దుఃఖనివృత్తి, సుఖప్రవృత్తికొరకు ఇహ, పరలోక సౌఖ్యములకై నిరంతరము ప్రయత్నించవలయును. ॥౨౩॥

23. O King, possessing a strong army, might, and fine attributes, with thy godly spirit, win for us a share of riches!.

Thou art the lord of valour, let none subdue thee. With a desire for extreme happiness, in this world and the next, remove our impediments just as a disease is removed.

౧౮౧౭.అష్టావిత్యస్యాఽఽఙ్గిరసో హిరణ్యస్తూప ఋషిః,సవితా దేవతా, భురిక్ పఙ్క్తిశ్ఛన్దః,పంచమః స్వరః.

అథ సూర్యః కిం కరోతీత్యాహ.సూర్యుడేమి చేయుచున్నాడు?

౧౮౧౭ అష్టౌ వ్యఖ్యత్కకుభః పృథివ్యాస్త్రీ ధన్వ యోజనా సప్త సిన్ధూన్।

హిరణ్యాక్షః సవితా దేవ ఆగాద్దధద్రత్నా దాశుషే వార్యాణి ॥౨౪॥

ప.వి:-అష్టౌ, వి, అఖ్యత్, కకుభః, పృథివ్యాః, త్రీ, ధన్వ, యోజనా, సప్త, సిన్ధూన్, హిరణ్యాక్ష ఇతి హిరణ్య + అక్షః, సవితా, దేవః, ఆ, అగాత్, దధత్, రత్నా, దాశుషే, వార్యాణి.॥౮॥

పదార్థః:-(అష్టౌ) (వి) (అఖ్యత్) విఖ్యాపయతి (కకుభః) సర్వా దిశః. కకుభ ఇతి దిఙ్నా... నిఘం. ౧.౬ (పృథివ్యాః) భూమేః సమ్బన్ధినీః (త్రీ) త్రీణి (ధన్వ) ధన్వేత్యన్తరిక్షనా.. నిఘం. ౧.౩. (యోజనా) యోజనాని (సప్త,సిన్ధూన్) భౌమసముద్రమారభ్య మేఘాదూర్ధ్వావయవపర్యన్తాన్ సాగరాన్ (హిరణ్యాక్షః) హిరణ్యాని జ్యోతీంషి అక్షీణీవ యస్య సః (సవితా) సూర్యః (దేవః) ద్యోతకః (ఆ) (అగాత్) ఆగచ్ఛతి (దధత్) దధానః సన్ (రత్నా) రమణీయాని పృథివీస్థాని (దాశుషే) దానశీలాయ జీవాయ (వార్యాణి) వర్త్తుం స్వీకర్త్తుం యోగ్యాని. ॥౮॥

అన్వయః:-హే మనుష్యాః! యథా హిరణ్యాక్షో దేవః సవితా దాశుషే వార్యాణి రత్నా దధత్ త్రీ ధన్వ యోజనా సప్త సిన్ధూన్ పృథివ్యా అష్టౌ కకుభో వ్యఖ్యదాగాచ్ఛ తథైవ యూయం భవత.॥౮॥

భావార్థః:-హే మనుష్యాః! యథా సూర్యేన పృథివీమారభ్య ద్వాదశక్రోశపర్యన్తగురుత్వ లఘుత్వ యుతానాం సప్తవిధానామపామవయవాః సర్వా దిశశ్చ విభజ్యన్తే, వర్షాదినా సర్వేభ్యః సుఖం దీయతే, తథా శుభగుణకర్మస్వభావైర్దిగన్తాం కీర్తిం సమ్పాద్య వివిధైశ్వర్యదానేన మనుష్యాదీన్ ప్రాణినః సతతం సుఖయత.॥౮॥

పదార్థము :-ఓ విద్వాంసుడా! ఎట్లు (హిరణ్యాక్షః) నేత్రములవలె రూపములను దర్శింపజేయు జ్యోతులుగలవాడు (దేవః) ప్రేరకుడు (సవితా) సూర్యుడు (దాశుషే) దానశీల ప్రాణులకొరకు (వార్యాణి) స్వీకరించదగిన (రత్నా) పృథివియందలి ఉత్తమపదార్థములను (దధత్) ధారణమొనర్చుడు (త్రీ) మూడు (ధన్వ) అవకాశరూపములు (యోజనా) యోజనములు [౧౨ క్రోసులు] మరియు (సప్త) ఏడు (సిన్ధూన్) పృథివిసంబంధ సముద్రములు మొదలు మేఘములపై అవయవముల పర్యంతముగల ఏడుసముద్రములు మరియు (పృథివ్యాః) భూమికి సంబంధించిన (అష్టౌ) ఎనిమిది (కకుభః) దిశలను (వి, అఖ్యత్) ప్రసిద్ధముగా ప్రఖ్యాతమొనర్చునో, అదేవిధముగా మీరును అగుడు.॥౮॥

**భావార్థము:**-ఓ మానవులారా! ఏవిధముగా సూర్యునినుండి భూమివరకు పంద్రెండు క్రోసులపర్యంతము తేలికైన భారముతో గూడిన ఏడు విధములగు జలముల అవయవములు దిశలు విభజింప

బడుచున్నవో మరియు వర్షములు మున్నగు వానిచే సకల ప్రాణులకు సుఖమునీయబడుచుండునో, అదే విధముగా శుభగుణకర్మ స్వభావములచే దిశలందు కీర్తిని వ్యాపింపజేసి అనేక విధములగు ఐశ్వర్యముల నిచ్చుచు సర్వప్రాణులను సదా సుఖమున నుంచుడు.॥౨౪॥

24. The radiant, urging sun, comes giving choice treasures to the charitably disposed person. His brightness illumines the earth's eight directions, the three regions, and the seven rivers upto twelve miles.

౧౮౧౮.హిరణ్యపాణిరిత్యస్యాఙ్గిరసో హిరణ్యస్తూప ఋషిః,సవితా దేవతా,నిచృజ్జగతీ ఛన్దః,నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నావిషయమే చెప్పబడినది.

౧౮౧౮ హిరణ్యపాణిః సవితా విచర్షణిరుభే ద్యావాపృథివీ అన్తరీయతే ।

అపామీవాం బాధతే వేత్తి సూర్యమభి కృష్ణేన రజసా ద్యామృణోతి॥౨౫॥

ప.వి:-హిరణ్యపాణిరితి హిరణ్య + పాణిః, సవితా, విచర్షణిరితి వి + చర్షణిః, ఉభే + ఇత్యుభే, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, అన్తః, ఈయతే, అప, అమీవామ్, బాధతే, వేత్తి, సూర్యమ్, అభి, కృష్ణేన, రజసా, ద్యామ్, ఋణోతి.॥౨౫॥

పదార్థః :-(హిరణ్యపాణిః) హిరణ్యం జ్యోతిః పాణిరివ యస్య సః (సవితా) ఐశ్వర్యప్రదః (విచర్షణిః) విశేషేణ దర్శకః(ఉభే)(ద్యావాపృథివీ) ప్రకాశభూమీ (అన్తః) మధ్యే) (ఈయతే) ప్రాప్య గచ్ఛతి (అప) దూరీకరణే (అమీవామ్) వ్యాధిరూపమన్ధకారమ్ (బాధతే) దూరీకరోతి (వేత్తి) అస్తమేతి (సూర్యమ్) సవితృలోకః. అత్ర విభక్తివ్యత్యయః (అభి) సర్వతః (కృష్ణేన) కృష్ణవర్ణేన (రజసా) అన్ధకారలక్షణేన (ద్యామ్) (ఋణోతి) గచ్ఛతి ప్రాప్నోతి. ఋణోతీతి గతికర్మా నిఘం.. ౨.౧౪.॥౨౫॥

అన్వయః :-హే మనుష్యాః! యో హిరణ్యపాణిర్విచర్షణిః సవితా సూర్యం యదోభే ద్యావాపృథివీ అన్తరీయతే తదాఽమీవామపబాధతే యదా చ వేత్తి తదా కృష్ణేన రజసా ద్యామభి ఋణోతి.తం యూయం విజానీత ॥౨౫॥

భావార్థః:-హే మనుష్యా! యథా సూర్యః సన్నిహితాం్ల్లోకానాకృష్య ధరతి తథైవాఽనేక లోకాఽలంకృతం సూర్యాదికం సర్వం జగదభివ్యాప్యాఽఽకృష్యేశ్వరో దధాతీతి యూయం విజానీత, నహీశ్వరమన్తరేణ సర్వస్య విధాతా ధర్తా అన్యః కశ్చిత్సమ్భవితుమర్హతి.॥౨౫॥

**పదార్థము :-** ఓ మానవులారా! ఎవడు (హిరణ్యపాణిః) హస్తములవలె జలములు మున్నగు వానిని గ్రహించు ప్రకాశరూప కిరణములచే గూడి (విచర్షణిః) విశేషించి, సర్వప్రాణులకు సమస్తమును చూపునట్టి (సవితా) సకల పదార్థముల ఉత్పత్తికి హేతువగు (సూర్యమ్) సూర్యలోకమున, ఎప్పుడు (ఉభే) ఉభయములగు (ద్యావాపృథివీ) ఆకాశము మరియు భూమికి (అన్తః) మధ్యన (ఈయతే) ఉదయించి తిరుగుచుండునో, అప్పుడు అతడు (అమీ,వామ్) వ్యాధిరూప అంధకారమును (అప, బాధతే) దూరము పారద్రోలును. మరియు ఎప్పుడు (వేతి) అస్తమయ సమయమున (కృష్ణేన) (రజసా) నల్లని అంధకార రూపమునుండి (ద్యామ్) ఆకాశమున (అభి, ఋణోతి) అన్నివైపులనుండి వ్యాప్తుడగుచున్నాడో అట్టి సూర్యుని మీరు తెలిసికొనుడు.॥౨౫॥

**భావార్థము :-** ఓ మానవులారా! ఏవిధముగ సూర్యుడు తన సమీపవర్తి లోకములను ఆకర్షణము ద్వారా ధారణమొనర్చుచున్నాడో, అదేవిధముగా అనేక లోకములచే శోభాయమానుడు, సూర్యాది సకల జగత్తునందు అన్నివైపుల వ్యాప్తమైయున్న పరమేశ్వరుడు సమస్తమును ఆకర్షణద్వారా మరియు ధారణమొనర్చుచున్నాడు. ఇట్లని మీరు తెలిసికొనుడు. ఏలన ఈశ్వరుడు గాక మరెవ్వరును దీనిని చేయజాలరు. సర్వస్రష్ట, ధర్త, హర్త యగుటకు ఆతడే సమర్థుడు.॥౨౫॥

25. The sun, the recipient of water with his rays, the radiant rays, the exhibitor of all substances, the creator of all edibles, rises and moves between the Heaven and Earth, and removes the disease of darkness.

At the time of setting it fills the atmosphere on all sides with dark night.

౧౮౭౯. హిరణ్యహస్త ఇత్యస్య ఆఙ్గిరసో హిరణ్యస్తూప ఋషిః,సవితా దేవతా,

విరాట్ త్రిష్టుప్ ఛన్దః,ధైవతః స్వరః.

పునస్తమేవ విసయమాహ. మరల నా విషయమే.

౧౮౭౯ హిరణ్యహస్తో అసురః సునీథః సుమృడీకః స్వవాఀ౩ యాత్వర్వాఙ్।

అపసేధ న్రక్షసో యాతుధానానస్థాద్దేవః ప్రతిదోషం గృణానః ॥౨౬॥

ప.వి:-హిరణ్యహస్త ఇతి హిరణ్య + హస్తః, అసురః, సునీథ ఇతి సు+ నీథః, సుమృడీక ఇతి సు+మృడీకః, స్వవానితి స్వ+వాన్, యాతు, అర్వాఙ్, అపసేధన్నిత్యప+ సేధన్, రక్షసః, యాతు ధానానితి యాతు+ధానాన్, అస్థాత్, దేవః, ప్రతిదోషమితి ప్రతి+దోషమ్, గృణానః.॥౨౬॥

**పదార్థః** :- (హిరణ్యహస్తః) హిరణ్యాని జ్యోతీంషి హస్తవద్యస్య సః (అసురః) ప్రక్షేప్తా (సునీథః) యః సుష్ఠు నయతి సః (సుమృడీకః) సుష్ఠు సుఖకరః (స్వవాన్) స్వే స్వకీయాః ప్రకాశాదయో గుణా విద్యన్తే యస్మిన్ సః. అత్ర దీర్ఘాదటి సమానపాదే అ. ౮.౩.౯. ఇతి రుత్వే భోభగో... ఇత్యనేన రోర్యాదేశే చ, హలి సర్వేషామితి లోపః (యాతు) ప్రాప్నోతు (అర్వాఙ్) యోఽర్వాచీనాన్ అఞ్చతి ప్రాప్నోతి సః (అపసేధన్) దూరీకుర్వన్ (రక్షసః) దస్యుచోరాదీన్ (యాతుధానాన్) అన్యాయేన పరపదార్థధారకాన్ (అస్థాత్) ఉత్తిష్ఠతి ఉదేతి (దేవః) ప్రకాశకః (ప్రతిదోషమ్) ప్రతిజనం యో దోషస్తమ్. అత్రోత్తరపదలోపః (గృణానః) ఉచ్చారయన్ ప్రకటయన్.॥౨౬॥

**అన్వయః** :- హే మనుష్యాః! యో హిరణ్యహస్తః సునీథోఽసురః సుమృడీకః స్వవాన్ దేవో రక్షసో యాతుధానానపసేధన్ ప్రతిదోషం గృణానశ్చాస్థాత్సోఽర్వాఙ్ స్మత్సుఖాయ యాతు తద్వదుద్యాయం భవత.॥౨౬॥

**భావార్థః**:- హే మనుష్యాః! సదైవౌదార్యేణ యాచమానేభ్యో హిరణ్యాదికం దత్వా దుష్టాచారాన్ తిరస్కృత్య ధార్మికేభ్యః సుఖం ప్రదాయాఽహర్నిశం సూర్యవత్ప్రశంసితా భవత. ॥౨౬॥

**పదార్థము** :- ఓ మానవులారా! (హిరణ్యహస్తః) హస్తములవంటి ప్రకాశములుగల (సునీథః) చక్కగా లభింపజేయు (అసురః) జలాదులను విరజిమ్మజేయు (సుమృడీకః) శ్రేష్ఠసుఖముల గలిగింపజేయు (స్వవాన్) స్వయంప్రకాశము మున్నగు గుణములచే (దేవః) ప్రకాశకమునగు సూర్యలోకము (యాతుధానాన్) అన్యాయముగ ఇతరుల పదార్థములను హరించునట్టి (రక్షసః) దోపిడికాండ్రు, దొంగలు మున్నగువారిని (అపసేధన్) తొలగించును. అనగా [దోపిడికాండ్రు, చోరులు మున్నగువారు సూర్యోదయ మగుటతో తమ కృత్యములను జేయజాలరు. రాత్రులందే తమ కార్యములను జేసికొనుచుందురు.] మరియు (ప్రతిదోషమ్) మానవులకుగల దోషములను (గృణానః) ప్రకటపరచుచు ఎట్లు (అస్థాత్) ఉదయమగుచున్నదో, అది (అర్వాఙ్) సమీపమునగల పదార్థములను పొందుచున్నదై మన సుఖములకొరకు (యాతు) ప్రాప్తించునో, అట్లు మీరును అగుడు.॥౨౬॥

**భావార్థము** :- మానవులారా! మీరు యాచకులకు ఉదారత్వముతో సువర్ణాదులనీయుడు. దుష్టాచారులను తిరస్కరించుడు. ధార్మికులగువారికి సుఖముల గలిగించుచు ప్రతిదినము సూర్యునివలె ప్రశంసితులగుడు.॥౨౬॥

26. The Sun, with its hands of gleaming rays, kind benefactor, the bringer of rain, the giver of happiness, self refulgent, driving off demons and thieves, rises, removing human physical weaknesses. May he bring us happiness, illuminating all substances.

౧౮౨.యే త ఇత్యస్యాఙ్గిరసో హిరణ్యస్తూప ఋషిః, సవితా దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః,ధైవతః స్వరః.
అథాధ్యాపకోపదేశక విషయమాహ. అధ్యాపక, ఉపదేశకుల విషయ మిందు జెప్పెను.

౧౮౨ యే తే పన్థాః సవితః పూర్వ్యాసోఽరేణవః సుకృతా అన్తరిక్షే ।
తేభిర్నో అద్య పథిభిః సుగేభీ రక్షా చ నో అధి చ బ్రూహి దేవ ॥౨౭॥

ప.విః- యే, తే, పన్థాః, సవితరితి సవితః, పూర్వ్యాసః, అరేణవః, సుకృతా ఇతి సు + కృతాః, అన్తరిక్షే, తేభిః, నః, అద్య, పథిభిరితి పథి + భిః, సుగేభిరితి సు + గేభిః, రక్షా, చ, నః, అధి, చ, బ్రూహి, దేవ. ॥౨౭॥

పదార్థః-(యే) (తే) తవ (పన్థాః) మార్గాః. అత్ర వచనవ్యత్యయేనైకవచనమ్ (సవితః) సవితృవదైశ్వర్యప్రద (పూర్వ్యాసః) పూర్వైరాప్తైః సేవితాః (అరేణవః) అవిద్యమానా రేణవో యేషు తే (సుకృతాః) సుష్ఠునిష్పాదితాః (అన్తరిక్షే) ఆకాశే (తేభిః) తైః (నః) అస్మాన్ (అద్య) ఇదానీమ్ (పథిభిః) మార్గైః (సుగేభిః) సుఖేన గమనాఽధికరణైః (రక్షా) అత్ర ద్వ్యచోఽత స్తిఙ ఇతి దీర్ఘః (చ) (నః) అస్మాన్ (అధి) ఉపరిభావే (చ) (బ్రూహి) ఉపదిశ (దేవ) సుఖవిద్య యోర్దాతః. ॥౨౭॥

అన్వయః:-హే సవితర్దేవాఽఽప్తవిద్వన్! యస్య తే సూర్యస్యాన్తరిక్షే ఇవ యే పూర్వ్యాసోఽరేణవః సుకృతాః పన్థాః సన్తి తేభిస్సుగేభిః పథిభిరద్య నో నయ తత్ర గచ్ఛతో నో రక్షా చ నోఽస్మాంశ్చాధి బ్రూహి. ఏవం సర్వాన్ ప్రతి బోధయ. ॥౨౭॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే విద్వాంసో! యుష్మాభిర్యథా సూర్యస్యాఽన్తరిక్షే నిర్మలాః మార్గాః సన్తి, తథైవోపదేశాధ్యాపనాభ్యాం విద్యాధర్మసుశీలప్రదాః పన్థానః ప్రాచరణీయాః. ॥౨౭॥

**పదార్థము** :- (సవితః) సూర్యునివలె ఐశ్వర్యముల నిచ్చు (దేవ) విద్య మరియు సుఖదాతయగు ఆప్త విద్వాంసుడా! ఏ (తే) నీవలెనే సూర్యునికి (అన్తరిక్షే) ఆకాశమున గమనమునకు శుద్ధ మార్గముగలదో, అటులనే (యే) ఏ (పూర్వ్యాసః) పూర్వజులగు ఆప్తజనులు సేవించునట్టి (అరేణవః) ధూళి మున్నగునవి లేనట్టి (సుకృతాః) చక్కగా సాధించిన (పన్థాః) ఏ మార్గముగలదో (తేభిః) అట్టి (సుగేభిః) సుఖవంతముగ నడచిన (పథిభిః) మార్గములో (అద్య) నేడు (నః) మమ్ము నడుపుము. ఈ మార్గములందు నడచుచున్న

మాయొక్క (రక్ష) రక్షణను కూడ (చ) ఒనర్చుము (చ) మరియు (నః) మాకు (అధి బ్రూహి) అధికతరముగ ఉపదేశమొనర్చుము. అటులనే సర్వజనులను జాగృతపరచుము. ॥౨౭॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ విద్వాంసులారా! ఏవిధముగా ఆకాశమునందు సూర్యుని మార్గము నిర్మలముగానున్నదో, అదేవిధముగు ఉపదేశము మరియు అధ్యాపనము ద్వారా విద్య, ధర్మము, సుశీలత్వమును గలిగించు మార్గములను గూర్చి ప్రచారమొనర్చుడు. ॥౨౭॥

27. O highly learned fellow, brilliant like the Sun, thy dustless pathways, followed by the ancient scholars, are well established in the air's mid region, like those of the Sun. Come by those paths so fair to travel: make us ever tread upon them, preserve us and instruct us!.

౧౮౨౧.ఉభేత్యస్య ప్రస్కణ్వ ఋషిః, అశ్వినౌ దేవతే, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే ఇందు చెప్పెను.

౧౮౨౧ ఉభా పిబతమశ్వినోభా నః శర్మ యచ్ఛతమ్ । అవిద్రియాభిరూతిభిః॥౨౮॥

ప.వి:- ఉభా, పిబతమ్, అశ్వినా, ఉభా, నః, శర్మ, యచ్ఛతమ్, అవిద్రియాభిః, ఊతిభిరిత్యూతి + భిః.॥ ౨౮॥

పదార్థః :- (ఉభా) ద్వౌ (పిబతమ్) (అశ్వినా) సూర్యాచన్ద్రమసావివాఽధ్యాపకోపదేశకౌ. (ఉభా) ద్వౌ (నః) అస్మభ్యమ్ (శర్మ) శ్రేష్ఠం శరణం సుఖం వా (యచ్ఛతమ్) దద్యాతమ్ (అవిద్రియాభిః) అచ్ఛిద్రాభిః (ఊతిభిః) రక్షణాదిభిః.॥౨౮॥

అన్వయః :- హే అశ్వినా! ఉభా యువాం యత్రోత్తమం రసం పిబతం తచ్ఛర్మోభా యువామవిద్రియాభిరూతిభీ రక్షితం గృహం నో యచ్ఛతమ్.॥౨౮॥

భావార్థః :- అధ్యాపకోపదేశకైః సదోత్తమగృహరచననివాసోపదేశాన్ కృత్వా యత్ర పూర్ణా రక్షా స్యాత్తత్ర సర్వే ప్రేరణీయాః.॥౨౮॥

**పదార్థము** :-(అశ్వినా) సూర్యచంద్రులవంటి అధ్యాపకోపదేశకులారా! (ఉభా) మీరుభయులెచ్చట ఉత్తమ రసమును (పిబతమ్) సేవించెదరో అచ్చట (శర్మ) ఉత్తమాశ్రయ స్థానము లేక సుఖమును (ఉభా) మీరిరువురు (అవిద్రియాభిః) ఛిద్రరహితము మరియు రక్షణ మున్నగు క్రియలచే సురక్షితగృహమును (నః) మాకొరకు (యచ్ఛతమ్) ఈయుడు [ఒసగుడు].॥౨౮॥

**భావార్థము** :- అధ్యాపకోపదేశకులు ఉత్తమ గృహములను నిర్మించి నివాసమొనర్చుటకు పూర్ణరక్షణలతో సుఖముగ నుండుటకు సదా అందరికి ప్రేరణనీయవలెను.

28. O teacher and preacher, lustrous like the Sun and Moon, grant us well protected, faultless, comfortable houses where ye may drink nice juices!.

౧౮౨౨. అప్నస్వతీమిత్యస్య కుత్స ఋషిః, అశ్వినౌ దేవతే, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే

౧౮౨౨ అప్నస్వతీమశ్వినా వాచమస్మే కృతం నో దస్రా వృషణా మనీషామ్ ।

అద్యూత్యేఽవసే ని హ్వయే వాం వృధే చ నో భవతం వాజసాతౌ ॥౨౯॥

ప.వి:- అప్నస్వతీమ్, అశ్వినా, వాచమ్, అస్మేఽఇత్యస్మే, కృతమ్, నః దస్రా, వృషణా, మనీషామ్, అద్యూత్యే, అవసే, ని, హ్వయే, వామ్, వృధే, చ, నః, భవతమ్, వాజసాతావితి వాజ + సాతౌ ॥౨౯॥

పదార్థః :- (అప్నస్వతీమ్) ప్రశస్తాన్యప్నాంసి కర్మాణి విద్యన్తే యస్యాస్తామ్ (అశ్వినా) సకల విద్యావ్యాపినావధ్యాపకోపదేశకౌ! (వాచమ్) వాణీమ్ (అస్మే) అస్మాకమ్ (కృతమ్) కురుతమ్ (నః) అస్మాకమ్ (దస్రా) దుఃఖోపక్షయితారౌ (వృషణా) సుఖస్య వర్షయితారౌ (మనీషామ్) ఉత్తమాం ప్రజ్ఞామ్ (అద్యూత్యే) అవిద్యమానాని ద్యూతాని యస్మింస్తస్మిన్భవే (అవసే) రక్షణాయ (ని, హ్వయే) నితరాం స్తౌమి (వామ్) యువామ్ (వృధే) వర్ధనాయ (చ) (నః) అస్మాకమ్ (భవతమ్) (వాజసాతౌ) వాజస్య ధనస్య విభాజకే సఙ్గ్రామే. ॥౨౯॥

అన్వయః:-హే దస్రా వృషణాఽశ్వినా! యువామస్మే వాచం మనీషాం చాప్నస్వతీం కృతం నోఽద్యూత్యేఽవసే స్థాపయతమ్. వాజసాతౌ నో వృధే చ భవతం యౌ వామహన్నిహ్వయే తౌ మామున్నయతమ్. ॥౨౯॥

భావార్థః :- యే మనుష్యా నిష్కపటానాప్తాన్దయాలూన్ విదుషః సతతం సేవన్తే తే ప్రగల్భా ధార్మికా విద్వాంసో భూత్వా సర్వతో వర్ధమానా విజయినః సన్తః సర్వేభ్యః సుఖదా భవన్తి. ॥౨౯॥

పదార్థము :-(దస్రా) దుఃఖనాశకులు (వృషణా) సుఖముల వర్షింపజేయు (అశ్వినా) సకల విద్యలందు వ్యాప్తులునగు అధ్యాపక, ఉపదేశకులారా! మీరిరువురు (అస్మే) మాయొక్క (వాచమ్) వాణిని (చ) మరియు (మనీషామ్) బుద్ధిని (అప్నస్వతీమ్) ప్రశస్త కర్మలనొనర్చునవిగా (కృతమ్) చేయుడు (నః) మాయొక్క (అద్యూత్యే) ద్యూత [జూదు] రహిత స్థానములందగు కర్మలందు (అవసే) రక్షణకొరకు స్థితమొనర్చుడు

(వాజసాతౌ) ధనమును విభజించగల సంగ్రామములందు (నః) మాయొక్క (వృధే) అభివృద్ధికై (భవతమ్) ఉద్యుతులగుడు (వామ్) ఏ మీ (ని, హ్వయే) స్తుతులనొనర్చుచున్నానో, అట్టి మీ రుభయులు మమ్ము ఉన్నతపరచుడు. ॥౨౯॥

**భావార్థము** :- ఏ మనుష్యులు నిష్కపటులు, ఆప్తులు, దయాళువులు, విద్వాంసులు నగువారిని నిరంతరము సేవించుచుండెదరో, వారు ప్రతిభావంతులు, ధార్మికులు, విద్వాంసులునై అన్నిదిశలనుండి విజయులగుచు అందరకు సుఖదాయకులగుదురు. ॥౨౯॥

29. O learned teacher and preacher, the dispellers of afflictions, and givers of joys, make ye our speech and wisdom effective. Protect us against gambling, strive for your prosperity in battle. I praise ye both; work for my advancement!.

౧౮౨౩. ద్యుభిరిత్యస్య కుత్స ఋషిః, అశ్వినౌ దేవతే, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ సభాసేనాధిపౌ కిం కుర్యాతామిత్యాహ. సభాసేనాధిపతులు ఏమి చేయవలయును?

౧౮౨౩ ద్యుభిరక్తుభిః పరి పాతమస్మానరిష్టేభిరశ్వినా సౌభగేభిః।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥30॥

**ప. వి:**– ద్యుభిరితి ద్యు + భిః, అక్తుభిరిత్యక్తు + భిః, పరి, పాతమ్, అస్మాన్, అరిష్టేభిః, అశ్వినా, సౌభగేభిః, తత్, నః, మిత్రః, వరుణః, మామహన్తామ్, అదితిః, సిన్ధుః, పృథివీ, ఉత, ద్యౌః. ॥30॥

పదార్థః :- (ద్యుభిః) దివసైః (అక్తుభిః) రాత్రిభిః (పరి) సర్వతః (పాతమ్) రక్షతమ్ (అస్మాన్) (అరిష్టేభిః) అహింసితైః (అశ్వినా) సభాసేనేశౌ! (సౌభగేభిః) శ్రేష్ఠానాం ధనానాం భావైః (తత్) తాన్ (నః) అస్మాన్ (మిత్రః) సఖా (వరుణః) దుష్టానాం బన్ధకః (మామహన్తామ్) సత్కుర్వన్తు (అదితిః) పృథివీ (సిన్ధుః) సప్తవిధః సముద్రః (పృథివీ) అన్తరిక్షమ్ (ఉత) అపి (ద్యౌః) ప్రకాశః. ॥30॥

అన్వయః :- హే అశ్వినా! యథాఽదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌస్తన్నో మామహన్తాం తథా మిత్రో వరుణశ్చ యువాం ద్యుభిరక్తుభిరరిష్టేభిః సౌభగేభిరస్మాన్ పరిపాతమ్. ॥30॥

భావార్థః :- అత్రవాచకలుప్తోపమాలఙ్కారః. హే సభాధీశాదివిద్వాంసో! యథా పృథివ్యాదీని

తత్వాని సర్వాన్ ప్రాణినో రక్షన్తి, తథైవ వర్ధమానాస్తైశ్వర్యైరహర్నిశం సర్వాన్ మనుష్యాన్ వర్ధయన్తు.॥30॥

**పదార్థము :-** (అశ్వినా) ఓ సభా సేనాధ్యక్షులారా! ఎట్లు (అదితిః) పృథివి (సిన్ధుః) ఏడువిధములగు సముద్రములు (పృథివీ) ఆకాశము (ఉత) మరియు (ద్యౌః) ప్రకాశము (తత్) అవి (నః) మమ్ము (మామహన్తామ్) సత్కారమొనర్చునో, అటులనే (మిత్రః) మిత్రులు మరియు (వరుణః) దుష్టులను బంధించు లేక ఆటంకపరచు మీ రిరువురు (ద్యుభిః) పగలు (అక్తుభిః) మరియు రాత్రులందు (అస్మాన్) మమ్ము (పరిపాతమ్) అన్నివైపులనుండి రక్షించుడు.॥30॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగా పృథివి మున్నగు తత్త్వములు సమస్త ప్రాణుల రక్షణమొనర్చుచుండునో అదేవిధముగా సభాధీశుడు మున్నగు విద్వాంసులు రాత్రింబవళ్లు సకల ప్రజలను అభివృద్ధి పరచుచుండవలయును.॥30॥

30. O King and Commander of the army, just as the Earth, Ocean, atmosphere and heaven portect us, so ye both, friendly and chastisers of the wicked, through day and night, protect us on every side, with harmless riches!.

౧౮౨౪.ఆ కృష్ణేనేత్యస్య హిరణ్యస్తూప ఋషిః, సూర్యో దేవతా, విరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ విద్యుతా కిం సాధ్యమిత్యాహ. విద్యుత్తువల నేమి సాధించవలయును?

**౧౮౨౪ ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యఞ్చ ।**

**హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్ ॥30॥**

**ప.వి:-** ఆ, కృష్ణేన, రజసా, వర్తమానః, నివేశయన్నితి ని + వేశయన్, అమృతమ్, మర్త్యమ్, చ, హిరణ్యయేన, సవితా, రథేన, ఆ, దేవః, యాతి, భువనాని, పశ్యన్.॥30॥

పదార్థః:-(ఆ) సమన్తాత్(కృష్ణేన) కర్షితేన (రజసా) లోకసమూహేన సహ (వర్తమానః) (నివేశయన్) నిత్యం ప్రవేశయన్ (అమృతమ్) నాశరహితం కారణమ్ (మర్త్యమ్) నాశసహితం కార్యమ్ (చ) (హిరణ్యయేన) తేజోమయేన (సవితా) ఐశ్వర్యప్రదః (రథేన) రమణీయేన స్వరూపేణ (ఆ) (దేవః) దేదీప్యమానః (యాతి) ప్రాప్నోతి (భువనాని) భువనాధికరణాని వస్తూని (పశ్యన్) సంప్రేక్షమాణః.॥30॥

అన్వయః:- హే విద్వన్ స్త్వం య ఆకృష్ణేన రజసా సహ వర్తమానః సతతమమృతం

మర్త్యఞ్చ నివేశయన్ హిరణ్యయేన రథేన సవితా దేవో విద్యుద్భువనాని యాతి తం పశ్యన్ సన్ సమ్ప్రయుజ్గ్ధి ॥30॥

భావార్థః:- హే మనుష్యాః! యా విద్యుత్కార్యం కారణం సమ్ప్రకాశ్య సర్వత్రాఽభివ్యాప్తా తేజోమయీ సద్యోగామినీ సర్వాకర్షికా వర్తతే తాం ప్రేక్షమాణాః సన్తః సంప్రయుజ్యాఽభీష్టాని సద్యో యాత ॥30॥

**పదార్థము :-** ఓ విద్వాంసుడా! నీవు ఏ (ఆ,కృష్ణేన) ఆకర్షితమైన (రజసా) లోకసమూహములతో గూడ (వర్తమానః) వర్తమానుడవై నిరంతరము (అమృతమ్) నాశరహితమగు కారణమును (చ) మరియు (మర్త్యమ్) నాశనమగు కార్యమును (నివేశయన్) [వానివాని] కక్షలందు స్థిరపరచుచు (హిరణ్యయేన) తేజఃస్వరూపమును (రథేన) రమణీయ స్వరూపముతో గూడ (సవితా) ఐశ్వర్యదాత (దేవః) దేదీప్యమానమగు విద్యుద్రూపాగ్ని (భువనాని) ప్రాపంచిక వస్తువులను (యాతి) పొందుచున్నదో దానిని (పశ్యన్) చూచుచు చక్కగా ప్రయోగమొనర్చుడు.॥30॥

**భావార్థము :-** ఓ మానవులారా! ఏ విద్యుత్తు కార్యకారణరూపములను చక్కగా ప్రకాశపరచుచు సర్వత్ర వ్యాప్తమగుచు తేజఃస్వరూపము, శీఘ్రగామి యగుచు సమస్తమును ఆకర్షణమొనర్చునదై యున్నదో దానిని చూచుచు, ప్రయోగాత్మకముగ కోరిన స్థలములందు శీఘ్రముగ విహరించుచుండును. ॥30॥

31. O learned person, with full observation, use full well the lustrous electriciry, which resides in the solar system, standing through attraction, fixes in its respective sphere the immortal cause and the mortal effect, and with its blazing beautiful nature, grants prosperity, and pervades material objects!.

౧౮౨౫.ఆ రాత్రీత్యస్య కుత్స ఋషిః, రాత్రిర్దేవతా, పథ్యా బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ రాత్రివర్ణనమాహ. రాత్రి వర్ణన ఇందు చెప్పబడెను.

౧౮౨౫ ఆ రాత్రి పార్థివꣳ రజః పితురప్రాయి ధామభిః ।

దివః సదాꣳసి బృహతీ వి తిష్ఠస ఆ త్వేషం వర్తతే తమః ॥31॥

ప.వి:–ఆ, రాత్రి, పార్థివమ్, రజః, పితుః, అప్రాయి, ధామభిరితి ధామ + భిః, దివః, సదాꣳసి, బృహతీ, వి, తిష్ఠసే, ఆ, త్వేషమ్, వర్తతే, తమః ॥31॥

పదార్థః :- (ఆ) సమన్తాత్ (రాత్రి) రాత్రిః. అత్ర లిఙ్గవ్యత్యయః (పార్థివమ్) పృథివ్యాః సమ్బన్ధి (రజః) లోకః (పితుః) మధ్యలోకస్య (అప్రాయి) పూర్యన్తే (ధామభిః) సర్వైస్థానైః

(దివః) ప్రకాశస్య (సదాంసి) సీదన్తి యేషు తాన్యధికరణాని (బృహతీ) మహతీ (వి) (తిష్ఠసే) తిష్ఠతే, ఆక్రమంతే వ్యాప్నోతి (ఆ) (త్వేషమ్) స్వకాన్త్యా ప్రకృష్టమ్ (వర్తతే) (తమః) అన్ధకారః.॥32॥

అన్వయః :-హే మనుష్యాః! యా బృహతీ రాత్రి దివః సదాంసి వితిష్ఠసే యయా పితుర్ధామభిః పార్థివం రజ ఆ అప్రాయి, యస్యాశ్చ త్వేషం తమ ఆ వర్తతే తాం యుక్త్యా సేవధ్వమ్.॥32॥

భావార్థః :-హే మనుష్యాః! యా పృథివ్యాదేశ్ఛాయా రాత్రౌ ప్రకాశం నిరోధయతి సర్వమావృణోతి తాం యథావత్సేవన్తామ్.॥32॥

పదార్థము :- ఓ మానవులారా! ఎయ్యది (బృహతీ) గొప్ప (రాత్రి) రాత్రి (దివః) ప్రకాశము యొక్క (సదాంసి) స్థానములందు (వి, తిష్ఠసే) వ్యాప్తమగుచున్నదో, ఏరాత్రి (పితుః) తన మరియు సూర్యుని మధ్యనుండు లోకముల (ధామభిః) సమస్త స్థానములతోగూడ (పార్థివమ్) పృథివిసంబంధమగు (రజః) లోకములను (ఆ, అప్రాయి) చక్కగా పూర్ణమొనర్చినదో, ఎయ్యది (త్వేషమ్) తన కాంతితో అభివృద్ధియైన (తమః) అంధకారమునకు (ఆ, వర్తతే) రాకపోకలొనర్చుచున్నదో, దానిని యుక్తితో ఉపయోగించుకొనుడు.॥32॥

భావార్థము :- ఓ మానవులారా! ఏ పృథివి మున్నగువాని నీడ [ఛాయ] రాత్రియందు ప్రకాశమును ఆపివేయుచుండునో దానిని మీరు చక్కగా సేవించుడు.॥32॥

32.O men, use properly the great Night, which covers the places of light, which hath filled the planet Earth and Sun's mid regions, whose terrific darkness comes and goes!.

౧౮౨౬.ఉష ఇత్యస్య గోతమ ఋషిః, ఉషర్దేవతా, నిచృత్పురోష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునరుషోవర్ణనముపదిశ్యతే. మరల ఉషఃకాల వర్ణన.

౧౮౨౬ ఉషస్తచ్చిత్రమా భరాస్మభ్యం వాజినీవతి ।

యేన తోకం చ తనయం చ ధామహే ॥33॥

ప.వి:-ఉషః, తత్, చిత్రమ్, ఆ, భర, అస్మభ్యమ్, వాజినీవతీతి వాజినీ + వతి, యేన, తోకమ్, చ, తనయమ్, చ, ధామహే ॥33॥

పదార్థః:- (ఉషః) ఉషోవద్వర్తమానే (తత్) (చిత్రమ్) అద్భుతస్వరూపమ్ (ఆ) (భర) పోషయ (అస్మభ్యమ్) (వాజినీవతి) బహ్వన్నాద్యైశ్వర్యయుక్తే (యేన) (తోకమ్) సద్యోజాతమపత్యమ్ (చ) (తనయమ్) ప్రాప్తకుమారావస్థమ్ (చ) (ధామహే) ధరేమ.॥33॥

అన్వయః:- హే వాజినీవత్యుషర్వద్వర్తమానే స్త్రి! యథా వాజినీవత్యుషా యాదృశం చిత్రం స్వరూపం ధరతి తత్తాదృశమస్మభ్యం త్వమాభర యేన వయం తోకం చ తనయం చ ధామహే.॥33॥

భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా సర్వశోభాయుక్తా మఙ్గలప్రదా ప్రభాతవేలా సర్వవ్యవహారధారికా వర్తతే తథాభూతాః స్త్రియో యది స్యుస్తర్హి తాః సదా స్వం పతిం ప్రసాద్య పుత్రపౌత్రాదినా ఆనన్దం లభేరన్.॥33॥

పదార్థము :- (వాజినీవతి) అనేక అన్నాద్యైశ్వర్యములతో గూడిన (ఉషః) ప్రాతఃకాలసమయమువంటి కాంతితో గూడియున్న ఓ మహిళామణీ! ఏవిధముగా అధికముగు అన్నము మున్నగు ఐశ్వర్యములకు హేతువగు ప్రాతఃకాలవేళ ఏవిధమగు (చిత్రమ్) ఆశ్చర్యస్వరూపమును ధారణమొనర్చుచున్నదో (తత్) అట్టి రూపమును నీవు (అస్మభ్యమ్) మాకొరకు (ఆ,భర) చక్కగా పుష్టియొనర్చుము (యేన) దానిచే మేము (తోకమ్) శీఘ్రముగా నుత్పన్నమైన బాలకుని (చ) మరియు (తనయమ్) కౌమారదశయందుండు తనయుని (చ) కూడ (ధామహే) ధారణమొనర్చెదముగాక!॥33॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగా శోభాయుక్తము, మంగళప్రదమునగు ప్రభాతకాలసమయము సమస్త వ్యవహారములను ధారణమొనర్చునదైయున్నదో, అదేవిధముగా స్త్రీరత్నములును తమతమ పతులను ప్రసన్నపరచుచు పుత్రపౌత్రాదులతో ఆనందమును పొందుచుందురు.॥33॥

33. O Dawn enriched with ample wealth, bestow on us that wondrous light wherewith we may support the babies and young sons, as does an accomplished wife!.

౧౮౨౭.ప్రాతరిత్యస్య వసిష్ఠ ఋషిః, అగ్న్యాదయో లిఙ్గోక్తా దేవతాః, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును?

౧౮౨౭ ప్రా॒త॒ర॒గ్నిం ప్రా॒త॒రిన్ద్ర॑గ్ం హవామహే ప్రా॒త॒ర్మి॒త్రావరు॑ణా
ప్రా॒త॒ర॒శ్వినా॑। ప్రా॒త॒ర్భగం॑ పూ॒షణం॒ బ్రహ్మ॑ణ॒స్పతిం॑ ప్రా॒తః
సోమ॑ము॒త రు॒ద్రగ్ం॑ హువేమ ॥34॥

ప.వి:- ప్రాతః, అగ్నిమ్, ప్రాతః, ఇన్ద్రమ్, హవామహే, ప్రాతః, మిత్రావరుణా, ప్రాతః, అశ్వినా, ప్రాతః, భగమ్, పూషణమ్, బ్రహ్మణః, పతిమ్, ప్రాతరితి ప్రాతః, సోమమ్, ఉత, రుద్రమ్, హువేమ.॥౩౪॥

పదార్థః :-(ప్రాతః) ప్రభాతే (అగ్నిమ్) పవిత్రం స్వప్రకాశం పరమాత్మానం పావకమగ్నిం వా (ప్రాతః) (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (హవామహే) ఆదద్యామాహ్వయేమ వా (ప్రాతః) (మిత్రావరుణా) ప్రాణోదానౌ (ప్రాతః) (అశ్వినా) అధ్యాపకోపదేశకౌ (ప్రాతః) (భగమ్) భజనీయం భాగమ్ (పూషణమ్) పుష్టికరం భోగమ్ (బ్రహ్మణః) ధనస్య వేదస్య (పతిమ్) స్వామినం పాలకమ్ (ప్రాతః) (సోమమ్) ఓషధిగణమ్ (ఉత) అపి (రుద్రమ్) జీవమ్ (హువేమ) గృహ్ణీయామ.॥౩౪॥

అన్వయః :-హే మనుష్యాః! యథా వయం ప్రాతరగ్నిం ప్రాతరింద్రం ప్రాతర్మిత్రావరుణా ప్రాతరశ్వినా హవామహే ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిం ప్రాతః సోమముత రుద్రఞ్చ హువేమ. తథా యూయమప్యాచరత.॥౩౪॥

భావార్థః :- యే మనుష్యాః ప్రాతః పరమేశ్వరోపాసనమగ్నిహోత్రమైశ్వర్యోన్నత్యుపాయం ప్రాణాపానపుష్టికరణమధ్యాపకోపదేశకాన్ విదుష ఓషధిసేవనం జీవం చ ప్రాప్తుం జ్ఞాతుం చ ప్రయతన్తే తే సర్వైః సుఖైరలఙ్కృతాః స్యుః.॥౩౪॥

**పదార్థము** :- ఓ మనుష్యులారా! మే మెట్లు (ప్రాతః) ప్రాతఃకాలమందు (అగ్నిమ్) పవిత్రుడు మరియు స్వయంప్రకాశస్వరూపుడునగు పరమాత్మను లేక అగ్నిని (ప్రాతః) ప్రాతఃసమయమున (ఇన్ద్రమ్) ఉత్తమైశ్వర్యములను (ప్రాతః) ప్రభాతకాలమున (మిత్రావరుణా) ప్రాణోదానవాయువులను మరియు (ప్రాతః) ప్రభాతసమయమున (అశ్వినా) అధ్యాపక, ఉపదేశకులను (హవామహే) ఆహ్వానించుచున్నామో (ప్రాతః) ప్రాతఃసమయమున (భగమ్) సేవించదగిన భాగమును (పూషణమ్) పుష్టికారక భోగములను (బ్రహ్మణస్పతిమ్) ధనమును లేక వేదరక్షకులను (ప్రాతః) ప్రభాతసమయమున (సోమమ్) సోమాది ఓషధీగణమును (ఉత) మరియు (రుద్రమ్) జీవుని (హువేమ) ఎట్లు స్వీకరించునో, అదేవిధముగ మీరును ఆచరించుడు.॥౩౪॥

**భావార్థము** :-ప్రాతఃకాలమున పరమేశ్వరోపాసన, అగ్నిహోత్రము, ఐశ్వర్యోన్నతికి ఉపాయము, ప్రాణాపానముల పుష్టిపరచుట, అధ్యాపక, ఉపదేశక, విద్వాంసులను ఐశ్వర్యములను సేవించుట, జీవాత్మను దెలిసికొనుట మున్నగు వానిని ఆచరించువారు సకల సుఖములచే సుశోభితులగుదురు.॥౩౪॥

34. We invoke God at dawn, we pray for progress at dawn, we practice breath control at dawn, we respect father and mother, at dawn. At dawn we invoke God, the Lord of the vedas, the Sustainer of all, and Adorable by all. We use medicinal herbs in the morning, and at dawn we try to realise the true nature of soul.

౧౮౩౫. ప్రాతర్జితమిత్యస్య వసిష్ఠ ఋషిః, భగో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యా ఐశ్వర్యం సంపాదయేయురిత్యాహ.

మానవు లైశ్వర్య (ధన) మును సంపాదించవలయును.

౧౮౩౫ ప్రాతర్జితం భగముగ్రꣳహువేమ వయం పుత్రమదితేర్యో విధర్తా ।

ఆధ్రశ్చిద్యం మన్యమానస్తురశ్చిద్రాజా చిద్యం భగం భక్షీత్యాహ ॥౩౫॥

ప. విః- ప్రాతర్జితమితి ప్రాతః + జితమ్, భగమ్, ఉగ్రమ్, హువేమ, వయమ్ పుత్రమ్, అదితేః, యః, విధర్తేతి వి + ధర్తా, ఆధ్రః, చిత్, యమ్, మన్యమానః, తురః, చిత్, రాజా, చిత్, యమ్, భగమ్, భక్షి, ఇతి, ఆహ ॥౩౫॥

పదార్థః :-(ప్రాతః) ప్రభాతే (జితమ్) స్వపురుషార్థేన లబ్ధమ్ (భగమ్) ఐశ్వర్యమ్ (ఉగ్రమ్) అత్యుత్కృష్టమ్ (హువేమ) గృహ్ణీయామ (వయమ్) (పుత్రమ్) (అదితేః) అవినాశినః కారణస్యేవ మాతుః (యః) (విధర్తా) యో వివిధాన్ పదార్థాన్ ధరతి సః (ఆధ్రః) అపుత్రస్య పుత్రః (చిత్) అపి (యమ్) (మన్యమానః) విజానన్ (తురః) త్వరమాణః (చిత్) అపి (రాజా) రాజమానః (చిత్) (యమ్) (భగమ్) ఐశ్వర్యమ్ (భక్షి) సేవస్వ (ఇతి) అనేన ప్రకారేణ (ఆహ) పరమేశ్వర ఉపదిశతి ॥౩౫॥

అన్వయః:-హే మనుష్యా! యథా వయం ప్రాతర్యో విధర్తా ఆధ్రశ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్రాజాఽస్తి యం భగం చిద్భక్షీత్యాహ తమదితేః పుత్రం జితముగ్రం భగం హువేమ. తథా యూయమపి స్వీకురుత॥౩౫॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా! యుష్మాభిః సదా ప్రాతరారభ్య శయనపర్యన్తం యథాశక్తి సామర్థ్యేన విద్యయా పురుషార్థేనైశ్వర్యోన్నతిం విధాయాఽఽనన్దో భోక్తవ్యో దరిద్రేభ్యః సుఖం దేయమిత్యాహేశ్వరః.॥౩౫॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఎట్లు (వయమ్) మేము (ప్రాతః) ప్రభాతకాలమున (యః) ఎవడు (విధర్తా) వివిధ పదార్థములను ధారణమొనర్చునో (ఆధ్రః) న్యాయాదులందు తృప్తిపరచజాలనివాని పుత్రుడవై (చిత్) కూడ (యమ్) ఏ యైశ్వర్యమును (మన్యమానః) విశేషముగ దెలిసికొనుచు (తురః) శీఘ్రకారియై (చిత్) కూడ (రాజా) శోభావంతుడగు రాజుగలడో (యమ్) ఏ (భగమ్) ఐశ్వర్యమును (చిత్) కూడ (భక్షి, ఇతి, ఆహ) నీవు సేవించుము అని ఈవిధముగా పరమేశ్వరు డుపదేశించుచున్నాడు. అట్టి (అదితేః) అవినాశి కారణమువలె నున్న తల్లియొక్క (పుత్రమ్) పుత్రుడు, రక్షకుడు (జితమ్) తన పురుషార్థముచే ప్రాప్తించిన (ఉగ్రమ్) ఉత్కృష్టమగు (భగమ్) ఐశ్వర్యమును (హువేమ) మేము గ్రహణమొనర్చుచున్నామో, అటులనే మీరును స్వీకరించుడు.॥౩౫॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మనుష్యులారా! మీరు ఎల్లప్పుడును ప్రాతఃకాలమునుండి రాత్రి నిద్రించువరకు శక్త్యానుసారము సామర్థ్యముతో విద్య మరియు పురుషార్థము చేసి ఐశ్వర్యోన్నతి నొనర్చుచు ఆనందము ననుభవించుడు. మరియు దరిద్రులకు సుఖములను చేకూర్చుడు. అని ఇట్లు పరమేశ్వరు డుపదేశించినాడు.॥౩౫॥

35. God is the Master of infinite power, the Sustainer of manifold worlds, the Conqueror of all the Object of adoration by all, the awe. Inspiring Chastiser of the wicked, may, we worship Him in the morning. Thinking of Whom the indigent, impatient, mighty person, even the King says, 'let me share His bounty'.

౧౮౭౯. భగ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, భగవాన్ దేవతా, నిచృత్‌త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వరప్రార్థనాదికవిషయమాహ. ఈశ్వర ప్రార్థన.

౧౮౭౯ భగ ప్రణేతర్భగ సత్యరాధో భగేమాం ధియముదవా దదన్నః।

భగ ప్ర ణో జనయ గోభిరశ్వైర్భగ ప్ర నృభిర్నృవన్తః స్యామ ॥౩౬॥

**ప.వి:**-భగ, ప్రణేతః, ప్రనేతరితి ప్ర + నేతః, భగ, సత్యరాధ ఇతి సత్య + రాధః, భగ, ఇమామ్, ధియమ్, ఉత్, అవ, దదత్, నః, భగ, ప్ర, నః, జనయ, గోభిః, అశ్వైః, భగ, ప్ర, నృభిరితి నృ + భిః, నృవన్త + ఇతి నృ + వన్తః స్యామ ॥౩౬॥

పదార్థః:-(భగ) ఐశ్వర్యయుక్త! (ప్రణేతః) పురుషార్థ ప్రతి ప్రేరక (భగ) ఐశ్వర్యప్రద! (సత్యరాధః) సత్సు సాధూని రాధాంసి ధనాని యస్య తత్సంబుద్ధౌ (భగ) భజనీయం!

(ఇమామ్) వర్తమానామ్ (ధియమ్) ప్రజ్ఞామ్ (ఉత్) (అవ) రక్ష. అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః. (దదత్) దదానః (నః) అస్మాకమ్ (భగ) విద్యైశ్వర్యప్రద! (ప్ర) (నః) అస్మాన్ (జనయ) ప్రకటయ (గోభిః) ధేన్వాదిభిః (అశ్వైః) అశ్వాదిభిః (భగ) భజమాన! (ప్ర) (నృభిః) నాయకైః (నృవన్తః) (స్యామ) భవేమ.॥36॥

అన్వయః:-హే భగ ప్రణేతర్భగ సత్యరాధో భగ! త్వం నోఽస్మాకమిమాం ధియం దదత్సదుదవ. హే భగ! త్వం గోభిరశ్వైర్నృభిస్సహ నోఽస్మాన్ ప్రజనయ. హే భగ! యేన వయం నృవన్తః ప్రస్యామ. తథా విధేహి.॥36॥

భావార్థః:-మనుష్యైర్యదా యదీశ్వరస్య ప్రార్థనా విదుషాం సఙ్గః క్రియేత తదా ప్రజ్ఞైవ యాచనీయోతాపి సన్తః పురుషాః.॥36॥

పదార్థము :-(భగ) ఓ ఐశ్వర్యశాలీ! (ప్రణేతః) పురుషార్థమునకు ప్రేరణనిచ్చు పరమేశ్వరా! (భగ) ఐశ్వర్యదాతా! (సత్యరాధః) ప్రకాశమానమైయున్న పదార్థములలో ఉత్తమ ధనముగలవాడా! (భగ) సేవించదగిన విద్వాంసుడా! నీవు (నః) మాయొక్క (ఇమామ్) ఈ వర్తమానమునందున్న (ధియమ్) ప్రజ్ఞను ప్రసాదించుచు (ఉత్, అవ) ఉత్కృష్టముగ రక్షణచేయుము (భగ) విద్యారూప, ఐశ్వర్యదాతవగు పరమేశ్వరా లేక విద్వాంసుడా! నీవు (గోభిః) గోవులు మున్నగు పశువుల (అశ్వైః) అశ్వములు మున్నగు వాహనముల మరియు (నృభిః) నాయకులగు, వంశ నిర్వాహకులగువారితోగూడ (నః) మమ్ము (ప్ర జనయ) ప్రఖ్యాత పరచుము (భగ) పూజనీయుడవగునో విద్వాంసుడా! ఎద్దానిచే మేము (నృవన్తః) ప్రశంసనీయులగు మనుష్యులు గలవారము (ప్ర స్యామ) ఎట్లు కాగలుగుదుమో అట్లు చేయుము.॥36॥

భావార్థము :- మానవులు పరమేశ్వరుని ప్రార్థించునప్పుడు, విద్వాంసుల సేవించునప్పుడు ఉత్తమ బుద్ధిని, శ్రేష్ఠపురుషుల సాంగత్యమే కావలయునని కోరవలయును.॥36॥

36. O glorious God, Goader of men to action, Giver of wealth, Master of riches, fit for adoration, grant us wisdom and afford us protection!.

O God, the Giver of knowledge, increase our store of kine and horses. O God, may we be rich in men and heroes!.

౧౮౩౦.ఉతేదానీమిత్యస్య వసిష్ఠ ఋషిః, భగో దేవతా, పఙ్క్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

అథైశ్వర్యోన్నతివిషయమాహ. ఐశ్వర్యోన్నతి విషయము నిందు చెప్పెను.

౧౮౩౦ ఉతేదానీం భగవన్తః స్యామోత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్।

ఉతోదితా మఘవన్త్సూర్యస్య వయం దేవానాꣳ సుమతౌ స్యామ ॥37॥

ప. వి:- ఉత, ఇదానీమ్, భగవన్త ఇతి భగ + వన్తః, స్యామ, ఉత, ప్రపిత్వ ఇతి ప్ర + పిత్వే, ఉత, మధ్యే, అహ్నామ్, ఉత, ఉదితేత్యుత్ + ఇతా, మఘవన్నితి మఘ + వన్, సూర్యస్య, వయమ్, దేవానామ్, సుమతావితి సు + మతౌ, స్యామ ॥౩౮॥

పదార్థః :-(ఉత) అపి (ఇదానీమ్) వర్తమానసమయే (భగవన్తః) సకలైశ్వర్యయుక్తాః (స్యామ) (ఉత) అపి (ప్రపిత్వే) పదార్థానాం ప్రాపణే (ఉత) (మధ్యే) (అహ్నామ్) దివసానామ్ (ఉత) (ఉదితా) ఉదయసమయే (మఘవన్) పరమపూజితధనయుక్త! (సూర్యస్య) (వయమ్) (దేవానామ్) విదుషామ్ (సుమతౌ) (స్యామ). ॥౩౮॥

అన్వయః :- హే మఘవన్! వయమిదానీముత ప్రపిత్వే ఉత భవిష్యతి ఉతాహ్నాం మధ్యే భగవన్తః స్యామ. ఉత సూర్యస్యోదితా దేవానాం సుమతౌ భగవన్తః స్యామ. ॥౩౮॥

భావార్థః :-మనుష్యైర్వర్తమానే భవిష్యతి చ యోగైశ్వర్యస్యోన్నతేర్లౌకికస్య వ్యవహారస్య వర్ధనే ప్రశంసాయాఞ్చ సతతం ప్రయతితవ్యమ్. ॥౩౮॥

**పదార్థము** :- (మఘవన్) ఉత్తమధనయుక్తుడవగు నో పరమేశ్వరా! లేక విద్వాంసుడా! (వయమ్) మేము (ఇదానీమ్) ఈ వర్తమానకాలమున (ఉత) మరియు (ప్రపిత్వే) పదార్థముల ప్రాప్తియందు (ఉత) మరియు భవిష్యత్కాలమున (ఉత) మరియు (అహ్నామ్) దినముల (మధ్యే) మధ్యకాలమున (భగవన్తః, స్యామ) సకలైశ్వర్యములతో కూడినవారమగుదుము గాక! (ఉత) మరియు (సూర్యస్య) సూర్యుని (ఉదితా) ఉదయకాలమున (దేవానామ్) విద్వాంసుల (సుమతౌ) ఉత్తమబుద్ధియందు సమస్త ఐశ్వర్యయుక్తులము (స్యామ) అగుదుముగాక! ॥౩౮॥

**భావార్థము** :- మానవుల వర్తమానకాలము, భవిష్యత్కాలములందు యోగ ఐశ్వర్యముల ఉన్నతిచే లౌకిక వ్యవహారముల నభివృద్ధిపరచుట మరియు ప్రశంసలయందు నిరంతరము సాగిపోవుటకు ప్రయత్నించవలెను. ॥౩౮॥

37. O noble, pure God, may prosperity be ours at present, in future, and during the day-time!.

May we, O Bounteous Lord, at the rising of the Sun, be happy, in the wake of the excellent wisdom of the learned!.

౧౮౩౯. భగ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, భగవాన్ దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే చెప్పబడినది.

౧౮౩౧ భగ ఏవ భగవాఀ౨॥ అస్తు దేవాస్తేన వయం భగవన్తః స్యామ ।
తం త్వా భగ సర్వ ఇజ్జోహవీతి స నో భగ పురఏతా భవేహ ॥౩౮॥

ప.వి:- భగః, ఏవ, భగవానితి భగ + వాన్, అస్తు, దేవాః, తేన, వయమ్, భగవన్త ఇతి భగ + వన్తః, స్యామ, తమ్, త్వా, భగ, సర్వః, ఇత్, జోహవీతి, సః, నః, భగ, పుర ఏతేతి పురః + ఏతా, భవ, ఇహ ॥ ౩౮॥

పదార్థః :- (భగః) భజనీయః సేవనీయః (ఏవ) (భగవాన్) ప్రశస్తైశ్వర్యయుక్తః (అస్తు) భవతు (దేవాః) విద్వాంసః (తేన) భగస్వరూపేణ భగవతా పరమేశ్వరేణ సహ (వయమ్) (భగవన్తః) సకలశోభాయుక్తాః (స్యామ) భవేమ (తమ్) (త్వా) త్వామ్ (భగ) అఖిలశోభాయుక్త! (సర్వః) అఖిలో జనః (ఇత్) ఏవ (జోహవీతి) భృశమాహ్వయతి (సః) (నః) అస్మాకమ్ (భగ) సకలైశ్వర్యప్రద! (పుర ఏతా) యః పురస్తాదేతి సః (భవ) (ఇహ).॥౩౮॥

అన్వయః :-హే దేవాః! యో భగ ఏవ భగవానస్తు తేన వయం భగవన్తః స్యామ. హే భగ! తం త్వా సర్వ ఇజ్జోహవీతి! స త్వమిహ నః పురఏతా భవ.॥౩౮॥

భావార్థః :-హే మనుష్యా! యూయం యః సకలైశ్వర్యసంపన్నః పరమేశ్వరస్తేన యే చాస్యోపాసకా విద్వాంసస్తైస్సహ సిద్ధాః శ్రీమన్తశ్చ భవత యో జగదీశ్వరో మాతాపితృవదస్మాసు కృపయతి తద్భక్తిపురఃసరేణేహ మనుష్యానైశ్వర్యవతః సతతం కురుత.॥౩౮॥

పదార్థము :-(దేవాః) ఓ విద్వాంసులారా! ఎవడు (భగ, ఏవ) చక్కని సేవనీయుడు (భగవాన్) ప్రశస్తమగు ఐశ్వర్యశాలి (అస్తు) అగునో (తేన) అట్టి పరమైశ్వర్యశాలియగు పరమేశ్వరునితోగూడ (వయమ్) మేము (భగవన్తః) సంపూర్ణ శోభాయుక్తులము (స్యామ) అగుదుముగాక! (భగ) సంపూర్ణ శోభాయుక్తుడవగు పరమాత్మా! (తమ్, త్వా) అట్టి నిన్ను (సర్వః, ఇత్) సమస్తజనము (జోహవీతి) శీఘ్రమే పిలుచుచుండును (భగ) సమస్తైశ్వర్యప్రదాతా! (సః) అట్టినీవు (ఇహ) ఈ విశ్వములో (నః) మాకు (పుర ఏతా) అగ్రగామినివి (భవ) అగుము.॥౩౮॥

**భావార్థము** :- ఓ మానవులారా! మీరు సకలైశ్వర్యవంతుడగు ఏ పరమేశ్వరుడు, వానియుపాసకులగు విద్వాంసులు గలరో వారితోనుండి సిద్ధులు మరియు శ్రీమంతులగుడు. ఏ జగదీశ్వరుడు తల్లి, తండ్రులవలె

మనపై కృపాదృష్టినుంచుచున్నాడో యాతనిని భక్తిపూర్వకముగ సేవించుచు సకల మానవులను నిరంతరము ఐశ్వర్యవంతులనుగ నొనర్చుడు.॥౩౮॥

38. O learned person, God verily is Supreme. May we become supreme through Him. O God, all invoke Thee. O Supreme God, be Thou our leader in this world!.

౧౮౩౨.సమధ్వరాయ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, భగో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౩౨ సమధ్వరాయోషసో నమన్త దధిక్రావేవ శుచయే పదాయ ।

అర్వాచీనం వసువిదం భగం నో రథమివాశ్వా వాజిన ఆ వహన్తు ॥౩౯॥

ప.విః-సమ్, అధ్వరాయ, ఉషసః,నమన్త, దధిక్రావేవేతి దధి + క్రావాఇవ, శుచయే, పదాయ, అర్వాచీనమ్, వసువిదమితి వసు + విదమ్, భగమ్, నః, రథమివేతి రథమ్ + ఇవ, అశ్వాః, వాజినః, ఆ, వహన్తు ॥౩౯॥

పదార్థః :- (సమ్) (అధ్వరాయ) అహింసామయాయ వ్యవహారాయ (ఉషసః) ప్రభాతాః (నమన్త) నమన్తి (దధిక్రావేవ) యథా ధారకః క్రమితోఽశ్వస్తథా (శుచయే) పవిత్రాయ (పదాయ) ప్రాపణీయాయ (అర్వాచీనమ్) ఇదానీన్తనమ్ (వసువిదమ్) యేన వసూని వివిధాని ధనాని విన్దతి తమ్ (భగమ్) ఐశ్వర్యయుక్తమ్ (నః) అస్మాన్ (రథమివ) రమణీయం యానమివ (అశ్వాః) ఆశుగామినః (వాజినః) తురంగాః (ఆ) (వహన్తు) గమయన్తు.॥౩౯॥

అన్వయః:- హే మనుష్యాః! ఉషసో దధిక్రావేవ శుచయే పదాయాఽధ్వరాయ సన్నమన్త వాజినోఽశ్వా రథమివ నోఽర్వాచీనం వసువిదం భగం ప్రాపయన్తి తథైతౌ భవన్త ఆ వహన్తు.॥౩౯॥

భావార్థః:- అత్ర ద్వావుపమాలఙ్కారౌ. యే మనుష్యా ఉషర్వద్విద్యాధర్మౌ ప్రకాశయన్తి అశ్వయానానీవ సద్యః సమగ్రమైశ్వర్యం సర్వాన్ ప్రాపయన్తి తే శుచయో విద్వాంసో విజ్ఞేయాః.॥౩౯॥

**పదార్థము** :- ఓ మానవులారా! (ఉషసః) ప్రభాతకాలములు (దధిక్రావేవ) చక్కగా ధారణమొనర్చి పరుగెత్తగల అశ్వములవలె (శుచయే) పవిత్రమగు (పదాయ) పొందదగిన (అధ్వరాయ) హింసా అధర్మరహిత

వ్యవహారములకై (సమ్, నమన్త) ఉత్తమముగ, నమ్రతతో నుండుడు అనగా ప్రాతఃకాలము సత్వగుణముయొక్క ఆధిక్యతవల్ల సకలప్రాణుల చిత్తములు శుద్ధముగ, నమ్రముగ నుండును (అశ్వాః) శీఘ్రముగా పరుగెత్తు (వాజినః) అశ్వములవలె (రథమివ) రమణీయమునగు యానమెట్లో, అట్లు (నః) మాకు (అర్వాచీనమ్) ఈకాలమునకు సంబంధించిన (వసువిదమ్) అనేక విధములగు ధనప్రాప్తికి హేతువగు (భగమ్) ఐశ్వర్యముల నెట్లు లభింపజేయుచున్నవో, అట్లే వీనిని మీరు (ఆ, వహన్తు) చక్కగా వ్యవహరింపజేసికొనుడు. ॥౩౯॥

**భావార్థము** :- ఈమంత్రములో రెండుపమాలంకారములు గలవు. ఏ మానవులు ప్రభాతకాలములవలె విద్య మరియు ధర్మములను ప్రకాశపరచుచుందురో మరియు ఉత్తమాశ్వముల యానములను వలె సమస్తైశ్వర్యములను శీఘ్రముగా చెందజేయుదురో అట్టి విద్వాంసులు తెలిసికొనదగినవారై యుందురు. ॥౩౯॥

39. O men, Dawns like a disciplined horse, incline us to acquire a pure, desirable, non-violent conduct!.

As strong steeds draw a chariot, may they remind us of the presence of the Mighty God, the Lord of riches.

౧౮౩౩. అశ్వావతీరిత్యస్య వసిష్ఠ ఋషిః, ఉషా దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

విదుష్యః కిం కుర్యురిత్యాహ. విదుషీమతల్లు లేమి చేయవలయును?

౧౮౩౩ అశ్వావతీర్గోమతీర్న ఉషాసో వీరవతీః సదముచ్ఛన్తు భద్రాః।

ఘృతం దుహానా విశ్వతః ప్రపీతా యూయం పాత స్వస్తిభిః సదా నః॥౪౦॥

ప. వి:- అశ్వావతీః, అశ్వవతీరిత్యశ్వ + వతీః, గోమతీరితి గో + మతీః, నః, ఉషాసః, ఉషస ఇత్యుషసః, వీరవతీరితి వీర + వతీః, సదమ్, ఉచ్ఛన్తు, భద్రాః, ఘృతమ్, దుహానాః, విశ్వతః, ప్రపీతా ఇతి ప్ర + పీతాః, యూయమ్, పాత, స్వస్తిభిః, సదా, నః.॥౪౦॥

పదార్థః :-(అశ్వావతీః) ప్రశస్తాన్యశ్వాని వ్యాప్తిశీలాన్యుదకాని విద్యన్తే యాసు తాః (గోమతీః) బహవో గావః కిరణా విద్యన్తే యాసు తాః (నః) అస్మాకమ్ (ఉషాసః) ప్రభాతాః (వీరవతీః) బహవో వీరాః సన్తి యాసు తాః (సదమ్) సీదన్తి యస్మింస్తత్ (ఉచ్ఛన్తు) వివసన్తు (భద్రాః) భన్దనీయాః కల్యాణకర్యః (ఘృతమ్) శుద్ధం ప్రదీప్తముదకమ్. ఘృతమిత్యుదక నా...నిఘం. ౧.౧౨. (దుహానాః) ప్రపూరయన్త్యః (విశ్వతః) సర్వతః (ప్రపీతాః) ప్రకర్షేణ పీతా వృద్ధాః (యూయమ్) (పాత) రక్షత (స్వస్తిభిః) స్వాస్థ్యప్రదైః సుఖైః (సదా) (నః) అస్మాన్.॥౪౦॥

అన్వయః:- హే విదుష్యః స్త్రియో ! యథాఽశ్వావతీర్గోమతీర్వీరవతీర్భద్రా ఘృతం దుహానాః విశ్వతః ప్రపీతా ఉషసో నోఽస్మాకం సదం ప్రాప్నువన్తి తథాఽస్మాకం సదం భవన్త్య ఉచ్ఛన్తు నోఽస్మాన్ యూయం స్వస్తిభిః సదా పాత.॥౪౦॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా ప్రభాతవేలా జాగ్రతాం మనుష్యాణాం సౌఖ్యప్రదా భవన్తి తథా విదుష్యః స్త్రియః కుమారీణాం విద్యార్థినీనాం కన్యానాం విద్యాసుశిక్షాసౌభాగ్యం వర్ధయిత్వా సదైతా ఆనన్దయన్తు.॥౪౦॥

పదార్థము :- విద్వాంసులగు ఓ మహిళామణులారా! ఎట్లు (అశ్వావతీః) వ్యాప్తిశీలమగు ప్రశస్త జలములుగలవి (గోమతీః) అనేక కిరణములుగలవి (వీరవతీః) అనేకమంది వీరులతో గూడియున్న (భద్రాః) కల్యాణప్రదములు (ఘృతమ్) శుద్ధజలములను (దుహానాః) పూర్ణపరచుచు (విశ్వతః) అన్నివైపులనుండి (ప్రపీతాః) బాగుగా అభివృద్ధి జెందినట్టి (ఉషసః) ప్రభాతవేళలు (నః) మాయొక్క (సదమ్) సభకు ప్రాప్తించునో, అనగా ప్రకాశము లేక ప్రవృత్తపరచుచుండునో, అదేవిధముగా మాయొక్క సభలను మీరు (ఉచ్ఛన్తు) సంపన్నమొనర్పుడు. మరియు (నః) మమ్ము (యూయమ్) మీరు (స్వస్తిభిః) ఆరోగ్యవంతములగు సుఖములచే (సదా) ఎల్లప్పుడు (పాత) రక్షించుడు.॥౪౦॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ప్రభాత సమయమున మేల్కొనువారికి ఏవిధముగ సుఖమునొసగెడిదగుచున్నదో, అదేవిధముగ విదుషీమణులగు స్త్రీలు కుమారీ విద్యార్థినులగు కన్యలకు విద్య ఉత్తమ శిక్షణ మరియు సౌభాగ్యమును వృద్ధి నొందించుచు సదా ఈ కన్యలను ఆనందముగ నుంచుచుండవలయును.॥౪౦॥

40. O learned ladies, just as Dawns, full of nice cold water, and manifold beams, awakeners of herioc persons; auspicious; bestowers of pure water, advancing magnificently from all sides, dawn on our assembly, so should ye adorn our assembly and preserve us evermore with your health giving joys!.

౧౮౩౪.పూషన్నిత్యస్య సుహోత్ర ఋషిః, పూషా దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథేశ్వరాప్తసేవినః కీదృశా భవన్తీత్యాహ.

ఈశ్వరుని ఆప్తజనులను సేవించువార లెటులుందురు?

౧౮౩౪ పూషన్తవ వ్రతే వయం న రిష్యేమ కదా చన। స్తోతారస్త ఇహ స్మసి ॥౪౧॥

ప.వి:-పూషన్, తవ, వ్రతే, వయమ్, న, రిష్యేమ, కదా, చన, స్తోతారః, తే, ఇహ, స్మసి.॥౪౧॥

పదార్థః:- (పూషన్) పుష్టికారక! (తవ) (వ్రతే) శీలే నియమే వా (వయమ్) (న) నిషేధే (రిష్యేమ) (కదా) (చన) కదాచిదపి (స్తోతారః) స్తుతికర్తారః (తే) తవ (ఇహ) (స్మసి) స్మః ॥౪౧॥

అన్వయః:- హే పూషన్ పరమేశ్వర ఆప్తవిద్వన్ వా వయం తవ వ్రతే తస్మాద్వర్తేమహి యతో న కదా చన రిష్యేమ. ఇహ తే స్తోతారః సన్తో వయం సుఖినః స్మసి. ॥౪౧॥

భావార్థః:- యే మనుష్యాః పరమేశ్వరస్యాప్తస్య వా గుణకర్మస్వభావానుకూలా వర్తన్తే తే కదా చిన్నష్టసుఖా న జాయన్తే ॥౪౧॥

పదార్థము :- (పూషన్) పుష్టికారకుడవగు పరమేశ్వరా! లేక ఆప్త విద్వాంసుడా! (వయమ్) మేము (తవ) నీయొక్క (వ్రతే) స్వభావము లేక నియమమునందు (కదా, చన) ఎప్పుడును (న, రిష్యేమ) చిత్త చాంచల్యము గలుగనీయకుందుముగాక! (ఇహ) ఈ జగత్తులో (తే) నీయొక్క (స్తోతారః) స్తుతియొనర్చువార మగు మేము సుఖవంతులము (స్మసి) ఐయుందుము గాక! ॥౪౧॥

భావార్థము :- పరమేశ్వరుని మరియు ఆప్త విద్వాంసుల గుణకర్మ స్వభావములకు అనుకూలముగ వర్తించుకొనువా రెప్పుడును దుఃఖితులు గాజాలరు. ॥౪౧॥

41. O nourishing God, may we following Thy Law, never suffer pain. We, in this world, are singers of Thy praise!.

౧౮౩౫.పథస్పథ ఇత్యస్య ఋజిష్వ ఋషిః, పూషా దేవతా, విరాట్ త్రిష్టుప్ఛన్దః, ధైవత స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యాదియే.

౧౮౩౫ పథస్పథః పరిపతిం వచస్యా కామేన కృతో అభ్యానడర్కమ్ ।

స నో రాసచ్ఛురుధశ్చన్ద్రాగ్రా ధియం ధియఀ సీషధాతి ప్ర పూషా ॥౪౨॥

ప.వి:-పథస్పథః, పథఃఽపథ ఇతి పథః + పథః, పరిపతిమితి పరి + పతిమ్, వచస్యా, కామేన, కృతః, అభి, ఆనట్, అర్కమ్, సః, నః, రాసత్, శురధః, చన్ద్రాగ్రా ఇతి చన్ద్ర + అగ్రాః, ధియంధియ మితి ధియమ్+ ధియమ్, సీషధాతి, సీసధాతీతి సీసధాతి, ప్ర, పూషా ॥౪౨॥

పదార్థః :- (పథస్పథః) మార్గస్య (పరిపతిమ్) స్వామినమ్ (వచస్యా) వచసా వచనేన. అత్ర సుపాం సులుగితి సూత్రేణ విభక్తేర్యాదేశః (కామేన) (కృతః) నిష్పన్నః (అభి) అభితః

(ఆనట్) వ్యాప్నోతి (అర్కమ్) అర్చనీయమ్ (సః) (నః) అస్మభ్యమ్ (రాసత్) దదాతు (శురుధః) యాః శురుధో దుఃఖాని రుద్ధన్తి తాః (చన్ద్రాగ్రాః) చన్ద్రమాహ్లాదనమగ్రం ముఖ్యం యాసాన్తాః (ధియం ధియం) ప్రజ్ఞాం ప్రజ్ఞాం కర్మ కర్మ వా (పీపధాతి) సాధ్నుయాత్ (ప్ర) (పూషా) పుష్టికర్తా.॥42॥

అన్వయః :- హే మనుష్యాః! యో వచస్యా కామేన కృతః పూషా జగదీశ్వర ఆప్తో వా శురుధః చన్ద్రాగ్రాః సాధనాని నో రాసద్ధియంధియం ప్రపీపధాతి స శుభగుణకర్మ స్వభావానభ్యానట్ తమర్కం పథస్పథః పరిపతిం వయం స్తుయామ.॥42॥

భావార్థః :-హే మనుష్యాః! యో జగదీశ్వరః సర్వేషాం సుఖాయ వేదప్రకాశం కామయత ఆప్తోఽధ్యాపయితుమిచ్ఛతి. యౌ సర్వేభ్యః శ్రేష్ఠాం ప్రజ్ఞాం సత్కర్మశిక్షాం చ ప్రదత్తస్తౌ సర్వసన్మార్గస్వామినౌ సదా సత్కర్తవ్యౌ.॥42॥

**పదార్థము** :- ఓ మానవులారా! (వచస్యా) వచనము మరియు (కామేన) అభిలషించినట్టి (కృతః) సిద్ధ పురుషుడు (పూషా) పుష్టికర్తయగు జగదీశ్వరుడు లేక ఆప్తుడు (శురుధః) శీఘ్రముగా దుఃఖములను దొలగించునట్టి (చన్ద్రాగ్రాః) మొదటినుండియే ఆనందకరములగు సాధనములను (నః) మాకొరకు (రాసత్) ఎవ డిచ్చునో (ధియం ధియమ్) ప్రతిబుద్ధిని లేక కర్మను (ప్ర పీపధాతి) ఘనముగా సిద్ధింపజేయునో (సః) అట్టి శుభకర గుణకర్మస్వభావములను (అభి, ఆనట్) అన్నివైపులనుండి వ్యాప్తపరచుచున్నాయి. (అర్కమ్) పూజనీయుడు (పథస్పథః) ప్రతిమార్గమునకు (పరిపతిమ్) స్వామియగు నా జగదీశ్వరుని మనము స్తుతించవలెను. ॥42॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఏ జగదీశ్వరుడు అందరిసుఖముకొరకు వేదమును ప్రకాశపరచినాడో, ఏ ఆప్త విద్వాంసులు చదివించుటకు ఇచ్ఛగింతురో సర్వజనుల కొరకు శ్రేష్ఠబుద్ధిని, ఉత్తమ కర్మలను మరియు శిక్షణనిచ్చుచుందురో ఆ శ్రేష్ఠమార్గములన్నిటస్వాములను సదా సత్కరించవలెను.॥42॥

42. O men, Mighty God, with your Vedic speech, noble intention, saintly Nature, gives us from time immemorial sources of happiness which keep afflictions away. God excellently establishes our wisdom and actions. He ever possesses good qualities, acts and nature. May we praise the Adorable God, Who guards all pathways!.

౧౮౩౯. త్రీణీత్యస్య మేధాతిథిర్ఋషిః, విష్ణుర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథేశ్వరవిషయమాహ. ఈశ్వరుని విషయమిందు చెప్పెను.

౧౮౩౯ త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపాఽఅదాభ్యః।

అతో ధర్మాణి ధారయన్ ॥43॥

ప.వి:-త్రీణి, పదా, వి, చక్రమే, విష్ణుః,గోపాః,అదాభ్యః, అతః, ధర్మాణి, ధారయన్ ॥౪౩॥

పదార్థః:-(త్రీణి) (పదా) పదాని జ్ఞాతుం ప్రాపయితుం వా యోగ్యాని కారణసూక్ష్మస్థూలరూపాణి (వి) (చక్రమే) విక్రమతి (విష్ణుః) వేవేష్టి వ్యాప్నోతి చరాఽచరం జగత్స పరమేశ్వరః (గోపాః) రక్షకః (అదాభ్యః) అహింసకత్వాద్దయాలుః (అతః) అస్మాత్ (ధర్మాణి) ధర్మాన్ ధారకాణి పృథివ్యాదీని వా (ధారయన్).॥౪౩॥

అన్వయః:-హే మనుష్యా యోఽదాభ్యో గోపా విష్ణుర్ధర్మాణి ధారయన్నతస్త్రీణి పదా విచక్రమే స ఏవాఽస్మాకం పూజనీయోఽస్తి.॥౪౩॥

భావార్థః :-హే మనుష్యా! యేన పరమేశ్వరేణ భూమ్యన్తరిక్షసూర్యరూపేణ త్రివిధం జగన్నిర్మితం సర్వం ధ్రియతే రక్ష్యతే చ స ఏవోపాసనీయ ఇష్టదేవోఽస్తి.॥౪౩॥

పదార్థము :- మానవులారా! (అదాభ్యః) అహింసాధర్మముగల దయాళువు (గోపాః) రక్షకుడు (విష్ణుః) చరాచరజగత్తునందంతటను వ్యాప్తుడగు పరమేశ్వరుడు (ధర్మాణి) పుణ్యరూప కర్మల ధారకములగు పృథివ్యాదులను (ధారయన్) ధారణమొనర్చును. (అతః) ఈ కారణమున (త్రీణి) మూడు (పదా) తెలిసికొనలేక పొందదగిన స్థూల, సూక్ష్మ కారణరూప జగమును (వి, చక్రమే) విశేషముగా ఆక్రమణమొనర్చునో, యాతడే మనకు పూజనీయుడై యున్నాడు.॥౪౩॥

భావార్థము :- ఓ మానవులారా! ఏ పరమేశ్వరుడు భూమి, అంతరిక్షము, సూర్యరూపము మున్నగు ముప్పిధములగు సృష్టిని నిర్మించియున్నాడో, సర్వమును ధారణమొనర్చియున్నాడో మరియు రక్షణనొనర్చుచున్నాడో, యాతడే ఉపాసనీయుడు, ఇష్టదైవమునై యున్నాడు.॥౪౩॥

43. The Merciful, Protecting, All-Pervading God, establishing His sacred laws, is thenceforth the Creator of the three steps of the causal, subtle and gross forms.

౧౮౩౭.తద్విప్రాస ఇత్యస్య మేధాతిథి ఋషిః, విష్ణుర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే ఇందు చెప్పెను.

౧౮౩౭ తద్విప్రాసో విపన్యవో జాగృవాꣳసః సమిన్ధతే। విష్ణోర్యత్పరమం పదమ్॥౪౪॥

ప.వి:-తత్, విప్రాసః, విపన్యవః, జాగృవాꣳస ఇతి జాగృ + వాꣳసః, సమ్, ఇన్ధతే, విష్ణోః, యత్, పరమమ్, పదమ్.॥౪౪॥

పదార్థః :-(తత్) (విప్రాసః) మేధావినో యోగినః (విపన్యవః) విశేషేణ స్తోతుమర్హా ఈశ్వరస్య వా స్తావకాః (జాగృవాంసః) అవిద్యానిద్రాత ఉత్థాయ జాగరూకాః (సమ్) (ఇన్ధతే) ప్రకాశయన్తి (విష్ణోః) సర్వత్రాఽభివ్యాపకస్య (యత్) (పరమమ్) ప్రకృష్టమ్ (పదమ్) ప్రాపణీయం మోక్షప్రదం స్వరూపమ్. ॥౪౪॥

అన్వయః :-హే మనుష్యా! యే జాగృవాంసో విపన్యవో విప్రాసో విష్ణోర్యత్పరమం పదమస్తి తత్సమిన్ధతే తత్సఙ్గేన యూయమపి తాదృశా భవత ॥౪౪॥

భావార్థః :- యే యోగాభ్యాసాదినా శుద్ధాన్తః కరణాత్మనో ధార్మికాః పురుషార్థినో జనాః సన్తి త ఏవ వ్యాపకస్య పరమేశ్వరస్య స్వరూపం జ్ఞాతుం లబ్ధుం చార్హన్తి నేతరే ॥౪౪॥

పదార్థము :- ఓ మానవులారా! (జాగృవాంసః) అవిద్యారూప నిద్రనుండి లేచి చేతనులైన (విపన్యవః) విశేషముగ స్తుతించదగిన లేక ఈశ్వరుని స్తుతించువారు (విప్రాసః) బుద్ధిశాలురగు యోగులు (విష్ణోః) సర్వవ్యాపకుడగు పరమాత్మని (యత్) ఏ (పరమమ్) ఉత్తమమగు (పదమ్) పొందదగిన మోక్షదాయి స్వరూపము గలదో (తత్) దానిని (సమ్, ఇన్ధతే) చక్కగా ప్రకాశపరచుచున్నారో వారి సత్సంగములచే మీరును ఆ విధముగానే యగుడు.॥౪౪॥

భావార్థము :- యోగాభ్యాసము మున్నగు సత్కర్మలొనర్చి శుద్ధమగు మనస్సు మరియు ఆత్మగల ధార్మిక పురుషార్థపరులు మాత్రమే సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని స్వరూపమును దెలిసికొని, దానిని పొందుటకు అర్హులగుదురు.॥౪౪॥

44. The ever vigilant, the singers of the praise of God, and the learned yogis, realise His most sublime Nature.

౧౮౩౮ ఘృతవతీత్యస్య భరద్వాజ ఋషిః, ద్యావాపృథివ్యౌ దేవతే, నిచృజ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే ఇందు చెప్పెను.

౧౮౩౮ ఘృతవతీ భువనానామభిశ్రియోర్వీ పృథ్వీ మధుదుఘే సుపేశసా ।
ద్యావాపృథివీ వరుణస్య ధర్మణా విష్కభితే అజరే భూరిరేతసా॥౪౫॥

ప.వి:-ఘృతవతీ ఇతి ఘృత + వతీ, భువనానామ్, అభిశ్రియేత్యభి + శ్రియా, ఉర్వీ ఇత్యుర్వీ, పృథ్వీ ఇతి + పృథ్వీ, మధుదుఘే ఇతి మధు + దుఘే, సుపేశసేతి సు +పేశసా,

ద్యావాపృథివీ + ఇతి ద్యావా పృథివీ, వరుణస్య, ధర్మణా, విస్కభితే ఇతి వి + స్కభితే, అజరే + ఇత్యజరే, భూరిరేతసేతి భూరి + రేతసా ॥౪౫॥

పదార్థః:-(ఘృతవతీ) ఘృతముదకం బహు విద్యతే యయోస్తే (భువనానామ్) లోకలోకాన్తరాణామ్ (అభిశ్రియా:) అభితః సర్వతః శ్రీః శోభా లక్ష్మీర్యాభ్యాన్తే (ఉర్వీ) బహుపదార్థయుక్తే (పృథ్వీ) విస్తీర్ణే (మధుదుఘే) యే మధూదకం ప్రపూరయతస్తే (సుపేశసా) శోభనం పేశోరూపం యయోస్తే (ద్యావాపృథివీ) సూర్యభూమీ (వరుణస్య) సర్వేభ్యో వరస్య శ్రేష్ఠస్య జగదీశ్వరస్య (ధర్మణా) ధారణసామర్థ్యేన (విష్కభితే) విశేషేణ ధృతే దృఢీకృతే (అజరే) స్వస్వరూపేణ జరానాశరహితే (భూరిరేతసా) భూరి బహు రేత ఉదకం యయోర్వా భూరీణి బహూని రేతాంసి వీర్యాణి యాభ్యాన్తే ॥౪౫॥

అన్వయః:-హే మనుష్యా ! యస్య వరుణస్య పరమేశ్వరస్య ధర్మణా మధుదుఘే సుపేశసా పృథ్వీ ఉర్వీ ఘృతవతీ అజరే భూరిరేతసా భువనానామభిశ్రియా ద్యావాపృథివీ విష్కభితే తమేవోపాస్యం యూయం విజానీత ॥౪౫॥

భావార్థః:- మనుష్యైర్యేన పరమేశ్వరేణ ప్రకాశాఽప్రకాశాత్మకం ద్వివిధం జగన్నిర్మాయ ధృత్వా పాల్యతే స ఏవ సర్వదోపాసనీయోఽస్తి ॥౪౫॥

**పదార్థము:**- ఓ మానవులారా! (వరుణస్య) సర్వశ్రేష్ఠుడగు జగదీశ్వరుని (ధర్మణా) ధారణమొనర్పదగిన సామర్థ్యముచే (మధుదుఘే) జలములను పరిపూర్ణపరచు (సుపేశసా) చక్కని రూపములుగల (పృథివీ) విస్తారమైన (ఉర్వీ) అనేక పదార్థములుగల (ఘృతవతీ) అనేక జలముల పరివర్తనముచే నున్న (అజరే) నాశరహితస్వరూపములుగల (భూరిరేతసా) బహుళ జలములతో గూడిన లేక అనేక వీర్యము లేదా పరాక్రమములకు హేతువులగు (భువనానామ్) లోకలోకాంతరములను (అభిశ్రియా) అన్నివైపులనుండి శోభింపజేయునట్టి (ద్యావాపృథివీ) సూర్యుడు మరియు భూమి (విష్కభితే) విశేషముగా నెవనిచే ధారణమొనర్చబడినవో లేక దృఢపరచబడినవో ఆతడే ఉపాసించదగినవా డని ఎరుగుడు.॥౪౫॥

**భావార్థము** :- ఏ పరమేశ్వరుడు మానవులను మరియు ప్రకాశ, అప్రకాశ రూపములగు రెండు విధములగు జగములను సృష్టించి, ధరించి, పాలించుచున్నాడో, ఆతడే సదా ఉపాసనీయు డని మీరు తెలిసికొనుడు.॥౪౫॥

45. By God's decree, the Sun and the Earth, full of light and water, ornamentors of the world created, vast, full of diverse objects, filled with sweet water, beautiful in their form, imperishable, rich in seed, stand apart firmly established.

౧౮౩౯.యే న ఇత్యస్య విహవ్య ఋషిః, లిఙ్గోక్తా దేవతాః, భురిక్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజధర్మవిషయమాహ. రాజధర్మ విషయము.

౧౮౩౯ యే నః సపత్నా అప తే భవన్త్విన్ద్రాగ్నిభ్యామవ బాధామహే తాన్।

వసవో రుద్రా ఆదిత్యా ఉపరిస్పృశం మోగ్రం చేత్తారమధిరాజమక్రన్॥౪౬॥

ప.వి:- యే, నః, సపత్నా ఇతి స + పత్నాః, అప, తే, భవన్తు, ఇన్ద్రాగ్నిభ్యామితీన్ద్రాగ్నీ + భ్యామ్, అవ, బాధామహే, తాన్, వసవః, రుద్రాః, ఆదిత్యాః, ఉపరిస్పృశమిత్యుపరి + స్పృశమ్, మా, ఉగ్రమ్, చేత్తారమ్, అధిరాజమిత్యధి + రాజమ్, అక్రన్ ॥౪౬॥

పదార్థః:-(యే) (నః) అస్మాకమ్ (సపత్నాః) శత్రవః (అప) దూరీకరణే (తే) (భవన్తు) (ఇన్ద్రాగ్నిభ్యామ్) వాయువిద్యుదస్త్రాభ్యామ్ (అవ) (బాధామహే) (తాన్) (వసవః) పృథివ్యాదయః (రుద్రాః) దశ ప్రాణా ఏకాదశ ఆత్మా చ (ఆదిత్యాః) సంవత్సరస్య మాసాః (ఉపరిస్పృశమ్) య ఉపరి స్పృశతి తమ్ (మా) మామ్ (ఉగ్రమ్) తీవ్రస్వభావమ్ (చేత్తారమ్)సత్యాఽసత్యయోర్యథావద్విజ్ఞాతారమ్ (అధిరాజమ్) సర్వేషాముపరి రాజానమ్ (అక్రన్) కుర్వన్తు.॥౪౬॥

అన్వయః:-హే మనుష్యా! యే నః సపత్నాః స్యుస్తేఽపభవన్తు యథా తానయ మిన్ద్రాగ్నిభ్యామవ బాధా మహే యథా చ వసవో రుద్రా అదిత్యా ఉపరిస్పృశముగ్రం చేత్తారం మా మామధిరాజమక్రన్ తథా తాన్ యూయం నివారయత మాం చ సత్కురుత.॥౪౬॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యస్యాఽధికారే పృథివ్యాదయః పదార్థాః స్యుస్స ఏవ సర్వేషాముపరి రాజా స్యాత్. యో రాజా భవేత్స శస్త్రాస్త్రైః శత్రూన్నివార్య నిష్కణ్టకం రాజ్యం కుర్యాత్. ॥౪౬॥

పదార్థము :- ఓ మానవులారా! (యే) ఎవరైతే (నః) మాకు (సపత్నాః) శత్రువులో (తే) వారు (అప, భవన్తు) దూరమగుదురుగాక! అన్గా పరాజయ మొందుదురు గాక! ఏవిధముగా (తాన్) ఆ శత్రువులను మేము (ఇన్ద్రాగ్నిభ్యామ్) వాయువు మరియు విద్యుత్తులతో నిర్మింపబడిన శస్త్రములతో (అవ, బాధామహే) పీడించెదమో మరియు నెట్లు (వసవః) పృథివ్యాది వసువులు (రుద్రాః) పదిప్రాణములు, పదునొకండవదగు ఆత్మ మరియు (ఆదిత్యాః) పండ్రెండు మాసములు (ఉపరిస్పృశమ్) ఉన్నత స్థానమున గూర్చుండు (ఉగ్రమ్)

తేజఃస్వభావము గలిగిన మరియు (చేత్తారమ్) సత్యాసత్యములను యథావతుగ నెరుగునట్టి (మా) నన్ను (అధిరాజమ్) అధిపతిగ, స్వామిగ, సమర్థునిగ (అక్రన్) చేయునో, అట్లే ఆ శత్రువులను తొలగించి మీరు నన్ను సత్కరించుడు.॥౪౬॥

**భావార్థము :**-ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఎవని యధికారమునందు పృథివి మున్నగు పదార్థము లుండునో, ఆతడే యందరిపై రాజు గాగలడు. ఎవడు రాజగునో యాతడు అస్త్రశస్త్రములతో శత్రువులను దొలగించివేసి నిష్కంటకముగ రాజ్యపాలన మొనర్పవలయును.॥౪౬॥

46. Let those who are our foemen stand apart from us. With airy and fiery weapons we will drive them off. The Vasus, Rudras, and Adityas have exalted me, made me pre-eminent, mighty, thinker, and sovereign lord.

౧౮౪౦.ఆ నాసత్యేత్యస్య హిరణ్యస్తూప ఋషిః, అశ్వినౌ దేవతే, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ కే జగద్ధితైషిణ ఇత్యాహ. ఎవరు జగత్తునకు మేలు కలుగజేయుదురు?

౧౮౪౦ ఆ నాసత్యా త్రిభిరేకాదశైరిహ దేవేభిర్యాతం మధుపేయమశ్వినా।ప్రాయు స్తారిష్టం నీ రపాꣳసి మృక్షతꣳ సేధతన్ద్వేషో భవతꣳసచాభువా॥౪౭॥

ప.వి:-ఆ, నాసత్యా, త్రిభిరితి త్రి+భిః, ఏకాదశైః, ఇహ, దేవేభిః, యాతమ్, మధుపేయమితి మధు + పేయమ్, అశ్వినా, ప్ర, ఆయుః, తారిష్టమ్, నిః, రపాꣳసి, మృక్షతమ్, సేధతమ్, ద్వేషః, భవతమ్, సచాభువేతి సచా + భువా.॥౪౭॥

పదార్థః :- (ఆ) సమన్తాత్ (నాసత్యా) అవిద్యమానాఽసత్యాచరణౌ (త్రిభిః) (ఏకాదశైః) త్రయస్త్రింశతా ఇహ (దేవేభిః) దివ్యైః పృథివ్యాదిభిః సహ (యాతమ్) ప్రాప్నుతమ్ (మధుపేయమ్) మధురైర్గుణైర్యుక్తం పాతుం యోగ్యమ్ (అశ్వినా) విద్వాంసౌ రాజప్రజాజనౌ (ప్ర) (ఆయుః) జీవనమ్ (తారిష్టమ్) వర్ధయతమ్ (నిః) నితరామ్ (రపాంసి) పాపాని (మృక్షతమ్) మార్జయతమ్ (సేధతమ్) గమయతమ్ (ద్వేషః) ద్వేషాదిదోషయుక్తాన్ ప్రాణినః (భవతమ్) (సచాభువా) యౌ సత్యేన పురుషార్థేన సహ భవతస్తౌ.॥౪౭॥

అన్వయః:-హే నాసత్యాఽశ్వినా! యథా యువామిహ త్రిభిరేకాదశైర్దేవేభిః సహ మధుపేయమాయాతం రపాంసి మృక్షతం ద్వేషో నిః షేధతం సచాభువా భవతమాయుః ప్రతారిష్టం తథా వయమపి భవేమ.॥౪౭॥

**భావార్థః:-త ఏవ జగద్ధితైషిణో యే పృథివ్యాదిసృష్టివిద్యాం విజ్ఞాయాఽన్యాన్ గ్రాహయేయు ర్దోషాన్ దూరీకుర్యుశ్చిరంజీవనస్య విధానం చ ప్రచారయేయుః.॥౪౭॥**

**పదార్థము :-** (నాసత్యా) అసత్యాచరణములులేని (అశ్వినా)రాజ్య, ప్రజల సంబంధ విద్వాంసులారా! మీరెట్లు (ఇహ) ఈ జగత్తునందు (త్రిభిః, ఏకాదశైః) ముప్పదిమూడు (దేవేభిః) ఉత్తమములగు పృథివి మున్నగునవి. [అనగా అష్టవసువులు, ప్రాణములు మున్నగు ఏకాదశరుద్రులు, ద్వాదశ మాసములు మరియు విద్యుత్తు, యజ్ఞము] ఈ ముప్పది మూడు దేవతలతో గూడ (మధుపేయమ్) మధురగుణయుక్త, పానయోగ్యమగు ఓషధీరసములను (ఆ, యాతమ్) చక్కగా పొందుదురో లేక దానికై ప్రయత్నింతురో (రపాంసి) పాపములను (మృక్షతమ్) శుద్ధపరచుచుందురో (ద్వేషః) ద్వేషము మున్నగు దోషములుగల ప్రాణులను (నిః, సేధతమ్) ఖండించుడు లేక తొలగించుడు (సచాభువా) సత్యపురుషార్థముతో కార్యములందు సంయుక్తులు (భవతమ్) అగుచు మరియు (ఆయుః) జీవితమును (ప్ర, తారిష్టమ్) ఉత్తమముగా వృద్ధిపరచుకొందురో, మేమును అట్లే యగుదుముగాక! ॥౪౭॥

**భావార్థము:-** పృథివి మున్నగు సృష్టివిద్యలను దెలిసికొని, ఇతరులకు తెలిపి, దోషములను దూరమొనర్చి దీర్ఘకాల జీవనవిధానమును గూర్చి ప్రచారమొనర్చువారే జగత్తునకు హితైషులగుదురని ఎరుగుడు.॥౪౭॥

47. O devotees of truth, ye learned persons amongst the officials and the subjects, knowing the thirty three gods, come for enjoying medicinal juices. Wipe out sins, ward off enemies, perform noble deeds with zeal and energy; and prolong the days of life!.

౧౮౪౧. ఏష వ ఇత్యస్యాగస్త్య ఋషిః, మరుతో దేవతాః, పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యురిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును?

**౧౮౪౧ ఏష వ స్తోమో మరుత ఇయఙ్గీర్మాన్దార్యస్య మాన్యస్య కారోః।**
**ఏషా యాసీష్ట తన్వే వయాం విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥౪౮॥**

**ప.వి:-** ఏషః, వః, స్తోమః, మరుతః, ఇయమ్, గీః, మాన్దార్యస్య, మాన్యస్య, కారోః, ఆ, ఇషా, యాసీష్ట, తన్వే, వయామ్, విద్యామ, ఇషమ్, వృజనమ్, జీరదానుమితి జీర+దానుమ్.॥౪౮॥

**పదార్థః:-** (ఏషః) (వః) యుష్మభ్యమ్ (స్తోమః) ప్రశంసా (మరుతః) మరణధర్మాణో మనుష్యాః (ఇయమ్) (గీః) సుశిక్షితా వాక్ (మాన్దార్యస్య) ప్రశస్తకర్మసేవకస్యోదారచిత్తస్య

(మాన్యస్య) మన్తుం సత్కర్తుం యోగ్యస్య (కారోః) కారుకస్య శిల్పినః (ఆ) (ఇషా) ఇచ్ఛయాఽన్నేనవా నిమిత్తేన (యాసీష్ట) ప్రాప్నుయాత్ (తన్వే) శరీరాదిరక్షణార్థమ్ (వయామ్) వయసామవస్థావతాం ప్రాణినామ్. అత్రాఽఽమి టిలోపశ్ఛాన్దసః (విద్యామ) లభేమహి (ఇషమ్) విజ్ఞానమన్నం వా (వృజనమ్) వర్జన్తి దుఃఖాని యేన తద్బలమ్ (జీరదానుమ్) జీవయతీతి జీరదానుస్తమ్. ॥౪౭॥

అన్వయః:- హే మరుతో మనుష్యాః! మాన్దార్యస్య మాన్యస్య కారోరేష స్తోమ ఇయం చ గీర్వోఽస్తు యుష్మాయమిషా వయాం తన్వే ఆ యాసీష్ట జీరదానుమిషం వృజనం చ విద్యామ. ॥౪౭॥

భావార్థః:- మనుష్యైస్సదైవ ప్రశంసనీయాని కర్మాణి సేవిత్వా, శిల్పవిద్యావిదః సత్కృత్య జీవనం బలమైశ్వర్యం చ ప్రాప్తవ్యమ్. ॥౪౭॥

పదార్థము :- (మరుతః) మరణధర్మముగల ఓ మానవులారా! (మాన్దార్యస్య) ప్రశస్తకర్మల సేవించు ఉదారచిత్తులు (మాన్యస్య) సత్కారయోగ్యులు (కారోః) పురుషార్థులగు శిల్పుల (ఏషః) ఈ (స్తోమః) ప్రశంస మరియు (ఇయమ్) ఇట్టి (గీః) వాణులు (వః) మీకొరకు ఉపయోగవంతములగు గాక! మీరు (ఇషా) ఇచ్ఛ లేదా అన్నము నిమిత్తముచే (వయామ్) ఆయువుగల ప్రాణుల (తన్వే) శరీరాదుల రక్షణ కొరకు (ఆ, యాసీష్ట) చక్కగా ప్రాప్తించుడు. మరియు మేము (జీరదానుమ్) జీవనహేతువగు (ఇషమ్) విజ్ఞానము లేక అన్నము మరియు (వృజనమ్) దుఃఖముల వర్జింపజేయు బలమును (విద్యామ) పొందుదుముగాక! ॥౪౭॥

భావార్థము :- మానవులు సర్వదా ప్రశంసనీయకర్మల సేవనము, శిల్పకళావిద్వాంసుల సత్కారముల నొనర్చుచు జీవనము, బలము, ఐశ్వర్యములను పొందుచుండవలెను. ॥౪౭॥

48. O mortals, may this praise and speech of the magnanimous, laudable and energetic artisan be conducive to your benefit. Protect well with food the body of the aged. For long life may we acquire strength, knowledge and food!

౧౭౪౮.సహస్తోమా ఇత్యస్య ప్రాజాపత్యో యజ్ఞ ఋషిః, ఋషయో దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ కే ఋషయో భవన్తీత్యాహ. ఎవరు ఋషులగుచున్నారు?

౧౭౪౮ సహస్తోమాః సహచ్ఛన్దసఽ ఆవృతః సహప్రమా ఋషయః సప్త దైవ్యాః ।
పూర్వేషాం పన్థామనుదృశ్య ధీరాఽ అన్వాలేభిరే రథ్యో న రశ్మీన్ ॥౪౮॥

ప.వి:-సహస్తోమా ఇతి సహ + స్తోమాః, సహఛన్దస ఇతి సహ + ఛన్దసః, ఆవృత ఇత్యా +

వృతః సహప్రమా ఇతి సహ + ప్రమాః, ఋషయః, సప్త, దైవ్యాః, పూర్వేషామ్, పన్థామ్,
అనుదృశ్యేత్యను + దృశ్య, ధీరాః, అన్వాలేభిర ఇత్యను + ఆలేభిరే, రథ్యః, న, రశ్మీన్.॥౪౯॥

పదార్థః:- (సహస్తోమాః) స్తోమైః శ్లాఘాభిస్సహ వర్తమానా యద్వా సహస్తోమాః శాస్త్రస్తుతయో యేషాన్తే (సహఛన్దసః) సహ ఛన్దాంసి వేదాఽధ్యయనం స్వాతన్త్ర్యం సుఖభోగో వా యేషాన్తే (ఆవృతః) బ్రహ్మచర్యేణ సకలా విద్యా అధీత్య గురుకులాన్నివృత్య గృహమాగతాః (సహప్రమాః) సహైవ ప్రమా యథార్థం ప్రజ్ఞానం యేషాన్తే (ఋషయః) వేదాదిశాస్త్రార్థవిదః (సప్త) పంచ జ్ఞానేన్ద్రియాణ్యన్తఃకరణమాత్మా చ (దైవ్యాః) దేవేషు గుణకర్మస్వభావేషు కుశలాః (పూర్వేషామ్) అతీతానాం విదుషామ్ (పన్థామ్) పన్థానం మార్గమ్ (అనుదృశ్య) అనుకూల్యేన దృష్ట్వా (ధీరాః) ధ్యానవన్తో యోగినః (అన్వాలేభిరే) అనులభన్తే (రథ్యః) రథే సాధూ రథ్యః సారథిః (న) ఇవ (రశ్మీన్) రజ్జూన్.॥౪౯॥

అన్వయః:-హే మనుష్యా! యథా సహస్తోమాః సహఛన్దస ఆవృతః సహప్రమాః సప్త దైవ్యా ధీరా ఋషయో రథ్యో రశ్మీన్నివ పూర్వేషాం పన్థామనుదృశ్యాన్వాలేభిరే తథా భూత్వా యూయమప్యాప్తమార్గ మన్వాలభధ్వమ్.॥౪౯॥

భావార్థః:- అత్రోపమావాచకలుప్తోపమాలంకారౌ. యే రాగద్వేషాదిదోషాన్ దూరతస్త్యక్త్వా పరస్పరస్మిన్ ప్రీతిమన్తో భూత్వా బ్రహ్మచర్యేణ ధర్మానుష్ఠానపురఃసరమఖిలాన్ వేదాన్ విజ్ఞాయ సత్యాఽసత్యే వివిచ్య సత్యం లబ్ధ్వాఽసత్యం విహాయా ప్తభావేన వర్తన్తే తే సుశిక్షితాః సారథయ ఇవాఽభీష్టం ధర్మ్యం మార్గం గన్తుమర్హన్తి త ఏవర్షిసంజ్ఞాం లభన్తే.॥౪౯॥

పదార్థము :- ఓ మానవులారా! ఏవిధముగా (సహస్తోమాః) ప్రశంసలతో గూడియున్న లేక సమాన శాస్త్రస్తుతులుగలవారు (సహఛన్దసః) వేదాదుల అధ్యయనము లేక స్వతంత్ర సుఖభోగములతో గూడినవారు (ఆవృతః) బ్రహ్మచర్యముతో సకల విద్యల నభ్యసించి గురుకులమునుండి సమావర్తనులై గృహమునకు చేరినట్టి (సహప్రమా) ప్రమాణయుక్తమగు యథార్థజ్ఞానముగలవారు (సప్త) ఏడు [ఐదుజ్ఞానేంద్రియములు, అన్తఃకరణము, ఆత్మ] (దైవ్యాః) ఉత్తమగుణకర్మస్వభావములందు ప్రవీణులు (ధీరాః) ధ్యాననిష్ఠగలయోగులు (ఋషయః) వేదాది శాస్త్రజ్ఞాతలు (రథ్యః) సారథి (న) ఏవిధముగా (రశ్మీన్) కళ్లెపుత్రాడును పట్టుకొనునో అట్లు (పూర్వేషామ్) పూర్వజులగు విద్వాంసుల (పన్థామ్) మార్గమును (అనుదృశ్య) అనుకూలముగజూచి (అన్వాలేభిరే) తరువాత ప్రాప్తించుకొందురో, మీరును అటులనేయై ఆప్తులమార్గమును పొందుడు.॥౪౯॥

**భావార్థము** :-ఈమంత్రములో వాచకలుప్తోపమాలంకారము గలదు. రాగద్వేషాదులను దూరమొనర్చుకొని పరస్పరము ప్రీతినుంచుకొనువారు, బ్రహ్మచర్యయుక్తముగ ధర్మానుష్ఠానముతో సమస్త వేదములను దెలిసికొని సత్యాసత్యములను నిర్ణయించి సత్యమును గ్రహించి, అసత్యమును వదలివేసి ఆప్తజన భావమున వర్తించుచుండువారు సుశిక్షిత సారథివలె అభీష్టమగు ధర్మమార్గమున పయనించుటకు సమర్థులగుదురు. మరియు అట్టివారే ఋషియను పేరును పొందగలుగుదురు.॥౪౯॥

49. Those who study together the religious lore, who read together the Vedas and enjoy happiness, who return home from the Gurukala after observing Brahmacharya and completing their studies, who are together advanced in knowledge, who are masters ef seven divine forces, are veritable Rishis, the knowers of the Vedas. Such calm, wise persons viewing the path of ancient sages take up the reins of noble deeds like a chariot-driver.

౧౮౪౩.ఆయుష్యమిత్యస్య దక్ష ఋషిః, హిరణ్యస్తేజో దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథైశ్వర్యజయాదిసంపాదనవిషయమాహ.

ఐశ్వర్యము, జయము మొదలగు వానిని సంపాదించు విషయము.

౧౮౪౩ ఆయుష్యం వర్చస్యꣳ రాయస్పోషమౌద్భిదమ్ ।
ఇదꣳ హిరణ్యం వర్చస్వజ్జైత్రాయావిశతాదు మామ్ ॥౫౦॥

ప.వి:- ఆయుష్యమ్, వర్చస్యమ్, రాయః పోషమ్, ఔద్భిదమ్, ఇదమ్, హిరణ్యమ్, వర్చస్వత్, జైత్రాయ, ఆ, విశతాత్, ఊఀ ఇత్యూఀ, మామ్ ॥౫౦॥

పదార్థః:-(ఆయుష్యమ్) ఆయుషే జీవనాయ హితమ్ (వర్చస్యమ్) వర్చసేఽధ్యయనాయ హితమ్ (రాయః) (పోషమ్) ధనస్య పోషకమ్ (ఔద్భిదమ్) ఉద్భినత్తి దుఃఖాని యేన తదేవ (ఇదమ్) (హిరణ్యమ్) తేజోమయం సువర్ణాదికమ్ (వర్చస్వత్) ప్రశస్తాని వర్చాంస్యన్నాని యస్మాత్తత్ (జైత్రాయ) జయాయ (ఆ) (విశతాత్) సమన్తాత్ విశతు తిష్ఠతు (ఉ) ఏవ (మామ్).॥౫౦॥

అన్వయః:-హే మనుష్యా! యదౌద్భిదమాయుష్యం వర్చస్యం రాయస్పోషం వర్చస్వద్ధిరణ్యం జైత్రాయ మామావిశతాత్తదు యుష్మానప్యావిశత్.॥౫౦॥

భావార్థః:-యే మనుష్యాః! స్వాత్మవత్సర్వాన్ జానన్తి విద్వద్భిః సహ పరామృశ్య

సత్యాఽసత్యే నిర్ణయన్తి తే దీర్ఘమాయుః పూర్ణవిద్యాః సమగ్రమైశ్వర్యవిజయం చ ప్రాప్నువన్తి.॥౫౦॥

**పదార్థము :-** మానవులారా! (ఔద్భిదమ్) దుఃఖనాశకము (ఆయుష్యమ్) జీవితమునకు హితకరము (వర్చస్యమ్) అధ్యయనమునకు ఉపయోగకరము (రాయః, పోషమ్) ధనపుష్టి గలిగించునది (వర్చస్వత్) ప్రశస్తమగు అన్నమునకు హేతువు (హిరణ్యమ్) తేజఃస్వరూపమగు సువర్ణము మున్నగు ఐశ్వర్యములు (జైత్రాయ) జయముగలుగుటకు (మామ్) నన్ను (ఆ,విశతాత్) ఆవేశపరచుగాక, అనగా నా సమీపమున స్థిరముగనుండుగాక! అది (ఉ) మీ సమీపమందును స్థిరపడుగాక! ॥౫౦॥

**భావార్థము :-** ఏ మనుష్యుడు సకల జనులను తనవలెనే ఎంచుచు, విద్వాంసులతోనాలోచించుచు వారితో దిరుగుచు సత్యాసత్యముల నిర్ణయమొనర్చునో, నాతడు దీర్ఘాయుష్మంతుడై పూర్ణవిద్యలను, సమగ్రైశ్వర్యములను, శత్రువులపై విజయమును పొందగలడు.॥౫౦॥

50. Bestowing length of life, splendour, increase of wealth, and conquering power, may this brightly shining gold and food be attached to me for victory.

౧౮౪౪.న తదిత్యస్య దక్ష ఋషిః, హిరణ్యన్తేజో దేవతా, భురిక్‌త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ బ్రహ్మచర్యప్రశంసావిషయమాహ. బ్రహ్మచర్య ప్రశంస విషయము.

౧౮౪౪ న తద్రక్షాꣳసి న పిశాచాస్తరన్తి దేవానామోజః ప్రథమజꣳ హ్యేతత్ ।

యో బిభర్తి దాక్షాయణꣳ హిరణ్యꣳ స దేవేషు కృణుతే దీర్ఘమాయుః।

స మనుష్యేషు కృణుతే దీర్ఘమాయుః ॥౫౧॥

ప.విః- న, తత్, రక్షాꣳసి, న, పిశాచాః, తరన్తి, దేవానామ్, ఓజః, ప్రథమజమితి ప్రథమ + జమ్, హి, ఏతత్, యః, బిభర్తి, దాక్షాయణమ్, హిరణ్యమ్, సః, దేవేషు, కృణుతే, దీర్ఘమ్, ఆయుః, సః, మనుష్యేషు, కృణుతే, దీర్ఘమ్, ఆయుః.॥౫౧॥

పదార్థః :-(న) (తత్) అధ్యయనం విద్యాప్రాపణమ్ (రక్షాంసి) అన్యాన్ ప్రపీడ్య స్వాత్మానమేవ యే రక్షన్తి తే (న) (పిశాచాః) యే ప్రాణినాం పేశితం రుధిరాదికమాచామన్తి భక్షయన్తి తే హింసకా మ్లేచ్ఛాచారిణో దుష్టాః (తరన్తి) ఉల్లంఘన్తే (దేవానామ్) విదుషామ్

(ఓజః) బలపరాక్రమః (ప్రథమజమ్) ప్రథమే వయసి బ్రహ్మచర్యాశ్రమే వా జాతమ్ (హి) ఖలు (ఏతత్) (యః) (బిభర్తి)(దాక్షాయణమ్) దక్షేణ చతురేణాఽయనం ప్రాపణీయం తదేవ స్వార్థేఽణ (హిరణ్యమ్) జ్యోతిర్మయమ్ (సః) (దేవేషు) విద్వత్సు (కృణుతే) (దీర్ఘమ్) అవ్యుత్తమావమ్ (ఆయుః) జీవనమ్ (సః) (మనుష్యేషు) మననశీలేషు (కృణుతే) కరోతి (దీర్ఘమ్) (ఆయుః).॥౫౧॥

అన్వయః :-హే మనుష్యా ! యద్దేవానాం ప్రథమజమోజోఽస్తి న తద్రక్షాంసి న పిశాచాస్తరన్తి యో హ్యేతద్దాక్షాయణం హిరణ్యం బిభర్తి స దేవేషు దీర్ఘమాయుః కృణుతే స మనుష్యేషు దీర్ఘమాయుః కృణుతే.॥౫౧॥

భావార్థః :-యే ప్రథమే వయసి దీర్ఘేణ ధర్మ్యేణ బ్రహ్మచర్యేణ పూర్ణాం విద్యామధీయతే న తేషాం కేచిచ్చోరా న దాయభాగినో న తేషాం భారో భవతి య ఏవం విద్వాంసో ధర్మ్యేణ వర్తన్తే తే విద్వత్సు మనుష్యేషు చ దీర్ఘమాయుర్లబ్ధ్వా సతతమానన్దన్త్యన్యానానన్దయన్తి చ.॥౫౧॥

పదార్థము :- ఓ మానవులారా! ఏ (దేవానామ్) విద్వాంసుల (ప్రథమజా) మొదటి వయస్సు లేక బ్రహ్మచర్యాశ్రమమందు ఉత్పన్నమైన (ఓజః) బలపరాక్రమములు గలవో (తత్) వానిని (న, రక్షాంసి) ఇతరులకు విశేషముగ పీడలను గలిగించుచు కేవలము తన రక్షణ, తనమేలుకొరకే వినియోగించువారు (నపిశాచాః) ఇతర ప్రాణుల రక్తమాంసాదులను తిను త్రాగు మ్లేచ్ఛాచారులగు దుష్టులను (తరన్తి) ఉల్లంఘింతురో (యః) ఏ మనుష్యుడు (హి, ఏతత్) ఇట్టి (దాక్షాయణమ్) దక్షుడగు చతురునిచే పొందదగిన (హిరణ్యమ్) తేజఃస్వరూపమగు బ్రహ్మచర్యమును (బిభర్తి) ధారణము మరియు పోషణము నొనర్చునో (సః) ఆతడు (దేవేషు) విద్వాంసులందు (దీర్ఘమ్, ఆయుః) సంపూర్ణాయుష్యమును (కృణుతే) పొందుచున్నాడు మరియు(సః) ఆతడు (మనుష్యేషు) మనన శీలురయందు (ధీర్ఘమ్, ఆయుః) దీర్ఘాయువును (కృణుతే) పొందువాడగుచున్నాడు.॥౫౧॥

**భావార్థము** :- ఎవరు మొదటి వయస్సునందు శ్రేష్ఠమగు బ్రహ్మచర్యముతో పూర్ణ విద్యలను పొందెదరో వారికి చోరులుగాని, దాయభాగులుగాని యుండరు. ఆతనికి ఎట్టి పవిత్రకార్యమును భారముగానుండదు. ఏ విద్వాంసుడు ఈ విధముగా ధర్మయుక్త కర్మలతోగూడ వర్తించుచుండునో యాతడు విద్వాంసులందు, మానవులందు దీర్ఘాయుష్యమును పొంది నిరంతరము ఆనందముగానుండి ఇతరులకును ఆనందమును సమకూర్చుచుండును.॥౫౧॥

51. The strength acquired by the learned in the Brahmcharya Ashrama, can be destroyed neither by demons nor by fiends. Whoever possesses the strength of celibacy, lives a long life among the sages, and also lives a long life among thoughtful persons.

**౧౫౪౨ యదేత్యస్య దక్ష ఋషిః, హిరణ్యన్తేజో దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.**

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే చెప్పబడినది.

౧౮౮౫ యదాబధ్నన్దాక్షాయణా హిరణ్య౧ం శతానీకాయ సుమనస్యమానాః ।

తన్మ ఆ బధ్నామి శతశారదాయాయుష్మాఞ్జరదష్టిర్యథాసమ్ ॥౫౨॥

ప.వి:-యత్, ఆ, అబధ్నన్, దాక్షాయణాః, హిరణ్యమ్, శతానీకాయేతి శత+అనీకాయ, సుమనస్యమానా ఇతి సు + మనస్యమానాః, తత్, మే, ఆ, బధ్నామి, శతశారదాయేతి శత + శారదాయ, ఆయుష్మాన్, జరదష్టిరితి జరత్ + అష్టిః, యథా, అసమ్ ॥౫౨॥

పదార్థః:-(యత్) (ఆ) (అబధ్నన్) బధ్నీయుః (దాక్షాయణాః) చాతుర్యవిజ్ఞానయుక్తాః (హిరణ్యమ్) సత్యాసత్యప్రకాశం విజ్ఞానమ్ (శతానీకాయ) శతాన్యనీకాని సైనికాని యస్య తస్మై (సుమనస్యమానాః) సుష్ఠు విచారయన్తః సజ్జనాః (తత్) (మే) మహ్యమ్ (ఆ) (బధ్నామి) (శతశారదాయ) శతం శరదో జీవనాయ (యుష్మాన్) (జరదష్టిః) జరం పూర్ణమాయుర్వ్యాప్తో యః సః (యథా) (అసమ్) భవేయమ్.॥౫౨॥

అన్వయః:- యే దాక్షాయణాః సుమనస్యమానాః శతానీకాయ మే యద్ధిరణ్యమాऽऽబధ్నన్ తదహం శతశారదాయాऽऽబధ్నామి. హే విద్వాంసో ! యథాऽహం యుష్మాన్ ప్రాప్య జరదష్టిరసం తథా యూయం మాం ప్రత్యుపదిశత.॥౫౨॥

భావార్థః:-ఏకత్ర శతశః సేనా ఏకత్రైకా విద్యా విజయప్రదా భవతి యే దీర్ఘేణ బ్రహ్మచర్యేణ విద్వద్భ్యో విద్యాం సుశిక్షాం చ గృహీత్వా తదనుకూలా వర్తన్తే తేऽల్పాऽऽయుషః కదాచిన్న జాయన్తే.॥౫౨॥

పదార్థము :-(దాక్షాయణాః) చతురులు మరియు విజ్ఞానవంతులు (సుమనస్యమానాః) ఉత్తమాలోచనలు గల సజ్జనులు (శతానీకాయ) వందలాది సైన్యములుగల (మే) నాకొరకు (యత్) ఎట్టి (హిరణ్యమ్) సత్యాసత్య ప్రకాశముయొక్క విజ్ఞానమును (ఆ, అబధ్నన్) నిబంధనానొనర్చెదరో (తత్) దానిని నేను (శతశారదాయ) నూరు సంవత్సరముల జీవనమునకై (ఆ, బధ్నామి) నియమితమొనర్చు కొనుచున్నాను. ఓ విద్వాంసులారా! (యథా) ఏవిధముగా నేను (యుష్మాన్) మిమ్ము ప్రాప్తించుకొని (జరదష్టిః) సంపూర్ణాయుష్యమును ప్రాప్తించువాడను (అసమ్) అగుచున్నానో, అందు కనుకూలమగు ఉపదేశమును మీరు నాకొసగుడు.॥౫౨॥

**భావార్థము** :- ఒక పక్షము వందలాది సైనికులుండి రెండవవైపు ఒక విద్యయే యున్న విద్యయే విజయము గలిగించునదై యుండును. దీర్ఘకాలమువరకు బ్రహ్మచర్యమునుధరించి విద్వాంసులచే విద్యలను, ఉత్తమ శిక్షణను పొంది, వానికి అనుకూలముగ వర్తించువారెప్పుడును అల్పాయుష్కులు గాజాలరు. ॥52॥

52. Noble persons with benevolent thoughts, full of sagacity and learning, lords of hundreds of soldiers, bind me in knowledge which distinguishes between truth and untruth. I possess that in me for life through hundred autumns, that I may live till ripe old age overtakes me.

౧౮౪౬. ఉత న ఇత్యస్య ఋజిష్వ ఋషిః, లిఙ్గోక్తా దేవతాః, భురిక్ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ కే సర్వరక్షకాః సన్తీత్యాహ. సర్వరక్షకు లెవరు?

౧౮౪౬ ఉత నో౽హిర్బుధ్న్యః శృణోత్వజ ఏకపాత్పృథివీ సముద్రః।
విశ్వే దేవా ఋతావృధో హువానాః స్తుతా మన్త్రాః కవిశస్తా అవన్తు ॥53॥

**ప.వి:**- ఉత, నః, అహిః, బుధ్న్యః, శృణోతు, అజః, ఏకపాదిత్యేక + పాత్, పృథివీ, సముద్రః, విశ్వే, దేవాః, ఋతావృధః, ఋతవృధ ఇత్యృత + వృధః, హువానాః, స్తుతాః, మన్త్రాః, కవిశస్తా ఇతి కవి + శస్తాః, అవన్తు ॥53॥

పదార్థః :- (ఉత) అపి (నః) అస్మాకం వచాంసి (అహిః) మేఘః (బుధ్న్యః) బుధ్నే౽న్తరిక్షే భవః (శృణోతు) (అజః) యో న జాయతే సః (ఏకపాత్) ఏకః పాదో బోధో యస్య సః (పృథివీ) (సముద్రః) అన్తరిక్షమ్ (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః (ఋతావృధః) సత్యస్య వర్ధకాః (హువానాః) స్పర్ధమానాః (స్తుతాః) స్తుతిప్రకాశకాః (మన్త్రాః) విచారసాధకాః (కవిశస్తాః) కవిభిర్మేధావిభిః శస్తాః ప్రశంసితాః (అవన్తు) ॥53॥

అన్వయః :- హే మనుష్యా! బుధ్న్యో౽హిరివ పృథివీ సముద్రశ్చైవైకపాదజో నః శృణోతు ఋతావృధో హువానా విశ్వే దేవా ఉతాపి కవిశస్తాః స్తుతా మన్త్రా నో౽స్మానవన్తు ॥53॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా ! యథా పృథివ్యాదయః పదార్థ మేఘః పరమేశ్వరశ్చ సర్వాన్ రక్షన్తి తథైవ విద్యా విద్వాంసశ్చ సర్వాన్ పాలయన్తి ॥53॥

**పదార్థము** :- ఓ మానవులారా! (బుధ్న్యః) అంతరిక్షమునందుత్పన్నమగు (అహిః) మేఘములవలె (పృథివీ) భూమివలె (సముద్రః) అంతరిక్షమువలె (ఏకపాత్) ఒకేవిధమగు నిశ్చల వ్యభిచారరహిత

జ్ఞానముగలవాడు (అజః) ఎప్పుడును ఉత్పన్నముగాని పరమేశ్వరుడు (నః) మా వచనములను (శృణోతు) ఆలకించుగాక! మరియు (ఋతావృధః) సత్యమును అభివృద్ధిపరచువారు (హువానాః) పోటీపడుచు (విశ్వే) సకల (దేవాః) విద్వాంసులు (ఉత) మరియు (కవిశస్తాః) బుద్ధిశాలురచే ప్రశంసించబడిన (స్తుతాః) స్తుతిని ప్రకాశపరచు (మన్త్రాః) విచార [ఆలోచనా] సాధకములగు మంత్రములు మమ్ము (అవన్తు) రక్షణయొనర్చుగాక! ॥౫౩॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఏవిధముగా పృథివి మున్నగు పదార్థములు, మేఘములు మరియు పరమేశ్వరుడు సమస్తమును రక్షించునో, అట్లే విద్య మరియు విద్వాంసులు ఎల్లరను పాలింతురుగాక! ॥౫౩॥

May the unborn God, the Support of all like the atmosphere, Indestructible, the Expander of the world, the Creator of all regions, the Master of permanent knowledge, hear our words. May all the learned persons, the protagonists of truth, vying with each other for advancement, and texts recited by the sages protect us.

౧౮౪౭.ఇమేత్యస్య కూరగార్త్సమద ఋషిః, ఆదిత్యా దేవతాః, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ వాగ్విషయమాహ. ఇందు వాక్కు విషయము చెప్పెను.

౧౮౪౭ ఇమా గిర ఆదిత్యేభ్యో ఘృతస్నూః సనాద్రాజభ్యో జుహ్వా జుహోమి ।
శృణోతు మిత్రో అర్యమా భగో నస్తువిజాతో వరుణో దక్షో అంశః ॥౫౪॥

ప.వి:- ఇమాః, గిరః, ఆదిత్యేభ్యః, ఘృతస్నూరితి ఘృత + స్నూః, సనాత్, రాజభ్య ఇతి రాజ + భ్యః, జుహ్వా, జుహోమి, శృణోతు, మిత్రః, అర్యమా, భగః, నః, తువిజాత ఇతి తువి + జాతః, వరుణః, దక్షః, అంశః ॥౫౪॥

పదార్థః :- (ఇమాః) సత్యాః (గిరః) వాచః (ఆదిత్యేభ్యః) తేజస్విభ్యః (ఘృతస్నూః) ఘృతముదక మివ ప్రదీప్తం వ్యవహారం స్నాన్తి శోధయన్తి తాః (సనాత్) నిత్యమ్ (రాజభ్యః) నృపేభ్యః (జుహ్వా) గ్రహణసాధనేన (జుహోమి) ఆదదామి (శృణోతు) (మిత్రః) సఖా (అర్యమా) న్యాయకారీ (భగః) ఐశ్వర్యవాన్ (నః) అస్మాకమ్ (తువిజాతః) బహుషు ప్రసిద్ధః (వరుణః) శ్రేష్ఠః (దక్షః) చతురః (అంశః) విభాజకః ॥౫౪॥

**అన్వయః :-** అహవమాదిత్యేభ్యో రాజభ్యో యా ఇమా గిరో జుహ్వా సనాజ్జుహోమి తా ఘృతస్నూ ర్నో గిరో మిత్రోఽర్యమా భగస్తువిజాతో దక్షోఽంశో వరుణశ్చ శృణోతు.॥౫౪॥

**భావార్థః :-** విద్యార్థిభిర్యా ఆచార్యేభ్యః సుశిక్షితా వాచో గృహీతాస్తా అన్య ఆప్తాః శ్రుత్వా సుపరీక్ష్య శిక్షయన్తు ॥౫౪॥

**పదార్థము :-** (ఆదిత్యేభ్యః) తేజోవంతులగు (రాజభ్యః) రాజులనుండి నేను (ఇమాః) ఈ సత్య (గిరః) వాణులను (జుహ్వా) గ్రహణసాధనముద్వారా (సనాత్) నిత్యము (జుహోమి) ఎట్లు స్వీకరించుచున్నానో, అట్టి (ఘృతస్నూః) జలములవలె ఉత్తమ వ్యవహారములను శోధించునట్టి (నః) మా వాణులను (మిత్రః) మిత్రుడు (అర్యమా) న్యాయకారి (భగః) ఐశ్వర్యవంతుడు (తువిజాతః) అనేకులలో ప్రసిద్ధుడు (దక్షః) చతురుడు (అంశః) విభజించువాడు మరియు (వరుణః) శ్రేష్ఠుడు (శృణోతు) వినునుగాక! ॥౫౪॥

**భావార్థము :-** విద్యార్థులగువారు ఆచార్యులనుండి ఎట్టి సుశిక్షితవాణులను పొందియుండిరో వానిని ఇతర ఆప్తులు విని చక్కగా పరీక్షించి శిక్షణనీయవలెను.॥౫౪॥

54. I listen with rapt attention to these eternal true sayings of the Veda preached by majestic kings.

May associates, intelligentsia, distributors, and noble persons herar our words purifying the conduct like water.

౧౮౫౫. సప్తేత్యస్య కణ్వ ఋషిః, అధ్యాత్మం ప్రాణా దేవతాః, భురిగ్జగతీ ఛన్దః నిషాదః స్వరః.

అథ శరీరేన్ద్రియవిషయమాహ. శరీరేంద్రియముల విషయము.

౧౮౫౫ సప్త ఋషయః ప్రతిహితాః శరీరే సప్త రక్షన్తి సదమప్రమాదమ్। సప్తాపః

స్వపతో లోకమీయుస్తత్ర జాగృతో అస్వప్నజౌ సత్రసదౌ చ దేవౌ ॥౫౫॥

**ప.వి:-** సప్త, ఋషయః, ప్రతిహితా ఇతి ప్రతి + హితాః, శరీరే, సప్త, రక్షన్తి, సదమ్, అప్రమాద మిత్యప్ర + మాదమ్, సప్త, ఆపః, స్వపతః, లోకమ్, ఈయుః, తత్ర, జాగృతః, అస్వప్నజావిత్యస్వప్న + జౌ, సత్రసదావితి సత్ర + సదౌ, చ, దేవౌ.॥౫౫॥

**పదార్థః :-** (సప్త) పంచజ్ఞానేన్ద్రియాణి మనో బుద్ధిశ్చ (ఋషయః) విషయప్రాపకాః (ప్రతిహితాః) ప్రతీత్యా ధృతాః (శరీరే) (సప్త) (రక్షన్తి) (సదమ్) సీదన్తి యస్మింస్తత్

(అప్రమాదమ్) (సప్త) (ఆపః) ఆప్నువన్తి వ్యాప్నువన్తి శరీరమిత్యాపః (స్వపతః) శయనం ప్రాప్తస్య (లోకమ్) జీవాత్మానమ్ (ఈయుః) యన్తి (తత్ర) లోకగమనకాలే (జాగృతః) (అస్వప్నజౌ) స్వప్నో న జాయతే యయోస్తౌ (సత్రసదౌ) సతాం జీవాత్మనాం త్రాణం సత్రం తత్ర సీదతస్తౌ (చ) (దేవౌ) దివ్యస్వరూపౌ ప్రాణాపానౌ ॥౫౫॥

**అన్వయః :- యే సప్తర్షయః శరీరే ప్రతిహితాస్త ఏవ సప్తాప్రమాదం యథా స్యాత్తథా సదం రక్షన్తి తే స్వపతః సప్తాఽపః లోకమీయుస్తత్రాఽస్వప్నజౌ సత్రసదౌ చ దేవౌ జాగృతః॥౫౫॥**

**భావార్థః :- అస్మిఞ్ఛరీరే స్థిరాణి వ్యాపకాని విషయంబోధకాని సాన్తఃకరణాని జ్ఞానేన్ద్రియాణ్యేవ సాతత్యేన శరీరం రక్షన్తి యదా చ జీవః స్వపితి తదా తమేవాశ్రిత్య తమోబలేనాన్తర్ముఖాని తిష్ఠన్తి బాహ్యవిషయం న బోధయన్తి స్వప్నావస్థాయాం చ జీవాత్మరక్షణతత్పరౌ తమోగుణానభిభూతౌ ప్రాణాపానౌ జాగరణం కుర్యాతే అన్యథా యద్యనయోరపి స్వప్నః స్యాత్తదా తు మరణమేవ సంభావ్యమితి.॥౫౫॥**

**పదార్థము :-** (సప్తఋషయః) విషయములను అనగా [శబ్దము మున్నగువానిని ప్రాప్తింపజేయు ఐదు జ్ఞానేంద్రియములు, మనస్సు, మరియు బుద్ధి ఈ సప్తఋషులు] (శరీరే) శరీరమందు (ప్రతిహితః) ప్రసిద్ధముగా స్థిరమైయున్నవియో, అవియే (సప్త) ఏడు (అప్రమాదమ్) ప్రమాదము లేదా పొరపాటు జరుగకుండునట్లు (సదమ్) నివసించుట కాధారమగు నీ శరీరమును (రక్షన్తి) రక్షించుచున్నవి (స్వపతః) నిదురించువారి (ఆపః) శరీరములందు వ్యాపించుచుండు పైదెలిపిన (సప్త) ఏడు (లోకమ్) జీవాత్మలను ఎట్లు (ఈయుః) ప్రాప్తించుచున్నవియో (తత్ర) అట్టి లోకప్రాప్తి సమయమునందు (అస్వప్నజౌ) ఎన్నడును స్వప్నములు గలుగనట్టి [నిదురించనట్టి] (సత్రసదౌ) జీవాత్మలను రక్షణయొనర్చుచుండును (చ) మరియు (దేవౌ) స్థిరమగు శ్రేష్ఠగుణములుగల ప్రాణాపానములు (జాగృతః) మేలుకొనియే యుండును.॥౫౫॥

**భావార్థము :-** ఈ శరీరమందు స్థిరములు, వ్యాపకములునగు విషయముల నెరుగునట్టి అంతఃకరణముల సహితముగ నుండు ఐదు జ్ఞానేంద్రియములు మాత్రమే నిరంతరము శరీరమును రక్షించుచుండును. జీవుడు నిద్రించునపుడు దానినే ఆశ్రయించుకొని తమోగుణ బలముతో లోపల స్థిరమగుచున్నవి. ఐనను బాహ్య విషయములను తెలియపరచవు. స్వప్నావస్థయందు జీవాత్మను రక్షించుటయందు తత్పరమ్మైయుండి తమోగుణముచే నణచబడజాలని ప్రాణాపానములు మేల్కొనియే యుండును. అట్లుగాక ఒకవేళ ప్రాణాపానములుసైతము నిద్రించినచో మరణమే సంభవించునని తెలిసికొనుడు.॥౫౫॥

55. Seven Rishis are established in the body; these seven guard it with unceasing care.

These vseven enter the soul in the body of him who lies asleep. At that time two sleepless gods, the protectors of soul, keep waking.

౧౮౪౫.ఉత్తిష్ఠేత్యస్య కణ్వ ఋషిః, బ్రహ్మణస్పతిర్దేవతా, నిచృద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
విద్వాన్ కిం కుర్యాదిత్యాహ. విద్వాంసు లేమి చేయవలయును?

౧౮౪౫ ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే దేవయన్తస్త్వేమహే।
ఉప ప్ర యన్తు మరుతః సుదానవ ఇన్ద్ర ప్రాశూర్భవా సచా॥౫౬॥

ప.వి:– ఉత్, తిష్ఠ, బ్రహ్మణః, పతే, దేవయన్త ఇతి దేవ + యన్తః, త్వా, ఈమహే, ఉప, ప్ర, యన్తు, మరుతః, సుదానవ ఇతి సు + దానవః, ఇన్ద్ర, ప్రాశూః, భవ, సచా ॥౫౬॥

పదార్థః :-(ఉత్) (తిష్ఠ) (బ్రహ్మణః) ధనస్య (పతే) పాలక (దేవయన్తః) దేవాన్ కామయమానాః (త్వా) త్వామ్ (ఈమహే) యాచామహే (ఉప) (ప్ర) (యన్తు) ప్రాప్నువన్తు (మరుతః) మనుష్యాః (సుదానవః) శోభనదానాః (ఇన్ద్ర) ఐశ్వర్యకారక! (ప్రాశూః) యః ప్రాశ్నాతి సః (భవ) అత్ర ద్వ్యచోతస్తిఙ ఇతి దీర్ఘః (సచా) సత్యసమవాయేన. ॥౫౬॥

అన్వయః:- హే బ్రహ్మణస్పతే ఇన్ద్ర! దేవయన్తో వయం యన్త్వేమహే యన్త్వా సుదానవో మరుత ఉప ప్రయన్తు స త్వముత్తిష్ఠ సచా ప్రాశూర్భవ.॥౫౬॥

భావార్థః:-హే విద్వన్! యే విద్యాం కామయమానాస్త్వాముపతిష్ఠేయుస్తేభ్యో విద్యాదానాయ భవాను త్తిష్ఠతూద్యుక్తో భవతు.॥౫౬॥

పదార్థము:- (బ్రహ్మణః) ధనములను (పతే) రక్షించువాడా! (ఇన్ద్ర) ఐశ్వర్యకారకుడవగు ఓ విద్వాంసుడా! (దేవయన్తః) దివ్యమగు విద్వాంసులను గోరుచు మే మెట్లు (త్వా) నిన్ను (ఈమహే) యాచించుచున్నామో, ఏ నిన్ను (సుదానవః) ఉత్తమదాతలగు (మరుతః) మానవులు (ఉప, ప్ర, యన్తు) సమీపమునసే ప్రయత్నపూర్వకముగ పొందుచున్నారో, అట్టినీవు (ఉత్, తిష్ఠ) మేల్కొనుము (సచా) సత్యముయొక్క సంబంధముతో (ప్రాశూః) ఉత్తమభోగములొనర్చువాడవు (భవ) అగుము. ॥౫౬॥

భావార్థము :-ఓ విద్వాంసుడా! విద్యను గోరువా రెవరైన నిన్నాశ్రయించినచో వారికి విద్యలను బోధించుటకు నీవు సంసిద్ధుడ వగుము. ॥ ౫౬ ॥

56. Arise, O learned person, the guardian of Vedic wealth, we longing for learned teachers pray to thee. May those persons who give good gifts, approach thee, and enjoy thou in a righteous manner the gifts offered!.

౧౮౫౦. ప్రనూనమిత్యస్య కణ్వ ఋషిః, బ్రహ్మణస్పతిర్దేవతా, విరాట్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
అథేశ్వరవిషయమాహ. ఈశ్వరుని విషయ మిందు చెప్పెను.

౧౮౫౦ ప్ర నూనం బ్రహ్మణస్పతిర్మన్త్రం వదత్యుక్థ్యమ్।
యస్మిన్నిన్ద్రో వరుణో మిత్రో అర్యమా దేవా ఓకాꣳసి చక్రిరే ॥౫౭॥

ప. వి:- ప్ర, నూనమ్, బ్రహ్మణః, పతిః, మన్త్రమ్, వదతి, ఉక్థ్యమ్, యస్మిన్, ఇన్ద్రః, వరుణః, మిత్రః, అర్యమా, దేవాః, ఓకాꣳసి, చక్రిరే ॥౫౭॥

పదార్థః :- (ప్ర) (నూనమ్) నిశ్చితమ్ (బ్రహ్మణః) వేదవిద్యాయాః (పతిః) పాలకః (మన్త్రమ్) (వదతి) (ఉక్థ్యమ్) ఉక్థేషు ప్రశంసనీయేషు సాధుమ్ (యస్మిన్) (ఇన్ద్రః) విద్యుత్సూర్యో వా (వరుణః) జలం చన్ద్రో వా (మిత్రః) ప్రాణోఽన్యే వాయవశ్చ (అర్యమా) సూత్రాత్మా (దేవాః) దివ్యగుణాః ( ఓకాంసి) నివాసాన్ (చక్రిరే) కృతవన్తః సన్తి.॥౫౭॥

అన్వయః :- హే మనుష్యా! యస్మిన్నిన్ద్రో వరుణో మిత్రోఽర్యమా దేవా ఓకాంసి చక్రిరే, స బ్రహ్మణస్పతిః పరమాత్మోక్థ్యం మన్త్రం వేదాఖ్యం నూనం ప్రవదతీతి విజానీత.॥౫౭॥

భావార్థః:- హే మనుష్యా ! యస్మిన్ పరమాత్మని సర్వం జగత్కారణం కార్యం జీవాశ్చ వసన్తి యశ్చ సర్వేషాం జీవానాం హితసాధకం వేదోపదేశం కృతవానస్తి తమేవ యూయం భజత ॥౫౭॥

**పదార్థము** :- ఓ మానవులారా! (యస్మిన్) ఏ పరమాత్మయందు (ఇన్ద్రః) విద్యుత్తు, లేక సూర్యుడు (వరుణః) జలములు లేక చంద్రుడు (మిత్రః) ప్రాణములు లేక ఇతర అపానాదివాయువులు (అర్యమా) సూత్రాత్మయగు వాయువు (దేవాః) ఈ యుత్తమగుణములు గలిగిన వన్నియును (ఓకాంసి) నివాసములను (చక్రిరే) చేసికొని యున్నవియో అవి (బ్రహ్మణః) వేదవిద్యల (పతిః) రక్షకుడగు జగదీశ్వరుడు (ఉక్థ్యమ్) ప్రశంసనీయ పదార్థములందు శ్రేష్ఠమగు (మన్త్రమ్) వేదరూపమంత్రభాగమును (నూనమ్) నిశ్చయముగ (ప్ర, వదతి) చక్కగా తెలుపుచున్నాడని ఎరుగుడు.॥౫౭॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఏ పరమాత్మయందు కార్యకారణరూప సమస్త జగమంతయు మరియు జీవాత్మలు నివసించియున్నవో, ఎవడు సకల జీవుల హితసాధకములగు వేదముల నుపదేశించెనో, యాతనినే మీరెల్లరును భక్తితో సేవించుడు, ఉపాసించుడు.॥౫౭॥

57. God, in Whom the Sun, Moon, breath, air and all good attributes, seek their dwelling-place, is verily the Guardian of the Vedic lore. He preaches the solemn hymn of praise.

౧౦౫౮. బ్రహ్మణస్పత ఇత్యస్య గృత్సమద ఋషిః, బ్రహ్మణస్పతిర్దేవతా, నిచృత్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౦౫౮ బ్రహ్మణస్పతే త్వమస్య యన్తా సూక్తస్య బోధి తనయం చ జిన్వ ।

విశ్వన్తద్భద్రం యదవన్తి దేవా బృహద్వదేమ విదథే సువీరాః ॥౫౮॥

ప.విః- బ్రహ్మణః, పతే, త్వమ్, అస్య, యన్తా, సూక్తస్యేతి సు+ఉక్తస్య, బోధి, తనయమ్, చ, జిన్వ, విశ్వమ్, తత్, భద్రమ్, యత్, అవన్తి, దేవాః, బృహత్, వదేమ విదథే, సువీరా ఇతి సు + వీరాః ॥౫౮॥

పదార్థః :- (బ్రహ్మణః) బ్రహ్మాణ్డస్య (పతే) రక్షక ! (త్వమ్) (అస్య) (యన్తా) నియన్తా (సూక్తస్య) సుష్ఠు వక్తుమర్హస్య (బోధి) బోధయ (తనయమ్) విద్యాపుత్రమ్ (చ) (జిన్వ) ప్రీణీహి (విశ్వమ్) సర్వమ్ (తత్) (భద్రమ్) కల్యాణకరమ్ (యత్) (అవన్తి) రక్షన్త్యుపదిశన్తి (దేవాః) విద్వాంసః (బృహత్) మహత్ (వదేమ) ఉపదిశేమ (విదథే) విజ్ఞాపనీయే వ్యవహారే (సువీరాః) శోభనాశతే వీరాశ్చసువీరాః ॥౫౮॥

అన్వయః :-హే బ్రహ్మణస్పతే! దేవా విదథే యదవన్తి యత్ సువీరా వయం బృహద్వదేమ తస్యాస్య సూక్తస్య త్వం యన్తా భవ తనయం చ బోధి తద్భద్రం విశ్వం జిన్వ. ॥౫౮॥

భావార్థః :- హే జగదీశ్వర! భవానస్మాకం విద్యాయాః సత్యస్య వ్యవహారస్య చ నియన్తా భవత్వస్మాకమపత్యాని విద్యావన్తి కరోతు సర్వం జగద్యథావద్రక్షతు! సర్వత్ర న్యాయ్యం ధర్మం సుశిక్షాం పరస్పరప్రీతిం చ జనయత్వితి.॥౫౮॥

పదార్థము :-(బ్రహ్మణః) బ్రహ్మాండ (పతే) రక్షకుడవునగు పరమేశ్వరా! (దేవాః) విద్వాంసులు (విదథే) ప్రకటించదగిన వ్యవహారములందు (యత్) వేనిని (అవన్తి) రక్షించుచున్నారో లేక ఉపదేశించుచున్నారో మరియు దేనిని (సువీరాః) సుందర, ఉత్తమ వీరులమగు మేము (బృహత్) మహాశ్రేష్ఠములని (వదేమ) చెప్పుదుమో, అట్టి (అస్య) ఈ (సూక్తస్య) చక్కగా చెప్పదగిన వచనములకు (త్వమ్) నీవు (యన్తా) నియమకర్తవగుదువు (చ) మరియు (తనయమ్) విద్యలను పవిత్రముగా నాలోచించు పుత్రునివంటి ప్రియపురుషునకు (బోధి) బోధించుము. మరియు (తత్) అట్టి (భద్రమ్) కల్యాణకరములగు (విశ్వమ్)

**భావార్థము** :- ఓ జగదీశ్వరా! నీవు మాయొక్క విద్య మరియు సత్యవ్యవహారములను నియమమున మొనర్చువాడవగుము. మా సంతానములను విద్యావంతులనుగ నొనర్చుము. సమస్త జగత్తును యథావతుగ రక్షించుము. న్యాయముతో గూడిన ధర్మమును, ఉత్తమ శిక్షణను మరియు పరస్పర ప్రీతిని ఉత్పన్న మొనర్చుము.॥౫౮॥

58. O God, Protector of the universe, the learned sing Thy praise in the yajna, and we brave people accept Thee as mighty, be Thou the Regulator of this our hymn, instruct the lover of knowledge, and satisfy all virtuous souls.

అస్మిన్నధ్యాయే మనసో లక్షణం, శిక్షా, విద్యేచ్ఛా, విద్వత్సఙ్గః, కన్యాప్రబోధో, విద్వల్లక్షణం రక్షాయాచనం, బలైశ్వర్యేచ్ఛా, సోమౌషధిలక్షణం, శుభేచ్ఛా, పరమేశ్వరసూర్యవర్ణనం, స్వరక్షా, ప్రాతరుత్థానం, పురుషార్థేనర్ద్ధిసిద్ధి ప్రాపణమీశ్వరస్య జగన్నిర్మాణం, మహారాజవర్ణనమశ్విగుణకథనమాయుర్వర్ధనం, విద్వత్ప్రాణలక్షణమీశ్వరకృత్యం చోక్తమతోఽస్యాఽధ్యాయార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతిర్వేద్యా.

ఈ యధ్యాయమునందు మనస్సుయొక్క లక్షణము, శిక్షణ, విద్యాభిలాష, విద్వాంసుల సాంగత్యము, కన్యలకు ప్రబోధము, చైతన్యము, విద్వాంసుల లక్షణము, రక్షణకొరకు ప్రార్థన, బలము మరియు ఐశ్వర్యముల ఆకాంక్ష, సోమ ఓషధి లక్షణము, శుభకర్మలకోరిక, పరమేశ్వరుడు మరియు సూర్యుని వర్ణన, ఆత్మ (స్వ) రక్షణ, ప్రాతః సమయముననే లేచుట, పురుషార్థముచే బుద్ధి సిద్ధులను పొందుట, పరమేశ్వరుని జగద్రచన, మహారాజుల వర్ణన, అశ్వి (ఈశ్వర) గుణముల వర్ణనము, ఆయుష్యమును పెంపొందించుకొనుట, విద్వాంసుల, మరియు ప్రాణములవర్ణన, ఈశ్వరుని కర్తవ్యములను గూర్చి చెప్పబడినది. కావున నీ యధ్యాయమునందలి అర్థమునకు పూర్వాధ్యాయములో చెప్పబడిన అర్థముతో సంగతిగలదని యెరుగ వలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయత దయానందసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే చతుస్త్రింశోఽధ్యాయః పూర్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత

యజుర్వేదభాష్యమునందలి ముప్పదినాల్గవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ

లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,

శిష్యుడునునగు 'చతుర్వేదభాష్యానువాదభాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ

పీఠాధిపతులునైన పం. లోకములహరి సిద్ధాంతాచార్యులచే నొనర్చబడిన ఆంధ్రానువాదము;

పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల

గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కులప్రపూర్ణ, వేదతత్త్వ

వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు

లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య

**'మల్లె కృష్ణారెడ్డి'** సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**ముప్పది నాల్గవ అధ్యాయము సమాప్తము.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

# యజుర్వేదభాష్యము

## 35వ అధ్యాయము - విషయసూచిక

# అథ పఞ్చత్రింశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే ద్వావింశతిర్మన్త్రాఃసన్తీతివేదితవ్యమ్.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్నఽఆ సువ ॥య.30.3॥

౧౮౫౭.అపేత్యస్య ఆదిత్యా దేవా వా ఋషయః, పితరో దేవతాః, పూర్వస్య పిపీలికామధ్యా గాయత్రీ, ద్యుభిరిత్యుత్తరస్య ప్రాజాపత్యా బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

అథ వ్యవహారజీవయోర్గతి మాహ. వ్యవహారగతి జీవముగతి చెప్పబడెను.

౧౮౫౭ అపేతో యన్తు పణయోఽసుమ్నా దేవపీయవః। అస్య లోకః సుతావతః।ద్యుభిరహోభిరక్తుభిర్వ్యక్తం యమో దదాత్వవసానమస్మై।౧॥

ప.వి:-అప, ఇతః, యన్తు, పణయః, అసుమ్నా, దేవపీయవ ఇతి దేవ + పీయవః, అస్య, లోకః, సుతావతః, సుతవత ఇతి సుత+వతః, ద్యుభిరితి ద్యుభిః, అహోభిరిత్యహః + భిః, అక్తుభిరిత్యక్తు + భిః, వ్యక్తమితి వి +అక్తమ్, యమః, దదాతు,అవసానమిత్యవ + సానమ్, అస్మై.॥౧॥

పదార్థః :-(అప) దూరీకరణే (ఇతః) అస్మాత్ (యన్తు) గచ్ఛన్తు (పణయః) వ్యవహారిణః (అసుమ్నా) అసుఖాని దుఃఖాని. సుమ్నమితి సుఖనా...నిఘం. 3.6. (దేవపీయవః) యే దేవానాం విదుషాం ద్వేష్టారః (అస్య) (లోకః) దర్శనీయః (సుతావతః) ప్రశస్తాని సుతాని వేదవిద్భిః ప్రేరితాని కర్మాణి యస్య తస్య (ద్యుభిః) ప్రకాశమానైః (అహోభిః) దినైః (అక్తుభిః) రాత్రిభిః (వ్యక్తమ్) ప్రసిద్ధమ్ (యమః) యన్తా (దదాతు) (అవసానమ్) అవకాశమ్ (అస్మై).॥౧॥

అన్వయః :-హే దేవపీయవః పణయోఽసుమ్నాఽన్యేభ్యో దదతి త ఇతోఽపయన్తు లోకో యమో ద్యుభిరహోభిరక్తుభిరస్య సుతావతో జనస్య సంబన్ధినేఽస్మై వ్యక్తమవసానం దదాతు.॥౧॥

భావార్థః :- య ఆప్తాన్విదుషో ద్విషన్తి తే సద్యో దుఃఖమాప్నువన్తి. యే జీవాః శరీరం త్యక్త్వా గచ్ఛన్తి తేభ్యో యథాయోగ్యమవకాశం దత్త్వా పరమేశ్వరస్తేషాం కర్మానుసారేణ సుఖదుఃఖాని దదాతి.॥౧॥

పదార్థము :- (దేవపీయవః) విద్వాంసులను ద్వేషించు ఏ (పణయః) వ్యవహారనిపుణులు ఇతరులకు (అసువన్వ్తా) దుఃఖములను గలిగించుచున్నారో, వారు (ఇతః) ఇచ్చటినుండి (అపయన్తు) దూరము తొలగిపోవుదురు గాక! (లోకః) చూడదగిన (యమః) సర్వనియన్తయగు పరమాత్మ (ద్యుభిః) ప్రకాశవంతమగు (అహోభిః) పగలు (అక్తుభిః) మరియు రాత్రులతో గూడ (అస్య) ఇట్టి (సుతావతః) వేదము లేక విద్వాంసులచే ప్రేరితమగు ప్రశస్తకర్మలనొనర్చు మానవత్వముగల (అస్మై) ఈ మానవునికొరకు (వ్యక్తమ్) ప్రసిద్ధమగు (అవసానమ్) అవకాశమును (దదాతు) ఇచ్చునుగాక!॥౧॥

భావార్థము :- ఆప్తులు, సత్యవాదులు ధర్మాత్ములు, విద్వాంసులునగువారిని ద్వేషించువారు శీఘ్రముగానే దుఃఖములను పొందుదురు. ఏ జీవులు భౌతికకాయము విడిచి వెళ్లుచుందురో వారికి వారియోగ్యతానుసారము అవకాశమును గలిగించి వారి కర్మానుసారము పరమేశ్వరుడు సుఖ, దుఃఖరూప ఫలముల నిచ్చును.॥౧॥

1. Businessmen who torment others, and are inimical to the learend, should get away from here. May the Beautiful God, grant this soul, the singer of vedic hymns, full opportunity for work with the lustre of knowledge during all the days and nights of life.

౧౮౫౩.సవితా తయిత్యస్య ఆదిత్యా దేవా ఋషయః, సవితా దేవతా,గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునరీశ్వరకర్తవ్యవిషయమాహ. ఈశ్వరుని కర్తవ్య విషయము.

౧౮౫౩ సవితా తే శరీరేభ్యః పృథివ్యాం లోకమిచ్ఛతు।
తస్మై యుజ్యన్తాముస్రియాః ॥౨॥

ప.వి:-సవితా, తే, శరీరేభ్యః, పృథివ్యామ్, లోకమ్, ఇచ్ఛతు, తస్మై, యుజ్యన్తామ్, ఉస్రియాః.॥౨॥

పదార్థః:- (సవితా) పరమాత్మా (తే) తవ (శరీరేభ్యః) దేహేభ్యః (పృథివ్యామ్) అన్తరిక్షే భూమౌవా (లోకమ్) కర్మానుకూలం సుఖదుఃఖప్రాపకమ్ (ఇచ్ఛతు) (తస్మై) (యుజ్యన్తామ్) (ఉస్రియాః) కిరణాః. ఉస్రా ఇతి రశ్మినా... నిఘం...౧.౫ ॥౨॥

అన్వయః:-హే జీవ! సవితా యస్య తే శరీరేభ్యః పృథివ్యాం లోకమిచ్ఛతు తస్మై తుభ్యముస్రియా యుజ్యన్తామ్.॥౨॥

భావార్థః:-హే జీవా యో జగదీశ్వరో యుష్మభ్యం సుఖమిచ్ఛతి కిరణద్వారా లోకలోకాన్తరం ప్రాపయతి స ఏవ యుష్మాభిర్న్యాయకారీ మన్తవ్యః.॥౨॥

పదార్థము :- ఓ జీవుడా! (సవితా) పరమాత్మ (తే) నీయొక్క (శరీరేభ్యః) జన్మజన్మాంతరముల శరీరములకొరకు (పృథివ్యామ్) అంతరిక్షము, లేకభూమియందు (లోకమ్) కర్మలకు అనుకూలములగు సుఖ దుఃఖముల సాధనరూపములో ప్రాప్తించిన స్థానమును (ఇచ్ఛతు) కోరునో (తస్మై) అట్టి నీకొరకు (ఉస్రియాః) ప్రకాశరూప కిరణములు (యుజ్యన్తామ్) ఉపకరించునుగాక! ॥౨॥

భావార్థము :-ఓ జీవులారా! ఏ జగదీశ్వరుడు మీకొరకు సుఖమును గోరి కిరణములద్వారా లోకలోకాంతరములకు చేర్చుచుండునో, యాతడే మీకు నిజమైన న్యాయకారియని తెలిసికొనుడు.॥౨॥

2. O soul; God grants for thy bodies in different births, according to thy deeds a happy or unhappy place on this earth. May radiant beams prove helpful to thee!.

౧౮౫౪.వాయురిత్యస్య ఆదిత్యా దేవా వా ఋషయః, సవితా దేవతా, ఉష్ణిక్ఛన్దః, ఋషభః స్వరః.

జీవానాం కర్మగతివిషయమాహ. జీవుల కర్మగతి విషయము.

౧౮౫౪ వాయుః పునాతు సవితా పునాత్వగ్నేర్భ్రాజసా సూర్యస్య వర్చసా ।
విముచ్యన్తాముస్రియాః ॥౩॥

ప.వి:- వాయుః, పునాతు, సవితా, పునాతు, అగ్నేః, భ్రాజసా, సూర్యస్య, వర్చసా, వి, ముచ్యన్తామ్, ఉస్రియాః.॥౩॥

పదార్థః :-(వాయుః) (పునాతు) పవిత్రయతు (సవితా) సూర్యః (పునాతు) (అగ్నేః) విద్యుతః (భ్రాజసా) దీప్త్యా (సూర్యస్య) (వర్చసా) ప్రకాశేన (వి) (ముచ్యన్తామ్) త్యజ్యన్తామ్ (ఉస్రియాః) కిరణాః ॥౩॥

అన్వయః:- హే మనుష్యా! వాయురగ్నేర్భ్రాజసా సూర్యస్య వర్చసా యానస్మాన్ పునాతు సవితా పునాతు ఉస్రియా విముచ్యన్తామ్ ॥౩॥

భావార్థః:- యదా జీవాః శరీరాణి త్యక్త్వా విద్యుతం సూర్యప్రకాశం వాయ్వాదీని చ ప్రాప్య గచ్ఛన్తి గర్భం ప్రవిశన్తి తదా కిరణాస్తాన్ త్యజన్తి ॥౩॥

పదార్థము :- ఓ మానవులారా! ఎట్లు (వాయుః) గాలి (అగ్నేః) విద్యుత్తుయొక్క (భ్రాజసా) దీప్తితో

(సూర్యస్య) సూర్యునియొక్క (వర్చసా) తేజముతో మమ్ము (పునాతు) పవిత్రపరచునో (సవితా) సూర్యుడు (పునాతు) పవిత్రమొనర్చునో అట్లే (ఉస్రియాః) కిరణములు (వి ముచ్యన్తామ్) వదలివేయునుగాక!॥3॥

**భావార్థము** :-జీవుడెప్పుడు శరీరమును వదలి విద్యుత్తును, సూర్యప్రకాశమును, వాయువు మున్నగు వానిని ప్రాప్తించుకొని గర్భమునందు ప్రవేశించునో, అపుడు కిరణములు వానిని వదలివేయుచున్నవి.॥3॥

3. O soul, let air purify thee, let God purify thee with lightning's glitter and sun's lustre. Let beams release thee!.

౧౮౫౫. అశ్వత్థ ఇత్యస్య ఆదిత్యా దేవా ఋషయః, వాయుః సవితా చ దేవతే, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మానవు లేమి చేయువలయును?

౧౮౫౫ అశ్వత్థే వో నిషదనం పర్ణే వో వసతిష్కృతా।

గోభాజ ఇత్కిలాసథ యత్సనవథ పూరుషమ్ ॥4॥

ప.వి:-అశ్వత్థే, వః, నిషదనమ్, నిసదనమితి ని+సదనమ్, పర్ణే, వః, వసతిః, కృతా, గోభాజ ఇతి గో + భాజః, ఇత్, కిల, అసథ, యత్, సనవథ, పూరుషమ్, పురుషమితి పురుషమ్.॥4॥

పదార్థః :-(అశ్వత్థే) శ్వః స్థాస్యతి న స్థాస్యతి వా తస్మిన్ననిత్యే సంసారే (వః) యుష్మాకమ్ (నిషదనమ్) స్థాపనమ్ (పర్ణే) పర్ణవచ్చంచలే జీవనే (వః) యుష్మాకమ్ (వసతిః) నివసతిః (కృతా) (గోభాజః) యే గాః పృథివీం వాచమిన్ద్రియాణి కిరణాన్ వా భజన్తి తే (ఇత్) ఏవ (కిల) (అసథ) భవథ (యత్) (సనవథ) సేవధ్వమ్ (పూరుషమ్) సర్వత్ర పూర్ణం పరమాత్మానమ్.॥4॥

అన్వయః:-హే జీవా! యేన జగదీశ్వరేణాశ్వత్థే వో నిషదనం కృతం, పర్ణే వో వసతిః కృతా, యత్పూరుషం కిల సనవథ తేన సహ గోభాజ ఇదర్వాయం ప్రయత్నేన ధర్మేఽసథ.॥4॥

భావార్థః:-మనుష్యైరనిత్యే సంసారేఽనిత్యాని శరీరాణి పదార్థాంశ్చ ప్రాప్య క్షణభఙ్గురే జీవనే ధర్మాచరణేన నిత్యం పరమాత్మానముపాస్యాఽఽత్మపరమాత్మసంయోగజం నిత్యం సుఖం ప్రాపణీయమ్.॥4॥

**పదార్థము** :-ఓ జీవులారా! ఏ జగదీశ్వరుడు (అశ్వత్థే) రేపటివరకు ఉండునా, ఉండదా! అనునటువంటి ఈ యనిత్య ప్రపంచములో (వః) మీయొక్క (నిషదనమ్) స్థితిని [స్థానమును] (పర్ణే) పర్ణమువంటి

చంచలజీవితమందు (వః) మీయొక్క (వసతిః) నివాసమును (కృతా) చేసియున్నాడో (యత్) ఆ (పురుషమ్) సర్వత్ర పరిపూర్ణుడైయున్న పరమాత్మను (కిల) మాత్రమే (సనవథ) సేవించుడు. ఆతనితోగూడ (గోభాజః) పృథివి, వాణి, ఇంద్రియములు లేక కిరణములను సేవించువారలై (ఇత్) మాత్రమే మీరు ప్రయత్నముతో ధర్మమునందు స్థిరము (అసథ) అగుడు.॥౪॥

**భావార్థము** :-మానవులు అనిత్యసంసారము (విశ్వము) నందు అనిత్యమగు శరీరములను, పదార్థములను ప్రాప్తించుకొని క్షణభంగుర జీవితమందు ధర్మాచరణముతో సదా పరమాత్మ యుపాసనము నొనర్చుచుము, పరమాత్మల సంయోగముచే నుత్పన్నమగు నిత్యసుఖమును పొందవలెను.॥౪॥

4. O souls, God has placed ye in this ephemeral world, and made your mansion in this life, ever changing like a leaf worships the Perfect God alone. Through His grace, establish yourselves laboriously in religion, and acquire worldly possessions. Vedic lore and control over passions!.

౧౮౩౬.సవితేత్యస్యాదిత్యా దేవా వా ఋషయః, వాయుసవితారౌ దేవతే, అనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

కన్యా కిం కుర్యాదిత్యాహ. కన్య ఏమి చేయవలయును?

**౧౮౩౬ సవితా తే శరీరాణి మాతురుపస్థ ఆ వపతు। తస్మై పృథివి శం భవ॥౫॥**

**ప.వి:-సవితా, తే, శరీరాణి, మాతుః, ఉపస్థ+ఇత్యుప+స్థే, ఆ, వపతు, తస్మై, పృథివి, శమ్, భవ.॥౫॥**

పదార్థః:-(సవితా) ఉత్పత్తికర్తా పితా (తే) తవ (శరీరాణి) ఆశ్రయాన్ (మాతుః) జననీవన్మాన్య ప్రదాయాః పృథివ్యాః (ఉపస్థే) సమీపే (ఆ) (వపతు) స్థాపయతు (తస్మై) (పృథివి) భూమివద్వర్తమానే కన్యే (శమ్) సుఖకారిణీ (భవ).॥౫॥

అన్వయః:-హే పృథివి! త్వం యస్యాస్తే శరీరాణి మాతురుపస్థే సవితా ఆ వపతు, సా త్వం తస్మై పిత్రే శమ్భవ.॥౫॥

భావార్థః:- హే కన్యే! యుష్మాభిర్వివాహానన్తరమపి జనకస్య జనన్యాశ్చ మధ్యే ప్రీతిర్నైవ త్యాజ్యా కుతస్తాభ్యామేవ యుష్మాకం శరీరాణి నిర్మితాని పాలితాని చ సన్త్యతః.॥౫॥

**పదార్థము** :-(పృథివి) భూమివంటి సహనశీలవగు ఓ కన్యారత్నమా! నీవు (తే) నీయొక్క (శరీరాణి) ఆశ్రయమును (మాతుః) తల్లివలె మాన్యతనిచ్చు పృథివియొక్క (ఉపస్థే) సమీపమందు (సవితా) ఉత్పన్నమొనర్చు తండ్రి (ఆ,వపతు) స్థాపితమొనర్చునో, అట్టి నీవు (తస్మై) ఆ తల్లి దండ్రులకొరకు (శమ్) సుఖకారిణివి (భవ) అగుము.॥౫॥

**భావార్థము** :- ఓ కన్యామణులారా! మీరు వివాహానంతరముకూడ తల్లిదండ్రులయెడ ప్రీతి వదలివేయకుడు. ఏలన వారిరువురిద్వారానే మీ శరీరములు ఉత్పన్నమైనవి. మరియు పోషించి పెంపొందించబడినవని మరువకుడు. ॥౫॥

5. O girl, forbearing like the earth, the father establishes thy asylum on the Earth, kind like a mother, Be pleasant unto him!.

౧౮౫౭౭. ప్రజాపతావిత్యస్యాదిత్యా దేవా ఋషయః, ప్రజాపతిర్దేవతా, ఉష్ణిక్ఛన్దః, ఋషభః స్వరః.

ఈశ్వరోపాసనావిషయమాహ. ఈశ్వరోపాసన విషయము.

౧౮౫౭౭ ప్రజాపతౌ త్వా దేవతాయాముపోదకే లోకే నిదధామ్యసౌ ।

అప నః శోశుచదఘమ్ ॥౬॥

**ప. వి:-** ప్రజాపతావితి ప్రజా+పతౌ, త్వా, దేవతాయామ్, ఉపోదక ఇత్యుప+ఉదకే, లోకే, ని, దధామి, అసౌ, అప, నః, శోశుచత్, అఘమ్. ॥౬॥

పదార్థః :- (ప్రజాపతౌ) ప్రజాయాః పాలకే పరమేశ్వరే (త్వా) త్వామ్ (దేవతాయామ్) పూజనీయాయామ్ (ఉపోదకే) ఉపగతాన్యుదకాని యస్మింస్తస్మిన్ (లోకే) దర్శనీయే (ని) (దధామి) (అసౌ) (అప) (నః) అస్మాకమ్ (శోశుచత్) భృశం శోషయంతు (అఘమ్) పాపమ్. ॥౬॥

అన్వయః :- హే జీవ! యోఽసౌ నోఽఘమపశోశుచత్త్వాం ప్రజాపతౌ దేవతాయాముపోదకే లోకే చ త్వా నిదధామి. ॥౬॥

భావార్థః :- హే మనుష్యా! యో జగదీశ్వర ఉపాసితః సన్ పాపాచరణాత్ పృథక్ కారయతి తస్మిన్నేవ భక్తికరణాయ యుష్మానహం స్థిరీకరోమి యేన సదైవ యూయం శ్రేష్ఠం సుఖదర్శనం ప్రాప్నుయాత. ॥౬॥

పదార్థము :- ఓ జీవుడా! (అసౌ) ఈ లోకము (నః) మనయొక్క (అఘమ్) పాపములను (అప, శోశుచత్) శీఘ్రముగా శుష్కింపజేయును. అట్టి (ప్రజాపతౌ) ప్రజల రక్షకుడు (దేవతాయామ్) పూజనీయుడగు పరమేశ్వరుని (ఉపోదకే) ప్రాప్తించిన, సమీపమందున్న ఉదకముగల (లోకే) దర్శించదగిన స్థానమునందు (త్వా) నీయొక్క (నిదధామి) ధారణము నిరంతరమొనర్చెదను. ॥౬॥

భావార్థము :- ఓ మానవులారా! ఉపాసించబడిన పరమేశ్వరుడు మిమ్ము పాపాచరణమునుండి వేరుగా నుంచును. ఆతనియందు భక్తియుంచుటకు నేను మిమ్ము స్థిరపరచుచున్నాను. దీనిచే మీరు శ్రేష్ఠసుఖములను ప్రాప్తించుకొనగలరు.॥౬॥

6. O soul, May God soon drive away our sin. I establish thee in Him, the Protector of men and Worthy of worship, near a beautiful place full of water!.

౧౦౫౭. పరమిత్యస్య సఙ్కసుక ఋషిః, యమో దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మానవు లేమి చేయవలయును?

౧౦౫౭ పరం మృత్యో అను పరేహి పన్థాం యస్తే అన్య ఇతరో దేవయానాత్ ।

చక్షుష్మతే శృణ్వతే తే బ్రవీమి మా నః ప్రజాꣳరీరిషో మోత వీరాన్ ॥౭॥

ప.వి:–పరమ్, మృత్యో ఇతి మృత్యో, అను, పరా, ఇహి, పన్థామ్, యః, తే, అన్యః, ఇతరః, దేవయానాదితి దేవ+యానాత్, చక్షుష్మతే, శృణ్వతే, తే, బ్రవీమి, మా, నః, ప్రజామితి ప్ర + జామ్, రీరిషః, రిరిష ఇతి రీరిషః, మా, ఉత, వీరాన్ ॥౭॥

పదార్థః :- (పరమ్) ప్రకృష్టమ్ (మృత్యో) మృత్యుః. అత్ర వ్యత్యయః (అను) (పరా) (ఇహి) దూరం గచ్ఛతు (పన్థామ్) మార్గమ్ (యః) (తే) తవ (అన్యః) (ఇతరః) భిన్నః (దేవయానాత్) దేవా విద్వాంసో యాన్తి యస్మింస్తస్మాత్ (చక్షుష్మతే) ప్రశస్తం చక్షుర్విద్యతే యస్య తస్మై (శృణ్వతే) యః శృణోతి తస్మై (తే) తుభ్యమ్ (బ్రవీమి) ఉపదిశామి (మా) (నః) అస్మాకమ్ (ప్రజామ్) (రీరిషః) హింస్యాః (మా) (ఉత) అపి (వీరాన్) ప్రాప్తవిద్యాన్ శరీరబలయుక్తాన్. ॥ ౭ ॥

అన్వయః:-హే మనుష్య ! యస్తే దేవయానాదితరోఽన్యో మార్గోఽస్తి తం పన్థాం మృత్యో పరేహి మృత్యుః పరైతు యతస్త్వం పరం దేవయానమన్విహి అతఏవ చక్షుష్మతే శృణ్వతేఽహం తే బ్రవీమి యథా మృత్యుర్నః ప్రజాం న హింస్యాదుతాపి వీరాన్న హన్యాత్తథా త్వం ప్రజాం మా రీరిష ఉతాపి వీరాన్ మా రీరిషః ॥ ౭ ॥

భావార్థః :-మనుష్యైర్యావజ్జీవనం తావద్విద్వన్మార్గేణ గత్వా పరమాయుర్లబ్ధవ్యమ్. కదాచిద్వినా బ్రహ్మచర్యేణ స్వయంవరం కృత్వాఽల్పాయుషః ప్రజా నోత్పాదనీయా నచైతాసాం బ్రహ్మచర్యానుష్ఠానేన వియోగః కర్తవ్యః.॥౭॥

**పదార్థము:**- ఓ మానవా! (యా) ఏ (తే) నీయొక్క (దేవయానాత్) మార్గమునందు విద్వాంసులు నడచెదరో, అందుకు (ఇతరః) భిన్నముగు (అన్యః) ఇతర మార్గములుగలవో, అట్టి (పన్థామ్) మార్గమునకు (మృత్యో) మృత్యువు (పరా, ఇహి) దూరము తొలగునుగాక! నీవు (పరమ్) ఉత్తమదేవ [దివ్య] మార్గమును (అను) అనుకూలముగ పొందుము. ఇందువల్ల (చక్షుష్మతే) ఉత్తమనేత్రములు గలవాడవు (శృణ్వతే) వినువాడవు నగు (తే) నీకొరకు (బ్రవీమి) ఉపదేశించుచున్నాను. ఏవిధముగ మృత్యువు (నః) మా ప్రజలను, మా వీరులను కబళించదో, అట్లే నీవును (ప్రజామ్) సంతానాదులను (మా, రీరిషః) చంపకుము లేక విషయాదులచే నష్టపరచకుము (ఉత) మరియు (వీరాన్) విద్య మరియు శారీరక బలముచే గూడిన వీరులను (మా) నష్టపరచకుము.॥౭॥

**భావార్థము :**- మానవులు జీవితాంతము ఉత్తమ విద్వాంసుల మార్గమున నడచుచు దీర్ఘాయువును పొందవలెను. బ్రహ్మచర్యము, స్వయంవరవివాహ విధానముచే ఎప్పుడును అల్పాయుష్కులగు సంతానము నుత్పన్నపరచవలదు. ఈ సంతానమును బ్రహ్మచర్యానుష్ఠానమునుండి వేరుగా నుంచరాదని తెలియవలయును. ॥౭॥

7. Go hence, O Death, pursue thy special pathway apart from that which the virtuous are won't to tread. To thee that sees and hears, I say, 'Kill not our offspring, injure not our heroes!.

౧౮౫౯.శం వాత ఇత్యస్య ఆదిత్యా దేవా వా ఋషయః,విశ్వేదేవా దేవతాః,అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

సృష్టిస్థాః పదార్థాః కథం మనుష్యాణాం సుఖకారిణః స్యురిత్యాహ.

సృష్టిస్థ పదార్థములు మానవుల కెట్లు సుఖకరము లగుచున్నవి?

౧౮౫౯ శం వాతః శꣳహి తే ఘృణిః శం తే భవన్త్విష్టకాః।

శం తే భవన్త్వగ్నయః పార్థివాసో మా త్వాభి శూశుచన్ ॥౮॥

ప.వి:-శమ్, వాతః, శమ్, హి, తే, ఘృణిః, శమ్, తే, భవన్తు, ఇష్టకాః, శమ్, తే, భవన్తు, అగ్నయః, పార్థివాసః, మా, త్వా, అభి, శూశుచన్ ॥౮॥

పదార్థః:-(శమ్) సుఖకరః (వాతః) వాయుః (శమ్) (హి) యతః (తే) (ఘృణిః) రశ్మివాన్ సూర్యః (శమ్) (తే) (భవన్తు) (ఇష్టకాః) వేద్యాం చితాః (శమ్) (తే) (భవన్తు) (అగ్నయః) పావకాః (పార్థివాసః) పృథివ్యాం విదితాః (మా) (త్వా) త్వామ్ (అభి) (శూశుచన్) భృశం శోకం కుర్య్యః.॥౮॥

అన్వయః:-హే జీవ! తే వాతః శం భవతు ఘృణిః శం హి భవతు ఇష్టకాస్తే శం భవన్తు పార్థివాసోऽగ్నయస్తే శం భవన్త్వేతే త్వా మభి శూశుచన్.।౮॥

భావార్థః :- హే జీవాస్తథైవ యుష్మాభిర్ధర్మ్యే వ్యవహారే వర్తితవ్యం యథా జీవతాం మృతానాం చ యుష్మాకం సృష్టిస్థా వాయ్వాదయః పదార్థాః సుఖకరాః స్యుః.।౮॥

పదార్థము :- ఓ జీవా! (తే) నీకొరకు (వాతః) వాయువు (శమ్) సుఖకారకమగు గాక! (ఘృణిః) కిరణములతో గూడిన సూర్యుడు (శమ్, హి) సుఖకారకుడగును గాక! (ఇష్టకాః) వేదికయందు చయనమొనర్చ [పేర్చ] బడిన ఇటుకలు(తే) నీకొరకు (శమ్) సుఖదాయకము (భవన్తు) అగును గాక! (పార్థివాసః) పృథివిపై ప్రసిద్ధమగు (అగ్నయః) విద్యుత్తు మున్నగు అగ్నులు (తే) నీకొరకు (శమ్) కల్యాణప్రదములు (భవన్తు) అగు గాక! ఇవి యన్నియును (త్వా) నిన్ను (మా అభి, శూశుచన్) అన్నివైపులనుండి ఎప్పుడు శోకము గలిగించునవి కాకుండుగాక! ।౮॥

భావార్థము :- ఓ జీవులారా! మీ కెప్పుడును అనగా బ్రతికి యున్నప్పుడును, మరణించిన పిదపను సృష్టియొక్క వాయువు మున్నగు పదార్థములు సుఖకారులగునట్లు ధర్మయుక్త వ్యవహారములందు మీరు సదా వర్తించుచుండుడు.।౮॥

8. Pleasant to thee be wind and Sun, and pleasant be the bircks to thee. Pleasant to thee be the terreistrial fires; let not these things put thee to grief.

౧౮౬౦.కల్పన్తామిత్యస్యాదిత్యా దేవా ఋషయః, విశ్వేదేవా దేవతాః,విరాట్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయమాహ.మరల విషయ మయ్యదియే.

౧౮౬౦ కల్పన్తాన్తే దిశస్తుభ్యమాపః శివతమాస్తుభ్యం భవన్తు సిన్ధవః ।

అన్తరిక్షశ్శివం తుభ్యం కల్పన్తాం తే దిశః సర్వాః ।౯॥

ప.వి:- కల్పన్తామ్, తే, దిశః, తుభ్యమ్, ఆపః, శివతమా ఇతి శివ + తమాః, తుభ్యమ్, భవన్తు, సిన్ధవః, అన్తరిక్షమ్, శివమ్, తుభ్యమ్, కల్పన్తామ్, తే, దిశః, సర్వాః.।౯॥

పదార్థః :- (కల్పన్తామ్) సమర్థా భవన్తు (తే) తుభ్యమ్ (దిశః) పూర్వాద్యాః (తుభ్యమ్) (ఆపః) ప్రాణా బలాని వా (శివతమాః) అతిశయేన సుఖకరాః (తుభ్యమ్) (భవన్తు) (సిన్ధవః) నద్యః సముద్రా వా (అన్తరిక్షమ్) ఆకాశమ్ (శివమ్) సుఖకరమ్. శివమితి సుఖ నా... నిఘం. ౩.౬. (తుభ్యమ్) (కల్పన్తామ్) (తే) తుభ్యమ్ (దిశః) ఐశాన్యాద్యాః (సర్వాః) సమగ్రాః.।౯॥

అన్వయః :-హే జీవ! తే దిశశ్శివతమాః కల్పన్తాం తుభ్యమాపః శివతమా భవన్తు తుభ్యం సిన్ధవః శివతమా భవన్తు. తుభ్యం శివమన్తరిక్షం భవతు తే సర్వా దిశః శివతమాః కల్పన్తామ్.॥౯॥

భావార్థః :- యేఽధర్మం విహాయ సర్వథా ధర్మమాచరన్తి తేభ్యః పృథివ్యాదయః సర్వే సృష్టిస్థాః పదార్థా మంగలకారిణో భవన్తి.॥౯॥

పదార్థము :- ఓ జీవుడా! (తే) నీకొరకు (దిశః) తూర్పు మున్నగు దిశలు (శివతమాః) అత్యంత సుఖకారకములు (కల్పన్తామ్) సమర్థవంతములు అగుగాక! (తుభ్యమ్) నీకొరకు (ఆపః) ప్రాణములు లేక జలములు అతిసుఖకారులగుగాక (తుభ్యమ్) నీ కొరకు (సిన్ధవః) నదులు మరియు సముద్రములు అతి సుఖవంతములు (భవన్తు) అగుగాక! (తుభ్యమ్) నీకొరకు (అన్తరిక్షమ్) ఆకాశము (శివమ్) కల్యాణ ప్రదమగు గాక! మరియు (తే) నీకొరకు (సర్వాః) సమస్త (దిశః) ఈశాన్యము మున్నగు విదిశలు అత్యంత కల్యాణకారకములు (కల్పన్తామ్) సమర్థములగుగాక!॥౯॥

భావార్థము :- అధర్మమును త్యజించి అన్నివిధములుగ ధర్మాచరణము నొనర్చువారికి పృథివి మున్నగు సృష్టి సంబంధ సకలపదార్థములు అత్యంత మంగళప్రదము లగును.॥౯॥

9. O soul, let the regions, the waters, and the seas be most propitious for thee. Auspicious unto thee be the atmosphere. Prosper all sub-quarters well for thee!.

౧౮౬౧. అశ్మన్వతీత్యస్య సుచీక ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

కే దుఃఖాత్తరన్తీత్యాహ. ఎవరు దుఃఖములనుండి తరించుచున్నారు?

౧౮౬౧ అశ్మన్వతీ రీయతే సꣳరభధ్వముత్తిష్ఠత ప్ర తరతా సఖాయః ।

అత్రా జహీమోఽశివా యే అసఞ్ఛివాన్వయముత్తరేమాభి వాజాన్ ॥౧౦॥

ప.పి:- అశ్మన్వతీత్యశ్మన్+వతీ, రీయతే, సమ్, రభధ్వమ్, ఉత్, తిష్ఠత, ప్ర, తరత, సఖాయః, అత్ర, జహీమః, అశివాః, యే, అసన్, శివాన్, వయమ్, ఉత్, తరేమ, అభి, వాజాన్.॥౧౦॥

పదార్థః :- (అశ్మన్వతీ) బహవోఽశ్మానో మేఘాః పాషాణా వా విద్యన్తే యస్యాం సృష్టౌ నద్యాం వా సా (రీయతే) గచ్ఛతి (సమ్) సమ్యక్ (రభధ్వమ్) ప్రారమ్భం కురుత (ఉత్)

(తిష్ఠత) ఉద్యతా భవత (ప్ర) (తరత) దుఃఖాన్యుల్లఙ్ఘయత. అత్ర సంహితాయామితి దీర్ఘః (సఖాయః) సుహృదః సన్తః (అత్ర) అస్మిన్ సంసారే సమయే వా. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (జహీమః) త్యజామః (అశివాః) అకల్యాణకరాః (యే) (అసన్) సన్తి (శివాన్) సుఖకరాన్ (వయమ్) (ఉత్) (తరేమ) ఉల్లంఘయేమ (అభి) (వాజాన్) అత్యుత్తమానాన్నాది భోగాన్.॥౧౦॥

అన్వయః :- హే సఖాయో! యాఽశ్మన్వతీ రీయతే తయా వయం యేఽత్రాశివా అసన్స్తాన్ జహీమః శివాన్వాజానభ్యుత్తరేమ తథా యూయం సంరభధ్వముత్తిష్ఠత ప్రతరత చ.॥౧౦॥

భావార్థః :- యే మనుష్యా బృహత్యా నౌకయా సముద్రమివాఽశుభాచరణాని దుష్టాంశ్చ తీర్త్వా ప్రయత్నేనోద్యమినో భూత్వా మఙ్గలాన్యాచరేయుస్తే దుఃఖసాగరం సహజతః సన్తరేయుః.॥౧౦॥

**పదార్థము :-** (సఖాః) ఓ మిత్రులారా! ఏది (అశ్మన్వతీ) అనేక మేఘములు లేక శిలలు, రత్నములు లేదా నదీప్రవాహములతో నీ సృష్టి (రీయతే) నడచుచున్నదో, దానితోకూడ ఎట్లు (వయమ్) మేము (యే) ఏ (అత్ర) ఈ జగమునందు లేక కాలమునందు (అశివాః) అకల్యాణకారకములు (అసన్) కలవో, వానిని (జహీమ) వదలివేయుచున్నామో, మరియు (శివాన్) సుఖవంతములు (వాజాన్) అత్యుత్తమ మగు అన్నము మున్నగు భాగములను (అభి, ఉత్, తరేమ) అన్నివైపులనుండి తరించి వెళ్లుదుమో, అనగా భోగించెదమో, అటులనే మీరును (సం రభధ్వమ్) చక్కగా ప్రారంభించుడు (ఉత్తిష్ఠత) ఉద్యుతు లగుడు. మరియు (ప్రతరత) దుఃఖములను ఉల్లంఘించుడు.॥౧౦॥

**భావార్థము:-** ఏ మనుష్యులు గొప్పనౌకద్వారా సముద్రమును దాటెదరో, అటులనే అశుభాచరణములు మరియు దుష్టులను దాటివేసి ప్రయత్నపూర్వకముగ ఉద్యమించి శుభాచరణములొనర్చువారు సహజముగానే దుఃఖసాగరమును దాటిపోగలుగుదురు.॥౧౦॥

10. On flows this stormy, sensual river-like world, work cautiously, my friends, arise and overcome all obstacles.

Let us abandon what is profitless in this world, and enjoy excellent foods.

౧౧.అపాఘమిత్యస్య శునః శేప ఋషిః, ఆపో దేవతాః, విరాడనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ కే పవిత్రకారకా ఇత్యాహ. ఏ మానవులు పవిత్రకారకులు?

౧౧. అపాఘమప కిల్బిషమప కృత్యామపో రపః।
అపామార్గ త్వమస్మదప దుఃష్వప్న్యꣳసువ ॥౧౧॥

ప.వి:- అప, అఘమ్, అప, కిల్బిషమ్, అప, కృత్యామ్, అపో + ఇత్యపో, రపః, అపామార్గ, అపమార్గేత్యప + మార్గ, త్వమ్, అస్మత్, అప, దుఃష్వప్న్యమ్, దుఃష్వప్న్యమితి దుః + స్వప్న్యమ్, సువ.॥౧౧॥

పదార్థః :-(అప) దూరీకరణే (అఘమ్) పాపమ్ (అప) (కిల్బిషమ్) స్వాన్తస్థం మలమ్ (అప) (కృత్యామ్) దుష్క్రియామ్ (అపో) దూరీకరణే (రపః) బాహ్యేన్ద్రియచాఞ్చల్య జన్యమపరాధమ్ (అపామార్గ) రోగనివారకోఽపామార్గ ఓషధిరివ పాపదూరీకర్తః (త్వమ్) (అస్మత్) అస్మాకం సకాశాత్ (అప) (దుఃష్వప్న్యమ్) దుష్టశ్చాసౌ స్వప్నో నిద్రా చ తస్మిన్ భవమ్ (సువ) ప్రేరయ.॥౧౧॥

అన్వయః :- హే అపామార్గ! త్వమస్మదఘమపసువ కిల్బిషమపసువ కృత్యామపసువ రపోఽపోసువ దుఃష్వప్న్యమపసువ.॥౧౧॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథాఽపామార్గాద్యోషధయో రోగాన్నివార్య ప్రాణినః సుఖయన్తి తథా స్వయం సర్వేభ్యో దోషేభ్యః పృథగ్భూత్వాఽన్యానశుభాచరణాత్ పృథక్ కృత్వా యే శుద్ధా భవన్త్యన్యాన్ భావయన్తి చ త ఏవ మనుష్యాదీనాం పవిత్రకరాః సన్తి.॥౧౧॥

**పదార్థము** :- (అపామార్గ) అపామార్గము [ఉత్తరేణి] అను ఓషధి ఎట్లురోగములను దొలగించునో, అటులనే పాపములను దూరమొనర్చు సజ్జనుడా! (త్వమ్) నీవు (అస్మత్) మా సమీపమునుండి (అఘమ్) పాపములను (అప, సువ) దూరమొనర్చుము. (కిల్బిషమ్) మనుస్సునందలి మాలిన్యమును నీవు (అప) దూరమొనర్చుము. (కృత్యామ్) దుష్టక్రియలను (అప) దూరమొనర్చుము. (రపః) బాహ్యేంద్రియముల చంచలరూప అపరాధములను (అపో) దూరమొనర్చుము. మరియు (దుఃష్వప్న్యమ్) దుఃస్వప్నములు [కలతనిద్రయందు సంభవమగు చెడుకలలు లేక ఆలోచనలను] (అప) దూరమొనర్చుము.॥౧౧॥

**భావార్థము** :- ఈ మంత్రములో ఉపమాలంకార మున్నది. ఏవిధముగా అపామార్గ [ఉత్తరేణి] అను ఓషధి మరియు ఇతరోషధులు వ్యాధులను దొలగించి ప్రాణులకు సుఖమును సమకూర్చుచున్నవో, అదేవిధముగా తాము సమస్త దోషములకు దూరముగనుండి ఇతర మానవులను అశుభాచరణములనుండి వేరుగ నుంచి తాము శుద్ధులై యుండి ఇతరులను శుద్ధులుగ నుంచువారే మనుష్యులు మున్నుగువారిని పవిత్రమొనర్చుటకు యోగ్యు లగుదురు. ॥౧౧॥

**11. O God, the Remover of sins, drive away from us sin, the impurity of soul, evil deeds, the offence committed by our unsteady external organs, and evil thoughts!.**

౧౭౬౩.సుమిత్రియా న ఇత్యస్యాదిత్యా దేవా ఋషయః,ఆపో దేవతాః,నిచృదనుష్టుప్ ఛన్దః,ఋషభః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యురిత్యాహ. మానవు లేమి చేయవలయును?

౧౭౬౩ సుమిత్రియా న ఆప ఓషధయః సన్తు దుర్మిత్రియాస్తస్మై సన్తు ।
యో౨ఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః ॥౧౨॥

ప.వి:- సుమిత్రియా ఇతి సు + మిత్రియాః, నః, ఆపః, ఓషధయః, సన్తు, దుర్మిత్రియా ఇతి దుః + మిత్రియాః, తస్మై సన్తు, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః.॥౧౨॥

పదార్థః :-(సుమిత్రియాః) శోభనా మిత్రా ఇవ(నః) అస్మభ్యమ్ (ఆపః) ప్రాణా జలాని వా (ఓషధయః) సోమాద్యాః (సన్తు) (దుర్మిత్రియాః) దుర్మిత్రాః శత్రవ ఇవ దుఃఖప్రదాః (తస్మై) (సన్తు) (యః) (అస్మాన్) ధర్మాత్మనః (ద్వేష్టి) అప్రసన్నయతి (యమ్) దుష్టాచారిణమ్ (చ) (వయమ్) (ద్విష్మః) అప్రీతయామః.॥౧౨॥

అన్వయః :-హే మనుష్యా! యా ఆప ఓషధయో నో౨ఽస్మభ్యం సుమిత్రియాః సన్తు తా యుష్మభ్యమపి తాదృశ్యో భవన్తు. యో౨ఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తస్మా ఏతా దుర్మిత్రియాః సన్తు.॥౧౨॥

భావార్థః :-యే రాగద్వేషాదిదోషాన్ విహాయ సర్వేషు స్వాత్మవద్వర్తన్తే తేభ్యో ధర్మాత్మభ్యః సర్వే జలౌషధ్యాదయః పదార్థాః సుఖకరా భవన్తి యే చ స్వాత్మపోషకాః పరద్వేషిణస్తేభ్యో౨ఽధర్మాత్మభ్యః సర్వ ఏతే దుఃఖకరా భవన్తి మనుష్యైర్ధర్మాత్మభిః సహ ప్రీతిర్దుష్టాత్మభిః సహా౨ఽప్రీతిశ్చసతతం కార్యా పరన్తు తేషా మప్యన్తఃకరణేన కల్యాణమేషణీయమ్.॥౧౨॥

**పదార్థము** :- ఓ మానవులారా! (ఆపః) ప్రాణములు లేక జలములు మరియు (ఓషధయః) సోమలతాది ఓషధులు (నః) మాకొరకు (సుమిత్రియాః) ప్రాణస్నేహితునివలె హితకారకములు (సన్తు) అగుగాక! మీకొరకును అదేవిధముగ అగుగాక! (యః) ఎవరు (అస్మాన్) ధర్మాత్ములగు మమ్ము (ద్వేష్టి) ద్వేషించుచుందురో (చ) మరియు (యమ్) ఏ దుష్టాచారి యెడ (వయమ్) మేము (ద్విష్మః) అసంతుష్టులుగ నుందుమో (తస్మై) వారికొరకు నా పదార్థములు (దుర్మిత్రియాః) శత్రువులకు వలె దుఃఖదాయకము (సన్తు) అగునుగాక!॥౧౨॥

**భావార్థము** :-రాగద్వేషములు మున్నగు దోషములను వదలి అందరియెడ తన ఆత్మకువలె ప్రవర్తించు ధర్మాత్ములకొరకై సర్వ ఓషధులు, జలములు మున్నగు పదార్థములు సుఖకారకము లగును. మరియు

స్వార్థమునందు ప్రీతియుంచి ఇతరులను ద్వేషించు నా ధర్మహీనులకు ఉపరోక్త పదార్థములన్నియును దుఃఖదాయకము లగును. మానవులు ధర్మాత్ములయెడ ప్రీతి మరియు దుష్టులయెడ నిరంతరము అప్రీతియే యుంచవలయును. కాని మనస్పూర్తిగా అట్టి దుష్టులకు హితమునే కోరవలెను.॥౧౨॥

12. To us let waters, and the medicinal plants be friendly, to him who hates us, whom we hate, unfriendly.

౧౮౬౪. అనడ్వానిత్యస్యాదిత్యా దేవా ఋషయః, కృషీవలా దేవతాః, స్వరాడనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

కే మనుష్యాః కార్యం సాద్ధుం శక్నువన్తీత్యాహ. ఏ మానవులు కార్యములను సాధించ గలరు ?

౧౮౬౪ అనడ్వాహమన్వారభామహే సౌరభేయꣳ స్వస్తయే ।

స న ఇన్ద్ర ఇవ దేవేభ్యో వహ్నిః సన్తరణో భవ ॥౧౩॥

ప. వి:- అనడ్వాహమ్, అన్వారభామహ ఇత్యను ఆరభామహే, సౌరభేయమ్, స్వస్తయే, సః, నః, ఇన్ద్ర ఇవేతీన్ద్రః + ఇవ, దేవేభ్యః, వహ్నిః, సన్తరణ ఇతి సమ్ + తరణః, భవ.॥౧౩॥

పదార్థః :- (అనడ్వాహమ్) యోఽనాంసి శకటాని వహతి తద్వద్వర్తమానమ్ (అన్వారభామహే) యానాని రచయిత్వా తత్ర స్థాపయేమ (సౌరభేయమ్) సురభ్యా అపత్యమ్ (స్వస్తయే) సుఖాయ (సః) (నః) అస్మభ్యమ్ (ఇన్ద్ర ఇవ) విద్యుదివ (దేవేభ్యః) విద్వద్భ్యః (వహ్నిః) సద్యో వోఢాగ్నిః (సన్తరణః) యః సమ్యగధ్వనస్తారయతి పారం కరోతి సః (భవ) భవతు.॥౧౩॥

అన్వయః :- హే విద్వన్! యో వహ్నిర్నో దేవేభ్యః సన్తరణో భవతి తం సౌరభేయమనడ్వాహమివ వర్తమానమగ్నిం వయం స్వస్తయేఽన్వారభామహే. స తుభ్యం ఇన్ద్ర ఇవ భవ భవతు.॥౧౩॥

భావార్థః :- యే మనుష్యా విద్యుదాద్యగ్నివిద్యయా యానాదీని కార్యాణి కర్తుమారభన్తే తే బలిష్ఠైర్వృషభైః కృషీవలా ఇవ స్వకార్యాణి సాద్ధుం శక్నువన్తి విద్యుదివేతస్తతో గన్తుఞ్చ.॥౧౩॥

**పదార్థము** :- ఓ విద్వాంసుడా! (వహ్ని) శీఘ్రముగా చేర్పించు ఏ యగ్ని (నః, దేవేభ్యః) విద్వాంసులమగు మాకొరకు (సన్తరణః) చక్కగా మార్గముల దాటించునది యగునో, అట్టి (సౌరభేయమ్) సురభి గోవుయొక్క సంతానము (అనడ్వాహమ్) శకటము మున్నగువానిని లాగునట్టి ఎద్దువలె నున్న యగ్నిని

మేము (స్వస్తయే) సుఖముకొరకు (అన్వారభామహే) యానములను సిద్ధపరచి వానియందు ప్రాణులను స్థిరమొనర్చిన (సః) అది నీకొరకు (ఇన్ద్ర ఇవ) విద్యుత్తువలె (భవ) అగుగాక! ॥౧౩॥

**భావార్థము** :- ఏ మనుష్యులు విద్యుత్తు మున్నగు అగ్నివిద్యలచే యానములు మున్నగువానిని నిర్మించుట మున్నగు కార్యముల నభ్యసించెదరో వా రతిశక్తివంతమగు ఎద్దులచే వ్యవసాయమొనర్చువారికి దీటగు కార్యములను సాధించగలరు. మరియు విద్యుదగ్నివలె అటునిటు సంచరించగలుగుదురు. ॥౧౩॥

13. Electricity carries us the learned to distant places, Just as an ox carries the cart, so we use this electricity for prosperity in preparing planes and seating people therein. May that serve as lightning for you.

౧౪. ఉద్వయన్తమిత్యస్యాదిత్యా దేవా ఋషయః, సూర్యో దేవతా, విరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

కే మోక్షమధిగచ్ఛన్తీత్యాహ. ఎవరు మోక్షమును పొందుచున్నారు ?

౧౪. ఉద్వయన్తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్ ।

దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్ ॥౧౪॥

ప.వి:- ఉత్, వయమ్, తమసః, పరి, స్వరితి స్వః, పశ్యన్తః, ఉత్తరమిత్యుత్ + తరమ్, దేవమ్, దేవత్రేతి, దేవ + త్రా, సూర్యమ్, అగన్మ, జ్యోతిః, ఉత్తమమిత్యుత్+తమమ్. ॥౧౪॥

పదార్థః :- (ఉత్) (వయమ్) (తమసః) అన్ధకారాత్ (పరి) వర్జనే (స్వః) స్వప్రకాశ మాదిత్యమ్ (పశ్యన్తః) ప్రేక్షమాణాః (ఉత్తరమ్) దుఃఖేభ్య ఉత్తారకం పరత్ర వర్తమానమ్ (దేవమ్) విజయాది లాభప్రదమ్ (దేవత్రా) దేవేషు విద్వత్సు ప్రకాశమయేషు సూర్యాదిషు వా (సూర్యమ్) అన్తర్యామిరూపేణ స్వవ్యాప్త్యా చరాఽచరాత్మానం పరమాత్మానం (అగన్మ) విజానీయామ (జ్యోతిః) స్వప్రకాశమ్ (ఉత్తమమ్) సర్వోత్కృష్టమ్. ॥౧౪॥

అన్వయః :- హే మనుష్యా ! వయం యం తమసస్పరి స్వరివ వర్తమానం దేవత్రా దేవం జ్యోతిరుత్తమముత్తరం సూర్యం పశ్యన్తః సన్తః పర్యుదగన్మ తమేవ యూయమపి సర్వతో విజానీత. ॥౧౪॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే మనుష్యా! యథా సూర్యం పశ్యన్తో దీర్ఘాయుషో ధర్మాత్మానో జనాః సుఖం లభన్తే తథైవ ధార్మికా యోగినో మహాదేవం సర్వప్రకాశకం జన్మమృత్యుక్లేశాదిభ్యః పృథగ్ వర్తమానం సచ్చిదానన్దస్వరూపం పరమాత్మానం సాక్షాద్విజ్ఞాయ మోక్షమవాప్య సతతమానన్దన్తి. ॥౧౪॥

**పదార్థము** :- ఓ మానవులారా! (వయమ్) మేము ఏ (తమసః) అంధకారమున కావల (స్వః) స్వయంప్రకాశరూపుడగు సూర్యునివలెనున్న (దేవత్రా) విద్వాంసుల లేక ప్రకాశమయ సూర్యాది పదార్థములందు (దేవమ్) విజయము మున్నగు లాభములను గలిగించువాడు (జ్యోతిః) స్వయంప్రకాశమయ స్వరూపుడు (ఉత్తమమ్) సర్వోత్తముడు (ఉత్తరమ్) దుఃఖములనుండి దరిజేర్చువాడు (సూర్యమ్) అంతర్యామి రూపమున వ్యాప్తమైయుండి సకలచరాచరములకు స్వామియగు పరమాత్మను (పశ్యన్తః) జ్ఞానదృష్టిచే జూచుచు (పరి ఉత్, అగన్మ) అన్నివైపులనుండి ఉత్కృష్టతతో ఎరుగుదుమో, వానిని మీరును తెలిసికొనుడు. ॥౧౪॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఏవిధముగ సూర్యుని జూచుచు దీర్ఘాయుష్మంతులగు ధర్మాత్ములు సుఖప్రాప్తిని పొందెదరో, అదేవిధముగ ధర్మాత్ములగు యోగులు మహాదేవుడు, సర్వప్రకాశకుడు, జన్మమరణక్లేశాదులు లేనివాడు, సచ్చిదానందస్వరూపుడగు పరమాత్మను సాక్షాత్కారమొనర్చుకొని మోక్షమును పొంది నిరంతరము ఆనందము ననుభవించు చుందురు. ॥౧౪॥

14. May we always keeping in view, eagerly know and realize God, free from the darkness of ignorance, Self-Effulgent, Releaser from afflictions, the most Learned of the learned, the Light that is most Excellent.

౧౮౬౬. ఇమమిత్యస్య సఙ్కుసుక ఋషిః, ఈశ్వరో దేవతా, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౬౬ ఇమం జీవేభ్యః పరిధిం దధామి మైషాం ను గాదపరో అర్థమేతమ్ ।
శతం జీవన్తు శరదః పురూచీరన్తర్మృత్యుం దధతాం పర్వతేన ॥౧౫॥

ప. విః- ఇమమ్, జీవేభ్యః, పరిధిమితి పరి + ధిమ్, దధామి, మా, ఏషామ్, ను, గాత్, అపరః, అర్థమ్, ఏతమ్, శతమ్, జీవన్తు, శరదః, పురూచీః, అన్తః, మృత్యుమ్, దధతామ్, పర్వతేన. ॥౧౫॥

పదార్థః :-(ఇమమ్) ప్రత్యక్షమ్ (జీవేభ్యః) ప్రాణధారకేభ్యః స్థావరశరీరేభ్యశ్చ (పరిధిమ్) మర్యాదామ్ (దధామి) వ్యవస్థాపయామి (మా) (ఏషామ్) జీవానామ్ (ను) సద్యః (అగాత్) ప్రాప్నుయాత్ (అపరః) అన్యః (అర్థమ్) ద్రవ్యమ్ (ఏతమ్) ప్రాప్తమ్ (శతమ్) (జీవన్తు) (శరదః)(పురూచీః) యాః పురూణి బహూని వర్షాణ్యఞ్చన్తి తాః (అన్తః) మధ్యే (మృత్యుమ్) (దధతామ్) ధారయన్తు (పర్వతేన) జ్ఞానేన బ్రహ్మచర్యాదినా వా. ॥౧౫॥

**అన్వయః:- అహం పరమేశ్వర ఏషాం జీవానామేతమర్థమపరో మా ను గాదితీమం జీవేభ్యః పరిధిం దధామ్యేవమాచరన్తో భవన్తః పురూచీః శతం శరదో జీవన్తు పర్వతేన మృత్యుమన్తర్ధ ధతామ్.॥౧౫॥**

**భావార్థః:- హే మనుష్యా! యే పరమేశ్వరేణ వ్యవస్థాపితాం ధర్మాచరణం కార్యమధర్మా చరణం త్యాజ్యమితి మర్యాదాం నోల్లఙ్ఘన్తేఽన్యాయేన పరపదార్థాన్న స్వీకుర్వన్తి తేఽరోగాః సన్తశ్శతం వర్షాణి జీవితుం శక్నువన్తి నేతర ఈశ్వరాజ్ఞాభఙ్క్తారః. యే పూర్ణేన బ్రహ్మచర్యేణ విద్యా అధీత్య ధర్మమాచరన్తి తాన్మృత్యుర్మధ్యే నాప్నోతీతి.॥౧౫॥**

**పదార్థము :-** పరమేశ్వరుడనగు నేను (ఏషామ్) ఈ జీవుల (ఏతమ్) పరిశ్రమద్వారా పొందినట్టి (అర్థమ్) ద్రవ్యములను (అపరః) ఇతరులెవ్వరును (మా,ను,గాత్) తేలికగా ప్రాప్తించుకొనవలదు. ఈవిధముగ (ఇమమ్) ఈ (జీవేభ్యః) జీవులకొరకు (పరిధిమ్) మర్యాదను (దధామి) వ్యవస్థితమొనర్చు చున్నాను. ఈ విధముగ ఆచరించుచు మీరు (పురూచీః) అనేక సంవత్సరములు అనగా (శతమ్) నూరు (శరదః) శరదృతువులు సంపూర్ణముగ (జీవన్తు) జీవించుడు (పర్వతేన) జ్ఞానము లేక బ్రహ్మచర్యాదులచే (మృత్యుమ్) మృత్యువును (అన్తః, దధతామ్) అణచివేయుడు, అనగా దూరమొనర్చుడు.॥౧౫॥

**భావార్థము :-** ఓ మానవులారా! పరమేశ్వరుడేర్పరచిన ధర్మాచరణముచేయుచు అధర్మాచరణమును త్యజించుట యను మర్యాద నతిక్రమించక, అన్యాయముగ ఇతరుల పదార్థములను ఎవరు గ్రహింపక యుందురో, వారారోగ్యవంతులై నూరువత్సరములవరకు జీవించగలరు. మరియు ఈశ్వరాజ్ఞకు విరోధులై యుండరు. పూర్ణ బ్రహ్మచర్యముతో విద్యలనభ్యసించి ధర్మాచరణమం దుండువారికి మధ్యకాలములో మృత్యువు దరిజేరదు.॥౧౫॥

15. So that none may confiscate speedily the wealth amassed through exertion by these souls, I establish a law of morality, following which you can live for a hundred lengthened autumns, and keep death away through celibacy and knowledge.

౧౮౬౭ అగ్న ఇత్యస్యాదిత్యా దేవా ఋషయః, అగ్నిర్దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

కే జనా దీర్ఘాయుషో భవన్తీత్యాహ. ఏ మానవులు దీర్ఘాయువును పొందుదురు?

**౧౮౬౭ అగ్న ఆయూꣳషి పవస ఆ సువర్జ్మిషఞ్చ నః।**

**ఆరే బాధస్వ దుచ్ఛునామ్ ॥౧౬॥**

**ప.వి:- అగ్నే, ఆయూꣳషి, పవసే, ఆ, సువ, ఊర్జమ్, ఇషమ్, చ, నః, ఆరే, బాధస్వ, దుచ్ఛునామ్.॥౧౬॥**

పదార్థః:- (అగ్నే) పరమేశ్వర విద్వన్ వా (ఆయూంషి) అన్నాదీని జీవనాని వా. ఆయురిత్యన్న నా... నిఘం. ౨.౧ (పవసే) పవిత్రీకరోషి (అ) (సువ) జనయ (ఊర్జమ్) బలమ్ (ఇషమ్) విజ్ఞానమ్ (చ) (నః) అస్మభ్యమ్ (ఆరే) దూరే నికటే వా (బాధస్వ) (దుచ్ఛునామ్) దుష్టాః శ్వాన ఇవ వర్తమానాస్తాః హింస్యాః ప్రాణినః.అత్ర కర్మణి షష్ఠీ॥౧౬॥

అన్వయః:-హే అగ్నే! త్వమాయూంషి పవసే న ఊర్జమిషం చాసువ దుచ్ఛునామారే బాధస్వ. ॥౧౬॥

భావార్థః :-యే మనుష్యా దుష్టాచరణదుష్టసఙ్గౌ విహాయ పరమేశ్వరాప్తయోః సేవాం కుర్వన్తి తే ధన ధాన్యయుక్తాః సన్తో దీర్ఘాయుషో భవన్తి.॥౧౬॥

పదార్థము :- (అగ్నే) పరమేశ్వరా! లేక విద్వాంసుడా! నీవు (ఆయూంషి)అన్నము మున్నగు పదార్థములను లేక జీవితములను (పవసే) పవిత్రపరచుచున్నావు (నః) మాకొరకు (ఊర్జమ్) బలము (చ) మరియు (ఇషమ్) విజ్ఞానమును (ఆ,సువ) చక్కగా ఉత్పన్నపరచుము. మరియు (దుచ్ఛునామ్) శునకములవంటి దుష్ట హింసక ప్రాణులను (ఆరే) దూరమునందు లేక సమీపమునందును (బాధస్వ) తాడనమొనర్చుము [గట్టిగా శిక్షింపుము].॥౧౬॥

భావార్థము :-ఏ మనుష్యులు దుష్టుల ఆచరణమును, సాంగత్యమును వదలివేసి పరమేశ్వరుని, మరియు ఆప్తులు, సత్యవాదులగు విద్వాంసుల సేవలనొనర్చెదరో, వారు సకలైశ్వర్యములతో దీర్ఘాయుష్మంతులై యుందురు.॥౧౬॥

16.O God, Thou purifiest our lives. Grant us vigorous strength and knowledge. Punish adequately the violent far or near!.

౧౮౬౮ ఆయుష్మానిత్యస్య వైఖానస ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ రాజధర్మవిషయమాహ. రాజధర్మ విషయము.

౧౮౬౮ ఆయుష్మానగ్నే హవిషా వృధానో ఘృతప్రతీకో ఘృతయోనిరేధి। ఘృతం

పీత్వా మధు చారు గవ్యం పితేవ పుత్రమభి రక్షతాదిమాన్త్స్వాహా ॥౧౭॥

ప.వి:- ఆయుష్మాన్, అగ్నే, హవిషా, వృధానః, ఘృతప్రతీక ఇతి ఘృత + ప్రతీకః, ఘృతయోనిరితి ఘృత + యోనిః, ఏధి, ఘృతమ్, పీత్వా, మధు, చారు, గవ్యమ్, పితేవేతి

పితా + ఇవ, పుత్రమ్, అభి, రక్షతాత్, ఇమాన్, స్వాహా ॥౧౭॥

పదార్థః :- (ఆయుష్మాన్) బహ్వాయుర్విద్యతే యస్య సః (అగ్నే) అగ్నిరివ వర్తమాన రాజన్ (హవిషా) ఘృతాదినా (వృధానః) వర్ధమానః. అత్ర బహులం ఛన్దసీతి శానచి శపో లుక్. (ఘృతప్రతీకః) యో ఘృతముదకం ప్రత్యాయయతి సః (ఘృతయోనిః) ఘృతం ప్రదీప్తం తేజో యోనిః కారణం గృహం వా యస్య సః (ఏధి) భవ (ఘృతమ్) (పీత్వా) (మధు) మధురమ్ (చారు) సున్దరమ్ (గవ్యమ్) గోర్వికారమ్ (పితేవ) (పుత్రమ్) (అభి) అభిముఖ్యే (రక్షతాత్) రక్ష (ఇమాన్) (స్వాహా) సత్యయా క్రియయా.॥౧౭॥

అన్వయః :- హే అగ్నే! యథా హవిషా వృధానో ఘృతప్రతీకో ఘృతయోనిరగ్నిర్వర్ధతే తథాఽఽయుష్మాంస్త్వమేధి. మధు చారు గవ్యం ఘృతం పీత్వా పుత్రం పితేవ స్వాహేమానభి రక్షతాత్.॥౧౭॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా సూర్యాదిరూపేణాగ్నిర్బాహ్యాభ్యన్తరః సన్ సర్వాన్ రక్షతి తథైవ రాజా పితృవద్వర్తమానః సన్ పుత్రమివేమాః ప్రజాః సతతం రక్షేత్.॥౧౭॥

పదార్థము :- (అగ్నే) అగ్నివంటి తేజశ్శాలివగు ఓ రాజా! ఎట్లు (హవిషా) ఘృతాదులచే (వృధానః) వృద్ధియైన (ఘృతప్రతీకః) జలముల ప్రసిద్ధముచేయు (ఘృతయోనిః) ఎద్దానికి ప్రదీప్త తేజము కారణమో లేక గృహముగ గలిగియున్న అగ్ని యెటుల వృద్ధియగునో, అటులనే (ఆయుష్మాన్) గొప్ప వయస్సు గలవాడవుగ నీవు (ఏధి) అగుము (మధు) మధురమగు (చారు) సుందరమైన (గవ్యమ్) గోవు (ఘృతమ్) ఘృతమును (పీత్వా) త్రాగి (పుత్రమ్) పుత్రునకు (పితేవ) తండ్రివలె (స్వాహా) సత్యమగు క్రియద్వారా (ఇమాన్) ఈ ప్రజలగు మానవులను (అభి) ప్రత్యక్షముగ అన్నివిధముల (రక్షతాత్) రక్షణయొనర్చుము. ॥౧౭॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ అగ్ని సూర్యుడు మున్నగు రూపములచే లోపల, వెలుపల నుండి సర్వమును రక్షణయొనర్చునో, అదేవిధముగ రాజు తండ్రివలె వర్తించుచు ఈ ప్రజలను కన్నబిడ్డలనువలె నిరంతరము రక్షించుచుండవలయును.॥౧౭॥

17. O King, brilliant like fire, just as fire fanned by butter, with source of lustre, waxes with oblations, so shouldst thou live long!.

When thou ahst assimilated the cow' fair savoury ghee, guard nicely, as a father guards his son, thy subjects.

౧౮. పరీమే ఇత్యస్య భారద్వాజః శిరమ్బిఠ ఋషిః, ఇన్ద్రో దేవతా, విరాడనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౯. పరీమే గామనేషత పర్యగ్నిమహృషత ।

దేవేష్వక్రత శ్రవః క ఇమాఀ2॥ఉ॥ఆ దధర్షతి ॥౧౮॥

ప.వి:-పరి, ఇమే, గామ్, అనేషత, పరి, అగ్నిమ్, అహృషత, దేవేషు, అక్రత, శ్రవః, కః, ఇమాన్, ఆ, దధర్షతి. ॥౧౮॥

పదార్థః:-(పరి) సర్వతః (ఇమే) (గామ్) వాణీం పృథివీం వా (అనేషత) (పరి) సర్వతః (అగ్నిమ్) (అహృషత) హరత (దేవేషు) విద్వత్సు (అక్రత) కురుత. అత్ర మంత్రే ఘసేతి చ్లేర్లుక్ (శ్రవః) అన్నమ్ (కః) (ఇమామ్) (ఆ) (దధర్షతి) ధర్షయితుం శక్నోతి. అత్ర లేటి వ్యత్యయేన శ్లుః.॥౧౮॥

అన్వయః :-హే రాజజనాః! య ఇమే యూయం గాం పర్యనేషతాఽగ్నిం పర్యహృషత. ఏషు దేవేషు శ్రవోఽక్రతైవం భూతానిమాన్భవతః క ఆ దధర్షతి.॥౧౮॥

భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే రాజజనాః పృథివీవద్ధీరా అగ్నివత్తేజస్వినోఽన్నవ దాయుష్కరాః సన్తో ధర్మేణ ప్రజా రక్షన్తి తేఽతులాం రాజశ్రియమాప్నువన్తి.॥౧౮॥

**పదార్థము** :- ఓ రాజపురుషులారా! (ఇమే) ఇట్టిమీరు (గామ్) వాణి లేక పృథివిని (పరి, అనేషత) స్వీకరించుడు (అగ్నిమ్) అగ్నిని (పరి, అహృషత) అన్నివైపులనుండి హరించుడు. అనగా కార్యమునందు ఉపయోగించుకొనుడు. ఈ (దేవేషు) విద్వాంసులందు (శ్రవః) అన్నమును (అక్రత) ఒనర్చుడు. ఈవిధముగ నుండు (ఇమాన్) మిమ్ము (కః) ఎవ్వడును (ఆ, దధర్షతి) భయపరచలేడు.॥౧౮॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. ఏ రాజపురుషులు పృథివివంటి ధీరత్వము, అగ్నివంటి తేజము, అన్నమువంటి ఆయుర్వర్ధకముగ నుండి ధర్మయుక్తముగ ప్రజాపాలన మొనర్తురో, వారు అతులరాజ్యలక్ష్మిని పొందగలరు.॥౧౮॥

18. If all study the Vedas, enter domestic life after due ceremony, listen to the spiritual teachings of the learned; who will then attack them with success?.

౧౯౨౦. క్రవ్యాదమిత్యస్య దమన ఋషిః, అగ్నిర్దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౮౪౦ క్రవ్యాదమగ్నిం ప్ర హిణోమి దూరం యమరాజ్యం గచ్ఛతు రిప్రవాహః।
ఇహైవాయమితరో జాతవేదా దేవేభ్యో హవ్యం వహతు ప్రజానన్ ॥౧౯॥

ప.వి:-క్రవ్యాదమితి క్రవ్యా+అదమ్, అగ్నిమ్,ప్ర, హినోమి, దూరమ్, యమరాజ్యమితి యమరాజ్యమ్ గచ్ఛతు, రిప్రవాహః ఇతి రిప్ర + వాహః, ఇహ, ఏవ, అయమ్, ఇతరః, జాతవేదా ఇతి జాత + వేదాః, దేవేభ్యః, హవ్యమ్, వహతు, ప్రజానన్నితి ప్ర + జానన్.॥౧౯॥

పదార్థః :- (క్రవ్యాదమ్) యః క్రవ్యం మాంసమత్తి తమ్ (అగ్నిమ్) అగ్నిమివాఽన్యాన్ పరితాపకమ్ (ప్ర) (హినోమి) గమయామి (దూరమ్) (యమఽరాజ్యమ్) యమస్య న్యాయాధీశస్య స్థానమ్ (గచ్ఛతు) (రిప్రవాహః) యే రిప్రం పాపం వహన్తి తాన్ (ఇహ) అస్మిన్ సంసారే (ఏవ) (అయమ్) (ఇతరః) భిన్నః (జాతవేదాః) జాతప్రజ్ఞానః (దేవేభ్యః) ధార్మికేభ్యో విద్వద్భ్యః (హవ్యమ్) ఆదాతుమర్హం విజ్ఞానమ్ (వహతు) ప్రాప్నోతు (ప్రజానన్) ప్రకర్షేణ జానన్ సన్.॥౧౯॥

అన్వయః :-ప్రజానన్నహం క్రవ్యాదమగ్నిమివ వర్తమానం యం దూరం ప్రహిణోమి యాశ్చ రిప్రవాహశ్చ దూరం ప్రహిణోమి స యమరాజ్యం గచ్ఛతు తే చ ఇహేతరోఽయం జాతవేదా దేవేభ్యో హవ్యమేవ వహతు.॥౧౯॥

భావార్థః :- అత్ర వాచకలుప్తోపమాలంకారః. హే న్యాయాధీశాః! యూయం దుష్టాచారిణః సంతాడ్య ప్రాణాదపి వియోజ్య శ్రేష్ఠాన్ సత్కృత్యేహ సృష్ట్వా సామ్రాజ్యం కురుత. ॥౧౯॥

పదార్థము :- (ప్రజానన్) బాగుగా తెలిసికొనుచున్న నేను (క్రవ్యాదమ్) మాంసమును దినువాడు (అగ్నిమ్) అగ్నివలె ఇతరులను దుఃఖములపాలుజేసి దహించునట్టి దుష్టులను (దూరమ్) దూరముగాను పారద్రోలునట్లు నేనును (ప్ర హిణోమి) తరిమివేయుదును. మరియు (రిప్రవాహః) పాపములను మోయుచుండు దుష్టులను దూరమొనర్చెదను. ఆతడు మరి యా పాపాత్ములెల్లరును (యమరాజ్యమ్) న్యాయాధీశుడగు రాజుయొక్క న్యాయాలయమునకు (గచ్ఛతు) వెళ్ళుదురుగాక! మరియు (ఇహ) ఈ ప్రపంచమున (ఇతరః) ఇతరులు (అయమ్) ఈ (జాతవేదాః) ధర్మాత్ములగు విద్వాంసులు(దేవేభ్యః) ధార్మికవిద్వాంసులచే (హవ్యమ్) గ్రహించదగిన విజ్ఞానమును (ఏవ) కూడ (వహతు) ప్రాప్తింతురుగాక! ॥౧౯॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. న్యాయాధీశులగు ఓ రాజపురుషులారా! మీరు దుష్టాచారులను బాగుగా తాడనమొనర్చుచు ప్రాణములను కూడా హరించుటకును

లెక్క చేయక శ్రేష్ఠులను సత్కరించుచు ఈ సృష్టియందు సామ్రాజ్యము, అనగా చక్రవర్తి రాజ్యము నేలుడు.॥౧౯॥

19. I, the knower, drive away the eater of raw meat, and the tormentor of men like fire, and cast aside the sinners.

Let all criminals be brought before the Court of Justice. Let a noble soul, in this world, derive useful knowledge from the learned.

౧౮౭౧.వహ వపామిత్యస్యాదిత్యా దేవా ఋషయః.జాతవేదా దేవతాః,స్వరాట్ త్రిష్టుప్ ఛన్దః,ధైవతః స్వరః.

అథ పితృసేవనవిషయమాహ. పితరులకు సేవచేయు విషయము.

౧౮౭౧ వహ వపాం జాతవేదః పితృభ్యో యత్రైనాన్వేత్థ నిహితాన్పరాకే। మేదసః కుల్యా ఉపతాన్త్స్రవన్తు సత్యా ఏషామాశిషః సం నమన్తాం స్వాహా॥౨౦॥

ప.వి:- వహ, వపామ్, జాతవేద ఇతి జాత +వేదః, పితృభ్య ఇతి పితృ + భ్యః, యత్ర, ఏనాన్, వేత్థ, నిహితానితి ని + హితాన్, పరాకే, మేదసః, కుల్యాః, ఉప, తాన్, స్రవన్తు, సత్యాః, ఏషామ్, ఆశిషి ఇత్యా+శిషః, సమ్, నమన్తామ్, స్వాహా.॥౨౦॥

పదార్థః :-(వహ) ప్రాప్నుహి (వపామ్) వపన్తి యస్యాం భూవౌ తామ్ (జాతవేదః) జాతప్రజ్ఞానః (పితృభ్యః) జనకేభ్యో విద్యాశిక్షాదాతృభ్యో వా (యత్ర) (ఏనాన్) (వేత్థ) జానాసి (నిహితాన్) (పరాకే) దూరే (మేదసః) స్నిగ్ధాః (కుల్యాః) జలప్రవాహోధారాః (ఉప) (తాన్) జనాన్ (స్రవన్తు) ప్రాప్నువన్తు (సత్యాః) సత్సు సాధ్వ్యః (ఏషామ్) (ఆశిషః) ఇచ్ఛాః (సమ్) సమ్యక్ (నమన్తామ్) ప్రాప్నువన్తు (స్వాహా) సత్యయా క్రియయా.॥౨౦॥

అన్వయః :- హే జాతవేదస్త్వం యత్రైతాన్ పరాకే నిహితాన్ వేత్థ తత్ర పితృభ్యో వపాం వహ యథా మేదసః కుల్యాస్తానుపస్రవన్తు తథా స్వాహైషామాశిషః సత్యాః సన్నమన్తామ్.॥౨౦॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే దూరే స్థితాన్ పితౄన్ విదుషశ్చాహూయ సత్కుర్వన్తి యథాఽఽరామవృక్షాదీన్ జలవాయూ వర్ధయతస్తథైతేషా మిచ్ఛాః సత్యాః సత్యః సర్వతో వర్ధన్తే.॥౨౦॥

**పదార్థము :-** (జాతవేదః) ఉత్తమజ్ఞానమును పొందినవాడా! నీవు (యత్ర) ఎచ్చట (ఏతాన్) ఈ (పరాకే) దూరమున నున్న (నిహితాన) స్థిరమైన పితృజనులను (వేత్థ) ఎరిగెదవో, అచ్చట (పితృభ్యః) జనకుడు లేక విద్యాశిక్షణనిచ్చు సజ్జనులగు పితరులనుండి (వపామ్) పంటలు పండించదగిన భూమిని (వహ) పొందుము. ఎట్లు (మేదసః) ఉత్తమ (కుల్యాః) జలప్రవాహముగల నదులు లేక కాలువలు (తాన్) ఆ సజ్జనులకు (ఉప, స్రవన్తు) సమీపముననే లభించునట్లు (స్వాహా) సత్యక్రియచే (ఏషామ్) వీరి (ఆశిషః) కోరికలు (సత్యాః) సత్యములై (సమ్, నమన్తామ్) ప్రాప్తించుగాక!॥౨౦॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. దూరమునందుండు పితరులను మరియు విద్వాంసులను పిలిచికొని సత్కారమొనర్చువారి కామితములు ఉద్యానములందలి వృక్షాదులను జలవాయువులు పెంపొందజేయునట్లు సత్యమగువారి కోరికలు అన్నివైపులనుండి పూర్ణమగును.॥౨౦॥

20. O intelligent person, thou knowest thy parents established far away, for them cultivate the land. Let rivulets full of water flow to meet them, and let their truthful wishes be accomplished in a decent manner!.

౧౮౭౨.స్యోనేత్యస్య మేధాతిథిర్ఋషిః, పృథివీ దేవతా, నిచృద్ గాయత్రీ, అపన ఇతి ప్రాజాపత్యా గాయత్రీఛన్దః, షడ్జః స్వరః.

గృహిణీ కీదృశీ స్యాదిత్యాహ. కులీనగృహిణి ఎటులుండవలయును?

౧౮౭౨ స్యోనా పృథివి నో భవానృక్షరా నివేశనీ ।

యచ్ఛా నః శర్మ సప్రథాః। అప నః శోశుచదఘమ్ ॥౨౧॥

ప.వి:- స్యోనా, పృథివి, నః, భవ, అనృక్షరా, నివేశనీతి ని + వేశనీ, యచ్ఛ, నః, శర్మ, సప్రథా ఇతి స + ప్రథాః, అప, నః, శోశుచత్, అఘమ్ ॥౨౧॥

పదార్థః :-(స్యోనా) సుఖకరీ (పృథివి) భూమిరివ వర్తమానే (నః) అస్మభ్యమ్ (భవ) (అనృక్షరా) నిష్కణ్టకా (నివేశనీ) నివిశన్తే యస్యాం సా (యచ్ఛ) దేహి. అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (నః) అస్మభ్యమ్ (శర్మ) సుఖమ్ (సప్రథాః) విస్తీర్ణేన ప్రశంసనేన సహ వర్తమానాః (అప) దూరీకరణే (నః) అస్మాకమ్ (శోశుచత్) భృశం శోధయతు (అఘమ్) పాపమ్.॥౨౧॥

అన్వయః:- హే పృథివి భూమిరివ వర్తమానే స్త్రి! త్వం యథాఽనృక్షరా నివేశనీ భూమిః స్యోనా భవతి తథా నో భవ సప్రథాః సతీ నశ్శర్మ యచ్ఛ. యథా న్యాయేశో నోఽఘమపశోశుచత్తథాఽపరాధం దూరం గమయ.॥౨౧॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలంకారః. యా స్త్రీ పృథివీవత్ క్షమాశీలా క్రూరతాది దోషరహితా బహుప్రశంసితా అన్యేషామపి దోషనివారికా భవతి సైవ గృహకృత్యే యోగ్యా భవతి.॥౨౧॥

పదార్థము :-(పృథివి) భూమివంటి క్షమాశీలత్వముగల ఓ మహిళామణీ! నీ వెటుల (అనృక్షరా) కంటకాదులులేని (నివేశనీ) కూర్చుండుట కాధారమగు భూమి (స్యోనా) సుఖకారకమగునట్లు (నః) మాకొరకు (భవ) అగుదువో, నీవు (సప్రథాః) అత్యంత ప్రశంసలతో గూడియున్న (నః) మాకొరకు (శర్మ) సుఖమును (యచ్ఛ) ఇమ్ము. ఏవిధముగ న్యాయాధీశుడు (నః) మాయొక్క (అఘమ్) పాపములను (అప, శోశుచత్) శీఘ్రముగ దూరమొనర్చునో లేక శుద్ధపరచునో అటులనే నీవు మా అపరాధములను దూరమొనర్చుము.॥౨౧॥

భావార్థము:-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ స్త్రీ పృథివివంటి క్షమాగుణముగలది, క్రూరత్వము మున్నగు దోషములకు దూరముగ నుండి అధికప్రశంసనీయముగ ఇతరుల దోషములను తొలగించునదై యుండునో, అట్టి మహిళయే గృహకృత్యములకు యోగ్యమైయుండును.॥౨౧॥

21. O wife calm like the Earth, give us far reaching pleasure, as does the Earth, free from thorn, our resting-place. Just as a just ruler drives away our sin, so shouldst thou eradicate our evil!.

౧౮౭౩.అస్మాదిత్యస్యాదిత్యా దేవా ఋషయః, అగ్నిర్దేవతా, స్వరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మానవు లేమి చేయవలయును?

౧౮౭౩ అస్మాత్ త్వమధి జాతోఽసి త్వదయం జాయతాం పునః ।

అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా ॥౨౨॥

ప.వి:- అస్మాత్, త్వమ్, అధి, జాతః, అసి, త్వత్, అయమ్, జాయతామ్, పునరితి పునః, అసౌ, స్వర్గాయేతి స్వః + గాయ, లోకాయ, స్వాహా.॥౨౨॥

పదార్థః:-(అస్మాత్) లోకాత్ (త్వమ్) (అధి) ఉపరిభావే (జాతః) (అసి) భవతి (త్వత్) తవ సకాశాదుత్పన్నః (అయమ్) పుత్రః (జాయతామ్) ఉత్పద్యతామ్ (పునః) పశ్చాత్ (అసౌ) విశేషనామా (స్వర్గాయ) విశేషసుఖభోగాయ (లోకాయ) ద్రష్టవ్యాయ (స్వాహా) సత్యయా క్రియయా.॥౨౨॥

అన్వయః:- హే విద్వన్! యతస్త్వమస్మాల్లోకాదధిజాతోఽసి తస్మాదయం త్వత్పునరసౌ స్వాహా స్వర్గాయ లోకాయ జాయతామ్.॥౨౨॥

**భావార్థః**:- హే మనుష్యా! యుష్మాభిరిహ మనుష్యశరీరం ధృత్వా విద్యాసుశిక్షాసుశీల ధర్మయోగ విజ్ఞానాని సఙ్గృహ్య ముక్తిసుఖాయ ప్రయతితవ్యమిదమేవ మనుష్యజన్మసాఫల్యం వేద్యమితి.॥౨౨॥

**పదార్థము**:- ఓ విద్వాంసుడా! (త్వమ్) నీవు (అస్మాత్) ఈ లోకమునుండి, అనగా ఇప్పటిమానవుల కన్న (అధి) అన్నిటికిపైన (జాతః) ప్రసిద్ధుడవై (అసి) ఉన్నావు. కావున (అయమ్) ఈ పుత్రుడు (త్వత్) నీకన్న (పునః) వెనక (అసౌ) విశేషప్రఖ్యాతుడై (స్వాహా) సత్యక్రియలచే (లోకాయ) చూడదగిన (స్వర్గాయ) విశేష సుఖము అనుభవించుటకై (జాయతామ్) సమర్థవంతుడగుగాక!॥౨౨॥

**భావార్థము** :- మానవులారా! మీరు మనుష్య జన్మ నెత్తినందుకు ఈ ప్రపంచమున విద్య, ఉత్తమశిక్షణ, శ్రేష్ఠస్వభావము, ధర్మము, యోగాభ్యాసము మరియు విజ్ఞానమును చక్కగా పొంది ముక్తిసుఖమునకై ప్రయత్నమొనర్పుడు. ఈ యమోఘమగు మానుషజన్మమును సఫలవంతమొనర్చుకొనుడు. ॥౨౨॥

22. O learned person, thou art foremost amongst men. May this son born anew from thee, be fair to look at, and enjoy fair reputation and happiness!.

అస్మిన్నధ్యాయే వ్యవహారజీవగతిజన్మమృత్యుసత్యాఽఽశీరగ్నిసత్యేచ్ఛానాం వ్యాఖ్యానాదేతదధ్యాయోక్తార్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతిరస్తీతి వేద్యమ్ ॥

ఈ అధ్యాయమునందు వ్యవహారము, జీవగతి, జన్మము, మృత్యువు, సత్యము, ఆశీర్వాదము, అగ్ని, సత్యేచ్ఛ మొదలగునవి వ్యాఖ్యానించబడినవగుటచే నీ యధ్యాయమునందు జెప్పబడిన యుర్థము పూర్వాధ్యాయమున చెప్పబడిన యర్థముతో సంగతి కలదని గ్రహించవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానంద సరస్వతీస్వామి నా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే పంచత్రింశోఽధ్యాయః పూర్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామివిరచితసంస్కృతార్య భాషావిభూషిత యజుర్వేదభాష్యమునందలి ముప్పది యైదవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు, శిష్యుడునునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల' చే నొనర్చబడిన ఆంధ్రానువాదము; పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కలాప్రపూర్ణ, వేదతత్త్వ వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య 'వంజ్జీ కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన ముప్పదియైదవ అధ్యాయము సమాప్తము.

# యజుర్వేదభాష్యము

## 36వ అధ్యాయము - విషయసూచిక

| క్ర.సం. | విషయము | మంత్రములు |
| --- | --- | --- |
| 1. | విద్వత్సంగముచే నేమగును? | ౧ |
| 2. | ఈశ్వరప్రార్థనావిషయం | ౨-౮,౨౦-౨౨,౨౪ |
| 3. | ఇతరుల సుఖమును కూడ కోరవలయును | ౯-౧౨ |
| 4. | పతివ్రతయైన స్త్రీ ఎటులుండును? | ౧౩-౧౬ |
| 5. | మానవు లెట్లు ప్రయత్నం చేయవలెను? | ౧౭-౧౯ |
| 6. | పదార్థము లెట్లు హితకరము లగుచున్నవి? | ౨౩ |

# అథ షట్‌త్రింశోఽధ్యాయః

## అస్మిన్నధ్యాయే చతుర్వింశతిర్మన్త్రాఃసన్తీతివేదితవ్యమ్.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ। యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

౧౮౬౪.ఋచమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, అగ్నిర్దేవతా, పంక్తిశ్ఛన్దః, పంచమః స్వరః.

అథ విద్వత్సఙ్గేన కిఞ్జాయత ఇత్యాహ. విద్వత్సంగముచే నేమగును?

౧౮౬౪ ఋచం వాచం ప్ర పద్యే మనో యజుః ప్ర పద్యే సామ ప్రాణం ప్ర పద్యే చక్షుః శ్రోత్రం ప్ర పద్యే। వాగోజః సహౌజో మయి ప్రాణాపానౌ ॥౧॥

**ప.వి:-ఋచమ్, వాచమ్, ప్ర, పద్యే, మనః, యజుః, ప్ర, పద్యే, సామ, ప్రాణమ్, ప్ర, పద్యే, చక్షుః, శ్రోత్రమ్, ప్ర, పద్యే, వాక్, ఓజః, సహ, ఓజః, మయి, ప్రాణాపానౌ ॥౧॥**

పదార్థః :- (ఋచమ్) ప్రశంసనీయమృగ్వేదమ్ (వాచమ్) వాణీమ్ (ప్ర) (పద్యే) ప్రాప్నుయామ్ (మనః) మననాత్మకం చిత్తమ్ (యజుః) యజుర్వేదమ్ (ప్ర) (పద్యే) (సామ) సామవేదమ్ (ప్రాణమ్) (ప్ర) (పద్యే) (చక్షుః) చష్టే పశ్యతి యేన తత్ (శ్రోత్రమ్) శృణోతి యేన తత్ (ప్ర) (పద్యే) (వాక్) వాణీ (ఓజః) మానసం బలమ్ (సహ) (ఓజః) శారీరం బలమ్ (మయి) ఆత్మని (ప్రాణాపానౌ) ప్రాణశ్చాఽపానశ్చ తావుచ్ఛ్వాసనిఃశ్వాసౌ.॥౧॥

అన్వయః :-హే మనుష్యా! యథా మయి ప్రాణాపానౌ దృఢౌ భవేతాం మమ వాగోజః ప్రాప్నుయాత్తయా తాభ్యాం చ సహోఽహమేవౌజః ప్రాప్నుయామృచం వాచం ప్రపద్యే మనో యజుః ప్రపద్యే సామ ప్రాణం ప్రపద్యే చక్షుః శ్రోత్రం ప్రపద్యే తథా యూయమేతాని ప్రాప్నుత.॥౧॥

భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే విద్వాంసో! యుష్మత్సఙ్గేన మమ ఋగివ ప్రశంసనీయా వాగ్యజురివ మనః సామ ఇవ ప్రాణః సప్తదశతత్త్వాత్మకం లిఙ్గం శరీరఞ్చ స్వస్థం నిరుపద్రవం సమర్థం భవతు.॥౧॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఏవిధముగ (మయి)నా యాత్మయందు (ప్రాణాపానౌ) ప్రాణము మరియు అపానము దృఢములగునో, నాయొక్క (వాక్) వాణి (ఓజః) మానసబలమును పొందుచున్నదో, ఆ

విధముగ శ్వాసల (సహ) తో కూడ నేను (ఓజః) శరీరబలమును పొందుదును (ఋచమ్) ఋగ్వేదరూప (వాచమ్) వాణిని (ప్ర, పద్యే) పొందుదును (మనః) మననమొనర్చువారివలె (యజుః) యజుర్వేదమును (ప్ర, పద్యే) ప్రాప్తించుకొందును (ప్రాణమ్) ప్రాణక్రియ, అనగా యోగాభ్యాసము మున్నగు ఉపాసనలకు సాధనమగు (సామ) సామవేదమును (ప్ర, పద్యే) ఎట్లు పొందుదునో, (చక్షుః) ఉత్తమ నేత్రములను మరియు (శ్రోత్రమ్) శ్రేష్ఠమగు కర్ణములను (ప్ర, పద్యే) ఎట్లు పొందుదునో, అదే విధముగ ఈయన్నిటిని మీరును ప్రాప్తించుకొనుడు.॥౧॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ విద్వాంసులారా! మీ సాంగత్యమున నాకు ఋగ్వేదమువంటి ప్రశంసనీయమగు వాణి, యజుర్వేదమువంటి మనస్సు, సామవేద సదృశమగు ప్రాణము మరియు పదునేడు తత్త్వములతో గూడిన లింగశరీరము, ఆరోగ్యవంతము, సకల ఉపద్రవరహితమునై సమర్థవంతమగు గాక!॥౧॥

1. May inbreath and outbreath be strengthened in my soul. May my speech acquire mental strength, whereby I may gain physical strengh.

May my speech be commendable like the Rig Veda, my mind reflective like the Yajur Veda. May I master the Sama Veda, the expositor of the science of yoga. May I possess good eyes and ears.

౧౮౭౩. యన్మే ఛిద్రమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, బృహస్పతిర్దేవతా, నిచృత్పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథేశ్వరప్రార్థనావిషయమాహ. ఈశ్వర ప్రార్థనా విషయము.

౧౮౭౩ యన్మే ఛిద్రం చక్షుషో హృదయస్య మనసో వాతితృణ్ణం

బృహస్పతిర్మే తద్దధాతు। శం నో భవతు భువనస్య యస్పతిః ॥౨॥

**ప. వి:- యత్, మే, ఛిద్రమ్, చక్షుషః, హృదయస్య, మనసః, వా, అతితృణ్ణమిత్యతితృణ్ణమ్, బృహస్పతిః, మే, తత్, దధాతు, శమ్, నః, భవతు, భువనస్య, యః, పతిః.॥౨॥**

పదార్థః :- (యత్) (మే) మమ (ఛిద్రమ్) న్యూనత్వమ్ (చక్షుషః) నేత్రస్య (హృదయస్య) (మనసః) అన్తఃకరణస్య (వా)(అతితృణ్ణమ్) అతిహింసితం వ్యాకులత్వమ్ (బృహస్పతిః) బృహతామాకాశాదీనాం పాలక ఈశ్వరః (మే) మహ్యమ్ (తత్) (దధాతు) పుష్ణాతు (శమ్) (నః) అస్మభ్యమ్ (భవతు) (భువనస్య) భవన్తి భూతాని యస్మింస్తస్య (యః) (పతిః) పాలకః స్వామీశ్వరః॥౨॥

అన్వయః :- యన్మే చక్షుషో హృదయస్య ఛిద్రం మనసో వాతితృణ్ణమస్తి తద్బృహస్పతిర్మే దధాతు యో భువనస్య పతి రస్తి స నః శమ్భవతు॥2॥

భావార్థః :- సర్వైర్మనుష్యైః పరమేశ్వరస్యోపాసనయాఽఽజ్ఞాపాలనే చాఽహింసాధర్మం స్వీకృత్య జితేన్ద్రియత్వం సంపాదనీయమ్.॥2॥

పదార్థము :- (యత్) ఏ (మే) నాయొక్క (చక్షుషః) నేత్రములలోక (హృదయస్య) అంతఃకరణముయొక్క (ఛిద్రమ్) న్యూనత్వము (వా) మరియు (మనసః) మనస్సుయొక్క (అతితృణ్ణమ్) వ్యాకులత్వముగలదో (తత్) దానిని (బృహస్పతిః) మహా ఆకాశాదులను పాలించు పరమేశ్వరుడు (మే) నాకొరకు (దదాతు) పుష్టివంతముగ పూర్ణపరచుగాక! (యః) ఎవడు (భువనస్య) విశ్వమంతటికి (పతిః) పాలకుడో, ఆతడు (నః) మాకొరకు (శమ్) కల్యాణకారి (భవతు) అగుగాక! ॥2॥

భావార్థము :- సకల మానవులును పరమేశ్వరుని ఉపాసన మరియు ఆజ్ఞాపాలనమొనర్చుచు, అహింసా ధర్మములనుస్వీకరించి జితేంద్రియత్వమును సాధించవలెను. ॥2॥

2. Whatever defect I have of eye or heart, or perplesity of mind, that may God amend. Gracious to us be He, Protector of the world.

౧౮౭౬. భూర్భువః స్వరిత్యస్య విశ్వామిత్ర ఋషిః, సవితా దేవతా, దైవీ బృహతీ ఛన్దః, మధ్యః స్వరః. తత్సవితు రిత్యస్య నిచృద్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథేశ్వరోపాసనావిషయమాహ. ఈశ్వరోపాసనా విషయము.

౧౮౭౬ భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి।
ధియో యో నః ప్రచోదయాత్ ॥3॥

ప.వి:- భూః, భువః, స్వః, తత్, సవితుః, వరేణ్యమ్, భర్గః, దేవస్య, ధీమహి, ధియః, యః, నః, ప్రచోదయాదితి ప్ర + చోదయాత్ ॥3॥

పదార్థః:- (భూః) కర్మవిద్యామ్ (భువః) ఉపాసనావిద్యామ్ (స్వః) జ్ఞానవిద్యామ్ (తత్) ఇన్ద్రియైరగ్రాహ్యం పరోక్షమ్ (సవితుః) సకలైశ్వర్యప్రదస్యేశ్వరస్య (వరేణ్యమ్) స్వీకర్తవ్యమ్ (భర్గః) సర్వదుఃఖప్రణాశకం తేజః స్వరూపమ్ (దేవస్య) కమనీయస్య (ధీమహి) ధ్యాయేమ (ధియః) ప్రజ్ఞాః (యః) (నః) అస్మాకమ్ (ప్రచోదయాత్) ప్రేరయేత్.॥3॥

**అన్వయః :-హే మనుష్యా! యథా వయం భూర్భువః స్వరధీత్య యో నో ధియః ప్రచోదయాత్తస్య దేవస్య సవితుస్తద్వరేణ్యం భర్గో ధీమహి తథా యూయమప్యేతద్ధ్యాయత.॥3॥**

**భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే మనుష్యాః కర్మోపాసనాజ్ఞానవిద్యాః సంగృహ్యాఖిలైశ్వర్య యుక్తేన పరమాత్మనా సహ స్వాత్మనో యుఞ్జతేఽధర్మాఽనైశ్వర్యదుఃఖాని విధూయ ధర్మైశ్వర్యసుఖాని ప్రాప్నువన్తి తానన్తర్యామీ జగదీశ్వరః స్వయం ధర్మాఽనుష్ఠానమధర్మత్యాగం చ కారయితుం సదైవేచ్ఛతి.॥3॥**

**పదార్థము :-** ఓ మానవులారా! మేమెట్లు (భూః) కర్మకాండ విద్యను (భువః) ఉపాసనాకాండ విద్యను (స్వః) జ్ఞానకాండ విద్యను సంగ్రహపూర్వకముగా చదివి (యః) ఏది (నః) మాయొక్క (ధియః) ధారణావతి బుద్ధులను (ప్రచోదయాత్) ప్రేరేపించునో అట్టి (దేవస్య) కామించదగిన (సవితుః) సమస్తైశ్వర్యములను ప్రసాదించు నా పరమేశ్వరుని (తత్) ఈ ఇంద్రియగోచరముగాని [పరోక్షమైనట్టి] (వరేణ్యమ్) స్వీకరించదగిన (భర్గః) సమస్త దుఃఖవినాశకరమునగు యా తేజః నా స్వరూపమును (ధీమహి) ధ్యానించుచున్నామో, అటులనే మీరెల్లరును దానిని ధ్యానమొనర్పుడు.॥3॥

**భావార్థము :-** ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏ మనుష్యులు జ్ఞాన కర్మ ఉపాసనా విషయక విద్యలను చక్కగా గ్రహించి సంపూర్ణైశ్వర్యములతో గూడ పరమేశ్వరునియందు తమ యాత్మలను యుక్త మొనర్చెదరో, అధర్మ, అనైశ్వర్య, దుఃఖరూప మాలిన్యములను దొలగించుకొని ధర్మైశ్వర్యములను, మరియు సుఖములనుప్రాప్తిజేసికొనుచుందురో వారికి అంతర్యామి యగు జగదీశ్వరుడు స్వయముగనే ధర్మానుష్ఠానము, అధర్మత్యాగము నొనర్పజేయుటకు ఎల్లప్పుడును సిద్ధముగానుండును. ॥3॥

3. Oh men, just as we having studied the science of moral duty, the science of contemplation, and the science of sacred knowledge, meditate upon God, the Reliever of afflictions. Inaccessible through physical organs, the Giver of affluence, the Object of desire, the Impeller of our intellects, so should ye do!.

౧౮౭౭ కయా న ఇత్యస్య వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

**౧౮౭౭ కయా నశ్చిత్ర ఆ భువదూతీ సదావృధః సఖా। కయా శచిష్ఠయా వృతా ॥४॥**

**ప.వి:-కయా, నః, చిత్రః, ఆ, భువత్, ఊతీ, సదావృధ ఇతి సదా + వృధః, సఖా, కయా, శచిష్ఠయా, వృతా. ॥४॥**

పదార్థః :-(కయా) (నః) అస్మాకమ్ (చిత్రః) అద్భుతగుణకర్మస్వభావః పరమేశ్వరః (ఆ) సమన్తాత్ (భువత్) భవేత్ (ఊతీ) రక్షణాదిక్రియయా. అత్ర తృతీయైకవచనస్య సుపాం సులుగితి పూర్వ సవర్ణః (సదావృధః) సదైవవర్ధమానః (సఖా) సుహృత్ (కయా) (శచిష్ఠయా) అతిశయేన శచీ ప్రజ్ఞా తయా (వృతా) వర్తమానయా.॥౪॥

అన్వయః:- స సదావృధశ్చిత్రో నః కయోతీ సఖా ఆభువత్ కయా వృతా శచిష్ఠయాఽస్మాన్ శుభేషు గుణకర్మస్వభావేషు ప్రేరయేత్.॥౪॥

భావార్థః:- వయమిదం యథార్థతయా న విజానీమః స ఈశ్వరః కయా యుక్త్యాఽస్మాన్ ప్రేరయతి యస్య సహాయేనైవ వయం ధర్మార్థకామమోక్షాన్ సాద్ధుం శక్నుమః.॥౪॥

పదార్థము :- (సదావృధః) ఎల్లప్పుడును వృద్ధియగు, అనగా ఎప్పుడును న్యూనత్వమును పొందునట్టి (చిత్రః) ఆశ్చర్యకరమగు గుణకర్మ స్వభావములతో గూడియున్న పరమేశ్వరుడు (నః) మాయొక్క (కయా) ఏవిధములగు (ఊతీ) రక్షణము మున్నగు క్రియలతో (సఖా) మిత్రుడు (ఆ, భువత్) అగునో, (కయా) అట్టివానిని (వృతా) కలిగియున్న (శచిష్ఠయా) అత్యంత ఉత్తమ బుద్ధితో మమ్ము శుభ గుణకర్మ స్వభావములందు ప్రేరేపించును. ॥౪॥

భావార్థము:-పరమేశ్వరుడు ఏ యుక్తిచే మనలను ప్రేరేపించునో, అనగా మనము ధర్మార్థకామ మోక్షములను సాధించ సమర్థులజేయునో, విషయమున మనము యథార్థమును దెలిసికొనజాలము. ॥౪॥

4. With what help does the ever-prospering, wonderful God become our Friend? With what constant, most mighty wisdom does He impel us to noble attributes, actions and natures. We cannot know.

౧౮౭౮ కస్త్వేత్యస్య వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౭౮ కస్త్వా సత్యో మదానాం మꣳహిష్ఠో మత్సదన్ధసః। దృఢా చిదారుజే వసు ॥౫॥

ప.వి:- కః, త్వా, సత్యః, మదానామ్, మꣳహిష్ఠః, మత్సత్, అన్ధసః, దృఢా, చిత్, ఆరుజ ఇత్యారుజే వసు. ॥౫॥

పదార్థః:-(కః) సుఖస్వరూపః (త్వా) త్వామ్ (సత్యః) సత్సు పదార్థేషు సాధురీశ్వరః (మదానామ్) ఆనన్దానాం మధ్యే (మంహిష్ఠః) అతిశయేన మంహితా వృద్ధః (మత్సత్) ఆనన్దయంతి (అన్ధసః) అన్నాదేః సకాశాత్ (దృఢా) దృఢాని (చిత్) అపి (ఆరుజే)

దుఃఖభఞ్జకాయ జీవాయ (వసు) వసూని ధనాని. అత్ర సుపాం సులుగితి జసో లుక్.॥౫॥

అన్వయః:-హే మనుష్యా ! మదానాం మంహిష్ఠః కః సత్యః ప్రజాపతిరన్ధసస్త్వా మత్సదారుజే తుభ్యం చిత్ దృఢా వసు ప్రయచ్ఛతి.॥౫॥

భావార్థః:- హే మనుష్యా! యోఽన్నాదినా సత్యవిజ్ఞాపనేన చ ధనాని ప్రదాయ సర్వానా నన్దయతి తం సుఖస్వరూపం పరమాత్మానమేవ యూయం నిత్యముపాధ్వమ్.॥౫॥

పదార్థము :- ఓ మానవులారా! (మదానామ్) ఆనందమున (మంహిష్ఠః)అత్యంత ఉన్నతుడు (కః) సుఖస్వరూపుడు (సత్యః) విద్యమానమైయున్న పదార్థములందు అతిశ్రేష్ఠతముడు, ప్రజారక్షకుడునగు పరమేశ్వరుడు (అన్ధసః) అన్నాది పదార్థములతో (త్వామ్) నిన్ను (మత్సత్) ఆనందపరచుచున్నాడు. మరియు (ఆరుజే) దుఃఖనాశకుడవు నగు నీకొరకు (చిత్) కూడ (దృఢా) దృఢమగు (వసు) ధనములను ఇచ్చుచున్నాడు.॥౫॥

భావార్థము :- ఎవడు అన్నాదులను మరియు సత్యమగు జ్ఞానమును, ధనాది పదార్థముల నిచ్చి అందరను ఆనందపరచునో అట్టి సుఖస్వరూపుడగు పరమాత్మను మాత్రమే మీరు సదా ఉపాసించుడు.॥౫॥

5. O man, God, the Most advanced in happiness, the Embodiment of joy, grants thee happiness through food; and gives thy soul. He is the eradicator of misery, the giver of durable wealth!.

౧౮౭౫.అభీ షు ణ ఇత్యస్య వామదేవ ఋషిః, ఇన్ద్రో దేవతా, పాదనిచృద్ గాయత్రీ ఛన్దః షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౮౭౫ అభీ షు ణః సఖీనామవితా జరితౄణామ్। శతమ్భవాస్యూతిభిః ॥౬॥

ప.విః-అభీ, సు, నః, సఖీనామ్, అవితా, జరితౄణామ్, శతమ్, భవాసి, ఊతిభిః ॥౬॥

పదార్థః:-(అభి) సర్వతః. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (సు) శోభనే (నః) అస్మాకమ్ (సఖీనామ్) మిత్రాణామ్ (అవితా) రక్షితా (జరితౄణామ్) సత్యస్తావకానామ్ (శతమ్) అసంఖ్యమ్ (భవాసి) భవేః (ఊతిభిః) రక్షణాదిభిః.॥౬॥

అన్వయః:-హే జగదీశ్వర! యతస్త్వం శతం దదద భ్యూతిభిర్నః సఖీనాం జరితౄణా మవితా సు భవాసి తస్మాదస్మాభిః సత్కర్తవ్యోఽసి. ॥౬॥

భావార్థః:-హే మనుష్యా! యో రాగద్వేషరహితానామజాతశత్రూణాం సర్వేషాం సుహృదాం మనుష్యాణామసంఖ్యమైశ్వర్యమతులం విజ్ఞానం చ ప్రదాయ సర్వతోఽభిరక్షతి తమేవ పరమేశ్వరం నిత్యం సేవధ్వమ్.॥౬॥

**పదార్థము** :- ఓ జగదీశ్వరా! నీవు (శతమ్) అసంఖ్యాక ఐశ్వర్యములనిచ్చుచు (అభి, ఊతిభిః) అన్నివైపులనుండి ఆరంభమైన రక్షాది క్రియలచే (నః) మాయొక్క (సఖీనామ్) మిత్రుల మరియు (జరితౄణామ్) సత్యస్తుతుల నొనర్చువారి (అవితా) రక్షణయొనర్చువాడవు (సు,భవాసి) చక్కగానగుము అందుచే మాకు సత్కారమొనర్చదగినవాడవగుదువు.॥౬॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఎవరు రాగద్వేషరహితులో, ఎవ్వరితోనూ వైరభావము నుంచరో, అనగా అందరియెడ మిత్రభావముతోనుందురో అట్టి సర్వమిత్రులగు మనుష్యులకు అసంఖ్యాక ఐశ్వర్యములు మరియు అధికాధిక విజ్ఞానమునిచ్చి అన్నిదిశలనుండి రక్షించునట్టి పరమేశ్వరునే సేవించుడు. ॥౬॥

6. O God, Thou granting us manifold glories, and protecting us from all sides, dost fairly guard us, Thy friends, who praise Thee!.

**౧౮౮౦.**కయా త్వమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః,ఇన్ద్రో దేవతా,వర్ధమానా గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

**౧౮౮౦ కయా త్వం న ఊత్యాభి ప్ర మన్దసే వృషన్। కయా స్తోతృభ్య ఆ భర ॥౭॥**

**ప.విః–కయా, త్వమ్, నః, ఊత్యా, అభి, ప్ర,మన్దసే, వృషన్, కయా, స్తోతృభ్య ఇతి స్తోతృభ్యః, ఆ, భర ॥౭॥**

పదార్థః :-(కయా) (త్వమ్) (నః) అస్మాన్ (ఊత్యా) రక్షణాద్యయా క్రియయా (అభి) (ప్ర) (మన్దసే) సర్వత్ర ఆనన్దయసి (వృషన్) సుఖాభివర్షక (కయా) రీత్యా (స్తోతృభ్యః) ప్రశంసకేభ్యో మనుష్యేభ్యః (ఆ) (భర).॥౭॥

అన్వయః:-హే వృషన్నీశ్వర! త్వం కయోత్యా నోఽభిప్రమన్దసే కయా స్తోతృభ్యః సుఖమాభర.॥౭॥

భావార్థః:- హే భగవన్ పరమాత్మన్! యయా యుక్త్యా త్వం ధార్మికానానన్దయసి తాన్ సర్వతః పాలయసి తాం యుక్తిమస్మాన్ బోధయ.॥౭॥

**పదార్థము** :-(వృషన్) అన్నివైపులనుండి సుఖవర్షమును కురిపించు పరమేశ్వరా! (త్వమ్) నీవు (కయా) ఎట్టి (ఊత్యా) రక్షణాది క్రియలచే (నః) మమ్ము (అభి, ప్ర, మన్దసే) అన్నివైపులనుండి ఆనందపరచుచున్నావో (కయా) ఆరీతిగనే (స్తోతృభ్యః) నీ ప్రశంసనొనర్చువారికొరకు సుఖములను (ఆ, భర) చక్కగా ధారణమొనరింపజేయుదువు.॥౭॥

**భావార్థము**:- భగవానుడవగు నో పరమేశ్వరా! ఏ యుక్తిచే నీవు ధర్మాత్ములను ఆనందపరచుచుందువో, అన్నివైపులనుండి రక్షించుచుందువో, అట్టియుక్తిని మాకు విశదపరచుము.॥౭॥

7. O God, the Shower of joys from all sides, with what aid dost Thou delight us, in what way dost Thou bestow happiness on thy worshippers is not known to us.

౧౮౮౧. ఇన్ద్ర ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ఇన్ద్రో దేవతా, ద్విపాద్విరాడ్ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౮౧ ఇన్ద్రో విశ్వస్య రాజతి శన్నో అస్తు ద్విపదే శం చతుష్పదే ॥౮॥

ప.వి:- ఇన్ద్రః, విశ్వస్య, రాజతి, శమ్, నః, అస్తు, ద్విపద ఇతి ద్వి + పదే, శమ్, చతుష్పదే, చతుః పద ఇతి చతుః + పదే. ॥౮॥

పదార్థః:- (ఇన్ద్రః) విద్యుదివేశ్వరః (విశ్వస్య) సంసారస్య మధ్యే (రాజతి) ప్రకాశతే (శమ్) సుఖమ్ (నః) అస్మాకమ్ (అస్తు) (ద్విపదే) పుత్రాద్యాయ (శమ్) (చతుష్పదే) గవాద్యాయ.॥౮॥

అన్వయః:- హే జగదీశ్వర! యో భవానిన్ద్ర ఇవ విశ్వస్య రాజతి తస్య భవతః కృపయా నో ద్విపదే శమస్తు నశ్చతుష్పదే శమస్తు.॥౮॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే జగదీశ్వర! యతో భవాన్ సర్వత్రాఽభివ్యాపకః మనుష్యపశ్వాదీనాం సుఖమిచ్ఛురసి తస్మాత్సర్వైరుపాసనీయోఽసి.॥౮॥

పదార్థము :- ఓ జగదీశ్వరా! నీవు (ఇన్ద్రః) విద్యుత్తువలె (విశ్వస్య) విశ్వమునందు (రాజతి) ప్రకాశమానమైయున్నావు. అట్టి నీకృపచే (నః) మాయొక్క (ద్విపదే) పుత్రాదులకు (శమ్) సుఖములు (అస్తు) కలుగునుగాక మరియు మాయొక్క (చతుష్పదే) గోవులు మున్నగువానికొరకు (శమ్) సుఖములు గలుగునుగాక! ॥౮॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ జగదీశ్వరా! నీవు అంతట, అన్నివైపులనుండి అభివ్యాప్తుడవైయుండి మానవులకు మరియు పశ్వాదులకు సుఖమును ఒసగువాడవై యున్నావు. కావుననే నీవు అందరకు ఉపాసనీయుడవు.॥౮॥

8.O God, like lightning Thou shinest in the universe, may weal attend our bipeds and our quadrupeds!.

౧౮౮౨.శన్న ఇత్యస్య దధ్యఙ్ ఙాథర్వణ ఋషిః, మిత్రాదయో లిఙ్గోక్తా దేవతాః,నిచృదనుష్టుప్ ఛన్దః,గాన్ధారః స్వరః.

మనుష్యైః స్వార్థపరార్థసుఖమిషితవ్యమిత్యాహ.

మానవులు తమ సుఖముతో పాటు ఇతరుల సుఖమును కూడ కోరవలయును.

౧౮౮౨ శన్నో మిత్ర శ్శం వరుణః శన్నో భవత్వర్యమా ।

శన్న ఇన్ద్రో బృహస్పతిః శన్నో విష్ణురురుక్రమః ॥౯॥

ప.విః–శమ్, నః, మిత్రః, శమ్, వరుణః, శమ్, నః, భవతు, అర్యమా, శమ్, నః, ఇన్ద్రః, బృహస్పతిః, శమ్, నః, విష్ణుః, ఉరుక్రమ ఇత్యురు + క్రమః ॥౯॥

పదార్థః :- (శమ్) సుఖకారి (నః) అస్మభ్యమ్ (మిత్రః) ప్రాణఇవ ప్రియః సఖా (శమ్) (వరుణః) జలమివ శాన్తిప్రదః (శమ్) (నః) అస్మభ్యమ్ (భవతు) (అర్యమా) యో౽ర్యాన్ మన్యతే స న్యాయాధీశః (శమ్) (నః) అస్మభ్యమ్ (ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్ (బృహస్పతిః) బృహత్యా వాచః పాలకో విద్వాన్ (శమ్) (నః) అస్మభ్యమ్ (విష్ణుః) వ్యాపకేశ్వరః (ఉరుక్రమః) ఉరు బహుక్రమః సంసారరచనే యస్య సః.॥౯॥

అన్వయః:-హే మనుష్యా ! యథా నో మిత్రః శం భవతు వరుణః శమ్భవత్వర్యమా నః శం భవతు ఇన్ద్రో బృహస్పతిర్నః శమ్భవతు ఉరుక్రమో విష్ణుర్నః శమ్భవతు తథా యుష్మభ్యమపి భవేత్.॥౯॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. మనుష్యైర్యథా స్వార్థం సుఖమేష్టవ్యం తథా పరార్థమపి. యథా చ తే స్వయం సత్సఙ్గమిచ్ఛేయుస్తథా తత్రాన్యానపి ప్రేరయేయుః.॥౯॥

పదార్థము :-ఓ మానవులారా! (నః) మాకొరకు (మిత్రః) ప్రాణములవంటి ప్రియమిత్రుడు (శమ్) ఎట్లు సుఖకారి (భవతు) అగునో (వరుణః) జలమువలె శాంతిని గలిగించువాడు (శమ్) సుఖకారి యగునో (అర్యమా)పదార్థముల స్వామి లేక వైశ్యులను మన్నించునట్టి న్యాయాధీశుడు (నః) మాకొరకు (శమ్) సుఖకారియగునో (ఇన్ద్రః) పరమైశ్వర్యవంతుడు (బృహస్పతిః) మహాన్ వేదరూప వాణికి రక్షకుడగు విద్వాంసుడు (నః) మాకొరకు (శమ్) కల్యాణకారి యగునో మరియు (ఉరుక్రమః) సృష్టిని రచించుటలో అతిశీఘ్రత్వము జూపు (విష్ణుః) సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు (నః) మాకొరకు (శమ్) కల్యాణ కారియగునో, అటులనే మీకొరకును యగుగాక! ॥౯॥

**భావార్థము** :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకార మున్నది. మానవులు తమకొరకెట్లు సుఖమును కాంక్షించెదరో, అట్లే ఇతరులకొరకును కోరవలయును. మరియు ఏవిధముగా తాము సత్సంగమొనర్చదలచెదరో, అటులనే ఇతరులను సైతము ఇందుకై ప్రేరేపించుట యోగ్యము.॥౯॥

May God, friendly like breath, be gracious unto us; may God, Tranquiliser like water be king to us; may God the Just be benevolent to us; may God the Mighty, and Guardian of the vedic speech be comfort-giving to us, may the All-pervading God, the Vigilant Creator of the universe be pleasant to us.

౧౮౮౩.శన్నో వాత ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః,వాతాదయో దేవతాః,విరాడనుష్టుప్ ఛన్దః,గాన్ధారః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మరల మానవు లేమి చేయవలయును?

౧౮౮౩ శన్నో వాతః పవతాᳬ శన్నస్తపతు సూర్యః ।

శన్నః కనిక్రదద్దేవః పర్జన్యోఽఽ అభి వర్షతు ॥౧౦॥

ప.వి:-శమ్, నః, వాతః, పవతామ్, శమ్, నః, తపతు, సూర్యః, శమ్, నః, కనిక్రదత్, దేవః, పర్జన్యః, అభి, వర్షతు.॥౧౦॥

పదార్థః:-(శమ్) సుఖకారకః (నః) అస్మభ్యమ్ (వాతః) పవనః (పవతామ్) చలతు (శమ్) (నః) (తపతు) (సూర్యః) (శమ్) (నః) (కనిక్రదత్) భృశం శబ్దం కుర్వన్ (దేవః) దివ్యగుణయుక్తో విద్యుదాఖ్యః (పర్జన్యః) మేఘః (అభి) అభిముఖ్యే (వర్షతు).॥౧౦॥

అన్వయః:-హే పరమేశ్వర! విద్వన్ వా యథా వాతో నః శం పవతాం సూర్యో నః శం తపతు కనిక్రదద్దేవో నః శం భవతు. పర్జన్యోఽభివర్షతు తథాఽస్మాన్ శిక్షయ.॥౧౦॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! యేన ప్రకారేణ వాయుసూర్య విద్యున్మేఘాః సర్వేషాం సుఖకరాః స్యుస్తథాఽనుతిష్ఠత.॥౧౦॥

**పదార్థము** :- ఓ పరమేశ్వరా! లేక విద్వాంసుడా! ఎట్లు (వాతః) వాయువు (నః) మాకొరకు (శమ్) సుఖకారియై (పవతామ్) వీచునో (సూర్యః) సూర్యుడు (నః) మాకొరకు (శమ్) సుఖము గలిగించునట్లుగ (తపతు) తపించునో (కనిక్రదద్) అత్యంత శబ్దము నొనర్చుచు (దేవః) ఉత్తమ గుణములతోగూడిన విద్యుద్రూపాగ్ని (నః) మాకొరకు (శమ్) కల్యాణకారి యగునో మరియు (పర్జన్యః) మేఘములు మాకొరకు (అభి, వర్షతు) అన్నివైపులనుండి వర్షమును గురిపించునో అట్టి శిక్షనే మాకును ఒసగుము.॥౧౦॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఏవిధముగా వాయువు, సూర్యుడు, విద్యుత్తు, మేఘములు సర్వప్రాణులకు సుఖకారకము లగుచున్నవియో అట్టి యనుష్ఠానమునే మీరొనర్చుడు.॥౧౦॥

10. May the wind blow pleasantly for us. May the Sun warm us pleasantly. May lightning roar for us. May cloud send the rain on us pleasantly.

౧౮౭౪.అహాని శమిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, లిఙ్గోక్తా దేవతాః,అతిశక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౮౭౪ అహా॑ని శం భ॑వన్తు నః శ్ర్యరా॑త్రీః ప్రతి॑ ధీయతామ్ ।

శన్న॑ ఇన్ద్రాగ్నీ భ॑వతామవో॑భిః శన్న॑ ఇన్ద్రావ॑రుణా రాతహ॑వ్యా।

శన్న॑ ఇన్ద్రాపూషణా వాజ॑సాతౌ శమిన్ద్రాసో॑మా సువితాయ శంయోః॥౧౧॥

ప.వి:- అహా॑ని, శమ్, భ॑వన్తు, నః, శమ్, రా॑త్రీః, ప్రతి॑, ధీయతామ్, శమ్, నః, ఇన్ద్రాగ్నీ ఇతీ॑న్ద్రాగ్నీ, భవతామ్, అవో॑భిరిత్య॑వః + భిః, శమ్, నః, ఇన్ద్రావ॑రుణా, రాతహ॑వ్యేతి రాత + హ॑వ్యా, శమ్, నః ఇన్ద్రాపూషణా, వాజ॑సాతావితి వాజ + సాతౌ, శమ్, ఇన్ద్రాసో॑మా, సువితా॑య, శంయోః.॥౧౧॥

పదార్థః:- (అహాని) దినాని (శమ్) సుఖకారకాణి (భవన్తు) (నః) అస్మభ్యమ్ (శమ్) (రాత్రీః) రాత్రయః (ప్రతి) (ధీయతామ్) ధీయన్తామ్. అత్ర వచనవ్యత్యయేనైకవచనమ్ (శమ్) (నః) అస్మభ్యమ్ (ఇన్ద్రాగ్నీ) విద్యుత్పావకౌ (భవతామ్) (అవోభిః) రక్షణాదిభిః సహ (శమ్) (నః) (ఇన్ద్రావరుణా) విద్యుజ్జలే (రాతహవ్యా) రాతం దత్తం హవ్యమాదాతవ్యం సుఖం యాభ్యాన్తే (శమ్) (నః) (ఇన్ద్రాపూషణా) విద్యుత్పృథివ్యౌ (వాజసాతౌ) వాజాన్యన్నాని సంభజన్తి యయా తస్యాం యుధి (శమ్) (ఇన్ద్రాసోమా) విద్యుదోషధిగణౌ (సువితాయ) ప్రేరణాయ (శంయోః) సుఖస్య.॥౧౧॥

అన్వయః:-హే పరమేశ్వర విద్వన్ వా! యథాఽవోభిః సహ శంయోః సువితాయ

**నో ఽహాని శం భవన్తు రాత్రీశ్శం ప్రతిధీయతామిన్ద్రాగ్నీ నః శం భవతాం రాతహవ్యా ఇన్ద్రావరుణా నః శం భవతాం వాజసాతావిన్ద్రాపూషణా నః శం భవతామిన్ద్రాసోమా చ శం భవతాం తథాఽస్మాననుశిక్షేతామ్.॥౧౧॥**

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! యదీశ్వరాప్తవిదుషాం శిక్షాయాం భవన్తః ప్రవర్తేరంస్తర్హ్యహర్నిశం భూమ్యాదయః సర్వే పదార్థా యుష్మాకం సుఖకరాః స్యుః.॥౧౧॥

పదార్థము :- ఓ పరమేశ్వరా! విద్వాంసుడా! ఎట్లు (అవోభిః) రక్షణలు మున్నగువానితో గూడ (శంయోః) సుఖముల (సువితాయ) ప్రేరణమునకై (నః) మాకొరకు (అహాని) దినములు [పగళ్లు] (శమ్) సుఖకరములు (భవన్తు) అగునో (రాత్రీః) రాత్రులు (శమ్) కల్యాణ (ప్రతి) ప్రదముగ (ధీయతామ్) మమ్ము ధారణమొనర్చునో (ఇన్ద్రాగ్నీ) విద్యుత్తు మరియు ప్రత్యక్ష [భౌతిక] అగ్ని (నః) మాకొరకు (శమ్) సుఖకారి (భవతామ్) యగుచున్నవియో (రాతహవ్యా) గ్రహించదగిన, సుఖమును గలిగించునవియగు (ఇన్ద్రావరుణా) విద్యుత్తు, జలములు (నః) మాకొరకు (శమ్) సుఖకారకములగునో (వాజసాతౌ) అన్నములను సేవించుటకు హేతువగు సంగ్రామములందు (ఇన్ద్రా పూషణా) విద్యుత్తు మరియు పృథివి (నః) మాకొరకు (శమ్) సుఖకారులగుచున్నవో (ఇన్ద్రాసోమా) విద్యుత్తు మరియు ఓషధులు (శమ్) సుఖముల గలిగించునవియగుచున్నవో, అట్టి శిక్షణనే అనుకూలరూపమున మాకొసగుము.॥౧౧॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఈశ్వరుడు మరియు ఆప్తులు, సత్యవాదులునగు విద్వాంసుల శిక్షణమున నుండునట్టి మీకు పగలు రాత్రులు, భూమి మున్నగు సకలపదార్థములు సుఖకరములు కాగలుగుచున్నవి.॥౧౧॥

11. May days pass pleasantly for us. May nights draw near delightfully. May lightning and fire, with their aids, bring us happiness. May the Sun and rain, givers of joy, comfort us.

౧౨౮.శన్నో దేవీరిత్యస్య దధ్యఙాథర్వణ ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

కీదృశా జనాః సుఖసంపన్నా భవన్తీత్యాహ. ఎట్టి మానవులు సుఖసంయుక్తు లగుదురు?

**౧౨౮ శన్నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శంయోరభి స్రవన్తు నః ॥౧౨॥**

**ప.వి:-శమ్, నః, దేవీః, అభిష్టయే, ఆపః, భవన్తు, పీతయే, శంయోః, అభి, స్రవన్తు, నః.॥౧౨॥**

పదార్థః:-(శమ్) (నః) అస్మభ్యమ్ (దేవీః) దివ్యాః (అభిష్టయే) ఇష్టసుఖసిద్ధయే (ఆపః) జలాని (భవన్తు) (పీతయే) పానాయ (శంయోః) సుఖస్య (అభి) సర్వతః (స్రవన్తు) వర్షన్తు (నః) అస్మభ్యమ్.॥౧౨॥

అన్వయః:-హే జగదీశ్వర విద్వన్వా! యథాఽభిష్టయే పీతయే దేవీరాపో నః శం భవన్తు నః శంయో ర్వృష్టిమభిస్రవన్తు తథోపదిశతమ్.॥౧౨॥

భావార్థః:-యే యజ్ఞాదినా శుద్ధాన్ జలాదిపదార్థాన్ శుద్ధాన్ సేవన్తే తేషాముపరి సుఖామృతస్య వృష్టిః సతతం భవతి.॥౧౨॥

పదార్థము :-ఓ జగదీశ్వరా! విద్వాంసుడా! ఎట్లు (అభిష్టయే) ఇష్టసుఖములను సాధించుటకొరకు (పీతయే) పానమొనర్చుటకు (దేవీః) దివ్యమగు ఉత్తమ (ఆపః) జలములు (నః) మాకు (శమ్) సుఖకరములు (భవన్తు) అగుచున్నవో (నః) మాకొరకు (శంయోః) సుఖవృష్టి (అభి, స్రవన్తు) అన్నిదిశలనుండి కలుగుచున్నవియో అట్టి ఉపదేశమును మాకొనర్చుడు.॥౧౨॥

భావార్థము :- ఏ మనుష్యులు యజ్ఞాదులద్వారా శుద్ధమగు జలములు మున్నగు పదార్థములు సేవనమొనర్చెదరో వారిపై సుఖరూపమగు అమృతవర్షము నిరంతరము వర్షించుచుండును.॥౧౨॥

12. May beautiful waters be pleasant to us to drink and acquire happiness, and flow with health and strength to us.

౧౮౮౬.స్యోనేత్యస్య మేధాతిథిర్ఋషిః, పృథివీ దేవతా, పిపీలికా మధ్యా నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పతివ్రతా కీదృశీ స్యాదిత్యాహ. పతివ్రతయైన స్త్రీ యెటులుండును?

౧౮౮౬ స్యోనా పృథివి నో భవానృక్షరా నివేశనీ। యచ్ఛా నః శర్మ సప్రథాః ॥౧౩॥

ప.వి:-స్యోనా, పృథివి, నః, భవ, అనృక్షరా, నివేశనీతి ని+వేశనీ, యచ్ఛ, నః, శర్మ, సప్రథా ఇతి స + ప్రథాః.॥౧౩॥

పదార్థః:- (స్యోనా) సుఖకరీ (పృథివి) భూమిః (నః) అస్మభ్యమ్ (భవ) భవతు. అత్ర పురుష వ్యత్యయః (అనృక్షరా) కణ్టకగర్తాదిరహితా (నివేశనీ) యయా నిత్యాన్ నివేశయతి సా (యచ్ఛ) దదాతు (నః)అస్మభ్యమ్(శర్మ) గృహమ్ (సప్రథాః) విస్తారేణ సహ వర్తమానాః॥౧౩॥

అన్వయః:-హే పృథివీవ వర్తమానే స్త్రి! యథాఽనృక్షరా నివేశనీ పృథివి నో భవతి తథా త్వం భవ సా సప్రథా నః శర్మ యచ్ఛేత్తథా స్యోనా త్వం నః శర్మ యచ్ఛ.॥౧౩॥

**భావార్థః**:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా సర్వేషాం భూతానాం సుఖైశ్వర్యప్రదా పృథివీ వర్తతే తథైవ విదుషీ పతివ్రతా స్త్రీ పత్యాదీనామానన్దప్రదా భవతి.॥౧౩॥

**పదార్థము** :- పృథివివంటి క్షమాశీలవగు ఓ మహిళామణీ! ఎట్లు (అనృక్షరా) కంటకములు [ముళ్ళు], గోతులు మున్నగునవిలేనట్టి (నివేశనీ) సదా స్థిరపదార్థముల స్థాపన మొనర్చునట్టి (పృథివి) భూమి (నః) మాకొరకగుచున్నదో, అట్లే నీవు (భవ) అగుము. ఆ పృథివి (సప్రథాః) విస్తారవంతమై (నః) మాకొరకు (శర్మ) స్థానమునిచ్చుచున్నదో, అటులనే (స్యోనా) సుఖమును గలిగించు నీవు (నః) మాకొరకు గార్హస్థ్యసుఖములను (యచ్ఛ) ఒసగుము. ॥౧౩॥

**భావార్థము** :- ఈ మంత్రములో వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగా సకల ప్రాణులకు సుఖ ఐశ్వర్యములను ఇచ్చునట్టి పృథివిగలదో, అటులనే విదుషీ పతివ్రతయగు మహిళామణి, పతి మున్నగు కుటుంబీయులకు ఆనందమును గలిగించునదై యుండును.॥౧౩॥

13. O wife, calm like the Earth, just as the Earth free from thorns and pits, the resting place for all durable substances, is comfortable for us, so shouldst thou be. Just as wide Earth gives us place for dwelling, so shouldst thou delight - affording, give us domestic happiness!.

౧౮౮౭. ఆప ఇత్యస్య సిన్ధుద్వీప ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

**౧౮౮౭ ఆపో హి ష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన। మహే రణాయ చక్షసే ॥౧౪॥**

**ప.వి:-ఆపః, హి, స్థ, మయోభువ ఇతి మయః + భువః, తాః, నః, ఊర్జే, దధాతన, మహే, రణాయ, చక్షసే. ॥ ౧౪॥**

పదార్థః:-(ఆపః) జలానీవ శాన్తిశీలా విదుష్యః సత్స్త్రియః (హి) యతః (స్థ) భవత. అత్ర సంహితాయామితి దీర్ఘః (మయోభువః) యా మయః సుఖం భావయన్తి తాః. మయ ఇతి సుఖ నా...నిఘం. 3.౬. (తాః) (నః) అస్మాన్ (ఊర్జే) పరాక్రమాయ బలాయ వా (దధాతన) ధరత (మహే) మహతే (రణాయ) సఙ్గ్రామాయ. రణ ఇతి సఙ్గ్రామ నా...నిఘం.౨.౧౭. (చక్షసే) ప్రసిద్ధాయ.॥౧౪॥

**అన్వయః**:-హే ఆపః! స్త్రియో యథా మయోభువ ఆపో హి నో మహే రణాయ చక్షస ఊర్జే దధతు తథైతా యూయం దధాతన ప్రియాః స్థః.॥౧౪॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా సత్యః పతివ్రతాః స్త్రియః సర్వతః సర్వాన్ సుఖయన్తి తథైవ జలాదయః పదార్థాః సుఖకరాః సన్తీతి వేద్యమ్.॥౧౪॥

పదార్థము :- (ఆపః) జలమువంటి శాంతిశీలురు, విదుషీమణులు, శ్రేష్ఠులగు మహిళామణులారా! ఎట్లు (మయోభువః) సుఖముల నుత్పన్నపరచునట్టి జలము (హి) ఏ కారణమున (నః) మాకు (మహే) గొప్ప (రణాయ, చక్షసే) సంగ్రామములకొరకు లేక (ఊర్జే) బలపరాక్రమములకొరకు ధారణ, పోషణముల నొనర్చుచున్నదో అటులనే మీరు వీనిని (దధాతన) ధారణమొనర్చుడు. మరియు ప్రియమైనవారలు (స్థ) అగుడు. ॥౧౪॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకార మున్నది. పతివ్రతలగు మహిళలు ఎట్లు అన్నివిధముల నందరిని సుఖులుగ నుంచుదురో, అటులనే జలము మున్నగు పదార్థములు ఎల్లరకును సుఖకారియగునని యెరుగుడు.॥౧౪॥

14. O peaceful, learned, noble wives, just as beneficent waters sustain us for a big famous gith and energy, so should ye endear yourselves to us!.

౧౮౧౫.యో వ ఇత్యస్య సిన్ధుద్వీప ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౧౫ యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః॥౧౫॥

ప.వి:-యః, వః, శివతమ ఇతి శివ+తమః, రసః, తస్య, భాజయత, ఇహ, నః, ఉశతీరివేత్యుశతీః + ఇవ, మాతరః.॥౧౫॥

పదార్థః :-(యః) (వః) యుష్మాకమ్ (శివతమః) అతిశయేన కల్యాణకరః (రసః) ఆనన్దవర్ధకః స్నేహరూపః (తస్య) రసమ్. అత్ర కర్మణి షష్ఠీ (భాజయత) సేవయత (ఇహ) అస్మిఞ్జగతి (నః) అస్మాన్ (ఉశతీరివ) కామయమానా ఇవ. అత్ర వాచ్ఛన్దసి ౬. ౧. ౧౦౬ ఇతి పూర్వసవర్ణాదేశః (మాతరః).॥౧౫॥

అన్వయః :- హే సత్స్త్రియో! యో వః శివతమో రసోఽస్తి తస్యేహ నో మాతరః పుత్రానుశతీరివ భాజయత.॥౧౫॥

భావార్థః:- యది హోమాదినాఽపః శుద్ధాః క్రియేరంస్తర్హ్యేతా మాతరోఽపత్యానీవ పతివ్రతా పతీనివ సర్వాన్ ప్రాణినస్సుఖయన్తి.॥౧౫॥

**పదార్థము** :- ఓ శ్రేష్ఠమగు స్త్రీరత్నములారా! (యః) ఎయ్యది (వః) మీయొక్క (శివతమః) అత్యంత కల్యాణకారి (రసః) ఆనందవర్ధకమగు స్నేహరూప రసముగలదో (తస్య) దానిని (ఇహ) ఈ ప్రపంచమునందు (నః) మాకు (ఉషతీరివ, మాతరః) పుత్రులనాకాంక్షించు తల్లులవలె (భాజయత) సేవింపజేయుడు.॥౧౫॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. హోమాదులద్వార శుద్ధపరచబడిన జలము తల్లి తనసంతానమువలె, పతివ్రతలు తమ పతులను ఎట్లు సుఖపరచుదురో, అట్లే సకలప్రాణులను సుఖకరముగ జేయు గాక! ॥౧౫॥

15. O noble wives, give us your most propitious affection in this world, like mothers longing for progeny!.

౧౮౮౯.తస్మా ఇత్యస్య సింధుద్వీప ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౮౯ తస్మా అరఙ్గమామ వో యస్య క్షయాయ జిన్వథ।
ఆపో జనయథా చ నః॥౧౬॥

ప.వి:- తస్మై, అరమ్, గమామ, వః, యస్య, క్షయాయ, జిన్వథ, ఆపః, జనయథ, చ, నః.॥౧౬॥

పదార్థః:-(తస్మై) (అరమ్) అలమ్ (గమామ) ప్రాప్నుయామ (వః) యుష్మాన్ (యస్య) (క్షయాయ) నివాసాయ (జిన్వథ) ప్రీణయథ (ఆపః) జలానీవ (జనయథ) అత్ర సంహితాయామితి దీర్ఘః. (చ) (నః) అస్మాన్.॥౧౬॥

అన్వయః:-హే స్త్రియో! యథా యూయం నోఽస్మానాప ఇవ శాన్తాఞ్జనయథ తథా వో యుష్మాన్చ శాన్తా వయం జనయేమ యూయం యస్య క్షయాయ జిన్వథ తస్మై వయమ రఙ్గమామ.॥౧౬॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలంకారః. స్త్రీపురుషైః పరస్పరస్యాఽఽనన్దాయ జల వత్ప్రలతయా వర్తితవ్యం శుభాచరణైః పరస్పరమలంకృతైరేవ భవితవ్యమ్.॥౧౬॥

**పదార్థము** :- ఓ మహిళామణులారా! మీ రేవిధముగ (నః) మమ్ము (ఆపః) జలమువలె శాంతముగ (జనయథ) ఉంచెదరో అదేవిధముగ (వః) మిమ్ముకూడా మేము శాంతముగ నుంచెదముగాక! (చ) మరియు మీరు (యస్య) పతియొక్క ఏ (క్షయాయ) నివాసముకొరకు (జిన్వథ) ఆతనిని తృప్తి పరచెదరో (తస్మై)

దానికొరకు మేమును (అరమ్) పూర్ణసామర్థ్యముతో (గమామ) ప్రాప్తించెదము [పొందెదముగాక!].॥౧౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. స్త్రీపురుషులు [పతీపత్నులు] పరస్పరానందముకొరకు జలమువలె సరళతతో మృదుమధురముగా శుభాచరణముతో పరస్పరము సుశోభితులై యుండవలెను.॥౧౬॥

16. O wives, just as ye make us calm like water, so should we make ye peaceful. As each of ye satisfies her husband for decent living for him, so may we acquire power and wealth for him.

౧౮౯౦.ద్యౌరిత్యస్య దధ్యఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, భురిక్ ఛక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః కథం ప్రయతితవ్యమిత్యాహ. మానవు లెట్లు ప్రయత్నము చేయవలెను?

౧౮౯౦ ద్యౌః శాన్తిరన్తరిక్ష౧ం శాన్తిః పృథివీ శాన్తిరాపః శాన్తిరోషధయః శాన్తిః ।
వనస్పతయః శాన్తిర్విశ్వే దేవాః శాన్తిర్బ్రహ్మ శాన్తిః సర్వ౧ం శాన్తిః శాన్తిరేవ
శాన్తిః సా మా శాన్తిరేధి ॥౧౭॥

**ప. వి:**– ద్యౌః, శాన్తిః, అన్తరిక్షమ్, శాన్తిః, పృథివీ, శాన్తిః, ఆపః, శాన్తిః, ఓషధయః, శాన్తిః, వనస్పతయః, శాన్తిః, విశ్వే, దేవాః, శాన్తిః, బ్రహ్మ,శాన్తిః, సర్వమ్, శాన్తిః, శాన్తిః, ఏవ శాన్తిః, సా, మా, శాన్తిః,ఏధి. ॥౧౭॥

పదార్థః:- (ద్యౌః) ప్రకాశయుక్తః పదార్థః (శాన్తిః) శాన్తికరః (అన్తరిక్షమ్) ఉభయోర్లోకయో ర్మధ్యస్థ మాకాశమ్ (శాన్తిః) (పృథివీ) భూమిః (శాన్తిః) (ఆపః) జలాని ప్రాణా వా (శాన్తిః) (ఓషధయః) సోమాద్యాః (శాన్తిః) (వనస్పతయః) వటాదయః (శాన్తిః) (విశ్వే) సర్వే (దేవాః) విద్వాంసః (శాన్తిః) (బ్రహ్మ) పరమేశ్వరో వేదో వా (శాన్తిః) (సర్వమ్) అఖిలం వస్తు (శాన్తిః) (శాన్తిః) (ఏవ) (శాన్తిః) (సా) (మా) మామ్ (శాన్తిః) (ఏధి) భవతు.॥౧౭॥

అన్వయః:- హే మనుష్యా! యా ద్యౌః శాన్తిరన్తరిక్షం శాన్తిః పృథివీ శాన్తిరాపఃశాన్తిరోషధయః శాన్తిర్వనస్పతయః శాన్తిర్విశ్వే దేవాః శాన్తిర్ బ్రహ్మ శాన్తిః సర్వం శాన్తిః శాన్తిరేవ శాన్తిర్మేధి సా శాన్తిర్యుష్మాక మపి ప్రాప్నోతు.॥౧౭॥

**భావార్థః:**-హే మనుష్యా! యథా ప్రకాశాదయః పదార్థాః శాన్తికరాః స్యుస్తథా యూయం ప్రయతధ్వమ్.॥౧౭॥

**పదార్థము :-** ఓ మానవులారా! (ద్యౌః, శాన్తిః) ప్రకాశయుక్త పదార్థములు శాంతికారకము (అన్తరిక్షమ్) రెండు లోకముల మధ్యగల ఆకాశము (శాన్తిః) శాంతికారకము (పృథివీ) భూలోకము (శాంతిః) నిరుపద్రవమై సుఖకారకము (ఆపః) జలము లేక ప్రాణము (శాన్తిః) శాంతిదాయకము (ఓషధయః) సోమలత మున్నగు ఓషధులు (శాన్తిః) సుఖదాయకము (వనస్పతయః) వటవృక్షము మున్నగు వనస్పతులు (శాంతిః) శాంతికారకము (విశ్వే,దేవాః) సకల విద్వాంసులు (శాన్తిః) ఉపద్రవ నివారకము (బ్రహ్మ) పరమేశ్వరుడు లేక వేదము (శాన్తిః) సుఖదాయకము (సర్వమ్) సకల వస్తువులు (శాన్తిః) శాంతికారకములు (శాన్తిరేవ) శాంతియే (శాన్తిః) శాంతి (మా) నాకు (ఏధి) కలిగించుగాక! (సా) అట్టి (శాన్తిః) శాన్తి మీకొరకును సంపూర్ణముగా ప్రాప్తించుగాక!॥౧౭॥

**భావార్థము :-** ఓ మానవులారా! ఏవిధముగ ప్రకాశము మున్నగు పదార్థములు శాంతి నొసగునవియైయున్నవో అటులనే మీరును ప్రయత్నించుడు.॥౧౭॥

17. May sky be peaceful. May atmosphere be peaceful.May Earth be peaceful. May waters be peaceful. May medicinal herbs be peaceful. May plants be peaceful.

May all the learned persons be peaceful. May God and the Vedas be peaceful. May all the objects be peaceful; May peace itself be peaceful. May that peace come unto me.

౧౮౯౧.దృత ఇత్యస్య దధ్యఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, భురిగ్ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ కే ధర్మాత్మాన ఇత్యాహ. ఎవరు ధర్మాత్ములు కాగలుగుదురు?

౧౮౯౧ దృతే దృꣳహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షన్తామ్।

మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే।

మిత్రస్య చక్షుషా సమీక్షామహే ॥౧౮॥

**ప.వి:-** దృతే, దృꣳహ, మా, మిత్రస్య, మా, చక్షుషా, సర్వాణి, భూతాని, సమ్, ఈక్షన్తామ్, మిత్రస్య, అహమ్, చక్షుషా, సర్వాణి, భూతాని, సమ్, ఈక్షే, మిత్రస్య, చక్షుషా, సమ్, ఈక్షామహే.॥౧౮॥

పదార్థః :-(దృతే) అవిద్యాన్ధకారనివారక జగదీశ్వర విద్వన్ వా (దృꣳహ) దృఢీకురు (మా) మామ్ (మిత్రస్య) సుహృదః (చక్షుషా) దృష్ట్యా (సర్వాణి) (భూతాని) ప్రాణినః (సమ్) (సమ్యక్) (ఈక్షన్తామ్) ప్రేక్షన్తాం పశ్యన్తు (మిత్రస్య) (అహమ్) (చక్షుషా) (సర్వాణి) (భూతాని) (సమ్) (ఈక్షే) పశ్యేయమ్ (మిత్రస్య) (చక్షుషా) (సమ్) (ఈక్షామహే) పశ్యేమ.॥౧౮॥

అన్వయః :-హే దృతే! యేన సర్వాణి భూతాని మిత్రస్య చక్షుషా మా సమీక్షన్తామహం మిత్రస్య చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే ఏవం వయం సర్వే పరస్పరాన్ మిత్రస్య చక్షుషా సమీక్షామహే తత్రాస్మాన్ దృంహ ॥౧౮॥

భావార్థః :-త ఏవ ధర్మాత్మానో మనుష్యా యే స్వాత్మవత్సర్వాన్ ప్రాణినో మన్యేరన్ కఞ్చిదపి న ద్విషేయుర్మిత్రవత్సర్వాన్ సదోపకుర్యురితి.॥౧౮॥

**పదార్థము** :-(దృతే) అవిద్యారూప అంధకారమును దొలగించు పరమేశా! లేక విద్వాంసుడా! ఎవ్వనిచే (సర్వాణి) సకల (భూతాని) ప్రాణులు (మిత్రస్య) మిత్రుని (చక్షుషా) దృష్టితో (మా) నన్ను (సమ్, ఈక్షన్తామ్) చక్కగా చూచునో (అహమ్) నేను (మిత్రస్య) మిత్రుని (చక్షుషా) దృష్టితో (సర్వాణి, భూతాని) సర్వప్రాణులను (సమీక్షే) చక్కగా ఎట్లు చూచెదనో ఆవిధముగానే మే మెల్లరము పరస్పరము (మిత్రస్య) మిత్రుల (చక్షుషా) దృష్టితో (సమీక్షామహే) చూచుకొనెదముగాక! ఈ విషయములో మమ్ము (దృంహ) దృఢవంతులుగ నొనర్పుము.॥౧౮॥

**భావార్థము** :- సకల ప్రాణులను తన ఆత్మవలెనే యెంచుచు, ఏ ప్రాణిని కూడా ద్వేషించక, హింసించక మిత్రదృష్టితో అన్నిప్రాణులను సత్కరించు ధర్మాత్ముడే ఎల్లరచే గౌరవించదగినవాడు. ॥౧౮॥

18. O God, the Dispeller of ignorance and darkness, strengthen me, May all beings regard me with the eye of a friend. May I regard all beings with the eye of a friend. With the eye of a friend do we regard one another!.

౧౮౫౨.దృతే దృంహ మేత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః,ఈశ్వరో దేవతా,

పాదనిచృద్గాయత్రీ ఛన్దః,షడ్జః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యురిత్యాహ. మానవు లేమి చేయవలయును?

౧౮౫౨ దృతే దృꣳహ మా᳚ జ్యోక్తే సన్దృశి జీవ్యాసం జ్యోక్తే సన్దృశి జీవ్యాసమ్॥౧౯॥

ప.వి:-దృతే, దృంహ, మా, జ్యోక్, తే, సందృశీతి సమ్ + దృశి, జీవ్యాసమ్, జ్యోక్, తే, సందృశీతి సమ్ + దృశి, జీవ్యాసమ్ ॥౧౯॥

పదార్థః :-(దృతే) సకలమోహాఽఽవరణవిచ్ఛేదకోపదేశక వా పరమాత్మన్! (దృంహ) (మా) మామ్ (జ్యోక్) నిరన్తరమ్ (తే) తవ (సందృశి) సమ్యగ్ దర్శనే (జీవ్యాసమ్) (జ్యోక్) నిరన్తరమ్ (తే) తవ (సందృశి) సమానదర్శనే విషయే (జీవ్యాసమ్).॥౧౯॥

అన్వయః :-హే దృతే! యేనాఽహన్తే సందృశి జ్యోక్ జీవ్యాసం తే సందృశి జ్యోగ్జీవ్యాసం తత్ర మా దృంహ.॥౧౯॥

భావార్థః:-మనుష్యైరీశ్వరాజ్ఞాపాలనేన యుక్తాహారవిహారైశ్చ శతం వర్షాణి జీవనీయమ్.॥౧౯॥

పదార్థము :-(దృతే) సమగ్ర మోహ ఆవరణమును విచ్ఛేదమొనర్చు పరమేశ్వరా! లేక ఉపదేశక విద్వాంసుడా! ఎట్లు నేను (తే) నీయొక్క (సందృశి) చక్కగా చూచు లేక జ్ఞానమునందు (జ్యోక్) నిరంతరము (జీవ్యాసమ్) జీవింతునో (తే) నీయొక్క (సందృశి) సమానదృష్టి విషయమునందు (జ్యోక్) నిరంతరము (జీవ్యాసమ్) జీవనమును వ్యతీతపరచెదనో, అట్టి జీవన విషయమునందు (మా) నన్ను (దృంహ) దృఢవంతునిగ నొనర్చుము.॥౧౯॥

భావార్థము :- సకల మానవులును ఈశ్వరాజ్ఞాపాలనము మరియు యుక్తాహార విహారాదులచే నూరు సంవత్సరములు సుఖముగా జీవించుటకు ఉపాయముల నొనర్చుట యోగ్యమైయున్నది.॥౧౯॥

19. Do, O God, the Preventer of mental delusion, strengthen me. May I live long to look on Thee. May I live long to look on Thee!.

౧౮౯౩.నమస్తే హరస ఇత్యస్య లోపాముద్రా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగ్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథేశ్వరోపాసనావిషయమాహ. ఈశ్వరోపాసనా విషయము.

౧౮౯౩ నమస్తే హరసే శోచిషే నమస్తేఽఅస్త్వర్చిషే। అన్యాఁస్తేఽ
అస్మత్తపన్తు హేతయః పావకోఽఅస్మభ్యꣳ శివో భవ ॥౨౦॥

ప.వి:-నమః, తే, హరసే, శోచిషే, నమః, తే, అస్తు, అర్చిషే, అన్యాన్, తే, అస్మత్, తపన్తు, హేతయః, పావకః, అస్మభ్యమ్, శివః, భవ ॥౨౦॥

పదార్థః:-(నమః) (తే) తుభ్యమ్ (హరసే) హరతి పాపాని తస్మై (శోచిషే) ప్రకాశాయ (నమః) (తే) తుభ్యమ్ (అస్తు) (అర్చిషే) స్తుతివిషయాయ (అన్యాన్) (తే) (అస్మత్) (తపన్తు) (హేతయః) వజ్ర ఇవ వ్యవస్థాః (పావకః) పవిత్రకర్తా (అస్మభ్యమ్) (శివః) కల్యాణకారకః (భవ).॥౨౦॥

అన్వయః:- హే భగవన్! హరసే శోచిషే తే నమో అర్చిషే తే నమోఽస్తు హేతయస్తేఽస్మదన్యాం స్తపన్తు త్వమస్మభ్యం పావకః శివో భవ.॥౨౦॥

భావార్థః:- హే పరమేశ్వర! వయం భవచ్ఛుభగుణకర్మస్వభావతుల్యానస్మద్గుణకర్మస్వభావాన్ కర్తుం తే నమస్కుర్మో నిశ్చితమిదం జానీమోఽధార్మికాంస్తే శాసనాః పీడయన్తి ధార్మికాంశ్చానన్దయన్తి తస్మాన్మఙ్గలస్వరూపం భవన్తమేవ వయముపాస్మహే.॥౨౦॥

పదార్థము :- భగవంతుడవగు నో పరమేశ్వరా! (హరసే) పాపముల హరించు (శోచిషే) ప్రకాశకుడవునగు (తే) నీకొరకు (నమః) నమస్కారములు (అర్చిషే) స్తుతించదగినవాడవునగు (తే) నీకొరకు (నమః) నమస్కారములు (అస్తు) అగుగాక! (తే) నీయొక్క (హేతయః) వజ్రమువంటి దృఢమగు వ్యవస్థలు (అస్మత్) మానుండి (అన్యాన్) ఇతర అన్యాయకారులగు శత్రువులకు (తపన్తు) దుఃఖములు గలిగించుగాక! నీవు (అస్మభ్యమ్) మానిమిత్తము (పావకః) పవిత్రకర్తవు (శివః) కల్యాణకారుడవు (భవ) అగుము.॥౨౦॥

భావార్థము :- ఓ పరమేశ్వరా! మేము నీయొక్క శుభగుణకర్మస్వభావములవంటి గుణకర్మస్వభావములనూగా నొనర్చుకొనుటకు నీకు నమస్కరించుచున్నాము. మరియు అధర్మాత్ములకు నీయొక్క శిక్ష పీడలను, ధర్మాత్ములకు ఆనందమును గలిగించునని మేము నిశ్చయముగ నెరుగుదుము. కావున మంగళప్రదాతవగు నిన్నే మే ముపాసించెదము.॥౨౦॥

20. Obeisance to God, the Queller of sins, the Source of light. Obeisance to God Worthy of adoration. May Thy punishments torment others. Be Thou Purifier, and Propitious unto us!.

౧౮౫౪.నమస్త ఇత్యస్య దధ్యఙ్ ఙాథర్వణ ఋషిః, ఈశ్వరో దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౮౫౪ నమస్తే అస్తు విద్యుతే నమస్తే స్తనయిత్నవే।
నమస్తే భగవన్నస్తు యతః స్వః సమీహసే॥౨౧॥

ప.వి:- నమః, తే, అస్తు, విద్యుత ఇతి వి + ద్యుతే, నమః, తే, స్తనయిత్నవే, నమః, తే,

భగవన్నితి భగ + వన్, అస్తు, యతః, స్వరితి స్వః,సమీహస ఇతి సమ్ + ఈహసే.॥౨౧॥

పదార్థః:- (నమః) (తే) తుభ్యం పరమేశ్వరాయ (అస్తు) (విద్యుతే) విద్యుదివాఽభివ్యాప్తాయ (నమః) (తే) (స్తనయిత్నవే) స్తనయిత్నురివ దుష్టానాం భయంకరాయ (నమః) (తే) (భగవన్) అత్యన్తైశ్వర్యసమ్పన్న (అస్తు) (యతః) (స్వః) సుఖదానాయ (సమీహసే) సమ్యక్ చేష్టసే. ॥౨౧॥

అన్వయః:-హే భగవన్ ! యతస్త్వమస్మభ్యం స్వః సమీహసే తస్మాద్విద్యుతే తే నమోఽస్తు స్తనయిత్నవే తే నమోఽస్తు సర్వాభిరక్షకాయ తే నమశ్చ సతతం కుర్యామ.॥౨౧॥

భావార్థః:-అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యాః! యస్మాదీశ్వరోఽస్మభ్యం సదాఽఽనన్దాయ సర్వాణి సాధనోపసాధనాని ప్రయచ్ఛతి తస్మాదయమస్మాభిః సేవ్యోఽస్తి.॥౨౧॥

పదార్థము :- (భగవన్) అనంతైశ్వర్యయుక్తుడవగు ఓ పరమేశ్వరా! (యతః) ఏ కారణముచే నీవు మాకొరకు (స్వః) సుఖముల నిచ్చుటకై (సమీహసే) చక్కని చేష్టలొనర్చుచున్నావో, అందువల్ల (విద్యుతే) విద్యుత్తువలె సర్వవ్యాపకుడవగు (తే) నీకొరకు (నమః) నమస్కారములు (అస్తు) అగుగాక! (స్తనయిత్నవే) భయంకరముగా గర్జించునట్టి విద్యుత్తువలె దుష్టులకు భయమును గొలుపు (తే) నీకొరకు (నమః) నమస్కారము (అస్తు) అగుగాక! మరియు సర్వ ప్రాణులను సకల విధములుగ రక్షణసేయు (తే) నీకొరకు (నమః) నిరంతరము నమస్కారములు ॥౨౧॥

భావార్థము :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. పరమేశ్వరుడు మనకొరకు సదా ఆనందపరుచుటకై సకల సాధనోపసాధనముల నిచ్చుచున్నాడు. కావున మనము అతనినే స్తుతించవలయును. ॥౨౧॥

21. Homage to Thee God pervading like lightning, Homage to Thee God, the Inspirer of awe for the sinners. Homage. O Bounteous Lord to Thee, as Thou desirest to give us happiness.

౧౮౯౫.యతోయత ఇత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః,ఈశ్వరో దేవతా,భురిగుష్ణిక్ ఛన్దః,ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౮౯౫ యతోయతః సమీహసే తతో నోఽఅభయం కురు ।

శం నః కురు ప్రజాభ్యోఽభయం నః పశుభ్యః ॥౨౨॥

ప.వి:- యతోయత ఇతి యతః +యతః, సమీహస ఇతి సమ్ + ఈహసే, తతః, నః, అభయమ్, కురు, శమ్, నః, కురు, ప్రజాభ్య ఇతి ప్ర + జాభ్యః, అభయమ్, నః, పశుభ్య ఇతి పశు + భ్యః.॥౨౨॥

పదార్థః:- (యతోయతః) యస్మాద్యస్మాత్స్థానాత్ (సమీహసే) సమ్యక్ చేష్టసే (తతః) తస్మాత్తస్మాత్ (నః) అస్మాన్ (అభయమ్) నిర్భయమ్ (కురు) (శమ్) సుఖమ్ (నః) అస్మాకమ్ (కురు) ప్రజాభ్యః (అభయమ్) (నః) అస్మాకమ్ (పశుభ్యః) గవాదిభ్యః.॥౨౨॥

అన్వయః:- హే భగవన్నీశ్వర! త్వం కృపాకటాక్షేణ యతోయతః సమీహసే, తతో నోఽభయం కురు. నః ప్రజాభ్యో నః పశుభ్యశ్చ శమభయం చ కురు.॥౨౨॥

భావార్థః:-హే పరమేశ్వర ! భవాన్ యతః సర్వాభివ్యాప్తోఽస్తి తస్మాదస్మానన్యాంశ్చ సర్వేషు కాలేషు సర్వేషు దేశేషు సర్వేభ్యః ప్రాణిభ్యో నిర్భయాన్ కరోతు.॥౨౨॥

పదార్థము :- ఓ భగవాన్ ఈశ్వరా! నీవు నీయొక్క కృపాకటాక్షముచే (యతోయతః) ఏ యే స్థానములనుండి (సమీహసే) చక్కని చేష్టలొనర్చెదవో (తతః) ఆ యా స్థలములనుండి (నః) మమ్ము (అభయమ్) భయరహితులనుగ (కురు) చేయుము (నః) మాయొక్క (ప్రజాభ్యః) ప్రజలను (నః) మాయొక్క (పశుభ్యః) గోవులు మున్నగు పశువులను (శమ్) సుఖయుక్తము మరియు (అభయమ్) భయరహితము (కురు) ఒనర్చుము.॥౨౨॥

భావార్థము :- ఓ పరమేశ్వరా! నీ వేకారణమున సకలమునందు అభివ్యాప్తుడవైయున్నావో ఆ కారణముననే మమ్ము మరియు ఇతరుల నెల్లరను సర్వకాలములందు సకల దేశములందు, సకల ప్రాణులచే భయరహితుల నొనర్చుము.॥౨౨॥

22. O God, from whatsoever place, Thou desirest, give us freedom from fear thence. Give to our people and our beasts happiness and fearlessness!.

౧౪౯౬.సుమిత్రియేత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, సోమో దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

కథం పదార్థా హితకారిణో భవన్తీత్యాహ. పదార్థము లెట్లు హితకరము లగుచున్నవి?

౧౪౯౬ సుమిత్రియా న ఆప ఓషధయః సన్తు దుర్మిత్రియాస్తస్మై సన్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యఞ్చ వయం ద్విష్మః ॥౨౩॥

ప.వి:- సుమిత్రియా ఇతి సు + మిత్రియాః, నః, ఆపః, ఓషధయః, సన్తు, దుర్మిత్రియా ఇతి దుః + మిత్రియాః, తస్మై, సన్తు, యః,అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః.॥౨౩॥

పదార్థః :-(సుమిత్రియాః) శోభనం మిత్రమివ వర్తమానాః (నః) అస్మభ్యమ్ (ఆపః) ప్రాణా జలాని వా (ఓషధయః) యవాద్యాః (సన్తు) (దుర్మిత్రియాః) శత్రురివ విరుద్ధాః (తస్మై) (సన్తు) (యః) అధర్మీ (అస్మాన్) ధార్మికాన్ (ద్వేష్టి) అప్రీతయతి (యమ్) (చ) (వయమ్) (ద్విష్మః). ॥౨౩॥

అన్వయః:-హే మనుష్యా! యా ఇమా ఆప ఓషధయో నః సుమిత్రియాః సన్తు తా యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తస్మై దుర్మిత్రియాః సన్తు.॥౨౨॥

భావార్థః:-యథా జితాన్యనుకూలానీన్ద్రియాణి మిత్రవద్ధితకారీణి భవన్తి తథా జలాదయోఽపి పదార్థా దేశకాలానుకూల్యేన యథోచితం సేవితా హితకరా విరుద్ధం సేవితాశ్చ శత్రువద్దుఃఖదా భవన్తి.॥౨౨॥

**పదార్థము** :- ఓ మానవులారా (ఆపః) ప్రాణము లేక జలము (ఓషధయః) యవలు మున్నగు ఓషధులు (నః) మాకొరకు (సుమిత్రియాః) శ్రేష్ఠమిత్రునివలె (సన్తు) అగుగాక! అవి (యః) ఏ అధర్మాత్ములు (అస్మాన్) ధర్మాత్ములమగుమమ్ము (ద్వేష్టి) ద్వేషించెదరో (చ) మరియు (యమ్) ఎవరిని (వయమ్) మేము (ద్విష్మః) ద్వేషించెదమో (తస్మై) వారికొరకును (దుర్మిత్రియాః) శత్రువువలె విరోధములు (సన్తు) అగునుగాక! ॥౨౩॥

**భావార్థము** :-ఏవిధముగ జయించబడిన ఇంద్రియములు మనకు మిత్రులవలె హితకరములు అగుచున్నవో, అదేవిధముగ జలము మున్నగు పదార్థములు కూడ దేశకాలానుగుణ్యముగ తగిన విధముగ సేవించిన హితకారకములు అగును. అట్లుకాక విపరీతముగ సేవించినట్లైనచో శత్రువువలె దుఃఖదాయకములగునని తెలియవలెను. ॥౨౩॥

23. O God, let waters and plants be friendly to us; unfriendly to him who hates us, and whom we hate!.

౧౮౪౭.తచ్చక్షురిత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః,సూర్యో దేవతా,భురిగ్ బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వరప్రార్థనావిషయమాహ. ఈశ్వరప్రార్థనావిషయము.

౧౪౫౭ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్। పశ్యేమ శరదః శతం
జీవేమ శరదః శతꣳ శృణుయామ శరదః శతం ప్ర బ్రవామ శరదః
శతమదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్ ॥౨౪॥

ప.విః- తత్, చక్షుః, దేవహితమితి దేవ + హితమ్, పురస్తాత్, శుక్రమ్, ఉత్, చరత్, పశ్యేమ, శరదః, శతమ్, జీవేమ, శరదః, శతమ్, శృణుయామ, శరదః, శతమ్, ప్ర, బ్రవామ, శరదః, శతమ్, అదీనాః, స్యామ, శరదః, శతమ్, భూయః, చ, శరదః, శతాత్ ॥౨౪॥

పదార్థః:-(తత్) చేతనం బ్రహ్మ (చక్షుః) చక్షురివ సర్వదర్శకమ్ (దేవహితమ్) దేవేభ్యో విద్వద్భ్యో హితకారి (పురస్తాత్) పూర్వకాలాత్ (శుక్రమ్) శుద్ధమ్ (ఉత్) (చరత్) చరతి సర్వం జానాతి (పశ్యేమ) (శరదః) (శతమ్) (జీవేమ) ప్రాణాన్ ధారయేమ (శరదః) (శతమ్) (శృణుయామ) శాస్త్రాణి మఙ్గలవచనాని చేతి శేషః (శరదః) (శతమ్) (ప్ర, బ్రవామ) అధ్యాపయేమోపదిశేమ వా (శరదః) (శతమ్) (అదీనాః) దీనతారహితాః (స్యామ) భవేమ (శరదః) (శతమ్) (భూయః) అధికమ్ (చ) పునః (శరదః) శతాత్.॥౨౪॥

అన్వయః:-హే పరమాత్మన్! భవాన్ యద్దేవహితం శుక్రం చక్షురివ వర్తమానం బ్రహ్మ పరస్తాదుచ్చరత్త్వాం శతం శరదః పశ్యేమ శతం శరదో జీవేమ శతం శరదః శృణుయామ శతం శరదః ప్రబ్రవామ శతం శరదోఽదీనాః స్యామ శతాచ్ఛరదో భూయశ్చ పశ్యేమ జీవేమ శృణుయామ ప్రబ్రవామోఽదీనాః స్యామ చ.॥౨౪॥

భావార్థః :- హే పరమేశ్వర! భవత్కృపయా భవద్విజ్ఞానేన భవత్సృష్టిం పశ్యన్త ఉపయుఞ్జానాఽరోగాః సమాహితాః సన్తో వయం సకలేన్ద్రియైర్యుక్తాః శతాద్వర్షేభ్యోఽప్యధికం జీవేమ సత్యశాస్త్రాణి భవద్గుణాంశ్చ శృణుయామ వేదాదీనధ్యాపయేమ సత్యముపదిశేమ కదాచిత్కేనాపివస్తునా వినా పరాధీనా న భవేమ సదైవమాత్మవశాః సన్తః సతతమానన్దేమాఽన్యాంశ్చానన్దయేమేతి. ॥౨౪॥

పదార్థము :- ఓ పరమేశ్వరా! నీవెట్లు (దేవహితమ్) విద్వాంసులకు హితకారివి (శుక్రమ్) శుద్ధుడవు (చక్షుః) నేత్రములవలె సర్వమును చూచువాడవు (పురస్తాత్) పూర్వకాలము, అనగా అనాదికాలము నుండి

(ఉత్, చరత్) చక్కగా సమస్తము నెరిగినవాడవున్నెయున్నావో (తత్) అట్టి చేతన బ్రహ్మవగు నిన్ను (శతమ్ శరదః) నూరు వత్సరములవరకు (పశ్యేమ) చూచెదముగాక! (శతమ్, శరదః) నూరేళ్లవరకు (జీవేమ) ప్రాణములను ధరించెదముగాక! [జీవించెదముగాక] (శతమ్, శరదః) నూరు సంవత్సరముల పర్యంతము (శృణుయామ) శాస్త్రముల మరియు మంగళవచనములను వినెదముగాక! (శతమ్, శరదః) నూరేళ్ల పర్యంతము (ప్రబ్రవామ) చదివించెదము మరియు ఉపదేశించెదముగాక (శతమ్, శరదః) నూరువత్సరముల పర్యంతము (అదీనాః) దీనత్వములేకుండ (స్యామ) ఉండెదముగాక! (చ) మరియు (శతమ్, శరదః) నూరుసంవత్సరములకన్నను (భూయః) అధికకాలమువరకును [చూచెదము, జీవించెదము, వినెదము, చదివించెదము, ఉపదేశించుచుండెదము మరియు అదీనులమై యుందుముగాక!]॥౨౪॥

భావార్థము :- ఓ పరమేశ్వరా! నీకృప మరియు విజ్ఞానముతో నీసృష్టిరచనను గాంచుచు నీతో గలిసియుండి సావధానులము, రోగరహితులము, వీర్యవంతులము, శక్తిశాలురమై మేము చేతనములైన సర్వేంద్రియములతో గూడ నూరుసంవత్సరములు, అంతకన్న అధికకాలమువరకును జీవితులమై యుందుముగాక! సత్యశాస్త్రములను, నీ గుణములను వినెదముగాక. వేదాదులను చదువుచు చదివించు చుండెదముగాక! సత్యములనే యుపదేశించెదముగాక! ఎప్పుడును ఏ వస్తువుకొరతవలన పరాధీనులమై యుండకుండెదముగాక! సదా స్వతంత్రులమై నిరంతరము ఆనందముల ననుభవించుచు ఇతరులనెల్లరను ఆనందపరచుచుండెదముగాక! ॥౨౪॥

24. O God, Thou art the Well-wisher of the learned. Immaculate, the Exhibitor of every thing like the eye, the Eternal knower of every thing. Through Thy kindness may we see for a hundred years; may we live for a hundred years; may we listen for a hundred years to Vedic lore; may we preach the Vedas for a hundred years; may we live content independently for a hundred years; yea, even beyond a hundred years, see, live, hear, preach and be not dependent.

అత్ర పరమేశ్వరప్రార్థనం సద్గుణప్రాపణం సర్వేషాం సుఖభావనం పరస్పరమిత్రత్వావశ్యకకరణం దినచర్యాశోధనం ధర్మలక్షణమాయుర్వర్ధనం పరమేశ్వరవిజ్ఞానం చోక్తమత ఏతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సఙ్గతిరస్తీతి వేద్యమ్.

ఈ యధ్యాయమునందు పరమేశ్వర ప్రార్థన, సర్వప్రాణుల సుఖమునకై విజ్ఞాపన, పరస్పరము మిత్రత్వముతో నుండు ఆవశ్యకత, దినచర్య విషయశోధనము, ధర్మలక్షణములు, ఆయువును పెంపొందించుకొనుట మరియు పరమేశ్వరుని తెలిసికొనుట యును విషయము లుపదేశించబడియున్నందున ఈ యధ్యాయార్థమునకు పూర్వాధ్యాయార్థముతో సంగతి గలదని ఎరుగవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానందసరస్వతీస్వామినా విరచితే
సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే షట్త్రింశోఽధ్యాయః పూర్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి ముప్పది ఆరవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశ్స్థ ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యు'లచే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
'వంశ్తీ కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**ముప్పది ఆరవ అధ్యాయము సమాప్తము.**

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# యజుర్వేదభాష్యము

## 37వ అధ్యాయము - విషయసూచిక

# అథ సప్తత్రింశోऽధ్యాయః

**అస్మిన్నధ్యాయే ఏకవింశతిర్మన్త్రాఃసన్తీతివేదితవ్యమ్.**

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ । యద్భద్రం తన్న ఆ సువ ॥య.30.3॥

1295. దేవస్యేత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, సవితా దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ.

మొదటి మంత్రమందు మానవు లేమి చేయవలయునను విషయము.

1295 దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో

హస్తాభ్యామ్। ఆ దదే నారిరసి ॥1॥

ప.వి:-దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర + సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు + భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, ఆ, దదే, నారిః, అసి ॥1॥

పదార్థః:- (దేవస్య) సకలసుఖప్రదాతుః (త్వా) త్వామ్ (సవితుః) జగదుత్పాదకస్య (ప్రసవే) ఉత్పన్నే జగతి (అశ్వినోః) అధ్యాపకోపదేశకయోః (బాహుభ్యామ్) బలవీర్యాభ్యామ్ (పూష్ణః) పోషకస్య (హస్తాభ్యామ్) కరాభ్యామ్ (ఆ) (దదే) సమన్తాద్ గృహ్ణామి (నారిః) నాయకః (అసి).॥1॥

అన్వయః:-హే విద్వన్! యతస్త్వం నారిరసి తస్మాత్ సవితుర్దేవస్య ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం త్వాఽఽదదే.॥1॥

భావార్థః:-హే మనుష్యా! యూయం విద్వద్వరాన్ ప్రాప్య సంసేవ్యైతేభ్యో విద్యాశిక్షే గృహీత్వాఽత్ర సృష్టౌ నాయకా భవత.॥1॥

పదార్థము :-ఓ విద్వాంసుడా! నీవు (నారిః) నాయకుడవై (అసి) ఉన్నావు. అందుచే (సవితుః) జగదుత్పాదకుడు (దేవస్య) సమస్త సుఖములదాత (ప్రసవే) ఉత్పన్నమైన జగత్తునందు (అశ్వినోః) అధ్యాపకోపదేశకుల (బాహుభ్యామ్) బలపరాక్రమములచే (పూష్ణః) పుష్టికర్తల (హస్తాభ్యామ్) హస్తములచే (త్వా) నిన్ను (ఆ, దదే) శ్రేష్ఠముగా గ్రహించుచున్నాను.॥1॥

**భావార్థము** :- ఓ మానవులారా! మీరు ఉత్తమ విద్వాంసుల నాశ్రయించి వారిద్వారా విద్యాశిక్షణలను పొంది ఈ సృష్టియందు నాయకులైయుండుడు.॥౧॥

1. O learned person, thou art a leader, so in this world created by God, the Giver of all happiness, with the strength and valour of the teacher and preacher, and with the assistance of a nourisher, I accept thee!.

౧౮౯౯. యుఞ్జత ఇత్యస్య శ్యావాశ్వ ఋషిః, సవితా దేవతా, జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ యోగాభ్యాసవిషయమాహ. యోగాభ్యాస విషయము.

౧౮౯౯ యుఞ్జతే మన ఉత యుఞ్జతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః।
వి హోత్రా దధే వయునావిదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః॥౨॥

ప.విః-యుఞ్జతే. మనః, ఉత, యుఞ్జతే, ధియః, విప్రాః, విప్రస్య, బృహతః, విపశ్చిత ఇతి విపః + చితః, వి, హోత్రాః, దధే, వయునావిత్, వయునవిదితి వయున + విత్, ఏకః, ఇత్, మహీ, దేవస్య, సవితుః, పరిష్టుతిః, పరిస్తుతిరితి పరి + స్తుతిః ॥౨॥

పదార్థః:- (యుఞ్జతే) సమాదధతి (మనః) సంకల్పవికల్పాత్మకమ్ (ఉత) అపి (యుఞ్జతే) (ధియః) ప్రజ్ఞాః కర్మాణి వా (విప్రాః) వివిధమేధావ్యాపినో మేధావినః (విప్రస్య) విశేషేణ సర్వత్ర వ్యాప్తస్య (బృహతః) సర్వేభ్యో మహతః (విపశ్చితః) అనన్తవిద్యస్య (వి) (హోత్రాః) యే జుహ్వత్యాదదతి తే (దధే) దధాతి (వయునావిత్) యో వయునాని ప్రజ్ఞానాని వేత్తి సః (ఏకః) అద్వితీయః (ఇత్) ఏవ (మహీ) మహతీ (దేవస్య) సకలజగత్ప్రకాశకస్య (సవితుః) సర్వాన్తర్యామిణః (పరిష్టుతిః) పరితః సర్వతః స్తుతిః ప్రశంసా.॥౨॥

అన్వయః:- హే మనుష్యా ! య ఏకో వయునావిజ్జగదీశ్వరో సర్వం విదధే యస్య సవితుర్దేవస్య మహీ పరిష్టుతిరస్తి హోత్రా విప్రా యోగినో యస్య బృహతో విపశ్చితో విప్రస్య మధ్యే మనో యుఞ్జత ఉత ధియో యుఞ్జతే తమిదేవ యూయముపాధ్వమ్.॥౨॥

భావార్థః:- హే మనుష్యా ! యో యోగిభిర్ధ్యేయో యస్య ప్రశంసాదృష్టాన్తాః సూర్యాదయో వర్తన్తే యః సర్వజ్ఞోఽసహాయః సచ్చిదానన్దస్వరూపోఽస్తి తస్మై సర్వే ధన్యవాదా దాతుమర్హా వర్తన్తే తమేవేష్టదేవం యూయం మన్యధ్వమ్.॥౨॥

**పదార్థము** :- ఓ మానవులారా! (వయునావిత్) ఉత్కృష్ట జ్ఞానప్రవీణుడు (ఏకః) అద్వితీయుడగు ఏ పరమేశ్వరుడు సమస్తమును (వి, దధే) రచించినాడో (సవితుః) సర్వాంతర్యామి (దేవస్య) సమస్త జగత్ప్రకాశకుడగు జగదీశ్వరుని యీ (మహీ) గొప్పనైన (పరిష్టుతిః) అన్నివైపులనుండి స్తుతిప్రశంస గలదో (హోత్రాః) శుభగుణముల గ్రహించి (విప్రాః) అనేక విధములగు బుద్ధులందు వ్యాప్తులు, జ్ఞానులు నగు యోగులు ఏ (బృహతః) సర్వోన్నతుడు (విపశ్చితః) అనంత విద్యావంతుడు (విప్రస్య) విశేషముగ సర్వవ్యాప్తుడగు పరమేశ్వరుని మధ్య (మనః) సంకల్ప వికల్పరూప మనస్సును (యుఞ్జతే) సమాహిత మొనర్చుచున్నారో (ఉత) మరియు (ధియః) బుద్ధి లేక కర్మలను (యుఞ్జతే) సంయుక్తపరచుచున్నారో (ఇత్) వానినే మీ రుపాసించుచుండుడు.॥౨॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఎవడు యోగులచే ధ్యానింపదగినవాడో, ఎవని ప్రశంసకు హేతువులుగ సూర్యచంద్రాదులు దృష్టాంతముగ నున్నవియో, ఎవడు ఇతర సహాయములేకయే సృష్టిని రచించెనో ఎవడు సర్వజ్ఞుడో, సచ్చిదానంద స్వరూపుడో, ఎవడు ఎల్లరచే ధన్యవాదములు పొందదగినవాడో, ఆతనినే ఇష్టదైవముగ నమ్ముడు.॥౨॥

2. The unequalled God, The Embodiment of knowledge, creates all beings. This is the great praise of Him, Who is Ubiquitous, and the Creator of the Universe. The noble and wise yogis concentrate their mind on and dedicate their action to, the Omnipresent God, the Highest knower. All should worship Him.

౧౯౦౦.దేవీత్యస్య దధ్యఙ్ఙాథర్వణ ఋషిః, ద్యావాపృథివ్యౌ దేవతే, బ్రాహ్మీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ యజ్ఞవిషయమాహ. యజ్ఞ విషయము.

౧౯౦౦ దేవీ ద్యావాపృథివీ మఖస్య వామద్య శిరో రాధ్యాసం
దేవయజనే పృథివ్యాః। మఖాయ త్వా మఖస్య త్వా శీర్ష్ణే ॥౩॥

ప.వి:-దేవీ౨ఇతి దేవీ, ద్యావాపృథివీ౨ఇతి ద్యావాపృథివీ, మఖస్య, వామ్, అద్య, శిరః, రాధ్యాసమ్, దేవయజన ఇతి దేవ + యజనే, పృథివ్యాః, మఖాయ, త్వా, మఖస్య,త్వా, శీర్ష్ణే॥౩॥

పదార్థః:- (దేవీ) దివ్యగుణసమ్పన్నే (ద్యావాపృథివీ) ప్రకాశభూమివద్వర్త్తమానే (మఖస్య) యజ్ఞస్య (వామ్) యువయోః (అద్య) ఇదానీమ్ (శిరః) ఉత్తమాఙ్గమ్ (రాధ్యాసమ్) సంసాధయేయమ్ (దేవయజనే) దేవా విద్వాంసో యజన్తి యస్మింస్తస్మిన్ (పృథివ్యాః) భూమేర్మధ్యే (మఖాయ) యజ్ఞాయ (త్వా) త్వామ్ (మఖస్య) యజ్ఞస్య (త్వా) (శీర్ష్ణే) ఉత్తమాఙ్గాయ.॥౩॥

అన్వయః:- దేవీ ద్యావాపృథివ్యధ్యాపికోపదేశికే స్త్రియావద్య పృథివ్యా దేవయజనే వాం మఖస్య శిరో రాధ్యాసమ్. మఖస్య శీర్ష్ణే త్వా మఖాయ త్వా రాధ్యాసమ్.॥3॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యాః! అత్ర జగతి యథా సూర్యభూమీ ఉత్తమాఙ్గవద్వర్తేతే తథైవ భవన్తః సర్వోత్తమా వర్తన్తాం యేన సర్వసఙ్గత్యధిష్ఠానో యజ్ఞః పూర్ణః స్యాత్.॥3॥

పదార్థము :-(దేవీ) ఉత్తమగుణసంపన్నులారా! (ద్యావాపృథివీ) ప్రకాశము, భూమివలెనున్న అధ్యాపిక మరియు ఉపదేశిక మహిళామణులారా! (అద్య) ఈ సమయమున (పృథివ్యాః) పృథివియందు (దేవయజనే) విద్వాంసుల యజ్ఞస్థలమందు (వామ్) మీయిరువురి (మఖస్య) యజ్ఞముయొక్క (శిరః) ఉత్తమ అవయవమును నేను (రాధ్యాసమ్) చక్కగా సిద్ధపరచెదను (మఖస్య) యజ్ఞముయొక్క (శీర్ష్ణే) ఉత్తమ అవయవ సిద్ధికై (త్వా) నిన్ను మరియు (మఖాయ) యజ్ఞమునకై (త్వా) నిన్ను చక్కగా సిద్ధపరచెదనుగాక! ॥3॥

భావార్థము :-ఈమంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఈ విశ్వమునందు ఏ ప్రకారముగా సూర్యుడు మరియు భూమి ఉత్తమాంగములవలె వర్తమానమై యున్నవియో, అదే ప్రకారముగా మీరు అందరియెడ ఉత్తమముగా వర్తించుడు. ఇందువల్ల సర్వసంగతుల కాశ్రయమగు యజ్ఞము పూర్ణమగును.॥3॥

3. O mistress and preachress, highly qualified like the Sun and Earth, may I nicely accomplish, this day, on the Earth, in the sacrificial abode of the learned, the excellent final stage of the sacrifice (yajna) conducted by ye both. O priest I accept thee for the yejna and the successful termination of the yajna!.

౧౯౦౧.దేవ్య ఇత్యస్య దధ్యఙాథర్వణ ఋషిః, యజ్ఞో దేవతా, నిచృత్పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ విదుష్యః స్త్రియః కీదృశ్యః స్యురిత్యాహ. విదుషీస్త్రీ లెటులుందురు?

౧౯౦౧ దేవ్యో వమ్ర్యో భూతస్య ప్రథమజా మఖస్య వోఽద్య శిరో రాధ్యాసం దేవయజనే పృథివ్యాః। మఖాయ త్వా మఖస్య త్వా శీర్ష్ణే ॥4॥

ప.వి:- దేవ్యః, వమ్ర్యః, భూతస్య, ప్రథమజా ఇతి ప్రథమ + జాః, మఖస్య, వః, అద్య, శిరః, రాధ్యాసమ్, దేవయజన ఇతి దేవ +యజనే, పృథివ్యాః, మఖాయ, త్వా, మఖస్య, త్వా, శీర్ష్ణే.॥4॥

2. O woman, well-instructed like speech, come unto me. Thou comest unto me, I go unto thee. O giver of entire happiness, may thou get full happiness. May thy husband give thee happiness; so acquire him!.

౧౯౨౧.ఆదిత్యా ఇత్యస్యాథర్వణ ఋషిః, పూషా దేవతా, భురిక్ సామ్నీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

స్త్రియా కిం కార్యమిత్యాహ. స్త్రీ ఏమి చేయువలయును ?

౧౯౨౧ అదిత్యై రాస్నాసీన్ద్రాణ్యా ఉష్ణీషః। పూషాసి ఘర్మాయ దీష్వ ॥3॥

ప.వి:- అదిత్యై, రాస్నా, అసి, ఇన్ద్రాణ్యై, ఉష్ణీషః, పూషా, అసి, ఘర్మాయ, దీష్వ.॥3॥

పదార్థః:-(అదిత్యై) నిత్యవిజ్ఞానమ్. అత్ర కర్మణి చతుర్థీ (రాస్నా) దాత్రీ (అసి) (ఇన్ద్రాణ్యై) పరమైశ్వర్యకారిణ్యై రాజనీత్యై (ఉష్ణీషః) శిరోవేష్టనమివ (పూషా) భూమిరివ పోషికా (అసి (ఘర్మాయ) ప్రసిద్ధాఽప్రసిద్ధసుఖప్రదాయ యజ్ఞాయ (దీష్వ) దేహి. అత్ర శపో లుక్ ఛన్దస్యుభయథేత్యార్ధధాతుకత్వమ్.॥3॥

అన్వయః:-కన్యే! యా త్వమదిత్యై రాస్నాసి ఉష్ణీష ఇవేన్ద్రాణ్యై పూషాసి. సా త్వం ఘర్మాయ దీష్వ.॥3॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే స్త్రి! యథోష్ణీషాదీని వస్త్రాణి సుఖప్రదాని సన్తి తథాపత్యే సుఖాని ప్రయచ్ఛ ॥3॥

పదార్థము :-ఓ కన్యామణీ! నీవు (అదిత్యై) నిత్యవిజ్ఞానమును (రాస్నా) ఇచ్చునట్టి దానవై (అసి) ఉన్నావు (ఇన్ద్రాణ్యై) పరమైశ్వర్యమునిచ్చు నీతికొరకు (ఉష్ణీషః) శిరోవేష్టనమగు తలపాగవలె (పూషా) భూమివలె పోషించుదానవై (అసి) ఉన్నావు. కావున నీవు (ఘర్మాయ) ప్రసిద్ధ, అప్రసిద్ధ సుఖముల నిచ్చునట్టి యజ్ఞముకొరకు (దీష్వ) దానమునొనర్చుము.॥3॥

భావార్థము :-ఈ మంత్రములో వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగ తలపాగ మున్నగునవి సుఖము నిచ్చునవియై యున్నవియో, అదేవిధముగ నీవు పతికి సుఖమునిచ్చుదానవునగుము.॥3॥

3. O woman, thou art constant bestower of knowledge, a turban for supreme state politics, a protector like the Earth, dedicate thyself to pleasant domestic life!.

౧౯౨౨.అశ్విభ్యామిత్యస్యాథర్వణ ఋషిః, సరస్వతీ దేవతా, ఆర్చీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౯.౨౨ అ॒శ్విభ్యాం᳚ పిన్వస్వ॒ సర॑స్వత్యై పిన్వ॒స్వేన్ద్రా᳚య పిన్వస్వ।
స్వాహేన్ద్ర॒వత్స్వాహేన్ద్ర॒వత్స్వాహేన్ద్ర॒వత్ ॥౪॥

ప.వి:-అ॒శ్విభ్యా᳚మ్, పి॒న్వ॒స్వ॒, సర॑స్వత్యై, పి॒న్వ॒స్వ॒, ఇన్ద్రా᳚య, పి॒న్వ॒స్వ॒, స్వాహా᳚, ఇన్ద్ర॒వదితీన్ద్ర। వత్, స్వాహా᳚, ఇన్ద్ర॒వదితీన్ద్ర + వత్, స్వాహా᳚, ఇన్ద్ర॒వదితీన్ద్ర + వత్.॥౪॥

పదార్థః :-(అశ్విభ్యామ్) చన్ద్రసూర్యాభ్యామ్ (పిన్వస్వ) తృప్నుహి (సరస్వత్యై) సుశిక్షితాయై వాచే (పిన్వస్వ) (ఇన్ద్రాయ) పరమైశ్వరాయ (పిన్వస్వ) (స్వాహా) సత్యయా క్రియయా (ఇన్ద్రవత్) ఇన్ద్రం పరమైశ్వర్యం విద్యతే యస్మింస్తత్ గృహీత్వా (స్వాహా) సత్యయా వాచా (ఇన్ద్రవత్) చేతనాత్మగుణసంయుక్తం శరీరం ప్రాప్య (స్వాహా) (ఇన్ద్రవత్) విద్యుద్వత్.॥౪॥

అన్వయః :-హే! విదుషి స్త్రి! త్వమిన్ద్రవత్స్వాహాఽశ్విభ్యాం పిన్వస్వేన్ద్రవత్స్వాహా, సరస్వత్యై పిన్వస్వేన్ద్రవత్స్వాహేన్ద్రాయ పిన్వస్వ ॥౪॥

భావార్థః :-యే స్త్రీపురుషా విద్యుదాదివిద్యయైశ్వర్యమున్నయేయుస్తే సుఖమపి లభేరన్.॥౪॥

పదార్థము :-ఓ విదుషీరత్నమా! నీవు (ఇన్ద్రవత్) పరమైశ్వర్యవంతమగు వస్తువును పొంది (స్వాహా) సత్యక్రియచే (అశ్విభ్యామ్) సూర్యచంద్రులకొరకు (పిన్వస్వ) తృప్తినొందుము. (ఇన్ద్రవత్) చైతన్యగుణయుక్త శరీరమును పొంది (స్వాహా)సత్యవాణితో(సరస్వత్యై) సుశిక్షితవాణికొరకు (పిన్వస్వ) సంతుష్టురాలవగుము. (ఇన్ద్రవత్) విద్యుద్విద్యను తెలిసికొని (స్వాహా) సత్యముద్వారా (ఇన్ద్రాయ) పరమోత్తమ ఐశ్వర్యముకొరకు (పిన్వస్వ) సంతుష్టురాలవగుము.॥౪॥

భావార్థము :- విద్యుదాది విద్యచే ఐశ్వర్యముల నున్నతిపరచికొనిన స్త్రీపురుషులు సుఖములను కూడ ప్రాప్తిజేసికొనగలుగుదురు.॥౪॥

4. O learned woman, acquire excellence, satisfy well thy parents. Possessing body endowed with consciousness, please thy teachers with truthful speech!.

౧౯.౨౩.యస్త ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, వాగ్ దేవతా; నిచృదతిజగతీ ఛన్దః; నిషాదః స్వరః.

పునః స్త్రీపురుషౌ కిం కుర్యాతామిత్యాహ.

స్త్రీపురుషు లేమి చేయవలయును?

౧౮౨౩ యస్తే స్తనః శశయో యో మయోభూర్యో రత్నధా వసువిద్యః
సుదత్రః। యేన విశ్వా పుష్యసి వార్యాణి సరస్వతి తమిహ
ధాతవేఽకః। ఉర్వన్తరిక్షమన్వేమి ॥౫॥

ప.విః- యః, తే, స్తనః, శశయః, యః, మయోభూరితి మయః + భూః, యః, రత్నధా ఇతి రత్న + ధాః, వసువిదితి వసు + విత్, యః, సుదత్ర ఇతి సు + దత్రః, యేన, విశ్వా, పుష్యసి, వార్యాణి, సరస్వతి, తమ్, ఇహ, ధాతవే, అకరిత్యకః, ఉరు, అన్తరిక్షమ్, అను, ఏమి.॥౫॥

పదార్థః:-(యః) (తే) తవ (స్తనః) దుగ్ధాధారవఙ్గమ్ (శశయః) శేతే యస్మిన్ సః (యః) (మయోభూః) యో మయః సుఖం భావయతి సః (యః) (రత్నధాః) యో రత్నాని దధాతి సః (వసువిత్) యో వసూని ధనాని విన్దతి ప్రాప్నోతి సః (యః) (సుదత్రః) శోభనం దత్రం దానం యస్య సః (యేన) (విశ్వా) సమగ్రాణి (పుష్యసి) (వార్యాణి) వరితుమర్హాణి (సరస్వతి) బహువిజ్ఞానయుక్తే (తమ్) (ఇహ) అస్మిన్ సంసారే (ధాతవే) ధాతుమ్ (అకః) కుర్యాః (ఉరు) బహు (అన్తరిక్షమ్) ఆకాశమ్ (అను) (ఏమి) ప్రాప్నోమి ॥౫॥

అన్వయః:- హే సరస్వతి స్త్రి! యస్తే శశయః స్తనో యో మయోభూర్యో రత్నధా వసువిద్యః సుదత్రో యేన విశ్వా వార్యాణి పుష్యసి తమిహ ధాతవేఽకః తేనాహముర్వన్తరిక్షమన్వేమి ॥౫॥

భావార్థః:- యది స్త్రీ న స్యాత్తర్హి బాలకానాం పాలనమప్యశక్యం భవేత్. యయా పురుషో బహు సుఖం యేన స్త్రీ చ పుష్కలం సుఖమాప్నుయాత్తౌ ద్వావితరేతరం వివహేతామ్ ॥౫॥

పదార్థము :- (సరస్వతి) అనేక విద్యలుగల ఓ మహిళామణీ! (యః) ఏ (తే) నీయొక్క (శశయః) వేని యాశ్రయమున శిశువులు చక్కగా నిదురించెదరో, అట్టి (స్తనః) క్షీరాధారములగు స్తనములు మరియు (యః) ఏ (మయోభూః) సుఖసాధకమగు (యః) ఏ (రత్నధాః) ఉత్తమోత్తమ గుణముల ధరించు (వసువిత్) ధనములను పొందువాడు మరియు (యః) ఏ (సుదత్రః) సుందర దానమునిచ్చునట్టి పతియొక్క (యేన)

ఎవనియాశ్రయమున (విశ్వా) సర్వ (వార్యాణి) పొందదగిన వస్తువులను (పుష్యసి) పుష్టపరచునో (తమ్) దానిని (ఇహ) ఈ ప్రపంచమున లేక గృహమునందు (ధాతవే) ధారణమొనర్చుటకు లేదా దుగ్ధపానమొనర్పజేయుటకు (అకః) నియమింపుము. దానిచే నేను (ఉరు) అధికతరమగు (అన్తరిక్షమ్) ఆకాశమును (అన్వేమి) అనుగమించగలను.॥౫॥

**భావార్థము** :- స్త్రీలు లేనిచో బాలబాలికల రక్షణ జరుగుట మిగుల కఠినమే యగును. ఎట్టి స్త్రీవల్ల పురుషుడు అధిక సుఖవంతుడును ఏ పురుషునివల్ల స్త్రీ అధికముగ ఆనందితురాలును కాగలుగుదురో అట్టి వధూవరులే పరస్పరము వివాహమొనర్చుకొనవలయును.॥౫॥

5. O highly learned woman, thy breast milks the child is made sleep. Thy husband is bringer of happiness, posessor of noble qualities, master of riches, and is charitable in nature. With his aid thou acquirest all desirable objects. Establish him in this house of acceptance. May I through him rise to the vast summit of prosperity!.

౧౯-౨౪. గాయత్రమిత్యస్య దీర్ఘతమా ఋషిః, అశ్వినౌ దేవతే, నిచృదత్యష్టిశ్ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః స్త్రీపురుషయోః కీదృశః సమ్బన్ధః స్యాదిత్యాహ?

స్త్రీపురుషులయొక్క సంబంధము ఎటులుండవలయును?

౧౯-౨౪ గాయత్రం ఛన్దోసి త్రైష్టుభం ఛన్దోసి ద్యావాపృథివీభ్యాన్త్వా
పరి గృహ్ణామ్యన్తరిక్షేణోప యచ్ఛామి ।
ఇన్ద్రాశ్వినా మధునః సారఘస్య ఘర్మం పాత వసవో
యజత వాట్ । స్వాహా సూర్యస్య రశ్మయే వృష్టివనయే ॥౬॥

ప. విః - గాయత్రమ్, ఛన్దః, అసి, త్రైష్టుభమ్, త్రైస్తుభమితి త్రైస్తుభమ్, ఛన్దః, అసి, ద్యావాపృథివీభ్యామ్, త్వా, పరి, గృహ్ణామి, అన్తరిక్షేణ, ఉప, యచ్ఛామి, ఇన్ద్ర, అశ్వినా, మధునః, సారఘస్య, ఘర్మమ్, పాత, వసవః, యజత, వాట్, స్వాహా, సూర్యస్య, రశ్మయే, వృష్టివనయ + ఇతి వృష్టి + వనయే.॥౬॥

పదార్థః :- (గాయత్రమ్) గాయత్రీఛన్దసా ప్రకాశితమ్ (ఛన్దః) స్వతన్త్రాహ్లాదకరమివ (అసి) (త్రైష్టుభమ్) త్రిష్టుభా వ్యాఖ్యాతవర్ణజాతమ్ (ఛన్దః) స్వతన్త్రమివ (అసి) (ద్యావాపృథివీభ్యామ్) సూర్యభూమీభ్యామ్ (త్వా) త్వామ్ (పరి) సర్వతః (గృహ్ణామి) స్వీకరోమి (అన్తరిక్షేణ) ఉదకేన సహ ప్రతిజ్ఞాతామ్ (ఉప, యచ్ఛామి) గృహ్ణామి (ఇన్ద్ర) పరమైశ్వర్యయుక్త (అశ్వినా) ప్రాణాఽపానావివ కార్యసాధకౌ (మధునః) మధురాది గుణయుక్తస్య (సారఘస్య) సరఘాభిర్మధుమక్షికాభిర్నిర్మితస్య (ఘర్మమ్) సుఖవర్షకం యజ్ఞం (పాత) రక్షత (వసవః) పృథివ్యాదయ ఇవ ప్రథమవిద్యాకల్పాః (యజత) సఙ్గచ్ఛధ్వమ్ (వాట్) సుష్ఠు (స్వాహా) సత్యయా క్రియయా (సూర్యస్య) (రశ్మయే) శోధనాయ (వృష్టివనయే) వృష్టేః సంవిభాజకాయ.॥౬॥

అన్వయః :- హే ఇన్ద్ర! యథా త్వం గాయత్రం ఛన్ద ఇవ హృద్యాం స్త్రియం ప్రాప్తవానసి, త్రైష్టుభం ఛన్ద ఇవ ప్రశంసితాం లబ్ధవానసి తథాఽహం త్వా దృష్ట్వా ద్యావాపృథివీభ్యామ్ ప్రియాం స్త్రియం పరిగృహ్ణామ్యన్తరిక్షేణోపయచ్ఛామి. హే అశ్వినా! స్త్రీపురుషౌ యువాం తథైవ వర్తేయాథామ్. హే వసవో విద్వాంసో! యూయం స్వాహా మధునః సారఘస్య ఘర్మం పాత సూర్యస్య వృష్టివనయే రశ్మయే వాట్ యజత.॥౬॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా శబ్దానామర్థైః సహ వాచ్యవాచక సంబన్ధః, సూర్యేణ సహ పృథివ్యా రశ్మిభిస్సహ వృష్టేర్యజ్ఞేన సహ యజమానస్యర్త్విజా చాస్తి తథైవ వివాహితయోః స్త్రీ పురుషయోః సమ్బన్ధో భవతు.॥౬॥

పదార్థము:-(ఇన్ద్ర) పరమైశ్వర్యవంతుడా! నీ వెటుల (గాయత్రమ్) గాయత్రీఛందస్సుతో ప్రకాశితమగు మరియు (ఛన్దః) స్వతంత్రానందకారకమగు అర్థముకొరకు హృదయమునకు ప్రియమగు స్త్రీని పొందినవాడవై (అసి) ఉన్నావో (త్రైష్టుభమ్) త్రిష్టుప్ఛందముతో వ్యాఖ్యాతమైన (ఛన్దః) స్వతంత్రార్థమువలె ప్రశంసనీయ పత్నిని పొందినవాడవై (అసి) ఉన్నావో, అటులనే నేను (త్వా) నిన్ను చూచి (ద్యావాపృథివీభ్యామ్) భూమి సూర్యులచే అతిశోభాయమానమగు ప్రియస్త్రీని (పరి, గృహ్ణామి) అన్నివిధముల స్వీకరింతును. మరియు (అన్తరిక్షేణ) హస్తముతో జలములు గొని ప్రతిజ్ఞలనొనర్చిన దానిని (ఉపయచ్ఛామి) స్త్రీత్వముతో బాటు గ్రహించుచున్నాను. (అశ్వినా) ప్రాణాపానములవలె కార్యసాధకులగు ఓ స్త్రీపురుషులారా! మీరుభయులు అదేవిధముగా వర్తించుడు (వసవః) పృథివి మున్నగు వసువులవంటి ప్రథమశ్రేణికి చెందిన విద్వాంసులారా! మీరు (స్వాహా) సత్యక్రియచే (మధునః, సారఘస్య) మధుమక్షికములు సిద్ధపరచినట్టి మధురాది గుణయుక్తమగు తేనె మరియు (ఘర్మమ్) సుఖమునందించు యజ్ఞముయొక్క (పాత) రక్షణను చేయుడు (సూర్యస్య) సూర్యుని (వృష్టివనయే) వర్షమును విభాగమొనర్చు (రశ్మయే) సంశోధక కిరణముకొరకు (వాట్) శ్రేష్ఠముగా (యజత) సంగతమొనర్చుడు. ॥౬॥

**భావార్థము** :- ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగా శబ్దార్థములతో వాచ్య వాచకములకు, సూర్యునితో పృథివికి, కిరణములతో వర్షమునకు, యజ్ఞముతో యజమానులకు, ఋత్విజులకు సంబంధముగలదో, అదేవిధముగ వివాహిత పతీపత్నుల సంబంధ ముండునుగాక! ॥౬॥

6. O strong man, like the twentfour syllables of the Gayatri metre, observe thou celibacy for twentyfour years; like fortyfour syllables of Trishtup metre, observe thou celibacy for fortyfour years!.

I grasp thee dear wife beautified by the Sun and Earth, and accept thee who takes vow with water in hand. O husband and wife behave mutually like Pran and Apan to accomplish your tasks.

O Vasus, protect nicely the sacrifice and the sweet honey prepared by the bees. Work together well and nobly to make sun's beams bring rain!.

౧౯౭౫. సముద్రాయేత్యస్య దీర్ఘతమా ఋషిః, వాతో దేవతా, భురిగష్టిశ్ఛన్దః, మధ్యమః స్వరః.

పునః కృతవివాహౌ స్త్రీపుంసౌ కిం కుర్యాతామిత్యాహ. స్త్రీపురుషు లేమి చేయవలయును ?

౧౯౭౫ సముద్రాయ త్వా వాతాయ స్వాహా। సరిరాయ త్వా వాతాయ స్వాహా। అనాధృష్యాయ త్వా వాతాయ స్వాహా। అప్రతిధృష్యాయ త్వా వాతాయ స్వాహా। అవస్యవే త్వా వాతాయ స్వాహా। అశిమిదాయ త్వా వాతాయ స్వాహా ॥౭॥

ప. వి:- సముద్రాయ, త్వా, వాతాయ, స్వాహా, సరిరాయ, త్వా, వాతాయ, స్వాహా, అనాధృష్యాయ, త్వా, వాతాయ, స్వాహా, అప్రతిధృష్యాయేత్య (ప్రతి + ధృష్యాయ త్వా, వాతాయ, స్వాహా, అవస్యవే, త్వా, వాతాయ, స్వాహా, అశిమిదాయేత్యశిమి + దాయ, త్వా, వాతాయ, స్వాహా ॥౭॥

పదార్థః :- (సముద్రాయ) అన్తరిక్షే గమనాయ (త్వా) త్వామ్ (వాతాయ) వాయు విద్యాయై వాయోః శోధనాయ వా (స్వాహా) సత్యయా వాచా క్రియయా వా (సరిరాయ)

ఉదకశోధనాయ (త్వా) (వాతాయ) గృహస్థాయ వాయవే (స్వాహా) (అనాధృష్యాయ) భయ ఘర్షణరాహిత్యాయ (త్వా) (వాతాయ) ఓషధిస్థవాయువిజ్ఞానాయ (స్వాహా) (అప్రతిధృష్యాయ) అధర్షితుం యోగ్యాన్ ప్రతి వర్తమానాయ (త్వా) (వాతాయ) వాయువేగగతివిజ్ఞానాయ (స్వాహా) (అవస్యవే) ఆత్మనోఽవమిచ్ఛవే (త్వా) (వాతాయ) ప్రాణశక్తివిజ్ఞానాయ (స్వాహా) (అశిమిదాయ) యదశ్యతే భుజ్యతే తదన్నం తన్మేదతే యస్మింస్తస్మై రసాయ (త్వా) (వాతాయ) ఉదానాయ (స్వాహా).॥౭॥

అన్వయః :- హే స్త్రీ పురుష వాఽహం స్వాహా సముద్రాయ వాతాయ త్వా స్వాహా సరిరాయ వాతాయ త్వా స్వాహాఽనాధృష్యాయ వాతాయ త్వా స్వాహాఽప్రతిధృష్యాయ వాతాయ త్వా స్వాహాఽవస్యవే వాతాయ త్వా స్వాహాఽశిమిదాయ వాతాయ త్వోపయచ్ఛామి.॥౭॥

భావార్థః :- అత్ర పూర్వస్మాన్మన్త్రాదుపయచ్ఛామీతి పదే అనువర్తేతే. కృతవివాహౌ స్త్రీపురుషౌ సృష్టి విద్యోన్నతయే ప్రయతేయాతామ్.॥౭॥

పదార్థము :- ఓ స్త్రీ లేదా పురుషుడా! నేను (స్వాహా) సత్క్రియచే (సముద్రాయ) ఆకాశముపై నడచుటకు (వాతాయ) వాయువిద్య లేక వాయువు శోధనకై (త్వా) నిన్ను (స్వాహా) సత్క్రియచే (సరిరాయ) జలముల మరియు గృహసంబంధ వాయువును శోధించుటకొరకు (త్వా) నిన్ను (స్వాహా) సత్యవాణితో (అనాధృష్యాయ) భయము, బెదిరించుటలు లేకుండుటకై (వాతాయ) ఓషధీసంబంధ వాయువు నెరుగుటకొరకు (త్వా) నిన్ను (స్వాహా) సత్యవాణి లేదా క్రియద్వారా (అప్రతిధృష్యాయ) భయపరచ గూడనివారియెడ వర్తించుటకొరకు (వాతాయ) వాయువుయొక్క వేగగతిని దెలిసికొనుటకై (త్వా) నిన్ను (స్వాహా) సత్క్రియచే (అవస్యతే) తమ రక్షణను గోరువారికొరకు మరియు (వాతాయ) ప్రాణశక్తిని విశేషముగా దెలిసికొనుటకై (త్వా) నిన్ను మరియు (స్వాహా) సత్క్రియచే (అశిమిదాయ) స్నేహమొనర్చదగిన రసయుక్త భోగ్యాన్నము మరియు (వాతాయ) ఉదానవాయువులకొరకు (త్వా) నిన్ను సమీపమునందే స్వీకరించుచున్నాను.॥౭॥

భావార్థము :- ఈ మంత్రమునందు (ఉప, యచ్ఛామి) అను పదముల అనువృత్తి వచ్చి యున్నది. వివాహిత స్త్రీపురుషులు సృష్టి విద్య ఉన్నతికై ప్రయత్నించవలెను. ॥౭॥

7. O husband or wife, truly do I accept thee for purifying the air that moves in the atmosphere. nicely do I accept thee for purifying the air in the water and in the house. I enjoin thee to be fearless and unconquerable, and to know the air in medicinal herbs. Verily do I ask thee to be irresistible, and know the velocity of air. Nobly do I accept thee as protection-seeker, for knowing speciallly the force of breath. In a noble way do I accept thee for the juice in which eatable food creates viscosity, and for Udan breath!.

౧౯౨౬. ఇన్ద్రాయేత్యస్య దీర్ఘతమా ఋషిః, ఇన్ద్రో దేవతా, అష్టిశ్ఛన్దః; మధ్యమః స్వరః.

పునః స్త్రీపురుషైః కిం కర్తవ్యమిత్యాహ. స్త్రీపురుషు లేమి చేయవలయును?

౧౯.౨౬ ఇన్ద్రాయ త్వా వసుమతే రుద్రవతే స్వాహేన్ద్రాయ త్వాదిత్యవతే
స్వాహేన్ద్రాయ త్వాభిమాతిఘ్నే స్వాహా । సవిత్రే త్వఽఋభుమతే
విభుమతే వాజవతే స్వాహా బృహస్పతయే త్వా విశ్వదేవ్యావతే స్వాహా ॥౮॥

ప.వి:-ఇన్ద్రాయ, త్వా, వసుమత ఇతి వసు + మతే, రుద్రవత ఇతి రుద్ర + వతే, స్వాహా, ఇన్ద్రాయ, త్వా, ఆదిత్యవత ఇత్యాదిత్య + వతే, స్వాహా, ఇన్ద్రాయ, త్వా, అభిమాతిఘ్న ఇత్యభి + మాతిఘ్నే, స్వాహా, సవిత్రే, త్వా, ఋభుమత ఇత్యృభు + మతే, విభుమత ఇతి విభు + మతే, వాజవత ఇతి వాజ + వతే, స్వాహా, బృహస్పతయే, త్వా, విశ్వదేవ్యావతే, విశ్వదేవ్యవత ఇతి విశ్వఽ దేవ్య + వతే, స్వాహా ॥౮॥

పదార్థః:-(ఇన్ద్రాయ) పరమైశ్వర్యాయ (త్వా) త్వాం స్త్రియం పురుషం వా (వసుమతే) బహుధనయుక్తాయ (రుద్రవతే) బహవో రుద్రాః ప్రాణా విద్యన్తే యస్మింస్తస్మై (స్వాహా) సత్యయా వాచా క్రియయా వా (ఇన్ద్రాయ) దుఃఖవిదారకాయ (త్వా) (ఆదిత్యవతే) పూర్ణవిద్యాయుక్తపాండిత్యవతే (స్వాహా) (ఇన్ద్రాయ) పరమైశ్వర్యప్రదాయ (త్వా) (అభిమాతిఘ్నే) యోఽభిమాతీన్ శత్రూన్ హన్తి తస్మై (స్వాహా) (సవిత్రే) సవితృవిద్యావిదే (త్వా) (ఋభుమతే) బహవ ఋభవో మేధావినో విద్యన్తే యస్మింస్తస్మై (విభుమతే) విభవః పదార్థా విదితా యేన తస్మై (వాజవతే) పుష్కలాన్నయుక్తాయ (స్వాహా) (బృహస్పతయే) బృహత్యాః వాచః పత్యే (త్వా) (విశ్వదేవ్యావతే) విశ్వాని దేవ్యాని విద్యన్తే యస్మింస్తస్మై (స్వాహా).॥౮॥

అన్వయః:-హే స్త్రీ పురుష! వాఽహం స్వాహా వసుమత ఇన్ద్రాయ త్వా స్వాహాఽఽదిత్యవతే రుద్రవత ఇన్ద్రాయ త్వా స్వాహాఽభిమాతిఘ్న ఇన్ద్రాయ త్వా స్వాహా సవిత్ర ఋభుమతే విభుమతే వాజవతే త్వా స్వాహా బృహస్పతయే విశ్వదేవ్యావతే త్వోపయచ్ఛామి.॥౮॥

భావార్థః:-అత్రాప్యుపయచ్ఛామీతి పదే అనువర్తేతే. యే స్త్రీపురుషా వసుభిరాదిత్యైరైశ్వర్యమున్నయన్తి తే విఘ్నాన్ హత్వా బుద్ధిమన్తః సన్తానాన్ ప్రాప్య సర్వస్య రక్షాం విధాతుం శక్నువన్తి.॥౮॥

**పదార్థము** :- ఓ స్త్రీ లేదా పురుషుడా! నేను (స్వాహా) సత్యవాణిచే (వసుమతే) అనేక ధనములలో (ఇన్ద్రాయ) ఉత్తమైశ్వర్యవంతులగు సంతానముకొరకు (త్వా) నిన్ను (స్వాహా) ఉత్తమ క్రియచే (ఆదిత్యవతే) సమస్త విద్యలయందు పాండిత్యవతియై (రుద్రవతే) అనేక ప్రాణుల బలము గలిగిన (ఇన్ద్రాయ) దుఃఖనాశకము నగు సంతానముకొరకు (త్వా) నిన్ను (స్వాహా) సత్యవాణిచే (అభిమాతిఘ్నే) శత్రువులను నశింపజేయు (ఇన్ద్రాయ) ఉత్తమైశ్వర్యముల నిచ్చు సంతానముకొరకు (త్వా) నిన్ను (స్వాహా) సత్యక్రియచే (సవిత్రే) సూర్యవిద్యనెరిగినట్టి (ఋభుమతే) అనేక బుద్ధిశాలురగు సఖులు గలది (విభుమతే) ఆకాశము మున్నగు విభుపదార్థముల నెరుగునది (వాజవతే) పుష్కల అన్నము గలదియునగు సంతానముకొరకు (త్వా) నిన్ను మరియు (స్వాహా) సత్యవాణిచే (బృహస్పతయే) గొప్పదైన వేదరూప వాణి రక్షకులగు (విశ్వదేవ్యావతే) సమస్త విద్వాంసుల హితకారి పదార్థములు గలిగిన సంతానమునకై (త్వా) నిన్ను గ్రహించుచున్నాను.।౮॥

**భావార్థము** :- ఈ మంత్రమునందును (ఉప, యచ్ఛామి) అను పదముల అనువృత్తి వచ్చియున్నది. ఏ స్త్రీపురుషులు పృథివి మున్నగు వసువుల మరియు చైత్రము మున్నగు మాసములచే తమ యైశ్వర్యములను వృద్ధిపరచుకొందురో వారు విఘ్నములను తొలగించుకొని బుద్ధిశాలురగు సంతానమును ప్రాప్తించుకొని సర్వప్రాణులను రక్షించుటకు సమర్థులగుదురు.।౮॥

8. O husband or wife, in true words, do I accept thee for the wealthy and powerful offspring. Truly do I accept thee for the erudite, self-controlled, miserykilling offspring. In truthful words, do I accept thee for the foe-killing, and affluent offspring. Truly do I accept thee for the offspring knowing the science of Sun, and befriending the wise, understanding the mighty atmosphere, and possessing stores of provisions. In true words do I accept thee for the offspring, the guardian of the Vedas, and the embodiment of noble virtues!.

౧౯౨౭. యమాయేత్యస్య దీర్ఘతమా ఋషిః, వాయుర్దేవతా, భురిగ్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౯౨౭ యమాయ త్వాఙ్గిరస్వతే పితృమతే స్వాహా।

స్వాహా ఘర్మాయ । స్వాహా ఘర్మః పిత్రే ।౯॥

ప. వి:- యమాయ, త్వా, అఙ్గిరస్వతే, పితృమత ఇతి పితృమతే, స్వాహా, స్వాహా, ఘర్మాయ, స్వాహా, ఘర్మః, పిత్రే.।౯॥

పదార్థః:-(యమాయ) న్యాయాధీశాయ (త్వా) త్వామ్ (అఙ్గిరస్వతే) విద్యుదాదివిద్యా యస్మిన్ విద్యన్తే తస్మై (పితృమతే) పితరః పాలకా విజ్ఞానినో విద్యన్తే యస్మింస్తస్మై (స్వాహా) (స్వాహా) (ఘర్మాయ) యజ్ఞాయ (స్వాహా) (ఘర్మః) యజ్ఞః (పిత్రే) పాలకాయ.॥౯॥

అన్వయః:- హే స్త్రీ పురుష వా! ఘర్మోఽహం స్వాహాఽఙ్గిరస్వతే యమాయ పితృమతే స్వాహా ఘర్మాయ స్వాహా పిత్రే త్వోపయచ్ఛామి ॥౯॥

భావార్థః:-అత్రోపయచ్ఛామీతి పదే అనువర్తేతే. యౌ స్త్రీపురుషౌ ప్రాణవన్న్యాయం జనకాన్ విదుషశ్చ సేవేతాం తౌ యజ్ఞవత్సర్వేషాం సుఖకరౌ స్యాతామ్ ॥౯॥

పదార్థము :- ఓ స్త్రీ లేదా పురుషుడా! (ఘర్మః) యజ్ఞమువలె ప్రకాశవంతుడనగు నేను (స్వాహా) సత్యవాణిచే (అంగిరస్వతే) విద్యుత్తు మున్నగు విద్యల జ్ఞాతలకొరకు (యమాయ) న్యాయాధీశునికొరకు (పితృమతే) రక్షకులగు జ్ఞానులతో గూడిన సంతానముకొరకు (స్వాహా) సత్యక్రియచే (ఘర్మాయ) యజ్ఞముకొరకు (స్వాహా) సత్యక్రియచే (పిత్రే) రక్షకులకొరకు (త్వా) స్వీకరించెదను.॥౯॥

భావార్థము :- ఈ మంత్రములోనూ 'ఉప, యచ్ఛామి' అను పదముల అనువృత్తి వచ్చినది. ఏ స్త్రీపురుషులు ప్రాణములవలె న్యాయమును పితరులను మరియు విద్వాంసులను సేవించుచుందురో వారు యజ్ఞమువలె నెల్లరకును సుఖకరులగుదురు.॥౯॥

**9.** O husband or wife, I, resplendent like sacrifice, in true words do accept thee for the offspring, knowing the science of electricity, lover of justice, and friend of the learned. Verily do I accept thee for sacrifice. Truly do I accept thee as a protector!.

౧౯౨౦. విశ్వా ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, అశ్వినౌ దేవతే, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునరధ్యాపకోపదేశకౌ కిం కుర్యాతామిత్యాహ. అధ్యాపకోపదేశకు లేమి చేయవలయును?

౧౯౨౦ విశ్వా ఆశా దక్షిణసద్విశ్వాన్దేవానయాడిహ।

స్వాహాకృతస్య ఘర్మస్య మధోః పిబతమశ్వినా ॥౧౦॥

ప. వి:- విశ్వాః, ఆశాః, దక్షిణసదితి దక్షిణ+సత్, విశ్వాన్, దేవాన్, అయాట్, ఇహ, స్వాహాకృతస్యేతి స్వాహా + కృతస్య, ఘర్మస్య, మధోః, పిబతమ్, అశ్వినా.॥౧౦॥

పదార్థః :- (విశ్వాః) సర్వాః (ఆశాః) దిశః (దక్షిణసత్) యో దక్షిణే దేశే సీదతి (విశ్వాన్) సమగ్రాన్ (దేవాన్) శుభాన్ గుణాన్ విదుషో వా (అయాట్) యజేత్సఙ్గచ్ఛేత్

(ఇహ) అస్మిన్ సంసారే (స్వాహాకృతస్య) సత్యక్రియానిష్పన్నస్య (ఘర్మస్య) యజ్ఞస్య (మధోః) మధురాదిగుణయుక్తస్య (పిబతమ్) (అశ్వినా) అధ్యాపకోపదేశకౌ.॥౧౦॥

అన్వయః:- హే అశ్వినా! యథా యువామిహ స్వాహాకృతస్య ఘర్మస్య మధోరవశిష్టం భాగం పిబతం తథాఽయం దక్షిణసజ్జనో విశ్వా ఆశా విశ్వాన్దేవానయాట్ సజ్గచ్ఛేత్.॥౧౦॥

భావార్థః:- యథోపదేశకాఽధ్యాపకాః శిష్యైరన్నధ్యాపయేయుశ్చ తథైవ సర్వే సజ్జ్యుష్ణీయుః.॥౧౦॥

పదార్థము :- (అశ్వినా) ఓ అధ్యాపక, ఉపదేశకులారా! మీరు (ఇహ) ఈ జగమునందు (స్వాహాకృతస్య) సత్యక్రియద్వారా సాధించిన (ఘర్మస్య, మధోః) మధురాది గుణములతో గూడిన యజ్ఞముయొక్క అవశేష భాగమును (పిబతమ్) పానమొనర్చుడు. అటులనే ఈ (దక్షిణసత్) వేదికపై దక్షిణభాగము [దిశ] నందు గూర్చుండునట్టి ఆచార్యుని (అయాట్) సేవ పూజనముల నొనర్చుడు.॥౧౦॥

భావార్థము :- ఏవిధముగ అధ్యాపకోపదేశకులు చదివించుట, ఉపదేశించుటలు చేయుదురో, ఆదే తీరున అందరును పొంటించవలయును.॥౧౦॥

10. O teacher and preacher, in this world, taste ye the remnants of this pleasant well-arranged sacrifice. Let the priest seated in the south of the altar, accompany and worship the learned in all quarters!.

౧౯౨౯. దివి ధా ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, యజ్ఞో దేవతా, విరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః స్త్రీపురుషాః కిం కుర్యురిత్యాహ. స్త్రీపురుషు లేమి చేయువలయును ?

౧౯౨౯ దివి ధా ఇమం యజ్ఞమిమం యజ్ఞం దివి ధాః।

స్వాహాఽగ్నయే యజ్ఞియాయ శం యజుర్భ్యః ॥౧౧॥

ప. వి:- దివి, ధాః, ఇమమ్, యజ్ఞమ్, ఇమమ్, యజ్ఞమ్, దివి, ధాః, స్వాహా, అగ్నయే, యజ్ఞియాయ, శమ్, యజుర్భ్య ఇతి యజుః + భ్యః ॥౧౧॥

పదార్థః:- (దివి) సూర్యాదిప్రకాశే (ధాః) ధేహి (ఇమమ్) గృహాశ్రమవ్యవహారోపయోగినమ్ (యజ్ఞమ్) సజ్గన్తుమర్హమ్ (ఇమమ్) పరమార్థసిద్ధికరం సంన్యాసాశ్రమోపయోగినమ్ (యజ్ఞమ్) విద్వత్సంగయుక్తమ్ (దివి) విజ్ఞానప్రకాశే (ధాః) ధేహి (స్వాహా) సత్యయా క్రియయా (అగ్నయే) పావకాయ (యజ్ఞియాయ) యజ్ఞార్హాయ (శమ్) సుఖమ్ (యజుర్భ్యః) యాజకేభ్యో యజుర్వేద విభాగేభ్యో వా.॥౧౧॥

**అన్వయః:-హే స్త్రీ పురుష వా! త్వం యజుర్భ్యః స్వాహాఽగ్నయే యజ్ఞియాయ దివీమం యజ్ఞం శం ధాః. దివీమం యజ్ఞం శం ధాః.॥౧౧॥**

**భావార్థః:-యే స్త్రీపురుషా బ్రహ్మచర్యేణాఽఖిలాం విద్యాసుశిక్షాం ప్రాప్య వేదరీత్యా కర్మాణ్యనుతిష్ఠే యుస్తేఽతులం సుఖం లభేరన్.॥౧౧॥**

**పదార్థము :-** స్త్రీ లేక పురుషుడా! నీవు (యజుర్భ్యః) యజ్ఞమునొనర్చు లేక యజుర్వేదముయొక్క విభాగములనుండి (స్వాహా) సత్యక్రియతో (అగ్నయే, యజ్ఞియాయ) యజ్ఞకర్మకు దగిన అగ్నికొరకు (దివి) సూర్యాదుల ప్రకాశమునందు (ఇమమ్) ఇట్టి (యజ్ఞమ్) సాంగత్యమొనర్చదగిన గృహాశ్రమ వ్యవహారములకు ఉపయుక్తమగు యజ్ఞమును (శమ్) సుఖపూర్వకముగ (ధాః) ధారణమొనర్చి (దివి) విజ్ఞానముయొక్క ప్రకాశమునందు (ఇమమ్) ఈ పరమార్థసాధకమగు సన్న్యాసాశ్రమమునకు ఉపయోగకరమగు (యజ్ఞమ్) విద్వాంసుల సంగరూప యజ్ఞమును సుఖపూర్వకముగ (ధాః) ధారణమొనర్చుము.॥౧౧॥

**భావార్థము :-** స్త్రీపురుషులు బ్రహ్మచర్యముతోగూడ సకల విద్యలతోగూడిన ఉత్తమ శిక్షణను పొంది వేదోక్తముగ కర్మానుష్ఠానముల నొనర్చువారు అతులసుఖసంపదలను పొందుదురు.॥౧౧॥

11. O husband or wife, with the verses of the Yajur veda, in a nice way, in the light of the Sun, in the fire fit for yajna, perform with pleasure, the duty of domestic life. In the light of knowledge, perform with pleasure in the company of the learned, the Sanyas yajna; the giver of true spiritual knowledge!.

౧౯౩౦. అశ్వినేత్యస్య దీర్ఘతమా ఋషిః, అశ్వినా దేవతే, ఆర్చీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరలనదే విషయము.

౧౯౩౦ అశ్వినా ఘర్మం పాతꣳహార్ద్వానమహర్దివాభిరూతిభిః।

తన్త్రాయిణే నమో ద్యావాపృథివీభ్యామ్ ॥౧౨॥

**ప.వి:-అశ్వినా, ఘర్మమ్, పాతమ్, హార్ద్వానమ్, అహః, దివాభిః, ఊతిభిరిత్యూతి + భిః, తన్త్రాయిణే, నమః, ద్యావాపృథివీభ్యామ్.॥౧౨॥**

పదార్థః:-(అశ్వినా) సుశిక్షితౌ స్త్రీపురుషౌ (ఘర్మమ్) (పాతమ్) రక్షతమ్ (హార్ద్వానమ్) హృదం వనతి సమ్భజతి యేన తదేవ (అహః) ప్రతిదినమ్ (దివాభిః) అహర్నిశవర్తమానాభిః (ఊతిభిః) రక్షాదిభిః (తన్త్రాయిణే) తన్త్రాణి కలాశాస్త్రాణి అయితుం జ్ఞాతుం ప్రాప్తుం వా శీలం యస్య తస్మై (నమః) అన్నమ్ (ద్యావాపృథివీభ్యామ్) సూర్యాన్తరిక్షాభ్యామ్ ॥౧౨॥

అన్వయః:- హే అశ్వినా స్త్రీపురుషౌ! యువామహర్దివాభిరూతిభిస్త్రత్రాయిణే హార్ద్వానం ఘర్మం పాతం ద్యావాపృథివీభ్యాం తత్రాయిణే నమో దత్తమ్.॥౧౨॥

భావార్థః:- యథా భూమిసూర్యౌ సదా పరస్పరోపకారిణౌ సహ వర్తేతే తథా సౌహార్దేన సహితౌ సతతం స్త్రీపురుషౌ వర్తేయాతామ్.॥౧౨॥

పదార్థము :-(అశ్వినా) సుశిక్షితులగు స్త్రీపురుషులారా! మీరు (అహః) ప్రతిదినము (దివాభిః) దివారాత్రములందు వర్తమానమైయున్న (ఊతిభిః) రక్షణము మున్నగు క్రియలచే (తత్రాయిణే) శిల్పవిద్యా శాస్త్రముల నెరుగుట లేక ప్రాప్తించు కొనుటకై (హార్ద్వానమ్) హృదయమునందు గలిగిన జ్ఞానసంబంధ (ఘర్మమ్) యజ్ఞమును (పాతమ్) రక్షించుడు (ద్యావా పృథివీభ్యామ్) సూర్యుడు మరియు ఆకాశసంబంధముతో శిల్పశాస్త్రజ్ఞునికొరకు (నమః) అన్నము నీయుడు.॥౧౨॥

భావార్థము:-ఏవిధముగ భూమి మరియు సూర్యుడు పరస్పరము ఉపకార స్వభావముతో కలిసియుండునో, అదేవిధముగ స్త్రీ పురుషులు [పతిపత్నులు] పరస్పరము మిత్రభావముతో వర్తించ వలయును. ॥౧౨॥

12. O well educated husband and wife, protect daily the yajna, which broadens our mental vision, gives us scientific and technical knowledge, and is worth preservation day and night, in various ways. Give food and who respect to the technician who brings the Sun and atmosphere in service!.

౧౯౩౧. అపాతామిత్యస్య దీర్ఘతమా ఋషిః, అశ్వినా దేవతే, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నావిషయమే.

౧౯౩౧ అపాతామశ్వినా ఘర్మమను ద్యావాపృథివీఽఅమంస్సాతామ్।

ఇహైవ రాతయః సన్తు ॥౧౩॥

ప. వి:-అపాతామ్, అశ్వినా, ఘర్మమ్, అను, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, అమంస్సాతామ్, ఇహ, ఏవ, రాతయః, సన్తు ॥౧౩॥

పదార్థః:-(అపాతామ్) రక్షేతమ్ (అశ్వినా) సురీత్యా వర్తమానౌ స్త్రీపురుషౌ (ఘర్మమ్) గృహాశ్రమ వ్యవహారాఽనుష్ఠానమ్ (అను) ఆనుకూల్యే (ద్యావాపృథివీ) సూర్యభూమీ ఇవ (అమంసాతామ్) మన్యేతామ్ (ఇహ) అస్మిన్నాశ్రమే (ఏవ) (రాతయః) విద్యాదిసుఖదానాని (సన్తు).॥౧౩॥

**అన్వయః:**- హే అశ్వినా! యువాం వాయువిద్యుతావివ ఘర్మమపాతాం ద్యావాపృథివీ ఇవ ఘర్మమన్వమంసాతాం యత ఇహ రాతయ ఏవ సన్తు.॥౧౩॥

**భావార్థః:**- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యథా వాయువిద్యుతౌ భూమిసూర్యౌ సహ వర్తిత్వా సుఖాని దత్తస్తథైవ స్త్రీపురుషౌ ప్రీత్యా సహ వర్తమానౌ సర్వేభ్యోఽతులం సుఖం దద్యాతామ్.॥౧౩॥

**పదార్థము** :-(అశ్వినా) చక్కనిరీతిలోనుండు స్త్రీపురుషులారా! మీరు వాయువు మరియు విద్యుత్తువలె (ఘర్మమ్) గృహాశ్రమవ్యవహారముల అనుష్ఠానమును (అపాతామ్) రక్షణజేయుడు. (ద్యావాపృథివీ) భూమి సూర్యులవలె గృహాశ్రమ వ్యవహారముల యనుష్ఠానమును (అను, అమంసాతామ్) అనుమానమొనర్చుచుండుడు. అందువల్ల (ఇహ) ఈ గృహాశ్రమమందు (రాతయః) విద్యాదులచే జనించిన సుఖముల దానములు (ఏవ) మాత్రమే (సన్తు) జరుగుగాక! ॥౧౩॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఏవిధముగా వాయువు, విద్యుత్తులు మరియు సూర్యుడు, భూమి కలిసియుండి సుఖముల నిచ్చుచుండునో అదే విధముగ, సతీపతులు ప్రేమతో గలిసియుండి అందరకు అతుల సుఖముల నీయవలెను.॥౧౩॥

13. O husband and wife, protect together the domestic life like air and lightning. Like the Sun and Earth judge together the responsibilities of the married life, whereby in this domestic life let your boons of knowledge and pleasure be bestowed on all!.

౧౯౩౭.ఇషే పిన్వస్వేత్యస్య దీర్ఘతమా ఋషిః, ద్యావాపృథివీ దేవతే,అతిశక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నదే విషయము.

౧౯౩౭ ఇషే పిన్వస్వోర్జే పిన్వస్వ బ్రహ్మణే పిన్వస్వ క్షత్రాయ పిన్వస్వ ద్యావా
పృథివీభ్యాం పిన్వస్వ। ధర్మాసి సుధర్మామేన్యస్మే నృమ్ణాని ధారయ
బ్రహ్మ ధారయ క్షత్రం ధారయ విశం ధారయ ॥౧౪॥

**ప.వి:**- ఇషే, పిన్వస్వ, ఊర్జే పిన్వస్వ, బ్రహ్మణే, పిన్వస్వ, క్షత్రాయ, పిన్వస్వ, ద్యావాపృథివీభ్యామ్, పిన్వస్వ, ధర్మ, అసి, సుధర్మేతి సు + ధర్మ, అమేని, అస్మేఽఇత్యస్మే, నృమ్ణాని, ధారయ, బ్రహ్మ ధారయ, క్షత్రమ్, ధారయ, విశమ్, ధారయ. ॥౧౪॥

పదార్థః:-(ఇషే) అన్నాద్యాయ (పిన్వస్వ) సేవస్వ (ఊర్జే) బలాద్యాయ (పిన్వస్వ) (బ్రహ్మణే) వేదవిజ్ఞానాయ పరమేశ్వరాయ వేదవిదే బ్రాహ్మణాయ వా (పిన్వస్వ) (క్షత్రాయ) రాజ్యాయ (పిన్వస్వ) (ద్యావాపృథివీభ్యామ్) భూమిసూర్యాభ్యామ్ (పిన్వస్వ) (ధర్మ) సత్యధారక (అసి) (సుధర్మ) శోభనో ధర్మో యస్య తత్సమ్బుద్ధౌ (అమేని) అహింసకః సన్. అత్ర సుపాం సులుగితి సులోపః.(అస్మే) అస్మభ్యమ్ (నృమ్ణాని) ధనాని (ధారయ) (బ్రహ్మ) వేదం బ్రాహ్మణం వా (ధారయ) (క్షత్రమ్) క్షత్రియం రాజ్యం వా (ధారయ) (విశమ్) ప్రజామ్ (ధారయ).॥౧౪॥

అన్వయః:-హే ధర్మ సుధర్మ పురుష స్త్రీ వా! త్వమమేన్యసి యేనాఽస్మే నృమ్ణాని ధారయ బ్రహ్మ ధారయ క్షత్రం ధారయ విశం ధారయ తేనేషే పిన్వస్వోర్జే పిన్వస్వ బ్రహ్మణే పిన్వస్వ క్షత్రాయ పిన్వస్వ ద్యావాపృథివీభ్యాం పిన్వస్వ.॥౧౪॥

భావార్థః:- యే స్త్రీపురుషా అహింసకా ధార్మికాః సన్తః స్వయం ధనాని విద్యాం రాజ్యం ప్రజాం చ ధృత్వాఽన్యాన్ధారయేయుస్తేఽన్నబలవిద్యారాజ్యాని ప్రాప్య భూమిసూర్యవద్దృష్టసుఖా జాయేరన్.॥౧౪॥

పదార్థము:-(ధర్మ) సత్యవ్రతుడా! (సుధర్మ) శ్రేష్ఠమగు ధర్మయుక్తులగు స్త్రీ లేక పురుషుడా! నీవు (అమేని) హింసాకృత్యములు లేనివాడవై (అసి) ఉన్నావు. కావున (అస్మే) మాకొరకు (నృమ్ణాని) ధనములను (ధారయ) ధరించుము (బ్రహ్మ) వేదమనెడి బ్రాహ్మణుని (ధారయ) ధారణమొనర్చుము (క్షత్రమ్) క్షత్రియుని లేక రాజ్యమును (ధారయ) ధారణమొనర్చుము (విశమ్) ప్రజలను (ధారయ) ధరించుము. కావున (ఇషే) అన్నాదులను (పిన్వస్వ) సేవించుము (ఊర్జే) బలము మున్నగువానికొరకు (పిన్వస్వ) సేవించుము (బ్రహ్మణే) వేదవిజ్ఞానము, పరమేశ్వరుడు లేక వేదజ్ఞుడగు బ్రాహ్మణునికొరకు (పిన్వస్వ) సేవనమొనర్చుము (క్షత్రాయ) రాజ్యముకొరకు (పిన్వస్వ) సేవించుము (ద్యావాపృథివీభ్యామ్) భూమి మరియు సూర్యునికొరకు (పిన్వస్వ) సేవనమొనర్చుము.॥౧౪॥

భావార్థము:- స్త్రీపురుషులు హింసారహితులు, ధర్మాత్ములునై స్వయముగ ధనము విద్య, రాజ్యము, ప్రజలను ధరించినవారలై, అన్నము, బలము, విద్య, ధనము రాజ్యములను పొంది భూమి సూర్యులవలె ప్రత్యక్షసుఖముల ననుభవించుచు ఇతరులకు సుఖములను గలిగించవలెను.॥౧౪॥

14. O husband or wife, the recipient of truth, religious. Minded, thou art free from violence, hence establish wealth for us, learn the Veda, acquire sovereignty, and preserve the subjects. Hence enjoy overflow for food, enjoy overflow for Vedic knowledge and God, enjoy overflow for energy, enjoy overflow for Vedic knowledge and God, enjoy overflow for political power, enjoy overflow for Heaven and Earth!.

౧౯౩౩.స్వాహా పూష్ణే ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, పూషాదయో లిఙ్గోక్తా దేవతాః, స్వరాడ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౯౩౩ స్వాహా పూష్ణే శరసే స్వాహా గ్రావభ్యః స్వాహా ప్రతిరవేభ్యః।
స్వాహా పితృభ్య ఊర్ధ్వబర్హిర్భ్యో ఘర్మపావభ్యః స్వాహా
ద్యావాపృథివీభ్యాꣳస్వాహా విశ్వేభ్యో దేవేభ్యః ॥౧౨॥

ప.వి:-స్వాహా, పూష్ణే, శరసే, స్వాహా, గ్రావభ్య ఇతి గ్రావ + భ్యః, స్వాహా, ప్రతిరవేభ్య ఇతి ప్రతి + రవేభ్యః, స్వాహా, పితృభ్య ఇతి పితృ + భ్యః, ఊర్ధ్వబర్హిర్భ్య ఇత్యూర్ధ్వ౨ బర్హిః + భ్యః, ఘర్మపావభ్య ఇతి ఘర్మ + పావభ్యః, స్వాహా, ద్యావాపృథివీభ్యామ్, స్వాహా, విశ్వేభ్యః, దేవేభ్యః.॥౧౨॥

పదార్థః :-(స్వాహా) సత్యా క్రియా (పూష్ణే) పుష్టికారకాయ (శరసే) హింసకాయ (స్వాహా) సత్యా వాక్ (గ్రావభ్యః) గర్జకేభ్యో మేఘేభ్యః. గ్రావేతి మేఘ నా...నిఘం ౧ ౧౦. (స్వాహా) (ప్రతిరవేభ్యః) యే రవాన్ ప్రతిరువన్తి శబ్దాయన్తే తేభ్యః (స్వాహా) (పితృభ్యః) పాలకేభ్య ఋతవ ఇవ వర్తమానేభ్యః (ఊర్ధ్వబర్హిర్భ్యః) ఊర్ధ్వముత్కృష్టం బర్హిర్వర్ధనం యేభ్యస్తేభ్యః (ఘర్మపావభ్యః) ఘర్మేణ యజ్ఞేన పవిత్రీకర్తృభ్యః (స్వాహా) (ద్యావాపృథివీభ్యామ్) సూర్యాన్తరిక్షాభ్యామ్ (స్వాహా) (విశ్వేభ్యః) సమగ్రేభ్యః (దేవేభ్యః) దివ్యేభ్యో పృథివ్యాదిభ్యో విద్వద్భ్యో వా.॥౧౨॥

అన్వయః:-స్త్రీపురుషైః పూష్ణే శరసే స్వాహా ప్రతిరవేభ్యః స్వాహా గ్రావభ్యః స్వాహోర్ధ్వ బర్హిర్భ్యో ఘర్మపావభ్యః పితృభ్యః స్వాహా ద్యావాపృథివీభ్యాం స్వాహా విశ్వేభ్యో దేవేభ్యశ్చ స్వాహా సదా ప్రయోజ్యా.॥౧౨॥

భావార్థః:-స్త్రీపురుషైః సత్యేన విజ్ఞానేన సత్యయా క్రియయేదృశః పురుషార్థః కర్తవ్యో యేన విశ్వం పుష్టమానన్దితం స్యాత్.॥౧౨॥

**పదార్థము** :- స్త్రీ పురుషులెట్లుండవలయు నన (ధ్రూష్ణ్వే) పుష్టికారకులు (శరసే) హింసకులకొరకు (స్వాహా) సత్యక్రియ, అనగా అధర్మమునుండి తప్పించుటకు ఉపాయము (ప్రతిరవేభ్యః) శబ్దమునకు ప్రతిశబ్దము నొనర్చువారలకొరకు (స్వాహా) సత్యవాణి (గ్రావభ్యః) గర్జించునట్టి మేఘములకొరకు (స్వాహా) సత్యక్రియ (ఊర్ధ్వ బర్హిర్భ్యః) ఉత్తమ కక్షలవరకు వృద్ధియైన (ఘర్మపావభ్యః) యజ్ఞములచే ప్రపంచమును పవిత్రపరచువారు (పితృభ్యః) రక్షకములగు ఋతువులవలె వర్తమానమైయున్న సజ్జనుల కొరకు (స్వాహా) సత్యవాణి (ద్యావాపృథివీభ్యామ్) సూర్యుడు మరియు ఆకాశములకొరకు (స్వాహా) సత్యక్రియ (విశ్వేభ్యః) సమస్త (దేవేభ్యః) పృథివ్యాదుల లేక విద్వాంసులకొరకు (స్వాహా) సత్యక్రియ లేక సత్యవాణిని సదా ప్రయోగించవలెను.॥౧౫॥

**భావార్థము** :- స్త్రీ పురుషులు సత్యవిజ్ఞానము, సత్యక్రియలద్వారా పురుషార్థపరులై సకల ప్రాణులకు పుష్టి మరియు ఆనందమును గలిగించవలయును.॥౧౫॥

15. Husband and wife should try to save powerful, violent persons from irreligious acts. They should respect the pupils who repeat the utterances of their preceptor They should receive gladly the thundering clouds. They should respect the highly cultured people, who purify the world with sacrifice, and like seasons protect us. They should use respectful words for ladies and gentlemen dignified like the sun and Earth. They should always speak the truth to all the learned people.

౧౯౩౪.స్వాహా రుద్రాయేత్యస్య దీర్ఘతమా ఋషిః, రుద్రాదయో దేవతాః,భురిగతిధృతిశ్ఛన్దః, షడ్జః స్వరః.

పునర్మనుష్యైః కిం కర్తవ్యమిత్యాహ. మానవు లేమి చేయవలయును?

౧౯౩౪ స్వాహా రుద్రాయ రుద్రహూతయే స్వాహా సం జ్యోతిషా జ్యోతిః।

అహః కేతునా జుషతాꣳ సుజ్యోతిర్జ్యోతిషా స్వాహా। రాత్రిః కేతునా

జుషతాꣳ సుజ్యోతిర్జ్యోతిషా స్వాహా। మధు హుతమిన్ద్రతమేఽ

అగ్నావశ్యామ తే దేవ ఘర్మ నమస్తేఽఅస్తు మా మా హిꣳసీః॥ ౧౬॥

ప.వి:- స్వాహా, రుద్రాయ, రుద్రహూతయ ఇతి రుద్ర + హూతయే, స్వాహా, సమ్,

జ్యోతిషా, జ్యోతిః, అహరిత్యహః, కేతునా, జుషతామ్, సుజ్యోతిరితి, సు + జ్యోతిః,

జ్యోతిషా, స్వాహా, రాత్రిః, కేతునా, జుషతామ్, సుజ్యోతిరితి సు + జ్యోతిః, జ్యోతిషా, స్వాహా, మధు, హుతమ్, ఇన్ద్రతమ ఇతీన్ద్ర + తమే, అగ్నౌ, అశ్యామ, తే, దేవ, ఘర్మ, నమః, తే, అస్తు, మా, మా, హింసీః ॥౧౬॥

పదార్థః:- (స్వాహా) (రుద్రాయ) జీవాయ (రుద్రహూతయే) రుద్రాః ప్రాణా జీవా వా హూయన్తే స్తూయన్తే యేన తస్మై (స్వాహా) (సమ్) (జ్యోతిషా) ప్రకాశేన (జ్యోతిః) ప్రకాశమ్ (అహః) దినమ్ (కేతునా) ప్రజ్ఞయా. కేతురితి ప్రజ్ఞానా...నిఘం. ౩.౯ (జుషతామ్) సేవతామ్ (సుజ్యోతిః) శోభనం విద్యాదిసద్గుణప్రకాశమ్ (జ్యోతిషా) సత్యవిద్యోపదేశరూపప్రకాశేన (స్వాహా) (రాత్రిః) రాత్రిమ్. అత్ర విభక్తివ్యత్యయః (కేతునా) సంకేతరూపచిహ్నేన (జుషతామ్) (సుజ్యోతిః) ధర్మాదిసద్గుణప్రకాశమ్ (జ్యోతిషా) మననాదిరూపప్రకాశేన (స్వాహా) (మధు) మధురాదిగుణయుక్తం ఘృతాది (హుతమ్) వహ్నౌ ప్రక్షిప్తమ్ (ఇన్ద్రతమే) అతిశయేనైశ్వర్యకారకే విద్యుద్రూపే (అగ్నౌ) పావకే (అశ్యామ) ప్రాప్నుయామ (తే) తుభ్యమ్ (దేవ) విద్వన్ (ఘర్మ) ప్రకాశమాన (నమః) (తే) (అస్తు) (మా) నిషేధే (మా) మామ్ (హింసీః) హింస్యాః.॥౧౬॥

అన్వయః:- హే స్త్రీ పురుష వా! భవతి భవాన్వా కేతునా రుద్రాయ రుద్రహూతయే స్వాహా జ్యోతిషా జ్యోతిః స్వాహా జ్యోతిషా సుజ్యోతిరహః స్వాహా సంజుషతామ్. కేతునా జ్యోతిషా సుజ్యోతిః రాత్రీ రాత్రిం స్వాహా జుషతామ్. హే దేవ ఘర్మ! యేన త ఇన్ద్రతమేఽగ్నౌ మధు హుతమశ్యామ తే నమోఽస్తు త్వం మా మా హింసీః.॥౧౬॥

భావార్థః:-మనుష్యైః ప్రాణానాం జీవనస్య సమాజస్య చ రక్షణాయ విజ్ఞానేన కర్మాణ్యహో రాత్రశ్చ యుక్త్యా సేవనీయః ప్రతిదినం ప్రాతః సాయం కస్తూర్యాదిసుగన్ధియుక్తం ఘృతం వహ్నౌ హుత్వా వాయ్వాదిశుద్ధిద్వారా నిత్యం మోదనీయమ్.॥౧౬॥

పదార్థము :- ఓ స్త్రీ లేక పురుషుడా! నీవు (కేతునా) బుద్ధిచే (రుద్రహూతయే) ప్రాణముల లేక జీవుల స్తుతినొనర్చునట్టి (రుద్రాయ) జీవునికొరకు (స్వాహా) సత్యవాణితో (జ్యోతిషా) ప్రకాశముతోగూడ (సుజ్యోతిః) ప్రకాశమును (స్వాహా) సత్యక్రియతోగూడిన (జ్యోతిషా) సత్యవిద్యల ఉపదేశరూప ప్రకాశముతో గూడ (సుజ్యోతిః) ఉత్తమ విద్యాదుల సద్గుణముల ప్రకాశము మరియు (అహః) దినము [పగలు] ను (స్వాహా) సత్యక్రియచే (సమ్, జుషతామ్) చక్కగా సేవించుము. (కేతునా) సంకేతరూప చిహ్నము, మరియు (జ్యోతిషా) మననము మున్నగు ప్రకాశములతోగూడ (సుజ్యోతిః) ధర్మాదిరూప సద్గుణముల ప్రకాశము,

మరియు (రాత్రిః) రాత్రిని (స్వాహా) సత్యక్రియచే (జుషతామ్) సేవించుడు (ఘర్మ) ప్రకాశవంతుడవగు నో (దేవ) విద్వాంసా! ఎయ్యది (తే) నీకొరకు (ఇన్ద్రవతే) అతిశయ ఐశ్వర్యములకు హేతువగు విద్యుత్తురూప (అగ్నౌ) అగ్నియందు (హుతమ్) హోమమొనర్చిన (మధు) మాధుర్యము మున్నగు గుణములతో గూడిన ఘృతాది పదార్థములు ఘ్రాణము [నాసికము] ద్వారా (అశ్యామ) ప్రాప్తించునో అట్టి (తే) నీకొరకు (నమః) నమస్కారము (అస్తు) ప్రాప్తించుగాక! నీవు (మా) నన్ను (మా హింసీః) హింసించకుము.॥౧౬॥

భావార్థము:- మానవులు ప్రాణుల జీవముల మరియు సమాజరక్షణకై విజ్ఞానముతోగూడ కర్మను రాత్రింబవళ్లు సంయుక్తపరచి సేవించవలయును. మరియు ప్రతిదినము ప్రాతఃసాయంకాలములందు కస్తూరి మున్నగు సుగంధిత ద్రవ్యములతో శుద్ధఘృతమును అగ్నియందు హోమమొనర్చి, వాయువు మున్నగు వాని శుద్ధిద్వారా నిత్యము ఆనందితులై యుండవలెను.॥౧౬॥

16. O husband or wife, for the soul that wisely extols the life breaths, let light combine with light in a righteous manner. Spend the day rightly combining the light of knowledge with the light of noble qualities!.

Wisely spend the night, rightly combining the light of contemplation with the light of noble religious qualities. May we enjoy through smell the sweet butter oblations put in the higly blazing fire. O Supreme God, I bow unto Thee. Let not Thou injure me!.

౧౯౩౫. అభీమమిత్యస్య దీర్ఘతమా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదతిశక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౯౩౫ అభీమం మహిమా దివం విప్రో బభూవ సప్రథాః। ఉత శ్రవసా

పృథివీꣳ సꣳ సీదస్వ మహాꣳ2॥ అసి రోచస్వ దేవవీతమః।

వి ధూమమగ్నే అరుషం మియేధ్య సృజ ప్రశస్త దర్శతమ్ ॥౧౭॥

ప.వి:- అభి, ఇమమ్, మహిమా, దివమ్, విప్రః, బభూవ, సప్రథా ఇతి స + ప్రథాః, ఉత, శ్రవసా, పృథివీమ్, సమ్, సీదస్వ, మహాన్, అసి, రోచస్వ, దేవవీతమ ఇతి దేవ + వీతమః, వి, ధూమమ్, అగ్నే, అరుషమ్, మియేధ్య, సృజ, ప్రశస్త, దర్శతమ్ ॥౧౭॥

పదార్థః:- (అభి) ఆభిముఖ్యే (ఇమమ్) (మహిమా) (దివమ్) అవిద్యాగుణప్రకాశమ్ (విప్రః) మేధావీ (బభూవ) భవతి (సప్రథాః) సుకీర్తిప్రఖ్యాతియుక్తః (ఉత) అపి (శ్రవసా)

శ్రవణేనాఽన్నేన వా (పృథివీమ్) భూమిమ్ (సమ్) (సీదస్వ) సమ్యగాస్వ (మహాన్) (అసి) (రోచస్వ) అభితః ప్రీతో భవ (దేవవీతమః) యో దేవాన్ దివ్యాన్ గుణాన్ విదుషో వేతి వ్యాప్నోతి ప్రాప్నోతి సోఽతిశయితః (వి) (ధూమమ్) (అగ్నే) అగ్నిరివ ప్రకాశమాన విద్వన్! (అరుషమ్) ఆరక్తరూపవిశిష్టమ్ (మియేధ్య) దుష్టానాం ప్రక్షేపణశీల! (సృజ) సర్జయ (ప్రశస్త) (దర్శతమ్) దర్శనీయమ్.॥౧౭॥

అన్వయః:-హే ప్రశస్త మియేధ్యాఽగ్నే మహిమా సప్రథా విప్రస్త్వమిమం దివమభి బభూవ. ఉతాపి శ్రవసా పృథివీం సం సీదస్వ యతో దేవవీతమో మహానసి తస్మాద్రోచ స్వారుషం దర్శతం ధూమం విసృజ. ॥౧౭॥

భావార్థః :- అయమేవ మనుష్యాణాం మహిమా యత్ బ్రహ్మచర్యేణ విద్యాం ప్రాప్య, సర్వత్ర విస్తార్య, శుభానాం గుణానాం ప్రచారం కృత్వా సృష్టివిద్యావమున్నయన్తి.॥౧౭॥

పదార్థము :-(ప్రశస్త) ప్రశంసనీయుడవు (మియేధ్య) దుష్టులను దూరమొనర్చువాడవునగు (అగ్నే) అగ్నివలె ప్రకాశమానుడవు, తేజోవంతుడవునగు నో విద్వాంసా! (మహిమా) విశిష్టమగు ఉత్తమ మహాగుణములుగల (సప్రథాః) ప్రసిద్ధ ఉత్తమ కీర్తిగల (విప్రః) బుద్ధిశాలివగు నీవు (ఇమమ్) ఇట్టి (దివమ్) అవిద్య మున్నగు గుణములు గలవారలను (అభి, బభూవ) తిరస్కరించుచున్నావు (ఉత) మరియు (శ్రవసా) వినుటద్వారా లేక అన్నముతోగూడ (పృథివీమ్) భూమిపై (సమ్, సీదస్వ) చక్కగా కూర్చుండుము (దేవవీతమః) దివ్యగుణముల లేక విద్వాంసులను అతిగా పొందువాడవు (మహాన్) మహాత్ముడవునై (అసి) ఉన్నావు. కావున (రోచస్వ) అన్ని వైపులనుండి ప్రసన్నుడవగుము. మరియు (అరుషమ్) కొద్దిపాటి ఎరుపువర్ణముగల దీనిచేతనే (దర్శతమ్) చూడదగిన (ధూమమ్) ధూమము [పొగ]ను హోమముద్వారా (వి,సృజ) విశేషముగా నుత్పన్నమొనర్చుము.॥౧౭॥

భావార్థము :-ఎవరు బ్రహ్మచర్యముతోగూడ సకల విద్యలను పొంది, సర్వత్ర వ్యాపింపజేసి శుభగుణములను ప్రచారమొనర్చుచు సృష్టివిద్యను అభివృద్ధిపరచుచుందురో అట్టి మనుష్యులే మహిమాన్వితులని తెలియవలెను.॥౧౭॥

17. O learned person, famous, chastiser of the wicked, majestic, possessing far-spread glory, and wise, thou condemnest the spread of ignorance. Seat thee well on earth with plenty to eat. Thou art mighty. Be happy, thou best entertainer of the learned. Loosen through Homa the smoke ruddy and beautiful to see!.

౧౮ యా త ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, యజ్ఞో దేవతా; భురిగాకృతిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునః స్త్రీపురుషాః కిం కుర్యురిత్యాహ.

స్త్రీపురుషు లేమి చేయవలయును?

౧౯౩౬ యా తే ఘర్మ దివ్యా శుగ్యా గాయత్ర్యాం హవిర్ధానే। సా త ఆ ప్యాయతాన్నిష్ట్యాయతాన్తస్యై తే స్వాహా। యా తే ఘర్మాన్తరిక్షే శుగ్యా త్రిష్టుబ్భ్యాగ్నీధ్రే। సా త ఆ ప్యాయతాన్నిష్ట్యాయతాన్తస్యై తే స్వాహా। యా తే ఘర్మ పృథివ్యాꣳ శుగ్యా జగత్యాꣳ సదస్యా। సా త ఆ ప్యాయతాన్నిష్ట్యాయతాన్తస్యై తే స్వాహా ॥౧౮॥

ప.వి:- యా, తే, ఘర్మ, దివ్యా, శుక్, యా, గాయత్ర్యామ్, హవిర్ధాన ఇతి హవిః + ధానే, సా, తే, ఆ, ప్యాయతామ్, నిః, స్త్యాయతామ్, తస్యై, తే, స్వాహా, యా, తే, ఘర్మ, అన్తరిక్షే, శుక్, యా, త్రిష్టుభి, త్రిస్తుభీతి త్రి + స్తుభి, ఆగ్నీధ్రే, సా, తే, ఆ, ప్యాయతామ్, నిః, స్త్యాయతామ్, తస్యై, తే, స్వాహా, యా, తే, ఘర్మ, పృథివ్యామ్, శుక్, యా, జగత్యామ్, సదస్యా, సా, తే, ఆ, ప్యాయతామ్, నిః, స్త్యాయతామ్, తస్యై, తే, స్వాహా ॥౧౮॥

పదార్థః :-(యా) (తే) (ఘర్మ) ప్రకాశాత్మన్ (దివ్యా) దివ్యేషు గుణేషు భవా (శుక్) శోచన్తి విచారయన్తి యయా సా (యా) (గాయత్ర్యామ్) గాయతో రక్షికాయాం విద్యాయామ్ (హవిర్ధానే) హవిషాం ధారణే (సా) (తే) తవ (ఆ) (ప్యాయతామ్) సర్వతో వర్ధతామ్ (నిః) నితరామ్ (స్త్యాయతామ్). అత్ర వ్యత్యయేనాత్మనేపదమ్. సంహతా భవన్తు (తస్యై) (తే) తుభ్యమ్ (స్వాహా) ప్రశంసితా వాక్ (యా) (తే) తవ (ఘర్మ) దినమివ విశాలవిద్యా (అన్తరిక్షే) ఆకాశే (శుక్) సూర్యస్యేవ ప్రదీప్తిః (యా) (త్రిష్టుభి) త్రిష్టుభ్ నిర్మితే ఊర్ధ్వే (ఆగ్నీధ్రే) అగ్నీధః శరణే (సా) (తే) తవ (ఆ) (ప్యాయతామ్) (నిః) (స్త్యాయతామ్) (తస్యై) (తే) (స్వాహా) (యా) (తే) తవ (ఘర్మ) విద్యుతః ప్రకాశ ఇవ వర్తమాన (పృథివ్యామ్) భూమౌ (శుక్) ప్రదీప్తిః (యా) (జగత్యామ్) జగదన్వితాయాం సృష్టౌ (సదస్యా) సదసి సభాయాం భవా (సా)(తే) తవ (ఆ) (ప్యాయతామ్) (నిః) (స్త్యాయతామ్) (తస్యై) (తే) (స్వాహా) సత్యవిద్యా.॥౧౮॥

అన్వయః:-హే ఘర్మ విద్వన్ విదుషి వా! యా తే గాయత్ర్యాం హవిర్ధానే శుగ్యా చ దివ్యా వర్తతే సా త ఆప్యాయతాం నిష్ట్యాయతాం తస్యై తే స్వాహా స్యాత్. హే ఘర్మ! యా తేఽన్తరిక్షే శుగ్యా ఆగ్నీధ్రే త్రిష్టుభి శుగస్తి సా త ఆప్యాయతాం నిష్ట్యాయతాం తస్యై తే స్వాహా. హే ఘర్మ! యా తే పృథివ్యాం యా సదస్యా జగత్యాం శుగస్తి సా త ఆప్యాయతాం నిష్ట్యాయతాం తస్యై తే స్వాహా భవతు.॥౧౮॥

భావార్థః:-యే స్త్రీ పురుషా దివ్యాం క్రియాం శుద్ధాముపాసనాం పవిత్రం విజ్ఞానం చ ప్రాప్య ప్రకాశన్తే త ఏవ మనుష్యజన్మఫలాపన్నా భవన్తి. అన్యానపి తథైవ కుర్యుః.॥౧౮॥

పదార్థము:-(ఘర్మ) ప్రకాశవంతుడవగు ఓ విద్వాంసుడా! లేక విదుషీరత్నమా! (యా) ఏ (తే) నీయొక్క (గాయత్ర్యామ్) చదువునట్టివారి రక్షకమగు విద్య మరియు (హవిర్ధానే) హోమమొనర్చదగు పదార్థములను ధరించుటయందు (శుక్) ఆలోచనాసాధనరూపమగు క్రియ మరియు (యా) ఎయ్యది (దివ్యా) దివ్యగుణములతో గూడిన క్రియగలదో (సా) అది (తే) నిన్ను (ఆ, ప్యాయతామ్) అన్నివైపులనుండి వృద్ధిపరచుగాక! మరియు (నిః, ష్ట్యాయతామ్) నిరంతరము సంయుక్తమగుగాక! (తస్యై) అట్టి క్రియ (తే) నీకొరకు (స్వాహా) ప్రశస్త వాణియగుగాక! (ఘర్మ) పగటివలె ప్రకాశవంతమగు విద్యగలపురుషుడా! లేక మహిళా (యా) ఏది (తే) నీయొక్క (అన్తరిక్షే) ఆకాశవిషయములో (శుక్) సూర్యుని దీప్తివలె విమానాదుల గమన క్రియగలదో మరియు (యా) ఎయ్యది (ఆగ్నీధ్రే) అగ్నియొక్క ఆశ్రయమందు మరియు (త్రిష్టుభి) త్రిష్టుప్ ఛందస్సునుండి వచ్చిన అర్థమునందు ఆలోచనారూప క్రియగలదో (సా) అది (తే) నీకొరకు (ఆ, ప్యాయతామ్) పెంపొందుగాక! మరియు (ని, ష్ట్యాయతామ్) నిరంతరము సంయుక్తమగుగాక! (తస్యై) అట్టి క్రియ (తే) నీకొరకు (స్వాహా) సత్యవాణియగుగాక! (ఘర్మ) విద్యుత్ప్రకాశమువలెనున్న స్త్రీ లేదా పురుషుడా! (యా) ఎయ్యది (తే) నీయొక్క (పృథివ్యామ్) భూమిపై మరియు (యా) ఎయ్యది (సదస్యా) సభయందు జరిగిన (జగత్యామ్) చేతన ప్రజాయుక్త సృష్టియందు (శుక్) ప్రకాశయుక్త క్రియగలదో (సా) అది (తే) నీకొరకు (ఆ, ప్యాయతామ్) వృద్ధి చెందునుగాక! మరియు (నిః, ష్ట్యాయతామ్) నిరంతరము సంబద్ధమగుగాక! (తస్యై) అట్టి క్రియ (తే) నీకొరకు (స్వాహా) సత్యవాణియగుగాక! ॥౧౮॥

భావార్థము :-ఏ స్త్రీపురుషులు దివ్యక్రియలు, శుద్ధమగు ఉపాసన, పవిత్ర విజ్ఞానమును పొంది ప్రకాశవంతులగుదురో అట్టివారే మనుష్యజన్మను సాఫల్యమొనర్చుకొనువారై యుందురు. అట్టివా రితరులను గూడ తమవంటివారిగా నొనర్చవలెను.॥౧౮॥

18. O learned husband or wife, may thy meditation and divine contemplation for preserving the knowledge of the pupils, and the provisions of the yajna increase and be ever accomplished. True speech for that act and thee!.

O husband or wife bright like the day, that flight of thine in the air, with the help of electricity as expounded in Trishtup, may increase and be accomplished. True speech for that act and thee!.

O husband or wife, lustrous like electricity, that shining performance of thine on the Earth, in the Assembly, or amongst the people, may increase and be accomplished. True speech for that performance and thee!.

౧౯౩౭. క్షత్రస్యేత్యస్య దీర్ఘతమా ఋషిః, యజ్ఞో దేవతా, నిచృదుపరిష్టాద్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ రాజప్రజే కిం కుర్యాతామిత్యాహ. రాజు, ప్రజలు ఏమి చేయవలయును?

౧౯౩౭ క్షత్రస్య త్వా పరస్పాయ బ్రహ్మణస్తన్వం పాహి।

విశస్త్వా ధర్మణా వయమను క్రామామ సువితాయ నవ్యసే ॥౧౯॥

ప.వి:- క్షత్రస్య, త్వా, పరస్పాయ, పరః పాయేతి పరః + పాయ, బ్రహ్మణః, తన్వమ్, పాహి, విశః, త్వా, ధర్మణా, వయమ్, అను, క్రామామ, సువితాయ, నవ్యసే ॥౧౯॥

పదార్థః :-(క్షత్రస్య) రాజన్యకులస్య రాష్ట్రస్య వా (త్వా) త్వామ్ (పరస్పాయ) యేన పరానన్యాన్ పాతి తస్మై (బ్రహ్మణః) బ్రహ్మవిదః (తన్వమ్) శరీరమ్ (పాహి) (విశః) మనుష్యాదిప్రజాః. విశ ఇతి మనుష్యనా.. నిఘం. ౨.౩ (త్వా) త్వామ్ (ధర్మణా) ధర్మేణ (వయమ్) (అను) (క్రామామ) అనుక్రమేణ గచ్ఛేమ (సువితాయ) ఐశ్వర్యప్రాప్తయే (నవ్యసే) అతిశయేన నవీనాయ.॥౧౯॥

అన్వయః :-హే రాజన్! రాజ్ఞి వా! త్వం పరస్పాయ క్షత్రస్య బ్రహ్మణస్త్వా తన్వం పాహి యథా వయం నవ్యసే సువితాయ ధర్మణాఽనుక్రామామ తథైవ ధర్మేణ వర్తమానం త్వా విశోఽనుగచ్ఛన్తు.॥౧౯॥

భావార్థః :-రాజ్ఞా రాజపురుషైశ్చ ధర్మేణ విదుషః ప్రజాశ్చ సంరక్షణీయాః. ఏవం ప్రజాభీ రాజపురుషైశ్చ రాజా సదా సంరక్షణీయః. ఏవం న్యాయవినయాభ్యాం వర్తిత్వా రాజప్రజే నూతనమైశ్వర్యమున్నయేతామ్.॥౧౯॥

పదార్థము :- ఓ రాజా! లేదా రాణీ! నీవు (పరస్పాయ) ఏ కర్మలద్వారా ఇతరుల రక్షణ జరుగునో దానికొరకు (క్షత్రస్య) క్షత్రియవంశము లేక రాజ్యమును మరియు (బ్రహ్మణః) వేదవిదులగు బ్రాహ్మణకుల సంబంధమగు (త్వా) నీయొక్క (తన్వమ్) శరీరమును (పాహి) రక్షణ యొనర్చుము. ఎట్లు (వయమ్) మేము (నవ్యసే) నవీనమగు (సువితాయ) ఐశ్వర్యప్రాప్తికై (ధర్మణా) ధర్మముతోగూడ (అను క్రామామ) అనుకూలముగ నడతుమో, అదేవిధముగ ధర్మముతో వర్తించు (త్వా) నీకును అనుకూలముగ (విశః) ప్రజలు నడచుకొందురు గాక! ॥౧౯॥

**భావార్థము** :- రాజ రాజపురుషులు ధర్మయుక్తముగ విద్వాంసులను మరియు ప్రజలను రక్షించు చుండవలయును. అదేవిధముగ ప్రజలు రాజపురుషులను మరియు రాజును సదా రక్షించుచుండ వలెను. ఈవిధముగ న్యాయ, వినయములచే వర్తించుచు రాజు మరియు ప్రజలు నవీన నవీన ఐశ్వర్యములను ఉన్నతి నొందించుట యోగ్యమైయుండును.॥౧౯॥

19. O King, guard the body of the Kshatriya and Brahmana for affording protection to others, Just as we follow thee for acquiring new supremacy, so let thy subjects follow thee in a spirit of devotion!.

౧౯౩౦ చతుఃస్రక్తిరిత్యస్య దీర్ఘతమా ఋషిః, యజ్ఞో దేవతాః, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యురిత్యాహ. మానవు లేమి చేయవలయును?

౧౯౩౦ చతుః స్రక్తిర్నాభిర్ఋతస్య సప్రథాః స నో విశ్వాయుః సప్రథాః స నః సర్వాయుః సప్రథాః। అప ద్వేషో అప హ్వరోఽన్యవ్రతస్య సశ్చిమ॥౨౦॥

ప.వి:- చతుఃస్రక్తిరితి చతుః + స్రక్తిః, నాభిః, ఋతస్య, సప్రథా ఇతి స+ప్రథాః, సః, నః, విశ్వాయురితి విశ్వ+ఆయుః, సప్రథా ఇతి స + ప్రథాః, సః, నః, సర్వాయురితి సర్వ + ఆయుః, సప్రథా ఇతి స + ప్రథాః, అప, ద్వేషః, అప, హ్వరః, అన్యవ్రతస్యేత్యన్య + వ్రతస్య, సశ్చిమ.॥౨౦॥

పదార్థః:- (చతుఃస్రక్తిః) చతురస్రా (నాభిః) నాభిరివ (ఋతస్య) సత్యస్వరూపస్య (సప్రథాః) విస్తారేణ సహ వర్తమానః (సః) (నః) అస్మాన్ (విశ్వాయుః) సర్వమాయుర్యస్య (సప్రథాః) విస్తారేణ సహ వర్తమానః (సః) (నః) అస్మాన్ (సర్వాయుః) విస్తారేణ సహ వర్తమానః (సః) (నః) అస్మాన్ (సర్వాయుః) సమ్పూర్ణజీవనమ్ (సప్రథాః) విస్తీర్ణసుఖః (అప) దూరీకరణే (ద్వేషః) యే ద్విషన్తి తాన్ (అప) (హ్వరః) యే హ్వరన్తి కుటిలం గచ్ఛన్తి తాన్ (అన్యవ్రతస్య) అన్యేషాం పాలనే వ్రతం శీలం యస్య తస్య (సశ్చిమ) దూరే ప్రాప్నుయామ గమయేమ వా.॥౨౦॥

అన్వయః:- హే మనుష్యా! యథా చతుఃస్రక్తిర్నాభిరివ సప్రథా అన్యవ్రతస్యర్తస్య పరమాత్మనః సేవాం కరోతి స సప్రథా విశ్వాయుర్నోఽస్మాన్ బోధయంతు స సప్రథాః

సర్వాయుర్నః పరమేశ్వరవిద్యాం గ్రాహయతు యేన వయం ద్వేషోపసశ్చిమ హ్వారోఽప సశ్చిమ తథా యూయమపి కురుత.॥౨౦॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. హే మనుష్యా! యథా ప్రాప్తరసా నాభీ రసముత్పాద్య సర్వాన్ శరీరావయవాన్ పుష్ణాతి తథా సేవితా విద్వాంస ఉపాసితః పరమేశ్వరశ్చ ద్వేషం కుటిలతాదిదోషాంశ్చ నివార్య సర్వాన్ జీవాన్ సంరక్షతీతి మత్వా తేషాం తస్య చ సతతం సేవా కార్యా.॥౨౦॥

**పదార్థము :-** ఓ మానవులారా! ఏవిధముగ (చతుః, స్రక్తిః) చతుష్కోణములుగల (నాభిః) నాభి మధ్య మార్గమువలె నిష్పక్షికుడు (సప్రథాః) విస్తారవర్తనుడగు సత్పురుషుడు (అన్యవ్రతస్య) ఇతరలోకముల నన్నిటిని రక్షించు స్వభావముగల (ఋతస్య) సత్యస్వరూపుడగు పరమేశ్వరుని సేవించునో (సః) ఆతడే (సప్రథాః) విస్తృత కార్యముల నొనర్చువాడు (విశ్వాయుః) సంపూర్ణాయుష్యము గలవాడు (నః) మాకు బోధనొనర్చుగాక! (సః) ఆతడు (సప్రథాః) అధిక సుఖవంతుడు (సర్వాయుః) దీర్ఘాయువుగలవాడు (నః) మాకు పరమేశ్వర సంబంధ విద్యను గ్రహింపజేయుగాక! దానివల్ల మేము (ద్వేషః) ద్వేషించు శత్రువులను (అపసశ్చిమ) దూరము తరిమివేయుదుముగాక! మరియు ఎట్లు (హ్వారః) కుటిలాత్ములను (అప) వేరుచేయుదుమో, అదేవిధముగ మీరును యొనర్చుడు.॥౨౦॥

**భావార్థము :-** ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఓ మానవులారా! ఏవిధముగ రసమును పొందిన నాభి రసమునుత్పన్నపరచి శరీరావయవములను పుష్టివంతమొనర్చునో, అదేవిధముగ సేవించబడిన విద్వాంసులు లేక ఉపాసించబడిన పరమేశ్వరుడు ద్వేషము మరియు కుటిలత్వము మున్నగు దోషములను నివృత్త మొనర్చజేసి సకల ప్రాణుల రక్షణనొనర్చెదరో లేక ఒనర్చునో అట్టి విద్వాంసులను లేదా ఆ పరమేశ్వరుని నిరంతరము సేవించవలయును.॥౨౦॥

20. A godly person, like the four-cornered navel, serves in abundance, God, the Protector of the world and True in nature. May he, full of age and engagements teach us. May he, advanced in age and happiness instruct us in the knowledge God, so that we may whun the hateful enemies, and cast aside the crooked persons.

౧౯౩౯. ఘర్మైతదిత్యస్య దీర్ఘతమా ఋషిః, యజ్ఞో దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే చెప్పెను.

౧౯౩౯ ఘర్మైతత్తే పురీషం తేన వర్ధస్వ చా చ ప్యాయస్వ।
వర్ధిషీమహి చ వయమా చ ప్యాసిషీమహి ॥౨౧॥

ప.వి:- ఘర్మ, ఏతత్, తే, పురీషమ్, తేన, వర్ధస్వ, చ, ఆ, చ, ప్యాయస్వ, వర్ధిషీమహి, చ, వయమ్, ఆ, చ, ప్యాసిషీమహి.॥౨౧॥

పదార్థః :-(ఘర్మ) పూజనీయతమ! (ఏతత్) (తే) తవ (పురీషమ్) వ్యాపనం పాలనం వా (తేన) (వర్ధస్వ) (చ) (ఆ) (చ) (ప్యాయస్వ) పుషాణ (వర్ధిషీమహి) పూర్ణాం వృద్ధిం ప్రాప్నుయామ (చ) (వయమ్) (ఆ) (చ) (ప్యాసిషీమహి) సర్వతో వర్ధేమ.॥౨౧॥

అన్వయః:- హే ఘర్మ సర్వతః ప్రకాశమయ జగదీశ్వర! విద్వన్ వా! యదేతత్తే పురీషమస్తి తేన త్వం వర్ధస్వ చాఽన్యాన్ వర్ధయ స్వయమాప్యాయస్వాఽన్యాంశ్చ పోషయ తవ కృపయా శిక్షయా వా, యథా వయం వర్ధిషీమహి తథా చాఽన్యాన్ వయం వర్ధయేమ, యథా చ వయమాప్యాసిషీమహి తథాఽ న్యాన్ సమన్తతః పోషయేమ తథా యూయమపి కురుత.॥౨౧॥

భావార్థః:-అత్ర శ్లేషవాచకలుప్తోపమాలఙ్కారౌ. హే మనుష్యా! యథేశ్వరేణ సర్వత్రాభివ్యాప్తేన సర్వం రక్ష్యతే పోష్యతే చ తథైవ వర్ధమానైః పుష్టైరస్మాభిః సర్వే జీవా వర్ధనీయాః పోషణీయాశ్చ.॥౨౧॥

పదార్థము :-(ఘర్మ) అత్యంత పూజనీయుడవు, అన్నివైపులనుండి ప్రకాశమయుడవునగు నో జగదీశ్వరా! లేక విద్వాంసా! (ఏతత్) ఈ (తే) నీయొక్క (పురీషమ్) ఏ వ్యాప్తి లేక పాలనముగలదో (తేన) దానిచే నీవు (వర్ధస్వ) వృద్ధియగుదుము (చ) మరియు ఇతరులను వృద్ధిపరచుము. నీవు స్వయముగ (ఆ,ప్యాయస్వ) పుష్టివంతుడవగుము (చ) మరియు నితరులను పుష్టిపరచుము. నీకృప లేక శిక్షణముచే ఏవిధముగ (వయమ్) మేము (వర్ధిషీమహి) పూర్ణవృద్ధిని పొందెదమో (చ) మరియు అదేవిధముగ ఇతరులను పెంపొందించెదమో (చ) మరియు నెట్లు మేము (ఆ, ప్యాసిషీమహి) అన్నివైపులనుండి వృద్ధియగుదుమో, అటులనే ఇతరులను నిరంతరము పుష్టిపరచెదముగాక! అట్లే మీరును చేయుడు.॥౨౧॥

భావార్థము:- ఈ మంత్రములో శ్లేష మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఓ మానవులారా! ఏ ప్రకారముగ సర్వత్ర అభివ్యాప్తుడైయున్న పరమేశ్వరుడు సర్వమును రక్షించుచు పుష్టిపరచుచున్నాడో అటులనే రక్షితులము, పుష్టివంతులమగు మనమును సర్వప్రాణులను ప్రేమతో పోషించి వర్ధిల్లజేయవలెను.॥౨౧॥

21. O most Adorable God, this is Thy nourishing power. Be great thereby and make others also great. Be strong, make others strong!.

Through your compassion, just as we advance, let us make others advance. Just as we grow great, let us make others great.

౧౯౪౦. అచిక్రదదిత్యస్య దీర్ఘతమా ఋషిః, యజ్ఞో దేవతా, పరోష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల నా విషయమే.

౧౯౪౦ అచిక్రదద్వృషా హరిర్మహాన్మిత్రో న దర్శతః।
సꣳ సూర్యేణ దిద్యుతదుదధిర్నిధిః ॥౨౨॥

ప.వి:-అచిక్రదత్, వృషా, హరిః, మహాన్, మిత్రః, న, దర్శతః, సమ్, సూర్యేణ, దిద్యుతత్, ఉదధి రిత్యుద + ధిః, నిధిరితి ని + ధిః ॥౨౨॥

పదార్థః:-(అచిక్రదత్) శబ్దం కుర్వన్ (వృషా) వర్షకః (హరిః) ఆశుగన్తా (మహాన్) సర్వేభ్యో జ్యేష్ఠః (మిత్రః) సఖా (న) ఇవ (దర్శతః) ద్రష్టవ్యః (సమ్) (సూర్యేణ) సవిత్రా (దిద్యుతత్) విద్యోతతే (ఉదధిః) ఉదకాని ధీయన్తే యస్మిం స్తత్సముద్రోఽన్తరిక్షం వా (నిధిః) నిధీయన్తే పదార్థా యస్మిన్ సః ॥౨౨॥

అన్వయః:- హే మనుష్యా ! యో వృషా హరిర్మహానచిక్రదన్మిత్రో న దర్శతః సూర్యేణ సహ ఉదధి ర్నిధిరివ సందిద్యుతత్స ఏవ విద్యుద్రూపోఽగ్నిః సర్వైః సంప్రయోజ్యః.॥౨౨॥

భావార్థః:-అత్రోపమావాచకలుప్తోపమాలఙ్కారౌ. హే మనుష్యా! యథా వృషభాస్తురఙ్గాశ్చ శబ్దాయన్తే, యథా సఖా సఖీన్ ప్రీతయతి తథైవ సర్వైర్లోకైః సహ వర్తమానా విద్యుత్ సర్వాన్ ప్రకాశయతి, తాం విజానీత.॥౨౨॥

పదార్థము :- ఓ మానవులారా! (వృషా) వర్షమునకు నిమిత్తము (హరిః) శీఘ్రముగా నడచునట్టి (మహాన్) అన్నిటికన్న గొప్పది (అచిక్రదత్) శబ్దము నొనర్చుచు (మిత్రః, న) మిత్రునివలె (దర్శతః) చూడదగినట్టి (సూర్యేణ) సూర్యునితోగూడ (ఉదధిః, నిధిః) పదార్థములనుంచు పుష్కలజలములు సమకూర్చుకొనునట్టి సముద్రము లేక ఆకాశమునందు (సమ్, దిద్యుతత్) చక్కగా ప్రకాశిత మగుచున్నదో అట్టి విద్యుద్రూపాగ్నియే సర్వజనులను కార్యములందుంచదగినదై యున్నది.॥౨౨॥

**భావార్థము** :-ఈ మంత్రములో ఉపమా, మరియు వాచకలుప్తోపమాలంకారములు గలవు. ఓ మానవులారా! ఏ ప్రకారముగా వృషభములు, అశ్వములు శబ్దమొనర్చునో మరియు నేవిధముగ సన్మిత్రుడు మిత్రులను తృప్తిపరచునో, అదే ప్రకారము విద్యుద్రూపాగ్ని సమస్త లోకములతో గలిసియుండి అన్నిటిని ప్రకాశపరచుచుండును. కావున దానిని మీరు తెలిసికొనుడు.॥౨౨॥

22. All should understand lightning-fire, the cause for rain fast in motion, mighty, roaring, like friend fair to see, shining with the Sun in the atmosphere, the ocean of water.

౧౯౪౧.సుమిత్రియా ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆపో దేవతాః, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
అథ సజ్జనదుర్జనకృత్యమాహ. సజ్జన, దుర్జనుల కృత్యము.

౧౯౪౧ సుమిత్రియా న ఆప ఓషధయః సన్తు దుర్మిత్రియాస్తస్మై
సన్తు యో౽స్మాన్ ద్వేష్టి యఞ్చ వయం ద్విష్మః॥౨౩॥

ప.వి:-సుమిత్రియా ఇతి సు + మిత్రియాః, నః, ఆపః, ఓషధయః, సన్తు, దుర్మిత్రియా ఇతి దుః + మిత్రియాః, తస్మై, సన్తు, యః, అస్మాన్, ద్వేష్టి, యమ్, చ, వయమ్, ద్విష్మః.॥౨౩॥

పదార్థః :- (సుమిత్రియాః) సుష్ఠు సఖాయ ఇవ (నః) అస్మభ్యమ్ (ఆపః) ప్రాణా (ఓషధయః) సోమాద్యాః (సన్తు) (దుర్మిత్రియాః) దుష్టాని మిత్రాణీవ (తస్మై) (సన్తు) (యః) పక్షపాతేనా౽ధర్మీ (అస్మాన్) (ద్వేష్టి) (యమ్) (చ) (వయమ్) (ద్విష్మః) న ప్రీణీమః.॥౨౩॥

అన్వయః:- హే మనుష్యా! ఆప ఓషధయో నో౽స్మభ్యం సుమిత్రియా ఇవ సన్తు. యో౽స్మాన్ ద్వేష్టి యఞ్చ వయం ద్విష్మస్తస్మై ఆప ఓషధయశ్చ దుర్మిత్రియా ఇవ సన్తు.॥౨౩॥

భావార్థః:- అత్ర వాచకలుప్తోపమాలఙ్కారః. యే మనుష్యా అన్యేషాం సుపథ్యౌషధి ప్రాణవద్రోగ దుఃఖనివారకాస్తే ధన్యాః. యే చ కుపథ్యదుష్టౌషధవృత్త్యవదన్యేషాం దుఃఖప్రదాస్తాన్ ధిగ్ధిక్.॥౨౩॥

పదార్థము :- ఓ మానవులార! (ఆపః) ప్రాణము లేక జలము (ఓషధయః) సోమలత మున్నగు ఓషధులు (నః) మాకొరకు (సుమిత్రియాః) చక్కని మిత్రునివలె సుఖదాయకములు (సన్తు) అగుగాక! (యః) ఏ పక్షపాతగుణము, అధర్మగుణము గలవారు (అస్మాన్) ధర్మాత్ములమగు మమ్ము (ద్వేష్టి) ద్వేషించెదరో (చ) మరియు (యమ్) ఏ దుష్టుని (వయమ్) ధర్మాత్ములమగు మేము (ద్విష్మః) ద్వేషింతుమో (తస్మై) వారికి ప్రాణములు, జలములు, ఓషధులు (దుర్మిత్రియాః) దుష్టమిత్రులవలె దుఃఖదాయకములు (సన్తు) అగుగాక! ॥౨౩॥

**భావార్థము** :-ఈ మంత్రమున వాచకలుప్తోపమాలంకారము గలదు. ఇతరులకు చక్కని పథ్యము, ఔషధముల నిచ్చి ప్రాణమువలె రోగములను తొలగించు విద్వాంసులు ధన్యవాదములకు అర్హులైయుందురు.

పదార్థము :- ఓ మానవా! నీవు (యత్) ఏ (ఇదమ్) ఈ ప్రకృతి మొదలుకొని పృథివి పర్యంతము (సర్వమ్) సమస్తము (జగత్యామ్) ప్రాప్తించుకొనదగిన సృష్టియందు (జగత్) జంగము [చలనముగల] ప్రాణిమాత్రులు గలనో అవి (ఈశా) సంపూర్ణైశ్వర్యవంతుడు, సర్వశక్తిమంతుడునగు పరమాత్మచే (వాస్యమ్) ఆచ్ఛాదన మొనర్చునది, అనగా అన్నివైపులనుండి వ్యాప్తమై యున్నవి (తేన) అట్టి (త్యక్తేన) త్యాగమొనర్చబడిన జగములోని (భుంజీథాః) పదార్థముల, భోగముల ననుభవించుము (కించ) కాని (కస్య, స్విత్) ఏ యితరుల (ధనమ్) ధనమును, వస్తుమాత్రమును (మాగృధః) అభిలషించకుము.॥౧॥

భావార్థము:- పరమేశ్వరుడు సర్వత్ర వ్యాప్తమైయుండి సదా అన్నివైపులనుండి సర్వమును చూచుచున్నాడని, సదా మన మొనర్చు కర్మలను గాంచుచున్నాడని, ప్రత్యణువునందును విద్యమానుడై యున్నాడని నిశ్చయించుకొని భయపడుచు అన్యాయాచరణముచే ఎవ్వరిధనము నేమాత్రమును దీసికొనవలదు. ఇట్లొనర్చువారు ధర్మాత్ములై ఇహలోక సుఖములను మరియు పరలోకముక్తిరూప సుఖములను పొంది సదా ఆనందమయులై యుందురు.॥౧॥

1. O man, all moving beings in the universe are enveloped by the Omnipotent God. Enjoy what God hath granted thee. Covet not the wealth of any man!.

౧౯౭౧. కుర్వన్నిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, భురిగనుష్టుప్ ఛన్దః ధైవతః స్వరః.

అథ వైదికకర్మణః ప్రాధాన్యముచ్యతే. వేదోక్త కర్మయొక్క ఉత్తమత్వము.

౧౯౭౧ కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతꣳ సమాః।

ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే ॥౨॥

ప.వి:- కుర్వన్, ఏవ, ఇహ, కర్మాణి, జిజీవిషేత్, శతమ్, సమాః, ఏవమ్, త్వయి, న, అన్యథా, ఇతః, అస్తి, న కర్మ, లిప్యతే, నరే ॥౨॥

పదార్థః:-(కుర్వన్) (ఏవ) (ఇహ) అస్మిన్ సంసారే (కర్మాణి) ధర్మ్యాణి వేదోక్తాని నిష్కామకృత్యాని (జిజీవిషేత్) జీవితుమిచ్ఛేత్ (శతమ్) (సమాః) సంవత్సరాన్ (ఏవమ్) అమునా ప్రకారేణ (త్వయి) (న) నిషేధే (అన్యథా) (ఇతః) అస్మాత్ ప్రకారాత్ (అస్తి) భవతి (న) నిషేధే (కర్మ) అధర్మ్యమవైదికం మనోర్థసంబన్ధికర్మ (లిప్యతే) (నరే) నయన కరరి.॥౨॥

**అన్వయః :-మనుష్య ఇహ కర్మాణి కుర్వన్నేవ శతం సమా జిజీవిషేదేవం ధర్మ్యే కర్మణి ప్రవర్తమానే త్వయి నరే న కర్మ లిప్యతే ఇతో౽న్యథా నాస్తి లేపాభావః ॥ ౨ ॥**

**భావార్థః :-మనుష్యా ఆలస్యం విహాయ సర్వస్య ద్రష్టారం న్యాయాధీశం పరమాత్మానం కర్తుమర్హాం తదాజ్ఞాం చ మత్వా శుభాని కర్మాణి కుర్వన్తో౽శుభాని త్యజన్తో బ్రహ్మచర్యేణ విద్యాసుశిక్షే ప్రాప్యోపస్థేన్ద్రియనిగ్రహేణ వీర్యమున్నీయాల్పమృత్యుం ఘ్నన్తు. యుక్తాహారవిహారేణ శతవార్షికమాయుః ప్రాప్నువన్తు. యథా యథా మనుష్యాః సుకర్మసు చేష్టన్తే తథా తథైవ పాపకర్మతో బుద్ధిర్నివర్తతే విద్యాయుః సుశీలతా చ వర్ధతే.॥౨॥**

**పదార్థము :-** మనుష్యుడు (ఇహ) ఈ జగమునందు (కర్మాణి) ధర్మయుక్త, వేదోక్త నిష్కామ కర్మలను (కుర్వన్) ఒనర్చుచు (ఏవ) మాత్రమే (శతమ్) నూరు (సమాః) సంవత్సరములు (జిజీవిషేత్) జీవించు కోరికగలిగియుండవలెను (ఏవమ్) ఈ విధమగు ధర్మయుక్త కర్మలందు ప్రవర్తించుచో (కర్మ) అధర్మయుక్తమగు అవైదిక కామ్యకర్మలందు (న లిప్యతే) లిప్తుడుగాజాలడు. కర్మ అంటకుండుటకు (ఇతః) ఇంతకన్నమించి ఇతర (అన్యథా) అన్యవిధమగు (న,అస్తి) మార్గములేదు.॥౨॥

**భావార్థము :-** మానవులు సోమరితనమును వదలి సర్వమును సదా చూచుచున్నట్టి పరమాత్మను, ఆచరించదగిన ఆతని యాజ్ఞలను స్వీకరించి శుభకర్మల నాచరించుచు దుష్కర్మలను త్యజించవలయును. బ్రహ్మచర్య సేవనమున విద్య మరియు ఉత్తమ శిక్షణను పొంది ఉపస్థేంద్రియ నిగ్రహామొనర్చి, పరాక్రమమును వృద్ధినొందించుకొని అల్పమృత్యువులను నిర్జించవలయును. యుక్తాహార విహారాదులచే నూరుసంవత్సరముల ఆయుష్యమును పొందవలయును. మానవు లెట్లెట్లు సత్కర్మలందు అభిరుచిని గలిగియుందురో, అట్లట్లే పాపకర్మలందు బుద్ధి ప్రవేశించకుండును. దానివలన విద్య, ఆయుష్యము, సుశీలత్వములు పెంపొందు చుండును. ॥౨॥

2. Man, only doing unselfish, religious deeds in this world, should wish to live for a hundred years. So Karma cleaveth not to man. No way is there for thee but this for emancipation.

౧౯౬౨. అసుర్యా ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథాత్మహన్తారో జనాః కీదృశా ఇత్యాహ.

ఆత్మహనన మొనర్చువారు అనగ ఆత్మను మరచినవారు ఎటువంటివారు అగుదురు?

**౧౯౬౨ అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసావృతాః।**

**తాంస్తే ప్రేత్యాపి గచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః॥౩॥**

ప.వి:- అసుర్యాః, నామ, తే, లోకాః, అన్ధేన, తమసా, ఆవృతా, ఇత్యా+వృతాః, తాన్, తే, ప్రేత్యేతి, ప్ర + ఇత్య, అపి గచ్ఛన్తి, యే, కే, చ, ఆత్మహన, ఇత్యాత్మ + హనః, జనాః.॥3॥

పదార్థః :-(అసుర్యాః) అసురాణాం ప్రాణపోషణతత్పరాణామవిద్యాదియుక్తానామిమే సవచ్ఛన్ధిన స్తత్సదృశః పాపకర్మాణః (నామ) ప్రసిద్ధా (తే) (లోకాః) లోకన్తే పశ్యన్తి తే జనాః (అన్ధేన) అన్ధకారరూపేణ (తమసా) అత్యావరకేణ (ఆవృతాః) సమన్తాద్యుక్తా ఆచ్ఛాదితాః (తాన్) దుఃఖాన్ధకారావృతాన్ భోగాన్ (తే) (ప్రేత్య) మరణం ప్రాప్య (అపి) జీవన్తోపి (గచ్ఛన్తి) ప్రాప్నువన్తి (యే) (కే) (చ) (ఆత్మహనః) య ఆత్మానం ఘ్నన్తి తద్విరుద్ధమాచరన్తి తే (జనాః) మనుష్యాః.॥3॥

అన్వయః :-యే లోకా అన్ధేన తమసాఽఽవృతా యే కే చాత్మహనో జనాః సన్తి, తేఽసుర్యా నామ, తే ప్రేత్యాపి తాన్ గచ్ఛన్తి.॥3॥

భావార్థః:-త ఏవ అసురా దైత్యా రాక్షసాః పిశాచా దుష్టా మనుష్యాయ ఆత్మన్యన్యద్ వాచ్యన్యత్ కర్మణ్యన్యదాచరన్తి తే న కదాచిదవిద్యాదుఃఖసాగరాదుత్తీర్యాఽనన్దం ప్రాప్తుం శక్నువన్తి. యే చ యదాత్మనా తన్మనసా, యన్మనసా తద్వాచా, యద్వాచా తత్కర్మణాఽనుతిష్ఠన్తి, త ఏవ దేవా ఆర్యా సౌభాగ్యవన్తోఽఖిలం జగత్పవిత్రయన్త ఇహాముత్రాతులం సుఖమశ్నువతే ॥3॥

పదార్థము:-ఏ (లోకాః) చూచువారు (అన్ధేన) అన్ధకారరూప (తమసా) జ్ఞానమును చుట్టుకొనియుండు అజ్ఞానముచే (ఆవృతాః) అన్నివైపులనుండి కప్పబడి (చ) మరియు (యే) ఏ (కే) ఎవరు (ఆత్మహనః) ఆత్మకు విరుద్ధముగా ఆచరణమొనర్చువారగు (జనాః) మనుష్యులున్నారో (తే) వారు (అసుర్యా) స్వంత ప్రాణపోషణమందే తత్పరులై, అవిద్య మున్నగు దోషములతో గూడినవారి సంబంధముగలవారలై, అట్టి పాపములనే యొనర్చుటయందు (నామ) ప్రసిద్ధులగుచుందురో (తే) వారు (ప్రేత్య) మరణించిన పిదప (అపి) కూడ మరియు జీవితులై యున్నప్పుడును (తాన్) అదేవిధమగు దుఃఖములకులోనై అజ్ఞానరూప అంధకారముచే గూడిన భోగములను (గచ్ఛన్తి) పొందుచుందురు.॥3॥

**భావార్థము** :-ఏ మనుష్యులు ఆత్మయందొకటి భావించుచు, వాణిద్వారా వేరొకటి చెప్పుచు మరోవిధముగ నాచరించెదరో, అట్టివారే అసురులు, దైత్యులు, రాక్షసులు, పిశాచులునైయుందురు. అట్టి వారెప్పుడును అవిద్యరూపమగు దుఃఖసాగరమునుండి తరింపజాలరు, ఆనందమును పొందజాలరు. ఎవరైతే ఆత్మ, మనస్సు, వాణి మరియు కర్మలచే నిష్కపటులై ఒకే విధముగా ఆచరణ మొనర్చెదరో అట్టివారు దేవతలు, ఆర్యులు, సౌభాగ్యశాలురునై, సర్వజగత్తును పవిత్రపరచుచు ఇహపరలోక సుఖముల కధికారు లగుదురు.॥3॥

3. Verily, the men engulfed in the darkness of ignorance, and those who disobey the dictates of conscience, are sinners given to carnal pleasures. They, in this life, and after death, attain to those sensual enjoyments enwrapt in affliction and ignorance.

౧౯౬౩ అనేజదిత్యస్య దీర్ఘతమా ఋషిః, బ్రహ్మ దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

కీదృశో జన ఈశ్వరం సాక్షాత్కరోతీత్యాహ. ఎటువంటివాడు ఈశ్వరుని సాక్షాత్కరించుకొనును?

౧౯౬౩ అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్పూర్వమర్షత్।

తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥౪॥

ప.వి:- అనేజత్, ఏకమ్, మనసః, జవీయః, న, ఏనత్, దేవాః, ఆప్నువన్, పూర్వమ్, అర్షత్, తత్, ధావతః, అన్యాన్, అతి, ఏతి, తిష్ఠత్, తస్మిన్, అపః, మాతరిశ్వా, దధాతి ॥౪॥

పదార్థః:-(అనేజత్) న ఏజతే కమ్పతే తదచలత్ స్వావస్థాయాశ్చ్యుతిః కమ్పనం తద్రహితమ్ (ఏకమ్) అద్వితీయం బ్రహ్మ (మనసః) మనోవేగాత్ (జవీయః) అతిశయేన వేగవత్ (న) (ఏనత్) (దేవాః) చక్షురాదీనీన్ద్రియాణి వా (ఆప్నువన్) ప్రాప్నువన్తి (పూర్వమ్) పురఃసరం పూర్ణం (అర్షత్) గచ్ఛత్ (తత్)(ధావతః) విషయాన్ ప్రతి పతతః (అన్యాన్) స్వస్వరూపాద్విలక్షణాన్మనోవాగిన్ద్రియాదీన్ (అతి) ఉల్లంఘనే (ఏతి) ప్రాప్నోతి గచ్ఛతి (తిష్ఠత్) స్వస్వరూపేణ స్థిరం సత్ (తస్మిన్) సర్వత్రాఽభివ్యాప్తే (అపః) కర్మ క్రియాం వా (మాతరిశ్వా) మాతర్యన్తరిక్షే శ్వసితి ప్రాణాన్ధరతి వాయుస్తద్వద్వర్తమానో జీవః (దధాతి).॥౪॥

అన్వయః:-హే విద్వాంసో మనుష్యాః! యదేకమనేజన్మనసో జవీయః పూర్వమర్షద్ బ్రహ్మాఽస్త్యేనద్దేవానాప్నువంస్తత్స్వయం తిష్ఠత్సత్స్వానన్తవ్యాప్త్యా ధావతోఽన్యానత్యేతి తస్మిన్స్థిరే సర్వత్రాభి వ్యాప్తే మాతరిశ్వా వాయురివ జీవోఽపో దధాతీతి విజానీత.॥౪॥

భావార్థః:-బ్రహ్మణోఽనన్తత్వాద్యత్ర యత్ర మనో యాతి, తత్ర తత్ర పురస్తాదేవాఽభివ్యాప్త మగ్రస్థం బ్రహ్మ వర్తతే తద్విజ్ఞానం శుద్ధేన మనసైవ జాయతే చక్షురాదిభిరవిద్వద్భిశ్చ ద్రష్టుమశక్యమస్తి స్వయం నిశ్చలం సత్సర్వాన్ జీవాన్ నియమేన చాలయతి ధరతి చ తస్యాతిసూక్ష్మత్వాదతీన్ద్రియత్వాద్ధార్మికస్య విదుషో యోగిన ఏవ సాక్షాత్కారో భవతి నేతరస్య.॥౪॥

పదార్థము :- ఓ విద్వాంసులారా! ఏది (ఏకమ్) అద్వితీయము (అనేజత్) కంపించనిది, చలించనిది [అనగా తన స్థానమునుండి కదలనిది] (మనసః) మనోవేగము కన్నను (జవీయః) అతివేగవంతమైనది (పూర్వమ్) అన్నిటికన్న ముందుముందు (అర్షత్) నడచును, అనగా ఎవరైన ఎచ్చటికైన వెళ్లినచో అదివరకే అచ్చటికి చేరియున్న ఏ బ్రహ్మము గలదో (ఏనత్) ఆ పూర్వోక్త పరమేశ్వరుని (దేవాః) చక్షువులు [నేత్రములు] మున్నగు ఇంద్రియములు (న, ఆప్నువత్) పొందజాలవు (తత్) ఆ పరబ్రహ్మ తనంతటతానే (తిష్ఠత్) స్థిరమైయున్నాడు. తన అనంత వ్యాపకముచే (ధావతః) విషయములవైపు బడిపోవుచున్న (అన్యాన్) ఆత్మస్వరూపమునకు విలక్షణములగు మనస్సు, వాణి మున్నగు ఇంద్రియములను (అతి, ఏతి) ఉల్లంఘించి [అతిక్రమించి] పోవుచున్నది. (తస్మిన్) అట్టి సర్వత్ర అభివ్యాప్తమై స్థిరమైయున్న పరమేశ్వరుని స్థిరత్వమునందు (మాతరిశ్వా) అంతరిక్షమునందు ప్రాణములను ధారణమొనర్చు వాయువువలె జీవుడు (అపః) కర్మను లేక క్రియను (దధాతి) ధారణమొనర్చుచున్నాడని మీరు తెలిసికొనుడు.॥౪॥

భావార్థము :- పరబ్రహ్మ అనంతుడగుటచే ఎచ్చటెచ్చటికి మనస్సు పోవుచున్నదో, అచ్చటచ్చట మొదటినుండియే అభివ్యాప్తుడై ముందునుండియే స్థిరుడైయున్నాడు. ఆయనవిజ్ఞానము శుద్ధమనస్సుచేతనే సాధ్యమగును. కాని చక్షురాదింద్రియములచేతగాని, అవిద్వాంసులుగాని చూచుటగాని పొందుటగాని సాధ్యము గాజాలదు. ఆతడు స్వయముగా నిశ్చలుడై యుండును. సమస్త జీవకోటిచే నిండియున్న లోకలోకాంతరములను నియమమునందు నడుపుచు ధారణమొనర్చుచున్నాడు. ఆయన అతి సూక్ష్మాతి సూక్ష్ముడు. ఇంద్రియ గమ్యమునకు అసాధ్యుడగు కారణమున ధర్మాత్ములగు విద్వాంసులు, యోగులు మాత్రమే యాతని సాక్షాత్కార జ్ఞానమును ప్రాప్తించుకొనగలరు. కాని అన్యులకు సాధ్యముగాదు. ॥౪॥

4. God is permanent, One, swifter than mind, beyond the reach of physical organs, speeding on before them. He through His Omnipresence, outstrips the physical organs running after passion.

Residing in Him the souls perform action.

౧౯౭౪. తదేజతీత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

విదుషాం నికటేఽవిదుషాం చ బ్రహ్మ దూరేఽస్తీత్యాహ.

బ్రహ్మ విద్వాంసులకు దగ్గఱగను, అవిద్వాంసులకు దూరముగను ఉన్నాడు.

౧౯౭౪ తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే ।

తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥౫॥

ప.వి:- తత్, ఏజతి, తత్, న, ఏజతి, తత్, దూరే, తత్, ఉ్ం ఇత్యూం, అన్తికే, తత్, అన్తః, అస్య, సర్వస్య, తత్, ఉ్ం ఇత్యూం, సర్వస్య, అస్య, బాహ్యతః.।౫॥

పదార్థః :- (తత్) (ఏజతి) కమ్పతే చలతి మూఢదృష్ట్యా (తత్) (న) (ఏజతి) కమ్పతే కమ్పయతే వా (తత్) (దూరే) అధర్మాత్మభ్యోఽవిద్వద్భ్యోఽయోగిభ్యః (తత్) (ఉ) (అన్తికే) ధర్మాత్మనాం విదుషాం యోగినాం సమీపే (తత్)(అన్తః) అభ్యన్తరే (అస్య) (సర్వస్య) అఖిలస్య జగతో జీవసమూహస్య వా (తత్) (ఉ) (సర్వస్య) సమగ్రస్య (అస్య) ప్రత్యక్షాఽప్రత్యక్షాత్మకస్య (బాహ్యతః) బహిరపి వర్తమానః.।౫॥

అన్వయః :- హే మనుష్యాస్తద్బ్రహ్మైజతి, తన్నైజతి తద్దూరే తద్వన్తికే తదస్య సర్వస్యాన్తస్తదు సర్వస్యాఽస్య బాహ్యతో వర్తత ఇతి నిశ్చినుత.।౫॥

భావార్థః :- హే మనుష్యాస్తద్బ్రహ్మ మూఢదృష్టౌ కమ్పత ఇవ తత్స్వతో వ్యాపకత్వాత్క్వాచిన్న చలతి యే తదాజ్ఞావిరుద్ధాస్తే ఇతస్తతో ధావన్తోఽపి తన్న విజానన్తి యే చేశ్వరాజ్ఞానుష్ఠాతారస్తే స్వాత్మస్థ మతినికటం బ్రహ్మ ప్రాప్నువన్తి యద్బ్రహ్మ సర్వస్య ప్రకృత్యాదేర్బాహ్యాఽభ్యన్తరాఽవయవానభివ్యాప్య సర్వేషాం జీవానామన్తర్యామిరూపతయా సర్వాణి పాపపుణ్యాత్మకకర్మాణి విజానన్ యాథాతథ్యం ఫలం ప్రయచ్ఛత్యేతదేవ సర్వైర్ధ్యేయమస్మాదేవ సర్వైర్భేతవ్యమితి. ।౫॥

**పదార్థము** :- ఓ మానవులారా! (తత్) ఆ బ్రహ్మ (ఏజతి) మూర్ఖుల దృష్టిలో చలాయమానుడుగా నుండును (తత్, న, ఏజతి) కాని తన స్వరూపముచే చలాయమానుడు కాడు, చలించడు (తత్) ఆతడు (దూరే) ధర్మహీనులకు, విద్యావిహీనులకు, యోగులుగానివారికి చాల దూరము, అనగా కోట్ల కొలది సంవత్సరములందును ప్రాప్తించజాలడు. (తత్) అది (ఉ, అన్తికే) ధర్మాత్ములు, విద్వాంసులు యోగులకు మాత్రమే సమీపమున నుండును (తత్) అది (అస్య) ఈ (సర్వస్య) సకల జగత్తు మరియు జీవుల (అన్తః) లోపల [అన్తఃకరణములందు] (ఉ) మరియు (తత్) ఆయన (అస్య, సర్వస్య) ఈ ప్రత్యక్ష మరియు అప్రత్యక్షరూప జగత్తునకు (బాహ్యతః) బయటను వర్తమానుడైయున్నాడు.।౫॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఆ పరబ్రహ్మ మూర్ఖుల దృష్టియందు కంపించుచున్నట్లుండును. కాని ఆయన సర్వవ్యాపకుడగుటచే ఎప్పుడును చలించడు. ఆతని యాజ్ఞకు విరుద్ధముగ నుండువారు అటు నిటు పరుగులెత్తుచును కూడ ఆతనిని దెలిసికొన లేరు. ఈశ్వరాజ్ఞానుష్ఠానవంతులు మాత్రమే తమ యాత్మయందే స్థిరమై అతి సమీపమునందేయున్న బ్రహ్మను ప్రాప్తించుకొనగలుగుదురు. ఏ పరబ్రహ్మ సమస్త ప్రకృత్యాదుల బాహ్యాభ్యంతరములందు అభివ్యాప్తుడైయుండి అంతర్యామిరూపమున సకల ప్రాణుల సమస్త పాపపుణ్యరూప

కర్మలను చక్కగా నెరుగుచు సరియైన ఫలము నిచ్చుచున్నాడో, ఆతనినే మానవులెల్లరును ధ్యానమందుంచుకొనవలెను. మరియు ఎల్లరును ఆతనికే భయపడవలయును. ॥౫॥

5. God moves in the eyes of fools. He is motionless. He is far distant from the irreligious and ignorant, and near the yogis. He is within this entire universe, and surrounds it externally.

౧౯౬౫. యస్త్విత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథేశ్వరవిషయమాహ. ఈశ్వర విషయము.

౧౯౬౫ యస్తు సర్వాణి భూతాన్యాత్మన్నేవానుపశ్యతి ।

సర్వభూతేషు చాత్మానం తతో న వి చికిత్సతి ॥౬॥

ప.వి:-యః, తు, సర్వాణి, భూతాని, ఆత్మన్, ఏవ, అనుపశ్యతీత్యను + పశ్యతి, సర్వభూతేష్వితి సర్వ + భూతేషు, చ, ఆత్మానమ్, తతః, న, వి, చికిత్సతి ॥ ౬ ॥

పదార్థః :- (యః) విద్వాన్ జనః (తు) పునరర్థే (సర్వాణి) అఖిలాని (భూతాని) ప్రాణ్యప్రాణిరూపాణి (ఆత్మన్) పరమాత్మని (ఏవ) (అనుపశ్యతి) విద్యాధర్మయోగాభ్యాసానన్తరం సమీక్షతే (సర్వభూతేషు) సర్వేషు ప్రకృత్యాదిషు (చ) (ఆత్మానమ్) అతతి సర్వత్ర వ్యాప్నోతి తమ్ (తతః) తదనన్తరమ్ (న) (వి) (చికిత్సతి) సంశయం ప్రాప్నోతి.॥ ౬ ॥

అన్వయః:-హే మనుష్యాః! య ఆత్మన్నేవ సర్వాణి భూతాన్యనుపశ్యతి, యస్తు సర్వభూతేష్వాత్మానం చ సమీక్షతే, స తతో న విచికిత్సతీతి యూయం విజానీత ॥ ౬ ॥

భావార్థః:-హే మనుష్యాః! యే సర్వవ్యాపినం న్యాయకారిణం సర్వజ్ఞం సనాతనం సర్వాత్మానం సకలస్య ద్రష్టారం పరమాత్మానం విదిత్వా సుఖదుఃఖహానిలాభేషు స్వాత్మవత్సర్వాణి భూతాని విజ్ఞాయ ధార్మికా జాయన్తే త ఏవ మోక్షమశ్నువతే ॥ ౬ ॥

పదార్థము :- మానవులారా! (యః) ఏ విద్వాంసులు (ఆత్మన్) పరమాత్మయందు (ఏవ) మాత్రమే (సర్వాణి) సమస్త (భూతాని) ప్రాణులను, ప్రాణరహితముల నన్నింటిని (అనుపశ్యతి) విద్య, ధర్మము, యోగాభ్యాసముల తరువాత ధ్యానదృష్టితో జూచెదరో (తు) మరియు నెవరు (సర్వభూతేషు) సమస్త ప్రకృత్యాది పదార్థములందును కూడ (ఆత్మానమ్) ఆత్మను (చ) చూచెదరో, అట్టి విద్వాంసులు (తతః) ఆ [illegible]

**భావార్థము:**- ఓ మానవులారా! ఏ విద్వాంసులు సర్వవ్యాపి, న్యాయకారి, సర్వజ్ఞుడు, సనాతనుడు, సకలాత్మలందు అంతర్యామి, సర్వద్రష్టయగు పరమాత్మను దెలిసికొని సుఖదుఃఖములు, హానిలాభములందు తనయాత్మవలె సకల ప్రాణులను గాంచుచు ధార్మికులై యుందురో వారే మోక్షమును పొందగలుగుదురు.॥౬॥

6. The man, who sees all animate and inanimate creation in God, and God pervading all material objects, falls not a prey to doubt.

౧౯౬౬. యస్మిన్నిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, నిచృదనుష్టుప్ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ కేఽవిద్యాదిదోషాన్ జహతీత్యాహ. ఎవరు అవిద్యాది దోషములను త్యజించుచున్నారు?

**౧౯౬౬ యస్మిన్త్సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః ।**

**తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః ॥౭॥**

**ప. వి:**- యస్మిన్, సర్వాణి, భూతాని, ఆత్మా, ఏవ, అభూత్, విజానత ఇతి వి + జానతః, తత్ర, కః, మోహః, కః, శోకః, ఏకత్వమిత్యేక + త్వమ్, అనుపశ్యత ఇత్యనుపశ్యతః ॥ ౭ ॥

పదార్థః:-(యస్మిన్) పరమాత్మని జ్ఞానే విజ్ఞానే ధర్మే వా (సర్వాణి) (భూతాని) (ఆత్మా) ఆత్మవత్ (ఏవ) (అభూత్) భవన్తి. అత్ర వచనవ్యత్యయేనైకవచనమ్. (విజానతః) విశేషేణ సమీక్షమాణస్య (తత్ర) తస్మిన్ పరమాత్మని స్థితస్య (కః) (మోహః) మూఢావస్థా (కః) (శోకః) పరితాపః (ఏకత్వమ్) పరమాత్మనోఽద్వితీయత్వమ్ (అనుపశ్యతః) అనుకూలేన యోగాభ్యాసేన సాక్షాద్ద్రష్టుః.॥౭॥

అన్వయః:- హే మనుష్యాః! యస్మిన్ పరమాత్మని విజానతః సర్వాణి భూతాన్యాత్మైవాభూత్, తత్రైకత్వమనుపశ్యతో యోగినః కో మోహోఽభూత్కః శోకశ్చ.॥౭॥

భావార్థః:- యే విద్వాంసః సంన్యాసినః పరమాత్మనా సహచరితాని ప్రాణిజాతాని స్వాత్మవద్విజానన్తి, యథా స్వాత్మనో హితమిచ్ఛన్తి, తథైవ తేషు వర్తన్త ఏకమేవాఽద్వితీయం పరమాత్మనః శరణముపాగతాః సన్తి తాన్ మోహశోకలోభాదయో దోషాః కదాచిన్నాప్నువన్తి యే చ స్వాత్మానం యథావద్విజ్ఞాయ పరమాత్మానం విదన్తి తే సదా సుఖినో భవన్తి.॥౭॥

**పదార్థము** :- ఓ మానవులారా! (యస్మిన్) ఏ పరమేశ్వరుని జ్ఞాన, విజ్ఞాన ధర్మములందు (విజానతః)

విశేషించి ధ్యానదృష్టితో జూచువారికి (సర్వాణి) సమస్త (భూతాని) ప్రాణులు (ఆత్మా,ఏవ) తన వలెనే సుఖదుఃఖములుగలవిగా (అభూత్) నుండుటను అనుభూతి నొందుదురు. వారికి (తత్ర) ఆ పరమాత్మ మున్నగు వానియందు (ఏకత్వమ్) అన్యభావములేకుండ (అనుపశ్యతః) అనుకూలమైన యోగాభ్యాసముచే సాక్షాత్కారము పొందిన యోగులగువారికి (కః, మోహః) మోహము [మూర్ఖత్వము] మరియు (కః, శోకః) శోకము లేక క్లేశము మున్నగునవి ఎక్కడుండును? అనగా ఉండజాలవు.॥౭॥

**భావార్థము :-** ఏ విద్వాంసులు, సన్న్యాసమహాపురుషులు పరమేశ్వరుని సహచారులగు ప్రాణిమాత్రులను తన ఆత్మకువలె నెరుగుదురో, అనగా స్వంత హితమును గోరుకొనునట్లే ఇతరుల హితమును అభిలషించెదరో, ఏకమాత్రుడు, అద్వితీయుడునగు పరమేశ్వరుని శరణమునే పొందుచున్నారో, అట్టివారికి మోహశోకములు గాని రాగద్వేషాదులుగాని ఎప్పుడును కలుగజాలవు. మరియు నెవరు తనయాత్మను యథావత్తుగా నెరిగి పరమాత్మను దెలిసికొనుచున్నారో, అట్టివారు సదా ఆనందము ననుభవించెదరు.॥౭॥

7. A man contemplating upon God, feels in Him all beings like unto him-self. Such a yogi looking upon God as an unequalled One, becomes free from delusion and grief.

౧౯౬౭.స పర్యగాదిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, స్వరాడ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునః పరమేశ్వరః కీదృశ ఇత్యాహ. పరమేశ్వరు డెట్టివాడు?

౧౯౬౭ స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరꣳ శుద్ధమపాపవిద్ధమ్।
కవిర్మనీషీ పరిభూః స్వయమ్భూర్యాథాతథ్యతోఽ
ర్థాన్వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః॥౮॥

**ప. వి:-** సః, పరి, అగాత్, శుక్రమ్, అకాయమ్, అవ్రణమ్, అస్నావిరమ్, శుద్ధమ్, అపాపవిద్ధమిత్యపాప + విద్ధమ్, కవిః, మనీషీ, పరిభూరితి పరి + భూః, స్వయమ్భూరితి స్వయమ్ + భూః, యాథాతథ్యత ఇతి యాథా + తథ్యతః, అర్థాన్, వి, అదధాత్, శాశ్వతీభ్యః, సమాభ్యః ॥౮॥

పదార్థః :- (సః) పరమాత్మా (పరి) సర్వతః (అగాత్) వ్యాప్తోఽస్తి (శుక్రమ్) ఆశుకరం సర్వశక్తిమత్ (అకాయమ్) స్థూలసూక్ష్మకారణశరీరరహితమ్ (అవ్రణమ్) అచ్ఛిద్ర మచ్ఛేద్యమ్ (అస్నావిరమ్) నాడ్యాదిసమ్బన్ధరహితమ్ (శుద్ధమ్) అవిద్యాదిదోషరహిత త్వాత్సదా పవిత్రమ్ (అపాపవిద్ధమ్) యత్ పాపయుక్తం పాపకారి పాపప్రియం కదాచిన్న భవతి తత్ (కవిః) సర్వజ్ఞః (మనీషీ) సర్వేషాం జీవానాం మనోవృత్తీనాం వేత్తా (పరిభూః) యే దుష్టాన్ పాపినః పరిభవతి తిరస్కరోతి సః (స్వయమ్భూః) అనాదిస్వరూపో యస్య సంయోగేనోత్పత్తిర్వియోగేన వినాశో మాతాపితరౌ గర్భవాసో జన్మవృద్ధిక్షయౌ చ న విద్యన్తే (యాథాతథ్యతః) యథార్థతయా (అర్థాన్) వేదద్వారా సర్వాన్ పదార్థాన్ (వి) విశేషేణ (అదధాత్) విధత్తే (శాశ్వతీభ్యః) సనాతనీభ్యోఽనాదిస్వరూపాభ్యః స్వస్వరూపేణోత్పత్తి వినాశరహితాభ్యః (సమాభ్యః) ప్రజాభ్యః.॥8॥

అన్వయః:-హే మనుష్యాః! యద్ బ్రహ్మ శుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధమపాపవిద్ధం పర్యగాద్యః కవిర్మనీషీ పరిభూః స్వయమ్భూః పరమాత్మా శాశ్వతీభ్యః సమాభ్యో యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్స ఏవ యుష్మాభిరుపాసనీయః..॥8॥

భావార్థః :-హే మనుష్యాః! యద్యనన్తశక్తిమదజం నిరన్తరం సదాముక్తం న్యాయకారి నిర్మలం సర్వజ్ఞం సర్వస్య సాక్షి నియన్తృ అనాదిస్వరూపం బ్రహ్మ కల్పాదౌ జీవేభ్యః స్వోక్తైర్వేదైః శబ్దార్థసమ్బన్ధవిజ్ఞాపికాం విద్యాం నోపదిశేత్తర్హి కోఽపి విద్వాన్న భవేత్, న చ ధర్మార్థకామమోక్ష ఫలం ప్రాప్తుం శక్నుయాత్ తస్మాదిదమేవ సదైవోపాధ్వమ్.॥8॥

**పదార్థము** :- ఓ మానవులారా! ఏ బ్రహ్మ (శుక్రమ్) శీఘ్రకారి, సర్వశక్తిమంతుడు (అకాయమ్) స్థూల సూక్ష్మ కారణ శరీరములు లేనివాడు (అవ్రణమ్) ఛిద్రరహితుడు మరియు ఛేదించసాధ్యముగానివాడు (అస్నావిరమ్) నాడి మున్నగువానితో గూడ సంబంధ రూప బంధనములు లేనివాడు (శుద్ధమ్) అవిద్య మున్నగు దోషములు లేని కారణమున సదా పవిత్రుడు మరియు (అపాపవిద్ధమ్) పాపయుక్తుడుగాని, పాపకారిగాని, పాపములందు ఎప్పుడును ప్రీతిగలవాడుగాని కాజాలడు (పరి, అగాత్) సర్వదిశలనుండి వ్యాప్తుడైయున్నవాడు (కవిః) సర్వత్ర, సర్వజ్ఞుడు (మనీషీ) సకల ప్రాణుల మనోవృత్తులనెరుగువాడు (పరిభూః) దుష్టులగు పాపాత్ములను తిరస్కరించువాడు (స్వయంభూః) అనాది స్వరూపుడు, అనగా ఆతడు సంయోగముచే ఉత్పత్తి, వియోగముచే నాశము లేనివాడు. మాతాపితాదులు, గర్భవాసము, జన్మము, వృద్ధి, మరణములు మున్నగునవి లేనివాడు. అట్టి పరమాత్మ (శాశ్వతీభ్యః) సనాతన అనాది స్వరూపులు - తమ తమ స్వరూపములచే ఉత్పత్తి వినాశరహితులగు (సమాభ్యః) ప్రజలకొరకు (యాథాతథ్యతః) యథార్థ భావముతో

(అర్థాన్) వేదములద్వారా సమస్త పదార్థములను (వ్యదధాత్) విశేషముగా సృష్టించెను. (సః) అట్టి పరమేశ్వరుడే మీ యందరకు ఉపాసించదగినవాడై యున్నాడని తెలిసికొనుడు.॥౮॥

**భావార్థము :-** ఓ మానవులారా! ఎవడు అనంతుడు, శక్తిశాలి, అజన్ముడు, నిరంతరము సదాముక్తుడు, న్యాయకారి, నిర్మలుడు, సర్వజ్ఞుడు, సర్వసాక్షి, నియంత, అనాదిస్వరూపుడగు పరబ్రహ్మ కల్పారంభమున జీవులకు తాను చెప్పినట్టి వేదములద్వారా శబ్దములు, అర్థములు మరియు వాని సంబంధములను దెలిసికొనునటుల ఉపదేశములనిచ్చినాడు [అట్లీయకున్నచో ఎవ్వరును విద్వాంసులు గాకపోయెడివారు. మరియు ధర్మార్థకామమోక్షముల ఫలములను భోగించుటకు సమర్థులును గాకుండెడివారు] కావుననే అందరును ఆ పరమాత్మనే సదా ఉపాసించుచుండవలయును. ॥౮॥

8. God is All pervading, Lustrous, Bodiless, Flawless, Sinewless, Pure, Inpierced by evil. He is Omniscient, Knower of the hearts of all, Censurer of the sinful and Self-existent. He truly reveals through the Vedas all things for His subjects from His immemorial attributes, free from birth and death.

౧౯౬౮. అన్ధన్తమ ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

కే జనా అన్ధన్తమః ప్రాప్నువన్తీత్యాహ. ఏ మానవు లన్ధకారమును పొందుదురు?

౧౯౬౮ అన్ధన్తమః ప్ర విశన్తి యేఽసమ్భూతిముపాసతే ।

తతో భూయఽఇవ తే తమో యఽఉ సమ్భూత్యాꣳరతాః ॥౯॥

**ప. వి:-** అన్ధమ్, తమః, ప్ర, విశన్తి, యే, అసమ్భూతిమిత్యసమ్ + భూతిమ్, ఉపాసత ఇత్యుప + ఆసతే, తతః, భూయఽఇవేతి భూయః + ఇవ, తే, తమః, యే, ఊꣳ ఇత్యూꣳ, సమ్భూత్యామితి సమ్ + భూత్యామ్, రతాః ॥ ౯ ॥

పదార్థః :- (అన్ధమ్) ఆవరకమ్ (తమః) అన్ధకారమ్ (ప్ర) ప్రకర్షేణ (విశన్తి) (యే) (అసమ్భూతిమ్) అనాద్యనుత్పన్నం ప్రకృత్యాఖ్యం సత్త్వరజస్తమోగుణమయం జడం వస్తు (ఉపాసతే) ఉపాస్యతయా జానన్తి (తతః) తస్మాత్ (భూయ ఇవ) అధికమివ (తే) (తమః) అవిద్యామయమన్ధకారమ్ (యే) (ఉ) వితర్కేణ సహ (సంభూత్యామ్) మహదాదిస్వరూపేణ పరిణతాయాం సృష్టౌ (రతాః) యే రమన్తే తే.॥౯॥

**అన్వయః :-** యే పరమేశ్వరం విహాయాఽసమ్భూతిముపాసతే తేఽన్ధన్తమః ప్రవిశన్తి యే సమ్భూత్యాం రతాస్త ఉ తతో భూయ ఇవ తమః ప్రవిశన్తి.॥౯॥

**భావార్థః :-** యే జనాః సకలజడజగతోఽనాది నిత్యం కారణముపాస్యతయా స్వీకుర్వన్తి తేఽవిద్యాం ప్రాప్య సదా క్లిశ్యన్తి యే చ తస్మాత్కారణాదుత్పన్నం పృథివ్యాదిస్థూలం సూక్ష్మం కార్యకారణాఖ్యమనిత్యం సంయోగజన్యం కార్యం జగదిష్టముపాస్యం మన్యన్తే తే గాఢామవిద్యాం ప్రాప్యాధికతరం క్లిశ్యన్తి తస్మాత్సచ్చిదానన్దస్వరూపం పరమాత్మానమేవ సర్వే సదోపాసీరన్.॥౯॥

**పదార్థము :-**(యే) ఎవరు, పరమేశ్వరుని వదలి (అసమ్భూతిమ్) అనాది, ఉత్పన్నరహితము, సత్త్వరజస్తమోగుణమయమునగు ప్రకృతిరూప జడ వస్తువును (ఉపాసతే) ఉపాసించదగిన దని యెరుగుదురో వారు (అన్ధమ్ తమః) ఆవరణ మొనర్చునట్టి అంధకారమును (ప్ర విశన్తి) చక్కగా పొందుచున్నారు. మరియు (యే) ఎవరు (సమ్భూత్యామ్) మహత్తత్త్వాది స్వరూపముచే పరిణామము పొందియున్న సృష్టియందు (రతాః) రమించుచుందురో (తే) వారు (ఉ) నిశ్చయముతో (తతః) దానికన్న (భూయ ఇవ) అధికముగా నుండు (తమః) అవిద్యారూప అంధకారమును పొందుచున్నారు.॥౯॥

**భావార్థము :-** ఏ మానవులు సమస్త జడజగత్తునకు అనాది, నిత్యమునగు కారణమును ఉపాసనాభావముతో స్వీకరించెదరో వారు అవిద్యయందు జిక్కుకొని క్లేశములను పొందుదురు. ఆ కారణమున నుత్పన్నమైన స్థూల సూక్ష్మ కార్యకారణములను అనిత్య సంయోగ జన్యంబగు కార్యజగత్తును ఉపాసనీయ దైవముగ నెవరు భావించెదరో, వారు గాఢమగు అవిద్యను పొంది అధికాధిక క్లేశములననుభవించుదురు. కావుననే సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మను మాత్రమే ఎల్లరును ఉపాసించవలయును.॥౯॥

9. Abandoning God, deep into the shade of blinding gloom fall the worshippers of eternal, unborn Matter. They sink to darkness deeper yet who are engaged in the material pleasures of the world.

౧౯౬౯. అన్యదిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునర్మనుష్యాః కిం కుర్యురిత్యాహ.

మానవు లేమి యొనర్పవలెను?

౧౯౬౯ అన్యదేవాహుః సమ్భవాదన్యదాహురసమ్భవాత్।

ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే ॥౧౦॥

ప. వి:- అన్యత్, ఏవ, ఆహుః, సమ్భవాదితి సమ్ + భవాత్, అన్యత్, ఆహుః, అసమ్భవాదిత్యసమ్ + భవాత్, ఇతి, శుశ్రుమ, ధీరాణామ్, యే, నః, తత్, విచచక్షిర ఇతి వి + చచక్షిరే ॥ ౧౦ ॥

పదార్థః :-(అన్యత్) కార్యం ఫలం వా (ఏవ) (ఆహుః) కథయన్తి (సమ్భవాత్) సంయోగ జన్యాత్ కార్యాత్ (అన్యత్) భిన్నమ్ (ఆహుః) కథయన్తి (అసమ్భవాత్) అనుత్పన్నాత్కారణాత్ (ఇతి) అనేన ప్రకారేణ (శుశ్రుమః) శృణుమః (ధీరాణాం) మేధావినాం విదుషాం యోగినామ్ (యే) (నః) అస్మాన్ ప్రతి (తత్) తయోర్వివేచనమ్ (విచచక్షిరే) వ్యాచక్షతే.॥౧౦॥

అన్వయః :-హే మనుష్యాః! యథా వయం ధీరాణాం సకాశాద్యద్వచః శుశ్రుమ యే నస్తద్విచచక్షిరే తే సమ్భవాదన్యదేవాహురసమ్భవాదన్యదాహురితి యూయమపి శృణుత.॥౧౦॥

భావార్థః:-హే మనుష్యాః! యథా విద్వాంసః కార్యాత్కారణాద్వస్తునో భిన్నమ్భిన్నం వక్ష్యమాణ ముపకారం గృహ్ణన్తి గ్రాహయన్తి, తద్గుణాన్ విజ్ఞాయాధివిజ్ఞాపయన్త్యేవమేవ యూయమపి నిశ్చినుత.॥౧౦॥

**పదార్థము** :-మానవులారా! మే మెటుల (ధీరాణమ్) మేధావులు యోగ్యులునగు విద్వాంసులచే ఏ యుపదేశములను (శుశ్రుమ) వినుచుందుమో (యే) ఎవరు (నః) మాకు (తత్, విచచక్షిరే) వ్యాఖ్యాన పూర్వకముగా చెప్పుచున్నారో, అట్టివారు (సమ్భవాత్) సంయోగజన్య కార్యమునుండి (అన్యత్, ఏవ) కార్యము లేక ఫలమును (ఆహుః) చెప్పుచుందురో, వారు (అసంభవాత్) ఉత్పన్నము గానట్టి కారణమునుండి (అన్యత్) భిన్నమైనదని (ఆహుః) చెప్పుచున్నారు (ఇతి) ఈ విషయమును మీరును నిశ్చయించుకొనుడు.॥౧౦॥

**భావార్థము** :- ఓ మానవులారా! ఏవిధముగ విద్వాంసులు కార్యకారణరూప వస్తువులు భిన్నములని వాని నుండి ఉపకారములను దీసికొందురో, తీసికొనజేయుదురో మరియు ఆ కార్యకారణముల గుణములను ఎరిగి తెలియజేయదురో, అదేవిధముగ మీరును చేయుడు.॥౧౦॥

10. One fruit, they say, results from the knowledge of this created world, the Effect, another from the knowledge of eternal Matter, the Cause. That from the sages have we heard who have declared this lore to us.

౧౮౭౦ సమ్భూతిమిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునర్మనుష్యైః కార్యకారణాభ్యాం కిం కిం సాధనీయమిత్యాహ.

మానవులు కార్యకారణములచే నేమేమి సాధించవలయును?

౧౮౭౦ సమ్భూతిం చ వినాశం చ యస్తద్వేదోభయఀ సహ।

వినాశేన మృత్యుం తీర్త్వా సమ్భూత్యాఽమృతమశ్నుతే ॥౧౧॥

ప. వి:-సమ్భూతిమితి సమ్ + భూతిమ్, చ, వినాశమితి వి + నాశమ్, చ, యః, తత్, వేద, ఉభయమ్, సహ, వినాశేనేతి వినాశేన, మృత్యుమ్, తీర్త్వా, సమ్భూత్యేతి సమ్ + భూత్యా, అమృతమ్, అశ్నుతే ॥ ౧౧॥

పదార్థః :-(సమ్భూతిమ్) సమ్భవన్తి యస్యాం తాం కార్యాఖ్యాం సృష్టిమ్ (చ) తస్యా గుణకర్మస్వభావాన్ (వినాశమ్) వినశ్యన్త్యదృశ్యాః పదార్థా భవన్తి యస్మిన్ (చ) తద్గుణకర్మస్వభావాన్ (యః) (తత్) (వేద) జానాతి (ఉభయమ్) కార్యకారణస్వరూపం జగత్ (సహ) (వినాశేన) నిత్యస్వరూపేణ విజ్ఞాతేన కారణేన సహ (మృత్యుమ్) శరీరవియోగజన్యం దుఃఖమ్ (తీర్త్వా) ఉల్లఙ్ఘ్య (సమ్భూత్యా) శరీరేన్ద్రియాన్తఃకరణ రూపయోత్పన్నయా కార్యరూపయా ధర్మే ప్రవర్తయిత్ర్యా సృష్ట్యా (అమృతమ్) మోక్షమ్ (అశ్నుతే) ప్రాప్నోతి.॥౧౧ ॥

అన్వయః:-హే మనుష్యాః! యో విద్వాన్ సమ్భూతిం చ వినాశం చ సహోభయం తద్వేద స వినాశేన సహ మృత్యుం తీర్త్వా సమ్భూత్యా సహాఽమృతమశ్నుతే.॥౧౧ ॥

భావార్థః:-హే మనుష్యాః! కార్యకారణాఖ్యే వస్తునీ నిరర్థకే న స్తః కిన్తు కార్యకారణయో ర్గుణకర్మస్వభావాన్ విదిత్వా ధర్మాదిమోక్షసాధనేషు సంప్రయోజ్య స్వాత్మకార్యకారణయోర్వి జ్ఞాతేన నిత్యత్వేన మృత్యుభయం త్యక్త్వా మోక్షసిద్ధిం సమ్పాదయతేతి కార్యకారణాభ్యా మన్యదేవ ఫలం నిష్పాదనీయమితి. అనయోర్నిషేధో హి పరమేశ్వరస్థాన ఉపాసనాప్రకరణే వేదితవ్యః.॥౧౧ ॥

**పదార్థము:**-మానవులారా! (యః) ఏ విద్వాంసుడు (సంభూతిమ్) సకల పదార్థములు త్పన్నమగునట్టి ఆ కార్యరూప సృష్టి (చ) మరియు దాని గుణకర్మ స్వభావములను మరియు (వినాశమ్) ఎద్దానియందు పదార్థములు నశించునో అట్టి కారణరూప జగత్తును (చ) మరియు దాని గుణకర్మస్వభావములను (సహ) వెన్వెంటనే [కలిపి] (ఉభయమ్) రెండింటిని (తత్) ఆ కార్య మరియు కారణ స్వరూపములను (వేద) ఎరుగునో అట్టి విద్వాంసుడు (వినాశేన) నిత్యస్వరూపముగా నెరుగబడియున్న కారణమును తెలిసికొని (మృత్యుమ్) శరీరత్యాగమును గూర్చిన దుఃఖమునుండి (తీర్త్వా) తరించి [దాటి] (సంభూత్యా) శరీరము, ఇంద్రియములు మరియు అంతఃకరణరూప, ఉత్పన్నమైన కార్యమునందు సృష్టితో ప్రవృత్తులై (అమృతమ్) మోక్ష సుఖమును (అశ్నుతే) ప్రాప్తిజేసికొనెదరు.॥౧౧॥

**భావార్థము** :-ఓ మానవులారా! కార్యకారణరూపవస్తువులు నిరర్థకములుగావు. కాని కార్యకారణముల గుణకర్మస్వభావములను దెలిసికొని ధర్మము మున్నగు మోక్షసాధనములందు సంయుక్తపరచి తమ శరీరము మున్నగు కార్యకారణములను, వాని నిత్యత్వమును దెలిసికొని, మరణభయమును వదలివేసి మోక్షమును సాధించుడు. ఈవిధముగా కార్యకారణములచే వేరైనట్టి మోక్షమును సాధించవలయును. కాని పరమేశ్వరుని స్థానమున ఈ కార్య కారణముల ఉపాసనా ప్రకరణమును నిషేధించవలయును.॥౧౧॥

11. the man who knows simultaneously the effect and the cause, overcoming death through the knowledge of the cause, attains to salvation through the knowledge of the effect, the created world.

౧౯౭౧. అన్ధన్తమ ఇత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ విద్యాఽవిద్యోపాసనఫలమాహ. విద్య-అవిద్యల ఉపాసనచే కలుగు ఫలము.

౧౯౭౧ అన్ధన్తమః ప్ర విశన్తి యేఽవిద్యాముపాసతే।

తతో భూయ ఇవ తే తమో యఽఉ విద్యాయాꣳ రతాః ॥౧౨॥

ప.వి:-అన్ధమ్, తమః, ప్ర, విశన్తి, యే, అవిద్యామ్, ఉపాసత ఇత్యుప + ఆసతే, తతః, భూయఽ ఇవేతి భూయః + ఇవ, తే, తమః, యే, ఊꣳ ఇత్యూꣳ, విద్యాయామ్, రతాః.॥౧౨॥

పదార్థః :- (అన్ధమ్) దృష్ట్యావరకమ్ (తమః) గాఢమజ్ఞానమ్ (ప్ర) (విశన్తి) (యే) (అవిద్యామ్) అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యేతి జ్ఞానాదిగుణరహితం వస్తు కార్యకారణాత్మకం జడం పరమేశ్వరాద్భిన్నమ్ (ఉపాసతే) అభ్యస్యన్తి (తతః) (భూయ ఇవ) అధికమివ (తే) (తమః) అజ్ఞానమ్ (యే) పణ్డితంమన్యమానాః (ఉ) (విద్యాయామ్) శబ్దార్థసమ్బన్ధవిజ్ఞానమాత్రేఽవైదిక ఆచరణే (రతాః) రమమాణాః.॥౧౨॥

అన్వయః :- యే మనుష్యా అవిద్యాముపాసతే తేఽన్ధన్తమః ప్రవిశన్తి యే విద్యాయాం రతాస్త ఉ తతో భూయ ఇవ తమః ప్రవిశన్తి.॥౧౨॥

భావార్థః :- అత్రోపమాలఙ్కారః. యద్యచ్చేతనం జ్ఞానాదిగుణయుక్తం వస్తు తజ్జ్ఞాతృ, యదవిద్యారూపం తజ్జ్ఞేయం, యచ్చ చేతనం బ్రహ్మవిద్వదాత్మస్వరూపం వా తదుపాసనీయం సేవనీయం చ. యదతో భిన్నం తన్నోపాసనీయం కిన్తూపకర్తవ్యమ్. యే మనుష్యా అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశైః క్లేశై ర్యుక్తా స్తే పరమేశ్వరం విహాయాతో భిన్నం జడం వస్తూపాస్య మహతి దుఃఖసాగరే మజ్జన్తి యే చ శబ్దార్థాన్వయమాత్రం సంస్కృతమధీత్య సత్యభాషణపక్షపాతరహితన్యాయాచరణాఖ్యం ధర్మం నాచరన్త్యభిమానారూఢాః సన్తో విద్యాం తిరస్కృత్యావిద్యామేవ మన్యన్తే తే చాఽధికతమసి దుఃఖార్ణవే సతతం పీడితా జాయన్తే.॥౧౨॥

**పదార్థము** :-(యే) ఏ మనుష్యులు (అవిద్యామ్) అనిత్యమున నిత్యమును, అశుద్ధమందు శుద్ధిని, దుఃఖమునందు సుఖమును మరియు అనాత్మయగు శరీరాదులందు ఆత్మ బుద్ధిరూపమును, అవిద్య దాని అనగా జ్ఞానము మున్నగు గుణరహితమగు కారణరూపమును, అనగా పరమేశ్వరునకు భిన్నమగు జడపదార్థములను (ఉపాసతే) ఉపాసించెదరో, పూజించెదరో, వారు (అన్ధమ్, తమః) దృష్టినిరోధకమగు అంధకారము మరియు అత్యంత అజ్ఞానమును (ప్ర, విశన్తి) పొందుచున్నారు. మరియు (యే) ఎవరు పండితులమని యెంచుకొందురో (విద్యాయామ్) కేవలము శబ్దార్థములను, వాని సంబంధములను ఎరుగుట మాత్రముచే అవైదికాచరణమునందు (రతాః) రమణమొనర్చుచుండెదరో (తే) వారు (ఉ) కూడ (తతః) దానికన్నను (భూయ, ఇవ) అధికతరమగు (తమః) అజ్ఞానరూప అంధకారమునందు ప్రవేశించెదరని ఎరుగుడు. ॥౧౨॥

**భావార్థము** :- ఈ మంత్రమునందు ఉపమాలంకారము గలదు. జ్ఞానాది గుణయుక్తము చేతనము జ్ఞాత, అవిద్యారూపవస్తువు జ్ఞేయము(తెలుపుకోదగినది). చేతనమగు బ్రహ్మ ఉపాసనీయుడు, లేక చేతనమైన విద్వాంసుని ఆత్మ సేవించదగినది. తద్భిన్నమైనది ఉపకారము పొందదగినదే కాని ఉపాసనీయముగాదు. ఏ మానవులు అవిద్యా అస్మిత రాగద్వేష అభినివేశములను క్లేశములచే కూడియున్నారో వారు పరమేశ్వరుని వదలి, దానికి భిన్నమగు జడవస్తువులను ఉపాసించి, మహాదుఃఖసాగరమున మునిగిపోవుదురు. మఱియు నెవరు

శబ్దార్థముల అన్వయమాత్రమెఱుగునంతటి సంస్కృతమునే చదివి, సత్యభాషణము, పక్షపాతరహితమునగు న్యాయచరణరూప ధర్మమును ఆచరించరో, ఎవరు అభిమానారూఢులై విద్యను తిరస్కరించి అ విద్యనే స్వీకరించుదురో వారు అత్యంత తమోగుణరూప దుఃఖసాగరమున నిరంతరము పీడితులగుచుందురు. ॥౧౨॥

12. To blinding darkness go the men who worship Nescience. Those proud of little knowledge enter darkness that is darker still.

౧౯౭౨. అన్యదిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ జడచేతనయోర్విభాగమాహ. జడచేతనముల భేదము చెప్పబడుచున్నది.

౧౯౭౨ అన్యదేవాహుర్విద్యాయాఽఅన్యదాహురవిద్యాయాః ।
ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే ॥ ౧౩ ॥

ప. వి:- అన్యత్, ఏవ, ఆహుః, విద్యాయాః, అన్యత్, ఆహుః, అవిద్యాయాః, ఇతి, శుశ్రుమ, ధీరాణామ్, యే, నః, తత్, విచచక్షిరే ఇతి వి + చచక్షిరే ॥ ౧౩ ॥

పదార్థః:- (అన్యత్) అన్యదేవ కార్యం ఫలం వా (ఏవ) (ఆహుః) కథయన్తి (విద్యాయాః) పూర్వోక్తాయాః (అన్యత్) (ఆహుః) (అవిద్యాయాః) పూర్వమన్త్రేణ ప్రతిపాదితాయాః (ఇతి) (శుశ్రుమ) శ్రుతవన్తః (ధీరాణామ్) ఆత్మజ్ఞానాం విదుషాం సకాశాత్ (యే) (నః) అస్మభ్యమ్ (తత్) విద్యాఽవిద్యాజం ఫలం ద్వయోః స్వరూపం వా (విచచక్షిరే) వ్యాఖ్యాతవన్తః. ॥౧౩॥

అన్వయః :- హే మనుష్యా! యే విద్వాంసో నో విచచక్షిరే విద్యాయా అన్యదాహురవిద్యాయా అన్యదేవాహురితి తేషాం ధీరాణాం తద్వచః వయం శుశ్రుమేతి విజానీత. ॥౧౩॥

భావార్థః :- జ్ఞానాదిగుణయుక్తస్య చేతనస్య సకాశాద్య ఉపయోగో భవితుం యోగ్యో, న స అజ్ఞాన యుక్తస్య జడస్య సకాశాత్, యచ్చ జడాత్ప్రయోజనం సిధ్యతి న తచ్చేతనాదితి సర్వైర్మనుష్యైర్విద్వత్సఙ్గేన విజ్ఞానేన యోగేన ధర్మాచరణేన చానయోర్వివేకం కృత్వోభయోరుపయోగః కర్తవ్యః. ॥౧౩॥

పదార్థము :- ఓ మానవులారా! (యే) ఏ విద్వాంసులు (నః) మాకొరకు (విచచక్షిరే) వ్యాఖ్యతో గూడ చెప్పుచుండిరో (విద్యాయాః) పూర్వోక్త [మొదట చెప్పినట్టి] విద్యకు (అన్యత్) ఇతర కార్యము లేక

ఫలముగలదని (ఆహుః) చెప్పుచుండిరో (అవిద్యాయాః) [పూర్వమంత్రమున ప్రతిపాదించినట్టి] అవిద్యయొక్క ఫలము (అన్యత్ ఏవ) వేరేయని (ఆహుః) చెప్పుచున్నారో (ఇతి) ఈ ప్రకారముగా చెప్పునట్టి (ధీరాణామ్) ఆత్మజ్ఞానులగు విద్వాంసులనుండి (తత్) ఆ వచనమును మేము (శుశ్రుమ) వినుచున్నామని ఎరుగుడు.॥౧౩॥

**భావార్థము** :- జ్ఞానము మున్నగు గుణములతో గూడిన చేతనములచే ఏ యుపయోగములు గలవో అవి అజ్ఞానయుక్తములగు జడములవల్ల ఎప్పుడును ఉండజాలవు. మరియు జడముచే ఏ ప్రయోజనములు సాధించబడునో అవి చేతనముచే సాధ్యముగాదు. మానవులెల్లరును విద్వాంసుల సాంగత్యము, యోగము, విజ్ఞానము మరియు ధర్మాచరణములచే ఈ రెండింటి వివేకము నెరిగి వీటి ఉపయోగమును పొందవలయును.॥౧౩॥

13. Different is the fruit, they say, of knowledge and Nescience. Thus from the sages have we heard who have declared this lore to us.

౧౯౭౩ విద్యామిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, స్వరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మరల విషయ మయ్యదియే.

౧౯౭౩ విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయꣳ సహ ।

అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే ॥ ౧౪॥

ప.వి:-విద్యామ్, చ, అవిద్యామ్, చ, యః, తత్, వేద, ఉభయమ్, సహ, అవిద్యయా, మృత్యుమ్, తీర్త్వా, విద్యయా, అమృతమ్, అశ్నుతే ॥ ౧౪ ॥

పదార్థః :- (విద్యామ్) పూర్వోక్తామ్ (చ) తత్సమ్బన్ధిసాధనోపసాధనమ్ (అవిద్యామ్) ప్రతిపాదిత పూర్వామ్ (చ) ఏతదుపయోగిసాధనకలాపమ్ (యః) (తత్) (వేద) విజానీత (ఉభయమ్) (సహ) (అవిద్యయా) శరీరాదిజడేన పదార్థసమూహేన కృతేన పురుషార్థేన (మృత్యుమ్) మరణదుఃఖభయమ్ (తీర్త్వా) ఉల్లఙ్ఘ్య (విద్యయా) ఆత్మశుద్ధాన్తః కరణసంయోగధర్మజనితేన యథార్థదర్శనేన (అమృతమ్) నాశరహితం స్వస్వరూపం పరమాత్మానం వా (అశ్నుతే).॥౧౪॥

అన్వయః :-యో విద్వాన్ విద్యాం చాఽవిద్యాం చ తదుభయం సహ వేద సోఽవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే.॥౧౪॥

భావార్థః :- యే మనుష్యా విద్యాఽవిద్యే స్వరూపతో విజ్ఞాయాఽనయోర్జడచేతనౌ సాధకౌ వర్తతే ఇతి నిశ్చిత్య సర్వం శరీరాదిజడం చేతనమాత్మానం చ ధర్మార్థకామమోక్ష సిద్ధయే సహైవ సంప్రయుఞ్జతే తే లౌకికం దుఃఖం విహాయ పారమార్థికం సుఖం ప్రాప్నువన్తి యది జడం ప్రకృత్యాదికారణం శరీరాదికార్యం వా న స్యాత్తర్హి పరమేశ్వరో జగదుద్పత్తిం, జీవః కర్మోపాసనే జ్ఞానం చ కర్తుం కథం శక్నుయాత్తస్మాన్న కేవలేన జడేన, న చ కేవలేన చేతనేనాథవా న కేవలేన కర్మణా, న కేవలేన జ్ఞానేన చ కశ్చిదపి ధర్మాదిసిద్ధిం కర్తుం సమర్థో భవతి.॥౧౪॥

పదార్థము :-(యః) ఏ విద్వాంసుడు (విద్యామ్) పూర్వోక్త విద్యను (చ) మరియు దానికి సంబంధించిన సాధనోపసాధనములను (అవిద్యామ్) పైన దెలిపినట్టి అవిద్యను (చ) మరియు దాని ఉపయోగవంతమగు సాధన సమూహమును మరియు (తత్) దాని ధ్యానగమ్య మర్మమును (ఉభయమ్) ఈ రెండింటిని (సహ) తోడ్తోడనే (వేద) ఎరుగుచున్నాడో, ఆతడు (అవిద్యయా) శరీరము మున్నగు జడపదార్థ సమూహముతో చేయబడిన పురుషార్థముచే (మృత్యుమ్) మరణదుఃఖ భయమును (తీర్త్వా) ఉల్లంఘించి (విద్యయా) ఆత్మ మరియు శుద్ధాంతఃకరణముల సంయోగమునందు ఏ ధర్మము గలదో దానిచే నుత్పన్నమైన యథార్థ దర్శనరూప విద్యద్వారా (అమృతమ్) నాశరహితమగు తన స్వరూపమును మరియు పరమాత్మను (అశ్నుతే) ప్రాప్తించుకొనుచున్నాడు. ॥౧౪॥

భావార్థము :-ఏ మనుష్యుడు విద్య అవిద్యలను వాని యథార్థ స్వరూపమును దెలిసికొని వీనికి జడ చేతనములు సాధకములని నిశ్చయించుకొని శరీరము మున్నగు జడపదార్థములను మరియు చేతనమగు ఆత్మను ధర్మార్థకామమోక్షముల సిద్ధికొరకు తోడ్తోడుగ ప్రయోగమొనర్చుకొనునో ఆతడు లౌకిక దుఃఖములను త్రోసివేసి పరమార్థ సుఖమును ప్రాప్తించుకొనును. ఈ జడప్రకృతి మున్నగు కారణములు, మరియు శరీరము మున్నగు కార్యరూపములు లేకున్నచో పరమేశ్వరుడు జగదుత్పత్తికి, జీవుడు జ్ఞానకర్మోపాసనల నొనర్చుట కెట్లు సమర్థులగుదురు? కావున కేవలము జడముచేతను మరియు కేవలము చేతనముచేతను లేక కేవలము కర్మచేతను, కేవలము జ్ఞానముచేతను ఎవ్వడును ధర్మము మున్నగు పదార్థములను సాధించుటకు సమర్థుడు గాజాలడు. ॥౧౪॥

**14. He who simultaneously knoweth well these two, knowledge and Action, overcoming death by Action, by knowledge gaineth salvation.**

౧౫౭౪.వాయురిత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, స్వరాడుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ దేహాన్తసమయే కిం కార్యమిత్యాహ. దేహాన్త సమయమున నేమేమి చేయవలయును?

౧౫౭౪ వాయురనిలమమృతమథేదం భస్మాన్తꣳ శరీరమ్ ।

ఓ౩మ్ క్రతో స్మర క్లిబే స్మర కృతꣳస్మర॥౧౫॥

ప.వి:-వాయుః, అనిలమ్, అమృతమ్, అథ, ఇదమ్, భస్మాన్తమితి భస్మ + అన్తమ్, శరీరమ్, ఓ౩మ్, క్రతో ఇతి క్రతో, స్మర, క్లిబే, స్మర, కృతమ్, స్మర.॥౧౫॥

పదార్థః:- (వాయుః) ధనంజయాదిరూపః (అనిలమ్) కారణరూపం వాయుమ్ (అమృతమ్) నాశరహితం కారణమ్ (అథ) (ఇదమ్) (భస్మాన్తమ్) భస్మ అన్తే యస్య తత్ (శరీరమ్) యచ్ఛీర్యతే హింస్యతే తదాశ్రయమ్ (ఓ౩మ్) ఏతన్నామవాచ్యమీశ్వరమ్ (క్రతో) యః కరోతి జీవస్తత్సమ్బుద్ధౌ (స్మర) పర్యాలోచయ (క్లిబే) స్వసామర్థ్యాయ (స్మర) (కృతమ్) యదనుష్ఠితమ్ (స్మర) తత్ ॥ ౧౫ ॥

అన్వయః:-హే క్రతో! త్వం శరీరత్యాగసమయే (ఓ౩మ్) స్మర క్లిభే పరమాత్మానం స్వస్వరూపం చ స్మర కృతం స్మర. అత్రస్థో వాయురనిలమనిలోఽమృతం ధరతి. అథేదం శరీరం భస్మాన్తం భవతీతి విజానీత.॥౧౫॥

భావార్థః :-మనుష్యైర్యథా మృత్యుసమయే చిత్తవృత్తిర్జాయతే శరీరాదాత్మనః పృథగ్భావశ్చ భవతి తథైవేదానీమపి విజ్ఞేయమ్. ఏతచ్ఛరీరస్య భస్మాన్తా క్రియా కార్యా నాతో దహనాత్పరః కశ్చిత్సంస్కారః కర్తవ్యో వర్తమానసమయ ఏకస్య పరమేశ్వరస్యైవాజ్ఞాపాలనముపాసనం స్వసామర్థ్యవర్ధనఞ్చైవ కార్యమ్. కృతం కర్మ విఫలం న భవతీతి మత్వా ధర్మే రుచిరధర్మేఽప్రీతిశ్చ కర్తవ్యా ॥ ౧౫ ॥

పదార్థము :- (క్రతో) కర్మలనొనర్చు ఓ జీవుడా! శరీరమును వదలివేయుసమయమున నీవు (ఓ౩మ్) ఈ ఓ౩మ్ నామవాచ్య పరమేశ్వరుని (స్మర) స్మరించుము (క్లిబే) నీ సామర్థ్యముకొరకు పరమాత్మను మరియు నీ స్వరూపమును (స్మర) స్మరించుము (కృతమ్) నీవుచేసిన కర్మలను (స్మర) స్మరించుము. ఓ మానవులారా! ఈ ప్రపంచముయొక్క (వాయుః) ధనంజయము మున్నగు వాయువులు (అనిలమ్) కారణరూప వాయువును

(అమృతమ్) అవినాశియగు కారణరూపమును ధరించుచున్నది. (అథ) ఆ తరువాత (ఇదమ్) ఈ (శరీరమ్) నష్టమగునట్టిసుఖాదుల కాశ్రయమగు ఈ శరీరము (భస్మాన్తమ్) అంతమందు భస్మమగునదియే యగునని మీరెరుగుడు.॥౧౫॥

**భావార్థము** :- మరణసమయమున చిత్తవృత్తులెట్లుండునో మరియు శరీరమునుండి ఆత్మ వేరగునప్పుడు ఎట్లుండునో దాని నిప్పుడు స్మరించవలయును. ఈ శరీరమునకు మరణపర్యంతము క్రియలొనర్చవలయునే గాని శవదహనమైన శరీరమున కేవిధముగను సంస్కారముగాని, కర్మలుగాని చేయవలదు. బ్రతికియున్నప్పుడే ఏకేశ్వరుని ఆజ్ఞనుపాలించుచు, ఆతని యుపాసనయే యొనర్చవలయును. మరియు తన సామర్థ్యమును పెంచుకొనవలయును. చేయబడిన కర్మ నిష్ఫలము గాజాలదని యెరిగి ధర్మమునందు ప్రియము, అధర్మమునం దప్రియము గలిగియుండవలయునని యెరుగవలయును.॥౧౫॥

15. O active soul, at the time of death, remember Om, remember God for thy vitality and thy eternity, remember thy deeds. Know that soul is immaterial and immortal but the body is finally reduced to ashes!.

౧౬౭౫. అగ్నే నయేత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

ఈశ్వరః కాననుగృహ్ణాతీత్యాహ. ఈశ్వరు డే మానవులపై దయ చూపును?

౧౬౭౫ అగ్నే నయ సుపథా రాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ ॥౧౬॥

ప.వి:-అగ్నే, నయ, సుపథేతి సు + పథా, రాయే, అస్మాన్, విశ్వాని, దేవ, వయునాని, విద్వాన్, యుయోధి, అస్మత్, జుహురాణమ్, ఏనః, భూయిష్ఠామ్, తే, నమఉక్తిమితి నమః +ఉక్తిమ్, విధేమ.॥ ౧౬ ॥

పదార్థః :-(అగ్నే) స్వప్రకాశస్వరూప కరుణామయ జగదీశ్వర! (నయ) గమయ (సుపథా) ధర్మ్యేణ మార్గేణ (రాయే) విజ్ఞానాయ ధనాయ వసుసుఖాయ (అస్మాన్) జీవాన్ (విశ్వాని) అఖిలాని (దేవ) దివ్యస్వరూప (వయునాని) ప్రశస్యాని ప్రజ్ఞానాని. వయునమితి ప్రశస్యనా...నిఘం. 3.౮. ప్రజ్ఞానామసు. నిఘం. 3.౯. (విద్వాన్) యః సర్వం వేత్తి సః

(యుయోధి) పృథక్కురు (అస్మత్) అస్మాకం సకాశాత్ (జుహురాణమ్) కౌటిల్యమ్ (ఏనః) పాపాచరణమ్ (భూయిష్ఠామ్) బహుతమామ్ (తే) తుభ్యమ్ (నమ ఉక్తిమ్) సత్కారపురః సరాం ప్రశంసామ్ (విధేమ) పరిచరేమ.॥౧౬॥

అన్వయః :- హే దేవాగ్నే పరమేశ్వర! యతో వయం తే భూయిష్ఠాం నమఉక్తిం విధేమ తస్మాద్విద్వాంస్త్వమస్మజ్జుహురాణమేనో యుయోధ్యస్మాన్ రాయే సుపథా విశ్వాని వయునాని నయ ప్రాపయ.॥౧౬॥

భావార్థః :- యే సత్యభావేన పరమేశ్వరముపాసతే యథాసామర్థ్యం తదాజ్ఞాం పాలయన్తి సర్వోపరి సత్కర్తవ్యం పరమాత్మానం మన్యన్తే తాన్ దయాలురీశ్వరః పాపాచరణమార్గాత్ పృథక్కృత్య ధర్మ్యమార్గే చాలయిత్వా విజ్ఞానం దత్వా ధర్మార్థకామమోక్షాన్ సాద్ధుం సమర్థాన్ కరోతి. తస్మాత్ సర్వ ఏకమద్వితీయ మీశ్వరం విహాయ కస్యాప్యుపాసనం కదాచిన్నైవ కుర్యుః ॥౧౬॥

పదార్థము :- (దేవ) దివ్యస్వరూపుడవు (అగ్నే) ప్రకాశస్వరూపుడవు కరుణామయుడవునగు జగదీశ్వరా! మేము (తే) నీకొరకు (భూయిష్ఠామ్) అధికతరమగు (నమ ఉక్తిమ్) సత్కారపూర్వకమగు ప్రశంసలను (విధేమ) సేవింతుముగాక! కావున (విద్వాన్) సర్వజ్ఞుడవగు నీవు (అస్మత్) మానుండి (జుహురాణమ్) కుటిలతారూపమగు (ఏనః) పాపాచరణమును (యుయోధి) తొలగించుము (అస్మాన్) జీవులమగు మమ్ము (రాయే) విజ్ఞానము, ధనము, ధనముచే గలుగు సుఖములకొరకు (సుపథా) ధర్మానుకూలమగు మార్గమందు (విశ్వాని) సమస్త (వయునాని) ప్రశస్తమగు జ్ఞానములను (నయ) ప్రాప్తింపజేయుము.॥౧౬॥

**భావార్థము** :-సత్యభావముతో నెవరు పరమేశ్వరుని ఉపాసించెదరో, ఆతని యాజ్ఞలను యథాశక్తిగా ఎవరు పాలించెదరో మరియు సర్వోపరి సత్కరించదగినవానిగ ఆ పరమాత్మను నమ్ముదురో అట్టివారిని దయాళువగు పరమేశ్వరుడు పాపాచరణ మార్గమునుండి వేరుగానుంచి ధర్మయుక్తమార్గమునందు నడుపుచు, విజ్ఞానమును ప్రసాదించి ధర్మార్థకామమోక్షములను సాధించుకొను సమర్థతను ఇచ్చుచున్నాడు. కావున అద్వితీయుడగు ఏకేశ్వరుని వదలి ఇంకెవరి యుపాసననో ఎప్పుడును జేయవలదు.॥౧౬॥

16. O Divine, Lustrous, Benevolent God, most ample, respectful adoration do we bring Thee. Thou art All-Knowing. Remove from us the sin that leads us astray. Lead us through virtuous path to riches, happiness and all sorts of wisdom!.

౧౯౭౬.హిరణ్మయేనేత్యస్య దీర్ఘతమా ఋషిః, ఆత్మా దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథాన్తే మనుష్యానీశ్వర ఉపదిశతి. అంతమున మానవుల కీశ్వరు డుపదేశించుచున్నాడు.

౧౯౭౬ హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।

యోఽసావాదిత్యే పురుషః సోఽసావహమ్ । ఓ౩మ్ ఖం బ్రహ్మ ॥౧౭॥

ప.వి:-హిరణ్మయేన, పాత్రేణ, సత్యస్య, అపిహితమిత్యపి + హితమ్, ముఖమ్, యః, అసౌ, ఆదిత్యే, పురుషః, సః, అసౌ, అహమ్, ఓ౩మ్, ఖమ్, బ్రహ్మ. ॥౧౭॥

పదార్థః:-(హిరణ్మయేన) జ్యోతిర్మయేన (పాత్రేణ) రక్షకేణ (సత్యస్య) అవినాశినః యథార్థస్య కారణస్య (అపిహితమ్) ఆచ్ఛాదితమ్ (ముఖమ్) ముఖవదుత్తమాఙ్గమ్ (యః) (అసౌ) (ఆదిత్యే) ప్రాణే సూర్యమణ్డలే వా (పురుషః) పూర్ణఃపరమాత్మా (సః) (అసౌ) (అహమ్) (ఓ౩మ్) యోఽవతి సకలం జగత్తదాఖ్యా ఖమ్ ఆకాశవద్ వ్యాపకమ్ (బ్రహ్మ) సర్వేభ్యో గుణకర్మస్వరూపతో బృహత్.॥౧౭॥

అన్వయః:- హే మనుష్యా! యేన హిరణ్మయేన పాత్రేణ మయా సత్యస్యాపిహితం ముఖం వికాశ్యతే యోఽసావాదిత్యే పరుషోఽస్తి సోఽసావహం ఖమ్బ్రహ్మాస్మ్యో౩మితి విజానీత.॥౧౭॥

భావార్థః:-సర్వాన్మనుష్యాన్ ప్రతీశ్వర ఉపదిశతి. హే మనుష్యా! యోఽహమత్రాస్మి స ఏవాన్యత్ర సూర్యాదౌ యోఽన్యత్ర సూర్యాదావస్మి స ఏవాఽత్రాఽస్మి సర్వత్ర పరిపూర్ణః ఖవద్వ్యాపకో న మత్తః కిఞ్చిదన్యద్ బృహదహమేవ సర్వేభ్యో మహానస్మి మదీయం సులక్షణపుత్రవత్ ప్రాణప్రియం నిజస్య నామఓ౩మితి వర్తతే యో మమ ప్రేమసత్యాచరణ భావాభ్యాం శరణం గచ్ఛతి. తస్యాన్తర్యామిరూపేణాహ మవిద్యాం వినాశ్య తదాత్మానం ప్రకాశ్య శుభగుణకర్మస్వభావం కృత్వా సత్యస్వరూపావరణం స్థాపయిత్వా శుద్ధం యోగజం విజ్ఞానం దత్వా సర్వేభ్యో దుఃఖేభ్యః పృథక్కృత్య మోక్షసుఖం ప్రాపయామీత్యో౩మ్.॥౧౭॥

పదార్థము :- ఓ మానవులారా! జ్యోతిఃస్వరూపుడను (పాత్రేణ) రక్షకుడనునగు నాచే ఏ (సత్యస్య) అవినాశి, యథార్థమునగు కారణముయొక్క (అపిహితమ్) ఆచ్ఛాదితమైయున్నదో (ముఖమ్) ముఖమువంటి ఉత్తమాంగమును ప్రకాశమొనర్చబడుచున్నదో (యః) ఏ (అసౌ) ఆ (ఆదిత్యే) ప్రాణము లేక

సూర్యమండలమునందు (పురుషః) పరిపూర్ణుడగు పరమాత్మయున్నాడో (సః) అట్టి (అసౌ) పరోక్షరూపుడనగు (అహమ్) నేను (ఖమ్) ఆకాశమువలె వ్యాప్తమైయుండి (బ్రహ్మ) అన్నిటికన్న గుణకర్మ స్వభావములం దధికుడను (ఓ౩మ్) సర్వరక్షకుడను. నా ముఖ్యనామము ''ఓ౩మ్'' అని గ్రహించుడు.॥౧౭॥

**భావార్థము** :- సర్వమానవులయెడ పరమేశ్వరు డిట్లుపదేశించుచున్నాడు, ఓ మానవులారా! ''ఏ నేను ఇచ్చటనున్నానో అట్టి నేను ఇతరత్ర సూర్యాదిలోకములందును, అన్యస్థానములగు సూర్యాదులందునున్నాను'', ఆ నేను ఇచ్చటను యున్నాను. పరిపూర్ణాకాశమువలె వ్యాపకుడనగు నాకన్న గొప్పదేదియునులేదు. నేనే సర్వము కన్న గొప్పవాడను. నాయొక్క సులక్షణములతో గూడిన పుత్రులవలె ప్రాణములకన్న ప్రియమైన నా నిజనామము ''ఓ౩మ్'' యైయున్నది. ప్రేమ, సత్యాచరణ భావముతో ఎవరు నా శరణమును కోరుదురో వారిని అంతర్యామిరూపమున నేను వారి అవిద్యను నశింపజేసి వారి యాత్మలను ప్రకాశితమొనర్చి శుభగుణకర్మస్వభావములు గలవిగా నొనర్చెదను. మరియు సత్యస్వరూపావరణమును స్థిరపరచి యోగముచే లభించినట్టి శుద్ధవిజ్ఞానమును ప్రసాదించి సకల సంకటములనుండి, దుఃఖములనుండి వేరుగా నుంచి మోక్షసుఖమును ప్రాప్తింపజేయుదును. ఇతి. ॥౧౭॥

17. O men, by Me, the Resplendant Protector, is covered the face of Eternal Cause, The Matter. The Spirit yonder in the Sun, that spirit dwelling there am I. I am vast like the atmosphere, Greatest of all in merit, action, and nature am I. Om is My name!.

అత్రేశ్వరగుణవర్ణనమధర్మత్యాగోపదేశః సర్వదా సత్కర్మానుష్ఠానావశ్యకత్వమధర్మాచరణనిన్దా పరమేశ్వరస్యాతిసూక్ష్మస్వరూపవర్ణనం విదుషా జ్ఞేయత్వమవిదుషామవిజ్ఞేయత్వం సర్వత్రాత్మభావేనాహింసాధర్మ పాలనం తేన మోహశోకాదిత్యాగ ఈశ్వరస్య జన్మాదిదోషరాహిత్యం వేదవిద్యోపదేశనం కార్యకారణాత్మకస్య జడస్యోపాసననిషేధస్తాభ్యాం కార్యకారణాభ్యాం మృత్యుం నివార్య మోక్షసిద్ధికరణం జడవస్తున ఉపాసననిషేధ శ్చేతనోపాసనవిధిస్తదుభయస్వరూపవిజ్ఞానాఽఽవశ్యకత్వం శరీరస్వభావవర్ణనం సమాధినా పరమేశ్వరమాత్మని నిధాయ శరీరత్యాగకరణం శరీరదాహాదూర్ధ్వమన్యక్రియానుష్ఠాననిషేధోఽధర్మత్యాగాయ ధర్మవర్ధనాయ పరమేశ్వర ప్రార్థనమీశ్వరస్వరూపవర్ణనం సర్వేభ్యో నామభ్య ఓ౩మిత్యస్య ప్రాధాన్యప్రతిపాదనం చ కృతమత ఏతదర్థస్య పూర్వాఽధ్యాయోక్తార్థేన సహ సఙ్గతిరస్తీతి వేద్యమ్.

ఈ యధ్యాయమునందు ఈశ్వరుని గుణముల వర్ణనము, అధర్మత్యాగమును గూర్చి, సర్వకాలములందును సత్కర్మల అనుష్ఠానముల ఆవశ్యకత, అధర్మాచరణదూష్యము, పరమేశ్వరుని అతిసూక్ష్మస్వరూపవర్ణనము, విద్వాంసులకు జ్ఞేయత్వము [తెలిసికొనదగిన] అవిద్వాంసులకు అజ్ఞేయత్వము [తెలిసికొన సాధ్యముగానిది] గనుండుట, సర్వత్ర ఆత్మయొక్క అస్తిత్వమును దెలిసికొని అహింసారక్షణము, దానివల్ల మోహశోకాదుల త్యాజ్యము, ఈశ్వరుడు జన్మ మున్నగు దోషములులేనివాడైయుండుట, వేదవిద్యోపదేశము, కార్యకారణరూప జడజగత్తు సంబంధ ఉపాసన నిషేధము, ఆ కార్యకారణములచే మృత్యువును నివారించి మోక్షాదులను సాధించుట, జడపదార్థముల ఉపాసన నిషేధము, చేతనోపాసనావిధి, జడచైతన్యములరెండింటి స్వరూపమును దెలిసికొను ఆవశ్యకత, శరీర స్వభావ వర్ణనము,

సమాధ్యవస్థద్వారా పరమేశ్వరుని తన యాత్మయందు ధారణమొనర్చి శరీరత్యాగమొనర్చుట, అంత్యేష్టి [దాహకర్మ] తరువాత ఇతర క్రియల నాచరించుట నిషేధము, అధర్మత్యాగము, ధర్మాభివృద్ధికై పరమేశ్వరుని ప్రార్థన, ఈశ్వరస్వరూప వర్ణనము, మరియు నాతని అనంతనామములలో 'ఓ౩మ్' అను నామముయొక్క ఉత్తమత్వము యొక్క ప్రతిపాదన, మున్నగునవి ఈ యధ్యాయమున చెప్పబడిన అర్థములకు పూర్వార్థములందు జెప్పబడిన అర్థములతో సంబంధము గలదని యెరుగవలయును.

ఇతి శ్రీమత్పరమవిద్వత్పరివ్రాజకాచార్యేణ శ్రీయుత దయానందసరస్వతీస్వామినా విరచితే సంస్కృతార్యభాషాభ్యాం సుభూషితే యజుర్వేదభాష్యే చత్వారింశోఽధ్యాయః పూర్తిమగాత్.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య మహర్షిదయానందసరస్వతీస్వామి విరచిత సంస్కృతార్య భాషావిభూషిత
యజుర్వేదభాష్యమునందలి నలుబదవ అధ్యాయమునకు ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశస్థ ఇందూరు మండ
లాంతర్గత బీబీపేట కాపురస్థులైన స్వ. లోకా లక్ష్మయ్య, వేంకమాంబార్యులద్వితీయపుత్రుడు,
శిష్యుడునునగు 'చతుర్వేద భాష్యానువాద భాస్కర' బిరుదాంకితులు, వేదగిరి ప్రథమ
పీఠాధిపతులునైన 'పం. లోకమలహరి సిద్ధాంతాచార్యుల'చే నొనర్చబడిన ఆంధ్రానువాదము;
పాలమూరు (మహబూబ్‌నగర్) జనపదమునందలి కొందుర్గు మండలాంతర్గత రావిర్యాల
గ్రామవాస్తవ్యులు స్వ. శివనీలమ్మబుగ్గారెడ్డి గార్ల పుత్రుండు, కళాప్రపూర్ణ, వేదతత్త్వ
వేత్త పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యుల శిష్యుండు, వేదగిరి స్థాపకు
లునైన సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద ఆచార్య
'వంగ్టి కృష్ణారెడ్డి' సంపాదకత్వమున పరిష్కరింపబడిన

**నలుబదవ అధ్యాయము సమాప్తము.**

మార్గశీర్ష కృష్ణ ౧ శనౌ, సంవత్ ౧౯౩౯

(౧౮౦౪ శా. శ. చిత్రభాను; 1882 క్రీ.శ.; ౫౭ ద.శ.) లో సమాప్తమైనది.

వైశాఖ శుక్ల ౧౧ శని సంవత్ ౧౯౪౬

(౧౮౧౧ విరోధి; 1889 క్రీ.శ. ౬౫. దయానందశకము) లో ముద్రణము సమాప్తమైనది.

వాజసనేయీ శుక్లయజుర్వేదమునకు వి.శ. ౨౦౪౧ రక్తాక్షి మార్గశిరశుద్ధ నవమి సరియగు తేది 1-12-1984న అనువాదము ప్రారంభించబడినది. వి.శ.౨౦౪౩ అక్షయ, మార్గశీర్ష మాస 30వ తిథి, అమావాస్య పర్వదినము బుధవారము (క్రీ.శ.౧౯౮౬ డిసెంబర్ ౩౧) న సంపూర్ణాంధ్రానువాదము పరిసమాప్తమైనది.

వైదికసాహిత్య ప్రచారసమితి ద్వారా తారణ మాఘమాసము మార్చి 2005న ప్రచురింపబడినది.

## సంపూర్ణ యజుర్వేదభాష్యము సమాప్తము

## అథ యజుర్వేద మంత్రానుక్రమణికా

| మంత్ర క్రమసంఖ్య | | అధ్యా. మంత్ర |
|---|---|---|
| ౧౨౯౭ | అద్భ్యః స్వాహా వార్భ్యః | ౨౨.౨౫ |
| ౧౭౩౮ | అద్యా దేవా ఉదితా సూర్య | ౩౩.౪౨ |
| ౧౦౯౫ | అద్యా యథా నః పితరః | ౧౯.౬౯ |
| ౭౬౪ | అధాహ్యగ్నే క్రతోర్భద్ర | ౧౫.౪౫ |
| ౧౭౪౩ | అధి న ఇంద్రేషాం విష్ణో | ౩౩.౪౭ |
| ౭౩౩ | అధి పత్యసి బృహతీ | ౧౫.౧౪ |
| ౭౮౯ | అధ్యశోచ దధి వక్త్రా | ౧౬.౫ |
| ౧౧౫౨ | అధ్వర్యో అద్రిభిః సుతగ్ం | ౨౦.౩౧ |
| ౬౯౮ | అనడ్వాన్వయః పంక్తిశ్ఛ | ౧౪.౧౦ |
| ౧౮౬౪ | అనడ్వాహ మన్వారభామ | ౩౫.౧౩ |
| ౧౯౦౯ | అనాధృష్టా పురస్తాత్ | ౩౭.౧౨ |
| ౧౪౯౨ | అనాధృష్యో జాతవేదా | ౨౭.౭ |
| ౧౭౬౩ | అను తే శుష్మం తురయన్త | ౩౩.౬౭ |
| ౧౭౭౫ | అనుత్తమా తే మఘవన్న కి | ౩౩.౭౯ |
| ౧౪౮ | అను త్వా మాతా మన్యతాం | ౪.౨౦ |
| ౧౫౯౫ | అను త్వా రథో అను మ | ౨౯.౧౯ |
| ౧౮౦౨ | అను నోఽద్యానుమతి ర్య | ౩౪.౯ |
| ౧౪౭౮ | అను వీరై రను పుష్యాస్మ | ౨౬.౧౯ |
| ౧౯౬౩ | అనేజదేకం మనసో జవీ | ౪౦.౪ |
| ౫౧౩ | అన్నపతేఽన్నస్య నో | ౧౧.౮౩ |
| ౧౧౦౧ | అన్నాత్పరి స్రుతో రసం | ౧౯.౭౫ |
| ౧౯౭౨ | అన్య దేవాహు ర్విద్యాయా | ౪౦.౧౩ |
| ౧౯౬౯ | అన్య దేవాహుః సంభవాత్ | ౪౦.౧౦ |
| ౧౪౦౮ | అన్వవాపోఽర్ధమాసానా | ౨౪.౩౭ |
| ౬౦౧ | అన్యా వో అన్యామవ | ౧౨.౮౮ |
| ౪౪౭ | అన్వగ్ని రుషసా మగ్ర | ౧౧.౧౭ |
| ౧౮౦౧ | అన్విదనుమతే త్వం మన్యా | ౩౪.౮ |
| ౧౯౦౭ | అపశ్యం గోపా మనిపద్య | ౩౭.౧౦ |
| ౬౬౦ | అపాం గమ్భన్త్సీద మా | ౧౩.౩౦ |
| ౧౮౬౨ | అపాఘ మప కిల్బిష మ | ౩౫.౧౧ |
| ౧౯౩౧ | అపేతా మశ్వినా ఘర్మ | ౩౮.౧౩ |
| ౬౮౩ | అపాం త్వేమం సాదయా | ౧౩.౫౩ |
| ౧౭౫౧ | అపాద మదభి శీర్ష్ణ ర | ౩౩.౯౫ |
| ౩౫౯ | అపాఽరస ముద్వయసగ్ం | ౯.౩ |
| ౪౫౯ | అపాంపృష్ఠమసి యోని | ౧౧.౨౯ |
| ౬౩౨ | అపాం పృష్ఠమసి యోని | ౧౩.౨ |
| ౨౧౮ | అపాం పేరు రస్యాపో దేవీ | ౬.౧౦ |
| ౧౦౯౭ | అపాం ఫేనేన నముచేః | ౧౯.౭౧ |
| ౮౫౭ | అపామిదం న్యయనగ్ంసము | ౧౭.౭ |
| ౨౬ | అపారరుం పృథివ్యై దేవ | ౧.౨౬ |
| ౧౩౫౬ | అపి తేషు త్రిషు పదేష్వ | ౨౩.౫౦ |
| ౫౫౮ | అపేత వీత వి చ సర్పతా | ౧౨.౪౫ |
| ౧౮౫౨ | అపేతో యన్తు పణయో | ౩౫.౧ |
| ౧౧౪౩ | అపో అద్యాన్వ చ | ౨౦.౨౨ |
| ౩౯౭ | అపో దేవా మధు మతీ | ౧౦.౧ |
| ౪౬౮ | అపో దేవీ రుప సృజ మధు | ౧౧.౩౮ |
| ౧౮౨౨ | అప్నస్వతీ మశ్వినా వాచ | ౩౪.౨౯ |
| ౫౪౯ | అప్స్వగ్నే సధి ష్ట వనౌషధీ | ౧౨.౩౬ |
| ౩౬౭ | అప్స్వన్తరమృత మప్సు | ౯.౬ |
| ౭౪౩ | అబోధ్యగ్నిః సమిధా | ౧౫.౨౪ |
| ౮౮౯ | అభి గోత్రాణి సహసా | ౧౭.౩౯ |
| ౧౫౩ | అభి త్యం దేవగ్ంసవితా ర | ౪.౨౫ |
| ౧౫౨ | అభీ త్వాం శూరనోనుమో | ౨౩.౩౫ |
| ౧౨౭౫ | అభి ధా అసి భువన మ | ౨౨.౩ |
| ౯౪౬ | అభి ప్రవన్త సమనేవ యో | ౧౭.౯౬ |
| ౪౨౪ | అభి భూ రస్యేతా స్తే పఞ్చ | ౧౦.౨౮ |
| ౧౪౮౦ | అభి యజ్ఞం గృణీహి నః | ౨౬.౨౧ |
| ౧౯౩౫ | అభీ మం మహిమా దివం | ౩౮.౧౭ |
| ౧౫౨౬ | అభీ షు ణః సఖీనాం | ౨౭.౪౧ |
| ౧౮౭౯ | అభీ షు ణః సఖీనాం | ౩౬.౬ |
| ౧౯౪౮ | అభ్యర్షత సుష్టుతిం గవ్య | ౧౩.౯౮ |
| ౧౧౪౫ | అభ్యాదధామి సమిధ మగ్నే | ౨౦.౨౪ |
| ౬౧౬ | అభ్యావర్తస్వ పృథివీ | ౧౨.౧౦౩ |
| ౪౪౦ | అభ్రి రసి నార్యసి త్వయా | ౧౧.౧౦ |
| ౮౯౪ | అమీషాం చిత్తం ప్రతిలోభ | ౧౭.౪౪ |
| ౧౪౯౪ | అముత్ర భూయాదధ యద్య | ౨౭.౯ |
| ౧౪౮౩ | అమేవ నః సుహవ ఆ | ౨౬.౨౪ |
| ౨౯ | అయం తే యోని ర్ఋత్వియో | ౩.౧౪ |
| ౫౬౫ | అయం తే యోని ర్ఋత్వియో | ౧౨.౫౨ |
| ౭౭౫ | అయం తే యోని ర్ఋత్వియో | ౧౫.౫౬ |

| మంత్రక్రమసంఖ్య | | అధ్యా. మంత్ర |
|---|---|---|
| ౭౩౫ | అయం దక్షిణా విశ్వకర్మా | ౧౫.౧౬ |
| ౬౮౫ | అయం దక్షిణా విశ్వకర్మా | ౧౩.౫౫ |
| ౨౦౨ | అయం నో అగ్ని ర్వరివ | ౫.౩౭ |
| ౨౮౯ | అయం నో అగ్ని ర్వరివ | ౭.౪౪ |
| ౭౩౬ | అయం పశ్చాద్విశ్వవ్యచా | ౧౫.౧౭ |
| ౬౮౬ | అయం పశ్చాద్విశ్వవ్యచా | ౧౩.౫౬ |
| ౬౮౪ | అయం పురో భువస్తస్య | ౧౩.౫౪ |
| ౭౩౪ | అయం పురో హరికేశః | ౧౫.౧౫ |
| ౨౫౪ | అయం వాం మిత్రావరుణా | ౭.౯ |
| ౨౬౧ | అయం వేన శ్చోదయత్పృ | ౭.౧౬ |
| ౧౭౭౯ | అయస్సహస్ర మృషిభిః | ౩౩.౮౩ |
| ౫౬౦ | అయమ్మనో అగ్ని ర్యస్మిన్ | ౧౨.౪౭ |
| ౧౦౪ | అయ మగ్నిర్గృహపతి ర్గార్హ | ౩.౩౯ |
| ౧౦౫ | అయ మగ్నిః పురీష్యో | ౩.౪౦ |
| ౭౭౧ | అయ మగ్ని ర్వీరతమో వ | ౧౫.౫౨ |
| ౭౪౦ | అయమగ్నిః సహస్రిణో | ౧౫.౨౧ |
| ౮౦ | అయ మిహ ప్రథమో ధాయి | ౩.౧౫ |
| ౭౪౫ | అయ మిహ ప్రథమో ధాయి | ౧౫.౨౬ |
| ౧౭౦౨ | అయ మిహ ప్రథమో ధాయి | ౩౩.౬ |
| ౭౩౭ | అయ ముత్తరా త్సంయద | ౧౫.౧౮ |
| ౭౩౮ | అయ ముపర్యర్వా గ్వసు | ౧౫.౧౯ |
| ౩౯౯ | అర్థేత స్థ రాష్ట్రదా రాష్ట్రం | ౧౦.౩౩ |
| ౧౦౫౧ | అర్థ ఋచై రుక్థానాం | ౧౯.౨౫ |
| ౧౩౪౭ | అర్ధమాసాః పరూం షి | ౨౩.౪౧ |
| ౧౬౪౭ | అర్మేభ్యో హస్తిపం జనా | ౩౦.౧౧ |
| ౩౮౩ | అర్యమణం బృహస్పతి | ౯.౨౭ |
| ౧౭౪౭ | అర్వాఙ్జ్వా అద్యా భవతా | ౩౩.౫౧ |
| ౭౯౭ | అవతత్య ధనుష్ట్వꣳసహ | ౧౬.౧౩ |
| ౬౦౪ | అవపత న్తీ రవ దన్తి వ | ౧౨.౯౧ |
| ౩౨౦ | అవభృథ నిచుమ్పుణ | ౮.౨౭ |
| ౧౧౩ | అవభృథ నిచుమ్పుణ | ౩.౪౮ |
| ౧౨౩ | అవరుద్ర మదీ మహ్యా వ | ౩.౫౮ |
| ౮౯౫ | అవసృష్టా పరాపత శరవ్యే | ౧౭.౪౫ |
| ౧౧౧౬ | అవి ర్న మేషో న సి | ౧౯.౯౦ |
| ౪౦౬ | అవేష్టా దన్దశూ కాః ప్రాచీ | ౧౦.౧౦ |
| ౭౪౪ | అవోచామ కవయే మేధ్యాయ | ౧౫.౨౫ |
| ౮౫౧ | అశ్మన్నూర్జం పర్వతే శిశ్రి | ౧౭.౧ |
| ౧౮౬౧ | అశ్మన్వతీ రీయతే సꣳ | ౩౫.౧౦ |
| ౯౬౨ | అశ్మా చ మే మ త్తికా చ | ౧౮.౧౩ |
| ౧౦౭౩ | అశ్యామ తం కామ మగ్నే | ౧౮.౭౪ |
| ౫౯౨ | అశ్వత్థే వో నిషదనం | ౧౨.౭౯ |
| ౧౮౫౫ | అశ్వత్థే వో నిషదనం | ౩౫.౪ |
| ౧౩౭౨ | అశ్వస్తూపరో గోమృగ స్తే | ౨౪.౧ |
| ౧౯౦౬ | అశ్వస్య త్వా వృష్ణః | ౩౭.౯ |
| ౧౮౩౩ | అశ్వావతీ ర్గోమతీ ర్న ఉషా | ౩౪.౪౦ |
| ౫౯౪ | అశ్వావతీꣳసోమావతీం | ౧౨.౮౧ |
| ౧౨౫౬ | అశ్వినా కృతస్య తే నర | ౨౦.౩౫ |
| ౧౨౯౪ | అశ్వి నా గోభి రిన్ద్రియ | ౨౦.౭౩ |
| ౧౯౩౦ | అశ్వినా ఘర్మపాతꣳ | ౩౮.౧౨ |
| ౧౨౦౧ | అశ్వినా తేజసా చక్షుః | ౨౦.౮౯ |
| ౧౧౮౦ | అశ్వి నముచేః సుతꣳ | ౨౦.౫౦ |
| ౧౨౧౧ | అశ్వినా పిబతాం మధు | ౨౦.౯౦ |
| ౧౩౮౫ | అశ్వినా భేషజం మధు | ౨౦.౬౪ |
| ౧౧౮౮ | అశ్వినా హవి రిన్ద్రియం | ౨౦.౬౭ |
| ౧౧౧౫ | అశ్విభ్యాం చక్షురమృతం | ౧౯.౮౯ |
| ౪౨౭ | అశ్విభ్యాం పచ్యస్వ సరస్వ | ౧౦.౩౧ |
| ౧౯౨౨ | అశ్విభ్యాం పిన్వస్వ సరస్వ | ౩౮.౪ |
| ౧౦౫౨ | అశ్విభ్యాం ప్రాతః సవన | .౨౬ |
| ౧౫౮౬ | అశ్వో ఘృతేన త్మన్యా | ౨౯.౧౦ |
| ౧౮౧౩ | అషాఢం యుత్సు పృతనా | ౩౪.౨౦ |
| ౬౫౬ | అషాఢాసి సహమానా | ౧౩.౨౬ |
| ౧౮౧౭ | అష్టౌ వ్యఖ్యత్కకుభః | ౩౪.౨౪ |
| ౮౩౮ | అసంఖ్యాతా సహస్రాణి | ౧౬.౫౪ |
| ౧౩౦౨ | అసవే స్వాహా వసవే స్వా | ౨౨.౩౦ |
| ౧౫౯౦ | అసి యమో అస్యాదిత్యో | ౨౯.౧౪ |
| ౫౭౫ | అసున్వన్త మ యజమాన | ౧౨.౬౨ |
| ౧౯౬౨ | అసుర్యా నామ తే లోకా | ౪౦.౩ |
| ౭౯౦ | అసౌ యస్తామ్రో అరుణ | ౧౬.౬ |
| ౮౯౭ | అసౌ యా సేనా మరుతః | ౧౭.౪౭ |
| ౭౯౧ | అసౌ యోఽవసర్పతి | ౧౬.౭ |

